# గీతా మకరందము




## శ్రీశ్రీశ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వాములువారు

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్యాది అనేక విషయాలు తెలుసుకోండి... ఫేస్‌బుక్ FB@mohanpublications

**మోహన్ పబ్లికేషన్స్**

కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట, రాజమహేంద్రవరం - 533101.



| | | | |
|---|---|---|---|
| 1963 నుండి 2004 సం॥ వరకు | | | **2,36,000** |
| 2005 సం॥ | ప్రతులు | .... | **9,000** |
| 2006 సం॥ | ప్రతులు | .... | **2,000** |
| 2007 సం॥ | ప్రతులు | .... | **8,000** |
| 2008 సం॥ | ప్రతులు | .... | **8,000** |
| 2009 సం॥ | ప్రతులు | .... | **4,000** |
| 2009 సం॥ | ప్రతులు | .... | **4,000** |
| 2010 సం॥ | ప్రతులు | .... | **4,000** |
| 2011 సం॥ | ప్రతులు | .... | **4,000** |
| | | | **2,79,000** |

వెల: రూ : **220.00**

గ్రంథములు కావలసినవారు
ఈ క్రింది అడ్రసుకు వ్రాసి తెప్పించుకొనవచ్చును

శ్రీ శుకబ్రహ్మాశ్రమము
శ్రీవిద్యాప్రకాశానంద నగర్
శ్రీ శుకబ్రహ్మాశ్రమము (పోస్టు)
శ్రీకాళహస్తి- పిన్ :517 640
ఫోన్ : 222239, (STD:08578)



అక్షరకూర్పు : గీతా కంప్యూటర్స్, చెన్నై

**VETRI OFFSET,**
**No.4, OLD JAIL LANE,**
**CHENNAI - 600 001.**
**PHONE: 044-25283556**

ॐ

**చేతోభృఙ్గ భ్రమసి వృథా**
**భవమరుభూమౌ విరసాయామ్**
**పిబపిబ గీతామకరన్దం**
**యదుపతిముఖకమలభవాధ్యమ్.**

మనస్సను ఓ తుమ్మెదా! రసహీనమగు ఈ సంసారమను మరుభూమియందేల వ్యర్థముగ సంచరించుచున్నావు? (ఇక ఆ సంచారమును కట్టిపెట్టి) శ్రీ కృష్ణపరమాత్మయొక్క ముఖపద్మము నుండి బయలు వెడలిన శ్రేష్ఠమగు **గీతామకరందమును** పానము చేయుము!

"....... విశాలార్థమున్ను, అగాధభావమున్ను, సమత్వమున్ను గల గ్రంథము గీతకు సాటియైనది మఱియొకటి లేనే లేదు."

**– శ్రీ మహర్షి మలయాళస్వాములవారు**

"Those of you who know Sanskrit should tomorrow, if possible today buy the Gita and begin to study the book. Those of you who do not know Sanskrit, should study Sanskrit, if only for the sake of the Gita. I tell you that it contains treasures of knowledge of which you have no conception whatsoever."

***- Mahatma Gandhi***

"మీలో సంస్కృతము తెలిసినవారు రేపు లేక వీలైనచో ఈ దినమే ఒక గీతాపుస్తకమును కొని చదువ ప్రారంభించుడు. మీలో సంస్కృతము తెలియనివారు కనీసము గీత కొఱకైనను సంస్కృతము నేర్చుకొనుడు. నేను యథార్థముగ చెప్పుచున్నాను - మీరు కని విని యెఱుగని అమూల్య జ్ఞానభండార మెంతయో గీతయందు కలదు."

**– శ్రీ మహాత్మా గాంధి**

**GITA** = Truths beautifully arranged together in their proper places like a fine garland or a boquet of choicest flowers.

***- Swami Vivekananda***

"చక్కని పుష్పమాలవలె, లేక మనోహర కుసుమ సముదాయమువలె క్రమపద్ధతిని సుందరముగ కూర్చబడిన ధర్మములయొక్క సముదాయమే గీత"

**– శ్రీ స్వామి వివేకానంద.**

## Message of the Gita
## "Be Fearless"

**క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే**
**క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప.** **(2-3)**

"ఓ అర్జునా! అధైర్యమును (భయమును) పొందకుము. ఇట్టి పిరికితనము నీకు తగదు. నీచమగు ఈ హృదయదౌర్బల్యమును విడనాడి లెమ్ము!! కర్తవ్యమునకు గడంగుము!!!"

If one reads this one sloka he gets all the merits of reading the entire Gita; for in this one sloka lies imbedded the whole message of the Gita.

***- Swami Vivekananda***

"ఈ ఒక్క శ్లోకమును చదివినచో గీతయంతయు చదివిన ఫలితమును మనుజుడు పొందగలడు; ఏలననిన, గీతయొక్క సందేశమంతయు ఈ ఒక్క శ్లోకములోనే ఇమిడియున్నది."

– స్వామి వివేకానంద

## GITA - A miraculous remedy for life's tragedies

"When doubts haunt me, when disappointments stare me in the face and when I see not one ray of light on the horizon I turn to Bhagavadgita and find a verse to comfort me and I immediately begin to smile in the midst of overwhelming sorrow. My life has been full of external tragedies and if they had not left any visible and indelible effect on me I owe it to the teachings of Bhagavadgita."

***- Mahatma Gandhi***

## జీవిత సంతాపములకు గీత రామబాణ దివ్యౌషధము

"సంశయములు నన్నావరించినపుడు, సంకటములు సంప్రాప్తమైనపుడు, నిరాశానిరుత్సాహములు జనించినపుడు నేను భగవద్గీతను తెఱచి చూచుదును. అందు ఏదో యొక శ్లోకము నన్నూరడించును. తత్ఫలితముగ మహా విపత్కర పరిస్థితియందుగూడ నా ముఖముపై చిఱునవ్వు తాండవించుచుండును. నా జీవితము అనేక ఒడుదుడుకులతో గూడియున్నను, ఘోరసంకటములను నేను అనుభవించవలసివచ్చినను అవి యెవ్వియు నా మనంబున లవలేశమైనను అశాంతిని గలుగజేయజాలకపోవుట యేదికలదో, అది యంతయు గీతాప్రబోధముయొక్క సత్ఫలితమే యగును."

***– శ్రీ మహాత్మా గాంధి***

## గ్రంథకర్త : పూజ్యశ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు

**జననం** : 13-4-1914 ఆనందనామ సంవత్సరం చైత్ర బహుళ తదియ.

**పేరు** : ఆనందమోహన్

**విద్యార్హతలు** : 1,13 సంవత్సరాల ప్రాయంలో విజయవాడలో మెట్రిక్యులేషన్‌లో ఉత్తీర్ణత

2. 1933 సం॥ ఆంధ్రవిశ్వ విద్యాలయానికి చెందిన మచిలీపట్నం నోబుల్ కళాశాల నుండి బి.ఏ. పట్టభద్రత.

3. వారణాసిలోని "కాశీ విద్యాపీఠం" నుండి హిందీలో 'కోవిద' పరీక్షలో ఉత్తీర్ణత.

**గంగానదిలో భగవద్గీతాప్రాప్తి** : ఋషీకేశంలో గంగానదిలో స్నానంచేస్తుండగా వారికి పూలతోను, కుంకుమతోనూ పూజింపబడిన పవిత్ర గీతా గ్రంథం సంస్కృతప్రతి లభించింది. వారి జీవితలక్ష్యాన్ని నిర్దేశించిన మహత్తరమైన శుభ సమయమది.

**గురుకుల వాసం** : 23 యేండ్ల ప్రాయంలో 17-5-1936 తేదీ నుండి శ్రీ సద్గురు మహర్షి మలయాళస్వామివారి వద్ద (చిత్తూరుజిల్లా ఏర్పేడు వ్యాసాశ్రమంలో) 1950 సంవత్సరంవరకు గురుకుల వాసం.

**తపస్సు** : అపక్వాహారం మాత్రమే స్వీకరిస్తూ 12 సంవత్సరాలు తపస్సు ధ్యానం చేస్తూ ఉండిపోయారు. ఈ సమయంలో వారు పూర్తిగా ఒక సంవత్సరకాలం మౌనం పాటించారు.

**సన్యాస స్వీకారం** : 34వ యేట 3-7-1947వ తేదీన శ్రీ సద్గురు మహర్షి శ్రీ మలయాళస్వాముల వారి నుండి (శ్రీ అసంగానందగిరి స్వాములవారి నుండి) సన్యాస దీక్ష స్వీకరించారు.

**సన్యాసనామం** : శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు.

**శ్రీ శుకబ్రహ్మాశ్రమ స్థాపన** : 37వ యేట 20-1-1950 తేదీన ఆంధ్రప్రదేశ్‌కు చెందిన చిత్తూరుజిల్లా శ్రీకాళహస్తిలో శ్రీ శుకబ్రహ్మాశ్రమాన్ని స్థాపించారు.

**గీతాజ్ఞానయజ్ఞప్రారంభం** : 2-12-1956 తేదీన గుంటూరుజిల్లా నరసరావుపేటలో మొదటి గీతాజ్ఞాన యజ్ఞాన్ని ప్రారంభించారు.

| | | |
|---|---|---|
| 100వ గీతాజ్ఞాన యజ్ఞం | : | 25-4-1981 తేదీన హైదరాబాదులోని ఎగ్జిబిషన్ గ్రౌండ్సులో తిరుమల తిరుపతి దేవస్థానంవారి యాజమాన్యంలో 100వ గీతాజ్ఞాన యజ్ఞోత్సవాన్ని నిర్వహించారు. |
| ఆశ్రమంలో జరిగిన ముఖ్య కార్యక్రమాలు | : | 1. 1963 మార్చిలో మౌక్తికోత్సవం. 2. 1975 లో రజతోత్సవం. 3. 2001లో స్వర్ణోత్సవాలు జరిగినవి. |
| మాసపత్రిక | : | 1963 జనవరిలో 'వేదాంతభేరి' అనే ఆధ్యాత్మిక మాసపత్రిక ప్రారంభింపబడింది. |
| గీతామకరందం | : | 1963 మార్చి 6వ తేదీన శ్రీ స్వామీజీ రచించిన పవిత్రమైన గీతామకరందం ఆవిష్కరింపబడింది. |
| కళాశాలలు | : | శ్రీ స్వామిజీ ఇచ్చిన భూరి విరాళంతో ప్రభుత్వంవారు 1966 ఆగష్టులో ఒక డిగ్రీ కళాశాలనూ, 1982 లో బాలికలకు ఒక జూనియర్ కళాశాలనూ ప్రారంభించారు. ఈ కళాశాలలు శ్రీ స్వాములవారి పేరుతోనే శ్రీ కాళహస్తిలో నెలకొల్పబడ్డాయి. |
| భగవద్గీత ఆడియో - వీడియో క్యాసెట్లు | : | శ్రీ స్వాముల వారి గీతోపన్యాసాల ప్రాముఖ్యం గుర్తించి, తిరుమల తిరుపతి దేవస్థానం యాజమాన్యం 1981 డిసెంబరులో ఆ ఉపన్యాసాలను ఆడియో క్యాసెట్లుగా రూపొందించింది. ప్రకాశంజిల్లాలోని వేటపాలెంలో వాటిని రికార్డు చేయడం జరిగింది.<br><br>1987 ఏప్రిల్ సికింద్రాబాదులోని మహబూబు కళాశాల ఆవరణలో తిరుమల తిరుపతి దేవస్థానంవారు స్వామీజీ గీతోపన్యాసాలను వీడియో క్యాసెట్లుగా రూపొందించారు. తర్వాత అవి ప్రజలు కొనుక్కోవడానికి వీలుగా విడుదల చేయబడ్డాయి. |
| కంటి వైద్యశాల | : | 28-4-1993 తేదీన శ్రీ శుకబ్రహ్మాశ్రమంలో పేద ప్రజల అవసరాన్ని తీర్చడానికై 'భక్తకన్నప్ప ఉచిత కంటి ఆసుపత్రి' (త్రినేత్ర వైద్యాలయం) ప్రారంభించబడింది. |
| ఉత్తర పీఠాధిపతి | : | 12-4-1996 తేదీన శ్రీ స్వాములవారు తమ శిష్యులైన శ్రీ విద్యాస్వరూపానందగిరి స్వామీజీని శ్రీ కాళహస్తిలోని ఆశ్రమానికి తమ తదనంతర పీఠాధిపతిగా నియమించారు. |
| మహాభి నిష్క్రమణ | : | 1998 ఏప్రిల్ 10 తేది చైత్ర శుద్ధచతుర్దశినాడు మహాసమాధిని పొందారు. |

# విషయసూచిక

ఓమ్

# పరిచయము

మకరంద మనగా తేనె. భగవద్గీత తేనెవలె సుమధురమై, ఆహ్లాదకరమై, తాపహారకమై యొప్పుటచే మకరందమను పేరు దానికి చేర్చబడినది. తేనెకు రోగవినాశకర శక్తియు మిక్కుటముగ కలదు. కనుకనే ఔషధములలో దానిని ఎక్కువగ వాడుచుందురు. అట్లే గీతయను మకరందమును సేవించినవారికిన్ని భవరోగము సంపూర్ణముగ తొలగిపోగలదు. మధుపము అనేక పుష్పములనుండి సేకరించి తేనెను సమకూర్చు కొనులాగున శ్రీకృష్ణపరమాత్మయు ఉపనిషత్తులను వివిధ కుసుమరాసులనుండి గీతామకరందమును వెలికిదీసి లోకమునకు ప్రసాదించిరి. ఇది 'ధర్మ్యామృతము'ని భగవానుడే గీతయందు సెలవిచ్చిరిగదా! కాబట్టి అమృతతుల్యమై, జనన మరణరూప భవతాపములను నిర్మూలించి వేయునట్టి ఈ భగవన్ముఖారవింద సంజనితమగు గీతామకరందమును ముముక్షువులు తనివితీర పానముచేసి కృతార్థులగుదురు గాక!

దక్షిణకాశియని ప్రసిద్ధికెక్కిన శ్రీకాళహస్తి పుణ్యక్షేత్రమున సువర్ణముఖీనదీ తీరమున 'శ్రీశుకబ్రహ్మాశ్రమము' అను నొక చక్కని యాశ్రమమును స్థాపించి ఆధ్యాత్మికసేవ నొనర్చుచున్న శ్రీ శ్రీ శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు గీతామకరందమను పేరిట గీతకు విపులమగు వ్యాఖ్యను వ్రాసి యుండిరి. దానినే ఈ గ్రంథరూపమున ప్రకటించుచున్నాము. ఈ గ్రంథమునందు మూలశ్లోకము, ప్రతిపదార్థము, తాత్పర్యము, వ్యాఖ్యానములే కాక గీతాపాఠకులకు అత్యవసరములైనట్టి పెక్కు ఇతర విషయములున్ను ప్రారంభమున తెలుపబడినవి. సామాన్యముగ వాడుకలో నున్న (వరాహపురాణాంతర్గతమగు) గీతామాహాత్మ్యములు కూడ తాత్పర్యసహితముగ నిందు ప్రకటింపబడినవి. ఇంకను గీతను జపించు పద్ధతి, పారాయణము సలుపు విధానము మున్నగునవి యన్నియు విపులముగ నిందు పేర్కొనబడినవి.

గీత మంత్రమయము; గీతయందలి ప్రతిశ్లోకమున్ను ఒక మహామంత్రమే. ఏ యే శ్లోకమును ఎన్ని పర్యాయములు ఎన్ని రోజులు జపము చేసినచో ఎట్టి ఫలితము చేకూరగలదో ఈ గ్రంథమున చక్కగ విశదీకరింపబడినది. లౌకిక, పారమార్థక ఫలితములకు అవసరములైనట్టి ఒపసాధనలు వేత్వేఱుగ నిందు తెలుపబడినప్పటికిని, ఆధ్యాత్మికగమ్యమును శీఘ్రముగ జేరవలెనను తలంపు గల ముముక్షువు వైరాగ్యోపేతుడై, లౌకికఫలములను కాంక్షింపక పరమార్థ ఫలితముల కొరకే తీవ్రతర యత్నములను గావించవలెను. నిరంతరము స్మృతిపథమున నుంచుకొనుటకై కొన్ని గీతా వాక్యములున్ను ప్రత్యేకముగ ఈ గ్రంథమున తెలుపబడినవి. మఱియు అధ్యాయక్రమముగ కథారూపమున చిత్రించబడిన గీతాపారాయణ ఫలము (పద్మపురాణాంతర్గతమైనది) ఇచ్చట సంక్షేపముగ నుల్లేఖింపబడినది. ఈ గీతాగ్రంథ ప్రారంభము నందు శ్రీ స్వాములవారు వ్రాసినట్టి విపులమగు ఉపోద్ఘాతమున్ను గలదు. అందు గీతయొక్క ముఖ్యాశయము, గీతాతత్త్వము, గీతోక్తసాధనలు మున్నగునవి లెస్సగ ప్రస్ఫుటీకరింపబడినవి. పాఠకుల సౌకర్యార్థము గ్రంథముయొక్క చివర శ్లోకానుక్రమణికయున్ను చేర్చబడినది.

ఈ బృహద్గ్రంథమును వెలువఱచుటలో సహకరించినట్టి పుణ్యాత్ములందఱికిన్ని మాహృదయపూర్వక అభినందనలు, కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాము. సర్వేశ్వరుని కృపచేతను, పరమకారుణికులగు మహర్షుల దయ చేతను గీతాజ్ఞానము లోకములో నలుదెసల పరివ్యాప్తమై, తత్ఫలితముగ జనులయొక్క హార్దిక తమః పటలము ఆధ్యాత్మిక దివ్యతేజఃపుంజములచే విచ్ఛిన్నము కాగా పరమశాంతి యెల్లరకును చేకూరగలదని విశ్వసించుచున్నాము.

ఇట్లు

**ప్రకాశకులు**



# దైవప్రార్థన

**కరుణామూర్తియగు దేవా !**

మా చిత్తము సర్వకాలసర్వావస్థలయందును నీ పాదారవిందములయందు లగ్నమై అచంచలమైన భక్తితో కూడియుండునట్లు అనుగ్రహింపుము.

**పరమదయానిధీ !**

ప్రాతఃకాలమున నిద్రలేచినదిమొదలు మఱల పరుండు వఱకును మనోవాక్కాయములచే మా వలన ఎవరికిని అపకారము కలుగకుండు నట్లును, ఇతర ప్రాణికోట్లకు ఉపకారము చేయులాగునను సద్బుద్ధిని దయచేయుము.

**సచ్చిదానందమూర్తీ ! నిర్మలాత్మా !**

మా యంతఃకరణమునందు ఎన్నడును ఏవిధమైన దుష్టసంకల్పముగాని, విషయవాసనగాని, అజ్ఞానవృత్తిగాని, జొరబడకుండునట్లు దయతో అనుగ్రహింపుము !

**వేదాంతవేద్యా ! అభయస్వరూపా !**

మా యందు భక్తి, జ్ఞాన, వైరాగ్య బీజము లంకురించి శీఘ్రముగ ప్రవృద్ధములగునట్లు ఆశీర్వదింపుము ! మఱియు ఈ జన్మమునందే కడతేరి నీ సాన్నిధ్యమున కేతెంచుటకు వలసిన శక్తి సామర్థ్యములను కరుణతో నొసంగుము.

**దేవా!**

నీవు భక్తవత్సలుడవు ! దీనుల పాలిటి కల్పవృక్షస్వరూపుడవు ! నీవు తప్ప మాకింకెవరు దిక్కు? నిన్ను ఆశ్రయించితిమి. అసత్తునుండి సత్తునకు గొనిపొమ్ము ! తమస్సునుండి జ్యోతిలోనికి తీసికొనిపొమ్ము ! మృత్యువునుండి అమృతత్వమును పొందింపజేయుమ్ము. ఇదే మా వినతి. అనుగ్రహింపుము. నీ దరి జేర్చుకొనుము.

పాహిమాం, పాహిమాం, పాహిమాం, పాహి.

ఓం తత్ సత్

(ఈ ప్రార్థనను ఎవరు ప్రతిదినము నియమముతప్పక ఉదయము నిద్రలేచునపుడును, రాత్రి పరుండబోవునపుడును మనస్ఫూర్తిగా పఠించుదురో, అట్టివారికి జీవితమునందేలాటి దోషములున్ను కలుగకుండుటయేగాక భగవంతునియొక్క అనుగ్రహమునకున్ను వారు పాత్రులుకాగలరు.)

## గీతాంజలి

**గీతా కల్పతరుం భజే భగవతా కృష్ణేన సంరోపితం**
**వేదవ్యాస వివర్ధితం శ్రుతిశిరోబీజం ప్రబోధాంకురమ్**
**నానాశాస్త్ర రహస్య శాఖ మరతి క్షాంతి ప్రవాలాంకితం**
**కృష్ణాంఘ్రిద్వయ భక్తి పుష్పసురభిం మోక్షప్రదం జ్ఞానినామ్.**

"గీత యను కల్పవృక్షమును నేను సేవించుచున్నాను. అయ్యది భగవంతుడగు శ్రీకృష్ణపరమాత్మచే నాటబడినది. వేదవ్యాస మహర్షిచే పెంచబడినది. ఉపనిషత్తులే దాని విత్తనము. ఆత్మప్రబోధము దాని అంకురము. వివిధశాస్త్రములయొక్క రహస్యములు దాని కొమ్మలు. వైరాగ్యము, సహనము మున్నగు సద్గుణములు దాని చిగురుటాకులు. శ్రీకృష్ణపరమాత్మయొక్క పాదపద్మముల యెడల భక్తి దాని పుష్పసుగంధము. మఱియు నది జ్ఞానులకు మోక్షదాయకమైనది."

# గీత - ప్రాణికోట్లకు పెన్నిధి !!

1. **శ్రీ వివేకానందస్వామి :-**

గీతలో శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు చెప్పినవి మాటలు కావు; జ్ఞానకణికలు. జీవితాదర్శమంతయు నొక్కక్షణములో నచట తెలిపివేయబడెను. ఉపనిషత్తులను తోటలో నుండి అధ్యాత్మిక సత్యములను పుష్పములను యేర్చికూర్చిన మాలయే భగవద్గీత.

2. **శ్రీ గాంధీ మహాత్ముడు :-**

దుఃఖపూరితమగు వాతావరణమునందున్నను, ఆ దుఃఖము నన్నంటకుండుటకు కారణము భగవద్గీతాబోధయే.

3. **శ్రీ తిలక్ :-**

ప్రపంచమునగల సాహిత్యమంతటిలోను గీతకు దీటురాగల పుస్తకము వేఱొకటి లేదు. మహాప్రకాశమానమగు అమూల్యరత్నమది. అయ్యది మనలను పరమానందపదవికి గొనిపోవు అపూర్వసాధనము.

4. **శ్రీ మహర్షి మలయాళ స్వాములవారు :-**

సంసారసాగరమును సులభముగ దాటుటకు భగవద్గీతను పఠించుటయు, దానియందు చెప్పినట్లు ఆచరించుటయు చాలును.

5. **శ్రీ అరవిందయోగి :-**

మానవుడు తన మేధనంతను ధారబోసినను గీతాజ్ఞానమున ఒకానొక అంశమును మాత్రమే తెలిసికొని, తెలుపగలడు.

6. **శ్రీ శివానంద సరస్వతీస్వాములవారు :-**

విశ్వవాఙ్మయమంతటిలోను గీతవంటి మహోన్నత గ్రంథరాజము మఱియొకటి లేనే లేదు. అది జ్ఞానభండారము, తరగని నిధి, ఆనందసాగరము...

7. **శ్రీ వినోబా భావే :-**

నా శరర వృద్ధికి తల్లిపాలు ఎంతగా ఉపయోగపడినవో, నా బుద్ధి వికాసమునకు భగవద్గీత అంతకంటె ఎక్కువగా ఉపయోగపడినది.

8. **శ్రీ మాలవ్యా :-**

నాకు తెలిసినంతవరకు విశ్వవాఙ్మయమున భగవద్గీతను మించిన గ్రంథము ఇంకొకటి లేనే లేదు. అది హిందువులకేకాక సమస్తమానవకోటికిని ధర్మబాండాగారమైయున్నది.

9. **శ్రీ ఎడ్విన్ ఆర్నాల్డ్:-**

భారతదేశముయొక్క ఈ సర్వప్రియ కావ్యమయదార్శనిక గ్రంథము లేనిచో, ఆంగ్లసాహిత్యము నిక్కముగ అపూర్ణముగనే యుండును.

10. **శ్రీ వారన్ హేస్టింగ్స్ :-**

ఉన్నత శిఖరముల నధిరోహింపదలంచు మానవులకు గీతోపదేశ మద్వితీయమైనది.

11. **శ్రీ బంకించంద్ :-**

భగవద్గీతలోవలె అపూర్వధర్మసమన్వయము, అద్భుతవ్యాఖ్య ఏ దేశమునను, ఏ కాలమునను, ఎవడును కనియుండడు. వినియుండడు.

# గీతాదేవీ ప్రార్థన

**తల్లీ! గీతాదేవీ! జగన్మాతా! చిన్మయస్వరూపిణీ!** సంసారఘోరారణ్యమున దరిగానక తల్లడిల్లుచున్న మాకు మీరు దిక్కు చూపి మార్గమును ప్రసాదించితిరి. మాయొక్క భీకర సాంసారిక సంకటములను, తాపత్రయములను అంతమొనర్చుటకై మీరు కృతనిశ్చయులైతిరి. కోట్లకొలది జన్మలు అజ్ఞాననిబిడాంధకారమున క్రుగ్గియున్నను కృతవశమున ఈ జన్మయందు మీ సేవాభాగ్యమును పొందగల్గుటచే మా హృదయము ఆనందముతో నుప్పొంగుచున్నది. మీ కృపాకటాక్షవీక్షణముచే జనులందు జ్ఞానతేజ మావిర్భవించుటచే అవిద్య పటాపంచలై పోవుచున్నది. సంసారతిమిరము అంతమగుచున్నది. అంధకారబంధురమ్మైన ఈ ప్రాపంచిక క్షేత్రమున మీరు మాకు వెలుగు చూపితిరి. తల్లీ! మీ ఋణమును మేమెట్లు తీర్చుకొనగలము? మీకు మా అనంతకోటి ప్రణామములు.

**గీతాంబికే!** శ్రీకృష్ణపరమాత్మ తమ యవతారమును చాలించి వైకుంఠమునకు వెడలిపోవు సమయమున మిమ్ము మాకు చూపించిపోయిరి. కావున మీరు కృష్ణప్రతినిధులు. కాదు కాదు. సాక్షాత్ కృష్ణరూపులే. అట్టి ఓ గీతాదేవీ! మీరే మాకు శరణ్యము! మా హార్దికనమోవాకములను అందుకొనుడు.

**జ్ఞానదాత్రీ!** తన్ను సృష్టించిన ఈశ్వరుని, తనకు బోధించిన శాస్త్రమును, తన్నుద్ధరించిన అనుష్ఠానమును ఏకాలమందును మఱువరాదని శిష్టులవాక్యము. కావున అమోఘబోధలచే మమ్ముల నుద్ధరించుటకు బూనుకొనిన మిమ్ము, సదా స్మృతిపథమున నుంచుకొనుట మాయొక్క కర్తవ్యము. విధ్యుక్తధర్మము!

**స్వారాజ్యప్రదాయినీ!** ఒక జాతినిగాని, ఒక మతమునుగాని, ఒక సంప్రదాయమునుగాని దూషింపక, సర్వసమన్వయ పద్ధతిలో మీరు మాకు బోధ సల్పితిరి. పాపులున్ను, దురాచారపరులున్ను ఏనాడైనను పుణ్యాత్ములు కాగలరని ఢంకాప్రమోగించి చెప్పితిరి. నిరాశానిఃస్పృహులకు ధైర్యసంచార మొనర్చితిరి. జీవుల యంతఃకరణము శుద్ధపడుటకు లెక్కలేనన్ని మార్గములను సూచించితిరి. జగజ్జననీ! మీరు చేసిన మేలును మేమెట్లు మఱువగలము? మీ దివ్యబోధనలను విస్మరింపకుండులాగున యనుగ్రహింపుడు. మీ యనుంగు బిడ్డలమగు మమ్ము దరికిజేర్చి దీవింపుడు!!

**దీనజనోద్ధారణీ!** మీ భవ్య సదుపదేశములు మా హృదయాంతరాళమున ప్రవేశించి జన్మాంతర దుస్సంస్కారములను రూపుమాపి జ్ఞానోదయము కలిగించు లాగున కటాక్షింపుడు.

పతితులను, దీనులను, ఆర్తులను, అనాథులను, సంసారపంకపరిమగ్నులను ఉద్ధరించుటకు కంకణము గట్టుకొనిన ఓ దేవీ! జగద్ధాత్రీ! అష్టాదశాధ్యాయినీ! అంబికే! మీకివే మా జోహారులు! ఆదరింపుడు!

**భగవన్ముఖారవిందసంజనితజ్ఞానగంగాస్వరూపులగు ఓ తల్లీ!** సర్వోపనిషత్సారరూపిణీ! భవసాగరమున మునుకలిడుచున్న మాకు మీరు నావ వంటి వారు. మిమ్ము ఆశ్రయించితిమి. తీరమునకు జేర్చుడు. భక్తి జ్ఞాన వైరాగ్యాది మోక్ష సాధనములు మా కబ్బునట్లాశీర్వదింపుడు. అహర్నిశములు మీ సేవ యొనర్చుటకు వలసిన శక్తి సామర్థ్యములను కరుణతో నొసంగుడు. మీ జన్మస్థానమగు శ్రీకృష్ణపరమాత్మ యొద్దకు మమ్ములను జేర్చుడు. ఇదే మా వినతి. అనుగ్రహింపుడు. మీ కృపాదృష్టిని మాపై వర్షింపుడు. పాహిమాం, పాహిమాం, పాహి !!



# కృతజ్ఞత

గీత
- ను బోధించిన శ్రీకృష్ణపరమాత్మకు
- కు నిమిత్తమాత్రుడైన అర్జునునకు
- ను ఛందోబద్ధమొనర్చి ప్రకటించిన శ్రీ వేదవ్యాస మహర్షికి
- ను లిఖించిన శ్రీ విఘ్నేశ్వరునకు
- ను ఓం ప్రథమముగ ప్రచారమొర్చిన సంజయునకు
- యొక్క తాళపత్రములనుకాలగర్భమున చెడకుండ
- కాపాడి లోకమునకొసంగిన పుణ్యాత్ములకు
- యొక్క సూక్ష్మభావములను ప్రస్ఫుటమొనర్చిన, ఒనర్చుచున్న భాష్యకారులకు
- ను ఇంటింటికి వ్యాపింపజేసిన, చేయుచున్న గీతాప్రచారకులకు

లోకమెంతయో ఋణపడియున్నది. గీతను శ్రద్ధాభక్తులతో పఠించి అందలి భావములను చక్కగ అనుష్ఠించుటద్వారా మాత్రమే వారి ఋణమును జనులు తీర్చుకొనగలరు.

# గీతాప్రాశస్త్యము

(మహాభారతము నుండి)

1. **గీతాశాస్త్ర మిదం పుణ్యం యః పఠేత్ ప్రయతః పుమాన్**
**విష్ణోః పదమవాప్నోతి భయశోకాది వర్జితః.**

పరమ పావనమగు ఈ గీతాశాస్త్రమును ఎవడు ప్రయత్నపూర్వకముగ పఠించునో, అట్టివాడు భయ శోకాది రహితమగు విష్ణుపదమును బొందును.

2 **గీతాధ్యయనశీలస్య ప్రాణాయామపరస్య చ**
**నైవసన్తిహి పాపాని పూర్వజన్మ కృతాని చ.**

గీతాధ్యయనము చేయువానికి, ప్రాణాయామము సలుపువానికి పూర్వజన్మములందు చేయబడిన పాపములుకూడ నశించును.

3. **మలనిర్మోచనం పుంసాం జలస్నానం దినే దినే**
**సకృద్గీతామ్భసి స్నానం సంసారమల నాశనమ్.**

జలమునందు ప్రతిదినము స్నానమాచరించుటవలన మనుజులకు శరీరమాలిన్యము తొలగిపోవు చున్నది. కాని గీతాజ్ఞానమను జలమునందు ఒక్క పర్యాయము స్నానము చేయుట మాత్రముచే సంసార మాలిన్యమంతయు నసించిపోవుచున్నది.

4. **భారతామృత సర్వస్వం విష్ణోర్వక్త్రాద్వినిస్సృతమ్**
**గీతాగంగోదకం పీత్వా పునర్జన్మ న విద్యతే.**

మహాభారతముయొక్క అమృతమయమగు సర్వస్వమున్ను, విష్ణువుయొక్క ముఖమునుండి వెలువడినదియునగు గీతాగంగయొక్క ఉదకమును త్రాగినచో పునర్జన్మ యుండనేరదు.

5. **సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనన్దనః**
**పార్థోవత్సః సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్.**

ఉపనిషత్తులన్నియు గోవులు, గోపాలనందనుడగు శ్రీకృష్ణమూర్తి పాలు పితుకువారు. అర్జునుడు దూడ. మహత్తరమగు గీతామృతమే పాలు. సద్బుద్ధి గల జిజ్ఞాసువులే ఆ పాలను త్రాగువారు.

6. **గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైః శాస్త్ర సంగ్రహైః**
**యా స్వయం పద్మనాభస్య ముఖపద్మాద్వినిస్సృతా.**

గీతనే లెస్సగా గానము చేయవలెను. ఇతరములగు శాస్త్రసంగ్రహములచే నేమి ప్రయోజనము? ఏలననిన, గీత స్వయముగ విష్ణుభగవానుని ముఖపద్మమునుండి బయల్వెడలినది.

7. **సర్వ శాస్త్రమయీ గీతా సర్వదేవమయో హరిః**
**సర్వతీర్థమయీ గంగా సర్వవేదమయో మనుః.**

గీత సర్వశాస్త్ర స్వరూపిణి. విష్ణువు సర్వదేవమయుడు. గంగ సర్వతీర్థమయి. మనువు సర్వవేద స్వరూపుడు.

8. **గీతా గంగాచ గాయత్రీ గోవిన్దేతి హృదిస్థితే**
**చతుర్గకార సంయుక్తే పునర్జన్మ నవిద్యతే.**

గీతా, గంగ, గాయత్రి, గోవిందుడు - అను ఈ నాలుగు 'గ' కార యుక్త పదార్థములను ఎవడు హృదయమున ధరించునో అట్టివానికిక పునర్జన్మ లేదు.

9. **భారతామృత సర్వస్య గీతాయా మథితస్య చ**
**సారముద్ధృత్య కృష్ణేన అర్జునస్య ముఖే హుతమ్.**

మహాభారతమను అమృతముయొక్క సర్వస్వమే గీత. భారతమును మథించి సారమగు గీతను వెలికిదీసి శ్రీకృష్ణమూర్తి అద్దానిని అర్జునుని ముఖమునందు హోమము చేసెను (ప్రవేశపెట్టెను).

## గీతాప్రభావము

(స్కాంద పురాణమునుండి)

శ్రీ భగవానువాచ -

1. **గీతాసారమిదం శాస్త్రం సర్వశాస్త్ర సునిశ్చితమ్**
**యత్రస్థితం బ్రహ్మజ్ఞానే వేదశాస్త్ర సునిశ్చితమ్**

శ్రీ భగవానుడు:- గీతాసారమగు ఈ శాస్త్రము సమస్త శాస్త్రముల ద్వారా చక్కగ నిశ్చయింపబడిన సిద్ధాంతములు గలిగియున్నది. అద్దానియందు వేదశాస్త్రసునిశ్చితమగు బ్రహ్మజ్ఞానము విరాజమానమై యున్నది.

2. **ఇదం శాస్త్రం మయా ప్రోక్తం గుహ్యవేదార్థ దర్పణమ్**
**యః పఠేత్ప్రయతో భూత్వా సగచ్ఛేద్విష్ణు శాశ్వతమ్.**

నాచే జెప్పబడిన ఈ గీతాశాస్త్రము రహస్యములగు వేదార్థములను అద్దమువలె ప్రతిబింబింప జేయుచున్నది. ఎవడు ప్రయత్నపూర్వకముగ దీనిని పఠించునో, అతడు శాశ్వతమగు విష్ణుపదవిని బొందును.

**3. ఏతత్పుణ్యం పాపహరం ధన్యం దుఃఖప్రణాశనమ్**
**పఠతాం శృణ్వతాం వాపి విష్ణోర్మాహాత్మ్య ముత్తమమ్.**

విష్ణువుయొక్క ఈ ఉత్తమ మాహాత్మ్యము (గీతాశాస్త్రము) చదువువారియొక్క, వినువారియొక్క పుణ్యమును అభివృద్ధి జేయునదియు, పాపమును హరింపజేయునదియు, ధన్యమైనదియు, దుఃఖమును లెస్సగ నశింపజేయునదియు అయియున్నది.

**4. అష్టాదశపురాణాని నవవ్యాకరణాని చ**
**నిర్మథ్య చతురో వేదాన్ మునినా భారతం కృతమ్.**

**5. భారతోదధి నిర్మథ్య గీతానిర్మథితస్యచ**
**సారముద్ధృత్య కృష్ణేన అర్జునస్య ముఖే ధృతమ్.**

పదునెనిమిది పురాణములను, తొమ్మిది వ్యాకరణములను, నాలుగు వేదములను బాగుగ మథించి వ్యాసమునీంద్రుడు భారతమును రచించెను. అట్టి మహాభారతమును గూడ మథించి సారమగు గీతను దీసి శ్రీకృష్ణపరమాత్మ అద్దానిని అర్జునుని ముఖమందు ప్రవేశపెట్టెను.

**6. మలనిర్మోచనం పుంసాం గంగాస్నానం దినేదినే**
**సకృద్గీతామ్భసి స్నానం సంసారమలమోచనమ్.**

ప్రతిదినము చేయు గంగాస్నానము (జలస్నానము) మనుజులకు శరీరమాలిన్యమును పోగొట్టు చున్నది. కాని గీతయను జలమందు ఒక్క పర్యాయము స్నానమాచరించినచో సంసారమాలిన్య మంతయు తుడిచిపెట్టుకొని పోవుచున్నది.

**7. గీతానామ సహస్రేణ స్తవరాజో వినిర్మితః**
**యస్య కుక్షౌ చ వర్తేత సోఽపి నారాయణః స్మృతః.**

గీత యొక్క సహస్రనామములచే నిర్మితమైన స్తవరాజమును ఎవడు మనంబున స్మరించునో అతడు సాక్షాత్ నారాయణ స్వరూపుడే యని చెప్పబడినది.

**8. సర్వవేదమయీ గీతా సర్వధర్మమయో మనుః**
**సర్వతీర్థమయీ గంగా సర్వదేవమయో హరిః.**

గీత సర్వవేదపరిపూర్ణరూపిణి. మనువు సర్వధర్మమయుడు. గంగ సర్వతీర్థపరిపూర్ణ. విష్ణువు సర్వదేవమయుడు.

**9. పాదంవాఽప్యర్థపాదంవా శ్లోకం శ్లోకార్థమేవవా**
**నిత్యం ధారయతే యస్తు సమోక్ష మధిగచ్ఛతి.**

గీతయొక్క ఒక్క శ్లోకమునుగాని, అర్ధశ్లోకమునుగాని, ఒక్క పాదమునుగాని, పాదార్ధమునుగాని నిరంతరము ఎవడు మనంబున ధారణచేయునో, అతడు మోక్షము నొందును.

**10. కృష్ణవృక్ష సముద్భూతా గీతామృత హరీతకీ**
**మానుషైః కిం న ఖాద్యేత కలౌ మలవిరేచినీ.**

శ్రీకృష్ణమూర్తియను వృక్షమునుండి వెలువడినట్టి గీతయను అమృతమయమగు హరీతకిఫలమును (కరక్కాయను) జనులేల తినకున్నారు? దానిని తినినచో, అది కలిమలమునంతను శరీరమునండి బయటికి వెడలగొట్టివేయును.

**11. గంగా గీతా తథా భిక్షుః కపిలాశ్వత్థసేవనమ్**
**వాసరం పద్మనాభస్య పావనం కిం కలౌయుగే.**

కలియుగమున గంగానది, గీత, సాధుపుంగవుడు (భిక్షువు), కపిలగోవు, రావిచెట్టు - వీని సేవనము, విష్ణుభగవానుని పర్వదినములు (ఏకాదశి మున్నగునవి) - వీనిని మించిన పావనకరములగు వస్తువులు మరియేవి కలవు?

**12. గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైః శాస్త్ర విస్తరైః**
**యా స్వయం పద్మనాభస్య ముఖపద్మాద్వినిస్సృతా.**

గీతను లెస్సగా పఠించవలెను. (శ్రవణ, మనన, నిదిధ్యాసనములను గావింపవలెను.) ఇతరములగు అనేక శాస్త్రములచే నేమి ప్రయోజనము? ఏలననగా, గీత స్వయముగ విష్ణుభగవానుని ముఖపద్మమునుండి బయల్వెడలినది.

**13. ఆపదం నరకం ఘోరం గీతాధ్యాయీ న పశ్యతి.**

గీతాధ్యయనము చేయువాడు ఆపత్తులనుగాని, ఘోరమగు నరకమునుగాని యెన్నటికిని చూడకయే యుండును.

## ఏకశ్లోకీ గీత

**యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః**
**తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ.** **(భ.గీ. 18-78)**

ఎచట యోగేశ్వరుడగు శ్రీకృష్ణమూర్తియు, ఎచట ధనుర్ధారియగు అర్జునుడును ఉందురో, అచ్చోట లక్ష్మి, విజయము, ఐశ్వర్యము, నీతి తప్పక ఉండునని నా నిశ్చయము.

(సంజయుడు)

# గీతకుగల 18 పేర్లు

1. గీతా గంగాచ గాయత్రీ సీతా సత్యా సరస్వతీ
బ్రహ్మవిద్యా బ్రహ్మవల్లీ త్రిసంధ్యా ముక్తిగేహినీ.

2. అర్ధమాత్రా చిదానందా భవఘ్నీ భ్రాన్తినాశినీ
వేదత్రయీ పరాఽనన్తా తత్వార్థజ్ఞానమంజరీ.

3. ఇత్యేతాని జపేన్నిత్యం నరో నిశ్చలమానసః
జ్ఞానసిద్ధిం లభేచ్ఛీఘ్రం తథాఽన్తే పరమం పదమ్.

గీతకు ఈ క్రింది పేర్లు కలవు :-

| | | |
|---|---|---|
| (1) గీత | (2) గంగ | (3) గాయత్రి |
| (4) సీత | (5) సత్య | (6) సరస్వతి |
| (7) బ్రహ్మవిద్య | (8) బ్రహ్మవల్లి | (9) త్రిసంధ్య |
| (10) ముక్తిగేహిని | (11) అర్ధమాత్ర | (12) చిదానంద |
| (13) భవఘ్ని | (14) భ్రాన్తినాశిని | (15) వేదత్రయి |
| (16) పర | (17) అనంత | (18) తత్వార్థజ్ఞానమంజరి |

ఈ పదునెనిమిది గీతానామములను ఎవడు నిశ్చలచిత్తుడై సదాజపించు చుండునో ఆతనికి శీఘ్రముగ జ్ఞానసిద్ధియు, తుదకు పరమాత్మ పదప్రాప్తియు లభించును.

## గీతా శ్లోక సంఖ్య

మహాభారతమునందు భీష్మపర్వములో గీత సంపూర్తి అయినపిదప గీతాశ్లోకసంఖ్యను గురించి శ్రీవేదవ్యాసు లిట్లు తెలిపిరి -

శ్లో॥ **షట్శతాని సవింశాని శ్లోకానాం ప్రాహ కేశవః**
**అర్జునః సప్తపంచాశత్ సప్తషష్టిం చ సంజయః**
**ధృతరాష్ట్రః శ్లోక మేకం గీతాయా మానముచ్యతే**

(భారతము - భీష్మపర్వము 43వ అధ్యాయము 4 వ శ్లోకము)

**తా॥** గీతయందు శ్రీకృష్ణమూర్తి 620 శ్లోకములను, అర్జునుడు 57 శ్లోకములను, సంజయుడు 67 శ్లోకములను ధృతరాష్ట్రుడు 1 శ్లోకమును చెప్పిరి. (మొత్తము 745 శ్లోకములు). కాని ఇప్పుడు లోకమున వాడుకలోనున్న గీతయందు శ్రీకృష్టుడు చెప్పినని 574 శ్లోకములుగను, అర్జునుడు చెప్పినని 84 శ్లోకములుగను, సంజయుడు చెప్పినని 41 శ్లోకములుగను, ధృతరాష్ట్రుడు చెప్పినది 1 శ్లోకముగను కలదు (మొత్తము 700 శ్లోక). అనగా భారతమందు గీతాశ్లోకసంఖ్య మొత్తము 745 అని తెలుపబడగా ఇప్పటి గీతలలో 700 శ్లోకములు మాత్రమే లభించుచున్నవి. కొన్ని ప్రతులలో 13వ అధ్యాయ ప్రారంభమున 'ప్రకృతిం పురుషంచైవ' అను అర్జునుని ప్రశ్నరూపమగు శ్లోకము కలదు. దానితో చేర్చిన మొత్తము 701 శ్లోకములగును. తక్కిన 44 శ్లోకములు ఏమైనవాయని పరిశోధించినవారు చాల అరుదుగానుండిరి. రాజస్థాన్‌లోని కథియవాడ్ ప్రాంతమున కొందరు విద్వాంసులు గీతా తాళపత్రములను లెస్సగ పరిశోధించి, తుట్టతుదకు బోజ (భూర్జర) పత్రములపై లిఖింపబడియున్న 755 శ్లోకములుగల ఒకానొక గీతాప్రతిని కనుగొనిరట. కాని అదియు భారతోక్త సంఖ్యకు సరిపోవుటలేదు. ఏది యెట్లున్నను భారతోక్త ప్రమాణమును బట్టి 44 అద్భుత గీతాశ్లోకములు కాలగర్భములో నెచ్చటనో విలీనములై పోయినవని స్పష్టమగుచున్నది. దీని విషయమై శాస్త్రజ్ఞులు తీవ్రమగు పరిశోధన సలుపుట ఆవశ్యకమైయున్నది.

## గీత - ఉపనిషత్సారము

ఉపనిషత్తులను గోవులయొక్క క్షీరమే భగవద్గీత. నిగూఢములగు ఉపనిషత్సిద్ధాంతములను సర్వజనులకును సులభముగ బోధపడులాగున గీత ప్రవచించినది. కావున ఉపనిషత్తులకును, గీతకును పెక్కుచోట్ల సామ్యము కలదు. అట్టి సందర్భములు కొన్ని ఈ క్రింద నిరూపింపబడుచున్నవి -

1. **శిష్యుడు గురువుదగ్గఱకు సందేహనివృత్తికొఱకై వెళ్ళి భక్తిపూర్వకముగ ఆతనిని ప్రశ్నించును -**

**ఉపనిషత్తు:-**

1. తద్విజ్ఞానార్థం స గురు మేవాభిగచ్ఛేత్ సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్. తస్మై స విద్వానుపసన్నాయ సమ్యక్ ప్రశాన్తచిత్తాయ శమాన్వితాయ యేనాక్షరం పురుషం వేదసత్యం ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్.

(ముండక 1-2-12, 13)

2. శౌనకో౽ఙ్గిరసం విధివదుపసన్నః పప్రచ్ఛ (ముం 1-3)
3. భృగుర్వైవారుణిః వరుణం పితర ముపససార (తై- భృవ 1)
4. అధీహి భగవన్ ఇతిహోపససాద సనత్కుమారం నారదః (ఛాం 7-1)

**గీత :–**

కార్పణ్యదోషోపహతః (భ.గీ. 2-7)

II. బ్రహ్మవిద్య శోకమోహములను తొలగించును –

**ఉపనిషత్తు :–**

(1) తత్ర కో మోహః కఃశోక ఏకత్వ మనుపశ్యతః (ఈ. 7)
(2) తరతి శోకమాత్మవిత్ (ఛాం 7-3)
(3) అభయం వై జనక ప్రాప్తో౽సి (బృ. 4-2-4)

**గీత :–**

(1) మోహో౽యం విగతో మమ. (భ.గీ. 11-1)
(2) నష్టోమోహః. (భ.గీ. 18-73)

III యజ్ఞదాన తపోరూపకర్మలు చిత్తమును శుద్ధపఱచి జ్ఞానోత్పత్తికి సహాయపడును. కావున వానిని ప్రారంభములో ముముక్షువు తప్పక ఆచరించవలెను.

**ఉపనిషత్తు :–**

(1) తదేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసా౽నాశకేన ఏతమేవ విదిత్వా మునిర్భవతి (బృ. 4-4-22)

**గీత :–**

(1) నకర్మణా మనారమ్భాన్నైష్కర్మ్యం...
(2) యజ్ఞోదానం తపశ్చైవ...
(3) సన్న్యాసస్తు మహాబాహో దుఃఖ మాప్తు మయోగతః
(4) స్వకర్మణా తమభ్యర్చ్య .....

IV. జ్ఞానముచే అజ్ఞానము నశించి మోక్షము కలుగును –

**ఉపనిషత్తు :–**

(1) తమేవం విద్వానమృత ఇహభవతి నాన్యః పన్థా విద్యతే౽యనాయ (నా.ఉ)
(2) తమేవ విదిత్వాతిమృత్యు మేతి నాన్యఃపన్థా విద్యతే౽యనాయ (శ్వే.3-8)
(3) స యో హ వై తత్పరమం బ్రహ్మ వేద బ్రహ్మైవభవతి (ముం. 3-2-6)
(4) యదా చర్మవదాకాశం వేష్టయిష్యన్తి మానవాః
తదా దేవ మవిజ్ఞాయ దుఃఖస్యాన్తో భవిష్యతి (శ్వే. 6-20)
(5) జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః (శ్వే. 2-15)
(6) జ్ఞాత్వా శివం శాన్తి మత్యన్తమేతి (శ్వే. 4-14)
(7) నిచాయ్య తం మృత్యుముఖా త్ప్రముచ్యతే (కా)

**గీత :-**

(1) జ్ఞానేన తు తదజ్ఞానం ....
(2) యజ్జ్ఞాత్వా న పునర్మోహం ....
(3) జ్ఞాత్వా మాం శాన్తి మృచ్ఛతి.
(4) జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తిం .....

**V. మోక్షము నిత్యము :-**

**ఉపనిషత్తు**

1. న స పునరావర్తతే (ఛాం)

**గీత :-**

(1) మా ముపేత్య పునర్జన్మ
(2) యద్గత్వా న నివర్తన్తే ....

**VI. సకామకర్మ నింద్యమైనది :-**

**ఉపనిషత్తు :-**

(1) ప్లవాహ్యేతే అదృఢా యజ్ఞరూపా (ముం. 1-2-7)
(2) జంఘన్యమానాః పరియన్తి మూఢా ... (ముం. 1-2-8)

**గీత :-**

(1) యామిమాం పుష్పితాం వాచం ....

**VII. స్వర్గమునుండి పునరావృత్తి కలుగును :-**

**ఉపనిషత్తు :-**

(1) నాకస్యపృష్ఠే తే సుకృతేఽనుభూత్వా ఇమం లోకం హీనతరం వా విశన్తి (ముం. 1-2-10)

**గీత :-**

(1) త్రైవిద్యా మాం సోమపాః ....
(2) తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం .....

**VIII. జ్ఞానముచే హృదయగ్రంథిభేదనము, సంశయనివృత్తి, కర్మక్షయము కలుగును.**

**ఉపనిషత్తు :-**

(1) భిద్యతే హృదయగ్రన్థిః...... (ముం 2-2-8)

**గీత :-**

(1) యథైధాంసి సమిద్ధోఽగ్నిః

**IX. జ్ఞానముచే సర్వపాపనివృత్తి సంభవించును -**

**ఉపనిషత్తు :-**

(1) సర్వే పాప్మానోఽతో నివర్తన్తే (ఛాం. 8-4-2)
(2) తం విదిత్వా నలిప్యతే కర్మణా పాపకేన (బృ. 4-4-22)

**గీత :–**

(1) అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః ......

**X. ప్రణవోపాసన – ముండక, ప్రశ్న, కఠ, తైత్తిరీయ, ఛాందోగ్యాద్యుపనిషత్తులలో ప్రణవోపాసన చెప్పబడినది. అట్లే గీతలోకూడ పేర్కొనబడినది.**

**గీత :–**

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ ......

**XI. జ్ఞానఫలమున సమస్త సత్కర్మలయొక్క ఫలము అంతర్భూతము –**

**ఉపనిషత్తు :–**

సర్వం తదభిసమేతి యత్కించ ప్రజాః సాధుః కుర్వన్తి యస్తద్వేద యత్సవేద (ఛాం. 4-2-4)

**గీత :–**

(1) యావానర్థ ఉదపానే .....

(2) సర్వం కర్మాఖిలం పార్థ .....

(3) వేదేషు యజ్ఞేషు తపఃసుచైవ ....

**XII. జ్ఞానసిద్ధికి, మోక్షప్రాప్తికి కామాదుల త్యాగ మవసరము.**

**ఉపనిషత్తు :–**

(1) యదాసర్వే ప్రముచ్యన్తే కామాయేఽస్య హృది స్థితాః

**గీత :–**

(1) ప్రజహాతి యదా కామాన్ ...

## గీతలోని సాక్షాత్ ఉపనిషద్వాక్యములు

**గీతలో కొన్నిచోట్ల ఉపనిషద్వాక్యములు ఉన్నవి ఉన్నట్లుగనే పేర్కొనబడినవి. అవి యేవియనిన –**

(1) న జాయతే మ్రియతే వా కదాచిత్ .... (2-20)

(2) ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే .... (2-19)

(3) ఆశ్చర్యవత్పశ్యతి .... (2-29)

(4) యదక్షరం వేదవిదో వదన్తి ... (8-11)

(5) సర్వతః పాణిపాదం తత్ .... (13-14)

(6) సర్వేన్ద్రియగుణాభాసం .... (13-15)

(7) దూరస్థం చాన్తికే చ తత్ .... (13-16)

(8) ఊర్ధ్వమూలమధఃశాఖమ్ .... (15-1)

# గీతామహిమ

(వైష్ణవీయతంత్రసారమునుండి)

**1. శౌనక ఉవాచ:- గీతాయాశ్చైవ మాహాత్మ్యం యథావత్సూత మే వద**
**పురా నారాయణక్షేత్రే వ్యాసేన మునినోదితమ్.**

శౌనకుడు: ఓ సూతమునీంద్రా! పూర్వ మొకానొకపుడు నారాయణక్షేత్రమున శ్రీ వ్యాసమునీంద్రుడు చెప్పిన గీతామహిమను ఉన్నది ఉన్నట్లుగా నాకు చెప్పుడు.

**2. సూతఉవాచ:- భద్రం భగవతా పృష్టం యద్ధి గుప్తతమం పరమ్**
**శక్యతే కేన తద్వక్తుం గీతామాహాత్మ్య ముత్తమమ్.**

సూతుడు:- శౌనకా! నీవు మంగళకరమైన ప్రశ్న నడిగితివి. కాని, అతిగోప్యమై సర్వోత్తమమైనట్టి గీతామహిమను సంపూర్ణముగ ఎవరు వర్ణించి చెప్పగలరు?

**3. కృష్ణో జానాతి వై సమ్యక్ కించిత్కుంతీసుతః ఫలమ్**
**వ్యాసోవా వ్యాసపుత్రోవా యాజ్ఞవల్క్యోఽథ మైథిలః.**

గీతయొక్క మహిమను పూర్తిగ తెలిసినవాడు శ్రీకృష్ణుడొక్కడే. అర్జునునకు దానిని గుఱించి ఒకింతమాత్రము తెలియును. అట్లే వ్యాసులుగాని, శుకులుగాని, యాజ్ఞవల్క్యుడుగాని, జనకుడుగాని, కొంత కొంత తెలిసికొనియున్నారు.

**4. అన్యే శ్రవణతః శ్రుత్వా లేశం సంకీర్తయన్తి చ**
**తస్మాత్కించిద్వదామ్యత్ర వ్యాసస్యాస్యాన్మయా శ్రుతమ్.**

ఇక తక్కినవారు కర్ణాకర్ణిగ విని ఆ గీతయొక్క మహిమను లేశమాత్రము వర్ణింపగలుగుచున్నారు. ఈ ప్రకారముగ వ్యాసుల ముఖతః నేను వినినదాని నొకింత ఇచట చెప్పుచున్నాను వినుము.

**5. సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనన్దనః**
**పార్థో వత్సః సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్.**

ఉపనిషత్తులన్నియు ఆవులు; శ్రీకృష్ణమూర్తి పాలుపితుకువాడు; అర్జునుడు దూడ; మహత్తరమగు గీతామృతమే పాలు; సద్బుద్ధికలవాడే ఆ పాలను త్రాగువాడు.

**6. సారథ్య మర్జునస్యాదౌ కుర్వన్ గీతామృతం దదౌ**
**లోకత్రయోపకారాయ తస్మై కృష్ణాత్మనే నమః.**

ఏ మహనీయుడు పూర్వము అర్జునునకు రథసారథ్యము చేయుచునుగూడ ముల్లోకములకు మహోపకారముచేయు నిమిత్తము అతనికి గీతామృతము నొసంగెనో, అట్టి శ్రీకృష్ణపరమాత్మకు నమస్కారము.

**7. సంసార సాగరం ఘోరం తర్తు మిచ్ఛతి యో నరః**
**గీతానావం సమాసాద్య పారం యాతి సుఖేన సః.**

ఘోరమగు సంసార సముద్రమును దాటదలంచు మానవుడు భగవద్గీతయను నౌకను బడసినచో, సులభముగ అవలి యొడ్డును చేరగలడు.

**8. గీతాజ్ఞానం శ్రుతం నైవ సదైవాభ్యాసయోగతః**
**మోక్షమిచ్ఛతి మూఢాత్మా యాతి బాలక హాస్యతామ్.**

ఎవడు నిరంతరాభ్యాసముచే గీతాజ్ఞానమును అనుభూత మొనర్చుకొనక, మోక్షమును మాత్రము కోరుచుండునో, అట్టి మూఢుడు బాలురకుకూడ పరిహాసపాత్రుడేయగును.

**9. యే శృణ్వన్తి పఠన్త్యేవ గీతాశాస్త్ర మహర్నిశమ్**
**న తేవై మానుషా జ్ఞేయా దేవరూపా న సంశయః.**

ఎవరు గీతాశాస్త్రమును అహర్నిశము శ్రవణము చేయుచు, పఠించుచూ నుందురో, అట్టివారిని మానవులుగ తలంపరాదు, వారు నిస్సంశయముగ దేవరూపులే యగుదురు.

**10. గీతాజ్ఞానేన సంబోధం కృష్ణః ప్రాహార్జునాయ వై**
**భక్తితత్త్వం పరం తత్ర సగుణం చాథ నిర్గుణమ్.**

శ్రీకృష్ణమూర్తి అర్జునునకు గీతాప్రబోధముద్వారా సమ్యక్ జ్ఞానమును, ఉత్కృష్టమగు భక్తితత్త్వమును, అందును సగుణ నిర్గుణ స్వరూపముల రెండింటిని లెస్సగ నుపదేశించెను.

**11. సోపానాష్టాదశైరేవ భుక్తి ముక్తి సముచ్ఛ్రితైః**
**క్రమశః చిత్తశుద్ధిః స్యా త్ప్రేమ భక్త్యాది కర్మసు.**

భుక్తి, ముక్తిదాయకములగు ఉపదేశములతో గూడి సమున్నతములైనట్టి పదునెనిమిది అధ్యాయములను సోపానముల ద్వారా ప్రేమ, భక్త్యాది సహిత కర్మలందు ప్రవేశింప, క్రమముగ జీవునకు చిత్తశుద్ధి కలుగగలదు.

**12. సాధు గీతామ్భసి స్నానం సంసారమలనాశనమ్**
**శ్రద్ధాహీనస్య తత్కార్యం హస్తిస్నానం వృథైవ తత్.**

గీతయను జలమందు స్నానము చేయుట చాల యుత్తమము. ఏలననిన, అయ్యది సంసార మాలిన్యమును నశింపజేయ గలదు. కాని శ్రద్ధారహితునకు అక్కార్యము గజస్నానము★ వలె వ్యర్థమేయగును.

**13. గీతాయాశ్చ న జానాతి పఠనం నైవ పాఠనమ్**
**స ఏవ మానుషే లోకే మోఘకర్మకరో భవేత్.**

గీతను పఠించుట, ఇతరులచే పఠింపజేయుట అనునవి తెలియనివాడీ మానవలోకమున వ్యర్థకార్యము లాచరించువాడే యగును.

★ గజస్నానము - ఏనుగునకు స్నానముచేయించి వదలినచో వెంటనే అది దుమ్మును నెత్తిన చల్లుకొనును. కావున స్నానఫలితము దానికి లభించదు.

**14. యస్మాద్గీతాం న జానాతి నాధమస్తత్పరో జనః**
**ధిక్తస్య మానుషం దేహం విజ్ఞానం కులశీలతామ్.**

గీతను తెలిసికొననివానికంటె అధముడు మఱియొక డుండబోడు. అట్టివాని మానవశరీరమునకు, విజ్ఞానమునకు, కులశీలములకు ధిక్కారమగుగాక!

**15. గీతార్థం న విజానాతి నాధమస్తత్పరో జనః**
**ధిగ్ఛరీరం శుభం శీలం విభవం తద్గృహాశ్రమమ్.**

గీతార్థమును తెలిసికొనని వానికంటె అల్పుడగువాడు మఱియొక డుండబోడు. అట్టివాని సుందరశరీరమునకు, శీలమునకు, వైభవమునకు, గృహస్థాశ్రమమునకు ధిక్కారమగుగాక !

**16. గీతాశాస్త్రం న జానాతి నాధమస్తత్పరో జనః**
**ధిక్ ప్రారబ్ధం ప్రతిష్ఠాం చ పూజాం మానం మహత్తమమ్.**

గీతాశాస్త్రమును ఎఱుగనివానికంటె నీచుడగు మనుజుడు మఱియొక డుండబోడు. అట్టివాని ప్రారబ్ధమునకు ప్రతిష్ఠకు, పూజకు, సన్మానమునకు ధిక్కారమగుగాక !

**17. గీతాశాస్త్రే మతిర్నాస్తి సర్వం తన్నిష్ఫలం జగుః**
**ధిక్ తస్య జ్ఞానదాతారం వ్రతం నిష్ఠాం తపో యశః.**

గీతాశాస్త్రమున బుద్ధి ప్రీతిగొననివానికి పైనదెల్పిన సమస్తము నిష్ఫలమేయని చెప్పబడినది. గీతా ధర్మమునకు విరుద్ధముగ బోధించువానియొక్క వ్రతమునకు, నిష్ఠకు, తపస్సుకు, కీర్తికి ధిక్కారమగుగాక!

**18. గీతార్థ పఠనం నాస్తి నాధమస్తత్పరో జనః**
**గీతాగీతం న యజ్జ్ఞానం తద్విద్ధ్యాసురసమ్భవమ్.**

గీతార్థమును పఠింపనివానికంటె అధముడగు మనుజుడు వేఱొక డుండబోడు. గీతకు సమ్మతముకాని జ్ఞానము ఆసురీప్రకృతి కలవారి బుద్ధినుండి జనించినదేయగును.

**19. తన్మోఘం ధర్మరహితం వేదవేదాన్తగర్హితమ్**
**తస్మాద్ధర్మమయీ గీతా సర్వజ్ఞానప్రయోజికా**
**సర్వశాస్త్రసారభూతా విశుద్ధా సా విశిష్యతే.**

గీతావిరుద్ధమగు జ్ఞానము వేదవేదాంతములచే గర్హితమున్ను, ధర్మరహితమున్ను, వ్యర్థమునగును. కాబట్టి ధర్మమయమై, సమస్త జ్ఞానమును బోధించునదై, సర్వశాస్త్రముల సారమై విశుద్ధమై యుండుట వలన గీత సర్వోత్తమముగ చెప్పొందుచున్నది.

**20. యోఽధీతే విష్ణుపర్వాహే గీతాం శ్రీహరివాసరే**
**స్వపఞ్జాగ్రచ్చల న్తిష్ఠఞ్ఛత్రుభిర్న స హీయతే.**

విష్ణుపర్వదినములందు, లేక ఏకాదశీమున్నగు దివసములందు, గీత నెవడు అధ్యయనము చేయునో, అట్టివాడు నిద్రించుచున్నను, మేల్కొనియున్నను, నడచుచున్నను, కూర్చొనియున్నను, శత్రువులచే (లేక కామక్రోధాదులచే) ఎన్నడును పరాభవమును బొందకయే యుండును.

**21. సాలగ్రామశిలాయాం వా దేవాగారే శివాలయే**
**తీర్థే నద్యాం పఠేద్ గీతాం సౌభాగ్యం లభతే ధ్రువమ్.**

సాలగ్రామశిలయొద్దగాని, దేవాలయమునందుగాని, శివాలయమునందుగాని, తీర్థస్థానమందుగాని నదీతీరమునగాని గీత నెవడు పఠించునో, వానికి సౌభాగ్యము తప్పక లభించును.

**22. దేవకీనందనః కృష్ణో గీతాపాఠేన తుష్యతి**
**యథా న వేదై ర్దానేన యజ్ఞతీర్థవ్రతాదిభిః.**

దేవకీసుతుడగు శ్రీకృష్ణపరమాత్మ గీతాపఠనముచే నెట్టి సంతుష్టిని బొందునో, అట్టి సంతుష్టిని వేదములచేగాని, దానముచేగాని, యజ్ఞతీర్థవ్రతాదులచేగాని బొందకుండును.

**23. గీతాధీతా చ యేనాపి భక్తిభావేన చోత్తమా**
**వేదశాస్త్రపురాణాని తేనాధీతాని సర్వశః.**

ఉత్తమమగు ఈ గీతాశాస్త్రమును భక్తిభావముతో అధ్యయనము చేయువాడు సమస్త వేదములను, శాస్త్రములను, పురాణములను, అధ్యయనము చేసినట్లేయగును.

**24. యోగిస్థానే సిద్ధపీఠే శిలాగ్రే సత్సభాసు చ**
**యజ్ఞే చ విష్ణుభక్తాగ్రే పఠన్ సిద్ధిం పరాం లభేత్.**

యోగుల నివాసస్థానమందును, సిద్ధపీఠమందును, సాలగ్రామశిలయొద్దను, సత్పురుషులయొక్క గోష్ఠులందును, యజ్ఞములందును, విష్ణుభక్తుని యెదుటను గీతను చదువువాడు ఉత్తమసిద్ధినిబడయును.

**25. గీతాపాఠం చ శ్రవణం యః కరోతి దినే దినే**
**క్రతవో వాజిమేధాద్యాః కృతాస్తేన సదక్షిణాః.**

ఎవడు ప్రతిదినమున్ను గీతాపఠనమును, గీతాశ్రవణమును గావించుచుండునో, అట్టివాడు దక్షిణలతో గూడ పెక్కు అశ్వమేధయాగము లాచరించినవాడేయగును.

**26. యః శృణోతి చ గీతార్థం కీర్తయత్యేవ యః పరమ్**
**శ్రావయేచ్చ పరార్థం వై స ప్రయాతి పరంపదమ్.**

ఎవడు గీతార్థమును శ్రవణముచేయునో, మఱియు అద్దానిని ఇతరులకును వర్ణించి చెప్పునో, అందలి ఉత్తమ భావములను పరులకు వినిపించునో, అట్టివాడు పరమాత్మపదమును బొందును.

**27. గీతాయాః పుస్తకం శుద్ధం యోఽర్పయత్యేవ సాదరాత్**
**విధినా భక్తిభావేన తస్య భార్యా ప్రియా భవేత్.**

**28. యశః సౌభాగ్య మారోగ్యం లభతే నాత్ర సంశయః**
**దయితానాం ప్రియో భూత్వా పరమం సుఖ మశ్నుతే.**

పరిశుద్ధమగు గీతాగ్రంథమును ఎవడు ఆదరముతోను, భక్తిభావముతోను, విధిపూర్వకముగను ఇతరులకు సమర్పించునో, అట్టివాని భార్య అతనికి సదా అనుకూలవర్తినిగ నుండును. మఱియు అట్టి

గీతాపుస్తకదాత కీర్తి, సౌభాగ్యము, ఆరోగ్యమును తప్పక బడయును. తన ధర్మపత్ని మున్నగు వారికి ప్రియుడై పరమసుఖమును బొందుచుండును.

**29. అభిచారోద్భవం దుఃఖం వరశాపాగతం చ యత్**
**నోపసర్పన్తి తత్రైవ యత్ర గీతార్చనం గృహే.**

ఏ గృహమందు గీతాగ్రంథము పూజింపబడుచుండునో, అచ్చోట అభిచార★ జనిత దుఃఖములుగాని, పెద్దల శాపములవలన కష్టములుగాని సమీపించనే సమీపించవు.

**30. తాపత్రయోద్భవా పీడా నైవ వ్యాధి ర్భవే త్క్వచిత్**
**న శాపో నైవ పాపం చ దుర్గతి ర్నరకం న చ.**

గీతాగ్రంథము పూజింపబడు గృహమందు తాపత్రయమువలన కలుగు బాధలుగాని, రోగములుగాని సంభవించుకుండును. మఱియు శాపముగాని, దుర్గతిగాని, నరకముగాని ఆగృహవాసులచే అనుభవింపబడకయే యుండును.

**31. విస్ఫోటకాదయో దేహే న బాధన్తే కదాచన**
**లభేత్ కృష్ణపదే దాస్యం చావ్యభిచారిణీమ్.**

గీతాభ్యాసనిరతునకు శరీరముపై బొబ్బలు, కురుపులు మున్నగునవి ఎన్నడును బాధింప కుండును. మఱియు నాతడు శ్రీకృష్ణమూర్తి యొక్క పాదకములములందు దాస్యవృత్తిని, అచంచల భక్తిని బడయును.

**32. జాయతే సతతం సఖ్యం సర్వజీవగణైః సహ**
**ప్రారబ్ధం భుంజతో వాఽపి గీతాభ్యాసరతస్యచ.**

**33. సముక్తః ససుఖీ లోకే కర్మణా నోపలిప్యతే**
**మహాపాపాది పాపాని గీతాధ్యాయీ కరోతిచేత్**
**న కించత్ స్పృశ్యతే తస్య నలినీదలమంభసా**

గీతాభ్యాసతత్పరుడు ప్రారబ్ధమునభవించుచున్నను, సమస్త భూతకోట్లతో నిరంతరము సఖ్యము కల్గియుండును. మఱియు నతడు ముక్తుడును సుఖవంతుడునగును. కర్మలచే అంటబడకయే యుండును. తామరాకును నీరంటనట్లు మహాపాపాదు లతనిని అంటనేరవు.

**34. అనాచారోద్భవం పాప మావాచ్యాదికృతం చ యత్**
**అభక్ష్యభక్షజం దోష మస్పృశ్యస్పర్శజం తథా.**

**35. జ్ఞానాజ్ఞానకృతం నిత్య మిన్ద్రియైర్జనితం చ యత్**
**తత్సర్వం నాశమాయాతి గీతాపాఠేన తత్క్షణాత్.**

అనాచారము, దుర్భాషణము, అభక్ష్యసేవనము (భక్షింపరానివానిని భక్షించుట), స్పృశింపరాని వానిని స్పృశించుట, తెలిసిగాని, తెలియకగాని చేయబడునవియు, ఇంద్రియములద్వారా ప్రతినిత్యము సంభవించునవియునగు పాపము లేవికలవో అవియన్నియు గీతాపఠనముచే తత్క్షణమే నశించిపోవును.

★ అభిచారము:- శత్రువుద్వారా చేయబడు మారణసంబంధమైన ఉచ్చాటనాదులు.

36. సర్వత్ర ప్రతిభోక్తా చ ప్రతిగృహ్యా చ సర్వశః
గీతాపాఠం ప్రకుర్వాణో న లిప్యేత కదాచన.

అన్నిచోట్ల భోజనము చేయువాడును, అందఱినుండి దానమును గ్రహించువాడును, గీతాపఠనము చేయుచో, ఆ యా పాపములచే నెన్నడును అంటబడకయేయుండును.

37. రత్నపూర్ణాం మహీం సర్వాం ప్రతిగృహ్యావిధానతః
గీతాపాఠేన చైకేన శుద్ధ స్ఫటికవత్సదా.

రత్నములచే పరిపూర్ణమైనట్టి భూమినంతను అవిధిపూర్వకముగ దానము స్వీకరించినప్పటికిని, గీతను ఒక్క పర్యాయము పఠనముచేసినచో మనుజుడు శుద్ధస్ఫటికవలె సదా నిర్మలుడుగనే భాసిల్లును.

38. యస్యాన్తఃకరణం నిత్యం గీతాయాం రమతే సదా
స సాగ్నికః సదా జాపీ క్రియావాన్ స చ పండితః.

39. దర్శనీయస్స ధనవాన్ స యోగీ జ్ఞానవానపి
స ఏవ యాజ్ఞికో యాజీ సర్వవేదార్థదర్శకః.

ఎవని అంతఃకరణము నిత్యము గీత యందే ప్రీతిగొనుచుండునో ఆతడే అగ్నిహోత్రము కలవాడును, ఆతడే నిరంతరము జపము సల్పువాడును, ఆతడే కర్మనిష్ఠుడును, ఆతడే పండితుడుననగును. మఱియు నట్టి గీతాతత్పరుడే దర్శింపదగినవాడును, ధనవంతుడును, యోగియు, జ్ఞానవంతుడును, యజ్ఞము సల్పువాడును, యజమానుడును, సంపూర్ణ వేదార్థము నెఱిగినవాడునగును.

40. గీతాయాః పుస్తకం యత్ర నిత్యపాఠశ్చ వర్తతే
తత్ర సర్వాణి తీర్థాని ప్రయాగాదీని భూతలే.

ఎచట గీతాగ్రంథము నిత్యము పఠింపబడుచుండునో, అచట ప్రయాగాది సమస్తతీర్థములున్ను వచ్చి చేరును.

41. నివసన్తి సదా దేహే దేహశేషేఽపి సర్వదా
సర్వే దేవాశ్చ ఋషయో యోగినో దేహరక్షకాః.

గీతాపాఠకుని శరీరమున తీర్థములన్నియు సదా వసించుచుండును. దేహవియోగమైనప్పుడు కూడ అతని దేహశేషమున ఆ తీర్థములు వర్తించుచుండును. సమస్తదేవతలు, ఋషులు, యోగులు, ఆ గీతాధ్యాయి యొక్క శరీరమును సంరక్షించుచుందురు.

42. గోపాలో బాలకృష్ణోఽపి నారద ధ్రువ పార్షదైః
సహాయో జాయతేశీఘ్రం యత్ర గీతా ప్రవర్తతే.

ఎచట గీతాపఠనము జరుగుచుండునో అచట గోపాలుడగు బాలకృష్ణుడున్ను నారద ధ్రువాది పార్షదులతో గూడ సహాయము నిమిత్తము శీఘ్రముగ వచ్చి చేరుదురు.

43. యత్ర గీతా విచారశ్చ పఠనం పాఠనం తథా
మోదతే తత్ర భగవాన్ కృష్ణో రాధికయా సహ.

ఎచట గీతయొక్క విచారణ, పఠనము, బోధనము జరుగుచుండునో, అచట భగవంతుడగు శ్రీకృష్ణ పరమాత్మ రాధతో గూడ విజయము చేసి ఆనందపడుచుండును.

**శ్రీ భగవానువాచ –**

**44. గీతా మే హృదయం పార్థ గీతా మే సార ముత్తమమ్**
**గీతా మే జ్ఞాన మత్యుగ్రం గీతా మే జ్ఞాన మవ్యయమ్.**

**శ్రీ భగవానుడు చెప్పెను –**

ఓ అర్జునా! గీతయే నా హృదయము. గీతయే నాయొక్క ఉత్తమ తత్త్వము. గీతయే నాయొక్క తేజోవంతమైన, నాశరహితమైన జ్ఞానము.

**45. గీతా మే చోత్తమం స్థానం గీతా మే పరమం పదమ్**
**గీతా మే పరమం గుహ్యం గీతా మే పరమో గురుః.**

గీతయే నాయొక్క ఉత్తమస్థానము. గీతయే నాయొక్క శ్రేష్ఠమగు పదము. గీతయే నాయొక్క పరమరహస్యము. గీతయే నాయొక్క పరమగురువు.

**46. గీతాశ్రయోఽహం తిష్ఠామి గీతా మే పరమం గృహమ్**
**గీతాజ్ఞానం సమాశ్రిత్య త్రీన్లోకాన్ పాలయామ్యహమ్.**

నేను గీత నాశ్రయించుకొనియున్నాను. గీత నాయొక్క ఉత్తమ గృహము. గీతాజ్ఞానము నాశ్రయించియే నేను ముల్లోకములను పాలించుచున్నాను.

**47. గీతా మే పరమా విద్యా బ్రహ్మరూపా న సంశయః**
**అర్థమాత్రా పరా నిత్యా స్వానిర్వాచ్యపదాత్మికా.**

గీతయే నాయొక్క శ్రేష్ఠమగు విద్య. అది బ్రహ్మస్వరూపము. (ప్రణవము యొక్క నాలుగవ పాదమగు) అర్థమాత్ర రూపము. ఉత్కృష్టమైనది. నిత్యమైనది. అనిర్వచనీయమైన స్వరూపము గలది. ఇట ఏలాటి సంశయమున్ను లేదు.

**48. గీతానామాని వక్ష్యామి గుహ్యాని శృణు పాణ్డవ**
**కీర్తనా త్సర్వపాపాని విలయం యాన్తి తత్క్షణాత్.**

పాండుతనయుడవగు ఓ అర్జునా! నీ కిపుడు రహస్యములగు గీతానామములను చెప్పుచున్నాను వినుము. వాని నుచ్చరించుటచే సమస్తపాపములున్ను తత్క్షణమే నశించిపోగలవు.

**49. గంగా గీతా చ గాయత్రీ సీతా సత్యా సరస్వతీ**
**బ్రహ్మవల్లీ బ్రహ్మవిద్యా త్రిసంధ్యా ముక్తిగేహినీ.**

**50. అర్థమాత్రా చిదానన్దా భవఘ్నీ భ్రాన్తినాశినీ**
**వేదత్రయీ పరాఽనన్తా తత్త్వార్థజ్ఞానమఞ్జరీ.**

**51. ఇత్యేతాని జపేన్నిత్యం నరో నిశ్చలమానసః**
**జ్ఞానసిద్ధిం లభేన్నిత్యం తథాన్తే పరమం పదమ్.**

"గంగ, గీత, గాయత్రీ, సీత, సరస్వతి, బ్రహ్మవల్లి, బ్రహ్మవిద్య, త్రిసంధ్య, ముక్తిగేహిని, అర్ధమాత్ర, చిదానంద, భవఘ్ని, భ్రాంతినాశిని, వేదత్రయి, పర, అనంత, తత్త్వార్థ జ్ఞానమంజరి" - గీతయొక్క ఈ నామములను మనుజుడు నిశ్చలచిత్తుడై నిరంతరము జపించవలెను. దానిచే నతడు నిరంతర జ్ఞానసిద్ధిని బడసి తుదకు పరమాత్మపదమును బొందుచున్నాడు.

**52. పాఠేఽసమర్థః సంపూర్ణే తదర్ధం పాఠ మాచరేత్**
**తదా గోదానజం పుణ్యం లభతే నాత్ర సంశయః.**

గీతను సంపూర్ణముగ చదువలేనివాడు అందు సగముభాగము చదువవలెను. అప్పుడు గోదానము వలన కలుగు ఫలిత మతనికి తప్పక లభించగలదు.

**53. త్రిభాగం పఠమానస్తు సోమయాగఫలం లభేత్**
**షడంశం జపమానస్తు గంగాస్నానఫలం లభేత్.**

గీతను మూడుభాగములు పఠించువానికి సోమయాగముయొక్క ఫలము లభించును. గీతయొక్క ఆఱవభాగము (3 అధ్యా) జపించువానికి గంగాస్నానఫలము దొరకును.

**54. తథాఽధ్యాయద్వయం నిత్యం పఠమానో నిరన్తరమ్**
**ఇంద్రలోక మవాప్నోతి కల్పమేకం వసేద్ధ్రువమ్.**

గీతను రెండధ్యాయములు నిత్యము పఠించువాడు ఇంద్రలోకమును బొంది, ఒక కల్పకాలము వఱకచట తప్పక వసించును.

**55. ఏక మధ్యాయకం నిత్యం పఠతే భక్తిసంయుతః**
**రుద్రలోక మవాప్నోతి గణోభూత్వా వసేచ్చిరమ్.**

నిత్యము ఒక్క అధ్యాయమును భక్తితో పఠించువాడు రుద్రలోకమును బొంది, అచట రుద్రగణమై చిఱకాలము వసించును.

**56. అధ్యాయార్థం చ పాదం వా నిత్యం యః పఠతే జనః**
**ప్రాప్నోతి రవిలోకం స మన్వన్తరసమాః శతమ్.**

అట్లే ప్రతిదినము గీత సగము అధ్యాయమునుగాని, లేక పాతిక అధ్యాయమునుగాని ఎవడు చదువునో అతడు నూఱు మన్వంతరముల కాలము సూర్యలోకమున నివసించును.

**57. గీతాయాః శ్లోకదశకం సప్త పంచ చతుష్టయమ్**
**త్రి ద్వ్యేక మేక మర్థం వా శ్లోకానాం యః పఠే న్నరః**
**చంద్రలోక మవాప్నోతి వర్షాణా మయుతం తథా.**

ఎవడు గీతలోని పది శ్లోకములనుగాని, లేక ఏడు శ్లోకములనుగాని లేక ఐదు, లేక నాలుగు, లేక మూడు, లేక ఒక్క శ్లోకమునుగాని లేక సగము శ్లోకమునుగాని నిత్యము పఠించునో అతడు పదివేల సంవత్సరములు చంద్రలోకమున నివసించును.

**58. గీతార్థ మేక పాదం చ శ్లోక మధ్యాయ మేవచ**
**స్మర న్త్యక్త్వా జనో దేహం ప్రయాతి పరమం పదమ్.**

గీతలోని ఒక్క అధ్యాయముయొక్కగాని, లేక ఒక్క శ్లోకముయొక్కగాని, లేక ఒక్క పాదముయొక్కగాని అర్థమును స్మరించుచు దేహమును త్యజించువాడు పరమాత్మపదమును బొందును.

**59. గీతార్థ మపి పాఠం వా శృణుయా దన్తకాలతః**
**మహాపాతకయుక్తోఽపి ముక్తి భాగీ భవేజ్జనః.**

ఎవడు అంత్యకాలమున గీతయొక్క మూలశ్లోకములనుగాని లేక అర్థమునుగాని శ్రవణము చేయునో, అతడు మహాపాపయుక్తుడైనప్పటికిని మోక్షభాగుడు కాగలడు.

**60. గీతాపుస్తకసంయుక్తః ప్రాణాం స్త్యక్త్వా ప్రయాతి యః**
**స వైకుంఠ మవాప్నోతి విష్ణునా సహ మోదతే.**

గీతాగ్రంథమును చేతబట్టుకొని ప్రాణములను వదలువాడు వైకుంఠమును బొంది, విష్ణువుతో గూడ ఆనంద మనుభవించుచుండును.

**61. గీతాధ్యాయ సమాయుక్తో మృతోమానుషతాం వ్రజేత్**
**గీతాభ్యాసం పునః కృత్వా లభతే ముక్తి ముత్తమామ్.**

గీతాధ్యయనము చేయుచు మరణించువాడు తిరిగి శుద్ధమగు మానవజన్మను బడయును. గీతాభ్యాసమును మరల మరల చేయువాడు ఉత్తమమగు మోక్షగతిని బొందును.

**62. గీతేత్యుచ్చార సంయుక్తో మ్రియమాణో గతిం లభేత్**
**యద్యత్కర్మ చ సర్వత్ర గీతాపాఠ ప్రకీర్తితమ్**
**తత్తత్కర్మ చ నిర్దోషం భూత్వా పూర్ణత్వ మాప్నుయాత్.**

'గీత' అను శబ్దమును ఉచ్చరించుచు మరణించువాడు సద్గతిని బడయును. గీతయొక్క పఠనము సంకీర్తనము గావించుచు ఏ యే కర్మ చేయుబడుచుండునో అది యంతయు దోషరహితమై పూర్ణత్వమును బొందుచుండును.

**63. పితౄనుద్దిశ్య యః శ్రాద్ధే గీతాపాఠం కరోతి హి**
**సన్తుష్టాః పితర స్తస్య నిరయా ద్యాన్తి స్వర్గతిమ్.**

శ్రాద్ధ కాలములో పితరుల నుద్దేశించి ఎవడు గీతను పఠించునో, అట్టివాని పితరులు సంతుష్టులై నరకమునుండి స్వర్గమునకేగుదురు.

**64. గీతాపాఠేన సంతుష్టాః పితరః శ్రాద్ధతర్పితాః**
**పితృలోకం ప్రయాన్త్యేవ పుత్రాశీర్వాదతత్పరాః.**

శ్రాద్ధమునందు తృప్తిగావింపబడిన పితరులు గీతాపఠనముచే సంతుష్టులై తమ కుమారులను ఆశీర్వదించి పితృలోకమున కరుగుదురు.

**65. గీతాపుస్తకదానం చ ధేనుపుచ్ఛసమన్వితమ్**
**కృత్వా చ తద్దినే సమ్యక్ కృతార్థో జాయతే జనః.**

ఆవుతో కతోగూడ గీతాపుస్తకమును చేతియందుగైకొని యథారీతి గోవును దానము చేయువాడు ఆ రోజే కృతార్థుడు కాగలడు.

**66. పుస్తకం హేమసంయుక్తం గీతాయాః ప్రకరోతి యః**
**దత్వా విప్రాయ విదుషే జాయతే న పునర్భవమ్.**

గీతాపుస్తకమును బంగారముతోగూడ విద్వాంసుడగు బ్రహ్మణునకు (బ్రహ్మనిష్ఠునకు) దానము చేయువాడు తిరిగి సంసారమున జన్మింపడు.

**67. శతపుస్తకదానం చ గీతాయాః ప్రకరోతి యః**
**స యాతి బ్రహ్మసదనం పునరావృత్తి దుర్లభమ్.**

గీతాపుస్తకములు నూఱింటిని లెస్సగ దానముచేయువాడు పునరావృత్తిరహితమగు బ్రహ్మధామమును బొందును.

**68. గీతాదానప్రభావేణ సప్తకల్పమితాః సమాః**
**విష్ణులోక మవాప్యాన్తే విష్ణునా సహ మోదతే.**

గీతాదాన ప్రభావముచే మనుజుడు అంత్యమున విష్ణులోకమునుబొంది, అచట ఏడు కల్పముల వఱకు విష్ణువుతో గూడ ఆనందపూర్వకముగ వసించును.

**69. సమ్యక్ శ్రుత్వా చ గీతార్థం పుస్తకం యః ప్రదాపయేత్**
**తస్మై ప్రీతః శ్రీభగవాన్ దదాతి మనసేప్సితమ్.**

గీతార్థమును బాగుగ విని ఎవడు గీతాగ్రంథమును దానము చేయునో, అట్టివానియెడల భగవానుడు ప్రీతిగలిగి అతని యభీష్టము నెరవేర్చును.

**70. దేహం మానుషమాశ్రిత్య చాతుర్వర్ణ్యేషు భారత**
**న శృణోతి న పఠతి గీతా మమృతరూపిణీమ్.**
**హస్తాత్త్యక్త్వాఽమృతం ప్రాప్తం స నరో విష మశ్నుతే.**

మనుష్యుడైపుట్టియు, చాతుర్వర్ణ్యములందు జనించియు, అమృతరూపిణియగు గీతను ఎవడు వినకుండునో, చదువకుండునో, అట్టివాడు చేతియందున్న పాయసమును పారవైచి విషమును భుజించువాడేయగును.

**71. జనః సంసారదుఃఖార్తో గీతాజ్ఞానం సమాలభేత్**
**పీత్వా గీతామృతం లోకే లబ్ధ్వా భక్తిం సుఖీ భవేత్.**

సంసారదుఃఖ సంతప్తుడగు మనుజుడు గీతాజ్ఞానమును పొందవలయును. ఈ ప్రకారముగా గీతామృతమును పానమొనర్చి భగవద్భక్తినిపొంది ఈ ప్రపంచమున సుఖియై మెలగవలయును.

**72. గీతా మాశ్రిత్య బహవో భూభుజో జనకాదయః**
**నిర్ధూత కల్మషా లోకే గతాస్తే పరమం పదమ్.**

గీత నాశ్రయించి ఈ ప్రపంచమున జనకాది రాజశ్రేష్ఠు లెందరో పాపరహితులై ఉత్తమమగు కైవల్యపదమును బొందిరి.

**73. గీతాసు న విశేషోఽస్తి జనేషూచ్చావచేషు చ**
**జ్ఞానేష్వేవ సమగ్రేషు సమా బ్రహ్మస్వరూపిణీ.**

గీతాధ్యయన విషయమందు జనులలో చిన్న, పెద్ద అను తేడా ఏమియును లేదు. (దానికి అందఱును అధికారులే యగుదురు.) గీత జ్ఞానములన్నిటిలోను సమరూపమైనదియు, బ్రహ్మస్వరూపిణియు అయియున్నది.

**74. యోఽభిమానేన గర్వేణ గీతానిన్దాం కరోతి చ**
**స యాతి నరకం ఘోరం యావదాభూతసంప్లవమ్.**

ఎవడు అభిమానముచేతను, గర్వముచేతను గీతను నిందించునో, అట్టివాడు ప్రళయకాలము వఱకును ఘోరమగు నరకమును అనుభవించును.

**75. అహంకారేణ మూఢాత్మా గీతార్థం నైవ మన్యతే**
**కుంభీపాకేషు పచ్యేత యావత్కల్పక్షయో భవేత్.**

ఏ మూఢుడు అహంకారవశమున గీతార్థమును ఆదరింపడో, అతడు కల్పక్షయమగువఱకును కుంభీపాకనరకములందు వసించి బాధ నొందుచుండును.

**76. గీతార్థం వాచ్యమానో యో న శృణోతి సమీపతః**
**స సూకరభవాం యోని మనేకామధిగచ్ఛతి.**

గీతార్థము చెప్పబడుచుండ సమీపముననే యుండియు ఎవడు వినకుండునో అట్టివాడు అనేక పర్యాయములు పందిజన్మ ఎత్తుచుండును.

**77. చౌర్యం కృత్వాచ గీతాయాః పుస్తకం యః సమానయేత్**
**న తస్య సఫలం కించిత్ పఠనం చ వృథా భవేత్.**

ఎవడు గీతాపుస్తకమును దొంగిలించి తెచ్చుకొనునో, అతనికి సాఫల్యము కలుగనేరదు. అట్టివాని గీతాపఠనము వ్యర్థమేయగును.

**78. యః శ్రుత్వా నైవ గీతార్థం మోదతే పరమార్థతః**
**నైవ తస్య ఫలం లోకే ప్రమత్తస్య యథాశ్రమః.**

ఎవడు గీతార్థమును వినియు పరమార్థముగ ప్రసన్నుడు కాకయుండునో, అతని శ్రవణమున కేమియు ఈ ప్రపంచమున ఫలితము లేకుండును. పిచ్చివాని చేష్టవలె అతనిది వ్యర్థపరిశ్రమమేయగును.

**79. గీతాం శ్రుత్వా హిరణ్యం చ భోజ్యం పట్టాంబరం తథా**
**నివేదయేత్ ప్రదానార్థం ప్రీతయే పరమాత్మనః.**

గీతను శ్రవణముచేసి పరమాత్మయొక్క ప్రీతికై పాఠకునకు బంగారము, ఉత్తమ భోజనము, శుభ్ర వస్త్రము దానము చేయవలయును.

**80. వాచకం పూజయే ద్భక్త్యా ద్రవ్య వస్త్రాద్యుపస్కరైః**
**అనేకై ర్బహుధా ప్రీత్యా తుష్యతాం భగవాన్ హరిః.**

'భగవంతుడగు శ్రీహరి సంతోషించుగాక!' అను నీ యుద్దేశ్యముతో గీతాపాఠకుని ద్రవ్య వస్త్రాది వివిధోపకరణములచే భక్తితో ప్రీతిపూర్వకముగ పూజింపవలెను.

సూత ఉవాచ :-

**81. మాహాత్మ్య మేతద్గీతాయాః కృష్ణప్రోక్తం పురాతనమ్**
**గీతాన్తే పఠతే యస్తు యథోక్త ఫలభాగ్భవేత్.**

సూతుడు చెప్పెను :-

శ్రీకృష్ణభగవానునిచే చెప్పబడిన పురాతనమగు ఈ గీతామహిమను (మహాత్మ్యమును) ఎవడు గీతాపారాయణము అయినవెనుక చదువునో, అతడు పైన తెలుపబడిన ఫలితములను పొందును.

**82. గీతాయాః పఠనం కృత్వా మాహాత్మ్యం నైవ యః పఠేత్**
**వృథా పాఠఫలం తస్య శ్రమ ఏవ హ్యుదాహృతః.**

గీతను చదివియు మాహాత్మ్యమును ఎవడు చదువకయుండునో, అట్టివాని గీతాపఠనము యొక్క ఫలము వ్యర్థమేయనియు, అయ్యది శ్రమమాత్రమే యనియు చెప్పబడినది.

**83. ఏతన్మాహాత్మ్యసంయుక్తం గీతాపాఠం కరోతి యః**
**శ్రద్ధయా యః శృణోత్యేవ పరమాం గతి మాప్నుయాత్.**

ఎవడు ఈ మాహాత్మ్యముతో గూడ గీతాపఠనము గావించునో, లేక శ్రద్ధతో వానిని వినునో అతడు ఉత్తమగతిని బొందును.

**84. శ్రుత్వా గీతా మర్థయుక్తాం మాహాత్మ్యం యః శృణోతి చ**
**తస్యపుణ్యఫలం లోకే భవే త్సర్వసుఖావహమ్.**

గీతను అర్థముతోగూడ ఎవడు వినునో మఱియు అద్దానిమహిమను (మాహాత్మ్యమును) చక్కగ శ్రవణము చేయునో అట్టివాని పుణ్యఫలము ఈ లోకమున సర్వులకును సుఖమును గలుగజేయునదియే కాగలదు.




**వక్త్రాణి పంచ జానీహి పంచాధ్యాయా ననుక్రమాత్**
**దశాధ్యాయాః భుజా శ్చైక ముదరం ద్వే పదాంబుజే,**
**ఏవ మష్టాదశాధ్యాయీ వాఙ్మయీ మూర్తి రీశ్వరీ**
**జానీహి జ్ఞానమాత్రేణ మహాపాతకనాశినీ॥**

గీతాదేవికి మొదటి ఐదు అధ్యాయములు ఐదుతలలు, తక్కిన పది అధ్యాయములు పది హస్తములు, పదునాఱవ అధ్యాయము ఉదరము, చివరి రెండధ్యాయములు పాదములు, ఇవ్విధముగ పదునెనిమిది అధ్యాయములతో శోభించుచు మహాపాతకములను నశింపజేయునట్టి వాఙ్మయస్వరూపిణియై విలసిల్లు ఈశ్వరీమూర్తియగు గీతాదేవిని వివేకముతో తెలిసికొనుడు!

**శుద్ధాం సనాతనీ మమ్బాం శోకమోహ వినాశినీమ్**
**కృష్ణస్వరూపిణీం గీతా మిష్టదేవీం భజామ్యహమ్.**

నిర్మల సనాతన స్వరూపముగలదియు, శోకమోహములను నశింపజేయునదియు, సాక్షాత్ శ్రీ కృష్ణస్వరూపిణియునగు గీతయను ఇష్టదేవిని నేను భజించుచున్నాను.

## గీతాపూజా విధానము

గీత ఒకానొక గ్రంథము కాదు. కేవల చైతన్యమూర్తి. సాక్షాత్ దేవి. కావున వ్యక్తికివలెనే గీతకున్ను అర్చన సలుపబడు చున్నది. ఆ పూజావిధానము ఈ క్రింద తెలుపబడినది. పవిత్రమగు ఏకాదశీ దినమునగాని, కృష్ణాష్టమి మున్నగు పర్వదినములందుగాని, గీతాజయంతి (మార్గశిర శుద్ధ ఏకాదశి) సందర్భమునగాని, లేక మఱియే ఇతర పవిత్ర సమయమునందుగాని లేక ప్రతినిత్యముగాని ఈ గీతాపూజను గావింపవచ్చును. భగవంతునకు, భగవద్వాణికిని అవినాభావసంబంధము కలదు. కనుక గీతను పూజించినచో సాక్షాత్ పరమాత్మను పూజించినట్లేయగును. మఱియు భగవదారాధనచే లభించు ఫలితమున్ను లభించును. వాస్తవముగ గీతావాక్యములను అనుష్ఠించుటయే గీతయొక్క నిజమైనపూజ అయినప్పటికిని, ఈ బాహ్యపూజయు జనులకు ఆవశ్యకమే అయియున్నది. ఇక పూజావిధానము తెలుపబడుచున్నది.

**ఓం గురుర్బ్రహ్మా గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః**
**గురస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీ గురువే నమః.**
**ఓం కృష్ణం కమలపత్రాక్షం పుణ్యశ్రవణ కీర్తనమ్**
**వాసుదేవం జగద్యోనిం నౌమి నారాయణం హరిమ్.**

పై ప్రార్థనాశ్లోకములను పఠించి ఆ పిదప. ముమ్మారు ఓం కేశవాయ స్వాహా, ఓం నారాయణాయ స్వాహా, ఓం మాధవాయ స్వాహా, అని ఆచమనము చేయవలెను. గోవిందాయ నమః అని నీరు క్రింద విడువవలెను. విష్ణవే నమః, మధుసూదనాయ నమః, త్రివిక్రమాయ నమః, వామనాయ నమః, శ్రీధరాయ నమః, హృషీకేశాయ నమః, పద్మనాభాయ నమః, దామోదరాయ నమః, సంకర్షణాయ నమః, వాసుదేవాయ నమః, ప్రద్యుమ్నాయ నమః, అనిరుద్ధాయ నమః, పురుషోత్తమాయ నమః, అధోక్షజాయ నమః, నారసింహాయ నమః, అచ్యుతాయ నమః, జనార్దనాయ నమః, ఉపేంద్రాయ నమః, హరయే నమః, శ్రీకృష్ణాయ నమః.

(పిదప ఈ క్రింది మంత్రమును చెప్పుచు ప్రాణాయామము చేయవలెను.)

ఓం భూః ఓం భువః ఓగ్ం సువః ఓం మహః ఓం జనః ఓం తపః ఓగ్ం సత్యం ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి, ధియో యో నః ప్రచోదయాత్, ఓం ఆపో జ్యోతీ రసోఽమృతం బ్రహ్మ భూర్భువ స్సువరోమ్.

(తరువాత గంట వాయించుచు ఈ క్రింది శ్లోకమును చెప్పవలెను.)

**ఆగమార్థం తు దేవానాం గమనార్థం తు రక్షసామ్**
**కురు ఘంటారవం తత్ర దేవతాహ్వాన లాంఛనమ్.**

(పిమ్మట దీపమును వెలిగించి ఈ క్రింది సంకల్పము గావింపవలెను.)

శుభే శోభనే ముహూర్తే శ్రీమహావిష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే మేరో ర్దక్షిణదిగ్భాగే శ్రీశైలస్య ఆగ్నేయ[1] ప్రదేశే, కృష్ణాకావేర్యో[2]ర్మధ్యప్రదేశే అస్మిన్ శోభనగృహే[3] సమస్త దేవతా బ్రాహ్మణ హరిహర గురుచరణసన్నిథౌ, అస్మిన్వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన... సంవత్సరే... అయనే.... ఋతౌ..... మాసే..... పక్షే..... తిథౌ..... వాసరే శుభనక్షత్ర శుభయోగ శుభకరణ ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీమాన్ శ్రీమతః..... గోత్రోద్భవస్య... నామధేయస్య మమ ఉపాత్తదురితక్షయద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం సమస్తపాప నివృత్త్యర్థం సర్వదురితక్షయద్వారా పుణ్యఫలప్రాప్త్యర్థం ఆత్మశుద్ధ్యర్థం భూమండలే చరాచర ప్రాణికోటీనాం క్షేమసిద్ధ్యర్థం భక్తి జ్ఞాన వైరాగ్య ఫలసిద్ధ్యర్థం మమ అభీష్టఫల సిద్ధ్యర్థం ప్రతిబంధరహిత బ్రహ్మసాక్షాత్కార జ్ఞానసిద్ధ్యర్థం శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం చ సంభవతా నియమేన సంభవద్భిర్ద్రవ్యైః సంభవద్భి రుపచారైశ్చ యావచ్ఛక్తి శ్రీగీతాదేవతా ముద్దిశ్య శ్రీగీతాదేవతా ప్రీత్యర్థం ధ్యానావాహనాది షోడశోపచార పూజామహం కరిష్యే –

ఆదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం శ్రీమహాగణాధిపతి పూజాం కరిష్యే – తదంగకలశారాధనం కరిష్యే – కలశం గంధపుష్పాక్షతైరభ్యర్చ్య –

(పిమ్మట కలశమును గంధపుష్పాక్షతలతో నలంకరించి ఈ క్రింది మంత్రము నుచ్చరించుచు అందలి నీటిని ఆకుతో స్పృశించవలెను.)

**గంగేచ యమునే కృష్ణే గోదావరి సరస్వతి**
**నర్మదే సింధుకావేరి జలేఽస్మిన్సన్నిధిం కురు.**

ఆయాంతు శ్రీ మహాగణాధిపతి పూజార్థం మమ దురితక్షయ కారకాః,ఇతి కలశోదకేన పూజాద్రవ్యాణి సంప్రోక్ష్య, దేవ మాత్మానం చ సంప్రోక్ష్య

(తదుపరి ఆ కలశోదకమును పూజాద్రవ్యములపైనను, తన శిరస్సుపైనను చల్లుకొని శ్రీమహాగణాధిపతికి ధ్యానావాహనాద్యుపచారముల గావించి ఈ క్రింది మంత్రములచే పూజించవలెను.)

ఓం సుముఖాయ నమః, ఓం ఏకదంతాయ నమః, ఓం కపిలాయ నమః, ఓం గజకర్ణికాయ నమః, ఓం లంబోదరాయ నమః, ఓం వికటాయ నమః, ఓం విఘ్నరాజాయ నమః, ఓం గణాధిపాయ నమః, ఓం ధూమకేతవే నమః, ఓం గణాధ్యక్షాయ నమః, ఓం ఫాలచంద్రాయ నమః, ఓం గజాననాయ నమః, ఓం వక్రతుండాయ నమః, ఓం శూర్పకర్ణాయ నమః, ఓం హేరంబాయ నమః, ఓం స్కందపూర్వజాయ నమః, ఓం శ్రీ మహాగణాధిపతయే నమః షోడశనామపూజాం సమర్పయామి.

శ్రీమహాగణాధిపతిదేవతాభ్యో నమః అని మంత్రపుష్పాలనర్పించి నమస్కరించి ఆపైన ధూపదీపనైవేద్యహారతి – సర్వోపచార పూజాం సమర్పయామి – అనయా పూజయా భగవాన్ శ్రీ మహాగణపతిః సుప్రీతో సుప్రసన్నో వరదో భవతు.

1. కొన్నిచోట్ల 'ఈశాన్యప్రదేశే' ఇత్యాది విధముగ ఆయా దిశలను బట్టి చెప్పవలసియుండును.
2. కొన్నిచోట్ల 'కృష్ణాగోదావర్యోః' ఇత్యాది విధముగ ఆయా నదులనుబట్టి చెప్పవలసి యుండును.
3. లేక, 'పుణ్యాశ్రమే'.

(పిమ్మట అక్షతలను, పుష్పములను గ్రహించి సంకల్పముచేసి ఈ క్రింది విధముగ చెప్పి వానిని నీటితో వదలవలెను.)

ఏవం గుణవిశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీమద్గీతాదేవతా ముద్దిశ్య శ్రీమద్గీతాదేవతా ప్రీత్యర్థం యావచ్ఛక్తి ధ్యానావాహనాది షోడశోపచారవిధానేన శ్రీగీతాదేవతా పూజాం కరిష్యే.

(పిదప గీతాగ్రంథమును పసుపు, కుంకుమ, పుష్పములతో చక్కగ నలంకరించి అచట ఒక పీటపైపెట్టి, ఈ క్రిందివిధముగ పూజాక్రమమును గావించవలయును -)

**అథ ప్రాణప్రతిష్ఠాపనం -**

**వక్త్రాణి పంచ జానీహి పంచాధ్యాయా ననుక్రమాత్**
**దశాధ్యాయాః భుజాశ్చైక ముదరం ద్వే పదాంబుజే**
**ఏవ మష్టాదశాధ్యాయీ వాఙ్మయీ మూర్తి రీశ్వరీ**
**జానీహి జ్ఞానమాత్రేణ మహాపాతకనాశినీ.**

ఓం శ్రీగీతాయై నమః - ధ్యానం సమర్పయామి; సర్వతీర్థమయ్యై నమః- ఆవాహనం సమర్పయామి; అక్షరాయై నమః - ఆసనం సమర్పయామి; మలనిర్మోచిన్యై నమః - పాద్యం సమర్పయామి; సత్యాయై నమః - అర్ఘ్యం సమర్పయామి; విష్ణోర్వక్త్రాద్వినిః సృతాయై నమః - ఆచమనం సమర్పయామి; వంద్యాయై నమః - పంచామృతస్నానం సమర్పయామి; అనంతరం శుద్ధోదకస్నానం సమర్పయామి; విశ్వమంగళకారిణ్యై నమః - వస్త్రయుగ్మం సమర్పయామి; సర్వశాస్త్రమయ్యై నమః - యజ్ఞోపవీతం సమర్పయామి; ఆభరణాని ధారయామి; సర్వైశ్వర్యప్రదాయిన్యై నమః - శ్రీగంధం సమర్పయామి; భారతామృత సర్వస్వాయై నమః - అక్షతాన్ సమర్పయామి; పుష్పైః పూజయామి -

(పిమ్మట అక్షతలుగాని, పుష్పములుగాని చేతగైకొని ఈ క్రింద తెలుపబడిన మంత్రముల నుచ్చరించుచు గీతాదేవిని పూజించవలయును.)

# శ్రీ గీతాష్టోత్తర శతనామావళి

1. ఓం శ్రీ గీతాదేవ్యై నమః
2. ఓం విమలాయై నమః
3. ఓం సుఖదాయై నమః
4. ఓం మునిసంస్తుతాయై నమః
5. ఓం తత్త్వార్థబోధిన్యై నమః
6. ఓం సర్వలోకసంపూజ్యాయై నమః
7. ఓం శ్రీకృష్ణముఖనిస్సృతాయై నమః
8. ఓం పాపఘ్న్యై నమః
9. ఓం పుణ్యదాయై నమః
10. ఓం మహాదేవ్యై నమః
11. ఓం నిష్ప్రత్యూహచిదాత్మికాయై నమః
12. ఓం శోకమోహాపహన్త్ర్యై నమః
13. ఓం మోక్షదాయై నమః
14. ఓం బ్రహ్మబోధిన్యై నమః
15. ఓం బ్రహ్మవిద్యాయై నమః
16. ఓం చిదానన్దాయై నమః
17. ఓం భవఘ్న్యై నమః
18. ఓం భయనాశిన్యై నమః
19. ఓం వేదత్రయాత్మికాయై నమః
20. ఓం అనన్తాయై నమః
21. ఓం తత్త్వార్థజ్ఞానమఞ్జర్యై నమః
22. ఓం వ్యాససంగ్రథితాయై నమః
23. ఓం పూతాయై నమః
24. ఓం సంసారమలమోచన్యై నమః
25. ఓం సర్వశాస్త్రమయ్యై నమః
26. ఓం మాత్రే నమః
27. ఓం సర్వతీర్థమయ్యై నమః
28. ఓం తత్త్వమస్యాది వాక్యోత్థబ్రహ్మ
తత్త్వావగాహిన్యై నమః
29. ఓం శాన్తిప్రదాయై నమః
30. ఓం పరానన్దాయై నమః
31. ఓం బోధామృత తరంగిణ్యై నమః
32. ఓం విశ్వసంస్కృతి సముద్భూతాయై నమః
33. ఓం విశ్వధర్మ ప్రచారిణ్యై నమః
34. ఓం విశ్వైకరచనాయై నమః
35. ఓం రమణీయార్థ భాసితాయై నమః
36. ఓం రమ్యాయై నమః
37. ఓం విశ్వమానవ సంపూజ్యాయై నమః
38. ఓం విశ్వమంగళకారిణ్యై నమః
39. ఓం విశ్వసిద్ధాన్తసమ్మాన్యై నమః
40. ఓం విశ్వసమ్మోహనాశిన్యై నమః
41. ఓం విశ్వస్వరూపిణ్యై నమః
42. ఓం విశ్వవన్ద్యాయై నమః
43. ఓం విశ్వతత్త్వప్రకాశిన్యై నమః
44. ఓం త్రిగుణాతీత తత్త్వార్థభాసిన్యై నమః
45. ఓం గ్రంథిభేదిన్యై నమః
46. ఓం లోకోత్తరగుణోపేతాయై నమః
47. ఓం లోకోచితమతాన్వితాయై నమః
48. ఓం లోకోద్ధరణ సంశీలాయై నమః
49. ఓం లోకామోద ప్రవర్ధితాయై నమః
50. ఓం నిహితాఖిల శాస్త్రార్థాయై నమః
51. ఓం శుభౌజః పదగుమ్ఫితాయై నమః
52. ఓం అనిర్వాచ్యాయై నమః
53. ఓం గంభీరాయై నమః
54. ఓం నిత్యాయై నమః
55. ఓం నిత్య సుఖప్రదాయై నమః
56. ఓం నైకవ్యాఖ్యాన సంభిన్నాయై నమః
57. ఓం నానాచార్య సమాదృతాయై నమః
58. ఓం స్వస్వానుకూల భావార్థశోభితాయై నమః
59. ఓం శాన్తిదాన్తిదాయై నమః
60. ఓం నిత్యనూతన భావార్థదాయిన్యై నమః
61. ఓం లోకకామదాయై నమః
62. ఓం ప్రాచ్యపాశ్చాత్య ఖండాంతర్ని
వాసి జనమోదిన్యై నమః
63. ఓం అక్షరాయై నమః
64. ఓం అద్వేషిణ్యై నమః
65. ఓం సర్వకాల ధర్మప్రబోధిన్యై నమః
66. ఓం దైవసంపత్సుసంపన్నాయై నమః
67. ఓం అసురభావాది వర్జితాయై నమః
68. ఓం అష్టాదశ మహాయోగ భూషితాయై నమః

69. ఓం భ్రష్టతారిణ్యై నమః
70. ఓం స్త్రీశూద్ర సముద్ధర్త్రై నమః
71. ఓం సమభావ విశోభిన్యై నమః
72. ఓం ఈర్ష్యాప్రసూత జాత్యాది దురహంకారఘాతిన్యై నమః
73. ఓం చండాల ద్విజ శూద్రాది సర్వోద్ధరణతత్పరాయై నమః
74. ఓం మాయాపనోదిన్యై నమః
75. ఓం సత్యాయై నమః
76. ఓం ద్వన్ద్వభేద వినాశిన్యై నమః
77. ఓం అభేదభావ పీయూషవర్షిణ్యై నమః
78. ఓం జ్ఞానభాసిన్యై నమః
79. ఓం త్యాగరూపాయై నమః
80. ఓం అనవద్యాయై నమః
81. ఓం విముక్త ఫలశాలిన్యై నమః
82. ఓం యథాధికారి నిష్కామకర్మ ధ్యానాదిబోధిన్యై నమః
83. ఓం భవమగ్న ప్రజానౌకాయై నమః
84. ఓం బంధచ్ఛేద విచక్షణాయై నమః
85. ఓం భగవద్భావ సంపూర్ణాయై నమః
86. ఓం భవవారిధి కారిణ్యై నమః
87. ఓం ఆధ్యాత్మిక మహాకాశ ..లసత్సౌదామినీ సమాయై నమః
88. ఓం నిష్కలాయై నమః
89. ఓం నిర్మలాయై నమః
90. ఓం శాన్తాయై నమః
91. ఓం సర్వతేజోమయ్యై నమః
92. ఓం శుభాయై నమః
93. ఓం తమోవిమూఢ లోకాన్ధకార నోదనచన్ద్రికాయై నమః
94. ఓం శ్రుత్యన్తగత తత్త్వార్థ బోధిన్యై నమః
95. ఓం బోధభాసురాయై నమః
96. ఓం బోధామృత పయశ్శ్లాఘ్యాయై నమః
97. ఓం పార్థవత్సతరాన్వితాయై నమః
98. ఓం దోగ్ధృకృష్ణాయై నమః
99. ఓం గోరూపాయై నమః
100. ఓం కామధేనవే నమః
101. ఓం శుగన్తికాయై నమః
102. ఓం క్లిన్నపార్థ తమోహన్త్ర్యై నమః
103. ఓం క్షాత్రధర్మప్రవర్తికాయై నమః
104. ఓం కర్తవ్యచ్యుత ధీమూఢ జన సత్పథదర్శికాయై నమః
105. ఓం సర్వసన్న్యాస సంలక్ష్యాయై నమః
106. ఓం పూర్ణబ్రహ్మప్రబోధిన్యై నమః
107. ఓం కలి సన్త్రస్తసమ్మూఢ లోకత్రాణ చణాయై నమః
108. ఓం పరాయై నమః

## హరిః ఓం తత్ సత్

ఓం ఇతి శ్రీభగవద్గీతాష్టోత్తర శతనామావళీస్తోత్ర పుష్పాంజలి పూజాం సమర్పయామి. ఓం అష్టాదశాధ్యాయిన్యై నమః - నానావిధ పరిమళపత్ర పుష్పాణి సమర్పయామి; ఓం భవద్వేషిణ్యై నమః - ధూపమాఘ్రాపయామి; ఓం సర్వోపనిషత్సారరూపిణ్యై నమః - దీపం దర్శయామి; ఓం అద్వైతామృతవర్షిణ్యై నమః - నైవేద్యం సమర్పయామి; మధ్యేమధ్యే పానీయం సమర్పయామి; ఉత్తరాపోశనం సమర్పయామి; ఓం వ్యాసేన గ్రథితాయై నమః - తాంబూలం సమర్పయామి; ఓం భారత పంకజ స్వరూపాయై నమః - కర్పూరనీరాజనం దర్శయామి; ఓం భయశోకాది వర్జితాయై నమః - మంత్రపుష్పం సమర్పయామి; ఓం లోకత్రయోపకారిణ్యై నమః - ప్రదక్షిణం సమర్పయామి; ఓం సర్వజ్ఞానమయ్యై నమః - సర్వోపచార పూజాం సమర్పయామి. అనయా ధ్యానావాహనాది షోడశోపచార పూజయా భగవతీ శ్రీగీతా దేవతా సుప్రీతా సుప్రసన్నా వరదా భవతు.

## ఇతి శ్రీగీతాదేవిపూజా సమాప్తా

(గీతాదేవిపూజా సందర్భమున శ్రీకృష్ణభగవానుని స్మరించుటయు, సేవించుటయు, సమయోచితముగ నుండును. అంతియే కాదు, అట్లు చేయుట ముముక్షువుల కర్తవ్యము కూడను. కాబట్టి భక్తజనోపయోగము నిమిత్తము. శ్రీకృష్ణాష్టోత్తర శతనామావళిని కూడ ఇచట పొందుపఱచుచున్నాము.)

# శ్రీ కృష్ణాష్టోత్తర శతనామావళి

1. ఓం శ్రీకృష్ణాయ నమః
2. ఓం కమలానాథాయ నమః
3. ఓం వాసుదేవాయ నమః
4. ఓం సనాతనాయ నమః
5. ఓం వసుదేవాత్మజాయ నమః
6. ఓం పుణ్యాయ నమః
7. ఓం లీలామానుష విగ్రహాయ నమః
8. ఓం శ్రీవత్సకౌస్తుభధరాయ నమః
9. ఓం యశోదావత్సలాయ నమః
10. ఓం హరయే నమః
11. ఓం చతుర్భుజాత్త చక్రాసి గదా శంఖాద్యాయుధాయ నమః
12. ఓం దేవకీనందనాయ నమః
13. ఓం శ్రీశాయ నమః
14. ఓం నందగోపప్రియాత్మజాయ నమః
15. ఓం యమునావేగ సంహారిణే నమః
16. ఓం బలభద్రప్రియానుజాయ నమః
17. ఓం పూతనాజీవితహరాయ నమః
18. ఓం శకటాసుర భంజనాయ నమః
19. ఓం నందవ్రజ జనానందినే నమః
20. ఓం సచ్చిదానంద విగ్రహాయ నమః
21. ఓం నవనీత విలిప్తాంగాయ నమః
22. ఓం నవనీతనటాయ నమః
23. ఓం అనఘాయ నమః
24. ఓం నవనీత నవాహారాయ నమః
25. ఓం ముచికుందప్రసాదకాయ నమః
26. ఓం షోడశ స్త్రీసహస్రేశాయ నమః
27. ఓం త్రిభంగినే నమః
28. ఓం మధురాకృతయే నమః
29. ఓం శుకవాగమృతాబ్ధీన్దవే నమః
30. ఓం గోవిందాయ నమః
31. ఓం యోగినాంపతయే నమః
32. ఓం వత్సవాటచరాయ నమః
33. ఓం అనంతాయ నమః
34. ఓం ధేనుకాసుర భంజనాయ నమః
35. ఓం తృణీకృతతృణావర్తాయ నమః
36. ఓం యమళార్జున భంజనాయ నమః
37. ఓం ఉత్తాలతాలభేత్రే నమః
38. ఓం తమాలశ్యామలాకృతయే నమః
39. ఓం గోపగోపీశ్వరాయ నమః
40. ఓం యోగినే నమః
41. ఓం కోటిసూర్యసమప్రభాయ నమః
42. ఓం ఇలాపతయే నమః
43. ఓం పరంజ్యోతిషే నమః
44. ఓం యాదవేంద్రాయ నమః
45. ఓం యదూద్వహాయ నమః
46. ఓం వనమాలినే నమః
47. ఓం పీతవాససే నమః
48. ఓం పారిజాతాపహారకాయ నమః
49. ఓం గోవర్ధనాచలోద్ధర్త్రే నమః
50. ఓం గోపాలాయ నమః
51. ఓం సర్వపాలకాయ నమః
52. ఓం అజాయ నమః
53. ఓం నిరంజనాయ నమః
54. ఓం కామజనకాయ నమః
55. ఓం కంజలోచనాయ నమః
56. ఓం మధుఘ్నే నమః
57. ఓం మధురానాథాయ నమః
58. ఓం ద్వారకానాథాయ నమః
59. ఓం బలినే నమః
60. ఓం బృందావనాన్తసంచారిణే నమః
61. ఓం తులసీదామభూషణాయ నమః
62. ఓం శమంతకమణేర్హర్త్రే నమః
63. ఓం నరనారాయణాత్మకాయ నమః
64. ఓం కుబ్జాకృష్ణాంబరధరాయ నమః
65. ఓం మాయినే నమః
66. ఓం పరమపురుషాయ నమః
67. ఓం ముష్టికాసుర చాణూర మల్లయుద్ధవిశారదాయ నమః
68. ఓం సంసారవైరిణే నమః
69. ఓం కంసారయే నమః

70. ఓం మురారయే నమః
71. ఓం నరకాన్తకాయ నమః
72. ఓం అనాది బ్రహ్మచారిణే నమః
73. ఓం కృష్ణావ్యసన కర్శకాయ నమః
74. ఓం శిశుపాల శిరచ్ఛేత్రే నమః
75. ఓం దుర్యోధనకులాన్తకాయ నమః
76. ఓం విదురాక్రూరవరదాయ నమః
77. ఓం విశ్వరూప ప్రదర్శకాయ నమః
78. ఓం సత్యవాచే నమః
79. ఓం సత్యసంకల్పాయ నమః
80. ఓం సత్యభామారతాయ నమః
81. ఓం జయినే నమః
82. ఓం సుభద్రాపూర్వజాయ నమః
83. ఓం విష్ణవే నమః
84. ఓం భీష్మముక్తిప్రదాయకాయ నమః
85. ఓం జగద్గురవే నమః
86. ఓం జగన్నాథాయ నమః
87. ఓం వేణునాదవిశారదాయ నమః
88. ఓం వృషభాసుర విధ్వంసినే నమః
89. ఓం బాణాసుర కరాన్తకాయ నమః
90. ఓం యుధిష్ఠిర ప్రతిష్ఠాత్రే నమః
91. ఓం బర్హిబర్హావతంసకాయ నమః
92. ఓం పార్థసారథయే నమః
93. ఓం గీతామృతమహోదధయే నమః
94. ఓం అవ్యక్తాయ నమః
95. ఓం కాళీయఫణిమాణిక్యమండిత శ్రీపదాంబుజాయ నమః
96. ఓం దామోదరాయ నమః
97. ఓం యజ్ఞభోక్త్రే నమః
98. ఓం దానవేన్ద్రవినాశకాయ నమః
99. ఓం నారాయణాయ నమః
100. ఓం పరబ్రహ్మణే నమః
101. ఓం పన్నగాశన వాహనాయ నమః
102. ఓం జలక్రీడాసమాసక్త గోపీ వస్త్రాపహారకాయ నమః
103. ఓం పుణ్యశ్లోకాయ నమః
104. ఓం తీర్థపాదాయ నమః
105. ఓం వేదవేద్యాయ నమః
106. ఓం దయానిధయే నమః
107. ఓం సర్వతీర్థాత్మకాయ నమః
108. ఓం సర్వగ్రహరూపిణే నమః

ఓం పరాత్పరాయ నమః

ఇతి శ్రీకృష్ణాష్టోత్తర శతనామావళీ సమాప్తా

ఓం తత్ సత్

## గీ తా గ ం గ

**శ్లో॥ జాతాసి త్వం మురహరిముఖాజ్జాహ్నవీ తస్య పాదాత్**
**సర్వానభ్యుద్ధరతి భవతీ సాతు మగ్నాన్ విధత్తే**
**ప్రత్యగ్బ్రహ్మామృతరసనిధిం ప్రాప్య విశ్రామ్యసి త్వం**
**మాతర్గీతే జడనిధిమియం మాతి న త్వత్ప్రభావః.**

**తా॥** ఓ గీతాదేవీ! విష్ణుభగవానుని పాదములనుండి గంగ ఉద్భవించినది. నీవో, ఆ భగవానుని ముఖమునుండి ఆవిర్భవించితివి! (ఓహో! ఎట్టి ఔత్కృష్ట్యము నీది!) మఱియు గంగయందు పడినవారి భౌతికదేహములు నీటిలో మునిగిపోవుచున్నవి. జ్ఞానగంగయగు నీయందు పడినవారి నందఱినో, నీవు ఉద్ధరించుచున్నావు! ఇంతియే కాదు. గంగానది పోయి పోయి జడమగు ఉప్పు సముద్రమున (బంగాళాఖాతమున) కలిసిపోవుచున్నది. గీతాగంగయగు నీవో, చైతన్యమగు ప్రత్యగాత్మ యందు (బ్రహ్మానందసాగరమున) చేరి విశ్రమించుచున్నావు! ఇట్టి అనుపమ ప్రభావముగల గీతాగంగాతల్లీ! నిన్నిక దేనితో పోల్చగలము? (గంగానది పవిత్రమైనదే; కాని గీతాగంగ అంతకంటెను పవిత్రమైనదని కవి చమత్కారముగ తెలుపుచున్నాడు.)

# గీత - జపించువిధానము

గీతలోని భావము లెంత గంభీరములో భాష అంత పటిష్ఠమైనది. ప్రతి పదమున్ను మహాశక్తివంతమై యలరుచున్నది. భావదృష్టియందును, అక్షరదృష్టియందును. గీత అత్యంత మహత్తరమైనది. వెయ్యేల, గీతలోని ప్రతిశ్లోకమున్ను ఒక మహామంత్రమే యగును. 701 శ్లోకములు 701 మంత్రములు. కనుకనే గీతలో ఋష్యాది న్యాసమునందు 'ఓం అస్య శ్రీ భగవద్గీతాశాస్త్ర మహామంత్రస్య' అను వాక్యము కానంబడుచున్నది. హరిరూపుడగు శ్రీకృష్ణపరమాత్మయొక్కయు, అపరహరిస్వరూపు@డగు శ్రీ వేదవ్యాసమహర్షియొక్కయు దివ్యశక్తి ప్రభావమే అది యని చెప్పవచ్చును. లౌకిక, పారమార్థిక ఫలితములు రెండిటికొఱకును గీతామంత్రములను జపించవచ్చును. అనగా లౌకిక మనోరథములు సిద్ధించుటకుగాని, పారమార్థిక వాంఛలు నెఱవేఱుటకుగాని ఆయా గీతామంత్రములను శ్రద్ధాపూర్వకముగ అనుష్ఠించవచ్చును. గీతయందలి శ్లోకములన్నియు మంత్రములైనప్పటికిన్ని ప్రత్యేకముగ 4,9,11,12,13,15వ అధ్యాయములు మంత్రదృష్టి యందు విశేష మహత్తుకలవి అయియున్నవి.

సూర్యోదయాత్పూర్వమే ఉషఃకాలమున నిద్రలేచుట, సాత్త్విక, మితభోజనమును స్వీకరించుట, బ్రహ్మచర్యమును శీలించుట, సత్యభాషణము, మితభాషణము కలిగియుండుట భూమిపై పరుండుట, సాధ్యమైనంతవరకు నిరంతరము 'హరిః శరణమ్' అను మంత్రమును మనస్సునందు జపించుచునుండుట మున్నగు పవిత్రనియమములను గీతానుష్ఠానపరులు పాటించుట అత్యావశ్యకము.

మఱియు జపము చేయువారు శౌచస్నానాదులను నిర్వర్తించుకొని శుద్ధమగు నూలు వస్త్రమునుగాని, హింసతోకూడని పట్టువస్త్రమునుగాని ధరించి దర్భ లేక ఉన్ని ఆసనముపై గూర్చొని, నియమానుసారము సంధ్య, గాయత్రీజపము మొదలైనవి చేసిన పిదప 'ఓం కేశవాయ నమః, ఓం నారాయణాయ నమః, ఓం మాధవాయ నమః, ఓం గోవిందాయ నమః, ఓం విష్ణవే నమః, ఓం మధుసూదనాయ నమః, అని ఉచ్చరించి శ్రీకృష్ణభగవానుని ధ్యానించవలెను. పిదప 'ఈ కార్యసిద్ధి కొఱకు ఈ మంత్రమును జపించెదను' అని సంకల్పము చేయవలెను. తరువాత 'ఓం క్లీం కృష్ణాయ నమః' అను మంత్రముచేగాని, లేక దేనిని జపింపదలంచునో ఆ మంత్రముచేగాని అంగన్యాసమును* గావింపవలెను. పిమ్మట చేతియందు తులసి, పుష్పములు గైకొని శ్రీకృష్ణమూర్తిని ఈ క్రింది మంత్రముతో ఆహ్వానించవలెను.

**వంశీవిభూషితకరా న్నవనీరదాభాత్**
**పీతాంబరా దరుణబిమ్బఫలాధరోష్ఠాత్**
**పూర్ణేందు సుందరముఖా దరవిన్దనేత్రాత్**
**కృష్ణాత్పరం కిమపి తత్త్వమహం నజానే.**

---

* ఈ వ్యాసము, దీని తరువాతగల "గీత - లౌకిక ఫలితములు", "గీత - పారమార్థిక ఫలితములు" - అను రెండు వ్యాసములు గోరఖ్‌పూర్ గీతా ప్రెస్సువారి 'కల్యాణ్' పత్రికలోని ఒకానొక వ్యాసము నాధారపఱచుకొని వ్రాయబడినవి. మఱియు ఆ పత్రికవారి సౌజన్యముతో నిచట ప్రకటింపబడినవి. ఈ వ్యాసములను ప్రకటించుటకు తమ సమ్మతిని దెలిపినందులకు వారికి మా కృతజ్ఞతలను సమర్పించుకొనుచున్నాము - (ప్రకాశకులు)

---

@ ద్విబాహురపరోహరిః = రెండు చేతులుగల విష్ణువే వ్యాసమునీంద్రుడు.

---

* అంగన్యాసకరన్యాసములయొక్క వివరము ఈ గ్రంథమున 'గీతాపారాయణము చేయుపద్ధతి', అను శీర్షిక క్రింద చూడనగును.

(తా॥ చేతియందు మురళిని ధరించినవాడును, మేఘచ్ఛాయతో గూడినవాడును, పీతాంబరధారియు, దొండపండువంటి ఎఱ్ఱటి పెదవులతో శోభిల్లువాడును, పూర్ణచంద్రునివలె సుందరమైన ముఖము కలవాడును, కమలనేత్రుడునగు శ్రీకృష్ణపరమాత్మ కంటె మించిన మఱియొక తత్త్వమును నే నెఱుగను.)

అనంతరము శ్రీకృష్ణభగవానుని షోడశోపచారములచేగాని, లేక పంచోపచారములచేగాని, పూజింపవలయును. తదుపరి నిశ్చింతతో గూడిన ఏకాగ్రమనంబుచే మంత్రమును జపించవలెను. జపించునపుడు మధ్యలో మాట్లాడరాదు. భగవంతుని విగ్రహమువైపే దృష్టిని ఉంచవలెను. లేక మనస్సునందు భగవంతునే ధ్యానించుచుండవలెను. ఇటునటు చూడరాదు. శాంత, ప్రసన్నచిత్తముతో మంత్రమును జపించవలెను.

అన్నిటికంటె ముఖ్యమైనది శ్రద్ధ. 'ఈ జపముచే మా యభీష్టము తప్పక సిద్ధించున'ను దృఢమగు విశ్వాసము (శ్రద్ధ) హృదయమందు కలవారే ఈ అనుష్ఠానము నాచరింపవలెను. మఱియు, జపము చేయునపుడు ఇట్టి శ్రద్ధనే హృదయమందుంచుకొని, దానిని వృద్ధిచేయుచు రావలెను. ఒక్కసారి ఆచరించినచో, కార్యసిద్ధి కాని యెడల శ్రద్ధాపూర్వకముగ మూడు, లేక ఏడుసార్లు అనుష్ఠించవలెను.

జపము అయిన వెనుక ఆ మంత్రముతోనే దశాంశ హోమము చేయవలెను. హోమ ద్రవ్యమునందు నువ్వులు, పిండి, చక్కెర, నెయ్యి తప్పక కలుపవలెను. గోధుమ పాయసముయొక్క బలి సమర్పించవలెను. ఒక మనుష్యునకు చాలినంతగాని, లేక శక్తిన ననుసరించి అంతకు తక్కువగాని, పాయసమును శ్రద్ధతో వండి, ఎడమచేతి బొటనవ్రేలు, చూపుడు వ్రేలు కలిపి "ఏషబలిః శ్రీకృష్ణాయనమః" అని పలికి మహావినయశ్రద్ధలతో దానిని భగవంతునకు అర్పించవలెను. ఆ బలి కొఱకైన పదార్థములను ఏదైన పవిత్రమగు పాత్రయందుంచి, కప్పి పెట్టి, రాత్రి తన తలదగ్గఱనే ఉంచుకొని, తన యభీష్టము నెరవేరుటకై భగవంతుని ప్రార్థించుచు, మంత్రము నుచ్చరించుచు నిద్రించవలెను. ప్రొద్దున లేచి ఆ నైవేద్యమును ఆవునకు తినిపించవలెను.

జపము పూర్తి అయిన తరువాత మిగుల నమ్రతతో ఈ క్రింది శ్లోకముల నుచ్చరించుచు భగవంతుని క్షమాప్రార్థన చేయవలెను.

**1. ఆవాహనం న జానామి నైవ జానామి పూజనమ్**
**విసర్జనం న జానామి క్షమస్వ పరమేశ్వర.**

**2. అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ**
**తస్మాత్కారుణ్యభావేన క్షమస్వ పరమేశ్వర.**

**3. గతం పాపం గతం దుఃఖం గతం దారిద్ర్యమేవ చ**
**ఆగతా సుఖసంపత్తిః పుణ్యాచ్చ తవ దర్శనాత్.**

**4. మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం సురేశ్వర**
**యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తు మే.**

**5. యదక్షరపదభ్రష్టం మాత్రాహీనం చ యద్భవేత్**
**తత్సర్వం క్షమ్యతాం దేవ ప్రసీద పరమేశ్వర.**

**6. యస్య స్మృత్యాచ నామోక్త్యా తపోయజ్ఞక్రియాదిషు**
**న్యూనం సంపూర్ణతామేతి సద్యో వన్దే తమచ్యుతమ్.**

**7. ప్రమాదాత్కుర్వతాం కర్మ ప్రచ్యవేతాధ్వరేషు యత్**
**స్మరణాదేవ తద్విష్ణోః సంపూర్ణం స్యాదితి శ్రుతిః.**

పిమ్మట "అనయా యథోపచార పూజయా శ్రీభగవాన్ కృష్ణః ప్రీయతాం న మమ" అని చెప్పి సాష్టాంగనమస్కారము చేయవలెను. తదుపరి భగవానుని చరణోదకమును ఈ క్రింది శ్లోకములను పలుకుచు శిరస్సుపై నుంచుకొని పిదప త్రాగవలెను.

**1. అకాలమృత్యుహరణం సర్వవ్యాధివినాశనమ్**
**విష్ణోః పాదోదకం పీత్వా పునర్జన్మ న విద్యతే.**

**2. విష్ణుపాదాభిషిక్తం యః పాత్రేణైవ పిబేజ్జలమ్**
**సర్వపాపవినిర్ముక్తః స యాతి పరమాం గతిమ్.**

ఇంకను, జపము చేయువారు ఈ క్రింది విషయములను తప్పక గమనించవలయును.

(1) ఏ మంత్రముయొక్క సిద్ధిని పొందదలంతురో దానిని కృష్ణాష్టమిరాత్రియందు, శరత్పూర్ణిమరాత్రియందు, దీపావళిరాత్రియందు, వైశాఖపౌర్ణమిరాత్రియందు పవిత్రముగ ఆసనముపై కూర్చుండి మూడువేలు జపించవలెను. అటు తరువాత ఆ మంత్రమును అనుష్ఠించినచో చాల లాభము కలుగును.

(2) జపమునకు ముందుగా భగవద్గీత పూర్తిగగాని, లేక 6 అధ్యాయములుగాని, లేక 3 అధ్యాయములుగాని, లేక కనీసము ఒక్క 15 వ అధ్యాయమునుగాని తప్పక చదువవలెను.

(3) ప్రత్యేకముగ జపముచేయదలంచువారు 11వ అధ్యాయమును 11సార్లు మొదట, మధ్య, చివరలయందు 9 రోజులవరకు తప్పక పఠనము చేయవలెను. జపము పూర్తి అయిన పిదప వీలైనచో విధిప్రకారము ఆ మంత్రముతో దశాంశ తర్పణము, హోమము చేసి బ్రహ్మనిష్ఠులకు భోజనము పెట్టుట మంచిది.

మంత్రజపము చేయువాడు భగవంతుని పూజతోబాటు ఈ క్రిందియంత్రము (నెం.1)ను కూడ పూజించవలెను.

| | | | |
|---|---|---|---|
| ద్గు 8 | ష్ణం 2 | కృ 1 | రుం 9 |
| జ 6 | దే 4 | వం 3 | గ 7 |

ఈ యంత్రమును రాగిరేకుపై వ్రాయించవలెను. లేక శ్రీ గంధపుపలకపై దానిమ్మ పుల్లతో, ఎఱ్ఱచందనముతో వ్రాయించి పూజాస్థలమున పెట్టవలెను. ఈ యంత్రములో 1 నుండి 9 వరకు అంకెలను, 'కృ' నుండి 'ఠుం' వరకు అక్షరములను 108 సార్లు దిద్దవలెను. దిద్దునపుడు ప్రతిసారి 'కృష్ణం వన్దే జగద్గురుమ్' అని ఉచ్చరించవలెను. ధ్యానము చేయునపుడు గోపాలకృష్ణరూపమును గాని, పార్థసారథిరూపముగాని భావించవచ్చును.

గీత 2 అ. 7వ శ్లోకమును శయనైకాదశి (ఆషాఢశుద్ధ ఏకాదశి) మొదలుకొని ఉత్థానైకాదశి (కార్తీకశుద్ధ ఏకాదశి) వరకు ప్రతి ఏకాదశియందు రాత్రి పవిత్ర వస్త్రములను ధరించి మంచి పడకపై కూర్చొని గీతోక్త రథముపై ఆసీనుడై యున్న భగవంతుని ధ్యానించుచు, అర్జునునివలె దీనముగ భగవంతుని ప్రార్థించుచు 108సార్లు పఠించవలెను. దీనివలన ఒకానొక ఏకాదశియందు స్వప్నమున భగవంతుడు యథాయోగ్యముగ ఆదేశించును. దీనియందును సాధకునకు శ్రద్ధ, ధారణ, పవిత్రత చాల అవసరములై యున్నవి. సాధకుడు ఎంత ఉత్తముడుగ నుండునో, అంత శీఘ్రముగ నతనికి అనుభవము కలుగును.

11వ అధ్యాయము 36వ శ్లోకముతో జలమునుగాని, విభూతిని గాని అభిమంత్రించి ప్రేతబాధకలవానికి (దయ్యము పట్టినవానికి) ఇచ్చుటవలన ఆ బాధ నివారించును. రోగికి ఇచ్చినను ఫలము కలుగును. మనుష్యునకు గొప్పవ్యాధి వచ్చినను లేక ఏదైన పశువు తీవ్ర వ్యాధిగ్రస్తమైనను ఈ మంత్రమును 3వేలు జపించి, ఒక లోటానీళ్లు బావి నుండి చేది పై మంత్రముతో అభిమంత్రించి రోగపీడితునకు మెల్లమెల్లగ చాల గంటలు లేక రోజులు త్రాపినచో రోగ ముపశమించును. పశ్వాదులకు మేతయందు కలిపిగాని లేక ఏవిధముగ్నైనను సరియై త్రాపినచో వ్యాధి కుదురును.

11వ అధ్యాయము 39వ శ్లోకముతో మంత్రించుచు దర్భ, లేక వేపమండతో రోగిని చాలసార్లు తుడిచినచో (ప్రేతబాధ - దయ్యపు బాధ) ఉపశమించును.

శ్రీమద్భగవద్గీతను నిష్కామభావముతో శక్తికొలది ప్రతిదినము పఠించుచో భగవానుని యనుగ్రహముచే భక్తి, జ్ఞానములు కలిగి భగవత్సాక్షత్కారమయి మానవ జీవితోద్దేశ్యము సఫలము కాగలదు. ఇందులకు శ్రద్ధ చాల అవసరము. మఱియు పవిత్రత, దైవీసంపత్తి (సద్గుణములు) ఆర్జించుచు పఠించవలెను. గీతోపదేశము ననుసరించి తమ జీవితమును గడుపువారు, ప్రతిరోజు గీతను పూర్ణముగ పఠించువారు నగు మహనీయులను గుఱించి ఇక వేఱుగ చెప్పవలసిన పనిలేదు.

జనులు వారి వారి కోరికలకు తగిన ఆ యా గీతాశ్లోకములను★ సామాన్యరీతిగ్నైనను, లేక సంపుటరీతిగ్నైనను జపించువచ్చును. ఈ సంపుట పద్ధతి రెండు విధములు. గీతలోని ప్రతియొక్క శ్లోకము పిదప తాను యెన్నుకొనిన సంపుట శ్లోకమును పఠించి తరువాతగల శ్లోకమును పఠించుట మొదటి సంపుట పద్ధతి. ప్రతిశ్లోకము ముందు, తరువాత, అనగా ఒక శ్లోకము పఠించి, రెండవ శ్లోకము పఠించుటకు ముందుగా మధ్యలో సంపుట శ్లోకము రెండుసార్లు ఉచ్చరించుట రెండవ సంపుట పద్ధతి. దీనినే సంపుటవల్లి అందురు. ఇది మొదటిదానికంటె విశేష మహత్త్వము గలిగి యున్నది. గీతలోని ప్రతియొక్క శ్లోకము మంత్రమే. అవి యన్నియు మనోరథముల నీడేర్చగలిగియున్నవి. కావున ప్రతి శ్లోకమును సంపుటముగ వాడుకొనవచ్చును. (ఒకానొక మహనీయుడు గీతలోని ప్రతి యొక్క శ్లోకమును సంపుటముచేసి 700 పర్యాయములు జపించి సిద్ధిపొందెనట!) అయినను కొన్ని ముఖ్య సంపుట శ్లోకములు వాని వాని ఫలితములతో సహా ఈ వ్యాసము చివరి భాగములో తెలుపబడినవి.

★ ఏ యే కోరిక సఫలమగుటకు ఏయే గీతాశ్లోకము ఎన్ని వేలు జపించవలయునో ఈ వ్యాసమునందే చివరిభాగమున తెలుపబడినది.

గీతాపారాయణమును పారాయణవిధి ననుసరించి మంగళాచరణ, అంగన్యాస కరన్యాస, ధ్యాన, వినియోగ సంకల్పాదులు చేసియే జరుపవలెను. గీతాపారాయణ పద్ధతి మున్ముందు తెలుపబడును. ప్రతిదినము పూర్తిపారాయణము జరిగినచో సర్వోత్తమము. లేనిచో రోజుకు 9 అధ్యాయముల చొప్పున రెండురోజులలోగాని, 6 అధ్యాయముల చొప్పున మూడురోజులలోగాని, లేక (మొదటిరోజు 1,2 అధ్యాయములు, రెండవ రోజు 3, 4, 5 అధ్యాయములు, మూడవరోజు 6,7,8, నాల్గవరోజు 9,10, ఐదవరోజు 11,12,13, ఆఱవరోజు 14,15,16, ఏడవరోజు 17,18 అధ్యాయములు ఈ ప్రకారముగ) ఏడురోజులలోగాని, లేక రోజుకు 2 అధ్యాయముల చొప్పున 9 రోజులలోగాని పూర్తి పారాయణము చేయవచ్చును. అట్లుకానిచో రోజుకు 1 అధ్యాయము చొప్పున 18 రోజులలో పూర్తి పారాయణము చేయవలెను. పారాయణ ప్రారంభమున భగవంతుడగు శ్రీకృష్ణుని మఱియు క్రింద కనుబరచిన షట్కోణయంత్రము (నెం.2) విధిపూర్వకముగ పూజింపవలెను. యంత్రమును రాగిరేకుపై వ్రాయించి పవిత్రముగ నుంచవలయును. లేక చదరమగు గంధపుపలకపై ఎఱ్ఱచందనముతో దానిమ్మపుల్లచే వ్రాయవలెను.

## నెం. 2 యంత్రము




శ్రీమద్భగవద్గీతను తప్పనిసరిగా ప్రతిదినము పూర్తిపారాయణము ఒక సంవత్సరము వరకు జరిపినచో ప్రతియొక్క కార్యము సిద్ధిపొందగలదు. మఱియు క్రింద కనుబరచిన నవకోష్ఠకయంత్రము (నెం.3)ను రాగిరేకుపైననో, గంధపుపలక మీదనో వ్రాసి పూజించవలెను. పారాయణము పూర్తి అయిన ప్రతినిత్యము 'క్లీం కృష్ణాయ నమః' అను మంత్రమును మూడువేలు జపము చేయవలెను.

## నెం. 3 యంత్రము

| | | |
|---|---|---|
| కృష్ణ | కృష్ణ | కృష్ణ |
| కృష్ణ | క్లీం కృష్ణాయ నమః | కృష్ణ |
| కృష్ణ | కృష్ణ | కృష్ణ |

భగవంతుడగు శ్రీకృష్ణుని ప్రత్యక్షకృపను బొందుటకై ఈ క్రింద కనుబరచిన యంత్రము (నెం.4) ను పూజింపవలెను.

## నెం. 4 యంత్రము



ఈ యంత్రమును రాగిరేకుపైనగాని, శ్రీగంధపుపలకపైనగాని శుద్ధముగ వ్రాసి ప్రతిదినము దానిని పూజించుచు పారాయణవిధి ననుసరించి గీతయొక్క పూర్తి పారాయణమును ప్రతిదినము గావింపవలయును. మఱియు 'ఓం ఐం క్లీం హ్రీం శ్రీం కృష్ణాయ గోపీజనవల్లభాయ స్వాహా' అను ఈ అష్టాదశాక్షర మంత్రమును ప్రతిదినము 1100 జపించవలెను. ఈ ప్రకారము ప్రతిదినము తప్పనిసరిగ 3 సంవత్సరములవఱకు వరుసగ పారాయణము, జపము చేసినచో ప్రత్యక్షముగ భగవత్కృప లభించును. మఱియు భగవత్సాక్షాత్కారము సులభముగ చేకూరును.

40 రోజుల వఱకు ప్రతిదినము 'సంహారక్రమము'న అనగా 18వ అధ్యాయము నుండి మొదలు పెట్టి 1వ అధ్యాయమువరకు వెనుకనుండి ముందుకు తలక్రిందుగ 3 సార్లు పఠించుటచే బంధవిముక్తి కలుగును.

అదేవిధముగ 'స్థితిక్రమము'చే 40 రోజులు ప్రతిదనము ముమ్మారు పఠించుటచే లక్ష్మి సంప్రాప్తమగును. 6వ అధ్యాయము మొదలుకొని 18 వ అధ్యాయము వఱకును. తిరిగి 5 వ అధ్యాయము నుండి 1 వ అధ్యాయము వరకును పఠించుట స్థితిక్రమమనబడును.

1వ అధ్యాయము నుండి 18 వ అధ్యాయము వఱకు పఠించుట సృష్టిక్రమమనబడును. ఇదియు శ్రేష్ఠమైనదియు, మనోరథముల నీడేర్చునదియు నగును.

సమస్త అభీష్టములయొక్క సిద్ధికై 'యత్రయోగేశ్వరః కృష్ణో' (18-78) అను మంత్రమును సంపుటము చేసికొని జపించవలెను. మఱియు సర్వరోగ శమనమునకై ఈ మంత్రమును సంపుటముచేసి 10వ అధ్యాయమును పారాయణ మొనర్పవలెను. భోజన సమయమున ప్రతిరోజు 15వ అధ్యాయమును పఠించుటచే చాల మేలు కలుగును.

జపము అయినవెనుక క్షమాప్రార్థనాశ్లోకము లేవి చెప్పబడెనో పారాయణము అయిన తరువాత కూడ ఆ శ్లోకములచే క్షమాయాచన చేసి, చరణోదకమును గైకొనవలెను. పూర్ణశ్రద్ధ, అచంచల విశ్వాసము కలిగి విధి ననుసరించి చక్కగ అనుష్ఠించినచో అవశ్యము సిద్ధి కలుగును. ఏ కార్యమున్ను పరిణామము కలుగజేయక నుండదు; నిష్ఫలము కాదు. అట్టిచో సంయమ నియమములతో గూడి చేయబడిన భగవద్గీతాపారాయణ, జపముల విషయమై వేఱుగ చెప్పనేల? కావున ఎన్ని ప్రతిబంధములు కలిగినను గీతామంత్రము జపమును వదలరాదు. దానిపై శ్రద్ధావిశ్వాసములను సడలించరాదు. గీతయొక్క అధ్యయన, మనన జపాదులచే లౌకిక, పారమార్థిక ఫలితములు రెండును చేకూరగలవు. ఏ యే శ్లోకమును ఎన్ని వేలు జపించినచో ఏ యే ఫలితము లభించునను విషయము ఈ క్రింది తెలుపబడుచున్నది. మొట్టమొదట లౌకిక ఫలితముల విషయమున్ను, ఆ పిదప పరమార్థ ఫలముల విషయమున్ను ఇచట వివరింపబడుచున్నవి -

# గీత - లౌకిక ఫలితములు

లౌకిక ఫలితములు చేకూరుటకై ఈ క్రింది కొన్ని గీతాశ్లోకములు (మంత్రములు) తెలుపబడుచున్నవి. ఇచట కొన్ని చోట్ల ఒక్కొక్క ఫలితము క్రింద పెక్కు మంత్రములు సూచింపబడినప్పటికిని, వానిలో ఏ ఒక్క మంత్రమునైనను విధిప్రకారము శ్రద్ధాభక్తులతో జపించినచో ఫలితమును తప్పక కలుగజేయగలదు. ఏ యే మంత్రమును ఎంత సంఖ్యలో ఏ మూర్తిని ధ్యానించుచు ఎన్ని రోజులలో పూర్తిచేయవలెనో ఇచట వివరముగ తెలుపబడినది. అప్రకారము చేసికొనవచ్చును. అయితే సకామకర్మ, ఫలాసక్తితో గూడిన గీతాపఠనము అంత శ్రేష్ఠమైనది కాదు. 'కృపణాః ఫలహేతవః' - 'ఫలమును కోరువారు అల్పులు' అని భగవానుడు గీతయందు తెలిపియేయున్నారు. కావున క్రమక్రమముగ మనుజుడు నిష్కామకర్మలోనికి, భగవత్ప్రీత్యర్థకర్మలోనికి, ఫలాభిసంధిరహిత అనుష్ఠానములోనికి ప్రవేశించుట శ్రేయస్కరము. గీతాశ్లోకముల యొక్క మహత్తర మంత్రశక్తిని నిరూపించుటకును, సామాన్యజనమునకు గీతయందు దాసక్తిని జనింపజేయుటకును (ప్రవేశము కలిగించుటకును) మాత్రమే ఈలౌకిక ఫలితము లిచట పేర్కొనబడినవి. కావున వానినే చరమలక్ష్యములుగ ఎవరును భావించరాదు. నిష్కామభావనతో గీతను పఠించుచు, అనుష్ఠించుటయే సర్వశ్రేష్ఠము. అట్లు చేయువారికి అంతఃకరణశుద్ధియు, భగవత్ప్రాప్తియు తప్పక లభించును.

I కార్యసిద్ధి -

1. మంత్రము :

**ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః**
**మామకాః పాణ్డవాశ్చైవ కిమకుర్వత సంజయ.** (1-1)

మొత్తము జపించవలసిన సంఖ్య - 25 వేలు;
ఈ సంఖ్య ఎన్నిరోజులలో పూర్తిచేయవలెను? - 21 రోజులు;
ఏ రూపమును ధ్యానించవలెను? - పార్థసారథి; ఫలితము - కార్యసిద్ధి.

2. మంత్రము :

**ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా**
**జహిశత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్.** (3-43)

జపసంఖ్య - 41వేలు; జపకాలము (గడువు) 21 రోజులు; ధ్యానమూర్తి గోపాలకృష్ణుడు; ఫలితము - కార్యసిద్ధి.

3. మంత్రము :

**యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్**
**యత్తపస్యసి కౌన్తేయ తత్కురుష్వ మదర్పణమ్.** (9-27)

జపసంఖ్య - 1½ లక్ష; జప కాలము - 50 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - కార్యసిద్ధి.

4. మంత్రము:

**జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వాఽమృతమశ్నుతే**
**అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే.** (13-13)

జనసంఖ్య - 5 లక్షలు; జప కాలము 150 రోజులు; ధ్యానమూర్తి పార్థసారథి, ఫలితము కార్యసిద్ధి.
ఈ మంత్రమునే సంపుటపద్ధతి★ లో 51 పర్యాయములు జపించినప్పటికిని కార్యసిద్ధి చేకూరగలదు.

5. మంత్రము :

**సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షి శిరోముఖమ్**
**సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి.** (13-14)

జపసంఖ్య - 25 వేలు; జప కాలము 25 రోజులు; ధ్యానమూర్తి పార్థసారధి; ఫలితము కార్యసిద్ధి.

6. మంత్రము :

**సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః.** (18-66)

ఈ మంత్రమును సంపుటరీతిగ 151 సార్లు జపించినచో సర్వకార్యములు సిద్ధించగలవు.

---

★ 'సంపుట పద్ధతి' అనగా నేమియో ఈ గ్రంథమునందు 52వ పేజీలో తెలుపబడినది.

II. రోగనాశము -

1. మంత్రము :

**కుతస్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్**
**అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున.** (2-2)

జపసంఖ్య - 25వేలు; జప కాలము - 11 రోజులు;
ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - రోగనాశనము.
ఈ మంత్రమును సంపుట పద్ధతిలో 100 సార్లు జపించినప్పటికిని రోగములు శమించి పోగలవు.

2. మంత్రము :

**మత్తః పరతరం నాన్యత్కించి దస్తి ధనఞ్జయ**
**మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ.** (7-7)

జనసంఖ్య - 1¼ లక్ష; జపకాలము - 75 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము రోగనాశనము.

ఈ మంత్రమును సంపుటపద్ధతిలో 100 పర్యాయములు జపించినప్పటికిని రోగ వినాశమను ఫలితము సంభవించగలదు.

III. స్వప్నసిద్ధి -

1. మంత్రము :

**కార్పణ్యదోషోపహతస్వభావః**
**పృచ్ఛామి త్వాం ధర్మసంమూఢచేతాః**
**యచ్ఛ్రేయస్స్యా న్నిశ్చితం బ్రూహి తన్మే**
**శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్.** (2-7)

జపసంఖ్య - 51వేలు; జపకాలము - 21 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - స్వప్నసిద్ధి.
ఈ మంత్రమును సంపుటపద్ధతిలో 51సార్లు జపించినప్పటికిని స్వప్నసిద్ధి చేకూరగలదు.

2. మంత్రము :

**వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే**
**తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహమాప్నుయామ్.** (3-2)

జపసంఖ్య - 11 వేలు; జపకాలము - 11 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - స్వప్నాదేశము.

IV. విపత్తులు తొలగుట -

1. మంత్రము :

**లోకేఽస్మిన్ద్వివిధా నిష్ఠా పురాప్రోక్తా మయాఽనఘ**
**జ్ఞానయోగేన సాఙ్ఖ్యానాం కర్మయోగేన యోగినామ్.** (3-3)

జపసంఖ్య - 125 వేలు; జపకాలము; 41 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - విపత్తులు తొలగుట.

ఈ మంత్రమును సంపుట పద్ధతిలో 100 సార్లు జపించిననుగూడ విపత్తులు నశించిపోగలవు.

2. మంత్రము :

**భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్**
**సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తి మృచ్ఛతి.** (5-29)

జపసంఖ్య - 43 వేలు; జపకాలము - 21 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి. ఫలితము - విపత్తి నాశనము.

V. పూర్వజన్మజ్ఞానము

1. మంత్రము :

**అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః**
**కథమేత ద్విజానీయాం త్వమాదౌ ప్రోక్తవానితి.** (4-4)

జపసంఖ్య - 5 లక్షలు; జపకాలము - 150 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - పూర్వజన్మజ్ఞానము సిద్ధించుట.

ఈ మంత్రము సంపుట పద్ధతిలో 150 పర్యాయములు జపించినను పైన తెలిపిన ఫలితము చేకూరగలదు.

2. మంత్రము :

**బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున**
**తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరన్తప.** (4-5)

జపసంఖ్య - 6 లక్షలు; జపకాలము - 51 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - పూర్వజన్మజ్ఞానము సిద్ధించుట.

VI. ధనప్రాప్తి

1. మంత్రము :

**యత్సాఙ్ఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే**
**ఏకం సాఙ్ఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి.** (5-5)

జపసంఖ్య - 40వేలు; జపకాలము - 31 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - ఆకస్మిక ద్రవ్యప్రాప్తి.

ఈ మంత్రము సంపుటము గావించుకొని 51 సార్లు జపించినను పై ఫలితము లభించగలదు.

2. మంత్రము :

**వక్తుమర్హస్యశేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః**
**యాభిర్విభూతిభిర్లోకానిమాంస్త్వం వ్యాప్య తిష్ఠసి.** (10-16)

జపసంఖ్య - 36వేలు; జపకాలము - 31 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - లక్ష్మీప్రాప్తి.

3. మంత్రము :

**అనేక బాహూదర వక్త్రనేత్రం**
**పశ్యామి త్వాం సర్వతోఽనన్తరూపమ్**
**నాన్తం న మధ్యం నపునస్తవాదిం**
**పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప!!** (11—16)

జపసంఖ్య - 13వేలు; జపకాలము - 15 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము ధనప్రాప్తి.

4. మంత్రము :

**యచ్చాపహాసార్థ మసత్కృతోఽసి**
**విహార శయ్యాసనభోజనేషు**
**ఏకోఽథవా ప్యచ్యుత తత్సమక్షం**
**తత్క్షామయే త్వామహ మప్రమేయమ్.** (11-42)

జపసంఖ్య - 1½ లక్ష; జపకాలము - 50 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - లక్ష్మీప్రాప్తి.
ఈ మంత్రము సంపుట పద్ధతిలో 100 సార్లు జపించినను పై ఫలితము చేకూరగలదు.

5. మంత్రము :

**అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా**
**భయేన చ ప్రవ్యథితం మనో మే**
**తదేవ మే దర్శయ దేవరూపం**
**ప్రసీద దేవేశ జగన్నివాస.** (11-45)

జపసంఖ్య - 1½ లక్ష; జపకాలము - 50 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - ఐశ్వర్యప్రాప్తి.

ఈ మంత్రమును సంపుటరీతిగ 100 పర్యాయములు జపించుటవలనగూడ ఉపర్యుక్త ఫలితము సిద్ధించును.

11వ అధ్యాయమునందలి ఈ క్రింది మంత్రములను ఇదియే సంఖ్యతో ఇదియే పద్ధతిలో జపించినను ఒక్కొక్క దానికిన్ని ఇట్టి ఫలితమే చేకూరగలదు.

**అ. మా తే వ్యథా మా చ విమూఢభావో**
**దృష్ట్వా రూపం ఘోర మీదృఙ్మమేదమ్**
**వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం**
**తదేవ మే రూప మిదం ప్రపశ్య.** (11-49)

ఆ. ఇత్యర్జునం వాసుదేవస్తథోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః
ఆశ్వాసయామాస చ భీతమేనం
భూత్వా పున స్సౌమ్యవపు ర్మహాత్మా. (11-50)

ఇ. దృష్ట్వేదం మానుషం రూపం
తవ సౌమ్యం జనార్దన
ఇదానీమస్మి సంవృత్తస్సచేతాః ప్రకృతిం గతః. (11-51)

ఈ. సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాఙ్క్షిణః. (11-52)

ఉ. నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా. (11-53)

6. మంత్రము:

నమః పురస్తా దథ పృష్ఠత స్తే
నమోఽస్తుతే సర్వత ఏవ సర్వ
అనన్తవీర్యామిత విక్రమస్త్వం
సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః. (11-40)

జపసంఖ్య - 1½ లక్ష; జపకాలము - 50 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - దారిద్ర్యనాశము.

VII. శత్రువులపై విజయము

1. మంత్రము :

బన్ధురాత్మాఽఽత్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్. (6-6)

జపసంఖ్య - 21 వేలు; జపకాలము - 21 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - ద్వేషులపై విజయము.

2. మంత్రము :

అ. శనై శ్శనైరుపరమే ద్బుద్ధ్యా ధృతిగృహీతయా
ఆత్మసంస్థం మనః కృత్వా నకించిదపి చిన్తయేత్. (6—25)

**ఆ. యతో యతో నిశ్చరతి మనశ్చంచల మస్థిరమ్‌**
**తతస్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్.** (6-26)

జపసంఖ్య - 13 వేలు; జపకాలము - 26 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - శత్రువులపై విజయము.

**VIII. సర్వప్రియత్వము –**

**1. మంత్రము :**

**యో మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి**
**తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి.** (6-30)

జపసంఖ్య - 5 లక్షల 10 వేలు; జపకాలము - 150 రోజులు; ధ్యానమూర్తి - గోపాలకృష్ణుడు; ఫలితము - సర్వప్రియత్వము.

**IX. ఋణవిముక్తి**

**1. మంత్రము:**

**సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః**
**సర్వథావర్తమానోఽపి స యోగీ మయి వర్తతే.** (6-31)

జపసంఖ్య - 5 లక్షల 10 వేలు; జపకాలము - 157 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము ఋణవిముక్తి.

**2. మంత్రము :**

**తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్**
**భవామి న చిరాత్పార్థ మయ్యావేశిత చేతసామ్.** (12-7)

జపసంఖ్య - 1½ లక్ష; జపకాలము - 50 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - ఋణవిముక్తి.

ఈ మంత్రమును సంపుటరీతిగ 100 సార్లు జపించుట వలనను గూడ ఋణవిముక్తి కాగలదు.

**X. శత్రుబాధావిముక్తి**

**మంత్రము :**

**అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా**
**పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్.** (8-8)

జపసంఖ్య - 1½ లక్ష; జపకాలము - 50 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - శత్రుబాధావిముక్తి.

**XI. సంతాన ప్రాప్తి**

1. మంత్రము :

**న చ మాం తాని కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ**
**ఉదాసీనవదాసీన మసక్తం తేషు కర్మసు.** **(9-9)**

జపసంఖ్య - 1 లక్ష 90 వేలు; జపకాలము 210 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - సంతానప్రాప్తి.

**XII. యోగక్షేమప్రాప్తి**

1. మంత్రము :

**అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.** (9-22)

జపసంఖ్య - 1½ లక్ష; జపకాలము - 75 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - యోగక్షేమప్రాప్తి.

**XIII. సుఖప్రాప్తి –**

మంత్రము:

**పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి**
**తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః.** **(9-26)**

జపసంఖ్య - 1½ లక్ష; జపకాలము - 50 రోజులు; ధ్యానమూర్తి - గోపాలకృష్ణుడు; ఫలితము - సుఖప్రాప్తి. ఈ మంత్రమును సంపుటపద్ధతిలో 151 సార్లు జపించినప్పటికిని పై ఫలితము చేకూరగలదు...

**XIV. భయనాశము –**

1. మంత్రము :

**మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః**
**స్త్రియోవైశ్యాస్తథాశూద్రాస్తేఽపియాన్తి పరాంగతిమ్.** **(9-32)**

జపసంఖ్య - 1½ లక్ష; జపకాలము - 50 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - భయనాశము.

2. మంత్రము :

**శ్రద్ధయా పరయా తప్తం తపస్త్రివిధం నరైః**
**అఫలాకాఙ్క్షిభిర్యుక్తైస్సాత్త్వికం పరిచక్షతే.** **(17-17)**

జపసంఖ్య - 75 వేలు; జపకాలము - 15 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - శత్రుభయనాశము.

**XV. సిద్ధులు కలుగుట –**

మంత్రము :

**మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు**
**మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః. (9-34)**

జపసంఖ్య - 20 లక్షల 10 వేలు; జపకాలము - 75 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - సిద్ధులు కలుగుట.

**XVI. దుఃఖనాశము –**

1. మంత్రము :

**యో మా మజ మనాదించ వేత్తి లోకమహేశ్వరమ్**
**అసమ్మూఢస్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే. (10-3)**

జపసంఖ్య - 1½ లక్ష; జపకాలము - 50 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - దుఃఖనాశము.

2. మంత్రము :

**తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం**
**దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాన్తి తే. (10-10)**

జపసంఖ్య - 36 వేలు; జపకాలము - 31 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - విపత్తినాశము.

3. మంత్రము :

**శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్ జ్ఞానా ద్ధ్యానం విశిష్యతే**
**ధ్యానాత్కర్మఫలత్యాగ స్త్యాగాచ్ఛాన్తి రనన్తరమ్. (12-12)**

జపసంఖ్య - 15 వేలు; జపకాలము - 21 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - దుఃఖవియోగము.

**XVII. విఘ్ననాశము –**

మంత్రము :

**దివ్యమాల్యామ్బరధరం దివ్యగన్ధానులేపనం**
**సర్వాశ్చర్యమయం దేవమనన్తం విశ్వతోముఖమ్. (11-11)**

జపసంఖ్య - 13 వేలు; జపకాలము - 15 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - విఘ్ననాశము. ఈ మంత్రము సంపుట పద్ధతిలో 51 సార్లు జపించినప్పటికిన్ని పై ఫలితము కలుగగలదు.

**XVIII. ప్రేమవృద్ధి**

1. మంత్రము :

**త్వమాదిదేవః పురుషః పురాణ**
**స్త్వమస్య విశ్వస్య పరం నిధానమ్**

వేత్తాఽసి వేద్యంచ పరం చ ధామ
త్వయా తతం విశ్వమనన్తరూప. (11-38)

జపసంఖ్య - 15 వేలు; జపకాలము - 21 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - ప్రేమవృద్ధి.

2. మంత్రము :

జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః. (18-18)

జపసంఖ్య - 15 వేలు; జపకాలము - 21 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - ప్రేమవృద్ధి.

XIX భూతప్రేత బాధానివారణ

1. మంత్రము :

వాయుర్యమోఽగ్నిర్వరుణశ్శశాఙ్కః ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ
నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః పునశ్చ భూయోఽపి నమో నమస్తే. (11-39)

జపసంఖ్య - 15 వేలు; జపకాలము - 15 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - భూతప్రేత బాధానివారణ.

2. భూతప్రేతబాధ శమించుటకు ఈ క్రింది మంత్రమును సంపుటముగ 51 సార్లు జపించవచ్చును.

మంత్రము :

స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ
రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి సర్వే నమస్యన్తి చ సిద్ధసఙ్ఘాః. (11-36)

XX. ప్రసన్నత్వము -

మంత్రము :

పితాసి లోకస్య చరాచరస్య త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్
న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో లోకత్రయేఽప్యప్రతిమప్రభావ. (11-43)

జపసంఖ్య - 15వేలు; జపకాలము - 15 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - ప్రసన్నత్వము.

XXI. గురుదేవులు తప్పులు మన్నించుట -

మంత్రము :

తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వా మహ మీశ మీడ్యమ్
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్. (11-44)

జపసంఖ్య - 1½ లక్ష; జపకాలము - 50 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - గురుదేవుల తప్పులు మన్నించుట.

**XXII. మృత్యుకాలజ్ఞానము –**

**మంత్రము :**

**యదా సత్త్వే ప్రవృద్ధేతు ప్రలయం యాతి దేహభృత్**
**తదోత్తమవిదాం లోకా నమలాన్ ప్రతిపద్యతే.** **(14-14)**

జపసంఖ్య - 1 లక్ష; జపకాలము - 51 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - మృత్యుకాల జ్ఞానము.

**XXIII. ఉదరరోగనాశము –**

**మంత్రము :**

**అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః**
**ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్.** **(15-14)**

జపసంఖ్య - 1½ లక్ష; జపకాలము - 15 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - ఉదరరోగనాశము.

ఈ మంత్రము సంపుటరీతిగ 51 సార్లు జపించిననుగూడ ఉదరరోగము శమించును.

**XXIV. దోషనాశము, క్రోధశమనము –**

1. **మంత్రము :**

**సర్వస్యచాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతిర్జ్ఞాన మపోహనంచ**
**వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో వేదాన్తకృద్వేదవిదేవ చాహమ్.** **(15-15)**

జపసంఖ్య - 1 లక్ష; 10 వేలు; జపకాలము - 110 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - క్రోధశమనము.

2. **మంత్రము :**

**అనేకచిత్త విభ్రాన్తా మోహజాల సమావృతాః**
**ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽశుచౌ.** **16-16**

జపసంఖ్య - 10 వేలు; జపకాలము - 11 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - దోషనాశము.

3. మంత్రము :

**త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః**
**కామః క్రోధస్తథా లోభ స్తస్మా దేతత్త్రయం త్యజేత్.** 16-21

జపసంఖ్య - 1½ లక్ష; జపకాలము - 150 రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - కామక్రోధలోభ విజయము.

**XXV. వైభవప్రాప్తి –**

1. మంత్రము :

**యో మామేవ మసంమూఢో జానాతి పురుషోత్తమమ్**
**స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత.** 15-19

జపసంఖ్య - 1½ లక్ష; జపకాలము - 50రోజులు; ధ్యానమూర్తి - పార్థసారథి; ఫలితము - వైభవప్రాప్తి.

## గీత - పారమార్థిక ఫలితములు

ఈ క్రింద తెలుపబడిన పారమార్థిక ఫలములు లభించవలెనని కాంక్షించువారు, వానికి అనుగుణమైన మంత్రమును ఇచ్చోట వివరింపబడినరీతిగా భక్తిపూర్వకముగ జపించినచో ఫలితమును బడయగలరు. ఈ మంత్రములు క్రిందటి వ్యాసమునందే పూర్తిగ వ్రాయబడియుండుటవలన ఇచట సంక్షేపముగ మాత్రము తెలుపబడినవి. ఒక్కొక్క ఫలమునకు అనేక మంత్రములు తెలుపబడినను విధి ప్రకారము ఒక్క మంత్రమును ఆయా సంఖ్యలో క్షుణ్ణముగ జపించినచో ఫలము అవశ్యము లభించగలదు.



| ఫలము | మంత్రము | అధ్యాయము శ్లోకము | జప సంఖ్య | గడువు ఎన్ని రోజులలో | ధ్యానమూర్తి | సంపుటముగ ఎన్ని సార్లు |
|---|---|---|---|---|---|---|
| అంతఃకరణశుద్ధి | ధర్మక్షేత్రేకురుక్షేత్రే | 1-1 | 25 వేలు | 21 | పార్థసారథి | |
| | వ్యామిశ్రేణేవ వాక్యేన | 3-2 | 11 వేలు | 11 | ,, | |
| | సర్వతః పాణి పాదం తత్. | 13-13 | 25 వేలు | 25 | ,, | |
| మానసతాపనాశము | కుతస్త్వాకశ్మలమిదం | 2-2 | 25 వేలు | 25 | ,, | 100 |
| కామాదిశత్రువిజయము | ఏవంబుద్ధేః పరంబుద్ధ్వా... | 3-43 | 41 వేలు | 21 | గోపాలకృష్ణుడు | |
| | అభ్యాసయోగయుక్తేన... | 8-8 | 1½ లక్ష | 50 | పార్థసారథి | |
| | త్రివిధం నరకస్యేదం... | 6-21 | 1½ లక్ష | 150 | ,, | |
| | శ్రద్ధయా పరయాతప్తం... | 17-17 | 75 వేలు | 15 | ,, | |
| భక్తియందు దృఢత్వము | బహూని మే వ్యతీతాని... | 4-5 | 6 లక్షలు | 51 | ,, | |
| | యో మాం పశ్యతి సర్వత్ర | 6-30 | 5ల.10వే. | 150 | గోపాలకృష్ణుడు | |
| | జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి | 3-12 | 5 లక్షలు | 150 | పార్థసారథి | 51 |
| | యో మామేవ మసంమూఢో... | 15-19 | 1½ లక్ష | 50 | ,, | |
| చిత్తచాంచల్యనాశము | లోకేఽస్మిన్ద్వివిధా నిష్ఠా... | 3-3 | 1¼ లక్ష | 41 | ,, | 100 |
| సాధనయందలివిఘ్నముల నాశము | భోక్తారం యజ్ఞతపసాం... | 5-29 | 43 వేలు | 21 | ,, | |
| | దివ్యమాల్యాంబరధరం... | 11-11 | 13 వేలు | 15 | ,, | |
| మనోజయము, ధ్యానయోగ్యత | శనైశ్శనైరుపరమేత్... | 6-25 | ,, | | | |
| | యతోయతోనిశ్చరతి | 6-26 | 13 వేలు | 26 | ,, | |
| | వాయుర్యమోఽగ్నిర్వరుణః శశాఙ్కః | 11-39 | 15 వేలు | 15 | ,, | |
| | స్థానేహృషీకేశ తవప్రకీర్త్యా | 11-36 | 15 వేలు | 15 | ,, | |
| శరణాగతియోగ్యత | కార్పణ్య దోషోపహత స్వభావః | 2-7 | 51 వేలు | 21 | పార్థసారథి | 51 |
| | మాం హి పార్థ వ్యపాశ్రిత్య ... | 9-32 | ½ లక్ష | 50 | ,, | |
| | మన్మనాభవ మద్భక్తో... | 9-34 | 2ల.10వే. | 75 | ,, | |
| విశ్వాసమందు దృఢత్వము | అపరం భవతోజన్మ... | 4-4 | 5 లక్షలు | 150 | ,, | 150 |
| సాంఖ్యనిష్ఠయందు యోగ్యత | యత్సాంఖ్యైః ప్రాప్యతేస్థానం.. | 5-5 | 40 వేలు | 31 | ,, | 51 |
| జ్ఞానపరిపక్వత | సర్వభూతస్థితం యో మాం... | 6-31 | 5ల.10వే. | 157 | ,, | |
| ద్వేషభావ వినాశము | బన్ధురాత్మాత్మనస్తస్య... | 6-6 | 21 వేలు | 21 | ,, | |
| సర్వత్రభగవద్దర్శనయోగ్యత | మత్తః పరతరం నాన్యత్ | 7-7 | 1¼ లక్ష | 75 | పార్థసారథి | 100 |
| | పత్రం పుష్పం ఫలం తోయం.. | 9-26 | 1½ లక్ష | 50 | గోపాలకృష్ణుడు | 151 |

| ఫలము | మంత్రము | అధ్యాయము శ్లోకము | జప సంఖ్య | గడువు ఎన్ని రోజులలో | ధ్యానమూర్తి | సంపుటముగ ఎన్ని సార్లు |
|---|---|---|---|---|---|---|
| కర్మయోగ పరిపక్వత | నచమాం తాని కర్మాణి... | 9-9 | 1ల. 90వే. | 210 | పార్థసారథి | |
| యోగక్షేమప్రాప్తి | అనన్యాశ్చిన్తయన్తో మాం... | 9-22 | 1¼ లక్ష | 75 | .. | |
| భగవత్కృప | యత్కరోషి యదశ్నాసి... | 9-27 | 1½ లక్ష | 50 | .. | |
| | వక్తు మర్హస్యశేషేణ... | 10-16 | 36 వేలు | 31 | .. | |
| భగవత్ప్రసన్నత్వము | పితాసి లోకస్య చరాచరస్య... | 11-43 | 15 వేలు | 15 | .. | |
| భగవంతుడు తప్పులు మన్నించుట | తస్మాత్ప్రణమ్య ప్రణిధాయకాయం | 11-44 | 1½ లక్ష | 50 | .. | 100 |
| భగవద్దర్శనము | అదృష్టపూర్వం హృషితో ఽస్మి దృష్ట్వా... | 11-45 | 1½ లక్ష | 50 | .. | |
| | మాతే వ్యథా మాచ విమూఢభావో. | 11-49 | 1½ లక్ష | 50 | .. | |
| | ఇత్యర్జునం వాసుదేవస్తథోక్త్వా... | 11-50 | 1 లక్ష | 50 | .. | |
| | దృష్ట్వేదం మానుషం రూపం... | 11-51 | 1½ లక్ష | 50 | .. | |
| | సుదుర్దర్శ మిదం రూపం... | 11-52 | 1½ లక్ష | 50 | .. | |
| | నాహం వేదైర్నతపసా... | 11-53 | .. | .. | .. | |
| పాపనాశము | యోమామజమనాదించ... | 10-3 | .. | .. | .. | |
| దోషనాశము | శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్.. | 12-12 | 15 వే | 21 | .. | |
| | అనేకచిత్త విభ్రాన్తా... | 16-16 | 10 వే | 11 | .. | |
| వివేకప్రాప్తి | అనేక బాహూదర వక్త్రనేత్రం.. | 11-16 | 13 వే | 15 | .. | 100 |
| | యచ్చావహాసార్థమసత్కృతో ఽసి | 11-42 | 1½ ల | 50 | .. | |
| | అహం వైశ్వానరో భూత్వా ... | 15-14 | 1½ ల | 15 | .. | 51 |
| ప్రేమవృద్ధి | త్వమాదిదేవః పురుషః పురాణః | 11-38 | 15వే | 15 | .. | |
| | జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా.. | 18-18 | 15వే | 21 | .. | |
| యోగయుక్తుడగుట | తేషాం సతతయుక్తానాం... | 10-10 | 36 వే | 31 | .. | |
| మోహనాశము | నమః పురస్తాతథ పృష్ఠతస్తే... | 12-7 | 1½ ల | 50 | .. | |
| భగవత్ప్రాప్తికి యోగ్యత | తేషామహం సముద్ధర్తా... | 12-7 | 1½ల | 50 | .. | 100 |
| | సర్వధర్మాన్ పరిత్యజ్య .... | 18-66 | | | | |
| మృత్యుకాలమున భగవత్స్మరణము | యదాసత్త్వేప్రవృద్ధేతు... | 14-4 | 1ల | 51 | .. | 151 |
| క్రోధశమనము | సర్వస్యచాహం హృదిసన్నివిష్టో... | 15-15 | 1ల 10వే | 110 | .. | |
| విఘ్ననాశము | దివ్యమాల్యామ్బరధరం... | 11-11 | | | | 51 |

# గీతయొక్క అమోఘశక్తికి కారణము




ఎట్లనిన, గీతను చెప్పినవాడు కృష్ణుడని సర్వులకును విదితమే. వినినవాడు అర్జునుడు. అర్జునుడు కృష్ణుడెట్లగునను సంశయము కలుగవచ్చును. ఆ సంశయమును భగవానుడే గీత 10వ అధ్యాయమున (విభూతియోగమున) తీర్చివైచెను. "పాణ్డవానాం ధనంజయః" – 'పంచపాండవులలో అర్జునుడను నేను' అని శ్రీకృష్ణ డచట పేర్కొనెను. కావున అర్జునుడు సాక్షాత్ శ్రీకృష్ణరూపమే యగును. ఇక వ్రాసినవాడో వ్యాసులు. వ్యాసులు కృష్ణ డెట్లగును? ఈ సంశయమున్ను అదే అధ్యాయములో నివారింపబడినది. "మునీనామప్యహం వ్యాసః", 'మునులలో శ్రీవేదవ్యాసుడని నేను' అని భగవానుడు వాక్రుచ్చెను. కాబట్టి వ్యాసులు సాక్షాత్ శ్రీకృష్ణస్వరూపమేయని తేలినది. ఈ ప్రకారము ముగ్గురు కృష్ణులయొక్క దివ్య తపశ్శక్తి ఏకీభవించిన మహత్తర గ్రంథమగుటచే గీత కిట్టి ఘనత చేకూరినది.

## అదృష్టసంఖ్య – 18

గీతయందలి అధ్యాయములు ........................ 18
మహాభారతయుద్ధము జరిగిన మొత్తము రోజులు ........................ 18
యుద్ధములోని సైనికసంఖ్య – (అక్షౌహిణులలో) ........................ 18
మహాభారత గ్రంథములోని పర్వములు ........................ 18

| | | | |
|---|---|---|---|
| అక్షౌహిణి | 21870 | ఏనుగులు | 2 + 1 + 8 + 7 + 0 = 18 |
| | 21870 | రథములు | 2 + 1 + 8 + 7 + 0 = 18 |
| | 65610 | గుఱ్ఱములు | 6 + 5 + 6 + 1 + 0 = 18 |
| | 109350 | కాల్బంట్లు | 1 + 0 + 9 + 3 + 5 + 0 = 18 |

| | | | |
|---|---|---|---|
| మోక్షసాధసోపానములు★ | అంతఃకరణ చతుష్టయము | –1 | |
| | పంచప్రాణములు | –5 | |
| | పంచ జ్ఞానేంద్రియములు | –5 | |
| | పంచకర్మేంద్రియములు | –5 | 1 + 5 + 5 + 5 + 1 + 1 = 18 |
| | దేహము | –1 | |
| | దృశ్యము | –1 | |

★ దృశ్యం దేహంచ వాగాది శ్రోత్రాదీంద్రియ పంచకమ్
ప్రాణాది పంచకం చైవ తథాఽన్తఃకరణమేవ చ
ముక్తిసాధస్య సోపానా అష్టాదశ ఇతీరితాః
ఏతాన్క్రమేణ చారుహ్య బ్రహ్మభూయాయ కల్పతే.

**తా॥** దృశ్యము, దేహము, పంచకర్మేంద్రియములు, పంచజ్ఞానేంద్రియములు, పంచప్రాణములు, అంతఃకరణ చతుష్టయము – అను ఈ పదునెనిమిదియు మోక్షసాధమునకు మెట్లుగా చెప్పబడినవి. వీనిని క్రమముగా దాటి ముముక్షువు పరబ్రహ్మస్వరూపడగుచున్నాడు.

మనుజునకు 'మైనర్' (Minor) తీరుకాలము (సంవత్సరములలో) ................ 18

దేవాలయము మెట్లు ................ 18

యజ్ఞములో ఋత్విక్కులు ................ 18

ప్రప్రథమ ఉపనిషత్తగు 'ఈశావాస్య'ము లోని మంత్రములు ................ 18

గీత 2వ అధ్యాయమున 'ఆత్మవర్ణన' శ్లోకములు ................ 18

గీత 2వ అధ్యాయమున స్థితప్రజ్ఞలక్షణ శ్లోకములు ................ 18

దుర్గాదేవికి గల భుజములు ................ 18

పదునెనిమిది సంఖ్య సాంఖ్యమతానుసారముగ "సోఽహం" భావమును సూచించుచున్నదని, లేక వేదాన్తమతానుసారము "అహంబ్రహ్మాస్మి" యను మహావాక్యముయొక్క అర్థమును స్ఫురింప జేయుచున్నదని పెద్దలు చెప్పుదురు.



# అధ్యాయానుక్రమముగ గీతయందలి వ్యక్తులు చెప్పిన శ్లోకముల సంఖ్య

| అధ్యాయము | ధృతరాష్ట్రుడు | సంజయుడు | అర్జునుడు | శ్రీ కృష్ణుడు | అధ్యాయములోని మొత్తము శ్లో\|\| సంఖ్య | ఆయా వ్యక్తులు చెప్పిన మొత్తము శ్లో\|\| సంఖ్య |
|---|---|---|---|---|---|---|
| 1 | 1 | 25 | 21 | – | 47 | |
| 2 | - | 3 | 6 | 63 | 72 | |
| 3 | - | - | 3 | 40 | 43 | |
| 4 | - | - | 1 | 41 | 42 | |
| 5 | - | - | 1 | 28 | 29 | శ్రీకృష్ణుడు – 574 |
| 6 | - | - | 5 | 42 | 47 | అర్జునుడు – 85 |
| 7 | - | - | - | 30 | 30 | సంజయుడు – 41 |
| 8 | - | - | 2 | 26 | 28 | ధృతరాష్ట్రుడు – 1 |
| 9 | - | - | - | 34 | 34 | మొత్తము – 701 |
| 10 | - | - | 7 | 35 | 42 | గీతాశ్లోకములు |
| 11 | - | 8 | 33 | 14 | 55 | |
| 12 | - | - | 1 | 19 | 20 | |
| 13 | - | - | 1 | 34 | 35 | |
| 14 | - | - | 1 | 26 | 27 | |
| 15 | - | - | - | 20 | 20 | |
| 16 | - | - | - | 24 | 24 | |
| 17 | - | - | 1 | 27 | 28 | |
| 18 | - | 5 | 2 | 71 | 78 | |
| | 1 | 41 | 85 | 574 | 701 | |

# గీతాశ్లోకముల ఛందోవివరణ

గీత యందు 5 ఛందస్సులు వాడబడినవి. అవి 'అనుష్టుప్, ఇంద్రవజ్ర, ఉపేంద్రవజ్ర, ఉపజాతి, విపరీతపూర్వ' అను నామములు గలిగియున్నవి. ఏ యే అధ్యాయమందు ఏ యే శ్లోకములు ఏ యే ఛందస్సులో నుపయోగింపబడినవో ఆ వివరము లన్నియు ఈ క్రింది తెలుపబడినవి. అవికాక మిగిలిన శ్లోకము లెవ్వికలవో అవి యన్నియు అనుష్టుప్ ఛందస్సులోనే కలవు. వాని సంఖ్య మొత్తము 646.

| ఛందస్సు | అధ్యాయము | శ్లోకముల నెంబరు | మొత్తం | | |
|---|---|---|---|---|---|
| ఇంద్రవజ్ర | 2 | 7,29 | 2 | | |
| "" | 8 | 28 | 1 | | |
| "" | 9 | 20 | 1 | | |
| "" | 11 | 20,22,27,30 | 4 | అనుష్టుప్ | 646 శ్లో |
| | 15 | 5,15 | 2 | ఇంద్రవజ్ర | 10 శ్లో |
| ఉపేంద్రవజ్ర | 11 | 18,28,29,45 | 4 | ఉపేంద్రవజ్ర | 4 శ్లో |
| ఉపజాతి | 2 | 5,6,8,20,22,70 | 6 | ఉపజాతి | 37 శ్లో |
| "" | 8 | 9,10,11 | 3 | విపరీతపూర్వ | 4 శ్లో |
| "" | 9 | 21 | 1 | గీతలోమొత్తం | 701 శ్లో |
| "" | 11 | 15,16,17,19,21 | | | |
| | | 23,24,25,26 | | | |
| | | 31,32,33,34,36, | | | |
| | | 38,40,41,42,43, | | | |
| | | 46,47,48,49,50 | 24 | | |
| " | 15 | 2,3,4 | 3 | | |
| విపరీతపూర్వ | 11 | 35,37,39,44 | 4 | | |

# గీ తా స్తో త్ర క ద ం బ ము

1. ఇదం గీతాశాస్త్రం పరమపురుషార్థైక నిలయం
త్రికాణ్డం వేదార్థం సకల మిహ సంగృహ్య కథితమ్
స్వయం శ్రీకృష్ణేన శ్రుతివిశదతత్త్వేన విభునా
జపాద్ధ్యానాజ్ఞ్నాచ్ఛ్రుతమపి ఫలత్యేవ సుధియామ్.

ఈ గీతాశాస్త్రము పరమపురుషార్థమగు మోక్షమునకు నిలయము. కాండత్రయాత్మకమగు వేదముయొక్క అర్థమంతయు సంగ్రహింపబడి సర్వవ్యాపకుడగు శ్రీకృష్ణపరమాత్మచేత నిట విశదముగ చెప్పబడినది. కావున ఇద్దానిని జపించినను, ధ్యానించినను, శ్రవణముచేసినను, దానియొక్క జ్ఞానమును సంపాదించినను, బుద్ధిమంతులకు తప్పక ఫలమును కలుగజేయగలదు.

2. రతాః కేచిద్యోగే విజితకరణాః సంయతధియః
క్రియాజాలే కేచిత్సుఖలవరసాస్వాదనపరాః
రతాః శాస్త్రాభ్యాసే విశదమతయః కేచిదజడా
వయంతు శ్రీకాన్తాననవచన మాస్వాద్య కృతినః.

కొందఱు తమ బుద్ధిని సంయమన మొనర్చి ఇంద్రియములను జయించి యోగమం దాసక్తి కలిగియున్నారు. మఱికొందఱు రవ్వంత సుఖము కొఱకు అనేక క్రియాకాండములందు నిమగ్నులైయున్నారు. కొందఱు వివేకవంతులు తమ బుద్ధిని నిర్మల మొనర్చుకొని శాస్త్రాభ్యాసమునందు నిరతులై యున్నారు. కాని, మేమో, లక్ష్మీపతియగు శ్రీకృష్ణపరమాత్మయొక్క ముఖారవిందము నుండి వెలువడిన వాక్యములను (గీతాశాస్త్రమును) గ్రోలి కృతార్థులమైతిమి.

3. వార్ష్ణేయబ్రహ్మశైలా దృజుశతపథగా జ్ఞానవిజ్ఞానకూలా
పార్థస్య ప్రార్థనాత శ్చిర మమృతవహా ప్రత్యగానందసింధుమ్
సంప్రాప్తార్థప్రవాహప్రపతిత వితతాశ్వత్థ మున్మూలయన్తీ
గీతా స్రోతా నిమజ్జ్యః సకల కలిమలం స్వర్ధునీయం ధునీతే.

పరబ్రహ్మ స్వరూపుడగు శ్రీకృష్ణమూర్తియను పర్వత శిఖరమునుండి అర్జునుని ప్రార్థనచే నుద్భవించినదియు, వంకరలులేని పెక్కుమార్గములతో గూడినదియు, జ్ఞాన విజ్ఞానములను తీర్థములు కలదియు, శాశ్వతమగు అమృతప్రవాహము గలిగియున్నదియు, ప్రత్యగాత్మయను ఆనందసముద్రమును చేరుచున్నదియు, తన పరమార్థమను ప్రవాహమునకు అడ్డుగాపడియున్న (సంసార రూప) అశ్వత్థ వృక్షమును సమూలముగ ఛేదించివేయునదియు, తనయందు మునుగువారియొక్క కలికల్మషమును హరించివేయునదియునగు గీత నిర్మల గంగాప్రవంతివలె శోభించుచున్నది.

4. అచార్యాః సన్తి కుత్రాప్యతివిమలధియో వేదశాస్త్రాగమానాం
దుష్ప్రాపస్తావదాస్తే త్రిజగతి నితరా మాత్మ తత్త్వోపదేష్టా
ఏవం సత్యర్జునస్యాద్భుత వికలవతో వర్ణ్యతే కిన్ను భాగ్యం
యస్యాచార్యస్య హేతోః స్వయ ముపనిషదామర్థ ఆవిర్బభూవ.

వేదశాస్త్రముల నెఱిగినవారును, అతినిర్మలచిత్తులునగు గురువులు అచటచట దొరకవచ్చును. కాని కేవల మాత్మతత్త్వమును అనుభవపూర్వకముగ బోధించు మహనీయులు ముల్లోకములయందును చాల అరుదుగా నుందురు. ఇట్లుండ, రణరంగమున బంధ్వాదులనుజూచి వికలచిత్తుడైయున్న అర్జునుని భాగ్య మేమని చెప్పవచ్చునో కాని ఆతనికి గురురూపమున సాక్షాత్ ఉపనిషత్తులయొక్క సారమే మూర్తీభవించి విలసిల్లెను.

5. క్వ శాస్త్రం గీతాఖ్యం హరిముఖ సరోజాద్విగలితం
క్వ చాస్మాకం బుద్ధి ర్విషయవిషపఙ్కే నిపతితా
తథాపి శ్రీకాన్తప్రచురగుణలక్ష్మీ విరచితం
కటాక్షం స్వచ్ఛాచ్ఛం హ్యనుసృతవతాం కిం న సులభమ్.

భగవానుని ముఖపద్మమునుండి వెలువడిన గీతయను ఈ మహాశాస్త్రమెచట! విషయములను విషపంకమున నిమగ్నమగు మాబుద్ధి ఎచట! అయినప్పటికిని అనంత సద్గుణ విలసితమై, నిర్మలమైనట్టి ఆ లక్ష్మీపతియొక్క కటాక్షమును అనుసరించువానిచే అది సులభముగనే గ్రహింపబడగలదు.

వేదోదధిప్రమథితం వాసుదేవ సముద్ధృతమ్
సన్తః పిబన్తి సతతం గీతామృత రసాయనమ్.

వేదములను క్షీరసముద్రమును మథించి శ్రీకృష్ణపరమాత్మ వెలికితీసినట్టి గీతామృతమును సత్పురుషులు నిరంతరము పాన మొనర్చుచున్నారు.

ఏకం శాస్త్రం దేవకీపుత్ర గీతం ఏకోదేవో దేవకీపుత్ర ఏవ,
ఏకో మన్త్రస్తస్య నామాని యాని కర్మాప్యేకం తస్య దేవస్య సేవా.

శాస్త్రము లన్నిటియందును దేవకీతనయుడగు శ్రీకృష్ణమూర్తి గానమొనర్చిన గీతాశాస్త్రమొకటియే మేటి. దేవతలందఱియందును దేవకీసుతుడగు శ్రీకృష్ణుడే గొప్పవారు. మంత్రములన్నిటి యందును ఆ శ్రీకృష్ణుని నామములే సర్వశ్రేష్ఠములు. కర్మలన్నిటియందును ఆ శ్రీకృష్ణుని సేవయే చాల గొప్పది.

భారతే సర్వవేదార్థో భారతార్థశ్చ కృత్స్నశః,
గీతాయామస్తి తేనేయం సర్వశాస్త్రమయీ మతా.

సమస్త వేదములయొక్క సారము భారతమునందు కలదు. భారతముయొక్క సారమంతనో గీతయందు కలదు. కాబట్టి భగవద్గీత సర్వశాస్త్రమయమని చెప్పబడుచున్నది.

**శ్రీ గోవిన్దముఖారవిన్ద మధునామిష్టం మహాభారతే**
**గీతాఖ్యం పరమం రహస్యమృషిణా వ్యాసేన విఖ్యాపితమ్**
**వ్యాఖ్యాతం భగవత్పాదైః ప్రతిపదం శ్రీశంకరాఖ్యైః పున**
**ర్విస్పష్టం మదుసూదనేన మునినా స్వజ్ఞానశుద్ధ్యైకృతమ్.**

గోవిందుడగు శ్రీకృష్ణపరమాత్మయొక్క ముఖపద్మమునుండి వినిర్గతమైనదియు, అత్యంత మధురమై యొప్పునదియునగు గీతయను పేరుగల పరమరహస్యము మహాభారతమున వ్యాసమహర్షిచే ప్రకటింపబడినది. శ్రీశంకర భగవత్పాదు లద్దానికి విపులముగ వ్యాఖ్యనొనర్చిరి. తిరిగి మధుసూదన సరస్వతి స్వకీయ జ్ఞానశుద్ధి కొఱకై దాని భావమును లోకులకు స్పష్టముగ నెఱుక పఱచెను.

**భగవద్గీతా కించి దధీతా గంగాజలలవకణికా పీతా,**
**సకృదపి యేన మురారిసమర్చా తస్య కరోతి యమోఽపి న చర్చామ్.**

ఎవడు భగవద్గీతను కొంచెమైనను అధ్యయనము చేయునో, గంగాజలమును రవ్వంతైనను త్రాగునో, విష్ణుమూర్తిని ఒక్క పర్యాయమైనను పూజించునో, అట్టివానిని గూర్చి యముడు చర్చింపడు. (మరణరాహిత్యపదవిని అతడు పొందునని భావము.)

**గేయం గీతానామసహస్రం ధ్యేయం శ్రీపతిరూప మజస్రం,**
**నేయం సజ్జనసఙ్గే చిత్తం దేయం దీనజనాయ చ విత్తమ్.**

భగవద్గీతను, విష్ణుసహస్రనామమును పఠించవలెను. .విష్ణుమూర్తియొక్క రూపమును ఎల్లప్పుడు ధ్యానించవలెను. సత్పురుషుల సాంగత్యమునందు చిత్తమును ప్రవేశింపజేయవలెను. దీనులగు జనులకు ధనమును దానము చేయవలెను.

**గీకారం త్యాగరూపం స్యాత్తత్త్వబోధం తకారకమ్**
**గీతావాక్య మిదం తత్త్వం జ్ఞేయం సర్వముముక్షుభిః.**

'గీ' అనగా త్యాగము, 'త' అనగా తత్త్వజ్ఞానము, ఇవ్విధముగ త్యాగమును, తత్త్వజ్ఞానమును బోధించునదే 'గీత' యని ముముక్షువులందఱును తెలిసికొనవలయును.



## 4 గ కారములు

**గీతా గంగా చ గాయత్రీ గోవిన్దేతి హృదిస్థితే**
**చతుర్గకారసంయుక్తే పునర్జన్మ న విద్యతే**

(మహాభారతము)

గీత
గంగ
గాయత్రి
గోవిందుడు

} అను గకారముతో ప్రారంభించు నాలుగింటిని ఎవడు కలిగియుండునో, అట్టివానికి పునర్జన్మలేదు. (అనగా జననమరణ రూపమగు సంసార దుఃఖమునుండి ఆతడు విముక్తినొంది కైవల్యపదవి నధిష్ఠించునని భావము. గీతాధ్యయనము, గంగాస్నానము, గాయత్రీమంత్రజపము, గోవిందునిధ్యానము జీవితములో అతిముఖ్యములని గమనించవలెను.)

# గీతాచార్యస్తోత్రము

**యస్యకృపాకటాక్షేణ సంసారోఽయం ప్రణశ్యతి**
**సర్వగం సచ్చిదాత్మానం తం వన్దే పార్థసారథిమ్.**

ఎవరియొక్క కృపాకటాక్షముచే ఈ సంసారదుఃఖము నశించిపోవునో, అట్టి సర్వవ్యాపకుడును, సచ్చిదానందాత్మస్వరూపుడును, అర్జునసారథియునగు శ్రీకృష్ణపరమాత్మకు నమస్కారము.

**వ్యవహితపృతనాముఖం నిరీక్ష్య**
**స్వజనవధా ద్విముఖస్య దోషబుద్ధ్యా**
**కుమతి మహరద దాత్మవిద్యయా యః**
**స భవతు మే భగవాన్ గతిర్ముకున్దః.** (భాగవతము - భీష్మస్తుతి)

ఇరుపక్షములందలి సేనలు యుద్ధమునకు సిద్ధమగుట జూచి స్వజనమును వధించుట దోషమని యెంచి యుద్ధముచేయ నొల్లకుండిన అర్జునుని విపరీతబుద్ధిని తన ఆత్మవిద్యోపదేశముచే తొలగించివైచినట్టి శ్రీకృష్ణభగవానుడు నన్ను బ్రోచుగాత!

**యదిచ్ఛాతరిం ప్రాప్య గీతాపయోధౌ**
**న్యమజ్జం గృహీతాతిచిత్రార్థ రత్నమ్**
**న చోత్థాతు మస్మి ప్రభుర్హర్ష యోగాత్**
**న మే కౌతికీనన్దసూనుః ప్రియః స్యాత్.**

ఎవరిని గూర్చిన అభిలాష (భగవద్భక్తి) యను నౌకను గ్రహించి గీతాసముద్రమున మునింగి అందలి చిత్రవిచిత్రములైన (జ్ఞాన) రత్నములను గ్రహించి ఆనందపారవశ్యముచే పైకి లేవజాలకున్నానో అట్టి పరమానందరూపుడైన ప్రభువగు శ్రీకృష్ణపరమాత్మ నాకు ప్రియమును జేకూర్చుగాక!

**శోకపఙ్కనిమగ్నం యః సాంఖ్యయోగోపదేశతః**
**ఉజ్జహారార్జునం భక్తం స కృష్ణః శరణం మమ.**

ఎవడు దుఃఖమను బురదలో కూరుకొనిపోయిన అర్జునుని తనజ్ఞానోపదేశముచే నుద్ధరించెనో అట్టి శ్రీకృష్ణమూర్తియే నాకు శరణ్యము.

**పీతం వాసో దధానం విజయరథగతం బ్రహ్మరుద్రాదివన్ద్యం**
**భూమేర్భారం జిహీర్షుం నవజలదరుచం శంఖచక్రాబ్జహస్తమ్**
**పార్థవ్యాజేన లోకం నిగమమనుసృతౌ యోజయన్తం మహేశం**
**ధ్యాయేన్నిత్యం సుసేవ్యం సుజనమతిగృహం కృష్ణమానందకన్దమ్.**

పీతవస్త్రమును ధరించినవారును, అర్జునుని రథసారథియు, బ్రహ్మరుద్రాది దేవతలకును వంద్యులును, భూభారమును తీర్చుటకు అవతరించినవారును, నీలమేఘకాంతి కలవారును, చేతులందు శంఖచక్ర గదాపద్మములు గల్గియున్నవారును, అర్జునుని నెపమున లోకమునంతను వేదమార్గమున ప్రవర్తింపజేసినవారును, మహేశ్వరుడును, సత్పురుషుల పవిత్రబుద్ధియందు నివసించువారును, లెస్సగ సేవింపదగినవారును, ఆనందనిలయులునగు శ్రీకృష్ణమూర్తిని నిరంతరము ధ్యానించెదను.

**కాండత్రయాత్మకం శాస్త్రం గీతాఖ్యం యేన నిర్మితమ్**
**ఆదిమధ్యాన్తషట్కేషు తస్మై భగవతే నమః.**

ఆదిమధ్యాంతములందు ఆఱేసి అధ్యాయముల చొప్పున మొత్తము పదునెనిమిది అధ్యాయములు కల గీతయను ఆధ్యాత్మిక శాస్త్రమును ఎవరు బోధించిరో అట్టి శ్రీకృష్ణభగవానునకు నమస్కారము.

**అగ్రే కృత్వా కమపి చరణం జానునైకేన తిష్ఠన్**
**పశ్చాత్పార్థం ప్రణయరసజుషా చక్షుషావేక్షమాణః**
**సవ్యే తోత్రం కరసరసిజే దక్షిణే జ్ఞానముద్రాం**
**ఆబిభ్రాణో రథమధివసన్ పాతు నః సూతవేషః.**

ఒక కాలు ముందునకుచాచి, మఱియొక కాలి మోకాలుపై రథమున కూర్చొనియున్నవారును, వెనుకగానున్న అర్జునుని ప్రేమపూరిత నేత్రములతో వీక్షించుచున్నవారును, ఎడమచేతితో కళ్ళెమును పట్టుకొని యున్నవారును, కుడిచేతితో జ్ఞానముద్రను ధరించినవారునగు సూతవేషధారియైన శ్రీకృష్ణపరమాత్మ మమ్ములను రక్షించుగాక!

## గీతా విశేషములు

1. గీతను సాక్షాత్తు (Direct) గ విననవాడు అర్జునుడొక్కడేకాదు. ఇంకను ముగ్గురు కలరు. అర్జునుని రథముయొక్క టెక్కెముపై కూర్చొని హనుమంతుడు కూడ వినెను. వ్యాసులున్ను వినిరి. వ్యాసుని యనుగ్రహముచే సంజయుడున్ను వినెను. కావున గీతను నేరులో విననవారు మొత్తము నలుగురు.

2. యుద్ధారంభమున అర్జునునకు కలిగిన అజ్ఞానసమ్మోహము శ్రీకృష్ణుని ముఖతః గీతయంతయు వినిన తరువాత తొలగిపోయినదని సామాన్యముగ జనులు తలంచు చుందురు. అందులకు "నష్టోమోహః స్మృతిర్లబ్ధా...." అను (18 వ అధ్యాయమందలి 73వ) గీతాశ్లోకమును వారుదహరించుదురు. నిజమే. కాని గీత 11వ అధ్యాయముయొక్క ప్రారంభమున అర్జునుడు ఈ క్రింది వాక్యములను పలికెను.

**మదనుగ్రహాయ పరమం గుహ్యమధ్యాత్మ సంజ్ఞితమ్**
**యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ.** **(11-1)**

"మహాత్మా! నా యందలి అనుగ్రహముచే మీరు బోధించినట్టి అతిరహస్యమగు ఈ అధ్యాత్మజ్ఞానము వలన నా అజ్ఞానము తొలగిపోయినది."

అర్జునుని ముఖతః వెలువడిన ఈ వాక్యముల ద్వారా అర్జునుని మోహ(భ్రాంతి గీతను దాదాపు సగము (10 అధ్యాయములు) వినినపుడే తొలగిపోయినదని స్పష్టపడగలదు.

3. 'గీతా' గ్రంథముయొక్క ఆశయము 'గీతా' పదమును తల(క్రిందులు చేసి చదివిన తెలియగలదు. 'గీతా' అను దానిని త్రిప్పి చదివిన 'తాగీ' యగును. అనగా 'త్యాగివి' కమ్ము అని గీత బోధించుచున్నది!

4. 'అశోచ్యాన్' – (2-11) అను పదముతో శ్రీకృష్ణునిబోధ ప్రారంభమై, మధ్యలో 'నత్వం శోచితుమర్హసి' (2-27) మున్నగు హెచ్చరికలతో గూడి తుట్టతుదకు 'మాశుచః' (18-66) అను వాక్యముతో పరిసమాప్తమైనది. కావున 'శోకరాహిత్యమే' గీత యొక్క ముఖ్యసిద్ధాంతమని తెలుచున్నది.

5. గీతలో గల మొత్తము శ్లోకములు 700. 13వ అధ్యాయ ప్రారంభమునగల అర్జునుని ప్రశ్నయగు 'ప్రకృతిం పురుషంచైవ – 'అను శ్లోకమును గూడ కలుపుకొనినచో ఆసంఖ్య 701 కాగలదు.

6. గీతను రణరంగమున శ్రీకృష్ణపరమాత్మ అర్జుననకు బోధించిన దివసము మార్గశిర శుద్ధ ఏకాదశి. అది గీత యొక్క జన్మదినము. కాబట్టియే ఆ తిథియందు జనులు గీతాజయంతి జరుపుచుందురు.

7. మొట్టమొదట గీతను బయట ప్రచారముచేసినవాడు సంజయుడు.

8. 'ధ' కారముతో గీత ప్రారంభమై 'మ' కారముతో అంతమైనది. 'ధ, మ' అను ఆ రెండక్షరములమధ్యనే గీతయంతయు వెలుగుచున్నది★. మూర్తీభవించిన ధర్మమే గీతయని తెలుపుటకు అట్టి పదగుంభన ఏర్పడినదేమో!

9. ఒకరు క్రొత్తగా గీతాపుస్తకమును చదువప్రారంభించి 'ధర్మంక్షేత్రే కురుక్షేత్రే' అని పొరపాటున చదివి 'క్షేత్రేక్షేత్రే ధర్మంకురు' (అన్ని చోట్లయందును ధర్మమును జేయుము) అని దానిని అన్వయించుకొని 'ఈ ఒక్కముక్కను ఆచరణలో పెట్టిన చాలును'ని యెంచి ధర్మాచరణపరాయణు డయ్యెనట!

10. గీతను చెప్పినవాడు, వినినవాడు, వ్రాసినవాడు కృష్ణుడే @

11. గీతను చెఱిపివేయునది గీత. (నొసటి వ్రాతను తుడిచివైచి జీవునకు కర్మాతీత, జన్మాతీత కైవల్యపదవిని ఒనగూర్చు అఖండశక్తి కలది గీతయని భావము.)

12. శ్రీ వేదవ్యాసులకు '18' సంఖ్యపై మక్కువ ఎక్కువ.

13. గీతయందు కొన్ని అధ్యాయములలోని శ్లోకములు సమానసంఖ్యలో కలవు. ఎట్లనిన –

| | | |
|---|---|---|
| 1వ అధ్యాయమునందు, | 6వ అధ్యాయమునందు – | 47 శ్లోకములు కలవు. |
| 4వ అధ్యాయమునందు | 10వ అధ్యాయమునందు – | 42 శ్లోకములు కలవు. |
| 8వ అధ్యాయమునందు | 17వ అధ్యాయమునందు – | 28 శ్లోకములు కలవు. |
| 9వ అధ్యాయమునందు | 13వ అధ్యాయమునందు – | 34 శ్లోకములు కలవు. |
| 12వ అధ్యాయమునందు | 15వ అధ్యాయమునందు – | 20వ శ్లోకములు కలవు. |

★ ప్రాకృత భాషలో 'ధర్మ'మును 'ధమ్మ'ము అందురు. దృష్టాంతమునకు – ధర్మపదము అను బౌద్ధగ్రంథము 'ధమ్మపదము' అని పిలువబడుచున్నది. (ధమ్మ = ధర్మ)

@ దీనిని గూర్చిన వివరము 'గీతయొక్క అమోఘశక్తికి కారణము' అను శీర్షిక క్రింద యిదివఱకే తెలుపబడినది.

14. మహాభారతమునందు గీతయొక్క స్థానము భీష్మపర్వమున 25వ అధ్యాయము మొదలుకొని 42వ అధ్యాయము వఱకు గలదు.

15. గొప్ప గొప్ప సంస్కృత గ్రంథములు 'అథ' అను మంగళవాచకముతో ప్రారంభింపబడి 'ఇతి; అను మంగళవాచకముతో అంతమగుచుండును. గీతయందును ప్రారంభఘట్టములలో 'అథ వ్యవస్థితాన్ దృష్ట్వా' అను వాక్యమునందు 'అథ' అను పదమున్ను, అంతిమఘట్టములో గల 'ఇతి గుహ్యతమం శాస్త్రం' అను వాక్యమునందు 'ఇతి' అను పదమున్ను కలవు. కావున ఆర్షసంప్రదాయమును గీత కాపాడినట్లేయగును.

16. కలియుగమునకు 38 సంవత్సరముల పూర్వము అనగా ద్వాపరయుగాంతమున గీత బోధింపబడినది. కలియుగము ప్రారంభించి క్రీ.శ. 1962 సం॥ నకు 5063 సం॥లు అయినవి. కాబట్టి అప్పటికి గీత ఆవిర్భవించి 5101 సంవత్సరములు అగుచున్నవి★.

17. శ్రీకృష్ణుని అవతారకాలము (ఉపాధి వయస్సు) 125 సం॥ల 7 నెలల 8 రోజుల 30 ఘడియలు. గీతను బోధించుసమయమున శ్రీకృష్ణుని వయస్సు - దాదాపు 87 సం॥లు.

18. (i) 'యేన సర్వమిదం తతమ్' అను వాక్యము గీతయందు 3 పర్యాయములు ప్రయోగింపబడినది.@

('ఎవనిచే ఈ సమస్తజగత్తు వ్యాపింపబడియున్నదో అట్టి పరమాత్మ' యని దాని అర్థము)

(ii) 'మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు' అను వాక్యము గీత యందు 2 సార్లు ప్రయోగింపబడినది. (9వ అధ్యాయము 34 శ్లోకమందును మఱియు 18వ అధ్యాయము 65 శ్లోకమందును). 'నా యందే మనస్సును నిలుపుము, నా భక్తుడవుకమ్ము, నన్నే అర్చింపుము, నాకు నమస్కరింపుము' అని దాని అర్థము.



★1962 సం॥ పైగ గడచిన సంవత్సరములను ఈ సంఖ్యను కలుపుకొని చదువుకొనవలయును.

@ 1. అవినాశి తు తద్విద్ధియేన సర్వమిదం తతమ్ (2-7)
2. యస్యాన్తఃస్థాని భూతాని యేన సర్వమిదం తతమ్ (8-22)
3. యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వమిదం తతమ్ (18-46)

# గీతయందలి కృష్ణార్జునుల నామములు

గీతయందు శ్రీకృష్ణపరమాత్మకు ఈ క్రింది నామధేయములు వాడబడినవి -

అచ్యుతుడు
అనంతుడు
అప్రతిమప్రభావుడు
అరిసూదనుడు
జనార్దనుడు
దేవుడు
దేవదేవుడు
దేవవరుడు
దేవేశుడు
పరమేశ్వరుడు
పురుషోత్తముడు
ప్రభువు
భగవంతుడు
ఆద్యుడు
కమలపత్రాక్షుడు
కృష్ణుడు
కేశవుడు
భూతభావనుడు
భూతేశుడు
మధుసూదనుడు
మహాత్ముడు
మహాబాహువు
మాధవుడు
యాదవుడు
యోగి
యోగేశ్వరుడు
కేశినిషూదనుడు
గోవిందుడు
జగత్పతి
జగన్నివాసుడు
వార్ష్ణేయుడు
వాసుదేవుడు
విశ్వమూర్తి
విశ్వేశ్వరుడు
విష్ణువు
సర్వుడు
సహస్రబాహువు
హృషీకేశుడు

## గీతయందు అర్జునునకు ఈ క్రింది నామములు వాడబడినవి:

అనఘుడు
అనసూయుడు
అర్జునుడు
కపిధ్వజుడు
కిరీటి
పురుషర్షభుడు
కురుప్రవీరుడు
కురునందనుడు
కురుశ్రేష్ఠుడు
కురుసత్తముడు
కౌన్తేయుడు
గూడాకేశుడు
తాత
దేహభృతాంవరుడు
ధనంజయుడు
పరన్తపుడు
పాండవుడు
పార్థుడు
భరతర్షభుడు
భరతశ్రేష్ఠుడు
భరతసత్తముడు
భారతుడు
మహాబాహువు
సవ్యసాచి

## నిత్యస్మరణీయములగు కొన్ని గీతావాక్యములు

(ఔషధమును సేవించిన మాత్రమే రోగము నయమగునట్లు, భవరోగము, శమించుటకు తదౌషధరూపమగు భగవద్గీతను లెస్సగ సేవించుచుండవలెను. నిత్యజీవితమునందు గీతను ఉపయోగించుకొనినపుడు మాత్రమే సంసార దుఃఖములు సమించగలవు. కావున సమయము దొరికినపుడెల్ల స్మరించుటకు, మననము చేయుటకు కొన్ని ముఖ్యమైన గీతావాక్యములు ఎల్లపుడు చేతియందుండవలెను. చీకటిలో పయనించు వానికి దీపమెంత ఉపయోగకారిగనుండునో, సంసారగాఢాంధకారమున దిక్కుగానక తల్లడిల్లుచుండు జీవునకు గీతా వాక్యము లంత ప్రయోజనకరములుగ నుండును. కావున ఇట్టి మహద్వాక్యములు నిత్యజీవితములో నిరంతరము స్మృతిపథమున నుండుటకై వానిని కంఠస్థము చేయుటగాని, లేక ఇంటిగోడలపై, దూలములపై చక్కగ కనిపించులాగున వ్రాయించి యంచుకొనుటగాని, మంచిది. లేక కొన్ని బోర్డులపై వ్రాయించి ఇంటిలోగాని, ఆశ్రమములందుగాని కీలకస్థానములందుగాని వానిని వ్రేలాడగట్టి బహుకార్య నిమగ్నుడగు తనయొక్క దృష్టియందు అవి పడులాగున చూడవలెను. గీతయందలి వాక్యము లన్నియు ముఖ్యములైనప్పటికిని పాఠకులు సౌకర్యము కొఱకు కొన్నిటిని మాత్రమే ఇచట పొందుపఱచుచున్నాము.)

| | గీతావాక్యము | | తాత్పర్యము |
|---|---|---|---|
| 1. | క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠపరన్తప | (2-3) | ఓ అర్జునా! నీచమగు హృదయదుర్బలత్వమును వీడి కర్తవ్యమునకు గడంగుము. |
| 2. | నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః | (2-16) | లేని దానికి ఉనికి లేదు; ఉన్నదానికి లేమి లేదు. (జగత్తు లేనిది; ఆత్మ యున్నది.) |
| 3. | నత్వేవాహం జాతునాసం నత్వం నేమే జనాధిపాః | (2-12) | నీవు, నేను, ఈ రాజులు - అందఱును పూర్వము, ఇపుడు మున్ముందు ఎల్లపుడును ఉండువారము (ఆత్మకు వినాశము లేదు.) |
| 4. | న హన్యతే హన్యమానే శరీరే | (2-20) | శరీరము చంపబడినను ఆత్మ చంపబడదు. |
| 5. | స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ | (2-40) | ధర్మము ఒకింతైనను గొప్ప భయము నుండి కాపాడును. |
| 6. | కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన | | కర్మలను చేయుటయందే నీ కధికారము కలదు. కాని వాని ఫలమును కోరుటయందుకాదు. |
| 7. | సమత్వం యోగ ఉచ్యతే | (2-48) | (కార్యము సిద్ధించినను, సిద్ధింపకున్నను) సమబుద్ధి కలిగి యుండటయే యోగ మనబడును. |
| 8. | యోగస్థః కురు కర్మాణి | | దైవము (ఆత్మ) నందు నిలుకడ కలవాడవై కర్మలను చేయుము. |

| | | | |
|---|---|---|---|
| 9. | యోగః కర్మసు కౌశలమ్ | (2-50) | కర్మలయందలి నేర్పు (నిష్కామాచరణ) యోగమనబడును. (అట్టి యోగము నవలంబింపుము.) |
| 10. | అశాన్తస్య కుతస్సుఖమ్ | (2-66) | శాంతి (చిత్తోపరతి) లేనివారికి సుఖమెక్కడ? |
| 11. | కర్మజ్యాయో హ్యకర్మణః | (3-8) | కర్మము చేయకపోవుటకంటె కర్మచేయుట మేలు. (తమోగుణ భూయిష్ఠుని కంటె కార్యాచరణశీలుడు శ్రేష్ఠుడని భావము.) |
| 12. | యుధ్యస్వ విగతజ్వరః | (3-30) | సంతాపము లేనివాడవై యుద్ధము చేయుము (కార్యశీలుడవు కమ్ము) |
| 13. | జహి శత్రుం మహాబాహో! కామరూపం దురాసదమ్ | (3-43) | ఓ అర్జునా! దుర్జేయమగుకామమను శత్రువును నశింపజేయుము. |
| 14. | సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరి సమాప్యతే | (4-33) | సమస్త కర్మయు జ్ఞానమందు పరిసమాప్తిని బొందుచున్నది. |
| 15. | న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే | (4-38) | ఈ ప్రపంచమున జ్ఞానముతో సమానమైన పవిత్రమైన వస్తువు మఱియొకటి లేదు. |
| 16. | శ్రద్ధావాన్ లభతే జ్ఞానం | (4-39) | శ్రద్ధకలవాడే జ్ఞానమును పొందును. |
| 17. | న సుఖం సంశయాత్మనః | (4-40) | మనస్సునందు సంశయములు పెట్టుకొని యుండువానికి సుఖమెన్నటికిని లభింపదు. |
| 18. | విగతేచ్ఛాభయక్రోధో యస్సదా ముక్త ఏవ సః | (5-28) | కామక్రోధ భయాదులు లేనివాడు ఎల్లపుడును ముక్తుడే అయియున్నాడు. |
| 19. | జ్ఞాత్వా మాం శాన్తి మృచ్ఛతి | (5-29) | నన్ను (ఆత్మను) తెలిసికొని జీవుడు పరమ శాంతిని బొందుచున్నాడు. |
| 20. | ఉద్ధరేదాత్మనాత్మానం | (6-5) | తన్ను తానే ఉద్ధరించుకొనవలెను. |
| 21. | ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చిన్తయేత్ | (6-25) | మనస్సును ఆత్మయందుంచి ఇతరమగు దేనిని కూడ చింతింపరాదు. |
| 22. | అభ్యాసేన తు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే | (6-35) | మనస్సు అభ్యాసము చేతను, వైరాగ్యము చేతను నిగ్రహింపబడును. |
| 23. | న హి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి | (6-40) | నాయనా! మంచి కార్యములు చేయువానికి ఎన్నడును దుర్గతి కలుగదు. |
| 24. | మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ | (7-7) | దారమునందు మణులవలె ఈ సమస్త జగత్తు నాయందు ఆశ్రయించుకొనియున్నది. |

| | | |
|---|---|---|
| 25. మామేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తితే | (7-14) | నన్నెవరు శరణు బొందుదురో, వారీ మాయను దాటుదురు. |
| 26. జ్ఞానీత్వాత్మైవ మే మతమ్ | (7-18) | జ్ఞాని నేనేయని నా నిశ్చయాభిప్రాయము. (జ్ఞానికిని నాకును భేదము లేదు.) |
| 27. వాసుదేవ స్సర్వమితి | (7-19) | సమస్తము వాసుదేవుడే! (ప్రపంచమంతయు భగవన్మయము.) |
| 28. తస్మాత్సర్వేషు కాలేషు మా మను స్మర యుధ్య చ | (8-7) | కావున ఎల్లకాలములయందును నన్ను స్మరించుచు యుద్ధము చేయుము. (నీ స్వధర్మము నాచరింపుము.) |
| 29. తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ | (9-22) | అనన్య చిత్తముతో నిరంతరము నన్ను ధ్యానించు పుణ్యశీలుర యొక్క యోగక్షేమములను నేను వహించెదను. |
| 30. తత్కురుష్వ మదర్పణం | (9-27) | నీవేది చేసినను నాకర్పింపుము. |
| 31. న మే భక్తః ప్రణశ్యతి | (9-31) | నా భక్తుడు ఎన్నిటికిని చెడిపోడు (నశింపడు) |
| 32. అనిత్య మసుఖం లోకమిమం ప్రాప్య భజస్వ మామ్ | (9-33) | అనిత్యము సుఖరహితమైనట్టి ఈ లోకమును పొందిన నీవు (శాశ్వత సుఖము కొఱకై) నన్ను సేవింపుము. |
| 33. సర్వభూతహితేరతాః | (12-4) | సమస్తప్రాణులకున్ను మేలు కలుగజేయుట యందు ప్రీతికలవారు నన్నే పొందుదురు. |
| 34. తేషా మహం సముద్ధర్తా మృత్యు సంసార సాగరాత్ | (12-7) | నన్ను ధ్యానించువారలను ఈ జననమరణరూప సంసార సాగరమునుండి పైకి లేవ దీసెదను. |
| 35. త్యాగా చ్ఛాన్తిరనన్తరమ్ | (12-12) | త్యాగము వలన శాంతి కలుగును. |
| 36. యో మద్భక్తః స మే ప్రియః | (12-14) | ఎవడు నా యెడల భక్తి కలిగియుండునో అతడే నాకు ప్రియుడు. |
| 37. క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వ క్షేత్రేషు భారత | (13-3) | ఓ అర్జునా! సమస్త ఉపాధులందును, ఆ ఉపాధులను తెలిసికొను ప్రజ్ఞారూప పరమాత్మగనే నన్నెఱుగుము. |
| 38. జన్మమృత్యు జరావ్యాధి దుఃఖ దోషానుదర్శనం | (13-9) | జనన, మరణ, వార్ధక్య, రోగాదులందలి దుఃఖమును, దోషమును మరల మరల చింతన చేయుచుండవలెను. |
| 39. అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్ | (18-20) | వేఱువేఱుగానుండు సమస్త వస్తువులయందును పరమాత్మ ఏకమై నిండి యున్నట్లు తెలిసికొనుట సాత్త్వికజ్ఞానమని యెఱుగుము. |
| 40. భక్త్యా మామభిజానాతి | (18-55) | భక్తిచే నన్ను తెలిసికొనగలడు. |
| 41. మచ్చిత్త స్సతతం భవ | (18-57) | ఎల్లప్పుడు నాయందే చిత్తమును నిలుపుము. |
| 42. మన్మనా భవ | (18-65) | నా యందే మనస్సును నెలకొల్పుము. |
| 43. మామేకం శరణం వ్రజ | (18-66) | నన్నొకనినే శరణు బొందుము. |

# సప్తశ్లోకీ గీత

1. కవిం పురాణ మనుశాసితార
మణోరణీయాంస మనుస్మరేద్యః
సర్వస్య ధాతార మచిన్త్యరూప
మాదిత్యవర్ణం తమసః పరస్తాత్. (8-9)

2. ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్
యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్. (8-13)

3. మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః. (9-34)

4. స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా
జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ
రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి
సర్వే నమస్యన్తి చ సిద్ధసంఘాః. (11-36)

5. సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖమ్
సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి. (13-14)

6. ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్
ఛన్దాంసి యస్య పర్ణాని యస్తంవేద స వేదవిత్. (15-1)

7. సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తః స్మృతిర్జ్ఞాన మపోహనం చ
వేదైశ్చ సర్వై రహమేవ వేద్యో
వేదాన్త కృద్వేదవిదేవ చాహమ్. (15-15)

# గీ తా సా ర ము

భగవద్గీత చివరి అధ్యాయములో శ్రీకృష్ణపరమాత్మ గీతాప్రబోధమునంతను క్రోడీకరించి సంక్షేపముగ మూడు శ్లోకములలో చెప్పివైచెను. పరబ్రహ్మ సాక్షాత్కారమును జీవుడెవ్విధముగ పొందగలడో ఆ సాధనలు వాని యందు చక్కగ వివరింపబడినవి. కావున ముముక్షువు లా శ్లోకములను కంఠస్థముచేసి భావమును నిరంతరము మననము చేయుచుండుట శ్రేయస్కరము. అవి యేవియనిన -

**1. బుద్ధ్యావిశుద్ధయా యుక్తో ధృత్యాఽఽత్మానం నియమ్య చ**
**శబ్దాదీన్విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ. (18-51)**

**2. వివిక్త సేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః**
**ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః. (18-52)**

**3. అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్**
**విముచ్య నిర్మమః శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే. (18-53)**

నిర్మల బుద్ధితో గూడి, ధైర్యముతో మనస్సును స్వాధీనపఱచుకొని, శబ్దాది విషయములను, రాగద్వేషములను విడిచిపెట్టి, ఏకాంతస్థలవాసియై, మితాహారమును స్వీకరించుచు, శరీర వాఙ్మనంబులను నియమించి, నిరంతరము ధ్యానయోగాభ్యాస మొనర్చుచు, వైరాగ్యమును లెస్సగ నాశ్రయించి, అహంకార బలదర్పములను, కామక్రోధములను, భోగ్యవస్తు పరిగ్రహమును బాగుగ త్యజించివైచి, మమకార రహితుడై, శాంతస్వభావము గలిగియుండు మహనీయుడు పరబ్రహ్మ సాక్షాత్కారము నొందుటకు సమర్థుడగుచున్నాడు.



# గీతయందలి ఉపమానములు

మహాత్ములు తాము బోధించు గంభీరతత్త్వములు జనసామాన్యముయొక్క హృదయమున నాటుట కొఱకై పెక్కు దృష్టాంతములను వాడుచుందురు. తద్ద్వారా క్లిష్టభావములున్ను జనులకు సులభముగ బోధపడుచుండును. రామాయణమునందు, యోగవాసిష్ఠ, భారత, భాగవతాదులందు, పెద్దల బోధలయందు దృష్టాంతములు కోకొల్లలుగ వాడబడినవి. గీతయందు శ్రీకృష్ణమూర్తియు ఇట్టి పద్ధతినే అనుసరించి అనుపమ ఆధ్యాత్మిక తత్త్వములను చక్కటి సాదృశ్యముల ద్వారా బోధించుచు పోయెను. వారు తెలిపిన ఉపమానము లిచట పేర్కొనబడుచున్నవి –

1. మనుజుడు పాతబట్టలను విడిచి యితరములగు క్రొత్తబట్టల నెటుల ధరించుచున్నాడో; అట్లే ఆత్మయు పాతశరీరములను వదలి క్రొత్తశరీరములను ధరించుచున్నది. (2-22)

2. సర్వత్ర జలముచే పరిపూర్ణమైన గొప్పజలాశయము లభింప; అత్తఱి స్వల్పజలముతో గూడిన బావి మొదలగు వానియందు మనుజున కెంత ప్రయోజన ముండునో, అనుభవజ్ఞుడగు బ్రహ్మజ్ఞానికి సమస్త వేదములందును అంత ప్రయోజనమే ఉండును. (2-46)

3. తాబేలు తన అవయవములను లోనికి ముడుచుకొనునట్లు యోగియగువాడు ఇంద్రియములను విషయములనుండి యెపుడు మరలించుకొనునో అపుడాతని జ్ఞానము స్థిరమైనదిగా నగుచున్నది. (2-58)

4. జలముచే సంపూర్ణముగా నిండింపబడినదియు, స్థిరమైన ఉనికి గలదియునగు సముద్రమును నదులు మొదలగువాని ఉదకము లే ప్రకారము ప్రవేశించుచున్నవో, ఆ ప్రకారముగా సమస్తమైన కోరికలు ఏ బ్రహ్మనిష్ఠునియందు ప్రవేశించి యణగిపోవుచున్నవో, అట్టి మహనీయుడే శాంతిని పొందునుగాని విషయాసక్తి కలవాడు కాదు. (2-70)

5. పొగచేత నిప్పు, దుమ్ముచే అద్దము, మావిచే గర్భమందలి శిశువు ఏలాగున కప్పబడియున్నవో ఆలాగున కామముచే ఆత్మజ్ఞానమున్ను కప్పబడియున్నది. (3-38)

6. ఓ అర్జునా! లెస్సగ మండుచున్న అగ్ని ఏ ప్రకారము కట్టెలను భస్మమొనర్చునో ఆ ప్రకారమే జ్ఞానమను అగ్నియు సమస్తకర్మలను భస్మమొనర్చివేయును. (4-37)

7. ఎవడు తాను చేయు కార్యములను పరమాత్మయందు సమర్పించి ఫలాసక్తిని (సంగమును) విడిచి చేయునో, అట్టివానికి తామరాకునకు నీరంటనట్లు పాపము లంటకుండును. (5-10)

8. ఏ ప్రకారము గాలి వీచనిచోటగల దీపము నిశ్చలముగ నుండునో, ఆ ప్రకారము ఆత్మధ్యానమందు లగ్నమైయున్న యోగియొక్క స్వాధీనచిత్తముకూడ నిశ్చల స్థితిని బొందియుండును. (కావున యోగిపుంగవుల నిశ్చలమనస్సునకు అట్టి దీపము యొక్క స్థితి ఉపమానముగ చెప్పబడినది.) (6-34)

9. అర్జునా! నా కంటె ఇతరమైనది యేదియును ఈ ప్రపంచమున ఒకింతైనను లేదు. దారమునందు మణులవలె నాయం దీ సమస్త ప్రపంచమున్ను కూర్చబడియున్నది. (7-7)

10. అంతటను సంచరించునదియు, గొప్పదియునగు వాయువు సర్వకాలములందును ఆకాశమునందెట్లు నిలిచియున్నదో, అట్లే సమస్తభూతములున్ను నాయందున్నవని తెలిసికొనుము. (9-6)

11. ఓ అర్జునా! ఈ శరీరము క్షేత్రమని చెప్పబడుచున్నది. మఱియు దీనిని తెలియువాడు క్షేత్రజ్ఞుడని విజ్ఞులు పేర్కొనుచున్నారు. (13-2)

12. అతిసూక్ష్మమైయుండుటచే సర్వవ్యాపకమగు ఆకాశము దేనిచేతను అంటబడక ఎట్లుండునో, అట్లే సర్వత్రవ్యాపించియున్న ఆత్మ దేహాదులచే నంటబడక యుండును. (13-33)

13. అర్జునా! సూర్యుడొక్కడు సమస్తలోకముల నెట్లు ప్రకాశింపజేయుచున్నాడో అట్లే క్షేత్రజ్ఞుడగు ఆత్మ దేహాది సమస్తక్షేత్రమును ప్రకాశింపజేయుచున్నాడు. (13-34)

14. దేనికి వేదములు ఆకులుగానున్నవో అట్టి సంసారరూప అశ్వత్థవృక్షము (రావిచెట్టు)ను వేళ్ళు పైన కొమ్మలు క్రిందగా గలిగియున్నదిగను, బహుకాలముండునదిగను పెద్దలు చెప్పుదురు. దాని నెవడెఱుగునో అతడు వేదము నెఱింగిన వాడగును. (15-1)

15. సంసారమను ఆ అశ్వత్థవృక్షముయొక్క కొమ్మలు గుణములచే వృద్ధినొందింపబడినవియు, విషయములను చిగుళ్లుగలవియు నయి పైకిని, క్రిందకును వ్యాపించి యున్నవి. దానివేళ్ళు మనుష్యలోకమునందు కర్మసంబంధము గలవియై క్రిందికి గూడ విస్తరించి యున్నవి. (15-2)

16. వాయువు - పుష్పములు మున్నగు వాసనగల పదార్థములనుండి బయలుదేరునపుడు, ఆ యా పదార్థముల నచటనే విడిచి అందలి గంధాణువుల నెట్లు తీసికొని పోవుచున్నదో, అట్లే జీవుడు ఒక దేహమును వదలి మఱియొక దేహమును పొందునపుడు శరీరము నచ్చటనే విడిచిపెట్టినను, దానియందుండు మనస్సు మొదలగు ఆరు ఇంద్రియములను, వాసనలను తీసికొని వెడలుచున్నాడు. (15-8)

17. నిప్పు పొగచే కప్పబడినట్లు సమస్త కర్మములున్ను (దృశ్యరూప) దోషముచేత కప్పబడియున్నవి. (18-48)

18. ఓ అర్జునా! ఈశ్వరుడు సమస్త ప్రాణుల యొక్క హృదయస్థానమున నివసించి, యంత్రమున తగుల్కొన్నవారినివలె వారి నందరిని మాయచే త్రిప్పుచున్నాడు. (18-61)

# గీతాభవనము

'గీతా మే చోత్తమం గృహమ్' - అని భగవద్వాక్యము. అనగా 'నేను గీత నాశ్రయించుకొని యున్నాను. గీత నాయొక్క నివాసగృహము'ని భావము. ఈ ప్రకారముగ గీతామాహాత్మ్యము గీతాగృహమునుగూర్చి భగవానుడు తెలిపియున్నాడు. ఆ గృహముయొక్క స్వరూప, స్వభావముల వివరము ఈ క్రింది తెలుపబడుచున్నది.

- గీతాసౌధ వివరములు -

| | | |
|---|---|---|
| నిర్మాత | - | శ్రీకృష్ణపరమాత్మ |
| అలంకరణకర్త | - | శ్రీ వేదవ్యాస మునీంద్రులు |
| ఆకారము | - | మూడంతస్తులు గలది. |
| పునాది | - | అర్జున విషాదయోగము (ప్రథమాధ్యాయము) |
| మొదటి అంతస్తు | - | 5 గదులు (2వ అధ్యాయమునుండి 6వ అధ్యాయమువఱకు) (సాంఖ్యయోగము, కర్మయోగము, జ్ఞానయోగము, కర్మసన్న్యాసయోగము, ఆత్మసంయమ యోగము - అనునవి.) |
| రెండవ అంతస్తు | - | 6 గదులు (భక్తిషట్కము - (7వ అధ్యాయమునుండి 12వ అధ్యాయము వరకు) విజ్ఞానయోగము, అక్షరపరబ్రహ్మయోగము, రాజవిద్యారాజగుహ్యయోగము, విభూతియోగము, విశ్వరూపసందర్శన యోగము, భక్తియోగము - అనునవి.) |
| మూడవ అంతస్తు | - | 6 గదులు (జ్ఞానషట్కము - (13వ అధ్యాయము నుండి 18వ అధ్యాయము వఱకు) క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము, గుణత్రయవిభాగయోగము, పురుషోత్తమ ప్రాప్తియోగము, దైవాసురసంపద్విభాగయోగము, శ్రద్ధాత్రయవిభాగయోగము, మోక్షసన్న్యాసయోగము అనునవి.) |

నిర్మాణమునకు వలసిన సున్నము - కర్మ
నీళ్ళు - భక్తి
ఇటుక - జ్ఞానము.

గీతాభవనము అతివిశాలమైనది. అతిసుందరమైనది. అందలి ఒక్కొక్క గది యందు చిత్రవిచిత్రములైన అమూల్యపదార్థములు ఉంచబడినవి. ఆ భవనమునందు ఎవరైనను ప్రవేశించవచ్చును. జాతి మత కుల లింగ వివక్షత లేదు. ప్రవేశరుసుము లేదు. అట్లు ప్రవేశించి ఆ యా వస్తువులను నిరాటంకముగ దర్శించవచ్చును, స్పర్శించవచ్చును, ఎత్తుకొని ఇంటికి వెళ్ళవచ్చును. అడ్డుపెట్టువారులేరు. ఆటంకపరచువారుండరు. ఒకపుడు శంకరాచార్యులు ఆ గీతాభవనములోనికేగి దాని సౌందర్యమును చూచి ముగ్ధులై తనయిచ్ఛవచ్చిన పదార్థముల నటనుండి గ్రహించివెళ్ళిరి. తదుపరి రామానుజాచార్యులు వచ్చిరి. మధ్వాచార్యులు వచ్చిరి. అట్లే అనేకులు వచ్చి గీతాభవనమును సందర్శించి, అందలి వస్తువులను స్వీకరించి వెడలి పరమశాంతిని బడసిరి. కాని విచిత్రమేమనగా, ఎవరు ఎన్ని వస్తువులను పట్టుకొని వెళ్ళినను, తిరిగి ఆ భవనము సమస్తపదార్థములచే పరిపూర్ణమై అక్షయముగ దనరుచున్నది. ఇదియే గీతాభవనము యొక్క విశిష్టత. కావున ముముక్షువులెల్లరు ఈ గీతానామక మహోత్తుంగ సువిశాల భవ్య భవనంబును కనులపండువుగ వీక్షించి, అందు బహుకాలము విశ్రాంతిగొని, సేదతీర్చుకొని, సంసారిక దుఃఖజాలమునుండి విముక్తులై పరమానంద మనుభవించి ధన్యులయ్యెదరుగాక!

# అధ్యాయక్రమముగ గీతాపారాయణ ఫలము

గీతయొక్క మహిమ అపారము. గీతాశ్లోకములయొక్క పారాయణ, జప, ధ్యానాదులవలన ఎన్నియో సత్ఫలితములు మనుజునకు చేకూరుచున్నవి. గీతయొక్క ఇట్టి అఖండశక్తిని గూర్చి పూర్వము లక్ష్మీదేవికి శ్రీమన్నారాయణుడు బోధింపగా, దానినే తిరిగి మహేశ్వరుడు పార్వతికి వివరించి చెప్పెను. ఈ విషయమంతయు పద్మపురాణమున గలదు. గీతయందలి ఒక్కొక్క అధ్యాయమును పారాయణము చేసినందువలన కలుగు అమోఘ ఫలితము కథారూపమున అందు చక్కగ చిత్రింపబడినది. పద్మ పురాణాంతర్గతమగు అట్టి గీతాధ్యాయ మాహాత్మ్యము పాఠకుల ఉపయోగార్థ మిచట సంక్షేపముగ తెలుపబడుచున్నది –

**1. ప్రథమాధ్యాయ ఫలము:–** గీతాపారాయణము పూర్తిగగాని, లేక ఒక అధ్యాయముగాని, లేక సగము అధ్యాయముగాని, లేక ఒక శ్లోకముగాని, లేక శ్లోకార్థముగాని, కడకు ఒక పాదముగాని, కనీసము ఒక పదముగాని భక్తిపూర్వకముగ నెవడు కావించునో ఆతడు సుశర్మవలె ముక్తుడగును. ఎట్లనిన – పూర్వము సుశర్మ యను బ్రాహ్మణుడు కలడు. ఆతడు విషయలోలుడై, దురాచారపరుడై, జీవితమును భ్రష్టమొనర్చుకొని, మరణించి, పెక్కు యమయాతనల ననుభవించి, తిరిగి మరుజన్మమున ఎద్దు అయి పుట్టెను. అది భారముల మోయుచు మోయుచు ఒకనాడొక పర్వత ప్రాంతమున భారాధిక్యముచే క్రిందపడి మృతినొందెను. అద్దాని దీనదశను జూచి ఆ మార్గమున బోవుచున్న కొందఱు దానికి సద్గతులు కలుగుటకై తమ పుణ్యములోని కొంతభాగమును ధారబోసిరి. అందొక వేశ్యయు తానేమియు పుణ్యముచేయలేదని తలచి, ఏదైన చేసియుండినచో ఆ వృషభమున కర్పించితినని సంకల్పించెను. వేశ్యయొక్క పుణ్యముచే ఆ వృషభము పుణ్యలోకములకు జని మరల పూర్వజన్మ జ్ఞానముగల ఉత్తమ బ్రాహ్మణజన్మను బొందెను. అంతట నా బ్రాహ్మణుడు తనకు పూర్వజన్మమున సుకృతమును ధారబోసిన వేశ్యయింటికివెళ్లి ఆ సుకృత మెట్టిది యని యరయ, ఆమె యొక చిలుకను జూపి, ఆ చిలుక పలుకు వాక్యములను వినుటచేతనే తన చిత్తము పునీతమైనదని నుడివెను. అంతట వారిద్దఱును ఆ చిలుకను సమీపించి ప్రశ్నింప, ఆ చిలుక పూర్వజన్మలో తానొక విద్వాంసుడననియు, గురుదూషణాది పాపములజేసి మరణించి తిరిగి చిలుకయైపుట్టి అరణ్యములో దీనావస్థయందున్న తనను ఒక మునిపుంగవుడు తన యాశ్రమమునకు గొనిపోయి పోషించుచుండెననియు, అచ్చోట గీత ప్రథమాధ్యాయము నాతడు తన శిష్యులకు నిరంతరము బోధించుచుండగా విని క్రమముగ దాని నుచ్చరింపగల్గితిననియు, ఒకనాడొక దొంగ తన్నపహరించి యీ వేశ్యకు అమ్మెననియు చెప్పెను. వేశ్యకు పాపవిముక్తి, సుశర్మకు సద్గతి లభించెను.

**తస్మా దధ్యాయ మాద్యం యః పఠతే శ్రుణుతే స్మరేత్**
**అభ్యసేత్తస్య న భవేత్ భవాంభోధిర్దురుత్తరః.**

కాబట్టి గీత ప్రథమాధ్యాయమును ఎవడు పఠించునో, శ్రవణము చేయునో, లేక స్మరించునో అట్టివాడు సంసారసాగరమును సులభముగ దాటిపోవును.

**గీత ప్రథమాధ్యాయ పారాయణముచే – పాపవిముక్తి, పూర్వజన్మస్మృతి కల్గును.**

**2. ద్వితీయాధ్యాయఫలము:–** పూర్వము దక్షిణదేశమున పురందరమను పట్టణమున దేవశర్మయను

బ్రాహ్మణు డొకడుండెను. అతడు పెక్కు యాగములను, అతిథిపూజాదిసత్క్రియలను ఆచరించినప్పటికిని మనశ్శాంతియు, ఆత్మజ్ఞానమున్ను పొందక చింతాక్రాంతుడై యుండ, ఒకనా డాతని యింటికి సాధుపుంగవు డొకడు రాగా, నాతనికి తనవృత్తాంతమెఱింగించి ఆత్మజ్ఞానోపాయము నర్థించెను. సాధు వతనిని తత్కార్యసిద్ధికై సౌపురనగరమున మిత్రవంతుడను గొల్లవానియొద్దకు పంపెను. మిత్రవంతుడు దేవశర్మతో నిట్లు వచించెను. - 'నేనొకనాడు అడవిలో మేకలను మేపుచుండ పెద్దపులి యొకటి రాగా నేనును, నామందలోని జీవములున్ను చిందరవందరగా పరుగెత్తుకొనిపోతిమి. కాని ఆ స్థలమాహాత్మ్యమేమియోకాని ఒకచోట నామందలోని ఒక మేకయు, ఆ పులియు స్నేహముగా నుండుట చూచితిమి. వెంటనే సమీపముననున్న యొక వానరశ్రేష్ఠముద్వారా ఆచమత్కారమునకు హేతువు తెలిసికొంటిని. అదియేమనగా, ఆ ప్రాంతమున నొక దేవాలయమున సుకర్మయను నాతడు జ్ఞానప్రాప్తి కొఱకై ఈశ్వరోపాసనము చేయుచుండ ఒకనాడచ్చోటికి ఒక అతిథి వచ్చి అతనికి హితమొనర్చదలంచి గీత రెండవ అధ్యాయమును ఒక శిలాఫలకముపై చెక్కి దాని నభ్యసింపుమని చెప్పి అంతర్థానమొందెను. సుకర్మయు అట్లే నిత్యము గీత ద్వితీయాధ్యాయమును పారాయణమొనర్చుచు, అభ్యాసము చేయుచుండ కొంతకాలమున కతనికి చిత్తము నిర్మలమై ఆత్మజ్ఞాన ముదయించెను. అప్పటినుండియు ఆ పవిత్రాత్ముడు అడుగిడిన చోటెల్ల పునీతమై, రాగద్వేషరహితమై యొప్పారుచుండెను. నేనును వెంటనే ఆ శిలాఫలకము యొద్దకేగి గీత ద్వితీయాధ్యాయమును అభ్యసించి ఆత్మజ్ఞానానుభవము నొందితిని. నీవును అట్లే కావింపుము.' - మిత్రవంతుని యావాక్యములను విని దేవశర్మయు గీత రెండవ అధ్యాయమును పారాయణముచేయుచు, మననము గావించుచు క్రమముగ ఆత్మజ్ఞానమును బడసి బ్రహ్మపదప్రాప్తిచే కృతార్థుడయ్యెను.

**శిక్షితస్తేన పూతాత్మా పఠ న్నధ్యాయ మాదరాత్**
**ద్వితీయ మాససాదోచ్చైః నిరవద్యం పరం పదమ్.**

**గీత ద్వితీయాధ్యాయఫలము - ఆత్మజ్ఞానప్రాప్తి.**

**3. తృతీయధ్యాయ ఫలము:** పూర్వము జనస్థానమను నగరమున జడుడను బ్రాహ్మణుడుండెను. అతడు తన జాతికి తగిన ఆచారములను పరిత్యజించి విషయలోలుడై ధనాశాపరుడై వ్యాపారనిమిత్తము ఉత్తరదిశకు జని అటనుండి తిరిగి వచ్చుచుండ మార్గమధ్యమున నొక వృక్షము క్రింద చోరు లతనిని చంపివైచిరి. పాపాత్ముడగుటచే మరణానంతర మతడు పిశాచరూపమును బొందెను. కొంతకాలమునకు ధర్మాత్ముడైన అతని కుమారుడు తండ్రికి ఉత్తరక్రియలు జరుపుటకై కాశీనగరమునకు బోవుచు త్రోవలో తన తండ్రి వధింపబడిన వృక్షముక్రింద గూర్చొని గీత మూడవ అధ్యాయమును పారాయణము చేసెను.

**తత్రాధ్యాయం స గీతాయా స్తృతీయం సంజజాప హ.**

వెంటనే ఆకసమున తన తండ్రి భయంకర ప్రేతదేహమును వీడి దివ్యవిమానారూఢుడై యుండుట జూచి 'తండ్రీ! ప్రేతత్వముపోయి నీకు దేవత్వము లభించుటకు కారణమేమి యని యాతని నడుగ 'నాయనా! నీచే పఠింపబడిన గీత తృతీయాధ్యాయమును వినుటవలన నాకిట్టి దివ్యస్థితి చేకూరినది. ఇక నీవు కాశికిపోనక్కఱలేదు. ఇంటికివెళ్ళి ఇదే యుపాయముచే అనగా గీత 3వ అధ్యాయమును పారాయణము చేయుచు తద్ద్వారా లభించిన పుణ్యమును ధారబోసి మన వంశజులందఱిని నరకలోకమునుండి ఉద్ధరింపుము' అని పలికెను. కుమారు డట్లే చేసెను. అపుడు విష్ణుభగవానుడు యముని యొద్దకు

దేవదూతలను బంపి నరకలోకవాసులను, యమునినిగూడ వైకుంఠమునకు బిలిపించుకొనెను. అట యమధర్మరాజు విష్ణువును స్తోత్రముచేసి అతని యాజ్ఞవడసి నిజలోకమున కరిగెను. ఈ ప్రకారముగ గీత తృతీయధ్యాయముయొక్క పారాయణముచే మనుజుడు పాపరహితుడై దివ్యత్వమును బొందుచున్నాడు.

**గీత తృతీయాధ్యాయ ఫలము – పాపరాహిత్యము, ప్రేతత్వవిముక్తి.**

**4. చతుర్థాధ్యాయ ఫలము:–** గంగానదీతీరమున వారణాశియను పట్టణము కలదు. అందలి విశ్వనాథుని దేవాలయమున భరతుడను మహనీయుడు భక్తిశ్రద్ధలతో నిత్యము గీత నాల్గవ అధ్యాయమును పారాయణము సల్పుచుండెను.

**నిత్య మాత్మరత స్తుర్యం జపత్యధ్యాయ మాదరాత్**
**తదభ్యాసాదదుష్టాత్మా న ద్వంద్వైరభిభూయతే.**

దానిచే నతడు పవిత్రుడై, సుఖదుఃఖ, శీతోష్ణాదిద్వంద్వములందు సమబుద్ధిగలిగి యుండెను. ఒకపుడతనికి మహాత్ములను సందర్శింప కుతూహలము జనింప, పర్యటనకు బయలుదేరెను. త్రోవలో నొకచోట రెండు రేగుచెట్లక్రింద విశ్రమించి గీత 4వ అధ్యాయమును పారాయణముచేసెను. తిరిగి అటనుండి వెడలునపుడు అచ్చోట రాలిన రెండు రేగుపండ్లను తీసికొనిపోయెను. తదుపరి ఐదు దినముల కారెండు చెట్లును ఎండిపోవ, అందలి జీవులు పూర్వజన్మజ్ఞానముగల ఇరువురు బ్రాహ్మణబాలికలై యొకచోట జనించిరి. ఇట్లుండ యొకనాడాభరతమునీంద్రు డాబాలికలగృహమునకేగ, వారాతనికి పూజాదుల నొనర్చి ఆతని యాదేశముపై తమ వృత్తాంతమునంతను ఇట్లు వివరించి చెప్పదొడగిరి. 'మహాత్మా! పూర్వము గోదావరీ తీరమున ఛిన్నపాపమను తీర్థ స్థలమున సత్యతపుడను యోగిపుంగవుడు ఘోరతపంబు సలుపుచుండెను. ఆతని తపస్సుచే తన పదవి కేమైన భంగము కల్గునేమోయని తలంచి ఇంద్రుడద్దానికి అంతరాయము కల్గింపనెంచి అప్సరసలమగు మా యిరువురిని అచ్చోటికి బంపెను. ఇంద్రుని యాజ్ఞనుసారము మేమా మునీంద్రుని చెంతకేగి సుమధురముగ నృత్యగానాదులను సలుప దొడగితిమి. దానిచే నతడు కోపోద్దీప్తుడై గంగాతీరమున రెండు రేగుచెట్లయి జన్మించులాగున మమ్ములను శపించెను. అంతట కరుణింపుడని దీనచిత్తులమై మేము వేడుకొనగా 'భరతుడను మహాత్ముడు మీచెంతకు వచ్చువఱకు మీకా వృక్షరూప ముండును. అనంతరము పూర్వజన్మస్మృతిగలవారై మానవజన్మయెత్తి క్రమముగ దేవతారూపమును బడయగలర'ని వాక్రుచ్చెను. మహాత్మా! ఇవ్విధముగ శాపవశమున రేగుచెట్లుగా నున్న మాచెంతకు పూర్వము తాము దయచేసి గీత చతుర్థాధ్యాయమును పారాయణము చేసియుండిరి. తత్ఫలితముగ మాకు శాపవిమోచనము గల్గినది. ఘోరసంసారమునుండి మమ్ములను తరింపజేసిన మహనీయులగు తమ కివే మా నమోవాకముల'ని ఆబాలికలిరువురును తమ భక్త్యంజలిని అమ్మునీంద్రున కర్పించి అప్పటినుండియు తామున్ను గీత చతుర్థాధ్యాయమును నిత్యము ఆదరముతో జపించుచు సుఖముగ నుండిరి.

**కన్యే చతుర్థ మధ్యాయం జపేతాం నిత్యమాదరాత్**

**గీత చతుర్థాధ్యాయఫలము – మానవులే కాదు, వృక్షాదులున్ను దోషవిముక్తములై తరించుట.**

**5. పంచమాధ్యాయ ఫలము:–** మద్రదేశమున పురుకుత్సమను నగర మొండు కలదు. అందు పింగళుడను బ్రాహ్మణుడు వసించుచుండెను. అతడు స్వకులోచితములగు వేదాధ్యయనాది కార్యములను వదలి, సంగీతమును, నాట్యమును అభ్యసించి రాజుయొక్క ఆస్థానమున కొలువునందు చేరెను. ఆతనికి నీచకులమున బుట్టిన అరుణయను భార్య కలదు. ఆమె మఱియొకనిని ప్రేమించి కాలము గడుపుచు, తన

స్వేచ్ఛాచారములకు పింగళుడు అడ్డుగానుండునని తలంచి ఒకనాటిరేయి అతని తల పగులగొట్టి చంపి, మృతశరీరమును భూమియందు పాతిపెట్టెను. ఆమెయు తన దుష్టవృత్తిచే భగందర మను రోగముచే పీడితయై మరణించెను. చనిపోయిన పింగళుడు ఒకానొక యరణ్యములో గ్రద్దగను, అతనిభార్య అచ్చోటనే చిలుకగను జన్మించి, పూర్వజన్మవైరముచే పరస్పరము కలహించుకొనుచు, ఒకనాడు అకస్మాత్తుగ జలపూరితమగు ఒక ఋషిపుంగవుని పుఱ్ఱెయందు పడి మృతినొందినవి. దూతలు వారిని యముని యొద్దకు గొనిపోవ, యముడు వారిని విడుదలచేసి ఉత్తమలోకములకు పోవునట్లు ఆజ్ఞ యొసంగెను. అది విని ఆ దంపతు లిరువురును అనేక పాపకార్యములు చేసిన మాకిట్టి సద్గతి యేల లభించినదని ప్రశ్నింప యము డిట్లు పలికెను - 'ఓ దంపతులారా! గంగాతీరమున వటువను పేరుగల బ్రహ్మవేత్త యొకడుండెను. అతడు నిత్యము గీత ఐదవ అధ్యాయమును పారాయణము చేయుచుండెను. దానిచే నతడు పునీతుడై సనాతనమగు పరబ్రహ్మమును జేరెను.

**గీతానాం పంచమాధ్యాయ మావర్తయతి సర్వదా**
**తేన పుణ్యేన పూతాత్మా యయౌ బ్రహ్మ సనాతనమ్.**

అతని పుఱ్ఱెయందుపడి చచ్చుటచే మీరున్ను పవిత్రులైరి. కాబట్టి మీకిష్టమగు ఉత్తమలోకమును పొందులాగున ఆజ్ఞ నొసంగుచున్నాను.' అనంతరము వారిరువురును విమానారూఢులై వైకుంఠమున కరిగిరి. ఈ ప్రకారముగ గీత ఐదవ అధ్యాయముయొక్క సంబంధముచే పశుపక్ష్యాదులున్ను తరించిపోయెను.

గీత పంచమాధ్యాయ ఫలము – దోషవిముక్తి, పశుపక్ష్యాదులు కూడ తరించుట.

**6. షష్ఠాధ్యాయ ఫలము:–** పూర్వము గోదావరీనదీతీరమున ప్రతిష్ఠానమను నగర ముండెను. ఆ నగరమును ధర్మాత్ముడగు జానశ్రుతి యనురాజు పాలించు చుండెను. ఆ రాజుయొక్క ధర్మనిరతికి, ప్రజాహితకార్యములకు మెచ్చి దేవత లాతని ననుగ్రహింపగోరి హంసలరూపమున నాతని ప్రాసాదము కడకు ఆకాశమార్గమున వచ్చుచుండిరి. పురమును సమీపించునపుడు అందు భద్రాశ్వుడు మున్నగు హంసలు తక్కినవానికంటె వేగముగ ముందు పరిగెత్తినవి. అది చూచి తక్కిన హంసలు వానితో ఓయీ! వేగముగ బోవుచు మహాతేజశ్శాలియగు జానశ్రుతి మహారాజు చెంత మీరిట్లు అవినయముగ ప్రవర్తించవచ్చునా? మెల్లగ పొండు. అని పలుక ఆ హంసలు 'బ్రహ్మవేత్తయగు రైక్వునిముందు ఈ రాజుయొక్క తేజ మేపాటిది?' అని ప్రత్యుత్తరమిచ్చెను. ఆ వాక్యములను తన మేడయందుండి వినిన జానశ్రుతి వెంటనే తన సారథిని బిలిచి రైక్వుని వెతకి తీసికొని రావలయునని యాజ్ఞాపించెను. అతడట్లే బయలుదేఱి పెక్కు పుణ్యక్షేత్రములను గాలించి తుట్టతుదకు కాశ్మీరదేశమున మాణిక్యేశ్వరాలయ ద్వారముకడ నొక బండియందు గూర్చొనియున్న రైక్వుని సందర్శించి ప్రణమిల్లి 'మహాత్మా! తామిచట ఈ ప్రకారముగ నుండుటకు కారణమేమి' యని యడుగ మేము పూర్ణమనోరథులము. మాస్వరూపము తెలియగోరిన యెడల కొంతకాలమిచట నుండవలసి యుండునని పలికెను. ఆవాక్యములను విని సారథి రాజకడకేగి జరిగిన వృత్తాంతమంతయు తెలియజేసెను. రాజు వెంటనే ఆ వైరాగ్యశీలుని సందర్శించి సేవింపనెంచి వెయ్యిగోవులను, పట్టువస్త్రములను, ముత్యాలహారములను, వెంటదీసికొని రైక్వమునీంద్రుని చెంత కేగి నమస్కరించి తాను దెచ్చిన వస్తువులను కానుకగా స్వీకరింపుడని ప్రార్థించెను. మునీంద్రుడంతట కోపగించుకొని 'ఓయీ! నా విషయము నీకు తెలియదా? ఈ వస్తువులను తిరిగి నీవే తీసికొనిపొమ్ము. నాకక్కఱలేద'ని పలుక రాజాతని పాదములను బట్టుకొని క్షమింపవేడి, అతని యా మాహాత్మ్యమునకు హేతువేమియని ప్రశ్నింప, ఆ రైక్వముని తాను గీత

ఆఱవ అధ్యాయమును ప్రతిదినము పారాయణము చేయుచుంటి ననియు, దాని ప్రభావముచే తనకట్టి వైరాగ్యాదులుదయించిన వనియు తెలిపెను.

**గీతానాం షష్ఠ మధ్యాయం జపామిప్రత్యహం నృప**
**తేనైవ తేజోరాశిర్మే సురాణామపి దుస్పృహః.**

పిమ్మట రాజాతనికి బహుకాలము సేవాశుశ్రూషలు జేసి, గీత ఆఱవ అధ్యాయము నతనివలన నేర్చుకొని తదభ్యాసవశమున క్రమముగ ముక్తిధామమునలంకరించెను. కావున గీత ఆఱవ అధ్యాయము యొక్క పారాయణ, అనుష్ఠానములచే జనులకు మోక్షప్రాప్తి అవశ్యము కలుగగలదు.

**గీత ఆఱవ అధ్యాయఫలము – మోక్షప్రాప్తి.**

**7. సప్తమాధ్యాయ ఫలము:–** పూర్వకాలమున పాటలీపుత్రమను నగరమున శంకుకర్ణుడను బ్రాహ్మణుడుండెను. అతడు తన బ్రాహ్మణవృత్తిని విసర్జించి నిరంతరము ధనార్జనతత్పరుడై కాలము గడుపుచుండెను. ఒకనా డాతడు తన బంధుమిత్రాదులతో గూడి మఱియొక గ్రామమునకు పయనమై పోవుచుండ మార్గమధ్యమున నొక సర్పముచే కఱవబడి మరణించెను. తదుపరి యాతడు సర్పమైపుట్టి పూర్వజన్మపు ధనాశాసంస్కారము లోన దాగియుండుటచే తా నిదివరకు భూమిలో దాచియున్న నిధిని సంరక్షించుచు ఒకనాటి రేయి తన కుమారులకు స్వప్నమున గన్పించి తాను వారి తండ్రిననియు, సర్పరూపమున తన నిధిని కాపాడుచున్నాననియు చెప్పెను. మఱునా డుదయమున వారు నిద్రలేచి నిధియున్న చోటిని త్రవ్వదొడగ నింతలో ఆ సర్పము లేచి శివుడను కుమారునితో తన్నా దీనదశనుండి ఉద్ధరించవలెననియు, భగవద్గీత సప్తమాధ్యాయ పారాయణమే తన్ను సద్గతికి గొనిపోగలదనియు వచింప, పుత్రులావిధముగనే చేసి తండ్రిని కడతేర్చిరి.

**గీతానాం సప్తమాధ్యాయ మన్తరేణ సుధామయం**
**జన్తోర్జరామృత్యుదుఃఖ నిరాకరణ కారణమ్.**

అమృతపరిపూర్ణమగు గీత ఏడవ అధ్యాయమును పారాయణము చేసినచో జీవులను జన్మజరామృత్యుదుఃఖము నుండి అది విడిపింపగలదు. శంకుకర్ణుని తనయులు గీత సప్తమాధ్యాయమును పఠించుటచే తండ్రికి సర్పజన్మ వదలిపోయి దివ్యత్వము లభించెను. పుత్రులును తండ్రి ద్రవ్యమును దానధర్మములకు వినియోగించి, సుచరితులై గీత సప్తమాధ్యాయమును నిరంతరము జపించుచు భగవద్జ్ఞానమును బొంది ముక్తులైరి.

**సప్తమాధ్యాయ జపతో ముక్తిభాజోఽభవం స్తతః**
**దేవ మిష్టతమం జ్ఞాత్వా నిర్వాణార్పిత బుద్ధయః.**

కాబట్టి గీత సప్తమాధ్యాయ పారాయణముచే మానవులేకాక, పితృదేవతలు, సర్పాది నీచయోనులందు జన్మించినవారుకూడ మోక్షభాగులగుచున్నారు.

**గీత సప్తమాధ్యాయ ఫలము – మానవులు, పితృదేవతలు, సరీసృపాదులుకూడ తరించుట.**

**8. అష్టమాధ్యాయ ఫలము:–** దక్షిణదేశమున అమర్దకమను ప్రసిద్ధనగరమున భావశర్మయను బ్రాహ్మణుడు నివసించుచుండెను. అతడు పెక్కు అనుచిత కార్యము లొనర్చుచు జీవితమును భ్రష్టమొనర్చుకొనెను. వేశ్యాలోలుడై మధుమాంసములను భక్షించుచుండెను. కాలక్రమమున నతడు అజీర్ణవ్యాధిచే పీడితుడై మరణించి (తాటికల్లును గూర్చిన సంస్కారమువలన) ఒకానొకచోట తాటిచెట్టయి జన్మించెను. ఇట్లుండ కుశీవలుడను బ్రాహ్మణుడు దానముల నధికముగ పరిగ్రహించుచు ధర్మకార్యము లెవ్వియు చేయక జీవితమును గడుపుచు కాలవశమున మృత్యువాతబడి బ్రహ్మరాక్షసుడై జన్మించెను. అతని భార్యయగు కుమతియు బ్రహ్మరక్కసియై పుట్టెను. వారిరువురును ఆ తాటిచెట్టునీడక్రింద కూర్చొనియుండ భార్య భర్తతో 'నాథా! మనకీబ్రహ్మరాక్షసరూప మెట్లు పోగలద'ని ప్రశ్నింప, భర్త 'బ్రహ్మవిద్యోపదేశముచేతను, అధ్యాత్మవిచారణచేతను, కర్మముయొక్క రహస్య మెఱుగుటచేతను తొలగిపోగలద'ని నుడివెను. ఆ వాక్యములను విని భార్యయగు కుమతి 'కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం కిం కర్మపురుషోత్తమ' – బ్రహ్మమనగా నేమి, అధ్యాత్మమనగా నెయ్యది, కర్మముయొక్క తత్త్వమేమి?' యని ప్రశ్నించి అప్రయత్నముగ గీత అష్టమాధ్యాయము యొక్క ప్రథమశ్లోక పూర్వార్థమును సంస్మరించెను. ఆ గీతావాక్యముయొక్క శ్రవణమాత్రముచేతనే తాటిచెట్టుగనున్న భావశర్మయు, బ్రహ్మరాక్షసుడుగనున్న కుశీవలుడున్ను, స్మరణ మాత్రముచే కుశీవలుని భార్యయు విముక్తులై నిజరూపంబులను బడసిరి. అందు కుశీవలదంపతులు తత్కాలమున నటకేతెంచిన విమానము నధిష్ఠించి దివ్యలోకమునకు జనిరి. భావశర్మయు ఆ గీత అష్టమాధ్యాయ అర్ధశ్లోకమును వ్రాసిపెట్టుకొని, కాశీపట్టణమున కేగి దానిని బాగుగ జపించుచు, అర్థమును మననము చేయుచు శ్రీహరినిగూర్చి ధ్యానింపదొడగెను. విష్ణుమూర్తియు నాతని జపతపములకు మెచ్చి యాతనికి మోక్షమును ప్రసాదించెను. అతని తపస్సుచే నరకవాసులగు అతని వంశస్థులున్ను తరించిపోయిరి.

**జపన్ గీతాష్టమాధ్యాయ శ్లోకార్థం నియతేన్ద్రియః**
**సంతుష్టవా నహం దేవి తదీయ తపసా భృశమ్.**

ఇవ్విధముగ గీత అష్టమాధ్యాయ పారాయణముచే బ్రహ్మరాక్షసత్వ, వృక్షత్వాది సమస్తదోషములు తొలగి జీవునకు ముక్తి లభించగలదు.

**గీత అష్టమాధ్యాయఫలము – సమస్త దుర్గతి నివారణ, మోక్షప్రాప్తి.**

**9. నవమాధ్యాయ ఫలము:–** పూర్వము నర్మదానదీ తీరమున మహిష్మతి యను పట్టణమున మాధవుడను బ్రాహ్మణుడుండెను. అతడు గొప్ప విద్వాంసుడు. మఱియు ధర్మప్రవృత్తి కలవాడు. ఒకపుడాత డొక యాగము చేయదలంచి అందు బలియిచ్చుట కొఱకై ఒక మేకను దెచ్చెను. సరిగా బలియిచ్చు సమయమున ఆ మేక 'ఓ ద్విజోత్తమా! ఈ యాగమువలన నీకు శాశ్వతఫలిత మేమియు చేకూరదు. మఱియు పశువును హింసించుటవలన నాకు పట్టిన దుర్గతియే నీకును పట్టగలదు' అని విప్రునితో బలుకగా నంతట నాబ్రాహ్మణుని కోరికపై ఆమేక తన పూర్వవృత్తాంతము నిట్లు చెప్పదొడగెను – ఓ విప్రుడా! పూర్వము నీవలెనే నేనున్ను బ్రాహ్మణవంశమున జన్మించితిని. ఒకనాడు నాపుత్రుడు రోగగ్రస్తుడుకాగా, నాభార్యయొక్క ప్రేరణచే రోగశాంతికొఱకై ఒక మేకను చండికా దేవికి బలి యిచ్చితిని. మేకయొక్క ఆ హృదయవిదారక దృశ్యమును చూచుచున్న దాని తల్లి నన్ను మేక జన్మ యెత్తులాగున శపించెను. కావుననే అనేక నీచజన్మలను బొంది ఇపు డీప్రకారము మేకనై పుట్టి బాధల నొందుచున్నాను! ఆ వాక్యములను విని బ్రాహ్మణుడు నిర్వేదమొంది ఆత్యంతిక సుఖప్రాప్తికై మార్గమును తెలుపుమని వేడగా, ఆ మేక యిట్లు ప్రత్యుత్తరమొసగెను

పూర్వము కురుక్షేత్రమను నగరమున చంద్రశర్మ యను రాజు ఒకనాడు సూర్యగ్రహణకాలమున బ్రాహ్మణునకు కాలపురుషదానము చేయదలచి ఉత్తముడగు విప్రుని రప్పించి యథావిధిగ నట్లొనర్చెను. వెంటనే ఆ కాలపురుషవిగ్రహమునుండి చండాల దంపతు లుద్భవించి దానప్రతిగ్రహీతయగు ఆ బ్రాహ్మణుని బాధింపదొడగిరి. కాని తత్క్షణమే యాతడు గీత నవమాధ్యాయమును పారాయణము చేయసాగెను. అపుడాయధ్యాయమునందలి ఒక్కొక్క అక్షరమునుండి ఒక్కొక్క విష్ణుదూత యావిర్భవించి ఆ చండాల దంపతులను దూరముగ పారద్రోలిరి. రాజాశ్చర్యపడి ఏ మంత్రమును జపించుటచే బ్రాహ్మణుడాభయంకరమగు ఆపత్తును దాటగల్గెనని యడుగ, అంతట నా విప్రోత్తముడు తాను గీత తొమ్మిదవ అధ్యాయమును జపించితిననియు మఱియు తానెల్లపుడు గీత నవమాధ్యాయమునుపారాయణము చేయుచుందుననియు, దానిచే సమస్త అపదలు, ప్రతిగ్రహణ దోషములు తొలగిపోవు చున్నవనియు, వచింపగా రాజున్ను అతనివలన ఆ అధ్యాయమును బాగుగ నభ్యసించెను. దానిచే నిరువురును ముక్తులైరి.

**1. గీతాయా నవమాధ్యాయమంత్రమాలా మయాస్మృతా**
**తన్మాహాత్మ్యమిదం సర్వం త్వ మవేహి మహీపతే.**

**2. గీతాయా నవమాధ్యాయం జపామి ప్రత్యహం నృప**
**నిస్తీర్ణాశ్చాపద స్తేన కుప్రతిగ్రహ సంభవాః.**

మేక యిట్లు పలుక నంతట ఆ బ్రాహ్మణుడు మేకను చంపక వదలివైచి సదా గీత నవమాధ్యాయమును శ్రద్ధతో పారాయణము చేయుచు అంతమున పరమాత్మ పదమును బొందెను. కాబట్టి గీత నవమాధ్యాయ పారాయణముచే ప్రతిగ్రహణాది జనిత దోషములు నశించుటయే గాక తుదకు మోక్షమున్ను లభించును.

**గీత నవమాధ్యాయఫలము – ప్రతిగ్రహణదోష వినాశము, ముక్తి.**

**10. దశమాధ్యాయ ఫలము:–** కాశీపట్టణమున ధీరబుద్ధియను బ్రాహ్మణుడుండెను. అతడు జితేంద్రియుడై పరమేశ్వరునియందు ఉత్కటభక్తి కలిగియుండెను. పరమ పునీతచిత్తుడగుటచే ఆ బ్రాహ్మణుడెచ్చటికేగిన, అచటకు ఈశ్వరుడున్ను ఆతని వెంట బోవుచుండెను. అది చూచి భృంగిరిటుడు అట్లొనర్చుటకు కారణమేమియని శివుని ప్రశ్నింప ఆతడిట్లు వచించెను – పూర్వము కైలాసమున, పున్నాగవనమున నొక వెన్నెలరాత్రియందొక తిన్నెపై నేను గూర్చొనియుండ ఆకసమునుండి యొక నల్లటి పక్షి నాయొద్దకువచ్చి ఒక పద్మమును సమర్పించి ప్రణమిల్లెను. 'నీవెవరవు? నీ వృత్తాంతమేమి?' యని నేను ప్రశ్నింప ఆ పక్షి యిట్లు వచించెను – నేను బ్రహ్మదేవుని హంసను. సౌరాష్ట్రదేశమున నొక తామరకొలను కలదు. అందలి తామరతూండ్లను భుజించి ఒకనాడు నే నాకసమున కెగుర వెంటనే క్రిందపడిపోతిని. నా శరీరము నలుపెక్కెను. ఏల యిట్లు జరిగెనని నేనాశ్చర్యముగ చూచుచుండ నింతలో ఆ పద్మసరోవరమునుండి "లెమ్ము!" అను శబ్దము వినబడగా నేనచటికేగి చూడ నొక పద్మలత కనిపించెను. ఆ లత నాతో నిట్లు చెప్పదొడగెను – 'నీవు ఆకాశమున నెగురుచు నన్ను దాటిపోతివి. తత్ఫలితముగ నీశరీరము నలుపుదనము బొందినది. మఱియు నీవు క్రిందపడిపోతివి. నాముఖగంధము నాఘ్రాణించుటచే ఇఱువదివేల తుమ్మెదలిపుడే దివ్యరూపమునొంది స్వర్గమున కేగినవి. ఈ నా ప్రభావమునకు కారణమేమనగా పూర్వము నేనొక బ్రాహ్మణ బాలికను. నాపేరు సరోజవదన. వివాహానంతరము పతిశుశ్రూష చేయుచు కాలము గడుపుచుంటిని. ఒకనా డొక గోరువంకపక్షిచే పాఠము చెప్పించుచుండ పతిసేవయం దొకింత ఆలస్యముకాగా

భర్తకోపగించి 'గోరువంక' వగుమని నన్ను శపించెను. వెంటనే నేనొక మునిపుంగవుని గృహమున గోరువంక పక్షిగా జన్మింప ఆయింటి యజమాని నిత్యము గీత పదియవ అధ్యాయమును పారాయణము చేయుచుండుటవలన నేనున్ను దానిని బాగుగ శ్రవణము చేయుచుంటిని. తన్మాహాత్మ్యమువలన కొంత కాలమునకు నేను దేహమును వీడి స్వర్గమందు అప్సరసగా జన్మించి పద్మావతియను పేరుతో లక్ష్మికి చెలికత్తెగా నుండుచు ఒకనాడీ సరోవరమున విహరించుచుండ అట దూర్వాసమునీంద్రుని జూచి భయపడి వెంటనే పద్మ లతా రూపమును ధరించితిని. అది చూచి యాతడు లతారూపమునందే నూఱు వత్సరము లుండులాగున నన్ను శపించెను. ఇప్పుడు నీకును నాకును శాపావధి సమీపించినది. నేనిపుడు గీత దశమాధ్యాయమును పారాయణము చేసెదను. నీవున్ను శ్రవణము చేయుము.' అని పలికి యా పద్మలత గీత 10వ అధ్యాయమును స్మరించి ముక్తిని బడసెను. ఆ లత యిచ్చిన పద్మమును దీసికొని నీ పాదములచెంతకు వచ్చితినని ఆ పక్షి పలికెను. భృంగీశ్వరా! బ్రహ్మదేవుని హంసయగు ఆ పక్షి పూర్వము పద్మలతచే జెప్పబడిన గీత దశమాధ్యాయ ప్రభావముచే నొక బ్రాహ్మణుడై జన్మించి పూర్వసంస్కారమువలన నిరంతరము దశమాధ్యాయమును పఠించుచుండెను. తత్ఫలితముగ నాతడు సర్వభూతస్థుడగు విష్ణువును దర్శించుచు మహాపవిత్రుడై, తత్త్వజ్ఞానమును బడసి జీవన్ముక్తుడైయున్నాడు.

**దశమాధ్యాయ మాహాత్మ్యా త్తత్త్వజ్ఞానం సుదుర్లభమ్**
**లబ్ధ మేతేన మునినా జీవన్ముక్తి రియం తథా.**

కనుకనే నే నాతనిని ప్రీతిచే సదా వెన్నంటుచుందును. గీత దశమాధ్యాయమున కిట్టి మహిమ కలిగియున్నది.

**గీత దశమాధ్యాయ ఫలము – బ్రహ్మజ్ఞానప్రాప్తి.**

**11. ఏకాదశాధ్యాయ ఫలము:–** పూర్వకాలమున ప్రణీత యను నది యొడ్డున మేఘంకరమను పురము కలదు. సకలలోకపతియగు విష్ణు వచ్చోట వసించుచు పురజనులకు సౌఖ్యములను ప్రసాదించుచుండెను. ఆ పట్టణమున మేఖల యను తీర్థరాజమును కలదు. అప్పురమున సునందుడను బ్రాహ్మణసత్తముడు సదాచార పరాయణుడై, వేదశాస్త్రప్రవీణుడై యుండెను. అతడు నిత్యము విష్ణుసన్నిధియందు గీత ఏకాదశాధ్యాయమును పారాయణ మొనర్చుచుండెను. దానిచే నతనికి బ్రహ్మజ్ఞాన ముదయింప జీవన్ముక్తుడై యలరారుచుండెను. ఒకపుడాతడు తీర్థయాత్రచేయుటకై బయలుదేఱి పెక్కు తీర్థములగాంచి తుదకు వివాహమండప మను పురమున గ్రామాధికారి చూపిన యొక మందిరమున ఆ రాత్రికాలమున తాను, మిత్రులు నివసించిరి. మఱునటిరోజు ఉదయమున చూచుసరికి అతడు తప్ప తక్కిన వారందఱు అదృశ్యులైరి. ఇంతలో గ్రామాధికారివచ్చి విషయమంతయు నాతని కిట్లెరిగించెను – 'మహాత్మా! ఈ పురమున నరభక్షకుడగు ఘోరరాక్షసుడొకడు కలడు. అతడు జనులను బాధించుచుండ, మేమాతనిని ప్రార్థించి ఇతర గ్రామములనుండి యిచటికేతెంచి నిదురించువారిని మాత్రము తినునట్లు ఒప్పించి అందులకై ఈ ధర్మశాలను ఏర్పాటుచేసితిమి. మీరుతప్ప మీవెంట నున్నవారందరు ఆతనిచేతనే కబళింపబడిరి. నా కుమారుడుకూడ నిట్లే ఆతనిచే భక్షింపివేయబడెను. మీలో నేదియో అలౌకికశక్తియున్నందుననే మీరు తప్పించుకొనగల్గితిరి. నా కుమారు డెట్లు జీవించునని నేనా రాక్షసుని యడుగ 'గీత ఏకాదశాధ్యాయమును పారాయణముచేయుచు అభిమంత్రించిన జలముచే నారాక్షసత్వము పోవుట యేకాక నాచే నింతదనుక భక్షింపబడిన వారందరు కూడ ముక్తులగుదుర'ని వచించెను. ఇట్టి అద్భుతశక్తి ఆ అధ్యాయమున కేల వచ్చినదని నేను వానినడుగగా నాతడిట్లు పలికెను –

'విత్తవానుడగు బ్రాహ్మణు డొకడు నిరంతరము గీత ఏకాదశాధ్యాయమును పఠించుచుండెను. అతడు మరణించినపిదప అతని యస్థిఖండము నొక గ్రద్ద నోట కరచుకొని పోవుచుండ త్రోవలో నొక జలాశయమున బడెను. దానిచే ఆచోటు మహాతీర్థముగా మారెను. గీత 11వ అధ్యాయమున కిట్టి మహిమయున్నది!' రాక్షసుడిట్లువచించి నాకుమారుని పునర్జీవనమునకై నీచెంతకు బొమ్మని ఆనతిచ్చెను. తదుపరి సునందుని ప్రశ్నను పురస్కరించుకొని గ్రామాధికారి ఆ రాక్షసుని వృత్తాంత మిట్లు చెప్పదొడగెను. ద్విజోత్తమా! పూర్వ మీ గ్రామమున వ్యవసాయము చేసికొను బ్రాహ్మణుడొకడుండెను. ఒకనాడతడు పొలములో గూర్చొనియుండ సమీపమున నొక గ్రద్ద బాటసారిని పొడిచి చంపుచుండెను. ఒక మునీశ్వరు డదిచూచి పరుగిడివచ్చునంతలో ఆ గ్రద్ద బాటసారిని చంపి యెగిరి పోయెను. అంతట నామునిపుంగవుడు ప్రక్కనే యుండియు బాటసారిని కాపాడని దోషమునకై ఆ బ్రాహ్మణకృషీవలుని 'రాక్షసుడై' జన్మించులాగున శపించెను. అనుగ్రహింపుడని బ్రాహ్మణుడు వేడుకొనగా 'గీత ఏకాదశాధ్యాయమును ఏడుసార్లు పఠించి అభిమంత్రింపబడు జలముచే నీకు శాపవిముక్తి కలుగగలద'ని మునీశ్వరుడు పలికెను. కావున మహాత్మా! ఆ రాక్షసుని, నాకుమారుని కూడ ఉద్ధరింపుడని గ్రామపాలుడు సునందుని ప్రార్థింప ఆతడట్లే గీత పదునొకండవ అధ్యాయమును ఏడుసార్లు పారాయణము చేసి రాక్షసుని శిరముపై చల్లెను. అంతట నారాక్షసుడు, ఆతనిచే భక్షింపబడిన అభాగ్యజీవులందఱున్ను దివ్యదేహధారులై విష్ణుపదమును బొందిరి. గ్రామపాలుని కుమారుడున్ను తండ్రికి 'సాధుజన సాంగత్యము చేయుచు గీత ఏకాదశాధ్యాయము పారాయణము చేయుచుండు మనియు, పరమాత్మయగు శ్రీకృష్ణుని సదా ధ్యానించు చుండుమనియు, దానిచే సకలకళ్యాణములు లభించుననియు, మోక్షసిద్ధి చేకూరుననియు వచించి' దివ్యలోకమున కరిగెను. గ్రామాధికారియు అట్లే కావించి ముక్తుడయ్యెను. కావున గీత ఏకాదశాధ్యాయ పారాయణముచే సర్వపాపవిముక్తి, పరమాత్మ పదప్రాప్తి చేకూరగలవు.

**నిష్కల్మషతయా చైనం ప్రాప్నుస్తే పరమం పదమ్**
**ఏకాదశస్య సామర్థ్యా దధ్యాయస్య భవిష్యతి.**

**గీత ఏకాదశాధ్యాయ ఫలము – సర్వపాప విముక్తి, పరమాత్మపదప్రాప్తి.**

**12. ద్వాదశాధ్యాయ ఫలము:–** దక్షిణదేశమందు కోల్హాపురమను గొప్ప పట్టణము కలదు. అయ్యది సకల సౌభాగ్యములకు ఆటపట్టై వెలయుచుండెను. ఆ దేశపురాజకుమారుడు పరాశక్తియగు లక్ష్మీదేవిని సందర్శించి భక్తిపూర్వకముగ నామెను సంస్తుతించెను. అంతట మహాలక్ష్మి ఆతనిభక్తికి మెచ్చి ప్రత్యక్షమై వరమును కోరుకొనుమని చెప్ప ఆతడిట్లు ప్రార్థించెను – 'దేవీ! నాతండ్రియగు బృహద్రథుడు అశ్వమేధయాగము చేయుచు రోగగ్రస్తుడై మరణించెను. ఆతని శరీరమును చెడకుండ తైలద్రావకమున భద్రపఱచియున్నాను. యాగాశ్వ మెచటికో పారిపోయి ఎంత వెతకినను కానరాకున్నది. కాబట్టి తల్లీ! ఆ గుఱ్ఱమును తిరిగి లభింపజేసినచో యాగమును పూర్తిచేసి పితృఋణమును దీర్చుకొందును. అనుగ్రహింపుము!' రాజకుమారుని ఆ వాక్యముల నాలకించి దేవి యిట్లు పలికెను – 'నా ఆలయద్వారమున సిద్ధసమాధి యను పేరుగల యొక బ్రాహ్మణుడు కలడు. ఆతడు నీ యభీష్టమును నెరవేర్చగలడు' – రాజపుత్రు డట్లే యా విప్రునిదెస కేగ నాతడు తన మంత్రప్రభావముచే దేవతలందఱిని యటకు రప్పించి దేవేంద్రుడపహరించిన యాగాశ్వమును శీఘ్రమే కొనిరండని వారిని ఆజ్ఞాపించెను. వారట్లే చేసిరి. పోయిన గుఱ్ఱము తిరిగి లభించుటయు, దేవతలందఱును అజ్ఞాబద్ధులై యుండుటయు గాంచి రాజకుమారు

డాబ్రాహ్మణుని అద్భుతశక్తిసామర్థ్యముల కాశ్చర్యము ప్రకటించి మృతినొందిన తన తండ్రినికూడ బ్రతికించులాగున వేడుకొనగా, అతడట్లే యాతని మృతకళేబరముకడకు జని జలమును అభిమంత్రించి దానిపై జల్లెను. తోడనే బృహద్రథుడు సజీవుడయ్యెను. రాజకుమారుడు తండ్రికి జరిగిన వృత్తాంతమంతయు నివేదించగా నతడా బ్రహ్మణునకు ప్రణమిల్లి ఏ పుణ్య ప్రభావముచే తమకిట్టి యలౌకికశక్తి కలిగినదని ప్రశ్నింప విప్రవర్యుడిట్లు పలికెను.

## గీతానాం ద్వాదశాధ్యాయం జపామ్యహ మతన్ద్రితః
## తేన శక్తిరియం రాజన్ యయా ప్రాప్తోఽసి జీవితమ్.

'రాజా! నేను ప్రతినిత్యము భక్తిపూర్వకముగ గీత పండ్రెండవ అధ్యాయమును పారాయణము చేయుచుందును. దానిచే నిట్టి శక్తి కలిగినది.' తదుపరి రాజు, అతని కుమారుడు ఆబ్రాహ్మణునివలన గీత ద్వాదశాధ్యాయమును నేర్చుకొని శ్రద్ధగా జపింపదొడగిరి. తక్కినవారును అట్లే చేసిరి. ఈ ప్రకారముగ వారందరున్ను ముక్తిధామము నలంకరించిరి. కాబట్టి గీత ద్వాదశాధ్యాయ పారాయణముచే దివ్యశక్తులుదయించుటయేకాక మోక్షప్రాప్తియు కలుగగలదు.

**గీత ద్వాదశాధ్యాయఫలము – దివ్యశక్తులుదయించుట, మోక్షరూపసద్గతి లభించుట.**

**13. త్రయోదశాధ్యాయ ఫలము :–** దక్షిణదేశమున తుంగభద్రానదీ తీరమున హరిహరపురమను నగరముండెను. అందు హరిదీక్షితుడను ధర్మానురక్తిగల బ్రాహ్మణుడు వసించుచుండెను. ఆతనికి దురాచారయను భార్య కలదు. ఆమె నిత్యము పతిని దూషించుచు, దుష్టప్రవృత్తికలదై, స్వేచ్ఛావిహారిణియై యుండుచుండెను. ఒకనాడు రాత్రి ఆ కులట నగరముబయటగల అరణ్యమున నొక సంకేత స్థలమును నిర్ణయించుకొని అటనుండగా, విటులెవ్వరును రానందున కామాంధురాలై అటునిటు తిరుగుచు విసిగి యొకచోట గూర్చొనియుండ ఒక పులి వచ్చి మీదపడి దేహమును చీల్చి తినివైచెను. మరణించినపిదప ఆమె తన పాపకృత్యములకు ఫలితముగ పెక్కు కల్పముల కాలము ఘోరనరకయాతనల ననుభవించి అటుపిమ్మట భూలోకమున చండాలస్త్రీయై జన్మించెను. ఒకనాడామె తన పురమునగల ఈశ్వరుని సతియగు జృంభకాదేవియొక్క ఆలయమునకు రాగా అచట వాసుదేవుడను బ్రాహ్మణుడు గీత 13వ అధ్యాయము పారాయణము చేయుచుండ అద్దానిని శ్రవణము చేసెను. వెంటనే యామె తన చండాల దేహమును వీడి దివ్యరూపమును ధరించి ఉత్తమ లోకమునకు జనెను. కావున గీత త్రయోదశాధ్యాయమును భక్తితో పారాయణము చేయువారు, శ్రవణమొనర్చువారు చండాలత్వాది దోషరహితులై పాపవిముక్తులై సద్గతులను బొందగలరు.

## గీతాత్రయోదశాధ్యాయ ముద్గిరన్తమనారతమ్
## తతస్తచ్ఛ్రవణాదేవ ముక్తా శ్వపచ విగ్రహాత్.

**గీత త్రయోదశాధ్యాయ ఫలము – పాపవిముక్తి, సద్గతిప్రాప్తి.**

**14. చతుర్థశాధ్యాయ ఫలము:–** పూర్వము కాశ్మీరదేశమున శౌర్యవర్మయను రాజు నివసించుచుండెను. అతడు తన మిత్రుడైన సింహళద్వీప ప్రభువగు విక్రమబేతాళునకు కానుకగా రెండు వేటకుక్కలను బంపెను. ఆకుక్కలను వెంటనిడుకొని ఒకనాడు విక్రమబేతాళభూపతి అనేక రాజ కుమారులతో గూడ వేటకు జనెను. అట నొకచోట వేగముగ పరుగిడుచున్న కుందేలు నొకదానిని పట్టుకొనుటకై ఆరాజు తన కుక్కలను బంప, అవి అతివేగముతో బరుగెత్తి తుదకొక ఆశ్రమస్థలమును జేరినవి. ఆ యాశ్రమమున

జితేంద్రియుడగు వత్సుడను మునిపుంగవుడు వసించుచుండెను. అతడు నిరంతరము గీత పదునాల్గవ అధ్యాయమును పారాయణము చేసికొనుచు శిష్యుల కద్దానిని బోధించుచుండును. ఆ యాశ్రమమున సింహశార్దూలాది హింస మృగములున్ను తమ క్రూరత్వమును విడనాడి తక్కిన మృగములతో ఆనందముగ క్రీడించుచుండెను. ఆ వత్సమునీంద్రుని శిష్యుడు పాదములు కడుగకొనిన జలముచే అట నొకచోట భూమి తడిసియుండెను. పరుగెత్తుకొని వచ్చుచున్న ఆ కుందేలు, కుక్క అలసిపోయి, అబురదయందు పడగా తత్పవిత్ర జలస్పర్శచే నా రెండును దివ్యరూపముల ధరించి విమాన మధిరోహించి స్వర్గమునకు జనెను.

అదియంతయు జూచి, ఆశ్చర్యచకితుడై విక్రమబేతాళరాజు అట్లు జరుగుటకు కారణమేమియని మునీంద్రుని శిష్యుని ప్రశ్నింప, అత డిట్లు నుడివెను. – పూర్వము మహారాష్ట్ర దేశమున ప్రత్యుదకము పట్టణము కలదు. అచట ధూర్తుడగు కేశవుడను బ్రాహ్మణుడు కలడు. అతనికి విలోభన యను దుశ్శీలయైన భార్య కలదు. వ్యభిచారిణియగు ఆస్త్రీపై ఒకనా డతడు కినిసి ఆమెను కొట్టి చంపెను. స్త్రీహత్యాపాపముచే నతడు కుందేలుగ జన్మించెను. పాపిష్ఠియగు అతని భార్యయు అడుకుక్కగ పుట్టెను. ఇపు డిచటి కేతెంచిన కుందేలు, కుక్క వారే. ఆశ్రమమున వత్సుడను జితేంద్రియుడైన యోగిసత్తముడు కలడు. అతడు సదా గీత 14వ అధ్యాయమును పారాయణము చేయుచుండును. నే నాతని శిష్యుడను. నేనున్ను ఆ 14వ అధ్యాయమును సదా జపించుచుందును. నేను కాళ్ళు కడుగుకొనిన జలముయొక్క స్పర్శచే ఆ మృగము లిపుడు పునీతములై దివి కేగినవి.

**చతుర్దశం తు అధ్యాయం జపామి ప్రత్యహం నృప**
**మదీయ చరణామ్భోజప్రక్షాలనజలే లుఠన్**
**శశ స్త్రీదివమాపన్న శ్శునక్యా సహ భూపతే.**

శిష్యుని యా వాక్యములను విని రాజున్ను అప్పటినుండి గీత పదునాల్గవ అధ్యాయమును పారాయణముచేయుచు క్రమముగ పరమాత్మపదము నలంకరించెను. కాబట్టి గీత 14వ అధ్యాయ పఠనముచే సమస్తదోషములు తొలగి జనులకు దివ్యపదము లభించును.

**గీత 14వ అధ్యాయ ఫలము – దోషనివారణ, ఉత్తమగతి ప్రాప్తి.**

**15 పంచదశాధ్యాయ ఫలము:–** పూర్వము గౌడదేశమున నరసింహుడను మహారాజు రాజ్యమేలుచుండెను. అతనికి సరసభేరుడను సేనాపతి యొకడు కలడు. కొంత కాలమున కా సేనాధిపతికి రాజునుచంపి తానే రాజ్యమును బాలింపవలెనను దుర్బుద్ధి యుదయించెను. కాని తన యభీష్టము నెరవేరకనే యాతడు విషూచికా వ్యాధిగ్రస్తుడై మరణించెను. పిమ్మట సింధుదేశమున నొక గుఱ్ఱమై పుట్టగా, ఒకానొక వణిక్ర్శేష్ఠు డద్దానిని తిరిగి యా రాజునకే అమ్మెను. రాజొకనాడు దానిపై నెక్కి అరణ్యమునకు వేటకుబోగా, త్రోవలో దప్పికగొని, గుఱ్ఱము నొక చెట్టునకుగట్టి, జలము నన్వేషించుచు ఒకచోట శిలపై గూర్చుండెను. ఇంతలో నొక తాటియాకుముక్క గాలికి కొట్టుకొని రాగా, దానిపై ఏదియో లిఖింపబడియుండుట జూచి రాజు దానిని చదివెను. అది గీత 15వ అధ్యాయమునందలి అర్ధశ్లోకము. ఆ అర్ధశ్లోకమును వినగనే ప్రక్కనయున్న గుఱ్ఱము దివ్యరూపమును ధరించి స్వర్గమున కేగెను. తదుపరి రాజు సమీపముననే యొక ఋష్యాశ్రమమును వీక్షించి, అటకు జని, ఆ ఋషివర్యుని అశ్వవిముక్తికి కారణంబడుగ అతడు గీత 15వ అధ్యాయమందలి అర్ధశ్లోకముయొక్క శ్రవణఫలితమే అది యని నుడివెను.

**అథ పంచదశాధ్యాయశ్లోకార్థం లిఖితం క్వచిత్**
**తతోవాచయత శ్రుత్వా నిరగాత్తురగో దివమ్.**

తదుపరి రాజు గీత పంచదశాధ్యాయమును భక్తితో సదా పఠించుచు విశుద్ధచిత్తుడై ముక్తిని బొందెను. కాబట్టి గీత 15వ అధ్యాయమును పారాయణము చేయుటచే జీవులు సర్వపాపవిముక్తులై మోక్షము నొందుదురు.

**గీత 15వ అధ్యాయఫలము – సర్వపాపనివృత్తి, ఉత్తమ మోక్షగతి సంప్రాప్తి.**

**16. షోడశాధ్యాయ ఫలము:–** పూర్వము ఘూర్జర దేశమున సౌరాష్ట్రికమను పురమున ఖడ్గబాహువను రాజు రాజ్యమేలుచుండెను. అతనియొద్ద అరివర్ధనమను పేరుగల మహాబలశాలియైన యేనుగొకటి కలదు. ఒకనాడది గొలుసులను త్రెంపుకొని ఊరిపై బడెను. దానిచే పురజను లెల్లరు భయవిహ్వలులైరి. మావటివాడుకాని, రాజుకాని, ఎంత ప్రయత్నించినను అది లోబడలేదు. ఇంతలో సరసుడను నొక బ్రాహ్మణుడు స్నాన మాచరించి కొన్ని గీతాశ్లోకములను బఠించుచు, ఆ దారిని బోవుచు జనులు నిషేధించుచున్నను వినక, ధైర్యముతో నా మదగజమును సమీపించి, దాని శరీరమును నిమురసాగెను. అంతట రాజాశ్చర్యచకితుడై యా విప్రుని సమీపించి అట్టి అలౌకిక శక్తికి కారణ మరయ అత డిట్లు వచించెను. ఓ రాజా! నేను ప్రతిదినము గీత పదునారవ అధ్యాయమందలి కొన్ని శ్లోకములను పఠింతును. దానివలన నాకీ సిద్ధులు కలిగినవి.

**గీతాయాష్షోడశోధ్యాయ శ్లోకాన్కతిపయానహమ్**
**జపామి ప్రత్యహం భూప తేనైతా స్సర్వ సిద్ధయః.**

ఆ వాక్యములను విని రాజా బ్రాహ్మణుని తనప్రాసాదమునకు గొనిపోయి, గౌరవించి, అతని వలన గీత 16వ అధ్యాయము నుపదేశమొంది, తత్ప్రభావముచే ఆ బ్రాహ్మణుడు పొందిన సిద్ధులను తానున్ను బొందగల్గెను. దానిచే నాతనికి ఆ గీతాశ్లోకములయెడల పరమవిశ్వాస ముదయింప, అత్యంత భక్తితో వానిని నిరంతరము పఠించుచు తుదకు పరమాత్మపదమును బొందెను. కావున గీత 16వ అధ్యాయ పారాయణముచే జీవుడు అపరిమిత శౌర్యసాహసములను బడసి తుదకు మోక్షము నొందగల్గును.

**గీత 16వ అధ్యాయఫలము – బలవిక్రమాదులు గల్గుట, మోక్షము సంప్రాప్తించుట.**

**17. సప్తదశాధ్యాయ ఫలము:–** పూర్వకాలమున ఘూర్జరదేశమును బాలించుచుండిన ఖడ్గబాహువను రాజుయొక్క పుత్రుని యొద్ద దుశ్శాసనుడను సేవకుడు కలడు. ఒకనాడాతడు మదగజమునెక్కి పోవుచుండ, మార్గమధ్యమున ఆ యేను గాతనిని క్రిందపడవైచి చంపివైచెను. తదుపరి యాతడు సింహలాధీశ్వరుడగు జయదేవుని యాస్థానమున గజమై పుట్టెను. జయదేవు డద్దానిని తన మిత్రుడగు ఖడ్గబాహు నృపాలున కొసంగెను. ఖడ్గబాహుడు దానిని ఒక కవీశ్వరునకు బహూకరించెను. ఆ కవీశ్వరుడు తిరిగి దానిని మాలవదేశాధిపతికి విక్రయించెను. ఇట్లుండ కొంతకాలమున కాయేనుగు వ్యాధిగ్రస్తమై మిగుల దుఃఖముతో నుండెను. రోగోపశమనమున్నకై రాజు పెక్కు వైద్యములను గావించెను. కాని వ్యాధి తగ్గలేదు. ఒకనాడు రాజు దానిని చూచుటకు రాగా ఆ యేనుగు రాజుతో నిట్లు పలికెను – 'రాజా!

ఈ ఔషధములచే నా వ్యాధి నెమ్మదించదు. గీత 17వ అధ్యాయమును పారాయణముచేయువాని నిచటకు గొనిరమ్ము. దానిచే నా రోగము శమించిపోవును'

**గీతా సప్తదశాధ్యాయజాపకం ద్విజమానయ**
**తేనాయం మామకో రోగః శామ్యత్యత్ర న సంశయః.**

ఆ వాక్యములను విని రాజు వెంటనే గీత సప్తదశాధ్యాయమును పారాయణముచేయు నొక విప్రుని రావించి ఆ అధ్యాయము నచ్చోట పఠింపించి, జలము నభిమంత్రింపజేయగా తత్ఫలితముగా నా గజము రోగవిముక్తమై దివ్యరూపముదాల్చి మోక్షమందెను. అదిజూచి మాలవాధిపతియగు నరవర్మయు గీత 17వ అధ్యాయమును పారాయణము చేయుచు అచిరకాలములో ముక్తుడయ్యెను. కాబట్టి గీత పదునేడవ అధ్యాయ పఠనముచే మహావ్యాధులున్ను ఉపశమించి జీవునకు ముక్తిలభించును.

**గీత 17వ అధ్యాయఫలము – సర్వరోగ విముక్తి, మోక్షప్రాప్తి.**

**18. అష్టాదశాధ్యాయ ఫలము:–** మేరుపర్వతశిఖరమున అమరావతీ పట్టణమున దేవేంద్రుడొకప్పుడు శచీదేవితో గూడ సుఖాసీనుడై యుండ తేజోరాశియగు ఒకానొక పరమపురుషుని విష్ణుదేవత లచటకి గొనివచ్చిరి. ఆతని దివ్యకాంతిపుంజముల జూడలేక దేవేంద్రుడు సింహాసనము నుండి నేలగూలగా, దేవదూత లా నూతనపురుషుని సింహాసనముపై గూర్చుండబెట్టి పట్టము కట్టిరి. మఱియు మంగళవాద్యములను, గీతములను బాడదొడంగిరి. ఆ చిత్రమునుజూచి దేవేంద్రుడు విస్మయావిష్టుడై యజ్ఞయాగాదులుగాని, దానధర్మములుగాని, పుణ్యక్షేత్ర సందర్శనము మున్నగునవికాని ఆచరింపని ఈతని కిట్టి మహోన్నత దశ యేలాగున సంభవించినదను సందియము బాధింప, తోడనే విష్ణులోకమున కరిగి ఇంద్రాధిపత్య మాతని కెట్లు లభించెనని విష్ణుభగవానుని ప్రశ్నించెను. అంతటి శ్రీహరి 'అతడు నిత్యము గీత పదునెనిమిదవ అధ్యాయమందలి ఐదు శ్లోకములను భక్తితో పఠించుచుండును. దానిచే నతని కట్టి మాహాత్మ్యము చేకూరెన'ని వచించెను.

**జపత్యష్టాదశాధ్యాయే గీతానాం శ్లోక పఞ్చకమ్**
**తత్పుణ్యేన చ సంప్రాప్తం తవ సామ్రాజ్యముత్తమమ్.**

ఆ వాక్యములను విని దేవేంద్రుడు వెంటనే బ్రాహ్మణ వేషమును దాల్చి గోదావరీ నదీ తీరమునకు జని యట గీత 18వ అధ్యాయమును నిత్యము పారాయణముసల్పు ఒకానొక బ్రాహ్మణోత్తమునకు సపర్యలు గావించి యతనినుండి గీత 18వ అధ్యాయమును నేర్చుకొని, ఇంద్రాది పదవులనుగూడ స్వల్పముగ తలంచి తుదకు విష్ణుసాయుజ్యము నొందెను. –

కాబట్టి గీత 18వ అధ్యాయ పారాయణముచే మనుజునకు సర్వయజ్ఞ ఫలము, సర్వపుణ్యకార్య ఫలము, మోక్షము లభించుచున్నవి. ఈ ప్రకారముగ గీతాధ్యాయ మాహాత్మ్యమునను పూర్వము విష్ణుభగవానుడు లక్ష్మీదేవికి జెప్ప, దానినే ఈశ్వరుడు పార్వతీదేవికి ఉపదేశించెను.

గీత 18వ అధ్యాయఫలము – సర్వపుణ్యఫలము, మోక్షరూపసద్గతి.

# గీతయొక్క పలువిధ రూపములు

(POLYMORHIISM)

గీత

- శ్రీకృష్ణభగవానుని దూత
- వ్యాసమునీంద్రుని వ్రాత
- వేదమంత్రముల మ్రోత
- అహంకారాదులకు కోత
- దివ్యజ్ఞానమునకు దాత
- అసురస్వభావమునకు వాత
- దైవీసంపదకు నేత
- పరమార్థదృష్టికి మాత
- రాగద్వేషములకు మూత
- కైవల్యపథమునకు సీత
- ప్రణవనాదమునకు గాత
- భవసాగరమునకు ఈత
- ముముక్షుజనులకు ఊత
- ప్రకృతిసామ్రాజ్యమునకు జేత
- ధర్మామృతమునకు పోత

# గీతాసంగ్రహము

భగవద్గీతలోని ఒక్కొక్క అధ్యాయమునందు అధ్యాయసారమును తెలుపునట్టి అతి ప్రధానమగు ఒక్కొక్క శ్లోకము ఏరి తీయబడి తాత్పర్యసహితముగ నిట వివరింపబడుచున్నది. గీతాసారమును గ్రహింపగోరువారి కివి లెస్సగ ఉపకరింపగలవు.

**1. న కాఙ్క్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ**
**కిం నో రాజ్యేన గోవిన్ద కిం భోగైర్జీవితేన వా. (1-23)**

ఓ కృష్ణా! నేను విజయమునుగాని, రాజ్యమునుగాని, (ప్రాపంచిక) సుఖములనుగాని కోరను. మనకు రాజ్యముతోగాని, భోగములతోగాని, జీవితముతోగాని యేమి ప్రయోజనము?

**2. న జాయతే మ్రియతే వా కదాచి**
**న్నాయం భూత్వా భవితా వా న భూయః**
**అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో**
**న హన్యతే హన్యమానే శరీరే. (2-20)**

ఈ ఆత్మ ఎపుడును పుట్టుట లేదు. చచ్చుట లేదు. అతడు ఒకప్పుడు లేకుండి మరల క్రొత్తగా వచ్చువాడు కాదు; ఉండి మరల లేకుండువాడు కాడు. అతడు పుట్టుక లేనివాడు, నాశరహితుడు, శాశ్వతుడు, అనాదియైనవాడు; శరీరము చంపబడినను అతడు చంపబడడు.

**3. యస్త్విన్ద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున**
**కర్మేన్ద్రియైః కర్మయోగ మసక్తస్స విశిష్యతే. (3-7)**

ఓ అర్జునా! ఎవడు ఇంద్రియములను మనస్సుచే నియమించి కర్మేంద్రియములచే కర్మయోగమును అసక్తుడై ఆచరించునో ఆతడే ఉత్తముడు.

**4. బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్**
**బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మ సమాధినా. (4-24)**

హోమసాధనములున్ను, హవిస్సున్ను, హోమాగ్నియు, హోమము చేయువాడును సమస్తము బ్రహ్మమేయని తెలియువాడు అట్టి చిత్తైకాగ్రతచే బ్రహ్మమునే పొందును.

**5. బ్రహ్మణ్యాధాయ కర్మాణి సఙ్గం త్యక్త్వా కరోతి యః**
**లిప్యతే న స పాపేన పద్మపత్రమివామ్భసా. (5-10)**

ఎవడు సమస్త కర్మములను పరమాత్మయందు సమర్పించి సంగమును (ఫలాపేక్షను) విడిచి చేయుచున్నాడో, అట్టివాడు నీటిచే తామరాకు అంటబడనట్లు పాపముచే అంటబడడు.

**6. శనైశ్శనైరుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా**
**ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చిన్తయేత్. (6-25)**

ధైర్యముతో గూడిన బుద్ధిచే మనస్సును మెల్లమెల్లగ విషయములనుండి మరలింపవలెను. మఱియు అట్టి మనస్సును ఆత్మయందు నెలకొల్పి ఇతరమగు దేనిని (దృశ్యవస్తువులను) తలంపక యుండవలెను.

7. మత్తః పరతరం నాన్యత్కిఞ్చిదస్తి ధనఞ్జయ
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ. (7-7)

ఓ అర్జునా! నాకంటె ఇతరమైనది ఈ ప్రపంచమున ఒకింతైనను లేదు. ఈ సమస్త జగత్తున్ను దారమునందు మణులవలె నాయందు కూర్చబడినది.

8. ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్
యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాంగతిమ్. (8-13)

ఎవడు పరబ్రహ్మవాచకమగు 'ఓం' అను ఏకాక్షరమును (ప్రణవమును) ఉచ్చరించుచు (లక్ష్యార్థమగు) నన్ను ధ్యానించుచు ఈ శరీరమును వదలునో అట్టివాడు సర్వోత్తమగతిని (మోక్షమును) పొందుచున్నాడు.

9. అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్. (9-22)

ఎవరు అనన్యచిత్తముతో నన్ను ధ్యానించుచు సేవించుచు నుందురో, ఎల్లప్పుడును నాయందే నిష్ఠగలిగియుండు అట్టివారియొక్క యోగక్షేమములను నేనే వహించుదును.

10. యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవవా
తత్తదేవావగచ్ఛత్వం మమ తేజోఽంశ సంభవమ్. (10-41)

ఏ యే వస్తువు ఐశ్వర్యయుక్తమై, కాంతివంతమై, శక్తివంతమై యుండునో, అది యంతయు నాయొక్క తేజోంశమువలన గలిగినదానినిగా నీవు తెలిసికొనుము.

11. మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సఙ్గవర్జితః
నిర్వైర స్సర్వభూతేషు యస్సమామేతి పాణ్డవ. (11-55)

ఓ అర్జునా! ఎవడు నాకు ప్రీతికరములగు కర్మలనే చేయునో, నన్నే పరమప్రాప్యముగ నెంచియుండునో, నాయెడల భక్తిగలిగియుండునో, దృశ్యపదార్థములందు సంసక్తి లేకయుండునో, మఱియు సమస్త ప్రాణులందును వైరరహితుడై దయగలిగి వర్తించునో, అట్టివాడు నన్నే పొందును.

12. సన్తుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః
మయ్యర్పిత మనోబుద్ధిర్యోమద్భక్తస్సమే ప్రియః (12-14)

ఎల్లప్పుడు సంతుష్టికలవాడును, యోగియు, మనోనిగ్రహము కలవాడును, స్థిరమైన నిశ్చయములతో గూడియున్నవాడును, నాకర్పించిన మనోబుద్ధులు కలవాడునగు నాభక్తుడెవడు కలడో, ఆతడే నాకు మిక్కిలి ప్రియుడు.

13. క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తజ్జ్ఞానం మతం మమ. (13-3)

ఓ అర్జునా! సమస్తక్షేత్రము (దేహము) లందుండు క్షేత్రజ్ఞుని నన్నుగా ఎఱుగుము. ఈ క్షేత్ర క్షేత్రజ్ఞులను గూర్చిన జ్ఞానమేదికలదో, అదియే వాస్తవమగు జ్ఞానమని నానిశ్చయము.

**14. నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టానుపశ్యతి**
**గుణేభ్యశ్చ పరంవేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి. (14-19)**

ఎవడు వివేకవంతుడై త్రిగుణములకంటె వేఱైన కర్తను ఎపుడు దర్శింపడో, మఱియు తన్ను త్రిగుణములకంటె అన్యునిగా నెపుడెఱుంగునో, అపుడాతడు నాస్వరూపమును (బ్రహ్మైక్యమును) పొందుచున్నాడు.

**15. నిర్మానమోహా జితసఙ్గదోషా**
**అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః**
**ద్వన్ద్వైర్విముక్తాస్సుఖదుఃఖసంజ్ఞై**
**ర్గచ్ఛన్త్యమూఢాః పదమవ్యయం తత్. (15-5)**

అభిమాన మోహములు లేనివారును, సంగ (ప్రపంచసంసర్గ) దోషములను జయించినవారును, సదా ఆత్మచింతన గలవారును, కోరికలన్నిటిని విడిచిపెట్టినవారును, సుఖదుఃఖాది ద్వంద్వములు లేనివారునగు వివేకవంతులు నాశములేని ఆ బ్రహ్మపదమును బొందుచున్నారు.

**16. యశ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః**
**న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాంగతిమ్. (16-23)**

ఎవడు శాస్త్రమునందు చెప్పినప్రకారము ఆచరించక తన యిష్టప్రకారము ప్రవర్తించునో, అట్టివాడు జ్ఞానసిద్ధినిగాని, సుఖమునుగాని, మోక్షమునుగాని బొందనేరడు. (శాస్త్రమందు చెప్పబడినట్లు దైవసంపదను గ్రహించి అసురసంపదను వీడవలెనని భావము).

**17. సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత**
**శ్రద్ధామయోఽయం పురుషో యోయచ్ఛ్రద్ధస్స ఏవ సః. (17-3)**

ఓ అర్జునా! సమస్తజీవులకును గుణము వారి వారి (పూర్వజన్మసంస్కారలభ్యమగు) యంతఃకరణము ననుసరించి కలుగుచున్నది. జీవుడు గుణమయుడై యున్నాడు. ఎవడు ఎట్టి గుణము గలిగి యుండునో ఆతడట్టి రూపముగలవాడే యగుచున్నాడు. (కాబట్టి ప్రతివారును శ్రద్ధతో ప్రయత్నపూర్వకముగ సత్త్వగుణము నవలంబించి క్రమముగా గుణాతీతస్థితిని చేరుకొనవలెనని భావము.)

**18. సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః. (18-66)**

సమస్త ధర్మములను (కర్మములను, లేక దృశ్యపదార్థములను) విడిచి నన్నొకనినే (దృక్స్వరూపమగు ఆత్మనే) శరణుబొందుము. అట్టి నిన్ను సమస్తపాపములనుండి నేను విడిపించెదను. కావున దుఃఖింపకుము.

# గీత - అంతరార్థము

పాండవ కౌరవ యుద్ధము వాస్తవముగ ప్రతిజీవియొక్క హృదయాంతరాళమున ప్రతిదినము సంభవించు ధర్మాధర్మ యుద్ధము యొక్క సాక్షాత్ ప్రతిబింబము. జీవిత సంగ్రామమున మంచికి చెడ్డకు, ధర్మమునకు అధర్మమునకు, న్యాయమునకు అన్యాయమునకు, సత్యమునకు అసత్యమునకు నిమిషనిమిషము పెద్ద పోరు జరుగుచుండును. ఆ పోరునందు నిశ్చయాత్మకమగు బుద్ధి ఎంత శుద్ధముగా నుండిన, ఎంత వివేకయుక్తముగ నుండిన జీవునకు అంత విజయము చేకూరుచుండును. కనుకనే ఉపనిషత్తులందు దానిని సారథిగపోల్చి చెప్పిరి. రథము గమ్యస్థానమును నిరాటంకముగ చేరవలెనని, కుమార్గమును జెబట్టక సవ్యమైన పథముననే నడువలెనని, సారథి మహాప్రజ్ఞావంతుడుగను, కుశలుడుగను ఉండవలెను. శ్రీకృష్ణపరమాత్మవంటి సారథి లభించినచో ఇక జీవితరథము మోక్షమను గమ్యస్థానము చేరకయుండగలదా? అర్జునుని సౌభాగ్యవశమున అతనికి ప్రజ్ఞాదురంధరుడగు అట్టి లోకేశుడే సారథిగ లభ్యమయ్యెను. కర్తవ్యచ్యుతుడై ధర్మక్షేత్రమున వక్రమార్గమున జననుంకించిన అర్జునుని తన పాటవముచే నతడు సవ్యమార్గమున నడిపించెను. వారి బోధయే భగవద్గీత. అట్లే హృదయక్షేత్రమున అధ్యాత్మనిశ్చయపరిపూర్ణమగు పవిత్రబుద్ధి కర్తవ్యచ్యుతమగు మనస్సునకు బోధించు దివ్యబోధకూడ భగవద్గీతయే యగును. గీతయొక్క అంతరార్థమిదియే. అర్జునునివలె ప్రతిజీవియు తన జీవితరథముయొక్క కళ్ళెములను పరమాత్మ చేతియందుంచి ప్రవర్తించినచో, వారి యనుగ్రహముచే మోక్షరూప గమ్యస్థానమును అతిసులభముగ చేరుకొనగలడు.

**గీతయొక్క రహస్యార్థము (అంతరార్థము) ఈ క్రింది తెలుపబడుచున్నది.**

| | | |
|---|---|---|
| కురక్షేత్రము | - | హృదయక్షేత్రము |
| అర్జునరథము | - | శరీరము |
| సారథియగు శ్రీకృష్ణుడు | - | ప్రజ్ఞానరూపమగు బుద్ధి (పరమాత్మ) |
| రథికుడగు అర్జునుడు | - | చంచల మనస్సు (జీవుడు) |
| గుఱ్ఱములు | - | ఇంద్రియములు |
| కౌరవులు + ప్రతిపక్షసేన | - | కామక్రోధ, రాగద్వేష, అహంకార, మమకారాది దుర్గుణములు |
| పాండవులు + స్వపక్షసేన | - | నిర్భయత్వ, భక్తి, శ్రద్ధాది సద్గుణములు |
| అర్జున ధనస్సు | - | సాధనచతుష్టయము |
| సంజయుడు | - | వివేకము |
| ధృతరాష్ట్రుడు | - | అవివేకము, అవిద్య |
| దుర్యోధనుడు | - | కామము |
| భగవద్గీత | - | జీవునిగూర్చి (మనస్సును గుఱించి) ప్రజ్ఞాన రూపమగు బుద్ధి పలుకు హితవాక్యములు |
| మొదటి 6 అధ్యాయములు | - | (కర్మషట్కము) - శ్రవణము |
| రెండవ 6 అధ్యాయములు | - | (భక్తిషట్కము) - మననము |
| మూడవ 6 అధ్యాయములు | - | (జ్ఞానషట్కము) - నిదిధ్యాసనము |

జీవితరథమును విషయమార్గములందు నడుపుటయే బంధము. దైవమార్గము నందు నడుపుటయే మోక్షము. ఇదియే గీతారహస్యము.

# గీతోద్యానవిహారము

శ్రీరాగము - ఆదితాళము

(1) భగవద్గీతో ద్యానవిహారము । భక్తి నొనర్పగ పరుగున రండీ ।
సొగసుగ దానిని జూడగనయ్యెడు । సుళువగుత్రోవను జూపెదనండీ ।

(2) భారతయుద్ధపు పరిసరభూముల । బయలుదేరిన భాగ్యంబండీ ।
ధీరుడు వ్యాసులు స్థిరముగనాటిన । దివ్యోద్యాన క్షేత్రము సుండీ ।

(3) రహినిల కృష్ణుడు రక్తితో పార్థుని । రథమును నడిపిన రంగంబండి ।
ఇహపరసుఖకర హేతుభూతముల । నెన్నియో యాతడు పన్నినదండీ ।

(4) ఇలపయినది పది యెన్మిదియౌ యక । రంబుల పరిమితి రాజిలునండీ ।
సలలితముగనట సప్తశతంబుల । సద్వృక్షంబులు చెలగును సుండీ ।

(5) ఎప్పుడు వాడని పూవులుసుండీ । ఎప్పుడు కుళ్లని ఫలములుసుండీ ।
తప్పక మనమా ధన్యవనికి జని । తలకొక కొన్నిటి దెత్తము రండీ ।

## గీతా జయంతి

వ్యక్తులకువలె జయంతి జరుపుకొనగల్గు భాగ్యము గీతాగ్రంథమునకు కలిగినది. దాని వైశిష్ట్యమువలననే దానికట్టి అపూర్వగౌరవము సిద్ధించినది. శ్రీకృష్ణభగవానుడు రణరంగమున అర్జునునుకు గీతోపదేశము చేసిన సుదినము మార్గశిర శుద్ధ ఏకాదశి. కాబట్టి ఆ దినము మహాపర్వదివసముగ భావింపబడు చున్నది. శ్రీరామజయంతి, శ్రీకృష్ణజయంతి, శ్రీబుద్ధజయంతి, శ్రీదత్తాత్రేయజయంతి, శ్రీశంకరజయంతి మున్నగు ఉత్సవములు జరుగు పవిత్రదినములందు ఆ యా అవతారపురుషులకు జను లెట్లు అర్చించుచుందురో, శ్రీగీతాజయంతి సందర్భమునగూడ గీతాదేవిని అర్చించు ఆచారము కలదు. గీతామాత నెట్లు పూజించవలెనో ఆ విధానమంతయు ఈ గ్రంథమున వేఱొకచోట తెలుపబడియున్నది. ఆ సుదినమున గీతా గ్రంథముయొక్కయు, శ్రీకృష్ణ, శ్రీవ్యాస, శ్రీఅర్జునులయొక్కయు అర్చనలతోబాటు ఈక్రింది కార్యక్రమములను గూడ అమలుజరుపుట చాల మంచిది.

(1) భగవద్గీత మొత్తము 18 అధ్యాయముల పారాయణము వ్యక్తిగతముగ గాని, సామూహికముగగాని జరుపవలెను. భక్తులు కొందఱు చేరినచో సమష్టి పారాయణము జరుపుటయే శ్రేష్ఠతరము. ఏలననగా సమష్టి పారాయణమువలన జనించు గీతాఘోష జనులకు ఉత్సాహమును రేకెత్తించుటయేకాక దూరముననున్నవారి శ్రుతిపుటములను గూడ పునీత మొనర్చ గలదు. గీత పూర్తి అయినపిదప మాహాత్మ్యమును గూడ పూర్తిగా చదువవలెను.

(2) గీతాతత్త్వము నెఱింగిన మహనీయులచే అనాడు గీతను గూర్చిన ఉపన్యాసముల నేర్పాటు చేయించవలెను. గీతోపన్యాసముల మూలకముగ జనులలో గీతయందలి మహోన్నతభావములు వ్యాప్తినొందుటయేకాక గీతపై వారికి మక్కువ అధికముకాజొచ్చును. తత్ఫలితముగ వారికి సంసారదుఃఖములు అంతమై పరమానంద ప్రాప్తి చేకూరగలదు. ఇంతకుమించిన పరోపకారకార్యము వేఱొకటి యేది కలదు? కాబట్టి

ఇట్టి బ్రహ్మవిద్యాదానమునకు, గీతాజ్ఞానవితరణమునకు జనులు దోహదమును కల్పించి తద్ద్వారా జనసామాన్యముయొక్క నైతిక, ఆధ్యాత్మిక విలువలను అభివృద్ధి పఱచవలెను. అట్లు కావించువారు జ్ఞానయజ్ఞము నాచరించిన మహాపుణ్యమును బడయుటయేకాక శ్రీకృష్ణపరమాత్మయొక్క అనుగ్రహమునకు పాత్రులున్ను కాగలరు★.

(3) పిన్నలలోను, పెద్దలలోను గీతాపోటీపరీక్షలు ఏర్పాటుచేసి గెలుపొందినవారికి ఆనాటి సాయంత్రము బహిరంగ సభలో బహుమతులు పంచిపెట్టవలెను. ఆ బహుమతులు కూడ గీతాసంబంధమైన పుస్తకములే యుండుట మంచిది. ఈ పరీక్షల మూలకముగ ఏదియోవిధముగ తీవ్రమైన అధ్యయనము సంభవించగలదు. ఉత్సాహమున్ను జనులలో పెంపొందగలదు.

(4) సామాన్యజనులకు గీతయందు దాసక్తి కలుగుటకుగాను గీతాబుఱ్ఱకథలు, గీతా హరికథలు ఇతరవిధములైన గీతాకాలక్షేపములు జరిపించుట శ్రేయస్కరము. గీతకు సంగీతము తోడైనప్పుడు అట్టి విద్యావినోదముల కలయికచే జనసామాన్యము గీత వైపునకు మిక్కుటముగ ఆకర్షింపబడగలదు. జనులకు గీతాపరిచయము గావించుట కిది యొక చక్కని మార్గము.

(5) గీతాసారమును, గీతావిశేషములను సంక్షేపముగ నచ్చొత్తించి కరపత్రములద్వారా జనులకు తెలియబఱచుటయు గావించవచ్చును. గీతాసాహిత్యమును విరివిగ వ్యాపింప జేయుట ఇక్కాలమున అత్యవసరము. శక్తికలవారు ఆ పవిత్ర దినమున గీతాగ్రంథములను ముముక్షువులకు, సాధుపుంగవులకు, భక్తులకు ఉచితముగ పంచిపెట్టవచ్చును.

(6) అనేకులు ఒకచోట చేరుటకు అవకాశమున్నచో అచ్చోట గీతాసంబంధమైన వివిధవ్యాఖ్యలతో గూడిన గ్రంథరాజములను, పద్య, గద్యముల సంపుటములను, గీతోపన్యాసరూపములైన పుస్తకములను, గీతాసంబంధ చిత్రములను, ఇంకను ఇతరమగు గీతాసాహిత్యమును జనుల సౌకర్యార్థము ప్రదర్శింపవచ్చును. (Gita-Exhibition).

(7) గీతాజయంతి మహాపుణ్యదివసమగుటవలన, ఆనాడు గీతాగ్రంథమును, శ్రీకృష్ణపరమాత్మ, శ్రీవేదవ్యాసమహర్షి, అర్జునుడు - వీరియొక్క పటములను చిత్రవిచిత్రముగ పుష్పాదులతో నలంకిరంచి రథముపైగాని, చిన్ని శకటముపైగాని ఉంచి మేళతాళములతో, భజనలతో పురముయొక్క ప్రధానవీధులగుండా ఊరేగింపు జరుపవలెను.

(8) ముఖ్యముగ గీతాజయంతి సందర్భమున జనులు కొన్ని పారమార్థిక ప్రతిజ్ఞలను గావించుకొనవలెను. ప్రతిదినము ఒక అధ్యాయమునుగాని, లేక కొన్ని శ్లోకములనుగాని తప్పక పారాయణము చేయుదునని ఆనాడు ప్రతిన గైకొనవలెను. తదను సారము ప్రతినిత్యము గీతాసంబంధ అనుష్ఠానమును తప్పక శీలించుచు, మరల ఒక సంవత్సరమునకు అనగా తిరిగి గీతాజయంతినాడు అధ్యాత్మపథమున తానెంతవఱకు ముందు కేగినది, గీత ఎంతవఱకు కంఠస్థముగ వచ్చినది, శీలమెంతవఱకు శుద్ధపడినది పరీక్షించుకొనవలెను. ఈ ప్రకారముగ నిర్మాణకార్యక్రమమును అమలుజరుపు లాగున చూడవలెను.

గీతాసంబంధమైన ఒకింతసేవయైనను సాక్షాద్భగవత్సేవయే యనియు, ఒకింత ప్రచారమైనను భగవత్కైంకర్యమేయనియు తలంచి ముముక్షువులు గీతాజ్ఞానవ్యాప్తికి, గీతా ప్రచారమునకు చేయూతనిచ్చుచు, తాము తరించి యితరులను గూడ తరింపజేయుటకై యత్నించుచు శ్రీకృష్ణపరమాత్మయొక్క అపారకృపకు పాత్రులగుదురుగాక!!

★ న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః
భవితా న చ మే తస్మా దన్యః ప్రియతరో భువి. (గీత 18-69)

# గీతామంగళహారతి

(ఆదితాళము)

**తెలుగులో :**

(1) పావన గీతా మాతా
జయ మంగళహారతి గైకొనుమా.

(2) భక్తజనావని బంధవిమోచని
భవభయహారిణి భవ్యదాయినీ ॥ పావన ॥

(3) సర్వలోక సంరక్షణి గీతా
సర్వదేవ సంసేవిత జననీ
శాంతివిధాయిని సత్యప్రదాయిని
సత్వగుణాలయ సచ్చరిత ॥ పావన ॥

(1) మంగళంబిదే చేకొనుమమ్మా ఓ భగవద్గీతా
మాతా, శ్రీభగవద్గీతా మాతా.

(2) సంగదూరులగు జ్ఞానుల హృదిలో వెలిగెడి జ్యోతివి నీవెకదా
పరమపావనుని ధ్యానముచేత విక్షేపము తొలగింపగదే మం

(3) పార్థుని నెపమున మురళీకృష్ణుడు కలిమానవులను పాలింప
ఆర్తినాశకరమగు నీ జ్ఞానజ్యోతిని జూపెను జగములకు మం

(4) మూడవస్థలకు సాక్షివి నీవు మూడు గుణంబులు లేకుండు
వాడవు నీవను అనుభవమొసగి పరమానందము నీయగదే మం

**సంస్కృతములో:**

(1) జయతు జయతు గీతా కృష్ణవక్త్రప్రభూతా
జయతు జయతు గీతా సర్వలోకైకమాతా
జయతు జయతు గీతా దైవసంపత్ప్రపూతా
జయతు జయతు గీతా విశ్వశాంతిప్రసూతా.

**తా॥** శ్రీకృష్ణుని ముఖారవిందమునుండి ఆవిర్భవించినదియు, సర్వజగజ్జననియు, భక్తిని, ముక్తిని గూడ నొసంగునదియు, ప్రపంచమున శాంతిని నెలకొల్పునదియు నగు గీతకు జయమగుగాక!

(2) మంగళం శ్రీకురుక్షేత్రరణక్షోణీ విహారిణే
పార్థసారథిరూపాయ గీతాచార్యాయ మంగళమ్.

**తా॥** కురుక్షేత్ర రణరంగమున విహరించువాడును, అర్జునుని రథసారథియు, గీతాచార్యులునగు శ్రీకృష్ణమూర్తికి మంగళమగుగాక!

**హిందీలో:–**

(1) **జయ భగవద్గీతే జయ భగవద్గీతే**
**హరి హియ కమల విహారిణి సున్దర సుపునీతే** ॥ జయ॥

(2) **కర్మ సుమర్మ ప్రకాశిని కామాసక్తిహరా**
**తత్త్వజ్ఞాన వికాశిని విద్యా బ్రహ్మపరా** ॥ జయ॥

(3) **నిశ్చల భక్తివిధాయిని నిర్మల మలహారీ**
**శరణరహస్యప్రదాయిని సబవిధి సుఖకారీ** ॥ జయ॥

(4) **రాగద్వేషవిదారిణి కారిణి మోదసదా**
**భవభయహారిణి తారిణి పరమానన్దప్రదా** ॥ జయ॥

(5) **ఆసుర భావ వినాశిని నాశిని తమరజనీ**
**దైవీ సద్గుణదాయిని హరిరసికాసజనీ** ॥ జయ॥

(6) **సమతా త్యాగ సిఖావని హరి ముఖకీ వాణీ**
**సకల శాస్త్రకీ స్వామిని శ్రుతియోంకీ రాణీ** ॥ జయ॥

(7) **దయాసుధా బరసావని మాతు! కృపాకీ జై**
**హరిపదప్రేమ దానకర అపనోకరలీ జై.** ॥ జయ॥

**తాత్పర్యము:–** విష్ణుభగవానుని హృదయకమలమునందు విహరించునదియు, సుందరమై, పరమ పవిత్రమై యొప్పునదియు, కర్మరహస్యమును బోధించునదియు, కామాసక్తిని రూపుమాపునదియు, తత్త్వజ్ఞానమును ప్రకాశింపజేయునదియు, ఉత్కృష్టబ్రహ్మవిద్యాస్వరూపిణియు, నిశ్చల భక్తిని గలుగ జేయునదియు, సంసారమాలిన్యమును తొలగించునదియు, 'శరణాగతి' రహస్యమును బోధించునదియు, సర్వవిధముల సుఖమును గలుగజేయునదియు, రాగద్వేషములను ఛేదించివైచునదియు, నిరంతరము పరమానందమును ప్రసాదించునదియు, సంసారభయమును పారద్రోలునదియు, జీవులనుతరింప జేయునదియు, అసురస్వభావమును నశింపజేయునదియు, రజస్తమస్సులను చీల్చి చెండాడునదియు, దైవీసంపదను గలుగజేయునదియు, భగవద్భక్తులకు అలంకరణభూతమైనదియు, సమత్వమును, త్యాగమును నేర్పునదియు, విష్ణుభగవానుని ముఖమునుండి ఉద్భవించినదియు, సమస్తశాస్త్రములకు మిన్నయు, శ్రుతులకు రాణివంటిదై యలరుచుండునదియు, దయారసామృతమును వర్షించునదియునగు భగవద్గీతకు జయమగుగాక! ఓ గీతాదేవీ! మాపై కృపకల్గియుండుము. హరిపాదపద్మయుగళమందు మాకు ప్రీతిని జనింపజేయు తల్లీ! మమ్ములను నీ దరిజేర్చుకొనుము!!

# గీతను పారాయణము చేయు పద్ధతి

గీతను పారాయణము చేయుటకు ముందుగా ఈ క్రింది శ్లోకముల నుచ్చరించుచు వందన మాచరింపవలయును.

ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

(1) **ఓం శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్**
**ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాన్తయే.**

(2) **ఓమ్ అఖండమండలాకారం వ్యాప్తం యేన చరాచరమ్**
**తత్పదం దర్శితం యేన తస్మై శ్రీగురవే నమః.**

(3) **ఓమ్కృష్ణం కమలపత్రాక్షం పుణ్యశ్రవణ కీర్తనమ్**
**వాసుదేవం జగద్యోనిం నౌమి నారాయణం హరిమ్.**

(4) **ఓమ్వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే**
**నమోవై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమోనమః.**

(5) **ఓమ్నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్**
**దేవీం సరస్వతీం వ్యాసం తతోజయ ముదీరయేత్.**

ఈ ప్రకారముగ వందన మాచరించిన పిదప భగవంతుడగు శ్రీకృష్ణమూర్తిని శ్రీ వేదవ్యాస మహర్షిని, గీతాగ్రంథమును భక్తిపూర్వకముగ పూజింపవలయును. పిమ్మట ఈ క్రిందివిధముగ పారాయణమును ఉపక్రమింపవలెను. (పారాయణము చేయునపుడు శ్లోకసంఖ్యగాని, అధ్యాయముల సంఖ్యగాని ప్రధానముగా గైకొనక, మనస్సు శ్రీకృష్ణపరమాత్మయందు, గీతాభావార్థమందు సంలగ్నమై యున్నదాయని విచారించుచుండ వలెను. కురుక్షేత్రరణరంగమున ఇరుసేనలమధ్య రథముపై గూర్చొని శ్రీకృష్ణపరమాత్మ దీన వదనుడై యున్న అర్జునునకు హితబోధగావించుచున్న దృశ్యమును హృదయఫలకమున చిత్రించుకొనవలయును. మఱియు తన్నర్జుననిగ భావించుకొని సాక్షాత్ శ్రీకృష్ణమూర్తి ఎదురుగనుండి తనకు బోధించుచున్నట్లు ఊహించవలెను. ఇవ్విధముగ పారాయణ సమయమున చిత్త మెంతెంత ఏకాగ్రముగ నుండునో, ఫలితమున్ను అంతంత అధికముగ గలుగుచుండును.) పారాయణముయొక్క వినియోగమును ఈ క్రింది తెలుపబడిన రీతిగ జరుపవలయును.

## వినియోగము:-

కుడిచేతి ఉంగరపు వ్రేలికి దర్భయొక్క పవిత్రి ధరించి చేతితో నీళ్ళు తీసికొని ఈ క్రింది వాక్యమును పలికి పళ్ళెములో వదలవలెను -

ఓమ్ అస్య శ్రీభగవద్గీతాశాస్త్ర మహామన్త్రస్య శ్రీ వేదవ్యాసో భగవాన్ ఋషిః, అనుష్టుప్ ఛందః, శ్రీకృష్ణపరమాత్మా దేవతా, అశోచ్యానన్వశోచస్త్వమితి బీజం, సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజేతిశక్తిః, అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచ ఇతి కీలకమ్, మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసీతి

కవచమ్, కిరీటినం గదినం చక్రహస్త మిత్యస్త్రమ్, అనాది మధ్యాన్త మనన్తవీర్య మితిధ్యానమ్, జ్ఞానయజ్ఞేన భగవతారాధనార్థే శ్రీకృష్ణపరమాత్మ ప్రీత్యర్థే గీతాపారాయణే జపే వినియోగః.

(పిమ్మట కరన్యాస, అంగన్యాసములను గావింపవలెను. ఆ పద్ధతి ఈ క్రింద తెలుపబడుచున్నది. తనయొక్క అవయవము లన్నియు పరమాత్మచైతన్యముచే, సత్తుచే పరిపూర్ణమై యున్నవని భావించుటయే 'న్యాస'ము యొక్క ఉద్దేశ్యము. దీనిచే జపించువాడు, లేక, పారాయణము సలుపువాడు మంత్రమయుడై, ఆ యా మంత్రదేవతలచే రక్షింపబడుచుండును. మఱియు అతని బాహ్యాంతరములు శుద్ధమగును. దివ్యబలము చేకూరును. సాధన నిర్విఘ్నముగ జరిగి పరమలాభదాయకమై యొప్పును.)

## కరన్యాసము:

నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః - ఇత్యంగుష్ఠాభ్యాం నమః
(ఈ మంత్రమును పఠించి రెండుచేతుల బొటనవ్రేళ్ళను రెండు చూపుడువ్రేళ్ళతో స్పృశింపవలెను.)

నచైనం క్లేదయన్త్యాపో నశోషయతి మారుతః - ఇతి తర్జనీభ్యాం నమః
(అనుచు రెండు చూపుడు వ్రేళ్ళను రెండు బొటన వ్రేళ్లతో స్పృశింపవలెను.)

అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవచ - ఇతి మధ్యమాభ్యాం నమః
(అనుచు రెండు బొటనవ్రేళ్ళతో రెండు నడిమివ్రేళ్ళను స్పృశింపవలెను.)

నిత్యః సర్వగతః స్థాణురచలోఽయం సనాతనః - ఇత్యనామికాభ్యాం నమః
(అనుచు రెండు బొటనవ్రేళ్ళతో రెండు ఉంగరపు వ్రేళ్ళను తాకవలెను.)

పశ్యమే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః - ఇతి కనిష్ఠికాభ్యాం నమః
(అనుచు రెండు బొటనవ్రేళ్ళతో రెండు చిటికినవ్రేళ్ళను స్పృశింపవలెను.)

నానావిధాని దివ్యాని నానా వర్ణాకృతీనిచ - ఇతి కరతలకరపృష్ఠాభ్యాం నమః
(అనుచు కుడిచేతిక్రింద ఎడమచేతిని, ఎడమచేతిక్రింద కుడిచేతిని ఉంచవలెను. అనగా అరచేతులు, వాని వెనుకవైపులు క్రమముగ తాకవలెను.)
(ఈ ప్రకారముగ కరన్యాసము గావించి అటుపిమ్మట అంగన్యాసమును చేయవలెను.)

## అంగన్యాసము:

నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః - ఇతి హృదయాయ నమః
(అని చెప్పి కుడిచేతితో హృదయమును తాకవలెను.)

నచైనం క్లేదయన్త్యాపో నశోషయతి మారుతః - ఇతి శిరసే స్వాహా
(అని చెప్పి శిరస్సును స్పృశించవలయును.)

అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవచ - ఇతి శిఖాయై వషట్
(అని పఠించి శిఖను తాకవలెను.)

నిత్యస్సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః - ఇతి కవచాయ హుమ్
(అని చెప్పి కుడిచేతితో ఎడమభుజమును, ఎడమచేతితో కుడిభుజమును స్పృశించవలెను.)

పశ్య మే పార్థ రూపాణి శతశోஉథ సహస్రశః - ఇతి నేత్రత్రయాయ వౌషట్
(అని పఠించి కుడిచేతితో నేత్రములను తాకవలెను.)

నానావిధాని దివ్యాని నానా వర్ణాకృతీనిచ - ఇత్యస్త్రాయ ఫట్

(అని పఠించి కుడిచేతిని శిరస్సుచుట్టును త్రిప్పి చూపుడు, మధ్యమవ్రేళ్ళతో ఎడమచేతిమీద చప్పట్లు కొట్టవలెను.)

(ఈ ప్రకారముగ న్యాసమొనర్చి అటుపిమ్మట మనస్సును నలుదిక్కులనుండి మరలించి ఏకాగ్రతతో భక్తిపూర్వకముగ ధ్యానించవలెను.)

## ధ్యానము:

(మహాభారత ధ్యానము):-

**పారాశర్యవచః సరోజ మమలం గీతార్థగన్ధోత్కటం**
**నానాఖ్యానక కేసరం హరికథా సమ్బోధనా బోధితమ్**
**లోకే సజ్జన షట్పదైరహరహః పేపీయమానం ముదా**
**భూయా ద్భారతపఙ్కజం కలిమల ప్రధ్వంసి నః శ్రేయసే.**

శ్రీ వేదవ్యాసుల వాక్కు అను సరోవరమునందు పుట్టినదియు, అతినిర్మలమైనదియు, గీతార్థమను మహాసుగంధముతో గూడినదియు, నానావిధ ఇతిహాసములను కేసరములు కలదియు, భగవత్కథోప దేశములను వికాసము గల్గియున్నదియు, లోకమున సజ్జనులను తుమ్మెదలచే నిరంతరము సంతోషముతో ఆస్వాదింపబడునదియు, కలిదోషములను పూర్తిగా నాశనము చేయునదియునగు మహాభారతమను పద్మము మనకు మంగళమును గలుగజేయుగాక!

## శ్రీకృష్ణధ్యానము:-

**ఓమ్ ప్రపన్న పారిజాతాయ తోత్రవేత్రైక పాణయే**
**జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృతదుహే నమః.**

శరణాగతులగు భక్తులకు కల్పవృక్షమువలె వాంఛితవస్తువుల నొసంగువారును, ఒకచేతియందు కొరడాను, మఱియొక చేతియందు జ్ఞానముద్రను ధరించినవారును, గీతయను అమృతమును పితుకువారునగు శ్రీకృష్ణమూర్తికి నమస్కారము.

**వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్**
**దేవకీపరమానందం కృష్ణం వన్దే జగద్గురుమ్.**

వసుదేవుని పుత్రుడును, దివ్యస్వరూపధారియు, కంసచాణూరులను సంహరించినవారును, దేవకికి పరమానందకారకులును, జగద్గురువునగు శ్రీకృష్ణునకు నమస్కరించుచున్నాను.

**భీష్మద్రోణ తటా జయద్రథజలా గాన్ధార నీలోత్పలా**
**శల్యగ్రాహవతీ కృపేణ వహనీ కర్ణేన వేలాకులా**

**అశ్వత్థామ వికర్ణ ఘోరమకరా దుర్యోధనావర్తినీ**
**సోత్తీర్ణా ఖలు పాణ్డవై రణనదీ కైవర్తకః కేశవః.**

భీష్మద్రోణులను తీరములు కలదియు, జయద్రథుడను జలముతో గూడినదియు, కౌరవులను నల్లకలువలు కలదియు, శల్యుడను భయంకర మత్స్యము గల్గియున్నదియు, కృపాచార్యుడను ప్రవాహముతో నొప్పునదియు, కర్ణుడను తరంగములచే వ్యాప్తమైనదియు, అశ్వత్థామ, వికర్ణులను భయంకరములైన మొసళ్ళు కలదియు, దురోధనుడను సుడిగుండముతో గూడినదియునగు యుద్ధమను మహానదిని పాండవులు శ్రీకృష్ణుడను నావికుని సహాయమున దాటగలిగిరి.

**మూకం కరోతి వాచాలం పఙ్గుం లఙ్ఘయతే గిరిమ్**
**యత్కృపా తమహం వన్దే పరమానన్ద మాధవమ్.**

ఎవరి కృపాకటాక్షముచే మూగవాడు గొప్పవాచాలుడు కాగలడో, కుంటివాడు పర్వతమును దాటగలడో, అట్టి పరమానందస్వరూపులగు శ్రీకృష్ణమూర్తికి నమస్కారము.

**యం బ్రహ్మా వరుణేన్ద్ర రుద్రమరుతః స్తున్వన్తి దివ్యైఃస్తవైః**
**వేదైస్సాంగ పద క్రమోపనిషదై ర్గాయన్తి యం సామగాః**
**ధ్యానావస్థిత తద్గతేన మనసా పశ్యన్తి యం యోగినో**
**యస్యాన్తం న విదుః సురాసురగణా దేవాయ తస్మై నమః.**

బ్రహ్మదేవుడు, వరుణుడు, ఇంద్రుడు, రుద్రుడు, వాయువు మున్నగు దేవతలు దివ్యస్తోత్రములచే ఎవరిని స్తుతించుచున్నారో, సామగానము చేయువారు అంగ, పద, క్రమ, ఉపనిషత్తులతో గూడ వేదములచే ఎవరిని గూర్చి గానము చేయుచున్నారో, యోగులు ధ్యాననిష్ఠులై ఏకాగ్రచిత్తముతో ఎవరిని దర్శించుచున్నారో, ఎవరియొక్క ఆద్యంతములను దేవతలుగాని, అసురులుగాని తెలిసికొనజాలరో అట్టి పరమాత్మకు నమస్కారము.

## శ్రీవ్యాసధ్యానము:–

**ఓమ్ నమోఽస్తుతే వ్యాస విశాలబుద్ధే**
**ఫుల్లారవిన్దాయత పత్రనేత్ర**
**యేన త్వయా భారత తైలపూర్ణః**
**ప్రజ్వాలితో జ్ఞానమయః ప్రదీపః.**

విశాలబుద్ధి కలవారును, వికసించిన కమలపత్రములవంటి నేత్రములు గల్గియున్నవారును, మహాభారతమను తైలముచే పరిపూర్ణమై యున్నట్టి గీతాజ్ఞానమను జ్యోతిని లెస్సగ వెలిగించినవారు (తద్ద్వారా జనుల హృదయమందలి అజ్ఞానాంధకారమును బోగొట్టినవారు) నగు వ్యాసభగవానునకు నమస్కారము.

## శ్రీ గీతాధ్యానము:–

**పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయమ్**
**వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యే మహాభారతమ్**

**అద్వైతామృతవర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయినీ**
**మమ్బత్వామనుసందధామి భగవద్గీతే భవద్వేషిణీమ్.**

స్వయముగ భగవంతుడగు నారాయణునిచే అర్జునునకు బోధింపబడినట్టియు, ప్రాచీన మహర్షి యగు వేదవ్యాసమునీంద్రునిచే మహాభారతమధ్యమున కూర్చబడినట్టియు, అద్వైతజ్ఞానమను అమృతమును వర్షించునట్టియు, పదునెనిమిది అధ్యాయములతో గూడినట్టియు, సంసారబంధముల నుండి విముక్తిని కలిగించునట్టియు ఓ తల్లీ! భగవద్గీతా! మిమ్ము నేను ధ్యానించుచున్నాను.

**గీతాకల్పతరుం భజే భగవతా కృష్ణేన సంరోపితమ్**
**వేదవ్యాస వివర్ధితం శ్రుతిశిరోబీజం ప్రబోధాఙ్కురమ్**
**నానాశాస్త్రరహస్యశాఖ మరతిక్షాన్తిప్రవాలాఙ్కితమ్**
**కృష్ణాఙ్ఘ్రిద్వయ భక్తిపుష్ప సురభిం మోక్షప్రదం జ్ఞానినామ్.**

భగవంతుడగు శ్రీకృష్ణునిచే నాటబడినదియు, శ్రీ వేదవ్యాస మునీంద్రునిచే వృద్ధినొందింపబడినదియు, ఉపనిషత్తులే విత్తనముగాగలదియు, ప్రబోధమను అంకురముతో నొప్పునదియు, సకల శాస్త్రరహస్యములను కొమ్మలుగలదియు, అనాసక్తి, క్షమయను చిగుళ్ళతో గూడినదియు, శ్రీకృష్ణభగవానుని పాదపద్మముల యెడల భక్తియను సుగంధముచే శోభించు నదియు, జ్ఞానులకు మోక్షము నొసగునదియునగు గీతా కల్ప వృక్షమును నేను సేవించుచున్నాను.

**సంసార సాగరం ఘోరం తర్తుమిచ్ఛతి యో నరః**
**గీతానావం సమాసాద్య పారం యాతి సుఖేన సః.**

భయంకరమగు సంసార సముద్రమును దాట నిచ్ఛగించువాడు భగవద్గీతయను నావను పొందినచో సులభముగ నద్దానిని దాటివేయగలడు.

**సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాల నన్దనః**
**పార్థో వత్సః సుధీ ర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్.**

ఉపనిషత్తులన్నియు గోవులు. గోపాలనందనుడగు శ్రీకృష్ణ పరమాత్మ పాలు పితుకువాడు. అర్జునుడు దూడ. మహత్తరమగు గీతామృతమే పాలు. సద్బుద్ధి కలవారే దానిని త్రాగువారు.

(ఈ ప్రకారముగ శ్రీకృష్ణపరమాత్మను, శ్రీ వేదవ్యాసులను, శ్రీగీతామాతను, శ్రీమహాభారతమును ధ్యానించి, ఆ పిదప గీతాపారాయణమును ప్రారంభించవలెను. ప్రతిదినము ఒక్క అధ్యాయమును పూర్తిగ పారాయణము చేయుట మంచిది. పారాయణము పూర్తి అయిన పిదప గీతామాహాత్మ్యమును చదువవలెను. ఇది శిష్టాచారము. ఇరువది మూడు శ్లోకములతో గూడిన (వరహపురాణాంతర్గతమగు) గీతామాహాత్మ్యము ఎక్కువగ వాడుకలో కలదు. దానిని ఈ క్రింద పొందుపఱచు చున్నాము. పారాయణానంతరము అందు రెండు శ్లోకములు చదువచ్చును.)

# గీతామాహాత్మ్యము

1. ధరోవాచ :-

**భగవన్ పరమేశాన భక్తి రవ్యభిచారిణీ**
**ప్రారబ్ధం భుజ్యమానస్య కథం భవతి హే ప్రభో.**

భూదేవి విష్ణుభగవానుని గూర్చి యిట్లు ప్రశ్నించెను - . ఓ భగవానుడా! పరమేశ్వరా! ప్రభూ! ప్రారబ్ధము అనుభవించువానికి అచంచలమైన భక్తి ఎట్లు కలుగగలదు?

2. విష్ణురువాచ :-

**ప్రారబ్ధం భుజ్యమనో ఽపి గీతాభ్యాసరతస్సదా**
**స ముక్త స్స సుఖీ లోకే కర్మణా నోపలిప్యతే.**

విష్ణువు - ఓ భూదేవీ! ప్రారబ్ధమనుభవించుచున్నను ఎవడు నిరంతరము గీతాభ్యాసమందు నిరతుడైయుండునో అట్టివాడు ముక్తుడై కర్మలచే నంటబడక ఈ ప్రపంచమున సుఖముగ నుండును.

3. **మహాపాపాదిపాపాని గీతాధ్యానం కరోతి చేత్**
**క్వచిత్స్పర్శం న కుర్వన్తి నలినీదల మంభసా.**

తామరాకును నీరంటనట్లు గీతాధ్యానము చేయువానిని మహాపాపములు కూడ కొంచెమైనను అంటకుండును.

4. **గీతాయాః పుస్తకం యత్ర యత్ర పాఠః ప్రవర్తతే**
**తత్ర సర్వాణి తీర్థాని ప్రయాగాదీని తత్రవై.**

ఎచట గీతాగ్రంథముండునో, మఱియు ఎచట గీత పారాయణమొనర్పబడుచుండునో, అచట ప్రయాగ మొదలగు సమస్త తీర్థములున్ను ఉండును.

5. **సర్వే దేవాశ్చ ఋషయో యోగినః పన్నగాశ్చ యే**
**గోపాలా గోపికా వాఽపి నారదోద్ధవ పార్షదైః**
**సహాయో జాయతే శీఘ్రం యత్ర గీతాప్రవర్తతే.**

ఎచట గీతాపారాయణము జరుగుచుండునో, అచ్చోటికి సమస్తదేవతలు, ఋషులు, యోగులు, నాగులు, గోపాలురు, గోపికలు, భగవత్పార్శ్వవర్తులగు నారద, ఉద్ధవాదులు వచ్చి శీఘ్రముగ సహాయ మొనర్తురు.

6. యత్రగీతావిచారశ్చ పఠనం పాఠనం శ్రుతమ్
తత్రాహం నిశ్చితం పృథ్వి నివసామి సదైవ హి.

ఓ భూదేవీ! ఎచట గీతను గూర్చిన విచారణ, పఠనము, బోధనము, శ్రవణము జరుగు చుండునో, అచట నే నెల్లపుడును తప్పక నివసించుదును.

7. గీతాశ్రయోఽహం తిష్ఠామి గీతా మే చోత్తమం గృహమ్
గీతాజ్ఞాన ముపాశ్రిత్య త్రీ న్లోకాన్పాలయామ్యహమ్

నేను గీత నాశ్రయించుకొనియున్నాను. గీతయే నాకుత్తమమగు నివాసమందిరము, మఱియు గీతాజ్ఞానము నాశ్రయించియే మూడులోకములను నేను పాలించుచున్నాను.

8. గీతా మే పరమా విద్యా బ్రహ్మరూపా న సంశయః
అర్ధమాత్రాక్షరా నిత్యా స్వనిర్వాచ్యపదాత్మికా.

గీత నా యొక్క పరమవిద్య. అది బ్రహ్మస్వరూపము. ఇట సంశయమేమియును లేదు. మఱియు నయ్యది (ప్రణవముయొక్క నాల్గవ పాదమగు) అర్ధమాత్రాస్వరూపము. అది నాశరహితమైనది. నిత్యమైనది, అనిర్వాచ్యమైనది.

9. చిదానన్దేన కృష్ణేన ప్రోక్తా స్వముఖతోఽర్జునమ్
వేదత్రయీ పరానన్దా తత్త్వార్థజ్ఞానమంజసా★.

సచ్చిదానందస్వరూపులగు శ్రీ కృష్ణపరమాత్మచే ఈ గీత స్వయముగ అర్జునునకు చెప్పబడినది. ఇది మూడు వేదముల సారము. పరమానందస్వరూపము. తన్నాశ్రయించినవారికిది శీఘ్రముగ తత్త్వజ్ఞానమును కలుగుజేయును.

10. యోఽష్టాదశ జపేన్నిత్యం నరో నిశ్చల మానసః
జ్ఞానసిద్ధిం స లభతే తతో యాతి పరం పదమ్.

ఏ నరుడు నిశ్చలచిత్తుడై గీత పదునెనిమిది అధ్యాయములను నిత్యము పారాయణము సలుపుచుండునో, అతడు జ్ఞానసిద్ధినిబొంది తద్ద్వారా పరమాత్మపదమును (మోక్షమును) బడయగల్గును.

11. పాఠేఽసమర్థ స్సంపూర్ణే తదర్ధం పాఠ మాచరేత్
తదా గోదానజం పుణ్యం లభతే నాత్ర సంశయః.

గీతను మొత్తము చదువలేనివారు అందలి అర్ధభాగమైనను పఠింపవలెను. దానిచే వారికి గోదానమువలన గలుగు పుణ్యము లభించును. ఇవ్విషయమున సందేహము లేదు.

★ తత్త్వార్థజ్ఞానసంయుతా – అని పాఠాంతరము.

12. త్రిభాగం పఠమానస్తు గంగాస్నానఫలం లభేత్
షడంశం జపమానస్తు సోమయాగఫలం లభేత్.

గీతయొక్క మూడవభాగము (1/3) (ఆఱు అధ్యాయములు) పారాయణ మొనర్చువారికి గంగాస్నానము వలన కలుగు ఫలము చేకూరును. ఆఱవభాగము (1/6) (మూడధ్యాయములు) పఠించువారికి సోమయాగఫలము లభించును.

13. ఏకాధ్యాయం తు యో నిత్యం పఠతే భక్తిసంయుతః
రుద్రలోక మవాప్నోతి గణో భూత్వా వసే చ్చిరమ్.

ఎవడు గీతయందలి ఒక్క అధ్యాయమును భక్తితో గూడి నిత్యము పఠించుచుండునో, అతడు రుద్రలోకమును పొంది అచ్చట రుద్రగణములలో నొకడై చిరకాలము వసించును.

14. అధ్యాయశ్లోకపాదం వా నిత్యం యః పఠతే నరః
స యాతి నరతాం యావన్మనుకాలం వసున్ధరే.

ఓ భూదేవీ ! ఎవడు ఒక అధ్యాయమందలి నాల్గవభాగమును నిత్యము పారాయణము చేయునో, అతడు ఒక మన్వంతరకాలము (ఉత్కృష్టమగు) మానవజన్మను బొందును.

15. గీతాయాః శ్లోకదశకం సప్తపంచ చతుష్టయమ్
ద్వౌత్రీ నేకం తదర్ధం వా శ్లోకానాం యః పఠేన్నరః.

16. చన్ద్రలోక మవాప్నోతి వర్షాణా మయుతం ధ్రువమ్
గీతాపాఠ సమాయుక్తో మృతో మానుషతాం వ్రజేత్.

గీతయందలి పదిశ్లోకములను గాని, లేక ఏడు కాని, ఐదు కాని, నాలుగు కాని, మూడు కాని, రెండు కాని, ఒకటి కాని, లేక కనీసము అర్ధశ్లోకమును గాని, ఎవడు పఠించునో అతడు చంద్రలోకమును బొంది అచట పదివేల సంవత్సరములు సుఖముగ నుండును. ఇందు సంశయము లేదు. మఱియు గీతను పఠించుచు ఎవడు మరణించునో, అతడు ఉత్తమమగు మానవజన్మమును బడయగలడు.

17. గీతాభ్యాసం పునః కృత్వా లభతే ముక్తి ముత్తమామ్
గీతేత్యుచ్చార సంయుక్తో మ్రియమాణో గతిం లభేత్.

అట్లాతడు మానవుడై జన్మించి గీతాభ్యాసమును మరల మరల గావించుచు ఉత్తమమగు మోక్షమును పొందును. 'గీతా, గీతా' అని ఉచ్చరించుచు ప్రాణములను విడుచువాడు సద్గతిని బడయును.

18. గీతార్థశ్రవణాసక్తో మహాపాపయుతోఽపి వా
వైకుంఠం సమవాప్నోతి విష్ణునా సహమోదతే.

మహాపాపాత్ముడైనను గీతార్థమును వినుటయం దాసక్తి కలవాడైనచో వైకుంఠమును బొంది అచట విష్ణువుతోసహా ఆనంద మనుభవించుచుండును.

**19. గీతార్థం ధ్యాయతే నిత్యం కృత్వా కర్మాణి భూరిశః**
**జీవన్ముక్త స్సవిజ్ఞేయో దేహాన్తే పరమం పదమ్.**

ఎవడు గీతార్థమును నిత్యము చింతనజేయుచుండునో, అతడు అనేక కర్మల నాచరించినను జీవన్ముక్తుడేయని చెప్పబడెను. మఱియు దేహపతనానంతర మతడు పరమాత్మపదమును (విదేహకైవల్యమును) బొందును.

**20. గీతామాశ్రిత్య బహవో భూభుజో జనకాదయః**
**నిర్ధూత కల్మషా లోకే గీతా యాతాః పరం పదమ్.**

ఈ ప్రపంచమున గీతను ఆశ్రయించి జనకాదులగు రాజు లనేకులు పాపరహితులై పరమాత్మపదమును బొందగల్గిరి.

**21. గీతాయాః పఠనం కృత్వా మాహాత్మ్యం నైవ యః పఠేత్**
**వృథా పాఠో భవేత్తస్య శ్రమ ఏవ హ్యుదాహృతః.**

గీతను పఠించి ఆ పిదప మాహాత్మ్యము నెవడు పఠింపకుండునో, అతని పారాయణము (తగిన ఫలమునివ్వక) వ్యర్థమేయగును. కావున అట్టివాని గీతాపఠనము శ్రమ మాత్రమే యని చెప్పబడినది★.

**22. ఏతన్మాహాత్మ్యసంయుక్తం గీతాభ్యాసం కరోతి యః**
**స తత్ఫల మవాప్నోతి దుర్లభాం గతి మాప్నుయాత్.**

ఈ మాహాత్మ్యముతోబాటు గీతాపారాయణముచేయువాడు పైన తెలుపబడిన ఫలమును బొంది దుర్లభమగు సద్గతిని (మోక్షమును) బడయగలడు.

**23. సూత ఉవాచ :–**

**మాహాత్మ్య మేతద్గీతాయా మయా ప్రోక్తం సనాతనమ్**
**గీతాన్తే చ పఠేద్యస్తు యదుక్తం తత్ఫలం లభేత్.**

సూతుడు చెప్పెను – ఓ శౌనకాది మహర్షులారా ! ఈ ప్రకారముగ సనాతనమైనట్టి గీతామాహాత్మ్యమును, నేను మీకు దెలిపితిని. ఇద్దానిని గీతాపారాయణానంతర మెవడు పఠించునో అతడు పైన దెలిపిన ఫలమును బొందును.

ఇతి శ్రీ వరాహపురాణే శ్రీ గీతామాహాత్మ్యం సంపూర్ణమ్.

ఇట్లు శ్రీ వరాహ పురాణమందలి శ్రీ గీతామహాత్మ్యము సమాప్తము.

ఓమ్

★ గ్రంథము యొక్క మహిమను తెలుసుకొననిచో, గ్రంథము యెడల శ్రద్ధ కలుగదని భావము.

ఓం

# ఉపోద్ఘాతము

విశ్వవాఙ్మయమున గీతయంతటి మహత్తర గ్రంథరాజము మఱియొకటి లేనే లేదు. తక్కిన సాహిత్యమంతయు మానవనిర్మితము. గీత భగవన్నిర్మితము. మాయాంతర్గతుడగు మానవునిచే నిర్మితమైన వస్తువెచట! మాయాతీతుడగు భగవంతునిచే సృజింపబడిన పదార్థమెచట! బోధించినది అవతారమూర్తి; వినినది అధికారమూర్తి. బోధించినది పరమాత్ముడు; వినినది మహాత్ముడు★ బోధించినది పురుషోత్తముడు; వినినది నరోత్తముడు.@ ఈప్రకారముగ అద్భుత పటిమగల గురుశిష్యుల సమ్మేళనమునం దావిర్భవించిన అమరవాణియే గీత. నరనారాయణుల తపఃఫలితమే గీత. శ్రీకృష్ణార్జునుల దివ్యసంసర్గజనిత సంభాషణమే గీత. వారిరువురి అట్టి యలౌకిక సంవాదమును జగద్విఖ్యాత రచయితయైన శ్రీ వేదవ్యాస మునీంద్రుడు ఛందోబద్ధ మొనర్చి అపార కరుణతో లోకమునకు ప్రసాదించెను. ఇవ్విదముగ మహనీయులగు ఆ ముప్వురు తపస్సంపన్నుల కృపావిశేషమువలన గీత ప్రపంచమున ఆవిర్భవించి సర్వజనులకు నిశ్శ్రేయస్కరమై వెలయుచున్నది. ఎవరి గీత చక్కగ నుండునో వా రట్టి గీత నాశ్రయించి నిస్సంశయముగ తరించిపోగలరు. వాస్తవముగ జీవుల పుణ్యము ఫలించునపుడు మాత్రమే గీతవంటి అత్యద్భుత పారలౌకిక గ్రంథరాజములు జనుల పాలిట వచ్చి చేరుచుండును. గీతయొక్క అనన్యసామాన్య ప్రతిభను, అఖండ శక్తిసామర్థ్యమును, అపారమహిమను పరికించినచో ఎవరికైనను దానిపై పరమపూజ్యభావము, భక్తిశ్రద్ధలు ఉదయించక మానవు. కావున అట్టి లోకోత్తర దివ్యవాఙ్మయముయొక్క పుట్టుపూర్వోత్తరములను, స్వరూపస్వభావములను, మహిమావిశేషములను విచారించుట కర్తవ్యము.

## రెండు గానములు

శ్రీకృష్ణపరమాత్మ తన జీవితకాలమున రెండు గానములను చేసెను. ఒకటి మురళీగానము, రెండవది గీతాగానము. మురళీగానమాధుర్యమును గోపికలు పూర్తిగ ఆస్వాదించిరి. తదితరులున్ను ఆ కాలమున తద్గాన రసామృతమును ఒకింత పానము చేసి ధన్యులైరి. ఆ మురళీగాన మెట్టిదో మనకు తెలియదు. దానిని వినుభాగ్యమున్ను మనకు కలుగలేదు. ఐననేమి? దానిని మించిన రెండవ గానము మనవంతునకు వచ్చిపడినది; అదియే గీతాగానము. పాడినవారికి, పాటకు భేదము లేదు. అట్లే శ్రీకృష్ణునకు గీతకు భేదము లేదు. వారిరువురికిని అవినాభావసంబంధము కలదు. శ్రీకృష్ణుని నిశ్వాసమే గీత. వెయ్యేల, భగవంతుని హృదయమే గీతయని నిస్సంశయముగ చెప్పవచ్చును. భగవన్ముఖారవిందసంజనితమగు అట్టి గీతాగాన స్రవంతియందు జలకమాడువారి పాపపుంజములు పటాపంచలైపోవును. ముక్తి కరతలామలకమగును. కావున భగవానుని యా రెండవ గానమగు గీతను శ్రవణముచేయుటకు నోచుకొనిన భూత, భవిష్యద్వర్తమానకాలిక జీవరాసులయొక్క అహోభాగ్య మేమని చెప్పవచ్చును!

★ పార్థస్య చ మహాత్మనః (గీత 18-14)

@ నరంచైవ నరోత్తమమ్ (భారతము)

## సర్వజనోపయోగమగు అద్భుత లీల

శ్రీ కృష్ణమూర్తి తన జీవితకాలములో లెక్కలేనన్ని అద్భుత సంఘటనలను, ఆశ్చర్యకరములగు లీలలను గావించెను. వాని నన్నింటిని మనము చూడలేదు. అనుభవింపలేదు. అకాలపువారికే అవి యన్నియు ఉపయోగపడినవి. కాని యశోదాతనయుని వలన సంభవించిన గీతారూప సంఘటన యొక్కటిమాత్రము వారికి, మనకు అందరికిని వరుసబెట్టి లాభించినది. భగవానుడు కావించిన ఈ గీతోపదేశరూప మహాలీల ఒక కాలమునకు గాని, ఒక దేశమునకుగాని, ఒక మతమునకు గాని, ఒక జాతికిగాని సంబంధించినదికాదు. అది సార్వజనీన సార్వభౌమ సార్వకాలీన సత్యశివసుందరభగవద్వాణి. కనుకనే శ్రీకృష్ణుని గూర్చిన ప్రార్థనలో ఇట్లు చెప్పబడినది -

**సారథ్య మర్జునస్యాదౌ కుర్వన్ గీతామృతం దదౌ**
**లోకత్రయోపకారాయ తస్మై కృష్ణాత్మనే నమః.**

"ఏ మహనీయుడు పూర్వము అర్జునునకు సారథియై వర్తించుచు ముల్లోకము లందలి జనులయొక్క ఉపకారార్థము గీతామృతము నొసంగెనో అట్టి శ్రీకృష్ణపరమాత్మకు నమస్కారము."

## సర్వశాస్త్రసారము

గీత యొక్క మహిమను గూర్చి యింకను లోతుగ విచారించెదము - హిందూధర్మసాహిత్యము అతివ్యాపకమైనది. ఎన్నియో శాస్త్రములు, ఎన్నియో గ్రంథములు, ఎన్నియో సిద్ధాంతములు ! వీని నన్నింటిని చూచి మనుజుడు నిర్ఘాంతపోయి దేనిని అనుసరించవలెనో, దేనిని త్యజించవలెనో దిక్కుతోచక ఈ ప్రశ్నలను వేయుచున్నాడు -

'ఈ అపారశాస్త్రపారావారమును మథించి వెలికిదీసిన సారభూతమైన గ్రంథమేదైన కలదా? సర్వశాస్త్ర సిద్ధాంత సమన్వయ రూపమగు గ్రంథమేదైన హైందవ సాహిత్యమున లభించునా? హిందూధర్మములన్నింటిని - కాదు కాదు, సర్వమత సంప్రదాయతత్త్వములను పరిపోషించునది, వానికి ప్రాతినిధ్యము నహించునది యగు ఏకైక ప్రామాణిక గ్రంథ మేదైన కలదా?'- వాని ఈ ప్రశ్నలన్నింటికిని తగు ప్రత్యుత్తరము కలదు. అట్టి ప్రామాణిక గ్రంథము భగవద్గీతయే అని. అధ్యాత్మ జ్ఞానమునకు, సమస్త ధర్మములకు నిఘంటువు భగవద్గీత. ఏలననగా, హిదూమతమునందలివే కాక సమస్త ఇతర మతములలోని ప్రధానసూత్రము లన్నియును, ధర్మములన్నియును దీనియందు క్రోడీకరింపబడినవి. వివిధ మతసిద్ధాంతరూపశాఖోపశాఖలతో విరాజిల్లు ధర్మవృక్షమే గీత. సర్వధర్మసమన్వయక్షేత్రమే గీత. సాంఖ్య, యోగ, న్యాయ, వైశేషిక, మీమాంస, వేదాంతములయొక్కయు, శాక్త, శైవ, గాణాపత్య, వైష్ణవాది మతముల యొక్కయు; వెయ్యేల, ప్రపంచమునగల సమస్తసంప్రదాయముల యొక్కయు చక్కటి సమన్వయము గీతయందు కానుపించుచున్నది. కనుకనే దీనిని విశ్వమత గ్రంథము (Universal Scripture, Universal Gospel, Bible of Humanity) అని ఏకకంఠముతో సర్వులును పేర్కొనిరి. పూర్వము వల్లభాచార్యులవారిని ఒకానొక భక్తు డిట్లు ప్రశ్నించెను. 'అయ్యా ! అన్ని శాస్త్రములలో ఏ శాస్త్రము గొప్పది?' అని. వారు వెంటనే ఈ క్రింది ప్రత్యుత్తర మిచ్చిరి - "**ఏకం శాస్త్రం దేవకీపుత్రగీతం**" - అని. అనగా దేవకీసుతుడగు శ్రీకృష్ణమూర్తి గానముచేసిన గీతాశాస్త్ర మొకటియే అన్నిటికంటె మిన్న యని భావము. అట్లే, ఏపాట పాడుకొనవలెను? అని యొకరు శ్రీ శంకరాచార్యులవారిని ప్రశ్నింప, '**గేయం గీతానామ సహస్రం**' అని వారానతిచ్చిరి. అనగా గీతను,

విష్ణుసహస్రనామములను పాడుకొనుచుం డవలెను అని అర్థము. అత్యంతమేధాసంపన్నులును, సర్వశాస్త్రవిశారదులును, అధ్యాత్మ విద్యాకోవిదులును నగు వారిరువురు నిట్లేల వచింపవలయును? గీతలో అట్టి అమోఘశక్తి యున్నది కనుకనే. అట్లే '**సర్వశాస్త్రమయీ గీతా**' గీత సర్వశాస్త్ర పరిపూర్ణమైనది – అని స్కాందపురాణమున్ను,

"**గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైః శాస్త్రవిస్తరైః**" గీతను లెస్సగ గానమొనర్పవలెను. ఇతరములగు పెక్కు శాస్త్రములతో నేమి ప్రయోజనము అని మహాభారతమున్ను గీతను వేనోళ్ల శ్లాఘించినవి. ఆనాడు ద్వాపరయుగాంతమున రణరంగమున భగవానునిచే నుపదేశింపబడి యిప్పటికి ఐదువేల సంవత్సరములు దాటినను గీత చెక్కుచెదరకుండ, నదీప్రవాహమువలె నిత్యనూతనముగ భాసిల్లుచున్నది. గీతయందలి గంభీరభావములను, సర్వమత సమన్వయధోరణిని, అగాధజ్ఞానమును, అంతులేని అర్థపరంపరను పరికించినపుడు ఇది మానవనిర్మితముకాదని స్పష్టముగ తోపకమానదు. సృష్ట్యారంభమునుండి నేటి వఱకు ఇటువంటి లోకోత్తర సర్వోపయోగగ్రంథము వెలువడ లేదనుట అతిశయోక్తి కానేరదు. కనుకనే ఏ మహనీయుడు జన్మించినను ముందు గీతకు జోహారులిర్పించి అద్దానికి తన భావానుగుణమగు వ్యాఖ్య నొకదానిని వ్రాసి గీతాసేవయందు ఒకింత పాలుపంచుకొని 'ధన్యోఽస్మి' యను కొనుచుండెను. భారతదేశ ధార్మిక జీవనముపై గీతయొక్క ప్రభావమెట్టిదో ఇవ్విషయము స్పష్టముగ ఋజువుచేయుచున్నది.

## వివిధ గీతలు – అందు భగవద్గీతయొక్క స్థానము

ప్రపంచమున ఎన్నియో గీతలు కలవు. అష్టావక్రగీత, అవధూతగీత, ఋభుగీత, బ్రహ్మగీత, వసిష్ఠగీత, గణేశగీత, హనుమద్గీత, పరాశరగీత, హారీతగీత. శివగీత, హంసగీత, భిక్షుగీత, కపిలగీత, దేవీగీత మున్నగు అగణితములైన గీతలు విశ్వసాహిత్యమున వెలయుచున్నను భగవద్గీత యొక్కదానికే గీత యను నామము చక్కగ రూఢి పడినది. గీతయొక్క సులభశైలి, విషయగాంభీర్యము, సమన్వయదృష్టి, సర్వులకు ఆచరణయోగ్యమగు అనుష్ఠానపద్ధతులు, మున్నగునవి దాని వ్యాపకత్వమునకు, సర్వజనసమాదరణత్వము నకు హేతుభూతములైనవి. 'భగవద్గీత' అను నామధేయమునందే ఒక విధమైన విశాలభావము ద్యోతకమగుచున్నది. ఏలననగా కృష్ణుడు బోధించినది కృష్ణగీతయని పేర్కొనబడవలసియుండగా భగవద్గీతయని చలామణియగుట దాని యొక్క జాతిమతవ్యక్త్యతీతమగు స్థాయిని సూచించుచున్నది. కనుకనే మాక్స్‌ముల్లర్, కార్లైల్, ఎమర్సన్, ఎడ్విన్ ఆర్నాల్డ్, అనిబిసెంటు మొదలగు పాశ్చాత్యులనేకులు గీతాప్రాభవమున కచ్చెరువొంది, దాని విషయగాంభీర్యముచే నాకర్షితులై, గీతోపదిష్టబోధలచే తమ తమ జీవితములను సంస్కరించుకొని గీతను లెస్సగ ప్రచారమొనర్చిరి. అందు ఎడ్విన్ ఆర్నాల్డ్ అను మహనీయుడు 'దివ్యగీతము' (The Song Celestial) అను పేరుతో గీత పదునెనిమిది అధ్యాయములను ఆంగ్లభాషయందు పద్యరూపమున వ్రాసెను. హూణభాషలో అది చాల విఖ్యాతమగు గ్రంథము. ఇంతియే కాదు. గీతయొక్క ఔన్నత్యమును గూర్చి ఆతడు పలికిన ఈ క్రింది పలుకులు గీత యెడల జనుల యొక్క శ్రద్ధాభక్తులను ఇనుమడింపజేయుచున్నవి. "భారతదేశము యొక్క ఈ సర్వప్రియకావ్యమయదార్శనికగ్రంథము లేనిచో ఆంగ్లసాహిత్యము అపూర్ణముగనే యుండును." ఆంగ్లముననే కాక ప్రపంచమున గల ప్రముఖ భాష లన్నిటియందును గీత యనువదింపబడియున్నందున, కోట్లకొలది జనులు గీతాజ్ఞానరసామృతమును పానముచేసి తమ తమ జీవితములను శాంతిమయములుగ నొనర్చుకొనుచున్నారు.

## గీతదిమాతృహృదయము

వాస్తవముగ గీత ఒకానొక గ్రంథము కాదు. సజీవ చైతన్యమూర్తి. శ్రీకృష్ణుడు ఈ లోకమును వీడి చనునపుడు ఆ నవచేతన విలసిత దివ్యమూర్తిని మన కనుగ్రహించి వెడలెను★. గీతారూపమగు ఆ వాఙ్మయమూర్తి మనకెల్లరకును జ్ఞానదానము చేయుచు భవదుఃఖములను బాపుచు తల్లివలె ఊరడించుచున్నది. గాంధిమహాత్ముడు పలికిన ఈ క్రింది వాక్యములు స్మరణీయములై యున్నవి-

I lost my earthly mother who gave me birth long ago but this eternal mother (Gita) has Completely filled her place by my side ever since. when I am in difficulty or distress,I seek refuge in her bosom.

"నా తల్లి చాలకాలము క్రిందటనే చనిపోయినది. కాని గీతయను తల్లి ఆ స్థానమును ఆక్రమించుకొని అప్పటినుండియు నా ప్రక్కనే యుండి నన్ను కాపాడుచున్నది. కష్టములు సంప్రాప్తించునపుడు నే నాపె యొడిలో తలదాచుకొందును." గాంధిమహాత్మునివలెనే ఎందరో గీతామాతను సమాశ్రయించి తమ తమ కష్టములను బాపుకొనిరి. గీతది మాతృహృదయము. పుత్రవాత్సల్యముచే నయ్యది త్రివర్ణస్థులనే కాక శూద్రచండాలురను, పురుషులనేగాక స్త్రీలను, ఇంతియే కాదు, పశుపక్ష్యాదులను, వెయ్యేల, సమస్త చరాచరములనుగూడ నాహ్వానించి వారికి తగు రక్షణలు కల్పించి ముక్తిమార్గమును బోధించుచున్నది. జాతి మత కుల లింగ వయోవిచక్షణ లేక సర్వులకును మోక్షాధికారము కలదని భేరీమ్రోగించి చెప్పుచున్నది గీత.

## గీత యొక్క అనుపమ సామర్థ్యము

గీత కల్పవృక్షమువంటిది. అయితే స్వర్గమందలి కల్పవృక్షమువలె క్షణిక ప్రాపంచిక వస్తుజాలమును ఒసంగునది కాదు. సంకల్పరహితమగు మోక్షస్థితిని ప్రసాదించునది. గీత కామధేనువువంటిది. అయితే సురలోకమందలి కామధేనువువలె నశ్వర భోగ్యపదార్థములను కలుగజేయునదికాదు కామవర్జితమగు నిష్కళంక నిర్వాణ పదవిని సమకూర్చునది. గీత చింతామణివంటిది. అయితే త్రివిష్టపమందలి చింతామణివలె పాంచభౌతిక సంపదను అభివృద్ధిపఱచునది కాదు. చింతలన్నింటిని పోగొట్టి నిశ్చింత నిరపేక్ష నిరామయ పరంధామమునకు జీవుని చేర్చునది. గీత అమృతమువంటిది. అయితే దేవతలు త్రాగు జడమైన ద్రవము కాదు. జనన మరణ రహితమగు శాశ్వత బ్రహ్మసాక్షాత్కారమును కలుగజేయు జ్ఞానామృతము. ఇంతియే కాదు. 'నీవు నాశరహితమగు ఆత్మవే కాని దేహాదులు కావ'ని విశ్వాసము కలుగజేయు అభయశాస్త్రము గీత. ఫలరహిత కర్తవ్యనిష్ఠను నేర్పి సర్వులు మోక్షాధికారులేయని ఘోషించిన ఈశ్వరీయ వాణి అది. మఱియు నది భవసాగరమును అవలీలగ దాటించివేయు గట్టి ఓడ. జీవిత రథమును ఒడుదుడుకులు లేక సవ్యముగా పోనిచ్చు రథచోదకుడు. జ్ఞానమను దివ్యగర్జనచే జనులను మోహనిద్రనుండి మేలుకొలుపు మేఘసము దాయము. ఉపనిషత్తులను గోవులనుండి శ్రీ కృష్ణుడను గోపాలుడు పాలుపిండ, వ్యాసమహర్షి ద్వారా భారతమను పాత్రయందు సేకరింపబడిన అమృతధార. తాపత్రయములను చల్లార్చి వ్యవహారపరమార్థమార్గ ముల రెండింటిని శీతలమొనర్చు దివ్యదృష్టి. నాస్తికులచే, పాషండులచే వ్యాపింపజేయబడిన భ్రమజాలమును విడిపించి, జనులను సత్యాకాశమున విహరింపజేయు విమానము. బాహ్యావేషములను తొలగించి సరియైన

★ భువం విహాయ కృష్ణస్త్వాం దర్శయిత్వా దివం గతః
త్వమేవ సాక్షాత్ శ్రీకృష్ణః హేగీతే శరణం మమ.

మార్గమును జూపు మార్గదర్శకుడు. దూరమునుండి సుందరముగా కన్పించు మిథ్యావస్తువులను గూర్చిన భ్రమను, అవిద్యను పారద్రోలి, మోక్షద్వారముల తాళపుచేతులను జిజ్ఞాసువుల చేతియందు నేరులో పెట్టివేయు అనుపమ బ్రహ్మవిద్యయే గీత.

## గీతయందలి అపారశక్తికి హేతువు

గీతయం దింతటి మహత్తరశక్తి ఏల ప్రాదుర్భవించినదో ఒకింత విచారించెదము. శ్రీ శుకులవారు పరీక్షిన్మహారాజునకు మోక్షమార్గ ముపదేశింప సమకట్టినపుడు, అక్కార్యమునకై వారికి ఏడురోజులు గడువు లభించినది. కాబట్టి సావకాశముగ అనేక కథలతో, ఇతిహాసములతో, వర్ణనలతో బోధింపదొడగెను. కాని గీతోపదేశసమయమున శ్రీకృష్ణుని పరిస్థితి వేఱు. అర్జునునకు జ్ఞానోపదేశము చేయుటకు కృష్ణునకు కొన్ని నిమిషముల కాలము మాత్రమే దొరికినది. అందును అది యుద్ధసమయము. సంగ్రామమున ఇరుపక్షములవారును రణక్రియకు సర్వసన్నద్ధులై వచ్చియుండిరి. శంఖములు మ్రోగింపబడెను. భేరీలు వాయించబడెను. ఇక తూణీరముల నుండి బాణములు కదలి వచ్చుటయే తరువాయి. అట్టి విషమ పరిస్థితిలో శ్రీకృష్ణునకు అర్జునుని మోహవినాశమను బ్రహ్మాండమైన బాధ్యత వచ్చిపడినది. కూర్చొనియున్న అర్జునుడు లేచులోపల సమస్త విజ్ఞానమును అతనికి బోధింపవలసివచ్చెను. కావున అట్టి గొప్ప నైతిక బాధ్యతను ఎదుర్కొనుటకై శ్రీకృష్ణమూర్తి అత్తఱి తన శక్తియుక్తు లన్నిటిని లెస్సగ కేంద్రీకరించి కార్యమున కుపక్రమించెను. వేదవేదాంతముల సారమంతయు పిండి క్షణకాలములో అర్జునునకు బోధించివైచెను. సమస్తశాస్త్రములయొక్క సిద్ధాంతములను, అనుష్ఠానపద్ధతులను చక్కగ నూరిపోసెను. తత్ఫలితముగ వారి ఆశయము నెరవేరినది. 'నయోత్స్య ఇతి గోవిన్ద' – ఓ కృష్ణా ! నేను యుద్ధము చేయను – అని పలికినవానిచే కొద్దిసేపటికే తిరిగి 'కరిష్యే వచనం తవ' ఓ కృష్ణా ! మీరు చెప్పినట్లు (యుద్ధము) చేసెదను; అని అనిపించగల్గెను. 'నా అజ్ఞానము శమించినది (నష్టోమోహః)' అను వాక్యమును అర్జునుని ముఖతః చెప్పించగల్గెను. దీనికంతటికిని కారణము శ్రీ కృష్ణపరమాత్మయొక్క లోకోత్తర ప్రతిభయే యగును. వారి తీవ్ర చిత్తైకాగ్రతారూపసమాధినిష్ఠాజనిత అఖండ జ్ఞానోపదేశమేయగును. సామాన్యమానవుడే ఏకాగ్రచిత్తుడగునపుడు ప్రాపంచిక రంగమునందుగాని, సాహిత్యక్షేత్రమునందు గాని, సాంఘిక, రాజకీయ, ఆధ్యాత్మికాది రంగములందు గాని సాహసోపేతములైన క్రియలను గావింపగల్గును. అట్టిచో సర్వజ్ఞుడగు సాక్షాత్ భగవంతుని విషయమై వేఱుగ చెప్పవలెనా? కనుకనే శ్రీ కృష్ణపరమాత్మ యొక్క భావసమాధిసంజనితమగు భగవద్గీత కిట్టి అపార మహిమ చేకూరినది.

ఈ సత్యమునే భారతము అశ్వమేధ పర్వమునందలి ఈ క్రిందిఘట్టము చక్కగ పరిపోషించుచున్నది – భారత యుద్ధము సమాప్తమైన వెనుక యుధిష్ఠిరుడు చక్కగ రాజ్యపాలనముచేయుచుండ, సర్వజనులు శాంతిసౌభాగ్యములను అనుభవించుచుండ, కొంతకాలమునకు శ్రీ కృష్ణమూర్తి ద్వారకకు పయనమై పోవ నుద్దేశించుచుండగా నత్తఱి ఒకనా డర్జునుడు శ్రీకృష్ణుని సమీపించి యిట్లు ప్రశ్నించెను..... "మహాత్మా! అలనాడు రణరంగమున తాము నాయెడల కరుణతో నుపదేశించిన దివ్యజ్ఞానమును (భగవద్గీతను) ఇపుడు కారణాంతరములచే మఱచిపోతిని. దానిని మరల వినవలెనను తీవ్రకుతూహలము కలుగుచున్నది. కాబట్టి నాయందు దయయుంచి అద్దానిని మరల బోధింపవేడెద" – ఆ వాక్యములను విని శ్రీకృష్ణుడిట్లు ప్రత్యుత్తరమిచ్చెను – "ఓ అర్జునా ! అతిరహస్యమైన జ్ఞానమును ఆసమయమున (యుద్ధరంగమున) నీ

కుపదేశించితిని. కాని అశ్రద్ధచే నీవు దాని నిపుడు మఱచిపోవుట నాకు చాల అప్రియముగ గన్పట్టుచున్నది. దానినంతను తిరిగి ఉన్నది ఉన్నట్లు ఇపుడు చెప్పుటకు నాకు సాధ్యపడదు. అపుడు యోగయుక్తుడనై (తీవ్ర ఏకాగ్రచిత్తుడనై) నేను నీకు బోధించియుంటిని. (అట్టి స్థితి మరల కలుగుట దుర్లభము.) బ్రహ్మ సాక్షాత్కారమునకు ఆ బోధ చాలును★. భగవానుని ఈ వాక్యముల ద్వారాగీతోపదేశ సమయమున వారి చిత్తైకాగ్రత, యోగనిష్ఠ (Concentration) విస్పష్టముగ తెలియుచున్నది. తన మనస్సు మహాప్రబుద్ధముగా నున్నపుడు శ్రీకృష్ణుడు గీతను బోధించెను. ఇవ్విధముగ యోగేశ్వరుని యోగనిష్ఠాసంజనితము కనుకనే గీతయందింతటి అఖండశక్తి ఉద్దీపించినది.

## గీతాయజ్ఞము

కురుక్షేత్ర సంగ్రామమందొక విచిత్రమగు యజ్ఞము జరుపబడెను. ఆ యజ్ఞమునకు హోమకుండము అర్జునుని ముఖము. హోమద్రవ్యము గీతోపదేశము. హోత శ్రీకృష్ణుడు. ఫలము కైవల్యము.

**భారతామృత సర్వస్వ గీతాయా మథితస్య చ**
**సారముద్ధృత్య కృష్ణేన అర్జునస్య ముఖే హుతమ్.** (భారతము - భీష్మపర్వము) (43–5)

భారతమను అమృతరాశియొక్క సర్వస్వమగు గీతను శ్రీకృష్ణమూర్తి బాగుగ మథించి దాని సారమును తీసి అర్జునుని ముఖమున బడవైచెను. ఇవ్విధముగ బ్రహ్మజ్ఞానామృతమను హోమద్రవ్యమును కబళించి పార్థుడు కృతార్థుడయ్యెను. అట్లే సర్వజీవులున్ను, భగవానుని యాదివ్యప్రసాదమును స్వీకరించి ధన్యులయ్యెదరు గాక !

## ఉపనిషత్సారముగీత

వేదముల సారము ఉపనిషత్తులు. ఉపనిషత్తుల సారము భగవద్గీత. ఉపనిషత్తులకు వేదాంతశాస్త్రమని, శ్రుతిశిరస్సులని పేర్లు కలవు. వేదములయొక్క అంతమున తెలుపబడిన సారభూతమైన సాహిత్యమగుటచే వేదాంతమనియు, శరీరమునకు శిరస్సు ప్రధానమై యున్నట్లు శ్రుతులలో ప్రధానభాగమగుటచే శ్రుతిశిరస్సులనియు, వానిని పేర్కొనుట సంభవించినది. ఈ ప్రకారముగ ఉపనిషత్తులు అధ్యాత్మవాఙ్మయమున కీలకస్థాన మాక్రమించుకొనియున్నవి. మహోన్నతమగు వేదవృక్షముయొక్క ఫలస్వరూపములగు ఆ ఉపనిషత్తులను తెలిసికొని, ఆస్వాదించి జన్మ సార్థకమొనరించుకొనవలెనని ప్రతిముముక్షువుయొక్క చిత్తము సాధారణముగ ఉత్కంఠితమగుచుండును. కాని ఉపనిషత్తులయొక్క భాష, భావము సామాన్యులకు దురవగాహమై అందుబాటులో లేకయున్నది. ఇక వారికి ఉపనిషన్మాధుర్యమును చవిచూచు అవకాశ మెచట? తదుపదిష్టమగు విజ్ఞానమును అనుభూతమొనర్చుకొనుటకు ఆస్కార మెచట? ఇది యొక

---

★ (1) అబుద్ధ్యా నాగ్రహీర్యస్త్వం తన్మేసుమహదప్రియమ్
న చ సాద్య పునర్భూయః స్మృతిర్మే సంభవిష్యతి (భారతము - అశ్వమేధపర్వము) (16-10)

(2) నూనమశ్రద్ధధానోఽసి దుర్మేధా హ్యసి పాణ్డవ
నచ శక్యం పునర్వక్తు మశేషేణ ధనంజయ. (16-11)

(3) స హిధర్మః సుపర్యాప్తో బ్రహ్మణః పదవేదనే
నశక్యం తన్మయా భూయస్తథావక్తు మశేషతః (16-12)

(4) పరం హి బ్రహ్మ కథితం యోగయుక్తేన తన్మయా. (16-13)

చిక్కుసమస్యయై కూర్చున్నది. ఈ సమస్యను పరిష్కరించుటకు భగవానుడు పూనుకొనెను. మఱియు తద్ద్వారా జనసామాన్యమునకు మహోపకారము చేయ సంకల్పించెను. వారు చేసినది ఏమి యనగా, ఉపనిషత్తులను గోవులను ముందు పెట్టుకొని, అర్జునుడను దూడను నిమిత్తముగా జేసికొని, గోపాలనందనుడగు తానే వాని నన్నిటిని పిండి బ్రహ్మజ్ఞానామృతమను ఆ క్షీరమును ముముక్షువులందఱికిని పంచిపెట్టెను. ఆ క్షీరమే భగవద్గీత★ ఈ ప్రకారముగ జటిలమగు వేదవిజ్ఞానమును భగవద్గీత యను సులభసాహిత్యము ద్వారా శ్రీకృష్ణమూర్తి జనులకందజేసి లోకమునకు మహోపకారమొనర్చెను. గీత అర్జునునకు బోధింపబడినదని జనులు స్థూలముగ తలంచుదురు. కాని, వాస్తముగ అది విశ్వప్రాణికోటికి ఉపదేశింపబడినది. దూడవంతునకు వచ్చు పాలు కొద్ది మాత్రమే కదా. తక్కిన పాలంతయు ఇతరుల పాలిటయే వచ్చిపడును. 'సుధీర్భోక్తా' - అని చెప్పబడినందున బుద్ధిమంతులెల్లరును (మోక్షాపేక్షకలవారందఱును) దానిని త్రాగి సుఖించవచ్చునని స్పష్టమగుచున్నది. మఱియు 'గీతామృతం మహత్' అని పేర్కొనినందువలన, ఇది లౌకికమగు స్వర్గమందలి అమృతము కాదనియు, పారలౌకికమగు సచ్చిదానందరసామృతమనియు తేలుచున్నది. కావున సులభశైలితో, గంభీరభావములతో నొప్పారుచు, సాక్షాత్ భగవంతునిచే లోకమునకు ప్రసాదింపబడిన "ఉపనిషత్తులయొక్క సారము" (Essence) అగు ఈ గీతను పఠించి, అనుష్ఠించి, భవదుఃఖమును బాపుకొనుట ప్రతిజీవి యొక్కయు కర్తవ్యమై యున్నది.

## గీతాజ్ఞానము అనంతము

గీతయొక్క మహిమను వర్ణించినకొలది అంతులేక యుండును. భగవంతు డెట్లు అనంతుడో భగవద్వాణి యొక్క మహత్తున్ను అనంతముగా గన్పట్టగలదు. "కృష్ణస్తు భగవాన్ స్వయం" - అని చెప్పబడినందువలన గీతాచార్యుడును, జగద్గురువు నగు శ్రీ కృష్ణమూర్తి సాక్షాత్ భగవంతుడే కనుక, కృష్ణవాణి భగవద్వాణియే యగును. కృష్ణగీత భగవద్గీతయే యగును. గీతను చదివిన ప్రతివానికిని అది దైవనిర్మిత పదార్థమని స్పష్టముగ తెలియగలదు. ప్రతి అక్షరమందును, ప్రతిశ్లోకమునందును దైవత్వము తొణికిసలాడుచుండును. ఒక్కొక్క శ్లోకమునందు ఎన్నెన్నియో నూతన నూతన అర్థములు ద్యోతకము లగుచుండును. వెయ్యేల, శ్లోకబిందువునందు జ్ఞానసింధువు కలిగి యుండుననుటలో అతిశయోక్తి లేదు. ఎవరెవరి సంస్కారము ఏయే విధముగ నుండునో వారివారికి తగిన అర్థము దానిలో స్ఫురించుచుండును. మఱియు చిత్తము శుద్ధమగుచుండుకొలది ఒకే శ్లోకమునందు వినూతన, విశాలభావములు గన్పట్టుచుండును.

The suggestiveness of this wonderful book is really infinite

'ఆశ్చర్యకరమగు ఈ గ్రంథముయొక్క వినూతనభావస్ఫురణశీలత్వము వాస్తవముగ అనంతమైనది.' అని ఒక మహనీయుడు నుడివెను. అయితే ఎవరెవరు ఎన్నెన్ని అర్థములు లాగినను, ఎన్నెన్ని భాష్యములు వ్రాసినను, ఇంకను అనంతవిజ్ఞానము దాని యందు మిగిలియే యుండును. ఒక నదీప్రవాహమందు ఒకడు చిన్న చెంబుతో నీళ్లు ముంచుకొనిపోవును. మఱియొకడు బిందెతో నీళ్లు తీసికొనిపోవును. ఇంకొకడు పీపానిండుగ తీసుకొని వెడలును. మఱియొకడు 'టాంకు' ను నింపుకొనిపోవును. ఈ ప్రకారముగ వారివారి

★ సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనన్దనః
పార్థోవత్సః సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్.

శక్తి కొలది ఎంతెంత తీర్థము గ్రహించి వెడలినను నదియం దింకను అనంతజలము శేషించియేయుండును. అట్లే గీతా గంగప్రవాహమున శంకరాచార్యు లొక పెద్దపాత్రనిండుగ విజ్ఞానమును తోడుకొనివెళ్ళిరి. అట్లే రామానుజులు, మధ్వాచార్యులు, శ్రీకంఠశివాచార్యులు మున్నగు మహనీయు లనేకులు వారి వారి శక్తికొలది బుద్ధిరూప పాత్రలనిండుగ గీతార్థమును గ్రహించివెళ్ళిరి. అట్లే ఆధునిక కాలమున తిలక్‌మహాశయుడు, గాంధీమహాత్ముడు, అనిబిసెంటు మున్నగు వారున్ను గీతామృతమును చేదుకొని వెడలిరి. ఇంకను అనేకులు చేదుకొనుచున్నారు. మున్ముందును పెక్కండ్రు చేదుకొనగలరు. కాని ఇందరు మహాత్ములు గీతను మథించి కొందఱు ద్వైతపరముగ, కొందఱు విశిష్టాద్వైతపరముగ, కొందఱు అద్వైతపరముగ, అట్లే కొందఱు కర్మపరముగ, కొందఱు భక్తిపరముగ, కొందఱు యోగపరముగ, కొందఱు జ్ఞానపరముగ అర్థములు చెప్పుచున్నను, భావములను వెల్లడించుచున్నను ఇంకను గీతయందెంతయో విజ్ఞానభండారము మిగిలియే యున్నది. ఇదియే గీతయొక్క మహావిశిష్టత. ఇట్టి శక్తి మఱి ఏ యితరగ్రంథమునకున్ను లేదు. కనుకనే గీతను సంపూర్ణముగ తెలిసి కొనినవాడు ప్రపంచములో ఒక్కరు మాత్రమే కలరని చెప్పబడినది. వారే శ్రీకృష్ణుడు. తక్కిన వారందఱు గీతయొక్క ఒకానొక అంశమును మాత్రమే గ్రహింపగల్గిరట!

**కృష్ణో జానాతి వై సమ్యక్ కించిత్కున్తీసుతః ఫలమ్**
**వ్యాసోవా వ్యాసపుత్రోవా యాజ్ఞవల్క్యోఽథ మైథిలః.**

"గీతార్థమును, గీతామహిమను, కృష్ణుడొక్కడు మాత్రమే సంపూర్ణముగ నెఱిగి యున్నాడు. అర్జునుడు, వ్యాసులు, శుకులు, యాజ్ఞవల్క్యుడు, జనకుడు మున్నగు తక్కినవారందఱున్ను ఒకింత మాత్రమే తెలిసికొనియున్నారు." ఓహో ! గీతామహిమ యెట్టిదైయున్నది!! గీతార్థము ఎంత అపారమైయున్నది !!

అయితే ఇచ్చోట ఒక ధర్మసూక్ష్మమును గ్రహించవలసియున్నది. అది యేదియనగా అమృతమును ఒక బిందువు త్రాగినను, చెంబుడు త్రాగినను, ఇంకను అధికముగా త్రాగినను ఫలితము ఒకటే. మరణరాహిత్యము అందఱికిని సమానముగ సిద్ధించును. అట్లే గీతామృతమును ఒకింత గ్రోలినను, అధికముగ గ్రోలినను భవదుఃఖహరణము, మోక్షప్రాప్తి, సమానముగనే సంభవించును. కాబట్టి ఈ విషయమై ఎవరును దిగులుపడక, శంకరాదులవంటి మేధాశక్తి లేకపోయినప్పటికిని, నిరుత్సాహపడక గీతోక్తధర్మములలో కనీసము ఒకదానినైనను చక్కగ అనుష్ఠించుటకై ప్రయత్నము సలుపవలెను. దానిచే నతడు పరమశాంతిని తప్పక బడయగలడు.

## భారతసర్వస్వము గీత

శ్రీ భగవద్గీత మహాభారతములోని భీష్మపర్వమునందు 25 వ అధ్యాయము మొదలుకొని 42 వ అధ్యాయమువఱకు గలదు. భారతమను మహాసముద్రమున దీపస్తంభము (Light house) వలె గీత మెఱయుచున్నది. భారతమను క్షీరమున గీత నవనీతమై వెలయుచున్నది. అష్టాదశ పురాణములను, నవవ్యాకరణములను, నాలుగు వేదములను చక్కగ మథించి వ్యాసమునీంద్రులు భారతమును రచించెను★.- కావుననే భారతము పంచమవేదమని ప్రఖ్యాతిగాంచినది. అట్టి మహోత్కృష్ట కావ్యముయొక్క

★1. అష్టాదశ పురాణాని నవవ్యాకరణాని చ
నిర్మథ్య చతురోవేదాన్ మునినా భారతం కృతమ్.

2. భారతోదధి నిర్మథ్య గీతాయా నిర్మథితస్యచ
సారముద్ధృత్య కృష్ణేన అర్జునస్య ముఖే హుతమ్.

సారమే భగవద్గీత. శ్రీకృష్ణపరమాత్మ జ్ఞానామృతమును వర్షించుచుండ వ్యాసమునీంద్రులు మహాభారతమను కలశమున దానిని పట్టియుంచెనని ఆలంకారికభాషలో చెప్పవచ్చును. మఱియు -

**ధర్మే చార్థే చ కామేచ మోక్షే చ భరతర్షభ**
**యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్క్వచిత్.** (భారతము)

"ధర్మార్థకామమోక్షములను చతుర్విధ పురుషార్థములనుగూర్చి భారతమున ఏమేమి తెలుపబడినదో అదియే యితరచోట్లయందును తెలుపబడినది. దీనియందు లేనిది మఱి యెచటను లేదు." ఇంతియేకాదు "యన్నభారతే తన్నభారతే" - భారతమున లేనిది భారతదేశముననే లేదు - ఈ ప్రకారమగు అనుపమఖ్యాతి నార్జించినది మహాభారతము. ఇక నద్దాని సారమగు భగవద్గీత యెట్లుండునో పాఠకులే ఊహించుకొనవచ్చును. కనుకనే శ్రీ ఆదిశంకరులు గీతాభాష్యము వ్రాయుచు ప్రారంభముననే -

**తదిదం గీతాశాస్త్రం సమస్త వేదార్థసారసంగ్రహభూతమ్.**

'ఈ గీతాశాస్త్రము సమస్త వేదవేదాంతములయొక్క సారసంగ్రహము' అని పేర్కొనియున్నారు. అట్లుకానిచో ఖండఖండాంతరములందలి ప్రాజ్ఞులెల్లరు దీనిచే ఏల నాకర్షింపబడుదురు? మధువులేనిచో తుమ్మెదలు రావుగదా! గీతయందు తెలుపబడినది అవ్యయమగుబోధ. దానికి నాశములేదు. దేశకాలములు మారినను అది మారదు. చెక్కు చెదరదు. అది యుగయుగములకును పనికివచ్చు ధర్మము. కనుకనే గీతాచార్యులు దానిని గూర్చి మూడవ అధ్యాయములో "ప్రోక్తవానహమవ్యయమ్" - అవ్యయమైన ఈ బ్రహ్మవిద్యను, యోగశాస్త్రమును పూర్వము నేను సూర్యున కుపదేశించితిని, అని వాక్రుచ్చిరి. మఱియు నిది అతి రహస్యమగు విద్య. కానిచో 'ఇదంతు తే గుహ్యతమం'- ఈ మహాగోప్యమగు శాస్త్రమును నేను నీకు చెప్పుచున్నానని గీతాచార్యులు పదేపదే గీతయం దేల ఉద్బోధించవలెను? ఈ ప్రకారముగ అతిరహస్యమై, అఖండమైనట్టి ఈతత్త్వబోధ ఒక దేశమునకు గాని, ఒక కాలమునకు గాని, ఒక మతమునకుగాని, ఒక జాతికిగాని, ఒక సంప్రదాయమునకు గాని సంబంధించినదికాక సర్వదేశములకు, సర్వకాలములకు, సర్వమతములకు, సమస్తసంప్రదాయములకు చెందినదైయున్నది. సర్వమతములసారము దీనియందు కలదు. కాబట్టి భగవద్గీత కేవలము హిందువుల మతగ్రంథము మాత్రమే యని చెప్పట పొరపాటు. ఇది సార్వభౌమగ్రంథము. కావున దీని నాశ్రయించువారు ధర్మరహస్యములనెల్ల గ్రహించి అచిరకాలములో పరమశాంతిని తప్పక బడయగలరు.

జ్ఞానేశ్వరుడు గీతనుగూర్చి ఈ క్రింది విధముగ ప్రస్తుతించెను - "గీత వివేకవృక్షములకు తోట; సర్వసుఖములకు పునాది; పరమార్థసిద్ధాంతరత్నఖని; నవరసములను అమృతముచే నిండిన సముద్రము; తెఱవబడియున్న పరంధామము; సర్వవిద్యలకు మూలభూమి; సర్వశాస్త్రములకు ఆశ్రయము; సర్వధర్మములకు మాతృభూమి; సజ్జనులకు ప్రేమాస్పదమిత్రుడు; సరస్వతియొక్క లావణ్యరత్నముల భండారము; జ్ఞానామృతపూర్ణగంగ; వివేకమను క్షీరసముద్రయొక్క నవలక్ష్మి" - మహనీయుల దృష్టియందు గీత ఎట్టి పూజ్యస్థానమును ఆక్రమించుకొనియున్నదో ఈ పైవాక్యములు ఋజువుచేయుచున్నవి.

## గీతోపనిషత్తు

ఇక గీతను గూర్చిన మఱికొన్ని వైచిత్ర్యములను పరిశీలించెదము - విష్ణుభగవానుని నాభికమలమునుండి బ్రహ్మదేవు డావిర్భవించెనని శాస్త్రములందు ప్రతీతి. బ్రహ్మదేవుని వలన వేదము

లుత్పన్నమైనవనియు లోకమున విఖ్యాతి. భగవద్గీతయో అట్లుకాక విష్ణుమూర్తియొక్క ముఖకమలమునుండియే నేరుగ జనించినది. ఎక్కడ ముఖకమలము! ఎక్కడ నాభికమలము! ఏది సమీపము? కావున వేదములకంటెను గీత భగవానునకు సన్నిహితమైన స్థానము నాశ్రమించుకొనినదని స్పష్టమగుచున్నది. ఈ యర్థమే ఈ క్రింది మహాభారత వాక్యములందు ధ్వనించుచున్నది.

**గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైః శాస్త్ర విస్తరైః**
**యా స్వయం పద్మనాభస్య ముఖపద్మాద్వినిఃసృతా** (భారతం - భీష్మపర్వము 4-31)

"గీతను లెస్సగ గానమొనర్పవలెను. ఇతర శాస్త్రములచే నేమి ప్రయోజనము? ఏలయనిన, గీత స్వయముగ విష్ణుభగవానుని ముఖకమలమునుండియే వినిర్గతమైనది." గీతయొక్క మహిమను వర్ణించుటకు ఇంతకంటె అధికమగు ప్రమాణమేమికావలెను? కొందఱు గీతను స్మృతిక్రింద పోల్చి చెప్పుదురు. ఈశ్వర నిశ్వాసము శ్రుతి అయినపుడు, ఈశ్వరవాణి స్మృతి యెట్లు కాగలదని వల్లభాచార్యులు నిలదీసి ప్రశ్నించిరి. మఱియు భగవద్గీత ప్రతిఅధ్యాయముయొక్క చివఱ - 'ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే.....' అను సంకల్పము గలదు. దానిలో ఉపనిషత్సు = 'ఉపనిషత్తులలో' అని చెప్పబడియుండుటవలన, గీత వేదము యొక్క అంతమగు ఉపనిషత్తులలో చేరినదేయని స్పష్టమగుచున్నది. కాబట్టి దీనిని 'గీతోపనిషత్తు' అనినను తప్పులేదు. వేదములవలెనే ఇదియు అమరవాణియనుటలో ఏ సందేహమున్ను లేదు.

## ప్రస్థానత్రయమునందు గీత

అధ్యాత్మ వాఙ్మయమున ముముక్షువులకు ప్రస్థానత్రయము అతిముఖ్యమగు ఆలంబనమైయున్నది. ప్రస్థానత్రయముయొక్క పరిచయము లేనిచో పరమార్థతత్త్వము చక్కగా బోధపడదు. దశోపనిషత్తులు, భగవద్గీత, బ్రహ్మసూత్రములు - అను నీమూడును కలిసి ప్రస్థానత్రయ మనబడును. గీత అనేక ధర్మసూక్ష్మములతో నిండినిబిడీకృతమైయున్నది. కనుకనే గీత ప్రస్థానత్రయములో చోటును సంపాదించుకొన గల్గినది. ఈ మూడిటి యందునుగూడ ఉపనిషత్తులయొక్కయు, బ్రహ్మసూత్రముల యొక్కయు భావములు గీతయందుండుటచేతను, భాష, శైలి సులభముగ నుండుట చేతను గీత జనులలో విశేషవ్యాప్తినొందినది.

మఱియు "నేను గీత నాశ్రయించుకొని యున్నాను; గీత నాకు చక్కని మందిరము; గీతాజ్ఞానమునవలంబించియే ముల్లోకములను నేను పాలించుచున్నాను★." అని గీతా మాహాత్మ్యమున విష్ణువు పలికిన వాక్యములు గీతయొక్క మహోన్నతస్థితిని, ప్రాధాన్యమును లెస్సగ చాటుచున్నవి. మఱియు గీతాసమాశ్రయముచే భగవంతుడు త్రిలోకములను, బ్రహ్మాండమునంతను పాలింపగల్గుచుండ, అద్దాని ఆశ్రయముచే మానవుడు ఒక చిన్న గృహమును పాలింపలేడా? కుటుంబమును పాలింపలేడా? తప్పక పాలింపగలడు. "భూభుజో జనకాదయః" అనునట్లు జనకాది మహారాజులు అట్లు పాలింపగల్గిరి. గీత నవలంబించి వారందఱున్ను తమతమ సంసారములను, తమతమ జీవితనౌకలను ఒడుదుడుకులు లేకుండ సాఫీగా నడుపుకొనగల్గిరి. కాబట్టి తాపత్రయ విదగ్ధమగు ఈ ఘోరసంసారారణ్యమున దుఃఖరహితమగు ప్రశాంతజీవనము నభిలషించు ప్రతివారును గీతయొక్క సహాయము గైకొనియే తీరవలెను.

★ గీతాశ్రయోఽహం తిష్ఠామి గీతామేచోత్తమం గృహమ్
గీతాజ్ఞాన ముపాశ్రిత్య త్రీన్లోకాన్పాలయామ్యహమ్. (గీ.మా. 7)

**"గీతా రక్షతి రక్షితా"** ఎవరు గీతను రక్షించుదురో వారలను గీత రక్షించును. అనగా గీత నెవరు ఆదరించుదురో, ఆశ్రయించుదురో, అనుష్ఠించుదురో వారలను గీత భవసాగరము నుండి కాపాడునని భావము. కనుకనే భయంకరమగు ఈ సంసారసముద్రము నెవడు దాటనిచ్ఛగించునో అతడు గీత యను నౌకను తప్పక ఆశ్రయించవలెనని శాస్త్రములుద్ఘోషించుచున్నవి.★

## కలికాలభేషజము

కలికాలమున ధర్మము ఏకపాదమున నుండుననికాబోలు, లేక, కలి తన యావచ్ఛక్తితో విజృంభించి జనులను కుమార్గమున నడిపించి భ్రష్టులంజేయునని కాబోలు – దయార్ద్రహృదయుడగు పరమాత్మ కృష్ణావతారమునెత్తి సరిగా కలికాలమునకు ఒకింతముందే గీతామృతమును జనుల కందజేసిరి.

కాకున్న, కృతయుగమున దీనిజోలికి యెందుకు పోలేదు ? త్రేతాయుగమున దీనిమాట యెందుల కూహించలేదు ? ద్వాపరయుగము చివఱవఱకు ఎందులకు వేచి యుండవలెను ? రోగము ముదిరినప్పుడే చక్కని మందువేయవలెనని భావించినట్లున్నది. ఏది యెట్లున్నను, కలిదోషభయ మిక జనులకు లేదు. మాంత్రికునకు గ్రహబాధలేనట్లు గీతామంత్రమును జపించు మానవునికడకు సంసారదోషములు, తాపములు వచ్చుటకు సాహసింపవు. ఒకవేళ వచ్చినను సమూలముగ విధ్వంసములై పోగలవు.

**"పాఠమాత్రపరాభూత కాలకింకరగర్జితమ్"** 'గీతాపఠన మాత్రముచే యమకింకరుల గర్జనలు వ్యర్థములై పోగలవు' – అని పద్మపురాణమున గీతామాహాత్మ్యమునందు తెలుపబడినది. గీతయందలి ప్రతిశబ్దమున్ను పాపమును భస్మీభూతమొనర్చు అగ్నికణమువంటిదని చెప్పుటలో అతిశయోక్తిలేదు. కావుననే పండితుడు మొదలుకొని పామరునివరకును, రాజు మొదలుకొని దరిద్రునివఱకును, భూసురుని మొదలుకొని చండాలునివఱకును గల సమస్తమానవకోట్లన్ను గీత నాశ్రయించి దానివలన శాంతి సౌభాగ్యముల ననుభవించుచున్నారు. గీతాగంగాపానముచే ఇదివఱకెందఱో తరించిరి, ఇపుడును తరించుచున్నారు. ముందును తరింపగలరు. శ్రీ శంకరాచార్యులు గీతాప్రశస్తిని గూర్చి యివ్విధముగ తెలిపియున్నారు –

**భగవద్గీతా కించిదధీతా**
**గంగాజలలవకణికా పీతా**
**సకృదపియేన మురారి సమర్చా**
**తస్యకరోతి యమోఽపి న చర్చామ్.**

భగవద్గీతను ఒకింత అధ్యయనము చేసినను, గంగాజలమును కొద్దిగా త్రాగినను, విష్ణుభగవానుని ఒక్క పర్యాయము పూజించినను, ఇక యముడు వారి చెంతకు పోనేరడు. కాబట్టి గీతపై పూర్ణవిశ్వాసముంచి, అందలి సత్యముల ననుష్ఠించి, నిరతిశయానంద మీజన్మయందే యనుభవించుటకు బద్ధకంకణులు కావలెను.

---

★ సంసారసాగరం ఘోరం తర్తు మిచ్ఛతి యో నరః
గీతా నావం సమాసాద్య పారం యాతి సుఖేన సః. (వైష్ణవీయతంత్రసారము)

## నిత్యజీవితసంగిని

గీత కేవలము కృష్ణార్జునసంభాషణమే కాదు. అది ప్రతివాని హృదయమందును నిరంతరము జరుగుచున్న సంభాషణయే యగును. అర్జునునివలె కర్ణగోళములను శ్రీ కృష్ణపరమాత్మవైపునకు త్రిప్పినచో, ఆ దైవవాణి సర్వులకును వినిపించగలదు. సామాన్యగ్రంథమునువలె దీని నొక్క పర్యాయము చదివి ప్రక్కన పెట్టరాదు. ఇది నవల వంటిది. కాదు చదివి అవలపారవేయుటకు. ఇది నిత్యజీవిత సంగిని. నిరంతరము దీని నధ్యయనముచేయుచు దైనందినజీవితమునందు తదుపదిష్టధర్మములను ప్రయోగించుచు రావలెను. ఆపత్తులలో, సాంసారిక క్లేశములలో అది జీవునకు కలుగుజేయు ఉపకారము అమోఘమైనది. రోగి ప్రక్కననే వైద్యుడున్నచో రోగికి ఎంత ధైర్యము కలుగునో, సంశయములు తొలగక తికమకపడుచుండు శిష్యుని చెంత అనుభవజ్ఞుడగు సద్గురువు వున్నచో శిష్యునకు ఎంత ఆనందము లభించునో, భవదుఃఖపీడితుడగు మనుజునియొద్ద గీత యున్నచో అంత ఉత్సాహ మాతనికి జనించును. గాంధిమహాత్ముని అనుభవపూర్వకములగు ఈక్రింది వాక్యములు సాధకులకు ప్రోత్సాహకరములుగ నున్నవి –

"సంశయములు నన్నావరించినపుడు, సంకటములు సంప్రాప్తమైనపుడు, నిరాశా నిరుత్సాహములు జనించునపుడు నేను భగవద్గీతను తెఱచిచూచుదును. అందు ఏదో యొక శ్లోకము నన్నూరడించును. తత్ఫలితముగ మహావిపత్కరపరిస్థితియందు గూడ నా ముఖముపై చిరునవ్వు తాండవించుచుండును. నా జీవితము అనేక ఒడిదుడుకులతో గూడియున్నను, ఘోరసంఘటనములను నే ననుభవించవలసివచ్చినను, అవి యెవ్వియు నా మనంబున లవలేశమైనను అశాంతిని గలుగజేయజాలకపోవుట యేది కలదో, అది యంతయు గీతాప్రబోధముయొక్క సత్ఫలితమే యగును," అందుకొఱకే కాబోలు మన పెద్దలు పారాయణమని గీతకు ఏర్పాటుచేసి ప్రతిదినము దానిని మఱువకుండులాగున కట్టుబాటుచేసిరి. ఆ ప్రకారము చేసిననే గీతార్థము హృదయమున ప్రవేశించి సామాన్య జీవితము దివ్యజీవితముగ మారిపోవును. మఱియు దానవుడు మానవుడుగ మారిపోయి, క్రమముగ మాధవుడుగ పరిణతి జెందగలడు. ఇదియే గీతయొక్క అనన్యసామాన్యప్రతిభ. ఇట్టి మహత్తర ఉద్గ్రంథమును మనకు ఒప్పజెప్పిన శ్రీకృష్ణపరమాత్మకు, శ్రీ వేదవ్యాసులకు మన మెంతయో ఋణపడియున్నాము.

## శోకరాహిత్యము, ఆనందప్రాప్తియే గీతాలక్ష్యము

గీత యనగా గానము చేయబడునదియని అర్థము. గానము ఆనందసమయములలోనే సంభవించునుగాని, దుఃఖసమయములలో కాదు. కావున ఆనందమే గీతయొక్క ప్రధానలక్ష్యమని, పరమావధియని ముముక్షువులు సదా జ్ఞప్తియందుంచుకొనవలెను. అట్టి ఆనందానుభవమునకు మార్గమును జూపుటయే గీతయొక్క పని. పదునెనిమిది అధ్యాయముల అఖండబోధచే నిరతిశయానందమును చూరగొను వివిధ ఉపాయములను గీత జీవునిముందు పెట్టినది. కనుకనే గీతాప్రబోధము 'అశోచ్యాన్' (శోకింపతగని వారినిగూర్చి) అను పదముతో ప్రారంభమై 'మాశుచః' (శోకింపవలదు) అను పదముతో నంతమైనది. శోకరాహిత్యము, ఆనందప్రాప్తి – ఇవియే గీతవలన కలుగు మహాఫలములు. సంసారదావానలమున తగుల్కొని త్రివిధతాపములచే దగ్ధులగుచున్న జనసముదాయమునకు ఈ ప్రకారముగ గీత మహోపకార మొనర్చుచున్నది. కన్నీరు కార్చుచున్న వారిని ఓదార్చుచున్నది. ఆపద్గ్రస్తుని వీపుతట్టి అతని హృదయమున ధైర్యసంచారమును కలుగజేయుచున్నది. నిరాశానిఃస్పృహలచే పరివేష్టితుడైనవానికి ఉత్సాహము

జనింపజేయుచున్నది. కాబట్టి యెందఱో గీతామాత సన్నిధి జేరి అద్భుతమైన హృదయపరిణామమును బడిసి ధన్యులగుచున్నారు.

ఇంతదనుక గీతయొక్క మహిమావిశేషములను విచారించి ఒకింత బాహ్యనిరీక్షణమును గావించితిమి. ఇక గీతాగ్రంథముయొక్క లోనికి ప్రవేశించి దాని యంద చందములను వీక్షించెదము. అట్లు వీక్షించుటకు ముందుగా అసలు గీత యేపరిస్థితిలో యెట్లేర్పడినదో, దాని పుట్టుపూర్వోత్తరములను గూర్చి సంక్షేపముగ విచారించెదము. గీత కాల్పనిక విషయముకాదు; ఒకానొక చారిత్రక సంఘటన (Historical fact) అని మొట్టమొదట తెలిసికొనవలయును. శ్రీకృష్ణుడు, అర్జునుడు మున్నగు వారందరును కొలదికాలముక్రిందట భారతదేశమున వెలసిన చారిత్రకపురుషులేకాని కల్పితవ్యక్తులు కారు. ఈ సత్యమును తెలిసికొనినచో గీతపై మఱింత విశ్వాసము కలుగగలదు.

## గీతావతరణము

పాండవులు, కౌరవులు కలిసిమెలసి అన్యోన్య మైత్రితో కాలము గడుపుచున్న దినములందు అసూయ అను పేరుపురుగు దుర్యోధనుని చిత్తకుహరమున ప్రవేశించి క్రమముగ అతని వివేకమును హరింపదొడగెను. తత్ఫలితముగ నాతడు శకుని మున్నగువారి సహాయముచే వక్రమార్గముల ద్వారా పాండవులను జూదమున నోడించి వారి రాజ్యమపహరించి ద్వాదశవర్షములు వనవాసము, ఒక వత్సరము అజ్ఞాతవాసము వారలచే చేయించి, అప్పటికిని వారి రాజ్యము వారికీయక నానాబాధలు పెట్టెను. అర్ధరాజ్యము కాదు, పాతిక రాజ్యముకాదు, ఆఖరుకు ఐదు గ్రామములుకాదు, సూదిమోపునంత స్థలమైనను పాండవులకీయనని దుర్యోధనుడు హఠముపట్టెను. తదుపరి శ్రీకృష్ణరాయబారము నడచెను. కాని ప్రయోజనము లేకపోయెను. పాండవుల కనీసపు కోర్కెలను కూడ దుర్యోధనుడు అహంకారగ్రహావిష్టుడై తిరస్కరించుటచే నిక గత్యంతరములేక పాండవులు ధర్మయుద్ధమునకు గడంగవలసివచ్చెను. ఇరుపక్షములందలి సైనికులును యుద్ధమునకు సన్నద్ధులైరి. ధర్మక్షేత్రమగు కురుక్షేత్రమున పాండవ కౌరవ సేనావాహినులు బారులుతీర్చి నిలబడెను. శంఖములూదిరి. భాణములను ఎక్కు పెట్టుచుండిరి. తత్సమయమున పార్థుని కోర్కె చొప్పున పార్థసారథి రథమును రెండుసేనల మధ్య నిలుపగా ఎదిరి సైన్యమందు అన్నలు, తమ్ములు, బావలు, బావమఱదులు, తండ్రులు, తాతలు, గురువులు మున్నగువారందఱు నుండుట జూచి అర్జునుడు 'ఈ స్వజనంబును నేనెట్లు వధింపగలను ? ఇది పాపహేతువుకదా ! ఈ బంధువులనుచంపి రాజ్యమేలుటకంటె భిక్షాటనముచేసి జీవించుటమేలు' అని పరిపరివిధముల వాపోయి శోకసంతప్తుడై గాండీవమును జార విడిచి, రథమున చతికిలబడి, తుట్టతుదకు గత్యంతరము కానక, ధర్మాధర్మనిర్ణయము స్వయముగ చేయలేక శ్రీకృష్ణుని పాదములపైబడి -

"**శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్**" 'నేను నీ శిష్యుడను, మిమ్ము శరణుబొందితిని, (కర్తవ్యమునుబోధించి) నన్ను శాసింపుడు' - అని శరణాగతుడై దీనముగ వేడుకొనెను. అంతట భగవానుడు అర్జునునకు గీతోపదేశము చేసిరి. గీతకుగల పూర్వగాథ ఇది. యుద్ధమునందు అహం, మమ (నేను, నావారు) అను రూపములతో అర్జునుని మోహము (అజ్ఞానము) వ్యక్తమై అతనిని కర్తవ్యచ్యుతునిగ జేసి వైచినది. శ్రీ కృష్ణుని బోధయంతయు అట్టి మోహముపైన గదాప్రహరణమేయగును. దేహాభిమానసంజనితమగు అర్జునుని యా కృపణత్వమును భగవానుడు తన యాత్మజ్ఞానోపదేశముచే తుత్తునియలుగ చేసివైచెను. మఱియు "నా అజ్ఞానము శమించినది, మీరు చెప్పినట్లాచరించెదను" అని అతనిచే చివరికి అనిపించగల్గిరి.

ఈ ప్రకారముగ అర్జునుని అజ్ఞానమును బోగొట్టగల్గిన గీత ఎవరి అజ్ఞానముసైనను పోగొట్టగలదు. అర్జునుని విషాదమును అంతమొందించిన గీత ఎవరి విషాదముసైనను అంతమొందించగలదు. ఒకరి రోగమును నివారణజేసిన మందు అందరి రోగములను నివారణచేయగలదు. ఇచట ఏలాటి సంశయమున్ను లేదు. పార్థవ్యాజమున శ్రీ కృష్ణమూర్తి జనసామాన్యమున కంతటికిని ఉపదేశము చేసిరనుట తథ్యము. కాబట్టి ప్రతివారు వారివారి హృదయములను తడుముకొని, వారివారి చిత్తములను బాగుగ పరిశోధించుకొని, జన్మజన్మాంతరములనుండి దాగియున్న కామక్రోధాది రూపమగు అజ్ఞాన నిబిడాంధకారమును గీతాజ్ఞానజ్యోతిచే నిర్మూలించి బంధవిముక్తులై అనంతానందమును ఈ జీవితమునందే అనుభవింతురు గాక !

## గీతకు అధికారి

అయితే గీతాగ్రంథమును పఠించుటకు అధికారి యెవడను ప్రశ్న ఇప్పట్టున సామాన్యముగ ఉదయించుచుండును. మంచినీరు త్రాగుటకు అధికారి యెవడు? దప్పిగొన్నవాడు. అన్నము తినుటకు అధికారియెవడు ? ఆకలి కలవాడు. ఔషధము సేవించుటకు అధికారి యెవడు? రోగము కలవాడు. కాబట్టి భవరోగపీడితులందరును గీతాజ్ఞానౌషధ సంసేవనమునకు అధికారులే యగుదురు. కాని భవరోగపీడితులెవరను సందేహ మిచ్చోట కలుగుచున్నది. పుట్టినవారందఱు భవరోగగ్రస్తులే. బాధ ననుభవించువారందఱు సంసారవ్యాధిపీడితులే. పుట్టుట, గిట్టుటయను చక్రమునందు తగుల్కొనినవారందఱు ఏదియోవిధముగ ఈ రోగముచే నాక్రమింపబడినవారేయగుదురు. కావున జాతి, మత, కుల వయోవిచక్షణలేక సర్వులున్ను గీతాపఠనమునకు, గీతాజ్ఞానసముపార్జనకు అధికారులే యగుదురు. అయితే తనకు రోగము కలదని ఎఱుగువాడు మాత్రమే ఔషధమునకై ప్రయత్నించునట్లును, జనన మరణ రూప సంసాపవ్యాధిచే తాను బాధపడుచున్నానని గుర్తెఱిగిన మనుజుడు మాత్రమే గీతాది సద్గ్రంథపఠనమున కియ్యకొనును. మఱియు ఆ యా శాస్త్రములపైనను, వానిని బోధించిన పుణ్యపురుషులపైనను అకుంఠితవిశ్వాసము కలవానికి మాత్రమే అవి ఉత్తమ ఫలితములను కలుగజేయును. తక్కినవారికి కలుగుజేయవు. కనుకనే శ్రీ కృష్ణపరమాత్మ గీతను చదువుటకు ఎవరు అధికారి అను ప్రశ్నవచ్చినపుడు ఈ క్రిందివిధముగ ఆనతిచ్చిరి.

**ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన**
**నచాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి.** (18–67)

"ఓ అర్జునా ! ఈ గీతాశాస్త్రమును జననమరణరూపమగు సంసారమునుండి తప్పించుకొనవలెనను మనోవ్యాకులత్వము లేనివానికిని, గురువునందును, ఈశ్వరునియందును భక్తిలేనివానికిని, పెద్దల శుశ్రూషచేయనివారికిని, నన్ను (భగవంతుని) నిందించువానికిని ఎన్నటికిని బోధింపరాదు. అట్టివాడు దీనిని చదువరాదు" అని గీతాంతమున పరమాత్మ సెలవిచ్చిరి. మఱియు "ఏ మానవులు నాయీ గీతాతత్త్వమును శ్రద్ధగలవారై, అసూయ లేనివారై నిత్యము అనుష్ఠించుచుందురో వారు కర్మబంధనమునుండి విడిపడుదురు. అట్లుగాక, ఎవరు దీనిని ద్వేషించుచు, చెప్పినట్లు ఆచరింపకనుందురో అట్టివారిని సర్వజ్ఞానరహితులుగను, బుద్ధిహీనులుగను, నశించినవారుగను ఎఱుగుము"★ - అని వేఱొకచోట ప్రస్తావించిరి. కాబట్టి

★ (1) యే మే మత మిదం నిత్య మనుతిష్ఠన్తి మానవాః
శ్రద్ధావన్తోఽనసూయన్తో ముచ్యన్తే తేఽపి కర్మభిః (3-31)
(2) యే త్వేతదభ్యసూయన్తో నానుతిష్ఠన్తి మే మతమ్
సర్వజ్ఞానవిమూఢాంస్తాన్ విద్ధి నష్టానచేతసః (3-23)

శ్రద్ధావిశ్వాసములు కలవారందఱున్ను, తరింప కుతూహలము కలవారందఱున్ను గీతకు అధికారులేయగుదురు. 'మానవాః' అని సర్వసామాన్యపదము (General term) ను భగవానుడు ప్రయోగించినందువలన జాతి మత కులభేదము లేక సమస్తమానవకోటియు గీతాసంసేవనమునకు పూర్ణాధికారము కలిగియున్నదని స్పష్టపఱచినట్లైనది.

ఇక గీతయొక్క అభ్యంతరమున ప్రవేశించి అందు గల విశేషములను ఒక్కొక్కటిగ పరికించెదము.

## గీతయందు అనుష్ఠానప్రాధాన్యము

సిద్ధాంతములను ఏకరువు పెట్టుటకంటె అనుష్ఠానమును నొక్కిచెప్పుట గీతాచార్యులకు పరమప్రీతి. కనుకనే సాధ్యవస్తువగు పరమాత్మను గూర్చి ఒకింత మాత్రమే తెలియజేసి, ఆ పరమాత్మను జేరుటకు వలసిన సాధనసంపత్తిని విస్తారముగ గీతయందు ప్రకటించిరి. రెండవ అధ్యాయమందలి స్థితప్రజ్ఞ లక్షణములు, ఆఱవఅధ్యాయమందలి యోగాభ్యాసపద్ధతి, పంద్రెండవ అధ్యాయమందలి భక్తుని లక్షణములు, పదుమూడవ అధ్యాయమందలి జ్ఞానగుణములు, పదునాఱవ అధ్యాయమందలి దైవీసంపద్వివరణ, మున్నగునవియే ఇందులకు తార్కాణము. సిద్ధాంత ప్రతిపాదనకంటె అనుష్ఠాన నిర్వహణమే చాల గొప్పదని ఇట్టి బోధనల ద్వారా భగవానుడు తెలియజేయుచున్నారు. గీతాగ్రంథము తెఱవగనే మొట్టమొదట ఈ సత్యము కండ్లకు కొట్టినట్లు పాఠకునకు అగపడగలదు. నైతిక పతనము కలవానికి ఆధ్యాత్మిక సూత్రములు హృదయమున ఎన్నటికిని ప్రవేశింపజాలవు. చిత్తశుద్ధిలేని వానికి జ్ఞానము ఒంటపట్టదు. ఊషరక్షేత్రమున సస్యము వృద్ధికి రాదు. కావున హృదయనిర్మలత్వమునకు వలసిన సాధనలు (Ethicaltraining) జీవునకు ప్రప్రథమమున అత్యంతావశ్యకములు. ఈ సత్యమును గుర్తెఱిగియే గీతాచార్యులు శీలనిర్మాణము (Character-building)నకు విశేషప్రాధాన్యము నొసంగుచుపోయిరి.

సాధ్యవస్తువగు పరమాత్మయందుగల ప్రీతిలో ఏ యొక భాగమైనను సాధనయందు వినియోగింపబడినచో లక్ష్యము కరతలామలకమైపోవును. కాని జనులట్లు చేయుటలేదు. దేవుడు గొప్పవాడైనను ఆ గొప్పతనము, ఆ పవిత్రత, జీవునకుగూడ కలిగినపుడే మోక్షము సిద్ధించును. లేకున్న దేవునకు, జీవునకు మధ్యగల అఖాతము అట్లే యుండిపోవును.

**"సత్త్వపురుషయోః శుద్ధిసామ్యే కైవల్యమ్"** 'చిత్తము పరమాత్మతో సమానమై నిర్మలత్వమునొందుటయే మోక్షము' అని పతంజలి మహర్షి నుడివియున్నారు. కాబట్టి చిత్తనైర్మల్యమునకు వలసిన పరికరములను, సాధనసంపత్తిని ముముక్షువు తప్పక గ్రహింపవలసియున్నాడు. భారతదేశము తన పూర్వపుటౌన్నత్యమును ఇపుడు పొందజాలకపోవుటకు కారణము లక్ష్యమునందుగల ఆసక్తి లక్ష్యసాధనయందు లేకపోవుటయేయనియు, సిద్ధాంతమునందుగల ప్రీతి ఆచరణయందు కానుపింపకపోవుటయే యనియు, సాధ్యవస్తువునందు గల ప్రేమ సాధనయందు లుప్తమగుటయేయనియు, అనుష్ఠానవేదాంతము తగ్గి 'వాచా' వేదాంతము ప్రబలుటయే యనియు జనులు జ్ఞప్తియందుంచుకొనవలెను. ఈ పద్ధతి గీతాచార్యులకు సరిపడదు. కనుకనే జ్ఞేయమును తక్కువగజెప్పి జ్ఞానమును విస్తారముగ గీతయందు ప్రతిపాదించిరి. ధ్యేయమును రవ్వంతజెప్పి ధ్యానమును మిక్కుటముగ బోధించిరి. 'సాధ్యము'ను ఒకింత ప్రతిపాదించి 'సాధన'ను బహుళముగ ప్రచారము చేసిరి. గీతాబోధలందు సాధకుడు మొట్టమొదట గ్రహించవలసిన పరమరహస్యమిదియే అయియున్నది. గీత ఆచరణాత్మక విజ్ఞానము (Practical Science) అని యెల్లరును గుర్తెఱుగుదురు గాక ! మఱియు తదుపదిష్టరీతి ఆచరించి తరింతురు గాక !!

## గీత వ్యవహారమును వేదాంతస్థాయికి కొనిపోవుట

"కర్మ చెడ్డది కాదు. వ్యవహారము దూష్యముకాదు. నీ దృష్టిని పవిత్రమొనర్చుకొనుము. అత్తఱి నీవుచేయుకర్మ మహాయజ్ఞమై భాసించును. నీ భావమును శుద్ధపఱచుకొనుము. అత్తఱి నీవుచేయు వ్యవహారము నిశ్శ్రేయసకమై చెన్నొందును" - అని గీత ఘోషించుచున్నది. కర్మచేయక ఒక క్షణమైనను మనుజు డుండజాలడు. కావున కర్మను దూషించుచు, నిషేధించుచు, చేయు బోధలు సామాన్యునకు ప్రయోజనకరములుగ నుండవు. పైగా అట్టి బోధలచే నతడు అకర్మణ్యుడుగ, జడప్రాయుడుగ తయారగును. జీవితము నిరర్థకమైపోవును. లోకములో నూటికి తొంభై తొమ్మిదిమంది గృహస్థులుగను, బ్రహ్మచారులుగ నున్నారు. వారు కర్మను పరిత్యజింపలేరు. సర్వసంగపరిత్యాగముచేసి ఏకాంతమున కాలముగడుపు, సన్న్యాసులు, సాధువులు చాల అరుదుగా నున్నారు. కావున ఎక్కువమందికి ఉపకరించు బోధయే ఇపుడు కావలసియున్నది. ఈ విషయములన్నియు గీతాచార్యులు చక్కగ ఆలోచించి, వ్యవహారమును దూషింపక, దానిని పవిత్రమొనర్చు ఉపాయముల నన్వేషింప దొడగిరి. మఱియు అట్టి వ్యవహారముద్వారా కర్మాచరణద్వారా చిత్తశుద్ధిని సంపాదించి క్రమముగ జ్ఞానానుభవమును బడసి మోక్షమును జెందవచ్చునని వారు బాహాటముగ ప్రకటించిరి.

**"స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః"** (18-46) 'తమ తమ కర్మలద్వారా పరమాత్మ నర్చించి మానవుడు ముక్తినొందగలడు' అని భగవానుడు వాక్రుచ్చిరి. ఇందులకు ప్రబల దృష్టాంతము అర్జునుడే యగును. ఏలననిన, 'నేను యుద్ధముచేయను; నాకు రాజ్యమువలదు; జోలె తీసికొని ఏకాంతమునకు బోయి భిక్షాన్నము భుజించుచు కాలక్షేపము చేసెదన'ని★ పలికిన అర్జునుడు శ్రీ కృష్ణమూర్తి యొక్క దివ్యబోధలచే కర్మరంగమున దుమికి, యుద్ధముచేసి, 'నేనేమియు చేయలేదు' అను నిర్లేపభావము కలవాడై, భయంకర సంగ్రామమును పవిత్ర యజ్ఞముగా మార్చివైచెను. శ్రీకృష్ణుని ముందుపెట్టుకొని అర్జునుడు యుద్ధమను వ్యవహారమును నడిపెను. వ్యవహారము మోక్షసోపానముగ పరిణమించుటకు ఉపాయ మిదియే అయియున్నది (భగవదున్ముఖత్వమే). భగవంతుని స్మరించుచు ఆ కార్యమును చేయుటయే ముక్తికి మార్గము.

**'మామనుస్మర యుధ్యచ'** 'నన్ను స్మరించుచు యుద్ధము చేయుము' - ఇదియే కర్మరహస్యము. యుద్ధముచేయుట గొప్పదికాదు. దేవుని స్మరించుచు యుద్ధము చేయుట గొప్పది. ఫలమును ఈశ్వరార్పణముచేసి కార్యమొనర్చుట గొప్పది. అపుడు 'కర్మ' కర్మగా నుండక 'కర్మయోగము'గా మారిపోవును (Work will be transformed into worship). అత్తఱి ఏకాంతమున సమాధినిష్ఠయందుండు యోగిపుంగవునకు, ప్రపంచమధ్యమున వివిధ కార్యకలాపములందు నిమగ్నుడగు కర్మిష్ఠునకు ఒకే ఫలము లభించును. ఆత్మశాంతి యిరువురికిని సంప్రాప్తించును; భగవద్గీత బోధించిన తత్త్వమిదియే. లోకములో కొన్ని శాస్త్రములు కర్మను పూర్తిగా నిషేధించుచున్నవి. అవి నివృత్తిమార్గమునే ఎక్కువగ పోషించుచుండును. మఱికొన్ని శాస్త్రములు కర్మను లెస్సగ ప్రోత్సహించుచున్నవి. అవి ప్రవృత్తినే ఎక్కువగా బలపఱచుచుండును. కాని గీత అటు ప్రవృత్తికాక, ఇటు నివృత్తికాక మధ్యమార్గమును కనిపెట్టినది. అది అందఱికిని ఆచరణయోగ్యముగ నున్నది. శరీరము ప్రవృత్తియందున్నను మనస్సును నివృత్తియం దుంచుకొనుము (Hands in the society and head in the forest) - అని గీత బోధించుచున్నది. ఈ గీతా భావము

★ శ్రేయో భోక్తుం భైక్ష్యమపీహ లోకే. (2-5)

నాధారపఱచుకొనియే జనకుడు రాజ్యమేలెను. విష్ణుమూర్తి ముల్లోకములను పాలింపగల్గిరి.★ ఇవ్విధముగ వేదాంతులు సామాన్యముగ ఏవగించుకొనుచుండు లోకవ్యవహారమునకు గీతాచార్యులు క్రొత్తరూపమిచ్చి దానికి పరమార్థస్థాయిని కల్పించిరి. ఇట్టి అపూర్వసిద్ధాంతమును మున్నెవరును, ఏ శాస్త్రమును ప్రతిపాదించలేదు. కనుకనే గీతకును, గీతాచార్యులకును ఇంతఘనత చేకూరినది.

## గీత యందు సర్వయోగసమన్వయము

లోకమున కర్మమార్గావలంబులు, భక్తిమార్గావలంబులు, యోగమార్గావలంబులు, జ్ఞానమార్గావలంబులు, అను నీ ప్రకారముగ అనేకులు అధ్యాత్మక్షేత్రమున కలరు. కాని, వారిలో కొందఱు తమ మార్గమే గొప్పదనియు, తక్కినవి నికృష్టములనియు వాదించుచుందురు. తమ తమ వాదములను బలపఱచుటకై వారు కొన్ని ప్రమాణములను గూడ చూపుచుందురు. ఈ ప్రకారముగ స్వమతసంస్తుతి, పరమత విద్వేషము, స్వమార్గ పరిపోషణము, అన్యమార్గవిమర్శనము ప్రపంచమున అమలులోనుండుటజూచి అద్దానిని దూరీకరించుటకై శ్రీ కృష్ణభగవానుడు గీతావతరణమునుగావించి సర్వమత సమన్వయ తత్త్వమును దానిద్వారా జనులలో వ్యాపింపజేసిరి. మోక్షసౌధమునకు కర్మ, భక్తి, ధ్యానము, జ్ఞానము అను నాల్గున్ను నాల్గు ద్వారములనియు, ఏ ద్వారముగుండా వెళ్ళినను ముక్తిప్రాసాదములోనికి చేరుకొనవచ్చుననియు వారు నుడివిరి. మఱియు నదులన్నియు గమ్యస్థానమగు సముద్రమును తప్పక చేరునట్లు, అన్ని మార్గములున్ను జీవుని కైవల్యధామమునకు జేర్చునని సెలవిచ్చిరి. ఏ మార్గముగుండా పోయినను తప్పులేదు. వారి వారి సంస్కారము ననుసరించి జనులు ఆయామార్గమును, ఆయాసిద్ధాంతమును అనుసరించుటకు సర్వస్వతంత్రులు అని గీత నుడువుచున్నది.

కొందఱి చిత్తము సహజముగనే క్రియాశీలమై (Active) యొప్పును. వారు తప్పనిసరిగ కర్మమార్గము ననుసరించుదురు. కర్మ నాచరించుటయందే, లోకసేవ చేయుటయందే వారు ఆనందమును బొందుచుందురు. కర్మతత్త్వమును, కర్మరహస్యమును చక్కగ తెలిసికొని నిష్కామపూర్వకముగ కర్మనే ఆచరించుచుండుడని అట్టి వారికి గీత బోధించుచుండును. వారికొఱకే కాబోలు 'కర్మయోగము' అను అధ్యాయమును గీత కేటాయించియుంచినది. మఱికొందఱి చిత్తము సహజముగనే ఆవేశపూరితమై, భక్తిపరవశముగ (Emotional) నుండును. అట్టివారు భక్తిమార్గము నవలంబించుదురు. జపము, పూజ, ప్రార్థన, సంకీర్తన, నామస్మరణ మున్నగు వానియందు వారు మిక్కుటముగ ప్రీతిబొందుదురు. అట్టివారికి భక్తిమార్గమును గీత ఉపదేశించి, దానినే చేబట్టి ముక్తిని బడయుడని ప్రోత్సహించుచున్నది. కనుకనే భక్తియోగము అను అధ్యాయమును అట్టి సంస్కారము కలవారికి ప్రత్యేకముగ గీత ఏర్పాటు చేసియున్నది. అట్లే కొందఱిమనస్సు ఉపాసనాశీలమై (meditative) వర్తించుచుండును. అట్టివారు నిరంతరము ధ్యానమునందాసక్తి గొనుచుందురు. బహిర్ముఖ వ్యవహారములం దాసక్తిలేక, చిత్తమును సర్వదా అంతర్ముఖమొనర్చి ధ్యాననిష్ఠను శీలించుటయందే వారు ప్రయత్నవంతులై యుందురు. అట్టివారికొఱకు గీత ధ్యానయోగము, లేక ఆత్మసంయమయోగము అను అధ్యాయమును ప్రత్యేకించినది. వీరు ముువ్వురును గాక మఱికొందఱు కలరు. వారు జ్ఞానులు. వారి చిత్తము సదా విచారణాపరమై (Rational) వర్తించును. వారు సత్యాసత్యములను, ఆత్మానాత్మలను, క్షేత్ర క్షేత్రజ్ఞులను చక్కగ వివేచించి చూచుదురు. వారికి ధీశక్తి (Will power) ఎక్కువగనుండును. అట్టి స్వభావముకలవారికి గీత జ్ఞానయోగము, క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము మున్నగు అధ్యాయములను ప్రత్యేకించి చెప్పినది.

★ గీతాజ్ఞానముపాశ్రిత్య త్రీన్లోకాన్పాలయామ్యహమ్. (గీ.మా)

ఈ ప్రకారముగ ప్రపంచములో గల భిన్నభిన్న మనస్తత్త్వములు కలవారి నందఱిని గీత సంతృప్తిపఱచి, అందఱికిని మోక్షమార్గము నుపదేశించి సర్వపథములు సత్యములేయని నిరూపించి పరస్పర విద్వేషమును, వైమనస్యమును రూపుమాపినది. ఇవ్విషయమున శ్రీ వివేకానందస్వామి వచించిన వ్యాకము లుల్లేఖింపదగినవి - 'The reconciliation of the different paths of Dharma and work without desire or attachment are the two special characteristics of the Gita!" - అనగా సర్వయోగ సమన్వయము, నిష్కామకర్మ - అను నీ రెండును గీతయొక్క ప్రముఖలక్షణములు! ఇట్టి సమన్వయభావము గలిగియున్నందువలననే, అన్ని సంప్రదాయములవారును గీతయెడల మిక్కుటమగు ఆదరమును ప్రదర్శించుచుందురు. అద్వైతమతప్రతిష్ఠాపకులైన శంకరాచార్యులు గీతను శ్లాఘించిరి. విశిష్టాద్వైతప్రవర్తకులగు రామానుజ లద్దానిని కొనియాడిరి. ద్వైతమతస్థాపకులైన మధ్వాచార్యులు దానికి జోహారు లర్పించిరి. శైవమతప్రతిష్ఠాపకులగు శ్రీకంఠశివాచార్యులు దానిని ప్రశంసించిరి. ఈ ప్రకారముగ వివిధయోగములతో గూడి వివిధమార్గముల నుపదేశించుచు భిన్నభిన్న తత్త్వములను ప్రతిపాదించుచు, తుదకన్నిటిని సమన్వయపఱచి, ఒకే లక్ష్యమగు పరంధామమునకు జీవులను చేర్చునట్టి అద్భుతకౌశలముతో గూడిన గ్రంథరాజమే గీత. యోగము లన్నిటిమధ్య చక్కని పొందికను, చక్కని సమత్వము (Balance) ను అది కాపాడినది. ఇదివఱలో తమతమ మార్గమే గొప్పదని వాదులాడువారి కందఱికిని గీత చక్కని గుణపాఠము బోధించి, వారిలో వారు తగవులాడుకొనుట కేవలము మూర్ఖత్వమే యనియు, అహంకారమును రూపుమాపి ఆత్మానుభూతిని కలుగజేయుటయే అన్ని మార్గములయొక్క ఏకైకలక్ష్యమనియు ముక్తకంఠముతో తెలిపెను. ఈ ప్రకారముగ జనులందఱిమధ్య మతము లన్నిటిమధ్య పరిపూర్ణమగు సమరసత్వమును స్థాపించుట యనునది గీత సాధించిన ఘనవిజయములలో నొకటియని పాఠకులు గుర్తెఱుగుదురుగాక !

## గీతయందు సర్వభూతదయ

గీతయందు కలది వాచావేదాంతము కాదు. అనుష్ఠానవేదాంతము. ప్రతి చిన్న విషయమునందును అది ఆచరణపైనే (Practical side) మొగ్గుచూపుచుండును. హృదయపరిపాకము లేనిదే మోక్ష మెవరికిని చేకూరదని గీతాచార్యులమతము. చిత్తము రజోగుణ తమోగుణాత్మకమై, కఠినముగ నున్నంతవఱకు పైపైన ఎన్నిపూజలు చేసినను, ఎన్నిస్తోత్రములు వల్లించినను, ఎన్ని ధ్యానములాచరించినను మోక్షము చేకూరనే చేకూరదు. పరప్రాణిపై దయ, కరుణ వర్షించునపుడే యోగము, భక్తి, ధ్యానము, జ్ఞానము, మున్నగునవి అభివృద్ధినొందగలవని నిశ్చయింపవలెను. భగవంతునిపై భక్తిగలిగి జీవరాసులపై ద్వేషము కలిగియున్నచో ఆ భక్తికి అర్థమే లేదు. అది భగవంతునికి గావింపబడు ఉపచారము కాదు. అపచారమే యగును.

**'సర్వజీవ తిరస్కారః కేశవం ప్రతి గచ్ఛతి'** అని యనునట్లు ఏ జీవిని తిరస్కరించినను, బాధించినను భగవంతుని బాధించినట్లే యగును. ఏలననగా సమస్తజీవకోట్లున్ను విరాడ్రూపుడగు పరమాత్మయొక్క అవయవములు. ఏ ఒక్క అవయవము బాధింపబడినను, మూలమునకు దెబ్బతగులును. కావున సర్వభూతదయ అనునది యోగములన్నిటికిని పరమావశ్యకమైన అంగము. ఈ సత్యమునే భగవద్గీత ప్రారంభమునుండి అంతమువఱకు పదేపదే ఉద్ఘాటించుచు వచ్చినది. సందర్భము దొరికినపుడెల్ల జీవకారుణ్యమును భగవానుడు నొక్కి చెప్పుచుండిరి.

**(1) అద్వేష్టా సర్వభూతానాం**

**(2) సర్వభూతహితేరతాః**

**(3) నిర్వైరస్సర్వభూతేషు**

మున్నగు విశ్వప్రేమసూచక వ్యాకములెన్నియో గీతయందు కానుపించుచున్నవి. 'సర్వభూత' అని ప్రయోగించుటవలన, మానవకోట్లనేకాక సమస్త జీవకోటిని ప్రేమించవలెనని, దానియెడల దయగల్గి వర్తించవలెనని బోధపడుచున్నది. శ్రీకృష్ణమూర్తి భూతకోట్లహితమునుగూర్చి ఇంత అధికముగ ప్రస్తావింపనేల? కేవలము ధ్యానము, పూజ, జపము, యోగము, విచారణ బోధించినచాలదా? అని ప్రశ్నించిన, చాలదనియే చెప్పవలసియుండును. మందు తిని పథ్యమాచరించనిచో వ్యాధి యెట్లునయముకాదో, అట్లే భగవంతుని పూజించి, భగవత్స్వరూపులగు జీవకోట్లను ద్వేషించినచో భవరోగమెన్నటికిని శమింపజాలదు. కావున మందు, పథ్యము రెండును అవశ్యకములేయగును. ఈ సత్యమునే భగవాను డీక్రింది శ్లోకమునందు చక్కగ నిరూపించియున్నారు -

**మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సఙ్గవర్జితః**
**నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాణ్డవ.** (11-55)

"ఎవడు దైవకార్యములు, దైవధ్యానము, దైవభక్తి, దైవజ్ఞానములతోబాటు సమస్త ప్రాణుల యెడల దయ గలిగియుండునో ఆతడు నన్ను పొందును." ఇంతియేకాదు. 'పంద్రెండవఅధ్యాయములో భక్తుని గుణములనుగూర్చి ప్రస్తావించుచు మొట్టమొదటనే 'అద్వేష్టాసర్వభూతానాం' (సమస్తప్రాణికోట్లయెడ ద్వేషములేకుండుట) అను సుగుణ రాజమును పేర్కొనియున్నారు. ఈ ప్రకారము బోధించుటలోగల యాంతర్యమేమి? భక్తియొక్కయు, యోగముయొక్కయు, జ్ఞానముయొక్కయు వాస్తవస్వరూపమును బోధించుటయే యగును. సర్వము భగవత్స్వరూపముగ వీక్షింపగల్గుటను అభ్యసింపజేయుటయే యగును. భక్తి, జ్ఞానాదుల యథార్థస్వరూపమును వెల్లడించుటయే యగును. వెయ్యేల, అనుష్ఠానవేదాంతమును ప్రోత్సహించుటయే యగును. భాగవతమున సుదాముడు శ్రీ కృష్ణమూర్తిని మూడు విషయము లర్థించెను - "(1) నీ పాదకమల సేవయు (2) నీ పాదార్చకులతోటి నెయ్యమును (3) నితాంతాపారభూతదయయు" - వీనిలో మూడవదియగు భూతదయ మొదటి రెండింటికిని బలమును చేకూర్చుచు వాని ప్రకాశమును ద్విగుణీకృత మొనర్చుచున్నది. కావున ముముక్షువుల కయ్యది అత్యావశ్యకమైన అంగముగా పరిగణింపబడినది. అది లేనిది భక్తి జ్ఞానాదులన్నియు నిస్తేజములై, నిర్వీర్యములైయుండగలవు. ఇదియంతయు గుర్తించియే శ్రీ కృష్ణభగవానుడు భూతదయయను మహోత్కృష్టసుగుణమునకు గీతలో సముచితస్థాన మొసంగి గౌరవించిరి.

## గీతయందు సమత్వము

గీతయందలి మఱియొక ప్రధాన విషయము సమత్వబోధ. మనస్సు నిశ్చలముగ, సమరూపమున నున్నపుడే అధిష్ఠానాత్మస్వరూపము చక్కగ సాక్షాత్కరింపబడును. నిశ్చల నిర్మలజలమున సూర్యప్రతిబింబము స్ఫుటముగ కనిపించునట్లు, మనస్సు అచంచలముగ నున్నపుడుమాత్రమే బ్రహ్మానుభూతి, ఆత్మానందము లెస్సగ కలుగుచుండును. కనుకనే గీతయందు భగవానుడు మనస్సుయొక్క సమస్థితినిగూర్చి విశేషముగ బోధించుచువచ్చి ముముక్షువు లట్టి చిత్తసామ్యమును తప్పక అవలంబించవలెనని హెచ్చరికచేసిరి. యోగమనగా అన్యమేమియు కాదనియు, 'చిత్తము నిశ్చలముగ నుండుటయే యోగ' మనియు ఉద్బోధించిరి. (సమత్వం యోగ ఉచ్యతే). "ఓ అర్జునా! సుఖదుఃఖములందును, మానావమానములందును, శీతోష్ణములందును, నిందాస్తుతులందును, లాభాలాభములందును, జయాపజయములందును, సమబుద్ధి గలిగి యుండుము. అట్టి సమబుద్ధిగల ధీరుడే మోక్షము నొందగలడు. ఎవరి మనస్సు సమత్వమునందు స్థితి

గల్గియుండునో వారీ జీవితమునందే ప్రకృతిని జయించినవారగుదురు. వారే పరమానందము ననుభవించుదురు"★ అని యీ ప్రకారముగ గీతాచార్యులు సాధకులకు అత్యంతోపయుక్తమైన సమత్వధర్మమును విశేషముగ ప్రోత్సహించిరి. జనులలో పెక్కురు మోక్షము నభిలషించువారే కాని ఆ మోక్షమునకు ప్రతిబంధకముగనున్న చిత్తమును సరిదిద్దుకొనుటకు యత్నింపకయేయున్నారు. కోతివలె చపలమై, సంసారక్షేత్రమున ఏర్పడుచుండు ఒడుదుడుకులకు ఎగిరెగిరిపడుచు, ఎవరైన స్తుతించునపుడు ఉబ్బిపోవుచు, తిట్టునపుడు క్రుంగిపోవుచు ఏతాము బానవలె ప్రవర్తించుచుండు మనస్సులతో పరమార్థలక్ష్యమును జను లెట్లు పొందగలరు? అసాధ్యము. కనుకనే శ్రీ కృష్ణపరమాత్మ గీతయందు సమత్వము నెక్కువగ బోధించి, ఎట్టి సాంసారిక వికట పరిస్థితియందైనను సమభావమును చిత్తము వీడరాదని యుపదేశించిరి.

విశ్వమంతయు ఒకే భగవత్స్వరూపము. ఇట భిన్నత్వము లేదు. అజ్ఞానము వలననే అనేకత్వము గోచరించుచున్నది. కాని వాస్తవముగ అది సత్యము కాదు. విశ్వరూపసందర్శనయోగమందీ రహస్యము బాగుగ తేటతెల్లమొనర్పబడినది. అంతయు ఒకే విరాడ్రూపము. విభక్తము చేయుటకు వీలుపడని ఒకే దైవతత్త్వ మీ ప్రపంచమున కలదు. తునకలు చేయుటకు వీలుపడని వస్త్రమిది. కాబట్టి చరాచరప్రాణికోట్లయందెవరిపైనను ద్వేషము ఉండరాదు. అందఱియెడలను సమదృష్టి కలిగి యుండవలెను. శత్రుమిత్రాదులందును సమభావమును ప్రదర్శించవలెను - అని గీత ప్రకటించుచున్నది. ఇంతియేకాదు. బ్రాహ్మణునియందును, గోవునందును, ఏనుగు నందును, కుక్కయందును, చండాలునియందును గూడ సమదృష్టి వర్తింపవలెనని గీత యాదేశించుచున్నది. @ గీతయొక్క మహిమ ఇచటనే యున్నది. మానవమాత్రుననేకాక, సమస్త జంతుజాలమును గూడ ప్రేమచే కౌగిలించు కొనుచున్నదిగీత. "ఓ జీవుడా ! నీ ప్రేమను, దయను పుణ్యాత్ములపైననేకాక పాపాత్ములపైనగూడ వర్షింపుము. మానవులపైననే కాక దానవులపైనగూడ వెదజల్లుము. ద్విపాదులపైననే కాక చతుష్పాదులపైనగూడ విస్తరింపజేయుము. నిన్ను నీవెట్లు ప్రేమించుకొనుచున్నావో అట్లే యితరులనుగూడ ప్రేమింపుము. సుఖస్థితియందును, దుఃఖస్థితియందును నీతో సమానముగ నితరులను పరిగణించుకొనుము● అని గీతాచార్యులు జనుల నాదేశించుచున్నారు.

సామాన్యముగ లోకములో 'సౌభ్రాతృత్వము' ఒక గొప్ప సుగుణముగ చెప్పబడుచుండును. 'నీవు నీ సోదరునివలె ఇతరుని ప్రేమింపుము' అని పెద్దలు చెప్పుచుందురు. కాని గీత దానికంటె ఇంకొక మెట్టు

★ (1) సమ దుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే (2-5)
(2) సుఖదుఃఖే సమేకృత్వా...నైవం పాప మవాప్స్యసి (2-38)
(3) సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వ యోగ ఉచ్యతే (2-48)
(4) ఇహైవ తైర్జితః సర్గో యేషాం సామ్యే స్థితం మనః (5-19)

@ 1. విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
శునిచైవ శ్వపాకే చ పణ్డితాః సమదర్శినః (5-18)

● 1. ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున
సుఖం వా యది వా దుఃఖం సయోగీ పరమో మతః (6-32)
2. సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థ ద్వేష్యబన్ధుషు
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే. (6-9)
3. సమలోష్టాశ్మకాఞ్చనః ...... (14-24)
4. సమశ్శత్రౌ చ మిత్రేచ ...... (12-18)

పైకిపోయినది. విశ్వసౌభ్రాతృత్వమును దాటి ఆత్మౌపమ్యస్థితిని అది చేరుకొనినది. దానినే అది వర్ణించినది. వాస్తవముగ అదియే ఆదర్శవంతమైనది. ఏలననిన, సోదరుడు సోదరుడు ఎపుడైన కలహించుకొనవచ్చును. కాని తన్ను తాను ఏకాలమందును ద్వేషించుకొననేరడు. కాబట్టి తనయందువలె ఇతరులపై దయగలిగి యుండవలెనని బోధించుట సర్వోత్తమధర్మము కాగలదు. ఇట్టి ఆత్మౌపమ్యదృష్టిని దిగ్దర్శనముచేసిన మతములు లోకములో చాల తక్కువ. విశ్వసౌభ్రాతృత్వమువఱకే అవి పోగల్గినవి. కాని హైందవమతము ఉపనిషత్తులందును, గీతాది సద్గ్రంథములందును -

**సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని**
**ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః** (6-29)

అనునిట్టి సర్వాత్మత్వ ప్రబోధముల ద్వారా ప్రేమయొక్క పరిధిని విస్తరింపజేసినది. ప్రపంచములోగల ఇతరమతములు "నీ తోటివానిని ప్రేమించుము" అని బోధించినవే కాని 'ఎందులకు ప్రేమించవలెను?' అను ప్రశ్నకు సరియయిన సమాధానము నీయలేదు. అందుచేత విజ్ఞానవేత్తలకు (Scientists), భౌతికశాస్త్రజ్ఞులకు మతముపై విశ్వాసము సరిగా కలుగుటలేదు. హేతువాదము (Logic) నెదుర్కొనలేని మతము కుంటిదని వారు చెప్పుచున్నారు. ఫలాని కార్యమును ఎందుకు చేయవలెను? ఫలాని ధర్మము నెందుల కాచరించవలెను? ఫలాని వ్యక్తిపై ఎందుకు ప్రేమను ప్రదర్శింపవలెను? అను ప్రశ్నలకు సమాధాన మొసంగలేని మతముగాని, సంప్రదాయముగాని అపూర్ణమేయగునని వారు చెప్పుచున్నారు. పదార్థవేత్తల గావించు ఈ సవాల్ ను పరమార్థవేత్తయగు శ్రీకృష్ణుడు ఎదుర్కొనిరి. గీతయందు వారు వారి ప్రశ్నలకు సరియైన సమాధాన మొసంగిరి (ఆత్మౌపమ్యేన ... మున్నగు శ్లోకములద్వారా). అంతటను ఒకే ఆత్మ (తానే) వ్యాపించియుండ, సర్వజీవులయందును తానే భాసించుచుండ ఇక ఒకరిపై ద్వేష మెట్లు కలుగగలదు?- అని వారు నిలదీసి ప్రశ్నించిరి. ఈ ప్రకారముగ శ్రీ కృష్ణభగవానుడు గీతయందు ముముక్షువుల కత్యావశ్యకమైనట్టి 'సమత్వ' ధర్మమును సహేతుకముగ ప్రతిపాదించి సాధకలోకమునకు మహోపకృతిని ఒనగూర్చిరి.

## గీత యందలి క్రొత్తపోకడలు

### యజ్ఞాదిపదములకు నూతనార్థము :-

గీతయందు కొన్ని కొన్ని క్రొత్తపోకడలు కలవు. ఇదివఱలో శాస్త్రకారులు ప్రవచించిన భావములకు, పదములకు, గీతయందు, నూతనరూపు ఒసంగబడెను. దానిచే సమాజములో గొప్ప ఉత్తేజము, క్రాంతి గల్గెను - అది జనులలో చక్కని శుభపరిణామమునకు దారితీసెను. యజ్ఞము, త్యాగము, యోగము, సన్న్యాసము, తపస్సు మున్నగుపదములు గీతయందు నూతనార్థమును గ్రహించినవి. ఆ యా పదములకు పూర్వమెట్టి యర్థముకలదో, గీతాచార్యులు వాని నెట్లు మార్చివైచిరో సంక్షేపముగ నిచట విచారించెదము. ఏలననగా ఆ యా యజ్ఞ, సన్న్యాసాదులు జనులకు అందుబాటులో లేనందుచే ఏ ఒకానొకరో తప్ప జనసామాన్యము వానిని గ్రహించలేకయుండెను. కాని శ్రీ కృష్ణభగవానుడు వాని యథార్థస్వరూపమును బయటపెట్టి, వాని నిజార్థమును వివరించి జనుల గుండెబరువును దింపివైచిరి. మఱియు ఆ యజ్ఞసన్న్యాసాదులను అందఱియొక్క సొత్తుగ చేసివైచిరి. కావును అట్టివానిని గుఱించి ఒకింత విచారించుట భావ్యము.

**యజ్ఞము. :-**

సామాన్యముగ యజ్ఞమను పేరు వినగానే 'ఇది అందఱికిని అలవియైన పని కాద'ను ఊహ జనించుచుండును. ధనబాహుళ్యము, జనబాహుళ్యము కలిగిన ఏ మహారాజులో పూర్వము దాని నాచరించుచుండెడివారు. అంగబలము, అర్థబలము ఉండినమాత్రమే యాగక్రియ సంభవమగు చుండెడిది. హోత, ఉద్గాత మొదలైనవారు, ఋత్విక్కులు, పండితులు, శాస్త్రపరిచయము కలవారు, ధనధాన్యములు, ఎంతయో క్రియాకలాపము - ఇదియంతయు యజ్ఞమునందు అవశ్యకమైయుండెను. ఇక ఫలితము చూతమా అతిస్వల్పము. కామ్యకర్మకనుక దాని ఫలిత మెపుడును న్యూనముగనే యుండును. శాశ్వతమగు మోక్షము దానివలన ఎన్నడును చేకూరదు. ఇది యంతయు ఆలోచించి శ్రీ కృష్ణభగవానుడు సర్వులకును అందుబాటులో నుండునదియు, ఎక్కువ శ్రమలేనిదియు, పండితులకు, పామరులకు, ధనికులకు, దరిద్రులకు, పురుషులకు, స్త్రీలకు, బ్రాహ్మణులకు, చండాలురకు, సర్వులకును ఆచరణయోగ్యమైనదియు, ధనవ్యయము లేనిదియు, జనసంబంధము కలిగియుండనిదియునగు ఒకానొక యజ్ఞమును కనిపెట్టిరి. అదియె నిష్కామకర్మ. కర్తృత్వములేకుండ చేయబడు ప్రతికార్యము ఒక మహాయజ్ఞమే యగును. దైవస్మృతిలో నాచరింపబడు కార్యమంతయు యజ్ఞక్రియగా మారిపోవును!- అని భగవానుడు గీతయందు తెలిపిరి. ఆ సూత్రము ననుసరించి ఇక మనుజుడు తన దైనందిన వ్యవహారమంతను పవిత్రమగు యజ్ఞముగా మార్చుకొనుటకు వీలున్నది. అర్జునుడు శ్రీకృష్ణపరమాత్మను ఎదురుగ పెట్టుకొని వారినే స్మరించుచు ఘోరసంగ్రామమునుగూడ సాత్త్వికమగు యజ్ఞముగ మార్చుకొనెను.

1. **యజ్ఞానాం జపయజ్ఞో ఽస్మి** (10–25)
2. **స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయః సంశితవ్రతాః** (4–28)

ఈ ప్రకారముగ గీతాచార్యులు జపము, స్వాధ్యయనము, ఆహారసంయమము మున్నగు సామాన్యక్రియలను గూడ యజ్ఞములుగ పేర్కొనిరి.

భగవానుడు తెలిపిన ఈ యజ్ఞములను ఎవరైనను ఆచరించవచ్చును. డబ్బు ఖర్చులేదు. ఎక్కువ పరిశ్రమ లేదు. ఫలమా అపారము. కర్మబంధమును త్రుంచి, అవల పారవేయగల అమోఘశక్తి ఆ యజ్ఞములకు కలదు. అట్లు యజ్ఞరూపముగగాక తదితరముగ నాచరింపబడు కర్మయంతయు జీవునకు బంధమునే కలిగించును★. కాబట్టి భగవానుడు చూపిన ఈ సులభోపాయముద్వారా ప్రతివారు వారి వారి నిత్యకర్మలను, వ్యవహారములను కర్తృత్వరహితముగ, ఈశ్వరార్పణబుద్ధితో నాచరించుటద్వారా యజ్ఞక్రియలుగా మార్చుకొని కర్మబంధమునుండి తప్పించుకొనవలెను. లేనిచో జీవితము భారభూతమై వర్తించును. మఱియు కర్మరాశి పెరిగి జననమరణరూపసంసారమును దృఢతరము గావించును. ఇవ్విధముగ శ్రీ కృష్ణపరమాత్మ సర్వజీవులున్ను తరించుటకై యజ్ఞపదమునకు నూతనరూప మొసంగి, కఠినమగు ఆ క్రియను సులభతరమొనర్చి ద్విగుణీకృతఫలవంతముగావించి జనసామాన్యమునకు మహోపకృతి నొనగూర్చిరి.

**త్యాగము, సన్న్యాసము: -**

త్యాగమనగా అంతయు వదలివేయుటయనియు, సన్న్యాసమనగా ఇల్లు, వాకిలి, భార్యాపుత్రులు,

★ యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబన్ధనః (3-9)

బంధువులు, ఆస్తిపాస్తులు మున్నగువానినన్నిటిని తొలగించుకొని కాషాయ వస్త్రము ధరించి అరణ్యములకు బోవుటయనియు ఇదివరలో తలంచు చుండెడివారు. కనుకనే అట్టి త్యాగము, అట్టి సన్న్యాసము జనులలో అరుదుగా కానిపించుచుండెడిది. కాని శ్రీ కృష్ణమూర్తి ఆ రెండు పదములకును విశాలమగు అర్థమును సృష్టించి, అన్ని ఆశ్రమములవారికిని అందుబాటులో నుండునట్లు చేసిరి.

1. **సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః** (18–2)
2. **యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే.** (18–11)

ఇత్యాది ప్రమాణములద్వారా కర్మఫలమును ఈశ్వరార్పణముగ వదలుటయే త్యాగమని గీతాచార్యులు నుడివిరి. కాబట్టి ఈ త్యాగము సర్వులకును ఆచరణ యోగ్యమై యొప్పుచున్నది. అట్లే సన్న్యాసమునకున్ను గీతాచార్యులు చక్కని అర్థమును బోధించిరి. ఎట్లనిన,

1. **అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః**
   **స సన్న్యాసీ చ యోగీచ న నిరగ్నిర్నచాక్రియః.** (6–1)
2. **కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః** (18–2)

"అగ్నిహోత్రమును వదలుటకాని, ఏపని చేయక ఊరకయుండుటగాని సన్న్యాసము కానేరదు. ఫలము నాశ్రయించక కర్మలను చేయుటయే సన్న్యాసము. కామ్యకర్మలను వదలుటయే సన్న్యాసము" –(The Sannyasa of Gita is all work, yet no work) – అని భగవానుడు గీతయందు స్పష్టముచేసిరి. ఓహో! ఎట్టి సులభతరమగు సన్న్యాసము! గృహపరివారములను త్యజించనక్కఱలేదు. భార్యాపుత్రులను వదల నవసరములేదు. ఉద్యోగమునకు తిలాంజలి నివ్వనక్కఱలేదు. కాషాయాంబరమును ధరింపనవసరములేదు. దండకమండలువులను స్వీకరింప నగత్యములేదు. విజనప్రదేశములకు బోనక్కఱలేదు. ఎక్కడ ఉన్నవారు. అక్కడే ఉండవచ్చును. ఏ పని చేయువారు ఆ పని చేసికొనవచ్చును. క్రియలందు కర్తృత్వబుద్ధిమాత్రము వదలిన చాలును. కామ్యబుద్ధిని అంతమొందించిన చాలును. అదియే సన్న్యాసము – అని శ్రీ కృష్ణమూర్తి ఘంటాపథముగ చాటివైచిరి. గీతయందలి ఈ సన్న్యాసమును గృహస్థులుకూడ ఆచరించవచ్చును. స్త్రీలుకూడ ఆచరించవచ్చును. వెయ్యేల, సర్వులున్ను ఆచరించి తరించవచ్చును.

**యోగము :–**

ఇక యోగమను పదమునకు గీత యెట్టి వ్యాఖ్య గావించెనో చూతము. ఇదివరలో యోగమను శబ్దము వినగానే, అదియేదియో అష్టాంగయోగమనియో, హఠయోగమనియో జనులు భావించుచుండిరి. కాని గీతాచార్యులు యోగమునకు సులభతరమగు నిర్వచనమును గావించిరి. ఎట్లనిన –

**(1) సమత్వం యోగ ఉచ్యతే** (2–48)
**(2) యోగః కర్మసు కౌశలమ్** (2–50)

"కార్యము ఫలించినను, ఫలింపకున్నను చిత్తమునందు సమస్థితిని గలిగియుండుటయే యోగము. మఱియు కర్మలందలి (ఫలాపేక్షను వదలివేయునట్టి) నేర్పరితనమే యోగము" అని శ్రీకృష్ణుడానతిచ్చిరి. జీవుని శివునితో నైక్యమొనర్చుటకు సహాయపడు ప్రతి క్రియయు యోగమేయగును (యుజ్యత ఇతి యోగః). ఈ ప్రకారముగ కర్మ, భక్తి, ధ్యానము, జ్ఞానము, మొదలైనవి అన్నియును యోగములేయగును.

కనుకనే కర్మయోగము, భక్తియోగము, ధ్యానయోగము, జ్ఞానయోగము అని పేర్కొనబడుటకు కారణము. కాబట్టి యోగాభ్యాసమున కెవరును భయపడనవసరము లేదనియు, కర్మలందు ఫలాపేక్షను వదలువారందఱున్ను, చిత్తమునందు సమత్వమును కాపాడుకొనువారందఱున్ను యోగులేయనియు, అధికముగ జెప్పనేల, దైవప్రాప్తికి సహాయపడు ఏ కార్యముచేసినను అతడు యోగియే యనియు గీత కరుణతో నుపదేశించుచున్నది.

**తపస్సు :-**

అట్లే పూర్వము తపస్సు అనుమాట వినగానే జనులు దద్దరిల్లి పోవుచుండిరి. తలను క్రిందబెట్టి కాళ్లు పైకి జాచి మండుటెండలో మలమల మాడుచు, లేక వర్షములో తడియుచు అన్నాహారములను వర్జించి, రోజులు, నెలలు తరబడి కాలక్షేపము చేయుటయే తపస్సు అని జనులు తలంచుచుండెడివారు. ఇట్టి భీతావహము ప్రజలలో వ్యాపించియున్న కారణముచేతనే ఆ తపస్సుజోలికి సామాన్యముగ ఎక్కువమంది పోకయున్నారు. అయితే తపస్సుచేతనే పాపసముదాయము భగ్నమైపోవును. (తపసా కిల్బిషంహన్తి) వేఱుదారిలేదు అని ఒక వైపు శాస్త్రము ఉద్ఘోషించుటను వారు పరికించుచున్నారు. ఇట్టి స్థితిలో ఏమి చేయుటకును తోచక తికమక పడుచున్న జనానీకమునకు అభయమొసంగుచు శ్రీ కృష్ణభగవానుడు తపస్సు అను పదమునకు చక్కని నిర్వచనము గావించిరి. గీత 17వ అధ్యాయమందు - "ఓ సాధకులారా! ముముక్షువులారా! మోక్షమునకు తపస్సు అత్యావశ్యకమైనది. అయితే అది మీరు సామాన్యముగ భావించు క్లేశాత్మకమగు భయంకర తపస్సు కాదు. అది సర్వులకును ఆచరణయోగ్యమైన సులభసాధన. అది శారీరక, వాచిక, మానసికములను మూడు విధములుగ నొప్పుచున్నది. దేవతలు, బ్రహ్మనిష్ఠులు, గురువులు, ప్రజ్ఞాశీలురైన మహనీయులు మున్నగువారిని పూజించుట, శౌచము, ఋజుత్వము, బ్రహ్మచర్యము, అహింసమున్నగు సుగుణములు గలిగియుండుట శారీరకతపస్సు అనబడును. ప్రియముగ, సత్యముగ మాట్లాడుట, స్వాధ్యయనముగావించుట వాచికతపస్సు అనబడును. మనోనైర్మల్యము, మౌనము, ఆత్మసంయమము, భావశుద్ధి మానసిక తపస్సు అనబడును★- అని శ్రీ కృష్ణమూర్తి ఆనతిచ్చిరి. భగవానుడు తెలిపిన ఈ తపస్సు అందఱికిని అందుబాటులో నున్నదై, ఒకింత పరిశ్రమచే సర్వులకును లభ్యపడుచున్నది. ఇంద్రియములకు, మనస్సునకు జన్మజన్మాంతరములనుండే దుస్సంస్కార దుర్వాసనాబలమున పట్టిన మాలిన్యమును వదలగొట్టుటయే (గీత యందలి) తపస్సు. సూక్ష్మదేహమునకు పట్టిన బూజును దులిపివేయుటయే తపస్సు. అధికముగ జెప్పనేల, మట్టము బంగారమును తపింపజేసి మేలిమిగా మార్చునట్లు, ఇంద్రియ మనంబులను జ్ఞానాగ్నిచే తపింపజేసి వానియందలి మాలిన్యమును పారద్రోలుటయే తపస్సు. ఈ ప్రకారముగ భగవద్గీత యజ్ఞాది వివిధపదములకు నూతనార్థములను సృజించి జనులకు సులభతరసాధనలను జూపి వేదాంతమును జూచి భయపడి పారిపోయిన జనులనందఱిని తిరిగి రాబట్టుకొని, ఆధ్యాత్మిక క్షేత్రమును భక్తబృందములచే కళకళ లాడునట్లు కావించెను. గీత చేసిన ఇట్టిమేలు ఎన్నటికిని మఱువరానిది.

---

★ (1) దేవద్విజగురుప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవమ్
బ్రహ్మచర్యమహింసా చ శారీరం తప ఉచ్యతే. (17-14)

(2) అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చయత్
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే. (17-15)

(3) మనః ప్రసాదస్సౌమ్యత్వం మౌనమాత్మ వినిగ్రహః
భావసంశుద్ధిరిత్యేతత్తపో మానస ముచ్యతే. (17-16)

# గీతా స్వరూపము

గీత పదునెనిమిది అధ్యాయములతో గూడియున్నది. వేదమువలె నయ్యది కాండత్రయాత్మకముగ విభజింపబడినది. వేదములోని మొదటిభాగము కర్మప్రతిపాదకమగు సంహిత. రెండవభాగము ఉపాసనాప్రతిపాదకమగు బ్రాహ్మణము. మూడవభాగము విజ్ఞానప్రతిపాదకములగు ఉపనిషత్తులు. వేదములయొక్క సారమే గీత కావున అదియు త్రిభాగరూపముగ వెలయుచున్నది. త్రిషట్కముతో నలరారుచున్నది. అందు ప్రథమషట్కము కర్మయోగమును, ద్వితీయషట్కము భక్తియోగమును, తృతీయషట్కము జ్ఞానయోగమును ఎక్కువగ బోధించును. అయితే కర్మషట్కమందు భక్తిజ్ఞానములు, భక్తిషట్కమందు జ్ఞానకర్మలు, జ్ఞానషట్కమందు భక్తికర్మలు లేకపోలేదు. ఇది కేవలము స్థూలవిభజనమాత్రమే యగును. వాస్తవముగ విచారించినచో ఆ యా యోగములందు తక్కిన యోగములున్ను అంతర్భూతములై గౌణముగ నుండును. వానిని ప్రత్యేకముగ విడదీయుటకులేదు. జీవితమున కీమూడుయోగములున్ను (కర్మ, భక్తి, జ్ఞానములు) అత్యవసరములే యగును. జనకుని క్రియాశీలత్వము, బుద్ధుని మార్దవహృదయము, శంకరుని మేధాశక్తి మూడును మానవుని వ్యక్తిత్వమును తప్పక అలంకరించవలెను. (One should Possess the head of Shankara,the heart of Buddha and the hand of janaka). గీతయం దీయోగములన్నియు ఒకదానితో నొకటి పెనవేసికొని అన్నియుజేరి తుదకు జీవుని పరంధామమునకు జేర్చివైచుచున్నవి.

గీతయందు మొదటి అధ్యాయమంతయును, రెండవ అధ్యాయమందు 10వ శ్లోకము వఱకునుగల విషయము పూర్వపీఠిక యనబడును. గీతాబోధ వాస్తవముగ రెండవ అధ్యాయము 11వ శ్లోకమగు "అశోచ్యానన్వశోచస్త్వం" - అను చోటనుండి ప్రారంభమగుచున్నది. కనుకనే ఆశ్లోకము గీతయొక్క అఙ్గన్యాసక్రమములో బీజమని పేర్కొనబడెను. అట్లే అంతమున 18వ అధ్యాయమునందలి 73వ శ్లోకమునుండి చివఱివఱకు గల విషయము ఉత్తరపీఠిక యనబడును. అది అర్జున, సంజయవాక్యములతో గూడియున్నది. ఈ రెండునుగాక తక్కినది యంతయును శ్రీ కృష్ణపరమాత్మయొక్క బోధామృతధార. మధ్యమధ్య అర్జునుడు వేయు ప్రశ్నలు సాధకలోకము సామాన్యముగ నెదుర్కొనుచుండు సంశయపరంపరయే యగును. గీతాబోధ సంవాద రూపముగ నుండుటవలన సాధకుల సంశయములన్నియు అచ్చోట పరిష్కరింపబడుటకు చక్కని అవకాశమేర్పడినది.

గీతయందలి అన్నిఅధ్యాయములందును భగవత్తత్త్వము బోధింపబడినప్పటికిని 11వ అధ్యాయమున (విశ్వరూపసందర్శనయోగమున) అయ్యది ప్రత్యక్షముగ చూపబడినది. ఇది గీతయందలి మహావిశేషము. తత్త్వము యొక్క శ్రవణమాత్రము చాలదు. ప్రత్యక్షదర్శనము, ప్రత్యక్షానుభవముకూడ పొందవలసి యుండునని ఈ సంఘటనద్వారా గీత లోకమునకు చాటుచున్నది. ఉన్నతపాఠశాలలో రసాయనిక విద్య (Chemistry) బోధించునపుడు వాచాజ్ఞానము (Theory)తోబాటు అనుభవజ్ఞానము (Practical Course) న్ను ఎట్లు మేళవింపబడునో, అట్లే గీతయందు భగవానుడు దాదాపు మధ్యభాగములో తన స్వరూపమును అర్జునునకు ప్రత్యక్షముగ జూపి అనుభవవిజ్ఞానముయొక్క ప్రాధాన్యమును, ఆవశ్యకతను నొక్కి చెప్పిన వారైరి.

గీతయందు అనేక యోగములు బోధింపబడినప్పటికిని అన్నిటిని స్థూలముగ కర్మ యోగము, భక్తియోగము, ధ్యానయోగము, జ్ఞానయోగము అను ప్రధానములగు నాలుగు యోగములక్రింద విభజించుకొనవచ్చును. ఆ యా యోగములను గూర్చి చదువునపుడు "గీతయందిది మాత్రమే చెప్పబడినది.

భగవానుడు దీనినే సమర్థించుచున్నారు.” అని అనిపించును. కర్మయోగప్రియులకు కర్మయోగమే గీతయందు నొక్కి చెప్పబడినట్లు స్ఫురించును. అందుల కచట అనేక ప్రమాణములున్ను గోచరించును. అట్లే భక్తి యోగులకు భక్తియు, జ్ఞానయోగులకు జ్ఞానమున్ను తోచును. వాస్తవముగ గీతాచార్యులు అన్నిటిని సమానముగ బోధించి, అన్నిటిని చక్కగ సమన్వయపఱచి, మోక్షమునకు అన్నియును అవశ్యకములేయని వెల్లడిచేసిరి. ఎవరెవరి సంస్కారమెట్లుండునో వారు వారికి ప్రియమైనదాని నాశ్రయించుకొని తరించవచ్చునని కరుణతో నుపదేశించిరి. అయితే అన్ని యోగములు పరస్పరము ఒకదానితోనొకటి పెనవేసికొని యుండుటవలన, ఒకరు ఒక యోగము నవలంబించినను తక్కినవానినిగూడ పరోక్షముగ ప్రేమించిన వారే యగుదురు. ఈ సర్వయోగసమ్మిశ్రమణము (The yoga of Synthesis) సర్వయోగసమన్వయము, గీతయొక్క అద్భుత చమత్కారములలో నొకటియై యున్నది.

## గీతాతాత్పర్యనిర్ణయము

ఈ ప్రకారముగ గీతయందు అన్ని యోగములు సమర్థింపబడినప్పటికిని గ్రంథము యొక్క ముఖ్యతాత్పర్య మేమి? బోధకునిదృష్టి ప్రధానముగ దేనియందు కేంద్రీకరింపబడియున్నది? అను విషయము తేల్చుటకు విమర్శకులు పలువిధ యత్నములను గావించిరి. అందొకటి రెండుమాత్ర మిచట విచారించెదము – సామాన్యముగ గ్రంథముయొక్క తాత్పర్యమును నిర్ణయించుటకు ఆఱు ప్రమాణములచే తరచిచూచెదరు. వానినే షడ్విధలింగము లందురు. అవి క్రమముగ (1) ఉపక్రమోపసంహారములు (2) అభ్యాసము (3) అపూర్వత (4) ఫలము (5) అర్థవాదము (6) ఉపపత్తి అని చెప్పబడును. ఈ ఆఱు గురుతులనుబట్టి గీతయొక్క ప్రధానాశయమును తేల్చుటకు యత్నములు కావింపబడెను. కొందఱు శరణాగతి (భక్తి)యే గీతయొక్క ముఖ్యతాత్పర్యమని పైన దెలిపిన షడ్విధలింగములద్వారా పరీక్షించి చెప్పుచున్నారు. ఎట్లనిన –

**(1) (a) ఉపక్రమము :–**

**శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్.** (2–7)

“కృష్ణా! నేను మీకు శిష్యుడను. మిమ్ము శరణుజొచ్చితిని. ఆజ్ఞాపింపుడు” – ఈ ప్రకారముగ గీత శరణాగతితోనే ప్రారంభమైనది.

**(b) ఉపసంహారము :–**

**సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ** (18–66)

“సమస్త విషయములను విడిచి నన్నొకనినే శరణుబొందుము.” – ఇవ్విధముగ గీత శరణాగతితోనే అంతమైనది.

గీతమధ్యభాగములో – “అనన్యాశ్చిన్తయన్తో మాం ... యోగక్షేమం వహామ్యహమ్” – అను శ్లోకముద్వారా కూడ శరణాగతియే బోధింపబడినది – ఈ రీతిగ గీతయొక్క ఆదిమధ్యాంతములందును శరణాగతిరూపమైన భక్తియే ప్రోత్సహింపబడియున్నది.

**2. అభ్యాసము :–**

12వ అధ్యాయమందలి ‘మయ్యేవ మన ఆధత్స్వ ... నసంశయః’..

'అద్వేష్టా సర్వభూతానాం ...క్షమీ' మున్నగు శ్లోకములు

(1) యే యథా మాం ప్రపద్యన్తే.........

(2) మామేవ యే ప్రపద్యన్తే ........మొదలైన శ్లోకములు, 7,10,11,15 వ అధ్యాయములందలి మఱికొన్ని శ్లోకములు, భక్తి, శరణాగతులగూర్చిన అభ్యాసమును బోధించుచున్నవి.

**3. అపూర్వత్వము :–**

కర్మ, భక్తి, జ్ఞానము – అను మూడును అనేకచోట్ల చెప్పబడినప్పటికిన్ని, గీతయందు జ్ఞాన, కర్మ సహితమగు భక్తి ఎక్కువగ ప్రతిపాదింపబడినది. ఇదియే దాని అపూర్వత్వము.

**4. ఫలము :–**

భగవదాజ్ఞాపాలనమే ఫలము. 'కరిష్యే వచనం తవ' – దేవుని ఆజ్ఞానుసారము భక్తుడు కార్యమొనర్చును. ఇట భక్తియే ప్రధానముగ కానిపించుచున్నది.

**5. అర్థవాదము :–**

(1) 'స్వల్పమప్యస్య' ... ఈశ్వరార్పణముగ, భక్తిపూర్వకముగ చేయబడు కర్మ, లేక శరణాగతి ఒకింతైనను గొప్ప సంసారభయమునుండి విముక్తిని గలుగుజేయును.

(2) జనకాదుల దృష్టాంతము – భగవంతునకు సర్వసమర్పణము గావించి వారు కర్మలను జేసిరి.

**6. ఉపపత్తి (యుక్తి) :–**

మయ్యావేశ్య మనో యే మాం.... ..... మున్నగు శ్లోకములద్వారా భక్తినిగూర్చిన ఉపపత్తి (యుక్తి) చక్కగ బోధింపబడెను.

ఈ ప్రకారముగ షడ్విధలింగములద్వారా, ఇంకను గీతయందలి అనేక ప్రమాణములద్వారాను★ శరణాగతియే గీతయొక్క ముఖ్యతాత్పర్యమని కొందఱి అభిప్రాయమై యున్నది.

మఱికొందఱు నిష్కామకర్మయే గీతయొక్క ప్రధానాశయమని పలుకుచున్నారు. గీతయంతయు బోధింపబడిన పిదప అర్జును డేదిచేసెనో అదియే గీతయొక్క తాత్పర్యమని వారి నిశ్చయము. అకర్మణ్యుడై రథముపై చతికిలబడిన అర్జునుడు గీతాబోధచే ధైర్యోత్సాహములతో 'కరిష్యే వచనం తవ' (మీరు చెప్పినట్లాచరించెదను) అని పలికి రణరంగమున దుమికెనేకాని ఒక మూల కూర్చొని ఊరక కాలక్షేపము చేయలేదు. లేక సర్వసంగపరిత్యాగముచేసి సన్న్యాసమును గ్రహించి అరణ్యములకు పారిపోలేదు. ఫలాపేక్షారహితుడై

★ (1) భక్త్యా మా మభిజానాతి. . . (18-55)
(2) నాహం వేదైర్న తపసా. . . (11-53)
(3) భక్త్యాత్వనన్యయా శక్య. . . (11-54)
(4) తేషా మహం సముద్ధర్తా. . . (12-7)
(5) అహం సర్వస్య ప్రభవో. . . (10-8)
(6) మత్తః పరతరం నాన్యత్. . . (7-7)
(7) . . . భజస్వమామ్. (9-33)

కర్తవ్యకర్మ నాచరించెను. కాబట్టి నిష్కామకర్మాచరణమే గీతాశయమని వారు నొక్కి చెప్పుచున్నారు. మఱియు అందులకు వలసిన అనేక ప్రమాణములనుకూడ వారు గీతనుండి ఉదహరించుటకు సంసిద్ధులై యున్నారు.★

ఇక మూడవ పక్షమువారు జ్ఞానమే గీతయందలి ప్రధానవిషయమని నుడువుచున్నారు. అర్జునునకు కలిగిన శోకమునకు కారణమేమి? అజ్ఞానము, మోహము. ఆ అజ్ఞాన మెట్లుపోయినది? ఆమోహ మెట్లు అంతమైనది? "నష్టోమోహః; మోహోఽయం విగతోమమ" – 'నాఅజ్ఞానము తొలగిపోయినది' అని అర్జునుడు ఎట్లు చెప్పగల్గెను? జ్ఞానము వలననే. అజ్ఞానము జ్ఞాన మొకదానిచేతనే తొలగును గాని మఱిదేనిచేతను గాదు. చీకటి ప్రకాశ మొక్కదానిచేతనే విలయమగునుగాని వేఱొకదానిచేగాదు. అర్జునుడు శోకాకులితమానసుడయ్యెను. ఆ శోకము ఆత్మజ్ఞాన మొకదానిచేతనే రహితము కాగలదు.

**'తరతిశోక మాత్మవిత్'** 'ఆత్మవేత్తయే దుఃఖమును దాటగలడ'ని ఉపనిషత్తు లుద్ఘోషించుచున్నవి. కనుకనే శ్రీ కృష్ణభగవానుడు తొలుదొల్తనే రెండవ అధ్యాయమున అఖండమగు ఆత్మజ్ఞానోపదేశము నుపక్రమించిరి. గీతాచార్యులు నోరు విప్పగనే కర్మను బోధింపలేదు. భక్తిని ప్రతిపాదించలేదు. ధ్యానమును వర్ణింపలేదు. స్వస్వరూపస్థితినిమాత్రము వర్ణించిచెప్పిరి. పుట్టుక, చావు లేని ఆత్మనుగూర్చి వివరించిరి. 'ఓ అర్జునా! నీవు నశ్వరమగు పాంచభౌతికదేహపంజరము కాదు, విశ్వవ్యాపకమగు అఖండాత్మచైతన్యమవు' అని పదే పదే ఘోషింపదొడగిరి. ఆత్మజ్ఞానమొకటియే భవదుఃఖమును, సంసారబంధమును సమూలముగ తొలగించివేయ గలదు. కనుకనే శ్రీకృష్ణమూర్తి మొట్టమొదట దానిని బోధించిరి. ఇక పోనుపోను జ్ఞానమునుగూర్చి, జ్ఞానమహిమనుగూర్చి –

1. **సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే** **(4–33)**
2. **నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే** **(4–38)**
3. **జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్** **(7–18)**
4. **జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తిమచిరేణాధిగచ్ఛతి.** **(4–39)**

ఈ ప్రకారముగ లెక్కలేనన్ని ప్రమాణములను మధ్య మధ్య దొర్లించివేయుచు, తుట్టతుదకు గీతాంతమున –

**అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః**
**జ్ఞానయజ్ఞేన తేనాహ మిష్టస్యామితి మేమతిః.** (18–70)

అను గంభీర ఉపసంహారవాక్యమును పలికిరి. దాని అర్థము – "ధర్మమునుండి తొలగనిదియు, మన యిరువురి సంభాషణారూపమైనదియు నగు ఈ గీతాశాస్త్రము నెవడు అధ్యయనముచేయునో ఆతడు

---

★ (1) తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర (3-19)
(2) నియతం కురు కర్మత్వం కర్మ జ్యాయో హ్యకర్మణః (3-8)
(3) కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన (2-47)
(4) తయోస్తు కర్మసన్న్యాసాత్కర్మయోగో విశిష్యతే (5-2)
(5) కర్మణైవహి సంసిద్ధిమాస్థితా జనకాదయః (3-20)
(6) అసక్తోహ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః (3-19)

జ్ఞానయజ్ఞముచే నన్ను పూజించినవాడగుచున్నాడు." గ్రంథము యొక్క చిట్టచివర బోధ నంతటిని జ్ఞానయజ్ఞముగా భగవానుడు వర్ణించి చెప్పుటవలన గీతయొక్క నిష్కర్ష జ్ఞానమనియే తెలుచున్నది. మఱియు 'జ్ఞానీత్వాత్మైవ మే మతమ్ (7–18) – జ్ఞానికిని నాకును భేదములేదు. జ్ఞానిని నేనే' అని ఏడవ అధ్యాయమున భగవానుడు చెప్పియుండుటచే జ్ఞానికి, జ్ఞానమునకు ఎంతటి విలువను గీతాచార్యులు ప్రసాదించిరో స్పష్టమగుచున్నది. అర్జునునిపై గీతాబోధ ఏ ప్రకారము ప్రభావమును కలుగజేసెనో వెనువెంటనే జరిగిన సంఘటనలను జూచి మాత్రమే నిర్ణయించక, ఆ వ్యక్తియొక్క జీవితాంతమువఱకును పరీక్షించి నిశ్చయించుట సమంజసము. అర్జునుడు గీతను వినిన తరువాత కొంతకాలము గృహస్థాశ్రమమున నున్నప్పటికిని, వ్యవహార మాచరించినప్పటికిని, చివఱకు సర్వసంగపరిత్యాగముచేసి, సన్న్యాసము గైకొని, నిర్వికల్పధ్యాననిష్ఠకై ఏకాంతమునకు జనినట్లు భారతము స్వర్గారోహణపర్వమునందు కానంబడుచున్నది. కావున ఏనాటికైనను మనస్సు బహిర్ముఖత్వమునువీడి, అంతర్ముఖమై, స్వస్వరూపమగు ఆత్మయందు నిలుకడను బొందినపుడు మాత్రమే జీవుడు పూర్ణముగ తన లక్ష్యమును బడసినవాడగును.

**'ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చిన్తయేత్' (6–25)** ఇత్యాది ప్రమాణములు ఈ యర్థమునే విశదీకరించుచున్నవి. కాబట్టి ఎప్పటికైనను జ్ఞానమే శరణ్యము. జ్ఞానమే అత్యంతికదుఃఖరాహిత్యమును, పరమానందప్రాప్తిని కలుగజేయగలదు. 'సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే' అనునట్లు తక్కిన కర్మ, భక్తి, ధ్యానాదులన్నియు చిట్టచివఱకు జ్ఞానమునందే పర్యవసించుచున్నవి. ఆ కర్మాదులన్నియు చిత్తమును శుద్ధమొనర్చి, ఆత్మవిచారణకు అనువగు వాతావరణమును జీవునకు కల్పించుచున్నవి. తదుపరి ఆత్మవిచారణ లెస్సగ గావించి జీవుడు మోక్షము నొందుచున్నాడు. ఈ సత్యమునే ఈ క్రింది శ్లోకములద్వారా భగవానుడు చక్కగ నిరూపించియున్నారు.

**తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్**
**దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తి తే. (10–10)** 'నిరంతరము ప్రీతిపూర్వకముగ ఎవరు నన్ను భజించుదురో అట్టివారికి నేను (ఆత్మానాత్మవిచారణా సమర్థమగు) బుద్ధియోగము (జ్ఞానము) నొసంగెదను. దానిచే వారు నన్ను చేరుకొనగలరు.' భక్తి, నిష్కామకర్మ, ధ్యానము మున్నగునవి ఏ ప్రకారము జ్ఞానోద్భవమునకు సహాయకారులగునో, జ్ఞానముచేతనే నేరుగ మోక్ష మెటుల లభించునో పైశ్లోకము వివరించుచున్నది. తన స్వరూపమును తాను తెలిసికొనుటయే మోక్షము. ఆ తెలిసికొనుశక్తియే జ్ఞానమనబడును. అట్టి శక్తి అందఱికిని రాదు. భగవదనుగ్రహము కలవారికే లభించును. ఆ భగవదనుగ్రహమున్ను అందఱికిని రాదు. ఎవరు నిష్కామకర్మచేతను, భజన, సంకీర్తన, జపము, తపము, పరోపకారము మున్నగువానిచేతను పరమాత్మను బహుకాల మర్చించుదురో వారికే లభించును.

**భగవద్భక్తి యుక్తస్య తత్ప్రసాదాత్మబోధతః**
**సుఖం బన్ధవిముక్తిః స్యాదితి గీతార్థ సంగ్రహః.** 'భగవద్భక్తి (మఱియు నిష్కామకర్మాచరణము) కలవానికి భగవదనుగ్రహము లభించును. భగవదనుగ్రహము కలవానికి ఆత్మజ్ఞాన ముదయించును. ఆత్మజ్ఞానము కలవానికి సులభముగ బంధవిముక్తి చేకూరును. ఇదియే గీతాసారసంగ్రహము' – అని పెద్దలు నుడివిరి.

గీతాసారమేమి యని యొక మహనీయుని ప్రశ్నింప నతడు 'W3' అని బదులు చెప్పెను. అనగా W X W X W - Work, Worship, Wisdom – కర్మ, భక్తి, జ్ఞానము – కర్మచే భక్తి, భక్తిచే జ్ఞానము, జ్ఞానముచే మోక్షము అని అర్థము.

**కర్మణా జాయతే భక్తిః భక్త్యా జ్ఞానం ప్రజాయతే**
**జ్ఞానాత్ప్రజాయతే ముక్తిః ఇతి శాస్త్రార్థసంగ్రహః.**

'నిష్కామకర్మాచరణముద్వారా భక్తి జనించుచున్నది. భక్తి వలన జ్ఞానము ప్రాదుర్భవించుచున్నది. జ్ఞానముచే మోక్షము లభించుచున్నది - ఇదియే సర్వశాస్త్ర సిద్ధాంతసారసంగ్రహము' - అని మహాత్ములు వచించిరి. కాబట్టి అర్జునుని శోకమును రూపు మాపినట్టియు, మోహమును నశింపజేసినట్టియు జ్ఞానమే గీత యొక్క పరమావధియనియు, అదియే గీతాగ్రంథముయొక్క తాత్పర్యమనియు, కర్మ, భక్తి, ధ్యానాదిసాధనలన్నియు, క్రమముగ చిత్తశుద్ధి ద్వారా జ్ఞానమునే సముత్పన్న మొనర్చుననియు, మోక్షమునకు జ్ఞానమే సాక్షాత్సాధనమనియు, తక్కినవి పరంపరాసాధనములనియు నిర్ణయించుటయే సముచితమని తోచుచున్నది.

## గీతాబోధ

మానవుని దేవునిగ మార్చివేయగల శక్తిసామర్థ్యములు గీతాబోధకు కలవు. లేనిచో సామాన్యుడుగనున్న అర్జునుని 'మహాత్ముడు'గ మార్చివేయగల్గునా?★ ఒక్క క్షణములో జీవితాదర్శమంతయు అర్జునునకు చూపబడెను. శ్రీకృష్ణమూర్తి ధర్మ్యామృతమును వర్షించిరి. అర్జునుడు తనివితీర గ్రోలి కృతకృత్యుడయ్యెను. ఇవ్విధముగ క్షణకాలములో నొకవ్యక్తిని మోక్షశిఖరమునకు గొనిపోయిన ఆ గీతాబోధ యెట్టిదో విచారించుట అత్యావశ్యకమై యున్నది.

పాఠశాలలో ఉపాధ్యాయుడు విద్యార్థికి ఒక్కొక్క పాఠమును చక్కగ బోధించువిధమున కరుణామయులగు శ్రీ కృష్ణపరమాత్మ అర్జునుని చేయిపట్టుకొని ఒక్కొక్క మెట్టు పైకిలేపి కట్టకడకు మోక్షధామమున జేర్చివైచిరి. 'నాకు నమస్కరింపుము' (మాంనమస్కురు) అను చిన్న సాధన మొదలుకొని 'తత్త్వమసి' యను మహావాక్యముయొక్క విచారణవఱకుగల సాధనక్రమము నంతటిని భగవానుడు ప్రేమపూర్వకముగ అర్జుననకు బోధించివేసిరి. గీతది మాతృహృదయము. సంసారకూపమునబడి నానాయాతనల ననుభవించుచున్న జీవకోట్లయెడల అనుకంపచే గీతామాత వారికి చక్కని త్రోవలను జూపెను. మొట్టమొదట కర్మను బోధించెను. తృప్తి పడలేదు. మరల భక్తిని ప్రతిపాదించెను. దానితోను తృప్తిపడలేదు. మరల ధ్యానపద్ధతిని వివరించెను. దానితోను సంతుష్టి నొందలేదు. తదుపరి జ్ఞానము నుద్బోధించెను. ఇవ్విధముగ సర్వయోగములను ప్రతిపాదించి, బద్ధుని ముక్తునిగ జేసి, సక్తుని యుక్తునిగమార్చి గీతామాత సంతృప్తిని బొందినది. గీతయందు ప్రబోధింపబడిన ప్రధానములగు ఈ నాలుగు యోగములను గూర్చి సంక్షేపముగ నిచట విచారించెదము. దానిచే గీతాతత్త్వము ఒకింతైనను ఆకళింపుకాగలదు.

## గీతయందుకర్మయోగము

గీత సన్న్యాసులకే ఉపయోగపడగల గ్రంథమని యెవరును తలంపరాదు. అది గృహస్థులకుగూడ పనికివచ్చును. ఏకాంతమున గుహాగహ్వరములందు తపంబు సలుపు సాధుపుంగవులకే పనికివచ్చు వాఙ్మయమని దీని నెవరును భావింపరాదు. జనాకీర్ణపట్టణములందు పనిపాటలు చేసికొను కుటుంబీకులకు, వ్యాపారస్థులకు, వ్యవసాయదారులకు కూడ అక్కఱకువచ్చు శాస్త్రమిది. ఏలననిన, దీనియందు

★ పార్థస్య చ మహాత్మనః (18-74)

తక్కినయోగములతో బాటు కర్మయోగము చక్కగ బోధింపబడినది. వ్యవహారము సలుపుకొనుచు కూడ మోక్షము నందుకొనగలుగు విధానము దీనియందు రూపొందింపబడినది. ఇదివరలో వేదాంతము నిత్యజీవితమునందు కలవదని ప్రతీతి. వేదాంతమునకును వ్యవహారమునకును పొత్తు కుదురదని వాడుక. కాని గీతాచార్యులు ఆ ప్రథను త్రుంచివైచి - Religion must rule even worldly pursuits. ప్రపంచకార్యములను దైవభావనతో చేయవచ్చుననియు, ఆ ప్రకారమే చేయవలెననియు బోధించి, అంతకుముందు భౌతిక, ఆధ్యాత్మికరంగముల మధ్యగల బ్రహ్మాండమైన అఖాతమునకు చక్కని వారధిని నిర్మించిరి. ప్రవృత్తిలో నివృత్తిని బోధించిరి. సంసారమందు సన్న్యాసమును ప్రతిపాదించిరి. రథముయొక్క చక్రములు తిరుగుచున్నను ఇరుసు నిశ్చలముగ నెట్లుండునో, అట్లే శరీరము, ఇంద్రియములు లోకమునందు వివిధకార్యములందు ప్రవర్తించుచున్నను మనస్సు నిశ్చలముగ దైవమునందు నిలుకడ కలిగియుండుటను శ్రీ కృష్ణపరమాత్మ గీతయందు నేర్పిరి. ఇదియే కర్మయోగము.

**'యోగస్థః కురు కర్మాణి'** 'చిత్తమును దైవమునందు (ఆత్మయందు) నిలిపి మీ మీ కార్యములను చేసి కొనుడు! ఫలమును ఈశ్వరార్పణముగావించి, కర్తృత్వమును వదలి ఎన్ని కార్యములనైనను చేయుడు. అట్టి కార్యములచే మీకు బంధము కలుగదు' అని భగవానుడుపదేశించిరి. గణితశాస్త్రమునం దొక సిద్ధాంతము కలదు. అది యేది యనిన -

Infinity + Anything = Infinity 'అనంతమునకు ఏది జోడించినను తుదకు అనంతమే మిగులును. దైవము అనంతము. జ్ఞానము అనంతము. కాబట్టి దైవదృష్టికలిగి, ఆత్మజ్ఞానము గలిగి (దైవస్మరణతో లేక దైవార్పణబుద్ధితో) ఏకార్యమాచరించినప్పటికిని (అది లౌకికకార్యమైనను, పరమార్థకార్యమైనను సరియే). తుదకు దైవమే శేషించునుగాని కర్మబంధము కాదు. ఇదియే గీతాచార్యులు తెలిపిన కర్మయోగముయొక్క రహస్యము. అట్లుకాక దైవవిస్మరణతో ఏ కార్యమునుచేసినను, లేక ఫలాపేక్షతో ఏ క్రియ నాచరించినను అది జీవుని బద్ధునిగ చేయగలదు. అత్తఱి యాతడు కర్మబంధమున తగుల్కొనును.'

Work divorced of spirituality is an artificial flower which has neither life nor fragrance – 'దైవదృష్టిలేని కార్యము, పరమార్థత, పవిత్రత లేనిక్రియ వాసనగాని, జీవముగాని లేని కృత్రిమపుష్పమువంటిదేయగున'ని ఒక మహనీయుడు పలికెను. కాబట్టి కర్మగొప్పది కాదు. కర్మచేయు విధానము గొప్పది. ఏమి చేయవలెనో గీత బోధింపదు. ఎట్లు చేయవలెనో అది బోధించును. ఇదియే గీతయందలి విశేషము. ఈ సూత్రము ననుసరించి ఆ యా ఆశ్రమములవారు, ఆ యా సంప్రదాయములవారు వారివారి విధ్యుక్తధర్మములను, కర్మలను ఆచరించుకొనవచ్చును; వదలవలసిన పనిలేదు. గృహస్థుడు తన నిత్యకార్యములను, దైనందిన వ్యవహారములను చేసికొనవచ్చును. వ్యాపారి వ్యాపారము సలుపుకొనవచ్చును. ఉద్యోగి ఉద్యోగము చేయవచ్చును. రైతు పొలము దున్నుకొనవచ్చును. పాకీవాడు పాకీపని చేసికొనవచ్చును. పురోహితుడు పౌరోహిత్యము సలుపవచ్చును. క్షత్రియుడు యుద్ధము చేయవచ్చును. కాని (మామనుస్మర) దైవదృష్టికలిగి, దైవమును స్మరించుచు, ఫలాపేక్షలేక, ఈశ్వరార్పణబుద్ధితో చేయవలెను. ఇదియే గీత శాసించునది. అపుడు కర్మయందలి విషము (బంధజనకత్వము) తొలగగా సామాన్యక్రియ మహాపవిత్రక్రియగ మారిపోవును.

వ్యవహారమందు పరమార్థప్రయోగము (Vedanta in daily life) అను ఈ కళ గీతయందు విశేషముగ కానిపించుచున్నది. గీతకు విశ్వవ్యాపకత్వము కలుగజేసిన ధర్మమిదియే. జ్ఞానానంతరము నివృత్తి

అనివార్యము కాదని గీత బోధించుచున్నది. అర్జునుని జీవితమే యిందులకు తార్కాణము. మోహము (అజ్ఞానము) శమించినప్పటికిని అర్జునుడు ప్రవృత్తిని వీడలేదు. ప్రపంచమును వదలలేదు. గీత చదివినచో వైరాగ్యము ముదిరి అరణ్యములకు పారిపోవుదురేమో అను సంశయముచే కొందఱు తమ బిడ్డలకు గీత చెప్పించుటలేదని తెలియుచున్నది. కాని అట్టి బెంగ ఏమియు వారు పెట్టుకొన నవసరము లేదు. గీతను నేరులో వినిన అర్జునుడే అట్లు చేయలేదు. ఇక తక్కినవారిమాట చెప్పవలెనా? కాబట్టి సర్వులును గీత నాశ్రయించి దాని వలన పూర్ణప్రయోజనమును పొందవలెను. మోక్షమనునది జ్ఞానములేకున్న సిద్ధింపదు. జ్ఞానము చిత్తశుద్ధిలేకున్న కలుగదు. చిత్తశుద్ధి నిష్కామకర్మచేయనిచో ఉదయింపదు. కాబట్టి సాధకులందఱికిని ప్రప్రథమమున కర్మయోగము అత్యావశ్యకమైయున్నది.

**ఆరురుక్షోర్మునేర్యోగం కర్మకారణముచ్యతే** (6–3) అను వాక్యమునం దీయర్థమునే భగవానుడు చక్కగ విశదీకరించిరి. జ్ఞానసౌధ మధిరోహింపదలంచువారికి ప్రారంభములో కర్మ కారణభూతమై యొప్పునని దాని భావము.

కర్మను పూర్తిగవదలి ఎవరును ఉండజాలరు. కర్మను పవిత్రమొనర్చుకొను పద్ధతి మాత్రము నేర్చుకొనినచో అది యున్నప్పటికిని ఏ చిక్కులేదు. అదియే శ్రీకృష్ణుడు తెలిపిన ఉపాయము. ఫలాపేక్షనువదలి కర్మనుచేయుటయే కర్మను పవిత్రమొనర్చుపద్ధతి. దానినే కర్మయోగమందురు. ఏ కర్మను కొందఱు వేదాంతులు అసంగతమని ఉపేక్షించిరో దానినే గీత స్వీకరించి అద్దానిని నిష్కామముగ మార్చివైచి మోక్షమునకు ఉపయోగపఱచుకొనెను. గీత ఉద్భవించుటకు పూర్వము లోకములో రెండు తరగతులవారుమాత్రముండిరి. కర్మలనుచేయుచు ఫలమును అపేక్షించువారు (ప్రాపంచిక సంస్కారముకలవారు) ఒక తరగతి, కర్మలను పూర్తిగ విసర్జించినవారు (సన్న్యాసులు, తాపసులు) రెండవ తరగతి. కాని గీత మూడవ తరగతివారిని లేవదీసినది. కర్మలను చేయుచు ఫలము నపేక్షింపనివారే వారు – కర్మలను ఆచరించినను అట్టివారిని కర్మబంధింపదు. కావున గీతామాత సూచించిన ఈ మూడవ పద్ధతిద్వారా జనులు తమ కర్మరంగమును శుద్ధముచేసికొని, తద్ద్వారా తమ హృదయక్షేత్రమును పునీతమొనర్చుకొని జ్ఞానావిర్భావముచే పరమానంద మనుభవించుదురుగాక!

## గీతయందు భక్తి యోగము

భగవద్గీత యందు భిన్నభిన్న సిద్ధాంతములు ప్రతిపాదింపబడినప్పటికిని ఒకే విచారధార సర్వత్ర ప్రవహించుచున్నది. అదియే యోగము. సిద్ధాంతమును ఆచరణలోనికి తెచ్చు కళయే యోగమనబడును. జీవుని శివునితో కలుపు సాధనయే యోగమని పేర్కొనబడును. జనులయొక్క సంస్కారములు, మనస్తత్త్వములు భిన్నముగా నున్నందున భగవత్ప్రాప్తికి వారవలంబించు సాధనలున్ను వేఱు వేఱుగా నుండుటచే యోగములున్ను అనేకములుగా రూపొందుటకు హేతువైనది. మఱియు రోగము లనేకములుగా నున్నపుడు మందులున్ను అధికముగానే యుండవలసివచ్చును. ఈకారణముచే గూడ పెక్కు యోగములు గీతయందు పేర్కొనవలసివచ్చినది. జైమినియొక్క కర్మసిద్ధాంతము, నారదునియొక్క భక్తిసిద్ధాంతము, పతంజలియొక్క యోగసిద్ధాంతము, వేదవ్యాసులయొక్క జ్ఞానసిద్ధాంతము – అన్నియును గీతయందు చక్కగ ప్రతిపాదింపబడినవి. అన్నివస్తువులు దొరుకునట్టి పెద్ద అంగడియే భగవద్గీత. ఎవరికి ఏదేది అవసరమో వారికది గీతయందు లభించును. ఇన్ని యోగములు, ఇన్ని మార్గములు వచింపబడినప్పటికిని వాని యన్నిటిమధ్య చక్కని సమన్వయమును సాధించుట గీతయొక్క మహిమావిశేషము. మోక్షమునొందుటకు

కర్మ, భక్తి, ధ్యానము, జ్ఞానము - అన్నియు కొంత కొంత మోతాదులో అవసరమే అయియున్నవి. ఏ యొక్క దానినిగూడ విడిచిపెట్టుటకు వీలులేదు. కర్మచే పవిత్రత (Purification), భక్తిధ్యానములచే ప్రకాశము (Illumination), జ్ఞానముచే ఐక్యత (Union) సిద్ధించగలవు. ఇల్లు కట్టుటకు ఇటుక, సున్నము, కొయ్య ఎట్లావశ్యకములో, రొట్టె చేయుటకు పిండి, నెయ్యి, వేడిమి ఎట్లవసరములో అట్లే కైవల్యప్రాప్తికిని కర్మ, భక్త్యాదిసాధనములన్నియు అవశ్యకములై యున్నవి. ముక్కాలిపీటకు ఏకాలు లేకున్నను పీట నిలువదు. అట్లే పైసాధనలలో ఏదికొరతగానున్నను సాధన పరిపూర్ణము కానేరదు. కనుకనే మహనీయులగువారు తమ జీవితములో అన్నిటిని సాధించివేసి పరమశాంతిని బొందుచుందురు. అయితే ఒక్కొక్కరి మనస్తత్త్వమునుబట్టి ఒక్కొక్కటి అధికముగా నుండవచ్చును. తక్కినవి గౌణముగానుండును. అన్ని మార్గములయొక్క ప్రధానలక్ష్యము అహంకారము (Ego) ను తొలగించుటయే యగును.

ఇక నిపుడు భక్తిమార్గమునుగూర్చి ఒకింత విచారించెదము. భగవంతునియందు ప్రీతిగలిగి యుండుటయే భక్తి. భక్తియందు తన్మయత్వమును బొందినవాడు "నీవే తప్ప ఇతఃపరం బెరుగ" నని వచించును. 'నాది యేమియునులేదు. అంతయు మీదే, మీరే తల్లి, మీరే తండ్రి; నేను మీ దాసానుదాసుడను' అని భగవంతుని ఉద్దేశించి పలుకును. అర్జునుడున్ను శ్రీ కృష్ణపరమాత్మకు సర్వసమర్పణము చేసికొని "శాధి మాంత్వాం ప్రపన్నమ్" - 'అజ్ఞాపింపుడు' అని వేడుకొనెను. అయితే సామాన్యభక్తితో గీత తృప్తిపడదు. 'అనన్యభక్తి' కావలెనని కోరుచుండును. 'అనన్య' అను పదము గీతయందు పదేపదే ప్రయోగింపబడుట గమనించదగినది.★ అన్యభావము లేకుండుట 'అనన్య' మనబడును. అనగా భగవంతునియందు తప్ప అన్యత్ర చిత్తము లగ్నము కాకుండుటయే అనన్యభక్తియగును. "ఇట్టి అనన్యభక్తి, ఇట్టి అవ్యభిచారిణీ భక్తికలవాడు నాకత్యంతప్రియుడు. అట్టివానిని నేను మృత్యురూపమగు సంసారసాగరము నుండి సముద్ధరించెదను," అని శ్రీ కృష్ణమూర్తి కరుణతో నుపదేశించిరి. ఒకవేళ మనస్సు దైవమునందు నిలుకడబొందనిచో అభ్యాసముచే నెట్లైన దానిని సాధించవలెనేకాని పట్టుదలను వదలరాదని సూచించిరి. కారణమేమనగా, ప్రపంచములో స్థిరమైనది. నాశరహితమైనదియునగు పదార్థ మొకటియే కలదు. అదియే పరమాత్మ. తక్కిన వస్తువులన్నియు క్షణికములు, నాశవంతములు, అస్థిరములు. వానిని నమ్ముకొనినచో శాంతి సుఖములు ఏ కాలమందును లభించజాలవు. కావుననే మాయాతీతుడగు పరమేశ్వరుని@ మాయాంతర్గతుడగు జీవుడు తప్పక ఆశ్రయించవలసి యున్నాడు. తరించుటకు వేఱుమార్గములేదు. అట్లు ఆశ్రయించుటనే భక్తి యని యందురు.

మఱియు సర్వేశ్వరునియొక్కయు, సద్గురుని యొక్కయు అనుగ్రహముండిననే తప్ప జీవుడీ భయంకర సంసారసాగరమును దాటలేడు. ఇదియొక పరమరహస్యము. ఈ రహస్యమును తెలియక ఎందఱో తమతమ స్వీయలౌకిక ప్రజ్ఞచే ప్రకృతిని జయింపజూచి తుదకు విఫలులైరి. ఏలననిన ప్రకృతి పరమాత్మకు అధీనమైయున్నది. పరమాత్మనాశ్రయించని వారికి ఆ ప్రకృతి విఘ్నములున్ను తొలగవు. పరమాత్మయో భక్తికి అధీనుడు. భక్తితో తన్నారాధించువారికి, తనయందు చిత్తమును నెలకొల్పువారికి వారు అనుగ్రహమును ప్రసాదించి వారి యాపదలను తొలగించి, తనయందు చేర్చుకొనును. వారి యోగక్షేమములను విచారించును.

---

★ (1) అనన్యాశ్చిన్తయన్తో మాం.... (9-22)
(2) అనన్యే నైవ యోగేన.... (12-6)
(3) అనన్య చేతా స్సతతం .... (8-14)

@ మాయినం తు మహేశ్వరమ్.

1. **మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి** (18-58)
2. **తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.** (9-22)

ఇత్యాది గీతావాక్యములద్వారా శ్రీకృష్ణపరమాత్మ పై యర్థమునే చక్కగ విశదీకరించిరి.

మఱియు మోక్షమునకు ప్రత్యక్ష హేతువైన ఆత్మానాత్మ విచారణారూపమైన జ్ఞానము కలుగవలెననిన, మున్ముందు భక్తి పరిపూర్ణముగ హృదయమున నావిర్భవించవలెను. "భక్త్యా జ్ఞానం ప్రజాయతే" - భక్తివలననే జ్ఞానము ప్రాదుర్భవించునని శాస్త్రములు వచించుచున్నవి. మహాత్ముల యనుభవములున్ను అట్లే కానుపించుచున్నవి. భక్తియను పుష్పము వికసించినపుడు మాత్రమే జ్ఞానమను ఫలము ఆవిర్భవించును. జీవుని భక్తికిమెచ్చి భగవానుడే ఆ జ్ఞానఫలమును, ఆ బుద్ధియోగమును అతని కిచ్చునని గీతయందు విభూతియోగమున తెలుపబడినది.★ దీనిని బట్టి భక్తియొక్క ప్రాశస్త్యమెట్టిదో స్పష్టపడుచున్నది.

అయితే గీతాచార్యులు ప్రాథమికభక్తితో పరితృప్తినొందక పరాభక్తిని కూడ తెలియజేసిరి. ఫలపుష్పాదులతో దేవుని అర్చించుట సామాన్యపూజ. ఏలననగా ఆ పుష్పాదులు భగవన్నిర్మితములు. మానవుడు నిర్మించినవికావు. దేవుడు నిర్మించినదానిని దేవునికి ఒప్పజెప్పుట సామాన్యమైనపని. మానవుడు తన హృదయక్షేత్రమున, హృదయోద్యానమున సొంతముగపెంచి పోషించినట్టి సుగుణములను పుష్పములను, దైవీసంపదయను పుష్పరాశిని భగవంతునికి అర్పించినపుడు మాత్రమే ఆ పరాత్పరుడు అపరిమితముగ సంతోషించుదురు. ఇదియే పరాపూజ యనబడును. ఇదియే పరాభక్తియనియు పేర్కొనబడును. కనుకనే శ్రీకృష్ణపరమాత్మ భక్తియోగమను (12వ) అధ్యాయమున చిన్నచిన్న పూజలను ఎక్కువగ వర్ణించక, ద్వేషరాహిత్యము, మైత్రి, కరుణ మొదలగు ముప్పదియైదు సుగుణరాజములను (అద్వేష్టా సర్వభూతానాం... ఇత్యాదులను) వర్ణించి చెప్పిరి. ఇట్టి సద్గుణకుసుమమాలలచే హృదయక్షేత్రమును అలంకరించుకొనువాడే నిజమైన భక్తుడు. అట్టి గుణగ్రహణమే నిజమైన భక్తి. 'భక్తిమాన్యస్సమే ప్రియః' అని పదేపదే చెప్పుచు అట్టి అద్వేష్టృత్వాది గుణములు కలవాడే నాకత్యంతప్రియుడని భగవానుడు గీతయందు ఘోషించిరి. కాబట్టి భక్తియోగు లొకింత జాగరూకులై సామాన్యపూజ, ఆరాధనలతోబాటు మైత్ర్యాది సుగుణములనుగూడ సంపాదించి భగవానుని కృపకు పాత్రులు కావలయును. అపుడే భక్తియోగము పరిపూర్ణమై చక్కగ రాణించును.

అన్ని యోగములకంటెను భక్తియోగము చాల సులభమైనది. ప్రతివానికిని అందుబాటులోనున్నది. కఠినమైన సాధనలెవ్వియును దీనియందులేవు. భగవానునిపై నిష్కళంక ప్రేమ కలిగియున్నచాలును. ఇవ్విధముగ సర్వులకును సులభ సాధ్యమైన మార్గమగుటచే గీతయందియ్యది విశేషముగ వర్ణించి చెప్పబడినది. దాదాపు ప్రతి అధ్యాయమందును దీనిని గూర్చిన ప్రస్తావన ఏదియో కొంత ఉండనే ఉన్నది. అఖండమైన జ్ఞానోపదేశము చేయబడిన 14వ అధ్యాయమందుకూడ చిట్టచివఱ -

**మాంచ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే.**
**సగుణాన్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే.** (14-26)

'ఎవడు అచంచలమైన భక్తియోగముచే నన్ను సేవించుచున్నాడో, ఆతడీ త్రిగుణములను

★ తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాన్తితే. (10-10)

అతిక్రమించినవాడై బ్రహ్మసాక్షాత్కారమున కర్హుడగుచున్నాడు' - అని ఈ ప్రకారముగ భక్తియొక్క మహిమ కీర్తింపబడినది. మఱియు విశ్వరూపసందర్శన యోగమున చివఱిభాగములో ఒకానొక అద్భుతరహస్యమును శ్రీకృష్ణపరమాత్మ బహిర్గతమొనర్చివేసిరి. అది యేదియనిన -

**భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున**
**జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుంచ పరన్తప. (11-54)**

"ఈ ప్రకారమగు విశ్వరూపమును తెలిసికొనుటగాని, చూచుటగాని, అందు ప్రవేశించుటగాని అనన్యభక్తిచేతనే సాధ్యపడగలదు. ఇతరమగు దేనిచేతనుగాదు" అని. దీనినిబట్టి భగవదైక్యమునకుగాని, భగవద్దర్శనమునకుగాని భక్తియే ప్రధానకారణమని స్పష్టపడుచున్నది. మఱియు అక్షరపరబ్రహ్మయోగమున "పరమపురుషుడగు పరమాత్మ అనన్యభక్తిచేతనే లభ్యమగునని★" అసందిగ్ధముగ ప్రకటింపబడియుండెను. గీతయం దొక చోట "నన్నెవరును తెలిసికొనలేరు" (మాంతు వేద న కశ్చన) అను భగవద్వాక్యమును వినగనే నిర్విణ్ణహృదయులైన ముముక్షుజనులను వెనువెంటనే మరల "భక్తిచే నన్ను తెలిసికొనగలరు" (భక్త్యామామభిజానాతి) అను వాక్యమునుచెప్పి శ్రీకృష్ణపరమాత్మ ఊరడించిరి. దీనినిబట్టి భక్తికి ఎట్టి అలౌకిక ప్రతిభ కలదో తేటతెల్లమగుచున్నది. కాబట్టి భగవద్వాక్యమునందు విశ్వాసముగల్గి సులభతరమైనట్టి ఈ భక్తియోగమును సర్వులును ఆశ్రయించి బ్రహ్మానందవారాశి యందు ఓలలాడుదురుగాక!

## గీతయందురాజయోగము

సూర్యకిరణములందు ఏడు రంగులు కలవు. ఏడును కలిసి తెలుపురంగుగా కనుపించును. ఇంద్రధనుస్సునందు ఈ సత్యము దృగ్గోచరమగుచుండును. పుష్పములు, ఓషధులు వానివానికి కావలసిన రంగును ఆ కిరణములనుండి స్వీకరించి, తద్రూపముగ పరిణమించి వృద్ధినొందుచుండును. సూర్యకిరణములకు ఒకే రంగు ఉన్నచో పుష్పములు, ఓషధులు ఇన్ని వర్ణములతో యీ ప్రకారముగా అభివృద్ధి నొందుటకు అవకాశములేదు. అట్లే గీతయందు పదునెనిమిది భిన్నభిన్న యోగములు ప్రతిపాదింపబడి యున్నందున ఎవరికి కావలసిన యోగమును వారు స్వీకరించి విముక్తిని బడయవచ్చును. వృత్తముయొక్క పైభాగము (Circumference) నుండి కేంద్రస్థానము (Centre) నకు వచ్చుటకు అనేక త్రోవలు (Radii) ఉండును. దేనిగుండా వచ్చినను కేంద్రమునకు చేరవచ్చును. అట్లే బ్రహ్మసాక్షాత్కారమను లక్ష్యమును బడయుటకు శ్రీకృష్ణపరమాత్మ కరుణతో గీతయందనేక యోగముల నుపదేశించిరి. అందీ రాజయోగ మొకటి. దీనినే ధ్యానయోగమనియు, ఆత్మసంయమయోగమనియు అందురు. పతంజలిమహర్షి దీనిని గూర్చి విస్తారముగ వర్ణించిరి. రాజయోగము ఎనిమిది అంగములతో గూడియున్నది. దీనినే అష్టాంగయోగ మందురు. అవి క్రమముగ - (1) యమము (2) నియమము (3) ఆసనము (4) ప్రాణాయామము (5) ప్రత్యాహారము (6) ధారణ (7) ధ్యానము (8) సమాధి - అని పేర్కొనబడును. ఈ యెనిమిది అంగములుకూడ గీతయం దచటచట బాగుగ వివరింపబడియున్నవి. గీతయం దేయేచోట్ల ఏ యే విధముగ నయ్యవి ప్రస్తావించబడినవో ఈ క్రింద తెలుపబడుచున్నది. వానిని గమనించినచో శ్రీకృష్ణమూర్తి గీతయందు రాజయోగమును ఎంత చక్కగ పోషించిరో విదితముకాగలదు.

★ పురుషః స పరః పార్థ భక్త్యా లభ్యస్త్వనన్యయా (8-22)

| | | |
|---|---|---|
| 1. యమము = | అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము అను నీ యైదుగుణములు చేరి యమ మనబడును. | |
| (1) అహింస :- | అహింసా క్షాన్తి రార్జవమ్... | (13-8) |
| | అహింసా సమతాతుష్టిః... | (10-5) |
| | బ్రహ్మచర్య మహింసా చ.... | (17-14) |
| (2) సత్యము :- | సత్యం ప్రియహితం చ యత్... | (17-15) |
| | అహింసా సత్యమక్రోధః .... | (16-2) |
| (3) అస్తేయము :- | అనపేక్షః శుచిర్దక్షః.... | (12-16) |
| (4) బ్రహ్మచర్యము :- | బ్రహ్మచర్యమహింసా చ... | (17-14) |
| | యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి... | (8-11) |
| | బ్రహ్మచారివ్రతేస్థితః.... | (6 14) |
| (5) అపరిగ్రహము :- | కామం క్రోధం పరిగ్రహమ్-విముచ్య.. | (18-53) |
| 2. నియమము = | శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరప్రణిధానము – అను నీ యైదుగుణములు చేరి నియమము అనబడును. | |
| (1) శౌచము :- | తేజః క్షమా ధృతి శ్శౌచం ... | (16-3) |
| | ఆచార్యోపాసనం శౌచం... | (13-8) |
| | దేవ ద్విజగురు ప్రాజ్ఞపూజనం శౌచమార్జవమ్... | (17-14) |
| (2) సంతోషము:- | సంతుష్టస్సతతం యోగీ... | (12-14) |
| | సంతుష్టో యేన కేనచిత్... | (12-19) |
| (3) తపస్సు:- | శారీరం తప ఉచ్యతే | (17-14) |
| | వాఙ్మయం తప ఉచ్యతే | (17-15) |
| | తపో మానస ముచ్యతే | (17-16) |
| | తపో దానం యశోఽయశః | (10-5) |
| (4) స్వాధ్యాయము:- | స్వాధ్యాయస్తప ఆర్జవమ్ | (16-1) |
| | స్వాధ్యాయాభ్యసనం చైవ | (17-15) |
| (5) ఈశ్వరప్రణిధానము:- | మామేకం శరణంవ్రజ | (18-66) |
| | తమేవ శరణం గచ్ఛ... | (18-62) |
| 3. ఆసనము:- | ... స్థిర మాసన మాత్మనః | (6-11) |
| 4. ప్రాణాయామము:- | ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః | (4-29) |
| | ప్రాణాపానౌసమౌకృత్వానాసాభ్యన్తరచారిణౌ | (5-27) |

5. ప్రత్యాహారము:-
- శబ్దాదీన్విషయాం స్త్యక్త్వా... (18-51)
- బాహ్యస్పర్శేష్వసక్తాత్మా... (5-21)
- యతో యతో నిశ్చరతి... (6-26)
- యదాసంహరతే చాయం... (2-58)

6. ధారణ:-
- ఆత్మసంస్థం మనః కృత్వా నకించిదపి చిన్తయేత్ (6-25)
- మయ్యేవ మనఆధత్స్వ మయిబుద్ధిం నివేశయ (12-8)

7. ధ్యానము:-
- ధ్యానేనాత్మని పశ్యన్తి... (13-25)
- ధ్యానయోగపరోనిత్యం... (18-52)
- ఉపవిశ్యాసనే యుఞ్జ్యాద్యోగ మాత్మవిశుద్ధయే (6-12)

8. సమాధి:-
- సమాధావచలాబుద్ధిః.... (2-53)
- భోగైశ్వర్యప్రసక్తానాం... సమాధౌ న విధీయతే (2-44)
- ప్రశాన్తమనసం హ్యేనం... బ్రహ్మభూతమకల్మషమ్ (6-27)
- సుఖమాత్యన్తికం యత్తత్... నచైవాయం స్థితశ్చలతి తత్త్వతః (6-21)

ఈ ప్రకారముగ భగవద్గీతయందు రాజయోగము యొక్క అష్టాంగములున్ను బాగుగ పరిపోషింపబడినవి. ధ్యానయోగి ఏ స్థలమున ఏ ప్రకారముగ ఏ నియమములతో ఏ పద్ధతుల నవలంబించి ధ్యానాదుల కుపక్రమించవలెనో గీత 6వ అధ్యాయమున వివరముగ తెలుపబడినది. ఆహారనియమము, అనుష్ఠాననియమము - ఈ మూడిటియందును సాధకులు బహుజాగరూకులై యుండులాగున గీతాచార్యులు హెచ్చరించిరి. సాధనయందు చిన్న విషయములను నివాసనియమముగూడ ఉపేక్షింపక ముముక్షువులకు తెలుపుట గీతయందలి ప్రత్యేకత. ఏలయనిన చిన్న విషయములందు అజాగ్రత పడినచో పెద్ద పెద్ద ఫలితములు చేయిజారిపోవును. కనుకనే ఏమి భుజించవలెను, ఏట్లు కూర్చొనవలెను, దృష్టిని ఎక్కడ నిలుపవలెను, మొదలగు సామాన్య విషయములపై గూడ గీత శ్రద్ధను కనుపఱచెను. కాబట్టి గీతోక్తరీతి ఆయా ప్రాథమిక అభ్యాసములనుగూడ శ్రద్ధాపూర్వకముగ శీలించుచు క్రమక్రమముగ యోగమునందారూఢత్వము నొందవలెను.

యోగమనగా నేమి? చిత్తవృత్తులను నిరోధించుటయే యోగమని పతంజలి నుడివిరి*. అనేక జన్మార్జిత సంస్కారబలముచే ఇంద్రియములు, మనస్సు బహిఃప్రపంచమునందాసక్తి కలిగి విషయభోగములపై పరుగిడుచున్నవి. వానిని అరికట్టవలెను. తాబేలు తన అవయవములను లోనికి ముడుచుకొనులాగున ఇంద్రియార్థములగు శబ్దస్పర్శాదులనుండి మనస్సును మరలించి, అంతర్ముఖమొనర్చి, ఆత్మయందు స్థాపించవలెను.

**తదా ద్రష్టుః స్వరూపేఽవస్థానమ్.** బాహ్యప్రపంచమును గూర్చిన విషయవృత్తు లెపుడు విచారణాబలముచేతను అభ్యాస, వైరాగ్యములచేతను నిరుద్ధములగునో అపుడు మనస్సు ఇక బయటకు పరుగిడుటకు అవకాశము లేక, దానంతట నదియే అధిష్ఠానమగు ఆత్మయందు (స్వస్వరూపమందు) నిలుకడను బొందును. ఈ ప్రకారముగ మనస్సును విషయముల నుండి మరలించి హృదయస్థమగు ఆత్మయందు స్థాపితమొనర్చుటయే రాజయోగము యొక్క సారాంశము. రాజయోగసారమునంతను గీతాచార్యులు ఈ క్రింది అర్ధశ్లోకములో నిమిడ్చివైచిరి -

* యోగశ్చిత్తవృత్తి నిరోధః

**ఆత్మసంస్థం మనఃకృత్వా న కించిదపి చిన్తయేత్ (6-25)** అనగా, 'మనస్సును ఆత్మయందు నెలకొల్పి బాహ్యవిషయముల నేమియు చింతింపరాదు' - అని దీని యర్థము. ఇచ్చోట రెండు సాధనలు చెప్పబడినవి. ఒకటి - విషయ విస్మరణ, రెండు - ఆత్మస్మరణ. కేవలము విషయ విస్మరణ మాత్రము చాలదు. ఏలననిన, గాఢనిద్రలో విషయవిస్మరణ జరుగుచునే యున్నది. దానివలన జీవుడు పొందిన మహాప్రయోజనమేమియును గన్పట్టదు. కనుకనే దానితోబాటు ఆత్మ చింతనకూడ ఉండవలెను. ప్రారంభస్థితిలో మనస్సు ఏచింతనయులేక ఉండలేదు. కాబట్టి దైవచింతననుగాని లేక ఆత్మవిచారణనుగాని మొట్టమొదట ఆశ్రయించవలెను. సాధన తీవ్రమైనకొలది క్రమముగ మనస్సు అతిసూక్ష్మమై కేవలము నిర్వికల్పస్థితిని బొందగా అపుడు స్వస్వరూపస్థితి తప్ప అన్యమగు ఏ సంకల్పమున్ను ఉండదు. కావున దుస్సంకల్పమునుండి మొదట సత్సంకల్పమునకు మారి, ఆటనుండి నిస్సంకల్పమునకు దారితీయవలెను. ఆ నిస్సంకల్పస్థితియే సమాధి యనబడును.

అయితే అట్టి స్థితి అనుకొనినంత సులభముకాదు. ఏలయనిన, మనస్సు మహాచపలమైనది. 'వాయోరివసుదుష్కరమ్' - గాలిని అరికట్టుటవలె దానిని నిగ్రహించుట చాలకష్టమని అర్జునుడు చెప్పనే చెప్పినాడు. అట్టి చపలత్వము వాసనాబలముచే ఏర్పడుచుండును. కావున విషయములయొక్క వాస్తవ క్షణికస్వరూపమును విచారించుట ద్వారా వానియెడల విరక్తినభ్యసించి, మనస్సును వానిపై పోనీయక అంతర్ముఖముగ మరల్చుచుండవలెను. ప్రతిదినము ఈ ప్రకారముగ ఒకింత అభ్యాసము చేయుచుండినచో అచిరకాలములోనే మనస్సు లొంగిపోగలదు. కనుకనే శ్రీకృష్ణపరమాత్మ గీతయందు -

**అభ్యాసేనతు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే (6-35)** అని తెలుపుచు, వైరాగ్యపూర్వకమగు అభ్యాసముచేతప్ప మఱిదేనిచేతను మనస్సులోబడదని స్పష్టముగ చెప్పివైచిరి. ఈ సిద్ధాంతమునే వేదాంతశాస్త్రము మఱియొక విధముగ బోధించుచున్నది. ఎట్లనిన - వాసనాక్షయ, మనోనాశ, తత్త్వజ్ఞానములను మూడిటిచేతను జీవునకు బ్రహ్మసాక్షాత్కారము సిద్ధించగలదు - అని. అందు తత్త్వజ్ఞానముయొక్క సహాయముచే వాసనాక్షయము కలగగా, అట్టి వాసనాక్షయముచే మనోనాశము సంభవించును. మోక్షము కలుగవలెననిన మనస్సు నశించవలెను. మనస్సు నశించవలెననిన వాసనలు క్షయించవలెను. వాసనలు క్షయించవలెననిన తత్త్వవిచారణ గావించవలెను. కాబట్టి అభ్యాస వైరాగ్యములచేతను, తత్త్వచింతనాదుల చేతను, ధ్యాననిష్ఠచేతను ఎట్లైన మనస్సును లొంగదీసికొని భవసాగరమును దాటివేయవలెను. రాజయోగముయొక్క నిష్కర్ష యిదియే.

## గీతయందు జ్ఞానయోగము

జీవునకు దుఃఖము దేనివలన కలిగినది? శరీరపరిగ్రహణమువలన. శరీరము దేనివలన కలిగినది? కర్మల వలన. కర్మ దేనివలన కలిగినది? రాగాదుల వలన. రాగాదులు దేనివలన కలిగినవి? అజ్ఞానము వలన. ఆ అజ్ఞాన మెటులపోవును? జ్ఞానముచే. కాబట్టి జీవునకు ఆత్యంతిక దుఃఖరాహిత్యము జ్ఞానమువలననే సిద్ధించుచున్నది. తన స్వరూపమును మఱచినందువలన బంధము, తిరిగి తన స్వరూపమును జ్ఞప్తికి తెచ్చుకొనినందువలన మోక్షము కలుగుచున్నది. అట్టి స్వస్వరూపానుసంధానముచే జ్ఞానమని పెద్దలు పేర్కొనిరి. మోక్షరూప పరమశాంతిని అభిలషించువాడు ఆ ప్రకారమగు జ్ఞానానుభవమును తప్పక పొందవలసియున్నాడు.

**జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తి మచిరేణాధిగచ్ఛతి (4-39)** అని గీతాచార్యులు ఈ సత్యమునే తెలిపియున్నారు. గీత నాలుగవ అధ్యాయమగు జ్ఞానయోగమున పెక్కురీతులు జ్ఞానము అభివర్ణింపబడినది★ ఎట్లనిన -

(1) జ్ఞానతపస్సు - జ్ఞానమను తపస్సుచే ఎందఱో పునీతులైరి.

(2) జ్ఞానయజ్ఞము - ధనాదులతోగూడిన యజ్ఞముకంటె జ్ఞానయజ్ఞము శ్రేష్ఠమైనది.

(3) జ్ఞాననౌక - పాపసముద్రమునంతను జ్ఞానమను నౌకచే లెస్సగ దాటివేయగలరు.

(4) జ్ఞానాగ్ని - జ్ఞానమను అగ్ని సమస్తకర్మలను కట్టెలను భస్మీభూతము చేసివేయగలదు.

(5) జ్ఞానఖడ్గము - అజ్ఞానజనితమగు సంశయమును జ్ఞానమను ఖడ్గముచే ఛేదించి వేయవలెను.

ఓహో! జ్ఞానమునుగూర్చి ఎన్ని ఉపమానములను భగవానుడు సెలవిచ్చి యున్నారు! ఇంతటితో తృప్తినొందక మరల ఐదవ అధ్యాయమున జ్ఞానమును సూర్యునిగ వర్ణించి చెప్పిరి. ●

అంతటితో ఆగక, మరల పదియవ అధ్యాయమున జ్ఞానమును ఒకానొక ప్రకాశవంతమగు దీపమునకు పోల్చి చెప్పిరి @. జ్ఞానమున కెట్టి అపార మహిమ కలదో, జ్ఞాన మెంతటి అద్భుత శక్తిసంపన్నమైన పదార్థమో జనులకు తెల్పి చెప్పుటకే భగవానుడు ఇన్ని సాదృశ్యములను చెప్పిరి. "ఓ జీవులారా! జ్ఞానతపస్సు నాచరించి పవిత్రులుకండు! జ్ఞానయజ్ఞమును నిర్వహించి ముక్తిశ్రీని జేబట్టుడు! జ్ఞానమను తెప్పచే పాపసముద్రమును దాటివేయుడు! జ్ఞానాగ్నిని రగుల్కొలిపి 'కర్మ' కట్టెలను కాల్చివేయుడు! జ్ఞానఖడ్గముచే సర్వసంశయములను ఛేదించివేయుడు! జ్ఞానభాస్కరుని దివ్యతేజముచే అజ్ఞానాంధకారమును రూపుమాపుడు! జ్ఞానదీపమును వెలిగించి అమృతమయకాంతిపుంజములను నలుగడల వెదజల్లుడు!" అని గీతయందు భగవానుడు జనులందఱికిని హితవు చెప్పుచున్నారు. కాబట్టి ప్రతివారును తమ జీవితమునందు జ్ఞానమును అవశ్యము సంపాదించవలెనని స్పష్టమగుచున్నది.

అయితే, జ్ఞానమనగా నేమి? అను విషయము నిచట విచారించెదము. ప్రకృతి పురుషులయొక్క కలయికయే ప్రపంచము. ఈ ప్రపంచమున ఆత్మ, అనాత్మ, క్షేత్రము, క్షేత్రజ్ఞుడు, దృక్కు, దృశ్యము, అన్నియు ఏకమై అజ్ఞానికి గన్పట్టుచున్నవి. వానిని విడదీయుటయే జ్ఞానము. వానిని విభజించి జడమును జడముగను, చైతన్యమును చైతన్యముగను భావించుటయే జ్ఞానము. కనుకనే 'విభాగ' యోగములను పేరుతో కొన్ని అధ్యాయములు గీతయందు ప్రత్యేకముగ చెప్పబడినవి. (క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము, గుణత్రయవిభాగయోగము, దైవాసురసంపద్విభాగయోగము, శ్రద్ధాత్రయవిభాగయోగము - అని). 'విభాగ'మనగా కలిసియున్నవానిని విడదీయుట (Division) అని అర్థము. మంచి, చెడ్డ కలిసియున్నపుడు

---

★ (1) బహవో జ్ఞానతపసా పూతా మద్భావ మాగతాః (4-10)
(2) శ్రేయాన్ద్రవ్యమయాద్యజ్ఞాజ్జ్ఞానయజ్ఞః పరన్తప (4-33)
(3) సర్వం జ్ఞాన ప్లవేనైవ వృజినం సన్తరిష్యసి (4-36)
(4) జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా (4-37)
(5) తస్మాదజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాత్మనః
ఛిత్త్వైనం సంశయం యోగమాతిష్ఠోత్తిష్ఠ భారత. (4-42)

● తేషామాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్ (5-16)

@ నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా

వానిని వేఱుచేసి, మంచిని గ్రహించి చెడ్డను విసర్జించుట లోకములో పరిపాటి. గుజ్జు, తొక్కు రెండును కలిసియున్న అరటిపండును పసిపిల్లవాని కిచ్చినప్పటికిని అతడు వెంటనే దానిని వలిచి గుజ్జును తిని, తొక్కును పారవేయును. ప్రతిదినము ఉదయమున ఇండ్లయందు గృహిణులు బియ్యము, రాళ్లు కలిసియున్న వస్తువులను చేటలో వేసికొని బియ్యము నట్టిపెట్టుకొని రాళ్లను ఏరి పారవేయుదురు. అట్లే ఆత్మ, అనాత్మ కలిసియున్న ఈ ఉపాధియందుగాని, దృశ్యప్రపంచమునందుగాని వానిని విభజించి ఆత్మయందే చిత్తమును నెలకొల్పి అనాత్మయందు విరక్తికలిగి యుండవలెను. ఇదియే జ్ఞానము. క్షేత్రమునుండి క్షేత్రజ్ఞుని వేఱుచేసి క్షేత్రజ్ఞుడే తానని భావించి క్షేత్రము యెడల అనాసక్తిని కలుగజేసికొనవలెను. 'అస్తి, భాతి, ప్రియ, నామ, రూపము' లను ఐదింటితో గూడిన ప్రతివస్తువునందును మొదటి మూడును సత్యమనియు, తక్కిన రెండును అసత్యమనియు భావము గలిగియుండవలెను.

ఇక క్షేత్రమనగా నేమియో, క్షేత్రజ్ఞుడనగా నెవరో యోచించెదము. పంచమహాభూతములు, అహంకారము, బుద్ధి, అవ్యక్తము, కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు, శబ్దస్పర్శాది విషయములు, ఇచ్ఛ, ద్వేషము, సుఖము, దుఃఖము, దేహేంద్రియాది సమూహము, అంతఃకరణవృత్తులు మున్నగునవియున్నియు క్షేత్రమనబడును. వీనిని తెలిసికొను ప్రజ్ఞారూపమగు చైతన్యమే క్షేత్రజ్ఞుడు.

**క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత. (13-3)** 'ఓ అర్జునా! సమస్త క్షేత్రములందును క్షేత్రజ్ఞుడను నేనే యని యెఱుగుము' అని శ్రీకృష్ణపరమాత్మ వచించిన అమోఘమగు సత్యము జనులపాలిటి వరప్రసాదమైయున్నది. ఏలననిన, సాక్షాత్ పరంధాముడు, వైకుంఠనాథుడు, విశ్వవ్యాపక చిన్మూర్తి ప్రతివానియొక్క హృదయాంతరాళముననే వెలుగొందుచున్నారేకాని దూరమున లేరని దీనిచే స్పష్టమగుచున్నది. వారు అతిసమీపముననే వర్తించుచున్నారు. సర్వసాక్షియై మనసులోనే ప్రకాశించు చున్నారు. కాబట్టి ప్రయత్నముచే సర్వులును వారిని తప్పక పొందగలరు - అను ధైర్యము దీనిచే కలుగుచున్నది. 'సర్వక్షేత్రేషు' - అని చెప్పబడినందువలన జాతి, మత, కుల వివక్షలేక సమస్తచరాచరములందును క్షేత్రజ్ఞుడగు పరమాత్మ అధివసించి యున్నారని విస్పష్టమగుచున్నది. విచారణచే అన్న మయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయములను పంచకోశములను వేఱుచేసి చూచినచో వాని యభ్యంతరమున సర్వసాక్షియగు ఆత్మ ప్రతివారియందు తప్పక అనుభూతము కాగలదు. ఇట్టి ఆత్మానుభూతియే జ్ఞానముయొక్క ఫలము. అదియే మోక్షము. కాబట్టి జ్ఞానవిచారణ జీవుని మహోన్నత అధ్యాత్మిక శిఖరములకు గొనిపోయి, స్వస్వరూపానుభవముద్వారా జీవుని దేవునిగ జేసి పరమానందమును, జీవన్ముక్తిని ఇచటనే కలుగజేయుచున్నది (జ్ఞానవాన్ మాం ప్రపద్యతే).

జ్ఞానము కలిగినపిమ్మట మనుజునిచే ఆచరింపబడు కర్మ మహాపవిత్రమై, నిర్లేపమై యుండును. ఏలయనిన, బుద్ధికి అవలనున్న (బుద్ధేఃపరం) పరమాత్మను ఎఱిగినవాడు, అచ్చోట స్థితిని బొందినవాడు దేహేంద్రియాది సంఘాతమునంతను అంతఃకరణమును సాక్షిగ వీక్షించును. అత్తఱి తాను కర్తకాడు. దేహేంద్రియాదులు వానివాని పనులను అవి చేసికొనుచుండును. వానియం దేమియు తగుల్కొనక అతడు నాశ రహితమగు సనాతన పరబ్రహ్మమునందే నిలుకడ కలవాడై, స్వస్వరూపానుభవము నొందుచు, అసక్తబుద్ధి గల్గియుండును. జ్ఞానియగువాడు ఒకవేళ లోకహితార్థము కర్మ చేసినను అట్టి అసక్తబుద్ధితోనే, నిర్లిప్తమానసముతోనే చేయును. అత్తఱి యాకర్మ పరమ పునీతమై అత్యద్భుత మహిమతో గూడియుండును. జ్ఞానిచేయు కర్మకున్ను, అజ్ఞానిచేయు కర్మకున్ను గల వ్యత్యాస మిదియే. అజ్ఞాని దేహేంద్రియాదిసంఘాతముతో నైక్యమై 'దేహమేనేను' అని భావించి సక్తచిత్తుడై కర్మల నాచరించి

బద్ధుడగును. జ్ఞాని 'నేను దేహమును కాను, సచ్చిదానందరూపమై, జననమరణ రహితమై, సనాతనమై, అవ్యయమైనట్టి ఆత్మయే నేనుగాని, నశ్వర దేహాది సముదాయమును కాను' అని భావించి కర్మలను చేయును.

**'తద్బ్రహ్మానిష్కలమహం న చ భూతసంఘః'** అని దృఢముగ నిశ్చయించి అహంభావమును పారద్రోలి, మమత్వరహితుడై, కర్తృత్వమునువీడి అసక్తబుద్ధితో కర్మల నాచరించి ముక్తుడగును. కావున కర్మల నాచరించుటకు పూర్వము వానియందు కుశలత్వము నెట్లు సంపాదింపగలరో ఆ రహస్యము నెఱుగవలెను. అట్టి కర్మకుశలత్వము జ్ఞానము వలననే కలుగును.

కనుకనే శ్రీకృష్ణపరమాత్మ రెండవ అధ్యాయమున తొలుదొల్తనే జ్ఞానము నుపదేశించి, కర్మయందు కుశలత్వము (Non-attachment) ను సంపాదించు కీలకమును బోధించి ఆ పిదప కర్మయోగమున కుపక్రమించిరి. 'యోగస్థః కురు కర్మాణి' - (ఆత్మ యందు నిలుకడకలిగి అసక్తబుద్ధితో కర్మలను చేయుము) అను మహామంత్రమును అత్తఱి బోధింప మొదలిడిరి. కాబట్టియే మహాత్ములు జ్ఞానప్రాప్త్యనంతరము చేయు లోకసేవ, సామాన్యులు చేయు సేవకంటె ఎన్నిరెట్లో అధికమై, నిష్కళంకమై యొప్పును. జ్ఞానమును పొంది పిదప వారివారి సంస్కారము ననుసరించి కొందఱు నివృత్తినవలంబించుదురు. మఱికొందఱు ప్రవృత్తిని స్వీకరించుదురు. అత్తఱి ప్రవృత్తిని స్వీకరించినప్పటికిని వారికి నివృత్తిఫలమే కలుగును★. శ్రీకృష్ణుడు, జనకుడు, ఇక్ష్వాకువు మొదలగు చక్రవర్తులు; శంకరాచార్యులు, వివేకానంద మొదలగు సన్న్యాసులు జ్ఞానానంతరము లోకహితార్థము ఎంతయో కర్మకాండ నాచరించిరి. అయినను జ్ఞాన ప్రభావముచే వారలను కర్మ ఏమాత్రము బంధింపకుండెను. కాబట్టి ప్రవృత్తికైనను, నివృత్తికైనను జ్ఞానము సర్వజీవులకును అవశ్యము సంపాదింపదగియున్నది. కనుకనే శ్రీకృష్ణపరమాత్మ -

**'నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే' (4-38)** 'జ్ఞానముతో సమానమైన పవిత్రమైన వస్తు వీప్రపంచమున ఎచటను లేదు' అని గీతయందు జ్ఞానప్రభావమును ఎలుగెత్తిచాటిరి. అయితే అపరోక్షజ్ఞానము హృదయమున చక్కగ కలుగవలెననిన గీత 13వ అధ్యాయమున చెప్పబడిన అమానిత్వాది జ్ఞానగుణములను సాధకుడు చక్కగ నభ్యసించవలెను. అట్టి జ్ఞానగుణముల నభ్యసించనిదే జ్ఞేయవస్తువగు పరబ్రహ్మము అనుభూతము కానేరదు.

మఱియు, భగవద్గీత ఏడవ అధ్యాయమున నాలుగు రకములగు భక్తులు చెప్పబడిరి. - వారు క్రమముగ - ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని - అని పేర్కొనబడిరి.

**'ఉదారాస్సర్వ ఏవైతే జ్ఞానీత్వాత్మైవ మే మతమ్' (7-18)** 'వారందఱున్ను మంచివారే. కాని అందు జ్ఞాని సాక్షాత్ నేనే అని నా యభిప్రాయము' అని శ్రీకృష్ణమూర్తి జ్ఞానముయొక్క సర్వోన్నతస్థితిని విశదీకరించిరి. జ్ఞానిసాక్షాత్ భగవంతుడే. భగవంతునకును జ్ఞానికిని ఏ మాత్రము భేదములేదు - అని ఆ వాక్యముల యొక్క అర్థము. ద్వైతసాధనలన్నియు క్రమక్రమముగ వికసించి వికసించి అద్వైతములోనికి జీవుని గొనిపోయినవి. ఇక భగవంతుడు, భక్తుడు అను భేద మచట లేదు. ఇరువురును ఒకే సచ్చిదానందఘనస్వరూపమై యలరారుదురు. అదియే జీవితము యొక్క చరమస్థితి. అదియే సాధనలయొక్క అంతిమదశ. అదియే జీవన్ముక్తి. జ్ఞానము యొక్క ఫలిత మింత మహిమతో గూడియున్నది. కాబట్టి ప్రతివారును తమ జీవితమునం దిట్టి అమోఘమగు జ్ఞానస్థితిని సంపాదించి జన్మసార్థకత నొందవలయును.

★ ప్రవృత్తిరపి ధీరస్య నివృత్తిఫలభాగినీ

## గీతయందలి సాధన

ఇంతదనుక గీతయందు తెలుపబడిన వివిధమార్గములను గూర్చి విచారించితిమి. ఇక వానిని సాధించుట యెట్లో తెలిసికొనవలసియున్నది. కావున సాధనయందలి లోతుపాతులనుగూడ యెఱింగియుండుట మంచిది. గీతాచార్యులకు అనుష్ఠానమందే ఎక్కువప్రీతి కనుక ఆయా సాధనరహస్యముల పెక్కింటిని గీతయందు పొందుపఱిచిరి. సామాన్యముగ ఒక్కొక్క యోగమును అభ్యసించుటకు మొదలు పెట్టునపుడు సాధకునకు కలుగు విఘ్నములెవ్వి? వాని నేప్రకార మతడు తొలగించుకొనగలడు? సాధనకాలమున అతడెదుర్కొను సమస్యలెవ్వి? వాని నెట్లు పరిష్కరించుకొన గలడు? ఈ మున్నగు విషయములు అభ్యాసకునకు అతిముఖ్యములైనవి. భగవానుడు గీతయందు వానినన్నింటిని చక్కగ విశదీకరించి సాధకలోకమునకు మహోపకారముచేసిరి. అవియేవి యనిన –

### 1. దుర్బలత్వమును పారద్రోలుము :

సాధన ప్రారంభించునపుడు అధైర్యమును, పిరికితనమును, దుర్బలత్వమును, నిరుత్సాహమును దరికి చేరనీయరాదు. "ఎవరో మహర్షులు మోక్షమును పొందిరి. నేను పొందగలనా? నాకట్టి చిత్తశుద్ధి కలుగగలదా? నేను గృహస్థుడను, పిల్ల, మేక కలవాడను. అంతయు వదలి అరణ్యములకు పోలేదు. సన్న్యాసమును తీసికొనలేదు. సంసారజంజాటమును వదలలేదు. అట్టి నాకెట్లు మోక్షము లభించగలదు?" ఈ ప్రకారమగు దుర్బలవచనములను ఎవరును పలుకరాదని గీత శాసించుచున్నది.

**'క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప'** **(2-3)** " ఓ అర్జునా! అతినీచమగు హృదయదౌర్బల్యమును పారద్రోలి లెమ్ము! కర్తవ్యమునకు గడంగుము!"– అని అర్జునవ్యాజమున సర్వజీవులను గీతామాత హెచ్చరించుచున్నది. మఱియు నిర్భయముగ నుండుడు (Be fearless !) – (విగతభీః) అని పదేపదే వాక్రుచ్చుచున్నది. 'ధృత్యుత్సాహసమన్వితః' – "ధైర్యము, ఉత్సాహము కలవాడవై కార్యము సిద్ధించినను సిద్ధించకపోయినను వికారమును బొందక సమబుద్ధితో కర్తవ్యమునకు గడంగుము" అని ఆదేశించుచున్నది. సన్న్యాసులే మోక్షమును పొందుదురని గృహస్థులెవరు బాధపడవలసినపనిలేదు. అర్జునుడు గృహస్థుడు. జనకుడు గృహస్థుడు. వారు మోక్షమును పొందగల్గినపుడు తక్కినవారందరును ఏల పొందలేరు? ఒకానొక మతమువారు, జాతివారు, కులమువారు, ఆశ్రమమువారు మాత్రమే ముక్తి కర్హులను విషయమును ఏ శాస్త్రమున్ను అంగీకరింపదు. గీత ఆ సిద్ధాంతమును అసలు మొదలే అంగీకరింపదు. అయితే విఘ్నములకు జంకక, ప్రతిబంధములను లెక్కసేయక భగవంతునిపై పరిపూర్ణ విశ్వాసముకలిగి కర్తవ్యమునకు బూనుకొనినపుడు మాత్రమే ఎవరికైనను మోక్షము లభించగలదు. కాబట్టి ధైర్యమును విడనాడవలదనునది గీతయొక్క ప్రప్రథమ ఆదేశము. సాధకు డివ్విషయమున అతి జాగరూకుడై, పిరికితనమును దులిపివేసి, విఘ్నములకు జంకక, అధైర్యమునకు తావీయక, సర్వేశ్వరునిపైనను, సద్గురువుపైనను, తనపైనను, పరిపూర్ణ విశ్వాసముంచుకొని పరమార్థపథమున ముందునకు సాగిపోవలెను.

### 2. మధ్యమార్గమును అవలంబించుము :–

లక్ష్యమును త్వరితముగ చేరవలెనను అభిలాష మంచిదేకాని, ఆ తొందరలో కాళ్ళువిఱుగగొట్టుకొనకూడదు. మనస్సు నిబ్బరముగ నుండవలెను. సాధనయందు గంభీరత్వము గోచరించవలెను. .Slow and steady wins the race – శాంతముగ స్థిరబుద్ధితో ప్రవర్తించువాడే పందెమును

గెలుచుకొనును. - అని నానుడి వచించుచున్నది. 'అతి సర్వత్ర వర్జయేత్' - అనియు పెద్దలు పలుకుచున్నారు. కావుననే శ్రీ కృష్ణపరమాత్మ గీతయందు సాధకుల నుద్దేశించి 'అధికముగ భుజించవలదు, ఏమియు భుజించకను ఉండరాదు; అధికముగ నిద్రించరాదు, నిద్రలేకను ఉండరాదు. మితాహారము, మితనిద్ర, మితాచరణ గలిగియుండుడు. అత్తఱి యోగము చక్కగ జరుగును★.' అని కరుణతో నాదేశించిరి. ఏ వస్తువైనను జాగ్రత్తగ వినియోగించుకొనినచో చాలకాలము పనిచేయును. మితిమీరి వాడివేసినచో త్వరలోనే చెడిపోవును. అట్లే దేహము, ఇంద్రియములు, మనస్సు అనువానిని భగవానుడు మనకు ప్రసాదించిరి. వానిని సదుపయోగ పఱచుకొని వానిద్వారా భవసాగరమును దాటివేయవలసి యున్నది. భగవద్దత్తములగు ఆ భవసాగరనౌకలను కడు జాగరూకతతో కాపాడుకొనుటకు బదులు వానికి శక్తినిమించిన పనియిచ్చినచో ఆ నౌకలు నడిసముద్రముననే మనలను ముంచివేయును. మఱియు యోగమునకు బదులు రోగమును తెచ్చి పెట్టును. ఎందఱోసాధకులు ప్రాణాయామాదులను, అవసరమైనదానికంటె ఎక్కువగజేసి, శుష్కోప వాసాదులచే దేహమును కృశింపజేసి, అటు పరమార్థమునకుగాని, ఇటు లోకమునకుగాని పనికిరాక 'రెండింటికి చెడ్డ రేవడు' ల వలె తయారగుచున్నారు. అట్టివారి జీవితము భ్రష్టమై పోవుచున్నది. ఇదియంతయు గమనించియే గీతాచార్యులు సాధనయందు 'మధ్యమార్గము'ను సూచించిరి. కాబట్టి ముముక్షువులు తమ తమ సాధనలయందు అతిజాగరూకులులై 'శనైః శనైః' అని భగవానుడు చెప్పినట్లు శాంతముగ, గంభీరముగ ప్రవర్తించుచు, మధ్యమమార్గమును జేబట్టి విజయమును కైవసమొనర్చుకొనవలయును.

### 3. అభ్యాసము వదలరాదు - మఱియు వైరాగ్యమును జేబట్టవలెను :-

అనేక జన్మలయందు మనస్సు ఒకానొక వికృతపంథా(ప్రకృతిదాసత్వము) అవలంబించుచు వచ్చినది. ఇపుడు దానిని మార్చి నూతనపంథా (దైవత్వము) త్రొక్కించవలసివచ్చినది. భోగమునుండి యోగమునకు మరలించవలసివచ్చినది. కాబట్టి సహజముగనే అది తిరుగబడును. ప్రతిక్రియ (Reaction) సంభవించును. జన్మజన్మాంతరము విషయసుఖములందు బాగుగ దొర్లాడిన మనస్సును అటనుండి త్రిప్పవలెననిన సామాన్యముగ అది ఒప్పుకొనదు. కొంత మారాం చేయును. కాని సాధకుడు పట్టుదల విడనాడక ప్రతిదినము ఒకింత అభ్యాసము చేయుచుండినచో, ఎట్టకేలకు అది లోబడిపోవును. గీత 6వ అధ్యాయమున అర్జునుడు మనస్సు మహాచపలముగానున్నదనియు, దానిని నిగ్రహించుట అతిదుష్కరముగా కనిపించుచున్నదనియు శ్రీ కృష్ణునకు ఫిర్యాదుచేయగా, అమ్మహనీయుడు 'దానికి నేనేమి చేయగలను? అభ్యాసముచే నీవే దానిని నిగ్రహించుకొనుము. వేఱుదారి లేదు. వైరాగ్యమునుగూడ సహాయముగ తీసికొనుము' అని వ్రాక్రుచ్చిరి. భగవానుని అతిసమీపబంధవు, ప్రియుడు, సఖుడు, భక్తుడు, ఆప్తమిత్రుడు అయిన అర్జునునకు గూడ మనోనిగ్రహమందు స్వప్రయత్నరూప అభ్యాసమే శరణ్యమైనపుడు ఇక తక్కినవారివిషయమై వేఱుగ చెప్పవలయునా? కావున మనోనిరోధమునకై చక్కని అభ్యాసమును సలుపవలెను.

మఱియు గీత 12వ అధ్యాయమునందు భక్తియోగ ఘట్టమున శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు కొన్నిసాధనల నుపదేశించుచు మొట్టమొదట 'నా యందు మనస్సును నిలుపుము. అట్లు కావించినచో నీవు

★ (1) నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాన్త మనశ్నతః
నచాతిస్వప్నశీలస్య జాగ్రతోనైవ చార్జున. (6-16)

(2) యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా. (6-17)

నాయందే నివసింపగలవు' - అని బోధించిరి. 'ఒకవేళ మీ యందు మనస్సును స్థిరముగ నిలుపలేనిచో ఏమిచేయమందురు మహానుభావా?' అని వెంటనే అర్జునుడు ప్రశ్నించునని భావించి, అంతపని జరుగకమునుపే భగవానుడు తామే ఆ ప్రశ్న కిట్లు సమాధాన మొసంగిరి.

'**అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనఞ్జయ (12-9)** 'ఒకవేళ నా యందు మనస్సును నీవు నిలుపలేకపోయినచో అభ్యాసముచే అట్లు నిలుపునట్లు చేసికొని నన్నుపొందుటకై యత్నింపుము' - కావున మనోనిగ్రహమునకు, భగవత్ప్రాప్తికి అభ్యాసము తప్ప వేఱుదారిలేదు. అందువలననే కాబోలు 'అభ్యాసయోగము' అని పేరు పెట్టి కర్మయోగము, భక్తియోగము, జ్ఞానయోగము మున్నగువానితో సమానమైన హోదా దానికికూడ ఇచ్చిరా అనిపించుచున్నది. ఇట్టి అభ్యాసయోగమను పదము గీత 8వ అధ్యాయమందుకూడ కనిపించుచున్నది.★ అక్షర పరబ్రహ్మమును పొందుటకు తదేకధ్యానరూపమగు నిరంతరాభ్యాసమే శరణ్యమని అచ్చోట భగవానుడు బోధించియుండిరి. కావున కర్మయోగమైనను, భక్తియోగమైనను, ధ్యానయోగమైనను, జ్ఞానయోగమైనను ఈ అభ్యాసయోగముతో కలవనిచో పరిపక్వతను, దృఢత్వమును బొందనేరవు. ఏయోగమైనను తుదకు అభ్యాసయోగము నాశ్రయించవలసినదే.

అయితే ఈ అభ్యాస మెపుడుచేయవలెను? దీనికి సమాధానము గీత యందు 'నిరంతరము' అని చెప్పబడినది. మాయ మహాప్రమాదకరమైనది. అది పొంచియుండి సాధకుడు ఏ కొంచెముసేపు అజాగ్రత్తగనున్నను వెంటనే వచ్చి కాటువేయును. కాబట్టి సదా జాగరూకుడై యుండవలెను. లేకున్న 'తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర' - ఎల్లకాలములందును నన్ను స్మరణచేయుము - అని భగవాను డేల వచింపవలయును? ప్రొద్దున, మధ్యాహ్నము, సాయంత్రము మాత్రము స్మరింపుడని యేల చెప్పలేదు? ఇందులకు కారణము, కామాదులు జీవునకు నిరంతరశత్రువులు, నిత్యవైరులు (జ్ఞానినో నిత్యవైరిణా). అవి సాధకుని కబళించివేయుటకు సర్వసన్నద్ధములై సదాకాచుకొనియున్నవి. కాబట్టి సాధకుడున్ను వానిపై విజయముసాధించుటకు వివేకఖడ్గముతో సదా సిద్ధముగనే యుండవలెను. 'తస్మాజ్జాగ్రత, జాగ్రత' అని శాస్త్రములు హెచ్చరించుచుండుట కిదియే కారణము. గీతయందు 'సతతము' (ఎల్లప్పుడును) అనుపదము విరివిగ కనిపించుచున్నది●. నిరంతరసాధన నాశ్రయించవలసినదిగా భగవానుడాదేశించుచున్నారు. ప్రారంభదశలో ముముక్షువు ధ్యానాదులకు కొన్ని వేళలను ఏర్పరచుకొనినను, క్రమక్రమముగ వానిని పెంచి నిరంతర దైవభావనకై యత్నింపవలెను. 'స్థిత్వాస్యామన్తకాలేఽపి' అంత్యకాలము వఱకుకూడ భగవత్స్మృతిని వీడరాదని, బ్రాహ్మీస్థితిని కాపాడుకొనవలయునని గీతామాత ఆనతిచ్చు చున్నది. ఏలయనిన, అంతిమశ్వాసయందుకూడ మాయ మనుజుని మోసగించగలదు. కావుననే మహనీయులు తమ ఆధ్యాత్మికసాధనలయందు కడుజాగరుకులై సంతతాభ్యాస పరులై యుందురు.

ఇక మనోనిగ్రహము నెట్లు అభ్యసింపవలెనో ఒకటి రెండు వాక్యములను జెప్పవలసియున్నది. గీతయందు తెలుపబడిన పద్ధతి యేదియనిన - ఎపుడెపుడు మనస్సు చపలముగానుండి బయటకు పరుగిడునో, అపుడపుడు దానికి నచ్చజెప్పి నెమ్మదిగ లోనికి తీసికొనివచ్చి ఆత్మయందు స్థాపించవలెను @. దృశ్యపదార్థములందు 'దుఃఖదోషానుదర్శనము' గావించవలెననియు గీత శాసించుచున్నది. బాహ్యపదార్థములు పాంచభౌతికములని, జడములని, క్షణికములని, శాశ్వతసుఖప్రదములుకావని

★ అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా. (8-8)

● (1) తేషాం సతతయుక్తానాం ... (10-10)

(2) సతతం కీర్తయన్తోమాం... (9-14)

@ యతో యతో నిశ్చరతి మనశ్చంచల మస్థిరమ్
తతస్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్. (6-26)

మనస్సునకు, ఇంద్రియములకు బాగుగ బోధించినచో, ఇక వానియందాసక్తిని అవి వదలి అధిష్ఠానాత్మయందే నిలుకడ కలిగియుండును. కనుకనే విషయవిరక్తి సాధకునకు అత్యవసరమైయున్నది. అట్లుకాక భోగైశ్వర్యములపై మనస్సు ఉరుకుచుండినచో –

**భోగైశ్వర్య ప్రసక్తానాం తయాఽపహృతచేతసాం**
**వ్యవసాయాత్మికా బుద్ధిస్సమాధౌ న విధీయతే. (2–44)** అని శ్రీకృష్ణమూర్తి సెలవిచ్చినట్లు ఆ విషయసుఖములచే మనస్సు లాగివేయబడుటచే ధ్యాననిష్ఠయందు చిత్తమున కేమాత్రము నిలుకడ లేకయుండును. కావున సాధకుడు ప్రయత్నపూర్వకముగ మొట్టమొదట విషయములందు విరక్తినభ్యసించి మనస్సు నటనుండి నెమ్మదిగ మరలించి ఆత్మయందు నెలకొల్పవలెను ★. ఇక్కార్యములను త్వరలో సాధించివేసి పరమానంద పదవియగు కైవల్యమును ఆ జన్మయందే చేపట్టుడని గీతామాత కరుణతో నుపదేశించుచున్నది. కాబట్టి అభ్యాసవైరాగ్యముల నెవరును వదలరాదు.

## 4. శ్రద్ధావిశ్వాసములు గలిగియుండుము, సంశయమును పారద్రోలుము :–

పరమాత్మయొక్క అస్తిత్వవిషయమందుగాని, జగత్తు యొక్క మిథ్యాత్వవిషయమందుగాని సందేహము గలిగి యుండరాదు. ఏలననిన వానివిషయమై శాస్త్రములు ఖచ్చితముగ కొన్ని నిర్ణయములు చేసి చెప్పివైచినవి. మహాత్ములున్ను వారి యనుభవమునం దట్లే కాంచిరి. 'తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే' అని గీత శాస్త్రప్రమాణము నాదరించవలసినదిగా హెచ్చరించినది. ఆ యా శాస్త్రప్రమాణములయొక్క సత్యత్వమునందిసుమంతైనను సందేహము లేదు. కాట్టి వానియందు శ్రద్ధావిశ్వాసములు గలిగి పరమార్థరంగమున ముందునకు సాగిపోవలెను.

**'సంశయాత్మా వినశ్యతి'** (త్రికాలములందును సత్యమైయున్నదానిని) సంశయించువాడు వినాశమునే పొందునని గీత తెలుపుచున్నది. మఱియు –

**'శ్రద్ధావాన్ లభతే జ్ఞానం'** శ్రద్ధాభక్తులు కలిగి విశ్వాసముతో సాధనచేయువాడు తప్పక జ్ఞానమును బొందగలడనియు గీత పేర్కొనుచున్నది. ఈ రెండు వాక్యములును గీతయందలి రెండు అష్టాక్షరీ మహామంత్రములని భావించి దైవకార్యములందును, ఆధ్యాత్మికసిద్ధాంతములందును శ్రద్ధను ఇనుమడింపజేసికొని సంశయమును హృదయకుహరమునుండి పారద్రోలి పరమాత్మపదమును సాధించివేయవలెను.

శ్రద్ధ అను పదము గీతయందు లెక్కలేనన్నిసార్లు ప్రయోగింపబడుట గమనింపదగినది @.

---

★ గీతోక్తసాధనలందు వైరాగ్యమునకు ప్రముఖమైన స్థాన మొసంగబడినట్లు ఈ క్రింది ప్రమాణముల ద్వారా తెలియుచున్నది–

(1) అభ్యాసేన తు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే (6-35)
(2) వైరాగ్యం సముపాశ్రితః (18-52)
(3) ఇన్ద్రియార్థేషు వైరాగ్యం (13-9)

@ (1) శ్రద్దధానా మత్పరమా (12-20)
(2) శ్రద్ధయా పరయా తప్తం (17-17)
(3) శ్రద్ధయా పరయోపేతాః (12-2)
(4) శ్రద్ధయార్చితు మిచ్ఛతి (7-21)
(5) శ్రద్ధావన్తోఽనసూయన్తో (3-31)
(6) శ్రద్ధావాననసూయశ్చ (18-71)
(7) శ్రద్ధావాన్భజతే యోమాం (6-47)
(8) శ్రద్ధావిరహితం యజ్ఞం (17-13)

దేవతయందుగాని, తీర్థమందుగాని, బ్రహ్మనిష్ఠునియందుగాని, మంత్రమందుగాని, జ్యోతిష్కునియందుగాని, ఔషధమునందుగాని, గురువుయందుగాని మనుజునకు ఎట్టి శ్రద్ధ, ఎట్టి భావన, ఎట్టి విశ్వాసము ఉండునో అట్టి ఫలితమే వానికి కలుగుచుండును ★. కాబట్టి భగవంతునియొక్క అస్తిత్వమునం దేలాటి సంశయమున్ను పెట్టుకొనక, వారిపై పరిపూర్ణ విశ్వాసముంచి, శ్రద్ధగలిగి దైవభక్త్యాదులచే విఘ్నశతంబులను ఆవలకు నెట్టివైచి సాధకుడు ఆధ్యాత్మికపథమున త్వరితముగ పురోగమించవలెను.

## గీతయందు నిషేధింపబడిన ఆచారవిచారములు

భగవత్సాక్షాత్కారమును కాంక్షించువాడు సవ్యమైన మార్గమునే అవలంబించవలెను. అపసవ్యమగు మార్గమున లక్ష్యమును చేరకపోవుటయేగాక, చిత్తశాంతిలేక దారిలో నానా అవస్థలు పడవలసియుండును. సాంసారిక క్లేశములకు, జననమరణాదులకు గురికావలసివచ్చును. కావున గీతాచార్యులు కొన్ని కొన్ని దురాచారములను పేర్కొని ముముక్షువు వాని ననుసరింపరాదని తీవ్రముగ హెచ్చరించిరి. వానిని తెలిసికొనియుండుట సాధకునకు అత్యవసరము కనుక అవి ఇచ్చోట పొందుపరుప బడుచున్నవి –

1. కామ్యబుద్ధితో యజ్ఞాదు లాచరించుట
2. అకర్మణ్యత్వము (ఏ కర్మచేయక ఊరక నుండుట)
3. నాస్తికమతము.
4. భౌతికవాదము
5. శరీరక్లేశదాయకమగు దాంభికతపస్సు
6. మిథ్యాచారము

అను ఈ ఆఱింటి విషయమై ముముక్షువులు కడుజాగరూకులుగానుండి వానినిదరికి చేర్చనీయవలదని గీతయందు బోధింపబడెను. వానిని గూర్చి సంక్షేపముగ నిచట విచారించెదము.

### 1. సకామ యజ్ఞాది కర్మలు :–

విషయభోగములకు పరమార్థజీవనమునకు పొత్తుకుదురదు. ఒకదానికొకటి చుక్కెదురు. భోగాసక్తి కలవాడు మోక్షము నెన్నటికిని పొందజాలడు. ఇహలోక భోగమైనను, పరలోక భోగమైనను రెండును ఒకటే. జీవుని ఆధ్యాత్మిక పతనమునకు కారణత్వమును వహించుటలో రెండును సమానమే. అయితే స్వర్గభోగములు కొంత నాణ్యముగా నుండవచ్చునేమో (నలుపులో నాణ్యమువలె). కాని ప్రయోజనమేమి?

**'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి'** అనునట్లు భోగానుభవముచే ఆ పుణ్యము క్షీణింపగనే స్వర్గమునుండి క్రిందబడి మరల భూలోకమున అధ్యాత్మరంగమున 'ఓ, న, మా' లు ప్రారంభించవలసినదే. కాబట్టి జననమరణములకు, జీవుని ఆవాగమనములకు గతాగతములకు @ ఆలవాలమైనట్టి కామ్యకర్మలను, స్వర్గభోగజనకములగు సకామయజ్ఞయాగాదులను శ్రీ కృష్ణపరమాత్మ గీత యందు పూర్తిగ నిషేధించిరి. జీవుని మోక్షప్రాప్తికి, ఆత్యంతిక దుఃఖరాహిత్యమునకు అడ్డుగానుండు ఏ క్రియయైనను సరియే అది

★ దేవే తీర్థే ద్విజే మంత్రే దైవజ్ఞే భేషజే గురౌ
యాదృశీ భావనా యస్య సిద్ధిర్భవతి తాదృశీ.

@ గతాగతం కామ కామా లభన్తే (9-21)

స్వర్గభోగమగుగాక, భూలోకభోగమగుగాక, లేక పాతాళభోగమగుగాక - నిషిద్ధమే యగును. ఏలయనగా మనస్సుకోరికలతో నిండి బహిర్ముఖముగ పరుగెత్తుచుండినచో, ధ్యానకాలమున ఆత్మయందు నిలుకడను బొందజాలదు. మనస్సు ఆత్మయందు స్థిరపడనిచో మోక్షము ఏ కాలమందును లభించదు. కనుకనే గీతాచార్యులు స్వర్గసుఖములకై అఱ్ఱులుచాచు జనులను 'అవిపశ్చితులు' (అవివేకులు, అల్పబుద్ధికలవారు) అని సంబోధించి వారి చర్యలను పూర్తిగ ఖండించివైచిరి. గీత 2 వ అధ్యాయమునందలి ఈ క్రింది శ్లోకములలో ఇట్టి భావమే వ్యక్తీకరింపబడినది -

1. **కామాత్మానః స్వర్గపరా జన్మ కర్మ ఫలప్రదామ్**
**క్రియావిశేషబహులాం భోగైశ్వర్యగతిం ప్రతి.** **(2-43)**

2. **భోగైశ్వర్య ప్రసక్తానాం...సమాధౌ న విధీయతే.** **(2-44)**

కాబట్టి క్రియాబాహుళ్యముతోగూడి, విక్షేపజనకమ్మై, చిత్తచాంచల్యమునకు కారణభూతమ్మైనట్టి ఈ సకామయజ్ఞముల నాచరించుటకంటె మోక్షదాయకములైనట్టి జపయజ్ఞము, స్వాధ్యాయయజ్ఞము, జ్ఞానయజ్ఞము మున్నగునవి ఏల ఆచరించరాదని గీతయందు భగవానుడు ప్రశ్నించుచున్నారు. కావున ముముక్షువు ఆ సకామకర్మలజోలికి పోక గీతయందు తెలుపబడిన చక్కని నిష్కామయజ్ఞముల నాశ్రయించి తరించుట శ్రేయస్కరము.

**2. అకర్మణ్యత్వము :-**

ఏ కర్మయుచేయక ఊరకనున్నచో అది చాల గొప్పస్థితియని కొందఱు తలంచవచ్చును. అట్లుండుట పరమ వైరాగ్యచిహ్నమని కొందఱూహించవచ్చును. కాని అది పొరపాటు. మనస్సునందు వాసనలు, సంస్కారములు ఉన్నంతవఱకు స్థూలదేహముతో కర్మల చేయకపోయినను జీవుని బంధము విడనాడదు. మనస్సునం దాయా సంకల్పములు విజృంభించుచునేయుండును. ఏ కర్మలు చేయక ఊరకనుండువారు తమోగుణమయులైనను అయియుండవలెను, లేక కేవలము విశుద్ధ సత్త్వమయులై నిర్వికల్పసమాధిస్థులై నను అయియుండవలెను. రెండవతరగతివారు లోకములో చాల అరుదు. అట్టివారు పరమపూజ్యులు. వారి హృదయము వాసనారహితమ్మై, నిష్కల్మషముగ నుండును. వారు కర్మలు చేసినను చేయకున్నను బంధము లేదు (నైవ తస్యకృతేనార్థో నాకృతేనేహ కశ్చన). కాని తక్కినవారలు అట్లుకాదు. వారు కర్మలు చేసియే తీరవలెను. ఏలయనిన తమోగుణమునుండి రజోగుణమునకు, రజోగుణమునుండి సత్త్వగుణమునకు, సత్త్వగుణమునుండి విశుద్ధసత్త్వమునకు, లేక గుణాతీతమునకు ప్రయాణము కావలసియున్నది. ఇట్టి స్థితిలో ఏ కర్మలు చేయక ఊరకుండుట కేవలము మూర్ఖత్వమే యగును. దానిచే జీవితము భ్రష్టమైపోగలదు. బంధము ఇంకను పెరిగి పోవును. కనుకనే శ్రీకృష్ణపరమాత్మ -

**కర్మజ్యాయో హ్యకర్మణః (3-8)** "కర్మలు చేయకుండుటకంటె చేయుటయే మేలు" అనియు,

**తయోస్తు కర్మసన్న్యాసాత్కర్మయోగో విశిష్యతే (5-2)** "ఆ రెండిటిలో కర్మత్యాగముకంటె కర్మయోగమే శ్రేష్ఠమైనది" - అనియు, ఈ ప్రకారముగ గీతయందు అకర్మణ్యత్వముపై దాడి చేసిరి. కుంభకర్ణునికంటె రావణాసురుడు మేలు. తమోగుణముకంటె రజోగుణముమేలు; రజోగుణముకంటె సత్త్వగుణముమేలు. కాబట్టి ఏకర్మచేయక కాలమును వృథాచేయుటకంటె ఏదియోకర్మచేయుటయే ఉత్తమము. క్రమముగ ఆ కర్మ శుద్ధపడి, నిష్కామముగా మారగలదు. దానిచే చిత్తశుద్ధియు, తద్ద్వారా

జ్ఞానప్రాప్తియు చేకూరగలదు. ఈ ప్రకారముగ కర్మాచరణ తుట్టతుదకు నైష్కర్మ్యసిద్ధిరూప మోక్షమునకు దారితీయుచున్నది. కాబట్టి సాధకులు తమోగుణమును సత్త్వగుణమని భ్రమింపక కడుజాగరూకులై అకర్మణ్యత్వమును దూరముగ పారద్రోలి, ఆధ్యాత్మికోన్నతికి దోహదమొసంగు సత్క్రియల నాచరించుచు జన్మసాఫల్యము నొందవలయునని శ్రీకృష్ణపరమాత్మ గీతయందు దానతిచ్చుచున్నారు.

### 3. నాస్తికమతము :-

"కనిపించునదియెల్ల సత్యము. పునర్జన్మ లేదు. కాబట్టి బ్రతికిన నాలుగురోజులు పుష్కలముగా తినిత్రాగి విలాసముగ గడుపవలయును. స్థూలదేహపోషణమే పరమపురుషార్థము" - నాస్తికుల విచారధార ఈ ప్రకారముగ నుండును. గీతాచార్యుల కిట్టి భావములు ఏమాత్రము రుచింపవు. కనుకనే గీత 16వ అధ్యాయమున అట్టి నాస్తికులభావములను పూర్తిగ ఖండించివైచిరి. "శౌచముగాని, ఆచారముగాని, సత్యముగాని లేనివారును, జగత్తును ఈశ్వరుడు సృష్టింపలేదు, స్త్రీపురుషుల సంయోగమువలననే జగత్తు ఏర్పడినది అని వాదించువారును, దుష్పూరమగు కామమును ఆశ్రయించి, దంభమానమదాన్వితులై, భోగములనే పరమగమ్యముగ భావించి, వానికొఱకై అన్యాయముగ ద్రవ్యమార్జించువారును, ధనమదాంధులై గర్వించువారునగు నరాధములను నరకమునందు, నీచయోనులందు విసిరివేసెదను. అధోగతియే వారికి శరణ్యము" - అని శ్రీకృష్ణపరమాత్మ అట్టి వారిని గూర్చి పలికిన వాక్యములు సాధకలోకమునకు గొప్ప హెచ్చరికగా నుండగలదు. కాబట్టి ముముక్షువు లట్టి నాస్తికభావములను దరికి జేరనీయక పరమాత్మ సత్యము, దేహాది భౌతికవస్తుజాలము అసత్యమని నమ్మి, భోగాసక్తిని త్యజించి, యోగాసక్తిని పెంపొందించుకొని జీవితమును పరమార్థసంపాదనమునకు అంకితమొనర్చి బ్రహ్మానందానుభూతి నిచటనే పడయవలయును.

### 4. భౌతికవాదము :-

"ప్రకృతి (Nature) వలననే సమస్తము జరుగుచున్నది. ఇక పురుషునియొక్క ఆవశ్యకత లేదు. కార్యకారణరూపమగు ఈ చరాచర జగత్తంతయు ప్రకృతికి అధీనము. ప్రకృతి స్వతః చేతనమైనది. సర్వశక్తి సమన్వితమైనది" - అను ఈ భౌతికవాదమును గీత అంగీకరింపదు. ప్రకృతియొక్క వ్యావహారిక సత్యత్వమును గీత సమ్మతించినను, ఆ ప్రకృతి పురుషునికి అధీనమైయున్నదనియు, స్వతః అయ్యది జడమై పురుషునివలన చైతన్యమును అరువుతెచ్చుకొని కార్యమందు ప్రవృత్తమగుచున్నదని నుడువుచున్నది.

**మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్ (గీ 9-10)** చైతన్యవంతుడగు పరమాత్మయొక్క సాన్నిధ్యముచే ప్రకృతి ఈ స్థావరజంగమాత్మకమగు సమస్త ప్రపంచమును ఉత్పన్న మొనర్చుచున్నది. అని పై గీతావాక్యము ఋజువు చేయుచున్నది. జగత్తను సభకు భగవానుడు అధ్యక్షుడు (Chairman), ప్రకృతి సంచాలకుడు (Convenor). అధ్యక్షుడు లేనిదే తక్కినవారందఱున్నను సభ యెట్లు రాణించదో, అసలు సభకు రూపమే యెట్లుండదో, జగద్విషయమున్ను అంతియేయని యెఱుంగవలెను. పరమాత్మ ప్రకృతికి ఆధారభూతడు. ఆధారములేనిదే ఆధేయము నిలువదు. 'సూత్రే మణిగణా ఇవ' అనునట్లు ఈ బ్రహ్మాండమను మణిహారమందు దారమువలె ఆధారభూతులై పరమాత్మ వ్యాపించియున్నారు. దారము లేనిచో మణులు చిందర వందఱగా పడిపోవును. అట్లే పురుషుడు లేనిచో ప్రకృతియొక్క అస్తిత్వమున్ను ఉండనేరదు. మఱియు -

**క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత. (గీ-13-34)** 'ఓ అర్జునా! క్షేత్రజ్ఞుడగు పరమాత్మ సమస్తక్షేత్రమును (ప్రకృతిని) ప్రకాశింపజేయుచున్నాడు.' అని గీతావ్యాకము. దీనిచే ప్రకృతి, లేక క్షేత్రము జడమైనదనియు, దానికి స్వతః ప్రకాశము లేదనియు, క్షేత్రజ్ఞుడగు పురుషుడే (పరమాత్మయే) క్షేత్రమగు ఆ ప్రకృతిని ప్రకాశింపజేయుచున్నారనియు తేలుచున్నది. ఇవ్విధముగ ప్రకృతియే స్వతః తన శక్తిచే అన్ని కార్యములను జరుపుచున్నదను భౌతికవాదమును గీత ప్రతిఘటించుచున్నది.

మఱియు పంచభూతములు అస్థిరములు, చపలములు, వికారవంతములు, నశ్వరములు; వానిని నమ్ముకొనినచో జీవుడున్ను పతనమును బొందిపోవును. కదలుచుండు స్తంభమును పట్టుకొని దానిచుట్టు తిరుగువాడు స్తంభముతోపాటు తానుగూడ పడిపోవును గదా! ప్రపంచములో కదలకుండనున్న వస్తువు ఒకటే. అదియే పరమాత్మ. 'అచలోఽయం సనాతనః' అని గీత దానినిగూర్చి పేర్కొనెను. అది సర్వసాక్షి. ఆ వస్తువును నమ్ముకొనినవానికిక పతనభయములేదు. భౌతికవస్తుజాలమును నమ్ముకొనినవాడు తప్పక దెబ్బతినును. ఇదివఱకెందఱో అట్లు పతనమొందిరి. ఎండమావులను గూర్చి పరుగెత్తువారు, ప్రతిబింబిత ఫలములను భక్షింపనెంచువారు తప్పక ఆశాభంగమునొందవలసివచ్చును. కావున ప్రకృతిని నమ్ముకొనక పురుషునే నమ్ముకొని అధ్యాత్మదృష్టికలిగి జన్మసార్థకత నొందవలసినదని గీత ఆదేశించుచున్నది. "నా వలననే అంతయు జరుగుచున్నది (మత్తః సర్వం ప్రవర్తతే), నేను జగత్తునకు తండ్రిని, తల్లిని, తాతను, విధాతను (పితాఽహమస్య జగతో మాతా ధాతా పితామహః). కావున ఇతరము నాశ్రయింపక, భౌతికమునుబట్టి వ్రేలాడక అధ్యాత్మరూపుడనగు నన్నొకనినే ఆశ్రయింపుము. (మామేకం శరణం వ్రజ)" అని భగవానుడు గీతయందు కరుణతో పలుతావుల బోధించియుండిరి. కాబట్టి సంసారదుఃఖతరణము నపేక్షించు ముముక్షువు భౌతికవాదమునకు తిలాంజలి యొసంగి అధ్యాత్మవాదమును ప్రోత్సహించి హృదయస్థపరమాత్మను సాక్షాత్కరించుకొని పరమానంద మనుభవించునుగాక!

## 5. దేహపీడాకరమగు తపస్సు :-

మోక్షమునకు ప్రతిబంధకము చిత్తమందలి దుష్టవాసనలు, దుష్టసంకల్పములు, దుస్సంస్కారములు. అంతియేకాని దేహముకాదు. దేహము అమాయకమైనది. దానిని బాధించినచో మోక్షము చేకూరునని తలంచుట వెఱ్ఱి. పుట్టను కొట్టినచో పాము చావదు. జన్మజన్మాంతరము హృదయమున బాగుగ జితించియున్న కామక్రోధాదులు దేహశోషణమాత్రముచే ఎన్నటికిని తొలగనేరవు. కాబట్టి మహనీయులు తమ చిత్తమునకు, తమ ఇంద్రియములకు పుటము పెట్టి, బాగుగ తపింపజేసి, సంయమమును అభ్యసించి వానియందలి రాగద్వేషాదికషాయమును, మాలిన్యమును దూరీకృతము చేయుదురు. ఇదియే వాస్తవమగు తపస్సు. రాగాదుల నిర్మూలనకై చిత్తమును తపింపజేయుటయే తపస్సుగాని, దేహమును శోషింపజేయుటకాదు. దీనినిగూర్చి శ్రీకృష్ణపరమాత్మ గీత17వ అధ్యాయమున బాగుగ హెచ్చరించిరి★. అట్లు అశాస్త్రీయముగ ఘోరతపస్సులు చేసి శరీరమును బాధించువారు కేవలము అసురులేయని మందలించిరి. వానికి ప్రత్యామ్నాయముగ ఆ అధ్యాయమందే గీతాచార్యులు శారీరక, వాచక, మానసికములను త్రివిధతపస్సులను చక్కగ బోధించిరి. అవి ప్రతివానికిన్ని ఆచరణయోగ్యములైనవి. అయితే దేహారోగ్యముకొఱకు అపుడపుడు

★ 1. అశాస్త్రవిహితం ఘోరం తప్యన్తే యే తపో జనాః
దంభాహంకార సంయుక్తాః కామరాగబలాన్వితాః. (17-5)

2. కర్శయన్తఃశరీరస్థం భూతగ్రామమచేతసః
మాం చైవాన్తః శరీరస్థం తాన్విద్ధ్యాసుర నిశ్చయాన్. (17-6)

ఏకాదశి మొదలగు పర్వదినములందు ఉపవాసము మొదలైనవి చేయుచుండవచ్చును. దేహశుద్ధికొఱకు అటువంటి చిన్న చిన్న ప్రక్రియలను ఆశ్రయించవచ్చును. అంతియేకాని కఠోరతపస్సులచే శరీరమును బాధించినందువలన కలుగు ప్రయోజన మేమియునులేదు. కాబట్టిఅట్టివాని నాశ్రయింపక, శ్రీకృష్ణమూర్తి గీతయందు సూచించిన సాత్త్వికతపస్సును మాత్రము చేపట్టి ముముక్షువులు పరమార్థసిద్ధికై యత్నములను గావించవలెను.

**6. మిథ్యాచారము :–**

కొందఱు కర్మేంద్రియములతో ఏపని చేయక ఊరక కూర్చుండి మనస్సుతో మాత్రము ముల్లోకములందలి సమాచారములను కెలుకుచుందురు. అట్టివారు శరీరేంద్రియములచే కర్మచేయకపోయినను మనస్సుతో విపులముగ కర్మనాచరించుటచే కర్మబద్ధులే యగుదురు.

**కర్మేన్ద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్.**
**ఇన్ద్రియార్థాన్విమూఢాత్మా మిథ్యాచారస్స ఉచ్యతే.** (గీ –3–6) "కర్మేంద్రియముల నణచిపెట్టి ఎవడు మనస్సుతో శబ్దాదివిషయములను చింతించుచుండునో, అట్టివాడు వివేకశూన్యుడే యగును. మఱియు నాతని చేష్ట మిథ్యాచారమని, కపటాచారమని చెప్పబడును" అని భగవానుడు సెలవిచ్చియున్నారు. కాబట్టిముందు మనస్సును మరమ్మతు చేసికొనుట అతిముఖ్యమైనపని. విషయవాసనలు లేకుండ దానిని శుద్ధపఱచుకొనవలెను. ప్రాపంచిక సంకల్పములను దరికిజేర్చరాదు. ఎపుడు మనస్సు విషయసంకల్పరహితమై, వాసనావర్జితమైయుండునో అపుడిక కర్మేంద్రియములచే కర్మలను చేసినను మనుజుడు బంధింపబడడు.★ కాబట్టి, సాధకులు గీతాచార్యుల ఈ హెచ్చరికను కడుజాగరూకతతో గమనించి మిథ్యాచారమును విసర్జించి ధ్యానకాలమునందు మనస్సునం దేలాటి విషయసంకల్పములున్ను రానీయక దైవభావనమాత్ర ముండునట్లు ప్రవర్తించవలెను. అయితే ప్రారంభమున అట్టి స్థితి వెంటనే చేకూరకున్నను, బహుకాలాభ్యాసముచే దానినెట్లైనను సాధించివేయవలెను. కేవలము కర్మేంద్రియములను మాత్ర మరికట్టినందువలన విశేషప్రయోజనమేమియును లేదు. మనస్సును లోబఱచుకొనవలెను.

## గీతాపాఠకునకు ఉదయించు కొన్నిప్రశ్నలు

**1. ప్రశ్న :–**

అంతస్వల్పసమయమున ఇంత పెద్ద గీతను శ్రీకృష్ణు డెట్లు చెప్పగల్గిరి?

**ఉత్తరము :–**

(1) వాస్తవముగ విచారించినచో శ్రీకృష్ణుడు చేయలేనిపని ప్రపంచమున ఏదియునుండదు. అఘటితఘటనాప్రవీణులు వారు. మాయాధీశులు. తమ యోగామాయచే గొప్పగొప్ప లీలలను గావించి లోకమును ఆశ్చర్యమున ముంచివైచిరి. అట్టివారికి స్వల్పసమయమున బృహద్బోధ నొనర్పగల్గుట కష్టతరమేమియునుకాదు.

★ యస్త్విన్ద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున
కర్మేన్ద్రియైః కర్మయోగమసక్తస్స విశిష్యతే. (3-7)

(2) యుద్ధసమయమున భగవానుడు సూత్రప్రాయముగ కొన్ని ధర్మములను బోధింప, వానిని వేదవ్యాసులు తదుపరి ఛందోబద్ధమొనర్చి విస్తారగ్రంథరూపముగ రూపొందించియుండవచ్చును.

(3) యుద్ధప్రారంభదినమున ఇరుపక్షసైనికులు బారులుతీర్చి రణరంగమున నిలబడిన తదుపరి వెనువెంటనే యుద్ధము ప్రారంభముకాలేదు. ఒకటి రెండు చిన్న సంఘటనలు జరిగినవి. ధర్మరాజు పాదచారియై శత్రుసైన్యమువైపు నడువసాగెను. సోదరులున్ను ఆతని ననుగమించిరి. అతడు భీష్మ ద్రోణ కృపాశల్యుల కడకేగి వారి యాశీర్వాదమును బడసివచ్చెను. తదుపరి శత్రుపక్షమునం దెవరైనను తనకు శరణాగతులైనచో వారికి రక్షణకల్పించెదనని, అభయమిచ్చెదనని ధర్మరాజు ప్రకటింప యుయుత్సుడు పాండవపక్షమున వచ్చిచేరెను. ఈ ప్రకారములగు కొన్నిఘటనలు మధ్యలో సంభవించినవి కనుక యుద్ధప్రారంభమునకు కొంతకాలయాపన అవశ్యము జరిగినదని ఊహించుకొనవచ్చును. అందును అది ప్రారంభదివసము కనుక యుద్ధసంబంధమైన కొన్ని సర్దుబాట్లు చేసికొనుటకు కొంతవ్యవధి ఏర్పడియుండవచ్చును. అట్టి వ్యవధిలో గీతోపదేశము గావింపబడినది, కనుక అందు వైపరీత్యమేమియునులేదు.

(4) యుద్ధనీతిననుసరించి ప్రతివారు సంగ్రామమున పాటింపవలసిన కొన్ని ధర్మసూత్రములు కలవు. అందులో నొకటి - "శత్రుపక్షముననున్న వాడెవడైనను నిరాయుధుడై, శోకసంతుప్తుడై యున్నపుడు స్వపక్షముననున్నవాడు అతనిపై శస్త్రప్రయోగము చేయరాదు" - అని కలదు. ఇరుపక్షములందును యుద్ధనీతిని గౌరవించుమహానుభావులనేకులు కలరు. అర్జునుడు యుద్ధారంభసమయమున శరచాపములను జారవిడిచి, శోకసంవిగ్నమానసుడై యుండెను. పాండవపక్షమున అర్జునుడు ప్రముఖస్థానమును ఆక్రమించుకొనియున్నదిట్టి. అట్టివాడు నిరస్త్రుడైయున్నప్పుడు ఎదుటివారు వెంటనే యుద్ధమును ప్రారంభింతురా? కావున వారు కొంతసేపు ఆగి, శ్రీకృష్ణుని దివ్యబోధలచే అర్జునుడు తెప్పరించుకొని తిరిగి ధనుర్ధరుడై రంగమున నిలబడిన వెనుక యుద్ధమును ఉపక్రమించి యుండవచ్చును.

ఈ పై కారణములన్నిటిచేతను రణక్షేత్రమున గీతాబోధ సంభవించుటయందు అసమంజసత్వమేమియు లేదని స్పష్టపడుచున్నది.

**2. ప్రశ్న :-**

కృష్ణుడు, అర్జునుడు చిన్ననాటినుండియు అనేక పర్యాయములు కలిసికొని సంభాషించియుండిరి. అట్టిచో ఎపుడైన ప్రశాంతముగనున్నపుడు గీతను బోధించక, చుట్టును గందరగోళముగానున్న యుద్ధసమయముననే శ్రీకృష్ణుడు దానిని బోధించుటకు ముహూర్తము నేల ఏర్పరచుకొనిరి?

**ఉత్తరము :-**

(1) తగిన వేళయందు చేసినచో మాత్రమే ఆ యా కార్యములు సత్ఫలితముల నిచ్చుచుండును. ఈ సూత్రము పరమార్థరంగమున ఇంకను చక్కగ అన్వయించును. ఇనుము బాగుగ కాలియున్నపుడే కమ్మరివాడు దానిని వంచుటకు ప్రయత్నము చేయును. పునాది బాగుగ గట్టిపడినపుడే యజమాని దానిపై గృహమును నిర్మింప ప్రారంభించును. రోగము కలిగినపుడే వైద్యుడు ఔషధమును ప్రయోగించును. క్షేత్రము శుద్ధపడినపుడు మాత్రమే కర్షకుడు అందు విత్తనమును నాటును. అట్లే అర్జునుని హృదయము రణరంగమున వైరాగ్యప్రపూరితమైయుండుట చూచి శ్రీకృష్ణుడు 'ఇదియే జ్ఞానబోధకు తగిన అదును' అని

నిశ్చయించి వెంటనే తత్త్వోపదేశమున కుపక్రమించిరి. అట్టిస్థితి అర్జునుని జీవితములో ఇదివరకెన్నడును ఏర్పడియుండలేదు. కావున ఇదివఱకట్టి యుపదేశమును చేయలేదు. మఱియు యుద్ధక్షేత్రమున అర్జునుడు 'ధర్మసమ్మూఢచేతస్కుడై' కర్తవ్యాకర్తవ్యములు తెలియక జ్ఞానబోధకై పరితపించెను. అంతటి తీవ్రపరితపన, తీవ్రధర్మజిజ్ఞాస జ్ఞానకాంక్ష ఇదివఱకతనికి ఎప్పుడును కలిగియుండలేదు. కనుక శ్రీకృష్ణుడు అతని జోలికి పోలేదు. ఇపుడో రణరంగమున ప్రవేశించగనే అట్టి జ్ఞానదాహము కలిగినది. కాబట్టి వెంటనే శ్రీకృష్ణపరమాత్మ జ్ఞానామృతవర్షమును కురిపించిరి.

(2) మఱియు, జీవితమే ఒక యుద్ధరంగము. ప్రతిదినము ధర్మాధర్మములకు, సత్యాసత్యములకు, న్యాయాన్యాయములకు భీకరమగు పోరు మానవుని చిత్తకుహరమున జరుగుచుండును. అట్టి యుద్ధముయొక్క ప్రతిరూపమే పాండవ కౌరవ యుద్ధము. పాండవులు సద్గుణములు. కౌరవులు దుర్గుణములు. శ్రీకృష్ణమూర్తి సద్గుణములవైపు జేరి వానిని ప్రోత్సాహపరచి, దుర్గుణములపై, రాక్షసస్వభావముపై విజయమును పొందునట్లుచేసిరి. అట్లే ప్రతిజీవియు పరమాత్మనాశ్రయించి, దుస్సంస్కారములను పారద్రోలి, హృదయము ధర్మమయముగ గావించుకొని పరమానంద మనుభవించవలెనని జనులకు బోధించుటకా యనునట్లు ఆ స్థూలసంగ్రామమును గీతాబోధకు తగిన క్షేత్రముగ నెన్నుకొనియుండవచ్చును.

**3. ప్రశ్న :–**

భీష్ముడు, ద్రోణుడు, కృపుడు, శల్యుడు, ధర్మరాజు, భీముడు, కర్ణుడు మొదలైన ఉద్దండు లెందఱో ఉండియుండ అందు అర్జుననకే శ్రీకృష్ణుడు గీత నేల యుపదేశింపవలెను?

**ఉత్తరము :–**

అర్జునుడు సామాన్యుడు కాడు. నరనారాయణులలో నొకడు. నారాయణుడు శ్రీకృష్ణరూపమున నవతరింప, నరుడు పార్థునిరూపమున జన్మించెను. 'పాండవానాంధనంజయః' – 'పాండవులలో అర్జునుడను నేను' అని భగవానుడు గీతయందు తెలిపియే యున్నారుకదా! దీనిచే అర్జును డెట్టి శక్తిసంపన్నుడో చక్కగ విదితముకాగలదు. ఒకపుడాతడు గొప్ప తపస్సు చేసి, శివుని మెప్పించి పాశుపతాస్త్రమును సంపాదించెను. అట్లే అనేక దేవతల మెప్పును బడసి పలువిధ అస్త్రశస్త్రాదులను బడయగల్గెను. ఉత్తరగోగ్రహణసమయమున ఒంటరిగా భీష్మాదిసహితమగు కౌరవసైన్యమునంతను ఎదుర్కొని తరిమివేయుట అర్జునుని అపరిమితబలపరాక్రమములకు చక్కని నిదర్శనము. ఇక శీలమును పరికింతమా స్వర్గమున ఊర్వశియొక్క పన్నాగములకు, తళుకుబెళుకులకు లొంగక ఆపె పన్నిన వలలో తగుల్కొనక బయటపడగల్గిన చరిత్రశుద్ధి గల మహనీయుడు. మఱియు శ్రీకృష్ణమూర్తికి బాల్యకాలమునుండియు ప్రాణస్నేహితుడు, సఖుడు. కాని యుద్ధప్రారంభసమయమున – 'శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్' – 'నేను మీ శిష్యుడను, మిమ్ము శరణుబొందితిని, ఆజ్ఞాపింపుడు'. అని శ్రీకృష్ణుని వేడుకొని సఖాత్వముతోబాటు భక్తిత్వమునుగూడ కలుపుకొనెను. అందువలననే శ్రీకృష్ణుడాతనిని 'భక్తోఽసిమే సఖాచేతి' (నీవు నాయొక్క సఖుడవే కాక భక్తుడవుకూడాను) అని పేర్కొనుట తటస్థించినది. 'నీవు సఖుడవుగను, భక్తుడవుగను నుండుటచే నీకీ అతిరహస్యమగు బ్రహ్మవిద్యను (రహస్యం హ్యేతదుత్తమమ్) ఉపదేశించితిని' అని భగవానుడు సెలవిచ్చిరి. 'నీవు నాకు చాల ప్రియుడవు' (ప్రతిజానే ప్రియోఽసి మే; ఇష్టోఽసి మే దృఢమితి) అనియు పెక్కుతావుల

వెల్లడించిరి. అర్జునుని భక్తత్వమే భగవానుని ప్రియత్వమునకు దారితీసినది. ఈ ప్రకారముగ భౌతిక , ఆధ్యాత్మికబలసంపన్నుడై, శ్రీకృష్ణపరమాత్మకు అతిసన్నిహితుడై పెక్కుయోగ్యతలు గల్గి వర్తించుటబట్టి గీతోపదేశమున కాతనినే భగవాను డెన్నుకొనుట తటస్థించినదని చెప్పవచ్చును.

4. ప్రశ్న :-

'యుద్ధము చేయుము' అని అర్జుననకు బోధించినందువలన గీతహింసను ప్రేరేపించినట్లైనదికదా?

**ఉత్తరము :-**

కాదు. గీత ఏనాడున్ను హింసను ప్రేరేపింపలేదు. పైగా అహింసనే ప్రొత్సహించుచు వచ్చినది.★ గీతయొక్క తత్త్వమును సరిగా అర్థము చేసికొననివాడే ఇట్టి వాక్కులను పలుకుచుండును. 'యుద్ధముచేయుము' అని ఏల చెప్పవలసివచ్చినదో, ఎవరికి చెప్పవలసివచ్చినదో, ఏ పరిస్థితియందు చెప్పవలసివచ్చినదో అంతయు చక్కగ విచారించినచో అట్టి విమర్శకు తావులేకుండును. అహింసాతత్త్వమును అతి సూక్ష్మముగ తెలిసికొనవలసియున్నది. అర్జునుడు క్షత్రియుడు, రాజు. రాజ్యపాలన మాతని విధ్యుక్తధర్మము. దుష్టశిక్షణ, శిష్టరక్షణ అతడు చేయవలసియున్నాడు. తద్ద్వారా ధర్మమును, శాంతిభద్రతలను (Peace and security) లోకమున స్థాపించవలసియున్నాడు. శ్రీకృష్ణుని యవతారమున్ను అందుకొఱకే యేర్పడినదని గీతయందు విస్పష్టముగ చెప్పబడినది @. దుష్కర్మల చేయువారిని, సంఘవిద్రోహులను, దేశద్రోహులను అరికట్టనిచో, వారలను శిక్షింపనిచో దేశము, సంఘము అల్లకల్లోలమైపోయి, అరాజకము ప్రబలి, దుష్టశక్తులు విజృంభించి, జనులందఱికిని అశాంతి, హింస కలుగుచుండును. వేరుపురుగును సకాలమున తీసివేయనిచో కొంతకాలమునకు చెట్టంతటిని కొట్టి గుల్లచేసి వేయును. పుండును 'అపరేషన్' చేసి నయము చేయనిచో అది పెద్దదై, దేహమంతయును వ్యాపించి ఘోరవిపత్తును కలుగుజేయును. అత్తఱి పుండును కోయుట హింసకాదు. అహింసయే. అట్లే సంఘవిద్రోహశక్తులు కొన్ని సమాజమున ప్రబలినప్పుడు పరిపాలకులు వానిని గమనించి వెంటనే తగు చర్య తీసికొని వానిని రూపుమాపవలెను. లేనిచో సంఘమంతయు చెడుపోవును. దొంగతనము చేసిన వానిని, ఖూనీజరిపినవానిని రక్షకభటులు (పోలీసువారు) పట్టి మేజస్ట్రేటునకు ఒప్పజెప్పి జైలుశిక్షకాని, ఉరిశిక్షకాని వేయింతురు. దానిచే వారు దొంగను హింసించినట్లా? కాదు. ఇట్టి చర్యచే వారు అహింసనే, శాంతినే, భద్రతనే, సర్వజీవసంక్షేమమునే లోకమున వ్యాపింపచేసినవారైరి.

అట్లే దుర్యోధనాదులు ఆతతాయులుగ ● ప్రవర్తించుచు లోకకంటకులుగ తయారైరి. సోదరులగు పాండవులకు న్యాయముగ సంక్రమించవలసిన రాజ్యములో సూదిమోపునంతటి స్థలమును గూడ ఇవ్వమని

★ (1) అహింసా క్షాన్తిరార్జవమ్ (13-8)
(2) అహింసా సత్యమక్రోధః (16-2)
(3) అహింసా సమతా తుష్టిః (10-5)
(4) బ్రహ్మచర్య మహింసా చ (17-14)
(5) అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ (12-13)

@ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే. (4-8)

● ఆతతాయి:- విషము పెట్టువాడు, ఇండ్లు కాల్చువాడు, స్త్రీల నవమానించువాడు. ఆయుధములచే చంపవచ్చువాడు. భూమిని దొంగిలించువాడు, ధనము నపహరించువాడు.

భీష్మించిరి. శ్రీకృష్ణుడున్ను రాయబారిగ వ్యవహరించి నయముగ ఎంతచెప్పవలెనో అంతయు చెప్పిచూచెను. కాని వారల కఠినహృదయములు ఒకింతైనను ద్రవించలేదు. ఇక విధిలేక పాండవులు యుద్ధమునకు దిగవలసి వచ్చినది.

ఈ ప్రకారముగ యుద్ధము అనివార్యమైనది. లోకసంక్షేమముకొఱకై రాజులు దుష్టులను శిక్షించుట హింస ఎన్నటికిని కాదు. అట్లు చేయుట క్షత్రియపరిపాలకులకు ధర్మము. అర్జునుడు క్షత్రియుడు. కావున క్షాత్రధర్మమును శ్రీకృష్ణుడు అర్జునునకు బోధించిరి. హింసాహింసల తత్త్వమును విశాలదృక్పథముతో వీక్షించవలెనే కాని సంకుచితదృష్టితోకాదు. లోతుగ విచారించవలెనేకాని పైపైభావములను పట్టుకొనికాదు. గీతయందు పలుతావుల అహింసయే బోధింపబడినదికాని హింస కాదు. సమస్తప్రాణికోట్లయెడల దయగలిగి యుండుడనియే చెప్పబడినదికాని ద్వేషమునుచూపుడనికాదు. ఇంతటి అహింసాదృష్టికలిగియున్న గీతాచార్యులు హింసను ప్రేరేపించిరని యనుట కేవలము హాస్యాస్పదము, నిర్హేతుకము; ప్రత్యేక సమయమున, ప్రత్యేక పరిస్థితులందు, ప్రత్యేక వ్యక్తికి (క్షత్రియునకు) యుద్ధమును గూర్చిన ఆదేశమొసంగబడిన ఘట్టమది. అదియు కర్తృత్వరహితముగ, అహంభావవర్జితముగ ఈశ్వరార్పణబుద్ధితో ఫలాఫలములందు సమబుద్ధిగలిగి నిష్కామముగ ఆచరించులాగున ప్రబోధింపబడెను. న్యాయాధికారి చోరునకు శిక్షవిధించుటలో ఎంత హింస యిమిడియున్నదో, అర్జునుడు దుష్టశిక్షణమునకై యుద్ధముచేయుటలోను అంత హింసయే వర్తించుచున్నది. అది హింసకాదు, పైపెచ్చు (విశాలభావముతో పరికించినచో) అహింసయే యగును. కావున గీత అహింసనే ప్రోత్సహించుచున్నదికాని హింసను కాదని ముమ్మాటికిని చెప్పవచ్చును.

## గీత – యోగవాసిష్ఠము

ఇంతవఱకుగీతాపాఠకునకు కలుగు సంశయావళి నివారింపబడినది. ఇక ఆధ్యాత్మికవాఙ్మయమున అతివ్యాపకముగా ప్రచారములో నున్నదియు, గొప్ప ప్రామాణిక గ్రంథములలో నొకటిగ నెంచబడుచున్నదియు, అతిపురాతనమైనదియునగు యోగవాసిష్ఠమునకును గీతకును గల పోలికలు, వాని సంబంధము తెలిసికొనుట పాఠకులకు చాల అవసరమైయుండుటచే క్లుప్తముగ నిచ్చోట నవి పొందుపఱుపబడుచున్నవి. త్రేతాయుగమున మహర్షి వాల్మీకి యోగవాసిష్ఠమును ముప్పదిరెండువేల శ్లోకములతో గూడిన బృహద్గ్రంథమును రచించిరి. గీతకును దానికిని ఈ క్రింది పోలికలు కలవు.

(1) గీతయందు శ్రీకృష్ణమూర్తి అర్జునున కుపదేశించిన విధముగ యోగవాసిష్ఠమున శ్రీ వశిష్ఠుడు శ్రీరామచంద్రునకు తత్త్వోపదేశము చేసిరి. కావున రెండును సంవాదరూపమున నున్నవి.

(2) అర్జునుడు ప్రాపంచికైశ్వర్యములయెడల విరక్తిగలిగి త్రైలోక్యసామ్రాజ్యమును గూడ తృణప్రాయముగనెంచి కింకర్తవ్యవిమూఢుడై రణరంగమున నున్నపుడు శ్రీకృష్ణపరమాత్మ అతనికి గీతాధర్మముల నెట్లు ప్రబోధించిరో, అట్లే పదునాఱేండ్ల చిఱుతప్రాయమున శ్రీ రామచంద్రుడు దృశ్యప్రపంచముయొక్క అనిత్యతనెఱింగి, భోగవిలాసములయెడ పూర్ణవిరక్తి గలిగి కర్తవ్యము తెలియక తూష్ణీంస్థితుడై యున్న సమయమున వారి కులగురువగు శ్రీ వసిష్ఠ మునీంద్రులు వారికి ధైర్యోత్సాహములను పురికొల్పుచు యోగవాసిష్ఠమను అఖండ పారమార్థికబోధను గావించిరి.

(3) శ్రీకృష్ణుని దివ్యబోధలచే అర్జునుడు మోహనిద్రనుండి మేల్కాంచి కార్యరంగమున నెట్లు దుమికెనో,

అట్లే శ్రీ వసిష్ఠుని అఖండాత్మోపదేశముచే శ్రీరామచంద్రుడు విగతశోకుడై అకర్మణ్యత్వమును పారద్రోలి కర్తవ్యపాలనమున కుపక్రమించెను.

(4) శ్రీ యోగవాసిష్ఠము త్రేతాయుగమునాటిది. భగవద్గీత ద్వాపరయుగాంతమునాటిది. దాదాపు రెండు యుగముల కాలము మధ్యకాలము. అయినను యోగవాసిష్ఠగ్రంథమున గీతాసంబంధమైన ప్రస్తావన నడచినది. యోగవాసిష్ఠమున నిర్వాణప్రకరణమందు అర్జునోపాఖ్యానమున శ్రీకృష్ణార్జునుల యిరువురి మధ్య మున్ముందు జరుగబోవు శ్రీభగవద్గీతారూపసంవాదమంతయు వివరములతోసహా సూచింపబడినది. ఆ సందర్భమున కొన్ని కొన్ని గీతాశ్లోకములు ఉన్నవి ఉన్నట్లుగ ఆ గ్రంథమందు పొందుపఱుపబడినవి. ఓహో! వసిష్ఠమహర్షియొక్క త్రికాలజ్ఞాన మేమని చెప్పవచ్చును! మఱియు యోగవాసిష్ఠమంతటి గొప్ప గ్రంథమందు ఒక ఉపాఖ్యానమంతయు గీత కొఱకు ప్రత్యేకించుట చూడ గీత యెంతటి మహిమ ఆర్జించుకొనినదో స్పష్టమగుచున్నది. యుగయుగముల క్రిందటనే దాని ఖ్యాతి విశ్వమంతటను వ్యాపించియున్నట్లు తోచుచున్నది. కావున ప్రాచీనకాలమునందే వసిష్ఠాదిమహర్షుల హృదయపీఠమున సమాదరణ పొంది, రామచంద్రాది మహనీయులకున్ను కర్తవ్యమును బోధింపకల్గినట్టి గీత యంతటి ప్రముఖగ్రంథరాజమును ముముక్షువులెల్లరు సమాశ్రయించి బంధ విముక్తులై పరమానంద మనుభవించుదురుగాక!

## గీత దైనందినజీవితమునం దెట్లుపయోగించును?

ప్రపంచములో లెక్కలేనన్ని గ్రంథములు దినదినము ప్రకటితములగుచున్నవి. కొన్ని నవలలు, కొన్ని నాటకములు, కొన్ని కథలు, కొన్ని సాహిత్యగ్రంథములు, కొన్ని చారిత్రక వైజ్ఞానిక పరిశోధనలకు సంబంధించిన పుస్తకములు - ఈ ప్రకారముగ ఎన్నియో తయారగుచున్నవి. ఒక పర్యాయము చదివినపిదప వీనిని దూరముగ పెట్టివేయుచుందురు. కాని ఈ గ్రంథజాలమంతటిలోను ఒక్కదానిని మాత్రము ప్రతివాడు దినమున కెన్నియో సార్లు విడువక వాడుచుండును. అదియే నిఘంటువు (Dictionary). దాని నెవరును వదలజాలరు. శ్రీ భగవద్గీత జీవితమున కట్టి నిఘంటువువంటిది. దినదినమునకు గంటగంటకు దాని యవసరము మనుజున కేర్పడుచుండును. డాక్టరుగారు మందుల పుస్తకము (Meteria Medica) ను రోజూ తిరుగవేయునట్లు, భవరోగబాధితుడగు జీవుడు గీతను ప్రతిదినము చూడకతప్పదు. ఏలననిన నిత్యజీవితమునకు ఆవశ్యకమైన సామగ్రి దానియం దొసంగబడినది. దైనందిన ప్రజాజీవితమునందు ఉపయోగపడని మతగ్రంథములకు లోకములో ఎక్కువ విలువయుండదు. కాని భగవద్గీత అట్టిదికాదు. మానవుడు తన నిత్యజీవితమున అడుగడుగునకు ఎదుర్కొనుచుండు భౌతిక, నైతిక, ఆధ్యాత్మిక సమస్యలన్నిటికిని తగు పరిష్కారమార్గమును గీత చూపెను. కాబట్టి అయ్యది మనుజునకు జీవితయాత్రయందు అతిప్రయోజనకరమగు గ్రంథమనుటలో నేమాత్రము సంశయములేదు. ఏరూపముగ గీత జనులకు సహాయపడగలదో ఒకింత విచారించెదము-

### 1. కోపము వచ్చినపుడు :-

కోపము ఒక మానసిక తరంగము. అది మొదట ఒక చిన్న గాలివలె ఆవిర్భవించి, సుడిగాలిగామారి, పెనుగాలిగా రూపొంది, క్రమముగ తుపానుగాలిగా పరిణమించి జీవుని అధోగతికి త్రోయుచుండును.

**క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతివిభ్రమః**
**స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి. (2-63)**

"క్రోధముచే మనుజుడు ఒడలు మఱచిపోవును (సమ్మోహము జనించును). దానిచే జ్ఞాపకశక్తి నశించును. తత్ఫలితముగ నతడు బుద్ధిని గోల్పోవును. తుదకు అధోగతికి చేరుకొనును" - అని గీతయందు భగవానుడు తొలుదొల్తనే కోపము యొక్క దుష్ఫలితములను సర్వులకును తెలియజేసిరి. ఈ ప్రకారముగ మానవునకు దానవస్వరూపమును కలుగజేయుటలో కోపము ప్రముఖపాత్ర వహించుటచే దాని విషయమై కడు జాగరూకులుగా నుండవలెనని గీతయందు హెచ్చరించబడెను. కోపము కల్లువంటిది. కోపము వచ్చినవాడు, కల్లుత్రాగినవాడు ఇరువురును శరీరమును మైమరచి ప్రవర్తించుదురు. వారికి యుక్తాయుక్తజ్ఞానముండదు. కనుకనే గొప్ప అపకారములు వారివలన లోకమునకు కలుగుచుండును. క్రోధము రజోగుణజన్యము. రజోగుణము కలవానికి ఏ కోశమందును శాంతిసుఖములు లభించవు. 'రజసస్తు ఫలం దుఃఖమ్' అని భగవానుడు చెప్పనే చెప్పినాడు. మఱియు 'క్రోధః పారుష్యమేవచ...పార్థ సంపద మాసురీమ్' (16-4) - అని క్రోధమును అసురగుణముగను చెప్పిరి. ఇదియంతయు బాగుగ యోచించుకొని కోపమువచ్చిన వెనువెంటనే పైన తెలిపిన గీతాశ్లోకములను జ్ఞాపకమునకు తెచ్చుకొని భగవానుని హెచ్చరికను మననము చేసి ఆ దుష్ట అతిథిని వచ్చీరాకమునుపే హృదయగేహమునుండి తరుమగొట్టవలెను.

## 2. భోగసముదాయముపై ఆసక్తి జనించినపుడు :-

'భోగా భవమహారోగాః' అని వసిష్ఠులు పలికిరి. అనగా భోగములుసంసార మహారోగములని అర్థము. ఈ వాక్యము త్రేతాయుగములో యోగవాసిష్ఠకర్తచే చెప్పబడినది. ద్వాపరయుగమున గీతాచార్యులైన శ్రీకృష్ణుడున్ను దానిని ఆమోదించి 'భోగా దుఃఖయోనయ ఏవ తే' (5-22) - భోగములు దుఃఖహేతువులు సుమా! అని వాక్రుచ్చిరి. అనుభవజ్ఞులైన పెద్దలందఱున్ను ఇట్లే వచించుచున్నారు. శాస్త్రములు, ఉపనిషత్తులు, ఇదేవిధముగ ఉద్ఘోషించుచున్నవి. కాని ఎవరెన్ని చెప్పినను అనేక జన్మార్జితసంస్కార ప్రాబల్యముచే జనులలో నధికసంఖ్యాకులు ఎండమావులవంటి ఆ విషయభోగములపైకియే ఉరుకుచున్నారు. విచారింపనికారణముచేతనే భోగములట్లు రుచికరములుగ తోచుచున్నవి. వానియందు అపాతరమణీయత్వము కలదేకాని యథార్థరమణీయత్వము లేదు. ఉండినచో వానివలన జనులకు పరిపూర్ణశాంతి, తృప్తి, ఆనందము కలుగవలసి యుండును. అట్లు కలుగుట లేదు. 'సౌఖ్యంబిన్దుమాత్రేణ దుఃఖం పర్వతమేవచ' - అనునట్లు లవలేశమగు సుఖము వానివలన కలిగినను వెనువెంటనే హిమలయసదృశదుఃఖము కాచుకొనియేయుండును.

కావున పరమశాంతిరూప మోక్షమును కాంక్షించువారందఱున్ను అట్టి ప్రాపంచిక భోగజాలమును త్యజించవలెనని గీత అనేక పర్యాయములు నొక్కి చెప్పుచున్నది. ఎట్లనిన - "భోగైశ్వర్యములం దాసక్తి కలవారు వానిచే అపహరింపబడిన చిత్తము కలవారుకాగా, ధ్యానాదులందు వారికి ఏకాగ్రత ఏమియు కలుగుకుండును*." మఱియు -

**యేహి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవతే**
**ఆద్యన్తవన్తః కౌన్తేయ న తేషు రమతే బుధః. (5-22)** 'శబ్దాది విషయభోగములు దుఃఖమే బీజముగా గలవియైయున్నవి. పైగా అవి క్షణికములు. అందువలన విజ్ఞులు వానియందెన్నటికిని రమింపరు' - అని భగవానుడు విషయాదుల తుచ్ఛత్వమును స్పష్టముగ ప్రకటించిరి. ఇంతియేకాదు,

* భోగైశ్వర్యప్రసక్తానాం......సమాధౌ న విధీయతే! (2-44)

వాస్తవసుఖము లోననే కలదుకాని బయట కాదనియు, ఆ అంతఃసుఖము అక్షయమైనదనియును★ బహుభంగుల వెల్లడిచేసిరి. భోగవిగర్హణనుగూర్చి గీతయందు భగవానుడు తెలిపిన ఒకటి రెండు ప్రమాణముల నింకను ఇచట తెలియజేయుట సముచితముగా నుండగలదు.

(1) ఇన్ద్రియార్థేషు వైరాగ్యం (13–9) = శబ్దస్పర్శాది విషయభోగములందు వైరాగ్యము కలిగియుండవలెను.

(2) శబ్దాదీన్విషయాం స్త్యక్త్వా (18–51) = శబ్దాది విషయ భోగములను త్యజించవలెను.

(3) కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః (16–11) = "శబ్దాది విషయభోగానుభవమే పరమపురుషార్థమని ఆసురీప్రకృతికలవారు తలంచుచుందురు. అది చాలపొరబాటు ... అట్టివారిని హీనములగు నరకములందు నేను విసిరివేయుదును."

(4) నిఃస్పృహః సర్వకామేభ్యో ..... (6–18) = సమస్త విషయాశలనుండి విడివిడినపుడు సాధకుడు ముక్తుడగును.

ఈ ప్రకారముగ గీతయందు ఎన్నియో ప్రమాణములు భోగత్యాగమును బోధించునవి కలవు. ఎపుడెపుడు సాధకునకు దృశ్యవిషయములపై ఆశ జనించునో, అపుడపుడు గీతయందలి పై భగవద్వాక్యములను మరల మరల జ్ఞాపకమునకు తెచ్చుకొనుచు ధైర్యమవలంబించి వీనినుండి చిత్తమును మరల్చవలెను. సాక్షాత్ శ్రీకృష్ణపరమాత్మ ఎదురుగా వచ్చి పై వాక్యములను చెప్పినట్లుగా భావన చేయవలెను.

### 3. మరణభయము కలిగినపుడు :–

భయములన్నిటిలోను మరణభయము చాల గొప్పది. పండితుడు, పామరుడు, ధనవంతుడు, దరిద్రుడు, బలవంతుడు, దుర్బలుడు, బ్రాహ్మణుడు, చండాలుడు – వెయ్యేల ప్రతివాడును మరణమను మాట వినగానే కంపించిపోవుచుండును. కాని అట్లు భయపడుట చాల హాస్యాస్పదమైన విషయమని గీతయందు నిరూపింపబడినది. మరణమనగా దేహవియోగము. తాను దేహమైనచో దేహవియోగమునకు ఏడ్చుట సబబుగానుండును. కాని తాను వాస్తముగ దేహము కాదు. దేహి. పాంచభౌతికవస్తుసముదాయముకాదు. శాశ్వత సచ్చిదానందఘనస్వరూపము. శిథిల వస్త్రములను తొలగించునపుడు ఎవరును దుఃఖించరు. అట్లే దేహములు జర్జరములై క్షీణించునపుడు వివేకులెన్నటికి క్లేశమొందరు. ఏలననిన ఆ దేహాదులకు సాక్షియగు అంతరాత్మయే తానని వారికి బాగుగ తెలియును.

**న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః**

**న చైవ న భవిష్యామస్సర్వే వయమతః పరమ్. (2–12)** "ఓ అర్జునా! నేను, నీవు, ఈ రాజులు అందఱును శాశ్వతస్వరూపులము. మనము పూర్వమున్ను ఉండియున్నారము. మున్ముందును ఉండగలము. (మనకు ఏ కాలమందును నాశములేదు)" అని శ్రీకృష్ణుడు గీతయం దర్జుననకు 'తత్త్వమసి' మహావాక్యోపదేశమును గావించి అఖండధైర్యమును నూరిపోసిరి. ఎవరికైనను తమ మరణమును గూర్చిన భయము కలిగినపుడుకాని, బంధుమిత్రాదులు మరణించునపుడుకాని ఈక్రింది గీతావాక్యములను లెస్సగ సంస్మరించినచో భయము పలాయనమై పోగలదు.

★ విన్దత్యాత్మని యత్సుఖమ్ సుఖమక్షయ మశ్నుతే. (5-21)

(1) అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవచ
నిత్యస్సర్వగతః స్థాణురచలోఽయం సనాతనః. (2-14)

'ఆత్మ' ఛేదింపబడనివాడు, దహింపబడనివాడు, తడుపబడనివాడి, ఎండింపబడనివాడు. ఆతడు నిత్యుడు, సర్వవ్యాపకుడు, నిశ్చలుడు, సనాతనుడు.

(2) దేహీ నిత్యమవధ్యోఽయం దేహే సర్వస్యభారత
తస్మాత్సర్వాణి భూతాని నత్వం శోచితు మర్హసి. (2-30)

'ఓ అర్జునా! దేహము చంపబడినను ఆత్మ చంపబడడు. ప్రతివానికిని ఈ సత్యము వర్తించును. కాబట్టి ఎవరిని గూర్చియు నీవు శోకింపతగదు.'

(3) న జాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా న భూయః
అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే. (2-20)

'ఆత్మ ఎపుడును పుట్టుటలేదు. చచ్చుటలేదు. పూర్వములేకుండి ఇపుడుండువాడుకాదు, ఇపుడుండి మరల లేకుండువాడుకాదు. ఆతడు పుట్టుకలేనివాడు, నిత్యుడు, స్థిరస్వరూపుడు, పురాణపురుషుడు; శరీరము చంపబడినను ఆత్మ చంపబడుటలేదు'

ఈ ప్రకారములైన ప్రమాణములు గీతయం దెన్నియో కలవు. వానిని ప్రతిదినము బాగుగ మననముచేసినచో ఇక మృత్యుభయమునకు మనుజుని హృదయమున తావే లేకుండును. "నేను దేహిని, దేహమునుకాను. నేను క్షేత్రజ్ఞుడను, క్షేత్రమునుకాను. నేను త్రిగుణాతీతుడను, త్రిగుణములను కాను." - అని ఈ ప్రకారముగ పదేపదే చింతించుచుండవలెను. అనాదికాలమునుండి 'నేను దేహమును' అని తలంచుకొనుచుండినందువలన దేహభావన బాగుగ రూఢిపడిపోయినది. ఇపుడు తద్వ్యతిరిక్తమగు ఆత్మభావనను బాగుగ అలవాటు చేసికొనవలెను (Dehypnotisation). గీతాభగవతి ఆజ్ఞాపించునది యిదియే. దీనిచే మరణభయము పటాపంచలైపోగలదు. గీత జనులకు కావించిన మహోపకారమిదియే.

## 4. కామాదివికారములు ప్రకోపించునపుడు :-

సాధకుని ప్రతిపశత్రులలో అగ్రగణ్యమైనది కామము. అది ప్రతిపక్షనాయకుడు. జ్ఞానరత్నము నపహరించుటకొఱకు సాధకుని హృదయగేహమున మొట్టమొదట కన్నము వేయునది కామము. అది ప్రవేశించినపిదప దాని ననుసరించుకొని క్రోధ, లోభాదులను తక్కిన పటాలమంతయును ప్రవేశించును. 'జ్ఞానినో నిత్యవైరిణా' (జ్ఞానికి నిరంతర శత్రువు), 'దుష్పూరేణానలేన చ' - (అగ్నివలె ఆహుతులచే తృప్తిని బొందనిది) అని ఈ ప్రకారముగ శ్రీకృష్ణభగవానుడు గీతయందు కామమునుగూర్చి పలుచోట్ల హెచ్చరించుకొనుచుపోయిరి. దానివిషయమై జాగ్రతవహింపనిచో అధ్యాత్మపథమున మనుజుడు ఉన్నతశిఖరములను ఎన్నటికిని అందుకొనజాలడు. కాబట్టి ఆయా దుష్టవికారములు ప్రకోపించినపుడు గీతయందలి ఈ క్రింది ప్రమాణములను మరల మరల చింతనజేసి వానిని తొలగించుకొనవలయును.

**(1) సఙ్గాత్సంజాయతే కామః ... ... ప్రణశ్యతి (2–62, 63)**

దృశ్యవిషయములను భావనచేయుట మొదలు పెట్టగనే, వానియెడల కోరిక జనించును - క్రమక్రమముగ ఆ కోరిక జీవుని వినాశమునకు దారితీయును. - అని చెప్పబడినందువలన, పాంచభౌతిక పదార్థములయొక్క నశ్వరత్వమును, అల్పత్వమును గూర్చి బాగుగ విచారణచేసి తత్సంబంధమైన సంకల్పమే హృదయమునం దావిర్భవింపకుండ చేయుటయో, లేక ఆవిర్భవించిన వెంటనే దానిని తత్క్షణమే పెకలించివేయుటయో కావింపవలెను.

**(2) శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్శరీరవిమోక్షణాత్**
**కామక్రోధోద్భవం వేగం స యుక్తస్స సుఖీ నరః (5–23)**

'ఈ శరీరముయొక్క వియోగమునకు పూర్వమే కామ, క్రోధాదిదుర్గుణములయొక్క వేగమును ఎవడు అరికట్టగల్గునో ఆతడే సుఖవంతుడు, ఆతడే ముక్తుడు' - అని గీతాచార్యులు 5వ అధ్యాయమున పేర్కొనిరి. కావున, కామముదయించగనే 'ఇది జీవితమునకు గొప్ప అనర్థమును తెచ్చిపెట్టు వస్తువనియు, మోక్షసుఖమునుండి జీవుని దవ్వునకు గొనిపోవుననియు నిశ్చయించి దానినెట్లైనను హృదయక్షేత్రమునుండి దూరీకరించవలెను. శత్రువు ప్రక్కనేయున్నచో ఎంతహాని కలుగునో, కామమును శత్రువు వలనను అంతహాని చేకూరును. కాబట్టి దానికి ఆశ్రయ మీయరాద'ని భగవానుడు పదేపదే గీతయందు తెలుపుచున్నారు.

**(3) త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః**
**కామక్రోధ స్తథాలోభస్తస్మా దేతత్త్రయం త్యజేత్. (16–21)**

'కామము, క్రోధము, లోభము - అను నీమూడునునరకద్వారములు. అవి జీవునకు వినాశనమును గలుగచేయును. కావున వానిని త్యజించివేయవలెన'ని భగవానుడు హితవు చెప్పుచున్నారు. ఓహో! ఎటువంటి హెచ్చరిక చేసిరి! కామముదయించినపుడెల్ల ఇటువంటి భగవద్వాక్యములను బాగుగ మననము చేయవలెను. కామకుఠారరూపములగు మఱికొన్ని గీతావచనము లీక్రింద పొందుపరుపబడుచున్నవి. వానిని గూడ సాధకులు జ్ఞప్తియందుంచుకొనవలెను-

**(1) కామ ఏష క్రోధ ఏష... (3–37)**

**(2) కామ క్రోధ వియుక్తానాం... (5–26)**

**(3) కామం క్రోధం పరిగ్రహమ్ విముచ్య... (18–53)**

**(4) జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్ (3–43)**

(ఓ మహాబాహూ ! భయంకరమైన ఈ కామమను శత్రువును జయించివేయుము, వినాశమొనర్పుము)

**(5) కామ సంకల్ప వర్జితాః ... (4–19)**

**(6) కామాత్మానః స్వర్గపరా ... (2–43)**

**(7) కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ... (7–20)**

కామమను శత్రువు దాడివెడలినపుడు ఈ పైనుదహరించిన గీతావాక్యములను అస్త్రశస్త్రములచే దాని నెదుర్కొని హతమార్చవలెను. నిరాయుధు డెన్నడును శత్రువును సమీపింపజాలడు. ఒకవేళ సమీపించినను ఎదుర్కొనజాలడు. ఎదుర్కొనినను జయించజాలడు. కాబట్టి అనేక జన్మలనుండియు బలమును, సాధనసంపత్తిని లెస్సగ సమకూర్చుకొని బలిష్ఠమై, ద్రఢిష్ఠమై యొప్పుచున్న కామమును జయించుటకు సాధకుడు గీతావాక్యములు, ఉపనిషద్వాక్యములు, ఇతర సచ్ఛాస్త్రములందలి ప్రమాణములు - మొదలగు ఆయుధములతో సర్వసన్నద్ధుడై యుండవలెను. అత్తఱి కామ మేమియు చేయజాలక 'జితోఽస్మి' అని సాధకునకు లొంగిపోక తప్పదు. ఈ ప్రకారముగ కామాదులు విజృంభించినపుడు తద్విజయసాధనయందు గీత మనుజున కెంతయో సహకారియగుచున్నది.

## 5. పరులపై అసూయ, ద్వేషము జనించినపుడు :-

ఈ ప్రపంచము విభక్తముగ కనిపించినను వాస్తవముగ అవిభక్తమైనది. తరంగమునందు, బుద్బుదమునందు, నురుగునందు ఒకేజలము వ్యాపించియున్న చందమున జీవకోట్లయందును ఒకే చైతన్యము పరివ్యాప్తమైయున్నది. ఇక ఒకరిపై ద్వేషమెచట? అసూయయేల? - అని గీత ప్రశ్నించుచున్నది. 'తత్ర కో మోహః కః శోక ఏకత్వ మనుపశ్యతః' - అని ఉపనిషత్తున్ను నిలదీసి అడుచున్నది. అనగా సర్వత్రఏకత్వమును గాంచువాని కిక మోదమెచట? దుఃఖమెచట? అని యర్థము. ఈ ఏకత్వానుభూతిని గీత పలుచోట్ల నొక్కి చెప్పుచున్నది. 'శత్రుమిత్రాదులందు, ఉదాసీనుని యందు, ద్వేషించువానియందు, బంధువులయందు, పుణ్యాత్ములందు, పాపాత్ములందు, సమబుద్ధికలవాడు ఉత్తముడు[1]' అని గీత ఘోషించుచున్నది. మఱియు -

**అద్వేష్టా సర్వభూతానాం... (12-13)** 'ఏ ప్రాణిని ద్వేషింపవలదు. వాని యెడల మైత్రి, కరుణ కలిగియుండవలెను. అట్టి వాడే నాభక్తుడు' అని శ్రీ కృష్ణమూర్తి ప్రకటించిరి. ఇంతియే కాదు. 'నీవలె ఇతరులను కూడ చూచుకొనుము'[2] అను విశాల సిద్ధాంతమును ప్రతిపాదించిరి. సర్వులయందును ఆత్మ ఒకటియే. కావున ఒకరిని ద్వేషించినచో తన్ను తాను ద్వేషించుకొనినట్లే; ఒకరిని నిందించినచో తన్ను తాను నిందించుకొని నట్లే యగును. భగవానుడు ఎఱుకపఱిచిన ఈ విశాలప్రాతిపదికను దృష్టియందుంచుకొనినచో ఇక అసూయద్వేషములే కాదు, ఏ దుర్గుణమున్ను దరికిజేరుటకు సాహసింపదు.

## 6. ప్రాపంచిక వైభవములచే గర్వముదయించినపుడు :-

ఈ అనంతకోటి బ్రహ్మాండములందు మనము వసించు ఈ చిన్నభూగోళ మెచట? ఈ భూగోళమందు ఏ మూలనో అణగియుండు ఈ మనదేశ మెచట? ఈ దేశమం దేకోణమందో దాగియున్న మనభూములు, రాజ్యములు, వైభవములు ఎచట? పరమాత్మయొక్క అనంత మహావిభూతిని ఒక్క పర్యాయము మనసార స్మరించినచో గర్వము, అహంకారము పటాపంచలైపోవును.

**విష్టభ్యాహ మిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్. (10-42)** 'నేనీ జగత్తునంతటిని ఒక్క అంశముచేతనే వ్యాపించియున్నాను' అని విభూతియోగమున భగవానుడు సెలవిచ్చిన వాక్య మెంతగంభీరమైనది! ఈ బ్రహ్మాండములన్నిటిని ఒక్క పాదముచే వ్యాపించి ఇంకను మూడుపాదములు దాని కతీతముగ భగవానుడు వర్తించుచున్నారని పురుషసూక్తము వచించుచున్నది.

---

1. సుహృన్మిత్రార్యుదాసీన..... సమబుద్ధిర్విశిష్యతే (6-9)
2. ఆత్మౌపమ్యేన సర్వత్ర... సయోగీ పరమో మతః (6-32)

**'పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి' అని.** భగవానుని ఈ విశ్వవ్యాపక అనంతశక్తియెదుట మానవుని ఆస్తిపాస్తులెంత! వైభవములెంత! భోగభాగ్యములెంత! ఇదియంతయు యోచించినచో మానవుని అల్పత్వము బట్టబయలు కాగలదు. అర్జునుడంత మహాబలశాలి, భౌతికశక్తిసమన్వితుడు, రాజాధిరాజు భగవానుని విశ్వరూపమును సందర్శించిన వెనువెంటనే ఎంతటి వినయవిధేయతలు, భక్తిభావము ప్రదర్శించెనో గీత 11వ అధ్యాయమును చదివిన వారికి తెలియగలదు★. ఇక సామాన్యుల విషయము చెప్పనేల! కాబట్టి గర్వాదులు జనించినపుడు గీతయందలి విభూతియోగము, విశ్వరూపసందర్శనయోగము, రెండింటిని ఒక్క పర్యాయము సంస్మరించినచో అవి తోడనే కాలికి బుద్ధిచెప్పగలవు.

'నేను గొప్పవాడను, నేను ధనవంతుడను, నాకనేక పరిజనులు కలరు. నాతో సమానమైనవాడెవడు?' ఈ ప్రకారములైన బింకములను పల్కువారు అసురస్వభావసంయుక్తులనియు, అట్టివారు తమ రజోగుణ, తమోగుణ ప్రభావముచే తుదకు నరకమునే ఆశ్రయించవలసివచ్చుననియు గీత 16వ అధాయయమున హెచ్చరింపబడెను.@ కావున తమ ప్రాపంచిక విభవాదులనుగూర్చి గర్వించువారు గీత 16వ అధ్యాయమును ఒక్క పర్యాయము తిరుగవేసి బాగుపడుటమేలు. అచటగల భగవానుని అతితీవ్రమగు హెచ్చరికను వినినచో ఎటువంటివానికైనను పాపభీతి ఏర్పడి, గర్వాహంకారాదులు దూరీకృతములు కాగలవు.

మఱియు చక్కగ విచారించినచో దృశ్యవస్తువులన్నియు క్షరములని తేలగలదు. 'యద్దృశ్యం తన్నశ్యం' (కనిపించునది యంతయు నశించిపోగలదు) అని శాస్త్రవాక్యము. 'జాతస్య హి ధ్రువో మృత్యుః' - పుట్టినదానికి చావు (వినాశము) తప్పదు - అనిగీతావాక్యము.

**ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున. (8–16)** 'బ్రహ్మలోకమువఱకుగల సమస్తలోకములున్ను తిరిగి వచ్చెడి స్వభావముకలవి.' అనగా పుట్టుట గిట్టుట కలవియై యున్నవి. పరమాత్మ ఒక్కడే అక్షరుడు. జననమరణములేనిది ఆ పరమాత్మస్థితి యొకటియే (మాముపేత్యతు కౌన్తేయ పునర్జన్మ నవిద్యతే (8–16)). కాబట్టి ఆవాగమనములతో గూడి, నశ్వరములై, జననమరణములకు హేతుభూతములై, క్షరములైనట్టి ఈ ప్రాపంచిక విషయజాలములనుగూర్చి, బ్రహ్మాండైశ్వర్యములనుగూర్చి గర్వింపనేల? వానిచే అహంభావమును బొందనేల? కనుక పైగీతావాక్యములను సంస్మరించి క్షరపదార్థములను గొప్పగా దలంచక, వానిచే గర్వాదులను బొందక, అక్షరుడగు పరమాత్మనే ఆశ్రయించి ధన్యులు కావలయును.

ఈ ప్రకారముగ ఆ యా దుర్గుణములు హృదయమున ప్రవేశించినపుడు వెనువెంటనే వానికి విరుగుడైన ఆ యా గీతాశ్లోకములను జ్ఞప్తికి తెచ్చుకొని హృదయక్షేత్రమును నిర్మలము కావించుకొనవలెను. రోగములు రాకముందే ఆరోగ్యపద్ధతులను నేర్చుకొనియుండుట సర్వోత్తమము. రోగములు వచ్చిన వెనుకయైనను తత్క్షణమే ఆరోగ్యవిధానములను, వైద్యపద్ధతులను అమలులో పెట్టుటయు మంచిదే. కాని ఏదియులేక ఊరకయుండినచో భవరోగము ముదిరి జీవుని యధఃపతనమునకు హేతుభూతము కాగలదు. గీతయం దెన్నియో ఔషధములు తెలుపబడినవి; దుర్గుణ నివారక పరికరములు ఒసంగబడినవి. భవరోగి వానిని సద్వినియోగపఱచుకొని భవబంధరహితుడై, నిర్మలాత్ముడై, నిరామయస్వరూపుడై విలసిల్లుగాక!

---

★ నమః పురస్తాదథ పృష్ఠతస్తే నమోఽస్తుతే సర్వత ఏవ సర్వ (11-40)

@ ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశోమయా (16-15)

............................ పతన్తి నరకేఽశుచౌ (16-16)

## మనకర్తవ్యము

ఇంతదనుక గీతనుగూర్చిన మహిమావిశేషముల నెన్నింటినో గమనించితిమి. ఇట్లు తెలిసికొనుచు పోవుచుండిన ఇక దీనికి అంతముండదు. ఏలయనిన, గీతాప్రతిభను వర్ణించుటకు వేయితలలు గలిగిన ఆదిశేషునకైనను తరముకాదు. అది అనంతము. కావున ఏ కొద్దివిషయము గీతను గూర్చి తెలిసికొనినను అంతమాత్రము చాలును. దానిచే పరితృప్తినంది అద్దాని మనననిదిధ్యాసనములు గావించుటకు పూనుకొనవలెను. గీతయొక్క అధ్యయనము (పారాయణము) పుణ్యమును, అనుష్ఠానము మోక్షమును మనుజునకు ప్రసాదించును. కాబట్టి అధ్యయనమాత్రముతో సంతుష్టినొందక, ఆచరణయందుగూడ ప్రవేశింపవలెను.

**గీతాగంగోదకం పీత్వా పునర్జన్మ న విద్యతే** అనునట్లు గీతాజ్ఞానగంగాతీర్థమును సేవించి జననమరణరూప మగు ఈ భవబంధమును ఛేదించి వేసికొనవలయును. ఇదియే మన కర్తవ్యము. గీతాది సద్గ్రంథములు లభించుట కూడ ఒకానొక పుణ్యవిశేషమేయని ముముక్షువులు గ్రహించవలెను. ఏలయనిన, మనుష్యుడై పుట్టుట, మోక్షమునుగూర్చిన జిజ్ఞాసకలుగుట, ఆ మోక్షమునకు దారిచూపు మహాత్ములయొక్కయు, వారి బోధనరూపమైన సచ్ఛాస్త్రముల యొక్కయు పరిచయము లభించుట మహాదుర్లభమని జగద్గురు శ్రీ శంకరాచార్యులవారు నుడివియున్నారు★. కావున శ్రీకృష్ణపరమాత్మయొక్కయు, వారి వాణియగు గీతయొక్కయు సేవాభాగ్యమును ఈ జన్మయందు పొందినవారు ధన్యులు. అట్లు పొందని వారు శరీరము పతనము కాక పూర్వమే (ప్రాక్శరీర విమోక్షణాత్) తల్లక్ష్యమునకై ప్రయత్నించవలెను. దీపమున్నపుడే ఇల్లు చక్కబెట్టుకొనవలెను. మానవ శరీరము మరల మరల లభించునది కాదు. 'శతకోటిజన్మసుకృతైర్పుణ్యైర్వినా లభ్యతే' - అని భగవత్పాదులు తెలిపినట్లు ఎంతయో పూర్వజన్మసుకృతముచే నిట్టి విజ్ఞానవంతమగు జన్మ లభించినది. కాబట్టి ఆరోగ్యము బాగుగ నున్నపుడే, అవకాశములు చక్కగ నున్నపుడే, జీవితవసంతమునందే (బాల్య, యౌవనములందే) గీతాది సద్గ్రంథముల నాశ్రయించి, భక్తిజ్ఞానవైరాగ్యములను చక్కగ నలవరచుకొని, సంసారదుఃఖశృంఖలమును ఛిన్నాభిన్నమొనర్చివేయవలెను. కనుకనే గీతయందు 'ఇహైవ @' (ఇచ్చటనే, ఈ జన్మయందే) అని భగవానుడు పెక్కుతూర్లు నొక్కి చెప్పుటకు కారణము. ఈ జన్మయందే 'వచ్చినపని' పూర్తిచేయవలయునని భావము.

కావున, ప్రతిదినము నియమము తప్పక భోజనకార్యమును నిర్వహించునట్లే సర్వోపనిషత్సారమై, సర్వశాస్త్రసిద్ధాంతసంగ్రహమైనట్టి భగవద్గీతయొక్క అధ్యయనముకూడ ఒకింత గావించుచు, దాని భావమును ఏకాగ్రచిత్తముతో చింతించుచుండవలెను. తాను అర్జునుడనియు, శ్రీకృష్ణమూర్తి తనకు బోధించుచున్నారనియు మనఃస్ఫూర్తిగ భావనచేయవలెను! అర్జునుడు రథముయొక్క గుఱ్ఱపు కళ్లెములను కృష్ణునకు ఒప్పగించినట్లు మనజీవితరథబాధ్యతను గూడ భగవానునికే ఒప్పగించి, కర్తృత్వమును వీడి, అహంభావమును పారద్రోలి, "నిమిత్తమాత్రం భవసవ్యసాచిన్" అనునట్లు ఈ సంసారయాత్రయందు కేవలము నిమిత్తమాత్రులుగ వ్యవహరించినచో, ఇక దుఃఖమునకు తావెచట? బంధమెచట? నిరాటంకముగ ఆ కృష్ణుడే మన జీవితరథమును గమ్యస్థానమునకు గొనిపోగలరు. ఈ ప్రకారముగ గీతాశ్రవణముచేతను, గీతోక్తభావానుష్ఠానము చేతను మానవుడు తన జీవితమును సంస్కరించుకొని ఈ జన్మయందే బ్రహ్మానుభూతి నొందవలయును.

---

★ దుర్లభం త్రయమేవైతద్దైవానుగ్రహ హేతుకమ్
మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుషసంశ్రయః

@ ఇహైవ తైర్జితస్సర్గో...
శక్నోతీహైవ యస్సోఢుం...

## గీతాప్రచారము

అయితే అంతటితో మనపని పూర్తికాలేదు. తాను తరించి యితరులను గూడ తరింపజేయుట సనాతనధర్మము. 'స్వయం తీర్ణః పరాంస్తారయతి' అనునట్లు తాను పొందిన పరమానందమును ఇతరులకు గూడ పంచిపెట్టవలెను. మఱియు ఏ గీతానుసంధానముచే తన యంతఃకరణము పరిశుద్ధము కాగా మనుజుడు ఆత్మానుభవమును పొందగల్గెనో, అట్టి గీతనుగూర్చిన పరిచయమును ఇతరులకుకూడ గావింపవలయును. ఎందఱో ఈ సంసారకూపములలోబడి దిక్కుతోచక నానాయాతనలను అనుభవించుచున్నారు. అజ్ఞాననిబిడాంధకారమున చిక్కుకొని దారితెన్నుగానక పెక్కుసంకటములకు లోనగుచున్నారు. వారిని కాపాడువారెవరు? ద్రవ్యవృద్ధులా? కాదు. వయోవృద్ధులా? కాదు. విద్యావృద్ధులా? కాదు. జ్ఞానవృద్ధులే వారిని కాపాడగలరు. ఆధ్యాత్మికతత్త్వకోవిదులే వారిని దరికిజేర్చగలరు. ప్రయత్నపూర్వకముగ గీతాజ్ఞానమయ ప్రదీపమును తమ హృదయసీమలందు వెలిగించుకొనినవారే వారిని సముద్ధరింపగలరు. కాబట్టి సర్వశాస్త్రసారమగు గీతను తాను అనుష్ఠించి ఇతరులచే గూడ ననుష్ఠింపజేయవలెను. తాను పఠించి ఇతరులచేగూడ పఠింపజేయవలెను. ఇదియే జ్ఞానదానము, ఇదియే జ్ఞానయజ్ఞము. అన్నియజ్ఞములకంటెను జ్ఞానయజ్ఞము శ్రేష్ఠమైనదని గీతయందు భగవానుడు తెలిపియే యున్నారు★. అన్నిదానములకంటె జ్ఞానదానము ఉత్కృష్టమైనదని శాస్త్రములున్ను వక్కాణించుచున్నవి -

**వార్యన్న గోమహీవాసస్తిలకాఞ్చన సర్పిషామ్**
**సర్వేషామేవ దానానాం జ్ఞానదానం విశిష్యతే.**

'జలదానము, అన్నదానము, గోదానము, భూదానము, నివాసదానము, సువర్ణదానము, ఘృతదానము - మున్నగు దానము లన్నిటికంటెను జ్ఞానదానము ఉత్తమమైనది! కావున గీతను తాను పఠించుటయేకాక చేతనైనంత గీతాప్రచారమును గూడ చేయవలెను. ఈప్రకారముగ గీతావ్యాప్తిచేయువాడు తనకు మిక్కిలి ప్రియుడు (ప్రియకృత్తమః) అని శ్రీకృష్ణభగవానుడు గీతాంతమున స్వయముగ తెలిపియున్నారు. దీనిచేగీతాప్రచారకార్యక్రమము శ్రీకృష్ణునకు అతిప్రియమైనదిగా తేలుచున్నది. భగవంతునకు ప్రియమైన కార్యమును ఏల చేయరాదు? తాను బాగుపడి సంఘమును కూడ బాగుపఱచినచో లోకమున కెంతశ్రేయస్కరము! కావున ప్రతిగ్రామమందును, పట్టణమందును గీతాసంఘము లేర్పడి, గీతాభవనములు నిర్మింపబడి, గీతాప్రచారము విరివిగాసాగుగాక! పాఠశాలలందు నిర్బంధముగ గీత బోధింపబడుగాక! ఇంటింటను గీతాఘోష ప్రతిధ్వనించుగాక! గీతామురళీనిస్వనము ఎల్లెడల వ్యాపించి జనుల కర్ణగోళములను పునీతమొనర్చి ఆనందమయులుగ వారలను జేయుగాక!'

ఎచట గీతయుండునో అచట కృష్ణుడుండును[1]. ఎచట కృష్ణుడుండునో అచట విజయముండును, ఐశ్వర్యముండును, నీతి తాండవించును[2]. కాబట్టి ప్రతివారును గీతను లెస్సగ నభ్యసించవలెను. మఱియు ఇతరులకుగూడ బోధింపవలెను. గీతాగంగా ప్రవాహముచే తమతమ హృదయక్షేత్రములను పండించుకొని ధన్యులగుటకై యత్నింపవలయును.

---

★ శ్రేయాన్ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరన్తప (4-33)

1. యత్ర గీతావిచారశ్చ పఠనం పాఠనం శ్రుతమ్.
   తత్రాహం నిశ్చితం పృథ్వి నివసామి సదైవ హి. (గీ.మా)
2. యత్ర యోగీశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః
   తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ. (18-78)

## ఉపసంహారము

ఇంతవఱకు గీతనుగూర్చిన అనేక వివరములు పాఠకులకు అందజేయడమైనది. ఇకనొక్క పర్యాయ మంతయును సింహావలోకనము చేసి ఈ వ్యాసము నుపసంహరించెదము. గీత ప్రత్యక్షభగవత్స్వరూపము. గీతాసేవ సాక్షాత్ శ్రీహరి సేవయే యగును. గీతాపఠనము భగవంతుని జపమే యగును. గీతాశ్లోకము నారాయణుని దివ్యమంత్రమే యగును. చక్కెరతో చేయబడిన చిలుకను ఎక్కడకొరికినను తీపిగనే యుండునట్లు, గీతలోని ఏ భాగమైనను బ్రహ్మానందమాధుర్యముచే తులతూగుచుండును. గీత ధర్మమయము, 'ధర్మ' వృక్షము. గీతాఫలము ఫలించినదనుటలో నతిశయోక్తి ఏ మాత్రమున్ను లేదు. గీతలో నిట్టి అద్భుతశక్తి యిమిడియుండుటలో హేతువేమి? దానిని బోధించినవారు షోడశకళాపరిపూర్ణుడగు అవతారపురుషుడే అయియుండుట యగును. ప్రపంచములోగల గొప్పగొప్ప మతములకు సంబంధించిన ప్రవక్తలలో కొందఱు 'నేను దేవుని కుమారుడను' అని చెప్పియుండిరి. మఱికొందఱు 'నేను దేవునిదూతను' అని పలికియుండిరి. ఇంక కొందఱు 'నేను దేవుని భృత్యుడను' అని వాక్రుచ్చియుండిరి. కాని గీతాప్రవక్త 'నేను దేవుడనే' అని చెప్పివేసిరి. కావున గీత 'సాక్షాత్ దైవవాణి'; పరంపరదైవవాణికాదు. కనుకనే అంత ప్రచండ ఆధ్యాత్మికశక్తిచే సంపన్నమై యలరారుచున్నది. అర్జునుని హిమగిరిసదృశమోహము (అజ్ఞానము) గీత దాదాపు సగముబోధపూర్తియగునప్పటికే పూర్తిగ తొలగిపోవుట★ అతివిచిత్రమైన విషయము. గీతయొక్క అలౌకిక సామర్థ్యమును ఋజువుచేయుటకు ఇంతకు మించిన వేఱొక సన్నివేశ మేమి కావలయును?

గీ - గానము చేయువారిని, త - తరింపజేయునది గీత. కల్పవృక్షమువలె తన్నాశ్రయించువారిని అది రక్షించును. అసహాయుల కది సహాయము; గ్రుడ్డివారికికన్ను; కుంటివారికి కాలు; దుర్బలులకు బలము; విషయదావాగ్నికి వర్షము; అజ్ఞానిని జ్ఞానిగ, పిరికివానిని సింహముగ, మరణించువారిని అమరునిగ అయ్యది త్రుటిలో నొనర్పగలదు. భవరోగమున కది రామబాణ దివ్యౌషధము. మానవసమాజమునకు సర్వోత్తమసంపద. ప్రతివారిని చేయిపట్టుకొని మెల్లమెల్లగ పైకిలేపి, ఒక్కొక్క మెట్టు ఊర్ధ్వముగ గొనిపోవుచు వారివారి లోపములను సవరించుచు, వారివారి యంతఃకరణమున నిగూఢమైయున్న ఆత్మతేజమును బహిర్గతమొనర్చుచు, నిద్రితమైయున్న శక్తిని జాగృతముచేయుచు క్రమక్రమముగ కైవల్యరూప పరంధామమున వారిని జేర్చివైచుచున్నది.

కర్మ, భక్తి, జ్ఞానములను మూడు ప్రవాహములు కలియు త్రివేణీపుణ్యతీర్థము గీత. అట్టి త్రివేణియందు స్నానమాడువారు ధన్యులు. కర్మ, భక్తి, ధ్యానము, జ్ఞానము అను నీనాల్గును వేఱువేఱుగ విడదీయుటకు వీలుకాని వస్తువులు. ఒకదానితో మఱియొకటి కలసిమెలసి సన్నిహిత సంబంధమేర్పరచుకొనియున్నవి. ఒకానొకనియందు సంస్కారవశాత్తు ఒకటి ప్రధానముగా గన్పించినను, తక్కినవి గౌణముగ ఉండియేయుండును. ఈ రహస్యము తెలియనివారే వారివారి మార్గము సత్యమైనదని కలహించుకొనుచుందురు. గీత అన్నిటిని సమన్వయపఱచినది. ఎవరితోను పేచీ లేకుండ చేసికొనినది. అహంకారరాహిత్యమే, స్వార్థత్యాగమే అన్ని మార్గములయొక్క ప్రధానలక్ష్యమని బోధించినది.

★ అర్జునుడు :- .. ... మోహోఽయం విగతోమమ.. (నా అజ్ఞానము తొలగిపోయినది) (11-1)

గీతకు అనేక వ్యాఖ్యలున్నప్పటికిన్ని, అన్నిటికంటె గొప్పవ్యాఖ్య శ్రీకృష్ణుని జీవితమే అయియున్నది. కర్మ, భక్తి, ధ్యాన, జ్ఞానము లన్నిటికిని శ్రీకృష్ణుని జీవితమున సముచిత స్థానములు లభించినవి. వారిది ఆదర్శజీవితము. వారనుసరించినది అనుష్ఠానవేదాంతము. వారి జీవితము మూర్తీభవించిన గీతాప్రబోధము. ఎట్లనిన - చక్కని నిష్కామకర్మను శ్రీకృష్ణుడు ఆచరించిచూపిరి. గీతాజ్ఞానము నాశ్రయించి మూడు లోకములను నిర్లేపముగ పాలింపదొడగిరి. అనవరతకర్మయందు నిరతిశయశాంతిని (intense rest in intense activity) బడయుట వారి జీవితమందలి ఒకానొక విశేషము. గీతయందలిప్రధానమైన బోధలలో నిది యొకటి. ఇక రెండవది భక్తి. తనగురువగు సాందీప మహర్షి యెడల, తక్కిన పెద్దలయెడల శ్రీకృష్ణుడు ఎంతయో భక్తిని ప్రదర్శించిరి. ధర్మరాజొనరించిన రాజసూయ యాగమున భక్తుల పాదములను కడిగి వినయమును నిగర్వమును జూపిరి. ఇక యోగవిషయ మాలోచించెదమాయనిన, స్వయముగ వారు 'యోగేశ్వరులే' అయియున్నారు. జ్ఞానవిషయము చూతమాయనిన, పోతపోసిన జ్ఞానవిగ్రహమే వారు. ఏనాడో సూర్యునకు యోగమును, జ్ఞానమును బోధించిన దిట్ట. ఈప్రకారముగ కర్మ, భక్తి, యోగ, జ్ఞానములను గీతాధర్మముల సంపుటరూపమే శ్రీకృష్ణపరమాత్మ. శ్రీకృష్ణు డేవిధముగ తన జీవితమును గీతామయముగ నొనర్చుకొనిరో, అట్లే ప్రతివ్యక్తియు తన నిత్య జీవితమును గీతకు అనురూపముగ నిర్మాణ మొనర్చుకొని తన మాంసమయవిగ్రహమును మంత్రమయముగ, సచ్చిదానంద దివ్యతేజోపరిపూర్ణముగ గావించుకొనవలెను. ఇదియే జీవితలక్ష్యము. గీతాప్రబోధసారము.

గీతయందలి మఱియొక విశేషము గీతాబోధను గ్రహించవలసినదిగా ఒరులను బలాత్కారము చేయకుండుటయే. గీతయందలి ధర్మబోధయంతయు సమాప్తమైన వెనుక శ్రీకృష్ణుడు అర్జుననితో

**విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు (18–63)** 'నేను చెప్పిన ఈ గీతాశాస్త్రమునంతను నీవు బాగుగ పర్యాలోచించుకొని తదుపరి నీకెట్లిష్టమో అట్లాచరింపుము.' అని పలుకుటయే ఇందులకు తార్కాణము. 'చెప్పవలసిన ధర్మములను నేను చెప్పితిని. ఇది గొయ్యి, ఇదిమెరక, ఇది అమృతము, ఇది విషము, అది శ్రేయము, ఇది ప్రేయము, ఇది బంధము, ఇది మోక్షము, ఇది పుణ్యము, ఇది పాపము - అని యీ ప్రకారముగ స్పష్టముగ నిరూపించి చూపితిని - ఇక నీ కేదియిష్టమో దానినే సంపాదించుకొనవచ్చును' - అని భగవానుడు కరుణతో వచించిరి. మహానుభావులు ఇతరులకు ధర్మమును బోధింతురేకాని కర్తృత్వమును ఎన్నడును వహింపరు. తెలివిగలిగిన శిష్యులు గురువుయొక్క ఇంగితమును గ్రహించివారై వారు బోధించు ధర్మమును మనసార స్వీకరింతురే కాని త్యజింపరు. అర్జును డట్లేచేసెను. ఫలితముగ ఆతని అజ్ఞానము తృటిలో మాయమైపోయెను.

ఇక గీతయందలి భావము లన్నిటిలో క్రోడీకరించి సంక్షేపముగ నాలుగు వాక్యములు ఇచట చెప్పబడుచున్నవి - ప్రతిజీవియు ఘనీభవించిన ఆత్మస్వరూపమేకాని దేహముకాదు (Each soul is potentially divine). కాని చిత్తశుద్ధిలేని కారణముచే మనుజునకట్టి అపరోక్షజ్ఞానము కలుగుటలేదు. కాబట్టి చిత్తశుద్ధికొరకై నిష్కామకర్మాచరణము తప్పక చేయవలసియున్నది. ఈశ్వరార్పణబుద్ధితో, కర్తృత్వరహితముగ, నిష్కామముగ కర్మల నాచరించుచు వచ్చినచో కొలదికాలములో చిత్తము నిర్మలత్వమును బొందగలదు. మలినరహితమగు అద్దమునందు సూర్య ప్రతిబింబము చక్కగ గోచరించునట్లును, మురికిలేని వస్త్రమునకు

రంగు బాగుగ అంటునట్లున్ను, నిర్మల చిత్తమునందు ఆత్మజ్ఞానము లెస్సగ అనుభూతమగును. కావుననే గీతయందు హృదయనిర్మలత్వమునకు, చిత్తశుద్ధికివలసిన సాధనోపాయములు లెక్కలేనన్ని వచింపబడినవి. మఱియు మాయాంతర్గతుడగు జీవుడు స్వయముగ మాయను దాటగల్గుట బహుదుస్తరము. కనుక మాయాతీతుడగు పరమేశ్వరుని అండదండలను ఆశ్రయించవలసియున్నది. కనుక భక్తియు చాల అవశ్యకమేయగును. నిర్మలభక్తితో గూడి భగవానుని నామసంకీర్తనము, జప, పూజ, ప్రార్థనాదులు సలుపుచుండవలెను.

**యే భజన్తి తు మాం భక్త్యా మయితే తేషు చాప్యహమ్ (9–29)** అని భగవానుడు తెలిపినట్లు ఎవరెవరు భక్తితో సర్వేశ్వరుని ఆరాధింతురో వారివారిని భగవంతుడు అనుగ్రహించును. అట్టి యనుగ్రహముచే సాధకునియందు 'బుద్ధియోగము'ను అపూర్వవస్తువువచ్చి చేరుచుండును (దదామి బుద్ధియోగం). దానినే ఆత్మజ్ఞానమందురు. అది కలిగినపుడు మోక్ష మిక దరిదాపులో నుండును. ఇవ్విధముగ పుణ్యకార్యాచరణము, నిష్కామకర్మము, అచంచలభక్తి మున్నగునవి క్రమముగ జీవునకు జ్ఞానోత్పాదనమందు మిక్కుటముగ సహాయపడుచున్నవి. అయితే ఇంటిలో దీపము వెలిగినను, కిటికీల గుండా గాలివీచినచో అది ఆరిపోవునట్లు, ఇంద్రియద్వారములగుండా విషయసంకల్పములు లోనికి ప్రవేశించినచో కష్టపడి వెలిగించుకొనిన ఆ జ్ఞానదీపము ఆరిపోవును. కాబట్టి ఇంద్రియనిగ్రహము, విషయవిరక్తి మొదటినుండియు అభ్యసించుచు రావలెను.

**తస్మాత్త్వమిన్ద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ (3–41)** అని భగవానుడు ఇంద్రియనిగ్రహమును గూర్చి అచటచట నొక్కిచెప్పుచు పోయిరి. ఇచట 'ఆదౌ' (మొట్టమొదట) అను పదమును ప్రయోగించినందువలన ఇక్కార్యము ఎప్పుడో చేయవలసినది కాదు, సాధనప్రారంభములోనే దీనిని గూర్చి యోచించవలెనని గీతాచార్యులు హెచ్చరిక చేయుచున్నారు. ఈ ప్రకారముగ ఇంద్రియములను, చిత్తవృత్తులను నిరోధించుటయే రాజయోగమని చెప్పబడును. ఇవ్విధముగ నిష్కామకర్మ, భక్తి, రాజయోగములచే చిత్తమునందలి భయంకర దోషములగు మల, విక్షేపములను పోగొట్టుకొని నెమ్మదిగ ఆత్మవిచారణయందు ప్రవేశింపవలెను. 'నేనెవరు?' అను ప్రశ్నవేసికొని పంచకోశములను ధీశక్తిచే వేఱుచేసి, తద్వ్యతిరిక్తముగ హృదయముననే భాసించు సర్వసాక్షియైన, స్వయంజ్యోతి స్వరూపమును (క్షేత్రజ్ఞుని) లెస్సగ అనుభూతమొనర్చుకొనవలెను. అపుడు చిత్తమందలి మూడవ దోషమగు 'ఆవరణము' పటాపంచలైపోవును. అత్తఱి జీవుడు 'తేషామాదిత్యవజ్జ్ఞానం' అనునట్లు మేఘము తొలగిన సూర్యునివలె నిరావరణముగ, స్వచ్ఛముగ ఆత్మతేజోవిరాజితుడై యొప్పును. అదియే మోక్షము. అట్టి స్థితిని బడయుటయే జీవుని లక్ష్యము. దానిని ఈ దేహమున్నపుడే సాధించివేసి కృతార్థుడు కావలయును. గీతాసార మిదియే.

గీతను పఠించుటకు కాలనియమ మేమియు లేదు. అయితే సామాన్యముగ ఉదయమున స్నానముచేసి శుచిర్భూతుడై, గృహమునగాని, తీర్థస్థానమందుగాని పవిత్ర స్థలమున గూర్చుండి గీతాపారాయణముచేయు ఆచారము కలదు. అట్లే తక్కిన సమయములందు గూడ పారాయణము చేయవచ్చును. కాని అభ్యంతరశుద్ధితో బాటు బాహ్యశుద్ధినికూడ గమనించుచుండవలెను. 'శుచౌదేశే' అని గీతయందు చెప్పబడి యుండుటచే సాధనచేయు చోటు. జపించుస్థలము పరిశుద్ధముగా నుండవలెనని

స్పష్టమగు చున్నది. ప్రతిదినము ఒక అధ్యాయమును పారాయణచేయవచ్చును. సమయమున్నచో ఇంకను అధికముగ చేయవచ్చును. పారాయణపద్ధతి గ్రంథాదియందు తెలుపబడియున్నది. పారాయణము పూర్తి అయిన వెనుక మహాత్మ్యమందలి ఒకటి రెండు శ్లోకములను తప్పక చదువవలెను.

మఱియు పారాయణానంతరము గీతను అర్థముతోసహా ఒకింత పఠించుటను బాగుగా అభ్యసించుచురావలెను. ఏలననిన, పారాయణమువలన పుణ్యము లభించినను, శ్లోకార్థమును బాగుగ మననము చేసినపుడు మాత్రమే చిత్తమందలి మలిన వాసనలు నశించి మోక్షమునకు దారి ఏర్పడును. అర్థము సందిగ్ధముగ నున్నపుడు శ్లోకముయొక్క పూర్వాపరములను సమన్వయపఱచుకొనుచు పోవలెను. దృష్టాంతమునకు

**ప్రకృతిం యాన్తి భూతాని నిగ్రహః కిం కరిష్యతి (3–33)** అను శ్లోకమున 'జనులు వారివారి సంస్కారము ననుసరించి వర్తించుచున్నారు; ఇక నిగ్రహ మేమి చేయగలదు?' అని చెప్పబడినది. ఇచ్చోట సంస్కారముల ప్రాబల్యమును నిరూపించుటకే అట్లు చెప్పబడినదికాని నిగ్రహముకూడదని భావముకాదు. కాకున్న, వెనువెంటనే,

**ఇన్ద్రియస్యేన్ద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ**
**తయోర్నవశమాగచ్ఛే త్తౌహ్యస్య పరిపన్థినౌ.** **(3–34)**

అను నిట్టి శ్లోకమును భగవానుడు చెప్పనా? దీనియర్థము 'ఇంద్రియములకు శబ్దాది విషయములందు రాగద్వేషము లేర్పడియున్నవి. ఆ రాగద్వేషములు జ్ఞానికి శత్రువులు. కావున వానికి వశపడకూడదు.' ఇచ్చోట ఇంద్రియనిగ్రహమును తప్పక అలవాటు చేసికొనవలెనని శ్రీకృష్ణమూర్తి శాసించుచున్నారు. కావున సందిగ్ధార్థముతో గూడిన ఒకానొక శ్లోకమునకు భావమును నిర్ణయించవలసివచ్చినపుడు పూర్వాపరశ్లోకములను గూడ విచారించవలసి యున్నది. సమన్వయదృష్టితో గీతను పఠించవలెను.

ఈ ప్రకారముగ ప్రతిదినము ఒకింత గీతాభ్యాసమొనర్చుచు చిత్తమును నిర్మలము చేసికొని భగవదనుగ్రహమునకు పాత్రులై జన్మపావనము గావించుకొనవలెను. ముఖ్యముగ పాశ్చాత్యనాగరికతా వ్యామోహము జనులను వెంటాడుతున్న ఈకాలమున గీతాప్రబోధముయొక్క ఆవశ్యకత ఎంతేని కలదు. ప్రాపంచిక భోగములే శరణ్యములని తలంచు అవివేకులకు గీత చక్కని గుణపాఠము చెప్పి వాస్తవసుఖ మెచటనున్నదో చూపుచున్నది. అల్పసుఖములకు అఱ్ఱులు చాచక నిరతిశయానందమును వెతకుకొనుడుయని ప్రేమతో బలుకుచున్నది. కావున గీతామాతయొక్క వాత్సల్యపూరిత దివ్యవచనములను శ్రద్ధతో నాలకించి, అనుష్ఠించి ఆత్మసామ్రాజ్యాభిషిక్తులగుదురుగాక!

అయితే గీతను పఠించుటకు తగిన విద్యావైదుష్యము లేనివారు, చదువు బొత్తిగా రానివారు ఎట్లు తరింపగలరను శంక కొందఱికి ఉదయించవచ్చును. అట్టి వారినిగూర్చి శ్రీకృష్ణపరమాత్మ గీతయందే ఒకటిరెండుచోట్ల ప్రస్తావించి వారున్ను తరించుటకు అవకాశము కలదని పలికిరి.–

**అన్యేత్వేవమజానన్తః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే**
**తేఽపి చాతితరన్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః.** **(13–26)**

పెద్దపెద్ద యోగములను గూర్చిన పరిచయము లేకున్నను, ఇతరుల వలన ఆ యా బోధలను విని, శ్రద్ధతో ఆచరించి వారున్ను జననమరణరూపమగు ఈ సంసారబంధమును దాటివేయుచున్నారని భగవానుడు చెప్పిరి. విద్యయుండుటయే శ్రేష్ఠము. ఒకవేళ లేనిచో ఇతరులవలన ఆధ్యాత్మిక విజ్ఞానమును శ్రవణముచేయుటద్వారా సంసార తరణము క్రమముగ చేకూరగలదని భావము. ఏలయనిన శ్రవణానంతరము మననము, మననా నంతరము నిదిధ్యాసనము గావించి మనుజుడు మెల్లమెల్లగ లక్ష్యమును సాధించివేయగలడు. కాని పట్టుదల, శ్రద్ధ మాత్రము తప్పక యుండవలెను. ఈ విషయమునే గీతాంతమున శ్రీకృష్ణమూర్తి ప్రస్తావించుచు శ్రద్ధతోగూడి, అసూయారహితుడై ఎవడు గీతను శ్రవణము చేయునో అట్టివాడున్ను పాపవిముక్తుడై పుణ్యవంతుల ఉత్తమలోకములను బడయగలడని స్పష్టముగా చెప్పివేసిరి★ కావున గీత చదువలేనివారు దిగులుతో కూర్చొనక గీతాబోధ జరుగుచోటికి వెళ్ళి శ్రవణము చేసి ఆచరించి తరింపవచ్చును. అయితే వీలుదొరికినచో స్వయముగ పఠింపగల్గుశక్తిని సంపాదించుటయే సర్వోత్తమము. గీతను పఠించుటకొఱకైనను సంస్కృతమును నేర్చుకొనుడు అని గాంధిమహాత్ము డొకతూరిజనుల కుద్భోధించి యుండుటను ఈ సందర్భమున జ్ఞాపకమునకు తెచ్చుకొనవలయును.

గీత సమాప్తమైనది. శ్రీకృష్ణుడు దివ్యౌషధమును ప్రయోగించుట పూర్తిచేసిరి. అర్జునుని వ్యాధి తత్క్షణమే ఉపశమించెను. అయినను వైద్యునకొక కర్తవ్యము ఇంకను మిగిలియున్నది. 'నీ పరిస్థితి యెట్లున్నది?' అని రోగిని విచారించుటయే ఆ కర్తవ్యము. భిషగ్వర్యుడగు శ్రీకృష్ణుడిట్టి విచారణ గావింప, 'నష్టోమోహః' అని వెనువెంటనే రోగినుండి ప్రత్యుత్తరము వచ్చివేసెను. 'మహాత్మా! నా అజ్ఞానము శమించినది. దీర్ఘసంసారవ్యాధి తుదముట్టినది, 'ధన్యోఽస్మి', ఇదియంతయు మీ యనుగ్రహఫలమే' అని అర్జునుడు ఉత్సాహపూర్వకముగ పలికెను. వైద్యుని గీతారూప ఔషధముయొక్క ప్రథమ ప్రయోగము (అర్జునునిపై) సఫలమైనది. వెనువెంటనే సంజయుడున్ను ఆ ఔషధమును త్రాగి "హృష్యామిచ పునః", "హృష్యామిచ ముహుర్ముహుః" అని ఆనందముతో చిందులు త్రొక్కసాగెను. బ్రహ్మజ్ఞానము యొక్క సద్యఃఫలములైన శోకరాహిత్యము, అతిహర్షము అను రెండును అర్జుననకువలె సంజయునకును సంప్రాప్తించినవి. కాబట్టి వైద్యునియొక్క గీతారూపమగు ఔషధముయొక్క ద్వితీయ ప్రయోగమున్ను (సంజయునిపై) సఫలమైనది. ఇట్లు గీతాశ్రవణముచే వెంటవెంటనే ఒకరి తరువాత నొకరు అర్జునుడు, సంజయుడు తరించిపోవ ఇక తక్కినవారి విషయమై ఏల సందేహింపవలెను? వారున్ను తప్పక తరించిపోగలరు. కావున సర్వులును గీతాధ్యయన మునకు పూనుకొనవలెను. అయితే శ్రద్ధ అవసరము.

ఈ ప్రకారము గీత ఒక్క అర్జునునకేకాక, సంజయునకేకాక, తక్కిన ప్రాణికోట్లందఱికిని గూడ శాంతిభిక్ష నొసంగుచున్నది. గీతాకల్పవృక్షము శాఖోపశాఖలుగ విస్తరించి చక్కని నీడ నొసంగుచుండ,

★ శ్రద్ధావాననసూయశ్చ శృణుయాదపి యోనరః
సోఽపి ముక్తః శుభాన్ లోకాన్ ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్. (18-71)

ఫలములను ప్రసాదించుచుండ సంసారమార్గమున అనాదికాలమునుండి పరిభ్రమించుచు భీషణతాపత్రయములచే వ్యథనొందుజీవుడు దాని క్రిందకుబోయి సేదతీర్చుకొని మోక్షఫలములు భుజించి ఏల సుఖముగ నుండరాదు? పవిత్ర **గీతామకరందమును** త్రావి ఏల పరమానంద మనుభవించరాదు? గీతాధ్యయనమను ఉత్తమ జ్ఞానయజ్ఞమాచరించి నిర్వాణసుఖము నేల బడయరాదు? సర్వేశ్వరుని కృపచేతను, పరమకారుణికులగు మహర్షుల కృపచేతను జనులలో గీతాసక్తి పెంపొంది అధ్యాత్మవిద్యా పరిచయము లెస్సగ కలుగుగాక! గీతాతత్త్వసమాశ్రయణముచే జనుల భవబంధములు విచ్ఛిన్నములైపోవు గాక! గీతారూపపరమార్థపీయూషవర్షధారలచే ప్రజలహృదయక్షేత్రములుసస్యశ్యామలములై యలరారుచు నిర్వాణమను చక్కని పంటను పండించుగాక! గీతాశంఖారవము దశదిశలు మార్మ్రోగి జనులను అజ్ఞాననిద్రనుండి మేలుకొలుపుగాక! గీతాగంగాస్రవంతియందు తనివితీర స్నానమాచరించి సంసారమాలిన్యమును వదలగొట్టుకొని ప్రాణికోట్లు నిరతిశయసుఖ మనుభవింతురుగాక! భగవత్కృపవలన గీతాతత్త్వానుభూతిచే జనులు తమ హార్దికతమఃపటలములు సంఛిన్న మొనర్చుకొని బ్రహ్మానందవారాశి యందు నిమగ్నులై జీవితములను ధన్యము గావించుకొందురుగాక !!!

ఓం తత్ సత్

ఓం శ్రీ కృష్ణార్పణమస్తు



ॐ

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః
శ్రీ సద్గురు పరమాత్మనే నమః - సర్వమహర్షిభ్యో నమః

గీతామకరంద వ్యాఖ్యాసహిత

# శ్రీ భగవద్గీత

అథ ప్రథమోఽధ్యాయః

## ఒకటవ అధ్యాయము

అర్జునవిషాదయోగః

## అర్జున విషాదయోగము

**అధ్యాయముయొక్క పేరు :-**

''అర్జున విషాదయోగము'' - యోగమనగా కూడిక. జీవాత్మ పరమాత్మల యొక్క ఐక్యమే యోగ మనబడును. అట్టి ఐక్యమును సిద్ధింపజేయు మార్గమున్ను యోగమనియే చెప్ప బడును. జీవ బ్రహ్మలయొక్క అట్టి సంయోగము నిష్కామకర్మచేగాని, భక్తిచేగాని, ధ్యానము (ఆత్మసంయమము)చే గాని, జ్ఞానముచేగాని సిద్ధించగలదు. కనుకనే ఆయా మార్గములను, సాధనలను అలంబించునపుడు వానికి కర్మయోగమని, భక్తియోగమని, ధ్యానయోగమని, జ్ఞానయోగమని వేఱ్వేఱుగ పేర్లు కలిగినవి. అయితే విషాదమున్ను ఒక యోగమేనా? విషాదమనగా దుఃఖము. దుఃఖము యోగ మెట్లు కాగలదు? ప్రాపంచిక వస్తువుల కొఱకు, భోగభాగ్యముల కొఱకు దుఃఖించుట యోగము కాదు. కాని దైవము కొఱకు, ధర్మము కొఱకు దుఃఖించుట యోగమే యగును. విషాదము యోగము కాదుకాని 'అర్జున విషాదము' యోగమగును. ఏలననగా అర్జునుడు ముల్లోకముల రాజ్యమును తృణప్రాయముగ నెంచి, ప్రాపంచిక సుఖములను ఏవగించుకొని, ధర్మము కొఱకై తీవ్రముగా పరితపించెను. ఇట్టి స్థితి ముముక్షువుల కత్యావశ్యకము. అర్జునునకు గలిగిన వైరాగ్యభావన, ధర్మ జిజ్ఞాస, తీవ్రపరితాపము జ్ఞానప్రాప్తికి, భగవదైక్యమునకు దారితీయునది యగుటచే ఆతని విషాదమున్ను ఒకానొక యోగముగా వర్ణింపబడినది. దానిని గుఱించి వివరించునది కాబట్టి ఈ అధ్యాయమునకు అర్జునవిషాదయోగ మనుపేరు వచ్చినది.

**ఈ అధ్యాయమందలి ప్రధాన విషయములు :-**

(1) రెండు సేనల యందలి ముఖ్యులైన వీరులయొక్క వర్ణన (1 వ శ్లో॥నుండి 11 వ శ్లో॥ వఱకు)
(2) ఆ యా సేనలయొక్క శంఖనినాదములు.... (12 వ శ్లో॥ నుండి 19 వ శ్లో॥ వఱకు)
(3) అర్జునుని సేనానిరీక్షణమును గూర్చిన ప్రసంగము ... (20 వ శ్లో॥ నుండి 27 వ శ్లో॥ వఱకు)
(4) మోహగ్రస్తుడగు అర్జునుని విషాదపూరిత వచనములు (28 వ శ్లో॥ నుండి 47 వ శ్లో॥ వఱకు)

**పూర్వచరిత్రతో ఈ అధ్యాయమునకుగల సంబంధము :-**

మహాభారతయుద్ధము ప్రారంభమై పది దినములు గడిచినది. భీష్ముడు రణరంగమున కూలిపోయెను. ఆ వృత్తాంతమును వెనువెంటనే సంజయుడు ధృతరాష్ట్రున కెఱింగింప, ఆతడు పలువిధముల శోకించి యుద్ధము మొదలుపెట్టినది లగాయితు అప్పటివఱకు జరిగిన వృత్తాంతమంతయును తెలుపవలసినదిగా సంజయుని కోరెను. అంతట సంజయుడు ఇరుపక్షములందలి సైనికులు యుద్ధసన్నద్ధులగుట, రణక్షేత్రమున శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు జ్ఞానోపదేశముచేయుట మున్నగు విషయము లన్నింటిని వివరముగ ధృతరాష్ట్రునకు తెలియజెప్పెను. అదియే ఈ గీతాశాస్త్రము.

**అవతారిక:-** యుద్ధమునుగూర్చి ధృతరాష్ట్రుడు సంజయుని ప్రశ్నించుచున్నాడు -

**ధృతరాష్ట్ర ఉవాచ :-**

**1. ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః**
**మామకాః పాణ్డవాశ్చైవ కిమకుర్వత సంజయ.**

**టీక:-** ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రుడు చెప్పెను:- సంజయ = ఓ సంజయుడా!, ధర్మక్షేత్రే = ధర్మభూమియైన, కురుక్షేత్రే = కురుక్షేత్రమునందు, యుయుత్సవః = యుద్ధము చేయ దలంపుగలవారలయి, సమవేతాః = కూడినట్టి, మామకాః = నావారలును, పాణ్డవాశ్చైవ = పాండవులును, కిమ్ = ఏమి, అకుర్వత = చేసిరి?

**తాత్పర్యము:-** ధృతరాష్ట్రుడిట్లు పలికెను:- ఓ సంజయా! నావారలగు దుర్యోధనాదులును, పాండుపుత్రులగు ధర్మరాజాదులును యుద్ధముచేయ గూతూహలముతో పుణ్య భూమియగు కురుక్షేత్రమున జేరి యేమి చేసిరి?

**వ్యాఖ్య:-** 'ధర్మ' శబ్దముతో గీత ప్రారంభమైనది. అది మంగళవాచకము. ధర్మమను పదమును మొట్టమొదట ప్రయోగించుటద్వారా శ్రీ వ్యాసమహర్షి గీతకు మంగళాచరణమును గావించినవాడాయెను. ఏలయనిన, భగవానుడు ధర్మస్వరూపుడు. ధర్మశబ్దోచ్చారణముచే భగవన్నామమునే వ్యాసులు కీర్తించినట్లైనది. గీతాగ్రంథము యొక్క లక్ష్యము, సారాంశము ఈ మొదటి పదమునందే తేల్చి వేయబడెను. అదియే ధర్మము. అట్టి ధర్మోద్ధరణము కొఱకే లోకమున భగవంతు డవతరించుచుండును★. ధృతరాష్ట్రుడనగా రాష్ట్రమును ధరించినవాడని యర్థము. తనదికాని రాష్ట్రమును తనదని భావించువాడే ధృతరాష్ట్రుడు. ఈ ప్రపంచము, దేహము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి మున్నగునవి దృశ్యములు. అవి తాను గాదు. దృక్కగు ఆత్మయొకటియే తానుగాని, దేహాది దృశ్యపదార్థములు కాదు. కాని అజ్ఞాని తనదికానట్టి అనగా ఆత్మేతరమైనట్టి దేహాది దృశ్యరూపరాష్ట్రమును తనదిగా దలంచి దానిపై మమత్వము, అహంభావము గలిగియుండుచున్నాడు. కనుకనే ఆతడు ధృతరాష్ట్రుడు. అజ్ఞానభావముతో గూడియుండు వారందఱున్ను ధృతరాష్ట్రులే యగుదురు. గీతాజ్ఞానశ్రవణముచే అట్టి అజ్ఞానరూప అంధత్వమును రూపుమాపుకొనుట ప్రతివానియొక్క కర్తవ్యమైయున్నది.

★ ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే (4-8)

**''కురుక్షేత్రము'':–** ఇది చాల గొప్ప పుణ్యక్షేత్రము. పంజాబ్ రాష్ట్రమున అంబాలా అను పట్టణమునకు దక్షిణముగను, ఢిల్లీ పట్టణమునకు ఉత్తరముగను ఇది వెలయుచున్నది. మహాభారత మందలి వనపర్వమున 83వ అధ్యాయమునందును, శల్యపర్వమున 53వ అధ్యాయమునందును ఈ కురుక్షేత్రము యొక్క మహిమను గుఱించి లెస్సగ తెలుపబడియున్నది. పూర్వము బ్రహ్మదేవుడు, ఇంద్రుడు, అగ్ని మున్నగు వారచ్చోట తపంబు సలిపియుండిరి. కౌరవులకు పాండవులకు మూలపురుషుడైన కురుమహారాజున్ను ఆ స్థలమున పెక్కు ధర్మము లాచరించి యుండెను. ఒకానొక సమయమున కురు భూపాలు డాప్రదేశమును దున్నుటచే దానికి కురుక్షేత్రమని పేరువచ్చినది. ఆ క్షేత్రమునం దెవరు తపస్సు చేయుదురో, లేక మృతినొందుదురో వారుత్తమలోకములకు జనుదురని ఇంద్రుడు కురునకు వరమిచ్చెను. పూర్వము పరశురాముడున్ను అచ్చోటనే పితృతర్పణము గావించి యుండెను. ఎందఱో మహనీయులా స్థలమున పెక్కు ధర్మకార్యము లాచరించి యుండిరి. కాబట్టి అయ్యది. ధర్మక్షేత్రమని పేర్కొనబడెను.

అట్టి ధర్మక్షేత్రమున ప్రవేశించుటవలన తత్ప్రభావముచే తన తనయులగు దుర్యోధనాదుల చిత్తమున దయాది సద్గుణము లుదయించిగాని, ధర్మరాజాదుల యందలి సహజ అహింసాది సద్గుణములు పెల్లుబికిగాని యుద్ధవిరమణమును గూర్చిన సంకల్పము లేవైన వారియం దుదయించియుండునేమోయను శంకనే ధృతరాష్ట్రుడు 'యుద్ధమున వారేమిచేసిరి?' అని ప్రశ్నించి యుండవచ్చును.

''మామకాః'' – 'నావారు' అని కౌరవులనుగూర్చి ప్రత్యేకించి చెప్పుటవలన ఆత్మీయులే యగు పాండవులయెడల ధృతరాష్ట్రునకొకింత పక్షపాతబుద్ధి కలదని వ్యక్తమగుచున్నది.

''సంజయుడు'' – 'సమ్యక్‌జయము' కలవాడే సంజయుడు. ఇంద్రియాదులను లెస్సగ నిగ్రహించినవాడని యర్థము. అట్టి ఇంద్రియజయము, పవిత్రహృదయముకలవారికే గీతా జ్ఞానము వినుటకు, ఆచరించుటకు, బోధించుటకు చక్కని యవకాశ మేర్పడగలదని సంజయుని వృత్తాంతము చాటుచు న్నది. మఱియు అల్పజాతియందు జనించినప్పటికిని (సూతకుల స్థుడైనను), స్వకీయయోగ్యతచే, హృదయపారిశుద్ధ్యముచే వ్యాసాది మహర్షుల యొక్క అనుగ్రహమునకు పాత్రుడగుటయు, ప్రత్యక్ష గీతాశ్రవణ విశ్వరూపసందర్శనాది మహాభాగ్యముల నొంద గల్గుటయు చూడ, ఆత్మోన్నతికి జాతి, మత, కులాదులేవియు అడ్డంకులుకావని స్పష్టపడుచున్నది.

దుర్యోధనుని జయమును గుఱించి తెలిసికొనగోరి ధృతరాష్ట్రుడడిగిన ''ధర్మక్షేత్రే కురుక్షేత్రే ... కిమకుర్వత సంజయ'' అను గీతయొక్క ప్రథమశ్లోకరూప ప్రశ్నకు సంజ యుడు ''యత్రయోగేశ్వరః కృష్ణో... ధ్రువానీతిర్మతిర్మమ'' (18-78) ఎచట శ్రీకృష్ణుడు, అర్జునుడు ఉందురో అచట విజయము తథ్యము అను గీతయొక్క చివరి శ్లోకమును ప్రత్యుత్తరముగ జెప్పదలంచినవాడై తద్భావమును పోషించుట కొఱకు అవాంతర వృత్తాంతమును (దృష్ట్వాతు పాణ్డవానీకం....'' మున్నగు శ్లోకములద్వారా) నుడువ నారంభించెను.

**అ:–** ధృతరాష్ట్రుని ప్రశ్నకు సమాధానముగా సంజయు డిట్లు వచించుచున్నాడు –

**సంజయ ఉవాచ :–**

**2. దృష్ట్వాతు పాణ్డవానీకం వ్యూఢం దుర్యోధనస్తదా**
**ఆచార్యముపసంగమ్య రాజా వచనమబ్రవీత్.**

**టీక:–** సంజయ ఉవాచ = సంజయుడు చెప్పెను - తదా = అప్పుడు, రాజా = రాజగు, దుర్యోధనః = దుర్యోధనుడు, వ్యూఢం = వ్యూహములుగా సమర్చబడియున్న, పాణ్డవానీకం = పాండవసేనను, దృష్ట్వాతు = చూచి (అటుపిమ్మట), ఆచార్యం = ద్రోణాచార్యుని, ఉపసంగమ్య = సమీపించి, వచనం = (ముందుచెప్పబోవు) వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

**తా:–** ధృతరాష్ట్రునితో సంజయు డిట్లు వచించెను - అపుడు రాజైన దుర్యోధనుడు వ్యూహాకారముగా రచింపబడి యున్న పాండవసేనను జూచి, తదుపరి గురువగు ద్రోణాచార్యుని సమీపించి యిట్లు పలికెను.

**వ్యాఖ్య:–** పాండవసేనాపతియగు ధృష్టద్యుమ్నుడు యుద్ధశాస్త్రానుసారముగ తన సైన్యమును వజ్రమను పేరుగల వ్యూహముగ సమర్చియుంచెను. పాండవసేనయొక్క అద్భుత వ్యూహరచన దుర్యోధనున కాశ్చర్యముగొలుప, అంతకంటెను పటుతరముగ తన సైన్యమును నిర్మింపజేయ నుద్దేశ్యముతో కాబోలు వెనువెంటనే ఆవార్తను గురువగు ద్రోణాచార్యున కెఱింగించెను.

దుర్యోధనుడు రాజు. ప్రభుత్వమున సర్వోన్నతస్థానము నలంకరించినవాడు. అట్టిచో తనకంటె క్రింది స్థానముననున్న ఒకానొక సేనానాయకుని యొద్దకు తానే స్వయముగ బోవలసిన పనియేమి యను శంక నిచట నుదయించును. ఇందులకు కారణము లివియై యుండవచ్చును - (1) పాండవుల సైన్య మును, అందును ముఖ్యముగ భీమాదులను జూచి భయపడి దుర్యోధనుడు అధైర్యమును బొంది యుండవచ్చును. (ప్రారంభములోనే రాజు ధైర్యమును గోల్పోవుట అశుభసూచకము). (2) ద్రోణాచార్యుడు సేనానాయకులలో నొకడు కావున ఆతనిని ఆస్థానమునుండి కదలించినచో సైన్యమంతయు చెదరిపోవు నవకాశము కలదు. (3) ద్రోణాచార్యుడు వయోవృద్ధుడు, జ్ఞానవృద్ధుడు. పైగా గురుస్థానముననున్నవాడు. అట్టివానియెడల విధేయత చూపుట ధర్మము. (4) ఏదియో విధముగ ద్రోణాచార్యుని మంచిచేసికొని ఆతనిని తన స్వార్థసంపాదనమునకు వినియోగించదలంచి యుండవచ్చును - ఈ యన్ని కారణముల బట్టి దుర్యోధనుడు ఆచార్యుని తన యొద్దకు పిలిపించక తానే ఆచార్యునికడకేగి విన్నవించుకొనెను.

**అ:–** దుర్యోధనుడు ద్రోణాచార్యుని సమీపించి ఈ ప్రకారముగ పలుకుచున్నాడు -

## 3. పశ్యైతాం పాణ్డుపుత్రాణా మాచార్య మహతీం చమూమ్
## వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా.

**టీక:–** ఆచార్య = ఓ గురువర్యా! తవ = నీయొక్క, శిష్యేణ = శిష్యుడును, ధీమతా = బుద్ధిమంతుడునగు, ద్రుపదపుత్రేణ = ద్రుపదరాజపుత్రుడగు ధృష్టద్యుమ్నునిచేత, వ్యూఢామ్ = వ్యూహాకారముగ రచింపబడిన, పాణ్డుపుత్రాణామ్ = పాండవుల యొక్క, ఏతామ్ = ఈ, మహతీమ్ = గొప్పదియగు, చమూమ్ = సేనను, పశ్య = చూడుము.

**తా:–** ఓ గురువర్యా! బుద్ధిశాలియు, మీశిష్యుడునగు ధృష్టద్యుమ్నునిచేత వ్యూహాకారముగ రచింపబడియున్నట్టి పాండవుల ఈ గొప్ప సైన్యమును జూడుడు!

**వ్యాఖ్య:–** ఈ శ్లోకమునకు ముందు 'దుర్యోధన ఉవాచ' అని యుండవలసినది. కాని అట్లులేదు. పాపియగుటచే ఆతని నామమును పుణ్యశీలురగు గీతాపాఠకులచే పలుమార్లు ఉచ్చరింపకుండ జేయుటకే కాబోలు ఆ విధముగ గావింపబడినది!

దుర్యోధనుడు రాజకీయచతురత గలవాడు. కార్యసాధన నిమిత్తము రాజగు తానే దిగివచ్చి ఒకానొక సేనానాయకునితో (ద్రోణాచార్యునితో) మాట్లాడుటయేకాక, ప్రతి పక్షముపై నాతనికి రోషమునుగూడ కల్పింపజొచ్చెను. 'ద్రుపదుని పుత్రుడును, మీ శిష్యుడునగు ధృష్టద్యుమ్నుడు పాండవసేనలను చక్కగా తీర్చిదిద్దెను -' అని పలుకుట ద్వారా యతడు ద్రోణాచార్యునకు ద్రుపదుని యెడలగల పూర్వపు వైరమును జ్ఞప్తికి దెచ్చెను. మఱియు 'మీకు శిష్యుడుగనున్నవాడే ప్రతిపక్షమునకు నాయకుడై గురువగు మీ పైననే కత్తిగట్టుచున్నాడ'ని తెలిపి ద్రోణాచార్యునకు తీవ్రమగు రోషమును జనింపజేయు చున్నాడు. ఎదిరి పక్షమును, తన్నాయకుని గొప్పగా వర్ణించుటద్వారా స్వపక్ష నాయకునకు వారిపై ప్రతీకారభావనను వృద్ధినొందించుటయే దుర్యోధనుని యాశయము.

'ధీమంతు'డని పేర్కొనబడుటచే ధృష్టద్యుమ్నుడు వ్యూహ రచనలో గొప్పనేర్పరి యని తెలుచున్నది. కనుకనే యాతనిని పాండవులు తమ సేనానాయకునిగ నెన్నుకొనియుండిరి.

**అ:-** దుర్యోధనుడు పాండవపక్షమునగల ముఖ్య యోధులయొక్క పేర్లను ద్రోణాచార్యున కెఱిగించుచున్నాడు -

**4. అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి**
**యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః.**

**5. ధృష్టకేతు శ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్**
**పురుజిత్కున్తిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః.**

**6. యుధామన్యుశ్చ విక్రాన్త ఉత్తమౌజాశ్చ వీర్యవాన్**
**సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః.**

**టీక:-** అత్ర = ఈ పాండవసేనయందు, మహేష్వాసాః = గొప్పవిలు కాండ్రును, యుధి = యుద్ధమున, భీమార్జునసమాః = భీమార్జునులతో సమానులునగు, శూరాః = శూరులు (సన్తి = కలరు), (వారెవరనిన -) యుయుధానః = యుయుధానుడును, విరాటశ్చ = విరాటుడును, మహారథః = మహారథుడైన, వీర్యవాన్ = పరాక్రమవంతుడగు, కాశీరాజశ్చ = కాశీరాజున్ను, పురిజిత్ = పురుజిత్తున్ను, కున్తిభోజశ్చ = కున్తిభోజుడును, నరపుంగవః = మనుజశ్రేష్ఠుడగు, శైబ్యశ్చ = శైబ్యుడును, విక్రాన్తః = పరాక్రమశాలియగు, యుధామన్యుశ్చ = యుధామన్యుడును, వీర్యవాన్ = శౌర్యవంతుడగు, ఉత్తమౌజాశ్చ = ఉత్తమౌజుడును, సౌభద్రః = అభిమన్యుడును, ద్రౌపదేయాశ్చ = ద్రౌపదీతనయులగు ఉపపాండవులును, సర్వే = వీరందఱున్ను మహారథాః ఏవ = మహారథులే (అయియున్నారు).

**తా:-** ఈ పాండవ సేనయందు గొప్ప విలుకాండ్రును, యుద్ధమునందు భీమార్జునులతో సమానులునగు శూరవీరులును పెక్కురుకలరు. వారెవరనిన - యుయుధానుడు, విరాటుడు, మహారథుడైన ద్రుపదుడు, ధృష్టకేతువు, చేకితానుడు, పరాక్రమవంతుడగు కాశీరాజు, పురుజిత్తు, కున్తిభోజుడు, నరోత్తముడగు శైబ్యుడు, శౌర్యవంతుడగు యుధామన్యుడు, పరాక్రమశాలియగు ఉత్తమౌజుడు, అభిమన్యుడు, ఉపపాండవులు. వీరందఱును మహారథులే అయియున్నారు.

**వ్యాఖ్య:–** పైన దెల్పిన వీరులందఱు భీమార్జునులతో సమానులని చెప్పుటవలన వారిరువురును శూరాగ్రేసరులనియు, దుర్యోధనునకు భయోత్పాతము కలిగించువారనియు స్పష్టపడుచున్నది.

దుర్యోధనుడు స్వపక్షవీరులను గూర్చి ముందుగా దెలుపక పరపక్షనాయకులను వర్ణించి చెప్పుటలో రెండు కారణములు కలవు – (1) ఆచార్యునకు శత్రుసైన్యముపై రోషము కల్పించుట (2) తన సైన్యమువిషయమై ధైర్యము తగ్గియుండుట, లేక, తన సైన్యముకంటె ప్రతిపక్ష సైన్యమే బలవత్తరముగ నున్నదను భావము గలిగియుండుట.

''మహారథుడు'' – పదివేల ధనుర్ధరులగు యోధులతో నేకాకిగ యుద్ధము చేయగలవాడును, ఆయుధశాస్త్రమందు ప్రవీణుడునగు శూరుడు మహారథు డనబడును★.

యుయుధానుడు – ఇతనికి సాత్యకి యనియు పేరుగలదు.

ధృష్టకేతువు – చేదిదేశపురాజు, శిశుపాలుని పుత్రుడు.

పురుజిత్, కున్తిభోజులు – కుంతీదేవికి సోదరులు.

ద్రౌపదేయులు – ద్రౌపదిసుతులగు ఉపపాండవులు, ప్రతి వింద్యుడు, శ్రుత సోముడు, శ్రుతకీర్తి, శతానీకుడు, శ్రుతసేనుడు – వీరైదుగురున్ను క్రమముగ ధర్మరాజ భీమాదులకు ద్రౌపదివలన గలిగిన సంతానము.

**అ:–** ఈ ప్రకారముగ పాండవపక్ష వీరులనుగూర్చి చెప్పి, ఇక తన పక్షమున గల ప్రధానులైన యోధులను దుర్యోధనుడు వర్ణించి చెప్పుచున్నాడు –

**7. అస్మాకం తు విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ**
**నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమితే.**

**టీక:–** ద్విజోత్తమ = ఓ బ్రాహ్మణశ్రేష్ఠా!, అస్మాకం తు = ఇక మనపక్షములో, యే = ఎవరు, విశిష్టాః = ప్రముఖులో, మమ = నాయొక్క, సైన్యస్య = సైన్యమునకు, నాయకాః = నాయకులో, తాన్ = వారిని, తే = నీకు, సంజ్ఞార్థం = జ్ఞాపకముకొఱకు, బ్రవీమి = చెప్పుచున్నాను.

**తా:–** ఓ బ్రాహ్మణోత్తమా! ఇక మనసైన్యములో ప్రముఖులు, సేనానాయకులు ఎవరుకలరో వారలను జ్ఞాపకముకొఱకు మీకు చెప్పుచున్నాను. (వినుడు).

**వ్యాఖ్య:–** ప్రతిపక్షవీరులను మాత్రము తెలిపినచో ద్రోణున కొకవేళ అధైర్యము కలుగునేమోయని తలంచి ధైర్యోత్పాదనము కొఱకు స్వకీయ శూరవీరులను గూడ దుర్యోధనుడు తెలుప నారంభించుచున్నాడు.

**8. భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః**
**అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి స్తథైవ చ★.**

★ ఏకోదశసహస్రాణి యోధయేద్యస్తు ధన్వినామ్
శస్త్రశాస్త్రప్రవీణశ్చ మహారథ ఇతి స్మృతః.

★ సౌమదత్తిర్జయద్రథః – (పాఠాన్తరము)

## 9. అన్యే చ బహవశ్శూరా మదర్థే త్యక్తజీవితాః
## నానాశస్త్రప్రహరణా స్సర్వే యుద్ధవిశారదాః.

**టీక:–** భవాన్ = నీవును, భీష్మశ్చ = భీష్ముడును, కర్ణశ్చ = కర్ణుడును, సమితింజయః = యుద్ధమందు జయశీలుడైన, కృపశ్చ = కృపాచార్యుడును, అశ్వత్థామా = అశ్వత్థామయు, వికర్ణశ్చ = వికర్ణుడును, తథైవచ = అట్లే, సౌమదత్తిః = సోమదత్తుని కుమారుడగు భూరిశ్రవుడును, (ఇంకను) మదర్థే = నాకొఱకు, త్యక్తజీవితాః = ప్రాణమును ధారబోయువారైన, బహవః = అనేకులగు, అన్యేచ = ఇతరులైన, శూరాః = శూరులును, నానాశస్త్రప్రహరణాః = వివిధములగు శస్త్రాస్త్రములు ఆయుధములు కలవారును (ఇచట కలరు), సర్వే = (వీరు) అందఱున్ను, యుద్ధవిశారదాః = యుద్ధమునందు ప్రవీణులు (అయియున్నారు).

**తా:–** మీరు, భీష్ముడు, కర్ణుడు, యుద్ధమందు జయ శీలుడైన కృపాచార్యుడు, అశ్వత్థామ, వికర్ణుడు, భూరిశ్రవుడు, ఇంకను నాకొఱకు తమతమ జీవితములను ధారబోయునట్టి అనేక ఇతర శూరులు, అందఱును యుద్ధసమర్థులై వివిధ శస్త్రాస్త్ర సంపన్నులై ఇచట నున్నారు.

**వ్యాఖ్య:–** దుర్యోధనుడు వీరులను పేర్కొనునపుడు తన పక్షమునకు భీష్ముడు సేనాపతియైయుండ, అతని పేరు ముందు చెప్పక ద్రోణునిపేరు ఏల చెప్పవలసివచ్చెను? ఎదుటనున్న ద్రోణు డేమి భావించుకొనునోయని సందేహించికాని, గురువును ప్రప్రథమమున ఎన్నుకొనుట భావ్యమని తలంచికాని, ద్రోణాచార్యుని ఉత్తేజపఱచు నుద్దేశ్యముతోగాని అట్లు చేసియుండవచ్చును.

రెండు సేనలయందలి శూరవీరులను ద్రోణాచార్యుడెఱిగియున్నను, అతనితో జెప్పునెపమున దుర్యోధనుడు వారలను తిరిగి జ్ఞాపకము చేసికొని బలాబలములను లెక్కించుచున్నాడు. ''త్యక్తజీవితాః'' = (ప్రాణములను విడిచిపెట్టినవారు) – అను పదము దుర్యోధనుని ముఖతః వెలువడుటబట్టిచూడ తనవారందఱున్ను నశించియే పోవుదురని ముందుగనే అతని అంతరాత్మ భావించియుండవచ్చునని తోచుచున్నది. ఆ ప్రకారముగ పలుకుట దుర్యోధనునకు దుర్నిమిత్తసూచకమని కొందఱి మతము.

**అ:–** ఇవ్విధముగ తన పక్షమునగల శూరులను పొగడి తదుపరి దుర్యోధనుడు రెండువైపుల గల సేనలను లెక్కగట్టి తన సైన్యమే చాల గొప్పదని నుడువుచున్నాడు –

## 10. అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్
## పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితమ్.

**టీక:–** తత్ = అట్టి, అస్మాకమ్ = మనయొక్క, బలమ్ = సైన్యము, భీష్మాభిరక్షితమ్ = భీష్మునిచేత బాగుగ రక్షింపబడుచున్నదై, అపర్యాప్తమ్ = అపరిమితముగనున్నది, ఏతేషామ్ = ఈ పాండవులయొక్క, ఇదమ్ = ఈ, బలంతు = సైన్యమన్ననో, భీమాభిరక్షితమ్ = భీమునిచేత కాపాడబడుచున్నదై, పర్యాప్తమ్ = పరిమితముగనున్నది.

**తా:–** అట్టిశూరులుకల మనసైన్యము భీష్మునిచే గాపాడ బడుచు అపరిమితముగ నున్నది. (అజేయమై యొప్పుచున్నది). పాండవులయొక్క ఈ సేనయో భీమునిచే రక్షింపబడుచు పరిమితముగనున్నది. (జయింప శక్యమైయున్నది.)

**వ్యాఖ్య:–** ఈ శ్లోకములోని 'అపర్యాప్తం', 'పర్యాప్తం' అను పదముల యర్థమందు భాష్యకారులలో మతభేదము కన్పట్టు చున్నది. ఆనందగిరి, శంకరానందులు మున్నగువారు 'అపర్యాప్త' పదమునకు అపరిమితమను అర్థమును సూచించిరి. శ్రీధరలు మున్నగువారు అసంపూర్ణము, అసమర్థము అను భావమును ప్రకటించిరి. కాని యిందు మొదటియర్థమే సమీచీనముగ తోచుచున్నది. ఏలననగా దుర్యోధను డిదివఱలో ఉద్యోగపర్వమందు ధృతరాష్ట్రునితోను (ఉ.54-60-70), భీష్మపర్వమున ద్రోణాచార్యునితోను (భీష్మ 51-4-6) తన సైన్యముయొక్క గొప్పతనమును గూర్చి మిక్కుటముగ శ్లాఘించి యుండెను. వారలను ఉత్సాహపఱచు నిమిత్త మావిధముగ నతడు చెప్పి యుండెను. ఇపుడును అదియే సందర్భము కనుక, మఱియొక విధముగ నాతడు చెప్పియుండడు. తన సైన్యమును కించపఱచుకొను అవకాశ మిచట లేదు. శ్లోకము యొక్క ధోరణి స్వపక్షమును కీర్తించునదిగనే యున్నది. కావున 'మన సైన్యము చాలకున్నది. పాండవ సైన్యము పరిపూర్ణముగనున్నది' అను నర్థ మిచట సందర్భోచితముగా లేదు. తన సైన్యమును శ్లాఘించుచు భీష్మపర్వమున (51-6) ఇదియే శ్లోకమును దుర్యోధనుడు ద్రోణాచార్యునకు చెప్పినవిషయమున్ను ఇచట గమనించ దగియున్నది.

''భీమాభిరక్షితమ్'' – కౌరవసేనకు భీష్ముడధిపతియై యున్నట్లు, పాండవసేనకు ధృష్టద్యుమ్ను డధిపతియై యుండ, ఇట 'భీమునిచే రక్షింపబడిన పాండవసేన' అని యేల చెప్పబడినది? ఇందులకు కారణము లివియైయుండ వచ్చును – (1) భీముడు ధార్తరాష్ట్రులనందఱిని వధించుటకు కృతనిశ్చయుడై యున్నందున దుర్యోధనుని చిత్తమున అతడే స్ఫురించియుండవచ్చును. (2) ధృష్టద్యుమ్నుడు పాండవసేనకు నాయకుడుగ నియమింపబడినను, సేననంతను కాపాడుచుండుటకు భీముడుకూడ నియోగింపబడెను. (3) మొదటి దినమున పాండవులచే రచింపబడిన వజ్రవ్యూహముయొక్క రక్షణ కొఱకు దాని యగ్రభాగమునందు భీముడుండెను. కావున సేనారక్షకుడుగ నాతడే దుర్యోధనునకు గన్పట్టియుండవచ్చును.

## 11. అయనేషు చ సర్వేషు యథాభాగమవస్థితాః
## భీష్మ మేవాభిరక్షన్తు భవన్తస్సర్వ ఏవ హి.

**టీక:–** భవన్తః = మీరు, సర్వ ఏవ = అందఱున్ను, సర్వేషు = సమస్తములైన, అయనేషు చ = వ్యూహమార్గములందును, యథాభాగమ్ = వారివారి నియమితస్థానములలో, అవస్థితాః = ఉన్నవారై, భీష్మమేవ = భీష్మునే, అభిరక్షన్తుహి = అన్నిప్రక్కల కాపాడుదురుగాక!

**తా:–** మీరందఱున్ను వ్యూహమార్గములందు మీమీ నియమిత స్థానములందుండి భీష్మునే సర్వవిధముల కాపాడుచుండవలయును.

**వ్యాఖ్య:–** భీష్ముడు మహాపరాక్రమశాలి. తన్నుతాను రక్షించుకొనగలడు. అట్టిచో భీష్మునే సర్వవిధముల కాపాడుచుండుడని దుర్యోధను డేల వచింపవలయును? ఇందులకు కారణము గలదు. ద్రుపదుని పుత్రుడగు శిఖండి మొట్టమొదట స్త్రీరూపము గలిగియుండినందువలన, ఆతనితో యుద్ధము చేయనని భీష్ముడు ప్రతిజ్ఞచేసెను. కావున పాండవపక్షముననున్న శిఖండి ఎదురుగ వచ్చినచో భీష్ముడాతనితో తలపడకుండును. ఆ ఆపదను చూచుకొని శత్రువు లాతనిని వధింపవచ్చును. ఈ రహస్యమెఱింగి దుర్యోధనుడు వీరులందఱిని భీష్ముని యెదుటకు శిఖండి రాకుండులాగున సర్వవిధముల నాతనిని

సంరక్షించుచుం డుడని యాదేశించెను. భీష్ముడొకడు క్షేమముగనున్నచో - శత్రువు లనందఱిని పరిమార్చగల సామర్థ్య మాతనికి కలదుగనుక - తన సైన్యమంతయు క్షేమముగ నన్నుట్లేయని భావించినవాడై దుర్యోధనుడు తన వీరులను పైవిధముగ నాజ్ఞాపించెను.

**అ:—** ఈ ప్రకారముగ దుర్యోధనుని వృత్తాంత మెఱింగించి సంజయుడు రణరంగమున తదుపరి జరిగిన సంఘటనలను వివరించుచున్నాడు -

## 12. తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః
## సింహనాదం వినద్యోచ్చై శ్శంఖం దధ్మౌ ప్రతాపవాన్.

**టీక:—** ప్రతాపవాన్ = పరాక్రమవంతుడును, కురువృద్ధః = కౌరవులలో పెద్దయు, పితామహః = తాతయునగు భీష్ముడు, తస్య = ఆ దుర్యోధనునకు, హర్షమ్ = సంతోషమును, సంజనయన్ = కలుగుజేయుచు, ఉచ్చైః = బిగ్గరగా, సింహనాదమ్ = సింహగర్జనవంటి ధ్వనిని, వినద్య = చేసి, శంఖమ్ = శంఖమును, దధ్మౌ = ఊదెను.

**తా:—** పరాక్రమశాలియు, కురువృద్ధుడునగు భీష్మపితామహుడంతట దుర్యోధనున కుత్సాహము గలుగునటుల పెద్దగ సింహధ్వనిజేసి శంఖమును పూరించెను.

**వ్యాఖ్య:—** ప్రతాపవాన్ - పరశురాముడు మున్నగు మహాశక్తి సంపన్నులను గూడ జయింపగల్గినట్టి అమిత పరాక్రమము కలవాడు కనుక భీష్ముడు ప్రతాపవంతుడని ఇట పేర్కొనబడెను.

ప్రభువగు దుర్యోధనుడు శత్రుసైన్యమును జూచి ఒకింత కలవరపడినట్లు గమనించినవాడై యాతని హృదయ ముప్పొంగునట్లు చేయుటకై సేనాపతియగు భీష్ముడు శంఖమును బిగ్గరగానూదెను. సేనానాయకుడు శంఖనినాదముచేయుట యుద్ధారంభమునుగూడ సూచించును. కురువృద్ధః = కురువంశమున అప్పుడున్నవారిలో బాహ్లికుని తరువాత వయస్సునందు పెద్ద భీష్ముడే. కనుకనే పితామహుడనికూడ నాతడు పేర్కొనబడెను.

**అ:—** భీష్ముని యుద్ధోత్సాహమునుజూచి తక్కిన సైనికులున్ను శంఖాదులను పూరించిరని సంజయుడు వచించుచున్నాడు -

## 13. తతశ్శంఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః
## సహసైవాభ్యహన్యన్త స శబ్దస్తుములోఽభవత్.

**టీక:—** తతః = తరవాత, శంఖాశ్చ = శంఖములున్ను, భేర్యశ్చ = భేరులున్ను, పణవానక గోముఖాః = తప్పెటలు, పలకలు, ఊదుకొమ్ములున్ను, సహసైవ = తత్క్షణమే, అభ్యహన్యన్త = మ్రోగింపబడెను. సశబ్దః = ఆధ్వని, తుములః = నలుదెసలు వ్యాపించినదిగ, అభవత్ = ఆయెను.

**తా:—** భీష్ముడు శంఖారావము చేసినపిమ్మట కౌరవ సైన్యమందలి తక్కిన వారున్ను శంఖములను, భేరులను, తప్పెటలు మున్నగువానిని వెంటనే మ్రోగించిరి. ఆ శబ్దముచే దిక్కులు పిక్కటిల్లెను.

**వ్యాఖ్య:–** సేనాపతియొక్క శంఖధ్వని, సింహనాదము తక్కిన సైనికులలో ఉత్సాహమును రేకెత్తించుటచే వారున్ను ఒక్కుమ్మడిగ వివిధములగు రణధ్వనులను గావించిరి.

'నావారు, పాండవులు యుద్ధమునం దేమిచేసిరి?' అను ధృతరాష్ట్రుని ప్రశ్నను పురస్కరించుకొని ఇంతదనుక సంజయుడు కౌరవులపక్షమందలి వార్తల నెఱింగించెను. ఇక నిచటినుండి 5 శ్లోకములవఱకు పాండవులపక్షమందలి వృత్తాంతములను తెలియ చెప్పుచున్నాడు –

**అ:–** కృష్ణార్జునులు తమ తమ శంఖముల నూదిరను విషయమును తెలుపుచున్నాడు –

## 14. తతశ్శ్వేతైర్హయైర్యుక్తే మహతి స్యన్దనే స్థితౌ
## మాధవః పాణ్డవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః.

**టీక:–** తతః = అటుపిమ్మట, శ్వేతైః = తెల్లనైన, హయైః = గుఱ్ఱములతో, యుక్తే = కూడిన, మహతి = గొప్పదియగు, స్యన్దనే = రథమునందు, స్థితౌ = ఉన్నట్టి, మాధవః = శ్రీకృష్ణుడున్ను, పాణ్డవశ్చైవ = అర్జునుడున్ను, దివ్యౌ = దివ్యములగు, శంఖౌ = (తమ తమ) శంఖములను, ప్రదధ్మతుః = గట్టిగ ఊదిరి.

**తా:–** పిమ్మట తెల్లని గుఱ్ఱములంబూన్చిన గొప్పరథము నందు గూర్చొనియున్న కృష్ణార్జున లిరువురును తమ తమ దివ్యములగు శంఖములను గట్టిగ ఊదిరి.

**వ్యాఖ్య:–** గీతయందు శ్రీకృష్ణపరమాత్మ రంగముమీదికి వచ్చినది ఇచ్చోటనే. తెల్లనిగుఱ్ఱములతో గూడిన అత్యద్భుతమైన దివ్యరథము నారోహించి నరనారాయణులు కృష్ణార్జునుల రూపమున ప్రత్యక్షమైరి. తెలుపుదనము సత్త్వగుణమును సూచించును. ధర్మమును ప్రతిబింబింప జేయును. దీనినిబట్టి ధర్మము (తత్ఫలితముగ) విజయము పాండవపక్షమునందే కలవని తెలియుచున్నది.

అర్జునునకు ఈ దివ్యరథమును, గాండీవమను ధనస్సును పూర్వము ఖాండవ దహనమునకు మెచ్చి అగ్నిదేవుడు ప్రసాదించెను. కావున మహాశక్తివంతములైనవి. తెల్లని గుఱ్ఱములు నాలుగున్ను గంధర్వరాజగు చిత్రరథుడు బహుమతిగా నొసంగిన నూఱు గుఱ్ఱములలోనివి. అవి భూమ్యాకాశములం దెచటనైనను సంచరింపగలవు. ఈ తెల్లగుఱ్ఱములు నాలుగున్ను నాలుగు వేదములనియు, కృష్ణార్జునులు పరమాత్మ జీవాత్మలనియు చెప్పుదురు.

''మాధవః'' – 'మా' అనగా లక్ష్మి 'ధవు' డనగా భర్త; లక్ష్మీపతియగు శ్రీకృష్ణపరమాత్మ శంఖమును పూరించి కౌరవపక్షమునుండి రాజ్యలక్ష్మిని స్వీకరించెనని సంజయుడు ధ్వనింపజేయుచున్నాడు.

కౌరవపక్షమున భీష్ముడు ప్రధానుడు. కాబట్టి ముందుగా నాతడే శంఖమును ఊదెను. అట్లే పాండవపక్షమున ముందుగా శ్రీకృష్ణమూర్తియే శంఖమును ఊదుటబట్టి, వారే ఆ పక్షమున ప్రధానులని, తక్కినవారలు నిమిత్తమాత్రులేయని స్పష్టమగుచున్నది.

''పాణ్డవః'' – అర్జునుడు. 'పాణ్డవానాం ధనంజయః' అని చెప్పబడినందువలన 'పాణ్డవ' శబ్దమునకు అర్జునుడను అర్థమే ఇట వివక్షితము.

**అ:–** ఇక నాలుగు శ్లోకములందు పాండవవీరులను, వారు పూరించిన శంఖములను పేర్కొనుచున్నాడు –

**15. పాఞ్చజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః**
**పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః.**

**16. అనన్త విజయం రాజా కున్తీపుత్రో యుధిష్ఠిరః**
**నకులః సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ.**

**17. కాశ్యశ్చ పరమేష్వాసశ్శిఖణ్డీ చ మహారథః**
**ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకిశ్చాపరాజితః.**

**18. ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే**
**సౌభద్రశ్చ మహాబాహుశ్శంఖాన్ దధ్ముః పృథక్ పృథక్.**

**టీక:–** *పృథివీపతే* = ఓ ధృతరాష్ట్రమహారాజా! *హృషీకేశః* = శ్రీకృష్ణుడు, *పాఞ్చజన్యమ్* = పాంచజన్యమను శంఖమును, *ధనంజయః* = అర్జునుడు, *దేవదత్తమ్* = దేవదత్తమను శంఖమును, *భీమకర్మా* = భయంకరకార్యముల నొనర్చు, *వృకోదరః* = భీముడు, *పౌణ్డ్రమ్* = పౌండ్రమను, *మహాశంఖమ్* = మహాశంఖమును, *దధ్మౌ* = ఊదెను, (అట్లే) *కున్తీపుత్రః* = కుంతీదేవి కుమారుడును, *రాజా* = రాజునునగు, *యుధిష్ఠరః* = ధర్మరాజు, *అనన్తవిజయమ్* = అనన్తవిజయమను శంఖమును, *నకులః* = నకులుడు, *సహదేవశ్చ* = సహదేవుడున్ను, *సుఘోషమణిపుష్పకౌ* = సుఘోషము, మణిపుష్పకము అను శంఖములను (*దధ్ముః* = క్రమముగ ఊదిరి). (అదే విధమున) *పరమేష్వాసః* = గొప్పధనస్సుగల, *కాశ్యశ్చ* = కాశీరాజున్ను, *మహారథః* = మహారథుడగు, *శిఖణ్డీచ* = శిఖండియు, *ధృష్టద్యుమ్నః* = ధృష్టద్యుమ్నుడును, *విరాటశ్చ* = విరాటుడును, *అపరాజితః* = అపజయమునుబొందనివాడగు, *సాత్యకిశ్చ* = సాత్యకియు, *ద్రుపదః* = ద్రుపదుడును, *ద్రౌపదేయాశ్చ* = ద్రౌపదికుమారులగు ఉపపాండవులును, *మహాబాహుః* = గొప్పబాహువులుగల, *సౌభద్రశ్చ* = అభిమన్యుడును, *సర్వశః* = సేనయందంతట, *పృథక్పృథక్* = వేఱువేఱుగా, *శంఖాన్* = (తమతమ) శంఖములను, *దధ్ముః* = ఊదిరి.

**తా:–** శ్రీకృష్ణుడు పాంచజన్యమను శంఖమును ఊదెను. అర్జునుడు దేవదత్తమును ఊదెను. భయంకరకార్యములనొనర్చు భీముడు పౌండ్రమను గొప్ప శంఖమును ఊదెను. కుంతీసుతుడగు ధర్మరాజు అనంతవిజయమును, నకులుడు సుఘోషమును, సహదేవుడు మణిపుష్పకమును ఊదిరి. అట్లే గొప్పధనుస్సుగల కాశీరాజున్ను, మహారథుడగు శిఖండియు, ధృష్టద్యుమ్నుడును, విరాటుడును, అపజయము నొందనివాడగు సాత్యకియు, ద్రుపదుడును, ద్రౌపదీతనయులగు ఉపపాండవులును, గొప్పభుజబలముగల అభిమన్యుడును, సేనయందంతట వేఱువేఱుగా తమతమ శంఖములను ఊదిరి.

**వ్యాఖ్య:–** కృష్ణాదులు పూరించిన ఈ పాంచజన్యాది శంఖములు సామాన్యములు కావనియు, దివ్యములైనవనియు ఇదివఱకే చెప్పబడినది.

''పాఞ్చజన్యం'' – పంచజనుడను రాక్షసునియొక్క యెముకలచే నేర్పడినదగుటచే శ్రీకృష్ణుని శంఖమునకు పాంచజన్యమను పేరు కలిగినది. హృషీకేశుడు – హృషీకములనగా ఇంద్రియములు.

ఈశుడనగా అధిపతి. ఇంద్రియములకు అధిపతియై, సర్వసాక్షియైయుండు పరమాత్మయని అర్థము. ఆనందమునకు నిలయుడనియు మఱియొక అర్థము కలదు.

''ధనంజయః'' = రాజసూయయాగమునకు అనేక రాజులనుండి ధనమును సంపాదించి తెచ్చుటచేతను, లేక ధనమునుగూర్చిన ఆశను జయించినవాడగుట చేతను అర్జునునకు ధనంజయుడని పేరువచ్చినది.

వృకోదరః = వృకమనగా తోడేలు; దాని ఉదరమువంటి ఉదరముకలవాడు కనుకను, లేక అన్నిటిని భస్మముచేయు 'వృక' మను అగ్ని ఉదరమున కలవాడు కనుకను భీమునకు వృకోదరుడను పేరు ఏర్పడినది.

**అ:–** పాండవపక్షవీరులయొక్క ఆ శంఖధ్వనులవలన కలిగిన ఫలితమును వివరించుచున్నాడు –

**19. స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్**
**నభశ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్.**

**టీక:–** తుములః = అంతటను వ్యాపించినట్టి, స ఘోషః = ఆ ధ్వని, నభశ్చ = ఆకాశమును, పృథివీంచైవ = భూమిని, వ్యనునాదయన్ = మారుమ్రోగించుచు, ధార్తరాష్ట్రాణామ్ = దుర్యోధనాదుల యొక్క, హృదయాని = గుండెలను, వ్యదారయత్ = చీల్చివైచెను.

**తా:–** పాండవవీరుల శంఖముల యొక్క ఆ సంకులధ్వని భూమ్యాకాశములను దద్దరిల్లజేయుచు దుర్యోధనాదుల గుండెలను బ్రద్దలుచేసెను.

**వ్యాఖ్య:–** శ్రీకృష్ణాదులయొక్క శంఖధ్వనులు దుర్యోధనాదులయొక్క హృదయములను భేదించివేసెనని చెప్పుటచే వారల సగము ప్రాణములు అప్పుడే పోయినవనియు, వారికి ఉత్సాహము సన్నగిలినదనియు స్పష్టమగుచున్నది.

**అ:–** తదుపరి అర్జునుడు ఉత్సాహపూరితుడై శ్రీకృష్ణునితో పలికిన పలుకులను సంజయుడు (నాలుగు శ్లోకములద్వారా) తెలియజేయుచున్నాడు –

**20. అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః**
**ప్రవృత్తే శస్త్రసమ్పాతే ధనురుద్యమ్య పాణ్డవః.**

**21. హృషీకేశం తదా వాక్యమిదమాహ మహీపతే**

**టీక:–** మహీపతే = ఓ ధృతరాష్ట్రమహారాజా! అథ = అంతట, శస్త్రసమ్పాతే = ఆయుధ ప్రయోగము, ప్రవృత్తే *(సతి)* = ప్రారంభమగుచుండగా, కపిధ్వజః = హనుమంతుడు టెక్కెమందు గల, పాణ్డవః = అర్జునుడు, వ్యవస్థితాన్ = యుద్ధసన్నద్ధులై యున్న, ధార్తరాష్ట్రాన్ = కౌరవులను, దృష్ట్వా = చూచి, ధనుః = వింటిని, ఉద్యమ్య = చేబట్టి, తదా = ఆ సమయమున, హృషీకేశం = శ్రీకృష్ణునిగూర్చి, ఇదమ్ = ఈ, వాక్యమ్ = మాటను, ఆహ = పలికెను.

**తా:–** ఓ ధృతరాష్ట్రమహారాజా! అటుపిమ్మట రణరంగమున ఆయుధములు ప్రయోగింపబడబోవుచుండగా కపిధ్వజుడగు అర్జునుడు యుద్ధసన్నద్ధులైయున్న కౌరవులను జూచి ధనస్సును చేబూని శ్రీకృష్ణునితో నిట్లు పలికెను –

**వ్యాఖ్య:–** "కపిధ్వజుడు" – అర్జునుని రథముయొక్క టెక్కెముపై హనుమంతుడుండుటచే అర్జునునకు కపిధ్వజుడను పేరు వచ్చినది. భీముని ప్రార్థన ననుసరించి ఆంజనేయుడు యుద్ధమున పాండవులకు విజయము కలుగునిమిత్తము అర్జునుని రథము యొక్క టెక్కెముపై తాను గూర్చుండులాగున వరమిచ్చి యుండెను. (భారతము – అరణ్య, 151 అ)

**అర్జున ఉవాచ :–**

## సేనయోరుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత.
## 22. యావదేతాన్నిరీక్షేఽహం యోద్ధుకామానవస్థితాన్
## కైర్మయా సహ యోద్ధవ్యమస్మిన్ రణసముద్యమే.

**అర్జునుడు చెప్పెను –**

**టీక:–** అచ్యుత – ఓ కృష్ణా! అస్మిన్ = ఈ, రణసముద్యమే = యుద్ధారంభమునందు, మయా = నాచేత, కైఃసహ = ఎవరితో, యోద్ధవ్యమ్ = యుద్ధము చేయబడవలసియున్నదో, యోద్ధు కామాన్ = యుద్ధము చేయగోరినవారలై, అవస్థితాన్ = (ఇచట) నిలబడియున్న, ఏతాన్ = (అట్టి) వీరిని, యావత్ = ఎంతలో, అహమ్ = నేను, నిరీక్షే = చూడగలనో, (తావత్ = అంతలో), ఉభయోః సేనయో = రెండుసేనలయొక్క, మధ్యే = నడుమ, మే = నా యొక్క, రథమ్ = రథమును, స్థాపయ = నిలబెట్టుము.

**తా:–** అర్జునుడు చెప్పెను – ఓ కృష్ణా! ఈ యుద్ధారంభమునందు నేనెవరితో పోరుసల్పవలయునో, అట్టి ఈ యుద్ధాభిలాషులను ఎచటినుండి నేను చక్కగ జూడగల్గుదునో రెండుసేనల మధ్య అచ్చోట నారథమును నిలబెట్టుడు.

**వ్యాఖ్య:–** శత్రువులతో తలపడుటకు ముందుగా, శత్రుపక్షమున ఎందఱు కలరో, ఎవరెవరు కలరో, వారందరు ఏప్రకారముగనున్నారో అంతయు గమనించుట ఉత్తమ యోధుని లక్షణము. కనుకనే అర్జునుడు వారలను చక్కగ జూచుటకై రథమును ఉభయ సేనల మధ్యకు తీసికొనిపొమ్మని శ్రీకృష్ణునకు జెప్పెను.

"అచ్యుత" – చ్యుతిలేనివాడు అచ్యుతుడు. అనగా నాశములేనివాడు, లేక స్వస్వరూపమునుండి చలింపనివాడు – అని అర్థము. లేక తన్నాశ్రయించినవారిని సంసార సముద్రమున చ్యుతినొందింపకుండ చూచువాడనియు అర్థము చెప్పవచ్చును. తమతమ ఆధ్యాత్మికసాధనలయందు చ్యుతి లేనివారు మాత్రమే అచ్యుతుని జేరగలరు. కావున అచ్యుతుని జేరదలంచువారు తమ సాధనలయం దేలాటి చ్యుతి, లోపము కలుగనీయక చూడవలయును.

## 23. యోత్స్యమానానవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః
## ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేర్యుద్ధే ప్రియచికీర్షవః.

**టీక:–** దుర్బుద్ధేః = దుష్టబుద్ధిగల, ధార్తరాష్ట్రస్య = దుర్యోధనునకు, యుద్ధే = యుద్ధమునందు, ప్రియచికీర్షవః = ప్రియము చేయగోరినవారై, యే ఏతే = ఏవీరులు, అత్ర = ఇక్కడ, సమాగతాః = చేరియున్నారో, (తాన్ = ఆ) యోత్స్యమానాన్ = యుద్ధముచేయబోవుచున్న వారిని, అహమ్ =నేను, అవేక్షే = చూచెదను.

**తా:–** దుష్టబుద్ధిగల దుర్యోధనునకు యుద్ధమున ప్రియమొనగూర్పనెంచి ఇచట చేరియున్నట్టి ఈ యోధులను నేను చూచెదను.

**వ్యాఖ్య:–** 'దుర్బుద్ధేః' – దుర్యోధనుడు పాండవుల కిదివఱలో నెన్నియో అపచారములు చేసెను. తుట్టతుదకు న్యాయముగ వారికి దక్కవలసిన రాజ్యమును గూడ లాగుకొని నానాహింసలు పెట్టజొచ్చెను. ఇదియంతయు మనసున నిడుకొనియే అర్జునుడాతనిని దుర్బుద్ధియని పేర్కొనెను. 'బుద్ధినాశాత్ప్రణశ్యతి --' బుద్ధి చెడినచో మనుజుడు నశించి పోవును. అని గీతయందు భగవానుడు తెలిపియున్నారు. దీనిని బట్టి దుర్యోధనునకు మున్ముందు కలుగబోవు నాశము ప్రారంభముననే 'దుర్బుద్ధి' యను పదముచే సూచింపబడినదని మన మూహింపవచ్చును. మఱియు ఎవరెవరి బుద్ధి శుద్ధత్వము లేక అవగుణములతో గూడియుండునో, అట్టివారు జీవితరంగమున దుర్యోధనునివలె అపయశస్సు, అపజయము, వినాశము తప్పక బొందగలరు. కావున సద్బుద్ధినే ఆశ్రయించవలెనుగాని 'దుర్బుద్ధి' నిగాదు.

''ప్రియచికీర్షవః'' – దుష్టశీలుడగు దుర్యోధనునకు ప్రియముచేయ దలంచిన వారందఱున్ను యుద్ధమున మడసిరి. పాపమును ప్రోత్సహించుటకూడ మహాపాపము. కావున దుర్యోధనునివలె దుర్బుద్ధి నాశ్రయించుటగాని, అతని పక్షమువారివలె నద్దానిని ప్రోత్సహించుటగాని ఎన్నటికిని తగదు.

**అ:–** అర్జునుని యా వాక్యములను విని శ్రీకృష్ణు డేమిచేసెనో తెలుపబడుచున్నది –

**సంజయ ఉవాచ :–**

**24. ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత**
**సేనయోరుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్.**

**25. భీష్మద్రోణప్రముఖతస్సర్వేషాం చ మహీక్షితాం**
**ఉవాచ పార్థ పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి.**

**సంజయ ఉవాచ** = సంజయుడు చెప్పెను –

**టీక:–** భారత = భరతవంశమున జనించిన ఓ ధృతరాష్ట్రమహారాజా! ఏవమ్ = ఈ ప్రకారముగ, *గుడాకేశేన* = అర్జునునిచేత, *ఉక్తః* = చెప్పబడిన, *హృషీకేశః* = శ్రీకృష్ణుడు, *ఉభయోః సేనయోః* = రెండుసేనలయొక్క, *మధ్యే* = నడుమను, *భీష్మద్రోణప్రముఖతః* = భీష్మద్రోణుల కెదురుగను, *సర్వేషాం మహీక్షితాం (ప్రముఖతః)* చ = అందఱు రాజుల కెదురుగను, *రథోత్తమమ్* = శ్రేష్ఠమగు రథమును, *స్థాపయిత్వా* = నిలబెట్టి, *పార్థ* = ఓ అర్జునా!, *సమవేతాన్* = చేరియున్న, *ఏతాన్* = ఈ, *కురూన్* = కౌరవులను, *పశ్య* = చూడుము, *ఇతి* = అని, *ఉవాచ* = చెప్పెను.

**తా:–** సంజయ డిట్లు పలికెను – ఓ ధృతరాష్ట్రమహారాజా! అర్జును డిట్లు చెప్పగా నంతట శ్రీకృష్ణుడు ఉత్తమమగు ఆ రథమును రెండుసేనలమధ్య భీష్మద్రోణులకును, ఎల్లరాజులకును ఎదుట నిలిపి 'అర్జునా! ఈ చేరియున్న కౌరవులను జూడుము!' అని చెప్పెను.

**వ్యాఖ్య:–** 'గుడాకేశః = నిద్రను జయించినవాడు, తమోగుణమును నిర్జించినవాడు.

అతిజాగరూకుడని యర్థము. అధ్యాత్మబోధయొక్క శ్రవణమునకు ఏకాగ్రత, ప్రమాద రాహిత్యము అత్యవసరములు. అట్టి సల్లక్షణములు గీతాబోధ రూప పరమార్థవిద్యను శ్రవణముచేయనున్న అర్జునునియందు కలవని 'గుడాకేశ' పదము నిరూపించుచున్నది. 'కురూన్' = 'కౌరవులను' జూడుము అని శ్రీకృష్ణ డర్జుననకు చెప్పిరి. కౌరవులందరును అర్జునునకు అతిసమీపబంధువులే. కావున ఏ స్వజనమును జూచి అర్జునుని చిత్తము శోకసంవిగ్నము కానున్నదో అట్టివారి కట్టెదుటనే పరమాత్మ రథమును నిలబెట్టిరి. గీతోపదేశమునకు క్షేత్ర మిచటనే తయారగుచున్నది. రథము నచ్చోట నిలుపుటద్వారా గీతాశాస్త్రమావిర్భవించుటకు అనువైన పరిస్థితిలో శ్రీకృష్ణ డర్జునుని ప్రవేశపెట్టుచున్నారు. గీతావిర్భావము సర్వజీవుల మహద్భాగ్యమే యగునుగదా!

**అ:–** శ్రీకృష్ణుని యా వాక్యమును విని అర్జును డేమి చేసెనో సంజయుడు చెప్పుచున్నాడు –

**26. తత్రాపశ్యత్స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్**
**ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్ సఖీంస్తథా.**

**27. శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయోరుభయోరపి**

**టీక:–** అథ = పిమ్మట, పార్థః = అర్జునుడు, తత్ర = అచ్చట, ఉభయోః సేనయోః అపి = రెండుసేనలయందును, స్థితాన్ = ఉన్నట్టి, పితౄన్ = తండ్రులను, పితామహాన్ = తాతలను, ఆచార్యాన్ = గురువులను, మాతులాన్ = మేనమామలను, భ్రాతౄన్ = అన్నదమ్ములను, పుత్రాన్ = కొడుకులను, పౌత్రాన్ = మనుమలను, సఖీన్ = స్నేహితులను, తథా = అటులనే, శ్వశురాన్ = మామలను, సుహృదశ్చైవ = హితముగోరువారినిన్ని, అపశ్యత్ = చూచెను.

**తా:–** తదుపరి అర్జును డచట రెండు సేనలయందును నిల్చియున్నట్టి తండ్రులను, తాతలను, గురువులను, మేనమామలను, అన్నదమ్ములను, కొడుకులను, మనుమలను, స్నేహితులను, మామలను, హితైషులను – (అందరిని) చూచెను.

**వ్యాఖ్య:–**

| | | |
|---|---|---|
| తండ్రులు | – | భూరిశ్రవస్సు మొదలైనవారు |
| తాతలు | – | భీష్ముడు మొదలైనవారు. |
| గురువులు | – | ద్రోణాచార్యులు మొదలైనవారు. |
| మేనమామలు | – | శల్యుడు మొదలైనవారు. |
| అన్నదమ్ములు | – | దుర్యోధనుడు మొదలైనవారు. |
| కొడుకులు | – | దుర్యోధనపుత్రుడగు లక్ష్మణుడు మున్నగువారు. |
| మనుమలు | – | లక్ష్మణపుత్రుడు మున్నగువారు. |
| స్నేహితులు | – | అశ్వత్థామ మొదలైనవారు. |
| మామలు | – | ద్రుపదుడు మున్నగువారు. |
| హితైషులు | – | కృతవర్మ మున్నగువారు. |

'ఉభయసేనలయందు' అని చెప్పుటవలన తన సైన్యమందలి జనులనుగూడ అర్జునుడు చూచెనని యర్థము.

**అ:–** ఈ ప్రకారముగ ఇరుపక్షములందలి సైనికులను జూచి అటుపిమ్మట అర్జునుడేమి చేసెనో చెప్పుచున్నాడు –

**తాన్సమీక్ష్య స కౌన్తేయస్సర్వాన్ బన్ధూనవస్థితాన్.**
**28. కృపయా పరయాఽఽవిష్టో విషీదన్నిదమబ్రవీత్**

**టీక:–** సఃకౌన్తేయః = ఆ అర్జునుడు, అవస్థితాన్ = (యుద్ధసన్నద్ధులై) నిలిచియున్న, తాన్ = ఆ, సర్వాన్బన్ధూన్ = బంధువులందఱిని, సమీక్ష్య = బాగుగచూచి, పరయా = అధికమైన, కృపయా = కనికరముతో, ఆవిష్టః = కూడినవాడై, విషీదన్ = దుఃఖించుచు, ఇదమ్ = ఈ చెప్పబోవు వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

**తా:–** అర్జునుడు యుద్ధభూమియందు నిలబడియున్న ఆబంధువులందఱిని బాగుగ పరికించి దయార్ద్రహృదయుడై, దుఃఖించుచు నిట్లు పలికెను –

**వ్యాఖ్య:–** 'కృప' యనగా దయ, కరుణ, కనికరము, జాలి – అని యర్థము. అది గొప్ప సుగుణమే. కాని చూపవలసినచోట చూపినచో నది శోభించును. అధర్మమున కియ్యకొనిన కౌరవులపై అర్జునుడు కనికరము గలవాడాయెను. వీరందఱు 'నావారు, నా బంధువులు' అను మమత్వబుద్ధి అతని కుదయించెను. 'వీరి నెట్లు చంపుదును' అను దిగులు కలిగెను. క్షత్రియుడైన అర్జునునకు యుద్ధసమయమున ఆసుగుణము శోభించలేదు. ఏలననగా, ఆ కృపను చూపరానివారిపై చూపుటకు, చూపదగని సమయమున చూపుటకు నాతడు ప్రారంభించెను. ఈ దోషమునే గీతాతత్త్వ ప్రబోధముచే శ్రీకృష్ణమూర్తి అర్జునుని హృదయమునుండి తొలగించుచున్నారు.

''విషీదన్'' – 'దుఃఖించుచు' అని చెప్పుటవలన ఎంతటి శారీరకబలము, భౌతిక శక్తి సామర్థ్యము లున్నప్పటికిని అవిద్య తొలగనిచో మనుజుడు ఒక్క క్షణములో క్రుంగి పోగలడని ఋజువగుచున్నది. అర్జునుడు మహాశక్తిమంతుడు. పెక్కు దివ్యములగు అస్త్రశస్త్రములు కలవాడు. అయినను అజ్ఞాన మావరించినపుడు బాలుని చందమున శక్తివిహీనుడై దుఃఖింప మొదలిడెను. మనోవ్యాధికి చికిత్సచేయనిచో శరీర మెంత సౌష్ఠవముగ నున్నను చింతవీడదు. కావున ఆత్మజ్ఞానముచే అవిద్య పూర్తిగ తొలగునపుడు మాత్రమే జీవునకు నిరతిశయానందము, దుఃఖరాహిత్యము సిద్ధించగలవు. అర్జునుడంతటివాడే అవిద్యచే దుర్బలత్వమును బొందగా. ఇక సామాన్యుల విషయము వేఱుగ చెప్పవలెనా? కావున అధ్యాత్మవిద్యద్వారా మనోజయము, తద్ద్వారా మనశ్శాంతి పొందుట ప్రతిజీవికిని ప్రధానకర్తవ్యమై యున్నది. అర్జునుని దీనస్థితిని జూచి ఇట్టి ఆత్మవిద్యనే శ్రీకృష్ణమూర్తి యాతనికి బోధించెను.

**అ:–** అర్జునుడు శ్రీకృష్ణపరమాత్మతో తన దీనపరిస్థితిని విన్నవించుకొనుచున్నాడు –

**అర్జున ఉవాచ :–**

**దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితమ్.**

**29. సీదన్తి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి**
**వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే.**

**30. గాణ్డీవం స్రంసతే హస్తాత్త్వక్చైవ పరిదహ్యతే**
**న చ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః.**

**అర్జున ఉవాచ** = అర్జునుడు చెప్పెను.

**టీక:–** కృష్ణ = ఓ కృష్ణమూర్తీ! యుయుత్సుమ్ = యుద్ధముచేయుటకొఱకు, సముపస్థితమ్ = సమకూడియున్న, ఇమమ్ = ఈ, స్వజనమ్ = బంధుజనమును, దృష్ట్వా = చూచి, మమ = నా యొక్క, గాత్రాణి = అవయవములు, సీదన్తి = శిథిలములగుచున్నవి, ముఖంచ = నోరున్ను, పరిశుష్యతి = ఎండుకొనిపోవుచున్నది, మే = నాయొక్క, శరీరే = శరీరమునందు, వేపథుశ్చ = వణకున్ను, రోమహర్షశ్చ = గగుర్పాటున్ను, జాయతే = కలుగుచున్నది, గాణ్డీవమ్ = గాండీవమను నాయొక్క ధనస్సు, హస్తాత్ = చేతినుండి, స్రంసతే = జారిపోవుచున్నది, త్వక్చైవ = చర్మమున్ను, పరిదహ్యతే = మండుచున్నది, అవస్థాతుం = నిలుచుటకైనను, న చ శక్నోమి = శక్తిలేనివాడుగ నున్నాను, మే = నా యొక్క, మనః = మనస్సు, భ్రమతీవ చ = గిఱ్ఱున తిరుగుచున్నట్లున్నది.

**తా:–** అర్జునుడు చెప్పెను - ఓ కృష్ణమూర్తీ! యుద్ధము చేయుటకై ఇచట సమకూడిన ఈ బంధుజనులను జూచి నా అవయవములు పట్టుదప్పుచున్నవి; నోరెండుకొని పోవుచున్నది; శరీరమందు వణకు పుట్టుచున్నది; గగుర్పాటు కలుగుచున్నది; గాండీవము చేతినుండి జారిపోవుచున్నది; చర్మము మండుచున్నది; నిలబడుటకైనను నాకు శక్తి లేకున్నది; మనస్సు గిఱ్ఱున తిరుగుచున్నది.

**వ్యాఖ్య:–** ఈ శ్లోకములందు అర్జునున కాసమయమున గలిగిన శారీరక మానసిక వికారములు తెలుపబడినవి. ఇవియన్నియు భయమునకు, అధైర్యమునకు, నిరుత్సాహమునకు చిహ్నములు. యుద్ధమనిగాని శత్రుసంహారమనినగాని లెక్కపెట్టని అర్జునుడు, ఎన్నియో సంగ్రామములందు విజయముగాంచియున్న అర్జును డీ సమయమున ఏల నిరుత్సాహపడవలెను? అతని శరీరబలమునకు, భౌతికశక్తికి ఏలోటును లేదు. కాని మానసికముగ నాతడు గొప్ప దెబ్బతినెను. దేనిచేత? వీరు 'నావారు' (స్వజనం), వీరి నెట్లు చంపుదును?.... అను మనస్తత్త్వము గలిగియుండుటచేత. ఇదియే మమకారము. ఈ మమకార మర్జునుని పీడించుటబట్టియే 'స్వజనం స్వజనం' అని పదే పదే యిట్లు కలవరించుట మొదలిడెను - ''దృష్ట్వేమం స్వజనం కృష్ణ; హత్వాస్వజన మాహవే; స్వజనం హి కథం హత్వా ...'' ఈ మమకారమే అర్జునునకు పట్టిన రోగము. దానికి ఆత్మజ్ఞానమే సరియైన మందు. దానినే శ్రీకృష్ణమూర్తి అర్జునున కిపుడు ప్రసాదించబోవుచున్నారు.

**అ:–** యుద్ధవిముఖతకు అర్జునుడు తన కారణములను శ్రీకృష్ణునకు దెల్పుచున్నాడు -

**31. నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ**
**న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజనమాహవే.**

**టీక:–** కేశవ = ఓ కృష్ణమూర్తీ!, విపరీతాని = అనర్థసూచకములగు, నిమిత్తాని చ =

శకునములనుగూడ, పశ్యామి, = చూచుచున్నాను, ఆహవే = యుద్ధమున, స్వజనమ్ = బంధువులను, హత్వా = చంపి, అను = అటుపిమ్మట, శ్రేయః = శ్రేయస్సును, న పశ్యామి = చూడజాలకున్నాను.

**తా:–** ఓ కృష్ణమూర్తీ! (పెక్కు) అపశకునములను సహితము చూచుచున్నాను. యుద్ధమునందు బంధువులను చంపినవెనుక పొందబోవు లాభమెద్దియో నాకు గనుపించుటలేదు.

**32. న కాఙ్క్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ**
**కిం నో రాజ్యేన గోవిన్ద కిం భోగైర్జీవితేన వా.**

**టీక:–** కృష్ణ = ఓ కృష్ణా!, విజయమ్ = విజయమును, న కాఙ్క్షే = కోరను, రాజ్యం చ = రాజ్యమును, సుఖాని చ = సుఖములను, న (కాఙ్క్షే) = కోరను, గోవిన్ద = ఓ కృష్ణా, నః = మనకు, రాజ్యేన = రాజ్యముతో, కిమ్ = ఏమి (ప్రయోజనము)?, భోగైః = భోగములతోగాని, జీవితేన వా = లేక జీవితముతోగాని, కిమ్ = ఏమి (ప్రయోజనము)?

**తా:–** కృష్ణా! నేను విజయమునుగాని, రాజ్యమునుగాని, సుఖములనుగాని కోరను. రాజ్యముతోగాని, భోగములతోగాని జీవితముతోగాని మనకేమి ప్రయోజనము?

**వ్యాఖ్య:–** వైరాగ్యముకలవానికే ఆత్మజ్ఞానము (బ్రహ్మ జ్ఞానము) నుపదేశింపవలయునను శాస్త్రనియమము కలదు. అయితే అధ్యాత్మజ్ఞానమయమగు గీతాశాస్త్రమును శ్రవణము చేయబోవుచున్న అర్జునున కట్టి వైరాగ్యము కలదా? ఆతడు జ్ఞానమున కధికారియా? అను సంశయము లీ శ్లోకముచే నివారితములగుచున్నవి. ఏదియో యొక విధముగ అర్జునునకు తీవ్రవిరక్తి జనించినది. ప్రాపంచిక సుఖముల యెడల రోతకలిగినది. రాజ్యమును, భోగములను నతడు తృణప్రాయముగ నెంచెను. వెయ్యేల, మూడులోకములు తనకు సమర్పింపబడినను అక్కరలేదని*ను నిర్ణయమునకు వచ్చెను. ఇట్టి తీవ్రవైరాగ్యోత్పత్తి కాలమే బ్రహ్మవిద్యాబోధనకు తగిన సుమూహూర్తము. కనుకనే శ్రీకృష్ణమూర్తి అర్జునున కిదివఱకెన్నడును బోధింపక, వైరాగ్యము, భోగవిగర్హణత్వము హృదయమున లెస్సగ ప్రజ్వలించిన ఆ యుద్ధసమయముననే అదనుజూచి పరమార్థతత్త్వమును బోధించెను.

**33. యేషామర్థే కాఙ్క్షితం నో రాజ్యం భోగాః సుఖాని చ**
**త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనానిచ.**

**34. ఆచార్యాః పితరః పుత్రా స్తథైవ చ పితామహాః**
**మాతులాశ్శ్వశురాః పౌత్రాస్స్యాలాస్సమ్బన్ధిన స్తథా.**

**టీక:–** నః = మనకు, రాజ్యం = రాజ్యమును, భోగాః = భోగములును, సుఖానిచ = సుఖములున్ను, యేషామర్థే = ఎవరికొఱకు, కాఙ్క్షితమ్ = కోరబడినవో, తే = అట్టి, ఆచార్యాః = గురువులు, పితరః = తండ్రులు, పుత్రాః = కొడుకులు, తథైవచ = అట్లే, పితామహాః = తాతలు, మాతులాః = మేనమామలు, శ్వశురాః = మామలు, పౌత్రాః = మనుమలు, స్యాలాః = బావమఱదులు, తథా =

* అపి త్రైలోక్య రాజ్యస్య హేతోః కిం ను మహీకృతే.

ఆప్రకారమే, సంబన్ధినః = సంబంధము కలవారు, ఇమే = వీరెల్లరును, ప్రాణాన్ = ప్రాణములను, ధనానిచ= ధనములనుకూడ, త్యక్త్వా = విడిచి, యుద్ధే = యుద్ధమునందు, అవస్థితాః = నిలబడియున్నారు.

**తా:–** ఎవరి నిమిత్త మీ రాజ్యమును, భోగములను, సుఖములను మనము కోరుదుమో, అట్టి గురువులు, తండ్రులు, కొడుకులు, తాతలు, మేనమామలు, మామలు, మనుమలు, బావమఱదులు, సంబంధులు – ఎల్లరును ప్రాణములమీద, ధనములమీద ఆశ వదలుకొని ఈ రణరంగములో వచ్చి నిలబడియున్నారు.

**35. ఏతాన్న హన్తుమిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన**
**అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిం ను మహీకృతే.**

**టీక:–** మధుసూదన = ఓ కృష్ణా! ఘ్నతోఽపి = (నన్ను) చంపువారలైనను, ఏతాన్ = వీరిని, త్రైలోక్యరాజ్యస్యహేతోః = మూడులోకముల రాజ్యాధిపత్యముకొఱకైనను, హన్తుం = చంపుటకు, నేచ్ఛామి = ఇష్టపడను, మహీకృతే = భూలోకరాజ్యముకొఱకు, కిం ను = (ఇక) చెప్పవలసినదేమి?

**తా:–** ఓ కృష్ణా! నన్ను చంపువారలైనను వీరిని ముల్లోకముల రాజ్యాధిపత్యము కొఱకైనను నేను చంపనిచ్ఛగింపను. ఇక భూలోక రాజ్యముకొఱకు వేఱుగచెప్పవలెనా?

**వ్యాఖ్య:–** ''మధుసూదనః'' – మధువను రాక్షసుని జంపుటచే శ్రీకృష్ణునకు మధుసూదనుడను పేరువచ్చినది.

**36. నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతిస్స్యా జ్జనార్దన**
**పాపమేవాశ్రయేదస్మాన్ హత్వైతానాతతాయినః.**

**టీక:–** జనార్దన = ఓ కృష్ణా! ధార్తరాష్ట్రాన్ = దుర్యోధనాదులను, నిహత్య = చంపి, నః = మనకు, కాప్రీతిః = ఏమి సంతోషము, స్యాత్ = కలుగును, ఆతతాయినః = దుర్మార్గులగు, ఏతాన్ = వీరిని, హత్వా = చంపిన, అస్మాన్ = మనలను, పాపమేవ = పాపమే, ఆశ్రయేత్ = పొందును.

**తా:–** ఓ కృష్ణా! దుర్యోధనాదులను చంపుటచే మనకేమి సంతోషము కలుగును? దుర్మార్గులైనను వీరిని చంపుటవలన మనకు పాపమే కలుగును.

**వ్యాఖ్య:–** ''ఆతతాయినః'' = మహాపాపములు చేయువారు:– (1) ఇంటికి నిప్పంటించువాడు (2) విషము బెట్టువాడు (3) ఆయుధమును ధరించి హింసించువాడు (4) ధనము నపహరించువాడు (5) భూమిని ఆక్రమించువాడు (6) ఇతరుల భార్యలను హరించువాడు – అను నీయార్గురును ఆతతాయులనబడుదురు★. (దుర్యోధనాదు లీ యాఱు రకముల పాపములను జేసినవారే)

**37. తస్మాన్నార్హా వయం హన్తుం ధార్తరాష్ట్రాన్ స్వబాన్ధవాన్@**
**స్వజనం హి కథం హత్వా సుఖినస్స్యామ మాధవ.**

---

★ అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణిర్ధనాపహః
క్షేత్రదారాపహర్తా చ షడేతే హ్యాతతాయినః. (వసిష్ఠస్మృతి 3-16)

@ సబాన్ధవాన్ – (పాఠాంతరము)

**టీక:—** మాధవ = ఓ కృష్ణా!, తస్మాత్ = అందువలన, స్వబాన్ధవాన్ = మనబంధువులగు, ధార్తరాష్ట్రాన్ = దుర్యోధనాదులను, హన్తుం = చంపుటకు, వయం = మనము, నార్హాః = తగినవారముకాము, స్వజనం = మనవారిని, హత్వా = చంపి, సుఖినః = సుఖవంతులము, కథం = ఎట్లు, స్యామ హి = కాగలము?

**తా:—** ఓ కృష్ణా! కావున మన బంధువులగు దుర్యోధనాదులను చంపుటకు మనము తగము. మనవారిని చంపి మన మెట్లు సుఖపడగలము?

**వ్యాఖ్య:—** 'స్వ, స్వ' అని అర్జునుడు కలవరించుచున్నాడు (స్వబాన్ధవాన్, స్వజనం...) 'నాది' యను మమకారభావ మతనికి గట్టిగ పాతుకొనిపోయినది. 'నేను, నాది' (అహంకార, మమకారములు) యను నీరెండును జీవునకు మోక్షమార్గమున మహా ప్రతిబంధకములై యున్నవి. 'ఈ దేహమే నేను' అని యనుకొనునంతకొఱకు నిట్టి భావములు జనులను వదలలేవు. కనుకనే శ్రీకృష్ణపరమాత్మ అర్జునుని ఈ దేహాభిమానమును 'నీవు ఆత్మవేగాని దేహముకాదు' అను అఖండ జ్ఞానోపదేశముద్వారా తొలగించివేయనున్నారు.

**38. యద్యప్యేతే న పశ్యన్తి లోభోపహతచేతసః**
**కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్.**

**39. కథం న జ్ఞేయమస్మాభిః పాపాదస్మాన్నివర్తితుమ్**
**కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భిర్జనార్దన.**

**టీక:—** జనార్దన = ఓ కృష్ణా!, లోభోపహతచేతసః = రాజ్యలోభముచే చెడిన మనస్సులు గల, ఏతే = ఈ దుర్యోధనాదులు, కులక్షయకృతమ్ = వంశనాశనమువలన గలుగు, దోషమ్ = దోషమును, మిత్రద్రోహే = మిత్రద్రోహమునందలి, పాతకం చ = పాపమును, యద్యపి న పశ్యన్తి = తెలిసికొనకపోయినను, కులక్షయకృతమ్ = కులనాశనమువలన గలుగు, దోషమ్ = దోషమును, ప్రపశ్యద్భిః = చక్కగా తెలిసికొనుచున్న, అస్మాభిః = మనచేత, అస్మాత్ పాపాత్ = ఈ పాపమునుండి, నివర్తితుమ్ = తొలుగుటకు, కథమ్ = ఎట్లు, నజ్ఞేయమ్ = తెలియబడదు?

**తా:—** ఓ కృష్ణా! రాజ్యలోభముచే భ్రష్టచిత్తులైన దుర్యోధనాదులు వంశనాశనమువలన గలుగు దోషమును, మిత్రద్రోహమువలన గలుగు పాపమును ఒకవేళ యెఱుగకున్నను, ఆ రెండిటిని బాగుగ తెలిసినట్టి మన మేల యీ పాపకృత్యమునుండి విరమింపగూడదో అర్థము కాకున్నది.

**వ్యాఖ్య:—** "లోభోపహతచేతసః" = లోభముచే గొట్టబడిన చిత్తముగలవారు (దుర్యోధనాదులు) కామక్రోధ లోభములను దుష్టత్రయములో లోభము చోటు సంపాదించుకొన గల్గినది. ఈ మూడిటిని నరకద్వారములుగ మున్ముందు భగవానుడు వర్ణించిచెప్పుదురు★. ఆ దుర్గుణములు చిత్తమును కలుషితముగ నొనర్చును. ఆ లోభాదుల నాశ్రయించుటవలన దుర్యోధనాదుల మానసము బాగుగ దెబ్బతినిపోయినది. కనుకనే లోభోపహతచేతస్కులని వారు పిలువబడిరి. శ్రేయఃకాములు ఆ దుర్గుణములను దరికిజేర్చరాదు.

**అ:—** అర్జునుడు తన వాదమును కొనసాగించుచున్నాడు –

★ త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః
కామక్రోధస్తథా లోభస్తస్మాదేతత్త్రయం త్యజేత్. (16-21)

**40. కులక్షయే ప్రణశ్యన్తి కులధర్మాస్సనాతనాః**
**ధర్మే నష్టే కులం కృత్స్నమధర్మోఽభిభవత్యుత.**

**41. అధర్మాభిభవాత్కృష్ణ ప్రదుష్యన్తి కులస్త్రియః**
**స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః.**

**42. సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ**
**పతన్తి పితరో హ్యేషాం లుప్తపిణ్డోదక క్రియాః.**

**టీక:–** కులక్షయే = వంశమునశింప, సనాతనః = అనాదిగా (వంశపరంపరగా) వచ్చుచున్న, కులధర్మాః = కులధర్మములు, ప్రణశ్యన్తి = నశించుచున్నవి, ధర్మేనష్టే = ధర్మమునశింప, కృత్స్నమ్ = సమస్తమైన, కులమ్ = కులమును, అధర్మః = అధర్మము, అభిభవతి ఉత = వ్యాపించునుగదా! కృష్ణ = ఓ కృష్ణా!, అధర్మాభిభవాత్ = అధర్మము వృద్ధినొందుటవలన, కులస్త్రియః = కులస్త్రీలు, ప్రదుష్యన్తి = చాల చెడిపోవుదురు, వార్ష్ణేయ = వృష్ణివంశీయుడవగు ఓ కృష్ణా!, స్త్రీషు దుష్టాసు = స్త్రీలు చెడినచో, వర్ణసంకరః = వర్ణసంకరము, జాయతే = కలుగుచున్నది, సంకరః = (వర్ణ) సంకరము, కులఘ్నానాం = కులమును జెఱచినవారికిని, కులస్యచ = కులమునకును, నరకాయైవ = నరకముకొఱకే (యగును), ఏషామ్ = వీరియొక్క, పితరః = పితృదేవతలు, లుప్తపిణ్డోదకక్రియాః = పిండోదక క్రియలు (శ్రాద్ధములు, తర్పణములు) లేనివారై, పతన్తి = అధోగతిని బొందుదురు.

**తా:–** ఓ కృష్ణా! కులము నశించుటచే అనాదిగవచ్చు కులధర్మములు అంతరించిపోవును. ధర్మము నశించుటచే కులమంతటను అధర్మము వ్యాపించును. అధర్మము వృద్ధినొందుటచే కులస్త్రీలు చాల చెడిపోవుదురు. స్త్రీలు చెడిపోవుటచే వర్ణసంకరమేర్పడును. అట్టి వర్ణసంకరమువలన సంకరముచేసినవారికి, సంకరమునొందిన కులమునకు గూడ నరకము సంప్రాప్తించును. వారి పితృదేవతలు శ్రాద్ధములు, తర్పణములు లేనివారై యధోగతిని బొందుదురు.

**43. దోషై రేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః**
**ఉత్సాద్యన్తే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః.**

**44. ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన**
**నరకే నియతంవాసో[1] భవతీత్యనుశుశ్రుమ.**

**టీక:–** కులఘ్నానామ్ = కులమును నాశనము చేయువారియొక్క, వర్ణసంకరకారకైః = జాతిని సంకరముచేయు, ఏతైః = ఈ, దోషైః = దోషములచేత, శాశ్వతాః = శాశ్వతములైన, జాతిధర్మాః = జాతిధర్మములు, కులధర్మాశ్చ = కులధర్మములున్ను, ఉత్సాద్యన్తే = నశింపజేయబడుచున్నవి. జనార్దన = ఓ కృష్ణా! ఉత్సన్నకులధర్మాణామ్ = నశించిన కుల ధర్మములుగల, మనుష్యాణామ్ = మనుజులకు, నరకే = నరకమునందు, నియతమ్ = ఎల్లప్పుడును, వాసః = నివాసము, భవతి = కలుగును, ఇతి = అని, అనుశుశ్రుమ = (పెద్దలవలన) వినియున్నాము.

1 అనియతం. (పాఠాన్తరము) - దీర్ఘకాలమని యర్థము.

**తా:–** ఓ కృష్ణా! కులనాశకులయొక్క జాతిసాంకర్య హేతువులైన ఈ దోషములచేత శాశ్వతములగు జాతిధర్మములు, కులధర్మములు నశించిపోవుచున్నవి. కులధర్మములు నశించిన మానవులకు శాశ్వత నరకనివాసము కలుగునని మనము వినియున్నాము.

**45. అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్**
**యద్రాజ్యసుఖలోభేన హన్తుం స్వజనముద్యతాః.**

**టీక:–** అహో = ఆశ్చర్యము!, బత = అయ్యో!, యత్ = ఏ కారణమువలన, వయమ్ = మనము, రాజ్యసుఖలోభేన = రాజ్యసుఖమునందలి యాశచేత, స్వజనమ్ = బంధువులను, హన్తుం = చంపుటకు, ఉద్యతాః = ప్రయత్నించితిమో, (తత్ = ఆ కారణముచేత) మహత్పాపమ్ = మహాపాతకమును, కర్తుమ్ = చేయుటకు, వ్యవసితాః = సమకట్టినవారమైతిమి.

**తా:–** కటకటా! రాజ్యసుఖమందలి యాశచే మనము బంధువులను చంపుట కుద్యమించి మహాపాపమును చేయుటకు సమకట్టితిమికదా!

**46. యది మామప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః**
**ధార్తరాష్ట్రా రణేహన్యుస్తన్మే క్షేమతరం భవేత్.**

**టీక:–** అశస్త్రం = శస్త్రమును ధరింపకనున్నట్టియు, అప్రతీకారం = ఎదిరించక నున్నట్టియు, మాం = నన్ను, రణే = యుద్ధమునందు, శస్త్రపాణయః = చేతియం దాయుధములను ధరించిన, ధార్తరాష్ట్రాః = దుర్యోధనాదులు, హన్యుఃయది = చంపుదురేని, తత్ = అది, మే = నాకు, క్షేమతరమ్ = మఱింత క్షేమమైనది, భవేత్ = అగును.

ఆయుధములు ధరింపకయు, ఎదిరించకయునున్న నన్ను ఆయుధములు చేబూనిన దుర్యోధనాదు లీయుద్ధమున జంపుదురేని, అది నాకు మఱింత క్షేమమైనదియే యగును.

**వ్యాఖ్య:–** ''క్షేమతరం'' - నిరస్త్రుడైయున్న తాను శత్రువుచే చంపబడినచో అది చాల మేలేయగునని అర్జునుడీ క్రింది కారణములచే చెప్పియుండవచ్చును.

(1) కులనాశనముచేసి క్రొత్తగా పాపము సంపాదించుట తొలగిపోయి అత్తఱి పూర్వ పుణ్యమును కాపాడుకొనుట జరుగును.

(2) బంధువధవలన కలుగు పాపము తప్పిపోవును.

(3) బంధుమిత్రాదుల ప్రాణములు దక్కును.

(4) బంధుమిత్రాదుల ప్రాణములను కాపాడుటవలన కలుగు పుణ్యము స్వకీయ మోక్షసాధన కుపకరించును.

**అ:–** అర్జును డీప్రకారముగ తన మానసికాందోళనను శ్రీకృష్ణపరమాత్మకు వ్యక్తము చేసి తదుపరి ఏమియొనర్చెనో సంజయుడు చెప్పుచున్నాడు -

**సంజయ ఉవాచ :–**

**47. ఏవముక్త్వార్జునస్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః.**

**సంజయ ఉవాచ =** సంజయుడు చెప్పెను –

**టీక:–** సంఖ్యే = యుద్ధభూమియందు, అర్జునః = అర్జునుడు, ఏవమ్ = ఈ ప్రకారముగ, ఉక్త్వా = చెప్పి, శోకసంవిగ్నమానసః = దుఃఖముచే మిక్కిలి చలించిన మనస్సుగలవాడై, సశరమ్ = బాణముతో గూడిన, చాపం = ధనస్సును, విసృజ్య = విడిచిపెట్టి, రథోపస్థే = రథముమీద, ఉపావిశత్ = చతికిలబడెను.

సంజయుడు చెప్పెను – (ఓ ధృతరాష్ట్రమహారాజా!) యుద్ధభూమి యందర్జును డీ ప్రకారముగ జెప్పి శోకముచే కలతనొందిన చిత్తముగలవాడై, బాణముతో గూడిన వింటిని పారవైచి రథముపై చతికిలబడెను.

**వ్యాఖ్య:–** ''శోకసంవిగ్నమానసః'' – అర్జునుడు శోకాకులితచిత్తుడై ధనుర్బాణములను సైతము జారవిడిచెను. అర్జునుని జీవితమునందు నిరుత్సాహముచే ధనస్సును వదిలివేసిన ఘట్ట మింతదనుక ఒకటియును లేదు. కావున దీనికేదియో ప్రబలమైన కారణముండియే యుండవలెను. స్వజనక్షయమును గూర్చిన ఆందోళనయే అది. ఆ ఆందోళన ఆవేదనగా మారెను. తత్ఫలితముగ నాతడు రాజ్యమును, భోగములను తృణీకరించివైచెను. యుద్ధమును నిరాకరించెను. అర్జునునియొక్క ఈ పరమవిరక్తిని ఊతగా దీసికొని శ్రీకృష్ణపరమాత్మ యాతనికి చక్కని ఆత్మజ్ఞానోపదేశముచేసిరి. అర్జునుని విషాదము విషాదముగానుండక విషాదయోగముగా మారెను. ఏలయనిన అర్జునుడు ప్రాపంచిక సుఖములయెడల, రాజ్యభోగములయెడల విముఖత్వము కలిగి, ధర్మమును తెలిసికొనుటకొఱకై పరితపించెను (ధర్మసమ్మూఢచేతాః). అట్టి పరితాపము ముముక్షువుల కత్యావశ్యకమైయున్నది. దైవము కొఱకు, ధర్మముకొఱకు కలుగు పరితాపము (విషాదము) యోగమునకు దారితీయును. ఒకదానియందు (విషయభోగము లందు) విరక్తి, మరియొక దానియందు (ధర్మమునందు) ఆసక్తి మోక్షమునకు అత్యావశ్యకమైయున్నది. అనగా ప్రాపంచిక వైభవములందు విరక్తి, ధర్మమునందు దైవమునందు ఆసక్తియుండిననే పరమార్థపదమున జీవుడు త్వరితముగా పురోగమనము సలుపగలడు. అర్జునున కీరెండును సమకూడినవి. కనుకనే యాతని అర్హతను గుర్తెఱిగి శ్రీకృష్ణపరమాత్మ వెనువెంటనే చక్కని జ్ఞానోపదేశమును జేసిరి. అర్జునునివలెనే ఎవరైనప్పటికిని దృశ్యవిషయములపై విరక్తి కలిగి ధర్మముకొఱకై తహతహలాడినచో, భగవదనుగ్రహముచే నాతనికి జ్ఞానోదయము, పరమశాంతి తప్పక లభించగలవు.

ఓమ్

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగాశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే అర్జునవిషాదయోగోనామ
ప్రథమోఽధ్యాయః

ఇది ఉపనిషత్ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జునసంవాదమునగు
శ్రీ భగవద్గీతలందు అర్జునవిషాదయోగమను
మొదటి అధ్యాయము
ఓమ్ తత్ సత్

# సాఙ్ఖ్య యోగము



**నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః**
**న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః. (2-23)**

ఈ ఆత్మను ఆయుధము లెవ్వియును ఛేదింపజాలవు. అగ్ని దహింపజాలదు, నీరు తడుపజాలదు, గాలి యెండింపజాలదు.

ఓం

# శ్రీ భగవద్గీత

అథ ద్వితీయో౽ధ్యాయః

## రెండవ అధ్యాయము

సాఙ్ఖ్యయోగః

## సాఙ్ఖ్యయోగము

**ఈ అధ్యాయముయొక్క పేరు:–**

''సాంఖ్యయోగము'' సంఖ్యతో గూడినది సాంఖ్యము. సాంఖ్యమనగా జ్ఞానము. జ్ఞానవిచారణయందు అనాత్మ వస్తువులను లెక్కించునపుడు సంఖ్యను ఆశ్రయించవలసి వచ్చును, గనుక అయ్యది సాంఖ్యమని చెప్పబడెను. ప్రకృతియందుగల 24 తత్వములను లేక 96 తత్వములను లెస్సగ శోధించి, అవి అనాత్మరూపములని త్యజించి వానికి సాక్షిగనున్నట్టి పరమాత్మను గ్రహించుటయే సాంఖ్యవిద్య; ఆత్మానాత్మవివేక రూపమగు విజ్ఞానమే సాంఖ్యము. ఈ అధ్యాయమునందు ఆత్మస్వరూపము లెస్సగ వర్ణింపబడుటవలనను, పంచభూతాత్మకమగు దేహాదులయొక్క నశ్వరత్వము ప్రతిపాదింపబడుటవలనను, జ్ఞానసంబంధమైన యంశములు మిక్కుటముగ వచ్చుట చేతను దీనికి సాంఖ్యయోగమను పేరు వచ్చినది.

**ఈ అధ్యాయమందలి ప్రధాన విషయములు :–**

1. అర్జునుడు తన మానసిక వ్యథను శ్రీకృష్ణపరమాత్మ కెఱింగించి, నివారణోపాయము నర్థించుట (1 వ శ్లో॥ నుండి 10 వ శ్లో॥ వఱకు)
2. ఆత్మస్వరూప వర్ణనము .... (11 వ శ్లో॥ నుండి 30 వ శ్లో॥ వఱకు)
3. క్షాత్రధర్మము ననుసరించి యుద్ధముచేయవలసిన ఆవశ్యకతను నిరూపించుట (31 వ శ్లో॥ నుండి 38 వ శ్లో॥వఱకు)
4. నిష్కామకర్మయోగ ప్రతిపాదనము (39 వ శ్లో॥ నుండి 53 వ శ్లో॥ వఱకు)
5. స్థితప్రజ్ఞుని లక్షణములు, ఆతని మహిమ (54 వ శ్లో॥ నుండి 72 వ శ్లో॥ వఱకు)

**పూర్వాధ్యాయముతో ఈ అధ్యాయమునకు గల సంబంధము :–**

శ్రీకృష్ణుడు అర్జునుని రథమును రెండుసేనల మధ్య నిలబెట్టగా కట్టెదుట బారులు తీర్చియున్న బంధ్వాదులను చూచి అర్జునుడు శోకవిహ్వలుడై వారి నెట్లు చంపుదునని మనంబున దిగులునొంది గాండీవమును జారవిడిచి రథముపై చతికిలబడెనని క్రిందటి అధ్యాయమున చెప్పబడినది. అర్జునుని యా

దీనస్థితిని జూచి శ్రీకృష్ణపరమాత్మ ఈ అధ్యాయమున నాతనికి ధైర్యోత్పాదన మొనర్చుటకై ఆత్మయొక్క నిజతత్త్వమును, కర్మరహస్యమును బోధించుచున్నారు -

**అ॥** అర్జునుని మానసిక పరిస్థితిని వర్ణించుచు సంజయు డీయధ్యాయము నుపక్రమించుచున్నాడు -

**సంజయ ఉవాచ :-**

## 1. తం తథా కృపయాఽఽవిష్టమశ్రుపూర్ణాకులేక్షణమ్
## విషీదన్తమిదం వాక్యమువాచ మధుసూదనః.

**సంజయ ఉవాచ** = సంజయుడు చెప్పెను -

**టీక:-** *తథా* = అట్లు, *కృపయా* = కనికరముచేత, *ఆవిష్టం* = కూడుకొనియున్న వాడును, *అశ్రుపూర్ణాకులేక్షణం* = కన్నీటితో నిండిన వ్యాకులములైన నేత్రములు గలవాడును, *విషీదన్తమ్* = దుఃఖించుచున్నవాడునగు, *తం* = ఆ యర్జునునిగూర్చి, *మధుసూదనః* = శ్రీకృష్ణమూర్తి, *ఇదం వాక్యం* = ఈ (చెప్పబోవు) వాక్యమును, *ఉవాచ* = పలికెను.

**తా:-** సంజయుడు చెప్పెను - ఆ ప్రకారముగ కనికరముతో గూడుకొని కంటనీరు పెట్టుకొనినవాడై వ్యాకులత్వముజెంది దుఃఖించుచున్న అర్జునుని జూచి శ్రీకృష్ణు డిట్లు పలికెను.

**వ్యాఖ్య:-** ''అశ్రుపూర్ణాకులేక్షణమ్'' = తీవ్రవైరాగ్యము కలిగినవాని లక్షణమివ్విధముగనే యుండును. ప్రపంచ భోగములయెడల, దృశ్యవిషయముల యెడల విరక్తి కలిగియుండ, సంసారముపై రోత జనింప అతని కంటివెంట ధారధారగా కన్నీరు కారుచుండును. జగద్వైభవములు భారభూతములుగా తోచుచుండును. ఇట్టి స్థితియే అర్జునునకు కలిగినది. బ్రహ్మోపదేశమునకు ఇట్టి వైరాగ్యము ఒక అర్హత (Qualification) అయియున్నది. ఇదిలేనివానికి అధ్యాత్మవిద్య బోధింపబడినను మురికిగుడ్డకు వేసిన రంగువలె నిష్ప్రయోజనమైపోవును. శ్రీకృష్ణమూర్తి కావింప బోవు అధ్యాత్మధర్మోపదేశమునకు అర్జునుడు (ఇట్టి వైరాగ్యావలంబనముద్వారా) అర్హతను సంపాదించుకొనెనని స్పష్టమగుచున్నది.

''కృపయాఽఽవిష్టమ్'' = కృప, దయ, కనికరము మంచిగుణములే. కాని చూప దగని వారిపై చూపినపుడుగాని, చూపదగని సమయమున చూపినగాని అవి సత్ఫలమును గలుగజేయ జాలవు. అస్థానస్నేహకారుణ్యము పనికిరాదు. అధర్మమునకు ఒడిగట్టినట్టి జనులపై అర్జునుడు కనికరము జూపెను. ఇది క్షాత్రధర్మవిరుద్ధము. కావుననే 'ఇట్టికృప, ఇట్టివారిపై ఈ సమయమున పనికి రాద' నియు తన క్షత్రియధర్మమును కార్యాన్వితమొనర్పవలెననియు అర్జునుడు బోధింపబడెను.

''మధుసూధన'' -- మధువను రాక్షసుని సంహరించుటచే శ్రీకృష్ణుని కాపేరు వచ్చెను. మధువనగా తేనె అనియు అర్థము కలదు. అహంకారము, శబ్దాదివిషయములు, దృశ్యభోగములు తేనెవలె మొదట ఆనందకరములుగ తోచును. తదుపరి విషమువలె బాధించును. కావున వానిని త్యజించవలెను. అదియే మధుసూదనత్వము. అట్టి మధుసూదనత్వమను లక్షణము కలవాడే మధుసూదనుడగు పరమాత్మను జేరగలడు.

అర్జునుని దీనస్థితిని జూచి శ్రీకృష్ణమూర్తి యాతనికి ధైర్యమును పురికొల్పుచున్నాడు -

**శ్రీ భగవానువాచ :-**

## 2. కుతస్త్వా కశ్మలమిదం విషమే సముపస్థితమ్
## అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున.

**శ్రీ భగవానువాచ** = భగవంతుడైన శ్రీకృష్ణుడు చెప్పెను -

**టీక:-** అర్జున = ఓ అర్జునా! అనార్యజుష్టం = పామరులచే నవలంబింపబడదగినదియు, అస్వర్గ్యం = స్వర్గప్రాప్తికి భంగకరమైనదియు, అకీర్తికరం = అపకీర్తిని గలిగించునదియునగు, ఇదం = ఈ, కశ్మలం = మనోవ్యాకులత్వము (మోహము), విషమే = (ఈ) విషమసమయమందు, త్వా = నిన్ను, కుతః = ఎక్కడనుండి (లేక ఏ కారణముచేత), సముపస్థితం = పొందినది?

**తా:-** శ్రీభగవానుడు చెప్పెను -- 'ఓ అర్జునా! పామరు లవలంబించునదియు, స్వర్గప్రతిబంధకమును, అపయశస్సును గలుగ జేయునదియునగు ఈ మోహము ఈ యొడుదుడుకు సమయమున నీకెక్కడనుండి దాపురించినది?'

**వ్యాఖ్య:-** ''కశ్మలమిదమ్'' - పిరికి తనము, శోకము, మనోవ్యాకులత్వము మొదలైన వానిని భగవానుడు కశ్మలము (మాలిన్యము) అని పేర్కొనిరి. శరీరమునకు ఏ ప్రకారము మాలిన్య మంటుకొనునో, మనస్సునకున్ను శోక, మోహ, రాగద్వేషాదిరూపమాలిన్యము అంటుకొనును. దేహముపైగల మురికిని సబ్బు, సున్నిపిండి మున్నగువానిచే కడిగివేయునట్లు మనోమాలిన్యమును పరమార్థ బోధచే నివారింపవలెను. అర్జునుని యీ కశ్మలము శ్రీకృష్ణమూర్తియొక్క దివ్యజ్ఞానోపదేశముచే తొలగింపబడనున్నది. అట్లే ప్రతివారున్ను వారి వారి చిత్తకుహరములను పరిశోధించుకొని అజ్ఞానమాలిన్యమును గీతాప్రబోధమను సమ్మార్జనిచే తుడిచివేయవలెను.

''అనార్యజుష్టమ్'' - ప్రపంచములో రెండు తెగలవారు మాత్రమే కలరు. ఆర్యులు, అనార్యులు అని. సన్మార్గము నవలంబించువారు, పవిత్రతను జేబట్టువారు, ప్రకాశమును వాంఛించువారు, ధైర్యము, ఉత్సాహము గలిగియుండువారు ఆర్యులు, దుర్మార్గము నవలంబించువారు, అపవిత్రతను, కశ్మలమును జేబట్టువారు, అంధకారమును వాంఛించువారు, అధైర్యము, నిరుత్సాహము, నిరంతరభీతి కలిగియుండువారు అనార్యులు. తాము ఆర్యుల తెగలో చేరి యున్నారా, లేక అనార్యుల తెగలో చేరియున్నారా యని ప్రతివారు తమ్ముతాము ప్రశ్నవేసికొని ఆర్యులుగ నుండుటకే యత్నించవలెను.

**ప్రశ్న:-** అధైర్యము, శోకము, భీతి మున్నగు అవగుణము లెట్టివి?

**ఉత్తరము:-** (1) అవి మనస్సునందలి మురికి (2) అనార్యులచే సేవింపదగినవి (3) స్వర్గాది ఉత్తమలోకములను కలుగజేయనివి (4) అపకీర్తిని కలుగజేయునవి.

## 3. క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే
## క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప.

**టీక:–** పార్థ = ఓ అర్జునా! క్లైబ్యం = అధైర్యమును, మాస్మగమః = పొందకుము, ఏతత్ = ఇది, త్వయి = నీయందు, న ఉపపద్యతే = తగదు, పరన్తప = శత్రువులను తపింపజేయు ఓ అర్జునా!, క్షుద్రం = నీచమైన, హృదయ దౌర్బల్యం = మనోదుర్బలత్వమును, త్యక్త్వా = విడిచి, ఉత్తిష్ఠ = (యుద్ధమునకు) లెమ్ము.

**తా:–** ఓ అర్జునా! అధైర్యమును పొందకుము. ఇది నీకు తగదు. నీచమగు ఈ మనోదుర్బలత్వమును వీడి యుద్ధముచేయుటకు లెమ్ము.

**వ్యాఖ్య:–** ''క్లైబ్యమ్'' – అనగా క్లీబత్వము, నపుంసకత్వము, పౌరుషము లేకుండుట, పిరికితనము, అధైర్యము. 'దీనిని పొందకుము' అని భగవాను డర్జునుని హెచ్చరించుచున్నాడు. అధైర్యము చాల నీచమగు స్వభావమగుటచే 'క్లైబ్యం' (నపుంసకత్వము) అని దానిని వర్ణించి, దాని నాశ్రయించినందులకు భగవాను డర్జునుని పరిహసించుచున్నాడు.

సుగుణములలో ధైర్యము, నిర్భయత్వము చాల ప్రధానములైనవి. అవి యుండినచో తక్కిన సుగుణములన్నియు వచ్చి చేరును. కనుకనే భగవానుడు గీత 16వ అధ్యాయ ప్రారంభములో నిరువదియాఱు సుగుణములను పేర్కొనుచు తొలదొల్తనే 'అభయం'★ అను సుగుణరాజమును వర్ణించి చెప్పెను.

**ఉత్సాహం సాహసం ధైర్యం బుద్ధిశ్శక్తిః పరాక్రమః, షడేతే యత్ర తిష్ఠన్తి తత్ర దేవోఽపి తిష్ఠతి.**

'ఉత్సాహము, సాహసము, ధైర్యము, సుద్బుద్ధి, శక్తి, పరాక్రమము అను నీయాఱు సుగుణములున్న ఎచట నుండునో, అచట సాక్షాత్ భగవానుడు కాపురముడున'ని పెద్దలు చెప్పుదురు. అట్లుకానిచో గీతలో ఓం ప్రథమముగ శ్రీకృష్ణమూర్తి ఈ ధైర్యమగు సుగుణము నేల ప్రతిపాదించవలెను? భగవానుడు నోరుతెఱచుట తోడనే మొట్టమొదట ఈ నిర్భయత్వమను మంత్రరాజము అతని ముఖారవిందము నుండి బయల్వెడలెను. గీతాచార్యులు అనేక తత్త్వములను చెప్పదలంచి తొలుదొల్తనే 'నిర్భయత్వము'ను బోధించుటచూడ, దీనిలో ఏదియో గొప్ప మహత్తు ఇమిడి యున్నదని బాగుగ నిశ్చితమగుచున్నది. అర్జునుని రోగము చాల తీవ్రమైనది. అదిచూచి శ్రీకృష్ణమూర్తి యను వైద్యుడు తన మందుల పెట్టెలోనున్న అనేక ఔషధములలో ఈ నిర్భయత్వరూప రామబాణదివ్యౌషధమును ఏరి ఏరి మొట్టమొదట దానినే ప్రయోగించిరి. అజ్ఞానజనిత మనోదౌర్బల్యమే అర్జునుని వ్యాధి. ఆత్మజ్ఞానజనిత ప్రచండధీరత్వమే శ్రీకృష్ణుని ఔషధము.

**''ఉత్తిష్ఠ'' – 'ఉత్తిష్ఠత! జాగ్రత! ప్రాప్యవరాన్నిబోధత' –**

'లెమ్ము, మేలుకొనుము, మహనీయులను సమీపించి విజ్ఞానమును బొందుము,' అని ఉపనిషత్తులు ఘోషించుచున్నవి. అట్లే భగవానుడు ''లెమ్ము! కార్యశూరుడవు కమ్ము! కర్తవ్యమును పాలింపుము'' అని అర్జునుని ఇచ్చట హెచ్చరించుచున్నారు.

''పరన్తప'' – ఓ అర్జునా! నీవిదివఱలో నెందఱో శత్రువులను తపింపజేసితివి. వారందఱు నీకు

★ అభయం సత్త్వసంశుద్ధిర్జ్ఞాన యోగవ్యవస్థితిః (16-1)

బహిఃశత్రువులు. ఇపుడు నీ యంతఃశత్రువులగు శోకమోహములను, అధైర్యమును, మనోదౌర్బల్యమునుగూడ జయించివేయుమ'ని 'పరన్తప' అను ఈ పదముచే సూచింపబడుచున్నది.

**అ॥** శ్రీకృష్ణుని యా బోధనవాక్యములను వినియు అర్జునుడు తన పాతధోరణినే ప్రదర్శించుచు పూజనీయులగు భీష్మద్రోణాదులతో తలపడుట పాపహేతువుగదా యని నుడువుచున్నాడు -

**అర్జున ఉవాచ :–**

## 4. కథం భీష్మమహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన
## ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హావరిసూదన.

**టీక:–** అర్జున ఉవాచ = అర్జునుడు అడిగెను, అరిసూదన = శత్రువులను నశింపజేయునట్టి, మధుసూదన = ఓ కృష్ణా! పూజార్హౌ = పూజింపదగినట్టి, భీష్మం = భీష్ముని, ద్రోణం చ = ద్రోణుని, సంఖ్యే = యుద్ధమునందు, అహం = నేను, ఇషుభిః = బాణములతో, కథం = ఎట్లు, ప్రతియోత్స్యామి = ఎదిరించి యుద్ధముచేయగలను?

**తా:–** అర్జునుడు అడిగెను - ఓ కృష్ణా! భీష్మద్రోణు లిరువురును పూజింపదగినవారు. అట్టివారిపై బాణములను వదలి నేనెట్లు యుద్ధము చేయగలను?

**వ్యాఖ్య:–** శత్రుపక్షమున చేరినప్పటికిని భీష్మద్రోణులందు అర్జునున కెంతటి గౌరవము, భక్తిభావము కలదో ఈ శ్లోకముచే వ్యక్తమగుచున్నది.

## 5. గురూనహత్వా హి మహానుభావాన్
## శ్రేయో భోక్తుం భైక్ష్యమపీహ[1] లోకే
## హత్వార్థకామాంస్తు గురూనిహైవ
## భుఞ్జీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్.

**టీక:–** మహానుభావాన్ = మహానుభావు లైన, గురూన్ = గురువులను, అహత్వా = చంపక, ఇహలోకే = ఈ లోకమునందు, భైక్ష్యమపి = భిక్షాన్నమైనను, భోక్తుం = భుజించుటకు, శ్రేయోహి = మంచిదికదా!, గురూన్ = గురువులను, హత్వాతు = చంపియో, ఇహైవ = ఈ లోకముననే, రుధిరప్రదిగ్ధాన్ = రక్తముచే పూయబడిన, అర్థకామాన్ = అర్థకామరూపము లగు (ధనసంపదలు, కామ్యవస్తువులు), భోగాన్ = భోగములను, భుఞ్జీయ = భుజించువాడ నగుదును.

**తా:–** మహానుభావులైన గురువులను చంపక ఈ లోకమునందు భిక్షాన్నమైనను భుజించుట మంచిది. వారిని చంపినచో అత్తఱి వారిరక్తముతో తడిసిన ధనసంపదలనే, (కామ్య భోగములనే) అనుభవింపవలసి యుండును.

1. భైక్షమపీహ - పాఠాన్తరము

**వ్యాఖ్య:–** ''గురూన్ మహానుభావాన్'', - ద్రోణాచార్య, కృపాచార్యులవంటి గురువులు; భీష్మ, బాహ్లిక, సోమదత్త, భూరిశ్రవ, శల్యాది మహనీయులు అని యర్థము.

**6. న చైతద్విద్మః కతరన్నో గరీయో**
**యద్వా జయేమ యది వా నో జయేయుః**
**యానేవ హత్వా న జిజీవిషామ**
**స్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః.**

**టీక:–** నః = మనకు, కతరత్ = ఏది, గరీయః = శ్రేష్ఠమో, ఏతత్ చ = దీనినికూడ, న విద్మః = ఎఱుగము, జయేమ యద్వా = (మనము) జయించెదమో, (లేక) నః = మనలను, జయేయుః యదివా = (వారే) జయించెదరో? యాన్ = ఎవరిని, హత్వా = చంపి, న జిజీవిషామః = జీవింప గోరమో, తే ధార్తరాష్ట్రా ఏవ = అట్టి ధృతరాష్ట్రుని సంబంధులగు భీష్మాదులే, ప్రముఖే = ఎదుట, అవస్థితాః = నిలిచియున్నారు.

**తా:–** పైగా ఈ యుద్ధమున మనము గెల్చుదుమో! లేక వారే గెల్చుదురో చెప్పలేము. ఈ రెండిటిలో మనకేది శ్రేష్ఠమోకూడ తెలియదు. ఎవరిని చంపి మనము జీవించగోరమో అట్టి భీష్మాదులు యుద్ధమున మనయెదుట నిలిచియున్నారు.

**అ॥** కర్తవ్య మెఱుంగజాలక అర్జునుడు శ్రీకృష్ణమూర్తికి శరణాగతుడగుచున్నాడు -

**7. కార్పణ్యదోషోపహతస్వభావః**
**పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః**
**యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే**
**శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్.**

**టీక:–** కార్పణ్యదోషోపహతస్వభావః = కృపణత్వమను దోషముచే కొట్టబడిన స్వభావము గల (నేను), ధర్మసమ్మూఢచేతాః = ధర్మవిషయమున సందేహముగల మనస్సుగలవాడనై, త్వాం = నిన్ను, పృచ్ఛామి = అడుగుచున్నాను, యత్ = ఏది, నిశ్చితం = నిశ్చయింపబడిన, శ్రేయః = శ్రేయము, స్యాత్ = అగునో, తత్ = దానిని, మే = నాకు, బ్రూహి = చెప్పుము, అహమ్ = నేను, తే = నీకు, శిష్యః = శిష్యుడను, త్వాం = నిన్ను, ప్రపన్నం = శరణుబొందిన, మాం = నన్ను, శాధి = శాసింపుము.

**తా:–** (ఓ కృష్ణా!) కృపణత్వము (ఆత్మజ్ఞానశూన్యత) అను దోషముచే కొట్టబడిన వాడనగుటచే ధర్మవిషయమున సందేహముగలిగి మిమ్మడుగుచున్నాను. ఏది నిశ్చయముగ శ్రేయస్కరమో దానిని చెప్పుడు - నేను మీకు శిష్యుడను; శరణుబొందిన నన్ను ('ఈ ప్రకారముగ నడుపుము' అని) శాసింపుడు.

**వ్యాఖ్య:–** ''కార్పణ్యదోషః'' - కృపణుని భావము కార్పణ్యము. కృపణుడనగా లోభి, దరిద్రుడు అని సామాన్యమగు అర్థము. ఆత్మజ్ఞానశూన్యుడని★ మఱియొక అర్థము. మొదటి అర్థము అర్జునునకు

★ యో వా ఏతదక్షరం గార్గ్యవిదిత్వాఽస్మాల్లోకాత్ప్రైతి స కృపణః (బృహ. ఉప. 3-8-10)

**40. కులక్షయే ప్రణశ్యన్తి కులధర్మాస్సనాతనాః**
**ధర్మే నష్టే కులం కృత్స్నమధర్మోఽభిభవత్యుత.**

**41. అధర్మాభిభవాత్కృష్ణ ప్రదుష్యన్తి కులస్త్రియః**
**స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః.**

**42. సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ**
**పతన్తి పితరో హ్యేషాం లుప్తపిణ్డోదక క్రియాః.**

**టీక:–** కులక్షయే = వంశమునశింప, సనాతనః = అనాదిగా (వంశపరంపరగా) వచ్చుచున్న, కులధర్మాః = కులధర్మములు, ప్రణశ్యన్తి = నశించుచున్నవి, ధర్మేనష్టే = ధర్మమునశింప, కృత్స్నమ్ = సమస్తమైన, కులమ్ = కులమును, అధర్మః = అధర్మము, అభిభవతి ఉత = వ్యాపించునుగదా! కృష్ణ = ఓ కృష్ణా!, అధర్మాభిభవాత్ = అధర్మము వృద్ధినొందుటవలన, కులస్త్రియః = కులస్త్రీలు, ప్రదుష్యన్తి = చాల చెడిపోవుదురు, వార్ష్ణేయ = వృష్ణివంశీయుడవగు ఓ కృష్ణా!, స్త్రీషు దుష్టాసు = స్త్రీలు చెడినచో, వర్ణసంకరః = వర్ణసంకరము, జాయతే = కలుగుచున్నది, సంకరః = (వర్ణ) సంకరము, కులఘ్నానాం = కులమును జెఱిచినవారికిని, కులస్యచ = కులమునకును, నరకాయైవ = నరకముకొఱకే (యగును), ఏషామ్ = వీరియొక్క, పితరః = పితృదేవతలు, లుప్తపిణ్డోదకక్రియాః = పిండోదక క్రియలు (శ్రాద్ధములు, తర్పణములు) లేనివారై, పతన్తి = అధోగతిని బొందుదురు.

**తా:–** ఓ కృష్ణా! కులము నశించుటచే అనాదిగవచ్చు కులధర్మములు అంతరించిపోవును. ధర్మము నశించుటచే కులమంతటను అధర్మము వ్యాపించును. అధర్మము వృద్ధినొందుటచే కులస్త్రీలు చాల చెడిపోవుదురు. స్త్రీలు చెడిపోవుటచే వర్ణసంకరమేర్పడును. అట్టి వర్ణసంకరమువలన సంకరముచేసినవారికి, సంకరమునొందిన కులమునకు గూడ నరకము సంప్రాప్తించును. వారి పితృదేవతలు శ్రాద్ధములు, తర్పణములు లేనివారై యధోగతిని బొందుదురు.

**43. దోషై రేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః**
**ఉత్సాద్యన్తే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః.**

**44. ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన**
**నరకే నియతంవాసో[1] భవతీత్యనుశుశ్రుమ.**

**టీక:–** కులఘ్నానామ్ = కులమును నాశనము చేయువారియొక్క, వర్ణసంకరకారకైః = జాతిని సంకరముచేయు, ఏతైః = ఈ, దోషైః = దోషములచేత, శాశ్వతాః = శాశ్వతములైన, జాతిధర్మాః = జాతిధర్మములు, కులధర్మాశ్చ = కులధర్మములున్ను, ఉత్సాద్యన్తే = నశింపజేయబడుచున్నవి. జనార్దన = ఓ కృష్ణా! ఉత్సన్నకులధర్మాణామ్ = నశించిన కుల ధర్మములుగల, మనుష్యాణామ్ = మనుజులకు, నరకే = నరకమునందు, నియతమ్ = ఎల్లప్పుడును, వాసః = నివాసము, భవతి = కలుగును, ఇతి = అని, అనుశుశ్రుమ = (పెద్దలవలన) వినియున్నాము.

1 అనియతం. (పాఠాన్తరము) – దీర్ఘకాలమని యర్థము.

**టీక:–** భూమౌ = భూమండలమునందు, అసపత్నం = శత్రువులు లేనట్టిదియు, ఋద్ధమ్ = సమృద్ధమైనట్టిదియునగు, రాజ్యమ్ = రాజ్యమును, (మఱియు) సురాణామ్ = దేవతలయొక్క, ఆధిపత్యంచ = ఆధిపత్యమున్ను, అవాప్య అపి = పొందియుగూడ, ఇన్ద్రియాణామ్ = ఇంద్రియములకు, ఉచ్ఛోషణం = మిగుల తాపమును గలుగజేయునట్టి, మమ = నా యొక్క, శోకం = దుఃఖమును, యత్ = ఏది, అపనుద్యాత్ = పోగొట్టునో, (తత్ = దానిని) నప్రపశ్యామిహి = కనుగొనజాల కున్నానుగదా!

**తా:–** ఈ భూమండలమున శత్రువులులేని సమృద్ధమైన రాజ్యమును, (స్వర్గమున) దేవతలయొక్క ఆధిపత్యమును పొందియుగూడ, ఇంద్రియములను శోషింపజేయుచున్న ఈ నా దుఃఖము నేది పోగొట్టగలదో దానిని కనుగొనజాలకున్నాను.

బాహ్యప్రపంచమున ఎన్నిసంపదలను, అధికారములను పదవులను పొందినప్పటికిని అవి మనుజుని మానసిక అశాంతిని తొలగింపజాలవు. మనోవ్యాధిని అవి కుదర్పజాలవు. కనుకనే భూలోక, స్వర్గలోకాధిపత్యములు రెండును జేరియు తన మనోదుఃఖమును నివారింపజాలకున్ననని అర్జునుడు పేర్కొనెను. మనోవ్యాధికి ఆత్మజ్ఞానమొకటియే పరమౌషధము. దానినే అర్జునునకు భగవానుడు ప్రసాదించబోవుచున్నాడు. కాబట్టి ప్రపంచములో ప్రతివారున్ను సంపాదించవలసినది బాహ్యప్రపంచసౌఖ్యములు, పదవులు, భోగములు కాదనియు ఆత్మవిజ్ఞానమే యనియు స్పష్టమగుచున్నది.

**అ॥** ఈ ప్రకారముగ పలికి తదుపరి అర్జును డేమిచేసెనో సంజయుడు చెప్పుచున్నాడు –

**సంజయ ఉవాచ :–**

## 9. ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః పరన్తపః
## న యోత్స్య ఇతి గోవిన్ద ముక్త్వా తూష్ణీం బభూవ హ.

**సంజయ ఉవాచ = సంజయుడు చెప్పెను.**

**టీక:–** పరన్తపః = శత్రువులను తపింపజేయునట్టి, గుడాకేశః = అర్జునుడు, హృషీకేశమ్ = శ్రీకృష్ణునితో, ఏవం = ఈ ప్రకారముగ, ఉక్త్వా = చెప్పి, నయోత్స్యే = యుద్ధము చేయను, ఇతి = అని, గోవిన్దమ్ = (ఆ) కృష్ణపరమాత్మతో, ఉక్త్వా = పలికి, తూష్ణీంబభూవహ = ఊరకుండెను.

**తా:–** సంజయుడు చెప్పెను – ఇవ్విధముగ అర్జునుడు శ్రీకృష్ణునితో చెప్పి 'నేను యుద్ధము చేయన'ని పలికి ఊరకుండెను.

**అ॥** అత్తఱి శ్రీకృష్ణు డేమి చేసెనో సంజయుడు వచించుచున్నాడు –

## 10. తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత
## సేనయోరుభయోర్మధ్యే విషీదన్తమిదం వచః.

**టీక:–** భారత = ఓ ధృతరాష్ట్రమహారాజా! ఉభయోః సేనయోః = రెండుసేనలయొక్క, మధ్యే =

నడుమ, విషీదన్తమ్ = దుఃఖించుచున్న, తం = ఆ అర్జునునిగూర్చి, హృషీకేశః = శ్రీకృష్ణుడు, ప్రహసన్నివ = నవ్వుచున్నవానివలె, ఇదం వచః = ఈ (చెప్పబోవు) వాక్యమును, ఉవాచ = పలికెను.

**తా:—** ఓ ధృతరాష్ట్రమహారాజా! రెండుసేనల మధ్య విలపించుచున్న ఆ యర్జునునిజూచి శ్రీకృష్ణుడు నవ్వుచున్నవానివలె ఈ (క్రింది) వాక్యములను బలికిరి.

**వ్యాఖ్య:—** ''ప్రహసన్నివ'' - హసన్ = నవ్వుచు, ప్రహసన్ = బాగుగనవ్వుచు; అజ్ఞానస్థితియందున్న వారిని జూచియు, వారి చేష్టలను పరికించియు, జ్ఞానులకు నవ్వు వచ్చుచుండును. అర్జునునకు ధర్మసూక్ష్మము తెలియనందువలన పరిస్థితి అయోమయముగ నున్నదై శోకమును గలిగించెను. ధర్మరహస్య మెఱిగిన శ్రీకృష్ణునకు అదియొక నవ్వులాటగ నుండెను. మాయను దాటనివారు మాయాజన్యములగు దేహేంద్రియమనంబులతోను, తదితర ప్రాపంచిక పదార్థములతోను తాదాత్మ్యమొంది, వాని గుణములను తమయందే ఆరోపించుకొని దుఃఖించుచున్నారు. వివేకవంతులగు జ్ఞానులో ఆ మాయను జయించి తదధీనములగు ఇంద్రియాదులకు లోబడక, వాని గుణములను తమయందారోపించుకొనక సాక్షిగా జూచుచుందురు. అట్టివారికి మాయాపరతంత్రుల చేష్టలు నవ్వుపుట్టించుచుండును. త్రాడు అని తెలిసినవాడు దానిని పామనుకొని ఏడ్చువానిని జూచి నవ్వడా? పరిహసింపడా? చంటిపిల్లవాని వికృతచేష్టలను తండ్రి చూచి నవ్వునట్లు అజ్ఞానుల చర్యలు జ్ఞానులకు హాస్యాస్పదములుగ నుండును. అజ్ఞానికి 'గోష్పదం సాగరాయతే' అనునట్లు ఈగోష్పదజలమంత సంసారము మహాసాగరముగ తోచును; జ్ఞానికి 'సాగరో గోష్పదాయతే' అనునట్లు సంసారమహాసాగరము రవ్వంత జలముగ తోచును. కావుననే ఇచట మోహగ్రస్తుడగు అర్జునుని వింతచర్యలన్నియు పరమజ్ఞానియగు శ్రీకృష్ణునకు హాస్యజనకములుగ గన్పట్టెను. ఒకని ముఖమునందు విషాదచ్ఛాయ ('విషీదన్తం') మఱియొకని ముఖమునందు ఆనందచ్ఛాయ ('ప్రహసన్') ఇదియే అజ్ఞానికి, జ్ఞానికిగల భేదము.

**అ॥** ఇక శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు గావించిన దివ్యప్రబోధమును సంజయుడు వివరించుచున్నాడు ప్రప్రథమమున ఎవరినిగూర్చియు శోకింపదగదని భగవానుడు వచించుచున్నాడు -

**శ్రీ భగవానువాచ :**

**11. అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే
గతాసూనగతాసూంశ్చ నానుశోచన్తి పణ్డితాః.**

**శ్రీభగవానువాచ = శ్రీభగవంతుడు (శ్రీకృష్ణపరమాత్మ) చెప్పెను -**

**టీక:—** త్వమ్ = అశోచ్యాన్ = శోకింపదగని వారినిగూర్చి, అన్వశోచః = శోకించితివి, ప్రజ్ఞావాదాంశ్చ = బుద్ధివాదముతోగూడిన మాటలనుగూడ, భాషసే = పలుకుచున్నావు, పణ్డితాః = ఆత్మజ్ఞానముకలవారు, గతాసూన్ = మరణించినవారినిగుఱించియు, అగతాసూన్ = బ్రతికియున్నవారిని గుఱించియు, న అనుశోచన్తి = దుఃఖింపరు.

**తా:—** శ్రీకృష్ణభగవానుడు చెప్పెను - (ఓ అర్జునా!) నీవు శోకింపదగనివారిని గూర్చి శోకించితివి. పైగా

బుద్ధివాదముతో గూడిన వాక్యములనుగూడ పలుకుచున్నావు. జ్ఞానులగు వారు మరణించినవారిని గుఱించిగాని, జీవించియున్నవారిని గుఱించిగాని యెన్నటికిని దుఃఖింపరు.

**వ్యాఖ్య:–** గీతాబోధ ఈ శ్లోకమునుండి ప్రారంభమగుచున్నది. కనుకనే గీతాశాస్త్రమున కీశ్లోకము బీజమని చెప్పబడినది★ వృక్షమంతయు బీజమునం దిమిడియున్నట్లు, గీతాతత్త్వమంతయు ఈ శ్లోకమునం దిమిడియున్నది.

గీతాప్రబోధము 'అశోచ్యాన్' అను పదముతో ప్రారంభమై చివఱి అధ్యాయములోని 'మాశుచః' అను పదముతో నంతమైనది. కనుక శోకరాహిత్యమే గీతయొక్క పరమలక్ష్యమని స్ఫురించుచున్నది.

''అశోచ్యాన్'' - ప్రపంచములోని ప్రతిపదార్థమున్ను అస్తి, భాతి, ప్రియ, నామ, రూపములను ఐదింటితో నేర్పడుచున్నది. అందు మొదటి మూడున్ను (సత్, చిత్, ఆనందము) సత్యములు. తక్కిన నామరూపములు రెండును కల్పితములు. మొదటి మూడుమాత్రమే జీవుని వాస్తవస్వరూపము; నామరూపములు కాదు. సత్యమగు తన స్వరూపము ఏకాలమందును నశింపదు. కావున దానికొఱకై శోకింపపనిలేదు. అసత్యమగు నామరూపములు మార్పుపొందినను, నశించినను అవి తన స్వరూపముకాదు గనుక వానికై శోకించుటయు నిష్ప్రయోజనము. కాబట్టి ఇక శోకించుట దేనికొఱకు? అని భగవానుడు ప్రశ్నించుచున్నారు.

''ప్రజ్ఞావాదాంశ్చ'' - బుద్ధివాదముతో గూడిన పలుకులు - బుద్ధి కొంత దూరము మాత్రమే పోగలదు. ఆ పైన పోలేదు. బుద్ధికి అతీతముగనున్న వస్తువు ఆత్మ. (ఏవంబుద్ధేః పరంబుద్ధ్వా ....) బుద్ధి (Conscious state) ప్రకృతియం దంతర్గతము, కనుక బుద్ధివాదమునందు కొన్ని లోపములుండుటకు ఆస్కారము కలదు. బుద్ధిని దాటి ఆత్మను (Super-conscious state) స్పృశించినవానికి అట్లుండదు. ఆతడు పరమార్థ తత్త్వమును, యాథార్థ్యమును వచింపగలడు. అర్జును డింకను అట్టిస్థితికి రాలేదు. కనుక బుద్ధియను తన కొలతబద్దతో కొలిచి తనకు తోచిన విధముగ పలికెను. ''ఇవన్నియు ప్రజ్ఞావాదములోయి!'' అని ఒక్కమాటతో వాని నన్నింటిని భగవానుడు కొట్టిపారవేసిరి.

''నానుశోచన్తి పణ్డితాః'' - సామాన్యముగ పండితులనగా కావ్యనాటకాలంకారము లందును, కవిత్వాదులందును ప్రకర్షత్వము కలవారని లోకములో వాడుక. కాని యథార్థముగ పండితుడనగా ఎవరికొఱకును, దేనికొఱకును దుఃఖింపనివాడని భగవానుడిచ్చోట పేర్కొనిరి.[1] ఇంతియేకాదు, జ్ఞానాగ్నిచే సమస్తకర్మలను భస్మీభూతమొనర్చుకొనువాడే పండితుడ[2]ని 4వ అధ్యాయమునను, సర్వజీవులందును సమభావము కలవాడే పండితుడ[3]ని 5వ అధ్యాయమునను చెప్పబోవుదురు. ఇట్టి సుగుణములు కలవానికే భగవానుడు పండితుడను బిరుదు నొసంగుదురు. కావున జనులు విద్యావైదుష్యముతోబాటు ఆత్మజ్ఞానమున్ను గలిగి భగవదుక్తమగు పాండిత్యమును సంపాదించి సర్వేశ్వరునకు ప్రీతిపాత్రులు కావలసియున్నారు.

---

★ ''అస్య శ్రీభగవద్గీతాశాస్త్రమహామంత్రస్య ...... అశోచ్యానన్వశోచస్త్వమితి బీజం ....''

1. గతాసూనగతాసూంశ్చ నానుశోచన్తి పణ్డితాః (2-11)
2. జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పణ్డితం బుధాః (4-19)
3. శుని చైవ శ్వపాకే చ పణ్డితాస్సమదర్శినః (5-18)

ప్రశ్న:- పండితులనగా నెవరు?

ఉ:- జీవించియున్నవారినిగూర్చిగాని, మరణించినవారినిగూర్చిగాని, లేక మఱే వస్తువును గూర్చిగాని దుఃఖింపనివారే పండితులు.

**అ॥** బంధ్వాదులనుగూర్చి యెందులకు శోకింపరాదో కారణమును దెల్పుచు ఆత్మయొక్క శాశ్వతత్వమును ప్రతిపాదించుచున్నారు -

## 12. న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః
## న చైవ న భవిష్యామస్సర్వే వయమతః పరమ్.

**టీక:–** అహమ్ = నేను, జాతు = ఒకప్పుడును, నాసం = (ఇతి) లేననునది, నతుఏవ = లేనే లేదు, త్వమ్ = నీవు (న ఆసీః ఇతి), న = లేవనునది లేదు, ఇమే = ఈ, జనాధిపాః = రాజులు, *(న ఆసన్ ఇతి)* న = లేరనునది లేదు, అతః పరమ్ = ఇకమీదట, వయంసర్వే = మనమందఱమును, న భవిష్యామః *(ఇతి)* చ = లేకపోవుదుమనునదియు, న ఏవ = లేదు.

**తా:–** అర్జునా! నేనుగాని, నీవుగాని (యుద్ధభూమియందుగల) రాజులుగాని, ఒకప్పుడును లేనివారము కాము. ముందున్ను లేకపోవువారముకాము.

**వ్యాఖ్య:–** ఈ శ్లోకముద్వారా భగవానుడు 'తత్త్వమసి' మహావాక్యోపదేశమును చేయుచున్నారు. 'నేను, నీవు, సమస్తజీవులు' అందఱును శాశ్వత ఆత్మస్వరూపులేయని ఘోషించుచున్నారు. జీవుని, శివుని ఒకేవేదికపై సమానస్థాయిలో నిచట భగవానుడు నెలకొల్పిరి. ఇది పరమరహస్యమగు అధ్యాత్మతత్త్వము. బ్రహ్మజ్ఞాన సారాంశమిదియే. అర్జునుడు త్రైలోక్యమునుగూడ తృణీకరించునంతటి తీవ్రవైరాగ్యప్రపూరితు డగుటచే, బ్రహ్మజ్ఞానమునకు అధికారియని నిర్ణయించి భగవానుడు మహోన్నతములగు పరమార్థసత్యముల నాతని కివ్విధముగ బోధింప నుపక్రమించుచున్నారు.

'నీవు, నేను, ఈ రాజులు అందఱము నిత్యులము' అని చెప్పుటవలన ఈ క్రింది సత్యములు బోధపడుచున్నవి -

(1) ఆత్మ నిత్యము

(2) తాను ఆత్మయేకాని దేహము కాదు.

(3) అందఱిజీవులందును ఒకే ఆత్మ వ్యాపించియున్నది.

ఇట్టిబోధచే జీవునకు అపరిమితధైర్యము, ఆనందము కలుగగలదు. ఏలననిన, తాను ఎన్నటికిని నశించుటలేదని తెలిసినప్పుడు ఇక తనయొక్కగాని, ఇతరులయొక్కగాని మరణమునుగూర్చిన దుఃఖమునకు అవకాశములేదు. శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు ధైర్యమును పురికొల్పుటకై ఉపాయ మాలోచించి, ఇట్టి నిజాత్మబోధచేదప్ప ఇతరమగు దేనిచేతను అది సిద్ధింపదని నిశ్చయించి మొట్టమొదటనే గంభీరమగు ఆత్మవిద్య నుపదేశించుచున్నారు.

''సర్వే వయమతఃపరమ్'' - (మనమందఱమును) అని చెప్పినందువల్ల ఆత్మదృష్టి యందు

భగవంతునకు, భక్తునకు, గురువునకు, శిష్యునకు భేదమేలేదనియు, అందఱును ఒకే సద్వస్తువనియు స్పష్టమగుచున్నది. కనుకనే అంజనేయులు శ్రీరామచంద్రునితో 'ఆత్మబుద్ధ్యా త్వమేవాహం' (ఆత్మదృష్టియందు నీవు నేను ఒకటే) అని వచించెను. ఉపాధివలననే జీవత్వమేర్పడినది. ఉపాధిభావము వీడినపుడు జీవుడు శివుడు కాగలడు (శివోఽహం). కాబట్టి ఇక దేహాదులు నశించినను దుఃఖింప నవసరములేదు (తాను శాశ్వతమగు ఆత్మకనుక). మఱియు ఎవరును తానల్పుడనని దిగులుపడనక్కఱలేదు (తాను వాస్తవముగ సాక్షాత్ పరమాత్మ స్వరూపుడే కనుక). ఈ ప్రకారముగ శ్రీకృష్ణపరమాత్మ ఒక చిన్న ధర్మసూక్ష్మముచే విషణ్ణచిత్తుడగు అర్జునునియందు గొప్ప ధైర్యసంచారమును గావించిరి.

ప్ర:- జీవు డెవడు?

ఉ:- ఆత్మయే కాని దేహము కాదు.

ప్ర:- ఆత్మ యెట్టిది?

ఉ:- పూర్వముండియున్నది, ఇపుడును గలదు, ముందును ఉండబోవును. దానికి వినాశము లేదు. అది శాశ్వతమైనది.

ప్ర:- ఈ సత్యము కొందఱికి మాత్రమే అన్వయించునా?

ఉ:- కాదు. పిపీలికాది బ్రహ్మపర్యంతము సర్వులకును వర్తించును. అందఱును జననమరణరహిత శాశ్వత ఆత్మస్వరూపులే అయియున్నారు.

**అ॥** దేహవియోగానంతరమున్ను ఆత్మయుండియేయుండునని తెలుపుచున్నాడు -

## 13. దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా
## తథా దేహాన్తరప్రాప్తిర్ధీర స్తత్ర న ముహ్యతి.

**టీక:-** దేహినః = జీవునకు, అస్మిన్దేహే = ఈ శరీరమునందు, కౌమారమ్ = బాల్యము, యౌవనమ్ = యౌవనము, జరా = వార్ధక్యము, యథా = ఎట్లుకలుగునో, తథా = అట్లే, దేహాన్తర ప్రాప్తిః = మఱియొక శరీరమును బొందుటయు (కలుగుచున్నది), తత్ర = ఆ విషయమున, ధీరః = జ్ఞాని, నముహ్యతి = మోహమునొందడు (శోకింపడు).

**తా:-** జీవునకీ శరీరమునందు బాల్య, యౌవన, వార్ధక్యములను అవస్థ లెట్లు కలుగుచున్నవో అట్లే మరణానంతరము మఱియొక శరీరమును బొందుటయు తటస్థించుచున్నది. కావున నివ్విషయమున జ్ఞానియగువా డెంతమాత్రమును మోహమును (శోకమును) జెందడు.

**వ్యాఖ్య:-** (1) బాల్యము (2) యౌవనము (3) వార్ధక్యము (4) దేహాంతరప్రాప్తి - అను నాలుగవస్థలు జీవునకు కలుగుచుండునని భగవానుడు తెలుపుచున్నారు.

'దేహే' అని చెప్పబడినందువలన ఈ మార్పులు దేహమునకేగాని ఆత్మకుగావని స్పష్టమగుచున్నది. బాల్యముపోయి యౌవనము వచ్చునపుడు ఎవడును దుఃఖించుటలేదు. యౌవనముపోయి వార్ధక్యము వచ్చునపుడు దుఃఖించుటలేదు. అట్టిచో వార్ధక్యము పోయి మరణము, దేహాంతరప్రాప్తి గలిగినపు డేల

దుఃఖించవలెనని భగవానుని ప్రశ్న. ఈ రహస్యమెఱిగి మహనీయులు వానినిగూర్చి పట్టించుకొనక అవి సంభవించినపుడు మేరువువలె ధీరులై గంభీరముగ వర్తించుదురు. పైన దెలిపిన బాల్యాదులను నాలుగవస్థలలో మొదటి మూడును కలవని జనులకు తెలియునుగాని నాల్గవది (దేహాంతరప్రాప్తి) ఉన్నదని తెలియదు. కాని భగవాను డిచట నాల్గవదియగు దేహాంతరప్రాప్తియను అవస్థయు కలదనియు, మొదటి మూడును ఎట్లు సత్యములో అదియు నట్లే సత్యమనియు, కావున దానినిగుఱించి దిగులునొందక ధీరులవలె ప్రవర్తించవలెననియు నుద్బోధించుచున్నారు. అయితే (కర్మరాహిత్యము నొందుటవలన) జ్ఞానికిమాత్ర మీదేహాంతర ప్రాప్తియుండనేరదు. సామాన్యునకు మాత్రమే అది యుండునని గ్రహించవలెను -

**దేహచక్రము (Cycle of the body)**




కర్మదోషమున్నంతవఱకును ఉపాధికి ఈ నాలుగవస్థలున్ను చక్రభ్రమణమువలె సంభవించుచుండును. జ్ఞానముచే కర్మసంచితము భస్మమగునపుడుమాత్రము దేహమున్ను, తత్సంబంధములగు ఈబాల్యాద్యవస్థలున్ను లేకుండును. అదియే మోక్షస్థితి.

ప్ర:- జీవికి ఎన్ని అవస్థలు? అవియేవి?

ఉ:- జీవికి నాలుగవస్థలు. అవి క్రమముగ బాల్య, యౌవన, వార్ధక్య, దేహాంతర ప్రాప్తులు.

ప్ర:- ధీరుడెవడు?

ఉ:- బాల్య, యౌవనాదులందువలె మరణ, దేహాంతరప్రాప్తులు సంభవించినపుడును ఏ మాత్రము దుఃఖింపనివాడు.

**అ॥** ఆ బంధుమిత్రాదులవలన గలుగు సుఖదుఃఖాది ద్వంద్వములు అనిత్యములనియు, వానిని లక్ష్యపెట్టవలదనియు చెప్పుచున్నాడు -

**14. మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ శీతోష్ణసుఖదుఃఖదాః**
**ఆగమాపాయినోఽనిత్యాస్తాం స్తితిక్షస్వ భారత.**

**టీక:–** కౌన్తేయ = ఓ అర్జునా! మాత్రాస్పర్శాస్తు = ఇంద్రియములయొక్క శబ్దాది విషయ సంయోగములన్ననో, శీతోష్ణ సుఖదుఃఖదాః = శీతము, ఉష్ణము, సుఖము, దుఃఖము – వీనినిచ్చునవియు ఆగమాపాయినః = రాకడపోకడలు గలవియు, అనిత్యాః = అస్థిరములును (అయియున్నవి), తాన్ = వానిని, భారత = భరతకులమందు బుట్టిన ఓ యర్జునా! తితిక్షస్వ = ఓర్చుకొనుము.

**తా:–** ఓ అర్జునా! ఇంద్రియములయొక్క శబ్దస్పర్శాది విషయసంయోగములు ఒకపుడు శీతమును, ఒకపుడు ఉష్ణమును, ఒకపుడు సుఖమును మఱియొకపుడు దుఃఖమును గులుగజేయుచుండును. మఱియు నవి రాకడపోకడలు గలవియై, అస్థిరములై యున్నవి. కాబట్టి వానిని ఓర్చుకొనుము.

**వ్యాఖ్య:–** జగత్తు మిథ్యయను జ్ఞానము లేనివారు బాహ్యపదార్థముల సంయోగముచే ఇంద్రియములకు గలుగు శీతోష్ణ, సుఖదుఃఖాది వికారములను సత్యము లనుకొని తమ యందు వాని నధ్యారోపించుకొని బాధనొందుచున్నారు. కాని ఈ వికారములన్నియు ప్రకృతిసంబంధములే యనియు, ఆత్మ అకర్తయు, నిర్లేపుడునని యెఱుంగువానికి అట్టిబాధ యుండదు. కావున సమబుద్ధిచే వీనిని సహించుకొనవలయునని భగవానుడర్జునునకు బోధించుచున్నారు.

''సుఖదుఃఖదాః'' – శబ్దాది విషయములవలన కలుగు సుఖము కేవలసుఖము కాదు. దుఃఖమిశ్రితసుఖము. ఏలయనిన కేవల సుఖమైనచో మరల దుఃఖము కలుగగూడదు. కాని అట్లు లేదు. ఒకింత సుఖమునవి కలుగజేసినను వెనువెంటనే అపరిమితదుఃఖము కాచుకొనియేయుండును. కనుకనే వానిని 'సుఖదాః' అని చెప్పక 'సుఖదుఃఖదాః' అని భగవానుడు వర్ణించిరి.

''ఆగమాపాయినః'' – రాకడపోకడలు కలవి. ప్రాపంచిక సుఖములు తటస్థించినపుడు ఎవరును మురిసిపోరాదు. ఏలయనిన అవి రాకడమాత్రమే కలిగియున్నవి కావు. పోకడ యున్ను కలిగియున్నవి. చుట్టములవలె వచ్చును. మరల పోవును. అవి అనిత్యములు. కావున వానియెడల ప్రీతి, మమకారము, ఆసక్తి కలిగియుండగూడదు. అట్టివాడే ధీరుడని మున్ముందు చెప్పబోవుదురు. ఆ తళుకుబెళుకు సుఖములపై ఆశ గలిగి వానివెంట పరుగిడువాడు దుఃఖమునే ఆహ్వానించువాడై సంసారగర్తమున పడిపోవును. కావున అట్టి క్షణికసుఖములకై ప్రాకులాడక శాశ్వతాత్మసుఖమునకై యత్నించవలెను.

''తాం స్తితిక్షస్వ'' తితిక్ష అనగా ఓర్పు. శీతోష్ణాదులు సంభవించునపుడు సమభావముగల్గి వానిని ఓర్చుకొనవలెను. 'తితిక్ష' అనునది శమదమాదిసద్గుణములలో నొకటి.

ప్ర:– శబ్దస్పర్శాదివిషయములయొక్క స్వభావ మెట్టిది?

ఉ:– అవి (1) శీతోష్ణ, సుఖదుఃఖదాయకములు (2) రాకడపోకడలు కలవి (3) అనిత్యములు

ప్ర:– ఆ శీతోష్ణాదులు తటస్థించినపు డేమిచేయవలెను?

ఉ:– సమదృష్టితో వానిని సహించుకొని, ధైర్యముగ నుండవలెను.

**అ||** అట్లు విషయజనిత సుఖదుఃఖాదులందు సమదృష్టి గలిగియుండువాని కెట్టి ఫలితము చేకూరునో వచించుచున్నాడు –

**15. యం హి న వ్యథయన్త్యేతే పురుషం పురుషర్షభ**
**సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే.**

**టీక:–** పురుషర్షభ= పురుషశ్రేష్ఠుడవగు ఓ అర్జునా! ఏతే= శబ్దస్పర్శాదివిషయములు, సమదుఃఖసుఖమ్ = సుఖదుఃఖములను సమముగ జూచునట్టి, ధీరమ్ = ధైర్యశాలియగు, యం పురుషమ్ = ఏ మనుజుని, న వ్యథయన్తి = బాధింపవో (చలింపజేయవో), సః హి = అతడు గదా, అమృతత్వాయ = మోక్షముకొఱకు, కల్పతే = తగియున్నాడు.

**తా:–** పురుషశ్రేష్ఠుడవగు ఓ అర్జునా! ఎవనిని ఈ శబ్దస్పర్శాదులు బాధింపవో (చలింపజేయవో), సుఖదుఃఖములందు సమభావముగల అట్టి ధీరుడే మోక్షమున కర్హుడగును.

**వ్యాఖ్య:–** ''పురుషర్షభ'' – (పురుష శ్రేష్ఠా). ''ఇంద్రియములను జయించి, విషయాదులచే చలింపక, సుఖదుఃఖాదులందు సమభావముగల్గి (లౌకిక శ్రేష్ఠత్వముతోబాటు) పారమార్థిక శ్రేష్ఠత్వమునుగూడ సంపాదింపుము ఓ అర్జునా!'' అని హెచ్చరించుటకు కాబోలు పురుషర్షభ అను సంబోధన వాడబడినది.

''సమదుఃఖసుఖం ధీరమ్'' – సుఖదుఃఖములందు సమానత్వము గలిగి యుండుటయే ధీరత్వము. ఆత్మయందు స్థితుడై సుఖదుఃఖముల రెండిటిని మనోవికారములుగ వీక్షించువాడే అట్టి ధీరుడు. దుఃఖమెట్లు ఒకానొక మనోవికారమో, సుఖమున్ను అట్టిదియే. కావున మనస్సునకు సాక్షియగు ఆత్మయందు నిలుకడగలిగియుండు ధీరులగు మహనీయులు, ఆరెండిటిని సమముగనే వీక్షింతురు (జనకుని యాస్థానమున శుకునివలె)

''సోఽమృతత్వాయ కల్పతే'' – మోక్షమునకు అమృతత్వమని పేరు కలదు. ఈనామరూపదృశ్య ప్రపంచమంతయు మృతస్వరూపము; జననమరణములతోను, వినాశముతోను గూడినది. ఆత్మస్థితిరూపమోక్షము మరణరహితమైనది. కావున మోక్షమనగా ఆకాశమందో, స్వర్గమందో కల ఒకానొక వస్తువుకాదు. అమృతత్వపదవియే మోక్షము. మృత్యురహితమగు ఆత్మస్థితియే మోక్షము. అద్దానిని పొందినవాడు మరల మృత్యువాతబడడు. మరల జన్మింపడు. (యద్గత్వా ననివర్తన్తే తద్ధామ పరమం మమ).

మోక్షార్హతకై భగవాను డిచట ఒకానొక జాతినిగాని, మతమునుగాని, కులమునుగాని పేర్కొనలేదు. ఎవరు ఇంద్రియనిగ్రహము, విషయరాహిత్యము, సుఖదుఃఖసమభావము గలిగియుందురో అట్టి ధీరులేమోక్షమునకు అర్హులని వచించిరి. ఆహా! గీతలో ఎట్టి ఉదాత్తభావములు ప్రకటింపబడినవో చూడుడు!

ప్ర:– మోక్షమనగా నేమి?

ఉ:– మరణరహితమగు శాశ్వత ఆనందపదవియే మోక్షము.

ప్ర:– దానినెవరు పొందగలరు?

ఉ:– శబ్దస్పర్శాదివిషయములచే చలింపనివారు, సుఖదుఃఖములందు సమభావము గలిగి యున్నవారు నగు ధీరులే మోక్షము నొందగలరు.

ప్ర:– ధీరులనగా నెవరు?

ఉ:– శబ్దాది విషయములను జయించినవారు, సుఖదుఃఖాదులందు సమభావము కలవారు ధీరులనబడుదురు.

**అ॥** ఏది సద్వస్తువో, ఏది అసద్వస్తువో విశదీకరించుచున్నాడు –

**16. నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః**
**ఉభయోరపి దృష్టో௨న్తస్త్వనయో స్తత్త్వదర్శిభిః.**

**టీక:–** అసతః = లేనిదానికి, భావః = ఉనికి, నవిద్యతే = లేదు, సతః = ఉన్నదానికి, అభావః = లేమి, నవిద్యతే = లేదు, అనయో = ఈ, ఉభయోరపి = రెండింటియొక్క, అన్తఃతు = నిశ్చయమన్ననో, తత్త్వదర్శిభిః = జ్ఞానులచేత, దృష్టః = చూడబడినది.

**తా:–** అసత్యములై (నామరూపాత్మకములై, నశించు స్వభావముగలవియై) నట్టి దేహాదులకు ఉనికిలేదు, సత్యమైనట్టి ఆత్మకు లేమిలేదు. తత్త్వజ్ఞానులగువారీ రెండింటి యొక్క నిశ్చయమును బాగుగ తెలిసికొనియున్నారు.

**వ్యాఖ్య:–** ''తత్త్వదర్శిభిః'' – 'దర్శిభిః' అని చెప్పుట వలన తత్త్వమును ప్రత్యక్షముగ చూచినవారని అర్థము. కేవలము నోటితో పలుకువారుకాదు (''తత్త్వవాదిభిః'' కాదు). సత్యమును కరతలామలకముగ గాంచినవారని అర్థము. అట్టి జ్ఞానులకు నిత్యానిత్యవస్తుపరిజ్ఞానము లెస్సగ యుండును. అనగా ఏదికలదో, ఏదిలేదో వారికి బాగుగ తెలియును. ఈ దేహాదిదృశ్యజాతమంతయు నశించునదికావున పరమార్థముగ లేనిది. అట్టి లేనిదానికి ఉనికి ఏకాలమందును ఉండనేరదు. ఒకవేళ కనుపించినను అది ఎండమావులవలె ఆభాసమేయగును. ఆత్మయో, సత్యమగు వస్తువు. దానికి లేమి ఏకాలమందును ఉండనేరదు. ఈ యథార్థస్థితిని జ్ఞానులుమాత్ర మెఱుగగలరు. తదితరులు ఈ సత్యమును తెలిసికొనలేక, లేనిదానికి ఉనికి కల్పించియు, ఉన్నదానికి లేమి కలించియు నానాబాధల నొందుచున్నారు.

(1) ఉన్నభగవంతుడు (ఆత్మ) లేడనుట ఒక దోషము.

(2) లేని జగత్తు ఉన్నదనుట మఱియొక దోషము.

మొదటి దానిని అసంభావన యనియు, రెండవ దానిని విపరీతభావన యనియు నందురు. అసంభావనచే సత్యవస్తువు వారికి దూరమైపోవుటచే నిత్యానందము వారినుండి పలాయనమై పోవుచున్నది. విపరీతభావనచే అసత్యవస్తువు దరికిజేరుటచే దుఃఖము చెంతకు వచ్చుచున్నది.

అట్టిదుఃఖము అంతము కావలెననిన ఉన్నదానిని ఉన్నట్లుగను, లేనిదానిని లేనట్లుగను చూచిన చాలును. ఇదియే శాంతికి మార్గము. దుఖరాహిత్యమునకు బాట. తత్త్వజ్ఞులీకీలకమును గ్రహించి తమ తమ జీవితములను కృతార్థమొనర్చుకొనిరి. అజ్ఞానులిద్దానిని తెలిసికొనలేక సంసారచక్రమున తగుల్కొని దుఃఖముల నొందుచున్నారు.

ఈ శ్లోకమునందు ''బ్రహ్మసత్యం, జగన్మిథ్య'' యను పరమసత్యము ఉద్ఘాటింపబడినది.

ప్ర:– తత్త్వజ్ఞాను లెట్టి యనుభవము గలిగియుందురు?

ఉ:– నామరూపాత్మకమగు దృశ్యప్రపంచమును లేనిదానినిగను, సచ్చిదానందపరమాత్మను కలదానినిగను వారు చూచుచుందురు.

**అ॥** పైన దెల్పిన సత్, అసత్తుల రెండిటిలో సద్వస్తువునుగూర్చి చెప్పుచున్నాడు –

## 17. అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్
## వినాశమవ్యయస్యాస్య న కశ్చిత్కర్తుమర్హతి.

**టీక:–** ఇదంసర్వమ్ = ఈ సమస్త ప్రపంచమున్ను, యేన = దేనిచేత (ఏ పరమాత్మచేత), తతమ్ = వ్యాపించబడియున్నదో, తత్ తు = దానిని, అవినాశి = నాశము లేనిదానినిగా, విద్ధి = ఎఱుంగుము, అస్య = ఈ, అవ్యయస్య = నశింపని సత్పదార్థమునకు, వినాశమ్ = నాశమును, కర్తుమ్ = కలుగజేయుటకు, కశ్చిత్ = ఎవడును, న అర్హతి = తగడు.

**తా:–** ఓ అర్జునా! ఈ సమస్త ప్రపంచమున్ను ఏపరమాత్మచేత వ్యాపింపబడి యున్నదో, అది నాశరహితమై యున్నదని యెఱుంగుము. అవ్యయమగు అట్టి ఆత్మకు వినాశము నెవడును కలుగజేయజాలడు.

**వ్యాఖ్య:–** సమస్త చరాచరవస్తువులు హృదయస్థమగు ఆత్మచేతనే వ్యాపింపబడి యుండుటచే-

(1) సర్వజీవులను ఆత్మరూపములుగ దలంచి వాని యెడల ప్రేమ, దయ, కరుణ గలిగియుండవలెను.

(2) భగవంతుడగు ఆత్మ అతిసమీపమున నుండుటచే ఏ కాలమందును పాపము చేయరాదు.

(3) తన వాస్తవస్వరూపమగు ఆత్మ నెవడును నశింపజేయజాలడు. కనుక సాధకుడు మహద్ధైర్యసంయుతుడై ఆనందముతో నిరంతరము అట్టిఆత్మనుగూర్చి మననము చేయుచు స్వాత్మసంస్థితుడై మెలగవలెను.

ప్ర:- ఆత్మ యెట్టిది?

ఉ:- (1) సమస్త ప్రపంచమును వ్యాపించియున్నది (2) నాశరహితమైనది (3) అద్దాని వినాశము నెవడును చేయజాలడు.

**అ॥** ఇట్లు సద్వస్తువును గూర్చి వివరించి ఇక, అసద్వస్తువునుగుఱించి తెలుపుచున్నాడు -

## 18. అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తాశ్శరీరిణః
## అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత.

**టీక:–** నిత్యస్య = నిత్యుడును, అనాశినః = నాశనము లేనివాడును, అప్రమేయస్య = ప్రత్యక్షాది ప్రమాణములచే దెలిసికొనబడనివాడునగు, శరీరిణః = దేహియైన ఆత్మయొక్క, ఇమేదేహాః = ఈ శరీరములు, అన్తవన్తః = వినాశము కలవిగా, ఉక్తాః = చెప్పబడినవి, తస్మాత్ = ఆ కారణమువలన, భారత = ఓ అర్జునా! యుధ్యస్వ = యుద్ధము చేయుము.

**తా:–** ఓ అర్జునా! నిత్యుడును, నాశరహితుడును, అప్రమేయుడునగు దేహి (ఆత్మ) యొక్క ఈ దేహములు నాశవంతములుగ జెప్పబడినవి. (ఆత్మయో శాశ్వతుడు). కాబట్టి (ఆత్మనుగూర్చికాని, దేహమునుగూర్చికాని శోకమును వదలి) నీవు యుద్ధము చేయుము.

**వ్యాఖ్య:–** ''అన్తవన్త ఇమే దేహాః'' = దేహములు అంతము (చావు) కలవి. తాను దేహముకాదు దేహి;

శరీరము కాదు శరీరి. దేహములు నశించును. కాని దేహియగు ఆత్మ నశింపడు. నాశవంతములగు ఇట్టి దేహముల నెన్నటికిని నమ్మరాదు. దానితో తాదాత్మ్యము నొందరాదు. నిత్యుడైన ఆత్మనే నమ్ముకొని, ఆతడే తానని భావించవలెను.

''శరీరిణః'' - అని చెప్పుటవలన, ఆత్మ దూరమునలేడు, శరీరముననే వ్యాపించియున్నాడని స్పష్టమగుచున్నది. కావున శరీరభావమువీడి శరీరిభావము గలిగియుండవలెను.

''తస్మాద్యుధ్యస్వ'' - 'ఆత్మ నశింపడు కావునను, నీవు దేహముకావు కనుకను ఇక దుఃఖమునువీడి ధైర్యముతో నీ విధ్యుక్తకర్మము నాచరింపుమ'ని భావము. జ్ఞానముతో గూడి కర్మ నాచరింపుమని భగవాను డిచట అర్జుననకు హితబోధ చేయుచున్నాడు.

ప్ర:- దేహముయొక్క స్వభావమేమి?

ఉ:- అది నాశవంతమైనది.

ప్ర:- దేహియగు ఆత్మ యెట్టివాడు?

ఉ:- (1) నిత్యుడు (2) నాశరహితుడు (3) అప్రమేయుడు

**అ॥** ఆత్మయొక్క స్వరూప స్వభావముల నింకను వివరించి చెప్పుచు ఆతడెన్నడును చంపబడడని తెలియజేయుచున్నాడు -

## 19. య ఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్
## ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే.

**టీక:-** యః = ఎవడు, ఏనమ్ = ఈ (శరీరమందలి) ఆత్మను, హన్తారమ్ = చంపువానినిగ, వేత్తి = తెలిసికొనుచున్నాడో, యశ్చ = ఎవడు, ఏనమ్ = వీనిని, హతమ్ = చంపబడినవానినిగ, మన్యతే = తలంచునో, తౌ ఉభౌ = ఆ యిద్దఱును, న విజానీతః = తెలిసినవారుకారు, అయమ్ = ఈ ఆత్మ, న హన్తి = చంపుటలేదు, న హన్యతే చ = చంపబడుటయు లేదు.

**తా:-** ఎవడీ యాత్మను చంపువానినిగ నెఱుగునో లేక ఎవడు చంపబడువానినిగ భావించునో, వారిరువురును వాస్తవమెఱిగినవారు కాదు. యథార్థముగ ఈ యాత్మ దేనిని చంపుటలేదు, దేనిచేతను చంపబడుట లేదు.

**వ్యాఖ్య:-** కఠోపనిషత్తునందు ఈ శ్లోకమును పోలిన శ్లోకమే యొకటి గలదు★. (1) ఆత్మ చంపువాడు కాదు అని చెప్పుటవలన కర్తృత్వాదు లాత్మకు లేవని తెలియుచున్నది. ఆత్మ చేయువాడుకాదు, చేయించువాడు కాదు. కర్తృత్వాదులు బుద్ధికేగాని బుద్ధికి సాక్షియగు ఆత్మకు గావు. ఆత్మకు కర్తృత్వమాపాదించువాడు వెఱ్ఱివాడేయని గీత నుడువుచున్నది.

(2) ఆత్మ చంపబడువాడు కాదు - అని చెప్పుటవలన శాశ్వతుడని, నిర్వికారుడని స్పష్టపడుచున్నది. కావున

★ హన్తా చేన్మన్యతే హన్తుం హతశ్చేన్మన్యతే హతమ్
ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే. (కఠ. ఉ. 11-19)

సాధకుడు 'తానాత్మస్వరూపుడనియు, మరణరహితుడనియు, మరణము దేహమునకేయనియు, తాను దేహసాక్షియై, నిత్యనిరంజనుడై వెలుగొందుచుండువాడ'నియు భావన చేయుచుండవలెను.

ప్ర:- ఆత్మ యెట్టివాడు?

ఉ:- అతడు చంపువాడు కాదు, చంపబడువాడు కాదు (అకర్త, అవినాశి).

**అ॥** ఆత్మ యేల చంపబడడో స్పష్టీకరించుచు అతడు నిర్వికారుడని వచించుచున్నాడు-

**20. న జాయతే మ్రియతే వా కదాచి**
**న్నాయం భూత్వా భవితా వా న భూయః**
**అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో**
**న హన్యతే హన్యమానే శరీరే.**

**టీక:-** అయమ్ = ఈఆత్మ, కదాచిత్ = ఎప్పుడును, నజాయతే = పుట్టుటలేదు, నమ్రియతేవా = చచ్చుటయులేదు, నభూత్వా = (ఇదివఱకు) లేకుండి, భూయః = మరల, భవితావాన = (క్రొత్తగా) కలుగువాడునుకాదు, (లేక), (భూత్వా = ఉండి, భూయః = మరల, నభవితాన = లేకుండువాడు కాదు) అయమ్= ఇతడు, అజః= పుట్టుకలేనివాడు, నిత్యః= మరణములేనివాడు, శాశ్వతః= ఎల్లప్పుడునుండువాడు, పురాణః= అనాదియైనవాడు, శరీరే హన్యమానే (సతి) = శరీరము చంపబడినను, నహన్యతే= చంపబడుట లేదు.

**తా:-** ఈ ఆత్మ ఎప్పుడును పుట్టుట లేదు. ఇదివఱకు లేకుండి మరల క్రొత్తగా కలుగువాడు కాదు. (ఉండి మరల లేకుండువాడును కాదు). ఈతడు జనన మరణములు లేనివాడు; శాశ్వతుడు, పురాతనుడు. శరీరము చంపబడినను ఈతడు చంపబడుటలేదు.

**వ్యాఖ్య:-** ఈ శ్లోకమును బోలినది కఠోపనిషత్తునందు గలదు★. గీత ఉపనిషత్సారమనుటకీవాక్యములే నిదర్శనము.

శరీరము నశించినను ఆత్మ నశింపడని చెప్పినందువలన శరీరముకంటె వేఱై ఆత్మ సాక్షిగ నున్నాడని స్పష్టమగుచున్నది. కావున మనుజుడు నశించు శరీరముతో తాదాత్మ్యమునొందక నశింపని ఆత్మయే తానని నిరంతరము భావించుచుండవలెను. దానిచే అపరిమితధైర్యము, ఆనందము కలుగును. నిర్భయత్వము జనించును. మరణ భయము పటాపంచలై పోవును.

ప్ర:- ఆత్మయొక్క స్వరూప మెట్టిది?

ఉ:- (1) అతడు పుట్టుక చావులు లేనివాడు (2) ఎల్లప్పుడును ఉండువాడు (3) స్థిరమైనవాడు (4) శాశ్వతుడు (5) పురాణపురుషుడు (6) శరీరము నశించినను నశింపనివాడు.

---

★ న జాయతే మ్రియతే వా విపశ్చి న్నాయం కుతశ్చిన్న బభూవ కశ్చిత్,
అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే. (కఠ. ఉ. 11-18)

**అ॥** ఆత్మ ఒకరిని చంపువా డెందులకుకాడో వివరించుచున్నాడు.

## 21. వేదావినాశినం నిత్యం య ఏనమజమవ్యయమ్
## కథం స పురుషః పార్థ కం ఘాతయతి హన్తి కమ్.

**టీక:–** పార్థ = ఓ అర్జునుడా!, యః = ఎవడు, ఏనమ్ = ఈ ఆత్మను, అజమ్ = పుట్టుకలేనివానిగను, అవ్యయమ్ = క్షయములేనివానిగను, అవినాశినమ్ = నాశరహితునిగను, నిత్యమ్ = నిత్యునిగను, వేద = తెలిసికొనుచున్నాడో, సఃపురుషః = ఆ మనుజుడు, *కథం* = ఎట్లు, *కమ్* = ఎవనిని, ఘాతయతి = చంపించును?, *కమ్* = ఎవనిని, *హన్తి* = చంపును?

**తా:–** ఓ అర్జునా! ఈ యాత్మ నెవడు జననమరణములు లేనివానిగను, నాశరహితునిగను, నిత్యునిగను ఎఱుంగునో, అట్టి వాడెట్లు ఒకనిని చంపించగలడు, తాను చంపగలడు?

**వ్యాఖ్య:–** ఆత్మ నిత్యుడు కావున నెవరును చంపలేరు, చంపించలేరని భావము.

**అ॥** దేహము లనిత్యములు, దేహియగు ఆత్మ నిత్యుడను విషయమును ఉపమానముద్వారా తెలియజేయుచున్నాడు –

## 22. వాసాంసి జీర్ణాని యథా విహాయ
## నవాని గృహ్ణాతి నరోఽపరాణి
## తథా శరీరాణి విహాయ జీర్ణా
## న్యన్యాని సంయాతి నవాని దేహీ.

**టీక:–** *నరః* = మనుజుడు, *జీర్ణాని* = శిథిలములైన (చినిగిపోయిన), *వాసాంసి* = వస్త్రములను, *విహాయ* = విడిచి, *అపరాణి* = ఇతరములైన, *నవాని (వాసాంసి)* = క్రొత్తవస్త్రములను, *యథా* = ఏ ప్రకారముగ, *గృహ్ణాతి* = గ్రహించుచున్నాడో, *తథా* = ఆప్రకారముగనే, *దేహీ* = ఆత్మ, *జీర్ణాని* = శిథిలములైన, *శరీరాణి* = దేహములను, *విహాయ* = విడిచి, *అన్యాని* = ఇతరములైన, *నవాని (శరీరాణి)* = క్రొత్తశరీరములను, *సంయాతి* = పొందుచున్నాడు.

**తా:–** చినిగిపోయిన పాతబట్టలను విడిచి మనుజుడు ఇతరములగు క్రొత్తబట్టలనెట్లు ధరించుచున్నాడో, అట్లే దేహియగు ఆత్మయు శిథిలములైన పాతశరీరములను వదలి ఇతరములగు క్రొత్తశరీరములను ధరించుచున్నాడు.

**వ్యాఖ్య:–** గీతయందు భగవానుడు కొన్ని చక్కటి ఉపమానములద్వారా బోధచేయుచు పోవుదురు. దృష్టాంతములచే సామాన్యునకు గూడ విషయము లెస్సగ బోధపడుచుండును. ఇచ్చోట అట్టి ఉపమానమే ఒకటి ప్రయోగింపబడినది.

చాకలివానికి మురికిబట్టలు వేయునపుడెవరును దుఃఖించుట లేదు. చెట్లఆకులు శిశిరఋతువునందు

రాలిపోవునపుడెవరును ఆవేదనము నొందుటలేదు. ఏలననిన, క్రొత్తక్రొత్తవి తిరిగి వచ్చుచుండునను ధైర్యము కలదు. మరణమున్ను అంతియేయని భగవాను డిచట తెలుపుచున్నాడు. శిథిలదేహపరిత్యాగమే మరణము. జీవుడు తన జీర్ణదేహమును వదలి నూతన శరీరమును గ్రహింపబోవుచున్నాడు. కనుక మరణ మనునది దుఃఖింపవలసిన విషయముకాదని శ్రీకృష్ణమూర్తి సెలవిచ్చుచున్నారు. అయితే జ్ఞానమును సంపాదించి కర్మసంక్షయమొనర్చుకొని, మరల జన్మగాని, మరణముగాని లేకుండ చేసికొనుటయే సర్వోత్తమమని భగవానుడు ముమ్ముందు తెలుపుదురు.

'శరీరాణి' అని బహువచనము ప్రయోగింపబడుటచే (జ్ఞానాగ్నిచే కర్మసంచయము దగ్ధము కావింపబడనిచో) జీవు డనేక జన్మలు ఎత్తవలసి యుండునని స్పష్టమగుచున్నది.

''జీర్ణాని'' అను పదమునకు 'శిథిలమైన ప్రారబ్ధముకల దేహము' అని అర్థము చెప్పవలసియుండును. ఏలననిన, వార్ధక్యమందే అందఱును మరణించుటలేదు. యౌవనబాల్యములందుగూడ మరణించుచున్నారు. అపుడు వారి దేహములు నవీనములుగ నుండునే కాని శిథిలములుగ నుండవు. 'దేహీ' అని చెప్పుటవలన మరణము దేహమునకేకాని దేహియగు ఆత్మకు కాదని స్పష్టపడుచున్నది. ఉపాధులు మారుచున్నను వానికి సాక్షియగు ఆత్మ కొంచెమైనను మారక (అచలోఽయం సనాతనః అనునట్లు) నిశ్చలముగ నున్నది, అదియే జీవుని వాస్తవస్వరూపము కాని దేహముకాదు.

**అ॥** ఆత్మను పంచభూతము లెవ్వియు బాధింపలేవని నుడువుచున్నాడు -

## 23. నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః
## న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః.

**టీకా:–** ఏనమ్ = ఈ ఆత్మను, శస్త్రాణి = ఆయుధములు, న ఛిన్దన్తి = ఛేదింపజాలవు, పావకః = అగ్ని, ఏనమ్ = ఈ ఆత్మను, న దహతి = కాల్చజాలదు, ఆపఃచ = నీరున్ను, ఏనమ్ = ఈ ఆత్మను, నక్లేదయన్తి = తడుపజాలదు, మారుతః = గాలి, న శోషయతి = ఎండింపజాలదు.

**తా:–** ఈఆత్మను ఆయుధము లెవ్వియును ఛేదింపజాలవు. అగ్ని దహింపజాలదు, నీరు తడుపజాలదు, గాలి యెండింపజాలదు.

**వ్యాఖ్య:–** జీవునకు (1) శరీరము (2) మనస్సు (3) ఆత్మ - అనుమూడు కలవు. వీనిలో ఒకదానికంటె మఱియొకటి అతిసూక్ష్మముగనుండును. స్థూలపంచభూతములు (శస్త్ర జలాదులు) స్థూలమగు శరీరమునే బాధింపగలవుగాని సూక్ష్మమగు మనస్సునుగాదు. అట్టిచో అతిసూక్ష్మమగు ఆత్మ నెట్లు అయ్యవి బాధించగలవు?

పరమార్థదృష్టియందు చూచినచో స్థూల సూక్ష్మ దేహములు రెండును ఆత్మయందు రజ్జుసర్పమువలె కల్పింపబడినవేయగును. కల్పితవస్తువు, లేక ఆరోపితవస్తువు, అధిష్ఠానము నొకింతైనను బాధింపజాలదు. మృగతృష్ణాజలము ఊషరక్షేత్రమును తడుపజాలదుకదా! ఆత్మయొక్క యట్టిస్వభావమును మననము చేయుచుండినచో జీవునకు అపరిమిత ధైర్యము చేకూరగలదు.

**అ॥** ఆత్మయొక్క అట్టి అవినాశిత్వమునే తిరిగి ప్రతిపాదించుచున్నాడు -

**24. అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవచ
నిత్యస్సర్వగతస్థాణురచలోఽయం సనాతనః.**

**టీక:–** అయమ్ = ఈ ఆత్మ, అచ్ఛేద్యః = ఛేదింపజాలడు, అయమ్ = ఈ ఆత్మ, అదాహ్యః = కాల్చబడజాలడు, (మఱియు) అక్లేద్యః = తడుపబడజాలడు, అశోష్యః ఏవచ = ఎండింపబడజాలడున్ను, అయం= ఈ ఆత్మ, నిత్యః= నిత్యుడు, సర్వగతః= అంతటను వ్యాపించియున్నవాడు, స్థాణుః= స్థిరస్వరూపుడు, అచలః = చలనములేనివాడు, సనాతనః = అనాదియైనవాడు.

**తా:–** ఈ ఆత్మ ఛేదింపబడజాలడు, దహింపబడజాలడు, తడుపబడజాలడు, ఎండింపబడజాలడు. ఇతడు నిత్యుడు, సర్వవ్యాపి, స్థిరస్వరూపుడు, నిశ్చలుడు, పురాతనుడు.

**వ్యాఖ్య:–** పంచభూతములు పాంచభౌతికవస్తువునే బాధింపగలవు. ఆత్మయో పంచభూతాత్మకము కాదు. కావున వాని ప్రభావమేమియు అతనిపై బడజాలదు.

''నిత్యః, సర్వగతః'' – అను రెండు పదములచే ఆత్మ కాలమునకు, దేశమునకు అతీతుడని వివరింపబడినది. ఎల్లకాలములందుండువాడు నిత్యుడు; ఎల్లదేశములందుడువాడు సర్వగతుడు. దేశకాలముల రెండిటియందును వ్యాపించియుండి ఆత్మ వాని కతీతుడై వర్తించుచున్నాడు. ప్రపంచములోని ప్రతివస్తువున్ను కాలమునకు లోబడియున్నది. కాలము గ్రహింపని పదార్థమేదియు జగత్తునలేదు. బ్రహ్మాండములన్నియు కాలగర్భమున విలీనములై పోవుచున్నవి. ఈ ప్రకారముగ కాలమన్నిటిని మ్రింగివేయుచుండ, అట్టికాలమును ఆత్మ మ్రింగివేయుచున్నాడు. కనుకనే యాతనికి 'అంతకాంతకుడు' అను పేరు గలదు. ఆతడు నిత్యుడు. అట్లే సర్వవ్యాపకుడున్ను. సమస్త చరాచరప్రాణికోట్లయం దాతడు 'సత్తాసామాన్యరూపము'న వెలుగొందుచున్నాడు. ఈ సత్య మెఱిగినచో నిక పాపముచేయుటకు జీవు డెట్లు సాహసించగలడు? సర్వసాక్షియగు పరమాత్మ సర్వత్ర వ్యాపించి సమస్తమును వీక్షించుచుండ నాతని సన్నిధియందు పాపము నెవ్వరైన చేయగలరా? కావున ఇట్టి సత్యములను బాగుగ మననము చేయుచు చిత్తమున కళంకమెద్దియు రాకుండ చూడవలెను.

ఆత్మ సర్వవ్యాపి యగుటవలన నాతడు వేఱొకచోటికి పోవుట సంభవింపదు. అతడు లేనిచోటు ఉండినగదా కదిలివెళ్ళుటకు? కాబట్టి స్థాణువని యతడు పేర్కొనబడెను. మఱియు సనాతనుడని వర్ణింపబడెను. ఆత్మ సనాతనుడు కనుక ఆత్మతత్త్వ విచారణమే వాస్తవమగు సనాతనధర్మ మగును. సనాతనముకానట్టి క్షణిక ప్రాపంచిక వస్తుజాలమును గూర్చిన విచారణచే ముక్తి యెన్నటికిని చేకూరదు. కావున ఆత్మవిచారణారూపమగు సనాతనధర్మమునే జీవుడాశ్రయించవలసియుండును.

ప్ర:– ఆత్మ యెట్టివాడు?

ఉ:– ఛేదింపబడనివాడు, దహింపబడనివాడు, తడుపబడనివాడు, ఎండింపబడనివాడు, నిత్యుడు, సర్వవ్యాపకుడు, నిశ్చలుడు, సనాతనుడు.

**అ॥** ఈ ప్రకారముగ ఆత్మ శాశ్వతుడని యెఱింగి దుఃఖమును పారద్రోలవలెనని వచించుచున్నాడు.

**25. అవ్యక్తోఽయమచిన్త్యోఽయమవికార్యోఽయముచ్యతే
తస్మాదేవం విదిత్వైనం నానుశోచితుమర్హసి.**

**టీక:–** అయమ్ = ఈ ఆత్మ, అవ్యక్తః = ఇంద్రియములకు గోచరింపనివాడు, అయమ్ = ఈ ఆత్మ, అచిన్త్యః = మనస్సుచే చింతింపనలవికానివాడు, అయమ్ = ఈ ఆత్మ, అవికార్యః = వికారమునొందింపబడనివాడు, (ఇతి = అని) ఉచ్యతే = చెప్పబడుచున్నాడు, తస్మాత్ = అందువలన, ఏనమ్ = ఈ ఆత్మను, ఏవమ్ = ఈ ప్రకారముగ, విదిత్వా = తెలిసికొని, అనుశోచితుం = దుఃఖించుటకు, న అర్హసి = తగవు.

**తా:–** ఈ ఆత్మ ఇంద్రియములకు గోచరముకానివాడు, మనస్సుచే చింతింపశక్యము కానివాడు, వికారములు బొందింపదగనివాడునని చెప్పబడుచున్నాడు. కావున ఈ ప్రకారముగ తెలిసికొని నీవు దుఃఖింపతగవు.

**వ్యాఖ్య:–** స్థూలపంచభూతాత్మక పదార్థమైనచో అది నేత్రముల కగుపించును. కాని ఆత్మ అట్టివాడు కాడు. కాబట్టి నేత్రాదుల కగోచరుడు. అట్లే సూక్ష్మపంచభూతాత్మకవస్తువైనచో మనస్సునకు గోచరించును. కాని ఆత్మ అట్టివాడు కాడు. కావున మనస్సున కగోచరుడు. మనస్సు లయించినపుడు శేషించువస్తువే ఆత్మ. మనస్సును శుద్ధమొనర్చుటద్వారా అద్దానిని అధిష్ఠానమందు లయింపజేయునపుడు మిగులునదియే ఆత్మ. ఈ ప్రకారముగ మనోవిలయముచే లభించువస్తువు మనస్సున కెట్లుగోచరింపగలదు? కావుననే ఆత్మ అచింత్యుడని యిట వర్ణింబడెను. మఱియు ప్రపంచములోని సమస్త దృశ్యపదార్థములున్ను పుట్టుట, పెరుగుట మున్నగు ఆఱు విధములగు వికారములకు లోనగుచుండును. ఆత్మ అట్టి దృశ్యవస్తువు కాదు. దృగ్రూపుడు. దేశకాలాతీతుడగు సచ్చిదానందరూపసర్వసాక్షి. మఱియు కార్యము వికారమొందుచు ఎన్నిటికైనను తన కారణమందు లయించును. ఆత్మయో కార్యము కాదు. సర్వకారణములకును కారణము. కాబట్టి వికారమే అట సంభవింపదు.

"తస్మాదేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి" – శోకమునకు మూలము స్వస్వరూపమునుగూర్చిన జ్ఞానము లేకుండుటయే. తాను దేహమనియు, మనస్సనియు తలంచి వానితో జీవు డెపుడు తాదాత్మ్యమునొందునో వెనువెంటనే దుఃఖ మాతనిని ఆశ్రయించును. కాని తాను వాస్తవముగ దేహముకాని, మనస్సుకాని కాడనియు, నిర్వికారుడగు ఆత్మయే యనియు సద్గురువులద్వారా, సచ్ఛాస్త్రములద్వారా యెఱింగినపుడిక దుఃఖమున కాస్కారమెచట? కనుకనే శ్రీకృష్ణమూర్తి అర్జునున కట్టి ఆత్మజ్ఞాన మొంది దుఃఖరహితుడవు కమ్మని యిట బోధించుచున్నారు.

దీనిని బట్టి యీ తాపత్రయాత్మకమగు మహాభయంకరమైన సంసారదుఃఖమునందుపడి తల్లడిల్లుచుండు జనులకు తద్దుఃఖనివారణోపాయము ఒక్క ఆత్మజ్ఞానమే (స్వస్వరూపానుభవమే) అని భగవద్వాక్యముద్వారా స్పష్టమగుచున్నది. కావున ఆత్మనుగూర్చియే సర్వులును అన్వేషింపవలెను★. ఆత్మజ్ఞానమొకటియే ఈ సంసార గాఢాంధకారమున వెలుగునిచ్చు దివ్వె.

ప్ర:– ఆత్మయొక్క లక్షణములను ఇంకను వివరించి చెప్పుడు?

ఉ:– అతడు (1) ఇంద్రియముల కగోచరుడు (2) మనస్సుచే చింతింపనలవికానివాడు (3) నిర్వికారుడు.

ప్ర:– శోకనివారణమున కుపాయమేమి?

ఉ:– ఈ ప్రకారముగ ఆత్మనెఱింగి, అట్టి ఆత్మానుభూతి నొందుటయే శోకరాహిత్యమునకు హేతువు.

★ ఆత్మా వా అరే ద్రష్టవ్య శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః (బృ – ఉ)

**అ॥** ఇక జీవదృష్టిననుసరించి చూచినను ఆత్మనుగూర్చి శోకించుట తగదని వచించుచున్నాడు -

## 26. అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్
## తథాపి త్వం మహాబాహో నైవం శోచితు మర్హసి.

**టీక:–** మహాబాహో! = గొప్ప బాహువులు కల ఓ అర్జునా!, అథచ = ఒకవేళ, ఏనమ్ = ఈ ఆత్మను, నిత్యజాతమ్ వా = ఎల్లప్పుడును పుట్టుకగలవానిగ గాని, నిత్యమ్ = ఎల్లప్పుడును, మృతమ్ = మరణముగలవానిగగాని, మన్యసే = తలంతువేని, తథాఽపి = అట్లైనను, ఏవమ్ = ఈ రీతిగ, శోచితుమ్ = దుఃఖించుటకు, త్వమ్ = నీవు, న అర్హసి = తగవు.

**తా:–** ఓ అర్జునా! ఒకవేళ ఈ ఆత్మ (దేహముతోబాటు) నిరంతరము పుట్టుచు చచ్చుచు నుండువాడని తలంచినను, అట్టిస్థితియందుగూడ నీ వీప్రకారము శోకించుట తగదు.

**వ్యాఖ్యా:–** ''మహాబాహో'' - ''ఓ అర్జునా! నీవు గొప్ప బాహుబలము (భౌతికబలము) కలవాడవు. అది చాలదు. ఆధ్యాత్మికబలముకూడ నుండవలెను. అదిలేనందువలననే నీవు శోకించుచున్నావు. నీ బాహుబలము నీ మానసికవ్యథను పోగొట్టజాలకున్నది. కాబట్టి భౌతికశక్తితోబాటు ఆత్మశక్తిని (Spiritual energy) కూడ సంపాదింపుము'' అని తెలుపుటకు కాబోలు 'మహాబాహో' అను పద మిచ్చోట వాడబడినది.

శ్రీ కృష్ణపరమాత్మ అర్జునుని ఊరడించు నిమిత్తము పై (ఆత్మ) స్థితినుండి దిగివచ్చి సామాన్య జనులుతలంచు 'జీవదృష్టి' ని తాత్కాలికముగగైకొని ఆ స్థితియందును దుఃఖమున కవకాశములేదని వచించుచున్నారు.

'అథచ' - 'ఒకవేళ' అని తెలిపినందువలన ఇది సిద్ధాంతపక్షముకాదనియు, సామాన్య జనుల దృష్టిననుసరించి చెప్పబడిన విషయమే యనియు స్పష్టమగుచున్నది. ఆత్మ దేహముతోబాటు పుట్టుచు చచ్చుచు నుండినగూడ శోకమునకు తావులేక యుండ, ఇక వాస్తవముగ పుట్టక, చావక నున్నపు డద్దాని విషయమై వేఱుగ చెప్పవలెనా యని భావము.

## 27. జాతస్య హి ధ్రువో మృత్యుర్ధ్రువం జన్మ మృతస్య చ
## తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి.

**టీక:–** జాతస్య = పుట్టినవానికి, మృత్యుః = చావు, ధ్రువోహి = నిశ్చయముగదా!, మృతస్య = చచ్చినవానికి, జన్మచ = పుట్టుకయు, ధ్రువం = నిశ్చయము, తస్మాత్ = ఆకారణమువలన, అపరిహార్యే = తప్పింపశక్యముకాని, అర్థే = (ఈ) విషయమందు, త్వమ్ = నీవు, శోచితుమ్ = దుఃఖించుటకు, న అర్హసి = తగవు.

**తా:–** (ఒకవేళ నీవీ యాత్మను చావుపుట్టుకలుకలవానినిగ తలంచెదవేని అత్తఱి) పుట్టినవానికి చావుతప్పదు. చచ్చినవానికి పుట్టుక తప్పదు. తప్పనిసరియగు ఆ విషయమున నీవిక శోకించుట యుక్తముకాదు.

**వ్యాఖ్య:–** ఇదియు పైనదెలిపిన సామాన్యులదృష్టి ననుసరించి చెప్పినదేయగును. యథార్థముగ ఆత్మకు పుట్టుకగాని చావుగాని లేవు.

''అపరిహార్యేర్థే'' - ఆత్మజ్ఞానము నొందనంతవఱకును ఈ జననమరణములు అపరిహార్యములే (తప్పింప

శక్యముకానివే) యగును. ఆత్మజ్ఞానము కలిగినపిమ్మట ఇక ఆ సంసారచక్రపరిభ్రమణము (చావుపుట్టుకలు) ఆగిపోవును. అత్తఱి అవి 'పరిహార్యము' లగును. కావున శ్రీ కృష్ణపరమాత్మ కర్మసంచయము క్షయింపని సామాన్యులనుగూర్చియే ఈ శ్లోకమున చెప్పియుందురని గ్రహించునది. అట్లుకానిచో 'న జాయతే మ్రియతే వా కదాచిత్..' మున్నగుశ్లోకములకు, ఆ పరమసత్యములకు వ్యాఘాతము సంభవించును. ఇచట భగవానుడు సామాన్యజనునిదృష్టిని గైకొని అట్టి దృష్టియందే ఆత్మ శోకింపరానపుడు, ఇక జ్ఞానదృష్టియందు వేఱుగ చెప్పవలెనా యని తెలిపినట్లూహించవలెను.

## 28. అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత
## అవ్యక్త నిధనాన్యేవ తత్ర కా పరిదేవనా.

**టీక:–** భారత = ఓ అర్జునా!, భూతాని = ప్రాణులు (ప్రాణుల శరీరములు), అవ్యక్తాదీని = ఆదియందు (పుట్టుకకు పూర్వము) కంటి కగపడని స్వరూపము గలవియు, వ్యక్తమధ్యాని = మధ్యమందు (పుట్టినపిదప) అగపడు రూపము గలవియు, అవ్యక్తనిధనాన్యేవ = మరణించిన పిదప (అంతమందు) అగపడని స్వరూపము గలవియే (భవన్తి = అగుచున్నవి), తత్ర = ఆ విషయమున, *(ఇక)* పరిదేవనా = దుఃఖము, కా = ఏల?

**తా:–** ఓ అర్జునా! ప్రాణికోట్లన్నియు పుట్టుకకు పూర్వము కనబడకయు పుట్టిన పిదప (దేహముతో గూడి) కనబడుచును, మరణించినపిదప మరల కనబడకయు నుండుచున్నవి. అట్టివాని విషయమై శోకింపనేల? (మొదట కనబడక, మరల కనబడి, తిరిగి అంతరించిపోవు భ్రాంతిరూపములైన ఈ దేహముల కొఱకై దుఃఖింపనేలయని భావము. లేక, ఆదియందు ఏ అవ్యక్తరూపముగల్గియున్నవో, అట్టి అవ్యక్తరూపమునే తిరిగి అంత్యమున ధరించుచుండ నిక దానికై శోకింపనేల? అనియు చెప్పవచ్చును.)

**వ్యాఖ్య:–** ప్రాణులకు పుట్టుటకుపూర్వ మీదేహములతో సంబంధములేదు. మరణించిన పిదపయు లేదు. మధ్యకాలములో మాత్రము కలదు. ఆద్యంతములందు లేనిదియై మధ్యకాలమునమాత్ర మగుపడునది మిథ్యావస్తువేయగును★. అది భ్రాంతి మాత్రమే. స్వప్నజగత్తు నిద్రకుపూర్వము లేదు, నిద్ర ఉడిగిన పిదప లేదు, మధ్యమాత్రము కలదు. అట్టిది మిథ్యామాత్రమే యెట్లగుచున్నదో అట్లే మధ్యకాలమునమాత్ర మగపడు ఈ దేహాది దృశ్యపదార్థములున్ను ఎండమావులవలె అసత్యములు, భ్రాంతిరూపములునగును. అట్టివానికొఱకై ఇక దిగులేల? అని భగవానుడు ప్రశ్నించుచున్నాడు.

ఈ ప్రకారముగ అనేక యుక్తులద్వారా శ్రీకృష్ణమూర్తి అర్జునుని శోకమును పరిహరించుటకు యత్నించుచున్నాడు – ఇంతవఱ కాతడు బోధించినయుక్తులు సంక్షేపముగ నిచట వివరింపబడుచున్నవి–

(1) ఆత్మ శాశ్వతము. ఈ బంధ్వాదులందఱు ఆత్మస్వరూపులు. కాబట్టి వారికొఱకై దుఃఖింపవలదు.

(2) ఆత్మ నిర్వికారమైనది. అది చినిగిన వస్త్రములవలె పాతశరీరములను తొలగించివేసి నూతన శరీరములను ధరించుచుండును. కావున ఆ శరీరములకై శోకింపనవసరములేదు.

---

★ యన్నాదౌ యచ్చ నాస్త్యన్తే తన్మధ్యే భాతమప్యసత్
అతో మిథ్యా జగత్సర్వమితి వేదాన్తడిణ్డిమః. (శ్రీ శంకరాచార్యులు)

ఏది మొదట లేదో, చివఱను లేదో, అది మధ్యలో కనిపించినను లేనిదేయగును. కాబట్టి సృష్టికి పూర్వము లేనిదియు, ప్రళయానంతరమున్ను లేనిదియునగు ఈ జగత్తంతయు మధ్యలో ఇపుడు కనుపించినను మిథ్యయేయని వేదాంతభేరి పలుకుచున్నది.

(3) ఒకవేళ ఆత్మ ఎల్లపుడు పుట్టుచు చచ్చుచు నున్నదని యనుకొనినను చచ్చినది మరల పుట్టును గావున దానికై దుఃఖింపనక్కఱలేదు.

(4) ఈ శరీరములు పుట్టకపూర్వము లేవు. చచ్చినపుడప లేవు. మధ్య మాత్రము కొంతసేపు అగపడుచున్నవి. కావున అవి భ్రాంతిమాత్రములె. అట్టివానికై శోకించుట తగదు.

**అ॥** ఈ ప్రకారముగ ఆత్మనుగూర్చిగాని, దేహమునుగూర్చిగాని శోకింప పనిలేదని అనేకవిధములుగ జెప్పి అట్టి అద్భుతమగు ఆత్మస్వరూపమును సాక్షాత్కరించుకొనువారు చాల అరుదని వచించుచున్నాడు -

**29. ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన**
**మాశ్చర్యవద్వదతి తథైవ చాన్యః**
**ఆశ్చర్యవచ్చైనమన్యశ్శృణోతి**
**శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్.**

**టీక:–** కశ్చిత్ = ఒకానొకడు, ఏనమ్ = ఈ ఆత్మను, ఆశ్చర్యవత్ = ఆశ్చర్యమైనదానివలె, పశ్యతి = చూచుచున్నాడు, తథైవ = అటులనే, అన్యఃచ = మఱియొకడు, ఆశ్చర్యవత్ = ఆశ్చర్యమైనదానివలె, ఏనమ్ = ఈ ఆత్మను, వదతి = చెప్పుచున్నాడు, అన్యఃచ = ఇంకొకడు, ఏనమ్ = ఈ ఆత్మను, ఆశ్చర్యవత్ = ఆశ్చర్యమైనదానివలె, శృణోతి = వినుచున్నాడు, శ్రుత్వాపి = వినియును, ఏనమ్ = ఈ ఆత్మను, కశ్చిత్ చ = (వారిలో) ఎవడును, నవేద ఏవ = ఎఱుంగుటయే లేదు (సాక్షాత్తుగ అనుభూత మొనర్చుకొనుట లేదు.)

**తా:–** ఈ ఆత్మను ఒకానొకడు ఆశ్యర్యమైనదానివలె చూచుచున్నాడు. మఱియొకడు ఆశ్చర్యమైనదానివలె (దీనినిగూర్చి) చెప్పుచున్నాడు. అట్లే వేఱొకడు అశ్చర్యమైన దానివలె దీనినిగూర్చి వినుచున్నాడు. అట్లు వినియు, చూచియు, చెప్పియుగూడ ఒకడును దానిని సరిగా తెలిసికొనుటలేదు (సాక్షాత్తుగ అనుభవించుటలేదు.)

**వ్యాఖ్య:–** అధ్యాత్మవిద్య మౌఖికవర్ణన (Theory) లతో పరిసమాప్తముకాదు. అది ఆచరణపూర్వకమైన విజ్ఞానము (Practical Science). దానిని గూర్చిన ప్రతి విషయముకూడ ప్రత్యక్షముగ అనుభూతమొనర్చుకొనినమాత్రమే పూర్ణముగ తెలియును. కాని అట్టి యనుభూతి లభించుటకు బహుజన్మార్జిత పుణ్యపరిపాకము, చిత్తనైర్మల్యము, వాసనారాహిత్యము అవసరములు. కనుకనే సాధనచతుష్టయసంపత్తి లెస్సగ గలవానికి మాత్రమే బ్రహ్మజ్ఞానమునందు ప్రవేశము కలుగుచున్నది. తక్కినవా రొకవేళ బ్రహ్మజ్ఞానమును, ఆత్మవిచారణను జేపట్టినను పూర్ణఫలితములను బొందజాలక యుందురు. హృదయక్షేత్రము సత్త్వగుణప్రధానమైయున్నచో, రజస్తమస్సులు తొలగి పరిశుద్ధముగానుండినచో నిర్మలదర్పణమందు వస్తువు చక్కగ ప్రతిబింబించునట్లును, ఉతికిన గుడ్డయందు రంగు బాగుగ ప్రవేశించునట్లును, మెత్తటి నేలయందు విత్తనము శీఘ్రముగ మొలకెత్తునట్లును, బ్రహ్మసాక్షాత్కారము శీఘ్రముగ లభించగలదు. ఆ ప్రకారముగ

చిత్తశుద్ధికలవారు లోకమున అరుదుగ నుండుటవలననే ఆత్మానుభూతి నొందినవారును చాల అరుదుగా నున్నారని భగవానుడు వచించుచున్నాడు★.

**'కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్షత్ ఆవృత్త చక్షురమృతత్వమిచ్ఛన్'** ఇంద్రియనిగ్రహముగలిగి, బాహ్యవిషయములనుండి చిత్తమును మరలించి, అంతర్ముఖుడై మోక్షమును గూర్చి తీవ్రతరాభిలాషతో గూడి యత్నించు ఏ ఒకానొక ధీరుడు మాత్రమే ప్రత్యగాత్మను సాక్షాత్కరించుకొనగలడని కఠోపనిషత్తు పలుకుచున్నది.

ఆత్మ ఒకానొక దృశ్యవస్తువువలె చూడబడునదికాదు, వినబడునదికాదు, చెప్పబడునది కాదు. అది ఇంద్రియాతీతమైనది. అతిసూక్ష్మమై, హృదయగుహయందు దాగియున్నది. నిష్కామకర్మ, భక్తి, వైరాగ్యము, ధ్యానము, అమానిత్వాది సద్గుణములు మున్నగు సాధనములద్వారా హృదయమును వినిర్మల మొనర్చుకొని ఆత్మవిచారణద్వారా అద్దానిననుభూతమొనర్చుకొనవలయును. ఇచట 'వేదనచైవకశ్చిత్' అనుదానికి 'ఎవరును తెలిసికొనుటలేదు' అని అర్థముకాదు. తెలిసికొనువారు చాల అరుదని మాత్రమే యర్థము. ఆత్మ దృశ్యవస్తువులకంటె సర్వవిధముల విలక్షణమైనది కనుక దానిని అందఱును ఆశ్చర్యముగ చూచుచున్నారు.

ఈ శ్లోకమునకు మఱియొక అర్థమునుగూడ చెప్పవచ్చును - ఆత్మనుగూర్చి చూచువాడు, వినువాడు, చెప్పువాడు (ఆత్మానుభవము పొందినవాడు) లోకములో అత్యాశ్చర్యకరమైనవాడు. అట్టివాడు మహాదుర్లభుడు.

**అ॥** ఇంతదనుక ఆత్మనుగూర్చి విచారణసల్పి ఇక ఆ విచారణను ఉపసంహరించుచు, ఆత్మ నిత్యుడు కావున ఎవరును ఎవరికొఱకును శోకింప బనిలేదని మరల కట్టకడకు వచించుచున్నారు -

## 30. దేహీ నిత్యమవధ్యోఽయం దేహే సర్వస్య భారత
## తస్మాత్సర్వాణి భూతాని న త్వం శోచితుమర్హసి.

**టీక:-** భారత = ఓ అర్జునా!, సర్వస్య = సమస్త ప్రాణులయొక్కయు, దేహే = దేహమునందు (ఉన్న), అయమ్ దేహీ = ఈ ఆత్మ, నిత్యమ్ = ఎల్లప్పుడును, అవధ్యః = చంపబడనివాడు, తస్మాత్ = అందువలన, సర్వాణి = సమస్తములైన, భూతాని = ప్రాణులను గుఱించి, త్వమ్ = నీవు, శోచితుమ్ = దుఃఖించుటకు, న అర్హసి = తగవు.

**తా:-** అర్జునా! సమస్త ప్రాణికోట్లయొక్కయు దేహములందు వసించియున్న ఈ ఆత్మ యెన్నడును చంపబడడు. కావున ఏ ప్రాణినిగూర్చియు నీవు శోకింపదగదు.

**వ్యాఖ్య:-** దేహము చంపబడినను, దేహములలోనున్న ఆత్మ చంపబడడు. 'దేహి' అని చెప్పబడినందువలన, ఆత్మ దేహమునందేయుండి, దేహమునకు సాక్షిగా వెలయుచున్నాడని అర్థము.

'నిత్యం' అని పేర్కొనుటవలన ఈసత్యమేదియో యొక కాలమున వర్తించునది కాదనియు, ఎల్లపుడును ఆత్మ అవధ్యుడే అనియు తెలియుచున్నది.

---

★ ఇట్టిభావమే కఠోపనిషత్తునందును తెలుపబడినది -
శ్రవణాయాపి బహుభిర్యో న లభ్యః
శృణ్వన్తోఽపి బహవో యం న విద్యుః
ఆశ్చర్యో వక్తా కుశలోఽస్య లబ్ధా
ఆశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః. (కఠోపనిషత్తు - 1-2-7)

ఈ శ్లోకమునందు 'సర్వ' శబ్దప్రయోగము రెండుసార్లు చేయబడినది - 'సర్వస్య 'సర్వాణి భూతాని' అని. దీనినిబట్టి సమస్త ప్రాణులయొక్క దేహములందును - ఆ దేహము ఏ జాతికి జెందినను, మతమునకు జెందినను, స్త్రీయైనను, పురుషుడైనను, జంతువైనను, స్థావరమైనను సరియే - ఆత్మ వసించుచున్నాడనియు, సర్వులయందును సమానముగ వర్తించుచున్నాడనియు స్పష్టమగుచున్నది. సామాన్యజనులు దేహము మరణించునపుడుకాని, రోగగ్రస్తమగునపుడుకాని, బాధనొందునపుడుకాని, తామే మరణించుచున్నామనియు, బాధనొందుచున్నామనియు తలంచి దుఃఖించుచుందురు. అట్లు తలంచుట చాల పొరబాటని భగవాను డీశ్లోకముద్వారా వెల్లడించుచున్నారు. దేహము బాధింపబడినను, మరణించినను దేహమందలి ఆత్మయగు తాను వాస్తవముగ ఏ మాత్రము బాధింపబడుటలేదు, మరణించుటలేదు. ఈ సత్యము చరాచరప్రాణికోట్లన్నిటియొక్క దేహములకున్ను వర్తించును. కాబట్టి ఇక శోకమునకు తావే లేదని భగవానుడు స్పష్టపఱచుచున్నాడు. దీనిని బట్టి శోకము పోవుటకు ఉపాయము తాను దేహముకాదనియు, దేహియగు ఆత్మయే యనియు తలంచుటమాత్రమే యగును. దేహభావనచే దుఃఖము, ఆత్మభావనచే దుఃఖరాహిత్యము జీవులకు కలుగుచుండును. కావున తాను ఆత్మయనియే విజ్ఞుడు నిరంతరము భావనచేయుచుండవలెను.

''భారత'' - 'భా' అనగా ప్రకాశము, 'రతః' = ఆసక్తికలవాడు - ఓ అర్జునా ! ఇట్టి ఆత్మజ్ఞానప్రకాశమునందే నీవు సదా నిరతుడవై యుండుము. దేహాభిమాన రూప తమస్సునందు మునుగకుము అని 'భారత' అను సంబోధనచే అర్జునుడు హెచ్చరింపబడియుండవచ్చును.

ప్ర:- దేహముయొక్కయు, దేహి (ఆత్మ) యొక్కయు స్వభావములను వివరింపుము?

ఉ:- దేహము వధింపబడును, నశించును. దేహియగు ఆత్మ వధింపబడడు, నశింపడు.

ప్ర:- శోకము తొలగుటకు ఉపాయమేమి?

ఉ:- దేహముతో తాదాత్మ్యము నొందక తాను ఆత్మయే యని భావనచేయుటవలన శోకము తొలగిపోవును.

**అ॥** ఇంతదనుక సాంఖ్యయోగానుసారము ఆత్మయొక్క నిత్యత్వమును బోధించి, ఇక నిపుడు ఏడుశ్లోకములద్వారా క్షత్రియధర్మము ననుసరించియైనను నీవు దుఃఖించుట తగదని భగవాను డర్జునునకు బోధించుచున్నాడు -

**31. స్వధర్మమపి చావేక్ష్య న వికమ్పితు మర్హసి**
**ధర్మ్యాద్ధి యుద్ధా చ్ఛ్రేయో ఽన్యత్ క్షత్రియస్య న విద్యతే.**

**టీక:-** చ = మఱియు, స్వధర్మమ్ = స్వకీయ (క్షత్రియ) ధర్మమును, అవేక్ష్య అపి = చూచియైనను, వికమ్పితుమ్ = చలించుటకు, న అర్హసి = తగవు, క్షత్రియస్య = క్షత్రియునకు, ధర్మ్యాత్ = ధర్మయుతమైన, యుద్ధాత్ = యుద్ధముకంటె, అన్యత్ = ఇతరమైన, శ్రేయః = మేలు, న విద్యతే హి = లేదుగదా!

**తా:-** మఱియు ఓ అర్జునా! స్వకీయమగు క్షత్రియ ధర్మమును విచారించుకొనినను యుద్ధమునకు వెనుదీయుట నీకు సరియైనదికాదు. ఏలయనిన, క్షత్రియునకు ధర్మయుద్ధముకంటె శ్రేయస్కరమైనది మఱియొకటి లేదుకదా!

**వ్యాఖ్య:-** కర్తవ్యనిర్వహణయందు, స్వధర్మాచరణయందు, ధర్మమునకు విరుద్ధము కాని

కార్యములందు శ్రీకృష్ణున కెంతప్రీతియో ఈ శ్లోకమువలన తెలియుచున్నది. శరీరమున్నంతవఱకును ప్రతివారును ఏదియో యొక కార్యమును చేయవలసియే యున్నది. అట్టితఱి స్వధర్మానుకూలమైన కార్యమును నిష్కామముగ నాచరించుటవలన మనుజునకు ఉత్తమశ్రేయము లభించుటయేకాక చిత్తశుద్ధిద్వారా మోక్షమున్ను సంప్రాప్తమగుచున్నది. ఇచట 'ధర్మ్యాత్' అని చెప్పుటవలన ధర్మయుద్ధమునే క్షత్రియు డాశ్రయింపవలెనుగాని అధర్మయుద్ధమును గాదని స్పష్టీకరింపబడినది.

## 32. యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వారమపావృతమ్
## సుఖినః క్షత్రియాః పార్థ లభన్తే యుద్ధమీదృశమ్.

**టీక:–** పార్థ = ఓ అర్జునా! యదృచ్ఛయా = తనంతతాను (కోరకుండ), ఉపపన్నమ్ = సంప్రాప్తమైనదియు, అపావృతమ్ = తెఱవబడిన, స్వర్గద్వారమ్ చ = స్వర్గద్వారమున్నునగు, ఈదృశమ్ = ఇట్టి, యుద్ధమ్ = యుద్ధమును, *(యే)* క్షత్రియాః = ఏ క్షత్రియులు, లభన్తే = పొందుచున్నారో, *(తే = వారు)* సుఖినః = సుఖవంతులు (ధన్యులు)

**తా:–** ఓ అర్జునా! అప్రయత్నముగనే లభించినట్టియు, తెఱవబడిన స్వర్గద్వారమువంటిదియు (స్వర్గమును గలుగజేయునదియు) నగు ఇట్టి యుద్ధమును ఏ క్షత్రియులు పొందుదురో వారు నిక్కముగ సుఖవంతులే యగుదురు.

**వ్యాఖ్య:–** 'పార్థ' – అర్జునుని 'పార్థా' అని సంబోధించుచు శ్రీకృష్ణమూర్తి అర్జునుని తల్లియగు పృథ (కుంతీదేవి) యొక్క క్షాత్రధర్మనిర్వహణమునుగూర్చిన సందేశము నాతనికి జ్ఞాపకము చేయుచున్నట్లున్నది. యుద్ధమునకు పూర్వము కుంతీదేవి హస్తినాపురమునుండి శ్రీకృష్ణునిద్వారా అర్జునున కీ క్రింది సందేశమును బంపెను – ''దేని నిమిత్తము క్షత్రియమాత కుమారుని కనుచున్నచో అట్టిసందర్భ మిపుడేతెంచినది''★.

బాహ్యయుద్ధము క్షత్రియులకు మాత్రము కలదు. అంతర్యుద్ధము (కామక్రోధాదులతో, రాగద్వేషాదులతో, దుష్టవాసనలతో పోరు) ప్రతివారికిని కలదు. బాహ్యయుద్ధమును ధర్మపూర్వకముగ నాచరించుచో స్వర్గము లభించును. అంతర్యుద్ధమున గెలుపొందువారికి మోక్షము సంప్రాప్తించును (మోక్షద్వారమపావృతమ్). నిజమగు క్షత్రియవీరులు యద్ధమెపుడువచ్చునా యని ఉవ్విళ్లూరుచుందురు. అట్లే తీవ్రముముక్షువులు మాయతో, అజ్ఞానముతో ఎపుడు యుద్ధముచేతుమా యని కాచుకొనియుందురు. క్షత్రియులకు యుద్ధమందువలె వీరికి అవిద్యతో పోరుసల్పుటయందు పరమప్రీతి.

## 33. అథ చేత్త్వమిమం ధర్మ్యం[1] సంగ్రామం న కరిశ్యసి
## తతస్స్వధర్మం కీర్తిం చ హిత్వా పాపమవాప్స్యసి.

**టీక:–** అథ = ఇక, త్వమ్ = నీవు, ఇమమ్ = ఈ, ధర్మ్యమ్ = ధర్మయుక్తమైన, సంగ్రామమ్ =

---

★ ఏతద్ధనఞ్జయో వాచ్యో నిత్యోద్యుక్తో వృకోదరః
యదర్థం క్షత్రియా సూతే తస్య కాలో ఒయమాగతః (మహాభారతము ఉ–137-910)
కుంతీదేవి – ఓ కృష్ణా! దేనినిమిత్తము క్షత్రియమాత కొమరుని గనుచున్నదో, అట్టి సందర్భమిపు డేతెంచినదని అర్జునునితోను, నిరంతరము యుద్ధసన్నద్ధుడగు భీమునితోను జెప్పుము.

1. అథచేత్త్వం ధర్మ్యమిమం – పాఠాన్తరము.

యుద్ధమును, న కరిష్యసిచేత్ = చేయకుందువేని, తతః = అందువలన, స్వధర్మమ్ = స్వధర్మమును, కీర్తించ = కీర్తిని, హిత్వా = విడిచి, పాపమ్ = పాపమును, అవాప్స్యసి = పొందగలవు.

**తా:–** ఇక నీవు ధర్మయుక్తమగు ఈ యుద్ధమును చేయకుందువేని, దానిచే నీవు స్వధర్మమును నిరసించినవాడవై, కీర్తిని బోగొట్టుకొని పాపమును బొందగలవు.

## 34. అకీర్తిం చాపి భూతాని కథయిష్యన్తి తేఽవ్యయామ్
## సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే.

**టీక:–** అపిచ = మఱియును, భూతాని = ప్రాణులు (జనులు), తే = నీ యొక్క, అవ్యయామ్ = చిరకాలమువఱకు మాయకుండునట్టి, అకీర్తిమ్ = అపకీర్తిని, కథయిష్యన్తి = చెప్పుకొనగలరు, సంభావితస్య = గౌరవింపబడినవానికి, అకీర్తిః = అపకీర్తి, మరణాత్ చ = చావుకంటెను, అతిరిచ్యతే = అధికమైనదగుచున్నది.

**తా:–** మఱియు లోకులు నీయొక్క అపకీర్తిని చిరకాలమువఱకు చెప్పుకొనుచుందురు. గౌరవముగ బ్రతికినవానికి అపకీర్తి చావుకంటెను అధికమైనది.

**వ్యాఖ్య:–** చేయరానిపని చేసినపుడు, చేయవలసినపని చేయనపుడు లోకమున అపకీర్తి వ్యాపించును. చేయవలసిన ధర్మయుద్ధమును చేయనందుచే అర్జునుడు అపకీర్తి పాలగునని శ్రీ కృష్ణమూర్తి హెచ్చరించుచున్నారు. గౌరవస్థునకు అపకీర్తి మరణము కంటెను బాధాకరమైనది. ఏలయనిన, మరణ మొక్క శరీరమునే బాధించును. అపకీర్తియో తరతరములు బాధించును.

**అంతరార్థము:–** జీవుడు ఆత్మస్వరూపుడు. మహాగౌరవనీయుడగు వ్యక్తి. అతడు ఇంద్రియ మనంబులకు లోబడినచో అపకీర్తిపాలగును. కావున ఆత్మస్మృతిని బడసి, మాయను, ఇంద్రియాదులను జయించి అట్టి అపకీర్తి రాకుండ కాపాడుకొనుట యతని కర్తవ్యము.

## 35. భయాద్రణాదుపరతం మంస్యన్తే[2] త్వాం మహారథాః
## యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్.

**టీక:–** చ = మఱియు, యేషామ్ = ఎవరిలో, త్వమ్ = నీవు, బహుమతఃభూత్వా = గౌరవింపబడినవాడవై, లాఘవమ్ = చులకనను (అగౌరవమును), యాస్యసి = పొందగలవో, (తే = అట్టి), మహారథాః = మహారథులు, త్వామ్ = నిన్ను, రణాత్ = యుద్ధమునుండి, భయాత్ = భయమువలన, ఉపరతమ్ = మఱలినవానినిగా, మంస్యన్తే = తలంతురు.

**తా:–** మఱియు ఇంతవఱకు ఏ మహారథులందు నీవు ఘనముగా భావింపబడుచుంటివో, వారెల్లరు నిన్నిపుడు చులకనజేసి భయముచే యుద్ధమునుండి మఱలిన వానినిగ దలంతురు.

2. మన్యన్తే -- పాఠాంతరము

## 36. అవాచ్యవాదాంశ్చ బహూన్ వదిష్యన్తి తవాహితాః
## నిన్దన్తస్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్.

**టీక:–** తవ= నీ యొక్క, అహితాః= శత్రువులు, తవ= నీ యొక్క, సామర్థ్యమ్= సామర్థ్యమును, నిన్దన్తః = దూషించుచున్నవారై, బహూన్= అనేకములయిన, అవాచ్యవాదాంశ్చ = అనరాని మాటలనుగూడ, వదిష్యన్తి= పలుకగలరు, తతః = అంతకంటె, దుఃఖంతరమ్ = మిగుల దుఃఖకరమైనది, కిమ్ ను =ఏమి కలదు?

**తా:–** (ఇంతియేకాక అత్తఱి) శత్రువులు నీయొక్క సామర్థ్యమును దూషించుచు పెక్కు దుర్భాషణములనుగూడ పలుకగలరు. దానిని మించిన దుఃఖ మేమి కలదు?

**అ॥** ధర్మయుద్ధమువలన ఇహపరలోకములందు గలుగు శ్రేయమును వచించుచున్నాడు-

## 37. హతో వా ప్రాప్స్యసే [1] స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్
## తస్మాదుత్తిష్ఠ కౌన్తేయ యుద్ధాయ కృతనిశ్చయః.

**టీక:–** కౌన్తేయ = ఓ అర్జునా! హతో వా = (నీవు) చంపబడినవాడవైతివేని, స్వర్గమ్ = స్వర్గమును, ప్రాప్స్యసే = పొందగలవు, జిత్వావా = జయించితివేని, మహీమ్ = రాజ్యమును, భోక్ష్యసే = అనుభవింపగలవు, తస్మాత్= అందువలన, యుద్ధాయ = యుద్ధముకొఱకు, కృతనిశ్చయః = చేయబడిన నిశ్చయము కలవాడవై, ఉత్తిష్ఠ = లెమ్ము.

**తా:–** అర్జునా! ఒకవేళ నీవీ ధర్మయుద్ధమందు శత్రువులచే చంపబడినచో స్వర్గమును బొందెదవు. అట్లుకాక నీవే జయించినచో భూలోకరాజ్యము ననుభవించెదవు. ఈ ప్రకారముగ రెండువిధముల మేలే. కావున లెమ్ము, యుద్ధమునకు సంసిద్ధుడవుకమ్ము.

**వ్యాఖ్య:–** ఈ శ్లోకము ముముక్షువులకు ప్రాణమువంటిది. ఇదియొక మహామంత్రము. సాధనయందు నిరాశ, అధైర్యము, నిరుత్సాహము కలిగినపుడెల్ల దీనిని పఠించుచుండినచో మహాధైర్యము చేకూరగలదు. ఏలననిన, ధర్మపూర్వకమైన బాహ్య యుద్ధమున శూరుడు జయించినచో రాజ్యమును, మరణించినచో స్వర్గమును ఎట్లు పొందునో, అట్లే అవిద్య (మాయ)తో నొనర్చుసంగ్రామమున, ఆత్మానాత్మయుద్ధమున సాధకుడు విజయము నొందినచో మోక్షమును, మరణము నొందినచో ఉత్తమలోకప్రాప్తిని బడయుచున్నాడు. కావున రెండువిధముల నాతనికి శ్రేయమే కలుగుచున్నది. ఆధ్యాత్మికసాధన పూర్తికాకమునుపే ఒకవేళ మధ్యలో ముముక్షువునకు మరణము సంభవించినచో అత్తఱి యాతనికి దుర్గతి యేమాత్రమున్ను గలుగదనియు, ఉత్తమలోకములందు సుఖముల ననుభవించి మరల భూలోకమునం దుత్తమవంశముననో లేక యోగులయొక్క కులముననో జన్మించి తానిదివఱలో వదలిపెట్టిన సాధనను తిరిగి కొనసాగించునని భగవానుడు మున్ముందు (6 వ అధ్యాయమున) చెప్పబోవును. కావున ముముక్షువు తన ఆధ్యాత్మిక సాధనను, ప్రకృతితోటి తన సంగ్రామమును ఏమాత్రము సడలింపక కృతనిశ్చయుడై ముందునకు సాగిపోవలెనని అర్జునుని నెపమున లోకమున కంతకును శ్రీకృష్ణమూర్తి హెచ్చరిక చేయుచున్నారు.

1. ప్రాప్స్యసి – పాఠాంతరము

''కృతనిశ్చయః'' - అని చెప్పబడినందువలన లక్ష్య మనుభూతమగువఱకును సాధనను ఏమాత్రము వదలరాదను దృఢనిశ్చయము గలిగియుండవలెనని స్పష్టమగుచున్నది. దృఢమైననిశ్చయము, పట్టుదల లేనివారిని మాయ క్రిందకు త్రోసివేయును. కావున జాగరూకులై యుండవలెను.

'తస్మాదుత్తిష్ఠ' ★ - 'లెమ్ము' అని భగవాను డర్జునునకు ధైర్యమును భోదించుచున్నారు. సంసారక్షేత్రమున అనేక దుఃఖములందు, తాపత్రయములందుబడి క్షణికసుఖములకై దేవులాడుచు నానాయాతనల నొందుచున్న మానవాళి కిచ్చి ధైర్యోద్బోధక వాక్యములు, ప్రోత్సాహజనకములగు బోధలు ఎంతేని అవసరములై యున్నవి.

అ॥ కార్యముల నేప్రకార మాచరించినచో మనుజుడు పాపమునొందడో వచించుచున్నాడు -

## 38. సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ
## తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి.

**టీక:–** సుఖదుఃఖే = సుఖదుఃఖములను, లాభాలాభౌ = లాభనష్టములను, జయాజయౌ = జయాపజయములను, సమేకృత్వా = సమానములుగాదలంచి, తతః = అటు పిమ్మట, యుద్ధాయ = యుద్ధముకొఱకు, యుజ్యస్వ = సిద్ధపడుము, ఏవమ్ (చేత్) = ఇట్లు చేసితివేని, పాపమ్ = పాపమును, న అవాప్స్యసి = పొందవు.

**తా:–** సుఖదుఃఖములందును, లాభనష్టములందును, జయాపజయములందును సమబుద్ధిగలిగి యుద్ధమునకు సంసిద్ధుడవగుము. ఇట్లు చేసితివేని నీవు పాపమును పొందకుందువు.

**వ్యాఖ్య:–** ఈ శ్లోకమున భగవానుడు కర్మరహస్యమును బోధించుచున్నారు. కర్మము చేయుచును ఏవిధమైన పాపముచేతను అంటబడకుండు విధానమును తెలుపుచున్నారు. అదియే సమభావము (Balance of mind). సుఖదుఃఖాదులందు సమబుద్ధిగలిగి కర్మ నాచరింపవలయును. దానిచే మనుజుడు పాపస్పర్శలేకుండును. సుఖము తటస్థించి నపుడు పొంగిపోయి గర్వించక, దుఃఖము కలిగినపుడు క్రుంగిపోయి విచారపడక సమస్థితిని కాపాడుకొనవలెను. సమచిత్తమందు ఆత్మ చక్కగ ప్రతిబింబించును. అట్టివాడిక పాపము నెట్లు పొందగలడు? కర్మమార్గము తక్కువనియు, కర్మ బంధహేతువనియు, జన్మకారకమనియు కొందఱు తలంచుదురు. కాని భగవాను డట్లు చెప్పలేదు. సమబుద్ధిగలిగి కర్మ నాచరించినచో ఆ కర్మవలన పాపమెన్నటికిని చేకూరదని గీతాచార్యులు ఘోషించుచున్నారు. 'కర్మయందు దోషములేదు. కర్మచేయు విధానమందు గలదు' అని సాధకులు గుర్తెఱిగి ఆ కర్మను సమబుద్ధితో నాచరింపవలెను.

''తతో యుద్ధాయ యుజ్యస్వ'' - అని చెప్పుటవలన కర్మరంగమున ప్రవేశించుటకు ముందు కర్మనెట్లు చేయవలెనో ఆ పద్ధతి తెలిసికొని యుండవలెనని స్పష్టపడుచున్నది.

తతః = అటుపిమ్మట, - యుద్ధముచేయుము అని భగవానుడు పలికిరి. దేనికి పిమ్మట? సుఖదుఃఖాదులందు సమభావమును అలవాటుచేసికొని ఆపిమ్మట. అట్టి సమత్వమును ముందుగా

★ ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్యవరాన్నిబోధత. (కఠోపనిషత్తు)
లెండు, మేలుకొనుడు, మహనీయుల నాశ్రయించి జ్ఞానమునొందుడు!

నభ్యసింపకయే కర్మక్షేత్రమున దిగినచో పతనమొందిపోవును. కర్మయొక్క ఒడుదుడుకులచే చంచలత్వమొందును. మఱియు పాపమును సంపాదించును. కర్మమునకు తోడుగ జ్ఞానము తప్పక ఉండవలెను. అపుడే అది రాణించును. అందువలననే శ్రీకృష్ణపరమాత్మ అర్జుననకు తొలుదొల్తనే జ్ఞానముపదేశించి, ఆపిదప కర్మను బోధించిరి.

ప్ర:- కర్మము నెపుడాచరించవలెను?

ఉ:- సుఖదుఃఖాదులందు సమబుద్ధిని బడసినవెనుక.

ప్ర:- కర్మము చేయుచు పాపమంటకుండ నుండుట కుపాయమేమి?

ఉ:- చిత్తమందు సుఖదుఃఖాదులయెడల సమభావమును కుదుర్చుకొని కర్మచేసినచో పాపమంటదు.

**అ॥** ఇంతవఱకు సాంఖ్యయోగమునుగూర్చి బోధించి ఇక కర్మయోగము నొకింత చెప్పుటకు ప్రారంభించుచున్నాడు -

## 39. ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు
## బుద్ధ్యా యుక్తో యయా పార్థ కర్మబన్ధం ప్రహాస్యసి.

**టీక:–** పార్థ = ఓ అర్జునా! సాంఖ్యే = ఆత్మతత్త్వవిషయమునందు, ఏషా = ఈ ప్రతిపాదింపబడిన, బుద్ధిః = జ్ఞానము, తే = నీకు, అభిహితా = చెప్పబడినది, యయా బుద్ధ్యా = ఎట్టి వివేకముతో, యుక్తః = కూడినవాడవై, కర్మబన్ధమ్ = కర్మబంధమును, ప్రహాస్యసి = వదలగలవో, *(తామ్ = అట్టి)* యోగేతు = కర్మయోగవిషయమందలి, ఇమామ్ = ఈ చెప్పబోవు బుద్ధిని (నిశ్చయమును), శృణు = వినుము.

**తా:–** ఓ అర్జునా! ఇంతవఱకు సాంఖ్యశాస్త్రమున జెప్పబడిన ఆత్మతత్త్వనిశ్చయమును దెలిపియుంటిని. ఇక యోగశాస్త్రమందలి కర్మయోగసంబంధమైన వివేకమును నీకు దెలుపబోవుచున్నాను. అద్దానినెఱింగినచో నీవు కర్మబంధమునుండి లెస్సగ విముక్తుడవు కాగలవు. కాబట్టి శ్రద్ధతో నాలకింపుము.

**వ్యాఖ్య:–** కర్మచేసినను బంధింపబడక నుండవలెనననిన, ఆ కర్మ యెట్లు చేయవలెనో దానిని గూర్చిన వివేకమవసరము. అట్టి వివేకమునే 'బుద్ధి' అని యిట పేర్కొనిరి. అట్టి బుద్ధితోగూడి కర్మనాచరించినచో జీవుడు కర్మబంధమున తగుల్కొనడు. బంధమును గలుగజేయుకర్మ అత్తఱి మోక్షమునకు హేతువుగ పరిణమించిపోవును. కావున భగవానుడు తెలుపబోవు అట్టి 'బుద్ధి'ని, అట్టి కర్మయోగరహస్యమును ప్రతివారును హస్తగతమొనర్చుకొని బంధవిముక్తులు కావలయును.

**అ॥** కర్మయోగముయొక్క మహిమను వర్ణించుచున్నారు -

## 40. నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే
## స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్.

**టీక:–** ఇహ = (మోక్షమార్గమగు) ఈ కర్మయోగమునందు, అభిక్రమనాశః = ప్రారంభించినది నిష్ఫలమగుట, న అస్తి = లేదు, ప్రత్యవాయః = దోషమున్ను (లేక విరుద్ధఫలితమున్ను), న విద్యతే = లేదు, అస్య

ధర్మస్య = కర్మయోగమనెడు ధర్మముయొక్క, స్వల్పమపి = లేశమైనను, మహతః = గొప్పదైన, భయాత్ = భయమునుండి, త్రాయతే = రక్షించుచున్నది.

**తా:–** ఈ కర్మయోగము ప్రారంభింపబడినది నిష్ఫలమెన్నటికిని కానేరదు. పూర్తి యగుటకు ముందుగా ఏకారణముచేనైనను మధ్యలో నిలిచిపోయినను దోషము లేదు. ఈ కర్మయోగానుష్ఠానమను ధర్మము ఒకింతైనను గొప్పదైన (జననమరణ ప్రవాహరూపమైన) సంసారభయమునుండి రక్షించుచున్నది.

**వ్యాఖ్య:–** బుద్ధితో (వివేకముతో) గూడిన ఈ కర్మయోగము అనగా నిష్కామ కర్మయోగమును (ఆధ్యాత్మిక సాధనను) ప్రారంభించుట వ్యర్థముకానేరదు. అది తప్పక సత్ఫలమును గలుగుజేయును ఒకవేళ ఏదైన అవాంతరములచే మధ్యలో నిలిచి పోయినను దోషములేదు. విత్తనమును నేలలో నాటినపిదప చివరివఱకు దానిని జలాదులచే పోషించిన మాత్రమే ఫలితము చేతికి వచ్చును. మధ్యలో ఎపుడైన జలసేచనమును మానివేసినచో ఆ మొలక ఎండిపోయి ఫలమునివ్వదు. అట్టిది కాదీ నిష్కామకర్మయోగము. ఎంతచేసిన అంత ఫలమొసంగునేకాని దానివలన దోషమెన్నటికిని కలుగదు.

''త్రాయతే మహతో భయాత్''– వివేకముతో గూడిన ఈ కర్మాచరణము, లేక నిష్కామకర్మయోగము ఒకింత కావింపబడినను మహాభయమునుండే జీవుని కాపాడునని వచింపబడినది. ప్రపంచములో అన్ని భయములకంటె గొప్పభయమేది? మరణభయము. జననమరణరూప సంసారభయము. అద్దాని నీ నిష్కామకర్మానుష్ఠానము తొలగించివేయుచున్నది.

చిన్న నిప్పురవ్వయైనను ఘోరకంటకావృతమహారణ్యమును భస్మీభూతమొనర్చునట్లును, చిన్న ఓడయైనను విశాలమహాసముద్రమును దాటించునట్లును ఈ పరమార్థసాధనయు ఒకింతైనను ఘోరసంసారవిపత్తునుండి జీవుని కాపాడుచున్నది. కాబట్టి సాధకు లిక దిగులు నొందవలసినపనిలేదు. పూర్ణస్థితిని మొట్టమొదట పొందలేక పోయినను తమ సాధనను విడువక ఆచరించుచుండవలెను. చిన్న పూజయైనను, చిన్న మంత్రమైనను, ఒక్క పుణ్యకార్యమైనను, దానిని గట్టిగ పట్టుకొని, దానియందు పరిపూర్ణవిశ్వాసముంచి ఆచరించుచుండినచో క్రమముగ నదియే సంసారసముద్రతరణోపాయమై విలసిల్లును. ఔషధము ఒకింతైనను, పథ్యానుసారముగ చక్కగ సేవించినచో భయంకరమగు రోగమునుగూడ మాన్పునుగదా!

కర్మయోగమను ధర్మము స్వల్పమైనను మహాసంసారభయమునుండి జీవుని పరిరక్షించునని భగవాను డీశ్లోకమున సెలవిచ్చిన విషయము సాధకలోకమున కెంతయో అశ్వాసమును గలుగజేయుచున్నది. ఏలననిన ''ఈ అనంత సంసారసాగరము నెట్లీదగలమా, ఈ ఘోరతమస్సు నెట్లు దాటగలమో, అయ్యో! మేము అన్ని ధర్మముల నాచరింపలేమే, నిరంతరము సాధనచేయలేమే. అది ఆ ఋషులకే, ఆ మునీశ్వరులకే చెల్లును, మాబోటి సామాన్యులు అంత తపస్సు నెట్లు చయగలరు?'' అని యీ ప్రకారముగ చింతించుచుండ జనులకు ధైర్యము నొసంగి మోక్షప్రాప్తికి, సంసారభయవినాశమునకు చక్కని వరప్రసాదమును భగవాను డిచట నొసంగినారు కావున భగవద్వాక్యములపై విశ్వాసముంచి నిష్కామకర్మయోగమను ఆధ్యాత్మికధర్మమును ఒకింతైనను ఆచరించి జనులు బంధవిముక్తులగుదురుగాక!

ప్ర:– నిష్కామకర్మమను ధర్మముయొక్క ప్రాశస్త్యమును వివరింపుడు?

ఉ:– (1) దానిని ప్రారంభించినచో నిష్ఫల మెన్నటికిని కాదు. (2) కొంత ఆచరించి మధ్యలో నిలిపినను దోషము లేదు (3) కొద్దిగ ఆచరించినను గొప్ప సంసారభయమును తొలగించును.

ప్ర:– సంసారభయమునుండి తప్పించుకొనుటకు ఉపాయమేమి?

ఉ:- వివేకయుక్తమగు కర్మాచరణము (నిష్కాను కర్మానుష్ఠానము).

అII ఉత్తమ కర్మయోగియొక్క స్థిరచిత్తమునకును, భోగాసక్తుల చంచలమానసమునకు గల భేదమును పుచున్నాడు -

**1. వ్యవసాయాత్మికా బుద్ధిరేకేహ కురునన్దన**
**బహుశాఖా హ్యనన్తాశ్చ బుద్ధయో உవ్యవసాయినామ్.**

**టీక :–** కురునన్దన= ఓ అర్జునా!, ఇహ= ఈకర్మయోగముయొక్క అనుష్ఠానమందు, వ్యవసాయాత్మికా నిశ్చయముతో గూడినట్టి, బుద్ధిః = బుద్ధి, ఏకా = ఒక్కటియే, అవ్యవసాయినామ్ = )యములేనివారలయొక్క, బుద్ధయః = బుద్ధులు , బహుశాఖాః = పలువిధములుగ పించియున్నవిగను, అనన్తాశ్చహి= అనంతములుగనున్నవిగదా!

**తా:–** అర్జునా! ఈ కర్మయోగానుష్ఠానమున నిశ్చయముతోగూడిన బుద్ధి ఒక్కటియే. )యములేనివారలయొక్క బుద్ధులు పలువిధములుగను, అనంతములుగను నున్నవి.

**వ్యాఖ్య:–** దైవమందు (ఆత్మయందు) నిశ్చయము గల్గియున్నబుద్ధి ఒక్కటియే అయియున్నది. యనిన, అది ఆ దైవమును తప్ప అన్యమును కాంక్షింపదు. అది శాఖోపశాఖలుగ విస్తరింపదు. దైవమను ్యమందే ఏకాగ్రముగ నుండును అట్టి నిశ్చయాత్మకమగు బుద్ధిగలవారు చేయు ప్రతికార్యమున్ను, భావనయు దైవోన్ముఖముగ నుండును. ఫలాపేక్షలేక ఈశ్వరార్పణముగ వారు కార్యములను యుచుందురు. అట్టి దైవలక్ష్యము లేనివారు అనేక ప్రాపంచిక వస్తువులను ఆశ్రయించి, దృశ్యపదార్థములపైకి ంగిడుచు, వాని ప్రాప్తియే తమ గమ్యముగ భావించి చంచల బుద్ధిగలిగియుందురు. అట్టివారి బుద్ధి న్ముఖముగ నుండదు. డొంకపైతీగెవలె బహుశాఖలుగ విస్తరించి, ప్రపంచవస్తువులపైబడి పెక్కు ఫలము ం గోరుచు, భోగములను కాంక్షించుచు అనేక కర్మకాండలలో చిక్కుకొని తత్ఫలితముగ ఏకాగ్రతలేనిదై ంచును. భిన్నభిన్నములగు సూర్యకిరణములు భూతద్దముద్వారా ఏకోన్ముఖములు కాగా క్రిందనున్న తమునుగూడ భస్మముచేసివేయగల్గును. అవియే వేఱువేఱుగ నున్నపుడు అట్టిశక్తిని గలిగియుండవు. ్విధముగనే నిశ్చయాత్మకమగు ఏకాగ్రబుద్ధియందును అఖండశక్తి విరాజిల్లును. ప్రాపంచికమానవుడు అనేక ్యవిషయములందు ప్రసరించిన మనస్సుగలవాడై కోరికలను తీర్చుకొనుటయందే తనశక్తినంతయు బోయుచుండును. అట్టివాని చిత్తము చంచలముగను బహుశాఖాయుతముగను నుండుటచే శాంతిలేక డిల్లుచుండును. కావున వివేవవంతుడై దైవమందు (మోక్షమందు) నిశ్చయముగల్గియున్నట్టి బుద్ధినే లంబించి, బహుశాఖాత్మకమగు అనిశ్చయాత్మక బుద్ధిని త్యజించివేయవలయును.

అII నిశ్చయాత్మక బుద్ధిలేనివారి స్వభావమును వర్ణించుచున్నాడు -

**2. యామిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్యవిపశ్చితః**
**వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతివాదినః.**

**3. కామాత్మానః స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్**
**క్రియావిశేషబహులాం భోగైశ్వర్యగతిం ప్రతి.**

**44. భోగైశ్వర్యప్రసక్తానాం తయాఽపహృతచేతసామ్
వ్యవసాయాత్మికా బుద్ధిస్సమాధౌ న విధీయతే.**

**టీక:–** పార్థ = ఓ అర్జునా! వేదవాదరతాః = వేదమునందు ఫలమును దెలిపెడి భాగములందు (అర్థవాదములందు) ప్రీతిగలవారును, నాన్యదస్తీతివాదినః = అందు జెప్పబడిన స్వర్గాదులకంటె అధికమైన ఫలము వేఱొకటి లేదని వాదించువారును, కామాత్మానః = కోరికలతో నిండిన మనస్సుగలవారును, స్వర్గపరాః = స్వర్గమునం దాసక్తి గలవారును (అగు), అవిపశ్చితః = అవివేకులు (తత్త్వము తెలియని అల్పజ్ఞానులు), జన్మకర్మఫలప్రదామ్ = జన్మమును, కర్మమును, దాని ఫలమును ఇచ్చునట్టియు, భోగైశ్వర్యగతిం ప్రతి = భోగములను, ఐశ్వర్యములను సంపాదించుటకు, క్రియావిశేషబహులాం = వివిధకర్మకలాపములతో గూడినదియు, పుష్పితామ్ = ఫలప్రదము కాని కేవల పుష్పములవలె చూపులకు మాత్రము రమ్యమైయుండునదియు (అగు), యామ్ ఇమామ్ = ఏ యీ, వాచమ్ = వాక్యమును, ప్రవదన్తి = విశేషించి చెప్పుచున్నారో, తయా = దానిచేత, అపహృత = అపహరింపబడిన, చేతసామ్ = మనస్సుగలవారును, భోగైశ్వర్యప్రసక్తానామ్ = భోగములందు, ఐశ్వర్యములందు మిక్కుటమగు ఆశకలవారు నగువారికి, వ్యవసాయాత్మికాబుద్ధిః = నిశ్చయమైనబుద్ధి (ఏకాగ్ర బుద్ధి), సమాధౌ = దైవధ్యానమందు (సమాధినిష్ఠయందు), న విధీయతే = కలుగనేరదు.

**తా:–** ఓ అర్జునా! వేదమునందు ఫలమునుదెలుపు భాగములం దిష్టముకలవారును, అందుజెప్పబడిన స్వర్గాది ఫలితములకంటె అధికమైనది వేఱొకటియెద్దియు లేదని వాదించువారును, విషయవాంఛలతో నిండిన చిత్తముకలవారును, స్వర్గాభిలాషులునగు అల్పజ్ఞులు, జన్మము, కర్మము, తత్ఫలము నొసంగునదియు, భోగైశ్వర్యసంపాదనకై వివిధకార్యకలాపములతో గూడినదియు, ఫలశూన్యమైనదియునగు ఏ వాక్యమును చెప్పుచున్నారో అద్దానిచే నపహరింపబడిన చిత్తముకలవారును (ఆవాక్యమునునమ్మి దృశ్య వ్యామోహమందు పడువారును) భోగైశ్వర్యప్రియులునగు జనులకు దైవధ్యానమందు (సమాధి నిష్ఠయందు) నిశ్చయమైన (ఏకాగ్రమైన) బుద్ధి కలుగనే కలుగదు.

**వ్యాఖ్య:–** పుష్పితాం వాచమ్ – ఫలప్రదముకాని వాక్యములు – లోన ఫలము లేనట్టి మోదుగ, బంతి, మున్నగు పుష్పములను బోలినవి. పైకి సొగసుగా గన్పించి లోన సత్తువలేనివి. మోక్షమనుఫలము నివ్వనట్టి కామ్యకర్మాదులంగూర్చిన వాక్యములని భావము.

''ప్రవదన్తి'' – 'వదన్తి' అని చెప్పక 'ప్రవదన్తి' అని చెప్పుటచే సారహీనములగు తమ వాక్యములను వారు అధికముగ పలుకుచుందురని అర్థము (Empty Vessels make much noise)

''అవిపశ్చితః'' – అవివేకులు, అల్పజ్ఞులు – కామ్యకర్మాదులను చేయువారు స్వర్గాది భోగముల నభిలషించువారు, తెలివితక్కువవారని యిట చెప్పబడినది. అట్టి వారిని తెలివికలవారిలో భగవంతుడు జమకట్టలేదు. కావున ఎంతటి మహాపండితుడైనను, వేదవేత్తయైనను, కామ్యబుద్ధిగలిగి, స్వర్గాదిభోగముల నపేక్షించువాడైనచో పరమార్థ దృష్టియం దాతడు వట్టి అవివేకియే యగును. అట్టివారి కనువిప్పుకొఱకై భగవానుడీ వాక్యములను చెప్పుచున్నాడు. మఱియు స్వర్గాదులనుగూర్చి అచటి భోగములను గూర్చి భగవానున కెట్టి యభిప్రాయముకలదో ఈ శ్లోకములందు వెల్లడియగుచున్నది.

''వేదవాదరతాః'' - వేదములలో ఫలమును దెలిపెడి అర్థవాదములు కొన్ని కలవు - 'ఈ ప్రకారము చేసినచో ఈ యీస్వర్గభోగములు కలుగును' - అని. అట్టివానిని పట్టుకొని వారు వ్రేలాడుదురు. వేదవేదాంతములలో మోక్షప్రాప్తికై యుపదేశింపబడిన బోధలెన్నియో కలవు. వాని నన్నింటిని వదలివేసి, కామ్యకర్మవిభాగమునే పట్టుకొని 'ప్రపంచమున ఇది తప్ప మఱియొకటి యేదియు లేనేలేద'ని వారు వాదించుదురు. వేదమునందు మూడు విభాగములు కలవు - (1) కర్మకాండ (2) ఉపాసనాకాండ (3) జ్ఞానకాండ అని. ఈ శ్లోకములందు తెలుపుబడిన అవివేకులు మొదటి కర్మకాండనే పట్టుకొని, అందును స్వర్గాదిఫలములనుగూర్చి చెప్పు భాగమునే స్వీకరించి, తక్కిన రెండిటిని వదలివేయుదురు. వారి పద్ధతి సరికాదని గీతాచార్యులు బోధించుచున్నారు.

''కామాత్మానః'' - కోరికలే స్వరూపముగ గలవారు, ఒంటినిండా కోరికలు కలవారని అర్థము. దారేషణ, ధనేషణ, పుత్రేషణలతో గూడి కామపిశాచమునకు తమ హృదయమున నెలవొసంగువారు. ఆ ప్రకారము ఉండరాదు. హృదయమున భగవంతునకు తావీయవలెనేకాని కామాది దుష్టప్రవృత్తులకుగాదు. దైవాత్ములు, కరుణాత్ములు, పరమాత్ములు కావలెనేకాని కామాత్ములు, క్రోధాత్ములు కాగూడదు.

''స్వర్గపరాః'' - వారు మోక్షపరులుకాదు. స్వర్గపరులు. అధ్యాత్మక్షేత్రమున స్వర్గమున కాధిక్యత యొసంగబడదు. పైగా స్వర్గాది సుఖములనుగూడ తృణీకరించిన వానికే మోక్షము లభించునని అట చెప్పబడినది. కాబట్టి సమాన్యులదృష్టిలో స్వర్గము అధికముగ తోచవచ్చునుగాని జ్ఞానులదృష్టియందుగాదు. ఏలననిన స్వర్గమున్ను ఒకానొక లోకమే. సృష్టి స్థితి లయములు దానికిన్ని కలవు. అయితే అచటి భౌతికవస్తువులు ఒకింత నాణ్యముగ నుండవచ్చును. దానివలన ప్రయోజనమేమి? అవి శాశ్వతములుకావుగదా! పైగా పుణ్యము క్షయించినచో మరల క్రిందపడిపోవలసినదే కదా!★. కావున విషయభోగములలో ముంచి జీవునియందు మృగప్రవృత్తిని రేకెత్తించి మోక్షమున కాతనిని దూరునిగ జేయునట్టి ఆ స్వర్గసీమవలన మనుజునకు కలుగు పరమపురుషార్థ మేదియును లేదు. విజ్ఞులద్దానిని ఆశింపరు; పైగా దానిని బంధకరముగ భావింతురు. భగవానుడుకూడ ఇచట ఆ స్వర్గాసక్తులను తీవ్రముగ విమర్శించి చెండాడిరి. కాబట్టి వైరాగ్యశీలురును, మోక్షకాంక్షులునగు వారెవరును వానిజోలికి పోరాదు.

''జన్మకర్మఫలప్రదామ్'' - కామ్యకర్మలు జన్మరాహిత్యము నెన్నటికిని కలుగజేయ జాలవు. కర్మ, జన్మ - జన్మ, కర్మ అను సంసారచక్రమున అవి జీవుని పడవేయును. కనుకనే భగవానుడు గీతయందు నిష్కామకర్మనే ప్రోత్సహించిరిగాని కామ్యకర్మను గాదు. కాబట్టి జన్మకర్మరూపములగు దారుణ ఫలితములను గలుగజేయు ఆ కామ్యకర్మలను ముముక్షువు లాశ్రయింపరాదు.

''క్రియావిశేషబహులాం భోగైశ్వర్యగతిం ప్రతి'' - స్వర్గాది భోగములను, ఐశ్వర్యములను అభిలషించి వానికొఱకై అనేక యజ్ఞయాగాదుల నాచరించుచు, కర్మకాండయందు వారు మునిగిపోవుదురు. వారు యత్నించునది శాశ్వత దైవసుఖము కొఱకుగాదు, క్షణిక ప్రాపంచిక సుఖముకొఱకు.

''తయాఽపహృతచేతసామ్'' - కామకర్మనిరతులు చెప్పు తియ్యనిమాటలచే జనుల చిత్తము లీడ్వబడుచున్నవి. వానిచే వారు మోసపోవుచున్నారు. కావున అట్టివారి సహవాసము చేయరాదు. సత్పురుషులయొక్క, సాధుపుంగవులయొక్క, విరాగులయొక్క సాంగత్యము చేసినచో చిత్తము దైవోన్ముఖముగ ప్రవర్తించును.

★ క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి

''వ్యవసాయాత్మికాబుద్ధిః సమాధౌ న విధీయతే'' - అట్టి భోగైశ్వర్యప్రసక్తి వలన కలుగు నష్టమేమియనిన, అది కలవారికి ధ్యానమందు, దైవచింతనయందు మనస్సు నిలుకడను బొందదు. చిత్తము బహిర్ముఖమగును. అట్టివారికి సమాధిస్థితి ఎన్నడును సిద్ధించదు. గాలి వీచుచున్నపుడు దీపమెట్లు మహాచంచలముగా నుండునో వారి చిత్తమున్ను అట్లుండును. దానిచే అశాంతి, అశాంతిచే సుఖవియోగము వారికి కలుగును. కావున మోక్షమునకు అత్యావశ్యకమైనట్టి ధ్యాననిష్ఠ చక్కగ జరుగుటకొఱకై చిత్తమును విషయభోగములపైకి పరుగిడనీయక చూడవలయును.

ప్ర. భోగైశ్వర్య ప్రసక్తి వలన కలుగు నష్టమేమి?

ఉ:- దానిచే దైవధ్యానమందు మనస్సు నిలువదు.

**అ॥** విషయములం దాసక్తిని త్యజించి ఆత్మానుభవమును బొందులాగున ప్రేరేపించుచున్నాడు -

## 45. త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున
## నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్.

**టీక:–** అర్జున = ఓ అర్జునా!, వేదాః = వేదములు (వాని పూర్వభాగమైన కర్మకాండము), త్రైగుణ్యవిషయా, = త్రిగుణాత్మకములగు విషయములను తెలుపునవి, *(త్వమ్ = నీవు)*, నిస్త్రైగుణ్యః = త్రిగుణములను విడిచినవాడవును (లేక త్రిగుణములవలన గలుగు విషయాశను త్యజించినవాడవును), నిర్ద్వన్ద్వః = సుఖదుఃఖాది ద్వంద్వములు లేనివాడవును, నిత్యసత్త్వస్థః = నిరంతరము శుద్ధసత్త్వము నాశ్రయించినవాడవును, నిర్యోగక్షేమః = యోగక్షేమములు లేనివాడవును, ఆత్మవాన్ = ఆత్మజ్ఞానివియు, భవ = కమ్ము.

**తా:–** ఓ అర్జునా! వేదములు (అందలి పూర్వభాగమగు కర్మకాండము) త్రిగుణాత్మకములగు (సంసార) విషయములను తెలుపునవిగానున్నవి. నీవు త్రిగుణములను వదలినవాడవును, ద్వంద్వములు లేనివాడవును, నిరంతరము శుద్ధసత్త్వము నాశ్రయించిన వాడవును, యోగక్షేమములదృష్టి లేనివాడవును, ఆత్మజ్ఞానివియు కమ్ము!

**వ్యాఖ్య:–** ''త్రైగుణ్యవిషయా వేదాః'' - పై శ్లోకములందలి సందర్భమునుబట్టి చూచినచో కర్మకాండకు, యజ్ఞయాగాదులకు సంబంధించిన వేదభాగము (పూర్వభాగము) ను గూర్చియే యిచట ప్రస్తావింపబడినదని స్పష్టమగుచున్నది. వేదముయొక్క ఉత్తరభాగము త్రిగుణాతీతమగు పరబ్రహ్మమునుగూర్చియే వచించినది. దృశ్యప్రపంచమంతయు త్రిగుణములతో గూడినది. అది అల్పమైనది. దృక్స్వరూపమగు ఆత్మయొకటియే త్రిగుణాతీతమైనది. అది సర్వోత్తమమైనది. గుణములకు లోబడియున్న వానికే ఈ బంధము, ఈ బాధలు, ఈ జన్మములు, కర్మములు. గుణములనుదాటి ఆత్మయందు స్థితిగల్గియున్న జ్ఞానికి నివియేవియు నుండవు. కనుకనే భగవాను డర్జునుని గుణాతీతుడుగ, ఆత్మవంతుడుగ కమ్మని ఆనతిచ్చిరి.

''నిత్యసత్త్వస్థః'' - ఇచట తెలుపబడిన సత్త్వము త్రిగుణములలోని సత్త్వము కాదు. త్రిగుణములను దాటుమనిచెప్పి మరల ఒకానొక గుణము నాశ్రయింపుమని ఎన్నటికిని బోధింపరు. కావున ఇచట 'సత్త్వము' నకు విశుద్ధసత్త్వస్థితి లేక ఆత్మస్థితి యని అర్థము చెప్పుకొనుట మంచిది. 'జ్ఞచిత్తం సత్త్వముచ్యతే' (ఆత్మజ్ఞానియొక్క

బ్రహ్మాకారమగు చిత్తము సత్త్వమనబడును) అని శ్రీ వసిష్ఠమునీంద్రులు తెలిపియున్నారు. 'నిత్యసత్త్వస్థః' అని చెప్పబడినందున ఏదియో ఒకానొకకాలమందుగాక నిరంతరము సత్త్వము నాశ్రయించి, ఆత్మస్థితుడై యుండవలెనని భావము.

''నిర్యోగక్షేమ ఆత్మవాన్'' - యోగమనగా లేనివస్తువును బొందుట, క్షేమమనగా దానిని కాపాడుట - ఈ రెండును లేకుండుమని భగవానుడు తెలిపెను. ఏలననగా ఆత్మయందున్న వానికి సమస్త పదార్థములు పొందబడినట్లే యగును గాన ఇక నాతడు దేనిని వాంఛింపవలెను? ఆత్మవంతుడై (ఆత్మవాన్) యుండుమని భగవదాజ్ఞ. 'ధనవాన్, సౌందర్యవాన్, అధికారవాన్, ....' అని చెప్పక 'ఆత్మవాన్' అని చెప్పుటవలన ప్రపంచములోని సమస్తపదార్థములకంటెను, పదవులకంటెను ఆత్మస్థితియే సర్వోత్తమమైనదని సూచితమగుచున్నది.

ప్ర:- ఏ ప్రకారము వర్తించవలసినదిగా శ్రీ కృష్ణ దర్జుననకు బోధించెను?

ఉ:- (1) త్రిగుణములను దాటిపోవలెను (2) ద్వంద్వములు లేకుండవలెను (3) నిరంతరము విశుద్ధసత్త్వమందు (ఆత్మయందు) స్థితిగల్గియుండవలెను. (4) యోగక్షేమములదృష్టి యుండరాదు (5) ఆత్మజ్ఞానియై వర్తించవలెను.

**అ॥** ఆత్మజ్ఞానియొక్క మహిమను పేర్కొనుచున్నాడు -

## 46. యావానర్థ ఉదపానే సర్వతస్సంప్లుతోదకే
## తావాన్సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః.

**టీక:-** ఉదపానే = బావి మొదలగు వానియందు, యావానర్థః = ఎంతటి ప్రయోజనము కలదో, సర్వతస్సంప్లుతోదకే = అంతటను నీటితో నిండియున్న జలప్రవాహమునందు, తావాన్ (+ అర్థః) = అంతటి ప్రయోజనము (యథా + భవతి) ఎట్లుకలుగుచున్నదో - దానియం దెట్లు ఇమిడియున్నదో, సర్వేషువేదేషు = సమస్తవేదములందును (వేదోక్తములైన సమస్తకర్మములలోను) (యావానర్థః = ఎంత ప్రయోజనముగలదో) (తావాన్ అర్థః = అంతప్రయోజనము) విజానతః = ఆత్మస్వరూపనిశ్చయానుభవముగల, బ్రాహ్మణస్య = బ్రహ్మనిష్ఠునకు, (తథా భవతి = అ ప్రకారమే కలుగుచున్నది - బ్రహ్మానందమునం దిమిడియున్నది.)

**తా:-** స్నానపానాదుల కుపయుక్తమగు స్వల్పజలముగల బావి మొదలగువాని యందెంత ప్రయోజనముకలదో, అంతప్రయోజనము అంతటను నీటితో నిండియున్న మహత్తర జలప్రవాహమునం దిమిడియున్న చందమున, వేదములందు జెప్పబడిన సమస్త కర్మములందును ఎంత ప్రయోజనము కలదో అంత ప్రయోజనము పరమార్థతత్త్వము నెఱిగిన బ్రహ్మనిష్ఠునకు బ్రహ్మానందమున నిమిడియున్నది.

మఱియొక అర్థము:- స్నానపానాదులవిషయమై అంతటను నీటితో నిండియున్న చెఱువు మొదలగువానియందు మనుజున కెంతటి ప్రయోజనము కలదో అంతటి ప్రయోజనమే సమస్తములైన వేదములందును అనుభవజ్ఞుడైన బ్రహ్మనిష్ఠునకు కలదు.

**వ్యాఖ్య: -** చిన్న చిన్న బావులందు స్నానపానాదుల కెంత ప్రయోజనము కలదో అంత ప్రయోజనము సర్వత్ర జలముతో నిండిన తటాకమం దంతర్భూతమైయున్నది. అట్లే వేదములందు జెప్పబడిన సమస్తకర్మకాండయొక్క ఫలము, ఆత్మానుభవముగల బ్రహ్మజ్ఞానియం దంతర్భూతమైయున్నది. కాబట్టి అట్టి

బ్రహ్మనిష్ఠుడు వేదములందలి ఆ కామ్యకర్మాదిఫలముల నెన్నటికిని అపేక్షింపడు 'శతే పంచాశత్' న్యాయము ననుసరించియు (నూటియందు యాభై యిమిడియున్న చందమున), ఏనుగుపాదమునందు తక్కిన అన్ని ప్రాణులయొక్క పాదములు ఇమిడియున్నట్లును, ఆత్మసుఖమునందు ఇతరములగు సమస్తసుఖములున్ను ఇమిడియున్నవి. కాబట్టి ఆత్మానుభవముగల జ్ఞాని వేదోక్తములగు స్వర్గాది కామ్యకర్మలఫలములకై దేవులాడడు. ఇచట 'జానతః' అని చెప్పక 'విజానతః' అని చెప్పినందువలన పైపైజ్ఞానము (Superficisl knowledge) చాలదనియు, అనుభవజ్ఞానముండవలెనని స్పష్టమగుచున్నది.

ఈ శ్లోకమును రామానుజులు మొదలగువారు మఱియొక విధముగ వ్యాఖ్యానించిరి - దప్పికగొనినవానికి మహాతటాకమునగల జలమంతటితోను ప్రయోజనములేదు. నాలుగు దోసిళ్ళు నీళ్లు మాత్రము చాలును. రోగి అన్ని ఔషధములను తినబనిలేదు. ఏ ఒక్క ఔషధమైనను చక్కగ సేవించినచాలును. ఆకలిగలవాడు అన్నపురాసుల నన్నింటిని భుజించనక్కఱలేదు. గుప్పెడు మెతుకులు తినినచాలును. అట్లే వివేకవంతునకు సమస్తవేదములలోను బ్రహ్మప్రాప్తికి అవసరమైన ఏకొన్ని సాధనలనో చక్కగ అనుష్ఠించి, అనుభూతమొనర్చుకొనిన చాలును. తక్కిన కామ్యకర్మాదులన్నిటితో నతనికి ప్రయోజనమేమియునులేదు. వేదములందు అనేక మంత్రములు, ఉపాసనలు, కర్మలు చెప్పబడినప్పటికిని భవరోగము నశించి మోక్షధామముచేరుటకు సాధకునకు ఏ ఒక్కమంత్రమో, ఉపాసనయో, ధ్యానమో సక్రమముగ ననుష్ఠించినచాలును. 'అన్నిటిని మేము చేయలేదే' యని యెవరును దిగిలునొంద పనిలేదని భగవానుడిచట భక్తులకు ఆశ్వాస మొసంగుచున్నారు.

**అ॥** ఇక కర్మయోగముయొక్క పద్ధతిని భగవానుడు తెలుపుచున్నాడు -

## 47. కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన
## మా కర్మఫలహేతుర్భూర్మాతే సఙ్గోఽస్త్వకర్మణి.

**టీక:- తే** = నీకు, కర్మణ్యేవ = కర్మమునందే, అధికారః = అధికారము (అస్తి = కలదు), కదాచన = ఒకప్పుడును, ఫలేషు = (వాని) ఫలములందు, (అధికారః = అధికారము) మా = వలదు, కర్మఫలహేతుః = కర్మఫలములకు కారణమైనవాడవు, మాభూః = కాకుము, అకర్మణి = కర్మలుచేయకుండుటయందు, తే = నీకు, సఙ్గః = ఆసక్తి, మా అస్తు = కలుగుకుండునుగాక!

**తా:-** (అర్జునా!) నీకు కర్మనుచేయుటయందే అధికారము కలదు. కర్మఫలముల నాశించుటయం దేనాడును నీకధికారము లేదు. కర్మఫలములకు నీవు కారణభూతుడవుకాకుము, మఱియు కర్మలు మానుటయందును నీకాసక్తి కలుగకుండుగాక!

**వ్యాఖ్య:-** అర్జునా ! కర్మలుచేయుటయే నీవంతు. ఫలమునుగోరుటకాదు. అని భగవాను డిచట తెలిపిరి. అనగా ఫలాభిసంధిరహితముగ, ఈశ్వరార్పణబుద్ధితో, కర్తృత్వరహితముగ కర్మల నాచరింపుమని భావము. 'కదాచన' అని చెప్పినందు వలన ఏకాలమందును అట్టి ఫలమును వాంఛింపకుమని భగవానుడు శాసించినట్లెరి. ఫలమునుగోరి చేయు కర్మలచే చిత్తశుద్ధి కలుగదు. చిత్తశుద్ధి కలుగనిచో ఆత్మజ్ఞాన మంకురింపదు. ఆత్మజ్ఞానము లేనిచో మోక్షము చేకూరదు. కాబట్టి మోక్షప్రాప్తికి నిష్కామకర్మ అత్యంత ఆవశ్యకమైయున్నది.

''మాతేసఙ్గోఽస్త్వకర్మణి'' - కర్మలయొక్క ఫలమును కోరవలదని చెప్పిరిగదా యని అసలు కర్మలే మానెదవేమో, అట్లెన్నటికిని చేయరాదని భగవానుడు చెప్పుచున్నాడు. ఏలయననిన, అది సోమరితనము

క్రిందకు వచ్చును. అది తమోగుణము. ఏ కర్మయు చేయక నుండుట గొప్పతనము కాదు. నిద్రలో ఎవరును ఏకర్మయు చేయరు. గోడ ఏకర్మను చేయదు. వానికి గొప్పతనమేమియు రాలేదు. కావున తమోగుణజన్యమగు అకర్మణ్యత్వమును దూరముగ పారద్రోలుమని భగవానుడు శాసించుచున్నారు. సోమరుల కీవాక్యమొక గొడ్డలిపెట్టుగ తయారైనది. కొందఱు సమాధినిష్ఠ యను పేరిట కేవలము తమస్సునందే కాలము గడుపుచున్నారు. అట్టివారు ఇహపరములకుగూడ చెడినవారగుదురు. వారు లేచి ఏదియో యొక సత్కార్యమును చేయుటమేలు. కర్మచేయక ఎవడును ఉండలేడు - కావున ఏదియోయొక కర్మను చేయవలెను. దానినే నిష్కామముగ నాచరింపుడని భగవాను డానతిచ్చుచున్నాడు. అట్లు చేసినచో అపారమగు మేలు చేకూరగలదు, గీతయొక్క ప్రధానాశయములలో ఈ అనాసక్తియోగమొకటి. అకర్మణ్యుడై రథమున చతికిలబడిన అర్జునుని కర్మవీరునిగ తయారుచేసిన బోధ లివియే. కావున ఇట్టి నిష్కామకర్మతత్త్వమును బాగుగ తెలిసికొని జనులు తమ జీవితములను సంస్కరించుకొనవలసియున్నది.

ప్ర:- మనుజునకు దేనియం దధికారము కలదు?

ఉ:- కర్మలు చేయుటయందే అధికారము కలదు, గాని ఫలము లాశించుటయందు గాదు.

ప్ర:- దేనిని త్యజించవలెను?

ఉ:- కర్మఫలమును, అకర్మణ్యత్వమును (ఏపనిని చేయకుండుటను) రెండిటిని వదలవలెను.

ప్ర:- కాబట్టి ఫలితాంశమేమి?

ఉ:- కర్మలను చేయుచు ఫలమును వదలవలెను.

**48. యోగస్థః కురు కర్మాణి సఙ్గం త్యక్త్వా ధనంజయ**
**సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే.**

**టీక:–** *ధనంజయ* = ఓ అర్జునా! (*త్వమ్* = నీవు) *యోగస్థః* = యోగనిష్ఠయందుండి, *సఙ్గం* = (నేను, నాది యను) అభిమానమును, ఆసక్తిని, *త్యక్త్వా* = విడిచి, *సిద్ధ్యసిద్ధ్యోః* = ఫలము నొందినను నొందకపోయినను, *సమోభూత్వా* = సమముగ నున్నవాడవై, *కర్మాణి* = కర్మములను, *కురు* = చేయుము, *సమత్వం* = (అట్టి) సమబుద్ధియే, *యోగః (ఇతి)* = యోగమని, *ఉచ్యతే* = చెప్పబడుచున్నది.

**తా:–** ఓ అర్జునా! నీవు యోగనిష్ఠయందుండి, సంగమును త్యజించి, కార్యము ఫలించినను, ఫలించకపోయినను సమానముగ నున్నవాడవై కర్మలను జేయుము. అట్టి సమత్వబుద్ధియే యోగమనబడును.

**వ్యాఖ్య:–** యోగనిష్ఠయందుండి కర్మలను జేయుమని భగవంతు డాజ్ఞాపించిరి. యోగమనగా నేమి? కార్యముయొక్క సిద్ధి, అసిద్ధులందు సమభావము గలిగియుండుటయే యోగమని యిట పేర్కొనబడినది. అయితే అట్టి నిర్వికారస్థితి యెట్లు చేకూరగలదు? సమత్వబుద్ధిని (Equilibrium of mind) కాపాడుకొనుట ఎట్లు? మనస్సును దాటి ఆత్మయందు నిలుకడకలిగినపుడు మాత్రమే అట్టి స్థితి చేకూరగలదు. అదియే యోగస్థితి. మనస్సు ఆత్మలయొక్క కలయికయే యోగము. జీవ పరమాత్మలయొక్క సంయోగమే యోగము. అట్టి యోగస్థితియందే ఈనిర్వికారసమస్థితి ఉదయించును. గావున దానికిన్ని యోగమను పేరిచట పెట్టబడెను. కావున యోగమునందుండి అనగా ఆత్మయందు నిలుకడగలిగి దృశ్యముతో సంగము (Attachment) ను

త్యజించి ఫలముయొక్క ప్రాప్తాప్రాప్తములందు సమభావముగల్గి కార్యములను జేయుమని భగవాను డానతిచ్చుచున్నాడు.

కార్యములను ప్రారంభించుటకు ముందుగా 'యోగస్థుడు' కావలెను. అనగా యోగమునందుండుటను నేర్చుకొనవలెను. దైవబుద్ధిని, ఆత్మబుద్ధిని బాగుగ అలవఱచుకొనవలెను. లేకున్న ఆ కార్యములు బంధకరములుగ పరిణమించును. అట్లు యోగమునందుండుటను అభ్యసింపక కర్మలను జేయుటవలన, అనేకులకు లాభాలాభములందు, జయాపజయములందు, సిద్ధ్యసిద్ధ్యులయందు చిత్తవికారము (చిత్తచాంచల్యము) కలుగుటచే అశాంతికి లోనగుచున్నారు. దీనినిబట్టి కర్మాచరణకు పూర్వము జ్ఞానవిచారణ, ఆత్మచింతన తప్పకనుండవలెననియు, అపుడే కర్మ నిర్దుష్టముగ, నిష్కామముగ, నిర్లేపముగ సంభవించుననియు స్పష్టమగుచున్నది. ఇక్కారణముననే గీతయందు కర్మ యోగమునకు ముందు సాంఖ్యయోగము (జ్ఞానము) ఉపదేశింపబడెను.

ప్ర:- యోగమనగా నేమి?

ఉ:- సమత్వబుద్ధియే యోగ మనబడును.

ప్ర:- కర్మల నేప్రకార మాచరించవలయును?

ఉ:- (1) యోగనిష్ఠయందుండి (2) సంగమును (ఆసక్తిని, అభిమానమును) వదలి (3) కార్యము సిద్ధింపకున్నను సమభావము గలిగి - కర్మల నాచరించవలెను.

**అ॥** కామ్యకర్మనువీడి సమత్వబుద్ధితో గూడిన కర్మను అవలంబించులాగున బోధించుచున్నాడు -

## 49. దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ
## బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః.

**టీక:-** ధనంజయ= ఓ అర్జునా!, బుద్ధియోగాత్= సమత్వబుద్ధితో గూడిన నిష్కామ కర్మముకంటె, కర్మ = ఫలాపేక్షతో గూడిన కామ్యకర్మము, దూరేణ = మిక్కిలి, అవరంహి = తక్కువగదా! (కాబట్టి) బుద్ధౌ = (ఆ) సమత్వ బుద్ధియందు, శరణమ్ = ఆశ్రయమును, అన్విచ్ఛ = అభిలషింపుము, ఫలహేతవః = ఫలమును గోరువారు, కృపణాః = అల్పులు (దీనులు).

**తా:-** ఓ అర్జునా! (పైన దెల్పిన) సమత్వబుద్ధితో గూడిన నిష్కామకర్మకంటె ఫలాపేక్షతో గూడిన కామ్యకర్మ చాల తక్కువైనది గదా! కావున సమత్వరూపమైన అట్టి నిష్కామకర్మానుష్ఠానబుద్ధినే నీ వాశ్రయింపుము. ఫలమును గోరువారు అల్పులు (దీనులు).

**వ్యాఖ్య:-** అర్జునుని సంబోధించుటకు 'ధనంజయ' అను పదమిచట వరుసగా రెండు శ్లోకములందు ప్రయోగింపబడుట గమనింపదగినది. భౌతికధనమునే కాక, జ్ఞానధనమును, యోగధనమును గూడ జయింపుము ఓ అర్జునా! అని సూచించుటయగును.

గీతయందు మున్ముందు కొన్నిచోట్ల బుద్ధియోగమను పదము జ్ఞానయోగమను అర్థమున నుపయోగింపబడును. ఇచట సమత్వబుద్ధితో గూడిన నిష్కామకర్మయోగమను అర్థమున నిపుడు ప్రయోగింపబడినది కామ్యకర్మ జననమరణములకు హేతువైనది. నిష్కామకర్మ చిత్తశుద్ధిద్వారా మోక్షమునకు

హేతువైనది. కాబట్టి ఈ రెండిటికిని సంబంధమే లేదు. కామ్యకర్మ మిక్కిలి అల్పమైనది. దానిని గోరువారు దీనులు, అల్పులు (కృపణాః ఫలహేతవః). వారు జననమరణరూపమగు సంసారప్రవాహమున గొట్టుకొనిపోవుదురు. అట్టి దీనత్వమును, కృపణత్వమును ఎవరును ఆశ్రయించరాదని భగవాను డిచట హెచ్చరించుచున్నారు. మానవులైపుట్టి ఈశ్వరుడిచ్చిన బుద్ధిశక్తులను దుర్వినియోగపఱచి విషయాదులయం దాసక్తి గలిగి, ఫలాభిలాషతో కర్మలజేయుచు కృపణులైవర్తించుట అత్యంతశోచనీయము. కావున అట్టి దీనత్వమును పారద్రోలి 'బుద్ధౌశరణమన్విచ్ఛ' అని భగవానుడు సెలవిచ్చినట్లు విజ్ఞుడు సమత్వబుద్ధియుక్తమగు నిష్కామకర్మమునే ఆశ్రయించవలయును. కామ్యకర్మములను త్యజించివేయవలెను. తన బుద్ధినే తాను శరణుబొంది తరించవలెను. బుద్ధిని సమత్వయుతముగ, నిష్కామభావముతో గూడినదానినిగ నొనర్చి అట్టి తన బుద్ధినే ఆశ్రయించినచో అదియే జన్మతరణమునకు హేతువుగా నగునని భగవాను డిచట తెలుపుచున్నారు.

ప్ర:- ఫలమునుగోరి చేయు కర్మయెట్టిది?

ఉ:- మహానికృష్టమైనది. (నిష్కామకర్మయే సర్వోత్తమమైనది).

ప్ర:- మనుజుడు దేనిని శరణుబొందవలెను?

ఉ:- తన బుద్ధిని సమత్వముతోను, నిష్కామభావముతోను గూడినదానినిగ జేసికొని అట్టి బుద్ధినే శరణుబొందవలెను.

ప్ర:- ఫలాభిలాషతో కర్మలుజేయువా రెట్టివారు?

ఉ:- అతిదీనులు (కృపణులు). వారు సంసారసముద్రమున గొట్టుకొనిపోవుచుందురు.

**అ॥** అట్టి సమత్వబుద్ధితో నాచరించు నిష్కామకర్మమునకు ఫలమును దెల్పుచు దానిని ఆశ్రయించవలసినదిగా తిరిగి బోధించుచున్నాడు -

## 50. బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే
## తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్.

**టీక:-** బుద్ధియుక్తః = సమత్వబుద్ధితో గూడినవాడు, ఉభే సుకృతదుష్కృతే = పుణ్యాపాపముల రెండిటిని, ఇహ = ఈ లోకమందే (ఈ జన్మయందే), జహాతి = విడుచుచున్నాడు, తస్మాత్ = ఆకారణమువలన, యోగాయ = సమత్వబుద్ధిసహిత నిష్కామకర్మయోగముకొఱకు, యుజ్యస్వ = సిద్ధపడుము, కర్మసు = కర్మలయందు, కౌశలమ్ = నేర్పు, యోగః (ఇతి) = యోగము (అని), ఉచ్యతే = చెప్పబడుచున్నది.

**తా:-** సమత్వబుద్ధి గలవాడు పుణ్యాపాపముల రెండింటిని ఈ జన్మయందే తొలగించుకొనుచున్నాడు. కావున నట్టి సమత్వబుద్ధియుక్తమగు నిష్కామకర్మయోగముకొఱకు యత్నింపుము. కర్మలయందలి నేర్పరితనమే యోగమనబడును.

**వ్యాఖ్య:-** బుద్ధియుక్తుడనగా సమత్వబుద్ధితో గూడి అనాసక్తముగ, నిష్కామముగ కర్మలనాచరించువాడు. అట్టి వానికి పుణ్యముగాని, పాపముగాని అంటదు. ఏలననిన ఆసక్తితో, ఫలాభిలాషతో కర్మలను జేయువారికే పుణ్యాపాపముల సంబంధముండును. అనాసక్తముగ, ఫలాభిలాషారహితముగ

జేయువారికి ఆ పుణ్యపాపముల సంబంధమేమియు నుండదు★ వారు బంధవిముక్తులై వెలయుదురు. అయినను మహనీయులగువారు నిష్కామబుద్ధితో పుణ్యకార్యములను లోకహితార్థ మాచరించుచునే యుందురు. గీతయందును భగవాను డచటచట పుణ్యకార్యములను ప్రోత్సహించుచువచ్చిరి @.

సాధకుడు పాపకార్యములను వదలివైచి పుణ్యకార్యములను జేబట్టవలెను. ఆ పుణ్యకార్యములను అనాసక్తముగ నిష్కామబుద్ధితో నాచరించుచు కర్మబంధనమునుండి విడుదలను పొందవలెను. ఇచట ఈ దృష్టితోనే సమబుద్ధిగల నిష్కామకర్మయోగి పుణ్యపాపముల రెండిటిని విడుచుచున్నాడని చెప్పబడినది. కేవల నిర్వికల్పసమాధియందు మాత్రము మనుజుడు ఆత్మస్థితుడై ఇంద్రియములచే ఏ కర్మయు చేయజాలకుండును. తక్కిన సమయములందు పుణ్యకార్యములను అనాసక్తముగ మహనీయులాచరించుచునే యుందురు. కావున తక్కినవారుకూడ తమ చిత్తశుద్ధికొఱకును, ఆత్మజ్ఞానోదయము కొఱకును పుణ్యకార్యములను, దైవకార్యములను వదలక నిష్కామబుద్ధితో ఆచరించుచుండవలెను. ఆత్మోన్నతి కిదియే మార్గము.

''కౌశలమ్'' - సమత్వబుద్ధితో గూడి కామ్యకర్మలనుండి మనస్సును తొలగించుకొను సామర్థ్యమే యోగము. ఈ ప్రకారము కర్మలయందు నేర్పరితనముగలిగి యుండుటయే యోగమని చెప్పబడుచున్నది. కర్మలనుచేయుచు వానియందు తగుల్కొనక, బంధనమును బొందక నుండగల సామర్థ్యమే యోగము. అనగా సమత్వబుద్ధితో గూడి నిష్కామముగ, అనాసక్తముగ, కర్మల నాచరింపగల్గు దక్షతయే యోగమని యిట పేర్కొనబడినది.

ప్ర:- యోగమనగా నేమి?

ఉ:- కర్మలు చేయుటయందలి నేర్పరితనమే యోగము (అనగా నేర్పుతో అనాసక్తముగ కర్మల నాచరింపగల్గు సామర్థ్యమే యోగము).

## 51. కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః
## జన్మబన్ధవినిర్ముక్తాః పదం గచ్ఛన్త్యనామయమ్.

**టీక:–** బుద్ధియుక్తాః = సమత్వబుద్ధితో గూడిన, మనీషిణః = వివేకవంతులు, కర్మజమ్ = కర్మములవలన గలిగిన, ఫలమ్ = ఫలమును, త్యక్త్వా = విడిచి, జన్మబన్ధవినిర్ముక్తాః = జన్మమనెడి బంధమునుండి విడువబడినవారలై, అనామయమ్ = దుఃఖరహితమగు, పదమ్ = స్థానమును, గచ్ఛన్తిహి = పొందుచున్నారు గదా!

**తా:–** సమత్వబుద్ధితో గూడిన వివేకవంతులు కర్మముల నొనర్చుచున్నను వాని ఫలమును త్యజించివైచి జననమరణరూపమను బంధమునుండి విడుదలను బొందినవారై దుఃఖరహితమగు మోక్షపదవిని బొందుచున్నారు.

**వ్యాఖ్య:–** మనీష యనగా ప్రజ్ఞ. బుద్ధియు, ప్రజ్ఞయు కలవాడు కర్మఫలమును త్యజించునని యిచట

★ యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే (4-23)

@ (1) యేషాం త్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్ (7-28)
(2) యజ్ఞదానతపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్ (18-5)

చెప్పబడినది. దీనినిబట్టి కర్మలనాచరించుటకు పూర్వము వివేకము అత్యావశ్యకమని తేలుచున్నది. కర్మలను సకామముగ, సంగముతో నాచరించుటవలన కలుగునష్టము, నిష్కామముగ, నిస్సంగముగ నాచరించుటవలన కలుగు శ్రేయము బాగుగనెఱింగియుండువాడే (అట్టి ప్రజ్ఞాశీలుడే, కర్మరహస్యమును తెలిసికొనినవాడే) కర్మఫలములను త్యజించి ఉత్తమపదమును బొందగలడు. వివేకము వలననే మనుజుడు కర్మలను నిష్కామముగ, అనాసక్తముగ నాచరింపగలడు. కనుకనే యిచట బుద్ధియుక్తులు, మనీషులు మాత్రమే కర్మఫలత్యాగసమర్థులగుదురని వచింపబడినది.

నిష్కామకర్మద్వారా చిత్తము శుద్ధముకాగా, అట్టి నిర్మలచిత్తమున ఆత్మజ్ఞాన ముదయించుటచే వారు జన్మబంధరహితులగుచున్నారు. దీనినిబట్టి కర్మమార్గము మోక్షమున కెట్లుపకరించుచున్నదో యిచట స్పష్టీకరింపబడినదగును. కర్మలచే మోక్షము కలుగునాయని కొందఱు సందేహింపవచ్చును. కాని భగవానుడే దానికిచట సరియైన సమాధానమొసంగిరి. కర్మలను ఫలాభిలాషారహితముగ, అనాసక్తముగ నాచరించువారు నిర్మల, నిరుపద్రవ, భవబంధరహితమోక్షపదమును తప్పక నొందగల్గుదురని గీతాచార్యులు వచించిరి.

''జన్మబన్ధవినిర్ముక్తాః'' ఈ ప్రపంచమున ప్రతివారున్ను బంధన మెట్లు తొలగునాయని విచారించుచున్నారు. అట్టి బంధవిముక్తికి భగవాను డిచట సులభోపాయమును వచించుచున్నారు. 'ఓ జీవులారా! మీరు బంధవిముక్తులై, నిరామయమగు మోక్షపదవిని బొందదలంతురేని కర్మలను నిష్కామముగ, ఈశ్వరార్పణ బుద్ధితో నాచరింపుడు. దానివలన చిత్తశుద్ధిగలిగి, ఆత్మజ్ఞాన ముదయించి మీరు తప్పక మోక్షధామము నలంకరించగలర'ని శ్రీకృష్ణమూర్తి భక్తుల కాశ్వాసమొసంగుచున్నారు.

''మనీషిణః'' - ఒకనికి ప్రజ్ఞకలదా, లేదా యని తెలిసికొనుటకు ఉపాయము పాండిత్యప్రకర్షను పరీక్షించుటగాదు. ఆతని ఆచరణమున నిష్కామభావము, అనాసక్తి యున్నవా లేవా యని చూచుటయే యగును. కర్మరహస్యమెఱిగి లోకమున అనాసక్తముగ వ్యవహరించువాడే వాస్తవముగ ప్రజ్ఞావంతుడుగాని లౌకికపాండిత్య ధురంధరత్వము కలవాడు కాడు.

''పదం గచ్ఛన్త్యనామయమ్'' - ప్రపంచమున అనేక గొప్పపదవులు కలవు. చక్రవర్తి పదవి, దేవేంద్రపదవి మున్నగునవి. కాని అవి యెంత గొప్పవైనను సంసార చక్రాంతర్గతములే యగును. పుట్టుక, చావు, దుఃఖముయొక్క లవలేశమైనను లేనిదియై, బంధరహితమైనట్టి ఒకానొక పదవి కలదు. అదియే ఆత్మ పదవి. బ్రహ్మపదవి. దానిని పొందుటయే ప్రతిజీవియొక్క లక్ష్యము. అద్దానిని పొందుటకు మార్గమేది? భగవానుడే ఆ మార్గము నిట సూచించినాడు. ఫలాభిసంధిరహితముగ కర్మల నాచరించుచు చిత్తశుద్ధిని, తద్ద్వారా ఆత్మజ్ఞానమును బడయుటయే ఆ మార్గము. కావున విజ్ఞులద్దాని ననుసరించి తరించుదురుగాక!

ప్ర:- ప్రజ్ఞాశీలుర (బుద్ధిమంతుల) లక్షణమేమి?

ఉ:- నిష్కామకర్మాచరణము.

ప్ర:- అట్టి నిష్కామకర్మాచరణముచే వారు దేనిని పొందుదురు?

ఉ:- జన్మబంధరహితులై వారు నిరామయమగు మోక్షపదమునుబొందుదురు.

ప్ర:- పరమాత్మపద మెట్టిది?

ఉ:- (1) జన్మబంధములేనిది (2) నిరామయము (దుఃఖవర్జితము) అయినది.

**అ॥** అట్టి మోక్షస్థితిని జను లెపుడు పొందగలరో నిరూపించుచున్నాడు -

**52. యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి**
**తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ.**

**టీక:–** యదా= ఎప్పుడు, తే= నీయొక్క, బుద్ధిః= బుద్ధి, మోహకలిలమ్= అజ్ఞానమనుమాలిన్యమును, వ్యతితరిష్యతి = దాటగలదో, తదా = అప్పుడు, శ్రోతవ్యస్య = వినదగిన బోధయందును, శ్రుతస్యచ = వినినబోధయందును, నిర్వేదమ్ = విరక్తిని, గన్తాసి = పొందగలవు.

**తా:–** అర్జునా! నీబుద్ధి యెపుడు అజ్ఞానమను మాలిన్యమును దాటివేయునో (తొలగించుకొని పరిశుద్ధమగునో) అపుడిక వినవలసినదానిని గూర్చియు, వినినదానిని గూర్చియు, నీవు విరక్తిని గలిగియుందువు.

**వ్యాఖ్య:–** జీవునిలక్ష్యము మోహమునుదాటి ఆవలకు పోవుటయే. ఆ మోహమునకే అజ్ఞానము, మాయ, ప్రకృతి మున్నగుపేర్లు కలవు. తమస్సునకు ఆవల పరమాత్మ కలడు. 'తమసస్తు పారే' అను వేదవాక్య మీ సత్యమునే బోధించుచున్నది. ప్రకాశరూపమగు ఆ పరమాత్మను జేరవలెననిన, అడ్డుగానున్న మోహము (తమస్సు)ను దాటవలసియున్నది. నిష్కామకర్మాచరణద్వారా, శ్రవణ మనన నిదిధ్యాసనరూప ఆత్మ విచారణద్వారా, అక్కార్యమును సాధించవలెను. ఈ ప్రకారముగ బుద్ధి యెపుడీ అజ్ఞానమాలిన్యమును దాటిపోవునో, ఆవలగల పరమాత్మ సాన్నిధ్యమును జేరునో, అపుడిక ధ్యేయవస్తువునందే యది రమించుచుండును. గావున శ్రవణాదులం దాసక్తిలేక యుండును. అయితే యిది సాధ్యవస్తువును (ఆత్మను) బొందినవారిని గూర్చి చెప్పినదేకాని సాధకుల నుద్దేశించి చెప్పినది కాదని యెఱుంగవలెను. సాధకులు శాస్త్రశ్రవణాదులను తప్పక చేసియే తీరవలెను.

''మోహకలిలమ్'' – అని చెప్పినందువలన జనుల హృదయములందు అజ్ఞానమను మురికి చేరియున్నదనియు, దానిని ప్రయత్నపూర్వకముగ నిష్కామకర్మాచరణాదుల ద్వారా ఆత్మవిచారణద్వారా తొలగించుకొని ఆత్మసాక్షాత్కారము నొందవలయుననియు స్పష్టపడుచున్నది.

**53. శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా**
**సమాధా వచలా బుద్ధి స్తదా యోగ మవాప్స్యసి.**

**టీక:–** శ్రుతివిప్రతిపన్నా = నానావిధ శ్రవణాదులచే కలతజెందియున్న, తే= నీయొక్క, బుద్ధిః= బుద్ధి, యదా = ఎప్పుడు, నిశ్చలా = చలింపనిదై, సమాధౌ = పరమాత్మధ్యానమందు, అచలా = స్థిరముగ, స్థాస్యతి = నిలిచియుండునో, తదా = అప్పుడు, యోగమ్ = యోగమును (భగవదైక్యమును, ఆత్మసాక్షాత్కారమును), అవాప్స్యసి = పొందగలవు.

**తా:–** నానావిధములగు శ్రవణాదులచే కలతజెందియున్న నీబుద్ధి యెపుడు చలింపనిదై పరమాత్మధ్యానమందు స్థిరముగ నిలిచియుండునో, అపుడు నీ వాత్మసాక్షాత్కారమును బొందగలవు.

**వ్యాఖ్య:–** వేదములందు 'ఈ ఫలమునకై ఈ కర్మను జేయుము' – అని యీప్రకారముగ జెప్పబడిన అర్థవాదరూపములైన వాక్యము లనేకములను వినుట వలన బుద్ధి ఒకదానియందును స్థిరత్వమునుబొందక కలతజెందియుండును. అట్టి బుద్ధి యెపుడు వానిని త్యజించి, తత్త్వవిచారణచే అజ్ఞానమాలిన్యమును దాటి,

ఇహలోక పరలోక భోగాదులం దాసక్తిని వదలి, విక్షేపమును పారద్రోలి, పరమాత్మధ్యానమందే స్థిరముగ నెలకొనియుండునో, అపుడే మనుజుడు ఆత్మసాక్షాత్కారమును (జీవన్ముక్తిని) బొందగలడని యిచట వచింపబడినది. అట్టి స్థితియే 'యోగ'మని పేర్కొనబడినది. ఇచట తెలుపబడిన 'యోగ' శబ్దమునకు ఐక్యము, జీవాత్మపరమాత్మల కలయిక, అని యర్థము. బుద్ధి ఆత్మయందు విలీనమగుటయే ఈ యోగము. అనేక బోధలు వినివిని కలతనొందియున్న బుద్ధి తుట్టతుదకు విచారణచే దృశ్యవిషయములనుండి మఱలి, బుద్ధికిసాక్షిగానున్న ఆత్మయం దెపుడు నిశ్చలముగ ధ్యానమగ్నమైయుండునో, అపుడు ఉప్పుకల్లు సముద్రమునందు కలియునట్లు, ఆత్మయందు విలీనమై పరమశాంతిని, ఆనందమును బొందును. అపుడే యోగము (ఐక్యము) సిద్ధించినట్లగును - అని భగవాను డిచట సెలవిచ్చిరి.

చిత్తము చపలముగానున్నచో ధ్యానముగాని, యోగముగాని సంభవింపవని యిచ్చోట స్పష్టముగా నిరూపింపబడినది. కనుకనే 'నిశ్చలా' అచలా' అను రెండు విశేషణములు చేర్చబడినవి. చేయి వణకుచున్నచో, లేక దారపుకొన సన్నగలేనిచో సూది రంధ్రమున ఆ దార మెట్లు ప్రవేశింపదో, అట్లే ఏకాగ్రత, నిర్విషయత్వము లేనిచో బుద్ధి (మనస్సు) ఆత్మయందు ప్రవేశింపదు.

కాబట్టి సాధకుడు (1) శ్రవణము ఒకింత చేసి మనననిదిధ్యాసనములు మిక్కుటముగ జేయవలెను. మఱియు శ్రవణముతోనే పని పూర్తిచేయరాదు. మననాదులను గూడ జరుపవలెను. కొద్దిగ విని యెక్కువగ ఆచరించవలెను. (2) ఇంకను, దృశ్యవిషయములనుండి, భోగములనుండి చిత్తమును మరల్చి, అంతర్ముఖమొనర్చి ఆత్మయందు స్థాపితము చేయవలెను. చిత్తమేకాగ్రత గలిగియుండవలెను; చపలత్వమును వీడి ధేయాకారమందే నెలకొని యుండవలెను.

మనుజుడు ఆత్మసాక్షాత్కారము నెపుడు పొందగలడను ప్రశ్న కీశ్లోకమున జవాబు చెప్పబడినది. ఆత్మానుభూతికి కాలనియమము లేదు. ఎపుడు చిత్తము విషయవిముఖత్వమును, ఏకాగ్రతను బొందగల్గునో, అపుడే మోక్షస్థితిని అది బడయగల్గును. కనుకనే యదా (ఎప్పుడు), తదా (అప్పుడు) అను రెండుపదము లిచట ఉపయోగింపబడినవి.

ప్ర:- జీవబ్రహ్మైక్యరూపమగు యోగము మనుజున కెపుడు సిద్ధించును?

ఉ:- బుద్ధియెపుడు నిశ్చలమై, నిర్విషయమై, ఆత్మధ్యానమందు స్థిరముగ నుండునో అపుడే జీవబ్రహ్మైక్యరూపయోగము సిద్ధించును.

**అ॥** స్థిరబుద్ధియుతుడగు జీవన్ముక్తునిగూర్చి భగవానుడు పలికిన యా వాక్యములను విని, అట్టి స్థితప్రజ్ఞుని లక్షణము లేవియో తెలిసికొనవలెనను అభిలాషజనింప అర్జునుడీ క్రిందివిధముగ ప్రశ్నించుచున్నాడు

**అర్జున ఉవాచ :-**

## 54. స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ
## స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్.

**అర్జున ఉవాచ = అర్జునుడు చెప్పెను -**

**టీక:-** కేశవ = ఓ కృష్ణా!, సమాధిస్థస్య = సమాధియందున్న, స్థితప్రజ్ఞస్య = స్థిరబుద్ధిగలవానియొక్క,

భాషా = లక్షణము, కా = ఏది?, స్థితధీః = స్థిరబుద్ధిగలవాడు, కిమ్ = ఏమి, ప్రభాషేత = పలుకును?, కిమ్ = ఏరీతిగ, ఆసీత = ఉండును, కిమ్ = ఎట్లు, వ్రజేత = సంచరించును?

**తా:–** అర్జునుడు అడిగెను - ఓ కృష్ణా! సమాధియందున్న స్థితప్రజ్ఞుడగు జీవన్ముక్తునియొక్క లక్షణమేమి? ఆతడెట్లు మాట్లాడును? ఏరీతిగ నుండును? ఎట్లు సంచరించును?

**వ్యాఖ్య:–** సమాధినిష్ఠయందుండు యోగియొక్క అనగా ఆత్మజ్ఞానియగు జీవన్ముక్తునియొక్క లక్షణములెవ్వియో ఈ సందర్భమున అర్జునుడు తెలిసికొన దలంచెను. కొందఱు వేషధారులు పైకి డాంబికముగ సమాధినిష్ఠయందున్నట్లు నటించుచుదురు. కావున నిజమగు సమాధినిష్ఠులను కనిపెట్టుటకు మార్గము లోకమునకు కావలసియున్నది. దైవవశాత్తు అర్జునుడే తత్సంబంధమగు ప్రశ్నను అడిగివైచెను. ఒక వ్యక్తి సరియైన ఆధ్యాత్మికపంథాలో నడుచుచున్నాడో, లేదో, ఆతడు నిజమైన యోగియో లేక మోసగాడో కనిపెట్టుటకు అర్జునుడు తెలిసికొనగోరిన యీమూడు గుర్తులు చాలును - (1) అతనివాక్కు, (2) అతని నివాసము, (3) అతని నడక. ప్రతివానికి వానివాని గుణము వాని క్రియలందు ప్రతిబింబించును. అజ్ఞానియొక్క ప్రతికార్యమందును తమోగుణము, రజోగుణము, అపవిత్రత గోచరించును. బ్రహ్మజ్ఞానియొక్క నిత్యవ్యవహారమందు దైవత్వము, శాంతి, పవిత్రత ఉట్టిపడుచుండును. కావున స్థితప్రజ్ఞుడగు మహనీయునియొక్క లక్షణములు, స్వరూపస్వభావములు, దైనందిన జీవితరహస్యములు తెలిసికొనినచో, అవిచూచి తక్కిన వారున్ను ఆ మార్గమున నడిచి తరించవచ్చునను ఉద్దేశ్యముతో అర్జును డీప్రశ్నను వైచెను.

స్థిత + {ప్రజ్ఞః ధీః}- అనగా ప్రజ్ఞను, లేక బుద్ధిని ఆత్మయందు స్థిరముగ నెలకొల్పినవాడని అర్థము. తక్కినవారు అస్థితప్రజ్ఞులు. వారి బుద్ధి, ప్రజ్ఞ ఆత్మయందు (దైవమందు) ఉండక దృశ్యమందు (విషయములందు) గలదని యర్థము. కావున విజ్ఞుడగువాడు స్థితప్రజ్ఞుని లక్షణముల నెఱింగి వాని నాచరణయందుంచుకొని భవబంధమునుండి విముక్తిని బొందవలయును. స్థితప్రజ్ఞుని లక్షణములను గూర్చిన ఈ భాగము (శ్లో 54 నుండి - 72 వఱకు) గీతయందు మహాప్రాముఖ్యత గలదియై యున్నది. గాంధిమహాత్ముడు ప్రతిదినము ఈ భాగమునంతను పారాయణము చేయుచుండెడివాడు.

ప్ర:– స్థితప్రజ్ఞుని ఏయే లక్షణములను అర్జునుడు తెలిసికొనగోరెను?

ఉ:– (1) అతని భాష (2) అతని నివాసము (3) అతని నడవడిక - వీనిని తెలిసికొనగోరెను.

**అII** అర్జునుని ప్రశ్నకు సమాధానమొసంగుచు శ్రీకృష్ణభగవానుడు 18 శ్లోకముల ద్వారా స్థితప్రజ్ఞుడగు జ్ఞానియొక్క లక్షణములను వివరించుచున్నాడు -

**శ్రీ భగవానువాచ :–**

## 55. ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్
## ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే.

**శ్రీ భగవానువాచ = శ్రీ కృష్ణభగవాను డిట్లు పలికెను –**

**టీక:–** పార్థ = ఓ అర్జునా!, యదా = ఎప్పుడు, మనోగతాన్ = మనస్సునందుండెడు, సర్వాన్ =

సమస్తములైన, కామన్ = కోరికలను, ప్రజహాతి = బొత్తిగ వదలివేయుచున్నాడో, ఆత్మన్యేవ = ఆత్మయందే, ఆత్మనా = ఆత్మచే (ఆత్మనవలంబించిన మనస్సుచే), తుష్టః = సంతుష్టిని బొందినవాడై (భవతి = ఉండుచున్నాడో), తదా = అప్పుడు, స్థితప్రజ్ఞః (ఇతి) = స్థితప్రజ్ఞుడని (నిశ్చలమైన బుద్ధిగలవాడని), ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

**తా:–** శ్రీభగవానుడు ఇట్లు చెప్పెను - ఓ అర్జునా! ఎప్పుడు మనుజుడు తన మనస్సునందున్నట్టి కోరికలన్నిటిని సంపూర్ణముగ వదలివేయునో, మఱియు ఆత్మయందే ఆత్మచే (నిర్మల చిత్తముతో) నిరంతరము సంతుష్టిని బొందుచుండునో, అప్పుడాతడు స్థితప్రజ్ఞుడని చెప్పబడును.

**వ్యాఖ్య:–** అనేకులు తమ గురువులయొద్దకేగి 'అయ్యా! మాకు మోక్షమెప్పుడు లభించును? ఈ సంసారబాధ మాకెప్పుడు తొలగును?' అని ప్రశ్నించుచున్నారు. అప్పుడు గురువులు ఈ శ్లోకమున భగవానుడు చెప్పిన సమాధానమునే చెప్పుచున్నారు. జనులయొక్క మోక్షప్రాప్తికి సరియైన మహూర్తము వారివారి చేతులలోనే యున్నది. 'యదా = ఎప్పుడు నీవు సాధన చేయుదువో, తదా = అప్పుడు నీవు మోక్షమును బొందుదువు' అని ముక్తసరిగ నిచట చెప్పివేయబడినది. ఈ శ్లోకమందు తెలుపబడిన యోగ్యత ఏ క్షణమందు జీవునకు లభించినో ఆక్షణమందే యాతనికి ముక్తి కరతలామలకమగును. కావున తన కింకనుశాంతి కలుగలేదే, దుఃఖము శమించలేదేయని పెద్దలను, శాస్త్రములను విమర్శించిన లాభములేదు. తాను చేయవలసిన సాధన సక్రమముగ చేయవలెను.

**ఆ సాధన యెట్టిదనగా – ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ –**

(1) మొట్టమొదట తనయందున్న కోరికలన్నిటిని సంపూర్ణముగ వదలివేయవలెను. ఇచట 'జహాతి' (విడుచుచున్నాడు) అని చెప్పక, 'ప్రజహాతి' అని చెప్పుట వలన కోరికలను నిశ్శేషముగ వదలవలెననియు, 'సర్వాన్' అని ప్రయోగించుటవలన ఏ ఒక్కటియు మిగులకుండ అన్నికోరికలను విడనాడవలెననియు స్పష్టమగుచున్నది. వాసన, అగ్ని, ఋణము, రోగము, శత్రువు, రాగము, వైరము, విషము మున్నగు వస్తువులు ఒకింత శేషించియున్నను మహోపద్రవము కలుగును. గాన వానిని సంపూర్ణముగ తొలగించివేయవలెనని శాస్త్రములు వక్కాణించుచున్నవి★. అసంపూర్ణముగ అన్ని కోరికలను త్యజించినను, సంపూర్ణముగ కొన్ని కోరికలను వదలినను ఎక్కువ ఫలితము చేకూరదనియు, సంపూర్ణముగ అన్నిటిని త్యజించివేయునపుడే అభిలషితఫలమగు మోక్షము చేకూరుననియు తెలుపుటకే భగవాను డీశ్లోకమున 'ప్రజహాతి' 'సర్వాన్' అను రెండుపదములను ప్రయోగించినారు.

కోరికలు మనస్సుయొక్క మారుమూలలందు దాగుకొని యుండును. వాసనారూపమున అవి లోన జితించియుండును. కనుకనే 'మనోగతాన్' అని చెప్పబడినది. దోషముగాని, బంధనముగాని బయటలేదు. మనస్సునందే కలదు. కాబట్టి మనస్సను అగాధ అంధకారకుహరమున వివేకమను దీపముయొక్క సహాయమున ఏ యే కోరికలున్నవో చక్కగా వెతికి వానిని ఏరిపారవేయవలెను. అన్నములో రాతిబెడ్డలను, పాల్కులో కలుపుమొక్కలను, ఉద్యానవనమున కంటకములను, కూరచెట్లలో చీడపురుగులను ఏరి దూరముగ పారవేయునట్లు, మనస్సునందలి కోరికలన్నిటిని సంపూర్ణముగ తొలగించివేయవలెనని భగవాను డిచట తెలుపుచున్నారు. ఈ కోరికలు అనేక జన్మల నుండియు జీవుని వెంటాడుచు ఘనవాసనారూపముగ పరిణమించి

★ వాసనాయాస్తథా వహ్నేః ఋణవ్యాధిద్విషామపి
స్నేహవైర విషాణాం చ శేషః స్వల్పోఽపి బాధతే.

కారణదేహమున చక్కగ రూఢిపడి, వేళ్ళు తన్నుకొని, జననమరణములను గలుగజేయుచున్నవి. కాబట్టి వాసనారహితముగ, మూలముతో గూడ వాని నన్నింటిని పెకలించి దూరముగ పార వేయవలెను. ఒక్కటి శేషించియుండినను ప్రమాదమే. ఏలననిన, కొందఱు దాదాపు అన్నికోరికలను విడనాడి చివరకు ఏ ఒక్కదానియందో మమత్వము పెట్టుకొని క్రమముగ మరల బంధనమునబడి దిగజారిపోవుచున్నారు. అగ్నియంతయు చల్లారి ఒక్క మిణుగురు శేషించినను కాలక్రమమున అది మహాదారుణముగ పరిణమించగలదు గదా! కనుకనే భగవానుడు 'సమస్తవాంఛలయొక్క సంపూర్ణత్యాగమునే' యిచట బలపఱచినవారైరి. ఇట్టి త్యాగమున ఆత్మవిచారణ, వివేకవైరాగ్యాదులు సహాయభూతములుగ నుండగలవు.

(2) ఇక రెండవ సాధన – 'ఆత్మన్యేవాత్మనాతుష్టః' – తన ఆత్మయందే తాను సంతుష్టుడైయుండుట. తుష్టి, ఆనందము ఎచట లభించును? అను ప్రశ్న కిచట సమాధాన మొసంగబడినది. ఆనందము బయటలేదు. దృశ్యములో లేదు. శబ్దస్పర్శాది విషయములలో లేదు. భూనభోంతరాళములను గాలించినను, చతుర్దశభువనములను అంగుళము అంగుళము కాగడాపెట్టి వెతికినను తుష్టి, ఆనందము లభింపనేరవు. ఆనందము బయటదొఱకు వస్తువుకాదు. అది తన ఆత్మయందే (తనయందే) లభించును. మనస్సునందుగల ఇచ్ఛాదిమాలిన్య మెపుడు రహితమగునో, అపుడు స్వతస్సిద్ధముగ వెలయుచున్న ఆత్మానందము జీవునకు ద్యోతకమగును. ఇదియే వేదాంతమందలి కీలకము. బ్రహ్మానందము క్రొత్తగా తయారుచేసి తెచ్చుకొను పదార్థము కాదు. ఆ యానందము స్వతః తనయందు ఉండనే యున్నది. కాని అనాది అజ్ఞానముచే మరుగు పడియున్నది. ఇప్పుడు వివేక, వైరాగ్యాదులచే మనస్సునకు పట్టి యున్న ఆ కామాదులను బూజును తుడిచి వేయగా లోననున్న సహజ ఆత్మానందము ప్రస్ఫుటమగుచున్నది. పాచిని తొలగించినచో స్వచ్ఛమగు జలము బయటపడునట్లును, దుమ్మును తుడిచినచో అద్దముయొక్క నిర్మలస్వరూపము బహిర్గతమగునట్లును, దృశ్య దోషములు, వాసనలు, కోరికలు సంపూర్ణముగ తొలగినపిమ్మట దృక్స్వరూపమైన స్వయంప్రకాశపరమాత్మ బయల్ప డును. కనుకనే ఈ శ్లోకమున ప్రథమపాదమున సర్వకామనారాహిత్యమను సాధనచెప్పి, రెండవపాదమున 'ఆత్మసంతుష్టి, ఆత్మానందము' అను సాధ్యమును భగవానుడు వచించెను. సాధనచేసినచో సాధ్యము లభించునని భావము.

ఈ ప్రకారముగ కోరికలన్నిటిని పూర్ణముగ విడనాడి, నిరంతరము ఆత్మయందే సంతుష్టిని బొందువాడు స్థితప్రజ్ఞుడు, జీవన్ముక్తుడు, జ్ఞాని అని చెప్పబడినది. ఈ గుర్తులచే ఒకడు పూర్ణస్థితిని బొందినది లేనిది బాగుగ తెలిసికొనవచ్చును. జీవన్ముక్తుని ముఖమున సదా తుష్టి, ఆనందము తాండవించుచుండును. కోరికలుగలవాని ముఖమున దిగులు, దుఃఖము పట్టి వ్రేలాడుచుండును. స్థితప్రజ్ఞున కిక పొందవలసిన పదార్థ మేదియు లేదుకనుక తన హృదయమందే బ్రహ్మానందామృతసాగరమున ఓలలాడుచుండును. ఇదియే ఆతనికి గుఱుతు.

ప్ర:- స్థితప్రజ్ఞుని లక్షణము లెవ్వి?

ఉ:- (1) మనస్సునందలి కోరికలన్నిటిని సంపూర్ణముగ విడనాడుట (2) నిరంతరము ఆత్మయందే సంతుష్టిని బొందుట.

ప్ర:- ప్రపంచమున పూర్ణానంద మెచట లభించును?

ఉ:- తన ఆత్మయందే.

**56. దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః**
**వీతరాగభయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే.**

**టీక:–** దుఃఖేషు = దుఃఖములందు, అనుద్విగ్నమనాః = క్షోభమునొందని మనస్సుగల వాడును, సుఖేషు = సుఖములందు, విగతస్పృహః = ఆసక్తిలేనివాడును, వీతరాగభయక్రోధః = అనురాగము, భయము, కోపము తొలగినవాడును (అగు), మునిః = (ఆత్మ) మననశీలుడు, స్థితధీః (ఇతి) = స్థితప్రజ్ఞుడని, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

**తా:–** దుఃఖములందు కలతనొందని మనస్సుగలవాడును, సుఖములందు ఆసక్తిలేనివాడును, అనురాగము, భయము, కోపము తొలగినవాడు నగు (ఆత్మ) మననశీలుడు స్థితప్రజ్ఞుడని చెప్పబడును.

**వ్యాఖ్య:–** స్థితప్రజ్ఞుని మఱికొన్నిలక్షణము లిచట పేర్కొనబడుచున్నవి. ప్రజ్ఞను, లేక బుద్ధిని ఆత్మయందు స్థిరముగనెలకొల్పువాడు స్థితప్రజ్ఞుడనబడును. సామాన్యులబుద్ధి, ప్రజ్ఞ ప్రపంచమునందు, దేహాది దృశ్యమునందు తగుల్కొని దైవమందు నిలుకడలేకయుండును గావున వారు స్థితప్రజ్ఞులుకారు. ఇచ్చోట స్థితప్రజ్ఞునకు మూడు లక్షణములు చెప్పబడినవి.

అవి యేవియనిన –

(1) దుఃఖములం దాతని మనస్సు ఏవిధమైన క్షోభయు జెందదు. కలతనొందదు. మేఘమునకు పైనున్న సూర్యునకు, మేఘమునకు క్రిందనుండువారికి గలుగు వర్షబాధ, పిడుగుయొక్క ఉపద్రవము, మున్నగునవి లేనట్లు, మనస్సునకు ఈవలనుండునవియు, మనోధర్మములు నగు సుఖదుఃఖాదులు ఆత్మజ్ఞునకుండవు. ఆతడు మనస్సునకు సాక్షిగా నుండును. సాక్షిని సాక్ష్యధర్మము లెన్నటికిని బాధింపవు. కావున దుఃఖాదులం దాతడు ఏ క్షోభయులేక యుండును. పర్వతమును బాణములు ఛేదించజాలనట్లును, సముద్రతరంగములు తీరస్థపర్వతమును కదలింపచేయజాలనట్లును, తామరతూడుయొక్క దారములు మదపుటేనుగును బంధింపజాలనట్లును, దుఃఖాదులు జ్ఞానిని వేధించజాలవని శ్రీ వసిష్ఠమునీంద్రులు పూర్వము శ్రీ రామచంద్రునకు బోధించియుండిరి.

(2) అట్లే సుఖములు సంప్రాప్తించినపుడు ఉబ్బిపోవుటయు జ్ఞానికుండదు. దుఃఖమువలె సుఖమున్ను ఒకానొక మనోవికారమే అయియున్నది. కావున మనస్సును దాటి ఆత్మనుచేరిన స్థితప్రజ్ఞుని ఆ మనోవికారమేమియు చేయజాలదు. మఱియు అనంతబ్రహ్మానందసముద్రమే తనరూపముగ గలిగియున్న జ్ఞాని, అందలి ఒకానొక లవలేశమై, పైగా ప్రతిబింబితపూరమైనట్టి ప్రాపంచికసుఖము నెన్నడైన వాంఛించునా? మేలుకొనినవాడు స్వప్నస్థరాజ్యసుఖమును కోరుకొనునా? ఒకవేళ కోరినచో అత డింకను మేలుకొనలేదని యర్థము. జనకుని యాస్థానమున శకమునీంద్రులు మహావైభవములనుగూడ నాశింపక, మహాబాధలందును కలతనొందక నుండుటవలన వారు స్థితప్రజ్ఞులని ఖండితముగ చెప్పవచ్చును. అట్లే యెవరైనను సరియే ఈ లక్షణములను గలిగియున్నచో వారు స్థితప్రజ్ఞులే యగుదురు.

(3) మఱియు స్థితప్రజ్ఞులగువారు రాగ, భయ, క్రోధములు లేక యుందురు. జ్ఞానిదృష్టియందు సమస్తము ఆత్మస్వరూపముగనే గోచరించును. కావున 'తత్ర కో మోహః కః శోక ఏకత్వమనుపశ్యతః' అను ఈశావాస్యోపనిషద్వాక్యము ననుసరించి వారికిక శోకమోహాదులుగాని, రాగభయక్రోధాదులుగాని యెట్లుండగలవు? అంతయు తానై యుండ ఇక తనపై తనకు రాగమేమి, భయమేమి, క్రోధమేమి? కావున ఆత్మానుభవముగల స్థితప్రజ్ఞుని కిట్టి వికారము లెవ్వియు నుండనేరవు.

'ముని' అనగా మననశీలుడు. మహనీయులు ఆధ్యాత్మికసత్యములను లెస్సగ మననము

చేయుచుందురు. కావున వారికి ముని లను పేరువచ్చినది. అట్లు మనననిదిధ్యాసనములను గావింపనిదే ఆ యా సత్యము లెవరికిని అనుభూతములు కావు. మననశీలురే స్థితప్రజ్ఞత్వమును, జీవన్ముక్తిని బొందగలరు. ఈ విషయమును తెలుపుటకొఱకే కాబోలు 'ముని' యను పదమిచట ప్రయోగింపబడినది. ఆధ్యాత్మిక్షేత్రమున సోమరులకు చోటులేదు. సోమరులు 'సోహం' పర్వతమును ఏకాలమందును అధిరోహింపజాలరు. మననశీలురు, సాధనపరులు మాత్రమే జీవన్ముక్తిపదమును బొందగలరు.

ప్ర:- స్థితప్రజ్ఞుని మఱికొన్ని లక్షణములను పేర్కొనుము?

ఉ:- (1) దుఃఖములందు క్షోభనొందకుండుట (2) సుఖములం దాసక్తి లేకుండుట (3) రాగ, భయ, క్రోధములు లేకుండుట.

## 57. యస్సర్వత్రానభిస్నేహ స్తత్తత్ప్రాప్య శుభాశుభమ్ నాభినన్దతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.

**టీక:–** యః = ఎవడు, సర్వత్ర = సమస్తవిషయములందును, అనభిస్నేహః = అభిమానములేనివాడై, తత్తత్ = ఆ యా, శుభాశుభమ్ = ప్రియ, అప్రియ విషయములను, ప్రాప్య = (ఒకవేళ) పొందినను, నాభినన్దతి = సంతోషింపడో, న ద్వేష్టి = ద్వేషమునుబొందడో, తస్య = అట్టివాని, ప్రజ్ఞా = జ్ఞానము, ప్రతిష్ఠితా = మిక్కిలి స్థిరమైనది (అట్టివాడు స్థితప్రజ్ఞుడని భావము).

**తా:–** ఎవడు సమస్తవిషయములందును (దేహ, బంధు, భోగాదులందు) అభిమానము లేకయుండునో, ఆ యా ప్రియాప్రియములు సంభవించినను సంతోషమునుగాని, ద్వేషమునుగాని బొందకుండునో, అట్టివాని జ్ఞానము మిగుల స్థిరమైనది యగును (అట్టివాడే స్థితప్రజుడు).

**వ్యాఖ్య:–** 'యః' (ఎవడు) – గీతయం దనేకచోట్ల ఈ యచ్ఛబ్దప్రయోగము చేయబడినది. 'ఎవడిట్టి యోగ్యత గలిగియుండునో, ఆతడు ముక్తినిబొందును' అని చెప్పబడినదేకాని, జాతి, మత, వర్ణ, లింగ, వయోవిచక్షణయేమియు నిట చూపబడలేదు. ఇదియే గీతయొక్క విశాలదృక్పథమునకు గుఱుతు.

''సర్వత్రానభిస్నేహః'' – ఎల్లవిషయములందును అభిమానము లేకుండవలెనని చెప్పబడినది. సామాన్యముగ అప్రియవిషయములం దెవనికిని అభిమానముండదు. అట్లే ప్రియవిషయములందును అభిమాన మెవనికి లేకుండునో ఆతడే స్థిప్రజ్ఞుడు. ప్రియముగాని, అప్రియముగాని అంతయు మాయ యందు (దృశ్యమునందు, ప్రకృతియందు) అంతర్భూతమే కావున మాయాతీతపరమాత్మ యందు స్థితిగలవానికవి ఏ మాత్రము రుచింపవు. కావున వానియం దభిమానము లేకుండును.

తాను కోరకున్నను ఒక్కొక్కపుడు జ్ఞానికి దైవికముగ, ప్రియములుకాని, అప్రియములుకాని, తటస్థించవచ్చును. అత్తఱి ప్రియములయెడల సంతోషముగాని, అప్రియములయెడల ద్వేషముగాని యాతడు కలిగియుండడు. పర్వతముమాడ్కి అచంచలుడై యుండును. ఇదియే స్థితప్రజ్ఞుని చిహ్నము.

ప్ర:- స్థితప్రజ్ఞుని ఏ యే యితర లక్షణము లిచట పేర్కొనబడినవి?

ఉ:- (1) సమస్త విషయములందును అభిమానము లేకుండుట (2) ప్రియాప్రియములు సంభవించినను, సంతోషముగాని, ద్వేషముగాని లేకుండుట – అను స్థితప్రజ్ఞలక్షణము లిచట చెప్పబడినవి.

**58. యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.**

**టీక:–** యదా = ఎప్పుడు, అయం = ఈతడు (యోగి), కూర్మః = తాబేలు, అఙ్గానీవ = అవయవములనువలె, ఇన్ద్రియార్థేభ్యః= ఇంద్రియవిషయములనుండి (శబ్దస్పర్శాదులనుండి), ఇన్ద్రియాణి= ఇంద్రియములను, సర్వశః చ = అన్నివైపులనుండియు, సంహరతే = వెనుకకు మరల్చుచున్నాడో, (తదా = అప్పుడు), తస్య = అతని యొక్క, ప్రజ్ఞా = జ్ఞానము, ప్రతిష్ఠితా = మిగుల స్థిరమైనది.

**తా:–** తాబేలు తన అవయవములను లోనికిముడుచుకొనునట్లు, యోగి యెపుడు తన ఇంద్రియములను ఇంద్రియార్థములగు విషయములనుండి సర్వత్ర వెనుకకు మరల్చుచున్నాడో, అపుడాతని జ్ఞానము మిగుల స్థిరమైనది యగును. (ఆతడుస్థితప్రజ్ఞుడగును).

**వ్యాఖ్య:–** మోక్షప్రాప్తికి (ఆత్మసాక్షాత్కారమునకు) ఇంద్రియనిగ్రహము అత్యంతావశ్యకమను విషయ మిచట తెలుపబడుచున్నది. 'యదా' అను పదము ప్రయోగించి నందువలన మనుజునకు ఎపుడిట్టి యంద్రియనిరోధము సిద్ధించునో, అపుడే బుద్ధి ఆత్మయందు స్థిరముగ నెలకొనగలదని వచింపబడినది. ఈ సత్యమునే పతంజలి మహర్షి ''యోగశ్చిత్తవృత్తినిరోధః; తదా ద్రష్టుః స్వరూపేఽవస్థానమ్'' అను రెండు సూత్రముల ద్వారా వ్యక్తమొనర్చెను. అనగా ఎపుడు చిత్తము తనబహిర్ముఖ విషయ ప్రవృత్తులను త్యజించి, అంతర్ముఖమగునో, అపుడది ఆత్మయందు చక్కగ స్థితిని బొందగలదని భావము.

ఈ తత్త్వము నిచట భగవానుడొక చక్కని ఉపమానముద్వార బోధించిరి. తాబేలు ఏ కొంచెము శబ్దముగాని, అలజడిగాని కలిగినను వెంటనే తన అవయవములన్నిటిని లోనికి (చిప్పలోనికి) ముడుచుకొనును. అట్లే యోగియగువాడు శబ్ద స్పర్శాది బాహ్యవిషయము లన్నిటినుండియు మనస్సును మఱల్చి, ప్రత్యాహారము గావించి, అంతరాత్మయం దద్దానిని నెలకొల్పును. 'సర్వశః' అని చెప్పినందున ఏ ఒకానొక ఇంద్రియమునో నిగ్రహించుట చాలదనియు, అన్నిటిని నిరోధించవలెననియు స్పష్టీకరించబడినది. రాత్రి తలుపులన్నిటిని మూసివేసి, ఒక్కదానిని తెఱచియుంచినను దొంగ అందుండి లోనికి ప్రవేశించి హానిచేయగలడు. కిటికీ లన్నిటిని మూసి ఒక్క దానిని తెఱచియుంచినను గాలిచే ప్రమిదయందలి దీప మారిపోవును. కావున ముముక్షువు కడుజాగరూకుడై సర్వేంద్రియములను విషయములనుండి మరల్చవలెను. ఆత్మానుభూతికి, స్థితప్రజ్ఞత్వమునకు ఇట్టి విషయరాహిత్య మొక ఆవశ్యకతయని గీతాచార్యులు ఈ శ్లోకమున బోధించుచున్నారు.

ప్ర:- మనుజుడు స్థితప్రజ్ఞు డెపుడు కాగల్గును?

ఉ:- ఎపుడు మనుజుడు తన యింద్రియము లన్నిటిని శబ్దాది విషయములనుండి మరల్చునో, (మఱియు చిత్తమును అంతర్ముఖ మొనర్చి ఆత్మయందు స్థాపితమొనర్చునో) అపుడు స్థితప్రజ్ఞుడు కాగల్గును.

**అ॥** ఈ ప్రకారముగ స్థితప్రజ్ఞుని లక్షణములను పేర్కొని ఇక నిపుడు ఆత్మ జ్ఞానముచేతనే విషయవాసన సమూలముగ తొలగగలదని వచించుచున్నాడు –

**59. విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే.**

**టీక:–** నిరాహారస్య = శబ్దాది విషయములను స్వీకరింపనట్టి, దేహినః = జీవునకు, రసవర్జం = విషయవాసనతప్ప, విషయాః = విషయములన్నియు, వినివర్తన్తే = నివర్తించుచున్నవి (తొలగుచున్నవి), పరమ్ = పరమాత్మను, దృష్ట్వా = చూచినపిమ్మటనో, రసోఽపి = ఆ విషయవాసనకూడ, అస్య = ఇతనికి, నివర్తతే = తొలగిపోవుచున్నది.

**తా:–** శబ్దాది విషయములను స్వీకరింపనట్టి జీవునకు, ఆ విషయములు తొలగుచున్నవేకాని వానినిగూర్చిన వాసన పోవుటలేదు. పరమాత్మను దర్శించినచో ఆ వాసనయు విషయములతోబాటు తొలగిపోవుచున్నది.

**వ్యాఖ్య:–** ఈ శ్లోకము సాధకులకు అతిముఖ్యమైనది. ఏలననిన, సాధనకు సంబంధించిన ఒకానొక పరమరహస్య మిందు తెలియజేయబడినది. అది యేదియో విచారించెదము –

వాసనాక్షయ, మనోనాశ, తత్త్వజ్ఞానము లను మూడు సాధనలు శాస్త్రములందు తెలుపబడినవి. ఈ మూడున్ను ఏకకాలమందే సాధింపబడిననే తప్ప సాక్షాత్కారము కలుగదనియు చెప్పబడినది. అందు వాసనాక్షయముచే తత్త్వజ్ఞానము, తత్త్వజ్ఞానముచే వాసనాక్షయము సిద్ధించుచుండును. వెనుకటి శ్లోకమున వాసనక్షయముచే తత్త్వదర్శనము చేకూరునని చెప్పబడగా, ఈ శ్లోకమున తత్త్వ దర్శనముచే (ఆత్మావలోకనముచే) వాసనాక్షయము సిద్ధించునని చెప్పబడినది. వాసనలు నశించనిదే ఆత్మదర్శనము కాదు. ఆత్మను దర్శింపనిదే వాసనలు నశింపవు. కనుకనే ఇచట 'పరందృష్ట్వా రసోఽపినివర్తతే' = పరమాత్మను దర్శించిన పిమ్మటనే వాసన నివర్తించును – అని తెలుపబడినది. వాసనాక్షయ, తత్త్వజ్ఞానము (లేక ఆత్మదర్శనము)ల రెండిటిని ఏకకాలముననే అభ్యసింపవలెనని శాస్త్రము లుద్ఘోషించుచున్నవి.

వాసనాక్షయము సామాన్యమైనది కాదు. మోక్షముయొక్క కీలకమంతయు దానియందే యిమిడియున్నది. అది సిద్ధించినచో సమస్తము సిద్ధించినట్లే. అనేక జన్మార్జితములైన సంస్కారములు ఘనీభవించి వాసనారూపముగ చిత్తమందు దృఢపడి యుండును. ఇంద్రియములకు శబ్దాది విషయములు ఆహారము. ఆ యాహారమును అనగా విషయములను స్వీకరింపనంతమాత్రముచేత, లోనగల విషయవాసన చచ్చునని యెవరును భ్రమపడరాదు. పుట్టను కొట్టినంతమాత్రమున పాము చావదు. ఆ విషయవాసన సమూలముగ తొలగుటకు ఆత్మను సందర్శించవలెను (పరందృష్ట్వా). ఆత్మయొక్క సత్యత్వమును, జగత్తుయొక్క మిథ్యాత్వమును అనుభూత మొనర్చుకొనవలెను. ఆత్మతత్త్వమును గూర్చిన శ్రవణమననాదులను లెస్సగ గావింపవలెను. విషయములందలి అనిత్యత్వమును, ఆత్మయొక్క శాశ్వతత్వ, ఆనందత్వములను బాగుగ తెలిసికొనవలెను. అత్తఱి విషయములందలి ప్రీతి, రాగము క్రమముగ తగ్గుచు వచ్చి వాసన సన్నగిలి తుదకు నశించిపోవును. కావున సాధకులు తాము కేవలము ఇంద్రియములను పైపైన నిరోధింపగల్గిరో లేక రసవర్జితముగ (వాసనారహితముగ) చేయగల్గిరో బాగుగ పరీక్షించుకొని, భగవానుడు దయతో తెలిపిన ఈ (ఆత్మ) తత్త్వదర్శనరూపమగు ఉపాయమును అమలులోపెట్టుటద్వారా నిశ్శేషవాసనారాహిత్యమును గావించికొని జన్మసార్థకత నొందవలెను.

'నిరాహారస్య' అను పదమునకు 'ఉపవాసముచేసినవానికి' అని కొందఱర్థము చెప్పిరి. కాని దానికంటె పై అర్థమే సముచితముగ నున్నది.

ప్ర:– మోక్షప్రాప్తికి ఇంద్రియములను విషయములనుండి మరల్చుటమాత్రము చాలునా?

ఉ:- చాలదు. చిత్తమునగల విషయవాసనకూడ తొలగవలెను.

ప్ర:- ఆ వాసన తొలగుటకు ఉపాయమేమి?

ఉ:- పరమాత్మను దర్శించుటయే. అనగా ఆత్మతత్త్వచింతనాదుల ద్వారా దృశ్యముయొక్క మిథ్యాత్వమును, ఆత్మయొక్క సత్యత్వమును ప్రత్యక్షముగ అనుభూత మొనర్చుకొనుటయే.

**అ॥** ఆత్మదర్శనము కొఱకు ప్రయత్నము సలుపుచున్నను కొందఱికి అదియేల సిద్ధించుటలేదో కారణము తెలుపుచున్నాడు -

## 60. యతతో హ్యపి కౌన్తేయ పురుషస్య విపశ్చితః
## ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః.

**టీక:-** కౌన్తేయ = ఓ అర్జునా!, యతతః అపి = (ఆత్మావలోకనము కొఱకు) ప్రయత్నము చేయుచున్నవాడైనను, విపశ్చితః = విద్వాంసుడైన (శాస్త్ర జ్ఞానముగల), పురుషస్య = పురుషునియొక్క, మనః = మనస్సును, ప్రమాథీని = క్షోభము గలుగజేయునట్టి, ఇన్ద్రియాణి = ఇంద్రియములు, ప్రసభమ్ = బలాత్కారముగ, హరన్తిహి = లాగుచున్నవిగదా!

**తా:-** ఓ అర్జునా! ఇంద్రియములు మహాశక్తివంతములైనవి. ఏలననిన, ఆత్మావలోకనముకొఱకు యత్నించుచున్నట్టి విద్వాంసుడగు మనుజునియొక్క మనస్సునుగూడ నయ్యవి బలాత్కారముగ (విషయములపైకి లాగుకొని పోవుచున్నవి.

**వ్యాఖ్య:-** ఇంద్రియము లెంత బలవత్తరములైనవో ఇచట నిరూపింపబడినది. 'విపశ్చితః' అని చెప్పుటవలన విద్వాంసుడైనవానియొక్క మనస్సునుగూడ ఇంద్రియములు హరించివేయుచుండ ఇక సామాన్యుని మనస్సునుగూర్చి వేఱుగ చెప్పవలెనా? యని తెలిపినట్లైనది. అట్లే ఇంద్రియములను నిగ్రహింప యత్నించుచున్న వానినిగూడ అవి పడగొట్టుచుండ, అసలు యత్నమేచేయని అజ్ఞానుల నవి యెంతబాధించునో ఊహించు కొనవచ్చును. 'బలవానిన్ద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి' - ఇంద్రియసమూహము బలవత్తరమైనది. అది విద్వాంసునిగూడ 'ఊపివేయును' అని వ్యాసభగవానులు తెలిపియే యున్నారు. 'ప్రసభమ్' బలాత్కారముగ లాగివేయును' అని వ్యాసభగవానులు తెలిపియే యున్నారు. 'ప్రసభమ్' బలాత్కారముగ లాగి వేయునని చెప్పుటచే ఆ ఇంద్రియము లెంత శక్తివంతములో తెలిసికొనవచ్చును.

ప్రతిజీవియందును ఆత్మానాత్మయుద్ధము, ధర్మాధర్మయుద్ధము కొంతపరిమితిలో జరుగుచునే యుండును. సాధకుడు దైవసంబంధబలమొకింత సేకరించుకొనుచుండ, అటు మాయయు అవిద్యయు తన సైన్యమగు ఇంద్రియములను, విషయాదులను, వాసనలను సమాయత్తపఱచుకొనుచుండును. ఆ యుద్ధమందలి ఒకానొక సన్నివేశమే ఈ శ్లోకమున చిత్రింపబడినది. ముముక్షువునకు దైవీసంపత్తియొక్క బలము విస్తారముగ నున్ననే ఈ సంగ్రామమున విజయము గాంచగల్గును. ఈ శ్లోకమున విద్వాంసుని మనస్సును ఇంద్రియములు బలాత్కారముగ లాగివేయుచున్నవని చెప్పినంతమాత్రముచే ఎవరును అధైర్యము పొందరాదు. తన సాధనసంపత్తిని (శమదమాదులను), ఇంకను పటుతరమొనర్చుకొని శత్రువును ఎదుర్కొనవలెను. అజాగ్రత పనికిరాదు. ఈ భావమునే రాబోవు శ్లోకమున భగవానుడు తెలుపనున్నాడు.

''విపశ్చితః'' - పాండిత్యము కలవానినిగూడ ఇంద్రియములు వేధించుచున్నవని చెప్పినందువలన కేవలము శాస్త్రపరిజ్ఞానము మాత్రము చాలదనియు, అనుభవజ్ఞానము కూడ నుండవలెననియు స్ఫురించుచున్నది.

ఇంతవఱకు శత్రువుయొక్క బలమెట్టిదో సాధకునకు సరియైన అంచనా లేనందువలన ఒకింత మందప్రయత్నము చేయుచు వచ్చియుండవచ్చును. కాని ఇపుడు భగవానుడీ శ్లోకమున శత్రువుయొక్క బలిమియెట్టిదో విశ్పష్టముగ ప్రకటించెను. గావున ఇకమీదట ముముక్షువు దానికి రెట్టింపుబలమును (దైవీసంపత్తిని) చేకూర్చుకొని ఆత్మానాత్మ సంగ్రామమున విజయమును జేపట్ట వలయును.

ప్ర:- ఇంద్రియములయొక్క శక్తి యెట్టిదో నిరూపింపుము?

ఉ:- అయ్యది మోక్షమార్గమున యత్నించుచున్న విద్వాంసుని మనస్సునుగూడ బలాత్కారముగ లాగి విషయములవైపునకు బడద్రోయుచున్నది.

**అ॥** కాబట్టి ముముక్షు వేమి చేయవలెనో తెలుపుచున్నాడు -

**61. తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః**
**వశే హి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.**

**టీక:-** తాని = ఆ యింద్రియములను, సర్వాణి = అన్నిటిని, సంయమ్య = చక్కగావశపఱచుకొని, యుక్తః = సమాధిస్థితి (మనఃస్థిరత్వము) గలవాఁడగును, మత్పరః = నాయందా సక్తమైన చిత్తముగలవాడుగను, ఆసీత = ఉండవలెను, హి = ఏలననగా, యస్య = ఎవనియొక్క, ఇంద్రియాణి = ఇంద్రియములు, వశే = స్వాధీనమందు (వర్తన్తే = ఉన్నవో), తస్య = ఆతనియొక్క, ప్రజ్ఞా = జ్ఞానము, ప్రతిష్ఠితా = సుస్థిరమైనది (భవతి = అగుచున్నది).

**తా:-** (బలవత్తరములగు) అట్టి యింద్రియములన్నిటిని చక్కగా వశపఱచుకొని సాధకుడు మనఃస్థిరత్వము (సమాధి) గలవాడై నాయందే (ఆత్మయందే) ఆసక్తమైన మనస్సు గల్గియుండవలెను. ఏలననగా, ఎవని యింద్రియములు స్వాధీనమునందుండునో, ఆతని జ్ఞానమే సుస్థిరమై వెలయుగలదు.

**వ్యాఖ్య:-** 'సర్వాణి' అని చెప్పుటవలన, ఏ ఒక్క ఇంద్రియము నిగ్రహింపబడక మిగిలియున్నను అది ప్రమాద హేతువనియు, కాబట్టి అన్ని ఇంద్రియములను లెస్సగా వశపఱచుకొనవలయుననియు ఆదేశించడమైనది. కుండకు ఒక్క చిల్లియున్నను నీళ్లన్నియు కారిపోవునుగదా! ఏ ఒక్క కిటికీ తెరిచియున్నను దీప మారిపోవునుగదా! 'తదస్యహరతి ప్రజ్ఞాం వాయుర్నావ మివామ్భసి (2-67)' అని మున్ముందు భగవానుడే ఈ విషయమును స్పష్టపఱుపనున్నారు.

ఈ శోక్లమున రెండు సాధనలు చెప్పబడినవి. (1) ఇంద్రియములన్నిటిని విషయములపైకి పోనీయక నిగ్రహించుట (2) మనస్సును భగవంతునియందు (ఆత్మయందు) సంలగ్నముచేయుట. అనగా దృశ్యమును నిరోధించుట, దృక్స్వరూపము నాశ్రయించుట రెండును అవసరమే. ఇందు మొదటిదియగు దృశ్యమును మాత్రము నిరోధించి ఊరకనున్నచో, అంత ప్రయోజనముండదు. ఏలననగా అట్టి దృశ్యరహితస్థితి గాఢనిద్ర (సుషుప్తి) లో మనుజునకు కలుగుచునే యున్నదికదా! కాబట్టి దానితోబాటు ఆత్మ యందు నిలుకడ,

ఆత్మధ్యానముకూడ నుండవలెను. అప్పు తొలగవలెను. సొంతముగ కొంత ద్రవ్యమును మిగుల్చుకొనవలెను. అపుడే జీవునకు శాంతి గల్గును. అట్లే విషయవిరక్తితోబాటు ఆత్మచింతనకూడ తప్పక నుండవలెనని ఈ శ్లోకము బోధించుచున్నది. వాసనాక్షయము, తత్త్వజ్ఞానము రెండును ఆవశ్యకములే యని సాధకుడు గుర్తెఱుంగవలెను ఒకవేళ రెండవదియగు ఆత్మధ్యానమును మాత్రమే స్వీకరించినచో, వశపడని ఇంద్రియములు చిత్తమును బహిర్ముఖములుగ నీడ్చివేయుప్రమాదము కలదు. కాబట్టి ఇంద్రియనిరోధము, ఆత్మచింతన రెండును అవసరములేయని శ్రీకృష్ణమూర్తి తెలుపుచున్నారు.

''యుక్తః'' - అనగా కూడుకొనినవాడు; దృశ్యముతో కూడుకొనక దృక్స్వరూపమగు ఆత్మతో కూడుకొనినవాడు - అనగా సమాధినిష్ఠయం దుండువాడు అని యర్థము.

''మత్పరః'' - (నాయందు ఆసక్తమైన చిత్తము కలవాడు) - శ్రీకృష్ణమూర్తి సాక్షాత్ పరమాత్మయే కనుక, 'నాయందు' అని తెలిపినపుడు 'ఆత్మయందు' అని మనము గ్రహించుకొనవెను. ద్వైతభావము కలవారు, సగుణారాధకులు శ్రీకృష్ణుని దివ్యమంగళమూర్తిపై మనస్సును సంలగ్నముచేయుదురు. క్రమముగవారు కృష్ణుడు ఆత్మరూపమున తమ హృదయమందే కలడని యెఱింగి ద్వైతమునుండి అద్వైతమునకు, సగుణమునుండి నిర్గుణమునకు మారగలరు. గీత భక్తిమార్గావలంబులకు, జ్ఞానమార్గావలంబులకు, సర్వులకును ఉపయోగకరమై యున్నదనుటకు ఇట్టి పదములే తార్కాణము ('ఆత్మపరః' అని చెప్పక 'మత్పరః' అని యిట చెప్పబడినది).

ఈ శ్లోకమున మొదటిపాదము సాధనను, రెండవపాదము ఆ సాధనవలన కలుగు ఫలితమును తెలుపుచున్నవి. మొదటిపాదము ఇంద్రియములను నిగ్రహించి మనస్సును ఆత్మయందు స్థాపించవలసినదనియు, రెండవపాదము అట్లొనర్చిన వారికే ఆత్మజ్ఞానము, ఆత్మానుభూతి స్థిరముగ నుండగలదనియు బోధించుచున్నవి. ఇంద్రియనిగ్రహము లేనిచో ఆత్మయందు నిలుకడ కలుగదు. ఒకవేళ కలిగినను ఎక్కువసేపు నిలువదు. ఎంతయో కష్టపడి ఆత్మజ్ఞానము, ఆత్మస్థితి సంపాదించుకొనుచుండినను, ఇంద్రియములను విచ్చలవిడిగా విషయములపైకి పోనిచ్చుచుండినచో ఆ సంపాదించినశక్తి వ్యర్థమైపోగలదు. ఒకడు పైరులోనికి కష్టపడి నీళ్ళుతోడుచున్నను పొలములో అచటచట ఎలుకబొక్కలున్నచో, ఇక ఆ నీరు నిలుచునా? అట్లే ఆత్మజ్యోతి (జ్ఞానము) ఆరకుండ ఉండవలెననిన ఇంద్రియములను కిటికీలను, రంధ్రములను మూయవలసినదిగా (నిగ్రహింపవలసినదిగా) భగవాను డిచట ఆదేశించుచున్నాడు. అట్లు మూసినవానికే ప్రజ్ఞ, బుద్ధి (ఆత్మయందు) స్థిరముగ నెలకొనియుండునేకాని అన్యులకు కాదని స్పష్టముగా చెప్పివైచెను. కాబట్టి మోక్షప్రాప్తియందు, ఆత్మసాక్షాత్కారమందు ఇంద్రియనిగ్రహ మెట్టి కీలకస్థానమాక్రమించుచున్నదో, అది ముముక్షువుల కెంత ఆవశ్యకమో యోచించుకొనుడు.

ప్ర:- మోక్షప్రాప్తికి వలసిన సాధనము లెవ్వి?

ఉ:- (1) ఇంద్రియములన్నిటిని విషయములపైకి పోనీయక నిగ్రహించుట (2) మనస్సును ఆత్మయందు స్థాపించుట.

ప్ర:- ఎవని జ్ఞానము స్థిరముగ నుండగలదు?

ఉ:- సర్వేంద్రియ నిగ్రహము కలవానియొక్క జ్ఞానము స్థిరముగ నుండగలదు.

**అ॥** విషయ చింతనమువలన కలుగు ఘోరప్రమాదమును రెండు శ్లోకములద్వారా వెల్లడించుచున్నాడు-

**62. ధ్యాయతో విషయాన్ పుంసః సఙ్గస్తేషూపజాయతే**
**సఙ్గాత్సంజాయతే కామః కామాత్క్రోధో ఽభిజాయతే.**

**63. క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతివిభ్రమః**
**స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశా త్ప్రణశ్యతి.**

**టీక:–** ''విషయాన్'' = (శబ్దస్పర్శాది) విషయములందు, ధ్యాయతః = చింతించుచున్న, పుంసః = మనుజునకు, తేషు = ఆ విషయములందు, సఙ్గః = ఆసక్తి, ఉపజాయతే = కలుగుచున్నది, సఙ్గాత్ = ఆసక్తివలన, కామః = కోరిక, సంజాయతే = పుట్టుచున్నది, కామాత్ = (అట్టి) కోరికవలన, క్రోధః = కోపము, అభిజాయతే = పుట్టుచున్నది, క్రోధాత్ = కోపమువలన, సమ్మోహః = అవివేకము (తన యొడలు తనకే తెలియని స్థితి), భవతి = కలుగుచున్నది, సమ్మోహాత్ = అవివేకమువలన, స్మృతివిభ్రమః = మఱపు (భవతి = కలుగుచున్నది), స్మృతిభ్రంశాత్ = మఱపువలన, బుద్ధినాశః = బుద్ధినాశము (భవతి = కలుగుచున్నది), బుద్ధినాశాత్ = బుద్ధినాశమువలన, ప్రణశ్యతి = నశించిపోవుచున్నాడు (పూర్తిగ చెడినవాడగుచున్నాడు).

**వ్యాఖ్య:–** (దృశ్య) విషయచింతన ఎంతటి అనర్థమునకు దారితీయునో ఈ రెండు శ్లోకములందును విశదీకరింపబడినది. శత్రువు మిత్రునివలె నటించి మెల్లగా లోన ప్రవేశించును. మొదట కొద్దిచోటుమాత్రము అర్థించి క్రమక్రమముగా వామనమూర్తివలె విస్తరించి విస్తరించి తుదకు తనకు చోటిచ్చినవానినే హతమార్చును.

"Give me room to sit down and i can make room to lie down" 'నాకు కూర్చొనుటకు మాత్రము చోటిచ్చినచాలును, పండుకొనుటకు చోటు నేనే చేసికొనగలను' - అని మనస్సు అనునట (ఆంగ్లసామెత). విషయభావన స్వల్పముగ మనస్సున ప్రవేశించినచో అదియే పెరిగి పెరిగి మనుజుని అధోగతికి త్రోసివేయును.

'ఈస్టిండియాకంపెనీ' వారు (ఆంగ్లేయులు) మొట్టమొదట భారతదేశమునకు వ్యాపారరీత్యా వచ్చి కొద్దిస్థలమును అర్థించి తీసికొనిరి. కాని కొంతకాలమునకు వారు బలపడి తమకు నేలయిచ్చిన భారతీయులనే తుదకు అణగద్రొక్కివేసిరి. అట్లే విషయ సంకల్పమున్ను.

మొదట మనుజునకు ఏ సంకల్పమున్ను ఉండదు. నెమ్మదిగా ఏదియో యొక దృశ్యవస్తువునుగూర్చి అతడు చింతింపమొదలిడును. అపుడు దానితో మనస్సునకు ఒకవిధమైన సంబంధము (Attachment) ఏర్పడును. ఆ సంబంధమే ముదిరి ఆ వస్తువును అనుభవింపవలెనను కోరికగా పరిణమించును. దానినే కామ మందురు. అది చాల చెడ్డది. 'మహాపాప్మా' (చాల పాపిష్టిది) అని భగవానుడు దానిని మున్ముందు వర్ణించి చెప్పుదురు. ఇంటిలో పామునుగాని, దొంగగాని జొరబడినచో ఎంత అపకారమును చేయుదురో హృదయములో కామము జొరబడినపుడును అంత కీడొనర్చును. కావున ఇంటినుండి సర్పమును, దొంగను బయటికి తరిమివేయులాగున ఈ కామపిశాచమును గూడ హృదయమున ప్రవేశించిన తత్‌క్షణమే బయటకు సాగనంపవలెను. (లేక అసలు ప్రవేశింపనీయకనే యుండినచో ఇంకను మంచిది). మొలకగా నున్నపుడే దానిని త్రుంచివేయవలెను. అట్లు చేయకున్న అది తన స్నేహితులను, చుట్టములను (క్రోధాదులను) వెంటనే పిలుచుకొనివచ్చి, తన పక్షమును బలపఱచుకొని జీవుని యధోగతికి త్రోసివేయును. ఆ ఘట్టమంతయును నిచట గీతాచార్యులచే బహు సుందరముగ చిత్రింపబడినది. ఇది సాధకులకు అతిముఖ్యమైనది. ఏలననిన మనుజునకు

శత్రువులెవరో, వారెట్లు లోనికి ప్రవేశించుదురో, ఎట్లు బలపడుదురో, జీవుని యెట్లు కూలద్రోయుదురో, వారిని జయించుట ఎట్లో, ఆవిషయములన్నియు కూలంకషముగ నిచట చర్చింపబడినవి.

కామమనునది హృదయమున ప్రవేశించినవెంటనే క్రోధమునుగూడ రంగస్థలమునకు ఈడ్చును. ఈ కామ క్రోధము లిరువురును పరమమిత్రులు. ఒకరిని విడిచి మఱొకరు ఉండజాలనంతటి సన్నిహితత్వము వీరియందు కలదు. కోరిక గలిగినపుడు దానిననుభవించుటలో అడ్డుపెట్టినవారిపై క్రోధము జనించును. క్రోధము కల్లువంటిది. అది కలిగినపుడు మనుజుడు ఒడలు మఱచిపోవును. కండ్లెఱ్ఱబడును. చిత్తము వికలత్వము నొందును. యుక్తయుక్తములను మఱచును. ఆవేశపూరితుడై దయ్యముపట్టిన చందమున ప్రవర్తించును. కనుకనే క్రోధమువలన సమ్మోహము (మైమఱుపు) జనించునని యిచట చెప్పబడినది. అట్టి సమ్మోహముచే జ్ఞాపకశక్తి (స్మృతి) నశించును. దానిచే బుద్ధి చెడును. బుద్ధిచెడగనే మనుజుడు మహాపతనము నొందిపోవును. కాబట్టి విజ్ఞుడగువాడు ఇంద్రియములను విషయములపైకి పోనీయక, మనస్సును విషయములనుగూర్చి చింతింపనీయక కడు జాగరూకుడై యుండవలెనని భగవాను డిచట హెచ్చరిక చేయుచున్నాడు.

''ధ్యాయతో విషయాన్'' – అను నిచ్చోట ఒక విశేషము కలదు. అదియేదియనిన – ధ్యానమనునది ఒక క్రొత్తవిషయముకాదు. అది ప్రాపంచిక జనులందఱికిని అభ్యస్తమైనదే. కాని వారు (దృశ్య) విషయములను ధ్యానించుచున్నారు. భగవంతుని ధ్యానించుటలేదు. ఇంతియే భేదము. కాబట్టి ఇప్పుడు దైవధ్యానమును నేర్చుకొనవలసియుండినచో, ఏ యేకాగ్రత, ఏ ఆసక్తి పూర్వము విషయభోగములం దుండియున్నదో దానిని దైవమువైపునకు త్రిప్పిన చాలును. క్రొత్తగ చేయవలసిన దేమియునులేదు. అత్తఱి మోక్షము కరతలామలకమగును. ప్రహ్లాదు డిట్టి వరమునే నారాయణుని కోరియుండెను★. కావున విషయధ్యానమును వదలి దైవధ్యానమును స్వీకరింపవలెను. మోహము అని చెప్పక సమ్మోహము అని చెప్పుటవలనను, భ్రమ అని చెప్పక విభ్రమయని చెప్పుటవలనను, నశ్యతి అని చెప్పక ప్రణశ్యతి అని చెప్పుటవలనను ఆ యా వస్తువులయొక్క, క్రియలయొక్క ఆధిక్యత వెల్లడించినట్లైనది.

ప్ర:– జీవుని వినాశమునకు హేతువేది?

ఉ:– (దృశ్య) విషయచింతన

ప్ర:– అది యే ప్రకారముగ జీవుని బడద్రోయును.

ఉ:– విషయచింతనచే విషయసంగమేర్పడును. దానిచే కామము, కామముచే క్రోధము, క్రోధముచే సమ్మోహము, సమ్మోహముచే విస్మృతి, విస్మృతిచే బుద్ధినాశము, బుద్ధినాశముచే అధోగతిప్రాప్తి క్రమముగ సంభవించుచున్నవి.

**అ॥** ఇంద్రియమనంబులను స్వాధీనపఱచుకొనిన స్థితప్రజ్ఞుడు ప్రపంచమున ఎట్లు మెలగునో ఎట్టి ఫలితమును బొందునో వచించుచున్నారు –

---

★ యా ప్రీతిరవివేకానాం విషయేష్వనపాయినీ
త్వామనుస్మరతస్సా మే హృదయాన్మాపసర్పతు. (భాగవతము)
''అవివేకులకు విషయములం దెంతటి తీవ్రమగు ఆసక్తి కలదో, అట్టి ఆసక్తి నిన్ను స్మరించు నాయొక్క హృదయమునుండి తొలగకుండునట్లు చేయుము.''

## 64. రాగద్వేషవియుక్తైస్తు విషయానిన్ద్రియైశ్చరన్
## ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి.

**టీక:–** తు = కాని, విధేయాత్మా = స్వాధీనమైన మనస్సుగలవాడు, రాగద్వేష వియుక్తైః = రాగద్వేషములు లేనివియు, ఆత్మవశ్యైః = తన స్వాధీనమునందున్నవియు (నగు), ఇన్ద్రియైః = ఇంద్రియములచేత, విషయాన్ = (శరీర ధారణోపయోగములగు అన్నపానాది) విషయములను, చరన్ = అనుభవించుచున్నవాడైనను, ప్రసాదమ్ = మనోనిర్మలత్వమును (మనశ్శాంతిని), అధిగచ్ఛతి = పొందుచున్నాడు.

**తా:–** కాని, స్వాధీనమైన మనస్సుకలవాడు, రాగద్వేషరహితములును, తనకు అధీనములై యున్నవియునగు ఇంద్రియములచే (దేహయాత్రోపయుక్తములగు) అన్న పానాది విషయములను అనుభవించుచున్నవాడైనను మనోనిర్మలత్వమును (మనశ్శాంతిని) బొందుచున్నాడు.

**వ్యాఖ్య:–** మనోనిర్మలత్వమును, తత్ఫలితముగ మనశ్శాంతిని ఎవరు పొందగలరో ఈ శ్లోకమునందు నిరూపించబడినది. రాగద్వేషములు లేనివాడును, ఇంద్రియమనంబులు స్వాధీనమునందున్నవాడును మనోనిర్మలత్వమును, మనశ్శాంతిని తప్పక పొందగలడని యిట వచింపబడినది. అట్టివాడు దేహసంరక్షణార్థము అన్నపానాది విషయములననుభవించినను అతని మనోనిర్మలత్వమునకు, శాంతికి ఏ విధమైన భంగమున్ను వాటిల్లదు. విషపుకోరలు పెరికివేయబడిన సర్పమువలన హానిలేనట్లు, రాగద్వేషములు ఉడిగిన ఇంద్రియములతోను, మనస్సుతోను ప్రపంచమున వ్యవహరించినను వానివలన ఏ హానియు గలుగబోదు. చెప్పినట్లు విను మంచి గుఱ్ఱములు కల రథము గమ్యస్థానమునకు నిరాటంకముగ బోవునట్లును, వానివలన రథికునకు పరమశాంతి గలుగునట్లును, స్వాధీనపడిన ఇంద్రియమనంబులుగల మనుజునకు శరీరయాత్రావ్యవహారమందును చిత్తశాంతికి లోటుండదు.

''ఆత్మవశ్యైః, విధేయాత్మా'' – అను రెండుపదములు ప్రయోగించినందువలన, ఇంద్రియములు, మనస్సు తనకు విధేయములుగా నుండవలెనేకాని తాను వానికి దాసుడు కాగూడదని స్పష్టమగుచున్నది. ప్రపంచములో అనేకులు తమ ఇంద్రియమనంబులకు దాసానుదాసులై పరతంత్రులుగ వర్తించుచున్నారు. అట్టివారికి చిత్తశాంతి యెన్నటికిని లభించదు. ఎటువంటి ధనవంతుడైనను, బలవంతుడైనను, విద్యావంతుడైనను, తన ఇంద్రియమనంబులు తనకు విధేయములుగా లేనిచో శాంతిని నోచుకొనలేడు. కనుకనే భగవాను డిచట శాంతికి, నిర్మలత్వమునకు చక్కని మార్గమును బోధించుచు ఇంద్రియాదులు వశమందున్నవాడే వానిననుభవింపగలడని ఘంటాపథముగ చెప్పివైచిరి. కావున తన ఇంద్రియమనంబులకు తాను దాసుడుకాక, అవి ఆడించినట్లు ఆడక, పారతంత్ర్యమును పారద్రోలి, వివేకవైరాగ్యదులచేతను, భగవద్భక్తిచేతను వానిని వశీకరించుకొని పరమశాంతిని, ఆనందమును బొందవలయును.

ప్ర:– శాంతిని, నిర్మలత్వమును ఎవడు పొందగలడు?

ఉ:– (1) రాగద్వేషములు లేనివాడు (2) ఇంద్రియమనంబులను స్వాధీనపఱచుకొనినవాడు పొందగలడు.

## 65. ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే
## ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి[1].

1. పర్యవతిష్ఠతే = పాఠాన్తరము

**టీక:–** ప్రసాదే = మనోనైర్మల్యము (చిత్తశాంతి) కలుగగా, అస్య = ఇతనికి, సర్వ దుఃఖానామ్ = సమస్తదుఃఖములయొక్కయు, హానిః = వినాశము, ఉపజాయతే = కలుగుచున్నది, ప్రసన్న చేతసః = నిర్మలమనస్సు గలవానికి, బుద్ధిః = బుద్ధి, ఆశు = శీఘ్రముగ, పర్యవతిష్ఠతి హి = (పరమాత్మయందు) స్థిరముగ నిలుచునుగదా!

**తా:–** మనోనిర్మలత్వము కలుగగా దానివలన మనుజునకు సమస్తదుఃఖములున్ను ఉపశమించిపోవుచున్నవి. నిర్మలమనస్కునకు బుద్ధి శీఘ్రముగ (పరమాత్మయందు) స్థిరత్వమును జెందుచున్నది.

**వ్యాఖ్య:–** ప్రతిజీవియు దుఃఖరాహిత్యము, ఆనందప్రాప్తి యను నీ రెండిటిని కోరుచున్నాడు. అవి యెట్లు లభించగలవు? దానికి సమాధాన మీ శ్లోకమున భగవానుడు తెలియజేయుచున్నారు. మనస్సు యొక్క నిర్మలత్వముచేతనే జీవున కవి రెండును సిద్ధించుచున్నవి. చిత్తమెపుడు భోగవాసనలులేక నిర్మలముగనుండునో అపుడు జీవితలక్ష్యము సిద్ధించినదేయగును. ఏలననగా, నిర్మల దర్పణము (అద్దము) నందు వస్తువు చక్కగ ప్రతిబింబించునట్లు, శుద్ధాంతఃకరణమున, శాంతచిత్తమున అధిష్ఠానమగు ఆత్మ దేదీప్యమానముగ ప్రకాశించును.

**'మోక్షో హి చేతో విమలం సమ్యగ్జ్ఞాన విబోధితమ్'** (వసిష్ఠగీత) ఉత్తమజ్ఞానవిచారణచే నేర్పడిన నిర్మలచిత్తమే మోక్షమని శ్రీ వసిష్ఠమునీంద్రులు పలికియున్నారు. పతంజలిమహర్షియు అట్టిభావమునే వ్యక్తీకరించియున్నారు. ★కావున మోక్షమును గోరువారందఱున్ను తమ చిత్తమందలి విషయవాసనాది మాలిన్యమును కడిగివైచి అద్దానిని నిర్మలముగ నొనర్పవలయును. అట్లు చేయుటవలన రెండు మహత్తర ఫలితములు చేకూరునని భగవానుడు నుడువుచున్నారు. అవి యేవియనిన-

(1) సమస్త దుఃఖములు నశించుట. (2) బుద్ధి శీఘ్రముగ ఆత్మయందు స్థిరత్వము నొందుట.

మొదటిది దుఃఖరాహిత్యము. రెండవది ఆనందప్రాప్తి. ఆ రెండును మనోనిర్మలత్వము వలన సిద్ధించుచున్నవి. 'సర్వదుఃఖానాం' అని చెప్పుటవలన ఏ ఒకటి రెండు దుఃఖములో నశించుట కాదనియు, ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికాది సమస్తదుఃఖములు దానివలన నుపశమించుననియు స్పష్టము చేయబడినది. ఆహా! ఎట్టి అమోఘఫలితములు! దుఃఖములలోబడి క్రుంగ్గుచు, తాపత్రయములచే దహింపబడుచు, ఒక్క క్షణకాలమైనను సుఖమును, శాంతిని బొందుటకు నోచుకొనలేని జనులకు ఇంతకు మించిన ఫలితమేమి కావలయును? కావున అట్టి ఫలితమునకై చిత్తశుద్ధిని సంపాదించవలసినదిగా భగవానుడు కరుణతో బోధించుచున్నారు. అది లేకున్న ఎన్ని జన్మలకైనను ఈ సంసారయాతన శమించనేరదు.

ఇక చిత్తనైర్మల్యముచే గలుగు రెండవ ఫలితము ఆనందప్రాప్తి. 'బుద్ధిః పర్యవతిష్ఠతి' - చిత్త మెపుడు స్థిరత్వమొందగల్గునో, ఇక జీవుని యానందమునకు మేరయుండునా? చతుర్ముఖానందముకూడ ఏ యాత్మానందసాగరమున ఒకానొక బిందువే అయియున్నదో అట్టిదానియందు బుద్ధి మిళితమైనచో, స్థిరతనుజెందినచో ఇక జీవితాశయము సిద్ధించినట్లే యగును. కాబట్టి దుఃఖరాహిత్య, ఆనందప్రాప్తులను ఈ మహోన్నతఫలితద్వయమును చేకూర్చగల్గు మనోనైర్మల్యమును ప్రయత్నపూర్వకముగ జీవుడు సాధించవలయునని ఈ శ్లోకముయొక్క తాత్పర్యమైయున్నది.

---

★ సత్త్వపురుషయోః శుద్ధిసామ్యే కైవల్యమ్ (ప. యోగ. సూత్రములు 111-55)
చిత్తము ఆత్మతో సమానముగ నిర్మలత్వ మెపుడు పొందునో, అట్టిస్థితియే కైవల్యము (మోక్షము)

ప్ర:- సమస్తదుఃఖములు శమించుటకు ఉపాయమేమి?

ఉ:- మనస్సును నిర్మలముగ నొనర్చుటయే.

ప్ర:- ఎవని బుద్ధి ఆత్మయందు నిలుకడనుబొందును?

ఉ:- నిర్మలచిత్తముగలవాని బుద్ధి.

ప్ర:- మనోనిర్మలత్వమువలన కలుగు ఫలితము లేవి?

ఉ:- (1) సమస్త దుఃఖములు నశించుట (2) బుద్ధిశీఘ్రముగ ఆత్మయందు నిలుకడనుబొందుట (తద్ద్వారా ఆనందప్రాప్తి సంభవించుట).

**అ॥** ఇక ఇంద్రియమనంబులను స్వాధీనపఱచుకొనని వారియొక్క దుఃస్థితిని రెండు శ్లోకముల ద్వారా తెలియజెప్పు చున్నాడు.

## 66. నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా
## న చాభావయతః శాన్తిరశాన్తస్య కుతః సుఖమ్.

**టీక:–** అయుక్తస్య = ఇంద్రియనిగ్రహము లేనివానికి (ఇంద్రియములను, మనస్సును అరికట్టలేని వానికి), బుద్ధిః = వివేకబుద్ధి, నాస్తి = కలుగదు, అయుక్తస్య = ఇంద్రియనిగ్రహములేనివానికి, భావనాచ = ఆత్మచింతనయు, న = కలుగనేరదు, అభావయతః = ఆత్మచింతనలేనివానికి, శాంతిః చ = శాంతియు, న = కలుగదు, అశాన్తస్య = శాంతిలేనివానికి, సుఖమ్ = సుఖము, కుతః = ఎక్కడిది?

**తా:–** ఇంద్రియనిగ్రహము, మనస్సంయమము లేనివానికి వివేకబుద్ధి కలుగదు. ఆత్మచింతనయు సంభవింపనేరదు. ఆత్మచింతన లేనివానికి శాంతి లభించదు. శాంతి లేనివానికిక సుఖమెచట?

**వ్యాఖ్య:–** ప్రతిజీవియు పూర్ణసుఖము నభిలషించుచున్నాడు. ఆ సుఖ మెచటగలదు? అది యెట్లు లభించును? దృశ్యపదార్థములందు, విషయభోగములందు లభించుసుఖము వాస్తవ సుఖము కాదు. అది ప్రతిబింబసుఖము, క్షణికసుఖము, దుఃఖమిశ్రితసుఖము. అవిచ్ఛిన్న పరిపూర్ణ నిరతిశయసుఖము కలుగవలెనన్న చిత్తమునందు శాంతి యేర్పడవలెను. అశాంతమానసము సుఖమును నోచుకొనలేదు. అయితే అట్టి శాంతి ఏ విధముగ లభ్యమగును? నశ్వర ప్రాపంచిక పదార్థములను చింతించుటవలన కలుగదు. ఒకవేళ ఒకింతకలిగినను అది నిలువదు. శాశ్వతమగు ఆత్మనుగూర్చి, దైవమునుగూర్చి చింతించుటవలన, ధ్యానించుటవలననే చిత్తమున శాంతినెలకొనును. కాని ఆ యాత్మచింతన అశుద్ధమనస్సుగలవారియందు లవలేశమైనను జనింపనేరదు. బుద్ధి శుద్ధముగానున్నపుడే (మనోనైర్మల్యస్థితియందే) ఆత్మచింతన, వివేకము ఉదయించును. అయితే ఆ బుద్ధియొక్క శుద్ధత్వము దేనివలన కలుగును? చిత్తము విషయములందు ప్రవర్తింపక దృశ్యవాసనలు లేకయున్నపుడు మాత్రమే బుద్ధి నిర్మలముగనుండును. ఇంద్రియనిగ్రహమువలననే, మనస్సంయమమువలననే బుద్ధి పరిశుద్ధమగును. ఈ ప్రకారముగ బ్రహ్మానందమునకు, నిత్యనిరతిశయసుఖమునకు హేతువు ఇంద్రియనిగ్రహమేయని తేలుచున్నది.

| | | |
|---|---|---|
| సుఖమును గోరుదువా | – | శాంతిని బడయుము. |
| శాంతిని కోరుదువా | – | ఆత్మ చింతన చేయుము. |
| ఆత్మచింతన కోరుదువా | – | నిర్మలబుద్ధి గలిగి యుండుము. |
| నిర్మలబుద్ధిని కోరుదువా | – | ఇంద్రియనిగ్రహము జేబట్టుము. |

– అని ఈ శ్లోకమున భగవానుడు విశదీకరించుచు సుఖమునకు కీలకమంతయు ఇంద్రియనిగ్రహమునందే కలదని వాక్రుచ్చిరి. కాబట్టి జీవితలక్ష్యమగు పరమసుఖమును సాధించుటయందు కీలకస్థాన మాక్రమించుకొనియున్న ఆ ఇంద్రియనిగ్రహమును ప్రతి వారున్ను తప్పక అభ్యసించవలయును.

1. ప్ర:– సుఖము దేనివలన కలుగును?

   ఉ:– శాంతిచే.

2. ప్ర:– శాంతి దేనివలన లభించును?

   ఉ:– ఆత్మచింతనచే.

3. ప్ర :– ఆత్మచింతన దేనివలన కలుగును?

   ఉ:– నిర్మలబుద్ధిచే.

4. ప్ర:– నిర్మలబుద్ధి దేనివలన కలుగును?

   ఉ:– ఇంద్రియనిగ్రహమువలన, మనస్సంయమమువలన, విషయవిరక్తి వలన.

## 67. ఇన్ద్రియాణాం హి చరతాం యన్మనో௨నువిధీయతే
## తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివామ్భసి.

**టీక:–** చరతాం ఇన్ద్రియాణామ్ = విషయములందు ప్రవర్తించుచున్న ఇంద్రియములలో, యత్ = ఏ యింద్రియమును, మనః = మనస్సు, అనువిధీయతే = అనుసరించిపోవుచున్నదో, తత్ = ఆ యింద్రియము, అస్య = దీనియొక్క, ప్రజ్ఞామ్ = వివేకమును, అంభసి = నీటియందు, నావమ్ = ఓడను, వాయురివ = (ప్రతికూల) వాయువువలె, హరతి హి = ఈడ్చుకొనిపోవుచున్నదిగదా!

**తా:–** విషయములందు ప్రవర్తించుచున్న ఇంద్రియములలో నెద్దానిని మనస్సు అనుసరించి పోవునో, అయ్యది మనుజునియొక్క వివేకమును – జలమందు ఓడను ప్రతికూలవాయువు పెడదారికి లాగుకొని పోవునట్లు – హరించివేయుచున్నది.

(యత్ మనః అనువిధీయతే తత్ = ఏ మనస్సు అనుసరించిపోవుచున్నదో ఆ మనస్సు = అనియు అర్థము చెప్పవచ్చును.)

**వ్యాఖ్య:–** సాధకుడు ఇంద్రియార్థములగు శబ్దస్పర్శాదులందు విరక్తి గలిగి యుండ వలెను. అట్లుకాక ఇంద్రియములు విచ్చలవిడిగ విషయారణ్యములందు సంచరించుచుండినచో, దానివలన కలుగు ముప్పు,

ప్రమాదము ఇచట వర్ణింపబడినది. విషయములందు సంచరించు ఇంద్రియములలో ఏ యింద్రియమును మనస్సు అనుసరించి వర్తించునో లేక ప్రేరణచేయునో ఆ యింద్రియము వానిని సంసారకూపమున పడద్రోయును; వానికొంప గూల్చును. ఈ సందర్భమును పోషించుట కిచట నొక చక్కని యుపమానము చెప్పబడినది. ఏ ప్రకారము సముద్రమున ప్రతికూలవాయువు. లేక తుపానుగాలి ఓడను అపమార్గమునకు ఈడ్చి వేయునో, లేక సముద్రమునందు కూలద్రోయునో, ఆ ప్రకారమే మనస్సు వెన్నంటు ఇంద్రియము మనుజుని దైవమార్గమునుండి తప్పించి సంసారమార్గమున కూలద్రోయుచున్నది. ఒక్క యింద్రియమే యింత అనర్థమును తెచ్చిపెట్టుచుండ నిక సర్వేంద్రియములను మనస్సు అనుసరించిపోవుచో సంఘటిల్లు వినాశ మెంతయో వేఱుగ జెప్పవలెనా?

కావున మనస్సును చక్కగ వివేకవంతముగ జేసి దానిని యింద్రియములవెంటబరువిడకుండులాగున చూడవలెను. మఱియు ఇంద్రియములను మనస్సు అదుపులోనుంచి విషయములయందు ప్రవర్తించకుండ నిరోధించుచు వానిని తన స్వాధీనమందుంచు కొనవలెను. అట్లుకాక, వానితోబాటు మనస్సుకూడ విషయములపైకి పోయినచో, ఆ యింద్రియములు మనుజునిప్రజ్ఞను, వివేకమును బూడిదపాలు చేయునని యిట చెప్పబడినది. కాబట్టి సాధకుడు తాను సంపాదించిన ఒకింత వివేకము, ఆత్మ జ్ఞానము సురక్షితముగ నుండవలెననిన, ఇంద్రియద్వారములను మూసివేసి (నిగ్రహించి), విషయవాయువు అందుండి తోలకుండచూడవలెను. ఈరహస్యమే ఈ శ్లోకమునందు వెల్లడింపబడినది. అనేకమంది సాధకులు ఎంతయో ప్రయత్నముచే ఒకింత ఆత్మజ్ఞానము, ప్రజ్ఞ, వివేకము సంపాదించియు, అజాగ్రతచే ఇంద్రియములను విషయములపైకి వదలుటచే, లేక, వైరాగ్యము సన్నగిలుటచే తమ యాప్రజ్ఞనంతను వమ్ము చేసికొనుచుండుట కానంబడుచున్నది. అట్టివారికి హెచ్చరికరూపమున నుండుట కొఱకై ఈ ప్రకారములగు బోధలను భగవాను డిచట గావించుచున్నారు. కావున నిట్టి బోధల నాలకించి సాధకులు తమ యనుష్ఠానవిషయమున కడు జాగరూకులై వర్తించవలయును.

ప్ర:- ఇంద్రియములు, మనస్సు విషయములందు సంచరించినచో కలుగు హానియేమి?

ఉ:- అట్లు విషయములందు ప్రీతి గల్గియున్న ఇంద్రియములు, మనస్సు మనుజుని (ప్రజ్ఞను) వివేకమును, దైవభక్తిని నశింపజేసివైచును.

**అ॥** కాబట్టి ఇంద్రియనిగ్రహము కలవానియొక్క ప్రజ్ఞయే స్థిరముగ నుండగల్గునని వచించుచున్నాడు.

## 68. తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః
## ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.

**టీక:-** మహాబాహో ! = గొప్పబాహువులుగల ఓ అర్జునా!, తస్మాత్ = అందువలన, యస్య = ఎవనియొక్క, ఇన్ద్రియాణి = ఇన్ద్రియములు, ఇన్ద్రియార్థేభ్యః = విషయములనుండి, సర్వశః = సర్వవిధములచేత (సంపూర్ణముగ), నిగృహీతాని= నిగ్రహింపబడినవో, తస్య = అతని యొక్క, ప్రజ్ఞా = జ్ఞానము (వివేకము), ప్రతిష్ఠితా = మిగుల స్థిరమైనది యగుచున్నది.

**తా:-** కాబట్టి ఓ అర్జునా! ఎవడు తన యింద్రియములను విషయములపైకి పోనీయక సర్వవిధముల అరికట్టుచున్నాడో, అతని జ్ఞానమే మిగుల స్థిరమైయుండును.

**వ్యాఖ్య:—** "సర్వశః" - అని చెప్పుటవలన ఇంద్రియములను ఒకింత నిగ్రహించుట చాలదనియు, సంపూర్ణముగ నిగ్రహింపవలయుననియు, సర్వవిధముల ప్రయత్నము చేసి ఎట్లైన వానిని లొంగదీసికొనవలయుననియు స్పష్టమగుచున్నది.

ఇంద్రియార్థములగు శబ్దస్పర్శాది విషయములపైకి పోనీయక ఎవడు తన ఇంద్రియములను సంపూర్ణముగ నిగ్రహించునో, అట్టివాని వివేకమే స్థిరముగ నుండుననియు, అట్టివాని బుద్ధియే ఆత్మయందు స్థిరత్వమునుబొందుననియు భగవాను డిచట తెలుపు చున్నారు. ఈ ప్రకారముగ పదేపదే నొక్కి చెప్పుటవలన మోక్షమార్గమున ఇంద్రియనిగ్రహమున కెట్టి ప్రముఖస్థానముకలదో తేటతెల్లమగుచున్నది. 'మాకు దుఃఖము పోవలెను. సంసారబాధలు శమించవలెను, మోక్షము కలుగవలెను' అని జనులు పలుకుచున్నారేకాని, దాని కత్యవసరమైన సాధనలనుమాత్రము చేయుటలేదు. కావున దుఃఖరాహిత్యమును గోరువారు భగవానుడు తెలిపిన ఈ ఇంద్రియనిగ్రహాది సాధనలను తప్పక అవలంబించవలెను.

ప్ర:- ఎవనియొక్క ప్రజ్ఞ (వివేకము) సుస్థిరమైయుండగలదు?

ఉ:- ఇంద్రియములను సంపూర్ణముగ నిగ్రహించువానియొక్క ప్రజ్ఞ సుస్థిరమైయుండగలదు.

**అ॥** సామాన్య జనుల ప్రవృత్తికిని సంయమశీలురైన యోగులయొక్క ప్రవృత్తికిని భేదములు జూపుచున్నాడు -

## 69. యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ
## యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః.

**టీక:—** సర్వభూతానామ్ = సమస్తప్రాణులకును, యా = ఏది, నిశా = రాత్రియో, తస్యామ్ = దానియందు, సంయమీ = ఇంద్రియనిగ్రహముగల యోగి, జాగర్తి = మేలుకొనియుండును, యస్యామ్ = దేనియందు, భూతాని= ప్రాణులు, జాగ్రతి= మేలుకొనియుండునో, సా= అది, పశ్యతః= పరమార్థతత్త్వమును దర్శించుచున్న, మునేః = (ఆత్మ) మననశీలునకు, నిశా = రాత్రి (భవతి = యగుచున్నది).

**తా:—** సమస్త ప్రాణులకును (సామాన్యజనులకు) ఏది (పరమార్థతత్త్వము) రాత్రియై (దృష్టికి గోచరముకాక) యున్నదో, దానియందు ఇంద్రియనిగ్రహపరుడగు యోగి మేలుకొనియుండును (ఆత్మావలోకనము జేయుచుండును). దేనియందు (ఏ శబ్దాది విషయములందు) ప్రాణులు మేలుకొనియున్నారో (ఆసక్తితో ప్రవర్తించుచున్నారో) అది (విషయజాలము) పరమార్థతత్త్వమును దర్శించు మునీంద్రునకు రాత్రిగా నుండును (దృష్టిగోచరముకాక యుండును).

**వ్యాఖ్య:—** ఈ శ్లోకము ఆలంకారిక భాషలో చెప్పబడినది. "అజ్ఞానులకు ఏది రాత్రియో అది జ్ఞానులకు పగలు, జ్ఞానుల కేది రాత్రియో అది అజ్ఞానులకు పగలు." అని యిట తెలుపబడినది. దీనిని గూర్చిన వివరణ:- ఆత్మ, దైవము, ఇంద్రియనిగ్రహము మున్నగు పరమార్థవిషయములు అజ్ఞానుల కేమియును తెలియవు. తెలిసికొనవలెనను కుతూహలమున్ను వారికుండదు. అవియేవియు వారి దృష్టికి గోచరింపవు. అవి వారికి లేనట్లే యగును. కావున అవి వారికి రాత్రివంటివని చెప్పబడినవి.

ఆ పరమార్థవిషయములందు వారు అజాగరూకులైయుందురు. నిదురపోవుచుందురు. నిర్లక్ష్యముగ

ప్రవర్తించుచుదురు. కాని సంయమశీలురైన జ్ఞానులయొక్క వర్తనము దీనికి కేవలము విరుద్ధముగ నుండును. ఏలయననిన, వారు నిరంతరము దైవచింతన, ఆత్మానుభూతిగలిగి యుందురు. ఆత్మవిషమై సదా జాగరూకులైయుందురు. దైవస్మరణను ఒక్కక్షణమైనను విస్మరింపరు. బ్రహ్మానుభూతియందు మేలుకొని యుందురు. కావున అజ్ఞానులు నిదురపోవుచుండు దైవవిషయమునజ్ఞానులు మేలుకొనియేయుందురు. వారి కేది రాత్రియో అదియే వీరికి పగలు.

మఱియు జ్ఞానులగు మహనీయులు ఇంద్రియనిగ్రహపరులై, విషయభోగములందు విరక్తి గలిగి నామరూపాత్మకమగు ఈ దృశ్యప్రపంచమును మిథ్యగా దలంచుచు, ప్రాపంచిక విషయములం దాసక్తిలేక యుందురు. ఇంద్రియార్థములగు శబ్దస్పర్శాదు లందు విముఖత్వము గలిగియుందురు. అవి వారిదృష్టికే గోచరింపవు. కనుక ఈ విషయాదులన్నియు, భోగవిలాసములన్నియు వారికి రాత్రివంటివేయగును. వానియందు సంయమశీలురు నిదురబోవుచుందురు. కాని అవియే అజ్ఞానులకు మహాప్రీతికరములుగ నుండును. అహర్నిశములు వానియందే ప్రీతిగొనుచు, వానినే యనుభవించుచు కాలక్షేపము చేయుచుందురు. ఆ విషయభోగములందు, నామరూపవ్యవహారములందు వారు సదా జాగరూకులై యుందురు. కాబట్టి అవి వారికి పగలు వంటివి. ఏ ఇంద్రియవిషయములందు జ్ఞానులు నిదురించుచున్నారో, వానియం దజ్ఞానులు మేలుకొనియున్నారు. వారికేది రాత్రియో వీరికది పగలు.

రాత్రికాలమున సంచరించు జంతువు లనేకములు కలవు - పిల్లి, గబ్బిలము, గుడ్లగూబ, రాక్షసులు, క్రూరమృగములు మున్నగునవి. మనకు పగలు వానికి రాత్రి. వానికిరాత్రి మనకు పగలు. అజ్ఞాను లీనిశాచరుల కోవకు చెందినవారు. జ్ఞానులు దినచరుల వర్గమునకు జెందినవారు.

''సంయమీ'' - అని ప్రయోగించుటవలన ఇంద్రియనిగ్రహము పరిపూర్ణముగ గలవాడై ఆత్మవిషయమున మేలుకొనగలడనియు (జాగర్తి), అట్టి సంయమములేనివానికి దైవము (ఆత్మ) కానరాడనియు స్పష్టముగ బోధపడుచున్నది. ఇవ్విధముగ అధ్యాత్మక్షేత్రమున సంయమమున (ఇంద్రియనిగ్రహమున) కెట్టి మహోన్నతస్థానము కలదో యిట చక్కగ నిరూపింపబడినది.

''పశ్యతో మునేః'' - మునులు అనగా మననశీలు రనేకులుండవచ్చునుగాని ఆత్మదర్శనమునొందిన ముని లరుదు. 'పశ్యతః' అని చెప్పినందువలన భగవంతుని (ఆత్మను) ప్రత్యక్షముగ చూడవచ్చుననియు, అనుభూతమొనర్చుకొనవచ్చుననియు నిట స్పష్టమగాచున్నది. అట్టి స్థితిని ప్రతివారున్ను పొందవలసియున్నది.

విషయభోగములను త్యజింపవలెననియు, ఇంద్రియనిగ్రహముగలిగి ఆత్మయందు సదా మేలుకొనియుండవలెననియు ఈ శ్లోకము బోధించుచున్నది.

ప్ర:- అజ్ఞానికి, జ్ఞానికి గల భేదమేమి?

ఉ:- అజ్ఞాని { దైవవిషయమున ప్రవర్తింపకుండును.
విషయభోగములందు సదా ప్రవర్తించును.

జ్ఞాని { దైవవిషయమున సదా ప్రవర్తించుచుండును.
విషయభోగములందు విరక్తి గలిగియుండును.

**అ॥** శాంతిని యెవరు పొందగలరో రెండు శ్లోకముల ద్వారా చెప్పుచున్నాడు -

**70. ఆపూర్యమాణమచలప్రతిష్ఠమ్
సముద్రమాపః ప్రవిశన్తి యద్వత్
తద్వత్కామా యం ప్రవిశన్తి సర్వే
స శాన్తి మాప్నోతి న కామకామీ.**

**టీక:—** ఆపూర్యమాణమ్ = ఉదకములచే (నదీజలము మున్నగువానిచే) సంపూర్ణముగ నిండింపబడినదియు, అచలప్రతిష్ఠమ్ = స్థిరమైనయునికిగలదియు (హద్దుమీరనిదియు) నగు, సముద్రమ్ = సముద్రమును, ఆపః = (నది మొదలగువాని) జలములు, యద్వత్ = ఏ రీతిగా, ప్రవిశన్తి = ప్రవేశించుచున్నవో, తద్వత్ = ఆ రీతిగనే, సర్వేకామాః = భోగ్యవిషయములన్నియు, యమ్ = ఏ మనుజుని (బ్రహ్మనిష్ఠుని), ప్రవిశన్తి = ప్రవేశించుచున్నవో (ప్రవేశించి అణగిపోవుచున్నవో), సః = అట్టివాడు, శాన్తిమ్ = శాంతిని, అప్నోతి = పొందుచున్నాడు. కామకామీ = విషయాసక్తి కలవాడు, న (అప్నోతి) = పొందడు.

**తా:—** జలములచే సంపూర్ణముగ నిండింపబడినదియు, నిశ్చలమైనదియు నగు సముద్రమును నదీజలము మున్నగునవి యేప్రకారము ప్రవేశించుచున్నవో, ఆ ప్రకారమే భోగ్యవిషయములన్నియు ఏ బ్రహ్మనిష్ఠుని పొంది (అతనిని వికృతము చేయలేక) అణగిపోవుచున్నవో, ఆతడే శాంతిని పొందునుగాని విషయాసక్తి కలవాడుకాదు.

**వ్యాఖ్య:—** "కామాః" - అను పదమునకు 'కోరికలు' అను అర్థ మిచట చెప్పుట సమంజసముకాదు. ఏలననగా బ్రహ్మజ్ఞానికి, స్థితప్రజ్ఞునకు కోరికలెవ్వియు నుండవు. కావున 'కామ్యన్తే, ఇతి కామాః' అను వ్యుత్పత్త్యర్థమునుబట్టి కోరబడునట్టి 'భోగ్యవిషయములు' అని అర్థము చెప్పుట మంచిది.

శాంతిని యెవరు పొందగలరో ఈ శ్లోకమున నిరూపింపబడినది. కామమునకు దాసుడు, విషయాసక్తుడు, కోరికలను కోరుచుండువాడు శాంతి నెన్నటికిని పొందజాలడని ఇచట స్పష్టముగ చెప్పివేయబడినది. 'న కామకామీ' కోరికలను కోరనివాడు, విషయాసక్తి లేనివాడు, కామమును జయించినవాడు మాత్రమే శాంతిని బొందగల్గును. సందర్భమును వివరించుటకై ఇచట నొక దృష్టాంతము చెప్పబడినది.

జ్ఞానిని యొక సముద్రమునకు పోల్చి చెప్పబడెను. సముద్రము తనలోని యెంతయో జలము సూర్యతాపమున కావిరియై మేఘరూపముగ పరిణతిజెందుచున్నను ఒక్క అంగుళమైనను తగ్గదు. అట్లే అనేక నదులద్వారా, వర్షములద్వారా ఎంతయో జలము దానియందు వచ్చిపడుచున్నను లవలేశమైనను పెరుగదు. సమముగా నుండును. అట్లే జ్ఞానియగువాడు, స్థితప్రజ్ఞుడు తన యింద్రియములకు శబ్దాదివిషయము లనేకములు గోచరించినను, గోచరింపకున్నను నిర్వికారుడుగ నుండును. ఏమాత్రము చలింపడు. అతనికి విషయాసక్తి ఒకింతైనను లేకుండును. 'సర్వేకామాః' అని చెప్పుటవలన ఒక విషయముకాదు, అనేక భోగ్యవిషయములువచ్చి మీదపడినను, అవి అచటనే అణగిపోవును. వికారమును గలుగజేయవు. అనగా జ్ఞానియగువాడు ఒకవేళ దైవికముగ నిత్యవ్యవహారమున అనేక దృశ్యవిషయములమధ్య యుండుట తటస్థించినను, ఇంద్రియములద్వారా యతనికి శబ్దాదివిషయములు గోచరించినను ఏవికారమున్ను లేకుండునని భావము.

**జ్ఞాతజ్ఞేయస్య మనసో నూనమేతద్ధి లక్షణమ్**
**న స్వదన్తే సమగ్రాణి భోగవృన్దాని యత్నునః.** (వసిష్ఠగీత) అని శ్రీవసిష్ఠమునీంద్రులు పలికినట్లు ఆత్మజ్ఞానియొక్క గుఱుతు భోగములందాసక్తి లేకుండుటయేయగును. ఒకవేళ ఆసక్తియుండినచో అతడింకను జ్ఞానస్థితిని బొందలేదనియే తాత్పర్యము. సముద్రము మహాజలముచే పరిపూర్ణమైయుండునట్లు జ్ఞాని బ్రహ్మానందముచే పరిపూర్ణుడైయుండును. మఱియు సముద్రము అచలమై, సుప్రతిష్ఠితమై యుండునట్లు జీవన్ముక్తుడు నిర్వికారుడై నిశ్చలుడై మేరుసమాన గాంభీర్యము గలిగియుండును.

చిన్న చిన్న చెఱువులలో, దొరువులలో గుంటలలో, బావులలో, సరస్సులలో, నదులలో అధికజలము వచ్చిపడునపుడు అవి కట్టలు త్రెంచుకొనును. జలమేమియు రానపుడు, ఎండలు బాగుగ కాచినపుడు పూర్తిగ ఎండిపోవును. అట్లే అజ్ఞానుల హృదయమున భోగ్యపదార్థములు శబ్దాది విషయములు వచ్చిపడినచో వికారవంతులై, చపలచిత్తులై ప్రవర్తించుదురు. ఏవిషయములు లభించనిచో శోకాకులురై, దీనులుగ వర్తించుదురు. ఇదియే జ్ఞానులకు, అజ్ఞానులకు గల భేదము. ఈ భేదమే ఈ శ్లోకమున నిరూపింపబడినది. మఱియు, కోరికలు కోరువాడు శాంతి నెన్నటికిని బడయజాలడని చెప్పబడినందున, మనుజుడు కామమును త్యజించి (లేక జయించి) విషయాసక్తిని వదలి వాంఛారహితుడు ('అకామకామీ') కావలెనేకాని వాంఛాసమన్వితుడు (కామకామీ) ఎన్నటికిని కారాదు.

ఇచట నింకొక రహస్యమున్నుగలదు. సముద్రము నదీజలమునుగాని, వర్షజలమునుగాని తనకు తానై ఎన్నటికిని కోరదు. అవియే దైవికముగ వచ్చిపడును. అట్లే జ్ఞానియు ఏ విషయమును కోరడు. కాని నిత్యవ్యవహారమున ఒకవేళ దైవికముగ శబ్దాదివిషయములు తటస్థించినను వానిచే నతడేమాత్రము తొణకక, నిర్వికారుడైయుండునని భావము.

కాబట్టి శాంతి నభిలషించువారందఱున్ను ఈ శ్లోకమును, అందును ముఖ్యముగ 'సశాన్తి మాప్నోతి న కామకామీ' అను చివఱిపాదమును బాగుగ మననము చేయుచు, తమయందున్న ఒక్కొక్క కోరికను బయటకు లాగిపారవేసి కామరూప పిశాచమునకు తన హృదయమున ఇసుమంతైనను చోటీయక తత్ఫలితముగ పరమశాంతిని, ఆత్మానందమును అనుభవించవలయును.

ప్ర:- శాంతిని ఎవడు పొందగలడు?

ఉ:- ఏ కోరికలు లేనివాడు. విషయజాలముచే వికృతముకాని హృదయముకలవాడు. సముద్రమువలె నిర్వికారుడై చెన్నొందువాడు శాంతిని పొందును. అంతియేకాని, కోరికలను కోరుచుండువాడెన్నటికిని శాంతిని బొందలేడు.

**71. విహాయ కామాన్ యస్సర్వాన్ పుమాం శ్చరతి నిస్స్పృహః**
**నిర్మమో నిరహంకారః స శాన్తి మధిగచ్ఛతి.**

**టీక:-** యః పుమాన్ = ఏ మనుజుడు, సర్వాన్ = సమస్తములైన, కామాన్ = కోరికలను, శబ్దాదివిషయములను, విహాయ = విడిచి, నిస్స్పృహః = వానియందు ఆశలేనివాడును, నిర్మమః = మమకారములేనివాడును, నిరహంకారః = అహంకారవర్జితుడును అయి, చరతి = సంచరించుచున్నాడో, సః = అతడు, శాన్తిమ్ = శాంతిని, అధిగచ్ఛతి = పొందుచున్నాడు.

**తా:–** ఎవడు సమస్తములైన కోరికలను, శబ్దాదివిషయములను త్యజించి వానియందేమాత్రము ఆశలేక, అహంకారమమకారవర్జితుడై ప్రవర్తించునో అట్టివాడే శాంతిని పొందుచున్నాడు.

**వ్యాఖ్య:–** స్థితప్రజ్ఞుని లక్షణములనుగూర్చి ఇదివఱలో అర్జునుడు నాలుగు ప్రశ్నలువైచెను. అవి యేవియనిన-

(1) కా భాషా = అతని లక్షణములెవ్వి? (2) కిం ప్రభాషేత = ఏమి పలుకును? (3) కి మాసీత = ఏరీతిగ నుండును? (4) వ్రజేత కిమ్ = ఎట్లు సంచరించును?

(1) ఇందు 55వ శ్లోకమునుండి అధ్యాయము చివఱవఱకు చెప్పినవియన్నియు స్థితప్రజ్ఞుని సర్వసామాన్యలక్షణములే కావున అవి మొదటి ప్రశ్నకు సమాధానమగును. (2) 55వ శ్లోకమునుండి 57వ శ్లోకము వఱకు రెండవ ప్రశ్నకు సమాధానము. (3) 58వ శ్లోకమునుండి 61వ శ్లోకము వఱకు మూడవప్రశ్నకు సమాధానము. (కి మాసీత అనుదానికి 61వ శ్లోకములోని 'యుక్త ఆసీత' – అని ప్రత్యుత్తరము). (4) 71వ శ్లోకము నాల్గవ ప్రశ్నకు – 'వ్రజేత కిమ్' అనుదానికి 71వ శ్లోకములోని 'చరతి నిస్స్పృహః' అనునది ప్రత్యుత్తరము. శాంతి యెవరికి లభించగలదో మరల ఈశ్లోకమున విశదీకరించుచున్నారు. శాంతిని, సుఖమును పొందదలచువారందఱున్ను నాలుగు అతి ముఖ్యమైన సాధనలను ఆచరింపవలసియుందురు. అవియేవి యనిన – (1) సమస్తమైన కోరికలను, శబ్దాదివిషయములను త్యజించుట (2) వీనియందే మాత్రమున్ను అభిలాష లేకుండుట (3) అహంకారమును పారద్రోలుట (4) మమకారమును విసర్జించుట. ఇందొక్కొక్క దానిని గూర్చి సంక్షేపముగ విచారించెదము:- (1) స్థితప్రజ్ఞఘట్టప్రారంభమున 'ప్రజహాతి యదా కామాన్ సర్వాన్' – అను విషయమునే అనగా సమస్తములైన కోరికలను విడనాడవలెనను దానినే భగవానుడు మఱల నిచ్చోట వచించుచున్నారు. 'సర్వాన్' (సమస్తములైన) అను పదమును బాగుగ గమనించవలయును. ఏ ఒక్కకోరికయు, విషయమున్ను హృదయమున మిగిలియుండరాదనిభావము. ఏలయనిన, అదియే పెరిగి పెరిగి విస్తరించి సాధకునకు ఉపద్రవము తెచ్చిపెట్టగలదు. కావున అన్నిటిని త్యజించివైచి హృదయమును నిశ్శేషవాసనారహితముగ నొనర్పవలెను. (2) విషయములను, వాంఛలను తొలగించినను మఱల వానిని గూర్చి అభిలాషగాని, సంస్మరణముగాని గలుగనీయక నిఃస్పృహుడుగా మెలగవలెను. (3) అహంకారమును దరికిచేర్చరాదు. వాస్తవముగ తాను ఆత్మయేకాని దేహాది ఉపాధిరూపము కాదు. కావున ఆత్మభావనగల్గి దేహాదులందహంభావమును పరివర్జింపవలయును. (4) దేహమే తనదికానపుడు దేహమునకు బయటగల క్షేత్రగేహబంధ్వాది పదార్థములు తనవి యెట్లగును? కాబట్టి వానియందు మమత్వమును త్యజించవలెను – ఈ ప్రకారముగ ఈ నాలుగు సాధనములను ఎవడనుష్ఠించునో ఆతడు పరమశాంతిని బడయగలడని భగవానుడు తెలుపుచున్నారు. అవి లేనివాడీసంసారచక్రమున తగుల్కొని అశాంతిని, దుఃఖమును పొందుచుండును.

ఈ శ్లోకమున 'యః' (ఎవడు) అని యచ్ఛబ్ద ప్రయోగము చేయబడుటవలన పై అర్హతలు గలవాడెవడైనను సరియే, ఏ జాతి మత కుల వర్ణములకు చెందినవాడైనను, స్త్రీయైనను, పురుషుడైనను, చండాలుడైనను శాంతిని, మోక్షమును తప్పక బడయగల్గునని స్పష్టమగుచున్నది. గీతయం దిట్టి విశాల భావములే సర్వత్ర ప్రకటింపబడియున్నవి.

ప్ర:- శాంతిని ఎవడు పొందగల్గును?

ఉ:- (1) కోరికలను, విషయములను అన్నిటిని విడనాడువాడును (2) దృశ్యపదార్థములవేనియందును

అభిలాష లేనివాడును (3) అహంకారమును పారద్రోలినవాడును (4)మమకారమును వదలినవాడును - అగు మనుజుడు శాంతిని పొందగల్గును.

**అ॥** ఇట్టి నిర్విషయస్థితిని అంత్యకాలమునందుగూడ గలిగియేయుండవలెననియు, దానివలన మోక్షము లభించుననియు బోధించుచున్నాడు -

## 72. ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి
## స్థిత్వాఽస్యా మన్తకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి.

**టీక:—** పార్థ= ఓ అర్జునా!, ఏషా= ఇది, బ్రాహ్మీస్థితిః= బ్రహ్మసంబంధమైనస్థితి, ఏనామ్= దీనిని, ప్రాప్య = పొంది, న విముహ్యతి = విమోహమును జెందడు, అన్తకాలే ఽపి = అంత్యకాలమందుగూడ, అస్యామ్ = ఈ స్థితియందు, స్థిత్వా = నిలిచి, బ్రహ్మనిర్వాణమ్ = బ్రహ్మానందమును (మోక్షమును), ఋచ్ఛతి = పొందుతున్నాడు.

**తా:—** అర్జునా! ఇదియంతయు బ్రహ్మసంబంధమైన స్థితి; ఇట్టి బ్రాహ్మీస్థితిని బొందినవాడు మఱల నెన్నటికిని విమోహమును జెందనేరడు. అంత్యకాలమునందు గూడ ఇట్టి స్థితియందున్నవాడు బ్రహ్మానందరూప మోక్షమును బడయుచున్నాడు.

**వ్యాఖ్య:—** స్థితప్రజ్ఞుని సంబంధముగ నింతవఱకు తెలుపుచువచ్చిన సాధనలను - అనగా ఇంద్రియనిగ్రహము, విషయత్యాగము, అహంకార మమకార రాహిత్యము మున్నగువానిని చేయుచురాగా జీవబ్రహ్మైక్యము సిద్ధించును. కీటకము భ్రమరముగా మారు చందమున జీవుడు బ్రహ్మస్వరూపుడై వెలయును. అదియే బ్రాహ్మీస్థితి. అట్టి స్థితియందు మనుజుడు బ్రహ్మానందభరితుడై యుండి సాంసారికభ్రమలను, విమోహమును మరల నెన్నటికిని బొందకనే యుండును.

''అన్తకాలేఽపి'' - సంస్కృతములో 'అపి' అను శబ్దమునకు 'కూడ' అని అర్థము. అన్తకాలేఽపి' అనగా అంత్యకాలమునందుగూడ - ఇట్టి బ్రాహ్మీస్థితియం దుండువాడు నిర్వాణరూపమగు మోక్షమును బడయును అని భావము. అంతియేకాని అంత్యకాలమందు 'మాత్రమే' అని యిచట చెప్పబడలేదు. అట్లు చెప్పియుండినచో జనులు జీవితమంతయు సోమరులుగ వ్యవహరించి భగవద్ధ్యానమును అంత్యకాలమునకు వాయిదా వేయుదురు. అయితే పొరపాటునగాని, బోధించువారు లేకపోవుటవలనగాని, లేక మఱియే కారణముచేగాని జీవితమంతయు భగవంతుని గూర్చి తలంపక వార్ధక్యమున, లేక అంత్యకాలమున దైవచింతన ప్రారంభముచేసిన, అది మంచిదేకాని శరీరదౌర్బల్యాదులవలన అత్తఱి సాధన చక్కగా జరుగదు. మఱియు ఈ పరమార్థసాధన, ఇంద్రియనిగ్రహాదులు, కామజయము ఒక్కరోజులో సిద్ధించునదికాదు. అనేక జన్మార్జిత మలిన వాసనలు ఒక్కక్షణములో మాయమైపోవునా? ఎంతయో దీర్ఘకాలము బుద్ధిబలముతో, శరీరసౌష్ఠవముగల్గి తీవ్రసాధన చేసిననే సిద్ధించును. కావున ఆరోగ్యము, బలము, ప్రజ్ఞ, స్మృతి బాగుగ గలిగియున్న బాల్యయౌవనకాలములే ఆధ్యాత్మిక సాధనలకు సరియైన వేళలు. కనుకనే భగవానుడు గీత - 8వ అధ్యాయమున -

'తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్యచ' ఎల్లకాలములందును భగవచ్చింతన చేయుమని చెప్పిరేకాని చివఱికాలమందే యని చెప్పలేదు. మఱియు జీవితమంతయు ఏ సాధనచేయుదురో, ఏ నామము

నుచ్చరించుదురో, అంత్యకాలమున అదియే అక్కఱకు వచ్చును. అట్లుకాక సరిగా అంత్యకాలముననే ప్రారంభించినచో (మంచిదేకాని) అత్తఱి భగవత్స్మృతి లెస్సగ గలుగుట దుర్లభము. కాబట్టి అంత్యకాలమున దైవస్థితిలో నిలుకడ కలుగుటకుగాను జీవితమంతయు దానినిగూర్చిన ప్రబలప్రయత్నము గావింపవలెను.

మఱియు 'అంత్యకాలము' ఫలానిసమయమున వచ్చునని నిర్దేశించి చెప్పుట కెవరికిని సాధ్యపడదు. అందువలన ప్రతినిమిషమును, బాల్యయౌవనములనుగూడ దైవచింతనామయముగ నొనర్చినచో బ్రాహ్మీసాధనయందు గడిపినచో ఇక అంత్యకాలమెప్పుడు తటస్థించిననేమి? మరణమెప్పుడు సంభవించిననేమి? కాబట్టి సాధకు లీవిషయమున కడుజాగరూకులై వార్ధక్యముకొఱకు వేచియుండక, అంత్యకాలము కొఱకు నిరీక్షించక బాల్యయౌవనాదులందుగూడ బ్రాహ్మీస్థితియొక్క అనుభవమునందు నిలుకడ గలిగియుండులాగున చూడవలెను.

ప్ర:- బ్రాహ్మీస్థితి యనగానేమి?

ఉ:- ఇంద్రియనిగ్రహ, కామజయాదులచేతను, ఆత్మచింతనచేతను గలుగు బ్రహ్మానుభవ స్థితియే అది.

ప్ర:- ఆ స్థితిని యెప్పుడు కలిగియుండవలెను?

ఉ:- బాల్యయౌవనములందును, అంత్యకాలమందుగూడ.

ప్ర:- దానివలన గలుగు ప్రయోజనమేమి?

ఉ:- జీవుడు బ్రహ్మానందరూపమగు మోక్షమును బడయును .

ఓమ్

ఇతి శ్రీ మద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే

శ్రీకృష్ణార్జునసంవాదే సాఙ్ఖ్యయోగో నామ

ద్వితీయోఽధ్యాయః

ఇది ఉపనిషత్ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును,

శ్రీకృష్ణార్జునసంవాదమునగు శ్రీభగవద్గీతలందు సాఙ్ఖ్యయోగమను

రెండవ అధ్యాయము

ఓమ్ తత్ సత్



# కర్మయోగము



**ధూమేనావ్రియతే వహ్నిర్యథా౽౽దర్శో మలేనచ**
**యథోల్బేనావృతో గర్భస్తథా తేనేదమావృతమ్.** **(3-38)**

పొగచేత అగ్నియు, మురికిచేత అద్దమున్ను, మావిచేత గర్భమందలి శిశువున్ను కప్పబడియుండులాగున ఆ కామముచేత ఈ ఆత్మజ్ఞానమున్ను కప్పబడియుండును.

ఓం

# శ్రీ భగవద్గీత

అథ తృతీయోఽధ్యాయః

## మూడవ అధ్యాయము

కర్మయోగః

## కర్మయోగము

**ఈ అధ్యాయముయొక్క పేరు :-**

"కర్మయోగము" - లోకమున కర్మచేయక ఏ జీవియు నుండలేదు. వారి వారికి నియతములైన కర్మలను వారు తప్పక నిష్కామబుద్ధితో నాచరించవలయును. తమ విధ్యుక్తకర్మమును ఫలాపేక్షలేక ఈశ్వరార్పణబుద్ధితో గావింపలెను. ఆ యా కార్యములను మనుజు డెందుల కాచరింపవలయునో, వాని నాచరించనిచో కలుగునపకారమేమియో, ఆచరించినచో కలుగు మేలెద్దియో, ఏ కర్మ బంధమును గల్గించునో, ఏ కర్మ ముక్తికి దారితీయునో - ఈ ప్రకారముగ కర్మకు సంబంధించిన వివిధ విషయములు విపులముగ ఈ అధ్యాయమున చర్చించబడియుండుటవలన దీనికి కర్మయోగమని పేరుపెట్టబడినది.

**ఈ అధ్యాయమందలి ప్రధాన విషయములు :-**

(1) అనాసక్తిభావముతో నియతకర్మల నాచరించుట ఉత్తమమని నిరూపించుట
(1వ శ్లో॥ నుండి 8 వ శ్లో॥ వఱకు)

(2) ఫలాపేక్షలేక చేయబడు కర్మ యజ్ఞమేయని తెలుపుచు అట్టి యజ్ఞము నాచరింపవలసిన యావశ్యకతను తెలియజేయుట. (9వ శ్లో॥ నుండి 16వ శ్లో॥ వఱకు)

(3) జ్ఞానియు, సాక్షాత్ భగవానుడున్ను లోకసంగ్రహార్థము కర్మలజేయుచునే యుందురని వచించుట.
(17వ శ్లో॥ నుండి 24వ శ్లో॥ వఱకు)

(4) అజ్ఞానియొక్కయు, జ్ఞానియొక్కయు లక్షణములను పేర్కొనుచు, రాగద్వేషరహితముగ కర్మనాచరింపవలసినదని యుద్బోధించుట. (25వ శ్లో॥ నుండి 35వ శ్లో॥ వఱకు)

(5) కామక్రోధాదుల స్వభావమును, వానిని జయించు పద్ధతిని తెలియజేయుట.
(36వ శ్లో॥ నుండి 43వ శ్లో॥ వఱకు)

**పూర్వాధ్యాయముతో ఈ అధ్యాయమునకు గల సంబంధము :-**

క్రిందటి అధ్యాయమగు సాంఖ్యయోగముయొక్క ప్రారంభమున భగవానుడు అఖండమగు జ్ఞానోపదేశమును అర్జునునకు గావించిరి. మరల మధ్యలో నిష్కామకర్మయోగమును గూర్చిన ప్రశంస నొకింతగావించిరి. తుట్టతుదకు మరల స్థితప్రజ్ఞుని లక్షణములను, ఇంద్రియనిగ్రహాదిసాధనలను వచించి మహోన్నతమగు బ్రాహ్మీస్థితిని, జ్ఞానానుభవమును వర్ణించి చెప్పిరి. అదియంతయు విని అర్జునుడు జ్ఞానమే

కర్మకంటె నధికమని భగవానుడు నిర్ణయించినట్లు భావించి జ్ఞానమే గొప్పదని భగవానుని యభిమతమైనచో నన్నెందులకీ కర్మరంగమున - యుద్ధమను ప్రచండకర్మక్షేత్రమున వారు దింపుచున్నారను సంశయము గలిగి భగవానుని ఈక్రిందివిధముగ ప్రశ్నించుచున్నాడు -

**అర్జున ఉవాచ :-**

## 1. జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన
## తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ.

అర్జున ఉవాచ = అర్జునుడు చెప్పెను -

**టీక:-** జనార్దన = ఓ కృష్ణా!, బుద్ధిః = జ్ఞానము, కర్మణః = కర్మముకంటె, జ్యాయసీ = శ్రేష్ఠమైనది (అని), తే = నీయొక్క, మతాచేత్ = అభిప్రాయమైనచో, తత్ = అప్పుడు, కేశవ = ఓ కృష్ణా!, ఘోరే = భయంకరమైన, కర్మణి = (యుద్ధమను) కర్మమునందు, మాం = నన్ను, కిమ్ = యెందువలన, నియోజయసి = ప్రవర్తింపజేయుచున్నావు?

**తా:-** ఓ కృష్ణ ! జ్ఞానము కర్మముకంటె శ్రేష్ఠమైనదని మీ యభిమతమగుచో, మఱి యీ భయంకరమైన (యుద్ధ) కర్మమునందు నన్నేల ప్రవర్తింపజేయుచున్నావు?

**వ్యాఖ్య:-** ఇచట బుద్ధియనగా జ్ఞానము. క్రిందటి అధ్యాయమున 49, 50, 51, శ్లోకములను భగవానుడు చెప్పినపుడే - అనగా కర్మకంటె బుద్ధియోగము శ్రేష్ఠమని వెల్లడించినపుడే అర్జునుని మనంబున ఈసందేహము జనించి యుండవచ్చును. "ఏమి, భగవానుడు కర్మలయందే నీ కధికారము గలదు (కర్మణ్యేవాధికారస్తే 2-47), కర్మలను జేయుము (కురు కర్మాణి 2-48), కాబట్టి లెమ్ము, యుద్ధము చేయుము (తస్మాద్యుధ్యస్వ 2-18) అని ఒకచెంప పలుకుచు, మరల బుద్ధియోగముకంటె కర్మ చాల తక్కువైనది (దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ 2-49) అని చెప్పినారే! ఈ వచనములు పరస్పరవిరుద్ధములుగ నున్నవే!" ఈ ప్రకారముగ సందేహించి రెండవ అధ్యాయమున 49, 50, 51 శ్లోకములను భగవానుడు చెప్పినపుడే తన సంశయము నాతనిముందు పెట్టదలంచియుండవచ్చును. కాని వెనువెంటనే శ్రీకృష్ణమూర్తి 'నీబుద్ధియెపుడు సమాధియందు నిలుకడనొందునో, అపుడు (జీవబ్రహ్మైక్యరూప) యోగమును బడయగలవు' అని బోధింప, తత్క్షణమే అర్జునునకు సమాధియందు నిలుకడను బొందిన వాని (స్థితప్రజ్ఞుని) లక్షణములను తెలిసికొనవలెనను ఉత్సుకత కలిగి, దానినే ముందుగా ప్రశ్నించివైచెను. అత్తఱి దానికి సమాధానముగ స్థితప్రజ్ఞ లక్షణములను భగవానుడు చెప్పి పూర్తి చేసినవెంటనే అర్జునుడు తన పాతసందేహమును వెంటనే వారి యెదుట పెట్టెను. ఈ మూడవ అధ్యాయ ప్రారంభమునగల రెండు శ్లోకములు ఆ సందేహమును గూర్చినవే యగును.

## 2. వ్యామిశ్రేణేవ[1] వాక్యేన బుద్ధిం మోహయసీవ మే
## తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహమాప్నుయామ్.

**టీక:-** వ్యామిశ్రేణేవ = మిశ్రమమైనదానివలెనున్న, వాక్యేన = వాక్యముచేత, మే = నాయొక్క, బుద్ధిం = బుద్ధిని, మోహయసీవ = కలవరపెట్టువానివలె (ఉన్నావు), అహమ్ = నేను, యేన = దేనిచేత, శ్రేయః =

1 వ్యామిశ్రేణైవ - పాఠాంతరము

శ్రేయస్సును , అప్నుయామ్ = పొందగలనో, తదేకమ్ = అట్టి యొకదానిని (కర్మమో, లేక జ్ఞానమో), నిశ్చిత్య =నిశ్చయించి, వద =చెప్పుము.

**తా:–** (ఓ కృష్ణా!) మిశ్రమమైనదానివలెనున్న వాక్యముచేత నీబుద్ధిని కలవరపెట్టు వానివలె నున్నావు. కావున నేను దేనిచే శ్రేయమును పొందగలనో అట్టి యొకదానిని (కర్మ, జ్ఞానములలో నొకదానిని) నిశ్చయించి నాకు జెప్పుము.

**వ్యాఖ్య:–** 'ఇవ' (వలె) అను పదమును అర్జునుడు రెండు పర్యాయములు ఈ శ్లోకమున ప్రయోగించుటలో శ్రీకృష్ణమూర్తి వాస్తవముగ కలవరపెట్టు వాక్యములను, సందిగ్ధవచనములను చెప్పుచున్నను, అర్జునునకు తన అజ్ఞానముచేతనే ఆ విధముగ గన్పట్టుచున్నదను భావము సూచింపబడుచున్నది.

**అ॥** అర్జునుని యా ప్రశ్నకు భగవానుడు సమాధానమొసంగుచు మోక్షప్రాప్తికిగల రెండు మార్గములను తెలుపుచున్నాడు.

**శ్రీభగవానువాచ :–**

**3. లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ**
**జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్.**

శ్రీ భగవానువాచ = శ్రీ భగవంతుడు చెప్పెను -

**టీక:–** అనఘ = పాపరహితుడవగు ఓ అర్జునా!, పురా = పూర్వము, లోకేఽస్మిన్ = ఈ లోకమునందు, మయా = నాచేత, సాంఖ్యానామ్ = సాంఖ్యులకు (జ్ఞానమార్గావలంబులకు), జ్ఞానయోగేన = జ్ఞానయోగముచేతను, యోగినామ్ = యోగులకు (కర్మమార్గావలంబులకు), కర్మయోగేన = కర్మయోగముచేతను, ద్వివిధా = రెండువిధములగు, నిష్ఠా = అనుష్ఠానక్రమము, ప్రోక్తా = చెప్పబడినది.

**తా:–** పాపరహితుడవగు ఓ అర్జునా! పూర్వ మీలోకమున సాంఖ్యులకు (తత్త్వవిచారణాపరులకు) జ్ఞానయోగము, యోగులకు కర్మయోగము అను రెండు విధములగు అనుష్ఠానము నాచే జెప్పబడియుండెను.

**వ్యాఖ్య:–** "అనఘ" - 'పాపరహితుడా' యని అర్జునుని శ్రీకృష్ణమూర్తి యిట సంబోధించిరి. చిత్తము పాపరహితమగునపుడే అందు బ్రహ్మవిద్య చక్కగ ప్రవేశించును. గుడ్డకు మురికి వదలిపోయినపిమ్మటనే రంగుపట్టును. వేదాంతబోధకు, ఆత్మవిచారణకు అర్జునుడు అనఘత్వము (పాపరాహిత్యము) ద్వారా అర్హతను సంపాదించుకొనెను. అర్జునుడు పాపరహితుడు కనుకనే శ్రీకృష్ణమూర్తి అతని యోగ్యతను గుర్తెఱింగి గీతాజ్ఞానమను ఆధ్యాత్మికోపదేశము నతనికి గావించిరి.

జీవులలో వారివారి మనస్తత్వము ననుసరించి ఒక్కొక్కరికి ఒక్కొక్క మార్గమునందు ప్రీతిగలిగి యుండును. కొందఱికి తత్త్వవిచారణయందు ఆసక్తిగలిగి యుండును. వీరు సాంఖ్యులు, జ్ఞానయోగులు. ఇట్టివారికి అనుగుణ్యమైనబోధ జ్ఞానయోగమేయగును. ఈ తరహావారికి సృష్ట్యారంభమున, (లేక పూర్వకాలమున) భగవానుడు జ్ఞానయోగమను సాధనక్రమము నుపదేశించిరి. మఱికొందఱికి కర్మమార్గమున ప్రీతికలిగియుండును. వారుయోగులు. అట్టివారికి వారి సంస్కారము ననుసరించి బోధింపదగు విద్య

కర్మయోగమే యగును. కావున అట్టి కర్మయోగమే వారికి పూర్వము సర్వేశ్వరుడు బోధించిరి. వారివారి సాధనను వారనుష్ఠించుటకు సర్వస్వతంత్రులు. ఇట బలాత్కారమేమియు లేదు. ఏలయనిన, ఒకవిధానమును ఒకరిప్రవృత్తికి విరుద్ధముగ అతనిపై రుద్ధినచో, అది కృత్రిమముగానుండి ఆతనికి ఉన్నతిని గలుగజేయజాలకుండును. ఒక గమ్యస్థానమును చేరుటకు అనేక మార్గములుండవచ్చును. ఒక శిఖరము చేరుటకు పెక్కుదారులుండవచ్చును. ఏ దారిగుండా ప్రయాణము సల్పినను తుదకు అందరును గమ్యస్థానమునే చేరుదురు. కాబట్టి యెవరి మనస్సు ఏ మార్గమునందు ప్రీతిగలదైయుండునో, వారు ఆ మార్గమును శ్రద్ధాభక్తులతో ననుసరించి లక్ష్యమగు పరమాత్మను చేరవచ్చునని భగవాను డిచట తెలుపుచున్నాడు. గీతయందు దనేక యోగములు వచింపబడినప్పటికిని అన్నిటిని ప్రధానముగ ఈ రెండు యోగముల (జ్ఞాన, కర్మయోగముల) క్రిందనే విభజింపవచ్చును.

పూర్వమెపుడో (సృష్ట్యారంభమున) శ్రీకృష్ణుడీ రెండు యోగములను బోధించిరని తెలుపబడుటవలన శ్రీకృష్ణుడు త్రికాలధీశుడనియు, దేశకాలాదులచే పరిచ్ఛిన్నుడు కానివా డనియు, సాక్షాత్పరమాత్మయే యనియు స్పష్టమగుచున్నది.

**ప్ర:–** పూర్వము భగవానుడు జనులు తరించుట కెన్ని మార్గములు బోధించెను? అవియేవి?

**ఉ:–** రెండు మార్గములను బోధించెను. (1) జ్ఞానయోగము (సాంఖ్యుల ఉపయోగార్థము) (2) కర్మయోగము (కర్మయోగుల ఉపయోగార్థము).

**అ||** ఈ రెండు మార్గములందును కేవలము కర్మలను త్యజించినంత మాత్రముచే మోక్షము లభించదని వచించుచున్నాడు –

## 4. న కర్మణా మనారమ్భా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే
## న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి.

**టీక:–** పురుషః = మనుజుడు, కర్మణామ్ = కర్మలయొక్క, అనారమ్భాత్ = ఆచరింపక పోవుటవలన, నైష్కర్మ్యమ్ = నిష్క్రియ మగు ఆత్మస్వరూపస్థితిని, న అశ్నుతే = పొందడు, సన్న్యసనాదేవ = కర్మత్యాగముచేయుట మాత్రము వలననే, సిద్ధిమ్ = మోక్షమును, న చ సమధిగచ్ఛతి = పొందనేపొందడుగదా!

**తా:–** మనుజుడు కర్మల నాచరింపకపోవుటవలన నిష్క్రియమగు ఆత్మస్వరూపస్థితిని పొందజాలడు. కర్మత్యాగ మాత్రముచే మోక్షసిద్ధిని ఎవడును పొందనేరడు.

**వ్యాఖ్య:–** ఈ శ్లోకమునందలి మొదటిపాదము కర్మమార్గము గూర్చియు, రెండవ పాదము జ్ఞానమార్గమును గూర్చియు వివరించినది. కర్మమార్గము ననుసరించువాడు తన విధ్యుక్తధర్మమును, తన కర్తవ్యమును, తన నియతకర్మమును (నిష్కామముగ) ఆచరించకపోయినచో నతనికి చిత్తశుద్ధి గలుగదు. అత్తఱి యతడు నైష్కర్మ్య (ఆత్మ) స్థితిని చేరజాలడు. అట్లే జ్ఞానమార్గమునం దుండువాడును బాహ్యసన్న్యాసమాత్రముచే, కర్మత్యాగమాత్రముచే మోక్షసిద్ధి నెన్నటికిని బడయజాలడు. ఏలయనిన మోక్షమునకు అంతస్సన్న్యాసము, వాసనాక్షయము ముఖ్యముగ కావలసియున్నవి. ఈ ప్రకారముగ ఏ దృష్టియందు చూచినను కేవల కర్మత్యాగము మోక్షహేతువు కానేరదని భగవానుడు వచించుచున్నాడు.

కర్మలను నిష్కామముగ నాచరించనిచో చిత్తశుద్ధి కలుగదు. చిత్తశుద్ధి కలుగనిచో జ్ఞాన ముదయింపదు. జ్ఞాన ముదయించనిచో మోక్షము (నిష్క్రియ ఆత్మస్థితి, లేక నైష్కర్మ్యసిద్ధి) చేకూరదు. కనుకనే భగవాను డిచట కర్మల నాచరించనిచో మోక్షపదవి లభించనేరదని వాక్రుచ్చిరి. ప్రారంభమున ప్రతివారును కర్మాచరణను ఆశ్రయించిననే తుట్టతుదకు జ్ఞాననిష్ఠాత్మకమగు ఆత్మానుభవమును బడయగల్గుచున్నారు. కర్మలను విడచుట మాత్రముచే మోక్షసిద్ధిని యెవరును బొందలేరు. పైగా అట్టివారు సోమరులై జీవితమును వ్యర్థముగ తమస్సునందు గడిపివేయుదురు. కావున నైష్కర్మ్యపరబ్రహ్మము పేరుతో మొదటనే కర్మరహితులై జనులు అటు దైవమునకుగాని ఇటు ప్రపంచమునకుగాని ఉపకరించక ఉభయభ్రష్టులు కాకుండ చూడవలెను.

తమస్సు నుండి రజస్సులోనికి, రజస్సునుండి సత్త్వములోనికి, సత్త్వమునుండి విశుద్ధ సత్త్వమునకు లేక గుణాతీతమునకు జీవుడు క్రమముగ పోవలెను. అట్టి స్థితి ప్రారంభమున కర్మాచరణమువలననే సాధ్యమగునుగాని అకర్మణ్యత్వమువలనగాదు. కనుకనే భగవానుడిచట నైష్కర్మ్యసిద్ధిరూప మోక్షము సామాన్యమైనది కాదనియు, అది అకస్మాత్తుగ ఊడిపడునది కాదనియు, కర్మాచరణములేక, చిత్తశుద్ధికి వలయు నిష్కామకర్మలను మొదటచేయక ఆ స్థితి యెన్నటికిని సంభవింపనేరదని ఢంకా మ్రోగించినట్లు చెప్పివైచిరి. మఱియు అభ్యంతరమున వాసనలు కలిగి బాహ్యమున అన్నిటిని వదలివేసినంతమాత్రమున మనుజుడు సాధించగల్గునది యేమియు లేదనియు, బాహ్యసన్న్యాసమాత్రమున లక్ష్యము సిద్ధించదనియు గీతాచార్యు లిచట విస్పష్ట మొనర్చిరి. కర్మలను త్యజించుట, త్యజించకపోవుట కాదు ప్రధానము. లోని వాసనలు చావవలెను. చిత్తము నిర్మలత్వ మొందవలెను. అదియే ముఖ్యము. అదియో మొట్టమొదట కర్మాచరణమువలననే సాధ్యపడును. కావున భగవానుడు కర్మాచరణమును (నిష్కామ కర్మయోగమును) ఇచట ప్రోత్సహించుచున్నాడు. ఇవ్విధముగ సోమరులకు, అకర్మణ్యులకు సర్వేశ్వరుడు చక్కని గుణ పాఠమును నేర్పినవారైరి. దీనినిబట్టి ప్రారంభమున ప్రతివారును చిత్తశుద్ధి కొఱకై ఏదియో యొక పవిత్ర కర్మను దైవప్రీత్యర్థముగ (ఫలాభిసంధిరహితముగ) తప్పక నాచరించియే తీరవలెనని స్పష్టమగుచున్నది.

**ప్ర:–** మోక్షము దేనివలన చేకూరదు?

**ఉ:–** (చిత్తశుద్ధికొఱకై) కర్మాచరణ చేయకపోవుటచేగాని, బాహ్యసన్న్యాసముమాత్రముచేగాని మోక్షము లభించదు.

**ప్ర:–** మఱి మోక్షము దేనివలన చేకూరునని దీనివలన స్పష్టమగుచున్నది?

**ఉ:–** నిష్కామకర్మాచరణమువలన క్రమముగ మోక్షము సంప్రాప్తించును. మఱియు అభ్యంతరసన్న్యాసము, అనగా వాసనాత్యాగమువలన మోక్షము లభించగలదు.

**అ॥** ఇక కర్మయోగముయొక్క ఆవశ్యకతను భగవానుడు పెక్కురీతుల తెలియచేయుచు ప్రప్రథమమున కర్మత్యాగము భౌతికముగ అసాధ్యమని తెలుపుచున్నాడు –

**5. న హి కశ్చిత్క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్**
**కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః.**

**టీక:–** కశ్చిత్ = ఎవడును్ను, జాతు = ఒకప్పుడును, క్షణమపి = క్షణకాలమైనను, అకర్మకృత్ = కర్మముచేయనివాడై, న హి తిష్ఠతి = ఉండడుకదా! హి = ఎందువలననగా, ప్రకృతిజైః = ప్రకృతి (మాయ) వలన పుట్టిన, గుణైః = గుణములచేత, సర్వః = (అజ్ఞుడగు) ప్రతివాడును, అవశః = అస్వతంత్రుడై (తన వశములేకయే), కర్మ = కర్మను, కార్యతే = చేయుచున్నాడు.

**తా:–** (ప్రపంచమున) ఎవడును ఒక్క క్షణకాలమైనను కర్మచేయక ఉండనేరడు. ప్రకృతివలన బుట్టిన గుణములచే ప్రతివాడును బలాత్కారముగ కర్మలను చేయుచునే యున్నాడు.

**వ్యాఖ్య:–** కర్మలను చేయక ఎవరును ఒక్క క్షణమైనను ఉండలేరు. గాలిపీల్చుటయు కర్మయే, తినుట కర్మయే, నడచుట కర్మయే, మాట్లాడుట కర్మయే. ఇవిలేక ఎవరైన ప్రపంచమున ఉండగలరా? కావున సర్వులకు కర్మ అనివార్యమైనదని భగవానుడు పలుకుచున్నాడు.

మఱియు, జ్ఞానితప్ప తక్కిన ప్రతిజీవియు మాయకు, ప్రకృతికి లోబడియే యున్నాడు. తత్ప్రకృతిజన్యములగు త్రిగుణముల కాతడధీనుడై ప్రవర్తించుచున్నాడు. కావున ఆ యా గుణముల ననుసరించి కర్మల నాతడు అవశుడై ఆచరించుచునే యుండును. అయితే ఇచట 'సర్వః' అను పదమునకు 'జీవన్ముక్తులగు మహనీయులు తప్ప తక్కిన వారందఱు' అని యర్థము. ఏలయనిన వారు గుణాతీతమగు ఆత్మస్థితిని బడసినవారు. గుణములకు లోబడినవారుకాదు. వారిని మాయ ఏమియు చేయజాలదు. అయినను వారి దేహేంద్రియాదులు ప్రకృతియం దంతర్గతములు. కావున అయ్యవి వానివాని నిర్దిష్టకార్యముల నాచరించినను, వారు అకర్తలై నిస్సంగముగ నుందురు.

ఇక అజ్ఞానులగువారు ప్రకృతికి, దానిగుణములకు బద్ధులై యున్నప్పటికిని అంతమాత్రముచేత నిరుత్సాహపడవలసిన పనిలేదు. పురుషప్రయత్నము నాశ్రయించి శుద్ధకర్మచే అశుద్ధకర్మను, పుణ్యముచే పాపమును రూపుమాపి ఈశ్వరార్పణ బుద్ధితో సత్కర్మల నాచరించుచు, నిష్కామముగ ప్రవర్తించినచో క్రమముగ చిత్తనైర్మల్యమును బడసి వారున్ను మోక్షస్థితిని బొందగలరు.

**అ॥** ఇంద్రియములను బిగబెట్టికూర్చొనుట కర్మత్యాగము (నైష్కర్మ్యము) ఎన్నటికిని కానేరదని వచించుచున్నాడు –

## 6. కర్మేన్ద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్
## ఇన్ద్రియార్థా న్విమూఢాత్మా మిథ్యాచార స్స ఉచ్యతే.

**టీక:–** యః = ఎవడు, కర్మేన్ద్రియాణి = కర్మేంద్రియ జ్ఞానేంద్రియములను, సంయమ్య = అణచిపెట్టి, మనసా = మనస్సుచేత, ఇన్ద్రియార్థాన్ = ఇంద్రియములయొక్క (శబ్దాది) విషయములను, స్మరన్ = చింతించుచు, ఆస్తే = ఉన్నాడో, విమూఢాత్మా = వివేకశూన్యమైన మనస్సుగల, సః = అతడు, మిథ్యాచారః = కపటమైన ఆచరణకలవాడని, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

**తా:–** ఎవడు కర్మేంద్రియ జ్ఞానేంద్రియములను అణచిపెట్టి మనస్సుచేత ఇంద్రియములయొక్క శబ్దాది విషయములను చింతించు చుండునో మూఢచిత్తుడగు అట్టి మనుజుడు కపటమైన ఆచరణగలవాడని చెప్పబడుచున్నాడు.

**వ్యాఖ్య:–** ఇచట కర్మేంద్రియాణి అనుపదమునకు కర్మేంద్రియ, జ్ఞానేంద్రియములు రెండును అని అర్థము. ఏలయనిన కొన్ని ఇంద్రియములనుగూర్చి మాత్రమే చెప్పినచో డంబాచారియొక్క చిత్రణ అపూర్ణముగా నుండును.

"సంయమ్య" – ఇది సాధకు డొనర్చు సంయమము కాదు. ఎందవలననగా, అట్టి ఉత్తమ సంయమము కలవాడు మిథ్యాచారి యెన్నటికిని కానేరడు. డంబము కొఱకు ఇంద్రియములను ఊరక బిగబెట్టుకొని కూర్చొని మనస్సుచే ముల్లోకములను తిరుగాడువానిని గూర్చియే ఇచట చెప్పబడినది. అయితే ప్రారంభమున కొందఱు సాధకులకుగూడ ధ్యానమందు మనస్సు దైవముపై (లక్ష్యముపై) నిలువక దిశదిక్కులు పరుగెత్తు చుండును. దానికిని ఈ డంబాచారియొక్క ప్రవర్తనకును చాల వ్యత్యాసము కలదు. ఎందుకనగా, ముముక్షువు తనమనస్సు విషయములపై పరువెత్తినను దాని నుండి మరలించి ఆత్మయందు (దైవమునందు) స్థాపించుటకు యత్నించుచుండును. డంబాచారి అట్లుచేయడు. సాధకునిది సదుద్దేశ్యము. ఈతనిది దురుద్దేశ్యము. ఈతడు చేయునది కృత్రిమధ్యానము, బకధ్యానము.

అధ్యాత్మసాధన ప్రారంభించునపుడు ముముక్షువు దాని పద్ధతిని, క్రమమును చక్కగ తెలిసికొనియుండవలెనని ఈ శ్లోకము వలన స్పష్టమగుచున్నది. లేకున్న కుమార్గమున పడిపోవును. పెద్దలగు మహాత్ములవలన, అనుభవజ్ఞులగు గురువులవలన సాధనపద్ధతులను ప్రత్యక్షముగ తెలిసికొనవలెను. 'ఇంద్రియనిగ్రహము ఆవశ్యకమైనది' అను సూత్రమును మాత్రము గ్రహించి, దాని లోతుపాతులను తెలియనిచో ఇంద్రియములను అణచిపెట్టి లోన మనస్సుతో లోకవ్యవహారమంతయు, విషయభోగమంతయు గావించుచుండుట సంభవించును. కాబట్టి ఇట్టి ప్రమాదమును ఊహించియే గురోర్గురువగు శ్రీకృష్ణపరమాత్మ అట్టివారిని చక్కదిద్దుటకై గీతాశాస్త్రమున ఈ విధములైన హెచ్చరికలు పెక్కింటిని అపుడపుడు కావించుచు పోవుదురు.

లోకమున యోగులవలె నటించు అజ్ఞానులు కొందఱుండవచ్చును. ప్రపంచమును వంచించుటకొఱకు ఇంద్రియములను అణచిపెట్టి వారొకచోట కూర్చున్నను, మనస్సు వాసనామయమై యుండుటచే అది త్రిలోకములందు సంచరించుచుండును. ఇటు ప్రపంచసుఖమునకును, అటు దైవసుఖమునకును రెండిటికిని వారు చెడినవారగుదురు. కనుకనే భగవాను డట్టివారికి 'మూఢు'లను పదము చాలదనియెంచి 'విమూఢు'లని పేరు పెట్టిరి.

ఇంద్రియములకు స్వతః విషయములను అనుభవించుశక్తిగాని, తెలిసికొనుశక్తిగాని లేదు. మనస్సు వానితో చేరినపుడే ఆయా శక్తులేర్పడును. కావున మనస్సుతోసహా ఇంద్రియములను నిగ్రహించుటవలన ప్రయోజనము కలదు. కాని కేవలము ఇంద్రియములను బిగబెట్టుటవలన ప్రయోజనముండదు. అట్లు బిగబెట్టినచో అది మిథ్యాచారము కాగలదు. విజ్ఞులగువారు అట్టి ప్రవర్తనను విడనాడవలెను. ఇంద్రియములతోబాటు మనస్సునుగూడ అదుపులో నుంచుకొనవలెను. అట్లు మనస్సును అదుపులో నుంచుకొనినచో, అత్తఱి ఒకవేళ ఇంద్రియములు దేహయాత్రావసరములైన అన్నపానాది విషయములందు ప్రవర్తించినను ప్రమాదములేదు. ఈ విషయమును గీతాచార్యులే రాబోవు శ్లోకమున తెలియజేయగలరు.

**ప్ర:–** మిథ్యాచారమనగా నేమి?

**ఉ:–** ఇంద్రియములను మాత్రము అణచిపెట్టి మనస్సుతో ముల్లోకములందును సంచరించుట, విషయములను స్మరించుట మిథ్యాచారము (డంబాచారము) అగును.

**అ॥** మనస్సునందాసక్తిని విడిచి ఇంద్రియములచే నిష్కామముగ కర్మలనాచరించువాడుత్తముడని వచించుచున్నాడు -

**7. యస్త్విన్ద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున
కర్మేన్ద్రియైః కర్మయోగమసక్తస్స విశిష్యతే.**

**టీక:–** అర్జున = ఓ అర్జునా!, యస్తు = ఎవడైతే, ఇంద్రియాణి = ఇంద్రియములను, మనసా = మనస్సుచేత, నియమ్య = నియమించి, కర్మేన్ద్రియైః = ఆ కర్మేంద్రియ జ్ఞానేంద్రియములచేత, కర్మయోగమ్ = కర్మయోగమును, అసక్తః = సంగములేనివాడై, ఆరభతే = చేయుచున్నాడో, సః = అతడు, విశిష్యతే = శ్రేష్ఠుడగును.

**తా:–** ఓ అర్జునా! ఎవడు ఇంద్రియములన్నిటిని మనస్సుచే నియమించి, వానిచే కర్మయోగమును సంగములేనివాడై ఆచరించునో, అతడుత్తముడు.

**వ్యాఖ్య:–** పైశ్లోకమునందువలె ఇచటకూడ 'ఇంద్రియాణి' 'కర్మేన్ద్రియైః' అను పదములచే ఇంద్రియములన్నియును వివక్షితములగును. ఏలయనిన ఒక్క కర్మేంద్రియములతోనే ఆచరింపబడు కర్మయోగము అపూర్ణమే కాగలదు.

మనస్సును చక్కగా నిగ్రహించి (అందలి వాసనలను దూరీకృతముచేసి), ఇంద్రియములను సంయమనమొనర్చి విషయములందు అంటక (అసక్తుడై) ఫలాపేక్షారహితముగ కర్మల నాచరించినచో మనుజుడు బద్ధుడు కానేరడు. ఇంద్రియములు మనస్సునకు లోబడియుండవలెను. మనస్సు తనకు లోబడియుండవలెను. ఇంద్రియములు వానివాని కార్యములను చేసినను చేయకున్నను మనస్సుయొక్క సక్తతయే బంధమునకు కారణము. అసక్తతయే మోక్షమునకు కారణము. కాబట్టి అట్టి సక్తత, విషయవాసన, మనస్సున లేకుండచేసి, తదుపరి ఇంద్రియములచే కార్యములను చేసినను దోషము కలుగదని భగవానుడు తెలుపుచున్నారు. కనుకనే మహనీయులు మొట్టమొదట మనస్సంయమము నభ్యసించి, ఇంద్రియములను అదుపులోనికి తెచ్చుకొని అట్టి విశుద్ధేంద్రియములచే లోకహితార్థము కర్మలను చేయుచుందురు.

**ప్ర:–** కర్మయోగము నెట్లు శీలించవలెను?

**ఉ:–** ఇంద్రియమనంబులను నిగ్రహించి అట్టి నియమితేంద్రియములచే అసక్తబుద్ధితో కర్మయోగమును శీలించవలెను.

**అ॥** కావున, శాస్త్రనియతమగు కర్మను (నిష్కామబుద్ధితో తప్పక) ఆచరించవలసినదిగా భగవానుడర్జునుని ఆదేశించుచున్నాడు -

**8. నియతం కురు కర్మత్వం కర్మ జ్యాయో హ్యకర్మణః
శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః.**

**టీక:–** త్వమ్ = నీవు, నియతమ్ = (శాస్త్రములచే) నియమింపబడినట్టి, కర్మ = కర్మమును, కురు

= చేయుము, అకర్మణః = కర్మము చేయకుండుటకంటె, కర్మ = కర్మ (చేయుట), జ్యాయోహి = శ్రేష్ఠమైనదికదా!, అకర్మణః = కర్మచేయకపోవుటవలన, తే = నీకు, శరీరయాత్రాపి చ = దేహయాత్రకూడ, న ప్రసిద్ధ్యేత్ = సిద్ధింపనేరదు.

**తా:–** (ఓ అర్జునా!) నీవు (శాస్త్రములచే) నియమితమైన కర్మను జేయుము. కర్మచేయకుండుటకంటె చేయుటయే శ్రేష్ఠము. మఱియు కర్మ చేయకపోవుటవలన నీకు దేహయాత్రకూడ సిద్ధింపనేరదు.

**వ్యాఖ్య:–** 'నేనేమి చేయవలెనో అసందిగ్ధముగ చెప్పుము కృష్ణా!' అని ఈ అధ్యాయప్రారంభములో అర్జును డడిగిన ప్రశ్నకు శ్రీకృష్ణమూర్తి 'నియతం కురు కర్మ' (నీవు కర్మమును త్యజింపక శాస్త్రనియమితమగు కర్మను చేయుము) – అని యిచట స్పష్టముగ నాదేశించిరి. నియతకర్మచే చిత్తము శుద్ధమై, ఆత్మజ్ఞానోదయము కాగలదు. కర్మమును త్యజించి కూర్చొనుటవలన ఏమియు సిద్ధింపదు. దానికంటె కర్మచేయుటయే మేలు. అదియు సత్కర్మ, దైవార్పితకర్మయైనచో ఇంకను శ్రేష్ఠము – అని భగవానుడు నుడువుచున్నారు. మఱియొక దృష్టితో చూచిన, కర్మచేయనిచో అసలు శరీరము నిలుచటయే కష్టమనియు, దేహయాత్రయే అత్తఱి కొనసాగదనియు వచించి ఆ విధముగను కర్మాచరణను ప్రోత్సహించుచున్నాడు.

**ప్ర:–** కర్మచేయుట మేలా, చేయకుండుట మేలా?

**ఉ:–** చేయుటయే మేలు.

**ప్ర:–** ఎట్టి కర్మ చేయవలెను?

**ఉ:–** శాస్త్రనియతమగు కర్మ చేయవలెను.

**ప్ర:–** కర్మచేయనిచో కలుగు హానియేమి?

**ఉ:–** అత్తఱి (1) చిత్తశుద్ధిగలుగదు, చిత్తశుద్ధిలేనిచో జ్ఞానమంకురింపదు, జ్ఞానములేనచో మోక్షము సిద్ధింపదు (2) కర్మచేయనిచో దేహయాత్రకూడ కొనసాగదు.

**అ||** కర్మబంధనమునుండి విడివడుటకు ఉపాయమును చెప్పుచున్నాడు –

## 9. యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబన్ధనః
## తదర్థం కర్మ కౌన్తేయ ముక్తసఙ్గస్సమాచర.

**టీక:–** కౌన్తేయ = ఓ అర్జునా!, యజ్ఞార్థాత్ = యజ్ఞము కొఱకైన (భగవద్విషయమైన), కర్మణః = కర్మకంటె, అన్యత్ర = ఇతరమగు కర్మచేత, అయంలోకః = ఈ లోకము (జనులు), కర్మబన్ధనః = కర్మచే గట్టుబడియున్నది (కాబట్టి), తదర్థమ్ = ఆ యజ్ఞముకొఱకైన, కర్మ = కర్మను, ముక్తసఙ్గః = సంగమును విడిచినవాడవై, సమాచర = లెస్సగా జేయుము.

**తా:–** ఓ అర్జునా! యజ్ఞముకొఱకైన (భగవత్ప్రీతికరమైన, లేక లోకహితార్థమైన) కర్మకంటె ఇతరమగు కర్మచే జనులు బంధింపబడుదురు. కాబట్టి ఆ యజ్ఞముకొఱకైన కర్మనే సంగరహితుడవై (ఫలాసక్తిలేక) యాచరింపుము.

**వ్యాఖ్య:-** గీతయందు శ్రీకృష్ణమూర్తి యజ్ఞము, సన్న్యాసము, త్యాగము మున్నగు పదములకు నూతనమగు అర్థమును వెల్లడించిరి. యజ్ఞమును సామాన్యముగ వాడుకలోనున్న అగ్నిహోత్ర, మంత్ర, తంత్ర, ఋత్విగాదులతో గూడిన ఒకానొక క్రియగా వర్ణించక, భగవద్విషయమైన, లేక పరహితార్థమైన క్రియగా వర్ణించి చెప్పిరి. ఇట్టి యజ్ఞము ప్రతివానికిని అందుబాటులో నుండగలదు కావున, దీని నాచరించి ప్రతివారున్ను తరించుటకు చక్కని యవకాశముండును. సామాన్యముగ కర్మ సంసారబంధనమును కలుగుజేయునని లోకములో నొకప్రతీతి. పుణ్యకార్యములు చేసినను ఆ పుణ్యఫలము ననుభవించుటకై మరల జన్మయెత్తవలసి యుండుననియు, కావున అట్టి కర్మలను చేయరాదనియు కొందఱు భయపెట్టుదురు. కాని గీతాచార్యు లట్టి భయములను తొలగించివేసిరి.. సకామముగ ఫలాసక్తితో చేయబడు కర్మమే జన్మాదిరూపసంసారమునకు హేతువై బంధమును గలుగజేయుననియు, తద్వ్యతిరిక్తమైనది, అనగా నిష్కామబుద్ధితో చేయబడుకర్మ ఎన్నటికిని బంధనమును గలుగజేయదనియు వక్కాణించిరి. భగవద్విషయమైన కర్మగాని, లోకహితకరమగు కర్మగాని ఫలాపేక్షారహితముగ జేయబడునది, బంధము నెన్నటికిని గలుగజేయదు. పైగా అట్టి నిష్కామకర్మ చిత్తశుద్ధిద్వారా మోక్షమునకు హేతువున్ను కాగలదు.

ఒకే కర్మ సంగముతో చేసినచో బంధమును, సంగరహితముగ చేసినచో (చిత్తశుద్ధిద్వారా) మోక్షమును కలుగజేయును. ఒకేకర్మ స్వార్థమునకై చేసిన బంధము; భగవదర్థము, లోకహితార్థము చేసినచో మోక్షమును గలుగజేయును. కాబట్టి కర్మలో దోషములేదు. దానిని చేయు పద్ధతిలో దోషము కలదు. సక్తముగ నాచరించుటయే ఆ దోషము. సకామముగ నాచరించుటయే ఆ లోపము.

శ్రీకృష్ణమూర్తి అర్జునునితో 'కర్మలను లెస్సగ నాచరింపుము' (సమాచర) అనిచెప్పి కర్మయోగమును ప్రోత్సహించిరి. అయితే ఆకర్మలను ఎట్లు చేయవలెనో ఆ పద్ధతిని ముందుగా తెలిసికొనుమని హెచ్చరించిరి. కర్మరహస్యము, కర్మకీలకము తెలిసికొనియే కర్మను చేయవలెను. లేకున్న దానిలో తగుల్కొనిపోవుదురు. ఆ కర్మరహస్యమేమియో భగవానుడే రెండు సూత్రములద్వారా యిచట బోధించిరి. అవి యేవియనిన - (1) యజ్ఞముకొఱకై (భగవత్ప్రీతికరములైన, పరహితార్థములైన) కర్మలనే చేయవలెను. (2) కర్మలను సంగరహితముగ, (ఫలాపేక్షారహితముగ) నాచరించవలెను. ఈ ప్రకారముగ నాచరింపబడు కర్మ సామాన్యమైనది అయినను మహాయజ్ఞముగ మారిపోయి జీవునకు పరమశ్రేయమును గలుగజేయగలదు. అపుడు కర్మ కర్మగానుండక ధ్యానముగ మారిపోవును. (Work will be transformed into worship). బంధకరముగ నుండక మోక్షకరముగ పరిణతిజెందును.

**ప్ర:-** ఎట్టి కర్మ బంధనమును గలుగజేయదు?

**ఉ:-** యజ్ఞముకొఱకైన (భగవత్ప్రీతికరమైన, పరోపకారార్థమైన) కర్మ బంధనమును గలుగ జేయదు. అద్దానిని సంగరహితముగ, ఫలాపేక్షలేక (నిష్కామముగ) నాచరించవలెను.

**అ॥** యజ్ఞములయొక్క మహిమను తెలియజేయుచున్నాడు -

**10. సహ యజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః**
**అనేన ప్రసవిష్యధ్వమేషవోఽస్త్విష్టకామధుక్.**

**టీక:–** ప్రజాపతిః = బ్రహ్మదేవుడు, పురా = పూర్వము (సృష్ట్యాదియందు), సహయజ్ఞాః = యజ్ఞములతోగూడి, ప్రజాః = జనులను, సృష్ట్వా = సృష్టించి, అనేన = దీనిచే (ఈ యజ్ఞములచేత), ప్రసవిష్యధ్వమ్ = వృద్ధిని బొందుడు, ఏషః = ఇది, వః = మీకు, ఇష్టకామధుక్ = ఇష్టములగు కోరికల నిచ్చునట్టిదిగా, అస్తు = అగుగాక, (అని) ఉవాచ = పలికెను.

**తా:–** పూర్వము బ్రహ్మదేవుడు యజ్ఞములతో గూడ ప్రజలను సృష్టించి 'ఈ యజ్ఞములచే మీరభివృద్ధినిబొందుడు. ఇవి మీ యభీష్టములను నెరవేర్చుగాక!' అని వారితో బలికెను.

**వ్యాఖ్య:–** మనుజు డెపుడు సృష్టింపబడెనో, అతనితోసహా అతడు బంధమునుండి ముక్తుడగుటకు వలసిన సాధనోపాయము కూడ సృష్టింపబడెనని ఈ శ్లోకమందు తెలుపబడినది. అహో! భగవంతు డెట్టి కరుణామయుడో, ప్రాణికోట్లను తరింపజేయవలెనని ఎంత కుతూహలముకలవారో చూడుడు! 'అయ్యో! ఈ సృష్టింపబడిన ప్రజలు సంసారబంధమున బడి జననమరణప్రవాహమున కొట్టుకొనుచు ఇంచుకేని శాంతిలేక తల్లడిల్లుదురు. అట్టివారు ఆ సంసారనరకబాధనుండి తప్పించుకొనుటెట్లు?' అని సర్వేశ్వరుడు ఆలోచించి మొట్టమొదటనే మోక్షసాధనోపాయములైన అనేక యజ్ఞములనుగూడ సృష్టించిరనియిట పేర్కొనబడినది.

యజ్ఞమనగా భగద్విషయమైనట్టిగాని, పరోపకారసంబంధమైనట్టిగాని, ఆత్మధ్యానసంబంధమైనట్టి గాని, క్రియయని భావము. ఈ యజ్ఞములనుగూర్చి విస్తారముగ రాబోవు అధ్యాయమున తెలుపబడగలదు.

"ఇష్టకామధుక్" – ఈ యజ్ఞములు కామధేనువువలె జీవుల యభీష్టములను నెరవేర్చి, వారిని ఉన్నతపథగాములుగ నొనర్చునని చెప్పబడినది. జీవులు మిక్కుటముగ నభిలషించునట్టి దుఃఖరాహిత్యము, పరమానందప్రాప్తి అను నీ రెండును ఈ యజ్ఞముల నాచరించుటద్వారా జీవుడు తప్పక పొందగలడు. కావున అవి ఇష్టకామధుక్ – అని వచింపబడినవి. ప్రసవిష్యధ్వమ్ – అని పేర్కొనుటవలన జీవుని నైతిక, ఆధ్యాత్మికాభివృద్ధిని ఆ యజ్ఞములు కలుగజేయగలవని ఇట స్పష్టముచేయబడినది.

**ప్ర:–** బ్రహ్మదేవుడు ప్రజలను సృష్టించునపుడు వారితోసహా మఱివేనిని సృష్టించిరి?

**ఉ:–** యజ్ఞములను (సత్కార్యములను, దైవకార్యములను).

**ప్ర:–** వానివలన ప్రయోజనమేమి?

**ఉ:–** అవి జీవుని ఆధ్యాత్మికాభివృద్ధిని గలుగజేయును – కామధేనువు చందమున ఆతని కోరికలను (శాంతిసుఖములను, మోక్షమును) నెరవేర్చును.

## 11. దేవాన్భావయతానేన తే దేవా భావయన్తు వః
## పరస్పరం భావయన్తః శ్రేయః పరమవాప్స్యథ.

**టీక:–** అనేన = ఈ యజ్ఞముచేత, దేవాన్ = దేవతలను, భావయత = సంతోష పఱచుడు, తే దేవాః = ఆ దేవతలు, వః = మిమ్ములను, భావయన్తు = (వర్షాదులచే) సంతుష్టినొందించుదురుగాక! (ఈ ప్రకారముగ), పరస్పరమ్ = ఒకరినొకరు, భావయన్తః = సంతోషపఱచుకొనువారలై, పరమ్ = ఉత్కృష్ట మగు, శ్రేయః = శ్రేయస్సును, అవాప్స్యథ = పొందగలరు.

**తా:–** ఈ యజ్ఞములచే దేవతలను తృప్తిపఱచుడు. ఆ దేవతలున్ను మిమ్ములను (వర్షాదులచే) తృప్తినొందించుదురు గాక! ఈ ప్రకారముగ పరస్పరము తృప్తినొందించు కొనుటవలన ఉత్తమశ్రేయమును బొందగలరు.

**వ్యాఖ్య:–** అనేక దేవతల రూపముననున్నది సాక్షాత్ పరమేశ్వరుడే కనుక, ఏ దేవతను పూజించినను, అర్చించినను, ధ్యానించినను భగవంతుని ఆరాధించినట్లే యగును. కావున ఈ యజ్ఞములద్వారా జీవులు భగవంతుని ఆరాధించినచో, భగవానుడు వారల ననుగ్రహించుదురు. ఆ యా దేవతల మూలకముగ తత్తత్ఫలములను ఒసంగుచుండును. ఈ ప్రకారముగ జీవుడు యజ్ఞములద్వారా (ఫలాపేక్షారహితసత్కర్మల ద్వారా) భగవంతు నెపుడారాధించునో అపుడు వారనుగ్రహించి జ్ఞానముద్వారా పరమశ్రేయమగు మోక్షమాతనికి కలుగజేయ గలరు.

"శ్రేయః పరమ్" - ప్రపంచములో అనేక శ్రేయములున్నను వాని నన్నింటిని మించిన శ్రేయమగు మోక్షమును భగవదారాధనపరుడు బడయగల్గుచున్నాడు. కనుకనే అయ్యది యిచట పరమశ్రేయమని వచింపబడినది. ఆత్మస్థితి (మోక్షస్థితి) యొకటియే లోకమున పరమశ్రేయము. దానిని భగవత్కరుణచే జీవుడు పొందగలడు. ఏలయనిన సర్వేశ్వరుని అనుగ్రహములేనిదే ఈ మాయ నెవరును దాటలేరు. ఆ భగవత్కరుణయో, జీవుని యొక్క స్వకీయపురుష ప్రయత్నముచేతనే లభించుచున్నది.

జీవునకు దేవునకు సంబంధము (link) లేనిచో ఎవడును ప్రపంచమున వృద్ధికిరాలేడు. కావున ప్రాపంచికవ్యక్తులతోకంటె దైవముతో ఎక్కువ సంబంధమును ఏర్పఱచుకొనవలెను. ప్రపంచ మనుజులు ఒకపుడు మనకు సహాయము చేయవచ్చును, మఱొకపుడు చేయలేకపోవచ్చును. ఎట్లున్నను వారితోటి సంబంధము ఈ జన్మముతోనే అంతమగును. కాని దైవసంబంధ మట్టిది కాదు. దైవము జన్మజన్మాంతరము జీవులవెంటనుండి వారికి శ్రేయమును గలుగజేయును. లేక, వారివారి సాధనతీవ్రతనుబట్టి ఈజన్మముననే మోక్షమును గలుగజేయవచ్చును. కాబట్టి అట్టి సర్వోత్తమమగు దైవసంబంధము నెవరును విస్మరింపరాదని ఈ శ్లోకమున జ్ఞాపకము చేయబడినది.

**ప్ర:–** పరమశ్రేయమగు మోక్ష మెట్లు లభించును?

**ఉ:–** యజ్ఞముల (ఫలాభిసంధిరహిత సత్కర్మల) ద్వారా భగవంతుని, లేక, దేవతలను ఆరాధించుటచే (క్రమముగ చిత్తశుద్ధిగలుగ, దానిచే జ్ఞానమావిర్భవింప, అట్టి జ్ఞానమువలన) మోక్షము లభించును.

**అ॥** భగవద్దత్తపదార్థములను భగవంతునకు నివేదించక అనుభవించువాడు దొంగయని చెప్పుచున్నాడు -

## 12. ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యన్తే యజ్ఞభావితాః
## తైర్దత్తా న ప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః.

**టీక:–** యజ్ఞభావితాః = యజ్ఞముచే సంతోషపెట్టబడిన, దేవాః = దేవతలు, వః = మీకొఱకు, ఇష్టాన్ = ఇష్టములగు, భోగాన్ = భోగములను, దాస్యన్తే హి = ఇయ్యగలరుకదా!, తైః = వారిచేత, దత్తాన్ =

ఇవ్వబడిన (మృష్టాన్నాది భోగములను), ఏభ్యః = వీరికొఱకు (ఆ దేవతలకు), అప్రదాయ = సమర్పింపకయే, యః = ఎవడు, భుఙ్క్తే = భుజించుచున్నాడో, సః = అతడు, స్తేన ఏవ = దొంగయే యగును.

**తా:–** మనుజుడు చేయు యజ్ఞములచే సంతోషించి దేవతలు వారికి ఇష్టములైన భోగములనిత్తురు. అట్లు వారిచే ఇవ్వబడిన యా భోగ్యవస్తువులను తిరిగి వారికి సమర్పింపకనే ఎవడనుభవించునో ఆతడు దొంగయే యగును.

**వ్యాఖ్య:–** యజ్ఞములచే ఆరాధింపబడినపుడు భగవంతుడు, లేక ఆ యా దేవతలు అన్నాది భోగ్యపదార్థములను వారికి కలుగజేయుదురు. భగవద్దత్తములైనవానిని తిరిగి భగవంతునికి సమర్పింపక, లేక భగవత్స్వరూపులేయగు ప్రాణికోట్లకు ఒసంగక తాను భుజించినచో, లేక అనుభవించినచో అతడు దొంగయే యగునని ఇట చెప్పబడినది. 'దొంగ' అను పదమునకు నిర్వచనమేమి? తనది కాని వస్తువును దాని క్రయము చెల్లించక తెచ్చుకొనువాడే దొంగ. అన్నము మొదలగు భోగ్యవస్తువులు భగవంతుని సొత్తు. మనదికాదు. ఏలయనిన దానిని మనము తయారుచేయలేము. పరమాత్మయే వర్షములను కురిపించి, సస్యములలోని జీవశక్తిని ప్రోద్దీపింపజేసి ధాన్యమును సృష్టించిరి. కావున దానిమూల్యమును మనము భగవంతునకు చెల్లించవలెను. భక్తియే దానిమూల్యము. కృతజ్ఞతయే దాని మూల్యము. కావున ఆ అన్నమును భగవంతునకు (కృతజ్ఞతా పూర్వకముగ) నివేదించవలెను. లేక దానిలో కొంతభాగమును ప్రాణికోట్లకు సమర్పించవలెను. అట్లుచేయకున్న దానిని జీవుడు దొంగిలించినట్లే యగును. ఈ ప్రకారముగ ఈశ్వరుడిచ్చిన అన్నాది భోగ్యపదార్థములను తిరిగి ఈశ్వరునకు సమర్పించక అనుభవించు వాడు దొంగయే యని శ్రీకృష్ణమూర్తి స్పష్టముగ చెప్పివేచిరి.

కాని యిపుడు ప్రపంచమున ఎందఱాప్రకారముగ దైవమునకు నివేదన సల్పుచున్నారు? ప్రపంచవాసుల దృష్టిలో మనుజు డెంత గొప్పవాడైనను, విద్యావంతుడైనను, ధనవంతుడైనను, రాజైనను, భగవంతుని దృష్టిలో దొంగ యనిపించుకొనిన నేమి ప్రయోజనము? కావున అట్టి స్థితి కలుగకుండ చూడవలెను. మఱియు ప్రపంచములో దొంగకు శిక్ష విధింపబడుచున్నది. అట్టిచో దైవవస్తువులను స్వార్థమునకు వినియోగించుకొను ఈ దొంగలకు శిక్ష యుండదా? వారికి ఈశ్వరుడు తగిన శిక్షను విధించియేతీరును. కావున ముముక్షువులు తమకున్నంతలో ఏదియో కొంతపదార్థము కనీసము ఒక్క కబళమైనను - భూతకోట్లకు ప్రసాదించుచు, తాననుభవించు దానిని 'బ్రహ్మార్పణము' లేక 'కృష్ణార్పణము' లేక 'రామార్పణము' చేసి తదుపరి యనుభవింపవలెను. ఈ ప్రకారముగ ఈశ్వరార్పణబుద్ధి, భక్తిభావన, పరోపకారదృష్టి అలవఱచుకొని ధన్యులు కావలయును.

**ప్ర:–** యజ్ఞములచే (ఫలాపేక్షారహిత సత్కర్మలచే) నారాధింపబడి భగవంతుడు జనుల కేమి యొసంగును?

**ఉ:–** వారివారికి ఇష్టములైన అన్నాది భోగ్యపదార్థముల నిచ్చును.

**ప్ర:–** అవి లభించినపుడు జీవు డేమిచేయవలెను?

**ఉ:–** వెంటనే వానిని ఆ యా దేవతలకు, లేక భగవంతునకు నివేదన చేయవలెను.

**ప్ర:–** అట్లుచేయక ననుభవించినచో కలుగు నష్టమేమి?

**ఉ:–** అత్తఱి యాతడు దొంగక్రింద పరిగణింపబడి తగు శిక్ష ననుభవించవలసివచ్చును.

**అ॥** పదార్థములను భగవదర్పితముచేసి యనుభవించు వారికి కలుగు సత్ఫలము, స్వార్థము కొఱకు వినియోగించువారికి కలుగు దుష్ఫలితము వచించుచున్నాడు -

## 13. యజ్ఞశిష్టాశినస్సన్తో ముచ్యన్తే సర్వకిల్బిషైః
## భుఞ్జతే తే త్వఘం పాపా[1] యే పచన్త్యాత్మకారణాత్.

**టీక:–** యజ్ఞశిష్టాశినః = యజ్ఞమందు భగవదర్పణముచేసి మిగిలినదానిని తిను, సన్తః = సజ్జనులు, సర్వకిల్బిషైః = సమస్త పాపములనుండియు, ముచ్యన్తే = విడువబడుచున్నారు, యేతు = ఎవరైతే, ఆత్మకారణాత్ = తమ (యుదరపూరణ) నిమిత్తమే, పచన్తి = వండుకొనుచున్నారో (భుజించుచున్నారో), పాపాః = పాపులైన, తే = వారలు, అఘమ్ = పాపమును, భుఞ్జతే = తినుచున్నారు.

**తా:–** యజ్ఞమునందు (భగవదర్పణముచేసి) మిగిలిన పదార్థమును తిను సజ్జనులు సమస్తపాపములనుండియు విడువబడుచున్నారు. అట్లుకాక ఎవరు తమ నిమిత్తమే భుజించు చున్నారో, అట్టివారు పాపమును తినువారే యగుదురు.

**వ్యాఖ్య:–** భగవదారాధనరూపములగు యజ్ఞములను గావించి, అన్నాదులను భగవంతునకు అర్పణచేసి (లేక, భగవత్స్వరూపులే యగు ప్రాణికోట్లకు కొంతభాగమును సమర్పించి) మిగిలిన పదార్థమును భుజించువాడు సమస్త పాపములనుండియు విముక్తుడగునని యిచట చెప్పబడినది. 'సర్వకిల్బిషైః' - అని చెప్పబడినందున, ఒకటి రెండు పాపముల నుండి కాదనియు, సమస్తపాపముల నుండియు విడివడునని తెలుపబడినది. దీనినిబట్టి యజ్ఞములకు, భగవన్నివేదనమునకు, త్యాగమునకు పరోపకారమునకు ఎంతటి సామర్థ్యమున్నదో స్పష్టమగుచున్నది. కనుకనే ఈశావాస్యోపనిషత్తుయొక్క ఆరంభమున 'తేన త్యక్తేన భుఞ్జీథాః' - 'నీకున్నదానిలో నొకింత త్యాగమొనర్చి భుజింపుము' నీకున్నది భగవంతునకు అర్పించి భుజింపుము. - అని చెప్పబడినది. అట్లు కాక స్వార్థము కొఱకే భుజించువారు, దైవమున కర్పింపక భుజించువారు, పరప్రాణికి ఒకింతైనను త్యాగమొనర్పక భుజించువారు, పాపమును భుజించినట్లే యని భగవానుడు వారిని తీవ్రముగ మందలించిరి. వారు పాపమునే మూటకట్టుకొనుచున్నారు. లేక, పాపమునే భుజించుటచే అయ్యది వారి రక్తనాళములలో ప్రవేశింప వారు కేవలము పాపరూపులే యగుచున్నారని భావము. కావున స్వార్థమే పాపహేతువు, స్వార్థత్యాగమే మోక్షహేతువని ఈ శ్లోకముద్వారా తేటతెల్లమగుచున్నది. భగవంతునకు నివేదింపక, పరప్రాణికి ఒకింతైనను పెట్టక పంచభక్ష్యపరమాన్నములను ఆరగించినను విషము తినినట్లేయగుననియు, ఈశ్వరార్పణముచేసి, భూతకోట్ల కొకింత త్యాగము చేసి గంజి త్రాగినను అది అమృతమేయగు ననియు నిట వెల్లడింపబడినది.

మఱియు మానవునకు తన నిత్యజీవితమున ఏదైన కోయునపుడు, నూఱునపుడు, విసఱుచున్నపుడు, వండునపుడు, ఊడ్చునపుడు, తెలియక కొంత ప్రాణిహింస జరుగవచ్చును. దానినే పంచసూనములందురు. ఆ పాపమును పరిహరించుటకు పంచమహాయజ్ఞము లేర్పడినవి. అవి యేవియనిన - (1) దేవయజ్ఞము (హోమము) (2) పితృయజ్ఞము (తర్పణము) (3) నృయజ్ఞము (అతిథిపూజ) (4) బ్రహ్మయజ్ఞము (వేదాధ్యయనము) (5) భూతయజ్ఞము (ప్రాణులకు అన్నమిడుట). కావున ఇవియు, ఇంకను భగవదారాధనరూపములై, పరోపకార సంబంధములైనట్టి ఇతరములునునగు యజ్ఞముల నాచరించుచు, యజ్ఞశేషమును మాత్రము భుజించుచు నుండువారు పాపరహితులై, క్రమముగ పరమశ్రేయము నొందగలరని భగవాను డీశ్లోకమున తెలుపుచున్నాడు.

[1] తే త్వఘం భుఞ్జతే పాపా - పాఠాన్తరము

**ప్ర:–** యజ్ఞశేషమును (దైవార్పితముచేసి శేషించిన దానిని) భుజించువారికి కలుగు ఫలితమేమి?

**ఉ:–** వారు సర్వపాపములనుండి విముక్తులగుదురు.

**ప్ర:–** అట్లుకాక, స్వార్థముకొఱకు భుజించువారికి కలుగు ఫలితమేమి?

**ఉ:–** వారు పాపమునే పొందుదురు. పాపరూపులే యగుదురు.

**అ॥** యజ్ఞము మహాపవిత్రమైనదనియు, పరమాత్మకూడ దానియందు సుప్రతిష్ఠితులై వెలయుచుందురనియు చెప్పబడుచున్నది -

**14. అన్నాద్భవన్తి భూతాని పర్జన్యా దన్నసంభవః**
**యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః.**

**15. కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్**
**తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్.**

**టీక:–** అన్నాత్ = అన్నమువలన, భూతాని = ప్రాణులు, భవన్తి = కలుగుచున్నవి, పర్జన్యాత్ = మేఘమువలన, అన్నసంభవః = అన్నము కలుగుచున్నది, యజ్ఞాత్ = యజ్ఞము వలన, పర్జన్యః = మేఘము, భవతి = కలుగుచున్నది, యజ్ఞః = యజ్ఞము, కర్మసముద్భవః = సత్కర్మాచరణమువలన గలుగుచున్నది, కర్మ = సత్కర్మము, బ్రహ్మోద్భవమ్ = వేదమువలన గలుగుచున్నది, బ్రహ్మ = వేదము, అక్షరసముద్భవమ్ = అక్షరపరమాత్మవలన గలుగుచున్నది, తస్మాత్ = అందువలన, సర్వగతమ్ = అంతటను వ్యాపించిన, బ్రహ్మ = బ్రహ్మము, నిత్యం = ఎల్లపుడును, యజ్ఞే = యజ్ఞమునందు, ప్రతిష్ఠితమ్ = ఉంచబడినదానినిగ, విద్ధి = యెఱుంగుము.

**తా:–** ప్రాణులు అన్నమువలన కలుగుచున్నవి. అన్నము మేఘమువలన కలుగుచున్నది. మేఘము యజ్ఞమువలన కలుగు చున్నది. యజ్ఞము సత్కర్మవలన కలుగుచున్నది. సత్కర్మ వేదము వలన కలుగుచున్నది. వేదము అక్షరపరబ్రహ్మము వలన కలుగు చున్నది. కాబట్టి సర్వవ్యాపకమగు బ్రహ్మము నిరంతరము యజ్ఞమునందు ప్రతిష్ఠింపబడినదానినిగ నెఱుంగుము.

**వ్యాఖ్య:–**

**ధర్మచక్రము**



బ్రహ్మమువలన వేదము, వేదమువలన సత్కర్మ, సత్కర్మ వలన యజ్ఞము కలుగుచున్నవి. ఇక్కారణమున యజ్ఞము నందు బ్రహ్మము సదాప్రతిష్ఠితమై యలరుచున్నదనియిట చెప్పబడినది. కనుకనే యజ్ఞాదులు మహాపవిత్రములై చిత్తశుద్ధి కారకములై, మోక్షప్రదములై యొప్పుచున్నవి. (పై చక్రమున వర్షము, అన్నము, శరీరము యజ్ఞమునం దంతర్భూతములై యుండుటవలన నిచట లిఖింపబడలేదు). దైవకార్యములు (యజ్ఞాదులు) సామాన్యములని తలంపరాదు. ఏలయనిన వానియందు సాక్షాత్ వ్యాపక పరబ్రహ్మము సుఖప్రతిష్ఠితమై యున్నదని గీత యుద్ఘోషించుచున్నది. కాబట్టి సర్వులు వాని నాచరించి క్రమముగ చిత్తశుద్ధి ద్వారా బ్రహ్మసాక్షాత్కారము నొంది బంధవిముక్తులు కావలసియున్నారు.

"యజ్ఞాద్భవతి పర్జన్యః" - యజ్ఞమువలన వర్షము కురియుచున్నదని చెప్పబడినది. దీనినిబట్టి యజ్ఞాదులయొక్క అభావమువలననే కఱవు - కాటకము లేర్పడుచున్నవని స్పష్టమగుచున్నది. కావున దేశ సౌభాగ్యము కొఱకును, ఆత్మశుద్ధి కొఱకును జనులు సత్కర్మలను విరివిగ నాచరింపవలయును.

**ప్ర:-** యజ్ఞము లెందులకు పవిత్రములైనవి?

**ఉ:-** వానియందు సర్వవ్యాపక బ్రహ్మము ప్రతిష్ఠితమై యున్నది. కావున వాని నాచరించుట ద్వారా జీవునకు క్రమముగ బ్రహ్మముయొక్క సాక్షాత్కారము సిద్ధించగలదు.

**అ॥** యజ్ఞరూప సత్కార్యముల నాచరించనివాని జీవితము నిష్ఫలమని వచించుచున్నాడు -

## 16. ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః
## అఘాయురిన్ద్రియారామో మోఘం పార్థ స జీవతి.

**టీక:-** పార్థ = ఓ అర్జునా!, యః = ఎవడు, ఏవమ్ = ఈ ప్రకారముగ, ప్రవర్తితమ్ = ప్రవర్తింపజేయబడిన, చక్రం = జగచ్చక్రమును, ఇహ = ఈ లోకమున, న అనువర్తయతి = అనుసరించి వర్తింపడో, సః = ఆతడు, అఘాయుః = పాపజీవితము కలవాడును, ఇన్ద్రియారామః = ఇంద్రియభోగాసక్తుడును (అయి), మోఘమ్ = వ్యర్థముగ, జీవతి = బ్రతుకుచున్నాడు.

**తా:-** ఓ అర్జునా! ఈ ప్రకారముగ ప్రవర్తింపజేయబడిన ధర్మచక్రమును ఈ ప్రపంచమున ఎవడనుసరించి వర్తింపడో, ఆతడు పాపజీవితమును గడుపువాడును, ఇంద్రియలోలుడును అయి వ్యర్థముగ బ్రతుకుచున్నాడు.

**వ్యాఖ్య:-** యజ్ఞములు (నిష్కామబుద్ధితో చేయబడు సత్కార్యములు) సామాన్యము లైనవి కావు. వానియందు సర్వవ్యాపకపరబ్రహ్మముయొక్క శక్తి ఇమిడియున్నది. కావున వానిననుసరించువాడు పరమశ్రేయమును (మోక్షమును) బొందును. అనుసరింపనివాడు తన జీవితమును వ్యర్థము చేసికొనును. ఏలయనిన అతడు దైవమును విస్మరించి, దృశ్యమును నమ్ముకొని విషయలోలుడై పాపపుబ్రతుకు బ్రతుకును. యజ్ఞరూప సత్కర్మలచే భగవంతుని, లేక దేవతలను ఆరాధింపనివాడు, త్యాగబుద్ధిలేనివాడు, పరోపకారముచేయని వాడు సంసారకూపమునబడి జీవితమును భ్రష్టమొనర్చుకొనునని యిట తెలుపబడినది. అట్లుకాక పైన దెలుపబడిన ఈ ధర్మచక్రము ననుసరించి యజ్ఞరూపసత్కర్మల నాచరించువాడు భగవదనుగ్రహమునకు పాత్రుడై, చిత్తశుద్ధిని బడసి క్రమముగ మోక్ష ధామము నలంకరించును. ఒకనిది పాపజీవితము,

మఱియొకనిది పుణ్యమయజీవితము; ఒకడు ఇంద్రియారాముడు, మఱి యొకడు ఆత్మారాముడు; ఒకడు వ్యర్థజీవి, మఱియొకడు సార్థకజీవి.

భగవంతుని మఱచుటయే పాపము (To forget God is sin) అని రామతీర్థులు వక్కాణించియున్నారు. పైనదెల్పిన ధర్మచక్రము ననువర్తింపనివారు దైవమును మఱచి దృశ్యమునే వెంటాడుచుందురు. కావున వారు పాపమును మూటకట్టుకొను చుందురు. కనుకనే వారిని 'అఘాయువులు' (పాపపుబ్రతుకు కలవారు) అని గీతాచార్యులు పేర్కొనిరి. మఱియు దృశ్యమును సత్యమని నమ్మి దానివెంట పరుగిడువాడు సహజముగ ఇంద్రియలోలుడై, విషయాసక్తుడై ప్రవర్తించును కాబట్టి వారిని 'ఇంద్రియారాము' లనియు వర్ణించిరి. అట్టివారి జీవితము తమకుగాని, పరులకుగాని ఉపయోగించదు. కావున వారిది 'మోఘజీవితము' (వ్యర్థజీవితము) అనియు చెప్పబడెను. మానవుడైపుట్టి, దైవమును విస్మరించి, ఇంద్రియసుఖములలో మునుగుటకంటె క్రిమికీటకాదులలో జన్మించుట మేలు. కావున భగవానుడు పేర్కొనిన ఈ యజ్ఞాచరణరూప ధర్మచక్రము ననుసరించి మానవజీవితమును సార్థకము చేసికొనవలయును.

**ప్ర:–** యజ్ఞాదిరూపమగు ధర్మచక్రము ననుసరింపనివాని జీవిత మెట్లుండును?

**ఉ:–** (1) అతడు పాపమయజీవితము గలిగియుండును. (2) ఇంద్రియలోలుడై వర్తించును. (3) జీవితమును వ్యర్థమొనర్చుకొనును.

**అ॥** ఆత్మసాక్షాత్కారముగల మహనీయులు స్వతః దైవమునందే నిరంతరము వర్తించు చుందురు. కావున అట్టివారికి మాత్ర మీ యజ్ఞాది కార్యనిర్వహణమునందు విధి యేమియు లేదని రెండుశ్లోకములద్వారా చెప్పుచున్నాడు –

## 17. యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః
## ఆత్మన్యేవ చ సన్తుష్టస్తస్య కార్యం న విద్యతే.

**టీక:–** యః మానవః తు = ఏ మానవుడైతే, ఆత్మరతిః ఏవ = ఆత్మయందే రమించువాడును, ఆత్మతృప్తః చ = ఆత్మయందే తృప్తిని బొందువాడును, ఆత్మని ఏవ = ఆత్మయందే, సంతుష్టః చ = సంతోషపడువాడును, స్యాత్ = అగునో, తస్య = అట్టివానికి, కార్యమ్ = చేయదగినది, న విద్యతే = లేదు.

**తా:–** ఎవడు కేవలము ఆత్మయందే క్రీడించుచు, ఆత్మయందే తృప్తిని బొందుచు, ఆత్మయందే సంతోషపడుచు నుండునో, అట్టి ఆత్మజ్ఞానికిక చేయదగినపని (విధి) యేదియును లేదు.

**వ్యాఖ్య:–** కర్మయోగమును శీలించవలసిన విధి లోకములో కొద్దిమందికి తప్ప తక్కినవారందఱికిని గలదు, ఆ కొద్దిమంది యెవరో ఈ శ్లోకమందు చెప్పబడినది. ఆత్మారాములు, ఆత్మతృప్తులు, ఆత్మసంతుష్టులు – అగు మహనీయులకు కర్మ సంబంధమైన విధిలేదు. ఏలననగా సమస్త కర్మలయొక్క, సాధనల యొక్క అవధి (లక్ష్యము) ఆత్మసాక్షాత్కారము. అదియో వారికి లభించియేయున్నది. కర్మద్వారా పొందదగిన ఫలమును వారు పొందియేచిరి. కాబట్టి శాస్త్రము లట్టివారికి 'విధి' ని తొలగించినవి. అయినను లోకసంగ్రహార్థము అట్టి మహాత్ములు సత్కర్మల నాచరించుచునేయుందురు. వారు కర్మచేసినను దోషములేదు, చేయకున్నను దోషములేదు.

అయితే ఇట్టి స్థితి సామాన్యజనులందఱికిని అన్వయించదు. ప్రపంచములో ఆత్మానుభూతినిబడసిన మహనీయులు చాల అరుదుగా నుందురు. తక్కినవారందఱున్ను కర్మ చేయవలసినదే. కృతార్థులు కావలయుననిన కృతకృత్యులు కావలసినదే. అయితే తాము పూర్ణస్థితిని పొందకున్నను, పొందినట్లు నటించి అకర్మణ్యులవరాదు. అది కపటము, మిథ్యాచారము.

ప్రపంచములో నిపుడెక్కువమంది విషయరతి, విషయతృప్తి, విషయసంతుష్టిలో కాలక్షేపము చేయుచున్నారు. దానివలన ఇహమునకుగాని, పరమునకుగాని వారికి లాభించునది లేదు. కాబట్టి ఆ పద్ధతిని మార్చుకొని "ఆత్మరతి, ఆత్మతృప్తి, ఆత్మసంతుష్టి" - వీనిని పొందులాగున ప్రయత్నించవలెను. జీవిత లక్ష్యమిదియే. వాస్తవముగ ఆనందము జనులు తలంచులాగున బయటలేదు. అది హృదయముననే కలదు. బయట నున్నది ప్రతిబింబానందము, క్షణికసుఖము. లోనగలది శాశ్వత నిరతిశయానందము. కనుకనే విజ్ఞులగువారు దృశ్యపదార్థముల యెడల విరక్తి గలిగి, అంతర్ముఖులై ఆత్మానందమును గ్రోలుచుందురు. అట్టివారిని గూర్చియే ఈ శ్లోకమున ప్రస్తావించబడినది.

"మానవః" - అని ప్రయోగింపబడినందువలన, ప్రతి మానవునకు అట్టి ఆత్మానుభవరూపమైన జీవన్ముక్తస్థితిని బడయుటకు అర్హతకలదనియు, సర్వమానవులును జాతి మత కులభేదములేక అట్టి మహోన్నతస్థితిని ప్రయత్నముచే పొంద వచ్చుననియు పేర్కొనబడినది.

**ప్ర:-** కర్మయోగమును గూర్చిన విధి యెవరికి లేదు?

**ఉ:-** ఆత్మారాములు, ఆత్మతృప్తులు, ఆత్మసంతుష్టులు నగు మహనీయులకు కర్మను గూర్చిన విధిలేదు.

## 18. నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన
## న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః.

**టీక:-** తస్య = అతనికి (అట్టి ఆత్మజ్ఞానికి), ఇహ = ఈ లోకమందు, కృతేన = కర్మచేయుట చేత, అర్థః = ప్రయోజనము, న ఏవ = లేదు, అకృతేన = కర్మచేయకపోవుటచేత, కశ్చన = ఒకానొక (దోషః = దోషము), న = లేదు, అస్య = ఇతనికి, సర్వభూతేషు = చరాచర సమస్త ప్రాణులందును, అర్థవ్యపాశ్రయః = ప్రయోజనమునిమిత్త మాశ్రయింపదగినది, కశ్చిత్ = ఏదియును, న = లేదు.

**తా:-** అట్టి ఆత్మజ్ఞానికి ప్రపంచమున కర్మచేయుటచే ప్రయోజనముగాని చేయకుండుటచే దోషముగాని ఏదియును లేదు. మఱియు నాతనికి సమస్తభూతములయందును ఎట్టి ప్రయోజనము కొఱకైనను ఆశ్రయింపదగినది యేమియులేదు.

**వ్యాఖ్య:-** పైనదెల్పిన జీవన్ముక్తుడగు ఆత్మజ్ఞానికి కర్మచేయుటచేగాని, చేయకపోవుటచేగాని, ప్రయోజనమేమియు లేదని తెలుపబడినది. ఏలయనిన, అతడు, నిరంతరము ఆత్మయందే తృప్తిగలిగి యుండును గనుక కర్మచేగాని, కర్మత్యాగముచేగాని క్రొత్తగ సాధింపదగిన విషయము ప్రపంచమున అతని కేమియునులేదు. అతడు తలంచుకొనినచో కర్మచేయవచ్చును; చేయకను ఉండవచ్చును. విధి యేమియును లేదు. అయినను లోకక్షేమము కొఱకై అట్టి మహనీయులలో పెక్కురు సత్కర్మల నాచరించుచునే యుందురు.

మఱియు అట్టి ఆత్మనిష్ఠులు ప్రపంచమున ఏ ప్రయోజనము నిమిత్తమైనను ఒకరిని ఆశ్రయింపవలసినపని లేదని వచింపబడినది. ఎందువలననగా, అన్ని ప్రయోజనములు దేనివలన సిద్ధించుచున్నవో, అన్ని ప్రయోజనములకును కూడలి, మూలస్థానము (Head Quarters) ఏదియో అట్టి ఆత్మను వారు కైవసము చేసికొనియే యున్నారు. 'శతే పంచాశత్' (నూటిలో యాభై ఇమిడి యున్నది) - అను న్యాయము ననుసరించి సమస్త ప్రాపంచిక ప్రయోజనములున్ను ఆత్మప్రాప్తియం దంతర్భూతములే అయియున్నవి. కావున అట్టివారొకరియొద్ద చేయిజాపవలసిన పనిగాని, ఒకరికి లొంగవలసిన పనిగాని, ఒకరిని ఆశ్రయించవలసిన అవసరముగాని యేదియును లేదు.

అయితే ఇట్టి కర్మసంబంధమైన విధి లేకుండుట ఆత్మనిష్ఠుని కొఱకేకాని తక్కిన వారికి కాదు. తక్కినవారందఱున్ను తప్పక (నిష్కామబుద్ధితో) కర్మనాచరింపవలసినదే. ఉద్యోగవిరమణానంతరము ఉపకారవేతనము (Pension) తీసికొనుచు, తీరికగానుండు వారిని జూచి విద్యార్థిదశలోనున్నవాడుగాని, ఉద్యోగిగాని తమ కర్తవ్యమును వదలినచో ఎట్లు భ్రష్టుడై పోవునో, అట్లే జీవన్ముక్తదశ నొందకపూర్వము కర్తవ్యనిర్వహణమును, (కర్మవిధిని) త్యజించువాడున్ను పతనమునొందిపోవును. కావున సాధకు లీ విషయమున కడుజాగరూకులై మెలగుచు తమతమ సాధనలయం దేమాత్రము కొఱత రానీయక చూచుచుండవలెను.

**అ॥** ఫలాపేక్షనువదలి కార్యముల నాచరించవలసినదిగా నిపుడు భగవానుడు అర్జునుని ఆదేశించుచున్నాడు -

## 19. తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర
## అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః.

**టీక:–** తస్మాత్ = అందువలన, (త్వమ్ = నీవు), అసక్తః = సంగము (ఫలాపేక్ష) లేనివాడవు (అయి), సతతమ్ = ఎల్లప్పుడును, కార్యమ్ = చేయదగిన, కర్మ = కర్మమును, సమాచర = లెస్సగ నాచరింపుము, అసక్తః = సంగములేనివాడు (అయి), కర్మ = కర్మను, ఆచరన్ = ఆచరించుచున్న, పూరుషః = పురుషుడు, పరమ్ = మోక్షమును, ఆప్నోతిహి = పొందుచున్నాడుకదా!

**తా:–** కాబట్టి నీవు సంగము (ఫలాపేక్ష) లేనివాడవై, చేయదగినకర్మను ఎల్లప్పుడును చక్కగ చేయుచుండుము. అసక్తుడై కర్మనాచరించు మనుజుడు (క్రమముగ) మోక్షము నొందుచున్నాడు.

**వ్యాఖ్య:–** "తస్మాత్" - ఆత్మజ్ఞానికి కర్మనిర్వహణము నందు విధిలేదు. తక్కిన వారందరున్ను కర్మ నాచరించవలసినదే. 'కాబట్టి' (సాధనదశయందున్న) నీవు కర్మ తప్పకచేయవలెను. అయితే (1) దానియందలి సంగమును, సక్తత్వమును (attachment) విడనాడి చేయుము. (2) మఱియు శాస్త్రనియతములగు కార్యములనే చేయుము. ఈ రెండువిశేషణములున్ను చేరి యున్నచో అపుడు కర్మము దోషవర్జితమై మోక్షమునకు గూడ హేతువై యలరును. కనుకనే అట్టి నిష్కామకర్మను ఎల్లపుడు (సతతమ్) ఆచరించుచుండుమని భగవాను డర్జునునకు హిత వొసంగిరి. కర్మ బంధకరమైనచో దేవదేవు డట్లు బోధించుదురా? కర్మమునందలి సక్తత్వమును, ఫలాపేక్షను, వదలివైచినచో ఆ కర్మము నైష్కర్మ్యమునకు, మోక్షము ('పరమ్')నకు దారితీయ గలదు. వదలనిచో ఆ కర్మము బంధకరమై, సంసారహేతువై వర్తించును. ఇదియే కర్మయందలి రహస్యము.

తక్కిన యోగములతోబాటు కర్మయోగముకూడ మోక్షదాయక మెట్లగునో ఈ శ్లోకమునందు స్పష్టీకరించబడినది. అనాసక్త కర్మయోగమువలన చిత్తము శుద్ధముకాగా మోక్షప్రాప్తికి చక్కని వాతావరణమేర్పడుచున్నది. 'మోక్షో హి చేతో విమలమ్' అనునట్లు చిత్తముయొక్క నైర్మల్యస్థితియే మోక్షము. అదియో, నిష్కామకర్మాచరణముచే తప్పక సిద్ధించుచునేయున్నది. మఱియు లోకములో జనసామాన్యమున జ్ఞాన, ధ్యానయోగము లందు ప్రవేశించువారు అరుదుగా నుందురు. కర్మ, భక్తిమార్గము లందు ప్రవేశించువారు ఎక్కువగా నుందురు. కాబట్టి జనులకు సులభముగ అందుబాటులో నున్న ఆ రెండుమార్గములను తక్కిన జ్ఞానధ్యానాదిమార్గములతోబాటు భగవానుడు గీతయందు చక్కగ ప్రోత్సహించినవారైరి.

**ప్ర:–** కర్మ నేప్రకార మాచరింపవలెను?

**ఉ:–** (1) అసక్తముగ (ఫలాపేక్షారహితముగ, నిష్కామముగ) నాచరింపవలెను. (2) చేయదగిన, అనగా శాస్త్రనియతములగు కర్మలనే ఆచరింపవలెను.

**ప్ర:–** ఆ ప్రకార మాచరించినచో కలుగు ఫలితమేమి?

**ఉ:–** అట్లాచరించినచో మనుజుడు సాక్షాత్ పరమపదమగు మోక్షమునే పడయును.

**అ॥** జనకాదుల దృష్టాంతమునొసంగి నిష్కామకర్మ యోగమును బలపఱచుచున్నాడు –

**20. కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః**
**లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి.**

**టీక:–** జనకాదయః = జనకుడు మొదలగువారు, కర్మణైవ = (నిష్కామ) కర్మముచేతనే, సంసిద్ధిమ్ = (చిత్తశుద్ధిద్వారా) మోక్షమును, ఆస్థితాహి = పొందిరికదా!, త్వమ్ = నీవు, లోకసంగ్రహమ్ = జనులను సన్మార్గమున ప్రవర్తింపజేయుట యను ప్రయోజనమును, సంపశ్యన్ అపి = ఆలోచించియైనను, కర్తుమేవ = కర్మమును జేయుటకే, అర్హసి = తగియున్నావు.

**తా:–** జనకుడు మున్నగువారు నిష్కామకర్మముచేతనే మోక్షమునుబొందిరి. జనులను సన్మార్గమున ప్రవర్తింపజేయు నుద్దేశ్యముచేనైనను నీవు కర్మలను చేయుటకే తగియున్నావు.

**వ్యాఖ్య:–** క్రిందటి శ్లోకమునందు నిష్కామకర్మాచరణచే మనుజుడు పరమాత్మను (మోక్షమును) బొందగలడని వచించిన సిద్ధాంతమునే యిపుడు జనకాదుల దృష్టాంతముచే బలపఱచుచున్నాడు.

"జనకాదయః" – అని చెప్పుటవలన జనకుడు, అశ్వపతి, ఇక్ష్వాకువు, ప్రహ్లాదుడు, అంబరీషుడు, భగీరథుడు, మున్నగు చక్రవర్తులని అర్థము. ఈ నిష్కామకర్మయోగము క్రొత్తదేమియు కాదనియు, అనేక రాజులు పూర్వము దానినవలంబించి ముక్తి ధామమును జేరిరనియు, కావున అర్జునుడుకూడ దాని నవలంబించవచ్చుననియు భగవానుడు తెలుపుచున్నాడు. రాజ్యమును పాలించుచు మోక్షమును బడయగలమా యనియు, కర్మచేతనే మోక్షసిద్ధి నెవరైన పొందగల్గిరా యనియు అర్జునుడు ప్రశ్నించకమునుపే శ్రీకృష్ణమూర్తి దానికి సమాధాన మిచట చెప్పివైచిరి. కర్మమును నిష్కామముగ శీలించుటచే

చిత్తము నిర్మలమగును. నిర్మలచిత్తమందు జ్ఞానముదయించును. జ్ఞాన విచారణచే మోక్షము సిద్ధించును. ఈ ప్రకారముగ నిష్కామకర్మ యోగము మోక్షహేతువేయగుచున్నది. జనకుడు మొట్టమొదట అనేక సత్కార్యములు ఫలాపేక్షారహితముగ గావించి, చిత్తము శుద్ధముకాగా ఆత్మవిచారణసలిపి స్వస్వరూపసాక్షాత్కారరూప మోక్షమును బడయ గల్గెనని యోగవాసిష్ఠమున చెప్పబడినది. కావున అనాసక్తకర్మవలన ముక్తి చేకూరుటలో సందేహమేమియును లేదు.

ఇక లోకసంగ్రహముకొఱకైనను, అనగా లోకులను అపమార్గమునుండి తప్పించి సన్మార్గమున ప్రవర్తింపజేయుట కైనను, కర్మయోగమత్యావశ్యకమని భగవానుడు వ్రాక్కుచ్చు చున్నారు. పరోపకారమున కెంతటి ప్రాధాన్య మొసంగబడెనో చూడుడు! ఒక్క ప్రాణికైనను ఉపకారముచేయుట మహాపుణ్య ప్రదమైనది. అందును మోక్షోపాయమగు కర్మయోగమును తాను శీలించి ఇతరులచే శీలింపజేయుట, తద్ద్వారా జనులను భవబంధనములనుండి విడివడజేయుట అనుదానిని మించిన ఉపకారము మఱియొకటి యేమికలదు? కనుకనే 'నీవు నిష్కామకర్మయోగమును లెస్సగ నాచరించి జనులనుగూడ సన్మార్గమునకు ద్రిప్పి తరింపజేయుము'ని భగవాను డర్జునునకు హితబోధ గావించిరి.

**ప్ర:–** కర్మయోగముచే నిదివఱకెవ్వరైన మోక్షమును బడసిరా? పడసినచో వారెవరు?

**ఉ:–** పడసిరి. వారే జనకాది చక్రవర్తులు మున్నగువారు.

**ప్ర:–** కర్మయోగమును శీలించుటవలన ప్రపంచమునకు కలుగు ప్రయోజనమేమి?

**ఉ:–** దానివలన అనేకులను అపమార్గమునుండి త్రిప్పి సన్మార్గమున ప్రవర్తింపజేయుటకు అవకాశము కలుగును.

**అ॥** పెద్దలు చేయుదానినే పిన్న లనుకరించుదురను లోకన్యాయమును వచించుచున్నారు -

## 21. యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః
## స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే.

**టీక:–** శ్రేష్ఠః = గొప్పవాడు, యత్ యత్ = ఏ యే కర్మమును, ఆచరతి = చేయుచున్నాడో, ఇతరః జనః = తక్కిన జనుడున్ను, తత్ తత్ ఏవ = ఆ యా కర్మనే (ఆచరతి = చేయుచున్నాడు), సః = అతడు, యత్ = దేనిని, ప్రమాణమ్ = ప్రమాణముగ, కురుతే = చేయుచున్నాడో (కైకొనుచున్నాడో), లోకః = లోకము (జనులు), తత్ = దానిని, అనువర్తతే = అనుసరించుచున్నది.

**తా:–** గొప్పవా డే కర్మను చేయునో దానినే తక్కినవారున్ను చేయుదురు. ఆతడు దేనిని ప్రమాణముగ గైకొనునో, తక్కినవారును దానినే అనుసరించుదురు.

**వ్యాఖ్య:–** సామాన్యముగ లోకములో నొక వాడుక కలదు. పెద్ద లేదిచేయుదురో తక్కినవారున్ను దాని ననుసరించుదురు అని. కాబట్టి శ్రేష్ఠులగువారు తమ ఆచరణవిషయమై బహుజాగరూకులుగ నుండవలెను. వారు పెట్టిన ఒరవడినే తక్కినవారున్ను అనుసరించుటవలన తమ యనుష్ఠానవిషయమై అప్రమత్తులుగ వ్యవహరింపవలెను. శాస్త్రవిరుద్ధమగు ఆచరణ లేకయుండవలెను. అర్జునుడు తన శౌర్య, ధైర్య,

పరాక్రమములచేతను, సచ్చరిత్ర చేతను లోకములో గొప్ప ఖ్యాతి నార్జించెను. అంతటి గొప్పవాడు అకర్మణ్యుడుకాక, తన విధ్యుక్తధర్మమును ఫలాపేక్షారహితముగ, అసక్తముగ, నాచరించినచో దానిని చూచి తక్కినవారున్ను 'ఆహా, అర్జునుడంతటివాడే ఈ ప్రకారముగ కర్మ నాచరించినపుడు మనమేల చేయరాదు' అని తలంచి నిష్కామకర్మావలంబులై, చిత్తశుద్ధిని బడసి పరమశ్రేయము నొందగలరు. 'యథా రాజా తథా ప్రజాః' - అను ఆర్యోక్తి ననుసరించి తాను అకర్మణ్యుడై యున్న యెడల తక్కినజనులున్ను ఏ కర్మచేయక ఊరక నుండి క్రమముగ కర్మభ్రష్టులైపోవుదురు. కాబట్టి లోకక్షేమదృష్టిని విచారించియైనను పెద్దలు సత్కర్మల నాచరింపవలసియే యున్నారు.

మఱియు పెద్దవారు తాము దేనిని ప్రమాణముగ గైకొందురో, ఇతురులున్ను దానినే ప్రమాణముగ తీసికొందురు. ఏ వాక్యమును, ఏ సిద్ధాంతమును, ఏ పద్ధతిని, ఏ శాస్త్రమును వారాదరించుదురో తక్కిన ప్రజలున్ను దానినే స్వీకరించి యాదరించుదురు. ఈ ప్రకారముగ సత్యసిద్ధాంతము, శాస్త్రనియతక్రమము విరివిగ ప్రచారమగుటయేకాక ఎందఱో వాని ననుష్ఠించుటద్వారా మోక్షభాగులు కాగలరు. కాబట్టి పెద్దలు మహోన్నత ధర్మములను మున్ముందు తామాచరించి లోకమునకు జూపుట అత్యావశ్యకమని భగవాను డిచట బోధించుచున్నారు.

"ఆచరతి" - ఈ శ్లోకమున శ్రీకృష్ణపరమాత్మ ఆచరణకు ఎక్కువ ప్రాధాన్య మొసంగిరే కాని 'వాచా' జ్ఞానమునకు గాదు. ఈ విషయమును సాధకులు బాగుగ గమనింపదగియున్నది. ఆచరణ, అనుష్ఠానము లేని ఒట్టి వాక్యములచే ప్రయోజనము లేదు. కావున ముందు తాను చేసిచూపవలెనని భగవదాదేశమై యున్నది. అపుడే జనులకు వానిపైగాని, శాస్త్రవాక్యములపైగాని విశ్వాసమేర్పడగలదు.

**అ॥** ఇక మూడు శ్లోకములందు కర్మయోగావశ్యకతను స్వకీయదృష్టాంతము ద్వారా పరిపోషించుచున్నాడు -

## 22. న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన
## నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి.

**టీక:–** *పార్థ* = ఓ అర్జునా!, *మే* = నాకు, *త్రిషు లోకేషు* = మూడులోకములందును, *కర్తవ్యమ్* = చేయదగినకార్యము, *కించన* = ఒకింతైనను, *న అస్తి* = లేదు. *అనవాప్తమ్* = పొందబడనిదియు, *అవాప్తవ్యమ్* = పొందవలసినదియు (అగు వస్తువేదియు), *న* = లేదు, *(తథాపి) చ* = అయినను, *కర్మణి* = కర్మయందు, *వర్తఏవ* = ప్రవర్తించుచునేయున్నాను.

**తా:–** అర్జునా! నా కీ మూడులోకములందును చేయదగిన కార్య మేదియును లేదు. మఱియు పొందబడనిదియు, పొందదగినదియునగు వస్తువున్ను ఏదియు లేదు. అయినను నేను కర్మయందు ప్రవర్తించుచునేయున్నాను.

**వ్యాఖ్య:–** శ్రీకృష్ణమూర్తి సాక్షాత్ పరమేశ్వరుడే కనుక లోకములన్నియు వారి కుక్షియందే వెలయుచుండును. అట్టితఱి ఇక ఆ యా లోకములందు వారికి చేయదగిన కార్యముగాని, పొందవలసినవస్తువుగాని యెట్లుండగలదు? అయినప్పటికిని కరుణామయులు కనుక భక్తసంతరణార్థము అవతారములెత్తి ప్రజోపకృతికై కర్మలను చేయుచునే యున్నారు. వాస్తవముగ నిరాకారుడైనను

సాకారరూపమును ధరించి, ప్రజలలో కలిసిమెలసి, వారికి ధర్మములను తత్త్వరహస్యములను బోధించి, ముక్తిమార్గమును జనులకు కరతలామలక మొనర్చుచున్నారు. సాక్షాత్ భగవానుడే ఈ ప్రకారముగ కర్మల నాచరించుచుండ, ఇక సామాన్యజనులు ఆచరింపవలదా? జీవన్ముక్తులైనప్పటికిని, తత్త్వానుభూతిని తాము బడసినప్పటికిని, అనేకులు భగవానుని ఈ ఆదర్శమునే గైకొని లోకసంగ్రహార్థము పెక్కుకార్యముల నాచరించుచునేయున్నారు. కాబట్టి ఇక సామాన్యులైనవారు, సాధకులు, ముముక్షువులు అకర్మణ్యత్వమును పారద్రోలి ఆత్మోద్ధరణకొఱకై నిష్కామముగ, అనాసక్తముగ కర్మలను తప్పక ఆచరించవలయును. దానిచే వారికి పరమశ్రేయము కలుగగలదు.

## 23. యది హ్యాహం న వర్తేయం జాతు కర్మణ్యతన్ద్రితః
## మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః.

**టీక:–** పార్థ = ఓ అర్జునా!, హి = ఏలయనగా, అహమ్ = నేను, జాతు = ఎప్పుడును, అతన్ద్రితః *(సన్)* = జాగరూకుడనై, *కర్మణి* = కర్మయందు, *న వర్తేయం యది* = ప్రవర్తింపక పోతినేని, *మనుష్యాః* = మనుష్యులు, *సర్వశః* = అన్ని విధముల, *మమ* = నా యొక్క, *వర్త్మ* = మార్గమునే, *అనువర్తన్తే* = అనుసరించి వర్తించుదురు.

**తా:–** అర్జునా! ఏలయనగా, నేనెల్లప్పుడును జాగరూకుడనై కర్మయందు ప్రవర్తింపక పోయినచో, మనుష్యులు సర్వవిధముల నా యొక్క ఆ మార్గమునే అనుసరించి వర్తించుదురు.

**వ్యాఖ్య:–** "అతన్ద్రితః" – 'తంద్రత' అనగా సోమరితనము, అలసత, మత్తు. అట్టి సోమరితనములేని స్థితియే అతంద్రత; జాగరూకతయని భావము. శ్రీకృష్ణపరమాత్మ తనకేమియు కర్మచేయవలసిన అవసరము లేకున్నను మహాజాగరూకుడనై కర్మలను చేయుచున్నానని చెప్పిరి. ఏలననిన, తాను కర్మలను మానివేసినచో తక్కినవారున్ను మానివేసి అధఃపతనము నొందుదురని వారి భావము. ఆ విషయమునే ఈ శ్లోకమందాతడు వ్యక్తము చేసిరి. కనుకనే మహనీయులు, ఆదర్శమూర్తులు, మహాప్రవక్తలు తమ తమ కర్మాచరణ విషయమున, ధర్మప్రవర్తనవిషయమున అత్యంతజాగరూకులై వర్తించిరి; వర్తించుచున్నారుకూడను. చరిత్రయే ఇందులకు ప్రబల నిదర్శనము.

మఱియు, 'అతన్ద్రితః' అను పదప్రయోగముచే ముముక్షువులు తమ సాధనలందు కడుసావధానముగ నుండవలెనని హెచ్చరిక చేయబడుచున్నది. ఏ కర్తవ్యము లేని భగవానుడే తన యాచరణవిషయమున ఇంత అప్రమత్తులై యుండ, ఇక సంసార బంధవిచ్ఛిత్తి కొఱకై ఎంతయో కర్మ, సాధన చేయవలసియున్న సామాన్యజనులు ఎంత జాగరూకతతో కర్మనాచరించవలయునో ఊహించుకొనవచ్చును. సాధనయందు తంద్రత పనికిరాదు. ఎందుకనగా, అజాగ్రతగనున్నచో ఎటువంటి మేధావినిగూడ మాయపడగొట్టగలదు. ఇంద్రియములు మహాప్రబలమైనవి. కాబట్టి అహర్నిశము వానిదెబ్బను ముముక్షువు కాచుకొనియుండ వలెను. ఎంతయో వివేకము, ఎంతయో జాగరూకత, ఎంతయో భగవత్కరుణ ఈ సందర్భమున ఆవశ్యకములైయున్నవి. రాత్రి మెయిలుబండి నడుపు డ్రైవరు ఎంత అప్రమత్తుడై యుండును, ఏ కొంచెము అజాగ్రత ఆతని పక్షమున సంభవించినను జనులందఱికిని ఘోరవిపత్తు ఎట్లు వాటిల్లునో, అట్లే ముముక్షువులున్ను తమ ఆధ్యాత్మిక సాధనలందు సోమరితనము వహించినచో గొప్ప పతనము చేకూరగలదు. 'జాతు' అని ప్రయోగించినందువలన భగవానుడు తానాచరించు కర్మల విషయమై ఏ కాలమందును

అజాగ్రత వహింపరని స్పష్ట మగుచున్నది. అన్నియు సాధించినవారే యిట్లుండ, ఇక ఏదియు సాధించని సామాన్యజను లెట్లుండవలెను? నిరంతరము బహుజాగరూకులై యుండవలెనని భావము. కనుకనే శాస్త్రములు "ప్రమాదో వై మృత్యుః" (ప్రమత్తత, అజాగ్రత చావుతో సమానము) అని ఘోషించుచున్నవి. శ్రీశంకరభగవత్పాదులున్ను ఈ విషయమున గొప్పహెచ్చరిక చేసియుండిరి★. కాబట్టి సాధకులు భగవానుడు తెలిపిన ఈ 'అతన్ద్రితః' అను పదమును మఱల మఱల జ్ఞాపకము చేసికొనుచు అప్రమత్తులై తమసాధనను కొనసాగించవలెను.

## 24. ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మచేదహమ్
## సంకరస్య చ కర్తా స్యాముపహన్యామిమాః ప్రజాః.

**టీక:–** *అహమ్* = నేను, *కర్మ* = కర్మను, *నకుర్యాంచేత్* = చేయకుందునేని, *ఇమేలోకాః* = ఈ ప్రజలు, *ఉత్సీదేయుః* = భ్రష్టులగుదురు, *సంకరస్య చ* = సంకరమునకును, *కర్తా* = కర్తను, *స్యామ్* = అగుదును, *ఇమాః ప్రజాః* = ఈ ప్రజలను, *ఉపహన్యామ్* = చెడగొట్టినవాడనగుదును.

**తా:–** మఱియు, నేను కర్మను చేయకుందునేని ఈ ప్రజలు చెడిపోవుదురు. అత్తఱి సంఘమునం దేర్పడు సంకరమునకు నేనే కర్తనగుదును. కావున జనులను నేను చెడగొట్టినవాడనగుదును.

**వ్యాఖ్య:–** 'నేను కర్మల ననుష్ఠించనిచో, తక్కిన జనులున్ను అనుష్ఠింపరు. అత్తఱి సంఘమున అన్ని రంగములందును గొప్ప సంకరము (కలగలుపు), అశాంతి ఏర్పడును. ప్రజలు అన్యాయమును, అధర్మమును ఆశ్రయించుదురు. తత్ఫలితముగ ఉత్పాతములు, ఉపద్రవములు సంభవించును. ఇవ్విధముగ ప్రజలయొక్క వినాశమునకు నేను కారణభూతుడనగుదును. వారలను అన్ని విధముల చెడగొట్టినవాడనగుదును. కావున ప్రజల సంక్షేమముకొఱకు నేను కర్మను చేయుచునేయుందున'ని భగవానుడు కర్మయోగము యొక్క ఆవశ్యకతను నిరూపించుచున్నాడు. భగవంతునకు ప్రాణికోట్లయెడల నెంతటి కరుణగలదో, వారి శ్రేయము వారెంతగాఢముగ వాంఛించుచున్నారో ఈ శ్లోకములవలన వ్యక్తమగుచున్నది. ఇవ్విధముగ నితరులున్ను భగవానుని యడుగుజాడల నడచుచు కర్మను త్యజింపక లోకక్షేమమునకు హేతుభూతులు కావలయును.

**అ॥** లోకహితము కొఱకు జ్ఞానులగువారు అసక్తముగ కర్మల నాచరింపవలయునని యుద్బోధించుచున్నాడు –

## 25. సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత
## కుర్యాద్విద్వాం స్తథాఽసక్తశ్చికీర్షుర్లోకసఙ్గ్రహమ్.

**టీక:–** *భారత* = ఓ అర్జునా! *అవిద్వాంసః* = అజ్ఞానులు, *కర్మణి* = కర్మయందు, *సక్తాః* = తగుల్కొని (ఫలాపేక్షగలవారై), *యథా* = ఏ ప్రకారము, *కుర్వన్తి* = చేయుచున్నారో, *తథా* = ఆప్రకారమే, *విద్వాన్* =

★ ప్రమాదో బ్రహ్మ నిష్ఠాయాం న కర్తవ్యః కదాచన
ప్రమాదో మృత్యురిత్యాహ భగవాన్ బ్రహ్మణస్సుతః (వివేకచూడామణి 322)
బ్రహ్మనిష్ఠయందు సోమరితనము (అజాగ్రత) ఎపుడును పనికిరాదు. అట్టి సోమరితనము మృత్యువుతో సమానమని భగవంతుడగు సనత్కుమారుడు చెప్పెను.

జ్ఞాని, అసక్తః = తగుల్కొనక (ఫలాసక్తి లేనివాడై), లోకసంగ్రహమ్ = లోకకల్యాణమును, చికీర్షుః = నెఱవేర్పదలంపుగలవాడై, (కర్మాణి = కర్మలను) కుర్యాత్ = చేయవలెను.

**తా:–** ఓ అర్జునా! అజ్ఞానులు కర్మలందు తగుల్కొని ఫలాపేక్షతో నేప్రకారము చేయుచున్నారో, అప్రకారమే జ్ఞానులు వానియందు తగుల్కొనక ఫలాసక్తిరహితులై లోకకల్యాణమునిమిత్తము కార్యముల నాచరించవలెను.

**వ్యాఖ్య:–** అజ్ఞానులు, జ్ఞానులు ఇరువురును కర్మచేయుదురు. కాని అజ్ఞానులు ఫలాసక్తితో చేయుదురు. జ్ఞానులు ఫలాసక్తిరహితులై చేయుదురు. ఒకరు కర్మయందు తగుల్కొని కర్తృత్వబుద్ధితో నాచరించుదురు. మఱియొకరు తగుల్కొనక కర్తృత్వరహితులై యాచరించుదురు. అజ్ఞానులు స్వార్థముకొఱకు కర్మచేయుదురు. జ్ఞానులు లోకక్షేమము నిమిత్తము చేయుదురు. కర్మలను చేయుట ఇరువురికిని సమానమే. కాని పద్ధతిలో మాత్రము భేదము కలదు. ఒకరు కర్మలలో అంటుకొని పోవుదురు (సక్తులు). మఱియొకరు అంటక నుందురు (అసక్తులు). మొదటివారికి కర్మబంధమును గలిగించును. రెండవవారికి అదియేకర్మ ముక్తిని ప్రసాదించును. ఒకే కత్తి తెలియకవాడినచో కీడుచేయును; తెలిసివాడినచో మేలు చేయును. ఒకే అగ్ని తెలియకవాడినచో శరీరమును కాల్చును. తెలిసి వాడినచో వంటకము తయారుచేయును. అట్లే కర్మ ఒక గొప్ప ఆయుధమువంటిది. దానిని పట్టుకొనుట, ఉపయోగించుట ముందుగా పెద్దలయొద్ద నేర్చుకొనవలెను. అపుడే అయ్యది సంసారబంధవిముక్తి యను లక్ష్యమును సాధించగలదు. కర్మయను ఈ గొప్ప ఆయుధము నెట్లుపయోగించవలెనో, ప్రయోగించవలెనో గీతయందచటచట భగవానుడు అందఱికిని తేటతెల్లముగ నేర్పుచున్నారు. 'కర్మయను ఆయుధమును మూల పెట్టవలదు (మాతే సఙ్గోఽస్త్వకర్మణి); దానిని వాడుకొనుడు; కాని తెలిసి వాడుడు!, ప్రయోగమును నేర్చుకొని వాడుడు!' అని హెచ్చరించుచున్నారు. ఈ శ్లోకమునం దాప్రయోగమెట్టిదో చక్కగ వివరింపబడినది. అనాసక్తముగ కర్మలను జేయుటయే ఆ ప్రయోగపద్ధతి.

"చికీర్షు ర్లోకసఙ్గ్రహమ్" – అను పదమువలన లోకహితమునందు భగవానున కెంత ప్రీతియో విదితమగు చున్నది. భగవత్ప్రీతికరమైన అట్టి లోకకల్యాణమును సాధించుట వివేకవంతుని విధ్యుక్తధర్మము. తాపత్రయాగ్నిచే సంతప్తులగు ప్రాణికోట్లను తరింప జేయుటకు ఏ ఒకింత సహాయమొనగూర్చినను అది చాల గొప్పదే యగును. కావున విద్వాంసుడగువాడు (జ్ఞాని) అనాసక్త కర్మాచరణద్వారా లోకహితమును సాధించ వలెనని భగవాను డీశ్లోకమున ఆదేశించుచున్నారు. వారిని జూచి తక్కినవారున్ను నిష్కామమార్గము నవలంబించి తరించుటకు వీలుండును.

"భారత" – అను పదముచే అర్జునుని అపుడపుడు సంబోధించుచు భగవాను డతని యుత్సాహమును రేకెత్తించు చున్నారు. ఆ పదమునకు 'భరతవంశమున జన్మించినట్టి' అను అర్థమున్నప్పటికిని ఇంకొక చక్కని అర్థమున్ను గలదు. (భా = ప్రకాశము, రతః = ఆసక్తికలవాడు) ప్రకాశమునం దాసక్తి కలవాడు భారతుడు. 'ఓ అర్జునా! లెమ్ము! అజ్ఞానాంధకారమును పోగొట్టుకొని జ్ఞానదీప్తియందు నిరతుడవుకమ్ము!' అని బోధించుట యగును.

ప్ర:– వివేకవంతుడు కర్మల నేప్రకారము చేయవలెను?

ఉ:– అసక్తుడై (ఫలాసక్తిరహితుడై) చేయవలెను.

ప్ర:– ఎందులకు?

ఉ:– లోకక్షేమముకొఱకు.

**26. న బుద్ధిభేదం జనయేదజ్ఞానాం కర్మసఙ్గినామ్
జోషయేత్సర్వకర్మాణి విద్వాన్యుక్తః సమాచరన్.**

**టీక:–** విద్వాన్ = జ్ఞాని, కర్మసఙ్గినామ్ = కర్మమునందాసక్తి గల, అజ్ఞానామ్ = అజ్ఞానులకు, బుద్ధిభేదమ్ = (ఫలాసక్తితో కర్మల నాచరించెడు) బుద్ధికి చలనమును, న జనయేత్ = పుట్టింపగూడదు, సర్వకర్మాణి = సమస్తకర్మలను, (స్వయం) యుక్తఃసమాచరన్ = (తాను) యోగయుక్తుడై (ఆత్మయందు స్థితుడై) నేర్పుతో నాచరించుచు, జోషయేత్ = (వారలచే) చేయించవలెను.

**తా:–** జ్ఞానియగువాడు కర్మఫలాసక్తులగు అజ్ఞానుల యొక్క బుద్ధిని కదలించరాదు. తాను యోగయుక్తుడై నేర్పుతో సమస్తకర్మల నాచరించుచు, తనయాచరణను జూచి వారున్ను అ ప్రకార మనుష్ఠించునట్లు చేయవలెను.

**వ్యాఖ్య:–** కర్మమందు తగుల్కొని ఫలాపేక్షతో కర్మల నాచరించువారి బుద్ధిని జ్ఞాని తన మౌఖికబోధలచే చపల మొనర్పక, తన నిర్మలయాచరణచే వారలను తన మార్గమునకు త్రిప్పుకొనవలెనని చెప్పబడినది. లోకములో కొందఱు నిష్కామకర్మ తత్త్వము తెలియక ఏదియో కొంత విశ్వాసముతో, శ్రద్ధతో ఫలాసక్తి యుతముగ కర్మలను చేయుచుందురు. అట్టివారికి 'మీరు చేయునది తప్పు, ఈ ప్రకారముగ చేయవద్దు, వేఱొక దారి కలదు.' అని బోధించినచో యథార్థమును గ్రహించువారు చాల అరుదుగా నుందురు. కావున అట్టి బోధలచే వారిలో కొందఱు అసలే వదలివేయు ప్రమాదము కలదు. దానివలన వారు ఉభయభ్రష్టులై ఘోరతమస్సునందు పడిపోవుదురు. కాబట్టి అట్టివారిని ఏమియు కదలించక, తానుమాత్రము ఆత్మస్థితుడై, ఇంద్రియనిగ్రహపరుడై అనాసక్తముగ కర్మల నాచరించుచుండినచో, ఆ నిర్మల యనుష్ఠానమును, ఆత్మశాంతిరూపమగు దాని ప్రత్యక్షఫలితమును వారు నేరులో చూచి గ్రహించి, తమ చిత్తములనుగూడ మార్చుకొని కాలక్రమమున నిష్కామకర్మాచరణపరులై మెలంగగలరు. ఇదియే ఈ శ్లోకమున తెలుపబడిన భావము.

మౌఖికబోధలకంటె అనుష్ఠానముద్వారా చేయు బోధ మహాపటుత్వము గలిగి యుండునని ఈ శ్లోకముద్వారా వ్యక్తమగు చున్నది. సభావేదికలపై చేయు ఉపన్యాసముల (Platform speeches) కంటె నిరాడంబరముగ ఏకాంతముగ గావింపబడు నిష్కామ పవిత్రానుష్ఠానమే (Silent unselfish work) పటుతరమైనదని దీనివలన స్పష్టమగుచున్నది. మఱియు హేతువాదము నర్థించు ఈ విజ్ఞానయుగమున 'వాచా' బోధలచే ఒకరిని మెప్పించుటగాని, మార్చగల్గుటగాని చాల కష్టము, తనయొక్క శుద్ధమైన అనుష్ఠానముచే ఎందఱి జనులనైన మార్చవచ్చును. అపుడే జనులకు వారి బోధలపై నమ్మకమేర్పడ గలదు.

"యుక్తః సమాచరన్" - అని చెప్పుటవలన తాను యోగయుక్తుడై, ఆత్మయందు నిలుకడగలిగి, నిష్కామబుద్ధితో కర్మలను ఆచరించుచుండవలెనని గ్రహింపనగును. 'ఆచరన్' అని చెప్పక 'సమాచరన్' అని చెప్పుటచే పవిత్రమగు అనుష్ఠానము గలిగియుండవలెనని బోధపడుచున్నది.

**ప్ర:–** అజ్ఞానుల కేప్రకారము బోధించవలెను?

**ఉ:–** తాను నిర్మలమగు ఆచరణగలిగి, అనాసక్తుడై కర్మలనాచరించుచు, దానినిచూచి వారు నేర్చుకొనులాగున ప్రవర్తించుటయే వారియెడల గావించు ఉత్తమబోధ.

**అ॥** జ్ఞానికిని, కర్మఫలాసక్తుడగు అజ్ఞానికిని గల భేదమును రెండుశ్లోకముల ద్వారా తెలుపుచున్నాడు

## 27. ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః
## అహంకార విమూఢాత్మా కర్తాహమితి మన్యతే.

**టీక:–** ప్రకృతేః = ప్రకృతియొక్క, గుణైః = గుణములచేత, సర్వశః = నానావిధములుగ, క్రియమాణాని = చేయబడుచున్న, కర్మాణి = కర్మములను, అహంకార విమూఢాత్మా = అహంకారముచే వివేకశూన్యమైన మనస్సు గలవాడు, అహం = నేను, కర్తా = చేయువాడను, ఇతి = అని, మన్యతే = తలంచుచున్నాడు.

**తా:–** ప్రకృతివలన బుట్టిన సత్త్వరజస్తమోగుణముల చేతనే సమస్తకార్యములు జరుగుచుండగా, అహంకారముచే వివేక శూన్యమైన మనస్సుగలవాడు తానే చేయుచున్నానని తలంచుచున్నాడు.

**వ్యాఖ్య:–** ప్రకృతివలన బుట్టిన సత్త్వరజస్తమోగుణములే 'మనోబుద్ధిచిత్తాహంకారములు, సూక్ష్మపంచభూతములు, కర్మేంద్రియ జ్ఞానేంద్రియములు, శబ్దాదివిషయములు' – అను ఇరువదినాలుగు తత్త్వములుగ మార్పునొందినవి. కాబట్టి ఈ దృశ్యప్రపంచము, దేహము, మనోబుద్ధ్యాదులు సమస్తము ప్రకృతిజన్యమే అయియున్నది. ప్రకృతివలన కలిగిన ఈ దేహేంద్రియాదిరూప ఉపాధిచేతనే సమస్త కర్మలు చేయబడుచున్నవి. కాని వానికి సాక్షియగు ఆత్మచేతగాదు. తాను వాస్తవముగ ఆత్మస్వరూపుడు. ఆ ఉపాధికి, దేహేంద్రియమనంబులకు సాక్షి. కావున యథార్థముగ తానేకర్మయు చేయుటలేదు. ప్రకృతియే అంతయు జరుపుచున్నది. దేహేంద్రియ మానసాదుల సంయోగ మగు ఉపాధియే ఆ యా కార్యములనన్నింటిని చేయుచున్నది. కాని దేహాదులం దభిమానముగల అవివేకి 'నేను చేయుచున్నాను, నేనే కర్తను' అని తలంచుచున్నాడు. దేహాహంభావముచే నతని మనస్సు వివేకమును గోల్పోయి ఆత్మానాత్మతత్త్వశూన్యమై యుండుటచే కర్తృత్వమును తనపై ఊరకవేసికొనుచున్నాడు. తత్ఫలితముగ అనేక జన్మలను, దుఃఖములను అనుభవించుచున్నాడు.

జ్ఞానికిని అజ్ఞానికిని భేద మిచటనేయున్నది. అజ్ఞాని ఉపాధితో తాదాత్మ్యమొంది కర్తృత్వభోక్తృత్వములను తనపై ఆరోపించుకొని బాధనొందుచున్నాడు. జ్ఞాని ఉపాధిని తననుండి వేఱుచేసికొని, తాను ఆత్మయేకాని ఉపాధికాదని తలంచి, అద్దానిని సాక్షీభూతముగ వీక్షించుచు కర్తృత్వాదులులేనివాడై, పరమానంద మనుభవించుచున్నాడు. దుఃఖము దుఃఖరాహిత్యము కర్తృత్వ, అకర్తృత్వాదులపై ఆధారపడియుండును. అజ్ఞానికి అనంత దుఃఖము, జ్ఞానికి అనంతానందము కలుగుట కిదియే కారణము. కావున విజ్ఞుడగువాడు ప్రకృతిచేయుదానిని తనపై ఆరోపించుకొనక కర్తృత్వరహితుడై తన సత్యస్వరూపమగు ఆత్మయందే స్థితుడై యుండవలెను.

"అహంకార విమూఢాత్మా" – అను పదమువలన అహంకారము జీవున కెంతటి చేటు తెచ్చునో వెల్లడియగుచున్నది. అహంకారము వివేకమును రూపుమాపి విమూఢత్వమును దరికి జేర్చును. కాబట్టి దేహాదులందు అహంభావ మెన్నటికిని గలిగి యుండరాదు. ఆత్మయందే 'నేన'ను భావము కలిగియుం డవలెను. (అహం బ్రహ్మాఽస్మి).

**ప్ర:–** ప్రపంచములోని సమస్తకర్మలు దేనిచే చేయబడుచున్నవి?

**ఉ:-** ప్రకృతిచే (ప్రకృతిజన్యములగు గుణములచే).

**ప్ర:-** కాని అహంకారముగల మనుజు డేమని తలంచుచున్నాడు?

**ఉ:-** తానే కర్తనని తలంచుచున్నాడు.

**ప్ర:-** ఫలితమేమి?

**ఉ:-** తత్ఫలితముగ జన్మపరంపరలను, దుఃఖమును అనుభవించుచున్నాడు. కాబట్టి తానాత్మస్వరూపుడని, కర్త కాదని తలంచి దుఃఖరహితుడై బ్రహ్మానందము నొందవలయును.

**28. తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః**
**గుణా గుణేషు వర్తన్త ఇతి మత్వా న సజ్జతే.**

**టీక:-** మహాబాహో = గొప్పబాహువులుకల ఓ అర్జునా!, *గుణకర్మవిభాగయోః* = గుణములయొక్కయు, కర్మలయొక్కయు విభజననుగూర్చిన, తత్త్వవిత్తు = యథార్థమును తెలిసినవాడు, *గుణాః* = (ఇంద్రియాదులను) గుణములు, *గుణేషు* = (శబ్దాది విషయములను) గుణముల యందు, వర్తన్తే = ప్రవర్తించుచున్నవి, ఇతి = అని, మత్వా = తలచి, న సజ్జతే = సంగను (అభిమానము) కలిగియుండడు.

**తా:-** గొప్పబాహువులుగల ఓ అర్జునా! గుణముల యొక్కయు, కర్మలయొక్కయు విభజననుగూర్చిన యథార్థ మెఱిగిన జ్ఞాని గుణములు (ఇంద్రియాదులు) గుణములందు (శబ్దాదివిషయములందు) ప్రవర్తించుచున్నవని, (ఆత్మస్వరూపుడగు తనకు వాస్తవముగ వానితో ఏ సంబంధమున్ను లేదని) తలంచి కర్మలందు సంగము (అభిమానము) లేకుండును.

**వ్యాఖ్య:-** ప్రపంచమున, దేహమునగూడ ఆత్మ, అనాత్మ, దృక్కు, దృశ్యము కలిసియున్నవి. ఆ రెండిటిని విడదీయవలెను. తత్త్వవేత్త వానిని విభజించగలడు. అట్లు విభజింప శక్తిగలవానినే తత్త్వవేత్తయందురు. 'తం స్వాచ్ఛరీరాత్ప్రవృహేన్ముఞ్జాదివేషీకాం ధైర్యేణ' అను కఠోపనిషద్వాక్యరీతిగా ముంజగడ్డినుండి దర్భను వేఱుపరచునట్లు, బియ్యములోనుండి మట్టిగడ్డలను వేఱుపరచునట్లు ఆత్మానాత్మల సంఘాతమునుండి అనాత్మను వేఱుచేయ వలెను. అట్లు వేఱుపరచి జ్ఞానియగువాడు ప్రపంచమునందలి, తన దేహమునందలి సమస్తకార్యములు ఆ అనాత్మచే ప్రకృతిచే చేయబడుచున్నట్లు వీక్షించును. ఆ యా గుణములు తత్తద్గుణ సంబంధములైన కార్యములందు ప్రవర్తించుచున్నవేకాని ఆత్మయగు తనకు వానితో నేలాటి సంబంధములేదని గ్రహించును. అట్లు గ్రహించినవాడై ఆ ప్రకృతితో (దృశ్యముతో) సంగము, అభిమానము లేకుండును. అసక్తుడైయుండును. ప్రపంచమున సంచరించుచున్నను తామరాకుపై నీటిబిందువువలె నిర్లేపముగ నుండును, 'న సజ్జతే' - అంటుకొనడు.

జడమై, స్వప్నతుల్యమైనట్టి దృశ్యముతో చైతన్యవంతుడగు జ్ఞాని ఎట్లు సక్తుడు కాగలడు? చిలికిన వెన్నముద్ద మజ్జిగయం దెట్లు మునుంగక, మజ్జిగతో సంబంధములేక వేఱుగనుండునో, తత్త్వవేత్తయు దృశ్యముతో నంటక వేఱుగనుండును. కావున ఆ యా దృశ్యసంబంధములైన సుఖదుఃఖము లాతనికి

అంటకనుండును. దుఃఖమునకు కారణము (ప్రకృతి) సంగమే. సంగరాహిత్యమే మోక్షము. 'దృగ్దృశ్యసంయోగోహేయ హేతుః' - (దృక్కు దృశ్యముల కలయికను విడనాడవలెను) - అని పతంజలి మహర్షియు నుడివియున్నాడు. ఈ ప్రకారమగు ఆత్మానాత్మ విచారణ లేనివాడు సంసారమున మునుంగును. ఏలయనగా నతడు దేహమే తానని, ఇంద్రియములే తానని, మనస్సే తానని భావించి, వానియం దభిమానముంచి, ఆ యా ఇంద్రియ కృతకార్యములను తానే చేసితినని తలంచుచు మోహమొందుచున్నాడు. కాబట్టి అనాత్మ (దృశ్య) వస్తువులగు దేహేంద్రియాదులపై అభిమానమును వీడి ఆత్మయందే నిలుకడ గలిగియుండవలెను. దుఃఖవిముక్తికి ఇదియొకటియే ఉపాయము. సంసారచక్రము నుండి తప్పించుకొనుటకిదియే కీలకము.

**ప్ర:-** తత్త్వవేత్త కర్మలం దెట్లు ప్రవర్తించును?

**ఉ:-** ఆత్మానాత్మ వివేకము కలవాడగుటచే నతడు "ఆ యా గుణములు ఆ యా కార్యములందు ప్రవర్తించుచున్నవే కాని ఆత్మయగు తానేమియు చేయుటలేద"ని నిశ్చయించి కార్యములందు సంగవర్జితుడై మెలగును.

**అ॥** ఆసక్తితో కర్మలనుజేయువారి చిత్తమును కదిలించ రాదనియు, తాను చక్కగ ననుష్ఠించి వారిని దారికి తీసికొనిరా వలయుననియు నిదివఱలో తెలిపిన భావమునే మరల నొక్కి చెప్పుచున్నాడు -

## 29. ప్రకృతేర్గుణసమ్మూఢాః సజ్జన్తే గుణకర్మసు
## తానకృత్స్నవిదో మన్దాన్కృత్స్నవిన్న విచాలయేత్.

**టీక:-** (యే = ఎవరు), ప్రకృతేః = ప్రకృతియొక్క, గుణసమ్మూఢాః = రాజసాది గుణములచే మోహపెట్టబడినవారై, గుణకర్మసు = గుణములయొక్క, (దేహేంద్రియమానసాదుల) కర్మలందు, సజ్జన్తే = ఆసక్తులగుచున్నారో, అకృత్స్నవిదః = అల్పజ్ఞులును, మన్దాన్ = మందమతులునగు, తాన్ = అట్టి కర్మసంగులను, కృత్స్నవిత్ = ఆత్మజ్ఞుడగు జ్ఞాని, న విచాలయేత్ = చలింపజేయగూడదు.

**తా:-** ప్రకృతియొక్క రాజసాదిగుణములచే మోహపెట్ట బడినవారై దేహేంద్రియాదుల యొక్క క్రియలందు ఆసక్తులై వర్తించు కర్మసంగులగు అల్పజ్ఞులను, మందమతులను ఆత్మజ్ఞుడగు జ్ఞాని చలింపజేయగూడదు. (కర్మలు మానునట్లు చేయరాదు.)

**వ్యాఖ్య:-** ఈ అధ్యాయమందలి 26వ శ్లోకమున చెప్పిన భావమునే జాగ్రత కొఱకు మరల చెప్పుచున్నారు - ఆత్మజ్ఞులగు మహనీయులు కర్మలం దాసక్తులైయున్నట్టి అనగా ఫలాదులను కోరుటద్వారా, కర్తృత్వబుద్ధి గలిగియుండుటద్వారా సక్తులై యున్నట్టి అజ్ఞానుల మనస్సును చెడగొట్టక, తమ ఉన్నతాచరణ ద్వారా వారిని గూడ తమదారికి మెల్లగ తీసికొనిరావలెను. తామాచరించి తమ నిష్కామాచరణచే క్రమముగ వారికి ప్రోత్సాహమును గలుగజేయవలెను. తమ సన్నిధియందున్న ఆ పెద్దల యొక్క నిష్కల్మషప్రవర్తనమును, నిస్సంగవ్యవహారమును జూచి వారున్ను క్రమముగ సన్మార్గగాములు కాగలరు.

"అకృత్స్నవిత్" - గుణకర్మములందు, దృశ్యపదార్థము లందు అభిమానము, సంగము కలవారిని

అల్పజ్ఞులని భగవానుడు పేర్కొనిరి. వారెంతటి ప్రాపంచిక విద్యావైదుష్యము కలిగియున్నను, గొప్పపండితులైనను ప్రకృతికి, ఇంద్రియ విషయములకు దాసులై యున్నారు. కనుక అల్పజ్ఞులే యగుదురు. మఱియు 'మన్దాన్' అని చెప్పుటచే వారు పెద్దలదృష్టిలో, భగవంతునిదృష్టిలో మందమతులే అయి యున్నారు. కావున గుణసంగమును, ప్రకృతిదాసత్వమునువీడి సర్వవేత్త (కృత్స్నవిత్) కావలెనేకాని, వాని నంటిపెట్టుకొని మందమతుడు (అకృత్స్నవిత్) అనిపించుకొనగూడదు.

"కృత్స్నవిత్" - దేనిని తెలిసికొనినచో సమస్తము తెలియబడినది యగుచున్నదో (యస్మిన్విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి) అట్టి ఆత్మను ఎఱుంగుటయే సర్వజ్ఞత్వము. దాని నెఱంగువాడే కృత్స్నవిదుడు. సమస్త బ్రహ్మాండములకును మూలాధారమైనట్టి బ్రహ్మ (ఆత్మ) వస్తువు నెఱింగినచో అంతయు తెలిసికొనబడినదియే యగును. కనుకనే మహనీయులగు ఋషులు, మునులు మొట్టమొదట తమహృదయమును శోధించుకొని, ఇంద్రియములను జయించి, ప్రకృతిని స్వాధీనపఱచుకొని, ఆత్మానుభవ మొందుటద్వారా సర్వజ్ఞులు (కృత్స్నవిదులు) కాగల్గిరి. అదియే జన్మసార్థకత్వమునకు ఏకైకమార్గము. శాంతికి సుఖమునకు ఉపాయము.

**ప్ర:**– ప్రకృతిగుణములకు దాసులై వర్తించు కర్మసంగు లెట్టివారు?.

**ఉ:**– అల్పజ్ఞులు, మందమతులు.

**ప్ర:**– అట్టివారిని జ్ఞాను లేమిచేయవలెను?

**ఉ:**– వారిబుద్ధిని చెడగొట్టకుండ స్వకీయ ఉత్తమాచరణ ద్వారా వారిని క్రమముగ తమదారికి తీసికొనిరావలెను.

**అ॥** ఈ అధ్యాయప్రారంభమునగల అర్జునుని ప్రశ్న ననుసరించి పరమశ్రేయమునకు మార్గమేదియో వచించుచున్నాడు -

## 30. మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మ చేతసా
## నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః.

**టీక:**– *సర్వాణి కర్మాణి* = సమస్తకర్మములను, *మయి* = నాయందు, *అధ్యాత్మచేతసా* = అధ్యాత్మ చిత్తముతో (ఆత్మయందు నెలకొనిన మనస్సుతో), *సన్న్యస్య* = సమర్పించి, *నిరాశీః* = ఆశలేనివాడవును, *నిర్మమః* = మమకారములేనివాడవును, *భూత్వా* = అయి, *విగతజ్వరః* = సంతాపరహితుడవై, *యుధ్యస్వ* = యుద్ధము చేయుము.

**తా:**– సమస్త కర్మములను నాయందు అధ్యాత్మచిత్తముతో సమర్పించి, ఆశగాని, మమకారముగాని లేనివాడవై, నిశ్చింతగ యుద్ధమును జేయుము.

**వ్యాఖ్య:**– "అధ్యాత్మచేతసా" - జనులలో చాలమంది యొక్క చిత్తము ప్రాపంచిక భావములతో, దృశ్యవికారములతో నిండియుండును. దైవమునకు, పరమాత్మకు అచటచోటు దొరకుట దుస్తరము. అది అధ్యాత్మచిత్తముకాదు. అది ప్రాపంచిక చిత్తము. ప్రతివాడును అధ్యాత్మ చిత్తము గలిగియుండవలెనని భగవంతు డానతిచ్చుచున్నారు. ఆత్మ జ్ఞానముచేతను, పరమార్థ చింతనలచేతను చిత్తము నిండియుండి

నిరతిశయభక్తిభావసమన్వితమై యుండవలెను. అదియే అధ్యాత్మచిత్తము. అట్టి పవిత్ర మానసముతో గూడుకొని సమస్త కర్మలను భగవదర్పణము గావింపవలెనని ఇట బోధింపబడినది. 'సర్వాణి కర్మాణి ' అని చెప్పుటవలన, ఒకటి రెండు కర్మలు కాదనియు, తాను చేయు సమస్తకార్యములను ఈశ్వరార్పణబుద్ధితో నాచరింపవలెనని విదితమగుచున్నది.

"నిరాశీః నిర్మమః" - ఆశ, మమకారము పారద్రోలవలెనని హెచ్చరింపబడినది. ఈ ప్రపంచమున భగవంతుడు (ఆత్మ) అను ఒక వస్తువుతప్ప విజ్ఞునకు వాంఛింపదగినది. మఱియొకటి యేదియునులేదు. ఆత్మ యొకటియే సత్యమైనది. దృశ్య ప్రపంచమంతయు దాని ప్రతిబింబరూపము, కల్పితము, నశ్వరము. అట్టి కల్పిత, మిథ్యాప్రపంచమున వివేకవంతుడగు వాడు ఏ పదార్థమందైన ఆశగాని, మమకారముగాని యెట్లుంచగలడు? కావున ఇట్టి విచారణద్వారా ఆశను, మమకారమును వెడలగొట్టి మనుజుడు అట్టి పవిత్ర భగవదర్పితచిత్తముతో తన విధ్యుక్తకర్మల నాచరించవలయునని అర్జునుని నెపమున లోకమునకంతకును బోధింపబడినది. అర్జునుడు క్షత్రియుడు కావున 'యుధ్యస్వ ' (యుద్ధము చేయుము) అని చెప్పబడినది. తక్కినవారలు వారివారి సాంప్రదాయోచితకార్యములను ఈశ్వరార్పణబుద్ధితో, పైనదెల్పిన అధ్యాత్మగుణములతో గూడి యాచరించవచ్చును. దీనినిబట్టి గృహస్థాశ్రమములో నున్నవారుకూడ తరించుటకు అవకాశ మేర్పడుచున్నది.

"విగతజ్వరః" - 'సంతాపరహితుడవై యుద్ధము చేయుము' అని భగవానుడు సెలవిచ్చెను. జ్వరములు రెండు రకములు (1) బాహ్య జ్వరము (2) అభ్యంతర జ్వరము. రెండును జీవుని బాధించుచున్నవి. అందు మొదటిదియగు బాహ్యజ్వరము అనగా శారీరకజ్వరము ఔషధాదులచే నివారిత మగుచున్నది. అభ్యంతరజ్వము, అనగా మానసికజ్వరము (భవరోగము, సంసారతాపము) చల్లారుటకు భగవాను డీశ్లోకమున చక్కని ఔషధములను నాల్గింటిని తెలియజేసిరి. అవి యేవియనిన -

(1) అధ్యాత్మచిత్తము గలిగియుండవలెను. (ఆత్మయందు, దైవమందు సంలగ్నమైన చిత్తముగలవారై యుండవలెనని భావము).

(2) అట్టి నిర్మలచిత్తముతో గూడుకొని సమస్తకర్మములను, వాని ఫలితములను భగవంతునకు అర్పణచేయవలెను.

(3) ఆశ వదలవలెను.

(4) మమకారము లేకుండవలెను.

ఈ నాలుగున్ను 'రామబాణ' దివ్యౌషధములు. భవరోగభేషజములు. వీనిని చక్కగ సేవించినచో మనుజుడు 'విగతజ్వరుడు' కాగలడు. 'గత' అని చెప్పక 'విగత ' అని చెప్పుటవలన జ్వరము పూర్తిగ తొలగగలదని అర్థము. ఎంతటి దేహారోగ్యము కలిగి యున్నప్పటికిని, జననమరణరూప ఘోరసంసారప్రవాహమున బడవేసి అనేక గర్భనరకములందు జీవుని త్రోసివేయునట్టి ఈ లోపలి జ్వరము అంతమొందనిచో మహా ప్రమాదము వాటిల్లును. కావున భగవానుడు తెలిపిన ఈ నాలుగు దివ్యౌషధములను లెస్సగ సేవించి విగతసంసారజ్వరుడై దైవార్పితచిత్తముతో ఆనందముగ తన కార్యములను చేయుచుండు లాగున శ్రీకృష్ణమూర్తి కరుణతో నిట బోధించుచున్నారు.

ప్ర:- పరమశ్రేయమునకు మార్గమేది?

**ఉ:-** అధ్యాత్మచిత్తముతో సమస్తకర్మములను భగవదర్పణముగావించి, ఆశామమకారవర్జితుడై నిస్సంతాపముగ స్వకీయకార్యముల నాచరించుటయే శ్రేయోమార్గము.

**అ॥** ఇట్టి మార్గము ననుసరించువారికి కలుగు ఫలితమును వివరించుచున్నాడు -

## 31. యే మే మతమిదం నిత్యమనుతిష్ఠన్తి మానవాః
## శ్రద్ధావన్తోఽనసూయన్తో ముచ్యన్తే తేఽపి కర్మభిః.

**టీక:-** యే మానవాః = ఏ మనుష్యులు, మే = నాయొక్క, ఇదంమతమ్ = ఈ యభిప్రాయమును, శ్రద్ధావన్తః = శ్రద్ధావంతులును, అనసూయన్తః = అసూయలేనివారును (అయి), నిత్యమ్ = ఎల్లప్పుడును, అనుతిష్ఠన్తి = అనుసరించు చున్నారో, తే అపి = వారుకూడా, కర్మభిః = కర్మలచేత, ముచ్యన్తే = విడువబడు చున్నారు.

**తా:-** ఏ మనుజులు శ్రద్ధావంతులై, అసూయలేనివారై ఈ నా అభిప్రాయముల నెల్లపుడును ఆచరణయందుంచుచున్నారో, వారున్ను కర్మబంధమునుండి విడివడుచున్నారు.

**వ్యాఖ్య:-** పైనదెల్పిన నిష్కామకర్మాచరణద్వారా మనుజుడు కర్మబంధమును త్రెంపి వేయగల్గుచున్నాడని చెప్పబడినది. దీనినిబట్టి సరిగా తెలిసికొని ఆచరించినచో కర్మయే కర్మను త్రుంచివేయగల్గుచున్నదని స్పష్టమగుచున్నది. కర్మయోగము ద్వారా కర్మ విముక్తుడు కాగల్గుచున్నాడు. అనగా అనాసక్త కర్మాచరణద్వారా కర్మయోగులు జ్ఞానయోగుల వలెనే కర్మబంధ విచ్ఛిత్తిని గలుగజేసికొనుచున్నారని భావము. (నిష్కామకర్మానుష్ఠానముచే చిత్తశుద్ధిగలుగ, దానిచే జ్ఞానమంకురింప విముక్తు లగుచున్నారు)

"నిత్యమ్" - అను చెప్పుటవలన ఏదియో ఒక సమయమున ఆ ప్రకారము వర్తించుట చాలదనియు, ప్రతిదినము వారు వారు చేయు సమస్తకార్యములను అనాసక్తముగ నాచరింపవలెననియు తెలుచున్నది. అయితే, అనుష్ఠించునపుడు రెండు సద్గుణములను ముఖ్యముగ నవలంబించియుండవలెను. అవియే శ్రద్ధ, అసూయారాహిత్యము. ఏ వస్తువునందుగాని, ఏ వాక్యమునందుగాని, ఏ వ్యక్తియందుగాని మనుజున కెంతెంత శ్రద్ధావిశ్వాసములుండునో అంతంత యధికఫలమును వానిద్వారా యతడు పొందగల్గును. అసూయ యనునది వేరుపురుగువంటిది. అది జీవుని శక్తిని తినివేయును. అధ్యాత్మరంగమున అది ప్రబల శత్రువు. సాధకుడు కష్టపడి సంపాదించిన సద్గుణముల నన్నింటిని తృటిలో నయ్యది బూడిదపాలుచేయును (క్షీరములో పడిన విషబిందువువలె). ఈ ప్రమాదమును కనిపెట్టి భగవానుడు సాధకలోకమునకు సకాలమున తగు హెచ్చరిక చేసిరి. శ్రద్ధ, అసూయ అను రెండు శస్త్రములను ధరించి - అనగా శ్రద్ధను ఆశ్రయించి, అసూయను పారద్రోలి కర్మక్షేత్రమున దుమికి అనాసక్తుడై నిరంతరము కర్మచేసినప్పటికిని మనుజుడు కర్మబంధమును ఏమాత్రమును పొందనేరడని ఇటవచింపబడినది. ఈ ప్రకారముగ కర్మ కర్మరాహిత్యమున కెట్లుపకరించగలదో ఇచట చక్కగ నిరూపింపబడినది. భగవదర్పితకర్మచే లేక ఫలాభిలాషా రహిత (అనాసక్త) కర్మచే కర్మయందలి బంధరూపమగు విషము హరించిపోయి కర్మ నైష్కర్మ్యముగ మారిపోవును.

"మానవాః" - అని చెప్పబడినందున ఈ పరమార్థసాధనలను జాతి మతకులభేదములేక సమస్తమానవులును ఆచరించి తరించవచ్చునని భావము.

"అపి" - అను పదప్రయోగమువలన - సామాన్యులు కూడ ఇట్టి పద్ధతిచే తరించిపోవుచుండ, ఇక అర్జునునకు అది సులభతరమని బోధించినట్లైనది.

**ప్ర:–** కర్మలనుండి యెవరు విముక్తులగుదురు?

**ఉ:–** భగవానుడు బోధించిన ఈ అనాసక్త కర్మయోగపద్ధతిని శ్రద్ధావంతులై, అసూయారహితులై, సత్యము శీలించువారు కర్మబంధవిక్తులగుదురు.

**అ॥** (నిష్కామయోగ) పద్ధతిని అనుష్ఠించనివారికి కలుగు హానిని వివరించుచున్నాడు -

## 32. యే త్వేతదభ్యసూయన్తో నానుతిష్ఠన్తి మే మతమ్
## సర్వజ్ఞానవిమూఢాంస్తాన్ విద్ధి నష్టానచేతసః.

**టీక:–** యేతు = ఎవరైతే, మే = నాయొక్క, ఏతత్ మతమ్ = ఈ యభిప్రాయమును, అభ్యసూయన్తః = ద్వేషించువారలై, న అనుతిష్ఠన్తి = అనుసరింపరో, తాన్ = వారిని, అచేతసః = బుద్ధిహీనులుగను, సర్వజ్ఞాన విమూఢాన్ = ఏవిధమగు జ్ఞానములేనివారలుగను, నష్టాన్ = చెడినవారలుగను, విద్ధి = ఎఱుంగుము.

**తా:–** ఎవరు నా యీ యభిప్రాయమును (అధ్యాత్మ మార్గమును, నిష్కామకర్మ యోగపద్ధతిని) ద్వేషించువారై యనుసరింపకనుందురో, అట్టివారిని బుద్ధిహీనులుగను, బొత్తిగ జ్ఞానములేనివారలుగను, చెడిపోయినవారలుగను నెఱుంగుము.

**వ్యాఖ్య:–** భగవత్ప్రోక్తమగు ఈ అనాసక్తకర్మయోగమును, దైవమార్గమును ద్వేషించువారు, ఆసక్తితో కర్మలుచేయుచు దృశ్యమందే రమించుచునుందురు. అట్టివారు కర్మబంధమున తప్పక తగుల్కొని జననమరణరూపమగు ఈ సంసారప్రవాహమున చిక్కుపడి నశించుదురు. వారు అటు బ్రహ్మమునుగాని, ఇటు కర్మమునుగాని తెలిసికొననివారై అవివేకమువలన వినాశమును జేబట్టుదురు. ప్రపంచజ్ఞానము లెన్ని కలిగియున్నను, మహాపండితుడైనను, భగవంతునియెడల భక్తిశ్రద్ధలు, నిష్కామ భావము, ఆత్మజ్ఞానము మున్నగునవి లేనిచో ఆతడు దైవదృష్టిలో సర్వజ్ఞానవిమూఢుడే యగును. బుద్ధియున్నను లేనివాడే యగును. (ఆ బుద్ధి నశ్వరదృశ్యవస్తువులందే మునుగుచుండును గనుక). అట్టివారి నొసట 'పతనము' అను పదము వ్రాయబడి యున్నదని ఈ శ్లోకమున స్పష్టముగ చెప్పివేయబడినది (నష్టాన్). కాబట్టి భగవదుక్తమార్గమునే చేబట్టి భక్తిశ్రద్ధలతో నిష్కామకర్మయోగాది పరమార్థతత్త్వముల నాశ్రయించుట, అనుష్ఠించుట శ్రేయస్కరము. లేకున్న మూడు గొప్ప అనర్థములు వాటిల్లగలవు. అవియే (1) సర్వజ్ఞానవిమూఢత్వము (2) బుద్ధివిహీనత్వము (3) వినాశము.

**ప్ర:–** భగవానుడు బోధించిన ఈ పరమార్థతత్త్వము ననుసరింపనివారికి, ద్వేషించువారికి కలుగు దుర్గతు లెవ్వియో వివరింపుడు.

**ఉ:–** (1) బొత్తిగా జ్ఞానములేకుండుట (2) బుద్ధిచెడిపోవుట (3) సంసారకూపమునబడి నశించిపోవుట.

**అ॥** ఈ ప్రకారముగ మనుజుడు తన విధ్యుక్తకర్మలను నిష్కామముగ నాచరింపక పైపెచ్చు కర్మలన్నిటిని త్యజించివేసి ఊరకనున్నచో కలుగు నష్టమేమి యనిన, వచించుచున్నాడు. -

## 33. సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్జ్ఞానవానపి
## ప్రకృతిం యాన్తి భూతాని నిగ్రహః కిం కరిష్యతి.

**టీక:–** జ్ఞానవాన్ అపి = జ్ఞానవంతుడైనను, స్వస్యాః = తనయొక్క, ప్రకృతేః = ప్రకృతికి (స్వభావమునకు), సదృశమ్ = అనుగుణముగనే, చేష్టతే = ప్రవర్తించుచున్నాడు, భూతాని = ప్రాణులు, ప్రకృతిమ్ = తమ స్వభావమును (ప్రకృతిని), యాన్తి = అనుసరించి నడచుచున్నవి, (కాబట్టి) నిగ్రహః = నిరోధము, కిం కరిష్యతి = ఏమి చేయగలదు?

**తా:–** జ్ఞానవంతుడైనను (శాస్త్రపాండిత్యము, లేక, లౌకిక జ్ఞానము కలవాడైనను) తన ప్రకృతికి (జన్మాంతర సంస్కారము వలన గలిగిన స్వభావమునకు) అనుగుణముగనే ప్రవర్తించుచున్నాడు. ప్రాణులు తమ ప్రకృతి ననుసరించియే నడుచుచున్నవి. కావున ఇక నిగ్రహ మేమిచేయగలదు?

**వ్యాఖ్య:–** ఇచట 'జ్ఞానవానపి' అను పదమునకు శాస్త్రపాండిత్యము, లౌకిక విద్యలు మాత్రము కలవాడని యర్థము. అనుభవముగల పూర్ణజ్ఞానికాదు. ఎంతటి మహాపండితుడైనను, శాస్త్రజ్ఞానము కలవాడైనను తన ప్రకృతికి, పూర్వజన్మసంస్కారమునకు అనుగుణ్యముగనే ప్రవర్తించుచున్నాడు. ఇక సామాన్యుల విషయమై వేఱుగ చెప్పవలెనా? అని భావము. ఇచ్చోట పూర్వ సంస్కారముయొక్క ప్రాబల్యమును వచించుటయే ప్రధానోద్దేశ్యము. అంతియేకాని నిగ్రహముయొక్క నిరుపయోగత్వము వివక్షితము కాదు. కాకున్న మఱుసటి శ్లోకములోనే "తయోర్న వశమాగచ్ఛేత్" ఇంద్రియములకు లోబడక వానిని నిగ్రహించ వలెను – అని యేల చెప్పవలసివచ్చును? గీతాశాస్త్ర ప్రారంభము నుండియు భగవానుడు 'దుష్టసంస్కారములను నిరోధించుడు, కామమును పారద్రోలుడు, క్రోధమును అరికట్టుడు, ఇంద్రియములను నిగ్రహించుడు' – అని నిట్టి ధోరణిలోనే బోధించుకొనుచువచ్చిరి. అట్టితఱి ఈ ఒక్కచోటమాత్రము నిగ్రహమువలన ప్రయోజనములేదని వచించుదురా? కాదు. జన్మాంతరవాసనలయొక్క, సంస్కారములయొక్క దృఢతరశక్తిని గూర్చి వర్ణించుచు నట్లు చెప్పవలసివచ్చినది. అంతియే.

**అ॥** ప్రతివాడును తన ప్రకృతి ననుసరించి వర్తించునో, ఇక కర్మబంధమునుండి విడివడుట కాతడేమి చేయవలెనను ప్రశ్నకు సమాధానమును చెప్పుచున్నాడు –

## 34. ఇన్ద్రియస్యేన్ద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ
## తయోర్న వశమాగచ్ఛేత్తౌ హ్యస్య పరిపన్థినౌ.

**టీక:–** ఇన్ద్రియస్య ఇన్ద్రియస్య = ప్రతి ఇంద్రియము యొక్క, అర్థే = విషయమందు, రాగద్వేషౌ = రాగము, ద్వేషము, వ్యవస్థితౌ = ఏర్పడియున్నవి, తయోః = ఆరాగద్వేషములకు, వశమ్ = అధీనమును, న ఆగచ్ఛేత్ = పొందగూడదు, తౌ = ఆ రాగద్వేషములు, అస్య = వీనికి, పరిపన్థినౌ హి = శత్రువులుగదా?

**తా:–** ప్రతి ఇంద్రియమునకును దాని దాని విషయమందు (శబ్దాదులందు) రాగద్వేషములు (ఇష్టానిష్టములు) ఏర్పడియున్నవి. ఆ రాగద్వేషములకు ఎవరును లోబడగూడదు. అవి మనుజునకు ప్రబలశత్రువులుగదా!

**వ్యాఖ్య:–** క్రిందటి శ్లోకములో వచించినట్లు మనుజుడు తన ప్రకృతికి అనుగుణ్యముగ వర్తించుట సహజమైనను పురుష ప్రయత్నబలముచే ప్రకృతిని జయించుటకు వీలుకలదను పరమసత్య మిచ్చోట చెప్పబడుచున్నది. ఇంద్రియములు శబ్దాది విషయములందు ఇష్టానిష్టములు (రాగద్వేషములు) కలిగి యున్నవి. అవి ముముక్షువునకు పరమశత్రువులు. అవి అనేక జన్మలనుండియు జీవుని హృదయక్షేత్రమును ఆక్రమించుకొని అధికారమును కొనసాగించుచున్నవి. ఇపుడు సద్గురూపదేశముచే ఆ శత్రువులను తరిమివేసి ఆత్మసామ్రాజ్యాధిపత్యమును తిరిగి సంపాదించుకొనుచున్నాడు. ఆత్మవిచారణ, భక్తి, వైరాగ్యము, నిష్కామకర్మాచరణ – మున్నగువానిద్వారా అక్కార్యమును సాధించవలెను. అట్లు సాధించువఱకు జీవునకు శాంతియుండదు. ఏలయనిన శత్రువు ఊరిలోనున్నచో ప్రమాదము; ఇంటిలో నున్నచో ఇంకను ప్రమాదము; హృదయములోనే యున్నచో ఎంతటి మహాప్రమాదమో, ఎంతటి అశాంతియో వేఱుగ చెప్పవలెనా? కావున ఆ రాగద్వేషాది అంతశ్శత్రువులకు లోబడక దైవిక పురుషప్రయత్నముచే వానినెట్లైన పరాజితమొనర్చి వేయవలెను.

పూర్వజన్మదుష్టసంస్కారము, ఇహజన్మపరమార్థయత్నము అను రెండును రెండు పొట్టేళ్ళవలె యుద్ధము చేసికొనుచున్నవి. అందేది బలవత్తరముగ నుండునో అదియే జయించును. కాబట్టి ఆధ్యాత్మిక పురుషప్రయత్నమును ద్విగుణీకృత మొనర్చి 'తయోర్న వశమాగచ్ఛేత్' అని భగవాను డాదేశించిన విధముగ, ఆ రాగద్వేషములకు తలయొగ్గక హృదయకుహరమునుండి వానిని దూరీకృతము చేసివేయవలెను. పూర్వజన్మ సంస్కారము బాగుగలేదే యని శోకించిన లాభములేదు. అది యెట్లైన నుండుగాక! 'పౌరుషేణ ప్రయత్నేన యోజనీయా శుభేపథి' – అని శ్రీవసిష్ఠమహర్షి పలికినట్లు ఇప్పటి పురుషప్రయత్నముచే ఆ పాతశక్తులను హతమార్చి మనస్సును శుద్ధమార్గమున ప్రవేశపెట్ట వచ్చును. శ్రీకృష్ణభగవానుడున్ను గీతయం దాప్రకారమే హెచ్చరిక చేయుచున్నారు. – 'ఓ జీవులారా! మీ మీ దుష్టసంస్కారములకు లోబడకుడు. ప్రయత్నపూర్వకముగ వానిని నిర్జించి ఆత్మ సామ్రాజ్యమును జేబట్టుడు!' భగవానుని ఈ యాదేశము నాలకించి ముముక్షువులెల్లరు తమ యంతఃశత్రువులగు రాగ ద్వేషాదులను జయించి పరమశాంతిని బడయుదురుగాక!

**ప్ర:–** ఇంద్రియముల స్వభావమేమి?

**ఉ:–** విషయములందు రాగము, ద్వేషము కలిగియుండుట.

**ప్ర:–** మోక్షాపేక్షగలవా డాచరించవలసిన విధానమేమి?

**ఉ:–** ఆ రాగద్వేషములకు లోబడక పురుషప్రయత్నముచే వానిని జయించివేయవలెను. అవి మనుజునకు ప్రబల శత్రువులు.

**అ||** స్వధర్మాచరణద్వారా అట్టి రాగద్వేషరహితస్థితికై యత్నింపవలెనని వచించుచున్నాడు –

## 35. శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్
## స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః.

**టీక:–** స్వనుష్ఠితాత్ = చక్కగా నాచరింపబడిన, పరధర్మాత్ = ఇతరుల ధర్మముకంటె, విగుణః =

గుణములేనిదైనను, స్వధర్మః = తన ధర్మమే, శ్రేయాన్ = శ్రేష్ఠమైనది, స్వధర్మే = తన ధర్మమందు, నిధనమ్ = మరణమైనను, శ్రేయః = శ్రేయస్కరము, పరధర్మః = ఇతరులధర్మము, భయావహః = భయమును గలుగజేయునది (అయియున్నది).

**తా:–** చక్కగ నాచరింపబడిన ఇతరుల ధర్మముకంటె గుణములేనిదైనను తన ధర్మమే శ్రేష్ఠమైనది. తన ధర్మమందు మరణమైనను శ్రేయస్కరమే యగును. ఇతరులధర్మము భయదాయకమైనది.

**వ్యాఖ్య:–** అర్జునుడు క్షత్రియుడు. కావున యుద్ధము చేయుట అతని ధర్మము. దానిని వదలివేసి మఱియొకని ధర్మమును స్వీకరించుట ఉత్తమముకాదు. స్వధర్మమగు యుద్ధమందు మరణించినను అతనికి శ్రేయమే (ఉత్తమలోకము) కలుగును. పరుల ధర్మము నాశ్రయించుట భయదాయకమైనది.

ఈ శ్లోకమునకు మఱియొక చక్కని యర్థము చెప్పవచ్చును. 'స్వధర్మః' = ఆత్మసంబంధమైన ధర్మము - ఆత్మప్రాప్తికి వలసిన సాధనములు. 'పరధర్మః' = దృశ్యసంబంధమైన ధర్మము - శబ్దాది విషయసౌఖ్యములు, ప్రాపంచిక భోగములు మొదలైనవి. ఆత్మప్రాప్తికై ఒనర్పబడు సాధనలు, వ్రతాదులు, ప్రారంభములో ఒకింత ప్రయాసకరములుగ తోచినను వానిని వదలరాదు. అట్లే విషయసౌఖ్య సాధనలు సులభముగ లభ్యమైనను వానిని చేబట్టరాదు. ఏలయనిన అవి జీవుని దైవవిముఖునిగజేసి నరకమున బడద్రోయును. కావున మహాభయప్రదమైనవి. అందుచే ముముక్షువు వాని జోలికిపోక, ఆత్మధర్మములందు, సదాచారములందు, వ్రతనిష్ఠాదులందు ప్రీతిని గొని వానినే యాశ్రయించవలెను. మాయ పలువిధముల జీవుని మోసగించును. పరమార్థసాధనలను ప్రారంభమున 'విగుణ'ముగ, ప్రయాసగ తోపింపజేయును. సంసార సౌఖ్యములను 'సుగుణ'ముగ సులభతరముగ తోపింపజేయును. సాధకు డివ్విషయమున కడుజాగరూకుడై యుండి కష్టముగా తోచినను తన పరమార్థసాధనను, వ్రతనిష్ఠను ఏమాత్రము సడలింపక జూడవలెను. ఒకవేళ స్వాత్మధర్మాచరణమందు, వ్రతపాలన మందు మధ్యలో చావు తటస్థించినను, అది శ్రేయస్కరమే యగును. బాధలు సంభవించినను అవి మంచికొఱకేయగును. అచంచలనిష్ఠతో ధైర్యముతో, పట్టుదలతో, తన యాత్మసాధనను కొనసాగించినచో అచిరకాలములో పరమానందరూపలక్ష్యమును బడయగల్గును. కావున ఎంత విగుణముగ తోచినను స్వాత్మధర్మమును విడనాడవలదనియు, ఎంత సుగుణముగ తోచినను దృశ్య ధర్మమును గ్రహించరాదనియు భగవానుడీ శ్లోకమున నుద్బోధించుచున్నారు. సాధనకాలమున ఇట్టి ధైర్యోత్పాదక వచనములను ముముక్షువు మరల మరల స్మరించుచు ముందుకు పోవలయును.

**ప్ర:–** స్వధర్మ, పరధర్మములలో ఏది శ్రేష్ఠమైనది? ఎందువలన?

**ఉ:–** కష్టముగా తోచినను స్వధర్మమే మేలైనది. సుఖముగా తోచినను పరధర్మము భయానకమైనది. స్వధర్మము ఉన్నతిని గలుగుజేయును. స్వధర్మపాలనమధ్యమున ఒకవేళ మరణము తటస్థించినను అది జీవునకు శ్రేయస్కరమే యగును.

**అ॥** ఇవ్విధముగ పరధర్మము నాశ్రయించుటగాని, పాపకార్యముల నవలంబించుటగాని దుఃఖప్రదములని తెలిసినప్పటికని మనుజు డేల బలవంతముగ వానివైపున కీడ్వబడు చున్నాడను శంక అర్జునునకీ సందర్భమున నుదయింప దానిని గూర్చి భగవాను నిట్లు ప్రశ్నించుచున్నాడు -

**అర్జున ఉవాచ :-**

**36. అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః**
**అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః.**

అర్జున ఉవాచ - అర్జునుడు చెప్పెను.

**టీక:-** వార్ష్ణేయ = ఓ కృష్ణా!, అథ = అయితే, అయం పూరుషః = ఈ పురుషుడు, కేన = దేనిచేత, ప్రయుక్తః = ప్రేరేపింపబడినవాడగుచు, అనిచ్ఛన్ అపి = కోరనప్పటికిని, బలాత్ = బలాత్కారముగ, నియోజిత ఇవ = నియోగింపబడినవానివలె, పాపమ్ = పాపమును, చరతి = ఆచరించుచున్నాడు?

**తా:-** అర్జునుడు శ్రీకృష్ణమూర్తి నిట్లు ప్రశ్నించెను - ఓ కృష్ణా! అయితే మనుజుడు పాపముచేయవలెనని కోరనప్పటికిని, దేనిచే ప్రేరేపింపబడి బలాత్కారముగ పాపము చేయుచున్నాడు?

**వ్యాఖ్య:-** శ్రీకృష్ణపరమాత్మ ఇంద్రియనిగ్రహము, రాగద్వేష వివర్జనము స్వధర్మము మున్నగువానినిగూర్చి బోధించుచు పోవుచుండ, అర్జునున కొక సందేహము కలిగి వెంటనే భగవానుని ప్రశ్నించివైచెను. ఈ సందేహము అర్జునుని కొకనికేకాదు. ప్రతి ముముక్షువునకు కలుగుచుండును. కాబట్టి ఆ ప్రశ్నయు, దానికి భగవానుడొసంగిన సమాధానమున్ను సాధకలోకమునకు అత్యావశ్యకమైనది.

విషయానుభవము ప్రమాదమని తెలియనివాడెవడు? అసత్యము పాపమని ఎఱుగని వాడెవడు? కోపము చెడ్డదని ప్రతివానికిని తెలియును గదా? అట్లెఱింగియు ఎందఱో బలాత్కారముగ ఆ యా పాపములను చేయుచునేయున్నారు. ఒక వస్తువును తినగూడదని మనస్సు భావించినను, ఏదియో యొకశక్తి దానిచేత తినిపించితీరుచున్నది. ఆ శక్తి యేది అనునది అర్జునునిప్రశ్న. చేయగూడదని నిశ్చయించుకొనిన మానవునిచేత ఆపనిని చేయించుచుదేదియని యాతని శంక. పాపము చేయవలెనను కోరిక లేకపోయినను, పాపము చేయుచున్నాడనిన, ప్రతికూలశక్తి జీవునియం దెంత బలవత్తరముగ నున్నదో యోచించుకొనవచ్చును. 'బలాదివ నియోజితః' - అని చెప్పినందు వలన రాజుచే నాజ్ఞాపితుడగు భృత్యునిపగిది ఏదియోయొక శక్తిచే మనుజుడు బలాత్కారముగ దుష్కర్మయందు నియోగింపబడు చున్నాడు. ఆ ప్రతికూలశక్తియేదియో, దానిని తొలగించు ఉపాయ మేదియో భగవానుడు కరుణతో నుపదేశింపబోవుచున్నారు. కాబట్టి సాధకు లత్యంతజాగరూకతతో ఈ ఘట్టమును పరిశీలించి తమ ఆచరణయందు చక్కని మార్పును తెచ్చుకొనవలసియుందురు.

ప్రపంచములో మూడురకముల జీవులుకలరు - (1) ఎన్నడును పాపము చేయనివారు (2) పాపము చేయ దలంపులేనివారైనను దేనియొక్క ప్రేరణచేతనో బలాత్కారముగ పాపముచేయువారు (3) కావలెనని పాపముచేయువారు. వీరిలో మొదటి తరగతివారు ఉత్తమోత్తములు, జీవన్ముక్తులు. మాయను దాటినవారు. వీరియెదుట ప్రకృతియొక్క కుట్రలు, పన్నాగములు సాగవు. రెండవతరగతివారు ముముక్షువులు, సాధకులు. వీరిని గూర్చియే అర్జును డిచట ప్రశ్నించెను. ఇక మూడవతరగతి వారు నికృష్టులు, రాక్షసతత్త్వముకలవారు. మహా అజ్ఞానులు. మూడు, రెండు తరగతులు దాటి మొదటితరగతిలోనికి ప్రవేశించవలెను. అందులకై భగవాను డిపుడు చెప్పబోవు సమాధానమునాలకించి జనులు వారివారి హృదయములను పరిశోధించుకొని పాపరహితులగుటకై తీవ్రతరయత్న మాచరించవలయును.

అ॥ అర్జునుని ప్రశ్నకు భగవానుడు సమాధాన మొసంగుచున్నాడు -

శ్రీ భగవానువాచ -

**37. కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః**
**మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్.**

శ్రీభగవానువాచ = శ్రీభగవంతుడు చెప్పెను.

**టీక:–** ఏషః = (నీవడిగిన) ఈ హేతువు, రజోగుణ సముద్భవః = రజోగుణమువలన పుట్టిన, కామః = కామము, ఏషః = ఇదియే (ఈకామమే), క్రోధః = క్రోధము (గ పరిణమించుచున్నది), మహాశనః = (ఇది) తృప్తిబొందనిదనియు, మహా పాప్మా = మహాపాపములకు కారణభూతమైనదియు, (అయి యున్నది కావున), ఏనమ్ = ఈ కామమును, ఇహ = ఈ మోక్షమార్గమందు, వైరిణమ్ = శత్రువుగా, విద్ధి = ఎఱుంగుము.

**తా:–** శ్రీభగవంతుడు చెప్పెను - ఓ అర్జునా! నీవడిగిన ఈ హేతువు రజోగుణము వలనపుట్టిన కామము. ఇదియే క్రోధముగ పరిణమించుచున్నది. ఈ కామము ఎంత అనుభవించినప్పటికిని తృప్తినిబొందనిదియు, మహాపాపములకు కారణభూతమైనదియు అయియున్నది. కావున దీనిని ఈ మోక్షమార్గమున శత్రువుగా నెఱుంగుము.

**వ్యాఖ్య:–** పాపముచేయగూడదని యనుకొనినను జీవునిచే బలాత్కారముగ పాపమును చేయించుశక్తి యేదియో ఇచట వచింపబడుచున్నది. అదియే కామము. అది రజోగుణము నుండి పుట్టినది. దానితమ్ముడు క్రోధము. ఈ కామక్రోధములు రెండును దాదాపు కూడియేయుండును. గీతయందును చాలచోట్ల వీరిరువురును కలిసియే వచ్చుచుందురు. ఇదివరలో తెలిపిన రాగద్వేషములయొక్క ప్రతిరూపములే ఈ కామక్రోధము లని యెఱుంగవలెను. క్రోధము కామమునుండియే ఉద్భవమగుట బట్టి ఈ రెంటియందును కామమే ప్రధానమైనది. శత్రువులలో మహాబలవత్తరమైనది కామమే యగుటచే అరిషడ్వర్గములో దానికి ప్రథమస్థాన మొసంగబడినది. అసురగుణములలో ఆ కామము నాయకుడు (Captain). క్రోధము ఉపనాయకుడు. మోక్షమార్గమున జనువారెదుర్కొను ప్రతిపక్షులలో ముఖ్యమైనదికావునను, జీవునకు దైవసాక్షాత్కారమున మహాప్రతిబంధకముగ నుండుటవలనను ఈ కామమును గూర్చి ఒకింత వివరించిచెప్పుటకై భగవాను డిచట పూనుకొనిరి.

దాని చరిత్రను వర్ణించిచెప్పుచు మొట్టమొదట (1) 'ఇది గొప్పతిండిబోతు' (మహాశనః) అని పలికెను. ఎన్ని ఆహుతులు వేసినను అగ్నిహోత్రునకు తృప్తిలేని చందమున ఈ కామె మెంత యనుభవించినను తృప్తినొందదు. పైగా వృద్ధినొందుచునే యుండును. 'కడుపు నిండినది' అని కామము చెప్పిన సందర్భ మొకటియైనను చరిత్రలో లేదు. కోరికల ననుభవించుచు కామము నెవరును నశింపచేయలేరు. సమిధలు వేయనిచో అగ్ని చల్లారునట్లు తత్త్వవిచారణ ద్వారా కోరికలు ననుభవింపకుండ చేయుటయే కామ నిర్మూలనమునకు మార్గము. మఱియు ఈ కామము (2) మహా పాపజనకమైనది (మహాపాప్మా) అని ఇచట చెప్పబడినది. 'పాప్మా' అని చెప్పక 'మహాపాప్మా' అని చెప్పుటవలన ఘోరపాపమున కిది హేతువైయున్నదని స్పష్టమగుచున్నది. జీవునకు అనేక జన్మలలో పుణ్యముయొక్క పద్దు తగ్గి, పాపముయొక్క పద్దు పెరిగిపోవుటకు కారణ మీ కామమే అయియున్నది.

ఇంకను ఇయ్యది (3) శత్రువు (వైరి) అని పేర్కొనబడినది. జీవునకు అతి సమీపమునగల శత్రు వీ కామమేయగును. ఏలయనిన అది బాహ్యమునగాక కేవలము హృదయముననే తిష్ఠవేసికొనియున్నది. ఇది ఇప్పటిశత్రువుకాదు. చాల పాతకాలపు శత్రువు. ఎన్ని జన్మలనుండియో జీవుని వేధించుచు, అతని యాత్మస్వాతంత్ర్యమును గుంజుకొని, వానిని బానిసగచేసివైచి తన చెప్పుచేతలలో నుంచుకొనుచు అతని హృదయసామ్రాజ్యాధిపత్య మంతయు తానే స్వీకరించి అధికారము చలాయించుచు, తానొకటియేకాక తన బంధువర్గమును (క్రోధాదులను) గూడ జేరబిలుచుకొని అటవసించుచున్నది. శత్రువుండినచోట శాంతియుండదు. కావున వివేక వైరాగ్యాదులచే ఈ కామమను ప్రబలశత్రువును హృదయగేహమునుండి తరిమివేయుటకు జీవుడు బద్ధకంకణుడు కావలెను.

వ్యాధిని పైపైన నివారించుటకంటె దానిమూలమును విచారించి, సమూలముగ దానిని తొలగించివేయుట శ్రేయస్కరము (Prevention is better than cure); భగవాను డిచట ఆ పనినే కావించుచున్నాడు. సంసారదుఃఖములను పైపైన నివారించుటకంటె, ఆ దుఃఖములకన్నిటికిని మూలమేమియో విచారించి, సంసారవృక్షమునకు బీజరూపముగనున్నట్టి ఆ కామమును పెకలించివేయుటకై ఉద్యమించుచున్నాడు.

**ప్ర:–** దేనిప్రేరణచే జీవుడు తాను వలదనుకొనినను పాపమును చేయుచున్నాడు?

**ఉ:–** కామముయొక్క ప్రేరణచే.

**ప్ర:–** ఆ కామమెట్టిది?

**ఉ:–** అది (1) ఎంత అనుభవించినను తృప్తినొందనిది (2) మహాపాపజనకమైనది (3) జీవునకు ప్రబలశత్రువు.

**అ||** కామముయొక్క స్వరూపస్వభావములను, పాపజనకత్వమును మూడు శ్లోకములద్వారా వివరించి చెప్పుచున్నాడు –

**38. ధూమేనావ్రియతే వహ్నిర్యథాఽఽదర్శో మలేన చ**
**యథోల్బేనావృతో గర్భస్తథా తేనేదమావృతమ్.**

**టీక:–** యథా = ఏప్రకారముగ, ధూమేన = పొగచేత, అగ్నిః = అగ్ని, ఆవ్రియతే = కప్పబడుచున్నదో, (యథా = ఏప్రకారముగ), ఆదర్శఃచ = అద్దమున్ను, మలేన = మాలిన్యము చేత, (ఆవ్రియతే = కప్పబడుచున్నదో), యథా = ఏప్రకారముగ, ఉల్బేన = మావిచేత, గర్భః = గర్భమందలి శిశువు, ఆవృతః = కప్పబడియుండునో, తథా = అప్రకారమే, తేన = ఆ కామముచేత, ఇదమ్ = ఈ ఆత్మజ్ఞానము, ఆవృతమ్ = కప్పబడియున్నది.

**తా:–** పొగచేత అగ్నియు, మురికిచేత అద్దమున్ను, మావిచేత గర్భమందలి శిశువున్ను కప్పబడియుండులాగున ఆ కామముచేత ఈ ఆత్మజ్ఞానమున్ను కప్పబడియుండును.

**వ్యాఖ్య:–** ప్రతిజీవియొక్క హృదయమందును ఆత్మ దేదీప్యమానముగ ప్రకాశించుచున్నది. కాని

అయ్యది కామాదులచే ఆవరింపబడుటవలన అనుభూతముకాకయున్నది. ఈ విషయమును స్పష్టీకరించుటకై భగవాను డిచట మూడు దృష్టాంతముల నొసంగెను. (1) అగ్ని పొగచే కప్పబడినట్లు (2) అద్దము దుమ్ముచే కప్పబడినట్లు (3) గర్భస్థ శిశువు మావిచే కప్పబడియున్నట్లు ఈ ఆత్మ కామముచే కప్పబడియున్నదని వచించెను. పొగచే కప్పబడినపుడు అగ్ని యున్నట్లే తెలియదు. పొగయొక్క నలుపుదనము అగ్నియొక్క ప్రకాశమును అభిభూత మొనర్చి అదియే జయించినదానిచందమున పైకి కనబడును. అట్లే దర్పణాదులున్ను. కాని విసరుట మొదలగు ప్రయత్నములచే ఆ పొగ తొలగిపోగా అగ్ని స్వతస్సిద్ధముగ దేదీప్యమానముగ నెట్లు వ్యక్తమగునో, అద్దముపైగల మురికిని తుడిచివేసినచో స్వచ్ఛముగ నది యెట్లు ప్రకాశించునో, మావి తొలగినపుడు శిశు వెట్లు బహిర్గతమగునో, అట్లే భక్తిజ్ఞానవైరాగ్యాదిసాధనములచే కామాదులను హృదయమునుండి పారద్రోలినచో ఆత్మ ప్రత్యక్షముగ అనుభూతము కాగలదు. అదియే మోక్షస్థితి, బంధరాహిత్యము.

మఱియు అగ్ని పొగచేత కప్పబడియున్నపుడుకాని, అద్దము దుమ్ముచే నావరింప బడి యున్నపుడుకాని, శిశువు మావిచే కప్పబడియున్నపుడుకాని, ఆ అగ్ని, దర్పణ, శిశువుల యొక్క స్వరూపములకు వాస్తవముగ ఏ హానియులేదు. అవి స్వతః నిర్మలములుగనే యున్నవి. అట్లే అజ్ఞానకాలమందును, కామాదులచే గప్పబడియున్నపుడుకూడను ఆత్మయొక్క నిర్మలత్వమందు ఏ మార్పున్ను ఉండదు. ఆవరణముండుట వలన పూర్వ మనుభూతము కాలేదు. అది తొలగినందువలన ఇపు డనుభూతమగుచున్నది. ఇదియే మార్పు. వస్తువులో ఏ మార్పున్ను జరుగలేదు. ఆవరణము మాత్రము భంగమైనది. కాబట్టి సాధకులు తమ హృదయమందుగల కామాదిరూప ఆవరణను పురుషప్రయత్నముచే, పెక్కు సాధనలచే పటాపంచలు చేసి తమ సహజ ఆత్మస్వరూపము ననుభూతమొనర్చుకొని, జన్మసార్థకత నొందవలెను. ఈ సత్యమునే భగవాను డీశ్లోకముద్వారా స్ఫురింపజేయుచున్నాడు.

పైన దెల్పిన దృష్టాంతములందు అసాధ్యమైన దేదియును లేదు. పొగను తేలికగా విసరివేయవచ్చును. దుమ్మును సులభముగ తుడిచివేయవచ్చును. మావియు కాలక్రమముగ తొలగిపోగలదు. అట్లే ఆత్మప్రాప్తియందును అసాధ్యమైనదేదియును లేదు. సోమరితనమును వీడి ఒకింత ప్రయత్నము సలిపినచో కామాదులు తప్పక జయించి వేయబడగలవు.

క్రిందటి శ్లోకమున కామమును గూర్చి ప్రస్తావించినందు వలన ఈ శ్లోకమందలి 'తేన' అను పదమునకు 'ఆ కామముచే' అనియు (రాబోవు శ్లోకమున 'ఈ కామముచే జ్ఞానము కప్పబడియున్నది' అని తెలుపబడినందువలన) 'ఇదమ్' అను పదమునకు జ్ఞానమనియు అర్థమును భావించవలసియుండును.

**ప్ర:-** ఆత్మజ్ఞానము దేనిచే కప్పబడుచున్నది?

**ఉ:-** కామాదులచే.

**ప్ర:-** ఏ ప్రకారముగ?

**ఉ:-** (1) పొగచే అగ్నివలె (2) దుమ్ముచే అద్దమువలె (3) మావిచే గర్భమందలి శిశువువలె.

**అ॥** కామమును అగ్నితో పోల్చి చెప్పుచున్నాడు -

**39. ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా**
**కామరూపేణ కౌన్తేయ దుష్పూరేణానలేన చ.**

**టీక :–** కౌన్తేయ = ఓ అర్జునా!, దుష్పూరేణ = నిండింప శక్యముకానిదియు, అనలేనచ = అగ్నివలె తృప్తిని బొందనిదియు, కామరూపేణ = ఆశారూపమైనదియు, జ్ఞానినః = జ్ఞానికి, నిత్యవైరిణా = నిరంతర శత్రువును (అగు), ఏతేన = ఈ కామముచేత, జ్ఞానమ్ = (ఆత్మ) జ్ఞానము, ఆవృతమ్ = కప్పబడియున్నది.

**తా:–** ఓ అర్జునా! నిండింప శక్యముకానిదియు, అగ్నివలె తృప్తిని జెందనిదియు, ఆశారూపమైనదియు, జ్ఞానికి నిరంతర శత్రువునగు ఈ కామముచేత (ఆత్మ) జ్ఞానము కప్పబడియున్నది.

**వ్యాఖ్య:–** క్రిందటి శ్లోకములో కామమునుగూర్చిన ఒకింత పరిచయము గావింపబడెను. ఇచట దానిని గూర్చి మఱికొంత చెప్పబడుచున్నది. సాధకులకు దాని స్వరూపము బాగుగ తెలియవలెనని భగవానుని యభిప్రాయము. ఏలయనిన శత్రువు యొక్క బలాబలములను బాగుగ తెలిసియున్నవాడే ఆతనిని పరాజయ మొనర్పగలడు. కామ మిచట మరల రెండు విశేషణములతో వర్ణించి చెప్పబడినది. అవి యేవియనిన – (1) నిత్యవైరి (2) దుష్పూరమగు అగ్ని. వీనినిగుఱించి ఒకింత విచారింతము.

"నిత్యవైరిణా" – మోక్షము నొందువఱకు ఈ కామము ఎన్నిజన్మలైనను మనుజుని వేధించుచునే యుండును. గావున దీనిని నిత్యశత్రువని పేర్కొనిరి. ప్రపంచములో శత్రువులనేకులుండవచ్చును. కాని ఒకపుడు శత్రువుగానున్నవాడు కాలక్రమమున మిత్రుడిగా మారిపోవచ్చును. కావున వారందఱును అనిత్య శత్రువులు. ప్రపంచములో ఒకే ఒక నిత్యశత్రువు జీవునకు కలడు. ఆతడే కామము. ప్రతిక్షణము ముముక్షువును పడగొట్టుటకై అతడు వేచియుండును. మహామహాపండితులను, బలవంతులను, రాజాధిరాజులను, ఇంద్రులను, చంద్రులను అందఱిని త్రుటికాలములో నతడు పడగొట్టివైచును. వెయ్యేల, అధ్యాత్మసాధనలో చాలవఱకు ముందుకుసాగిన ఉద్దండులను గూడ వారొకింత అజాగ్రతగనున్నచో, సమయమునుకనిపెట్టి ఈ శత్రువు తనవలలో వేసికొనుచున్నాడు. పరమపదసోపానపటములోని పెద్దపాముతో వీనిని పోల్చవచ్చును. పైకిపోయిన సాధకుడు వీనినోటిలోపడి మొదలుకు వచ్చును. ఈ నిత్యశత్రువుబారినుండి తప్పించుకొనుటకై సాధకులు ఎన్నియో యత్నములు చేయవలసి యున్నారు. ఒకవేళ ఆ కామము పైపైన తొలగినను, వాసనారూపముగ హృదయములో మఱికొంతకాలము తిష్ఠవేసికొనియే యుండును. కావున వివేకవైరాగ్యాదులచే, ఆత్మ విచారణచే దానిని నిశ్శేషముగ తొలగించివేయువాడు ధన్యుడు.

"దుష్పూరేణ అనలేన" – అగ్నివలెను, సముద్రము వలెను కామము నింప శక్యము కానిది. ఎన్నిసమిధలు వేసినను అగ్ని 'చాలును' అని అనదు. ఎంత నదీజలము వచ్చిచేరినను సముద్రము 'చాలును' అని చెప్పదు. అట్లే కామమున్ను; అనుభవించుచు దాని నెవరున్ను తృప్తిని బొందింపలేరు. అది 'మహాశనుడ'ని ఇదివఱకే పేర్కొనబడెనుగదా! అలకని గంపతో నీళ్ళు చేదినట్లేయుండును. ఆ కామమును పూరించుటకు చేయుయత్నము. ఆ గంప ఏనాటికిన్ని నిండదు. అట్లే 'తృప్తోఽస్మి' అని కామము అనదు. దానిని అనునట్లు ఎవరును చేయలేరు. అగ్నిలో నేయి వేయుచుండినచో అది చల్లారదు. పై పెచ్చు వృద్ధియగుచుండును. అట్లే కామమును అనుభవించినకొలది పెరుగునేకాని తరగదు. ఈ సందర్భమున భాగవతమునందలి యయాతి అనుభవ పూర్వకముగ పలికిన పలుకులు ముముక్షువులచే స్మరింపదగినవి★ కావున సమిధలు తీసివైచినచో అగ్ని చల్లారునట్లు కోరికలను, భోగసంకల్పములను హృదయము నుండి

★ న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏ వాభివర్ధతే. (భాగవతము. 9-14-14)
"అనుభవించుచుండినచో కామ మెన్నటికిని శమింపదు. అగ్నిలో నేయివేసినచందమున పైగా అది వృద్ధినొందుచునేయుండును. (యయాతి)"

ఏరిపారవేసినచో కామము చల్లారును. కామనివారణ కిదియే యుపాయముకాని అనుభవించుటకాదు. సంస్కృతములో 'అలమ్' అనగా 'చాలు' అని అర్థము. 'అనలమ్' అనగా 'చాలదు' అని అర్థము. ఎంత ఆహుతివేసినను అగ్ని చాలదని చెప్పను, గావున దానిని అనలము అని పేర్కొనిరి. కామమున్ను అట్టిదేయని భగవానుడు పలుకుచున్నాడు. మఱియు తన్ను స్పృశించువారిని అగ్నివలె కాల్చుటబట్టియు దానిని అగ్నితో పోల్చిచెప్పిరి.

"జ్ఞానినో నిత్యవైరిణా" - కామము సర్వజీవులకును అనర్థము కలిగించినను, అట్టి అనర్థమును తెలిసికొనువాడు, తొలగించుటకు యత్నించువాడు జ్ఞానిమాత్రమే యగుటవలన అది యాతనికి శత్రువుపగిది యుండును. అజ్ఞానికిగూడ వాస్తవముగ అది శత్రువుగా నున్నప్పటికిని ఆ విషయము నాతడు తెలిసికొనలేక దానిని మిత్రుడుగా భావించుచు మహానర్థమును బొందుచున్నాడు. ఇక్కారణమువలననే జ్ఞానికిమాత్రము నిత్యశత్రువుగా నిట వర్ణించబడినది.

ఇట్టి నిత్యశత్రువు హృదయమున నున్నంతవఱకు జీవునకు మోక్షమునుగూర్చిన వార్తయే ఉదయింపదు కావున, అనేక సాధనలద్వారా ఆ కామపిశాచము నతడు తొలగించివేసి తన జన్మహక్కు అయిన ఆత్మానందము ననుభవింపవలసినదిగా ఈ గీతాశాస్త్రమున శ్రీకృష్ణభగవాను డాదేశించుచున్నారు.

**ప్ర:-** (ఆత్మ) జ్ఞానము దేనిచే గప్పబడినది?

**ఉ:-** కామముచే

**ప్ర:-** అది యెట్టిది?

**ఉ:-** (1) జ్ఞానికి నిత్యశత్రువు (2) అగ్నివలె పూరింప శక్యము కానిది, అగ్నివలె దహించునది.

**అ॥** అట్టి కామమును నశింపజేయు ఉపాయమును చెప్పబోవుచు ముందుగా అదియుండు స్థానమును వచించుచున్నాడు -

## 40. ఇన్ద్రియాణి మనోబుద్ధిరస్యాధిష్ఠానముచ్యతే ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్.

**టీక:-** ఇన్ద్రియాణి = ఇంద్రియములు, మనః = మనస్సు, బుద్ధిః = బుద్ధి, అస్య = దీనికి (ఈ కామమునకు), అధిష్ఠానమ్ = ఆశ్రయమని, ఉచ్యతే = చెప్పబడుచున్నది, ఏషః = ఇది (ఈ కామము), ఏతైః = వీనిచేత (ఈ యింద్రియాదులచేత), జ్ఞానమ్ = (ఆత్మ) జ్ఞానమును, ఆవృత్య = కప్పి, దేహినమ్ = మనుజుని, విమోహయతి = మిగుల మోహపెట్టుచున్నది.

**తా:-** ఈకామమునకు ఇంద్రియములు, మనస్సు, బుద్ధి ఆశ్రయములని చెప్పబడుచున్నది. ఆ యింద్రియాదులచేత కామము ఆత్మజ్ఞానమును గప్పివైచి మనుజుని మిగుల మోహపెట్టు చున్నది.

**వ్యాఖ్య:-** ఇంతదనుక కామముయొక్క స్వరూప స్వభావములను వర్ణించిచెప్పి, ఇక దానిని తొలగించివేయుట కుపాయమును చెప్పబోవుచు, మొట్టమొదట అది ఆశ్రయించు నట్టి స్థానములను

పేర్కొనుచున్నారు. ఏలయనగా, శత్రువును జయించవలెననిన అతడుండుచోటు చక్కగ తెలిసియుండవలెను. ఈ కామమునకు ఆశ్రయస్థానములు ఇంద్రియములు, మనస్సు, బుద్ధి. వీని ద్వారా అది ఆత్మజ్ఞానమును కప్పివైచి జీవుని మోహపెట్టుచున్నది. 'మోహయతి' అని చెప్పక 'విమోహయతి' అని చెప్పుట వలన కామము జీవుని యెంతగా బాధించుచున్నదో, స్పష్టమగుచున్నది. జీవునియందది ఇంద్రియ, మనోబుద్ధులను కొన్నిస్థానములను సంపాదించుకొని, కొంతపట్టు సంపాదించి చివఱ కాజీవునే పడగొట్టుచున్నది. ఇపుడు కామమును జయించ వలెనన్న, దాని యాశ్రమములగు ఇంద్రియాదులను మొదట జయించవలెను. ఈ విషయమునే రాబోవు శ్లోకమున భగవానుడు స్పష్టముగ చెప్పివైచిరి. ఇంద్రియములను విషయములపైకి పోకుండ అరికట్టినయెడల ఇక కామమునకు నిలువనీడలేక క్రమముగ నశించిపోవును. ఇదియే కామజయమునకు చక్కటి ఉపాయము.

**ప్ర:–** కామమున కాశ్రయములేవి?

**ఉ:–** ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, వీనిచే నది జ్ఞానమును కప్పివైచి జీవుని అజ్ఞానమున బడద్రోయుచున్నది.

**అ॥** ఇట్లు కామముయొక్క ఆశ్రయములను పేర్కొని ఇక దానిని నశింపజేయుట కుపాయమును వచించుచున్నాడు –

## 41. తస్మాత్త్వమిన్ద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ
## పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్.

**టీక:–** భరతర్షభ = భరతవంశశ్రేష్ఠుడవగు ఓ అర్జునా!, తస్మాత్ = అందువలన, త్వమ్ = నీవు, ఆదౌ = మొదట, ఇన్ద్రియాణి = ఇంద్రియములను, నియమ్య = నిగ్రహించి (స్వాధీనముచేసికొని), జ్ఞానవిజ్ఞాన నాశనమ్ = జ్ఞాన విజ్ఞానములను (శాస్త్రజ్ఞాన, అనుభవజ్ఞానములను) రెండిటిని నాశనము చేయునదియు, పాప్మానమ్ = పాపస్వరూపమైనదియు (అగు), ఏనమ్ = దీనిని (ఈ కామమున), హి = తప్పకుండ, ప్రజహి = పూర్తిగా విడువుము (నశింపజేయుము).

**తా:–** భరతవంశశ్రేష్ఠుడవగు ఓ అర్జునా! కాబట్టి నీవు మొట్టమొదట ఇంద్రియములను నిగ్రహించి జ్ఞానవిజ్ఞానములను (శాస్త్రజ్ఞాన, అనుభవజ్ఞానములను) రెండిటిని నాశనముచేయు నదియు, పాపస్వరూపమైనదియునగు ఈ కామమును తప్పకుండ సంపూర్ణముగ విడిచివేయుము (నశింపజేయుము).

**వ్యాఖ్య:–** కామమును జయించవలెననిన, ముందుగా దాని ఆశ్రయములను లోబఱచుకొనవలెను. ఆ ఆశ్రయములేవి? ఇంద్రియములు, మనస్సు, బుద్ధి అని పైనతెలుపబడినది. అందు మొదటిదియగు ఇంద్రియముల నది ముందుగా నాక్రమించుకొని ఆ పిదప మనస్సును, బుద్ధిని వశపఱచుకొనును. కాబట్టి సాధకుడు మొట్టమొదట కామముయొక్క ప్రథమాశ్రయమగు ఇంద్రియములను వశపఱచుకొనినచో కామ మిక ముందుకు పోజాలక అట్లే శమించిపోవును. కనుకనే భగవానుడు కామజయమునకు మొదట ఇంద్రియములను స్వాధీనపఱచుకొనవలసినదిగా ఆనతిచ్చిరి. 'ఆదౌ' అని చెప్పినందువలన, తక్కిన సాధనలన్నిటికంటె ముందు ఈ ఇంద్రియనిగ్రహరూప సాధనను తప్పక అవలంబించవలెనని

స్పష్టమగుచున్నది. సాధకుడు అధ్యాత్మ రంగమున ప్రవేశించి మోక్షప్రాప్తికై ప్రయత్నము సలుపునపుడు మొట్టమొదట చేయవలసినపని యిదియే. 'ఓ అర్జునా! నీకు ఇతర పనులెన్నియున్నను, ముందు ఈ పని జూడుము' అని శ్రీకృష్ణు డర్జునునకు హెచ్చరికచేయుచున్నాడు. సర్వజ్ఞుడగు పరమాత్మ వచించిన ఈ వాక్యముపై ముముక్షువుల కెంతటి విశ్వాసముండవలెను! కాబట్టి ఏ యే ఇంద్రియములు ఏ యే విషయములపై పరుగిడుచున్నవో జాగ్రతగ పరిశీలించి అభ్యాసవైరాగ్యవిచారణాదులద్వారా వానిని వెనుకకు త్రిప్పవలెను. అత్తఱి కామము నిలుచుటకు నీడలేక పలాయనము చిత్తగించును.

"పాప్మానమ్" - కామముయొక్క అల్పత్వమును అందఱికిని ఎత్తిచూపుటకు కాబోలు భగవానుడు మరల మరల దాని హీనస్వరూపమును బయట పెట్టుచున్నాడు. ఇదివఱలో (37వ శ్లో) 'మహాపాప్మా' అని వర్ణించెను. ఇపుడు 'పాప్మానమ్' - పాపస్వరూపమైనది యని వచించెను. ఏలయనిన, దానినుండియే అనేక పాపము లుద్భవించుచున్నవి. కామాంధులై ఎందఱు ఎన్ని ఘోరపాపములకు ఒడిగట్టుచున్నారో లోకమెఱిగినవిషయమే. ఇంతియేకాదు. ఆ కామము మనుజుని జ్ఞాన విజ్ఞానముల రెండిటిని నాశమొనర్చునని చెప్పబడినది. జ్ఞానమనగా శాస్త్రజ్ఞానము; విజ్ఞానమనగా అనుభవజ్ఞానము. సాధనదశలో కష్టపడి సంపాదించిన ఈ రెండును కామప్రభావముచే బూడిదపాలై పోవుచున్నవి. ఎందఱో పండితులు, శాస్త్రవేత్తలు, ఒకింత అనుభవముగలవారుగూడ కామముచే నాక్రమింపబడినపుడు తమ విజ్ఞానమును గోల్పోయి పామరులవలె ప్రవర్తించుట చూడబడుచున్నది గదా! విజ్ఞానవంతులవిషయమే యిట్లుండ ఇక సామాన్యులమాట చెప్పవలెనా! అయితే ఇంద్రియనిగ్రహము గలవారినిగాని, పూర్ణజ్ఞానముకలవారినిగాని ఆ కామ మేమియును చేయజాలదని గుర్తుంచుకొనవలెను.

కామమునకింతటి వినాశకరశక్తి యున్నప్పటికిని ఎవరును ఏమియు జంకనక్కరలేదు. అభ్యాసమును, వివేకవైరాగ్యములను జేపట్టి దానిని బయటకి గెంటిపారవేయవలెనని భగవానుడు నుడువుచున్నాడు. కనుకనే 'ప్రజహి' అని చెప్పుటద్వారా కామమును పూర్తిగా విడువవలెననియు, సంపూర్ణముగ వినాశమొనర్పవలెననియు తెలుపబడినది. (ఇచట కామమనగా దృశ్యవిషయసంబంధములైన వాంఛలన్నియును అని భావము).

"భరతర్షభ" - 'ఓ అర్జునా! నీవు భరతకులమందు శ్రేష్ఠుడవై, భౌతికబల సంపన్నుడవై యలరుచున్నావు. అట్లే ఇంద్రియములను గూడ జయించి ఆధ్యాత్మిక బలమును గూడ జేర్చుకొని నీ శ్రేష్ఠత్వమును ఇనుమడింపజేసికొనుము' అను భావ మీ పదమునందు స్ఫురించుచున్నది.

**ప్ర:-** పరమార్థరంగమున సాధకుడు మొట్టమొదట ఏమిచేయవలెను?

**ఉ:-** ఇంద్రియములను నిగ్రహించవలెను.

**ప్ర:-** దానివలన కలుగు లాభమేమి?

**ఉ:-** కామము తొలగును.

**ప్ర:-** ఆ కామ మెట్టిది?

**ఉ:-** (1) పాపజనకమైనది (2) జ్ఞానవిజ్ఞానములను నాశమొనర్చునది.

**అ॥** కామము ఇంద్రియములను, మనస్సును, బుద్ధిని వశపఱచుకొని, జీవుని (ఆత్మని) మోహపెట్టుచుండ ఇక దానిని జయించుటెట్లు? ఇంద్రియములను వశపఱచుకొనుటెట్లు? అను శంకకు సమాధానము చెప్పదలచి జీవునియొక్క యథార్థ స్వరూపమును, ఆతని నిజస్థానమును, శక్తిని వర్ణించుచున్నాడు -

**42. ఇన్ద్రియాణి పరాణ్యాహురిన్ద్రియేభ్యః పరం మనః**
**మనసస్తు పరా బుద్ధిర్యో బుద్ధేః పరతస్తు సః.**

**టీక:-** ఇన్ద్రియాణి = ఇంద్రియములు, పరాణి = (దేహాదులకంటె) గొప్పవి, ఇన్ద్రియేభ్యః = ఇంద్రియముకంటె, మనః = మనస్సు, పరమ్ = గొప్పది, మనసఃతు = మనస్సు కంటెనో, బుద్ధిః = బుద్ధి, పరా = గొప్పది, బుద్ధేః = బుద్ధికంటె, పరతః = గొప్పవాడు, యః తు = ఎవడో, సః = ఆతడే ఆత్మ, (ఇతి = అని) ఆహుః = పెద్దలు చెప్పుదురు.

**తా:-** (దేహాదులకంటె) ఇంద్రియములు గొప్పవి. ఇంద్రియములకంటె మనస్సు గొప్పది. మనస్సుకంటె బుద్ధి గొప్పది. బుద్ధి కంటె గొప్పవాడెవడో ఆతడే ఆత్మ అని యిట్లు పెద్దలు చెప్పుదురు.

**వ్యాఖ్య:-** ఇంద్రియములను తొలుదొల్త నిగ్రహించవలెనని క్రిందటి శ్లోకమున చెప్పబడెను. అయితే వానిని నిగ్రహించుటెట్లు? ఆ పద్ధతిని రెండు శ్లోకములద్వారా తెలుపుచున్నారు. ఒక వస్తువును నిగ్రహించవలెనన్నిన, దానికంటె పైస్థానమందున్ననే సాధ్యపడును. లేక దానికంటె శక్తివంతమైన వస్తువును జేబట్టిననే వీలగును. కావున ఇంద్రియములను జయించవలెనన్నిన వానికంటె పరమైనట్టి స్థానమందు జీవుడు స్థితిని బొందవలెను. దేహము రథమువంటిది. అది జడమైనది. ఇంద్రియములు గుఱ్ఱముల వంటిది. అవి ఒకింత చైతన్యవంతములు. కావున దేహముకంటె ఇంద్రియములు గొప్పవి. అట్లే ఇంద్రియముల కంటె మనస్సున్ను; మనస్సుకంటె బుద్ధియు, బుద్ధికంటె ఆత్మయు గొప్పవి. ఒకదానికంటె మఱియొకటి అధికచైతన్య వంతములు, శక్తివంతములునైయున్నవి. మఱియు ఒకదానికంటె మఱియొకటి ఉపరి భాగమున కలవు. అన్నిటికంటెపైన ఆత్మ కలదు. ఒకదృష్టితో చూచినచో ఆత్మతప్ప తక్కిన బుద్ధ్యాదులన్నియును జడములే యగును. ఆత్మయొకటియే చైతన్యవంతమైనది. ఆత్మసాన్నిధ్యమున (అగ్నిసన్నిధియందు ఇనుపగుండువలె) ఆ బుద్ధ్యాదులు చైతన్యవంతములుగ గన్పట్టుచున్నవి. ఆత్మేతరములగు ఆ బుద్ధ్యాది సమస్తపదార్థములున్ను ప్రకృతికి (మాయకు) లోబడి వర్తించుచున్నవి. అవి దృశ్యములు. ఆత్మయొకటియే దృక్కు.

కాబట్టి అట్టి ఆత్మస్థానముననున్నచో తక్కిన ఇంద్రియాదు లన్నిటిని సులభముగ నిగ్రహించవచ్చును. అపుడే పూర్ణఇంద్రియ నిగ్రహము సాధ్యమగును. 'రసోఽప్యస్య పరందృష్ట్వా నివర్తతే' (2-59) అని భగవాను డిదివఱకే ఈ భావమును వ్యక్తముచేసి యున్నాడు. ఇది వేదాంతమునందలి కీలకమగుటచే ముముక్షువులెల్లరు దీనిని చక్కగ గ్రహించవలెను. కావున ప్రతివాడును దేహమునందుగాని, ఇంద్రియములందుగాని, మనస్సు నందుగాని, బుద్ధియందుగాని నివసించుట తగదనియు వాని యన్నింటికి సాక్షిగా, పరముగానున్న ఆత్మనుజేరి అచటనే నివాసమేర్పఱచుకొనవలెననియు, అపుడే పూర్ణ ఇంద్రియ నిగ్రహము, తద్ద్వారా కామాదుల జయము తత్ఫలితముగ సంసారబంధ విచ్ఛేదము సంభవించుననియు ఇచట స్పష్టమొనర్పబడినది. జీవుడు తన గొప్ప అంతస్తును తాను గుర్తించవలెను. తాను

సర్వోపరిస్థానమందుగల ఆత్మయే యను నిశ్చయభావము గలిగియుండవలెను. అట్టి నిశ్చయముచే ఇంద్రియాదుల జయము అతిసులభముగ సిద్ధించును. ఆత్మయందు స్థావరము నేర్పరచుకొని ఇంద్రియాదులను దుష్టమృగములను గురిపెట్టి కాల్చవలెను. ఆ చోటనుండి తప్ప తక్కిన యేస్థానమునుండికూడ వానిని పూర్ణముగ వశపఱచు కొనుట సాధ్యముకాదని తెలుపుచు బుద్ధికి పరమైన ఆత్మయందే సదా నిలుకడను బొందులాగున భగవాను డీశ్లోకమున, రాబోవు శ్లోకమున హెచ్చరికచేయుచున్నాడు.

ప్ర:- ఆత్మయొక్క స్థానమును, శక్తిని నిరూపించుము?

ఉ:- దేహమునకుపైన ఇంద్రియములు, ఇంద్రియములకు పైన మనస్సు, మనస్సునకుపైన బుద్ధి, బుద్ధికిపైన ఆత్మ కలదు. ఇవి ఒకదానికంటె మఱియొకటి ఉత్తరోత్తర శ్రేష్ఠములై యొప్పుచున్నవి.

అ॥ ఈ ప్రకారముగ ఆత్మ అన్నిటికంటెను పరముగ నున్నదని తెలిసికొని అట్టి యనుభవముచే కామపిశాచమును పారద్రోలవలసినదిగా ఆదేశించుచున్నాడు -

## 43. ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా
## జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్.

**టీక:-** మహాబాహో = గొప్ప బాహువులుకల ఓ అర్జునా! ఏవమ్ = ఈ ప్రకారముగ, బుద్ధేః = బుద్ధికంటె, పరమ్ = అతీతమైనదానినిగా, లేక, శ్రేష్ఠమైనదానినిగా, (ఆత్మానమ్ = ఆత్మను), బుద్ధ్వా = తెలిసికొని, ఆత్మనా = (వివేకవంతమైన) బుద్ధిచేత, ఆత్మానమ్ = మనస్సును, సంస్తభ్య = లెస్సగా నరికట్టి, దురాసదమ్ = జయించుటకు కష్టసాధ్యమైనట్టి, కామరూపమ్ = కామమను, శత్రుం = శత్రువును, జహి = నశింపజేయుము (విడువుము లేక జయింపుము).

**తా:-** గొప్పబాహువులుకల ఓ అర్జునా! ఈ ప్రకారముగ బుద్ధికంటె అతీతమైన దానినిగా ఆత్మ నెఱింగి, (వివేకముతో గూడిన) బుద్ధిచేత మనస్సును బాగుగ నరికట్టి జయించుటకు కష్టసాధ్యమైనట్టి ఈ కామమను శత్రువును నశింపజేయుము.

**వ్యాఖ్య:-** ప్రపంచములోగల దుఃఖమంతటికిని కారణము జీవుడు తన నిజ స్వరూపమును తెలిసికొనక యుండుటయే. తాను దేహమని, ఇంద్రియములని, మనస్సని యనుకొనుచు జీవుడు ఆ యా దేహేంద్రియాదుల వికారములను తనపై ఆరోపించుకొనుచు దుఃఖించుచున్నాడు. ఈ దేహాదిరూప దృశ్యతాదాత్మ్యమే అశాంతికి, దుఃఖమునకు మూలము. కాని భగవాను డిచట యథార్థతత్త్వమును బోధించుచు 'ఓ జీవుడా! నీవు బుద్ధికంటెను పరమైనట్టి ఆత్మవే కాని దేహాదులుకావు. అట్టి యాత్మస్థానమున నిలుకడనొంది జయింప దుస్సాధ్యమగు ఈ కామమను శత్రువును నశింపజేసి పరమానందమొందుము' అని కరుణతో బోధించుచున్నారు.

దేహమునకు, ఇంద్రియములకు, మనస్సునకు వాస్తవముగ చైతన్యమును కల్పించుచున్నది ఆత్మయే. ఆత్మనుండియే అవి శక్తిని గ్రహించుచున్నవి. కాని అవియే కాలక్రమమున ఆత్మను మరుగుబఱచి తామే పైకివచ్చి కూర్చున్నవి. జీవుని అజ్ఞానమే దీనికి కారణము. ఆత్మను విస్మరించుటయే దీనికి హేతువు. కావున ఇపుడు విచారణచేతను, మహనీయుల బోధలచేతను తన యథార్థస్వరూపమును (ఆత్మను) తిరిగి జ్ఞప్తికి

తెచ్చుకొనినచో ఆ దేహేంద్రియాదు లన్నియు అణగియుండును. కాబట్టి భగవాను డీశ్లోకమున కామజయమునకు, బంధరాహిత్యమునకు ఆత్మజ్ఞానమొకటియే పరమశరణ్యమని తెలుపుచు, అట్టి ఆత్మయొక్క సర్వోపరిస్థానమును, ప్రచండసామర్థ్యమును వెల్లడించుచున్నాడు.

దేహేంద్రియాది సంఘాతమునకంతకును వ్యవహారమును కల్పించుచున్న ఏ అభ్యాసము, ఆత్మతోటి దృశ్యసంగము కలదో ఆ సంగమును, గ్రంథిని, వివేకమను శస్త్రముతో ఛేదించివైచినచో ఇక ఆ ఇంద్రియాదులన్నియు దుర్బలములై, నిర్వీర్యములైపోవును. దీనినే గ్రంథివిచ్ఛేదనమందురు. అజ్ఞాని ఈ దేహేంద్రియాది దృశ్యజాతమంతటితో తన్ను ముడివేసికొనును. జ్ఞాని ఆముడిని ఊడదీసి తననుండి (ఆత్మనుండి) దానిని వేఱుపఱచుకొనును. అపుడీ ఇంద్రియాదులన్నియు ఉన్నను జీవుని ఏ మాత్రము బాధింపనేరవు. అవి యాతనికి లొంగిపడియుండును. ఇదియే వేదాంతమునందలి పరమరహస్యము. ఒక్కొక్క ఇంద్రియమును, ఒక్కొక్క దృశ్యవస్తువును పట్టుకొని లొంగదీసికొనుటకంటె, సమస్తమునకు మూలమగు ఆత్మస్థానమును జేరినచో, ఒక ఇంద్రియములేల, మనస్సేల, బుద్ధియేల, సమస్తదృశ్యము కూడ వశమైపోవును. సంసార దుఃఖమంతయు శమించుటకిది సులభోపాయము. నడచుచున్న రైలుబండిని ఆపవలెనని వేలకొలది జనులు పట్టి వెనుకకు లాగినను ఆగదు. ఇంజనులోని ఒక చిన్న 'బ్రేకు' వేసినచో ఆగిపోవును. ఒక ఫ్యాక్టరీలోని చక్రములన్నిటిని ఆపవలెనని ఇంజనుతో కలుపునట్టి బెల్టు తొలగించిన చాలును. అట్లే ఈ సంసారచక్రపరిభ్రమణమంతయు, ఈ అనాది దుఃఖజాలమంతయు ఇతరమగు ఏ ప్రక్రియ చేతను తొలగదు. దృశ్యముతోటి ఆత్మయొక్క సంగమును ఛేదించివైచినచో చాలును. అది అంతయు ఆగిపోవును. ఆత్మస్వరూపవిజ్ఞాన మొకదానిచేతనే తత్ఫలితము చేకూరగలదు. ఈ రహస్యమునే భగవాను డీశ్లోకములందు వ్యక్తమొనర్చుచున్నాడు. తత్త్వజ్ఞానముచే వాసనాక్షయము తప్పక కలుగగలదని ఘంటాపథముగ నిట వచించుచున్నారు.

"దురాసదమ్" - కామమను శత్రువు మహాశక్తివంతమైన దనియు, జయించుటకు కష్టసాధ్యమైనదనియు చెప్పబడినది. మహావటవృక్షము వేళ్లు తన్నుకొని దృఢముగ నున్నట్లు, పెక్కుజన్మలందు బలమును సంపాదించుకొని కామము హృదయక్షేత్రమున చక్కగ నిలద్రొక్కుకున్నది. కామరూపమహాపాదపము అసంగమను (ఆత్మజ్ఞానమను) గండ్రగొడ్డలిచేతనే ఛేదింపశక్యమగును (అసంగ శస్త్రేణ దృఢేన ఛిత్త్వా).

కామమను శత్రువును జయించుట కీచిన్న బాహువులు చాలవు. మహాబాహువులు, శక్తివంతములైన భుజములు, గొప్పబలము కావలెనని సూచించుటకే కాబోలు అర్జునుని 'మహాబాహో' యని భగవాను డిచట సంబోధించెను.

కాబట్టి శోకసాగరమును తరింపదలంచువారు, కామాదిశత్రువులను జయింపదలంచువారు, మోక్షపదవిని కాంక్షించువారు, తాము దేహేంద్రియాదులని భావింపక, వాని యన్నింటికిని సాక్షియగు ఆత్మయే తామని దృఢముగ నిశ్చయించుకొనవలెను. అట్టి నిశ్చయము గల్గియున్నచో ఇక నిండు యౌవనమందున్నప్పటికిని, ప్రపంచమధ్యమున మెలగు చున్నప్పటికిని, ఇంద్రియములు అదుపులోనేయుండును. ఈ ప్రకారముగ కామాదులను జయించుటకు ఆత్మజ్ఞానమను అద్భుతసాధనమును భగవాను డిచట బోధించినవారైరి.

కర్మయోగమునుగూర్చి బోధించుచు బోధించుచు తుట్టతుద కీయఖండజ్ఞానబోధను

గావించినందువలన, ప్రతి వారును, మొట్టమొదట నిష్కామకర్మాచరణ ద్వారా చిత్తశుద్ధిని బడసి, తద్ద్వారా దృగ్దృశ్యవివేకరూపమగు ఈ ఆత్మజ్ఞానమును తప్పక పొందవలసి యుందురని స్పష్టము చేయబడినట్లైనది.

**ప్ర:–** కామమును జయించుట కుపాయమేమి?

**ఉ:–** బుద్ధికంటెను పైస్థానమున నున్న సాక్షియగు ఆత్మను తెలిసికొని అచ్చోట నిలుకడను బొందినచో కామము పలాయనము చిత్తగించగలదు.

ఓమ్

ఇతి శ్రీమద్భగవద్గీసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే

శ్రీకృష్ణార్జునసంవాదే కర్మయోగోనామ

తృతీయోఽధ్యాయః

ఇది ఉపనిషత్ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును,

శ్రీకృష్ణార్జున సంవాదమునగు శ్రీ భగవద్గీతలందు కర్మయోగమను

మూడవ అధ్యాయము

ఓమ్ తత్ సత్



ఓం

# శ్రీ భగవద్గీత

అథ చతుర్థో౽ధ్యాయః

## నాల్గవ అధ్యాయము

జ్ఞానయోగః

## జ్ఞానయోగము

**ఈ అధ్యాయముయొక్క పేరు :-**

"జ్ఞానయోగము" - ఈ అధ్యాయమునందు జ్ఞానసంబంధమైన విచారణయుండుట చేతను, జ్ఞానతపస్సు, జ్ఞానయజ్ఞము, జ్ఞాననౌక, జ్ఞానాగ్ని, జ్ఞానఖడ్గము - మున్నగు వానిని గూర్చి ప్రస్తావింపబడుటచేతను, అధ్యాత్మజ్ఞానముయొక్క మహిమ విశేషముగ చెప్పబడుటచేతను, అట్టి జ్ఞాన మెవరికి ఎట్లు లభించునో చక్కగ విశదీకరింపబడుటచేతను ఈ ప్రకారముగ జ్ఞానమునకు సంబంధించిన విషయములే యెక్కువగా వర్ణింప బడియుండుటవలనను దీనికి జ్ఞానయోగమని పేరు పెట్టబడినది.

**ఈ అధ్యాయమందలి ప్రధాన విషయములు :-**

(1) భగవానుని ప్రభావము, నిష్కామకర్మయోగ ప్రస్తావన (1వ శ్లో॥ నుండి 18 వ శ్లో॥ వఱకు).

(2) జ్ఞానియొక్క పవిత్ర ఆచరణము (19వ శ్లో॥ నుండి 23వ శ్లో॥ వఱకు).

(3) వివిధములగు యజ్ఞముల వర్ణన- జ్ఞానయజ్ఞముయొక్క ఆధిక్యత (24వ శ్లో॥ నుండి 32 వ శ్లో॥ వఱకు).

(4) జ్ఞానముయొక్క మహిమ (33వ శ్లో॥ నుండి 42వ శ్లో॥ వఱకు).

**పూర్వాధ్యాయముతో ఈ అధ్యాయమునకు గల సంబంధము :-**

నిష్కామకర్మాచరణముచే చిత్తము శుద్ధము కాగా, అట్టి నిర్మలచిత్తమున జ్ఞాన ముదయించుననుట పరమసత్యము. క్రిందటి అధ్యాయమగు 'కర్మయోగమున' అట్టి చిత్తశుద్ధికి వలసిన కర్మాచరణపద్ధతు లన్నియు చక్కగ తెలుపబడనవి. కావున ఇక జ్ఞానావలంబమునకు క్షేత్రము సిద్ధిపడినట్లే అయినది. ఇక్కారణమున వెనువెంటనే అర్జునునకు జ్ఞానయోగమును భగవాను డీయధ్యాయమున ప్రసాదించుచున్నారు. అట్టి జ్ఞానమే ఈ అధ్యాయముయొక్క విషయము. ఈ అధ్యాయమున జ్ఞానసంబంధ వార్తలే యెక్కువగనున్నను, మధ్య యొకింత కర్మయోగప్రస్తావనయుకలదు. వెనుకటి అధ్యాయములందు వివరింపబడిన నిష్కామకర్మయోగాదిరూప అధ్యాత్మవిద్య అతి ప్రాచీనమైనదనియు, మొట్టమొదట భగవానుడే దానిని సూర్యున కుపదేశింప, సూర్యునిద్వారా క్రమముగ మన్వాది మహర్షులు దాని నవలంబించిరనియు ఈ అధ్యాయ ప్రారంభమున తెలుపబడినది. ఈ ప్రకారముగ నిష్కామకర్మయోగము యొక్క ప్రశంసతో ఈ

# జ్ఞాన యోగము



**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్**
**ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే.** **(4-8)**

సాధు, సజ్జనులను సంరక్షించుటకొఱకును, దుర్మార్గులను వినాశ మొనర్చుట కొఱకును, ధర్మమును లెస్సగ స్థాపించుటకొఱకును నేను ప్రతియుగమునందును అవతరించుచుందును.

అధ్యాయము ప్రారంభింపబడుచున్నది - మూడు శ్లోకములద్వారా శ్రీకృష్ణమూర్తి తత్సందర్భమును వివరించుచున్నాడు -

**శ్రీ భగవానువాచ :-**

**1. ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయమ్**
**వివస్వాన్ మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్.**

శ్రీ భగవానువాచ = శ్రీ భగవంతుడు పలికెను.

**టీక:-** అవ్యయమ్ = నాశరహితమైనట్టి, ఇమంయోగమ్ = ఈ నిష్కామకర్మయోగ మును, (తద్ద్వారా పొందబడు జ్ఞాననిష్ఠను), అహమ్ = నేను, (పురా = సృష్ట్యాదికాలమున) వివస్వతే = సూర్యునికొఱకు, ప్రోక్తవాన్ = చెప్పియుంటివి, వివస్వాన్ = సూర్యుడు, మనవే = (తన పుత్రుడగు వైవస్వత) మనువుకొఱకు, ప్రాహ = చెప్పెను, మనుః = మనువు, ఇక్ష్వాకవే = (తనపుత్రుడగు) ఇక్ష్వాకునికొఱకు, అబ్రవీత్ = చెప్పెను.

**తా:-** శ్రీభగవానుడు చెప్పెను - నాశరహితమగు ఈ నిష్కామకర్మయోగమును (తద్ద్వారా పొందబడు జ్ఞాననిష్ఠను) పూర్వము నేను సూర్యునకు జెప్పితిని. సూర్యుడు వైవస్వత మనువున కుపదేశించెను. మనువు ఇక్ష్వాకునకు బోధించెను.

**వ్యాఖ్య:-** ఈ నిష్కామకర్మయోగమును (తద్ద్వారా పొందబడు జ్ఞాననిష్ఠను) పూర్వము భగవానుడు సూర్యున కుపదేశింప, ఆతనిద్వారా క్రమముగ తక్కిన రాజర్షులును తెలిసికొనగల్గిరి. ఈ మహత్తరయోగము జీవుని చిత్తమును శుద్ధపరచి స్వస్వరూపానుభూతిద్వారా సంసారబంధవిచ్ఛిత్తిని. మోక్షమును కలుగజేయునదియగుటచే దీనిని సాధించినవారందఱు ఋషిసత్తములై ముక్తులైరి. వారు సంఘమున ఏ అంతస్తునందున్నప్పటికిని, బ్రాహ్మణులైనను, రాజులైనను, తదితరులైనను సర్వులును పరమశ్రేయమును బొందిరి.

"అవ్యయమ్" - చిత్తశుద్ధిద్వారా నాశరహితమగు మోక్షమను ఫలమొసంగుట వలన నిష్కామకర్మయోగాదిరూప అధ్యాత్మవిద్య అవ్యయమని చెప్పబడినది. మఱియు సత్యము ఏ కాలమందును నశింపదు కనుక, ఆ సత్యమును పొందింపజేయ మార్గమునకును ఏ కాలమందును నాశముండదు. కావున అది అవ్యయమైనది. ఒకవేళ దాని ప్రచారము దేశకాలపరిస్థితులచే హెచ్చుతగ్గులు గల్గియున్నను అది మాత్రము పూర్తిగ అంతరించదు. భగవానుడే అవతారమెత్తి దాని నుద్ధరించుచుందురు.

**ప్ర:-** నిష్కామ కర్మయోగ మెట్టిది?

**ఉ:-** నాశరహితమైనది. శాశ్వత మోక్షఫలంబొసంగునది.

**ప్ర:-** అది లోకమున నెట్లు వ్యాపించెను?

**ఉ:-** మొట్టమొదట భగవానుడు సూర్యున కుపదేశింప, సూర్యుడు మనువునకును, మనువు ఇక్ష్వాకువునకును దానిని బోధింప, క్రమముగ లోకమున వ్యాపించెను.

## 2. ఏవం పరమ్పరాప్రాప్తమిమం రాజర్షయో విదుః
## స కాలేనేహ మహతా యోగో నష్టః పరన్తప.

**టీక:–** పరన్తప = ఓ అర్జునా! ఏవమ్ = ఈ ప్రకారముగ, పరమ్పరాప్రాప్తమ్ = పరంపరగ వచ్చిన, ఇమమ్ = ఈ యోగమును, రాజర్షయః = రాజర్షులు, విదుః = తెలిసికొనిరి, మహతాకాలేన = చాలాకాలము గడచినందున, సయోగః = ఆ యోగము, ఇహ = ఈ లోకమున, నష్టః = అదృశ్యమైనది.

**తా:–** ఓ అర్జునా! ఈ ప్రకారముగ పరంపరంగా వచ్చిన ఈ నిష్కామకర్మ యోగమును రాజర్షులు తెలిసికొనిరి. చాలాకాలము గడచినందున ఆ యోగ మిపుడి లోకమున అదృశ్యమైనది (ప్రచారములో లేకున్నది).

**వ్యాఖ్య:–** "రాజర్షయః" - రాజు అధ్యాత్మవిద్యయొక్క అనుభూతి గలిగి యుండి నపుడు రాజర్షి యగును. అనగా రాజత్వము, ఋషిత్వము రెండునుగలవాడు రాజర్షి యనబడును. పూర్వ మనేకమంది రాజులు ఈ పరమార్థవిద్యను గ్రహించి రాజర్షులుగా మారిరి. 'ఋషి' అనునది ఒక బిరుదు. దాని నెవరైనను పొందవచ్చును. అధ్యాత్మ జ్ఞానమును చక్కగ సాధించినచో సామాన్యమానవుడు మహర్షిగా మారిపోగలడు. నిష్కామకర్మయోగము నవలంబించి, ఇంద్రియములను జయించి, మనస్సును స్వాధీనపఱచుకొని, కామాదులను నిర్జించి ఆత్మానుభవము నొందగల్గువాడే ఋషిత్వమును బడసినట్లగును. పూర్వ మెందరో రాజు లాప్రకార మాచరించి రాజర్షులు కాగల్గిరని యిట వచింపబడినది. ఎన్నియో కార్యకలాపములు, విక్షేపములు, వ్యవహారములుగల రాజులే ఇట్టి విద్యను సాధింపగల్గినపుడు, ఇక తక్కినవారి విషయము చెప్పనేల? కొందఱు గృహస్థులు తమకు అనేక కుటుంబ వ్యవహారములు, ఉద్యోగపుపనులు, వ్యవసాయకార్యములు ఉండుననియు, ఆధ్యాత్మికసాధనల నొనర్చుటకు ఏ మాత్రము తీరకలేదనియు, అన్నియు వదలిన సన్న్యాసులకే అది సాధ్యపడుననియు వచించుచుందురు. ఆ వాక్యము సత్యదూరమైనదని ఈ శ్లోకము ఋజువుచేయుచున్నది. రాజునకులేని వ్యవహారములా గృహస్థులకుండునవి? కావున ఆ పూర్వకాలపు రాజులవలె సర్వులును నిష్కామకర్మ యోగాది పరమార్థసాధనల ననుష్ఠించి తరింపవచ్చును. ఈ శ్లోకమున రాజర్షులు తెలిసికొనిరి అని చెప్పబడినందున, తక్కిన వారు తెలిసికొనలేదని యర్థముకాదు. ఆ కాలమున దాని నాచరించువారిలో రాజులు ప్రధానులై యుండిరి. మఱియు అర్జునుడు రాజై యుండినందువలన పూర్వీక రాజుల యొక్క యా మార్గము ననుసరించుటలో నాతనికి కష్టతరమైనదేదియు నుండదని తెలుపుట కొఱకును అట్లు చెప్పియుండవచ్చును.

"నష్టః" - అను పదమునకు పూర్తిగ నశించిపోయినది అను అర్థముకాదు. కాలగర్భమున (పరశురాముడు రాజులను వధించుట మొదలగు అవాంతర పరిస్థితులచే) రాజర్షులెఱిగిన ఆ బ్రహ్మవిద్యయొక్క, నిష్కామకర్మయోగముయొక్క ప్రచారము లోకమున సన్నగిలినదనియే అర్థము. కానిచో పైశ్లోకమునందే ఈయోగము 'అవ్యయమ్', (నాశరహితమైనది) అని చెప్పినదానికి వ్యాఘాతము కలుగును. పరమాత్మ యెట్లు శాశ్వతుడో, ఆతనిచే సృజింపబడిన ధర్మమున్ను శాశ్వతమైనదే యగును.

## 3. స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః
## భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్.

**టీక:—** మే = నా యొక్క, భక్తః = భక్తుడవును, సఖాచ = స్నేహితుడవును, అసి ఇతి = అయితివని, పురాతనః = ప్రాచీనమైన, సః ఏవ అయం యోగః = ఆ యీ నిష్కామకర్మ యోగమే, అద్య = ఇప్పుడు, తే = నీ కొఱకు, మయా = నాచేత, ప్రోక్తః = చెప్పబడినది, ఉత్తమమ్ = శ్రేష్ఠమైన, ఏతత్ = ఈ యోగము, రహస్యమ్ హి = అతిరహస్యమైనది కదా!

**తా:—** నీవు నాభక్తుడుగను, మిత్రుడుగను నున్నావు కావున ఆ పురాతనమైన నిష్కామకర్మయోగమునే యిపుడు తిరిగి నీకు జెప్పితిని. అది మిగుల శ్రేష్ఠమైనదనియు, రహస్యమైనదనియు నెఱుంగుము.

**వ్యాఖ్య:—** భగవాను డర్జునునకు బోధించిన ఈ (ఈ నిష్కామకర్మయోగాది) పరమార్థవిద్య క్రొత్తగా ఆవిర్భవించినదికాదు. అనాదికాలమునుండియు కలదు. కనుకనే అది 'పురాతనము' అని చెప్పబడినది. అయితే దేశకాలపరిస్థితులనుబట్టి కాలగర్భమున అది ఒకింత మరుగైనపుడు సాక్షాత్ దైవముకాని లేక దైవాంశసంభూతులగు మహనీయులుగాని యవతరించి అద్దానిని సముద్ధరించుదురు. ఇట్టి ప్రాచీనమగు ఉత్తమవిద్యనే శ్రీకృష్ణమూర్తి అర్జునున కిపుడు బోధించిరి.

ఈ యోగమును అర్జునునకే యేల బోధింపవలెను? ఇందులకు కారణము కలదు. ఆ కారణ మీ శ్లోకమున స్పష్టముగ తెలుపబడినది. అర్జునుడు పరమభక్తుడు, పరమమిత్రుడు. కనుకనే భగవానుడు అతిరహస్యమైనప్పటికిని దాని నతనికి ఉపదేశించివైచిరి. అర్జునునివలెనే ఎవరైనను సరియే నిర్మలభక్తి, పరమప్రేమ సంపాదించుకొనగల్గుచో వారికిని భగవానుడు తప్పక అధ్యాత్మజ్ఞానమును ప్రసాదించగలరు. (దదామి బుద్ధియోగమ్ 10-10). కాబట్టి అర్జునునివలె అర్హతను ముందు సంపాదించుకొనవలెను. తదుపరి జ్ఞానము దానియంతట నదియే భగవత్కృపవలన లభించగలదు.

"రహస్యం హ్యేతదుత్తమమ్" - భగవానుడు బోధించిన ఈ పరమార్థవిద్య, ఈ నిష్కామకర్మతత్త్వము పరమరహస్యమైనదనియు, మహోత్కృష్టమైనదనియు తెలుప బడినది. సామాన్యముగ రహస్యమును ఎవరును ఒకరికి తెలుపరు. కాని అర్జునుని యందు తగిన యోగ్యతలు (భక్తి, ప్రేమ) ఉన్నందున శ్రీకృష్ణ డాతనికి రహస్యమును బట్టబయలుచేసివైచిరి. మఱియు, 'ఉత్తమమ్' అని చెప్పినందువలన ప్రపంచములో గల సమస్త పదార్థములందును శ్రేష్టమైనది. ఈ అధ్యాత్మవిద్యయేయని భగవానుడు స్పష్టముచేసినట్లైనది.

**ప్ర:—** భగవాను డర్జునునకు బోధించిన పరమార్థవిద్య, నిష్కామకర్మతత్త్వము ఎట్టిది?

**ఉ:—** (1) పురాతనమైనది (2) ఉత్తమమైనది (3) రహస్యమైనది.

**ప్ర:—** ఇట్టి విద్యను అర్జునునికే ఏల ఉపదేశింపవలెను?

**ఉ:—** భగవానున కాతడు (1) పరమభక్తుడు (2) పరమమిత్రుడు కాబట్టి.

**అ॥** శ్రీకృష్ణమూర్తి పూర్వము సూర్యభగవానున కీపరమార్థవిద్య నుపదేశించిరను వాక్యమును వినుటతోడనే, మొన్న మొన్న (ద్వాపరయుగాంతమున) దేవకీగర్భమున పుట్టిన శ్రీకృష్ణుడు సృష్ట్యాదియందు సూర్యున కెట్లు బోధింపగల్గిరను సంశయ మర్జునునకు కలుగగా, వెంటనే తన్నివృత్తికొఱ కాతడు భగవానుని యిట్లు ప్రశ్నించెను -

**అర్జున ఉవాచ :-**

**4. అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః**
**కథమేతద్విజానీయాం త్వమాదౌ ప్రోక్తవానితి.**

అర్జున ఉవాచ = అర్జునుడు చెప్పెను -

**టీక:-** భవతః = నీ యొక్క, జన్మ = జన్మము, అపరమ్ = తరువాతిది, వివస్వతః = సూర్యునియొక్క, జన్మ = జన్మము, పరమ్ = వెనుకటిది, ఆదౌ = సృష్ట్యారంభమున, త్వమ్ = నీవు, ప్రోక్తవాన్ ఇతి (యత్) = చెప్పితివనుట యేదికలదో, ఏతత్ = దీనిని, కథమ్ = ఎట్లు, విజానీయామ్ = తెలిసికొందును!

**తా:-** అర్జునుడు చెప్పెను - (ఓ కృష్ణా!) మీ జన్మము ఇటీవలది. సూర్యుని జన్మము బహుపురాతనమైనది. అట్టిచో మీరు సూర్యున కుపదేశించితిరను విషయమును నేనెట్లు గ్రహించగలను?

**వ్యాఖ్య:-** పూర్వము రాజసూయయాగసందర్భమున అర్జునుడు భీష్మునివంటి మహనీయుని ముఖతః శ్రీకృష్ణునియొక్క నిజతత్త్వమును, వారు సాక్షాత్ పరమాత్మ యేయను సత్యమును వినియుండెను. అయినను ఇపుడు శ్రీకృష్ణుని దేవకీసుతునిగనే వీక్షించి 'మీరు మొన్న మొన్ననే పుట్టితిరిగదా!' అని పలుకుటకు కారణమేమి? ఇందులకీ క్రింది హేతువులను చెప్పవచ్చును. (1) సాక్షాత్ శ్రీకృష్ణుని ముఖతః ఆతని అవ్యయస్వరూపవర్ణనమును అర్జునుడు స్వయముగ వినగోరియుండవచ్చును. (2) ఈ ప్రశ్న ద్వారా సామాన్యజనులయొక్క మనస్సునందుండు సంశయమును నివారింపజేయదలంచి యుండవచ్చును.

శ్రీకృష్ణమూర్తి కేవలము పాంచభౌతికరూపముకాదు. వారు త్రికాలాబాధ్యులగు విశ్వవ్యాపకులైన పరమాత్మ. ఈ సత్యమును భగవానుడే మఱుశ్లోకమునందు జెప్పబోవుదురు. దేహదృష్టి, మనోదృష్టి, ఆత్మదృష్టి యని మూడుదృష్టులు కలవు. ఒకవ్యక్తిని జూడగనే ఆతనిశరీరము, చర్మము, దాని అందచందములు, దాని పుట్టుక, జాతి, రంగు, ఆకారము మాత్రమే స్ఫురణకువచ్చుట దేహదృష్టి. ఆతని పాండిత్యము, గుణగణములు, శీలము మున్నగువానిని తలంచుట మనోదృష్టి. ఆతని నిర్మల ఆత్మరూపమునే వీక్షించుట ఆత్మదృష్టి. ఇందు మూడవదియగు ఆత్మదృష్టినే మహనీయులు గలిగియుందురు. సామాన్యజనులు మొదటి రెండుదృష్టులను అవలంబింతురు. దేహము, మనస్సు ప్రకృతి జన్యములు, నశ్వరములు. ఆ దృష్టులు సరికావు. కావున ఆత్మదృష్టినే ప్రతివారును అభ్యసించవలయును. దానినే భగవాను డిపుడు ప్రతిపాదింపబోవుచున్నాడు.

**అ॥** అర్జునుని యా ప్రశ్న విని శ్రీకృష్ణమూర్తి తన నిజతత్త్వమును ప్రకటించుచున్నాడు -

**శ్రీ భగవానువాచ :-**

**5. బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున**
**తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరన్తప.**

శ్రీ భగవానువాచ : శ్రీభగవంతుడు చెప్పెను.

**టీక:–** అర్జున = ఓ అర్జునా!, మే = నాకును, తవచ = నీకును, జన్మాని = జన్మలు, బహూని = అనేకములు, వ్యతీతాని = గడచిపోయినవి, తాని సర్వాణి = వానినన్నిటిని, అహమ్ = నేను, వేద = ఎఱుంగుదును, పరన్తప = ఓ అర్జునా!, త్వమ్ = నీవు, న వేత్థ = ఎఱుగవు.

**తా:–** శ్రీ భగవానుడు చెప్పెను - శత్రువులను తపింపజేయు ఓ అర్జునా! నీకును, నాకును ఇంతవఱ కనేక జన్మలు గడచినవి. వాని నన్నిటిని నే నెఱుంగుదును. నీ వెఱుంగవు.

**వ్యాఖ్య:–** ఈశ్వరుడు, జీవుడు - ఇరువురును వాస్తవముగ ఒకే ఆత్మ స్వరూపులు. కాని ఈశ్వరుడు మాయను జయించినవాడు; జీవుడు మాయాధీనుడు. ఇదియే వారిరువురకును గల భేదము. ఈశ్వరుడు మాయను స్వాధీనముచేసికొని లోకసంరక్షణార్థము పెక్కు జన్మలు (అవతారములు) ఎత్తుచుండును. జీవుడు మాయకు లోబడి, కర్మబద్ధుడై అనేక జన్మ లెత్తుచుండును. ఈశ్వరుడు సర్వజ్ఞుడుకావున తానెత్తిన యా జన్మలన్నిటిని ఎఱింగియేయుండును. జీవుడు కించిజ్జ్ఞుడు కావున అట్టి స్మృతి వానికి లేదు. ఈ సత్యమునే భగవాను డీశ్లోకమున వివరించుచున్నాడు.

అజ్ఞానవశమున జీవునిదృష్టి ఈ వర్తమానజన్మకే పరిమితమైయుండును. వాస్తవముగ ప్రతిజీవికి కోట్లకొలది జన్మలు గడచినవి. ఇప్పటికి ఎందఱో తండ్రులు, ఎందఱో తల్లులు అతనికి గడచిపోయిరి. ఆత్మజ్ఞానముచే కర్మబంధము నశింపనిచో ఆతడింకను ఎన్నియో జన్మలెత్తవలసియుండును. పుణ్యవశాత్తు ఇపుడు సర్వోత్తమమగు మానవజన్మ లభించినది. మోక్షమునకు సోపానమువంటి ఈ మానవజన్మను బొందియు తన యాత్మనెఱింగి తరించుటకై యత్నింపక జన్మల నంతముచేయజూడక, పై పెచ్చు విషయభోగములందు మునింగి తత్ఫలితముగ ఇంకను అనేకజన్మలందు యాతనల ననుభవించువాడు నిక్కముగ దౌర్భాగ్యుడేయగును. కాబట్టి భగవాను డీశ్లోకమున దెలిపినట్లు ప్రతివాడును తనపూర్వజన్మలన్నింటిని ఒకపర్యాయము స్మృతిపథమునకు దెచ్చుకొని, ఆ యమయాతనలను, ఆ గర్భనరకములను, క్లేశములను సంస్మరించి, ఇకమీదట అట్టి జన్మలకు స్వస్తిచెప్పులాగున కృతనిశ్చయుడుకావలెను. తల్లిగర్భమున నున్నపుడు జీవునకు దాదాపు 7వ మాసమున క్షణకాలము దివ్యదృష్టిగలుగగా నపుడాతడు తనపూర్వపు జన్మలన్నిటిని జూచి భీతిల్లి భగవానుని శరణుబొంది జన్మరాహిత్యమునకై ఈజీవితమున సర్వయత్నములు చేసెదనని వాగ్దానముచేయును. కాని గర్భమునుండి వెలువడగనే అంతయు మఱచిపోవును. అట్లుచేయక, జీవుడు భగవానుని ఆశ్రయించి ఈజన్మయందే కడతేరులాగున చూడవలయును. పురోభివృద్ధిని గోరువాడు పూర్వవృత్తాంతమును మఱువగూడదు. భగవాను డర్జునునకు పూర్వజన్మలనుగూర్చి జ్ఞాపకము చేసెను. అర్జునునకువలె ప్రతిమానవునకును అట్టిజన్మలు సంభవించియున్నవి. గనుక, వానిని సంస్మరించి ఈ జన్మయందు భక్తి జ్ఞానవైరాగ్యాది సాధనములచే ఆత్మానుభూతిని సముపార్జించుటద్వారా సంసారబంధవిచ్ఛిత్తిని, జన్మరాహిత్యమును గలుగజేసికొనుట జీవుని కర్తవ్యము.

**అ॥** తన జన్మకున్ను, తక్కిన జీవరాసుల జన్మలకున్ను గల భేదమును తెలుపుటకై, తన జన్మరహస్యమును భగవాను డెఱింగించుచున్నాడు–

**6. అజోఽపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపి సన్
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా.**

**టీక:–** (అహమ్ = నేను), అజః అపిసన్ = పుట్టుకలేనివాడనైనను, అవ్యయాత్మా (అపిసన్) = నాశరహితస్వరూపముకలవాడనైనను, భూతానామ్ = ప్రాణులకు, ఈశ్వరః అపిసన్ = ఈశ్వరుడను (నియామకుడను) అయియున్నను, స్వామ్ = స్వకీయమైన, ప్రకృతిమ్ = ప్రకృతిని, అధిష్ఠాయ = స్వాధీనపఱచుకొని, ఆత్మమాయయా = నాయొక్క మాయాశక్తిచేత, సంభవామి = పుట్టుచున్నాను.

**తా:–** నేను పుట్టుకలేనివాడను, నాశరహితస్వరూపముకలవాడను, సమస్తప్రాణులకు ఈశ్వరుడను అయియున్నప్పటికి స్వకీయమగు ప్రకృతిని వశపఱచుకొని నా మాయాశక్తిచేత పుట్టుచున్నాను (అవతరించుచున్నాను).

**వ్యాఖ్య:–** 'నాకును అనేక జన్మలు గడచినవి' అని శ్రీకృష్ణమూర్తి క్రిందటి శ్లోకమునందు చెప్పియుండిరి. కావున భగవంతుడును సర్వజీవులవలె జన్మకర్మలకులోనైయున్నారా? అను సంశయ మిచట నుదయింపవచ్చును గనుక అందులకు సమాధానము వెనువెంటనే ఈ శ్లోకమునందు చెప్పబడుచున్నది. భగవంతునియొక్క జన్మమువేఱు, తదితరులయొక్క జన్మమువేఱు. జీవులు ప్రకృతికి వశులై (మాయకులోబడి) కర్మవశమున జన్మలెత్తుచున్నారు. ఈశ్వరు డట్లుకాదు. వారు ప్రకృతికిలోబడక, మాయను స్వాధీనమొనర్చుకొని లోకోపకారార్థము, ధర్మసముద్ధరణము కొఱకు తమ యిచ్ఛచేతనే జన్మలెత్తుచున్నారు. ఇచట భగవంతునకు మూడులక్షణములు చెప్పబడినవి – (1) జన్మలేనివాడు (2) నాశరహితుడు (3) ప్రాణికోట్లయొక్క నియామకుడు – అని. ఈ ప్రకారముగ వాస్తవముగ జన్మరహితుడైనను స్వకీయశక్తిచే లోకసంగ్రహార్థము అవతారము లెత్తుచున్నాడు. ప్రాణికోట్లపై భగవానున కెంత కరుణగల్గియున్నదో, ధర్మసముద్ధరణమందు వారికి ఎంత ఉత్కంఠతగలదో ఈ అవతారతత్త్వముద్వారా మనము గ్రహించుకొనవచ్చును. ఈ వాక్యములవలన శ్రీకృష్ణమూర్తి కేవలము వసుదేవుని సుతుడుమాత్రమే కాదనియు, అవ్యయపరమాత్మయేయనియు, జగన్నియామకుడగు ఈశ్వరుడే యనియు స్పష్టమగుచున్నది.

**ప్ర:–** భగవంతు డెట్టివాడు?

**ఉ:–** (1) జన్మరహితుడు (2) నాశవర్జితుడు (౩) జగన్నియామకుడు (ఈశ్వరుడు)

**ప్ర:–** అట్టి జన్మరహితుడు మరల యేల జన్మలెత్తుచున్నాడు?

**ఉ:–** ప్రకృతిని స్వాధీనపఱచుకొని లోకోద్ధరణముకొఱకు మాత్రము జన్మించుచున్నాడే కాని అజ్ఞానులవలె కర్మకు వశుడై కాదు.

**అ॥** తాను జన్మించుటకు కారణములను రెండుశ్లోకములద్వారా భగవానుడు చెప్పుచున్నాడు-

## 7. యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత
## అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్.

**టీక:–** భారత = ఓ అర్జునా!, యదా యదా = ఎప్పుడెప్పుడు, ధర్మస్య = ధర్మమునకు, గ్లానిః = హానియు, అధర్మస్య = అధర్మమునకు, అభ్యుత్థానమ్ = అభివృద్ధియును, భవతి = కలుగుచున్నదో, తదా = అప్పుడు, ఆత్మానమ్ = నన్ను, అహమ్ = నేను, సృజామి = సృష్టించుకొనుచున్నాను.

**తా:–** ఓ అర్జునా! ఎప్పుడెప్పుడు ధర్మము క్షీణించి, అధర్మము వృద్ధియగుచుండునో, అప్పుడప్పుడు నన్ను నేనే సృష్టించుకొనుచుందును (నేను అవతరించుచుందును).

**వ్యాఖ్య:–** ధర్మము ఎంతశ్రేష్ఠమైనదో భగవానుని ఈవాక్యమువలన సుస్పష్ట మగుచున్నది. 'ధర్మోరక్షతిరక్షితః' అనునట్లు ధర్మాచరణమే మనుజుని రక్షించగలదు. జీవునకు శాంతిని, శాశ్వతసౌఖ్యమును ఒసంగగల్గునది అదియే. కనుకనే భగవాను డద్దాని రక్షణమునకై బద్ధకంకణులైరి. ధర్మముయొక్క రక్షణకై సాక్షాత్ పరమాత్మయే పూనుకొనునని చెప్పినపుడు ఇక నద్దాని మహాత్మ్యమును వేఱుగ వర్ణించవలెనా? అట్లే అధర్మముయొక్క అభివృద్ధిని తాను సహింపలేనని భగవానుడు తెలుపుటవలన దానియొక్క నికృష్టత్వమున్ను స్పష్టముగ గోచరించుచున్నది. కాబట్టి శ్రేయమును కాంక్షించువారందఱును ధర్మము నభివృద్ధిపఱచుచు, అధర్మమును రూపుమాపుచునుండవలెను. అపుడే వారు ఈశ్వరనియమమున కనుగుణ్యముగ నడచువారై జన్మసార్థక్య మొందగలరు.

**ప్ర:–** భగవంతు డెపుడవతరించును?

**ఉ:–** ధర్మము క్షయించునపుడు, అధర్మము వృద్ధినొందునపుడు.

## 8. పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్
## ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే.

**టీక:–** సాధూనాం = సజ్జనులయొక్క (సన్మార్గప్రవర్తకులయొక్క), పరిత్రాణాయ = సంరక్షణముకొఱకును, దుష్కృతామ్ = దుర్మార్గులయొక్క, వినాశాయ చ = వినాశము కొఱకును, ధర్మసంస్థాపనార్థాయ = ధర్మమును లెస్సగ స్థాపించుటకొఱకును, యుగే యుగే = ప్రతియుగమునందును (ప్రతి సమయమునందును అనగా, అపుడుపుడు), సంభవామి = అవతరించుచున్నాను.

**తా:–** సాధు, సజ్జనులను సంరక్షించుటకొఱకును, దుర్మార్గులను వినాశమొనర్చుట కొఱకును, ధర్మమును లెస్సగ స్థాపించుట కొఱకును నేను ప్రతియుగము నందును అవతరించుచుందును.

**వ్యాఖ్య:–** సన్మార్గమున జనువారికి, సత్ప్రవర్తనగలిగియుండువారికి, సాధుశీలురకు మాత్రమే భగవానుని రక్షణ లభించును. సర్వేశ్వరుని సంరక్షణ నభిలషించువారికి తగిన అర్హతయుండవలెను. ఆ అర్హత ఒకానొక జాతికాదు, మతముకాదు, కులముకాదు, సాధుత్వము. అనగా సత్ప్రవర్తన, ధర్మానుష్ఠానము. అట్లు సన్మార్గమున, సత్యపథమున నడచువారందఱును భగవానునిచే సంరక్షింపబడుదురు. వారు భగవంతుని అభయహస్తముక్రింద నుండుటచే వారికి ఏకొఱతయు నుండదు. వారచిరకాలములోనే భవసాగరమును దాటిపోవుదురు. అట్టివారి సముద్ధరణముకొఱకు, పరిరక్షణముకొఱకు తానపుడపుడు అవతరించుచుందునని భగవాను డిచట వాక్రుచ్చిరి.

అట్లే దుష్టులను శిక్షించుటకు గూడ తాను జన్మించుచుందునని వచించిరి. కావున దుష్కార్యములయొక్క ఘోరపరిణామములను ముందుగనే ఊహించుకొని, వానినుండి విముఖులై, పాపభీతిగల్గి, దైవసంస్థాపనము. ధర్మము నుద్ధరించుటకై భగవానుడు బద్ధకంకణులైరి. కావున భగవానున కేది అతిప్రీతికరమైయున్నదో, అట్టి ధర్మమునే ఆశ్రయించి జీవులు సర్వేశ్వరునికృపకు పాత్రులు కావలసియున్నారు.

ఈశ్లోకమునందు తెలుపబడిన (1) సాధుసంరక్షణము (2) దుష్టశిక్షణము (3) ధర్మసంస్థాపనము - అను మూడు ఉద్దేశ్యములలో ఏయొకదానికొఱకుగాని, లేక రెండిటికొఱకుగాని, లేక మూడింటికొఱకుగాని, భగవాను డవతరించుచుందురు.

ఇచట సాధువులనగా సన్న్యాసులనిగాని, బైరాగులనిగాని అర్థముకాదు. 'సాధు' - అనగా 'మంచి' అని యర్థము. మంచిప్రవర్తనగలవారందఱును సాధువులే. వారు గృహస్థులైనను, బ్రహ్మచారులైననుసరియే.

'యుగేయుగే' - అనగా యుగమునకు ఒకసారి అవతరించునను భావము కాదు. 'అపుడపుడు' అని దాని అర్థము. పైనదెలిపిన యవసరము లెపుడేర్పడునో అపుడు - అని తాత్పర్యము.

ఈ శ్లోకమునందు 'త్రాణాయ' అనిచెప్పక 'పరిత్రాణాయ' అని చెప్పుటయు, 'నాశాయ' అనిచెప్పక 'వినాశాయ' అనిచెప్పుటయు, 'స్థాపనార్థాయ' అనిచెప్పక 'సంస్థాపనార్థాయ' అని చెప్పుటయు గమనించదగినవి. ఆయా క్రియలయొక్క అధికమాత్రనవి సూచించును.

భగవంతుడు దయార్ద్రహృదయుడుకదా! మఱి దుష్టుల నెందులకు శిక్షించునని కొందఱు ప్రశ్నించవచ్చును. నిజముగా ఆ శిక్షణ వారిపై చూపిన యనుగ్రహమే యగును. భగవానుని ఆ శిక్షణచే వారిపాపములు క్షాళితములై పోగలవు. మఱియు అట్లు శిక్షించనిచో లోకమున అధర్మము, దుర్మార్గము ప్రబలి సంఘమునకంతకును గొప్పప్రమాదము వాటిల్లగలదు. శరీరముపై పుండు లేచినచో దానిని 'ఆపరేషన్' ద్వారా నిర్మూలించిననే, లేక కొంతభాగము ఛేదించిననే శరీర మారోగ్యవంతముగ నుండును గదా! పుండుమానిపోవునుగదా! అట్లే దుష్టశిక్షణయునని గ్రహించుకొనవలయును.

**అ॥** ఈ ప్రకారము భగవంతునియొక్క జన్మకర్మలను తెలిసికొను వారికి కలుగుఫలితమును వివరించుచున్నాడు -

## 9. జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః
## త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున.

**టీక:–** అర్జున = ఓ అర్జునా!, యః = ఎవ్వడు, ఏవమ్ = ఈ రీతిగా, మే = నా యొక్క, దివ్యమ్ = దివ్యమైన, జన్మ =జన్మమును, కర్మ చ = కర్మమును, తత్త్వతః = యథార్థముగ, వేత్తి = తెలిసికొనుచున్నాడో, సః = అతడు, దేహమ్ = శరీరమును, త్యక్త్వా = విడిచి, పునః = తిరిగి, జన్మ = జన్మను, న ఏతి = పొందడు, మామ్ = నన్ను, ఏతి = పొందును.

**తా:–** అర్జునా! ఎవడీ ప్రకారముగ నా యొక్క దివ్యమైన జన్మమును, కర్మమును గూర్చి యథార్థముగ తెలిసికొనుచున్నాడో, అట్టివాడు మరణానంతరము మఱల జన్మమునొందక నన్నే పొందుచున్నాడు (మోక్షమును బడయుచున్నాడు).

**వ్యాఖ్య:–** 'బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి' - బ్రహ్మమును తెలిసికొనువాడు బ్రహ్మమే యగుచున్నాడను ఉపనిషద్వాక్యముయొక్క సారాంశమే ఈ శ్లోకమున తెలుపబడినది. భగవంతునియొక్క దివ్యములగు జన్మ, కర్మలను (లీలలను) యథార్థముగ నెఱుంగువాడు, భక్తిపారవశ్యముచేత వారియందే దత్తచిత్తుడై భగవద్ధ్యాననిరతుడై యుండును. గావున ఆతడా పరమాత్మనే పొందుచున్నాడు. భగవత్స్వరూపమును చక్కగ

తెలిసికొనుట 'సాధన'. భగవదైక్యమునొందుట 'సాధ్యము'. ఈ ప్రకారముగ సాధన, సాధ్యము - రెండును ఈ శ్లోకమునందు తెలుపబడినవి. అయితే 'తత్త్వతః' అని చెప్పినందువలన, భగవద్విషయమును స్వానుభవముద్వారా యథార్థముగ నెఱుంగ వలెనేకాని, 'వాచా' జ్ఞానముచేగాని, అశాస్త్రీయజ్ఞానముచేగాని, అపాతజ్ఞానముచేగాని సంతుష్టినొందరాదు.

'దివ్యమ్' అని చెప్పినందువలన భగవానుని లీలలు, జన్మ, కర్మలు అప్రాకృతములని తేలుచున్నది. భగవానుడు ప్రకృతిని స్వాధీనపఱచుకొనినవాడు గనుక వారి చర్యలు సామాన్యప్రాణులయొక్క చర్యలవలె నుండవు. భగవత్తత్త్వము నెఱుగువాడు 'పునర్జన్మను పొందడు' అని చెప్పి, వెనువెంటనే 'నన్నే పొందును' అని తెలుపుటవలన జన్మరాహిత్యపదవి శూన్యము కాదనియు కేవలము సచ్చిదానందఘనఆత్మస్వరూపస్థితియే అది యనియు సుస్పష్టమగుచున్నది.

'దేహమును విడిచి నన్నే పొందును' - అను వాక్యము యొక్క అర్థము దేహమును విడిచిన పిదపయే మోక్షమును పొందునని కాదు. వాస్తవముగ, ఏ క్షణమున మనుజుడు భగవత్తత్త్వమును లెస్సగ నెఱుంగునో, ఆ క్షణముననే (దేహమున్నపుడే) అతడు మోక్షమునొందుచున్నాడు. దేహమును విడిచిన పిదప మరల దేహమును పొందడని తెలుపుటకొఱకే దేహాన్తరప్రస్తావన ఇచట గొనిరాబడినది.

**ప్ర:–** భగవత్సాయుజ్యమునెవరు పొందగలరు?

**ఉ:–** భగవంతునియొక్క అప్రాకృత జన్మ, కర్మలను, తత్త్వమును వాస్తవముగ నెఱుంగువారు.

**అ॥** పూర్వమెందఱో మహనీయు లాప్రకారము దైవతత్త్వము నెఱింగి తరించి యుండిరని వచించుచున్నాడు.

## 10. వీతరాగభయక్రోధా మన్మయా మాముపాశ్రితాః
## బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః.

**టీక:.–** *వీతరాగభయక్రోధాః* = అనురాగము (కోరిక), భయము, కోపము విడచినవారును, *మన్మయాః* = నాయందే లగ్నమైన చిత్తముగలవారును (నాయందే తన్మయులును), *మామ్* = నన్ను, *ఉపాశ్రితాః* = ఆశ్రయించినవారును (అగు), *బహవః* = అనేకులు, *జ్ఞానతపసా* = (ఇట్టి) జ్ఞానతపస్సుచేత, *పూతాః* = పవిత్రులై, *మద్భావమ్* = నా స్వరూపమును (మోక్షమును), *ఆగతాః* = పొందిరి.

**తా:–** అనురాగము, భయము, క్రోధము విడిచినవారును, నాయందే లగ్నమైన చిత్తముగలవారును, నన్నే ఆశ్రయించినవారు నగు అనేకులు ఇట్టి జ్ఞానతపస్సుచే పవిత్రులై నా స్వరూపమును (మోక్షమును) బొందియుండిరి.

**వ్యాఖ్య:–** 'జ్ఞానయోగ' మను ఈ అధ్యాయమునందు గీతాచార్యులు జ్ఞానమును తపస్సు, యజ్ఞము, అగ్ని, నౌక, ఖడ్గము మున్నగు వివిధరూపముల వర్ణించిచెప్పుదురు. ఇచ్చోట జ్ఞానమును తపస్సుగా వర్ణించిరి. ప్రపంచములో అనేక తపస్సులున్నప్పటికిని, జ్ఞానతపస్సు సర్వోత్కృష్టమైనది. ఏలయనిన శరీరముపై గల మాలిన్యమును జలము కడిగివైచి శుద్ధి చేయునట్లు, బహుజన్మార్జిత పాపపంకిలమును జ్ఞానతపస్సు కడిగివైచి చిత్తమును శుద్ధమొనర్చును (కనుకనే 'పూతాః' (పవిత్రులై) అను పదము ప్రయోగింపబడినది).

మోక్షమున కిట్టి చిత్తనైర్మల్య మత్యంతావశ్యకమై యున్నది. అయితే జ్ఞానతపస్సనగానేమి? (1) రాగభయ క్రోధములు లేకుండుట (2) భగవన్మయుడైయుండుట (3) భగవంతుని ఆశ్రయించుట. అట్టి జ్ఞానతపస్సు యొక్క ఫలితమేమి? (1) చిత్తశుద్ధి (2) పరమాత్మస్వరూపప్రాప్తి - అని యీశ్లోకమున చెప్పబడినది.

"వీతరాగభయక్రోధాః" - జ్ఞానతపస్సునందలి మొదటిసాధన కామక్రోధభయములను త్యజించుట. ఈదుష్టత్రయము సాధకునకు మహాప్రమాదకరమైనది. కాబట్టి ప్రయత్నపూర్వకముగ ఆ దుర్గుణముల మూడింటిని తొలగించుకొనవలెను. అయితే అవి యెట్లు తొలగగలవు? దానికి ఉపాయమున్ను వెనువెంటనే చెప్పబడినది. 'మన్మయాః' 'మాముపాశ్రితాః' - అనగా నిరంతర భగవచ్చింతన, భగవదాశ్రయము ఇవియే ఉపాయములు. రాగభయక్రోధరాహిత్యమను 'వాసనాక్షయము' నిరంతర భగవన్మయత్వ, భగవదాశ్రయత్వములను 'తత్త్వజ్ఞానము' యొక్క సహాయముచే లభ్యముకాగలదు. ఈ వాసనాక్షయ, తత్త్వజ్ఞానములు రెండును ఒకదానిచే మఱియొకటి పరిపోషింపబడుటవలన రెండిటిని ఏకకాలమందే సమముగ నభ్యసించుచురావలెను.

"బహవః" - ఇంతవఱకెందఱో ఇట్టి జ్ఞానతపస్సుచే పునీతులై బ్రహ్మసాయుజ్య మొందగల్గిరని చెప్పుటవలన దానిమహిమను దెల్పుటకు ప్రత్యక్షసాక్ష్యము లభించినట్లైనది. పూర్వమెందఱో దానిని సాధించి ముక్తిని బడసినందున, ఇపుడును, మున్ముందును గూడ ఆ ప్రకారమే పడయగలరనుటలో సందేహములేదు. కాబట్టి ముముక్షువు లాయాసాధనలను తప్పక ఆచరించి శ్రేయము నొందవలయును.

ఈ శ్లోకముద్వారా తెలుపబడిన ముఖ్యాంశములు-

(1) భగవత్స్వరూపమును బొందుటకు హృదయనిర్మలత్వము ఆవశ్యకము.

(2) ఆ హృదయనిర్మలత్వమునకు జ్ఞానతపస్సు అవసరము.

(3) జ్ఞానతపస్సనగా - (1) కామక్రోధభయరాహిత్యము.

(2) భగవత్తన్మయత్వము.

(3) భగవదాశ్రయత్వము.

**ప్ర:–** హృదయశుద్ధి దేనివలన కలుగగలదు?

**ఉ:–** జ్ఞానతపస్సుచే. (దీనివివరములు పైన తెలుపబడినవి).

**అ॥** తన్నేప్రకారముగ జనులు సేవించుదురో, ఆ ప్రకారమే వారి ననుగ్రహించుదునని భగవానుడు వచించుచున్నాడు -

## 11. యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్
## మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః.

**టీక:–** పార్థ = ఓ అర్జునా!, యే = ఎవరు, యథా = ఏప్రకారముగ, మామ్ = నన్ను, ప్రపద్యన్తే = ఆశ్రయించుచున్నారో (సేవించుచున్నారో), తాన్ = వారలను, తథా ఏవ = ఆప్రకారమే, అహమ్ = నేను, భజామి = అనుగ్రహించుచున్నాను, మనుష్యాః = మనుజులు, మమ = నాయొక్క, వర్త్మ = మార్గమును, సర్వశః = అన్నివిధముల, అనువర్తన్తే = అనుసరించుచున్నారు.

**తా:–** ఓ అర్జునా! ఎవరేప్రకారముగ నన్ను సేవింతురో వారి నాప్రకారముగనే నేననుగ్రహింతును. మనుజులు సర్వవిధముల నా మార్గమునే అనుసరించుచున్నారు.

**వ్యాఖ్య:–** 'చేసుకున్నవారికి చేసుకున్నంత మహాదేవ'! అనునట్లు ఎవరెవరు ఏయే విధముగ ఎంతెంత భక్తితో, ఏయే రూపముతో తన్ను అర్చించుదురో లేక సేవించుదురో, వారిని ఆయావిధముగనే అనుగ్రహించెదనని భగవానుడు పలుకుచున్నాడు. పరమాత్మ కల్పవృక్షమువంటివాడు. ఆయన చెంతకుపోయి ఏది వాంఛించిన దానినొసంగును. ఏ ప్రకారముకోరిన, ఆ ప్రకారముగ ఫలితమును గలుగజేయును. ఎవరికైన ఉత్తమఫలితములుగాని, మోక్షముగాని కలుగకపోయినచో అది వారిదోషమే కాని భగవంతునిది కాదు. తెఱచాపను పైకి ఎత్తనిచో పడవ కదలదు. భగవదనుగ్రహమనుగాలి సర్వత్రవీచుచున్నను జనులు తమ హృదయములను తెరచాపలను దైవోన్ముఖములుగ చేసిననేకాని జీవితనౌకలు పురోగమించవు. ఇనుమునకు త్రుప్పు ఉండినచో సూదంటురాయి దాని నాకర్షించదు. అట్లే మనస్సునందు విషయామాలిన్యము, దృశ్యదోషములు ఉన్నచో భగవంతుడు తనవైపునకు దాని నాకర్షించుకొనరు. కాబట్టి వారివారి ప్రయత్నములయొక్క తీవ్రతనుబట్టి ఆ యా పరమార్థసత్ఫలములను భగవానుడు వారలకు కలుగజేయుచునుండును.

"మమ వర్త్మానువర్తన్తే" – ఈ ప్రకారముగ భగవంతుడు భక్తులయెడల ప్రేమ, దయ చూపుటవలన జనులున్ను పరస్పర మట్టిప్రేమను, సద్భావమును లెస్సగ ప్రకటించుకొనుచున్నారు. జనులు భగవన్మార్గమునే సర్వవిధముల ననుసరించుచున్నారు. (లేక, దైవమార్గములగు కర్మ, భక్తి, ధ్యాన, జ్ఞానమార్గములనే జనులాశ్రయించుచున్నారనియు చెప్పవచ్చును).

**అ॥** కొందఱు ఇతరదేవతల నేల యుపాసించుచున్నారో చెప్పబడుచున్నది–

## 12. కాఙ్క్షన్తః కర్మణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః
## క్షిప్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా.

**టీక:–** కర్మణామ్ = కర్మములయొక్క, సిద్ధిమ్ = ఫలప్రాప్తిని, కాఙ్క్షన్తః = అపేక్షించువారు, ఇహ = ఈలోకమున, దేవతాః = దేవతలను, యజన్తే = ఆరాధించుచున్నారు, హి = ఏలయనగా, కర్మజా = కర్మమువలనగలిగెడు, సిద్ధిః = ఫలప్రాప్తి, మానుషేలోకే = మనుష్యలోకమునందు, క్షిప్రమ్ = శీఘ్రముగ, భవతి = కలుగుచున్నది.

**తా:–** కర్మములయొక్క ఫలప్రాప్తిని అపేక్షించు మానవు లీప్రపంచమున దేవతల నారాధించుచున్నారు. ఏలయనగా కర్మఫలసిద్ధి ఈ మనుష్యలోకమున శీఘ్రముగ గలుగుచున్నది.

**వ్యాఖ్య:–** తక్కినలోకములకంటె ఈ మనుష్యలోకమున కర్మములకు ఫలసిద్ధి శీఘ్రముగ గలుగునని యిట వచింపబడినది. కాబట్టి జనులు సత్కర్మానుష్ఠానపరులై యుండులాగున త్వరితముగ యత్నించవలెను. ఇది కర్మానుష్ఠానలోకము. తక్కిన లోకములు ఇంచుమించు కర్మఫలానుభవలోకములే. కావున అచట మోక్షసిద్ధికై యత్నించుట కంతగా వీలుపడదు. నరకమనువ్యాధికి (భవరోగమునకు) ఈ మనుష్యలోకమునందే ఉత్తమానుష్ఠానము ద్వారా చికిత్సచేసికొననిచో, కర్మానుష్ఠానమున కవకాశములేని తక్కినలోకములను (మఱణానంతరము) పొంది ఈ భవరోగపీడితుడేమిచేయగలడని విష్ణుభగవానుడు

పూర్వము గరుత్మంతుని ప్రశ్నించెను★. కావున త్వరితముగ సత్కర్మముల నాచరించి చిత్తశుద్ధిని బడసి జ్ఞానప్రాప్తిద్వారా ఈ లోకమందే మోక్షధామము నలంకరించుట శ్రేయస్కరము.

**ప్ర:–** కర్మముయొక్క ఫలితము ఏ లోకమున శీఘ్రముగ కలుగును?

**ఉ:–** మనుష్యలోకమున.

**అ॥** భగవంతుడు తాను చేయుజగత్సృష్టి మొదలగు కార్యములన్నియు కర్తృత్వరహితములుగ నుండునని రెండుశ్లోకములద్వారా తెలుపుచున్నాడు -

**13. చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః**
**తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్.**

**టీక:–** చాతుర్వర్ణ్యమ్ = నాలుగువర్ణములున్ను, గుణకర్మవిభాగశః = సత్త్వాది గుణములయొక్కయు, అగుణముల వలన చేయబడు కర్మలయొక్కయు, విభజనము ననుసరించి, మయా = నాచేత, సృష్టమ్ = సృష్టింపబడినవి, తస్య = దానికి, కర్తారమ్ అపి = కర్తనైనను, మామ్ = నన్ను, అకర్తారమ్ = కర్తకానివానినిగను, అవ్యయమ్ = నాశములేనివానినిగను, (లేకనిర్వికారునిగను) విద్ధి = ఎఱుంగుము.

**తా:–** బ్రాహ్మణక్షత్రియాదులను నాలుగువర్ణములు సత్త్వాది గుణముల యొక్కయు, ఆ గుణములచే చేయబడు కర్మలయొక్కయు విభాగము ననుసరించి నాచే సృజింపబడినవి. వారికి నేను కర్తనైనప్పటికిని (ప్రకృతికి అతీతుడనగుటచే) వాస్తవముగ నన్ను అకర్తగను, నాశరహితునిగను (నిర్వికారునిగను) ఎఱుంగుము.

**వ్యాఖ్య:–** గుణములనుబట్టియు, ఆ యా గుణములకు సంబంధించిన కర్మలను బట్టియు జనులను నాలుగు వర్ణములుగ (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులగ) భగవానుడు విభజించిరి.

| గుణము | వర్ణము | కర్మ |
|---|---|---|
| కేవలము సత్త్వగుణము కలవారు | బ్రాహ్మణులు | శమదమాదులు, తపస్సు. |
| సత్త్వగుణము స్వల్పముగను, రజోగుణము అధికముగను గలవారు. | క్షత్రియులు | శౌర్య, ధైర్య, గాంభీర్యాది సంయుక్తయుద్ధ రాజ్య పాలనాదులు. |
| స్వల్పముగ సత్త్వగుణముగలిగి రజోగుణ తమోగుణములు గలవారు. | వైశ్యులు | కృషి, గోరక్షణ, వాణిజ్యాదులు. |
| తమోగుణము అధికముగను, రజోగుణము స్వల్పముగను గలవారు. | శూద్రులు | పరిచర్యాదులు. |

★ ఇహైవ నరకవ్యాధేశ్చికిత్సాం న కరోతి యః
గత్వా నిరౌషధం దేశం వ్యాధిస్థః కిం కరిష్యతి. (గరుడపురాణము)

ఈ ప్రకారముగ జనులను విభజించి భగవానుడు సృష్టిక్రియల నాచరించినప్పటికిని, వారు కర్తృత్వరహితులై, నిర్వికారులుగనే చెన్నొందుచున్నారు. కర్తయైనను అకర్తగనే విలసిల్లుచున్నారు. మహనీయులు సంగరహితులై క్రియలాచరించుదురు. కావున కర్తృత్వరాహిత్యముపలన కర్మబంధమొకింతైనను వారికి లేకుండును.

## 14. న మాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మఫలే స్పృహా
## ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే.

**టీక:–** మామ్ = నన్ను, కర్మాణి = కర్మములు, నలిమ్పన్తి = అంటవు, మే = నాకు, కర్మఫలే = కర్మఫలమునందు, స్పృహా = కోరిక, న = లేదు, ఇతి = ఈ ప్రకారముగ, మామ్ = నన్ను, యః = ఎవడు, అభిజానాతి = తెలిసికొనుచున్నాడో, సః = అతడు, కర్మభిః = కర్మములచేత, న బధ్యతే = కట్టుపడడు.

**తా:–** నన్ను కర్మలంటవు. నాకు కర్మఫలమునం దపేక్షయు లేదు. ఈప్రకారముగ నన్నుగూర్చి యెవడు తెలిసికొనునో ఆతడు కర్మములచే బంధింపబడడు.

**వ్యాఖ్య:–** భగవానుడుకర్మఫలమునం దపేక్షలేక కర్మలనాచరించుచున్నారని యెఱింగినపుడు జీవుడు తానున్ను ఫలాపేక్షలేక కర్మల నాచరింపదొడగును. తత్ఫలితముగ నాతడు కర్మలచే నంటబడక, కర్మబంధవిముక్తుడు కాగల్గును.

**అ॥** పూర్వమెందఱో ముముక్షువు లాప్రకారముగ నిష్కామముగ కర్మలాచరించి శ్రేయము నొందిరని వచించుచున్నాడు.

## 15. ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః
## కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్.

**టీక:–** ఏవమ్ = ఈప్రకారముగ, జ్ఞాత్వా = తెలిసికొని, పూర్వైః = పూర్వులైన, ముముక్షుభిః అపి = ముముక్షువులచేగూడ, కర్మ = కర్మము, కృతమ్ = చేయబడినది, తస్మాత్ = అందువలన, త్వమ్ = నీవు, పూర్వైః = పూర్వులచే, కృతమ్ = చేయబడిన, పూర్వతరమ్ = మిగుల పురాతనమైనట్టి, కర్మ ఏవ = (ఈ) కర్తృత్వరహిత (నిష్కామ) కర్మమునే, కురు = చేయుము.

**తా:–** (తాను వాస్తవముగ కర్తకాదు. తనకు కర్మఫలమునం దపేక్షయుండరాదు – అని) ఈ ప్రకారముగ (భగవంతుని కర్మాచరణముద్వారా) తెలిసికొని పూర్వమెందఱో ముముక్షువులు నిష్కామముగ కర్మలనాచరించియుండిరి. కావున (ఓ అర్జునా!) నీవున్ను పూర్వులచే అట్టి పురాతనమైన నిష్కామకర్మమునే చేయుము.

**వ్యాఖ్య:–** నిష్కామకర్మాచరణము, మోక్షమునకు పునాదియని చెప్పవచ్చును. మోక్షసౌధనిర్మాణ మచటినుండియే ప్రారంభమగును. కనుకనే 'యెందరో ముముక్షువులు కర్మముయొక్క యా నిష్కామతత్త్వరహస్యమెఱింగి తద్రీతి కర్మాచరణముచేసి పూర్వము తరించియుండిరి. కావున నీవున్ను ఆ ప్రకారమే ఫలాసక్తి రహితముగ కర్మల జేయుము' అని భగవాను డర్జునుని ఆదేశించుచున్నాడు.

'కురుకర్మైవ' - 'కర్మమునే చేయుము' అని శ్రీకృష్ణమూర్తి అసందిగ్ధముగ పలికినందువలన అనాసక్తకర్మయొక్క ప్రాముఖ్యత వెల్లడియగుచున్నది. మఱియు 'పూర్వతరమ్' అని చెప్పినందువలన ఈ నిష్కామకర్మమార్గము క్రొత్తగా ప్రాదుర్భవించినది కాదనియు, అనాదికాలమునుండియు నెందఱినో తరింపజేయుచున్నదనియు స్పష్టమగుచున్నది. పూర్వీకులకు మేలుచేయగలిగిన ఈభవరోగదివ్యౌషధము ఇప్పటివారికిగూడ తప్పక మేలుచేయగలదు. కాబట్టి దానిపై విశ్వాసముగల్గి ఆచరించి తరించవలసినదిగా భగవాను డుద్బోధించుచున్నాడు.

**అ॥** జ్ఞానమునకు అత్యావశ్యకమైనది చిత్తశుద్ధి. అట్టి చిత్తశుద్ధి నిష్కామకర్మాచరణముచే సిద్ధించును. కావున అట్టి అనాసక్తకర్మాచరణపద్ధతిని భగవానుడు పదునైదు శ్లోకములద్వారా (18శ్లో. నుండి 32 శ్లో. వఱకు) యిచట విశదీకరించుచున్నాడు. -

**16. కిం కర్మ కిమకర్మేతి కవయో౽ప్యత్ర మోహితాః**
**తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసే౽శుభాత్.**

**టీక:-** కర్మ = కర్మ, కిమ్ = ఏది, అకర్మ = అకర్మ, కిమ్ = ఏది, ఇతి అత్ర = అను ఈవిషయమున, కవయః అపి = మేధావులు కూడ, మోహితాః = మోహమును జెందిరి, యత్ = దేనిని, జ్ఞాత్వా = తెలిసికొని, అశుభాత్ = అశుభమునుండి (సంసారసంబంధమైన అనర్థమునుండి), మోక్ష్యసే = విముక్తుడవుకాగలవో, తత్కర్మ = ఆ కర్మను, తే = నీకు, ప్రవక్ష్యామి = లెస్సగ జెప్పెదను.

**తా:-** కర్మయెట్టిది, అకర్మయెట్టిది అను ఈవిషయమును పండితులుకూడ సరిగా తెలిసికొనజాలకున్నారు. దేనినెఱింగినచో నీవు సంసారబంధమునుండి విముక్తుడవు కాగలవో అట్టి కర్మరహస్యమును నీకిపుడు తెలుపుచున్నాను.

**వ్యాఖ్య:-** కర్మరహస్యము చాల నిగూఢమైనది కనుక గొప్పగొప్ప పండితులు, శాస్త్రజ్ఞులుకూడ దాని అంతు కనుగొనజాలరైరి. కనుక భగవానుడే కరుణతో నిచట దానిని బోధింపదలచిరి. ఆ కర్మతత్త్వమెఱుంగుటవలన కలుగు ఫలితమేమి? మనుజుడు అశుభమగు ఈ సంసారదుఃఖమునుండి విడుదలను బొందగలడు. కాబట్టి సాంసారిక క్లేశములనుండి విముక్తులు కాదలంచువారందఱున్ను భగవానుడు తెలుపబోవు ఆ కర్మపద్ధతిని చక్కగ తెలిసికొనియుండవలెను.

**ప్ర:-** అశుభమగు సంసారబంధమునుండి విడివడుట కుపాయమేమి?

**ఉ:-** కర్మయేదియో, అకర్మయేదియో బాగుగా తెలిసికొని తదనురీతి వ్యవహరించుటయే.

**అ॥** కర్మ, అకర్మ, వికర్మ అను మూడింటిని తెలిసికొనవలయునని బోధించుచున్నాడు-

**17. కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః**
**అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః.**

**టీక:-** కర్మణః అపి = శాస్త్రవిహితమగు కర్మయొక్కయు, (స్వరూపము) బోద్ధవ్యం =

తెలిసికొనదగినది, వికర్మణః చ = శాస్త్రనిషిద్ధమగు కర్మయొక్కయు స్వరూపము, బోద్ధవ్యమ్ = తెలిసికొనదగినది, అకర్మణః చ = కర్మరహిత తూష్ణీంభావముయొక్కయు స్వరూపము, బోద్ధవ్యమ్ = తెలిసికొనదగినది, హి = ఏలయనగా, కర్మణః = కర్మయొక్క, గతిః = తత్త్వము, గహనా = చాల లోతైనది (ఎఱుగుటకు కష్టమైనది).

**తా:–** శాస్త్రములచే విధింపబడిన కర్మలయొక్కయు, నిషేధింపబడిన వికర్మలయొక్కయు, ఏమియుచేయక నూరకుండుట యను అకర్మయొక్కయు స్వరూపమును బాగుగ తెలిసికొనవలసి యున్నది. ఏలయనగా కర్మయొక్క వాస్తవతత్త్వము చాల లోతైనది. (ఎఱుంగుట మిగుల కష్టతరము).

**వ్యాఖ్య:–** కర్మ = చేయదగిన కర్మ (విహితకర్మ).

వికర్మ = చేయరాని కర్మ (నిషిద్ధకర్మ).

అకర్మ = ఊరకయుండు సోమరియొక్కస్థితి.

కర్మాకర్మవికర్మలకు మఱియొక అర్థమునుగూడ చెప్పవచ్చును.

కర్మ = సామాన్యమగు కర్మ.

వికర్మ = ఆ కర్మనే కామక్రోధాదిరహితముగ, నిష్కామముగ, దైవార్పణబుద్ధితో నాచరించుట.

అకర్మ = అట్లు కర్మను అనాసక్తముగ నాచరించుటచే చిత్తశుద్ధి వలన కలుగు నైష్కర్మ్యాత్మస్థితి. అనగా కర్మ, వికర్మలయొక్క సంయోగముచే కలుగు కర్తృత్వరహిత నిష్క్రియ ఆత్మస్థితియే అకర్మ.

కర్మయోగమును నిర్దుష్టముగ నాచరింపవలసియుండినచో కర్మ, అకర్మ, వికర్మల యొక్క స్వరూపమును బాగుగ తెలిసికొనియుండవలెను. ఆ కర్మతత్త్వము చాల నిగూఢమైనది. కనుక భగవానుడే దానిని విడదీసిచెప్పుటకు పూనుకొనిరి.

**అ॥** కర్మనెట్లాచరింపవలయునో తెలుపుచున్నాడు –

## 18. కర్మణ్యకర్మ యః పశ్యేదకర్మణి చ కర్మ యః
## స బుద్ధిమాన్ మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్.

**టీక:–** కర్మణి = కర్మయందు, అకర్మ = అకర్మను, యః = ఎవడు, పశ్యేత్ = చూచునో, అకర్మణి చ = అకర్మయందును, కర్మ = కర్మను, యః = ఎవడు, (పశ్యేత్ = చూచునో) సః = అతడు, మనుష్యేషు = మనుజులందు, బుద్ధిమాన్ = వివేకవంతుడు, సః = అతడు, యుక్తః = యోగముతో గూడినవాడును, కృత్స్న కర్మకృత్ = సకలకర్మలనాచరించినవాడును, (భవతి = అగుచున్నాడు).

**తా:–** ఎవడు కర్మయందు అకర్మను, అకర్మయందు కర్మను జూచునో అతడు మనుజులలో వివేకవంతుడును, యోగయుక్తుడును, సకలకర్మల నాచరించిన వాడును యగుచున్నాడు.

**వ్యాఖ్య:–** కర్మయందు అకర్మను జూచుట :– కర్తృత్వములేకుండగను, ఫలమును

వాంఛింపకుండగను ఎంతకర్మచేసినప్పటికిని అది బంధమును గలుగజేయజాలదు. అత్తఱి ఏ కర్మయు చేయనట్లేయగును. అనగా అది అకర్మయే యగును. అద్దము ప్రతిబింబక్రియను రోజంతయు సలుపుచున్నను - ఆ ప్రతిబింబితవస్తువులు దానియందు అంటకనుండుటవలన అది యేమియు చేయనట్లే నిర్మలముగ, నిష్క్రియముగ నుండును. మహనీయులగువారు తమ జీవయాత్రకు సంబంధించిన కార్యములను చేసినను వానిని చేయనివారే యగుదురు. అనాసక్తచిత్తముతో కార్యమునాచరించినందువలన కర్మ అకర్మగా, నైష్కర్మ్యముగా మారి బంధమును కలుగజేయకుండును. దీని నెఱుంగుటయే కర్మయందకర్మను జూచుటయగును. అహంకారముతోను, కర్తృత్వబుద్ధితోను, ఆసక్తి, సంగములతోను చేయబడు కర్మయే బంధమును కలుగజేయునుగాని, అసక్తబుద్ధితో చేయబడు కర్మకాదు. అట్టి అనాసక్తకర్మ అకర్మయేయగును. అనగా కర్మరాహిత్యముతో సమానమగును. ఈప్రకారముగ కర్మయందు కర్మరాహిత్యమును, లేక అకర్మను ఎవడు చూడగల్గునో ఆతడు మనుజులలో వివేకవంతుడును, యోగయుక్తుడును నగును. ఆతడు క్రమముగ నిష్కామకర్మము నవలంబించుట ద్వారా చిత్తశుద్ధిని, ఆత్మస్థితిని బడయుటవలన, జీవితలక్ష్యమును సాధించినవాడగుటచే సకలకర్మలయొక్క ఫలమును పొందినట్లెనది. కనుకనే ఆతడు 'బుద్ధిమాన్, యుక్తః, కృత్స్నకర్మకృత్' అనిమూడు విశేషణములచే నిచట స్తుతింపబడియుండెను. అట్లుగాక కర్మ అసలే చెడ్డది, అది పనికిరాదు. ఏ రూపముననున్నను అది బంధమే యని తలంచువారు కర్మయందు అకర్మను చూడలేనివారు. వారు బుద్ధిమంతులుకారు. బుద్ధిమాంద్యము కలవారు.

<u>అకర్మయందు కర్మనుజూచుట:-</u> కొందఱు వాసనాసహితులై, ప్రకృతిగుణములేవియు తొలగకనే దేహేంద్రియాదులచే కర్మలను పరిత్యజించి ఏపనియుచేయక సోమరులుగనుందురు. అట్టివారి 'అకర్మ' యందు మహాబంధకరమగు కర్మ యిమిడియున్నది. పైకి కర్మచేయకపోయినను మనస్సుతో వారు కర్మ చేయుచునేయున్నారు. ఇంద్రియములు చలింపకున్నను, మనస్సు, సంకల్పములు, వాసనలు చలించుచునే యున్నవి. శరీరము ఒకచోట నిశ్చలముగ, నిష్క్రియముగనున్నను మనస్సు ముల్లోకములను చుట్టివచ్చుచున్నది. అట్టివారి అకర్మయందు బంధభూతమగు కర్మ అంతర్భూతమైయున్నది. ఇట్లెఱుంగుటయే అకర్మయందు కర్మను జూచుటయగును. బంధమును, బంధరాహిత్యమును నిర్ణయించునది వాసనలు, అహంభావము, మనస్సేకాని; ఇంద్రియములు, దేహముకావని గుర్తెఱుంగవలెను. ఒకవేళ కర్మేంద్రియములను బిగబెట్టి చిత్తముతో అన్నికర్మలు చేయుచున్నచో, అది మిథ్యాచారమేయగునని క్రిందటి అధ్యాయములో భగవానుడు తెలిపియేయున్నారు. ఈప్రకారముగ అకర్మయందు కర్మను జూచువారు కూడ వివేకవంతులే. కావున వారున్ను క్రమముగ ఉత్తమాచరణద్వారా ఆత్మస్థితియను జీవితలక్ష్యమును బొందగల్గుటచే సకలకర్మల నాచరించివారే యగుదురని యిచట తెలుపబడినది.

ప్రపంచమున మనుజులలో అనేక గొప్ప విద్వాంసులు, పండితులు, కవులు మొదలైన వారందఱున్ను 'బుద్ధిమంతుల'ని చెప్పుటకు వీలుపడదు. ఏలయనగా సత్యము నెఱుంగగల్గువాడే బుద్ధిశాలి. పైనదెలిపిన కర్మరహస్యమెఱింగి వర్తించువాడే (తద్ద్వారా జీవిత లక్ష్యమగు ఆత్మసాక్షాత్కారమును బడయగల్గువాడే) బుద్ధిమంతుడని భగవానుడీశ్లోకమున తెలియచేసెను. కావున అట్టి వివేకమును బడసి ఉత్తమాచరణ గల్గియుండుట శ్రేయస్కరము.

ప్ర:- మనుజులలో బుద్ధిమంతుడెవడు?

**ఉ:–** కర్మయందు అకర్మను, అకర్మయందు కర్మను జూడగలుగువాడు.

**ప్ర:–** అట్టివా డేఫలితమును బొందును?

**ఉ:–** క్రమముగ ఆత్మసాక్షాత్కారమును బడయుటచే నతడు సమస్తకర్మలను ఆచరించిన ఫలితమును బొందును.

**అ॥** అట్టి అసంగకర్మాచరణశీలురనుగూర్చి, వారి మహిమనుగూర్చి ఐదు శ్లోకముల ద్వారా తెలుపుచున్నాడు -

## 19. యస్య సర్వే సమారమ్భాః కామసంకల్పవర్జితాః
## జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం తమాహుః పణ్డితం బుధాః.

**టీక:–** యస్య = ఎవనియొక్క, సర్వే = సమస్తములైన, సమారమ్భాః = కర్మలు, కామసంకల్పవర్జితాః = కోరిక, సంకల్పము అనునవి లేకయుండునో, జ్ఞానాగ్నిదగ్ధకర్మాణమ్ = జ్ఞానమనెడి అగ్నిచేత దహింపబడిన కర్మలుగల, తమ్ = అతనిని, పణ్డితమ్ = పండితునిగ, బుధాః = విజ్ఞులు, ఆహుః = చెప్పుదురు.

**తా:–** ఎవనియొక్క సమస్తకర్మలు కోరిక, సంకల్పము అనునవి లేకయుండునో, జ్ఞానమను అగ్నిచేత దహింపబడినకర్మలుగల అట్టివానిని పండితుడని విజ్ఞులు పేర్కొందురు.

**వ్యాఖ్య:–** పండితుడనగా నెవరో ఈ శ్లోకమునందు చెప్పబడినది. భగవంతుని దృష్టిలో పాండిత్యమనగా కేవలము ప్రాపంచిక విద్యలయం దారితేరుటకాదు. హృదయశుద్ధిగల్గి, కామ సంకల్పములు లేక, ఆత్మజ్ఞానముతో గూడియుండుటయే పాండిత్యము. ఎవని యొక్క సమస్తకార్యములు కోరికతోగాని, సంకల్పముతోగాని కూడియుండవో, ఎవనియొక్క కర్మలన్నియు జ్ఞానాగ్నిచే దగ్ధములైపోవునో ఆతడే పండితుడని యిచట చెప్పబడినది.

'ఆరమ్భాః' (క్రియలు) అని చెప్పక 'సమారమ్భాః' అని చెప్పుటచే మహనీయులు ఉత్తమకార్యములనే చేయుదురని సూచింపబడినది. 'కామము' అనగా భోగసంబంధమైన వాంఛ. దారాపుత్రగృహారామక్షేత్రాదులందలి ఆశ యని భావము. ఇచట సంకల్పమనగా అహంభావముతో గూడిన సంకల్పమనియే అర్థము. ఏలయనిన, సంకల్పవర్జితస్థితియందు కార్యములు (సమారమ్భాః) అనునవియే అసలు సంభవింపనేరవు గదా! ఎవరు తాము చేయు సమస్తకార్యములందును కోరిక (ఆశ) లేక యుందురో, మఱియు ఆ యా కార్యములనుగూర్చిన సంకల్పముగాని, కర్తృత్వముగాని, అహంభావముగాని కల్గియుండరో, అనగా నిష్కామబుద్ధితో నెవరు కర్మల జేయుదురో వారు చిత్తశుద్ధిని బడసి ఆత్మజ్ఞానమును తప్పక బొందుదురు. అట్టి జ్ఞానాగ్నిచే వారల సమస్తకర్మలున్ను దగ్ధములైపోవును. వారే జీవన్ముక్తులు. వారే పండితులు. కర్మలనునవి పెద్దదూదికుప్పవంటివి కోట్లకొలది జన్మలందు చేయబడిన కర్మయంతయు గూడ ఆత్మజ్ఞానమను ఒక్కనిప్పురవ్వచే భస్మీభూతము గాగలదు. కాబట్టి ఇట్టి జ్ఞానసముత్పాదనకు హేతువైన చిత్తశుద్ధి, దానికి కారణభూతమైన నిష్కామకర్మాచరణము ఎంతటి మహత్తుకలవియో యోచించుకొనవచ్చును.

"సర్వే సమారమ్భాః" - అని చెప్పినందువలన ఏ ఒకటి రెండు కార్యములలోకాదు. సమస్తకార్యములున్ను కామసంకల్పవర్జితములై యుండవలెనని స్పష్టమగుచున్నది.

మఱియు, ఇంతకు పూర్వము తెలియకచేయబడిన కర్మమునుగూర్చి మనుజుడు దిగులుపడిన లాభములేదు. అది యెట్టికర్మఅయియున్నప్పటికిని ప్రయత్నపూర్వకముగ నిపుడు నిష్కామకర్మాచరణాదుల ద్వారా జ్ఞానమును సంపాదించుకొనిన చాలును. అది యంతయు నశించిపోగలదను సత్య మీశ్లోకముద్వారా తెలియుచున్నది. మనుజుడు తాను చేయు కర్మలు కామసంకల్పవర్జితములై యుండునట్లు చూడవలెను. అహంభావ యుక్తమగు సంకల్పమే బంధము. కర్తృత్వమే బంధము. ఆసక్తియే బంధము. సంకల్ప రాహిత్యమే మోక్షము. అట్లు కామసంకల్పరహితముగ కార్యములనొనర్చువాడే పండుతుడు. అని విజ్ఞులు (బుధాః) పలుకుచున్నారు. సామాన్యులుకాదు. అట్టివాడెన్ని కర్మలనుజేసినను శాంతినే పడయును. అట్లుకాక కామసంకల్పములతో గూడియుండు వాడు ఏ కార్యమును జేయక ఊరకనున్నప్పటికిని అశాంతినే పొందును. ఇదియే కర్మరహస్యము.

పండితుని లక్షణ మీశ్లోకమున తెలియజేయబడినది. కావున భగవానునిద్వారా ఒసంగబడు ఈ 'పండిత' బిరుదుకై సర్వులును ప్రయత్నశీలురు కావలసియున్నది.

**ప్ర:–** పండితుడనగా ఎవరు?

**ఉ:–** (1) ఎవనియొక్క సమస్తకార్యములు కామసంకల్పవర్జితములైయుండునో, (2) ఎవనికర్మలన్నియు జ్ఞానాగ్నిచే దగ్ధములై పోయినవో అతడే పండితుడు.

**ప్ర:–** కర్మను ఎట్లాచరించవలయును?

**ఉ:–** కోరికలేకుండగను, దానినిగూర్చినకర్తృత్వముతో గూడిన (అహంభావయుక్తమగు) సంకల్పంలేకుండగను ఆచరించవలయును.

**ప్ర:–** కర్మరాశియంతయు దేనిచే నశించును?

**ఉ:–** జ్ఞానాగ్నిచే.

**20. త్యక్త్వా కర్మఫలాసఙ్గం నిత్యతృప్తో నిరాశ్రయః**
**కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః.**

**టీక:–** *కర్మఫలాసఙ్గమ్* = కర్మఫలమునందాసక్తిని, *త్యక్త్వా* = విడిచి, *నిత్యతృప్తః* = నిరంతరము సంతృప్తి కలవాడును, *నిరాశ్రయః* = దేనిని ఆశ్రయించనివాడును (అగుచు), *కర్మణి* = కర్మమునందు, *అభిప్రవృత్తః అపి* = ప్రవర్తించినవాడైనను, *సః* = అతడు, *కించిత్* = కొంచెమైనను (కర్మను), *న కరోతి ఏవ* = చేయుటయే లేదు.

**తా:–** ఎవడు కర్మఫలములందాసక్తిని విడనాడి నిరంతరము సంతృప్తిగలవాడై దేనిని ఆశ్రయించకనుండునో, అట్టివాడు కర్మలందు ప్రవర్తించినను ఒకింతైనను చేయనివాడే యగును.

**వ్యాఖ్య:–** (1) కర్మఫలమందాసక్తిలేనివాడు (2) నిరంతరము తృప్తిగలవాడు (3) దృశ్యవస్తువులను ఆశ్రయింపనివాడు (ఆత్మయే ఆశ్రయముగగలవాడు) - ఇట్టి లక్షణములు గల మనుజుడు ఎన్ని కర్మలనాచరించినను ఏమియు నాచరింపనివాడే యగునని యిట చెప్పబడినది. జీవన్ముక్తులగు మహనీయులు ఇట్టి స్థితిని సంపాదించియే లోకసంగ్రహార్థము పెక్కు కార్యముల నాచరించుదురు.

(1) వారు కర్మలనుజేయుదురుగాని కర్మఫలమునందు వారికి ఆసక్తియుండదు. ఫలాభిసంధిరహితముగ ఈశ్వరార్పణబుద్ధితో వారు కార్యముల నాచరించుచుందురు. (2) మఱియు వారు నిత్యతృప్తులై యుందురు. పొందవలసినదియంతయు వారు ఆత్మయందే పొందియున్నారు. కావున మహాసంతృప్తులై యుందురు. 'నిత్య' అను పదముచే వారితృప్తి యేదియో ఒక సమయమునకు పరిమితమై యుండునదికాదనియు, సర్వకాలము లందును వారు తృప్తులై యుందురనియు తెలియుచున్నది. (3) ఇక మూడవది నిరాశ్రయత్వము. మహాత్ములు నశ్వరములగు దృశ్యపదార్థముల నెన్నడును ఆశ్రయించియుండరు. శాశ్వతమగు ఆత్మనే సదా ఆశ్రయించుకొనియుందురు. ఈ ప్రకారముగ కర్మఫలాసక్తి రాహిత్యము, నిత్యతృప్తి, నిరాశ్రయత్వమను మూడు సుగుణములుగల మహనీయుడు కర్మలను విరివిగ ఆచరించినను, ఏ మాత్రము నాచరించనివాడే యగును. ఇదియే కర్మయందలి అకర్మత్వము. 'ప్రవృత్తో౽పి' అని చెప్పక 'అభిప్రవృత్తో౽పి' అని చెప్పినందువలన జ్ఞాని పెక్కు కార్యములనుగూడ చక్కగ నాచరింపగల్గునని స్పష్టమగుచున్నది.

**ప్ర:–** అనేక కార్యముల నాచరించినను ఏమియు నాచరించనివా డెవడు?

**ఉ:–** (1) కర్మఫలాసక్తిని వదలినవాడు (2) నిరంతరము తృప్తిగలవాడు (3) దేనిని ఆశ్రయింపనివాడు (దృక్ - వస్తువగు ఆత్మనే ఆశ్రయించువాడు).

**అ॥** ఎట్టి సద్గుణములను గలిగియుండినచో కర్మనాచరించినను పాపము సంభవింపకుండునో వచించుచున్నాడు -

## 21. నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః
## శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్.

**టీక:–** *నిరాశీః* = ఆశలేనివాడును, *యతచిత్తాత్మా* = నిగ్రహింపబడిన ఇంద్రియమనంబులు కలవాడును, *త్యక్తసర్వపరిగ్రహః* = సమస్తవస్తుస్వీకారమును విడిచినవాడును (అయి), *శారీరంకేవలం కర్మ* = శరీరమాత్రముచేత (దేహధారణా, లోకసంగ్రహాది) కర్మను, *కుర్వన్* = చేయుచు (ఉండినను), *కిల్బిషమ్* = పాపమును, *న ఆప్నోతి* = పొందడు.

**తా:–** ఆశలేనివాడును, ఇంద్రియమనంబులను నిగ్రహించినవాడును, ఏవస్తువును పరిగ్రహింపనివాడునగు మనుజుడు శరీరమాత్రముచేత (దేహధారణాది) కర్మను చేసినను పాపము నొందడు.

**వ్యాఖ్య:–** కర్మను చేయవలసినరీతిగ చేసినచో అది బంధమునుగాని, పాపమునుగాని ఎన్నటికిని కలుగజేయదు. ఈ శ్లోకమునందు మూడు మహత్తరసద్గుణములు వచింపబడినవి - (1) ఆశ లేకుండుట (2)

ఇంద్రియమనంబులు వశమందుండుట (3) ఏ వస్తువును పరిగ్రహింపకుండుట (వస్తువులందు మమత్వము లేకుండుట). ఈ మూడు సల్లక్షణములుగలవాడు కేవలము ఉపాధితో ఎంత కర్మచేసినప్పటికిని పాపమునుబొందనేరడు. ఏలయనగా, ఆశలేనివానికి మనస్సు బహిర్ముఖములగు విషయాదులవైపుపోక, అంతర్ముఖమై, ఆత్మోన్ముఖమై యుండుటవలన ఆతడు కర్మలనుజేసినను ఫలాభిలాషారహితుడై యుండును. అట్లే ఇంద్రియమనంబులు స్వాధీనమందుగలవాని చిత్తము కర్మలందు కర్తృత్వభావన, సంగము లేకుండును. ఇక మూడవదియగు అపరిగ్రహము గలవానిమనస్సు దేనియందును మమత్వమును, ఆసక్తిని జెందకయుండును. కాబట్టి ఈ సద్గుణములుకలవాని క్రియలన్నియు ఫలాభిలాషారహితములై, అసక్తములైయుండుటవలన కర్తకు పాపమేమియు అంటకుండును. ఈ రహస్యమే ఈ శ్లోకమునందు తెలుపబడినది.

"త్యక్తసర్వపరిగ్రహః" - 'సర్వ' అని ప్రయోగించుటవలన ఏ ఒకటి రెండు వస్తువులనో కాదనియు సమస్తపదార్థములయొక్కయు పరిగ్రహణమును త్యజించిన వాడనియు చెప్పబడినది. ఏలయనగా, వస్తుపరిగ్రహణముచే, వస్తువులతోబాటు ఒరులకర్మనుగూడ తాను స్వీకరింపవలసివచ్చును. ఆ కర్మను తన జ్ఞానాగ్నిచే భస్మీభూతముచేయగలశక్తి తనకులేనిచో, అయ్యది సాధకునకు అశాంతిని కలుగజేయగలదు. కనుకనే ముముక్షువగు వానికి పరులవస్తువులను గ్రహింపరాదను "అపరిగ్రహ" నియమము శాస్త్రములందు విధింపబడినది★.

**ప్ర:–** కర్మచేసినను పాపము నెవడు పొందకుండును?

**ఉ:–** (1) ఆశలేనివాడు (2) ఇంద్రియమనంబులను స్వాధీనపరచుకొనినవాడు, (3) ఒరులనుండి ఏ వస్తువును పరిగ్రహింపనివాడు.

**అ॥** కర్మలను జేసినను ఎవడు బంధింపబడకుండునో తెలుపుచున్నాడు –

## 22. యదృచ్ఛాలాభసన్తుష్టో ద్వన్ద్వాతీతో విమత్సరః
## సమః సిద్ధావసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే.

**టీక:–** యదృచ్ఛాలాభ సన్తుష్టః = అప్రయత్నముగ దొరకినదానితో సంతోషమును బొందినవాడును, ద్వన్ద్వాతీతః = శీతోష్ణ, సుఖదుఃఖాది ద్వంద్వములను అతిక్రమించినవాడును (లక్ష్యపెట్టనివాడును), విమత్సరః = మాత్సర్యములేనివాడును, సిద్ధౌ = (ఫలముయొక్క) ప్రాప్తియందును (లేక కార్యముయొక్క సిద్ధియందును), అసిద్ధౌచ = ఫలముయొక్క అప్రాప్తియందును, సమః = సమబుద్ధి కలవాడును, కృత్వా అపి = కర్మ చేసినను, న నిబధ్యతే = బంధింపబడడు.

**తా:–** అప్రయత్నముగ లభించినదానితో సంతుష్టిని బొందువాడును, సుఖదుఃఖాది ద్వంద్వములను దాటినవాడును, మాత్సర్యము లేనివాడును, ఫలముయొక్క ప్రాప్తాప్రాప్తములందు సమబుద్ధిగలవాడు (లేక కార్యము సిద్ధించినను, సిద్ధింపకున్నను సమభావముతో నుండువాడు) నగు మనుజుడు కర్మనుచేసినను బంధింపబడడు.

★ యమము = అహింస, సత్యము, అస్తేయము (దొంగిలింపకుండుట), బ్రహ్మచర్యము, అపరిగ్రహము.

**వ్యాఖ్య:–** క్రిందటి శ్లోకమునందువలెనే కర్మనాచరించుచుగూడ బంధింపబడని వానియొక్క లక్షణములను మఱికొన్నిటి నిచట పేర్కొనిరి. దొరకినదానితో సంతుష్టినొందుట, ద్వంద్వములను లక్ష్యపెట్టకుండుట, మాత్సర్యము లేకుండుట, కార్యము సిద్ధించినను, సిద్ధింపకున్నను సమభావముతో నుండుట యను నీనాలుగు గుణములున్ను, పై శ్లోకమునందుతెలుపబడిన మూడు గుణములున్ను, జ్ఞానగుణములని, జీవన్ముక్తుని లక్షణములని స్పష్టముగ తెలియుచుండుటబట్టి జ్ఞానమందు బాగుగ అరితేరినగాని కర్మను శుద్ధముగ బంధరహితముగ ఆచరించుటకు వీలుపడదని తెలుచున్నది. జ్ఞానము, కర్మ అను నీరెండును ఒకదానికి మఱియొకటి పరస్పరము సహాయభూతములుగ నున్నవి. నిష్కామకర్మ ద్వారా (చిత్తశుద్ధి, తద్ద్వారా) జ్ఞానము కలుగుచున్నది. జ్ఞానము కలిగిననే నిష్కామకర్మ చక్కగ ఆచరించుటకు వీలుపడుచున్నది. అందువలననే కాబోలు కర్మయోగము (3వ అధ్యాయము) చివర అఖండజ్ఞానమును గూర్చియు 'జ్ఞానయోగము' (4వ అధ్యాయము) మధ్య కర్మాచరణమును గూర్చియు బోధింపబడినది. పైనదెల్పిన జ్ఞానగుణములు కలవాడు నిరంతరము సంస్థితియందే యుండును. గావున శరీరాదులచే నతడు కర్మలను చేసినప్పటికిని వానియందు తగుల్కొనక అసక్తుడై యుండును. కనుకనే యాత డాకర్మములచే నెన్నటికిని బంధింపబడనేరడని భగవానుడిచట తెలియజేయుచున్నాడు.

**ప్ర:–** కార్యమును జేసినప్పటికిని వానిచే నెవడు బంధింపబడకుండును?

**ఉ:–** (1) అప్రయత్నముగ లభించినదానితో సంతుష్టినొందువాడు (2) సుఖదుఃఖాది ద్వంద్వములను దాటినవాడు (3) మాత్సర్యములేనివాడు (4) కార్యముయొక్క సిద్ధి, అసిద్ధులందు సమభావము కలవాడు.

**అ॥** కర్మలను జేసినప్పటికిని కర్మరాహిత్య మెవనికి సిద్ధించునో వచించుచున్నాడు –

## 23. గత సఙ్గస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః.
## యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే.

**టీక:–** *గతసఙ్గస్య* = దేనియందును సంగము (ఆసక్తి) లేనివాడును, *ముక్తస్య* = (రాగద్వేష కామ క్రోధాదిరూప) సంసారబంధములనుండి విడువబడినవాడును, *జ్ఞానావస్థిత చేతసః* = ఆత్మజ్ఞానమందు నిలిచియున్న మనస్సుగలవాడును, *యజ్ఞాయ* = భగవత్ప్రీత్యర్థము, లేక పరప్రాణి యొక్క హితముకొఱకు, లేక ధర్మంకొఱకు, *ఆచరతః* = కర్మము నాచరించువాడగు మనుజుని యొక్క, *కర్మ* = కర్మ, *సమగ్రమ్* = సంపూర్ణముగ, *ప్రవిలీయతే* = విలీనమై పోవుచున్నది, (బంధాదులను గలిగింపక నశించిపోవుచున్నది)...

**తా:–** దేనియందును సంగము (ఆసక్తి) లేనివాడును, రాగద్వేషకామక్రోధాదిరూపసంసారబంధములనుండి విముక్తుడును, ఆత్మజ్ఞానమందే మనస్సు నిలుకడకలవాడును, భగవత్ప్రీత్యర్థము (లేక పరప్రాణిహితార్థము లేక, ధర్మము నిమిత్తము) కర్మ నాచరించువాడునగు మనుజునియొక్క కర్మ యావత్తు విలీనమైపోవుచున్నది. (జన్మ, బంధాదులను గలిగింపక నశించుచున్నది.)

**వ్యాఖ్య:–** "గతసఙ్గస్య" – సంగము (Attachment) తో, ఫలాసక్తితో నాచరింపబడునపుడు కర్మ బంధమును గలిగించును. జన్మకు హేతువగును. సంగరహితముగ ఫలాభిలాషావర్జితముగ నాచరింపబడునపుడు ఆ కర్మయే జీవుని విముక్తికి దారితీయును.

ప్రపంచములో అనేక కోట్ల జీవరాసులున్నప్పటికిని ఈ శ్లోకమునందు చెప్పబడిన నాలుగు సల్లక్షణములుగలవానియొక్క కర్మయే విలయమగునుగాని తదితరులది కాదు. వారే కర్మరాహిత్యమును, నైష్కర్మ్యస్థితిని బొందగలరు.

అవి యేవి యనిన - (1) సంగము (విషయాసక్తి, ఫలాసక్తి) లేకుండుట (2) రాగద్వేష, కామక్రోధాదిరూపములగు సంసారబంధములనుండి విడుదలను బొందుట (3) ఆత్మజ్ఞానమందే యెల్లప్పుడు చిత్తము నిలుకడనుబొందుట (4) భగవత్ప్రీత్యర్థము, పరహితార్థము కర్మను జేయుట.

"జ్ఞానావస్థితచేతసః" జ్ఞానమందు సదా నిలుకడనుబొందిన చిత్తము గలవానియొక్క కర్మలు నశించునని చెప్పబడినది. అట్టివా రెన్ని కర్మల నాచరించినను అవి యన్నియు ఆ జ్ఞానసాగరమున విలీనములై పోవునని భావము. కాబట్టి కర్మరాహిత్యమునకు జ్ఞానమత్యావశ్యకమని ఈ శ్లోకముద్వారా తెలుచున్నది. అట్టి జ్ఞానములేనివారి చిత్తము దృశ్యమును సత్యమని నమ్మి, దానియందే మునుంగుచు, సంగముకలదై, కర్తృత్వాదులు కలిగియుండును గనుక వారి కర్మ నశింపక బంధమునే కలిగించును.

"యాజ్ఞాయాచరతః" - 'యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబన్ధనః' అనగా యజ్ఞము (దైవము, ధర్మము, పరహితము) కొఱకు తప్ప ఇతర విధముగ జేయబడుకర్మబంధమును గలుగజేయునని భగవాను డిదివఱకే (3వ అధ్యాయమున) చెప్పియుండిరి.

"ప్రవిలీయతే" - 'లీయతే' అనిగాని 'విలీయతే' అనిగాని చెప్పక 'ప్రవిలీయతే' అని చెప్పుటవలన వారికర్మము ఒకింతైనను శేషింపక పూర్తిగ నశింపపోవునని యర్థము. మఱియు 'సమగ్రం' అని ప్రయోగించుటవలన, సంచితాదికర్మ లెవ్వియు మిగలక మొత్తము కర్మయంతయు జ్ఞానకుండములో ఆహుతి అయిపోవునని భావము.

సాధకులకు, భక్తులకు, ముముక్షువులకు ఇట్టి వాక్యములచే పరమధైర్యము చేకూరగలదు. ఏలయనగా ప్రతివారు వాంఛించునది ఈ కర్మరాహిత్యము, బంధరాహిత్యమేకదా! అట్టి మహోన్నతస్థితి యేప్రకారము కలుగగలదో ఈ శ్లోకమున నిరూపింపబడినది. కర్మ యేమియుచేయక ఊరకకూర్చుండుట కాదు ఇచట నుపదేశింపబడినది. గీతయొక్క ఆశయ మదికాదు. కర్మ యెంతచేసినను అది బంధకరముగ గాకుండు పద్ధతియే ఇట నేర్పబడినది. కావున ఈ నాలుగు సల్లక్షణములను ప్రతివారును అనుష్ఠించి కర్మబంధవిముక్తులు కావలసియున్నారు.

**అ॥** పైన దెల్పిన "యజ్ఞము" అను విషయమునుగూర్చి యేడు శ్లోకముల ద్వారా వివరించి చెప్పుచున్నాడు -

## 24. బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్
## బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మసమాధినా.

**టీక:–** (యజ్ఞమునందు) అర్పణమ్ = (స్రుక్కు, స్రువము మున్నగు) హోమసాధనములు, బ్రహ్మ = బ్రహ్మమే, హవిః = (అన్నము, నేయి మొదలగు) హోమద్రవ్యములు, బ్రహ్మ = బ్రహ్మమే, బ్రహ్మాగ్నౌ = బ్రహ్మమనెడి అగ్నియందు, బ్రహ్మణా = బ్రహ్మస్వరూపుడగు యజమాని చేత, హుతమ్ = హోమముచేయబడినది, (బ్రహ్మైవ = బ్రహ్మమే), బ్రహ్మకర్మసమాధినా = సర్వము బ్రహ్మస్వరూపమేయనెడి ఏకాగ్రభావముతో ఆ యజ్ఞాదికర్మలనుజేయు, తేన = అతనిచేత (ఆ బ్రహ్మనిష్ఠునిచేత), గన్తవ్యమ్ = పొందదగినఫలమున్ను, బ్రహ్మ ఏవ = బ్రహ్మమేయగును.

**తా:–** యజ్ఞమునందలి హోమసాధనములు, హోమద్రవ్యములు, హోమాగ్ని, హోమము చేయువాడు, హోమము చేయబడినది – అన్నియును బ్రహ్మస్వరూపములే యనెడి ఏకాగ్ర భావముతో ఆ యజ్ఞాది కర్మలను జేయు మనుజుడు బ్రహ్మమునే పొందగలడు.

**వ్యాఖ్య:–** ఈ ప్రపంచమున సమస్తము బ్రహ్మస్వరూపమేకాని అన్యముకాదు. ఈ విషయమును సదా జ్ఞప్తియందుంచుకొని కర్మచేయవలెను. అనగా చిత్తమందు బ్రహ్మభావన, దైవభావనగలిగి కర్మముచేయవలెను. అత్తఱి ఆ కర్మము యజ్ఞముగా మారిపోవును.

సమస్తము బ్రహ్మస్వరూప మెట్లగుననిన, ఈ నామరూపాత్మక జగత్తంతయు బ్రహ్మమందు మిథ్యగ ఆరోపింపబడినది. ఆరోపితవస్తువు అధిష్ఠానముకంటె వేఱుగ నుండదు. భ్రాంతిచే రజ్జువునందు సర్పము కల్పింపబడినది. కావున ఆ కల్పితసర్పము రజ్జువుకంటె భిన్నముగా నుండదు. రజ్జుస్వరూపమే యగును. అట్లే అజ్ఞానముచే ఈజగత్తు బ్రహ్మమునందు ఆరోపింపబడినది. ఆరోపితవస్తువు అధిష్ఠానముకంటె వేఱుగ నెన్నడును ఉండనేరదు. కనుక ఈ జగత్తున్ను బ్రహ్మస్వరూపమే. జగత్తునందలి ప్రతివస్తువు, ప్రతికార్యము బ్రహ్మస్వరూపమే. ఈసత్యమే ఈశ్లోకమందు నిరూపింపబడినది.

ఇచట యజ్ఞమందలి హోమమనుక్రియ దృష్టాంతముగ గైకొనబడినది. పూర్వ కాలము, అందును ముఖ్యముగ ద్వాపరయుగమున యజ్ఞయాగాదులు విరివిగ జరుపబడు చుండటవలన 'హోమకార్యము' అందఱికి తెలిసినవిషయమై యుండుటచే దానినే యిచట భగవానుడు దృష్టాంతరముగ తీసికొనెను. దీనినిబట్టి ఒక్క హోమమును గూర్చి చెప్పబడినప్పటికిని సమస్తకార్యములను ఆ ప్రకారమే ఊహించుకొనవచ్చును. ఇచట హోమముచేయు యజమాని, హవిస్సు, అగ్ని – అన్నియు బ్రహ్మస్వరూపములే అయినట్లు, ప్రతికార్యమందును చేయువాడు, చేయబడునది – అనునవి బ్రహ్మస్వరూపములే యగును. వెయ్యేల 'సర్వంఖల్విదంబ్రహ్మ' (ఛాందోగ్య. iii – 14-1) అని ఛాందోగ్యోపనిషత్తు తెలిపినవిధమున ఈసమస్తము బ్రహ్మమే యను భావము గల్గి జగత్తునందు మెలగువాడు ధన్యుడు.

'సమాధినా' – అని చెప్పుటచేత ఏకాగ్రచిత్తముతో, అనగా బ్రహ్మభావము తొలగక ఆ యా కర్మ నాచరించవలెనని ఉద్బోధింపబడినది. అత్తఱి కర్మ కర్మగా నుండక ధ్యానముగను, సమాధిగను మారిపోవును. కర్మ ఏప్రకారము జ్ఞానరూపముగ పరిణతి జెందగలదో ఆపద్ధతి యిచట తెలియజేయబడినది. బ్రహ్మభావముతో, ఏకాగ్ర దైవభావనతో కర్మచేసినచో ఆ కర్మ తనకర్మత్వమును గోల్పోయి జ్ఞానరూపమును, సమాధిరూపమును బొందగలదు.

ఈ ప్రకారముగ సమస్తము బ్రహ్మమే యను నిశ్చయముగల్గి అట్టి బ్రహ్మభావనతో కర్మముచేయువాడు పొందు ఫలితమేమి? 'బ్రహ్మైవ తేన గన్తవ్యమ్' అని చెప్పుట వలన అట్టివాడు బ్రహ్మమునే పొందునని స్పష్టముగా తేల్చివేయబడినది. మనుజుడు నిరంతరము దేనినిగూర్చి చింతించుచుండునో, ఆ స్వరూపమే యగును. కార్యములందు నిరంతర బ్రహ్మభావన గల్గియుండుటచే మనుజుడు బ్రహ్మమే యగుచున్నాడు. సామాన్యమగు కర్మ జీవున కేప్రకారముగ బ్రహ్మప్రాప్తికి హేతుభూత మగుచున్నదో ఈశ్లోకము స్పష్టీకరించుచున్నది.

కాబట్టి ఏకార్యమైనను చేయుటకు ముందుగా ఈ శ్లోకమును పఠించి శ్లోకార్థమును బాగుగ మననము

చేసినచో బ్రహ్మభావనచే సత్ఫలితములు తప్పక కలుగగలవు. కొందఱు భోజనముచేయునపు డీ శ్లోకమును పఠించు ఆచారము కలదు.

**అ॥** వివిధయజ్ఞములను తెలుపుచున్నాడు -

## 25. దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే
## బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి.

**టీక:-** అపరే = కొందఱు, యోగినః = యోగులు, దైవమ్ = దేవతలనుద్దేశించినట్టి (దేవతారాధనరూపమైన), యజ్ఞమ్ ఏవ = యజ్ఞమునే, పర్యుపాసతే = అనుష్ఠించుచున్నారు, అపరే = మరికొందఱు, యజ్ఞేనైవ = జీవబ్రహ్మైక్యభావనచేతనే, యజ్ఞమ్ = జీవుని, బ్రహ్మాగ్నౌ = బ్రహ్మమను అగ్నియందు, ఉపజుహ్వతి = హోమము చేయుచున్నారు.

**తా:-** కొందఱు యోగులు దేవతారాధనరూపమైన యజ్ఞమునే అనుష్ఠించు చున్నారు. మఱికొందఱు జీవబ్రహ్మైక్యభావనచే జీవుని పరబ్రహ్మమను అగ్నియందు హోమము చేయుచున్నారు. (ఆహుతి నొనర్చుచున్నారు).

**వ్యాఖ్య:-** యజ్ఞముకొఱకు కర్మనాచరించువానియొక్క కర్మ యావత్తు విలీనమై పోవునని 23వ శ్లోకమున తెలుపబడినది. ఇకనిపుడు ఆ యజ్ఞముయొక్క పెక్కువిధములు పేర్కొనబడుచున్నవి - కొందఱు (1) దైవయజ్ఞము నాచరించుదురు. అనగా దేవతారాధన, దేవతోపాసన, దేవతాధ్యానము, దేవతాకైంకర్యము, దేవతా ప్రార్థన ఇత్యాదికార్యముల నొనర్చుచుందురు. వీరు కర్మయోగులు, లేక భక్తియోగులు అని చెప్పవచ్చును.

(2) మఱికొందఱు బ్రహ్మాత్మైకత్వభావనచే చిత్తమును (జీవుని) బ్రహ్మమను అగ్నియందు ఆహుతిచేయుచున్నారు. అగ్ని సమస్తమును భక్షించి తనయందు లీన మొనర్చుకొనును. అట్లే బ్రహ్మమందు దృశ్యజాతమంతయు లీనమైపోవును. చిత్తము (జీవుడు) కూడ దృశ్యమునం దంతర్భాగమే కనుక, జీవబ్రహ్మైక్యభావనచే మహనీయు లద్దానిని బ్రహ్మమను అగ్నియందు (ఆత్మయందు) హోమముచేసివైచుచున్నారు. అనగా లయింపజేయుచున్నారు. ఇదియే బ్రహ్మయజ్ఞము. దీని నాచరించువారు జ్ఞానయోగులనబడుదురు. ఇట్టియజ్ఞముచే వారు (భ్రమరకీటన్యాయము ననుసరించి) బ్రహ్మముతో నైక్యమొందుచున్నారు. ఏ వస్తువు అగ్నియందు వేయబడినను అది అగ్నిరూపమునే పొందును. అట్లే బ్రహ్మమునందు వ్రేల్చబడిన మనస్సు (జీవుడు) బ్రహ్మస్వరూపమేయగును. అదియే మోక్షస్థితి. ఆత్మవిచారణ చేతను, విషయవిరక్తిచేతను తనయందలి వాసనలు, దృశ్యసంస్కారములు నిర్మూలనముకాగా, అట్టి శుద్ధసాత్త్వికచిత్తము బ్రహ్మమునందు విలీనమైపోవును. అదియే బ్రహ్మయజ్ఞము.

**ప్ర:-** యజ్ఞములలో కొన్నిటిని పేర్కొనుము?

**ఉ:-** (1) దైవయజ్ఞము (దేవతారాధన, దేవతోపాసన ఇత్యాదిరూప యజ్ఞము). (2) బ్రహ్మయజ్ఞము (విచారణచేతను, పవిత్రతచేతను చిత్తమును బ్రహ్మమందు (ఆత్మయందు) విలీనమొనర్చుట).

**26. శ్రోత్రాదీనీన్ద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి
శబ్దాదీన్విషయానన్య ఇన్ద్రియాగ్నిషు జుహ్వతి.**

**టీక:–** అన్యే = కొందఱు, శ్రోత్రాదీని = శ్రోత్రము (చెవి) మొదలగు, ఇన్ద్రియాణి = ఇంద్రియములను, సంయమాగ్నిషు = నిగ్రహమనెడి అగ్నులందు, జుహ్వతి = హోమము చేయుచున్నారు, అన్యే = మఱికొందఱు, శబ్దాదీన్ = శబ్దము మొదలైన, విషయాన్ = విషయములను, ఇన్ద్రియాగ్నిషు = ఇంద్రియములను అగ్నులందు, జుహ్వతి = హోమముచేయుచున్నారు.

**తా:–** కొందఱు చెవి మొదలగు ఇంద్రియములను నిగ్రహమనెడి అగ్నులందును, మఱికొందఱు శబ్దాదివిషయములను ఇంద్రియములనెడి అగ్నులందును హోమము చేయుచున్నారు.

**వ్యాఖ్య:–** (1) ఇంద్రియనిగ్రహము (2) శబ్దాదివిషయత్యాగము – అను రెండు విధములగు యజ్ఞము లిచట తెలుపబడినవి.

ఇంద్రియనిగ్రహము అధ్యాత్మశాస్త్రమున కీలకస్థానమాక్రమించియున్నది. మోక్షసౌధము నెక్కుట కది నిచ్చెనవంటిది. కాబట్టియే దీనినిగూర్చి 2వ, 3వ అధ్యాయములందు భగవానుడు విపులముగ బోధించియున్నారు. 'తస్మాత్త్వమిన్ద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ' – అని చెప్పుచు ఇంద్రియనిగ్రహమునే ప్రథమసాధనగా శ్రీకృష్ణమూర్తి సూచించిరి. ఇంద్రియములను నిరోధింపక పలుకు వేదాంతవచనములు నిర్వీర్యములును, నిస్తేజములు నగును. అది 'వాచావేదాంతమే' కాగలదు. ఇంద్రియములను జయించి, ఏమియు పలుకకున్నను అట్టి సంయమశీలునినుండి వేదాంతబోధ దిగంతముల ప్రసరించుచుండును. మహోన్నతమగు అట్టి ఇంద్రియనిగ్రహరూపసాధన ఒకానొక యజ్ఞముగ నిచట వర్ణించబడినది. మోక్షమును పొందవలెనని మనస్సును నిగ్రహించవలెను. మనస్సును నిగ్రహించవలెనని ఇంద్రియములను నిరోధించవలెను. కాబట్టి ముముక్షువునకు ఇంద్రియనిగ్రహ మత్యావశ్యకమై యున్నది. పెక్కువ్రతముల ద్వారా, సంయమములద్వారా, నియమములద్వారా ఇంద్రియములన్నిటిని స్వాధీనపఱచుకొనవలెను. సంయమమను అగ్నులందు ఇంద్రియములను హోమముచేయుట యనగా నిదియే. అనేక ఇంద్రియములుండుటవలన, ఒక్కొక్కదానిని విడివిడిగ బాగుగా సంయమ మొనర్చవలెనని తెలుపుటకై 'అగ్నులు' అను బహువచనప్రయోగము చేయబడినది.

ఇక రెండవయజ్ఞమగు శబ్దాదివిషయనిరోధమున్ను దాదాపు పైయజ్ఞమునకు సంబంధించినదే యగును. ఇంద్రియములు శబ్దాదివిషయము లను క్షేత్రములందు సంచరించుచుండును. ఆ యా విషయములందలి దోషములను చక్కగ విచారించి, వానిపై ప్రీతిని విడనాడవలెను. ఇదియే విషయములను హవిస్సును, ఇంద్రియములను అగ్నులందు హోమముచేయుట. విషయములందలి ఇట్టి దోషదృష్టిచే ఇంద్రియములు ఆ యా విషయములపైకి పరుగిడకుండును. ఇంద్రియములెపుడు నిశ్చలములుగ నుండునో, అపుడు చిత్తవృత్తులు నిరోధింపబడినవి యగును. ఎపుడు చిత్తవృత్తులు నిరోధింపబడునో అపుడు ద్రష్టయగు జీవుడు స్వస్వరూపమగు ఆత్మయందు నిలుకడను బొందును. అదియే మోక్షము.

**ప్ర:–** మఱికొన్ని యజ్ఞముల నుదహరింపుము?

**ఉ:–** (1) ఇన్ద్రియనిగ్రహము (2) విషయత్యాగము.

**27. సర్వాణీన్ద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే.**

**టీక:–** అపరే = మఱికొందరు, సర్వాణి = సమస్తములైన, ఇంద్రియకర్మాణి = ఇంద్రియ వ్యాపారములను, ప్రాణకర్మాణి చ = పంచప్రాణములయొక్క వ్యాపారములను, జ్ఞానదీపితే = జ్ఞానముచే ప్రకాశింపజేయబడిన, ఆత్మసంయమయోగాగ్నౌ = మనోనిగ్రహ యోగమను (సమాధియోగమను) అగ్నియందు, జుహ్వతి = హోమము చేయుచున్నారు.

**తా:–** మఱికొందఱు ఇంద్రియములయొక్క వ్యాపారములన్నిటిని, ప్రాణములయొక్క వ్యాపారములన్నిటిని జ్ఞానముచే ప్రకాశింపజేయబడిన 'మనోనిగ్రహ' యోగమను (సమాధియోగమను) అగ్నియందు హోమము చేయుచున్నారు.

**వ్యాఖ్య:–** మోక్షప్రాప్తికి మనస్సు అనునది అడ్డుగానున్నది. అది అనేక జన్మాంతర దుస్సంస్కారములతో గూడి మహాప్రబలమై యుండుచున్నది. దానిని నిగ్రహింపవలెననిన, ఇంద్రియనిరోధము, ప్రాణాయామము మున్నగునవి అవసరములై యున్నవి. ఏలయనిన ఇంద్రియవేగమును, ప్రాణవేగమును అరికట్టనిచో మనస్సును ఎవరును జయించలేరు. కాబట్టి మనస్సంయమనమునకు సహాయముగ ఇంద్రియనిగ్రహము, ప్రాణాయామము శీలించవలసియుండును. ఆ విషయమే అలంకారికభాషలో 'ఆత్మసంయమయోగమను అగ్నియందు ఇంద్రియకర్మలు, ప్రాణకర్మలు వ్రేల్చబడుచున్నవి' అని యిచట తెలుపబడినది.

"జ్ఞానదీపితే" – అను పదము బాగుగ గమనింపదగియున్నది. మనస్సంయమనము, మనోనిగ్రహము ఆత్మజ్ఞానముచే లెస్సగ ప్రకాశింపజేయబడగలదు, వర్ధిల్లగలదు. తత్త్వజ్ఞానము యొక్క సహాయములేనిచో వాసనాక్షయము(మనోనిగ్రహము) సిద్ధించుట కష్టతరము. కనుకనే 'జ్ఞానదీపితే' – 'జ్ఞానముచే వృద్ధినొందింపబడిన మనోనిగ్రహ' మని యిచట పేర్కొనబడినది. మనస్సంయమనమను అగ్నికి తత్త్వజ్ఞానము (విచారణ) విసనకఱ్ఱవంటిది. దానిచే ఆ సంయమాగ్ని దేదీప్యమానముగ ప్రజ్వలించును. కావున ఆత్మసంయమనమును అనగా మనోనిగ్రహమును శీలింపదలంచువారు తత్త్వ జ్ఞానముయొక్క సహాయము తప్పక గైకొనవలసియుండును. 'ఈ జగత్తు ఏమి? విషయములు శాశ్వతములా? శాశ్వతమగు పదార్థమెద్ది?' – అనునట్టి విచారణచే (జ్ఞానముచే) మనస్సు నశ్వరములగు విషయములపై పరుగిడక శాశ్వతమగు ఆత్మవైపునకే పయనించును. మఱియు 'జ్ఞానదీపితే' అని చెప్పినందువలన సమాధిస్థితి, మనస్సంయమనస్థితి ఒకానొక శూన్యావస్థ కాదనియు, కేవలము ప్రజ్ఞామయమగు జ్ఞానవంతమగు చిన్మయస్థితయేయనియు స్పష్టమగుచున్నది.

**ప్ర:–** మనస్సంయమనము దేనిచే వర్ధిల్లును?

**ఉ:–** జ్ఞానముచే, తత్త్వవిచారణచే.

**28. ద్రవ్యయజ్ఞాస్తపోయజ్ఞా యోగయజ్ఞాస్తథాఽపరే
స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ యతయః సంశితవ్రతాః.**

**టీక:–** అపరే = కొందఱు, ద్రవ్యయజ్ఞాః = ద్రవ్యమును సద్విషయములందు వినియోగించుటయే యజ్ఞముగ గలవారును, (అపరే = కొందరు) తపోయజ్ఞా = తపస్సే యజ్ఞముగ గలవారును, (అపరే = మఱికొందరు) యోగయజ్ఞాః = ప్రాణాయామాది అష్టాంగయోగమే యజ్ఞముగగలవారును, తథా = ఆ ప్రకారముగనే, (అపరే = ఇంకకొందఱు) స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ = వేదాధ్యయనము, వేదార్థజ్ఞానసముపార్జనము యజ్ఞముగ గలవారును (అయియున్నారు). (వారందఱును), యతయః = ప్రయత్నశీలురును, సంశితవ్రతాః = దృఢవ్రతములుగలవారునయి యొప్పుచున్నారు.

**తా:–** కొందఱు ద్రవ్యమును దానధర్మాది సద్విషయములందు వినియోగించుటయే యజ్ఞముగ గలవారును, కొందఱు తపస్సే యజ్ఞముగ గలవారును, కొందఱు (ప్రాణాయామాద్యష్టాంగ) యోగమే యజ్ఞముగ గలవారు నయియున్నారు. వారందఱున్ను ప్రయత్నశీలురును, దృఢవ్రతములు కలవారునయి యొప్పుచున్నారు.

**వ్యాఖ్య:–** మఱికొన్ని విధములగు యజ్ఞముల నిచట చెప్పుచున్నారు –

(1) ద్రవ్యయజ్ఞము:– వారివారి ధనమును, వస్తువులను సత్పాత్రులకు దానముచేయుట, సద్విషయములకు వినియోగపఱచుట. ఇట్టి దానధర్మములుకూడ ఒకనొక యజ్ఞమేయని యిట వచింపబడినది.

(2) తపోయజ్ఞము:– వ్రతోపవాసాదులచే దేహేంద్రియమనంబులను తపింపజేసి క్రమముగ వానిని స్వాధీనపఱచుకొనుట. ఇదియును ఒకవిధమగు యజ్ఞమే.

(3) యోగయజ్ఞము:– యమనియమాదిరూపమగు అష్టాంగయోగము. ఇదియు యజ్ఞమే.

(4) స్వాధ్యాయజ్ఞానయజ్ఞము:– వేదాధ్యయనము, శాస్త్రపఠనముచేయుట, అందలి అర్థమును బాగుగ తెలిసికొని అనుష్ఠించుట. ఇదియు ఒకానొక యజ్ఞమే యగును.

ఈ ప్రకారముగ జనులు వారివారి సంస్కారము, అభిరుచిననుసరించి భిన్నబిన్నములగు మార్గములను జేబట్టి వివిధములగు యజ్ఞముల నాచరించుచు చిత్తశుద్ధినిబడసి కట్టకడకు పరమాత్మను జేరుచున్నారు. వీరందఱున్ను యతులే యగుదురు. అనగా ప్రయత్నశీలురని భావము. మోక్షముకొఱకు, భగవత్సాక్షాత్కారముకొఱకు యత్నించువారందఱున్ను యతులే.

"సంశితవ్రతాః" – అని చెప్పినందువలన వీరందఱున్ను దృఢతరములగు వ్రతనిష్ఠలనుబూని, కఠోరనియమములను శీలించుచు మనస్సునందు జన్మజన్మాంతరములనుండి ఘనీభవించియున్న వాసనలను, దృశ్యసంస్కారములను పారద్రోలుచున్నారని యర్థము. సోమరియగువాడు మోక్షమార్గమున ఒక్క అడుగైనను ముందుకుపోలేడు. అంగడిలోని వస్తువులకు మూల్యమును చెల్లించువిధమున మోక్షమునకున్ను గొప్పమూల్యమును చెల్లించవలెను. అదియే త్యాగము. అల్పవిషయసుఖత్యాగము. బ్రహ్మానందమను వస్తువు లభించవలెనన్న ఈమాత్రపు మూల్యమును తప్పక చెల్లించవలెను. ప్రారంభమున కొంత కష్టపడవలెను. శ్రమకు ఓర్వవలెను. యతులై (ప్రయత్నవంతులై), సంశితవ్రతులై ఇక్కార్యమును ఎట్లైనను సాధించివేయవలెను. ఇచట యతులనగా సన్న్యాసులని అర్థముకాదు, ప్రయత్నశీలురనియే భావము. మఱియు 'సంశితవ్రతాః' అనిచెప్పినందువలన సామాన్యవ్రతములచే, నియమములచే మాయ

లొంగదనియు, దృఢవ్రతములు, కఠిననియమములు ఆచరించిననే అది దారికివచ్చుననియు ముముక్షువులకు హెచ్చరిక చేయబడినది. దృఢముగ నాటుకొనిన మఱ్ఱిచెట్టును నఱకుటకు రేకుకత్తులుకాక ఉక్కుతో చేయబడిన గండ్రగొడ్డళ్లు కావలెను గదా!

## 29. అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాఽపరే
## ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః.

**టీక:–** ప్రాణాయామపరాయణాః = ప్రాణాయామతత్పరులగు, అపరే = కొందఱు, ప్రాణాపానగతీ = ప్రాణాపానముల మార్గములను, రుద్ధ్వా = నిరోధించి (కుంభకమొనర్చి), అపానే = అపానవాయువునందు, ప్రాణం = ప్రాణవాయువును (పూరకమును), తథా = అటులనే, ప్రాణే = ప్రాణవాయువునందు, అపానమ్ = అపానవాయువును (రేచకమును), జుహ్వతి = హోమముచేయుచున్నారు.

**తా:–** ప్రాణాయామతత్పరులగు కొందఱు ప్రాణాపానములయొక్క గతులను (మార్గములను) నిరోధించి అపానవాయువునందు ప్రాణవాయువును, ప్రాణవాయువునందు అపానవాయువును హోమముచేయుచున్నారు. (పూరక, కుంభక, రేచకముల నొనర్చుచున్నారని భావము).

**వ్యాఖ్య:–** ప్రాణాయామముకూడ ఒకానొక యజ్ఞమేనని యిచట వర్ణించుచున్నారు. ప్రాణాయామము అష్టాంగయోగమునందుగల యమనియమాదులలో నాల్గవది. శరీరము యొక్క ఆరోగ్యము కాపాడుటకొఱకును, మనస్సుయొక్క చంచలత్వమును రూపుమాపుటకును ప్రాణాయామము ఆవశ్యకమైనది. ఇది పూరక, కుంభక, రేచకములను మూడువిభాగములతో గూడియున్నది. ఈ శ్లోకమునందు అపానమందు ప్రాణమును హోమముచేయుట యనగా పూరకము. ప్రాణమం దపానమును వ్రేల్చుటయనగా రేచకము. ప్రాణాపానములగతులను నిరోధించుటయనగా కుంభకము. ఈ పూరక, కుంభక, రేచకముల నాచరించునపు డేదైన (ప్రణవాది) దివ్యమంత్రమును మానసికముగ చింతన జేయుదురు, లేక దైవభావనగల్గియుందురు. ఈ ప్రాణాయామమువలన మనస్సుబహిర్ముఖత్వమును వీడి నిశ్చలముగ నుండును. ఏలయనిన ప్రాణమునకును, మనస్సునకును చాల సన్నిహితసంబంధము కలదు. మనోనిరోధముచే ప్రాణనిరోధము, ప్రాణనిరోధముచే మనోనిరోధము సంభవించుచుండును. కాబట్టి మనస్సుయొక్క చపలత్వ ముడుగుటకై సాధకుడు ప్రారంభములో ఒకింత ప్రాణాయామమును శీలించుట మంచిది. అయితే, దీనిని అనుభవముకలవారియొద్ద చక్కగ నేర్చుకొనవలెను. ఇట్టి ప్రాణాయామము ఒక యజ్ఞముగా నిచట వర్ణించబడినది.

## 30. అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి
## సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః.

**టీక:–** అపరే = మఱికొందఱు, నియతాహారాః = ఆహారమునందు కట్టుబాటుగలవారలై, ప్రాణాన్ = ప్రాణాదివాయువులను, (లేక ఇంద్రియవ్యాపారములను), ప్రాణేషు = ప్రాణాది వాయువులందే (వశీకృతేంద్రియములందు), జుహ్వతి = హోమముచేయుచున్నారు, ఏతే సర్వేఽపి = వీరందఱునుగూడ,

యజ్ఞవిదః = యజ్ఞమునెఱిగినవారును, యజ్ఞక్షపితకల్మషాః = యజ్ఞముచేత నశింపబడిన పాపము గలవారును (అగుచున్నారు).

**తా:–** మఱికొందఱు ఆహారవిషయమున కట్టుబాటుగలవారై ప్రాణాదివాయువులను ప్రాణాదివాయువులందే హోమము చేయుచున్నారు. (లేక, ఇంద్రియవ్యాపారములను వశీకృతేంద్రియములందు వ్రేల్చుచున్నారు). వీరందఱున్ను యజ్ఞము నెఱిగినవారును, యజ్ఞముచే పాపము నశించినవారును అయియున్నారు.

**వ్యాఖ్య:–** శ్రీకృష్ణపరమాత్మ ఈ శ్లోకముతో వివిధయజ్ఞములయొక్క వర్ణనను పూర్తిచేయుచున్నారు. మొత్తము పండ్రెండు రకముల యజ్ఞముల నిచట భగవానుడు పేర్కొనిరి. అందులో చివరిది ఆహారసంయమము. ఆహారనియమముకూడ ఒకానొక యజ్ఞమేయని యిట వచింపబడినది. ఆహారమనునది సామాన్యవిషయమేయని కొందఱు తలంచవచ్చును. కాని గీతాచార్యులు దానికి భగవద్గీతయందు సముచితస్థానమొసంగిగౌరవించిరి. అనేకచోట్ల దానిని గుఱించి ప్రస్తావించుచుపోయిరి. దానిని చులకనగ చూడలేదు. మోక్షమునకు వలసిన ప్రధానసాధనలలో దానినిగూడ జేర్చివైచిరి. ఏలయనగా, ఆహారముచేతనే మనస్సు యేర్పడుచున్నది. ఆహారముయొక్క స్థూలాంశముచే శరీరమున్ను, సూక్ష్మాంశముచే మనస్సున్ను గలుగుచున్నవి. ఆహారముయొక్క శుద్ధత్వము వలన మనస్సున్ను శుద్ధపడుచున్నది. ఆహారము సాత్త్వికమైనచో ఆ సాత్త్వికాణువులచే నేర్పడు మనస్సున్ను సాత్త్వికముగ నుండును. రజోగుణాత్మకములైన మాంసాద్యాహారములను స్వీకరించు మానవులందును, జంతువులందును క్రూరత్వాదులు ప్రత్యక్షముగ గన్పట్టుచున్నవి గదా.

పెద్ద ఫాక్టరీలో ఒక చిన్నమేకు సరిగా లేనిచో ఆ ఫాక్టరీయంతయు నెట్లాగిపోవునో, రైలుపట్టాలపై ఒక చిన్నశీల ఊడినచో రైలుబండికి ఘోరప్రమాద మెట్లు వాటిల్లునో, అట్లే ఆహారనియమమను ఒక చిన్న విషయము సరిగాలేనిచో మోక్షప్రయత్నరూపయంత్రాంగమంతయు స్తబ్ధమైపోగలదు. ఆహారము శుద్ధముగా నుండిన, మనస్సున్ను శుద్ధముగా నుండును. మనస్సు శుద్ధముగానుండిననే మోక్షప్రాప్తి చేకూరును. కాబట్టియే ఆహారసంయమనమును భగవాను డొక యజ్ఞముగా నిచట వర్ణించి చెప్పిరి. ఆహార మేవిధముగ నుండవలెననగా – (1) మితముగను (2) సాత్త్వికముగను (3) న్యాయార్జితముగను (4) భగవదర్పితముగను (5) నియమితకాలసేవితముగను నుండవలెను. ఈ యైదు విధములగు శుద్ధిని ఆహారవిషయమున గమనించుచుండవలెను.

ఈ ప్రకారముగ అనేక మోక్ష సాధనములనుగూర్చి యింతదనుక భగవాను డిచట తెలియజేసిరి. ఆ సాధన లన్నింటికిని 'యజ్ఞము'లను పవిత్రనామకరణమున్ను గావించిరి. యజ్ఞమనగా ఏమియో అసాధ్యమగు కర్మకాండయని భయపడువారికందఱికిని అభయమొసంగి వాస్తవయజ్ఞతత్త్వమును బాహాటముగ చాటిరి. మఱియు నిచట పశుహింసతో గూడిన యజ్ఞ మొకటియైనను తెలుపబడలేదు. ఈ పైసాధనలనుగూర్చి తెలిసినవారందఱు, వానిని అనుష్ఠించువారందఱు యజ్ఞవేత్తలే (యజ్ఞవిదః) అని భగవానుడు నుడివిరి. అనగా యజ్ఞముయొక్క తత్త్వము (Science) తెలిసినవారని భావము.

ఈ యజ్ఞమువలన కలుగు ఫలితమేమి? వానిచే పాపము నశించును (క్షపితకల్మషాః). అనేక జన్మలనుండియు మనస్సునకు పట్టియున్నకుళ్ళు, పాచి తొలగిపోవును. పాపమును తొలగించుకొనుటకు ఈ యజ్ఞరూప పుణ్యాచరణమే శరణ్యము. 'నా పాప మెట్లుపోవును?' అని చాలమంది ప్రశ్నించుచుందురు.

అందులకుపాయమును భగవానుడే యిచట సెలవిచ్చియున్నారు. యజ్ఞములనంబడు ఈ పుణ్యకార్యములయొక్క అనుష్ఠానమే పాపహరణమున కేకైక ఉపాయమని యిచట స్పష్టముగ తెలుపబడినది. పాపము నశించనిచో చిత్తము శుద్ధము కాదు. చిత్తము శుద్ధముకానిచో ఆత్మజ్ఞాన ముదయించదు. ఆత్మజ్ఞాన ముదయించనిచో మోక్షరూప పరమశాంతి లభించదు. కాబట్టి మొట్టమొదట పాప మంతరించవలెను. అందులకై ఈ పైన దెల్పిన పంద్రెండు యజ్ఞములలో అన్నిటినిగాని, లేక కొన్నిటినిగాని, లేక కనీసము ఒక్కదానినైనగాని ముముక్షువు తప్పక ఆచరించవలయును. బంధవిముక్తికి వేఱుమార్గములేదు.

**ప్ర:–** యజ్ఞముల నాచరించుటవలన కలుగు ఫలితమేమి?

**ఉ:–** పాపము నశించును.

**ప్ర:–** కావున పాపము నశించుట కుపాయమేమి?

**ఉ:–** యజ్ఞాచరణము, సత్కర్మానుష్ఠానము.

**అ||** యజ్ఞముల నాచరించుటవలన కలుగు సత్ఫలితమును, ఆచరింపకపోవుట వలన కలుగు దుష్ఫలితమును వివరించుచున్నాడు-

**31. యజ్ఞశిష్టామృతభుజో యాన్తి బ్రహ్మ సనాతనమ్**
**నాయం లోకో౽స్త్యయజ్ఞస్య కుతో౽న్యః కురుసత్తమ.**

**టీక:–** కురుసత్తమ = కురువంశ శ్రేష్ఠుడవగు ఓ అర్జునా, యజ్ఞశిష్టామృతభుజః = (పైనదెల్పిన) యజ్ఞములందు శేషించిన అమృతరూపమైన అన్నమును భుజించువారు, సనాతనమ్ = శాశ్వతమైన, బ్రహ్మ = బ్రహ్మమును, యాన్తి = పొందుచున్నారు, అయజ్ఞస్య = యజ్ఞమొక దానినైనను చేయనివానికి, అయమ్ = ఈ, లోకః = లోకము, నాస్తి = లేదు (అట్టిచో), అన్యః = పరలోకము, కుతః = ఎక్కడిది?

**తా:–** కురువంశశ్రేష్ఠుడవగు ఓ అర్జునా! (పైనదెల్పిన) యజ్ఞములాచరింపగా శేషించిన అమృతరూపమైన అన్నమును భుజించువారు శాశ్వతపరబ్రహ్మమును పొందుదురు. అట్టియజ్ఞ మొకదానినైనను చేయనివానికి ఇహలోకసుఖములేదు. అట్టిచో నిక పరలోకసుఖ మెక్కడిది?

**వ్యాఖ్య:–** ఇంతదనుక అనేక యజ్ఞములను పేర్కొని యిపుడు వాని మాహాత్మ్యమును భగవానుడు వర్ణించుచున్నాడు. పైనదెల్పిన యజ్ఞములలో అన్ని కాని, కొన్ని కాని, లేక ఒకటైనను గాని చేసి, లేక, ఏదైన దైవకార్యముగాని, పరమార్థసాధనగాని చేసి ఆ పిదప భుజించునట్టి అన్నము అమృతముగా మారిపోవును. కనుకనే దానిని భుజించువారు 'యాన్తి బ్రహ్మసనాతనమ్' – జననమరణరహితమగు శాశ్వతపరబ్రహ్మమును బొందుదురని యిచట వచింపబడినది. క్రిందటిశ్లోకమునందు 'యజ్ఞక్షపిత కల్మషాః' – యజ్ఞముచే (దైవకార్యముచే) పాపము నశించునని చెప్పబడినది. పాపక్షయముచే చిత్తము నిష్కల్మషమై యలరారును. శుద్ధచిత్తమున అధిష్ఠానాత్మ దేదీప్యమానముగ ప్రకాశించును. అనగా చిత్తము ఆత్మయందు లయింప ఆత్మమాత్రము శేషించును. అదియే సనాతనబ్రహ్మపదవి. కావుననే యజ్ఞశేషమును భుజించువారు పరబ్రహ్మమును బొందుదురని చెప్పుటకు కారణము. అహా! ఎట్టి అద్భుతఫలితము!

కార్యముయొక్క మహిమ ఫలితముయొక్క గొప్పతనముపై ఆధారపడి యుండును. ఇచట యజ్ఞమను కార్యముయొక్క ఫలితమో సాక్షాత్ బ్రహ్మమే. కావున యజ్ఞము యొక్క మహత్తు ఎట్టిదో యూహించుకొనవచ్చును. ప్రపంచములో ఎంతయో శ్రమపడినచో ఒకింత ధనమో, క్షేత్రమో, యశస్సో లభించుచున్నది. కాని అవి క్షణికములైనవి. ఈ శరీరముతోబాటు నశించునవి. కాని బ్రహ్మమో, సనాతనమైనది. అమరస్వరూపము. ప్రతివానియొక్క గమ్యస్థానము ఎట్టకేలకు అదియే అయియున్నది. అట్టిచో ఈ జన్మమందే దానినేల సాధించరాదు? సాధించుట కుపాయమును భగవానుడే యిచట తెలియజేసిరిగదా! యజ్ఞమే దానికి ఉపాయము. అనగా భగవత్కార్యము, అధ్యాత్మసాధన, పరహితవర్తనము, ఆ యజ్ఞములయొక్క స్వరూపము, వాని వివిధరీతులన్నియు నిదివఱకే చెప్పబడియున్నవి. వాని నాచరించిన చాలును.

అట్లు ఏదేని యజ్ఞము, సత్కార్యము చేయకుండ అన్నము భుజించరాదను శపథము, దృఢవ్రతము గైకొనవలెను. ఏలయనిన, ఆ నియమమే క్రమముగ ముక్తికి దారితీయును. అట్లు యజ్ఞము నాచరింపక భుజించువాడు పాపమును భుజించినట్లే యగునని ఇదివఱకే భగవానుడు తెలిపియున్నాడు. అట్టివానికి ఇహము లేదు. పరములేదు. చూచితిరా! యజ్ఞము లాచరింపనివానికి, దైవకార్యమును చేయని వానికి కలుగు ఘోరపతనము! భయంకర దుష్ఫలితము! ఉత్తమమగు మానవజన్మను బొందియు దైవవిచారణచేయక నశ్వరములగు దృశ్యవస్తువులనే పట్టి వ్రేలాడువా డెట్టిఅవివేకి? కనుకనే భగవానుడిచట సత్కర్మవిముఖుల కీప్రకారముగ తీవ్రమగు హెచ్చరిక చేయుచున్నారు - ''ఓ జీవులారా! ఉత్తమజన్మనుబడసియు, సత్కార్యములనాచరింపక, పరమార్థసాధన నొకింతైనను చేయకనున్నచో మీకు ఇహలోకసుఖము దక్కదు. పరలోక సుఖము అంతకంటెను దక్కదు." కాబట్టి భగవద్వాక్యములందు విశ్వాసముంచి, ప్రతివారును ఈ యజ్ఞములను తప్పక ఆచరించవలయును.

"యజ్ఞశిష్టాశినః" - 'యజ్ఞమునందు శేషించిన అన్నమును భుజించువార'ని యిచట చెప్పబడినది గదా! మఱి భగవానుడు తెలిపిన "జ్ఞానము, ఇంద్రియనిగ్రహము, తపస్సు, ప్రాణాయామము" మున్నగు యజ్ఞములందు అన్నమనునదియే సంభవించదు గదా! కనుక ఈ పదమున కిట్లు అర్థము చెప్పుకొనవలసివచ్చును - యజ్ఞములాచరించిన పిదప భుజింపబడు ఆహారము అమృతతుల్యమగును గాన, దానిని భుజించువారు పాపరహితులగుదురు. లేక యజ్ఞాచరణమువలన గలుగు అమృతతుల్యమగు మనశ్శాంతిని, సాత్త్వికసుఖమును వీరనుభవించుదురనియు చెప్పవచ్చును.

**ప్ర:-** బ్రహ్మమెట్టిది?

**ఉ:-** శాశ్వతమైనది, నాశరహితమైనది.

**ప్ర:-** దాని నెవరు పొందుదురు?

**ఉ:-** యజ్ఞములను (సత్కార్యములను) ఆచరించి శేషించిన యన్నమును భుజించువారు.

**ప్ర:-** యజ్ఞముల నాచరింపనివారి కెట్టి దుర్గతి కలుగును?

**ఉ:-** వారికి ఇహలోకసుఖముగాని పరలోకసుఖముగాని లభించదు.

**అ||** ఇక యజ్ఞసంబంధమగు చర్చను విరమించుచున్నాడు-

**32. ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే**
**కర్మజాన్ విద్ధి తాన్ సర్వానేవం జ్ఞాత్వా విమోక్ష్యసే.**

**టీక:–** ఏవమ్ = ఈ ప్రకారముగ, బహువిధాః = అనేక విధములైన, యజ్ఞాః = యజ్ఞములు, బ్రహ్మణః ముఖే = వేదమందు, వితతాః = సవిస్తరముగ జెప్పబడియున్నవి, తాన్ సర్వాన్ = వాని నన్నిటిని, కర్మజాన్ = కర్మములవలన పుట్టినవానినిగ, విద్ధి = ఎఱుగుము, ఏవమ్ = ఇట్లు, జ్ఞాత్వా = తెలిసికొని, విమోక్ష్యసే = విముక్తుడవు కాగలవు.

**తా:–** ఈ ప్రకారముగ అనేక విధములైన యజ్ఞములు వేదమునందు సవిస్తరముగ తెలుపబడియున్నవి. అవియన్నియు కర్మలవలన పుట్టినవానినిగ (కర్మమునకు సంబంధించినవేయని) నీవెఱుంగుము. ఇట్లెఱింగిన నీవు విముక్తుడవు కాగలవు.

**వ్యాఖ్య:–** పైన తెలుపబడిన యజ్ఞములే కాక ఇంకను నెన్నియో యజ్ఞములు వేదమునందు విస్తారముగ చెప్పబడినవని యిట పేర్కొనుచున్నారు. కావున ఈ కొన్నిటి చేతనే యజ్ఞములవరుస పూర్తి అయినదని యెవరును తలంపరాదు. వేదము పరబ్రహ్మమునుండి కలిగినదనుటవలన 'బ్రహ్మము యొక్క ముఖమ'ని చెప్పబడినది.

"కర్మజాన్" - మనోవాక్కాయములయొక్క, ఇంద్రియాదులయొక్క ప్రయత్నాతిశయమువలననే ఈ యజ్ఞములు సంభవించుచున్నవి. ఇవి పురుషప్రయత్నము వలననే సాధింపబడుచున్నవి. కాని సోమరితనముచేగాదు! వట్టిమాటలచే గాదు. అధ్యాత్మవిద్య అనుభవైకవేద్యమగు శాస్త్రమే (Practical Science) కాని 'వాచా' విద్యకాదు. కావున జనులద్దానిని వారి వారి ఇంద్రియ మనోవాక్కాయముల ప్రయత్నాదులచే సాధించవలసియున్నారు. 'యజ్ఞముకాని, మోక్షముకాని అకస్మాత్తుగ లభించునవికావు. అవి కర్మవలననే, స్వప్రయత్నము చేతనే సిద్ధించును' అని భగవాను డిచట పేర్కొనుచున్నారు. 'ఈ రహస్యమును తెలిసికొనినచో నీవు విముక్తుడవు కాగలవు' అని వాక్యముయొక్క భావము - ఈ రీతిగా దేహేంద్రియమనంబుల వ్యాపారముచేతనే, (ప్రయత్నముచేతనే) యజ్ఞములు సాధింపబడుననియు, సోమరితనముచే ఊరకనుండినచో కాదనియు నెఱింగినవాడు తప్పక ప్రయత్నమున కుపక్రమించి ఆ యజ్ఞాదికార్యములను నిర్వర్తించి తద్ద్వారా 'సనాతనబ్రహ్మమును జేరగలడ'నియే యగును.

ఇచట 'కర్మజాన్' అను పదముయొక్క ప్రయోగముచే భగవానుడు సోమరితనముపై దెబ్బతీసెను. 'వాచా' వేదాంతమును ఖండించెను.

"విమోక్ష్యసే" - 'మోక్ష్యసే' అని చెప్పక 'విమోక్ష్యసే' అని చెప్పుటవలన యజ్ఞాచరణముచే లెస్సగ విముక్తుడుకాగలడని తెలిపినట్లైనది.

**ప్ర:–** ఈ యజ్ఞములన్నియు నెచట తెలుపబడినవి?

**ఉ:–** వేదమునందు విస్తారముగ వర్ణింపబడియున్నవి.

**ప్ర:–** అవి దేనిచే సిద్ధించును?

**ఉ:–** దేహేంద్రియమనంబుల వ్యాపారముచే. అంతియేకాని సోమరితనముచేగాదు.

**ప్ర:–** ఈ సత్య మెఱుగుటవలన కలుగు ఫలితమేమి?

**ఉ:–** మనుజుడు ప్రయత్నపరుడై, యజ్ఞములను సాధించి లెస్సగ విముక్తుడగును.

**ప్ర:–** ఇంతదనుక పేర్కొనబడిన యజ్ఞములన్నియును జేరి మొత్తమెన్ని? అవి యేవి?

**ఉ:–** మొత్తము పండ్రెండు - అవి క్రమముగ -

శ్లో - 25
(1) దైవయజ్ఞము
(2) బ్రహ్మయజ్ఞము

శ్లో - 26
(3) ఇంద్రియ సంయమయజ్ఞము
(4) శబ్దాది విషయనిరోధయజ్ఞము

శ్లో - 27
(5) మనోనిగ్రహ యజ్ఞము

శ్లో - 28
(6) ద్రవ్యయజ్ఞము
(7) తపోయజ్ఞము
(8) యోగయజ్ఞము
(9) స్వాధ్యాయయజ్ఞము
(10) జ్ఞానయజ్ఞము

శ్లో - 29
(11) ప్రాణాయామయజ్ఞము.

శ్లో - 30
(12) ఆహారనియమయజ్ఞము.

ఈ యజ్ఞములన్నియు జీవుని పాపమును బోగొట్టి, చిత్తశుద్ధిని గలిగించి, తద్ద్వారా మోక్షమును బొందింపజేయును. కావున ముముక్షువు లెల్లరు వీనిని చక్కగ నాచరింపవలయునని భగవానుడు తెలియజేయుచున్నాడు.

**అ॥** యజ్ఞములన్నిటిలోను ఏది సర్వశ్రేష్ఠమైనదో వచించుచున్నాడు–

## 33. శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాజ్జ్ఞానయజ్ఞః పరన్తప
## సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే.

**టీక:–** పరన్తప = ఓ అర్జునా!, ద్రవ్యమయాత్ = ద్రవ్యమువలన సాధ్యమైన, యజ్ఞాత్ = యజ్ఞముకంటె, జ్ఞానయజ్ఞః = జ్ఞానయజ్ఞము, శ్రేయాన్ = గొప్పది, పార్థ = ఓ అర్జునా!, సర్వంకర్మ =

కర్మమంతయును, అఖిలమ్ (సత్) = నాశముకానిదగుచు, (ఫలముతో గూడ) జ్ఞానే = జ్ఞానమునందు, పరిసమాప్యతే = పరిసామాప్తినొందుచున్నది. (పర్యవసించుచున్నది లేక అంతర్భూతమగుచున్నది).

**తా:–** ఓ అర్జునా! ద్రవ్యమువలన సాధింపబడు యజ్ఞముకంటె జ్ఞానయజ్ఞము శ్రేష్ఠమైనది. ఏలయనిన, సమస్త కర్మయున్ను నాశముకానిదగుచు (ఫలసహితముగ) జ్ఞానమునందే పర్యవసించుచున్నది (అంతర్భూతమగుచున్నది).

**వ్యాఖ్య:–** జ్ఞానయజ్ఞమనగా తత్త్వవిచారణ, తత్త్వంపదార్థశోధన, ఆత్మానాత్మవివేకము, దృగ్దృశ్యవివేచనము, శ్రవణమనననిదిధ్యాసనములు, ఇంద్రియమనోనిగ్రహము, వాసనాక్షయము మున్నగునవి. ద్రవ్యయజ్ఞములనగా ధన, ధాన్య వస్తువులచే సాధింపబడు సత్కార్యములు మున్నగునవి. ద్రవ్యయజ్ఞములకంటె జ్ఞానయజ్ఞము ఉత్కృష్టమైనదని యిచట చెప్పబడెను. ఏలయనగా, ప్రతిజీవియొక్క చరమలక్ష్యము మఱచిపోయిన తన నిజస్వరూపమును తిరిగి జ్ఞాపకము పెట్టుకొనుటయేయగును. అనగా ఆత్మజ్ఞానమని యర్థము. తక్కిన అన్ని సాధనలున్ను, అన్ని పరమార్థ కర్మలున్ను తుట్టతుదకు ఆ జ్ఞానరూప లక్ష్యమునే పొందింపజేయును. వాని ఫలితములున్ను జ్ఞానముయొక్క మహాఫలమగు బ్రహ్మానందమునందే యిమిడియుండును. కాబట్టియే జ్ఞానయజ్ఞము సమస్త ఇతర యజ్ఞములకంటెను, ఇతర (పరమార్థ) కర్మలకంటెను సర్వశ్రేష్ఠమని వచింపబడినది.

జ్ఞానమే అన్ని కర్మలయొక్క పరాకాష్ఠ. అయితే తక్కిన సాధనలు, కర్మాదులు వ్యర్థములు కానేరవు. అవి జీవునకు చిత్తశుద్ధిని గలిగించి జ్ఞానప్రాప్తికి దోహదమును కలుగజేయును. కర్మమంతయు జీవుని జ్ఞానముయొద్దకుచేర్చి తదుపరి 'నది సముద్రము నందు లయించినట్లు' జ్ఞానమందు లయించిపోవును. 'జ్ఞానే పరిసమాప్యతే' అను వాక్యము యొక్క అర్థ మిదియే. దీనినిబట్టి సముద్రమునందు నది అంతర్భూతమైయున్నట్లు జ్ఞానమందు సమస్తకర్మలు, కర్మఫలములు అంతర్భూతములైయే యుండునే కాని నశింపవనిభావము. చేసిన సత్కర్మ యెన్నటికి వ్యర్థముకాదు. కనుకనే కర్మ 'అఖిలం' (సత్) = 'నాశనముకానిదగుచు, నిశ్శేషముగ, ఫలసహితముగ' జ్ఞానమందు పర్యవసించుచున్నదని యిట చెప్పబడినది.

కాబట్టి ప్రతివారున్ను జ్ఞానమును పొందుటయను లక్ష్యముగల్గి, తత్ప్రాప్తికై కర్మాదులను సహాయముగ గైకొనవలెను. ఏ సాధనయైనను, ఏ మార్గమైనను, ఏ సంప్రదాయమైనను కడకు జ్ఞానోదయమే చరమస్థితిగాగల్గియుండును. ఏదియో యొక సమయమున ప్రతివారును అట్టి జ్ఞానమును పొందియే మోక్షమొందవలసియుందురు. (జ్ఞానాదేవతుకైవల్యమ్). ఈ శ్లోకమందు కర్మ సాధనగను, జ్ఞానము సాధ్యముగను నిరూపింపబడినది. కర్మ జీవుని జ్ఞానసౌధమువఱకు తీసికొనిపోయి అచట వదలును. అటుపిమ్మట జ్ఞానమే వానిని సౌధాగ్రమగు మోక్షస్థానమునకు చేర్చును. దీనినిబట్టి జ్ఞానమనునది అకస్మాత్తుగ లభించు వస్తువు కాదనియు, పరమార్థకర్మలుచేయుచు రాగా రాగా చిత్తశుద్ధి జనింప, తదుపరి ఉదయించు స్థితి యనియు తేలుచున్నది. కావున సత్కర్మలు జీవునకు మోక్షప్రాప్తికై అత్యవసరములని స్పష్టమగుచున్నది. నిరంతర దైవచింతనచే, సత్కార్యాచరణముచే, భగవదారాధనచే భగవానుడు కరుణించి జీవునకు జ్ఞానమును (బుద్ధియోగమును) ప్రసాదించును. దానిచే నతడు ముక్తినొందును. కాబట్టి జ్ఞానమును లక్ష్యముగపెట్టుకొని, తల్లక్ష్యసాధనకై కర్మనాచరించుచు రావలెను. ఒకవేళ సాధ్యవస్తువును పొందినను లోకసంగ్రహార్థము పెక్కురు మహాత్ములు కర్మను వదలక అచరించుచునేయుందురు. ఈ శ్లోకమునందు జ్ఞానముయొక్క శ్రేష్ఠత్వము, కర్మయొక్క ఆవశ్యకత – రెండును ప్రతిపాదింపబడినవి.

'సర్వమ్' అను పదము సమస్తకర్మలను, సాధనలను, పైనదెల్పిన యజ్ఞము లన్నిటిని సూచించును.

**ప్ర:–** యజ్ఞములన్నిటిలో ఏ యజ్ఞము శ్రేష్ఠమైనది?

**ఉ:–** జ్ఞానయజ్ఞము.

**ప్ర:–** అయితే తక్కిన యజ్ఞములు, కర్మలు వ్యర్థములగునా?

**ఉ:–** కావు; అవి జ్ఞానోత్పాదనమును జేసి తుదకు జ్ఞానమందు లయించిపోవును. కర్మము జీవుని జ్ఞానమువఱకు గొనిపోయి అట వదలును. అటనుండి జ్ఞానము మోక్షము వఱకు జీవుని తీసికొనిపోయి అట చేర్చివైచును.

**అ॥** అట్టి జ్ఞానమును పొందుటకు ఉపాయమును తెలియజేయుచున్నాడు –

**34. తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా**
**ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః.**

**టీక:–** తత్ జ్ఞానం = అజ్ఞానమును, ప్రణిపాతేన = సాష్టాంగనమస్కారముచేతను, పరిప్రశ్నేన = సమయముచూచి వినయముతో ప్రశ్నించుటచేతనూ, సేవయా = సేవచేతను, విద్ధి = తెలిసికొనుము, తత్త్వదర్శినః = తత్త్వవేత్తలగు (బ్రహ్మానుభవముగల), జ్ఞానినః = జ్ఞానులు, తే = నీకు, ఉపదేక్ష్యన్తి = ఉపదేశింపగలరు.

**తా:–** (ఓ అర్జునా!) అట్టి జ్ఞానమును నీవు తత్త్వవేత్తలగు జ్ఞానులకు సాష్టాంగ నమస్కారముచేసియు, సమయముచూచి వినయముగ ప్రశ్నించియు, సేవచేసియు, వారి వలననెఱుంగుము. వారు తప్పక నీకుపదేశింపగలరు.

**వ్యాఖ్య:–** జ్ఞానము శ్రేష్ఠమైనదని క్రిందటి శ్లోకమున వచింపబడెను. అయితే ఆ జ్ఞానమెట్లు లభించును? ఎవరివలన లభించును? అను ప్రశ్నల కిచట సమాధాన మొసంగబడినది.

"తత్త్వదర్శినః" – తత్త్వవేత్తలగు జ్ఞానపుంగవులవలన ఆ జ్ఞానము లభించగలదు. "తత్త్వదర్శినః" అని చెప్పుటవలన 'వాచా' వేదాంతులవలన కాదనియు, పరమాత్మతత్త్వమును ప్రత్యక్షముగ గాంచినవారివలన (అనుభూతమొనర్చుకొనినవారివలన) అనియు స్పష్టమగుచున్నది. వేదాంతమును బోధించువారు, శాస్త్రపాండిత్యముకలవారు ప్రపంచములో చాలమంది యుండవచ్చును గాని, ప్రత్యక్షముగ అనుభవించి బోధించువారు చాలఅరుదు. అట్టి అనుభవజ్ఞులవాక్యమునకే లోకమున విలువయుండును. 'దర్శినః' అనుపదముచే పరమాత్మ గ్రంథస్థమగు ఒకానొకపదార్థము కాదనియు, ప్రతివారును తగుప్రయత్నమాచరించిన, కళ్ళార వారిని గాంచవచ్చుననియు (అనుభూతమొనర్చుకొనవచ్చుననియు) విదితమగుచున్నది. అయితే గోవు, గోడ మున్నగు వస్తువులవలె తనకంటె వేఱుగా నతడు కన్పించరు. తన స్వరూపముగనే అనుభూతుడగుదురు. ('తత్త్వదర్శినః' అను ఈ పదముచే ముముక్షువులకు ఆత్మతత్త్వమునుగూర్చి పరమధైర్యము లభించుచున్నది. ఎందుకనగా ఆత్మనున్ను ప్రయత్నముచే ప్రతివారున్ను దర్శించవచ్చునని ఈ పదముచే వ్యక్తమగుచున్నది.) తత్త్వదర్శులగు అట్టి మహాత్ములు

జనులకు జ్ఞానమును బోధించెదరు. అయితే అందఱికిని బోధించెదరా? కాదు. అందులకు మూడుషరతులు విధింపబడినవి. వానిని పాలించినవారికి మాత్రమే వారుబోధించెదరు.

అవి యేవి యనిన -

(1) "ప్రణిపాతేన" - (పాతము = పడుట, నిపాతము = బాగుగా పడుట, ప్రణిపాతము = పూర్తిగా లెస్సగాపడుట) సాధకుడు మహాత్ముడగు జ్ఞానికి భక్తిపూర్వకముగ, వినయవిధేయతలతో సాష్టాంగనమస్కార మాచరించవలెను. తనయొక్క గర్వమును, అహంకారమును, దర్పమును అచ్చోట కక్కివేయవలెను. నిరహంకారుడై, నిగర్వియై, వినయముతో గూడియుండవలెను. తాను గొప్ప అను భావముండరాదు. ఎందుకనగా దేహాభిమానమను పిశాచము లోన నున్నంతవఱకు గురుబోధహృదయమున ప్రవేశింపదు (మురికిగుడ్డకు రంగు అంటనట్లు). సాష్టాంగనమస్కారముచే అభిమానము చచ్చిపోవును. సాధకున కీ నిరభిమానత్వము ప్రప్రథమ ఆవశ్యకతయై యున్నది. నిలబడి దండముపెట్టిన చాలదా? వంగి దండము పెట్టిన చాలదా? యనిన చాలదు. అష్టాంగములు నేలను స్పృషించునట్లు సాష్టాంగవందనమాచరించవలసినదే యని చెప్పినారు. దీని యాంతర్యమేమి? ఇదియొక గొప్ప సాధన. ఆ సాధనచే ఒంటికిబట్టిన క్రొవ్వు (అహంకారము) కరగిపోవును. వాస్తవముగ మహనీయులు తాము నమస్కరింపబడవలెనని ఎన్నడును ఆశింపరు. కాని సాధకునిలో వినయవిధేయత లున్నవో లేవో ఇట్టిక్రియలచే పరీక్షించి, ఆ పిదపయే ఉపదేశింతురు.

ప్రపంచదృష్టిలో మనుజుడు గొప్పవాడు అయియుండుగాక! అధికారముగల్గియుండుగాక! రాజాధిరాజు అయియుండుగాక! కాని దేవునిదగ్గఱ, గురువుదగ్గఱ మహనీయులగు తత్త్వవేత్తలదగ్గఱ ఆ అధికారములు చెల్లవు. పరమార్థదృష్టిలో వ్యావహారికపదవులకు విలువలేదు. భౌతికబలసంపత్తులు ఆధ్యాత్మిక సంపదకడ తలవంచవలసినదే. బ్రహ్మబలమే నిజమైనబలము. విశ్వామిత్రుడు గొప్పభౌతికబలము కలిగియున్నను, 'ధిక్ బలం, క్షత్రియబలం బ్రహ్మతేజోబలం బలమ్' అని వచించి వసిష్ఠమహర్షియొద్ద సాష్టాంగమనస్కారము చేసి బ్రహ్మర్షి యని వారిచే స్తుతింపబడుట సర్వులును ఎఱింగిన విషయమేకదా! కనుకనే పూర్వకాలమున, ఇక్కాలమునగూడ రాజాధిరాజులు, శ్రీమంతులు ఎక్కడనో ఏకాంతమున కాపీనధారియున్న జ్ఞానియొద్దకు చేతులుకట్టుకొనివచ్చి, సాష్టాంగవందనముచేసి, ఉపదేశమును గైకొనుచున్నారు. ఒకవేళ గర్వముతో పెద్దలయొద్దకేగినచో ఆ ఠీవి, అభిమానమును చూచి వారుపదేశింపనిచో తుదకు నష్టపడునది యెవరు? కనుకనే అన్నిమతములవారును దేవాలయములందు పెద్దల సన్నిధియందు చెప్పులు, తలపాగా తీసివైచుచుందురు. (ఆ వస్తువులందు అభిమానమును రేకెత్తించు గుణము కలదు కనుక).

(2) "పరిప్రశ్నేన" - పైన దెల్పినవిధముగ పెద్దలకు సాష్టాంగవందన మాచరించి ఆ పిమ్మట తన సందేహములనుగూర్చి వినయముతో, సమయాసమయములు చూచి ప్రశ్నించవలెను. కనుకనే 'ప్రశ్న' అని చెప్పక 'పరిప్రశ్న' అని చెప్పబడినది, సౌమ్య వాక్యములతో, భక్తిభావముతో ప్రశ్నించవలెననిభావము.

(3) "సేవయా" - ఇకమూడది సేవ. పెద్దలకు సేవచేసి వారి యనుగ్రహమును సంపాదించవలెను. గురుసేవచే గురువుల హృదయమును చూరగొనవచ్చును. వారి యనుగ్రహము, కటాక్షము, లేనిచో పరమార్థరంగమున సాధకుడు ఒక్క అడుగైనను ముందునకు వేయజాలడు. కనుకనే గురుసేవ, దైవసేవ అత్యవసరములని శాస్త్రములందు వచింపబడినది. మాయను దాటవలెననిన మాయను జయించిన మహనీయుల అండదండ లుండవలెను. గురుసేవయందు గొప్పప్రయోజనము కలదు.

ఈ ప్రకారముగ (1) సాష్టాంగవందనము (2) పరిప్రశ్న (3) సేవ - అను మూడింటిని ఆచరణయందుంచినచో మహనీయులు తమ కృపాదృష్టిని ఆ ముముక్షువుపై ప్రసరింపజేసి 'తప్పక ఉపదేశింపగలరు' (ఉపదేక్ష్యన్తి) అని అసందిగ్ధముగ నిచట చెప్పివేయబడెను. శిష్యుడు తాను చేయవలసిన పద్ధతిలో చేసినచో, గురువు తాను చెప్పవలసిన పద్ధతిలో చెప్పును. శిష్యుడు తన కర్తవ్యమును విస్మరించినచో గురువునుండి బోధ నెన్నటికిని ఆశింపలేడు.

అయితే, ఆ గురువులు దేని నుపదేశించెదరు! జ్ఞానమును. అజ్ఞానములో పడి యున్నవారికి ఇంకేమికావలయును? ఏది సత్యమో, నిత్యమో దానినే వారు యుపదేశించెదరు. ఇక శిష్యుడు ధన్యుడైపోవును.

అధ్యాత్మక్షేత్రమున పురోగమించుటకు గురువుయొక్క సహాయము తప్పక అవసరమని ఈ శ్లోకముద్వారా వెల్లడియగుచున్నది. మఱియు గురుసన్నిధియందు, గురుకులవాసమునందు శిష్యు డెట్లు ప్రవర్తించవలయునో, ఆ పద్ధతియు నిచట చక్కగ తెలుపబడినది. కావున ముముక్షువులు వీనిని బాగుగ గమనించవలెను.

శ్రీకృష్ణపరమాత్మ తానర్జునునకు ఆత్మజ్ఞాన ముపదేశించినను మరల తత్త్వజ్ఞులయొద్దకేగి దానిని తెలిసికొనవలసినదిగ యేల బోధించిరి? (1) తానుపదేశించిన జ్ఞానము బాగుగ దృఢపడుటకొఱకై మహనీయుల యొద్దకు కూడ యేగి తెలిసికొనవలసినదిగా చెప్పియుండవచ్చును. (2) లేక గురుశిష్య సంబంధమైన సర్వసామాన్యపద్ధతిని దీని ద్వారా లోకమునకు సూచించియుండవచ్చును.

**ప్ర:**— జ్ఞానము ఎవరివలన లభించును?

**ఉ:**— అనుభవజ్ఞులగు తత్త్వవేత్తలవలన.

**ప్ర:**— అట్టి సద్గురువులయొద్ద ముముక్షు వెట్లు ప్రవర్తించవలెను?

**ఉ:**— (1) సాష్టాంగవందన మాచరించవలెను. (2) వినయముతో సమయాసమయములుచూచి ప్రశ్నించవలెను. (3) సేవ యొనర్పవలెను.

**అ॥** అట్టి జ్ఞానమును పొందుటవలన కలుగు ఫలితమును తెలియజేయుచున్నారు -

## 35. యజ్జ్ఞాత్వా న పునర్మోహమేవం యాస్యసి పాణ్డవ
## యేన భూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి.

**టీక:**— పాణ్డవ = ఓ అర్జునా!, యత్ = దేనిని (ఏజ్ఞానమును), జ్ఞాత్వా = తెలిసికొని, పునః = మరల, ఏవమ్ = ఇట్టి, మోహమ్ = మోహమును (అజ్ఞానమును), న యాస్యసి = పొందవో, యేన = దేనిచేత, భూతాని అశేషేణ = సమస్తములైన ప్రాణులను, ఆత్మని = నీయందును, అథో = ఆలాగుననే, మయి = నాయందును, ద్రక్ష్యసి = చూడగలవో, (తత్ = అట్టి, జ్ఞానం = జ్ఞానమును, విద్ధి = తెలిసికొనుము).

**తా:**— ఓ అర్జునా! దేనిని తెలిసికొనినచో మరల నిట్టిమోహమును నీవు పొందకుందువో మఱియు దేనిచే సమస్తప్రాణులను నీయందును, నాయందునుగూడ చూడగలవో (అట్టి జ్ఞానమును తత్త్వవేత్తలవలన తెలిసికొనుము).

**వ్యాఖ్య:–** జ్ఞానమును పొందుటవలన రెండు ఫలితములు కలుగగలవు. (1) అంత వఱకు నున్నట్టి మోహము (అజ్ఞానము) నశించును (2) సమస్త ప్రాణికోట్లను తనయందును, భగవంతునియందును వీక్షింపగల్గును. ఈ రెండిటినిగూర్చి ఒకింత విచారించెదము.

(1) కండ్లుఉన్నదానికి గుఱుతు గోతిలోపడకుండుటయే. ఎవరైన గోతిలోపడినచో నాతనికి కండ్లులేవని యర్థము. అట్లే జ్ఞానము పొందినదానికి గుఱుతు మరల పూర్వమువలె మోహమును పొందకుండుటయే. దృక్స్వరూపమగు ఆత్మయొకటియే సత్యము, తక్కిన దృశ్యపదార్థములన్నియు అసత్యములు అనునదియే జ్ఞానము. అట్టి జ్ఞానముకలవాడిక మరల దృశ్యవస్తువులనుగూర్చి ఏల శోకమును, మోహమును బొందును?★ మామిడికాయ పచ్చిగనున్నపుడు వగరుగ, పులుపుగ నుండును. పక్వమైనపిదప ఎచట రుచిచూచినను తీపిగనే యుండును. పూర్వపు పులుపుదనము, వగరుదనము అత్తఱిఏమాత్రమునుండవు. ఒకవేళ నున్నచో అది యింకను పక్వముకాలేదని యర్థము. అట్లే యింతదనుక అర్జునుడు బంధ్వాదులనుజూచి 'వీరు నావారు' వీరి నెట్లు వధింపగలను? అని మోహమందు పడియుండెను. జ్ఞానప్రాప్త్యనంతర మా ప్రకారముగ మోహమును జెందనేరదని భగవాను డర్జుననకు బోధించిరి.

ఇపుడు జనులలో కొందఱు తమకు జ్ఞానము కలిగియున్నదని వచించినను, వారి ఆచరణలో, అనుష్ఠానములో విషయప్రవృత్తి, మఱికొన్నిలోపములు వ్యక్తమగుచున్నవి. అట్టివారింకను జ్ఞానమును పొందలేదనియే ఈ భగవద్వాక్యములవలన స్పష్టమగుచున్నది. మరల మోహమును, విషయవాంఛను పొందకుండుటయే జ్ఞానమునకు చిహ్నము. భగవానుని ఈ వాక్యములచే ఆచరణశూన్యులగు శుష్కవేదాంతులకు పెద్దదెబ్బతగిలినది. కావున, వారు తమ యాచరణను శుద్ధపఱచుకొని లోకమునకు ఆదర్శవంతులు కావలయును. భగవద్గీత అనుష్ఠానము నెక్కువగ ప్రోత్సహించుచున్నదని ఈ వాక్యములచే బాగుగ తెలియుచున్నది. కాబట్టి సాధకుడు ఒక్కొక్క సాధనను అనుష్ఠించుచు, అది పూర్తిగ సిద్ధించెనా, లేదా యని తనజీవితమున పరీక్షించుకొనుచుండవలెను. కామము పూర్తిగ తొలగినదా, క్రోధము అంతరించినదా, అసూయ తగ్గినదా, దైవగుణము అబ్బినదా యని తరచు పరీక్షించుకొనవలెను. హృదయశోధనము కావింపవలెను. లోనదాగియున్న వాసనలను వెతకి పారద్రోలవలెను. ఆత్మజ్ఞానము లెస్సగ గలిగినచో నిట్టి కామాదిదుర్గుణము లుండుట కవకాశమే లేదు.

(2) ఇక రెండవ విషయము – జ్ఞానమును బొందినవారు సమస్త ప్రాణికోట్లను తన యందును, పరమాత్మయందును చూడగలరనుట. ఈ బ్రహ్మాండమంతయు, ఈ చరాచరజగత్తంతయు ఆత్మయందు కల్పింపబడినది. సర్పము ఎచటనున్నది? రజ్జువునందే. స్వప్న మెచటగలదు? మేలుకొనినవానియందే. 'ఆరోపితవస్తువు అధిష్ఠానమందే యుండును' గాని అన్యత్రకాదు. కావున అధిష్ఠానమగు ఆత్మస్వరూపము ననుభూతమొనర్చుకొనిన జ్ఞానికి ఆరోపితమగు ఈ సమస్తజగత్తు తనయందే గోచరించును. లేక, మఱియొకవిధముగ నాలోచించిచూచిన, ఈ సమస్తబ్రహ్మాండము మనస్సుయొక్క కల్పనయే అయియున్నది. ఆ మనస్సో, ఆత్మయందు (మిథ్యారూపమున) స్థితగల్గియున్నది. కాబట్టి సమస్తజగత్తును, ప్రాణికోట్లను ఆత్మయందు (తనయందు) జ్ఞాని కాంచగలడు. ఈసత్యమే యిచట తెలుపబడినది.

'అథోమయి' అనుటవలన తనయందువలె, భగవంతునియందును ఆ ప్రకారముగ సమస్తభూతములను గాంచగలడని యర్థము. అయితే భగవంతుడు తనకంటె వేఱని కాదు. జ్ఞాన మెపుడుకలుగునో అపుడు తానే భగవంతుడగును (జ్ఞానీత్వాత్మైవమేమతమ్). కనుక తనయం దెపుడు

★ యస్మిన్ సర్వాణి భూతాన్యాత్మైవాభూద్విజానతః
తత్ర కో మోహః కః శోక ఏకత్వమనుపశ్యతః. (ఈశావాస్యోపనిషత్తు)

జగత్తంతటినిజూచునో, అపుడు భగవంతునియందును ఆ ప్రకారము చూచినట్లేయగును. అయితే ఈ స్థితి అజ్ఞానకాలమున కలుగదు. జ్ఞానప్రాప్తిచే ద్వైతభావనతొలగి, అద్వైతభావమేర్పడునపుడు సిద్ధించును. అత్తఱి గురువునకు శిష్యునకు గాని, భగవంతునకు భక్తునకుగాని ఈషత్తైనను భేదములేక, అంతయు ఏకస్వరూపముగ యలరుచుండును.

ఇచట అర్జునుడు = X, శ్రీకృష్ణుడు = Y, సమస్తప్రాణికోట్లు = Z, అని అనుకొనినచో-

'ద్రక్ష్యస్యాత్మన్యథోమయి' - అను వాక్యముద్వారా ఆత్మని = తనయందు (అర్జునునియందు) సమస్తప్రాణికోట్లను చూడగలడు కావున, X = Z అగుచున్నది. అట్లే మయి = శ్రీకృష్ణమూర్తియందు సమస్తప్రాణికోట్లను చూడగలడు కావున Y = Z అగుచున్నది.

కాబట్టి X = Z (అర్జునుడు = సమస్తప్రాణికోట్లు)

Y = Z (కృష్ణుడు = సమస్తప్రాణికోట్లు)

అందుచేత X = Y (అర్జునుడు = కృష్ణుడు) అని తేలుచున్నది.

సమస్త ప్రాణికోట్లు రెండువస్తువులందు వేర్వేరుగనుండుట సంభవించదు. గనుక గణిత శాస్త్రదృష్ట్యా (Mathematical గా) చూచిన ఆ రెండును ఒకటియే కావలసియున్నది. కావున జ్ఞానానంతరము జీవుడు సాక్షాత్ శ్రీకృష్ణపరమాత్మయే యగుచున్నాడని యర్థము.

దీనినిబట్టి చూచినచో జ్ఞాన మెంతటి మహత్తరవస్తువో బోధపడగలదు. ప్రపంచములో నెంతయో కష్టపడినచో కొంతధనము, క్షేత్రము, అధికారము మాత్రము లభించుచున్నవి. కాని ఒకింత పరిశ్రమచే, సాధనచే, ఇంద్రియనిగ్రహముచే, ఆత్మవిచారణముచే, భక్తిచే బ్రహ్మాండమునంతటిని జీవుడు పొందగల్గుచున్నాడు. వెయ్యేల సాక్షాత్ భగవంతుడే తానగుచున్నాడు. ఎట్టి ఉత్కృష్టపదవి! కాబట్టి శ్రీకృష్ణమూర్తియొక్క ఈ వాక్యము లందు అకుంఠిత విశ్వాసముంచి అట్టి మహోన్నతపదవిని బడయుటకై మహనీయులను సేవించి ఈ జన్మయందే ఆత్మజ్ఞానమును సముపార్జించవలెను.

**ప్ర:–** జ్ఞానమును పొందినచో కలుగు ఫలితమేమి?

**ఉ:–** (1) మరల జీవుడు మోహమందు (అజ్ఞానమందు) పడకుండును (2) అత్తఱి సమస్త ప్రాణికోట్లను తనయందును, భగవంతునియందును వీక్షింపగల్గును.

**అ॥** జ్ఞానప్రభావము నింకను చెప్పుచున్నాడు -

## 36. అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః
## సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి.

**టీక:–** సర్వేభ్యః పాపేభ్యః = పాపాత్ములందఱికంటెను, (త్వమ్ = నీవు) పాపకృత్తమః = మిగుల పాపము చేసినవాడవు, అసిచేత్ అపి = అయితివేనియు, సర్వమ్ = సమస్తమైన, వృజినమ్ = పాపమును, జ్ఞానప్లవేన ఏవ = జ్ఞానమను తెప్పచేతనే, సంతరిష్యసి = లెస్సగ దాటగలవు.

**తా:–** (ఒకవేళ) పాపాత్ములందఱికంటెను నీవు మిగుల పాపము చేసినవాడవైతివేని, ఆ సమస్త పాపసముద్రమును జ్ఞానమను తెప్పచేతనే లెస్సగ దాటివేయగలవు.

**వ్యాఖ్య:** – మహాపాపాత్ముడైనను జ్ఞానముచే పాపరహితుడై తరించిపోగలడని ఇచట వచింపబడినది. జ్ఞానముయొక్క మహత్తరశక్తి దీనిచే వెల్లడియగుచున్నది. అల్పపాపమునే కాదు; కొండంతపాపమునుగూడ భస్మీభూత మొనర్పగలశక్తి జ్ఞానమునకు కలదు. కనుకనే భగవాను డిచట ప్రపంచములోని పాపాత్ములందఱికంటెను గొప్ప పాపము చేసినవానిని దృష్టాంతముగ తీసికొని అట్టివాడుకూడ జ్ఞానముచే తరించగలడని సెలవిచ్చిరి. ('పాపకృత్', 'పాపకృత్తరః', 'పాపకృత్తమః') – 'తమ' ప్రత్యయ ముపయోగింపబడుటద్వారా పాపముయొక్క తీవ్రత యిచట వ్యక్తముచేయబడెను. అట్టి ఘోరపాపికూడ జ్ఞానప్రభావముచే పాపరహితుడై ముక్తినందుచుండ, ఇక అల్పపాపములను చేసినవారినిగూర్చి చెప్పవలెనా? కావున పాపాత్ములిక భయపడనవసరములేదు. వారు గతించిన తమ పాపములనుగూర్చి పశ్చాత్తాపపడి ఇకమీదట పాపముచేయక జ్ఞానోపార్జనమునకు వలసిన సాధనములను గావించిన చాలును. తరించిపోగలరు.

మహాపాపికూడ జ్ఞానముచే తరించిపోగలడని చెప్పుటచే పాపమును ప్రోత్సహించిన ట్లెన్నడును ఊహింపరాదు. అది భగవానుని యభిమతముకాదు. ఇదివరలో అజ్ఞానవశమున పాపములను చేసియున్నను, ఇకమీదట అట్లుచేయక జ్ఞానసంపాదనముగావించినచో ముక్తుడగుననియే చెప్పబడినది. జ్ఞానోత్కర్షత్వమును చాటుటయే ఈ శ్లోకముయొక్క అంతర్యము. కావున ఇక పాపాత్ములు దిగులునొందవలసినపనిలేదు. వారు ధైర్యముతో సన్మార్గ మవలంబించినచో శ్రేయమును పొందగలరు. సముద్రమెంత విశాలముగ నున్నప్పటికిని, ఒకచిన్న తెప్పచే దానినంతను దాటివేయవచ్చును. అట్లే పాపసముద్ర మెంత అగాధముగ నున్నప్పటికిని జ్ఞానమను తెప్పచే నది లెస్సగ దాటివేయబడగలదని యిచట వచింపబడినది. 'తరిష్యసి' అనిచెప్పక 'సంతరిష్యసి' అని చెప్పుటచే జ్ఞానప్రాప్తివలన పాపాత్ముడు సంసారసముద్రమును లెస్సగ దాటగలడని స్పష్టమగుచున్నది. వాల్మీకియే ఇందులకు ప్రబలదృష్టాంతము.

"పాపియగువాడు శాస్త్రమును చదువరాదు; వేదాంతమును తాకరాదు; ఓంకారము నుచ్చరించరాదు; గీతను పఠింపరాదు" అనునిట్టి వాక్యములకు అర్థమే లేదని ఈ శ్లోకము వలన తెలియుచున్నది. రోగికే ఔషధము కావలసియున్న చందమున పాపాత్మునకే, బద్ధునకే విముక్తి సాధనమగు జ్ఞానము ముఖ్యముగ అవసరము. కాబట్టి దుఃఖసాగరమును దాట నుంకించువారు పాపాత్ములైనను పుణ్యాత్ములైనను నిర్భయముగ జ్ఞానసంపాదన మొనర్చి ముక్తినొందవచ్చునని భగవాను డిచట సర్వులకును అభయమొసంగిరి.

'చేత్' 'అపి' అను రెండు ప్రత్యయములవలన అర్జునుడు పాపికాదని స్పష్టీకరించబడినది. ఆతడు దైవగుణములు కలవాడనియే మున్ముందు చెప్పబడును. (మాశుచ స్సంపదం దైవీమభిజాతోఽసి (16–5)

**ప్ర:** – పాపమును పోగొట్టుకొనుటకు ఉపాయమేమి?

**ఉ:** – జ్ఞానమును సముపార్జించుటయే.

**ప్ర:** – జ్ఞానముయొక్క ప్రభావమెట్టిది?

**ఉ:** – మహాపాపాత్ముడైనను జ్ఞానమను తెప్పచే పాపసముద్రమును దాటివేయగలడు.

**అ॥** ఇక, అగ్నిదృష్టాంతముచే జ్ఞానముయొక్క మహిమను వర్ణించుచున్నాడు–

**37. యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున**
**జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా.**

**టీక:–** అర్జున = ఓ అర్జునా!, సమిద్ధః = బాగుగ ప్రజ్వలింపజేయబడిన, అగ్నిః = అగ్ని, ఏధాంసి = కట్టెలను, యథా = ఏ ప్రకారముగ, భస్మసాత్ = భస్మీభూతమొనర్చుచున్నదో, తథా = ఆ ప్రకారముగనే, జ్ఞానాగ్నిః = జ్ఞానమనెడి అగ్ని, సర్వకర్మాణి = సమస్తకర్మలను, భస్మసాత్కురుతే = భస్మముచేసి వైచుచున్నది (నశింపజేయుచున్నది).

**తా:–** అర్జునా! బాగుగ ప్రజ్వలింపజేయబడిన అగ్ని కట్టెల నేప్రకారము బూడిదగా జేయునో ఆ ప్రకారమే జ్ఞానమను అగ్ని సమస్తకర్మలను భస్మమొనర్చివైచుచున్నది.

**వ్యాఖ్య:–** జ్ఞానమును అగ్నితో పోల్చి దానిమహిమ నిచట వర్ణించుచున్నారు - దుఃఖరాహిత్యము జన్మరాహిత్యముచే గలుగును. జన్మరాహిత్యము కర్మరాహిత్యమువలన సిద్ధించును. కర్మరాహిత్యము జ్ఞానప్రాప్తివలన చేకూరును. కొండంత కట్టెలరాశినైనను అగ్ని బూడిదగా చేసివేయగలదు. అట్లే సంచితకర్మ లనేకములుండినను, వానినన్నింటిని జ్ఞానమను అగ్ని వినాశమొనర్పగలదు. అయితే బాగుగా జ్వలించుచున్న అగ్నిమాత్రమే అక్కార్యమును సాధింపగలదు; మందాగ్ని కాదు. కనుకనే 'సమిద్ధోఽగ్నిః' అను పదము ప్రయోగింపబడినది. కాబట్టి జ్ఞానము పరిపూర్ణముగ సంప్రాప్తించనిచో కర్మసంచయము రహితము కానేరదు. స్వప్నమనుజుని కర్మ మేలుకొనిన పిదప ఎట్లు నశించునో, అట్లే జ్ఞానప్రాప్తిరూప జాగృతిచే సంసారస్వప్నసంబంధ కర్మయంతయు, జీవునకు తొలగిపోవును. 'సర్వకర్మాణి' అని చెప్పినందువలన సమస్తకర్మలను, కర్మబంధములను జ్ఞానముచే మనుజుడుదాటివేయగలడని స్పష్టముచేయబడినది. (జ్ఞానమనగా ఆత్మానాత్మ విచారణచే దృశ్యమును మిథ్యగ భావించి త్రోసివైచి దృగ్రూప ఆత్మను - అవలంబించుట). కాబట్టి జననమరణరూప కర్మఫలమును తప్పించుకొనదలచువాడు జ్ఞానమును తప్పక సంపాదించవలెనని ఈ శ్లోకముద్వారా స్పష్టమగుచున్నది 'క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్దృష్టే పరావరే' (పరమాత్మను గాంచినవాని కర్మలన్నియు నశించిపోవుచున్నవి). అను ముండకోపనిషద్వాక్య మీసత్యమునే ఋజువుచేయుచున్నది.

**ప్ర:–** కర్మసంచయ మెట్లు తొలగును?

**ఉ:–** జ్ఞానముచే (మండుచున్న అగ్ని కట్టెలను దహించునట్లు జ్ఞానము కర్మలన్నిటిని భస్మీభూతమొనర్పగలదు).

**ప్ర:–** జ్ఞానముయొక్క మహిమను నిరూపింపుము?

**ఉ:–** అది కర్మరాసులను నిర్మూల మొనర్చి జీవుని బంధవిముక్తునిగ జేయగలదు.

**అ॥** ఆ జ్ఞాన మెట్లు చేకూరగలదో వివరించుచున్నాడు -

**38. న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే**
**తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విన్దతి.**

**టీక:–** ఇహ = ఈ ప్రపంచమున, జ్ఞానేన = జ్ఞానముతో, సదృశమ్ = సమానముగ, పవిత్రమ్ = పవిత్రమైనది, న విద్యతే హి = (ఏదియు) లేనేలేదుకదా!, తత్ = అట్టి జ్ఞానమును, యోగసంసిద్ధః = (కర్మ)

యోగసిద్ధినిబొందినవాడు, కాలేన = కాలక్రమమున, ఆత్మని = తనయందు, స్వయమ్ = స్వయముగనే, విన్దతి = పొందుచున్నాడు (అనుభవించుచున్నాడు).

**తా:–** ఈ ప్రపంచమున జ్ఞానముతో సమానముగ పవిత్రమైనది ఏదియును లేదు. అట్టి జ్ఞానమును (కర్మ) యోగసిద్ధిని బొందినవాడు కాలక్రమమున తనయందే స్వయముగ పొందుచున్నాడు.

**వ్యాఖ్య:–** ఈ ప్రపంచమున పవిత్రమైనవస్తువు లెన్నియో కలవు. కాని వాని యన్నింటికంటెను పరమపవిత్రమైనది జ్ఞానమేయని యిట వచింపబడినది. మనుజుని పునీతమొనర్చుటలో జ్ఞానమునకు మించినది మఱియొకటి లేదు. అయ్యది జీవుని అజ్ఞానరూపమాలిన్యమును బోగొట్టి ఆత్మానుభూతిని గలుగుజేయును. జీవుని స్థూలదేహమునకు సంబంధించిన కల్మషమును బోగొట్టుటకు సబ్బు, సీకాయ, కుంకుడుకాయ, నీరు మొదలైనవస్తువు లెన్నియోకలవు. అట్లే సూక్ష్మదేహమగు చిత్తమునకు పట్టిన మాలిన్యమును నిర్మూలించుటకు, కర్మ, ఉపాసన, ధ్యానము, యోగము, జ్ఞానము మున్నగు సాధనము లనేకములు కలవు. వానియన్నిటిలో జ్ఞానమే సర్వశ్రేష్ఠమని భగవానుడు వచించుచున్నారు.

"స్వయమ్" - అయితే ఆ జ్ఞాన మెట్లు లభించును? స్వకీయ ప్రయత్నముచేతనే. తన్నుతానే యుద్ధరించుకొనవలెను. తనయొకలిని తానే తీర్చుకొనవలెను. గురువులు, దైవము, పెద్దలు సహాయముమాత్రము చేయుదురు. నడువవలసినది తానే. అనుభవించవలసినది తానే. స్వప్రయత్నముచేతనే జ్ఞానమును సముపార్జించవలెను. కనుకనే 'స్వయమ్' అను పదము ప్రయోగింపబడినది.

"యోగసంసిద్ధః" - జ్ఞానమును పొందుటకు ముందుగా యోగసంసిద్ధుడు కావలెను. అనగా కర్మయోగమందు ఆరితేరవలెను. నిష్కామకర్మమును బాగుగా అనుష్ఠించుచువచ్చి చిత్తశుద్ధిని బడయవలెను. వస్త్రమునకు మురికిపోయిననే రంగు అంటునట్లు నిష్కామకర్మ, సాధనచతుష్టయసంపత్తి మున్నగు చిత్తశుద్ధికర యత్నములచే హృదయము నిర్మలమైనపుడే జ్ఞానముదయించును.

"ఆత్మని" - అయితే ఆ జ్ఞాన మెచట నుదయించును? తనయందే. తనహృదయమందే జ్ఞానము వ్యక్తమగునుగాని అన్యత్రకాదు. అది యింకొకడు అనుభవించువస్తువు కాదు. తనకుతానే యనుభవించును. కనుకనే 'ఆత్మని' అని ప్రయోగింపబడినది. ఆ జ్ఞాన మెపుడు కలుగును?

"కాలేన" - కాలక్రమమున (కర్మయోగమందు సిద్ధినిబడసినవెనుక) జీవునియందది యుదయించును. 'మోక్ష మెపుడు సిద్ధించును? జ్ఞాన మెపుడు కలుగును?' అను ప్రశ్నలకు భగవాను డిచట చక్కని సమాధానమొసంగిరి. మోక్షమునకు కాలనియమము లేదు. చిత్త మెపుడు పరిక్వమగునో అపుడే అది లభించును. వారివారి సాధనలయొక్క తీవ్రతనుబట్టి కొందఱికి శీఘ్రముగను, మఱికొందరికి చిరకాలమునకును అది చేకూరును. కావున మోక్షవిషయమై, జ్ఞానవిషయమై ఎవరును నిరుత్సాహపడవలసిన పనిలేదు. వారివారి ప్రయత్నాతిశయమునుబట్టి కాలక్రమమున సర్వులకును అది లభింపగలదు. అయితే ప్రయత్నమును మాత్రము విడనాడరాదు. పచ్చికాయ పండవలెనన్న కొంత కాలము పట్టును. క్రమపరిణామమునొంది అది పక్వము కావలెను. ఈ లోపల చెట్టు మొదలుకు నీరు మాత్రము తప్పక పోయుచుండవలెను. శిశువు జన్మించవలయుననిన తల్లి తొమ్మిదినెలలు ఓపికపట్టవలెనుగదా! కాబట్టి సహనము గల్గి, నిశ్చలమనస్సుతో నిష్కామకర్మయోగాది సాధనల నవలంబించి హృదయనైర్మల్యమును సంపాదించినచో జ్ఞానము దానంతటనదియే భగవదనుగ్రహముచే జీవునియందు వ్యక్తమగును. .కాలేన. అను పదముయొక్క వివరణమిదియే.

ఈ ప్రకారముగ జ్ఞానముయొక్క సర్వశ్రేష్ఠత్వమున్ను అది ఎపుడు ఏ ప్రకారముగ ఎచ్చోట సంభవించునను విషయమున్ను సంక్షేపముగ ఈ శ్లోకమునందు తెలుపబడినది. కావున ముముక్షువు లిద్దానిని బాగుగ జ్ఞాపకమునందుంచుకొని తదనురీతిగ యాచరించి జ్ఞానవంతులై తరించవలయును.

**ప్ర:–** ప్రపంచములో అన్నిటికంటెను మిగుల పవిత్రమైన వస్తువేది?

**ఉ:–** ఆత్మజ్ఞానము.

**ప్ర:–** అది (1) ఎట్లు (2) ఎచట (3) ఎప్పుడు జీవునకు లభించును?

**ఉ:–** (1) కర్మయోగసిద్ధిచే (2) తనయందే (3) కాలక్రమమున లభించును.

**అ॥** అట్టి జ్ఞానము నెవరు పొందగలరో, పొందిన పిదప కలుగు ఫలితమేమియో వచించుచున్నాడు -

**39. శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరః సంయతేన్ద్రియః**
**జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తిమచిరేణాధిగచ్ఛతి.**

**టీక:–** *శ్రద్ధావాన్* = శ్రద్ధగలవాడును, *తత్పరః* = తదేకనిష్ఠతో గూడినవాడును, *సంయతేన్ద్రియః* = ఇంద్రియములను లెస్సగ జయించినవాడును, *జ్ఞానమ్* = (ఆత్మ) జ్ఞానమును, *లభతే* = పొందుచున్నాడు, *జ్ఞానమ్* = జ్ఞానమును, *లబ్ధ్వా* = పొంది, *పరామ్* = గొప్పదైన, *శాంతిమ్* = శాంతిని, *అచిరేణ* = శీఘ్రముగ, *అధిగచ్ఛతి* = **పొందుచున్నాడు**

**తా:–** (గురు, శాస్త్రవాక్యములందు) శ్రద్ధగలవాడును,(ఆధ్యాత్మికసాధనలందు) తదేకనిష్ఠతో గూడినవాడును, ఇంద్రియములను లెస్సగ జయించినవాడునగు మనుజుడు జ్ఞానమును పొందుచున్నాడు. అట్లు జ్ఞానమును బొందినవాడై యతడు పరమశాంతిని శీఘ్రముగ బడయగల్గుచున్నాడు.

**వ్యాఖ్య:–** జ్ఞానమును ఎవడు పొందగల్గునో ఇట వచింపబడినది. జ్ఞానమును పొందవలెననిన మూడు సుగుణములుగల్గియుండవలెను. అవి యేవియనిన - (1) శ్రద్ధ (2) తదేకనిష్ఠ (3) ఇంద్రియనిగ్రహము. ఇవి లేనివారు జ్ఞానమును పొందజాలరు.

(1) శ్రద్ధ - ఏ కార్యమందైనను శ్రద్ధ అధికముగ నున్నపుడే సత్ఫలితములు చేకూరును. గురువునందుగాని, దైవమునందుగాని, శాస్త్రమందుగాని జీవున కెంతెంత శ్రద్ధ అధికముగనుండునో, అంతంత ఉత్తమ ఫలములను వారివలన నతడు బడయగల్గుచుండును. 'ఇది తప్పక మేలు కలిగించును' అను అచంచల విశ్వాసముతో సాధన నుపక్రమించవలెనే కాని 'ఇది సిద్ధించునో లేదో, దీనివలన మేలు ఉండునో లేదో' అను సందిగ్ధస్థితి యుండరాదు. కనుకనే భగవాను డీ 'శ్రద్ధ' యను సుగుణమును గూర్చి గీతయందు పలుతావుల నుద్ఘాటించియున్నారు.

"తత్పరః" - ఇక రెండవ సుగుణము తత్పరత్వము 'తదేకనిష్ఠ'. పట్టుదలతో, ఏకాగ్రతతో తదేకచింతనతో జ్ఞానమును సాధించవలెను. శరీరము, వాక్కు, మనస్సు అనుత్రికరణములు అక్కార్యమునందే సంలగ్నములు కావలెను. ఇతరకార్యములను తగ్గించుకొని ఈ జ్ఞానప్రాప్తిరూప

ఏకైకకార్యమందే చిత్తమును కేంద్రీకరింపవలెను. చిత్తముయొక్క శక్తులన్నియు ఛిన్నాభిన్నములు కాక ఒకేవస్తువునందు ప్రసరించినచో అత్తఱి అఖండశక్తి ప్రాదుర్భవింప లక్ష్యము నది కరతలామలకము గావించుకొనగలదు. కావున మనస్సును దృశ్యవిషయములనుండి మరల్చి పరమార్థవిచారణవైపునకు త్రిప్పి తదేకనిష్ఠతో దానిని సాధించవలెను. అపుడే యా జ్ఞానము శీఘ్రముగ సిద్ధించును.

"సంయతేన్ద్రియః" - జ్ఞానప్రాప్తికి మూడవ అవశ్యకత ఇంద్రియనిగ్రహము. ఇంద్రియములద్వారా మనస్సు బహిఃప్రపంచమువైపునకు పరుగిడి విషయములపై వ్రాలుచుండినచో, హృదయాంతర్వర్తియగు ఆత్మ నది యేకాలమందును తెలిసికొనజాలదు. మఱియు నత్తఱి జ్ఞాననిష్ఠయం దేకాగ్రత సంభవించదు. కావున అంతర్ముఖత్వమవలంబించవలెను. అదియో; ఇంద్రియనిగ్రహములేనిదే ఎన్నటికిని సిద్ధింపదు. కాబట్టి జ్ఞానప్రాప్తికి, ఆత్మసాక్షాత్కారమునకు ఇంద్రియనిగ్రహము అత్యావశ్యకమైనది. 'యతేన్ద్రియః' అని చెప్పక 'సంయతేన్ద్రియః' అని చెప్పుటవలన ఇంద్రియములను లెస్సగ నిగ్రహింపవలయుననియు, సామాన్యనిగ్రహము చాలదనియు సూచితమగుచున్నది. సాధకునకు ఇంద్రియములు ప్రబలశత్రువులు. నిత్యవైరులు. శత్రువులను నిరోధింపనిదే (ఆత్మ) సామ్రాజ్యము లభింపదు. కావుననే జ్ఞానప్రాప్తికి ఇంద్రియసంయమము అత్యావశ్యకమని యిచట తెలుపబడుటకు కారణము.

ఈ ప్రకారము శ్రద్ధ, తదేకనిష్ఠ, ఇంద్రియనిగ్రహముల నవలంబించి జ్ఞానమును బొందినచో కలుగు ఫలితమేమి? 'పరమశాంతి' (సామాన్యశాంతికాదు). జ్ఞానమును బొందిన వెనువెంటనే ఈ పరమశాంతి జీవునకు లభించును. అదియే మోక్షస్థితి. 'అచిరేణ' అని చెప్పుటవలన అట్టి ఫలితము జ్ఞానానంతరము శీఘ్రాతి శీఘ్రముగ కలుగునని భావము. సూర్యోదయముచే అంధకారము నశించి పరమప్రకాశము తత్క్షణమే నలుదెసల వ్యాపించునట్లు జ్ఞానోదయముచే సంసారదుఃఖ మంతరించి మోక్షరూప పరమశాంతి వెంటనే లభ్యమగును. శాంతికి మార్గమేదియని ప్రపంచములో పెక్కురు ప్రశ్నించుచున్నారు. దానికి సమాధానము నీ శ్లోకములో భగవానుడు తెలియజేసిరి. 'ఓ జీవులారా! మీరు పరమశాంతిని కాంక్షింతురేని ఆత్మజ్ఞానమును బడయుడు!' అని వారు హెచ్చరించుచున్నారు. ప్రపంచములో దృశ్యవస్తువులచే లభించునది అల్పశాంతియేకాని పరమశాంతికాదని మఱువరాదు. కావున దానికై అఱ్ఱులుచాచక జ్ఞానజన్యమగు ఈ పరమశాంతికొఱకే యత్నించుదురుగాక! శాంతికి రాజబాటను భగవాను డిచట చూపిరి. కావున అశాంతిచే పరితపించు జీవులు దానికై యేల కృషిసలుపరాదు?

ప్ర:- జ్ఞానము నెవడు పొందగల్గును?

ఉ:- (1) శ్రద్ధగలవాడు (2) తదేకనిష్ఠతోగూడినవాడు (3) ఇంద్రియనిగ్రహము లెస్సగ గలవాడు.

ప్ర:- జ్ఞానప్రాప్తివలన కలుగు ఫలితమేమి?

ఉ:- పరమశాంతి.

ప్ర:- శాంతికి మార్గమేది?

ఉ:- జ్ఞానప్రాప్తి.

అ॥ శ్రద్ధలేనివారికి కలుగు దుర్గతిని వివరించుచున్నాడు -

**40. అజ్ఞశ్చాஉశ్రద్ధధానశ్చ సంశయాత్మా వినశ్యతి**
**నాయం లోకోஉస్తి న పరో న సుఖం సంశయాత్మనః.**

**టీక:–** అజ్ఞశ్చ = జ్ఞానములేనివాడును, అశ్రద్ధధానశ్చ = శ్రద్ధలేనివాడును, సంశయాత్మా = (శాస్త్ర, గురు వాక్యములను) సందేహించు మనస్సుగలవాడును, వినశ్యతి = పూర్తిగ నశించుచున్నాడు, సంశయాత్మనః = సంశయచిత్తునకు, అయమ్ = ఈ, లోకః = లోకము, నాస్తి = లేదు, పరః = పరలోకమున్ను, న = లేదు, సుఖమ్ = సుఖమున్నులేదు.

**తా:–** జ్ఞానములేనివాడు, శ్రద్ధారహితుడు, సంశయచిత్తుడు వినాశమునే పొందును. సంశయచిత్తునకు ఇహలోకముగాని, పరలోకముగాని, సౌఖ్యముగాని లేవు.

**వ్యాఖ్య:–** గురువాక్యమునందు, శాస్త్రవాక్యమునందు, పరమార్థసత్యములందు విశ్వాసము, శ్రద్ధకలవాడు జ్ఞానప్రాప్తిచే పరమశాంతిని బొందునని క్రిందటి శ్లోకమున చెప్పబడినది. అట్టిశ్రద్ధలేనివాడు జ్ఞానహీనుడై సంసారకూపమునబడి నశించునని ఈ శ్లోకమునతెలియజేయబడినది. (1) అజ్ఞాని (2) శ్రద్ధలేనివాడు (3) సంశయచిత్తుడు అను నీముచ్వురును కడతేరరనియు, వినాశమునే పొందుదురనియు చెప్పబడినది. ఇందు అజ్ఞాని పరమార్థవిషయములను తెలియక, తెలిసికొనుటకైనను యత్నింపక, దృశ్యమును సత్యమనినమ్మి జననమరణములంబాల్పడి నశించును. శ్రద్ధలేనివాడు శాస్త్రాదులందు అవిశ్వాసముగల్గి వానియందు ప్రవర్తింపక తత్ఫలితముగ ధర్మచ్యుతుడై నశించును. ఇక మూడవవాడగు సంశయచిత్తుడు ప్రతిదానిని సందేహించుచు, కింకర్తవ్యవిమూఢుడై పరమార్థసాధనచేయక ఊరకయుండి నశించును. 'నశ్యతి' అని చెప్పక 'వినశ్యతి' అని చెప్పుటచే ఆ ముచ్వురును ఘోరవినాశమును బడయుదురని స్పష్టమగుచున్నది.

ఈ ప్రకారముగ పైముగ్గురినిగూర్చి చెప్పి మరల రెండవపాదములో సంశయాత్ముని గూర్చి ప్రస్తావించి అతనికి ఇహపరసౌఖ్యములుగాని మనశ్శాంతిగాని యుండనేరవని భగవానుడు తెలియజేసిరి. సంశయము మనస్సును పీల్చిపిప్పిచేయును కావున ముముక్షువు శాస్త్ర, గురువాక్యములందు విశ్వాసము, శ్రద్ధగలిగి, సంశయమును పారద్రోలి అధ్యాత్మపథమున పురోగమించవలెను. అపుడే పూర్ణసుఖము (మోక్షస్థితి) చేకూరగలదు.

**ప్ర:–** ఈ ప్రపంచమున వినాశమును బొందువారెవరు?

**ఉ:–** (1) అజ్ఞాని (2) శ్రద్ధావిహీనుడు (3) సంశయచిత్తుడు.

**ప్ర:–** సంశయాత్ముని కెట్టి దుర్గతి కలుగును?

**ఉ:–** అతనికి ఇహలోకసుఖముగాని, పరలోకసుఖముగాని, మనశ్శాంతిగాని యుండనేరవు.

**ప్ర:–** కాబట్టి ముముక్షువుయొక్క కర్తవ్యమేమి?

**ఉ:–** (1) అజ్ఞానమునువీడి జ్ఞానమును సముపార్జించవలెను.
(2) శాస్త్ర, గురువాక్యములందు అశ్రద్ధగలిగి యుండరాదు.
(3) పరమార్థసత్యములందు సంశయము కలిగియుండరాదు.

**అ॥** జ్ఞానిని కర్మలు బంధింపనేరవని వచించుచున్నాడు –

## 41. యోగసన్న్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్నసంశయమ్ ఆత్మవన్తం న కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ.

**టీక:–** ధనఞ్జయ = ఓ అర్జునా!, యోగసన్న్యస్తకర్మాణమ్ = నిష్కామకర్మయోగముచే కర్మఫలములను త్యజించినవాడును, లేక ఈశ్వరార్పణ మొనర్చినవాడును, జ్ఞానసంఛిన్నసంశయమ్ = జ్ఞానముచే సంశయములు నివర్తించినవాడునగు, ఆత్మవన్తమ్ = ఆత్మనిష్ఠుని, కర్మాణి = కర్మములు, న నిబధ్నన్తి = బంధింపవు.

**తా:–** ఓ అర్జునా! నిష్కామకర్మయోగముచే కర్మఫలములను త్యజించినవాడును, లేక ఈశ్వరార్పణమొనర్చిన వాడును, జ్ఞానముచే సంశయములు నివర్తించినవాడు నగు ఆత్మనిష్ఠుని (బ్రహ్మజ్ఞానిని) కర్మములు బంధింపనేరవు.

**వ్యాఖ్య:–** కర్మ లెవనిని బంధింపకుండునను ప్రశ్నకిచట సమాధానము చెప్పబడినది. కర్మఫలములను త్యజించి, జ్ఞానముచే సమస్తసంశయములను బోగొట్టుకొని, ఆత్మయందు నిలుకడను బొందినట్టి జ్ఞానిని కర్మలు బంధిపనేరవు. కర్మఫలములను ఈశ్వరార్పణముచేసి, సంగరహితుడై, ఆత్మయందు స్థితి గలిగి యుండువానికి, దృశ్యమగు దేహమునందు అహంభావ ముండదుగనుక, కర్తృత్వభావములేనివాడై యుండుటవలన కర్మ లతనిని బంధింపనేరవు. అట్టివాడు నిరంతరము కర్మలాచరించినను, వానియందు తగుల్కొనడు. బంధమున్ను గలుగదు. ఏలయనగా బంధమనునది కర్మలు చేయుటయందుగాని, చేయకుండుటయందుగాని లేదు. ఫలాభిలాషయందు, కర్తృత్వబుద్ధి యందు, సంగమునందు మాత్రమే బంధముకలదు. మఱియు ఆత్మనిష్ఠుడగు వానికి సమస్తకర్మలున్ను జ్ఞానాగ్నిచే దగ్ధములై పోవుటవలన ఇక వాని నవి యెట్లు బంధింపగలవు?

"జ్ఞానసంఛిన్నసంశయమ్" – జ్ఞానము కలుగనంతవఱకు జీవుని సంశయములు బాధించుచునేయుండును. ప్రత్యక్షజ్ఞానము కలిగినమీదట సందేహములన్నియు పటాపంచలైపోవును (ఛిద్యన్తే సర్వసంశయాః).

"ఆత్మవన్తమ్" – ఆత్మనిష్ఠుని, బ్రహ్మజ్ఞానసంపన్నుని కర్మలెవ్వియు బంధింపనేరవు. ప్రపంచములో నొక ఆత్మజ్ఞానిని దప్ప తక్కినవారినందఱిని (వారు ధనవంతులైనను, బలవంతులైనను, విద్యావంతులైనను, సౌందర్యవంతులైనను) కర్మలు బంధించి వైచును. కాబట్టి ఆత్మజ్ఞానమును బడసి ఆత్మవంతుడగుటకే సర్వులును యత్నశీలురు కావలెను.

**ప్ర:–** కర్మ లెవనిని బంధింపవు?

**ఉ:–** (1) నిష్కామకర్మయోగముచే కర్మఫలమును త్యజించువానిని, లేక ఈశ్వరార్పణము చేయువానిని (2) జ్ఞానముచే సంశయములు నివర్తించినవానిని (3) ఆత్మనిష్ఠుని కర్మలు బంధించనేరవు.

**ప్ర:–** కావున కర్మలచే బంధింపబడకుండుటకుగాను సాధకు డేమి యొనర్పవలయును?

**ఉ:–** (1) కర్మఫలములను త్యజించివేయవలెను (2) జ్ఞానమును సంపాదించి సంశయనివృత్తి గలుగజేసికొనవలెను (3) ఆత్మయందు స్థితి గలిగియుండవలెను.

**అ॥** జ్ఞానముచే అజ్ఞానమును బోగొట్టుకొని లోకహితమునకై (నిష్కామ) కర్మయోగము నాశ్రయించవలసినదిగా భగవాను డర్జునున కుద్బోధించుచున్నాడు -

**42. తస్మాదజ్ఞానసమ్భూతం హృత్థ్సం జ్ఞానాసినాత్మనః**
**ఛిత్త్వైనం సంశయం యోగమాతిష్ఠోత్తిష్ఠ భారత.**

**టీక:-** భారత = ఓ అర్జునా!, తస్మాత్ = అందువలన, ఆత్మనః = నీయొక్క, హృత్థ్సమ్ = హృదయముననున్నదియు, అజ్ఞానసమ్భూతమ్ = అజ్ఞానమువలన బుట్టినదియు (అగు), ఏనం సంశయమ్ = ఈ సందేహమును, జ్ఞానాసినా = జ్ఞానమనుఖడ్గముచేత, ఛిత్త్వా = ఛేదించి, యోగమ్ = (జ్ఞానయోగ సాధనమైన) నిష్కామకర్మయోగమును, ఆతిష్ఠ = ఆచరింపుము, ఉత్తిష్ఠ = లెమ్ము.

**తా:-** ఓ అర్జునా! కాబట్టి నీయొక్క హృదయముననున్నదియు, అజ్ఞానమువలన బుట్టినదియునగు ఈ సంశయమును జ్ఞానమను ఖడ్గముచే ఛేదించివైచి నిష్కామకర్మ యోగము నాచరింపుము. లెమ్ము.

**వ్యాఖ్య:-** ఈ ప్రకారముగ ఈ అధ్యాయమున జ్ఞానమును, జ్ఞానమాహాత్మ్యమును, జ్ఞానయోగసహాయముచే సంభవమగు నిష్కామకర్మయోగమును బోధించి, తుట్టతుదకు భగవానుడు అర్జునుని కార్యాచరణకై పురికొల్పుచున్నాడు. కర్తవ్యనిష్ఠను బోధించుచున్నాడు. 'లెమ్ము (ఉత్తిష్ఠ) కార్యరంగమున దుముకుము' అని ఉత్సాహపరచుచున్నాడు.

"అజ్ఞానసమ్భూతమ్" - సంశయ, మోహాదులన్నియు అజ్ఞానమునుండియే ప్రాదుర్భవించుచున్నవి. వానియన్నింటికి అజ్ఞానము తల్లివంటిది. సమస్తదుర్గుణములు, దుర్వాసనలు దుస్సంకల్పములు, సంశయములు అచ్చోటనే పుట్టుచున్నవి.

"జ్ఞానాసినా" అజ్ఞానమును పారద్రోలుటయందు జ్ఞానమే సమర్థమగునుగాని తదితరములగు ఏ సాధనలున్నుగావు. కనుకనే అద్దానిని ఛేదించుటకు జ్ఞానమను ఖడ్గమును ప్రయోగించవలసినదిగా భగవానుడుద్బోధించిరి. అంధకారమును బోగొట్టుటకు ప్రకాశమొకటియే సమర్థమగునుగదా! అట్లే అజ్ఞానాంధకారమును నిర్మూలించుటయందు జ్ఞానప్రకాశ ముపయోగపడుచున్నది.

"హృత్థ్సమ్" అని చెప్పుటవలన అనాదికాలమునుండి ఆ సంశయమోహాదులు హృదయముననే తిష్ఠవేసికొనియున్నవని స్పష్టమగుచున్నది. శత్రువు దూరమునలేడు. అతిసమీపముననున్న హృదయముననే కలడని యెఱుంగవలెను.

"యోగమాతిష్ఠ" జ్ఞానప్రాప్త్యనంతరము లోకహితమునకై నిష్కామకర్మయోగాచరణము నవలంబించవలసినదిగా భగవాను డర్జునునకు బోధించుచున్నాడు. జ్ఞానికి కర్మను చేయుటయందుగాని, త్యజించుటయందుగాని పట్టుదల యేమియులేకున్నను, ధర్మసముద్ధరణముకొఱకును, లోకసంగ్రహార్థమున్ను సామాన్యముగ నతడు నిష్కామబుద్ధితో కర్మచేయుచునేయుండును. కనుకనే భగవానుడిచట అర్జునుని గూర్చి 'ఓ అర్జునా! ముందు నీవు జ్ఞానమును సంపాదింపుము. అట్టి జ్ఞానఖడ్గముచే అవిద్యాహృదయగ్రంథిని ఛేదించివేయుము. తదుపరి లోకహితముకొఱకై కర్మను శీలింపుము'. అని యుపదేశించుచున్నాడు.

"ఉత్తిష్ఠ" - 'లెమ్ము!' అనిశ్రీకృష్ణుడు ధైర్యోద్బోధకమగు వాక్యమును పలికిరి. మహాత్ములగువారు నిద్రించుజనులను ఇట్టి వాక్యములచే మేలుకొలుపుదురు. కూర్చొని మూలుగుచున్నవారికి ధైర్యప్రదానముచేసి కార్యరంగమున దుముకునట్లు చేయుదురు. ఇచట అకర్మణ్యుడై రథమున చతికిలబడియున్న అర్జునునకు భగవానుడు ధైర్యమును నూరిపోసి 'ఉత్తిష్ఠ' - (లెమ్ము) అనుచున్నారు! కావున భగవానుని ఈ వాక్యమును సంస్మరించి తక్కినవారును అర్జునునివలె తమతమ హృదయములందు జన్మజన్మాంతరములనుండి గాఢముగ నాటుకొనియున్న అవిద్యాగ్రంథిని జ్ఞానఖడ్గముచే నఱకివైచి కర్తవ్యోన్ముఖులు కావలసియున్నారు. ఎన్ని సాధనలను అవలంబించినను తుట్టతుదకు ఆత్మజ్ఞానమొకటియే బంధవిముక్తికి శరణ్యము. ఆత్మజ్ఞానమును పొందిన పిదపయే నిష్కామకర్మయోగమును ఇంకను చక్కగ శీలించుటకు అవకాశముండునని యెఱుంగవలయును.

ప్ర:- సంశయ, మోహాదు లెచట కాపురముండును?

ఉ:- హృదయమున.

ప్ర:- అవి దేనినుండి ప్రాదుర్భవించును?

ఉ:- అజ్ఞానమునుండి.

ప్ర:- ఆ యజ్ఞాన మెటుల నశించును?

ఉ:- జ్ఞానమను ఖడ్గముచే.

ప్ర:- అట్లు అజ్ఞానమును నశింపజేసికొనినపిదప మహనీయులు సామాన్యముగ ఏమి చేయుదురు?

ఉ:- లోకోపకారార్థము నిష్కామకర్మయోగమును శీలించుదురు.

ఓమ్
ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే జ్ఞానయోగో నామ
చతుర్థోఽధ్యాయః
ఇది ఉపనిషత్ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును,
శ్రీకృష్ణార్జునసంవాదమునగు శ్రీ భగవద్గీతలందు జ్ఞానయోగమను
నాల్గవ అధ్యాయము
ఓమ్ తత్ సత్



ఓం

# శ్రీ భగవద్గీత

అథ పఞ్చమోఽధ్యాయః

## ఐదవ అధ్యాయము

కర్మసన్న్యాసయోగః

## కర్మసన్న్యాసయోగము

**ఈ అధ్యాయము యొక్క పేరు :-**

"కర్మసన్న్యాసయోగము" - సన్న్యాసమనగా త్యాగము. కర్మత్యాగము ప్రారంభమున కూడదనియు, కర్మఫలత్యాగరూపమగు నిష్కామకర్మయోగమును శీలించుచురాగా చిత్తశుద్ధిగలిగినమీదట నిర్విషయ ఆత్మస్థితియందు, లేక అట్టిస్థితి కొఱకు కర్మత్యాగమనునది సంభవించుననియు కాబట్టి సాధకులకు కర్మసన్న్యాసముకంటె కర్మయోగమే శ్రేష్ఠమైనదనియు ఈ అధ్యాయమున చెప్పబడినది. ఈ ప్రకారముగ కర్మసన్న్యాసమునుగూర్చి వివరముగ బోధించిన అధ్యాయమగుటచే దీనికి కర్మసన్న్యాసయోగమను పేరు గలిగినది. లేక 'సన్న్యాస' మను పదము సాంఖ్యమునకు, జ్ఞానమునకు పర్యాయముగ వాడబడుచుండును. ఈ అధ్యాయమునందు కర్మయోగము, జ్ఞానయోగము రెండింటిని గూర్చి వచింపబడియుండుటచేగూడ దీనికి కర్మసన్న్యాసమను పేరు ఏర్పడియుండవచ్చును.

**ఈ అధ్యాయమందలి ప్రధాన విషయములు :-**

1. సాంఖ్యయోగము, (నిష్కామ) కర్మయోగములను గూర్చిన నిర్ణయము. (1 వ శ్లో॥ నుండి 6వ శ్లో॥ వఱకు)
2. సాంఖ్యయోగియొక్కయు, కర్మయోగియొక్కయు లక్షణములు, వారి మహిమ. (7 వ శ్లో॥ నుండి 12వ శ్లో॥ వఱకు)
3. జ్ఞానయోగముయొక్క వివరణము. (13వ శ్లో॥ నుండి 26వ శ్లో॥ వఱకు)
4. భక్తిసహితమగు ధ్యానయోగముయొక్క వర్ణనము. (27 వ శ్లో॥ నుండి 29 వ శ్లో॥ వఱకు)

**పూర్వాధ్యాయముతో ఈ అధ్యాయమునకు గల సంబంధము :-**

మూడవ, నాల్గవ అధ్యాయములందు భగవానుడు నిష్కామకర్మయోగమును అచటచట ప్రస్తుతించుచువచ్చిరి. అద్దానియాచరణముచే క్రమముగ జ్ఞానము సిద్ధించగలదనియు వచించిరి (4-38). అయినను జ్ఞానమును గూర్చికూడ పలుచోట్ల నుద్ఘాటించుటయు జరిగెను. అట్టి జ్ఞానమును మహనీయులను సేవించుటద్వారా యెఱుగవలయుననియు భగవానుడు తెలియజేసిరి. కావున ఈ జ్ఞాన,

# కర్మ సన్న్యాసయోగము



**భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్**
**సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తిమృచ్ఛతి. (5-29)**

యజ్ఞములయొక్కయు, తపస్సులయొక్కయు భోక్త (ఫలములనుభవించువాడు) గను, సమస్తలోకములయొక్క ఈశ్వరుడు (ప్రభువు, శాసకుడు) గను, సమస్త ప్రాణులయొక్క హితకారిగను, నన్నెఱింగి మనుజుడు శాంతిని బొందుచున్నాడు.

కర్మల రెండింటిలో నేది శ్రేష్ఠమోయను సంశయ మర్జుననకు కలుగగా, అద్దాని నివారణముకొరకై శ్రీకృష్ణమూర్తిని వెనువెంటనే ప్రశ్నించెను. అర్జునుని యీ ప్రశ్నతో నీయధ్యాయము ప్రారంభింపబడుచున్నది.

**అర్జున ఉవాచ :–**

## 1. సన్న్యాసం కర్మణాం కృష్ణ పునర్యోగం చ శంససి
## యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్.

అర్జున ఉవాచ = అర్జునుడు చెప్పెను -

**టీక:–** కృష్ణ = ఓ కృష్ణమూర్తీ!, కర్మణామ్ = కర్మములయొక్క, సన్న్యాసమ్ = పరిత్యాగమును, పునః = మఱల, యోగం చ = కర్మయోగమును, శంససి = ప్రశంసించుచున్నావు, ఏతయోః = ఈ రెండింటిలో, యత్ = ఏది, శ్రేయః = శ్రేయస్కరమైనదో, సునిశ్చితమ్ తత్ ఏకమ్ = బాగుగ నిశ్చయింపబడిన అట్టి ఒక్క దానిని, మే బ్రూహి = నాకు జెప్పుము.

**తా:–** అర్జునుడు చెప్పెను - ఓ కృష్ణమూర్తీ! మీరొకప్పుడు కర్మలయొక్క త్యాగమును (కర్మత్యాగపూర్వకమగు జ్ఞానమును), మఱియొకప్పుడు కర్మయోగమును ప్రశంసించుచున్నారు. కావున ఈ రెండింటిలో నేది శ్రేష్ఠమైనదో బాగుగ నిశ్చయించి ఆ ఒక్కదానిని నాకు జెప్పుడు.

**వ్యాఖ్య:–** వాస్తవముగ శ్రీకృష్ణమూర్తి కర్మముల త్యాగమును ఎచటను బోధింప లేదు. కర్మఫలత్యాగమును మాత్రము బోధించిరి. కావున ఇచ్చట కర్మసన్న్యాసమునకు అర్థము కర్మత్యాగపూర్వకమగు జ్ఞానమనియే. కావున అర్జునుని ప్రశ్న జ్ఞానయోగ, కర్మయోగములలో ఏది శ్రేష్ఠమని, ఏది శ్రేయోదాయకమని. ఈ ప్రశ్న సమంజసముగనేయున్నది. ఏలయనిన శ్రీకృష్ణమూర్తి -

కార్యం కర్మ సమాచర (3-19)
యుధ్యస్వ విగతజ్వరః (3-30)
కురు కర్మైవ తస్మాత్త్వం (4-15)
యోగమాతిష్ఠోత్తిష్ఠ భారత (4-42)

మున్నగు వాక్యములద్వారా కర్మయోగము నాశ్రయించవలసినదిగా అర్జుననకు అసందిగ్ధముగ జెప్పివేచిరి. అయినను కొన్ని చోట్ల -

శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞా జ్జ్ఞానయజ్ఞః పరన్తప
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే (4-33)
తద్విద్ధి ప్రణిపాతేన (4-34)

మున్నగు వాక్యములద్వారా జ్ఞానయోగముయొక్క శ్రేష్ఠత్వమును ప్రతిపాదించి దాని నవలంబించవలసినదిగాను భగవాను డర్జునుని ఆదేశించిరి. రెండిటిని శ్రద్ధగ వినినట్టి అర్జుననకు వానిలో నేది గొప్పదియను సంశయ ముదయించెను. దీనిని బోలిన సందేహమే పూర్వము మూడవ అధ్యాయ ప్రారంభమున అర్జుననకు కలిగియుండుట ఇచ్చోట గమనింపదగినది.

అ॥ అందులకు భగవానుడు ప్రత్యుత్తరమిచ్చుచున్నాడు -

**శ్రీ భగవానువాచ :**

**2. సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరావుభౌ**
**తయోస్తు కర్మసన్న్యాసాత్కర్మయోగో విశిష్యతే.**

శ్రీ భగవానువాచ : శ్రీభగవంతుడు చెప్పెను.

**టీక:–** సన్న్యాసః = కర్మత్యాగము (కర్మత్యాగపూర్వకమగు జ్ఞానయోగము), కర్మయోగః చ = కర్మయోగమున్ను, ఉభౌ = రెండును, నిశ్శ్రేయసకరౌ = మోక్షమును గలుగజేయునట్టివి, తయోః తు = ఆ రెండిటిలోనన్నను, కర్మసన్న్యాసాత్ = కర్మత్యాగముకంటె, కర్మయోగః = కర్మయోగమే, విశిష్యతే = శ్రేష్ఠమగుచున్నది.

**తా:–** శ్రీభగవంతుడు చెప్పెను - కర్మత్యాగము (కర్మత్యాగపూర్వకమగు జ్ఞానయోగము), కర్మయోగము అను రెండును మోక్షమును గలుగజేయును. అయితే, ఆ రెండిటిలోను (ప్రారంభమున) కర్మత్యాగమునకంటె, కర్మయోగమే శ్రేష్ఠమైనది.

**వ్యాఖ్య:–** కర్మసన్న్యాసపూర్వక జ్ఞానయోగము, కర్మాచరణపూర్వక నిష్కామకర్మయోగము అను నీ రెండును గొప్ప శ్రేయస్సును కలుగజేయును. రెండును మోక్షప్రదములేయగును. అయినను ప్రారంభస్థితి యందుండువారికి కర్మలను విడుచుట కంటె కర్మలను (నిష్కామముగ) ఆచరించుటయే ఉత్తమము. వారికి కర్మసన్న్యాసము కంటె కర్మయోగమే శ్రేయస్కరమైనది. అర్జునుడు పూర్ణనిర్విషయజ్ఞానస్థితిని ఇంకను బడయనందున, అతనిని దృష్టియందుంచుకొని ఈ ప్రకారము భగవానుడు చెప్పియుండవచ్చును. మఱియు ప్రపంచములో జ్ఞానులకంటె అజ్ఞానులే అధికసంఖ్యలోనున్నారు. వారందఱియొక్క శ్రేయమునుద్దేశించియు భగవానుడు కర్మసన్న్యాసమును అనగా కర్మపరిత్యాగమును ఇచట ప్రోత్సహించలేదనియు ఊహించుకొన వచ్చును. ఇట్లు చెప్పనిచో ప్రతివారును తాము నిర్విషయస్థితిని పొందకపూర్వమే కర్మలను విడిచిపెైచి, సోమరులుగానుండి, భుక్తికిని, ముక్తికిని రెండిటికిని దూరులగుదురు. కావున జన సామాన్యముయొక్క శ్రేయమునిమిత్తము భగవాను డీప్రకారముగ కర్మయోగ విశిష్టతను ప్రతిపాదించిరి.

**ప్ర:–** కర్మసన్న్యాసపూర్వకమగు జ్ఞానయోగము శ్రేష్ఠమా, కర్మాచరణపూర్వకమగు నిష్కామ కర్మయోగము శ్రేష్ఠమా?

**ఉ:–** రెండును శ్రేష్ఠములే. రెండును ముక్తిప్రదములే. అయినను సాధకునకు ప్రారంభస్థితి యందు కర్మాచరణమే శ్రేయోదాయకమైనది.

అ॥ రాగద్వేషములులేని నిష్కామకర్మయోగిని స్తుతించుచున్నాడు -

**3. జ్ఞేయస్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాఙ్క్షతి**
**నిర్ద్వన్ద్వో హి మహాబాహో సుఖం బన్ధాత్ప్రముచ్యతే.**

**టీక:–** మహాబాహో = గొప్పబాహువులుకల ఓ అర్జునా!, యః = ఎవడు, న ద్వేష్టి = ద్వేషింపడో, న కాఙ్క్షతి = కోరడో, సః = అతడు, నిత్యసన్న్యాసీ = ఎల్లపుడును సన్న్యాసియే (అని), జ్ఞేయః = తెలియబడదగినవాడు, హి = ఏలయనగా, నిర్ద్వన్ద్వః = (రాగద్వేషాది) ద్వంద్వములు లేనివాడు, సుఖం = సులభముగ, బన్ధాత్ = (సంసార) బంధమునుండి, ప్రముచ్యతే = లెస్సగ విడువబడుచున్నాడు.

**తా:–** గొప్పబాహువులు కల ఓ అర్జునా! ఎవడు (ఏకర్మయోగి) దేనినిగూడ ద్వేషింపడో, దేనినిగూడ కోరడో అట్టివాడు ఎల్లప్పుడును సన్న్యాసి (త్యాగి) యేయని తెలియదగినది. ఏలయనగా, (రాగద్వేషాది) ద్వంద్వములులేనివాడు సులభముగ సంసార బంధమునుండి విముక్తుడు కాగలడు.

**వ్యాఖ్య:–** సన్న్యాసమనగా రాగద్వేషములను, సుఖదుఃఖాది ద్వంద్వములను త్యజించుటయేకాని కర్మలను త్యజించుటమాత్రము కాదని యిచట స్పష్టీకరించబడినది. అట్లు రాగద్వేషాదులను వదలిపెట్టువాడే 'నిత్యసన్న్యాసి' యగును. తక్కినవారు 'అనిత్యసన్న్యాసులే' యని భావము. సన్న్యాసులు (కుటీచక, బహూదకాదులను) అనేక తరగతులవారున్నను ఇచట రెండుతరగతులవారు మాత్రము సూచించబడిరి – (1) నిత్యసన్న్యాసులు (2) అనిత్యసన్న్యాసులు అని. రాగద్వేషరహితుడు, ద్వంద్వ విముక్తుడు నిత్యసన్న్యాసి. సన్న్యాసివేషము మాత్రము వేసికొని, అంతఃకరణమున రాగాదులు, కామాదులు, ద్వంద్వములు కలిగియున్నవాడు అనిత్యసన్న్యాసి అనగా హృదయపరిణామములేక బాహ్యాకారముమాత్రము మార్చుకొనువాడు – అని అర్థము. కావున రాగమువదలుటయే సన్న్యాసము. ద్వేషము వదలుటయే సన్న్యాసము. ద్వంద్వములు విడుచుటయే సన్న్యాసము. వాసనాత్యాగమే వాస్తవసన్న్యాసము. అది లేనివాడు సన్న్యాసియైనను పతితుడే. అదియున్నవాడు గృహస్థుడైనను సన్న్యాసియే.

"సుఖం బన్ధాత్" – సంసారబంధము చాల గట్టిది. అది దృఢమగు గ్రంథితో గూడినది. బహుజన్మలనుండి అది గట్టిపడుచు వచ్చినది. కావున దానిని విడదీసికొని పోగల్గుట కష్టతరము. అయినను రాగద్వేషాదులను వదలినవారు దానిని సులభముగ, అనాయాసముగ ఛేదింపగల్గుచున్నారని భగవానుడిచట నుడివిరి. కనుకనే 'సుఖం' (సులభముగ) అను పదము ప్రయోగింపబడినది. సంసారబంధము తొలగుటకేదైన సులభోపాయము కలదా యని అనేకులు ప్రశ్నింతురు. భగవానుడు దానికిచట సరియైన సమాధానమొసంగియుండిరి. రాగద్వేషములను వదలుటయే ఆ ఉపాయము. అట్టివాడు గృహస్థుడైనను, కర్మలనాచరించుచున్నను సదా సన్న్యాసియే (నిత్యసన్న్యాసి) యగును.

అంతఃకరణమునందలి దోషములను వదలుటయే నిజమైన సన్న్యాసమని, నిత్యసన్న్యాసమని భగవానుడు చెప్పినందువలన ఇక వేషధారులగు కపటసన్న్యాసుల ఆటకట్టినట్లేయగుచున్నది. అట్టివారు అనిత్యసన్న్యాసులతెగలో జమకట్టివేయబడిరి. కావున కృత్రిమత్వమును స్వీకరించక భగవానుడు తెలిపిన బంధవిముక్తికరమగు పవిత్ర మార్గమునే సర్వులును అనుసరించవలయును.

**ప్ర:–** 'నిత్యసన్న్యాసి' ఎవరు?

**ఉ:–** (1) దేనిని ద్వేషింపనివాడు (2) దేనిని వాంఛింపనివాడు (3) సుఖదుఃఖాది ద్వంద్వములు లేనివాడు.

**ప్ర:–** అట్టి నిత్యసన్న్యాసత్వమునకు ఫలమేమి ?

**ఉ:–** దానిచే మనుజుడు సంసారబంధమును సులభముగ దాటివేయగలడు.

**ప్ర:–** సంసారబంధమునుండి సులభముగ తప్పించుకొనుటకు మార్గమేది ?

**ఉ:–** రాగద్వేషాదులు లేకుండుట, ద్వంద్వములను పారద్రోలుట.

**అ॥** కర్మయోగ, జ్ఞానయోగముల రెండిటియొక్క ఫలమొకటేయని రెండు శ్లోకములద్వారా వచించుచున్నాడు –

**4. సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పణ్డితాః**
**ఏకమప్యాస్థితః సమ్యగుభయోర్విన్దతే ఫలమ్.**

**టీక:–** సాంఖ్యయోగౌ = జ్ఞానయోగ, కర్మయోగములు, పృథక్ = వేఱువేఱని, బాలాః = అవివేకులు, ప్రవదన్తి = చెప్పుచున్నారు, పణ్డితాః = వివేకవంతులు, న (ప్రవదన్తి) = అట్లు చెప్పరు, ఉభయోః = ఆ రెండిటిలోను, ఏకమ్ అపి = ఒక్కదానినైనను, సమ్యక్ = లెస్సగా, ఆస్థితః = ఆచరించువాడు, (ఉభయోః) ఫలమ్ = రెండిటియొక్క ఫలమును (మోక్షమును), విన్దతే = పొందుచున్నాడు.

**తా:–** (కర్మసన్న్యాసపూర్వకమగు) జ్ఞానయోగము, కర్మయోగము వేఱువేఱని (వేఱు వేఱు ఫలములు కలవని) అవివేకులు పలుకుదురేకాని వివేకవంతులు కాదు. ఆ రెండిటిలో ఏ ఒక్కదానినైనను బాగుగ అనుష్ఠించినచో రెండిటియొక్క ఫలమును (మోక్షమును) మనుజుడు పొందుచున్నాడు.

**వ్యాఖ్య:–** పండితులనగా నిచట పారమార్థిక అనుభవజ్ఞానము గలిగిన మహనీయులనియే భావముకాని కావ్యాలంకారాది సాహిత్యపరిజ్ఞానము కలవారనికాదు. జ్ఞానయోగము, కర్మయోగము వేఱువేఱు ఫలములు గలుగజేయునని పిల్లలు (బాలాః) చెప్పుదురేకాని పెద్దలు కాదని భగవాను డిచట నుడివిరి. ఏలయనిన, ఏ యోగమును అనుష్ఠించినను ఆత్మసాక్షాత్కారరూపమగు మోక్షమను ఒకే ఫలము గలుగుచున్నది. కొందఱు ఉత్తమాధికారులు వారి వారి సంస్కారమునననుసరించి ఆత్మవిచారణారూప జ్ఞానయోగము నవలంబించి దృగ్దృశ్యములను వివేచించి స్వస్వరూపమునెఱింగి మోక్షఫలమును బడయుదురు. మఱికొందఱు వారి చిత్తవృత్తిననుసరించి నిష్కామకర్మయోగమును శీలించి సమస్తకర్మములను ఈశ్వరార్పణముచేసి, స్వార్థరహితులై, ఫలాభిలాషను వర్జించి, చిత్తశుద్ధిని బడసి, తద్ద్వారా స్వస్వరూపపరిజ్ఞానమునొంది మోక్షమును బొందుచున్నారు. ఈ ప్రకారముగ రెండిటియందును అహంభావరాహిత్యమే, కర్తృత్వబుద్ధిరహితత్వమే, సంకుచితజీవభావవినాశమే యిమిడియున్నది. జీవత్వము తొలగినపుడు శేషించునది శివత్వమేకదా! కావున సాంఖ్య (జ్ఞాన) యోగ, కర్మయోగములలో ఒక్కదానియందు చక్కగ నిలుకడ కలిగినచో రెండిటియొక్క ఫలమగు మోక్షము లభించునని చెప్పుటకు కారణమైనది.

"సమ్యక్" – ఏ యోగమైనను అందు చక్కగా, దృఢముగా (అచంచలముగా) స్థితిని బొందినమాత్రమే అట్టి మోక్షఫలము లభించునుగాని ఒకింత అనుభవముచే గాదు. అస్థిరమగు స్థితిచేగాదు. అనగా ఏ ఒక్క మార్గమందైనను పరిపక్వతబడయవలెను. దానియందు ప్రవీణుడు (Expert) కావలయును. ఈ భావమును తెలుపుటకే 'సమ్యక్' అను పదమిచట ప్రయోగింపబడినది.

ఉత్తమ జ్ఞానులు లోకోపకారార్థము కర్మను (ఫలాభిసంధిరహితముగ) చేయుచునేయున్నారు. ఉత్తమ కర్మయోగనిష్ఠులు స్వార్థరహితులై, ఏ ఫలముకోరక, అంతరంగమున అంతయు భగవత్స్వరూపమే (సర్వం ఖల్విదం బ్రహ్మ) అను జ్ఞానభావము కలిగియే యుండుచున్నారు. కాబట్టి పరిపక్వదశలో జ్ఞానయోగ, కర్మయోగములు రెండును ఒకటిగనేయుండును. ఒకే ఫలమును గలుగజేయును. రెండిటియొక్క లక్ష్యము చిత్త విలయమే; వ్యష్టిత్వమును వదలి సమష్టిత్వమందు ప్రవేశించుటయే. ఇట్లుండ ఈ జ్ఞానయోగ, కర్మయోగములు, వేఱువేఱని వచించువారు నిజముగ పసిపిల్లలే (బాలాః) యగుదురు. వారి బుద్ధి యింకను వికసించలేదని యర్థము.

విశాలభావముగలవారెన్నడును ఏమార్గమును దూషింపరు. అన్నిమార్గములును భగవత్సాన్నిధ్యమునకు గొనిపోవునవియేయని తలంచి సర్వమతసహనముకలిగి, అన్నిమతములను ఆమోదించుదురు. ఒక వృత్తము (Circle) యొక్క పైభాగమునుండి ఏ వ్యాసార్థము (Radius) ననుసరించిపోయినను తుదకు అన్నియును కేంద్రము (Centre) నే చేరును గదా! అట్లే జ్ఞాన, కర్మాది వివిధమార్గములున్ను ఒకే మోక్షరూపస్థానమునకు జీవుని గొనిపోవుచున్నవి. ఈ శ్లోకమున 'జ్ఞాన' కర్మయోగములలో ఏ ఒక్కదానియందైనను చక్కగ నిలుకడ కలిగినచో రెండిటియొక్క ఫలము కలుగునని భగవానుడు సెలవిచ్చిరి. రెండిటియొక్క ఫలము ఒకటియే అయియుండిననే ఆ ప్రకారము సంభవించగలదు. ఇవ్విధముగ సర్వమార్గ, సర్వమతసమన్వయము ఈశ్లోకమున వ్యక్తముచేయబడినది. మత విషయమున, మార్గవిషయమున విశాలభావమును గలిగించుకొనుడని భగవాను డిచట హెచ్చరిక చేయుచున్నారు. నదులన్నియు వేఱువేఱుగా ప్రవహించినను తుదకు సముద్రమును గమ్యస్థానమును జేరునట్లు, జ్ఞాన, కర్మ, ధ్యాన, భక్తియోగాదులన్నియు ఆత్మసాక్షాత్కారమను ఒకే లక్ష్యమునకు జీవుని బొందించుచున్నవి.

**ప్ర:–** జ్ఞానయోగ, కర్మయోగములు వేఱువేఱా ?

**ఉ:–** కాదు. చక్కగ నాచరించినచో రెండును ఒకే మోక్షరూపఫలమును గలుగజేయును.

**ప్ర:–** కాబట్టి మోక్షప్రాప్తికి ఉపాయమేమి ?

**ఉ:–** జ్ఞానయోగమునుగాని, కర్మయోగమునుగాని తుదివఱకు చక్కగ అనుష్ఠించవలెను. అపుడు రెండిటియొక్క ఫలమగు మోక్షము లభించగలదు.

## 5. యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే
## ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి.

**టీక:–** సాంఖ్యైః = జ్ఞాననిష్ఠులచే, యత్‌స్థానమ్ = ఏస్థానము (మోక్షము), ప్రాప్యతే = పొందబడుచున్నదో, తత్ = అది, యోగైః అపి = కర్మయోగులచేతను, గమ్యతే = పొందబడుచున్నది, సాంఖ్యంచ = జ్ఞానయోగమును, యోగంచ = కర్మయోగమును, ఏకమ్ = ఒకటిగ (ఒకేఫలముగలదిగ), యః = ఎవడు, పశ్యతి = చూచుచున్నాడో (తెలిసికొనుచున్నాడో) సః (ఏవ) = అతడే, పశ్యతి = నిజముగచూచినవాడు (తెలిసినవాడు) (అగును).

**తా:–** జ్ఞానయోగులచే ఏ స్థానము (మోక్షము) పొందబడుచున్నదో, అది కర్మయోగులచేతను పొందబడుచున్నది. జ్ఞానయోగమును, కర్మయోగమును ఒక్కటిగ (ఒకే ఫలము గలుగజేయునదిగ) చూచువాడే నిజముగ చూచువాడగును (తెలిసినవాడగును).

**వ్యాఖ్య:–** క్రిందటి శ్లోకమునందలి భావమునే మరల నిచట వ్యక్తమొనర్చుచున్నారు. జ్ఞానయోగ కర్మయోగములు రెండును ఒకే ఫలమును గలుగజేయునని ఎఱుగగల్గువారే పరమార్థము నెఱింగినవారగుదురు. వారే నిజముగ చూచువారు. తక్కినవారు నేత్రములున్నను చూడజాలనివారే యగుదురని భావము. సత్యము నవలోకించుటయే నేత్రములున్నదానికి సార్థకత; యథార్థమును గాంచగల్గుటే వివేకము యొక్క చిహ్నము. కాబట్టి అవివేకమను గ్రుడ్డితనమును పొందక, దూరదృష్టి, విశాలభావముగల్గి, ఏ యోగమైనను ఒకే (మోక్షరూప) ఫలమును గలుగజేయునని నిశ్చయించవలెను. కావున ఇక కర్మయోగులు తాము అల్పులమని తలంచక, జ్ఞాన యోగులు తామధికులమని భావించక నిర్భయముగ వారివారి మార్గమును 'సమ్యక్ - రీతిని. అనుసరించి గమ్యమును జేరవచ్చును'. సాధ్యము (లక్ష్యము) ఒకేవస్తువు (పరమాత్మ) అయియున్నందువలన సాధనలందు ఒకవేళ భిన్నత్వము గోచరించినను అది భిన్నత్వము కానేరదని వీక్షింప గల్గుటయే మనుజుని ప్రజ్ఞ - అని యిచట తెలుపబడినది. అమెరికా వెళ్ళవలెననిన, తూర్పుగా పయనించినను, పశ్చిమముగా పయనించినను ఒకటియే. ఏ విధముగనైనను గమ్యమును జేరగలరుగదా!

**ప్ర:–** ప్రపంచమున నిజముగ చూచువాడెవడు ? (వివేకవంతుడెవడు)

**ఉ:–** జ్ఞానయోగము, కర్మయోగము ఒకటియేయను, (ఒకే ఫలమును గలుగచేయునను) వివేకముగలవాడే నిజముగ చూచువాడగును (వివేకవంతుడగును).

**అ॥** కర్మయోగముచే చిత్తశుద్ధిని బొందనిచో జ్ఞానయోగమునందు నిలుకడబొందుట కష్టసాధ్యమని వచించుచున్నాడు -

**6. సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగతః**
**యోగయుక్తో మునిర్బ్రహ్మ న చిరేణాధిగచ్ఛతి.**

**టీక:–** మహాబాహో = గొప్పబాహువులుగల ఓ అర్జునా!, సన్న్యాసఃతు = జ్ఞానయోగము (కర్మసన్న్యాసరూపమగు జ్ఞాననిష్ఠ) అయితే, అయోగతః = కర్మయోగము లేకుండ, ఆప్తుమ్ = పొందుటకు, దుఃఖమ్ = కష్టతరము (శక్యముకాదు), యోగయుక్తః = కర్మయోగముతో గూడిన, మునిః = (దైవ) మననశీలుడు, నచిరేణ = శీఘ్రముగ, బ్రహ్మ = బ్రహ్మమును, అధిగచ్ఛతి = పొందుచున్నాడు.

**తా:–** గొప్పబాహువులుకల ఓ అర్జునా! (కర్మసన్న్యాసరూపమగు) జ్ఞానయోగమైతే కర్మయోగము లేకుండ పొందుటకు కష్టతరమైనది. కర్మయోగముతో గూడిన (దైవ) మననశీలుడు శీఘ్రముగ (లక్ష్యమగు) బ్రహ్మమును బొందుచున్నాడు.

**వ్యాఖ్య:–** కర్మయోగముయొక్క సహాయములేనిచో కర్మసన్న్యాసరూపమగు జ్ఞాననిష్ఠను బడయుట

కష్టతరమని యిచట వచించుచున్నారు. అనగా కర్మయోగమునందారితేరిన మాత్రమే జ్ఞానయోగము సులభముగ సిద్ధించునని భావము. కర్మలన్నింటిని పూర్తిగ విడిచి కేవలము దృక్స్వరూపమగు ఆత్మయందు నిలుకడగలిగియుండుట సామాన్యమైనపనికాదు. అట్టి జ్ఞానస్థితి సర్వులకును వెంటనే లభించదు. దానికి ఎంతయో చిత్తశుద్ధికరమగు సాధన ముందుగా జేయవలసియున్నది. నిష్కామకర్మయోగ మవలంబించవలసియున్నది. కర్మయోగము ప్రాథమికవిద్య (Elementary Course) వంటిది. జ్ఞానయోగము ఉన్నతవిద్య (College Course) వంటిది. కావున ముందుగా కర్మయోగమునం దారితేరనివారు జ్ఞానానుభవమును చక్కగబడయజాలరు. కనుకనే భగవాను డిచట కర్మసన్న్యాసమును ముందుగ తలపెట్టవలదనియు, కర్మయోగమును చక్కగశీలించి, చిత్తశుద్ధిని బడసి తదుపరి జ్ఞానార్జనమును గావించినచో అతిశీఘ్రముగ పరబ్రహ్మమును జేరగలరనియు కరుణతో బోధించుచున్నారు. 'న చిరేణ' అని చెప్పుటవలన అట్టి వారికి బ్రహ్మప్రాప్తియందు విలంబనము జరుగదనియు, శీఘ్రముగనే వారు లక్ష్యమును జేరుకొనగలరనియు స్పష్టమగుచున్నది.

"మునిః" - మననశీలుడు అని పేర్కొనుటవలన కర్మయోగముతోబాటు భగవత్స్వరూపమననము గూడ ఆవశ్యకమని తెలుచున్నది. అనగా కర్మయోగముతోబాటు పరమాత్మధ్యానమును, భగవచ్చింతనను గూడ శీలించువాడు త్వరలోనే జ్ఞానమును బడసి బ్రహ్మసాక్షాత్కారము నొందగలడని భావము.

ఈ ప్రకారముగ ప్రారంభములో (నిష్కామ) కర్మయోగమునందు అనుభవమును సంపాదింపక, తద్ద్వారా చిత్తశుద్ధిని బడయక అకస్మాత్తుగ జ్ఞానయోగమునకు, కర్మ సన్న్యాసమునకు ఉపక్రమించినచో సాధనయందు పెక్కుకష్టములను బొందవలసివచ్చును. ఏలయనిన కర్మసన్న్యాసము, జ్ఞాననిష్ఠ - వాసనారహితస్థితియందే సంభవించును. వాసనలు హృదయమున ఉన్నంతవఱకు, పాపము, మలినత్వము చిత్తమును ఆక్రమించియున్నంత కాలము జ్ఞానము ఆవిర్భవింపనే ఆవిర్భవింపదు. తొందరపడి బాహ్యసన్న్యాసముచేసినను లోన మనస్సు కుప్పిగంతులు పెట్టుచు జీవునకు అశాంతినే కలుగజేయును. కాబట్టి ఏసాధనకైనను మున్ముందు చిత్తశుద్ధి, పాపరాహిత్యము అవసరము. దానికో కర్మయోగము బాగుగ ఉపకరించునని భగవాను డీశ్లోకమున తెలియజేయుచున్నారు. పునాదిని ముందు గట్టిచేసికొనుడని హెచ్చరించుచున్నారు. కర్మయోగమే ఆ పునాది. దాని నాశ్రయింపక మోక్షసౌధనిర్మాణమున కుపక్రమించినను, అది కాలక్రమమున కూలి పోగలదు. అనేకు లాప్రకారముగ పతనమైపోయిన దృష్టాంతములు చరిత్రయందు కలవు. కాబట్టి మున్ముందు కర్మయోగమునందు దక్షత సంపాదింపవలెను. వేదాంత శాస్త్రమునం దిదియొక పరమరహస్యము. దీనిని తెలియక కొందఱు 'మాకు జ్ఞానమే కావలెను' అని తొలుదొల్తనే హఠముచేసి, చిత్తపరిపక్వతలేని కారణమున తజ్జ్ఞానార్జనమున విఫలురైపోవుచున్నారు. ఇటు కర్మకుగాని, అటు జ్ఞానమునకుగాని పనికిరాక వారు ఉభయభ్రష్టులగుచున్నారు. ఇట్టి ప్రమాదమునుండి తప్పించుటకొఱకై భగవాను డీశ్లోకమున చక్కనియాదేశముల నొసంగియున్నారు. వానిని శిరసావహించి సాధకులు పరమశ్రేయమును బొందవలసియున్నది.

వైద్యులు రోగికి ఔషధము నిచ్చుటకు పూర్వము విరేచనమునకు మాత్ర లిచ్చుదురు. దానిచే శరీరము కడిగివేయబడగా మందు బాగుగపట్టును. అట్లే నిష్కామ కర్మయోగముచే ముందు చిత్తమును కడిగివేసినచో జ్ఞానమను మందు నిలుచును. కావున కర్మయోగమను 'శుద్ధికర్మ'ను (Cleaning process) సర్వులును ముందుగా నవలంబించవలెనని ఈ శ్లోకము బోధించుచున్నది.

**ప్ర:–** జ్ఞానయోగ మెపుడు సిద్ధించును ?

**ఉ:–** కర్మయోగమునందు చక్కగ ఆరితేరినచో మాత్రమే.

**ప్ర:–** బ్రహ్మమును శీఘ్రముగ నెవడు పొందగలడు ?

**ఉ:–** కర్మయోగము నాశ్రయించిన మననశీలుడు (క్రమముగ దానిచే చిత్తశుద్ధిని, జ్ఞానమును బడయుటవలన) బ్రహ్మమును శీఘ్రముగ బొందగల్గుచున్నాడు.

**అ||** జితేంద్రియుడగు కర్మయోగి కర్మలనాచరించినను వానిచే నంటబడడని తెలుపుచున్నాడు -

## 7. యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేన్ద్రియః
## సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే.

**టీక:–** యోగయుక్తః = (నిష్కామ) కర్మయోగము నాచరించువాడును, విశుద్ధాత్మా = పరిశుద్ధమైన హృదయముగలవాడును, విజితాత్మా = లెస్సగ జయింపబడిన మనస్సుతోగూడిన వాడును, జితేంద్రియః = ఇంద్రియములను జయించినవాడును, సర్వభూతాత్మభూతాత్మా = సమస్తప్రాణికోట్లయందుండు ఆత్మయు, తనయందుండు ఆత్మయు ఒకటేయని తెలిసికొనినవాడును, కుర్వన్ అపి = కర్మలుచేయుచున్నను, న లిప్యతే = కర్మబంధముచే అంటబడడు.

**తా:–** (నిష్కామ) కర్మయోగము నాచరించువాడును, పరిశుద్ధమైన హృదయము గలవాడును, లెస్సగ జయింపబడిన మనస్సుగలవాడును, ఇంద్రియములను జయించినవాడును, సమస్త ప్రాణులయందుండు ఆత్మయు, తన ఆత్మయు నొకటేయని తెలిసికొనినవాడునగు మనుజుడు కర్మలను జేసినను వానిచే నంటబడడు.

**వ్యాఖ్య:–** కర్మలను జేయుచున్నను కర్మబంధముచే అంటబడక యుండవలెననిన ఐదు లక్షణములు గలిగియుండవలెనని వచించుచున్నారు. అవియేవి యనిన (1) నిష్కామ కర్మాచరణము (2) నిర్మలహృదయము (3) మనోజయము (4) ఇంద్రియజయము (5) సర్వత్ర ఏకాత్మదర్శనము. ఇవి సాక్షాత్ జ్ఞానియొక్క లక్షణములే యని విదితము కాగలదు. దీనినిబట్టి కర్మయోగ, జ్ఞానయోగములు పరాకాష్ఠదశయందు ఒకదానినొకటి పోలియుండునని స్పష్టమగుచున్నది. ఈ యైదు లక్షణములు గలిగి కర్మనాచరించువాడు కర్మలచే బద్ధుడుకాడు. అట్లుకాక, కామ్యభావముతో, మలిన చిత్తముతో, కర్తృత్వబుద్ధితో, నిగ్రహింపబడని ఇంద్రియములతో నాచరించినచో కర్మలచే బంధింపబడును.

అంతఃకరణము అనేక దుస్సంకల్పములతోను, దుర్గుణములతోను, దుర్వాసనలతోను గూడియున్నచో అత్తఱి జీవుడాచరించు కర్మ మలినముగానేయుండును. కావున బద్ధుడగును. మఱియు సర్వభూతములందును తన ఆత్మయే కలదను భావములేనిచో, పరప్రాణికి అపకారము దలపెట్టును; ఇతరులపై ద్వేషమును జూపును. దయప్రేమ కరుణ మున్నగు సుగుణములు అతని క్రియలందు వ్యక్తముకావు, కనుక అట్టివాడు తన దోషయుక్తమగు కర్మచే తప్పక బద్ధుడుకాగలడు. కాబట్టి కర్మచే బంధమును బొందకుండుటకుగాను సర్వత్రైకాత్మదర్శనమున్ను ఒకానొక ఆవశ్యకతయే యగును. అట్లే ఇంద్రియ, మనోనిగ్రహములున్ను కర్మబంధవిముక్తికి అవసరములేయని భగవానుడిచట తెలియజేసిరి. ఈప్రకారముగ పైనదెల్పిన ఐదు లక్షణములుగల్గి కర్మల నాచరించినచో జీవుడు వానిచే నేమాత్రము

అంటబడక నిర్లిప్తుడై బంధరహితుడై వెలయునుగావున ముముక్షువు లాసద్గుణములను తప్పక ఆశ్రయించవలయును.

**ప్ర:–** కర్మల నాచరించినను వానిచే నంటబడకుండువాడెవడు ?

**ఉ:–** (1) నిష్కామకర్మాచరణ (2) నిర్మలహృదయము (3) మనోజయము (4) ఇంద్రియ జయము (5) సర్వత్రైకాత్మదర్శనము – అను నీ యైదు సల్లక్షణములు గలవాడు కర్మల నాచరించినను వానిచే బద్ధుడుకాడు.

**అ॥** తత్త్వజ్ఞుడగు యోగి ప్రపంచమున వ్యవహరించునపు డెట్లుండునో రెండు శ్లోకములద్వారా వచించుచున్నాడు –

**8. నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్**
**పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్.**

**9. ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి**
**ఇన్ద్రియాణీన్ద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్.**

**టీక:–** తత్త్వవిత్ = పరమార్థతత్త్వము నెఱింగినవాడైన, యుక్తః = యోగయుక్తుడు (ఆత్మయందు నెలకొనిన చిత్తముగలవాడు) పశ్యన్ = చూచుచున్నను, శృణ్వన్ = వినుచున్నను, స్పృశన్ = తాకుచున్నను, జిఘ్రన్ = వాసనజూచుచున్నను, అశ్నన్ = తినుచున్నను, గచ్ఛన్ = నడచుచున్నను, స్వపన్ = నిదురించుచున్నను, శ్వసన్ = ఊపిరివిడుచుచున్నను, ప్రలపన్ = మాట్లాడుచున్నను, విసృజన్ = విడుచుచున్నను, గృహ్ణన్ = గ్రహించుచున్నను, ఉన్మిషన్ నిమిషన్ అపి = కండ్లను తెఱచుచున్నను, మూయుచున్నను, ఇన్ద్రియాణి = ఇంద్రియములు, ఇంద్రియార్థేషు = (శబ్దాది) విషయములందు, వర్తన్తే + ఇతి = ప్రవర్తించుచున్నవని, ధారయన్ = నిశ్చయించినవాడై, కించిత్ = ఇంచుకయైనను, న ఏవకరోమి ఇతి = నేను చేయుటలేదనియే, మన్యేత = తలంచును.

**తా:–** పరమార్థతత్త్వము నెఱిగిన యోగయుక్తుడు (ఆత్మయందు నెలకొనిన చిత్తముగలవాడు) చూచుచున్నను, వినుచున్నను, తాకుచున్నను, వాసనజూచుచున్నను, తినుచున్నను, నడచుచున్నను, నిదురించుచున్నను, ఊపిరివిడుచుచున్నను, మాట్లాడుచున్నను, విడుచుచున్నను, గ్రహించుచున్నను, కండ్లను తెఱచుచున్నను, మూయుచున్నను, ఇంద్రియములు (వానివాని) విషయములందు ప్రవర్తించుచున్నవని నిశ్చయించినవాడై – నే నొకింతైనను చేయుటలేదు – అనియే తలంచును (ఆ యా కార్యములందు కర్తృత్వబుద్ధిలేకుండును).

**వ్యాఖ్య:–** ఆత్మ దేహేంద్రియమనంబులకు అతీతమైనది. సాక్షిగానుండి ఆ యా చిత్తవృత్తుల నది వీక్షించుచుండును. కావున ఏ కార్యమునకును అది కర్తగాదు. అవిద్యాదోషముచే జీవుడు స్వస్వరూపమును మఱచి దేహేంద్రియమనంబులతో తాదాత్మ్యమొంది, తానే దేహమని, తానే యింద్రియములని, మనంబని తలంచి వానివాని క్రియలను, వికారములను తనపై వ్యర్థముగ ఆరోపించుకొని దుఃఖములనొందుచున్నాడు.

కాని తత్త్వజ్ఞానముచే అవిద్యాదోషము నశించిన మహనీయుడు ఆత్మస్వరూపమున స్థితిగలవాడై 'ఆ యా ఇంద్రియములు ఆ యా ఇంద్రియకార్యములందు, ఇంద్రియార్థములందు ప్రవర్తించుచున్నవి' నేను వానికి సాక్షిని, నేనేమియు చేయుటలేదు. అని నిశ్చయించుకొని నిర్వికారుడైయుండును. తత్తదింద్రియజనిత సుఖదుఃఖముల నొందక నిత్యనిరతిశయ సహజానందమునే పొందుచుండును.

అయితే కొందఱు శుష్కవేదాంతులు ఆత్మజ్ఞానమునొందకనే, అవిద్యనశింపకనే, దేహాది సంఘాతతాదాత్మ్యమును వీడకనే, విషయలోలురై, ఇంద్రియములచే పెక్కు విషయభోగముల ననుభవించుచు, 'నేను వానికి సాక్షిని' అని పలుకుచున్నారు. అది చాల ఘోరము. ఇది కనిపెట్టియే భగవానుడు పై 7 వ శ్లోకమందు అట్టిజ్ఞానికుండవలసిన ఐదు లక్షణములను పేర్కొనియున్నారు. (యోగయుక్తో విశుద్ధాత్మా...) అవి కలిగియుండి అవిద్య నశించినమాత్రమే ఇట్టి సాక్షిత్వము సిద్ధించును గాని అన్యథాకాదు. ఒకచెంప దృశ్యముతో తాదాత్మ్యమునొందుచు, మఱియొకచెంప 'నేను సాక్షిని' అనుట బాలుర ప్రలాపమేకాని విజ్ఞులవచనముగాదు. సాక్షిభావమందు నిలుకడకలిగినవానికెన్నడును ఇంద్రియములు దుర్విషయములందు ప్రవర్తింపనేరవు. ఏలయనిన, తమోగుణమునుండి రజోగుణమునకు, రజోగుణమునుండి సత్త్వగుణమునకు, సత్త్వమునుండి విశుద్ధసత్త్వమునకు మారినట్టి వివేకవంతునకు మనస్సు క్రిందకు దిగజారి రజస్తమస్సులందు, భోగవిలాసములందు, దుర్వాసనాజనిత చేష్టలందు ఎన్నటికిని ప్రవర్తింపనేరదు. చిలికిన పిదప వెన్న మజ్జిగలో నిక మునుంగదు. అట్లే సంసారసాగరమును విచారణచే మథించి పరమాత్మను బయటకుతీసి అనుభవించుచుండు జ్ఞాని మరల మిథ్యారూపములగు ఆ సంసార భోగములందు మునుంగకుండును. మేలుకొనినవాడు మరల స్వప్నసౌందర్యములందు రమింపబడడుగదా!

కాబట్టి తత్త్వవేత్తయై, అవిద్య నశించి, దృశ్యతాదాత్మ్యమునువీడి, ఆత్మతో నైక్యమొందిన మహనీయునకే ఈ సాక్షిత్వము చెల్లును. కావుననే అట్టివాడు తినుచున్నను, త్రాగుచున్నను, పలుకుచున్నను తానేమియు చేయుటలేదనియే తలంచుచుండునని భగవాను డిచట పేర్కొనిరి. అతని ఇంద్రియములు విషయవాసనావర్జితములై యుండును. అట్టి ఇంద్రియములచే వారు లోకోపకార కార్యములు, దేహయాత్రోపయుక్త కార్యములు చేయుచుందురు. అట్లు చేసినను కర్తృత్వములేక యుందురు. అజ్ఞాని కర్తృత్వము గలిగి బద్ధుడగును.

కాబట్టి ముందుగా నిష్కామకర్మ, భక్తి, ధ్యానాదిసాధనల ద్వారా చిత్తమును శుద్ధమొనర్చుకొని (ఆత్మ) తత్త్వమును లెస్సగ గ్రహించి తత్త్వవేత్త కావలెను. అత్తఱి యాతడు కర్మలను చేసినను, చేయకున్నను ఏ విధమైన బంధము నొందకుండును. ఆతని చిత్తమపుడు భర్జితబీజము (వేయించిన విత్తనము) వలె నుండి విషయసంస్కారవర్జితమైయుండును. క్రియలయందు సాక్షిభావము గలిగియుండును. అపు డాతని ఇంద్రియములు ధర్మమునకు విరుద్ధముకాని కార్యములనే ఆచరించును. ఒకవేళ యెవరైన అన్యథా ఆచరించినచో వారింకను తత్త్వవేత్తకాలేదనియే అర్థము. కావున ముముక్షువు ప్రప్రథమమున భగవానుడు తెలిపిన ఐదు సల్లక్షణములనుబొంది తత్త్వవేత్తకావలయును. అపుడే యాతడు జగన్నాటకమును, దేహేంద్రియ వ్యవహారమును సాక్షిగ వీక్షించు శక్తిని సంపాదించగల్గును.

**ప్ర:—** తత్త్వవేత్త ఇంద్రియములతో తినుట, త్రాగుట మొదలగు అనేక కార్యములను చేయుచున్నను ఎట్టిభావన గలిగియుండును ?

**ఉ:—** 'నేనేమియు చేయుటలేదు' ఆ యా ఇంద్రియములు ఆ యా కార్యములను చేసికొనుచున్నవి. నేను సాక్షిని (నిర్వికార ఆత్మను), అను భావము గలిగియుండును.

అ॥ కర్మలను జేసినను బంధింపబడకుండుటకు ఉపాయమును వచించుచున్నాడు -

**10. బ్రహ్మణ్యాధాయ కర్మాణి సఙ్గం త్యక్త్వా కరోతి యః
లిప్యతే న స పాపేన పద్మపత్రమివామ్భసా.**

**టీక:–** *యః* = ఎవడు, *కర్మాణి* = కర్మములను, *బ్రహ్మణి* = పరమాత్మయందు, *ఆధాయ* = సమర్పించి, *సంగమ్* = (ఆసక్తిని) ఫలాపేక్షను, *త్యక్త్వా* = విడిచి, *కరోతి* = చేయుచున్నాడో, *సః* = అతడు, *అంభసా* = నీటిచే, *పద్మపత్రం ఇవ* = తామరాకువలె, *పాపేన* = పాపముచేత, *న లిప్యతే* = అంటబడడు.

**తా:–** ఎవడు తానుజేయుకర్మలను పరమాత్మకర్పించి సంగమును (ఆసక్తిని) విడిచి చేయుచున్నాడో అట్టివాడు తామరాకు నీటిచే అంటబడనట్లు, పాపముచే నంటబడకుండును.

**వ్యాఖ్య:–** తానుజేయు సమస్తకర్మలను బ్రహ్మమందు (ఆత్మయందు) సమర్పించి, ఈ సమస్తదృశ్యము, కర్మలు, వ్యవహారములు అద్దమందు ప్రతిబింబమువలె బ్రహ్మమందు కల్పితములై యున్నవని భావించి, అహంభావముగాని, కర్తృత్వబుద్ధిగాని లేక అసక్త బుద్ధి (Non-attachment) తో కర్మలనాచరించువానిని తత్కర్మజనిత బంధముగాని, పాపముగాని అంటనేరదు. ఈ సత్యమును నిరూపించుట కిచట తామరాకును దృష్టాంతముగ గైకొనిరి. తామరాకు నీటియందే యుండును. కాని అనీరు దానికి అంటదు. జారిపోవును. అట్లే పెక్కుకర్మలనాచరించినను, వానియందు సంగము, ఆసక్తి, కర్తృత్వములేనివారు పాపములచేగాని, బంధముచేగాని అంటబడరు. కనుకనే జీవన్ముక్తులగు మహనీయులు తాము తరించియు ఇతరులను తరింపజేయునిమిత్తము ఎన్నియో కార్యములను నిరంతరము చేయుచున్నను, కర్మబంధము ఒకింతైనను లేక యున్నారు. కర్మయోగమందలి రహస్యమిదియే.

ఫలాపేక్షలేక, ఈశ్వరార్పణబుద్ధితో, లేక బ్రహ్మార్పణబుద్ధితో అసక్తముగ కార్యముల నాచరించినచో కర్తకు వానిచే బంధముదయించదు. సంగమే బంధమునకు కారణము, అసంగమే మోక్షమునకు హేతువు. తామరాకునుతప్ప తక్కిన ఆకులన్నిటికిని నీరు అంటుకొనును. అట్లే కర్తృత్వబుద్ధితో, సంగము (ఆసక్తి) తో కర్మలజేయువారందఱికిని పాపము అంటుకొనును. కాబట్టి బంధరాహిత్యమునకై కర్మలను అనాసక్తముగ, నిష్కామముగ, భగవదర్పణబుద్ధితో నాచరింపవలయును.

ఇచట 'పాపేన ' అను పదమునకు 'కర్మబంధముచే' అని అర్థముచెప్పిన సముచితముగ నుండును.

**ప్ర:–** కర్మలను జేసినను పాపముచే ఎవరు అంటబడకుందురు ?

**ఉ:–** (1) తానుచేయు కర్మలను భగవంతునకు సమర్పించువారు. (2) సంగమును (ఆసక్తిని) వదలి కార్యములను జేయువారు ఆ కర్మలచే బంధింపబడరు, పాపమునొందరు.

**ప్ర:–** ఏ ప్రకారముగ ?

**ఉ:–** తామరాకు నీటిచే అంటబడనట్లు.

**అ॥** మహనీయులు సంగమును విడిచి కర్మలను జేయుదురని వచించుచున్నాడు -

**11. కాయేన మనసా బుద్ధ్యా కేవలైరిన్ద్రియైరపి
యోగినః కర్మ కుర్వన్తి సఙ్గం త్యక్త్వాఽఽత్మశుద్ధయే.**

**టీక:-** యోగినః = (నిష్కామకర్మ) యోగులు, ఆత్మశుద్ధయే = చిత్తశుద్ధికొఱకు, సఙ్గమ్ = ఫలాసక్తిని, త్యక్త్వా = విడిచి, కాయేన = శరీరముచేతను, మనసా = మనస్సుచేతను, బుద్ధ్యా = బుద్ధిచేతను, కేవలైః = వట్టివగు (మమత్వము, అభిమానము లేని), ఇన్ద్రియైః అపి = ఇంద్రియములచేతను, కర్మ = కర్మమును, కుర్వన్తి = చేయుచున్నారు.

**తా:-** (నిష్కామకర్మ) యోగులు చిత్తశుద్ధికొఱకై ఫలాసక్తిని విడిచి శరీరము చేతను, మనస్సుచేతను, బుద్ధిచేతను, అభిమానములేని వట్టి ఇంద్రియములచేతను కర్మలను జేయుచున్నారు.

**వ్యాఖ్య:-** నిష్కామకర్మాచరణముచే చిత్తశుద్ధి కలుగునని చెప్పుచున్నారు. యోగులు తమ చిత్తశుద్ధికొఱకై శరీరవాఙ్మనంబులచేతను, బుద్ధిచేతను, ఇచ్ఛాద్వేషములులేని ఇంద్రియములచేతను అసంగముగ, ఫలాసక్తిరహితముగ, కర్మలను జేయుచున్నారు. మమత్వముగాని, అభిమానముగాని, రాగద్వేషములుగానిలేని ఇంద్రియములు కేవలేంద్రియము లనబడును. అట్టి కల్మషరహితములగు ఇంద్రియములచే వారు కార్యములను జేయుదురు. ఈ 'కేవల' పదమును దేహమనోబుద్ధులకు కూడ వర్తింపజేసి అర్థమును చెప్పుకొనవచ్చును. అనగా యోగి అభిమానరహితములగు ఆ యా కారణములచే కార్యములను జేయుచుండునని భావము.

ఇట్టి అసంగాచరణచే చిత్తము పరమనిర్మలత్వమొందును. మోక్షప్రాప్తికి ఆవశ్యకమైన జ్ఞానముదయించుటకు అట్టి మనోనైర్మల్య మత్యవసరము. ఏలయనగా మలినచిత్తమున జ్ఞానమంకురింపదు. కనుకనే అట్టి చిత్తనైర్మల్యము నిమిత్తము యోగులు అనాసక్తముగ కార్యముల నాచరించుదురని యిట వచింపబడినది. జ్ఞానమును పొందిన పిదప కూడ మహనీయ లట్టి కేవలేంద్రియములచేతనే తమ జీవితయాత్రగాని, లోకోపకారకార్యములనుగాని ఒనర్చుచుందురు. కావున ముముక్షువు ఫలాసక్తి రహితముగ, అభిమానవర్జితములగు తన దేహేంద్రియాదులచే కర్మను జేయుచు, చిత్తశుద్ధిని, తద్ద్వారా జ్ఞానమును బడసి విముక్తుడు కావలయును.

**ప్ర:-** చిత్తశుద్ధి యెట్లు చేకూరగలదు ?

**ఉ:-** ఫలాసక్తిని (సంగమును) త్యజించి, అభిమానరహితములగు దేహేంద్రియాదికరణములచే కార్యములను జేయువారికి చిత్తశుద్ధి కలుగును.

**ప్ర:-** నిష్కామకర్మయోగులు కర్మ నే ప్రకార మాచరించుదురు ?

**ఉ:-** (1) సంగమును (ఫలాసక్తిని) విడనాడి (2) మమత్వాదులులేని వట్టి ఇంద్రియములచే, దేహాదులచే కర్మలను చేయుదురు.

**ప్ర:-** అట్లు చేయుట వలన లభించు ఫలితమేమి ?

**ఉ:-** చిత్తశుద్ధి.

**అ॥** నిష్కామ, సకామకర్మల రెండిటియొక్క ఫలములను వేర్వేఱుగ దెలుపుచున్నాడు -

## 12. యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తిమాప్నోతి నైష్ఠికీమ్
## అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే.

**టీక:–** యుక్తః = యోగయుక్తుడు (నిష్కామకర్మయోగి), కర్మఫలమ్ = కర్మలయొక్క ఫలమును, త్యక్త్వా = విడిచిపెట్టి, నైష్ఠికీమ్ = ఆత్మనిష్ఠాసంబంధమగు శాశ్వతమైన, శాన్తిమ్ = శాంతిని, ఆప్నోతి = పొందుచున్నాడు, అయుక్తః = యోగయుక్తుడుకానివాడు (ఫలాపేక్షతో కర్మలజేయువాడు), కామకారేణ = ఆశ (ఫలాపేక్ష) యొక్క ప్రేరణచేత, ఫలే = కర్మఫలమందు, సక్తః = ఆసక్తి గలవాడై, నిబధ్యతే = (కర్మబంధముచే) కట్టబడుచున్నాడు.

**తా:–** యోగయుక్తుడు (నిష్కామకర్మయోగి) కర్మలయొక్క ఫలమును విడిచిపెట్టి (చిత్తశుద్ధివలన) ఆత్మనిష్ఠాసంబంధమైన శాశ్వతమగు శాంతిని బొందుచున్నాడు. యోగయుక్తుడు కానివాడు (ఫలాపేక్షతో కర్మలను జేయువాడు) ఆశచే ప్రేరితుడై కర్మఫలమందాసక్తిగల్గి బద్ధుడగుచున్నాడు.

**వ్యాఖ్య:–** బంధమునకు కారణము ఆశ యని, మోక్షమునకు కారణము ఆశారాహిత్యమని ఈ శ్లోకమున స్పష్టముగ తెలుపబడినది. ఫలాపేక్షలేక కర్మలను జేయువానికి చిత్తము నిర్మలమగుటచే ఆత్మనిష్ఠ ఉదయించి శాశ్వతమగు శాంతి లభించుచున్నది. దీనినిబట్టి కర్మయోగము, జ్ఞానయోగము రెండును ఆత్మశాంతి యను ఒకే ఫలమును గలుగజేయుచున్నవని తెలియుచున్నది. కర్మయోగమేమియు తక్కువ కాదనియు దానిఫలితము నైష్ఠికమగు (ఆత్మనిష్ఠచేగలుగు) పరమశాంతియేయనియు ఈ శ్లోకమున స్పష్టీకరింపబడినది.

మోక్షరూప పరమశాంతికి ఆశారాహిత్య మెట్లు హేతువో, అట్లే బంధమునకు హేతువు ఆశయేయనియు నిచట పేర్కొనబడినది. ఫలాపేక్షయే బంధము. 'బధ్యతే' అని చెప్పక 'నిబధ్యతే' అని చెప్పుటవలన ఫలాసక్తి గలవాడు సంసారబంధమున లెస్సగ తగుల్కొనునని తెలియుచున్నది. కాబట్టి సాధకు లివ్విషయమున కడుజాగరూకులై, వారుచేయు సమస్తకార్యములను ఈశ్వరార్పణబుద్ధితో జేయుచు, ఫలములం దపేక్షలేక యుండవలెను. అపుడే స్థిరమైన శాంతి లభ్యమగును.

శాంతికి ఉపాయమెద్దియో భగవాను డీశ్లోకమున నిరూపించుచున్నాడు. ప్రతివారును శాంతికై, సుఖమునకై పరితపించుచున్నారు. కాని అది యెట్లు లభించునో తెలియక తికమకపడుచున్నారు. ఫలాపేక్షనువదలి నిష్కామముగ కర్మలనాచరించుటయే శాంతికిమార్గమని యిట తెలుపబడినది. ఈవిధముగ నిష్కామకర్మనిష్ఠచే జ్ఞాననిష్ఠ వలన కలుగు పరమశాంతి జీవునకు చేకూరుచున్నది. అట్లే బంధమునకు కారణమున్ను ఈశ్లోకమున తెలిపి ఇవ్విషయమున చాల భద్రముగా నుండవలసినదని భగవానుడు హెచ్చరించుచున్నారు. కామమే బంధమునకు కారణము. ఆశయే, ఫలాసక్తియే, సంగమే దుఃఖమునకు, అశాంతికి హేతువు. కావున వానిని దరికిజేర్చరాదు. సాధకులు భగవానుని ఈ హెచ్చరికలను పాటించి జీవితమును నిష్కామమార్గమునకు ద్రిప్పుకొని నైష్ఠికశాంతి ననుభవించవలయును.

**ప్ర:–** నిష్కామకర్మయోగి యెట్టి ఫలితమును బొందును? ఎందుచేత?

**ఉ:–** ఆత్మనిష్ఠచే గలుగు పరమశాంతిని బొందును. ఫలాపేక్షలేని కారణముచేత.

**ప్ర:–** కామ్యకర్మలను జేయువా డెట్టి ఫలితమును బొందును? ఎందుచేత?

**ఉ:–** సంసారబంధమున లెస్సగ తగుల్కొనును. ఫలాసక్తి వలన.

**ప్ర:–** దీనినిబట్టి బంధమోక్షములకు కారణమేమని తేలుచున్నది?

**ఉ:–** కర్మలందు ఫలాపేక్షగలిగియుండుటయే బంధము. అది లేకుండుటయే (అనాసక్తియే) మోక్షము.

**ప్ర:–** పరమశాంతికి మార్గమేమి?

**ఉ:–** కోరికలేకుండుట. కర్మఫలములందాసక్తిని త్యజించుట.

**ప్ర:–** బంధమునకు హేతువేమి?

**ఉ:–** కామమే. కర్మఫలాసక్తియే.

**అ॥** ఇంద్రియనిగ్రహపరుడగు యోగియొక్క స్థితిని వర్ణించుచున్నాడు -

## 13. సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ
## నవద్వారే పురే దేహీ[1] నైవ కుర్వన్నకారయన్.

**టీక:–** వశీ = ఇంద్రియ నిగ్రహముగలవాడగు, దేహీ = దేహధారి (జీవుడు), మనసా = మనస్సుచేత, సర్వకర్మాణి = సమస్తకర్మములను (కర్మఫలములను), సన్న్యస్య = పరిత్యజించి, న ఏవ కుర్వన్ = ఏమియు చేయనివాడై, న కారయన్ = చేయింపనివాడై, నవద్వారే = తొమ్మిదిద్వారములుగల, పురే = పట్టణమగు శరీరమందు, సుఖమ్ = హాయిగా, ఆస్తే = ఉండుచున్నాడు.

**తా:–** ఇంద్రియ నిగ్రహముగల దేహధారి మనస్సుచే సమస్త కర్మములను (కర్మ ఫలములను) పరిత్యజించి, ఏమియుచేయనివాడై, చేయింపనివాడై, తొమ్మిదిద్వారములుగల పట్టణమగు శరీరమందు హాయిగా నుండుచున్నాడు.

**వ్యాఖ్య:–** జీవితము ఆనందమయముగ నెట్లుండగలదో ఆ పద్ధతి యిచ్చట చెప్పబడుచున్నది. ప్రప్రథమమున మనుజుడు తన ఇంద్రియములను స్వాధీనపఱచుకొనవలెను. 'వశీ' అనుదాని అర్థమిదియే. ఇంద్రియములు వశమందులేనిచో జగత్తంతయు వశమందున్నప్పటికిని ప్రయోజనములేదు. పూర్ణసుఖము ఇంద్రియనిగ్రహముగలవానికే లభించునని యిట తెలియజేయబడినది ('వశీ సుఖం ఆస్తే'). కావున సుఖమును కాంక్షించువాడు మొట్టమొదట తన ఇంద్రియములను, మనస్సును వశమందుంచుకొనవలయును.

అట్టి సంయమశీలుడు మనస్సుచే సమస్తకర్మలయొక్క ఫలములను త్యజించి ఈ దేహమను నగరమున

1 దేహే - పాఠాన్తరము.

తానేమియు చేయకయు, చేయించకయు, సుఖముగ వెలయుచున్నాడు. ఎపుడు కర్మలయొక్క ఫలములను త్యజించునో, అపుడాకర్మలను చేసినను అంటక నుండుటచే చేయనట్లే లెక్క. ఇంద్రియములు వానివాని కార్యములను జేసినను తాను అసక్తబుద్ధిగలిగి సాక్షిభావమున స్థిరముగ నుండును. ఇచట 'మనసా' అని చెప్పుటవలన దేహముతో కర్మలను జేసినను కర్మఫలములను పరిత్యజించుటబట్టి మనస్సుచే కర్మపరిత్యాగము, కర్మసన్న్యాసము గావించినట్లే యగుచున్నది. దేహముతో కర్మలను వదలుట గొప్పకాదు. అది అసలు సంభవించదుకూడను. మనస్సుతో వదలుటయే గొప్ప. సమస్తకర్మలను మనస్సుచేతనే పరిత్యజించవలసినదిగా భగవాను డుద్బోధించుచున్నారు. మనస్సుతో వాని ఫలములను గోరక, వానియందు సక్తముగాక నుండుటయే మనస్సుతో చేయు కర్మసన్న్యాసము. 'సర్వకర్మాణి' అని చెప్పుటవలన, నిష్కామబుద్ధిగలిగియున్నచో, దేహముతో ఎన్ని కర్మల నాచరించినను మనస్సుతో ఆచరించనట్లే యగునని భావము. ఈ ప్రకారముగ ఇంద్రియనిగ్రహపరులై, మనస్సుచే సమస్తకార్యములయొక్క ఫలములను త్యజించువారు, శరీరముతో ఎన్ని కార్యములను జేసినను నవద్వారపురమగు ఈ దేహమున ఏ కార్యమునుచేయకయు, చేయింపకయు తటస్థముగ, సాక్షిభావమున నిశ్చింతగ ఆత్మయందు సుఖముగ వెలయగలరని యిట బోధింపబడినది.

దీనికి మఱియొక అర్థముకూడ చెప్పబడుచున్నది. 'ఇంద్రియనిగ్రహపరుడగు యోగి ఆత్మయందు నిలుకడకలవాడై మనస్సుతోసహా దృశ్యరూపములగు సమస్తకార్యములను త్యజించివైచి తానేమియు చేయకయు, చేయించకయు సాక్షిగనుండుచు ఈ దేహపట్టణమున సుఖముగ నుండుచున్నాడు.

ఇంకొక అర్థము - మనస్సుతో సమస్తకార్యములను (దృశ్యరూపమగు) దేహపట్టణమునకు వదలివైచి తాను నిశ్చింతగ ఆత్మయందు స్థితుడై యుండుచున్నాడు.

సుఖమును గోరువాడు రెండు సాధనములను తప్పక నాచరింపవలయునని ఈ శ్లోకముద్వారా తెలియుచున్నది. అవి యేవియనిన (1) ఇంద్రియనిగ్రహము, మనోజయము (2) సర్వకర్మఫలత్యాగము.

"నవద్వారములు" - కంటిద్వారములు 2 + చెవిద్వారములు 2 + ముక్కు ద్వారములు 2 + నోటిద్వారము 1 + మూత్రద్వారము 1 + మలద్వారము 1 = 9 (స్పర్శద్వారము శరీరమంతటను వ్యాపించియుండును. దానితో చేర్చిన 10 యగును) పూర్వకాలమున గొప్ప గొప్ప నగరములకు ద్వారములుండెడివి. ఆనగరములోపల రాజు నివసించుచుండును. ద్వారములు సురక్షితముగనున్నపుడే రాజు సుఖముగ నుండగలడు. అట్లే నవద్వారపురమగు దేహమున రాజగు జీవుడు ఇంద్రియనిగ్రహముగల్గి యున్నపుడు మాత్రమే సుఖముగ నుండగలడు. లేనిచో జీవున కెల్లపుడును అశాంతియే (శత్రువు లాక్రమించు ద్వారములుగల పట్టణమునందలి రాజుకువలె).

**ప్ర:-** మనుజునకు సుఖమెట్లు చేకూరగలదు?

**ఉ:-** (1) ఇంద్రియములను స్వాధీనపఱచుకొని (2) సమస్తకర్మలను, లేక, వానిఫలములను మనస్సుచే త్యజించివైచినచో సుఖము కలుగగలదు.

**ప్ర:-** కర్మలను శరీరముచే త్యజించవలెనా ? మనస్సుచేతనా ?

**ఉ:-** శరీరముచేగాదు. మనస్సుచేతనే.

**అ॥** కర్మ, కర్తృత్వము ప్రకృతి (మాయ) వలననే సంభవించుచున్నవని చెప్పుచున్నాడు -

## 14. న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః
## న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే.

**టీక:–** ప్రభుః = భగవంతుడు (ఆత్మ), లోకస్య = లోకమునకు (ప్రాణులకు), కర్తృత్వమ్ = కర్తృత్వమును, న సృజతి = కలుగజేయుటలేదు, కర్మాణి = కర్మములను, న = కలుగజేయుట లేదు, కర్మఫలసంయోగమ్ = కర్మఫలములతోటి సంబంధమును, న సృజతి = కలుగజేయుటలేదు, స్వభావః తు = (దేహాభిమానవాసనామూలమగు) ప్రకృతియే (జన్మాంతరసంస్కారమే), ప్రవర్తతే = ప్రవర్తించుచున్నది (అట్టి కర్తృత్వాదులను కలుగజేయుచున్నది).

**తా:–** భగవంతుడు (ఆత్మ) జీవులకు కర్తృత్వమునుగాని, కర్మములనుగాని, కర్మ ఫలములతోటి సంబంధముగాని కలుగజేయుటలేదు. మఱేమనిన, ప్రకృతియే (ప్రకృతి సంబంధమువలన గలిగిన జన్మాంతర సంస్కారమే) ఆ యా కర్తృత్వాదులను గలుగజేయుచున్నది.

**వ్యాఖ్య:–** సృష్టికర్తయగు పరమేశ్వరుడు జీవరాసులలో దేనికిని కర్తృత్వాదులను సృష్టించుటలేదు. ప్రకృతిజన్యమగు వారివారి జన్మాంతర సంస్కారము ననుసరించి జనులు ఆ యా కర్మలనుజేయుచు, కర్తృత్వముగలవారలై, ఆ యా కర్మలయొక్క ఫలముల ననుభవించుచున్నవారే యగుదురు. 'అవని జల్లిన దెద్దియో అదియె పండు (Who sows must reap)' అనునట్లు వారువారు దేనిని నాటుదురో, దానినే వారనుభవించుదురు. మామిడి విత్తనము నాటినచో తీపిఫల మనుభవించుదురు. కుంకుడువిత్తనము పెట్టినచో చేదుఫల మనుభవించుదురు. పాపసంస్కారము గలిగియున్నచో దుష్కార్యము లాచరించి దుఃఖ మనుభవింతురు. పుణ్యసంస్కారమున్నచో సత్కార్యము లాచరించి సుఖ మనుభవింతురు. కాబట్టి జనులు తమ పూర్వపు పాపస్వభావమును ఇప్పటి పురుషప్రయత్నజనిత పుణ్యస్వభావముచే పరాజితమొనర్చి సన్మార్గమున అగ్రేసరులు కావలసియున్నది. పాపస్వభావము అభ్యాసముచే నెట్లేర్పడినదో అట్లే పుణ్యస్వభావమున్ను అభ్యాసముచే నేర్పడగలదు. కాబట్టి 'నాదురదృష్టమిట్లున్నది' అని యెవరును దిగులుపడక, పురుషప్రయత్న బలమున పరమార్థపథమును జేబట్టి కృతార్థులు కావలసియున్నది. దీనినిబట్టి జీవుడు తన్నుద్ధరించుకొనుటకుగాని, పతనము నొందించుకొనుటకుగాని తానే సమర్థుడని తెలుచున్నది. ఇవ్విషయమున మఱియొకరి సంబంధమేమియునులేదు. కాబట్టి ఉన్నతినొందుటకు పెక్కు అవకాశములతో గూడిన ఈ మానవజన్మను ఆత్మోద్ధరణనిమిత్తము సద్వినియోగపఱచుకొనుట ప్రతిమానవునియొక్కయు కర్తవ్యము.

**ప్ర:–** జీవులయొక్క ఆ యా కర్మలలో భగవంతున కెంత సంబంధముకలదు ?

**ఉ:–** జీవుల కర్మలతో భగవంతుని కేమియు సంబంధము లేదు.

**ప్ర:–** మఱి దేనివలన జీవున కవి కలుగుచున్నవి ?

**ఉ:–** ప్రకృతివలన (తమ తమ జన్మాంతర సంస్కారములవలన).

**అ॥** జీవుని పుణ్యపాపములతో భగవంతునకు సంబంధములేదను విషయమునే మరల తెలుపుచున్నాడు –

**15. నాదత్తే కస్యచిత్పాపం న చైవ సుకృతం విభుః**
**అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః.**

**టీక:–** విభుః = భగవంతుడు (ఆత్మ), కస్యచిత్ = ఎవనియొక్కయు, పాపమ్ = పాపమును, న ఆదత్తే = స్వీకరింపడు, సుకృతమ్ చ ఏవ = పుణ్యమునున్ను, న = స్వీకరింపడు, అజ్ఞానేన = అజ్ఞానముచేత, జ్ఞానమ్ = జ్ఞానము, ఆవృతమ్ = కప్పబడియున్నది, తేన = అందుచేత, జన్తవః = ప్రాణులు, ముహ్యన్తి = మోహమును జెందుచున్నారు.

**తా:–** పరమాత్మ యెవనియొక్కయు పాపమునుగాని, పుణ్యమునుగాని స్వీకరింపరు, అజ్ఞానముచేత జ్ఞానము కప్పబడియున్నది. అందుచేత జీవులు భ్రమనొందుచున్నారు.

**వ్యాఖ్య:–** ఒకనియొక్క పుణ్యముతోగాని, పాపముతోగాని ఈశ్వరునకు సంబంధము లేదు. ఆ పుణ్య పాపములనుగాని, వాని ఫలములనుగాని వారు స్వీకరింపరు. వారు తటస్థులు, సాక్షి; సర్వభూతములందును సాక్షిగ వర్తించుచు వారు చేయు పుణ్యపాపములను కనిపెట్టుచుందురు. అయితే, జీవులు ఏ కారణముచే మోహమందు పడియున్నారను ప్రశ్నకు శ్రీకృష్ణపరమాత్మ రెండవ పాదమున ఇట్లు సమాధాన మొసంగియున్నారు –

ప్రతిజీవియు సచ్చిదానందఘనమగు ఆత్మయేకాని దృశ్యవస్తువు కాదు. అవినాశియగు పరబ్రహ్మమేకాని నాశవంతమగు ఉపాధికాదు. కాని, ఆ సత్యము అనాది అజ్ఞానముచే మఱుగుపడి జీవునకు తెలియకున్నది. తన నిజరూపమగు ఆత్మ నతడు మఱచి తన్ను దేహాది అన్యరూపముగ భావించుచున్నాడు. తత్ఫలితముగ జననమరణరూపసంసారబంధమున తగుల్కొని దుఃఖము నొందుచున్నాడు. అయితే ఈ బంధము శాశ్వతముకాదు. (ఈ విషయము రాబోవు శ్లోకమువలన తెలియగలదు). ఏక్షణమందు జీవుడు ప్రయత్నపూర్వకముగ ఆత్మజ్ఞానమును సంపాదించునో, ఆక్షణముననే అజ్ఞానము పటాపంచలైపోయి నిజ ఆత్మస్వరూపము సాక్షాత్కరింపబడును. అదియే మోక్షము. కాబట్టి తన్ను కప్పియున్న అవిద్యను, అజ్ఞానమును తొలగించుటయే జీవుని పనికాని, క్రొత్తగ ఆత్మనుకాని, దైవమునుగాని పొందుటకాదు.

జీవులు వారివారి పుణ్యపాపములను వారే చేసికొని వాని ఫలితములను వారే యనుభవించుచున్నారు. ఇట భగవంతునకేమియు సంబంధములేదు. ఆయా పుణ్యపాపఫలములను వారేమియు స్వీకరించుటలేదు. కాబట్టి భగవద్భక్తిగలిగి తమను గప్పియున్న అజ్ఞానమును జ్ఞానసముపార్జనద్వారా స్వప్రయత్నముచేతనే పారద్రోలి జీవుడు ముక్తుడు కావలయును.

జీవు లేల దుఃఖపడుచున్నారో ఆ దుఃఖకారణ మీ శ్లోకమున తెలుపబడి, తద్దుఃఖ నివారణోపాయము రాబోవు శ్లోకమున దెలుపబడుచున్నది.

**ప్ర:–** జీవులు దుఃఖమునొందుటకు కారణమేమి ?

**ఉ:–** అజ్ఞానముచే వారి జ్ఞానము (చిన్మయ ఆత్మరూపము) కప్పబడియున్నది. అందుచే జీవులు దుఃఖమునొందుచున్నారు.

**అ॥** జీవుల ఆ యజ్ఞాన మెటుల తొలగగలదో వివరించుచున్నాడు -

**16. జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః**
**తేషామాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్.**

**టీక:–** ఆత్మనః = ఆత్మయొక్క, జ్ఞానేనతు = జ్ఞానముచేత, యేషామ్ = ఎవరియొక్క, తదజ్ఞానమ్ = ఆ యజ్ఞానము, నాశితమ్ = నాశనమొనర్పబడినదో, తేషామ్ = వారియొక్క, జ్ఞానమ్ = జ్ఞానము ఆదిత్యవత్ = సూర్యునివలె, తత్ పరమ్ = ఆ పరబ్రహ్మస్వరూపమును, ప్రకాశయతి = ప్రకాశింపజేయుచున్నది (స్వస్వరూపానుభవమును గలుగజేయుచున్నది).

**తా:–** ఆత్మజ్ఞానముచే ఎవరియొక్క అజ్ఞానము నశింపజేయబడినదో, అట్టి వారి జ్ఞానము సూర్యునివలె ఆ పరబ్రహ్మస్వరూపమును ప్రకాశింపజేయుచున్నది. (స్వస్వరూపానుభవమును గలుగజేయుచున్నది).

**వ్యాఖ్య:–** క్రిందటిశ్లోకమున జీవునిబాధించు 'రోగము' చెప్పబడినది. ఈ శ్లోకమున దానికి ఔషధము చెప్పబడుచున్నది. దుఃఖమే ఆ రోగము. జ్ఞానమే దానికి మందు. దుఃఖమునకు కారణము అజ్ఞానమని ఇదివఱకు చెప్పబడినది. దుఃఖము పోవలెననిన, అజ్ఞానము తొలగవలెను. అది యెట్లుతొలగును? జ్ఞానముచే తత్త్వవివేచనముచే మహావాక్యవిచారణచే. 'ఆత్మనః జ్ఞానేన' అని చెప్పుటవలన ఆత్మజ్ఞానమును ప్రయత్నపూర్వకముగ శ్రవణమనననిదిధ్యాసనములద్వారా యెవరుసంపాదించుకొందురో, అట్టి వారి అజ్ఞానము అట్టి జ్ఞానముచే పటాపంచలైపోవునని విదితమగుచున్నది.

"ఆదిత్యవత్" - దట్టమైన మేఘముచే సూర్యుడు కప్పబడియున్నపుడు లోకము అంధకారబంధురమైయుండును. కాని గొప్పఝంఝూమారుతముచే ఆమేఘము తొలగి పోవునపుడు సూర్యుడు స్వతస్సిద్ధముగనే దేదీప్యమానముగ ప్రకాశించును. తత్ఫలితముగ అంధకారము నశించును. అట్లే ఆత్మవస్తువు సూర్యునివలె స్వతఃప్రకాశమానమై విరాజిల్లుచున్నది. అజ్ఞానమను మేఘము దానిని కప్పుటవలన ఆత్మ తెలియబడనందుచే జీవుడు అనాదికాలమునుండి దుఃఖముల బాల్పడుచున్నాడు. ఇప్పుడు చేయవలసినపని క్రొత్తగా ఆత్మను సృష్టించుటకాదు. దానిని ఆవరించియున్న అజ్ఞానమేఘమును ఆత్మజ్ఞానరూప ప్రచండవాయువుచే తొలగించుటయే యగును. అత్తఱి ఆత్మరూప ఆదిత్యుడు సువ్యక్తమై చెన్నొందును. అదియే మోక్షస్థితి.

లేక, సూర్యుడు సర్వవస్తువులను ప్రకాశింపజేయునట్లు, జ్ఞానముచే అజ్ఞానము తొలగింపబడినవారి యందు ఆ జ్ఞానము పరమాత్మను ప్రకాశింపజేయుచున్నది. అనుభూతము గావింపజేయుచున్నది. జ్ఞానము పరమాత్మను ప్రకాశింపజేయుచున్నదని చెప్పినపుడు పరమాత్మ జడమని అర్థముకాదు. అది స్వయంప్రకాశమైనది. దానిని ప్రకాశింప జేయుటకు మఱియొక పదార్థ మవసరములేదు. 'తస్య భాసా సర్వమిదం విభాతి' అని చెప్పినట్లు దానివలననే అన్నియు ప్రకాశించుచున్నవి. కావున జ్ఞానరూపబుద్ధివృత్తి వలన అజ్ఞానవృత్తినశింప అధిష్ఠానమగు ఆత్మ జీవున కనుభూతమగుచున్నదనియే 'జ్ఞానము ఆత్మను ప్రకాశింపజేయుచున్నది' అనుదాని అర్థము. దీపముపై కుండ బోర్లించియున్నపుడు దీపప్రకాశము బయటకు కనిపించదు. ఇదియే అజ్ఞానస్థితి. కఱ్ఱచే కుండను బ్రద్దలుకొట్టినపుడు, దీపము దానంతట నదియే వ్యక్తమై

ప్రకాశించుచున్నది. కావున జ్ఞానరూపబుద్ధివృత్తివలన అజ్ఞానవృత్తినశింప అధిష్ఠానమగు ఆత్మ జీవున కనుభూతమగుచున్నదనియే 'జ్ఞానము ఆత్మను ప్రకాశింపజేయుచున్నది' అనుదాని అర్థము. ఇదియే జ్ఞానస్థితి. జ్ఞానమను దండముచే అజ్ఞానావరణమను ఘటమును తొలగించు, ఆత్మయను దీపము స్వతస్సిద్ధముగవెలుగుచు సువ్యక్తమగును. కాబట్టి జీవులు అనాది మోహమునుండి తప్పించుకొని దుఃఖరహితులు కావలెననిన, ఆత్మజ్ఞాన మత్యావశ్యకమని ఈ శ్లోకముద్వారా స్పష్టపడుచున్నది. అందుచే నిష్కామకర్మ, భక్తి, ధ్యాన, వైరాగ్యాది సాధనలచే నెట్లైనను దానిని సంపాదించుటకై యత్నింపవలయును. మోక్షమున కదియే దారి.

"యేషామ్" - అని చెప్పబడినందున ఏ జాతివారైనను, అట్టి జ్ఞానమును సముపార్జించినచో తరించిపోగలరని స్పష్టముచేయబడినది. ప్రతిజీవియొక్క హృదయమందు ఆత్మ దేదీప్యమానముగ ప్రకాశించుచున్నది (Each soul is potentially divine). అజ్ఞానమను ఆవరణముచే అది కప్పబడియున్నది. ఆ ఆవరణను ఎవరు ప్రయత్నపూర్వకముగ జ్ఞానముచే తొలగించుకొందురో వారికి స్వస్వరూపానుభవము (మోక్షము) కలుగును (వారు ఏకులస్థులైనను సరియే).

ప్రతిజీవియు ఒక సూర్యుడు. అంతియేకాదు. సూర్యులకున్ను సూర్యుడు. 'న తత్ర సూర్యోభాతి' అనునట్లు ఈ దృశ్యమానమగు సూర్యుడు ఆ ఆత్మసూర్యుని దగ్గర మొక్కపోవును. అయినను జనులు చీకటిలోబడి కొట్టుకొనుచున్నారు. ఇదియే జగన్మాయ. కాబట్టి సద్గురువులగు మహాత్ములవలన, సచ్ఛాస్త్రములవలన, సర్వేశ్వరుని యెడల భక్తివలన ఆ మాయను తొలగించివేయునట్టి ఆత్మజ్ఞానమను ఉపాయము నెఱింగి జనులు స్వస్వరూపసాక్షాత్కారమునొంది కృతార్థులుకావలయును.

"తత్పరమ్" - ఆ పరబ్రహ్మస్వరూపమును (తత్ = ఆ, పరమ్ = పరబ్రహ్మస్వరూపము (2) లేక, తత్ = ఆ అజ్ఞానముకంటె, పరమ్ = వేఱగు (పరమాత్మను).

**ప్ర:–** అజ్ఞాన మెట్లు నశించును ?

**ఉ:–** ఆత్మజ్ఞానముచే.

**ప్ర:–** అత్తఱి యేమి సంభవించును ?

**ఉ:–** చిద్రూపుడగు ఆత్మ (ఆత్మభాస్కరుడు) స్వయముగ ప్రకాశించును (అనుభూతమగును).

**అ॥** అట్టి యాత్మజ్ఞాన మెట్లు లభించగలదో, ఆ పద్ధతిని తెలియజేయుచున్నాడు -

## 17 తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః
## గచ్ఛన్త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః.

**టీక:–** *తత్ బుద్ధయః* = ఆ పరమాత్మయందే బుద్ధిగలవారును, *తత్ ఆత్మానః* = ఆ పరమాత్మయందే మనస్సుగలవారును, *తత్ నిష్ఠాః* = ఆ పరమాత్మయందే నిష్ఠగలవారును, *తత్ పరాయణాః* = ఆ పరమాత్మయే పరమగతిగ (శరణముగ) గలవారును, *జ్ఞాన నిర్ధూతకల్మషాః (సన్తః)* = జ్ఞానముచే నెగురుగొట్టబడిన పాపముగలవారగుచు, *అపునరావృత్తిమ్* = పునర్జన్మరహితమైన స్థితిని (మోక్షమును), *గచ్ఛన్తి* = పొందుచున్నారు.

**తా:–** ఆ పరమాత్మయందే బుద్ధిగలవారును, ఆ పరమాత్మయందే మనస్సును నెలకొల్పినవారును, ఆ పరమాత్మయందే నిష్ఠగలవారును, ఆ పరమాత్మనే పరమగతిగ నెంచువారును జ్ఞానముచే నెగురుగొట్టబడిన పాపముగలవారై పునరావృత్తిరహితమగు (పునర్జన్మవర్జితమగు) శాశ్వత మోక్షపదవిని బొందుచున్నారు.

**వ్యాఖ్య:–** ఈ శ్లోకమునందు భగవానుడు ఆత్మజ్ఞానసంప్రాప్తికి చక్కటి సాధన నుపదేశించుచున్నారు. మోక్షపదవి మాటలచే సిద్ధించునదికాదు. తీవ్రసాధన, సంతతాభ్యాసము గలిగియున్నవారికిమాత్రమే అది లభ్యమగును. క్రిందటి శ్లోకమున జ్ఞానముచే అజ్ఞానమేఘము నశించి ఆత్మభాస్కరుడు ప్రత్యక్షమగునని తెలుపబడినది. ఆ జ్ఞానమెట్లు లభించునను ప్రశ్నకిచట సమాధానమొసంగుచున్నారు.

ఏ కార్యమైనను ఏకాగ్రత, తదేకచింతన, తన్మయత్వములచే సులభముగ సాధింపబడును. అట్లే ఆత్మయను లక్ష్యమును సాధింపదలంచువారును, ఆ యాత్మయందే బుద్ధి గలవారై, దానియందే మనస్సునుజొప్పించి, దానియందే నిష్ఠగలిగి, దానినే ఆశ్రయించి, తదేకపరాయణులై వర్తించవలెనని యిట బోధింపబడినది. 'భ్రమర కీట న్యాయము' నందు కీటకము (పురుగు) భ్రమరము (తుమ్మెద)నే చింతన జేయుచు తదాకారస్థితి నొందుట లోకవిదితము. అట్లే మనస్సున్ను దేనినిగూర్చి తీవ్రముగ భావించునో, తన్మయమైపోవును. మహనీయులందఱున్ను ఇట్టితీవ్రసాధనచేసియే జ్ఞేయైకస్థితిని శీఘ్రముగ బడసినవారైరి. అట్లుకాక మనస్సులోని కొంతభాగమును దృశ్యసౌఖ్యములందును, మఱికొంతభాగమును దైవచింతనయందును వినియోగించినచో ఏకాగ్రత, తదేకనిష్ఠలేని కారణమున భగవత్సాక్షాత్కారము వెంటనే కలుగకుండును. కాబట్టి పరమాత్మ ప్రాప్తికై సాధకుడు తనచిత్తమును పూర్ణముగ ఆ యాత్మరూపలక్ష్యమందే సంలగ్నముచేసి, తనసర్వశక్తులను అచ్చోటనే కేంద్రీకరించవలెను.

"అపునరావృత్తిమ్" – పునరావృత్తియనగా మరల జన్మించుట. మరల సంసార బంధమున పడుట. అదిలేనిది అపునరావృత్తి. అనగా మరణరహిత శాశ్వతకైవల్య పదవి.

అట్టి మహత్తరపదవి యెవరికి లభించును ? కల్మషము నశించినవారికి, పాపము తొలగినవారికి, అజ్ఞానము, అవిద్య, ఉడిగినవారికి. ఆ కల్మష మెట్లు నశించును ? జ్ఞానముచే. కనుకనే 'జ్ఞాన నిర్ధూత కల్మషాః' అనిచెప్పబడెను. ఆత్మజ్ఞానముచే మాయాదోషము (కల్మషము) సమూలముగ నశింపగలదు. జీవునియందు పాపముగాని, మాలిన్యముగాని, ఉన్నంతవఱకు ఆత్మోదయము కలుగదు. కాబట్టి దానిని ముందు జ్ఞానముచే నెగురగొట్టివేయవలెను. అట్టి జ్ఞానమో, నిరంతర ఆత్మచింతనచే, ఆత్మనిష్ఠచే, ఆత్మపరాయణత్వముచే లభించగలదు.

కాబట్టి సోమఱితనమునకు స్వస్తిచెప్పి, గొప్ప పురుషప్రయత్నము నాశ్రయించి ఆత్మపదవిని కైవస మొనర్చుకొనవలెను. అశాశ్వతములైన ప్రాపంచిక వస్తువులను సంపాదించుటయందు సామాన్యజనులెంతయో ఏకాగ్రతను ప్రదర్శించి రాత్రింబవళ్ళు కృషి సలుపుచున్నారుగదా! అట్టిచో శాశ్వతమై, దుఃఖవర్జితమై, పునరావృత్తిరహితమైనట్టి మోక్షపదవికొఱకు, దైవముకొఱకు ఏకాగ్రతతో తీవ్రప్రయత్న మేలచేయరాదు? తన శక్తిని, యుక్తిని, బలమును, నిష్ఠను దృశ్యమునుండి దైవముపైకి మరలించిన చాలును. మోక్షము కరతలామలకమగును. కాబట్టి దైవమందు (ఆత్మయందు) అత్యంతప్రీతి, శ్రద్ధ గలిగి, తదేకనిష్ఠతో విచారణాదులను సలుపుచు ఆత్మజ్ఞానమును సంపాదించవలసినదిగా భగవాను డిచట నాదేశించుచున్నారు.

మోక్షము నొందుట కిదియే పద్ధతియని సెలవిచ్చుచున్నారు. కనుక ముముక్షువులు భగవదాదేశప్రకారము సంతతాభ్యాసముచే ఆత్మనిష్ఠను పెంపొందించుకొని జన్మరాహిత్యమగు కైవల్యపదవిని జేబట్టవలెను.

ఇచట 'తత్.' అనగా క్రిందటి శ్లోకమున 'తత్ పరమ్' అని వర్ణింపబడిన పరమాత్మ యని అర్థము.

గీతయందు ఆ పరమాత్మపదము - (1) అక్షయసుఖము (2) నిర్వాణబ్రహ్మము (3) ఉత్తమ సుఖము (4) పరమగతి (5) పరమధామము (6) అవ్యయపదము - మున్నగుపేర్లచే వర్ణింపబడినది.

**ప్ర:–** మోక్షముయొక్క స్వరూపమెట్టిది ?

**ఉ:–** పునరావృత్తిరహితమైనది - జన్మవర్జితమగు శాశ్వతానందపదవియే అది.

**ప్ర:–** అది యెవరికి లభించును ?

**ఉ:–** అజ్ఞానకల్మషము నశించినవారికి, పాపముడిగినవారికి మాత్రమే అది లభించును.

**ప్ర:–** పాప మెట్లు నశించును ?

**ఉ:–** ఆత్మజ్ఞానముచే పాప మెగురగొట్టివేయబడును.

**ప్ర:–** ఆత్మజ్ఞాన మెట్లు సంప్రాప్తించును ?

**ఉ:–** ఆత్మయందే బుద్ధినుంచి, ఆత్మనుగూర్చియే చింతనజేయుచు, ఆత్మయందే మనస్సును సంలగ్నపఱచి, ఆత్మయందే నిష్ఠగలిగి, ఆత్మపరాయణుడై యుండుటద్వారా అది లభించును.

**అ॥** అట్టి జ్ఞానులయొక్క సమదృష్టిని వర్ణించుచున్నాడు -

**18. విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని**
**శుని చైవ శ్వపాకే చ పణ్డితాః సమదర్శినః.**

**టీక:–** విద్యావినయసంపన్నే = విద్య, వినయము గలిగియున్నట్టి, బ్రాహ్మణే = బ్రాహ్మణుని యందును, గవి = గోవునందును, హస్తిని = ఏనుగునందును, శునిచ ఏవ = కుక్కయందును, శ్వపాకే చ = కుక్కమాంసమువండి తిను చండాలునియందు, సమదర్శినః = సమదృష్టిగలవారు (వారిని సమముగా జూచువారు), పణ్డితాః = జ్ఞానులు (అని చెప్పబడుదురు).

**తా:–** విద్య, వినయము గలిగియున్న బ్రాహ్మణునియందును, గోవునందును, ఏనుగునందును, కుక్కయందును, కుక్కమాంసము వండుకొని తిను చండాలుని యందును సమదృష్టిగలవారే (వారిని సమముగ జూచువారే) జ్ఞానులు (ఆత్మానుభవముగలవారు) అని చెప్పబడుదురు.

**వ్యాఖ్య:–** జ్ఞాననిష్ఠులు సమస్తమును ఆత్మరూపముగనే సందర్శించుచుందురు. కావున అన్ని ప్రాణులయందును వారు ఆత్మనే దర్శించుచు సమభావముగలిగి, ప్రేమను, దయను వర్షించుచుందురు. జ్ఞానులయొక్క 'సర్వభూతములయందలి సమదృష్టిని', తెలుపుటకొఱకై ఇచట మానవులలోను,

తిర్యగ్జంతువులలోను కొన్ని ప్రాణులు మచ్చునకు గైకొనబడినవి. మానవులలో ఉత్తమతరగతికి ప్రాతినిధ్యము వహించుటకై విద్యావినయసంపన్నుడగు బ్రాహ్మణుడు ఎన్నుకొనబడెను. అట్లే నీచశ్రేణినుండి కుక్కమాంసముతిను చండాలుడు ఏరుకొనబడెను. వీరిరువురును మానవసంఘముయొక్క ఊర్ధ్వాధఃపరాకాష్ఠలను సూచించుటవలన, వీరిని నిరూపించుట ద్వారా సంఘమంతయు నిరూపింపబడినట్లాయెను. అట్లే జంతువులందు గోవు ఉత్తమతరగతిని, ఏనుగు మధ్యమతరగతిని, కుక్క అధమతరగతిని సూచించును. కావున ఆ మూడిటిని తెలుపుటచే తిర్యగ్జాతియంతయు తెలిపినట్లైనది. వీరందఱిని సమముగ వీక్షించువాడే జ్ఞాని, పండితుడు. సామాన్యముగ పండితుడనగా పాండిత్యప్రకర్ష, సాహిత్యకౌశలము గలవాడని జనులు తలంచుదురు. కాని భగవానుడిచట సమదృష్టి గలవాడే పండితుడని వచించిరి. ఇట్టి సమదృష్టి గలవారు చదువురానివారైనను మహాపండితులే యగుదురు. అదిలేనివారు ఎంతటి మహాపాండిత్యము గలిగియున్నను, పరమార్థదృష్టియందు అజ్ఞానులే యగుదురు.

జనులలో కొందఱికి దేహదృష్టి, కొందఱికి మనోదృష్టి, కొందఱికి ఆత్మదృష్టి యుండును. దేహదృష్టిగలవారు అధములు. ఒకప్రాణిని చూచినపుడు ఆ ప్రాణి యొక్క దేహసౌందర్యమును, పరిమాణమును మాత్రము వారు చూచుచుందురు. మనోదృష్టిగలవారు మధ్యములు. వీరు ప్రాణియొక్క మనోభావములను, విద్యను కవిత్వమును చూచుచుందురు. ఇక ఆత్మదృష్టిగలవారు ఉత్తములు. వీరు ఏ ప్రాణిని జూచినను లోని ఆత్మనే వీక్షించుచుందురు. దేహములు, మనస్సులు వేఱువేఱుగానున్నను, పరిణామము నొందుచున్నను సర్వజీవులకును ఆత్మయొకటియే. కావున అట్టివారు సమస్తప్రాణికోట్లయందును సమభావముగలిగి యుందురు. జనులలో పెక్కురు పైన తెలిపిన మధ్యమ, అధమ తరగతులకు జెందినవారే అయియున్నారు. ఉత్తమ తరగతికి జెందిన జ్ఞానులు చాల అరుదు. అట్టివారినిగూర్చియే ఈ శ్లోకమున నిపుడు ప్రస్తావించబడినది.

ప్రేమయను దైవగుణమును మానవులవఱకే పరిమితముచేయక, జంతుజాలముపైనగూడ దానిని విస్తరింపజేయవలెనని ఈ శ్లోకము తెలుపుచున్నది. ఇంతియేకాదు. సమస్త చరాచరప్రాణికోట్లపైనను విస్తరింపజేయుటయే ఆదర్శమానవునియొక్క చిహ్నము. కనుకనే యిచట జంతుజాలములోని కొన్ని పేర్లున్ను చేర్చబడినవి. గోవుపై, ఏనుగుపై, కుక్కపై, క్రిమిపై, కీటకముపై ప్రేమ, దయ కలుగవలెను. ఇదియే విశాలభావము. ఇదియే ఆత్మదృష్టి. ఇట్టి విశాలభావమునే గీత ప్రోత్సహించుచున్నది. కాబట్టి ముముక్షువగువాడు భగవానుడు తెలిపిన యిట్టి విశాల ఆత్మదృష్టినే అలవఱచుకొనవలెను. ఏ ప్రాణినైన చూచినపుడు వెంటనే లోని ఆత్మ గోచరింపవలెను. అపుడే సర్వప్రాణికోట్లయెడల పరిపూర్ణమగు దయ ఉదయించును. సర్వమానవసౌభ్రాతృత్వము (Fraternity) మంచిదేకాని అదిచాలదు. ఇంకను ఒకమెట్టుపైకిపోయి సర్వాత్మదృష్టిని అలవఱచుకొనవలెను. అనగా ఎల్లప్రాణులందును తనయొక్క ఆత్మనే వీక్షించుటను అభ్యసించవలెను. ఇట్టి విశ్వప్రేమయే ఈ శ్లోకమున తెలుపబడినది. ఒక శరీరమున కన్ను, ముక్కు, చెవి మున్నగు వేర్వేఱు అవయవములున్నను అన్నిటియందును మనుజునకు సమానమగు ప్రేమ, ఆసక్తి యెట్లుకలదో, అందేయొక్కదానికైన బాధగలిగినచో తనకే బాధగలిగిన ట్లేలాగున భావించి ఆ బాధను నివారింపయత్నించునో అట్లే విశ్వమంతయు ఒకే ఆత్మయొక్క శరీరమని భావించి సర్వజీవులయెడల సమభావముగలిగి వర్తించవలెననియు, అట్టివాడే జ్ఞానియనియు నిచట పేర్కొనబడినది.

ఒకడు జ్ఞాని అగునా కాదా, పండితుడగునా కాదా యని పరీక్షించుటకీ సమదృష్టియే ఒక గుఱుతు.

'ఆత్మసర్వవ్యాపి' అను సిద్ధాంతమును చెప్పువారు సర్వభూతదయ సమత్వము గలిగియుండనిచో వారిది 'వాచావేదాంతమే' యగును. కావున సమదర్శిత్వము నభ్యసించి, అనుష్ఠానవేదాంతులై పఱగవలెను. ఈ శ్లోకమున ఆచరణ వేదాంతము (Practical Vedanta) చక్కగ ప్రస్ఫుటిత మొనర్చుబడినది.

**ప్ర:–** పండితుడనగా (జ్ఞానియనగా) నెట్టివాడు ?

**ఉ:–** (1) విద్య వినయముగల బ్రాహ్మణునియందు (2) ఆవుయందు (3) ఏనుగునందు (4) కుక్కయందు (5) కుక్కమాంసముతిను చండాలునియందు - సమభావముగలవాడే పండితుడు, జ్ఞాని.

**అ॥** అట్టి సమత్వస్థితియొక్క మహిమను వచించుచున్నాడు -

## 19. ఇహైవ తైర్జితః సర్గో యేషాం సామ్యే స్థితం మనః
## నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః.

**టీక:–** యేషామ్ = ఎవరియొక్క, మనః = మనస్సు, సామ్యే = సమభావమందు (నిశ్చల సమస్థితియందు, లేక సర్వభూతములయందును ఆత్మను సమముగజూచుటలో), స్థితమ్ = స్థిరముగనున్నదో, తైః = వారిచేత, ఇహ ఏవ = ఇచటనే (ఈ శరీరముతో నున్నపుడే), సర్గః = జననమరణరూపసంసారము, జితః = జయింపబడినది, హి = ఎందువలననగా, బ్రహ్మ = బ్రహ్మము (ఆత్మ), నిర్దోషమ్ = దోషరహితమైనది, సమమ్ = సమమైనది, తస్మాత్ = కాబట్టి, తే = వారు, బ్రహ్మణి = బ్రహ్మమునందు, స్థితాః = ఉన్నవారగుదురు.

**తా:–** ఎవరియొక్క మనస్సు సమభావమందు (నిశ్చల సమస్థితియందు, లేక సర్వప్రాణులందును ఆత్మను సమముగజూచుటలో) స్థిరముగనున్నదో, అట్టివా రీజన్మమునందే జననమరణరూప సంసారమును జయించినవారగుదురు. ఏలయనిన, బ్రహ్మము దోషరహితమైనది, సమమైనది, కావున (సమత్వమందు స్థితిగల) వారు బ్రహ్మమునందున్న వారే యగుదురు.

**వ్యాఖ్య:–** జననమరణరూపసంసారమును దాటుటకు, బంధమునుండి విడివడుటకు ఉపాయ మిచట వచింపబడుచున్నది. బంధమునకుగాని, మోక్షమునకుగాని మనస్సే కారణము. మనస్సు చపలముగానున్నచో బంధము, నిశ్చలముగానున్నచో మోక్షము. మనస్సు మలినముగానున్నచో బంధము, నిర్మలముగానున్నచో మోక్షము. కనుకనే భగవానుడు ఎవరిమనస్సు సమముగను (in the state of equilibrium) - సర్వభూతములందును సమదృష్టిగలిగియుండునో అట్టివారు సంసృతిని జయించినట్లేయని వచించుచున్నారు. ఏలయనగా పరబ్రహ్మము దోషరహితమైనది; సమమైనది. (నిర్దోషం హి సమమ్). ఎవరిమనస్సు ఆ ప్రకారముగ దోషరహితమై, సమమైయలరునో, వారు తప్పక ఆ బ్రహ్మమందే కాపురమున్న వారగుదురు (బ్రహ్మణితే స్థితాః). అనగా మోక్షభాగులగుదురు. సజాతీయ వస్తువునందు సజాతీయ వస్తువే కలియునుగాని విజాతీయవస్తువుకాదు. నీటిలో నీరే కలియునుగాని నూనె కలియదు. నూనెలో నూనె కలియునుగాని నీరు కలువదు. అట్లే బ్రహ్మముతో నేకము కావలెననిన, లేక బ్రహ్మములో లయించవలెననిన, ఆ బ్రహ్మముయొక్క లక్షణములుగల వస్తువే కావలయును. ఆ బ్రహ్మముయొక్క లక్షణములు రెండు ఇచట వచింపబడినవి. అవియే (1) దోషరాహిత్యము (2) సమత్వము. కాబట్టి మనస్సున్ను ఆ రెండు

సల్లక్షణములను ప్రయత్నపూర్వకముగ స్వీకరించినచో, అత్తఱి అది బ్రహ్మమందు లయించుటకు అర్హమైయుండును. ఈ పరమసత్యమునే భగవాను డీ శ్లోకమున విశదీకరించియున్నారు.

సత్త్వపురుషయోః శుద్ధిసామ్యే కైవల్యమ్.

అని పంతజలిమహర్షి వచించియున్నారు. అనగా శుద్ధతయందు, నిర్విషయత్వమందు సమత్వమందు మనస్సు, బ్రహ్మముతోటి సమానస్థాయి నెపుడందుకొనునో అదియే మోక్షస్థితియని యర్థము. మనస్సెపుడు నిర్మలమై, క్రమముగ ఆత్మవలె (బ్రహ్మమువలె) అత్యంత శుద్ధత్వము, అత్యంత నిర్దోషిత్వము, అత్యంత సమత్వము నొందునో అపుడే మనుజుడు కైవల్యమును బడయునని భావము. మోక్షప్రాప్తికి అదియే సుముహూర్తము.

**న మోక్షో నభసః పృష్ఠే పాతాలే న చ భూతలే**
**మోక్షో హి చేతో విమలం సమ్యగ్జ్ఞానవిబోధితమ్** (వసిష్ఠగీత)

అని వసిష్ఠమహర్షియు నుడివియున్నారు. అనగా 'మోక్షమనునది ఆకాశములోగాని పాతాళమందుగాని, భూతలమునగానిలేదు', సమ్యక్ - జ్ఞానమువలన గలుగు నిర్మల చిత్తమే మోక్షము. అని యర్థము. కాబట్టి ప్రతివారును వారివారి మనస్సును ప్రయత్న పూర్వకముగ నిర్మలమొనర్చి, నిశ్చలస్థితి యందుండునట్లుచేసి, సమభావము (సర్వత్ర సమదృష్టి) గలిగియున్నచో ఈ క్షణమందే మోక్షమునొందవచ్చును. సంసారమును జయించవచ్చును.

"ఇహైవ" - అని చెప్పుటవలన పైగుణములుకలవారు ఇచ్చోటనే, ఈ జన్మయందే తరించిపోగలరని స్పష్టముచేయబడెను. కావున ఇపుడు సాధనచేసినచో ఎపుడో, ఏ జన్మమందో ముక్తిలభించునని యెవరును దిగులుపడనక్కరలేదు. ఫలిత మిపుడే చేతికి చిక్కును. మోక్షమునకు కాలనియమముగాని, దేశనియమముగాని లేదు. ఏ సమయమున ఏ చోటునందు మనస్సు నిర్మల, నిశ్చల, సమస్థితినిబొందునో ఆ సమయముననే మనుజుడు ముక్తుడగునని యిచట వచింపబడినది.

"సామ్యేస్థితమ్" - అనుదానికి అర్థము చిత్తము ఒడుదుడుకులు లేక సమముగ నిశ్చలముగనుండుటయు, సర్వభూతములందును సమముగ వ్యాపించియున్నట్టి ఆత్మను వీక్షించుటయునగును. ప్రాణులను జూచునపుడు దేహదృష్టిగాని, మనోదృష్టిగాని లేక ఆత్మదృష్టియే కలవాడు సర్వభూతములను సమముగ వీక్షింపగల్గును. అట్టి సమదృష్టి గలిగి, చిత్తమందు ఎట్టి పరిస్థితియందైనను కల్లోలము, విక్షేపములేక నిశ్చలత్వమును కాపాడుకొనుచుండవలెను.

ఈ ప్రకారముగ మోక్షము నొందుటకు, సంసారబంధమును విచ్ఛిన్న మొనర్చుటకు, మాయను జయించుటకు భగవానుడు జీవులకు చక్కటి రాజబాటనుజూపిరి. మఱియు ఈ శరీరమున్నపుడే అట్టికైవల్యస్థితిని బడయవచ్చునను 'హామీ' గూడ నిచ్చిరి. 'యేషాం' అని చెప్పినందువలన ప్రతివారును అట్టిదశను బొందవచ్చునను ధైర్యమునుగూడ గలుగజేసిరి.

**ప్ర:–** ఈ సంసారము నెవరు జయించుదురు ?

**ఉ:–** ఎవరి మనస్సు దోషరహితమై, సమభావము గలిగియుండునో వారు జయించగలరు.

**ప్ర:–** భవదుఃఖమును దాటుట కుపాయము లెవ్వి ?

**ఉ:–** (1) మనస్సునందు ఏవిధమైన పాపము, దోషము లేకుండుట (2) నిశ్చలస్థితిగలిగి, సర్వభూతములందు సమదృష్టి (ఆత్మదృష్టి) గలిగియుండుట.

**ప్ర:–** బ్రహ్మ మెట్టిది ?

**ఉ:–** (1) దోషరహితమైనది (2) సమమైనది.

**ప్ర:–** జీవులు మోక్షము నెపుడు పొందుదురు ?

**ఉ:–** ఏ క్షణమున మనస్సును నిర్మలము చేసికొందురో, మనస్సునందు సమస్థితిని కాపాడుకొని సమదృష్టిని గలిగియుందురో, ఆ క్షణముననే మోక్షమును బొందుదురు.

**అ॥** బ్రహ్మజ్ఞానియొక్క మఱికొన్ని లక్షణములను జెప్పుచున్నాడు -

**20. న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్య చాప్రియమ్**
**స్థిరబుద్ధిరసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః.**

**టీక:–** స్థిరబుద్ధిః = నిశ్చలమగు బుద్ధిగలవాడును, అసమ్మూఢః = మోహరహితుడును, బ్రహ్మణి = బ్రహ్మమందు, స్థితః = నిలుకడకలవాడునగు, బ్రహ్మవిత్ = బ్రహ్మజ్ఞాని, ప్రియమ్ = ఇష్టమైనదానిని, ప్రాప్య = పొంది, న ప్రహృష్యేత్ = సంతోషింపడు, అప్రియమ్ చ = అనిష్టమైనదానిని, ప్రాప్య = పొంది, న ఉద్విజేత్ = దుఃఖము నొందడు.

**తా:–** స్థిరమగు బుద్ధిగలవాడును, మోహరహితుడును, బ్రహ్మమందు నిలుకడ కలవాడునగు బ్రహ్మజ్ఞాని ఇష్టమైనదానిని పొందినపుడు సంతోషమునుగాని, అనిష్టమైనదానిని పొందినపుడు దుఃఖమునుగాని పొందకుండును.

**వ్యాఖ్య:–** బ్రహ్మసాక్షాత్కారమునొందినవారికి గుఱుతు ఏమియో ఇచట వచింపబడినది. అజ్ఞానికి, జ్ఞానికి గల భేదము వారి ఆచరణయందే వ్యక్తమగును. గ్రుడ్డివానికి, నేత్రములుకలవానికి గలభేదము వారి నడకయందే తెలిసిపోవును. బ్రహ్మజ్ఞాని ఎటువంటి విపత్కర పరస్థితులందుగాని, అప్రియసందర్భములందు గాని వ్యసనమును బొందకుండును. అట్లే ఎటువంటి సౌఖ్యప్రదములగు పరిస్థితులందను ఉప్పొంగడు. రెండిటియందును అతని చిత్తము ఒడుదుడుకులులేక సమభావముతో నుండును.

ఏలయనిన, బ్రహ్మము నెఱింగినవారికి ఈ ప్రపంచము స్వప్నతుల్యముగ మిథ్యగ గోచరించును. అట్టి మిథ్యాప్రపంచమున ప్రియవస్తులాభముచే సంతోషముగాని, అప్రియ వస్తులాభముచే దుఃఖముగాని వారికేల యుండగలదు? ప్రపంచము సత్యమను భావము కలవారికే ఆ సుఖదుఃఖాదిభావము లుండును.

"స్థిరబుద్ధిరసమ్మూఢో" - బ్రహ్మజ్ఞునిబుద్ధి విక్షేపరహితమై మేరువువలె స్థిరముగ నుండును. అజ్ఞానిబుద్ధి కామాదులతో గూడి చంచలముగ వర్తించును. ప్రకాశమున నున్నవాడు అంధకారమున పడనట్లు, బ్రహ్మజ్ఞునకు మోహముగాని సంశయముగాని ఎన్నటికి గలుగకుండును. కనుకనే యాతడు అసమ్మూఢుడని (మోహరహితుడని) చెప్పబడినది. 'ఇవి యెండమావులు' అని తెలిసినవారు వానికొఱకై పరువెత్తరు. మోహమునొందరు. తెలియనివారుమాత్రమే పరుగిడి దుఃఖమొందుదురు.

దీనినిబట్టి పైనదెల్పిన మూడుసల్లక్షణములను (సమభావము, స్థిరబుద్ధి, మోహరాహిత్యము) చక్కగా అభ్యసించుచు వచ్చినవానికి కాలక్రమముగ బ్రహ్మమందు నిలుకడ సంభవించగలదని స్పష్టమగుచున్నది.

**ప్ర:–** బ్రహ్మవేత్తయగు మహనీయుని లక్షణము లెవ్వి ?

**ఉ:–** (1) ప్రియవస్తువు లభించునపుడు ఉప్పొంగుటగాని, అప్రియవస్తువు లభించునపుడు క్రుంగిపోవుటగాని లేకుండుట (2) స్థిరబుద్ధి గలిగియుండుట (3) మోహములేకుండుట.

**అ॥** అట్టి బ్రహ్మస్థితియందు (ఆత్మయందు) నిలుకడకలుగుటకు ఉపాయమును వచించుచున్నాడు -

**21. బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విన్దత్యాత్మని యత్సుఖమ్**
**స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే.**

**టీక:–** బాహ్యస్పర్శేషు = బాహ్యమునందలి శబ్దాదివిషయములందు, అసక్తాత్మా = ఆసక్తి లేని మనస్సు గలవాడు, ఆత్మని = ఆత్మయందు, యత్ సుఖమ్ = ఏ సుఖముకలదో, (తత్ సుఖమ్) విన్దతి = అట్టి సుఖమును బొందుచున్నాడు, సః = అతడు, బ్రహ్మయోగయుక్తాత్మా = బ్రహ్మనిష్ఠయను సమాధితో గూడుకొనినవాడై, అక్షయమ్ = నాశరహితమైన, సుఖమ్ = సుఖమును, అశ్నుతే = పొందుచున్నాడు.

**తా:–** బాహ్యమునగల శబ్దాది విషయములం దాసక్తి లేనివాడు ఆత్మయం దెట్టి (నిరతిశయ) సుఖముకలదో అట్టి సుఖమునే పొందుచున్నాడు. అతడు బ్రహ్మనిష్ఠయను సమాధితో గూడుకొనినవాడై (బ్రహ్మానుసంధానపరుడై) అక్షయమగు సుఖమును బడయుచున్నాడు.

**వ్యాఖ్య:–** ఆత్మయందు నిలుకడకలుగవలెనన్న శబ్దాదివిషయములనుండి మనస్సు మరలవలెను. బాహ్యవిషయములం దాసక్తిలేని మనస్సు అంతర్ముఖమై ఆత్మయందు స్థిరత్వమునుబొంది అక్షయసుఖమును బొందుచున్నదని యిట వచింపబడినది..

అక్షయసుఖము బయట ఎచటను లేదు. అది ఆత్మయందే కలదు. ప్రపంచమున విషయాదులందుగల సుఖము క్షయమైనది. అశాశ్వతమైనది. దుఃఖమిశ్రితమైనది. రాకడ పోకడ గలిగియున్నది (ఆగమాపాయినః). అది ప్రతిబింబ సుఖము. బింబభూతమగు సుఖము ఒక్క ఆత్మయందే కలదు. సుఖముయొక్క ప్రధానకేంద్రము (Head-Quarters) అంతరముననే కలదు గాని బాహ్యమునకాదు. ఆత్మసుఖమే వస్తువులందు ప్రతిబింబించి విషయసుఖముగ వ్యక్తమగుచున్నది. ఈ సత్యమును తెలిసికొనజాలక అవివేకులగు జనులు సుఖము బయటనున్నదని తలంచి ఎముకను కొఱుకు కుక్క తన నోటినుండి జారిన రక్తమునే ఆస్వాదించుచు అది ఎముకనుండి వచ్చినదని భ్రమించు చందమున ఆ శబ్దస్పర్శాదివిషయములకొఱకే పరుగిడుచు, ఎండమావులనువలె వానిని వెన్నంటుచు జీవితమును వ్యర్థము చేసికొనుచున్నారు. ప్రతిబింబరూప క్షణికసుఖమును శాశ్వత సుఖమని తలంచి గొప్ప ప్రమాదములో పడిపోవుచున్నారు.

కాని విజ్ఞుడగువాడు బాహ్యవిషయములం దాసక్తి లేనివాడై అభ్యంతర ఆత్మ సుఖముకొఱకే అన్వేషించుచు, దానిని బడసి కృతార్థుడగుచున్నాడు. విషయములపై విరక్తిజనింపనిచో మనస్సు అటనుండి

మరలి అంతర్ముఖము కానేరదు. ధ్యానము సరిగా జరుగదు. కాబట్టి అంతరాత్మసుఖానుభవమునకు ముందుగా బాహ్యవస్తువ్యామోహము నశించి, దృశ్యపదార్థముల యెడల విరక్తి జనింపవలెను. కనుకనే భగవాను డిచట 'బాహ్యస్పర్శేష్వసక్తాత్మా' అను షరతు ముందుగా విధించుటకు కారణమైనది. ఆత్మసుఖము ననుభవించవలెననిన, ముందు కొద్దిగా "పన్ను" (Tax) చెల్లించవలెను. అదియే విషయసుఖత్యాగము. అధికసుఖముకొఱకై అల్పసుఖమును మనుజుడు త్యజించ వలసివచ్చును. 'త్యాగేనైకే అమృతత్వమానశుః' అను శ్రుతివాక్య మీ సత్యమునే బోధించుచున్నది. కాబట్టి ఇంద్రియములను విషయములపైకి పోనీయక నిగ్రహించి 'దుఃఖదోషానుదర్శనమ్' అని భగవానుడు తెలిపినట్లు విషయములందలి నశ్వరత్వాది దోషములను మాటిమాటికి చింతనజేయుచు విరక్తిని అభ్యసించవలయును. అపుడే ఆత్మధ్యానము నిరాటంకముగ కొనసాగుచు అక్షయ సుఖానుభవము సంభవించును.

ప్రపంచమున సర్వజీవులును తమకు నిరతిశయ సుఖము కావలెననియే కోరుచుందురు. కాని ఆసుఖ మెట్లులభించునో తెలియక నానాబాధలు పడుచున్నారు. భగవానుడు కరుణతో నిచట అక్షయప్రాప్తికి మార్గమును జూపిరి. అదియే విషయవిరక్తి. అద్దానినవలంబించి నిరతిశయానందమును బడసి జన్మను ధన్యముగావించుకొనవలెను.

ఈ శ్లోకముద్వారా ఈ క్రిందియంశములు వెల్లడియగుచున్నవి -

(1) సుఖము బాహ్యమునలేదు; అంతరమున (ఆత్మయందే) కలదు.

(2) బాహ్యసుఖము క్షయశీలమైనది (నశ్వరము); దుఃఖమిశ్రితమైనది.

(3) శబ్దాదివిషయములు ఆత్మసుఖమునకు అడ్డుగానున్నవి. కావున వాని యెడల ఆసక్తినుంచరాదు. వానివెంట పరుగిడువాడు ఆత్మసుఖము ననుభవింపలేడు.

**ప్ర:–** ఆత్మసుఖ మెట్టిది ?

**ఉ:–** అక్షయమైనది (నాశరహితమైనది).

**ప్ర:–** అది యెట్లు లభించును ?

**ఉ:–** శబ్దాది విషయములం దాసక్తి వదలి ఆత్మయందు నిష్ఠగలిగియుండుటచే (బ్రహ్మయోగముచే) లభించును.

**అ॥** విషయభోగములు దుఃఖకరములు, బంధజనకములు కావున వానినాశ్రయించరాదని బోధించుచున్నాడు -

## 22. యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే
## ఆద్యన్తవన్తః కౌన్తేయ న తేషు రమతే బుధః.

**టీక:–** కౌన్తేయ = ఓ అర్జునా!, సంస్పర్శజాః = (ఇంద్రియ) విషయసంయోగము వలన గలుగు, భోగాః = భోగములు, యే (సన్తి) = ఏవి (కలవో), తే = అవి, దుఃఖయోనయః ఏవ హి = దుఃఖకారణములే

యగుచున్నవి, (మఱియు) ఆద్యన్తవన్తః = మొదలు, తుది కలవి (స్వల్పకాలముండునవి), (తతః = కాబట్టి), బుధః = వివేకవంతుడు, తేషు = వానియందు, న రమతే = క్రీడింపడు (ప్రీతినొందడు).

**తా:–** అర్జునా! (ఇంద్రియ) విషయసంయోగమువలన గలుగు భోగములు దుఃఖ హేతువులును, అల్పకాలముండునవియు నయియున్నవి. కావున విజ్ఞుడగువాడు వాని యందు క్రీడింపడు (ఆసక్తిగొనడు).

**వ్యాఖ్య:–** విషయవిరక్తి కలిగియుండవలెనని క్రిందటి శ్లోకమున బోధింపబడినది. అది యెందులకు కలిగియుండవలెనను ప్రశ్నకిచట సమాధానము చెప్పబడుచున్నది. విషయేంద్రియసంయోగమువలన కలుగు సుఖము వాస్తవసుఖముకాదు. పైకి ఒకింత సుఖముగతోచి లోన అపారదుఃఖము గలిగియుండును. కనుకనే దానిని 'దుఃఖయోని' అని భగవానుడు వర్ణించిరి.

'సౌఖ్యంతు బిన్దుమాత్రేణ దుఃఖం పర్వతమేవ చ' మొదట రవ్వంతసుఖము తోచినను వెనువెంటనే పర్వతమంత దుఃఖము వచ్చి మీదపడును. అనియు విషయసౌఖ్యములనుగూర్చి పెద్దలు వర్ణించిరి. అవి క్షణికములు. అపాతరమణీయములు. ఆద్యంతములతో గూడియున్నవి. కాబట్టి విజ్ఞులెవ్వరును వానియందు రమింపరని యిట చెప్పబడినది.

"దుఃఖయోనయః" – విషయసుఖము తనగర్భమందు దుఃఖమనుదానినిగల్గి యుండుట వలన విషయముల ననుభవింపదలంచువాడు తత్సుఖములోగల దుఃఖమును గూడ అనుభవింపవలసియే యుండును. ఇదియంతయు తెలిసికొనియే వివేకవంతుడగువాడు వానిజోలికి పోకుండును. వానియెడల విరక్తి గలిగియుండును. శరీరముపై ఎక్స్‌కిరణములను ('X' Rays) ప్రసరింపజేసినచో లోనగల ఎముకలు మొదలయినవి కన్పించులాగున, విజ్ఞుడు దృశ్యసుఖమును చూడగనే వివేకమను కిరణజాలమును దానిపై ప్రసరింపజేసి దాని లోనగల దుఃఖమును వీక్షించి అద్దానియెడల ఉపేక్షాభావము గలిగియుండును. 'నతేషు రమతే బుధః' అనుదానిభావ మిదియే. అజ్ఞానియో, పైపై తళుకుబెళుకులను సుఖాభాసమునుచూచి మురిసిపోయి ఆ విషయసుఖముల ననుభవించి గోతిలో పడుచున్నాడు. గాలమున తగుల్కొనుచేపవలె వినాశమును బొందుచున్నాడు. ఎట్లనిన, చేపమాంసపుముక్కనుజూచి ఆనందపడి దానిని సమీపించి భక్షించును. కాని దానిలోన నిగూఢముగనున్న గాలమును అది చూచుటలేదు. తత్ఫలితముగ మృత్యుముఖమున బడుచున్నది. 'దుఃఖయోనయః' అను పదముయొక్క ఆంతర్యమిదియే.

ఈశ్లోకముద్వారా దృశ్యసౌఖ్యములందుగల రెండు గొప్పదోషములు వెల్లడియగుచున్నవి – (1) పైకి సుఖముగా గన్పించినను లోన దుఃఖము గలిగియుండుట (2) ఆద్యంతములుగలవియై యుండుటవలన క్షణికములైవర్తించుట. అనగా దుఃఖజనకత్వము, క్షణికత్వమను రెండు ప్రబలదోషములు విషయభోగము లందు కలవు. ఆత్మసుఖమో అట్లుకాదు. దానియందు దుఃఖము లవలేశమైనను ఎచటను నుండదు. తైలధారవలె అవిచ్ఛిన్నమైనట్టి సుఖమది. మఱియు శాశ్వతమైనది. విషయసుఖమును చిన్నదీపమునకు పోల్చినచో ఆత్మసుఖమును అస్తమయములేని సూర్యునకు పోల్చవచ్చును. దీప మెప్పుడైన ఆరిపోవును. కాని ఆత్మభాస్కరు డెన్నడును ఉపశమింపడు. ఇంద్రియసుఖములు చిన్నదొరువులవంటివి. క్షణకాలములో ఎండిపోవును. ఆత్మానందము సముద్రమువంటిది. అది యేకాలమందును తరగదు. ఈ భేదము తెలిసియే మహనీయులగువారు విషయభోగములందు విరక్తిగలిగి ఆత్మానందమునే ఆశ్రయించుచుందురు. 'బుధః' – తెలివిగలవాడు, దృశ్యసౌఖ్యములందు రమింపడని చెప్పుటచే వానియందు రమించువాడు

వట్టితెలివితక్కువవాడని స్పష్టమగుచున్నది. ఎంతధనవంతుడైనను, అధికారవంతుడైనను, విద్యావంతుడైనను, బలవంతుడైనను విషయములపై పరుగిడినచో నతడు భగవద్దృష్టియందు తెలివితక్కువవాడే (అబుధః) అని తేలుచున్నది.

**ప్ర:—** విషయసుఖములయొక్క స్వభావమెట్టిది ?

**ఉ:—** (1) అవి దుఃఖము లోనగలిగియుండును (దుఃఖజనకములు) (2) అల్పకాలమాత్ర ముండును (క్షణికములు).

**ప్ర:—** కాబట్టి విజ్ఞుడగువా డేమి చేయును ?

**ఉ:—** అట్టి నశ్వరసుఖములందు రమింపక, ఆత్మసుఖమునే యన్వేషించును.

**ప్ర:—** విషయములకొఱకు పరుగిడువాడెవడు ?

**ఉ:—** వట్టి తెలివితక్కువవాడు, అజ్ఞాని.

**అ॥** అట్టి విషయలోలత్వమును (కామక్రోధాదులను) త్యజించువాడే సుఖము నొందగలడని వచించుచున్నాడు -

**23. శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్శరీరవిమోక్షణాత్**
**కామక్రోధోద్భవం వేగం స యుక్తః స సుఖీ నరః.**

**టీక:—** *యః* = ఎవడు, *శరీరవిమోక్షణాత్* = శరీరమును విడుచుటకు, *ప్రాక్* = మునుపు, *ఇహ ఏవ* = ఇచ్చటనే (ఈ లోకమందే), *కామక్రోధోద్భవం* = కామ క్రోధముల వలన బుట్టిన,, *వేగమ్* = క్షోభను (తీవ్రతను), *సోఢుమ్* = సహించుటకు (జయించుటకు) *శక్నోతి* = సమర్థుడగుచున్నాడో, *సః నరః* = ఆ మనుజుడు, *యుక్తః* = యోగియు; *సః* = అతడు, *సుఖీ* = సుఖవంతుడును నగును.

**తా:—** ఎవడీశరీరమును విడుచుటకు పూర్వమే యిచ్చోటనే (ఈ జన్మయందే) కామక్రోధముల వేగమును అరికట్టగల్గుచున్నాడో, అతడే యోగియు (చిత్తోపరతి కలవాడును), సుఖవంతుడునగును.

**వ్యాఖ్య:—** మోక్షమునకు వలసిన సాధనసామగ్రిని ఈజీవితమునందే సమకూర్చు కొనవలెను. మఱియొక లోకమునగాని, మఱియొక జన్మయందుగాని ఆపని సాధ్యపడదు.. భూలోకము కర్మభూమి. సాధనచేయుటకు అనువైన ప్రదేశము. స్వర్గాది ఊర్ధ్వ లోకములందుగాని, పాతాళాది అధోలోకములందుగాని పరమార్థసాధనకు ఎక్కువ అవకాశములుండవు (అవి కర్మానుభవలోకములే కనుక). కాబట్టి 'ఇహైవ' అను పదమిచట పేర్కొనబడెను. ఇంతకుముందే 19వ శ్లోకమున 'ఇహైవ తైర్జితః సర్గః' అని చెప్పబడియుండెను. ఈ ప్రకారముగ 'ఇహైవ' (ఇచ్చోటనే) అను పదము ఒకే అధ్యాయమున, ఒకే సందర్భమున రెండుపర్యాయములు వాడబడుటచూడ 'ఇచ్చోటనే' ఈ లోకమందే, ఈ జన్మమందే అధ్యాత్మసాధనను త్వరితముగ పూర్తిచేయవలెనని భగవంతుడు నొక్కి చెప్పినట్లైనది.

"ప్రాక్ఛరీరవిమోక్షణాత్" - మఱియు శరీరమును విడుచుటకు పూర్వమే - అనగా మరణము రాకమునుపే కామక్రోధాదుల విజయమును సాధించవలెనని హెచ్చరించిరి. ఏలయనగా, రాబోవు జన్మ మానవజన్మయే వచ్చుననిగాని ఒకవేళ వచ్చినను మోక్షసాధనకు చక్కని అవకాశములు కలుగననిగాని ఎవరును చెప్పలేరు. కాబట్టి ఈ జీవితమునే సదుపయోగము చేసికొని, నిరంతరము పరమార్థలక్ష్యమునకై ప్రయత్నము సలుపవలెను.

'శీర్యతే' ఇతిశరీరమ్ - శిథిలమై పోవునదే శరీరము. కావున అది చాల కాలము నిలువదు. అది బుద్బుదప్రాయము. మఱియు మృత్యువనునది ఫలాని సమయమున వచ్చునని యెవరును చెప్పలేరు. వార్ధక్యమునసేకాక, బాల్య యౌవనములందుగూడ జనులు మరణించుచున్నారు. కాబట్టి సాధనను వార్ధక్యమువఱకు వాయిదా వేయుట అవివేకమేయగును. మఱియు ముసలితనమున శక్తిసామర్థ్యము లుడిగిపోవుటచే ధ్యానాదులు, ఇంద్రియ మనోనిగ్రహాదులు చక్కగా జరుగవు. కాబట్టి శరీరపతనమునకు పూర్వమే కామాదుల వేగమును అరికట్టి ధ్యానాదులను సల్పుడని భగవాను డిచట హెచ్చరిక చేయుచున్నారు. అట్లుచేయువాడే సుఖవంతుడనియు పేర్కొనుచున్నారు (స సుఖీ). అట్లుచేయనిచో మహావినాశము తటస్థించునని శ్రుతులున్ను ఘోషించుచున్నవి★.

దీనినిబట్టి సుఖము నపేక్షించువాడు మున్ముందు తనయందలి ముఖ్యశత్రువులగు కామక్రోధములను జయించవలెనని స్పష్టమగుచున్నది. అరిషడ్వర్గమునందు కామ క్రోధములు ప్రధానములగుటచే ఆ రెండు నిచట చెప్పబడినను తక్కిన దోషములనుగూడ వానితోబాటు అన్వయించుకొనవలెను. అనగా అన్నిటిని జయించవలెనని భావము. అవి ప్రబల శత్రువులు, నిత్యవైరులు కావున సాధకుడు ఒక కంటితో నిరంతరము వానిని కనిపెట్టుచునే యుండవలెను.

'ఓ జీవులారా! శరీరమును విడుచుటకుపూర్వమే ఇంద్రియములను, మనస్సును, కామక్రోధాది అరిషడ్వర్గమును జయించుటకు యత్నింపుడు. మరణ మెపుడాసన్నమగునో ఎవరికిని తెలియదుగనుక ఎల్లకాలములందును సాధనయందు అప్రమత్తులై యుండుడు. అమూల్యమగు ఈ మానవజీవితమును భోగాదులందు గడిపివేసి వ్యర్థముచేయకుడు. ఈ ప్రకారము మీ మనోవికారములను జయింపగల్గినచో అపారసుఖమును (ఆత్మానందమును) బడయగలరు. అని భగవాను డీశ్లోకముద్వారా జీవులను హెచ్చరించుచున్నారు.

అధ్యాత్మమార్గమున ప్రమత్తత, సోమరితనము పనికిరాదు. ఆయువుయొక్క ఒక్కొక్క క్షణము గడచిపోయినచో, తిరిగి ఎన్నికోట్ల రత్నములను వెచ్చించినను అది మరల లభించదు @. కావున దానిని వ్యర్థముగ గడుపక ఇంద్రియజయముద్వారా ఆత్మాన్వేషణమును గావింపవలెను.

"వేగమ్" - అని చెప్పుటచే ఆ కామాదులు గొప్ప సంక్షోభమును గలుగజేయునని వ్యక్తమగుచున్నది.

"స నరః" - అను దానికి - 'ఈ ప్రకారముగ కామాదులను జయింపగల్గువాడే నరుడు (మానవుడు) అని చెప్పనగును' - అనియు అర్థము చెప్పవచ్చును.

---

★ న చేదిహావేదీన్మహతీ వినష్టిః (కేనోపనిషత్)

@ ఆయుషః క్షణ ఏకోఽపి సర్వరత్నైర్న లభ్యతే
నీయతే తద్వృథా యేన ప్రమాదః సుమహానహో. (వసిష్ఠగీత)

"శక్నోతి" - అనుపదమువలన 'భక్తివైరాగ్యాదులద్వారా కామాదులను సులభముగ అణచివేయ వచ్చున'ని స్పష్టమగుచున్నది.

ఈ శ్లోకముద్వారా ఈ క్రింది విషయములు తెలియుచున్నవి -

(1) శరీరపతనము గాకపూర్వమే మోక్షప్రయత్న మాచరింపవలెను.

(2) మోక్షప్రయత్నములలో ముఖ్యమైనది కామక్రోధాదులను జయించుట.

(3) అట్లు వానిని జయింపగల్గువాడే పూర్ణసుఖమును బడయగల్గునుగాని అన్యుడు కాదు.

**అ॥** ఈ ప్రకారముగ కామాదులను జయించి అంతర్ముఖదృష్టికలవాడు బ్రహ్మానుభూతిని బొందగల్గునని చెప్పుచున్నాడు -

## 24. యోఽన్తః సుఖోఽన్తరారామ స్తథాన్తర్జ్యోతిరేవ యః స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి.

**టీక:-** యః = ఎవడు, అన్తస్సుఖః = అంతరాత్మయందే సుఖముకలవాడును, అంతరారామః = ఆత్మయందే క్రీడించువాడును, తథా = ఆ ప్రకారమే, యః = ఎవడు, అన్తర్జ్యోతిః ఏవ = ఆత్మయందే ప్రకాశముకలవాడును (అగునో), సః యోగీ = ఆ యోగి (బ్రహ్మనిష్ఠుడు), బ్రహ్మభూతః = బ్రహ్మస్వరూపుడై, బ్రహ్మనిర్వాణమ్ = బ్రహ్మసాయుజ్యమును (బ్రహ్మానందమును లేక మోక్షమును) అధిగచ్ఛతి = పొందుచున్నాడు.

**తా:-** ఎవడు లోన ఆత్మయందే సుఖించుచు, ఆత్మయందే క్రీడించుచు, ఆత్మయందే ప్రకాశముగలవాడై యుండునో, అట్టియోగి బ్రహ్మస్వరూపుడై బ్రహ్మసాక్షాత్కారమును (మోక్షమును) బొందును.

**వ్యాఖ్య:-** బ్రహ్మసాక్షాత్కారమును (బ్రహ్మానందమును) ఎవడు పొందగలడో ఈ శ్లోకమున వివరింపబడుచున్నది. సర్వోన్నతమగు బ్రహ్మనిర్వాణస్థితిని ప్రయత్నముచే సర్వులును పొందగలరు. ఆ ప్రయత్నమేమియనగా, బాహ్యసుఖముల నిచ్ఛగింపక, దృష్టిని అభ్యంతరమునకు మరలించి ఆత్మసుఖమునే అన్వేషించుట, (ఇంద్రియార్థములందు క్రీడింపక, ఆత్మయందే రమించుట) యగును. అనగా ఇంద్రియములను, మనస్సును విషయాదులపైకి, భోగవిలాసములపైకి పరుగిడనీయక అరికట్టి, వివేక వైరాగ్యాదులచే వానిని స్వస్వరూపాత్మయందు స్థాపితమొనర్చుటయేయగును.

ఈ శ్లోకమునందు మూడు విషయములు ప్రస్తావించబడినవి - (1) సుఖము (2) క్రీడ (3) జ్యోతి. ఒక్కొక్క దానినిగూర్చి సంక్షేపముగ నిచట విచారించెదము -

(1) 'సుఖము' - సామాన్యజనులు సుఖముకొఱకై బాహ్యపదార్థములనే శోధించుచున్నారు. తద్ద్వారా వారు అల్పమగు ప్రతిబింబసుఖమునే పొందుచు దానినే గొప్పగ దలంచి తృప్తిపడుచున్నారు. కాని వాస్తవముగ విచారించినచో సుఖము బాహ్యమున లేదు. అంతరముననే కలదు. సుఖముయొక్క ప్రధానకేంద్రము అంతరాత్మయందే కలదు. అది శాశ్వతమైన సుఖము. బింబానందము. బాహ్యసుఖము అశాశ్వతము,

క్షణికము, ప్రతిబింబము, దుఃఖమిశ్రితము. ఈసత్యమెఱింగి వివేకవంతులు తమయావచ్ఛక్తిని అంతుర్ముఖముగ మరలించి ఆత్మసుఖమునే గ్రోలుదురు. అట్టివారు ధన్యులు, కృతకృత్యులు. అచిరకాలములో వారు బ్రహ్మభూతులై వెలయగలరు.

(2) 'క్రీడ' - అజ్ఞులు బాహ్యమునగల వస్తువులందే క్రీడింతురు. విషయ క్షేత్రములందు రమించుదురు. వారికదియే క్రీడాస్థలము. కాని విజ్ఞుడు దృశ్యపదార్థములు చంచలములని గ్రహించి వానినుపేక్షించి ఆత్మధ్యానమందే కాలము గడపును. వానికదియే ఆరామస్థలము, ఉద్యానవనము, క్రీడాంగణము, విహారప్రదేశము. బహిర్ముఖదృష్టిగలవారికి దానియొక్క విలువతెలియదు. అట్టివస్తువొకటి యున్నదనియు వారెఱుగరు. వివేకవంతులో, దానిసత్తువ గ్రహించి దానియందే క్రీడించుచు అనంతశాంతిని బడయుదురు.

(3) 'జ్యోతి' - సామాన్యులకు బాహ్యమునగల సూర్యచంద్రాదులే జ్యోతులు. అయినను, వానినిగూడ ప్రకాశింపజేయు జ్యోతి మఱియొకటికలదు (తస్యభాసాసర్వ మిదం విభాతి). అదియే ఆత్మ. సూర్యుని నేత్రము ప్రకాశింపజేయును. నేత్రమును బుద్ధి ప్రకాశింపజేయును. బుద్ధిని ఆత్మ ప్రకాశింపజేయును. అది జ్యోతిర్జ్యోతి, పరంజ్యోతి. మహనీయు లట్టి ఆత్మజ్యోతినే యాశ్రయించి శాశ్వత ప్రకాశస్వరూపులై వర్తించుదురు. జీవన్ముక్తులై వెలయుదురు.

ఈ ప్రకారము దృశ్యవ్యామోహమును వదలి, ఆత్మయే సుఖస్థానముగను, క్రీడాస్థలిగను, ప్రకాశక్షేత్రముగను గలవాడు నిరంతరము ఆత్మధ్యానపరాయణుడే యగుచు బ్రహ్మభూతుడై బ్రహ్మనిర్వాణమును (మోక్షమును) బడయుచున్నాడు.

**ప్ర:—** బ్రహ్మసాయుజ్యమును (మోక్షమును) ఎవడు పొందగల్గును ?

**ఉ:—** (1) బాహ్యసుఖములను వదలి ఆత్మయందే సుఖమును బొందువాడు.

(2) బాహ్యక్రీడలందాసక్తిలేక ఆత్మయందే క్రీడించువాడు.

(3) బాహ్యప్రకాశములందు దృష్టిలేక ఆత్మయందే ప్రకాశముగలవాడు బ్రహ్మనిర్వాణమును (మోక్షమును) బొందును.

**అ॥** అట్లు బ్రహ్మసాక్షాత్కారమును బడసినవారి లక్షణములను రెండు శ్లోకముల ద్వారా వివరించి చెప్పుచున్నాడు -

## 25. లభన్తే బ్రహ్మనిర్వాణమృషయః క్షీణకల్మషాః
## ఛిన్నద్వైధా యతాత్మానః సర్వభూతహితేరతాః.

**టీక:—** క్షీణకల్మషాః = పాపమును బోగొట్టుకొనినవారును, ఛిన్నద్వైధాః = సంశయములు లేనివారును, యతాత్మానః = స్వాధీనములైన ఇంద్రియ మనంబులుగలవారును, సర్వభూతహితే = సమస్త ప్రాణులయొక్క హితమందు, రతాః = ఆసక్తికలవారును (అగు), ఋషయః = ఋషులు (జ్ఞానులు), బ్రహ్మనిర్వాణమ్ = బ్రహ్మసాయుజ్యమును (మోక్షమును, బ్రహ్మానందమును), లభన్తే = పొందుచున్నారు.

**తా:–** పాపరహితులును, సంశయవర్జితులును, ఇంద్రియ మనంబులను స్వాధీనపఱచు కొనినవారును, సమస్తప్రాణులయొక్క క్షేమమందాసక్తి గలవారునగు ఋషులు (అతీంద్రియజ్ఞానులు) బ్రహ్మసాక్షాత్కారమును (మోక్షమును) బొందుచున్నారు.

**వ్యాఖ్య:–** బ్రహ్మసాయుజ్యరూపమోక్షము నెవరు పొందగలరో ఈశ్లోకమున ఇంకను వివరముగ చెప్పబడినది. ఋషులు మోక్షధామము నలంకరించెదరని యిచట పేర్కొనబడినది. ఋషులనగా నెవరు? 'హృషీకము'లను (ఇంద్రియములను) జయించి మనస్సును పరమాత్మయందు సంలగ్న మొనర్చువారే ఋషులు. ఋషిత్వమనునది ఒకానొక మహోన్నత పదవి. అది (బి.ఏ., ఎమ్.ఏ. ల వలె) ఒక 'డిగ్రీ' వంటిది. దానిని ప్రయత్నముచే సర్వులును పొందవచ్చును. నేడు అజ్ఞానిగా నున్నవాడు, సత్ప్రయత్నములచే రేపు ఋషికావచ్చును. విశ్వవిద్యాలయ డిగ్రీలకొఱకై 10, లేక 15 సంవత్సరములు విద్యార్థులు నిరంతరకృషి యెట్లు జరుపుచున్నారో, అట్లే ఈ ఋషిత్వము కొఱకున్ను కొంతకాలము అనవరతసాధన చేయవలెను. అట్లు సాధనయందు దారితేరిన వాడిక సామాన్యమానవుడుగ నుండడు. ఋషిగా మారిపోవును. జగద్వంద్యుడై పరగును. వెయ్యేల, సాక్షాత్ భగవంతుడుగ మారిపోవును. (బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి). ఆ సాధనలలో ముఖ్యములైనవి నాలు గిచట ప్రస్తావించబడినవి. - (1) పాపరాహిత్యము (2) సంశయములు, ద్వంద్వములు లేకుండుట (3) ఇంద్రియమనోనిగ్రహము (4) సర్వభూతదయ. ఇవి సాధకునకు అమూల్యములైనవి కాబట్టి వీనినిగుఱించి యొకింత యోచించవలసియున్నది.

(1) "పాపరాహిత్యము" - ప్రతిజీవియొక్క చిత్తమందు అనేక జన్మార్జిత పాపపంకిల ముండును. అది పరమార్థమార్గమున అడ్డుగోడవలె నిలిచియున్నది. పాపచిత్తమునందు ఆత్మజ్ఞానముదయించదు. కాబట్టి పుణ్యకార్యములచేతను, నిష్కామ కర్మాచరణముచేతను, భక్తిధ్యానాదులవలనను ఆ పాపమును బోగొట్టుకొని, వస్త్రమును ఉతికినట్లు చిత్తమును కల్మషరహితముగ గావించుకొనవలెను.

(2) "సంశయరహితత్వము" - సంశయములు, ద్వంద్వములు మున్నగు వానిని వివేకముయొక్క సహాయముచే పారద్రోలవలెను. 'ఛిద్యన్తే సర్వసంశయాః' అనునట్లు పరమార్థజ్ఞానముచే, తత్త్వవిచారణచే సర్వసంశయములను బోగొట్టుకొనవలెను.

(3) "ఇంద్రియ మనోనిగ్రహము" - దృశ్యవస్తువులపైకి పరుగిడు ఇంద్రియములు, మనస్సు మోక్షమునకు గొప్ప అవరోధములుగ నుండును. కావున వివేక, వైరాగ్యాదులచే వానిని చక్కగ స్వాధీనపఱచుకొని ఆత్మయందు స్థాపితమొనర్చవలెను. ఇంద్రియజయము లేకుండ మోక్షమార్గమున ఒక్క అడుగైనను ఎవరును ముందునకు వేయలేరు. చెడుగుఱ్ఱములుగల రథము గమ్యస్థానము నెట్లు చేరలేదో అట్లే సంయమ మొనర్పబడని ఇంద్రియములుగల మనుజుడున్ను ముక్తిధామమును జేరజాలడు. కాబట్టి వానిని తన అదుపులోనుంచుకొనవలెను.

(4) "సర్వభూతదయ" - 'సర్వభూతహితేరతాః' అను వాక్యము, దాని భావము, గీత యందు పెక్కుచోట్ల కానంబడుచున్నది. ఇది అనుష్ఠానవేదాంతసూత్రము. 'అంతయు బ్రహ్మమే' అనునది సిద్ధాంతము. 'సర్వభూతదయ' అనునది ఆ సిద్ధాంతముయొక్క ఆచరణరూపము. ఒక ప్రాణిని దూషించుచు, ద్వేషించుచున్నవాడెన్నటికిని సర్వాత్మ భావము కలవాడు కానేరడు. 'అంతయు ఆత్మ' యను భావము జీర్ణమైనవాడొక్క ప్రాణికైనను అపకారముచేయడు. చేయజాలడు. హితమునే చేయును. ఏలయనగా విశ్వమంతయును ఆత్మరూపముగ (తనరూపముగ) గాంచువాడు ఒక ప్రాణికి అపకారము

చేసినచో తనకుతాను అపకారము చేసికొనినట్లేయగును. కావున, సర్వాత్మభావనగల వానియందెల్లపుడును సర్వభూతదయ తొణికిసలాడుచుండును. ఒకడు ఆత్మజ్ఞాని అగునో కాదో తేల్చి చెప్పుట కిదియొక చక్కని గుఱుతు. ధ్యానానుష్ఠానములు మందు వంటివని చెప్పినచో, సర్వభూతదయ పథ్యము వంటిదని చెప్పవచ్చును. మందుతిని పథ్యము సరిగలేనిచో రోగము నయముకానట్లు, భగవద్ధ్యానము చేయుచు భూతదయ, జీవకారుణ్యములేనిచో ఆ ధ్యానము సక్రమపద్ధతిలో లేదు గనుక భవరోగము దానిచే ఉన్మూలనము కానేరదు. ఇచట 'సర్వభూతహితేరతాః' అని చెప్పుటచే ఏ ఒకానొక ప్రాణిపై దయచూపిన చాలదనియు సమస్త ప్రాణికోట్లపై కరుణగలిగి వానిక్షేమమునకై యత్నించవలెనని సూచితమగుచున్నది.

ఈ ప్రకారముగ పై నాలుగులక్షణములు గలిగి ఋషియై విలసిల్లువాడు బ్రహ్మనిర్వాణరూప మోక్షమును బడయగల్గుచున్నాడు.

**ప్ర:–** బ్రహ్మసాక్షాత్కారమును (మోక్షమును) ఎవరు పొందగల్గుదురు?

**ఉ:–** (1) పాపము నశించినవారు (2) సంశయములు, ద్వంద్వములు తొలగినవారు (3) ఇంద్రియనిగ్రహముకలవారు (4) సర్వభూతహితమాచరించువారు, బ్రహ్మసాయుజ్యము (మోక్షము) నొందగలరు.

**ప్ర:–** ఋషులనగా నెవరు?

**ఉ:–** పైన దెల్పిన నాలుగు సుగుణములు కలవారు

## 26. కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్
## అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్.

**టీక:–** కామక్రోధవియుక్తానామ్ = కామక్రోధములచే విడువబడినవారును, యతచేతసామ్ = నిగ్రహింపబడిన చిత్తముగలవారును (మనోనిగ్రహము గలవారును), విదితాత్మనామ్ = ఆత్మతత్త్వము నెఱిగినవారును (అగు), యతీనామ్ = యత్నశీలురకు, బ్రహ్మనిర్వాణమ్ = బ్రహ్మసాయుజ్యము (మోక్షము, బ్రహ్మానందము), అభితః = అంతటను (దేహమున్నపుడును, లేనపుడును, సర్వత్ర), వర్తతే = ఉన్నది.

**తా:–** కామక్రోధాదులు లేనివారును, మనోనిగ్రహము కలవారును, ఆత్మతత్త్వము నెఱిగినవారునగు యత్నశీలురకు బ్రహ్మసాయుజ్యము (మోక్షము, బ్రహ్మానందము) అంతటను (శరీరమున్నపుడును, లేనపుడును, సర్వత్ర) వెలయుచునేయున్నది.

**వ్యాఖ్య:–** మోక్ష మెచటనున్నది? దాని నెవరు పొందగలరు? అను ప్రశ్నల కిచట సమాధానము చెప్పబడినది –

(1) కామక్రోధములు తొలగుట (వాసనాక్షయము).

(2) చిత్తము స్వాధీనమందుండుట (మనోనాశము).

(3) ఆత్మ నెఱుగుట (తత్త్వజ్ఞానము).

అను మూడు సల్లక్షణములు గలవారి చుట్టును మోక్షము ఎల్లపుడు విరాజమానమైయే యుండునని వచింపబడినది. అనగా వేదాంతశాస్త్రములందు తరచు చెప్పబడు వాసనాక్షయ, మనోనాశ, తత్త్వజ్ఞానములను ప్రముఖ సాధనత్రయముగలవా డెల్లప్పుడు మోక్షరూపుడే అయియుండునని భావము. ఈ మూడు సాధనలనుగూర్చి గీతయందు భగవానుడు పలుచోట్ల ప్రసంగించుచువచ్చిరి. ఇందు తత్త్వజ్ఞానముయొక్క సహాయముచే కామాది వాసనాక్షయముకాగా, మనోనాశము దానియంతటనదియే సిద్ధించుచుండును. ఈ మూడు సాధనలును ఒకదానికొకటి పెనవేసికొనియుండి, విడదీయుటకు వీలు లేనందుచే, మూడిటిని ఏకకాలముననే సాధించవలయునని శాస్త్రములుచెప్పుచున్నవి. ప్రయత్నశీలురకే మోక్షము లభించునుగాని సోమరులకుగాదు. ఈ తత్త్వమును తెలుపుటకే కాబోలు 'యతీనాం' అను పద మిచట ప్రయోగింపబడినది. యతులనగా యత్నశీలురని అర్థము. 'ఉద్యోగినం పురుషసింహ ముపైతి లక్ష్మీః' - అనునట్లు ప్రయత్నశీలురనే లక్ష్మి వరించును. ధనలక్ష్మిగాని, మోక్షలక్ష్మిగాని. కాబట్టి భగవంతునిపై, సద్గురువులపై, సచ్ఛాస్త్రములపై పూర్ణవిశ్వాసముంచి సాధనచేయుచు రావలెను. మోక్షప్రాప్తికై పైన దెల్పిన మూడుసాధనలను ఓపికతో ననుష్ఠించవలెను.

ఇందు మొదటిసాధన కామాది పరిత్యాగము. ఆత్మస్వరూపమును గూర్చిన మననముచేతను, దృశ్యము యొక్క మిథ్యాత్వభావనాదార్ఢ్యముచేతను కామక్రోధాదిదుర్గుణములు తొలగగలవు. (2) రెండవది మనోనిగ్రహము. మనస్సు స్వాధీనపడవలెననిన, దానియందలి రజోగుణ, తమోగుణములు ముందు నశింపవలెను. ఇనుము గట్టిగా నున్నపుడు దానినెవరును వంచలేరు. అగ్నియందు సంతప్తమై మెత్తబడినపుడు మాత్రమే వంచగలరు. అట్లే జ్ఞానాగ్నిచే చిత్తమును బాగుగ పుటమొనర్చి పాపములను, రజస్తమములను దూరీకరించవలెను. అపుడే అది స్వాధీనపడగలదు. ఈ సంసారచక్రమునకంతటికిని కీలకము (నాభి) చిత్తమే అయియున్నది. చిత్తము కదలిన, జగత్తు కదులును. చిత్తము శమించిన జగత్తు శమించును. ఆ చిత్తమును జయించుటకు సర్వోత్తమ ఉపాయము దానికంటె పైననున్నట్టి ఆత్మను పట్టుకొనుటయే. 'ఏవంబుద్ధేః పరం బుద్ధ్వా' అనునట్లు ఆత్మయందలి నిలుకడచే చిత్తము, ఇంద్రియములు సులభముగ వశీకృతములగును. (3) ఇక మూడవసాధన ఆత్మజ్ఞానము. ఆత్మస్వరూపమెట్టిదో తెలిసికొని దానినే నిరంతరము మననము చేయుచుండవలెను. తాను శరీరము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి కాదనియు, వానియన్నింటికిని సాక్షిగానుండు ఆత్మయనియు, ప్రజ్ఞయనియు తెలిసికొని అట్టి సాక్షిస్థితియందు నిలుకడకలిగియుండుటను అభ్యసించవలెను. తాను నశించువాడు కాదనియు, నశించునది పంచభూతాత్మకమగు దేహమేయనియు, దృశ్యమంతయు వికారమొందునదియనియు, తాను నిర్వికారుడననియు చింతనజేయవలెను. ఇదియే తత్త్వజ్ఞానాభ్యాసము.

ఈ ప్రకారముగ పై మూడుసాధనలను చక్కగ నాచరించినవారు కృతకృత్యులగుదురు. మోక్షము (బ్రహ్మనిర్వాణము) వారిచుట్టును మెలగుచుండును. వారు సాక్షాత్ మోక్షస్వరూపులే, బ్రహ్మస్వరూపులేయగుదురు. మోక్షము ఎచటనో ఆకాశముననో, పాతాళముననో కలదని భావించువారి ఆశయముల నీశ్లోకము ద్వారా భగవానుడు ఛిన్నమొనర్చి నిర్మలచిత్తునియొద్దనే మోక్షము సదా భాసిల్లుచుండునని వచించిరి.

**ప్ర:–** బ్రహ్మనిర్వాణమును (మోక్షమును) ఎవరు బొందగలరు?

**ఉ:–** (1) కామక్రోధాదులు తొలగినవారు (2) చిత్తము స్వాధీనమందు కలవారు (3) ఆత్మ నెఱిగిన వారు మాత్రము పొందగలరు.

ప్ర:— మోక్షస్థానమును సోమరులు అందుకొనగలరా?

ఉ:— లేదు. యత్నశీలురు మాత్రము చేరుకొనగలరు.

ప్ర:— మోక్ష మెచట నున్నది?

ఉ:— పైన దెల్పిన సల్లక్షణములుగలవా రెచటనుందురో, వారి చుట్టును మోక్షముండును. కావున మోక్షమునకై మఱియొకచోటికి బోనవసరము లేదు. తన చిత్తమును శుద్ధమొనర్చుకొనినచో మోక్షమచటికే వచ్చి చేరును.

అ॥ ధ్యానపద్ధతిని వివరించుచు ఆత్మధ్యానపరాయణుడు సదా ముక్తుడేయని వచించుచున్నాడు -

**27. స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాంశ్చక్షుశ్చైవాన్తరే భ్రువోః
ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యన్తరచారిణౌ.**

**28. యతేన్ద్రియమనోబుద్ధిర్మునిర్మోక్షపరాయణః
విగతేచ్ఛాభయక్రోధో యస్సదాముక్త ఏవ సః.**

**టీక:—** యః = ఎవడు, బాహ్యాన్ స్పర్శాన్ = వెలుపలనున్న శబ్దస్పర్శాది విషయములను, బహిః కృత్వా = వెలుపలికే నెట్టివైచి, చక్షుః = చూపును, భ్రువోః అన్తరే ఏవ = భ్రూమధ్యముననే (కనుబొమ్మల నడుమనే), (కృత్వా = నిలిపి), నాసాభ్యన్తరచారిణౌ = ముక్కు లోపలనే సంచరించునట్టి, ప్రాణాపానౌ = ప్రాణాపానవాయువులను, సమౌ చ కృత్వా = సమముగ జేసి, యతేంద్రియమనోబుద్ధిః = స్వాధీనపఱచుకొనబడిన ఇంద్రియములు, మనస్సు, బుద్ధి గలవాడై, విగతేచ్ఛాభయక్రోధః = కోరిక, భయము, కోపము - వీనిని విడిచినవాడై, మోక్షపరాయణః = మోక్షాసక్తుడై, మునిః = (ఆత్మ) మననశీలుడై, (వర్తతే = ఉండునో), సః = అతడు, సదా = ఎల్లపుడును, ముక్తః ఏవ = ముక్తుడేయగును.

**తా:—** ఎవడు వెలుపలనున్న శబ్దస్పర్శాది విషయములను వెలుపలికే నెట్టివైచి (లోన ప్రవేశింపనీయక) చూపును భ్రూమధ్యమున నిలిపి, నాసికాపుటములందు సంచరించు ప్రాణాపానవాయువులను సమముగజేసి, ఇంద్రియ మనోబుద్ధులను నిగ్రహించి ఇచ్ఛా భయ క్రోధములు లేనివాడై, మోక్షాసక్తుడై (ఆత్మ) మననశీలుడై యుండునో అట్టివాడెల్లప్పుడును ముక్తుడే యగును.

**వ్యాఖ్య:—** "స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాన్" - శబ్దాది విషయములయొక్క క్షేత్రము బహిఃప్రపంచము. జీవుని అంతరక్షేత్రమగు హృదయమున ప్రవేశించుటకు వానికేమి హక్కుగలదు? అని విజ్ఞుడు యోచించి 'అవి యెచటనున్నవో అచటనే యుండుగాక' అని నిశ్చయించి, బాహ్యవిషయములను లోనికిరానీయక, ఒకవేళ వచ్చినచో ప్రయత్నపూర్వకముగ బయటకు గెంటివైచును. అవివేకియో వానిని స్వేచ్ఛగ లోనికి రానిచ్చును. తత్ఫలితముగ విషయలోలుడై సంసారగర్తమున పడిపోవుచున్నాడు. కాబట్టి వివేకి ఇంద్రియద్వారములకడ, మనోద్వారములకడ, 'ఫారా' ఏర్పాటుచేసి "లోనికిపోగూడదు" (No admision) - అని విషయముల నాదేశించుచు దృశ్యరూప అన్యరాష్ట్రమందుండు ఇంద్రియార్థములను హృదయసామ్రాజ్యములోనికి రానీయక సదా జాగరూకుడై యుండును.

"చక్షుశ్చైవాన్తరే భ్రువోః" – ఈ ప్రకారముగ శబ్దాదిబాహ్యవిషయములను నిరోధించి, ధ్యాననిష్ఠుడు దృష్టిని భ్రూమధ్యమున నిలుపును. దీనినే ఖేచరీముద్ర యందురు. ధ్యానము చేయువాడు కండ్లు తెఱచియుంచినచో చుట్టునున్న వస్తువులు కానంబడుట వలన చిత్తమునకు విక్షేపము కలుగును. కండ్లు మూసికొనినచో నిద్రలో (తమస్సులో) పడిపోవు ప్రమాదము కలదు. కనుకనే యాతడు మధ్యమార్గమును జేబట్టి నిమీలితనేత్రుడై భ్రూమధ్యమున దృష్టిని నిలిపి ధ్యానించుచుండును. భ్రూమధ్యమనగా రెండు కనుబొమ్మల నడుమ యని అర్థము. అచ్చోట ఆజ్ఞాచక్రము కలదు. నేత్రములకు అతిసమీపమున నుండుటబట్టి భ్రూమధ్యస్థానమున దృష్టిని నిలిపి ధ్యానించుట సాధకునకు చాల అనుకూలముగ నుండును. అయినను కొందఱు నాసికాగ్రమున, కొందఱు హృదయస్థానమున, మఱికొందఱు సహస్రారమున గూడ దృష్టిని నిలిపి ధ్యానించుచుందురు. ఎవరికెట్లు అనుకూలమో అట్లు చేసికొనవచ్చును. చిత్తము బహిర్ముఖముగ చెదరకుండుటయే ప్రధానము.

"ప్రాణాపానౌ సమౌ కృత్వా" – సామాన్యముగ జనులందు ప్రాణాపానవాయువులు సమముగ ప్రవహించకుండును. ప్రాణాయామాభ్యాసముచే వానిని క్రమరీతిని బోవులాగున చేయుట ఆరోగ్యమునకు, చిత్తైకాగ్రతకుకూడ అవసరము. కనుకనే ప్రాణాయామమనునది అష్టాంగయోగమునం దొకానొక భాగముగ జేర్చబడినది. ప్రాణమునకు, మనస్సునకును అత్యంత సన్నిహితసంబంధము కలదు. ఒకదానిని నిరోధించిన, మఱియొకటి నిరుద్ధమగును. కావున అతిసూక్ష్మమగు మనస్సును నిగ్రహించుటయందు కొంతసహాయకారిగ నుండుటకై ప్రాణాయామమును శాస్త్రములందు విధించిరి. ప్రాణాపానములను సమముగ ప్రవహింపజేయుటచే మనస్సున్ను చపలత్వమును వీడి ఏకాగ్రతను బొందగలదు.

"యతేన్ద్రియమనోబుద్ధిః" – ఇంద్రియములు, మనస్సు, బుద్ధి – వీనినన్నింటిని సాధకుడు తనయొక్క అదుపులో నుంచుకొనవలెను. అవి చెప్పినట్లు తానాడరాదు. తాను చెప్పినట్లు అవి నడుచుకొనవలెను. ఇదియే ఇంద్రియనిగ్రహము. అజ్ఞాని వానికి దాసానుదాసుడై ప్రవర్తించును. జ్ఞాని వానిని నిగ్రహించి తనవశమందుంచుకొనును. వాస్తవముగ తాను వానియన్నింటికి పైనున్న ఆత్మయేకాని, లోబడియున్న వస్తువు కాదు. ఈసత్యమెఱిగి అభ్యాసవైరాగ్య విచారణాదులద్వారా ఇంద్రియ మనంబులను స్వాధీనపఱచుకొనవలెను.

"మోక్షపరాయణః"– అజ్ఞానులు భోగపరాయణులై యుందురు. ముముక్షువులు మోక్షపరాయణులైవర్తింతురు. కైవల్యప్రాప్తికి తీవ్రముముక్షుత్వము అత్యవసరము. మోక్షముకొఱకై పరితపించువారికే మోక్షలక్ష్మి సంప్రాప్తించును. 'ఎపుడు నేను బంధమునుండి విడివడుదునా, ఎపుడు జననమరణరహితమగు శాశ్వతపదవి నాకు సంప్రాప్తించునా' యని తీవ్రఆవేదనతో పరితపించువానికి ముక్తి దరిదాపుననేయుండును. భగవంతునిదర్శనము కాలేదేయని రాత్రింబగళ్లు విలపించుచు కన్నీరు ధారధారగ ప్రవహింపజేసి దైవాయత్తచిత్తులై మెలగు మహనీయు లెందఱినిగూర్చియో మనము చరిత్రయందు వినియున్నాముకదా! వారే మోక్షపరాయణులు. అట్టివారు ముక్తిసాధనములను అతిశ్రద్ధాభక్తులతో నాచరించుచుందురు.

"విగతేచ్ఛాభయక్రోధః" – కామాది దుర్వాసనారాహిత్యమునుగూర్చి యిదివఱకెన్నియోసార్లు భగవానుడు హెచ్చరించియుండిరి. ఇంకను మున్ముందును చాలసార్లు చెప్పబోవును. వాని నిర్మూలనము

హృదయశుద్ధికి, ఆత్మజ్ఞానోదయమునకు అత్యావశ్యకముగనుక పదేపదే వానినిగూర్చి చెప్పుటకు కారణమైనది. కామము, క్రోధము, భయము - ఈ మూడును దుర్గుణసంఘమునకు నాయకులు, నాయకులను జయించినచో తక్కినవారు తృటిలో స్వాధీనపడగలరు. ఈ మూడు దుర్గుణములు హృదయమును వదలిపోయినచో, పాచిలేని సరోవరమువలెను, దుమ్ముతొలగిన అద్దమువలెను, మసితుడిచిన చిమ్నీవలెను హృదయము నిర్మలమై భాసించును. నిర్మలహృదయముననే జ్ఞానభాస్కరుడుదయించును.

మునిః = మననశీలుడై యుండువాడు.

"సదాముక్తః" - అని చెప్పుటవలన పైనదెలిపిన సద్గుణములచే విరాజితుడగువాడు, ఎల్లపుడును ముక్తుడే అయియుండుననిభావము. మోక్షమునకై మఱియొక లోకమునకు పోనవసరములేదు. మఱియొక దేహమును ధరింపనవసరము లేదు. ఎప్పుడో కలుగునని దిగులును పొందనక్కరలేదు. ఈ సాధనలయందారితేరిన మఱుక్షణమే మనుజుడు ముక్తుడై చెన్నొందునని భగవానుడిచట అభయ మొసంగిరి.

**ప్ర:-** మోక్షప్రాప్తికి ఉపాయములెవ్వి?

**ఉ:-** (1) శబ్దాది విషయత్యాగము (2) ఏకాగ్రధ్యానము (3) ప్రాణాయామము (4) ఇంద్రియ మనోబుద్ధుల నిగ్రహము (5) మననశీలత్వము (6) మోక్షపరాయణత్వము (7) కామక్రోధ భయరాహిత్యము.

**అ॥** మోక్షప్రాప్తికి భక్తిరూప సులభోపాయమును వచించుచున్నాడు -

## 29. భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్
## సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తిమృచ్ఛతి.

**టీక:-** యజ్ఞతపసామ్ = యజ్ఞములకు, తపస్సులకు, భోక్తారమ్ = భోక్త (అనుభవించువాడు) గను, సర్వలోకమహేశ్వరమ్ = సమస్తలోకములకు ఈశ్వరునిగను (నియామకుడు, ప్రభువుగను), సర్వభూతానామ్ = సమస్తప్రాణులకు, సుహృదమ్ = ప్రతిఫలముకోరక హితమొనర్చువానిగను, మామ్ = నన్ను, జ్ఞాత్వా = ఎఱిగి (మనుజుడు), శాన్తిమ్ = శాంతిని, ఋచ్ఛతి = పొందుచున్నాడు.

**తా:-** యజ్ఞములయొక్కయు, తపస్సులయొక్కయుభోక్త (ఫలము లనుభవించువాడు) గను, సమస్తలోకములయొక్క ఈశ్వరుడు (ప్రభువు, శాసకుడు) గను, సమస్తప్రాణుల యొక్క హితకారిగను, నన్నెఱిగి మనుజుడు శాంతిని బొందుచున్నాడు.

**వ్యాఖ్య:-** శాంతిని సాధించుట ఎట్లు? దుఃఖనివృత్తి, పరమశాంతిరూప మోక్ష మెట్లుకలుగును? అను ప్రశ్నల కిచట సమాధానము చెప్పబడుచున్నది. ఎవడు భగవంతుని (ఆత్మను) తెలిసికొనునో, అతడే శాంతినొందునని వచింపబడినది. అయితే ఆ భగవంతు డెట్టివాడు? అతని లక్షణములు కొన్ని యిచట పేర్కొనబడినవి - (1) సమస్తయజ్ఞములయొక్కయు, తపస్సులయొక్కయు ఫలముల ననుభవించువాడు. పరమాత్మ చరాచర ప్రాణికోట్లయందంతటను వ్యాపించియుండుటవలన, సమస్తపుణ్యకార్యములయొక్క, ధర్మకార్యములయొక్క కర్తయు, ఫలభోక్తయు అతడే అయియున్నాడు. (2) మఱియు అతడు సమస్త జగంబులకును ప్రభువు, శాసకుడు, నియామకుడు. ఒకలోకమునకుగాదు 'సర్వలోకములకు'. అతను

ఈశ్వరుడేకాదు; 'మహేశ్వరుడు', అతనిని మించి మఱియొకడు లేనేలేడని యర్థము. (3) ఈ ప్రకారముగ సర్వలోకములకు నియామకుడైనప్పటికిని అతని హృదయము అతికోమలమైయుండును. ఏలయనిన సమస్తప్రాణికోట్లకును అతడు పరమమిత్రుడు, ఉపకారి, హితకారి, 'సుహృత్తు'. (ప్రతిఫలము కోరక సహాయపడువానిని 'సుహృత్తు' అందురు). 'సర్వభూతానామ్' అని చెప్పుటవలన ఒకరికిగాదు, కొందఱికిగాదు, సమస్తప్రాణులకును మేలొనర్చుటయందు అతడు బద్ధకంకణుడైయున్నాడనిభావము. జీవులను ఈ సంసారదుఃఖసాగరమునుండి ఉద్ధరించి తరింపజేయుటకై ఈ గీతాజ్ఞానమును లోకమునకు ప్రసాదించుటయే వారి పరమ వాత్సల్యమునకు, సహృదయతకు తార్కాణము. మఱియు వేదశాస్త్రములను సృష్టించి జనులకు మహోపకారము గావించెను. 'తేషామహంసముద్ధర్తా' అనునట్లు భక్తులను కాపాడుటకు అతడు సంసిద్ధుడైయేయున్నాడు. ఈ దేహరచననుగాని, ప్రపంచరచననుగాని చక్కగ వివేచించి చూచినచో ఆ భగవానుని దయాళుత్వము పదపదమునందును గోచరముకాగలదు. ఇట్టి లక్షణములు పరమాత్మ గలిగియుండునని యిచట తెలుపబడినది.

ఈ ప్రకారమగు భగవానుని మహిమను ఎఱుగువాడు ఊరకనుండక అనవరతము వారినే ధ్యానించుచు, భక్తితో సేవించుచుండును గావున తత్ఫలితముగ నాతడు పరమశాంతిని బొందును. 'తేషాం శాన్తి శ్శాశ్వతీ నేతరేషామ్' - ఆ పరమాత్మను తెలిసికొనినవారికే శాశ్వతమగు శాంతి లభించునుగాని తదితరులకు కాదని ఉపనిషత్తులున్ను ఉద్ఘోషించుచున్నవి. ప్రతివారును శాంతిని, సుఖమునే కోరుచున్నారు. అట్టి శాంతి లాభమునకు శ్రీకృష్ణపరమాత్మ యిచట చక్కటి ఉపాయమును సెలవిచ్చియున్నారు. దానిని గ్రహించి, అనగా భగవత్తత్త్వమునెఱిగి ప్రతివారును శాంతిని బడయవలయును. పరమాత్మ సర్వలోకైక ప్రభువని తెలిసికొని వారిని ధ్యానించుటయే శాంతికి రాజమార్గము. భక్తియే శాంతికి బాట. 'జ్ఞాత్వా' అని చెప్పుటవలన ముందుగ భగవంతుని స్వరూపమును, భగవత్తత్త్వమును చక్కగ తెలిసికొనవలెనని భావము. అపుడే ధ్యేయవస్తువగు ఆ పరమాత్మయందు భక్తి లెస్సగ కుదురును. ఒకానొక వస్తువుయొక్క మహిమ యిట్టిదని తెలియనిదే దానిమీది విశ్వాసము కలుగదు గదా!

సామాన్యముగ లోకములో నొకచిన్న అధికారి తమగ్రామమునకు వచ్చినచో జనులాతనినెంతయో ఆదరించి గౌరవింతురు. ఒక రాజువచ్చినచో ఇంకను ఎక్కువగ గౌరవించుదురు. కాని రారాజై, చక్రవర్తులకు చక్రవర్తియై, సమస్తబ్రహ్మాండములకు నియంతయైనట్టి సర్వేశ్వరుడు చెంతనే యున్నప్పటికిని కొందఱి జనులకు వారిపై విశ్వాసములేకుండుట అత్యంతశోచనీయము. ఇట్టి దైవవిశ్వాసరాహిత్యమే జీవుని పతనమునకు, అశాంతికి ప్రధానహేతువు. కాబట్టి భగవానుని మహిమను గుర్తెఱిగి భక్తితో నిరతము వారిని సేవించుటయే, ధ్యానించుటయే శాంతికి, సుఖమునకు, జన్మరాహిత్యమునకు ఏకైకమార్గము. ఈ సత్యమునే ఈశ్లోకము నిరూపించుచున్నది.

ఇంతదనుక ఈ అధ్యాయమున ఇంద్రియనిగ్రహ, తత్త్వవిచారణాద్యనేక సాధనలు చెప్పబడినప్పటికిని అధ్యాయాంతమున భక్తిమార్గ ముపదేశించుటవలన, ప్రతివారును అత్యంత సులభమైనట్టి ఆ భక్తిని మొట్టమొదట జేబట్టి భగవత్కృపచే క్రమముగ అధ్యాత్మమార్గమున వికాసమునొంది తుదకు భగవదైక్యముచే పరమశాంతిని బడయగలరని స్పష్టమగుచున్నది.

ప్ర:– శాంతిని బొందుటకు మార్గమేది?

**ఉ:—** భగవంతుని స్వరూపమును చక్కగ తెలిసికొని, భక్తితో నతని నారాధించుటయే, ధ్యానించుటయే శాంతికిమార్గము.

**ప్ర:—** భగవంతునియొక్క స్వరూపమెట్టిది? ఆతడెట్టివాడు?

**ఉ:—** అతడు (1) సమస్తయజ్ఞములకు, తపస్సులకు భోక్త (2) సమస్తలోకములకు ప్రభువు, నియంత (3) సర్వజీవులకు ఆప్తమిత్రుడు, హితకారి.

ఓమ్

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే

శ్రీకృష్ణార్జునసంవాదే కర్మసన్న్యాసయోగో నామ

పఞ్చమోఽధ్యాయః

ఇది ఉపనిషత్ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును,

శ్రీకృష్ణార్జునసంవాదమునగు శ్రీ భగవద్గీతలందు కర్మసన్న్యాసయోగమను

ఐదవ అధ్యాయము

ఓమ్ తత్ సత్



ॐ

# శ్రీ భగవద్గీత

అథ షష్ఠోఽధ్యాయః

## ఆఱవ అధ్యాయము

ఆత్మసంయమయోగః

## ఆత్మ సంయమయోగము

### ఈ అధ్యాయము యొక్క పేరు :-

ఈ అధ్యాయమునకు ఆత్మసంయమయోగము అనిపేరు. దీనినే ధ్యానయోగమనియు చెప్పుదురు. ఇచట 'ఆత్మ' అను పదమునకు శరీరము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి - ఇవియన్నియునని యర్థము. వానియన్నింటియొక్క నిగ్రహ మెట్లు సాధించవలెనో ఆ పద్ధతులన్నియు చక్కగ ఈ అధ్యాయమున బోధింపబడుటచే దీనికి ఆత్మ సంయమయోగమని పేరువచ్చినది.

### ఈ అధ్యాయమందలి ప్రధాన విషయములు :-

| | |
|---|---|
| నిష్కామకర్మయోగప్రస్తావన, యోగారూఢుని లక్షణములు - | (1వ శ్లో॥ నుండి 4వ శ్లో॥ వఱకు) |
| ఆత్మోద్ధరణ, జితేంద్రియుడగు జ్ఞానియొక్క స్వభావము - | (5 వ శ్లో॥ నుండి 10 వ శ్లో॥ వఱకు) |
| ధ్యానయోగపద్ధతి - | (11వ శ్లో॥ నుండి 32 వ శ్లో॥ వఱకు) |
| మనోనిగ్రహమునుగూర్చిన విచారణ - | (33 శ్లో॥ నుండి 36వ శ్లో॥ వఱకు) |
| యోగభ్రష్టుని సద్గతి, ధ్యానయోగముయొక్క మహిమ - | (37 వ శ్లో॥ నుండి 47 వ శ్లో॥ వఱకు) |

### పూర్వాధ్యాయముతో ఈ అధ్యాయమునకు గల సంబంధము :-

5 వ అధ్యాయ ప్రారంభమున కర్మసన్న్యాసము (జ్ఞానయోగము) గొప్పదా, కర్మయోగము గొప్పదా యను అర్జునుని ప్రశ్నను పురస్కరించుకొని శ్రీకృష్ణపరమాత్మ రెండును గొప్పవే యనియు, అయినను సాధకులకు మొట్టమొదట కర్మయోగమే సులభసాధ్యమగుటబట్టి శ్రేయస్కరమనియు నుడువుచు, ఆ రెండుమార్గములనుగూర్చి క్షుణ్ణముగ విచారణసలిపి తుట్టతుదకు ఆ రెండింటికి సహాయభూతముగ నుండునట్టి ధ్యానయోగము (ఆత్మసంయమయోగము) ను ఒకింత ప్రస్తావించిరి. కాని దానినిగూర్చి అచట వివరముగ తెలుపలేదు. అందుచే ఈ 6వ అధ్యాయమును పూర్తిగ ఆ ధ్యానయోగము (ఆత్మసంయమ యోగము) ను లెస్సగ వర్ణింపదలంచినవారై గీతాచార్యులు ప్రప్రథమమున నిష్కామకర్మయోగమును గూర్చి ఒకటి రెండ మాటలను జెప్పదలంచి ఇవ్విధముగ అధ్యాయమును ఆరంభించుచున్నారు -

# ఆత్మసంయమ యోగము




**యోగీ యుఞ్జీత సతతమాత్మానం రహసి స్థితః**
**ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః.** **(6 -10)**

(ధ్యానయోగమునభ్యసించు) యోగి ఏకాంతప్రదేశమున ఒంటరిగ నున్నవాడై మనస్సును, దేహేంద్రియములను స్వాధీనమొనర్చుకొని, ఆశలేనివాడై, ఒరులనుండి యేమియు స్వీకరింపక ఎల్లప్పుడును మనస్సును ఆత్మయందే నెలకొల్పుచుండవలెను (లయమొనర్చుచుండవలెను).

**శ్రీ భగవానువాచ :–**

**1. అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః**
**స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్నచాక్రియః.**

శ్రీ భగవానువాచ = శ్రీ భగవంతుడు చెప్పుచున్నాడు –

**టీక:–** యః= ఎవడు, కర్మఫలమ్= కర్మలయొక్క ఫలమును, అనాశ్రితః= అపేక్షింపనివాడై, కార్యమ్ = చేయవలసిన, కర్మ = కర్మమును, కరోతి= చేయుచున్నాడో, సః= అతడు, సన్న్యాసీ= సన్న్యాసియును, యోగీ చ= యోగియును, ( భవతి= అగుచున్నాడు), నిరగ్నిః= అగ్నిహోత్రమును వదలినవాడు, న = కాడు, అక్రియః చ = కర్మలను విడచినవాడును, న = (సన్న్యాసియు, యోగియు) కాడు.

**తా:–** శ్రీ భగవంతుడు చెప్పెను – ఎవడు చేయవలసినకర్మలను ఫలాపేక్ష లేకుండ చేయునో ఆతడే సన్న్యాసియు, యోగియు నగును. అంతియేకాని అగ్నిహోత్రమును వదలినవాడుకాని, కర్మలను విడిచినవాడుకాని సన్న్యాసియు, యోగియు ఎన్నటికిని కానేరడు.

**వ్యాఖ్య:–** సన్న్యాసియనగా కొందఱు అగ్నిహోత్రమును త్యజించినవాడనియు, కాషాయాంబరములను ధరించినవాడనియు మాత్రమే తలంచుచుందురు. మఱికొందఱు యోగియనగా కర్మలన్నిటిని విడిచిపెట్టి ఏకాంతమున ఏ కొండగుహలోనే యుండువాడని భావించుదురు. కాని ఇవన్నియు బాహ్యచిహ్నములు. ఇంతమాత్రముచేత ఎవరును సన్న్యాసులనిగాని, యోగులనికాని చెప్పదగరు. లోనివాసనలు నశించవలెను. సంగము (Attachment) తొలగవలెను. ఫలాపేక్ష వీడవలెను. బాహ్యముతోబాటు అభ్యంతరముకూడ మారవలెను. అపుడే వారు సన్న్యాసులనికాని, యోగులనికాని చెప్పదగియుందురు – అని భగవానుడిచట చక్కగ నుపదేశించుచున్నాడు.

చేయదగిన కర్మములనే చేయుటయు, వానినిగూడ ఫలాపేక్షలేకుండ మాత్రమే చేయుటయు సన్న్యాసియొక్కయు, యోగియొక్కయు లక్షణమని యిట పేర్కొనబడెను. కావున కర్మలను బొత్తిగా వదలిపెట్టి సోమరులై, తమస్సునబడి ఏకాంతమున వ్యర్థముగ కాలము గడుపుచుండునట్టిగాని, లేక, కాషాయాంబరములను మాత్రము ధరించి, అగ్నిహోత్రమును విసర్జించి దేశద్రిమ్మరులై తిరుగునట్టిగాని మనుజులు సన్న్యాసులు, యోగులు యెన్నటికిని కానేరరని ఈ శ్లోకము స్పష్టముగ ఋజువుచేయుచున్నది. సన్న్యాసమునకు చిహ్నము కర్మఫలత్యాగమే యగును. సంగరాహిత్యమే యతీశ్వరునకు గుఱుతు. కాబట్టి ఒకడు వాస్తవముగ సన్న్యాసి అగునా కాదాయని పరీక్షించుట కాతని యాచరణచూచిన చాలును. ఇచట రెండు విషయములు ప్రస్తావించబడినవి –

(1) చేయదగిన కర్మనే ('కార్యం కర్మ') చేయుట

(2) దానినిగూడ ఫలాపేక్షలేకుండ మాత్రమే చేయుట.

అధర్మకార్యములను, శాస్త్రవిరుద్ధకార్యములను, పాపకార్యములను ఎన్నటికిని చేయరాదు. ధర్మకార్యములనే, శాస్త్రవిహితకార్యములనే, పుణ్యకార్యములనే చేయవలెను. వానినిగూడ ఫలాపేక్ష లేకుండ గావింపవలెను. ఇదియే మహోన్నతమగు ఆచరణ. అవ్విధముగ ప్రవర్తించువాడే వాస్తవమగు సన్న్యాసి. అట్లు

ప్రవర్తించువాడు గృహస్థుడైనను సన్న్యాసియేయగును. మఱియు సన్న్యాసులు పొందు ఉత్తమ ఫలముల నాతడున్ను పొందగల్గును. సన్న్యాసియగుటకు ఇచట ఒకానొక వర్ణముగాని, జాతిగాని, మతముగాని అవశ్యకమని చెప్పబడలేదు. పైన దెల్పిన సల్లక్షణములు రెండును (ధర్మాచరణ, నిష్కామాచరణ) గలిగియున్న చాలునని మాత్రమే వచింపబడినది.

**ప్ర:–** సన్న్యాసి అనగా నెవడు? యోగి యెవడు?

**ఉ:–** చేయదగిన కార్యములను ఫలాపేక్షలేకుండ చేయువాడే సన్న్యాసి; అంతియేకాని కేవలము అగ్నిహోత్రమును వదలినవాడు కాదు. మఱియు అట్టి లక్షణముగలవాడే యోగి; అంతియేకాని, కేవలము కర్మలను త్యజించినవాడు కాడు.

**అ॥** పైన దెల్పిన సన్న్యాసము, యోగము, రెండును ఒకటియేయని చెప్పుచున్నాడు -

## 2. యం సన్న్యాసమితి ప్రాహుర్యోగం తం విద్ధి పాణ్డవ
## న హ్యసన్న్యస్తసంకల్పో యోగీ భవతి కశ్చన.

**టీక:–** పాణ్డవ = ఓ అర్జునా!, యమ్ = దేనిని, సన్న్యాసమ్ ఇతి = సన్న్యాసమని, ప్రాహుః = చెప్పుదురో, తమ్ = దానిని, యోగమ్ (ఇతి) = యోగమని, విద్ధి = తెలిసికొనుము, హి = ఏలయనగా, అసన్న్యస్తసంకల్పః = (ఫలాపేక్షాకామక్రోధాదిరూప) సంకల్పమును వదలనివాడు, కశ్చన = ఎవడును, యోగీ = యోగి, న భవతి = కానేరడు.

**తా:–** ఓ అర్జునా! దేనిని సన్న్యాసమని చెప్పుదురో, దానినే యోగమని నెఱుగుము. ఏలయనగా, (కామాది) సంకల్పమును వదలనివాడు (సంకల్పరహితుడు కానివాడు) ఎవడును యోగి కానేరడు.

**వ్యాఖ్య:–** జ్ఞానయోగి ఆత్మానాత్మవివేచనచే దేహాది దృశ్యపదార్థములను గూర్చిన సంకల్పమును త్యజించి ఆత్మయందే స్థిరచిత్తుడైయుండును. కర్మయోగి కర్తృత్వమును వదలి, ఫలాపేక్షలేక, 'నేను, నాది' యను సంకల్పములనువీడి ఈశ్వరార్పణబుద్ధితో కర్మలను జేయును. ధ్యానయోగి బహిర్ముఖవృత్తులను త్యజించి అంతర్ముఖుడై పరమాత్మను ధ్యానించుచుండును. భక్తియోగి పరమాత్మయందుతప్ప తదితరవస్తువులందు ప్రీతిలేనివాడై వానినిగూర్చిన సంకల్పములను త్యజించి, దైవపరాయణుడై మెలగును. ఈ ప్రకారముగ అన్ని యోగములందును దృశ్యపదార్థములను గూర్చిన సంకల్పమును త్యజించుట ఇమిడియేయున్నది. మఱియు దైవపరాయణత్వమున్ను అన్నిటియందునుగలదు. కనుకనే భగవాను డీశ్లోకమున సన్న్యాసము (జ్ఞానయోగము), యోగము (నిష్కామకర్మయోగము, లేక భక్తియోగము) రెండును ఒకటియే యని బోధించుచున్నాడు. మఱియు కామక్రోధాదిసంకల్పములను ఫలాపేక్షాదిసంకల్పములను, వెయ్యేల దృశ్యపదార్థములను గూర్చిన సంకల్పములను వీడని వాడెవడును యోగి (జ్ఞానయోగికాని, కర్మయోగికాని, భక్తియోగికాని, ధ్యానయోగికాని) కానేరడని ఘంటా పథముగ చెప్పివైచిరి. కావున సంకల్పత్యాగమే నిజమైన సన్న్యాసము, నిజమైనయోగము అగును. అట్టి సంకల్పత్యాగములేక కేవలము కర్మలనుమాత్రము త్యజించి అక్రియుడై ఊరకనుండువాడు సన్న్యాసియనిగాని, యోగియనిగాని చెప్పదగడు.

**ప్ర:–** సన్న్యాసము, యోగము, వేఱువేఱా?

**ఉ:–** కాదు, రెండును ఒకటే. దేనిని సన్న్యాసమని చెప్పుదురో అదియే యోగమనియు నెఱుగవలెను.

**ప్ర:–** మనుజుడు యోగి యెపుడు కాగలడు?

**ఉ:–** దేహాది దృశ్యపదార్థములను గూర్చిన సంకల్పములను వదలినపుడు మాత్రమే. వానిని వదలనిచో నాతడు యోగిగాని, సన్న్యాసిగాని యెన్నటికిని కానేరడు.

**అ॥** సాధకునకు ప్రారంభదశలో కర్మ యావశ్యకమని తెలియజేయుచున్నాడు –

## 3. ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణముచ్యతే
## యోగారూఢస్య తస్యైవ శమః కారణముచ్యతే.

**టీక:–** యోగమ్ = యోగమును (జ్ఞానయోగమును లేక ధ్యానయోగమును), ఆరురుక్షోః = ఎక్కదలచిన, మునేః = మననశీలునకు, కర్మ = కర్మము, కారణమ్ = సాధనమని, ఉచ్యతే = చెప్పబడుచున్నది, యోగారూఢస్య = యోగమును (జ్ఞానయోగమును, లేక ధ్యానయోగమును) బాగుగ ఎక్కినట్టి (అధిష్ఠించినట్టి), తస్య ఏవ = వానికే, శమః = ఉపరతి (కర్మనివృత్తి), కారణమ్ = సాధనమని, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

**తా:–** యోగమును (జ్ఞానయోగమును, లేక ధ్యానయోగమును) ఎక్కదలంచిన (పొందగోరిన) మునికి (మననశీలునకు) కర్మ సాధనమనియు, దానిని బాగుగ ఎక్కినట్టి మునికి ఉపరతి (కర్మనివృత్తి) సాధనమనియు చెప్పబడినది.

**వ్యాఖ్య:–** జ్ఞానయోగమునుగాని, ధ్యానయోగమునుగాని సాధించుటకు నిష్కామ కర్మయోగము సాధనముగ చెప్పబడినది. ధ్యానయోగమందు లేక జ్ఞానయోగమందు ఒకింత నిలుకడనుబొందినవానికి దానియందింకను దృఢత్వమునొందుటకై కర్మనివృత్తి రూపమగు శమము (శాంతి, చిత్తోపరతి) సాధనముగ జెప్పబడినది. దీనినిబట్టి సాధకుడు ధ్యానయోగమందు ప్రవేశమును బొందుటకు వలసిన చిత్తశుద్ధికొఱకై నిష్కామకర్మ యోగమును ప్రారంభమున శీలించవలెననియు, ఆపిదప ధ్యానమందు ఒకింత నిలుకడ జేకూరినపుడు, ఇక కర్మానుష్ఠానమును తగ్గించుచు, కర్మనివృత్తిరూపచిత్తోపరతిని పెంచవలెననియు తెలియుచున్నది.

సాధకునకు చిత్తశుద్ధిని కలిగించువఱకు నిష్కామకర్మానుష్ఠానము ప్రారంభములో చాల ఉపకరించును. ధ్యానప్రవేశస్థితివఱకు అతనిని గొనిపోయి ఆపిదప కర్మానుష్ఠానమచటనే నిలిచిపోవును. ఆపిదప కర్మనివృత్తిరూప చిత్తోపరతి, శమము (శాంతి) అతనిని ఇంకను పైకి (ధ్యానారూఢస్థితికి) గొంపోవును. అనగా అత్తఱి బాహ్యకర్మనివృత్తి సంభవించి శ్రవణ, మనన, నిదిధ్యాసనరూప అంతరంగప్రయత్నములు ప్రారంభించునని యర్థము. ఆ సమయమున అతనిచిత్తము ఇక కర్మకలాపములందు ప్రీతిగొనక కర్మనివృత్తియందే ప్రీతిగొనును. దృష్టిని బహిర్ముఖముగ పోనీయక, అంతర్ముఖమొనర్చి చిత్తశాంతిని గోరుచుండును. అట్టి శమమే అతనికి ధ్యానయోగమందు క్రమముగ నిస్సంకల్పస్థితిని కలిగించి ఆత్మస్వరూపానుభవమునకు తీసికొనిపోవును.

కాబట్టి అధ్యాత్మరంగమున ప్రారంభస్థితిలో ప్రతివారును పుణ్యకర్మాచరణ, నిష్కామకర్మసాధన

తప్పకచేయవలసినదే. అట్లు చేయనిచో చిత్తమున తమస్సు, సోమరితనము ప్రవేశించుటచే నది జడప్రాయమై జ్ఞానయోగమందుగాని, ధ్యానయోగమందుగాని ప్రవేశించుట కనర్హమైయుండును. కురుపుపై ఏర్పడిన పక్కు కాలక్రమమున దానియంతటనది రాలవలసినదేకాని, బలాత్కారముగ ఊడదీసినచో పుండు పెద్దదై చెరుపుచేయును. అట్లే ధ్యానమందు నిలుకడకలిగినపుడు కర్మ దానియంతటనదియే తొలగిపోవును. అపరిపక్వదశలోనే దానిని తొలగించినచో లక్ష్యప్రాప్తి చేకూరదు. కావున ప్రారంభమున సత్కార్యములను చేయుచురాగా చిత్తముశుద్ధమై ధ్యానమందెపుడు ఒకింత నిలుకడ ఏర్పడునో, అపుడిక కర్మానుష్ఠానమును తగ్గించి, ఉపరతిని (శమమును) అవలంబించి ముందునకు కొనసాగవలెను. మనస్సు నంతర్ముఖమొనర్చి విచారణాధ్యానాదులను గావింపవలెను. అపుడు క్రమముగ ధ్యానమం దారూఢత్వము కలిగి ఆత్మస్వరూపానుభవము కలుగగలదు.

(1) ఆరురుక్షువు – High School Course – ప్రారంభదశ

(2) యోగారూఢయత్నపరుడు - College Course - మధ్యమదశ

(3) యోగారూఢుడు – Graduate – అంతిమదశ

ఇందు మొదటి యిరువురుసాధకులనుగూర్చియు ఈ శ్లోకమందు వచింపబడినది. ప్రథమదశయందు బాగుగ అనుభవముపొందనిదే మధ్యమదశయందుగాని, అంతిమదశయందుగాని విజయమునుపొందలేడు. ప్రాథమిక పాఠశాలలో విద్యయందారితేరనివాడు ఉన్నతపాఠశాల యందలి విద్యను గడింపజాలడుగదా! కాబట్టి అధ్యాత్మరంగమున నడక ప్రారంభించిన వాడు కర్మలనువదలక నిష్కామముగా వానినాచరించుచు, కొంతపరిపక్వదశ ఏర్పడినపుడు కర్మనివృత్తినవలంబించి అంతర్ముఖుడై ముందునకు సాగవచ్చును. చిత్తము అంతర్ముఖమైనపుడు కర్మ ఆచరించుటకు గూడ సాధ్యపడదు. అత్తఱి కర్మ భారభూతముగతోచును. కర్మనివృత్తికి అదియే సరియైనలగ్నము. అంతకుముందు కాదు. ఈ విషయమును సాధకులు బాగుగా జ్ఞప్తియందుంచుకొనవలెను.

**అ॥** యోగారూఢుని లక్షణములను వచించుచున్నాడు –

## 4. యదా హి నేన్ద్రియార్థేషు★ న కర్మస్వనుషజ్జతే
## సర్వసంకల్పసన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే.

**టీక:–** యదాహి = ఎప్పుడైతే, ఇన్ద్రియార్థేషు = శబ్దాది విషయములందు, న అనుషజ్జతే = ఆసక్తినుంచడో, కర్మసు = కర్మలయందును, న *(అనుషజ్జతే)* = ఆసక్తుడుకాడో (తగుల్కొనడో), సర్వసంకల్పసన్న్యాసీ *(భవతి)* = సమస్తసంకల్పములను విడిచిపెట్టునో, తదా = అప్పుడు, యోగారూఢః = యోగారూఢుడని, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

**తా:–** ఎపుడు శబ్దాదివిషయములందును, కర్మలందును, ఆసక్తినుంచడో, సమస్త సంకల్పములను విడచిపెట్టునో అపుడు మనుజుడు యోగారూఢుడని చెప్పబడును.

**వ్యాఖ్య:–** 'యదా, తదా' అను రెండు పదములు ప్రయోగించుటవలన, పైన దెల్పిన మూడు లక్షణములెపుడు మనుజుడు గలిగియుండునో అపుడే యాతనికి యోగారూఢత్వము సిద్ధించునని భావము.

★ చేంద్రియార్థేషు – (పాఠాన్తరము)

అంతకుపూర్వముకాదు. ఆ మూడు లక్షణము లెవ్వియనిన - (1) ఇంద్రియార్థములగు శబ్దస్పర్శాది విషయములందాసక్తి లేకుండుట. (2) కర్మలందును ఆసక్తుడు కాకుండుట. (3) సమస్త సంకల్పములను విడిచిపెట్టుట - ఒకడు యోగారూఢుడైనది కానిది, పరిపూర్ణ ధ్యాననిష్ఠుడైనది కానిది ఈ పరీక్షవలన సులభముగ తెలిసికొనవచ్చును. ధ్యానమందు, యోగమందు పరిపూర్ణతను బొందినట్లు తలంచువారు ఈ మూడులక్షణములు తమకు చేకూరినవాయని విచారించుకొనవలెను.

(1) ఇంద్రియార్థములగు విషయాదులం దాసక్తి గలిగియున్నవారికి ధ్యానమందేకాగ్రత కుదురదు. వానియందు విరక్తిగలిగియున్నపుడుమాత్రమే మనస్సు బయటకు పరుగెత్తక అంతర్ముఖమై ఏకాగ్రతను బొందగలదు. కనుకనే విషయాదులం దాసక్తి లేనివాడు మాత్రమే యోగారూఢుడు కాగలడని యిచట చెప్పబడినది. (2) ఇక రెండవది కర్మలందాసక్తతలేకుండుట. అంతరంగమున చిత్తము ఆత్మయందే ప్రీతిగొనునపుడు, ఇక బాహ్యసంబంధమగు ఏ కర్మయును రుచింపదు. పైగా ఇంద్రియములు, మనస్సు అంతర్ముఖములై ఉపరతిని బొందియుండుటచే కర్మప్రవృత్తియును అత్తఱి సంభవింపదు. అయితే ఇది సాధనయొక్క ఉన్నతదశలో చెప్పబడిన విషయమే యగును. సాధనపూర్తిఅయి, సాధ్యవస్తువు (ఆత్మ) లభించిన పిదపయు కొందఱు జీవన్ముక్తులు లోకోపకారార్థము కార్యములను అసక్తముగ నాచరించుచునేయుందురు. (3) ఇక మూడవది సర్వసంకల్పసన్న్యాసము. సంకల్పములు మూడువిధములు - (1) మలినసంకల్పము (2) శుద్ధసంకల్పము (3) నిస్సంకల్పము (సంకల్పరాహిత్యము) సాధన ప్రారంభదశలో శుద్ధసంకల్పములచే మలినసంకల్పములను నిర్మూలించుచుండవలెను. అనగా శాస్త్ర సజ్జన సంపర్కాదులచే జన్యమగు పవిత్ర (పుణ్య) సంకల్పములచే పూర్వపు పాపసంకల్పములను కడిగివేయవలెను. చిత్తమందు పూర్ణముగ శుద్ధసంకల్పములే, దైవసంకల్పములే యుండులాగున చూడవలయును. ఆ వెనుక ఇంకను ఒకమెట్టు పైకిపోయి సంకల్పరహితమగు ఆత్మయందు నిలుకడను బొందుచు నిస్సంకల్పత్వమును జెందవలెను. అనగా అత్తఱి దృశ్యపదార్థములగూర్చిన ఏ విధమైన సంకల్పమున్ను ఉండదు. చిత్తము కేవలము ఆత్మాకారముగ వెలయుచుండును. 'సర్వసంకల్ప సన్న్యాస' స్థితి యనగా శూన్యమని యెవరును భావించరాదు. ఏలయనగా అపుడు ప్రజ్ఞాన రూపమగు ఆత్మచైతన్యము మేలుకొనియే యుండును. చిత్తమద్దాని యందు లయమై, అంతర్హితమై యుండును. (సమాధినుండి వ్యుత్థానదశకు వచ్చిన పిదప అట్టి మహనీయులలో కొందఱు బ్రహ్మాకారవృత్తిని వదలకయే శుద్ధసంకల్పము నాశ్రయించి లోకోపకార కార్యములను జేయుచుందురు.)

ఈ ప్రకారముగ పైనదెల్పిన మూడు లక్షణములను సాధకుడు బాగుగ నభ్యసించి క్రమముగ యోగారూఢుడై పఱగినచో జీవితము ధన్యముకాగలదు.

**ప్ర:–** యోగారూఢుని లక్షణము లెవ్వి?

**ఉ:–** (1) ఇంద్రియార్థములగు శబ్దస్పర్శాదివిషయములం దాసక్తి లేకుండుట.

(2) కర్మలయం దాసక్తుడు కాకుండుట.

(3) సమస్తసంకల్పములను త్యజించి ఆత్మమాత్రమందు స్థితిగల్గియుండుట.

**అ॥** (అట్టి యోగారూఢస్థితిని బొందుటకై) తన్ను తానే యుద్ధరించుకొనవలెనని తెలుపుచున్నాడు -

**5. ఉద్ధరేదాత్మనాఽఽత్మానం నాత్మానమవసాదయేత్**
**ఆత్మైవ హ్యాత్మనో బన్ధురాత్మైవ రిపురాత్మనః.**

**టీక:–** ఆత్మనా = తనచేత, ఆత్మానం = తన్ను, ఉద్ధరేత్ = ఉద్ధరించుకొనవలెను, ఆత్మానమ్ = తన్ను, న అవసాదయేత్ = అధోగతిని బొందించుకొనగూడదు, హి = ఏలయనగా, ఆత్మనః = తనకు, ఆత్మైవ = తానే, బన్ధుః = బంధువు, ఆత్మనః = తనకు, ఆత్మైవ = తానే, రిపుః = శత్రువు...

**తా:–** తన్నుతానే యుద్ధరించుకొనవలెను. తన్ను అధోగతిని బొందించుకొన గూడదు. ఏలయనగా, (ఇంద్రియమనంబులను జయించినచో) తనకు తానే బంధువున్ను, (జయింపనిచో) తనకుతానే శత్రువున్ను అగును.

**వ్యాఖ్య:–** ప్రతిజీవుడున్ను తన్నుతానే యుద్ధరించుకొనవలసినదిగా భగవానుడుద్బోధించుచున్నారు. గురువులు, శాస్త్రములు, దైవము దారిచూపుదురేకాని నడవవలసినది తానే. తనకాళ్ళతో తాను నడవవలెను. తనకండ్లతో తాను చూడవలెను. తన ఆకలిని తానే పోగొట్టుకొనవలెను.

'God helps those who help themselves'

అని పెద్దలు చెప్పునట్లు తమ్ముతాము ఉద్ధరించుకొనజూచువారికి మాత్రమే భగవానుడు సహాయముచేయును. సోమరులై, ఒకింతైనను ఇంద్రియనిగ్రహము, వైరాగ్యము లేక భోగపరాయణులై – 'దేవుడే మాకు మోక్షము నిప్పించు' ననుకొనుటగాని, 'గురువే తమను కైవల్యధామమునకు గొనిపోవు' ననుకొనుటగాని వెఱ్ఱి. భగవంతుడుగాని, శాస్త్రములుగాని, గురువులుగాని సోమరులకు, అకర్మణ్యులకు ఉచితముగ మోక్షమునకు ప్రవేశపత్రము (Passport) ను తీసియిచ్చుటకై కూర్చొనియున్నవారుకాదు. సామాన్యముగ ఒక చిన్నవస్తువును బజారులో కొనవలెననిన కొంతమూల్యమును చెల్లించ వలసివచ్చును. ఆ వస్తువుయొక్క విలువనుబట్టి దానిఖరీదున్ను అధికముగా నుండును. అట్టిచో మోక్షము, దుఃఖరాహిత్యము, జననమరణరూప బంధవిచ్ఛేదము, పరమానంద ప్రాప్తియను వస్తువు నభిలషించువాడు దానికెంత విలువను చెల్లింపవలసియుండును? సోమరిగానుండియున్నచో అది సాధ్యపడునా? ఎంతయో త్యాగము, ఎంతయో సాధన, ఎంతయో ఇంద్రియనిగ్రహము దానికి అవసరము. అట్టి అధ్యాత్మసాధనరూప మూల్యమును జీవుడు చెల్లించనిదే సాక్షాత్ పరమేశ్వరుడుకూడ జీవున కేమియు నొసంగజాలడు. కావున కొంతశ్రమపడవలెను. పెద్దలు బోధించిన మార్గమును అనుసరింపవలెను. తన్నుతానే యుద్ధరించుకొనవలెను. ఈసత్యమునే భగవాను డీశ్లోకమున స్పష్టముగ చెప్పివైచిరి.

మహాత్ములగువారు ఎంతయో శ్రమపడి కష్టములకోర్చి, శీతోష్ణాది ద్వంద్వములను సహించుచు ఎన్నియోవత్సరములు కఠోరములగు సాధనలను జేసి తమచిత్తమును, ఇంద్రియములను తామే నిగ్రహించుకొని ధన్యులైరి. అట్లే తక్కినవారున్ను ప్రయత్న పూర్వకముగ తమ చిత్తమును తామే వైరాగ్యబోధోపరతులద్వారా శుద్ధపఱచవలెను. అట్లు శుద్ధపడిన మనస్సే జనులను సంసారమను గోతినుండి పైకితీయగలదు. గురువు శిష్యునకుపదేశించుట సంప్రదాయమును పాలించుటకొఱకే కాని అసలు చేయవలసిన పనియంతయు శిష్యునిచేతిలోనే యున్నదని వసిష్ఠమునీంద్రులు శ్రీరామచంద్రునకు చెప్పియున్నారు. మనుజుడు తనరోగమునకు తానే మందుతిని ఎట్లు నయము చేసికొనుచున్నాడో, తన ఆకలిని తానే అన్నము భుజించి ఎట్లు తీర్చుకొనుచున్నాడో, అట్లే భవరోగపీడితుడగు జీవుడు తానే స్వయముగ సాధనజేసి తరించవలెను. 'ఉద్ధరేదాత్మనాత్మానమ్' అనుదాని యర్థమిదియే.

మఱియు తన్నుతాను అధోగతిని బొందించకుండులాగున చూచుకొనవలెను. ప్రపంచములో తనయొక్క

ఉద్ధారకులు బంధుమిత్రాదులు కాదు; మఱెవ్వరునుగాదు. తనయొక్క శుద్ధమనస్సే తనయొక్క ఉద్ధారకుడు. విషయరాహిత్యముగల్గి, దృశ్యవాసనలెవ్వియు లేకుండు తన నిర్మలచిత్తమే తన యుద్ధారకుడు. అట్లే తనయొక్క మలినమనస్సే తనకు పతనమును గలుగజేయును గాన అదియే తన శత్రువు. మనస్సు, ఇంద్రియములు వశమందున్నచో అవియే బంధువులు. వశమందులేనిచో అవియే శత్రువులు - ఈ సత్యమునే భగవాను డీ శ్లోకమందును, రాబోవు శ్లోకమందును నిరూపించిరి.

సామాన్యముగ ప్రతివానికిని మనస్సునందు రెండు భాగములుండును. ఒకటి మంచి భాగము, మఱియొకటి చెడ్డభాగము. ఒకటి ధర్మమువైపు ఈడ్చునది, మఱియొకటి అధర్మమువైపు ఈడ్చునది. వీనిలో మొదటిదానిచే రెండవదానిని ప్రయత్నపూర్వకముగ నోడించి అద్దానిని ధర్మమువైపు త్రిప్పుకొనవలెను. ఇది పురుషప్రయత్నముచే సాధ్యపడును. ఈ ప్రకారముగ తన్ను తానుద్ధరించుకొనవలెను. బంధువు తనయందే కలడు. శత్రువు తనయందే కలడు. శుద్ధచిత్తమే బంధువు; వశీకృతమనస్సే బంధువు. కావున దానినే ఆశ్రయించవలెను. అది జీవునకు మహోపకారము చేయగలదు. అట్లే మలినచిత్తము, అవశీకృతమనస్సు తనకు శత్రువు. అది తనకు మహాపకారము చేయగలదు. బాహ్యశత్రువు ఈ జన్మయందు మాత్రము హింసింపగలడు. అంతఃశత్రువగు మలినచిత్తమో, జన్మజన్మాంతరము జీవుని వెంబడించి బాధించును. కావున అట్టి అంతఃశత్రువును ప్రయత్నముచే మొట్టమొదట తొలగించుకొని పరమశాంతి నొందవలెను.

'ఉద్ధరేత్' - (తన్ను తానుద్ధరించుకొనవలయును) అని చెప్పినందువలన జీవునకు ప్రారబ్ధమనునది అడ్డుగా నుండదనియు, తన్నుతానెల్లప్పుడును ఉద్ధరించుకొనుటకు వీలున్నదనియు బోధించినట్లైనది.

**ప్ర:-** ఈ సంసారమున జీవుని ఉద్ధరించువారెవరు?

**ఉ:-** తన్నుతానే యుద్ధరించుకొనవలెను. తన్ను అధోగతిని పొందించుకొనరాదు.

**ప్ర:-** మనుజునకు బంధువెవరు? శత్రు వెవరు?

**ఉ:-** తనకు తానే బంధువు (తన మనస్సును తాను జయించినచో), తనకు తానే శత్రువు (తన మనస్సును తాను జయించనచో).

**అ॥** పై విషయమునే విపులీకరించుచున్నాడు -

## 6. బన్ధురాత్మాత్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః
## అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్.

**టీక:-** యేన = ఎవనిచేత, ఆత్మనైవ = తనచేతనే (తన వివేకముచే), ఆత్మా = మనస్సు, జితః = జయింపబడినదో, తస్య = అట్టివాని, ఆత్మా = మనస్సు, ఆత్మనః = తనకు, బన్ధుః = బంధువు, అనాత్మనస్తు = మనస్సును జయింపనివానికైనచో, ఆత్మా = తన మనస్సే, శత్రువత్= శత్రువువలె, శత్రుత్వే ఏవ = అపకారమందే, వర్తేత = ప్రవర్తించును.

**తా:-** ఎవడు (వివేకవైరాగ్యాదులచే) తన మనస్సును తాను జయించుకొనునో, అట్టి జయింపబడిన మనస్సు తనకు బంధువుపగిది నుండును (ఉపకారము చేయును). జయింపనిచో, అదియే శత్రువుపగిది నుండును (అపకారముచేయును).

**వ్యాఖ్య:–** క్రిందటి శ్లోకమునందు సూక్ష్మముగ తెలిపిన యంశమునే ఇచట విశదముగ తెలియజేయుచున్నాడు. మనుజునకు బంధువు, శత్రువు, ఇరువురును తనయందేయున్నారు. జయింపబడిన మనస్సే బంధువు. అది జీవుని జనన మరణ సంసార సముద్రమునుండి యుద్ధరించును. శాంతిని గలుగజేయును. సచ్చిదానందాత్మను పొందింపజేయును. ఈ ప్రకారముగ అది జీవునకు మహత్తరమైన ఉపకారమును గలుగజేయుచున్నది. బాహ్యబంధువులు ఒకింత ఉపకారముచేసినను, స్నేహరాగాదుల మూలమున అధ్యాత్మమార్గమున అడ్డుగనే యుండుచున్నారు. లోనిబంధువగు సంయమ చిత్తమట్లుకాదు. అది మోక్షప్రాప్తిరూప శాశ్వత ఉపకారమునే చేయును. అట్లే జయింపబడని మనస్సు శత్రువుగ వ్యవహరించుననియు చెప్పబడినది. ఏలయనిన అది జీవుని భవారణ్యమున త్రోసివైచి, కామక్రోధాది ఘోరజంతువులకు బలియొసంగి జన్మజన్మాంతర మాతనిని నాశమొనర్చును. కావున జీవుడు ప్రయత్నపూర్వకముగ వివేకాదులచే తన మనస్సును జయించుకొని, శత్రువును మిత్రునిగా మార్చుకొని, బంధువుగ నొనర్చుకొని అతనిద్వారా ముక్తిధామమునుజేరి సుఖించవలెను.

ఆత్మా:– అను దానికి అర్థము కేవలము మనస్సనియేకాదు; ఇంద్రియములు, శరీరము – అనికూడ చెప్పవలయును.

ఆత్మానా జితః:– అని చెప్పుటవలన తన మనస్సును తానే జయించుకొనవలెనని స్పష్టమగుచున్నది.

**ప్ర:–** మనుజునకు బంధువెవడు?

**ఉ:–** తనచే స్వాధీనపఱచుకొనబడిన తన మనస్సే తనకు బంధువు.

**ప్ర:–** శత్రువెవడు?

**ఉ:–** అట్లు తనచే జయింపబడని తన మనస్సే తనకు శత్రువు.

**అ॥** ఆ ప్రకారముగ దేహేంద్రియమనంబులను స్వాధీనపఱచుకొనుటవలన కలుగు ఫలితమును జెప్పుచున్నాడు –

**7. జితాత్మనః ప్రశాన్తస్య పరమాత్మా సమాహితః**
**శీతోష్ణ సుఖదుఃఖేషు తథా మానావమానయోః.**

**టీక:–** జితాత్మనః = జయింపబడిన మనస్సుకలవాడును, ప్రశాన్తస్య = పరమశాంతితో గూడినవాడునగు మనుజునకు, శీతోష్ణసుఖదుఃఖేషు = శీతోష్ణ, సుఖదుఃఖాది ద్వంద్వములందును, తథా = అటులనే, మానావమానయోః = మాన, అవమానములందును, పరమాత్మా = పరమాత్మ, సమాహితః = అనుభవమునందే యుండును. నిలుకడజెందియుండును (లేక, ఆత్మ = మనస్సు, పరమ్ = మిక్కుటముగ, సమాహితః = ఆత్మానుభవమందే యుండును – అనియు చెప్పవచ్చును).

**తా:–** మనస్సును జయించినవాడును, పరమశాంతితో గూడినవాడునగు మనుజునకు శీతోష్ణ, సుఖదుఃఖాదులందును, అట్లే మానావమానములందును పరమాత్మానుభవము చెక్కుచెదరకనేయుండును. (లేక, అట్టివానికి శీతోష్ణాదులందును మనస్సు లెస్సగ ఆత్మానుభవమందేయుండును).

**వ్యాఖ్య:–** సామాన్యులయొక్క మనస్సు శీతోష్ణములు, సుఖదుఃఖములు, మానావమానములు తటస్థించినపుడు తలక్రిందులగుచుండును. అది తన సమత్వము (balance) ను పోగొట్టుకొని చపలమగుచుండును. సుఖముగలిగినపుడు పొంగిపోవుటయు, దుఃఖము కలిగినపుడు క్రుంగిపోవుటయు, అట్లే ఎవరైన తననుస్తోత్రముచేయునపుడు ఉబ్బిపోవుటయు, నిందించినపుడు దిగులునొందుటయు సంభవించుచుండును. ఈ ప్రకారముగ అజ్ఞానియగు జీవుడు ద్వంద్వములకు దాసుడై, వాని చెప్పుచేతలలో మెలగుచు, వాని దయాదాక్షిణ్యములపై బ్రతుకుచున్నాడు. కనుకనే ఒక్కక్షణకాలమైనను అతని చిత్తము నిలుకడలేక, శాంతినొందకున్నది. కాని మనస్సును, ఇంద్రియములను జయించినవానిస్థితి యట్లుండదు. అట్టి ఎన్ని ద్వంద్వములు తటస్థించినప్పటికిని అతని చిత్తము నిశ్చలముగను, ప్రశాంతముగను నున్నదై, పరమాత్మయందే నిలుకడ జెందియుండునని యిచట వచింపబడినది. సముద్రతరంగములుగాని, పిల్లవాయువులుగాని మహాపర్వతమును కదలింప జేయజాలనట్లు ఆయాసుఖదుఃఖాదులు జితమానసుని చలింపజేయజాలవు. ఆతడెల్లపుడు పరమాత్మయందే సుస్థితుడై మహత్తరశాంతి ననుభవించుచుండును. కావున అభ్యాసవైరాగ్య వివేకాదులద్వారా ఇంద్రియమనంబులనెట్లైనను జయించుట అతిముఖ్యమని ఈ శ్లోకముద్వారా తెలియుచున్నది.

కొందఱు 'ప్రశాన్తస్య' అను పదమును శీతోష్ణాదులకు అన్వయించి 'శీతోష్ణ సుఖదుఃఖాదులందు చలించక పరమశాంతుడై యుండువానికి మనస్సు పరమాత్మాను భవమునందే యుండును' అని అర్థముచెప్పిరి. భావము అంతయు ఒకటే.

**ప్ర:–** ఎవనియొక్క చిత్తము శీతోష్ణాది ద్వంద్వములందు నిశ్చలముగ నుండును?

**ఉ:–** ఇంద్రియమనంబులను జయించినవానియొక్కయు, ప్రశాంతహృదయునియొక్కయు చిత్తము ద్వంద్వములందు నిశ్చలముగ నుండును.

**ప్ర:–** కావున మనోజయమువలన కలుగు గొప్పఫలితమేమి?

**ఉ:–** మనోజయము కలవాడు శీతోష్ణసుఖదుఃఖాది ద్వంద్వములందు చలింపక, సదా పరమాత్మయందే నిలుకడకలిగియుండును. తత్ఫలితముగ పరమశాంతినే ఎల్లపు డనుభవించుచుండును.

**అ॥** అట్లు పరమాత్మయందు నిలుకడకలిగియున్నవాని లక్షణములను రెండు శ్లోకములద్వారా చెప్పుచున్నాడు –

## 8. జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేన్ద్రియః
## యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మ కాంచనః.

**టీక:–** జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా = శాస్త్రజ్ఞానముచేతను, అనుభవజ్ఞానముచేతను తృప్తినొందిన మనస్సుగలవాడును, కూటస్థః = నిర్వికారుడు (చలింపజేయ నలవికానివాడు) ను, విజితేన్ద్రియః = ఇంద్రియములను లెస్సగ జయించినవాడును, సమలోష్టాశ్మకాంచనః = మట్టిగడ్డ, ఱాయి, బంగారము అనువానిని సమముగ జూచువాడును (అగు), యోగీ = యోగనిష్ఠుడు, యుక్తః = యోగారూఢుడు (ఆత్మానుభవముతో గూడినవాడు), ఇతి = అని, ఉచ్యతే = చెప్పబడును.

**తా:–** శాస్త్రజ్ఞాన, అనుభవజ్ఞానములచే తృప్తినొందిన మనస్సుగలవాడును, నిర్వికారుడును, ఇంద్రియములను లెస్సగ జయించినవాడును, మట్టిగడ్డ, ఱాయి, బంగారము అను మూడిటిని సమముగ జూచువాడునగు యోగి యోగారూఢుడని (ఆత్మానుభవయుక్తుడని) చెప్పబడును.

**వ్యాఖ్య:–** యోగమనగా కలయిక, జీవబ్రహ్మైక్యము. అట్టి ఐక్యమును గలిగించు ప్రయత్నమున్ను యోగమనియే చెప్పబడును. అట్టి ప్రయత్నము నాచరించువాడు యోగి. యోగులనేకులున్నను అందు ఆరూఢస్థితి నొందినవారు చాలయరుదు. అట్లు ఆరూఢస్థితినొందిన ఉత్తమయోగులయొక్క లక్షణములెవ్వియో ఈ శ్లోకమున వివరింపబడినవి. ఒకానొకడు పరిపక్వదశనొందెనా, లేదా యని ఈ గుఱుతులవలన తెలిసికొనవచ్చును.

అవి యేవియనిన – (1) జ్ఞాన, విజ్ఞానములచే తృప్తినొందుట

(2) కూటస్థుడై (నిర్వికారుడై) యుండుట

(3) ఇంద్రియములను లెస్సగ జయించుట

(4) మట్టిగడ్డ, ఱాయి, బంగారము – వీనిని సమముగ జూచుట

ఈ నాలుగు లక్షణములు సాధకునకు అత్యంతావశ్యకములు గనుక వానిని గుఱించి ఒకింత యోచించెదము –

(1) గీతయందు భగవాను డచటచట జ్ఞాన విజ్ఞానములను వేఱ్వేఱుగ చెప్పుకొనిపోవుట గమనించదగియున్నది. జ్ఞానమనగా శాస్త్రాదులద్వారా, గురూపదేశముద్వారా, పెద్దల బోధలద్వారా తత్త్వమిట్టిదియని తెలిసికొనుట. విజ్ఞానమనగా అట్టి తత్త్వమును పూర్ణముగ అనుభూత మొనర్చుకొనుట. జ్ఞానమనునది పాకశాస్త్రమును నేర్చుకొనుటవంటిది. విజ్ఞానము ఆ పాకశాస్త్రము అమలుపఱచి అన్నమువండి భుజించుట వంటిది. అపుడే ఆకలితీరును. రెండును అవసరములే. మున్ముందు పరమాత్మయొక్క తత్త్వమిట్టిదియని యెఱింగి ఆ పిదప దానిని సాక్షాత్కరించుకొనవలెను. మొదటిది జ్ఞానము, రెండవది విజ్ఞానము. జనులలో కొందఱు జ్ఞానమాత్రముతో తృప్తినొందుచున్నారు. అది చాలదనియు, విజ్ఞానమునుగూడ బడసి జ్ఞాన విజ్ఞానముల రెండిటితో తృప్తిని బడయవలెననియు, అట్టివాడే యోగారూఢుడనియు, ఉత్తమయోగియనియు నిచట వచింపబడినది. (లోకములో కొందఱు ధనమును, కొందఱు అధికారమును, మఱికొందఱు విషయభోగములను బొంది తృప్తిపడుచున్నారు. వీరందఱు తక్కువవారు. జ్ఞాన, విజ్ఞానములతో తృప్తినొందువాడే సర్వోత్తముడు.)

(2) ఇక రెండవ లక్షణము కూటస్థత్వము. అనగా నిశ్చలత్వము, నిర్వికారత్వము. కూటమనగా కంసాలియొక్క దాగిలి. దానిపై స్వర్ణకారు డెన్నియో ఆభరణములను తయారుచేసినను, అది నిశ్చలముగ, నిర్వికారముగ నుండును. అట్లే యెవని మనస్సు సుఖదుఃఖాదులు, లాభనష్టములు, మానావమానములు లెక్కలేనన్ని గలిగినను వికారమునొందక సమస్థితియందుండునో ఆతడే కూడస్థుడని చెప్పబడును. అట్టివాడే ఉత్తమయోగి; లేక కూటస్థుడనగా ఆత్మయనియు చెప్పవచ్చును. 'కూటస్థో౽క్షర ఉచ్యతే' అని గీతయందొకచోట పేర్కొనబడియున్నది కదా! అట్టి కూటస్థాత్మతో ఏకత్వము నొందినవాడే యోగారూఢుడని యర్థము.

(3) మూడవలక్షణము విజితేంద్రియత్వము. అనగా ఇంద్రియ, మనంబులను జయించుట.

'జితేంద్రియః' అనిచెప్పక 'విజితేంద్రియః' అని చెప్పుటవలన ఇంద్రియములను బాగుగ నిగ్రహించవలెనని భావము. వాసనలు ఏ మాత్రము శేషించియున్నను అవి తిరిగి సాధకుని రెచ్చగొట్టగలవు గనుక వానిని సమూలముగ ద్రుంచివైచి ఇంద్రియమనంబులను పరిపూర్ణముగ అదుపులోనుంచుకొనువాడే విజితేంద్రియుడు. ఇక్కార్యమున తత్త్వవిచారణ చక్కగ సహాయపడగలదు. కావున వివేకవైరాగ్యాదులచే ఇంద్రియములను లెస్సగ నిగ్రహించి యోగారూఢత్వము నొందవలయును.

(4) ఇక యోగారూఢుని నాల్గవలక్షణము సమదృష్టి. మట్టిగడ్డ, ఱాయి, బంగారము వీనిని సమముగజూచుట. మట్టిని, రాతిని సమముగ జూచుటలో ఏ కష్టమున్ను లేదు. కాని ఱాతిని బంగారమును సమముగజూచుటలో ప్రయాసముకలదు. కొన్ని ఉపాయములచేత అట్టిస్థితి చేకూరగలదు. అవియేవియనిన -

(1) ఈ ప్రపంచమున సమస్తపదార్థములున్ను పంచభూతములయొక్క వికారములే అయియున్నవి. చెట్టు, పుట్ట, సూర్యుడు, చంద్రుడు, దేహము, ఱాయి, బంగారము - అన్నియు పంచభూతాత్మకములే. ఈ సత్యమును బాగుగ నెఱిగిన విజ్ఞానికి ప్రపంచములో ఏ వస్తువునుజూచినను వెంటనే వాని యధిష్ఠానములగు పృథివ్యాది పంచభూతములుకాని, లేక పంచభూతములకు ఆధారమగు పరమాత్మకాని జ్ఞప్తికివచ్చుటవలన వానియందు సమత్వమునే వీక్షించును. (2) ఈ ప్రపంచమున ఒక వస్తువునందు విలువను, మఱియొక వస్తువునందు విలువలేమిని కల్పించినది వారివారి మనస్సే. మట్టి అధికముగ లభించుటచే దానికి మూల్యరాహిత్యమున్ను, బంగారు తక్కువగ లభించుటచే దానికి గొప్ప మూల్యమున్ను మనస్సే కల్పించినది. చంటిపిల్లవానియెదుట బంగారు పెట్టినచో అట్టి మనఃకల్పన లేనందున దాని నాతడు లెక్కసేయకుండును. అట్లే జ్ఞానికి భేద జనకమగు మనఃకల్పన లేనందువలన మట్టి, ఱాయి, బంగారు అను మూడువస్తువులేకాక, సమస్తపదార్థములును అతనికి సమముగనే తోచును. (3) ఆరూఢస్థితిని బడసినయోగికి బ్రహ్మము (ఆత్మ) ఒకటియే సత్యముగను దృశ్యమంతయు స్వప్నమువలె మిథ్యగను తోచును. కావున లేని ఈ జగత్తునందు ఒకటి అల్పమేమి? ఒకటి అధికమేమి? స్వప్నమందు రాజు, సామాన్యపౌరుడు ఒకటియే యగునట్లు ఉత్తమయోగికి ఱాయి, బంగారు మొదలైన మిథ్యారూపదృశ్యవస్తువు లన్నింటి యందును సమత్వమే గోచరించును. (4) ఆత్మప్రాప్తికి మట్టి ఉపయోగింపదు. అట్లే బంగారుమున్ను ఉపయోగపడదు. ఈ సత్యమెఱిగినందువలన యోగిదృష్టిలో ఆ రెండును సమముగనేయుండును.

ప్ర:- ఆరూఢస్థితినొందిన ఉత్తమయోగియొక్క లక్షణములెవ్వి?

ఉ:- (1) శాస్త్రజ్ఞాన, అనుభవజ్ఞానములు రెండును గలిగి, వానిచే తృప్తినొందియుండుట.

(2) నిర్వికారుడై (కూటస్థుడై) యుండుట.

(3) ఇంద్రియ మనంబులను లెస్సగ జయించుట.

**అ॥** చివఱిలక్షణమగు అట్టి సమదృష్టినే ఇంకను వివరించి చెప్పుచున్నాడు -

## 9. సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థ ద్వేష్య బన్ధుషు
## సాధుష్వపి చ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే.

**టీక:-** సుహృత్ = ప్రతిఫలమును గోరక ఉపకారము చేయువారియందు, మిత్ర = ప్రతిఫలము గలుగునని తలంచి ఉపకారము చేయువారియందు, అరి = శత్రువులందు, ఉదాసీన = తటస్థులయందు,

మధ్యస్థ = మధ్యవర్తులయందు, ద్వేష్య = ద్వేషింపబడదగినవారియందు (విరోధులందు), బన్ధుషు = బంధువులందు, సాధుషు అపి = సజ్జనులయందును, పాపేషు చ = పాపులందును, సమబుద్ధిః = సమభావముగలవాడు, విశిష్యతే = శ్రేష్ఠుడగుచున్నాడు.

**తా:–** ప్రత్యుపకారమును గోరకయే మేలొనర్చువారియందు, ప్రతిఫలమునుగోరి మేలు చేయువారియందు, శత్రువులందు, తటస్థులందు, మధ్యవర్తులందు, ద్వేషింపబడదగిన వారియందు (విరోధులందు), బంధువులందు, సజ్జనులందు, పాపులందు, సమభావము గల్గియుండువాడే శ్రేష్ఠుడు.

**వ్యాఖ్య:–** మనుజులలో ఎవడుత్తముడో ఈ శ్లోకమందు తెలుపబడినది. సామాన్యముగ జనులలో ఎవడైన ఎక్కువ ధనమునుగాని, సౌందర్యముగాని, లౌకిక విద్యగాని గలిగియున్నచో అతడు గొప్పవాడని జనులు తలంచుదురు. కాని భగవంతు డటుల చెప్పలేదు. ఎవడు సర్వజీవులయెడల సమబుద్ధిగలిగియుండునో ఆతడే శ్రేష్ఠుడని నుడివిరి. ఆ సర్వజీవులందు కొందఱినిమాత్ర మిచట పేర్కొనిరి. వారిని మూడు వర్గములుగ విభజించవచ్చును.

(1) సుహృత్తు, మిత్రుడు, బంధువు, సాధువు – అను వీరు నలుగురును ఒక తెగ (2) మధ్యస్థుడు, ఉదాసీనుడు – అను వీరిద్దరు ఒక తెగ (3) శత్రువు, ద్వేషి, పాపి – అను వీరుముప్పరును ఒక తెగ. ఇందు మొదటితరగతివారు ఉపకారముచేయువారు. రెండవతరగతివారు ఉపకారముగాని అపకారముగాని చేయనివారు; మూడవతరగతివారు కేవలము అపకారమేచేయువారు. వీరిలో మొదటి తెగవారిపై జనులకు సహజముగ ప్రీతియు, రెండవవారిపై తటస్థభావమున్ను, మూడవవారిపై ద్వేషమున్ను గలుగును. కాని ఉత్తమయోగికి వీరిముప్పరి పైనను సమభావమేయుండును. కారణమేమనగా అధమునకు ఒక వ్యక్తిని చూడగనే, దేహభావముమాత్రము గల్గుచుండును. అతడు తెల్లవాడా నల్లవాడాయని, కురూపియా, సుందరుడాయని యాతడు పరికించుచుండును. అతనికి దేహదృష్టిమాత్రముండును. మధ్యముడు ఒకవ్యక్తినిజూడగనే అతనివిద్య, తెలివి మున్నగువానిని వీక్షించును. ఇతనిది మనోదృష్టి. కాని ఉత్తముడు ఒక వ్యక్తిని జూడగనే అతని ఆత్మనుమాత్రము పరికించును. అతనిది ఆత్మదృష్టి. వ్యక్తియొక్క దేహముపైగాని, మనస్సుపైగాని అతనిదృష్టిపడదు. సర్వభూతములందును ఆత్మ ఒకటియే కనుక, అతని దృష్టియందు శత్రు మిత్ర ఉదాసీనులందుఱును సమముగనే కన్పించుదురు. విభక్తమగు ప్రపంచమునందు అవిభక్తత్వమునే యాతడు గాంచును. కావున అట్టివాడు సర్వశ్రేష్ఠుడని యిట వచింపబడినది. ఇక్కారణమున ప్రతిజీవియు ఉత్తమస్థితిని బొందుటకై ప్రయత్నపూర్వకముగ దేహభావనను, మనోభావనను తగ్గించుకొని ఆత్మభావననే పెంపొందించు కొనుచు నుండవలెను. అపుడే యాతనికి సమబుద్ధియుదయింప జనులలో సర్వోత్తముడై వెలయుచుండును.

**ప్ర:–** మనుజులలో ఉత్తముడెవడు?

**ఉ:–** శత్రు మిత్ర ఉదాసీనులందు సమబుద్ధికలవాడే ఉత్తముడు.

**అ॥** అట్టి యోగారూఢదశ నొందుటకై భగవత్సాక్షాత్కారమునకై ధ్యానయోగమును వివరింపదలంచి మొట్టమొదట ధ్యానపద్ధతిని గూర్చి తెలియజేయుచున్నాడు –

**10. యోగీ యుఞ్జీత సతతమాత్మానం రహసి స్థితః**
**ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః.**

**టీక:–** యోగీ = యోగియగువాడు, రహసి = ఏకాంతప్రదేశమున, స్థితః = ఉన్నవాడై, ఏకాకీ = ఒంటరిగనుండి, యతచిత్తాత్మా = స్వాధీన మొనర్పబడిన మనోబుద్ధీంద్రియ దేహములుగలవాడై, నిరాశీః = ఆశలేనివాడై, అపరిగ్రహః = ఇతరులనుండి యేమియు స్వీకరింపక, సతతమ్ = ఎల్లపుడును, ఆత్మానమ్ = మనస్సును, యుఞ్జీత = ఆత్మయందు నెలకొల్పవలెను (లయ మొనర్పవలెను).

**తా:–** (ధ్యానయోగమునభ్యసించు) యోగి ఏకాంతప్రదేశమున ఒంటరిగ నున్నవాడై మనస్సును, దేహేంద్రియములను స్వాధీనమొనర్చుకొని, ఆశలేనివాడై, ఒరులనుండి యేమియు స్వీకరింపక ఎల్లపుడును మనస్సును ఆత్మయందే నెలకొల్పుచుండవలెను. (లయ మొనర్చుచుండవలెను).

**వ్యాఖ్య:–** ఇది మొదలుకొని ఇక ధ్యానాభ్యాసము నెట్లుచేయవలెనో ఆ పద్ధతి నంతను పూసగ్రుచ్చినట్లు భగవాను డిచట తెలియజేయుచున్నాడు. ఇచట యోగియనగా పూర్ణత్వమునొందినవాడు కాదనియు, పరమార్థసాధకుడు మాత్రమే యనియు గ్రహించవలెను. ధ్యానాభ్యాసియని అర్థము. అట్టివాడు ధ్యానమందు పరిపక్వతనొందుటకై ఐదు నియమములను పాటించవలెనని చెప్పబడినది. అవియేవియనిన – (1) ఏకాంత స్థలమును సేవించుట (2) ఒంటరిగ ధ్యానించుట (3) ఇంద్రియములను, మనస్సును దేహమును నిగ్రహించుట (4) ఆశ లేకుండుట (5) వస్తువులను పరిగ్రహించకుండుట.

ఈ ఐదు నియమములను చక్కగపాలించి సాధకుడు ఆత్మధ్యానమందే నిరంతరము కాలము గడుపుచుండవలెను.

"రహసి" – ధ్యానము చేయునపుడు బహిరంగస్థలమున కూర్చుండరాదు. అట్లు చేసినచో విక్షేపముకలుగును. ధ్యానము చేయుట ఒకరిమెప్పుకొఱకుగాదు. మఱియొకరు చూడవలెననికాదు. ధ్యానమనునది భక్తునకు భగవంతునకు ఇరువురకు మధ్యగల సంబంధమేయగును. కాబట్టి ఏకాంతస్థలమునే ఆశ్రయించవలసినదిగా నిటచెప్పబడినది. కనుకనే పూర్వకాలమున ఋషులు, మునులు, తాపసులు తమ ధ్యానానుష్ఠానములు నిరాటంకముగ జరుగుటకుగాను పర్వతగుహలను, నదీతీరములను, అరణ్యప్రదేశములను ఎన్నుకొనిరి. అచట విక్షేపజనకశక్తులెవ్వియు లేకుండుటయేకాక ప్రకృతిరమణీయత్వముచే చిత్తమునకాహ్లాదమున్ను జనించును. అయితే గృహస్థులగువారు అట్టి యేకాంతప్రదేశమును తమ గృహమందును కల్పించుకొనవచ్చును. తమయింటిలో ప్రత్యేకముగ ఒకగదిని జపధ్యానపూజాదులకై వినియోగించి, అందితరుల నెవ్వరిని రానీయక, మహనీయుల పటములను పెట్టి పుష్పధూపదీపాదులతో నలంకరించి శుచిగనుంచుకొనవచ్చును. అప్పుడదియు ఏకాంతస్థలమేకాగలదు. అట్లుకాక 'రహసి' అను పదమునకు కొండగుహ, నదీతీరము, అరణ్యము అనిమాత్రమే అర్థము చెప్పినచో దాదాపు ప్రపంచములో నూటికి తొంబదిమందికిపైగా నున్నట్టి గృహస్థులందఱున్ను భగవానుడు సూచించిన ఈ ధ్యానస్థలమును ఆశ్రయించుటకు వీలులేకుండెడిది.

ఈ ప్రకారము ఏకాంతస్థలమును సేవించినను అచ్చోట నలుగురైదుగురుగాని, పదిమందిగానిగూడి ఒకేచోట ధ్యానింపరాదు. ఒంటరిగమాత్రమే ధ్యానింపవలెను. కనుకనే "ఏకాకీ" యని చెప్పబడినది. ఇద్దరుముగ్గురు చేరినచో ధ్యానకాలమున మనస్సునకు విక్షేపము కలుగవచ్చును. లోకాభిరామాయణములున్ను వారిలో ప్రారంభము కావచ్చును. "ఏక్ నిరంజన్, దో గడబడ్" అను వాక్యము నందఱు నెఱిగినదేకదా! ఇవ్విధముగ స్థలనిర్ణయముచేసికొని మితాహారాదులద్వారా దేహమును, భక్తివైరాగ్యవిచారణాదులద్వారా ఇంద్రియమనంబులను నిగ్రహించి, దృశ్యపదార్థములపై ఆశను విడనాడవలెను. ఎందుకనగా, ఒక్కదానిపైనను

ఆశగలిగినచో వెంటనే మనస్సు దానినే చింతించుచుండుట వలన, భగవద్ధ్యానమునకు అంతరాయముకలుగును. ఆశ గొప్ప పిశాచమువంటిది. దానిని విచారణచే హృదయమునుండి పెకలించివేయవలెను. మఱియు ధ్యానయోగి (దేహధారణకువలసినతప్ప) ఒరులనుండి ఏ వస్తువును పరిగ్రహింపరాదు. పరిగ్రహముచే మనుజునకు పుణ్యము క్షయించుచుండును. ఒరుల కర్మయు తనకు తగుల్కొనుచుండును. మఱియు ఆ యా వస్తువులయొక్క యోగక్షేమములనుగూర్చియే మనస్సు అహర్నిశము ఆలోచించుచుండును. కాబట్టి యిదియంతయు సాధకునకు బంధకరమని తలంచి పెద్దలు అపరిగ్రహనియమమును ఏర్పఱచిరి.

ఇవ్విధముగ పైనదెల్పిన ఐదునియమములను పాటించి సాధకుడు నిరంతరము తన చిత్తమును ఆత్మయందే నెలకొల్పుచుండవలెను. ఏదియో ఒకానొక సమయమునందు మాత్రమే కాదు; నిరంతరమున్ను. కనుకనే 'సతతం' అను పదము చేర్చబడినది. 'నాస్తి జాగరతో భయమ్' అనునట్లు నిరంతరము భగవద్విషయమున జాగరూకులుగనున్నచో కామాది విరుద్ధశక్తులు లోనికి ప్రవేశింపజాలవు. ఎల్లపుడు మేలుకొనియుండినచో దొంగలు లోనికిరారుకదా! దీపమెల్లపుడు వెలుగుచుండినచో చీకటి ప్రవేశింపదుకదా!

**ప్ర:–** యోగాభ్యాసి యెట్టినియమములు కలిగియుండవలెను?

**ఉ:–** (1) ఏకాంతస్థలము నాశ్రయించవలెను. (2) ఏకాకియై ధ్యానమొనర్పవలెను. (3) దేహేంద్రియమనంబులను స్వాధీనమందుంచుకొనవలెను. (4) ఆశ లేకుండవలెను (5) అపరిగ్రహనియమము (ఒరులనుండి దేనిని స్వీకరింపకుండుట) ను శీలించవలెను.

**ప్ర:–** ఇట్టి నియమముగల్గి సాధకు డేమి చేయవలెను?

**ఉ:–** తన చిత్తమును నిరంతరము ఆత్మయందే లయమొనర్చుచుండవలెను. అనగా ఆత్మధ్యానమును శీలించుచుండవలెను.

**అ॥** ధ్యానమునకు తగినచోటు, ఆసనము, కూర్చొనుపద్ధతి, ధ్యానక్రమము చెప్పుచున్నాడు –

**11. శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః**
**నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజినకుశోత్తరమ్★.**

**12. తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేన్ద్రియక్రియః**
**ఉపవిశ్యాసనే యుఞ్జ్యాద్యోగ మాత్మవిశుద్ధయే.**

**టీక:–** శుచౌ = పరిశుద్ధమైన, దేశే = స్థలమునందు, న అత్యుచ్ఛ్రితమ్ = మిక్కిలి యెత్తుగా నుండనిదియు, న అతినీచమ్ = మిక్కిలి పల్లముగా (పొట్టిగా) నుండనిదియు, చేలాజినకుశోత్తరమ్ = క్రింద దర్భాసనము, దానిపైన చర్మము (జింకచర్మము లేక పులిచర్మము), దానిపైన వస్త్రము గలదియు, స్థిరమ్ = కదలనిదియు (అగు), ఆసనమ్ = ఆసనమును (పీఠమును), ఆత్మనః = తనకొఱకు, ప్రతిష్ఠాప్య = వేసికొని, తత్ర ఆసనే = ఆ యాసనముపై, ఉపవిశ్య = కూర్చుండి, మనః = మనస్సును, ఏకాగ్రమ్ = ఏకాగ్రముగ (నిశ్చలముగ), కృత్వా = చేసి, యతచిత్తేన్ద్రియక్రియః = ఇంద్రియమనోవ్యాపారములను అరికట్టి (స్వాధీనపఱచుకొని),

★ చైలాజినకుశోత్తరమ్ – (పాఠాన్తరము)

ఆత్మవిశుద్ధయే = అంతఃకరణశుద్ధికొఱకు, యోగమ్ = పరమాత్మ ధ్యానమును, యుఞ్జ్యాత్ = అభ్యసింపవలయును.

**తా:–** పరిశుద్ధమైన చోటునందు మిక్కిలి యెత్తుగా నుండనిదియు, మిక్కిలి పొట్టిగా నుండనిదియు, క్రింది దర్భాసనము, దానిపై చర్మము (జింక చర్మము లేక పులి చర్మము), దానిపైన వస్త్రముగలదియు, కదలకనుండునదియు నగు ఆసనము (పీఠము)ను వేసికొని, దానిపైగూర్చుండి, మనస్సును ఏకాగ్రపఱచి, ఇంద్రియమనోవ్యాపారములను అరికట్టి (స్వాధీనపఱచుకొని) అంతఃకరణశుద్ధికొఱకు (పరమాత్మ) ధ్యానము నభ్యసింపవలయును.

**వ్యాఖ్య:–** ధ్యానము చేయునపుడు ఎచట కూర్చొనవలయునో, ఎట్లు కూర్చొనవలయునో, ఏమి చేయవలెనో ఆపద్ధతియంతయు నిచట చెప్పబడుచున్నది. భగవద్గీత యొక్క గొప్పతన మిచటనేయున్నది. సాధకునకు వలసిన చిన్న విషయము మొదలుకొని పెద్దవిషయమువఱకు అన్నిటిని కూలంకషముగ గీత చర్చించివేసినది. మొట్టమొదట ధ్యానమునకై కూర్చొనవలసినచోటు పరిశుభ్రముగానుండవలెనని వచింపబడినది. 'శుచౌ దేశే' అని చెప్పినందువలన ధ్యాననిష్ఠకై ఏదేశమునకు పోనక్కఱలేదని, శుభ్రప్రదేశముండినచాలుననియు తెలియుచున్నది. తానుధ్యానించుచోటు ఏకాంతముగను, పరిశుభ్రముగను నున్నచో అదియే ధ్యానమునకు అనువైనచోటగును. శుభ్రతనుగూర్చి భగవానుడెట్లు నొక్కి చెప్పిరో గమనించదగియున్నది. కొందఱు 'చోటు ఎట్లున్న నేమి, మనస్సుగదా ప్రధానము' అని చెప్పుదురు. మనస్సే ప్రధానమైనప్పటికిని, పరిసరము నిర్మలముగానున్నపుడే ఆ మనస్సు ఊర్ధ్వముఖముగ జనుచుండును. ఉన్నత పవిత్రభావము లత్తఱి కలుగుచుండును. మలినప్రదేశముయొక్క ప్రభావము సాధకుని మనస్సుపైకూడ పడుచుండును. మహనీయులగువారు తమ మనస్సు నెంత పవిత్రముగా నుంచుకొందురో, అంతపవిత్రముగ తమదేహమును, తమవాక్కును, తాముండు ప్రదేశమునుగూడ నుంచుకొందురు. వారి శుద్ధత్వము అన్నిటియందును ప్రతిబింబించుచుండును. కావున సాధకులు తాము ధ్యానించుచోటును బాగుగ ఊడ్చి, గోమయముచే నలికి, శుభ్రపఱచవలెను.

ధ్యానాభ్యాసి తాను కూర్చొనుచోటుగాని, పీటగాని ఎక్కువ ఎత్తుగాగాని, ఎక్కువ పల్లముగాగాని యుండరాదని భగవానుడు వచించిరి. కారణమేమనగా, మిక్కిలి ఎత్తుగా నున్నచో, ధ్యానమునందెపుడైనమైకము (తమస్సు) కలిగినయెడల క్రింద పడిపోగలడు. అట్లే మిక్కిలి పల్లముగానున్నచో నీరు, క్రిమికీటకాదులు చేరవచ్చును. కావున మితమైన ఎత్తులోనున్న అరుగుపైగాని, పీటపైగాని కూర్చొని ధ్యానముచేయుట ఉత్తమమని చెప్పబడినది. అచ్చోట గరుకుగానున్నచో బాధ కలుగును. కావున, దానిపై దర్భాసనమువైచి, దానిపై జింకచర్మమును (లేక వ్యాఘ్రాజినమును) పరచి, దానిపైనొక వస్త్రమును వేసికొని కూర్చొనవలయును. మొత్తము ఆసనమంతయు ఏ మాత్రము కదలక, సమముగా స్థిరముగ నుండవలెను. ఒక 'ఇంజను'ను నేలపై స్థాపించునపుడు నేల చదరముగా, గట్టిగనున్నదో, లేదో బాగుగ విచారించుదురుగదా! అట్లే ధ్యానాభ్యాసి కూర్చుండు ఆసనమున్ను కదలకనున్నచో ధ్యానము నిరాటంకముగ జరుగగలదు. ఏ ప్రకారము కూర్చుండవలెనను ప్రశ్న వచ్చినపుడు, ఫలాని ఆసనమును వేసికొని - అని చెప్పక స్థిరమైన ఆసనమును మాత్రము (స్థిరమాసనమ్) వేసికొనుమనియే గీతాచార్యులు చెప్పిరి. అనగా వారివారి అనుకూలమునుబట్టి పద్మాసనముగాని, సిద్ధాసనముగాని, లేక మఱియొక ఆసనముగాని, ఏది వారికి స్థిరముగ చాలసేపు కూర్చుండుటకు వీలుగనుండునో దానినే అవలంబించవచ్చునని పేర్కొనబడినది. పతంజలియు ఈ సందర్భమున

'స్థిరసుఖమాసనమ్' అనియే చెప్పిరి. అనగా ఏ ఆసనము సాధకునకు సుఖముగను, స్థిరముగను నుండునో దానినే వేసికొనవచ్చునని బోధించిరి.

ఈ ప్రకారముగ ఆసనముపైకూర్చుండి తదుపరి సాధకుడు ఇంద్రియ మనోవృత్తులను బహిర్ముఖములుగ పోనీయక, అరికట్టి వానిని అంతర్ముఖములుగజేసికొని పరమాత్మ ధ్యానమందు నెలకొల్పవలెను. మనస్సును ప్రాపంచికవస్తువులపైకి విస్తరింపకుండ నిరోధించి దైవమందే ఏకాగ్రపఱచవలెను. ఏకాగ్రత (Concentration) యందు గొప్పశక్తికలదు. సామాన్యములగు సూర్యకిరణములు భూతద్దముగుండా ప్రసరించినపుడు ఒకేస్థానమున కేంద్రీభూతములుకాగా, గొప్ప ఉష్ణశక్తి వానికి జనింప క్రిందనున్న కాగితము మున్నగు వానినిగూడ కాల్చివేయునుగదా! అట్లే మనస్సుయొక్క శక్తులన్నిటిని ప్రాపంచిక పదార్థములనుండి మరలించి ఒకదైవము (ఆత్మ) పైననే ఏకాగ్రమొనర్చినచో అఖండశక్తి ప్రాదుర్భవించి అజ్ఞానపటలమును భస్మీభూతమొనర్చి వేయగలదు.

ఇవ్విధముగ మనస్సును ఏకాగ్రపఱచి అంతఃకరణశుద్ధికొఱకై ధ్యానమును ఉపక్రమింపవలెను. ఏలయనగా అట్టి హృదయనైర్మల్యము, అంతఃకరణశుద్ధి ఆత్మసాక్షాత్కారమునకు అత్యవసరము. నిర్మలహృదయమందే ఆత్మోదయముకాగలదు.

పైశ్లోకమున 'అజినము' అని చెప్పినచోట జింకమొదలైనవానిని చంపి చర్మము తేవలెనని యర్థముకాదు. మరణించిన ఆ యా జంతువులయొక్క చర్మములను వాడుకొనవచ్చుననియే భావము. లేనిచో హింసాదోషము ఆవరించగలదు.

ప్ర:- ధ్యానాభ్యాసి మొట్టమొదట శీలించవలసిన పద్ధతు లెవ్వి?

ఉ:- (1) ధ్యానమునకై నిర్మలమైనచోటును ఎంచుకొనవలెను. లేక, తానుండుచోటునైన పరిశుభ్రము చేయవలెను. (2) మిగుల ఎత్తైనట్టి, లేక,పల్లముగనున్నట్టి చోటునందు కూర్చొనరాదు. (3) కూర్చునునపుడు క్రింద దర్భాసనము, దానిపై చర్మము, దానిపై వస్త్రము వేసికొనవలెను. (4) కూర్చొనుపీఠము కదలరాదు. మఱియు ఏ ఆసనముపై కూర్చొనిన తాను స్థిరముగ సుఖముగ నుండగలడో దానినే వేసికొనవలెను. (5) ఇంద్రియ, మనోవృత్తులను నిగ్రహించవలెను. (6) మనస్సును ఏకాగ్రపఱచవలెను.

ప్ర:- ఎందులకై ధ్యానమును చేయవలెను?

ఉ:- హృదయశుద్ధికొఱకు, అంతఃకరణముయొక్క నిర్మలత్వముకొఱకు. నిర్మలాంతః కరణముననే (శుద్ధహృదయమున) పరమాత్మ సాక్షాత్కరించునుగదా!

అ॥ ధ్యానాభ్యాసి ఎట్లు కూర్చొనవలెనో, దృష్టి యెచట నిలుపవలెనో చెప్పుచున్నాడు -

**13. సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః**
**సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్.**

**14. ప్రశాన్తాత్మా విగతభీ ర్బ్రహ్మచారివ్రతే స్థితః**
**మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః.**

**టీక:–** కాయశిరోగ్రీవమ్ = శరీరము, శిరస్సు, కంఠము, సమమ్ = సమముగాను, అచలమ్ = కదలకుండగను, ధారయన్ = నిలుపుచు, స్థిరః = స్థిరముగనున్నవాడై, దిశః చ = దిక్కులనుగూడ, అనవలోకయన్ = చూడక, స్వమ్ = తనయొక్క, నాసికాగ్రమ్ = ముక్కుకొనను, సంప్రేక్ష్య = దృష్టినుంచి, ప్రశాన్తాత్మా = మిక్కిలిశాంతమైన అంతఃకరణముకలవాడును, విగతభీః = భయమువీడినవాడును, బ్రహ్మచారివ్రతే = బ్రహ్మచర్యవ్రతమందు, స్థితః = ఉన్నవాడును (అయి), మనః = మనస్సును, సంయమ్య = బాగుగ నిగ్రహించి (స్వాధీనపఱచుకొని), మచ్చిత్తః = నా యందు చిత్తముగలవాడును, మత్పరః = నేనే పరమగతియని నమ్మినవాడును (నన్నే ధ్యానించువాడును), యుక్తః = సమాధియుక్తుడును (అయి), ఆసీత = ఉండవలెను.

**తా:–** (ధ్యానముచేయువాడు) శరీరము, శిరస్సు, కంఠము సమముగ (తిన్నగ) నిలిపి, కదలక, స్థిరముగ నున్నవాడై, దిక్కులను జూడక, నాసికాగ్రమును వీక్షించుచు, ప్రశాంతహృదయుడై, నిర్భయచేతస్కుడై, బ్రహ్మచర్యవ్రతనిష్ఠగలిగి, మనస్సును బాగుగ నిగ్రహించి, నాయందు చిత్తముగలవాడై, నన్నే పరమగతిగనమ్మి, సమాధి (ధ్యాన) యుక్తుడై యుండవలెను.

**వ్యాఖ్య:–** ధ్యానము చేయువాడు ఆసనముపైగూర్చుండి శరీరము, కంఠము, శిరస్సు - అను ఈ మూడింటిని సమముగ నిలిపి, అనగా ఏ మాత్రము వంగకుండ నిటారుగ నుంచవలెనని తెలుపబడినది. ఏలయనిన, ఆ మూడును తిన్నగ నున్నపుడు మాత్రమే సుషుమ్నానాడిగుండా కుండలినీశక్తి అవిచ్ఛిన్నముగ సహస్రారమునకు ప్రవహించుటకు వీలుండును. అపుడుమాత్రమే సాధకునకు గొప్పగొప్ప పరమార్థానుభవములు గలుగుచుండును. మిలటరీవారు, పోలీసువారు కవాతుచేయునపుడు, నడచునపుడు ఏవిధముగ పైమూడు అంగములను సమముగ నిలుపుదురో, అట్లే ధ్యానాభ్యాసియు ప్రవర్తించి, నిశ్చలముగ గూర్చొని ధ్యానించవలెను. 'స్థిరః' అని చెప్పినందువలన ధ్యానకాలమున మధ్యమధ్య లేవక ధ్యానము సమాప్తియగువఱకు నిశ్చలముగ కూర్చొని యుండవలెనని భావము.

అట్లు నిశ్చలముగ కూర్చొని, దృష్టిని నలువైపుల బ్రసరింపక, దిక్కులు చూడక ధ్యానమగ్నుడు కావలయును. దిక్కులుచూచినచో 'అదియేమి, వారెవరు -' మున్నగు సంకల్పములుదయించి విక్షేపముజనించును, గావున ధ్యానకాలమున దిక్కులు చూడరాదని హెచ్చరింపబడెను. ఈ ప్రకారముగ దృష్టిని బాహ్యమునుండి మరలించి ఇటునటు చెదరనీయక తనయొక్క నాసికాగ్రము (ముక్కుకొన)పై నిలిపి ధ్యానముపక్రమింపవలెను. దీనినే 'భూచరీ' ముద్ర యందురు. అట్లు దృష్టిని అచ్చోటనిలిపినయెడల మనస్సు క్రమముగ నిశ్చలము కాగలదు. కొందఱు దృష్టిని భ్రూమధ్యమున నిలుపుదురు. మఱికొందఱు హృదయస్థానమునను, కొందఱు సహస్రారమునను వారివారి అనుకూలతను బట్టి ఆ యా స్థానమును నిర్ణయించుకొనవచ్చును. ప్రారంభదశలో కండ్లు పూర్తిగ తెఱచిన దృశ్యవస్తువులు గోచరించునుగాన, పూర్తిగ మూసినచో నిద్రవచ్చు ప్రమాదముకలదు. కావున, అర్ధనిమీలితనేత్రుడై నాసికాగ్రాది స్థానములందు దృష్టిని నిలిపి ధ్యానించినచో ధ్యానము చక్కగ కొనసాగగలదు. ధ్యానసమయమున దృశ్యమువలన విక్షేపము కలుగకుండ జేయుటకేకాబోలు భగవానుడు కంటికి ఱెప్పయను తలుపు నేర్పాటు చేసియున్నారు. ఇక ఏ ఇంద్రియమునకును అట్టి తలుపులేదు. ఆహా! జీవరాసులపై భగవానున కెంతటి కరుణ!

ఈ ప్రకారముగ ధ్యానకాలమున దృష్టిని బాహ్యమునుండి ప్రత్యాహారమొనర్చి, అంతర్ముఖముగజేసి, ఒకచోట ఏకాగ్రముగ నిలిపి, పరమాత్మయే పరమగతియని నమ్మి, వారినే ధ్యానించవలెను. 'నాయందే

చిత్తముంచి నన్నే ధ్యానించవలెన'ని ఇట శ్రీకృష్ణపరమాత్మ నుడివిరి. శ్రీకృష్ణమూర్తి సర్వజీవుల హృదయాంతరాళములందు బుద్ధికి సాక్షిగవెలయునట్టి ఆత్మయే కనుక, అట్టి ఆత్మనే ధ్యానింపవలెనని యర్థము. అట్లు ధ్యానించుటకు పూర్వము ధ్యాతకు నాలుగు సల్లక్షణములుండవలెనని యిట బోధింపబడినది –

అవియేవియనిన – (1) ప్రశాంత చిత్తత్వము (2) నిర్భయత్వము (3) బ్రహ్మచర్యవ్రతము (4) మనస్సంయమము.

సముద్రమేప్రకారము శాంతముగ గంభీరముగనుండునో సాధకుని యంతఃకరణమున్ను ఆ ప్రకారముండ వలెను. 'శాన్తాత్మా' అని చెప్పక 'ప్రశాన్తాత్మా' అని చెప్పుటవలన చిత్తమునందు అత్యంతప్రశాంతి నెలకొనియుండవలెనని గోచరించుచున్నది. సాధకుని హృదయమున భయమేమాత్ర ముండరాదు. దృశ్యపదార్థములన్నియును వాస్తవముగ మిథ్యారూపములుగనుక సాధకుడు ఇక దేనికిని భయపడవలసినపనిలేదు. లేక, అంతయు తన (ఆత్మ) స్వరూపమేకావున తననుగూర్చి తానిక భయపడవలసిన అగత్యములేదు. తన (ఆత్మ) స్వరూపమును మఱచి దృశ్యమును సత్యమనుకొనునపుడే భయము జీవుని బాధించును. శ్రుతివాక్యము లీ సత్యమునే యుద్ఘాటించుచున్నవి★. ఇట్టి పూర్ణనిర్భయత్వము ప్రారంభదశలో సాధకునకు కలుగకున్నను, భక్తివైరాగ్యతత్త్వ విచారణాదుల అభ్యాసముద్వారా కొంతయైనను భయరాహిత్యమును సంపాదించుకొనిననే చిత్తము ధ్యానమందు నిలుకడను బొందగలదు. కనుకనే 'విగతభీః' అని చెప్పుచు నిర్భయత్వము ధ్యానశీలున కొక అంగముగ, ఆవశ్యకతగ నిట వర్ణింపబడినది.

మఱియు ధ్యానశీలుడు బ్రహ్మచర్యమును చక్కగ కాపాడుకొనవలెను. బ్రహ్మచర్యము వలన సాధకునకు శారీరకముగ, మానసికముగ అపరిమితమైనశక్తి కలుగగలదు. బ్రహ్మచర్య మను పదమునకు 'బ్రహ్మమునందు చరించుట' అను అర్థమున్నప్పటికిని, 'కామసంబంధమైన చేష్టలు, సంకల్పములు ఎవ్వియు లేకుండుట' అను అర్థమునందే ఆపదమెక్కువగ వాడబడుచుండును. గృహస్థులకు గృహస్థబ్రహ్మచర్యము విధింపబడినది. బ్రహ్మచర్యమును కేవలము శరీరమునకే పరిమితముచేయక మనోవాక్కులకు కూడ విస్తరింపజేసి, ఏవిషయసంకల్పమున్ను మనస్సునందు జొరబడనీయక త్రికరణశుద్ధిగ ఆ వ్రతమును పాలింపవలెను. బ్రహ్మచర్యముయొక్క ఫలితము అపారము. ప్రపంచములో నింతవఱకవతరించిన మహాత్ములందఱును, లోకము నుఱ్ఱుతలూగించిన ప్రవక్తలందఱును ఏదియోరూపమున బ్రహ్మచర్యమును శీలించియే అట్టి అపారశక్తిని సంపాదింపగల్గిరి. తైలములేనిచో దీపమెట్లు వెలుగదో, అట్లే వీర్యము వ్యర్థమైపోయినచో జ్ఞానదీప మెన్నటికిని వెలుగనేరదు. వీర్యమే ఓజస్సుగ పరిణమించి మెదడునకు, తక్కిన అంగములకు పుష్టిని, వికాసమును గలుగజేయును. ఎన్నియో బిందువుల రక్తముచేరి ఒక బిందువు వీర్యముగ తయారగును. కావున అది దేహమున సారతమమగు వస్తువు. అట్టి అమూల్య వస్తువును విషయభోగములందు వ్యర్థముచేయుట విజ్ఞులకు పాడిగాదు. అద్దానిని ధ్యానమందే వినియోగించవలెను. బ్రహ్మచర్య మతిముఖ్యమైనది. కనుకనే గీతలో వ్రతమను పదము దానికి జోడింపబడెను. (బ్రహ్మచారివ్రతే స్థితః). దీనినిబట్టి ఇది సర్వోత్తమసాధన మని స్పష్టమగుచున్నది. వ్రతము నేప్రకారముగ శ్రద్ధతో, అతి జాగరూకతతో, నియమ పూర్వకముగ శీలించుదురో ఆ ప్రకారమే దీనిననుష్ఠించవలెనని ఆ 'వ్రత' శబ్దము యొక్క భావము. కాబట్టి ధ్యానశీలుడు వ్రతచూడామణి యగు ఈ బ్రహ్మచర్యమును తప్పక ఆశ్రయించవలెను.

ఈ ప్రకారముగ సాధకుడు చక్కని నియమములను పాటించి మనస్సును సంయమముచేసి ఆత్మయందే

★ (1) యదా హ్యేవైష ఏతస్మిన్నుదరమన్తరం కురుతే అథ తస్య భయం భవతి
(2) ద్వితీయాద్వై భయం భవతి

నెలకొల్పి ఆత్మధ్యానపరాయణుడై మెలగవలెను. 'మచ్చిత్తః' 'మత్పరః' మున్నగు పదములచే ధ్యానయోగి ఇతరమగు దేనిని చింతింపక భగవంతునే (ఆత్మనే) చింతించుచు, భగవంతునియందే మనస్సును లయమొనర్పవలెనని స్పష్టమగుచున్నది.

ప్ర:— ధ్యానము చేయువాడు ఆసనముపై నెట్లు కూర్చుండవలెను?

ఉ:— శరీరము, కంఠము, శిరస్సు - మూడింటిని సమముగనుంచి, ఏమాత్రము కదలక, ధ్యానము పూర్తియగు వఱకు మధ్యలో లేవక స్థిరముగా కూర్చొనవలెను.

ప్ర:— దృష్టిని ఎచట నుంచవలెను?

ఉ:— నాసికాగ్రమందు (ముక్కుకొనయందు). దిక్కులు చూడరాదు.

ప్ర:— ధ్యానాభ్యాసి యెట్టి లక్షణములు కలిగియుండవలెను?

ఉ:— (1) ప్రశాంతచిత్తుడై యుండవలెను (2) నిర్భయుడై మెలగవలెను (3) బ్రహ్మచర్యవ్రతము నవలంబించవలెను. (4) మనస్సును (విషయములపైకి పోనీయక) సంయమమొనర్చవలెను.

ప్ర:— ఇట్టి లక్షణములు గలిగి తదుపరి యేమి చేయవలెను?

ఉ:— ఆత్మయందే చిత్తమును లగ్న మొనర్చి, ఆత్మపరాయణుడై, ఆత్మనే ధ్యానించుచు కేవల మాత్మరూపుడై చెన్నొందవలెను.

అ॥ అట్టి ధ్యానముయొక్క ఫలితమును వచించుచున్నాడు -

**15. యుఞ్జన్నేవం సదా ఽ ఽ త్మానం యోగీ నియతమానసః**
**శాన్తిం నిర్వాణపరమాం మత్సంస్థా మధిగచ్ఛతి.**

**టీక:—** నియతమానసః = మనోనిగ్రహముగల, యోగీ = యోగి, సదా = ఎల్లప్పుడును, ఏవమ్ = ఈ రీతిగా, ఆత్మానమ్ = మనస్సును, యుఞ్జన్ = ఆత్మధ్యానమందు నిలిపి, మత్సంస్థామ్ = నాయందున్నట్టిదియు (నాస్వరూపముగనే యున్నట్టిదియు), నిర్వాణపరమామ్ = ఉత్కృష్టమోక్షరూపమైనదియు (పరమానంద రూపమైనదియు) (అగు), శాన్తిమ్ = శాంతిని, అధిగచ్ఛతి = పొందుచున్నాడు.

**తా:—** మనోనిగ్రహముగలయోగి ఈ ప్రకారముగ ఎల్లపుడును మనస్సును ఆత్మ ధ్యానమందునిలిపి, నాయందున్నట్టిదియు (నాస్వరూపమైనదియు), ఉత్కృష్టమోక్షరూపమైనదియు (పరమానందరూపమై నదియు) నగు శాంతిని బొందుచున్నాడు.

**వ్యాఖ్య:—** పైన దెలిపినప్రకారము ధ్యానము చేయుచురాగా సాధకున కెట్టి ఫలితము చేకూరగలదో ఈ శ్లోకమునందు వివరింపబడినది. ఆతనికి పరమశాంతి లభించును. ఆ శాంతియెట్టిది? సాక్షాత్ భగవంతునియందు కాపురముండునది. భగవత్స్వరూపమేయది. దృశ్యవిషయములందుండు శాంతికాదది. భోగజనితసుఖముగాని, శాంతిగాని క్షణికములై యున్నవి. కావున మహనీయులు శాంతికొఱకై బయటదేవులాడక, హృదయమునే పరిశోధించుకొని, అద్దానిని పొంది ధన్యులైరి. అయితే అట్టి నిరతిశయశాంతిని

బొందవలెననిన (1) మనోనిగ్రహము (2) సంతతాభ్యాసము గలిగి యుండవలెనని యిట బోధింపబడినది. 'సదా యుఞ్జన్' అని చెప్పుటచే మాయను జయించుటకు ఒకింత అభ్యాసము చాలదనియు నిరంతరాభ్యాసమే శరణ్యమనియు విశదమగుచున్నది. వైరాగ్య విచారణాదులద్వారా ఇంద్రియమనంబులను విషయములపైకి పోనీయక, అభ్యాసముచే నెమ్మదిగ, వానిని స్వాధీనపఱచుకొని అంతర్ముఖమొనర్చి ఆత్మధ్యానమందు నెలకొల్పవలెను. అపుడే పరమనిర్వాణరూపమైన ఆత్యంతిక శాంతియను ఫలము లభించగలదు. ఎంతవిలువ చెల్లింపబడునో అంతఫలితము చేకూరుచుండును. విషయత్యాగము, అవిద్యా త్యాగము అను గొప్ప పణమును చెల్లించినచో మోక్షరూపపరమశాంతి యను ఫలము లభించగలదు. కాబట్టి 'నాకింకను శాంతి దొఱకలేదే' అని యెవరును దుఃఖింపనిలేదు. భగవానుడు తెలిపిన ఈ (ధ్యానరూప) సాధన సంపత్తిని సమకూర్చుకొనినచాలును. శాంతి కరతలామలకమగును.

**ప్ర:–** ఇట్టి ధ్యానయోగమువలన కలుగు ఫలితమేమి?

**ఉ:–** పరమశాంతిని జీవుడు పొందగల్గును.

**ప్ర:–** ఆ శాంతి యొక్క స్వరూపమెట్టిది?

**ఉ:–** మోక్షరూపమైనది. పరమాత్మయందు ఉండునది (పరమాత్మస్వరూపమే అయినది).

**ప్ర:–** ఇట్టి అపూర్వఫలితమును బొందుటకు సాధకుడేమిచేయవలెను?

**ఉ:–** (1) మనస్సును స్వాధీనపఱచుకొనవలెను (2) నిరంతరము ఆత్మధ్యానమును అభ్యసించుచుండవలెను.

**అ||** ఇక ధ్యానయోగియొక్క ఆహారాది నియమములగూర్చి రెండు శ్లోకముల ద్వారా తెలియజేయుచున్నాడు –

**16. నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాన్తమనశ్నతః**
**న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున.**

**టీక:–** అర్జున = ఓ అర్జునా! యోగః = (ధ్యాన) యోగము, అతి అశ్నతఃతు = అధికముగ భుజించువానికి, న అస్తి= కలుగనేరదు, ఏకాన్తమ్ అనశ్నతః చ= బొత్తిగా భుజింపనివానికిని, న= కలుగనేరదు, అతిస్వప్నశీలస్యచ= ఎక్కువగా నిద్రించువానికిని, న= కలుగనేరదు, జాగ్రతః చ= ఎక్కువగా మేలుకొనువానికిని, నైవ = కలుగనేకలుగదు.

**తా:–** అర్జునా! ఈ ధ్యానయోగము అధికముగ భుజించువానికిని, బొత్తిగా భుజింపని వానికిని, అట్లే అధికముగ నిద్రించువానికిని (బొత్తిగానిద్రించక) ఎల్లప్పుడు మేలుకొనియుండువానికిని కలుగనేకలుగదు.

**వ్యాఖ్య:–** ధ్యానయోగమునకు సహాయభూతములుగనుండు ఆహారవిహారములనుగూర్చి యిట వచించుచున్నారు – 'యోగ' మను పదమునకు భగవంతుని యొద్దకు జేర్చునట్టి ఏ మార్గమైనను అని అర్థము చెప్పవచ్చును. అయినను ఇట ప్రస్తుత విషయము ధ్యానయోగము కాబట్టి అదియే వివక్షితమైయున్నది. అయితే యిపుడు చెప్పబోవు ఆహారాది నియములు అన్ని యోగములకున్ను ఆవశ్యకమేయని యెఱుగవలెను.

అధికాహారము భుజించువారికి ధ్యానము కుదరదని చెప్పబడినది. మితాహారమును★ సేవించినవారికి మాత్రమే ధ్యానము చక్కగ జరుగును. ఆహారమనునది పరమార్థ సాధనలందు గొప్పవిషయముకాదని తలంచి కొందఱు దాని నుపేక్షించుచుందురు. కాని, భగవానుడు దానికి అమిత ప్రాధాన్యమునిచ్చి దాని విషయమై కడు జాగ్రత వహించవలెనని గీతయందనేకచోట్ల నొక్కి వక్కాణించిరి. ఒక చిన్న చీల సరిగా లేనిచో గొప్పయంత్రమంతయు నెట్లాగిపోవునో, ఆహారముయొక్క స్థితియు నంతియే. అది చక్కగ లేనిచో మోక్షసాధన కుదురదు. జీవితమునంతను (1) ఆహారము (2) నిద్రయను ఇరువురు దొంగలు అపహరించి వేయుచున్నారు. అవివేకులకు దాదాపు కాలమంతయు ఆ రెండిటిలోనే గడచిపోవుచున్నది. అమూల్యమగు ఈ మానవ జీవితమును, బంధవిముక్తికై ప్రయత్నింపవలసిన ఈ ఉత్తమ జీవితమును ఆ ప్రకారముగ ఆహార నిద్రాదులందే వ్యర్థముచేయుట పాడికాదు. ఆహారముండవలసినదే. అట్లే నిద్రయు ఉండవలసినదే. అయితే యెంతవఱకు జీవితనిర్వహణమునకు, పరమాత్మచింతనకు అవి అవసరమో అంతమాత్రముండిన చాలును. అంతకు అధికముగగాని, అల్పముగగాని ఉండిన భగవచ్చింతన జరుగనేరదు. ఈ విషయమునే భగవాను డిచట రెండుశ్లోకములద్వారా చక్కగ నిరూపించుచున్నారు.

అధికభోజనముచే శరీరము బరువెక్కి, మత్తెక్కియుండుటచే ధ్యానమందు కూర్చొనుటకుకూడ సాధ్యపడదు. 'సమం కాయ శిరోగ్రీవం' (శరీరము, శిరస్సు, కంఠము తిన్నగనుండుట) అనునది అసలే సాధ్యపడదు. ఒకవేళ బలవంతముగ కూర్చొనినను నిద్ర ఆవహించును. ఒకవేళ నిద్రరాకున్నను కడుపు బరువుగానుండుటచే దేహభావన కలుగుచునే యుండును. ధ్యానమందు దేహమును దాటి, ఇంద్రియములను దాటి, మనస్సును దాటి ఆవలనున్న ఆత్మయొద్దకు పోవలసినవారు అత్తఱి దేహస్ఫురణచే దేహము దగ్గఱనే నిలిపి పోవుదురు. ఈ ప్రకారముగ అధికాహారము ధ్యానమునకు ఆటంకమై నిలుచుచున్నది. అందుచే మితాహారము సేవింపవలెను. అట్లే ఏమియు ఆహారము భుజింపనివారికిన్ని ధ్యానము కుదరదు. ఏలయనిన, ఆహారమువలననే శరీరము, మనస్సు ఏర్పడుచున్నవి. ఆహారములేనిచో అవి క్షీణించిపోవుటచే, శరీరమునకు కూర్చుండుటకు గాని, మనస్సునకు ధ్యానించుటకు గాని శక్తియుండదు. కాబట్టి ధ్యానయోగి శుష్కోపవాసాదులు తఱచు చేయుచుండరాదు. ఎప్పుడైన ఆరోగ్యము కొఱకు పక్షమున కొకమారు (ఏకాదశి మున్నగు తిథులందు) ఉపవాసము చేయవచ్చును. ఇవ్విధముగ అధికాహారమును, ఏ ఆహారమును లేకుండుటను రెండింటిని విసర్జించి మితాహారియై ధ్యానయోగమును శీలించినవారు విజయమును జేబట్టుదురు.

అట్లే నిద్రావిషయమునుగూడ కడు జాగరూకులై ప్రవర్తించి అధికనిద్రను నిద్రలేమిని – రెండిటిని వదలి – మితనిద్ర గలిగియుండినచో యోగము చక్కగ కొనసాగును. శరీర నిర్మాణము ననుసరించి ఉపాధికొకింత విశ్రాంతి ప్రతిదినము అవసరమైయున్నది. అది లేకున్నను, లేక మితముతప్పియున్నను – రెండును ప్రమాదహేతువులేయగును. కాబట్టి సాధకుడు ఆహార, నిద్రల రెండిటియందును మితత్వమును (moderation) శీలించుచు ఆధ్యాత్మికసాధనలందు పురోగమనము సల్పవలెనని భగవానుడిట నుద్బోధించుచున్నారు.

ప్ర:– ధ్యానయోగి ఆహారనిద్రాదులం దెట్లు ప్రవర్తింపవలెను?

---

★ మితాహార లక్షణము –

ద్వౌ భాగౌ పూరయేదన్నైః తోయేనైకం ప్రపూరయేత్

మారుతస్య ప్రచారార్థం చతుర్థమవశేషయేత్.

కడుపులోని సగభాగమును అన్నాదులచేతను, పాతికభాగమును నీటిచేతను నింపి తక్కిన పాతికభాగమును గాలి ఆడుటకై ఖాళీగా నుంచవలెను

**ఉ:–** వానిని మితముగ సేవింపవలెను. అధికాహారమును, ఆహారముయొక్క లేమిని, అధికనిద్రను, నిద్రయొక్క లేమిని వదలివేసి మితాహార, మితనిద్రలను ఆశ్రయించవలెను.

**అ॥** పై విషయమునే మరల చెప్పుచున్నాడు –

**17. యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు**
**యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా.**

**టీక:–** *యుక్తాహారవిహారస్య* = మితమైన ఆహారము, నడత గలవాడును, *కర్మసు* = కర్మములందు, *యుక్తచేష్టస్య* = మితమైన ప్రవర్తనగలవాడును, *యుక్తస్వప్నావబోధస్య* = మితమైననిదుర, మెలుకువగలవాడును (అగు మనుజునకు) *యోగః* = యోగము, *దుఃఖహా* = (జననమరణాది) దుఃఖములను బోగొట్టునదిగ, *భవతి* = అగుచున్నది.

**తా:–** మితమైన ఆహారము, నడత గలవాడును, కర్మలందు మితమైన ప్రవర్తన గలవాడును, మితమైన నిద్ర, జాగరణము గలవాడునగు మనుజునకు యోగము (జననమరణాది సంసార) దుఃఖములను బోగొట్టునదిగ అగుచున్నది.

**వ్యాఖ్య:–** క్రిందటి శ్లోకమునందు ఆహార, నిద్రలందు యోగి యెట్లు ప్రవర్తింపవలెనో చెప్పబడినది. ఇచట తక్కినక్రియలు, వ్యవహారములు యెట్లుచేయవలెనో అదికూడ పేర్కొనబడినది. ఆహారవిహారములందు, కర్మలందు, నిద్రాజాగరణలందు మితముగ వ్యవహరించువానికి యోగము దుఃఖమునుపోగొట్టునది కాగలదని బోధింపబడెను. మితముతప్పి ప్రవర్తించినచో ఆ యోగము జీవుని దుఃఖమును బోగొట్టజాలదని భావము. కావున సాధకులెవరికైన దుఃఖము అంతముకానిచో దానికి హేతువు వారి సాధనపద్ధతిలో లోపమేయగునుగాని యోగముయొక్క పొరపాటుగాదు. అనియతముగ వ్యవహరించినచో యోగము సత్ఫలితముల నొసంగజాలదు. మంచి ఔషధమైనను సేవించవలసినపద్ధతిలో సేవించిననే వ్యాధిని నివారింపగల్గునుగాని అన్యథా కాదు. ఆ విషయమిచట స్పష్టముగ చెప్పివేయబడినది. కొందఱు ధ్యానమును ప్రారంభించి, లేక ఇతరములగు పరమార్థసాధనలను మొదలుపెట్టి ఆవేశముతో రాత్రింబగళ్ళు కృషిచేసి తుదకు శరీరము, మనస్సు అస్వస్థములుకాగా ఆ లోపమును యోగముమీద ఆరోపించుచున్నారు. అది సరికాదు. అది యోగముయొక్క దోషముకాదు. తమ ప్రవర్తనయొక్క లోపమేయగును. యోగము "దుఃఖహా" అని చెప్పబడినదేకాని "దుఃఖజః" అనికాదు. యోగము దుఃఖమును పోగొట్టునదేకాని, కలుగజేయునది కాదు. ఒకవేళ యోగమువలన దుఃఖము కలిగినచో అది యోగసాధనక్రమమునందు తాను చేసిన లోపమువలననే యగునుగాని మఱియొకటికాదు.

దీపపువత్తిని మితముగానుంచినచో రాత్రియంతయు వెలుగునిచ్చుచుండును. వత్తిని బాగుగ పైకెత్తినచో చిమ్నీ మసిపట్టిపోయి అసలు వెలుగే లేకుండపోవును. వత్తిని బాగుగ తగ్గించివైచినచో అసలు ప్రకాశమే ఉండదు. కావున మితత్వమే (యుక్తత్వమే) శ్రేయస్కరము. బుద్ధదేవుడు తనసాధనకాలములో ఒకపుడు ఆహారమును బొత్తిగా మానివైచి, ధ్యానము సరిగా సాగమి, మరల ఒకింత ఆహారమును సేవింపదొడగినట్లు చరిత్ర తెలుపుచున్నది. కావున 'అతి సర్వత్ర వర్జయేత్' అనుసూత్రమును సాధకుడు బాగుగ జ్ఞప్తియందుంచుకొని వర్తించవలెను. సాధకుడు ఆహార విహార నిద్రాదులందు మితముతప్పి వ్యవహరింపక యుక్తాహారవిహారుడై ధ్యానయోగమును శీలించుచు తద్ద్వారా దుఃఖమును అంతముచేసికొనవలయును.

దీనినిబట్టి దుఃఖమును పోగొట్టుకొనదలంచువారందఱున్ను యోగమును (ఆత్మధ్యానమును) ఆశ్రయింపవలెననియు, ఆ యోగమును యుక్తాహార విహారియైయే సేవించ వలెనుగాని ఇష్టమువచ్చినట్లుకాదనియు స్పష్టమగుచున్నది.

**ప్ర:–** (ధ్యాన) యోగముయొక్క ఫలితమేమి?

**ఉ:–** దుఃఖరాహిత్యము.

**ప్ర:–** ఆ యోగము ఎట్టి నియమములతో నాచరించవలెను?

**ఉ:–** (1) మితాహారము (2) మితవిహారము (3) మితకర్మ (4) మితనిద్ర (5) మితజాగరణకలిగి ప్రవర్తించవలెను. దేనియందును మితముతప్పరాదు.

**ప్ర:–** దుఃఖము తొలగుటకు ఉపాయమేమి?

**ఉ:–** యోగము (దైవధ్యానము ఆత్మచింతన).

**అ॥** ధ్యానయోగియొక్క లక్షణములను జెప్పుచున్నాడు –

**18. యదా వినియతం చిత్తమాత్మన్యేవావతిష్ఠతే**
**నిస్స్పృహస్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా.**

**టీక:–** *యదా* = యెప్పుడు, *చిత్తమ్* = మనస్సు, *వినియతం (సత్)* = బాగుగనిగ్రహింపబడినదై, *ఆత్మనిఏవ* = ఆత్మయందే, *అవతిష్ఠతే* = నిలుచుచున్నదో, (*యదా* = ఎప్పుడు, *యోగి* = యోగి) *సర్వకామేభ్యః* = సమస్తములైనకోరికలనుండి, *నిస్పృహః* = నివృత్తుడై (అభిలాషలేనివాడై) (యుండునో), *తదా* = అప్పుడు, *యుక్తః* = యోగసిద్ధిని బొందినవాడని (సమాధియుక్తుడని), *ఉచ్యతే* = చెప్పబడుచున్నాడు.

**తా:–** ఎపుడు మనస్సు బాగుగ నిగ్రహింపబడినదై ఆత్మయందే స్థిరముగ నిలుచునో, మఱియు ఎపుడు యోగి సమస్తములైన కోరికలనుండి నివృత్తుడగునో, అపుడే యాతడు యోగసిద్ధిని బొందినవాడని (సమాధియుక్తుడని) చెప్పబడును.

**వ్యాఖ్య:–** యోగసిద్ధిని మనుజుడెపుడు పడయగలడో యిచట వచింపబడుచున్నది. మోక్షమునకు కాలనియమ మేమియు లేదని యిదివఱలో పలుతావులందు చెప్పబడియుండెను. ఎపుడు మనుజుడు పైన దెలిపిన మూడు లక్షణములను – అనగా (1) సర్వకామనారాహిత్యము (2) మనోనిగ్రహము (3) ఆత్మస్థితి – అను వానిని గలిగియుండునో అపుడాతడు మోక్షభాగియై యొప్పగలడు. భగవానుడు తెలిపిన ఈ మూడు లక్షణములనే (1) వాసనాక్షయ (2) మనోనాశ (3) తత్త్వజ్ఞానములనియు నందురు. అందొకదానిచే మరియొకటి సాధింపబడుచుండును.

(1) "నిస్స్పృహః సర్వకామేభ్యో":- కోరికలు (ఆశలు) జీవుని బంధించు శృంఖలములు. విషయభోగములందు జీవునకెపుడు ఆశకలుగునో, అపుడిక చిత్తము నిలుకడలేక, మహాచంచలముగ ప్రవర్తించును గావున, అత్తఱి ధ్యానముకుదురదు. కాబట్టి కట్టెలు తీసి వైచినచో అగ్ని చల్లారునట్లు, వివేక వైరాగ్యాదులచే ఒక్కొక్క కోరికను, భోగాశను, విషయసంకల్పమును హృదయమునుండి ఏరిపారవేసినచో ఇక

మనస్సు దానియంతట నదియే అధిష్ఠానమగు ఆత్మయందు లయించును. 'సర్వకామేభ్యః' అని చెప్పినందువలన ఏవియో కొన్ని ఆశలు, కోరికలు పోయిన చాలదనియు, అన్నియును తొలగవలెననియు విదితమగుచున్నది.

(2) "వినియతం చిత్తమ్":- చిత్తము లెస్సగ నిగ్రహింపబడవలెను. సామాన్య నిగ్రహము చాలదు. కనుకనే వినియతం (యతం = స్వాధీనపడిన, నియతం = విశేషముగ స్వాధీనపడిన, వినియతం = బాగుగ నిశ్శేషముగ నిగ్రహింపబడిన) అని ప్రయోగింపబడినది. స్వాధీనపడిన గుఱ్ఱములుగల రథికుడు గమ్యస్థానమును నిరాటంకముగ చేరుకొనునట్లు, స్వాధీనపడిన ఇంద్రియ మనంబులు గలవాడు మోక్షమను గమ్యమును శీఘ్రముగ జేరగలడు.

(3) "ఆత్మన్యేవావతిష్ఠతే" - చిత్తమునందలి ఆశలన్నియు నశించినపుడు ఇక, చిత్తము తనరూపమునుగోల్పోయి అధిష్ఠానమగు ఆత్మయందు లయించిపోవును. ఎచటికిని పోక ఆత్మయందే స్థితిగల్గియుండును. అదియే మోక్షము.

ఈ ప్రకారముగ పైమూడులక్షణములుగలవాడు యోగసిద్ధుడని చెప్పబడును.

**ప్ర:–** జీవుడు యోగసిద్ధుడని, లేక మోక్షయుక్తుడని ఎపుడు చెప్పబడును?

**ఉ:–** (1) ఏ ఒక్క కోరికయులేక, (2) మనస్సును పూర్ణముగ నిగ్రహించి (3) ఆత్మయందెపుడద్దానిని స్థాపించునో అపుడే యాతడు యోగసిద్ధుడని, లేక మోక్షయుక్తుడని చెప్పబడును.

**ప్ర:–** మోక్షప్రాప్తికి ఉపాయము లెవ్వియో వచింపుడు?

**ఉ:–** (1) సమస్తములైనకోరికలను, ఆశలను విడనాడుట, (2) మనస్సును లెస్సగ నిగ్రహించుట (స్వాధీనపఱచుకొనుట) (3) మనస్సును ఆత్మయందుస్థాపించుట.

**అ||** సమాధిస్థితియందు యోగియొక్క మనస్సెట్లుండునో వర్ణించుచున్నాడు -

## 19. యథా దీపో నివాతస్థో నేఙ్గతే సోపమా స్మృతా
## యోగినో యతచిత్తస్య యుఞ్జతో యోగమాత్మనః.

**టీక:–** నివాతస్థః = గాలివీచని చోటనున్న, దీపః = దీపము, యథా = ఏ ప్రకారము, న ఇఙ్గతే = కదలకనుండునో, సా = అది (అట్టి నిష్ఠ), ఆత్మనః యోగమ్ = ఆత్మధ్యానమును, యుఞ్జతః = అభ్యసించుచున్న (అనుష్ఠించుచున్న), యోగినః = యోగియొక్క, యతచిత్తస్య = నిగ్రహింపబడిన మనస్సునకు, ఉపమా = దృష్టాంతముగ, స్మృతా = తలంపబడినది.

**తా:–** గాలివీచనిచోటనున్న దీప మేప్రకారము కదలక నిశ్చలముగ నుండునో, ఆ ప్రకారమే ఆత్మధ్యానమును శీలించుచున్న యోగియొక్క స్వాధీనపడిన చిత్తమున్ను నిశ్చలముగనుండును. కనుకనే యోగియొక్క నిశ్చల మనస్సునకు అట్టిగాలి వీచనిచోటగల దీపము దృష్టాంతముగ చెప్పబడినది.

**వ్యాఖ్య:–** పర్వతము నిశ్చలముగనున్నను దానికి ప్రకాశము లేనందున 'పర్వత' దృష్టాంత మిచట గైకొనబడలేదు. గాలివీచనిచోటగల దీపము నిశ్చలముగ నుండును. ప్రకాశవంతముగను నుండును. కనుకనే

యోగియొక్క జ్ఞానతేజోమయ నిశ్చల చిత్తమున కా దృష్టాంతము సమీచీనముగనున్నది. నిత్యజీవితమునందలి సర్వసామాన్య దృష్టాంతములతో బోధించుట గీతయొక్క ఒకానొక విశిష్టత. దానిచే విషయము బాగుగ బోధపడగలదు. కిటికీలు, ద్వారములు తెరచియుంచినగదిలోనున్న ప్రమిద యందలి దీపము ఆ యా ద్వారములగుండా వీచు గాలిచే చపలముగనుండును. లేక ఆరిపోవును. అట్లే అజ్ఞానియొక్క చిత్తము ఇంద్రియద్వారములగుండా ప్రవేశించు విషయాశలచే మహాచపలముగనుండును. యోగియో, శబ్దాది విషయములం దాశలేక, 'సర్వద్వారాణి సంయమ్య' అనునట్లు ఇంద్రియద్వారము లన్నిటిని, విషయవాయువులు ప్రవేశింపకుండ నియమించినందువలన ఆతని మనస్సు అను జ్యోతి నిశ్చలముగ ఆత్మయందు నెలకొనియుండును. నిశ్చల నిర్మల జలమందు సూర్యప్రతిబింబము చక్కగ పడునట్లు. అట్టి నిశ్చల నిర్మల మానసమున ఆత్మవస్తువు చక్కగ ప్రతిబింబించ (లేక అట్టి మానసము అధిష్ఠానమగు ఆత్మయందు లయింప) బ్రహ్మానందానుభూతి కలుగుచుండును. అజ్ఞానికి చంచలమానసమున ఆత్మ ప్రతిబింబింపమి దుఃఖానుభూతియే కలుగుచుండును. కావున (1) చిత్తమును స్వాధీనపఱచుకొనుట (2) అద్దానిని ఆత్మధ్యానమున నెలకొల్పుట అను నీ రెండు క్రియలచే యోగికి, నిశ్చలదీపమునుండి ప్రకాశమువలె, ఆత్మానందము వ్యక్తమగుచుండును. అదియే మోక్షము.

**ప్ర:—** ఆత్మధ్యానము శీలించు యోగియొక్క మనస్సును దేనితో పోల్చవచ్చును?

**ఉ:—** గాలిలేనిచోట గల దీపముతో (అనగా అట్టి దీపమువలె యోగియొక్క మనస్సు నిశ్చలముగ, ప్రకాశవంతముగ (చిన్మయముగ) నుండునని భావము).

**ప్ర:—** మనస్సు ఆత్మయందు నెలకొనియుండవలెననిన, అది ఎట్లుండవలెను?

**ఉ:—** నిగ్రహింపబడినదై, స్వాధీనపడినదై యుండవలెను.

**అ॥** ఆత్మసాక్షాత్కారరూపమగు అట్టి (ధ్యాన) యోగముయొక్క మహిమను నాలుగు శ్లోకములద్వారా చెప్పుచున్నాడు –

**20. యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా**
**యత్ర చైవాత్మనా ఽ ఽ త్మానం పశ్యన్నాత్మని తుష్యతి.**

**21. సుఖమాత్యన్తికం యత్తద్బుద్ధిగ్రాహ్యమతీన్ద్రియమ్**
**వేత్తి యత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః.**

**22. యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః**
**యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే.**

**23. తం విద్యాద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్**
**స నిశ్చయేన యోక్తవ్యో యోగో ఽ నిర్విణ్ణచేతసా.**

**టీక:–** యోగసేవయా = యోగాభ్యాసముచేత, నిరుద్ధమ్ = నిగ్రహింపబడిన (విషయములనుండి త్రిప్పబడిన), చిత్తమ్ = మనస్సు, యత్ర = ఎచట, ఉపరమతే = శాంతిని బొందుచున్నదో, యత్రచ = ఎచట, ఆత్మనా = (పరిశుద్ధమైన) మనస్సుచేత, ఆత్మానమ్ = ఆత్మను (స్వస్వరూపమును), పశ్యన్ = చూచుచు (అనుభవించుచు), ఆత్మన్యేవ = తనయందే, తుష్యతి = ఆనందమునుబొందునో, యత్ర = ఎచట, స్థితః = స్థిరముగానున్న, అయమ్ = ఈయోగి, యత్ = ఏది, అతీన్ద్రియమ్ = ఇంద్రియములకు గోచరముకానిదియో, బుద్ధిగ్రాహ్యం = బుద్ధిచే (ప్రజ్ఞచే) గ్రహింపబడదగినదియో, ఆత్యన్తికం చ = అంతములేనిదియో, తత్ సుఖమ్ = ఆ సుఖమును, వేత్తి = తెలిసికొనుచున్నాడో, చ = మఱియు, తత్త్వతః = స్వానుభవమునుండి, నైవచలతి = ఏమాత్రము చలింపడో, యమ్ = దేనిని, లబ్ధ్వా = పొందినపిమ్మట, అపరమ్ = ఇతరమైన, లాభమ్ = లాభమును, తతః = అంతకంటె, అధికమ్ = ఎక్కువగా, న మన్యతే = తలంపడో, యస్మిన్ = దేనియందు, స్థితః = ఉన్నవాడై, గురుణా = గొప్పదైన, దుఃఖేన అపి = దుఃఖముచేనైనను, నవిచాల్యతే = చలింపజేయబడడో, దుఃఖ సంయోగవియోగమ్ = దుఃఖసంబంధమేమియులేనట్టి, తమ్ = అద్దానిని, యోగసంజ్ఞితమ్ = (ధ్యాన) యోగమను పేరుగలదానినిగా, విద్యాత్ = ఎఱుగవలయును, సయోగః = ఆ (ధ్యాన) యోగము, అనిర్విణ్ణచేతసా = కలతజెందని (దుఃఖపడని, విసుగునొందని) మనస్సుచే, నిశ్చయేన = పట్టుదలతో, యోక్తవ్యః = పొందదగినది.

**తా:–** యోగాభ్యాసముచేత నిగ్రహింపబడిన మనస్సు ఎచట పరమశాంతిని బొందుచుండునో, ఎచట (పరిశుద్ధమైన) మనస్సుచే ఆత్మను సందర్శించుచు (అనుభవించుచు) యోగి తనయందే ఆనందమును బడయుచుండునో, ఎచటనున్నవాడై యోగి ఇంద్రియములకు గోచరముకానిదియు, (నిర్మల) బుద్ధిచే గ్రహింపబడదగినదియు, **అంతము** లేనిదియునగు సుఖమును అనుభవించుచుండునో, మఱియు స్వానుభవమునుండి ఏమాత్రము చలింపకుండునో, దేనిని పొందిన పిదప ఇతరమగు ఏలాభమును అంతకంటె గొప్పదానినిగ తలంపకుండునో, దేనియందున్నవాడై మహత్తర దుఃఖముచే గూడ చలింపకుండునో, దుఃఖసంబంధము లేశమైనను లేని అట్టి స్థితినే యోగము (ఆత్మైక్యము, ఆత్మసాక్షాత్కారము) అని యెఱుగవలయును. అట్టి ఆత్మసాక్షాత్కారరూపయోగము దుఃఖముచే కలతనొందని ధీరమనస్సుచే పట్టుదలతో సాధింపదగియున్నది.

**వ్యాఖ్య:–** జీవబ్రహ్మైక్యరూపమై, ఆత్మసాక్షాత్కారరూపమైనట్టి ఈ (ధ్యాన) యోగము యొక్క మహిమ ఎట్టిదో ఈ నాలుగు శ్లోకములందును తెలుపబడినది. ధ్యానయోగముచే మనస్సు ఆత్మయందు లయమై పరమశాంతిని, సుఖమును బొందును. అదియే జీవితలక్ష్యము. అయితే, నిగ్రహింపబడిన మనస్సే అట్లు లయమొందగల్గును. అనగా విషయములనుండి మరలి, వాసనారహితమైనట్టి మనస్సే ఆత్మైక్యమును నోచుకొనగల్గును. మనస్సును నిగ్రహించుట ఎట్లు? 'యోగసేవయా' – యోగాభ్యాసముచే, సాధనచే మనస్సు నిరుద్ధమగును. అభ్యాసవైరాగ్యములచే మనస్సు అవలీలగ నిగ్రహింపబడగలదు. కాబట్టి 'యోగసేవ' తప్పకచేయవలెను. అజ్ఞానులు 'విషయసేవ' ఎట్లు చేయుచున్నారో విజ్ఞానులు 'యోగసేవ' అట్లు చేయుదురు. కావున విషయసేవను దైవసేవగా మార్చినపుడే జీవుడు కడతేరగలడు.

అట్టి యోగాభ్యాస వశమున జీవుడు తనయొక్క పరిశుద్ధమనస్సుచే అంతరంగమున ఆత్మను అవలోకించి మహదానందము నొందుచున్నాడు. 'పశ్యన్' అని చెప్పుట వలన ఆత్మవస్తువు పరోక్షము కాదనియు, ప్రత్యక్షముగ నద్దానిని చూడవచ్చుననియు (అనుభూతమొనర్చుకొనవచ్చుననియు) స్పష్టమగుచున్నది. ఇచట 'చూచుట'

యనగా దృశ్యవస్తువును చూచినట్లుకాదు. అద్వయ ఆత్మస్థితియందు చూచుట అనునదియే సంభవింపదు. కావున 'అనుభవించుట' అని దాని అర్థము. అయితే శుద్ధమైన మనస్సు మాత్రమే ఆత్మను అనుభవించగలదు. మలినమనస్సుకాదు. ఆత్మను దర్శించుటకు ప్రపంచములోని ఏ వస్తువున్ను ఉపకరింపదు. తనయొక్క శుద్ధమనస్సే అందుల కుపకరించును.

అయితే ఆ ఆత్మ యెచటనున్నది? భగవంతు డెచటనున్నాడు? 'ఆత్మని' – తనయందే, వారికొఱకు బయట వెతకనక్కఱలేదు. తన హృదయమును పరిశోధించుకొనిన చాలును. భగవానుడు తనలోనే అతిసమీపమున వర్తించుచున్నాడు. కావున ఈ వాక్యము సాధకులకు పరమధైర్యమును చేకూర్చుచున్నది. అట్లు ఆత్మను తనయందు కనుగొనినందువలన సంభవించు ప్రయోజనమేమి? 'తుష్యతి' – మహదానందము ననుభవించుచున్నాడు. ఇదియే ప్రయోజనము. అల్పసుఖములకై బయటవెతకి వెతకి, విసిగి వేసారి, తుదకు అంతర్ముఖుడై మనుజుడు పరమానందమును గనుగొని ధన్యుడగుచున్నాడు.

ఆ సుఖమెట్టిది? అనంతమైనది. ఇంద్రియాతీతమైనది. నిర్మలబుద్ధిచే గ్రహింప దగినది. బుద్ధి నిర్మలమగునపుడు అది తన ఉపాధిరూపమును గోల్పోయి ఆత్మాకారముగ పరిణమించును. అట్టి వినిర్మలబుద్ధిచే ఆత్మసుఖము అనుభూతముకాగలదు. అది ఇంద్రియములకు గోచరముకానిది. ఇంద్రియములకు దాసులై బహిర్ముఖదృష్టిగలిగి యుండువారిచే నది యెన్నడును తెలియబడదు. అయితే ఆత్మసుఖము ఇంద్రియములకు గోచరముకానిదని చెప్పి మరల (ఒకానొక ఇంద్రియమేయగు) బుద్ధిచే తెలిసికొనబడ గలదని చెప్పుట పరస్పరవిరుద్ధము కాదాయనిన, కాదు. బుద్ధి అత్యంతశుద్ధమైనపుడు అది తన ఇంద్రియరూపమును గోల్పోయి బ్రహ్మాకారముగనే పరిణమించి పోవును (ఉప్పుకల్లు, వడగండ్లు సముద్రమున కలిసిపోయినట్లు). మఱియు 'బుద్ధిగ్రాహ్య' మని చెప్పుట వలన ఆత్మ ప్రతివారిచేతను గ్రహింపబడగలదనియు, దానికై దిగులు నొందవలసిన పనిలేదనియు, వారి వారి బుద్ధిని శుద్ధమొనర్చుకొనిన చాలుననియు స్పష్టముచేయబడినది. 'అతీంద్రియమ్' అని చెప్పుటవలన ఇంద్రియసుఖములందే కాలక్షేపము చేయువారికి ఆ యాత్మానందము కలలోకూడ కనిపించదని తేల్చివేయబడినది. మఱియు ఆత్మసుఖము అనంతము (ఆత్యన్తికమ్) అని తెలియజేయబడుటచే, తక్కిన అన్ని దృశ్యసుఖములు అంతములని, కావున వానికై పరుగిడరాదని సూచింపబడినది.

అట్టి ఆత్మానందమున మగ్నుడైయుండు యోగి అచ్చోటినుండి మరల చలింపడనియు దానియందే రమించుచుండుననియు నిట వచింపబడినది. మకరందమును పానముచేయు భృంగము కుసుమమును వీడిపోవ నిచ్ఛగించునా, సత్యవస్తువును బడసినవాడు మరల మిథ్యావస్తువునకై పరుగిడునా? బింబమును పొందినవాడు ప్రతిబింబమునకై అఱ్ఱులు చాచునా? ఒకవేళ చాచినచో అతడింకను పూర్ణవస్తువును పొందలేదనియే అర్థము. స్వప్నసుఖమునకై పరుగిడువాడింకను మేల్కొనలేదనియే భావము.

ప్రపంచములోని అన్ని లాభములకంటె గొప్పలాభము అట్టి ఆత్మానందమే. కావున ధ్యానయోగి అద్దానిని బడసినప్పుడు దానినే సర్వోత్తమ లాభముగ నెంచి తక్కిన ప్రాపంచిక లాభములన్నిటిని దానిచుట్టు దిగతుడిచివేయును. లోకములో ప్రతి జీవియు లాభమునే కోరును. వర్తకుడు ధాన్యమును కొలుచుటకు ప్రారంభించునపుడు 'ఒకటి' అనకుండ 'లాభం' అనుచుండును. కాని ప్రాపంచిక లాభముల నెన్నిటిని పొందినను అవి కొంతకాలమునకు నశించిపోవును. ఒకవేళ అవి నశింపకున్నను అనుభవించు తన ఉపాధియైనను ఒక కాలమున నశించిపోవును. కావున అవి పరమలాభములుకావు. క్షణిక లాభములే. ఆత్యంతికశాంతి, జననమరణదుఃఖరాహిత్యము, నిరతిశయసుఖము కలుగజేయు ఆత్మానుభవమే పరమలాభము. కనుకనే

అద్దానిని పొందినవాడు తక్కిన ఏ యితర వస్తువునుగాని, లాభమునుగాని, తుదకు బ్రహ్మాండాధిపత్యమునుగాని అధికముగా తలంపడని యిచట పేర్కొనబడినది. కాబట్టి వివేకవంతుడగువాడు ఇట్టి భగవద్వాక్యముపై విశ్వాసముంచి నశ్వర ప్రాపంచిక లాభములకై దేబరించి చూడక, క్షణికములగు దృశ్య వస్తువులయొక్క సంపాదనమందే కాలమును వ్యర్థముచేయక ఆత్మ ప్రాప్తికై యత్నించవలెను.

అట్టి ఆత్మస్థితియందున్నవాడిక ఎట్టి భయంకరదుఃఖము వచ్చి మీదపడినను చలింపడనియు నిచట చెప్పబడినది. దీనినిబట్టి సర్వదుఃఖనివారణోపాయము ఆత్మసాక్షాత్కారమే యని స్పష్టపడుచున్నది. స్వప్నమందలి ఆపదలు మేలుకొనినవానిని కష్టపెట్టజాలనట్లు ఆత్మానుభవపరుని మహాదుఃఖముకూడ ఈషత్తైనను కదలింపజాలదు. ఇక సామాన్యదుఃఖమునుగూర్చి వేరుగ జెప్పవలెనా? ఆత్మజ్ఞానము లేనివానిని, దేహాభిమానిని, దృశ్యము సత్యమని నమ్మువానిని చిన్నదుఃఖముకూడ తలక్రిందుచేయగలదు. 'గోష్పదం సాగరాయతే' అనునట్లు గోవుపాదమంత దుఃఖము వానికి మహాసాగరముగ తోచును. కాబట్టి దుఃఖము ఏ మాత్రము సంప్రాప్తించకుండ నుండవలెనని, ఆత్మస్థితిని బడయవలెను. అదితప్ప గత్యంతరములేదు.

అట్టి ఆత్మస్థితియే యోగమని చెప్పబడినది. దుఃఖముయొక్క గంధముకూడలేని వినిర్మలస్థితియే అది. కనుకనే 'దుఃఖసంయోగ వియోగమ్' అని భగవానుడు దానిని గూర్చి పేర్కొనిరి. ప్రపంచములో ధనవియోగము, పుత్రవియోగము మొదలైన ఏ వియోగమైనను క్లేశమును కలుగజేయునుగాని భగవానుడు తెలిపిన ఈ ఆత్మస్థితిరూప 'దుఃఖసంయోగ వియోగము' మాత్రము బ్రహ్మానందమును గలుగజేయును. అయితే అట్టిస్థితి యెవరికి చేకూరగలదు? పట్టుదలతో గూడిన ధీరచిత్తముగల వానికే చేకూరును. దుర్బలచిత్తునకది లభించదు. కనుకనే 'అనిర్విణ్ణచేతసా' అని యిట చెప్పబడినది. ధైర్యసాహసములతో గూడినదియు, 'నేను తప్పకపొందెదను' అను విశ్వాసము గలిగి యున్నదియునగు మనస్సే పరమాత్మరూపలక్ష్యమును బొందగలదు.. (1) అభ్యాసకాలమున ఎన్ని ఆటంకములు వచ్చినను జంకకుండునదియు, (2) పట్టుదలతో గూడినదియునగు (అనిర్విణ్ణ, నిశ్చయ) చిత్తమే ఆత్మానుభూతిని బడయగలదని యిచట స్పష్టముగ చెప్పబడినది. సాధకుని పడగొట్టుటకై మాయ పలువిధముల యత్నించుచుండును. ఒక్కొక్కప్పుడు సుఖములనిచ్చి, ఒక్కొక్కపుడు దుఃఖములనిచ్చి అది మోసగించు చుండును. అత్తఱి వివేకవంతుడు ఇది 'మాయాపరీక్ష' అని తలంచి భగవంతునిపై, సద్గురువుపై అపరిమిత విశ్వాసముగల్గి, ధైర్యముతో మోక్షమార్గమున నిలద్రొక్కుకొని ముందునకు సాగిపోవలెను.

**ప్ర:—** చిత్తము దేనిచే నిరోధించబడగలదు?

**ఉ:—** యోగసేవచే (అభ్యాసవైరాగ్యాదులచే).

**ప్ర:—** ఎట్టి చిత్తము ఆత్మయందు లయింపగలదు?

**ఉ:—** విషయములనుండి నిగ్రహింపబడిన చిత్తము.

**ప్ర:—** ఆత్మను దేనిచే చూడగలరు?

**ఉ:—** శుద్ధమనస్సుచే (నిర్మలబుద్ధిచే).

**ప్ర:—** ఎచట?

**ఉ:–** తనయందే. తనహృదయముననే.

**ప్ర:–** ఆత్మదర్శనమువలన కలుగు ఫలితమేమి?

**ఉ:–** అత్తఱి జీవునకు అపరిమిత ఆనందముకలుగును (మోక్షము సంప్రాప్తించును).

**ప్ర:–** ఆత్మసుఖ మెట్టిది?

**ఉ:–** ఇంద్రియముల కగోచరమైనది.

**ప్ర:–** ఇంద్రియములకు గోచరముకానిచో ఇక దానిని తెలిసికొనుట ఎట్లు?

**ఉ:–** నిర్మలబుద్ధిచే, విశుద్ధమనస్సుచే దానిని తెలిసికొనవచ్చును. (బుద్ధిగ్రాహ్యమ్).

**ప్ర:–** ఆత్మస్థితిని బడసిన వాడేమిచేయును?

**ఉ:–** నిరంతరము ఆత్మయందే రమించుచుండును. అచ్చోటు వీడి చనడు.

**ప్ర:–** ప్రపంచములో అన్నిలాభములకంటె గొప్పలాభమేది?

**ఉ:–** ఆత్మలాభము (ఆత్మప్రాప్తి).

**ప్ర:–** ఆత్మస్థితియందున్నవానికి గుఱుతేమి?

**ఉ:–** ఎటువంటి ఘోరదుఃఖములు సంప్రాప్తించినను లవలేశమైనను చలింపడు.

**ప్ర:–** కావున దుఃఖములు తొలగుట కుపాయమేమి?

**ఉ:–** ఆత్మయందు స్థితిగలిగియుండుటయే. ఆత్మానుభవమును బడయుటయే.

**ప్ర:–** ఆత్మస్థితి యెట్టిది?

**ఉ:–** దుఃఖసంపర్కము ఏమాత్రము లేనట్టిది.

**ప్ర:–** అది యెట్లు లభింపగలదు?

**ఉ:–** (1) కష్టములకు జంకని మనస్సుచేతను (2) పట్టుదలచేతను లభింపగలదు.

**అ॥** అట్టి ఆత్మస్థితిని బడయుటకుగాను అవలంబించవలసిన ధ్యానపద్ధతిని రెండు శ్లోకములద్వారా చెప్పుచున్నాడు –

**24. సంకల్పప్రభవాన్ కామాం స్త్యక్త్వా సర్వానశేషతః**
**మనసై వేన్ద్రియగ్రామం వినియమ్య సమన్తతః.**

**25. శనైః శనైరుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా**
**ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చిన్తయేత్.**

**టీక:—** సంకల్పప్రభవాన్ = సంకల్పమువలనకలిగెడు, కామాన్ = కోరికలను, సర్వాన్ = అన్నిటిని, అశేషతః = పూర్తిగా, త్యక్త్వా = విడిచిపెట్టి, మనసా ఏవ = మనస్సుచేతనే, ఇంద్రియగ్రామమ్ = ఇంద్రియసమూహమును, సమన్తతః = అన్నిప్రక్కలనుండియు (సమస్త విషయముల నుండియు), వినియమ్య = బాగుగ నిగ్రహించి, ధృతిగృహీతయా = ధైర్యము నవలంబించిన, బుద్ధ్యా = బుద్ధిచేత, శనైః శనైః = మెల్లమెల్లగ, ఉపరమేత్ = (దృశ్యప్రపంచమునుండి విరమించి అంతరంగమున) విశ్రాంతినొందవలెను (ఉపరతిని బొందవలెను), మనః = మనస్సును, ఆత్మసంస్థమ్ = ఆత్మయందుండులాగున, కృత్వా = చేసి, కించిత్ అపి = ఆత్మవ్యతిరిక్తమగు దేనిని గూడ, న చిన్తయేత్ = తలంపగూడదు.

**తా:—** సంకల్పమువలన గలిగెడు కోరికలన్నిటిని సంపూర్తిగా విడిచిపెట్టి, మనస్సుచే ఇంద్రియములను నలుప్రక్కలనుండి బాగుగ నిగ్రహించి, ధైర్యముతో గూడిన బుద్ధిచే మెల్లమెల్లగ బాహ్యప్రపంచమునుండి ఆ మనస్సును మరలించి అంతరంగమున విశ్రాంతినొందవలెను (ఉపరతిని బడయవలెను). మఱియు మనస్సును ఆత్మయందు స్థాపించి ఆత్మేతరమగు దేనినిగూడ చింతింపక నుండవలయును.

**వ్యాఖ్య:—** ధ్యానము చేయునపుడు ఏ ప్రకారము కూర్చుండవలెనో, దృష్టిని ఎచట నిలువవలయునో ఆ విషయములన్నిటిని యిదివఱకు చెప్పియుండిరి. ఇక ధ్యానమెట్లు చేయవలయునో ఆ పద్ధతి నిచట నిరూపించుచున్నారు.

కోరికలన్నిటిని పూర్తిగ విడనాడవలెనని మొట్టమొదట చెప్పిరి. కోరికలు ఎచట నుండిపుట్టును? సంకల్పమునుండి. సంకల్పమే కోరికలకు, ఆశలకు తల్లి, కనుకనే 'సంకల్ప ప్రభవాన్' అని వానినిగూర్చి చెప్పబడినది. వివేకవైరాగ్యాదులచే విషయములను గూర్చిన సంకల్పమే ఉదయించకుండ చూచినచో, ఇక కోరికలు జనింపనేరవు. ఈ ప్రకారముగ కోరికలన్నిటిని పూర్తిగ విడనాడవలయునని ఆదేశింపబడినది. 'సర్వాన్' అని చెప్పుట వలన ఏ ఒకటి రెండు కోరికలనో వదలిన చాలదనియు, అన్నిటిని వదలవలెననియు తేలుచున్నది. ఏలయనగా, ఒక్క విషయాశ మిగిలియున్నను అది సాధకునకు చెప్పరాని కీడును చేకూర్చును. కాబట్టియే భగవానుడు గీతయందు కోరికలను విడువ వలసినదని బోధించునప్పుడెల్ల 'సమస్తమైనకోరికలను' అని నొక్కి చెప్పుచుందురు. అగ్నికాని, శత్రువుకాని, రోగముకాని, ఋణముకాని, విషయాశగాని ఒకింత శేషించి యున్నను అదియే కాలక్రమమున బలపడి అపకారమును కలుగజేయగలవు. కావున విషయవాంఛల నన్నిటిని తొలగించవలెను. అయితే అన్నిటిని కొద్దికొద్దిగాతొలగించిన చాలదాయనిన, చాలదని చెప్పుటకై 'అశేషతః' (పూర్తిగా) అను పదమునుగూడ ప్రయోగించిరి. కామము అన్నిటిలోను ప్రబలశత్రువగుటబట్టి దానివిషయమై ఏమరుపాటు పనికిరాదని సాధకులను హెచ్చరించుటకుకాబోలు 'సర్వాన్' 'అశేషతః' అను రెండు విశేషణములను దానికి చేర్చిరి. అనగా కోరికలను కొన్నిటిని పూర్తిగ విడుచుటగాని, అన్నిటిని కొద్ది కొద్దిగా విడుచుటగాని చాలదనియు, అన్నిటిని పూర్తిగ విడువవలెననియు బోధింపబడినది. కోరికలున్నచో వాని ననుభవించుటకుగాను చిత్తము బహిర్ముఖముగ పరుగెత్తుచుండును. అవిలేనిచో అంతర్ముఖముగ ప్రవర్తించుచుండును. కనుకనే ధ్యాననిష్ఠునకు కామనాత్యాగ మత్యవసరము.

ఇవ్విధముగ సమస్తవాంఛలను సంపూర్తిగ వదలివైచి మనస్సుచే ఇంద్రియము లన్నిటిని (తాబేలు తన అవయవములను లోనిక ముడుచుకొనునట్లు) శబ్దాది విషయములనుండి మరలించి లోనికి త్రిప్పవలెను. ఇంద్రియములను గుఱ్ఱములను మనస్సను కళ్ళెముచే లాగి అదుపులో నుంచవలయును. ఇచట 'నియమ్య'

అని చెప్పక 'వినియమ్య' అని చెప్పుటచే మనస్సుచే ఇంద్రియములను లెస్సగ నిగ్రహించవలెననియు 'గ్రామం' (సమూహము) అని చెప్పుటవలన ఒక్క ఇంద్రియమునేకాక అన్ని యింద్రియములను నిరోధించవలెననియు, 'సమన్తతః' అను పదమును ప్రయోగించుటవలన, ఒకవైపునుండికాక అన్నిచోట్లనుండియు ఇంద్రియములను వెనుకకులాగి హృదయమున ప్రవేశపెట్టవలెననియు స్పష్టమగుచున్నది. ఇంద్రియములను నిగ్రహింపగలశక్తి మనస్సునకు కలదు. మనస్సు వివేక వైరాగ్యయుక్తమైనది యగుచో ఇంద్రియములను లాగి తనవశమందుంచుకొనగలదు. లేనిచో ఇంద్రియములు చెప్పినట్లు అది ఆడును. కాబట్టి వివేకయుక్తమగు మనస్సుచే ఇంద్రియసమూహమును బాగుగ నిగ్రహించవలెనని బోధించబడినది.

తదుపరి ధైర్యముతో గూడిన బుద్ధిచే మనస్సును మెల్లమెల్లగ బాహ్యప్రపంచమునుండి (విషయాదులనుండి) మరలించి ఆత్మయందు స్థాపితము చేయవలెను. మనస్సును స్వాధీనము చేసికొనగలశక్తి బుద్ధికి గలదు. 'మనసస్తు పరాబుద్ధిః' అని ఇది వఱకే చెప్పబడినదికదా! అజ్ఞానులకు మనస్సుచెప్పినట్లు బుద్ధి ఆడును. జ్ఞానులకు బుద్ధిచెప్పినట్లు మనస్సు ఆడును. అయితే జన్మాంతర విషయవాసనలతో గూడుకొనిన మనస్సు సామాన్యబుద్ధికి జవాబు చెప్పదు. కనుకనే 'ధృతిగృహీతయా' – అని చెప్పిరి. అనగా ధైర్యముతో గూడిన బుద్ధిచే మనస్సును స్వాధీనపఱచుకొనవలెను. మనస్సు పులివంటిది. కావున బుద్ధి మేకగా నుండగూడదు. సింహముపగిది నుండవలెను. 'సైంహీవృత్తి'ని ఆశ్రయించవలెను. 'బుద్ధ్యా ధృతిగృహీతయా' అనుదాని యర్థమిదియే. ధైర్యస్థైర్యములతో గూడిన బుద్ధిచే మనస్సును అంతర్ముఖముగ జేయవలెను.

అయితే ఇక్కార్యమున తొందరపాటు పనికిరాదు. 'శనైఃశనైః' – మెల్లమెల్లగా మనస్సునులాలించి వెనుకకు తీసికొనిరావలెను. ఇట బలాత్కారము పనికిరాదు 'లాలయేత్ చిత్తబాలకమ్' అని వసిష్ఠులు చెప్పినట్లు మనస్సను బాలుని లాలించి, పాలించి, బుజ్జగించి వివేకముతో నెమ్మదిగ దానిని బాహ్యప్రపంచమునుండి మరలించి అంతర్ముఖము చేయవలెను. సాధకులలో కొందఱు భగవానుని ఈ ఆదేశమును పాలింపక తొందరపడి మనస్సును బలాత్కారముగ లాగి తుదకు అపజయమును పొందుచున్నారు. చిన్న నిప్పురవ్వపై పెద్దకట్టెలువేసిన ఆరిపోవునట్లు తొందరపాటుచే మొదటనే పెద్దపెద్ద సాధనలను చేసినచో శరీరము, మనస్సు తట్టుకొనలేనందువలన లక్ష్యమునకే చేటు సంభవించుచున్నది. Slow and steady wins the race అను ఆంగ్లసామెత ననుసరించి మెల్లమెల్లగ సాధించుచువచ్చిననే జయము సంప్రాప్తించ గలదు.

ఈ ప్రకారముగ ధీరబుద్ధిచే మనస్సును మెల్లమెల్లగ నిగ్రహించి తదుపరి దానిని ఊరకపెట్టిపెట్టక ఆత్మయందు నెలకొల్పవలెను. ఆత్మచింతన యను ఆహారమును దాని కొసంగవలెను. అత్తఱి, వడగండ్లు సముద్రమున లయమగు చందమున, ఆ మనస్సు ఆత్మసాగరమున (బ్రహ్మార్ణవమున) విలీనమై ఆత్మాకారముగ పరిణమించి పోగలదు. అదియే మోక్షము. అయితే మనస్సును అట్లు ఆత్మయందు స్థాపించి మరల ఆత్మేతరమగు దేనిని చింతించకనుండవలెను. కనుకనే 'న కించిదపి చిన్తయేత్' అనియు హెచ్చరింపబడెను. ఏలయనగా, ఔషధమును భుజించి పథ్యమాచరింపనిచో రోగమెట్లు నయముకాదో, అట్లే ఆత్మయందు మనస్సును స్థాపించి మరల దృశ్యవస్తువులనుగూర్చి చింతించుచుండినచో లక్ష్యముచేకూరదు. కావున ఆత్మధ్యానమను మందుకు 'ఆత్మేతరమగు దేనిని చింతింపకుండుట' అను పథ్యమునుగూడ జోడించిననే భవరోగము నది బాపగలదు. ఇవ్విషయమును సాధకులు బాగుగా జ్ఞప్తియందుంచుకొని ధ్యానకాలమున (ఆత్మతప్ప) అన్యవస్తువును దేనిని భావించకుండులాగున యత్నించవలెను.

'ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చిన్తయేత్' (ఆత్మయందు మనస్సునునిలిపి అన్యమగు దేనిని చింతింపరాదు) అను ఈ గీతావాక్యము సమస్తశాస్త్రములయొక్క సారమున్ను, సమస్తసాధనలయొక్క సంక్షిప్త రూపమున్ను అయియున్నందువలన ముముక్షువు లిద్దానిని మరల మరల స్మరించుచు అనుష్ఠానమునకు తీసికొని రావలయును. అనగా దృశ్యమును భావింపక దృగ్రూపమగు ఆత్మయందే మనస్సును నిలుపవలెను.

**ప్ర:–** ధ్యానాభ్యాసి అవలంబించవలసిన నియమము లెవ్వి?

**ఉ:–** (1) కోరికలన్నిటిని పూర్తిగ విడనాడవలెను.

(2) మనస్సును, ఇంద్రియములను విషయములనుండి మరలించవలెను.

(3) ధైర్యోపేతమగు బుద్ధిచే మనస్సును బాహ్యప్రపంచమునుండి మెల్లమెల్లగ మరలించి ఆత్మయందు స్థాపితము చేయవలెను.

(4) అట్లు మనస్సును ఆత్మయందుంచి ఆత్మేతరమగు దేనిని చింతింపకుండవలయును.

**ప్ర:–** కోరికలు దేనినుండి పుట్టును?

**ఉ:–** సంకల్పమునుండి.

**ప్ర:–** సాధకుడు ఎట్టి బుద్ధి గలిగి యుండవలెను?

**ఉ:–** ధైర్యముతో గూడిన బుద్ధి గలిగియుండవలెను.

**ప్ర:–** సాధన యెట్లు చేయవలెను?

**ఉ:–** మెల్లమెల్లగ చేయవలెను. తొందరపాటు పనికిరాదు.

**అ॥** పూర్వపు అలవాటుచే ఒకవేళ సాధకులకు ధ్యానకాలమున మనస్సు బయటకు పరుగెత్తినచో ఏమిచేయవలెనో వచించుచున్నాడు -

**26. యతో యతో నిశ్చరతి మనశ్చఞ్చలమస్థిరమ్**
**తతస్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్.**

**టీక:–** చఞ్చలమ్ = చపలస్వభావముగలదియు, అస్థిరమ్ = నిలుకడలేనిదియు (అగు), మనః = మనస్సు, యతః యతః = ఎచటెచటకు (ఏ యే విషయములవైపు), నిశ్చరతి = సంచరించుచున్నదో, తతః తతః = అచటచటనుండి, ఏతత్ = దీనిని (మనస్సును), నియమ్య = మరలించి (బాగుగ వశపఱచుకొని), ఆత్మని ఏవ = ఆత్మయందే, వశం = అధీనమును, నయేత్ = పొందింపవలయును (ఆత్మయందే నిలుచులాగున చేయవలెను).

**తా:–** చపలస్వభావము గలదియు, నిలుకడలేనిదియునగు మనస్సు ఎచటెచట (ఏయే విషయములయందు) సంచరించునో అచటచటనుండి దానిని మరలించి ఆత్మయందే స్థాపితము చేయవలెను. ఆత్మకధీనముగ నొనర్పవలెను.

**వ్యాఖ్య:–** మనస్సును ఆత్మయందేనిలిపి ఇతరమగుదేనిని చింతింపరాదని క్రిందటి శ్లోకమున చెప్పబడినది. ఒకవేళ ఆత్మయందది నిలువక బయటకు పరువెత్తిపోయినచో అపుడేమిచేయవలెనను శంక కిచట సమాధానమును చెప్పుచున్నారు. గీత అనుభవపూర్వకమైన శాస్త్రము (Practical Science) కనుక, సాధకుడెదుర్కొను కష్టనిష్ఠురములన్నిటిని ముందుగనే ఊహించి అది సమాధానమొసంగివేసినది.

మనస్సు బహుచపలమైనది. ప్రారంభస్థితిలో అది ఒకచోట నిలుకడగనుండదు. ఆత్మధ్యానమందు దానిని ప్రవేశపెట్టినను వెనుకటి యలవాటుచే అకస్మాత్తుగ బయటకు పారిపోయి విషయములపై వ్రాలుచుండును. అత్తఱి సాధకు డేమిచేయవలెను? ఎచటెచటకు అది పరుగెత్తునో ఆ యా విషయములనుండి మరలించవలెను. అయితే అది ఊరక మరలునా? ఆ యా విషయములందలి నశ్వరత్వాది దోషములను చక్కగ విచారించినచో వెంటనే మనస్సునకు వానిపై విరక్తిజనించును, రోతపుట్టును; అత్తఱి అది వెనుకకు మరలును. 'దుఃఖదోషానుదర్శనమ్' అను నీ పద్ధతిని భగవానుడు మున్ముందుచెప్పబోవును. కావున వివేకవైరాగ్యాదుల సహాయముచే మనస్సునకు విషయములందలి దోషములను బాగుగ నచ్చచెప్పి అటనుండిమరల్చి ఆత్మయందు స్థాపించవలెను. బాహ్యమునగలది దుఃఖమిశ్రితమగు క్షణికసుఖమనియు, అభ్యంతరమున ఆత్మయందుగలది నిరతిశయావిచ్ఛిన్నసుఖమనియు బోధించినపుడు ఇక తుచ్ఛసుఖములపై వ్రాలుట కిష్టముండక మనస్సు విషయములనుండి మరలి ఆత్మకడకు వచ్చును. ఈప్రకారముగ విజ్ఞుడు మనస్సును ఆత్మయందుంచి, ఆత్మకధీనముగ నొనర్పవలెనని యిచట చెప్పబడినది. అజ్ఞానులందు ఆత్మ మనస్సునకధీనమై యుండును. అనగా మనస్సు చెప్పినట్లు మనుజు డాడుచుండును. అట్లుకాక మనస్సు ఆత్మకు అధీనమై యుండునపుడే శాంతి సుఖములు కలుగుచుండును. ఆత్మది పైచేయిగా నుండవలెనే కాని మనస్సునదికాదు. కనుకనే. ఆత్మన్యేవ వశం నయేత్. – మనస్సును ఆత్మకధీనముగా చేయవలెనని భగవంతు డాదేశించుచున్నాడు.

కాబట్టి సాధకుడు మనస్సుయొక్క చర్యలను బాగుగ గమనించుచుండవలెను. అజ్ఞాని మనస్సుతో ఐక్యమైపోయి మనోవికారములను తనకంటె వేఱుగా జూడజాలకుండును. కనుకనే వానిని నిగ్రహింపజాలకుండును. వివేకవంతుడు తనయందు వికారముదయించగనే దానిని సాక్షిగ జూచుచు నిగ్రహింపగల్గును. మనస్సు ఎటుపోయినది, ఎటు వచ్చినది అజ్ఞాని చూడజాలడు. ధ్యానయోగియో దాని చర్యలను బాగుగ వీక్షించు చుండును. ఇట్టి వీక్షణమునే అభ్యసించవలసినదని భగవాను డీ శ్లోకమున బోధించుచున్నారు. సంకల్పమే మనస్సుయొక్క రూపము. కావున, ఏ యే సంకల్పము లోన ఉదయించి దృశ్యవిషయములపైకి జనుచుండునో దాని నచ్చోటినుండి మరలించి, ఆత్మయందు నెలకొల్పవలెను. ఇదితప్ప శాంతికి వేఱుమార్గము లేదు. అట్టి ఆత్మస్థితియే జీవిత పరమావధి.

**ప్ర:–** మనస్సుయొక్క స్వభావమెట్టిది?

**ఉ:–** చంచలమైనది, నిలుకడలేనిది.

**ప్ర:–** మనస్సు ఆత్మయందు నిలువక బయటకు పరుగెత్తినచో ఏమిచేయవలెను?

**ఉ:–** ఎచటెచటికి అదిపోవునో, (వివేకసహాయముచే) అచటచటనుండి దానిని మరలించి తిరిగి ఆత్మయందు స్థాపించవలెను. ఆత్మకధీనము చేయవలెను.

**అ॥** మనస్సును విషయములనుండి మరలించి ఆత్మయందు స్థాపించుటవలన కలుగు ఫలితమును వచించుచున్నాడు -

**27. ప్రశాన్తమనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్**
**ఉపైతి శాన్తరజసం బ్రహ్మభూతమకల్మషమ్.**

**టీక:–** ప్రశాన్తమనసమ్ = మిక్కిలి శాంతమైన మనస్సుగలవాడును, శాన్తరజసమ్ = (కామక్రోధాదిరూప) రజోగుణ వికారములు లేనివాడును, బ్రహ్మభూతమ్ = బ్రహ్మభావమును బొందినవాడును, అకల్మషమ్ = దోషరహితుడును (అగు), ఏనమ్ = ఈ, యోగినమ్ = యోగిని, ఉత్తమమ్ = శ్రేష్ఠమైన, సుఖమ్ = సుఖము, ఉప ఏతి హి = పొందుచున్నదికదా!

**తా:–** ప్రశాంతచిత్తుడును, (కామక్రోధాది) రజోగుణవికారములు లేనివాడును, బ్రహ్మరూపమును బొందినవాడును, దోషరహితుడునగు ఈ ధ్యానయోగిని సర్వోత్తమమగు సుఖము (ఆత్మానందము) పొందుచున్నదిగదా! (అట్లు పొందుట శాస్త్రప్రసిద్ధమని భావము).

**వ్యాఖ్య:–** నిరతిశయసుఖ మెవరికికలుగునో ఇచట వివరింపబడినది. ప్రపంచమున సామాన్యజనులందఱును అనుభవించునది ఉత్తమసుఖముకాదు. దృశ్యవస్తువులందు పూర్ణసుఖములేదు. కాలమునకు, దేశమునకు లోబడిన సుఖము శాశ్వతమైనది కానేరదు. అది ఇంద్రసుఖమైనను, హిరణ్యగర్భసుఖమైనను సరియే. ఆత్మసుఖమొకటియే దేశకాలవస్తువులకు లోబడకయున్నది. కనుకనే దాని నిచట 'ఉత్తమసుఖ' మని పేర్కొనిరి. దీనినిబట్టి తక్కిన సుఖమంతయు నికృష్టమనియే తెలుచున్నది. కావున విజ్ఞులద్దానికై యత్నింపక పరిపూర్ణాత్మసుఖముకొఱకే అన్వేషింతురు. ఏ యే సాధనలు అవలంబించినచో అట్టి మహోన్నతసుఖము జీవునకు లభించగలదో ఈ శ్లోకమున తెలియజేయబడినది.

(1) ఒడుదుడుకులులేకుండ మనస్సును ప్రశాంతముగ నుంచుట.

(2) రజోగుణ తమోగుణ వికారములెవ్వియు చిత్తమున లేకుండుట.

(3) హృదయమునందు వాసనామాలిన్యముగాని, పాపదోషముగాని, ఏమియు లేకుండుట.

అను మూడు సాధనలచే మనుజుడు బ్రహ్మస్వరూపుడేకాగల్గును. అత్తఱిపైన దెల్పిన ఉత్తమసుఖ మాతనిని వెతకికొనుచువచ్చి అతనిపాలిట పడును. లోకములో జనులందఱున్ను సుఖమెచటకలదాయని వెతకుచు దానికొఱకై పరుగెత్తుచుండ, పైసుగుణములుగల యోగిని సుఖమే తనంతటతాను వచ్చి పొందుచున్నదట! ఆహా! యోగిది ఎట్టి మహోన్నతస్థితియో యోచించుకొనుడు! అట్టి స్థితిని ప్రతివారును బడయవచ్చును. అయితే పైన దెలిపిన మూడు సాధనలను తప్పక ఆచరించవలెను.

పరమాత్మను పొందుటకు అడ్డుగోడవలెనున్న ఏ చిత్తస్థమాలిన్యముకలదో దానిని ముందుగా తొలగించవలెను. దృశ్యవాసనలను నిర్మూలించి దానిని 'అకల్మషము'గ నొనర్పవలెను. అనేక వత్సరములు మూయబడియున్న ఇంటిని ఒక్క పర్యాయము తెరచి చూచినచో, లోన దుమ్ము, బూజు, ఎలుకలు, గబ్బిలములు, పందికొక్కులు, పాములు, తేళ్ళు, పిశాచములు కాపురముండియుండును. అపుడు వానినన్నింటిని బయటకు గెంటివేసి, ఊడ్చి కడిగినపుడుమాత్రమే ఆయిల్లు నివాసయోగ్యమెట్లు కాగల్గునో, అట్లే

జీవునియుపాధి ఎన్నిజన్మలనుండియో అజ్ఞానాంధకారమున మునిగియున్నందున కామక్రోధాది సర్పములు, రాగద్వేషాది మూషికములు దానిలో చేరియున్నవి. ఇపుడు వివేక, వైరాగ్య, భక్త్యాదిసలిలములచే పాప, వాసనాధూళిని ప్రక్షాళనమొనర్చి, జ్ఞానప్రకాశమును కలుగజేయుటవలన ఆత్మదేవునకు నివాసయోగ్యమై తనరుచున్నది. మలినహృదయమునందు భగవంతుడు నివసింపడు. కనుకనే 'శాన్తరజసమ్' 'అకల్మషమ్' మున్నగు పదములద్వారా హృదయనైర్మల్యముయొక్క ఆవశ్యకతను గీతాచార్యులు నొక్కి వక్కాణించిరి. 'ప్రశాన్తమనసమ్' అని చెప్పుట వలన మనస్సు ఏవిధమైన ఒడుదొడుకులు, చాపల్యములేక, సమముగ, శాంతముగ నుండవలెనని ఉద్బోధింపబడినది. కాబట్టి భగవత్సాక్షాత్కారమునకు, ఆత్యంతిక సుఖానుభూతికి మనస్సుయొక్క (1) నిశ్చలత్వము (2) నిర్మలత్వము రెండును పరమావశ్యకములని స్పష్టమగుచున్నది.

ఇట్టి సుగుణములు కలవాడు సాక్షాత్ బ్రహ్మస్వరూపుడేయగును. ఏలననిన, ఆవరణము తొలగినపుడు జీవుడు శివుడే యగుచున్నాడు. చిత్తమునందలి దోషములు తొలగిపోవునపుడు 'చిత్తము' చిత్తుగా మారును. అనగా చిద్రూపాత్మయందు లయమై బ్రహ్మాకారముగనే చెన్నొందును. కావున అత్తఱి జీవుడు బ్రహ్మభూతుడగును. అట్టి బ్రహ్మభూతునియొద్దకు వెనువెంటనే ఉత్తమసుఖము పరుగెత్తుకొనివచ్చి చేరును. మోక్షలక్ష్మి అతనిమెడలో పూలహారమువైచును. కాబట్టి దేనిచే మోక్షము చేకూరునో ఆ ప్రయత్నమందే దృష్టినుంచుకొనినచో, దానిని సాధించుటయందే దత్తచిత్తుడై యున్నచో మోక్షము దానంతట నదియే వచ్చిచేకూరును. అత్తఱి తాను కోరకున్నను బ్రహ్మానందము తనకడకు వచ్చియే తీరును.

కాబట్టి 'నాకింకను మోక్షము కలుగలేదే', 'ఆనందము నన్ను పొందలేదే' అని యెవరును దిగులుపడనక్కఱలేదు. ఏ క్షణమందు జనులు తమ మనస్సును కల్మషరహితముగ, రజోగుణతమోగుణవర్జితముగ గావించుకొందురో ఆ క్షణమందే సర్వోత్తమసుఖమువచ్చి వారిని వరించును – అని భగవాను డీశ్లోకమున సర్వులకును అభయమొసంగిరి. కావున తత్ప్రయత్నము లాచరించి ఆనందానుభూతిని బడసి జన్మను ధన్యము కావించుకొనవలెను.

ప్ర:– ప్రపంచములో అన్ని సుఖములకంటె ఉత్తమసుఖమెయ్యది?

ఉ:– మోక్షసుఖము (ఆత్మానందము).

ప్ర:– దాని నెవడు పొందగలడు?

ఉ:– (1) ప్రశాంతచిత్తుడు (2) రజోగుణ, తమోగుణరహితుడు (3) దోషవర్జితుడు అగువాడు అట్టి ఉత్తమసుఖమును పొందగలడు.

ప్ర:– కాబట్టి ఉత్తమసుఖమును బడయుటకు ఉపాయములెవ్వి?

ఉ:– (1) మనస్సును ప్రశాంతముగ నుంచుకొనవలెను (2) మనస్సునందలి కామాది రజోగుణ తమోగుణ వికారములను తొలగించవలెను. (3) మనస్సునందుగల వాసనామాలిన్యమును, పాపమును పారద్రోలి దానిని దోషరహితముగ జేసికొనవలెను.

అII ఆత్మధ్యానపరుడగు అట్టి నిర్మలచిత్తునకు కలుగు ఫలితమును మరల తెలుపుచున్నాడు –

**28. యుఞ్జన్నేవం సదాఽఽత్మానం యోగీ విగతకల్మషః**
**సుఖేన బ్రహ్మసంస్పర్శమత్యన్తం సుఖమశ్నుతే.**

**టీక:–** ఏవమ్ = ఈ ప్రకారముగ, సదా = ఎల్లప్పుడు, ఆత్మానమ్ = మనస్సును, యుఞ్జన్ = ఆత్మయందు నిలుపుచు, విగతకల్మషః = దోషరహితుడగు, యోగీ = యోగి, సుఖేన = సులభముగా, బ్రహ్మసంస్పర్శమ్ = బ్రహ్మానుభవరూపమైనట్టి, అత్యన్తమ్ = మిగుల గొప్పదైన, సుఖమ్ = ఆనందమును, అశ్నుతే = పొందుచున్నాడు.

**తా:–** ఈ ప్రకారముగ మనస్సు నెల్లప్పుడును ఆత్మయందే నిలుపుచు దోషరహితుడగు యోగి బ్రహ్మానుభవరూపమైన పరమసుఖమును సులభముగ పొందుచున్నాడు.

**వ్యాఖ్య:–** బ్రహ్మానందము సులభముగ లభించుట కుపాయ మిచట చెప్పుచున్నారు. అనేకులీప్రశ్నసే యడుగుచుందురు – 'మోక్షము సులభముగ లభించుటకు మార్గమేది?' అని. దానికి భగవానుడే ఈశ్లోకమున సమాధాన మొసంగిరి. మోక్షము సులభముగ లభింపవలెననిన రెండు సాధనలను చేయవలెను. – (1) మనస్సులోగల పాపములను దుర్గుణములను, కామక్రోధాదులను పోగొట్టుకొనవలెను. (2) మనస్సును నిరంతరము ఆత్మయందు లయింపజేయుచుండవలెను (ఆత్మధ్యానపరుడై యుండవలెను). మొట్టమొదట చిత్తమందలి కల్మషము (దోషము) దూరీకృతము కావలసియున్నది. '(విగతకల్మషః)' ఈ కల్మషరాహిత్యమునుగూర్చి భగవానుడు గీతయందు పదేపదే హెచ్చరించుచున్నాడు. ఏలయనిన, మలినచిత్తమున ఆత్మజ్ఞాన ముదయింపదు. కల్మషచిత్త మాత్మయందు లయింపదు. దృశ్యవాసనలు, పాపములుగల మనస్సు విజాతీయముగ నుండును గావున సజాతీయమగు ఆత్మయందది కలవదు. కావున దానియందలి దోషములను ప్రయత్నపూర్వకముగ తొలగించి నిర్మల మొనర్చినచో ఆత్మయందు లయించిపోవును. వాసనారాహిత్యము, ఆత్మచింతన రెండును అవశ్యకములేయని ఈ శ్లోకమున చెప్పబడినది. ఒకవైపున చిత్తమును నిర్మలమొనర్చుచు, మఱియొక వైపున ఆత్మచింతనచే నద్దానిని ఆత్మయందు విలయమొనర్చు యత్నము చేయుచు నుండవలెను.

ఈ ప్రయత్నమును ఏదియో ఒకానొక కాలమున చేసిన చాలదనియు, నిరంతరము చేయుచుండవలెననియు తెలుపబడినది. 'సదా' అను పదముయొక్క అర్థమదియే. అత్తఱి, మనుజుడు అతిసులభముగ బ్రహ్మానుభూతినిబడసి పరమానందమును కైవసము చేసికొనగలడు. పైన దెల్పిన సాధనలను జేయువారికి బ్రహ్మసాక్షాత్కారము సుళువుగ లభించును; చేయనివారికి ఎంతకష్టపడినను లభించదు. 'బ్రహ్మసంస్పర్శమ్' అని చెప్పినందువలన యోగి సాక్షాత్ పరమాత్మను స్పృశించగలడని స్పష్టమగుచున్నది. ప్రపంచమున దృశ్యములో కాలముగడుపు ఏ వ్యక్తిగాని, దృశ్యవస్తువు ఏదిగాని బ్రహ్మమును తాకలేదు. మిథ్యావస్తువు సత్యవస్తువు నెట్లు స్పృశించగలదు? స్వప్నపదార్థము జాగ్రతుని తగులగలదా? నిర్మలచిత్తుడగు ఒక్క ఆత్మధ్యానపరాయణుడే బ్రహ్మమును (ఆత్మను) తాకగలడు. బ్రహ్మమందు లీనముకాగలడు. అత్తఱి యాతనికి కలుగు సుఖము ఇంతింతగాదు. 'యోవై భూమా తత్సుఖమ్ నాల్పేసుఖమస్తి' (ఛాం 7-23-1) అనునట్లు భూమారూపమగు అనంతసౌఖ్య మాతనికి కలుగును. దృశ్యవస్తువులయందట్టి సుఖముండదు. కనుకనే ఆ యాత్మసుఖమును 'అత్యన్తసుఖమ్' అని యిచట వర్ణించిరి. హిరణ్యగర్భుని సుఖముకూడ ఆ యాత్మానందసాగరమున నొక బిందువే యని ఉపనిషత్తులు ఘోషించుచున్నవి. ఆ యాత్మానందము నెవ్వరైనను పొందగలరు. పైన దెల్పిన ప్రయత్నముల నాచరించినచో. ఈ జీవితమునందే పొందగలరు.

**ప్ర:–** మోక్షసుఖమును సులభముగ పొందుట కుపాయము లేవి?

**ఉ:—** (1) మనస్సునందలి పాపవాసనలను, దోషములను పోగొట్టుకొనుట.

(2) మనస్సును నిరంతరము ఆత్మధ్యానమున లగ్నమొనర్చుట.

**ప్ర:—** మోక్షసుఖమెట్టిది?

**ఉ:—** (1) నిరతిశయమైనది (2) బ్రహ్మమును స్పృశించినది (బ్రహ్మానుభవరూపమైనది).

**అ||** ప్రపంచమున వ్యవహరించునపుడు ఆ ధ్యానయోగి యెట్టిభావము కలిగియుండునో చెప్పుచున్నాడు -

## 29. సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని
## ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః.

**టీక:—** యోగయుక్తాత్మా = యోగముతో గూడుకొనిన మనస్సుగలవాడు, సర్వత్ర = సమస్త చరాచరప్రాణులందును, సమదర్శనః = సమదృష్టిగలవాడై, ఆత్మానమ్ = తన్ను, సర్వభూతస్థమ్ = సమస్తభూతకోట్లయందున్నవానిగను, సర్వభూతాని = సమస్తభూతములున్ను, ఆత్మని చ = తనయందున్నవిగను, ఈక్షతే = చూచుచున్నాడు.

**తా:—** యోగముతో గూడుకొనిన మనస్సుగలవాడు (ఆత్మైక్యము నొందినయోగి) సమస్త చరాచర ప్రాణికోట్లయందును సమదృష్టిగలవాడై తన్ను సర్వభూతములందున్న వానిగను, సర్వభూతములు తనయందున్నవిగను చూచుచున్నాడు.

**వ్యాఖ్య:—** ఇచట యోగమనగా జీవబ్రహ్మైక్యము. మనస్సు ఆత్మయందు కలయుట (ఐక్యమొందుట, విలీనమైనపోవుట) యే యోగము. అట్టి యోగమును సాధించినట్టి మహనీయునియొక్క లక్షణమెట్టిదో ఇట వివరించుచున్నారు. ఆతడు సమస్తప్రాణులందును తనను, తనయందు సమస్త ప్రాణులను వీక్షించుచు సర్వత్ర సమదృష్టి గలిగియుండునని వచింపబడినది. అది యెట్లు సాధ్యపడగలదో విచారించెదము.

ఈ దృశ్యజగత్తంతయు అధిష్ఠానమగు ఆత్మయందు కల్పింపబడినది. సర్పము రజ్జువునందు కల్పింపబడినట్లు, స్వప్నము జాగ్రత్పురుషునియందు కల్పింపబడినట్లు, ఈ సమస్త ప్రపంచము, సమస్త ప్రాణికోట్లు, వెయ్యేల, బ్రహ్మాండమంతయు ఆత్మయందే ఆరోపింపబడినది. ఆరోపితవస్తువు అధిష్ఠానమందే కాపురముండగలదుగాని అన్యత్రకాదు. అన్యత్ర దాని ఉనికికి అవకాశములేదు. కావున ఆత్మయే తానని అనుభూతమొనర్చుకొనినయోగి తనయందే ఈ జగత్తునంతను వీక్షించును. మఱియు జగత్తునందంతట అధిష్ఠానమగు ఆత్మయే వ్యాపించియున్నది గనుక, జగత్తునందు తననుగాంచును. ఇట్టి స్థితి ధ్యానయోగముచేగాని, మఱియే ఇతర యోగముచేగాని మనస్సును ఆత్మయందైక్యపరచుకొని ఆత్మసాక్షాత్కారమొందినయోగికే చెల్లునుగాని తక్కినవారికి కాదు. ఏలయనగా, తాను ఆత్మయేకాని, దేహముకాదు, ఉపాధికాదు అని అనుకొనినపుడు మాత్రమే ఈ సర్వాత్మస్థితి సంభవించును. తాను దేహమే యనుకొనువాడింకను ఆత్మను జేరలేదుగనుక సర్వభూతములందు తన్నుగాని, తనయందు సర్వభూతములనుగాని చూడలేడు. దేహభావన సంకుచితమైనది. అట్టిభావన గలవాడు విశాలత్వమును

బడయజాలడు. దేహమునకు దేహమునకు మధ్య అతడు భేదమునే కాంచును. భేదమే స్పర్థకు, అశాంతికి కారణము. ఆత్మభావనగలవాడు ఉపాధులందు భేదమును జూడక అంతయు ఆత్మగనే చూచును. అట్టివానికిక పరప్రాణియెడల ద్వేషముండదు. అంతయు తన ఆత్మయే, తనశరీరమే, తనమనస్సే అనుకొనువానికి మాత్రమే పూర్ణదయ, పూర్ణకరుణ, పూర్ణప్రేమ కలుగగలవు. దీనినిబట్టి నైతికక్షేత్రము (Ethical field) నకు ఆధారము అధ్యాత్మక్షేత్రమే (Spiritual field) యని స్పష్టమగుచున్నది. 'సర్వము ఆత్మయే, ఆత్మయందే సమస్తముకలదు' అను ఆధ్యాత్మిక సిద్ధాంతమే సమస్త నైతిక సంపత్తికి, సమస్త గుణములకు మూలకందమై యున్నది.

సాధకుడు యోగమునందు పూర్ణత్వము బడయుటకుగాను ఇట్టి సర్వసమత్వమును, విశాలదృష్టిని అలవఱచుకొనవలెను. మఱియు ఇట్టి సమదృష్టిగలవాడే నిజమైన యోగియని యెఱుగవలెను. ఒకడు యోగి అగునా, కాదా యని తెలిసికొనుట కీ సర్వభూతదయ, సమత్వము ఉపకరించును.

(ఆరూఢుడగు) యోగి యెట్టి లక్షణములు గలిగియుండును?

**ఉ:–** ఎల్లెడల సమదృష్టిగలవాడై సమస్తప్రాణికోట్లయందు తనను (ఆత్మను), తనయందు (ఆత్మయందు) సమస్తప్రాణికోట్లను గాంచును.

**అ॥** సర్వత్ర భగవంతునే వీక్షించువాడు భగవద్దృష్టియందెన్నడును మరుగుపడడని తెలియజేయుచున్నాడు –

## 30. యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి
## తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి.

**టీక:–** యః = ఎవడు, సర్వత్ర = సమస్తభూతములందును, మామ్ = నన్ను, పశ్యతి = చూచుచున్నాడో, సర్వంచ = సమస్తభూతములను, మయి = నాయందు, పశ్యతి = చూచుచున్నాడో, తస్య = అతనికి, అహం = నేను, న ప్రణశ్యామి = కనబడకపోను, సఃచ = అతడును, మే = నాకు, న ప్రణశ్యతి = కనబడకపోడు.

**తా:–** ఎవడు సమస్తభూతములందును నన్ను చూచుచున్నాడో, మఱియు నన్ను సమస్తభూతములందును గాంచుచున్నాడో అట్టివానికి నేను కనబడకపోను, నాకతడు కనబడకపోడు.

**వ్యాఖ్య:–** శ్రీకృష్ణభగవానుడు సర్వజీవులయొక్క ఆత్మరూపుడు కావున క్రిందటి శ్లోకమునందు చెప్పబడిన యోగయుక్తుడు, సర్వాత్మదర్శనముగలవాడు సర్వజీవులందును శ్రీకృష్ణుని (భగవంతుని), శ్రీకృష్ణునియందు (భగవంతునియందు) సర్వజీవులను గాంచునని యర్థము. ఈ ప్రకారముగ ఎవడు సమస్తభూతములను పరమాత్మయందును, పరమాత్మయందు సమస్తభూతములను గాంచునో, అట్టివానికిక పరమాత్మ కనబడక ఎట్లుండగలడు? ఇచట కనుపించుట అనగా ఒకానొక దృశ్యవస్తువును జూచినట్లు కాదు. సాక్షాత్కరించుట (అనుభవించుట) యని యర్థము. జీవుడు పరమాత్మలో ఐక్యమైనపిమ్మట ఇక ఇరువురును ఒకే చైతన్యవస్తువగుచుండ ఇక ఒకరికి తెలియక ఒకరెట్లుండగలరు?

మఱియు (ద్వైతదృష్టితోచూచిన) భగవంతునియొక్క అనుగ్రహ మెవనిపై యుండగలదని ప్రశ్నకిచట సమాధానము చెప్పబడినది. ఎవడు సమస్తప్రాణికోట్లయందును భగవంతుని (దైవమును), మఱియు

భగవంతునియందు సమస్తప్రాణికోట్లను వీక్షించునో, అట్టివానియెడల భగవానునకు పూర్ణానుగ్రహముండునని స్పష్టమగుచున్నది. ఏలయనగా 'సచమే నప్రణశ్యతి' - అతడు నాకు కనబడకపోడు అని భగవానుడు తెలిపెను. అతడు భగవంతుని దృష్టియందు బడెననియు, భగవంతున కాతడు పరమప్రియుడనియు భావము. సర్వజీవులు భగవంతుని బిడ్డలైనను తన్నాశ్రయించువారినే యాతడు మిగుల ప్రేమించు చుండును. భగవద్దృష్టిని వారే యెక్కువగ ఆకర్షింతురు. ఆహా! వారెట్టి యదృష్టవంతులు! వారి జీవితము ధన్యమైనట్లే. ప్రపంచములోని చిన్న చిన్న అధికారుల దృష్టియందు పడుటకై పెక్కు అగచాట్లు పడుటకంటె భక్తి వైరాగ్య ధ్యానాదుల ద్వారా జగన్నాథుని దృష్టియందు పడుట మంచిది. వారి ఆశీస్సును బడయుటకై యత్నించుట మంచిది. అయితే అదియెట్లు లభించును? వారి కృపాకటాక్షమెట్లబ్బును? దానికి సమాధాన మీ శ్లోకమున గలదు. (ధ్యానాదుల ద్వారా) సర్వజీవరాసులలోను పరమాత్మను, పరమాత్మయందు సర్వజీవరాసులను గాంచునట్టి అనుభవమును సంపాదించుకొనిన చాలును. భగవత్కృప ఆతనిపై వర్షించగలదు. అట్లుకాక భేదబుద్ధి గలిగియుండువారి కది యెన్నటికిని లభించనేరదు.

ఈ శ్లోకమునందు యచ్ఛబ్దప్రయోగము చేయబడుట గమనించదగినది. 'యః' ఎవడైననుసరియే - ఈ ప్రకారముగ సాధనచేయుచో భగవదనుగ్రహమను మహత్తర ఫలిత మాతడు పొందగలడు. జాతి మత కులాది ప్రసక్తి ఇట లేనేలేదు.

**ప్ర:-** భగవంతు డెవనికి గోచరించును? లేక, భగవద్దృష్టి కెవడు గోచరించును?

**ఉ:-** సమస్తభూతకోట్లయందు భగవంతుని, భగవంతునియందు సమస్త భూతకోట్లను గాంచువానికి భగవానుడు తప్పక గోచరించును. మఱియు భగవద్దృష్టికిని అట్టివాడు తప్పక గోచరించును.

**ప్ర:-** (దీనినిబట్టి) భగవద్దృష్టియందు పడుటకై, లేక భగవంతునకు ప్రీతిపాత్రుడగుటకై ఏమి చేయవలెను?

**ఉ:-** సమస్త ప్రాణులందును పరమాత్మను, పరమాత్మయందు సమస్తప్రాణులను గాంచవలెను. (మఱియు సమస్తప్రాణులకు హిత మొనర్చుచుండవలెను).

**అ॥** అట్టి సర్వాత్మదృష్టికలవాడు ఏ కార్యమునుజేసినను నిరంతరము పరమాత్మ యందే వసించుచుండునని తెలుపుచున్నాడు -

## 31. సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః
## సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే.

**టీక:-** సర్వభూతస్థితమ్ = సమస్తభూతములయందున్న, మామ్ = నన్ను, యః = ఎవడు, ఏకత్వమ్ = అభేదబుద్ధిని (సర్వత్ర ఒకే పరమాత్మయను భావమును), ఆస్థితః = పొందినవాడై, భజతి = సేవించుచున్నాడో, సః యోగీ = ఆ యోగి, సర్వథా వర్తమానః అపి = ఏ విధముగ ప్రవర్తించుచున్నవాడైనను (వ్యవహరించుచున్నను, లేక ధ్యానమందున్నను), మయి = నా యందే, వర్తతే = ఉండువాడగుచున్నాడు.

**తా:-** ఎవడు సమస్తభూతములయందున్న నన్ను అభేదబుద్ధి (సర్వత్ర ఒకే పరమాత్మయను

భావము) గలిగి సేవించుచున్నాడో, అట్టి యోగి ఏ విధముగ ప్రవర్తించుచున్నవాడైనను (సమాధినిష్ఠయందున్నను, లేక వ్యవహారము సల్పుచున్నను) నాయందే (ఆత్మయందే) ఉండువాడగుచున్నాడు.

**వ్యాఖ్య:–** (1) భగవంతు డెచట నున్నారు? (2) ఏయుపాయముచే మనుజుడు భగవంతునియందు స్థితిని సంపాదించుకొనగలడు? అను ప్రశ్నల కిచట సమాధాన మొసంగబడినది. దేవుడెచట నున్నారను సంశయము సామాన్యముగ ప్రతివానికిని గలుగు చుండును. దేవుడొకచోట మాత్రమే కాదు. సమస్త చరాచర ప్రాణికోట్లయందును నివసించుచున్నారు. దేవుడు లేనిచోటు లేదు. పాలలో వెన్నవలె, పుష్పమాలలో దారమువలె, నువ్వులలో నూనెవలె, చెఱుకుగడయందు రసమువలె భగవానుడు సమస్త భూతములందును వ్యాపించియున్నట్లు ఇచట స్పష్టముగ తెలుపబడినది. కాబట్టి సర్వప్రాణులు భగవత్స్వరూపులేయని తలంచి ఎవరికిని అపకారము చేయరాదు. ప్రాణికోట్ల యెడల దయ, కరుణ కలిగియుండవలెను. వానికి హితమాచరించవలెను. అదియే మాధవసేవ యగును.

ఇక రెండవప్రశ్న – ఏయుపాయముచే మనుజుడు పరమాత్మయందు స్థితిని సంపాదించుకొనగలడు? సర్వత్ర ఒకే పరమాత్మ వ్యాపించియున్నారని అభేదజ్ఞానము గలిగి వారిని సేవించువాడు, ధ్యానించువాడు తుదకు వారినే పొందుచున్నాడు. ఒకే సూర్యబింబము భిన్న భిన్న జలోపాధులందు వివిధముగ ప్రతిబింబించిన చందముననను, ఒకే వ్యక్తి అనేక వేషములు వేసిన విధముననను, ఒకే బంగారము భిన్న భిన్న ఆభరణముల రూపమున వెలయునట్లును, ఒకే మృత్తిక వివిధఘటాదులందు అనుస్యూతమై యుండునట్లును, ఉపాధులు వేర్వేఱుగనున్నను పరమాత్మ ఒకరే సమస్త చరాచరప్రాణికోట్లయందును అభిన్నముగ వ్యాపించియున్నారను ఏకత్వబుద్ధి గలిగి సర్వాంతర్యామియగు అట్టి భగవానుని సేవించువాడు, ధ్యానించువాడు తుదకు వారినే పొందగలడు. ఇదియే దైవప్రాప్తికి ఉపాయము.

అట్టి ఏకాత్మబుద్ధి, అభేదాత్మతత్త్వపరిజ్ఞానము కలవాడు ఏ విధముగ ప్రవర్తించినప్పటికిని భగవంతునియందే నివసించుచుండునని చెప్పబడినది. అనగా అతడు సమాధినిష్ఠయందున్నను, లేక వ్యవహరించుచున్నను, లేక ఊరకనున్నను, చిత్తమెపుడును ధ్యేయమందే (ఆత్మయందే) తన్మయమై యుండును. సముద్రయానము చేయువారి దగ్గఱనుండు 'కంపాసు' యంత్రమునందలి ముల్లు ఎటుత్రిప్పినను ఉత్తరపు దిక్కునే చూపునట్లు, ఏకాత్మజ్ఞానముగల అట్టి మహనీయులు ప్రపంచమున అనేకకార్యములు చేయుచున్నను భగవంతునియందు నివసించుచున్నవారే యగుదురు. కనుకనే ఆత్మజ్ఞులగు మహనీయులు ప్రపంచములో లోకసంగ్రహార్థము పెక్కు కార్యములను చేసినను వారి భగవత్స్థితికి ఏమాత్రము భంగము కలుగకనే యున్నది.

అయితే "సర్వథా వర్తమానోఽపి" అనుదానియర్థము జ్ఞాని యథేచ్ఛాచరణమునకు దిగవచ్చుననికాదు, దుశ్శీలుడై యుండవచ్చుననికాదు; అట్లు దుష్ప్రవర్తనగలవాడు అసలు జ్ఞానియేకాదు. పరమాత్మానుభవముగలుగుటకు విశుద్ధసత్త్వగుణము కలిగియుండవలెను గదా! అట్టి మహోన్నత శీలసంపత్తి గలవాడు ఏకాలమందైన క్రిందకు దిగి రజోగుణ, తమోగుణములను ఆశ్రయింపగలడా! అట్లెన్నడును జరుగదు. ఒకవేళ దిగజారినచో నతడు జ్ఞానియే కాదని ముమ్మాటికిని నిశ్చయింపవలెను. కాబట్టి శుష్కవేదాంతము నాశ్రయింపక, ముముక్షువులు కడుజాగరూకులై యుండవలెను. తమ ప్రవర్తనయందేలాటి లోపము రానీయక చూచుచుండవలెను. ఇట్టి పదములయొక్క అర్థమును బహుజాగ్రత్తగ గమించవలెను. .ఏ విధముగ ప్రవర్తించినను. అనుదాని భావ మిచట 'సర్వాత్మవిజ్ఞానము కలవాడు ధ్యానమందున్నను, లోకవ్యవహారము లాచరించినను, ఎట్లున్నను అతని ఆత్మస్థితికి లోపము లేదనియే' యగును.

ప్ర:– భగవంతు డెచట నున్నాడు?

ఉ:– సమస్తచరాచరప్రాణికోట్ల యందును వ్యాపించియున్నాడు.

ప్ర:– భగవంతునియందు స్థితిబొందవలెననిన జీవు డేమి చేయవలెను?

ఉ:– సర్వత్ర ఏకాత్మబుద్ధిగలిగి అట్టి అద్వయపరమాత్మను సేవించవలెను. ధ్యానించవలెను.

ప్ర:– ఆత్మజ్ఞుడగు మహనీయుడు లోకమున వ్యవహరించినను అతని భగవత్థ్సితికి హాని కలుగునా?

ఉ:– కలుగదు. అతడెట్లు ప్రవర్తించినను అతని భగవత్థ్సితికి లోపము గలుగదు.

**అ॥** అట్టి ఆత్మదృష్టి గలిగి సర్వజీవులను తనవలె సమముగ జూచువాడు సర్వోత్తముడని వచించుచున్నాడు –

**32. ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున**
**సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః.**

**టీక:–** అర్జున = ఓ అర్జునా!, సర్వత్ర = సమస్తప్రాణులయందును, సుఖంవా = సుఖమునుగాని, దుఃఖం యదివా = దుఃఖమునుగాని, ఆత్మౌపమ్యేన = తనతోటి పోల్చుకొనుచు (తన ఆత్మవంటిదే తక్కినవారి ఆత్మయనెడు భావముతో), సమమ్ = సమానముగా, యః = ఎవడు, పశ్యతి = చూచుచున్నాడో, సఃయోగీ = ఆ యోగి, పరమః (ఇతి) = శ్రేష్ఠుడని, మతః = తలంపబడుచున్నాడు.

**తా:–** ఓ అర్జునా! సమస్తప్రాణులయందును సుఖమునుగాని, దుఃఖమునుగాని తనతోడ పోల్చుకొనుచు (తన ఆత్మవంటిదే తక్కినవారి ఆత్మయనెడు భావముతో), తనవలె సమానముగా ఎవడుచూచునో, అట్టియోగి శ్రేష్ఠుడని తలంపబడుచున్నాడు.

**వ్యాఖ్య:–** ఈ శ్లోకమున ఆచరణవేదాంతము (Practical Vedanta) నుపదేశించుచున్నారు. ఒకనికి బోధ సరిగా ఒంటపట్టినది లేనిది అతని ఆచరణద్వారా తెలియుచుండును. వాక్కుద్వారా 'అంతయు బ్రహ్మమే, అంతయు దైవమే' అని చెప్పుచు పరప్రాణికి అపకారముచేయుట సరియగు పద్ధతికాదు. అది అనుభవవేదాంతముకాదు. బోధను త్రికరణశుద్ధముగ ఆచరించవలెను. తాను సంకల్పించినదానినే చెప్పవలెను. చెప్పినదానినే చేయవలెను. వేదాంతము నిత్యవ్యవహారములో జొరబడవలెను. మహనీయులాప్రకారమే కావించిరి. లేనిచో సిద్ధాంతము 'పుష్పితాం వాచమ్' అనునటుల నిష్ఫలమైపోవును. కాబట్టి 'అంతట ఒకే ఆత్మ కలదు' అను సిద్ధాంతము నాచరణయం దుంచినపుడు సమస్తప్రాణులయెడల దయ, కరుణ, ప్రేమ కలిగియుండవలసివచ్చును. తనదేహమునకు, తన మనస్సునకు తానెట్లు సుఖమును, శాంతిని, దుఃఖాభావమును కోరుచున్నాడో, అట్లే పరులవిషయమైకూడ భావింపవలెను. ఇదియే ఆత్మౌపమ్యస్థితి. ఈ ప్రకారముగ సుఖదుఃఖములందు తనతోబాటు సమానముగ ఇతరులనుగూడ చూచునట్టి యోగియే యోగులందఱిలోను సర్వశ్రేష్ఠుడని భగవానుడు పలికిరి.

కాబట్టి మనుజులలో శ్రేష్ఠత్వము వారి ఆచరణపై ఆధారపడియున్నదని భగవద్వాక్యములచే

స్పష్టమగుచున్నది. 'ఓ జీవులారా! 'అంతయు బ్రహ్మమే' అను సిద్ధాంతమును ఆచరణలోనికి తీసికొనివచ్చి సర్వజీవులయెడల ప్రేమను, కారుణ్యమును వర్షింపజేయుడు. అపుడే మీరు నిజమైన భక్తులు, యోగులు కాగలరు.' అని భగవానుడిచట నిస్సంకోచముగ జెప్పివైచిరి. ఈ వాక్యములు వాచావేదాంతులగు సోమరుల గుండెలను చీల్చునవియైయున్నవి. అధ్యాత్మరంగమున 'వాచావేదాంతము' నకు, సోమరితనమునకు చోటు లేకుండచేయుటకు కాబోలు ఇట్టి తమఃప్రభంజక వాక్యములను భగవానుడు అపుడపుడు పలుకుచుందురు. కావున ముముక్షువులు జాగరూకులై 'సర్వంఖల్విదంబ్రహ్మ' ఇత్యాది పరమార్థసూత్రములను ఆచరణయందుంచి సర్వభూతములను తనవలె జూచుచు దయార్ద్రహృదయులై వర్తించవలెను. అట్టివారే భగవద్దృష్టిలో సర్వశ్రేష్ఠులు.

పశ్చిమదేశములందు మతమున, సంఘమున, 'సోదరత్వము' (Brother-hood) నకు జనులు చాల ప్రాముఖ్యతను జూపుదురు. మంచిదే. కాని అది చాలదు. ఏలయనిన, సోదరులలోగూడ పరస్పర మెన్నియో వైమనస్యములు, అభిప్రాయభేదములు, వైరములు ఉదయించుచున్నవి. కావున సోదరత్వము ప్రేమయొక్క పరాకాష్ఠను సూచించనేరదు. గీతాది గ్రంథములు, ఉపనిషత్తులు ప్రేమ యొక్క చరమస్థితిని బోధించుచు 'ఆత్మౌపమ్యభావము'ను జనులలో నుద్బోధించినవి. 'సోదరత్వమును' దాటి ఒక మెట్టు ఇంకను పైకిపోయి విశ్వమునంతను ఒకే ఆత్మరూపమును కౌగిలించుకొనునట్లు చేసినవి. ఇదియే గీతయొక్క ఉపనిషత్తులయొక్క ఘనత; హైందవమత సిద్ధాంతము యొక్క ప్రకర్షత.

ఈ శ్లోకమున 'సర్వత్ర' అని చెప్పినందువలన, ప్రేమజూపవలసినది ఏ ఒకరిద్దరిపైననే కాదనియు, కేవలము మానవులపైననే కాదనియు, సమస్తచరాచర భూతకోట్లయెడల దయాది సద్గుణములను ప్రదర్శించవలెననియు స్పష్టపడుచున్నది.

'సయోగీ పరమో మతః' అని బోధించినందువలన సామాన్యయోగులవలెనుండక (ఆత్మౌపమ్యదృష్టిగలిగి) యోగులలో సర్వశ్రేష్ఠుడై చెన్నొందవలెనని సూచించినట్లైనది.

**అ॥** భగవానుడు బోధించిన జీవబ్రహ్మైక్యరూపమగు, లేక సర్వాత్మదృష్టి రూపమగు ఈ యోగమును అర్జునుడు అందుకొనజాలక ఈ క్రింది విధముగా భగవానుని ప్రశ్నించుచున్నాడు -

**అర్జున ఉవాచ :-**

## 33. యోఽయం యోగస్త్వయా ప్రోక్తస్సామ్యేన మధుసూదన
## ఏతస్యాహం న పశ్యామి చఞ్చలత్వాత్స్థితిం స్థిరామ్.

అర్జున ఉవాచ = అర్జున డిట్లు ప్రశ్నించెను.

**టీక:-** మధుసూదన = ఓ కృష్ణా!, సామ్యేన *(సాధ్యః)* = (మనస్సు యొక్క) సమత్వముచే (నిశ్చలత్వముచే) సిద్ధింపదగిన, యః అయమ్ యోగః = ఏ యీ యోగము, త్వయా = నీచేత, ప్రోక్తః = చెప్పబడినదో, ఏతస్య = దీనియొక్క, స్థిరామ్ = స్థిరమైన, స్థితిమ్ = నిలుకడను, చఞ్చలత్వాత్ = మనశ్చాంచల్యమువలన, అహమ్ = నేను, న పశ్యామి = చూడజాలకున్నాను (తెలిసికొనజాలకున్నాను).

**తా:-** అర్జునుడు ఇట్లు ప్రశ్నించెను - ఓ కృష్ణా! మనోనిశ్చలత్వముచే సిద్ధింపదగిన ఏ యోగమును

మీరుపదేశించితిరో దానియొక్క స్థిరమైన నిలుకడను మనస్సుయొక్క చపలత్వమువలన నేను తెలిసికొనజాలకున్నాను.

**వ్యాఖ్య:–** శ్రీకృష్ణపరమాత్మ ఆత్మతత్త్వమునుగూర్చి గంభీరముగ బోధించుచు పోవుచుండిరి. అకస్మాత్తుగ అర్జునుడు మధ్యలో తనకు గల సందేహమును అడిగివైచెను. ఈ ప్రకారముగ అర్జునుడు మధ్యలో ప్రశ్నించనిచో ఇంకను ఎంతయో అఖండమగు ఆత్మతత్త్వబోధామృతమును శ్రీకృష్ణపరమాత్మ వర్షించియుండెడివారేమో! అయినను అర్జునుని ప్రశ్నయు ముముక్షువులకు చాల ఉపకరించునదే అయియున్నది. "దేవా! జీవాత్మ పరమాత్మల సామ్యరూపమైనదియు, మనోనిశ్చలతచే సిద్ధింపదగినదియునగు ఈ ధ్యానయోగమునందు నాకు స్థిరమగు నిలుకడ కలుగకున్నది. ఏలయనిన, నా మనస్సు చపలముగనున్నది" అని అర్జునుడు తన పరిస్థితిని భగవానునకు వెల్లడించెను. శిష్యుడు గురువుయొద్ద తన హృదయమును తెఱచి మాట్లాడవలెను. ఏదియు కప్పిపుచ్చగూడదు. వైద్యునియొద్ద రోగి తనపరిస్థితిని ఉన్నది ఉన్నట్లు చెప్పవలెనేకాని దాపరిక మచట పనికిరాదు. లేకున్న విపరీతపరిణామములు కలుగవచ్చును. తన యాంతరంగికభావమును హృదయము విప్పి చెప్పినపుడే శిష్యుడు గురువువలన సత్ఫలితములను పొందగలడు. ఆత్మోన్నతిని బడయగలడు. అర్జునుడు సచ్ఛిష్యుడు కనుకనే తనహృదయమును విప్పి భగవానుని ముందుంచెను. తన మనస్సు చపలముగానున్నదనియు, తత్ఫలితముగ ఆత్మయందు నిలుకడను బొందజాలకున్నదనియు ఆ చపలత్వమును బోగొట్టుట కుపాయమును సెలవివ్వవలసినదనియు వేడెను.

అర్జునుడు ప్రపంచములోగల సకల ముముక్షువుల తరపున ప్రతినిధియైయున్నాడు. వారందఱి తరపున అతడు 'వకాలతు' తీసికొనియున్నాడు. కాబట్టి సాధకులందఱిని సామాన్యముగ బాధించునట్టి సంశయమునే ఆతడడిగెను. అద్దానికి భగవానుడు చెప్పు సమాధానము ఒక్క అర్జునునకే కాక సమస్తముముక్షులోకమునకును ఉద్దేశింపబడినదే యగును.

'సామ్యేన' అని చెప్పినందువలన ధ్యానయోగము మనస్సుయొక్క సమత్వముచేతనే, నిశ్చలత్వముచేతనే సిద్ధింపగలదని స్పష్టమగుచున్నది. సూదిరంధ్రములో దారము నెక్కించవలెననిన అది ఏకాగ్రముగను నిశ్చలముగను ఉండవలెను. అట్లే మనస్సు బ్రహ్మరంధ్రములో, లేక మోక్షద్వారములో ప్రవేశింపవలెననిన నిశ్చలముగనుండవలెను. ఫోటో తీయునపుడు వ్యక్తి నిశ్చలముగా లేనిచో బొమ్మ సరిగా పడదు కదా! కావున మనస్సు చపలముగానున్నచో ధ్యేయవస్తువు సరిగా అనుభూతముకాదు. అర్జునునకట్టి మనోనిశ్చలత్వ మింకను కలుగలేదుగనుక దానినిగూర్చి భగవాను నిట్లు ప్రశ్నించెను.

ఇచట 'సామ్యేన' అను పదమునకు సమదృష్టిరూపముతో, లేక సర్వాత్మ దృష్టి రూపముతో అనియు అర్థము చెప్పుకొనవచ్చును.

**ప్ర:–** యోగము దేనిచే సిద్ధించును?

**ఉ:–** మనోనిశ్చలతచే, సమత్వముచే సిద్ధించును (మనస్సు చపలముగానున్నచో యోగమందు స్థిరమగు నిలుకడ కలుగదు).

**అ॥** మనస్సును నిగ్రహించుట బహుకష్టమని అర్జునుడు తెలుపుచున్నాడు –

**34. చఞ్చలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్**
**తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్.**

**టీక:-** కృష్ణ = ఓ కృష్ణా!, మనః = మనస్సు, చఞ్చలమ్ = చంచలమైనదియు, ప్రమాథి = (దేహేంద్రియాదులను) క్షోభపెట్టునదియు, బలవత్ = బలవంతమైనదియు (నిగ్రహించుటకు కష్టసాధ్యమైనదియు), దృఢమ్ హి = (విషయప్రవర్తనమునందు) దృఢమైనదియునుగదా!, తస్య = దానియొక్క, నిగ్రహమ్ = నిరోధము, వాయోః ఇవ = గాలిని అణిచపెట్టుటవలె, సుదుష్కరమ్ = మిగుల కష్టసాధ్యమైనదని, అహమ్ = నేను, మన్యే = తలంచుచున్నాను.

**తా:-** కృష్ణా! మనస్సు చంచలమైనదియు, విక్షోభమును గలుగజేయునదియు, బలవంతమైనదియు, దృఢమైనదియునుగదా! కావున అద్దానిని నిగ్రహించుట, గాలిని అణచిపెట్టుటవలె మిగుల కష్టసాధ్యమైనదని నేను తలంచుచున్నాను.

**వ్యాఖ్య:-** మనస్సు నిశ్చలముగ నుండిననే యోగము (ఆత్మైక్యము) సాధ్యపడును. కాని మనస్సు మహాచంచలమైనది. అది దేహేంద్రియాదులను క్షోభపెట్టుచు శాంతమగుహృదయమును - క్షీరసాగరమును మందరపర్వతమువలె తీవ్రముగ మథించి వైచుచున్నది. మఱియు అనేకజన్మార్జిత వాసనలను, సంస్కారములను, దృశ్యవృత్తులను అది ప్రోగుచేసుకొని బలవత్తరమై, దృఢమైయున్నది. అందుచే నయ్యది నిగ్రహింపబడుటకు సాధ్యపడకనున్నది. ఈ ప్రకారముగ అర్జునుడు మనస్సుయొక్క సామర్థ్యమును వర్ణించుచు దాని స్వరూపమును నాలుగు విశేషణములతో తెలియజెప్పెను. అవియేవి యనిన - (1) చపలత్వము (2) క్షోభజనకత్వము (3) బలవత్వము (4) దృఢత్వము. మనస్సుయొక్క ఈలక్షణములు సర్వులకును అనుభవైకవేద్యములే. చాపల్యమందు మనస్సును ముల్లుగ్రుచ్చుకొనిన, కల్లుత్రాగిన, దయ్యముపట్టిన, తేలుకుట్టిన కోతితో పెద్దలు పోల్చిచెప్పుదురు. మనస్సు ధ్యానకాలమున సాధకులను ముప్పతిప్పలు పెట్టుట అందఱికిని తెలిసినదే. మఱియు దేహేంద్రియములను, హృదయమును అది శాంతముగ నుండనీయదు. ఒక్కొక్క ఘటనయందు కలచివైచును. అశాంతిని గలుగజేయును. మరల మామూలు శాంతస్థితికి వచ్చుటకు కొన్ని మాసములుకూడ పట్టవచ్చును.

ఈ ప్రకారముగ మనశ్శక్తినిగూర్చి అర్జునుడు అభివర్ణించి, దానిని నిగ్రహించుట కష్టతరమనియు వచించి దానినెట్లు స్వాధీనపఱచుకొనవలెనో ఉపాయమును సెలవిండని భగవానుని ప్రార్థించెను. 'దుష్కరమ్' అని చెప్పక 'సుదుష్కరమ్' అని చెప్పుటవలన మనోనిగ్రహము అతిప్రయాసకరమని స్పష్టమగుచున్నది.

**ప్ర:-** మనస్సుయొక్క స్వభావమెట్టిది?

**ఉ:-** అది (1) చంచలమైనది (2) దేహేంద్రియాదులను క్షోభపెట్టునది (3) బలవత్తరమైనది (4) దృఢమైనది.

**అ॥** అర్జునుని వాక్యములను విని శ్రీకృష్ణపరమాత్మ మనస్సును నిగ్రహించు ఉపాయములను సెలవిచ్చుచున్నాడు -

**శ్రీ భగవానువాచ :-**

**35. అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్**
**అభ్యాసేన తు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే.**

శ్రీ భగవానువాచ = శ్రీ భగవంతుడు పలికెను -

**టీక:—** మహాబాహో = గొప్పబాహువులుగల ఓ అర్జునా!, మనః = మనస్సు, దుర్నిగ్రహమ్ = నిగ్రహించుటకు కష్టసాధ్యమైనది, చలమ్ = చంచలమైనది, (ఇత్యత్ర = అని చెప్పుటలో) అసంశయమ్ = సందేహములేదు, (తథాపి= అయినను) కౌన్తేయ= ఓ అర్జునా!, అభ్యాసేనతు= అభ్యాసముచేతను, వైరాగ్యేణచ = వైరాగ్యముచేతను, గృహ్యతే = (ఆ మనస్సు) నిగ్రహింపబడుచున్నది.

**తా:—** శ్రీ భగవంతుడు పలికెను - గొప్పబాహువులుగల ఓ అర్జునా! మనస్సును నిగ్రహించుట కష్టమే. మఱియు అది చంచలమైనదే. ఇట ఏలాటి సంశయమున్ను లేదు. అయినను అభ్యాసము చేతను, వైరాగ్యముచేతను అది నిగ్రహింపబడగలదు.

**వ్యాఖ్య:—** మనస్సు చంచలమైనది, దానిని నిగ్రహించుట కష్టసాధ్యమైనది. (ప్రయాసతో గూడినపని) - అను విషయమును శ్రీకృష్ణభగవానుడున్ను ఆమోదించెను. కాని అంతమాత్రముచేత భయపడవలసిన పనిలేదనియు, అభ్యాసవైరాగ్యములచే అయ్యది నిగ్రహింపబడగలదనియు ధైర్యమును జెప్పిరి. వస్తువుగాని, వ్యక్తిగాని బలశాలి అయినంత మాత్రమున ఎవరును జంకవలసిన పనిలేదు. దానిని అణచుటకు తగిన ఆయుధమును వెతకికొనిన చాలును. ఏనుగు చాల గొప్పదే. అయిననేమి? ఒక చిన్న అంకుశమును సంపాదించుకొనిన చాలును. దాని ఆటకట్టినట్లే యగును. అట్లే సింహము, పులి మున్నగునవి మహాభయంకరములైనవి. అయినను ఒక చిన్న తుపాకిగుండుచే వశీభూత ములగుచున్నవి. ఎద్దు బలిష్ఠమైనదైనను ముక్కుత్రాటికి లొంగుచున్నదిగదా. అట్లే మనస్సుయొక్క బలీయత, సామర్థ్యమునుజూచి 'గాబరా' పడవద్దనియు దానిని లోబర్చుకొనుట కుపాయముకలదనియు వచించి, ఆ యుపాయమేదియో బయటపెట్టిరి. మనస్సు 'దుర్నిగ్రహ'మైనదేకాని 'అనిగ్రహ'మైనదికాదు. దానిని జయించుట కష్టసాధ్యమేకాని అసాధ్యముకాదు. తగు ప్రయత్నముచే అది తప్పక నిగ్రహింపబడగలదు.

ఇక దానిని నిగ్రహించుటకు భగవానుడు బోధించిన ఉపాయములనుగూర్చి విచారించెదము. ఈ ఘట్టము సాధకలోకమునకు అతిముఖ్యమైనది. ఏలయనిన ఎద్దానికి వశీభూతలై జనులు అనాదికాలమునుండి ఈసంసారసాగరమునబడి దరిగానక ఈదులాడుచున్నారో, ఈ జననమరణాది దుఃఖములకు లోనగుచున్నారో, ఏది ఆత్మానుభూతికి ప్రధానమగు అడ్డుగోడగా నిలిచియున్నదో, అట్టి మనస్సుయొక్క నిగ్రహమునుగూర్చి యిట వచింపబడినది. అందును సాక్షాత్ అవతారమూర్తియగు శ్రీకృష్ణభగవానుని ముఖారవిందమునుండి ఆ యుపాయము వెలువడుటబట్టి అది అత్యంతప్రాధాన్యమును పొందుచున్నది. మనస్సును నిగ్రహించుట ఎట్లు? అను ఈ ప్రశ్నయే దాదాపు ప్రతివాని నోటిగుండా వచ్చుచున్నది. ఈ ప్రశ్న నివారింపబడినచో ఒక ఆధ్యాత్మిక సాధనయంతయు పూర్తి అయినట్లే. కాబట్టి దీనినిగూర్చి భగవానుడేమి బోధించిరో తెలిసికొనుట అత్యావశ్యకము.

(1) అభ్యాసము (2) వైరాగ్యము అను రెండు ఉపాయములచే మనస్సు తప్పక నిగ్రహింపబడగలదని భగవానుడు హామీనొసంగిరి. పతంజలి మహర్షియు అట్లే నుడివిరి★. వైరాగ్యమనగా దృశ్యవిషయములందలి నశ్వరత్వాది దోషములను విచారించి వానియెడల ఏహ్యభావము గలిగియుండుట. దానిచే మనస్సు బహిర్ముఖముగ పరుగెత్తక అంతర్ముఖముగ మరలును. వైరాగ్యము ఎందులకు కలిగియుండవలెననగా - ఈ దృశ్యప్రపంచములోని సమస్తపదార్థములును కాలక్రమమున నశించునవియైయున్నవి. తుదకు శరీరమున్ను కొంతకాలమునకు నశించియేతీరును. అశాశ్వతములగు నిట్టిపదార్థములపై వాంఛయేల? (శాశ్వతవస్తువు ఒక్క

★ అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధః. (పతంజలి)

ఆత్మయే (దైవమే). కావున దానియెడలమాత్రము కోరిక గలిగియుండవలెను) ఒకవేళ ప్రాపంచిక భోగములను అనుభవించినను తృప్తికలుగదు. ఆశ తగ్గదు. మరల వానియందు ద్విగుణీకృతవాంఛ ఉదయించును. దానివలన వాసనలు బలపడి సంసారబంధము వృద్ధియగును. పైగా మనస్సు విషయానుభవమున్నకై, బహిర్ముఖమగుచున్నకొలది ఆత్మవస్తువు దూరమగుచుండును. ధ్యానమందు మనస్సు నిలవకుండును. కాబట్టి మనస్సు నిశ్చలమగుటకై, స్వాధీనపడుటకై విషయవైరాగ్యమత్యవసరమైయున్నది.

ఇక మనోనిగ్రహమందు గమనించవలసిన రెండవయంశము అభ్యాసము. అభ్యాసముచే, సతతప్రయత్నముచే ఏ కార్యమైనను సాధింపబడగలదు. 'సతు దీర్ఘకాలనైరన్తర్యసత్కారసేవితో దృఢభూమిః' - అని పతంజలి మహర్షియు బహుకాల నిరంతరరాభ్యాసముచే మనోనిగ్రహము తప్పక సాధ్యపడగలదని చెప్పియున్నాడు. సోమరులకు మనస్సులొంగదు. ఏలయనగా దానిని లొంగదీయుటకు వారు ప్రయత్నమే చేయరు. ప్రయత్నముగాని, అభ్యాసముగాని లేనిచో లౌకికరంగమునగాని, పరమార్థరంగమునగాని ఏకార్యమున్ను సాధింపబడదు. ఒకచిన్న పరీక్షయం దుత్తీర్ణులు కావలెనని ఎన్నిరోజులు కష్టపడవలసియుండ, ఇక ఎన్నిజన్మలనుండియో గడ్డకట్టియున్న కఠినమగు మనస్సును కరగించుట కెంత శ్రమ, ఎంత అభ్యాసము గావింపవలసియుండునో యోచించుకొనుడు! కాబట్టి ప్రతిరోజున్ను మనస్సును విచారవైరాగ్యములచే బాహ్యమునుండి మరలించి అంతరంగమున ఆత్మధ్యానమందు నియోగించుటయను అభ్యాసమును బహుభంగుల గావించుచున్నచో అచిరకాలములో మనస్సు స్వాధీనపడి ఆత్మయందే నిరంతరము ప్రీతిని బొందుచుండగలదు.

ఈ శ్లోకమున అర్జునుని 'మహాబాహో' అని శ్రీకృష్ణుడు సంబోధించిరి. 'ఓ అర్జునా! నీవు గొప్ప భుజబలము, పరాక్రమము గలవాడవు, భౌతికశక్తిసమన్వితుడవు. అట్టి నీ శక్తిని అధ్యాత్మరంగమునగూడ వ్యక్తమొనర్చి అభ్యాసవైరాగ్యములద్వారా మనస్సును నిగ్రహించి, విజయమును బొందుము' అని యీ సంబోధన ద్వారా భగవానుడు తెలిపినట్లైనది. అర్జునుడు మనోనిగ్రహము దుస్తరమని వచించినది చూచి అతనికి ధైర్యమును పురిగొల్పుటకై 'మహాబాహో' అని యిట సంబోధించియు నుండవచ్చును.

**ప్ర:-** మనస్సు ఎట్టిది?

**ఉ:-** (1) చంచలమైనది (2) నిగ్రహించుటకు కష్టసాధ్యమైనది.

**ప్ర:-** ఏ సాధనములచే మనస్సు నిగ్రహింపబడగలదు?

**ప్ర:-** (1) అభ్యాసము (2) వైరాగ్యము - అను నీరెండిటిచే మనస్సు స్వాధీనపడగలదు.

**అ॥** మనస్సును ఎందులకు నిగ్రహింపవలెనో చెప్పుచున్నాడు -

## 36. అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః
## వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః.

**టీక:-** అసంయతాత్మనా = నిగ్రహింపబడని మనస్సుగలవానిచేత, యోగః = యోగము, (బ్రహ్మైక్యము), దుష్ప్రాపః = పొందశక్యముకానిది, ఇతి = అని, మే = నాయొక్క, మతిః = అభిప్రాయము, వశ్యాత్మనా తు యతతా = స్వాధీనమైన మనస్సుగల్గి ప్రయత్నించువానిచేతనో, ఉపాయతః = ఉపాయముచేత, అవాప్తుమ్ = పొందుటకు, శక్యః = సాధ్యమైనది.

**తా:—** నిగ్రహింపబడని మనస్సుగలవానిచేత యోగము (బ్రహ్మైక్యము) పొంద శక్యముకానిది అని నా అభిప్రాయము. స్వాధీనమైన మనస్సుగల్గి ప్రయత్నించువానిచేతనో, ఉపాయముచే నది పొంద శక్యమైయున్నది.

**వ్యాఖ్య:—** మనస్సును నిగ్రహింపనివానికి ఆత్మసాక్షాత్కారము లభించదు. ధ్యానయోగమందు నిలుకడ సంభవింపదు. అది నిగ్రహించినవానికే ఆత్మైక్యము సాధ్యపడును - అని భగవానుడిచట తెలియజేయుచున్నాడు. కావున మోక్షాపేక్షగల వారందఱున్ను పెక్కుసాధనలచే, ఉపాయములచే మొట్టమొదట తమ మనస్సును, ఇంద్రియములను నిగ్రహించవలెను. అవి పట్టుతప్పి విచ్చలవిడిగా విషయారణ్యములందు సంచరించుచున్నంత వఱకు మోక్షమును గూర్చిన వార్తయేయుండదు. ఏలయనగా మనస్సు ఆశాపాశములచే గట్టబడి బహిర్ముఖముగ ప్రవర్తించునపుడు ఆత్మయందు (దైవమందు) ప్రీతిలేక, అంతర్ముఖత్వముజెందక యుండుటచే నత్తఱి ఆత్మస్వరూపమును దెలియజాలకయుండును.

అయితే, అట్టి మనస్సంయమము ఎట్లు లభించును? దీనికి భగవానుడే క్రిందటి శ్లోకమున సమాధాన మొసంగియుండిరి. అభ్యాసము, వైరాగ్యము అను రెండింటిని ఆశ్రయించినచో మనస్సు స్వాధీనపడగలదు. 'యతతా' (ప్రయత్నించువానిచేత) అని యిచట చెప్పుటవలన యోగము, లేక ఆత్మసాక్షాత్కారము సిద్ధించుటకు ప్రయత్నమత్యావశ్యకమనియు, ప్రయత్నశీలునకే యోగమబ్బునుగాని, సోమరులకుగాదనియు స్పష్టపఱచినట్లైనది. సోమరి, అకర్మణ్యుడు, అలసుడు ఏ రంగమునను వృద్ధికిరాలేడు. పరమార్థరంగమున అసలు రాలేడు. జన్మజన్మాంతరములనుండి జీవుని వెన్నంటుచున్న దుష్టవాసనలను అంతమొందించుటకు ప్రబలమగు పురుషప్రయత్న మవసరము. మఱియు 'ఉపాయతః' అని చెప్పినందువలన మాయను జయించుటకు, పరమాత్మను (యోగసిద్ధిని) బొందుటకు యుక్తియు అత్యావశ్యకమని తేలుచున్నది. కొన్నిచోట్ల శక్తియు, కొన్నిచోట్ల యుక్తియు శత్రుజయమున పనికి వచ్చును. ఎంతటిగొప్పకార్యమైనను కొన్ని సందర్భములలో యుక్తిచే అతిశీఘ్రముగ నెరవేరగలదు. అట్టి యుక్తులను, ఉపాయములను ముముక్షువు పెక్కింటిని ఊహించుకొని, వానిచేతను, మఱి ఇతరములగు అనేక మార్గములచేతను ఎట్లైనను భగవత్సాక్షాత్కారమును బడయవలెను.

'మే మతిః' నా యొక్క నిశ్చయము అని భగవాను డిచట తెలిపినందువలన మనోనిగ్రహములేనివానికి దైవసాక్షాత్కారము లభింపదనియు, అదికలవానికే ఉపాయములచే అది సాధ్యపడగలదనియు సాక్షాత్ భగవంతునియొక్క నిశ్చితాభిప్రాయమై యుండుటచే ముముక్షువుల కీవాక్యములం దెంతటి విశ్వాసము గలిగియుండవలెనో, ఎంతటి గొప్ప ప్రమాణముగ వీనిని స్వీకరించవలసియుండునో ఊహించుకొనవచ్చును. కావున ఇక 'మా మనస్సు జయింపబడునో లేదో, మోక్షము సిద్ధించునో లేదో' అను సంశయముల నెవరును పెట్టుకొనక, భగవద్వాక్యములపై పరమ విశ్వాసముగలిగి అభ్యాస వైరాగ్యాది ఉపాయముల నాశ్రయించి యత్నించుచు మనస్సును స్వాధీనపఱచుకొని ఆత్మసాక్షాత్కారరూపయోగమును ఈ జన్మయందే సాధించివేయవలెను.

**ప్ర:—** యోగసిద్ధిని (ఆత్మసాక్షాత్కారమును) ఎవడు పొందగలడు? ఎవడు పొందలేడు?

**ఉ:—** మనోనిగ్రహముకల్గి ఉపాయములచే యత్నించువాడు పొందగలడు. అదిలేనివాడు పొందలేడు.

**ప్ర:—** మోక్షమెట్టివానికి లభ్యమగును?

**ఉ:–** ప్రయత్నశీలుడగువానికే లభ్యమగునుగాని యత్నరహితుడగు సోమరికి కాదు.

**అ॥** యోగమునందు శ్రద్ధగలిగియు మనోనిగ్రహము నింకను బడయజాలనట్టి సాధకుడు మరణించినపిదప ఏ గతిని బొందునో తెలిసికొనదలంచి అర్జును డావిషయమై పరమాత్మను ప్రశ్నించుచున్నాడు –

**అర్జున ఉవాచ :–**

**37. అయతిశ్శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః**
**అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి.**

అర్జునఉవాచ = అర్జునుడడిగెను –

**టీక:–** *కృష్ణ* = ఓ కృష్ణా!, *శ్రద్ధయా* = శ్రద్ధతో, *ఉపేతః* = కూడినవాడును, (కాని) *అయతిః* = మనోనిగ్రహశక్తిలేనివాడగుటచే, *యోగాత్* = యోగమునుండి, *చలితమానసః* = జాఱిన మనస్సుగలవాడును (అగు సాధకుడు), *యోగసంసిద్ధిమ్* = యోగసిద్ధిని (ఆత్మసాక్షాత్కారమును), *అప్రాప్య* = పొందక, *కాం గతిమ్* = ఏ గతిని, *గచ్ఛతి* = పొందుచున్నాడు?

**తా:–** అర్జునుడడిగెను – కృష్ణా! శ్రద్ధతో గూడియున్నవాడును, కాని నిగ్రహశక్తి లేని వాడగుటచే యోగమునుండి జాఱిన మనస్సుగలవాడునగు సాధకుడు యోగసిద్ధిని (ఆత్మసాక్షాత్కారమును) బొందజాలక మఱియేగతిని బొందుచున్నాడు?

**వ్యాఖ్య:–** మనస్సును నిగ్రహించిననే యోగసిద్ధి (ఆత్మసాక్షాత్కారము) కలుగునని శ్రీకృష్ణమూర్తిచెప్పగా, అంతట అర్జునున కొకసందేహముకలిగినది. ఒకనికి యోగమందు, ధ్యానమందు, గురువాక్యమందు శ్రద్ధయున్నది, విశ్వాసమున్నది. సాధనచేయుచున్నాడు. కాని మనస్సు ధ్యానమందు నిలుకడను బొందుటలేదు. అది స్వాధీనపడకున్నది. అట్టివాడు లక్ష్యమునుబొందక మరణించినచో ఏగతిని బొందును? – అనునది అర్జునునిప్రశ్న. ఈ ప్రశ్న సామాన్యముగ లోకములో చాలమందికి కలుగుచుండును. ఏలయనిన, ఈ జన్మయందే మోక్షసిద్ధిపర్యంతము తీవ్రప్రయత్నము చేయువారు చాల అరుదు. మధ్యతరగతివారైయుండి ఒకింతనిష్ఠసలుపువారే ఎక్కువ. కావున అట్టి వారు ఈజన్మయందు యోగముయొక్క పరాకాష్ఠను బడయకున్నస్థితిలో అకస్మాత్తుగ దేహవియోగము సంభవించినచో వారిగతి ఏమగును? అను సంశయము నిక్కముగ పెక్కుమందికి గలుగుచుండును. కావున అర్జునుని ప్రశ్న, దానికి భగవానుడొసంగు సమాధానమును సాధకలోకమునకు లెస్సగ నుపకరించునదై యున్నది. శ్రద్ధాభక్తులు గలిగి యున్నను ఈ జన్మయందు పూర్ణత్వమును బొందజాలని వారనేకులు తమకు అధోగతియేమైన తటస్థించునేమోయని భయపడుచుందురు. కావున అట్టివారి భయమును అర్జునుని యీ ప్రశ్న – దానికి భగవాను డొసంగు సమాధానము తొలగించివైచుచున్నది.

**ప్ర:–** అర్జునుడు శ్రీకృష్ణుని యేమని ప్రశ్నించెను?

**ఉ:–** దైవప్రాప్తికై శ్రద్ధతోగూడి యత్నించువాడును, కాని మనోనిగ్రహశక్తి లేకయుండువాడును అగు మనుజుడు, యోగసిద్ధిని బొందజాలక మరణించినచో నాత డేగతిని బడయును? అనునది అర్జునుని ప్రశ్న.

## 38. కచ్చిన్నోభయవిభ్రష్టశ్ఛిన్నాభ్రమివ నశ్యతి
## అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి.

**టీక:–** మహాబాహో = గొప్పబాహువులుకల ఓ కృష్ణా!, బ్రహ్మణః = బ్రహ్మముయొక్క, పథి = మార్గమునందు (మోక్షమార్గమగు యోగమునందు), అప్రతిష్ఠః = స్థిరత్వము లేనివాడగు, విమూఢః = మూఢుడు, ఉభయ విభ్రష్టః = ఇహపరముల రెండికిని చెడినవాడై, ఛిన్నాభ్రమ్ ఇవ = చెదిరిన మేఘమువలె, న నశ్యతికచ్చిత్ = నశించిపోడాయేమి?

**తా:–** గొప్ప బాహువులుకల ఓ కృష్ణా! బ్రహ్మమార్గమున (యోగమున) స్థిరత్వములేనివాడగు మూఢుడు ఇహపరముల రెండిటికిని చెడినవాడై చెదిరిన మేఘమువలె నశించిపోడా యేమి?

**వ్యాఖ్య:–** అధ్యాత్మమార్గమున ప్రవేశించియు అందు స్థిరత్వమునుబొందనివాని విషయమై యిట ప్రశ్నించడమైనది. 'ఉభయవిభ్రష్టః' అను పదమునకు కర్మమార్గము నుండి, యోగమార్గమునుండి అని కొందఱును, స్వర్గమోక్షములనుండి అని కొందఱును అర్థము చెప్పిరి.

**అ॥** తన యీ ప్రశ్నకు సమాధానమొసంగవలసినదిగా అర్జునుడు భగవానుని ప్రార్థించుచున్నాడు

## 39. ఏతం మే సంశయం కృష్ణ ఛేత్తుమర్హస్యశేషతః
## త్వదన్యః సంశయస్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే.

**టీక:–** కృష్ణ= ఓ కృష్ణా!, మే= నాయొక్క, ఏతం= ఈ, సంశయమ్= సందేహమును, అశేషతః= పూర్తిగా, ఛేత్తుమ్ = పోగొట్టుటకు, అర్హసి = తగుదువు, అస్య = ఈ, సంశయస్య = సందేహమును, ఛేత్తా = పోగొట్టువాడు, త్వత్ = నీకంటె, అన్యః = మఱియొకడు, న హి ఉపపద్యతే = లభింపడుగదా!

**తా:–** కృష్ణా! ఈ నాసందేహమును పూర్తిగా తొలగించుటకు మీరేతగుదురు (సమర్థులు). మీరుతప్ప ఇతరులెవ్వరును దీనిని తొలగింపజాలరు.

**వ్యాఖ్య:–** అర్జునుడు గురువగు శ్రీకృష్ణమూర్తియెడల అనన్య భక్తిభావమును, సంపూర్ణవిశ్వాసమును ప్రదర్శించుచున్నాడు. 'పరిప్రశ్నేన సేవయా' (4-34) అను వాక్యములోని 'పరిప్రశ్న' కిది చక్కటి యుదాహరణము. శిష్యుడు గురువును ప్రశ్నించునపుడు ఎంతయో వినయవిధేయతులు చూపవలెను. అప్పుడే గురువునకు సంతోషము గలిగి శిష్యునిపై తనయనుగ్రహమును జూపును. గురువుచెంత, దైవముచెంత, పెద్దలచెంత, దర్పము పనికిరాదు. అహంభావ, దర్పములు కలవాడు గుర్వనుగ్రహమునకును, దైవానుగ్రహమునకును ఎన్నడును పాత్రుడు కానేరడు.

శ్రీకృష్ణమూర్తి త్రిలోకనాథుడు, సాక్షాత్ ఈశ్వరుడు. సమస్త బ్రహ్మాండములందలి భూతభవిష్యద్వర్తమాన భూతకోట్లయొక్క గతులన్నింటి నెఱిగినవాడు. కావున యోగభ్రష్టులయొక్క భావిచరిత్రను చక్కగ దెలిసినవాడు. అట్టి మహనీయుడు తన యెదుటనుండగా, ఇక మఱియొకనిని తనసంశయనివృత్తికై అర్జునుడెట్లాశ్రయించగలడు? అట్టిసమర్థత మరియెవరికి కలదుగనుక! కాబట్టియే అర్జునుడు 'మీరే నా సంశయమును భేదించుటకు తగుదురు, అన్యులు కాద'ని భగవానునితో చెప్పుటకు కారణమైనది.

**అ॥** అర్జునుని యా ప్రశ్నకు భగవానుడు సమాధానమొసంగుచున్నాడు -

**శ్రీ భగవానువాచ :-**

## 40. పార్థ నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే
## న హి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి.

శ్రీ భగవానువాచ = శ్రీ భగవంతుడు చెప్పెను.

**టీక:-** పార్థ = ఓ అర్జునా!, తస్య = వానికి (యోగభ్రష్టునకు), ఇహ = ఈ లోకమందు, వినాశః = వినాశము, న విద్యతే ఏవ = లేనే లేదు, అముత్ర = పరలోకమందును, న = లేదు, తాత = నాయనా!, కల్యాణకృత్ = మంచిపనిచేయువాడు, కశ్చిత్ = ఎవడును, దుర్గతిమ్ = చెడుగతిని, న గచ్ఛతి హి = పొందడుగదా!

**తా:-** శ్రీభగవంతుడు చెప్పెను - ఓ అర్జునా! అట్టి యోగభ్రష్టున కీలోకమందుగాని, పరలోకమందుగాని వినాశము కలుగనే కలుగదు. నాయనా! మంచికార్యములు చేయువాడెవడును దుర్గతిని పొందడుగదా!

**వ్యాఖ్య:-** సత్కార్యతత్పరులకు భగవానుడు అభయమొసంగుచున్నాడు. యోగాభ్యాసము, ధ్యానము, మున్నగునవి చేయువారు ఒకవేళ తమ లక్ష్యమును పొందక పూర్వమే మరణించినచో వారికి దుర్గతి ఏమాత్రమున్ను గలుగదని సాధకులకు భగవానుడు హామీనిచ్చిరి. ఇంతియేకాదు. మంచికార్యములు చేయువాని కెన్నడును వినాశముగాని, దుర్గతిగాని కలుగనేకలుగదని భేరిమ్రోగించి చెప్పిరి. భగవానుని ఈ వాక్యము భక్తులకు, సాధకులకు బ్రహ్మమార్గమున జనువారికి సంజీవివంటిది. వారికిది యెంతయో ఉత్సాహమును రేకెత్తించుచున్నది. తమ సద్గతి విషయమై సంశయాస్పదులైయున్న సత్కార్య పరాయణులకందఱికిని గీతాచార్యుని ఈవాక్యము ప్రాణముపోసినట్లైనది. ఈశ్లోకమును బాగుగ కంఠస్థముచేసి, అపుడపుడు స్మరించుచుండినచో ఇక దిగులు, దుఃఖము, సందేహము ముముక్షువునకు కలుగనేరవు. ఇట్టి ధైర్యోద్బోధకవాక్యములచేతనే సాధకుడు పరమార్థరంగమున ఇతోధిక శ్రద్ధాభక్తులతో వ్యవహరించగలడు. చెడ్డపనికి భయపడవలసినదేకాని మంచిపని ఎంత చిన్నదైనను భయపడనవసరములేదని స్పష్టమగుచున్నది. వారువారు చేయు సత్కార్యముల ననుసరించి జనులకు లభించు సత్ఫలితములలో ఒకింత తారతమ్యముండవచ్చునేకాని, దుష్ఫలితములుమాత్ర మెన్నడును అట్టివారికి కలుగనేరవు.

'ఇహ', 'అముత్ర' అని రెండుపదములు ప్రయోగింపబడినందువలన, ఇహలోకమందుగాని, పరలోకమందుగాని, మఱెచ్చటగాని సత్కార్యపరునకు చేటులేదని భావము. మఱియు 'కళ్యాణకృత్' (శుభకార్యము) అను సర్వసామాన్యపదము (General term) ప్రయోగింపబడుటవలన ఏ పుణ్యకార్యమైనను, సత్కార్యమైనను సరియే ఉత్తమగతినే కలుగజేయునుగాని దుర్గతినిగాదని స్పష్టమగుచున్నది. యోగాభ్యాసమున్ను ఒకానొక సత్కార్యమేకావున యోగమొకింత ఆచరించి మరణించినను వానికి దుర్గతి యెన్నడును కలుగదనియు, సద్గతియే కలుగుననియు తెలుటచే భగవానుని ఈ సమాధానమువలన అర్జునుని సంశయము నివృత్తమైనట్లేయగును.

మఱియు శ్రీకృష్ణపరమాత్మ యొసంగిన ఈ ప్రత్యుత్తరమునందు పాపాత్ములకు, దుష్కార్యపరులకు, అశుభాచరణయుక్తులకు దుర్గతి తప్పకకలుగగలదని ధ్వనించుచున్నది. పాపుల కీలోకమందును, పరలోకమందునుగూడ వినాశమే కలుగగలదని స్పష్టమగుచున్నది. (వినాశమనగా నీచజన్మ, దుఃఖము మొదలైనవి కలుగుటయని చెప్పవచ్చును). కావున వానిని త్యజించివైచి సత్కార్యాచరణశీలురై అధ్యాత్మసాధనపరులై శ్రేయము నొందవలెను. లక్ష్యమగు ఆత్మసాక్షాత్కారమును ఈజన్మయందే పొందివైచుటకు యత్నించుచు ఒకవేళ పొందజాలకపోయినను, పై భగవద్వాక్యములవలన ధైర్యమును జేకూర్చుకొని ముందునకు సాగిపోవలెను.

**ప్ర:–** యోగభ్రష్టున కెట్టి గతి లభించును?

**ఉ:–** అతని కీలోకమునగాని, పరలోకమునగాని దుర్గతి యెన్నడును గలుగదు. సద్గతియే కలుగును.

**ప్ర:–** ఇట శ్రీకృష్ణమూర్తి సిద్ధాంతీకరించిన విషయమేమి?

**ఉ:–** "శుభకార్యములను జేయువారికెవరికిని దుర్గతి కలుగదు, సద్గతియే కలుగు"నను పరమ సత్యము నిచట వెల్లడించెను.

**అ॥** దేహవియోగానంతరము యోగభ్రష్టు డెట్టి సద్గతినిబొందునో వివరించుచున్నాడు -

## 41. ప్రాప్య పుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీః సమాః
## శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే.

**టీక:–** యోగభ్రష్టః = యోగమునుండి జాఱినవాడు (యోగసిద్ధిని బొందనివాడు), (మరణానంతరము), పుణ్యకృతామ్ = పుణ్యముచేసినవారియొక్క, లోకాన్ = లోకములను, ప్రాప్య = పొంది, శాశ్వతీః = అనేకములైన, సమాః = సంవత్సరములు, ఉషిత్వా = (అట) నివసించి, (తదుపరి) శుచీనామ్ = పరిశుద్ధులైనట్టి (సదాచారవంతులైన), శ్రీమతాం = శ్రీమంతులయొక్క, గేహే = గృహమునందు, అభిజాయతే = పుట్టుచున్నాడు.

**తా:–** యోగభ్రష్టుడు (మరణానంతరము) పుణ్యాత్ముల లోకములనుపొంది, అట అనేక వత్సరములు నివసించి, తదుపరి పరిశుద్ధులైనట్టి (సదాచారవంతులైన) శ్రీమంతులయొక్క గృహమందు పుట్టుచున్నాడు.

**వ్యాఖ్య:–** యోగభ్రష్టుడగువాడు దుర్గతినిబొందడని క్రిందటిశ్లోకమున చెప్పబడినది. మఱి యెట్టి సద్గతిని బొందునో ఈశ్లోకమున నిరూపించబడినది. అతడు (మరణానంతరము) పుణ్యవంతులయొక్క లోకములకు జని, అట చాలకాలము వసించి, తదుపరి సదాచారపరులైన ధనవంతుల గృహమునందు జన్మించును. ఇట్లు జన్మించి తానిదివరలో విడిచిపెట్టి వెళ్ళిన యోగాభ్యాసమును మరల కొనసాగించును. పుణ్యాత్ములలోకములందు సుఖమేయుండునుగాని దుఃఖముండదు. మఱియు శ్రీమంతుల గృహమందు దారిద్ర్యాది బాధలెవ్వియు నుండవు. వారు సదాచారపరులైన శ్రీమంతులు గనుక భోగవిలాసాది దుశ్చేష్టలేవియు

వారికుండవు. మరల యోగాభ్యాసమును కొనసాగించుటకు అనువైన ప్రదేశమే అది యగును. కాబట్టి యోగభ్రష్టునకు మరణానంతరము ఎల్లెడల అనుకూల వాతావరణమే సంభవించునుగాని ప్రతికూలమైనది కాదు. అందుచే నాతనికి సద్గతియే లభించునని స్పష్టమగుచున్నది.

ఈ శ్లోకమున 'శుచీనామ్' 'శ్రీమతామ్' అను రెండువిశేషణములు తెలుపబడినవి. 'పరిశుద్ధులైనట్టి, శ్రీమంతులైనట్టి' అని వానియర్థము. దరిద్రులైన సదాచారపరుల యిండ్లయందు యోగభ్రష్టుడు ఒకవేళ జన్మించినచో నట భోజనాదులనిర్వహణకై మిగుల శ్రమించవలసివచ్చును. తత్ఫలితముగ యోగమున కంతరాయము కలుగవచ్చును. అట్లే కేవలము శ్రీమంతుల యిండ్లలో పుట్టినచో భోగవిలాసములందు మునిగిపోవు చిక్కుకలదు. కావున దారిద్ర్యములేనట్టి, దురాచారములేనట్టి యిండ్లయందే యోగభ్రష్టుని భగవానుడు జన్మింపజేయుచున్నారు. అపుడు దైవధ్యానమునకు ఏ ఆటంకమున్ను అతనికుండదు. ఆహా! సాధకులపై, భక్తులపై భగవానున కెట్టి అవ్యాజకరుణ! తమను ధ్యానించువారిని వేయికండ్లతో వారు కనిపెట్టుచుందురు. కావున ఇక మనుజుడు దైవమార్గమున ప్రవర్తించుట కేల సంకోచించవలెను?

(1) యోగభ్రష్టుడు పుణ్యవంతుల లోకములకు జనునని చెప్పుటవలన, యోగము మహాపుణ్యప్రదమైనదని స్పష్టమగుచున్నది. (2) మఱియు చక్కని జన్మనుబొంది మరల యోగమును కొనసాగించుటవలన (ఈ విషయమును రాబోవుశ్లోకమున భగవానుడు తెలుపగలడు) తానింతవఱకుచేసిన అభ్యాసము నిష్ఫలముకాదనియు తెలుచున్నది. (3) ధనముతోబాటు సదాచారమున్ననే రాణించుననియు ఈ శ్లోకముద్వారా స్ఫురించుచున్నది. కావున ఐశ్వర్యవంతులు తమ ఐశ్వర్యముతోబాటు శుచిత్వము (సదాచార సంపన్నత్వము) కూడ శీలించుటకై యత్నించవలెను. ధనత్వమునకు శుచిత్వమును జోడించవలయును. ఒకవేళ ఆ రెండిటిలో ఏది గొప్పయను ప్రశ్న వచ్చినపుడు శుచిత్వమునకే (సదాచారత్వమునకే) ప్రాముఖ్యత నీయవలసివచ్చును. ఏలయనిన, అది భగవంతుని సమీపమునకు జీవుని గొనిపోవగలదు.

గీత రెండవ అధ్యాయప్రారంభమందలి కొన్ని శ్లోకములు ('దేహినోఽస్మిన్ యథా దేహే' మున్నగునవి), ఈ ఆఱవ అధ్యాయముచివఱగల శ్లోకములు ('ప్రాప్యపుణ్యకృతాం లోకాన్!' మున్నగునవి) 'జన్మాంతరసిద్ధాంతము'ను సిద్ధపఱచునవైయున్నవి.

**ప్ర:–** యోగభ్రష్టుడు మరణించిన వెనుక ఎట్టి సద్గతిని బొందును?

**ఉ:–** అతడు మొదట పుణ్యవంతుల లోకమునకేగి అట చాలకాలము నివసించి తదుపరి సదాచారపరులగు శ్రీమంతుల గృహమందు జన్మించి తానిదివఱలో విడిచిపెట్టిన యోగము నచట తిరిగి కొనసాగించును.

**అ॥** ఈ ప్రకారముగ సామాన్యయోగులనుగూర్చి చెప్పి ఇక ఉత్తమతరగతి యోగులయొక్క మరణానంతర స్థితిగతులనుగూర్చి తెలియజెప్పుచున్నాడు –

## 42. అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్
## ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్.

**టీక:–** అథవా = లేక (ఉత్తమ తరగతి యోగియైనచో), ధీమతామ్ = జ్ఞానవంతులగు, యోగినాం =

యోగులయొక్క, కులే ఏవ = వంశమునందే, భవతి = పుట్టుచున్నాడు, ఈదృశమ్ = ఈ ప్రకారమగు, జన్మ = జన్మము, యత్ = ఏదికలదో, ఏతత్ హి = అదియే, లోకే = ప్రపంచమున, దుర్లభతరమ్ = మిక్కిలి దుర్లభమైనది.

**తా:–** లేక, (ఉత్తమతరగతి యోగియైనచో) జ్ఞానవంతులగు యోగులయొక్క వంశమందే జన్మించుచున్నాడు. ఈ ప్రకారమగు జన్మము లోకమున మహాదుర్లభమైనది.

**వ్యాఖ్య:–** ఒకింత సాధనజేసి మరణించిన యోగులనుగూర్చి క్రిందటి శ్లోకమున వర్ణింపబడెను. యోగసాధన ఎక్కువగజేసి లక్ష్యమును మాత్రము పొందక మరణించిన వారిస్థితి యెట్లుండునో, వారి కెట్టిగతి లభించునో ఇచట వివరింపబడినది. అట్టి వారు మరణించిన పిదప ధీమంతులగు యోగులవంశమున, తపస్సంపన్నులగు మహాత్ముల సంప్రదాయమున జన్మించుదురు. (క్రిందటి శ్లోకమున వర్ణింపబడినవారు నూటికి 40 మార్కులు సంపాదించినవారని చెప్పినచో, వీరు నూటికి 80 మార్కులు సంపాదించినవారని చెప్పవచ్చును). ఉత్తమయోగిపుంగవుల వంశమందు కలుగు అట్టి జన్మ లోకమున మహాదుర్లభమైనదని భగవానుడు నుడివిరి. ఏలయనగా వారు ధీమంతులు (జ్ఞానవంతులు) కనుక, ఆత్మానుభవమును లెస్సగ బడసినవారుకనుక, అట జన్మించువాడు వంశపారంపర్య సత్సంస్కారముననుసరించి పుట్టుకనుండియే శుకమహర్షివలె భక్తిజ్ఞాన వైరాగ్యాదులతో గూడియుండుట కవకాశమేర్పడును. చిన్నకాలమునుండియు దైవవాతావరణమందు జీవించుట సామాన్యమైన విషయముకాదు. మహాతపఃఫలము. అనేక జన్మల పుణ్యసంస్కారఫలితము. అట్టి ఉత్తమయోగభ్రష్టునకు ప్రారంభము నుండియు ఏ విక్షేపమున్నులేక సాధన కొనసాగును. ఏలయనిన, అతడు జన్మించిన యోగుల సంప్రదాయమందు నిరంతర అధ్యాత్మవిచారణ, యోగసాధన, నియమనిష్ఠలు, పరమార్థగ్రంథపఠనము మున్నగునవియే విరాజిల్లుచుండును. తద్విరుద్ధముగ బోధించువారుకాని, ఆచరించువారుకాని అట నుండరు. కావున పూర్వము తాను విడిచిపెట్టిన సాధనయొక్క ఒకింతశేషమును అతిత్వరలో పూర్తిచేసికొని కృతార్థుడగుటకు గొప్ప అవకాశ మతనికి అచట లభించుచున్నది.

ప్రపంచమునగల అన్ని జన్మలకంటెను యోగులవంశమునందలి జన్మమే సర్వోత్కృష్టమైనదని భగవంతుడు వచించుటలో దానియొక్క గొప్పతనము వెల్లడియగుచున్నది. 'లోకములో ధనికులజన్మ గొప్పదికాదు. రాజాధిరాజులజన్మ గొప్పదికాదు. ఇంద్రునిజన్మ గొప్పదికాదు. చంద్రునిజన్మ గొప్పదికాదు. ధీమంతులగు యోగుల జన్మమే గొప్పది.' అని భగవానుడు ముక్తకంఠముతో బల్కుచున్నాడు. కనుకనే అట్టిజన్మ దుర్లభమని చెప్పక 'దుర్లభతర'మని పేర్కొనిరి. కాబట్టి దైవత్వమందు, యోగాభ్యాసమందు, ఆత్మానుభూతియందుమాత్రమే వాస్తవమగు గొప్పతనమున్నదని గ్రహించి విజ్ఞులు వానికొఱకై తీవ్రమగు కృషి ఈ జన్మయందే సలుపవలయును. పరమార్థసాధన ఎంత అధికముగజేసిన అంతమేలు కలదు. దానిచే జన్మ పావనమగును. మోక్షము సన్నిహితమగును.

'కులే' అను పదమునకు వంశము లేక సంప్రదాయము అని అర్థము చెప్పవచ్చును.

**ప్ర:–** ఉత్తమతరగతి యోగసాధకులకు (యోగసాధన అధికముగజేసి లక్ష్యమును బొందక మరణించినవారికి) ఎట్టి సద్గతి కలుగునో వివరింపుడు?

**ఉ:–** అట్టివారు ధీమంతులగు యోగుల కుటుంబములో జన్మించుదురు. (అట పుట్టుకనుండియే యోగాభ్యాసమును శీలించి తరించుదురని భావము).

**ప్ర:–** ప్రపంచమున అన్ని జన్మలకంటెను శ్రేష్ఠమగు జన్మయేది?

**ఉ:–** ధీమంతులగు (జ్ఞానసంపన్నులగు) యోగుల కుటుంబమునందు (లేక సంప్రదాయమునందు) జన్మించుట.

**అ॥** అట్లు యోగుల వంశమున జన్మించిన పిదప అతని పరిస్థితిని, కార్యక్రమమును వివరించుచున్నాడు –

## 43. తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్
## యతతే చ తతో భూయస్సంసిద్ధౌ కురునన్దన.

**టీక:–** కురునన్దన = ఓ అర్జునా!, తత్ర = ఆ యోగికులమునందు (అతడు), పౌర్వదైహికమ్ = పూర్వదేహసంబంధమైన, తమ్ = ఆ, బుద్ధిసంయోగమ్ = యోగవిషయికమైన బుద్ధితోటి సంపర్కమును, లభతే = పొందుచున్నాడు, తతః = అట్టి పూర్వజన్మసంస్కారమువలన, భూయః = మరల (అధికముగ), సంసిద్ధౌ = సంపూర్ణయోగసిద్ధి (మోక్షము) కొఱకు, యతతేచ = ప్రయత్నము చేయుచున్నాడుకూడను.

**తా:–** ఓ అర్జునా! అట్లాతడు యోగులవంశమున జన్మించి పూర్వదేహ సంబంధమైన (యోగవిషయిక) బుద్ధితోటి సంపర్కమును పొందుచున్నాడు. అట్టి (యోగ) సంస్కారమువలన నాతడు సంపూర్ణయోగసిద్ధి (మోక్షము) కొఱకై మరల తీవ్రతరప్రయత్నమును సల్పుచున్నాడు.

**వ్యాఖ్య:–** అట్లు యోగులయొక్క వంశమందు జన్మించి ఆతడేమిచేయునో ఇచట వచింపబడినది. పూర్వజన్మమందు తానభ్యసించి అసంపూర్తిగ నిలిపివేసినట్టి యోగమును మరల ఎత్తుకొని పూర్ణసిద్ధికలుగువఱకు దానిని సాధించును. ఎచట వదలెనో అచటినుండి తిరిగి ప్రారంభించును. అతనికి పూర్వపుశరీరము నశించెనేకాని పూర్వపు మనస్సు, బుద్ధి, సంస్కారములు నశింపలేదు. మోక్షపర్యంతము అవి ఉండియేయుండును. కాబట్టి పూర్వజన్మయందలి బుద్ధితోటి సంయోగము నిచట మరల పొందెనని చెప్పబడినది (సంబంధము తెగలేదని భావము). అది పుణ్యబుద్ధియైనచో ఆ పుణ్యసంస్కారమే యిపుడు విజృంభించును. పాపబుద్ధియైనచో పాపసంస్కారములు అలవడును. కావున పూర్వము తానుచేసినది నశింపక ఈ జన్మయందు తిరిగి ఉదయించును. ఇది 'బ్రాటోవరు' (Broughtover) పద్ధతివంటిది. అనగా అంగడిలో లెక్కలు వ్రాయువారు ఒకపేజీలెక్క పూర్తికాగానే దానిని కూడి ఆ మొత్తమును మఱుసటిపేజీ పైనవేసి మరల లెక్కవ్రాయుదురు. అట్లే యోగియగువాడు పూర్వజన్మమందు యోగాభ్యాసము నెచట నిలిపెనో అచటనుండియే తిరిగి యిపుడు ప్రారంభించి మోక్షసిద్ధి కలుగువఱకు నిర్విరామముగ ప్రయత్నము సలుపుచుండును. 'సంసిద్ధౌ' (సమ్యక్ – సిద్ధౌ) అని చెప్పినందువలన పూర్ణసిద్ధికొఱకే అతడు యత్నశీలుడై యుండునని స్పష్టమగుచున్నది. యోగులవంశమందు జన్మించుటవలన ఆధ్యాత్మికవాతావరణమే అచటనుండుటచే ఆతని సాధన కేమాత్రము ప్రతిబంధము లేకుండును.

దీనినిబట్టి పుణ్యముగాని, పాపముగాని, జ్ఞానముగాని, అజ్ఞానముగాని, సద్వాసనలుగాని, దుర్వాసనలుగాని జన్మజన్మాంతరము జీవునివెంట నీడవలె వచ్చుచునే యుండునని తేలుచున్నది. జ్ఞానాగ్నిలో దగ్ధమైనపుడుమాత్రమే కర్మ అంతమై జీవున కీసంసార చక్రపరిభ్రమణమునుండి విముక్తిని కల్పించును. కావున శరీరము పతనమగుటకు పూర్వమే జీవుడు తన బుద్ధికి పూర్ణమగు పారమార్థిక వికాసమును కల్పించవలెను. అనేక సాధనలద్వారా అద్దానికి దైవసంస్కారములనే కలుగజేయవలెను. ఏలయనగా అట్టి సంస్కారమొకటియే

మరణకాలమున జీవునివెంట నుండునది. తక్కిన వస్తువులన్నియు, తుదకు దేహముకూడ ఇచటనే నిలిచిపోవును. కాబట్టి విజ్ఞుడగువాడు తనవెంట ఎల్లప్పుడు ఉండు సూక్ష్మదేహమును (మనస్సును, బుద్ధిని) పరిశుద్ధముగను, దైవగంధయుతముగను, ఆత్మజ్ఞానసంపన్నముగను జేసికొనవలెను. చేసిన పుణ్యముగాని పాపముగాని నశింపదుగనుక, ఏ ఒకింత జపముగాని, ధ్యానముగాని, జ్ఞానముగాని, పరోపకారముగాని, ధర్మముగాని ఈ జన్మయందు చేసినచో, అది మఱుజన్మయందు ఇంకను వికసించి జనన మరణరూప మహాభయమునుండి జీవుని సంరక్షించగలదు. (స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ 2-40). కాబట్టి హృదయమును దైవమయముగను, ధర్మమయముగను గావించుకొనుచు ఈ జన్మయందే కడతేరుటకు కృతనిశ్చయుడై, ఒకవేళ జీవితాంతమువఱకు మోక్షలక్ష్యమును బొందజాలనిచో మఱుజన్మయందైన దానిని కొనసాగించి పూర్తిచేయవలయును. అమూల్యమగు ఈ మానవజన్మను భోగవిలాసములందు వ్యర్థము చేయరాదు. పరమార్థ సామగ్రిని త్వరత్వరగా సంపాదించవలెను. లేనిచో తదుపరి పశ్చాత్తాపము నొందవలసి యుండును.

**ప్ర:–** అట్లు యోగుల వంశమందు జన్మించి సాధకు డేమిచేయును?

**ఉ:–** పూర్వము తాను అసంపూర్తిగనుంచిన యోగమును పూర్ణసిద్ధి కలుగువఱకు తిరిగి సాధించును.

**ప్ర:–** పుట్టగనే ఆతనికి యోగసంస్కార మెట్లు కలుగును?

**ఉ:–** పూర్వజన్మయందలి యోగవిషయికమైనబుద్ధితో నతనికి సంయోగము కలుగును. అందుచే చక్కటి యోగసంస్కార మేర్పడును.

**అ॥** యోగముయొక్క మహిమను వర్ణించుచున్నాడు –

## 44. పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః
## జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే.

**టీక:–** సః = అతడు (యోగభ్రష్టుడు), అవశః అపి = యోగాభ్యాసమునకు తానుగ (మొదట) నిశ్చయింపకున్నను, తేన = ఆ, పూర్వాభ్యాసేన ఏవ = పూర్వజన్మమునందలి అభ్యాసబలముచేతనే, హ్రియతేహి = (యోగమువైపునకు బలాత్కారముగ) ఈడ్వబడుచున్నాడుగదా!, యోగస్య = యోగముయొక్క, జిజ్ఞాసుః అపి = తత్త్వము నెఱుగదలంపుగలవాడైనంతమాత్రముచే, శబ్దబ్రహ్మ = వేదమును (వేదోక్త కర్మానుష్ఠాన ఫలమును), అతివర్తతే = అతిక్రమించుచున్నాడు (దాటివైచుచున్నాడు).

**తా:–** అతడు (యోగభ్రష్టుడు) యోగాభ్యాసమునకు తానుగా (మొదట) నిశ్చయింపకున్నను పూర్వజన్మమునందలి అభ్యాసబలముచే యోగమువైపునకే ఈడ్వబడుచున్నాడు. యోగము నెఱుగ దలంపుగలవాడైనంత మాత్రముచేతనే (యోగాభ్యాసముచేయ నిచ్చగించినంతమాత్రముచేతనే) వేదములందు జెప్పబడిన కర్మానుష్ఠాన ఫలమును మనుజుడు దాటివేయుచున్నాడు.

**వ్యాఖ్య:–** పూర్వజన్మమందుచేసిన యోగసాధనయొక్క ఫలితమెట్టిదో చూపుచున్నారు. ఈ జన్మయందు యోగమునుగూర్చి తానుగా ఏమియు అనుకొనకున్నప్పటికిని, మనుజుడు పూర్వసంస్కార ప్రాబల్యముచే యోగమువైపునకే ఈడ్వబడుచున్నాడు. సంస్కారముయొక్క ప్రాబల్యమెట్టిదో చూడుడు! కావున ఏనాడో చేసిన

పుణ్యము జీవునకు ఏ ప్రకారముగ అక్కరకు వచ్చునో భగవానుడిచట ఋజువుచేసి చూపించిరి. చేసిన పుణ్యముగాని, పాపముగాని తమ తమ కర్తవ్యములను నెరవేర్చుకొనియేతీరును. పుణ్యము పుణ్యబుద్ధినే కలిగించును. పాపము పాపబుద్ధినే కలిగించును. కనుకనే కొందఱికి పుట్టుకతోనే విరక్తి, భగవద్భక్తి, యోగాభ్యాసకుశలత, పరమార్థవిచారణ కలుగుట సంభవించుచున్నది. పూర్వపుణ్యము, యోగాభ్యాసము ప్రబలముగ గలవాడు ఒకవేళ ఊరకనుండదలంచినను అవి ఉండనీయక పూర్వసంస్కారవశమున బలాత్కారముగ నాతనిచే పుణ్యమే చేయించును. యోగభ్యాసములోనికే అతనిని దింపును. కాబట్టి శ్రేయఃకాముడగు జీవుడు తన మనస్సును పుణ్యవంతముగను, పరమార్థ సంస్కార యుతముగను, యోగాభ్యాస కుశలముగను ఈ జన్మయందే ఒనర్చుకొనవలయును.

ఇక ఈ శ్లోకముయొక్క రెండవపాదమున భగవానుడు యోగముయొక్క మహిమ యెట్టిదో నిరూపించిరి. యోగమును (జీవబ్రహ్మైక్యమును) తెలిసికొనవలెనను జిజ్ఞాస మనుజున కుదయించినంతమాత్రముననే అతడు - శబ్దబ్రహ్మమును - అనగా వేదోక్త కర్మానుష్ఠానఫలమును, లేక శాస్త్ర జన్యజ్ఞానము (పరోక్షజ్ఞానము) యొక్క ఫలమును దాటిపైచుచున్నాడని చెప్పబడినది. దీనినిబట్టి ఆత్మధ్యానరూపమగు యోగమున కెట్టి మహిమ గలదో వ్యక్తమగుచున్నది. యోగమును తెలిసికొనవలెనను తలంపుచేతనే మనుజుడు శబ్దబ్రహ్మమును దాటిపైచునపుడు, ఇక యోగము నాచరించినచో నెంతఫలితము కలుగునో వేఱుగ చెప్పనక్కఱలేదు.

**ప్ర:-** యోగభ్రష్టు డీ జన్మయందు మరల యోగమువైపునకే ఏల ఆకర్షింపబడును?

**ఉ:-** పూర్వజన్మసంబంధమగు యోగాభ్యాససంస్కార మాప్రకారముగ నతనిని బలాత్కారముగ యోగమువైపునకే ఈడ్చుచున్నది.

**ప్ర:-** యోగముయొక్క మహిమ యెట్టిది?

**ఉ:-** దానినిగూర్చిన జిజ్ఞాసామాత్రముచే మనుజుడు శబ్దబ్రహ్మమును (వేదోక్త కర్మానుష్ఠాన ఫలమును) దాటిపైచుచున్నాడు.

**అ॥** యోగభ్రష్టు డెట్టి సద్గతిని బడయునో వచించుచున్నాడు -

## 45. ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః
## అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్.

**టీక:-** ప్రయత్నాత్ = పట్టుదలతో, యతమానః = యత్నించుచున్న, యోగీతు = యోగియైనచో, సంశుద్ధకిల్బిషః = పాపములనుండి విడువబడినవాడై (దోషరహితుడై), అనేకజన్మ సంసిద్ధః = అనేక జన్మలందు చేయబడిన అభ్యాసవిశేషముచే బొందబడిన యోగసిద్ధి కలవాడై, తతః = ఆ పిమ్మట, పరాం = సర్వోత్తమమైన, గతిమ్ = గతిని (మోక్షమును), యాతి = పొందుచున్నాడు.

**తా:-** పట్టుదలతో ప్రయత్నించునట్టి యోగి పాపరహితుడై, అనేకజన్మలందు చేయుబడిన అభ్యాసముచే యోగసిద్ధినిబొందినవాడై, ఆ పిదప సర్వోత్తమమగు (మోక్ష) గతిని బడయుచున్నాడు.

**వ్యాఖ్య:-** యోగి యేప్రకారముగ సర్వోత్తమమగు మోక్షపదవిని బడయగల్గునో యిట వివరింపబడినది.

మోక్షప్రాప్తి కిచట మూడు విషయములు ప్రస్తావించబడినవి. (1) పట్టుదలతో గూడిన ప్రయత్నము (2) అనేక జన్మలందు చేయబడిన అభ్యాసము (3) పాపరాహిత్యము – మోక్షసౌధము నధిరోహించుట కీమూడున్ను అత్యావశ్యకములు.

ఏకార్యమందైనను పట్టుదల, దృఢప్రతిజ్ఞ, అత్యవసరములు, ప్రాపంచిక కార్యము లందే అవి అవసరమైనపు డిక ఆధ్యాత్మికకార్యములందు వేఱుగ చెప్పవలెనా? 'నాయమాత్మా బలహీనేన లభ్యః' – 'ఈ ఆత్మ దుర్బలునిచేత పొందబడదు; సోమరుల కిది అలవికాదు' అని ఉపనిషత్తులు ఘోషించుచున్నవి. కావున ప్రయత్నమవసరము. అదియు పట్టుదలతో, అధ్యవసాయముతో గూడిన ప్రయత్నమై యుండవలెను. లేకున్న మాయ ఒక్క ఊపులో అతనిని పడగొట్టివేయగలదు. 'కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్షత్' – అని ఉపనిషత్తులు వచించినట్లు ధైర్యము, పట్టుదలయున్నవాడే ఆత్మను బొందగలడు.

అట్టి దృఢప్రయత్న మీజన్మయందు యోగికి గలుగుచున్నదనిన, పూర్వమెన్నియో జన్మలందు చేయుచువచ్చిన అభ్యాసఫలితమే అది. మానవజన్మ లభించుటయు, మోక్షేచ్ఛకలుగుటయు, పరమార్థసంస్కారము జనించుటయు బహుజన్మార్జిత సుకృత ఫలితమని శాస్త్రములు వక్కాణించుచున్నవి. కావున ఈ జన్మలో ఒకనికి యోగమందు దృఢతరాభ్యాసము కలిగినచో అది ఎన్ని జన్మలందో క్రమముగ పరిపక్వమైనట్టి స్థితియేయగును. అయితే ఈ వాక్యముచే మోక్షమునకు ఎన్నియోజన్మలవసరమని భావింపరాదు. అట్లు భావించి దిగులునొందరాదు. తీవ్రయత్నముచే ఈ జన్మయందే – కాదు, కాదు – ఈ క్షణమందే మోక్షసిద్ధిని బడయవచ్చును. అనేక జన్మలకొఱకు వేచియుండవలసిన పనిలేదు. ఇదివఱలో పెక్కు జన్మలందలి ప్రయత్నముచేతనే ఇపుడీ యంతఃకరణశుద్ధి, దైవజిజ్ఞాస కలిగినవని తలంచినచాలును.

ఇక మూడవది పాపరాహిత్యము చిత్తమందు పాపపంకిలమున్నంతవరకును ఆత్మ ప్రకాశింపదు. కావున ఆత్మానుభూతి సిద్ధించవలెననిన, పాపము లెస్సగ కడిగివేయబడవలెను. జప, ధ్యానాదులచేతను, భక్తిచేతను, నిష్కామకర్మచేతను పాపదోషములు తొలగింపబడ హృదయము శుద్ధమగును. అత్తఱి నిర్మలసరోవరమువలె నది వెలుగొందుచుండును. ఆత్మోదయమునకట్టి హృదయనైర్మల్య మత్యావశ్యకము. కనుకనే భగవానుడు 'సంశుద్ధకిల్బిషః' పాపము పూర్తిగ కడిగివేయబడినవాడు మాత్రమే మోక్షసిద్ధిని బడయగలడని వచించెను. దుమ్మును తుడిచివేయుటకు చీపురు యెట్లవసరమో మలమును కడగివేయుటకు జలమెట్లవసరమో, హృదయస్థపాపపంకిలమును కడిగివేయుటకు దైవధ్యానము, ఆత్మవిచారణ, నిష్కామకర్మ మున్నగునవి అట్లవసరములై యున్నవి. వాని సహాయముచే యోగి నిర్ధూతకల్మషుడై వర్తించును.

'పరాంగతిమ్' అని చెప్పుటవలన మోక్షపదవి ప్రపంచములోగల అన్ని పదవుల కంటెను సర్వశ్రేష్ఠమైనదని స్పష్టమగుచున్నది. ఏలయనిన, తక్కిన పదవులన్నియు పునరావృత్తిని కలుగజేయును. మోక్షపదవి (దైవస్థితి) యొక్కటియే పునరావృత్తి రహితమైనది. అట్టి సర్వశ్రేష్ఠపదవిని బొందుటకు మార్గమును సర్వేశ్వరు డిచట పొందుపఱచెను (పాపరాహిత్యాదిసాధనలు). అద్దానిననుసరించి బ్రహ్మానుభూతిని బడసి జీవులు ధన్యులయ్యెదరుగాక!

**ప్ర:–** ప్రపంచములో అన్నిటికంటెను ఉత్తమగతి యేది?

**ఉ:–** ఆత్మసాక్షాత్కారము ((బ్రహ్మానుభూతి) మోక్షము).

**ప్ర:–** అది జీవున కెట్లు లభించును?

**ఉ:–** (1) పట్టుదలతో గూడిన ప్రయత్నముచేతను (2) బహుకాలకృత ధ్యానాభ్యాసాదులచేతను (3) పాపరాహిత్యముచేతను లభించగలదు.

**అ॥** యోగియొక్క గొప్పతనమును వర్ణించుచున్నాడు –

**46. తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున.**

**టీక:–** అర్జునా = ఓ అర్జునా!, యోగీ = యోగి, తపస్విభ్యః = (కృచ్ఛ్రచాంద్రాయణాది) తపస్సులొనర్చువారికంటె, అధికః = శ్రేష్ఠుడు, జ్ఞానిభ్యః అపి = శాస్త్రజ్ఞానముగలవారికంటెను గూడ, అధికః = శ్రేష్ఠుడని, మతః = తలంపబడుచున్నాడు, యోగీ = యోగి, కర్మిభ్యః చ = (అగ్నిహోత్రాది) కర్మలు చేయువారికంటెనుగూడ, అధికః = శ్రేష్ఠుడు, తస్మాత్ = అందువలన, యోగీ = యోగివి, భవ = కమ్ము.

**తా:–** ఓ అర్జునా! యోగియగువాడు (కృచ్ఛ్రచాంద్రాయణాది) తపస్సులు చేయువారికంటెను, శాస్త్రజ్ఞానముగలవారికంటెను, (అగ్నిహోత్రాది) కర్మలుచేయువారికంటెనుగూడ శ్రేష్ఠుడని తలంపబడు చున్నాడు. కాబట్టి నీవు యోగివి కమ్ము.

**వ్యాఖ్య:–** ధ్యానయోగియొక్క ఆధిక్యత ఇచట నిరూపించబడుచున్నది. అతడు (1) తపస్వులకంటె (2) శాస్త్రజన్య (పరోక్ష) జ్ఞానులకంటె (3) కర్మనిష్ఠులకంటె గొప్పవాడని వచింపబడినది. తపస్వులనగా ఇచట కృచ్ఛ్రచాంద్రాయణాదులను సలుపు వారనియు, జ్ఞానులనగా శాస్త్రజ్ఞానము మాత్రము కలవారనియు, కర్మనిష్ఠులనగా అగ్నిహోత్రాది (యజ్ఞయాగాది) కర్మల నొనర్చు వారనియు అర్థము. 'జ్ఞానాద్ధ్యానం విశిష్యతే'- అని మున్ముందు ఈ యర్థమునే భగవానుడు వెల్లడించుదురు. అనగా శాస్త్రజన్య పరోక్షజ్ఞానముకంటె ఆత్మధ్యానము శ్రేష్ఠమని భావము. ఏది జీవుని పరమాత్మపదమునకు సమీపమునజేర్చునో, లేక దేనిద్వారా జీవుడు ఆత్మకు (దైవమునకు) అతిసన్నిహితుడై వర్తించునో, అదియే తక్కిన యన్నిటికంటెను శ్రేష్ఠమైనదగును. ఈ సూత్రముద్వారా ప్రపంచములోగల సమస్త పదార్థములయొక్క అంతస్తును, న్యూనాధిక్యతలను మనము గుర్తించుకొనవచ్చును.

'యోగీభవ' – (యోగివికమ్ము) అని భగవానుడు అర్జునుని శాసించిరి. యోగము యొక్క శ్రేష్ఠత్వమును ముందుగా జెప్పియే తదుపరి అట్లానతిచ్చుట ఇచట గమనింప దగినది. కనుకనే 'తస్మాత్' (అందువలన) – అనుపదమును ప్రయోగించుట జరిగినది. దేన్నైనను సహేతుకముగ జెప్పినపుడే యెదుటివారికి విశ్వాసము కలుగును. కావున శ్రీకృష్ణుడున్ను అట్లే చేసిరి. ధ్యానముయొక్క పద్ధతిని, విలువను చాల దూరము చెప్పి చెప్పి తుట్టతుదకు 'ఈ కారణములచే నీవు యోగిని కమ్ము' అని కరుణతో పలికిరి. కావున భగవానుడానతిచ్చిన విధమున ప్రతివారును యోగికావలెనే కాని భోగికారాదు. 'యోగీభవ' అని సర్వులకును బోధించవలెనేకాని 'భోగీభవ' అని చెప్పరాదు. యోగము రోగమును నిర్మూలించును. అనగా భవరోగమును రూపుమాపును. భగవదైక్యమును ప్రసాదించునట్టి యోగమే సర్వసాంసారికదుఃఖముల యొక్క విముక్తికి సర్వోత్తమ ఉపాయము. యోగివికమ్మని భగవాను డర్జునుని కొక్కనికే బోధించినను, సర్వులకును బోధించినట్లే తలంపవలెను. యోగులనగా జటాజూటములు, కాషాయాంబరములు ధరించి సాధువృత్తిని స్వీకరించినవారని అర్థముకాదు. మనస్సును విషయాదులనుండి మరలించి, అంతర్ముఖమొనర్చి ఆత్మయందు స్థాపించువాడే యోగి.

భగవద్ధ్యానము చేయువాడే యోగి. యోగి అయినపుడే భవబంధవిమోచనము గల్గును. అనగా ధ్యానము ద్వారా స్వస్వరూపసాక్షాత్కారము కలుగు నపుడు జీవుడు ముక్తినొందును. కావున అట్టి మహోన్నత యోగపదము నధిష్ఠించి సర్వులును తరించవలయును.

**ప్ర:–** యోగి యెట్టివాడు?

**ఉ:–** అతడు (1) తపస్వులకంటెను (2) శాస్త్రజ్ఞానులకంటెను (3) కర్మనిష్ఠులకంటెను గొప్పవాడు.

**ప్ర:–** కావున భగవాను డర్జునున కేమని దెల్పెను?

**ఉ:–** 'నీవు యోగివికమ్ము' అని బోధించెను.

**అ||** యోగులలో నెవడు శ్రేష్ఠుడో వచించుచున్నాడు –

## 47. యోగినామపి సర్వేషాం మద్గతేనాన్తరాత్మనా
## శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః.

**టీక:–** సర్వేషాం యోగినామ్ అపి = యోగులందఱిలోను, యః = ఎవడు, మద్గతేన = నా యందు నిలువబడిన, అంతరాత్మనా = మనస్సుతో, శ్రద్ధావాన్ = శ్రద్ధగలవాడై, మామ్ = నన్ను, భజతే = సేవించుచున్నాడో (ధ్యానించుచున్నాడో), సః = అతడు, యుక్తతమః = మిక్కిలి శ్రేష్ఠుడని, మే మతః = నాయభిప్రాయము.

**తా:–** యోగులందఱిలోను ఎవడు నాయందు మనస్సును నిలిపి శ్రద్ధతో నన్ను ధ్యానించుచున్నాడో అట్టివాడు సర్వశ్రేష్ఠుడని నా యభిప్రాయము.

**వ్యాఖ్య:–** ప్రపంచమున అందఱికంటెను యోగులు ఉత్తములని క్రిందటి శ్లోకమున చెప్పబడినది. ఆ యోగులలో నెవడు సర్వశ్రేష్ఠుడో ఇచట తెలుపుచున్నాడు. అత్యంత శ్రద్ధగలిగి అంతరాత్మయందే మనస్సును నిలిపి అట్టి పరమాత్మనే ధ్యానించువాడు యోగులలో సర్వోత్తముడని శ్రీకృష్ణమూర్తి ఆనతిచ్చిరి. శ్రీకృష్ణుడు చరాచర ప్రాణికోట్ల హృదయాంతరాళములందు వెలుగొందు సాక్షాత్ పరమాత్మయే కనుక, 'నా యందు మనస్సును నిలుపుము' అను వాక్యముయొక్క అర్థము హృదయసాక్షియగు అంతరాత్మయందు చిత్తమును సంలగ్న మొనర్చుమనియే యగును. లేక శ్రీకృష్ణమూర్తి యొక్క సగుణరూపమునైనను భక్తులు సేవించవచ్చును. ఎట్లున్నను, మనస్సునందలి వాసనాదోషములుతొలగి, ధ్యేయవస్తువగు పరమాత్మయందు లయించి జీవుడు ఆత్మమాత్రుడై శేషించుటయే ముఖ్యము. అదియే యోగము. అద్దాని నాచరించువాడే సర్వశ్రేష్ఠుడగు యోగి. 'యోగులందఱిలోను' అని చెప్పినందువలన కర్మయోగముగాని, ధ్యానయోగముగాని, జ్ఞానయోగముగాని – దేనిననుసరించువారైనను వారిమార్గమునందు భక్తిని జోడించినపుడే చక్కనిఫలితముల నీయగలవు. ఈభావమే యిచట తెలుపబడినది. ఏ విత్తనమైనను నీటిలో తడిపినపుడేకదా మొలకెత్తును. అట్లే భక్తియను జలములో గూడినపుడే ఏ మార్గమైనను లెస్సగ ఫలించగలదు. భీషణమాయావిజయకార్యమున సాధకునకు భగవదనుగ్రహములేనిదే విజయము దుస్తరము. కనుకనే మహనీయ లెల్లరును ఏ మార్గము ననుసరించినను భక్తినిమాత్రము ఆశ్రయించియే తీరుదురు. గీతయందు దాదాపు ప్రతి అధ్యాయమందును ఎక్కడనో ఒకచోట ఈభక్తినిగూర్చి భగవానుడు నొక్కి చెప్పుచునేయుందురు.

'శ్రద్ధావాన్' - అని చెప్పుటవలన సాధకుడు అత్యంతశ్రద్ధగలిగి భగవంతుని సేవింపవలెనని స్పష్టపరుపబడినది. ఈ శ్రద్ధనుగూర్చి గీతాచార్యులు తన ప్రసంగమున అనేక చోట్ల నొక్కి చెప్పుట గమనించదగినది. అశ్రద్ధతో చేసినకార్యము చేయనిదానితో సమానమే అనియు ఒకచోట మున్ముందు చెప్పెదరు (17-28). శమదమాదిసాధనలలో శ్రద్ధ అనునదికూడ ఒకటి చేర్చబడియున్నది. కాబట్టి సాధకుడు అతిశ్రద్ధాళువై భగవంతుని ధ్యానించవలెను. 'మద్గతేన' అనుటవలన మనస్సును అన్యత్రపోనీయక ఆత్మయందే నెలకొల్పవలెనని సూచింపబడినది. అట్లు శ్రద్ధతో దైవమును ధ్యానించువాడు మహాశ్రేష్ఠుడు (యుక్తతమః) అని చెప్పుటవలనను (ఇచట 'తమ' ప్రత్యయము చేర్చబడుట గమనించ దగినది), 'ఇది నానిశ్చితాభిప్రాయము' అని భగవానుడు తెలుపుటవలనను, భక్తితో గూడిన అట్టి ధ్యానమం దెట్టి మహత్తుకలదో తేటతెల్లమగుచున్నది. ప్రాపంచిక జనుల దృష్టిలో గొప్పవాడు అనిపించుకొనినంతమాత్రమున చాలదు. భగవంతుని దృష్టియందు 'వీడు గొప్పవాడు' (యుక్తతముడు) అనిపించుకొనవలెను. అట్టి స్థితియో, శ్రద్ధతోగూడిన పరమాత్మధ్యానమువలననే చేకూరగలదని యిచట స్పష్టముచేయబడినది. కావున అద్దానిని ముముక్షువు తప్పక ఆశ్రయించి భగవత్కటాక్షమునకుపాత్రుడై తరించవలయును.

**ప్ర:-** యోగులందఱిలోను భగవంతునిదృష్టిలో ఎవడు సర్వశ్రేష్ఠుడు?

**ఉ:-** (1) మిగుల శ్రద్ధతోగూడినవాడు (2) లక్ష్యమగు ఆత్మయందు, లేక శ్రీకృష్ణునియందు మనస్సును సంలగ్న మొనర్చువాడు (3) అట్టి పరమాత్మనే నిరంతరము ధ్యానించువాడు సర్వోత్తమయోగియగును.

ఓమ్

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే

శ్రీకృష్ణార్జునసంవాదే ఆత్మసంయమయోగోనామ

షష్ఠోఽధ్యాయః

ఇది ఉపనిషత్ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును,

శ్రీ కృష్ణార్జున సంవాదమునగు శ్రీ భగవద్గీతలందు ఆత్మసంయమయోగమను

ఆఱవ అధ్యాయము

ఓమ్ తత్ సత్



ఓం

# శ్రీ భగవద్గీత

అథ సప్తమోఽధ్యాయః

## ఏడవ అధ్యాయము

విజ్ఞానయోగః

## విజ్ఞానయోగము

**ఈ అధ్యాయము యొక్క పేరు :-**

'విజ్ఞానయోగము' విజ్ఞానమనగా విశేషజ్ఞానము. లేక అనుభవపూర్వకమైన జ్ఞానము. లేక జ్ఞేయ (ఆత్మ) స్వరూపము. జ్ఞానమాత్రముతో సంతృప్తి నొందక, విజ్ఞానమును గూడ సముపార్జించవలెనని భగవానుని యాజ్ఞ. అమానిత్వాది జ్ఞానగుణములనేకాక, జ్ఞేయతత్త్వరూపమగు విజ్ఞానముయొక్క పరిచయమున్ను ముముక్షువు కలిగియుండవలెను. అట్టి విజ్ఞానమునుగూర్చి అనగా స్వానుభవయుక్తమగు పరమార్థజ్ఞానమునుగూర్చి విశేషముగ తెలుపబడిన అధ్యాయమగుటచే దీనికి విజ్ఞానయోగమని పేరువచ్చినది.

**ఈ అధ్యాయమందలి ప్రధాన విషయములు :-**

(1) విజ్ఞానసహితమగు జ్ఞానముయొక్క ప్రస్తావన (1వ శ్లో॥ నుండి 3వ శ్లో॥ వఱకు)

(2) పరాపర ప్రకృతులయొక్క వర్ణనము. (4వ శ్లో॥ నుండి 7వ శ్లో॥ వఱకు)

(3) సమస్తపదార్థములందును పరమాత్మయొక్క అస్తిత్వమును ప్రతిపాదించుట. (8వ శ్లో॥ నుండి 12వ శ్లో॥ వఱకు)

(4) ఆసురీభావయుక్తులయొక్క గర్హణము, దైవీస్వభావయుక్తులయొక్క ప్రశంస, చతుర్విధ భక్తుల వివరము. (13వ శ్లో॥ నుండి 19వ శ్లో॥ వఱకు)

(5) ఇతర దేవతలనుగూర్చిన ఉపాసనావిషయము. (20వ శ్లో॥ నుండి 23వ శ్లో॥ వఱకు)

(6) భగవానుని ప్రభావమును ఎఱుంగనివారి స్వభావము, ఎఱుంగువారి మహిమ. (24వ శ్లో॥ నుండి 30వ శ్లో॥ వఱకు)

**పూర్వాధ్యాయముతో ఈ అధ్యాయమునకు గల సంబంధము :-**

క్రిందటి అధ్యాయముయొక్క చివఱ, యోగులందఱిలోను పరమాత్మయందు సంలగ్నమైన చిత్తముగలిగి శ్రద్ధతో భజించువాడు సర్వశ్రేష్ఠుడని శ్రీకృష్ణమూర్తి ఆనతిచ్చిరి, కాని పరమాత్మయొక్క స్వరూప

# విజ్ఞాన యోగము



**మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే**
**యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః. (7-3)**

అనేకవేలమంది మనుజులలో ఏ ఒకానొకడో మోక్షసిద్ధికై యత్నించుచున్నాడు. అట్లు యత్నించువారైన అనేకమందిలో ఏ ఒకానొకడుమాత్రమే నన్ను వాస్తవముగ తెలిసికొనగల్గుచున్నాడు.

స్వభావములను చక్కగ తెలిసికొనినచో మాత్రమే అట్టి ధ్యానము, ఏకాగ్రచింతనము సాధ్యపడగలదు. కాబట్టి భగవత్స్వరూపమును, దాని మహిమను, దాని యనుభూతిని లెస్సగ దెలియజేయునిమిత్తము ఈ అధ్యాయము ప్రారంభింపబడుచున్నది -

**శ్రీ భగవానువాచ :-**

## 1. మయ్యాసక్తమనాః పార్థ యోగం యుఞ్జన్మదాశ్రయః
## అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు.

శ్రీ భగవానువాచ :- శ్రీ భగవంతుడు చెప్పెను.

**టీక:–** పార్థ = ఓ అర్జునా!, మయి = నా యందు, ఆసక్తమనాః = ఆసక్తిగలమనస్సుగల వాడవును, మదాశ్రయః = నన్నే ఆశ్రయముగ గలవాడవును (అయి), యోగమ్ = యోగమును, యుఞ్జన్ = ఆచరించుచు (అభ్యసించుచు), మామ్ = నన్ను, అసంశయమ్ = నిస్సంశయముగ, సమగ్రమ్ = సంపూర్ణముగ, యథా = ఏ ప్రకారముగ, జ్ఞాస్యసి = తెలిసికొనగలవో, తత్ = దానిని (ఆ పద్ధతిని), శృణు = వినుము.

**తా:–** శ్రీ భగవంతుడుచెప్పెను - ఓ అర్జునా! నాయం దాసక్తిగల మనస్సు గలిగి, నన్నే ఆశ్రయించి యోగము నాచరించుచు నిస్సందేహముగ సంపూర్ణముగ నన్నెట్లు తెలిసికొనగలవో దానిని (ఆ పద్ధతిని) చెప్పెదను వినుము.

**వ్యాఖ్య:–** భగవంతునిగూర్చి తెలిసికొనినవారు జనులలో చాల అరుదుగ నుందురు. అందునను ఏ విధమైన సందేహములేక సంపూర్ణముగ తెలిసికొనువారింకను అరుదు. ఆ ప్రకారముగ భగవంతుని తెలిసికొనవలెనని, మొట్టమొదట మూడు అర్హతలుండవలెను. అవియేవియనిన–

(1) భగవంతునియందే మనస్సు ఆసక్తమైయుండవలెను. (2) భగవంతునే ఆశ్రయించవలెను. (3) భగవత్ప్రాప్తికై ధ్యానాదియోగముల నభ్యసించవలెను.

మనస్సు ఒక టార్చిలైటువంటిది. దానిని దృశ్యమువైపునకు త్రిప్పినచో దృశ్యపదార్థములు గోచరించును. అంతర్ముఖముగ త్రిప్పినచో ఆత్మవస్తువు (భగవంతుడు) గోచరించును. దేనియందు చిత్తము తీవ్రమగు ఆసక్తిగలిగియుండునో దానినిగూర్చియే అది నిరంతరము చింతించుచుండును. అజ్ఞానుల మనస్సు శబ్దాదివిషయములందే ఆసక్తిగొనుచుండునుగావున వానినిగూర్చియే చింతించుచు పరమాత్మ నెఱుంగజాలకుండును. విజ్ఞులగువారు తమమనస్సును భగవదున్ముఖముచేసి భగవత్తత్త్వము ననుభూత మొనర్చుకొని పరమానంద మనుభవించుదురు. కావున జ్ఞానులవలె శాశ్వతపరమాత్మనే ఆశ్రయించవలెనుగాని నశ్వర ప్రాపంచిక పదార్థములనుగాదు. క్షణికదృశ్యపదార్థములను నమ్ముకొని వాని నాశ్రయించినచో జీవుడు జన్మదుఃఖాది మహాప్రమాదముల నెదుర్కొనవలసి వచ్చును. కావున 'మయ్యాసక్తమనాః' 'మదాశ్రయః' అనుపదముల ద్వారా భగవదాశ్రయమే యిచట ప్రోత్సహించబడినది.

'నాయందాసక్తమైన మనస్సుగలిగి, నన్నే ఆశ్రయించి (ధ్యాన) యోగము నభ్యసించుచు నన్నెట్లు తెలిసికొనగలవో' అని చెప్పుటబట్టి జ్ఞానయోగమునకు భక్తియోగము, ధ్యానయోగము సహాయభూతములుగ నుండగలవని తెలియుచున్నది.

మఱియు, 'మాకు భగవత్తత్త్వము తెలియుటలేదే' అని కొందఱడుగుచుందురు. దానికి సమాధాన మీశ్లోకమున చెప్పబడినది. దైవమునందే ఆసక్తమైన చిత్తము గలిగియుండుట, దైవమునే ఆశ్రయించుట, ధ్యానాదియోగముల నభ్యసించుట అనుయోగ్యతలుగలవానికి దైవవిజ్ఞానము, దైవానుభూతి గలుగగలదని యిట సూచింపబడినది.

**ప్ర:–** భగవంతుని సంపూర్ణముగ, నిస్సంశయముగ తెలిసికొనవలెననిన కావలసిన యోగ్యతలెవ్వి?..

**ఉ:–** (1) భగవంతునియందే మనస్సు ఆసక్తమైయుండుట (2) భగవంతునే ఆశ్రయిచుట (3) (ధ్యానాది) యోగాభ్యాసమును శీలించుట.

**2. జ్ఞానం తేఽహం సవిజ్ఞానమిదం వక్ష్యామ్యశేషతః**
**యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్యజ్జ్ఞాతవ్య మవశిష్యతే.**

**టీక:–** యత్ = దేనిని, జ్ఞాత్వా = తెలిసికొనిన పిమ్మట, ఇహ = ఈ ప్రపంచమున, భూయః = మరల, జ్ఞాతవ్యమ్ = తెలిసికొనదగినది, అన్యత్ = మఱియొకటి, న అవశిష్యతే = మిగిలియుండదో, ఇదమ్ = అట్టి యీ, సవిజ్ఞానమ్ = అనుభవసహితమైన, జ్ఞానమ్ = జ్ఞానమును, అశేషతః = సంపూర్తిగా, తే = నీకు, వక్ష్యామి = చెప్పెదను.

**తా:–** దేనిని తెలిసికొనినచో మరల యీ ప్రపంచమున తెలిసికొనదగినది మఱియొకటి మిగిలియుండదో అట్టి అనుభవసహితమగు జ్ఞానమును సంపూర్ణముగ నీకు జెప్పెదను.

**వ్యాఖ్యా:–** భక్తునిపై భగవంతున కెట్టి అవ్యాజకరుణగలదో ఈ శ్లోకము తెలియజేయుచున్నది. భక్తుడగు అర్జునునకు భగవానుడు విజ్ఞానసహితముగ జ్ఞానము నుపదేశింపబోవుచున్నారు. ప్రపంచమున అనేక విద్యలు, కళలు కలవు. కాని వానిలో నెన్నిటిని తెలిసికొనినను విద్య సంపూర్ణము కానేరదు. ఇంకను కొంత శేషించియే యుండును. కాని భగవంతుని గూర్చిన జ్ఞానమును అనుభవపూర్వకముగ పొందినచో సమస్తమును తెలిసికొనినట్లే యగును. అత్తఱి ఇక తెలియదగినది యేదియు మిగిలియుండదు.

**'యస్మిన్విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి'** అను ఉపనిషద్వాక్య మీయర్థమునే స్పష్టీకరించుచున్నది. కావున దేనిని తెలిసికొనినచో సమస్తము తెలిసికొనబడినదగునో, ఏది సమస్తశాస్త్రములయొక్క సారమైయున్నదో అట్టి ఆత్మతత్త్వమును, (భగవత్తత్త్వమును) అనుభూతమొనర్చు కొనిన చాలును. చెట్టు మొదట నీళ్లుపోసిన చాలును. ఆకులను, కొమ్మలను తడిపినట్లే యగును. కావున బ్రహ్మానుభూతిని బొందినచో అన్నియనుభవములను బడసినట్లేయగును. కుమారస్వామి జగత్తంతయు ప్రదక్షిణము చేసివచ్చిరి. విఘ్నేశ్వరుడు తండ్రియగు శివునకుమాత్రము ప్రదక్షిణముచేసి తద్ద్వారా సమస్తబ్రహ్మాండమును ప్రదక్షిణముచేసిన ఫలితమును బొందినవారైరి. అట్లే ఒక్క బ్రహ్మవిద్యను బడసినచో సమస్తవిద్యలను నేర్చినట్లేయగును. మఱియు మనుజుని ఆయుష్కాలము చాల తక్కువ. శాస్త్రములకు, విద్యలకు అంతులేదు. కావున సారాతిసారమగు దైవము నెఱుగుటయే జీవుని కర్తవ్యము. అట్లుకాక జీవితమునంతను ఇతరవిద్యల సంపాదనయందుమాత్రమే గడిపి బ్రహ్మవిద్యను, భగవద్విజ్ఞానమును బొందనిచో జన్మ నిరర్థకము కాగలదు. కనుకనే శ్రీ కృష్ణపరమాత్మ అర్జునుని కడతేర్చదలంచి అట్టి బ్రహ్మవిజ్ఞానము నుపదేశించుటకు పూనుకొనిరి.

ఇచట జ్ఞానము, విజ్ఞానము అని రెండు తెలుపబడినవి. జ్ఞానమనగా శాస్త్ర జన్యజ్ఞానము, శబ్దబ్రహ్మము. విజ్ఞానమనగా అనుభవజ్ఞానము, పరబ్రహ్మము. పూర్ణదుఃఖరాహిత్యము, ఆనందప్రాప్తి అనుభవజ్ఞానము, పరబ్రహ్మము. పూర్ణదుఃఖరాహిత్యము, ఆనందప్రాప్తి అనుభవజ్ఞానమువలననే, అనగా భగవత్తత్త్వానుభూతి వలననే కలుగగలదుగాని వాచా విద్యలచేగాదు. కావున గీతలో పెక్కుచోట్ల జ్ఞానముతో సహా విజ్ఞానమున్ను ఆర్జించవలసినదిగా భగవానుడు హెచ్చరించిరి. 'అశేషతః' అని చెప్పినందువలన, 'జ్ఞాన విజ్ఞానములను సంపూర్ణముగ వచించుచున్నాను. ఇక వానిలో ఏ కొరవలేదు' అని తెలిసినట్లైనది. ఇచట జ్ఞానమనగా 13వ అధ్యాయమందు చెప్పబడిన అమానిత్వాది గుణములనియు, విజ్ఞానమనగా జ్ఞేయమగు పరబ్రహ్మమనియుకూడ చెప్పవచ్చును.

**ప్ర:**– జీవుడు తరింపవలెననిన దేనిని తెలిసికొనవలెను?

**ఉ:**– జ్ఞానమును, విజ్ఞానమును (అనుభవజ్ఞానమును).

**ప్ర:**– అధ్యాత్మ విజ్ఞానముయొక్క మహిమ యెట్టిది?

**ఉ:**– దానిని తెలిసికొనినచో సమస్తమును తెలిసికొనినట్లే యగును.

**ప్ర:**– దేనిని తెలిసికొనినచో సమస్తము తెలియబడినట్లేయగును?

**ఉ:**– పరబ్రహ్మమును అనుభవపూర్వకముగ తెలిసికొనినచో సమస్తము తెలియబడినట్లేయగును.

**అ॥** అట్టి పరమాత్మనుగూర్చి తెలిసికొనువారు లోకములో చాల అరుదని వచించుచున్నాడు –

## 3. మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే
## యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః.

**టీక:**– మనుష్యాణామ్ = మనుష్యులలో, సహస్రేషు = అనేక వేలయందు, కశ్చిత్ = ఒకానొకడు, సిద్ధయే = మోక్షసిద్ధికొఱకు, యతతి = ప్రయత్నముచేయుచున్నాడు, యతతామ్ = (అట్లు) యత్నించుచున్న, సిద్ధానాం అపి = ముముక్షువులందును, కశ్చిత్ = ఒకానొకడు, మామ్ = నన్ను, తత్త్వతః = వాస్తవముగ, వేత్తి = తెలిసికొనుచున్నాడు.

**తా:**– అనేకవేలమంది మనుజులలో ఏ ఒకానొకడో మోక్షసిద్ధికై యత్నించుచున్నాడు. అట్లు యత్నించువారైన అనేకమందిలో ఏ ఒకానొకడుమాత్రమే నన్ను వాస్తవముగ తెలిసికొనగల్గుచున్నాడు.

**వ్యాఖ్య:**– ప్రపంచములో అనేకకోట్లమంది జనులున్నప్పటికిని, అందు అధ్యాత్మమార్గమున ప్రవేశించువారు అరుదు. ప్రవేశించి మోక్షసిద్ధికై యత్నించువారు ఇంకను అరుదు. అట్లు యత్నించువారిలో కడతేరువాడు, భగవదనుభూతిని పూర్ణముగ బొందువాడు ఏ ఒకానొకడో మాత్రమే యుండును. పరుగుపందెములో మొదట బయలుదేరునపుడు అనేకులుందురు. మధ్యలో కొందఱు నిలిచిపోవుదురు. కడకు ఏ ఒకరిద్దఱో గమ్యమును చేరుకొందురు. చెట్టునకు అనేక పూవులుపూయును. అందు చాలవఱకు రాలిపోయి ఏకొన్నియో పిందలుగ మారును. అవియు చాలరాలిపోగా కొద్దిమాత్రమే ఫలములుగ ఏర్పడును.

అట్లే ముముక్షువుల విషయమున్ను. భగవంతునియందు భక్తి ఉదయింపవలెననిన బహుజన్మసుకృత ముండవలెను★. మాయా ప్రవాహమున అనేకులు కొట్టుకొనిపోవుచుండ పుణ్యవశమున ఏ ఒకానొక ధీరుడో పరమాత్మనుగూర్చి యన్వేషించి, అనవరతయత్నముచే తత్సాధనమున సఫలీభూతుడగుచున్నాడు (కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్షత్). పూర్వపుణ్యమువలన అధ్యాత్మమార్గమున కొందఱు అడుగుపెట్టినప్పటికిని, భగవత్సాక్షాత్కార రూపలక్ష్యమును బొందువఱకును అట యత్నశీలురగువారు చాల అరుదుగానుందురు. ఈ విషయమునే గీతాచార్యులీశ్లోకమున తెలియజేసిరి.

ఆత్మానుభూతి మాటలతో కలుగునదికాదు. దానికి ఎంతయో మహత్తర పురుషప్రయత్నము, పట్టుదల, త్యాగము అవసరము. ఇంద్రియనిగ్రహము, మనస్సంయమము మున్నగునవి ఆవశ్యకములు. కావున సోమరులు ఆ లక్ష్యము నెన్నటికిని జేరలేరు. ముక్తిధామమునకుబోవు మార్గములో అనేకపరీక్షలు (Selections) ఉండును. వానిలో నెగ్గినవారే పైకిపోవుదురు. జల్లెడతో జల్లింపబడిన విధమున పొల్లురకమంతయు దారిలో నిలిచిపోవుదురు.

'తత్త్వతః' (యథార్థముగ) అనిచెప్పినందువలన, దేవుని తెలిసికొనువా రనేకులుండినను, యథార్థముగ తెలిసికొనినవాడు (అనగా అనుభవించువాడు) ఏ ఒకానొకడు మాత్రమే యుండుననియు భగవంతునిగూర్చి స్వల్పజ్ఞానము గలిగియుండుట చాలదనియు, ఆతనిని అనుభూత మొనర్చుకొనవలెననియు స్పష్టమగుచున్నది. మృగము మానవుడగుటకు ఎన్నియో జన్మలు పట్టియుండినను మానవుడు మాధవుడుగ మారుటకు అంతకాలము పనిలేదు. కావున కాలయాపనచేయక త్వరితముగ యత్నశీలుడై ఆత్మజ్ఞానమును బడసి జన్మసార్థకత నొందవలయును.

**ప్ర:–** జనులలో మోక్షసిద్ధికొఱ కెందఱు ప్రయత్నించుదురు?

**ఉ:–** నూటికి కోటికి ఏ ఒకానొకడో ప్రయత్నించును.

**ప్ర:–** అట్లు ప్రయత్నించువారిలో దైవమును వాస్తవముగ నెఱుంగువారెందఱు?

**ఉ:–** ఏ ఒకానొకడో.

**అ॥** భగవానుడు తనయొక్క పరాపరప్రకృతులను వర్ణింపబోవుచు మున్ముందు అపరాప్రకృతినిగూర్చి తెలియజేయుచున్నాడు –

**4. భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవచ**
**అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా.**

**టీక:–** భూమిః = భూమి, ఆపః = జలము, అనలః = అగ్ని, వాయుః = గాలి, ఖమ్ = ఆకాశము, మనః = మనస్సు, బుద్ధిః = బుద్ధి, అహంకార ఏవచ = అహంకారమున్ను, ఇతి = అని, మే ఇయంప్రకృతిః = నా యీప్రకృతి, అష్టధా = ఎనిమిది విధములుగా, భిన్నా = విభజింపబడినది.

★ జన్మాంతర సహస్రేషు తపోధ్యాన సమాధిభిః, నరాణాం క్షీణపాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే.

**తా:–** భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము – అని యీ ప్రకారముగ ఎనిమిది విధములుగ నా యీ ప్రకృతి (మాయ) విభజింపబడినది.

**వ్యాఖ్య:–** పరాపరప్రకృతులనుగూర్చి చెప్పదలంచి ముందు అపరాప్రకృతిని వర్ణించుచున్నారు. పంచభూతములు, మనస్సు, బుద్ధి, అహంకారము, అను ఈ యెనిమిదియుచేరి అపరాప్రకృతియగును. ప్రకృతి జడమైనది. పురుషుడు (ఆత్మ, బ్రహ్మము) ఒకడే చైతన్యరూపుడు. ప్రకృతి దృశ్యము. పురుషుడు దృక్కు. ప్రకృతి నశించును. పురుషుడు (ఆత్మ) శాశ్వతుడు. ఈ శ్లోకమున మనస్సు, బుద్ధి, అహంకారము – అనునవి పంచభూతములతో సమానముగ నెన్నుకొనబడినవి. అవియు పంచభూతములును ఒకేతరగతిగ పరిగణింపబడినవి. పంచభూతములు జడములు. కావున మనోబుద్ధ్యాదులున్ను వాస్తవముగ జడములేయని దీనినిబట్టి స్పష్టపడుచున్నది. సామాన్యముగ జనులు మనోబుద్ధ్యాదులను చైతన్యములుగ భావింతురు. అది పొరబాటు. అవియు జడములే. రాయి, మట్టి, కొయ్యవంటివే అవియు. ఈ ప్రకారముగ మనస్సున్ను జడమేయని యెపుడు తెలియబడునో అపుడు దానియొక్క బలము, శక్తి ఉడిగిపోవును. ఒక పాంచభౌతికపదార్థమువలె అది పట్టుపడిపోవును. జడమగువస్తువు ఎచటను చైతన్యవస్తువు (ఆత్మ) పై ఆధిపత్యము చలాయించజాలదు. ఈ రహస్యమును తెలియలేని అజ్ఞానులనే అది ఆటలాడించుచున్నది. కావున మనస్సును నిగ్రహించుటకు ఈ ప్రకారమగు ప్రకృతి పురుష స్వరూపవిజ్ఞాన మత్యావశ్యకమై యున్నది.

**ప్ర:–** భగవంతునియొక్క అపరాప్రకృతి యెన్ని విధములు? అవియేవి?

**ఉ:–** ఎనిమిది విధములు. అవియేవియనిన – (1) భూమి (2) జలము (3) అగ్ని (4) వాయువు (5) ఆకాశము (6) మనస్సు (7) బుద్ధి (8) అహంకారము.

## 5. అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్
## జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్.

**టీక:–** మహాబాహో = గొప్పబాహువులుగల ఓ అర్జునా!, ఇయమ్ = ఈప్రకృతి, అపరా = నికృష్టమైనది, ఇతఃతు = దీనికంటె, అన్యామ్ = వేఱైనదియు, యయా = దేనిచేత, ఇదంజగత్ = ఈప్రపంచము, ధార్యతే = ధరింపబడుచున్నదో, (తామ్ = అట్టి), జీవభూతామ్ = జీవరూప మైనదియునగు, మే = నాయొక్క, ప్రకృతిమ్ = (పరా) ప్రకృతిని, పరామ్ = ఉత్కృష్టమైన దానినిగా, విద్ధి = ఎఱుగుము.

**తా:–** గొప్పబాహువులుగల ఓ అర్జునా! ఈ (అపరా) ప్రకృతి చాల అల్పమైనది. దీనికంటె వేఱైనదియు, ఈ జగత్తునంతను ధరించునదియు, జీవరూపమైనదియునగు మఱియొక ప్రకృతిని (పరాప్రకృతిని) శ్రేష్ఠమైనదానినిగా నెఱుంగుము.

**వ్యాఖ్య:–** ఇక నిపుడు పరాప్రకృతినిగూర్చి వచించుచున్నారు. ఏది జీవరూపమైనదో, దేనిచేత ఈ జగత్తంతయు ధరింపబడుచున్నదో, అది పరాప్రకృతి యనబడును. ఇదియు అపరాప్రకృతివలె భగవంతుని (పురుషుని) అధీనమైయున్నది. కనుకనే నాయొక్క ప్రకృతి అని చెప్పబడినది. ఇక పరాప్రకృతి యనగా నెట్టిదో, అపరాప్రకృతి యనగా నెట్టిదో, దృష్టాంతముద్వారా తెలిసికొందము – ఒక కుండ కలదు. దానిలో నీరున్నది. ఆ నీటిలో సూర్యుడు ప్రతిబింబించెను అనుకొనుడు. ఇచ్చోట ఘటము దేహము; జలము మనస్సు; సూర్యప్రతిబింబము (చిదాభాసరూపుడగు) జీవుడు; సూర్యుడు పరమాత్మ. ఘటము, జలము, అపరాప్రకృతి. సూర్యప్రతిబింబము పరాప్రకృతి. ఆ రెండిటికంటె విలక్షణుడగు సూర్యుడు

పరాపరప్రకృతులకతీతుడగు పురుషుడు (భగవానుడు). శ్రీశంకరాచార్యులవారు తమ వివేకచూడామణియందీవిషయమునే స్పష్టముగ నిరూపించియుండిరి★.

వికారములన్నియు ఘట, జల, ప్రతిబింబములకే కలుగునుగాని సూర్యున కెట్లుకాదో, అట్లే సమస్తజగద్వికారములున్ను పరాపరప్రకృతులకే కలుగునుగాని తద్విలక్షణమైన ఆత్మకుగాదు. అపరాప్రకృతియగు పంచభూతాదులు జడములు. పరాప్రకృతియగు చిదాభాసుడు ఆభాసచైతన్యరూపుడు, జీవరూపుడు. కాబట్టియే జీవభూతమైనట్టి ఈ పరాప్రకృతిచే జడమగు ఈ జగత్తు ధరింపబడుచున్నది (ధార్యతే). అద్వైతవిచారణయందీ రెండు ప్రకృతులున్ను మిథ్యయేయగుచు, ఆభాసరూపములుగనే నిశ్చితములై తద్విలక్షణుడైన పురుషుడు(ఆత్మ) ఒకడే సత్యముగ తేలును. కాబట్టి ముముక్షువగువాడు పరాపరప్రకృతులను రెండిటినిదాటి సాక్షియగు ఆత్మను చేరవలెను. జీవత్వమనునది జడత్వముకంటె ఒకింత మేలైనను, అదియు ఈ ప్రకృతియం దంతర్గతమే, కావున మిథ్యయే అయియున్నది. స్వప్నమందలి రాతికి జీవునికి గల భేదమే అపరా పరాప్రకృతులకున్ను గలదు. స్వప్నమందలి జీవుడు స్వప్నమందలి రాతికంటె కొంతమెఱుగే అయినను, రెండును స్వప్నరూపములే కనుక వాస్తవముగ లేనివే అయియున్నవి. మేలుకొనినవాడొకడే సత్యము. అట్లే ఎవనియం దీపరాపరప్రకృతులు రెండును ఆభాసరూపములై వర్తించుచున్నవో, అట్టి సర్వాధారుడగు అధిష్ఠాన పరమాత్మయే సత్యము. ఈ విషయమును ముముక్షువు చక్కగ గుర్తెఱింగి జీవజగత్తులకు విలక్షణుడైన సాక్షియగు ఆత్మను సాక్షాత్కరించుకొని బంధవిముక్తుడు కావలయును.

**ప్ర:-** పరాప్రకృతియొక్క స్వరూపమెట్టిది?

**ఉ:-** (1) అది జీవరూపమైనది (2) దానిచేతనే ఈ జగత్తంతయు ధరింపబడుచున్నది (3) కావుననే ఉత్కృష్టమైనది.

**అ॥** ప్రకృతులకు అతీతుడైన తానే జగత్తునకు పరమకారణుడని భగవానుడు వచించుచున్నాడు-

## 6. ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ
## అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయస్తథా.

**టీక:-** సర్వాణి = సమస్తములైన, భూతాని = ప్రాణులు, ఏతద్యోనీని = ఈపరాపరప్రకృతులే కారణముగా గలిగినవి, ఇతి = అని, ఉపధారయ = తెలిసికొనుము, అహమ్ = నేను, కృత్స్నస్య = సమస్తమైన, జగతః = ప్రపంచమునకు (ఈ రెండు ప్రకృతులద్వారా) ప్రభవః = ఉత్పత్తికి కారణభూతుడను, తథా = ఆ ప్రకారమే, ప్రలయః = నాశమునకు (ప్రళయమునకు) కారణభూతుడను (అయియున్నాను).

**తా:-** (జడ, చేతనములగు) సమస్త భూతములున్ను ఈ రెండు విధములగు (పరాపర) ప్రకృతుల వలననే కలుగునవియని తెలిసికొనుము. (ఈ రెండు ప్రకృతులద్వారా) నేనే ఈ సమస్త ప్రపంచముయొక్క ఉత్పత్తికి, వినాశమునకు కారణభూతుడనై యున్నాను.

---

★ ఘటం జలం తద్గతమర్కబింబం విహాయ సర్వం దివి వీక్ష్యతేఽర్కః,
తటస్థ ఏత త్త్రితయావభాసకః స్వయంప్రకాశో విదుషా యథా తథా (వివేకచూడామణి - 221)
కుండను, నీటిని, అందలి సూర్యప్రతిబింబమును - అన్నిటినివదలి వీనికి సాక్షిగానుండి అన్నిటిని ప్రకాశింపజేయునట్టి స్వయంప్రకాశ పరమాత్మయను సూర్యబింబమును విజ్ఞులాశ్రయించుదురు.

**వ్యాఖ్య:–** జడ, చేతన, ప్రకృతులవలన ప్రాణులు సంభవించుచున్నవి. ఆ రెండిటికి విలక్షణుడైన పరమాత్మ ఆ ప్రకృతులద్వారా జగత్తుయొక్క సృష్టిస్థితిలయములను గావించుచున్నారు. కావున సమస్త జగత్తునకు కారణభూతుడు వాస్తవముగ ఆ సర్వాధిష్ఠానపరమాత్మయే. ప్రకృతియను ఉపకరణముద్వారా వారే సూత్రధారివలె ఈ జగన్నాటకమంతటిని ఆడించుచున్నారు. అధిష్ఠానమగు పరమాత్మయందు ఆరోపింపబడిన జగత్తుయొక్క సృష్టిస్థితిలయములకు అధిష్ఠానమే హేతుభూతమగును గదా! (కాని, వాస్తవముగ అద్వైతదృష్టియందు పరమాత్మ నిర్వికారుడై ఏమియు చేయకయు, చేయించకయు సాక్షిగనున్నవారే యగుదురు.)

**ప్ర:–** సమస్తప్రాణికోట్లు ఎట్లేర్పడినవి?

**ఉ:–** పరాపరప్రకృతులవలన.

**ప్ర:–** ఈ సమస్తజగత్తుయొక్క సృష్టిస్థితిలయములకు కారణభూతు డెవడు?

**ఉ:–** పరమాత్మయే (ఆ రెండుప్రకృతులద్వారా) ఈ జగత్తుయొక్క సృష్ట్యాదులనుగావించుచున్నాడు.

**అ॥** పరమాత్మయే ఈ జగత్తునకు హేతుభూతులును ఆధారరూపులును, గావున వారే యెల్లెడను వ్యాపించియున్నారని వచించుచున్నాడు –

**7. మత్తః పరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ.**

**టీక:–** ధనంజయ = ఓ అర్జునా!, మత్తః = నాకంటె, పరతరమ్ = వేఱుగ(లేక, శ్రేష్ఠమైనది), అన్యత్ = మఱియొకటి, కించిత్ = ఏదియు, న అస్తి = లేదు, సూత్రే = దారమునందు, మణిగణాఇవ = మణుల సమూహమువలె, మయి = నాయందు, ఇదంసర్వమ్ = ఈ సమస్తప్రపంచము, ప్రోతమ్ = కూర్చబడినది.

**తా:–** ఓ అర్జునా! నాకంటె వేఱుగ మఱియొకటి ఏదియు లేనేలేదు. దారమందు మణులవలె నాయం దీసమస్తప్రపంచము కూర్చబడినది.

**వ్యాఖ్య:–** దేవు డెచటనున్నాడు? ఏ విధముగనున్నాడు? అను ప్రశ్నల కీశ్లోకమున సమాధానము చెప్పబడినది. పాలయందు వెన్నవలె, నువ్వులందు నూనెవలె, మణులందు దారమువలె పరమాత్మ జగత్తునందంతటను వ్యాపించియున్నారు. వారులేనిచోటే లేదు. వారికంటె వేఱైన మఱియొక వస్తువెద్దియు ముల్లోకములందును లేదు. ఈ సత్యమే యిచట నిరూపించబడినది.

మణిరత్నమాలయందు దారములేనిచో మణులు నిలవవు. మణులకు ఆధారమైనది దారము. మణులకు స్వతః నిలబడుశక్తిలేదు. దారమువలననే అవి నిలబడుచున్నవి. దారములేనిచో మణులు చెల్లాచెదరైపోవును. మఱియు మణులు అనేకములున్నను, రకరకములైనవి యున్నను దారముమాత్ర మొకటియే. జగత్తునందలి చరాచర ప్రాణికోట్లన్నియు (వివిధజాతులు, వివిధమతములు, వివిధరూపములుకలవి) మణులు. పరమాత్మదారము. పరమాత్మలేనిచో ఆ ప్రాణికోట్లన్నియు నిలువజాలవు. ప్రాణులన్నిటిని ఒక్కచో కూర్చగల్గినది అంతర్యామియగు ఆ పరమాత్మయే. వారి ఆధారమువలననే అవియన్నియు వర్తించుచున్నవి. మఱియు మణిమాలయందు మణులే స్థూలదృష్టికి కానుపించునుగాని

దారముగాదు. దారము సూక్ష్మదృష్టికి కానుపించును. అట్లే భగవంతుడు స్థూలదృష్టికి, చర్మచక్షువునకు గోచరింపరు. జ్ఞాననేత్రమునకే గోచరించుదురు.

కొందఱు 'మాకు దేవుడు కనుపించుటలేదే? ఉన్నచో మాకేల కనుపించడు? కాబట్టి లేడు' అని అజ్ఞానవశమున బల్కుచుందురు. మణిమాలనుజూచి 'దారము కంటికి కనుపించుటలేదు; కావున అందు దారములేదు' అనిపలికిన చందముననేయుండును వారి వాక్యము. అది ఉన్మత్తప్రలాపమేయగును. మణిమాలయందు దారము స్థూలదృష్టికిగాక వివేకదృష్టికిమాత్ర మెట్లు గోచరించునో అట్లే జగత్తునందంతట పరమాత్మ వ్యాపించియున్నను వివేకదృష్టికి, జ్ఞాననేత్రమునకు మాత్రమే వారు గోచరించుదురు★. జడమందు చేతనమును, నశ్వరమందు శాశ్వతమును, వికారమందు నిర్వికారమును చూడగల్గునదే జ్ఞాననేత్రము. ఉపాధులన్నియు జడములు, వానియం దనుస్యూతమై వ్యాపించియున్న అంతరాత్మను వీక్షింపగల్గుటయే జ్ఞాననేత్రము. అజ్ఞానులు బాహ్యమును మాత్రమే చూచుదురు. వారి దృష్టి అంతవరకే పోవును. ఎటువంటి మహాపండితుడైనను బాహ్యమును, ఉపాధిని మాత్రమే చూచుచో, లోనున్న పరమాత్మను చూడనిచో అతడజ్ఞానియే యగును. కావున 'X' కిరణములను ('X"Rays) వేసినచో వస్తువుయొక్క అభ్యంతరవిశేషములు గోచరించునట్లు వివేకమను కిరణములను ప్రసరింప జేసి ప్రతిజీవియందును, వస్తువునందును లోనవెలుగుచున్న పరమాత్మను వీక్షించవలెను. ఒక వ్యక్తిని చూడగనే దేహమును మాత్రము పరికించువాడు అధముడు. మనస్సును చూచువాడు మధ్యముడు. ఆత్మను గాంచువాడు ఉత్తముడు. దేహము, మనస్సు ప్రకృతిరూపములు, జడములు. ఆత్మయొకటియే పురుషుడు; చైతన్యము. కావున విజ్ఞులు దానినే ఆశ్రయించవలెను. ఇటువంటి భగవద్వాక్యములను వినిన పిమ్మట మనుజులు ప్రయత్నపూర్వకముగా తమ దృష్టిని మార్చుకొని స్థూలమునుమాత్రమేకాక, అంతరమునగల సూక్ష్మమగు ఆత్మవస్తువునుగూడ నవలోకించుటను అభ్యసించవలెను.

భగవంతునియొక్క స్వరూపమును, స్థానమును నిరూపించుటవలన ఈ శ్లోకము సాధనపరులగు ముముక్షువులకు అతిముఖ్యమైయున్నది. 'పరతరమ్' - అను పదమునకు మిక్కిలి శ్రేష్ఠమైనది అనియు అర్థము చెప్పవచ్చును. ఈ శ్లోకమున తెలుపబడిన మణిమాలసాదృశ్యముయొక్క వివరములు -

| మణిమాల | జగత్తు |
|---|---|
| (1) మణులు. | (1) దృశ్యపదార్థములు. |
| (2) దారము. | (2) పరమాత్మ. |
| (3) మణులు అనేకములు, (అనేక రకములు) దారము ఒక్కటే. | (3) పదార్థము లనేకములు, (అనేక రకములు) పరమాత్మ ఒక్కరే. |
| (4) దారములేనిచో మణులు నిలువవు. | (4) పరమాత్మలేనిచో జగత్పదార్థము. లెవ్వియు నిలువజాలవు. |
| (5) స్థూలదృష్టికి దారము కనుపించదు. | (5) అజ్ఞానదృష్టికి పరమాత్మ గోచరింపరు. |
| (6) వివేకదృష్టికి దారము కనుపించును. | (6) జ్ఞానదృష్టికి పరమాత్మ గోచరించును. |

★ సర్వగం సచ్చిదానన్దం జ్ఞానచక్షుర్నిరీక్షతే
అజ్ఞానచక్షుర్నేక్షేత భాస్వన్తం భానుమన్ధవత్ (ఆత్మబోధ - శ్రీ శంకరాచార్యులవారు)

సర్వవ్యాపకుడగు సచ్చిదానందపరమాత్మను జ్ఞాననేత్రుడే చూడగల్గును, ప్రకాశమానుడగు సూర్యుని గ్రుడ్డివాడు చూడజాలనట్లు అజ్ఞాని పరమాత్మను చూడజాలడు.

**ప్ర:–** జగత్తుయొక్క వాస్తవస్వరూపమెట్టిది?

**ఉ:–** పరమాత్మకంటె వేఱుగ ఈ జగత్తునందు ఏ పదార్థమున్ను లేదు.

**ప్ర:–** జగత్తునందు పరమాత్మ యేప్రకారముగ వ్యాపించియున్నాడు?

**ఉ:–** మణులందు దారమువలె.

**ప్ర:–** కాబట్టి భగవద్దర్శనమునకై యేమిచేయవలెను?

**ఉ:–** వివేకదృష్టిని (జ్ఞానదృష్టిని) సంపాదించవలెను.

**అ॥** తనయొక్క ఆ సర్వవ్యాపకత్వమును భగవానుడు నాలుగు శ్లోకముల ద్వారా తెలియజేయుచున్నాడు –

**8. రసోఽహమప్సు కౌన్తేయ ప్రభాస్మి శశిసూర్యయోః**
**ప్రణవః సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు.**

**టీక:–** కౌన్తేయ = ఓ అర్జునా, అహమ్ = నేను, అప్సు = ఉదకములయందు, రసః = రుచియు, శశిసూర్యయోః = చంద్ర సూర్యులందు, ప్రభా = కాంతియు, సర్వవేదేషు = సమస్తవేదములయందు, ప్రణవః = ఓంకారమును, ఖే = ఆకాశమందు, శబ్దః = శబ్దమును, నృషు = మనుష్యులయందు, పౌరుషమ్ = పరాక్రమమును, అస్మి = అయియున్నాను.

**తా:–** అర్జునా ! నేను జలమందు రుచియు, చంద్ర సూర్యులందు కాంతియు, సమస్తవేదములందు ఓంకారమును, ఆకాశమందు శబ్దమును, మనుజులందు పరాక్రమమును అయియున్నాను.

**వ్యాఖ్య:–** సమస్తచరాచర ప్రాణికోట్లయందు మణులందు దారమువలె తాను వ్యాపించి యున్నానని భగవానుడు క్రిందటి శ్లోకమందు ప్రతిపాదించిరి. ఆ సత్యమును ఋజువు చేయుటకై కొన్ని కొన్ని వస్తువులను తీసుకొని వానియందు తానెట్లు వ్యాపించియున్నది ఇచట తెలుపుచున్నారు. నీటియందు తాను రుచిరూపమునను, చంద్రసూర్యులందు ప్రకాశరూపమునను, వేదములందు ఓంకారరూపమునను, ఆకాశమందు శబ్దరూపమునను, మనుష్యులందు పరాక్రమరూపమునను ఉన్నట్లు భగవానుడు సెలవిచ్చిరి. దీనినిబట్టి పరమాత్మ సమస్త వస్తువులందును ఓతప్రోతమై అంతర్యామిరూపమున వ్యాపించియున్నట్లు స్పష్టమగుచున్నది. రుచిలేనిది జలముండదు. రుచికి జలమునకు అవినాభావ సంబంధముగలదు. జలమే రుచి, రుచియే జలము. రెండింటిని విడదీయుటకు వీలుండదు. అట్లే ప్రకాశమే సూర్యుడు. సూర్యుడే ప్రకాశము. ప్రకాశములేని సూర్యుని యెవరును ఊహింపజాలరు. ఈ ప్రకారముగ సర్వవస్తువులను గుఱించియు గ్రహించుకొనవచ్చును. భగవానుని సర్వవ్యాపకత్వమును ఆదిలోనే తెలిసికొనుట కష్టతరముగనుక సామాన్యలకు అట్టి విశ్వవ్యాపకభావము సులభగ్రాహ్యమగుటకొఱకై కొన్ని ఉదాహరణము లిచట పొందుపరుపబడినవి.

వేదములందు తాను ఓంకారరూపముననున్నట్లు భగవానుడు చెప్పినందువలన వేదములందలి

సమస్తవేదముయొక్కయు సార మోంకారమేయని స్పష్టమగుచున్నది. జనుల ఆయుష్కాలము అతిస్వల్పమగుటవలనను, వేదము లనంతములగుట వలనను సారభూతమైన విషయము నెఱింగి అనుష్ఠించినచో జన్మ తరించిపోగలదు. అట్టి సారమే ఓంకారము. కావున ప్రణవమును జపించుచు ప్రణవార్థమును చింతించుచు ప్రణవవాచ్యుడగు పరమాత్మను ధ్యానించుచుండిన పరమశ్రేయము లభించగలదు.

మనుష్యులందు పరాక్రమ (ఉత్సాహ, ధైర్య) రూపమున తానున్నానని భగవానుడు చెప్పినందువలన, ఆ సుగుణరాజము మనుజుల కత్యావశ్యకమని స్పష్టమగుచున్నది. ధైర్యము, పరాక్రమము, ఉత్సాహము ఉండుచోట సాక్షాత్ భగవానుడు కాపురముండును. దిగులు, దుఃఖము, పిరికితనము, వ్రేలాడుముఖములు (Long faces) ఉండుచోట దయ్యములు వసించును. కావున దుర్బలత్వమును పారద్రోలి భగవత్స్వరూపములే యగు ధైర్యోత్సాహాది సుగుణములను ఆర్జించవలయును. అట్టివాడు ధన్యుడు.

**ప్ర:–** భగవానుడు ఏ యే వస్తువులయం దేయేరూపమున నుండునో మచ్చునకు కొన్ని తెలుపుడు?

**ఉ:–** (1) నీటియందు రుచి రూపమునను (2) చంద్రసూర్యులందు కాంతిరూపమునను (3) వేదము లన్నిటియందును ప్రణవరూపమునను (4) ఆకాశమందు శబ్దరూపమునను (5) మనుష్యులందు పరాక్రమరూపమునను భగవానుడున్నాడు.

## 9. పుణ్యో గన్ధః పృథివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ
## జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు.

**టీక:–** (మఱియు నేను) పృథివ్యామ్ = భూమియందు, పుణ్యః గన్ధఃచ = మంచివాసనయు, విభావసౌ = అగ్నియందు, తేజః చ = ప్రకాశమును, అస్మి = అయియున్నాను, సర్వభూతేషు = సమస్త ప్రాణులయందు, జీవనమ్ = ప్రాణమును (లేక ఆయువును), తపస్విషు = తపస్సుచేయువారియందు, తపః చ = తపస్సున్ను, అస్మి = అయియున్నాను.

**తా:–** (మఱియు నేను) భూమియందు సుగంధమును, అగ్నియందు ప్రకాశమును, సమస్తప్రాణులయందు ప్రాణమును (లేక ఆయువును), తాపసులయందు తపస్సును అయియున్నాను.

**వ్యాఖ్య:–** గంధములేని భూమిని, ప్రకాశములేని అగ్నిని, ప్రాణములేని ప్రాణిని, తపస్సులేని తపస్విని మన మూహింపజాలముకదా! కాబట్టి ఆ యా వస్తువులందలి సారమే పరమాత్మ. దీనిచే వారు సమస్త పదార్థములందును పూర్ణముగ వ్యాపించియున్నారని స్పష్టమగుచున్నది.

## 10. బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్
## బుద్ధిర్బుద్ధిమతామస్మి తేజస్తేజస్వినామహమ్.

**టీక:–** పార్థ = ఓ అర్జునా!, మామ్ = నన్ను, సర్వభూతానామ్ = సమస్తప్రాణులయొక్క, సనాతనమ్ = శాశ్వతమైన, బీజమ్ = బీజముగ (కారణముగ, మూలముగ), విద్ధి = ఎఱుగుము, (మఱియు) అహం = నేను, బుద్ధిమతామ్ = బుద్ధిమంతులయొక్క, బుద్ధిః = బుద్ధియు (వివేకమును), తేజస్వినామ్ = ధీరులయొక్క, తేజః = ధైర్యమును, అస్మి = అయియున్నాను.

**తా:–** ఓ అర్జునా! నన్ను ప్రాణులయొక్క శాశ్వతమైన బీజముగ నెఱుంగుము. మఱియు, బుద్ధిమంతులయొక్క బుద్ధియు, ధీరులయొక్క ధైర్యమును నేనే అయియున్నాను.

**వ్యాఖ్య:–** 'బీజం మాం సర్వభూతానాం' అను వాక్యముద్వారా సమస్త ప్రాణులయొక్క బీజము (మూలము) ఆ పరమాత్మయేయనియు, వారినుండియే సర్వులు నుద్భవించిరనియు స్పష్టమగుచున్నది. అందఱికిని బీజము వారే కనుక ఇక 'వాడెక్కువ, వీడు తక్కువ,' అను భేదబుద్ధికి అస్కారమేలేదు. కావున ఎట్టి తక్కువకులమందు జన్మించినప్పటికిని, ఎట్టి పాపాత్ముడైనప్పటికిని, తనబీజము, తన తండ్రి ఆ పరమాత్మయే యని నిశ్చయించి మనుజులు పుణ్యపథమున అగ్రసరులు కావలసియున్నది. తాను తక్కువ అని యెవరును దుఃఖపడనక్కఱలేదు. అందఱికిని బీజ మాభగవానుడే అయియున్నారు. అందఱిది 'పరబ్రహ్మ' గోత్రమే అయియున్నది. బీజముయొక్క స్వభావమే చెట్టునందుండును. కావున అందఱును వాస్తవముగ సనాతనబ్రహ్మస్వరూపులే అయియున్నారు. అవిద్యావశముననే మనుజుడు తానల్పుడని, జీవుడని, దేహమని, దృశ్యమని భ్రమించుచున్నాడు. ఎపుడిట్టి ధైర్యోత్పాదకములగు భగవద్వాక్యముల వలన ఆ అవిద్య తొలగిపోవునో అపుడు తాను సనాతన ఆత్మ స్వరూపుడేయనియు, తనకు మూలహేతు వా పరమాత్మయే యనియు నిశ్చయించి పరమానందభరితుడగును.

ఎటువంటి నీచుడైనను, చండాలుడైనను, దరిద్రుడైనను, దీనాతిదీనుడైనను తనకు బీజము, మూలము పరమాత్మయేయని తెలిసికొనినచో ధైర్యోపేతుడుకాగలడు. తన నిజస్వరూప మెఱిగినపుడు ఎట్టి అల్పునకైనను మేరుసమానగాంభీర్యము చేకూరగలదు. గీతాచార్యు లెవరినిగూడ 'నీవు అల్పుడవు, నీచుడవు, తక్కువజాతివాడవు' అని బోధించలేదు. పై పెచ్చు 'నీయొక్క బీజము సనాతనపరమాత్మయే' అని వచించుచున్నారు. 'సర్వభూతానాం' అని చెప్పుటచే ఏ ఒకానొకనికో ఆతడు బీజముకాదనియు సమస్త ప్రాణికోట్లకును బీజమనియు స్పష్టమగుచున్నది. ఇట్టిబోధలే ఇపుడు లోతమున కెంతయో అవసరములైయున్నవి. సంసారమున క్రుంగిపోవుచుండువారి నీ బోధలు పైకి లేవనెత్తుచుండును. తరంగము చిన్నది. అయిననేమి? దానివెనుక దానికాధారముగ, కారణముగ, బీజముగ అనంతసముద్రము కలదు. కావున తరంగము తన అల్పరూపమునుగూర్చి దుఃఖించక, తనకు బీజభూతమైన మహాసముద్రమును తలంచుకొని ధైర్యమొందవలెను. అట్లే మానవుడున్ను తన చిన్న ఉపాధినిగూర్చి స్మరింపక, తన బీజము, తన నిజరూపము, తన ఉపాధికి ఆధారము పరమాత్మయేయని నిశ్చయించుకొనినచో ఎంతధైర్యము చేకూరును! తనకు మూలము తన తండ్రికాదు, తాతకాదు, ముత్తాతకాదు, సాక్షాత్ పరమాత్మయే యను నమ్మకము పూర్తిగ ఉండవలెను. కనుకనే ఇప్పటికిని ద్విజులు సంధ్యావందనమునందు కట్టకడకు ప్రవరచెప్పునపుడు తమగ్రోతము వచించు సందర్భమున ఏ మహర్షినో స్మరించుదురుకాని తమకులమందలి అన్యులనుగాదు.

'బీజం మాం సర్వభూతానాం' అను వాక్యముద్వారా భగవాను డీ క్రిందిబోధను జనులకు గావించుచున్నారు – "ఓ జీవులారా! మీరు అల్పులని, దీనులని ఏ కాలమందును భావింపరాదు. మీ అందఱియొక్క బీజము, మూలము నేనే. అది సామాన్య బీజము కాదు, శాశ్వతమైన (సనాతనమ్) బీజము. కాబట్టి మీరందఱునాపరంపరలో పుట్టినవారే. మీకు నేనే మూలపురుషుడను. మీరందఱు దైవాంశములో జన్మించినవారే. చెట్టు విత్తనమునకు అన్యముగా నుండదు. మీరందఱు వృక్షరూపులు, ఆ వృక్షమునకు నేను బీజమును. నేను సనాతనుడను, గనుక మీరున్ను సనాతనులే (శాశ్వతులే) యగుదురు. ఈ వాక్యమునందు నమ్మకముంచి తరించిపొండు. దేహభావము గలిగి అనవసరముగ దుఃఖముల బాల్పడకుడు! మీ నిజరూపమును సంస్మరించి సింహకిశోరమువలె పైకిలెండు!"

శ్రీకృష్ణభగవానుని ఈ దివ్యబోధను స్మృతిపథమునందుంచుకొని తరించుట ప్రతిజీవియొక్కయు విధ్యుక్త ధర్మము.

**ప్ర:–** సమస్తప్రాణికోట్లకు బీజభూతు డెవడు?

**ఉ:–** పరమాత్మయే.

**ప్ర:–** ఆతని స్వరూప మెట్టిది?

**ఉ:–** శాశ్వతమైనది (సనాతనము)

**11. బలం బలవతాం★ చాహం కామరాగవివర్జితమ్**
**ధర్మావిరుద్ధో భూతేషు కామో౽స్మి భరతర్షభ.**

**టీక:–** భరతర్షభ = భరతకులశ్రేష్ఠుడవగు ఓ అర్జునా!, అహమ్ = నేను, బలవతామ్ = బలవంతులయొక్క, కామరాగ వివర్జితమ్ = ఆశ, అనురాగము బొత్తిగాలేని, బలమ్ = బలమును. భూతేషు = ప్రాణులయందు, ధర్మావిరుద్ధః = ధర్మమునకు విరుద్ధముగాని, కామః = కోరికయు, అస్మి = అయియున్నాను.

**తా:–** భరతకులశ్రేష్ఠుడవగు ఓ అర్జునా! నేను బలవంతులయొక్క ఆశ, అనురాగము లేని బలమును, ప్రాణులయందు ధర్మమునకు వ్యతిరేకముకాని కోరికయు అయియున్నాను.

**వ్యాఖ్య:–** బలము కలిగియుండుట మంచిదే. కాని అది కామము, రాగము లేనిదై యుండవలెను. అనగా ధర్మవిరుద్ధమగు కార్యములను జేయుటయందును, విషయసంబంధమైన కోరికలను సంతృప్తి పఱచుటయందును, దృశ్యవస్తువులందు అనురాగము, ఆసక్తి చూపుటయందును వినియోగపడునది కానిదై యుండవలెను. ధర్మకార్యములకు, పరోపకారకార్యములకు, దైవకార్యములకు, పరమార్థసాధనలకు వినియోగపడు బలము ఉత్తమమైనది. అది మానసిక బలముకాని, శారీరక బలము కాని, కామరాగములతో గూడినదియు, విషయభోగానుభవముకొఱకు వినియోగపడునదియునగు బలము నికృష్టమైనది. అది పశుబలము, ఆసురికబలము. భగవన్నివాసమునకది యోగ్యముకాదు. 'వర్జితమ్' అని చెప్పక 'వివర్జితమ్' అని చెప్పుటవలన బలమందు కామ, రాగములు ఏమాత్రము చేరకయుండవలెనని స్పష్టమగుచున్నది.

మఱియు ధర్మమునకు, శాస్త్రాదేశమునకు విరుద్ధముకాని కోరికయు తానేయని భగవానుడు సెలవిచ్చియున్నారు. కోరిక దుర్వినియోగపరచబడునపుడది ఆసురికమై వర్తించును. సద్వినియోగ పఱచబడునపుడు దైవికమై యొప్పును. దేహధారణానిమిత్తములగు అన్నపానాదుల గూర్చిన ఇచ్ఛామాత్రరూపమైనదియు, మోక్షేచ్ఛా సంబంధమైనదియు, గృహస్థులకు సత్సంతానమాత్రనిమిత్తమై నదియు నగు కోరిక ధర్మానుకూలమైనది. కావున అది దోషరహితమైనదగుటచే అట్టి కోరికయు తన రూపమేయని భగవానుడు వచించిరి. అయితే ఇదివరలో అనేక పర్యాయములు కోరికలన్నిటిని విడువలసినదిగా (ప్రజహాతి యదాకామాన్ సర్వాన్) బోధించి, ఇపుడు 'ధర్మమునకు విరుద్ధముకాని కోరికను నేను' అని గీతాచార్యు లేల చెప్పిరని కొందఱు ప్రశ్నించవచ్చును. అందులకు సమాధానమేమియనిన – కోరిక

★ బలవతామస్మి – పాఠాన్తరము

మూడువిధములు (1) చెడ్డకోరిక (2) మంచికోరిక (3) కోరికలేకుండుట. ప్రారంభస్థితిలో సాధకుడు చెడ్డకోరికలను విడనాడి, మంచివానిని గ్రహించవలెను. ధర్మమునకు విరుద్ధముకాని కోరికలను స్వీకరించవలెను. (దుస్సంకల్పములను వీడి సత్సంకల్పములను గ్రహించవలెను.) అనగా పరోపకారమును గూర్చిన కోరిక, జన్మతరించవలెనను కోరిక, భగవద్ధ్యానము చేయవలెనను కోరిక, గృహస్థుడైనచో సత్సంతానప్రాప్తికి హేతువగు కోరిక, పుణ్యకార్యముల నాచరించవలయునను కోరిక మున్నగువానిని ప్రారంభములో నవలంబించి క్రమముగ **సాధనపరిపక్వతచే** పురోగతినొందుచు, నిస్సంకల్పస్థితిని అనగా ఏకోరికయు, ఏ సంకల్పమున్ను లేని ఆత్మస్థితిని పొందవలెను. ఈ ప్రకారముగ ఆత్మస్థితికి దోహదమొనర్చుటవలన ధర్మానుకూలములగు కోరిక లిచట ప్రోత్సహింపబడి ధర్మవిరుద్ధమగు కోరికలుమాత్రము ఖండింపబడెనని గ్రహించవలెను. కాని ఎప్పటికైనను కోరికలన్నిటిని విడనాడిననే తప్ప నిర్విషయ ఆత్మస్థితి గలుగదనియు సాధకులు గుర్తెఱుంగవలయును.

**అ॥** జగత్తునకు మూలకారణము తానేయని భగవానుడు చెప్పుచున్నాడు -

## 12. యే చైవ సాత్త్వికా భావా రాజసా స్తామసాశ్చయే
## మత్త ఏవేతి తాన్విద్ధి న త్వహం తేషు తే మయి.

**టీక:-** సాత్త్వికాః = సత్త్వగుణముచేగలిగిన, భావాః = పదార్థములు (లేక స్వభావములు), యే = ఏవి (కలవో), రాజసాఃచ = రజోగుణమువలన గలిగినవియు, తామసాఃచ = తమోగుణమువలన గలిగినవియు, యే = ఏవి (కలవో), తాన్ = వానిని, మత్తః ఏవ ఇతి = నావలన గలిగినవియే యని, విద్ధి = తెలిసికొనుము, తు = కాని, తేషు = వానియందు, అహమ్ = నేను, న = లేను, తే = అవి, మయి = నాయందు, (సన్తి = ఉన్నవి).

**తా:-** సత్త్వరజస్తమోగుణములచే గలిగిన పదార్థములు (లేక స్వభావములు) ఎవ్వికలవో అవి నా వలననే కలిగినవని నీవెఱుంగుము. అయితే నేను వానియందు లేను. అవి నాయందున్నవి. (నేను వానికి వశుడనుగాను, అవి నాకు వశవర్తులై యున్నవని భావము).

**వ్యాఖ్య:-** ఆధారములేనిదే ఆధేయము నిలవదు. ఈ సమస్తప్రపంచమునకును అందలి పదార్థములకును ఆధారము పరమాత్మ. ఆతని సత్తవలననే అవి సత్తగలిగియున్నవి. అధిష్ఠానమగు ఆత్మయొక్క వివర్తమాత్రమే ఈ ప్రపంచము. అనగా భ్రమచే రజ్జువునందు గోచరించు సర్పమున కెట్లు రజ్జువు కారణభూతమైనదో అట్లే ఈ జగత్తునకు పరమాత్మ కారణభూతులైయున్నారు. కనుకనే ఇచట సాత్త్వికాది గుణములవలన గలిగిన 'సమస్త పదార్థములు నావలననే కలిగిన'వని భగవానుడు చెప్పుటకు కారణమైనది. ఈ ప్రకారముగ ఆ జగద్రూప వస్తువులన్నియు పరమాత్మపై ఆధారపడియున్నవి. కాని పరమాత్మ వానిపై ఆధారపడుటలేదు. సర్పము రజ్జువునందు గలదు. రజ్జువు సర్పమునందు లేదు. అనగా సర్పము రజ్జువుపై ఆధారపడియున్నది. అంతియేకాని రజ్జువు సర్పముపై కాదు. తరంగములు సముద్రముపై ఆధారపడియున్నవి. సముద్రము తరంగములపై కాదు. 'అవి నాయందున్నవి. నేను వానియందులేను' అను భగవద్వాక్యముయొక్క అర్థ మిదియే.

'న త్వహం తేషు తేమయి' - అను వాక్యమునకు మరియొకవిధముగగూడ అర్థము చెప్పవచ్చును -

ఎట్లనిన - (అహం తేషు న, తేమయి న) నేను వానియందుగాని, అవి నాయందుగాని లేవు. ఇది పూర్ణఅద్వైతస్థితిని గూర్చి చెప్పువాక్యము. ఈ దృశ్యజగత్తు స్వప్నప్రాయమై వాస్తవముగ (పరమార్థదృష్టియందు) లేనిదై యున్నది. కావున లేని వస్తువునందు పరమాత్మ యుండుటయేమి? పరమాత్మయందు ఆ లేని వస్తువు వుండుటయేమి?

ఈ శ్లోకమునందు మొదటిపాదము, రెండవపాదములోని పూర్వార్థము ద్వైత విశిష్టాద్వైత తత్త్వమును, రెండవపాదములోని ఉత్తరార్థము అద్వైతతత్త్వమును సూచించుచున్నది. గీతయందు పరిపూర్ణ అద్వైతస్థితి బోధింపబడిన కొలది సందర్భములలో ఇదయొకటియై యున్నది. (భూతభృత్ న చ భూతస్థః (9-5) ఇత్యాదిసందర్భములు)

ఈ శ్లోకమున రాజస తామస భావములుకూడ పరమాత్మవలననే కలిగినవను వాక్యముచే ఆ దుష్టభావములను ప్రోత్సహించిన ట్లెవరును భావింపరాదు. వానియన్నింటి యొక్క అధిష్ఠానము పరమాత్మయే యని తెలుపుటకొఱకే అట్లు వచింపబడినది.

**ప్ర:-** పరమాత్మ యెట్టివాడు?

**ఉ:-** సత్త్వరజస్తమోగుణ సంజనితములగు సమస్త వస్తువులకును ఆధారభూతుడు. అవి ఆతనికి వశములై యున్నవి. ఆతడు వానికి వశుడై లేడు.

**అ॥** అట్టి పరమాత్మను జను లేల తెలిసికొనజాలకున్నారో వచింపబడుచున్నది -

**13. త్రిభిర్గుణమయైర్భావైరేభిస్సర్వమిదం జగత్**
**మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్.**

**టీక:-** *ఏభిః* = ఈ చెప్పబడిన, *త్రిభిః* = మూడువిధములైన, *గుణమయైః* = (సత్త్వరజస్తమో) గుణములయొక్క వికారములగు, *భావైః* = స్వభావములచేత, *సర్వం ఇదంజగత్* = ఈ ప్రపంచమంతయు, *మోహితమ్ (సత్)* = మోహమును (భ్రాంతిని, అవివేకమును) బొందింపబడినదై, *ఏభ్యః* = ఈ త్రిగుణములకంటె, *పరమ్* = వేఱైనట్టియు (అతీతుడైనట్టియు), *అవ్యయమ్* = నాశరహితుడైనట్టియు, *మామ్* = నన్ను, *న అభిజానాతి* = తెలిసికొనజాలకున్నది.

**తా:-** ఈ చెప్పబడిన మూడువిధములగు సత్త్వరజస్తమోగుణములయొక్క వికారములగు స్వభావములచేత ఈ ప్రపంచమంతయు మోహమును (అవివేకమును) బొందింపబడినదై ఆ గుణములకంటె వేఱై (అతీతుడనై) నాశరహితుడనైనట్టి నన్ను తెలిసికొనజాలకున్నది.

**వ్యాఖ్య:-** ఆకసము మేఘములచే దట్టముగ గప్పబడినపుడు మేఘమునకు అవలనున్న సూర్యుని మేఘములకు ఈవలనున్న జను లెట్లు చూడజాలరో, అట్లే త్రిగుణములకు అవలనున్న పరమాత్మను త్రిగుణములస్వభావములకు, వికారములకు లోబడిన జనులు తెలిసికొనజాలకున్నారు. మఱియు అత్తిపండులోనున్న పురుగులవలె త్రిగుణాత్మకమగు మాయాగోళమున జీవులు పరిభ్రమించుచున్నారు. తత్త్వవిచారణయను ఝంఝూమారుతముచే మనుజుడెపుడు త్రిగుణాత్మకమగు ఆ మాయామేఘమును తొలగించివేయునో అపుడు స్వస్వరూపమగు ఆత్మ నిరావరణముగ ప్రకాశించును. ఆత్మసాక్షాత్కారము

లభించును. ఈ శ్లోకమున జీవుడేప్రకారము త్రిగుణాత్మకమగు మాయచే బంధింపబడెనో తెలుపబడినది. రాబోవు శ్లోకమున ఆ బంధము నెట్లు తొలగించుకొనగలడో వచింపబడినది. ప్రతిమనుజుడును మొట్టమొదట తాను మాయారూపబంధనమున తగుల్కొనియున్నాడను సత్యమును గ్రహించుట అత్యావశ్యకము. ఏలయనగా తాను బంధింపబడియున్నాడని తెలిసికొనినవాడు తద్విముక్తికై తప్పక ప్రయత్నించగలడు. 'సర్వమిదం జగత్' అని శ్లోకమున చెప్పబడినట్లు ప్రపంచమందలి సమస్తజీవులును (జీవన్ముక్తులుమినహా) ధనవంతులు, బలవంతులు, సౌందర్యవంతులు, లౌకికవిద్యావంతులు - అందఱును బంధనమందేయున్నారు. కావున ఆ సత్యమెఱిగి ప్రతివారును తమ బంధవిముక్తికై తప్పక ప్రయత్నించవలెను. 'తమసస్తు పారే' అనునట్లు పరమాత్మ తమస్సు (అజ్ఞానము) అను తెర ఆవలనున్నారు. వారిని దర్శించనిదే సంసారదుఃఖము శమించదు. అయితే భగవద్దర్శనము కావలెననిన జీవునకు దేవునకు మధ్యగల త్రిగుణాత్మకమగు పొర ఛేదింపబడవలెను. భక్తివైరాగ్యాదులచేతను, నిష్కామకర్మాచరణముచేతను, తదితర సాధనలచేతను క్రమముగ రజోగుణ తమోగుణములను బోగొట్టుకొని, అపిమ్మట సత్త్వగుణమునుగూడ దాటి కేవలాత్మస్థితియందు నిలకడను బొందవలెను. అదియే మోక్షము.

నాకు భగవంతు డేల కనుపించుటలేదు? అని కొందఱు ప్రశ్నించుదురు. వారికి ఈ శ్లోకమున సమాధానము గలదు. త్రిగుణములచే మోహితులైయున్నంత వఱకు జనులు పరమాత్మనెఱుగజాలరు. మఱియు దుఃఖము నంతముచేసికొనజాలరు. నేత్రములు పొరచేకప్పబడినవాడు 'నాకు వస్తువులు కనిపించుటలేదే' అని ప్రశ్నించుటవంటిదే పైప్రశ్న. 'ఆపరేషన్' చేసి ఆ పొర ఎత్తివేయవలెను. అపుడు పదార్థములు స్పష్టముగ గోచరించును. అట్లే ప్రాపంచికభోగములకై ప్రాకులాడక మొట్టమొదట తన హృదయమందలి రజోగుణ తమోగుణాదులను, వాని వికారములను పురుషప్రయత్నముచే భక్త్యాది సాధనల నవలంబించి తొలగించుటకు యత్నించవలెను. భగవద్దర్శనమున కిదియే మార్గము.

**ప్ర:–** పరమాత్మ యెట్టివాడు?

**ఉ:–** అవ్యయుడు, నాశరహితుడు.

**ప్ర:–** అత డెచట నుండును? అతని స్థానమెద్ది?

**ఉ:–** త్రిగుణములకు ఆవల. (త్రిగుణములు = సత్త్వరజస్తమోగుణములు)

**ప్ర:–** జీవులేల అతనిని తెలిసికొనజాలకున్నారు?

**ఉ:–** వారు త్రిగుణములకు ఈవలనుండుటచే వానిచే మోహితులై ఆవలనున్న పరమాత్మను తెలిసికొనజాలకున్నారు.

**ప్ర:–** కావున భగవంతుని తెలిసికొనవలెననిన ఉపాయమేమి?

**ఉ:–** నిష్కామకర్మ, భక్త్యాదిసాధనలచే ఆ త్రిగుణములను దాటిపోవలెను. అదియే యుపాయము.

**అ॥** త్రిగుణాత్మకమగు ఆ మాయాబంధముయొక్క స్వభావమును తెలియజేసి దానిని తొలగించుట కుపాయమును చెప్పుచున్నాడు –

**14. దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా**
**మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే.**

**టీక:–** హి = ఏలయనగా, దైవీ = దైవసంబంధమైనదియు (అలౌకికసామర్థ్యముకలదియు), గుణమయీ = త్రిగుణాత్మకమైనదియునగు, ఏషా = ఈ (చెప్పబడిన), మమ = నాయొక్క, మాయా = మాయ (ప్రకృతి), దురత్యయా = దాటుటకు కష్టసాధ్యమైనది, మాం ఏవ = నన్నే, యే = ఎవరు, ప్రపద్యన్తే = శరణుబొందుచున్నారో, తే = వారు, ఏతాం మాయామ్ = ఈ మాయను, తరన్తి = దాటుచున్నారు.

**తా:–** ఏలయనగా, దైవసంబంధమైనదియు (అలౌకిక సామర్థ్యముకలదియు), త్రిగుణాత్మకమైనదియునగు ఈ నాయొక్క మాయ (ప్రకృతి) దాటుటకు కష్టసాధ్యమైనది. (అయినను) ఎవరు నన్నే శరణుబొందుచున్నారో వారీమాయను దాటివేయగలరు.

**వ్యాఖ్య:–** జనులు భగవంతుని ఏల తెలిసికొనలేకయున్నారో క్రిందటిశ్లోకమున చెప్పబడినది. ఈశ్లోకమున భగవంతుని పొందుటకు, మాయను దాటుటకు ఉపాయము చెప్పబడుచున్నది. కాబట్టి ముముక్షువుల కీ శ్లోకము అతి ముఖ్యమై యున్నది. దీనిని కంఠస్థముచేసి నిరంతరము మననము చేయవలసియున్నది.

దేవుని దర్శించుటకు ఒక పెద్ద అడ్డుగోడయున్నది. అది అడ్డముగానున్నందున ఎవరును ఆ పరమాత్మను దర్శింపజాలకున్నారు. దానినే 'మాయ' అందురు. 'పెన్నదాటితే పెరుమాళ్లుసేవ' అనునట్లు ఆ మాయను దాటిననే పరమాత్మదర్శనమగును. అయితే దానిని దాటుట ఎట్లు? ఆ పద్ధతి ఈశ్లోకమున చక్కగ చెప్పబడినది. మాయను అభివర్ణించుచు భగవానుడు నాలుగ విశేషణములను పేర్కొనియున్నారు. అవియేవి యనిన - అది (1) దైవసంబంధమైనది అనగా అలౌకికమైనది. గొప్పసామర్థ్యము కలది (2) త్రిగుణాత్మకమైనది (3) భగవంతునకు లోబడినది (4) దాటుటకు కష్టసాధ్యమైనది. ఈ మాయాలక్షణములను గుఱించి ఒకింత విచారించెదము.

(1) మాయను 'దైవీ' (దైవసంబంధమైనది) అని వర్ణించుటచే అది సామాన్యమైనది కాదనియు, భగవత్సంబంధమైనదనియు, మహత్తర శక్తిసామర్థ్యములుగలిగి అలౌకికమైనదనియు స్పష్టమగుచున్నది. దీనినే 'వైష్ణవీమాయ' అనికూడ అందురు. అది మహాశక్తివంతమైయుండుటవలన అనేకులను మేధాసంపన్నులను, బలవంతులను, రాజాధిరాజులను, ఇంద్రులను చంద్రులనుగూడ పడగొట్టి అజ్ఞానమందు, జననమరణ ప్రవాహమందు పడద్రోయుచున్నది. జనులయొక్క లౌకికములైన తెలివితేటలు దాని దగ్గఱ ఉపయోగించవు. అది దైవసంబంధమైనది కనుక దైవిక ఉపాయములవలననే లోబడగలదు.

(2) 'గుణమయీ' అని చెప్పుటచే ఈ మాయ త్రిగుణాత్మకమైనదని, అనగా సత్త్వరజస్తమోగుణములే స్వరూపముగ గలదని తెలియుచున్నది. మాయకు (ప్రకృతికి) వేఱు ఆకారములేదు. త్రిగుణములే దాని ఆకారము. కనుకనే 'గుణమయ' మని చెప్పబడినది. ఆ త్రిగుణములలో ఒక్కొక్క గుణమును లాగిపారవైచినచో ఇక మాయ మిగులదు. ఈ గుణములచే మోహితులయియే (భ్రమింపబడి) జనులు తన్నెఱుగజాలకున్నారని క్రిందటి శ్లోకముననే భగవానుడు తెలిపియుండుట గమనింపదగినది.

(3) 'మమ' (నాయొక్క) 'మాయా' అని చెప్పుటవలన ఈ మాయ భగవంతునకు స్వాధీనమై యున్నదని స్పష్టమగుచున్నది. ఇండ్లలోని పెంపుడుమృగములు యజమానికి లోబడియుండునట్లు మాయ పరమేశ్వరునికి లోబడియున్నది. ('మాయినంతు మహేశ్వరమ్'). ఈ మాయ సామాన్యజనులను

ముప్పతిప్పలు పెట్టునదియైనను దేవుని దగ్గర అణగియుండును (యజమానిచెంత భృత్యునిపగిది). మాయకు లోబడినవారికి దానిని జూచిన భయము. మాయను స్వాధీనపఱచుకొనిన పరమాత్మకుగాని, దానిని జయించిన జ్ఞానులకుగాని అది అల్పముగతోచును. 'యా మా సా మాయా' (ఏదిలేదో అదియే మాయ) అనునట్లు దాని రహస్యమెఱిగినవారికి అది లేనిదేయగును. మహాసముద్రము భయంకరముగ తోచినను గరుత్మంతునకు గోష్పదజలమువలె తోచును. అవలీలగా దానిని దాటివేయును. ఒక దోమకు గోష్పదజలము మహాసాగరముగ తోచును. ఆప్రకారమే మహాశక్తివంతమగు ఈ మాయ, ఈ ప్రకృతి జనులకు అనుల్లంఘనీయముగా స్ఫురించినను పరమాత్మకు స్వాధీనపడి ఆతని కొక ఉపకరణముగ వర్తించుచున్నది. కనుకనే 'మమ మాయా' - నాయొక్క మాయ, నాకు లోబడినమాయ అని భగవానుడు చెప్పుటకు కారణమైనది.

(4) 'దురత్యయా' - (దాటుటకు కష్టసాధ్యమైనది). మాయనుదాటుట కష్టసాధ్యమేకాని అసాధ్యముకాదు. మనస్సును జయింపనివారు, ఇంద్రియములకు దాసులు, విషయవాంఛాపరులు అగు మనుజులు మాయను దాటలేరు. ఆత్మజ్ఞానపరాయణులు, దైవతత్పరులు, భక్తివైరాగ్యాదిసాధనోపేతులు దాటగలరు. ఈ విషయమును రెండవ పాదమునందు భగవానులు చెప్పబోవుచున్నారు.

ఈ ప్రకారముగ మాయయొక్క భయంకరస్వరూపమును తెలిసికొంటిమి. అంతమాత్రముచేత ఎవరును భీతిల్లవలసినపనిలేదు. సముద్రము విశాలమైనను, దుస్తరమైనను ఒకచిన్న ఓడను సంపాదించినచో దానిని అవలీలగ దాటివేయవచ్చును. అట్లే భయంకర మాయాసముద్రమును దాటుటకు భగవానుడు ఈ శ్లోకముయొక్క రెండవపాదమందు చక్కని పడవను ప్రసాదించినారు. అదియే భక్తి, భగవదాశ్రయము, భగవచ్ఛరణాగతి, ఆత్మచింతన. 'నన్ను శరణుబొందువారీ భయంకరమగు మాయను సులభముగ దాటివేయగలర'ని పరమాత్మ కరుణతో బోధించిరి. విశ్వేశుని పాదాంబుజములను దీర్ఘనౌకచే అపారసంసారసముద్రమును దాటివేయవచ్చునని శ్రీ శంకరాచార్యులున్ను తెలిపియున్నారు.★ అదిలేనిచో దానిని దాటుట అసాధ్యమే యగును. ఏ ఇతర ఉపాయమున్ను అట పనికిరాదు. భగవచ్ఛరణాగతియే ఏకైక మార్గము.

మాయను జయించవలెననిన, లేక దాటవలెననిన, దానిని స్వాధీనపఱచుకొనినవారి పాదముల నాశ్రయించవలెను. దానిని వశమొనర్చుకొనినవాడు సాక్షాత్ పరమాత్మయే. కాబట్టి వారినే శరణుబొందవలెను. కొన్ని భవనములముందు కావలికుక్కయుండును. అది యెవరిని లోనికిరానీయదు. కాని యజమానిని మంచి చేసికొనినచో అది లొంగిపోవును. అట్లే ఆ మాయయు భగవంతుని ఆశ్రయించినవారికి దారియొసంగును. జీవన్ముక్తులగు మహనీయులున్ను భగవదాశ్రయముచే మాయను దాటియుందురుగనుక అట్టివారిసేవకూడ ముముక్షువుల కెంతయో ఉపకరించును.

'తరన్తి తే' (నన్నాశ్రయించినవారు మాయను తప్పక దాటగలరు) - అని భగవానుడు విస్పష్టముగ తెలియజేయుటవలన ఇక ఈ విషయమై సంకోచము పనికిరాదు. ప్రాపంచికవస్తువులను, ప్రాపంచికమనుజులను శరణుబొందుటవలన పరమార్థలక్ష్య మేనాటికిని చేకూరదు. దైవమును, దైవభక్తులనే ఆశ్రయించవలెను. 'మామేవ' (నన్నే) అని 'ఏవ' పదమును ప్రయోగించుటచే ఇతరమును దేనిని

---

★ అపార సంసార సముద్రమధ్యే సమ్మజ్జతో మే శరణం కిమస్తి।
గురో కృపాళో కృపయావదైత ద్విశ్వేశ పాదామ్బుజదీర్ఘనౌకా॥ (శ్రీ శంకరాచార్యులు)

శిష్యుడు : దయామయా! అపారమగు ఈ సంసార సముద్రమున మునుంగుచున్న నాకు శరణ్యమేదియో తెలుపుడు?
గురువు : భగవానుని పాదపద్మములను విశాలమైన నౌకను ఆశ్రయింపుము. తరించి పోదువు.

ఆశ్రయింపక ఒక్క పరమాత్మనే ఆశ్రయింపవలెనని సూచితమగుచున్నది. కావున ఎవరి తరణము వారిచేతులలోనేయున్నది. దైవము నాశ్రయించినచో తరింతురు. విషయముల నాశ్రయించినచో పతనమొందుదురు. కాబట్టి నశ్వరప్రాపంచికవస్తువులపైనుండి దృష్టిని మరల్చి జనులు భగవచ్ఛరణాగతిపైననే దృష్టిని సంలగ్న మొనర్చవలెను. అట్టివారి జన్మమే సార్థకము కాగలదు.

(భగవంతుని శరణుబొందుటయనగా వారిపై అనన్యభక్తిగలిగియుండుట, భగవత్కార్యములను జేయుట, ఆత్మచింతన, ఆత్మధ్యానము గావించుట, దైవికగుణములు గలిగియుండుట మొదలైనవియగును.)

**ప్ర:–** మాయ యెట్టిది?

**ఉ:–** (1) దైవికమైనది (అలౌకికసామర్థ్యముకలది) (2) త్రిగుణాత్మకమైనది (3) భగవంతునకు స్వాధీనపడియున్నది (4) దాటుటకు కష్టసాధ్యమైనది.

**ప్ర:–** అయితే అట్టి భయంకరమగు మాయను దాటుట ఎట్లు?

**ఉ:–** భగవంతుని శరణుబొందువారు, ఆశ్రయించువారు ఆ మాయాసముద్రమును అవలీలగ దాటివేయగలరు. తక్కినవారు దాటలేరు.

**అ॥** అయినను కొందఱు భగవానుని ఏల శరణుబొందుటలేదో కారణమును వచించుచున్నాడు –

**15. న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః**
**మాయయాఽపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః.**

**టీక:–** దుష్కృతినః = పాపముచేయువారును, మూఢాః = బుద్ధిహీనులును, మాయయా = మాయచేత, అపహృతజ్ఞానాః = అపహరింపబడిన జ్ఞానముగలవారును, ఆసురమ్ = రాక్షససంబంధమైన, భావమ్ = స్వభావమును, ఆశ్రితాః = ఆశ్రయించినవారును, (అగు), నరాధమాః = మనుజాధములు (నీచజనులు), మామ్ = నన్ను, న ప్రపద్యన్తే = పొందుటలేదు (ఆశ్రయించుట లేదు).

**తా:–** పాపముచేయువారును, మూఢులును, మాయచే అపహరింపబడిన జ్ఞానము గలవారును, రాక్షస స్వభావమును (అసురగుణములను) ఆశ్రయించువారు నగు మనుజాధములు నన్ను బొందుటలేదు (ఆశ్రయించుటలేదు).

**వ్యాఖ్య:–** భగవంతుని శరణుబొందువారు మాయను దాటగలరని క్రిందటి శ్లోకమున చెప్పబడినది. అయితే అందఱును శరణుబొందుదురాయనిన, కాదు. పాపులు, మూఢులు, మాయచే నపహరింపబడిన వివేకము గలవారు, అసురస్వభావము నాశ్రయించువారు నగు అధములుతప్ప తక్కినవారు మాత్రమే ఆశ్రయించుదురని యిట తెలుపబడినది. పైనదెల్పిన పాపాదిదోషములుకలవారు మాయను దాటజాలక సంసార సముద్రమునందే కొట్టుకొనుచుందురు. అట్టివారు భగవంతుని పొందజాలరు. 'మాయ' లేక అజ్ఞానము అనునది ఒక గజదొంగ. దానిని హృదయములో ప్రవేశించుటకు అవకాశమివ్వకూడదు. ఇచ్చితిమా, అది మన సర్వస్వమును, జ్ఞానమును, ప్రజ్ఞను, వివేకమును హరించివేయును. కనుకనే

'మాయయాఽపహృతజ్ఞానాః' అని చెప్పబడినది. అది లోన ప్రవేశించినచో నరుని 'నరాధముని'గ మార్చివేయును. దేవతను దానవునిగ రూపొందించును. విజ్ఞుని 'మూఢు'నిగ జేసివైచును. 'మాయ' అనగానేమి? అనేక పాపవాసనలు, కామక్రోధాదులు, రాగద్వేషాదులు, విషయసంస్కారములు మున్నగునవి యన్నియుజేరి 'మాయ' యగును. కావున వివేకవైరాగ్యాదులచేతను, భగవద్భక్తి, భగవదాశ్రయములచేతను ఆ మాయ యను దొంగను హృదయకుహరమునుండి తొలగించివేయవలెను. అట్లు చేయనిచో ఈ శ్లోకమున దెలుపబడినట్లు మాయాప్రభావముచే మనుజుడు మూఢుడుగ, పాపిగ నరాధముడుగ, అజ్ఞానిగ, రాక్షసుడుగ పరిణమించు పరిస్థితి యేర్పడగలదు.

**ప్ర:–** భగవంతుని ఎవరు ఆశ్రయింపరు?

**ఉ:–** (1) పాపులు (2) మూఢులు (3) నరాధములు (4) మాయచే నపహరింపబడిన వివేకముగలవారు (5) అసురస్వభావము నాశ్రయించువారు (తత్ఫలితముగ వారు సంసారదుఃఖ సముద్రమున మునుగుచుందురు).

**ప్ర:–** మనుజుని జ్ఞానమును (వివేకమును) అపహరించివేయు దొంగ ఎవరు?

**ఉ:–** మాయ.

**అ॥** ఇక ఎట్టివారు భగవంతుని భజించెదరో తెలుపుచున్నాడు –

## 16. చతుర్విధా భజన్తే మాం జనాస్సుకృతినోఽర్జున
## ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ.

**టీక:–** భరతర్షభ = భరతవంశశ్రేష్ఠుడవగు, అర్జున = ఓ అర్జునా!, ఆర్తః = ఆపత్తునందున్నవాడు, జిజ్ఞాసుః = (భగవంతుని) తెలిసికొనగోరువాడు, అర్థార్థీ = ధనము (సంపత్తు) నభిలషించువాడు, జ్ఞానీ చ = (ఆత్మ) జ్ఞానముకలవాడును (అగు నీ), చతుర్విధాః = నాలుగు విధములైన, సుకృతినః = పుణ్యాత్ములగు, జనాః = జనులు, మామ్ = నన్ను, భజన్తే = సేవించుచున్నారు (భజించుచున్నారు).

**తా:–** భరతవంశశ్రేష్ఠుడగువగు ఓ అర్జునా! ఆపత్తునందున్నవాడు, (భగవంతుని) తెలిసికొనగోరువాడు, ధనము (సంపత్తు) నభిలషించువాడు, (ఆత్మ) జ్ఞానముకలవాడు, అను నీ నాలుగువిధములైన పుణ్యాత్ములగు జనులు నన్ను సేవించుచున్నారు (భజించుచున్నారు).

**వ్యాఖ్య:–** భగవంతుని సేవింపనివారి విషయమై ఇదివఱకు చెప్పబడినది. ఇక సేవించువారినిగూర్చి ఇచట చెప్పబడుచున్నది. (1) ఆర్తుడు (2) జిజ్ఞాసువు (3) ధనార్థి (4) జ్ఞాని – అను నాలుగు రకములవారు పరమాత్మ నాశ్రయించుదురని యిట పేర్కొనబడినది. వీరందఱును ఏదియో విధముగ భగవంతుని స్మరించుచున్నారు. కావున అందఱును పుణ్యాత్ములేయని చెప్పబడినది. అయితే ఏ హేతువుచే ప్రేరితులై వారు పరమాత్మను సేవించుచున్నారో దానియొక్క తారతమ్యముచేతనే వారిలో భేదమేర్పడినది.

అందు మొదటివాడగు ఆర్తుడు ఏదైన ఆపత్తు తటస్థించినపుడు భగవంతుని స్మరించును, ప్రార్థించును. ఏదైన రోగబాధ గలిగినపుడుగాని, చోర వ్యాఘ్రాదుల వలన కీడు సంభవించినపుడుగాని, ఏదైన

యితర కష్టము సంభవించినపుడుగాని సర్వేశ్వరుని చింతనజేయును. అట్టి యాపత్సమయమున 'ఏడుకొండలవాడు' గాని మఱియొక దేవుడుగాని అతని స్మృతిపథమునకు వచ్చును. ఈ తరగతికి జెందినవారు జనులలో చాలమంది కలరు. కష్టములలో దేవునకు మ్రొక్కుకొనువారు, ముడుపులు కట్టుకొనువారు మున్నగువారందఱు ఈ తరగితజెందినవారే. ఎట్లున్నను ఏదియో నెపమున భగవంతుని స్మరించుటబట్టి వారు పుణ్యాత్ములలోనే జమకట్టబడిరి.

ఇక రెండవవాడు జిజ్ఞాసువు. భగవత్తత్త్వ మెట్టిదో తెలిసికొనదలంచువాడు. ప్రపంచములో జనులు కోట్లకొలది యున్నప్పటికిని ఇట్టి దైవజిజ్ఞాసకలవారు చాల అరుదుగ నుందురు. కంటికి కనుపించు దృశ్యపదార్థములనుగూర్చి జిజ్ఞాసయే యెక్కువ మంది కలిగియుందురు. మఱియు వానిగూర్చిన అన్వేషణ (Research), విచారణ, సంపాదనలందే కాలము గడుపుచుందురు. దేవునిగూర్చి వారు పట్టించుకొనరు. అసలు దేవుడొకడు ఉన్నాడనియే వారిలో కొందఱు నమ్మరు. కావున దైవజిజ్ఞాస కలవారు గొప్పవారే, పుణ్యాత్ములే యగుదురు. వారు అధ్యాత్మక్షేత్రమున అడుగుపెట్టిరి. ఇక క్రమక్రమముగ వారు సాధనచే పైకి పోవుదురు. 'జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే' – అని గీతాచార్యులు దైవజిజ్ఞాసకలవాడు శబ్దబ్రహ్మమును అనగా శాస్త్రోక్త కర్మానుష్ఠానఫలము నతిక్రమించిపోవుచున్నాడని యిదివఱలోనే చెప్పియుండిరి. అట్టి జిజ్ఞాస బహుజన్మసుకృతము వలననే జీవునియం దుదయించుచున్నది.

మూడవవాడు 'అర్థార్థి' అనగా ధనము కొఱకు, సంపదలకొఱకు, ఐశ్వర్యము కొఱకు మాత్రము భగవంతుని భజించువాడు. అతని ఉద్దేశ్యము దేవునియనుగ్రహముచే తనకు ప్రాపంచికసంపద లభివృద్ధినొందవలెననియే. ఈతడున్ను ఏదియో కారణముచే భగవానుని స్మరించుచున్నాడు కనుక పుణ్యాత్ముడేయని చెప్పబడినది.

ఇక నాల్గవవాడు జ్ఞాని. భగవత్తత్త్వము లెస్సగ తెలిసినవాడు. అనుభూతమొనర్చుకొనినవాడు. ఆత్మానాత్మవివేకము గలవాడు. స్వస్వరూపానుభవమునొందిన మహనీయుడు. అతడు నిరంతరము సత్యవస్తువగు ఆత్మయందే స్థితిగలిగి, ఆత్మనే స్మరించుచు, ధ్యానించుచుండును. ఆర్తునివలె, అర్థార్థివలె ఒకానొక కోరికతో నతడు భగవంతుని స్మరించువాడుకాడు. అతడు ఏవిధమైన కామ్యబుద్ధియులేక యుండును. కనుకనే తక్కిన వారందఱికంటెను ఈతడే ఉత్తముడని రాబోవు శ్లోకములో భగవానుడు తెలియజేయుదురు. ఈ ప్రకారముగ నలుగురును పరమాత్మను ఏదియో విధముగ భజించుటబట్టి అందఱును పుణ్యాత్ములేయని యిట తెలుపబడినది. ఆర్తభక్తులలో గజేంద్రుడు మున్నగువారిని, జిజ్ఞాసుభక్తులలో పరీక్షిత్తు, ఉద్ధవుడు మున్నగువారిని, అర్థార్థభక్తులలో సుగ్రీవ ధ్రువాదులను, జ్ఞాని భక్తులలో శుక, సనక, నారద, భీష్మ ప్రహ్లాదాదులను పేర్కొనవచ్చును.

**ప్ర:–** భగవంతుని సేవించువా రెన్నిరకములు? వారెవరు?

**ఉ:–** నాలుగు రకములు. వారు క్రమముగ (1) ఆర్తుడు (2) జిజ్ఞాసువు (3) అర్థార్థి (4) జ్ఞాని.

**అ॥** ఈ నలుగురిలో జ్ఞాని శ్రేష్ఠుడని వచించుచున్నాడు –

**17. తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే**
**ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమ ప్రియః**

**టీక:–** తేషామ్ = వారి (ఆ నలుగురి)లో, నిత్యయుక్తః = ఎల్లప్పుడును పరమాత్మతో గూడియుండువాడును, ఏకభక్తిః = ఒక్క పరమాత్మయందే భక్తిగలవాడును (అగు), జ్ఞానీ = (ఆత్మ) జ్ఞాని, విశిష్యతే = శ్రేష్ఠుడగుచున్నాడు, జ్ఞానినః = (ఆత్మ) జ్ఞానికి, అహమ్ = నేను, అత్యర్థమ్ = మిక్కిలి, ప్రియః హి = ఇష్టుడనుగదా!, సః చ = అతడును, మమ = నాకు, ప్రియః = (మిక్కిలి) ఇష్టుడే.

**తా:–** వారి (ఆ నలుగురి)లో నిత్యము పరమాత్మతో గూడియుండువాడును, ఒక్కపరమాత్మయందే భక్తిగలవాడునగు జ్ఞాని శ్రేష్ఠుడగుచున్నాడు. అట్టి జ్ఞానికి నేను మిక్కిలి ఇష్టమైనవాడను; అతడున్ను నాకు మిగుల ఇష్టుడే.

**వ్యాఖ్య:–** క్రిందటి శ్లోకములో చెప్పబడిన నలుగురు భక్తులలో ఎవడు శ్రేష్ఠుడో ఇచట వివరించుచున్నారు. వారందరిలో జ్ఞానియే ఉత్తముడని చెప్పబడినది. ఏలయనిన, అతనిలో తక్కిన ముగ్గురికిలేని రెండు విశిష్టగుణములు కలవు – అవియే (1) నిత్యయుక్తత్వము (2) ఏకభక్తి.

(1) నిత్యయుక్తత్వమనగా నిరంతరము పరమాత్మతో (దైవముతో) సంబంధము గల్గియుండుట, అనగా జ్ఞాని నిరంతరము ఆత్మధ్యానపరుడై ఆత్మయందు స్థితిగలిగి యుండునని భావము. తక్కినవారగు ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి అపుడపుడు దైవమును స్మరించుదురు. వారు అనిత్యయుక్తులు (Part-timed devotees). వారు కొంతకాలము దైవచింతనజేసి తదుపరి ప్రపంచకార్యములందు ప్రవేశించి దైవమును మఱచుదురు. జ్ఞానియే సర్వకాలసర్వావస్థలయందును భగవంతునితో (ఆత్మతో) గూడి యుండును. అదియే నిత్యయుక్తత్వము. నిరంతరము వెలుగు (జ్ఞానము) నందుండుటచే అట్టివారి దరికి చీకటి (అజ్ఞానము) రానేరదు. కాబట్టియే వారు మాయామోహమును జయించి సర్వోత్కృష్టులై చెన్నొందుచున్నారు. తక్కినవారు 'నిత్యయుక్తులు' కానందుచే కొంతకాలము భగవంతుని విస్మరించుటవలన వారియందు అవిద్యచేరుటకు అవకాశమున్నది. సాధకులగువారు ప్రారంభమున కొంతకాలము భగవద్ధ్యానముచేసికొని తదుపరి కొంతకాలము ఇతరపనులకు వినియోగించినప్పటికిని, క్రమక్రమముగ ఆ ధ్యానకాలమును, దైవనిష్ఠాసమయమును పెంచుకొనుచుపోయి తుదకు నిరంతర దైవనిష్ఠత్వరూపలక్ష్యమును చేరుకొనవలెను. అపుడే యాతడు దైవభక్తులందఱిలోను అగ్రగణ్యుడై యలరారును. అట్టివాడే 'నిత్యయుక్తుడ'గు జ్ఞాని. అట్టి జ్ఞానికే తక్కిన భక్తులందఱిలోను భగవానుడు ప్రథమస్థానము (First mark) నొసంగెను.

ఇక జ్ఞానియొక్క రెండవలక్షణము 'ఏకభక్తి' అనగా జ్ఞానికి రెండుమూడుభక్తులు ఉండవనియు ఒకేభక్తియనియు అర్థము. అతనిది పంచభక్తి, నవభక్తి, శతభక్తి, కాదు. ఏకభక్తి. అనగా ఒక్క పరమాత్మయందు తప్ప మఱిదేనియందును భక్తిలేనివాడు. ప్రపంచములోని జనులలో కొందఱికి ధనమందు భక్తి, కొందఱికి కీర్తియందు భక్తి, కొందఱికి భార్యయందు భక్తి, కొందఱికి అధికారమందు భక్తి, మఱికొందఱికి విషయభోగములందు భక్తి యుండును. కాని జ్ఞానికో ఒక్క భగవంతునియందు (ఆత్మయందు) తప్ప తక్కిన దేనియందును భక్తియుండనేరదు. తక్కినవారికి అనేక విషయములందు ప్రీతియుండుటవలన, ఏకభక్తి లేనందువలన మనస్సు చంచలముగానున్నదై ఒకేవస్తువునందు ఏకాగ్రత, నిష్ఠ లేనిదైయుండును. ధ్యాననిష్ఠయం దీచంచలత పనికిరాదు. ఒకే దైవవస్తువునందు, ఆత్మయందు దృష్టి ఏకాగ్రముగ నిలువవలెను. భగవద్వ్యతిరిక్తములగు వస్తువులపై దృష్టి చెదిరిపోరాదు. ఇదియే ఏకభక్తి. ఇట్టిది జ్ఞానికి కలదు. కనుకనే యాతడు భక్తులందఱిలోను భగవద్దృష్టియందు సర్వోపరిస్థానము నలంకరించుటకు కారణము.

'అత్యర్థమ్' (మిక్కిలి) అని చెప్పినందువలన అట్టి జ్ఞానికి భగవంతునియందు అమితప్రీతియుండునని తెలియుచున్నది. జ్ఞానిదృష్టియందు దృశ్యవస్తువులన్నియు నశించి పోవునవే గావున వానియందాతడు ప్రీతిగొనడు; శాశ్వత పరమాత్మయందే మిక్కిలి ప్రీతినుంచును. ఈ ప్రకారముగ భక్తుడెపుడు భగవంతుని ప్రేమించునో, భగవంతుడును భక్తుని ప్రేమించుచున్నాడు. 'సచమమ ప్రియః' (ఆతడు నాకు మిక్కిలి ప్రియుడు) అను వాక్య మీయర్థమునే సూచించుచున్నది. ప్రాపంచిక జనులయొక్క ప్రియమును సంపాదించుట మంచిదైనను దైవముయొక్క ప్రియమును సంపాదించుట ఇంకను మంచిది. అది జీవునియొక్క అహోభాగ్యమే అయియున్నది. అట్టి స్థితియే చేకూరినచో నికజన్మ సార్థకమగును. ఇతరులు మెచ్చినచో ఏ కొద్దియో లభించును. భగవంతుడు మెచ్చిన సాక్షాత్ మోక్షము లభించును.

ఈ శ్లోకమున జ్ఞానికి 'ఏకభక్తి' యుండునని చెప్పుటవలన వాస్తవముగ భక్తికిని జ్ఞానమునకును భేదములేదని తేటతెల్లమగుచున్నది. జ్ఞానికి భక్తియుండును, భక్తునకు జ్ఞానముండును. ఒకటి యెక్కువ, ఒకటి తక్కువ అను భావమే లేదు. అనుభవములో చూచుకొనినచో ఈసత్యము లన్నియు చక్కగా తెలియగలవు. పరాకాష్ఠయందు భక్తి, జ్ఞానము, ధ్యానము అన్నియు ఒకటిగనే యుండును.

ప్ర:– పైనదెల్పిన నలుగురు భక్తులలో ఎవడు శ్రేష్ఠుడు?

ఉ:– జ్ఞాని.

ప్ర:– ఎందువలన?

ఉ:– అతనికి (జ్ఞానికి) (1) నిత్యయుక్తత్వము (నిరంతరదైవసంబంధము) (2) ఏకభక్తి – అను రెండు విశిష్టగుణములు కలవు. అవి తక్కినవారికి లేవు. కావున అతడు శ్రేష్ఠుడు.

ప్ర:– జ్ఞానికి ఈ ప్రపంచమున అందఱికంటెను మిక్కిలి ప్రియుడెవడు?

ఉ:– భగవంతుడు.

ప్ర:– భగవంతునకు అందఱికంటె మిక్కిలి ప్రియుడెవడు?

ఉ:– జ్ఞాని,

ప్ర:– కావున, జనులయొక్క కర్తవ్యమేమి?

ఉ:– 'ఏకభక్తి' రూపమగు జ్ఞానమును సముపార్జించుటద్వారా భగవంతునకు అతిప్రియుడగుటకై యత్నింపవలెను.

అ॥ అయితే తక్కిన భక్తులమాటేమిటియనిన, వచించుచున్నాడు –

**18. ఉదారాః సర్వ ఏవైతే జ్ఞానీత్వాత్మైవ మే మతమ్**
**ఆస్థితః స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్.**

**టీక:–** ఏతే సర్వే = వీరందఱున్ను (పైన దెలిపిన నలుగురు భక్తులు), ఉదారాః ఏవ = మంచివారే, జ్ఞానీతు = జ్ఞానియన్ననో, ఆత్మ ఏవ = నేనే (ఇతి = అని) మే = నాయొక్క, మతమ్ = అభిప్రాయము, హి

= ఏలయనగా, సః = అతడు, యుక్తాత్మా (సన్) = నాయందే మనస్సును స్థిరముగ నిలిపినవాడై, మాం ఏవ = నన్నే, అనుత్తమామ్ = సర్వోత్తమమైన, గతిమ్ = ప్రాప్యస్థానముగ, ఆస్థితః = (నిశ్చయించి) ఆశ్రయించుకొనియున్నాడు.

**తా:-** వీరందఱున్ను (పైనదెలిపిన నలుగురు భక్తులు) మంచివారే. కాని అందు జ్ఞానియో సాక్షాత్ నేనేయని నాఅభిప్రాయము. ఏలయనగా అతడు నాయందే చిత్తమును స్థిరముగ నెలకొల్పి నన్నే సర్వోత్తమమైన ప్రాప్యస్థానముగ నిశ్చయించి ఆశ్రయించు కొనియున్నాడు.

**వ్యాఖ్య:-** పైనదెలిపిన నలుగురు భక్తులలోను జ్ఞాని శ్రేష్ఠుడని చెప్పినంత మాత్రముచే తక్కినవారు తీసివేయదగినవారని అర్థముకాదు. వారున్ను మంచివారే. భక్తిలేని సామాన్యులకంటె వారెంతయో ఉత్తములు. ఎందుకనగా వారు శ్రద్ధతో ఏదియోవిధముగ దైవమును ఆరాధించుచునేయున్నారు. కాబట్టి వారందఱిని 'ఉదారులు' (మంచివారే) అని భగవానుడిచట పేర్కొనియున్నారు. అయితే వారందఱిలోను జ్ఞానియొక్క అంతస్తు పెద్దది. అందులకు కారణము నిరంతర భగవచ్చింతనచే అతడు సాక్షాత్ భగవత్స్వరూపుడే యగుచున్నాడు. 'బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి' - 'బ్రహ్మవేత్త సాక్షాత్ బ్రహ్మమేయగుచున్నాడు' అని శ్రుతియు వక్కాణించుచున్నది. సముద్రమునపడిన వడగండ్లు సముద్రరూపమే యగునట్లు, జ్ఞానియొక్క చిత్తము బ్రహ్మమునందు లయమై బ్రహ్మాకారముగనే పరిణమించుచున్నది. కనుకనే జ్ఞానికిని భగవంతునకును భేదములేదని యిట వచింపబడినది. 'మేమతమ్' - (ఇది నానిశ్చయము) - అని భగవానుడు చెప్పుటవలన ఈ వాక్యములయొక్క పరమసత్యత్వము వెల్లడియగుచున్నది.

తక్కిన ముగ్గురు భక్తులు ద్వైతప్రపంచమున తిరుగాడుచుందురు. జ్ఞాని అద్వైత వీధులలో విహరించుచుండును. భగవంతుడు తనకంటె వేఱుగనున్నాడని తలంచి ధ్యానించుట ప్రారంభస్థితిలో జరుగుచుండును. ఆరూఢస్థితిలో భగవానుడు తనకంటె వేఱుగనుండడు. ధ్యాత ధ్యేయమై యొప్పును. జీవుడు శివుడగును. ఇట్టిస్థితి నిరంతర ఆత్మచింతనచేతను, అహంభావనిర్మూలనముచేతను, వాసనాక్షయము వలనను గలుగ గలదు. కనుకనే 'యుక్తాత్మా' అని చెప్పబడినది. జ్ఞాని ఆత్మయందే తనచిత్తమును నిరంతరము సంలగ్న మొనర్చుచుండునని భావము.

ఆత్మపదవిని, దైవపదవిని 'అనుత్తమాం గతిమ్' - సర్వోత్తమమగు గతిగా, పదవిగా వర్ణించుటవలన ప్రపంచములోని సమస్త ఇతరపదవులు దానిముందు అల్పములనియే తేలుచున్నది. కావున సర్వులును ప్రయత్నపూర్వకముగ అట్టి సర్వోత్తమబ్రహ్మపదవి కొఱకే యత్నించి జీవితములను ధన్యము గావించుకొనవలయును.

గీతయం దీశ్లోకమున పూర్ణ అద్వైతస్థితి వర్ణింపబడినది. భక్తుడు సాక్షాత్ భగవంతుడుగా మారిపోవుట ఇచట తెలుపబడినది. జీవితపరమావధి అదియే. ద్వైతమునందు భగవంతుడు ఒకింతదూరములోనుండును. విశిష్టాద్వైతములో ఇంకను దగ్గఱకు వచ్చును. అద్వైతములో ఇంకను దగ్గఱకువచ్చి తానే భగవంతుడుగా మారిపోవును. కనుకనే జీవన్ముక్తులగు మహనీయులను సాక్షాత్ దైవముగ జనులారాధించుచుందురు. 'ద్విబాహురపరోహరిః' - రెండుచేతులతో విరాజిల్లు విష్ణువు - అను వాక్యము వారికే చెల్లును. వారికి భగవంతునకు ఏ మాత్రము ఎడముండదు. అట్టి అద్వయజ్ఞానస్థితి కలుగువఱకు ముముక్షువు నిరంతరము అధ్యాత్మసాధన సలుపుచునే యుండవలెను. ప్రతివారును అట్టి జ్ఞాన పరాకాష్ఠస్థితిని ఎప్పటికైనను

పొందవలసియే యుండును. కర్మ, భక్తి, ధ్యానాదులన్నియు తుట్టతుదకు ఈ జ్ఞానస్థితినే కలుగజేసి ముక్తికి హేతువులై పరగును. కనుకనే భగవానుడు జ్ఞానమునకు, జ్ఞానికి ఇట్టి ఆధిక్యత నొసంగుటకు కారణము.

**ప్ర:—** పైన దెల్పిన నలుగురు భక్తులు ఎట్టివారు?

**ఉ:—** అందరును చాల మంచివారే.

**ప్ర:—** అయితే అందు జ్ఞానికి ఎందుల కాధిక్యత నొసంగబడెను?

**ఉ:—** జ్ఞానికిని భగవంతునకును భేదముండదు. జ్ఞాని సాక్షాత్ భగవంతుడే యగుచున్నాడు. అందువలన (జ్ఞానీత్వాత్మైవ మేమతమ్).

**ప్ర:—** ఏ కారణముచే జ్ఞాని అట్టి భగవత్స్వరూపమును బడయును?

**ఉ:—** అతడు తన మనస్సును చక్కగ నిగ్రహించి ఆత్మయందు స్థాపించి (యుక్తాత్మా) ఆత్మనే పరమగతిగ నెంచి అందే స్థితుడై యుండును గావున.

**అ॥** అట్టి జ్ఞానులు లోకములో చాల అరుదని చెప్పుచున్నాడు -

## 19. బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే
## వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః.

**టీక:—** బహూనామ్ = అనేకములైన, జన్మనామ్ = జన్మములయొక్క, అన్తే = చివఱ, జ్ఞానవాన్ (సన్) = జ్ఞానవంతుడు (అయి), సర్వమ్ = సమస్తమున్ను, వాసుదేవః ఇతి = వాసుదేవుడే (భగవంతుడే) అని (తెలిసికొని), మామ్ = నన్ను, ప్రపద్యతే = పొందుచున్నాడు, సః మహాత్మా = అట్టి మహాత్ముడు, సుదుర్లభః = (లోకములో) మిక్కిలి అరుదు.

**తా:—** అనేకజన్మలయొక్క అంతమున మనుజుడు జ్ఞానవంతుడై సమస్తము వాసుదేవుడే (భగవంతుడే) యను సద్బుద్ధిగల్గి నన్ను పొందుచున్నాడు - అట్టి మహాత్ముడు లోకములో చాల అరుదు.

**వ్యాఖ్య:—** జీవుడు అనాదికాలమునుండి ఈ సంసారచక్రమున పరిభ్రమించుచున్నాడు. క్రిమికీటకాద్యనేకజన్మలెత్తి యెత్తి సుకృతవశమున మానవుడై జన్మించుచున్నాడు. అట్లు జన్మించిన ప్రతిమానవుడును ముక్తికొఱకై ప్రయత్నించుటలేదు. ఏ కొలదిమంది పుణ్యాత్ములో ప్రయత్నించుచున్నారు. అట్లు ప్రయత్నించువారిలోను ఏ ఒకానొకధీరుడో ఆత్మజ్ఞానమొంది తరించిపోవుచున్నాడు★. ఒక్కొక్క జన్మయందు జీవుడు కొంతకొంత అధికపుణ్యమును సంపాదించుకొనుచురాగా ఎట్టకేలకు ఏ ఒకానొక జన్మయందో తీవ్రతర ఆధ్యాత్మిక సాధనలచేతను, పరమేశ్వరుని అనుగ్రహముచేతను ఆతనికి జ్ఞానముదయించును. అపుడు సమస్తమును భగవన్మయముగ, ఆత్మమయముగ, 'వాసుదేవమయముగ' గాంచును. అట్లు సర్వాత్మదృష్టిగలవాడై జ్ఞాని భగవత్సాక్షాత్కారము నొందుచున్నాడు. ఎన్నియోజన్మల

★ (1) యతతా మపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః (7-3)
(2) అనేకజన్మ సంసిద్ధస్తతో యాతి పరాంగతిమ్ (6-45)

పుణ్యాధిక్యతచేతను, పురుషప్రయత్నబలముచేతను, సాధనాతిశయము చేతను జీవునకట్టి మహత్తరపదవి చేకూరును. జ్ఞానవంతుడగుభాగ్యము చేకూరును. కనుకనే జ్ఞానవంతులగు మహాత్ములు లోకములో చాల అరుదు (సుదుర్లభులు) అని భగవానుడు పేర్కొనిరి. 'దుర్లభః' అని చెప్పక 'సుదుర్లభః' అని చెప్పుటవలన అట్టివారు నూటికి కోటికి ఏ ఒకానొకడో ఉండునని భావము.

అయితే, ఇంకను అనేక జన్మలైనపిదపనే జ్ఞానవంతుడనగుదునని తలంచి సోమరితనము వహింపరాదు. ఇంతవరకు గడచిన జన్మలన్నియు ఆ అనంతకోటిజన్మలని భావించి ఈ జన్మయందే కడతేరుటకై, జ్ఞానమును బొందుటకై తీవ్రయత్న మాచరింపవలెను. అట్టి జ్ఞానమును బొందినది లేనిది తెలిసికొనుటకై భగవాను డీశ్లోకమున చక్కని పరీక్ష (Test) నొకదానిని ఏర్పఱచియున్నారు. 'అంతయు వాసుదేవమయముగ (భగవన్మయముగ - ఆత్మమయముగ) తనకు కానవచ్చుచున్నదా?' అని సాధకుడు తనలో పరీక్షించుకొనుచుండవలెను. ఆవిధముగ కానుపించనిచో నామరూపములే కానుపించు చుండినచో సాధన ఇంకను పరిపక్వము కాలేదని తలంచి ధ్యానవిచారణాద్యభ్యాసములను తీవ్రతరముగావించవలెను. జ్ఞానప్రాప్తికి గుఱుతు ఈ 'సర్వంఖల్విదంబ్రహ్మ' (అంతయు బ్రహ్మమే) అను సిద్ధాంతముయొక్క అనుభూతిని బడయుటయే యగును. ప్రారంభస్థితిలో మనుజుడు దేవుని ఏ గుడియందో, ఏ విగ్రహములోనో, ఏ తీర్థమందో చూచును. ఆరూఢస్థితియందు ఆ దేవునే సర్వత్ర వీక్షింపగల్గును. 'జగమంతా రామమయమ్' అనుస్థితి చేకూరును.

ఈ శ్లోకమున 'బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్' అని చెప్పినచోట జ్ఞాని అనేక జన్మలైనపిదప మోక్షమునొందునని అర్థముకాదు. అనేక జన్మలకు మనుజుడు జ్ఞానవంతుడై మోక్షమునొందుననియే అర్థము. ఏ క్షణమున జ్ఞానమును పొందునో ఆ క్షణముననే మోక్షము లభించగలదు.

అంతయు భగవన్మయముగగాంచు జ్ఞానవంతునకు గీతాచార్యుడు 'మహాత్మా' అను బిరుదు నొసంగెను. అట్టి బిరుదును సంపాదించుటకై సర్వులును యత్నించవలెను. పరిచ్ఛిన్న దృష్టిగలిగి 'సామాన్యాత్ముడు' గ నుండరాదు. విశాలదృష్టి నవలంబించి 'మహాత్ముడు' గ మారిపోవలెను. అపుడే జన్మము సార్థకముకాగలదు.

ప్ర:— జీవుడు మోక్షము నెపుడు పొందగలడు?

ఉ:— జ్ఞానవంతుడైనపుడు.

ప్ర:— జ్ఞాన మెపుడు పొందును?

ఉ:— అనేక జన్మలందలి శుభప్రయత్నముచే కట్టకడకు ఒకానొక జన్మయందు పొందును.

ప్ర:— జ్ఞాని యెట్టిభావము గల్గియుండును?

ఉ:— అంతయు వాసుదేవమయము (భగవన్మయము, ఆత్మమయము) అను భావము గల్గియుండును.

ప్ర:— లోకములో 'మహాత్ము' డనదగినవాడెవడు?

ఉ:— జ్ఞానియే.

ప్ర:- అట్టి జ్ఞానులు లోకములో విరివిగా నుందురా?

ఉ:- ఉండరు. ఏ ఒకానొకడో అట్లుండును. వారు మహాదుర్లభులు.

ప్ర:- ఒకడు జ్ఞాని అగునా కాదా యని పరీక్షించుటకు ఉపాయమేమి?

ఉ:- ఆతని దృష్టిలో అంతయు వాసుదేవమయముగ నున్నదా లేదా యని తెలిసికొనిన చాలును.

అ॥ కోరికలతో గూడి ఇతరదేవతల నారాధించువారినిగురించి చెప్పుచున్నాడు -

**20. కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యన్తేఽన్యదేవతాః**
**తం తం నియమమాస్థాయ ప్రకృత్యా నియతాస్స్వయా.**

**టీక:-** స్వయా = తమయొక్క, ప్రకృత్యా = ప్రకృతి (జన్మాంతర సంస్కారము) చేత, నియతాః = ప్రేరేపింపబడిన జనులు, తైఃతైఃకామైః = ఆయా (విషయములందలి) కోరికలచేత, హృతజ్ఞానాః = అపహరింపబడిన వివేకముగలవారై, తం తం నియమమ్ = ఆయా (దేవతారాధన సంబంధమగు) నియమమును, ఆస్థాయ = అవలంబించి, అన్యదేవతాః = ఇతర దేవతలను, ప్రపద్యన్తే = భజించుచున్నారు.

**తా:-** (కొందఱు) తమయొక్క ప్రకృతి (జన్మాంతర సంస్కారము) చే ప్రేరేపింపబడినవారై విషయాదులందలి కోరికలచే వివేకమును గోల్పోయి, దేవతారాధన సంబంధమైన ఆ యా నియమముల నవలంబించి ఇతర దేవతలను భజించుచున్నారు.

**వ్యాఖ్య:-** కొందఱు పరమాత్మనుగూర్చి ధ్యానింపక విషయసంబంధమైన కోరికలు నెరవేరుటకై ఇతరదేవతల నారాధించుచున్నారు. దానికి కారణము వారు తమ వివేకము గోల్పోవుటయేయని యిట తెలుపబడినది. అది యెట్లుపోయినది? కోరికలను దొంగలు వారిహృదయమున ప్రవేశించి వారిజ్ఞానమును (వివేకమును) హరించి వేసిరి (కామైః హృతజ్ఞానాః). తత్ఫలితముగ వారు ఆత్మయొక్క గాంభీర్యమునెఱుగజాలక, పరమాత్మనుసేవించుట విడిచిపెట్టి ఇతరదేవతల నారాధించుచున్నారు. తత్సంబంధములైన నియమములను, వ్రతములను ఆచరించుచు వారిని భజించుచున్నారు. వారి ఆరాధనలక్ష్యము కోరికలు నెరవేరుటయేకాని మోక్షముకాదు. కావున మోక్షము నభిలషించు తీవ్రవైరాగ్యయుతులగు సాధకు లవలంబించదగిన పద్ధతి యిదికాదు. కోరికలను అంతముచేసికొని, ఇంద్రియములను నిరోధించి హృదయస్థపరమాత్మను నిరంతరము ధ్యానించుటయే ముక్తికి మార్గము.

'కామైః హృతజ్ఞానాః' - అని చెప్పుటవలన విషయవాంఛలు విజ్ఞానమును హరించి వేయునని, నాశనమొనర్చునని స్పష్టమగుచున్నది. కావున భగవన్మార్గమున మహాప్రమాద జనకములగు వానిని విజ్ఞులు జేబట్టరాదు.

ఈ అధ్యాయమున 15వ శ్లోకమున చెప్పబడిన 'మాయయాఽపహృతజ్ఞానాః' - కోరికలచే అపహరింపబడిన జ్ఞానముగల మూఢులకును, ఈ శ్లోకమున చెప్పబడిన 'కామైఃహృతజ్ఞానాః' - కోరికలచే అపహరింపబడిన జ్ఞానముగలవారికిని చాల తారతమ్యముగలదు. మొదటివారు తమోగుణప్రేరితులు. వీరు సత్త్వగుణ రజోగుణ మిశ్రితమగు గుణము కలవారు. వీరికి దైవమందు విశ్వాసముకలదు. వారికిలేదు.

ప్ర:— జీవునియొక్క జ్ఞానమును హరించివేయునది ఏది?

ఉ:— కోరికలు, విషయాశలు.

ప్ర:— అవి యెట్లు కలుగుచున్నవి?

ఉ:— జన్మాంతర విషయసంస్కారములచే.

ప్ర:— తత్ఫలితముగ మనుజుడేమిచేయుచున్నాడు?

ఉ:— జ్ఞానమును పోగొట్టుకొని పరమాత్మను విడిచిపెట్టి ఇతరదేవతల నారాధించుచున్నాడు.

అ॥ ఆయా దేవతారాధకులకు కలుగు ఫలితమును రెండుశ్లోకములద్వారా చెప్పుచున్నాడు -

## 21. యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితుమిచ్ఛతి
## తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్.

**టీక:—** యః యః భక్తః = ఏ యే భక్తుడు, యాం యామ్ తనుమ్ = ఏ యే (దేవతా) రూపమును, శ్రద్ధయా = శ్రద్ధతో, అర్చితుమ్ = పూజించుటకు, ఇచ్ఛతి = కోరుచున్నాడో, తస్య తస్య = వానివానికి, శ్రద్ధాం= దానికి తగిన శ్రద్ధనే, అచలామ్ = స్థిరమైన దానినిగ, విదధామి = చేయుచున్నాను.

**తా:—** ఏ యే భక్తుడు ఏ యే (దేవతా) రూపమును శ్రద్ధతో పూజింపదలంచుచున్నాడో, దానిదానికి తగిన శ్రద్ధనే వానివానికి నేను స్థిరముగ గలుగజేయుచున్నాను.

**వ్యాఖ్య:—** మనుజుడు పరమాత్మనుగాక ఇతరదేవతలను ఆరాధించుచున్నంత మాత్రమున వారిపై వారు కినుక వహింపరు. పైపెచ్చు ఆ యా దేవతలందరియెడల ఆతని భక్తిని, శ్రద్ధను దృఢపఱచుదురు (అచలాంశ్రద్ధాంవిదధామి). ఆహా! పరమేశ్వరునియొక్క దయాళుత్వమెట్టిది. అయితే భక్తిశ్రద్ధలతో గూడియుండి భజించువారికి మాత్రమే సహాయము చేయుదురు. అవి లేనివారికిగాదు. కనుకనే 'శ్రద్ధయా' అను పదము చేర్చబడినది. అట్టి శ్రద్ధగలిగియున్నవారికి ఆ శ్రద్ధ నింకను తాను బలపరచెదనని శ్రీకృష్ణపరమాత్మ ఆనతిచ్చిరి.

హిందూమతములోగల విశిష్టతయే ఇది. ప్రతివాడున్ను వానివాని సంస్కారము ననుసరించి తగిన మార్గమును వెతకుకొనుటకు, తగిన దేవతను ఉపాసించుటకు సంపూర్ణమగు స్వేచ్ఛ దీనియందుగలదు. ఏమార్గముగుండా పోయినను, ఎవరిని ఆశ్రయించుకొని ముందుకేగినను తుట్టతుద కందఱున్ను గమ్యమగు ఆత్మనే చేరవలసియుండును. అట్టి పరమాత్మరూపలక్ష్యమును చేరుటకు వారివారికి తగిన మార్గమును, తగిన ఇష్టదేవతను వారు ఎన్నుకొనవచ్చును. అయితే భక్తిశ్రద్ధలతో పురోగమనము సాగించుచుండవలెను. గమ్యమునుగూర్చి మెల్లగా నడచినను, త్వరగా నడచినను నడక మాత్రము ఆపకూడదు. మఱియు లక్ష్యమువైపునకే నడవవలెనుగాని వెనుకకు నడవగూడదు. ఈ రెండు నియమములచే మనుజుడు ఎప్పటికైనను పరమలక్ష్యమగు ఆత్మదేవుని చేరుకొనగలడు. ఇతర దేవతల నుపాసించువారి భక్తిశ్రద్ధలను భగవాను డేల స్థిరపఱచుచున్నారనగా, వారట్టి దృఢతరశ్రద్ధచే ఎప్పటికైనను దేవదేవుడగు పరమాత్మను బొందగలరుకనుకనే. కాబట్టి వారికి తమతమ మార్గమును అనుసరించుటకు స్వేచ్ఛయు, భక్త్యాదుల

దృఢత్వమును భగవాను డొసంగుచున్నారు. దీనినిబట్టి ఎవడు ఆధ్యాత్మికోన్నతికై ఎంతటి ప్రయత్నము సలుపునో వాడంతటి ఫలితమునే పొందగలడని స్పష్టమగుచున్నది. ప్రయత్నమే చేయనివానికి ఏఫలితమున్ను లభించదు. జీవుడు తాను యత్నించనిదే భగవంతుడు మాత్రమేమి చేయగలరు? కాబట్టి ముముక్షువులెల్లరు తీవ్రతరయత్న మాచరించి గమ్యమును శీఘ్రముగ చేరవలయును.

**ప్ర:—** భగవంతునిగాని, ఇతర దేవతలనుగాని ఉపాసించునపుడు ముఖ్యముగ ఉండవలసిన గుణము లేవి?

**ఉ:—** భక్తి, శ్రద్ధ

**ప్ర:—** అట్లు భక్తిశ్రద్ధలతో ఆ యా దేవతల నుపాసించువారికి భగవాను డెట్టి సహాయము చేయును?

**ఉ:—** వారికి ఆయాదేవతలయందుగల శ్రద్ధాభక్తులను స్థిరపఱచును.

**అ||** ఆ యితర దేవతలద్వారా భగవానుడే వారికి తగినఫలితముల నొసంగుదురని తెలుపబడుచున్నది.

**22. స తయా శ్రద్ధయా యుక్తస్తస్యారాధన మీహతే**
**లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హి తాన్.**

**టీక:—** సః = అతడు (పైన తెలుపుబడిన కామ్యభక్తుడు) తయా శ్రద్ధయా = అట్టి శ్రద్ధతో, యుక్తః = కూడుకొనినవాడై, తస్య = ఆదేవతయొక్క, ఆరాధనమ్ = పూజను, ఈహతే = చేయుచున్నాడు, మయాఏవ = నాచేతనే, విహితాన్ = విధింపబడిన, తాన్ కామాన్హి = ఆయాకోరికలనే (కోరినవస్తువులనే), తతః = ఆ దేవతలవలన, లభతే = పొందుచున్నాడు.

**తా:—** అతడు (పైన తెలుపబడిన కామ్యభక్తుడు) అట్టి శ్రద్ధతో గూడుకొనినవాడై ఆ యా దేవతలయొక్క ఆరాధనను గావించుచున్నాడు. మఱియు నాచే విధింపబడిన ఆ యా యిష్టఫలములను ఆ యా దేవతలద్వారా పొందుచున్నాడు.

**వ్యాఖ్య:—** ఆ ప్రకారముగ భగవంతునిచే స్థిరపఱచబడినట్టి శ్రద్ధతో గూడుకొనిన వాడై ఆ భక్తుడు ఆ యా దేవతల నారాధించుచు తత్ఫలితముగ వారినుండి తన యిష్టఫలములను బొందుచున్నాడు. అట్లా దేవతలనుండి యాతడు తన యభీష్టఫలములను బడసినప్పటికిని, అయ్యవి భగవంతునిచే నిర్దేశింపబడినవే యగును. కాబట్టి వాస్తవముగ భగవంతునినుండియే యాతనికి లభించినవగును. ఈ చరాచర ప్రపంచమంతయు ఒక ప్రభుత్వయంత్రాంగము (Universal Government). పరమాత్మ దాని యధిపతి. ఇంద్రాది దేవతలందఱు భిన్నభిన్న శాఖలను నిర్వహించు ఉద్యోగులు. జగత్పరిపాలనానియమములన్నింటిని, శాసనములన్నింటిని జగత్ప్రభువగు పరాత్పరుడే తొలుదొల్త నిర్ణయించివైచెను. వానిననుసరించియే ఆ యా క్రింది శాఖాధిపతులు కార్యముల నమలుజరుపవలసి యుండును. కాబట్టి భక్తులు వారివారి వాంఛితములను ఆ యా దేవతలద్వారా పొందినను దేవుదేవుడగు సర్వేశ్వరుడే దాని నిచ్చినట్లగును

(ప్రభుత్వమున క్రింది ఉద్యోగిద్వారా జరుపబడినది వాస్తవముగ ప్రభుత్వాధినేతయొక్క శాసనమే కావున అతడే జరిపినట్లు).

భగవంతుడు కల్పవృక్షమువంటివారు. వారి నాశ్రయించి శ్రద్ధతో ఎవరేది కోరిన దానిని వారి కొసంగుదురు. కాబట్టి అల్పములగు ప్రాపంచిక దృశ్యపదార్థములను వారిని కోరుటకంటె శాశ్వతమగు మోక్షమునే కోరుట శ్రేయస్కరము.

ఈ శ్లోకము చివరగల 'హి, తాన్' అను రెండు పదములను కలిపి కొందఱు 'హితాన్' అని అన్వయించి 'హితాన్, కామాన్' - ఇష్టములైన భోగ్యవస్తువులు అని అర్థము చెప్పిరి. కాని అయిష్టములైన భోగ్యవస్తువులను ఎవరును కోరరు గనుక ఆ విశేషణము దానికి తగిలించుట అనవసరమని తోచుచున్నది.

**ప్ర:-** ఆ యా దేవతలపై శ్రద్ధ ఇనుమడించినపుడు భక్తుడేమిచేయును?

**ఉ:-** వారిని ఇతోధికశ్రద్ధతో నారాధించును.

**ప్ర:-** తత్ఫలితముగ నాతడేమిపొందును?

**ఉ:-** తన యభీష్టఫలములను వారివలన పొందును.

**ప్ర:-** ఆ ఫలములను ఎవరు నిర్ణయించిరి?..

**ఉ:-** దేవదేవుడగు పరమాత్మయే. కావున ఆతడే ఆ యా దేవతలద్వారా వారివారివాంఛితముల నొసంగినట్లగును.

**అ॥** అయితే ఆ యా దేవతల నారాధించుటవలన లభించునవి నశ్వరఫలితములే యనియు, తన్నారాధించుటచే శాశ్వతమోక్షము లభించుననియు భగవానుడు వచించుచున్నాడు -

## 23. అన్తవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసామ్
## దేవాన్ దేవయజో యాన్తి మద్భక్తా యాన్తి మామపి.

**టీక:-** అల్పమేధసామ్ = అల్పబుద్ధికలిగిన, తేషామ్ = వారియొక్క, తత్ ఫలమ్ తు = ఆ ఫలమన్ననో, అన్తవత్ = అంతముగలదిగా (అశాశ్వతముగా), భవతి = అగుచున్నది, దేవయజః = దేవతలను పూజించువారు, దేవాన్ = దేవతలను, యాన్తి = పొందుచున్నారు, మద్భక్తాః = నాభక్తులు, మామ్ అపి యాన్తి = నన్నేపొందుచున్నారు.

**తా:-** అల్పబుద్ధి కలిగిన వారియొక్క ఆ ఫలము నాశవంతమైయున్నది. (ఏలననగా) దేవతలను పూజించువారు **దేవతలనే** పొందుచున్నారు. నాభక్తులు (నన్ను పూజించువారు) నన్నే పొందుచున్నారు...

**వ్యాఖ్య:-** పరమాత్మను వదలి ఇతరదేవతల నారాధించువారెట్టివారో వారెట్టి ఫలితమును బొందగలరో, భగవద్భక్తు లెట్టి ఫలితములను బొందగలరో ఈశ్లోకమున వివరింపబడినది. సాక్షాత్ దేవదేవుడగు పరమాత్మను వదలి ఇతర దేవతల నాశ్రయించువారు, భజించువారు అల్పఫలములనే పొందుదురు. కావున

అట్టి నశ్వరఫలితములకై అఱ్ఱులు చాచువారు అల్పబుద్ధి (Small brain) కలవారని ఇట పేర్కొనబడినది. ఏలయనిన, పూర్ణబుద్ధికలవారైనచో శాశ్వతఫలమొసంగునట్టి, జన్మరాహిత్యమును కలుగజేయునట్టి పరమాత్మనే ఆశ్రయించెడివారుగదా! అల్పాధికారములు, అల్పజీవితములు గలిగిన దేవతలను నమ్ముకొని శాశ్వతపరమాత్మను విస్మరించువారు అల్పబుద్ధులేకదా! వారు పొందెడు ఫలమున్ను అల్పముగనేయుండును (అన్తవత్). గంగానదిని వదలి ప్రక్కనేఉన్న చిన్నవాగిని ఆశ్రయించువాడెట్టివాడో, కల్పవృక్షమును వదలి ప్రక్కనేగల చిన్నచెట్టును జేరువాడెట్టివాడో, పరమాత్మనువదలి అల్పఫలప్రదాతలగు దేవతల నాశ్రయించువారలును అట్టివారేయగుదురు. కనుకనే వారిచ్చు స్వల్పఫలములను, భోగ్యపదార్థములను బడసి ఆనందించుచున్నారు.

ప్రపంచమున ఏవస్తువుకాని, ఏ వ్యక్తిగాని, ఆతడింద్రుడైనను సరియే, చంద్రుడైనను సరియే దృశ్యవర్గములోనే చేరియుండును. గావున కాలక్రమమున నశించిపోవును. దృగ్వస్తువగు ఆత్మయొకటియే ఈ ప్రపంచమున ఏకైక అవినాశివస్తువు. కనుక విజ్ఞులద్దానికొఱకే అన్వేషించుదురు. అద్దానినే ఆశ్రయించుదురు. అల్పబుద్ధికలవారే ప్రాపంచికసుఖముల నొసంగు నశ్వర దేవతాసమూహమును ఆశ్రయించుదురు. 'దేవతల నారాధించువారు దేవతలను, నన్నారాధించువారు నన్ను పొందుదురు' అని భగవాను డిచట తెలియజేసిరి. కాబట్టి నిరతిశయ సుఖప్రదాతయగు పరమాత్మయొక్క భక్తుడగుట ఉత్తమమో, అల్పసుఖమొసంగగల ఆ యా దేవతలయొక్క భక్తులగుట ఉత్తమమో వివేకముకలవారు యోచించవలెను. అట్లు యోచించి తమ యావచ్ఛక్తిని, అమూల్యమగు మానవజీవితమును పునరావృత్తిరహిత శాశ్వత మోక్షసుఖము నొసంగు పరమాత్మయొక్క సాక్షాత్కారమందే వినియోగించి ధన్యులుకావలెను. ఎవరు దేనిని ఆరాధించిన, వారు దానినేపొందుదురు. రాక్షసులను ఆరాధించిన రాక్షసులనే పొందుదురు. దేవతల నారాధించిన దేవతలనే పొందుదురు. పరమాత్మ నారాధించిన పరమాత్మనే పొందుదురు. బంధముగాని, స్వర్గముగాని మోక్షముగాని వారివారి చేతులలోనున్నది. కావున కొంతతెలివి నుపయోగించి, దూరముగ ఆలోచించి తాను యత్నించునది ఎట్టి ఫలితమైయున్నది? అది సంసారబంధమును రహితమొనర్పగలదా? లేక దానిని ఇంకను దృఢపఱచునా? అని బాగుగ యోచించియే సాధకుడు కార్యమునకు దిగవలెను. కావున మహాత్ములగు సద్గురువుల వలనను, ఇట్టి గీతాది సద్గ్రంథములవలనను ప్రపంచములోని సర్వోత్తమ లక్ష్యమేదియో చక్కగా నెఱిగి అట్టి సర్వేశ్వరునియొక్క (పరమాత్మయొక్క) పాదారవిందములనే అనన్యముగ ఆశ్రయించి తరించవలెను.

**ప్ర:-** దేవతల నారాధించువారు పొందు ఫలమెట్టిది?

**ఉ:-** నాశవంతమైనది (అంతము కలది).

**ప్ర:-** అట్టి నాశవంతమగు ఫలమునకై ప్రయత్నించు వారెట్టివారు?

**ఉ:-** అల్పబుద్ధిగలవారు (అల్పమేధసామ్).

**ప్ర:-** దేవతారాధకులు దేనిని పొందుదురు? పరమాత్మను అర్చించువారు దేనిని పొందుదురు?

**ఉ:-** దేవతారాధకులు ఆయాదేవతలను, భగవదారాధకులు భగవంతుని (ఆత్మసాక్షాత్కార రూపమోక్షమును) పొందుదురు.

**ప్ర:-** కాబట్టి విజ్ఞుడగువాడేమి చేయవలెను?

**ఉ:–** శాశ్వత మోక్షపదవి నొసంగు పరమాత్మనే ఆశ్రయించవలెను.

**అ॥** అయినను జనులలో కొందఱు తన్నెందుకాశ్రయించుటలేదో తెలుపుచున్నాడు -

## 24. అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యన్తే మామబుద్ధయః
## పరం భావమజానన్తో మమావ్యయమనుత్తమమ్.

**టీక:–** అవ్యయమ్ = నాశరహితమైనట్టియు, అనుత్తమమ్ = సర్వోత్తమమైనట్టియు, పరమ్ = ప్రకృతిపరమై (విలక్షణమై) నట్టియు, మమ = నాయొక్క భావమ్ = స్వరూపమును, అజానన్తః = తెలియని, అబుద్ధయః = అవివేకులు, అవ్యక్తమ్ = నేత్రాదీంద్రియములకు గోచరము కాని (ప్రపంచాతీతుడనగు), మామ్ = నన్ను, వ్యక్తిం ఆపన్నమ్ = పాంచభౌతికదేహమును పొందినవానినిగా, మన్యన్తే = తలంచుచున్నారు.

**వ్యాఖ్య:–** భగవంతుడు వాస్తవముగ నిరాకారుడు, సర్వవ్యాపి, ప్రపంచాతీతుడు, ప్రకృతికి విలక్షణమైనవాడు, అనంతుడు, నాశరహితుడు. లోకకల్యాణార్థమై వారు అపుడపుడు దేహమునుధరించి దుష్టశిక్షణ, శిష్టరక్షణ, ధర్మసముద్ధరణాది కార్యముల నొనర్చుటకై లోకమున అవతరించుచుందురు. మాయను స్వాధీనపఱచుకొనినవారు కనుక వారు తన యిష్టప్రకారము దేహమును గ్రహించుటకు, త్యజించుటకు శక్తిగలిగియుందురు.

ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా (4-6) అని వారే ఒకసమయమున వచించియుండిరి. కావున ఆప్రకార మవతరించినపుడు అనగా వ్యష్టిత్వమును (దేహమును) స్వీకరించినపుడు వారి సమష్టిత్వమున కేమాత్రము భంగములేదు. వ్యష్టిరూపము వారు తాత్కాలికముగా కల్పించుకొనినదే యగును. నామరూపాత్మకమైన యా దేహము వారి పరిపూర్ణరూపముకాదు. భక్తుల ననుగ్రహించుటకొఱకు తాత్కాలికముగ గ్రహించినదే యగును.

అయినను వివేకములేనివారు, మందబుద్ధులు ఆ చిన్నదేహమే భగవంతుని యథార్థ రూపమనియు, భగవంతుడు మనుష్యమాత్రుడే యనియు తలంచుచున్నారు. దేవకీవసుదేవులకు బుట్టిన ఈ కానుపించు మానవశరీరమే భగవంతుడనియు, అంతకు మించి మఱియొకరూపము వారికిలేదనియు వారి యభిప్రాయము. ప్రారంభములో భక్తిశ్రద్ధలు కలుగుటకు భగవానుని సాకారరూపమును గ్రహించినను, అంతమాత్రముతో తృప్తినొందక ఆతని నిరాకారరూపమునుగూడ క్రమముగ తెలిసికొనవలసియుండును. పరమాత్మకు పరాపరా రూపములు రెండునుకలవు. భక్తుల ననుగ్రహించుటకొఱకై గైకొను రామకృష్ణాద్యవతారములు అపరారూపము. అవ్యక్త, అనంత, సద్ఘన, చిద్ఘన స్వరూపము పరారూపము. కనుకనే 'పరంభావమ్' అని దానినిగూర్చి చెప్పిరి. అదియే భగవానుని వాస్తవస్వరూపము. దానిని విశ్వసింపక, పాంచభౌతిక దేహము మాత్రమే భగవంతుడని తలంచువారు అవివేకులు, అల్పబుద్ధులు (అబుద్ధయః) అని పేర్కొనబడినది. ఏలయనగా వారు దృశ్యమునకు పరమై, అవ్యయమైన అపరిచ్ఛిన్నస్వరూపమును ఎఱుగక, పరిచ్ఛిన్నమైన స్వరూపముమాత్రమే భగవంతుడని చెప్పుచున్నారు. అది చాల పొరబాటు, కనుకనే వారు మందబుద్ధులని తెలుపబడిరి.

భగవంతుని కిచట నాలుగు విశేషణములు చెప్పబడినవి. (1) అవ్యక్తత్వము (2) ప్రపంచాతీతత్వము (3) అవ్యయత్వము (4) సర్వోత్తమత్వము. పరమాత్మ వాస్తవముగ అవ్యక్తుడు. అనగా స్థూలనేత్రమునకు

కానరాడు. ఏలయనిన, వ్యక్తమగు ప్రతివస్తువు ఏదియోయొక సమయమున నశించిపోవును. పరమాత్మయు వ్యక్తరూపముమాత్రము కలిగియున్నాడని తలంచుచో వారును నశించిపోవువారనియే భావించవలసివచ్చును. అట్లుకాదు; వారు అవినాశి. కావున భౌతికనేత్రమునకు కానుపించు స్థూలవిగ్రహముమాత్రమే, లేక ఉపాధిమాత్రమే దేవుడని తలంచితే అది కేవలము భ్రమమాత్రమేయగునని ఇచట స్పష్టీకరించబడినది. మఱియు భగవంతుడు అతిసూక్ష్మమైనవాడు. స్థూలమగు ఆకాశమే కంటికి కనబడకయుండ ఇక మనస్సు కంటెను అతిసూక్ష్మమైన చిదాకాశరూపపరమాత్మ కంటికి ఎట్లు కానవచ్చును? కనుకనే అవ్యక్తరూపుడని చెప్పబడినది. (అయినను జనులకు శుద్ధబుద్ధిచే వారివారి హృదయమున ఆత్మరూపమున సాక్షాత్కరింపబడుచునే యున్నాడు). మఱియు దృశ్యమునకు పరుడై దృక్స్వరూపుడై యుండుటవలన ప్రపంచాతీతుడని చెప్పబడెను. నాశము లేనందువలన అవ్యయుడని పేర్కొనబడెను. దేశకాలములకు అతీతుడై, దృశ్యదోషరహితుడై, నాశరహితుడై యుండుట వలన సర్వోత్తముడని తెలుపబడెను.

ఈశ్లోకముద్వారా - సగుణారాధకులు, సాకారోపాసకులు, విగ్రహారాధనపరులు, భగవంతుని ఒక వ్యక్తిమాత్రముగ దలంచి సేవించువారు, క్రమముగ ఏకాగ్రత, భక్తి బాగుగ కుదిరినపిదప క్రమముగ తమ భక్తిని, దృష్టిని విశాలపఱచి, పైమెట్టు ఎక్కి, భగవంతుడు విగ్రహమునందు మాత్రమేకాక సమస్త చరాచరములందును, భూతభవిష్యద్వర్తమానములందును వ్యాపించి ప్రపంచాతీతుడై వర్తించుచున్నాడనియు, అదియే ఆతని యథార్థరూపమనియు గ్రహించవలెనని సూచితమగుచున్నది.

**ప్ర:-** భగవంతుని వాస్తవరూపమెట్టిది?

**ఉ:-** (1) అవ్యక్తమైనది (2) ప్రపంచాతీతమైనది (3) నాశరహితమైనది (4) సర్వోత్తమమైనది.

**ప్ర:-** భగవంతు డొక చిన్న దేహమేయని తలంచువారెట్టివారు?

**ఉ:-** అవివేకులు.

**అ||** ఏకారణముచేత జనులు పరమాత్మను తెలిసికొనలేకున్నారో, ఒకవేళ తెలిసికొనినను సామాన్యమానవునిగ నమ్ముచున్నారో ఇచట విశదపఱచుచున్నాడు -

## 25. నాహం ప్రకాశః సర్వస్య యోగమాయాసమావృతః
## మూఢోఽయం నాభిజానాతి లోకో మామజమవ్యయమ్.

**టీక:-** యోగమాయా సమావృతః = యోగమాయచే బాగుగ గప్పబడియున్న, అహమ్ = నేను, సర్వస్య = అందఱికిని, ప్రకాశః న = కనుపించువాడనుగాను, మూఢః = వివేకములేని, అయం లోకః = ఈ జనులు, మామ్ = నన్ను, అజమ్ = పుట్టుకలేనివానినిగను, అవ్యయమ్ = నాశరహితునిగను, నాభిజానాతి = ఎఱుగరు.

**తా:-** యోగమాయచే బాగుగ కప్పబడియుండుటచే నేను అందఱికిని కనుపించు వాడనుగాను. అవివేకులగు ఈ జనులు నన్ను పుట్టుకలేనివానినిగను, నాశరహితునిగను ఎఱుగరు!

**వ్యాఖ్య:-** భగవంతుడు సర్వవ్యాపి అయియున్నచో అందఱికిని ఎందులకు కానరారు? సర్వజనులు ఏల వారిని తెలిసికొనజాలకున్నారు? అను ప్రశ్నల కిచట సమాధానము చెప్పబడుచున్నది -

పరమాత్మ యోగమాయచే గప్పబడి అందు దాగుకొనియున్నారు. కాబట్టి జనులకు ప్రత్యక్షముగాకయున్నారు. ఎవరా మాయను వివేకాదులచే ఛేదించివైచుదురో వారు భగవంతుని ప్రత్యక్షముగా గాంచగలరు. భగవంతునకును, జనులకును మధ్య ఒకతెర (Curtain) కలదు. అది త్రిగుణాత్మకమైనది. అనగా సత్త్వరజస్తమోగుణము లను మూడుపొరలు కలిగియున్నది. తమోగుణము నల్లటిమొద్దుపొర. రజోగుణము ఎఱ్ఱటిసామాన్యపొర. సత్త్వగుణము తెల్లటి పల్చనిపొర. ఈమూడుపొరలతో గూడియున్నది మాయావరణ. జీవుడు నిష్కామకర్మ, భక్తి, వైరాగ్య విచారణాదులచేతను, సాధనాతిశయముచేతను ఒక్కొక్కపొరను ఛేదించుకొనుచుపోయి ఆ మాయాప్రతిబంధకమును పూర్తిగ తొలగించుకొనినచో అపుడు ఆవలనున్న పరమాత్మ నిరావరణముగ ప్రత్యక్షముగ కానుపించగలడు. అధ్యాత్మరంగమున తెలుపబడిన సమస్తసాధనలును జీవునకు, దేవునకు మధ్యగల ఆ మాయయను అడ్డుగోడను నిర్మూలించుటకే యగును. అంతియేకాని దేవుని క్రొత్తగ పొందుటకుగాదు. అడ్డాని నిర్మూలనముచే తనయందు వెలుగుచున్న దేవుడు పొందబడియే తీరును.

అయితే మూఢునకు మాయాయవనిక ఛేదింపబడనందున దైవదర్శనము కాకయున్నది. భగవంతుడున్నాడు - కాని అజ్ఞానులకు కానరాకయున్నాడు. సూర్యుడున్నాడు - కాని గ్రుడ్డివారికి కనిపించుటలేదు. దీపమున్నది, కాని కుండ బోర్లింపబడియున్నది. అందుచే ఆదీప మెవరికిని గోచరముకాకయున్నది. ఆకుండను తీసివేసినవారికి లేక పగులగొట్టినవారికి మాత్రమే లోనగల దీపము కనుపించును. ఇదియే మాయా భంగము. భగవంతుడు వాస్తవముగ జన్మరహితుడు, నాశములేనివాడు. ఆ విషయమును మాయనుదాటిన వివేకవంతులుమాత్రమే తెలిసికొనగల్గుచున్నారు. కాని మాయకులోబడిన మూఢులుకాదు అని గీతాచార్యు లిచట బోధించుచున్నారు.

అవివేకులు మాయను పోషించుచున్నారేకాని శుష్కింపజేయుటలేదు. అనేక విషయ వాసనలు, దుర్వ్యసనములు, భోగలంపటత్వము, కామక్రోధాదులు - మున్నగువానిచే వారా మాయ నింకను బలపఱచుచున్నారు. దానికి పుష్టిగల ఆహారము నొసంగుచున్నారు. అందుచే అది ఇంకను బలపడి, దృఢపడి, బాగుగ నిలద్రొక్కుకొని భగవద్దర్శనమునకు ఘనమైన అడ్డుగోడవలె నుండి జీవునకు మోక్షమార్గమున మహాప్రతిబంధకముగ వర్తించుచున్నది. కాబట్టి విజ్ఞుడగువాడు ఆ మాయారూపావరణను భక్తిజ్ఞానవైరాగ్యాదులచే విచ్ఛిన్న మొనర్చి భగవంతుని సాక్షాత్కరించుకొనవలెను.

ఈ శ్లోకమున 'సర్వస్య' (ఎవరికిని కనబడుటలేదు) అని చెప్పినదాని అర్థము అజ్ఞాను లెవరికిని కనిపించుటలేదనియే యగును. మఱియు భగవంతుడు యోగమాయచే కప్పబడియున్నాడను విషయము ద్వైతదృష్టియందు చెప్పినదే యగును. ఏలననిన, వాస్తవముగ పరమాత్మకు ఏ ఆవరణమున్ను లేదు. అతడు నిరావరణ శుద్ధ చిన్మయమూర్తి. అజ్ఞానులగు జీవుల దృష్టిననుసరించియే అట్లు చెప్పబడినది. సూర్యునకు మేఘమునకు వాస్తవముగ ఏ సంబంధమున్ను లేదు. కాని మేఘమునకు క్రింద నున్నవారిదృష్టిననుసరించి సూర్యుడు మేఘముచే కప్పబడియున్నాడని చెప్పుదురు. అట్లే భగవద్విషయమున్ను.

కొందఱు 'యోగమాయా సమావృతః' అను పదమును మూఢునకు విశేషణముగ తగిలించి యోగమాయావృతుడగు మూఢుడు (అజ్ఞాని) దేవుని తెలిసికొనజాలకున్నాడని అర్థముచెప్పిరి.

**ప్ర:–** భగవంతు డేల అందఱికిని కనుపించుట లేదు?

**ఉ:–** యోగమాయచే కప్పబడియుండుటవలన.

ప్ర:– భగవంతుని స్వరూపమెట్టిది?

ఉ:– (1) జన్మరహితమైనది (2) నాశవర్జితమైనది.

ప్ర:– భగవత్స్వరూపము నెవరు తెలిసికొనజాలకున్నారు?

ఉ:– అజ్ఞానులు.

ప్ర:– ఎందుచేత ?

ఉ:– భగవంతుని చుట్టునున్న మాయారూపమగు ఆవరణను వారు భేధింపలేదు కావున.

ప్ర:– కాబట్టి విజ్ఞుడగువా డేమి చేయవలెను?

ఉ:– తనకు భగవంతునకు మధ్య అడ్డుగోడగా నిలిచియున్న మాయారూపావరణమును శీఘ్రముగ (ఈజన్మయందే) ప్రయత్నపూర్వకముగ అధ్యాత్మసాధనలచే తొలగించివేసి భగవత్సాక్షాత్కారము నొందవలయును.

అ॥ ఆ యోగమాయ భగవానుని స్వాధీనమందే యుండునదియగుటచే వారి సర్వజ్ఞత్వమున కదియేమియు అడ్డుకలుగజేయజాలదు. కనుకనే ప్రతిబంధకముకాదు. కావున తాను భూతభవిష్యద్వర్తమాన స్థితిగతులనన్నిటిని ఎఱుంగుదునని భగవానుడు తెలుపుచున్నాడు –

**26. వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున**
**భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన.**

**టీక:–** అర్జున = ఓ అర్జునా!, అహమ్ = నేను, సమతీతాని = గడచిపోయినట్టియు, వర్తమానాని చ = ఉన్నట్టియు, భవిష్యాణి చ = రాబోవునట్టియు, భూతాని = ప్రాణులను, వేద = ఎఱుగుదును, మాం తు = నన్నో, కశ్చన = ఎవడును, న వేద = ఎఱుంగడు.

**తా:–** ఓ అర్జునా! నేను భూతభవిష్యద్వర్తమానకాలములందలి ప్రాణులందఱిని ఎఱుంగుదును. నన్నుమాత్ర మెవడును ఎఱుంగడు.

**వ్యాఖ్య:–** భగవంతునియొక్క సర్వశక్తిమత్త్వ మిచట తెలుపబడుచున్నది. ప్రాణులందఱును కాలగర్భముననున్నారు. ఆ కాలమో, భగవానుని కుక్షియందు (కల్పితముగ) ఉన్నది. కావున సమస్తచరాచరములు సర్వేశ్వరునియందే వర్తించుచుండుటబట్టి వారికి తెలియని ప్రాణిగాని, తెలియని విషయముగాని భూతభవిష్యద్వర్తమానములం దేదియు ఉండనేరదు. ఎల్లప్రాణులను, ఎల్లకాలములందు వారు జాగరూకతతో వీక్షించుచునేయుందురు. ఈ సత్య మెఱింగినవాడిక పాపముచేయుట కెట్లుత్సహింపగలడు? అతడు పాపభీతిగలిగి ధర్మమార్గమందే ప్రవృత్తుడగును.

మఱియు ఈ శ్లోకమువలన జీవునియొక్క అల్పత్వమును పట్టిచూపినట్లైనది. జీవుడు కాలాధీనుడు. మృత్యుగ్రస్తుడు. క్షణికజీవితము కలవాడు. భూతభవిష్యత్తులు తెలియనివాడు. పరమేశ్వరుడో కాలాతీతుడు,

అమరుడు, సర్వజ్ఞుడు. అట్టివానిముందు జీవుడేపాటివాడు? అయినను ఆ అల్పజీవుడు తన ధనమునుజూచియు, బలమునుజూచియు, విద్యనుజూచియు, అధికారమునుజూచియు, సౌందర్యమును జూచియు గర్వించుచున్నాడు. ధనమదముచే, అధికారమదముచే భగవంతుని లెక్కకు తీసికొనుటలేదు. ఇది కేవలము అజ్ఞానముయొక్క ప్రభావమేయగును. సత్యమెఱిగినవాడు తనయొక్క అల్పత్వమును గుర్తెఱిగి భగవంతునియొక్క అనంతశక్తిని వేనోళ్ళ కొనియాడును. భక్తిపూర్వకముగ ఆతనికి ప్రణమిల్లును. ప్రపంచములో ఏకొంచెము శక్తిసామర్థ్యములున్నవానినే ప్రజలు ఎంతయో ఆదరించి, గౌరవించి, బ్రహ్మరథముపట్టుచున్నారు. అట్టిచో అనంతశక్తిసంపన్నుడగు సర్వేశ్వరుని ఎంత అధికముగ గౌరవించి పూజించవలెను? కావున ఈ శ్లోకముద్వారా జీవుడు పరాత్పరుని త్రికాలజ్ఞానమును, అనంతశక్తిసామర్థ్యములను, అమరత్వమును తెలిసికొని అకుంఠితభక్తితో నాతనిని సేవించి కృతార్థుడుకావలెను. గర్వాహంకారములను వదలివేయవలెను.

ఈ శ్లోకమున 'నన్నెవడును తెలిసికొనుటలేదు' (మాంతు వేద న కశ్చన) అను వాక్యము యొక్క అర్థము 'శ్రద్ధాభక్తులులేనివాడు, ఆత్మజ్ఞానములేనివాడు తెలిసికొనుట లేదనియే' యగును. భగవంతుని తెలిసికొనినవారు చాల అరుదుగను, తెలియనివారు అధికముగ నున్నందున ఈ లాగున చెప్పడమైనది. అంతఃపురమున పైఅంతస్తులోని కిటికీగుండా చూచు రాణివాసస్త్రీ క్రిందివీథిలో పోవుచిన్న జనమునంతను వీక్షింపగల్గును. కాని బాటలోనివా రామెను చూడజాలరు. అట్లే పరమాత్మ సర్వజీవులను గాంచగల్గినను ఆతనిని గాంచగల్గువారు చాల అరుదుగ నున్నారు. కావున జీవుడు తాను కృతార్థుడుకావలెననిన, సంసారసాగరమును తరించవలెననిన, తన అల్పత్వమును, భగవానుని సర్వశక్తిమత్త్వమును గుర్తెఱింగి ఆతనియెడల భక్తి ప్రపత్తులుగలవాడై వర్షబిందువు సముద్రములో కలియునట్లు తనచిత్తమును పరమాత్మయందు లయింపజేయవలెను. భగవంతుడు జీవుని తెలిసికొనునట్లు, జీవుడున్ను భగవంతుని తెలిసికొనినచో ఆక్షణముననే అతనికి ముక్తిగల్గును. అంతవఱకును బంధమున తిరుగాడుచునేయుండును.

**ప్ర:–** భగవానుని శక్తి సామర్థ్యములను వర్ణింపుము ?

**ఉ:–** అతడు త్రికాలజ్ఞుడు, భూతభవిష్యద్వర్తమానములందలి సమస్తప్రాణులను, పదార్థములను ఎఱింగినవాడు.

**అ॥** అట్టి తనను జనులేల తెలిసికొనజాలకున్నారో వచించుచున్నాడు –

## 27. ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వన్ద్వమోహేన భారత
## సర్వభూతాని సమ్మోహం సర్గే యాన్తి పరంతప.

**టీక:–** పరంతప = శత్రువులను తపింపజేయువాడవైన, భారత = ఓ అర్జునా!, సర్గే = పుట్టుకతోడనే (లేక, ఈ ప్రపంచమున), ఇచ్ఛాద్వేషసముత్థేన = రాగద్వేషములవలన (లేక, కామక్రోధములవలన) పుట్టిన, ద్వన్ద్వమోహేన = సుఖదుఃఖాది ద్వంద్వరూపమగు వ్యామోహము(అవివేకము)చే, సర్వభూతాని = సమస్తప్రాణులును, సమ్మోహమ్ = మిక్కిలి అజ్ఞానమును, యాన్తి = పొందుచున్నవి.

**తా:–** శత్రువులను తపింపజేయు ఓ అర్జునా! సమస్తప్రాణులును పుట్టుకతోనే రాగద్వేషజనితమగు సుఖదుఃఖాదిద్వంద్వరూపమైన వ్యామోహమువలన మిక్కిలి అజ్ఞానమును బొందుచున్నవి.

**వ్యాఖ్య:–** సమస్తజీవులును పుట్టుకతోనే ప్రబల అజ్ఞానమును పొందుచున్నారు. మహామాయ ('వైష్ణవీ' మాయ) వారిని ఆవరించివేయుచున్నది. అందువలననే వారు పరమాత్మను దర్శింపలేక సంసారకుహరమున చిక్కుకొనిపోవుచున్నారు. మోక్షమును బడయజాలకున్నారు. అది సామాన్యమైన అజ్ఞానము కాదు. మిక్కిలి దట్టమైనది. కనుకనే 'మోహం' అని చెప్పక 'సమ్మోహం' అని చెప్పిరి. ఈ అజ్ఞానమునకు హేతువేమి? సుఖదుఃఖాదిద్వంద్వరూపమగు వ్యామోహము. అదియో ఇచ్ఛాద్వేషముల వలన – అనగా కామక్రోధములవలన పుట్టుచున్నది. కాబట్టి మోక్షమునకు ప్రతిబంధమైనట్టి అజ్ఞానమును తొలగింపవలెననిన ఇచ్ఛాద్వేషములు రెండును నశింపవలెను. (ఒకదానిని అనుభవింపవలెనను, లేక పొందవలెనను కోరికనే ఇచ్ఛయందురు. దాని ననుభవించుటలో అడ్డుపడువారిపై కినుక వహించుటను ద్వేషమందురు.) ఇచ్ఛ–ఏదియోయొక దృశ్యవస్తువునందు కోరిక, అభిలాష యెపుడు జనించునో అపుడు చిత్తము నిరంతరము దానిని పొందవలెననెడి సంకల్పములతో నిండి, దానిని గూర్చియే చింతించుచు మహాచపలముగనుండును. ఏకాగ్రత లేక యుండును. చంచలచిత్తమున ఆత్మ చక్కగ ప్రతిబింబించదు. కావున అశాంతి, దుఃఖము కలుగుటకు కారణమగుచున్నది. ఒకవేళ ఆవిషయము లభించినను, దానివలన తృప్తికలుగకపోగా, దానిపై ఆశ అనేకరెట్లు పెరిగి పోవును. కోరికలు అనుభవించినకొలది పెరుగునేకాని తరగవు. కాబట్టి ఇచ్ఛయను ప్రబలశత్రువును వివేకవైరాగ్యాదులద్వారా హృదయమునుండి పెకలించివేయవలెను.

'ద్వేషము' – తనకు అయిష్టమైన వస్తువునందుగాని, తనకు ఇష్టమైన వస్తువునకు అడ్డుపెట్టువారియందుగాని మనుజునకు సామాన్యముగ ద్వేషము కలుగుచుండును. ఆ ద్వేషమే క్రోధముగ పరిణమించును. క్రోధముచే సమ్మోహము, సమ్మోహముచే స్మృతివిభ్రమము, దానిచే బుద్ధినాశము, దానిచే సర్వవినాశము జీవునకు సంభవించుచుండును. కాబట్టి జీవుని యధఃపతనమునకు హేతువులైన ఈ ఇచ్ఛాద్వేషములనే ప్రబలశత్రువులను సర్వము 'భగవత్స్వరూపమే' యను వివేకము చేతను, ఇంకను పెక్కు ఆధ్యాత్మిక యుక్తులచేతను పారద్రోలి, ఆ దుష్టద్వయమునకు శాశ్వతముగ తర్పణమొసంగి పరమ శాంతిని అనుభవించవలయును.

'సర్గే' – అని చెప్పుటవలన తల్లిగర్భమునుండి జన్మించు కాలమందే అజ్ఞానము వచ్చి ఆవరించివేయుచున్నదనియు, యౌవనమునగాని, వార్ధక్యమునగాని కాదనియు స్పష్టమగుచున్నది. కాబట్టి బాల్యకాలమందే పరమార్థయత్నములను గావించి అజ్ఞానమును పాఱద్రోలువారు ధన్యులు. దొంగను ఇంటినుండి ఎంతత్వరగా బయటకు గెంటివేసిన అంతమంచిదికదా! కావున ఏ క్షణమున జీవున కిట్టి వివేకముదయించునో ఆ క్షణమందే ఉత్తమసాధనలద్వారా ఆ హృదయచోరులను తరిమివేసి ఆత్మానందమును బడయవలెను.

ఇచట 'పరంతప' – అను సంబోధనయం దొక విశేషముకలదు. 'ఓ అర్జునా! నీవు శత్రువులను తపింపజేయువాడవు. కావున యంతఃశత్రువులగు ఇచ్ఛాద్వేషములను గూడ తపింపజేయుము. నిర్మూలింపుము' అని బోధించుటయగును.

'సర్వభూతాని' – అను పదమునకు శ్రద్ధాభక్తులుగలిగి భగవంతుని అర్చించువారు, జ్ఞానవంతులుతప్ప తక్కిన యందఱును, అని అర్థము (చూడుడు శ్లో॥ 28).

**ప్ర:–** సుఖదుఃఖాది ద్వంద్వములు వేనినుండి ప్రాదుర్భవించును?

**ఉ:–** ఇచ్ఛాద్వేషములనుండి.

**ప్ర:–** సమస్తప్రాణులు అజ్ఞానము నెపుడు పొందుచున్నవి?

**ఉ:–** పుట్టుకతోనే.

**అ॥** (పైనదెల్పిన) అజ్ఞానమునుండి యెవరు విముక్తులగుదురో తెలుపుచున్నాడు -

**28. యేషాం త్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్**
**తే ద్వన్ద్వమోహనిర్ముక్తా భజన్తే మాం దృఢవ్రతాః.**

**టీక:–** పుణ్యకర్మణామ్ = పుణ్యకర్మలుచేయు, యేషాం జనానామ్ = ఏ జనులయొక్క, పాపంతు = పాపమైతే, అన్తగతమ్ = నాశమును బొందినదో, తే = అట్టివారు, ద్వన్ద్వమోహనిర్ముక్తా =(సుఖదుఃఖాది) ద్వంద్వరూపమగు అజ్ఞానమునుండి విడువబడినవారై, దృఢవ్రతాః =చలింపని నియమనిష్ఠలుగలవారై, మాం = నన్ను, భజన్తే = సేవించుచున్నారు.

**తా:–** పుణ్యకార్యతత్పరులగు ఏ జనులయొక్క పాపము నశించిపోయినదో, అట్టివారు(సుఖదుఃఖాది) ద్వంద్వరూపమగు అజ్ఞానమునుండి విడువబడినవారై దృఢవ్రతులై నన్ను సేవించుచున్నారు.

**వ్యాఖ్య:–** పరమాత్మను దృఢవ్రతులై సేవించినవారికే బంధవిముక్తిలభించును. కాబట్టియే అనేకులు దైవసాక్షాత్కారమునకై పెక్కువ్రతములు, నియమములు శీలించుచుందురు. మౌనవ్రతము, ఉపవాసవ్రతము, బ్రహ్మచర్యవ్రతము, స్వాధ్యాయవ్రతము మున్నగువానిని ఆచరించుదురు. కాని వానియందు పెక్కురికి దృఢత్వము (స్థిరత్వము) ఏర్పడుటలేదు. దానికి కారణమేమియో భగవాను డిచట స్పష్టముగ తెలిపిరి. అనేక జన్మార్జితపాపమే దానికి కారణము. ఆ పాపము హృదయమున నున్నంతవఱకు పరమార్థసాధనలందు అడ్డుకలుగుచునేయుండును. మురికిగుడ్డకు రంగుఅంటనట్లు, చవిటినేలలో విత్తనము మొలవనట్లు, పాపకల్మషయుక్తమగు హృదయమున పరమార్థబీజము లంకురింపజాలవు. అట్టివారొకవేళ వ్రతములను ప్రారంభించినను చక్కగ కొనసాగించలేరు. వానియందు దృఢత్వముకలుగదు. విరేచనమునకు మందుతీసికొనినవాడు ఇంటియందు మెదలక ఉండదలచినచో నెట్లుసాధ్యపడదో, ఆ మందు కడుపులో త్రిప్పి వానిని బయటకెట్లు సాగనంపునో, అట్లే పాపము, రజోగుణము చిత్తమునగలవాడు ధ్యాననిష్ఠయందు కూర్చొనినను, అవి వానిని లేపి బహిర్ముఖునిగ నొనర్చును. కాబట్టి భగవానుని దృఢవ్రతములతో సేవింపవలెనవిన లోనగల పాపము నశింపవలెను. అది యెట్లు నశించునో ఆ పద్ధతినిగూడ శ్రీకృష్ణపరమాత్మ ఈశ్లోకమందు విశదీకరించిరి.

పుణ్యకర్మలచేతను, అనేక సత్కార్యము లాచరించుటవలనను, నిష్కామకర్మయోగానుష్ఠానము చేతను జీవునిపాపమంతయు నశించిపోవును. కావున సాధకుడు మొట్టమొదట అనేక సత్కార్యములను, దానధర్మములు, పరోపకారము, దివ్యమంత్రజపము - మున్నగువానిని విరివిగ ఆచరించవలెను. కొందఱు శుష్కవేదాంతులు "పుణ్యకార్యములుకూడ బంధనమును కలుగజేయును, కావున వాని నాచరించరాద"ని చెప్పుదురు. అది వారియొక్క ఉన్మత్తప్రలాపమేకాని, అన్యముకాదు. ఏలయనిన భగవానుడు గీతయందు పుణ్యకార్యములను, సత్క్రియలను తప్పక చేయవలెననియే పెక్కుచోట్ల ఆదేశించిరి. ఇంతియేకాదు వానిని

వదలవద్దనికూడ హెచ్చరించిరి★. భగవద్వాక్యమునందు విశ్వాసముగలవారు ఆ యాదేశమును తప్పక పాలించవలెను. పుణ్యకార్యములను జేయువానికి, శుభాచరణశీలునకు దుర్గతి యెన్నడును కలుగదనికూడ నిదివఱలో భగవానుడు చెప్పియుండుట గమనింపదగినది @. కేవలము అతీతస్థితి యందుండువానికి, ఇంద్రియమనంబులను దాటియున్నవానికి, నిశ్చల సమాధినిష్ఠునకు పుణ్యము, పాపము లేవని చెప్పిన వాక్యమును సామాన్యులగు సాధకులకు అన్వయించరాదు. ఏలయనిన, దానిచే ఆ సాధకుని చెడగొట్టినట్లేయగును. వారికి ఉభయభ్రష్టత్వము కలుగజేసినట్లేయగును. తురీయస్థితియందున్న అట్టి జీవన్ముక్తులుకూడ వ్యుత్థానదశయందు లోకాదర్శముకొఱకు పుణ్యకార్యములను, సత్క్రియలను చేయుచునేయుందురు.

ఈ ప్రకారముగ పుణ్యకార్యములచే పాపము నశించినవారు సుఖదుఃఖాదిద్వంద్వమోహరహితులై పరమాత్మను దృఢవ్రతములతో సేవింతురు. దానిచే వారికి ఆత్మసాక్షాత్కారము లభించి బంధవిముక్తి సిద్ధించుచున్నది. ఈ శ్లోకముద్వారా శ్రీకృష్ణపరమాత్మ జనుల కీప్రకారముగ హెచ్చరికచేయుచున్నారు- 'ఓ జీవులారా! మున్ముందు మీచిత్తములందుగల పాపపంకిలమును, జన్మజన్మాంతరమునందు గావింపబడిన దుష్కార్యములకు సంబంధించిన కల్మషబీజములను, సత్క్రియలద్వారా పుణ్యకార్యాచరణముద్వారా క్షాళనముచేయుడు. అపుడే మీకు సుఖదుఃఖాదిద్వంద్వవ్యామోహ మంతరించి దైవవ్రతమందు దృఢత్వమేర్పడును. దానిచే మోక్షము సన్నిహితమగును'. కాబట్టి సాధకులు భగవద్వాక్యమునందు విశ్వాసముగలిగి పుణ్యాచరణతత్పరులై మెలగవలెను.

ఈశ్లోకముద్వారా మఱియొకవిషయము స్పష్టమగుచున్నది. అది యేది యనిన - పరమార్థరంగమున సాధకుడు కొన్నిదృఢనియమములను, వ్రతములను ఏర్పఱచుకొనవలెను. లేనిచో మాయ దారి ఇవ్వదు. దుర్బలనియమములచే మాయ లొంగదు. మనస్సు స్వాధీనపడదు. రేకుగొడ్డలిచే బలమైనవృక్షము తెగదుగదా! 'ఈ రోజున ఇన్ని వేల జపముచేయనిదే భుజింపను, ఇన్ని అధ్యాయములు పారాయణము చేయనిదే మఱియొకపనిని తాకను' - ఈ ప్రకారముగ దృఢనిశ్చయములను గావించుకొనవలెను.

ఈ శ్లోకమువలన ఈ క్రిందివిషయములు స్పష్టపడుచున్నవి -

(1) మోక్షము పొందవలెననిన సాధకుడు దృఢవ్రతములను శీలింపవలెను.

(2) దృఢవ్రతము గలుగవలెననిన చిత్తమునందలి పాపము నశించవలెను.

(3) పాపము నశించవలెననిన పుణ్యకార్యములను, సత్కర్మలను లెస్సగ నాచరింపవలెను.

**ప్ర:-** భగవంతుని దృఢవ్రతులై ఎవరు సేవింపగలరు?

**ఉ:-** పాపము నశించినవారు.

**ప్ర:-** పాప మెట్లు నశింపగలదు?

**ఉ:-** పుణ్యకార్యములచే.

---

★ యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యం కార్యమేవ తత్, యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్॥ (18-5)

@ న హి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి। (6-40)

ప్ర:- పాపము నశించిన కలుగు ఫలితము లెవ్వి?

ఉ:- (1) ద్వంద్వమోహవినాశము (2) ధ్యానదృఢత్వము.

అ॥ శ్రద్ధాభక్తులతో భగవంతు నాశ్రయించి ప్రయత్నించువారికి కలుగు ఫలితమును వివరించుచున్నాడు -

**29. జరామరణ మోక్షాయ మామాశ్రిత్య యతన్తి యే**
**తే బ్రహ్మ తద్విదుః కృత్స్నమధ్యాత్మం కర్మ చాఖిలమ్.**

**టీక:-** యే = యెవరు, జరామరణమోక్షాయ = వార్ధక్యమును, మరణమును పోగొట్టుకొనుటకొఱకు, మామ్ = నన్ను, ఆశ్రిత్య = ఆశ్రయించి, యతన్తి = ప్రయత్నముచేయుచున్నారో, తే = వారు, కృత్స్నం = సమస్తమైన, అధ్యాత్మమ్ = ప్రత్యగాత్మస్వరూపమును, అఖిలంకర్మచ = సకలకర్మమున్ను, తత్ బ్రహ్మ = ఆ బ్రహ్మమేయని, విదుః = తెలిసికొందురు.

**తా:-** ఎవరు వార్ధక్యమును, మరణమును (సంసారదుఃఖమును) పోగొట్టుకొనుటకొఱకు నన్నాశ్రయించి ప్రయత్నముచేయుచున్నారో, వారు సమస్తప్రత్యగాత్మస్వరూపమున్ను, సకలకర్మమున్ను ఆ బ్రహ్మమేయని తెలిసికొందురు.

**వ్యాఖ్య:-** జీవుడు సంసారదుఃఖవిముక్తికొఱకు, పరమానందప్రాప్తికొఱకు, భగవంతుని ఆశ్రయించి తల్లక్ష్యసాధనకై యత్నించుచున్నాడు. జననమరణములు, జరావ్యాధులు మున్నగువానితోగూడిన ఈ సంసారదుఃఖము అతిభయంకరమైనది. దానినుండి విడుదలపొందుటకే సర్వేశ్వరుని జనులాశ్రయించి ప్రయత్నశీలురగుచున్నారు. సమస్త ఆధ్యాత్మికసాధనలు ఇందుకొఱకే ఏర్పడినవి - అనగా జరామరణరూపసంసారదుఃఖవినాశముకొఱకై, నిరతిశయాత్మానందప్రాప్తికొఱకు. అట్లు సర్వేశ్వరుని ఆశ్రయించి ధ్యానాదియత్నములను సలుపువారు క్రమక్రమముగ వారియత్నములు పరిపక్వములుకాగా, సాధనయందారితేరినపిమ్మట, అనగా ఆరూఢస్థితిని బడసినపుడు, సమస్తకర్మలు, సమస్తజీవులు, సమస్తప్రత్యగాత్మస్వరూపములు అద్వైతపరబ్రహ్మముగనే వారు తెలిసికొందురని ఇట వచింపబడినది. అనగా, వారిదృష్టిలో బ్రహ్మేతరమగు వస్తువేదియు కానరాదు. అంతయు ఆత్మమయముగ, బ్రహ్మమయముగ గాంచుదురు.

అయితే ఇట్టిబ్రహ్మానుభూతి అందఱికిని కలుగదు. ఎవరు మోక్షముకొఱకు తీవ్రప్రయత్నము సలుపుదురో, ఎవరు బంధవిముక్తికై సర్వేశ్వరుని ఆశ్రయించి ధ్యానాదులను జరుపుదురో అట్టివారికే కలుగును. అపుడు తానే పరబ్రహ్మముగను, తనయందే సమస్తకర్మసమూహము, సమస్తజగత్తులు, సమస్తజీవరాసులు (కల్పితములై) యున్నట్లును, సర్వజీవులయొక్క ఆత్మ తానే అయియున్నట్లును కనుగొనగల్గును. ఇదియే 'అహంబ్రహ్మాస్మి' అను మహావాక్యముయొక్క అనుభవము అయియున్నది.

ఈ శ్లోకమున 'యతన్తి' - (ప్రయత్నించుచున్నారు) అని చెప్పినందువలన బ్రహ్మానుభూతి మాటలవలన సిద్ధించునదికాదనియు, తీవ్రతరయత్నము చేయవలసియుండుననియు స్పష్టమగుచున్నది. మఱియు 'ఆశ్రిత్య', 'యతన్తి' అని రెండుపదములను చేర్చుటవలన, కేవలము భగవంతుని

ఆశ్రయించుటమాత్రము చాలదనియు, భగవత్ సాక్షాత్కారమునకే ప్రయత్నముకూడ సలుపవలయుననియు తెలుచున్నది. భగవదాశ్రయముచే భగవంతు డనుగ్రహించి త్రోవచూపును. ఆ త్రోవనుబట్టి తానే నడవవలెను. యత్నశీలుడై తనమనస్సును తానే శుద్ధమొనర్చుకొని బ్రహ్మానుభూతిని బొందవలెను.

**ప్ర:–** భగవానుని ఎందుల కాశ్రయింపవలెను?

**ఉ:–** జన్మజరామరణరూప సంసారబంధవిచ్ఛిత్తికొఱకై.

**ప్ర:–** భగవత్ప్రాప్తి యెట్లు కలుగగలదు?

**ఉ:–** స్వప్రయత్నముచే, తాను స్వయముగ ఆధ్యాత్మికసాధనల నభ్యసించుటచే.

**ప్ర:–** ఫలితముగ అతని కేమిలభించిను?

**ఉ:–** భగవదాశ్రయముచేతను, భగవత్సాక్షాత్కారమునకువలసిన యత్నములచేతను అతడు బ్రహ్మప్రాప్తినొంద, సమస్తజీవుల సమస్తకర్మము అంతయు ఆ పరబ్రహ్మమే యని తెలిసికొనగల్గను.

**30. సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః**
**ప్రయాణకాలేఽపి చ మాం తే విదుర్యుక్తచేతసః.**

**టీక:–** యే = ఎవరు, సాధిభూతాధిదైవమ్ = అధిభూత, అధిదైవములతో గూడినట్టియు, సాధియజ్ఞంచ = అధియజ్ఞముతో గూడినట్టియు, మామ్ = నన్ను, విదుః = తెలిసికొనుచున్నారో, తే = వారు, ప్రయాణకాలే అపి చ = దేహవియోగకాలమందును, యుక్తచేతసః = (దైవమందు) నిలుకడగల మనస్సుగలవారై (లేక, మనోనిగ్రహముకలవారై), మామ్ = నన్ను, విదుః = తెలిసికొందురు.

**తా:–** అధిభూత, అధిదైవ, అధియజ్ఞములతో గూడియున్న నన్నెవరు తెలిసికొందురో వారు దేహవియోగకాలమందును (దైవమందు) నిలుకడగల మనస్సుగలవారై (మనోనిగ్రహముకలవారై) నన్నెఱుంగగలరు.

**వ్యాఖ్య:–** ఎవరు జీవితకాలమంతయు ఆత్మచింతనగలిగియుందురో, వారు అంతిమకాలమందును (దేహవియోగసమయమందును) నియమితచిత్తులై అట్టిదైవానుభవమే కలిగియుందురని ఇచట చెప్పబడినది. అధిభూత, అధిదైవ, అధియజ్ఞరూపములగు సమస్తపదార్థములున్ను పరమాత్మస్వరూపములే యను నిట్టి ఆత్మానుభవము జీవితకాలమునగలవారు, అంతిమకాలమందును అట్టి బ్రహ్మానుభవమే కలిగియుందురు. 'సమస్తముబ్రహ్మమే; ఆ బ్రహ్మమును నేనే' అను ఈ బ్రహ్మానుభవమును జనులు ఎల్లకాలములందును గలిగియుండవలెను.

ఆ యనుభవ మెట్లుకలుగును? దానికి సమాధాన మిచటనే వివరింపబడినది –'యుక్తచేతసః' మనోనిగ్రహముచే (మనోజయముచే) సిద్ధించును. ఇంద్రియములను మనస్సును జయింపలేనివారి కట్టి సార్వాత్మిక అనుభవము కలుగనేరదు. ఇంద్రియములకు దాసులుగా నుండువారి కట్టి బ్రహ్మానుభవము కలుగదు. జీవితమంతయు ఇట్టి నియమితచిత్తము కలిగియుండువారికే బ్రహ్మానుభవము సిద్ధించును. కాని

కేవలము అంతిమకాలమందుమాత్రమే అని చెప్పలేదు. అంతిమకాలమందుకూడ (ప్రయాణకాలేఽపిచ) అనియే చెప్పబడెను. కాబట్టి ఆరోగ్యము బాగుగనున్నపుడే, ఇంద్రియములు శైథిల్యమునొందకపూర్వమే, దేహశక్తి ఉడుగుటకుముందే సమస్తసాధనలుగావించి, ఆత్మానుభవము నొందవలసియుండుననియు, అట్లుండిననే చివఱికాలమందుగూడ దైవస్మృతి కలుగగలదనియు స్పష్టమగుచున్నది. ప్రయాణముచేయుటకు ముందుగనే సామగ్రినంతను ఎట్లు సర్దుకొందురో, దారిబత్తెము సేకరించుకొని సిద్ధముగనుందురో అట్లే దీర్ఘప్రయాణము ప్రారంభమగు ఈ దేహవియోగసమయమునకు పూర్వమే దైవానుభవమును పూర్తిగ పొందియుండవలెను. బాల్యమందే, యౌవనమందే దానిని సిద్ధపఱచుకొని యుండవలెను. అన్నిశక్తులున్ను ఉడిగిపోయిన వార్ధక్యమున జీవుడు పరమార్థయత్నములను ఎక్కువగ చేయజాలడు. కాబట్టి ఈ శ్లోకమునందు ఆత్మసాక్షాత్కారరూపలక్ష్యమును జీవితకాలములో చాల ముందుగనే పొందియుండవలెనని సూచింపబడినది.

'జీవితకాలమందు ఎవరు నన్నెఱుగుదురో, అంత్యకాలమందును వారు నన్నెఱుగగలరు'. అని భగవాను డిచట చెప్పినందువలన అంత్యకాలమునమాత్రము నమ్ముకొని జీవితమంతయు సోమరిగా గడుపరాదని హెచ్చరించినట్లైనది. మఱియు అంత్యకాలమనునది ఫలానిసమయమని ఎవరికిని తెలియదు. కనుక, జీవితమంతయు భగవచ్చింతనయందే గడిపినచో ఇక మృత్యువు ఎప్పుడువచ్చినను భయములేదు. అంత్యకాలమందు మాత్రమే భగవచ్చింతన చేయవలెననువారి వాదన ఈ శ్లోకముచే పూర్తిగ ఖండింపబడినది. గీతాచార్యులు అధ్యాత్మరంగమున సోమరులకు ఏమాత్రము చోటీయక ఆ జీవితపురుషప్రయత్నమునే లెస్సగ చాటినవారైరి.

అధిభూత, అధిదైవ, అధియజ్ఞములనగా నెవ్వియో రాబోవు అధ్యాయమున వివరముగ తెలియజేయబడినవి.

**ప్ర:–** దేహవియోగసమయమందును ఎవరు నియమితచిత్తులై ఆత్మానుభవముగలిగియుందురు?

**ఉ:–** ఎవరు పెక్కు సాధనలద్వారా జీవితకాలమంతయు యత్నించి పరమాత్మానుభవమును సంపాదించుకొందురో వారు.

ఓమ్

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే విజ్ఞానయోగోనామ
సప్తమోఽధ్యాయః

ఇది ఉపనిషత్ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున సంవాదమునగు శ్రీ భగవద్గీతలందు విజ్ఞానయోగమను
ఏడవ అధ్యాయము
ఓమ్ తత్ సత్

# అక్షరపరబ్రహ్మ యోగము



**ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్**
**యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్.** **(8–13)**

ఎవడు ఇంద్రియద్వారములన్నిటిని బాగుగ అరికట్టి, మనస్సును హృదయమందు (ఆత్మయందు) లెస్సగా స్థాపించి, శిరస్సునందు (బ్రహ్మరంధ్రమందు) ప్రాణవాయువును ఉంచి, ఆత్మనుగూర్చిన ఏకాగ్రచింతనము (యోగధారణ) గలవాడై పరబ్రహ్మమునకు వాచకమైన 'ఓమ్' అను ఒక్క అక్షరమును ఉచ్చరించుచు నన్ను ఎడతెగకచింతించుచు శరీరమును వదలునో అతడు సర్వోత్తమస్థానమును (మోక్షమును) బొందుచున్నాడు.

ॐ

# శ్రీ భగవద్గీత

అథ అష్టమోఽధ్యాయః

## ఎనిమిదవ అధ్యాయము

అక్షరపరబ్రహ్మయోగః

## అక్షరపరబ్రహ్మయోగము

**ఈ అధ్యాయము యొక్క పేరు:-**

'అక్షరపరబ్రహ్మయోగము' - 'క్షర' మనగా నశించునది. అక్షరమనగా నాశరహితమైనది. నాశరహితమగు పరబ్రహ్మమునుగూర్చి బోధించు అధ్యాయమగుటచే దీనికి అక్షరపరబ్రహ్మయోగమను పేరు వచ్చినది.

**ఈ అధ్యాయమందలి ప్రధాన విషయములు :-**

(1) బ్రహ్మము, అధ్యాత్మము, కర్మము మున్నగువానినిగూర్చిన అర్జునునిప్రశ్నలు, వానికి భగవానుడొసంగిన ప్రత్యుత్తరములు (1వ శ్లో॥ నుండి 7వ శ్లో॥ వఱకు)

(2) ప్రణవోపాసన, దాని యద్భుతఫలితము - (8వ శ్లో॥ నుండి 16వ శ్లో॥ వఱకు)

(3) సృష్టి, ప్రళయములగూర్చిన వివరణము - (17వ శ్లో॥ నుండి 19వ శ్లో॥ వఱకు)

(4) భగవానుని సనాతనస్వరూపము - భక్తిచే అద్దాని సంప్రాప్తి - (20 వ శ్లో॥ నుండి 22 వ శ్లో॥ వఱకు)

(5) శుక్ల, కృష్ణమార్గముల వర్ణనము - (23వ శ్లో॥ నుండి 26వ శ్లో॥ వఱకు)

(6) యోగియొక్క మహిమ - (27వ శ్లో॥ నుండి 28వ శ్లో॥ వఱకు)

**పూర్వాధ్యాయముతో ఈ అధ్యాయమునకు గల సంబంధము :-**

క్రిందటి అధ్యాయముయొక్క చివఱ శ్రీకృష్ణపరమాత్మ జరామరణవిముక్తికై తన్నాశ్రయించి ప్రయత్నించువారు బ్రహ్మమును చక్కగా తెలిసికొందురని వచించి ఆబ్రహ్మమునకు కొన్ని విశేషణములను తెలియజెప్పిరి. అవియేవనగా - బ్రహ్మము సకల అధ్యాత్మ రూపము, సకలకర్మస్వరూపము, అధిభూతసహితము, అధిదైవయుక్తము, అధియజ్ఞసహితము అని ఈ ప్రకారముగ చెప్పి అట్టి బ్రహ్మమునకై

యత్నించువారు నియమితచిత్తులై దేహవియోగసమయమున (ప్రయాణకాలమున) కూడ ఆ పరమాత్మను బాగుగనెఱుగుదురని వచించిరి. ఆవాక్యములను వినుటతోటనే అర్జునునకు సందేహము గలిగి భగవానుడు బోధించిన ఏడువిషయములను వివరముగ తెలిసికొనదలంచి ఈ (8వ) అధ్యాయప్రారంభమున ఆ ఏడింటినిగూర్చి విడివిడిగ ప్రశించెను - 'బ్రహ్మమనగానేమి? అధ్యాత్మమనగానేమి?' - అని యీ ప్రకారముగ అర్జునుని ఈ యేడు ప్రశ్నలతో ఈ అధ్యాయము ప్రారంభమగుచున్నది.

**అర్జున ఉవాచ :-**

**1. కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ**
**అధిభూతం చ కిం ప్రోక్తమధిదైవం కిముచ్యతే.**

**2. అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మిన్మధుసూదన**
**ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః.**

అర్జున ఉవాచ - అర్జున డడిగెను -

**టీక:-** పురుషోత్తమ = పురుషశ్రేష్ఠుడవగు ఓకృష్ణా!, *తత్ బ్రహ్మ* = ఆబ్రహ్మము, *కిమ్* = ఏది? *అధ్యాత్మమ్* = అధ్యాత్మము, *కిమ్* = ఏది?, *కర్మ* = కర్మము, *కిమ్* = ఏది? *అధిభూతం చ* = అధిభూతమున్ను, *కిమ్* = ఎట్టిదిగా, *ప్రోక్తమ్* = చెప్పబడినది, *అధిదైవమ్* = అధిదైవము, *కిమ్* = ఏదిగా, *ఉచ్యతే* = చెప్పబడుచున్నది, *మధుసూదన* = ఓ కృష్ణా!, *అస్మిన్ దేహే* = ఈ దేహమందు, *అధియజ్ఞః* = అధియజ్ఞుడు, *కః* = ఎవడు?, *అత్ర* = ఈతనినిగూర్చి, *కథమ్* = ఎట్లు (తెలిసికొనవలెను), *ప్రయాణకాలే చ* = ప్రాణ ప్రయాణసమయమందును, *నియతాత్మభిః* = నియమింపబడిన మనస్సు గలవారిచేత (మనోనిగ్రహము గలవారిచేత) (*త్వమ్* = నీవు), *కథమ్* = ఎట్లు, *జ్ఞేయః* = తెలియబడువాడవు, *అసి* = అగుచున్నావు?

**తా:-** అర్జునుడడిగెను - పురుషశ్రేష్ఠుడవగు ఓ కృష్ణా! ఆ బ్రహ్మమేది? అధ్యాత్మమెయ్యది? కర్మమనగానేమి? అధిభూతమని యేది చెప్పబడినది? అధిదైవమని దేనిని చెప్పుదురు? ఈ దేహమందు అధియజ్ఞుడెవడు? ఆతనిని తెలిసికొనుట ఎట్లు? ప్రాణప్రయాణ సమయమందు నియమితచిత్తులచే మీరెట్లు తెలిసికొనబడగలరు?

**వ్యాఖ్య:-** క్రిందటి అధ్యాయముయొక్క కడపటి రెండుశ్లోకములందు శ్రీకృష్ణమూర్తి బ్రహ్మము, అధ్యాత్మము మున్నగువానినిగూర్చి సంక్షేపముగ తెలియజేయ, అర్జునుడు వెంటనే అందుకొని వానియన్నిటిని సవిస్తరముగ బోధించవలసినదిగా భగవానుని ప్రార్థించుచు ఏడు ప్రశ్నల నడిగెను. అందులకు భగవానుడు మొదటి ఆఱుప్రశ్నలకు సంక్షేపముగ ప్రత్యుత్తరమిచ్చి, చిట్టచివఱి ప్రశ్నయగు అంత్యకాలభగవచ్చింతనమును గుఱించి విపులముగ ప్రబోధించిరి. ఈప్రకారముగ పూర్వాధ్యాయముయొక్క చివర సూచనామాత్రముగ తెలియజేయబడినదానిని, మఱు అధ్యాయమున విపులముగ బోధించుటను సమాసవ్యాసపద్ధతి యందురు. అర్జునునిప్రశ్నలతో ఈ అధ్యాయము ప్రారంభమై భగవానుని జవాబులతో అంతమైనది. అంత్యకాలమున యోగనిష్ఠాపరు లెట్టిభావన గలిగియుండినచో బ్రహ్మసాయుజ్య మొందగలరో

అనువిషయము అతిముఖ్యమైనది యగుటవలనను, జీవితమంతయు ధ్యానాద్యనుష్ఠానములు సలుపుట అట్టి భగవత్స్థితియందు నిలుకడకలుగుట కొఱకే యగుటవలనను, ఆ ఘట్టమును గీతాచార్యులు చక్కగ విశదీకరించిచెప్పిరి.

'పురుషోత్తమా', 'మధుసూదనా' యను పదములద్వారా శ్రీకృష్ణుని స్తుతించుటలో అర్జునుని భక్తిభావము లెస్సగ వెల్లడియగుచున్నది.

క్రిందటి అధ్యాయముయొక్క కడపటివాక్యములందు భగవానుడు 'యుక్తచేతసః' (నియమితచిత్తులచే) అని చెప్పుటయు ఈ అధ్యాయప్రారంభమున అర్జునుడు 'నియతాత్మభిః' (మనోనియమముకలవారిచే) అని మరల పేర్కొనుటయుచూడ నియమితచిత్తులకు, మనస్సును స్వాధీనపఱచుకొనినవారికి మాత్రమే అధ్యాత్మరంగమున ఉత్తమఫలితములు చేకూరగలవనియు, అట్టి మనోనిగ్రహము మోక్షమునకత్యావశ్యకమనియు స్పష్టమగుచున్నది.

**అ॥** అర్జునుని ఏడుప్రశ్నలకును భగవానుడు క్రమముగ సమాధాన మొసంగుచున్నాడు -

**శ్రీ భగవానువాచ :-**

## 3. అక్షరం బ్రహ్మ పరమం స్వభావో ఽ ధ్యాత్మముచ్యతే
## భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః.

శ్రీభగవానువాచ = శ్రీ భగవానుడు చెప్పుచున్నారు -

**టీక:-** పరమమ్ = సర్వోత్తమమైన (నిరతిశయమైన), అక్షరమ్ = నాశరహితమైనది, బ్రహ్మ = బ్రహ్మము (అనబడును), స్వభావః = ప్రత్యగాత్మభావము, అధ్యాత్మమ్ = అధ్యాత్మమని, ఉచ్యతే = చెప్పబడుచున్నది, భూతభావోద్భవకరః = సమస్తప్రాణులకు, వస్తువులకు ఉత్పత్తినిగలుగజేయు, విసర్గః = త్యాగపూర్వకమగు క్రియ (దేవతలనుద్దేశించి మంత్రపూర్వకముగ అగ్నియందు ఆహుతులను సమర్పించుటయను యజ్ఞము మొదలైనవి), కర్మసంజ్ఞితః = కర్మమనుపేరు గల్గియున్నది.

**తా:-** శ్రీ భగవానుడు చెప్పుచున్నారు - సర్వోత్తమమైన (నిరతిశయమైన) నాశరహితమైనదే, బ్రహ్మమనబడును. ప్రత్యగాత్మభావము అధ్యాత్మమని చెప్పబడును. ప్రాణికోట్లకు ఉత్పత్తిని గలుగజేయు (యజ్ఞాదిరూపమగు) త్యాగపూర్వకమైన క్రియ కర్మమను పేరు కలిగియున్నది.

**వ్యాఖ్య:-** అర్జునుడడిగిన ఏడుప్రశ్నలకును క్రమముగ భగవానుడిచట సమాధాన మొసంగుచున్నారు. అందు మొదటిప్రశ్నయగు బ్రహ్మమనగానేమి యనుదానికి సర్వోత్తమమైన (నిరతిశయమైన) నాశరహితవస్తువే బ్రహ్మమని వచింపబడెను. ప్రపంచమున సమస్త దృశ్యపదార్థములున్ను కాలక్రమమున నశించిపోవుచున్నవి. అవి క్షరములు. నశింపని వస్తువొక్కటియే కలదు. అదియే దృగ్రూపమగు పరబ్రహ్మము. అది అక్షరము. నాశరహితమైనది. 'పరమమ్', 'అక్షరమ్' అని చెప్పుటవలన అది నిరతిశయ అక్షరస్వరూపమనియు, ఏకాలమందును అది నశింపదనియు, దేశకాలాదులచే నెన్నడును పరిచ్ఛిన్నముకాదనియు స్పష్టమగుచున్నది.

ఇక రెండవప్రశ్నయగు అధ్యాత్మమనగానేమి యనుదానికి 'స్వభావమే' అధ్యాత్మమని చెప్పబడెను. స్వ+ భావము = స్వభావము. తనయొక్క భావము. అనగా ప్రత్యగాత్మ రూపమే అధ్యాత్మమని అర్థము. సామాన్యముగ జనులు అజ్ఞానవశమున తాను దేహమని, మనస్సని తలంచుచుందురు. అదియే వారిస్వరూపమని, స్వభావమని భావించుచుందురు. అది చాలపొరపాటని ఈశ్లోకముద్వారా తెలియుచున్నది. జీవుని వాస్తవస్వరూపము అధ్యాత్మము, అనగా ప్రత్యగాత్మభావమేకాని దేహాదులుకాదు. తాను దేహమని, మనస్సని, ప్రపంచవస్తువని తలంచునంతవఱకు ఎవరికిని శాంతిగాని సుఖముగాని యుండనేరవు. ఏలయనిన అవి క్షరములు. అక్షరవస్తువునందే సుఖము కలదు. కావున తనస్వభావము, తనస్వరూపము ఆత్మయేకాని నశ్వరవస్తుసముదాయము కాదను దృఢనిశ్చయము గలిగియుండవలెను.

ఇక మూడవప్రశ్న - కర్మమనగానేమి? భూతకోట్లయొక్క ఉత్పత్తికి హేతువగు యజ్ఞాదులు కర్మయని వచింపబడెను. ఎందుకనగా యజ్ఞముచే వర్షము, వర్షముచే సస్యములు, సస్యములచే ప్రాణులయుత్పత్తి సంభవించుచున్నది. ఇచట విసర్గః అనగా వదలుట, త్యాగము. యజ్ఞమునందు హోమద్రవ్యములను వదలుదురు. హోమమందు ఆజ్యాదులను వదలుదురు. కావున 'విసర్గః' అనుపదమునకు హోమాదులతోగూడిన యజ్ఞాదిక్రియలని చెప్పవచ్చును. లేక, విసర్గః అనగా త్యాగము, త్యాగముతో గూడిన క్రియయనియు చెప్పవచ్చును. (దానమందు ధనమును త్యజించుట ఇత్యాదులు). 'విసర్గః కర్మసంజ్ఞితః' అని చెప్పబడినందువలన, త్యాగముతో గూడిన క్రియయే నిజమగు క్రియయని తేలుచున్నది. అదియే ఉత్తమజన్మకు, మోక్షమునకు హేతువగును.

**ప్ర:—** బ్రహ్మమనగానేమి?

**ఉ:—** సర్వోత్తమమైన లేక నిరతిశయమైనవస్తువే బ్రహ్మము.

**ప్ర:—** అధ్యాత్మమనగా నేమి?

**ఉ:—** స్వభావము, ప్రత్యగాత్మభావము అధ్యాత్మమనబడును.

**ప్ర:—** కర్మమనగా నేమి?

**ఉ:—** ప్రాణికోట్ల ఉత్పత్తికి హేతువగు (యజ్ఞాదిరూపమగు) త్యాగపూర్వకమైనక్రియ కర్మయనబడును.

**4. అధిభూతం క్షరో భావః పురుషశ్చాధిదైవతమ్**
**అధియజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాం వర.**

**టీక:—** దేహభృతాంవర = దేహధారులలో శ్రేష్ఠుడవగు ఓ అర్జునా!, క్షరః = నశించునట్టి, భావః = పదార్థము, అధిభూతమ్ = అధిభూతము (అనబడును), పురుషః చ = విరాట్పురుషుడు, లేక హిరణ్యగర్భుడే, అధిదైవతమ్ = అధిదైవతము (అనబడును), అత్రదేహే = ఈ దేహమందు, అహమేవ = నేనే (పరమాత్మయే), అధియజ్ఞః = అధియజ్ఞుడు (అనబడుదును).

**తా:—** దేహధారులలో శ్రేష్ఠుడవగు ఓ అర్జునా! నశించుపదార్థము అధిభూత మనబడును.

విరాట్పురుషుడు లేక హిరణ్యగర్భుడే అధిదైవతమనబడును. ఈ దేహమందు నేనే (పరమాత్మయే) అధియజ్ఞుడనబడుదును.

**వ్యాఖ్య:–** 'ఈ దేహమందు అదియజ్ఞుడను నేనే' అని భగవానుడు చెప్పినందువలన, సమస్తశరీరములందును అధియజ్ఞరూపమున సాక్షాత్ పరాత్పరుడే నివసించుచున్నాడని స్పష్టపఱుపబడినది. భగవంతుడు దూరముగానున్నాడని, ఆకాశముననో పాతాళముననో ఉన్నాడని తలంచుట వెఱ్ఱి. వారు దేహాంతర్వర్తియై అతిసమీపమున నున్నాడు. కావున ఆత్మపరిశోధనచేసికొని, పంచకోశములను వేఱుచేసి అతనిని కనుగొని పరమశాంతిని బొందవలయును. మఱియు భగవత్సామీప్యమును గుర్తెఱింగి పాపకృత్యముల నెన్నడును చేయరాదు. సమస్తదేహములందును అధియజ్ఞుడై పరమాత్మ విలసిల్లుటబట్టి జనులలో ఒకరు తక్కువని, ఒకరు ఎక్కువని భావింపక సర్వప్రాణులందును సమభావముగల్గి దీనత్వమును వహింపక ఆత్మగాంభీర్యముతో నొప్పారుచు నుండవలెను.

'దేహభృతాంవర' - (దేహధారులలో శ్రేష్ఠుడు) అను పదముద్వారా మానవుడు దేహమును ధరించువాడేకాని వాస్తవముగ దేహముకాదని స్ఫురించుచున్నది.

**ప్ర:–** అధిభూత మనగానేమి?

**ఉ:–** నశించు పదార్థమే (సమస్తదృశ్యసముదాయమే) అధిభూత మనబడును.

**ప్ర:–** అధిదైవత మనగానేమి?

**ఉ:–** విరాట్పురుషుడు, లేక హిరణ్యగర్భుడే అధిదైవతము.

**ప్ర:–** అధియజ్ఞు డెవ్వడు?

**ఉ:–** ఈ దేహమందు శ్రీకృష్ణమూర్తియే (సాక్షాత్ పరమాత్మయే) అధియజ్ఞుడు.

**అ॥** ఈ ప్రకారముగ అర్జునుని మొదటి యారుప్రశ్నలకు సంక్షేపముగ సమాధానము చెప్పి ఇక చివఱిప్రశ్నయగు అంత్యకాలభగవచ్చింతనమునుగూర్చి విస్తారముగ తెలియజేయ ప్రారంభించుచున్నాడు.

**5. అన్తకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కలేబరమ్**
**యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః.**

**టీక:–** *యః* = ఎవడు, *అన్తకాలే చ* = మరణకాలమందుగూడ, *మాం ఏవ* = నన్నే, *స్మరన్* = స్మరించుచు, *కలేబరమ్* = శరరమును, *ముక్త్వా* = విడిచి, *ప్రయాతి* = వెడలుచున్నాడో, *సః* = అతడు, *మద్భావమ్* = నాస్వరూపమును, *యాతి* = పొందుచున్నాడు, *అత్ర* = ఈ విషయమమందు, *సంశయః* = సందేహము, *నాస్తి* = లేదు.

**తా:–** ఎవడు మరణకాలమందుకూడ నన్నే స్మరించుచు శరీరమును విడిచిపోవుచున్నాడో, అతడు నాస్వరూపమును పొందుచున్నాడు. ఇట సంశయమేమియును లేదు.

**వ్యాఖ్య:–** ఇక చివరిదియగు ఏడవప్రశ్నకు భగవానుడిచట సమాధానము చెప్పుచున్నాడు. అంత్యకాలమున నియమితచిత్తులై పరమాత్మ నెట్లు తెలిసికొనగలరో ఆ పద్ధతి యిచట వివరింపబడుచున్నది.

'అన్తకాలేచ' – మరణసమయమునగూడ ఎవడు పరమాత్మనే స్మరించుచు శరీరమును వీడునో, అతడు తప్పక ఆ పరమాత్మస్వరూపమునే పొందగలడని చెప్పబడినది. ఇచట 'చ' అనుపదము బాగుగ్రహింపదగియున్నది. సంస్కృతములో 'చ' అనగా 'కూడ' అని యర్థము. అంత్యకాలమందుగూడ నన్నేస్మరించువాడు ముక్తిని బొందునని శ్రీకృష్ణమూర్తి చెప్పుటవలన, జీవితకాలమందును, అంత్యకాలమందును గూడ దైవచింతన చేయవలసియుండునని స్పష్టమగుచున్నది. అట్లుకానిచో 'కూడ' అనుపదమునకు అర్థమేయుండదు. భగవంతుడు 'అన్తకాలఏవ' (అంత్యకాలమందే) అనిచెప్పలేదు. అట్లు చెప్పియుండినచో సోమరులకు చక్కటి అవకాశము చిక్కియుండెడిది. కాని మనుజులను సోమరులుగా తయారుచేయుట భగవానుని యభిమతముకాదు. 'తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర' (కాబట్టి ఎల్లకాలములందును నన్ను స్మరింపుము) అని ముందుముందు గీతాచార్యులు ఈశ్లోకాతాత్పర్యమును ఇంకను చక్కగ విశదీకరింపగలరు.

జీవితమంతయు నిరంతర దైవచింతనచేయువారికే చివరికాలమున దైవస్మరణ కలుగగలదు. పూర్వజన్మ పుణ్యసంస్కారబలముగల ఏ ఒకానొక మహానుభావునకో తప్ప తక్కిన ఎవరికిని మరణకాలమున అకస్మాత్తుగ దైవభావము కలుగదు. దానికి పూర్వమెంతయో గొప్పసాధన (Preparation) ఉండవలెను. ఒక నాటకము వేయవలెననిన అందలి పాత్రలు అభినయమును ఎన్నినెలలనుండియో బాగుగ అభ్యసించుచుందురు. ఒక విద్యార్థి పరీక్ష 'ప్యాసు' కావలెననిన సంవత్సరమంతయు బాగుగ చదువవలసియుండును. సరిగా పరీక్షరోజుననే పుస్తకముతెరచినచో అంతగా ప్రయోజనముండదు. అట్లే మరణకాలమునకు ఎంతయోముందుగనే మనుజుడు తన చిత్తమును లెస్సగ భగవన్మయముగ నొనర్చియుంచుకొనవలెను. అత్తఱి అంత్యమందు సునాయాసముగ దైవస్మరణ కలుగుటకు అవకాశముండును. మఱియు పగలంతయు ఎట్టిభావములతో గూడియుండునో, రాత్రి స్వప్నమందును అట్టిభావములే కలుగుచుండును. ఆప్రకారమే జీవితమంతయు ఎట్టిభావములు, సంకల్పములు గలిగియుండునో, అంత్యకాలమందును అవియే జ్ఞాపకమునకు వచ్చును. కాబట్టి అంత్యకాలమున భగవత్స్మరణకలుగుటకు సహాయభూతముగ నుండుటకై జీవితమంతయు భగవచ్చింతన, ధ్యాన, విచారణాదులను లెస్సగ గావింపవలెను. మనస్సు ఉత్తమదైవసంస్కారపూరితము కావలెను. మరణకాలమున ఒక్కొక్కప్పుడు దేహము కఫవాతపిత్తములచే వివశమైయుండును. లేక స్మృతితప్పియుండును. కాబట్టి సరిగా అదేసమయమున అకస్మాత్తుగ దైవచింతన ప్రారంభించదలంచుట ప్రయాసకరముగ నుండును. ఒక్కొక్కప్పుడు అసలు సాధ్యపడనూపడదు. కావున అంత్యకాల సత్సంస్కారముకొఱకై జీవితమంతయు చిత్తమును పరమార్థమయముగ నొనర్చుకొనవలెను.

'అన్తకాలేచ' అనిచెప్పుటలో ఇంకొకరహస్యమున్నుగలదు. మాయ మహాబలవత్తరమైనది. అది జీవుని మోసగించుటకై నిరంతరము కాచుకొనియేయుండును. కావున ముముక్షువు దైవవిషయమున అంతిమశ్వాసవదలువఱకును బహుజాగ్రత్తగా నుండవలెను. కనుకనే గీతాచార్యులు 'అంత్యకాలమందుగూడ నాస్మరణను వదలరాదనియు, అట్లు స్మరించువాడే ముక్తినిబొందు'ననియు సెలవిచ్చిరి. ఏమాత్ర మొకింత దైవవిస్మరణ జరిగినను దానినే మాయ ఊతగదీసికొని విజృంభించి జీవుని సంసారగర్తమున పడద్రోసివేయగలదు. పడవచే సముద్రమునంతను కష్టపడి దాటిదాటి సరిగా తీరమునకు

పదిగజములదూరములో అజాగ్రత్తగనున్నచో మనుజు డెట్లు మునిగిపోగలడో నిచ్చెన ఎక్కి ఎక్కి చివర ఒకమెట్టున్నదనగా అజాగ్రతవహించినచో ఎట్లుపడిపోవునో, అలాగుననే జీవితమంతయు దైవకృషిచేసినను, చివరిరోజులలో దానిని వదలివేసినచో మాయ ప్రవేశించి విమోహమును గలుగజేయవచ్చును. గనుక పై హెచ్చరిక చేయబడినది. ఈ సందర్భమున శ్రీవసిష్ఠమహర్షి శ్రీరామచంద్రునకుగావించిన హితబోధ స్మరింపదగియున్నది.

**తవ నావహితం చిత్తం కామః కవలయిష్యతి**
**సావధానస్య బుద్ధస్య పిశాచః కిం కరిష్యతి.** **(యోగవాసిష్ఠము)**

ఓ రామచంద్రా! అజాగ్రతగనున్నచో నీచిత్తమును కామము మ్రింగివేయగలదు. జాగ్రతగనున్నవాని చిత్తమును (కామ) పిశాచ మేమిచేయగలదు?.

'మామేవ' – (నన్నేస్మరించుచు) 'ఏవ' అను పదము ప్రయోగించుటవలన ఒక్క భగవంతునిదప్ప ఇతరమగు దేనిని చింతించరాదని తెలుపబడినది. ఏలయనిన, అట్లు దృశ్యవస్తువులనుగూడ చింతించుచుండినచో చిత్తమునకు విక్షేపముగలుగ, దైవధ్యానము సరిగాజరుగదు. ధ్యేయమందు మనస్సునకు నిలుకడ చిక్కదు. మనస్సు ఏకాగ్రముగనున్నపుడే దానిబలము హెచ్చును. కాబట్టి ఒకేదైవవస్తువునందు చిత్తమును సంలగ్న మొనర్చియుండవలెనని బోధింపబడినది.

ఇక ఆప్రకారముగ అంత్యకాలమందుగూడ భగవత్స్మరణ చేయువానికి కలుగు ఫలితమేమి? 'మద్భావంయాతి' – నాస్వరూపమునే పొందును. ఫలితము తెలిసియుండినచో కార్యాచరణమందు విశేషప్రవృత్తి సంభవించును. దైవస్మరణకు ఫలితము దైవసాక్షాత్కారమే, స్వస్వరూపాత్మానుభవమే, మోక్షమే. కాబట్టి అట్లు అంత్యకాలమందును నిరంతర భగవత్స్మరణ, చింతన చేయువాడు ఘోరసంసార దుఃఖమునుదాటి పునర్జన్మరహితుడై, శాశ్వతబ్రహ్మపదవి నొందగలడని ఇచట చెప్పబడినది. ఇంతియేకాదు. ఈవిషయమై యెవరికైనను సందేహముదయించునేమోయని తలంచి .నాస్త్యత్రసంశయః – "ఇట ఏ మాత్రము సంశయములేదు; నిక్కముగ వారు పరమాత్మపదమును బొందగలరు; ఇది ముమ్మాటికిని నిశ్చయము." అని శ్రీకృష్ణపరమాత్మ కరుణతో నుపదేశించిరి. దయార్ద్రహృదయుడగు భగవానుడు భక్తులపై అపారకరుణను ఈప్రకారముగవర్షించి జనులకు తన వాక్యములపై విశ్వాసమును గలుగజేయుచున్నారు. కాబట్టి ముముక్షువులిక సంకోచమును విడనాడి చిన్న చిన్న ఫలితములుకాక సాక్షాన్మోక్షమే ఫలితముగాగలదియు, నిరతిశయానందమే గమ్యముగాగలదియు నగు ఈ మహత్తర దైవస్మరణను శ్రద్ధాభక్తులతో నిరంతరము కొనసాగించవలెను.

**ప్ర:–** జీవుడు అంత్యకాలమందుగూడ ఎట్టి భావన గలిగియుండవలెను?

**ఉ:–** దైవమునే స్మరించుచు ఇతర భావన యెద్దియు లేకుండవలెను.

**ప్ర:–** దాని ఫలితమేమి?

**ఉ:–** దానిచే నతడు పరమాత్మస్వరూపమునే పొందుచున్నాడు.

**ప్ర:–** కాబట్టి జీవు లెట్లు ప్రవర్తించవలెను?

**ఉ:–** జీవితమంతను, అంత్యకాలమునుగూడ దైవచింతనాదులందే గడుపవలెను.

**అ॥** జీవు డేభావముతో శరీరమును వీడునో ఆ రూపమునే పొందునని వచించుచున్నాడు –

**6. యం యం వాపి స్మరన్ భావం త్యజత్యన్తే కలేబరమ్**
**తం తమేవైతి కౌన్తేయ సదా తద్భావభావితః.**

**టీక:–** కౌన్తేయ = ఓ అర్జునా!, (యః = ఎవడు) అన్తే = మరణకాలమందు, యం యం వాపి భావమ్ = ఏ యే భావమును (లేక, రూపమును), స్మరన్ = తలంచుచున్నవాడై, కలేబరమ్ = శరీరమును, త్యజతి = విడుచుచున్నాడో, (సః = వాడు) సదా = ఎల్లప్పుడును, తద్భావభావితః (సన్) = ఆ యా భావముయొక్క స్మరణముచేగలిగిన సంస్కారముగలవాడై, తం తం ఏవ (భావమ్) = ఆ యా రూపమునే, ఏతి = పొందుచున్నాడు.

**తా:–** అర్జునా! ఎవడు మరణకాలమున ఏయేభావమును (లేక రూపమును) చింతించుచు దేహమును వీడునో వాడట్టిభావముయొక్క స్మరణచేగలిగిన సంస్కారము గలిగియుండుటవలన ఆ యా రూపమునే పొందుచున్నాడు.

**వ్యాఖ్య:–** మనుజుడు నిరంతరము దేనినిగూర్చి చింతించుచుండునో దానిని గూర్చిన సంస్కారమే అతని చిత్తమున ఏర్పడును. కావున అంత్యకాలమున చిత్తమం దేసంస్కార ముండునో తదనుగుణ్యమగు జన్మనే (శరీరమునే) యాతడు పొందునని యిట చెప్పబడినది. జడభరతుడు అంత్యకాలమున లేడినిగూర్చి చింతించుచు మఱుజన్మయందు లేడియై పుట్టినట్లు భాగవతమున పేర్కొనబడియున్నది. 'యద్భావం తద్భవతి' ఎట్టి భావము గలిగియుండునో అట్టిరూపమునే పొందును. అయితే ఆ అంత్యకాలసంస్కారము జీవితకాల నిరంతర ప్రయత్నముపై ఆధారపడియున్నది. (సదా తద్భావభావితః). జీవితమంతయు దేనిని చింతించుచుండునో చివరిరోజులలోను అదియే చింతన మనస్సునకు వచ్చును. మరణకాలమందును ఆ సంస్కారమే ప్రబలముగనుండును. అందుచే మరణానంతరము ఆ యా రూపములనే అతడు పొందుచుండును. కాబట్టి జీవితమంతయు క్షణికములగు దృశ్యవస్తువులగూర్చిన విచారణలతో వెళ్లబుచ్చక, పరమాత్మచింతన చేయుచుండుచో అట్టి దైవసంస్కారమే మనస్సునందు రూఢిపడ, అంత్యకాలమందును దైవస్మరణయే అతనికి కలుగును. తత్ఫలితముగ నతడు భగవదైక్యమును, ఆత్మసాయుజ్యరూపమోక్షమును బొందును (సయాతిపరమాంగతిమ్). కాబట్టి అంత్యకాలసత్సంస్కారమును రూపొందించుటకొఱకై జీవితమంతను తత్సంబంధమైన అభ్యాసమే చేయవలెను. ప్రపంచములోకెల్ల సర్వోత్తమపదవి, దుఃఖరహితమగు నిరతిశయానందపదవి ఆత్మసాక్షాత్కారమే (భగవత్సాయుజ్యమే) కావున, తద్దైవసంస్కారము మనస్సునందు రూఢిపడుటకొఱకై జీవితమంతయు భగవచ్చింతన, స్మరణ, విచారణ, ధ్యానాదులను నిరంతరము జరుపవలెను. దైవసంస్కారము ఒక్కక్షణములో ఏర్పడునదికాదు. దానికి అనవరతప్రయత్న మవసరము. జీవితమంతయు సదా విషయసముపార్జనయందు భోగజాలసంగ్రహణములందు గడపివైచినచో అంత్యకాలమున దైవసంస్కారము, దైవస్మరణము ఎట్లేర్పడగలదు? కావున అపుడు పశ్చాత్తాపపడవలసి వచ్చును.

ఇక్కారణమున బాల్యయౌవనములందే, శరీరము ఆరోగ్యముగ నున్నపుడే, వార్ధక్యము రాకమునుపే

జీవుడు పరమార్థసాధనయం దారితేరియుండవలెను. ఉత్తమదైవసంస్కారము నేర్పఱచుకొనవలెను. బంధమునకు మోక్షమునకు తానే కర్త. ఉత్తమజన్మగాని, నికృష్టజన్మగాని, జన్మరాహిత్యముగాని తనచేతులలోనే యున్నది. అవియన్నియు జీవుని అంత్యకాలభావనపై, సంస్కారముపై ఆధారపడియున్నవి కనుకను, ఆ సంస్కారము యావజ్జీవితసాధనలపై ఆదారపడియున్నది కనుకను, జీవుడు మొదటినుండియు బహుజాగరూకుడై తనచిత్తమును దైవమయముగ గావించుకొనుచుండవలెను. 'తస్మాత్సర్వేషు కాలేషు......' అను రాబోవు శ్లోకముద్వారా ఈవిషయమునే భగవానుడింకను విశదముగ బోధింపనున్నారు. అయితే జీవితమంతను సత్సంస్కారములు గలిగి, అంత్య కాలమున ఒకవేళ కఫవాతపిత్తముల ప్రకోపముచే ఎవనికైన విస్మృతి సంభవించినను, ఆతని సద్గతి కేమియు లోటుండదని గ్రహించవలెను.

**ప్ర:–** జీవుడు మరణానంతర మేరూపమును బొందును?

**ఉ:–** మరణకాలమున ఏ యే భావమును స్మరించునో, లేక ఏ యే రూపమునుగూర్చి భావించునో, ఆ యా రూపమునే పొందును.

**ప్ర:–** అంత్యకాలమున దైవసంస్కార మెట్లేర్పడగలదు?

**ఉ:–** జీవితమంతయు దైవస్మరణ, దైవచింతనాదులను గావించుటవలన (సదాతద్భావభావితః).

**అ॥** అంత్యకాల దైవసంస్కారముకొఱకై యావజ్జీవిత దైవసంస్మరణమును ప్రోత్సహించుచున్నాడు -

## 7. తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్యచ
## మయ్యర్పితమనోబుద్ధిర్మామేవైష్యస్యసంశయః.

**టీక:–** తస్మాత్ = అందువలన, సర్వేషుకాలేషు = అన్నికాలములందును, (ఎల్లప్పుడును) మామ్ = నన్ను, అనుస్మర = స్మరింపుము, యుధ్యచ = యుద్ధమును (స్వధర్మమును) గూడ చేయుము, మయి = నాయందు, అర్పిత = సమర్పింపబడిన, మనోబుద్ధిః = మనస్సు, బుద్ధి గలవాడవై, మామ్ఏవ = నన్నే, ఏష్యసి = పొందగలవు, అసంశయః = (ఈ విషయమున) సందేహములేదు.

**తా:–** కాబట్టి ఎల్లకాలములందును నన్ను స్మరించుచు (నీస్వధర్మమగు) యుద్ధమునుగూడ జేయుము. ఈ ప్రకారముగ నాయందు సమర్పింపబడిన మనోబుద్ధులు గలవాడవైనచో నీవు నన్నే పొందగలవు. ఇట సంశయములేదు.

**వ్యాఖ్య:–** 5వ శ్లోకమున అంత్యకాలమందుగూడ (అన్తకాలేచ) భగవచ్చింతన చేయువారికి పరమాత్మపదవి సంప్రాప్తించునని తాను వచించిన వాక్యమును 'అంత్యకాలమందు మాత్రమే దైవచింతన చేయవలె' నని కొందఱు అర్థముచేసికొని జీవితకాలమంతయు సోమరులుగనుండి, విషయచింతనలో గడిపి దైవధ్యానమునకై వార్థక్యము వఱకు లేక మరణకాలమువరకు వేచియుందురేమోయని తలంచి అట్టి ప్రమత్తులకు తగిన పాఠము బోధించుటకుకాబోలు, వారిని తీవ్రముగ హెచ్చరించుటకు కాబోలు భగవానుడీ శ్లోకమును మరల చెప్పినవారైరి. 'అన్తకాలేచ' అను పైశ్లోకమునకు 'తస్మాత్ సర్వేషు కాలేషు' అను ఈ శ్లోకము భాష్యముగానున్నది. అందువలన (తస్మాత్) 'ఎల్లకాలములందును నన్ను స్మరింపుము'. 'తస్మాత్' అను

పదమును ప్రయోగించుటవలన నిరంతర దైవచింతనవలననే పైనదెల్పిన అంత్యకాలసంస్మరణ భాగ్యము లభించునని స్పష్టమగుచున్నది. దీనిచే, కేవల మొకవార్ధక్యమే, లేక మరణకాలమే భగవత్స్మరణకు కాలము కాదనియు బాల్యయౌవనములందుగూడ దైవచింతన చేయవలెననియు అర్థమగుచున్నది.

ప్రకాశము అంతరించినచో వెంటనే అంధకారమావరించునట్లు, భగవచ్చింతనను మఱచినచో మాయ తత్క్షణమే వచ్చి జొరబడుటకు అవకాశముకలదు. కాబట్టి సప్తాహాది మహోత్సవములందు అఖండదీపమును వెలిగించుచందమున హృదయకుహరమున దైవస్మృతి నిత్యము వెలుగులాగున చూడవలెను.

'అనుస్మరన్' - స్మరన్ అని చెప్పక అనుస్మరన్, అని చెప్పుటవలన పరమాత్మను మాటిమాటికి స్మరించుచుండవలెనని బోధపడుచున్నది. శ్రవణ, మనన, నిదిధ్యాసనములను విడువకుండ నాచరించుచుండవలెను. ఏదైన ఒకభావము హృదయమందు లెస్సగరూఢిపడవలెననిన స్మరణము చాలదు. అనుస్మరణము (మాటిమాటికి స్మరించుట) ఉండవలెను. ముందుగా టిక్కెట్టుకొని సిద్ధముగానున్నవానికి రైలు ఎప్పుడువచ్చినను దిగులు లేనట్లు, జీవితకాలమంతయు భగవచ్చింతనగలవానికి చిత్తము భగవన్మయమై,దైవసంస్కారపూరితమై యుండుటవలన ఆతనికి మృత్యువు ఎపుడు తటస్థించినను ఆనందముగనే యుండును.

అయితే కొందఱిట్లు ప్రశ్నించుదురు. 'అయ్యా, నిరంతరము దైవమును చింతించు చుండవలెనని చెప్పుచున్నారే, అట్లు చేయుచుండినచో ఇక మా జీవితచర్య ఎట్లు కొనసాగగలదు? కుటుంబమును పోషించుకొనుట ఎట్లు?' - అట్టివారికి తగిన సమాధానమును భగవాను డీశ్లోకమందు జెప్పెను. 'మాం అనుస్మర యుధ్య చ' - 'నన్ను స్మరించుచు యుద్ధమునుగూడ జేయుము' - ఇదియే ఆ సమాధానము. అర్జునుడు క్షత్రియుడు కావున అతని స్వధర్మమగు యుద్ధము ప్రస్తావించబడెను. తక్కినవారు వారివారి వర్ణోచిత, ఆశ్రమోచిత క్రియలను గావించుచు పరమాత్మను సంస్మరించు చుండవలెనని భావము. జనులు వారివారి దైనందినకార్యములను - పౌరోహిత్య, వ్యాపార, వ్యవసాయ, సేవాదికృత్యములను నిరాటంకముగజేసికొనుచు భగవత్స్మరణను మాత్రము విడువకుండ నుండవలెను. అర్జునుడు శ్రీకృష్ణుని ముందుపెట్టుకొని, వారినే చూచుచు, స్మరించుచు యుద్ధమను భీకరకార్యమునే నిర్వహింప గల్గినపుడు, తక్కినవారు భగవత్స్మరణచేయుచు వారివారి సంసారకార్యములను ఏల నిర్వహింపలేరు? తప్పక నిర్వహించుకొనవచ్చును. అట్లు కావింపవలెననియే భగవదాదేశము.

'మయ్యర్పితమనోబుద్ధిః' - మనుజుని మనస్సు, బుద్ధి ఎప్పుడు నిరంతరము భగవంతునియందే సమర్పితమై యుండునో, అపుడాతడు భగవత్సాయుజ్యమును తప్పక పొందగలడని యిచట చెప్పబడినది. ఇచట మనస్సుతోబాటు బుద్ధినిగూడ జేర్చుటలో ఒక విశేషము కలదు. మనస్సు సంకల్పించును; బుద్ధి నిశ్చయించును. మనస్సు సంకల్పించినదానిని బుద్ధి నిశ్చయించనిచో, ధ్రువపఱచనిచో ఆ పదార్థమునందు మనస్సు నిశ్చలముగ నిలువదు. కాబట్టి మనస్సుతోబాటు బుద్ధినిగూడ కూడగట్టుకొని పరమాత్మయందు నిలుపవలెను.

'అసంశయః' - అట్లు చేసినచో నిస్సంశయముగ దైవసాక్షాత్కారము కలుగగలదని నొక్కి చెప్పడమైనది. రెండుశ్లోకముల క్రిందటనే (5వ శ్లోకమున) 'నాస్త్యత్రసంశయః' - (ఈ విషయమున సందియములేదు) అని చెప్పి మరల వెనువెంటనే 'అసంశయః' అని పలుకుటవలన ఆ వాక్యములు పరమసత్యములని, వానిపై విశ్వాసముగలిగి తద్రీతి తప్పక ననుష్ఠింపవలెననియు బోధించినట్లైనది. జీవుడు తాను చేయవలసినది

చేసినచో, ఈశ్వరుడు తానివ్వవలసినది తప్పక ఇచ్చును. జీవుడు తన మనోబుద్ధులను నిరంతరము దైవమునకర్పించినచో, బ్రహ్మసాయుజ్యము దానియంతటనదియే వచ్చిచేరును. కావున జనులు తమ మనోబుద్ధులను దృశ్యవిషయములనుండి మరలించి దైవమందు సంస్థాపితముచేయవలెను. అపుడే తాము వాంఛించు పరమానందరూపలక్ష్యము చేకూరగలదు.

**ప్ర:–** దేవుని ఎపుడు స్మరించవలెను?

**ఉ:–** ఎల్లకాలములందు, మాటిమాటికి స్మరించవలెను.

**ప్ర:–** అట్లు నిరంతరము దైవచింతనచేయవలసియుండిన, ఇక జీవిత నిర్వహణ మెట్లు జరుగగలదు?

**ఉ:–** దైవస్మరణచేయుచు వారివారివృత్తులను, కార్యములను ధర్మపూర్వకముగ జరుపుకొనవచ్చును (మామనుస్మర యుధ్యచ).

**ప్ర:–** భగవంతుని పొందుటకు ఉపాయమేమి?

**ఉ:–** వారివారి మనోబుద్ధులను భగవంతునకు అర్పించుటయే (అనవరత దైవచింతన గావించుటయే) (మయ్యర్పిత మనోబుద్ధిః).

**అ॥** పరమాత్మనుపొందుటకు అవలంబించవలసిన ధ్యానపద్ధతిని వివరించుచున్నాడు -

**8. అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా**
**పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచిన్తయన్.**

**టీక:–** పార్థ = ఓ అర్జునా!, అభ్యాసయోగయుక్తేన = అభ్యాసమనెడి యోగముతో గూడినదియు, న అన్యగామినా = ఇతరవిషయములమీదికి పోనిదియునగు, చేతసా = మనస్సుచేత, దివ్యమ్ = అప్రాకృతుడైనట్టియు, (లేక స్వయంప్రకాశస్వరూపుడైనట్టియు), పరమమ్ = సర్వోత్తముడైనట్టియు, పురుషమ్ = పరమపురుషుని, అనుచిన్తయన్ = మాటిమాటికి స్మరించుచున్నవాడై, (తమ్ ఏవ = ఆ పరబ్రహ్మనే), యాతి = పొందుచున్నాడు.

**తా:–** ఓ అర్జునా! అభ్యాసమను యోగముతో గూడినదియు, ఇతర విషయములపైకి పోనిదియునగు మనస్సుచేత, అప్రాకృతుడైన (లేక స్వయంప్రకాశస్వరూపుడైన) సర్వోత్తముడగు పరమపురుషుని మరల మరల స్మరించుచు మనుజుడు వారినే పొందుచున్నాడు.

**వ్యాఖ్య:–** ఏ ప్రకార మాచరించినచో మనుజుడు ఆత్మసాక్షాత్కారమును బడయ గల్గునో, ఆ పద్ధతి యిచట చెప్పబడినది. ఈ శ్లోకమున ఆత్మరూపపరమపురుషుని జేరుటకు మూడు సదుపదేశములు గావింపబడినవి.

(1) అభ్యాసయోగమును శీలించవలెను.

(2) చిత్తము (పరమాత్మను విడిచి) ఇతరత్ర పోగూడదు.

(3) ఆత్మనుగూర్చియే మరల మరల చింతన చేయవలెను.

(1) 'అభ్యాసయోగము' - గీతయందు భగవానుడు మోక్షప్రాప్తికై కర్మ, భక్తి, ధ్యాన, జ్ఞానాది వివిధయోగములను గూర్చి తెలిపియుండిరి. ఇపుడీశ్లోకమున మఱియొక విచిత్రమైన యోగమును గుఱించి వచించుచున్నారు. అదియే అభ్యాసయోగము. ఇది ప్రత్యేకముగ ఒక యోగముకాకున్నను అన్ని యోగములతో మిళితమై యుండును. అభ్యాసమునకు ఒక యోగముయొక్క అంతస్తు (Status) నిచ్చి భగవానుడు దీనిని మిక్కుటముగ గౌరవించిరి.

కావున ముముక్షువులకది యెంత ప్రధానమైనదో దీనివలన తెలియగలదు. ఏ యోగమైనను అభ్యాసములేనిచో ఎట్లు ఫలించును? కావున అన్ని యోగములకును అభ్యాస మావశ్యకమే అయియున్నది. గీత 6వ అధ్యాయమున మనోనిగ్రహమునకు అభ్యాసవైరాగ్యము లెంతయో అవసరములని భగవానుడిదివఱకే తెలిపియుండిరి★. 'అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధః' - అని పతంజలి మహర్షియు ఆ విషయమునే నొక్కిచెప్పిరి. ఈ ప్రకారముగ అధ్యాత్మరంగమున అభ్యాసము ఉన్నతస్థానము నాక్రమించియున్నది. లౌకిక క్షేత్రమందును దాని యావశ్యకత అందఱును ఎఱిగినదే. దుర్వాసనలు, దుస్సంకల్పములు అభ్యాసముచే ఎట్లు రూఢిపడునో, అట్లే సద్వాసనలు, సత్సంకల్పములు, దైవవిచారణ అభ్యాసముచే స్థిరత్వమును బడయగలవు. మురికిపోవుటకు సబ్బు, సీకాయ, సున్నిపిండి మొదలైన అనేకవస్తువులున్నను, నీటితో చేరినపుడే అవి మాలిన్యమును బోగొట్టు సమర్థములగునట్లు, ఏ యోగమైనను అభ్యాసయోగముతో మిళితమైనపుడే ఫలితముల నొసంగగల్గును.

'చేతసా నాన్యగామినా' - ఇక రెండవ విషయము చిత్తము ఇతరత్ర పరుగిడ కుండుట. అనగా అవ్యభిచారరూపమై వర్తించుట. చిత్తము దృశ్యవిషయములందు వ్యాపింపక ధ్యేయవస్తువగు పరమాత్మయందే స్థిరముగనుండవలెను. దృగ్వస్తువగు ఆత్మ కన్యముగ తోచునదియంతయు అనగా దృశ్యపదార్థజాతమంతయు నశించిపోవునదియేయని నిశ్చయించి దానినుండి మనస్సును వివేకముచే మరల్చి ఆత్మయందే స్థాపనము చేయవలెను. చిత్తము ఊరకనుండజాలదు గనుక దానికి చింతించుటకు ఏదైన వస్తువు నొసంగవలెను. కాబట్టి ప్రాపంచికవస్తువులపై దానిని పోనీయక దైవవస్తువునందే కేంద్రీకరించవలెనని యిచట చెప్పబడినది.

'అనుచిన్తయన్' - పరమపరుషుడగు ఆత్మనుగూర్చియే మరల మరల చింతనజేయవలెనని బోధింపబడినది. 'చిన్తయన్' అని చెప్పక 'అనుచిన్తయన్' అని చెప్పుటచే మాటిమాటికి ఆ దైవచింతనారూప ప్రయత్నమును గావించవలెనని సూచింపబడినది. ఈ ప్రకారముగ సాధనచేయుచురాగా మనుజుడు తప్పక ఆ పరమాత్మపదమును జేరగలడని 'యాతి' అను పదముచే గీతాచార్యులు స్పష్టముగా నిరూపించివైచిరి. కాబట్టి ముముక్షువులు భగవద్వాక్యములందు పూర్ణవిశ్వాసముంచి ఆ యా సాధనలను గావించి కృతార్థులు కావలెను.

**ప్ర:—** భగవంతు డెట్టివాడు?

**ఉ:—** అప్రాకృతస్వరూపుడు, స్వయంప్రకాశరూపుడు, సర్వోత్తముడు.

★ అభ్యాసేనతు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే. (6-35)

**ప్ర:–** వారిని పొందుట కుపాయమేమి?

**ఉ:–** (1) చిత్తమును దృశ్యవిషయములపైకి పోనీయక (2) పరమాత్మనే అనవరతము చింతన జేయుచు - ఈ ప్రకారముగ సదా అభ్యాసము సలుపుచుండవలెను. ఇదియే మోక్షోపాయము.

**ప్ర:–** భగవద్ధ్యానము చేయువాని చిత్తమెట్లుండవలెను?

**ఉ:–** ధ్యేయమగు పరమాత్మయందుతప్ప మఱి దేనియందును అది ప్రవర్తింపగూడదు.

**అ॥** అట్టి ధ్యేయస్వరూపమగు పరమాత్మను వర్ణించుచు ధ్యానపద్ధతిని, తత్ఫలితమునుగూడ రెండుశ్లోకములద్వారా తెలియజేయుచున్నాడు –

**9. కవిం పురాణమనుశాసితార**
**మణోరణీయాంసమనుస్మరేద్యః**
**సర్వస్య ధాతారమచిన్త్యరూప**
**మాదిత్యవర్ణం తమసః పరస్తాత్.**

**10. ప్రయాణకాలే మనసాఽచలేన**
**భక్త్యా యుక్తో యోగబలేన చైవ**
**భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్**
**స తం పరం పురుషముపైతి దివ్యమ్.**

**టీక:–** యః = ఎవడు, భక్త్యా = భక్తితో, యుక్తః = కూడుకొనినవాడై, ప్రయాణకాలే = అంత్యకాలమునందు, యోగబలేన = ధ్యానాభ్యాస సంస్కారబలముచే, ప్రాణమ్ = ప్రాణవాయువును, భ్రువోః = కనుబొమ్మలయొక్క, మధ్యే = నడుమ (భ్రూమధ్యమందు), సమ్యక్ = లెస్సగా, ఆవేశ్య = నిలిపి, చ = పిదప, కవిమ్ = సర్వజ్ఞుడును, పురాణమ్ = పురాతనుడును, అనుశాసితారమ్ = సర్వలోకనియామకుడును, అణోః = అణువుకంటెను, అణీయాంసమ్ = మిక్కిలిసూక్ష్మమైనవాడును, సర్వస్య = సమస్త ప్రపంచమునకును, ధాతారమ్ = ఆధారమైనవాడును (పోషించిరక్షించువాడును), అచిన్త్యరూపమ్ = చింతింప శక్యముకాని స్వరూపముకలవాడును, ఆదిత్యవర్ణమ్ = సూర్యునికాంతివంటి కాంతిగలవాడును (స్వయంప్రకాశరూపుడును), తమసః = అజ్ఞానాంధకారమునకు, పరస్తాత్ = ఆవలనుండువాడును, (అగు) పురుషమ్ = పరమాత్మను, అచలేన మనసా = నిశ్చలమనస్సుచే, అనుస్మరేత్ = ఎడతెగకచింతించునో, సః = అతడు, దివ్యమ్ = ప్రకాశస్వరూపుడైన, పరమ్ = సర్వోత్తముడగు, తమ్ ఏవ = ఆపరమాత్మనే, ఉపైతి = పొందుచున్నాడు.

**తా:–** ఎవడు భక్తితో గూడుకొనినవాడై, అంత్యకాలమునందు యోగబలముచే (ధ్యానాభ్యాససంస్కారబలముచే) ప్రాణవాయువును భ్రూమధ్యమున (కనుబొమ్మల నడుమ) బాగుగానిలిపి,

ఆ పిదప సర్వజ్ఞుడును, పురాణపురుషుడును, జగన్నియామకుడును అణువుకంటెను మిగుల సూక్ష్మమైనవాడును, సకలప్రపంచమునకు ఆధారభూతుడును (సంరక్షకుడును), చింతింప నలవికాని స్వరూపముగలవాడును, సూర్యునికాంతివంటి కాంతిగలవాడును (స్వయంప్రకాశ స్వరూపుడును), అజ్ఞానాంధకారమునకు అవలనుండువాడునగు పరమాత్మను నిశ్చలమనస్సుచే ఎడతెగకచింతించునో ఆతడు దివ్యస్వరూపుడైన సర్వోత్తముడగు ఆ పరమాత్మనే పొందుచున్నాడు.

**వ్యాఖ్య:–** పరమాత్మ ఎట్టివాడో తెలుపుచు వారి నెట్లు ధ్యానించవలెనో ఆ పద్ధతియు చెప్పుచున్నారు. ధ్యాతకు ధ్యేయవస్తువుపై పూర్ణవిశ్వాసము కలుగవలెననిన ముందుగా, వారిస్వరూపము, మహిమ బాగుగ తెలిసికొనియుండవలెను. ఒక వస్తువు యొక్క స్వరూపస్వభావములు పూర్తిగాతెలిసినపుడుమాత్రమే దానినిగూర్చి చింతించుటకు వీలుపడునుగదా! కావున ఇచటగూడ ధ్యానపద్ధతిని వివరించుటకు ముందుగా ధ్యేయస్వరూపమగు పరమాత్మయొక్క స్వరూపము 'కవిం పురాణం' అను శ్లోకముద్వారా యెనిమిదిలక్షణములతో చెప్పబడినది.

(1) 'కవి' – పరమాత్మ కవి. అనగా సర్వజ్ఞుడు. కవులకు కవి. ఆ పరమకవిని యెఱుగుటయే ముఖ్యమైన కవిత్వము.

(2) పురాణపురుషుడు – ఆతడు సనాతనుడు, అనాది స్వరూపుడు. ప్రపంచములో గల సమస్త దృశ్యపదార్థములకును ఆది కలదు. పరమాత్మకు ఆది లేదు. ఆది కలదానికి అంతమున్ను ఉండును. కావున దృశ్యవస్తువులు నశ్వరములు. పరమాత్మ శాశ్వతుడు.

(3) శాసకుడు – సర్వజీవులను, సర్వలోకములను శాసించువాడు, నియామకుడు, ప్రభువు. చిన్న చిన్న రాజ్యాధినేతలనే జనులు కొల్చునపుడు బ్రహ్మాండనియామకుడగు పరమేశ్వరుని యెంతభక్తితో కొలువవలెను?

(4) సూక్ష్మరూపి – అణువుకంటెను సూక్ష్మమైనవాడు. 'అణోరణీయాన్ మహతో మహీయాన్' – అణువుకంటెను సూక్ష్మతమమైనవాడని, మహద్వస్తువులకంటె మహత్తరమైనవాడని భగవంతునిగూర్చి ఉపనిషత్తులున్ను ఘోషించుచున్నవి. కావున ప్రతి అణువునందును సూక్ష్మముగ వ్యాపించియున్న ఆ పరమాత్మయొక్క సన్నిధానమును సర్వత్ర అనుభవించుచు భక్తిప్రపత్తులు గలిగియుండవలెను.

(5) సర్వాధారుడు – సమస్తప్రపంచమును ధరించువాడు, పోషించువాడు, సంరక్షించువాడు, ఆధారభూతుడు. దృశ్యపదార్థములు జడములు. చైతన్యము యొక్క ఆధారములేనిదే అవి నిలువజాలవు. ఆ చైతన్యాధారమే పరమాత్మ.

(6) అచింత్యరూపుడు – ఇంద్రియమనంబులకు అతీతుడు. కావున మనస్సుచే చింతించుటకు అలవికానివాడు. అయినను శుద్ధమనస్సు నిరంతరధ్యానముచే సముద్రమందు నదివలె ఆ పరమాత్మయందు లయమై తద్రూపమే అయి వెలయగలదు. మలినచిత్తమునకు పరమాత్మ యెన్నటికిని విషయుడు కానేరడు. శుద్ధచిత్తముచే నాతనిని తెలిసికొనవచ్చును. అనుభూతమొనర్చుకొనవచ్చును. అయితే ఒకానొక దృశ్యవస్తువును తెలిసికొనినట్లుకాక, తత్స్వరూపమున లయమై, తదాకారమై వర్తించుటద్వారా ఆతని యనుభూతిని బొందవచ్చును.

అట్లుకానిచో 'బుద్ధిగ్రాహ్య'మని 6వ అధ్యాయముననను, 'అనుస్మరేత్' అని ఈశ్లోకముననను ఏల చెప్పియుండును.

(7) ఆదిత్యవర్ణుడు - ప్రకాశస్వరూపుడని అర్థము. సూర్యులనుగూడ ప్రకాశింపజేయు జ్ఞానసూర్యుడతడు (తస్య భాసా సర్వమిదం విభాతి).

(8) తమస్సునకు పరమైనవాడు - మాయకు, అజ్ఞానమను చీకటికి విలక్షణుడై వాని కతీతుడై పఱగువాడు పరమాత్మ.

ఈ ప్రకారమగు లక్షణములతో గూడిన పరమాత్మను అంత్యకాలమున మనుజుడు ఏకాగ్రచిత్తుడై, భక్తిభావముతో నిరంతరము చింతనజేయవలెను. ఇచట అంత్యకాలమునకు ప్రయాణసమయమని పేరుపెట్టిరి. అనగా అత్తఱి సంభవించునదియు ఒకానొక ప్రయాణమే యనియు, అయితే దీర్ఘప్రయాణమనియు భావించి, ప్రయాణమునకు ముందుగా ఏ ప్రకారము వస్తువులన్నిటిని సర్దుకొని దారిబత్తెమును జాగ్రతగ గ్రహించి వెడలుదురో, అట్లే పరలోక ప్రయాణమునకు వలసిన పుణ్యసంపత్తిని ముందుగనే సేకరించి యుంచుకొనవలెను.

అట్టి అంత్యకాలమున ఏ ప్రకారము పరమాత్మను ధ్యానింపవలసినది ఇట చెప్పబడినది. (1) భక్తితో గూడుకొని (2) యోగబలముచే ప్రాణవాయువును లేక దృష్టిని భ్రూమధ్యమున నిలిపి నిశ్చలమనస్సుతో పైన తెలుపబడిన లక్షణములతో గూడుకొనిన పరమాత్మను ధ్యానింపవలెను. ఇచట భక్తియు, యోగమును. రెండును తెలుపబడినవి. రెండును ధ్యానయోగికి అత్యవసరములని స్పష్టమగుచున్నది. అహంకారము చచ్చుటకు, భగవానుని అనుగ్రహము సంపాదించుటకు భక్తిభావము చాల అవసరమైయున్నది. అట్లే చిత్తముయొక్క ఏకాగ్రతకొఱకు ఇంద్రియమనోనిగ్రహరూప యోగమున్ను ఆవశ్యకమైయున్నది. కనుకనే 'భక్త్యా' 'యోగబలేన' అను పదములచే భక్తిని, యోగమును రెండిటిని బోధించిరి. 'అనుస్మరన్' అని చెప్పుట వలన భగవంతుని ఎడతెగక చింతించుచుండవలెనని అర్థము. 'అచలేన మనసా' అని పేర్కొనుటవలన మనస్సు బహునిశ్చలముగ నుండవలెననియు, చపలచిత్తము పరమాత్మను గ్రహింపజాలదనియు నిరూపింపబడినది.

ఈప్రకారమగు భగవద్ధ్యానము అంత్యకాలమున చేయవలెనని బోధింపబడినను అంత్యమున ఉత్తమసంస్కారము కలుగునిమిత్తము జీవితకాలమంతను ఆప్రకారముగ అభ్యాసముచేయవలెననియే భావము. లేనిచో ఇచట తెలుపబడిన 'యోగబలము' (యోగబలేన) మరణకాలమున అకస్మాత్తుగ ఎట్లుచేకూరగలదు? కాబట్టి జీవితమందలి సర్వకాల సర్వావస్థలయందును ఆ పరాత్పరుని నిశ్చలమనస్సుతో, భక్తిభావముతో ఎడతెగక స్మరించుచు అంత్యకాలమునగూడ ఆప్రకారమే యుండవలెను. అట్లు కావించినచో దానికి ఫలితము సాక్షాన్మోక్షమే, భగవదైక్యమే (పురుషముపైతిదివ్యమ్). ఆహా! ఎట్టి అపూర్వఫలితము! కావున చిన్న చిన్న ప్రాపంచిక ఫలములకై రాత్రింబగళ్లు శ్రమించు వారు భగవానుని ఈ వాక్యముల నాలకించి నిరతిశయానందరూపమైన సర్వోత్తమ పరమాత్మపదమునకై యత్నించుట శ్రేయస్కరము.

ప్ర:– పరమాత్మ యెట్టివాడు?

**ఉ:–** (1) సర్వజ్ఞుడు (2) అనాదిస్వరూపుడు (3) జగన్నియామకుడు (4) అణువు కంటెను సూక్ష్మరూపుడు (5) సర్వాధారుడు (6) అచింత్యరూపుడు (7) ఆదిత్యవర్ణుడు (స్వయంప్రకాశరూపుడు) (8) తమస్సునకు (ప్రకృతికి) అవలనున్నవాడు.

ప్ర:– అంత్యకాలమున ఏ ప్రకార మాతనిని ధ్యానించవలెను?

ఉ:– (1) నిశ్చలమనస్సుతో (2) భక్తిభావముతో (3) యోగబలముచే ప్రాణవాయువును, లేక దృష్టిని భ్రూమధ్యమున నిలిపి, పై లక్షణములుగల పరమాత్మను యెడతెగక ధ్యానించవలెను.

ప్ర:– అట్లు చేయుటవలల ఫలితమేమి?

ఉ:– సాక్షాత్ పరమాత్మపదమే ఆతనికి లభించును?

ప్ర:– కావున భగవత్ప్రాప్తికి ఉపాయమేమి?

ఉ:– నిశ్చలచిత్తముతో, నిర్మలభక్తితో, దైవమును సదా ధ్యానించుటయే.

అ॥ ఆ పరమాత్మపదము (బ్రహ్మపదము) ఎట్టి మహిమగలదియో వచించుచున్నాడు –

**11. యదక్షరం వేదవిదో వదన్తి
విశన్తి యద్యతయో వీతరాగాః
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి
తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే.**

**టీక:–** వేదవిదః = వేదార్థము నెఱిగినవారు, యత్ = దేనిని, అక్షరమ్ = నాశములేని దానినిగా, వదన్తి = చెప్పుచున్నారో, వీతరాగాః = రాగరహితులగు (పోయినకోరికలుగల, లేక కామక్రోధాదులను జయించిన), యతయః = యత్నశీలురు (జితేంద్రియులు), యత్ = దేనిని, విశన్తి = ప్రవేశించుచున్నారో, యత్ = దేనిని, ఇచ్ఛన్తః = కోరుచున్నవారై, బ్రహ్మచర్యమ్ = బ్రహ్మచర్యమును, చరన్తి = అనుష్ఠించుచున్నారో, తత్ పదమ్ = ఆ స్థానమును, తే = నీకు, సంగ్రహేణ = సంక్షేపముగ, ప్రవక్ష్యే = చెప్పెదను.

**తా:–** వేదవేత్తలు దేనిని నాశరహితమైనదానినిగ జెప్పుచున్నారో, రాగరహితులగు (కోరికలు నశించిన) యత్నశీలురు (జితేంద్రియులు) ఎద్దానియందు ప్రవేశించుచున్నారో, దేనిని అభిలషించుచు జనులు బ్రహ్మచర్యము ననుష్ఠించుచున్నారో అట్టి (పరమాత్మ) పదమునుగూర్చి నీకు సంక్షేపముగ జెప్పెదను.

**వ్యాఖ్య:–** పరమాత్మపదమును (మోక్షస్థానమును) గూర్చి సంగ్రహముగ జెప్పెదనని శ్రీకృష్ణమూర్తి వచించిరి. అది యుద్ధసమయముగనుక విశేషించి చెప్పుటకు అవకాశము లేదు కావునను, బ్రహ్మపదమును ఎంతవర్ణించినను అంతముండదుగనుకను, సంక్షేపముగ చెప్పెదనని భగవాను డానతిచ్చిరి. ముముక్షువుల కియ్యది అతిముఖ్యమైనబోధగా నుండగలదు. ఏలయనిన, వేదములయొక్క సారమంతయు పిండి సంగ్రహరూపముగ సాక్షాత్ భగవాను డిచట పేర్కొనుచున్నారు. ప్రణవోపాసన బోధింపబోవుచున్నారు. ఆ పరబ్రహ్మపద మెట్టిదనిన –

(1) వేదవేత్తలు దానిని నాశరహితమైనదానినిగ (అక్షరముగ) పేర్కొనుచున్నారు. ప్రపంచములోని సమస్తపదార్థములు నాశవంతములు, క్షణికములు, క్షరములు. బ్రహ్మము (ఆత్మ) ఒకటియే నాశములేనిది, అక్షరమైనది, త్రికాలాబాధ్యమైనది. ప్రతివారును వారివారిజీవితములో ముఖ్యముగ తెలిసికొనదగినది ఈ పరబ్రహ్మమే అయియున్నది. తక్కినవి ఎన్నితెలిసికొనినను శాశ్వతసుఖము నవి ప్రసాదింపజాలవు. కనుకనే బాల్యకాలమున పిల్లలకు అక్షరాభ్యాసమని ఒక నియమమేర్పడినది. అక్షరమగు పరమాత్మను బోధించుటయే నిజమగు అక్షరాభ్యాసము. అక్షరములను నేర్పునపుడు పరబ్రహ్మవాచకమగు 'ఓం' కారమును మొట్టమొదట వ్రాయించుట కిదియే కారణము. కావున ఇతరవిద్యల నెన్నిటిని గ్రహించినను పరావిద్యయగు ఈ అక్షర (బ్రహ్మ) విద్యనుమాత్రము త్యజించరాదు. మఱియు వేదముల నెఱుగుటయనగా వేదార్థమును అనుభూతమొనర్చుకొనుట, ఆచరణయందుంచుట. 'వాచా' జ్ఞానము మాత్రము కలిగియుండుటకాదు. కనుకనే వేదవేత్తలు పరమాత్మను చక్కగ అనుభూతమొనర్చుకొని, సాక్షాత్కరించుకొని ఆతనిని 'అక్షరునిగ' కనుగొనగల్గిరి (అక్షరం వేదవిదో వదన్తి).

(2) అట్టి పరమాత్మ పదమునం దెవరు ప్రవేశింపగలరు? అను ప్రశ్నకుకూడ యిట సమాధానము చెప్పబడినది. రాగద్వేషరహితులు, కామక్రోధాది దుర్వాసనావర్జితులు (వీతరాగులు) మాత్రమే మోక్షసౌధమున ప్రవేశింపగలరుగాని తదితరులు కాదు. మోక్షధామప్రవేశమునకీ రాగవివర్జితత్వ మొక టిక్కెట్టువంటిది. టిక్కెట్టులేనివారిని, అనుమతిపత్రము పొందియుండనివారిని గొప్పగొప్ప రాజభవనములం దెట్లు పోనీయరో, అట్లే కామము నశింపనివారు, కోరికలు తొలగనివారు, రాగాదులు క్షయింపనివారు అక్షరబ్రహ్మపదమున, మోక్షసౌధమున ప్రవేశింపజాలరు. అవి నశించినవారే నిరాటంకముగ, నిర్భయముగ పోగలరు. కాబట్టి 'నాకింకను మోక్షముకలుగలేదే' యని యెవరును వెతలనొందక భగవానుడు తెలిపిన ఈ వీతరాగత్వ మభ్యసించిన చాలును.

'యతయః' - (ప్రయత్నశీలురు) అని చెప్పుటవలన దైవవిషయమున లెస్సగ యత్నించువారు, పెక్కుకష్టములకోర్చి తీవ్రమగు సాధనలను జరుపువారు, ఇంద్రియనిగ్రహపరులు మాత్రమే మోక్షమార్గమున సాఫల్యము నొందగలరేకాని తదితరములగు సోమరులుకాదని స్పష్టమగుచున్నది. యత్నరహితులగు సోమరు లెన్నటికిని అక్షరమగు మోక్షపదమును బడయజాలరు. ఒక చిన్న ప్రాపంచిక వస్తువును సంపాదించుటకే ఎంతయోయత్న మావశ్యకమైయుండ, అనేక జన్మలనుండివచ్చుచున్న దుష్టవాసనలను, దుస్సంస్కారములను నశింపజేసి, పరబ్రహ్మమను మహోన్నతపదము నధిష్ఠించుటకు ప్రయత్న మవసరము కాదా?

(3) ఇక మూడవవిషయము బ్రహ్మచర్యము, 'ఏ పరమాత్మపదము నభిలషించుచు జనులు బ్రహ్మచర్యము ననుష్ఠించుచున్నారో!' అని యిచట చెప్పబడినందున దైవప్రాప్తికి, మోక్షమునకు బ్రహ్మచర్య మత్యావశ్యకమని తేలుచున్నది. మోక్షమునకై యత్నించువారికీబ్రహ్మచర్య మెంతయో సహాయపడగలదని ఈ భగవద్వాక్యములవలన స్పష్టమగుచున్నది. అధ్యాత్మక్షేత్రమున బ్రహ్మచర్యమున కెంతటి ప్రాముఖ్యతను భగవాను డొసంగిరో ఇచట విశదమగుచున్నది. కాయికముగా, వాచకముగా, మానసికముగా విషయసంపర్కము లేకుండుటయు, బ్రహ్మమందు చిత్తమును లగ్నముచేయుటయు బ్రహ్మచర్య మనంబడును.

'ప్రవక్ష్యే' - (లెస్సగచెప్పెదను) - 'వక్ష్యే' అనకుండ 'ప్రవక్ష్యే' అనుట వలన భగవానుడు చెప్పబోవు

బ్రహ్మోపాసనవిషయము ఎంతముఖ్యమైనదో, దాని యెడల ముముక్షువులు ఎంతటి విశ్వాసము కలిగియుండవలెనో తేటతెల్లమగుచున్నది. ఈ శ్లోకమునుబోలిన శ్లోకము కఠోపనిషత్తునందును గలదు★.

**ప్ర:—** పరమాత్మపదము (మోక్షపదము) ఎట్టిది?

**ఉ:—** నాశరహితమైనది (అక్షరము).

**ప్ర:—** ఈ సత్యము నెవరు తెలిసికొనుచున్నారు?

**ఉ:—** వేదవేత్తలగు మహనీయులు.

**ప్ర:—** అట్టి పరమాత్మపదమున ఎవరు ప్రవేశింపగల్గుచున్నారు?

**ఉ:—** కోరికలు నశించినవారు (వీతరాగులు), బ్రహ్మచర్యము ననుష్ఠించువారు.

**ప్ర:—** దీనినిబట్టి మోక్షప్రాప్తికి ఉపాయము లేవియని స్పష్టమగుచున్నది?

**ఉ:—** (1) కోరికలు నశించుట (రాగాదులు తొలగుట) (2) బ్రహ్మచర్యమును లెస్సగ అనుష్ఠించుట.

**అ॥** ప్రణవోపాసనారూపమగు ధ్యానపద్ధతిని రెండు శ్లోకములద్వారా వివరించి చెప్పుచున్నాడు -

**12. సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్యచ**
**మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్.**

**13. ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్**
**యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్.**

**టీక:—** యః = ఎవడు, సర్వద్వారాణి = ఇంద్రియద్వారములన్నిటిని, సంయమ్య = బాగుగ అరికట్టి (నియమించి), మనః = మనస్సును, హృది = హృదయమందు (ఆత్మయందు), నిరుధ్యచ = లెస్సగస్థాపించి (నిలిపి), మూర్ధ్ని = శిరస్సునందు (బ్రహ్మరంధ్రమున), ప్రాణమ్ = ప్రాణవాయువును, ఆధాయ = ఉంచి, ఆత్మనఃయోగధారణామ్ = ఆత్మనుగూర్చిన యోగధారణమును (ఏకాగ్రచింతనమును), ఆస్థితః = పొందినవాడై (దృఢముగ నాశ్రయించినవాడై), బ్రహ్మ = పరబ్రహ్మమునకు వాచకమైన, ఓమ్ఇతి = 'ఓమ్' అను, ఏకాక్షరమ్ = ఒక్క అక్షరమును, వ్యాహరన్ = ఉచ్చరించుచు, మామ్ = నన్ను, అనుస్మరన్ = ఎడతెగక చింతించుచు. దేహమ్ = శరీరమును, త్యజన్ = విడుచుచున్నవాడై, ప్రయాతి = పోవుచున్నాడో, సః = అతడు, పరమాంగతిమ్ = సర్వోత్తమైన స్థానమును (మోక్షమును), యాతి = పొందుచున్నాడు.

**తా:—** ఎవడు ఇంద్రియద్వారములన్నిటిని బాగుగ అరికట్టి, మనస్సును హృదయమందు (ఆత్మయందు) లెస్సగా స్థాపించి, శిరస్సునందు (బ్రహ్మరంధ్రమందు) ప్రాణవాయువు నుంచి, ఆత్మనుగూర్చిన ఏకాగ్రచింతనము (యోగధారణ) గలవాడై పరబ్రహ్మమునకు వాచకమైన 'ఓమ్' అను ఒక్క

★ సర్వేవేదా యత్పదమామనన్తి తపాంసి సర్వాణి చ యద్వదన్తి
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తేపదం సంగ్రహేణ బ్రవీమ్యోమిత్యేతత్. (కఠ 1-2-15)

అక్షరమును ఉచ్చరించుచు నన్ను ఎడతెగక చింతించుచు శరీరమును వదలునో అతడు సర్వోత్తమస్థానమును (మోక్షమును) బొందుచున్నాడు.

**వ్యాఖ్య:–** పరమగతియగు మోక్షమునుబొందు విధాన మిచట చెప్పబడుచున్నది. ఈ విధానమును అంత్యకాలమున మాత్రము చేయవలెనని అర్థము కాదు. జీవితకాలమంతను ఆ ప్రకారముగ చేయుచు, అంత్యకాలమునగూడ అట్టిస్థితియందే ఉండవలెనని భావము. ఇచట నాలుగు సాధనలు చెప్పబడినవి – (1) ఇంద్రియద్వారముల నరికట్టుట (2) మనస్సును హృదయమందు స్థాపించుట (3) ప్రాణవాయువును శిరస్సునందుంచి ఆత్మచింతనారూపయోగధారణ నవలంబించుట (4) ఓంకారము నుచ్చరించుచు బ్రహ్మమును భావించుట. వానిని గుఱించి సంక్షేపముగ విచారించెదము.

(1) ఇంద్రియద్వారములన్నిటిని సంయమనమొనర్చుట ధ్యానమునకు అత్యావశ్యకము. వానిని తెరచియుంచినచో మనస్సు ఆ యా ఇంద్రియములవెంట బహిర్ముఖముగ జనుటవలన ధ్యేయమగు ఆత్మయందు ఏకాగ్రత కుదరదు. గాలి ఎక్కువగ వీచునపుడు కిటికీలు తెరచియుంచినచో ఇంటిలోనగల ప్రమిదదీపము ఆరిపోవునట్లు, ఇంద్రియద్వారములను అరికట్టనిచో జ్ఞానజ్యోతి ఆరిపోవును. కనుకనే ఇంద్రియములు వానివాని విషయములగు ఇంద్రియార్థములపైకి పోకుండ నిగ్రహించవలెనని ఇట చెప్పబడినది. 'సర్వేన్ద్రియాణి' అని చెప్పుటవలన ఏ ఒకటి రెండు ఇంద్రియములనో నిగ్రహించిన చాలదనియు అన్నిటిని నిగ్రహించవలెననియు బోధింపబడినది. ఒక్క కిటికీ తెరువబడియున్నను గాలికి దీపమారిపోవునుగదా! మోక్షప్రాప్తికి వలసిన నాలుగు సాధనలలోను ఇచట ఇంద్రియనిరోధమును మొట్టమొదటగా పేర్కొనుటలో ఒక విశేషము కలదు. అది యేదియనిన – వానిని అరికట్టిననేగాని తక్కిన ఏ యితర సాధనము చక్కగా జరుగదు. కనుకనే 'తస్మాత్త్వమిన్ద్రియాణ్యాదౌ నియమ్యభరతర్షభ' అని భగవాను డిదివఱలో చెప్పియుండిరి. 'ఆదౌ' మొదటనే ఆ పని చేయవలెనని ఆదేశించిరి. కాబట్టి మోక్షమును గోరువారందఱును ప్రప్రథమమున తమ ఇంద్రియద్వారములు మూసి (అరికట్టి), బహిఃప్రపంచముపై వానిని విస్తరింపజేయక తాబేలు తన అవయవములను ముడుచుకొనునట్లు ఇంద్రియములను లోనికి ముడుచుకొనవలెను.

(2) తదుపరి మనస్సును హృదయమందు జేర్చవలెను. హృదయమనగా పరమాత్మస్థానము. బయట విచ్చలవిడిగ మనస్సును తిరగనీయక, లోనికిలాగి హృదయమున (ఆత్మయందు) స్థాపించవలెను. మనస్సుయొక్క జన్మస్థానము హృదయము. కావున దానిని అచటనే లయపఱచవలెను. మొదటిసాధనచే ఇంద్రియములను భృత్యువు లెపుడు నిగ్రహింపబడిరో, అపుడు నాయకుడగు మనస్సున్ను శక్తిహీనుడై సులభముగ వశపడును.

(3) పిమ్మట ప్రాణవాయువును శిరస్సునందు (బ్రహ్మరంధ్రమున) నిలిపి 'యోగధారణ'ము నవలంబించవలెను. మనస్సును పరమాత్మయందు నిశ్చలముగ నిలిపి ఏకాగ్రతతో ధ్యానించుటయే యోగధారణము.

(4) ఇక ధ్యానించుటకు చక్కని మంత్ర మిచట తెలుపబడినది. అదియే ప్రణవము (ఓంకారము). అది పరబ్రహ్మమునకు వాచకము. వేదములయొక్క సారము (ప్రణవస్సర్వవేదేషు). మంత్రముల కన్నిటికిని రాజు. 'వ్యాహరన్' (ఉచ్చరించుచు) – అని చెప్పి వెంటనే 'మామనుస్మరన్' (నన్నుమాటిమాటికి చింతనజేయవలెను) అనియు చెప్పుటవలన అట్టి ఓంకారమును కేవల ముచ్చరించినమాత్రమున

చాలదనియు, దాని యర్థమునుగూడ బాగుగ మననముచేయవలెననియు స్పష్టమగుచున్నది. ఏలయనిన మంత్రమునుమాత్ర ముచ్చరించి మంత్రార్థమును భావించనిచో ఆ మంత్రమువలన పూర్ణఫలము కలుగనేరదు. ఫిరంగిలో మందు మాత్రము కూరి గుండులేక కాల్చినచో శబ్దమువచ్చునేకాని లక్ష్యము నది భేదింపదు. అట్లే ప్రణవజపమున్ను అర్థయుక్తముగ చేసిననే బ్రహ్మమను లక్ష్యము నది చేర్చగలదు. 'అనుస్మరన్' అని పేర్కొనుటవలన మరల మరల ఎడతెరిపిలేక పరమాత్మను చింతనజేయవలెనని బోధింపబడినది.

ఈప్రకారముగ పై నాలుగుసాధనలను అవలంబించువాడు పరమాత్మపదమును శీఘ్రముగ జేరగలడని తెలుపబడినది. 'యః' (ఎవడైన) అని ప్రయోగింపబడినందువలన, ఏజాతివాడైనను, ఏమతమువాడైనను, స్త్రీయైనను, పురుషుడైనను, పైసాధన లాచరించినచో, ప్రణవమును జపించినచో పరమగతిని తప్పక బొందగలడని తేలుచున్నది. 'పరమాం గతిమ్' అని తెలుపుటవలన, బ్రహ్మపదవి ప్రపంచములోగల అన్నిపదవులకంటెను సర్వోత్కృష్టమైనదని స్పష్టముచేయబడినది. కాబట్టి చిన్నచిన్న ప్రాపంచిక పదవులకై శక్తిని ధారబోయుటకంటె నిరతిశయానందరూప సర్వోత్తమ ఆత్మపదవికై ప్రయత్నించుట మేలు.

ఈ శ్లోకముద్వారా ఈ క్రింది విషయములు స్పష్టపడుచున్నవి -

(1) జపముమాత్రము చాలదు. ధ్యానముకూడ ఉండవలెను. అనగా మంత్రోచ్చారణతోబాటు మంత్రార్థచింతనమున్ను ఉండవలెను.

(2) అన్నిమంత్రములలోను ఓంకారమే, అనగా ప్రణవమంత్రమే శ్రేష్ఠమైనది.

(3) భగవంతుని ఎపుడో ఒకపుడు స్మరించుట చాలదు. మరల మరల నిరంతరము స్మరించుచుండవలెను.

(4) ఇంద్రియములలో ఏ ఒకటి రెండింటినో అరికట్టుట చాలదు; అన్నిటిని నిగ్రహించవలెను.

(5) మనస్సు లయించుచోటు హృదయము.

(6) దైవముపై భక్తిశ్రద్ధలు గలిగియున్నవాడెవడైనను ప్రణవమంత్రమును జపించుచు, ధ్యానించుచు పరమాత్మపదము నొందవచ్చును. ఇచట జాతి మత కుల లింగ విచక్షణ యేమియులేదు.

**ప్ర:–** ఈ ప్రపంచమున సర్వోత్తమస్థాన మెయ్యది?

**ఉ:–** పరమాత్మస్థానము (బ్రహ్మపదవి).

**ప్ర:–** దాని నెవరు పొందగలరు?

**ఉ:–** ఎవడు (1) సమస్తేంద్రియములను నిగ్రహించునో (2) మనస్సును హృదయమున (ఆత్మయందు) స్థాపించునో (3) ప్రాణవాయువును, లేక దృష్టిని శిరస్సునందు (బ్రహ్మరంధ్రమునందు) నిలిపి ఆత్మచింతనారూప యోగధారణ నవలంబించునో (4) 'ఓం' అను ఏకాక్షరమైన ప్రణవమంత్రమును జపించుచు ప్రణవార్థమగు పరబ్రహ్మమును లెస్సగ చింతించుచుండునో, అట్టివాడు ఆ సర్వోత్తమ దైవపదమును బొందగలడు.

**అ॥** నిరంతర యత్నశీలునిచే పరమాత్మ సులభముగ పొందబడునని వచించుచున్నాడు -

**14. అనన్యచేతాస్సతతం యో మాం స్మరతినిత్యశః**
**తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః.**

**టీక:–** పార్థ = ఓ అర్జునా!, యః = ఎవడు, అనన్యచేతాః = ఇతరవిషయములందు ప్రవర్తింపని మనస్సుగలవాడై, మామ్ = నన్ను, నిత్యశః = ప్రతినిత్యము (ప్రతిదినము), సతతమ్ = ఎల్లప్పుడు, స్మరతి = స్మరించుచున్నాడో, నిత్యయుక్తస్య = నిరంతరధ్యానపరుడైన, తస్య = అతనికి, అహమ్ = నేను, సులభః = సులభముగా పొందబడువాడనగుదును.

**తా:–** ఓ అర్జునా!, ఎవడు అనన్యచిత్తుడై నన్నుగూర్చి ప్రతిదినము నిరంతరము స్మరించుచుండునో అట్టి నిరంతరధ్యానపరునకు నేను సులభముగ పొందబడువాడనై యున్నాను.

**వ్యాఖ్య:–** భగవంతుని ఎవరు సులభముగ పొందగలరో యిచట వచింపబడినది. మోక్షమునుబడయుట, భగవానుని సాక్షాత్కరించుట బహుకష్టతరమని జనులు భావించుదురు. కాని చేయవలసిన పద్ధతిప్రకారము ప్రయత్నముచేసినచో బహుసులభముగ పరమాత్మను పొందవచ్చునని ఇచట చెప్పబడుచున్నది. ఎవడు అనన్యచిత్తుడై ప్రతిదినము నిరంతరము భగవచ్చింతన చేయుచుండునో ఆతడు దైవమును సులభముగ పొందగలడని వచింపబడినది.

'అనన్యచేతాః' – చిత్తమందు ఇతరచింతలెవ్వియు లేక భగవత్సంబంధమైన భావనలే కలిగియుండుట అనన్యచిత్తముయొక్క లక్షణము. మనస్సు దృశ్యపదార్థములపైకిపరుగిడక దృక్స్వరూపమగు పరమాత్మయందే లగ్నమైయుండవలెను, సామాన్యమైన జనులయొక్క మనస్సు ఎక్కువగా విషయములపైననే ప్రసరించుచుండును. అట్టిది 'అనన్యచిత్తము' కాదు, 'అన్యచిత్తమే' యగును. మఱికొందఱి చిత్తము కొంత దృశ్యవిషయములపైకి, కొంత దైవముపైకి వ్యాపించుచుండును. ఇదియు అనన్యచిత్తముకానేరదు. ఈ అనన్యత్వమును స్పష్టముగ విశదపఱచుటకే కాబోలు ఇచట 'సతతమ్' (ఎల్లప్పుడును), 'నిత్యశః' (ప్రతిదినము) అను రెండు సమానార్థకపదములు ప్రయోగింపబడినవి. దీనినిబట్టి నిరంతరదైవస్మరణను భగవాను డెంతనొక్కిచెప్పిరో తేటతెల్లమగుచున్నది. కొందఱు ఏదియోయొకరోజున నిరంతరము దైవమును స్మరించుదురు; మఱికొందఱు ప్రతిరోజు కొద్దిసేపు దైవమును భజించుదురు. ఈ రెండు పద్ధతులును మంచివేకాని అవిచాలవు. ప్రతిదినము, నిరంతరము ఎడతెగక దైవస్మరణ చేయుటను బాగుగ అభ్యసించవలెను. అదియే అనన్యచిత్తుని లక్షణము. అట్టి వానికే భగవంతుడు సులభసాధ్యుడగును. ఆతడే నిత్యయుక్తుడు. నిరంతరధ్యానపరుడు. అట్టి నిరంతర దైవచింతనము ప్రారంభమున కుదరకపోయినను ఎప్పటికైనను ఆస్థితిని అభ్యసించియే తీరవలెను.

ఏలయనిన, భగవద్విస్మృతి ఏ క్షణమందు సంభవించునో, ఆ క్షణమందే మాయ ప్రవేశించి చిత్తమున నిలద్రొక్కుకొని జీవుని మరల విషయోన్ముఖునిగ జేయుటకు యత్నించును. కాబట్టి ఈ విషయమున సాధకుడు బహుజాగరూకుడైయుండి దైవవిస్మృతి ఏకాలమందును కలుగకుండులాగున చూడవలయును. 'నాస్తిజాగరతో భయమ్' అనునట్లు దైవవిషయమున సదా మేలుకొనియుండువానికిక సంసారభయ ముండనేరదు. కాబట్టి నిరంతర భగవత్స్మరణద్వారా మాయకు ఒకింతేని చిత్తమందు అవకాశమివ్వక నుండవలెను. అట్టి నిరంతర దైవస్మరణశీలుడే పరమాత్మను సులభముగ బొందగలడని యిట చెప్పబడినది. (దీనినిబట్టి, అట్టి అనన్యదైవచింతన, నిత్యయుక్తత్వము లేనివారికి దైవప్రాప్తి సులభతరముకాదని

సూచితమగుచున్నది). కావున దైవప్రాప్తికి సులభమార్గమును అభిలషించువారందఱును శ్రీకృష్ణపరమాత్మ కరుణతో వచించిన ఈ ఉపాయము నవలంబించి జన్మ సార్థక మొనర్చుకొనవలెను.

**ప్ర:–** భగవంతుని ఎవరు సులభముగ పొందగలరు?

**ఉ:–** (1) అనన్యచిత్తులై (2) ప్రతిదినము ఎడతెగక నిరంతరము దైవమునుగూర్చి చింతించువారు (అనగా నిత్యయుక్తులు) భగవంతుని సులభముగ పొందగలరు.

**ప్ర:–** దీనినిబట్టి భగవత్ప్రాప్తికి (మోక్షమునొందుటకు) సులభోపాయమేమియని తెలుచున్నది?

**ఉ:–** (1) అనన్యచిత్తత్వము (చిత్తమందు దైవము తప్ప ఇతర దృశ్యచింతన యేదియు లేకుండుట) (2) నిరంతర దైవస్మరణము.

**అ॥** అట్లు పరమాత్మనుపొందినవారు మరల దుఃఖభూయిష్టమగు ఈ సంసారమును బడయరని వచించుచున్నాడు –

## 15. మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్
## నాప్నువన్తి మహాత్మానస్సంసిద్ధిం పరమాం గతాః.

**టీక:–** పరమామ్ = సర్వోత్తమమైన, సంసిద్ధిమ్ = మోక్షమును, గతాః = పొందిన, మహాత్మానః = మహాత్ములు, మామ్ = నన్ను, ఉపేత్య = పొందినవారై (బ్రహ్మత్వమును బడసినవారై), పునః = మరల, దుఃఖాలయమ్ = దుఃఖములకు నిలయమున్ను, అశాశ్వతమ్ = అనిత్యమైనదియునగు, జన్మ = జన్మమును, నాప్నువన్తి = పొందరు.

**తా:–** సర్వోత్తమమైన మోక్షమును పొందిన మహాత్ములు నన్ను పొందినవారై మరల – దుఃఖనిలయమై అనిత్యమైనట్టి – జన్మను ఎన్నిటికిని పొందనేరరు.

**వ్యాఖ్య:–** భగవంతుని బొందినవారు మరల ఈసంసారకూపమున పడరని ఇచట తెలుపబడుచున్నది. దైవమును పొందనంతవఱకు జీవుడు పుట్టుట, చచ్చుట అను ఈ జననమరణప్రవాహరూపమైన సంసారచక్రమున తగుల్కొని నానాబాధలనందుచుండును. పరమాత్మను పొందినపిదప మరల నతనికి పునరావృత్తియుండదు. మరల ఈ సంసారమున పుట్టుటగాని, దుఃఖములనుభవించుటగాని యుండనేరదు. కాబట్టి మోక్షముయొక్క ఆవశ్యకతయేమియో ఇచట ఋజువుచేయబడినది. భగవత్ప్రాప్తిగాని, మోక్షముగాని ఏల పొందవలెనని కొందఱు ప్రశ్నింతురు. అట్టివారి కీశ్లోకమున చక్కటి సమాధానమొసంగబడినది. భగవానుని పొందనిచో జననమరణాదులనుండి విముక్తిసంభవింపదు. అందుచే దుఃఖమున్ను అంతముకాదు. కాబట్టి దుఃఖరాహిత్యమునకై దైవమును తప్పక ఆశ్రయించవలసియున్నది.

అయితే కొందఱు – 'ఈజన్మ అనేక విషయభోగములతోగూడి చాల ఆనందకరమునున్నదే' అని చెప్పవచ్చును. ఇట్టి విపరీతబుద్ధులకు శ్రీకృష్ణపరమాత్మ ఈ శ్లోకమున సూటిగ జవాబు చెప్పిరి. 'జన్మ' అనునది యెట్టిదో ఎట్టిస్వభావము గలిగియున్నదో విస్పష్టముగ నిచట తెలియజేసిరి. (1) దుఃఖాలయము (2) అశాశ్వతము – అను రెండు విశేషణములచే భగవానుడు జన్మనుగూర్చి వర్ణించిరి. అనగా అది దుఃఖమునకు

నిలయము, అనిత్యము అని యర్థము. ఈ రెండు దోషములును జన్మయందు కలవు. కావున అట్టిది సౌఖ్యప్రద మెట్లు కాగలదు. ఒకవేళ ఒకింత సుఖము కనుపించినను, అది ఆభాససుఖము, ప్రతిబింబసుఖము, దుఃఖమిశ్రితసుఖమేకాని, అవిచ్ఛిన్న నిరతిశయ సుఖము కాదు. ప్రాపంచికసుఖము దుఃఖమునుగూడ తనవెంట తెచ్చుకొనుచుండును. కావుననే విజ్ఞుల దృష్టియందిది గణనీయముకాకున్నది. ఇక్కారణమున భగవానుడు జన్మను 'దుఃఖాలయమ'ని పేర్కొనిరి. ఆలయమనగా నెలవు, స్థానము. రామాలయము, కృష్ణాలయము, శివాలయము - అనునవి ఆ యా దేవతలకు, అవతారములకు నెలవులై యెట్లున్నవో, అట్లే జన్మయు దుఃఖాలయమైయుండుటవలన దుఃఖాసురునకు కాపురస్థలమై యున్నదని అర్థము. సుఖదేవతకుకాదు. అవివేకముచే జనులిచట సుఖమున్నదని తలంచుచున్నారేకాని వాస్తవముగ దుఃఖమే కలదని పైభగవద్వాక్యముద్వారా స్పష్టపడుచున్నది. త్రికాలజ్ఞుడును, సర్వజ్ఞుడునగు శ్రీకృష్ణపరమాత్మ జనులయొక్క పొరబాటు గమనించి ప్రపంచముయొక్క యథార్థస్థితిని జన్మయొక్క వాస్తవస్వరూపమును ఇచట బహిర్గతముచేసివైచిరి. 'ఓ జీవులారా! ప్రపంచసుఖములనుజూచి మోసపోకుడు. అందు సుఖమున్నదని తలంచి వానివెంట పరుగెత్తి జీవితములను నాశముచేసికొనకుడు. అవి దుఃఖాలయములేకాని సుఖాలయములు కావు. క్షణికములే కాని శాశ్వతములుకావు' - అని పరమాత్మ జనులను హెచ్చరించుచున్నారు. వాస్తవముగ విచారించిన అవిద్యయొక్క ప్రభావముచే జనులట్లు దుఃఖమును సుఖముగ తలంచుచున్నారు.★

కాబట్టి దుఃఖాలయమై, శాశ్వతమైనట్టి ఈ జన్మపంకమున మరల పడకుండులాగున చూడవలెను. అయితే అందులకుపాయమేమి? 'మాముపేత్య' - ఇదియే ఉపాయము. అనగా భగవానుని పొందుటయే, ఆశ్రయించుటయే. కావున భక్తిజ్ఞానవైరాగ్యధ్యానాదులద్వారా పరమాత్మను పొందుటకై జనులు ఈ జన్మయందే తీవ్రతరయత్నమాచరించవలెను. భగవత్సాయుజ్యము 'పరమాం సంసిద్ధిమ్' - సర్వోత్కృష్టమగు పదముగ, సిద్ధిగ వర్ణింపబడుటవలన సమస్త ఇతరపదములన్నియు దానికంటె తక్కువేయని స్పష్టమగుచున్నది. మఱియు మహాత్ములెందఱో అట్టి సంసిద్ధినిబడసిరని యిచట చెప్పబడుటచే తక్కినవారున్ను ప్రయత్నాతిశయముచే తప్పక పొందగలరనియు తేలుచున్నది. అయితే మహాత్ముడు కావలెనేకాని అల్పాత్ముడుకాదు. నిర్మలచిత్తులై, పరమాత్మ నాశ్రయించువారు మహాత్ములు. మలినచిత్తులై దృశ్యభోగములవెంట పరుగిడువారు అల్పాత్ములు. కావున మహాత్ములగుటకే యత్నించవలెను. 'మహాత్మా' అనునది ఒకబిరుదు. అసత్యము నాశ్రయింపక సత్యము నాశ్రయించువారందఱికిని, క్షణికము నాశ్రయించక శాశ్వతము నాశ్రయించువారందఱికిని, అనాత్మ నాశ్రయించక ఆత్మనే ఆశ్రయించువారందఱికిని ఆ బిరుదు తప్పక లభించగలదు. పరమాత్మ నాశ్రయించు అట్టి మహనీయులు జన్మరాహిత్యరూప కైవల్యము నొందుటవలన మరల దుఃఖభూయిష్టమగు ఈ సంసారమునకు తిరిగిరారనియు, మరల జన్మను బొందరనియు ఇచట చెప్పబడినది. నది సముద్రమునుజేరినపిదప మరల వెనుకకు బోదుగదా! అట్లే జీవన్ముక్తులుకూడ. కాబట్టి దుఃఖమును కోరనివారందఱున్ను, సుఖము నభిలషించువారందఱున్ను పైన దెలిపిన ఈ భగవద్వాక్యములందు విశ్వాసము కలవారై, జన్మను సంసారమును దుఃఖప్రదముగనెంచి అది వదలిపోవుటకై భగవదాశ్రయమను ఏకైక ఉపాయము నవలంబించి తరించవలయును.

★ అనిత్యాశుచిదుఃఖానాత్మసు నిత్యశుచిసుఖాత్మఖ్యాతిరవిద్యా (పతంజలి)
అనిత్యమైనదానిని నిత్యముగను, అపవిత్రమైనదానిని పవిత్రముగను, దుఃఖమును సుఖముగను, అనాత్మను ఆత్మగను తోపింపజేయునదే అవిద్య.

ప్ర:– ఈ ప్రపంచముయొక్క (లేక ఈ జన్మయొక్క) స్వరూపమెట్టిది?

ఉ:– ఇది (1) దుఃఖనిలయము (2) అశాశ్వతము - అయియున్నది.

ప్ర:– ఇట్టి సంసారమును (లేక జన్మను) ఎవరు పొందకుందురు?

ఉ:– భగవంతుని పొందిన మహనీయులు.

ప్ర:– భగవత్సాయుజ్య మెట్టి పదవి అయియున్నది?

ఉ:– సర్వోత్తమమగు పదవి (సిద్ధి) అయియున్నది.

ప్ర:– దుఃఖరాహిత్యమున కుపాయమేమి?

ఉ:– మరల జన్మలేకుండుటయే.

ప్ర:– జన్మలేకుండుటకు మార్గమేమి?

ఉ:– భగవంతుని పొందుటయే.

**అ॥** ఒక్క పరమాత్మస్థానమును బొందినతప్ప తక్కిన ఏలోకమున కేగినను మరల జన్మతప్పదని యిచట తెలుపుచున్నాడు -

**16. ఆబ్రహ్మభువనాల్లోకాః★ పునరావర్తినోఽర్జున**
**మాముపేత్య తు కౌన్తేయ పునర్జన్మ న విద్యతే.**

**టీక:–** అర్జున = ఓ అర్జునా!, ఆబ్రహ్మభువనాల్లోకాః = బ్రహ్మలోకమువఱకుగల లోకములన్నియు, పునరావర్తినః = తిరిగివచ్చెడి స్వభావముగలవి (పునర్జన్మను గలుగజేయునట్టివి), కౌన్తేయ = ఓ అర్జునా!, మామ్ = నన్ను, ఉపేత్య తు = పొందినట్లైననో, పునర్జన్మ = మరలజన్మ, న విద్యతే = లేదు.

**తా:–** ఓ అర్జునా! బ్రహ్మలోకమువఱకుగల లోకములన్నియు తిరిగివచ్చెడి స్వభావము కలవి (అనగా వానిని పొందినవారు మరల జన్మమెత్తవలసియే వచ్చుదురు). నన్ను పొందినవారికో మరల జన్మయేలేదు.

**వ్యాఖ్య:–** బ్రహ్మాండకుహరమునం దెన్నియో లోకములుకలవు - భూలోకము, స్వర్గలోకము, బ్రహ్మలోకము మున్నగునవి. కాని అవియన్నియు పునరావృత్తి గలవియైయున్నవి. అనగా వానిని పొందినవాడు మరల జన్మయెత్తును. కాని పరమాత్మనుబొందినవాడు మరల నెన్నటికిని జన్మనుబడయడు. ఇదియే దైవసాక్షాత్కారమందలి విశేషము. దీనికి కారణము కలదు. బ్రహ్మలోకపర్యంతముగల సమస్తలోకములున్ను దృశ్యమునందంతర్గతములైయున్నవి. కనుకనే జన్మాదులకు హేతువులైయున్నవి. ఆత్మ (దైవము) ఒకటియే ఈ ప్రపంచమున దృశ్యముకాని వస్తువు. అది ఆ దృశ్యమును సాక్షిగా జూచు దృగ్వస్తువు. అది దేశకాలక్రియలకు వశముకాక పరిణామరహితమై, నాశవర్జితమై యుండును. అట్టి పరమాత్మపదమును బడసినవానికి కర్మము లేదు, జన్మములేదు.

కాబట్టి పునరావృత్తితో గూడిన స్వర్గాది ఇతరలోకములకై యత్నించుటలో జీవితమును

ధారబోయుటకంటె భక్తివైరాగ్య విచారణాది సాధనములద్వారా ఆత్మలోకమును చేరుటయే మేలు. అనగా భగవత్సాయుజ్యమును బడయుటయే శ్రేయస్కరము.

**ప్ర:–** మరల జన్మ కలుగకుండుటకై ఉపాయమేమి?

**ఉ:–** పరమాత్మను బొందుటయే.

**ప్ర:–** బ్రహ్మలోకమువఱకుగల సమస్తలోకములయొక్క స్వభావమేమి?

**ఉ:–** పునరావృత్తి (అచటికిబోయినవారికి మరల జన్మము కలుగును).

**అ॥** బ్రహ్మదిలోకములయొక్క నశ్వరస్వభావమును, కాలాధీనత్వమును తెలుపుచున్నాడు –

**17. సహస్రయుగపర్యన్తమహర్యద్బ్రహ్మణో విదుః**
**రాత్రిం యుగసహస్రాన్తాం తేఽహోరాత్రవిదో జనాః.**

**టీక:–** (యే) జనాః = ఏజనులు, బ్రహ్మణః = బ్రహ్మదేవునియొక్క, యత్ అహః = ఏ పగలు (కలదో దానిని), సహస్రయుగపర్యన్తమ్ = వేయియుగముల పరిమితిగల దానిగను, విదుః = ఎఱుంగుదురో, తే = అట్టివారు, అహోరాత్రవిదః = రాత్రింబగళ్ళుయొక్క (కాలముయొక్క) తత్త్వము నెఱింగినవారగుదురు (కాలతత్త్వమును తెలిసికొనినవారగుదురు.)

**తా:–** ఏ జనులు బ్రహ్మదేవునియొక్క పగటిని వేయియుగముల పరిమితిగలదానిగను, అట్లే రాత్రిని వేయియుగముల పరిమితిగలదానిగను ఎఱుంగుదురో, అట్టివారు రాత్రింబగళ్ళుయొక్క తత్త్వమును బాగుగ నెఱింగిన వారగుదురు.

**వ్యాఖ్య:–** బ్రహ్మలోకము వఱకుగల సమస్తలోకములు కాలమునకు లోబడినవని, క్షయశీలములని, పరిణామవంతములని, జన్మకారణములని క్రిందటి శ్లోకమున తెలుపబడినది. ఇచట బ్రహ్మదేవునియొక్క కాలపరిమితిని సూచించుచు, తద్ద్వారా బ్రహ్మలోకమున్ను కాలమునకులోబడియే యున్నదను భావమును భగవానుడు వ్యక్తీకరించుచున్నారు. బ్రహ్మదేవుని పగలు వేయి మహాయుగముల కాలము. అట్లే ఆతని రాత్రియు వేయి మహాయుగములు. ఈ ప్రకారముగ బ్రహ్మదేవుని ఒక్కరోజు రెండువేల మహాయుగముల కాలపరిమితి గలిగియున్నది. మహాయుగమనగా నలుబదిమూడులక్షల ఇరువదివేల సంవత్సరముల కాలము. ఎట్లనిన –

| | | | |
|---|---|---|---|
| కలియుగము – | 432000 | సంవత్సరములు | |
| ద్వాపరయుగము – | 864000 | ,, | (కలియుగమునకు రెండు రెట్లు) |
| త్రేతాయుగము – | 1296000 | ,, | (కలియుగమునకు మూడు రెట్లు) |
| కృతయుగము లేక | | | |
| సత్యయుగము – | 1728000 | ,, | (కలియుగమునకు నాలుగు రెట్లు) |
| మొత్తము | 4320000 | సంవత్సరములు = 1 మహాయుగము | |

ఈ మొత్తముకాలము ఒక మహాయుగ మనబడును. అట్టి వేయి మహాయుగములు బ్రహ్మదేవునకు ఒక పగలు. మఱియొక వేయి రాత్రి.

అనగా, 4320000 x 1000 = 4320000000 సంవత్సరములు బ్రహ్మదేవుని పగలు.

4320000000 x 2 = 8640000000 సం॥ బ్రహ్మదేవుని ఒకరోజు.

ఇట్టిరోజులు 360 చేరి బ్రహ్మదేవుని ఒక సంవత్సరకాల మగును. అట్టి సంవత్సరములు 100 చేరి బ్రహ్మదేవుని ఆయుర్దాయ మగును. దీనినిబట్టి బ్రహ్మలోకమున్ను కాలగర్భమున ఇమిడియే యున్నదనియు, ఒకానొకసమయమున అదియు నశించియేతీరుననియు స్పష్టమగుచున్నది. కావున విజ్ఞుడు అట్టి నశ్వరలోకములనుగాని, తల్లోకాంతర్గత భోగసముదాయమునుగాని వాంఛింపక, కాలాతీతుడగు పరమాత్మనే ఆశ్రయించి తరించి పోవును. సమస్తపదార్థములను, బ్రహ్మాండములను కాలము గ్రసించివేయును. కాలమును పరమాత్మ గ్రసించివేయును. అతడు అంతకాంతకుడు. కావున ఏ మహనీయునియందు దేశకాలాదులన్నియు కల్పితములై వెలయుచున్నవో, అట్టి సత్యస్వరూపుడగు పరమాత్మ నాశ్రయించుటయు, కాలమునకు లోబడినవానియందు విరక్తి గలిగియుండుటయు కాలతత్త్వము నెఱింగినవాని లక్షణము. ఈ ప్రకారము దృశ్యప్రపంచముయొక్క నశ్వరత్వము (కాలాధీనత్వము), ఆత్మయొక్క శాశ్వతత్వము నెఱింగినవాడే కాలజ్ఞానము గలవాడు. అహోరాత్రవిదుడు.

**ప్ర:–** బ్రహ్మదేవుని పగలు, రాత్రి ఎంతెంత కాలపరిమాణము గలిగియున్నవి?

**ఉ:–** ఒక్కొక్కటి వేయి మహాయుగముల కాలము గలిగియున్నది.

**ప్ర:–** దీనినిబట్టి తేలిన యంశమేమి?

**ఉ:–** బ్రహ్మలోకముగూడ కాలమునకు లోబడినదేయని తేలుచున్నది. కాలమునకు లోబడనివాడు ఒక పరమాత్మయే. కావున జన్మరాహిత్యమునకై, మోక్షమునకై ఆతనినే ఆశ్రయించవలెనని భావము.

**అ॥** ప్రపంచముయొక్క నశ్వరస్వభావమును, పరిణామశీలత్వమును తెలియజేయుచున్నాడు –

## 18. అవ్యక్తాద్వ్యక్తయః సర్వాః ప్రభవన్త్యహరాగమే
## రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రైవావ్యక్తసంజ్ఞకే.

**టీక:–** అహరాగమే = పగటియొక్క ప్రారంభమునందు, అవ్యక్తాత్ = అవ్యక్తము (ప్రకృతి) నుండి, సర్వాః = సమస్తములైన, వ్యక్తయః = చరాచరవస్తువులు, ప్రభవన్తి = పుట్టుచున్నవి, రాత్ర్యాగమే = రాత్రియొక్క ప్రారంభమునందు, అవ్యక్తసంజ్ఞకే = అవ్యక్తమను పేరుగల, తత్రైవ = దానియందే (ఆ ప్రకృతియందే), ప్రలీయన్తే = లీనమగుచున్నవి.

**తా:–** బ్రహ్మదేవుని పగలు ప్రారంభమగునపుడు అవ్యక్తము (ప్రకృతి) నుండి సమస్త చరాచరవస్తువులు పుట్టుచున్నవి. మరల రాత్రి ప్రారంభమగునపుడు ఆ అవ్యక్తమునందే లీనమగుచున్నవి.

**వ్యాఖ్య:–** ఒక్క పరమాత్మతప్ప తక్కినవస్తువులన్నియు పుట్టుక, చావు కలవియేయగును. ఆ పదార్థములన్నియు పరమాత్మయందే కల్పితముగనున్న మాయయందు (అవ్యక్తము, లేక, మూలప్రకృతి యందు) ఉద్భవించి లయించుచుండును. నిద్రయను తమస్సునందు స్వప్నపదార్థములన్నియు సృష్టింపబడి మరల ఆ తమస్సునందే విలీనములైపోవునట్లును, మేలుకొనినవానికి వానితో ఏ సంబంధమును లేనట్లును, ఈ సమస్త జగత్తుకూడ పరమాత్మయందు ఆభాసరూపముననున్న అవ్యక్తము (ప్రకృతి) నందుద్భవించుచు,

తిరిగి దానియందే లయించుచున్నది. కావున ఈ సృష్టిప్రళయములతో వాస్తవముగ పరమాత్మకు ఏ సంబంధమున్ను లేదు. అయినను వాని యన్నింటికిని ఆధారభూతుడై అధిష్ఠానరూపుడై వెలయుచున్నాడు.

**ప్ర:–** ఈ సమస్త జగత్పదార్థములు దేనినుండి పుట్టుచున్నవి?

**ఉ:–** అవ్యక్తమునుండి (అవ్యక్తము = మూలప్రకృతి, మాయ).

**ప్ర:–** ఎప్పుడు పుట్టును?

**ఉ:–** బ్రహ్మదేవుని పగలు ప్రారంభమగునపుడు.

**ప్ర:–** ఎపుడు లయించును? ఎచ్చోట లయించును?

**ఉ:–** బ్రహ్మదేవునియొక్క రాత్రి ప్రారంభమగునపుడు లయించును. ఎచట పుట్టుచున్నవో ఆ అవ్యక్తమునందే తిరిగి లయించుచున్నవి.

**అ॥** దైవతత్త్వమెఱుంగనంతవఱకు జీవు లీప్రకారమే మరలమరల పుట్టుచు గిట్టుచునుందురని వచించుచున్నాడు –

**19. భూతగ్రామస్స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే**
**రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవత్యహరాగమే.**

**టీక:–** పార్థ = ఓ అర్జునా!, స ఏవ అయమ్ భూతగ్రామః = అట్టి యీ ప్రాణిసమూహమే, అవశః = కర్మపరాధీనమై, భూత్వాభూత్వా = పుట్టిపుట్టి (అనేకజన్మలెత్తి), రాత్ర్యాగమే = (బ్రహ్మదేవుని) రాత్రియొక్క ప్రారంభమున, ప్రలీయతే = లయ మొందుచున్నది, (తిరిగి), అహరాగమే = (బ్రహ్మదేవుని) పగటియొక్క ప్రారంభమున, ప్రభవతి = పుట్టుచున్నది.

**తా:–** ఓ అర్జునా! ఆ యీ (పూర్వకల్పమందలి) ప్రాణిసమూహమే కర్మ పరాధీనమై పుట్టిపుట్టి (బ్రహ్మదేవుని) రాత్రియొక్క ప్రారంభమున (మరల) విలయమొందుచున్నది. తిరిగి (బ్రహ్మదేవుని) పగటియొక్క ప్రారంభమున పుట్టుచున్నది.

**వ్యాఖ్య:–** పూర్వకల్పమందలి ఆ ప్రాణిసముదాయమే కర్మపరాధీనమై మరల ఈ కల్పమందు పుట్టుచున్నది. మరల చచ్చుచు మరల పుట్టుచు – ఈ ప్రకారముగ సంసార మహాచక్రమున తిరుగాడుచున్నది. 'భూత్వాభూత్వా' అని చెప్పినందువలన జీవునకు ఒకటి రెండు జన్మలుకాదనియు, (జ్ఞానప్రాప్తిచే) కర్మము అంతము కానంత వఱకు ఎన్నియో జన్మలెత్తుచుండుననియు స్పష్టమగుచున్నది. కర్మబద్ధుడు కావున జీవుడు 'అవశుడని' చెప్పబడెను. ఆశాపాశములను సంకెళ్ళచే బద్ధుడైనందువలన అతడు అస్వంతత్రుడై యున్నాడు. కావున ప్రయత్నపూర్వకముగ ఆత్మజ్ఞానమును సంపాదించి తద్ద్వారా కర్మబంధమును ఛేదించివైచి ఈ జననమరణరూప సంసారచక్రపరిభ్రమణము నుండి విడుదలను బొందవలెను. ఇప్పటి కెన్నియోకోట్ల జన్మలను జీవుడెత్తియున్నాడు. ఏదియో సుకృతవశమున ఈ మానవజన్మ వచ్చినది. ఎంతయో సౌభాగ్యముచే లభించిన అట్టి ఈ మానవజన్మను సదుపయోగముచేసికొని, పరమార్థ విజ్ఞానమునుబడసి జన్మపరంపరకు పూర్ణవిరామము (Fullstop) ను పెట్టవలెను. ఇంతవఱకు అవివేకముచే జనులు అపూర్ణవిరామము (Comma) నే పెట్టుచువచ్చిరి. కావున ఇప్పటికైనను తెప్పరించుకొని, భగవంతు నాశ్రయించి జన్మపరంపరను అంతముగావించుకొనుట ఉత్తమము.

ప్ర:- (కర్మము రహితము కానంతవఱకు) జీవులగతి యెట్లుండును?

ఉ:- వారు సృష్ట్యారంభమున పుట్టుచు, ప్రళయమందు లయించుచునుందురు.

ప్ర:- కర్మబంధము దేనిచే తొలగును?

ఉ:- ఆత్మజ్ఞానముచే, స్వస్వరూపానుభవముచే (జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా) (4--37).

అ॥ ఈ అవ్యక్తము (ప్రకృతి) కంటె పరమాత్మ అతీతుడనియు, నాశరహితుడనియు వచించుచున్నాడు -

**20. పరస్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః**
**యస్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి.**

**టీక:-** యః భావః = ఏ పరమాత్మవస్తువు (అక్షరపరబ్రహ్మము), తస్మాత్ అవ్యక్తాత్తు = ఆ అవ్యక్తము (ప్రకృతి) కంటెను, అన్యః = వేఱైనదియు, పరః = ఉత్తమమైనదియు, అవ్యక్తః = ఇంద్రియములకు గోచరింపనిదియు, సనాతనః = పురాతనము (అనాది) అయినదియునగునో, సః (భావః) = ఆ పరమాత్మవస్తువు, సర్వేషుభూతేషు = సమస్తప్రాణికోట్లు, నశ్యత్సు (సత్స్వపి) = నశించుచున్నను, న వినశ్యతి = నశించదు.

**తా:-** ఏ పరమాత్మ వస్తువు ఆ అవ్యక్తము (ప్రకృతి) కంటె వేఱైనదియు, ఉత్తమమైనదియు, ఇంద్రియములకు వ్యక్తముకానిదియు, పురాతనమైనదియునగునో, అయ్యది సమస్తప్రాణికోట్లు నశించినను తాను నశించకయే యుండును.

**వ్యాఖ్య:-** క్రిందటిశ్లోకమున అవ్యక్తము (మాయాప్రకృతి) ను గూర్చి చెప్పబడినది. ఇపుడు ఆ అవ్యక్తముకంటె పరమైన వస్తువొకటికలదనియు, అదియే శాశ్వతపరబ్రహ్మమనియు నిచట తెలుపుచున్నారు. మాయాంతర్గతములైన ప్రపంచమందలి సమస్తప్రాణికోట్లకును, ఆ పరమాత్మకును ఎంతయో వ్యత్యాసముగలదు. ఎట్లనిన -

| ప్రాణికోట్లు | పరమాత్మ |
|---|---|
| (1) మాయకులోబడినవారు | మాయాతీతుడు. ప్రకృతిని వశమందుంచుకొనినవాడు |
| (2) అల్పరూపులు | మహత్తర చిద్రూపుడు |
| (3) ఇంద్రియములకు గోచరించువారు | ఇంద్రియాగోచరుడు (అవ్యక్తరూపుడు) |
| (4) ఆది (ఆరంభము) కలవారు | అనాదిరూపుడు (సనాతనుడు) |
| (5) నాశము కలవారు | అవినాశి |

ఈ ప్రకారముగ సమస్త భూతకోట్లకును పరమాత్మకునుగల భేద మీశ్లోకమున చక్కగ నిరూపింపబడినది. దీనినిబట్టి జీవుడు భగవంతుని ఏల అర్చించవలెనో, పూజించవలెనో, ధ్యానించవలెనో సుస్పష్టమగుచున్నది. నశించువస్తువు నశించనివస్తువును ధ్యానించియే తీరవలెను. కావున జీవులు నశ్వరమగు

తమ ఉపాధితో తాదాత్మ్యమునొందక తమ నశ్వరప్రాపంచిక ఐశ్వర్యములను జూచి గర్వించక, తమలోనే దేదీప్యమానముగ వెలుగుచున్న పరాత్పరుని, హృదయాంతర్వర్తియగు పరమాత్మను కొలుచుచు, ధ్యానించుచు, క్రమముగ వారితో నైక్యమొంది జన్మసాఫల్యమును బడయవలయును.

**ప్ర:–** పరమాత్మ యెట్టివాడు?

**ఉ:–**(1) అవ్యక్తము (మాయా) కంటె వేఱైనవాడు (2) సర్వశ్రేష్ఠుడు (3) ఇంద్రియములకు గోచరింపనివాడు (4) అనాదిస్వరూపుడు (సనాతనుడు) (5) సమస్తభూతకోట్లు నశించినను, తాను నశింపనివాడు.

**అ॥** అట్టి పరమాత్మను బొందినవారికి మరల జన్మలేదని వచించుచున్నాడు –

## 21. అవ్యక్తోఽక్షర ఇత్యుక్తస్తమాహుః పరమాం గతిమ్
## యం ప్రాప్య న నివర్తన్తే తద్ధామ పరమం మమ.

**టీక:–** (యః = ఏ పరమాత్మ), అవ్యక్తః = (ఇంద్రియములకు) అగోచరుడనియు, అక్షరః ఇతి = నాశరహితుడనియు, ఉక్తః = చెప్పబడెనో, తమ్ = ఆతనిని, పరమామ్ = సర్వోత్తమమైన, గతిమ్ = ప్రాప్యస్థానముగా, ఆహుః = (వేదవేత్తలు) చెప్పుచున్నారు, యమ్ = దేనిని, ప్రాప్య = పొంది, ననివర్తన్తే = మరలజన్మింపరో, తత్ = అది, మమ = నాయొక్క, పరమమ్ = శ్రేష్ఠమైన, ధామ = స్థానము (స్వరూపము).

**తా:–** ఏ పరమాత్మ (ఇంద్రియములకు) అగోచరుడనియు, నాశరహితుడనియు చెప్పబడెనో, అతనినే సర్వోత్తమమైన ప్రాప్యస్థానముగా (వేదవేత్తలు) చెప్పుచున్నారు. దేనిని పొందినచో మరల (వెనుకకు తిరిగి ఈ సంసారమున) జన్మింపరో, అదియే నాయొక్క శ్రేష్ఠమైన స్థానము (స్వరూపము) అయియున్నది.

**వ్యాఖ్య:–** ప్రపంచములోని అన్నిపదవులకంటెను, ప్రాప్యస్థానములకంటెను సర్వశ్రేష్ఠమైనది ఏది అను విషయమున్ను, దేనిని పొందినచో మరల జీవునకు పునరావృత్తి (పునర్జన్మము) కలుగదో ఆవిషయమున్ను ఇచట చెప్పబడినది. స్థూలదృష్టికి అగోచరుడును, నాశరహితుడునగు పరమాత్మయే సర్వోత్తమ ప్రాప్యస్థానమని వేదశాస్త్రాదులన్నియు వచించుచున్నవి. కావున క్షరమును (నశించుదానిని) ఆశ్రయించినచో, లేక ఆశించినచో ఏమి ప్రయోజనము? అక్షరమునే (నశింపనిదానినే) ఆశ్రయించవలెను. ప్రపంచములోని సమస్తదృశ్యపదార్థములున్ను నాశవంతములు. కావున అవి జీవులకు ఉత్తమ ప్రాప్యస్థానములు కానేరవు. పరమగతి యేదియో దానినే అన్వేషింపవలెను. గాని అల్పగతిని, అల్పస్థానమునుగాదు. ఆ పరమగతియో అక్షరపరమాత్మయే యని ఇట వచింపబడినది. కావున వివేకవంతులగువారు మాయాప్రభావమునకు లోబడక సర్వశ్రేష్ఠమగు పరమాత్మస్థానమునే అవలంబించవలెనుగాని అల్పప్రాపంచిక పదములనుగాదు. (Aim at the lion and miss it rather than hunt a jackal and catch it – గురితప్పినను సింహమునే వేటాడవలెనుగాని, చేతికి చిక్కినను నక్కవలన ప్రయోజనమేమి? అని ఆంగ్లసామెత.)

ఇక నట్టి పరమాత్మనుపొందినవారికి గలుగు పరమప్రయోజనమేమియో తెలుపుచున్నారు. అదియే జన్మరాహిత్యము. ప్రపంచములోని ఏ లోకమును బొందినను జీవుడు మరల జన్మింపవలసినదే. కాని పరమాత్మను పొందినవారికి మరల జన్మలేదు. సంసారదుఃఖములేదు. మాయకులోబడిన ఏస్థానమైనను

వికారముతోను, పరిణామముతోను, పుట్టుక చావులతోను గూడియుండును. మాయకులోబడని స్థానమొక్కటి మాత్రమే కలదు. అదియే దైవస్థానము. అట్టి పరంధామమును జెందినవాడు జననమరణాదులనుండి విముక్తినిబడసి పునరావృత్తిరహిత శాశ్వతకైవల్యమునే పడయుచున్నాడు. కావున అట్టి మహోన్నతస్థానమునే అన్వేషింపవలయును. జన్మదుఃఖము, జరాదుఃఖము, మరణదుఃఖము మహాభయంకరములైనవి. అట్టి దారుణ సంసృతియందు మరల పడకయుండవలెననిన అక్షయ పరమాత్మస్థానమునే ఆశ్రయించవలసియుండును.

**ప్ర:–** ప్రపంచములోని అన్నిస్థానములకంటె శ్రేష్ఠమైనదేది?

**ఉ:–** అవ్యక్తమై, నాశరహితమైనట్టి పరమాత్మస్థానమే.

**ప్ర:–** దానిని పొందినవారికి గలుగు ప్రయోజనమేమి?

**ఉ:–** వారు మరల జననమరణాది సంసారదుఃఖమందు ఎన్నటికిని తగుల్కొనరు. మరల జన్మింపరు.

**ప్ర:–** దేనిని పొందినచో జీవుడు తిరిగి జన్మాదులను బొందకుండును?

**ఉ:–** పరమాత్మ పదవిని.

**ప్ర:–** పరమాత్మ యెట్టివాడు?

**ఉ:–** అవ్యక్తుడు (ఇంద్రియములకు అగోచరుడు), నాశరహితుడు.

**అ॥** ఇక నట్టి పరమాత్మను బొందుట కుపాయమును తెలియజేయుచున్నాడు –

## 22. పురుషః స పరః పార్థ భక్త్యా లభ్యస్త్వనన్యయా
## యస్యాన్తఃస్థాని భూతాని యేన సర్వమిదం తతమ్.

**టీక:–** పార్థ = ఓ అర్జునా!, భూతాని = ప్రాణులు, యస్య = ఎవనియొక్క, అన్తస్స్థాని = లోపలనున్నవో, యేన = ఎవనిచేత, ఇదం సర్వమ్ = ఈ సమస్త జగత్తున్ను, తతమ్ = వ్యాపింపబడియున్నదో, సః పరః పురుషః = ఆపరమపురుషుడు, అనన్యయా = అనన్యమగు (ఇతరవిషయములులేని అచంచలమైన), భక్త్యాతు = భక్తిచేతనే, లభ్యః = పొందదగినవాడు.

**తా:–** ఓ అర్జునా! ఎవనియందు దీ ప్రాణికోట్లన్నియు నివసించుచున్నవో, ఎవనిచే ఈ సమస్త జగత్తున్ను వ్యాపింపబడియున్నదో, అట్టి పరమపురుషుడు (పరమాత్మ) అనన్యమగు (అచంచలమగు) భక్తిచేతనే పొందగలడు.

**వ్యాఖ్య:–** పరమాత్మయొక్క స్వరూపము, వారిని పొందుమార్గము అనగా సాధ్యవస్తువు, సాధనము – రెండును ఈశ్లోకమున తెలుపబడినవి. అనేక ప్రాణికోట్లతో నిండి నిబిడీకృతమైన ఈ జగత్తంతయు ఎచటనున్నది? దాని కాధారమేమి? పరమాత్మయను ఆధారముపై, అధిష్ఠానముపై ఈచరాచరప్రపంచమంతయు రజ్జువునందు సర్పమువలె కల్పింపబడియున్నది. ఆరోపితవస్తువుయొక్క స్థానము, నివాసము అధిష్ఠానవస్తువే యనుట సుప్రసిద్ధము. కావున జగత్తంతయు సద్వస్తువగు పరమాత్మలోపల అధ్యస్తమై వెలయు చున్నది. స్వప్నలోకమంతయు మేలుకొనినవానియందే వర్తించునట్లు ఈ

సమస్త స్థావరజంగమప్రాణికోటియుక్తమగు ప్రపంచమంతయు ఆత్మయందే కలదు. కావున ఆత్మచేతనే అది పరివ్యాప్తమైయున్నది. వెన్న ఏ ప్రకారము పాలయందంతట వ్యాపించియున్నదో, ఆ ప్రకారమే పరమాత్మ జగత్తునందంతటను వ్యాపించి యున్నారు. (యేన సర్వమిదం తతమ్).

అట్టి సర్వవ్యాపకపరమాత్మ జీవుల కేయుపాయముచే లభ్యముకాగలరు? అను ప్రశ్నకిచట సూటియైన సమాధానమొసంగబడినది. 'భక్త్యాలభ్యస్త్వనన్యయా' - అనన్యభక్తిచేతనే యాతడు పొందబడగలడని వచింపబడినది. 'అనన్యభక్తి' అని పేర్కొనుటవలన మోక్షప్రాప్తికి స్వల్పభక్తి చాలదనియు, తీవ్రతరభక్తి అవసరమనియు స్పష్టమగుచున్నది. అన్యముకానిది 'అనన్యము' - అనగా భగవంతునిమీద తప్ప ఇతరమగు ఏ పదార్థమందును ఆసక్తిలేకుండుటయని భావము. నశ్వరములగు ప్రాపంచిక విషయములపైని కొంత ప్రీతి, భగవంతునిపై కొంతప్రీతి అనన్యప్రేమ, అనన్యభక్తి కానేరదు. భక్తిమార్గము సులభతరమైనది. కావున దాదాపు ప్రతి అధ్యాయము యొక్క చివరను దానిని పేర్కొనుచున్నారు. ఏ యోగమును బోధించినను దాని చివర భక్తిని ఉటంకించుచున్నారు. ఏలయనిన అది సులభమైనది యగుటయేకాక, అన్ని యోగములందును అద్దాని సమ్మేళనము అవశ్యకమైయున్నది.

ఈ ప్రకారముగ అనన్యభక్తిచే ఆ పరమపురుషుడు (పరమాత్మ) తప్పక పొందబడగలడని భగవాను డిచట స్పష్టముగ తెలియజేసినందువలన, ఇవ్విషయమున జనులే మాత్రము సందేహింపక, అట్టిసాధనను వెనువెంటనే ఆచరించి, మోక్షసామ్రాజ్యాభిషిక్తులు కావలయును. దేవునిపొందుటకు మార్గమేమి? అని అనేకులు ప్రశ్నించుచుందురు.

అట్టివారీశ్లోకమును బాగుగగ్రహించి, అనన్యభక్తియే అందులకు మార్గమని విశ్వసించి అట్టి పరాభక్తిని ప్రయత్నపూర్వకముగ సాధించివేయవలెను.

ఇచట భగవానుని 'పరమపురుషుడ'ని వర్ణించిరి. తక్కినవారందఱు సామాన్యపురుషులు. ఆతడొక్కడే పరమపురుషుడు. పురుషుడు (జీవుడు) భక్త్యాది సాధన లాశ్రయించి పరమాత్మయం దైక్యమై పరమపురుషుడుగ మారవలెను. అదియే జీవితలక్ష్యమని ప్రతివారును గుర్తుంచుకొనవలెను.

**ప్ర:—** ఈ సమస్తజగత్తు ఎవనియందు స్థితిగలిగియున్నది? ఎవనిచే వ్యాప్తమైయున్నది?

**ఉ:—** పరమాత్మయందు స్థితిగల్గియున్నది. ఆతనిచేతనే వ్యాప్తమైయున్నది.

**ప్ర:—** ఆ పరమాత్మ యెట్లు పొందబడగలడు?

**ఉ:—** అనన్యభక్తిచే.

**అ॥** ఏ మార్గమునబోయిన జనులు తిరిగి సంసారమున జన్మింపకుందురో, ఏ మార్గమునబోయిన తిరిగి జన్మింతురో, ఆ రెండుమార్గములనుగూర్చి నాలుగు శ్లోకములద్వారా యిపుడు తెలుపుచున్నాడు -

**23. యత్ర కాలే త్వనావృత్తిమావృత్తిం చైవ యోగినః**
**ప్రయాతా యాన్తి తం కాలం వక్ష్యామి భరతర్షభ.**

**టీక:—** భరతర్షభ = భరతవంశశ్రేష్ఠుడవగు ఓ అర్జునా!, యత్రకాలే = ఏ కాలమందు, ప్రయాతాః = (శరీరమునువిడిచి)) పోయిన, యోగినః = యోగులు, అనావృత్తింతు = అపునరావృత్తిని

(పునర్జన్మరాహిత్యమును), *అవృత్తిం చ ఏవ* = (ఏకాలమందు పోయిన యోగులు) పునరావృత్తిని (పునర్జన్మను), *యాన్తి* = పొందుచున్నారో, *తం కాలమ్* = ఆ కాలమును, *వక్ష్యామి* = చెప్పుచున్నాను.

**తా:–** భరతకులశ్రేష్ఠుడవగు ఓ అర్జునా! ఏకాలమందు (లేక, ఏమార్గమందు) (శరీరమును విడిచి) వెడలిన యోగులు మరల తిరిగిరారో (జన్మమునొందరో), ఏ కాలమందు వెడలిన యెగులు మరల తిరిగివచ్చుదురో (జన్మించుదురో), ఆ యా కాలవిశేషములను చెప్పుచున్నాను. (వినుము) -

**అ॥** పునరావృత్తిరహితులగువారి 'అర్చిరాది' మార్గములను తెలుపుచున్నాడు -

**24. అగ్నిర్జ్యోతిరహశ్శుక్ల ష్షణ్మాసా ఉత్తరాయణమ్**
**తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః.**

**టీక:–** *అగ్నిః* = అగ్ని, *జ్యోతిః* = ప్రకాశము, *అహః* = పగలు, *శుక్లః* = శుక్లపక్షము, *షణ్మాసాః* = ఆఱునెలలుగల, *ఉత్తరాయణమ్* = ఉత్తరాయణము, (*యత్రసన్తి* = ఏమార్గమునగలవో), *తత్ర* = ఆ మార్గమందు, *ప్రయాతాః* = వెడలిన, *బ్రహ్మవిదః* = బ్రహ్మవేత్తలైన, *జనాః* = జనులు, *బ్రహ్మ* = బ్రహ్మమును, *గచ్ఛన్తి* = పొందుచున్నారు.

**తా:–** అగ్ని, ప్రకాశము, పగలు, శుక్లపక్షము, ఆఱునెలలుగల ఉత్తరాయణము, ఏమార్గమందుగలవో, ఆమార్గమందు వెడలిన బ్రహ్మవేత్తలగు జనులు బ్రహ్మమునే పొందుచున్నారు.

**వ్యాఖ్య:–** జ్ఞానము ప్రకాశము. అజ్ఞానము చీకటి. ప్రకాశరూపమగు బ్రహ్మజ్ఞానము కలవాడు బ్రహ్మమునేపొందును. దేహమును వీడినపుడును, దేహముతో గూడియున్నపుడునుగూడ అతడు బ్రహ్మస్వరూపముగనే యుండును. 'బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి' - బ్రహ్మవేత్త బ్రహ్మమేయగుచున్నాడని శ్రుతి. ఈ శ్లోకమున 'బ్రహ్మవిదో జనాః' అని చెప్పుటవలన బ్రహ్మమునెఱింగిన (అనుభూతమొనర్చుకొనిన)వారే అట్టి మహోన్నతస్థితిని బడయగలరుగాని తదితరులుకాదని స్పష్టమగుచున్నది. మఱియు 'జనాః' (జనులు) అని సర్వసామాన్యపదము ప్రయోగింపబడుటవలన జాతిమతకులవివక్షతలేక సర్వులును బ్రహ్మజ్ఞానమను యోగ్యతగలిగియుండినచో బ్రహ్మపదము నొందవచ్చునని తెలియుచున్నది.

బ్రహ్మజ్ఞానము తేజోవంతమైనదిగనుక ప్రకాశద్యోతకములగు కొన్ని వస్తువు లిచట చెప్పబడినవి - (1) అగ్ని (2) జ్యోతి (3) పగలు (4) శుక్లపక్షము (5) ఉత్తరాయణము. ఇందు మొదటి నాలుగు ప్రకాశమును సూచించును. ఐదవదియగు ఉత్తరాయణము ఊర్ధ్వగతిని నిరూపించును. ప్రకాశరూపమగు జ్ఞానము నాశ్రయించువాడు బ్రహ్మమును తప్పక పొందగలడని ఈశ్లోకముయొక్క అంతరార్థము. జీవుడు పరమాత్మను పొందవలెననిన ప్రకాశమందే - అనగా జ్ఞానమందే, స్వస్వరూపవిజ్ఞానమందే స్థితిగల్గియుండవలెనుగాని అంధకారరూపమగు అజ్ఞానమందుగాదు. ఊర్ధ్వమార్గముననే, సత్యమార్గముననే పోవలెనుగాని అధోమార్గమున, అసత్యమార్గమునగాదు. ఊర్ధ్వదృష్టి (ఆత్మదృష్టి) యే కలిగియుండవలెనుగాని అధోదృష్టి (ప్రాపంచిక విషయదృష్టి, పాపదృష్టి) కాదు. ఈ ప్రకారమగు ఊర్ధ్వదృష్టిని, ప్రకాశరూప జ్ఞానదృష్టిని ఉత్తరాయణము, అగ్న్యాది ప్రకాశక పదార్థములు సూచించుచున్నవి.

**ప్ర:–** బ్రహ్మవేత్త లేమార్గముగుండా పోవుదురు?

**ఉ:–** (1) అగ్ని (2) ప్రకాశము (3) పగలు (4) శుక్లపక్షము (5) ఉత్తరాయణము అను ఐదున్ను గలిగియున్న మార్గముగుండా పోవుదురు.

**ప్ర:–** బ్రహ్మవేత్తలు దేనిని బొందుదురు?

**ఉ:–** బ్రహ్మమునే పొందుదురు.

**అ॥** ఇక పునరావృత్తిగలిగియుండువారి 'ధూమాది' మార్గమును వచించుచున్నాడు -

**25. ధూమో రాత్రిస్తథా కృష్ణష్షణ్మాసా దక్షిణాయనమ్**
**తత్ర చాన్ద్రమసం జ్యోతిర్యోగీ ప్రాప్య నివర్తతే.**

**టీక:–** ధూమః = పొగ, రాత్రిః = రాత్రి, తథా = ఆ ప్రకారమే, కృష్ణః = కృష్ణపక్షము, షణ్మాసాః = ఆఱునెలలుగల, దక్షిణాయనమ్ = దక్షిణాయనము, (యత్రసన్తి = ఏ మార్గమునగలవో), తత్ర = ఆ మార్గమున (వెడలిన), యోగీ = యోగి (సకామకర్మయోగి), చాన్ద్రమసమ్ = చంద్రసంబంధమైన, జ్యోతిః = ప్రకాశమును, ప్రాప్య = పొంది, నివర్తతే = మరలివచ్చుచున్నాడు. (తిరిగి జన్మించుచున్నాడు).

**తా:–** పొగ, రాత్రి, కృష్ణపక్షము, ఆఱునెలలుగల దక్షిణాయనము ఏ మార్గమునగలవో ఆ మార్గమున (వెడలిన) సకామకర్మయోగి చంద్రసంబంధమైన ప్రకాశమునుబొంది మఱల వెనుకకు వచ్చుచున్నాడు (తిరిగి జన్మించుచున్నాడు.)

**వ్యాఖ్య:–** జ్ఞానము ప్రకాశరూపమైయున్న చందమున అజ్ఞానము అంధకార రూపమైయున్నది. అట్టి అంధకారమార్గమున జనువాడు మరల జన్మించును. మరల సంసారచక్రమున తగుల్కొనును. ఇచట 'యోగి' అనగా ఫలాపేక్షతో గూడుకొనిన కర్మలనాచరించువాడని అర్థము. ఆత్మజ్ఞానములేమిచే అతడు మరల జన్మించును. అజ్ఞానాంధకారమును సూచించుటకు ఇచట కొన్ని పదార్థములు తెలుపబడినవి. అవి యేవియనిన - (1) పొగ (2) రాత్రి (3) కృష్ణపక్షము (4) దక్షిణాయనము. ఇందు మొదటిమూడును అంధకారసూచకములై యున్నవి. నాల్గవది అధోమార్గమును సూచించుచున్నది. ఇట్టి అంధకారమార్గముగుండా చనువాడు అనగా ఆత్మజ్ఞానము లేనివాడు అతనికర్మననుసరించి చంద్రలోకము మున్నగువానినిబొంది, మరల కొంత కాలమునకు భూలోకమున జన్మించును. (క్షీణేపుణ్యేమర్త్యలోకంవిశన్తి). పైనదెల్పిన దక్షిణాయనము అవిద్యావశమున జీవునకుగలుగు అధోదృష్టిని తెలుపుచున్నది.

పై శ్లోకములందలి 'ఉత్తరాయణ, దక్షిణాయన' పదములకు అంతరార్థమును గూడ గైకొనుట ఉత్తమముగ తోచుచున్నది. ఏలయనిన మహనీయు లెందరో దక్షిణాయనమున గూడ దేహమును వీడుచున్నారు. మూర్ఖులెందరో ఉత్తరాయణమునగూడ దేహమును వదలుచున్నారు. బాహ్యార్థమును మాత్రము గైకొనినచో దక్షిణాయనమున దేహమునువీడు జ్ఞానులు తిరిగి జన్మించుదురనియు, ఉత్తరాయణమున దేహమును వదలు మూఢులు జన్మరాహిత్యము నొందుదురని చెప్పవలసివచ్చును. అది కేవలము సత్యదూరమేయగును. కాబట్టి ఉత్తరాయణ, దక్షిణాయనములకు ఉత్తరమార్గము, దక్షిణమార్గములనిగాని, జ్ఞాన, అజ్ఞానములని గాని కూడ అర్థముచెప్పుట సమంజసముగ తోచుచున్నది.

**ప్ర:–** సకామకర్మయోగి (లేక, అజ్ఞాని) ఏ మార్గముగుండా చనును?

**ఉ:–** పొగ, రాత్రి, కృష్ణపక్షము, దక్షిణాయనము – అనునవి కల అంధకారమార్గముగుండా చనును.

**ప్ర:–** అతనికి జన్మరాహిత్యము కలుగునా?

**ఉ:–** కలుగదు. అతడు తిరిగి జన్మించియే తీరును.

**ప్ర:–** కాబట్టి ఫలితాంశమేమి?

**ఉ:–** ఆత్మజ్ఞానమ్మునుబొంది, ఊర్ధ్వమార్గమునజని, పునరావృత్తిరహితశాశ్వతపదవి నొందుటయే యుక్తము.

**అ॥** పై విషయములనే స్పష్టీకరించుచున్నాడు –

**26. శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతః శాశ్వతే మతే**
**ఏకయా యాత్యనావృత్తిమన్యయాఽఽవర్తతే పునః.**

**టీక:–** శుక్లకృష్ణే = శుక్ల, కృష్ణములనెడు, ఏతే గతీ హి = ఈ రెండు ప్రసిద్ధములయిన మార్గములున్ను, జగతః = జగత్తునకు, శాశ్వతేమతే = శాశ్వతములని తల్లంపబడుచున్నవి, ఏకయా = అందొకదానిచేత, అనావృత్తిమ్ = పునర్జన్మరాహిత్యమును, (మనుజుడు), యాతి = పొందుచున్నాడు, అన్యయా = మఱియొకదానిచేత, పునః = మరల, ఆవర్తతే = జన్మమెత్తుచున్నాడు.

**తా:–** ఈ శుక్లకృష్ణమార్గములు రెండును జగత్తునందు శాశ్వతముగ నుండునవిగ తలంపబడుచున్నవి. అందు మొదటిదానిచే జన్మరాహిత్యమును, రెండవదానిచే మరల జన్మమును మనుజుడు పొందుచున్నాడు.

**వ్యాఖ్య:–** లోకములో రెండేరెండు మార్గములు కలవనియు, ఒకటి మనుజుని ఊర్ధ్వముగ గొనిపోవుననియు, మఱియొకటి అధఃపతనమును గలుగజేయుననియు ఇచట చెప్పబడినది. ప్రకాశరూపమగు జ్ఞానమార్గము ననుసరించువాడు జన్మరాహిత్యము (మోక్షము)ను బొందుననియు, అంధకారరూపమగు అజ్ఞానమార్గము ననుసరించువాడు మరల జన్మను బడయుననియు, సంసారమునబడి పుట్టుచుచచ్చుచునుండుననియు వచింపబడినది. ఈ ప్రకారముగ ఒకటి ముక్తిని మఱి యొకటి బంధమును గలుగజేయును. కాబట్టి జనులు తమవిజ్ఞత నుపయోగించి శ్రేయోదాయకమగు మొదటిమార్గమునే అనుసరించి, బంధకరమగు రెండవమార్గమును త్యజించవలెను.

**ప్ర:–** ప్రపంచములో ఎన్ని మార్గములు కలవు? అవియేవి?

**ఉ:–** రెండేమార్గములు కలవు. (1) ప్రకాశరూపమగు ఉత్తరాయణమార్గము (జ్ఞానమార్గము) (2) అంధకారరూపమగు దక్షిణాయనమార్గము (అజ్ఞానమార్గము).

**ప్ర:–** కాబట్టి విజ్ఞుడగువాడేమి చేయవలెను?

**ఉ:–** మొదటిదియగు ప్రకాశమార్గము ననుసరించి రెండవదియగు అంధకారమార్గమును త్యజించవలెను.

అ॥ ఈ రెండుమార్గములను గూర్చి యెఱింగినవానిని సంస్తుతించుచు 'యోగివికమ్ము'ని అర్జునునకు హితము చెప్పుచున్నాడు –

## 27. నైతే సృతీ పార్థ జానన్యోగీ ముహ్యతి కశ్చన
## తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున.

**టీక:–** పార్థ = ఓ అర్జునా!, ఏతేసృతీ = ఈ రెండుమార్గములను, జానన్ = ఎఱుంగుచున్న, యోగీకశ్చన = యోగియగు నెవ్వడును, నముహ్యతి = మోహమునుబొందడు, తస్మాత్ = అందువలన, అర్జున = ఓ అర్జునా!, సర్వేషు కాలేషు = ఎల్లకాలములందును, యోగయుక్తః = (జ్ఞాన) యోగయుక్తుడవు భవ = కమ్ము.

**తా:–** ఓ అర్జునా! ఈ రెండుమార్గములను ఎఱుంగునట్టి యోగియెవడును ఇక మోహమును బొందడు. కాబట్టి నీవెల్లకాలమందును (దైవ) యోగయుక్తుడవుకమ్ము.

**వ్యాఖ్య:–** పైనదెల్పిన ప్రకాశరూపమగు ఊర్ధ్వమార్గమును, అంధకారరూపమగు అధోమార్గమును – రెండింటిని ఎఱింగిన యోగి యెవడును ఇక మోహమును జెందనేరడని వచింపబడినది. అనగా నట్టివాడు మరల నెన్నటికిని అంధకారరూపమగు అజ్ఞానమార్గమును జేబట్టడనియు, ప్రకాశరూపమగు జ్ఞానమార్గమునే చేబట్టుననియు, భ్రమయం దెన్నటికి పడడనియు భావము. 'ఇది మంచిది, ఇది చెడ్డది' అని తెలిసిన విజ్ఞుడెన్నటికిని చెడ్డదానిని కోరడు. మంచిదానినే ఆశ్రయించును.

'విషందృష్ట్వాఽమృతం దృష్ట్వా విషం త్యజతి బుద్ధిమాన్' విషమును, అమృతమును చూచి బుద్ధిమంతుడగువాడు విషమును త్యజించి అమృతమునే గ్రహించును. అట్లే 'ఇదిఆత్మ, ఇది అనాత్మ, ఇది ప్రకాశము, ఇది అంధకారము, ఇదిమోక్షము, ఇది బంధము, ఇది జ్ఞానము, ఇది అజ్ఞానము' అని తెలిసినవాడు బంధరూపములగు వస్తువుల నాశింపక ముక్తిప్రదమగు జ్ఞానమునే ఆశ్రయించును. కావున అట్టివాడు ఇతరులవలె భ్రమయందుపడడని ఇచట వచింపబడినది. ఈ ప్రకారముగ విచారణారూపజ్ఞానము జీవుని మరల నెన్నటికిని మోహమందు (అజ్ఞానమందు) పడకుండ సంరక్షించుచున్నది. కాబట్టియే 'ఓ అర్జునా! నీవెల్లప్పుడును (దైవ) యోగనిష్ఠుడవై యుండుము. ప్రకాశరూప బ్రహ్మచైతన్యయుక్తుడవై యుండుము' అని శ్రీకృష్ణపరమాత్మ అర్జునుని హెచ్చరించుటకు కారణమైనది. ఇచట 'సర్వేషుకాలేషు' అని చెప్పబడినందున, ఏ ఒకానొకసమయముననోకాక ఎల్లవేళలయందు దైవయోగయుక్తుడై యుండవలెనని స్పష్టపఱచినట్లైనది. ఏలయనిన, ఏక్షణమందు మనుజుడు భగవంతుని మఱచునో, తన ఆత్మస్వరూపమును విస్మరించునో, ఆ క్షణముననే 'మాయ' వచ్చి ప్రవేశించి జీవునకు గొప్ప అపకారమును గలుగజేయగలదు. కావున అట్లు కావించుట మహాప్రమాదభూయిష్ఠమైనదని యెఱుంగవలెను★. ప్రకాశముయొక్క అభావమే అంధకారము. దైవవిస్మృతియే మాయకు పట్టు. కనుకనే 'నీవెల్లకాలము దైవయోగపరుడవైయుండుమ'ని భగవానుడర్జునుని హెచ్చరించుటకు కారణమైనది. అత్తఱి యిక మాయ జొరబడుటకు, జీవుని ఆక్రమించుటకు అవకాశమే లేకుండును.

★ యన్ముహూర్తం క్షణమపి వాసుదేవో నచిన్త్యతే।
సా హానిస్తన్మహచ్ఛిద్రం సా భ్రాన్తిస్సాచ విక్రియా॥
ఏ క్షణమందు వాసుదేవునిగూర్చిన చింతన జరుగదో, ఆ క్షణమే గొప్పహానియు, మహాదోషమున్ను, భ్రాంతియు, వికారమున్ను అగును.

'యోగయుక్తోభవ' - 'యోగ' మనగా ఐక్యము. మనస్సును ఆత్మతోనైక్య పఱచుటయే యోగము. ధ్యానముద్వారా, లేక జ్ఞానముద్వారా, లేక భక్తిద్వారా, లేక ఏయితరమార్గముద్వారా మనస్సును సాక్షియగు ఆత్మస్వరూపమందు లయమొనర్చుటయే యోగము. అట్టియోగమే నిరంతరము గలిగియుండులాగున ఇచట బోధింపబడినది.

**ప్ర:–** ఎట్టివాడు ప్రపంచమున మాయాభ్రమయందు పడకుండును?

**ఉ:–** 'ఇది ప్రకాశరూపమగు జ్ఞానమార్గము, ఇది అంధకారరూపమగు అజ్ఞానమార్గము' అని యిట్లు రెండిటిని బాగుగ తెలిసికొనినవాడు మాయామోహమున బడనేరడు.

**ప్ర:–** కాబట్టి ముముక్షువు ఏ ప్రకారముగ వర్తించవలెను?

**ఉ:–** సర్వకాలములందును దైవచింతనాపరుడై, (దైవ) యోగయుక్తుడై యుండవలెను.

**ప్ర:–** కొద్దికాలము భగవన్నిష్ఠ గలిగియుండిన చాలదా?

**ఉ:–** చాలదు. ఎల్లకాలములందును (సర్వేషుకాలేషు) అట్టి దైవనిష్ఠ యుండవలెను. ఏలయనిన మాయ మహాప్రమాదకరమైనది.

**అ॥** యోగియొక్క సర్వోన్నతస్థితిని, యోగముయొక్క అపారఫలితమును తెలియజేయుచున్నాడు -

**28. వేదేషు యజ్ఞేషు తపఃసు చైవ**
**దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్.**
**అత్యేతి తత్సర్వమిదం విదిత్వా**
**యోగీ పరం స్థానముపైతి చాద్యమ్.**

**టీక:–** యోగీ = యోగియైనవాడు, ఇదం విదిత్వా = దీనిని (ఈ అధ్యాయమున చెప్పబడిన అక్షరపరబ్రహ్మతత్త్వము మున్నగువానిని) ఎఱింగి, వేదేషు = వేదములయందును, యజ్ఞేషు = యజ్ఞములయందును, దానేషు = దానములయందును, తపఃసు చ = తపస్సులయందును, యత్ = ఏ, పుణ్యఫలమ్ = పుణ్యఫలము, ప్రదిష్టమ్ = చెప్పబడియున్నదో, తత్సర్వమ్ = అదియంతయు, అత్యేతి = అతిక్రమించుచున్నాడు (దానిని మించిన పుణ్యఫలమును బొందుచున్నాడు), చ = మఱియు, ఆద్యమ్ = అనాదియు (లేక సమస్తమునకు ఆదికారణమైనదియు), పరంస్థానమ్ = సర్వోత్కృష్టమైన స్థానమును (బ్రహ్మమును), ఉపైతి = పొందుచున్నాడు.

**తా:–** యోగియైనవాడు దీనిని (ఈ అధ్యాయమున చెప్పబడిన అక్షరపరబ్రహ్మతత్త్వము మున్నగువానిని) ఎఱింగి వేదములందును, యజ్ఞములందును, దానములందును, తపస్సులందును ఏ పుణ్యఫలము చెప్పబడియున్నదో, దానినంతను అతిక్రమించుచున్నాడు. (దానిని మించిన పుణ్యఫలమును బొందుచున్నాడు). మఱియు అనాదియగు సర్వోత్తమ (బ్రహ్మ) స్థానమును బొందుచున్నాడు.

**వ్యాఖ్య:–** ఈ అధ్యాయమందు చెప్పబడిన అక్షరపరబ్రహ్మతత్త్వము నెఱింగినవాడు ఎట్టి మహత్తరపుణ్యఫలమును నొందగలడో, ఎట్టి సర్వోన్నతస్థానము నలంకరించగలడో ఇచట వచింపబడినది.

(1) వేదాధ్యయనమువలన (2) యజ్ఞాచరణమువలన (3) తపఃక్రియలవలన (4) దానములుచేయుటవలన జీవున కెంతటి పుణ్యముకలుగునో దానికంటె నధికతరమగు పుణ్యమును పరబ్రహ్మతత్త్వము నెఱింగిన యోగి పొందుచున్నాడని యిచట స్పష్టముగ చెప్పివేయబడినది. దీనినిబట్టి అన్ని పుణ్యములలోను అత్యధికమైనది యేదియో, దేనినాశ్రయించినచో పుణ్యము లన్నిటియొక్క పరాకాష్ఠను జీవుడు పొందగలడో యిచట నిరూపింపబడినట్లైనది. ప్రపంచమున పరబ్రహ్మవస్తువొకటియే సత్యమైనది. తదితరములన్నియు మిథ్యాభూతములు. కావున సత్యవస్తువు నాశ్రయించినవారికే పరిపూర్ణమగు పుణ్యఫలము లభించగలదు.

వేదములవలన, యజ్ఞములవలన, తపస్సులవలన, దానమువలన కొంతకొంత పుణ్యము జీవునకు లభించుచునేయున్నది. కాని పరమాత్మను ధ్యానించు యోగి, లేక ఆత్మ (బ్రహ్మ) జ్ఞానము కలిగియుండు యోగి వానినన్నింటిని దాటివేయుచున్నాడు. ఆత్మప్రాప్తిచే నతడు అనంతపుణ్యమును సంపాదించుచున్నాడు. సముద్రమునందు బిందువు అంతర్భూతమైయే యుండును. 'శతే పంచాశత్' అనునట్లు నూటియందు యాభైఇమిడియే యుండును. అట్లే బ్రహ్మజ్ఞానజనిత మహాపుణ్యమందు తక్కిన పుణ్యములన్నియు అంతర్భూతములైయుండును. పైగా, ఆ చిన్న చిన్న పుణ్యములన్నియు పుణ్యఫలానుభవానంతరము కాలక్రమమున నశించిపోవును. కాని బ్రహ్మానుభూతి వలన కలుగుపుణ్యము అనంతమైనది. అది యేకాలముననను క్షయింపదు. అది నిరతిశయమైనది. తక్కిన పుణ్యములన్నియు శ్రేష్ఠములే అయినను ఇయ్యది శ్రేష్ఠతమమై వెలయుచున్నది. కాబట్టి విజ్ఞులద్దానికొఱకే యత్నించవలెను.

లోకములో కొందఱు చదువురానందువలన వేదములను అధ్యయనము చేయలేక పోవచ్చును. అర్థబలములేనందువలన యజ్ఞాదు లాచరింపలేకపోవచ్చును, శరీరదార్ఢ్యము లేనందుచే కఠినములైన తపస్సులు చేయలేకపోవచ్చును. బీదవారగుటచే దానములు చేయలేకపోవచ్చును. ఇక నట్టివారికి పుణ్యప్రాప్తికై మార్గమేది? వారు దిగులుపడవలసినదేనా? కాదు, వానియన్నింటిని మించిన పుణ్యమును సంపాదింపగల్గు ఉపాయమును భగవాను డిచట కరుణతో నుపదేశించిరి. అదియే పరమాత్మధ్యానము. బ్రహ్మవిజ్ఞానము. అద్దానికి చదువులతోగాని, తపస్సులతోగాని, యజ్ఞములతోగాని, దానములతోగాని పనిలేదు. మనశ్శుద్ధియే, హృదయపవిత్రతయే, నిర్మలభక్తియే దానికి కావలసినది. అదికలవారు ఆత్మ (బ్రహ్మ) జ్ఞానప్రాప్తిద్వారా తక్కిన పుణ్యఫలములన్నిటిని దాటివైచుదురు. దీని అర్థము పైన దెల్పిన దానాదులను, వేదపఠనాదులను ఉపేక్షింపవలెననికాదు. వానిని నిష్కామముగ ఆచరించుచు క్రమముగ చిత్తశుద్ధిని బడసి తద్ద్వారా ఆత్మానుభూతిచే మహాపుణ్యము నొందవలెననియే.

ఇంతియేకాదు. అట్టి బ్రహ్మ తత్త్వము నెఱుంగుయోగి ఆద్యమై, సర్వోత్తమ స్థానమైనట్టి సాక్షాత్ బ్రహ్మమునే పొందుచున్నాడని యిట వచింపబడినది. బ్రహ్మవేత్త బ్రహ్మస్వరూపుడే యగునని శ్రుతిభగవతియు పలుకుచున్నది. 'పరంస్థానమ్' అని చెప్పుటవలన ప్రపంచమునగల అన్ని పదవులకంటెను, స్థానములకంటెను బ్రహ్మపదవి సర్వోత్కృష్టమైనదని తేలుచున్నది. తక్కిన పదవులు, స్థానములు, సంపదలు క్షయిష్ణువులు, దేశకాలాధీనములు. దేహవియోగముచే వియోగమును బొందునవి. కాని బ్రహ్మపదవి, ఆత్మస్థానము అట్టిదికాదు. అది శాశ్వతమైనది. కనుకనే 'పరంస్థానమ్' అని భగవానుడు దానినిగూర్చి వర్ణించిరి. కాబట్టి ముముక్షువులగువారు చిన్న చిన్న పుణ్యములతో సంతృప్తినొందక పుణ్యనిధి (Fountain of Virtue)యై మహత్తరస్థానమైయలరారుచుండు ఏపరబ్రహ్మపదవి కలదో, ఏ ఆత్మస్థానము కలదో అద్దానిని భగవానుడు గీతయందు తెలిపిన అభ్యాసములద్వారా పొంది మానవజీవితమును సార్థకము చేసికొనవలెను.

'యోగీ' - యోగమనగా జీవుని భగవంతునితో చేర్చుమార్గము. అది నిష్కామకర్మయైనను, భక్తియైనను, ధ్యానమైనను, జ్ఞానమైనను సరియే దేనిననుసరించినను అతడు యోగియే యగును.

ఈ శ్లోకముద్వారా వేదములు, యజ్ఞములు, తపస్సులు, దానములు - వీని యన్నిటికంటె బ్రహ్మజ్ఞానము, ఆత్మానుభవము శ్రేష్ఠమని సర్వోత్తమమని స్పష్టపడుచున్నది. కావున ప్రారంభస్థితిలో ఆ తపోదానాదులను ఆశ్రయించినను, వానితో పరితృప్తినొందక ఇంకను పైకిబోయి క్రమముగ చిత్తశుద్ధిద్వారా ఆత్మజ్ఞానమును, బ్రహ్మానుభూతిని బడయవలెను.

ప్ర:- (అక్షర) పరబ్రహ్మము తెలిసికొనువా డెట్టిపుణ్యమును బడయును?

ఉ:- (1) వేదశాస్త్రాదుల నధ్యయనము చేయుటచేతను (2) యజ్ఞాదు లాచరించుటవలనను (3) తపస్సులను సలుపుటవలనను (4) దానములను గావించుటవలనను - ఏయే పుణ్యఫలములు జీవునకు లభించునో, బ్రహ్మవేత్తకు వాని యన్నింటిని మించిన పుణ్యఫలము కలుగును.

ప్ర:- పరబ్రహ్మమెట్టిది?

ఉ:- (1) ఆద్యస్వరూపము (సమస్తమునకు మూలకారణము) (2) సర్వోన్నతస్థానము (అన్నిస్థానముకంటెను శ్రేష్ఠమైనది).

ప్ర:- ప్రపంచములోగల స్థానములన్నిటిలోను, పదవులన్నిటిలోను గొప్పదియేది?

ఉ:- పరమాత్మస్థానము (పరబ్రహ్మపదవి).

ప్ర:- అన్నిటికంటెను గొప్పపుణ్యము నాశించువా డేమి చేయవలెను?

ఉ:- చిత్తశుద్ధిగలిగి పుణ్యనిధియగు పరమాత్మ నాశ్రయించవలెను. దానిచే వృక్షముయొక్క మూలమును పోషించినచో శాఖాపత్రాదులన్నియు పుష్టినొందునట్లు సమస్తదేవతలను, సమస్తపుణ్యములను ఆశ్రయించినట్లే కాగలదు.

ఓమ్

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే అక్షరపరబ్రహ్మయోగో నామ
అష్టమోఽధ్యాయః

ఇది ఉపనిషత్ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున
సంవాదమునగు శ్రీ భగవద్గీతలందు అక్షరపరబ్రహ్మయోగమను
ఎనిమిదవ అధ్యాయము

ఓమ్ తత్ సత్

ఓం

# శ్రీ భగవద్గీత

అథ నవమోऽధ్యాయః

## తొమ్మిదవ అధ్యాయము

రాజవిద్యా రాజగుహ్యయోగః

## రాజవిద్యా రాజగుహ్యయోగము

**ఈ అధ్యాయము యొక్క పేరు :-**

'రాజవిద్యా రాజగుహ్యయోగము' - రాజ పదము శ్రేష్ఠత్వమును సూచించును. రాజవిద్యయనగా విద్యలలోకెల్ల శ్రేష్ఠమైనదనియు, రాజగుహ్యమనగా రహస్యములలోకెల్ల పరమరహస్యమైనదనియు అర్థము. లేక, రాజవిద్యయనగా పూర్వకాలము రాజులు అనుష్ఠించుచువచ్చిన గొప్పవిద్యయనియు చెప్పవచ్చును. ఈ అధ్యాయమునందు చెప్పబడిన అమూల్యమగు అధ్యాత్మబోధ విద్యలన్నిటిలోను సర్వోత్కృష్టమైనదియు, రహస్యములన్నిటిలోను పరమరహస్యమైనదియు అయియుండుటవలన ఈ అధ్యాయమునకు రాజవిద్యా రాజగుహ్యయోగమను పేరువచ్చినది.

**ఈ అధ్యాయమందలి ప్రధాన విషయములు :-**

(1) అధ్యాత్మవిద్యా ప్రభావము (1 శ్లో॥ నుండి 3 శ్లో॥ వఱకు)

(2) భగవత్స్వరూపవర్ణనము - (4 శ్లో॥ నుండి 6 శ్లో॥ వఱకు)

(3) జగదుత్పత్తి - (7శ్లో॥ నుండి 10శ్లో॥ వఱకు)

(4) ఆసురీప్రకృతికలవారియొక్కయు, దైవీప్రకృతికలవారియొక్కయు లక్షణములు - (11 శ్లో॥ నుండి 15 శ్లో॥ వఱకు)

(5) భగవానుని సర్వాత్మ స్వరూపము - (16 శ్లో॥ నుండి 19 శ్లో॥ వఱకు)

(6) స్వర్గాదికామనారూపమైన సకామోపాసనయొక్క ఫలము, నిష్కామోపాసన యొక్క ఫలము - (20 శ్లో॥నుండి 25 శ్లో॥ వఱకు)

(7) భగవద్భక్తితో గూడిన నిష్కామకర్మాచరణముయొక్క అఖండమహిమ (26 శ్లో॥ నుండి - 34 శ్లో॥ వఱకు)

# రాజవిద్యారాజగుహ్యాయోగము



**పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి**
**తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః** **(9–26)**

ఎవడు నాకు భక్తితో ఆకునుగాని, పువ్వునుగాని, పండునుగాని, జలమునుగాని సమర్పించుచున్నాడో అట్టి పరిశుద్ధాంతఃకరణునియొక్క (లేక, పరమార్థయత్నశీలునియొక్క) భక్తిపూర్వముగ నొసంగబడిన ఆ పత్రపుష్పాదులను నేను (ప్రీతితో) ఆరగించుచున్నాను (అనుభవించుచున్నాను).

**పూర్వాధ్యాయముతో ఈ అధ్యాయమునకు గల సంబంధము :-**

ఏడవ అధ్యాయమగు విజ్ఞానయోగమున భగవానుడు సగుణ, నిర్గుణ పరబ్రహ్మస్వరూపములను వర్ణించిచెప్పుచు తుట్టతుదకు అధిభూత, అధిదైవాదిసహితముగ బ్రహ్మమును సాక్షాత్కరించుకొను విషయమునుగూర్చియు, అంత్యకాలమున చిత్తమును పరమాత్మయందు నెలకొల్పు విషయమును గూర్చియు సూచనామాత్రముగ తెలుప, వెంటనే అర్జునుడు వాని వివరములు తెలిసికొనదలంచి ఏడుప్రశ్నలను గావించెను. ఆ ప్రశ్నలను పురస్కరించుకొని సమాధానముల నొసంగుచు భగవానుడు ఎనిమిదవ అధ్యాయమునంతను దానికొఱకై వినియోగించిరి. ఇకనిపుడు పూర్వము 7వ అధ్యాయమున తాను చెప్పుచువచ్చిన విజ్ఞానవిషయమునే మఱల కొనసాగించుచు శ్రీకృష్ణపరమాత్మ ఈ తొమ్మిదవ అధ్యాయమును ప్రారంభించుచున్నారు. పూర్వము తాను తెలిపియుండిన జ్ఞాన, విజ్ఞాన విషయములనే మఱల ఈ అధ్యాయప్రారంభమున ప్రస్తావించుచు వానిగూర్చివిపులముగ నిపుడు బోధించిరి. అదియే రాజవిద్యా రాజగుహ్యాయోగమనంబడు ఈ తొమ్మిదవ అధ్యాయము. అతిరహస్యమై, మోక్షప్రదమైనట్టి అధ్యాత్మజ్ఞానమును విజ్ఞానసహితముగ తానిపుడు చెప్పబోవుచున్నానని భగవానుడు తెలుపుచున్నాడు -

**శ్రీ భగవానువాచ :-**

## 1. ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే
## జ్ఞానం విజ్ఞానసహితం యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్.

శ్రీ భగవానువాచ = భగవంతుడగు శ్రీ కృష్ణుడు పలికెను -

**టీక:-** యత్ = దేనిని, జ్ఞాత్వా = తెలిసికొని, అశుభాత్ = అశుభరూపమగు సంసారబంధమునుండి, మోక్ష్యసే = విముక్తుడవుకాగలవో, (తత్ = అట్టి), గుహ్యతమమ్ = అతిరహస్యమైనదియు, విజ్ఞానసహితమ్ = అనుభవజ్ఞానముతో గూడుకొనినదియునగు, ఇదంజ్ఞానమ్ తు = ఈ బ్రహ్మజ్ఞానమునైతే, అనసూయవే = అసూయలేనివాడవగు, తే = నీకు, ప్రవక్ష్యామి = లెస్సగాచెప్పుచున్నాను.

**తా:-** శ్రీ భగవంతుడు చెప్పెను - (ఓ అర్జునా!) దేనిని తెలిసికొనినచో అశుభరూపమగు ఈ సంసారబంధమునుండి నీవు విడివడుదువో అట్టి అతిరహస్యమైన, అనుభవజ్ఞానసహితమైన ఈ బ్రహ్మజ్ఞానమును అసూయలేనివాడవగు నీకు లెస్సగా జెప్పుచున్నాను (వినుము).

**వ్యాఖ్య:-** ఇకనిపుడు విద్యలలోకెల్ల శ్రేష్ఠమైనదియు, అతిరహస్యమైనదియునగు బ్రహ్మవిద్యను అనుభవపూర్వకముగ భగవానుడు బోధించుచున్నారు. 'గుహ్యతమమ్' అని చెప్పుటవలన ఈ బోధ రహస్యముయొక్క పరాకాష్ఠను సూచించుచున్నది. బ్రహ్మోపదేశము సామాన్యముగ అధికారియగు మనుజునకే కావింపబడుచుండును. దానిని వినుటకుకూడ యోగ్యత అవసరము. ఆ యోగ్యత యేది ? అసూయాది దుర్గుణములు లేకుండుటయే. చిత్తశుద్ధి గలిగియుండుటయే. సాధనచతుష్టయ సంపత్తిచే ఈ యోగ్యత చేకూరును. అయితే ఇచట బ్రహ్మజ్ఞానము బోధింపబడుచున్న అర్జునున కట్టి యోగ్యతకలదా? అని యడుగవచ్చును. కలదనియే చెప్పవలసియున్నది. ఏలయనిన, ఈ అధ్యాయప్రారంభముననే శ్రీకృష్ణమూర్తి అర్జునుని అసూయారహితునిగ ('అనసూయవే') వర్ణించిరి. అసూయాది దుర్గుణములు లేనివాడని బాగుగ నెఱింగి యున్నందుననే శ్రీకృష్ణపరమాత్మ అర్జుననకు గీతోపదేశమును గావించిరి. కావున సమీపించుటతోడనే

బ్రహ్మజ్ఞానమును బోధించుడని గురువులను వేధించు శిష్యులు మున్ముందు తమకట్టి అసూయాది దుర్గుణములు తొలగినవాయని ప్రశ్నించుకొనవలెను. వస్త్రము నిర్మలముగా నున్నపుడే రంగు అంటునట్లు, శుద్ధచిత్తునియందే బ్రహ్మజ్ఞానము ప్రవేశించును. మలినచిత్తునియందుగాదు.

ఈ ప్రకారముగ 'అనసూయవే' అనుపదముద్వారా భగవానుడు బ్రహ్మవిద్యకు యోగ్యతను నిరూపించినవారైరి. కాబట్టి సాధకులివ్విషయమున కడుజాగురూకులై బ్రహ్మజ్ఞానమును బడయుటకుముందు అట్టి అసూయారాహిత్యము తమకు గలిగినదాయని ప్రశ్నించుకొని, లేకున్న అద్దానిని బాగుగ సిద్ధింపజేసికొనవలెను. దంభదర్పాది దుర్గుణములన్నిటికిని 'అసూయ' రాజు అయియున్నది. కనుకనే అది యిచట పేర్కొనబడినది. అది ఒక వేరుపురుగువంటిది. వేరుపురుగు చెట్టునంతను క్రమముగ గుల్లచేసివైచునట్లు అసూయ జీవునియందు ప్రవేశించినచో, ఆత డంతవఱకు చేసిన సాధనానంతను ఒకతృటిలో నది భ్రష్టముచేసివేయగలదు. కనుకనే పరమార్థరంగమున ఎంతయో సాధనచేసినవారుకూడ ఒక్కొక్కప్పుడీ అసూయారాక్షసికి బలియై తమ సాధనసర్వస్వమును గోల్పోయి పతనమొందుచున్నారు. కాబట్టి భగవానుడు లోకులను ఈ 'అనసూయవే' అను పదముద్వారా జాగరూకులుగానుండుడని, హెచ్చరికచేసిరి. అసూయను పోగొట్టుకొని అర్జునునివలె బ్రహ్మవిద్యకు అధికారులు కండని బోధించిరి. అట్టి అర్హతను బొందినవారికి సద్గురువులు అతిరహస్యములైన, అంశములన్నిటిని బహిర్గతముచేసి వైతురు. ఇక్కారణముననే 'వక్ష్యామి' అని పలుకక, 'ప్రవక్ష్యామి' అని భగవానుడు పలికిరి. అనగా 'లెస్సగా జెప్పుచున్నాను వినుము' అని భావము. అర్జునునిపై ఈ ప్రీతి గురువగు శ్రీకృష్ణున కేలకలిగెను? అర్జునునియందు అసూయలేదు. అందువలన; మఱియు సామాన్యముగ జనులు రహస్యములను అందఱికిని చెప్పరు. మిక్కిలి నమ్మకముగలిగియున్నవారికే చెప్పుదురు. ఇపుడు భగవానుడు చెప్పబోవునది 'గుహ్యతమమగు' విద్య. అనగా అతిరహస్యమైనవిద్య. దానిని చెప్పవలెననిన, బోధితు డెంతయో విశ్వాసపాత్రుడై యుండవలెను. ఆ విశ్వాసమో, శిష్యుని హృదయనైర్మల్యమునుజూచి గురువునకు కలుగుచుండును.

మఱియు 'విజ్ఞాన సహితముగ నీకు జ్ఞానమును బోధించుచున్నాను' అని శ్రీ కృష్ణమూర్తి వచించుటలో ఒక విశేషముకలదు. శాస్త్రములో జ్ఞానమని, విజ్ఞానమని రెండుకలవు. జ్ఞానమనగా శాస్త్రజన్యజ్ఞానము, పరోక్షజ్ఞానము. విజ్ఞానమనగా అనుభవజ్ఞానము, అపరోక్షజ్ఞానము. బోధ అనుష్ఠానరూపముగ పరిణమించినపుడే పూర్ణఫలితమును గలుగజేయును. కనుకనే గీతయందు జ్ఞానబోధతో తృప్తినొందక శ్రీకృష్ణమూర్తి విజ్ఞానమునుగూడ లెస్సగ బోధించినవారైరి.

ఇక నట్టి విజ్ఞానసహిత జ్ఞానమును తెలిసికొనినందువలన గలుగు ప్రయోజనమేమి? ఆ ప్రయోజనమేదియో భగవానుడే సెలవిచ్చిరి. దాని ప్రయోజనము జననమరణరూప అశుభమునుండి విడివడుటయే యగును. పుట్టుక, చావు, దుఃఖము, రోగము, ముసలితనము మొదలగు అశుభములతో గూడుకొనిన ఈ భయంకర సంసారమునుండి అది జనులను విముక్తులుగజేయును. కావున దుఃఖమును బోగొట్టుకొన దలంచువాడు ఈ బ్రహ్మవిజ్ఞానమును తప్పక సంపాదించవలెను. ఈ విషయమును భగవాను డిచట స్పష్టపఱచిరి. మఱియు ఈసంసారమునుజూచి జనులు ఏమో గొప్పగ తలంచుకొనుచున్నారు. కాని శ్రీకృష్ణమూర్తి దానినంతను 'అశుభముగ' వర్ణించిరి. ఏలయనిన అదియంతయు అసత్యమై, దృశ్యరూపమై, ఆత్మేతరమై, క్షణికమై, నశ్వరమైయున్నది. అశుభము నాశ్రయించినవా డశుభమునే పొందును. శుభము నాశ్రయించినవాడు శుభమునేపొందును. ఈ ప్రపంచమున ఆత్మయొకటియే, దైవమొకటియే శుభము. కావున దానినే ఆశ్రయించవలెను. అత్తఱి యశుభమునుండి యాతడు విముక్తిని బడయుగలడు. ఈ ప్రకారముగ

జ్ఞానవిజ్ఞానముల నాశ్రయించువారికి కలుగు ప్రత్యక్షఫలితము సంసార దుఃఖరాహిత్యము, నిరతిశయ ఆత్మానందప్రాప్తి అయియున్నది. కాబట్టి విజ్ఞులెల్లరు భగవానుడు బోధింపబోవు ఈ అనుభవపూర్వక బ్రహ్మతత్త్వమునెఱింగి కృతార్థులు కావలయును.

**ప్ర:–** బ్రహ్మవిద్య యెట్టిది?

**ఉ:–** విద్యలలోకెల్ల శ్రేష్ఠమైనది, అతిరహస్యమైనది.

**ప్ర:–** అది యెవరికి బోధింపబడును?

**ఉ:–** అసూయాది దుర్గుణములులేనివారికి.

**ప్ర:–** బ్రహ్మవిద్యకు అర్హతయేమి?

**ఉ:–** హృదయశుద్ధి, అసూయాది దుర్గుణరాహిత్యము.

**ప్ర:–** మనుజుడు కడతేరవలెననిన దేనిని తెలిసికొనవలెను?

**ఉ:–** జ్ఞానమును, విజ్ఞానమును (అనుభవజ్ఞానము).

**ప్ర:–** దానిని తెలిసికొనినందువలన గలుగు ప్రయోజనమేమి?

**ఉ:–** జీవుడు జననమరణాది అశుభములనుండి విముక్తుడుకాగలడు.

**ప్ర:–** ఈ సంసార మెట్టిది?

**ఉ:–** అశుభరూపమైనది.

**ప్ర:–** దానినుండి తప్పించుకొనుట ఎట్లు?

**ఉ:–** అనుభవపూర్వకముగ బ్రహ్మజ్ఞానము నొందుటయే.

**అ॥** అట్టి బ్రహ్మజ్ఞానమును సంస్తుతించుచున్నాడు –

**2. రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిదముత్తమమ్
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్.**

**టీక:–** ఇదమ్ = ఈ బ్రహ్మజ్ఞానమును, రాజవిద్యా = విద్యలలోకెల్ల శ్రేష్ఠమైనదియు, రాజగుహ్యామ్ = రహస్యములలోకెల్ల అతిరహస్యమైనదియు, ఉత్తమమ్ = సర్వోత్కృష్టమైనదియు, పవిత్రమ్ = పవిత్రమైనదియు, ప్రత్యక్షావగమమ్ = ప్రత్యక్షముగ తెలియందగినదియు, ధర్మ్యమ్ = ధర్మయుక్తమైనదియు, కర్తుమ్ = అనుష్ఠించుటకు, సుసుఖమ్ = మిక్కిలి సులభమైనదియు, అవ్యయమ్ = నాశములేనిదియు అయియున్నది.

**తా:–** ఈ బ్రహ్మజ్ఞానము విద్యలలోకెల్ల శ్రేష్ఠమైనదియు, రహస్యములలోకెల్ల అతి రహస్యమైనదియు, సర్వోత్కృష్టమైనదియు, పవిత్రమైనదియు, ప్రత్యక్షముగ తెలియదగినదియు, ధర్మయుక్తమైనదియు, అనుష్ఠించుటకు మిగుల సులభమైనదియు, నాశరహితమైనదియు అయియున్నది.

**వ్యాఖ్య:–** ఈ అధ్యాయమున చెప్పబోవు బ్రహ్మజ్ఞానము ఎట్టిదో, దాని మహిమ ఏమియో ఈశ్లోకమున వివరింపబడుచున్నది. ప్రపంచములో అనేక విద్యలు కలవు. కాని అవియేవియు జీవుని జననమరణములనుండి తప్పించజాలవు. ఒక్క బ్రహ్మవిద్యయే అట్టిపనిని చేయజాలియున్నది. మఱియు దృశ్యవస్తువులన్నియు నశ్వరములు. కావున వానినిగూర్చిన విద్యయేదియు మనుజునకు పూర్ణశాంతిని గలుగజేయజాలదు. శాశ్వతమగు బ్రహ్మము (ఆత్మ) ను గూర్చిన విద్యయే శాంతిని చేకూర్చగలదు. కనుకనే బ్రహ్మవిద్య విద్యలలోకెల్ల శ్రేష్ఠమని, రాజవిద్యయని యిచట పేర్కొనబడినది. మఱియు లోకములో పవిత్రతమమైనట్టి పరమాత్మవస్తువును ప్రతిపాదించునది యగుటబట్టి ఇదియు అతిపవిత్రమైనదియే యగును.

'ప్రత్యక్షావగమమ్' – ఈ బ్రహ్మవిద్యను ప్రత్యక్షముగ తెలిసికొనవచ్చును. అనుభూత మొనర్చుకొనవచ్చును. ఇది ప్రత్యక్షఫలమునే కలుగుజేయునుగాని పరోక్షఫలమునుగాదు. ఏలయనిన, ఏక్షణమున సాధకు డీ బ్రహ్మవిద్యను అనుభూతమొనర్చుకొనుచున్నాడో, ఆ క్షణముననే అతడు సాక్షాత్ బ్రహ్మమే యగుచుండుట కానబడుచున్నది. కావున ఇది ఫలితమును గలుగజేయునో, లేదో, యను సందేహమున కాస్కారములేదు.

'సుసుఖమ్' – ఈ బ్రహ్మవిద్యను ఆచరించుట చాలతేలికయని చెప్పబడినది. మనస్సునందలి దుస్సంస్కారములను, వాసనాజాలమును ప్రయత్నపూర్వకముగ తొలగించుకొనినచో, ఇక స్వస్వరూపసాక్షాత్కారమునం దేలాటి పరిశ్రమయులేదు. కనుకనే శాస్త్రములం దీ ఆత్మానుభూతి పుష్పములను నలుపుటకంటెను, శ్వాసను పీల్చుటకంటెనుగూడ సులభమని వచింపబడినది. బ్రహ్మానుభవము అతిసులభమైనదని ఈ ప్రకారముగ భగవానుడు గీతయందు సాధకులకు ధైర్యమును గొలుపుచున్నారు. మఱియు ఈ విద్య ధర్మములకు మూలమున్ను, సనాతనమున్ను, అవ్యయమున్ను అయియున్నదనియు ఇచట చెప్పబడినది.

ఈ ప్రకారముగ శ్రీకృష్ణపరమాత్మ తానుబోధింపదలచిన బ్రహ్మజ్ఞానము యొక్క మహిమను ప్రారంభముననందే వెల్లడించిరి. దీనిచే ముముక్షువులకు దానియందెంతయో ప్రీతి, విశ్వాసము జనించుచున్నది.

**ప్ర:–** బ్రహ్మజ్ఞాన మెట్టిది?

**ఉ:–** (1) విద్యలన్నిటిలో శ్రేష్ఠమైనది (2) అతిరహస్యమైనది (3) పవిత్రమైనది (4) ఉత్తమమైనది (5) ప్రత్యక్షముగ తెలిసికొనదగినది (6) ధర్మయుక్తమైనది (7) సులభముగ ఆచరింపదగినది (8) నాశరహితమైనది.

**అ॥** దానియందు శ్రద్ధలేనివారు దైవమును బొందజాలరనియు, సంసారకూపముననే తిరుగాడుచుందురనియు వచించుచున్నాడు –

**3. అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరన్తప
అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని.**

**టీక:–** పరన్తప = శత్రువులను తపింపజేయు ఓ అర్జునా!, అస్య = ఈ, ధర్మస్య = (ఆత్మజ్ఞానమను) ధర్మమునందు, అశ్రద్దధానాః = శ్రద్ధలేనట్టి, పురుషాః = మనుష్యులు, మామ్ = నన్ను, అప్రాప్య = పొందక, మృత్యుసంసారవర్త్మని = మృత్యురూపమైన సంసారమార్గమునందు, నివర్తన్తే = మఱలుచున్నారు, (తిరిగితిరిగి పుట్టుచున్నారు లేక సంసారముననే స్థిరముగ నుండుచున్నారు).

**తా:–** ఓ అర్జునా! ఈ (ఆత్మజ్ఞానమను) ధర్మమునందు శ్రద్ధలేనట్టి మనుజులు నన్ను పొందనివారై మృత్యురూపమైన సంసారమార్గమునందే మఱలుచున్నారు (తిరుగుచున్నారు, లేక నిక్కముగ వర్తించుచున్నారు).

**వ్యాఖ్య:–** లౌకికరంగమునగాని, పరమార్థరంగమునగాని ప్రతికార్యమునందును శ్రద్ధ చాల అవసరము. ఒకనికి ఒక వస్తువునందుగాని, ఒక కార్యమునందుగాని ఎంతెంత శ్రద్ధయుండునో అంతంతచక్కగ ఆ వస్తువు ఫలించుచుండును. ఆ కార్యము నెరవేరుచుండును. కనుకనే భగవాను డీ శ్లోకమున తానుచెప్పబోవు బ్రహ్మజ్ఞానమం దెవనికి శ్రద్ధయుండునో, ఆతడు శ్రద్ధాపూర్వకముగ దాని ననుష్ఠించి తన్ను జేరగలడనియు, అట్లు శ్రద్ధలేనివారు తన్ను పొందజాలనివారై మృత్యురూపమగు సంసారముననే పడి తిరుగాడుచుందురనియు సెలవిచ్చిరి. కాబట్టి విజ్ఞులగువారు చక్కగా యోచించుకొని, దుఃఖప్రదమగు సంసారమార్గమున బడకుండుటకును, ఆనందప్రదమగు దైవసాక్షాత్కారమును బడయుటకును, శ్రద్ధయను ఈ సుగుణమును జేపట్టి బ్రహ్మవిద్యను చక్కగ అనుష్ఠించి తరించవలయును. లోకమున సామాన్యకార్యములగు వంట, సేద్యము మున్నగునవి చక్కగ జరుగుటకే ఎంతయో శ్రద్ధ అవసరమైయుండ ఇక బ్రహ్మవిద్యాసాధనమున వేఱుగజెప్పవలెనా? కనుకనే గీతాచార్యులు తనబోధయం దపుడపుడు ఈ శ్రద్ధయనుదానిని నొక్కి చెప్పుచుపోయిరి.

ఇక ఈ సంసారమార్గమెట్టిదో ఈ శ్లోకమున విశదీకరింపబడినది. సామాన్యముగ కొందఱుజనులు భోగవిలాసములకులోనై ఈ సంసారమును స్వర్గతుల్యముగ భావించుదురు. అమృతప్రాయముగ దానిని వర్ణించుదురు. కాని సర్వజ్ఞుడగు పరమాత్మ దానిని మృత్యురూపముగ వర్ణించిరి (మృత్యుసంసారవర్త్మని). అదియే దాని నిజరూపము. మాయాప్రభావముచే ఈసంసారము పైకి 'డాబు'గా కనుపించినను లోన మృత్యురూపమే కలిగియున్నది. ఈ రహస్యమును భగవాను డీ శ్లోకమున బహిర్గతమొనర్చిరి. బాగుగ అలంకరింపబడిన శవ మేప్రకారము పైకి అందముగ గనుపించినను లోన క్రుళ్లు, దుర్గంధము గలిగియుండునో, ఈ సంసారస్థితియు అంతియే. కాబట్టి విజ్ఞులు దానిచే మోసపోక అమృతరూపుడగు పరమాత్మనాశ్రయించి ధన్యులు కావలయును. నివర్తన్తే అను పదమునకు 'నితరాం వర్తన్తే' – మిక్కిలి (స్థిరముగ) వర్తించుచున్నారు – అనియు చెప్పవచ్చును.

**ప్ర:–** పరమాత్మను ఎవరు పొందగలరు?

**ఉ:–** బ్రహ్మజ్ఞానమందు శ్రద్ధగలవారు.

**ప్ర:–** అట్లు శ్రద్ధలేనివారిగతి యేమగును?

**ఉ:–** వారు పరమాత్మను బొందలేక మృత్యురూపమగు సంసారముననే తిరుగాడుచుందురు.

**ప్ర:–** ఈ సంసారముయొక్క స్వరూపమెట్టిది?

**ఉ:–** అది మృత్యురూపమై యున్నది. అనగా జననమరణరూపమై, దుఃఖభూయిష్ఠమైయున్నదని భావము.

**అ॥** పరమాత్మయొక్క స్వరూపమును ఏడుశ్లోకములద్వారా వర్ణించుచున్నాడు -

## 4. మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా
## మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః.

**టీక:–** ఇదమ్ = ఈ, సర్వమ్ = సమస్తమైన, జగత్ = ప్రపంచము, అవ్యక్త మూర్తినా = ఇంద్రియగోచరముకాని స్వరూపముగల, మయా = నాచేత, తతమ్ = వ్యాపింపబడినది, సర్వభూతాని = సమస్తప్రాణికోట్లు, మత్స్థాని = నాయందున్నవి, తేషు = వానియందు, అహమ్ = నేను, న చ అవస్థితః = ఉండుటలేదు (నాకవి ఆధారములు కావు).

**తా:–** ఈ సమస్తప్రపంచము అవ్యక్తరూపుడనగు నాచే వ్యాపించబడియున్నది. సమస్తప్రాణికోట్లు నాయందున్నవి. నేను వానియందుండుటలేదు. (నాకవి ఆధారములు కావు).

**వ్యాఖ్య:–** 'అవ్యక్తమూర్తినా' - ఇంద్రియములకు గోచరముకాని అతిసూక్ష్మవస్తువే పరమాత్మ. సామాన్యమగు భూతాకాశమే నేత్రములకు కానరాకయుండ, ఇక సూక్ష్మాతిసూక్ష్మమైన చిదాకాశము (ఆత్మ) నేత్రాదులకెట్లుగోచరించును? కనుకనే పరమాత్మ అవ్యక్తరూపుడని ఇట పేర్కొనబడెను. స్థూలాకాశముచే ఏ ప్రకారము జగత్తంతయు పరివ్యాప్తమైయున్నదో, అట్లే చిదాకాశము(పరమాత్మ)చే ఈ స్థూల, సూక్ష్మజగత్తంతయును, ప్రాణికోట్లన్నియును వ్యాప్తములైయున్నవి. కావున అవియన్నియు పరమాత్మయందే యున్నవగును.

'న చాహం తేష్వవస్థితః' - అవియన్నియు 'నాయందున్నను నేను వానియందులేను' అని భగవానుడేల పలికిరి; వాస్తవదృష్టితో పరికించిన ఈ నామరూపాత్మకమగు దృశ్యజగత్తంతయు స్వప్నమువలె మిథ్యయైయున్నది. ఆత్మయొకటియే సత్యము. ఆ ఆత్మయందీ దృశ్యజాతమంతయు రజ్జువునందు సర్పమువలె ఆరోపింపబడియున్నది. కనుక మిథ్యాభూతమగు దృశ్యవస్తువునందు సత్యవస్తువగు పరమాత్మ యెట్లుండ గలడు? కాబట్టియే భగవాను డిచట 'నాయందీ భూతములన్నియు కలవు, నేను వానియందు లేను' అని చెప్పుటకు కారణము.

స్థూల సూక్ష్మమగు చరాచరప్రపంచ మంతటను పరమాత్మ వ్యాపించియుండుటచేత, ఆతడు లేనిచోటు లేదు. కనుక సాధకుడు ఆతని ఉనికిని సర్వత్ర అనుభూత మొనర్చుకొనుచు పాపకృత్యములు చేయక, ప్రాణికోట్ల యెడల దయగలిగి, భక్తిభావసమన్వితుడై యుండవలెను.

**ప్ర:–** పరమాత్మ యెట్టి రూపముగలవాడు?

**ఉ:–** ఇంద్రియములకు గోచరముకాని అతిసూక్ష్మరూపము కలవాడు.

**ప్ర:—** ఆత డెచట నున్నాడు?

**ఉ:—** స్థూల సూక్ష్మ సమస్త ప్రపంచమునందును వ్యాపించియున్నాడు.

**ప్ర:—** ప్రాణికోట్లన్నియు ఎచట నున్నవి?

**ఉ:—** ఉపమాత్మయందు స్థితిగల్గియున్నవి.

**5. న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్
భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః.**

**టీక:—** భూతాని = ప్రాణులు, మత్స్థాని న చ = నాయం దుండునవియుకావు, మే = నాయొక్క, ఐశ్వరమ్ = ఈశ్వరసంబంధమైన, యోగమ్ = యోగమహిమను, పశ్య = చూడుము, మమ = నాయొక్క, ఆత్మా = ఆత్మ (స్వరూపము), భూతభృత్ = ప్రాణికోట్లను భరించునదియు, భూతభావనః అపి = ప్రాణికోట్లను ఉత్పన్న మొనర్చునదియు (లేక రక్షించునదియు) అయినను, భూతస్థః = ప్రాణికోట్లయందుండునది (వాని నాధారముచేసికొని యుండునది), న చ = కాదు.

**తా:—** ప్రాణికోట్లు నాయం దుండునవియుకావు. ఈశ్వరసంబంధమగు నా యీ యోగమహిమను జూడుము. నాయాత్మ (స్వరూపము) ప్రాణికోట్ల నుత్పన్న మొనర్చునదియు, భరించునదియునైనను ఆ ప్రాణులయం దుండుటలేదు. (వాని నాధారముగ జేసికొని యుండునదికాదు.)

**వ్యాఖ్య:—** క్రిందటి శ్లోకములో 'నాయందు సమస్తప్రాణులు కలవు' అని చెప్పి ఈ శ్లోకమున 'నాయం దే ప్రాణులు లేవు' అని చెప్పుట విపరీతము కాదాయని ప్రశ్నించవచ్చును. సామాన్యుల దృష్టియందు దృశ్యమనునది యొకటి యున్నది గనుక అది భగవంతునియందు స్థితిగల్గియున్నదని, దాని కాధార మా భగవంతుడేయనియు వచింపబడినది. పరమార్థదృష్టియందు ద్వైతమనునదియే యుండదు. కావున ఇక ప్రపంచముగాని, ప్రాణికోట్లుగాని అత్తఱియుండవు. ఒకే చిద్ఘనపరమాత్మ శేషించియుండును. కావున అట్టి అద్వైతదృష్టియందు 'నాయం దీభూతములు కలవు' అను వాక్యమెట్లు పొసగును? కావున 'నా యందు ఏ భూతములున్ను లేవు. దృశ్యము నాయందు లేనే లేదు. నేను దృశ్యమందు లేను.' అని సర్వోన్నత అద్వైతదృష్టితో భగవానుడీవాక్యములను బలికిరి. ఎట్లనిన, మేలుకొనిన తరువాత మనుజుడు 'స్వప్నలోకము నాయందు లేదు, నేను స్వప్నలోకమునందు లేను' అని ఎట్లుచెప్పునో, సర్పభ్రమ తొలగిన మీదట రజ్జువునందు సర్పముగాని, సర్పమునందు రజ్జువుగాని లేదని ఎట్లుచెప్పునో, అట్లే పై వాక్యములనున్ను భగవానుడు దృశ్యరహిత పరిపూర్ణాద్వైతదృష్టియందు చెప్పిరి. అట్టి పూర్ణస్థితియందు ఒక్క బ్రహ్మము (ఆత్మ) తప్ప అన్యమగు ఏ వస్తువున్ను ఉండనేరదు. కావున ద్వైతదృష్టిలో తనయొక్క స్వరూపము ప్రాణులను భరించుచున్నను, రక్షించుచున్నను, పరమార్థదృష్టిలో ప్రాణులతోగాని, జగత్తుతోగాని ఏమాత్రము సంబంధములేక పరమాత్మ వెలయుచున్నారు. ఆ సత్యమునే గీతాచార్యు లీశ్లోకమున వెల్లడించి, జగత్తుతోటి తనయొక్క అసంగత్వమును, నిర్లేపత్వమును వ్యక్తపఱచినవారై ఆ తన యోగమహిమను గాంచవలసినదిగా అర్జునున కాదేశించిరి. ఇదియే ఈశ్వర సంబంధమగు గొప్ప యోగమహిమ.

పరమార్థదృష్టియందు జగత్తు బ్రహ్మరూపముగనే శేషించియుండును. జగత్తను పదార్థ మొకటి వేఱుగనుండదు. ఆరోపితవస్తువు సత్యదృష్టియందు అధిష్ఠానరూపముగనే పరిణమించునుగదా! అట్టి పరిపూర్ణదృష్టినే శ్రీకృష్ణపరమాత్మ ఈ శ్లోకమున వ్యక్తపఱచినవారైరి.

**ప్ర:–** ఈశ్వరీయ యోగమహిమ యెట్టిదో నిరూపింపుము?

**ఉ:–** పరమాత్మ ప్రాణులను భరించుచున్నను, రక్షించుచున్నను, అవియేవియు వాస్తవముగ అతనియమదు లేకయు నున్నాడు. ఇదియే ఈశ్వరమహిమ.

**ప్ర:–** పూర్ణాద్వైతదృష్టియందు జగత్తుయొక్క స్థానమెచట?

**ఉ:–** అట్టిస్థితియందు జగత్తు అనునదియే యుండదు. అంతయు ఒకే బ్రహ్మస్వరూపముగ నుండును.

**అ||** ఇక ద్వైతదృష్టియందు జగత్తుయొక్క స్థానమును వివరించుచున్నాడు –

**6. యథాఽఽకాశస్థితో నిత్యం వాయుస్సర్వత్రగో మహాన్**
**తథా సర్వాణి భూతాని మత్స్థానీత్యుపధారయ.**

**టీక:–** యథా = ఏ ప్రకారముగ, సర్వత్రగః = అంతటను సంచరించునదియు, మహాన్ = గొప్పదియునగు, వాయుః = వాయువు, నిత్యమ్ = ఎల్లప్పుడును, ఆకాశస్థితః = ఆకాశమునందున్నదో (ఉండియు ఆకాశముచే నంటబడకనున్నదో), తథా = ఆ ప్రకారముగనే, సర్వాణి = సమస్తములైన, భూతాని = ప్రాణులున్ను, మత్స్థాని ఇతి = నాయందున్నవని, ఉపధారయ = తెలిసికొనుము.

**తా:–** ఏ ప్రకారముగ అంతటను సంచరించునదియు, గొప్పదియునగు వాయువెల్లప్పుడును ఆకాశమునందున్నదో, ఆ ప్రకారమే సమస్త ప్రాణికోట్లున్ను నాయందున్నవని తెలిసికొనుము.

**వ్యాఖ్య:–** సమస్తప్రాణికోట్లు పరమాత్మయం దేప్రకారము స్థితిగల్గియుండుచున్నవో అనువిషయం ఇచట ఒక ఉపమానముద్వారా చెప్పబడినది. వాయువు చాల విశాలమైనది, అంతట సంచరించునది, గొప్పది. అయినను అది సదా ఆకాశమందు ఒకమూల అణగియే యుండుచున్నది. అట్లే జగత్తు విశాలమైనది, అనేక ప్రాణికోట్లతో గూడినది. అయినను పరమాత్మయందది ఏమూలనో అణగియుండుచున్నది. మఱియు ఆకాశము తనయందున్న వాయువుతో అతిసన్నిహితముగనున్నను దానితో ఏమాత్రము నంటక నిర్లేపముగ నెట్లున్నదో, అట్లే పరమాత్మ జగత్తును తనయందు (కల్పితముగ) కలిగియున్నను, దానితో నేమియు అంటకనున్నాడు. వాయువుయొక్క గుణదోషములు, ఆకాశమునంటని విధమున ప్రాణులయొక్క గుణదోషములుగాని, కర్మాదులుగాని పరమాత్మనంటవు. ఆకాశము కంటికి కానరాదు. అట్లే పరమాత్మ అవ్యక్తరూపుడు. ఆకాశము సూక్ష్మమైనది. సర్వవ్యాపకమైనది. అట్లే పరమాత్మ అతిసూక్ష్మరూపుడు, సర్వవ్యాపకుడు. ఈ ప్రకారముగ ఆకాశమునకు, పరమాత్మకు కొన్ని సామ్యములున్నందున, పరమాత్మను వర్ణించునపుడు స్థూలదృష్టిగలవారికి గ్రాహ్యమగుటకొఱకై ఆకాశదృష్టాంతమును వాడుచుందురు. కాని వాస్తవముగ పరమాత్మ ఆకాశముకాదు. ఏలయనిన, ఆకాశము జడమైనది. పరమాత్మ చైతన్యస్వరూపుడు.

ఆకాశమువలె పరమాత్మ సర్వత్రవ్యాపించియున్నారని చెప్పబడుటవలన, వారి అస్తిత్వమును సర్వత్ర అనుభూతమొనర్చుకొనవలెను. దేవుడు ఎక్కడున్నాడు? అను ప్రశ్నకు ఈ శ్లోకమునుబట్టి అంతట నున్నాడని చెప్పవలసివచ్చును. అణువణువునందును వారు వ్యాపించియున్నారు. ఈ సత్యమును తెలిసికొనినచో ఇక జనులు పాపకృత్యముల నెట్లు చేయగలరు? చేయలేరు. ఏలయనగా, సర్వత్ర పరమాత్మ వారి చేష్టలను గమనించుచునేయున్నారని తెలియగలదు. కావున అట్టివారు పాపభీతి గల్గి, సుగుణసంపత్తియుతులై మెలగుదురు. మఱియు సమస్తజీవరాసులను పరమాత్మ తనయందు గలిగియున్నటుల చెప్పబడినందున, జీవులకంటె ఈశ్వరు డెంతటి ఉన్నత స్థానమందు స్థితిగల్గియున్నాడో విశదమగుచున్నది. కాబట్టి జనులు తమ అల్పబల, సౌందర్య, ధన, అధికారాదులనుజూచి గర్వించక, తాను గొప్ప అను దర్పమును విడనాడి, సర్వేశ్వరునియెడల భక్తిప్రపత్తులుగలవారై వారిని సేవించవలెనని స్పష్టమగుచున్నది.

**ప్ర:–** సమస్త ప్రాణికోట్లు ఎచ్చోట స్థితిగలిగియున్నవి?

**ఉ:–** పరమాత్మయందు.

**ప్ర:–** ఏ ప్రకారముగ ?

**ఉ:–** ఆకాశమునందు వాయువువలె.

**అ॥** జగత్తుయొక్క సృష్టిస్థితి లయములకు తానే కారకుడని భగవానుడు సెలవిచ్చుచున్నాడు –

**7. సర్వభూతాని కౌన్తేయ ప్రకృతిం యాన్తి మామికామ్**
**కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్.**

**టీక:–** కౌన్తేయ = ఓ అర్జునా!, సర్వభూతాని = సమస్తప్రాణికోట్లు, కల్పక్షయే = ప్రళయకాలమున, మామికామ్ = నాదియైన (స్వాధీనమైన), ప్రకృతిమ్ = ప్రకృతిని (మాయను), యాన్తి = పొందుచున్నవి, కల్పాదౌ = సృష్టికాలమున, తాని = వానిని, పునః = మరల, అహమ్ = నేను, విసృజామి = సృష్టించుచున్నాను.

**తా:–** అర్జునా! సమస్తప్రాణికోట్లు ప్రళయకాలమున నా ప్రకృతిని (మాయను) జేరి అందు అణగియుండును. తిరిగి సృష్టికాలమున వానిని నేను సృజించుచుందును.

**వ్యాఖ్య:–** జీవులు ప్రకృతికి (మాయకు) లోబడియున్నారు. ప్రకృతి పరమాత్మకు లోబడియున్నది. కనుకనే 'మామికామ్' – నా సంబంధమైన ప్రకృతి, లేక నా స్వాధీనమందున్న ప్రకృతి అని శ్రీకృష్ణమూర్తిచే చెప్పబడెను.

**మాయాం తు ప్రకృతిం విద్ధి మాయినం తు మహేశ్వరమ్.** అను శ్రుతివాక్య మీ యర్థమునే బోధించుచున్నది. ప్రకృతియే మాయ. ఆ ప్రకృతిని మాయను స్వాధీనపఱచుకొనినవాడే మహేశ్వరుడు. దీనినిబట్టి ప్రకృతిని జయించుటకు మాయను స్వాధీనపఱచుకొనుటకు సర్వేశ్వరునియొక్క సహాయము, అనుగ్రహము ఎంతేని ఆవశ్యకమైయున్నదని స్పష్టమగుచున్నది. కావున పరమార్థరంగమున సాధకుడు

పురోభివృద్ధినొందవలెననిన, మాయను జయించవలెననిన, సర్వేశ్వరునియొక్కయు, ఆ మాయను ఇదివఱకే జయించియున్నట్టి జీవన్ముక్తులగు మహాత్ములయొక్కయు అనుగ్రహమును సంపాదించుకొనవలయును. అపుడే ఆతడు సులభముగ గట్టెక్కగలడు. ప్రకృతికి లోబడినవారందఱు ఈ శ్లోకమున జెప్పబడినట్లు సృష్టికాలమున పుట్టుచు, ప్రళయకాలమున లయించుచు రాకడపోకడలు గలిగి యుందురు. ఆ సంసృతినుండి తప్పించుకొనవలెననిన, మాయాధీశుడగు పరమాత్మను జీవుడాశ్రయించియే తీరవలెను.

**ప్ర:–** ప్రకృతి (మాయ) ఎవరి స్వాధీనములో నున్నది?

**ఉ:–** పరమాత్మయొక్క స్వాధీనములో నున్నది.

**ప్ర:–** ప్రకృతికి లోబడియున్నవారి గతి ఎట్లుండును?

**ఉ:–** సృష్టికాలమున పుట్టుచు, ప్రళయకాలమున లయించుచు నుందురు.

**8. ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః**
**భూతగ్రామమిమం కృత్స్నమవశం ప్రకృతేర్వశాత్.**

**టీక:–** ప్రకృతేః = ప్రకృతికి (మాయకు లేక స్వకీయకర్మకు), వశాత్ = అధీనమైయుండుటవలన (వశమగుటవలన), అవశమ్ = అస్వతంత్రమైన, ఇమమ్ = ఈ, కృత్స్నమ్ =సమస్తమైన, భూతగ్రామమ్ = ప్రాణిసముదాయమును, (అహమ్ = నేను), స్వామ్ = స్వకీయమైన, ప్రకృతిమ్ = ప్రకృతిని (మాయను); అవష్టభ్య = అవలంబించి, (స్వీకరించి), పునః పునః = మఱల మఱల, విసృజామి = సృష్టించుచున్నాను.

**తా:–** ప్రకృతికి (మాయకు లేక స్వకీయకర్మకు) అధీనమై యుండుటవలన అస్వతంత్రమైనట్టి ఈ సమస్త ప్రాణిసముదాయమును నేను స్వకీయప్రకృతిని అవలంబించి మఱలమఱల సృష్టించుచున్నాను.

**వ్యాఖ్య:–** ఈ శ్లోకమునందు జీవేశ్వరులయొక్క భేదము చక్కగ వివరింపబడినది. జీవుడు ప్రకృతికి వశుడు. ఈశ్వరుడు ప్రకృతిని స్వాధీనపఱచుకొనినవాడు. జీవులు వారివారి కర్మలకు లోబడి, వారివారి మనఃప్రకృతికి వశులై అస్వతంత్రులై యున్నారు. 'కృత్స్నం' అని చెప్పుటవలన ఒకరిద్దఱు కాదనియు, సమస్తప్రాణికోటియు (ప్రకృతిని జయించిన జీవన్ముక్తులు మినహా) ఆ ప్రకారము ప్రకృతికి అధీనమైయే యున్నదని స్పష్టపఱుపబడినది. ఎంతవఱకు కర్మయుండునో, వాసనలుండునో, అంతవఱకు జన్మ తప్పదు. కనుకనే అజ్ఞానులగు ఆ జీవులను మఱలమఱల సృష్టించుచున్నానని భగవానుడు పలికిరి.

కాబట్టి ఈ జననమరణరూప సంసారబంధమును తొలగించుకొన దలంచువారు పరమాత్మను ఆశ్రయించి వారివారి ప్రకృతిని, మనస్సును, జయించుకొనవలెను. బంధవిముక్తి కిదియే యుపాయము. అజ్ఞానులగు జనులు తమకెంతటి భౌతికసంపత్తియున్నను ప్రకృతికి లోబడినవారే కనుకను, తమ ఇంద్రియములకు దాసులే కనుకను, అస్వతంత్రులే యగుదురు. వారు బలాత్కారముగ జన్మకర్మలను బొందుచునేయుందురు. కాబట్టి అధ్యాత్మజ్ఞానమును సముపార్జించి, పరమాత్మయొక్క అనుగ్రహమును సంపాదించి, ప్రకృతిని జయించుటద్వారా జనులు సంసారబంధవిముక్తిని పొందవలసియున్నారు.

రంగులరాట్నముపై ఎక్కిన మనుజులు అవశులై తిరుగులాగున, మాయాచక్రమధిష్ఠించిన జీవులు వారివారి ప్రకృతికి వశులై అస్వతంత్రులై సంసారమున తిరుగాడుచున్నారు. రంగులరాట్నమును ఆపవలెననిన, దానిని త్రిప్పువానిని ఎట్లాశ్రయించవలెనో, అట్లే మాయాచక్రమును త్రిప్పు పరమాత్మను ముక్తికొఱకై జీవు లాశ్రయించవలెను.

**ప్ర:–** జీవులు దేనికి వశులై యున్నారు?

**ఉ:–** వారివారి ప్రకృతికి (కర్మకు).

**ప్ర:–** కావున ఆత్మస్వాతంత్ర్యమునకై జీవు లేమి చేయవలెను?

**ఉ:–** మాయాధీశుడగు పరమాత్మయెడల అనన్యభక్తిగలిగి తమ ప్రకృతిని (మనస్సును, ఇంద్రియములను, కర్మను) జయించుకొనవలెను.

**అ॥** ఈ ప్రకారము జనులను మఱల మఱల సృష్టించుచున్నను వారి కర్మలతో తన కేలాటిసంబంధములేదని భగవానుడు పలుకుచున్నాడు –

## 9. న చ మాం తాని కర్మాణి నిబధ్నన్తి ధనంజయ
## ఉదాసీనవదాసీన మసక్తం తేషు కర్మసు.

**టీక:–** ధనంజయ = ఓ అర్జునా!, తేషు కర్మసు = ఆ కర్మములందు, అసక్తమ్ = తగులుకొననివాడనై (ఆసక్తిలేనివాడనై), ఉదాసీనవత్ = తటస్థునివలె, ఆసీనమ్ = ఉండునట్టి, మామ్ = నన్ను, తాని కర్మాణి = ఆ కర్మములు, న నిబధ్నన్తి = బంధింపవు.

**తా:–** ఓ అర్జునా! (ఆ ప్రకారము జీవులను సృష్టించినవాడనైనను) ఆ సృష్ట్యాదికర్మలయందు తగులుకొననివాడనై సాక్షీభూతుడుగ నుండునట్టి నన్ను ఆకర్మలెవ్వియు బంధింపనేరవు.

**వ్యాఖ్య:–** ఈ ప్రకారముగ జీవులను మఱల మఱల సృష్టించుచున్నను ఆ కర్మలతో పరమాత్మ కేలాటి సంబంధమున్ను లేదు. వారు తటస్థులు, సాక్షీభూతులు. సూర్యుని సన్నిధానమాత్రముచేతనే జనులు వారివారి కర్మల నాచరించినను, ఆ కర్మలతో సూర్యునకేలాటి సంబంధమున్ను ఎట్లులేదో, అట్లే భగవత్సాన్నిధ్యముచే జరుగు ప్రకృతి చర్యలకు సృష్ట్యాదికర్మలచే వాస్తవముగ ఆ భగవంతున కేసంబంధమున్ను లేదనియు, వానియందు వారు తగుల్కొనరనియు, వానిచే బంధితులుకారనియు ఇట వచింపబడినది. దీనినిబట్టి పరమాత్మతో నైక్యమొందిన జీవులకున్ను కర్మబంధమేమియు నుండజాలదని స్పష్టమగుచున్నది.

**అ॥** భగవత్సాన్నిధ్యముచే ప్రకృతి చరాచరసృష్టినంతయు గావించుచున్నదని వచించుచున్నాడు –

## 10. మయాఽధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్
## హేతునానేన కౌన్తేయ జగద్విపరివర్తతే.

**టీక:–** కౌన్తేయ = ఓ అర్జునా!, అధ్యక్షేణ = అధ్యక్షుడనైయున్న (సాక్షీభూతుడనైయున్న), మయా = నాచేత, ప్రకృతిః = ప్రకృతి, (మాయ) సచరాచరమ్ = చరాచరప్రపంచమునంతను, సూయతే = పుట్టించుచున్నది, అనేనహేతునా = ఈ కారణముచేత, జగత్ = జగత్తు, విపరివర్తతే = ప్రవర్తించుచున్నది.

**తా:–** ఓ అర్జునా! అధ్యక్షుడనై (సాక్షిమాత్రుడనై) యున్న నాచేత ప్రకృతి చరాచర ప్రపంచమునంతను సృజించుచున్నది. ఈ కారణముచేతనే జగత్తు ప్రవర్తించుచున్నది.

**వ్యాఖ్య:–** ప్రకృతి జడమైనది. పరమాత్మ చైతన్యరూపుడు. పరమాత్మసాన్నిధ్యము చేతనే ప్రకృతి చరాచరప్రాణికోట్లను సృజింపగల్గుచున్నది. సూదంటురాయియొక్క సన్నిధానమందు ఇనుపసూది కదలుచున్నను, సూదంటురాతికి ఏకర్తృత్వమున్ను లేదు. అది సాక్షిమాత్రమైయున్నది. అట్లే పరమాత్మయు జగద్వ్యవహారమున సాక్షిమాత్రుడై యొప్పుచున్నాడు. అతని సన్నిధానమహిమచే ప్రకృతి సమస్తజగత్కార్యములను జేయుచున్నది. పరమాత్మయొక్క ఇట్టి తాటస్థ్యమును, చైతన్యశక్తిని వర్ణించుటకై ఈ శ్లోకమందు 'అధ్యక్షేణ' అను చక్కటి పదమొకటి ప్రయోగింపబడినది. ఒక సభలో ఎందఱు సభ్యులు గుమిగూడినను సభకు చైతన్యమురాదు. అధ్యక్షుడు వచ్చికూర్చొనుటతోనే సభకు చైతన్యము వచ్చును. అట్లే ఒకకోర్టులో తక్కిన వారెందఱున్నప్పటికిని 'జడ్జీ' వచ్చి కూర్చొననిదే కార్యక్రమము జరుగదు. అతడు వచ్చినతోడనే అతని సాన్నిధ్యముచేతనే కోర్టువ్యవహారమంతయు నడచిపోవును. అట్లే ప్రకృతియు ఈశ్వరసాన్నిధ్యములేనిచో జడమై, సృజనశక్తిరహితమై యుండును. చిద్ఘనుడగు పరమాత్మవలననే ప్రకృతికి సృష్టిరూపశక్తి ఏర్పడుచున్నది. ఈ హేతువుచేతనే జగత్తంతయు పరివర్తనము గలిగియుండుచున్నది. లేకున్న ఇంజనులేని రైలుపెట్టెలవలె ప్రపంచము నిర్వీర్యమై, నిశ్చేష్టమై యుండగలదు.

సామాన్యముగ జనులయొక్కదృష్టి స్థూలప్రపంచమువఱకే పోవుచున్నది. గావున దానినే సత్యమనినమ్మి దానివెంటనే పరుగెత్తుచున్నారు. కాని ఈ శ్లోకముద్వారా వారు పొరబడుచున్నారని తెలియగలదు. స్థూలప్రపంచము జడమైనది. దానిని త్రిప్పునట్టిదియు, దానికి చైతన్యశక్తిని ప్రసాదించునదియునగు అతిసూక్ష్మమైన (ఆత్మ) వస్తువు దాని వెనుకగలదు. స్థూలదృష్టికి అదిగోచరింపదు. విజ్ఞాననేత్రముచే దానినెఱుంగవలెను. అదియే పరమాత్మ. ప్రపంచమంతయు ఆ పరమాత్మయందు ఆరోపింపబడినది. ఆరోపితవస్తువునకు స్వతః ఏ బలమున్ను, వ్యక్తిత్వమున్ను ఉండదు. అది తనశక్తిని అధిష్ఠానవస్తువునుండియే పరిగ్రహించును. అట్లే ఆరోపితమగు జగత్తుయొక్క శక్తి యంతయు అధిష్ఠానమగు పరమాత్మవలననే కలుగుచున్నది. (అయినను పరమాత్మకర్తృత్వరహితులై, సాక్షిమాత్రులై, ఆ యా జడక్రియలయందు నిర్లిప్తులై యున్నారు). దీనినిబట్టి భౌతికశక్తిగాని, మానసికశక్తిగాని ఎంతగొప్పదైనను ఆధ్యాత్మికశక్తియొద్ద తీసికట్టేయగును. ఆత్మశక్తి ప్రధానమైనది. చైతన్యవంతమైనది. తక్కిన శక్తులన్నియు ప్రకృతికి జెందినవై అప్రధానములైయున్నవి. కావున విజ్ఞుడు స్వల్పస్వల్ప భౌతికశక్తుల సముపార్జనయందే జీవితమును ధారబోయక వానినిజూచి మురిసిపోవక దైవశక్తిని సముపార్జించవలెను. మఱియు చిన్న చిన్న అధ్యక్షపదవులకై అఱ్ఱులు చాచక, జగదధ్యక్షులగు పరమాత్మయొక్క సాన్నిధ్యమునకై, ఐక్యమునకై యత్నించవలెను. ఎద్దానివలన ఈ చరాచరజగత్తంతయు వ్యవహారసమర్థమై యొప్పుచున్నదో అట్టి అధిష్ఠానచైతన్య పరమాత్మయొక్క సాక్షాత్కారముకొఱకే యత్నించవలెనుగాని, జడములగు దృశ్యవస్తువుల స్వీకరణముచే సంతృప్తిని బొందరాదు.

**ప్ర:–** ఈ జగత్తునకు అధ్యక్షుడెవడు?

**ఉ:–** పరమాత్మ. ఆతని సాన్నిధ్యమువలననే ఈ చరాచరజగత్తంతయు వ్యవహరించుచున్నది.

**అ॥** భగవానుని అట్టి మహిమను గుర్తెఱుంగని ఆసురీప్రకృతియుతులగు మూఢులయొక్క ప్రవర్తనను రెండు శ్లోకములద్వారా గర్హించుచున్నాడు –

## 11. అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్
## పరం భావమజానన్తో మమ భూతమహేశ్వరమ్

**టీక:–** మమ = నాయొక్క, పరంభావమ్ = పరమతత్త్వమును (సర్వోత్తమస్వరూపమును), అజానన్తః = ఎఱుంగని, మూఢాః = అవివేకులు, భూతమహేశ్వరమ్ = సమస్తప్రాణులకు నియామకుడను, మానుషీంతనుమ్ = (లోకసంరక్షణార్థము) మనుష్యదేహమును, ఆశ్రితమ్ = ఆశ్రయించినవాడనునగు, మామ్ = నన్ను, అవజానన్తి = అవమానించుచున్నారు. (అలక్ష్యము చేయుచున్నారు).

**తా:–** నాయొక్క పరమతత్త్వమును ఎఱుంగని అవివేకులు సర్వభూతమహేశ్వరుడను, (లోకసంరక్షణార్థము) మనుష్యదేహమును ఆశ్రయించినవాడనునగు నన్ను అవమానించుచున్నారు. (అలక్ష్యము చేయుచున్నారు.)

**వ్యాఖ్య:–** పరమాత్మ సమస్తభూతకోట్లకు నియామకుడు, ప్రభువు, ఈశ్వరుడు. ధర్మోద్ధరణముకొఱకు, లోకసంరక్షణముకొఱకు అపుడపుడు లోకమున అవతరించుచుండును. అట్లు మనుష్యదేహమును గ్రహించి లోకమున అవతరించిన సాక్షాత్ భగవానుని మూఢులు తెలిసికొనజాలక, ఎవరో సామాన్యుడని తలంచి ఆతనిని అవమానించుచున్నారు. నిర్లక్ష్యము చేయుచున్నారు. ఆతని పరతత్త్వమును వారు గ్రహించుటలేదు. అట్టివారిని 'మూఢులు' అని శ్రీకృష్ణమూర్తి సంబోధించిరి. ఏలయనగా, ఒకింతైనను వివేకముకలవారు అట్లు పరమాత్మను ద్వేషింపరు. కొందఱు జనులు అహంభావపూరితులై, తమ ధనజనసంపదాదులను, అధికారమును జూచుకొని గర్వులై కన్నుమిన్ను తెలియక మహాత్ములను, సాధుపుంగవులను దూషించుచుందురు. హేళనచేయుచుందురు. శిశుపాల, దుర్యోధనాదు లీ తెగలోనివారు. కనుకనే వారు దుష్ఫలితముల ననుభవించిరి.

ఆధ్యాత్మికసాధనలు చేయువారికి తమజీవితములో నిందాస్తుతులకు గురియగు సందర్భములు కొన్ని తటస్థింపవచ్చును. అట్టి సందర్భములలో ఎంతయో సహనము గల్గి తమయం దేవేని దోషములున్నచో తొలగించుకొని, ఏ దోషములు లేనపుడు గంభీరచిత్తులై ఆ యా నిందలకు జంకక నుండవలెను. లోకులలో కొందఱి స్వభావము ఈ ప్రకారముగనే పరనిందాత్మకముగ నుండునని తలంచి మనఃస్థిమితము గల్గియుండవలెను. సాక్షాత్ శ్రీకృష్ణపరమాత్మయే అవివేకుల నిర్హేతుకనిందలకు గురి అయినపుడు ఇక సామాన్యులవిషయము వేఱుగ చెప్పవలెనా? అని ఇట్లు తలంచి ధైర్యము తెచ్చుకొని సహనశీలురై యుండవలెను మాయయొక్క స్వభావ మిట్లేయుండునని గ్రహించి నిశ్చలచిత్తులై యుండవలెను. ఎవరిని ద్వేషింపరాదు. ఎవరైన అవివేకులు భగవంతునిగూర్చి నిందాపూర్వకముగ పలికినచో ఆ వాక్యములను ముముక్షువులు లక్ష్యపెట్టక అట్టి నాస్తికుల వచనములను విశ్వసింపక భగవద్భక్తిని అభివృద్ధిపఱచుకొనుచు, తద్ద్వారా వారికి చక్కని బుద్ధి గఱపవలెను.

ప్ర:– పరమాత్మ యెట్టివాడు?

ఉ:– (1) సమస్తప్రాణికోట్లకు నియామకుడు (2) లోకోపకారార్థము అత డపుడపుడు మనుష్యాది దేహములను గ్రహించుచుండును.

ప్ర:– ఈశ్వరుని పరతత్త్వము నెఱుంగని అవివేకులెట్లు ప్రవర్తించుదురు?

ఉ:– లోకసంరక్షణార్థము మానవదేహమును ధరించిన పరమాత్మను ఆతడెవడో సామాన్యుడని తలంచి అవమానించుదురు.

ప్ర:– దీనినిబట్టి గ్రహించవలసిన యంశములేవి?

ఉ:– (1) మూఢత్వమును పోగొట్టుకొనవలెను (2) పరులను నిందించరాదు (3) భగవానుని నిజతత్త్వ మెఱింగి ఆతనియెడల భక్తిభావము గలిగియుండవలెను.

**12. మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః**
**రాక్షసీమాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః.**

**టీక:**– (తే = వారు), మోఘాశాః = వ్యర్థములైన ఆశలుగలవారును, విచేతసః = బుద్ధిహీనులును (అగుచు), మోహినీమ్ = మోహమును గలుగజేయునదియు, రాక్షసీమ్ = రాక్షస సంబంధమైనదియు, ఆసురీంచ = అసురసంబంధమైనదియునగు, ప్రకృతిమ్‌ఏవ = స్వభావమునే, శ్రితాః = ఆశ్రయించినవారు (అగుచున్నారు).

**తా:**– (అట్టివారు) వ్యర్థములైన ఆశలుగలవారును, వ్యర్థములైన కర్మలుగలవారును, వ్యర్థమైన జ్ఞానముగలవారును, బుద్ధిహీనులును (అగుచు) రాక్షససంబంధమైనదియు, అసురసంబంధమైనదియునగు స్వభావమునే ఆశ్రయించుచున్నారు.

**వ్యాఖ్య:**– జనుల ప్రకృతి (స్వభావము) సామాన్యముగ రెండువిధములుగ నుండుచుండును. (1) దైవీప్రకృతి (2) ఆసురీప్రకృతి – అని. అందు ఆసురీప్రకృతిగలవారిని గూర్చి క్రిందటి శ్లోకమునందును, ఈ శ్లోకమునందును తెలియజేసిరి. దైవీప్రకృతి గలవారిని గూర్చి రాబోవు శ్లోకమున చెప్పుదురు. ఆసురీప్రకృతిగలవారు వ్యర్థములైన ఆశలు, కర్మలు గలిగియుందురు. వారికుండు ఒకింత జ్ఞానమున్ను నశ్వరములగు దృశ్యవస్తువులనుగూర్చినదియే యగుటబట్టి అదియు పరమార్థదృష్టియందు నిష్ఫల మైనదియే యగును. వారి చిత్తమందు సత్యవస్తువు (ఆత్మ)ను గూర్చిన పరిజ్ఞానముగాని, వివేకముగాని ఒకింతైనను ఉండదు. కనుకనే వారు 'విచేతసులు'గ (Brainless people), చిత్తముచెడినవారుగ, బుద్ధిహీనులుగ వర్ణింపబడిరి. మఱియు నట్టివారు రాక్షససంబంధమైనదియు, మోహపెట్టునదియు, అనగా అజ్ఞానమున బడద్రోయునదియునగు స్వభావమునే ఆశ్రయించుదురు. ఇచట 'రాక్షసీం', 'ఆసురీం' అను రెండుపదములను ఒకేచోట ప్రయోగించుటవలన వారి క్రూరస్వభావము, రాజస, తామస స్వభావము లెస్సగ వ్యక్తమొనర్పబడినట్లైనది. అట్టివారు పరమార్థదృష్టియందు ఎందుకు పనికిరానివారే యగుదురు. కనుకనే వారిబ్రతుకు మోఘపుబ్రతుకని (వ్యర్థజీవితమని) భగవాను డిచట స్పష్టముగ చెప్పివైచిరి. అందులకే 'మోఘ'

మనుపద మీశ్లోకమున వరుసగ మూడు పర్యాయములు ప్రయోగింపబడినది. మిథ్యారూపములైన దృశ్యవస్తువులనే పట్టివ్రేలాడుచు సత్యమగు పరమాత్మను విస్మరించువారి జీవితము నిజముగ వ్యర్థమేయగును.

కావున జనులు రాక్షసప్రకృతిని, అసురస్వభావమును, కామాదిదుర్గుణములను, రాజస తామస ప్రవృత్తులను పారద్రోలి దైవీసంపత్తిని ఆశ్రయించి సత్యవస్తువగు పరమాత్మను నమ్మి తమతమ జీవితములను సార్థకము చేసికొనవలయును. ఈ శ్లోకమందు అజ్ఞానులు వ్యర్థమగు ఆశ, వ్యర్థమగు కర్మ, వ్యర్థమగు జ్ఞానము గలిగియుందురని చెప్పబడెను, గావున విజ్ఞులగువారు తద్విరుద్ధమగు ఆచరణనే స్వీకరించుచు అనగా దైవమును గూర్చిన ఆశ, దైవమును గూర్చిన కర్మ, దైవమునుగూర్చిన జ్ఞానమునే కలిగియుండి విగతచిత్తులుకాక 'విశేషచిత్తులై' దైవచిత్తులై మెలగవలయును.

**ప్ర:–** అసురప్రకృతి యెట్టిది?

**ఉ:–** జనులను మోహపెట్టునది, అజ్ఞానమున బడద్రోయునది.

**ప్ర:–** అసురప్రకృతి కల వారెట్టి గుణములు కలిగియుందురు?

**ఉ:–** (1) వ్యర్థములగు ఆశలు, (2) వ్యర్థ చేష్టలు, (3) వ్యర్థజ్ఞానము గలిగియుందురు.

**ప్ర:–** కావున జీవు లెట్లు ప్రవర్తింపవలెను?

**ఉ:–** ఆసురీప్రకృతిని వదలి దైవీప్రకృతినే ఆశ్రయించుచు, దైవమునుగూర్చిన ఇచ్ఛ, దైవమును గూర్చిన చేష్ట, దైవమునుగూర్చిన జ్ఞానము గలిగియుండవలెను.

**అ||** ఇక దైవీప్రకృతిగలవారి లక్షణములను రెండు శ్లోకములద్వారా చెప్పుచున్నాడు –

## 13. మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతిమాశ్రితాః
## భజన్త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాదిమవ్యయమ్.

**టీక:–** పార్థ = ఓ అర్జునా !, మహాత్మానః తు = మహాత్ములైతే, దైవీమ్ = దేవసంబంధమైన, ప్రకృతిమ్ = స్వభావమును, ఆశ్రితాః (సన్తః) = ఆశ్రయించినవారలై, మామ్ = నన్ను, భూతాదిమ్ = సమస్తప్రాణులకును కారణభూతుడనైనవానిగను, అవ్యయమ్ = నాశములేనివానిగను, జ్ఞాత్వా = తెలిసికొని, అనన్యమనసః = ఇతరచింతలులేనివారై, భజన్తి = సేవించుచున్నారు (భజించుచున్నారు).

**తా:–** ఓ అర్జునా! మహాత్ములైతే దైవీప్రకృతిని (దేవసంబంధమైన స్వభావమును) ఆశ్రయించినవారలై, నన్ను సమస్తప్రాణులకును ఆదికారణునిగను, నాశరహితునిగను ఎఱింగి వేఱొకదానియందు మనస్సునుంచనివారలై నన్నే సేవించుచున్నారు.

**వ్యాఖ్య:–** క్రిందటి రెండుశ్లోకములందును ఆసురీప్రకృతిని ఆశ్రయించువారి స్వభావమెట్లుండునో తెలుపబడినది. ఈ శ్లోకమందు, రాబోవు శ్లోకమందు దైవీప్రకృతి నవలంబించువారి లక్షణములు వివరింపబడినవి. దైవీప్రకృతిని★, సత్త్వగుణమును ఆశ్రయించిన మహాత్ములు పరమాత్మను అనన్యచిత్తముతో

★ దైవీప్రకృతి, ఆసురీప్రకృతి కలవారిని గూర్చి 16వ అధ్యాయములో విస్తారముగ తెలుపబడినది.

సేవించుచున్నారు. ఎందులకు సేవించుచున్నారు? వారు పరమాత్మయందు రెండు విశిష్టగుణములను చూచిరి. అవి యేవియనిన (1) ఆదికారణత్వము (2) అవ్యయత్వము. భగవానుడు సమస్త చరాచర ప్రపంచమునకు ఆదికారణుడని, నాశరహితుడని వారెఱింగిరి. ఇట్టి మహత్తరగుణములు మఱియేయితర పదార్థమందుగాని, వ్యక్తియందుగాని లేవు. పరమాత్మ సనాతనుడు, అనాదిస్వరూపుడు. తక్కిన పదార్థములన్నియు ఆద్యంతములు గలిగియున్నవి. కావున అవి అల్పములు. పరమాత్మ అవ్యయుడు. నాశములేనివాడు. తక్కినవన్నియు నాశవంతములు. క్షయిష్ణువులు. పుట్టుక, చావు కలవి. ఈ ప్రకారముగ మహనీయులు దృగ్దృశ్య పదార్థశోధనము కలవారై దేనిస్వభావ మెట్లుండునో బాగుగ విచారించి, దృశ్యమును నశ్వరముగను, పరమాత్మను శాశ్వతునిగను ఎఱింగి చరాచర జగత్తునందాతనినే పరమోత్కృష్టుడని నిశ్చయించి అనన్యచిత్తముతో వారినే సేవించుచున్నారు.

'అనన్యమనసః' - మనస్సు మఱియొకదానియందు సంలగ్నముకాక ఇతర వ్యాపకములేక ఒకే ధ్యేయమునందు నిలుకడకలిగియున్నచో దానిని అనన్యమనస్సందురు. అట్టి అనన్యమనస్సుతో పరమాత్మను ధ్యానించవలెననిన, ఇతర వస్తువులయొక్క నశ్వరత్వాది దోషములు, పరమాత్మయందలి శాశ్వతత్వాది సుగుణములు బాగుగ గ్రహించియుండవలెను. కనుకనే ఇచట 'జ్ఞాత్వా' అని చెప్పబడినది. ధ్యేయవస్తువుయొక్క పరిజ్ఞానము గలిగియున్నపుడే దానిపై విశ్వాసమేర్పడగలదు. అపుడు మాత్రమే దానిపై అనన్యమనస్సు సంభవించగలదు. అట్లే దృశ్యవస్తువులయొక్క దోషములను విచారించియు వానియెడల విరక్తి గలిగియుండినచో ఇక మనస్సు బయటకు పరుగెత్తక అంతర్ముఖమై ఒకే పరమాత్మయందు నిలుకడ గలిగియుండును. చిత్తమునందు అనన్యత్వము చక్కగ ఏర్పడగలదు.

'మహాత్మానః' - మహాత్ముడనగా నెట్టివాడో ఈ శ్లోకమున చక్కగ విశదీకరింపబడినది. 'మహాత్మా' అనునది ఒకబిరుదు. అది ప్రయత్నముచే ప్రతివారికిని లభ్యముకాగలదు. ఎవరు (1) దైవీప్రకృతిని ఆశ్రయించి (2) భగవానుని నాశరహితునిగను, ఆదికారణునిగను ఎఱింగి (3) అనన్యమనస్కులై వారిని ధ్యానించుదురో, అట్టివారు మహాత్ములు కాగల్గుదురు. కాబట్టి మహాత్మత్వమునకు జాతిమతకులగోత్రాదులతో పనిలేదు. ఎవ్వరైన సరియే పైనదెల్పిన సల్లక్షణములు గలిగియుండినచో వారు మహాత్ములే యగుదురు. అసురప్రకృతిని ఆశ్రయించువారు, కామక్రోధాదులు కలవారు, భగవంతుని ఏకాగ్రచిత్తముతో భజింపనివారు మహాత్ము లెన్నటికిని కానేరరు. వారు అల్పాత్ములు, దురాత్ములే యగుదురు.

లోకములో భగవంతునిగూర్చి ధ్యానించువారు చాలమంది యుండవచ్చును, గాని అనన్యమనస్సుతో ధ్యానించువారు చాల అరుదు. మనస్సులో కొంతభాగము దృశ్యముపైనను, కొంతదైవముపైనను వారికి వ్యాపించుచుండును. అట్టివారు భగవత్తత్త్వమును ఇంకను బాగుగ తెలిసికొని, వారి మహిమను లెస్సగ గుర్తెఱింగి క్రమముగ దృశ్యచింతను తొలగించి అనన్యచిత్తముతో దైవమును సేవించుటను అభ్యసింపవలెను. మనస్సునందు నూటికినూరుపాళ్లు దైవత్వము (100% దైవత్వము) ఉండులాగున చూడవలెను. అట్టి మనస్సు ఇక మనస్సుగానుండక చిద్రూపముగా, దైవస్వరూపముగా, సత్త్వముగా మారిపోవును (జ్ఞచిత్తంసత్త్వముచ్యతే). అట్టి స్థితియే మోక్షము.

**ప్ర:–** దైవీప్రకృతిని ఆశ్రయించిన మహాత్ము లెట్లు ప్రవర్తించుదురు?

**ఉ:–** పరమాత్మను సమస్తభూతకోట్లకు ఆదికారణునిగను, అవ్యయునిగను ఎఱింగి అనన్యమనస్సుతో ఆతనిని సేవించుచుందురు.

ప్ర:– పరమాత్మ యెట్టి లక్షణములు కలవాడు?

**ఉ:**– (1) సమస్తప్రాణికోట్లకు ఆదికారణుడు (2) నాశరహితుడు.

ప్ర:– మహాత్ముడని ఎట్టివాడు చెప్పనగును?

**ఉ:**– (1) దైవీప్రకృతిని ఆశ్రయించువాడు (2) భగవత్తత్త్వ మెఱుంగువాడు (3) అట్లెఱిగి పరమాత్మను అనన్యచిత్తముతో సేవించువాడు.

ప్ర:– భగవంతునియందు అనన్యమనస్సు ఎట్లేర్పడగలదు?

**ఉ:**– అతని స్వరూపస్వభావములను బాగుగ తెలిసికొనినచో, అనగా, ఆతడు నాశరహితుడని ఆదికారణుడని యెఱింగినచో, అట్టి భగవత్పరిజ్ఞానమువలన నాతనిపై పూర్ణభక్తివిశ్వాసములు కలుగుటబట్టి ఇక మనస్సు అన్యత్రపోక ఆతనిపైననే నిలుచును. అదియే అనన్యమనస్సు. అనన్యమనస్సేర్పడుట కిదియే యుపాయము.

**అ॥** దైవీప్రకృతి కలవారి లక్షణముల నింకను వివరించుచున్నాడు –

**14. సతతం కీర్తయన్తో మాం యతన్తశ్చ దృఢవ్రతాః**
**నమస్యన్తశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే.**

**టీక:**– (తే = వారు), సతతమ్ = ఎల్లప్పుడు, మామ్ = నన్నుగూర్చి, కీర్తయన్తః = కీర్తించుచు, దృఢవ్రతాః = చలింపని వ్రతములుగలవారై, యతన్తః చ = ప్రయత్నించుచు, భక్త్యా = భక్తితో, నమస్యన్తః చ = నమస్కరించుచు, నిత్యయుక్తాః = సదా నాయందుచిత్తముంచినవారలై (ఏకాగ్రచిత్తులై), మామ్ = నన్ను, ఉపాసతే = సేవించుచున్నారు.

**తా:**– వారు (పైన దెల్పిన దైవీప్రకృతిగలవారు) ఎల్లప్పుడు నన్నుగూర్చి కీర్తించుచు, దృఢవ్రతనిష్ఠులై ప్రయత్నించుచు, భక్తితో నమస్కరించుచు, సదా నాయందు చిత్తముంచినవారలై నన్ను సేవించుచున్నారు.

**వ్యాఖ్య:**– మహాత్ములగువారు పరమాత్మను అనన్యమనస్సుతో సేవింతురని పై శ్లోకమందు చెప్పబడినది. ఎట్లు సేవింతురో. ఆ పద్ధతి యిచట తెలుపబడినది. సర్వకాల సర్వావస్థలయందును వారు భగవంతుని స్మరించుచుందురు, కీర్తించుచుందురు. 'సతతమ్' అని చెప్పినందువలన ఏదియో యొక సమయమున కీర్తించుట కాదనియు, నిరంతరము కీర్తించుచుందురనియు తెలియుచున్నది. సాకారభక్తికలవారైనచో భగవంతుని నామస్మరణాదులు గావించుదురు. నిరాకారభక్తిగలవారైనచో హృదయమున ఆ పరమాత్మనుగూర్చిన మనననిదిధ్యాసనములను గావించుదురు.

వారు భగవత్ప్రాప్తికై సదా యత్నశీలురై యుందురు. ఇంద్రియనిగ్రహాదులను (శమదమాదులను) అభ్యసించుచుందురు. సోమరులైయుండరు. ప్రయత్నశీలురకు మాత్రమే దైవపదము లభ్యమగునుగాని తదితరులకుగాదని ఈ 'యతన్తశ్చ' అను పదమువలన సుస్పష్టమగుచున్నది. ప్రయత్నములేనిచో ప్రాపంచికవస్తువే సిద్ధింపకయుండ ఇక దైవ వస్తువునుగూర్చి వేఱుగ చెప్పవలెనా? వారు చేయునది

సామాన్యప్రయత్నముకాదు. 'దృఢవ్రతముల' నవలంబించి గొప్ప పట్టుదలతో పరమార్థసాధనములను గావించుదురు.

**'తే ద్వన్ద్వమోహనిర్ముక్తా భజన్తే మాం దృఢవ్రతాః'** **(7-28)** అని వారి యీ దృఢవ్రతశీలత్వమునుగూర్చి యిదివఱకే గీతాచార్యులు చెప్పియున్నారు. ఇపుడు మరల దానినే ప్రస్తావించుటబట్టి అద్దాని గొప్పతనము, అత్యావశ్యకత నిరూపితమగుచున్నది. బహుజన్మార్జిత పాపవాసనలతో, మలినసంస్కారములతోను గూడి మదించియున్న మనస్సును లొంగదీయవలెనని సాధకుడు కొన్ని వ్రతములను తప్పక శీలించవలసియుండును. (ఉపవాసవ్రతము, మౌనవ్రతము, జపవ్రతము, ధ్యానవ్రతము, బ్రహ్మచర్యవ్రతము మున్నగునవి). అయితే దృఢవ్రతములుగ నుండవలెనేకాని దుర్బల వ్రతములుగ నుండరాదు. అనగా వానిని మధ్యమధ్య భంగమొనర్పరాదు. వ్రతములందు, నియమములందు, పరమార్థనిష్ఠయందు ఇట్టి దృఢత్వము లేనందువలననే అనేకులు ఈ మార్గమున ప్రవేశించియు బలవత్తరమగు మాయచే పరాజితులై వెనుకకు మఱలిపోవుచున్నారు. మాయ భయంకరమైన శత్రువు. అది సామాన్యాయుధములకు లొంగదు. కావున దృఢవ్రతము లను దివ్యాస్త్రములచే దానిని ఓడించవలెను.

'నిత్యయుక్తాః' - అని చెప్పుటచే వారు నిరంతరము ఏకాగ్రతతో భగవంతుని యందు చిత్తమును నెలకొల్పుచుందురని స్పష్టమగుచున్నది. అయితే 'భక్త్యా' అను పదమును గూడ చేర్చినందువలన వారు చేయు వందనముగాని, ధ్యానముగాని నిర్మల భక్తితో గూడియుండునదియే యగునని తెలియుచున్నది. భగవంతుని ధ్యానించువారు పెక్కురుండవచ్చునుగాని భక్తితో ధ్యానించువారు చాల అరుదు.

'స తు దీర్ఘరాలనైరన్తర్య సత్కారసేవితో దృఢభూమిః' అని పతంజలి మహర్షియు ప్రీతితో గూడిన ధ్యానాది నిరంతరయత్నములకే ఎక్కువ ప్రాధాన్యమొసంగియుండిరి. ఈ ప్రకారముగ నిరంతరదైవస్మరణము, దృఢవ్రతత్వము, భక్తితోగూడిన నిరంతర ధ్యానము భగవత్సాక్షాత్కారమునకు మార్గములని ఈ శ్లోకము ద్వారా వెల్లడియగుచున్నది. కావున ముముక్షువు లట్టి యాచరణను శీలించి దైవీప్రకృతికలవారై యత్నించినచో బ్రహ్మసాయుజ్యమును శీఘ్రముగ బొందగలరు.

**ప్ర:-** మహాత్ములగువారు భగవంతుని ఏ ప్రకారము సేవింతురు?

**ఉ:-** (1) ఎల్లపుడు కీర్తించుచుందురు (2) దృఢవ్రతము లవలంబించి దైవప్రాప్తికై యత్నించుచుందురు. (3) భగవానుని భక్తితో నమస్కరించుదురు (4) చిత్తమును అన్యత్రపోనీయక పరమాత్మయందే సదా నెలకొనియుండులాగున చూచుదురు.

**ప్ర:-** దీనిని బట్టి **భగవత్ప్రాప్తికి** ఉపాయము లేవియని స్పష్టమగుచున్నది?

**ఉ:-** (1) నిరంతర స్మరణము (2) దృఢవ్రతసంయుక్తమగు యత్నము (3) భక్తితోగూడినవందనము, ధ్యానము (4) ఏకాగ్రతతో గూడిన నిరంతరదైవచింతనము (నిత్యయుక్తత్వము) అనునవి భగవత్ప్రాప్తికి ఉపాయములని తేలుచున్నది.

**ప్ర:-** భగవంతుని ఎపుడెపుడు స్మరించవలెను, కీర్తించవలెను?

**ఉ:-** నిరంతరము.

**ప్ర:–** ఎట్టి వ్రతములుగలిగి యత్నించవలెను?

**ఉ:–** దృఢవ్రతములుగలిగి.

**ప్ర:–** భగవచ్చింతన యెట్లు చేయవలెను?

**ఉ:–** భక్తితో గూడి.

**అ॥** జనులు పెక్కు విధముల తన్ను ఉపాసించుదురని (సేవించుదురని) భగవానుడు తెలుపుచున్నాడు –

**15. జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజన్తో మాముపాసతే**
**ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్.**

**టీక:–** అన్యే అపి = మఱికొందఱును, జ్ఞానయజ్ఞేన చ = జ్ఞానయజ్ఞముచేతను, యజన్తః = పూజించుచున్నవారై, ఏకత్వేన = (తానే బ్రహ్మమను) అద్వైతభావముతోను, (కేచిత్ = మఱికొందఱును), పృథక్త్వేన = (బ్రహ్మమే వివిధ దేవతాదిరూపమున నున్నదను) ద్వైతభావముతోను, బహుధా = ఇట్లనేకవిధములుగ (లేక వివిధరూపముల), విశ్వతోముఖమ్ = విశ్వరూపుడనగు (సర్వాత్మకుడనగు), మామ్ = నన్ను, ఉపాసతే = ఉపాసించుచున్నారు.

**తా:–** మఱికొందఱు జ్ఞానయజ్ఞముచే పూజించుచున్నవారై (తానే బ్రహ్మమను) అద్వైతభావముతోను, ఇంకకొందఱు (బ్రహ్మమే వివిధదేవతాది రూపమున నున్నది. ఆ దేవతలలో నేనొకదానిని సేవించుచున్నానను) ద్వైతభావముతోను ఇట్లనేక విధములుగ (లేక వివిధరూపముల) నన్ను ఉపాసించుచున్నారు.

**వ్యాఖ్య:–** మహాత్ములగువారు సదా పరమాత్మను భజించుచుందురని ఇంతదనుక చెప్పబడినది. వారిలో కొందఱు అద్వైతభావనతోను, మఱికొందఱు ద్వైతభావనతోను, ఇంక కొందఱు వేఱు వేఱు విధములుగను వారి వారి సంస్కారము ననుసరించి భగవంతుని సేవించుచుందురని ఇట చెప్పబడుచున్నది. ఋజువుగగాని, వక్రముగగాని ఎట్లు ప్రవహించినను నదులన్నియు ఎట్టకేలకు సముద్రమును చేరియే తీరును. అట్లే అధ్యాత్మమార్గమున యత్నశీలురగువారున్ను భిన్నభిన్నరీతుల భగవానుని సేవించినను, ప్రయత్నమును విడనాడనిచో, తుట్టతుదకు అందఱున్ను ఆ భగవద్రూపలక్ష్యమునే చేరగలరు. అయితే లక్ష్యమందు ఏకాగ్రత, భక్తి అందఱికిని యుండవలెను.

'జ్ఞానయజ్ఞేన' – జ్ఞానయజ్ఞమనగానేమి? "బ్రహ్మసత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవనాపరః" – బ్రహ్మమొకటియే సత్యము, దృశ్యజగత్తంతయు లేనిది. జీవుడు వాస్తవముగ బ్రహ్మమేకాని అన్యుడుకాదు అను నిశ్చయము గలిగియుండుటయే జ్ఞానయజ్ఞము నాచరించుటయగును. ఇదియే అద్వైతబ్రహ్మభావము. 'తత్త్వమసి' మహావాక్యచింతన. 'సోహం' భావము. ఇట్టి జ్ఞానయజ్ఞమాచరించువాడు అద్వైతభావము గల్గి తానే బ్రహ్మమను చింతనగల్గియుండును. ఈ జ్ఞానయజ్ఞముయొక్క శ్రేష్ఠత్వమును గూర్చి, ఆవశ్యకతనుగూర్చి శ్రీకృష్ణమూర్తి గీతయందు దచటచట వక్కాణించుచునే యున్నారు. తుట్టతుదకు గీతను సమాప్తిచేయుచు "జ్ఞానయజ్ఞేన తేనాహమిష్టస్స్యామితి మే మతిః –" గీతాధ్యయనము చేయువానిచేత, జ్ఞానయజ్ఞముచే నేనారాధింపబడినవాడ నగుదును – అని పలికి జ్ఞానయజ్ఞముయొక్క మాహాత్మ్యమును

చాటినవారైరి. సర్వము ఒకే భగవత్స్వరూపమనియు, ఆ స్వరూపము తన ఆత్మకంటె నన్యముకాదనియు, ప్రతివారును ఏదియో యొకకాలమున తెలిసికొనియే ముక్తినొందవలసియుందురు. ఇదియే జ్ఞానయజ్ఞము.

'విశ్వతోముఖమ్' - ప్రపంచమంతట ముఖముకలవాడు - సర్వాత్మస్వరూపుడు - అని భగవాను డిచట వర్ణించబడిరి. ఈసత్యమెఱింగినచో ఇక ఎవడును ఏ పాప కార్యమును చేయజాలడు. ఏలయనిన అన్నిచోట్లను భగవానునిముఖము, దృష్టి, అస్తిత్వము కలదు. ఆతడు సర్వమును వీక్షించుచునేయున్నాడు. కావున 'విశ్వతోముఖమ్' అను ఈ పదమును జనులు మఱల మఱల జ్ఞాపకము చేసికొనుచు దుష్కృత్యములనుండి విరమించవలెను.

**ప్ర:–** జనులు భగవంతుని ఏయే ప్రకారముగ సేవించుచుందురు?

**ఉ:–** కొందఱు జ్ఞానయజ్ఞముద్వారా అద్వైతభావముతోను, మఱికొందఱు ద్వైతభావముతోను ఈ ప్రకారముగ వారివారి రుచులనుబట్టి పలువిధములుగ అర్చించుచున్నారు.

**అ॥** ఈ ప్రపంచమున సమస్తము పరమాత్మయే అని నాలుగు శ్లోకములద్వారా వచించుచున్నాడు -

## 16. అహం క్రతురహం యజ్ఞః స్వధాహమహమౌషధమ్
## మన్త్రోఽహమహమేవాజ్యమహమగ్నిరహం హుతమ్.

**టీక:–** అహమ్ = నేను, క్రతుః = క్రతువును (వేదోక్తమైన అగ్నిష్టోమాదులను), అహమ్ = నేను, యజ్ఞః = యజ్ఞమును, అహమ్ = నేను, మన్త్రః = మంత్రమును, అహమ్ = నేను, ఆజ్యమ్ = హోమద్రవ్యమును (హవిస్సు), అహమ్ = నేను, అగ్నిః = అగ్నిహోత్రమును, అహ మేవ = నేనే, హుతమ్ (అస్మి) = హోమకర్మమును (అయియున్నాను).

**తా:–** (అగ్నిష్టోమాదిరూప) క్రతువు నేనే, యజ్ఞము నేనే, పితృదేవతలకిచ్చు అన్నము నేనే, ఔషధము నేనే, మంత్రము నేనే, హవిస్సు నేనే, అగ్ని నేనే, హోమకర్మమున్ను నేనే, అయియున్నాను.

**వ్యాఖ్య:–** పరమాత్మ సర్వవ్యాపకులై, విశ్వతోముఖులై సమస్తపదార్థము లందును వెలయుచున్నారను వాక్యమును ఋజువుచేయుటకై దృష్టాంతరూపముగ యజ్ఞమనుక్రియనుగైకొని, దానియందుపయోగింపబడు సమస్తమున్ను భగవత్స్వరూపమేయని వచించుచున్నారు. అదేవిధముగ ప్రపంచమందలి సమస్తపదార్థములున్ను భగవద్రూపములేయని దీనినిబట్టి తెలిసికొనవలయును. అట్లు తెలిసికొని భక్తిభావసంయుతులై, క్రమముగ అట్టి సర్వాత్మభావమును అనుభూత మొనర్చుకొనవలెను.

## 17. పితాఽహమస్య జగతో మాతా ధాతా పితామహః
## వేద్యం పవిత్ర మోంకార ఋక్సామయజురేవ చ.

**టీక:–** అస్యజగతః = ఈజగత్తునకు, అహమ్ఏవ = నేనే, పితా = తండ్రిని, మాతా = తల్లిని, ధాతా = రక్షకుడను (లేక, కర్మఫలప్రదాతను), పితామహః = తాతను, వేద్యమ్ = తెలిసికొనదగిన వస్తువును, పవిత్రమ్ = పావనపదార్థమును, ఓంకారః = ఓంకారమును (ప్రణవస్వరూపుడను), ఋక్సామయజుఃచ = ఋగ్వేద, యజుర్వేద, సామవేదములను (అయియున్నాను).

**తా:–** ఈ జగత్తునకు నేనే తండ్రిని, తల్లిని, సంరక్షకుడను (లేక, కర్మఫలప్రదాతను), తాతను; మఱియు తెలిసికొనదగిన వస్తువును, పావనపదార్థమును, ఓంకారమును, ఋగ్వేద, యజుర్వేద, సామవేదములును అయియున్నాను.

**వ్యాఖ్య:–** లౌకిక బంధువులతో జీవుని సంబంధము తాత్కాలికమైనది. స్థూలదేహమున్నంతవఱకే వారితో సంబంధముండును. దాని పతనముతో ఆ సంబంధము ముగిసిపోవును. తల్లిగాని, తండ్రిగాని, తాతగాని, సోదరుడుగాని అంతియే. కాని భగవత్సంబంధ మట్టిదికాదు. భగవానుడను తండ్రి, తల్లి, తాత - ఎల్లప్పుడును మనవెంటనుండును. దైవముతో మనసంబంధము స్థూలదేహపరిమితముకాదు. అది శాశ్వతమైనది. భగవానుడు నిత్యుడు. కావున అట్టి నిత్యబంధువునే జీవు డధికముగ నాశ్రయించవలెను. పరమాత్మయే తండ్రిగ, తల్లిగ, సంరక్షకుడుగ గలవాడు నిర్భయుడై ఆనందమయుడై యుండవలెను. ఏలయనిన, శాశ్వతశాంతిని, బంధవిముక్తిని భక్తుడగు ఆతనికి భగవానుడు గలుగజేయగలడు. అట్టి లోకైక బంధువును ఆశ్రయించినవారికి, శరణు జొచ్చినవారికి వారు కైవల్యమును ప్రసాదించి, మహోపకారమొనర్చగలరు. కాబట్టి మాతృభక్తి, పితృభక్తి మొదలగునవి కలిగియున్నప్పటికిని వానితోబాటు భగవద్భక్తి గూడ అలవఱచుకొనవలెను.

'వేద్యమ్' – అని చెప్పినందువలన ఈ ప్రపంచమున అనేకవస్తువులున్నప్పటికిని ముఖ్యముగ తెలిసికొనదగిన వస్తువు ఆ పరమాత్మయే యని స్పష్టమగుచున్నది. దేనిని తెలిసికొనినచో జీవునకు ఆత్యంతికశాంతి, జన్మరాహిత్యము కలుగునో అద్దానినే తెలిసికొనవలెను. అదియే పరమాత్మవస్తువు. అన్నిటిని తెలిసికొనినప్పటికిని, ఆ పరమాత్మను తెలిసికొననిచో మనుజు డేమియు తెలిసికొననివాడేయగును. పరమాత్మను తెలిసికొనినచో, దృశ్యవస్తువుల వేనిని తెలిసికొనకున్నను సమస్తము తెలిసికొనినవాడే యగును.

'ఓంకారః' – ఓంకారము (ప్రణవము) భగవంతుని నామమైయుండుటవలన దానినుచ్చరించి, అద్దాని యర్థమును మననము చేసినచో అద్భుతఫలితములు చేకూరగలవు. మంత్రములన్నింటిలోను ప్రణవమంత్రము శ్రేష్ఠతమమై యొప్పుచున్నది.

ఈ ప్రకారముగ జగత్తునందలి సమస్తము భగవత్స్వరూపమే యని యెంచి భక్తి భావము గలిగియుండవలెను.

**ప్ర:–** ఈ ప్రపంచమున సర్వులకును తండ్రియెవరు ? తల్లియెవరు ? తాతయెవరు ? సంరక్షకుడెవరు?

**ఉ:–** పరమాత్మయే.

**ప్ర:–** ఈ ప్రపంచమున తెలిసికొనదగిన వస్తువేది?

**ఉ:–** పరమాత్మయే.

**ప్ర:–** అన్నిటికంటెను పవిత్రమైన వస్తువేది?

**ఉ:–** పరమాత్మయే.

**ప్ర:–** ఇంకను విశేషముగ ఏ యే రూపముల పరమాత్మ వెలుగొందుచున్నారు?

**ఉ:–** ప్రణవ (ఓంకార) రూపమున, ఋక్, యజుస్సామాది వేదరూపమున వెలయుచున్నారు.

## 18. గతిర్భర్తా ప్రభుస్సాక్షీ నివాసశ్శరణం సుహృత్ ప్రభవః ప్రలయః స్థానం నిధానం బీజమవ్యయమ్.

**టీక:–** *గతిః* = పరమలక్ష్యమును, *భర్తా* = భరించువాడును, *ప్రభుః* = ప్రభువును (నియామకుడును), *సాక్షీ* = సాక్షియు, *నివాసః* = ప్రాణుల నివాసమును, *శరణమ్* = శరణమొందదగినవాడును, *సుహృత్* = ప్రతిఫలముగోరక హితమొనర్చువాడును, *ప్రభవఃస్థానమ్ ప్రలయః* = సృష్టిస్థితిలయములకు కారణమైనవాడును, *నిధానమ్* = నిక్షేపమును, *అవ్యయమ్* = నాశరహితమైన, *బీజమ్* = బీజమును (మూలకారణమును) నేనే అయియున్నాను).

**తా:–** పరమలక్ష్యమును, భరించువాడును, ప్రభువును, సాక్షియు, ప్రాణుల నివాసమును, శరణమొందదగినవాడును, హితమొనర్చువాడును, సృష్టిస్థితిలయకర్తయు, నిక్షేపమును, నాశరహితమైన బీజమును (మూలకారణమును) నేనే అయియున్నాను.

**వ్యాఖ్య:–** 'గతి' – జీవులకు పరమగతి, పరమప్రాప్యస్థానము పరమాత్మయే. ఆత్మేతరమగునది యంతయు నశ్వరమైనది, కనుక సద్వస్తువగు శాశ్వత ఆత్మయే సమస్తజీవులకును పరమగతియైయున్నది.

'భర్తా' – సర్వులను భరించువాడు, పోషించువాడు పరమాత్మ. కావున ఆతడు జగద్భర్త. స్త్రీలకును, పురుషులకును, సర్వులకును 'భగవానుడు' భర్త (భరించువాడు). స్త్రీలు తమ పతిసేవ చేయుచున్నను జగత్పతియెడలకూడ అనన్యభక్తిగలిగియుండవలెను. వైధవ్యమును బొందిన స్త్రీలు దుఃఖమునందు కాలముగడుపక ధైర్యమువహించి పరమాత్మనే తమభర్తగ నెంచుకొని ధ్యానించుచు, సేవించుచు నుండవలెను.

'ప్రభుః' – పరమాత్మ లోకైక ప్రభువు. మహాచక్రవర్తి. విశ్వసామ్రాట్. బ్రహ్మాండనాయకుడు. కావున చిన్నచిన్న రాజ్యములకు, గ్రామములకు, ప్రాంతములకు, వెయ్యేల, భూలోకమంతటికిని ప్రభువైనప్పటికిని, గర్వించక ఆ మహాప్రభువు యెడల భక్తిప్రపత్తులను గలిగియుండుట శ్రేయస్కరము.

'సాక్షీ' – భగవానుడు సర్వజగత్సాక్షి. జనులుచేయు పుణ్యపాపములను సాక్షిగా నుండి గమనించుచున్నారు. కాబట్టి ఆచరణయందు జనులు బహుజాగరూకులై యుండి ధర్మమార్గమునే చేబట్టవలెను.

'నివాసః' – సర్వజీవులకును భగవానుడే నివాసము. ఏలయనగా బ్రహ్మాండములన్నియు వారి కుక్షియందే వర్తించుచున్నవి. జనులు తమ నివాసమేదియని యడిగినపుడు ఇల్లు, వాకిలి, ఊరు అని చెప్పుకొనుచుందురు. కాని వాస్తవముగ ఈ సమస్తము ఎద్దానియందు నిలుకడగలిగియున్నదో అట్టి పరమాత్మయే వారినివాసమగును. ఈ సమస్తము దేనియందు నిలుకడగలిగియున్నదో అట్టి పరమాత్మయే సర్వులకును నివాసమగును.

'శరణమ్' – భగవానుడే పరమశరణ్యుడు. నశ్వరప్రాపంచికవస్తువులను శరణుబొందినచో నేమి ప్రయోజనము? శాశ్వత మోక్షఫలమొసంగు సర్వేశ్వరునే శరణుబొందవలెను.

'సుహృత్' - పరమాత్మ సర్వులకును ప్రాణమిత్రుడు. ప్రతిఫలము గోరక మేలు చేయువాడు. ప్రాపంచిక మిత్రులతో సంబంధము ఈ దేహముతో తీరిపోవును. కాని శాశ్వతమిత్రుడగు భగవానునితో సంబంధము ఎల్లకాలములం దుండునది. కావున వారితో మైత్రిని సంపాదించుకొనుట అత్యుత్తమము.

'ప్రభవః ప్రలయః స్థానమ్' - జగత్తుయొక్క సృష్టిస్థితిలయకారకుడు ఆ పరమాత్మయే. ఏలయనిన వారి సన్నిధానమున ఈ సమస్తప్రపంచమున్ను సూదంటురాతిచెంత సూదివలె క్రియావంతమగుచున్నది.

'నిధానమ్' - భగవానుడు సర్వజీవులకును గొప్పనిక్షేపము (Store - house). ప్రళయకాలమందును సమస్తము వారియందే అణగియుండునుగావున.

'బీజమవ్యయమ్' - సమస్తజగత్తునకును, సర్వప్రాణులకును, బీజస్వరూపుడు, కారణభూతుడు పరమాత్మయే. కావున ప్రతిజీవియు తాను ఏ కులమందు బుట్టినను, ఏ జాతియందు జనించినను, స్త్రీయైనను, పురుషుడైనను, తన జన్మస్థానము, తనగోత్రము, తనపుట్టిల్లు, ఆ పరమాత్మయేయను విశ్వాసముగల్గి ధైర్యము వహింపవలెను. తాను అల్పుడనని, శక్తిహీనుడనని, దుర్బలుడనని ఏకాలమందును తలంపరాదు. మఱియు వృక్షము బీజముకంటె అన్యముకాదు. అట్లే జీవుడు తన బీజమగు (కారణమగు) పరమాత్మకంటె వేఱుకాదు. కావున జీవుడు తన ఉపాధి యెంత అల్పమై యున్నప్పటికిని తన మూలము (బీజము) అగు పరమాత్మను స్మరించుకొని మహద్ధైర్యయుతుడై యుండవలెను. 'అవ్యయం బీజం' అని చెప్పినందువలన ఆ పరమకారణము నాశరహితమైనదని స్పష్టమగుచున్నది.

**ప్ర:-** జీవులకు పరమగతియేది ? సర్వులకు భర్తయెవరు ? నివాసమెద్ది ? సాక్షియెవడు ? శరణుడు, మిత్రుడు ఎవడు ? సృష్టిస్థితిలయకారకుడెవడు ? సమస్తమునకు నిక్షేపమెద్ది ? బీజమేది ?

**ఉ:-** పరమాత్మయే.

## 19. తపామ్యహమహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ
## అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహమర్జున.

**టీక:-** అర్జున = ఓ అర్జునా!, అహమ్ = నేను, తపామి = (సూర్యకిరణములచే) తపింపజేయుచున్నాను, అహమ్ = నేను, వర్షమ్ = వర్షమును, ఉత్సృజామి = కురిపించుచున్నాను, నిగృహ్ణామిచ = (వర్షమును) నిలుపుదలయు చేయుచున్నాను, అమృతమ్ చ = మరణరాహిత్యమున్ను, మృత్యుఃచ = మరణమున్ను, సత్ = సద్వస్తువున్ను, అసత్ చ = అసద్వస్తువున్ను, అహమ్ ఏవ (అస్మి) = నేనే (అయియున్నాను).

**తా:-** ఓ అర్జునా! నేను (సూర్యకిరణములచే) తపింపజేయుచున్నాను మఱియు వర్షమును కురిపించుచున్నాను. వర్షమును నిలుపుదలచేయుచున్నాను. మరణరాహిత్యమున్ను (మోక్షమున్ను), మరణమున్ను నేనే. అట్లే సద్వస్తువున్ను, అసద్వస్తువున్ను నేనే (అయియున్నాను).

**వ్యాఖ్య:-** సమస్త జగత్తునకు, సమస్త జగత్క్రియలకును ఆధారభూతుడు పరమాత్మయే కనుక, సర్వము వారివలననే జరుగుచున్నదని యిట వచింపబడినది. దృష్టాంతమున కిచట మూడుక్రియలు చెప్పబడినవి. (1) ఎండకాయించునది (2) వర్షమును కురిపించునది (3) వర్షమును బిగబెట్టునది వారే అని

కాబట్టి అతివృష్టిగాని, క్షామముగాని లేక మఱి యే ఆపదకాని సంభవించినపుడు తన్నివారణమునకు సర్వేశ్వరుడుతప్ప జీవులకు వేఱుశరణ్యము లేదని స్పష్టపడుచున్నది.

రజ్జుసర్పభ్రాంతియందు సర్పము రజ్జువుకంటె అన్యముకానట్లు, ఆభాసరూపమగు ఈ జగత్తు అధిష్ఠానమగు పరమాత్మకంటె వేఱుకాదు. కనుకనే పరమార్థదృష్టియందు అమృతము, మృత్యువు, సత్తు, అసత్తు అన్నియు ఒకే దైవస్వరూపముగ నిచట వర్ణింపబడినది. వాస్తవముగ భగవానుడు సద్వస్తువేకాని అసద్వస్తువుకాదు. అమృతస్వరూపుడేకాని మృత్యురూపుడుకాడని గ్రహించునది.

**ప్ర:–** గ్రీష్మము, వర్షము, వర్షాభావము ఎవరివలన కలుగుచున్నవి?

**ఉ:–** పరమాత్మవలన.

**అ॥** కామ్యభావనతో గూడి స్వర్గాదిభోగములకై యజ్ఞాదులను సల్పుట ఉత్తమముకాదనియు, అట్టివారు జననమరణములనుండి తప్పించుకొనజాలరనియు రెండుశ్లోకముల ద్వారా వచించుచున్నాడు –

**20. త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా**
**యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే**
**తే పుణ్యమాసాద్య సురేన్ద్రలోక**
**మశ్నన్తి దివ్యాన్దివి దేవభోగాన్.**

**టీక:–** త్రైవిద్యాః = మూడువేదముల నధ్యయనముచేసినవారును, సోమపాః = సోమపానముచేసినవారును, పూతపాపాః = పాపకల్మషముతొలగినవారును, యజ్ఞైః = యజ్ఞములచే, మామ్ = నన్ను, ఇష్ట్వా = పూజించి, స్వర్గతిమ్ = స్వర్గప్రాప్తిని, ప్రార్థయన్తే = వేడుకొనుచున్నారు, తే = వారు, పుణ్యమ్ = పుణ్యఫలమగు (లేక, పవిత్రమగు), సురేన్ద్రలోకమ్ = దేవేంద్రలోకమును, ఆసాద్య = పొంది, దివి = ఆ స్వర్గమందు, దివ్యాన్ = దివ్యములైన, దేవభోగాన్ = దేవభోగములను, అశ్నన్తి = అనుభవించుచున్నారు.

**తా:–** మూడువేదముల నధ్యయనముచేసినవారును, కర్మకాండను సకామభావముతో నాచరించువారును, సోమపానము గావించినవారును, పాపకల్మషము తొలగినవారునగు మనుజులు యజ్ఞములచే నన్ను పూజించి స్వర్గముకొఱకై ప్రార్థించుచున్నారు. వారు (మరణానంతరము) పుణ్యఫలమగు దేవేంద్రలోకమునుబొంది, అట్టి స్వర్గమందు దివ్యములగు దేవభోగముల ననుభవించుచున్నారు.

**వ్యాఖ్య:–** వేదముల నభ్యసించినను కొందఱు అందుచెప్పబడిన సకామకర్మలను మాత్రమే (పూర్వభాగమునే) అవలంబించి యజ్ఞయాగాదులద్వారా భగవంతుని అర్చించి తత్ఫలితముగ స్వర్గాది పుణ్యలోకములను బొందుచున్నారు. అచట పుణ్యఫలము ననుభవించినపిదప మఱల భూలోకమందు జన్మించుచున్నారు. అట్టి సకామ భక్తులను గూర్చి యిచట చెప్పబడినది. వీరు మోక్షముకొఱకై ప్రయత్నింపక స్వర్గాది భోగములకొఱకే ప్రయత్నించువారగుదురు. కాబట్టి పరమార్థదృష్టియందు పూర్ణవికాసము కలిగినవారు కారు. ఏలయనగా, అది స్వర్గమైనను, లేక ఏ యితర పుణ్యలోకమైనను పునరావృత్తి కలిగియున్నదేయని ఇదివరలో భగవానుడు తెలిపియున్నారు.

**'ఆ బ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున'**, కనుక అట్టివారు జననమరణసంసారచక్రము నుండి తప్పించుకొనినవారుకాదు. బంగారుసంకెళ్ళచే బంధింపబడినవారని వారినిగూర్చి చెప్పవచ్చును. ఏలయనిన, వారు సంసారకారాగృహమున పడియున్నవారే యగుదురు. ఏది జననమరణములనుండి తప్పించగల్గునో అదియే సర్వులకును ఉత్తమమైనది. ముముక్షువులకు ఆచరణీయమైనది. అదియే ఆత్మపదము, బ్రహ్మపదము.

**'మాముపేత్యతు కౌన్తేయ పునర్జన్మ న విద్యతే'**, అట్టి బ్రహ్మపదమునొందినవారికిక జన్మలేదు; సంసృతిలేదు. కాబట్టి పునరావృత్తిరహితమగు అట్టి పరమాత్మపదమును బొందుటకే విజ్ఞుడు యత్నించవలెనుగాని క్షయశీలములై పునరావృత్తిసహితములైనట్టి స్వర్గాది లోకములనుగాదు. వేదములందు సకామ, నిష్కామకర్మలను రెండిటినిగూర్చి చెప్పబడినను, వారందఱు సకామకర్మలనే అవలంబించి సంసారమును తిరిగి కొనితెచ్చుకొనుచున్నారు. యజ్ఞాది పుణ్యకార్యములచే వారిపాప మొకింత క్షయించినను, ఆ పాపక్షయమును చిత్తశుద్ధిద్వారా మోక్షాన్వేషణకు ఉపయోగించుకొనినయెడల వారెంతయో మహత్తరమగు శ్రేయమును బొందగలిగియుండెడివారు. కాని వారట్లు చేయక తిరిగి నశ్వరములగు స్వర్గాదిభోగములనే కాంక్షించుచున్నారు. అట్టి సకామదృష్టికలిగియున్నవారి విధానమును గీతాచార్యులు 2వ అధ్యాయమున లెస్సగ ఖండించియున్నారు★.

స్వర్గభోగములు భూలోకభోగములకంటె కొంతమెరుగైనను, వానివలన సంసారబంధము తొలగనందుచేతను, ఇంకను దృఢతరమగుటచేతను మోక్షమునకు ప్రతిబంధములగుటవలన విజ్ఞులకవి వాంఛనీయములుకావు.

'ప్రార్థయన్తే' - అని చెప్పినందువలన వారు స్వర్గపదవికై ఎంతయో ఆసక్తితో ప్రార్థించుచున్నారని, అభిలషించుచున్నారని బోధపడుచున్నది. అట్టి ప్రార్థనను భోగముల కొఱకుగాక యోగముకొఱకు చేసినచో మానవుడెప్పుడో మోక్షమును బొంది యుండెడివాడు. కావున ప్రార్థనచేయదలంచుచో మోక్షముకొఱకై ప్రార్థించుదురుగాక! భోగముల కొఱకుగాదు. అయితే ఈ యజ్ఞయాగాదులు వేదములం దేల చెప్పబడినవి యనగా పాపాచరణను తొలగించి జనులకు అధ్యాత్మమార్గమున త్రిప్పుటకొఱకే యగును. పుణ్యమందాసక్తిని గలుగజేయుటకే యగును. కాని అది చాలదు. పుణ్యమునొకింత ఆర్జించినను, గమ్యస్థానమగు పరమాత్మను జేరువఱకు సాధనలను అభివృద్ధిపఱచుకొనుచునే పోవలెను. కావున సకామకర్మనుదాటి నిష్కామకర్మను ఏనాడైనను మనుజుడు చేబట్టవలసియేయుండును. ఆ పని యెంత శీఘ్రముగ జరిగిన అంతమేలు. కనుకనే సకామకర్మలను, స్వర్గభోగాదులను భగవానుడు గీతయందు నిశితముగ విమర్శించి, నిష్కామకర్మాదులనే ప్రోత్సహించిరి.

**ప్ర:–** సకామకర్మరూపములగు యజ్ఞయాగాదుల నాచరించుటవలన కలుగు ఫలితమేమి ?

**ఉ:–** స్వర్గలోకప్రాప్తి.

**21. తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం**
**క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి।**
**ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా**
**గతాగతం కామకామా లభన్తే.**

★ కామాత్మానః స్వర్గపరా..., ॥ ... సమాధౌ న విధీయతే। (2-43,44)

**టీక:–** తే = వారు, తమ్ = ఆ, విశాలమ్ = విశాలమైన, స్వర్గలోకమ్ = స్వర్గలోకమును, భుక్త్వా = అనుభవించి, పుణ్యే = పుణ్యము, క్షీణే (సతి) = అంతరింపగా, మర్త్యలోకమ్ = (ఈ) మనుష్యలోకమును, విశన్తి = ప్రవేశించుచున్నారు; ఏవమ్ = ఈ ప్రకారముగా, త్రయీధర్మమ్ = వేదోక్తధర్మమును (కర్మమును), అనుప్రపన్నాః = (ఫలాపేక్షతో) అనుష్ఠించువారైన, కామకామాః = కామాభిలాషులు (విషయేచ్ఛగలవారు), గతాగతమ్ = రాకడపోకడలను (జననమరణములను), లభన్తే = పొందుచున్నారు.

**తా:–** వారు (అట్టి స్వర్గాభిలాషులు) విశాలమగు స్వర్గలోకము ననుభవించి పుణ్యము క్షయింప తిరిగి మనుష్యలోకమున జన్మించుచున్నారు. ఈ ప్రకారముగ (సకామముగ) వేదోక్తకర్మమును అనుష్ఠించునట్టి ఆ భోగాభిలాషులు రాకడపోకడలను (జననమరణములను) పొందుచున్నారు.

**వ్యాఖ్య:–** అట్లు సకామముగ వేదోక్తములగు యజ్ఞయాగాదులను ఆచరించువారు స్వర్గలోకమునుబొంది, అట దేవభోగముల ననుభవించి, పుణ్యము క్షయించిన మీదట మఱల భూలోకమున పుట్టుచున్నారు. ఈ ప్రకారముగ సకామకర్మములను శరణుబొందువారగు భోగాభిలాషులు మఱలమఱల పుట్టుచు చచ్చుచు నుందురని వచింపబడినది. పుణ్యముగాని పాపముగాని, అనుభవించినకొలది క్షయించుచుండును. దీనినిబట్టి ఆ స్వర్గాదిలోకములందును జీవునకు శాశ్వతస్థితి గలుగనేరదని స్పష్టమగుచున్నది. 'విశాలమ్' అని చెప్పినందువలన, ఆ స్వర్గలోకము భూలోకముకంటె ఒకింత విస్తీర్ణముగ నుండవచ్చుగాక! అంతమాత్రముచేత దాని గొప్పతనమేమి ? అచట మోక్షప్రయత్నము చేయుటకు అవకాశము లేదు. పైగా అచటి భోగాదులకు మోక్షము చుక్కెదురు. స్వర్గాదులన్నియు కర్మానుభవలోకములు. మోక్షప్రయత్నము భూలోకమందే సాధ్యపడునని, ఒక్కమానవునికే అట్టి ప్రజ్ఞ భగవానుడొసంగెననియు శాస్త్రములు చెప్పుచున్నవి. కాబట్టి ఈ అమూల్య మానవజీవితమును ఆవాగమములతో గూడిన సంసారముకొఱకు గాక మోక్షముకొఱకే వినియోగించువాడు ధన్యుడు. లేకున్న మఱల ఏ లోకమందును ఇట్టి సదవకాశ మాతనికి లభింపనేరదు.

వేదోక్తకర్మమును ఆచరించుట మంచిదేకాని సకామముగ (ఫలాపేక్షతో) నాచరించుట ఉత్తమముకాదు. ఆ వేదధర్మములందును యజ్ఞయాగాది కర్మకాండ సంబంధములైన వానికంటె, ఉపాసనాకాండ సంబంధములైనవి, వానికంటె జ్ఞానకాండ సంబంధములైనవి క్రమముగ ఉత్తమోత్తములై యుండును. సకామముగను, భోగానుభవముకొఱకును ఆచరించు కర్మములవలన జీవునకు బంధవిముక్తిగాని, పరమార్థోన్నతిగాని కలుగనేరవు. కాబట్టి నిష్కామముగనే, దైవప్రాప్తికొఱకే ఆచరించవలెను.

'గతాగతం కామకామా లభన్తే' అని చెప్పినందువలన కోరికలు కలవారు, కామమునకు (భోగమునకు) దాసులు జననమరణములను బొందుచు ఈ సంసారచక్రమునుండి తప్పించుకొనజాలరని స్పష్టమగుచున్నది. ఈవాక్యమును ముముక్షువులు సదా జ్ఞాపకముంచుకొని కోరికలను పూర్తిగ విడనాడవలెను. సకామబుద్ధిని త్యజించవలెను. ఈ ప్రపంచములో ఎవడును దుఃఖమును కోరుటలేదు. జననమరణములను వాంఛించుటలేదు. అయినను జననమరణములను కలుగజేయు పనులనే చేయుచున్నారు. ఏలయనగా, సంసృతికి, రాకపోకడలకు కారణమేమి? విషయవాంఛయే, కామమే, భోగాభిలాషయే. 'కామకామి'యే సంసారమందుపడి రాకడపోకడలను పొందుచుండునని భగవాను డిచట సెలవిచ్చియున్నారు. కాబట్టి చావుపుట్టుకలను తప్పించుకొనదలంచువా రీకామమునకు, స్వర్గాదిభోగానుభవమునకు, కోరికలకు

అతిదూరమున నుండవలెను. కామము ముముక్షువునకు మహాఘోరశత్రువని శ్రీకృష్ణమూర్తి లోగడ అనేకసార్లు చెప్పియేయుండిరి. ఆ విషయమునే మఱల నిచట స్పష్టపఱచిన వారైరి.

**ప్ర:–** యజ్ఞాదులను, సకామముగ నాచరించువారు స్వర్గమునుబొంది అచట ఎంతకాలముందురు?

**ఉ:–** పుణ్యము క్షయింపనంతవఱకు.

**ప్ర:–** తదుపరి ?

**ఉ:–** (పుణ్యము క్షయింప) భూలోకమున జన్మించుదురు.

**ప్ర:–** కోరికలు కోరువారికి, భోగాభిలాషులకు లభించు ఫలమేమి ?

**ఉ:–** జననమరణములు ('గతాగతమ్')

**ప్ర:–** కాబట్టి జననమరణములనుండి తప్పించుకొనుటకు ఉపాయమేమి?

**ఉ:–** కోరికలు లేకుండుటయే, కామవివర్జనమే, విషయవాంఛారాహిత్యమే.

**ప్ర:–** స్వర్గలోక మెట్టిది?

**ఉ:–** (1) విశాలమైనది (2) భోగానుభవముతో గూడినది (3) పుణ్యక్షయము అవధిగాగలది.

**అ॥** నిర్మలభక్తియొక్క ఫలితమును వచించుచున్నాడు -

**22. అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.**

**టీక:–** యేజనాః = ఏ జనులు, అనన్యాః = ఇతరభావములేనివారై, మామ్ = నన్ను, చిన్తయన్తః = చింతించుచు, పర్యుపాసతే = ఎడతెగక ధ్యానించుచున్నారో, తేషామ్ = అట్టి, నిత్యాభియుక్తానామ్ = ఎల్లప్పుడు నాయందే నిష్ఠగలవారియొక్క, యోగక్షేమమ్ = యోగక్షేమములను, అహమ్ = నేను, వహామి = వహించుచున్నాను.

**తా:–** ఎవరు ఇతర భావములు లేనివారై నన్ను గూర్చి చింతించుచు ఎడతెగక ధ్యానించుచున్నారో, ఎల్లప్పుడు నాయందే నిష్ఠగల్గియుండు అట్టివారియొక్క యోగక్షేమములను నేను వహించుచున్నాను.

**వ్యాఖ్య:–** ఇది గీతలో చాలముఖ్యమైన శ్లోకము. దాదాపు గీతయొక్క మధ్యభాగమున నుండుటవలన ఇది గీతాకుసుమమాలయందు, లేక గీతారత్నమాలయందు మధ్యమణియై హృదయస్థానము నలంకరించుచున్నది. భక్తులకు ఈ శ్లోకముద్వారా భగవాను డభయమొసంగినారు. నిరంతరము తాము పరమాత్మ చింతనచేయుచుండుచో తమయొక్క అవసరములను తీర్చువారెవరని భక్తులు శంకించుదురేమోయని తలంచి 'అపనిని నేనే వహించెదన'ని భగవాను డిచట సెలవిచ్చిరి. 'యోగ' మనగా కావలసిన పదార్థమును సమకూర్చుట, 'క్షేమ' మనగా దానిని సంరక్షించుట. ఈ ప్రకారముగ భక్తునియొక్క

యోగక్షేమములను తాను వహించెదనని, భగవానుడు హామీనిచ్చెను. అయితే ఆ భక్తుడెట్లుండవలెనో అదియు చెప్పబడెను. అనన్యచిత్తుడై పరమాత్మనే నిరంతరము చింతన జేయుచు లెస్సగ ధ్యానించుచు - ఈ ప్రకారముగ సర్వకాలములందును పరమాత్మతో గూడియుండవలెను.

'అనన్యాః' - అన్యములేనిది అనన్యము. అనగా భగవంతుడు తప్ప అన్యమగు ఏదియులేనివారని అర్థము. లేక పరమాత్మయందు తప్ప తక్కిన దేనియందును మనస్సును పోనీయకయుండువారని భావము. ఇంతకుమునుపు పైశ్లోకమందు స్వర్గభోగపరాయణులనుగూర్చి చెప్పబడినది. అట్టివారికిని, ఈ 'అనన్యభక్తు'లకును ఎంతయో భేదముకలదు. మొదటివారు దృశ్యమందు మనసును పోనిచ్చుచు ప్రాపంచిక విషయములందు కోరికలుగలవారైయుందురు. రెండవవారు భగవంతునిదప్ప అన్యమగు దేనియందును వాంఛలేనివారు. వారిదృష్టియందు దృశ్యపదార్థములన్నియు తుచ్ఛములుగ గానుపించును. లేక ఆత్మకంటె నన్యమగునదియంతయు మిథ్యగాదలంచి వానిపై కోరికలేక దృష్టినంతను ఆత్మయందే కేంద్రీకరించుదురు. కాబట్టి వారు 'అనన్యచిత్తు'లని చెప్పబడిరి. ప్రపంచములో జనులు మూడుతరగతులుగ నుందురు - కొందఱుభగవంతుని అసలు చింతింపకయేయుండి ప్రపంచదృష్టియే కలిగియుందురు. మఱికొందఱు దైవమును కొంతసేపు ధ్యానించి తదుపరి ప్రపంచదృష్టి కలిగియుందురు. ఇంక కొందఱు ప్రపంచదృష్టియేలేక నిరంతరము దైవచింతన, స్మరణ, ధ్యానాదులే కలిగియుందురు. ఈ మూడవతరగతివారే అనన్యచిత్తులు.

అట్టి నిరంతర దైవధ్యానపరులయొక్క యోగక్షేమములను కాపాడుపని తాను గైకొనెదనని భగవానుడు ప్రతిజ్ఞచేసిరి. ఆహా! భక్తులపై ఎట్టి వాత్సల్యము! ఎట్టి కరుణ! ఎట్టి అనుగ్రహబుద్ధి! మహాభక్తుడగు అర్జునునకు శ్రీకృష్ణుడు సారథిత్వమును వహించుట ఈ రహస్యమునే తెలుపుచున్నది. అర్జునుడు రథముయొక్క (గుఱ్ఱపు) పగ్గములను శ్రీకృష్ణునకొప్పగించెను. ఇక అతని రథమున కేలోటున్ను ఉండదు. అట్లే ఎవరు తమ 'జీవిత' పగ్గములను భగవానునిచేతికి అందించెదరో, వారి జీవితయాత్రకిక ఏలోటున్ను ఉండదు. ఎవరు తమ సమస్తమును భగవానునకు అర్పణచేసి అనన్య చిత్తులై ఆతనిని శరణుబొందెదరో, వారి జీవితరథము నాతడు నిరాటంకముగ నడుపగలడు. 'యోగక్షేమం వహామ్యహమ్' అను దానియర్థ మిదియే. భక్తునకేదేది అవసరమో అది ప్రపంచవస్తువుగాని, ఆత్మజ్ఞానముగాని దానినిచేర్చుట, అట్లు చేర్చినదానిని సంరక్షించుట - ఈ రెండుపనులను భగవానుడు భక్తునకు చేసిపెట్టును. అయితే ఆ భక్తుడు అనన్య చింతనతో భగవానుని ధ్యానించువాడైయుండవలెను. కొంతభక్తి దృశ్యవిషయములందు, కొంతభక్తి దేవునియందు పంచియుండుట అనన్యభక్తి కానేరదు.

భగవానుని ఈ 'అభయ' వాక్యముద్వారా భక్తుల కొక బరువు తీరిపోయినది. ఏలయనిన, కొందఱు "మేము నిరంతరము భగవంతుని ధ్యానించుచుండినచో మా సంసారము చూచువారెవరు ? వారికి సంపాదించి పెట్టువారెవరు ?" అని ప్రశ్నించుచుందురు. అట్టివారిని భగవానుడీ శ్లోకముద్వారా చక్కగ సంతృప్తిపఱచెను.

'అనన్యభక్తుడు' కావలెనేగాని ఇక 'వాని బాగోగులను నేనే చూచుకొందును' అని భగవానుడు సెలవిచ్చిరి. అట్టివాడు ఏ కొండగుహయందున్నను, అరణ్యమధ్యమందున్నను, వానిని భగవానుడు అనుసరించియేయుండి వాని యోగక్షేమములను విచారించుచుండును. కావున తీవ్రముముక్షువులు ఇక ఏ దిగులులేక సమస్తము భగవంతున కర్పించి వారినే ఎల్లవేళలందును స్మరించుచు ధ్యానించుచుండవచ్చును. మహాభక్తులయొక్క చరిత్ర లొక్కసారి పరికించినచో ఈ శ్లోకమందలి సత్య మెట్లు కార్యాన్వితమైనది తెలియగలదు. వారెచటికిపోయినను ఒకకంట సర్వేశ్వరుడు వారిని కనిపెట్టుచునే యుండును.

ఇచట 'యే జనాః' (ఏ జనులు) అని చెప్పినందువలన ఎవరైననుసరియే జాతి మత కులభేదము లేక

భగవత్కృపకు పాత్రులుకాగలరని స్పష్టమగుచున్నది. అయితే అర్హత కలిగియుండవలెను. అనన్యభక్తియే ఆ అర్హత. ఆంజనేయుడు మృగజాతిలో జనించియు అనన్యభక్తిచే భగవదనుగ్రహమునకు పాత్రుడు కాగలిగినపుడిక మానవుల విషయమై వేఱుగ చెప్పవలెనా? అనన్యభక్తియను మూల్యము చెల్లించినచో భగవత్కృప యను వస్తువు తద్ద్వారా యోగక్షేమప్రాప్తి లభించును. ఈ శ్లోకమందు చెల్లించవలసిన మూల్యమును, లభ్యమగువస్తువు రెండును తెలుపబడినవి. మూల్యము చెల్లించనిదే సామాన్యమగు ప్రపంచవస్తువే లభించకయుండ ఇక పరమార్థవస్తువు విషయమై వేఱుగ చెప్పవలయునా! కాబట్టి భగవదనుగ్రహమును ఈ జీవితమునందే బడసి తరించుటకుగాను, ప్రతివారును అనన్యదైవచింతనను లెస్సగ నభ్యసించవలెను.

'పర్యుపాసతే' - 'ఉపాసతే' అని చెప్పక 'పర్యుపాసతే' అని చెప్పుటవలన భగవానుని లెస్సగ, ఎడతెగక ధ్యానించవలెనని తెలిపినట్లైనది.

'యోగక్షేమమ్' - అనుచోట యోగమనుదానిలో భక్తులకు వలసిన జీవితావసరవస్తువులేకాక, ఆత్మజ్ఞానముకూడ చేరియున్నది. నిరంతర భగవచ్చింతనచే సర్వేశ్వరుడు సంతుష్టుడై ఆత్మజ్ఞానమును కలుగజేసి అది జారిపోకుండ సంరక్షించుచుండును. (దదామి బుద్ధియోగం).

'నిత్యాభియుక్తానామ్' - అని చెప్పినందువలన ఏ కొద్దిసేపో ధ్యానించువారు కాదనియు, నిరంతర ధ్యానశీలురనియు అర్థము.

**ప్ర:–** భగవంతుని ఏ ప్రకారముగ చింతన చేయవలెను?

**ఉ:–** అనన్యచిత్తముతో - ఒక పరమాత్మతప్ప ఇతరమెద్దియు మనస్సునకు రాకయుండవలెను. మఱియు ఇతరమగు దేనియందును కోరికలేక యుండవలెను.

**ప్ర:–** అట్లు అనన్యచిత్తులై ధ్యానించువారికి కలుగు ఫలితమేమి?

**ఉ:–** భగవత్కృపయే. అట్టివారి యోగక్షేమములను భగవానుడు వహించుచుండును.

**ప్ర:–** కావున భగవత్కృప లభించుటకై జీవు డేమి చేయవలెను?

**ఉ:–** అనన్యచిత్తముతో పరమాత్మను నిరంతరము ధ్యానించుచుండవలెను.

**అ॥** శ్రద్ధతో ఇతరదేవతలను అర్చించువారు (క్రమపద్ధతితప్పి) తన్నే అర్చించువారగుదురని భగవానుడు తెలుపుచున్నాడు.

## 23. యేఽప్యన్యదేవతాభక్తా యజన్తే శ్రద్ధయాన్వితాః
## తేఽపి మామేవ కౌన్తేయ యజన్త్యవిధిపూర్వకమ్.

**టీక:** కౌన్తేయ = ఓ అర్జునా!, యే అపి = ఎవరైతే, అన్యదేవతాభక్తా = ఇతరదేవతలయెడల భక్తిగలవారై, శ్రద్ధయాన్వితాః = శ్రద్ధతోగూడినవారలై, యజన్తే = (ఆ దేవతలను) ఆరాధించుచున్నారో, తే అపి = వారుకూడ, మామ్ ఏవ = నన్నే, అవిధిపూర్వకమ్ = విధితప్పి (క్రమముతప్పి), యజన్తి = ఆరాధించుచున్నారు.

**తా:–** ఓ అర్జునా ! ఎవరు ఇతర దేవతలయెడల భక్తిగలవారై శ్రద్ధతోగూడి వారి నారాధించుచున్నారో, వారున్ను నన్నే అవిధిపూర్వకముగ (క్రమముతప్పి) ఆరాధించుచున్న వారగుదురు.

**వ్యాఖ్య:–** కొందఱు నిరాకార నిర్గుణపరమాత్మనుగాక, నామరూపసహితులగు ఇతర దేవతలను ఆరాధించుచుందురు. వారుగనుక శ్రద్ధతో ఆ యారాధనమును సల్పినచో, ఒకదృష్టితో వారు ఆయా దేవతలకు అధిష్ఠానరూపుడైవర్తించు పరమాత్మను కొలిచిన వారేయగుదురు. అయితే ఇది సక్రమ భగవదర్చనముకాదు. విధిపూర్వక పరమాత్మ సేవనము కాదు. క్రమపద్ధతి తప్పిన భగవదారాధనమేయగును. ఏలయనిన వారు సర్వవ్యాపక పరమాత్మను సాక్షాత్తుగ సేవించుటలేదు. కాబట్టి పుణ్యఫలములందును తారతమ్యముండును. ఇతరదేవతలను అర్చించినచో ఒకింత పుణ్యము లభించును. సర్వవ్యాపక, సర్వాధిష్ఠాన పరమాత్మను సేవించినచో సాక్షాన్మోక్షమే చేకూరును. అయితే ఏ దేవతను ఆరాధించినను, కేవలము పరమాత్మను ఆరాధించినను శ్రద్ధమాత్రము తప్పక యుండవలెను. మఱియు ఇతరదేవతల నారాధించి అల్పఫలములను పొందుటకంటె సాక్షాత్ పరమాత్మనే సేవించి మోక్షరూప మహోన్నత ఫలమును బడయుట శ్రేయస్కరము.

**ప్ర:–** భగవదారాధన యెట్లు జరుపవలెను ?

**ఉ:–** శ్రద్ధతోగూడి.

**అ॥** ఇతర దేవతాభక్తులు మోక్షపదము (దైవసాక్షాత్కారము) నెందులకు బొందజాలకున్నారో తెలియజేయుచున్నాడు –

## 24. అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ
## న తు మామభిజానన్తి తత్త్వేనాతశ్చ్యవన్తి తే.

**టీక:–** హి = ఏలయనగా, సర్వయజ్ఞానామ్ = సమస్తయజ్ఞములకు, భోక్తా చ = భోక్తయు, ప్రభుఃఏవ చ = ప్రభువు (యజమానుడు)ను, అహమ్ ఏవ = నేనే (అయియున్నాను), మామ్ = (అట్టి) నన్ను, తే = వారు, తత్త్వేన = యథార్థముగ, న అభిజానన్తి = తెలిసికొనుటలేదు, అతః = ఇందువలన, చ్యవన్తి = జారిపోవుచున్నారు (పునర్జన్మను పొందుచున్నారు).

**తా:–** ఏలయనగా, సమస్తయజ్ఞములకు భోక్తను, ప్రభువు (యజమానుడు)ను నేనే అయియున్నాను. అట్టి నన్ను వారు యథార్థముగ తెలిసికొనుటలేదు. ఇందువలన జారిపోవుచున్నారు. (పునర్జన్మను బొందుచున్నారు).

**వ్యాఖ్య:–** సమస్తయజ్ఞములకు పరమాత్మయే భోక్త; ప్రభువు. ఇట్టి యథార్థజ్ఞానము లేనందువలన సంకుచితదృష్టిగలవారై, ఆ యా దేవతల నుద్దేశించియే క్రియలను జరుపుచు ఉన్నతస్థానమునుండి దిగజారిపోయి సంసారకూపమున జననమరణప్రవాహమున పడిపోవుచున్నారు. పరమాత్మను ధ్యానించి పరమాత్మను బొందువారు తప్ప తక్కిన వారందఱు పునరావృత్తి గలిగియే యుందురు. పరమాత్మను గూర్చిన యథార్థజ్ఞానము లేనివారందఱు పునరావృత్తి గలిగియే యుందురు. పరమాత్మను గూర్చిన యథార్థజ్ఞానము లేనివారందఱును ఈప్రకారముగ జననమరణములకు గురియగుచునేయుందురు. ఇదియే చ్యుతి;

సంసారమను గోతియందు దిగజారుట. కావున పరమాత్మనుగూర్చి బాగుగ తెలిసికొనవలెను. 'తత్త్వేన' అని చెప్పుటచే సామాన్యజ్ఞానము చాలదనియు యథార్థముగ, ప్రత్యక్షముగ తెలిసికొనవలెననియు భావము. అనగా భగవానుడు సర్వాంతర్యామియై సమస్త చరాచరములకు అధిష్ఠానమై, జీవులనిజరూపమై వెలయుచుండుటను అనుభవపూర్వకముగ తెలిసికొనవలెను. అట్టివారిక జారరు. వారికి చ్యుతి సంభవింపదు. వారు పరమాత్మయొక్క యథార్థజ్ఞానము కలవారై అతిజాగరూకులై, స్వస్వరూపాత్మయందే నిష్ఠగలిగి మిథ్యయగు దృశ్యమును గూర్చిన భావన లేక యుందురు.

**ప్ర:–** సమస్తయజ్ఞములకు భోక్తయెవరు ? ప్రభువెవరు ?

**ఉ:–** పరమాత్మయే.

**ప్ర:–** జను లేల సంసారమను గోతిలోనికి జారిపోవుచున్నారు ?

**ఉ:–** భగవంతునిగూర్చిన యథార్థజ్ఞానము లేనందుచే.

**ప్ర:–** కాబట్టి 'సంసారచ్యుతి' నుండి తప్పించుకొనుట కుపాయమేమి ?

**ఉ:–** పరమాత్మనుగూర్చిన యథార్థజ్ఞానము గలిగియుండుటయే. (అనగా పరమాత్మయే సమస్త దేవతలకు, సమస్త చరాచర ప్రపంచమునకు అధిష్ఠానరూపుడనియు, త్రికాలాబాధ్యుడనియు, సత్యస్వరూపుడనియు ఎఱుంగుట).

**అ॥** ఏ యే దేవతల నారాధించువా రాయాదేవతలనే పొందుదురనియు, తన్నారాధించువారు తన్నే పొందుదురనియు భగవానుడు చెప్పుచున్నాడు -

## 25. యాన్తి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాన్తి పితృవ్రతాః
## భూతాని యాన్తి భూతేజ్యా యాన్తి మద్యాజినోఽపి మామ్.

**టీక:–** దేవవ్రతాః = దేవతలనారాధించువారు, దేవాన్ = దేవతలను, యాన్తి = పొందుచున్నారు, భూతేజ్యా = భూతములను పూజించువారు, భూతాని = భూతములను, యాన్తి = పొందుచున్నారు, మద్యాజినఃఅపి = నన్నుపూజించువారో (ధ్యానించువారో), మామ్ = నన్నే, యాన్తి = పొందుచున్నారు.

**తా:–** దేవతల నారాధించువారు దేవతలను, పితృదేవతల నారాధించువారు పితృదేవతలను, భూతముల నారాధించువారు భూతములను, నన్నారాధించువారు నన్ను పొందుచున్నారు.

**వ్యాఖ్య:–** మనస్సు ఎట్టిభావనలతో గూడియుండునో అట్టి రూపమునే పొందుచుండును. కాబట్టి జను లేయే దేవతలను అర్చించుచుందురో వారివారినే పొందుచుందురు. అశాశ్వత దేవతలను పూజించువారు వారినే బొందుదురు. శాశ్వత పరమాత్మను ధ్యానించువారు అట్టి శాశ్వతస్వరూపమునే చేరుదురు. కావున వారువారు ధ్యానించు, పూజించు లక్ష్యస్వరూపము శాశ్వతమా, అశాశ్వతమా యని విజ్ఞులు ముందుగా యోచనచేయవలెను. పరమాత్మతప్ప తక్కిన వ్యక్తులుగాని, లోకములుగాని ఏదియో యొక కాలమున నశించిపోవువారే. దేవతలుగాని, భూతములుగాని, సర్వులును ఉపాధిని ధరించినవారే కనుక, ఆ యుపాధి యేనాటికైనను విలయమొందిపోవుటచే శాశ్వతమగు స్థితిని వారు పొందజాలకయే యుందురు. పరమాత్మ

అట్టుకాడు. అతడు అవినాశి, అవ్యయుడు, సనాతనుడు; దేశకాలములకు వశముకానివాడు. అట్టివానిని అర్చించువారు, ధ్యానించువారు నాశరహితమగు పరమాత్మపదమునే పొందుదురు. కాబట్టి ఇదియే సర్వశ్రేష్ఠమగు లక్ష్యము, గమ్యము. విజ్ఞులగువారు అశాశ్వత వస్తువును వాంఛింపరు. శాశ్వతమునే కోరుదురు. కావున పునరావృత్తిరహిత శాశ్వతపదవి నొసంగు పరమాత్మనే జనులాశ్రయింపవలెను. అతనినే ధ్యానింపవలెను. ఏ వ్రతములను, నియమములను, నిష్ఠలను ఇతర దేవతల నారాధించుటయందుపయోగించుచున్నారో, వానిని పరమాత్మ నుపాసించుటయందు వినియోగించవలెను, 'దేవతావ్రతులు' 'ఆత్మవ్రతులుగ 'గ మారవలెను.

ప్ర:– దేవతలనుగాని, పితృదేవతలనుగాని, భూతములనుగాని ఆరాధించువా రెవరిని పొందుదురు?

ఉ:– వారువా రుపాసించు ఆ యా దేవతలనే పొందుదురు.

ప్ర:– పరమాత్మను ఆరాధించువారో ?

ఉ:– పరమాత్మనే పొందుదురు.

**అ॥** భక్తితో ఏస్వల్పవస్తువు నొసంగినప్పటికిని తాను సంతుష్టినొందెదనని భగవానుడు పలుకుచున్నాడు

## 26. పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
## తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః.

**టీక:–** యః = ఎవడు, మే = నాకు, భక్త్యా = భక్తితో, పత్రమ్ = ఆకు(దళము) ను గాని, పుష్పమ్ = పువ్వునుగాని, ఫలమ్ = పండునుగాని, తోయమ్ = జలమునుగాని, ప్రయచ్ఛతి = ఇచ్చుచున్నాడో, ప్రయతాత్మనః = (అట్టి) పరిశుద్ధాంతఃకరణునియొక్క (లేక, పరమార్థయత్నశీలునియొక్క), భక్త్యుపహృతమ్ = భక్తిపూర్వకముగ సమర్పింపబడిన, తత్ = ఆ పత్రపుష్పాదులను, అహమ్ = నేను, అశ్నామి = (ప్రీతితో) ఆరగించుచున్నాను (అనుభవించుచున్నాను).

**తా:–** ఎవడు నాకు భక్తితో ఆకునుగాని, పువ్వునుగాని, పండునుగాని, జలమునుగాని సమర్పించుచున్నాడో అట్టి పరిశుద్ధాంతఃకరణునియొక్క (లేక, పరమార్థయత్నశీలునియొక్క) భక్తిపూర్వకముగ నొసంగబడిన ఆ పత్రపుష్పాదులను నేను (ప్రీతితో) ఆరగించుచున్నాను (అనుభవించుచున్నాను).

**వ్యాఖ్య:–** పైనదెల్పిన పత్రపుష్పాదులు బీదలకు, ధనవంతులకు, పండితులకు, పామరులకు, సర్వులకును అందుబాటులోనున్న వస్తువులు. భగవత్ప్రీతిని బడయుటకు సామాన్యమైన వస్తువునైనను ప్రీతితో, భక్తితో సమర్పించిన చాలునని ఈశ్లోకముద్వారా వెల్లడియగుచున్నది. శక్తిలేనివారు మేము పెద్ద పెద్ద నైవేద్యములను దేవునకు సమర్పింపలేకపోతిమేయని దిగులునొందరాదు. ఏలయనిన భగవానుడు భక్తిని, హృదయశుద్ధిని ప్రధానముగ నెంచునేకాని వస్తువునుగాదు. వాస్తవముగచూచిన దేవునకు ఒకానొక వస్తువు యొక్క ఆవశ్యకత యేమియునులేదు. బ్రహ్మాండములన్నియు వారి కుక్షియందే యుండ ఇక వారికేమి కొఱత ? అయినను నిర్మలమనస్కులగు భగవానుడు రెండుషరతులను నియమించిరి. అవియేవి యనిన–

(1) ఇచ్చువాడు పరిశుద్ధుడై యుండవలెను.

(2) ఇచ్చుదానిని పరమభక్తితో నీయవలెను.

మలినచిత్తము గలవాడు ఏదియొసంగినను, తుదకు రాజ్యాదులను, మేరుపర్వతమంత బంగారమిచ్చినను భగవంతుడు స్వీకరింపరు. శుద్ధచిత్తముగలవాడు, నిర్మలాంతఃకరణుడు కేవల మొక ఆకు ఇచ్చినను, పువ్వు ఇచ్చినను, పండు ఇచ్చినను, గరిటెడు నీరిచ్చినను మహాసంతుష్టితో గ్రహించును. అట్లే భక్తిలేకుండ రత్నరాసులిచ్చినను స్వీకరింపరు. భక్తితో చిల్లిగవ్వ ఇచ్చినను ఆనందముతో తీసికొనును. ప్రేమగాని, భక్తిగానిలేని దుర్యోధనునియింట అతిథ్యమును నిరాకరించి, దయ, ప్రేమ, ఉట్టిపడుచుండు విదురునియింట శ్రీకృష్ణమూర్తి అతిథ్యమును స్వీకరించుట సర్వులకును విదితమే కదా! మఱియు కుచేలుని అటుకులను పరమప్రీతితో వారు గైకొనినసంగతియు అందఱికిని తెలిసినదే కదా!

దీనినిబట్టి భగవంతుని యనుగ్రహము మనుజుడిచ్చు వస్తువుయొక్క గొప్పతనముపైగాని, విలువపైగాని ఆధారపడియుండదనియు, ఆతనియొక్క మనస్తత్త్వముపైననే ఆధారపడియుండుననియు స్పష్టమగుచున్నది. ఆతని నిర్మలభక్తి, నిర్మలహృదయము - వీనిపైగాని ఆధారపడియుండదనియు, ఆతనియొక్క మనస్తత్త్వముపైననే ఆధారపడియుండుననియు స్పష్టమగుచున్నది. ఆతని నిర్మలభక్తి, నిర్మలహృదయము - వీనిపైననే సర్వేశ్వరునికృప ఆధారపడియుండును. కనుకనే ఎంతటి కోటీశ్వరులైనను, రాజాధిరాజులైనను, మహాపండితులైనను, భగవంతుని అనుగ్రహమును కొందఱు పొందలేకుండుటయు, వారి దయకు పాత్రులు కాకుండుటయు చిల్లిగవ్వయైనలేక, కౌపీనధారులైయుండువారు పరమాత్మయొక్క అపారకృపకు పాత్రులగుటయు చరిత్రయందుకానంబడుచున్నది. భక్తి, చిత్తశుద్ధి - అను నీరెండే భగవద్దృష్టిలో ప్రధానములుకాని, తక్కినవికావు. 'అశ్నామి' అని చెప్పుటవలన అట్టి భక్తితో నీయబడిన దానిని పరమాత్మ గ్రహించుటయేకాదు, అనుభవించునని, భుజించునని, స్పష్టమగుచున్నది. ఆహా! భక్తులపై భగవానున కెంతటి కరుణయో చూడుడు!

'ప్రయతాత్మనః' - అను పదమునకు నిర్మలాంతఃకరణుడని, ప్రయత్నశీలుడనియు అర్థములు కలవు.

'యః' అని ప్రయోగించుటవలన ఎవరైనను సరియే - జాతిమతకులవిచక్షణగాని, ధనిక దరిద్ర భేదముగాని, స్త్రీపురుష భేదముగాని లేక - భక్తితోగూడి నిర్మలచిత్తుడై యుండినచో ఆతడొసంగినది సర్వేశ్వరుడు స్వీకరించునని తేలుచున్నది.

భక్తి యనునది, హృదయశుద్ధి యనునది మోక్షప్రయాణమునకు టికెట్టు వంటిది. టిక్కెట్టు చేతగలవారు ఎంతబీదవారైనను, అల్పకులస్థులైనను రైలుపెట్టెలో నిశ్చింతగ, నిర్భయముగ ప్రయాణముచేసి గమ్యస్థానమును చేరగలరు. అట్లుకాక, టిక్కెట్టులేనివారు ఎంత ధనవంతులైనను, అధికారవంతులైనను, పండితులైనను, సౌందర్యవంతులైనను వారిని రైలుపెట్టెలోనుండి దింపివేయుదురు. వారు గమ్యస్థానమును చేరజాలరు. అట్లే మోక్షప్రయాణమున్ను. కాబట్టి భగవత్కృపకు, మోక్షప్రాప్తికి భక్తి, చిత్తనైర్మల్యము అతి ప్రధానములైయున్నవి. ఈవిషయమును భగవాను డీశ్లోకముద్వారా సుస్పష్టము చేసియున్నారు. ముక్తికి అర్హత, యోగ్యత (MERIT) ప్రధానమేకాని తక్కిన విషయములుకావని ఇట ఋజువుచేయబడినది. ఇట్టి బోధలవలన ప్రపంచములో ప్రతి మానవుడును దైవమార్గమున ప్రయత్నించుటకు అవకాశమేర్పడుచున్నది. దేవునిబిడ్డలని ముద్రవేయబడినవా రెక్కడను ఉండరు.

అనన్యభక్తిగలవారే, నిర్మలచిత్తముగలవారే దేవుని బిడ్డలు. అట్టివారినే యతడు **కరుణించును** వారికే ఆత్మజ్ఞానమును ప్రసాదించును.

**'యమేవైషవృణుతే తేన లభ్య స్తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్.'**

అను ఉపనిషద్వాక్య మీసత్యమునే తెలుపుచున్నది.

| | | | | |
|---|---|---|---|---|
| భగవంతునకు | పత్రమును | - | విదురుడు, ద్రౌపది | భక్తితో ఒసంగి కృతార్థులైరి. |
| | పుష్పమును | - | గజేంద్రుడు | |
| | ఫలమును | - | శబరి | |
| | తోయమును | - | రంతీదేవుడు | |

**ప్ర:–** భగవంతుడు దేనిని స్వీకరించును ?

**ఉ:–** భక్తితోను, నిర్మలచిత్తముతోనుగూడిన ఏ స్వల్పవస్తువు (పత్రముగాని, పుష్పముగాని, ఫలముగాని, జలముగాని) నొసంగినను ప్రీతితో స్వీకరించును.

**ప్ర:–** కాబట్టి భగవత్కృపను సంపాదించవలెననిన ఏది అవశ్యకము?

**ఉ:–** (1) భక్తి, (2) చిత్తశుద్ధి – అను రెండును ఆవశ్యకములు.

**అ॥** ఏ కార్యమును చేసినను భగవదర్పణముగ చేయవలయునని ఉద్బోధించుచున్నాడు–

**27. యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్**
**యత్తపస్యసి కౌన్తేయ తత్కురుష్వ మదర్పణమ్.**

**టీక:–** కౌన్తేయ = ఓ అర్జునా !, యత్ = దేనిని, కరోషి = చేయుచున్నావో, యత్ = దేనిని, అశ్నాసి = తినుచున్నావో, యత్ = దేనిని, దదాసి = దానము చేయుచున్నావో, యత్తపస్యసి = ఏ తపస్సును జేయుచున్నావో, తత్ = దానిని, మదర్పణమ్ = నాకర్పణము, కురుష్వ = చేయుము.

**తా:–** ఓ అర్జునా! నీవేదిచేసినను, తినినను, హోమమొనర్చినను, దానముచేసినను, తపస్సుచేసినను, దానిని నా కర్పింపుము.

**వ్యాఖ్య:–** మనుజుడు తాను చేయు సమస్తకార్యములను ఈశ్వరార్పణబుద్ధితో గావింపవలెను. ఫలితములను గోరక కార్యములను భగవదర్పితము చేయవలెను. అట్లు చేయుటవలన గలుగు ఫలితము రాబోవు శ్లోకమున వివరింపబడినది. అట్టివాడు ఆ యా కర్మబంధనములనుండి విడువబడి పరమాత్మనే బొందుచున్నాడు. అతని హృదయము మాలిన్యరహితముకాగా పరబ్రహ్మమును సాక్షాత్కరించుకొనుచున్నాడు. కాబట్టి ఈ ప్రకారముగ సమస్తకర్మలను భగవదర్పితముచేయుట మోక్షప్రాప్తికి, ఆత్మసాక్షాత్కారమునకు సులభోపాయముగ నుండుచున్నది. 'ఏదిచేసినను' అని చెప్పుటచే 'పాపకార్యమును' చేసినను అని అర్థముకాదు. ఏలయనిన, పాపకార్యములను భగవంతునకెవరును సమర్పింపరు గదా! అట్లే 'ఏమితినినను' అనుచోట నిషిద్ధాహారమును అన్వయించుకొనగూడదు.

కర్మచేయక ఏజీవియు నుండలేదు. ఉదయము లేచినదిమొదలు రాత్రి పరుండు వఱకును పెక్కుకార్యములను జీవుడు చేయుచుండును. ఎటుతిరిగి వానిని తప్పకచేయవలసియున్నది, కావున 'కృష్ణార్పణమస్తు' 'బ్రహ్మార్పణమస్తు' అని వానినేల చేయరాదు ? అట్లు చేయుటవలన భగవదనుగ్రహము సిద్ధించుటయు, కర్మబంధము తొలగుటయు రెండును సిద్ధించును. కావున మోక్షమునకిది సర్వులకును సులభోపాయముగనున్నది. ముఖ్యముగ పనిపాటలు చేసికొను గృహస్థున కీపద్ధతి యెంతయో సుళువుగనుండగలదు.

'యద్యత్కర్మకరోమి తత్తదఖిలం శంభో తవారాధనమ్' – 'ఓ పరమశివా! నేను (నడచినను, కూర్చొనినను, భుజించినను) ఏదిచేసినను అదియంతయు నీ యారాధనమే' అని ఒక భక్తుడు భగవంతునిగూర్చి పలికిన పలుకు లీ సందర్భమున స్మరణీయములైయున్నవి.

**ప్ర:–** జీవు డేప్రకారము కర్మల నాచరించవలెను?

**ఉ:–** తానేదిచేసినను, భుజించినను, హోమముచేసినను, దానమొనర్చినను, తపస్సుచేసినను అంతయు భగవదర్పణముగ చేయవలెను. ఈశ్వరార్పణబుద్ధితో కర్మల నాచరింపవలెనని భావము.

**ప్ర:–** అట్లు చేయుటవలన కలుగు ఫలితమేమి?

**ఉ:–** కర్మబంధవిముక్తి, భగవత్ప్రాప్తి.

**అ॥** అట్లు సమస్తకర్మలను భగవదర్పణము చేయుటవలన కలుగు ఫలితమేమియో వచించుచున్నాడు –

## 28. శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబన్ధనైః
## సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మాముపైష్యసి.

**టీక:–** ఏవమ్ = ఈప్రకారముగ, సన్న్యాసయోగయుక్తాత్మా = 'కర్మసమర్పణ' యోగముతో గూడినవాడవై, శుభాశుభఫలైః = ఇష్టానిష్టములు (లేక పుణ్యపాపములు) ఫలములుగాగల, కర్మబన్ధనైః = కర్మబంధములనుండి, మోక్ష్యసే = విడువబడగలవు, విముక్తః = (అట్లు) విడువబడినవాడవై, మామ్ = నన్ను, ఉపైష్యసి = పొందగలవు.

**తా:–** ఈ ప్రకారముగ 'కర్మసమర్పణ' యోగముతో గూడినవాడవై పుణ్యపాపములు ఫలములుగాగల కర్మబంధములనుండి నీవు విడువబడగలవు. అట్లు విడువబడినవాడవై నన్ను పొందగలవు.

**వ్యాఖ్య:–** క్రిందటి శ్లోకమున జెప్పబడిన సర్వకర్మఫలత్యాగమునకును, భగవదర్పిత కర్మకు ఫలమిచట చెప్పబడుచున్నది. 'సన్న్యాస' మనగా కర్మఫలసన్న్యాస మని అర్థము. 'కర్మలనుజేయుచు వానిని నాకర్పణచేయుము' అని భగవానుడు చెప్పినందువలన సన్న్యాసమున కిచట ఫలత్యాగమే అర్థమగునుగాని కర్మత్యాగముకాదు. ఈ ప్రకారముగ సమస్తకర్మఫలములను భగవదర్పణముచేయుటవలన జీవుడు శుభాశుభఫలరూప కర్మబంధములనుండి విముక్తుడై పరమాత్మను బొందగలడని యిట వచింపబడినది. 'ముక్తుడై' అని చెప్పక 'విముక్తుడై' అని చెప్పుటవలన అట్టివాడు కర్మబంధమునుండి పూర్తిగ విడివడునని అర్థమగుచున్నది.

సామాన్యముగ జనులు 'మోక్షము' 'మోక్షము' అని పలుకుచుందురు. ఆ మోక్షమునకు అర్థమేమి? బంధవిమోచనమే మోక్షము. ఏమిబంధము? కర్మబంధము. ఏమికర్మలు? శుభాశుభ ఫలముల నొసంగు కర్మలు. అట్టి కర్మరూప బంధనమునుండి విడుదలయే మోక్షము. అయ్యది 'సన్న్యాస' యోగముచే అనగా కర్మఫలములను ఈశ్వరార్పణమొనర్చుటద్వారా లభించుచున్నది. దీనినే నిష్కామకర్మయోగమనియు నందురు. అయితే శుభాశుభఫలములు రెండును ఇచట బంధనములుగా వర్ణింపబడుట గమనింపదగినది. అశుభకర్మ, అశుభఫలము బంధమని అందఱికిని తెలిసినవిషయమే. అయితే అతీత పరమార్థదృష్టియందు దృశ్యముగాని, తదంతర్గతమగు ఏకర్మగాని, ఏ ఫలముగాని మిథ్యయే యగుటచే శుభకర్మయు, శుభఫలమున్ను దానియందే అంతర్గతమగుటబట్టి అదియు బంధమని ఇచట తెలుపబడినది కావున దానినికూడ దాటి సత్యవస్తువగు పరమాత్మను జేరవలయునని తాత్పర్యము. (అయితే శుభకర్మరూపబంధము ముముక్షువునకు ప్రమాదకరమైనదికాదు. మొదట దాని నాశ్రయించి, క్రమముగ దానిని దాటి నిర్వికల్పాత్మస్థితికి బోవచ్చును). ఈ ప్రకారముగ కర్మలను తత్ఫలములను ఈశ్వరార్పణమొనర్చుటవలన ఆ కర్మసంబంధమైన బంధనములనుండి జీవుడు విముక్తుడై పరమాత్మను జేరుచున్నాడు. ఫలాభిసంధిరహితముగ కర్మల నాచరించుటవలనను, లేక, కర్మలను భగవదర్పణముగావించుటవలనను ఆ కర్మలందలి దోషము - నివృత్తమగుచున్నది. అందుచే జీవుడు కర్మబంధవిముక్తుడై భగవత్సాయుజ్యమును బడయుచున్నాడు.

**ప్ర:–** కర్మబంధన మెట్టిది?

**ఉ:–** శుభాశుభ ఫలరూపమైనది.

**ప్ర:–** అట్టి కర్మబంధనమునుండి జీవుడెట్లు విముక్తుడు కాగలడు ?

**ఉ:–** తానాచరించు సమస్తకర్మములను ఈశ్వరార్పణము చేయుటవలన. దానిచే కర్మబంధ విముక్తి పరమాత్మపదప్రాప్తి - అను రెండుసత్ఫలితము లాతనికి చేకూరుచున్నవి.

**అ॥** సర్వజీవులందును తనకు సమభావమే కలదనియు, వారివారి భక్తినిబట్టి వారు తరించిపోవుదురనియు భగవానుడు వచించుచున్నాడు -

## 29. సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః
## యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్.

**టీక:–** అహమ్ = నేను, సర్వభూతేషు = సమస్తప్రాణులందును, సమః = సమముగానుండువాడను, మే = నాకు, ద్వేష్యః = ద్వేషింపగదినవాడు, న అస్తి = లేడు, ప్రియః = ఇష్టుడును, న = లేడు, యేతు = ఎవరైతే, మామ్ = నన్ను, భక్త్యా = భక్తితో, భజన్తి = సేవించుచున్నారో, తే = వారు, మయి = నాయందు, (వర్తన్తే = ఉన్నారు) తేషుచ = వారియందును, అహమ్అపి = నేనును, (వర్తే = ఉన్నాను).

**తా:–** నేను సమస్తప్రాణులందును సమముగా నుండువాడను. నాకొకడు ద్వేషింపదగినవాడుగాని, మఱియొకడు ఇష్టుడుగాని ఎవడును లేడు. ఎవరు నన్ను భక్తితో సేవించుదురో వారు నాయందును, నేను వారియందును ఉందుము.

**వ్యాఖ్య:—** సమస్త చరాచర ప్రాణికోట్లయందును భగవంతుడు సమానముగా నున్నారు. వారిదృష్టియందు అందఱున్ను సమమే. వారికి ఒకడు ప్రియుడు, మఱియొకడు అప్రియుడు ఉండనేరడు. అందఱును వారి బిడ్డలే. అందఱియందును వారికి సమానవాత్సల్యమే కలదు. అయితే లోకములో కొందఱు సుఖవంతులుగను, మఱికొందఱు దుఃఖవంతులుగను ఉండుటకు కారణమేమి? భగవంతునకు పక్షపాతము కలదా? అని ప్రశ్నించవచ్చును. భగవానున కెవరిపైనను పక్షపాతములేదు. కాని జీవులు వారువారు చేసికొనిన కర్మననుసరించి ఆ యా సుఖదుఃఖాది ఫలములనొందుచున్నారు. దేవుడందఱియందును సమముగనున్నను, దేవునియం దందఱును సమముగలేరు. కొందఱు పుణ్యమును, మఱికొందరు పాపమును ఆచరించుట వలన తత్తత్ఫలితములగు సుఖదుఃఖముల నొందుచున్నారు. ఒకరికి మేలొనరించువారు, భగవంతుని భక్తితో నారాధించువారు, చిత్తశుద్ధికై ప్రయత్నము సలుపువారు సుఖమును బొందుదురు. పరులకు కీడొనర్చువారు, దేవుని భజించనివారు, మలినచిత్తులు దుఃఖమును బొందుదురు. ఇది ప్రకృతియందుగల అనుల్లంఘనీయమగు నియమము. దీనినిబట్టి జీవుల సుఖదుఃఖములందు భగవంతునకు ఏ బాధ్యతయులేదని స్పష్టమగుచున్నది. సూర్యప్రకాశము అంతట సమముగనున్నను మట్టిపై ప్రకాశింపక, అద్దమందు లెస్సగ ప్రకాశించును గదా. అట్లే భగవత్కరుణ సర్వత్ర వెలయుచున్నను ఎవరు భక్తితో భగవానుని సేవించుదురో వారే దానిని స్వీకరింపగల్గుదురు. సముద్రముపైగాలి అంతట వీచుచున్నను ఎవరు తెరచాప ఎత్తుదురో వారి పడవయే కదులునుగదా! కావున భగవత్కరుణ యను గాలి సర్వత్రవీచుచున్నను వారివారిహృదయములను తెరచాపలను విప్పి భగవదున్ముఖముగనుంచినచో మోక్షమను గమ్యస్థానమును శీఘ్రముగ చేరగలరు. అన్నిసుఖములకంటె గొప్పసుఖము భగవత్ప్రాప్తియే అయియున్నది. అదియో ఎవరు నిరంతరము అనన్యభక్తితో పరమాత్మను సేవింతురో, ఆరాధింతురో వారు పొందగలరు. ఆ విషయ మీశ్లోకమున స్పష్టముగ నిరూపింపబడినది. 'ఎవరు భక్తితో నన్నారాధింతురో వారు నాయందును, నేను వారియందును ఉందుము' అని భగవాను డిచటసెలవిచ్చిరి. ఆహా! భక్తియొక్క మహిమ యెట్టిదై యున్నది? దాని ఫలిత మెంత అపారమైయున్నది. సాక్షాత్ భగవత్ప్రాప్తియను మహోన్నతఫలము భక్తిపూర్వక భగవత్సేవనమను క్రియవలన లభించుచున్నది. కాబట్టి ప్రతిమానవుడును అట్టి పరమభక్తి నవలంబించి పరమాత్మను సేవించవలెను. 'భజన్తి' అనుపదమునకు 'భక్త్యా' అను పదము చేర్చుటవలన, సామాన్యమగు ఆరాధనము, సేవనము చాలదనియు భక్తితోగూడిన సేవన మావశ్యకమనియు స్పష్టమగుచున్నది. మఱియు 'మయి తే తేషుచాప్యహమ్' అని చెప్పుటవలన అట్టిభక్తులు భగవంతునియందును, భగవంతుడు అట్టి భక్తులందును కాపురముండునని తెలియు చున్నది. దేవుడువచ్చి కాపురముండుటబట్టి వారి శరీరోపాధి ఒక దేవమందిరముగ మారిపోవును. వారు దేవులుగా మారిపోవుదురు. అత్తఱి జీవుడు శివుడగును. దేహము దేవాలయమగును. ఎవరు దేవునియందు వసించుదురో వారియందు దేవుడు వసించును. కావున 'నాకు దుఃఖము కలుగుచున్నదే' అని విలపించిన ప్రయోజనములేదు.

దాని నివారణోపాయ మొకటియేకలదు. దేవుని తన హృదయమున కాహ్వానించుటయేయగును. ఎచట పరమాత్మయుండునో అచట సుఖము, ఐశ్వర్యము, విజయము తప్పక కలిగితీరును★. కాబట్టి సుఖమునపేక్షించువాడు అనన్యభక్తిని తప్పక ఆశ్రయించవలసియుండును.

**ప్ర:—** సర్వజీవుల యెడల భగవంతునిదృష్టి యెట్లుండును?

**ఉ:—** సమముగ నుండును.

★ యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థోధనుర్ధరః, తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ. (1878)

ప్ర:— అయితే జీవులలో కొందఱికి సుఖము, మఱికొందఱికి దుఃఖ మేల కలుగుచున్నది?

ఉ:— వారువారు చేయు కర్మలనుబట్టి అట్లు కలుగుచున్నది. ఎవరు భగవంతునియందుందురో (దేవుని సేవించెదరో) వారియందు భగవంతుడుండును. కావున అట్టివారికి సుఖముకలుగును. తక్కినవారికి కాదు.

ప్ర:— భగవంతుని ఏ ప్రకారముగ సేవించవలెను?

ఉ:— భక్తితో.

ప్ర:— భగవంతు డెవరియందు విశేషముగ నివసించును?

ఉ:— అనన్యభక్తితో ఆతనిని సేవించువారియందు నివసించును. (సామాన్యముగ అందఱి యందును 'సత్తాసామాన్య' రూపమున పరమాత్మ వ్యాపించియున్నను తన్ను సేవించువారియందు విశేషముగ నభివ్యక్తుడై వారికి మోక్షసుఖమును కలుగజేయునని భావము).

అII పాపియైనను మనస్సుమార్చుకొని తన్ను భక్తితో సేవించినచో అతడు పుణ్యాత్ముడేయగునని భగవానుడు సెలవిచ్చుచున్నాడు –

**30. అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్**
**సాధురేవ స మన్తవ్యస్సమ్యగ్వ్యవసితో హి సః.**

**టీక:**— సుదురాచారః అపి = మిక్కిలిదురాచారముగలవాడైనప్పటికిని, అనన్యభాక్ = అనన్యభక్తితో (ఇతరమగుదేనియందును భక్తినుంచక, ఆశ్రయింపక), మామ్ = నన్ను, భజతేచేత్ = భజించునేని, సః = అతడు, సాధుః ఏవ = సత్పురుషుడనియే (లేక, శ్రేష్ఠుడనియే), మన్తవ్యః = తలంపబడదగినవాడు, హి = ఏలననగా, సః = అతడు, సమ్యక్ = స్థిరమైన (లేక ఉత్తమ), వ్యవసితః = మనోనిశ్చయముబొందియున్నాడు.

**తా:**— మిక్కిలి దురాచారముగలవాడైనప్పటికిని అనన్యభక్తిగలవాడై ఇతరమగు దేని యందును భక్తినుంచక, (ఆశ్రయింపక) నన్ను భజించునేని, అతడు సత్పురుషుడనియే (శ్రేష్ఠుడనియే) తలంపబడదగినవాడు. ఏలయనగా అతడు స్థిరమైన (ఉత్తమ) మనోనిశ్చయముగలవాడు.

**వ్యాఖ్య:**— మిక్కిలి దురాచారముగలవాడైనను, మనస్సుమార్చుకొని దైవమార్గమున వర్తించుచు పరమాత్మయే పరమగతియని నమ్మి, ఇతరమును దేనిని చింతింపక ఆ పరమాత్మనే సదా భజించుచో నతడు ఉత్తముడనియే చెప్పనగును. అతడు పూర్వము దురాచారి అయియున్నను ఇప్పుడు సాధువేయగును. 'దురాచారి' అని చెప్పక 'సుదురాచారి' అని చెప్పుటవలన మహాపాపి అయియున్నప్పటికిని మనస్సు మార్చుకొని భగవానుని లెస్సగ నాశ్రయించినచో అతడు మహాపుణ్యాత్ముడే యగునని భావము. ఎందుకనగా, అతడు సత్యమును గమనించెను. సరియైనమార్గమును జేబట్టెను. ఉత్తమనిశ్చయమునకు వచ్చెను. "ప్రపంచములో పరమాత్మ ఒకడే సత్యము. తక్కినదియంతయు అసత్యము, మిథ్య, నశ్వరము. కావున అసత్యమై, క్షణికమైనట్టి ఆత్మేతరవస్తువును అనగా దృశ్యపదార్థమును వదలి సత్యమై శాశ్వతమైన పరమాత్మనే ఆశ్రయింపవలెను." అనునది ఉత్తమనిశ్చయము (సమ్యక్ – వ్యవసితత్వము) అగును.

'అనన్యభాక్' - పరమాత్మతప్ప అన్యమగు దేనిని ఆశ్రయించనివాడు. నిరంతరము దైవమునుమాత్రము చింతించువాడు. అట్టి అనన్యభక్తుని పూర్వకాలికపాపమంతయు, పరమాత్మ సేవనముచే ఒక్కతృటిలో భస్మమైపోవ అతడు వినిర్మలహృదయుడగును. అనేక వేల సంవత్సరములనుండియు కుప్పలు కుప్పలుగా పడియున్నకట్టెలు ఏ ప్రకారము ఒక్క నిప్పురవ్వచే భస్మీభూతమగునో, అట్లే పరమభక్తుని పూర్వకాలిక పాపమంతయు క్షణములో నశించిపోవ అతడు పుణ్యాత్ముడగును. వాల్మీకియే ఇందులకు దృష్టాంతము. ఒక గుహయందు ఎంతకాలమునుండియో చీకటి నివాసముచేయుచున్నను ఒక అగ్గిపుల్ల వెలిగించినచో అదియంతయు తృటిలో మాయపోవునట్లు అజ్ఞానవశమున పూర్వముతానాచరించిన పాపజాలమంతయు ఇప్పటి భగవద్భక్తిచే నశించిపోవ పాపి సాధువగుచున్నాడు, సుదురాచారి పరమసదాచారి యగుచున్నాడు. రాక్షసుడు దేవుడగుచున్నాడు. ఇట్టి మహత్తర పరిణామమును తెచ్చినదియేది? భగవద్భక్తియే. సమ్యక్ - జ్ఞానమే. ఈ భావమునే పూర్వము -

**అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః, సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సన్తరిష్యసి. (4-36)**

అను శ్లోకమునందు గీతాచార్యులు వ్యక్తపఱచియున్నారు. దీనినిబట్టి మనుజు డెల్ల కాలమునందును ఒకే నిమ్నస్థితియందుండునని చెప్పుట తగదనియు, అట్లుండవలెనని వాంఛించుట అంతకంటె తగదనియు. సత్ప్రయత్నముచే సర్వులును ఉన్నతపథమును జేబట్టగలరనియు, అట్లు చేబట్టవలెననియే బోధింపవలెననియు స్పష్టమగుచున్నది. పాపిని 'నీ వెల్లకాలములందును పాపివే' అనుట ఘోరపాతకమని దీనివల్ల తేలుచున్నది.

మఱియు పాపికూడ భగవద్భక్తిచే పుణ్యాత్ముడు కాగలడని చెప్పుటచే దాని అర్థము పాపముచేయవలెనని, తదుపరి భక్తిచే కడిగివేయవలెననికాదు. అదివఱలో, తెలియకచేసిన పాపము, ఇప్పటి సన్మార్గావలంబనముచేతను, అనన్యభక్తివలనను, నిర్మలజ్ఞానముచేతను భస్మీభూతమైపోగా మనుజుడు శుద్ధాత్ముడగునని చెప్పుటయే యగును. ఇట్టి అభయవాక్యమువలన సామాన్యజనానీకమున కెంతయో ఆశ్వాసము, ధైర్యము చేకూరగలదు. అందఱికిని ఉన్నతినిబొందుటకు అవకాశము లేర్పడగలవు.

దైవమార్గమును, 'సమ్యక్ - మార్గమని' (ఉత్తమమార్గమని) చెప్పుటవలనను, దానిననుసరించువానిని 'సాధువని' చెప్పుటవలనను ప్రాపంచిక మార్గములకంటె అదియెంతయో అధిక శ్రేయోదాయక మని, మిక్కిలి అనుసరణీయమని బోధింపబడినట్లగుచున్నది. కావున అసమ్యక్ - మార్గములను (దృశ్యమే సత్యమని నమ్మి అనుసరించుమార్గములను) త్యజించి, సమ్యక్ - మార్గమునే (భగవన్మార్గమునే చేబట్టవలెను.

ఇచట **'సాధువు'** అనగా జటాజూట, కాషాయాంబరములను ధరించినవాడని కాదు అర్థము. 'సాధు' పదమునకు ఉత్తమమని అర్థము. అనగా సన్మార్గుడని భావము.

**ప్ర:-** గొప్పదుర్మార్గుడు సన్మార్గు డెట్లు కాగలడు ?

**ఉ:-** పరమాత్మను అనన్యభక్తితో సేవించినచో.

**ప్ర:-** ప్రపంచములో ఉత్తమనిశ్చయ మేది ?

**ఉ:-** భగవంతుని సత్యమనినమ్మి వారి నా శ్రయించుటయే.

**అ॥** దైవభక్తుడెన్నటికిని చెడడని (హీనగతిని బొందడని) చెప్పుచున్నాడు -

**31. క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి**
**కౌన్తేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి.**

**టీక:–** (సః = అతడు), క్షిప్రమ్ = శీఘ్రముగా, ధర్మాత్మా = ధర్మబుద్ధిగలవాడు, భవతి = అగుచున్నాడు, శశ్వత్ = శాశ్వతమైన, శాన్తిమ్ = శాంతిని, నిగచ్ఛతి = పొందుచున్నాడు, కౌన్తేయ = ఓ అర్జునా, మే = నాయొక్క, భక్తః = భక్తుడు, నప్రణశ్యతి (ఇతి) = చెడిపోడు (నశింపడు, హీనగతినొందడు) (అని), ప్రతిజానీహి = ప్రతిజ్ఞచేయుము.

**తా:–** అతడు (నన్నాశ్రయించిన పాపాత్ముడు) శీఘ్రముగ ధర్మబుద్ధిగలవాడగుచున్నాడు. మఱియు శాశ్వతమైన శాంతిని పొందుచున్నాడు. ఓ అర్జునా! 'నాభక్తుడు చెడడు' అని ప్రతిజ్ఞచేయుము.

**వ్యాఖ్య:–** పైనదెల్పిన ప్రకారముగ పాపాత్ముడైనను భగవంతుని పరమశరణ్యముగ నమ్మి భజించుచో శీఘ్రముగ ధర్మాత్ముడు, పుణ్యాత్ముడు అగుచున్నాడు. మఱియు శాశ్వతశాంతిని బడయుచున్నాడు. 'క్షిప్రమ్' – శీఘ్రముగ అని తెలుపుటవలన అట్టి శాంతిని ఏనాడో పొందుటకాదనియు దైవమునాశ్రయించిన వెనువెంటనే లభించుననియు స్పష్టమగుచున్నది. దీపము వెలిగించిన మఱుక్షణమే చీకటి పోవునుగదా! దైవమార్గమున జనులు కొందఱు 'మాకు మోక్షమెపుడు లభించునో' అని సంశయగ్రస్తులై యుందురు. అట్టిసంశయముల కిచట భగవానుడు తావులేకుండ చేసివైచిరి. 'అనన్యభక్తితో మీరు నన్ను భజించుచో శీఘ్రముగ మీకు మోక్షరూప పరమశాంతి లభించును' అని పరమాత్మ భక్తుల కిచట అభయమొసంగిరి.

భగవత్సేవనమువలన మనుజునకు రెండు గొప్పఫలితములు చేకూరునని యిట వచింప బడినది – (1) అతడు ధర్మాత్ముడగును (2) శాశ్వతమగు శాంతిని లెస్సగ బడయును. అతడు ధర్మమయుడై, సదాచారవంతుడైయుండును. ఏ కోశమునను అతనికి అధర్మము వర్తింపకుండును. మఱియు నతడు గొప్పశాంతిని బొందును.

**'తేషాం శాన్తిశ్శాశ్వతీ నేతరేషామ్'** అని యుపనిషత్తులున్ను ఈసత్యమునే ఉద్ఘోషించుచున్నవి. దృశ్యవస్తువును వెన్నంటుకొలది శాంతి దూరముగ పలాయనమగుచుండును. దైవమును వెన్నంటినచో అది అతిసమీపమునకు వచ్చుచుండును.

ఇక ఈ శ్లోకముయొక్క రెండవపాదమున 'న మేభక్తఃప్రణశ్యతి' (నాభక్తు డెన్నడునుచెడడు, దుర్గతినొందడు) అను గంభీరసత్యమును భగవానుడు వెల్లడించిరి. ఈ అష్టాక్షరీ మహామంత్రమును ముముక్షువులు నిరంతరము స్మృతిపథమున నుంచుకొనవలెను. అధైర్యము, నిరుత్సాహము కలిగినపుడెల్ల దీనిని స్మరించుచుండవలెను. పరమార్థరంగమున ప్రవేశించుటకుముందు కొందఱికి కొన్ని సంశయములు కలుగుచుండును – భక్తి గలిగియున్నచో ప్రయోజన ముండునో, లేదో, దానివలన సద్గతి కలుగునో లేదో, అని. అట్టివారి సందేహములన్నిటిని గీతాచార్యు లీశ్లోకమున పటాపంచలు చేసివైచిరి. 'దైవము నాశ్రయించిన వాడెన్నడును చెడడు, అతడు సద్గతినే చెందును' అని అసందిగ్ధముగ చెప్పివేసిరి. కల్పవృక్షము నాశ్రయించినవానికి దుస్థితి యెట్లు కలుగగలదు? గంగానదిని ఆశ్రయించినవారికి దాహ మెట్లు కలుగును?

'ప్రతిజానీహి' (ప్రతిజ్ఞచేయుము) అని అర్జునుని యాజ్ఞాపించుటలో తన భక్తుడు చెడడను ఆ వాక్య మెంతటి సత్యమో తేటతెల్లమగుచున్నది. ఇది ముమ్మాటికి సత్యమని భగవానుడు పలుకుటవలన ఆ

వాక్యముయొక్క యాథార్థ్యము చక్కగ ఋజువగుచున్నది. భక్తులయొక్క సద్గతినిగూర్చి భగవానుడు జనుల కెట్టి విశ్వాసమును గలుగ జేయుచున్నారో చూడుడు! కాబట్టి ఇక జనులందఱును ప్రతిజ్ఞాపూర్వకములైన ఈ భగవద్వాక్యములపై పూర్ణవిశ్వాసముంచి తమ హృదయమందలి సంశయములను పారద్రోలి సర్వేశ్వరుని ఇతోధికముగ సేవించి కృతార్థులగుదురుగాక!

**ప్ర:–** దైవము నాశ్రయించినపాపి యెట్టివాడుగా మారును?

**ఉ:–** ధర్మాత్ముడుగా మారును.

**ప్ర:–** ఎంతకాలమునకు?

**ఉ:–** శీఘ్రముగ.

**ప్ర:–** అట్టి భగవదారాధనమువలన లభించు ఫలితమేమి?

**ఉ:–** శాశ్వతమగు శాంతి.

**ప్ర:–** కావున శాశ్వతశాంతి లభించుటకు ఉపాయమేమి?

**ఉ:–** అనన్యభక్తితో భగవత్సంసేవనము గావించుట.

**ప్ర:–** భగవద్భక్తునకు దుర్గతి ఎన్నడైన కలుగునా?

**ఉ:–** ఎన్నటికిని కలుగదు, ఈ సత్యమును భేరీమ్రోగించి ప్రతిజ్ఞచేసి చెప్పవచ్చును.

**అ॥** భగవదాశ్రయముచే ఉచ్చనీచభేదములేక సర్వులును తరించిపోవుదురని వచించుచున్నాడు–

**32. మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః**
**స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాన్తి పరాంగతిమ్.**

**టీక:–** పార్థ = ఓ అర్జునా!, యే = ఎవరు, పాపయోనయః అపి = పాపజన్మము (నీచజన్మము) గలవారును, స్యుః = అగుదురో, తే అపి = వారున్ను, స్త్రియః = స్త్రీలున్ను, వైశ్యాః = వైశ్యులున్ను, తథా = అటులనే, శూద్రాః = శూద్రులున్ను, మామ్ = నన్ను, వ్యపాశ్రిత్య = ఆశ్రయించి, పరామ్‌గతిమ్ = సర్వోత్తమపదవిని (మోక్షమును), యాన్తి హి = నిశ్చయముగా పొందుచున్నారు.

**తా:–** ఓ అర్జునా ! ఎవరు పాపజన్మము (నీచజన్మము) గలవారైయుందురో, వారును, స్త్రీలును, వైశ్యులును, అట్లే శూద్రులును నన్నాశ్రయించి సర్వోత్తమపదవిని (మోక్షమును) నిశ్చయముగ పొందుచున్నారు.

**వ్యాఖ్య:–** పాపజన్మము (నీచజన్మము) కలవారైనప్పటికి, లేక స్త్రీ వైశ్యశూద్రాదులైనప్పటికిని భగవంతుని ఆశ్రయించి ధ్యానాదులు సలుపుచో వారుకూడ పరమగతియగు మోక్షమును పొందగలరని యిచట వచింపబడినది. అట్టివారే భక్తిచే మోక్షము బడయుచుండ ఇక తక్కినవారి విషయమై వేఱుగ చెప్పవలెనా అని భావము. ఇచట 'పాపయోనయః' అనుపదము 'స్త్రీవైశ్యశూద్రాదు' లకు అన్వయించి అర్థము

చెప్పుటయుక్తముకాదు. ఆ పదమును వేఱుచేసి పాపజన్ములైనవారున్ను మఱియు స్త్రీవైశ్యశూద్రులున్ను భగవదాశ్రయముచే తరించిపోవుదురని చెప్పుటయే సముచితముగ నుండును. శ్రీధరుడు, శంకరానందగిరి మున్నగువారట్లే అర్థముచెప్పిరి. ఏలయనిన, స్త్రీలను పాపజన్ములనుటచే వారికిపుట్టు సంతానమున్ను పాపజన్ములనియే చెప్పవలసివచ్చును. అత్తఱి ప్రపంచమందలి జనులందఱును, అన్ని వర్ణములవారును, పుణ్యాత్ములు సహితము పాపులు కావలసివచ్చును. అది అసంగతము. కావున ఈ అర్థము సమీచీనముగ గన్పట్టుటలేదు. పురుషులకువలె స్త్రీలకుకూడ బ్రహ్మవిద్యాధికారముకలదనియు, వారుకూడ పరమార్థసాధనలను అవలంబించి తరించవచ్చుననియు ఈశ్లోకముద్వారా స్పష్టముగ నిరూపింపబడినది. ఔషధమును సేవించుటకు రోగులందఱున్ను అర్హులే; వారు పురుషులుకాని, స్త్రీలుకాని, ఏ జాతివారుకాని, ఏ మతమువారుకాని అవుగాక! అట్లే భవరోగభేషజమగు ఈ బ్రహ్మవిద్యనుగూర్చియు గ్రహించనగును. కనుకనే భగవాను డీ శ్లోకమున వైశ్యశూద్రులను పేర్కొని జాతిభేదమును, స్త్రీలను పేర్కొని లింగభేదమును, పాపాత్ములను పేర్కొని గుణభేదమును అధ్యాత్మపథమున తొలగించివైచిరి. ఎట్టివాడైనను సరియే భగవదాశ్రయముచే తరించిపోవచ్చునని రూఢిపఱచిరి. ఇట్టి విశాలభావములను ప్రకటించుటయందే గీతయొక్క విశేషత కలదు. సంకుచితభావముల కతీతమై గీత నడచుచుండును. యోగ్యతకు ప్రాధాన్యమొసంగుచుండును.

ఎవరు అద్దమును తుడుచుదురో వారిముఖము దానియందు బాగుగ కన్పించును. దానిని ఎవ్వరైనను తుడువవచ్చును. గొప్పకులమందు జన్మించినను అద్దమును తుడువనిచో వారికి ముఖము సరిగా కనుపించదు. అల్పకులస్థుడైనను దానిని తుడిచినచో ముఖము చక్కగ గోచరించును. భగవదాశ్రయముచే తరించినవారియందు నీచజాతులవారిలో గుహుడుమున్నగువారిని, స్త్రీలలో శబరి, గోపికలు మున్నగువారిని, వైశ్యులలో సమాధి★ మున్నదువారిని, శూద్రులలో సంజయుడు మున్నగువారిని పేర్కొనవచ్చును.

పరాంగతిమ్ - సర్వోత్తమపదవి అని దైవపదమును వర్ణించుటవలన, ప్రపంచములోని సమస్తపదవులకంటెను, గతులకంటెను, పరమాత్మపదవి అత్యంతశ్రేష్ఠమైనదని నిశ్చితమగుచున్నది. కావున క్షుద్రములగు క్షణిక ప్రాపంచికపదవులకై సమయమును ధారబోయక భక్త్యాదుల నవలంబించి శాశ్వతదైవపదప్రాప్తికై సర్వులును యత్నింపవలసియున్నది.

**ప్ర:–** దైవపద మెట్టిది ?

**ఉ:–** ప్రపంచములోని సమస్తపదవులకంటెను, స్థానములకంటెను సర్వోత్తమమైనది.

**ప్ర:–** దానినెవరు పొందగలరు ?

**ఉ:–** భగవానుని ఆశ్రయించి నిర్మలభక్తితో ధ్యానములను సల్పువారందఱున్ను పొందగలరు.

**ప్ర:–** ఈ మోక్షమార్గమున జాతి మత కుల లింగ విచక్షణకలదా ?

**ఉ:–** లేదు. పాపజన్ములు (నీచకులస్థులు), మఱియు స్త్రీలు, వైశ్యులు, శూద్రులు అందఱును భగవత్సమాశ్రయముచే ముక్తినొందగలరు.

---

★ సమాధియను వైశ్యభక్తునిగూర్చి మార్కండేయ పురాణము (18-93) నందు, బ్రహ్మవైవర్త పురాణము (62-63) నందు గలదు.

**అ॥** ఈ ప్రపంచ మనిత్యమని, దుఃఖభూయిష్ఠమని తెల్పుచు తద్విముక్తికై తన్ను భజింపుమని భగవానుడు బోధించుచున్నాడు -

## 33. కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయస్తథా
## అనిత్యమసుఖం లోకమిమం ప్రాప్య భజస్వ మామ్.

**టీక:–** పుణ్యాః = పుణ్యాత్ములైన, బ్రాహ్మణాః = బ్రాహ్మణులున్ను, తథా = అటులనే, భక్తాః = భక్తులైన, రాజర్షయః = రాజర్షులున్ను, పునఃకిమ్ (వక్తవ్యమ్) = (భగవదాశ్రయముద్వారా ఉత్తమగతినొందుదురని) మఱల జెప్ప నేల ?, అనిత్యమ్ = నిత్యముకానిదియు (క్షణభంగురమైనదియు), అసుఖమ్ = సుఖములేనిదియునగు, ఇమమ్ = ఈ, లోకమ్ = లోకమును (లేక, శరీరమును), ప్రాప్య = పొంది, మామ్ = నన్ను, భజస్వ = భజింపుము (సేవింపుము).

**తా:–** ఇక పుణ్యాత్ములగు బ్రాహ్మణుల విషయమునను, భక్తులగు రాజర్షుల విషయమునకు మఱల జెప్పనేల? (భగవదాశ్రయముచే వారున్ను తప్పక ముక్తినొందుదురని భావము). కావున అశాశ్వతమై, సుఖరహితమైనట్టి ఈలోకమును పొందియున్న నీవు నన్ను భజింపుము.

**వ్యాఖ్య:–** పాపాత్ములే పరమాత్మను సేవించినచో ముక్తిని బొందుచుండ ఇక పుణ్యాత్ములవిషయమై, భక్తులవిషయమై వేఱుగచెప్పవలెనా? అని వచించుచున్నారు. మఱియు స్త్రీలు, వైశ్యులు, శూద్రులుకూడ భగవంతుని ఆశ్రయించి పరమగతిని బొందుచుండ ఇక బ్రాహ్మణులవిషయమై, క్షత్రియులవిషయమై మఱల చెప్పవలెనా? అనియు నిటపేర్కొనబడినది. అయితే ఎవ్వరైనప్పటికిని పుణ్యమును, భక్తిని సంపాదించిన మాత్రమే అట్టి సద్గతిని బడయగలరని 'పుణ్యాః' 'భక్తాః' అను రెండుపదములద్వారా వ్యక్తమగుచున్నది. అవి లేనివారు ఉత్తమకులజులైనను, ముక్తిని బొందజాలరని భావము. కాబట్టి మోక్షకాంక్షులందఱును (1) పుణ్యము (2) భక్తి అను రెండు పదార్థములను తప్పక సేకరించవలసియున్నది.

'రాజర్షయః' - ఋషిత్వమును (ఇంద్రియనిగ్రహాదులను) బొందిన రాజులని అర్థము. రాజ్యపాలనమువలన అనేక కార్యకలాపములందు, లోకవ్యవహారములందు మునింగియుండు రాజులే ఋషిత్వమును, భక్త్యాది సద్గుణములను పూర్వము సంపాదించియుండ, ఇక సామాన్య కుటుంబవ్యవహారములుగల వ్యక్తి ఋషిత్వము నేల సంపాదింపలేడు ? ప్రయత్నముచే తప్పక సాధించవచ్చును.

'అనిత్యమసుఖం లోకమ్' - ఈ ప్రపంచమును (లేక ఈ జన్మను లేక ఈ శరీరమును) భగవానుడు అనిత్యముగను, సుఖరహితముగను వర్ణించిరి. ఈవాక్యమును సర్వులును బాగుగ జ్ఞప్తియందుంచుకొనవలెను. జీవితము క్షణికము. శరీరములు ఎప్పటికప్పుడు రాలిపోవుటకు సిద్ధముగానున్నవి. ఘటము ఏనాడైనను మృత్తికయందు కలిసిపోవును. అట్లే ఈ ప్రపంచముగాని, దేహములుగాని, వానికారణమగు పంచభూతములలో కాలక్రమమున విలయమైపోవును. కనుకనే ఈ జగత్తు అనిత్యమని వర్ణించబడినది. దేహాదులు అనిత్యములుగావున వానితో చేయవలసిన పరమార్థకార్యములను అతిశీఘ్రముగ చేసివేయవలెను. నావ బాగుగనున్నపుడే దానితో సముద్రమును దాటివేయవలెను. ప్రపంచము, దేహము శాశ్వతమని తలంచి విఱ్ఱవీగుచుండువారికి కనువిప్పు గలిగించుటకే కాబోలు భగవానుడు 'ఇదియంతయు అనిత్యమైనద'ని

హెచ్చరించిరి. (చావుగాని, వినాశముగాని జ్ఞప్తికి వచ్చినపుడే సామాన్యముగ మనుజుడు కడతేరు మార్గమునుగూర్చి యోచించుచుండును). ఇంతియే కాదు. ఈ ప్రపంచము 'అసుఖమ్' (సుఖరహితమైనది) అనియు వాక్రుచ్చిరి.

**'నాల్పే సుఖమస్తి భూమా వై తత్సుఖమ్'** అను ఉపనిషద్వాక్యము బోధించినరీతిగ అల్పమగు దృశ్యవస్తువునందు వాస్తవముగ సుఖము లేదు. అనంతమగు ఆత్మయందే కలదు. క్షణికపదార్థమందు, నశ్వరవస్తువునందు సుఖమెట్లుండగలదు? సామాన్యముగ భోగవిలాసమగ్నులగు జనులీప్రపంచమును వర్ణించినపుడు 'ఇది చాల ఆనందకరమైనది' అని చెప్పుదురు. కాని భగవానుడట్లు చెప్పలేదు. తద్విరుద్ధమగు భావమునే సూచించిరి. దీనిని సుఖవర్జితముగ వర్ణించెను. ఆత్మవస్తువొకటియే సుఖస్వరూపము. అనాత్మరూపమగు దృశ్యమంతయు సుఖరహితమైనది.

ఈ ప్రకారముగ ప్రపంచము 'అనిత్యము'ని, అసుఖమని వర్ణింపబడినది సరియే, అయితే దానినుండి తప్పించుకొనుటెట్లు? అను ప్రశ్న సహజముగనే ఇప్పట్టున ఉదయించును. దానికి సమాధానమును భగవానుడే ఇచట నొసంగిరి. – 'భజస్వమామ్' (నన్ను భజింపుము) అని. భవరోగమునకు, దుఃఖవిముక్తికి ఇదియే పరమౌషధము – భగవత్సంసేవనము, పరమాత్మను సేవించుటయే, ధ్యానించుటయే. 'అనిత్యము' యొక్క బారినుండి తప్పించుకొనుటకు నిత్యమునే ఆశ్రయించవలసియుండును. అట్లే 'అసుఖము'ను (దుఃఖమును) వదలించుకొనుటకు 'సుఖ' వస్తువునే ఆశ్రయించవలెను. అట్టి నిత్యసుఖవస్తువే ఆత్మ, పరబ్రహ్మము, దైవము. కావున ఆతనినే భజించి కృతార్థుడు కావలయును (భజస్వమామ్). ఆపాతరమణీయమగు ఈ దృశ్యప్రపంచముయొక్క తళుకు బెళుకులకు మోసపోక సత్యశివసుందరమగు పరమాత్మనే ఆశ్రయించి తరించవలెను. ఈ ప్రకారముగ రోగమును, ఔషధమును – రెండిటిని ఈ శ్లోకమున శ్రీకృష్ణమూర్తి ప్రవచించినవారైరి.

**ప్ర:–** భగవత్ప్రాప్తికి అవసరమైన వస్తువులెవ్వి?

**ఉ:–** (1) పుణ్యము (2) భక్తి.

**ప్ర:–** ఈ ప్రపంచమెట్టిది?

**ఉ:–** (1) అనిత్యమైనది (2) సుఖవర్జితమైనది.

**ప్ర:–** ఈ జననమరణరూప సంసారబంధనమునుండి తప్పించుకొనుటకు ఉపాయమేమి?

**ఉ:–** భగవానుని భజించుటయే.

**అ॥** భగవత్ప్రాప్తికి మార్గములను సెలవిచ్చుచున్నాడు –

**34. మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి యుక్త్వైవమాత్మానం మత్పరాయణః.**

**టీక:–** మన్మనాః = నాయందే మనస్సుగలవాడవును, మద్భక్తః = నాభక్తుడవును, మద్యాజీ = నన్నేపూజించువాడవును, భవ = అగుము, మామ్ = నన్నే, నమస్కురు = నమస్కరింపుము, ఏవమ్ = ఈ

రీతిగా, ఆత్మానమ్ = మనస్సును, యుక్త్వా = నాయందేనిలిపి, మత్పరాయణః = నన్నేపరమగతిగ నెన్నుకొనినవాడవై, మామ్ ఏవ = నన్నే, ఏష్యసి = పొందగలవు.

**తా:–** నాయందే మనస్సుగలవాడవును, నాభక్తుడవును, నన్నే పూజించువాడవును అగుము. నాకు నమస్కరింపుము. ఈ ప్రకారముగ చిత్తము నాయందే నిలిపి నన్నే పరమగతిగ నెన్నుకొనినవాడవై తుదకు నన్నే పొందగలవు.

**వ్యాఖ్య:–** సాధనచేయనిచో సాధ్యవస్తువు లభించదు. ఈ శ్లోకమందు బ్రహ్మాభ్యాసము చక్కగ వివరింపబడినది. బ్రహ్మమును, దైవమును బొందుటకు మార్గము చెప్పబడినది. 'తచ్చిన్తనం తత్కథనమన్యోన్యం తత్ప్రభాషణమ్' అనునట్లు, లక్ష్యమగు దైవమునుగూర్చియే చింతించుట, వారినిగూర్చియే చెప్పుట, వారినిగూర్చియే పరస్పరము సంభాషించుకొనుట, వారిని గూర్చియే ధ్యానించుట మున్నగు క్రియలద్వారా మనుజుడు ఆ పరమాత్మను అచిరకాలములో చేరుకొనగలడు. ఇట్టి అభ్యాసమే ఈ శ్లోకమున తెలియజేయబడినది. నిరంతరము భగవత్పరాయణుడై శరీరము, వాక్కు, మనస్సు అను త్రికరణములను వారియందే సంలగ్నపఱచి తదేకనిష్ఠుడైయుండువాడు లక్ష్యమును సులభముగ బొందగలడు. సామాన్యముగ జనులయొక్క మనస్సు దృశ్యవస్తువులయందే ఎక్కువగ రమించుచుండును. దానిని అచ్చోటనుండి మరలించి పరమాత్మయందు స్థాపించవలెను. అట్లు స్థాపించుటకుగాను భక్తి ఎంతయో ఆవశ్యకమై యున్నది. ఒక వస్తువునందు ప్రీతి, విశ్వాసము, భక్తి జనించినపుడే ఆ వస్తువుపై మనస్సు నిలుచును. కాబట్టి భగవంతునియొక్క శాశ్వతత్వ, సుఖరూపత్వములను బాగుగనెఱింగి, వారిపై భక్తివిశ్వాసములను అభివృద్ధిపఱచవలెను. అపుడు సహజముగనే మనస్సు పరమాత్మవైపునకు మరలుచుండును. వారినే ఆరాధించుచు, వారికే నమస్కరించును.

**'యద్భావం తద్భవతి'** అనునట్లు మనస్సు ఎద్దానినిగూర్చి నిరంతరము చింతనచేయుచుండునో తద్రూపముగా మారిపోవును. కావున మనస్సు అనవరతము పరమాత్మనుగూర్చియే విచారణధ్యానాదులను సలుపుచుండినచో, ఆ పరమాత్మయందే లయమై తద్రూపముగ మారిపోవును. అదియే జీవబ్రహ్మైక్యము. 'మామేవైష్యసి' అనుదానియర్థ మిదియే. ఇట్టి స్థితి పైనదెల్పిన అభ్యాసమువలననే సిద్ధించును.

దీనినిబట్టి భగవత్ప్రాప్తికి నిరంతర భగవచ్చింతన, భగవత్పరాయణత్వము తప్ప అన్యమగు మార్గమేదియు లేదని స్పష్టపడుచున్నది. కావున దుఃఖభూయిష్టమై, అనిత్యమైనట్టి ఈ సంసారస్థితినుండి తప్పించుకొని, నిరతిశయానందరూపకైవల్యమును బడయుటకై జీవుడు తనమనస్సును దృశ్యవిషయములనుండి మరల్చి, దైవోన్ముఖముగ, ఆత్మోన్ముఖముగ నొనర్చవలయును. అట్లుకాక, సోమరియై దృశ్యవాసనలతోనే, విషయభోగములతోనే గూడియున్నచో ఆత్మప్రాప్తినిగూర్చిన వార్తకూడ అతనికి లభింపనేరదు. కాబట్టి ఎవరైనను 'నేను భగవంతుని ఎట్లు పొందగలను?' అని ప్రశ్నించినచో వారి నిట్లు అడుగవలయును – '(1) నీమనస్సు దేనిపై లగ్నమగుచున్నది? దృశ్యవస్తువులందా, పరమాత్మయందా? (2) నీవు దేని యెడల భక్తి గలిగియున్నావు? దృశ్యముపైనా, దేవునిపైనా? (3) దేని నారాధించుచున్నావు? నశ్వరవిషయములనా, శాశ్వతదైవమునా? (4) దేనికి నమస్కరించుచున్నావు? నామరూపములకా, పరమాత్మకా? (5) దేనియందు పరాయణుడవై యున్నావు? శబ్దాది విషయములందా, హృదయస్థాత్మయందా?' – అట్లు ప్రశ్నించి ఆతడేమి సమాధాన మొసంగునో చూడవలెను. దృశ్యమందే మనస్సు ఆసక్తమగుచున్నదని తెలిపినచో అటనుండి మరల్చి శ్రీకృష్ణభగవాను డీ శ్లోకమున తెలిపినరీతి దైవపరాయణముగ గావింపవలెననియు, అదియే దైవప్రాప్తికి, మోక్షమునకు మార్గమనియు చెప్పవలెను.

**ప్ర:–** జీవుడు భగవంతుని ఎట్లు పొందగలడు? భగవత్ప్రాప్తికి ఏ యే సాధనలను అవలంబించవలెను?

**ఉ:–** (1) మనస్సును పరమాత్మయందే లగ్నము చేయవలెను. (2) పరమాత్మయందే భక్తి గలిగి యుండవలెను. (3) పరమాత్మనే ఆరాధించవలెను. (4) పరమాత్మనే నమస్కరింపవలెను. ఈ ప్రకారముగ నిరంతరము దైవపరాయణుడై వర్తించవలెను.

ఓమ్

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే రాజవిద్యా రాజగుహ్యయోగో నామ
నవమోఽధ్యాయః

ఇది ఉపనిషత్ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున సంవాదమునగు
శ్రీ భగవద్గీతలందు రాజవిద్యా రాజగుహ్యయోగమను
తొమ్మిదవ అధ్యాయము
ఓమ్ తత్ సత్



ఓం

# శ్రీ భగవద్గీత

అథ దశమోఽధ్యాయః

## పదియవ అధ్యాయము

విభూతియోగః

## విభూతియోగము

**ఈ అధ్యాయము యొక్క పేరు :-**

'విభూతియోగము' - విభూతియనగా ఐశ్వర్యము. మహిమాతిశయము. ఈ చరాచరప్రపంచమంతయు భగవంతునియొక్క వ్యక్తరూపమే. కావున వారి విభూతియే యగును. ఇదియంతయు వారి మహిమావిస్తారమే, చిద్విలాసమే అయియున్నది. భగవద్విభూతియే యగు ఈ ప్రపంచమున భగవానుడు విశేషముగ అభివ్యక్తమైన పదార్థములనుగూర్చి వ్యక్తులనుగూర్చి వర్ణింపబడిన అధ్యాయమగుటచే దీనికి 'విభూతియోగము' అని పేరు వచ్చినది.

**ఈ అధ్యాయమందలి ప్రధాన విషయములు :-**

(1) భగవంతుని విభూతియొక్క యోగశక్తులయొక్క వర్ణనము - వాని నెఱుగుట వలన గలుగు ఫలితము. (1 శ్లో॥ నుండి 7 శ్లో॥ వఱకు)

(2) ఫల, ప్రభావసహితముగ భక్తియోగముయొక్క నిరూపణము. -(8 శ్లో॥ నుండి 11 శ్లో॥ వఱకు)

(3) అర్జునుడు భగవానుని స్తుతించుట, స్వకీయవిభూతిని, యోగశక్తిని వర్ణించి చెప్పుడని ప్రార్థించుట. - (12శ్లో॥ నుండి 18శ్లో॥ వఱకు)

(4) భగవానునిచే గావింపబడిన విభూతివర్ణనము - (19 శ్లో॥ నుండి 42 శ్లో॥ వఱకు)

**పూర్వాధ్యాయముతో ఈ అధ్యాయమునకు గల సంబంధము :-**

ఏడవ అధ్యాయమున, ఎనిమిదవ అధ్యాయమున, తొమ్మిదవ అధ్యాయమున అచటచట సంక్షేపముగ భగవానుడు తన విభూతులనుగూర్చి తెలియజేసిరి. భక్తుల యొక్క ఉపాసనా సౌకర్యార్థము ఇపుడు తన విభూతులను విశదముగ వర్ణింపదలంచి భగవాను డీ యధ్యాయమును ప్రారంభించుచున్నారు. అట్టి భగవద్విభూతులయొక్క జ్ఞానముచే సర్వత్ర ఈశ్వరదృష్టి అలవడగలదు. అత్తఱి భక్తి చక్కగ అభివృద్ధినొంది క్రిందటి అధ్యాయముయొక్క చివఱ చెప్పబడిన "మన్మనాభవ మద్భక్తో" - అను బ్రహ్మాభ్యాసము లెస్సగ కార్యాన్వితముకాగలదు. అట్టి నిరంతరాత్మదృష్టికొఱకే భగవద్విభూతినిగూర్చిన విజ్ఞానము సహాయకారిగా

# విభూతి యోగము



**ఆదిత్యానామహం విష్ణుర్జ్యోతిషాం రవిరంశుమాన్**
**మరీచిర్మరుతామస్మి నక్షత్రాణామహం శశీ** **(10–21)**

నేను ఆదిత్యులలో విష్ణువనువాడను, ప్రకాశింపజేయువానిలో కిరణములు గల సూర్యుడను, మరుత్తులను దేవతలలో మరీచియనువాడను, నక్షత్రములలో చంద్రుడను అయియున్నాను.

నుండగలదు. గనుక ఈ విభూతియోగము ప్రారంభింపబడుచున్నది. పూర్వము తానుజెప్పిన విభూతిసంబంధములైన వచనములనే మఱల నిపుడు విస్తృతముగ తెలుపుచున్నానని భగవానుడు నుడువుచున్నాడు.

**శ్రీ భగవానువాచ :-**

**1. భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః**
**యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా.**

శ్రీభగవానువాచ = శ్రీ భగవానుడు చెప్పెను -

**టీక:-** మహాబాహో = గొప్పబాహువులుగల ఓ అర్జునా!, ప్రీయమాణాయ = (నామాటచే) సంతసించుచున్న, తే = నీ కొఱకు, హితకామ్యయా = హితమును గలుగుజేయు నుద్దేశముతో, భూయః ఏవ = మఱల, యత్ = ఏ, పరమమ్ = శ్రేష్టమైన, వచః = వాక్యమును, అహమ్ = నేను, వక్ష్యామి = చెప్పబోవుచున్నానో, మే = నాయొక్క, (తత్ వచః = ఆ వాక్యమును), శృణు = వినుము.

**తా:-** శ్రీభగవానుడు చెప్పెను - గొప్ప బాహువులుగల ఓ అర్జునా! (నామాటలువిని) సంతసించుచున్న నీకు హితమును గలుగజేయు నుద్దేశముతో మరల ఏ శ్రేష్ఠమగు వాక్యమును నేను చెప్పబోవుచున్నానో, దానిని వినుము.

**వ్యాఖ్య :-** గురువాక్యములను శిష్యుడు ఆసక్తితో శ్రవణముచేయుచు ప్రీతిని కనబఱచునపుడు గురువునకు ఉత్సాహము జనించి కరుణతో ఇంకను ఎంతయో మహత్తరమగు బోధను గావించును. కనుకనే శ్రద్ధ అవసరము. అశ్రద్ధతో విననది విననిదానితో సామానము, ఇచ్చినది ఇవ్వనిదానితో సమానము★. అర్జునుడు భగవంతుని వాక్యములను అత్యంతశ్రద్ధతో నాలకించుచు అమృతపానము చేయుచున్నవాని చందమున గీతోపదేశ శ్రవణమున పరమప్రీతి వ్యక్తముచేయుచుండెను. కనుకనే 'ప్రీయమాణాయ' (ప్రీతినిబొందుచున్న) అని చెప్పబడెను. శ్రీకృష్ణనిబోధ అర్జునుని బాధను పోగొట్టుచుండెను. అందువలననే అర్జునునకు భగవద్వాక్యములందు ప్రీతి మెండగుచుండెను. ఇదియంతయు గ్రహించి శ్రీకృష్ణమూర్తి ఉత్సాహభరితుడై ఇట్టి శ్రద్ధాళువగు శిష్యునకు ఇంకను భగవత్తత్త్వమునుగూర్చి బోధించిన బాగుండునని తలంచి మఱల బోధనుపక్రమించుచున్నారు. అందుచే 'భూయః' (మఱల) అని చెప్పబడెను. పరమార్థవిద్యను మఱల మఱల శ్రవణముచేయుచు, శ్రవణమొనర్చినదానిని మననము చేయుచు, నిదిధ్యాసనము గావించుచుండిన, అది లెస్సగ జీర్ణము కాగలదు. పూర్వము చెప్పినదానిని తిరిగి భగవానుడు చెప్పనారంభించుట కిదియును కారణమైయున్నది. అర్జునున కిట్టి పౌనఃపున్యవిచారణచే, అతిశయశ్రవణాదులచే దైవతత్త్వము బాగుగ హృదయస్థము కాగలదను అభిప్రాయముచే నిట్లు చెప్పినదానినే మఱల చెప్పుట సంభవించుచున్నది.

'హితకామ్యయా' - శ్రద్ధాళువగు శిష్యునకు గురువు హితమొనర్పదలంచును. అన్నిటికంటె గొప్పహితము బంధవిముక్తియే. అయ్యది ప్రాపంచికపదార్థప్రదానముచే ఎన్నటికిని కలుగనేరదు. ఆధ్యాత్మిక జ్ఞానదానముచేతనే కలుగగలదు. అందువలన అర్జునునకు ఆత్యంతికహితము చేకూర్చదలంచి భగవానుడు తత్త్వబోధ గావింపనుపక్రమించిరి.

★ అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్, అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ. (17-28)

'పరమం వచః' - అని చెప్పుటవలన శ్రీకృష్ణమూర్తి చెప్పబోవువాక్యములు సామాన్యములైనవి కావనియు జీవుని హృదయస్థమగు అనాది అజ్ఞానాంధకారమును తొలగింపగలవి యనియు స్పష్టమగుచున్నది. కావున విజ్ఞుడగువాడు తనజీవితమును వ్యర్థములగు ప్రాపంచికవాక్యములను వినుటయందే గడిపివేయక సంసారతరణోపాయములను తెలుపునట్టి ఇట్టి పరమవాక్యములను, పరమార్థజ్ఞానమును వినవలెను.

**ప్ర:**– శ్రీకృష్ణమూర్తి చెప్పబోవునవి యెట్టి వాక్యములు?

**ఉ:**– సర్వశ్రేష్ఠములైన వాక్యములు.

**ప్ర:**– శ్రీకృష్ణ డర్జునునకు పరమార్థజ్ఞానమును మఱల ఏల బోధింపనెంచెను?

**ఉ:**– భగవద్వాక్యములందు అర్జునుడు పరమాసక్తిని కనబఱచెను. అందుచే నతినికి హితమొనర్పదలంచి అట్లు చెప్పదొడంగెను.

**ప్ర:**– ప్రపంచములో అన్ని హితకరకార్యములకంటె గొప్పది యేది?

**ఉ:**– పరమార్థవిద్యావితరణము.

**అ॥** తనయొక్క యోగశక్తిని, అధ్యాత్మమహిమాతిశయమును ఐదు శ్లోకములద్వారా భగవానుడు తెలియజేయుచున్నాడు –

## 2. న మే విదుః సురగణాః ప్రభవం న మహర్షయః
## అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః.

**టీక:**– మే = నాయొక్క, ప్రభవమ్ = ఉత్పత్తిని (అవతారరహస్యమును, లేక ప్రభావమును), *సురగణాః* = దేవతలసమూహములు, *న విదుః* = ఎఱుంగవు, *మహర్షయః* = మహర్షులున్ను, *న (విదుః)* = ఎఱుగరు, *అహమ్* = నేను, *దేవానామ్* = దేవతలకును, *మహర్షీణాం చ* = మహర్షులకును, *సర్వశః* = అన్నివిధములచేతను, *ఆదిః హి* = మొదటివాడను (కారణమైనవాడను) గదా!

**తా:**– నాయొక్క ఉత్పత్తిని (అవతారరహస్యమును, లేక, ప్రభావమును) దేవగణము లెఱుంగవు. మహర్షులున్ను ఎఱుంగరు. (ఏలయనిన) నేను ఆ దేవతలకును, మహర్షులకును సర్వవిధముల మొదటివాడను (కారణభూతుడను) గదా!

**వ్యాఖ్య:**– పరమాత్మ సనాతనుడు. సర్వులకున్ను ఆదికారణుడు. దేవతలకు, మహర్షులకు వెయ్యేల, సమస్తభూతకోట్లకును మూలపురుషుడు. అనాదియైనవాడు. వారినుండియే ఈ దేవ, మహర్షులందఱున్ను జనించినవారైయున్నారు. కాబట్టి ఆ పరమాత్మయొక్క పుట్టుకను, లేక మాహాత్మ్యమును వారు పూర్ణముగ తెలిసికొనజాలకున్నారు. సమస్తభూతకోట్లకు ప్రాతినిధ్యము చూపుటకొఱకై, అందు ఉత్తములైన ఇరువురిని (1) దేవతను (2) మహర్షిని – భగవాను డిచట ఏరుకొనిరి. అట్టివారికే భగవన్మాహాత్మ్యము, లేక ఆతని ఉత్పత్తి దురూహ్యముగ నున్నపుడు ఇక తక్కినవారి విషయమై వేఱుగ చెప్పవలెనాయని అర్థము. పరిచ్ఛిన్నమగు ఈ మానవబుద్ధితో అపరిచ్ఛిన్నుడగు పరమాత్మయొక్క మహిమను, ఉత్పత్త్యాది విశేషములను ఎవరును

కొలవజాలరు. మహర్షులే కొలవలేరనినపు డిక తక్కినవారిమాటేల? కావున అట్టి పరమాత్మయందు (ధ్యానాదులద్వారా) మనస్సును విలయమొనర్చి, తద్రూపుడేయగుట జీవుడు చేయవలసినపని.

ప్ర:– భగవంతు డెట్టివాడు?

ఉ:– ఆదిపురుషుడు. దేవతలకును, మహర్షులకును, వెయ్యేల సమస్తభూతకోట్లకును ఆదిభూతుడై విలసిల్లుచున్నాడు.

ప్ర:– మఱి జీవులు చేయవలసిన పనియేమి?

ఉ:– భక్తితో ఆ భగవంతునియందు చిత్తమును సంలగ్నపఱచి అద్దాని నాతనియందు విలయమొనర్చుటయే.

**అ॥** భగవాను డనాదియని యెఱుంగువాడు భక్తితో నాతని నారాధించి సర్వపాప విముక్తుడగునని వచించుచున్నాడు –

**3. యో మామజమనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్**
**అసమ్మూఢస్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే.**

**టీక:–** యః = ఎవడు, మామ్ = నన్ను, అజమ్ = పుట్టుకలేనివానిగను, అనాదిమ్ చ = ఆదిలేనివానిగను, లోకమహేశ్వరమ్ = సర్వలోకములకు నియామకునిగను, వేత్తి = తెలిసికొనుచున్నాడో, సః = అతడు, మర్త్యేషు = మనుష్యులలో, అసమ్మూఢః = అజ్ఞానములేనివాడై, సర్వపాపైః = సమస్తపాపములనుండి, ప్రముచ్యతే = లెస్సగ విడువబడుచున్నాడు.

**తా:–** ఎవడు నన్ను పుట్టుకలేనివానిగను, అనాదిరూపునిగను, సమస్తలోకములకు నియామకునిగను తెలిసికొనుచున్నాడో, ఆతడు మనుష్యులలో అజ్ఞానము లేనివాడై సర్వపాపములనుండి లెస్సగ విడువబడుచున్నాడు.

**వ్యాఖ్య:–** సమస్తప్రాణికోట్లయందును మానవుడు గొప్పవాడు. ఆ మానవులందును అజ్ఞానములేనివాడే గొప్పవాడు. భగవత్తత్త్వమును చక్కగనెఱుగువాడే గొప్పవాడు. అట్టి భగవత్తత్త్వ విజ్ఞానముచే నాతని పాపములన్నియు తొలగిపోవుచున్నవి – అని యిచట చెప్పబడినది. ప్రపంచములోని సమస్తపదార్థములు పుట్టుక కలవి. ఆది కలవి. కావున జీవులు దేనినాశ్రయించవలెను? నశించువస్తువునా? ఆద్యంతరహితమగు శాశ్వతపదార్థమునా? ప్రపంచములో శాశ్వతవస్తు వొక్కపరమాత్మ తప్ప అన్యమేదియులేదు. ఆతడు దేశకాలాతీతుడు. సర్వలోకమహేశ్వరుడు. జగన్నియంత. మాయను ఆడించువాడు. తక్కినవారు మాయాధీనులు. ఇవ్విధముగ భగవత్తత్త్వమునుగూర్చిన వివేకముచే ఆతని యెడల భక్తియుదయింప, ఆతనినే ఆశ్రయించి తద్ద్వారా జీవుడు అనవరత ధ్యానాదులచే భగవత్సాక్షాత్కారము, బంధవిముక్తి, సర్వపాపవిముక్తి బడయగలుగుచున్నాడు. కావున భగవంతుని యథార్థస్వరూపము నెఱుంగుట జీవుల కత్యావశ్యకమై యున్నది.

ఇట్లు దైవతత్త్వమెఱుంగువాడు అసత్యమును వీడి (దృశ్యముయెడల విరక్తిగలిగి) సత్యము నాశ్రయించినందువలన, అంధకారమును వదలి ప్రకాశమును జేబట్టినందువలన, మనుష్యులలోకెల్ల నాతడే

మూఢత్వము (అజ్ఞానము) పోయినవాడై, సర్వశ్రేష్ఠుడై చెన్నొందును. మనుజుడు ఎంత బలవంతుడైనను, ధనవంతుడైనను, అంతమాత్రముచేత అతడు మానవులలో గొప్పవాడుకాడు. ఏలయనిన అతడింకను మాయకు లోబడియేయున్నాడు. మాయకు లోబడియున్నవాడు ఎంత గొప్పవాడైనను అల్పుడేయగును; మూఢుడేయగును. భగవతత్త్వమెఱింగి ఆ మూఢత్వమును బోగొట్టుకొనువాడే మానవులలో శ్రేష్ఠుడు – అని భగవానుడు 'అసమ్మూఢః స మర్త్యేషు' అను వాక్యముద్వారా స్పష్టపఱచిరి. భగవంతుని దృష్టియందు జనులలో ఎవరు గొప్పవారో యిచట తేలిపోయినది. పరమాత్మయొక్క నిజస్వభావమును అనగా అతడు జన్మరహితుడని, అనాదిస్వరూపుడని ఎఱుంగువాడే మనుజులలో గొప్పవాడు – అని గీతాచార్యు లిచట పేర్కొనిరి. కాబట్టి తక్కిన ప్రాపంచికయోగ్యత లున్నను లేకున్నను దైవతత్త్వవిజ్ఞానము మాత్రము తప్పక కలిగియుండవలెనని దీనిద్వారా స్పష్టమగుచున్నది.

మఱియు జీవులు అనేక జన్మార్జితములైన పాపసంచయముతో గూడియున్నారు. వారి యా పాపములన్నియు నెట్లు నశించును? ఏ యుపాయముచే నవి తొలగిపోగలవు? ఆ యుపాయము నీశ్లోకమున భగవానుడు చెప్పివైచిరి. ఎంతటి గొప్ప కట్టెలసమూహమైనను ఒక నిప్పురవ్వచే భస్మీభూతమగునట్లు, ఎంతటి పాపసంచయమైనను జ్ఞానాగ్నిచే, భగవత్తత్త్వవివేకవహ్నిచే దగ్ధమైపోవును. (సర్వపాపైః ప్రముచ్యతే). కావున దైవతత్త్వమును తప్పక నెరుగవలెను. దేవు డనాదియని, జన్మరహితుడని యెరుగవలెను. దానిచే భక్తియేర్పడును. భక్తిచే (దృశ్యమందు విరక్తి గలిగి) దైవమును ధ్యానింపదొడగును. దానిచే పాపవిముక్తి, బంధరాహిత్యము, మోక్షప్రాప్తి సిద్ధించును. ఈ ప్రకారము దైవవిజ్ఞానము మోక్షమునకు దారితీయుచున్నది.

**ప్ర:–** మనుజులందరిలో ఎవడు వివేకవంతుడు? గొప్పవాడు?

**ఉ:–** భగవంతుని (1) జన్మరహితునిగను (2) అనాదిరూపునిగను (3) సర్వలోకమహేశ్వరునిగను ఎఱుంగువాడు.

**ప్ర:–** కావున మనుజులలో శ్రేష్ఠత్వమును బడయవలెననిన అనుసరించవలసిన పద్ధతి ఏమి?

**ఉ:–** భగవంతునియొక్క స్వరూపమును యథార్థముగ తెలిసికొనుటయే.

**ప్ర:–** సమస్తపాపములనుండి విడివడుటకు ఉపాయమేమి?

**ఉ:–** భగవత్తత్త్వము నెఱుంగుటయే (అత డనాదియని జన్మరహితుడని – ఈ ప్రకారముగ నెఱుంగుట. దానిచే భక్తి, భక్తిచే ధ్యానము, ధ్యానముచే భగవత్సాక్షాత్కారము, దానిచే సర్వపాపరాహిత్యము, బంధవిముక్తి సిద్ధించుచున్నవి).

**4. బుద్ధిర్జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమశ్శమః**
**సుఖం దుఃఖం భవోఽభావో భయం చాభయమేవచ.**

**5. అహింసా సమతా తుష్టిస్తపో దానం యశోఽయశః**
**భవన్తి భావా భూతానాం మత్తఏవ పృథగ్విధాః.**

**టీక:–** బుద్ధిః = బుద్ధి (సూక్ష్మవిషయగ్రహణసామర్థ్యము), జ్ఞానమ్ = జ్ఞానము, అసమ్మోహః =

మోహరాహిత్యము, క్షమా = ఓర్పు, సత్యమ్ = సత్యము, దమః = బాహ్యేంద్రియనిగ్రహము, శమః = అంతరింద్రియనిగ్రహము, సుఖమ్ = సుఖము, దుఃఖమ్ = దుఃఖము, భవః = పుట్టుక, అభావః = నాశము, భయమ్ చ = భయమున్ను, అభయమ్ ఏవచ = భయములేకుండుటయు, అహింసా = అహింస, సమతా = సమత్వము, తుష్టిః = సంతుష్టి, తపః = తపస్సు, దానమ్ = దానము, యశః = కీర్తి, అయశః = అపకీర్తి, భూతానామ్ = ప్రాణులయొక్క, పృథగ్విధాః = నానావిధములైన, భావాః = (ఈ మొదలగు) గుణములు, మత్తః ఏవ = నావలననే, భవన్తి = కలుగుచున్నవి.

**తా:–** బుద్ధి, జ్ఞానము, మోహరాహిత్యము, ఓర్పు, సత్యము, బాహ్యేంద్రియనిగ్రహము, అంతరింద్రియనిగ్రహము, సుఖము, దుఃఖము, పుట్టుక (ఉత్పత్తి), నాశము, భయము, భయములేకుండుట, అహింస, సమత్వము, సంతుష్టి, తపస్సు, దానము, కీర్తి, అపకీర్తి, ప్రాణులయొక్క ఈ ప్రకారములైన నానావిధములగు గుణములు నావలననే కలుగుచున్నవి.

**వ్యాఖ్య:–** ఈ రెండు శ్లోకములందును. బుద్ధి, జ్ఞానము మున్నగు 16 అనుకూలగుణములున్ను; దుఃఖము, నాశము, భయము, అపకీర్తియను 4 ప్రతికూల గుణములున్ను చెప్పబడినవి. ఇవియన్నియు భగవంతుని వలననే కలుగుచున్నవని పేర్కొనబడినది. దీని భావమేమి? భగవానుడు వాస్తవముగ ప్రతికూలభావములను జీవులకు కలుగజేయుటలేదు. జీవుల ఆ యా కర్మములకు ఫలమొసంగువాడే ఈశ్వరుడు. ఈశ్వరుడు కర్మఫల ప్రదాత. జీవులు కర్మకర్తలు. కొందఱికి కీర్తి, మఱికొందఱికి అపకీర్తి, కొందఱికి సుఖము, మఱికొందఱికి దుఃఖము వారివారి పూర్వకృత కర్మలవలననే కలుగుచున్నవి. ఏ విత్తనము వారు నాటిన ఆ ఫలితము వారికి కలుగుచుండును. ఈశ్వరుడు నిమిత్తమాత్రుడు. దుష్కర్మలు చేసినవారికి దుఃఖము, సత్కర్మలు చేసినవారికి సుఖము భగవన్నియతివలననే కలుగుచుండును. ఈ దృష్టితోనే ఆ సుఖదుఃఖాదులన్నియు భగవంతునివలన కలుగుచున్నవని చెప్పబడినది.

మఱియు ఇప్పుడు చెప్పబడిన వికారములన్నియు మనస్సునం దుద్భవమగుచుండును. మనస్సు స్వతః జడమైనది. దానికి ఆధారముగ చైతన్యమగు ఆత్మవస్తువు కలదు. సూదంటురాయిసమీపమున సూది కదలునట్లు చైతన్యాత్మయొక్క సన్నిధానమున మనస్సు క్రియాత్మకమగుచున్నది. ఈ ప్రకారముగ మనస్సునకును తద్గతవికారములకును పరమాత్మయే ఆధారముగనుక ఇట్టి దృష్టితోనే - అవి యన్నియును పరమాత్మవలననే కలిగినవని ఇచట చెప్పబడినది. అంతియేకాని వాని సంబంధమైన కర్తృత్వముగాని, ప్రేరకత్వముగాని ఆత్మకు (భగవంతునకు) లేదు. (సూర్యునకు జగత్క్రియలందుగాని, నాటకదీపమునకు నాటకమందుగాని కర్తృత్వములేనట్లు).

**6. మహర్షయస్సప్త పూర్వే చత్వారో మనవస్తథా**
**మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః.**

**టీక:–** లోకే = లోకమునందు, ఇమాః ప్రజాః = ఈ ప్రజలు, యేషామ్ = ఎవరియొక్క (సంతతి అయియున్నారో అట్టి), పూర్వే = పూర్వీకులైన, మహర్షయః = మహర్షులు, సప్త = ఏడుగురును, తథా = అటులనే, చత్వారః = సనకాదులైన నలుగురు దేవర్షులును, మనవః = మనువులు (పదునల్గురు)ను, మద్భావాః = నా యొక్క భావము (దైవభావము) గలవారై (నన్ను గూర్చిన ధ్యానము, భక్తి గలవారై), మానసా జాతాః = నా యొక్క మనస్సంకల్పమువలననే పుట్టిరి.

**తా:–** లోకమునం దీ ప్రజలు యెవరియొక్క సంతతియైయున్నారో అట్టి పూర్వీకులైన సప్తమహర్షులున్ను, సనకాదులైన నలుగురు దేవర్షులున్ను, మనువులు పదునలుగురున్ను నాయొక్క భావము (దైవభావము) గలవారై నాయొక్క మనస్సంకల్పము వలననే పుట్టిరి.

**వ్యాఖ్య:–** సప్తర్షులు - 7 మంది

సనకాదులు - 4 మంది

మనువులు - 14 మంది

వీరందరు చాల పూర్వీకులు. వీరు భగవంతునియొక్క సంకల్పముచే నుద్భవించినవారు. వీరినుండియే ప్రపంచములోని జనులందరున్ను పుట్టిరి. అనగా వీరు మూలపురుషులని భావము. వీరందరు భగవద్భావము గలిగియున్నవారే అయియున్నారు. అనగా భగవద్భక్తి, ఆత్మజ్ఞానము కలిగియుండిరని అర్థము. ఈ శ్లోకము ద్వారా ఈ క్రింది రహస్యములు బోధపడుచున్నవి.

(1) భగవంతుడు అపార శక్తిసంపన్నుడనియు, సంకల్పముచేతనే అతడు జనులనుగాని, లోకములనుగాని సృష్టింపగలడనియు 'మానసా జాతాః' అను వాక్యముచే తెలియుచున్నది. ఇట పేర్కొనబడిన సప్తమహర్షులు మున్నగువారందఱిని భగవానుడు తన సంకల్పముచేతనే సృష్టించిన వారైరి. అట్టి సర్వశక్తిమంతునకు అంజలిఘటించి వారి యెడల భక్తిభావము గల్గియుండుటయే జీవుల కర్తవ్యము.

(2) పైన దెల్పిన మహర్షులు మున్నగువారందరున్ను సామన్యులుకారు. భగవద్భావమయులు. నిర్మల దైవభక్తిసంపన్నులు. కనుకనే వారినిగూర్చి 'మద్భావాః' అని వచింపబడినది. అనగా నిరంతరము దైవభావముతో గూడియుండువారు, ఆత్మజ్ఞానసంపన్నులు, అపరోక్షానుభూతిగలవారు అని అర్థము. అట్టి మహామహులనుండియే ఈ జనులందరును వచ్చిరని ఇచట చెప్పబడినది. అట్టిచో వారికి జనించిన వీరు భగవద్భావరహితులై యుండుట విడ్డూరముకాదా! వీరున్ను వారివలె (వారి పితరులవలె) భగవద్భావయుక్తులై యుండునపుడు మాత్రమే శోభించును. లేకున్న వారికి బుట్టి అజ్ఞానులై యుండుట హాస్యాస్పదముగ నుండును. ఎవ్వారలు నిరంతరము దైవభావసంయుతులై, ఒక్క క్షణమైనను భగవద్విస్మృతి లేకయుండిరో అట్టివారికి జనించి అహర్నిశము దృశ్యవ్యామోహమునందుపడి కొట్టుకొనుచు నశ్వరప్రాపంచిక భోగ్యవస్తుజాలమును పట్టి వ్రేలాడుచు భగవానుని ఒక నిమిషమేని స్మరింపకుండుట ఎంత శోచనీయము! కావున జనులందరున్ను తమ పూర్వీకులగు మహర్షులనుస్మరించి దైవసంబంధమగు ఉత్తేజమును బడయుదురు! ద్విజులు సంధ్యావందనము చేయునపుడు చిట్టచివర ప్రవర చెప్పుసందర్భమున తమ గోత్రమూలపురుషాదులను సంస్మరించుట విధియై యున్నది. దీనిభావము తమ వంశమందలి అట్టి మహర్షులను స్మరించి వారివలె తామున్నూ జ్ఞానధనమొంది తరించవలెననియే యగును. మఱియు వారి వంశమందు ఎందరో భౌతికశక్తిసమన్వితులు ఉద్యోగులు, అధికారులు, విద్వాంసులు ఉన్నప్పటికిని ఆ ఋషులనే స్మరించుచుండుటవలన జ్ఞానధనమే జీవుని కడతేర్చునదిగాని తక్కిన లౌకికసంపదలు కావనియు దీనిచే స్పష్టమగుచున్నది.

(3) ఇక మూడవ విషయము - ఈ సమస్తప్రజలున్ను పైన దెల్పిన మహర్షుల నుండియే ఉద్భవించిరని చెప్పుటవలన వీరి మూలపురుషులు వారేయని స్పష్టపడుటబట్టి ఇక ఎవరున్ను తాము అల్పులమని, అల్పజాతికి చెందినవారమని దిగులుపడవలసిన అవసరములేదు. ఏ జాతికి, మతమునకు, వర్ణమునకు

జెందినను అందఱున్ను మహర్షుల సంతానమే అని తలంచి దైవోత్తేజమును బొందవలెను, ఆ మహర్షులయొక్క పవిత్ర రక్తము ఈ ప్రజలందఱియందును ప్రవహించుచున్నది. ఇట్టి సత్యమునెఱింగి జనులు ధైర్యోపేతులై తమ పూర్వజుల జ్ఞానధనమును, దైవవారసత్వమును అనుభవింపవలెను. అది ఏ ఒక్కరి సొత్తుకాదు. దానిపై సర్వులకును హక్కుగలదు. చండాలుడును తగిన యత్నముచేసినచో ఆసొత్తు ననుభవింపగలడు. ఈ సత్యమును బోధించుటకే కాబోలు శ్రీకృష్ణపరమాత్మ జనుల వంశపారంపర్యము నిచట వర్ణించినవారైరి. సర్వజీవులున్ను మహర్షుల దైవసంపత్తికి సమానవారసులని భేరీవాయించి భగవానుడు చెప్పివైచిరి. కాబట్టి ఎవరైన 'మీపూర్వీకులెవ' రని ప్రశ్నించిన ఫలాని సామాన్యవ్యక్తియని చెప్పక 'నాపూర్వీకులు సప్తర్షులు, సనకాదులు, మనువులు' అని ఘంటాపథముగ చెప్పవలెను. తాను అల్పుడని తలంచువాడు అల్పుడే యగును. తాను పవిత్రుడని, ఋషివారసుడనని తలంచువాడు శుద్ధుడేయగును. కాబట్టి జనులందఱును వారి వారి మూలపురుషులగు అమ్మహనీయులను ప్రతిదినము స్మరించుకొని వారివలె భగవద్భావయుతులై సంసారబంధమును విచ్ఛిన్నమొనర్చుకొని పరమశాంతిని అనుభవించుదురుగాక!

ఇచట తెలుపబడిన పూర్వజులలో సనకాదులు జనులకు నివృత్తిమార్గమును, మన్వాదులు (ధర్మపూర్వక) ప్రవృత్తిమార్గమును లోకమునకు బోధించిరి. ఇందు మొదటివారు గురుపరంపరకును, రెండవవారు వంశపరంపరకును మూలపురుషులు. ఆ మూలపురుషులు కూడ భగవంతుని మానసపుత్రులేగనుక - సర్వజనులును భగవంతుని బిడ్డలేయని నిరూపింపబడినట్లైనది. ఇచ్చట సనకాదులు నలుగురు నైష్ఠికబ్రహ్మచారులగుటచే 'వారికి పుట్టిరి' అనువాక్యమునకు 'వారికి శిష్యులైరి' అని అర్థము చెప్పుకొనవలసివచ్చును.

**ప్ర:—** ఈ ప్రపంచమందలి జనులందఱున్ను ఎవరి వలన పుట్టిరి?

**ఉ:—** (1) సప్తమహర్షులు (2) సనకాదులు (3) మనువులు - వీరివలన పుట్టిరి.

**ప్ర:—** ఆ మహనీయ లెట్టివారు?

**ఉ:—** నిరంతర భగవద్భావ సంయుతులు.

**ప్ర:—** ఆ మూలపురుషు లెట్లు జనించిరి?

**ఉ:—** భగవంతునియొక్క సంకల్పముచే.

**అ॥** ఈ ప్రకారముగ భగవద్విభూతి నెఱుంగువానికి కలుగు మహత్తర ఫలితమును వచించుచున్నాడు-

**7. ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః**
**సోఽవికమ్పేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః.**

**టీక:—** మమ = నాయొక్క, ఏతామ్ = ఈ, విభూతిమ్ = ఐశ్వర్యమును, (విస్తారమును, సృష్టిమహిమను), యోగమ్ చ = యోగమును, (అలౌకికశక్తిని), తత్త్వతః = యథార్థముగా, యః = ఎవడు, వేత్తి = తెలిసికొనుచున్నాడో, సః = అతడు, అవికమ్పేన = చలింపని, యోగేన = యోగముతో, యుజ్యతే = కూడుకొనుచున్నాడు, అత్ర = ఈ విషయమునందు, సంశయః = సందేహము, న = లేదు.

**తా:–** నాయొక్క విభూతిని (ఐశ్వర్యమును, విస్తారమును), యోగమును (అలౌకికశక్తిని), ఎవడు యథార్థముగ తెలిసికొనుచున్నాడో అతడు నిశ్చలమగు యోగముతో కూడుకొనుచున్నాడు. ఇవ్విషయమున సందేహములేదు.

**వ్యాఖ్య:–** ఈ ప్రకారముగ భగవద్విభూతిని (సృష్టిమహిమను) యథార్థముగ ఎవడెఱుంగునో, సమస్తజగత్తు భగవంతునినుండియే ఆవిర్భవించినదని లెస్సగ తెలిసికొనునో ఆతడు నిశ్చలమగు యోగముతో, (భగవద్ధ్యానముతో, దైవనిష్ఠతో) గూడి యుండునని ఇట చెప్పబడినది. 'తత్త్వతః' (యథార్థముగ) అని తెలుపబడినందువలన భగవద్విభూతిని. యోగమును యథార్థముగ నెఱుంగవలెనేకాని అన్యవిధముగగాదు. అనగా భగవంతుడొకరే సత్యము, వారినుండియే జగదాదులన్నియు ప్రభవించినవని తెలిసికొనుటయే వాస్తవజ్ఞానము. అట్లెఱిగినవాడు అవ్యయుడగు ఆ పరమాత్మనే పొందుటకు కృతనిశ్చయుడై నిశ్చలధ్యానయోగముతో, దృఢప్రయత్నముతో గూడియుండును. 'అవికమ్పేన' (నిశ్చలమగు) అని చెప్పబడుటవలన ఆతడనుసరించు ధ్యాననిష్ఠ, యోగము, దైవవిశ్వాసము ఏమాత్రము చలింపనిదనియు ఇటు దృశ్యముపైకి అటు దైవము పైకి ఊగులాడునదికాదనియు స్పష్టపడుచున్నది. 'న సంశయః' (సందేహములేదు) అని పేర్కొనుటవలన పైనదెల్పిన వాక్యముయొక్క సత్యత్వము లెస్సగ నిరూపింపబడినట్లైనది. కావున ముముక్షువు భగవద్విభూతిని బాగుగ తెలిసికొని తత్ఫలితముగ నిశ్చలమగు ధ్యాననిష్ఠనవలంబించి భగవత్ప్రాప్తికై యత్నించవలయును. ఇచట 'యః = ఎవడు' అని యచ్ఛబ్దప్రయోగము చేయుటవలన (జాతిమతభేదములేక) ఎవడైనను సరియే భగవద్విభూతిని గూర్చి బాగుగనెఱింగినచో నిశ్చలయోగమును బడయగల్గుచున్నాడని స్పష్టమగుచున్నది.

**ప్ర:–** దైవసంబంధమైన నిశ్చలయోగ మెవనికి సిద్ధించును?

**ఉ:–** భగవద్విభూతిని యథార్థముగ నెఱింగినవానికి.

**అ॥** ఈ ప్రకారముగ భగవద్విభూతిని, భగవత్తత్త్వమును బాగుగ తెలిసికొనిన భక్తులు నిర్మలభక్తితో నాతనిని సేవించుదురని రెండు శ్లోకములద్వారా తెలుపుచున్నాడు –

**8. అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే**
**ఇతి మత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః.**

**టీక:–** అహమ్ = నేను, సర్వస్య = సమస్తమునకును, ప్రభవః = ఉత్పత్తికారణమైనవాడను, మత్తః = నావలన, సర్వమ్ = సమస్తము, ప్రవర్తతే = ప్రవర్తించుచున్నది. (నడచుచున్నది), ఇతి = అని, మత్వా = తెలిసికొని, బుధాః = తెలివిగలవారు (విజ్ఞులు), భావసమన్వితాః = పరిపూర్ణభక్తిభావముతో గూడినవారై, మామ్ = నన్ను, భజన్తే = భజించుచున్నారు (ఉపాసించుచున్నారు).

**తా:–** 'నేను సమస్త జగత్తునకును ఉత్పత్తికారణమైనవాడను, నా వలననే ఈ సమస్తము నడచుచున్నది' అని వివేకవంతులు తెలిసికొని పరిపూర్ణభక్తిభావముతో గూడినవారై నన్ను భజించుచున్నారు.

**వ్యాఖ్య:–** భగవంతుని ధ్యానించువారు, సేవించువారు, వారి నామమును జపించువారు చాలమంది కలరు. కాని 'భావము'తో గూడి అనగా నిర్మల భక్తితోను, శ్రద్ధతోనుగూడి ఆ కార్యమును చేయువారరుదు.

అయితే అట్టి భక్తిశ్రద్ధ భగవానునిపై ఎట్లు కలుగగలదు? వారి సృష్టిమహిమను, విభూతిరహస్యమును ఎఱింగినపుడు. ఒక వస్తువుయొక్క విలువ బాగుగ తెలిసినపుడే దానిపై మనుజునకు శ్రద్ధ ఉదయించును. అట్లే భగవానుడు సమస్త జగత్తునకును మూలాధారుడు; వారివలననే ఈ సమస్తము ప్రవర్తించుచున్నది. (మత్తః సర్వం ప్రవర్తతే) - అని ఎవడు తెలిసికొనునో ఆతనికి సర్వేశ్వరునిపై అచంచల విశ్వాసము కలుగుచున్నది, అత్తఱి యాతడు పరమభక్తితో వారిని సేవింపదొడగును. 'భావసమన్వితాః' అనుదాని యర్థమిదియే. భగవద్విభూతిని, భగవత్తత్త్వమును బాగుగ తెలిసికొనినవారికే భగవానునిపై అపారశ్రద్ధాభక్తులు కలుగును. కావుననే వారు భావసమన్వితులై, అనగా శ్రద్ధాభక్తియుతులై భగవంతుని ధ్యానించి అచిరకాలములో భగవత్ప్రాప్తి నొందుదురు.

ఈ శ్లోకమందు తెలిపిన 'భావ' మనునది లక్ష్యప్రాప్తికి అత్యావశ్యకమైయున్నది. అది తుపాకిలోని గుండువంటిది. గుండులేని తుపాకిని కాల్చినచో శబ్దము వచ్చునేకాని లక్ష్యమును భేదింపదు. అట్లే జపమందుగాని, ధ్యానమందుగాని మంత్రముతోబాటు మంత్రార్థచింతనముకూడ నుండవలెను. అదియు శ్రద్ధతో గూడి యుండవలయును. కావున ఇచట తెలుపబడిన 'భావసమన్వితాః' అనుపదమును ముముక్షువు లతిజాగ్రత్తతో గమనించవలెను. ఇదిలేనికారణముననే అనేకుల ధ్యానములు సత్ఫలితమును గలుగజేయక మొక్కపోవుచున్నవి. ధ్యానము కుంఠితముకాక యుండవలెనని 'భావసమన్వితమై' యుండవలయును. భావము కలుగవలెనని భక్తి ఉదయించవలెను. భక్తి ఉదయించవలెనని, దేవత్వమిట్టిది, దైవమహిమ ఇట్టిది అని స్పష్టముగా తెలిసియుండవలెను. ఈ రహస్యములన్నియు ఈ శ్లోకమున చక్కగా విశదీకరింపబడినవి.

**ప్ర:—** ఈ సమస్తజగత్తునకు ఉత్పత్తికారణమేది? ఎవనివలన ఈ సమస్తము ప్రవర్తించుచున్నది?

**ఉ:—** పరమాత్మయే - పరమాత్మవలననే ఈ జగత్తంతయు నడచుచున్నది.

**ప్ర:—** భగవానుని ఏ ప్రకారము ధ్యానించవలెను? సేవించవలెను?

**ఉ:—** భక్తిభావముతోగూడి, శ్రద్ధతోగూడి.

**ప్ర:—** అట్టి శ్రద్ధాభక్తులు జీవున కెట్లు కలుగగలవు?

**ఉ:—** భగవత్తత్త్వము, భగవద్విభూతి బాగుగ తెలిసికొనినపుడు. అనగా పరమాత్మయే ఈ సమస్తమునకు కారణభూతుడు, అతనివలననే ఈ జగత్తంతయు ప్రవర్చించుచున్నది అని యెఱింగినపుడు.

**అ॥** అట్టి భక్తులు ఏ ప్రకారము దైవచింతనయందు కాలము గడుపుచుందురో చెప్పుచున్నాడు -

**9. మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్**
**కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమన్తి చ.**

**టీక:—** (తే = వారు), మచ్చిత్తా = నాయందు మనస్సుగలవారును, మద్గతప్రాణాః = నన్నుపొందిన ప్రాణములు (ఇంద్రియములు) గలవారును(లేక నాయెడల ప్రాణమునర్పించినవారునుఅయి), మామ్ = నన్నుగూర్చి, పరస్పరమ్ = ఒకరికొకరు, బోధయన్తః = బోధించుకొనుచు, కథయన్తః చ = ముచ్చటించుకొనుచు, నిత్యమ్ = ఎల్లప్పుడును, తుష్యన్తి చ = సంతృప్తినిబొందుచున్నారు, రమన్తిచ = ఆనందించుచున్నారు.

**తా:–** (వారు) నాయందు మనస్సుగలవారును, నన్ను బొందిన ప్రాణములు (ఇంద్రియములు) కలవారును, (లేక నాయెడల ప్రాణము నర్పించినవారును) అయి, నన్ను గూర్చి పరస్పరము బోధించుకొనుచు, ముచ్చటించుకొనుచు ఎల్లప్పుడును సంతృప్తిని, ఆనందమును బొందుచున్నారు.

**వ్యాఖ్య:–** భగవద్భక్తికలవా రెట్లు ప్రవర్తించెదరో ఈ శ్లోకమున చక్కగ తెలియజేయబడినది. సామాన్యజనులయొక్క మనస్సు, చిత్తము, ప్రాణము, ఇంద్రియములు - అన్నియు ప్రాపంచికవిషయములందే తిరుగాడును. కాని భగవన్మహిమను గుర్తెఱింగిన మహనీయులయొక్క యా కరణములన్నియు పరమాత్మయందే సంలగ్నములైయుండును. ఏ లక్ష్యమునైనను పొందవలెననిన, మనస్సు తదేకనిష్ఠతో దానిని గూర్చియే చింతన చేయుచుండవలెను. (అది ప్రాపంచికలక్ష్యముకాని, దైవలక్ష్యముకాని). అజ్ఞానులు నశ్వరములగు భౌతికపదార్థములందును, జ్ఞానులు శాశ్వతమగు దైవవస్తువునందును తమ దృష్టిని కేంద్రీకరించుచుందురు. భక్తులు, జ్ఞానులు, పరమభాగవతోత్తములు భగవానుని అవ్యయత్వమును, మహిమను గుర్తెఱింగినవారై ఎల్లప్పుడు ఆ పరమాత్మను గూర్చియే ఒకరికొకరు బోధించుకొనుచు చెప్పుకొనుచుందురు. ఇదియే బ్రహ్మాభ్యాసమనబడును. వారేది మాట్లాడినను, అది దైవసంబంధమైన విషయమే అయియుండును. అన్యమగు దేనినిగూర్చియు వారు ప్రసంగించరు; దేనియందు జనులకు మిక్కుటమగు ప్రీతియుండునో దానినిగుఱించియే వారు రోజంతయు ప్రసంగించుకొనుట లోకములో ప్రసిద్ధమైయున్నది. సామాన్యులకు క్షుద్రములగు ప్రాపంచికవస్తువులందే ఎక్కువప్రీతియుండును గావున వారెప్పుడు నోరుతెరచినను తత్సంబంధమైన వాక్యములే, ప్రసంగములే వచ్చుచుండును. కాని భక్తులయొక్క ప్రవర్తన అట్లుండదు. వారి త్రికరణములు దైవమునందే అర్పితములైయుండును. కావున వారేదిచేసినను, మాట్లాడినను, తలంచినను, అంతయు దైవసంబంధమైనదిగనే యుండును. పండినపండును ఎక్కడ కొరికినను తీపిగనేయుండునట్లును, కుసుమము తన చుట్టు పరిమళమును వెదజల్లునట్లును వారి ఉపాధినుండి యెల్లెడల దైవగంధమే వినిర్గతమగుచుండును.

'బోధయన్తః పరస్పరమ్' - ఒకరికొకరు బోధించుకొనుటవలన, తత్త్వము దృఢపడగలదు. అత్తఱి సంభాషణయం దనేకప్రశ్న లుదయించును; పెక్కు దృష్టికోణములనుండి విచారించుట సంభవించును. కావున ముముక్షువులకు సత్సంగ మత్యావశ్యకము. (నాస్తికులతో నెన్నడును వారు చేరరాదు).

'నిత్యం తుష్యన్తి రమన్తి' - అని చెప్పినందువలన అట్టి భాగవతులందు పరమతృప్తి, పరమానందము ఏదియోయొకకాలమున గాదనియు ఎల్లకాలములందును తాండవించుచుండుననియు విశదమగుచున్నది. దైవాయత్తచిత్తునకు అతృప్తిగాని, దుఃఖముగాని ఏలకలుగును? శాశ్వతపదార్థము (ఆత్మ, దైవము) నాశ్రయించినవారికి అసంతుష్టిగాని, దుఃఖముగాని ఏకోశమందును గలుగనేరదు.

'మద్గతప్రాణాః' - భగవద్విభూతి నెఱింగిన మహనీయులు తమ జీవితమును ఆ పరమాత్మకొఱకే అంకితము చేసివైచుదురు. దైవప్రాప్తికి తమ ప్రాణములనుగూడ ఒడ్డుదురు. దైవరూపలక్ష్యమును బొందుటకై తమప్రాణమునుసైతము బలిదానము చేయుటకు సంసిద్ధులైయుందురు. అట్టితీవ్రనిశ్చయము, తీవ్రత్యాగము కలిగినపుడే లక్ష్యము సులభముగ చేకూరగలదు. స్వల్ప స్వల్ప అదృఢనిశ్చయములచేత, అల్పత్యాగములచేత, అస్థిరభావములచేత ఆత్మ (దైవము) లభించుట కష్టసాధ్యము. (త్యాగేనైకే అమృతత్వమానశుః). లక్ష్యసాధనమున ప్రాణమునుకూడ అర్పించునంతటి దృఢమగు పట్టుదలచేతనే దైవము సాక్షాత్కరింపబడగలడను విషయ మిచట పొందుపరుపబడినది.

లోకములో కొందఱు రాజ్యముకొఱకు, సంపదలకొఱకు, తమప్రాణములనుసైతము సరకుగొనక ప్రయత్నముచేయుచున్నారు. కాని పరమాత్మపదము వానియన్నింటికంటెను మహోన్నతమైనది. అనంతసుఖమును అది ప్రసాదించునది. కనుకనే మహనీయులు తమ మనఃప్రాణేంద్రియములన్నిటిని తత్ప్రాప్తియందే వినియోగించుచున్నారు.

ఈ శ్లోకమందు పరమార్థసాధకు లెట్లు ప్రవర్తింపవలెనో వారు తమదినచర్య యెట్లు గడుపవలెనో, ఏమిమాట్లాడవలెనో, ఏమిచేయవలెనో, అంతయు చక్కగ తెలుపబడినది. కావున ముముక్షువు లాప్రకార మనుష్ఠించి బ్రహ్మానుభూతిని బడయవలయును.

**ప్ర:–** భగవద్విభూతి నెఱింగిన మహనీయు లెట్లు ప్రవర్తించెదరు?

**ఉ:–** (1) దైవమందే సంలగ్నములైన చిత్తము, ప్రాణము, ఇంద్రియములు గలిగియుందురు.

(2) పరస్పరము దైవమునుగూర్చియే సదా బోధించుకొనుచు ప్రసంగించుకొనుచుందురు.

(3) అట్లు దైవవిచారణగావించుకొనుచు పరమతృప్తిని, ఆనందమును బొందుచుందురు.

**ప్ర:–** దీనినిబట్టి సాధకుడగువాడు మోక్షప్రాప్తికై యేప్రకారమాచరించవలెనని స్పష్టమగుచున్నది?

**ఉ:–** పైనతెల్పినప్రకారము నిరంతర ఆధ్యాత్మికచింతనయందు కాలముగడుపవలయునని నిశ్చితమగుచున్నది.

**ప్ర:–** పూర్ణసంతుష్టి, ఆనందము దేనియందుగలదు?

**ఉ:–** పరమాత్మప్రాప్తియందు.

**ప్ర:–** ముముక్షువు దేనినిగూర్చి బోధించుకొనుచుండవలెను? మాట్లాడుకొనవలెను?

**ఉ:–** భగవత్తత్త్వమునుగూర్చి.

**ప్ర:–** సాధకుడు తన చిత్తమును ప్రాణమును ఇంద్రియములను దేనియందు లగ్నముచేయవలెను?

**ఉ:–** పరమాత్మయందు.

**అ॥** నిరంతరము భక్తితో తన్నుభజించువార్లకు జ్ఞానయోగమను బహుమానము నొసంగెదనని భగవానుడు రెండు శ్లోకములద్వారా సెలవిచ్చుచున్నాడు –

## 10. తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్
## దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తి తే.

**టీక:–** సతతయుక్తానామ్ = ఎల్లప్పుడు నాయందు మనస్సుగలవారై, ప్రీతిపూర్వకమ్ = ప్రీతితో, భజతామ్ = (నన్ను) భజించునట్టి, తేషామ్ = వారికి, యేన = దేనిచేత, తే = వారు, మామ్ = నన్ను, ఉపయాన్తి = పొందగలరో, తమ్ = అట్టి, బుద్ధియోగమ్ = జ్ఞానయోగమును (ఆత్మానాత్మవివేచనాశక్తిని), దదామి = ఇచ్చుచున్నాను.

**తా:–** ఎల్లప్పుడు నాయందు మనస్సుగలవారై, ప్రీతితో నన్ను భజించునట్టివారికి – దేనిచే వారు **నన్నుపొందగలరో** – అట్టి జ్ఞానయోగమును (ఆత్మానాత్మ వివేచనాశక్తిని) ప్రసాదించుచున్నాను.

**వ్యాఖ్య:–** భగవంతుని ప్రీతితో నిరంతరము సేవించువారికి కలుగు మహత్తర ఫలితమిచట వచింపబడినది. అట్టి పరమభక్తులకు చక్కటి జ్ఞానయోగమును తాను ప్రసాదించెదనని భగవానుడు నుడువుచున్నారు. ఆ యోగము జీవుని పరమాత్మ కడకు చేర్చునట్టి నిరుపమసామర్థ్యము కలది అయియున్నది. అయితే ఇట్టి మహోన్నత ఫలము చేకూరవలెనన్నిన, దానికి యోగ్యత, అర్హత కావలసియున్నది. ఆ యోగ్యతను నిరూపించుటకై ఇచ్చట రెండుక్రియలు ప్రస్తావింపబడినవి-

(1) నిరంతరము పరమాత్మయందు చిత్తమును నెలకొల్పుట

(2) ప్రీతిపూర్వకముగ భగవంతుని భజించుట – అని.

ఈ రెండిటిలో మొదటిదానియందు 'నిరంతరము' (సతతయుక్తానాం) అని చెప్పుటవలన, కొంతసేపు మాత్రము దైవమును చింతించుట చాలదనియు, ఎల్లకాలములందును చింతింపవలెననియు బోధింపబడినది. అట్టిస్థితిని క్రమముగ అభ్యసింపవలెను. లోకములో పెక్కురు దృశ్యపదార్థములందే తమచిత్తమును లగ్నపఱచుచున్నారుగాని భగవంతుని యందుకాదు. ఒకవేళ కొందఱు దైవమందు మనస్సును నిలిపినను, ఎల్లకాలములందును నిలుపువారరుదు. అందును ప్రీతిపూర్వకముగ, భక్తిపూర్వకముగ నిలుపువారింకను అరుదు. భగవానుని నిరంతరము **ధ్యానించినను** శ్రద్ధ, ప్రీతి, భక్తి అందు కలియనిచో ఆ ధ్యానము ఎక్కువఫలితము నీయదుగనుక 'ప్రీతిపూర్వకముగ' సేవింపవలెనని రెండవ దానిలో చెప్పబడినది. పాఠశాలలో ప్రప్రథమమున ఉత్తీర్ణుడైన విద్యార్థికి అధికారులు గొప్పబహుమతి నెట్లొసంగుదురో అట్లే ఆ ప్రకారముగ ప్రీతిపూర్వకముగ నిరంతరము తన్నుసేవించువారికి, ధ్యానించువారికి భగవానుడు తన కరకమలముద్వారా బుద్ధి యోగము (ఆత్మానాత్మవిచారణాశక్తి) అను గొప్పపురస్కారము నొసంగుచున్నారు. ఓహో! ఎంతటి గౌరవము ! ఆ భక్తుని యదృష్టమెట్టిది! అనేక జన్మార్జిత పుణ్యపుంజము ఫలించి ఇట్టి భాగ్యరేఖగ పరిణమించినదేయగును.

భగవానుడు భక్తునకొసంగు ఆ బుద్ధియోగము సామాన్యమైనదికాదు. జీవుని శివునిగ నొనర్చును. నరుని నారాయణునియొద్దకు చేర్చును. కనుకనే 'మాం ఉపయాన్తి' (దానిద్వారా వారు నన్ను చేరుచున్నారు) అని చెప్పబడెను. ఆబుద్ధియోగముద్వారా జనులు తన్ను తప్పక చేరగలరని భగవానుడు హామీ ఇచ్చిరి. 'బుద్ధియోగ' మనగా నేమి? బుద్ధి (Brain) కి చెందిన యోగము అనగా విచారణాసంబంధమగు యోగము (The yoga of discrimination) అని అర్థము. దీనినే జ్ఞానయోగ మందురు. 'ఇదిఆత్మ ఇది అనాత్మ; ఇది నిత్యము, ఇది అనిత్యము; ఇదిదృక్కు, ఇదిదృశ్యము' – అని యిట్లు వివేచించి చూపునదే ఈ యోగము. శరీరమును, ఉపాధిని ఆత్మనుండి వేఱుపరచునదియే ఈ యోగము. దీనిని పొందినవాడిక ప్రపంచములోని ప్రతివస్తువును విడదీసి 'అస్తి. భాతి, ప్రియ' ములను (సత్, చిత్, ఆనందములను) గ్రహించి 'నామ, రూప' ములను త్యజించగలడు.

ఇట్టి బుద్ధియోగము, జ్ఞానయోగము ఎవరికి లభించుచున్నది? ప్రపంచములో అనేక కోట్లమంది జనులున్నప్పటికిని ఎవడు భక్తితో, ప్రీతిపూర్వకముగ నిరంతరము భగవంతుని ఆరాధించుచున్నాడో ఆతనికి మాత్రమే లభించుచున్నది. భక్తియే జ్ఞానముగ పరిణమించిపోవుచున్నది. భక్తియను పుష్పము వికసించి జ్ఞానఫలోత్పత్తికి దారితీయుచున్నది. కొందఱిట్లు ప్రశ్నించుచున్నారు – "ఆత్మ పంచకోశాంతర్గతముగ నున్నాడని చెప్పుదురుగదా! మే మెప్పుడును బయటగల దేవునే – అనగా ఏవిగ్రహమునో, మూర్తినో పూజించుచున్నామే; మాకాయంతర్దృష్టి ఎపుడు కలుగగలదు? విగ్రహారాధన మొదలగువానిద్వారా

బాహ్యమున పూజ జరుపు మాయొక్కదృష్టి అంతరంగమందుగల ఆత్మవైపున కెపుడు మరలగలదు? సాకారము నిరాకారముగ ఎపుడు పరిణమించగలదు? బాహ్యసాకారదృష్టి అంతరంగనిరాకారదృష్టిగ ఎపుడు ఎపుడు మార్పునొందగలదు? విగ్రహమును బాహ్యమునగాదా మేము పూజించునది, అట్టిచో అంతరమునగల పరమాత్మను మేమెట్లుపొందగలము?" - ఈ మొదలగు ప్రశ్నలన్నిటికిని ఈ శ్లోకమున చక్కటి సమాధాన మొసంగబడినది. 'జీవుడా! ఆ ప్రకారమే కొంతకాలము ఏదియోరూపమున (సాకారముగ) నన్ను అర్చింపుము. సేవింపుము. అయితే ప్రీతితో సేవింపుము. శ్రద్ధతో, భక్తితో సేవింపుము. నిరంతరము సేవింపుము. దానిచే నేను సంతుష్టుడనై, అట్టి సగుణోపాసనచే ప్రీతి నొందినవాడనై నిర్గుణోపాసనకు వలసిన బుద్ధిబలమును, జ్ఞానయోగమునకు వలసిన ధీశక్తిని, ఆత్మానాత్మవిచారణకు వలసిన ప్రజ్ఞాపాటవమును **ఒసంగెదను** దానిద్వారా నీవు నన్ను తప్పక బొందగలవు' అని భగవానుడు కరుణతో నిచట వచించిరి. దీనిచే పైన ప్రశ్నించినవారి సంశయములన్నియు పటాపంచలైపోయినవి. భగవాను డిచట భక్తులకు గొప్ప ఆశ్వాసమొసంగిరి.

మఱియు ఆప్రకారముగ జీవునకేక్షణమున భగవత్కరుణచే బుద్ధియోగము లభించునో ఆ క్షణమునుండి యాతడు నిరాకారపరమాత్మవైపునకు మొగ్గుజూపి అట్టి ఆత్మయొక్క అన్వేషణయందు, విచారణయందు దత్తచిత్తుడై యుండును. ఇదియే భక్తి జ్ఞానముగ మారునట్టి సుముహూర్తము. 'మా భక్తియోగము శ్రేష్ఠము, మా జ్ఞానయోగము శ్రేష్ఠము' అని కొట్లాడుకొనువారికి, 'భక్తికంటె జ్ఞానము గొప్పది, జ్ఞానముకంటె భక్తి గొప్పది' - అని వితర్కించుకొనువారికి భగవాను డీశ్లోకమున గొప్ప గుణపాఠమును నేర్పిరి. రెండును అవసరములే. మోక్షమునకు రెండును సహాయభూతములే. రెండింటికిని అవినాభావసంబంధము కలదు. వాస్తవముగ రెండును ఒకే వస్తువైయున్నవి; భేదములేదు. మొదటిదియగు భక్తి కాలాంతరమున రెండవదియగు జ్ఞానముగ మారగలదు. ఆ మారునట్టి లగ్నమేదియో, సుముహూర్తమేదియో ఈశ్లోకమున చక్కగ తెలుపబడినది. భక్తి పరిపక్వమగు సమయమే ఆ సుముహూర్తము. 'దాసోఽహ'మే కాలాంతరమున 'సోఽహ'ముగ మారును. 'దదామి బుద్ధియోగమ్' (నేను బుద్ధియోగము నిచ్చెదను) అని అసందిగ్ధముగ చెప్పినందున ఈమార్పునకు భగవానుడే కారణభూతుడని స్పష్టమగుచున్నది. సమస్తచరాచరప్రాణికోట్లయొక్క సూక్ష్మతర సంకల్పమునుగూడ బహుజాగరూకతతో పరిశీలించుచుండు పరమాత్మ, భక్తునియొక్క హృదయక్షేత్రము నిర్మలభక్తిచే పరిప్లావితమగుటజూచి అట్టి సుక్షేత్రమున 'బుద్ధియోగ'మను (జ్ఞానయోగమను) బీజమును నాటును. అదియే మోక్షవృక్షముగ ప్రవృద్ధముకాగలదు. అనగా ఆ జ్ఞానయోగమే మోక్షసౌధమునకు జీవుని గొంపోవగలదు. 'దదామి' (తప్పక ఇచ్చెదను) అని నొక్కిచెప్పుటలో భక్తులపై భగవానునకు గల అపారకరుణ వ్యక్తమగుచున్నది. 'నిర్మలభక్తియను మూల్యమును నీవుచెల్లించినచాలును. బుద్ధియోగము (జ్ఞానయోగము) అను అలౌకిక మోక్షప్రద పదార్థమును నీ కొసంగెదన'ని భగవానుడు అభయమొసంగుచున్నారు. సాధ్యవస్తువు నపేక్షించువాడు సాధనను తప్పక చేయవలెనుగనుక సాధ్యమగు మోక్షమును, భగవత్సాయుజ్యమును కాంక్షించువాడు తత్సాధనమగు బుద్ధియోగము (జ్ఞానయోగము)ను, దానికి కారణభూతమగు నిర్మలభక్తిని తప్పక సంపాదించవలెనని ఈశ్లోకముద్వారా వ్యక్తమగుచున్నది. భక్తి సులభసాధ్యమైనదిగనుక, ప్రథమమున సర్వులును దానినే ఆశ్రయించి తద్ద్వారా భగవత్కరుణచే జ్ఞానమునుబొంది మోక్షభాగులుకావలయును.

**ప్ర:–** మోక్షము (భగవత్సాయుజ్యము) ఎట్లు లభించును?

**ఉ:–** బుద్ధియోగముచే (ఆత్మానాత్మ విచారణారూప జ్ఞానయోగముచే).

ప్ర:– అట్టి బుద్ధియోగము జీవున కెట్లు సంప్రాప్తించును?

ఉ:– నిరంతరము ప్రీతిపూర్వకముగ భక్తితో భగవానుని భజించువారికి ఆ భగవానుడే దాని నొసంగును.

ప్ర:– బుద్ధియోగము (జ్ఞానయోగము) సంప్రాప్తించుటకు వలసిన యోగ్యతలెవ్వి?

ఉ:– (1) నిరంతర భగవత్సేవనము (2) ప్రీతిపూర్వకముగ భగవత్సేవనము.

## 11. తేషామేవానుకమ్పార్థ మహమజ్ఞానజం తమః
## నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా.

**టీక:–** తేషామ్ = వారలకు, అనుకమ్పార్థమ్ = దయజూపుటకొఱకు, అహమ్ ఏవ = నేనే, ఆత్మభావస్థః = వారియంతఃకరణమునందు నిలిచినవాడనై, భాస్వతా = ప్రకాశించుచున్న, జ్ఞానదీపేన = జ్ఞానదీపముచేత, అజ్ఞానజమ్ = అజ్ఞానమువలనగలిగిన, తమః = చీకటిని (మోహాంధకారమును), నాశయామి = నశింపజేయుచున్నాను.

**తా:–** వారలకు (అట్టి భక్తులకు) దయజూపుట కొఱకు నేనే వారియంతఃకరణమునందు నిలిచి ప్రకాశమానమగు జ్ఞానదీపముచేత, అజ్ఞానజన్యమగు అంధకారమును నశింపజేయుచున్నాను.

**వ్యాఖ్య:–** నిరంతరము ప్రీతిపూర్వకముగ తన్నుసేవించువారికి బుద్ధియోగమును (జ్ఞానమును) ప్రసాదించెదనని క్రిందటి శ్లోకమునందు భగవానుడు తెలియజేసిరి. ఎందులకట్టి బుద్ధియోగము నాతనికొసంగునో ఆకారణ మిచట తెలియజేయబడినది. సదా యాతనినిగూర్చి చింతించు భక్తులయెడల భగవానునకు కనికరము కలుగును. తత్ఫలితముగ వారికేదైన ఉపకారము నొనర్పవలెనను కుతూహలము జనింప, వారి ననుగ్రహింప సమకట్టినవాడై ప్రపంచములోగల సమస్తపదార్థములకంటెను విలువైనదేదియో విచారించి ఎద్దానివలన జీవునకు భగవత్సాక్షాత్కారము, నిరతిశయానందరూప కైవల్యము సంప్రాప్తించునో, అట్టి తత్త్వవిచారణయే, జ్ఞానమే (బుద్ధియోగము) అన్నిటికంటెను మేటియని నిశ్చయించి దానినే యాతని కొసంగుచున్నాడు. ఆ జ్ఞానమెట్టిది? ఎట్టి ప్రభావము కలది? అది యొక దీపమువంటిది. ప్రకాశమానమగు జ్యోతియది. అజ్ఞానాంధకారమును బోగొట్టునది. అనేక జన్మార్జితమగు తమఃపటలమును, మోహాంధకారమును, అవిద్యయను చీకటిని జీవునిహృదయమునుండి పారద్రోలునది. అయితే ప్రపంచములోగల అన్నిదీపములకును ఈ జ్ఞానదీపమునకును చాల వ్యత్యాసము కలదు. అవి అల్పప్రకాశము కలవి. పైగా కొంతకాలమునకు ఆరిపోవునవి. ఈజ్ఞానదీప మట్టిదికాదు. మహాప్రకాశమానమైనది. కనుకనే 'భాస్వతా' అని చెప్పబడెను. మఱియు సామాన్యదీపము బాహ్యాంధకారమును బోగొట్టును. ఈ జ్ఞానదీపమో అంతఃకరణమందలి మోహరూప తమస్సును నశింపజేయును. 'అజ్ఞానజం' అని చెప్పినందువలన ఆ తమస్సు అజ్ఞానమునుండియే ప్రభవించుచున్నదని తెలియుచున్నది. అది అహంకార మమకారాదిరూపమున నున్నదై, జీవుని సంసారదుఃఖమునకు హేతువై అసత్యమును సత్యముగను, సత్యమును అసత్యముగను తోపింపజేయుచున్నది. హృదయస్థమగు అట్టి అవిద్యాంధకారమును ఈ జ్ఞానదీపము నశింపజేయుచున్నది.

అయితే ఆ జ్ఞానదీప మెట్లు లభించును? దానిని భగవానుడే జీవులకొసంగును. అందఱికి

నొసంగునా? కాదు. ఎవరు తనను ప్రీతి పూర్వకముగ నిరంతరము భజించుదురో వారికిమాత్రమే ఇచ్చును. అట్టి పరమభక్తులపై దయగలిగి వారిని కనికరించు నిమిత్తము జ్ఞానదీపమును ఈ మహాప్రసాదమును వారికొసంగును. ఈ రహస్యములన్నియు ఈ శ్లోకమున చక్కగ తెలుపబడినవి.

భగవంతుని భజింపనిచో వారి యనుగ్రహము లభింపదు.

వారి యనుగ్రహములేనిచో జ్ఞానదీపము దొఱకదు.

జ్ఞానదీపములేనిచో అజ్ఞానాంధకారము నశించదు.

అజ్ఞానాంధకారము తొలగనిచో దుఃఖమంతరింపదు.

కాబట్టి దుఃఖనివారణముకొఱకు ప్రతిజీవియు నిర్మలహృదయముతో, అచంచల భక్తితో మొట్టమొదట భగవదారాధనమును గావింపవలయును. మోక్షముయొక్క కీలకమంతయు ఈ భగవత్సంసేవనమందే యిమిడియున్నదని ఈ శ్లోకముద్వారా స్పష్టముగ తెలియుచున్నది.

ఆ ప్రకారముగ భక్తిసంయుతులై భగవానుని ధ్యానించువారియొక్క హృదయమును ఆ సర్వేశ్వరు డెట్లు తెలిసికొనగలడు? వారు దూరమునలేరు. 'ఆత్మభావస్థః' - ప్రతిజీవియొక్క హృదయముననే విరాజిల్లుచు సాక్షిభూతులై వారుచేయు సమస్తమును గమనించుచున్నారు. వారు సంకల్పించు ప్రతి సంకల్పమునుగూడ వారు చక్కగ పరిశీలించుచుండ ఇక వారి దృష్టినుండి ఎవ్వరైన తప్పించుకొన సాహసింపగలరా? కాబట్టి ఎవరును పాపకార్యములను చేయరాదు. మనస్సుతోనైనను దుష్టసంకల్పములను సంకల్పించరాదు. దైవకార్య, ధర్మకార్యనిరతులై యుండవలెను. ఏలననిన ప్రతిజీవియొక్క హృదయముననే భగవానుడు కాపురము పెట్టుకొనియున్నారని యిట తెలుపబడినది (ఆత్మభావస్థః).

'నాశయామి' తనను భజించువారి హృదయమునగల మోహాంధకారమును నేను నశింపజేయు చున్నాను. - అని భగవానుడు అసందిగ్ధముగ చెప్పివైచినందువలన జీవుడు తన కర్తవ్యమగు భగవదారాధనమును నెరవేర్చినచో పరమాత్మ తనవంతుపని (మోహనాశము) తాను తప్పక చేసియే తీరునని స్పష్టమగుచున్నది. 'నేను (అట్టిజీవుల మోహమును) నశింపజేయుచున్నాను' అని ప్రతిజ్ఞాపూర్వకముగ భగవానుడు పలికినందువలన ఇక భక్తులకు తమ బంధవిముక్తివిషయమున ఏమాత్రము సంకోచింపపనిలేదు. వారు చేయవలసిన పనిని అనగా అనవరత ప్రీతిపూర్వక భజనను ధ్యానమును చేసిన చాలును. చెట్టుమొదలుకు నీరుపోయుచుండినచో ఇక ఫలవిషయమై సందేహము పెట్టుకొన నవసరములేదు. అది వచ్చియేతీరును. అట్లే భక్తియను జలమును పరమార్థవృక్షమునకు బోయుచుండినచో ముక్తియనుఫలము తాను కోరకనే లభింపగలదు. దానిని భగవానుడే తెచ్చి వానిచేతిలో పెట్టగలరు. కనుకనే 'నేనొక జ్ఞానదీపమును దెచ్చి వానిహృదయమందలి చీకటిని (అజ్ఞానమును) నశింపజేయుచున్నాన'ని శ్రీకృష్ణమూర్తి తెలిపినవారైరి. ఆ యంధకారమును జీవుడు స్వతః పోగొట్టుకొనలేడు. దానికి భగవత్సహాయము అవసరము. కాబట్టి వారి యనుగ్రహమునకై భగవద్భజన, సేవన, పూజ, ఆరాధన, ధ్యానాదులద్వారా అతిశయప్రయత్న మాచరింపవలసియున్నది.

**ప్ర:-** జీవునకు మోక్షమెపుడు లభించును?

**ఉ:-** అజ్ఞానమను అంధకారము తొలగినపుడు.

ప్ర:— అది యెట్లు తొలగును?

ఉ:— జ్ఞానమను ప్రకాశవంతమగు దీపముచే తొలగును.

ప్ర:— ఆ జ్ఞానదీప మెట్లు లభించును?

ఉ:— అది భగవానునిచే నొసంగబడును.

ప్ర:— ఎవరికి?

ఉ:— అతనికి ఎవరిపై కనికరముగలుగునో వారికి.

ప్ర:— భగవంతున కెవనిపై కనికరము కలుగును?

ఉ:— నిరంతరము ప్రీతితో తన్నుభజించువారిపై నాతనికి కనికరము, దయ కలుగును.

ప్ర:— జీవులుచేయు ఆ యా పుణ్యములను భగవంతు డెట్లు తెలిసికొనగలడు?

ఉ:— సమస్తజీవులయొక్క హృదయమందే యాత డధివసించుచున్నాడు. కావున వారివారి సంకల్పములను, చేష్టలను అతడు సులభముగ గ్రహించగలడు.

ప్ర:— సంసారమోహరూపతమస్సు(చీకటి) దేనినుండి పుట్టును?

ఉ:— అజ్ఞానమునుండి.

ప్ర:— జ్ఞానదీపమెట్టిది?

ఉ:— మహాప్రకాశవంతమైనది. జీవుని మోక్షమునకు దారిచూపి అచటికి గొనిపోవునది.

**అ॥** పైనదెల్పిన భక్తి చక్కగ ఏర్పడుటకు అభివృద్ధినొందుటకు భగవద్విభూతిని, భగవన్మహిమను తెలిసికొనియుండుట అవసరమని భావించి భగవానునిద్వారా వాని నెఱుంగదలంచినవాడై అర్జునుడు మొట్టమొదట వారిని ఏడుశ్లోకములద్వారా సంస్తుతించి తుట్టతుదకు 'మీ విభూతిని, వైభవమును ఎఱింగింపుడు దేవా!' అని ప్రార్థించుచున్నాడు. భగవానుని బోధలను విని సంతోషమునుపట్టలేకయు ఈ ప్రకారముగ సంస్తుతించుచున్నాడు -

**అర్జున ఉవాచ :–**

**12. పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్**
**పురుషం శాశ్వతం దివ్యమాదిదేవమజం విభుమ్.**

**13. ఆహుస్త్వాం ఋషయస్సర్వే దేవర్షిర్నారదస్తథా**
**అసితో దేవలో వ్యాసస్స్వయం చైవ బ్రవీషి మే.**

అర్జునఉవాచ = అర్జునుడుచెప్పెను.

**టీక:–** భవాన్ = నీవు, పరంబ్రహ్మ = పరబ్రహ్మవు, పరంధామ = పరంధాముడవు (పరమపదమవు, లేక గొప్ప తేజస్స్వరూపుడవు), పరమం పవిత్రమ్ = పరమపావనుడవు, త్వామ్ = నిన్ను, శాశ్వతమ్ = నిత్యునిగను, దివ్యమ్ = ప్రకాశస్వరూపునిగను, పురుషమ్ = పరమపురుషునిగను, ఆదిదేవమ్ = దేవతాదులకును ఆదియైనవానిగను, అజమ్ = జన్మరహితునిగను, విభుమ్ = సర్వవ్యాపకునిగను, సర్వేఋషయః = ఋషులందరున్ను, దేవర్షిః నారదః = దేవర్షి యగు నారదుడున్ను, అసితః = అసితుడును, దేవలః = దేవలుడును, వ్యాసః = వేదవ్యాసమహర్షియును, ఆహుః = చెప్పుచున్నారు, స్వయం చ = నీవున్ను, తథాఏవ = ఆ ప్రకారముగనే, మే = నాకు, బ్రవీషి = చెప్పుచున్నావు.

**తా:–** అర్జునుడు చెప్పెను – మీరు పరబ్రహ్మస్వరూపులు, పరంధాములు (పరమ పదస్వరూపులు లేక గొప్ప తేజస్స్వరూపులు), పరమపావనరూపులు. మిమ్ము నిత్యులుగను, ప్రకాశస్వరూపులుగను, పరమపురుషులుగను, ఆదిదేవులుగను, జన్మరహితులుగను, సర్వవ్యాపకులుగను, ఋషులందఱున్ను దేవర్షియగు నారదుడున్ను, అసితుడున్ను, దేవలుడున్ను, వేదవ్యాసమహర్షియు చెప్పుచున్నారు. స్వయముగ మీరున్ను ఆప్రకారమే (మిమ్ముగూర్చి) నాకు చెప్పుచున్నారు.

**వ్యాఖ్య:–** భక్తులపై భగవానుడు కరుణావర్షము కురిపించుచుండ అఖండమగు ఆ బోధను విని అర్జునుడు ప్రపుల్లితాంతఃకరణుడై తన ఆనందాతిరేకమును ఆపుకొన జాలక భగవానుని ఈప్రకారముగ స్తోత్రముచేయదొడంగెను. గురువుయెడల ఇట్టి అనన్యభక్తికలిగియున్నపుడే గురువాక్యము శిష్యునకు చక్కగ హృదయంగమము కాగలదు.

**ప్ర:–** శ్రీకృష్ణపరమాత్మ యెట్టివాడు?

**ఉ:–** (1) పరబ్రహ్మ స్వరూపుడు (2) పరంధాముడు (3) పరమపావనుడు (4) శాశ్వతుడు (5) ఆదిదేవుడు (6) జననమరణ వర్జితుడు (7) సర్వవ్యాపకుడు.

**ప్ర:–** శ్రీకృష్ణు డిట్టివాడని పేర్కొనిన మహనీయులెవరు?

**ఉ:–** (1) సమస్తఋషులు (2) నారదుడు (3) అసితుడు (4) దేవలుడు (5) వేదవ్యాసులు (6) శ్రీకృష్ణమూర్తి (స్వయముగ అట్లే నుడివెను).

## 14. సర్వమేతదృతం మన్యే యన్మాం వదసి కేశవ
## న హి తే భగవన్ వ్యక్తిం విదుర్దేవా న దానవాః.

**టీక:–** కేశవ = ఓ కృష్ణా, యత్ = దేనిని, మామ్ = నన్నుగూర్చి (నాకు), వదసి = చెప్పుచున్నావో, ఏతత్సర్వమ్ = ఇదియంతయు, ఋతమ్ = సత్యమని, మన్యే = తలంచుచున్నాను, భగవాన్ = ఓ భగవానుడా!, తే = నీయొక్క, వ్యక్తిమ్ = నిజస్వరూపమును, దేవాః = దేవతలు, నవిదుః = ఎఱుగరు, దానవాః (చ) = అసురులును (రాక్షసులును), నహి (విదుః) = ఎఱుగరుగదా!

**తా:–** ఓ కృష్ణా! దేనిని మీరు నాకుచెప్పుచున్నారో అదియంతయు సత్యమని నేను తలంచుచున్నాను. ఓ భగవంతుడా! మీయొక్క (నిజ) స్వరూపమును దేవతలుగాని, అసురులుగాని ఎఱుంగజాలరుకదా!

**వ్యాఖ్య:–** "మీరు చెప్పినదంతయు సత్యమని తలంచుచున్నాను" - అని యీ ప్రకారముగ గురువాక్యములందు శిష్యుడు పూర్ణవిశ్వాసమును ప్రకటించుచున్నాడు. ఇట్టి విశ్వాసప్రకటనమువలన గురువునకు శిష్యునిపై ప్రీతి, వాత్సల్యము అధికరించుచుండును.

**15. స్వయమేవాత్మనాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ**
**భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే.**

**టీక:–** పురుషోత్తమా = ఓ పురుషశ్రేష్ఠుడా!, భూతభావన = సమస్తప్రాణులను సృష్టించువాడా, భూతేశ = సకలజీవులకు నియామకుడగువాడా, దేవదేవ = దేవతలకును దేవుడైనవాడా, జగత్పతే = జగన్నాథుడా (జగత్తును పాలించువాడా), త్వమ్ = నీవు, ఆత్మానమ్ = నిన్ను (స్వస్వరూపమును), ఆత్మనా = నీచేత, స్వయమ్ ఏవ = స్వయముగనే, వేత్థ = ఎఱుగుదువు.

**తా:–** ఓ పురుషశ్రేష్ఠా, సమస్తప్రాణి సృష్టికర్తా, సకలజీవ నియామకా, దేవదేవా, జగన్నాథా, మిమ్ము మీరే యెఱుగుదురు (మీస్వరూప మితరులకు దుర్గ్రాహ్యమని భావము).

**16. వక్తు మర్హస్యశేషేణ దివ్యాహ్యాత్మ విభూతయః**
**యాభిర్విభూతిభిర్లోకానిమాంస్త్వం వ్యాప్య తిష్ఠసి.**

**టీక:–** హి = కాబట్టి, యాభిఃవిభూతిభిః = ఏ విభూతులచే (ఐశ్వర్యములచే, మాహాత్మ్య విస్తారములచే), త్వమ్ = నీవు, ఇమాన్‌లోకాన్ = ఈలోకములను, వ్యాప్య = వ్యాపించి, తిష్ఠసి = ఉన్నావో (అట్టి), దివ్యాః = దివ్యములైన (అప్రాకృతములైన), ఆత్మవిభూతయః = నీ విభూతులను, అశేషేణ = సంపూర్ణముగ, వక్తుమ్ = చెప్పుటకు (నీవే), అర్హసి = తగుదువు.

**తా:–** కావున ఏ విభూతులచే (మాహాత్మ్యవిస్తారములచే) మీరీ లోకములన్నిటిని వ్యాపించియున్నారో అట్టి దివ్యములగు మీ విభూతులను సంపూర్ణముగ చెప్పుటకు మీరే తగుదురు...

**17. కథం విద్యామహం యోగింస్త్వాం సదా పరిచిన్తయన్**
**కేషుకేషు చ భావేషు చిన్త్యోఽసి భగవన్మయా.**

**టీక:–** యోగిన్ = యోగేశ్వరా!, అహమ్ = నేను, సదా = ఎల్లప్పుడు, కథమ్ = ఏ ప్రకారముగ, పరిచిన్తయన్ = ధ్యానముచేయుచు, త్వామ్ = నిన్ను, విద్యామ్ = తెలిసికొనగలను?, భగవన్ = భగవంతుడా, కేషుకేషు భావేషు చ = ఏ యే వస్తువులయందును, చిన్త్యః = ధ్యానింపదగినవాడవు, అసి = అగుచున్నావు.

**తా:–** యోగేశ్వరా! నే నెల్లప్పుడును ఏ ప్రకారముగ ధ్యానించుచు మిమ్ము తెలిసికొనగలను? భగవంతుడా! ఏ యే వస్తువులందు మిమ్ము నేను ధ్యానింపవలెను?

**వ్యాఖ్య:–** అతిసూక్ష్మమగు దైవతత్త్వము సామాన్యముగ జనులకు వెంటనే అనుభూతము కాదు, గనుక సాధకుడు ప్రారంభస్థితియందు తన మనస్సును ఒకానొక భగవత్సంబంధమైన పవిత్రవస్తువునందు లేక మూర్తియందు కేంద్రీకరించి కొంతకాలము ధ్యానము నభ్యసింపవలయును. క్రమముగ చిత్తైకాగ్రతను

సంపాదించిన మీదట నిరాకార, నిర్గుణతత్త్వమునుగూర్చి విచారింపవచ్చును. కనుకనే అర్జునుడు ధ్యానించుటకు కొన్ని సాకారవిభూతులను, దివ్యపదార్థములను తెలుపవలసినదిగా భగవానుని వేడుకొనుచున్నాడు. సమస్తజగత్తున్ను భగవంతునిస్వరూపమే అయియున్నను, ధ్యానానుకూలతకొఱకై ఏ యే రూపములు తగియున్నవో, అట్టి ప్రధానములైన కొన్నిటిని సెలవివ్వవలసినదిగా అర్జునుడు ప్రార్థించుచున్నాడు.

**18. విస్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్దన**
**భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్.**

**టీక:–** జనార్ధన = ఓ కృష్ణా!, ఆత్మనః = నీయొక్క, యోగమ్ = యోగమహిమను (సామర్థ్య విశేషమును), విభూతిం చ = జగల్లీలా విభూతులను (ధ్యేయవస్తువులను), విస్తరేణ = సవిస్తరముగ, భూయః = మఱల, కథయ = చెప్పుము, హి = ఏలయనగా, అమృతమ్ = అమృతవాక్కును, శృణ్వతః = వినుచున్న, మే = నాకు, తృప్తిః = సంతృప్తి, నాస్తి = లేదు (కలుగుటలేదు).

**తా:–** ఓకృష్ణా! మీయొక్క యోగమహిమను, జగల్లీలావిభూతులను, (ధ్యానింపదగిన వస్తువులను) సవిస్తరముగ మఱల తెలియుజేయుడు. ఏలయనగా మీయొక్క అమృతవాక్యములను వినుచున్న నాకు సంతృప్తికలుగుటలేదు (ఇంకను వినవలయునని కుతూహలము గలుగుచున్నది).

**వ్యాఖ్య:–** శిష్యునకు గురువాక్య శ్రవణమున ఇట్టి ఉత్కంఠ జనింపవలెను.

**అ॥** అర్జునుని యా వాక్యములనువిని భగవానుడు తన విభూతులను వర్ణింపదొడగుచు, ప్రధానములైనవానిని మాత్రమే చెప్పెదనని తెలుపుచున్నాడు –

**శ్రీ భగవానువాచ :–**

**19. హన్త తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః**
**ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యన్తో విస్తరస్య మే.**

శ్రీభగవానువాచ = శ్రీభగవంతుడు చెప్పెను.

**టీక:–** కురుశ్రేష్ఠ = కురువంశీయులలో శ్రేష్ఠుడవగు ఓ అర్జునా!, హన్త = ఇప్పుడు, దివ్యాః = దివ్యములైన (అలౌకికములైన), ఆత్మవిభూతయః = నా యొక్క విభూతులను, ప్రాధాన్యతః = ప్రాధాన్యత ననుసరించి, తే = నీకు, కథయిష్యామి = చెప్పెదను, హి = ఏలయనగా, మే = నాయొక్క, విస్తరస్య = విభూతి విస్తారమునకు, అన్తః = అంతము, నాస్తి = లేదు.

**తా:–** శ్రీభగవంతుడు చెప్పెను – కురువంశశ్రేష్ఠుడవగు ఓ అర్జునా! ఇప్పుడు దివ్యములైన నాయొక్క విభూతులను ప్రాధాన్యతననుసరించి (ముఖ్యములైనవానిని) నీకు చెప్పెదను. ఏలయనగా – నాయొక్క విభూతివిస్తారమునకు అంతములేదు.

**వ్యాఖ్య:–** భగవానుడు అనంతుడు. కాబట్టి వారి విభూతియు అనంతమైనదియే యగును. కాబట్టి ముఖ్యములైన విభూతులను మాత్రమే వర్ణించిచెప్పుటకు భగవానుడు పూనుకొనుచున్నాడు.

**అ॥** ఇటనుండి ఇరువది శ్లోకములవఱకు (39వ శ్లో॥ వఱకు) భగవానుడు తన వివిధ విభూతులను వర్ణించి చెప్పుచున్నాడు -

**20. అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః**
**అహమాదిశ్చ మధ్యం చ భూతానామన్త ఏవ చ.**

**టీక:–** *గుడాకేశ* = ఓ అర్జునా!, *సర్వభూతాశయస్థితః* = సమస్తప్రాణులయొక్క హృదయమందున్న, *ఆత్మా* = ప్రత్యగాత్మ, *అహమ్‌ఏవ (అస్మి)* = నేనే అయియున్నాను, *భూతానామ్* = ప్రాణులయొక్క, *ఆదిః చ* = ఆదియు (సృష్టియు), *మధ్యం చ* = మధ్యమున్ను (స్థితియు), *అన్తః చ* = అంతమున్ను (లయమున్ను), *అహమ్ (ఏవ అస్మి)* = నేనే (అయియున్నాను).

**తా:–** ఓ అర్జునా! సమస్తప్రాణులయొక్క హృదయమునందున్న ప్రత్యగాత్మను నేనే అయియున్నాను. మఱియు ప్రాణులయొక్క ఆదిమధ్యాంతములున్ను (సృష్టిస్థితిలయములున్ను) నేనే అయియున్నాను.

**వ్యాఖ్య:–** చెప్పవలసినదానినంతను ఒక్కవాక్యములోనే భగవానుడు చెప్పివైచిరి. ('అహమాత్మా... స్థితః' - అని) 'సమస్తప్రాణికోట్లయందును వెలయుచున్న ప్రత్యగాత్మను నేనే' అని శ్రీకృష్ణమూర్తి ఇట వచించిరి. ప్రతిజీవియందును దేహేంద్రియ మనోబుద్ధులకు సాక్షిగ ప్రత్యగాత్మ వర్తించుచున్నారు. వారినే జీవాత్మయనియు అందురు. వారు పరమాత్మకంటె వేఱుకాదని ఇట పేర్కొనబడినది. అనగా జీవాత్మయే పరమాత్మయను అఖండ మహావాక్యబోధ ఇచట గావింపబడినదని యర్థము. ఇదియే అద్వైతబోధ. కావున జీవుడు పరమాత్మస్థానమును బొందవలెనని జీవాత్మస్థానమును చేరిన చాలును. అనగా పంచకోశములనుండి తనను వేఱుపఱచుకొని, దేహేంద్రియ మనోబుద్ధ్యాదులకు సాక్షిగానున్న ప్రత్యగాత్మను సాక్షాత్కరించుకొనవలెను. ఆ ప్రత్యగాత్మయే పరమాత్మ. ఉపనిషత్తులన్నియు ఈ సత్యమునే బోధించుచున్నవి.

మఱియు ప్రతిజీవియందును భగవానుడు (ప్రత్యగాత్మ రూపమున) వసించుచున్నట్లు స్పష్టముగ తెలుపబడినందువలన ఇక ఏ జీవిని అల్పుడని చెప్పుటకు లేదు. తన యొక్క ప్రత్యగాత్మను (దేహేంద్రియాదులకు సాక్షియగు నిజరూపమును), స్మరణకు తెచ్చుకొని ప్రతిమానవుడును తాను అల్పమై, నశ్వరమైనట్టి ఉపాధికాదనియు, మహత్తర శాశ్వత పరబ్రహ్మస్వరూపుడేయనియు నిశ్చయించుకొనవలెను. మఱియు ప్రతిప్రాణియందును భగవంతుడు నివసించుచున్నారను విశ్వాసమును దృఢపఱచుకొని ఏ జీవికిని హింస చేయక పరోపకారపారీణుడై వర్తించవలెను. అట్టి పరప్రాణిసేవ మాధవసేవయనియే భావించవలెను. ఈ ప్రకారముగ సర్వత్ర భగవత్సన్నిధానమును భావించుకొనుచు పాపకార్యమెద్దియు చేయకయుండవలెను. ఏలయనిన పరమాత్మ వారివారి హృదయముననే నివసించుచు వారికి అతిసమీపమునుండి వారువారు చేయు పాపపుణ్యములను బహుజాగరూకతతో గమనించుచున్నారు.

జగత్తంతయును అధిష్ఠానమగు పరమాత్మయందు అధ్యస్తమై యుండుటవలన వాస్తవముగ నది అధిష్ఠానముకంటె వేఱుకాదుగనుక సమస్తప్రాణుల ఆదిమధ్యాంతములు తానే అయియున్నానని భగవానుడు చెప్పుటకు కారణము. మఱియు 'సర్వభూతాశయస్థితః' అను వాక్యమునందలి 'సర్వ' అను పదముయొక్క ప్రయోగమువలన ఏ ప్రాణియందైనను తాను లేకుండ ఉండునదిలేదనియు, సమస్తభూతములందును తప్పక అధివసించుచున్నాడనియు స్పష్టమగుచున్నది. కాబట్టి ఇక ఏ ప్రాణియు దిగులుపడక,

నిరుత్సాహముజెందక తాను అల్పమని భావించక, తనయందు దాగియున్నట్టి ఆ అక్షయపరమాత్మను సాక్షాత్కరించుకొనుటకై యత్నింపవలెను. దిగులు, దుఃఖము మున్నగునవి జీవునకు తన వాస్తవస్వరూపముయొక్క విస్మరణమువలననే కలుగుచుండునని గ్రహించవలెను. కావున తన యథార్థస్వరూపమును (ఆత్మను) పునఃస్మరించి, మహద్ధైర్యమును, ఆనందమును పొంది, దుఃఖరాహిత్యమును బంధవిముక్తిని శాశ్వతకైవల్యమును బడయవలెను.

గుడాకేశ - గుడాక + ఈశ - నిద్రను జయించినవాడు అర్జునుడు. ఆహారము, నిద్ర - అను ఇరువురుదొంగలు మనుజుని జీవితమును హరించివేయుచున్నారు. కావున ముముక్షువు ఆ రెండిటిని అదుపునందుంచుకొని సంయమశీలుడై ప్రవర్తించవలెను. మితనిద్ర, మితాహారములనే సేవించుటను అభ్యసించవలెను.

**ప్ర:-** సమస్తప్రాణికోట్లయొక్క హృదయాంతరాళములందు నివసించు ప్రత్యగాత్మ యెవరు?

**ఉ:-** సాక్షాత్ పరమాత్మయే.

**ప్ర:-** ఇంకను ఆ పరమాత్మ యెట్టివాడు?

**ఉ:-** ప్రాణులయొక్క ఆదిమధ్యాంతము లాతడే అయియున్నాడు.

## 21. ఆదిత్యానామహం విష్ణుర్జ్యోతిషాం రవిరంశుమాన్ మరీచిర్మరుతామస్మి నక్షత్రాణామహం శశీ.

**టీక:-** అహమ్ = నేను, ఆదిత్యానామ్ = ఆదిత్యులలో, విష్ణుః = విష్ణువను ఆదిత్యుడను, జ్యోతిషామ్ = ప్రకాశింపజేయువానిలో, అంశుమాన్ = కిరణములుగల, రవిః = సూర్యుడను, మరుతామ్ = మరుత్తులను దేవతలలో, మరీచిః = మరీచియనువాడను, అహమ్ = నేను, నక్షత్రాణామ్ = నక్షత్రములో, శశీ = చంద్రుడను, అస్మి = అయియున్నాను.

**తా:-** నేను ఆదిత్యులలో విష్ణువనువాడను, ప్రకాశింపజేయువానిలో కిరణములుగల సూర్యుడను, మరుత్తులను దేవతలలో మరీచియనువాడను, నక్షత్రములో చంద్రుడను అయియున్నాను.

**వ్యాఖ్య:-** 'ఆదిత్యులు' - అదితికుమారులు పంద్రెండుగురు - వీరినే ద్వాదశాదిత్యులందురు. వారు (1) ధాత (2) మిత్రుడు (3) అర్యముడు (4) శక్రుడు (5) వరుణుడు (6) అంశువు (7) భగుడు (8) వివస్వంతుడు (9) పూష (10) సవిత (11) త్వష్ట (12) విష్ణువు - అను పేర్లు గలిగియున్నారు★.

'మరుత్తులు' - ఏడుగురు. వారు క్రమముగ (1) ఆవహుడు (2) ప్రవహుడు (3) నివహుడు (4) పరావహుడు (5) ఉద్వహుడు (6) సంవహుడు (7) పరివహుడు (మరీచి) - అనుపేర్లు గలిగియున్నారు.

★ 1. ధాతా మిత్రో ఒర్యమా శక్రో వరుణస్త్వంశ ఏవ చ
భగో వివస్వాన్ పూషా చ సవితా దశమస్తథా.
2. ఏకాదశస్తథా త్వష్టా ద్వాదశో విష్ణురుచ్యతే
జఘన్యజస్తు సర్వేషామాదిత్యానాం గుణాధికః (మహాభారతము - ఆదిపర్వము)

'ఆదిత్యులలో నేను విష్ణువును' - అను వాక్యముయొక్క అర్థము 'ఆదిత్యులందఱిలో విష్ణువను ఆదిత్యునియందు తక్కినవారియందుకంటె నేను విశేషముగ అభివ్యక్తమగుచుందును' - అనియేయగును. అట్లే తక్కినవాక్యములయొక్క అర్థమునుగూడ ఊహించుకొనవచ్చును.

## 22. వేదానాం సామవేదోఽస్మి దేవానామస్మి వాసవః
## ఇన్ద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా.

**టీక:-** వేదానాం = వేదములలో, సామవేదః = సామవేదము, అస్మి = (నేను) అయియున్నాను, దేవానామ్ = దేవతలలో, వాసవః = ఇంద్రుడను, అస్మి = అయియున్నాను, ఇన్ద్రియాణామ్ = ఇంద్రియములలో, మనః చ = మనస్సున్ను, అస్మి = అయియున్నాను, భూతానామ్ = ప్రాణులలో, చేతనా = చైతన్యము (తెలివి), అస్మి = అయియున్నాను.

**తా:-** నేను వేదములలో సామవేదమును, దేవతలలో ఇంద్రుడను, ఇంద్రియములలో మనస్సున్ను, ప్రాణులలో చైతన్యమున్ను (తెలివి) అయియున్నాను.

## 23. రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్
## వసూనాం పావకశ్చాస్మి మేరుశ్శిఖరిణామహమ్.

**టీక:-** రుద్రాణామ్ = రుద్రులలో, శంకరః = శంకరుడనువాడను, అస్మి = అయియున్నాను, యక్షరక్షసామ్ = యక్షులలోను, రాక్షసులలోను, విత్తేశః = కుబేరుడను, వసూనామ్ = **వసువులలో,** పావకః చ = అగ్నియు, శిఖరిణామ్ = శిఖరముగల పర్వతములలో, మేరుః = మేరుపర్వతమును, అస్మి = (నేను) అయియున్నాను.

**తా:-** నేను రుద్రులలో శంకరుడనువాడను, యక్షులలోను, రాక్షసులలోను కుబేరుడను, వసువులలో అగ్నియు, పర్వతములలో మేరువును అయియున్నాను.

**వ్యాఖ్య:-** 'రుద్రులు' - పదునొకండుగురు - (వీరినే ఏకాదశ రుద్రులందరు) - వారు (1) హరుడు (2) బహురూపుడు (3) త్ర్యంబకుడు (4) అపరాజితుడు (5) వృషాకపి (6) శంభువు (7) కపర్ది (8) రైవతుడు (9) మృగవ్యాధుడు (10) శర్వుడు (11) కపాలి - అను పేర్లు గలిగియున్నారు★.

'వసువులు' - ఎనిమిదిమంది (అష్టవసువులు) - వారు (1) ధరుడు (2) ధ్రువుడు (3) సోముడు (4) అహుడు (5) అనిలుడు (6) అనలుడు (7) ప్రత్యూషుడు (8) ప్రభాసుడు. @.

---

★ 1. హరశ్చ బహురూపశ్చ త్ర్యంబకశ్చాపరాజితః
వృషాకపిశ్చ శమ్భుశ్చ కపర్దీ రైవతస్తథా.
2. మృగవ్యాధశ్చ శర్వశ్చ కపాలీ చ విశామ్పతే
ఏకాదశైతే కథితా రుద్రాస్త్రిభువనేశ్వరాః॥ (హరివంశము)

@ ధరో ధ్రువశ్చ సోమశ్చ అహశ్చైవానిలోఽనలః
ప్రత్యూషశ్చ ప్రభాసశ్చ వసవోఽష్టౌ ప్రకీర్తితాః॥ (మహాభారతం - ఆదిపర్వం)

## 24. పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిమ్
## సేనానీనామహం స్కన్దస్సరసామస్మి సాగరః.

**టీక:–** పార్థ = ఓ అర్జునా!, పురోధసాం = పురోహితులలో, ముఖ్యమ్ = శ్రేష్ఠుడైన, బృహస్పతిమ్ చ = బృహస్పతినిగాను, మామ్ = నన్ను, విద్ధి = తెలిసికొనుము, అహమ్ = నేను, సేనానీనామ్ = సేనానాయకులలో, స్కన్దః = కుమారస్వామియు, సరసామ్ = సరస్సులలో, సాగరః = సముద్రమును, అస్మి = అయియున్నాను.

**తా:–** ఓ అర్జునా! పురోహితులలో శ్రేష్ఠుడగు బృహస్పతినిగా నన్నెఱుంగుము. మఱియు నేను సేనానాయకులలో కుమారస్వామియు, సరస్సులలో సముద్రమును అయియున్నాను.

**వ్యాఖ్య:–** 'ముఖ్యమ్' – అని చెప్పుటవలన శ్రేష్ఠత్వమే, పవిత్రత్వమే దైవత్వమునకు చిహ్నమని స్ఫురించుచున్నది.

## 25. మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేకమక్షరమ్
## యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః.

**టీక:–** అహమ్ = నేను, మహర్షీణామ్ = మహర్షులలో, భృగుః = భృగుమహర్షిని, గిరామ్ = వాక్కులలో, ఏకమ్ అక్షరమ్ = ఒక్క అక్షరమగు ప్రణవమును (ఓంకారమును), అస్మి = అయియున్నాను, యజ్ఞానామ్ =యజ్ఞములలో, జపయజ్ఞః = జపయజ్ఞమును, స్థావరాణామ్ = స్థిరపదార్థములలో, హిమాలయః = హిమాలయపర్వతమును, అస్మి = (నేను) అయియున్నాను.

**తా:–** నేను మహర్షులలో భృగుమహర్షిని, వాక్కులలో ఏకాక్షరమగు ప్రణవమును (ఓంకారమును), యజ్ఞములలో జపయజ్ఞమును, స్థిరపదార్థములలో హిమాలయపర్వతమును అయియున్నాను.

**వ్యాఖ్య:–** 'గిరామస్మ్యేకమక్షరమ్' – వాక్కులు అనేకములున్నను ఏకాక్షరమైన ప్రణవమే (ఓంకారమే) తానని భగవానుడు చెప్పుటవలన దానికెంత ప్రాముఖ్యత కలదో తేటతెల్లమగుచున్నది. నూఱువాక్యము లుచ్చరించుటకంటె సారవంతమైన ఒక్క వాక్యము నుచ్చరించుట మేలు, పుణ్యప్రదము. ఆ సారవాక్కే ప్రణవము. సమస్తమంత్రములకును అది ప్రాణము. సమస్తవేదములకును అది సారము. అది పరబ్రహ్మమునకు వాచకము. కావున జపించువాని పాపములను బోగొట్టును. అర్థమననముచే మోక్షమునకు గొనిపోవును. కనుకనే సమస్తవేదములు, శాస్త్రములు ఈప్రణవమునుగూర్చి విశేషించి చెప్పినవి. ఈ ప్రకారముగ వాక్కులన్నింటిలోను అది సారభూతమగుటవలన, వ్యర్థములగు ప్రాపంచికవాక్కులందు కాలమును వృథాచేయక దివ్యరూపమై సాక్షాత్ భగవత్స్వరూపమై యలరు ఈ ఏకాక్షరమును (ప్రణవమును) ఉచ్చరించుట, భావించుట శ్రేయస్కరము.

'యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి' – యజ్ఞములలో తాను జపయజ్ఞమని శ్రీకృష్ణపరమాత్మ నుడివిరి. దీనినిబట్టి జపమున కెట్టి మాహాత్మ్యముకలదో విదితమగుచున్నది. జపమును ఒక యజ్ఞముగనే చెప్పుటవలన అది మహాపవిత్రవంతమై, చిత్తశుద్ధికరమైన గొప్పక్రతువని స్పష్టమగుచున్నది. శాస్త్రములలో అనేకయజ్ఞములు

చెప్పబడియున్నను అవియన్నియు చాలప్రయాసతో గూడినవి. కావున అతిసులభమై, సర్వులకును అందుబాటులోనున్నదై, ఆచరణసాధ్యమై, ఏవిధమైన ప్రయాసలేనిదైనట్టి ఈ జపయజ్ఞము యజ్ఞములన్నిటిలోను మేటియైయున్నది. కనుకనే భగవానుడు దానినే తనరూపముగ వర్ణించిరి. ఇది ఖర్చులేని యజ్ఞము. పైగా అపరిమిత ఫలము నొసంగునది. ఇది చిత్తమును శుద్ధపఱచి అనేక జన్మార్జితపాపమును క్షాళనమొనర్చి బ్రహ్మజ్ఞానవ్యాప్తికి అనుకూలముగ నొనర్చును. కాబట్టి ఇది మోక్షప్రాప్తికి అత్యంత సహాయకారిగనున్నది. వెయ్యేల ఇది సాక్షాత్ భగవత్స్వరూపమే యని పేర్కొనబడుటవలన జనులందఱికిని ఇయ్యది అనుష్ఠేయమైయున్నది.

## 26. అశ్వత్థః సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః
## గన్ధర్వాణాం చిత్రరథః సిద్ధానాం కపిలో మునిః.

**టీక:–** (అహమ్ = నేను), సర్వవృక్షాణామ్ = అన్నిచెట్లలోను, అశ్వత్థః = రావిచెట్టును, దేవర్షీణామ్ = దేవర్షులలో, నారదః చ = నారదుడును, గన్ధర్వాణామ్ = గంధర్వులలో, చిత్రరథః = చిత్రరథుడను, సిద్ధానామ్ = సిద్ధులలో, కపిలః మునిః = కపిలుడను మునియు, (అస్మి = అయియున్నాను).

**తా:–** నేను చెట్లన్నిటియందును రావిచెట్టును, దేవర్షులలో నారదుడను, గంధర్వులలో చిత్రరథుడను, సిద్ధులలో కపిలమునీంద్రుడను అయియున్నాను.

**వ్యాఖ్య:–** 'అశ్వత్థః సర్వవృక్షాణామ్' చెట్లన్నిటియందును రావిచెట్టు చాలశ్రేష్ఠమై, పవిత్రమైయున్నది. పురాణములలో దీనిమహిమనుగూర్చి విశేషించి చెప్పబడినది★ వృక్షములలో అశ్వత్థవృక్షము తానని శ్రీకృష్ణపరమాత్మ చెప్పుటవలన ఆ వృక్షము సాక్షాద్భగవన్నిలయమే యని స్పష్టమగుచున్నది. కనుకనే జనులద్దానికి ప్రదక్షిణ, పూజాదులను గావించుచుందురు. ఔషధదృష్టియందును రావిచెట్టునకు గొప్ప ప్రాముఖ్యతకలదు.

## 27. ఉచ్చైశ్శ్రవసమశ్వానాం విద్ధి మామమృతోద్భవమ్
## ఐరావతం గజేన్ద్రాణాం నరాణాం చ నరాధిపమ్.

**టీక:–** అశ్వానామ్ = గుఱ్ఱములలో, అమృతోద్భవమ్ = (క్షీరసాగరమథనమున) అమృతముతోబాటు

---

★(1) మూలే విష్ణుః స్థితో నిత్యం స్కన్ధే కేశవ ఏవచ, నారాయణస్తు శాఖాసు పత్రేషు భగవాన్హరిః॥

(2) ఫలేఽచ్యుతో న సందేహః సర్వదేవైః సమన్వితః ।

(3) స ఏవ విష్ణుర్ద్రుమ ఏవ మూర్తో మహాత్మభిః సేవితపుణ్యమూలః।
యస్యాశ్రయః పాపసహస్రహన్తా భవేన్నృణాం కామదుఘో గుణాఢ్యః॥

(స్కాందపురాణము – నాగరఖండము 247-41, 42,44)

తా:- రావిచెట్టు యొక్క మూలమందు విష్ణువు, బోదెయందు కేశవుడు, కొమ్మలలో నారాయణుడు, ఆకులలో శ్రీహరి, ఫలములందు అచ్యుతుడు, సమస్తదేవతలతో గూడి విరాజిల్లుచుందురు. ఇవ్విషయమున సందేహములేదు. ఇది సాక్షాత్ ఆకారమును ధరించివచ్చిన విష్ణువే అయియున్నది. దీనిమూలమును మహనీయులు సేవించుచుందురు. దీని నాశ్రయించువారియొక్క పాపజాలమునంతను అది నశింపజేయును. మఱియు నిది మనుజుల కోరికలను నెరవేర్చునదియు, సద్గుణములను, పుణ్యములను ఇచ్చునదియు అయియున్నది.

పుట్టిన, ఉచ్చైశ్శ్రవసమ్ = ఉచ్చైశ్శ్రవసమను గుఱ్ఱమునుగను, గజేన్ద్రాణామ్ = గొప్ప ఏనుగులలో, ఐరావతమ్ = ఐరావతమను యేనుగుగను, నరాణామ్ = మనుజులలో, నరాధిపమ్ = రాజుగను, మామ్ = నన్ను, విద్ధి = తెలిసికొనుము.

**తా:–** గుఱ్ఱములలో అమృతముతోబాటు పుట్టిన ఉచ్చైశ్శ్రవసమను గుఱ్ఱమునుగను, గొప్ప యేనుగులలో ఐరావతమను యేనుగుగను, మనుష్యులలో రాజుగను నన్ను తెలిసికొనుము.

**వ్యాఖ్య:–** ఉచ్చైశ్శ్రవసమను గుఱ్ఱము, ఐరావతమను యేనుగు పూర్వము క్షీరసాగరమథనకాలమున ఉద్భవించినవి.

## 28. ఆయుధానామహం వజ్రం ధేనూనామస్మి కామధుక్
## ప్రజనశ్చాస్మి కందర్పః సర్పాణామస్మి వాసుకిః.

**టీక:–** అహమ్ = నేను, ఆయుధానామ్ = ఆయుధములలో, వజ్రమ్ = వజ్రాయుధమును, ధేనూనామ్ = పాడియావులలో, కామధుక్ = కామధేనువును, అస్మి = అయియున్నాను, ప్రజనః = ప్రజలయుత్పత్తికి కారణభూతుడైన, కందర్పః చ = మన్మథుడను, అస్మి = అయియున్నాను, సర్పాణామ్ = సర్పములలో, వాసుకిః = వాసుకియను సర్పమును, అస్మి = అయియున్నాను.

**తా:–** నేను ఆయుధములలో వజ్రాయుధమును, పాడియావులలో కామధేనువును, ప్రజల (ధర్మబద్ధమగు) యుత్పత్తికి కారణభూతుడైన మన్మథుడను, సర్పములలో వాసుకియు అయియున్నాను.

**వ్యాఖ్య:–** 'ప్రజనశ్చాస్మి కందర్పః' – 'ప్రజనః' అను విశేషణమును మన్మథునకు చేర్చుటవలన ధర్మబద్ధమైన సత్సంతానోత్పత్తికి హేతుభూతమైనట్టి కామమే ఇచట పేర్కొనబడినదని గ్రహింపవలయును. 'ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ, (7-11) –' అను వాక్యముద్వారా పూర్వమీవిషయమునే భగవానుడు తెలిపియుండిరి.

## 29. అనన్తశ్చాస్మి నాగానాం వరుణో యాదసామహమ్
## పితౄణామర్యమా చాస్మి యమస్సంయమతామహమ్. 29

**టీక:–** అహమ్ = నేను, నాగానామ్ = నాగులలో, అనన్తః చ = (నాగరాజగు) అనంతుడను, అస్మి = అయియున్నాను, యాదసామ్ = జలదేవతలలో, వరుణః = వరుణుడను, పితౄణామ్ = పితృదేవతలలో, అర్యమాచ = అర్యమయను పేరుగల పితృరాజును, (అస్మి = అయియున్నాను), అహమ్ = నేను, సంయమతాం = నియమించువారిలో (లేక శిక్షించువారిలో), యమః = యముడను (అస్మి = అయియున్నాను).

**తా:–** నేను నాగులలో అనంతుడను, జలదేవతలలో వరుణుడను, పితృదేవతలలో అర్యమయు, నియమించువారిలో యముడను అయియున్నాను.

**వ్యాఖ్య:–** 'నాగానామ్' నాగులను సర్పములకు శిరస్సు లనేకము లుండును, కాని విషముండదు. సర్పములకు ఒకే శిరస్సుండును, కాని విషముండును. నాగ, సర్పముల కిదియే భేదము.

**30. ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్**
**మృగాణాం చ మృగేన్ద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్.**

**టీక:–** అహమ్ = నేను, దైత్యానామ్ = అసురులలో, ప్రహ్లాదః చ = ప్రహ్లాదుడను, కలయతామ్ = లెక్క పెట్టువారిలో, కాలః = కాలమును, మృగాణాంచ = మృగములలోను, మృగేన్ద్రః = మృగరాజగు సింహమును, పక్షిణామ్ = పక్షులలో, వైనతేయః చ = గరుత్మంతుడను, అస్మి = అయియున్నాను.

**తా:–** నేను అసురులలో ప్రహ్లాదుడను, లెక్కపెట్టువారిలో కాలమును, మృగములలో మృగరాజగు సింహమును, పక్షులలో గరుత్మంతుడను అయియున్నాను.

**వ్యాఖ్య:–** ప్రహ్లాదుడు అసురుడు. అసురకులములో జనించినవాడు. అయినను పరమభక్తాగ్రేసరుడగుటబట్టి సాక్షాత్ భగవంతుని పదవిని బొందగల్గెను. ఇట శ్రీకృష్ణపరమాత్మ 'ప్రహ్లాదుడను నేనే' అని చెప్పుటవలన, భక్తియొక్క పరాకాష్ఠస్థితియందు భక్తుడు భగవంతుడు ఒకటే యగునను పరమసత్యము వెల్లడియగుచున్నది. వారివారి పురుషప్రయత్నముచే జీవుడు శివుడు కాగలడని స్పష్టమగుచున్నది. క్రూరస్వభావముగల అసురజాతియందు బుట్టియు ప్రయత్నపూర్వకముగ ఆర్జింపబడిన తనయొక్క దైవీసంపదచే మహోన్నత పరమార్థస్థితిని జేబట్టి శాస్త్రాదులందు గణుతికెక్కినవాడై, భక్తశిరోమణియై తేజరిల్లుచు సాక్షాత్ భగవద్రూపుడై వెలసెను. కావున కులముకంటె గుణమే ప్రధానమని తేలుచున్నది. దీనినిబట్టి ఎట్టి నీచకులమందు జన్మించినప్పటికిని తమ ప్రయత్నాతిశయముచే జనులు మహత్తరదైవస్థితిని బడయగలరని ఋజువైనది. అసురుడే ముక్తినొంద ఇక తక్కినవారిమాట చెప్పనేల? కావున జాతి మత కుల లింగ విచక్షణలేక సర్వులును ఆధ్యాత్మికసాధనలనొనర్చి భగవత్పదము నలంకరించవచ్చును.

'కాలము' – తానేయని భగవానుడు సెలవిచ్చెను. కావున అది మహాపవిత్రమైనది. అద్దానిని వ్యర్థముచేయక, దుర్వినియోగపఱచక, నశ్వరప్రాపంచిక వస్తుసంపాదనయందే గడిపివేయక శాశ్వత దైవపదార్థాన్వేషణమునందు మాత్రమే వినియోగించవలెను.

'వైనతేయశ్చ పక్షిణామ్' – గరుత్మంతుడు ఒకానొక పక్షి. హనుమంతుడు ఒకానొక కోతి. గజేంద్రుడు మృగము. అయినను వీరందఱును తమతమ భక్త్యతిశయముచేతను, నిరంతర దైవస్మరణచేతను సాక్షాత్ భగవద్రూపులు కాగల్గిరి. ఇవ్విధముగ పశుపక్ష్యాదులే ముక్తినొందుచుండ ఇక మానవు లేల ముక్తికై యత్నింపరాదు? కావున సోమరితనమునువీడి పైనదెల్పిన మహనీయులనుండి పాఠమునేర్చుకొని, యత్నపూర్వకముగ దైవసాక్షాత్కారమునొంది మానవులు తమ మానవత్వమును సార్థకము చేసికొనవలయును.

**31. పవనః పవతామస్మి రామశ్శస్త్రభృతామహమ్**
**ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ.**

**టీక:–** అహమ్ = నేను, పవతామ్ = పవిత్ర మొనర్చువానిలో (లేక వేగముగలవానిలో), పవనః = వాయువును, అస్మి = అయియున్నాను, శస్త్రభృతామ్ = ఆయుధమును ధరించినవారిలో, రామః = శ్రీరామచంద్రుడను, ఝషాణామ్ = చేపలలో, మకరంచ = మొసలియు, అస్మి = అయియున్నాను, స్రోతసామ్ = నదులలో, జాహ్నవీ = గంగానదిని, అస్మి = అయియున్నాను.

**తా:–** నేను పవిత్రమొనర్చువారిలో (లేక వేగవంతులలో) వాయువును, ఆయుధమును ధరించినవారిలో శ్రీరామచంద్రుడను, చేపలలో మొసలిని, నదులలో గంగానదిని అయియున్నాను.

**వ్యాఖ్య:–** ఈ శ్లోకమందు తెలుపబడినరీతి గంగానది సాక్షాత్ భగవత్స్వరూపమే. కావున అది మహాపవిత్రముగ, పాపహారకముగ నెన్నుకొనబడుచున్నది. కృష్ణుడు తాను రాముడేయని వచించుటవలన రామకృష్ణు లిరువురును ఒకే భగవత్స్వరూపమని స్పష్టమగుచున్నది.

## 32. సర్గాణామాదిరన్తశ్చ మధ్యం చైవాహమర్జున
## అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతామహమ్.

**టీక:–** అర్జున = ఓ అర్జునా!. సర్గాణామ్ = సృష్టులయొక్క, ఆదిః = ఆదియు (మొదలు, లేక ఉత్పత్తి), అన్తః చ = అంతమును (లయమును), మధ్యంచ = మధ్యమును (స్థితియు), అహమ్ ఏవ (అస్మి) = నేనే అయియున్నాను, విద్యానామ్ = విద్యలలో, అధ్యాత్మవిద్యా = అధ్యాత్మవిద్యను, ప్రవదతామ్ = వాదించువారిలో, వాదః = (రాగద్వేషరహితముగ, తత్త్వనిశ్చయముకొఱకు చేయబడు) వాదమును, అహమ్ (అస్మి) = నేనైయున్నాను.

**తా:–** ఓ అర్జునా ! సృష్టులయొక్క ఆదిమధ్యాంతములు (ఉత్పత్తి, స్థితి, లయములు) నేనే అయియున్నాను. మఱియు, విద్యలలో అధ్యాత్మవిద్యయు, వాదించువారిలో (రాగద్వేషరహితముగ, తత్త్వనిశ్చయముకొఱకు చేయబడు) వాదమును నేనైయున్నాను.

**వ్యాఖ్య:–** 'అధ్యాత్మవిద్యా విద్యానామ్' – ప్రపంచములో అనేక విద్యలున్నప్పటికిని, అధ్యాత్మవిద్యయే తానని భగవానుడు చెప్పుటవలన ఆ విద్యయొక్క శ్రేష్ఠత్వము బాగుగవెల్లడియగుచున్నది. ఏ విద్యవలన మనుజునకు దుఃఖరాహిత్యము, ఆనందప్రాప్తికలుగునో, పరమశాంతి చేకూరునో, అదియే అన్నిటికంటెను గొప్పదియగును. అట్టిశక్తి ఒక్క బ్రహ్మవిద్య (అధ్యాత్మవిద్య) కు మాత్రమే కలదు. కనుకనే అట్టి లోకోత్తరవిద్య తానని శ్రీకృష్ణమూర్తి పలికిరి. మనుజుడు ఏ విద్యను గడించవలెను? అను ప్రశ్నకిచట చక్కటి సమాధానమొసంగబడినది. అధ్యాత్మవిద్యను జేపట్టి జననమరణరూప సంసారబంధము నుండి విముక్తినొందుడు – అని పరమాత్మ కరుణతో బోధించుచున్నారు. లౌకికవిద్యయేదియు రానివాడైనను అక్షరమగు పరమాత్మనుగూర్చిన **విద్యగలవాడైనచో** రక్షరకుక్షియేయగును★.

'వాదః ప్రవదతామ్' – వాదము, జల్పము, వితండము – అని వాదము మూడువిధములు. (1) రాగద్వేషములు లేక కేవలము తత్త్వమును తెలిసికొను నభిలాషతో చేయబడు ప్రశ్నోత్తరాదులు వాదమనబడును. (2) పరమతములను ఖండించి తనమతమును స్థాపించుకొని, ఇతరులను జయించునిమిత్తము చేయబడు ప్రసంగము జల్పమనబడును. (3) కేవలము పరమతమును దూషించునుద్దేశ్యముతో చేయబడునది వితండమనబడును.

వీనిలో వాదమును తానని భగవానుడు చెప్పుటవలన తత్త్వనిశ్చయముకొఱకై చేయబడు రాగద్వేషరహితమగు విచారణయే ఉత్తమమని స్పష్టమగుచున్నది. కావున విజ్ఞులద్దానినే యాశ్రయించవలెను.

★ నిరక్షరస్యాపితు యస్యకుక్షౌ బ్రహ్మైవ చాభాతి స ఏవ సాక్షరః ।
సర్వాక్షరస్యాపితు యస్యచిత్తే బ్రహ్మైవ నాభాతి స్వై నిరక్షరః ॥

## 33. అక్షరాణామకారోఽస్మి ద్వన్ద్వః సామాసికస్య చ
## అహమేవాక్షయః కాలో ధాతాహం విశ్వతోముఖః.

**టీక:–** అక్షరాణామ్ = అక్షరములలో, అకారః = 'అ' కారమును, అస్మి = అయియున్నాను, సామాసికస్య = సమాసములలో, ద్వన్ద్వః చ = 'దంద్వ' సమాసమును ( అస్మి = అయియున్నాను), అక్షయః = నాశములేని, కాలః = కాలమును (లేక కాలకాలుడగు పరమేశ్వరుడను), అహమ్ ఏవ = నేనే అయియున్నాను, విశ్వతోముఖః = సర్వత్రముఖములుగల విరాట్స్వరూపియగు, ధాతా = బ్రహ్మదేవుడను (లేక కర్మఫలప్రదాతను), అహమ్ = నేనే, ( అస్మి = అయియున్నాను).

**తా:–** నేను అక్షరములలో 'అ' కారమును, సమాసములలో ద్వంద్వసమాసమును అయియున్నాను. మఱియు నాశములేని కాలమును (కాలమునకు కాలమైనట్టి పరమేశ్వరుడను), సర్వత్రముఖములుగల కర్మఫలప్రదాతయును (లేక విరాట్స్వరూపుడగు బ్రహ్మదేవుడను) నేనే అయియున్నాను.

**వ్యాఖ్య:–** 'విశ్వతోముఖః' – భగవంతుని సర్వతోముఖుడని వర్ణించుటచే వారి అస్తిత్వము, చూపు (దృష్టి) సర్వత్రవెలయుచున్నదని భావము. ఈ రహస్యమెఱింగినచో ఇక ఎవరు ఏ పాపమును మనస్సులోగూడ చేయజాలరు.

## 34. మృత్యుస్సర్వహరశ్చాహముద్భవశ్చ భవిష్యతామ్
## కీర్తిశ్శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా.

**టీక:–** సర్వహరః = సమస్తమును సంహరించునట్టి, మృత్యుః చ = మృత్యువును, భవిష్యతామ్ = ఇకముందు ఉత్పత్తికాగల సమస్తముయొక్క, ఉద్భవః చ = పుట్టుకయు, అహమ్ = నేనే, ( అస్మి = అయియున్నాను), నారీణాం = స్త్రీలయొక్క (లేక స్త్రీలలోగల), కీర్తిః = కీర్తి, శ్రీః = సంపద (లక్ష్మి), వాక్ చ = వాక్కు (సరస్వతి), స్మృతిః = జ్ఞానము, మేధా = ధారణాశక్తి గల బుద్ధియు, ధృతిః = ధైర్యము, క్షమా చ = ఓర్పున్ను, ( అహమేవ = నేనే, అస్మి = అయియున్నాను).

**తా:–** సమస్తమును సంహరించునట్టి మృత్యువును, ఇకముందు ఉత్పత్తికాగల సమస్తముయొక్క పుట్టుకయు నేనే అయియున్నాను. మఱియు స్త్రీలలోగల కీర్తి, సంపద, వాక్కు, స్మృతిజ్ఞానము, ధారణాశక్తిగల బుద్ధి, ధైర్యము, ఓర్పు, అను ఈ ఏడుగుణములున్ను నేనే అయియున్నాను.

**వ్యాఖ్య:–** స్త్రీలలోగల పై ఏడు సద్గుణములు తానేయని భగవానుడు సెలవిచ్చియున్నారు. ఈ యేడుగుణములు పురుషులందును కానవచ్చినను, పురుషులతోబాటు స్త్రీలనుగూడ సముద్ధరింపదలంచినవాడై భగవాను డీ ప్రకారముగ తెలియజేసిరి. స్త్రీలోకముపై భగవానున కెంతటి కరుణయో ఈ వాక్యముచే వెల్లడి యగుచున్నది. దీనిని బట్టి స్త్రీలు అబలలు, శక్తిహీనులు కారనియు; వారున్ను పురుషులవలె మేధాశక్తి, ధైర్యము, విద్య (వాక్కు) మొదలైనవి సంపాదించవచ్చుననియు స్పష్టపఱచినట్లైనది. ప్రయత్నముచేతను, అభ్యాసముచేతను, శ్రద్ధవల్లను ఎవరైనను అట్టి సుగుణములను సంపాదించుకొనవచ్చును. ధైర్యము, మేధాశక్తి, సహనము మొదలగు సద్గుణములు తానేయని భగవానుడు

తెలిపినందువలన వానిని సర్వులును అభ్యాసముచేపొంది తమ హృదయములను భగవన్నిలయములుగా నొనర్చుకొనవలయును. ఎచట అట్టి సుగుణములుండునో అచట సాక్షాత్ భగవానుడు కాపురముండును.

ఈశ్లోకముయొక్క రెండవపాదమునకు మఱియొక అర్థమున్ను చెప్పవచ్చును - స్వాయంభువమనువుయొక్క కొమార్తెయగు ప్రసూతి దక్షప్రజాపతిని వివాహమాడగా వారిరువురికిని ఇరువదినలుగురు కొమార్తెలు కలిగిరి. వారిలో కీర్తిదేవి, మేధాదేవి, ధృతిదేవి, స్మృతిదేవి, క్షమాదేవి కలరు. శ్రీదేవి భృగువుయొక్క కొమార్తె, వాగ్దేవి బ్రహ్మదేవునివలన గలిగినది. ఈయేడుగురును ఆ యా సద్గుణములకు అధిష్ఠాన దేవతలు. కావున "స్త్రీలలో ముఖ్యులైనట్టి కీర్తిదేవిని, ఐశ్వర్యదేవిని, వాగ్దేవిని, స్మృతిదేవిని, మేధాదేవిని, ధైర్యదేవిని, క్షమాదేవిని, నేనే అయియున్నాను," - ఎట్లు చెప్పినను ఆ సద్గుణములు భగవత్స్వరూపములనియు, వానిని జీవులు తప్పక అవలంబింపవలయుననియు తెలుపు విషయము మాత్రము సుస్పష్టము.

ఈ శ్లోకముద్వారా ముఖ్యముగ స్త్రీలకు ధర్మమార్గావలంబనమునందు, పరమార్థపథగమనమునందు విశేషప్రోత్సాహము లభించుచున్నది. ఇక వారు తమ విద్యావిషయమునగాని, ధీశక్తివిషయమునగాని నిరుత్సాహపడవలసిన పనిలేదు. వెనుకంజ వేయవలసిన పనిలేదు. పురుషులతోబాటు వారున్ను ఆసుగుణరాశినంతను తమ ప్రయత్నాతిశయముచే సాధించుకొనవచ్చును. ఏలయనిన అవి కలచోటే భగవన్నిలయము.

## 35. బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసామహమ్
## మాసానాం మార్గశీర్షోఽహం ఋతూనాం కుసుమాకరః.

**టీక:–** తథా = ఆ ప్రకారమే, అహమ్ = నేను, సామ్నామ్ = సామవేదగానములలో, బృహత్సామ = బృహత్సామమును, ఛందసామ్ = ఛందస్సులలో (ఛందస్సుతోగూడిన మంత్రములలో), గాయత్రీ = గాయత్రియను ఛందస్సును (అట్టి ఛందస్సుతో గూడిన మంత్రమును), మాసానాం = మాసములలో, మార్గశీర్షః = మార్గశీర్షమాసమును, ఋతూనామ్ = ఋతువులలో, కుసుమాకరః = వసంతఋతువును, అహమ్ (అస్మి) = నేనైయున్నాను.

**తా:–** సామవేదగానములలో బృహత్సామమును, ఛందస్సులలో గాయత్రియు, మాసములలో మార్గశిరమాసమును, ఋతువులలో వసంతఋతువును నేనైయున్నాను.

**వ్యాఖ్య:–** 'మాసానాం మార్గశీర్షోఽస్మి' - ఈ క్రింది కారణములచే మార్గశీర్షమాసముయొక్క శ్రేష్ఠత్వము సూచితమగుచున్నది -

(1) పూర్వము మహాభారతకాలమున సంవత్సరము మార్గశీర్షమాసముతో ప్రారంభమగుచుండెడిది. (మహాభారతము - అను - 106, 109 అధ్యా). కావున అది అన్నిమాసములకును మొదటిది అయియుండెను.

(2) ధనుర్మాసకాలమగు ఆ సమయము మహాపవిత్రమైయున్నది. శాస్త్రములందును ఆ సమయమున వ్రతోపవాసాదులు సలుపువారికి గొప్ప ఫలితములు చేకూరునని వచింపబడినది.

(3) జనులకు క్రొత్తపంట చేతికివచ్చును. అందఱియొద్ద ధాన్యము పుష్కలముగ నుండును.

(4) వాల్మీకి రామాయణమునందు మార్గశీర్షమాసము సంవత్సరమునకు భూషణముగ వర్ణింపబడినది.

(5) భగవద్గీత ఈ మార్గశిరమాసమందే ఆవిర్భవించినది. (మార్గశిర శుద్ధ ఏకాదశి).

(6) అవతారపురుషులగు దత్తాత్రేయులు ఈ నెలయందే జన్మించిరి. (మార్గశిర శుద్ధపౌర్ణమి).

(7) వాతావరణము చల్లగనుండుటచే జనుల హృదయమున్ను ఉల్లాసముగ నుండును. ధ్యానాదులకది అనుకూలసమయము.

'ఋతూనాం కుసుమాకరః' - వసంతఋతువునందు చెట్లన్నియు చిగిర్చి శోభాయమానముగ నుండును. అత్తఱి వాతావరణమున్ను సమశీతోష్ణముగ నుండును. కావున ఋతువులలో నది శ్రేష్ఠముగ వర్ణింపబడెను. శ్రీరామచంద్రుడున్ను ఆ పవిత్రఋతువునందే జన్మించిరి.

## 36. ద్యూతం ఛలయతామస్మి తేజస్తేజస్వినామహమ్
## జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతామహమ్.

**టీక:–** (అహం = నేను), ఛలయతాం = వంచకవ్యాపారములలో, ద్యూతమ్ = జూదమును, అస్మి = అయియున్నాను, తేజస్వినామ్ = తేజోవంతులయొక్క, తేజః = తేజస్సును (ప్రభావము), అస్మి = అయియున్నాను, జయః = జయమును, అస్మి = అయియున్నాను, వ్యవసాయః = ప్రయత్నమును, అస్మి = అయియున్నాను, సత్త్వవతామ్ = సాత్త్వికులయొక్క, సత్త్వమ్ = సత్త్వగుణమును, అహమ్ = నేను, అస్మి = అయియున్నాను.

**తా:–** వంచక వ్యాపారములలో నేను జూదమును అయియున్నాను. మఱియు నేను తేజోవంతులయొక్క తేజస్సును (ప్రభావము), (జయించువారలయొక్క) జయమును, (ప్రయత్నశీలురయొక్క) ప్రయత్నమును, (సాత్త్వికులయొక్క) సత్త్వగుణమును అయియున్నాను.

**వ్యాఖ్య:–** ప్రపంచములోగల సమస్తపదార్థములందును, మంచివానియందుగాని, చెడ్డవానియందుగాని, భగవానుని అస్తిత్వముకలదు. వారి సాన్నిధ్యమే ప్రపంచములోని సమస్తపదార్థములకు, క్రియలకు శక్తిని ప్రసాదించుచున్నది. ఈ సత్యమును నిరూపించుటకే భగవానుడీ విభూతియోగమున కొందఱు దేవతలను, దానవులను, జంతువులను, జడపదార్థములను, కొన్ని క్రియలనుగూడ పేర్కొనెను. సంక్షేపించి చెప్పుటవలన ఒక్కొక్క తరగతికి ఒక్కొక్కటి చెప్పుకొనుచుపోయిరి. ఏ వస్తువును జూచినను, ఏ క్రియను పరికించినను అచ్చోట సాక్షాత్ భగవానునియొక్క అస్తిత్వమును భావనచేయవలెను. ఈ ఉద్దేశ్యముచేతనే జూదవిషయ మిచట ప్రస్తావించబడినది. కాని, దానిని ప్రోత్సహించవలెననిగాని, అనుసరించవలెననిగాని, అది ఉపాదేయమనిగాని అభిప్రాయము గాదు. 'నేను మృగములలో సింహమును' అని చెప్పినంతమాత్రమున సింహముతో ఆటలాడుకొనుమని అర్థముకాదుగదా! అట్లే ఈ జూదవిషయమున్ను - అని గ్రహించుకొనవలయును.

'వ్యవసాయము' అనగా ప్రయత్నము తానని భగవానుడే పేర్కొనుటవలన మోక్షవిషయమున ప్రయత్నరహితులుగ, సోమరులుగనుండక సత్ప్రయత్నమాచరించుచుండుట శ్రేయస్కరమని తెలుచున్నది. ఎచట తేజము (ఉత్సాహము, ధైర్యము మున్నగునవి) ఉండునో, ఎచట దయయుండునో, ఎచట

సత్ప్రయత్నముండునో, ఎచట సత్త్వగుణముండునో అచట తానుండునని భగవానుడు పలికిరి. కావున ఆయా సద్గుణములను చక్కగ అలవఱచుకొనవలెను.

## 37. వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాణ్డవానాం ధనంజయః
## మునీనామప్యహం వ్యాసః కవీనాముశనాకవిః.

**టీక:–** అహమ్ = నేను, వృష్ణీనాం = వృష్ణివంశస్థులగు యాదవులలో, వాసుదేవః = వసుదేవుని కుమారుడగు శ్రీకృష్ణుడను, అస్మి = అయియున్నాను, పాణ్డవానాం = పంచపాండవులలో, ధనంజయః = అర్జునుడను, మునీనామ్ అపి = మునులలోను, వ్యాసః = వేదవ్యాస మునీంద్రుడను, కవీనామ్ = కవులలో, ఉశనాకవిః = శుక్రాచార్యుడను (అస్మి = అయియున్నాను).

**తా:–** నేను వంశీయులలో వసుదేవుని పుత్రుడగు వాసుదేవుడను (శ్రీకృష్ణుడను), పాండవులలో అర్జునుడను, మునులలో వేదవ్యాసమునీంద్రుడను, కవులలో శుక్రాచార్యుడను అయియున్నాను.

**వ్యాఖ్య:–** పాండవులలో అర్జునుడును, మునులలో వ్యాసులును తానేయని భగవానుడు చెప్పుటచే గీతను వినినట్టి అర్జునుడున్ను లిఖించినట్టి వ్యాసులున్ను ఇరువురును సాక్షాత్ భగవత్స్వరూపులేయని స్పష్టమగుచున్నది. కనుకనే గీతాసన్నివేశమున కింతటి మహత్తు చేకూరినది.

'కవీనాముశనాకవిః' - కవియనగా గొప్ప విజ్ఞానముగలవాడని యర్థము. ఉశనాకవియనగా భృగుమహాముని కుమారుడగు శుక్రాచార్యుడు.

## 38. దణ్డో దమయతామస్మి నీతిరస్మి జిగీషతామ్
## మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహమ్.

**టీక:–** అహమ్ (ఏవ) = నేనే, దమయతామ్ = దండించు (శిక్షించు) వారియొక్క, దణ్డః = శిక్షను (దండనీతి), అస్మి = అయియున్నాను, జిగీషతామ్ = జయింప నిచ్ఛగలవారియొక్క, నీతిః = (జయోపాయమగు) నీతి (సామదానభేదదణ్డములను ఉపాయములు), అస్మి = అయియున్నాను, గుహ్యానామ్ = రహస్యములలో, మౌనమ్ = మౌనమును, అస్మి = అయియున్నాను, జ్ఞానవతామ్ = జ్ఞానవంతులయొక్క, జ్ఞానమ్ చ = జ్ఞానమున్ను, (అస్మి = అయియున్నాను).

**తా:–** నేను దండించువారియొక్క దండనమును (శిక్షయు), జయింపనిచ్ఛగలవారియొక్క (జయోపాయమగు) నీతియు అయియున్నాను. మఱియు రహస్యములలో మౌనమును, జ్ఞానవంతులలో జ్ఞానమును నేనై యున్నాను.

**వ్యాఖ్య:–** 'నీతిరస్మి జిగీషతామ్' - నీతితో గూడిన జయమే జయము కాని, అవినీతితోగూడిన జయము జయముకానేరదు; అపజయమేయగును. కావున జయము గొప్పది కాదు, నీతితో గూడిన జయమే గొప్పదని ఈ భగవద్వాక్యమువలన స్ఫురించుచున్నది.

'మౌనం చైవాస్మి గుహ్యానామ్' - మౌనము భగవత్స్వరూపము కావున వాఙ్మౌనము, మానసికమౌనము రెండింటిని సాధకులు అభ్యసించవలెను.

'జ్ఞానం జ్ఞానవతామహమ్' - జ్ఞానము సాక్షాత్ భగవత్స్వరూపము కావున సర్వోత్కృష్టమైనదియగును. కావున దానిని తప్పక జేబట్టవలయును.

## 39. యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున
## న తదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరమ్.

**టీక:–** అర్జునా = ఓ అర్జునా!, సర్వభూతానామ్ = సమస్తప్రాణికోట్లకు, యత్ = ఏది, బీజమ్ = మూలకారణమైయున్నదో (ఉత్పత్తికి హేతువైయున్నదో), తత్ అపి చ = అదియును, అహమ్ (అస్మి) = నేనైయున్నాను.(కిం బహునా = వేయేల), చరాచరమ్ = స్థావరజంగమాత్మకమైన, భూతమ్ = వస్తువు, యత్ స్యాత్ = ఏదికలదో, తత్ = అది, మయా వినా = నన్నువినాగా, నాస్తి = లేదు.

**తా:–** ఓ అర్జునా! సమస్తప్రాణికోట్లకు ఏది మూలకారణమైయున్నదో అదియు నేనే అయియున్నాను. (వెయ్యేల) స్థావరజంగమాత్మకమైన వస్తువేదియు నన్ను వినాగా లేనే లేదు (నాకంటె వేఱుగలేదు).

**వ్యాఖ్య:–** ఇంతదనుక తనయొక్క విభూతులను కొన్నిటిని పేర్కొని తుట్టతుదకు సమస్తము భగవత్స్వరూపమేయని శ్రీకృష్ణమూర్తి పేర్కొనుచున్నారు. సమస్తచరాచర ప్రాణికోట్లయొక్క బీజము (ఉత్పత్తి కారణము) తానేయని భగవానుడు నుడివిరి. బీజము పరమాత్మ అయియున్నపుడు మొలక మఱియొకటియగునా? కాదు. అదియు పరమాత్మయే యగును. దీనినిబట్టి చూచిన సమస్తజీవరాసులు వాస్తవముగ భగవత్స్వరూపులేకాని తదితరులుకారని స్పష్టమగుచున్నది. కావున వారు అల్పులుకారు, పాపులుకారు.

'ప్రతిప్రాణియు ఘనీభూతమగు ఆత్మరూపమేయగును' - అల్పత్వనీచత్వాదులన్నియు జీవులు కల్పించుకొనినవేకాని వాస్తవములుకావు. జీవుని యథార్థరూపము పరబ్రహ్మమే యగును. ఈ సత్యమును నిరూపించుటకొఱకే సమస్తచరాచర ప్రాణుల యొక్క బీజము తానని భగవాను డిచట పలికిరి. మఱియు దైవమువినాగా ఏ ప్రాణియులేదని ఇచట స్పష్టముగా చెప్పబడుటచే ఇక జీవులు అల్పులని, తక్కువజాతి వారని చెప్పు వాదనలన్నియు నిరాధారములుకాక మఱేమికాగలవు? కాబట్టి ప్రతిజీవియు తన బీజము, తన మూలము సాక్షాత్ పరమాత్మయేయని నిశ్చయించి ఉపాధిభావమును వీడి, తాను వాస్తవముగ భగవద్రూపుడేయను భావముగల్గి ధైర్యోపేతుడై, స్వస్వరూపానుసంధానపరుడై యుండవలెను.

## 40. నాన్తోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరన్తప
## ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా.

**టీక:–** పరన్తప = ఓ అర్జునా!, మమ = నాయొక్క, దివ్యానామ్ = దివ్యములైన (అద్భుతములైన), విభూతీనామ్ = విభూతులకు (స్వరూపవిస్తారములకు), అన్తః = అంతము, న అస్తి = లేదు, తు = అయినను, ఏషః = ఈ, విభూతేః = విభూతియొక్క, విస్తరః = వివరణము, ఉద్దేశతః = సంక్షేపముగ, మయా = నాచేత, ప్రోక్తః = చెప్పబడినది.

**తా:–** ఓ అర్జునా! నాయొక్క దివ్యములైన విభూతులకు అంతములేదు. అయినను కొన్నిటిని సంక్షేపముగ నేనిపుడు వివరించి చెప్పితిని.

**వ్యాఖ్య:–** భగవానుడు అనంతుడగుటవలన వారి విభూతులకును అంతముండదు. కావున సంక్షేపముగ నిట వివరించి చెప్పబడినది.

## 41. యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా
## తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశ సమ్భవమ్.

**టీక:–** విభూతిమత్ = ఐశ్వర్యయుక్తమైనదియు, శ్రీమత్ = కాంతివంతమైనదియు (నిర్మలమైనదియు), ఊర్జితమ్ ఏవ వా = ఉత్సాహముతో గూడినదియు (శక్తివంతమైనదియు) నగు, సత్త్వమ్ = వస్తువు (లేక ప్రాణి), యత్ యత్ = ఏదియేది (కలదో), తత్ తత్ = ఆయా వస్తువును లేక ప్రాణిని, మమ = నాయొక్క, తేజోఽంశసమ్భవమ్ ఏవ = తేజస్సు (శక్తి) యొక్క అంశము వలన గలిగినదానినిగనే, త్వమ్ = నీవు, అవగచ్ఛ = తెలిసికొనుము.

**తా:–** (ఈ ప్రపంచమున) ఐశ్వర్యయుక్తమైనదియు, కాంతివంతమైనదియు (నిర్మలమైనదియు), ఉత్సాహముతో గూడినదియు (శక్తివంతమైనదియు) నగు వస్తువు (లేక ప్రాణి) ఏది యేది కలదో అదియది నాతేజస్సుయొక్క అంశమువలన కలిగిన దానినిగనే నీవెఱుంగుము.

**వ్యాఖ్య:–** జ్ఞానైశ్వర్యము, మనోనిర్మలత్వము(బాహ్యాభ్యంతరశుద్ధి), ధర్మముయెడల, మోక్షముయెడల ఉత్సాహము ఎచటనుండునో అచట సాక్షాత్ పరమాత్మవెలుగుచున్నారని గ్రహింపనగును. భగవత్తేజముయొక్క అంశమువలన అట్టి పవిత్రగుణము సంభవించునని చెప్పుటవలన భగవత్తేజము, ఈశ్వరీయశక్తి అనంతమని, అందలి ఏ ఒకానొక అంశమువలననో ఇట్టి ఉత్తమవిభూతి, ఉత్సాహాది సద్గుణములు సంభవించునని తెలియుచున్నది. కాబట్టి జనులట్టి సద్గుణములకు తమహృదయములందుస్థానమొసంగి తద్ద్వారా భగవత్సాన్నిధ్యమును అనుభూతమొనర్చుకొనవలెను. మఱియు ఆ ప్రకారములైన సుగుణము లెవనియందున్నను, ఆతడేజాతివాడైనను భగవంతునివలె వంద్యుడేయగును.

## 42. అథవా బహునైతేన కిం జ్ఞాతేన* తవార్జున
## విష్టభ్యాహమిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్.

**టీక:–** అర్జున = అర్జునా!, అథవా = లేక, బహునా = విస్తారమైన, ఏతేన = ఈ, జ్ఞాతేన = గ్రహింపబడినదానిచే (విభూతి) జ్ఞానముచే, తవ = నీకు, కిమ్ = ఏమిప్రయోజనము?, అహమ్ = నేను, ఇదమ్ = ఈ, కృత్స్నమ్ = సమస్తమైన, జగత్ = జగత్తును, ఏకాంశేన = ఒక్క అంశముచేత (ఏకభాగముచేత), విష్టభ్య = వ్యాపించి, స్థితః = ఉన్నాను.

**తా:–** అర్జునా! లేక, విస్తారమైన ఈ (విభూతి) జ్ఞానముచే నీ కేమి ప్రయోజనము? నేనీ జగత్తునంతను ఒక్క అంశముచేత వ్యాపించియున్నాను (అని తెలిసికొనుము).

---

* జ్ఞానేన -- పాఠాన్తరము

**వ్యాఖ్య:–** ఈ ప్రకారముగ భగద్విభూతిని ఎంత తెలిసికొనినను, ఇంకను తెలిసికొనవలసినది మిగిలియేయుండును గావున, అంతములేని ఈ వర్ణనలవలన నీకేమి ప్రయోజనమని భగవాను డర్జుననకు హితబోధచేయుచున్నారు. అవియన్నియు ఏ ఒక్కపరమాత్మ చైతన్యముచే వ్యాపింపబడియున్నవో, ధరింపబడియున్నవో ఆ ఒక్కదానిని తెలిసికొనినచాలునని వచించుటయగును. ఈ జగత్తంతయు పరమాత్మయొక్క ఒకానొక అంశముచేతనే వ్యాపింపబడియున్నదని చెప్పబడుటచే భగవానుని అనంతశక్తి, విశ్వవ్యాపకత్వము వెల్లడియగుచున్నది. ఈ అనంతకోటి బ్రహ్మాండములన్నియు ఎంతయో విశాలములయినవి. అయినను భగవానుని ఏ ఒక్క అంశముచేతనో అవియన్నియు వ్యాపింపబడియున్నవి. ఇంకను ఎన్ని అంశములో మిగిలియున్నవి.

**'పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి'** అను పురుషసూక్తవచన మీయర్థమునే ప్రస్ఫుటీకరించుచున్నది. దీనినిబట్టి భగవానునిముందు ఈ విశ్వమంతయు ఎంత అల్పమైనదో ద్యోతకమగుచున్నది. మఱియు ఏ మహనీయుని ఒకానొక అంశముచే ఈ జగత్తంతయు పరివ్యాప్తమైయున్నదో అట్టి పరమాత్మయొక్క అఖండ శక్తికి మనుజుడు జోహారులర్పింపవలసియున్నాడు. అట్టి సర్వేశ్వరుని వినమ్రచిత్తుడై అనన్యభక్తితో సేవించవలసియున్నాడు. వారి అనంత శక్తిని, విశ్వవ్యాపకత్వమును, విరాడ్రూపమును తలంచుకొని అల్పుడగు జీవుడు తన గర్వమును, అహంకారమును పారద్రోలవలెను. ఆతని ధనముగాని, అధికారముగాని, బలముగాని, శక్తిగాని, సర్వేశ్వరుని అనంతతేజముయొద్ద ఏపాటిది? ఇంతియేకాదు. ఇంకను పైకిపోయి విచారించినచో, ఈ దృశ్యజాతమంతయు మిథ్యయై, కల్పితమై యున్నట్లు తెలియగలదు. సత్యవస్తు వొక్క పరమాత్మయే అయియున్నాడు. అసత్యవస్తు వెంత పెద్దదైనను, గొప్పదైనను దానికి విలువ ఒకింతైననులేదు. స్వప్నప్రపంచ మెంత గొప్పదైనను జాగ్రతునిముందు తీసికట్టేకదా! కాబట్టి ఈ రహస్యములన్నిటిని తెలిసికొని జీవుడు తన అహంభావమును, దర్పమును పారవైచి పరమాత్మను శరణుబొంది కృతార్థుడుకావలెను. ఈ విభూతియోగమువలన నేర్చుకొనుపాఠ మిదియే.

**ప్ర:–** ఈ జగత్తంతయు దేనిచే వ్యాప్తమైయున్నది?

**ఉ:–** పరమాత్మయొక్క ఒకానొక అంశముచే వ్యాప్తమైయున్నది. (భగవత్స్వరూపమునం దీ విశ్వమంతయు పరిగణింపబడజాలనంత అల్పమై యున్నదని భావము).

ఓమ్

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే అక్షరపరబ్రహ్మయోగో నామ
దశమోఽధ్యాయః

ఇది ఉపనిషత్ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున
సంవాదమునగు శ్రీ భగవద్గీతలందు విభూతియోగమను
పదియవ అధ్యాయము

ఓమ్ తత్ సత్



ఓం

# శ్రీ భగవద్గీత

అథ ఏకాదశోఽధ్యాయః

## పదునొకండవ అధ్యాయము

విశ్వరూపసందర్శనయోగః

## విశ్వరూపసందర్శనయోగము

**ఈ అధ్యాయము యొక్క పేరు :-**

'విశ్వరూపసందర్శనయోగము' - అర్జునుని ప్రార్థన ననుసరించి భగవానుడు తన విశ్వరూపము నాతనికి జూపించిరి. ఈ అధ్యాయమునందలి యెక్కువభాగము ఆ విశ్వరూపముయొక్క వర్ణనలతోను, అట్టి విశ్వరూపియగు భగవానునకు అర్జునుడు గావించిన స్తోత్రములతోను గూడియుండుటబట్టియు సాక్షాత్ భగవానునియొక్క విశ్వరూపసందర్శనము అర్జునునకు లభించిన యధ్యాయమగుటచేతను దీనికి 'విశ్వరూపసందర్శనయోగమ'ను పేరు కలిగినది.

**ఈ అధ్యాయమందలి ప్రధాన విషయములు :-**

(1) విశ్వరూపమును జూపవలసినదిగా అర్జునుడు భగవానుని ప్రార్థించుట - (1 శ్లో॥ నుండి 4 శ్లో॥ వఱకు)

(2) భగవానుడు తన విశ్వరూపమును వర్ణించుట - (5 శ్లో॥ నుండి 8 శ్లో॥ వఱకు)

(3) సంజయుడు ధృతరాష్ట్రునకు విశ్వరూపమును వర్ణించి చెప్పుట - (9శ్లో ॥ నుండి 14శ్లో ॥ వఱకు)

(4) అర్జునుడు భగవానుని విశ్వరూపమును దర్శించుట, స్తుతించుట - (15 శ్లో॥ నుండి 31 శ్లో॥ వఱకు)

(5) భగవానుడు తనశక్తిని వెల్లడించుచు యుద్ధమొనర్చుటకై అర్జునుని ప్రోత్సహింప జేయుట - (32 శ్లో॥ నుండి 34 శ్లో॥ వఱకు)

(6) విశ్వరూపమును జూచి భీతిల్లిన అర్జునుడు భగవానుని స్తుతించుట, చతుర్భుజరూపము తిరిగి గ్రహించులాగున ప్రార్థించుట - (35 శ్లో॥ నుండి 46 శ్లో॥ వఱకు)

(7) భగవానుడు విశ్వరూపసందర్శనమహిమను చెప్పుట, తిరిగి సౌమ్యరూపమును గ్రహించుట - (47 శ్లో॥ నుండి 50 శ్లో॥ వఱకు)

# విశ్వరూప సందర్శనయోగము



**పశ్య మే పార్థ రూపాణి శతశోऽథ సహస్రశః**
**నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ.** **(11-5)**

ఓ అర్జునా! అనేకవిధములుగ నున్నవియు, అలౌకికములైనవియు, వివిధ వర్ణములు ఆకారములుగలవియు, అసంఖ్యాకములుగ వర్తించునవియు నగు నాయొక్క రూపములను గాంచుము.

(8) అనన్యభక్తిచేతనే విశ్వరూపసందర్శనము సాధ్యపడగలదని చెప్పుట, ఫలసహితముగ అనన్యభక్తినిగూర్చి ప్రవచించుట - (51 శ్లో॥ నుండి 55 శ్లో॥ వఱకు)

**పూర్వాధ్యాయముతో ఈ అధ్యాయమునకు గల సంబంధము :-**

క్రిందటి అధ్యాయము (విభూతియోగము) యొక్క చివర తానీజగత్తునంతను ఒకానొక అంశము (Fraction) చేతనే వ్యాపించియున్నానని భగవానుడునుడువగా, వెంటనే అర్జునునకు భగవానుని అనంతవిశ్వరూపమును జూడవలెనను తీవ్రమగు ఉత్సుకతకలిగి అద్దానిని చూపవలసినదిగా భగవానుని వేడుకొనెను. అర్జునుని యా ప్రార్థనతో ఈ 11వ అధ్యాయము మొదలిడుచున్నది. మఱియు క్రిందటి అధ్యాయమున భగవానుడు తన విభూతులనుగూర్చి ఒకింత తెలియజేయగా, వానియన్నిటిని ప్రత్యక్షముగ వీక్షింపనెంచియు, సర్వేశ్వరుని అనంత మహావిభూతి నొక పర్యాయము కళ్ళార చూడదలంచియు, అట్టి విశ్వరూపసందర్శనమునకై భగవాను నివ్విధముగ (నాలుగు శ్లోకములద్వారా) ప్రార్థింపదొడగెను -

**అర్జున ఉవాచ :-**

## 1. మదనుగ్రహాయ పరమం గుహ్యమధ్యాత్మ సంజ్ఞితమ్
## యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ.

అర్జున ఉవాచ = అర్జునుడు చెప్పెను-

**టీక :-** మదనుగ్రహాయ = నన్ననుగ్రహించుటకొఱకు, పరమమ్ = సర్వోత్తమమైనదియు, గుహ్యమ్ = రహస్యమైనదియు, అధ్యాత్మసంజ్ఞితమ్ = అధ్యాత్మమనుపేరుగలదియు (అగు), యత్ వచః = ఏ వాక్యము, త్వయా = నీచేత, ఉక్తమ్ = చెప్పబడినదో, తేన = దానిచేత, మమ = నాయొక్క, అయమ్ మోహః = ఈ అజ్ఞానము, విగతః = పూర్తిగ తొలగిపోయినది.

**తా:-** అర్జునుడు చెప్పెను - (శ్రీకృష్ణమూర్తీ!) నన్ననుగ్రహించుటకొఱకై సర్వోత్తమమై, రహస్యమై అధ్యాత్మమను పేరుగలదైనట్టి ఏ వాక్యమును (బోధను) మీరు చెప్పితిరో, దానిచే నా అజ్ఞానము పూర్తిగా తొలగిపోయినది.

**వ్యాఖ్య:-** శ్రీకృష్ణభగవాను డింతవఱకు అర్జునునకు గావించిన ఆధ్యాత్మిక హితబోధచే అర్జునుని మోహము (అజ్ఞానము) తొలగిపోయినది. ఏ అవివేకమువలన మొట్టమొదట ఈ దృశ్యజగత్తు నిత్యమని, 'ఈ బంధువులు నావారని' 'ఈ దేహము నేన'ని అర్జునుడు తలంచుచు తత్ఫలితముగ దుఃఖమునొందుచుండెనో ఆ అవివేకమిపుడు భగవానుని అధ్యాత్మప్రసంగమువలన తొలగిపోయినది. గీతాబోధ యింకను పూర్తి కాలేదు. 10 అధ్యాయములుమాత్ర మైనది. ఇంకను 8 అధ్యాయములు బాకీయున్నవి. అయినను ఇంతమాత్రపు బోధచేతనే అర్జునునకు చిత్తోపరతి, జ్ఞానప్రాప్తి, తత్ఫలితముగ మోహోపశమనము సంభవించినది. ఈ విషయమును అర్జునుడు 'మోహోఽయంవిగతోమమ' (నా అజ్ఞాన మంతరించినది) - అను వాక్యముద్వారా స్పష్టముగ ఒప్పుకొనెను.

అర్జునుడు భవరోగముచే పీడితుడగుచుండెను. శ్రీకృష్ణపరమాత్మయను వైద్యుడుగీతామృతమను ఔషధము నొసంగిరి. అద్దాని నొకింతమాత్రమే అర్జునుడు సేవించెను. పూర్తిగాకాదు. అయినను

ఆ రవ్వంతమందుతోనే అర్జునుని రోగము (మోహమను వ్యాధి) పూర్తిగ నయమయ్యెను. దీనినిబట్టి ఆ వైద్యుడెంతగొప్పవాడో, ఆతడిచ్చిన ఆ మందు ఎంతపటుతరమైనదో స్పష్టమగుచున్నది. ఔషధముయొక్క శ్రేష్ఠత్వము వ్యాధినివారణపై ఆధారపడియుండును. వ్యాధితొలగనిచో ఆ ఔషధము శ్రేష్ఠమైనది కాదని యర్థము. ఇచట గీతామృతభేషజమును దాదాపు సగముసేవించినంతనే ఫలితము వెంటనే అర్జునునియందు కానంబడినది. ఆతని అజ్ఞానరోగము, భవరోగము పటాపంచలైపోయినది. శ్రీకృష్ణ పరమాత్మ సామాన్యులుకారు. యోగిరాట్. యోగీశ్వరులు. వారు బోధించిన అధ్యాత్మబోధయు సామాన్యమైనదికాదు. అది (1) మహాశ్రేష్ఠమైనది (పరమం) (2) అతిరహస్యమైనది (గుహ్యమ్) - అని అర్జును డిచట దానిని గూర్చి పలికెను. ఏలయనగా అద్దాని ప్రభావముచే ఆతని హృదయమందు ప్రత్యక్షఫలితము కానుపించినది. అంధకారము తొలగినది. ప్రకాశమావిర్భవించినది.

ప్రపంచములో ఎన్నియో విద్యలు కలవు. కాని అవియన్నియు హృదయాంధకారవినాశమందు సమర్థములుకావు. భవరోగనివారణమందు శక్తివంతములు కావు. కాని ఈ అధ్యాత్మబోధ అట్టిది కాదు. ఇది జననమరణ దుఃఖప్రవాహము నుండి జీవుని ఉద్ధరించి దరికి జేర్చునది. కనుకనే అర్జును డిద్దానిని 'పరమమ్' (మిగుల శ్రేష్ఠమైనది) అనియు 'గుహ్యమ్' (అతిరహస్యమైనది) అనియు పేర్కొనెను. అయితే యిట్టి మహత్తరమైన విద్యను గురువులు అందఱికిని చెప్పరు. ఎవరు అధికారులో, ఎవరియందు వారికి అనుగ్రహము కలుగునో ('మదనుగ్రహాయ') ఎవరు నిర్మలభక్తితో గూడియుందురో అట్టివారికి మాత్రమే వారు బోధించుదురు. ఇట అర్జునుడట్టి యోగ్యతలు గలిగియుండెను. కావున ఆతనిపై భగవానునకు అనుగ్రహముగలిగి ఆతనికి పరమపావనమగు అధ్యాత్మవిద్య నుపదేశించిరి. 'మదనుగ్రహాయ' అను పదముచే అధ్యాత్మవిద్యాపరిగ్రహణమున గురువుయొక్క అనుగ్రహము శిష్యునకు అత్యావశ్యకమని తేలుచున్నది.

భుజించువానికి త్రేపువచ్చినచో కడుపునిండినట్లు గ్రహించుకొనవచ్చును. అనగా అతనికి తృప్తికలిగినదని యర్థము. అదియే దానికి గురుతు. అర్జునుడు గీతామృతమును తనివితీర పానము చేయుచుండెను. 10 అధ్యాయములు వినినంతనే ఆతనికొక త్రేపువచ్చెను. "మోహోఽయం విగతోమమ" (నా అజ్ఞానము శమించినది) అను వాక్యమే ఆ త్రేపు. మఱల 18 వ అధ్యాయమున 'నష్టోమోహః స్మృతిర్లబ్ధా' అను వాక్యమును పలుకుటద్వారా తన పరిపూర్ణసంతృప్తిని ఈ ప్రకారమే మఱియొకసారి వెల్లడింపగలడు.

**ప్ర:-** అధ్యాత్మ విద్య యెట్టిది?

**ఉ:-** (1) సర్వోత్కృష్టమైనది (2) అతిరహస్యమైనది.

**ప్ర:-** దాని ప్రభావమెట్టిది?

**ఉ:-** అది జీవుల అజ్ఞామును, సంసారవ్యామోహమును నశింపజేయును.

**ప్ర:-** శ్రీకృష్ణమూర్తి అద్దానిని అర్జునుని కేల బోధించెను?

**ఉ:-** అతడు సర్వవిధముల తచ్ఛ్రవణమునకు భక్త్యాదులచే యోగ్యతను బడసెను. కనుక ఆతనిపై అనుగ్రహముకలిగి దానిని బోధించెను.

**ప్ర:-** ఆ బోధ అర్జునునకు ఫలించెననుటకు గురుతేమి?

**ఉ:-** దానిని వినిన వెంటనే 'నా అజ్ఞానము శమించినది' అని యతడు పలికెను.

**2. భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా
త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్యమపి చావ్యయమ్.**

**టీక:–** హి = ఏలయనగా, కమలపత్రాక్ష = కమలనేత్రుండవగు ఓ కృష్ణా!, త్వత్తః = నీవలన, భూతానాం = ప్రాణులయొక్క, భవాప్యయౌ = ఉత్పత్తినాశములు, విస్తరశః = సవిస్తరముగ, మయా = నాచేత, శ్రుతౌ = వినబడినవి, అవ్యయమ్ = నాశములేని, (తే = నీయొక్క), మాహాత్మ్యమ్ అపి చ = మహిమయున్ను, శ్రుతం = (నాచే) వినబడెను.

**తా:–** ఏలయనగా కమలనేత్రులగు ఓ కృష్ణా! మీవలన ప్రాణులయొక్క ఉత్పత్తి వినాశములగూర్చి, మీయొక్క మాహాత్మ్యమును (మహిమను) గూర్చి సవిస్తరముగ వింటిని.

**3. ఏవమేతద్యథాఽఽత్థ త్వమాత్మానం పరమేశ్వర
ద్రష్టుమిచ్ఛామి తే రూపమైశ్వరం పురుషోత్తమ.**

**టీక:–** పరమేశ్వర = ఓ పరమేశ్వరా!, త్వమ్ = నీవు, ఆత్మానం = నిన్నుగూర్చి, యథా = ఏప్రకారముగ, ఆత్థ = చెప్పితివో, ఏవమ్ ఏతత్ = అది అట్లే (అని నేను విశ్వసించుచున్నాను), పురుషోత్తమ = పురుషోత్తముండవగు ఓ కృష్ణా, తే = నీయొక్క, ఐశ్వరమ్ = ఈశ్వరసంబంధమైన (జ్ఞానైశ్వర్యశక్తి బలవీర్యాది సంపన్నమగు), రూపమ్ = (విశ్వ)రూపమును, ద్రష్టుమ్ = చూచుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

**తా:–** ఓ పరమేశ్వరా! మిమ్ము గూర్చి మీరు చెప్పినదంతయు సరియేయని నేను విశ్వసించుచున్నాను. ఓ పురుషోత్తమా! మీయొక్క ఈశ్వరసంబంధమైన విశ్వరూపమును నేనిపుడు చూడదలంచుచున్నాను.

**4. మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టుమితి ప్రభో
యోగేశ్వర తతో మే త్వం దర్శయాత్మాన మవ్యయమ్.**

**టీక:–** ప్రభో = ప్రభో!, తత్ = ఆ నీ స్వరూపము, మయా = నాచేత, ద్రష్టుం = చూచుటకు, శక్యమ్ ఇతి = సాధ్యమని, మన్యసే యది = తలంతువేని, తతః = అటుపైని, యోగేశ్వర = ఓ యోగేశ్వరా! , త్వమ్ = నీవు, అవ్యయమ్ = నాశరహితమైన, ఆత్మానమ్ = నీ స్వరూపమును, మే = నాకు, దర్శయ = చూపుము.

**తా:–** ప్రభూ! ఆ మీస్వరూపమును జూచుటకు నాకు సాధ్యమగునని మీరు తలంతురేని, ఓ యోగేశ్వరా! నాశరహితమైన ఆ మీ (విశ్వ)రూపమును ఇక నాకు జూపుడు.

**వ్యాఖ్య:–** వినయవిధేయతలు భక్తిప్రపత్తులుగలిగిన శిష్యునియొక్క లక్షణము ఈ శ్లోకము ద్వారా వెల్లడియగుచున్నది. అర్జునునకు భగవానుని విశ్వరూపమును జూడ కోర్కె జనించినది. అయితే 'అద్దానిని నాకు జూపుడు' అని మోటుగా అడుగక 'అట్టి రూపమును జూచుటకు నేను తగుదునని మీరుతలంచుచో చూపుడు'- అని అత్యంతవిధేయతతో ప్రశ్నించెను. గురువుచెంతనుండు అంతేవాసులిట్టి వినయాన్విత ప్రవర్తనను నేర్చుకొని యుండవలయును.

**అ॥** తన ప్రియభక్తుడగు అర్జునుని యా ప్రార్థనను విని శ్రీ కృష్ణమూర్తి మూడు శ్లోకములద్వారా తన విశ్వరూపమును వర్ణించిచెప్పుచు అద్దాని నవలోకింపుమని అర్జునునితో పలుకుచున్నాడు -

**శ్రీ భగవానువాచ :-**

**5. పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః**
**నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీనిచ.**

శ్రీభగవానువాచ = శ్రీభగవంతుడు చెప్పెను -

**టీక:-** పార్థ = ఓ అర్జునా!, నానావిధాని = అనేకవిధములైనవియు, దివ్యాని = అలౌకికములైనవియు, నానావర్ణాకృతీని చ = అనేకరంగులు, ఆకారములు గలవియు, శతశఃఅథసహస్రశః = వందలకొలది, మఱియు వేలకొలది యున్నవియు (అసంఖ్యాకములైనవియు) అగు, మే = నాయొక్క, రూపాణి = రూపములను, పశ్య = చూడుము.

**తా:-** శ్రీభగవానుడు చెప్పుచున్నాడు - ఓ అర్జునా! అనేకవిధములుగ నున్నవియు, అలౌకికములైనవియు, వివిధవర్ణములు ఆకారములుగలవియు, అసంఖ్యాకములుగ వర్తించునవియు నగు నాయొక్క రూపములను గాంచుము.

**6. పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రానశ్వినౌ మరుతస్తథా**
**బహూన్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత.**

**టీక:-** భారత = ఓ అర్జునా!, ఆదిత్యాన్ = సూర్యులను, వసూన్ = వసువులను, రుద్రాన్ = రుద్రులను, అశ్వినౌ = అశ్వినీదేవతలను, మరుతః = మరుత్తులను, పశ్య = చూడుము, తథా = ఆప్రకారమే, అదృష్టపూర్వాణి = మున్నెన్నడును చూడబడని, బహూని = పెక్కు, ఆశ్చర్యాణి = ఆశ్చర్యములను, పశ్య = చూడుము.

**తా:-** ఓ అర్జునా! సూర్యులను, వసువులను, రుద్రులను, అశ్వనీదేవతలను, మరుత్తులను చూడుము. అట్లే ఇదివఱకెన్నడును నీవు చూడని పెక్కు ఆశ్చర్యములను గాంచుము.

**వ్యాఖ్య:-** (1) సూర్యులు (12మంది). (2) వసువులు (8మంది). (3) రుద్రులు (11మంది). (4) అశ్వనీదేవతలు (ఇద్దరు). (5) మరుత్తులు (49మంది).

**7. ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్**
**మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ద్రష్టు మిచ్ఛసి.**

**టీక:-** గుడాకేశ = ఓ అర్జునా!, సచరాచరమ్ = చరచరాత్మకమగు (స్థావరజంగమాత్మకమగు), కృత్స్నమ్ = సమస్తమైన, జగత్ = ప్రపంచము, అన్యత్ యత్ = ఇంకను దేనిదేనిని, ద్రష్టుమ్ ఇచ్ఛసి =

చూడగోరుచున్నావో, (తత్) చ = దానినిగూడ, మమ = నాయొక్క, ఇహ = ఈ (ఇక నీకు చూపబోవు), దేహే = శరీరమందు, ఏకస్థమ్ = (అవయవములవలె) ఒకచోట నున్నదానినిగా, అద్య = ఇపుడు, పశ్య = చూడుము.

**తా:–** ఓ అర్జునా! ఈ సమస్తచరాచర ప్రపంచమును, ఇంకను దేనిదేనిని జూడ దలంచుచున్నావో దానిని ఈ నాశరీరమందు (అవయవములవలె) ఒకచోటనున్నదానినిగా ఇపుడు చూడుము.

**వ్యాఖ్య:–** 'విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్' – అని భగవాను డిదివరలో (విభూతియోగముచివర) చెప్పినచందమున ఈ సమస్తబ్రహ్మాండములతోగూడిన చరాచరజగత్తంతయు పరమాత్మయొక్క ఒకానొక అంశమునందే ఇమిడి యున్నదగును. కావుననే తనయొక్క అనంతదేహమున (స్వరూపమున) ఈ విశ్వమునంతను ఒకానొక చోట (అవయవమువలె) నున్నదానినిగా వీక్షింపవలసినదిగా శ్రీకృష్ణపరమాత్మ అర్జుననకిచట తెలిపిరి. దీనినిబట్టి పరమాత్మయొక్క స్వరూప మెంత విశాలమైనదో, అనంతమైనదో యోచించుకొనవచ్చును. భూతాకాశమే ఎంతయో విస్తృతమైనది; సూక్ష్మమైనది. దానికంటె చిత్తాకాశము ఇంకను విస్తృతమై, సూక్ష్మతరమైయున్నది. దానికంటె చిదాకాశము (ఆత్మ) ఇంకను విశాలమై, సూక్ష్మతమమై వెలయుచున్నది. కావున అట్టి చిదాకాశమునందు ఈ భూతాకాశముగాని, దానియందెచటనో అణగియున్న ఈ చరాచరజగత్తుగాని ఏపాటిది? కనుకనే ఆ చిదాకాశమున (ఆత్మయందు) ఈ సమస్తప్రపంచము ఎక్కడో ఒకమూల (కల్పితమై) అణగి యున్నదని భగవాను డిచట నుడివిరి.

ఇట్టి అనంతరూపుడు, సర్వవ్యాపి, సర్వశక్తిమంతుడునగు పరమాత్మను అల్పుడును, పరిచ్ఛిన్నుడును, దేశకాలాదులకు వశుడును నగు ఈజీవుడు భక్తిప్రపత్తులుగలిగి వినయవిధేయుడై సేవించుట ధర్మము. ఈ ప్రకారముగ ఆ సమష్టిరూప పరమాత్మను సేవించుటచే వారి యనుగ్రహమువలన జ్ఞానమునుబడసి వారిలో ఐక్యమొంది తరించుటకు అవకాశముండును. లేకున్న ఈ జననమరణప్రవాహమున తగుల్కొని జీవుడు ఇంకెంతకాలమో దుఃఖములపాల్పడవలసి యున్నది.

మనుజున కెపుడైన తనయొక్క ధన, జన, క్షేత్ర, అధికారాదులగూర్చిన అహంకారము, గర్వము కలిగినచో అత్తఱి ఈశ్లోకమును చక్కగ మననము చేసినచో ఆ గర్వములన్నియు ఉడిగిపోగలవు. ఏలయనిన, 'ఈవిశాలజగత్తంతయు ఎద్దానియందొకమూల కల్పితమై అణుమాత్రముగ భాసించుచున్నదో అట్టి పరమాత్మయొక్క అనంతరూపమున ఈ నా ధనముగాని, బలముగాని, పరిజనముగాని, అధికారముగాని ఏమూలకు? కావున వానినిజూచి ఏల గర్వపడవలెను?' అను భావ మాతనికపుడు కలుగగా భగవంతునియెడల భక్తిభావ ముత్పన్నమగును. మఱియు అల్పములగు ఈ దృశ్యపదార్థములయెడల విరాగము జనించును.

**అ॥** భౌతికనేత్రముచే విశ్వరూపము నెవరును చూడజాలరు. కనుక అర్జుననకు భగవానుడు దివ్యదృష్టిని ప్రసాదించుచున్నాడు –

## 8. న తు మాం శక్యసే★ ద్రష్టుమనేనైవ స్వచక్షుషా
## దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్.

**టీక:–** అనేన = ఈ, స్వచక్షుషా ఏవతు = నీ మాంసమయనేత్రములతోనే, మాం = నన్ను, ద్రష్టుమ్

★ శక్యసే – పాఠాన్తరము

= చూచుటకు, న శక్యసే = శక్తుడవుకావు, దివ్యం చక్షుః = దివ్యదృష్టిని (జ్ఞాననేత్రమును), తే = నీకు, దదామి = ఇచ్చుచున్నాను, ఐశ్వరమ్ = ఈశ్వరసంబంధమగు, మే = నాయొక్క, యోగమ్ = యోగమును (యోగమహిమను, అలౌకికసామర్థ్యమును), పశ్య = చూడుము.

**తా:–** ఈ నీ మాంసమయ నేత్రములతో నీవు నావిశ్వరూపమును గాంచ జాలవు. కావున దివ్యదృష్టిని (జ్ఞాననేత్రమును) నీకు ప్రసాదించుచున్నాను. దానిచే ఈశ్వరసంబంధమైన నాయోగమహిమను జూడుము.

**వ్యాఖ్య:–** భగవంతు డేల కనుపించుటలేదను ప్రశ్నకిచట సమాధానము చెప్పబడినది. ఈచర్మచక్షువులచే (స్థూలనేత్రములచే) మనుజుడు అతిసూక్ష్మమైన పరమాత్మను చూడజాలడు. సామాన్యాకాశమునే ఈనేత్రములచే చూడజాలనపుడు ఇక సూక్ష్మాతి సూక్ష్మమైన చిదాకాశమును (పరమాత్మను) ఎట్లు చూడగలడు? పంచభూతాత్మకమగు నేత్రము పాంచభౌతిక పదార్థములనే చూడగలదుగాని, చిన్మయ ఆత్మవస్తువునుగాదు. కావున పరమాత్మను దర్శింపవలెననిన జ్ఞాననేత్రము, దివ్యదృష్టి అవసరమైయున్నది.

'దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః' "సూక్ష్మమగు ఏకాగ్రబుద్ధితో తత్త్వవేత్తలచే పరమాత్మ చూడబడుచున్నాడు. (అనుభూతమగుచున్నాడు)". అను శ్రుతివాక్య మీ సత్యమునే వెల్లడించుచున్నది. భగవానుడు సర్వత్ర వ్యాపించియుండి ప్రత్యక్షముగనే యున్నారుకాని జనులకంటికి పొర (అజ్ఞానము) కప్పబడియుండుటవలన వారాతనిని చాడజాలకున్నారు. అదియే మాయాయవనిక; అదియే అజ్ఞానతిమిరము. దానిని జ్ఞానాంజనముచే తుడిచివేసినచో పరమాత్మను ప్రత్యక్షముగ దర్శింపగలరు.

**సర్వగం సచ్చిదాత్మానం జ్ఞానచక్షుర్నిరీక్షతే**
**అజ్ఞానచక్షుర్నేక్షేత భాస్వన్తం భానుమన్ధవత్** (శ్రీ శంకరాచార్యులవారు – ఆత్మబోధ)

'సర్వవ్యాపకమగు సచ్చిదానందపరబ్రహ్మమును జ్ఞాననేత్రముతోనే మనుజుడు చూడగలడు. ప్రకాశించుచున్న సూర్యుని గ్రుడ్డివాడు చూడజాలనట్లు అజ్ఞాననేత్రు డాతనిని వీక్షింపజాలడు'.

'దేవుడు మాకంటికి కనుపించుటలేదు. కావున ఆతడు లేడ'ని వాదించుట గ్రుడ్డివారు, సూర్యుడులేడని వాదించుటవంటిదే యగును. కాబట్టి భగవద్దర్శనమునకు దైవానుభూతికి జ్ఞాననేత్రమును, దివ్యదృష్టిని సంపాదించవలెను. అయితే, అది యెట్లులభించును? భగవత్కరుణచే. 'దదామితేచక్షుః' – అని భగవానుడు చెప్పుటబట్టి దానిని వారివ్వవలసినదే. కాని, అందఱికిని దాని నిచ్చునా? కాదు. ఎవరు అనన్యభక్తిగలిగి వారిని ధ్యానించుదురో, సేవించుదురో వారికి మాత్రమే ఇచ్చును. అర్జునుడట్టి అర్హతను సంపాదించుకొనెను గనుక ఆతనికి లభించినది. అట్లే ఎవరైనను సరియే అట్టి భక్తిప్రపత్తులుగలిగి భగవానుని ప్రీతితో సేవించినచో, ధ్యానించినచో వారికిన్ని అది తప్పక లభించును. "తేషాం సతతయుక్తానాం... దదామిబుద్ధియోగం..." (10-10) అను విభూతియోగమందలి శ్లోకమున్ను యీ తత్త్వమును ప్రతిపాదించుచున్నది. భూతద్దము అమర్చబడిన కండ్లజోడును ధరించినచో జలమందు, స్థలమందు, ఆకాశమందుగల అతిసూక్ష్ములైన పదార్థములు గోచరించును. మామూలు కండ్ల కవి కానరావు. ఆ అద్దమును బీదవాడు ధరించినను ఎవరు ధరించినప్పటికిని ఆ సూక్ష్మవస్తువులు గోచరించును. దానిని ధరింపనిచో ధనవంతుడైనను, ఉన్నతకులసంజాతుడైనను, పురుషుడైనను, మహాపండితుడైనను ఆ వస్తువులు కనిపించవు. అట్లే జ్ఞాననేత్రము (దివ్యదృష్టి) అను కండ్లజోడు ధరించినవారికే పరమాత్మ ప్రత్యక్షమగును. ఆత

డెట్టిజాతివాడైనను, ఎట్టి అంతస్తునందున్నను సరియే. భగవద్దర్శనమున కుపకరించు ఆ కండ్లజోడును సర్వేశ్వరుడే ప్రసాదించగలడు (భక్త్యాదులు గలిగియున్నచో). కాబట్టి ఆ వస్తువును సంపాదింపకపోయినచో అది ఎవరి దోషము? వారి వారి దోషమేయగును. దేవుడు కానరాకపోవుటకు కారణము జీవులయొక్క ప్రయత్నరాహిత్యమే యగును. కాబట్టి సర్వులును గీతయందు తెలుపబడిన భక్త్యాది, అమానిత్వాది, అద్వేష్టృత్వాది, అభయాది సుగుణములను ప్రయత్నపూర్వకముగ సంపాదించి భగవత్కటాక్షమును, తద్ద్వారా జ్ఞాననేత్రమును, తద్ద్వారా బ్రహ్మసాయుజ్యమును పొందవలెను.

'దివ్యమ్' - దైవసంబంధమైనది - 'దైవసంపత్తి' ద్వారా లభించునది.

**ప్ర:—** భగవంతుని ఈ స్థూలనేత్రములచే చూడ శక్యమగునా?

**ఉ:—** కాదు.

**ప్ర:—** మఱి దేనిచే చూడ సాధ్యమగును?

**ఉ:—** దివ్యనేత్రములచే (జ్ఞానచక్షువులచే).

**ప్ర:—** ఆ దివ్యనేత్ర మెవని వలన లభించును?

**ఉ:—** భగవానుని వలన.

**ప్ర:—** దాని నతడు ఎవరి కొసంగును?

**ఉ:—** అనన్యభక్తితో తన్ను సేవించువారికి, ధ్యానించువారికి, దైవగుణములు కలవారికి ఒసంగును.

**అ॥** (అర్జునునకు దివ్యదృష్టి నొసంగినపిదప) సంజయుడు భగవానుని విశ్వరూప విశేషములను ఐదుశ్లోకములద్వారా ధృతరాష్ట్రునకు వర్ణించి చెప్పుచున్నాడు -

**సంజయ ఉవాచ -**

## 9. ఏవముక్త్వా తతో రాజన్ మహాయోగేశ్వరో హరిః
## దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరమ్.

సంజయ ఉవాచ = సంజయుడు చెప్పెను -

**టీక:—** రాజన్ = ధృతరాష్ట్ర మహారాజా! మహాయోగేశ్వరః = గొప్పయోగేశ్వరుడగు, హరిః = శ్రీకృష్ణమూర్తి, ఏవమ్ = ఈప్రకారముగ, ఉక్త్వా = పలికి, పార్థాయ = అర్జునుని కొఱకు, పరమమ్ = సర్వోత్తమమైన, ఐశ్వరమ్ = ఈశ్వర సంబంధమగు, రూపమ్ = (విశ్వ) రూపమును, దర్శయామాస = చూపెను.

**తా:—** సంజయుడు చెప్పెను - ఓ ధృతరాష్ట్ర మహారాజా! మహాయోగేశ్వరుడగు శ్రీకృష్ణపరమాత్మ ఈ ప్రకారముగ వచించి తదుపరి సర్వోత్తమమైన ఈశ్వరసంబంధమగు (విశ్వ) రూపమును అర్జునునకు జూపెను.

**వ్యాఖ్య:–** శ్రీవేదవ్యాసుల యనుగ్రహముచే సంజయుడు యుద్ధరంగమున జరుగువృత్తాంతములన్నిటిని తెలిసికొనగల్గియుండుటచే భగవానుని విశ్వరూపమును గూడ సందర్శించు భాగ్యముగలవాడై, ఆ విశేషములన్నిటిని ధృతరాష్ట్రునకెఱింగించుచున్నాడు.

**10. అనేకవక్త్రనయన మనేకాద్భుతదర్శనమ్**
**అనేకదివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్.**

**11. దివ్యమాల్యామ్బరధరం దివ్యగన్ధానులేపనమ్**
**సర్వాశ్చర్యమయం దేవమనన్తం విశ్వతోముఖమ్.**

**టీక:–** అనేకవక్త్రనయనమ్ = పెక్కుముఖములు, నేత్రములుగలదియు, అనేకాద్భుత దర్శనమ్ = అనేకములగు వింతలను జూపునదియు, అనేకదివ్యాభరణమ్ = పెక్కుదివ్యములైన ఆభరణములతో గూడినదియు, దివ్యానేకోద్యతాయుధమ్ = ఎత్తబడియున్న అనేక దివ్యాయుధములు గలదియు, దివ్యమాలామ్బరధరమ్ = దివ్యములైన పుష్పమాలికలను, వస్త్రములను ధరించినదియు, దివ్య గన్ధానులేపనమ్ = దివ్యమగు గంధపుపూత గలదియు, సర్వాశ్చర్యమయమ్ = అనేక ఆశ్చర్యములతో నిండియున్నదియు, దేవమ్ = ప్రకాశించుచున్నదియు, అనన్తమ్ = అంతములేనిదియు, విశ్వతోముఖమ్ = ఎల్లెడల ముఖములుగలదియు (అగు విశ్వరూపమును, దర్శయామాస = చూపెను).

**తా:–** (అత్తఱి) పెక్కుముఖములు, నేత్రములు గలదియు, అనేకములగు అద్భుతవిషయములను జూపునదియు, దివ్యములైన పెక్కు ఆభరణములతో గూడినదియు, ఎత్తబడియున్న అనేక దివ్యాయుధములుగలదియు, దివ్యములైన పుష్పమాలికలను, వస్త్రములను ధరించినదియు, దివ్యమగు గంధపుపూతతో గూడియున్నదియు, అనేక ఆశ్చర్యములతో నిండియున్నదియు, ప్రకాశమానమైనదియు, అంతములేనిదియు, ఎల్లెడల ముఖములు గలదియు (నగు తన విశ్వరూపమును భగవాను డర్జునునకు జూపెను).

**12. దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా**
**యది భాస్సదృశీ సా స్యాద్భాసస్తస్య మహాత్మనః.**

**టీక:–** దివి = ఆకాశమందు, సూర్యసహస్రస్య = వేలకొలది సూర్యులయొక్క, భాః = కాంతి, యుగపత్ = ఒక్కపర్యాయము, ఉత్థితా భవేత్ యది = బయలుదేరేనేని, సా = అది, (ఆ కాంతి) తస్యమహాత్మనః = ఆ మహాత్మునియొక్క, భాసః = కాంతికి, సాదృశీ = పోలునది, స్యాత్ = అగును.

**తా:–** ఆకాశమందు వేలకొలది సూర్యులయొక్క కాంతి ఒక్కసారి బయలుదేరినచో ఎంతకాంతియుండునో అది ఆ మహాత్మునియొక్క కాంతికి బోలియున్నది.

**13. తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్తమనేకధా**
**అపశ్యద్దేవదేవస్య శరీరే పాణ్డవస్తదా.**

**టీక:–** తదా= అప్పుడు, పాణ్డవః = అర్జునుడు. అనేకధా = నానావిధములుగా, ప్రవిభక్తమ్ = విభజింపబడియున్న, కృత్స్నమ్‌జగత్ = సమస్తజగత్తును, దేవదేవస్య = దేవదేవుడగు శ్రీకృష్ణభగవానునియొక్క, శరీరే = శరీరమున, ఏకస్థమ్ = (అవయవమువలె) ఒక్కచోటనున్నదానినిగ, అపశ్యత్ = చూచెను.

**తా:–** అప్పు డర్జునుడు నానావిధములుగ విభజింపబడియున్న సమస్తజగత్తును దేవదేవుడగు శ్రీకృష్ణభగవానునియొక్క శరీరమున (అవయవమువలె) ఒక్కచోట నున్నదానినిగ చూచెను.

**వ్యాఖ్య:–** ఈ సమస్తప్రపంచము పరమాత్మయందే మూలనో ఒకచోట అణగిపడియున్నది. 'ఇహైకస్థం జగత్కృత్స్నమ్' – అని ఇంతకుముందే 7వ శ్లోకమున భగవాను డీవిషయమునే స్పష్టీకరించియున్నారు. దానినే యిపుడు మఱల సంజయుడు పక్కాణించుచున్నాడు. భగవానుని అనంతచిన్మయస్వరూపమున ఈ జగత్తంతయు (అవయవరూపమున) ఏదియో ఒకమూల (కల్పితముగ) స్థితినొందియున్నది.

'ప్రవిభక్తమ్' – పరమాత్మ అవిభక్తుడు. జగత్తు ప్రవిభక్తము (భిన్నబిన్న రూపములు గలదై అనేక నామరూపములుగ విభజింపబడినది).

**అ॥** ఆ యద్భుతరూపమును దర్శించి అర్జునుడు ఆశ్చర్యచకితుడై భగవాను నివ్విధముగ స్తుతింపదొడగెనని సంజయుడు చెప్పుచున్నాడు –

**14. తతః స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః**
**ప్రణమ్య శిరసా దేవం కృతాఞ్జలిరభాషత.**

**టీక:–** తతః = తరువాత, సః ధనంజయః = ఆ యర్జునుడు, విస్మయావిష్టః = ఆశ్చర్యముతో గూడినవాడును, హృష్టరోమా = గగుర్పాటుగలవాడును (అయి), దేవమ్ = విశ్వరూపమును ధరించిన ఆ భగవానుని, శిరసా = శిరస్సుచేత, ప్రణమ్య = నమస్కరించి, కృతాఞ్జలిః = చేతులుజోడించుకొని, అభాషత = (ఈ ప్రకారముగ) పలికెను.

**తా:–** అటుపిమ్మట ఆ యర్జునుడు ఆశ్చర్యముతో గూడినవాడును, గగుర్పాటు కలవాడును అయి విశ్వరూపమును ధరించిన భగవానునకు శిరస్సుచే నమస్కరించి చేతులు జోడించుకొని (ఈ ప్రకారముగ) పలికెను.

**వ్యాఖ్య:–** శిరస్సువంచి నమస్కరించుట, చేతులు జోడించుట మున్నగు క్రియలు వినయమును, భక్త్యతిశయమును సూచించును.

**అర్జున ఉవాచ –**

**15. పశ్యామి దేవాంస్తవ దేవ దేహే**
**సర్వాంస్తథా భూతవిశేషసఙ్ఘాన్**
**బ్రహ్మాణమీశం కమలాసనస్థ**
**మృషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్.**

అర్జున ఉవాచ = అర్జునుడుచెప్పెను.

**టీక:–** దేవ = దేవా!, తవదేహే = నీశరీరమందు, సర్వాన్ దేవాన్ = సమస్తదేవతలను, తథా = ఆలాగుననే, భూతవిశేషసఙ్ఘాన్ = స్థావరజంగములగుప్రాణికోట్లసమూహములను, కమలాసనస్థమ్ = (నీయొక్క) నాభికమలమునవెలయు, ఈశంబ్రహ్మాణమ్ = సృష్టికర్తయగు బ్రహ్మదేవుని, సర్వాన్ ఋషీన్ చ = సమస్తఋషులను, దివ్యానురగాన్‌చ = దివ్యములగు (దేవలోకసంబంధములగు) సర్పములను, పశ్యామి = చూచుచున్నాను. ('కమలాసనస్థమ్ బ్రహ్మాణమ్ = కమలాసనుడగు బ్రహ్మదేవుని (మఱియు) ఈశమ్ = శివుని' – అనియు చెప్పవచ్చును.)

**తా:–** అర్జునుడు చెప్పెను – దేవా! మీశరీరమందు సమస్తదేవతలను, అట్లే చరాచరప్రాణికోట్ల సమూహములను, కమలాసనుడైన సృష్టికర్తయగు బ్రహ్మదేవుని, సమస్తఋషులను, దివ్యములగు సర్పములను చూచుచున్నాను.

**16. అనేక బాహూదరవక్త్రనేత్రం.**
**పశ్యామి త్వాం సర్వతో ఽనన్తరూపమ్**
**నాన్తం న మధ్యం న పునస్తవాదిం**
**పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప.**

**టీక:–** విశ్వేశ్వర = ప్రపంచమునకు అధిపతియైనవాడా!, విశ్వరూప = జగద్రూపుడా!, అనేక బాహూదరవక్త్రనేత్రమ్ = అనేకహస్తములు, ఉదరములు, ముఖములు, నేత్రములుగలవానినిగను, అనన్తరూపమ్ = అంతములేని రూపముగలవానినిగను (లేక అనేకరూపములు గలవానినిగను) త్వామ్ = నిన్ను. సర్వతః = అంతటను, పశ్యామి = చూచుచున్నాను, పునః = మఱియు, తవ = నీయొక్క, ఆదిమ్ = మొదలును, నపశ్యామి = చూడలేకున్నాను, మధ్యమ్ = మధ్యమును, న (పశ్యామి) = చూడలేకున్నాను, అన్తమ్ తుదను, న (పశ్యామి) = చూడజాలకున్నాను.

**తా:–** ప్రపంచాధిపతీ! జగద్రూపా! మిమ్ము సర్వత్ర అనేక హస్తములు, ఉదరములు, ముఖములు, నేత్రములు గలవానినిగను, అనంతరూపులుగను నేను చూచుచున్నాను. మఱియు మీయొక్క మొదలుగాని, మధ్యముగాని, తుదనుగాని నేను గాంచజాలకున్నాను.

**17. కిరీటినం గదినం చక్రిణం చ**
**తేజోరాశిం సర్వతో దీప్తిమన్తమ్**
**పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం★ సమన్తా**
**ద్దీప్తానలార్కద్యుతి మప్రమేయమ్.**

**టీక:–** త్వామ్ = నిన్ను, సమన్తాత్ = అంతటను, కిరీటినమ్ = కిరీటముగలవానినిగను, గదినమ్

★ దుర్నిరీక్షం – పాఠాన్తరము

= గదను ధరించినవానినిగను, చక్రిణమ్ చ = చక్రమునుబూనినవానినిగను, తేజోరాశిమ్ = కాంతిపుంజముగను, సర్వతః = అంతటను, దీప్తిమన్తమ్ = ప్రకాశించువానినిగను, దీప్తానలార్కద్యుతిమ్ = జ్వలించు అగ్నివంటి, సూర్యునివంటి కాంతిగలవానినిగను, అప్రమేయమ్ = అపరిచ్ఛిన్నునిగను (పరిమితిలేనివానినిగను), పశ్యామి = చూచుచున్నాను.

**తా:–** మిమ్ము ఎల్లెడలను కిరీటముగలవారినిగను, గదను ధరించినవారినిగను, చక్రమును బూనినవారినిగను, కాంతిపుంజముగను, అంతటను ప్రకాశించువారినిగను, జ్వలించు అగ్ని, సూర్యులవంటి కాంతిగలవారినిగను, అపరిచ్ఛిన్నులుగను (పరిమితిలేని వారినిగను) చూచుచున్నాను.

**18. త్వమక్షరం పరమం వేదితవ్యం**
**త్వమస్య విశ్వస్య పరం నిధానమ్**
**త్వమవ్యయశ్శాశ్వతధర్మగోప్తా**
**సనాతనస్త్వం పురుషో మతో మే.**

**టీక:–** త్వమ్ = నీవు, వేదితవ్యమ్ = తెలియందగిన, పరమంఅక్షరమ్ = సర్వోత్తమమైన అక్షర (నాశరహిత) పరబ్రహ్మవు, త్వమ్ = నీవు, అస్య విశ్వస్య = ఈ జగత్తునకు, పరంనిధానమ్ = గొప్ప ఆధారమవు (ఆశ్రయుడవు), త్వమ్ = నీవు, అవ్యయః = నాశరహితుడవు, శాశ్వతధర్మగోప్తా = శాశ్వతములగు ధర్మములను కాపాడువాడవు, త్వమ్ = నీవు, సనాతనః పురుషః = పురాణపురుషుడవు, (ఇతి = అని) మే మతః = నా యభిప్రాయము.

**తా:–** మీరు తెలియదగిన సర్వోత్తమ అక్షరపరబ్రహ్మస్వరూపులు. మీరీ జగత్తునకంతటికి గొప్ప ఆధారభూతులు. మీరు నాశరహితులు. శాశ్వతములగు ధర్మములను కాపాడువారు. మీరు పురాణపురుషులు – అని నా యభిప్రాయము.

**వ్యాఖ్య:–** 'శాశ్వతధర్మగోప్తా' అనుపదము బాగుగ గమనింపదగియున్నది. ధర్మము శాశ్వతమైనది, అది ఏకాలమందును నశింపదు. దేశకాలపరిస్థితులచే లోకమున దాని ప్రచారమెపుడైన తగ్గిన తగ్గవచ్చునుగాని ధర్మమేనాడును నశింపదు. అది తగ్గినపుడు సాక్షాత్ భగవానుడుగాని, మహనీయులుగాని యవతరించి దానిని సముద్ధరించుదురు. 'ధర్మగోప్తా' యనుటచే భగవానుడు ధర్మమును లెస్సగ సంరక్షించువాడని స్పష్టమగుచున్నది. కాబట్టి భగవానునకు అంతటిప్రీతికరమైన వస్తువును అనగా ధర్మమును జనులవలంబించినచో వారు భగవత్కృపకు తప్పక పాత్రులు కాగలరనుట నిర్వివాదాంశము.

**19. అనాది మధ్యాన్తమనన్తవీర్య**
**మనన్తబాహుం శశిసూర్యనేత్రమ్**
**పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం**
**స్వతేజసా విశ్వమిదం తపన్తమ్.**

**టీక:–** అనాదిమధ్యాన్తమ్ = మొదలు, మధ్య, తుద లేనివానినిగను, అనన్తవీర్యమ్ = అపరిమిత సామర్థ్యముగలవానినిగను, అనన్తబాహుమ్ = అనేకహస్తములుగలవానినిగను, శశిసూర్యనేత్రమ్ = చంద్రుడు సూర్యుడు కన్నులుగ గలవానినిగను, దీప్తహుతాశవక్త్రమ్ = ప్రజ్వలించు అగ్నిహోత్రునివంటి ముఖముగలవానినిగను, స్వతేజసా = స్వకీయతేజస్సు (కాంతి)చే, ఇదం విశ్వమ్ = ఈ సమస్త ప్రపంచమును, తపన్తమ్ = తపింపజేయుచున్నవానినిగను, త్వామ్ = నిన్ను, పశ్యామి = చూచుచున్నాను.

**తా:–** ఆదిమధ్యాన్తరహితునిగను, అపరిమితసామర్థ్యముగలవానినిగను, అనేకహస్తములువానినిగను, చంద్రసూర్యులు నేత్రములుగ గలవానినిగను, ప్రజ్వలించు అగ్నిహోత్రునివంటి ముఖముగలవానినిగను, స్వకీయతేజస్సుచే ఈ ప్రపంచమునంతను తపింపజేయుచున్నవానినిగను నిన్ను చూచుచున్నాను.

**20. ద్యావాపృథివ్యోరిదమన్తరం హి**
**వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః**
**దృష్ట్వాద్భుతం రూపముగ్రం తవేదం**
**లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్.**

**టీక:–** మహాత్మన్ = ఓమహాత్మా!, ద్యావాపృథివ్యోః = భూమ్యాకాశములయొక్క, ఇదం అన్తరమ్ = ఈ మధ్యప్రదేశము (అంతరిక్షము) అంతయు, సర్వాః దిశః చ = దిక్కులన్నియును, త్వయా ఏకేన = నీయొక్కనిచేతనే, వ్యాప్తం హి = వ్యాపింపబడియున్నదిగదా!, ఉగ్రమ్ = భయంకరమైనదియు, అద్భుతమ్ = ఆశ్చర్యకరమైనదియు (అగు), తవ = నీయొక్క, ఇదం రూపమ్ = ఈ (విశ్వ) రూపమును, దృష్ట్వా = చూచి, లోకత్రయమ్ = ముల్లోకములును, ప్రవ్యథితమ్ = మిగుల భీతిని బొందియున్నవి.

**తా:–** ఓ మహాత్మా! భూమ్యాకాశములయొక్క ఈ మధ్యప్రదేశమంతయును, దిక్కులన్నియును, నీయొక్కనిచేతనే వ్యాపింపబడియున్నదిగదా! మఱియు భయంకరమైనదియు, ఆశ్చర్యకరమైనదియు నగు నీయీ రూపమునుజూచి ముల్లోకములున్ను మిగుల భీతినిబొందియున్నవి.

**21. అమీ హి త్వాం సురసఙ్ఘా విశన్తి**
**కేచిద్భీతాః ప్రాఞ్జలయో గృణన్తి**
**స్వస్తీత్యుక్త్వా మహర్షి సిద్ధసఙ్ఘాః**
**స్తువన్తి త్వాం స్తుతిభిః పుష్కలాభిః.**

**టీక:–** అమీ = ఈ, సురసఙ్ఘాః = దేవతాసమూహములు, త్వామ్ = నిన్ను, (నీ విశ్వరూపమున), విశన్తిహి = ప్రవేశించుచున్నవిగదా, కేచిత్ = (మఱి) కొందఱు, భీతాః = భయపడినవారై, ప్రాఞ్జలయః = చేతులుజోడించినవారలగుచు, గృణన్తి = స్తుతించుచున్నారు, మహర్షి సిద్ధసఙ్ఘాః = మహర్షులయొక్కయు, సిద్ధులయొక్కయు సమూహములు, స్వస్తి ఇతి ఉక్త్వా = (లోకమునకు) క్షేమమగుగాక! యని పలికి, పుష్కలాభిః స్తుతిభిః = సంపూర్ణములగు స్తోత్రములచేత, త్వామ్ = నిన్ను, స్తువన్తి = పొగడుచున్నారు.

**తా:–** ఈ దేవతాసమూహములు నీయందు ప్రవేశించుచున్నవి. (మఱి) కొందఱు భూతిల్లి చేతులుజోడించుకొని (నిన్ను) స్తుతించుచున్నారు. మహర్షులయొక్కయు, సిద్ధులయొక్కయు సమూహములు (లోకమునకు) క్షేమమగుగాక! యని పలికి సంపూర్ణములగు స్తోత్రములచేత నిన్ను పొగడుచున్నారు.

**వ్యాఖ్య:–** 'స్వస్తీత్యుక్త్వా మహర్షిసిద్ధసఙ్ఘాః' - మహనీయులెపుడును లోకముయొక్క క్షేమమునే కోరుచుందురు. 'స్వస్తిప్రజాభ్యః' అనియే వారి వచనము.

'స్తువన్తి' - మహర్షులే భగవానుని స్తోత్రముచేయుచుండ ఇక సామాన్యుల విషయము చెప్పనేల! వారున్ను తప్పక భక్తినాశ్రయించి సర్వేశ్వరుని స్తుతించుట ధర్మము.

**22. రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా**
**విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ**
**గన్ధర్వయక్షాసురసిద్ధసఙ్ఘా**
**వీక్షన్తే త్వాం విస్మితాశ్చైవ సర్వే.**

**టీక:–** రుద్రాదిత్యాః = రుద్రులును, సూర్యులును, వసవః = వసువులును, యే చ సాధ్యాః = సాధ్యులెవరో వారును, విశ్వే = విశ్వేదేవతలును, అశ్వినౌ = అశ్వినీదేవతలును, *గంధర్వయక్షాసుర సిద్ధసఙ్ఘాః* = గంధర్వులయొక్కయు, యక్షులయొక్కయు, అసురులయొక్కయు, సిద్ధులయొక్కయు సంఘములును, సర్వే చ ఏవ = వీరందఱున్ను, విస్మితాః = ఆశ్చర్యమును బొందినవారలై, త్వామ్ = నిన్ను, వీక్షన్తే = చూచుచున్నారు.

**తా:–** రుద్రులును, సూర్యులును, వసువులును, సాధ్యులును, విశ్వేదేవతలును, అశ్వినీదేవతలును, గంధర్వులయొక్కయు, యక్షులయొక్కయు, అసురులయొక్కయు సిద్ధులయొక్కయు సంఘములును, వారందఱున్ను ఆశ్చర్యచకితులై నిన్ను చూచుచున్నారు.

**23. రూపం మహత్తే బహువక్త్రనేత్రం**
**మహాబాహో బహుబాహూరుపాదమ్**
**బహూదరం బహుదంష్ట్రాకరాలం**
**దృష్ట్వా లోకాః ప్రవ్యథితా స్తథాఽహమ్.**

**టీక:–** మహాబాహో = గొప్పభుజములుగల ఓ కృష్ణా!, బహువక్త్రనేత్రమ్ = అనేకముఖములు నేత్రములు గలిగినట్టియు, బహుబాహూరుపాదమ్ = అనేకములగు హస్తములు, తొడలు, పాదములు గలిగినట్టియు, బహూదరమ్ = పెక్కుకడుపులుగలిగినట్టియు, బహుదంష్ట్రాకరాలమ్ = అనేకములైన కోరలచే భయంకరమైనట్టియు, తే = నీయొక్క, మహత్‌రూపమ్ = గొప్పదియైనరూపమును, దృష్ట్వా = చూచి, లోకాః = జనులు, ప్రవ్యథితాః = మిగులభయపడుచున్నారు, తథా = అట్లే, అహమ్ ( చ ) = నేనున్ను (ప్రవ్యథితః = భయపడుచున్నాను).

**తా:–** గొప్పభుజములుగల ఓ కృష్ణా! అనేక ముఖములు, నేత్రములు గలిగినట్టియు, అనేకములగు హస్తములు, తొడలు, పాదములు, గలిగినట్టియు, పెక్కుఉదరములు గల్గియున్నట్టియు, అనేకములైన కోఱలచే భయంకరమైనట్టియు, నీయొక్క గొప్ప రూపమునుజూచి జనులందఱును మిగుల భయపడుచున్నారు. నేనున్ను అట్లే భయపడుచున్నాను.

**24. నభఃస్పృశం దీప్తమనేకవర్ణం**
**వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్**
**దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాన్తరాత్మా**
**ధృతిం న విన్దామి శమం చ విష్ణో.**

**టీక:–** విష్ణో = ఓ విష్ణుమూర్తీ!, నభఃస్పృశమ్ = ఆకాశమునుతాకుచున్నవాడవును, దీప్తమ్ = ప్రకాశించుచున్నవాడవును, అనేకవర్ణమ్ = పెక్కురంగులుగలవాడవును, వ్యాత్తాననమ్ = తెరవబడిన నోరులుగలవాడవును, దీప్తవిశాలనేత్రమ్ = జ్వలించుచున్న విశాలములైన నేత్రములుకలవాడవునగు, త్వామ్ = నిన్ను, దృష్ట్వా = చూచి, ప్రవ్యథితాన్తరాత్మా = మిక్కిలిభయపడిన మనస్సుగలవాడనై, (అహం = నేను) ధృతిమ్ = ధైర్యమును, శమంచ = శాంతిని, న విన్దామి హి = పొందకున్నానుగదా!.

**తా:–** ఓ విష్ణుమూర్తీ! ఆకాశమును తాకుచున్నవారును, ప్రకాశించుచున్నవారును, పెక్కురంగులుగలవారును, తెఱవబడిన నోరులుగలవారును, జ్వలించుచున్న విశాలములైన నేత్రములుగలవారుననగు మిమ్ముజూచి మిగుల భీతిల్లిన మనస్సుగలవాడనై ధైర్యమును, శాన్తిని నేను పొందజాలకున్నాను.

**25. దంష్ట్రాకరాలాని చ తే ముఖాని**
**దృష్ట్వైవ కాలానల సన్నిభాని**
**దిశో న జానే న లభే చ శర్మ**
**ప్రసీద దేవేశ జగన్నివాస.**

**టీక:–** దంష్ట్రాకరాలాని = కోరలనే భయంకరములైనవియు, కాలానల సన్నిభాని చ = మఱియు ప్రళయాగ్నిని బోలినవియునగు, తే = నీయొక్క, ముఖాని = ముఖములను, దృష్ట్వా = చూచి, దిశః = దిక్కులను, నజానే = తెలియకయున్నాను (దిగ్భ్రమజెందియున్నాను), శర్మచ = సుఖమునుగూడ, న ఏవ లభే = పొందకయేయున్నాను, దేవేశ = ఓ దేవదేవా!, జగన్నివాస = జగదాశ్రయా!, ప్రసీద = ప్రసన్నుడవగుము.

**తా:–** కోరలచే భయంకరములైనవియు, ప్రళయాగ్నినిబోలినవియునగు మీముఖములను జూచి, నేను దిగ్భ్రమజెందియున్నాను. సుఖమునుగూడ పొందకయేయున్నాను. కావున ఓ దేవదేవా! జగదాశ్రయా! ప్రసన్నులుకండు (నన్ననుగ్రహింపుడు).

**26. అమీచ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః**
**సర్వే సహైవావనిపాలసఙ్ఘైః**
**భీష్మో ద్రోణస్సూతపుత్ర స్తథాఽసౌ**
**సహాస్మదీయైరపి యోధముఖ్యైః.**

**27. వక్త్రాణి తే త్వరమాణా విశన్తి**
**దంష్ట్రాకరాలాని భయానకాని**
**కేచిద్విలగ్నా దశనాన్తరేషు**
**సందృశ్యన్తే చూర్ణితైరుత్తమాఙ్గైః.**

**టీక:–** అమీ = ఈ, ధృతరాష్ట్రస్యపుత్రాః = దృతరాష్ట్రునికొడుకులు, సర్వే = అందఱును, భీష్మః = భీష్మాచార్యుడున్ను, ద్రోణః = ద్రోణాచార్యుడున్ను, అసౌసూతపుత్రః = ఈసూతునికొడుకైన కర్ణుడును, అవనిపాలసఙ్ఘైః సహ ఏవ = (ఇతర) రాజుల సమూహములతో గూడ, తథా = అప్రకారమే, అస్మదీయైః = మావారలగు, యోధముఖ్యైః అపి సహ = సైనికప్రముఖులతోగూడ, త్వామ్ = నిన్నుగూర్చి, త్వరమాణాః = త్వరపడుచున్నవారై (త్వరితముగ నిన్ను జేరుచు), దంష్ట్రాకరాలాని = కోరలచే భీషణముగనొప్పునవియు, భయానకాని = భయంకరములైనవియుయగు, తే = నీయొక్క, వక్త్రాణి = ముఖములను (నోళ్ళయందు), విశన్తి = ప్రవేశించుచున్నారు, కేచిత్ = (వారిలో) కొందఱు, దశనాన్తరేషు = పండ్లసందులయందు, విలగ్నాః = చిక్కుకొనినవారై, చూర్ణితైః = పొడిచేయబడిన, ఉత్తమాఙ్గైః = శిరస్సులతోడ. సందృశ్యన్తే = కనబడుచున్నారు.

**తా:–** ఈ ధృతరాష్ట్రుని కొమారులందఱును, భీష్ముడును, ద్రోణుడును, కర్ణుడును, వారిసేనయందలి సమస్తరాజసమూహములును, అట్లే **మనసేనయందలి** సైనికప్రముఖులును, నిన్ను త్వరితముగ జేరుచున్నవారై కోరలచే భయంకరములుగ నున్నట్టి మీనోళ్ళయందు ప్రవేశించుచున్నారు. (వారిలో) కొందఱు మీపండ్లసందులయందు చిక్కుకొనినవారై చూర్ణమొనర్పబడిన శిరస్సులతో కనుపించుచున్నారు.

**వ్యాఖ్య:–** పరమాత్మయందు భూత భవిష్యద్వర్తమానకాలభేదము లేదు. కాలాతీతుడగు భగవానునియందు కాలమునకు సంబంధించిన విభేదములుగాని, విభజనలుగాని ఉండనేరవు. కనుకనే భవిష్యత్తునందు జరుపబోవునదియంతయును వర్తమానమందే విశ్వరూపమున అర్జుననకు గోచరించుటకు కారణమైనది. భీష్మద్రోణకర్ణాది కౌరవపక్షవీరులు, మరియు పాండవపక్షమువారు భవిష్యత్కాలమున మృతినొంది కాలగర్భమున ప్రవేశించుటను అర్జునుడు విశ్వరూపమున స్పష్టముగ గాంచగల్గెను. దీనిభావమేమి? భూతభవిష్యద్వర్తమానములన్నియు పరమాత్మయందు ఒకటే. గడచిన అనేకయుగములకాలము. రాబోవు అనేకయుగములకాలము పరమాత్మయందు వర్తమానకాలమేయగును. అతడు కాలాతీతుడు. కాలకాలుడు. కాలము వారియందు కల్పింపబడినది.

ఈశ్లోకమందు వ్యక్తమొనర్పబడిన భావములను బాగుగవిచారించిచూచినచో గొప్పవైరాగ్యము

జీవునియం దుదయింపగలదు. ఏలయనిన, ప్రత్యక్షముగ కానుపించు భీష్మద్రోణాదులు తక్కిన వీరులు ఆ క్షణముననే భయంకరమగు కాలముయొక్క కరాళవదనమందు త్వరితముగ ప్రవేశించుచున్నట్లు అర్జును డెట్లు గాంచగల్గెనో ఆ ప్రకారమే ఇపుడు ప్రత్యక్షముగా గానుపించు ఈ బంధుమిత్రదారాసుతాదులు, ధనధాన్యాదులు, భవనములు, క్షేత్రారామములు, సంపదలు అన్నియు కాలగర్భమున విలీనమైపోవునవే యనియు, నశ్వరములనియు, జీవుడు భావించుకొనవలెను. ఈ సత్యమును చక్కగ భావించుకొనినచో దృశ్యపదార్థములం దంతట వైరాగ్యభావ ముప్పతిల్లగలదు.

భవిష్యత్తును వర్తమానమున జూడగల్గుటయే జ్ఞానదృష్టి. రాబోవు మృత్యువును ఇప్పుడు భావించగల్గుటయే జీవుని విజ్ఞతయైయున్నది. అట్టి భవిష్యద్భావనచే, మృత్యుచింతనచే జీవుడు వైరాగ్యోపేతుడై జీవితమును జాగ్రత్తగ నడుపు కొనగలడు. అత్తఱి భోగాదులం దాతనికి విరక్తియు, భగవంతునియందు భక్తియు ఉదయించును. మరణము సంభవింపకమునుపే లక్ష్యప్రాప్తినొందవలెనను దృఢనిశ్చయము కలుగజేసికొని అందులకై తీవ్రతరముగ ప్రయత్నించును.

కాబట్టి విశ్వరూపమున అర్జునుడు చూడగల్గిన భవిష్యత్కాలచిత్రమును ప్రతిముముక్షువు తన హృదయవీథియందు చిత్రించుకొని, వైరాగ్యయుక్తుడై లక్ష్యమగు పరమాత్మ ప్రాప్తికై అనవరతము యత్నము గావించుచుండవలెను.

**28. యథా నదీనాం బహవో ఽమ్బువేగా**
**స్సముద్రమేవాభిముఖా ద్రవన్తి**
**తథా తవామీ నరలోకవీరా**
**విశన్తి వక్త్రాణ్యభివిజ్వలన్తి.**

**టీక:–** యథా = ఏ ప్రకారముగ, నదీనామ్ = నదులయొక్క, బహవః = అనేకములైన, అమ్బువేగాః = జలప్రవాహములు, సముద్రమ్ ఏవ = సముద్రమునుగూర్చియే, అభిముఖాః = అభిముఖములై, ద్రవన్తి= ప్రవహించుచున్నవో (ప్రవేశించుచున్నవో), తథా = ఆ ప్రకారముగనే, అమీ = ఈ, నరలోకవీరాః = మనుష్యలోకమందలి వీరులు (రాజులు), అభివిజ్వలన్తి = లెస్సగ జ్వలించుచున్న, తవ = నీయొక్క, వక్త్రాణి = నోళ్ళయందు, విశన్తి = ప్రవేశించుచున్నారు.

**తా:–** ఏ ప్రకారము అనేక నదీప్రవాహములు సముద్రాభిముఖములై ప్రవహించుచు అందు ప్రవేశించుచున్నవో, ఆప్రకారమే ఈ మనుష్యలోకమందలి వీరులు (రాజులు) లెస్సగ జ్వలించుచున్న మీనోళ్ళయందు ప్రవేశించుచున్నారు.

**29. యథా ప్రదీప్తం జ్వలనం పతఙ్గా**
**విశన్తి నాశాయ సమృద్ధవేగాః**
**తథైవ నాశాయ విశన్తి లోకా**
**స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః.**

**టీక:–** యథా = ఏ ప్రకారముగ, **పతఙ్గాః** = మిడుతలు, నాశాయ = వినాశముకొఱకు, సమృద్ధవేగాః = మిక్కిలి వేగముకలవై, ప్రదీప్తమ్ = బాగుగమండుచున్న, జ్వలనమ్ = అగ్నిని, విశన్తి = ప్రవేశించుచున్నవో, తథా ఏవ = ఆ ప్రకారముగనే, లోకాః అపి = జనులుకూడ, సమృద్ధవేగాః = మిక్కలి వేగముతో గూడినవారై, నాశాయ = నాశముకొఱకు, తవ = నీయొక్క, వక్త్రాణి = నోళ్ళను (నోళ్ళయందు), విశన్తి = ప్రవేశించుచున్నారు.

**తా:–** ఏ ప్రకారము మిడుతలు వినాశముకొఱకు మిక్కిలివేగముతో గూడినవై బాగుగ మండుచున్న అగ్నియందు ప్రవేశించుచున్నవో ఆప్రకారమే జనులున్ను మిగులవేగముతో గూడినవారై నాశముకొఱకు మీనోళ్ళయందు ప్రవేశించుచున్నారు.

**30. లేలిహ్యసే గ్రసమానస్సమన్తా**
**ల్లోకాన్ సమగ్రాన్ వదనైర్జ్వలద్భిః**
**తేజోభిరాపూర్య జగత్సమగ్రం**
**భాసస్తవోగ్రాః ప్రతపన్తి విష్ణో.**

**టీక:–** విష్ణో = ఓవిష్ణుమూర్తీ, జ్వలద్భిః = మండుచున్న, వదనైః = ముఖములచే (నోళ్ళచే), సమగ్రాన్ లోకాన్ = సమస్తజనులను, సమన్తాత్ = అంతటను (నలువైపుల), గ్రసమానః = మ్రింగుచున్నవాడవై, లేలిహ్యసే = ఆస్వాదించుచున్నావు, తవ = నీయొక్క, ఉగ్రాః = భయంకరములైన, భాసః = కాంతులు, తేజోభిః = తమతేజస్సులచేత, సమగ్రమ్ = సమస్తమైన, జగత్ = జగత్తును, ఆపూర్య = వ్యాపించి, ప్రతపన్తి = మిగుల తపింపజేయుచున్నవి.

**తా:–** ఓ విష్ణుమూర్తీ! మండుచున్న నీయొక్క నోళ్ళచే జనులందఱిని అంతటను మ్రింగుచున్నవాడవై ఆస్వాదించుచున్నావు. నీయొక్క భయంకరములైన కాంతులు తమ తేజస్సులచేత జగత్తునంతను వ్యాపించి మిగుల తపింపజేయుచున్నవి.

**31. ఆఖ్యాహి మే కో భవానుగ్రరూపో**
**నమోఽస్తు తే దేవవర ప్రసీద**
**విజ్ఞాతుమిచ్ఛామి భవన్తమాద్యం**
**న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్.**

**టీక:–** దేవవర = దేవశ్రేష్ఠా, ఉగ్రరూపః = భయంకరాకారముగల, భవాన్ = నీవు, కః = ఎవడవో, మే = నాకు, ఆఖ్యాహి = చెప్పుము, హి = ఏలయనగా, తవప్రవృత్తిమ్ = నీప్రవృత్తిని, న ప్రజానామి = ఎఱుంగకున్నానుగనుక, ఆద్యం = ఆదిపురుషుడవగు, భవన్తమ్ = నిన్ను, విజ్ఞాతుమ్ = తెలిసికొనుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను, తే = నీకు, నమః = నమస్కారము, అస్తు = అగుగాక!, ప్రసీద = అనుగ్రహింపుము (ప్రసన్నుడవగుము).

**తా:—** దేవోత్తమా! భయంకరాకారముగల నీవెవరో నాకు చెప్పుము. ఏల యనగా - నీప్రవృత్తిని ఎఱుంగకున్నాను. కనుక ఆదిపురుషుడవగు నిన్ను గూర్చి తెలిసికొనగోరుచున్నాను. నీకు నమస్కారము. నన్నను గ్రహింపుము.

**వ్యాఖ్య:—** భగవంతుని గుఱించి తెలిసికొనదలంచువాడు అర్జునునివలె వినయాన్వితుడై, భక్తిభావసమన్వితుడై యుండవలెను.

అర్జునుని ప్రశ్నలకు భగవానుడు సమాధానమొసంగుచున్నాడు -

**శ్రీ భగవానువాచ -**

**32. కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో**
**లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః**
**ఋతేఽపి త్వా★ న భవిష్యన్తి సర్వే**
**యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః.**

శ్రీ భగవానువాచ = శ్రీభగవంతుడు పలికెను -

**టీక:—** (అహమ్ = నేను), లోకక్షయకృత్ = లోకసంహారకుడనై, ప్రవృద్ధః = విజృంభించిన, కాలః = కాలుడను, అస్మి = అయియున్నాను, లోకాన్ = ప్రాణులను, సమాహర్తుమ్ = సంహరించుటకు, ఇహ = ఈ ప్రపంచమున, ప్రవృత్తః = ప్రవర్తించినవాడను, ప్రత్యనీకేషు = ప్రతిపక్షసైన్యములందు (శత్రుసేనలందు), యే యోధాః = ఏ వీరులు, అవస్థితాః = ఉన్నారో, (తే) సర్వే = వారంఱున్ను, త్వా ఋతేఽపి = నీవు లేకపోయినను (నీవు యుద్ధము చేయకపోయినను), న భవిష్యన్తి = జీవించియుండరు (మృతినొందక తప్పరు).

**తా:—** శ్రీ భగవంతుడు చెప్పెను - (నేను) లోకసంహారకుడనై విజృంభించినకాలుడను అయియున్నాను. ప్రాణులను సంహరించు నిమిత్త మీ ప్రపంచమున ప్రవర్తించుచున్నాను. ప్రతిపక్షసైన్యములందుగల వీరులు నీవు లేకపోయినను (యుద్ధము చేయకున్నను) జీవించియుండరు (మృతినొందక తప్పరు).

**33. తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ**
**జిత్వా శత్రూన్ భుఙ్క్ష్వ రాజ్యం సమృద్ధమ్**
**మయైవైతే నిహతాః పూర్వమేవ**
**నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్.**

**టీక:—** తస్మాత్ = కాబట్టి, త్వమ్ = నీవు, ఉత్తిష్ఠ = లెమ్ము, శత్రూన్ = శత్రువులను, జిత్వా = జయించి, యశః = కీర్తిని, లభస్వ = పొందుము, సమృద్ధమ్ = పరిపూర్ణమగు (నిష్కంటకమైన), రాజ్యం =

★ త్వాం = పాఠాన్తరము

రాజ్యమును, భుఙ్క్ష్వ = అనుభవింపుము, ఏతే = వీరు, మయా ఏవ = నాచేతనే, పూర్వం ఏవ = ఇదివఱకే, నిహతాః = చంపబడిరి. సవ్యసాచిన్ = ఓ అర్జునా!, నిమిత్తమాత్రమ్ భవ = (నీవు) నిమిత్తమాత్రముగ నుండుము.

**తా:–** కాబట్టి నీవులెమ్ము. శత్రువులను జయించి కీర్తిని బడయుము. పరిపూర్ణమగు (నిష్కంటకమైన) రాజ్యము ననుభవింపుము. వీరందఱును ఇదివఱకే నాచేతనే చంపబడిరి. కావున ఓ అర్జునా! నీవు నిమిత్తమాత్రముగ నుండుము.

**వ్యాఖ్య:–** 'నిమిత్తమాత్రం భవ' – ప్రపంచములోని సమస్తకార్యములున్ను భగవంతునిచేతనే చేయబడుచున్నవి. జీవులు నిమిత్తమాత్రులే యగుదురు. కాని అజ్ఞానులగు జనులు 'నేను చేసినాను' అను కర్తృత్వమును గలిగియుండుచు తత్ఫలితముగ బద్ధులై దుఃఖమునొందుచున్నారు. 'ఓ అర్జునా! నీ శత్రువులిదివఱకే నాచే హతులైరి. నీవిపుడు నిమిత్తమాత్రముగ యుద్ధముచేసి విజయమునొందుము,' అని భగవానుడర్జునునకు బోధించిరి. దీనినిబట్టి ఈ జగత్తునందలి సమస్తము భగవంతునిచే చేయబడుచున్నదనియు, జీవులు భ్రాంతిలోపడి, అహంభావముగలిగి వ్యర్థముగ తమపై కర్తృత్వమును పెట్టుకొనుచున్నారనియు స్పష్టమగుచున్నది. కావున విజ్ఞుడగువాడు అట్టి కర్తృత్వమును విడనాడి అంతయు భగవానుడే చేయుచున్నాడని భావించి తాను లోకవ్యవహారమున నిమిత్తమాత్రుడై యుండవలెను. దానిచే నిరహంభావము, తత్ఫలితముగ నిర్మలభావము, భగవదనుగ్రహము అతనికి లభించగలవు.

'సవ్యసాచిన్' – అర్జునుడు ఎడమచేతితో గూడ బాణములను ప్రయోగింపగల సామర్థ్యము గలవాడని యర్థము.

**34. ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ**
**కర్ణం తథాఽన్యానపి యోధవీరాన్**
**మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా**
**యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్.**

**టీక:–** మయా= నాచేత, హతాన్ = (ఇదివఱకే) చంపబడిన, ద్రోణం చ = ద్రోణాచార్యుని, భీష్మం చ = భీష్మాచార్యుని, జయద్రథం చ = జయద్రథుని, కర్ణమ్ = కర్ణుని, తథా = అట్లే, అన్యాన్ యోధవీరాన్ అపి = ఇతర యుద్ధవీరులనుగూడ, త్వమ్ = నీవు, జహి =చంపుము, మావ్యథిష్ఠాః = భయపడకుము, యుధ్యస్వ = యుద్ధముచేయుము, రణే = యుద్ధమందు, సపత్నాన్= శత్రువులను, జేతాసి = గెలువగలవు.

**తా:–** నాచేత (ఇదివఱకే) చంపబడిన ద్రోణాచార్యుని, భీష్మాచార్యుని, జయద్రథుని, కర్ణుని అట్లే ఇతర యుద్ధవీరులనుగూడ నీవు చంపుము. భయపడకుము. యుద్ధముచేయుము. శత్రువులను గెలువగలవు.

**వ్యాఖ్య:–** 'మావ్యథిష్ఠాః' – భయపడవలదు. ఇది సర్వులకును చక్కని ఉపదేశము. సర్వేశ్వరుని శరణుబొంది తన కర్తవ్యమును ధర్మపూర్వకముగ నాచరించువాడిక దిగులునొందనేల? భయపడనేల? కనుకనే భగవానుడర్జునునకు తనకర్తవ్యమును, తన విధ్యుక్తధర్మమును, ధైర్యముతో, నిర్భయముతో నాచరింపవలసినదిగా బోధించుచున్నాడు. 'మావ్యథిష్ఠాః' అను ఈ భగవద్వాక్యమును సర్వులున్ను తమ

నిత్యవ్యవహారములందు జ్ఞాపకముంచుకొనవలసియున్నది. జీవితరంగమున మనుజులు పెక్కుచోట్ల అనేక క్లేశములను, ప్రతిబంధములను ఎదుర్కొనవలసియుండును. అత్తఱి ఈ పైవాక్యములను స్మరించి ధైర్యమును తెచ్చుకొనవలెను. అర్జునునివలె సమస్తము భగవదర్పణముచేసి భగవానుని వినిర్మలచిత్తముతో నాశ్రయించి తనకర్తవ్య కర్మమును నెరవేర్చుచో ఇక జీవుడు వెతలొందవలసిన పనిలేదు. ఇచ్చట 'యుధ్యస్వ'(యుద్ధమును చేయుము) అను పదము వారివారి కర్తవ్యనిర్వహణమును సూచించుచున్నది.'జేతాసి' (జయింపగలవు) అను పదము ఫలమును నిరూపించుచున్నది. అనగా - ఈ ప్రకారము సర్వేశ్వరుని ఆశ్రయించి తనకర్తవ్యము నెరవేర్చువాడు ఉత్తమఫలితమును తప్పక పొందగల్గునని, విజయమును తప్పక సాధించునని భావము. కార్యవిజయమున కిదియే ఉపాయము. ఎచట శ్రీకృష్ణుడు (భగవద్భావము) ఉండునో అచట విజయము తథ్యము.

శ్రీకృష్ణుడు గీతను బోధించుసమయమునకు భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు మున్నగువారు జీవించేయున్నారు. కాని వారు మరణించినట్లు భగవాను డర్జునున కిచట తెలిపిరి. ఇది యేమి ఆశ్చర్యము! దీనికి కారణముగలదు. ఈ విషయము నింతకుముందే 27వ శ్లోకవ్యాఖ్యయందు తెలుపబడినది. భగవానుడు కాలాతీతుడు. వారియందు భూతభవిష్యద్వర్తమానములను కాలభేదములు లేవు. కనుకనే భవిష్యద్వృత్తాంతమును (భీష్మాదులమృతిని) వర్తమానకాలమందు జూపగల్గిరి. దీనివలన మనుజుల కొక చక్కని గుణపాఠము లభించుచున్నది. అది యేదియనిన 'ఈ కానుపించు బంధుమిత్రాదులు, సిరిసంపదలు మున్నగునవియన్నియు భవిష్యత్కాలమున వినాశమొందునవే అయియున్నవి' అని స్పష్టముగ తెలియుచున్నది. ఆ భవిష్యచ్చిత్రమును విజ్ఞులిపుడే తమ హృదయమందు చిత్రించుకొని, వైరాగ్యాదుల నభ్యసించవలెను. బుద్ధదేవు డాప్రకారమే 'మరణము'ను గూర్చి దేహాదుల అశాశ్వతత్త్వమునుగూర్చి ముందుగనే బాగుగ చింతించి తద్భావనచే మహోపకారమును బొందగల్గిరి.

భగవానుని యా వాక్యములను విని అర్జును డేమియొనర్చెనో సంజయుడు చెప్పుచున్నాడు -

**సంజయ ఉవాచ -**

**35. ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య**
**కృతాఞ్జలిర్వేపమానః కిరీటీ**
**నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం**
**సగద్గదం భీతభీతః ప్రణమ్య.**

సంజయ ఉవాచ = సంజయుడు చెప్పెను -

**టీక:-** కిరీటీ = అర్జునుడు, కేశవస్య = శ్రీకృష్ణునియొక్క, ఏతత్ = ఈ, వచనమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, వేపమానః = వణకుచున్నవాడై, కృతాఞ్జలిః = చేతులుజోడించుకొనినవాడై, కృష్ణమ్ = శ్రీకృష్ణునిగూర్చి, నమస్కృత్వా = నమస్కరించి, భీతభీతః = మిక్కిలి భయపడినవాడగుచు, ప్రణమ్య = వినమ్రుడై (బాగుగవంగి), సగద్గదమ్ = గద్గదస్వరముతో, భూయ ఏవ = మఱల, ఆహ = (ఇట్లు) పలికెను.

**తా:-** సంజయుడు చెప్పెను - అర్జునుడు శ్రీకృష్ణమూర్తియొక్క ఈవాక్యములను విని

వణకుచున్నవాడై చేతులుజోడించుకొని శ్రీకృష్ణునకు నమస్కరించి మిగుల భయపడినవాడగుచు వినమ్రుడై గద్గదస్వరముతో నిట్లు పలికెను.

**వ్యాఖ్య:—** (1) చేతులుజోడించుకొనుట (2) నమస్కరించుట (3) వినమ్రుడై (బాగుగవంగి) పలుకుట - మున్నగు క్రియలు అర్జునుని పరిపూర్ణభక్తిభావమును, నమ్రతను సూచించుచున్నవి.

**అ॥** అత్తఱి అర్జునుడు భగవానుని ఏ ప్రకారముస్తుతించెనో (11 శ్లోకముల ద్వారా) తెలుపుచున్నాడు.

**అర్జున ఉవాచ –**

**36. స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా**
**జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ**
**రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి**
**సర్వే నమస్యన్తి చ సిద్ధసఙ్ఘాః.**

అర్జున ఉవాచ = అర్జునుడు చెప్పెను.

**టీక:—** హృషీకేశ = ఓ శ్రీకృష్ణా!, తవ = నీ యొక్క, ప్రకీర్త్యా = నామమునుచ్చరించుటచేత, మాహాత్మ్యమును లెస్సగకొనియాడుటచేత, జగత్ = లోకము, ప్రహృష్యతి = మిగుల సంతోషించుచున్నది, అనురజ్యతే చ = మిక్కిలి ప్రీతినిగూడ బొందుచున్నది, రక్షాంసి = రాక్షసులు, భీతాని = భయపడినవారై, దిశః = దిక్కులనుగూర్చి, ద్రవన్తి = పరుగిడుచున్నారు, సర్వేసిద్ధసఙ్ఘాః = సిద్ధుల సమూహములన్నీ, నమస్యన్తి చ = నమస్కరించుచున్నవిగూడ, (ఏతాని = ఇవియన్నియు), స్థానే = (నీ మహిమకు) తగి యున్నవి.

**తా:—** అర్జునుడు చెప్పెను - ఓ శ్రీకృష్ణా! మీయొక్క నామము నుచ్చరించుటచేతను, మాహాత్మ్యమును లెస్సగకొనియాడుటచేతను లోకము మిగుల సంతోషించుచున్నది. మిక్కిలి ప్రీతిబొందుచున్నది. (మిమ్ము జూచి) రాక్షసులు భయపడినవారై దిగంతములకు పరుగిడుచున్నారు. సిద్ధుల సమూహములన్నియు మీకు నమస్కరించుచున్నవి. అవియన్నియు మీ మహిమకు తగియే యున్నవి.

**వ్యాఖ్య:—** 'తవప్రకీర్త్యా జగత్ప్రహృష్యతి' - భగవన్నామసంకీర్తనముచేతను, భగవన్మహిమల కథనముచేతను జనులు అత్యంత హర్షమును బొందుచున్నారని అర్జునుడు పలికెను. 'హృష్యతి' అని చెప్పక 'ప్రహృష్యతి' అని చెప్పుటవలన అట్టివారు అపారమగు ఆనందమును బడయుచున్నారని అర్థము. దీనినిబట్టి అతిహర్షమునకు, దుఃఖరాహిత్యమునకు భగవన్నామోచ్చారణ, భగవద్విచారణయే మార్గమని స్పష్టమగుచున్నది.

'రక్షాంసి భీతాని దిశోద్రవన్తి' - భగవద్దర్శనముచే రాక్షసులు పలాయనము చిత్తగించుచున్నారని చెప్పబడినది. అనగా ఎచట పరమాత్మయుండునో, ఎచట పవిత్రతయుండునో, ఎచట సద్గుణములు విరాజిల్లునో అచట భూతప్రేతపిశాచ రాక్షసాదులు లేక కామాది దుష్టప్రవృత్తులు ఉండనేరవని భావము. కావున జీవులు తమ హృదయసీమయందు దేవదేవుడగు పరమాత్మను భక్త్యాదులచే ప్రతిష్ఠజేసికొనినచో, ఇక అజ్ఞానాదులు, దంభదర్పాదులు, రాగద్వేషాదులు, కామక్రోధాదులు అటనిలువలేక పరుగిడిపోవును,

రాక్షసులు బయటనేకాదు, హృదయమందును కాపురముందురు. వారే పైనతెల్పిన యసురగుణములు. భగద్ధ్యానముచేతను, భగవత్సంకీర్తనముచేతను పరమాత్మ నెపుడు జీవుడు తనయం దాహ్వానించుకొనునో, అపుడిక ఆ అసురీసంపద వెంటనే కాలికి బుద్ధిజెప్పును. ఈ సత్యమును నిరూపించుటకే కాబోలు అర్జునుడు పైవిధముగ భగవానుని స్తుతించెను.

ఈ శ్లోకమునందు బీజాక్షరములు ఎక్కువగ కలవనియు, దీనిని జపించినవారికి భూతప్రేతపిశాచాదుల బాధ యుండనేరదనియు, భూతప్రేతాదులబాధ గలవా రీశ్లోకమును భక్తితో, భావముతో జపించినచో ఆ బెడద తొలగిపోగలదనియు పెద్దలు చెప్పుదురు.

**37. కస్మాచ్చ తే న నమేరన్మహాత్మన్**
**గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే**
**అనన్త దేవేశ జగన్నివాస**
**త్వమక్షరం సదసత్తత్పరం యత్.**

**టీక:–** మహాత్మన్ = ఓ మహాత్మా! అనన్త = అనంతరూపా (లేక, నాశరహితుడా), దేవేశ = దేవదేవా! జగన్నివాస = జగదాశ్రయా!, సత్ = సత్పదార్థమున్ను (స్థూలజగత్తు), అసత్ చ = అసత్పదార్థమున్ను (సూక్ష్మజగత్తు), యత్ = ఏదికలదో, తత్పరమ్ = ఆ రెండింటికి పరమైనట్టి, అక్షరమ్ = నాశరహితమగు పరబ్రహ్మము, త్వమ్ (అసి) = నీవే (అయియున్నావు), బ్రహ్మణః అపి = బ్రహ్మమునకును, ఆదికర్త్రే = ఆదికారణుడవును (కనుకనే), గరీయసే = సర్వోత్కృష్టుడవును (అగు), తే = నీకు, కస్మాత్ = ఏల, న నమేరన్ = నమస్కరింపకుందురు?

**తా:–** మహాత్మా! అనంతరూపా! దేవదేవా! జగదాశ్రయా! సత్, అసత్తులకు (స్థూలసూక్ష్మజగత్తుల రెండింటికిని) పరమైనట్టి అక్షర (నాశరహిత) పరబ్రహ్మ స్వరూపులు మీరే అయియున్నారు. బ్రహ్మదేవునకుగూడ ఆదికారణరూపులును, కనుకనే సర్వోత్కృష్టులు నగు మీకేల నమస్కరింపకుందురు? (వారి నమస్కారములకు మీరు తగుదురు అని భావము).

**వ్యాఖ్య:–** 'సదసత్తత్పరమ్' - పరమాత్మ సత్, అసత్తులకు పరమైనవాడు. సత్ అనగా - స్థూలపదార్థము (లేక స్థూలజగత్తు). అసత్ అనగా సూక్ష్మపదార్థము, (లేక సూక్ష్మజగత్తు). ఆ రెండిటికిని పరమాత్మ విలక్షణమై పరమై వర్తించునని భావము. లేక 'సత్' అనగా మనస్సనియు, 'అసత్' అనగా దేహమనియు చెప్పవచ్చును. అపుడును ఇదియే అర్థమిచ్చును. స్థూలమగు భౌతికప్రపంచమైనను, సూక్ష్మమగు మనఃప్రపంచమైనను రెండును పరమార్థదృష్టిలో మిథ్యాభూతములే యగును. పరమాత్మయొకడే సత్యవస్తువు. కావుననే మిథ్యాభూతములగు ఆ దృశ్యజగత్తులకంటె ఆతడు పరమైనవాడని యిట పేర్కొనబడినది.

**ప్ర:–** పరమాత్మ యెట్టివాడు?

**ఉ:–** (1) సర్వశ్రేష్ఠుడు (2) బ్రహ్మదేవునకున్ను ఆదికారణుడు (3) అనంతుడు (4) దేవతలకును ప్రభువు (5) జగదాశ్రయుడు (6) నాశరహితుడు (7) సదసత్తులకు పరమైనవాడు.

**38. త్వమాదిదేవః పురుషః పురాణ**
**స్త్వమస్య విశ్వస్య పరం నిధానమ్**
**వేత్తాఽసి వేద్యం చ పరం చ ధామ**
**త్వయా తతం విశ్వమనన్తరూప.**

**టీక:–** అనన్తరూప = అంతములేని స్వరూపముగల (లేక అనేకరూపములు గల) ఓ కృష్ణా! త్వమ్ = నీవు, ఆదిదేవః = మొదటి దేవుడవు, పురాణపురుషః = ప్రాచీన (సనాతన) పురుషుడవు, అస్య విశ్వస్య = ఈ ప్రపంచమునకు, పరమ్ = శ్రేష్ఠమైన, నిధానమ్ = ఆధారము (ఆశ్రయము), వేత్తా = సమస్తమును తెలిసికొనినవాడవు, వేద్యం చ = తెలియదగినవాడవును, పరంధామ చ = సర్వోత్తమమైన స్థానమును, త్వమ్ = నీవు, అసి = అయియున్నావు, త్వయా = నీచేత, విశ్వమ్ = ఈ ప్రపంచమంతయు, తతమ్ = వ్యాపింపబడియున్నది.

**తా:–** అనంతరూపుడగు ఓ కృష్ణా! నీవు ఆదిదేవుడు, సనాతనపురుషుడు, ఈ ప్రపంచమునకు శ్రేష్ఠమైన ఆధారమున్ను, సమస్తమును తెలిసికొనినవాడును, తెలియదగినవాడును, సర్వోత్తమస్థానమును అయియున్నావు. నీచేతనే ఈ ప్రపంచమంతయును వ్యాపింపబడియున్నది.

**ప్ర:–** పరమాత్మ ఇంకను ఎట్టి లక్షణములు కలవాడు?

**ఉ:–** (1) ఆదిదేవుడు (2) ప్రాచీనపురుషుడు (3) ప్రపంచమునకు ఆధారభూతుడు (4) సమస్తము తెలిసినవాడు (5) తెలియదగినవాడు (6) సర్వోత్తమస్థానము (7) ప్రపంచమంతటను వ్యాపించియున్నవాడు (8) అనంతరూపుడు.

**39. వాయుర్యమోఽగ్నిర్వరుణశ్శశాఙ్కః**
**ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ**
**నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః**
**పునశ్చ భూయోఽపి నమో నమస్తే.**

**టీక:–** వాయుః = వాయువు, యమః = యముడు, అగ్నిః = అగ్ని, వరుణః = వరుణుడు, శశాఙ్కః = చంద్రుడు, ప్రజాపతిః = బ్రహ్మదేవుడు, ప్రపితామహః చ = బ్రహ్మదేవునకు తండ్రియును, త్వమ్ (అసి) = నీవే అయియున్నావు, తే = నీకు, సహస్రకృత్వః = వెయ్యిమార్లు, నమోనమః = నమస్కారము, అస్తు = అగుగాక, తే = నీకు, పునః చ = మఱల, నమః = నమస్కారము, భూయః అపి = మఱల కూడ, నమః = నమస్కారము.

**తా:–** వాయువును, యముడును, అగ్నియు, వరుణుడును, చంద్రుడును, బ్రహ్మదేవుడును, బ్రహ్మదేవునకు తండ్రియును మీరే అయియున్నారు. మీకనేకవేల నమస్కారములు! మఱల మఱల మీకు నమస్కారము.

**వ్యాఖ్య:—** అర్జునునకు భగవానునియెడల కలిగిన అట్టి అపరిమితభక్తి సాధకునకు అత్యంతావశ్యకమైయున్నది.

**40. నమః పురస్తాదథ పృష్ఠతస్తే**
**నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ**
**అనన్తవీర్యామితవిక్రమస్త్వం**
**సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః.**

**టీక:—** సర్వ = సర్వరూపుడవగు ఓ కృష్ణా!, పురస్తాత్ = ఎదుటను, పృష్ఠతః = వెనుకను, తే = నీకు, నమః = నమస్కారము, అస్తు = అగుగాక!, అనన్తవీర్యామితవిక్రమః = అపరిమిత సామర్థ్యమును, పరాక్రమమునుగలవాడవగు, త్వమ్ = నీవు, సర్వమ్ = సమస్తమును, సమాప్నోషి = లెస్సగ వ్యాపించియున్నావు, తతః = అందువలన, సర్వః = సర్వస్వరూపుడవు, అసి = అయియున్నావు.

**తా:—** సర్వరూపులగు ఓ కృష్ణా! ఎదుటను, వెనుకను మీకు నమస్కారము మఱియు అన్నివైపులను మీకు నమస్కారమగుగాక! అపరిమితసామర్థ్యము, పరాక్రమము గలవారగు మీరు సమస్తమును లెస్సగ వ్యాపించియున్నారు. కనుకనే సర్వస్వరూపులై యున్నారు.

**వ్యాఖ్య:—** అర్జునుడు తన హృదయమున పొంగిపొరలుచున్న భక్తిభావాతిశయమును వ్యక్తముచేయుచున్నాడు.

'అనన్తవీర్యామితవిక్రమః' - భగవానుడు అపరిమిత శక్తిసామర్థ్యములు కలవాడు. ఒక చిన్న విసనకఱ్ఱతో వీచుకొనిన, కొద్దిగాలి వచ్చును. ఒక్కసారి ఝంఝామారుతము వీచినచో అపరిమితమగుగాలి ఉద్భవించును. మొదటిది మనుష్యశక్తి. రెండవది దైవశక్తి. బిందెలతో గాని, ఏతాముతోగాని, మిషన్లతోగాని నీరు పారగట్టినచో ఒకింత నీరు ప్రవహించును. కుంభవర్షముకురిసినచో వెల్లువలు పారును. వేలకొలది ఎకరముల నేల తడియును. మొదటిది మనుష్యశక్తి, రెండవది దైవశక్తి. మనుజుని శక్తికిని భగవంతుని శక్తికినిగల తేడా ఇదియే. కనుకనే అర్జునుడు భగవానుని 'అనంతవీర్యామితవిక్రముడ'ని సంబోధించెను. కావున మనుజుడు తన అల్పశక్తినిజూచి గర్వించక, సర్వశక్తిమంతుడగు పరమాత్మయెడల అకుంఠిత భక్తిభావము గలిగియుండవలెను.

**ప్ర:—** పరమాత్మ ఇంకను ఎట్టివాడు?

**ఉ:—**(1) అనంతశక్తిగలవాడు (2) అపరిమిత పరాక్రమశీలుడు (3) సర్వత్రవ్యాపించి యున్నవాడు (4) సర్వరూపుడు.

**41. సఖేతి మత్వా ప్రసభం యదుక్తం**
**హే కృష్ణ హే యాదవ హే సఖేతి**
**అజానతా మహిమానం తవేదం**
**మయా ప్రమాదాత్ప్రణయేన వాపి.**

**42. యచ్చాపహాసార్థమసత్కృతో௨సి**
**విహారశయ్యాసనభోజనేషు**
**ఏకో௨థవాప్యచ్యుత తత్సమక్షం**
**తత్క్షామయే త్వామహమప్రమేయమ్.**

**టీక:–** అచ్యుత = నాశరహితుడవగు ఓ కృష్ణా!, తవ = నీయొక్క, ఇదమ్ = ఈ, మహిమానమ్ = మహిమను, అజానతా = ఎఱుగని, మయా = నాచేత, ప్రమాదాత్ = అజ్ఞానమువలననైనను, (పొరపాటున నైనను), ప్రణయేనవాఅపి = స్నేహముచేతనైనను (చనువు చేతనైనను), సఖా ఇతి = చెలికాడవని, మత్వా = తలంచి, హే కృష్ణ = ఓ కృష్ణా!, హే యాదవ = ఓ యాదవా, హే సఖా = ఓ సుఖుడా, ఇతి = అని, ప్రసభమ్ = అలక్ష్యముగ (బండతనముగ), యత్ = ఏది, ఉక్తమ్ = చెప్పబడెనో, విహారశయ్యాసనభోజనేషు = విహారము సలుపునప్పుడును, పరుండునప్పుడును, కూర్చుండునప్పుడును, భుజించునప్పుడును, ఏకః = ఒక్కడవుగ నుండునప్పుడుగాని, అథవా = లేక, తత్ సమక్షం అపి = ఇతరులయెదుటగాని, అపహాసార్థమ్ = పరిహాసముకొఱకు, అసత్కృతః అసి (ఇతి) యత్ చ = అవమానింపబడితివనునది యేదికలదో, తత్ = దానిని (అట్టి అపరాధములన్నిటిని), అప్రమేయమ్ = ప్రమాణములచే తెలియబడనివాడవగు, త్వామ్ = నిన్ను, అహమ్ = నేను, క్షామయే = క్షమింపవేడుచున్నాను.

**తా:–** నాశరహితులగు ఓ కృష్ణా! మీయొక్క ఈ మహిమను తెలియక పొరపాటునగాని, చనువువలనగాని, సఖుడవని తలంచి 'ఓ కృష్ణా, ఓ యాదవా, ఓ సఖా' అని అలక్ష్యముగ మిమ్ముగూర్చి నేనేదిచెప్పితినో మఱియు విహారముసల్పునపుడుగాని, పరుండునపుడుగాని, కూర్చుండునపుడుగాని, భుజించునపుడుగాని, ఒక్కరుగ నున్నపుడుగాని, లేక ఇతరులయెదుటగాని పరిహాసముకొఱకు ఏ అవమానమును గావించితినో - ఆ యపరాధము లన్నిటిని అప్రమేయులగు మీరు క్షమింపవేడుచున్నాను.

**వ్యాఖ్య:–** చేసిన తప్పిదనమునకు పశ్చాత్తాపపడి మఱల నద్దానిని చేయకుండుట విజ్ఞుల లక్షణము.

**43. పితా௨సి లోకస్య చరాచరస్య**
**త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్**
**న త్వత్సమో௨స్త్యభ్యధికః కుతో௨న్యో**
**లోకత్రయే௨ప్యప్రతిమప్రభావ.**

**టీక:–** అప్రతిమప్రభావ = సాటిలేని ప్రభావముకలవాడా!, త్వమ్ = నీవు, చరాచరస్య = స్థావరజంగమాత్మకమైన, అస్య లోకస్య = ఈ ప్రపంచమునకు, పితా = తండ్రివి, అసి = అయియున్నావు, చ = మఱియు, పూజ్యః = పూజింపబడదగినవాడవును, గరీయాన్గురుః = సర్వశ్రేష్ఠుడవైన గురువును, (అసి = అయియున్నావు), లోకత్రయే అపి = ముల్లోకములందును, త్వత్సమః = నీతో సమానమైనవాడు, న అస్తి = లేడు, అభ్యధికః = (ఇక) నిన్నుమించినవాడు, అన్యః = మఱియొకడు, కుతః = ఎక్కడ? (ఎట్లుండగలడు?)

**తా:–** సాటిలేని ప్రభావముగల ఓ కృష్ణమూర్తీ! మీరు చరాచరాత్మకమైన ఈ

ప్రపంచమునకంతకును తండ్రి అయియున్నారు. మఱియు మీరు పూజ్యులును, సర్వశ్రేష్ఠులగు గురువులును అయి వెలయుచున్నారు. ముల్లోకములందును మీతో సమానమైనవారు లేరు. ఇక మిమ్ములను మించినవారు మఱియొక రెట్లుండగలరు?

**వ్యాఖ్య:–** చరాచర ప్రపంచమునకు, సమస్త ప్రాణికోట్లకు భగవంతుడే తండ్రి, వారే తల్లి, వారే గురువు. గురువులందఱిలోను సర్వోత్తముడగు గురువు. కనుకనే 'గురుర్గరీయాన్' అని చెప్పబడినది. వారొకరే సద్వస్తువుగనుకను, తక్కినదంతయు (దృశ్యము) అసద్వస్తువుగనుకను, వారికి సమానుడుగాని, మించినవాడుగాని మఱియొకడు లేనేలేడని స్పష్టమగుచున్నది. కావున సర్వులు వారినే ఆశ్రయించవలెను...

'గరీయాన్' అను ఈ పదమును 'గురువు'నకు విశేషణముగ కాకుండ విడిగాకూడ చెప్పవచ్చును. (గరీయాన్ = శ్రేష్ఠుడవు – అని).

**ప్ర:–** పరమాత్మ ఇంకను ఎట్టివాడు?

**ఉ:–** (1) చరాచరప్రపంచమునకు తండ్రి (2) పరమపూజ్యుడు (3) ఉత్తమగురువు (4) ముల్లోకములందును సాటిలేని ప్రభావముకలవాడు (5) అతనితో సమానుడుగాని, అతనికంటె అధికుడుగాని లేనివాడు.

**అ||** ఈ ప్రకారముగ భగవానుని ప్రార్థించి అటుపిదప అర్జునుడు సాష్టాంగవందనముచేసి తన యపరాధములను క్షమింపవేడుకొనుచున్నాడు –

**44. తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం**
**ప్రసాదయే త్వామహమీశ మీడ్యమ్**
**పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః**
**ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్.**

**టీక:–** తస్మాత్ = అందువలన, కాయమ్ = శరీరమును, ప్రణిధాయ = (భూమిపై) సాష్టాంగముగవంచి (పడవైచి), ప్రణమ్య = నమస్కరించి, ఈశమ్ = ఈశ్వరుడవును (నియామకుడవును), ఈడ్యమ్ = స్తుతింపదగినవాడవునగు, త్వామ్ = నిన్ను, ప్రసాదయే = అనుగ్రహింప వేడుచున్నాను, దేవ = ఓ దేవా!, పుత్రస్య = కుమారునియొక్క (అపరాధమును), పితా ఇవ = తండ్రివలెను, సఖ్యుః = చెలికానియొక్క (తప్పును), సఖా ఇవ = చెలికానివలెను, ప్రియాయాః = ప్రియురాలియొక్క (తప్పును), ప్రియః (ఇవ) = ప్రియునివలెను, (మే = నాయొక్క, అపరాధమ్ = తప్పును), సోఢుమ్ = సహించుటకు (క్షమించుటకు), అర్హసి = తగుదువు.

**తా:–** అందువలన నేను శరీరమును భూమిపై సాష్టాంగముగ బడవైచి నమస్కరించి. ఈశ్వరుడును, స్తుతింపదగినవాడవును అగునిన్ను అనుగ్రహింప వేడుచున్నాను. దేవా! కుమారుని అపరాధమును తండ్రివలెను, స్నేహితుని అపరాధమును స్నేహితుడు వలెను, **ప్రియురాలి** అపరాధమును ప్రియుడువలెను (నాయొక్క అపరాధమును) మీరు క్షమింపుడు.

**వ్యాఖ్య:–** 'ప్రణిధాయ కాయమ్' – పెద్దలకెట్లు నమస్కరింపవలయునో ఆ పద్ధతి ఇచట తెలుపబడినది. శరీరమును భూమిపైపూర్తిగ పడవైచి భక్తితో పెద్దలకు సాష్టాంగవందన మాచరింపవలయునని అర్జునుని నెపమున లోకమునకు చూపబడినది. అట్టి క్రియచే అహంకారము, గర్వము చచ్చును. దర్పము నశించును. కనుకనే హిందూమత సాంప్రదాయమున సాష్టాంగవందనపద్ధతి ప్రవేశపెట్టబడినది. దానిచే పెద్దల యనుగ్రహమునకు మనుజుడు పాత్రుడు కాగల్గును. అర్జును డాప్రకారమేచేసి భగవానుని యనుగ్రహమును పొందగల్గెను. విశ్వామిత్రు డా ప్రకారమే చేసి వసిష్ఠునిచే 'బ్రహ్మర్షి' యనిపించుకొనెను. అయితే శరీరముతోపాటు మనస్సునందు, వాక్కునందుకూడ వినయము ద్యోతకము కావలెను. అపుడు త్రికరణములతోను, దైవమును, పెద్దలను సేవించినట్లగును.

తన తప్పులను క్షమించమని అర్జునుడు భగవానుని వినయాన్వితుడై ప్రార్థించెను. నిర్మలభక్తితో గావింపబడు ప్రార్థనలను భగవానుడు తప్పక మన్నించును.

**ప్ర:–** పరమాత్మ ఎట్టివాడు?

**ఉ:–** (1) సర్వలోకములకును ఈశుడు, ప్రభువు (2) సర్వులచే స్తుతింపదగినవాడు.

**ప్ర:–** భగవంతునకుగాని, పెద్దలకుగాని యే ప్రకారము నమస్కరించవలెను?

**ఉ:–** నిర్మలభక్తితో వారిపాదములకు సాష్టాంగవందన మాచరించవలెను.

**అ॥** విశ్వరూపమును జూచి భయకంపితుడైన అర్జునుడు తిరిగి సౌమ్యరూపమును జూపులాగున భగవానుని ప్రార్థించుచున్నాడు–

**45. అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే
తదేవ మే దర్శయ దేవ రూపం
ప్రసీద దేవేశ జగన్నివాస.**

**టీక:–** అదృష్టపూర్వమ్ = అదివఱకెన్నడును జూడనట్టి ఈ విశ్వరూపమును, దృష్ట్వా = చూచి, హృషితః = ఆనందించినవాడను, అస్మి = అగుచున్నాను, చ = మఱియు, మే = నా యొక్క, మనః = మనస్సు, భయేన = భయముచేత, ప్రవ్యథితం = మిక్కిలిబాధనొందినది, దేవ = ఓ దేవా!, తత్ రూపమ్ ఏవ = మునుపటి ఆ శాంతరూపమునే, మే = నాకు, దర్శయ = చూపుము, దేవేశ = దేవదేవా!, జగన్నివాస = జగదాధారా!, ప్రసీద = అనుగ్రహింపుము (ప్రసన్నుడవగుము).

**తా:–** ఇదివఱకెన్నడును జూడనట్టి ఈ విశ్వరూపమును జూచి ఆనందమును బొందితిని, కాని భయముచే నాయొక్క మనస్సు మిగుల వ్యథనొందుచున్నది. కావున దేవా! ఆ మునుపటి (సౌమ్య) రూపమునే నాకు జూపుడు. దేవదేవా! జగదాధారా! అనుగ్రహింపుడు!

**వ్యాఖ్య:–** అర్జునునకు అపూర్వమగు విశ్వరూపమును గాంచుటవలన హర్షమున్ను, అందలి

భయంకర దృశ్యములను పరికించుటవలన కంపమున్ను, భీతియు గలిగెను. ఆ భయమును పోగొట్టుకొనుటకై సౌమ్యరూపమును జూపులాగున భగవానుని అర్థించుచున్నాడు.

'ప్రసీద దేవేశ జగన్నివాస' - ఇదే వాక్యమును ఈ అధ్యాయములోని 25వ శ్లోకమున అర్జునుడు పలికియున్నాడు. 'దేవదేవా! జగదాధారా! కరుణింపుడు! అనుగ్రహింపుడు!' అని దాని భావము.

'దేవ,' 'రూపమ్' అను రెండుపదములను కలిపి 'దేవరూపమ్' = చతుర్భుజాకారమగు దేవ (విష్ణు) రూపమును జూపుము - అని కొందఱు అర్థము చెప్పిరి.

**అ॥** తాను జూడదలంచిన సౌమ్యరూపమును అర్జునుడు వర్ణించుచున్నాడు -

**46. కిరీటినం గదినం చక్రహస్త**
**మిచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ**
**తేనైవ రూపేణ చతుర్భుజేన**
**సహస్రబాహో భవ విశ్వమూర్తే.**

**టీక:-** అహమ్ = నేను, త్వామ్ = నిన్ను, తథా ఏవ = మునుపటివలెనే, కిరీటినమ్ = కిరీటముగలవానిగను, గదినమ్ = గదను ధరించినవానిగను, చక్రహస్తమ్ = చక్రముచేతగలవానిగను, ద్రష్టుమ్ = చూచుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను, సహస్రబాహో = అనేక హస్తములు గలవాడా!. విశ్వమూర్తే = సమస్తప్రపంచము స్వరూపముగ గలవాడా!, చతుర్భుజేన = నాలుగుచేతులుగల, తేనరూపేణ ఏవ = ఆ రూపముతోనే, భవ = (మఱల) అగుము, (ఆ రూపమునే మఱల ధరింపుమని భావము).

**తా:-** (ఓ కృష్ణమూర్తీ) నేను నిన్ను మునుపటివలెనే కిరీటము, గద, చక్రము చేతధరించినవానినిగ జూడదలంచుచున్నాను. అనేక హస్తములుగలదేవా! జగద్రూపా! నాలుగు భుజములుగల ఆ పూర్వరూపమునే మఱల ధరింపుడు.

**వ్యాఖ్య:-** ఈశ్లోకమునం దొక ప్రశ్న యుదయించుచున్నది - 'తేనైవ = ఆ చతుర్భుజరూపముతోనే' ప్రత్యక్షమగుము - అని యడుగుటలో అర్జునుడు భగవానుని చతుర్భుజాకారమును, పూర్వము చూచినట్లే స్పష్టమగుచున్నది. అయితే దానిని ఎపుడు చూచెను? ఈ అధ్యాయమందలి 41, 42వ శ్లోకములలో అర్జునుడు భగవానునితో 'నిన్ను సామాన్య సఖునిగనెంచి పరిహాసపూర్వకముగ పలికిన వాక్యములను క్షమింపుము' అని వేడుకొనుటబట్టియు, భగవానుడు చతుర్భుజాకారముతో నెపుడైన గన్పట్టియుండినచో ఆప్రకారము సామాన్య సఖునివలె నాతనిని భావించి యుండెడివాడు కాదుగనుకనూ, ఆ యాకారముతో నతనికి పరిచయము లేనట్లే తెలుచున్నది. ఈ ప్రకారముగ పరస్పర విరుద్ధములుగనున్న ఈ రెండు భావములను సమన్వయపఱచు టెట్లు? ఈ క్రింది విధముగ దీనికి సమాధానము చెప్పకొనవచ్చును.

(1) విశ్వరూపమును జూపుటకు ముందుగా ప్రారంభములో భగవానుడు సంతోషముతో తన చతుర్భుజాకారమును అర్జునునకు గన్పఱచి యుండవచ్చును.

50వ శ్లోకములో 'భూయః స్వకం రూపం దర్శయామాస' (తిరిగి తన రూపమును జూపెను) అనిచెప్పి

వెంటనే 'పునస్సౌమ్యవపుర్భూత్వా' (మఱల శాంతరూపమును ధరించెను) అని పలుకుటవలన మొదట చతుర్భుజాకారమునుజూపి, ఆ పిమ్మట శాంతమగు మానవరూపమును ధరించియుండవచ్చును.

(2) దేవకీదేవియొక్క గర్భమున భగవానుడు జన్మించినపుడు శంఖచక్రాది చిహ్నములుండెనని, అది చాల ప్రసన్నమైనరూపముగా నుండెనని అర్జునుడు విని యుండవచ్చును.

(3) విశ్వరూపదర్శనముచే శ్రీకృష్ణుడు సామాన్యులుకాదనియు, సాక్షాత్ విష్ణువేయనియు తెలిసికొనుటచే వైకుంఠమందు దట్టి చిహ్నములతోనే వారు సదా ప్రసన్నరూపులై వెలయుచుందురని ఎఱింగియుండుటవలన అర్జును డట్లు ప్రశ్నించియుండవచ్చును.

**అ॥** అర్జునుని యా ప్రార్థనను విని భగవానుడు తన సౌమ్యరూపముతో తిరిగి ప్రత్యక్షముకానున్నవారై విశ్వరూపముయొక్క మహిమను ముందుగా వెల్లడించుచున్నాడు -

**శ్రీ భగవానువాచ -**

**47. మయా ప్రసన్నేన తవార్జునేదం**
**రూపం పరం దర్శిత మాత్మయోగాత్**
**తేజోమయం విశ్వమనన్త మాద్యం**
**యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్.**

శ్రీ భగవానువాచ = శ్రీ భగవానుడు చెప్పుచున్నాడు -

**టీక:–** అర్జున = ఓ అర్జునా!, తేజోమయమ్ = ప్రకాశముచే పరిపూర్ణమైనదియు, విశ్వమ్ = ప్రపంచస్వరూపమైనదియు, అనన్తమ్ = అంతములేనిదియు, ఆద్యమ్ = మొదటిదియు, త్వదన్యేన = నీవుతప్ప మఱియొకనిచే, న దృష్టపూర్వమ్ = అదివఱకెన్నడును జూడబడనిదియు నగు, మే = నాయొక్క, యత్ ఇదమ్ పరం రూపమ్ = ఏ యీ సర్వోత్తమమైన విశ్వరూపమును, (అద్రాక్షీః = చూచితివో), తత్ = ఆ రూపము, ప్రసన్నేనమయా = ప్రసన్నుడనగు నా చేత, తవ = నీకు, ఆత్మయోగాత్ = నాయొక్క యోగశక్తివలన, దర్శితమ్ = చూపబడినది.

**తా:–** శ్రీ భగవానుడు చెప్పుచున్నాడు - అర్జునా! ప్రకాశముచే పరిపూర్ణమైనదియు, జగద్రూపమైనదియు, అంతములేనిదియు, మొదటిదియు, నీవుతప్ప ఇతరులచే నిదివఱకెన్నడును జూడబడనిదియు నగు ఏ యీ సర్వోత్తమమైన విశ్వరూపముగలదో, అయ్యది ప్రసన్నుడనగు నాచే స్వకీయయోగశక్తివలన నీకు చూపబడినది.

**వ్యాఖ్య:–** 'మయా ప్రసన్నేన' అని చెప్పుటవలన అనన్యభక్తిగలవారియెడల భగవానుడు అనుగ్రహము జూపునని స్పష్టమగుచున్నది.

**ప్ర:–** భగవంతు డెట్టివాడు?

**ఉ:–** (1) తేజోమయుడు (2) విశ్వవ్యాపకుడు (3) అనంతరూపుడు (4) ఆద్యస్వరూపుడు.

**48. న వేదయజ్ఞాధ్యయనైర్న దానై**
**ర్న చ క్రియాభిర్న తపోభిరుగ్రైః**
**ఏవం రూపశ్శక్య అహం నృలోకే**
**ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర.**

**టీక:–** కురుప్రవీర = కురువంశశ్రేష్ఠుడవగు ఓ అర్జునా!, ఏవం రూపః = ఇట్టిరూపముగల, అహమ్ = నేను, నృలోకే = మనుష్యలోకమున, త్వదన్యేన = నీకంటె నితరునిచే, వేదయజ్ఞాధ్యయనైః = వేదాధ్యయనము, యజ్ఞాధ్యయనములచేతను, ద్రష్టుమ్ = చూచుటకు, నశక్యః = సాధ్యముకానివాడను, దానైః = దానముచేత, న = చూచుటకు సాధ్యపడువాడనుకాను; క్రియాభిః = (అగ్నిహోత్రాది, శ్రౌతస్మార్తాది) క్రియలచేతను, న = చూచుటకు సాధ్యముకానివాడను, ఉగ్రైః తపోభిః చ =ఘోరతపస్సులచేగూడ, న = చూచుటకు సాధ్యముకానివాడను.

**తా:–** కురువంశశ్రేష్ఠడవగు ఓ అర్జునా! ఈ నా విశ్వరూపమును నీవు తప్ప మఱియొక రెవరును ఈ మనుష్యలోకమున చూచియుండలేదు (నాయనుగ్రహముచే నీవు చూడగల్గితివి). మఱియు వేదాధ్యయన, యజ్ఞాధ్యయనములచేగాని, దానములచేగాని, (అగ్నిహోత్రాది శ్రౌతస్మార్తాది) క్రియలచేగాని, ఘోరతపస్సులచేగాని, ఇట్టి (విశ్వరూపుడనగు) నన్నుచూచుటకు శక్యముకాదు.

**వ్యాఖ్య:–** ఇచట తెలిపిన వేదాధ్యయన, యజ్ఞాదులచే భగవానుని విశ్వరూపమును జూడజాలరని చెప్పినంతమాత్రముచే అవియన్నియు నిరుపయోగములని అర్థముకాదు. ఆ క్రియలన్నిటితో భక్తికలియనిచో నవి యెక్కువఫలితము నొసంగజాలవని తెలుపుటయే యగును. ఎంత కృషిచేసినను జలములేనిచో సస్యములు ఫలింపవుగదా! అట్లే ఆ క్రియలును్న.

**49. మాతే వ్యథా మా చ విమూఢభావో**
**దృష్ట్వా రూపం ఘోరమీదృఙ్మమేదమ్**
**వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం**
**తదేవ మే రూపమిదం ప్రపశ్య.**

**టీక:–** ఈ దృక్ = ఇటువంటి, ఘోరమ్ = భయంకరమైన, మమ = నాయొక్క, ఇదం రూపమ్ = ఈ (విశ్వ) రూపమును, దృష్ట్వా = చూచి, తే = నీకు, వ్యథా = భయము (బాధ), మా = వలదు, విమూఢభావః చ = చిత్తవైకల్యమున్ను, మా = వలదు, త్వమ్ = నీవు, వ్యపేతభీః = భయరహితుడవును, ప్రీతమనాః = ప్రసన్నచిత్తుడవును అయి, మే = నాయొక్క, తత్ ఇదం రూపం ఏవ = (నీవు కోరిన) ఆ యీ పూర్వరూపమునే, పునః = మఱల, ప్రపశ్య =బాగుగ జూడుము.

**తా:–** ఇటువంటి భయంకరమైన నా(విశ్వ) రూపమును జూచి నీవు భయమునుగాని, చిత్తవికలత్వముగాని పొందకుము. నీవు నిర్భయుడవును, ప్రసన్నచిత్తుడవును అయి నా యీ పూర్వరూపమునే, మఱల బాగుగ జూడుము.

**అ॥** ఇట్లు వచించి తదుపరి శ్రీకృష్ణు డేమి యొనర్చెనో సంజయుడు చెప్పుచున్నాడు -

**సంజయ ఉవాచ :-**

**50. ఇత్యర్జునం వాసుదేవస్తథోక్త్వా**
**స్వకం రూపం దర్శయామాస భూయః**
**ఆశ్వాసయామాస చ భీతమేనం**
**భూత్వా పునస్సౌమ్యవపుర్మహాత్మా.**

సంజయ ఉవాచ = సంజయుడు చెప్పెను -

**టీక:-** ఇతి = ఈ ప్రకారముగ, వాసుదేవః = శ్రీకృష్ణుడు, అర్జునమ్ = అర్జునుని గూర్చి, ఉక్త్వా = చెప్పి, తథా = ఆ ప్రకారము, స్వకంరూపమ్ = తన పూర్వరూపమును, భూయః = తిరిగి, దర్శయామాస = చూపెను, మహాత్మా = మహాత్ముడగు ఆ శ్రీకృష్ణమూర్తి, పునః చ = మఱల, సౌమ్యవపుః = శాంతరూపముగలవాడు, భూత్వా = అయి, భీతమ్ = భయపడియున్నట్టి, ఏనమ్ = అర్జునుని, ఆశ్వాసయామాస = ఓదార్చెను.

**తా:-** సంజయుడు చెప్పెను - (ఓ ధృతరాష్ట్రమహారాజా!) ఈ ప్రకారముగ శ్రీకృష్ణు డర్జునునకు జెప్పి ఆ ప్రకారమే తన (పూర్వపు) రూపమును మఱల జూపెను. మహాత్ముడగు ఆ శ్రీకృష్ణమూర్తి మఱల తన సౌమ్యరూపమును వహించి భయపడియున్న అర్జునుని ఓదార్చెను.

**వ్యాఖ:-** ఇచట రెండు పర్యాయములు "మఱల తనరూపమును జూపెను" అని చెప్పుటవలన మొదట అర్జునుని కోర్కెననుసరించి చతుర్భుజాకారముతో ప్రత్యక్షమై ఆ పిదప మఱల తన సౌమ్య మానవరూపమును జూపియుండవచ్చునని తోచుచున్నది.

**అ॥** భగవానుని అవ్విధముగ శాంతరూపమునజూచి అర్జునుడు పలికిన పలుకులను వివరించుచున్నాడు -

**అర్జున ఉవాచ :-**

**51. దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన**
**ఇదానీమస్మి సంవృత్తస్సచేతాః ప్రకృతిం గతః.**

అర్జున ఉవాచ - అర్జునుడు చెప్పెను -

**టీక:-** జనార్దన = ఓ కృష్ణా!, తవ = నీయొక్క, సౌమ్యమ్ = ప్రసన్నమైన (శాంతమైన), ఇదం మానుషం రూపమ్ = ఈ మనుష్యరూపమును, దృష్ట్వా = చూచి, ఇదానీమ్ = ఇప్పుడు, సచేతాః = తేటపడిన (కుదుటపడిన) మనస్సుగలవాడను, సంవృత్తః = అయితిని, (మఱియు) ప్రకృతిమ్ = స్వస్థతను, గతః అస్మి = పొందినవాడనైతిని.

**తా:–** అర్జునుడు చెప్పెను - ఓ కృష్ణా! మీయొక్క ప్రశాంతమైన ఈ మనుష్యరూపమునుజూచి యిపుడు నామనస్సుకుదుటపడినది. మఱియు నేను స్వస్థతనుబొందితిని.

**అ॥** అర్జునుని యా వాక్యములను విని భగవానుడు తానుచూపిన రూపముయొక్క మహిమాతిశయమును రెండు శ్లోకములద్వారా వెల్లడించుచున్నాడు -

**శ్రీ భగవానువాచ –**

**52. సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ**
**దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాఙ్క్షిణః.**

శ్రీ భగవానువాచ = శ్రీ భగవానుడు చెప్పెను -

**టీక:–** మమ = నాయొక్క, యత్ = ఏ రూపమును, దృష్టవాన్ అసి = చూచినవాడవయితివో, (తత్) ఇదమ్ రూపమ్ = ఆ యీ (విశ్వ) రూపము, సుదుర్దర్శమ్ = చూచుటకు అత్యంతదుర్లభమైనది, దేవాః అపి = దేవతలుగూడ, నిత్యమ్ = ఎల్లపుడును, అస్య రూపస్య = ఈ (విశ్వ) రూపముయొక్క, దర్శనకాఙ్క్షిణః (భవన్తి) = దర్శనము నభిలషించువారు (అగుచున్నారు).

**తా:–** శ్రీ భగవానుడు చెప్పెను - నాయొక్క ఏరూపమును నీవిపుడు చూచితివో అది మహాదుర్లభమైనది. దేవతలుకూడ నిత్యము నద్దానిని దర్శనముచేయగోరుచుందురు.

**వ్యాఖ్య:–** భగవంతుని స్వరూపమును సామాన్యులెవరును దర్శింపజాలరు. ఎంతయో హృదయనిర్మలత (చిత్తశుద్ధి), అనన్యభక్తిగలవారుమాత్రమే దానిని దర్శింపగలరు. కనుకనే 'దుర్దర్శమ్' అనకుండ 'సుదుర్దర్శమ్' అని చెప్పబడినది. భగవద్దర్శనము మహాదుర్లభమని భావము.

**53. నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా**
**శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా.**

**టీక:–** మామ్ = నన్ను, యథా = ఏ రీతిగ, దృష్టవాన్ అసి = చూచినవాడవైతివో, ఏవం విధః = ఇట్టి (స్వరూపముగల) వాడనగు, అహమ్ = నేను, వేదైః = వేదములచేత, (వేదాధ్యయనపరులచేత) ద్రష్టుమ్ = చూచుటకు, న శక్యః = శక్యుడనుగాను, తపసా = తపస్సుచేతను, న = (చూచుటకు శక్యుడను) కాను, దానేన = దానముచేతను, న = (చూచుటకు శక్యుడను) కాను, ఇజ్యయా = యజ్ఞముచేతను, న చ = (చూచుటకు శక్యుడను) కాను.

**తా:–** నన్ను ఏ రీతిగ నీవు చూచితివో, అటువంటి రూపముగల నేను వేదములచే (వేదాధ్యయనపరులచే) గాని, తపస్సుచేగాని, దానముచేగాని, యజ్ఞముచేగాని చూచుటకు శక్యుడనుగాను.

**వ్యాఖ్య:–** 48వ శ్లోకమున తెలిపిన భావములనే మఱల తెలియజేయుచున్నారు. వేదాధ్యయన, తపో, దాన, యజ్ఞాదిక్రియలు పవిత్రములైనను నిర్మలభక్తి, అచంచల దైవవిశ్వాసము వానితో జోడింపబడినపుడు

మాత్రమే అవి సత్ఫలములనొసంగగల్గును. (చూ - వ్యాఖ్య - 48 శ్లో) (ఈ విషయము రాబోవుశ్లోకమున తెలియజేయబడును).

అII ఇట్టి భగవత్స్వరూపదర్శనము మఱి దేనివలన లభించునో తెలియజేయుచున్నాడు -

**54. భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున**
**జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరన్తప.**

**టీక:–** పరన్తప = శత్రువులను తపింపజేయువాడా!, అర్జున = ఓ అర్జునా!, ఏవం విధః అహమ్ = ఈ విధమగు (రూపముగల) నేను, అనన్యయా భక్త్యాతు = అనన్యభక్తిచేత మాత్రమే, తత్త్వేన = యథార్థముగ, జ్ఞాతుమ్ = తెలిసికొనుటకును, ద్రష్టుంచ = చూచుటకును, ప్రవేష్టుంచ = ప్రవేశించుటకును (ఐక్యమొందుటకు), శక్యః (అస్మి) = శక్యుడను (అగుచున్నాను).

**తా:–** శత్రువులను తపింపజేయువాడా! ఓ అర్జునా! ఈ విధమగు రూపముగల నేను అనన్యభక్తిచేత మాత్రమే యథార్థముగ తెలిసికొనుటకును, చూచుటకును, ప్రవేశించుటకును, సాధ్యమైనవాడ నగుచున్నాను.

**వ్యాఖ్య:–** క్రిందటి శ్లోకమున వేదపఠన యజ్ఞాదులవలన భగవద్దర్శనము కాజాలదని చెప్పబడినది. మఱిదేనిచేత భగవద్దర్శనము కాగల్గునో ఈ శ్లోకమందు విపులముగ చెప్పబడినది. భగవత్సందర్శనమునకు ఉపాయము చెప్పబడిన శ్లోకమగుటచే ఇది అతి ముఖ్యమైనది. ముముక్షువు లిద్దానిని బాగుగ మననముచేసి అందలి భావములను కార్యాన్విత మొనర్పవలెను.

అనన్యభక్తివలననే మనుజుడు పరమాత్మను సందర్శింపగల్గునని యిట వచింప బడినది. భక్తి అను పదమునకు 'అనన్య' అను విశేషణముచేర్చుటవలన, ఇతరములగు ప్రాపంచిక పదార్థములపై ఆసక్తినుంచక కేవలము పరమాత్మయందే అనన్యమగు ప్రేమ, అనురాగము, ఆసక్తికలిగియుండవలయునని స్పష్టమగుచున్నది. పంపకములేని భక్తి, మఱియొకవస్తువుపై చెదిరిపోనిభక్తి, పరమాత్మతప్ప అన్యవస్తువును అభిలషింపని భక్తి అనన్యభక్తి యనబడును. సామాన్యముగ జనులయొక్క భక్తి కొంత గృహారామాదులందు, దారాపుత్రులందు, సంపదలయందు, కీర్తిప్రతిష్ఠలయందు విభజింపబడినది యగుటవలన, భగవంతునిపై ఏకొద్దియో భక్తి మిగులుచున్నది. ఇది అనన్యభక్తికాదు. దృశ్యపదార్థములందు పంపకములేని భక్తియే అనన్యభక్తి. అదియే భగవత్సందర్శనమునకు ఏకైక ఉపాయమని యిట తెలుపబడినది.

అట్టి అనన్యభక్తిచే భగవానుని (1) తెలిసికొనుటకు (జ్ఞాతుం), (2) చూచుటకు (ద్రష్టుం), (3) ప్రవేశించుటకు (ప్రవేష్టుం) శక్యమగునని పేర్కొనబడినది. దాని భావమేమి? ఇచట తెలిసికొనుట, చూచుట, ప్రవేశించుట అను మూడు క్రియలు చెప్పబడినవి. ప్రారంభమున మనుజునకు 'భగవంతుడిట్టివాడు' అను పరిజ్ఞానము కలుగును. 'జ్ఞాతుమ్' ఇది మొదటి అంతస్తు. ఈ స్థితియందు భక్తునకు భగవంతుడొకింత దూరముగనే యుండును. ఇది ద్వైతస్థితి. తదుపరి అభ్యాసవశమున ఆ భక్తుడు భగవంతునకు ఇంకను సమీపమునకువచ్చి ప్రత్యక్షముగా (Face to face) ఆతనిని దర్శింపగల్గును. (ద్రష్టుమ్). ఇక భగవద్విషయమై అతనికేమాత్రము సందేహముండజాలదు. ఇది రెండవ అంతస్తు. ఇది మొదటిదానికంటె పైస్థితి. ఈ స్థితియందు భక్తుడు భగవంతునకు అతిసమీపమున వచ్చిచేరును. అత్తఱి, కరతలమందలి

బిల్వఫలమునుగాని, అమలకఫలమునుగాని మనుజుడు ప్రత్యక్షముగ చూడగల్గునట్లు, యాతడు భగవంతుని విస్పష్టముగ గాంచగల్గును. ఇది దాదాపు విశిష్టాద్వైతస్థితికి సమానము.

అటుపిమ్మట అభ్యాసప్రాబల్యముచే ఆ భక్తుడు భగవంతునకింకను సమీపమునకు వెళ్ళి క్రమముగ వారియందు ప్రవేశించి ఐక్యమైపోవును (ప్రవేష్టుమ్). ఉప్పుకల్లు సముద్రమునందు లయించినట్లు, వర్షబిందువు నదీజలమున మిళితమైపోవునట్లు, నీళ్లుపాలలో కలిసిపోయినట్లు, అత్తఱి భక్తుడు భగవంతునియందు విలీనమైపోవును. అపుడు భక్తుడు, భగవంతుడు – అను రెండు వస్తువులుండనేరవు. ఒకే భగవద్వస్తువు మిగిలియుండును. ఇది మొదటి రెండంతస్తులకంటెను పరమైనది. ఇది పూర్ణఅద్వైతస్థితి. ప్రతివాడు మొదటి రెండంతస్తుల యనుభవమునుబొంది, అంతటితో తృప్తినొందక సాధనాభ్యాసమును ఇతోధికముగ కొనసాగించుచు మూడవది యగు భగవత్సాయుజ్యమును బొందవలెను. పైన దెల్పిన మూడుస్థితులలో మొదటిది సామీప్యము, రెండవది సారూప్యము, మూడవది సాయుజ్యము. సామాన్యముగ కొందఱు భగవంతునిగూర్చి శాస్త్రాదులవలన ఒకింతతెలిసికొని అంతయు తెలిసినదని తృప్తినొంది సాధనను విరమింతురు. అది సరికాదు. అట్టివాడు పూర్ణత్వమును బొందజాలడు. ఆతడింకను ముందుకుపోయి, భగవానుని ప్రత్యక్షముగ దర్శించుటకు, ఆతనిలో ఐక్యమొందుటకు యత్నింపవలెను. కనుకనే శ్రీకృష్ణమూర్తి కేవలము 'జ్ఞాతుమ్' అనిచెప్పి ఊరుకొనక, 'ద్రష్టుమ్', 'ప్రవేష్టుమ్' అనికూడ వచించిరి.

ఒకమంచిఫలము బజారునందు కలదనియు, దానివర్ణము, రుచి, విలువ ఇట్టి దనియు ఒకడు ఇంటివద్దకూర్చొని మఱియొకనిద్వారా తెలిసికొనెను – అనుకొనుడు. వెంటనే దానినిగూర్చి యాసక్తిగలిగి బజారునకువెళ్ళి దానిని చూచును. చూచిన పిదప ఇంకను ఆసక్తిగలిగి దానినికొని భుజించును. ఇచ్చోట, మొదటిస్థితి 'జ్ఞాతుమ్' అని భగవానుడు చెప్పినదానికి సరిపోవును. (భగవంతునిగూర్చి సద్గురువులవలన, సచ్ఛాస్త్రములవలన తెలిసికొనుట). అట్లే రెండవస్థితి 'ద్రష్టుమ్' అనుదానికి సరిపోవును. (సాధనాభ్యాసములచే భగవంతుని ప్రత్యక్షముగ గాంచగల్గుట). మూడవస్థితి 'ప్రవేష్టుమ్' అను పదమునకు సరిపోవును. (సాధనపరిపక్వతచే భక్తుడు భగవంతునియందైక్యమగుట). ఇదియే జీవన్ముక్తదశ, మోక్షస్థితి. ఒక ఇంటినిగూర్చి తెలిసికొనుట, తెలిసికొనిన పిమ్మట దానిని సమీపించుట, తదుపరి ఇంటిలో ప్రవేశించుట యెట్లో, అట్లే భగవంతునిగూర్చియు నెఱుంగవలయును. ప్రతివారును అనన్యభక్తియొక్క సమాశ్రయముచే భగవదైక్యరూపమగు అద్వైత పరాకాష్ఠస్థితిని జీవితములో తప్పక పొందియేతీరవలెను. అపుడే సంసారదుఃఖమంతమగును.

'యదాహ్యేవైష ఏతస్మిన్నుదరమన్తరం కురుతే అథ తస్య భయం భవతి' అను ఉపనిషద్వాక్యానుసారము భగవంతునకు తనకు రవ్వంతైనను ఎడమున్నచో భయము జనించును. భయముగలస్థితి పూర్ణస్థితి యెన్నటికిని కానేరదు. కాబట్టి 'ప్రవేష్టుమ్' అను మూడవదశను ప్రతిజీవియు అనన్యభక్తియొక్క సాహాయ్యముచేపొంది కృతార్థుడు కావలయును.

కేవలము వేదపఠనాదులచే ముక్తికలుగునని వచించినచో చదువురానివారు అక్కార్యమును చేయజాలరు. కనుక వారికి ముక్తిలేకపోవును. కేవలము తపస్సులచేగాని, యజ్ఞములచేగాని ముక్తికలుగునని వచించినచో అవియు సర్వులకు అందుబాటులో లేవు, గనుక అందఱును చేయజాలరు. కేవలము దానములచే మోక్షము సిద్ధించునని చెప్పినచో బీదవారు దాని నాచరింపలేరు, కావున వారికిన్ని ముక్తిలేకపోవును. భక్తిచేతనే భగవద్దర్శనము, (భగవదైక్యము) చేకూరగలదని ఇచ్చట చెప్పుటవలన, అది సులభముగ నుండుటచేతను, సర్వులకును అందుబాటులో నుండుటచేతను ఎల్లరకును అవలంబనీయమై

యొప్పుచున్నది. కావున జీవరాసులయెడల కరుణగలిగి ఇట్టి సర్వజనసులభమగు మోక్షసాధనమును భగవాను డిచట తెలిపినవారైరి.

**ప్ర:–** భగవద్దర్శనమున కుపాయమేమి?

**ఉ:–** అనన్యభక్తి.

**ప్ర:–** దానివలన జీవునకు ఏ యే ప్రయోజనములు సిద్ధించును?

**ఉ:–** భగవంతునిగూర్చి తెలిసికొనగల్గును. వారిని చూడగల్గును. వారియందు ప్రవేశింపగల్గును.

**అ॥** దేవుని ఎవరు పొందగలరో వచించుచున్నాడు –

**55. మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సఙ్గవర్జితః**
**నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాణ్డవ.**

**టీక:–** పాణ్డవ = ఓ అర్జునా!, మత్కర్మకృత్ = నాకొఱకే (ఈశ్వరార్పణబుద్ధితో లేక భగవత్ప్రీత్యర్థము) కర్మలనుజేయువాడును (లేక, భగవత్సంబంధమైన, భగవత్ప్రీతికరములైన కర్మలను జేయువాడును), మత్పరమః = నన్నే పరమప్రాప్యముగ, పరమపురుషార్థముగ నమ్మినవాడును, మద్భక్తః = నాయందే భక్తిగలవాడును, సఙ్గవర్జితః = సమస్తదృశ్యపదార్థములందును, సంగమును (ఆసక్తిని, మమత్వమును) విడిచినవాడును, సర్వభూతేషు = సమస్తప్రాణులయందును, నిర్వైరః = ద్వేషములేనివాడును, యః = ఎవడో, సః = అతడు, మామ్ = నన్ను, ఏతి = పొందుచున్నాడు.

**తా:–** అర్జునా! ఎవడు నాకొఱకే కర్మలజేయునో (లేక నాసంబంధమైన (దైవసంబంధమైన) కార్యములనే చేయునో), నన్నే పరమప్రాప్యముగ నమ్మియుండునో, నాయందే భక్తిగల్గియుండునో, సమస్తదృశ్యపదార్థములందును సంగమును (ఆసక్తిని, మమత్వమును) విడిచివేయునో, సమస్తప్రాణులందును ద్వేషము లేకయుండునో అట్టి వాడు నన్ను పొందుచున్నాడు.

**వ్యాఖ్య:–** భగవంతుని యెవరు పొందగలరో ఇచట చక్కగ వివరింపబడినది. ఐదు సద్గుణములను వచించి, వాని నెవడుగలిగియుండునో అతడు తప్పక భగవత్సాయుజ్యమును బడయగలడని శ్రీకృష్ణపరమాత్మ పేర్కొనిరి. 'యః' అనిచెప్పుటవలన ఎవడైనను సరియే ఇట్టి మహోన్నతగుణముల నవలంబించియుండినచో మోక్షభాగుడు కాగలడని స్పష్టముచేయబడినది. ఇట జాతిమతకుల విచక్షణ యేమియును లేదు. యోగ్యతయే ప్రధానము. ఔషధమును ఎవరు త్రాగినను రోగము నయమగునుగదా! ప్రమిద, తైలము, వత్తి నిప్పుపెట్టి తెచ్చుకొనినచో దీపము ఎవరికైనను వెలుగునుగదా! గీతయందిట్టి విశాల భావములే పలుచోట్ల వ్యక్తీకరింపబడినవి. గీతయొక్క ఔన్నత్యమున కిట్టి సార్వజనిక భావములే కారణములు.

'మత్కర్మకృత్' – దైవసంబంధములగు పూజ, ధ్యాన, జపాదులను గావించువాడు లేక ఏ కార్యముచేసినను భగవదర్పితముగ జేయువాడు (పాపకార్యములను జేయక సత్కర్మలనే ఈశ్వరార్పణబుద్ధితో నాచరించువాడని అర్థము). అట్టివాడు క్రమముగ చిత్తశుద్ధినిబడసి, భగవత్కృపకు పాత్రుడై, ఆత్మవిజ్ఞానమునుబడసి మోక్షమునొందును. జీవితములో మనుజుడు తన దైనందినకార్యముల

నెన్నిటినో ఆచరించును. కాని వానినన్నింటిని భగవదర్పితబుద్ధితో చేయుచో అవి దైవపూజగా పరిణమించిపోవును (Work changes into worship). అత్తఱి అవి సామాన్యకారణములుగనుండక మోక్షహేతువులుగ మారిపోవును. కనుకనే భగవంతుని పొందగల్గువారిలో 'మత్కర్మకృత్' (నా కొఱకే కర్మలుచేయువాడు, లేక నా సంబంధమైన కర్మలు చేయువాడు) అనునది చేర్చబడెను.

'మత్పరమః' - భగవంతునే పరమప్రాప్యముగ, పరమలక్ష్యముగ దలంచి దైవతత్పరుడైయుండువాడు. సామాన్యముగ జనులలో పెక్కురు ప్రాపంచికవిషయములనే పరమ గమ్యములుగ భావించి వానికొఱకే అహోరాత్రములు కృషిసలుపుచునుందురు. కాని దృశ్యపదార్థములన్నియు అసద్వస్తువులు, నశ్వరములు. కావున అవి బంధవిముక్తిని గలిగింపజాలవు. పరమాత్మయొకడే ఈ ప్రపంచమునందలి సద్వస్తువు, కావున ఆతనినే తనలక్ష్యముగ, గమ్యముగ జీవుడు తలంచి తల్లక్ష్యప్రాప్తికై యత్నించవలెను. అట్టివాడు భగవంతుని తప్పక పొందగలడు.

'మద్భక్తః' - పరమానందప్రదుడగు భగవంతునియందే అతిశయభక్తి కలిగియుండవలెనుగాని తదితర పదార్థములందుగాదు. జననమరణములనుండి తప్పించజాలని పదార్థములయెడల భక్తి (ప్రీతి) యున్నచో నేమిప్రయోజనము? భగవద్భక్తిచే అచిరకాలములో జీవుడు పరమాత్మపదము నొందగలడను సత్య మిచట వచింపబడినది.

'సఙ్గవర్జితః' - సంగమనగా ఆసక్తి, దేహాదిదృశ్యపదార్థములందు మమత్వము. అద్దానిని వదలవలెను. అసంగత్వమును అభ్యసించవలెను. అసంగమను పదునైన కత్తితో సంసార (దుఃఖ) వృక్షమును సమూలముగ ఛేదించివేయవలెనని భగవానుడు (గీత 15వ అధ్యాయమున) ఆనతిచ్చియున్నారు (అసంగశస్త్రేణ దృఢేన ఛిత్వా). తామరాకు నీటిని అంటనట్లు, దృశ్యపదార్థములందు మెలగుచున్నను, విచారణా బలముచే వానితోనంటక, అసంగుడై మెలగువాడు, అట్టి సంగరాహిత్యమువలన ముక్తిని బడయగలడని యిట పేర్కొనబడినది.

'నిర్వైరస్సర్వభూతేషు' - ఇక ఐదవది సమస్తప్రాణికోట్ల యెడల ప్రేమ, దయ, ద్వేషరాహిత్యము. 'సర్వభూతేషు' అని చెప్పినందువలన ఏ ఒకటి రెండు ప్రాణుల యెడలనో దయగల్గియున్న చాలదనియు, సమస్తభూతకోట్లయెడల కరుణ, దయగలిగియుండవలెననియు తేలుచున్నది. సమస్తప్రాణులు భగవత్స్వరూపులు, నారాయణస్వరూపులు. కావున ఏ ప్రాణికైనను, అపకారముచేసినచో, దేవున కపకారము చేసినట్లే యగును. కాబట్టి నిర్వైరత్వమును లెస్సగ శీలించవలెను. ఈ సత్యమునే 'అద్వేష్టాసర్వభూతానామ్' మొదలగు వాక్యములద్వారా గీతలో పెక్కుచోట్ల భగవానుడు తెలిపియున్నారు. ఒకప్రక్క ఉపనిషద్వాక్యములను నల్లించుచు, దేవుని పూజాదులను సల్పుచు, వేఱొకప్రక్క ప్రాణికోట్లను దూషించుచు, ద్వేషించుచు, హింసించుచునున్నచో ఆ పూజాదులవలన నేమి ప్రయోజనము? అది ఆచరణ వేదాంతముకానేరదు. మందుతినువాడు పథ్యముకూడ ఆచరించవలెను. పైనతెలిపిన నాలుగు సుగుణములు (మత్కర్మకృత్ - ఇత్యాదులు) మందువంటివి. ఈ ఐదవ సుగుణమగు సర్వభూతదయ పథ్యమువంటిది. కాబట్టి వానితోబాటు దీనినిగూడ తప్పక అవలంబించవలెను. ఆ నాలుగు సుగుణములలో ప్రతియొక్కటియు ఈ ఐదవ సుగుణముతో చేరియుండవలెను. ఈ ప్రకారముగ భగవద్భక్తి, సర్వభూతదయ కలవాడు తప్పక భగవానుని చేరగలడని ('మామేతి') ఈ శ్లోకమందు అసందిగ్ధముగ చెప్పివేయబడెను.

గీతయం దీశ్లోకము చాల ముఖ్యమైనది. శ్రీశంకరాచార్యులవారున్ను గీత మొత్తము మీద ఈశ్లోకము

సర్వోత్కృష్టమైనదని, సారభూతమైనదని తెలిపియున్నారు. ఏలయనిన, దీనియం దన్నియోగములున్ను సంక్షేపముగ బోధింపబడినవి. మఱియు ఆ అన్నియోగములకు ఆవశ్యకమైన సర్వభూతదయయు పేర్కొనబడినది. ఎట్లనిన –

(1) నాకర్మలను చేయుము – (మత్కర్మకృత్) – కర్మయోగము } మందు..
(2) నాయందు తత్పరుడవైయుండుము (మత్పరమః) – ధ్యానయోగము }
(3) నాయెడల భక్తిగలిగియుండుము (మద్భక్తః) – భక్తియోగము }
(4) దృశ్యపదార్థములయెడల సంగము లేకుండయుండుము – (సఙ్గవర్జితః) – జ్ఞానయోగము
(5) సమస్తప్రాణులయెడల – దయగలిగియుండుము } (నిర్వైరస్సర్వభూతేషు) – భూతదయ } పథ్యము

కాబట్టి సాధకు లీశ్లోకముయొక్క తాత్పర్యమును పదేపదే చింతించుచు, భక్త్యాది సుగుణములుగల్గి పరమాత్మసాయుజ్యము నీజన్మయందే పొందేలాగున యత్నించవలెను.

ప్ర:– భగవంతుని యెవడు పొందగలడు?

ఉ:– (1) దైవకార్యములు నాచరించువాడు, (2) దైవమునే పరమప్రాప్యముగ నెంచువాడు, దైవతత్పరుడై యుండువాడు, (3) దైవభక్తుడు, (4) సంగరహితుడు, (5) సర్వభూతదయగలవాడు – ఇట్టివాడు భగవంతుని పొందగలడు.

ప్ర:– దీనినిబట్టి భగవత్ప్రాప్తికి ఉపాయములేవియని స్పష్టమగుచున్నది?

ఉ:– (1) దైవకార్యముల నాచరించుట, (2) దైవమునే పరమప్రాప్యముగ నమ్ముట, దైవతత్పరుడై యుండుట, (3) దైవభక్తి గలిగియుండుట, (4) సంగరాహిత్యము నవలంబించుట, (5) సర్వప్రాణులయందు దయ, వైరములేమి గలిగియుండుట.

ఓమ్
ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే విశ్వరూపసందర్శనయోగో నామ
ఏకాదశో உధ్యాయః

ఇది ఉపనిషత్ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున
సంవాదమునగు శ్రీ భగవద్గీతలందు విశ్వరూపసందర్శనయోగమను
పదునొకండవ అధ్యాయము
ఓమ్ తత్ సత్



# భక్తి యోగము



**సమ శ్శత్రౌ చ మిత్రేచ తథా మానావమానయోః**
**శీతోష్ణ సుఖదుఃఖేషు సమస్సంగ వివర్జితః.** **(12-18)**

శత్రువునందును, మిత్రునియందును, మానావమానములందును, శీతోష్ణసుఖదుఃఖములందును సమముగ ఉండువాడును, దేనియందును, ఆసక్తి లేనివాడును అగు మనుజుడు నాకు ఇష్టుడు.

ఓం

# శ్రీ భగవద్గీత

అథ ద్వాదశోఽధ్యాయః

## పండ్రెండవ అధ్యాయము

భక్తియోగః

## భక్తియోగము

**ఈ అధ్యాయము యొక్క పేరు :-**

'భక్తియోగము' - భక్తిని గుఱించి ప్రతిపాదింపబడిన అధ్యాయమగుటచే దీనికి భక్తియోగమను పేరు వచ్చినది. భక్తియొక్క స్వరూపము, భక్తుని లక్షణములు, వివిధ ఆధ్యాత్మిక సాధనములు ఈ అధ్యాయమున పేర్కొనబడినవి. ఈ అధ్యాయము భక్తితో ప్రారంభింపబడి భక్తితో అంతమైనది. ఈ ప్రకారముగ భక్తినిగూర్చియు, భక్తుని గూర్చియు విశేషముగ తెలుపబడుటవలన ఈ అధ్యాయమునకు 'భక్తియోగము'ను పేరు కలిగినది.

**ఈ అధ్యాయమందలి ప్రధాన విషయములు :-**

(1) సాకార, నిరాకారోపాసకులను గూర్చిన విషయములు - (1 శ్లో॥ నుండి 5 శ్లో॥ వఱకు)

(2) భక్తియొక్క మహత్తరఫలము - (6 శ్లో॥ నుండి 8 శ్లో॥ వఱకు)

(3) వివిధ ఆధ్యాత్మికసాధనలు - (9శ్లో॥ నుండి 12శ్లో॥ వఱకు)

(4) భక్తుని లక్షణములు - (13 శ్లో॥ నుండి 20 శ్లో॥ వఱకు)

**పూర్వాధ్యాయముతో ఈ అధ్యాయమునకు గల సంబంధము :-**

రెండవ అధ్యాయము మొదలుకొని పదునొకండవ అధ్యాయమువఱకును భగవానుడు కొన్నిచోట్ల నిర్గుణబ్రహ్మోపాసన, అక్షరపరబ్రహ్మతత్త్వము, జ్ఞాననిష్ఠలను బోధించుచు మఱికొన్నిచోట్ల (విభూతియోగ విశ్వరూపసందర్శనాది యోగములందు) సగుణబ్రహ్మోపాసనను, సాకారార్చననుగూడ తెలుపుచువచ్చిరి. తుట్టతుదకు విశ్వరూపమును జూపిరి. విశ్వరూపమును ఉపసంహరించినమీదట పలికిన 'మత్కర్మకృత్', 'మత్పరమః', 'మద్భక్తః' మున్నగు వచనములు సగుణోపాసనను మిక్కిలి బలపఱచునవియై యున్నవి. పూర్వము భగవానుడు తెలిపిన అక్షర, నిరాకార, ఆత్మోపాసనకు సంబంధించిన విషయములు అర్జునుని మనంబున నాటుకొని యుండుటచేతను, ఇపుడు తిరిగి సాకారోపాసనాసంబంధములైన వాక్యములను వినుట వలనను వెంటనే అర్జునునకు సంశయమొదవ, 'సాకారనిరాకారోపాసకుల' లో ఎవరు శ్రేష్ఠులు? అని ఈ (12వ) అధ్యాయప్రారంభమున భగవానుని ప్రశ్నించుచున్నాడు. అర్జునుని యా ప్రశ్నతో ఈ అధ్యాయము ప్రారంభమగుచున్నది.

**అర్జున ఉవాచ :-**

**1. ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే**
**యే చాప్యక్షరమవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః.**

అర్జునఉవాచ = అర్జునుడు చెప్పెను.

**టీక:-** ఏవమ్ = ఈ ప్రకారముగ (11వ అధ్యాయముచివఱ చెప్పబడినవిధముగ), సతతయుక్తాః = ఎల్లప్పుడు మీయందే మనస్సును నెలకొల్పినవారై, యే భక్తాః = ఏ భక్తులు (సగుణోపాసకులు), త్వామ్ = మిమ్ము, పర్యుపాసతే = ఉపాసించుచున్నారో, యే చ అపి = ఎవరైతే, అవ్యక్తమ్ = ఇంద్రియములకు గోచరముకాని, అక్షరమ్ = నాశరహితపరబ్రహ్మమును, పర్యుపాసతే = ధ్యానించుచున్నారో, తేషామ్ = ఆ యిరుతెగలవారిలో, కే = ఎవరు, యోగవిత్తమాః = యోగమును బాగుగ నెఱిగినవారు.

**తా:-** అర్జునుడు చెప్పెను - ఈ ప్రకారముగ ఎల్లప్పుడు మీయందే మనస్సును నెలకొల్పినవారై ఏ భక్తులు మిమ్ముపాసించుచున్నారో, మఱియు ఎవరు ఇంద్రియగోచరముగాని అక్షరపరబ్రహ్మను ధ్యానించుచున్నారో, ఆ యిరుతెగలవారిలో యోగమును బాగుగ నెఱిగిన వారెవరు?

**వ్యాఖ్య:-** 'ఏవమ్' అను పదము క్రిందటి అధ్యాయముయొక్క 55వ శ్లోకమగు 'మత్కర్మకృత్' అను శ్లోకముయొక్క భావమును సూచించుచున్నది.

భగవానుని విశ్వరూపమునుగాని, లేక దైవసంబంధమైన వేఱొకమూర్తినిగాని, సాకార స్వరూపమునుగాని, అనవరత భక్తితో, ఉపాసించువారు (సగుణోపాసకులు) గొప్పా? లేక ఇంద్రియములకు గోచరముకాని, నిరాకారమైన, సర్వవ్యాపకమైన, అక్షర పరమాత్మను ధ్యానించువారు (నిర్గుణోపాసకులు) గొప్పా? అని అర్జునుని ప్రశ్న. ఇదివఱలో అనేకమార్లు భగవానుడు (2వ అధ్యాయము 8వ అధ్యాయము మున్నగుచోట్ల) నిర్గుణపరమాత్మయొక్క తత్త్వమునుగూర్చి, ధ్యానమునుగూర్చి తెలిపియుండిరి. ఇపుడు విశ్వరూపమునుజూపి, సగుణోపాసనను బలపఱచిరి. కావున రెండిటిలో ఏదిశ్రేష్ఠమను భావము అర్జుననకు కలుగుట సహజమే అయియున్నది -

**అ॥** అర్జునుని యా సంశయమును భగవానుడు తీర్చివైచుచున్నాడు -

**శ్రీ భగవానువాచ -**

**2. మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే**
**శ్రద్ధయా పరయోపేతా స్తేమే యుక్తతమా మతాః.**

శ్రీ భగవానువాచ = శ్రీ భగవంతుడు చెప్పెను.

**టీక:-** మయి = నాయందు, మనః = మనస్సును, ఆవేశ్య = నిలిపి, నిత్యయుక్తాః = నిరంతర దైవచింతనాపరులై (తదేకనిష్ఠులై), పరయా = మిక్కిలి, శ్రద్ధయా = శ్రద్ధతో, ఉపేతాః = కూడుకొనినవారై, యే = ఎవరు, మామ్ = నన్ను, ఉపాసతే = ఉపాసించుచున్నారో, తే = వారు, యుక్తతమాః = ఉత్తమయోగులని, మే మతాః = నాయొక్క అభిప్రాయము.

**తా:–** శ్రీ భగవంతుడు చెప్పెను - నాయందు మనస్సును నిలిపి నిరంతర దైవచింతనాపరులై (తదేకనిష్ఠులై) మిక్కిలి శ్రద్ధతో గూడుకొనినవారై యెవరు నన్నుపాసించుచున్నారో వారే ఉత్తమయోగులని నా యభిప్రాయము.

**వ్యాఖ్య:–** అర్జునుని ప్రశ్నకు భగవానుడు చక్కటిసమాధాన మొసంగిరి. సగుణోపాసకులు శ్రేష్ఠులా? నిర్గుణోపాసకులు శ్రేష్ఠులా? యను ప్రశ్నకు ఎవరైనను సరియే మిక్కిలిశ్రద్ధతో గూడుకొని నిరంతరము దైవాయత్తచిత్తులైయుందురో వారే శ్రేష్ఠులని శ్రీకృష్ణుడు ప్రత్యుత్తరమొసంగిరి. ఇచట మూడుసాధనలు చెప్పబడెను.

(1) మనస్సును పరమాత్మయందు నిలుపుట.

(2) నిరంతరము దైవచింతనాపరులై యుండుట.

(3) మిక్కిలి శ్రద్ధతో గూడుకొనియుండుట.

ఈ మూడింటిని అనుష్ఠించువాడెవడో అతడు సర్వశ్రేష్ఠుడగు యోగిగాని, సగుణోపాసకుడా, నిర్గుణోపాసకుడా, సన్న్యాసియా, గృహస్థుడా, ద్విజుడా, ద్విజేతరుడా - అను ప్రశ్నయే ఇచట లేదు. ఆహా! భగవాను డెట్టి విశాలభావమును ప్రకటించిరి! భక్తికి, శ్రద్ధకు, ఏకాగ్రతకు, ప్రాధాన్యమొసంగిరే కాని ఒకానొకమార్గమునకు, సంప్రదాయమునకు గాదు.

**అ॥** నిర్గుణోపాసకులను గుఱించి ఒకింత చెప్పుచున్నాడు -

**3. యే త్వక్షరమనిర్దేశ్యమవ్యక్తం పర్యుపాసతే**
**సర్వత్రగమచిన్త్యం చ కూటస్థమచలం ధ్రువమ్.**

**4. సంనియమ్యేన్ద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః**
**తే ప్రాప్నువన్తి మామేవ సర్వభూతహితే రతాః.**

**టీక:–** యే తు = ఎవరైతే, ఇన్ద్రియగ్రామమ్ = ఇంద్రియముల సమూహమును, సంనియమ్య = లెస్సగ స్వాధీనపఱుచుకొని, సర్వత్ర = అంతటను, సమబుద్ధయః = సమానభావముగలవారై, సర్వభూతహితేరతాః = సమస్తప్రాణులకును హితమును గలుగజేయుటయం దాసక్తిగలవారై, అనిర్దేశ్యమ్ = ఇట్టిదని సూచింప నలవికానిదియు, అవ్యక్తమ్ = ఇంద్రియగోచరము కానిదియు (లేక, ఏ ప్రమాణముచేతను దెలియబడనిదియు), అచిన్త్యమ్ = చింతింప నలవికానిదియు (ఊహింపశక్యముకానిదియు), కూటస్థమ్ = నిర్వికారమైనదియు (ప్రపంచమున కధిష్ఠానమైనదియు), అచలమ్ = చలింపనిదియు, ధ్రువమ్ = నిత్యమైనదియు, సర్వత్రగం చ = అంతటను వ్యాపించినదియు నగు, అక్షరమ్ = నాశరహితమగు (నిర్గుణ) పరబ్రహ్మమును, పర్యుపాసతే = ధ్యానించుచున్నారో, తే = వారు, మామ్ ఏవ = నన్నే, ప్రాప్నువన్తి = పొందుచున్నారు.

**తా:–** ఎవరు ఇంద్రియములన్నిటిని బాగుగ నిగ్రహించి (స్వాధీనపఱుచుకొని) ఎల్లెడల సమభావముగలవారై, సమస్తప్రాణులకును హితమొనర్చుటయం దాసక్తిగలవారై, ఇట్టిదని నిర్దేశింప శక్యముకానిదియు, ఇంద్రియములకు గోచరముకానిదియు, చింతింపనలవికానిదియు, నిర్వికారమైనదియు,

చలించనిదియు, నిత్యమైనదియు, అంతటను వ్యాపించియున్నదియు నగు అక్షరపరబ్రహ్మమును ధ్యానించుచున్నారో, వారు నన్ను పొందుచున్నారు.

**వ్యాఖ్య:–** ఒకే పరమాత్మ సాకారముగను, నిరాకారముగను ఉండుటవలన, సగుణధ్యానమునకుగాని, నిర్గుణధ్యానమునకుగాని లక్ష్యము ఒకటియే అయియున్నది. శ్రద్ధతోను, నిర్మలభక్తితోను ఏ ప్రకారము ధ్యానించినను జనులు పరమాత్మనే చేరుదురు. ఈ రెండు శ్లోకములందును నిర్గుణపరబ్రహ్మమును ధ్యానించువారిని గుఱించి చెప్పబడినది. ఇందు మొదటి శ్లోకమున బ్రహ్మమునుగూర్చిన విశేషణములున్ను, రెండవ శ్లోకమున బ్రహ్మప్రాప్తికివలసిన శీలసంపత్తియు తెలుపబడినవి. సాధకుడు సాధ్యవస్తువగు పరమాత్మను ధ్యానించుచున్నప్పటికిని, హృదయశుద్ధిలేనిచో, ఇంద్రియ నిగ్రహము గల్గియుండనిచో, ప్రాణికోట్లయెడల దయలేనిచో ఆ ధ్యానము చక్కని ఫలితము నొసంగజాలదు. అట్టి వానికి బ్రహ్మానుభూతికలుగుటదుస్తరము. అతని ఉపాసన కళాయిలేని పాత్రలోవండిన పప్పుపులుసువలె నుండును. వస్తువులన్నియు మంచివి అయినను పాత్ర శుద్ధముగాలేనిచో ఆ పులుసెట్లు చిలుమెక్కిపోయి నిరుపయోగమగునో, అట్లే హృదయశుద్ధి, ఇంద్రియనిగ్రహము, భూతదయ మున్నగు పవిత్రగుణములులేక భగవంతుని నిరాకారముగగాని, సాకారముగగాని యెట్లుపాసించినను పూర్ణఫలితము కలుగదు. కనుకనే గీతాచార్యులు ధ్యానశీలురను హెచ్చరించుటకు కాబోలు, ధ్యాతకు వలసిన మూడు గొప్ప సుగుణములను ఇచట నిర్గుణబ్రహ్మోపాసనాఘట్టమున పేర్కొనిరి. అవి యేవియనిన –

(1) ఇంద్రియ సమూహమును లెస్సగ అరికట్టుట (సంనియమ్యేన్ద్రియగ్రామం)

(2) ఎల్లెడల సమభావము గలిగియుండుట (సర్వత్రసమబుద్ధయః)

(3) సమస్తప్రాణులకు హితమునాచరించుట (సర్వభూతహితేరతాః)

కాబట్టి ముముక్షువులు ధ్యానాదులను సల్పుచు ఈ సుగుణత్రయమును బాగుగ అలవఱచుకొనవలెను. ఇచట 'నియమ్య' అని చెప్పక 'సంనియమ్య' అని చెప్పుటవలన ఇంద్రియములను ఒకింత నిగ్రహించిన చాలదనియు లెస్సగ నిగ్రహించవలెననియు, 'సర్వత్ర' అని పేర్కొనుటవలన సమస్తప్రాణులందును, లేక ఎల్లకాలమందును సమభావము గలిగియుండవలెననియు, 'సర్వభూతహితేరతాః' అని చెప్పుటచే ఏ ఒకానొక ప్రాణియెడల దయగలిగియుండుట చాలదనియు, సమస్తప్రాణికోట్లయెడ ప్రేమ, దయ, ఉపకారబుద్ధి గలిగియుండవలెననియు స్పష్టమగుచున్నది. ఈ ప్రకారములగు సుగుణములుగల్గి పరమాత్మను ధ్యానించుచో వారు తప్పక ఆ పరమాత్మను జేరగలరని 'తేప్రాప్నువన్తి' అను వాక్యముచే భగవానుడు నిశ్చయపూర్వకముగ తెలుపుచు సర్వులకును అభయమొసంగుచున్నారు. కావున భగవద్ధ్యానపరుడు పైమూడు సుగుణములను తనయందున్నవా, లేవా యని పరీక్షించుకొనవలయును.

**అ॥** సగుణనిర్గుణోపాసనల రెండిటిలో, నిర్గుణోపాసన (సామాన్యులకు) కష్టతరమనియు, దేహభావనగలవారి కయ్యది బహుప్రయాసగ నుండుననియు వచించుచున్నాడు –

**5. క్లేశోఽధికతరస్తేషామవ్యక్తాసక్తచేతసామ్
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే.**

**టీక:–** అవ్యక్తాసక్తచేతసామ్ తేషామ్ = ఇంద్రియగోచరముకాని పరమాత్మయందు

(నిర్గుణబ్రహ్మమందు) ఆసక్తిగల మనస్సుగలవారికి, క్లేశః = కష్టము, అధికతరః = మిక్కిలి అధికమైనది, హి = ఏలయనగా, అవ్యక్తా = నిర్గుణవిషయమైన, గతిః = మార్గము, దేహవద్భిః = దేహాభిమానము గలవారిచేత, దుఃఖమ్ = అతికష్టముగా, అవాప్యతే = పొందబడుచున్నది.

**తా:–** అవ్యక్త (నిర్గుణ) పరబ్రహ్మమునం దాసక్తిగల మనస్సుగలవారికి (బ్రహ్మమందు నిష్ఠను బొందుటలో సగుణోపాసకులకంటె) ప్రయాస చాల అధికముగ నుండును. ఏలయనిన, నిర్గుణోపాసనా మార్గము దేహాభిమానముగలవారిచేత అతికష్టముగా పొందబడుచున్నది.

**వ్యాఖ్య:–** నిర్గుణోపాసనామార్గము దేహాభిమానముగలవారికి చాల ప్రయాసగ నుండునని యిచట తెలుపబడినది. అదిలేనివారికి చాల సులభముగనుండును. అనగా దేహాహంభావములేక, ఇంద్రియనిగ్రహముగలిగి, నిష్కామకర్మానుష్ఠానముచేతను, ఈశ్వరోపాసనచేతను చిత్తశుద్ధిని బడసినవారికి నిర్గుణోపాసనయందేమియు కష్టముండదు. ఈ శ్లోకముయొక్క మొదటిపాదమునందు నిర్గుణోపాసన అధికతరక్లేశవంతమై యుండుననిచెప్పుట దేహాభిమానముగలవారికే యనియు, ఇంద్రియనిగ్రహములేనివారికే యనియు, సగుణోపాసనచే చిత్తశుద్ధిని బడయనివారికే యనియు గ్రహించవలెను. దేహాభిమానములేనివారికి, ఇంద్రియనిగ్రహముకలవారికి నిర్గుణమార్గము అతిసులభముగనున్నదై జీవుని పరమాత్మసాన్నిధ్యమునకు తప్పక చేర్చగలదని వెనుకటి శ్లోకములందు భగవానుడు చెప్పియేయుండిరను విషయమును ఈ సందర్భమున జ్ఞాపకమునకు తెచ్చుకొనవలెను.

కాబట్టి సాధకులు మొట్టమొదటనే అవ్యక్త (నిరాకార, నిర్గుణ) మార్గమునకై పరువిడక, దేహాభిమానమను దోషమును భగవదుపాసన, నిష్కామకర్మాద్యనుష్ఠానముల వలన తొలగించుకొని, ఇంద్రియనిగ్రహమును అభ్యసించి క్రమముగ నిర్గుణపరబ్రహ్మమందు చిత్తమును ప్రవేశింపజేసినచో అత్తఱి ఏ ప్రయాసలేకయే దైవప్రాప్తిరూపలక్ష్యము సిద్ధించగలదు. పరమార్థరంగమున ప్రవేశించి సాధకులనేకులు బ్రహ్మమునుగూర్చి ఉపాసనాదుల సలుపుచున్నను ఉత్తమఫలితములను బొందజాలకపోవుటకు కారణ మీశ్లోకమున చక్కగ తెలుపబడినది. క్షేత్రమును శుద్ధపఱచక విత్తనము వేసినచో ఏమిలాభము? పునాది గట్టిగలేక మేడ కట్టినచో నిలుచునా? అట్లే హృదయమందలి దేహాభిమానము మున్నగునవి తొలగనిచో బ్రహ్మమందు మనస్సు నిలవదు. సాధకులీవిషయమును బాగుగ జ్ఞప్తియందుంచుకొనవలెను. వాస్తవముగ ధ్యానముగాని, ఉపాసనగాని ఎంతయో ఆనందకరమైన పరిస్థితి. అది సచ్చిదానందసాగరమును గూర్చిన విషయముకదా! అందు కష్టమెందులకుండును? అది ప్రయాసను పోగొట్టునదేకాని, కలుగజేయునదికాదు. కాని జనులు దానిని ఆచరించుపద్ధతిని తెలుసుకొనజాలక దేహాభిమానవశమున కష్టమనుభవించుచున్నారు. కావున సగుణోపాసనమున కొంతకాలము మెలిగి, దేహాభిమానమును పోగొట్టుకొని తదుపరి నిర్గుణోపాసన నవలంబించుట ఉత్తమోత్తమము.

**అ॥** అనన్యభావముతో తన్నుగూర్చి ధ్యానించువారిని సంసారసాగరమునుండి ఉద్ధరించెదనని రెండు శ్లోకములద్వారా భగవానుడు చెప్పుచున్నాడు –

**6. యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః**
**అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే.**

## 7. తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ భవామి న చిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్.

**టీక:–** పార్థ= ఓ అర్జునా!, యేతు= ఎవరైతే, సర్వాణి= సమస్తములైన, కర్మాణి= కర్మములను, మయి = నాయందు, సన్న్యస్య = సమర్పించి, మత్పరాః = నన్నేపరమగతిగాదలంచినవారై (లేక నాయందే చిత్తముగలవారై), అనన్యేన యోగేన = (పరమాత్మ తప్ప) ఇతరమునుదేనిని దలంపని యోగముచే (అనగా ఇతరచింతన లెవ్వియులేక), మామ్ ఏవ = నన్నే, ధ్యాయన్తః = చింతించుచున్నవారలై, ఉపాసతే = ఉపాసించుచున్నారో, మయి = నాయందు, ఆవేశితచేతసామ్ = ఉంచబడిన చిత్తముగల, తేషామ్ = అట్టివారికి (అట్టివారిని) అహమ్ = నేను, మృత్యుసంసారసాగరాత్ = మృత్యురూపమగు (మరణాద్యనర్థములను గలుగజేయు) సంసారమను సముద్రమునుండి, న చిరాత్ = శీఘ్రముగ, సముద్ధర్తా = బాగుగలేవనెత్తువాడను, భవామి = అగుచున్నాను.

**తా:–** ఓ అర్జునా! ఎవరు సమస్తకర్మములను నాయందు సమర్పించి, నన్నేపరమగతిగ దలంచినవారై, అనన్యచిత్తముతో నన్నేధ్యానించుచు ఉపాసించుదురో, నాయందు చిత్తమునుజేర్చిన అట్టివారిని మృత్యురూపమగు ఈ సంసారసముద్రమునుండి నేను శీఘ్రముగ బాగుగ లేవదీయుచున్నాను.

**వ్యాఖ్య:–** ఇందు మొదటిశ్లోకమున సాధకుడు అనుసరించవలసిన పద్ధతిని, రెండవ శ్లోకమున దానియొక్క అఖండఫలితమును భగవానుడు తెలియజేసిరి. ఆ పద్ధతి యేదియనిన (1) సమస్తకర్మములను భగవంతునకు సమర్పించుట (2) వారినే పరమ గతిగ నెన్నుకొనుట, లేక వారియందే చిత్తమును నెలకొల్పుట (3) అనన్యభావముతో (ఏకాంతభక్తితో) అట్టి పరమాత్మను ధ్యానించుట – ఈ ప్రకారము భక్తితో తన్నుపాసించువారలను సర్వేశ్వరుడు జననమరణరూపమగు ఈ సంసారసాగరమునుండి లెస్సగ ఉద్ధరించెదరని పలుకుచున్నారు. ఓహో! ఎట్టి మహత్తరఫలితము భగవదుపాసకులకు లభించుచున్నది! భయంకరమై, మరణరూపమైనట్టి ఈ సంసారసముద్రమున మునిగితేలుచు, నానాయాతనలను బొందుచున్న ఈ జనానీకమున కిట్టి వాక్యము లెంతటి ఆశ్వాసమును గలుగజేయగలవు! అనాదికాలమునుండి సంసారరూపమగు ఈ ఘోరవిపత్తునందు తగుల్కొని బద్ధుడై 'పునరపి జననం, పునరపి మరణం' అనునట్లు కాలచక్రమున పరిభ్రమించుచు అల్లాడిపోవుచున్న జీవునకు భగవత్ప్రోక్తములగు ఈవాక్యములు సంజీవివంటివేయగును. మునుగుచున్నవానికి నావయెట్టిదో సంసారదుఃఖబాధితునకు భగవంతుడట్టివారు. ఎంత గొప్పసముద్రమైనను ఒక చిన్ననావచే దాటబడునట్లు భక్తియను తెప్పచే సంసారసముద్రమును దాటవచ్చును. మిమ్ములను 'తప్పకలేవనెత్తెదను' (సముద్ధర్తా) అని భగవానుడు కరుణతో పలుకుచున్నాడు. అయితే ఎవరు హస్తమును పైకి జాచి వారి అనుగ్రహమును వాంఛించుదురో అట్టివారినే లేవనెత్తుదురుగాని తక్కినవారినికాదు. ఎవ్వరువారినిగూర్చి చింతింపరో, ధ్యానింపరో, అట్టి వారి యుద్ధరణమునుగూర్చి వారు పట్టించుకొనరు. వారీదుఃఖసాగరమున ఇంకెంతయో కాలము తిరుగాడవలసివచ్చును. జీవుడు తాను చేయవలసినదానిని చేసినచో భగవంతుడు తాను గావించవలసిన సముద్ధరణమును తాను గావించును. కాబట్టి విజ్ఞుడగువాడు తాను అనుభవించుచున్న సంసారసాగరనిమజ్జనరూప ఘోరవిపత్తును గుర్తెఱిగి మరణాదిబాధలను సంపూర్ణముగ తొలగించుకొనుటకై భగవానుని వెంటనే భక్తిపూర్వకముగ సేవించవలెను. భవరోగవినాశనమున కిదియే సముచిత భేషజము.

యే తు - అని చెప్పినందువలన ఎవ్వరైనను సరియే (జాతి మత కుల భేదములేక) భగవంతు నాశ్రయించి తరింపవచ్చునని స్పష్టమగుచున్నది.

'సర్వాణి కర్మాణి.' అనుటచే ఏవియో కొన్ని కర్మలను సమర్పించుట కాదనియు, తానుజేయు సమస్తకర్మలను ఈశ్వరార్పణము గావింపవలయుననియు భావము.

అనన్యేనైవ యోగేన. - ఇంతవఱకు కర్మయోగము, జ్ఞానయోగము, భక్తియోగము మున్నగు అనేక యోగములను చెప్పి చెప్పి ఇపుడొక క్రొత్తయోగమును భగవానుడు లేవదీసెను. అదియే అనన్యయోగము. ఇది ప్రత్యేకమగు ఒకయోగము కాకున్నను అన్ని యోగములతో ఇది చేరిననే అవి రాణించును. ఏ యోగమైనను అనన్యచిత్తముతో నాచరించినచో మాత్రమే ఫలవంతమగును. ఇతరములగు ప్రాపంచిక చింతనలు, దృశ్యసంకల్పములు మనస్సునకు రానీయక కేవలము పరమాత్మవస్తువొక్కదానినే చింతించుచుండవలెనని దాని భావము.

'మాం ధ్యాయన్త ఉపాసతే' - 'మాముపాసతే' అని చెప్పక 'ధ్యాయన్తః' అని కూడ దానికి చేర్చుటవలన సామాన్యమగు ఉపాసనకంటె అర్థభావనతో గావింపబడు ఉపాసనయే శ్రేష్ఠతమమని, అదియే అవలంబనీయమని బోధించినట్లైనది. మంత్రజపము చేయునపుడు మంత్రోచ్చారణతోబాటు మంత్రార్థమునుగూడ నెట్లుభావించవలెనో, అట్లే భగవంతుని ఉపాసించునపుడును వారి స్వరూపస్వభావాదులను బాగుగ చింతన జేయవలెను. 'తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్' - అను పతంజలి యోగసూత్ర మీ భావమునే తెలుపుచున్నది.

'సముద్ధర్తా' - 'ఉద్ధర్తా' అని గాక సముద్ధర్తా అని పేర్కొనుటవలన అట్టి భగవదుపాసకులను తాను లెస్సగ సముద్ధరించెదనని భగవానుడు తెలిపినట్లైనది.

'మృత్యు సంసారసాగరాత్' - సంసారమును సముద్రమునకు పోల్చిచెప్పిరి. సముద్రమువలె భయంకరమై, కామాది దుష్ట జల జంతువులతోగూడి అపారమైయుండుటవలన ఆప్రకార మది సాగరమునకు పోల్చి చెప్పబడినది. అయితే అనేకులు సంసారసుఖములు మహా ఆనందకరములని, కావున సంసారస్థితి అభిలషణీయమని పలుకుచుందురు. అజ్ఞానము వలననే వారట్లు చెప్పుచుందురు. సంసారస్థితియొక్క వాస్తవస్వరూపము వారి కింకను తెలియలేదని యర్థము. దాని యథార్థరూపమును భగవానుడిచట బయటపెట్టిరి - అది 'మృత్యు' సంసారమని వారు వర్ణించిరి. అనగా మరణరూపమైనదని, పుట్టుక చావులతో గూడినది యని భావము. కాబట్టి ఈ మృత్యుసంసారమధ్యమున తగుల్కొనిన జీవుడు అమరత్వసిద్ధికై అమృతస్వరూపుడగు భగవానుని, సచ్చిదానందప్రభువును తప్పక ఆశ్రయించవలసియున్నాడు.

'న చిరాత్' అని చెప్పుటవలన భగవదాశ్రయముచే జీవుడు శీఘ్రముగ విముక్తి నొందగలడని తెలియుచున్నది. (దృష్టాంతము - గజేంద్రుడు, **ప్రహ్లాదుడు** అంబరీషుడు, ద్రౌపది).

**ప్ర:–** ఈ సంసారస్థితి యెట్టిది?

**ఉ:–** అది (1) సముద్రమువలె భయంకరమైనది, అపారమైనది. (2) మృత్యురూపమైనది (జననమరణములతో గూడినది).

**ప్ర:–** దానినుండి తప్పించుకొనుట యెట్లు?

**ఉ:–** భగవంతుని ఆశ్రయించినచో ఆతడే ఆ సంసారసాగరమునుండి జీవుని సముద్ధరించును.

ప్ర:– భగవానుని ఏ ప్రకార మాశ్రయించవలెను?

ఉ:– (1) సమస్తకర్మలను భగవానునకర్పించి (2) ఆతనినే పరమగతిగా భావించి (3) చిత్తము నాతనియందే నెలకొల్పి (4) ఆతనినే చింతింపజేయుచు ( ధ్యానించుచు) ఉపాసించవలెను.

ప్ర:– అట్లు ధ్యానించువారికి కొన్ని సాధనాక్రమములను నాలుగు శ్లోకములద్వారా తెలియజేయబోవుచు మొట్టమొదట మనస్సును తనయందు నిలుపవలసినదిగా శ్రీకృష్ణమూర్తి బోధించుచున్నాడు –

**8. మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ**
**నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః.**

**టీక:–** మయి ఏవ = నాయందే, మనః = మనస్సును, ఆధత్స్వ = స్థిరముగా నిలుపుము, మయి = నాయందు, బుద్ధిమ్ = బుద్ధిని, నివేశయ = ప్రవేశపెట్టుము, అతః ఊర్ధ్వమ్ = అటు పిమ్మట, మయి ఏవ = నాయందే, నివసిష్యసి = నివసింపగలవు, సంశయః = (ఈవిషయమున) సందేహము, న = లేదు.

**తా:–** నాయందే మనస్సును స్థిరముగానిలుపుము. నాయందే బుద్ధిని ప్రవేశపెట్టుము. పిమ్మట నాయందే నివసింతువు. సందేహములేదు.

**వ్యాఖ్య:–** విద్యార్థికి ఉపాధ్యాయు డెట్లు పాఠములను బోధింగునో, ఆప్రకారముగ భగవాను డర్జునున కిపుడు ఒకటితరువాత మఱియొకటిగ పెక్కుసాధనలను తెలియజేయబోవుచున్నాడు. ప్రప్రథమమున మనస్సును, బుద్ధిని పరమాత్మయందు స్థిరముగ నిలుపులాగున ఆనతిచ్చిరి. ఇది మొదటి పాఠము. మనస్సునుమాత్రము నిలిపినచాలదా, బుద్ధినికూడ ఏలజోడించవలెను? అని ప్రశ్నించినచో, బుద్ధి నిశ్చయము చేయునది కావున, అదిలేనిచో మనస్సు సంకల్పవికల్పములతో గూడియున్నదైచంచలముగ నుండును. మనస్సు సంకల్పించును, బుద్ధి నిశ్చయించును. కాబట్టి భగవద్విషయమై దృఢమగు నిశ్చయమును గలుగజేయునది బుద్ధియే, కావున దానినిగూడ మనస్సుతో చేర్చిచెప్పిరి. అట్లు మనోబుద్ధుల రెండిటిని ఇతరమైన దృశ్యవస్తువుల వేనియందును ప్రవేశింపనీయక ఒక్కభగవంతునియందే సంలగ్నమైయుండులాగున ప్రయత్నించవలెను. అట్లుచేసినచో నిక మనుజుడు ధ్యేయవస్తువగు ఆ పరమాత్మయందే సదానివసింపగలడు. ఆహా! ఎంతటి గొప్పస్థానమం దతడు నివాసము బడయును! ఉప్పుకల్లు సముద్రమునందు లయించునట్లు మనస్సు నిరంతరము దేనినిగూర్చి ధ్యానించునో, దేనియందు సంలగ్నమైయుండునో, దానియందే లయించి తదాకారాకారితమై యొప్పును. కావున అనవరతము భగవంతునియందు స్థిరముగనుండునట్టి మనస్సు క్రమముగ ఆ దైవాకారమునే పొందిపోవును. అదియే మోక్షము. దేవునియందు నివసించుట యనగా నిదియే. ఇవ్విషయమున ఏ మాత్రము సందేహములేదనియు, ఇది పరమసత్యమనియు భగవానుడు తెలియజేసిరి. కాబట్టి సాధకులు తమ మనస్సును అన్యత్రపోనీయక ధ్యానాదుల ద్వారా ప్రయత్నపూర్వకముగ భగవంతునియందు నిలిపినచో ఇక తమ మోక్షవిషయమై ఏలాటి సంశయమున్ను పెట్టుకొన నక్కరలేదని స్పష్టమగుచున్నది.

'న సంశయః' – 'ఈ విషయమున సంశయములేదు' అని సాక్షాత్ భగవానుడే చెప్పినందువలన ఇక సాధకుల కీ వాక్యములపై ఎంతటి విశ్వాసముండవలెనో ఊహించుకొనుడు.

'మయి ఏవ' - (నాయందే) అని 'ఏవ' పదప్రయోగముచేయుటవలన, దైవముపైతప్ప ఇతరమగు దేనిపైనను దృష్టిని పోనీయరాదని (మనస్సును నిలుపరాదని) భావము.

**ప్ర:—** మనస్సును, బుద్ధిని ఎచటనుంచవలెను?

**ఉ:—** భగవంతునియందు.

**ప్ర:—** అట్లుంచుటవలన ప్రయోజనమేమి?

**ఉ:—** అత్తఱి భగవంతునియందే యాతడు నివసింపగలడు (ఇట ఏలాటి సంశయములేదు).

**అ॥** ఒకవేళ మనస్సు దైవమందు స్థిరముగ నిలవనిచో అప్పుడేమిచేయవలెనో చెప్పుచున్నాడు -

**9. అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్**
**అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనఞ్జయ.**

**టీక:—** ధనంజయ = ఓ అర్జునా!, అథ = ఇక (ఒకవేళ), చిత్తమ్ = మనస్సును, మయి = నాయందు, స్థిరమ్ = స్థిరముగ, సమాధాతుమ్ = నిలుపుటకు, న శక్నోషి (యది) = శక్తుడవు కానిచో, తతః = అటుపిమ్మట, అభ్యాసయోగేన = అభ్యాసమను యోగముచేత, మామ్ = నన్ను, ఆప్తుమ్ = పొందుటకు, ఇచ్ఛ = కోరుము.

**తా:—** ఓ అర్జునా ఒకవేళ ఆ ప్రకారము మనస్సును నాయందు స్థిరముగ నిలుపుటకు నీకు శక్తిలేనిచో అత్తఱి అభ్యాసయోగముచే నన్ను పొందుటకు ప్రయత్నింపుము. (అభ్యాసముచే ఆ స్థితిని ఎట్లైనను సాధింపుమని భావము).

**వ్యాఖ్య:—** మొదట తెల్పిన సాధన చేయలేనివారికి భగవానుడు మఱికొన్ని ప్రత్యామ్నాయపద్ధతులను సూచించుచున్నారు. ఆహా! భక్తులపై, సాధకులపై సర్వేశ్వరునకు ఎంతటి కరుణ! మనస్సుచేతనే బంధము, మనస్సుచేతనే మోక్షము జీవునకు కలుగుచున్నవి★. కాబట్టి మోక్షము పొందుటకు ఆ మనస్సు ఏదోవిధముగ అధిష్ఠానమగు పరమాత్మయందు (దైవమందు) లయించియే తీరవలెను. ఇక్కారణముననే గీతాచార్యులు మనస్సు దైవమందు నిలుకడను బొందనిచో అభ్యాసముచే నెట్లైనను దానిని నిలుకడబొందులాగున చేయవలయునని, (అది తప్ప మోక్షమునకు వేఱుదారిలేదని) తెలియజేయుచున్నారు. ప్రతివారును ఏదియోవిధముగ తమ మనస్సును బహిర్ముఖముగ పోనీయక, దృశ్యవిషయములపై వ్రాలనీయక, ఆత్మయందు (దైవమందు) స్థాపనచేయవలెను. ఒకవేళ ప్రారంభస్థితిలో అట్లు మనస్సు ధ్యేయమందు నిలుకడను బొందనిచో అభ్యాసముచే మెల్లమెల్లగా ఆ స్థితిని ఎట్లైనను సాధించియే తీరవలెను. మనస్సు ఆత్మయందు లయించి, ఆత్మరూపమున శేషించుటయే మోక్షము. కావున ఆ స్థితిని ప్రయత్నపూర్వకముగ అభ్యాసము ద్వారా ప్రతివారును సాధించవలెను. 'యతో యతో నిశ్చరతి .... (6-26)' అని 6వ అధ్యాయమున భగవానుడు తెలియజేసినరీతి చపలమనస్సును నెమ్మదిగా వశమొనర్చుకొని ఆత్మయందు (దైవమందు) స్థాపించవలెను. ఇట్టి అభ్యాసమునుగూర్చియే ఈ శ్లోకమందు తెలియజేయబడినది.

★ మన ఏవ మనుష్యాణాం కారణం బన్ధమోక్షయోః (అమృతబిందూపనిషత్తు - 10)

'అభ్యాసయోగేన' - ఈ అభ్యాసమనుయోగము కర్మయోగ, భక్తియోగ, ధ్యానయోగ, జ్ఞానయోగాదులన్నిటితోను కూడియుండవలెను. అన్ని యోగములకును 6వ శ్లోకమున తెలుపబడిన అనన్యయోగము, ఈ శ్లోకమందు తెలుపబడిన ఈ అభ్యాసయోగము ఆవశ్యకమైయున్నది. దీనితో చేరినపుడే తక్కిన యోగములన్నియు అభివృద్ధిని, వికాసమును బొందగలవు.

కొందఱు సాధకులు గురువులయొద్దకువెళ్ళి 'అయ్యా! ధ్యానకాలమున నా మనస్సు దైవమందు స్థిరముగ నిలుచుటలేదే? ఏమి చేయవలెను?' అని యడుగుచుందురు. అందులకు ప్రత్యుత్తరముగ వారు భగవానుడీశ్లోకమున తెలిపినదానినే చెప్పుదురు. 'నాయనలారా! మనస్సు నిలువనిచో, అభ్యాసముచేసి ఎట్లైనను నిలుచులాగున చేసికొనుడు. వేఱుదారిలేదు' అని వారు బోధించుదురు. మనోనిగ్రహమును గూర్చి 6వ అధ్యాయమున 'అభ్యాసేనతు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే' అను వాక్యము ద్వారా భగవానుడీ అభ్యాసమునే నొక్కిచెప్పిరి. కాబట్టి ప్రతివారును తమ మనస్సు ధ్యానకాలమున నిలుకడను బొందనిచో నిరుత్సాహపడక భగవాను డిచట బోధించినరీతిగ అభ్యాసముచే దానినెట్లైనను నిలుకడబొందునట్లు చేయవలెను. మోక్షమునకు వేఱుమార్గములేదు.

**ప్ర:-** మనస్సును దైవమందు స్థిరముగ నిలుపుడని చెప్పిరే, అట్లు మనస్సు నిలవనిచో ఏమి చేయవలెను?..

**ఉ:-** అభ్యాసముచే ఆ స్థితిని ఎట్లైనను సాధించవలెను?

**అII** ఒకవేళ అట్టి అభ్యాసము కూడ చేతకానిచో అపుడేమి చేయవలెనో చెప్పుచున్నాడు -

**10. అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ**
**మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధిమవాప్స్యసి.**

**టీక:-** అభ్యాసే అపి = అభ్యాసముచేయుటయందును, అసమర్థః అసి = సమర్థతలేనివాడవైనచో, మత్కర్మపరమః = నాసంబంధమగు కర్మలనొనర్చుటయం దాసక్తిగలవాడవు, భవ = అగుము, మదర్థమ్ = నాకొఱకు, కర్మాణి = కర్మములకును, కుర్వన్ అపి = చేయుచున్నను గూడ, సిద్ధిమ్ = (మోక్షసిద్ధిని), అవాప్స్యసి = పొందగలవు.

**తా:-** ఒకవేళ అభ్యాసముచేయుటయందును నీవసమర్థుడవైతివేని నా సంబంధమైన కర్మలజేయుటయం దాసక్తిగలవాడవు కమ్ము. అట్లు నాకొఱకు కర్మలను జేయుచున్నను గూడ నీవు మోక్షసిద్ధిని బడయగలవు.

**వ్యాఖ్య:-** ఒకవేళ పైన దెల్పిన చిత్తైకాగ్రతాభ్యాసమును గూడ యెవ్వరైన చేయజాలనిచో అట్టివారు తరించుటకై మఱియొక ప్రత్యామ్నాయ పద్ధతిని భగవానుడు కరుణతో సూచించుచున్నారు. మనోనిశ్చలత్వమును సాధింపలేనివాడు క్రమముగ దైవకార్యలందును, ధర్మకార్యములందు, పరోపకారక్రియలందు, పరప్రాణులకు హితమొనర్చుకార్యములందు ఆసక్తి గలిగి వానిని నిష్కామముగ నాచరించుచురావలయును. జపము, ప్రార్థన, కీర్తన, భజన, పూజ, వ్రతములు మున్నగువానిని భగవత్ప్రీత్యర్థము గావించుచుండవలెను. 'మత్కర్మపరమోభవ' అనుదాని యర్థమిదియే. దానిచే చిత్తము

శుద్ధముకాగా, క్రమముగ జ్ఞానమంకురింప, దానిచే మనుజుడు మోక్షసిద్ధిని బడయగలడు. ఈ ప్రకారముగ కర్మాచరణయు ఎట్టకేలకు ముక్తిని ప్రసాదించును. అతిసూక్ష్మమైన మనస్సును, సంకల్పములను అరికట్టలేనివారికి - ఈ కర్మమార్గము ఎంతయో సులభతరమైయుండగలదు. అయితే 'మదర్థం' అని భగవానుడు చెప్పెనే కాని 'త్వదర్థం' అని చెప్పలేదు. కావున ఆ యా క్రియలను దైవప్రీత్యర్థముగనే ఒనర్చవలెనుగాని, స్వార్థముకొఱకుగాదు. నిష్కామముగనే ఆచరించవలెనుగాని, సకామముగగాదు.

'కుర్వన్ సిద్ధి మవాప్స్యసి' - అను వాక్యము ద్వారా కర్మయోగమున్ను మోక్షసిద్ధికి హేతువుకాగలదని స్పష్టమగుచున్నది. ఎట్లనిన, ఆ కర్మలు, నిష్కామముగ, (దైవప్రీత్యర్థముగ) నాచరింపబడినచో చిత్తశుద్ధిని, తద్ద్వారా జ్ఞానమును, తద్ద్వారా మోక్షసిద్ధిని అవి కలుగజేయగలవు. అయితే నిష్కామాచరణకు మాత్రమే యిట్టి శక్తి కలదనియు, సకామాచరణకుగాదనియు నెఱుంగవలెను.

**ప్ర:-** మనస్సును పరమాత్మయందు నిలుపుటకై వలసిన అభ్యాసమునుగూడ ఎవ్వరైన చేయజాలనిచో అట్టివారు తరించుటకు మార్గమేమి?

**ఉ:-** వారు దైవకార్యములను, ధర్మకార్యములను, పరహితకార్యములను, నిష్కామబుద్ధితో నాచరించుచువచ్చిన క్రమముగ మోక్షసిద్ధిని బడయగలరు.

**అ॥** అట్లు దైవసంబంధమైన కర్మాచరణము చేయజాలనిచో అత్తఱి తరించుటకేమి యుపాయమో తెలియజేయుచున్నాడు -

**11. అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్.**

**టీక:-** *అథ* = ఇకను, *మద్యోగమ్* = నన్నుగూర్చినయోగమును, *ఆశ్రితః* = ఆశ్రయించినవాడవై, *ఏతత్ అపి* = దీనినిగూడ, *కర్తుమ్* = ఆచరించుటకు, *అశక్తః అసి (చేత్)* = సమర్థుడవుకానిచో, *తతః* = ఆ పిమ్మట, *యతాత్మవాన్* = నియమింపబడిన మనస్సుగలవాడవై (మనస్సును స్వాధీనపఱచుకొనినవాడవై), *సర్వకర్మఫలత్యాగమ్* = సమస్తకర్మములయొక్క ఫలములను విడిచిపెట్టుటను, *కురు* = చేయుము.

**తా:-** ఇక నన్ను గూర్చిన యోగము నవలంబించినవాడవై దీనినిగూడ నాచరించుటకు శక్తుడవుకానిచో అటుపిమ్మట నియమింపబడిన మనస్సు గలవాడవై సమస్తకర్మములయొక్క ఫలములను త్యజించివేయుము.

**వ్యాఖ్య:-** పైన తెలిపిన మూడుసాధనలున్ను చేయజాలనివారికి సులభమైన మఱియొక పద్ధతిని భగవాను డిచట సూచించిరి. ఉదయము నిద్రలేచినది మొదలు రాత్రి పరుండువఱకును మనుజుడు అనేక కార్యములు చేయుచుండునుగదా! ఆ యా కార్యములు చేయునపుడు దైవభావముగలిగి, తాను నిమిత్తమాత్రుడేయని భావించుకొని, సమస్తజగత్క్రియలు ఆ సర్వేశ్వరుడే జరుపుచున్నాడని నిశ్చయించుకొని, తాను చేయు ఆ సమస్తకార్యములయొక్క ఫలములను ఆ సర్వేశ్వరునకే అర్పించవలెను. అనగా ఫలాపేక్షను వదలి ఈశ్వరార్పణబుద్ధితో ఆ యా కర్మలను చేయవలెను. సమస్తకర్మలని చెప్పుటచే అసత్కార్యములు, పాపకార్యములుకూడ అనియెవరును భావించరాదు. ఏలయనిన అవి మొదటనే శాస్త్రములచే నిషిద్ధములై యున్నవి. కావున వాని నెవరును ఆచరించగూడదు. దానధర్మములు, వ్రతపూజాదులు, నిత్యనైమిత్తికకర్మలు

ఇంకను తనదినచర్యయందలి వివిధక్రియలు ఆచరించునపుడు దైవభావముగలిగి, ఆయా కర్మలయొక్క ఫలమును, ఈశ్వరార్పణము, (లేక కృష్ణార్పణము, రామార్పణము) గావించవలెను. పైన తెలుపుచు వచ్చిన పద్ధతులలో ఒక్కొక్కదానికంటె మఱియొకటి ఉత్తరోత్తర సులభతరమై యుండుటచే సాధకులలో ఎవరెవరికి ఏయే సాధన అనుకూలముగనుండునో, వారివారి మనస్తత్వములనుబట్టి దానిదానిని యేరుకొని, చక్కగ సాధించవచ్చును. చివరికి చెప్పబడిన ఈ సాధన అనగా తాను చేయు సమస్తకార్యములయొక్క ఫలములను భగవదర్పణము గావించుట యనుదానిని సామాన్యులుకూడ ఆచరించి తరింపవచ్చును. తాను నడచుచున్నచో అది భగవంతునకు ప్రదక్షిణమని భావించవలెను. మాట్లాడుచున్నచో అది దైవసంకీర్తనమని యెంచవలెను. ఈప్రకారముగ ఏపని చేయుచున్నను భగవత్స్మృతి గలిగి 'మామనుస్మర యుధ్యచ' అని గీతాచార్యులు తెలిపినవిధమున అట్టి దైవసంస్కారముతో తానాచరించుచు ఆయా కార్యములన్నిటియొక్క ఫలమును ఈశ్వరార్పణము గావించినచో, క్రమముగ పాపము నశించి, చిత్తశుద్ధిగల్గి జ్ఞానోదయమయి క్రమముగ మోక్షము లభించగలదు.

అయితే ఇట్టిస్థితి కలుగుటకు అనగా సర్వకర్మ ఫలత్యాగము చేయుటకు కొంతమనోనిబ్బరము, మనోనియమనశక్తి, ప్రయత్నము ఆవశ్యకమైయున్నది. కనుకనే 'యతాత్మవాన్' అని చెప్పబడినది. పట్టుదలతో ప్రయత్నపూర్వకముగ మనస్సును నియమించుకొనుచు (స్వాధీనమందుంచుకొనుచు) సర్వకర్మఫలత్యాగమను ఆ సులభతరమైన చక్కటి పరమార్థసాధనను జీవులు అమలునందుంచవలెను.

**ప్ర:–** క్రిందటి శ్లోకమందు తెలుపబడిన విధముగ దైవకార్యములను ఆచరించుటకు శక్తిలేని వారికి తరించుట కేదైన యుపాయము గలదా! ఉన్నచో అదియేమి?

**ఉ:–** కలదు, నియమితచిత్తుడై, తాను చేయు సమస్తకార్యములయొక్క ఫలమును ఈశ్వరార్పణము గావించుచుండవలెను. అదియే ఉపాయము.

**అ॥** కర్మఫలత్యాగము యొక్క విశిష్టతను నిరూపించుచున్నాడు -

## 12. శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే ధ్యానాత్కర్మఫలత్యాగస్త్యాగాచ్ఛాన్తిరనన్తరమ్.

**టీక:–** అభ్యాసాత్= (వివేకముతో గూడని) అభ్యాసముకంటె, జ్ఞానమ్ = (శాస్త్రజన్య) జ్ఞానము శ్రేయః హి= శ్రేష్ఠమైనది గదా!, జ్ఞానాత్= (శాస్త్రజన్య) జ్ఞానముకంటె, ధ్యానమ్= ధ్యానము, విశిష్యతే= శ్రేష్ఠమగుచున్నది, ధ్యానాత్= ధ్యానము (ధ్యానకాలమందు మాత్రము నిర్విషయముగనుండు మనఃస్థితి) కంటె, కర్మఫలత్యాగః= కర్మఫలమును విడుచుట (ప్రవృత్తియందును మనస్సు విషయదోషములేకుండుట), (విశిష్యతే = శ్రేష్ఠమగుచున్నది), త్యాగాత్ అనన్తరమ్ = (అట్టి కర్మఫల) త్యాగము చేసినవెనుక, శాన్తిః = శాంతి, భవతి = కలుగుచున్నది.

**తా:–** (వివేకముతోగూడని) అభ్యాసముకంటె (శాస్త్రజన్య) జ్ఞానము శ్రేష్ఠ మైనదికదా! (శాస్త్రజన్య) జ్ఞానముకంటె ధ్యానము శ్రేష్ఠమగుచున్నది. ధ్యానము (ధ్యానకాలమందు మాత్రము నిర్విషయముగనుండు మనఃస్థితి) కంటె కర్మఫలమును విడుచుట (ప్రవృత్తియందును విషయదోషములేకుండుట) శ్రేష్ఠమైయున్నది. అట్టి కర్మఫలత్యాగముచే శీఘ్రముగ (చిత్త) శాంతి లభించుచున్నది.

**వ్యాఖ్య:–** ఇచట అభ్యాసమని చెప్పినచోట వివేకముతో గూడని అభ్యాసమనియు, జ్ఞానమని చెప్పినచోట శాస్త్రజన్యజ్ఞానమని, ధ్యానమని చెప్పినచోట అసంపూర్ణమగు ధ్యానమని, ధ్యానకాలమందు మాత్రము విషయదోషములేని స్థితియని, అనగా ధ్యానాభ్యాసియొక్క స్థితియని గ్రహించుకొనవలెను.

'జ్ఞానాద్ధ్యానం విశిష్యతే' – 'వాచా' జ్ఞానముకంటె అనుభవపూర్వకమైన జ్ఞానము గొప్పది. జ్ఞానవిషయములను తదేకనిష్ఠతో చింతనచేయుటయే, అనుభూతమొనర్చుకొనుటయే ధ్యానము. కాబట్టి 'వాచా' జ్ఞానముకంటె శాస్త్రజన్యజ్ఞానముకంటె ధ్యానము గొప్పదని వచింపబడినది.

'ధ్యానాత్కర్మఫలత్యాగః' – కర్మఫలములను త్యజించువాని మనస్సు అసంగమై, విషయదోషము లేనిదైయుండును. ధ్యానాభ్యాసికి ధ్యానకాలమందు మాత్రము చిత్తము నిర్విషయమైయుండును. త్యాగికి ఎల్లప్పుడును అట్లేయుండును. కనుకనే ధ్యానముకంటె కర్మఫలత్యాగము శ్రేష్ఠమని చెప్పినారు. దీనిని బట్టి నిష్కామకర్మయోగమెంత మహిమ గలిగియున్నదో స్పష్టమగుచున్నది. జనులలో అధికులకు నివృత్తి కంటె ప్రవృత్తిసంస్కారమే ఎక్కువగ యుండియుండును. కాబట్టి అట్టివారు కర్మలనాచరించుచు కర్మఫలత్యాగమును చక్కగ అలవాటు చేసికొనినచో వారు ధ్యాన్యాభ్యాసికంటె, జ్ఞానాభ్యాసికంటె గొప్పస్థానమును బొందినవారగుదురు. మఱియు భక్తికొఱకైనను, ధ్యానముకొఱకైనను, జ్ఞానము కొఱకైనను చిత్తశుద్ధి చాల అవసరము. అదియో, నిష్కామకర్మయోగముచే, కర్మఫలత్యాగముచే లభించుచున్నది. కాబట్టి అద్దానిని చక్కగ అనుష్ఠించినచో మాత్రమే – పునాది గట్టిగనున్నచో పైనగల మేడయు సుస్థిరముగ నుండునట్లు – ధ్యాన, జ్ఞానాదులన్నియుకూడ చక్కగ అభివృద్ధి నొందగలవు. కనుకనే భగవాను డీశ్లోకమున నిష్కామకర్మయోగము (కర్మఫలత్యాగము) యొక్క ప్రాశస్త్యమును వెల్లడించిరి.

'త్యాగాచ్ఛాన్తిరనన్తరమ్' – కర్మఫలత్యాగముచే, ఈశ్వరార్పణ బుద్ధిచే చిత్తము శుద్ధమగుటవలన వెంటనే శాంతి ఉదయించుచున్నది. కర్తృత్వత్యాగమువలననే, అహంభావత్యాగమువలననే, దోషత్యాగమువలననే, ప్రాపంచికవిషయసుఖత్యాగమువలననే శాంతి లభింపగలదు. చిత్తమందలి దోషములు తొలగుటయే శాంతికి మార్గము, (తేషాంశాన్తిశ్శాశ్వతీ నేతరేషామ్); ఏలయనగా నిర్మలచిత్తమున ఆత్మ ప్రత్యక్షముకాగలదు. దుఃఖభూయిష్ఠమగు ఈ సంసారమున ప్రతివాడును శాంతినే అభిలషించుచున్నాడు. కాని ఆ శాంతి యెట్లు లభింపగలదో తెలియజాలకున్నాడు. 'త్యాగాత్ శాంతిః' – త్యాగము వలననే శాంతిచేకూరునని భగవాను డిచట స్పష్టముగ తెలియజేసెను. కాబట్టి విషయసుఖములను, కర్మఫలములను, మమత్వమును, అహంభావమును, కర్తృత్వమును, త్యాగముచేసి పరమశాంతిని జీవుడనుభవించవలెను.

**ప్ర:–** కర్మఫలత్యాగముయొక్క మహిమయెట్టిదో పేర్కొనుము?

**ఉ:–** అది (వివేకముతో గూడని) అభ్యాసముకంటెను, (శాస్త్రజన్య) జ్ఞానముకంటెను, (ధ్యానకాలముమాత్రము నిర్విషయస్థితిగలిగియుండు) ధ్యానముకంటెను శ్రేష్ఠమైనది.

**ప్ర:–** శాంతి యెట్లు లభించును?

**ఉ:–** (కర్మఫల) త్యాగముచే.

**అ॥** ఇంతదనుక భక్తియొక్క అంగములైన వివిధసాధనలను జెప్పి, ఇక ఏడు శ్లోకములద్వారా ఉత్తమభక్తుని లక్షణములను పేర్కొనుచున్నాడు –

**13. అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ**
**నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ.**

**14. సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః**
**మయ్యర్పితమనోబుద్ధిర్యో మద్భక్తస్స మే ప్రియః.**

**టీక:—** సర్వభూతానామ్ = సమస్తప్రాణులకును, అద్వేష్టా = ద్వేషి కానివాడును, మైత్రః = మిత్రభావముగలవాడును, కరుణః ఏవచ = దయగలవాడును, నిర్మమః = మమకారము లేనివాడును, నిరహంకారః= అహంకారములేనివాడును, సమదుఃఖసుఖః= సుఖదుఃఖములందు సమభావముగలవాడును, క్షమీ = ఓర్పు గలవాడును, సతతమ్ = ఎల్లప్పుడు, సంతుష్టః = సంతృప్తితో గూడియుండువాడును, యోగీ = యోగయుక్తుడై యుండువాడును (దైవమునందు చిత్తమును నియోగించువాడును), యతాత్మా = నియమింపబడిన మనస్సుగలవాడును(మనస్సును స్వాధీనపఱచుకొనినవాడును), దృఢనిశ్చయః = దృఢనిశ్చయముగలవాడును, మయి = నాయందు, అర్పిత = సమర్పింపబడిన, మనః బుద్ధిః= మనస్సు, బుద్ధి గలవాడును, మద్భక్తః= నాయందు భక్తిగలవాడును, యః= ఎవడు (కలడో), సః= అతడు, మే= నాకు, ప్రియః = ఇష్టుడు.

**తా:—** సమస్తప్రాణులయెడల ద్వేషములేనివాడును, మైత్రి, కరుణగలవాడును, అహంకారమమకారములు లేనివాడును, సుఖదుఃఖములందు సమభావముగలవాడును, ఓర్పుగలవాడును, ఎల్లప్పుడు సంతృప్తితో గూడియుండువాడును, యోగయుక్తుడును, మనస్సును స్వాధీనపఱచుకొనినవాడును, దృఢమైననిశ్చయముగలవాడును, నాయందు సమర్పింపబడిన మనోబుద్ధులుగలవాడును, నాయందు భక్తిగలవాడును ఎవడుకలడో, అతడు నాకు ఇష్టుడు.

**వ్యాఖ్య:—** ఎట్టివాడు తనకు ప్రియుడో భగవానుడు ఏడు శ్లోకములద్వారా చెప్పుచున్నాడు. ముప్పదియైదు సుగుణములను పేర్కొని 'ఇవి కలవాడే నాకుప్రియుడు' అని శ్రీకృష్ణపరమాత్మ తెలియజేయుచున్నారు. ఈ గుణములన్నియు 'అద్వేష్టా' అను పదముతో ప్రారంభమగుటచే 'అద్వేష్టృత్వాది' గుణములని ప్రసిద్ధికెక్కినవి. ఈముప్పదియైదున్ను ముప్పదియైదు పాఠములు, లేక పాఠ్యవిషయములు (Subjects) అయివున్నవి. విద్యార్థి పరీక్షలో అన్నిపాఠ్యవిషయములందును ఉత్తీర్ణుడైనచో మాత్రమే పై తరగతికి బోవుటకు అర్హత గలిగియుండు విధమున ఈ 35 సుగుణములను చక్కగ గలిగియుండువాడు మాత్రమే భగవంతునకు ప్రీతిపాత్రుడు కాగల్గును. ఇవి లేనివాడు భగవత్కృపకు పాత్రుడుకానందుచే అత డీ జననమరణసంసారప్రవాహమునబడికొట్టుకొనుచునే యుండును. దుఃఖమునుండి విడువబడవలెననిన, భగవదనుగ్రహమును సంపాదించవలెను. వారి యనుగ్రహమో ఈ సల్లక్షణములు, ఈ సద్గుణములు గలవానిపైననే ప్రసరించును.

**సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి నప్రియః**
**యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్.** **(9-29)**

అని భగవానుడు చెప్పినరీతిగా, వాస్తవముగ వారికి ఎవనిపైనను ప్రీతిగాని, ద్వేషముగాని లేకున్నను ఎవరు వారిని భక్తితో సేవించుదురో వారిపై వారనుగ్రహమును వర్షించుదురు. అట్టి భగవదనుగ్రహమహిమచే

ఆత్మజ్ఞానమును, తద్ద్వారా ముక్తిని అతడు పొందియేతీరును. కాబట్టి మోక్షము నభిలషించువాడు, సంసారదుఃఖమును అంతరింప జేసికొనదలంచువాడు, భగవదనుగ్రహమును పొందుగోరువాడు ఈ అధ్యాయమందు తెలుపబడిన ఈ భక్తుని లక్షణములన్నిటిని చక్కగ శీలించవలెను.

అనేకులకు భగవంతునిపై ప్రీతి యుండును. కాని అది చాలదు. భగవంతునకు తనపై ప్రీతి జనించినదా యని పరీక్షించుకొనుచుండవలెను. దేవుడు జీవునకు ప్రియుడైనను, దేవునకు జీవుడు ప్రియుడుగానున్నాడా యని చూచుకొనవలెను. అట్టిస్థితి చేకూరెనా ఇక జీవుడు తరించినట్లే. అయితే భగవంతుడు తాను చెప్పిన ఈ సుగుణములు కలవానినే ప్రియుడుగ నెంచునని 'యోమద్భక్తః సమేప్రియః' మున్నగు వాక్యములద్వారా ఇట తెలియజేసిరి గావున వానిని జీవుడు తప్పక సంపాదించవలసియుండును.

సాధ్యవస్తువగు పరమాత్మను జేరవలెననిన, సాధనయందు చక్కగ ఆరితేరవలెను. గీతాగ్రంథము సాధ్యవస్తువును గుఱించి ఒకింతయు, సాధననుగూర్చియే విశేషముగను తెలుపుచుపోవును. కనుకనే దీనిని అనుష్ఠాన వేదాంతగ్రంథమని చెప్పుదురు. మొట్టమొదట స్థితప్రజ్ఞలక్షణములు, తదుపరి అద్వేష్టృత్వాది భక్తలక్షణములు, ఆ పిమ్మట అమానిత్వాది జ్ఞానగుణములు, ఆ వెనుక 'అభయం' ఇత్యాది దైవీసంపత్తి లక్షణములు – ఈ ప్రకారముగ అనుష్ఠానమును గీతాచార్యులు జనులకు నూరిపోసిరి.

కాబట్టి ముముక్షువులు వానినన్నింటిని చక్కగ శీలించి భగవంతునకు ప్రీతిపాత్రులై జన్మసార్థకత నొందవలయును. 'సర్వభూతానామ్' – అని చెప్పుటవలన ఏ ఒకరిద్దరిపై ద్వేషములేకుండుట కాదనియు, సమస్తప్రాణికోట్ల యెడల ద్వేషరాహిత్యము కలిగియుండవలెననియు బోధింపబడినది.

'సంతుష్టః సతతమ్' – ఏ కొద్దిసేపో తృప్తిగలిగి మఱల విషయవాంఛలతో గూడియుండుట సరికాదు. ఎల్లప్పుడు సంతృప్తుడై యుండవలయును.

'దృఢనిశ్చయః' – దైవవిషయమునగాని, ప్రపంచవిషయమునగాని స్థిరమైన నిర్ణయములు కలిగి సాధనయందు గట్టి నిశ్చయములతో దృఢవ్రతములతో గూడియుండవలెను. శాస్త్ర, గురువాక్యములందు దృఢవిశ్వాసముండవలెను. ఇది 'ఔనో, కాదో' అను ఊగులాట పనికిరాదు. 'దేవుడున్నాడు, వారిని నేను పొందితీరెదను' అనునట్టి దృఢనిశ్చయములు గల్గియుండవలెను. లేనిచో 'మాయ' చపలమనస్కుని ఊపివేయును.

'మయ్యర్పిత మనోబుద్ధిః' – మనస్సుతోబాటు బుద్ధినిగూడ తనయందు నిలుపవలెనని గీతయందచటచట భగవానుడు హెచ్చరికలు చేయుచున్నారు. ఏలయనిన మనస్సు వికలాత్మకమైనది గనుక, నిశ్చయాత్మకమగు బుద్ధి దానితో చేరనిచో ఆ మనస్సు చంచలముగనేయుండి లక్ష్యమును సరిగా పొందజాలకుండును.

## 15. యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః
## హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యస్స చ మే ప్రియః.

**టీక:–** యస్మాత్ = ఎవనివలన, లోకః = ప్రపంచము (జనులు), న ఉద్విజతే = భయమును పొందరో, లోకాత్ చ = లోకమువలనగూడ, యః = ఎవడు, న ఉద్విజతే = భయమును పొందడో, యః = ఎవడు, హర్ష, అమర్ష, భయ, ఉద్వేగైః = సంతోషము, క్రోధము, భయము, మనోవ్యాకులత – అను వానిచే, ముక్తః = విడువబడినవాడో, సః చ = అతడును, మే = నాకు, ప్రియః = ఇష్టుడు.

**తా:–** ఎవనివలన ప్రపంచము (జనులు) భయమునుబొందదో, లోకమువలన ఎవడు భయమును బొందడో, ఎవడు సంతోషము, క్రోధము, భయము, మనోవ్యాకులత – మున్నగునవి లేకుండునో అట్టివాడు నాకు ఇష్టుడు.

**వ్యాఖ్య:–** 'లోకాన్నోద్విజతే' – సత్యమార్గమున జనువాడు ప్రపంచము యొక్క నిందాస్తుతులకు ఏ మాత్రము జంకగూడదు. నిర్భయుడై ముందుకు సాగి పోవలయును. (Be fearless) – .విగతభీః. అని యొకతూరి భగవానుడు సెలవిచ్చిన విషయమును జ్ఞాపకమునం దుంచుకొనవలెను.

'హర్షామర్షభయోద్వేగైః' హర్షము (సంతోషము) మంచిదే అయినను ఆవేశములకులోనై, స్తోత్రములకు ఉప్పొంగిపోవుటయు, నిందలకు క్రుంగిపోవుటయు కూడదనియు, ఆ ప్రకారము ద్వంద్వములకు లోబడక, నిర్వికారుడై సమభావముగలిగి యుండవలెననియు తెలుపుటయే యగును.

## 16. అనపేక్ష శ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః
## సర్వారమ్భపరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియః.

**టీక:–** అనపేక్షః = కోరికలులేనివాడును, శుచిః = బాహ్యాభ్యంతరశుద్ధిగలవాడును, దక్షః = కార్యసమర్థుడును (సమయస్ఫూర్తిగలవాడును), ఉదాసీనః = తటస్థుడును (దేనియందును తగలని మనస్సుగలవాడును), గతవ్యథః = దిగులు (దుఃఖము) లేనివాడును, సర్వారమ్భపరిత్యాగీ = సమస్తకార్యములందును కర్తృత్వమును వదలినవాడును (లేక సమస్తకామ్యకర్మలను, శాస్త్రనిషిద్ధకర్మలను త్యజించినవాడును), మద్భక్తః= నాయందు భక్తి గలవాడును, యః= ఎవడు (కలడో), సః= అతడు, మే= నాకు, ప్రియః = ఇష్టుడు.

**తా:–** కోరికలు లేనివాడును, బాహ్యాభ్యంతర శుద్ధిగలవాడును, కార్యసమర్థుడును, (సమయస్ఫూర్తిగలవాడును), తటస్థుడును, దిగులు (దుఃఖము) లేనివాడును, సమస్తకార్యములందు **కర్తృత్వమును** వదలినవాడును (లేక సమస్తకామ్యకర్మలను, శాస్త్రనిషిద్ధకర్మలను త్యజించినవాడును), నాయందు భక్తి గలవాడును, ఎవడు కలడో, అతడు నాకు ఇష్టుడు.

**వ్యాఖ్య:–** 'శుచిర్దక్షః' – గీతాచార్యులు శుచిత్వమును అచటచట నొక్కి చెప్పుచున్నారు. బాహ్యాభ్యంతరముల రెండిటియందును శుద్ధత్వమును కాపాడుకొనవలెను. తన శరీరము, తన వస్త్రములు, తన పరిసరము, తన మనస్సు – అన్నియు నిర్మలముగా నుండవలెను. మురికియందున్నవారికి మురికిభావనలే గలుగుచుండును. కావున దేహమనోనిర్మలత్వముల రెండిటిని కాపాడుకొనవలెను.

'దక్షః' – బహుసమర్థతతో, సమయస్ఫూర్తితో కార్యములను, ఆధ్యాత్మిక సాధనలను నిర్వహించుకొనుచు పోవలెను – అజాగ్రత్తగనున్నచో మాయ పడగొట్టి వేయగలదు.

'గతవ్యథః' – భక్తుడగువాడు అన్నిటికిని మూలాధారమైన భగవానుని ఆశ్రయించెను గనుక ఇక నాతనికి దిగులునొందవలసిన విషయ మీప్రపంచమున ఏదియునులేదు. కావున దిగులును, దుఃఖమును దరికి జేర్చరాదు.

'సర్వారమ్భపరిత్యాగీ' - కార్యములన్నిటిని సంపూర్ణముగ పరిత్యజించువాడనగా అకర్మణ్యుడనికాదు. దైవేతరములగు సమస్తకార్యములను త్యజించువాడని, లేక సమస్తకార్యములందును కర్తృత్వబుద్ధిని (doership) విడనాడువాడనియే అర్థము. లేక కామ్యకర్మలన్నిటిని త్యజించినవాడనియు, లేకశాస్త్రనిషిద్ధములగు సమస్త కర్మములను వదలువాడనియును చెప్పుకొనవచ్చును. కార్యమునందు కర్తృత్వమును, సంగమును వదలినవాడు కార్యముచేసినను చేయనట్లేయగును. కావున అట్టివాడు సర్వకార్యపరిత్యాగియేయగును.

## 17. యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాఙ్క్షతి
## శుభాశుభ పరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః.

**టీక:–** యః = ఎవడు, న హృష్యతి = సంతోషింపడో (ఉప్పొంగడో), న ద్వేష్టి = ద్వేషింపడో, న శోచతి = శోకమును బొందడో, న కాఙ్క్షతి = కోరడో, యః = ఎవడు, శుభాశుభపరిత్యాగీ = శుభాశుభములను వదలినవాడో, సః భక్తిమాన్ = అట్టి భక్తుడు, మే = నాకు, ప్రియః = ఇష్టుడు.

**తా:–** ఎవడు సంతోషింపడో, ద్వేషింపడో, శోకమునుబొందడో, ఎవడు శుభాశుభములను వదలినవాడో అట్టిభక్తుడు నాకు ఇష్టుడు.

**వ్యాఖ్య:–** 'నహృష్యతి' - ఇచట సంతోషింపడనగా ఉప్పొంగిపోడని భావము. హర్షము (సంతోషము) మంచిదే అయినను అది హర్షశోకములను ద్వంద్వములలో చేరినదిగనుకను, మనోధర్మము గనుకను, పూర్ణమనోలయమునకు, నిరంతరాత్మస్థితికి అదియు ఒకానొక అడ్డే గనుకను ఆ ప్రకారముగ చెప్పబడినది.

'శుభాశుభపరిత్యాగీ' - ఇచట పాఠకులకొక సందేహముదయించవచ్చును - లోకములో అశుభమును వదలుటగదా ధర్మము. కాని ఇచట అశుభముతోబాటు శుభమునుగూడ పరిత్యజించువాడు - అని ఏల చెప్పబడెను? గీతావాక్యములను బహుజాగ్రతగ అర్థముచేసికొనవలసియుండును. పూర్వాపరములను సమన్వయించుకొనుచు, ఏ సందర్భమున ఏ భావముతో చెప్పబడెనో గమనించుచు అర్థమును గ్రహించవలసియుండును. ఇచట భక్తియొక్క పరాకాష్ఠస్థితి చెప్పబడుచున్నది. భక్తియొక్క చరమస్థితి, జ్ఞానస్థితి రెండును ఒకటే. పరిపూర్ణభక్తిగల మనుజుడున్ను, జ్ఞానియు ఇరువురును ఒకేదైవస్థితియందు, ఆత్మస్థితియందు నిలుకడగలిగియుందురు. అది మనస్సును, మనోవికారములను దాటిన జీవన్ముక్తస్థితి. అట్టిస్థితిలో శీతోష్ణసుఖదుఃఖ, హర్షశోక, శుభాశుభాది ద్వంద్వభావములెవ్వియు ఉండనేరవు. కేవలము దైవభావము, ఆత్మభావము ఒకటియేయుండును. కనుకనే పరిపూర్ణభక్తుడు శుభాశుభపరిత్యాగియని చెప్పబడెను. సాధకులు మొట్టమొదట శుభమును (శుభకార్యములను, శుభసంకల్పములను) గ్రహించి తద్వారా అశుభమును (అశుభకార్యములను, అశుభసంకల్పములను) త్యజించివేయవలెను. తదుపరి నిస్సంకల్పాత్మస్థితియందు, కేవలదైవస్థితియందు ఆ శుభసంకల్పాదులున్ను వానియంతటనవియే తొలగిపోయి ఒకే దైవవస్తువు మాత్రము మిగులును. శుభాశుభపరిత్యాగమను పదముయొక్క భావమిదియే. అంతియేకాని శుభకార్యములను, పుణ్యకార్యములను త్యజించివేయవలెననికాదు. సాధకులీ విషయమును బహుజాగ్రతగ గమనించవలెను.

## 18. సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః
## శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సఙ్గవివర్జితః.

## 19. తుల్యనిన్దాస్తుతిర్మౌనీ సంతుష్టో యేనకేనచిత్
## అనికేతః స్థిరమతిర్భక్తిమాన్మే ప్రియో నరః.

**టీక:–** శత్రౌ చ = శత్రువునందును, మిత్రే చ = మిత్రునియందును, తథా =అటులనే, మానావమానయోః = మానావమానములందును, సమః = సమముగా నుండువాడును, శీతోష్ణసుఖదుఃఖేషు = శీతము, ఉష్ణము, సుఖము, దుఃఖము – వీనియందు, సమః = సమముగానుండువాడును, సఙ్గవివర్జితః = దేనియందును సంగము (ఆసక్తి, మనస్సంబంధము) లేనివాడును, తుల్యనిన్దాస్తుతిః = నిందాస్తుతులందు సమముగానుండువాడును, మౌనీ = మౌనముతో నుండువాడును (లేక మననశీలుడును), యేనకేనచిత్ = దేనిచేతనైనను (దొరకినదానితో), సంతుష్టః = తృప్తినొందువాడును, అనికేతః = నిర్దిష్టమగు నివాసస్థానము లేనివాడును (లేక గృహాదులందాసక్తిలేనివాడును), స్థిరమతిః = నిశ్చయబుద్ధిగలవాడును, భక్తిమాన్ = భక్తిగలవాడును (అగు), నరః = మనుష్యుడు, మే = నాకు, ప్రియః = ఇష్టుడు.

**తా:–** శత్రువునందును, మిత్రునియందును, మానావమానములందును, శీతోష్ణసుఖదుఃఖములందును సమముగానుండువాడును, దేనియందును సంగము (ఆసక్తి, మనస్సంబంధము) లేనివాడును, నిందాస్తుతులందు సమముగా నుండువాడును, మౌనముతో నుండువాడును (లేక మననశీలుడును), దేనిచేతనైనను (దొరికిన దానితో) తృప్తిని బొందువాడును, నిర్దిష్టమగు నివాసస్థానము లేనివాడును (లేక గృహాదులం దాసక్తి లేని వాడును), నిశ్చయమగు బుద్ధిగలవాడును, భక్తితో గూడియుండువాడునగు మనుజుడు నాకు ఇష్టుడు.

**వ్యాఖ్య:–** ఈ రెండు శ్లోకములందును ఐదురకములైన ద్వంద్వములు చెప్పబడినవి – (1) శత్రుమిత్రులు (2) మానావమానములు (3) శీతోష్ణములు (4) సుఖదుఃఖములు (5) నిందాస్తుతులు – అని. అవి తటస్థించినపుడు ఏ విధమైన మనోవికారమును బొందక సమస్థితియం దుండువాడని యర్థము.

'మౌనీ' – మౌనము వాక్కునకే కాదు, మనస్సునకు గూడ నుండవలెను. భక్తుడు నిరంతరము దైవమందే లగ్నమైన చిత్తము గలిగియుండును గనుక ఎవరితోను అధికముగ మాటలు పెట్టుకొనడు; లేక 'మౌనీ' శబ్దమునకు మననశీలుడని, అనగా దైవమును గూర్చి సదా మననము చేయుచుండుననియు చెప్పవచ్చును.

'అనికేతః' – నికేతము (నివాసస్థానము) లేనివాడు అనికేతుడు. అనగా ఏ సమయమున ఏనివాసము దొరకునో, దానిచే సంతుష్టినొందువాడు, లేక ఒకచోటనున్నచో తాను నివసించు గృహాదులయెడలగాని, మఠాదులయెడలగాని మమత్వము, ఆసక్తి, సంగము లేనివాడని భావము. లేక 'నికేత' మనగా దేహమనియు చెప్పవచ్చును. అనికేతుడనగా దేహమునం దభిమానము లేనివాడు అని అర్థము.

'స్థిరమతిః' – అధ్యాత్మ (దైవ) విషయమునగాని, ప్రపంచ విషయమునగాని స్థిరమైన నిశ్చయములు గలవాడని భావము.

'భక్తిమాన్' – భక్తుడెట్టి లక్షణములు గలిగియుండవలెనో ఇంతదనుక చెప్పబడినది. ఈ ముప్పదియైదు సద్గుణములతో విరాజిల్లువాడే భక్తుడని పేర్కొనబడుటవలనను, అవియన్నియు జ్ఞానియొక్క లక్షణములుగనే తోచుచుండుటచేతను వాస్తవముగ పరాభక్తికిని, జ్ఞానమునకును భేదమేలేదని తేలుచున్నది. భక్తి గలవాడు

ప్రారంభస్థితియందు దేవుని పత్రపుష్పాదులతో పూజించుచుండును. కాని చిత్తము వికాసము నొందుచురాగా క్రమక్రమముగా సర్వాంతర్యామియగు ఆ యాత్మదేవుని తన మనఃపుష్పములచే పూజించును.

**'సమర్ప్యైకశ్చేత స్సరసిజ ముమానాథ భవతే సుఖేనావస్థాతుం జనఇహ న జానాతి కిమహో '**

'ఉమాపతిమగు ఓ పరమేశ్వరా! చిత్తమను కమలపుష్పమును మీకర్పించి సుఖముగ నుండుటను జనులు తెలిసికొనలేకున్నారే!' అని శ్రీశంకరభగవత్పాదులు శివానందలహరియందు తెలిపిన చందమున ఆ మనఃకుసుమములచే భక్తుడు భగవానుని ఆరాధించును. ఆ పుష్పములెవ్వి? ఈ అధ్యాయమునందు తెలుపబడిన ఆ ముప్పదియైదు సుగుణములే ఆ పుష్పములు.

మఱియు -

**అహింసా ప్రథమం పుష్పం పుష్పమిన్ద్రియనిగ్రహః సర్వభూత దయాపుష్పం క్షమాపుష్పం విశేషతః**
**శాన్తిపుష్పం తపః పుష్పం ధ్యానపుష్పం తథైవచ సత్యమష్టవిధం పుష్పం విష్ణోః ప్రీతికరం భవేత్.**

అని చెప్పబడినట్లు అహింసా, ఇంద్రియనిగ్రహము, సర్వభూతదయ, క్షమ, శాంతి, తపస్సు, ధ్యానము, సత్యము అను యెనిమిది పుష్పములు విష్ణుభగవానునకు చాల ప్రీతికరములై యుండును. కావున బాహ్యపుష్పాదులతోబాటు ఈ సద్గుణరూపమనఃపుష్పములచేగూడ భగవానుని ఆరాధించుట శ్రేయోదాయకము. కాబట్టి ఈ అధ్యాయమందు తెలుపబడిన సద్గుణములన్నిటిని ముముక్షువు చక్కగ నభ్యసించి, భగవంతునకు ప్రీతిపాత్రుడు కావలయును.

ఈ ప్రపంచమున మనుజుడు సంపాదింపదగిన సమస్తపదార్థములందును సర్వోత్తమమైనది, అత్యంతమూల్యవంతమైనది ఈ భగవత్ప్రీతియే అయియున్నది. కావున దానిని తప్పక సంపాదింపవలయును. అయితే అది యెట్లు లభింపగలదు? ఈ అధ్యాయమందుగాని, గీతయందు తక్కినచోట్లగాని తెలుపబడిన సద్గుణరాశినంతను చక్కగ అవలంబించినచో భగవానుడు ప్రీతినొందుదురు. 'భక్తిమాన్ మే ప్రియోనరః' (అట్టి సుగుణములుగల భక్తుడు నాకు ప్రియుడు) - అని వారు చెప్పనే చెప్పిరి. ఒకనికి భగవంతునిపై ప్రీతియుండవచ్చునుగాని, భగవంతున కాతనిపై ప్రీతికలిగినదాయని ఆలోచించుకొనవలసియుండును. భగవద్వాక్యములకు, శాస్త్రవాక్యములకు వ్యతిరిక్తముగ నడచినచో మనుజుడు ఏకాలమందును భగవత్ప్రీతిని, భగవదనుగ్రహమును సంపాదించ జాలడు. కాబట్టి భగవత్ప్రోక్తములైన ఈ ముప్పదియైదు సుగుణములను జనులు అవలంబించి దైవానుగ్రహమునకు పాత్రులుకావలయును.

'నరః' - అని చెప్పినందువలన ఏ మానవుడైనను అట్టి స్థితిని అనగా భగవదనుగ్రహమును బడయవచ్చునని తెలిపినట్లైనది.

**ప్ర:—** ఈ అధ్యాయమున భక్తుని లక్షణములు మొత్తము ఎన్ని చెప్పబడెను? అవియేవి?

**ఉ:—** మొత్తము ముప్పదియైదు చెప్పబడెను. అవి క్రమముగ (1) ఏ ప్రాణిని ద్వేషింపకుండుట (2) మైత్రి (3) కరుణ (4) మమత్వములేకుండుట (5) అహంకారము లేకుండుట (6) సుఖదుఃఖములందు సమత్వము (7) ఓర్పు (8) నిత్యసంతుష్టి (9) మనోనిగ్రహము (10) దృఢనిశ్చయము (11) మనోబుద్ధులను భగవంతునకు సమర్పించుట (12) లోకమువలన తానుగాని, తనవలన లోకముగాని భయపడకుండుట (13) హర్షము, క్రోధము, భయము లేకుండుట (14) దేనియందును అపేక్షలేకుండుట (15) శుచిత్వము గలిగియుండుట (16)

కార్య సామర్థ్యము (17) తటస్థత్వము (18) మనోవ్యాకులత్వము లేకుండుట (19) సర్వకర్మ (ఫల) పరిత్యాగము (20) హర్షములేకుండుట (21) ద్వేషము లేకుండుట (22) శోకము లేకుండుట (23) కోరిక లేకుండుట (24) శుభాశుభపరిత్యాగము (25) శత్రుమిత్రులందు సమత్వము (26) మానావమానములందు సమభావము (27) శీతోష్ణములందు సమత్వము (28) సుఖ దుఃఖములందు సమభావము (29) సంగవర్జితత్వము (30) నిందాస్తుతులందు సమత్వము (31) మౌనము (32) దొరికినదానితో సంతుష్టి (33) నివాసమునం దభిమానము లేకుండుట (34) స్థిరబుద్ధి (35) భగవంతునియందు భక్తి.

**ప్ర:–** భగవంతునకు ప్రీతిపాత్రుడెవడు?

**ఉ:–** పైన దెల్పిన ఈ సుగుణములు కలవాడు.

**ప్ర:–** కాబట్టి భగవదనుగ్రహమును సంపాదించుట కుపాయమేమి?

**ఉ:–** ఈ సుగుణములన్నిటిని గలిగియుండుటయే.

**అ॥** అధ్యాయాంతమున ఫలశ్రుతిని చెప్పుచున్నాడు –

## 20. యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే
## శ్రద్ధధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః.

**టీక:–** యేతు = ఎవరైతే, శ్రద్ధధానాః = శ్రద్ధావంతులై, మత్పరమాః = నన్నే పరమగతిగా నమ్మినవారై (లేక, నాయందాసక్తిగలవారై), ఇదమ్ = ఈ, ధర్మ్యామృతమ్ = అమృతరూపమగు (మోక్షసాధనమైన) ధర్మమును, యథోక్తమ్ = ఈ (పైన) చెప్పబడిన ప్రకారము, పర్యుపాసతే = అనుష్ఠించుచున్నారో, తే భక్తాః = అట్టి భక్తులు, మే = నాకు, అతీవ = మిక్కిలి, ప్రియాః = ఇష్టులు.

**తా:–** ఎవరైతే శ్రద్ధావంతులై, నన్నే పరమగతిగ నమ్మి (నాయందాసక్తిగలవారై), ఈ అమృతరూపమగు (మోక్షసాధమైన) ధర్మమును (ఇప్పుడు) చెప్పబడిన ప్రకారము అనుష్ఠించుదురో అట్టిభక్తులు నాకు మిక్కిలి ఇష్టులు.

**వ్యాఖ్య:–** పైనతెలుపబడిన ధర్మములను శ్రద్ధాభక్తులతో అనుష్ఠించువారికి కలుగు ఫలితమును వచించుచున్నారు. ఏదియైన ధర్మమును బోధించునపుడు దానిఫలితమునుగూడ చెప్పినచో ఆచరించువారికి దానిపై పరమవిశ్వాస మేర్పడుచుండును. అందువలననే కాబోలు భగవానుడు భక్తునిలక్షణములను పేర్కొనిపేర్కొని కట్టకడకు వాని ననుష్ఠించుటవలన కలుగు గొప్పఫలితమును చెప్పివైచిరి. ఆ ఫలితమేమి? 'తే అతీవ మే ప్రియాః' – భగవంతునకు పరమప్రీతిపాత్రులగుటయే. ఇంతకుమించిన ఫలము జీవుల కేమికావలయును? అదియున్నచో అన్నియు లభించినట్లే. అది లేనిచో తక్కినవి యెన్నియున్నను నిరుపయోగములే – భగవత్కృపకు మించినవస్తువు ముల్లోకములందును మఱియొకటిలేదు. ఏలయనగా, అట్టి కృప మోక్షమునకు దారితీయును. ఎట్లనిన భగవదనుగ్రహముగలవారికి బుద్ధియోగము (తత్త్వవిచారణాశక్తి) సంప్రాప్తించును. (దదామిబుద్ధియోగమ్) దానిచే నతనికి మోక్షము సన్నిహితమగును.

'ధర్మ్యామృతమ్' – పైనతెలుపబడిన ధర్మములు అమృతరూపమున వర్ణింపబడినవి. ఎందువలననగా,

జననమరణములనుండి తప్పించగల సామర్థ్యము వానియందు గలదు. జీవుని అమరునిగ చేయగలశక్తి వానియందు గర్భితమైయున్నది. భగవానుడు కరుణతో అమృతవర్షమును కురిపించిరి. వారివారి బుద్ధియనుపాత్రనిండుగ ఆ అమృతమును పట్టి తనివితీర త్రాగుట జీవులధర్మము. ఎవరట్లుచేయరో వారు ఆ అమృతమును త్రావు సౌభాగ్యమును చేతులారా జారవిడుచుకొనినవారే యగుచు సంసారదాహపీడితులై దుర్భరయాతనల ననుభవించవలసివచ్చును. అయితే ఆ ధర్మముల నేప్రకారమనుష్ఠించవలెను?

'శ్రద్ధధానాః' - శ్రద్ధతో ననుష్ఠించవలెనని చెప్పబడినది. ఒకతూరికాదు, రెండుతూర్లుకాదు, భగవానుడనేకతూర్లు ఈశ్రద్ధయొక్క ఆవశ్యకతను గీతయందు పేర్కొనుచుండుట గమనింపదగియున్నది. మఱియు 'మత్పరమాః' - పరాత్పరుడే పరమగతియని నమ్మి వారిని ధ్యానించుచు అయా సుగుణములను, ధర్మములను అనుష్ఠింపవలెను. 'అతీవమేప్రియాః' అని చెప్పుటవలన, ఆ ప్రకారమాచరించువారు తనకు మిక్కిలి ప్రియులని గీతాచార్యులభావమైయున్నది. పాఠశాలలో ఉపాధ్యాయునకు ప్రీతిపాత్రుడైయుండు విద్యార్థియొక్క భవిష్యద్విద్యాభివృద్ధివిషయమై ఏలాటి సంశయ మెట్లుండదో, తండ్రియొక్క అభయహస్తముక్రిందనున్న చంటిపిల్లవానియొక్క యోగక్షేమములవిషయమై ఏ సందేహమున్ను ఎట్లుండదో, అట్లే భగవంతునకు మిక్కిలి ప్రీతిపాత్రుడై యుండుజీవునియొక్క మోక్షవిషయమై ఏ సందియమున్ను ఉండదు. ఆతడు కడతేరినట్లేయగును. కాబట్టి ముముక్షువులు త్వరబడి భగవత్ప్రోక్తమగు ఈ ధర్మ్యామృతమును తనివితీర పానముచేసి కృతార్థులగుటకై యత్నింపవలయును. 'యేతు' - అని 'యచ్ఛబ్ద' ప్రయోగము చేయుటవలన ఎవ్వరైననుసరియే వానిని శ్రద్ధతో ననుష్ఠించినచో మోక్షభాగులు కాగల్గుదురని భావము.

**ప్ర:—** శ్రీకృష్ణమూర్తి బోధించిన ఈ ధర్మములెట్టివి?

**ఉ:—** అమృతరూపములు, జననమరణములనుండి తప్పించి జీవుని అమరునిగ (ముక్తునిగ) చేయగలిగినవి.

**ప్ర:—** ఈ ధర్మముల నేప్రకార మాచరించవలెను?

**ఉ:—** శ్రద్ధతో, భగవంతునియెడల అపారమైన భక్తితో.

**ప్ర:—** అట్లాచరించినందువలన కలుగు ఫలితమేమి?

**ఉ:—** వాని నాచరించువాడు భగవానునకు మిక్కిలి ప్రీతిపాత్రుడు కాగల్గును.

ఓమ్
ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే భక్తియోగో నామ
ద్వాదశోఽధ్యాయః
ఇది ఉపనిషత్ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున
సంవాదమునగు శ్రీ భగవద్గీతలందు భక్తియోగమను
పండ్రెండవ అధ్యాయము
ఓమ్ తత్ సత్



# క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము



ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్ (13-20)

ప్రకృతిని, పురుషుని ఉభయములను ఆదిలేనివారినిగ నెఱుంగుము. (మనోబుద్ధీంద్రియాదుల) వికారములను, (సత్త్వరజస్తమో) గుణములను ప్రకృతివలన గలిగినవిగా నెఱుంగుము.

ॐ

# శ్రీ భగవద్గీత

అథ త్రయోదశోఽధ్యాయః

## పదుమూడవ అధ్యాయము

క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగః

## క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము

**ఈ అధ్యాయము యొక్క పేరు :-**

"క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము" - క్షేత్రమనగా శరీరము. క్షేత్రజ్ఞుడనగా ఆత్మ. జీవుడు వాస్తవముగ క్షేత్రజ్ఞుడేకాని క్షేత్రముకాదు. కాని అజ్ఞానకారణమున తాను క్షేత్రమని తలంచి జీవుడు దుఃఖముల ననుభవించుచున్నాడు. క్షేత్రము పంచభూతాత్మకమైనది, నశ్వరమైనది, వికారవంతమైనది. క్షేత్రజ్ఞుడు (ఆ క్షేత్రమునెఱుగు ప్రత్యగాత్మ) చిన్మయరూపుడు, శాశ్వతుడు, వికారరహితుడు. ఆ రెండిటియొక్క స్వభావములు వివరింపబడి, కలిసియున్నట్టి వానియొక్క విభజనమును (విభాగమును) గూర్చి తెలుపబడిన అధ్యాయమగుటచే దీనికి క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగమను పేరు గలిగెను.

**ఈ అధ్యాయమందలి ప్రధాన విషయములు :-**

(1) క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క స్వరూపవివరణము - (1శ్లో॥ నుండి - 7 శ్లో॥ వఱకు)

(2) అమానిత్వాది జ్ఞానగుణములు - (8 శ్లో॥ నుండి - 12 శ్లో॥ వఱకు)

(3) జ్ఞేయవస్తు ప్రతిపాదనము - (13 శ్లో॥ నుండి - 18 శ్లో॥ వఱకు)

(4) ప్రకృతి, పురుషుల వర్ణనము - (19 శ్లో॥ నుండి - 35 శ్లో॥ వఱకు)

**పూర్వాధ్యాయముతో ఈ అధ్మాయమునకు గల సంబంధము :-**

క్రిందటి అధ్యాయమున శ్రీకృష్ణపరమాత్మ సగుణబ్రహ్మయొక్క ఉపాసననుగూర్చియు, భక్తునియొక్క లక్షణములనుగూర్చియు అర్జునునకు బోధించిరి. కాని నిర్గుణబ్రహ్మముయొక్క తత్త్వమును గుఱించిగాని, జ్ఞానసంబంధమైన విచారణను గూర్చి గాని అచట ఎక్కువ ప్రస్తావించలేదు. కావున సగుణబ్రహ్మముయొక్క విషయము, వాస్తవభక్తియొక్క స్వరూపము అంతయు నెఱింగిన పిదప వెంటనే అర్జునునకు నిర్గుణపరమాత్మ యొక్క తత్త్వమును, జ్ఞానసంబంధమైన విచారణను క్షుణ్ణముగ తెలిసికొన కుతూహలము గలిగి, వానినిగుఱించి భగవానుని ప్రశ్నింప అంతట వారు నిర్గుణ పరమాత్మతత్త్వమును, అట్టిపరమాత్మను జీవుడు పొందగల్గుటకు ఉపాయములను విపులముగ సెలవిచ్చిరి. తత్త్వజ్ఞానమునుగూర్చిన జిజ్ఞాసచే అర్జునుడడిగిన ప్రశ్నతో ఈ అధ్యాయము ప్రారంభమగుచున్నది.

**అర్జునఉవాచ :-**

**1. ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞ మేవ చ**
**ఏతద్వేదితుమిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ.**

అర్జునఉవాచ = అర్జునుడు చెప్పెను -

**టీక:-** కేశవ = ఓ కృష్ణా!, ప్రకృతిమ్ = ప్రకృతిని, పురుషం చ ఏవ = పురుషుని, క్షేత్రమ్ = క్షేత్రమును, క్షేత్రజ్ఞం ఏవ చ = క్షేత్రజ్ఞునిగూడను, జ్ఞానమ్ = జ్ఞానమును, జ్ఞేయం చ = జ్ఞేయమునున్ను (తెలియదగినదియగు పరమాత్మను), ఏతత్ = వీనినన్నిటిని, వేదితుమ్ = తెలిసికొనుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

**తా:-** అర్జునుడు చెప్పెను - ఓ కృష్ణా! ప్రకృతిని, పురుషుని, క్షేత్రమును, క్షేత్రజ్ఞుని, జ్ఞానమును, జ్ఞేయమును - వీనినన్నిటిని గూర్చి నేను తెలిసికొనగోరుచున్నాను.

**వ్యాఖ్యా:-** సగుణబ్రహ్మమునుగుఱించి ఇంతవఱకు బాగుగ వినియున్న అర్జునునకు నిర్గుణబ్రహ్మతత్త్వమును దెలిసికొన కుతూహలముజనింప దానినిగూర్చి భగవానుని ప్రశ్నించుచున్నాడు. గీతయందలి మొదటి ఆఱధ్యాయములు కర్మషట్కమనియు, రెండవ ఆఱధ్యాయములు భక్తిషట్కమనియు, మూడవ ఆఱధ్యాయములు అనగా 13వ అధ్యాయము మొదలుకొని 18వ అధ్యాయమువఱకు జ్ఞానషట్కమనియు చెప్పబడును. కాబట్టి యిపుడు జ్ఞానసంబంధమైన విచారణ గావింపబడుచున్నది. జ్ఞానమార్గావలంబుల కీ యధ్యాయము (13వ అధ్యాయము) అతిముఖ్యమైనది.

**ప్ర:-** అర్జునుడు వేనినిగూర్చి భగవానునివలన వినగోరెను?

**ఉ:-** (1) ప్రకృతి (2) పురుషుడు (3) క్షేత్రము (4) క్షేత్రజ్ఞుడు (5) జ్ఞానము (6) జ్ఞేయము అను నీ యాఱువిషయములను గుఱించియు వినదలంచెను.

**అ॥** అర్జునుని యాప్రశ్నను పురస్కరించుకొని భగవానుడు ఆతడడిగిన ఆఱు విషయములకు విపులమగు సమాధాన మొసంగుచున్నాడు -

**శ్రీ భగవానువాచ -**

**2. ఇదం శరీరం కౌన్తేయ క్షేత్రమిత్యభిధీయతే**
**ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః.**

శ్రీ భగవానువాచ = శ్రీ భగవానుడు చెప్పెను -

**టీక:-** కౌన్తేయ = కుంతీపుత్రుడవగు ఓ అర్జునా!, ఇదం శరీరం = ఈ శరీరము, క్షేత్రమ్ ఇతి = క్షేత్రమని, అభిధీయతే = చెప్పబడుచున్నది, ఏతత్ = దీనిని, యః = ఎవడు, వేత్తి = తెలిసికొనుచున్నాడో, తమ్ = వానిని, క్షేత్రజ్ఞః ఇతి = క్షేత్రజ్ఞుడని, తత్ విదః = వానినిగూర్చి తెలిసినవారు, ప్రాహుః = చెప్పుదురు.

**తా:–** శ్రీ భగవానుడు చెప్పెను - కుంతీపుత్రుడవగు ఓ అర్జునా! ఈశరీరమే క్షేత్రమనబడుచున్నది. దానిని తెలిసికొనువాడు క్షేత్రజ్ఞుడని క్షేత్ర క్షేత్రజ్ఞుల నెఱింగినవారు చెప్పుదురు.

**వ్యాఖ్య:–** క్షేత్రమనగా పొలము, భూమి. సస్యమభివృద్ధినొందుటకు, ఫలించుటకు భూమి ఆధారభూతమై ఎంతయో సహాయవంతముగ నెట్లుండునో అట్లే జీవుని హృదయాంతరమందలి జ్ఞానబీజము అభివృద్ధినొంది కాలాంతరమున మోక్షఫలము నొసంగుటకై ఈశరీరము ఆధారభూతముగనుండును. ఏలయనిన, అనేక సాధనానుష్ఠానములను ఈ శరీరముతోనే చేయవలసివచ్చును. ఇది ధర్మబీజమునకు, జ్ఞానబీజమునకు క్షేత్రముపగిది వర్తించుచున్నది. కనుకనే దీనిని క్షేత్రమనిచెప్పిరి.

ఈ జడమైన శరీరమును చైతన్యవంతమైన ఒకశక్తి తెలిసికొనుచున్నది (ఏతద్యోవేత్తి). ఆ ప్రజ్ఞారూపమగు వస్తువునే క్షేత్రజ్ఞుడందురు. క్షేత్రమగు శరీరమును తెలిసికొనువాడు క్షేత్రజ్ఞుడు. అతడే ప్రత్యగాత్మ. దేహేంద్రియాది సంఘాతమునకంతకును అతడు సాక్షి, నిర్వికారుడు, చిద్రూపుడు, అవినాశి, పంచకోశవిలక్షణుడు. జడమగుదానిని జడమగునది తెలిసికొనలేదు. ప్రజ్ఞయే దానిని తెలిసికొనగలది. ఆ ప్రజ్ఞయే క్షేత్రజ్ఞుడు. 'వేత్తి' (ఎఱుంగుచున్నాడు) అని చెప్పుటవలన క్షేత్రజ్ఞుడు ప్రజ్ఞావంతుడనియు, జడస్వరూపుడు కాడనియు స్పష్టమగుచున్నది.

పొలమును చూచువాడు పొలముకంటె వేఱుగనుండును. అట్లే శరీరమును (ఉపాధిని) చూచువాడు (క్షేత్రజ్ఞుడు) శరీరముకంటె వేఱుగనే యుండును. ఆ ప్రత్యగాత్మ దేహమునందున్నను, దేహసాక్షియై, జాగ్రత్స్వప్న సుషుప్తులందును మేల్కొనియుండి అంతయు వీక్షించుచున్నది.

**ప్ర:–** క్షేత్రమనగా నేమి?

**ఉ:–** ఈ శరీరమే (ఉపాధియే) క్షేత్రము.

**ప్ర:–** క్షేత్రజ్ఞుడెవరు?

**ఉ:–** ఈ శరీరమును (ఉపాధిని) తెలిసికొనువాడే క్షేత్రజ్ఞుడు (చిద్రూపుడగు ప్రత్యగాత్మ).

**అ॥** సమస్తప్రాణులందును క్షేత్రజ్ఞుడు తానేయని భగవానుడు నుడువుచున్నాడు -

## 3. క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత
## క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తజ్జ్ఞానం మతం మమ.

**టీక:–** భారత = ఓ అర్జునా!, సర్వక్షేత్రేషు = సమస్తక్షేత్రములందును (శరీరములందును), మామ్ = నన్ను, క్షేత్రజ్ఞం చ అపి = క్షేత్రజ్ఞుడనికూడ, విద్ధి = తెలిసికొనుము, క్షేత్రక్షేత్రజ్ఞయోః = క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క, జ్ఞానమ్ = జ్ఞానము, యత్ = ఏదికలదో, తత్ = అదియే, జ్ఞానమ్ = జ్ఞానమని, మమ = నాయొక్క, మతమ్ = అభిప్రాయము.

**తా:–** అర్జునా! సమస్తక్షేత్రములందును (శరీరములందును) నన్ను క్షేత్రజ్ఞునిగ గూడ నెఱుంగుము. క్షేత్రక్షేత్రజ్ఞులనుగూర్చిన జ్ఞానమేదికలదో, అదియే వాస్తవమగు జ్ఞానమని నా యభిప్రాయము.

**వ్యాఖ్య:–** ఈ శ్లోకమున 'తత్త్వమసి' మహావాక్యోపదేశమును చేయుచున్నారు. ఇదివఱలో 2వ అధ్యాయమున 'న త్వేవాహం జాతు నాసం .....' (2-12) అను శ్లోకమం దీప్రకారమే 'తత్త్వమసి' మహావాక్యోపదేశమును గావించియున్నారు. జీవుడు సాక్షాత్ శివుడేయను పరమరహస్యమును భగవాను డిచట తెలియజేయుచున్నాడు. క్షేత్రమునందు అనగా దేహేంద్రియాది సంఘాతమునందును (ఉపాధియందు, పంచకోశములందు) సాక్షిరూపమున వెలుగొందు ఏ ప్రత్యగాత్మ (జీవాత్మ) కలదో, అది పరమాత్మకంటె వేఱుకాదనియు, రెండును ఒకటేయనియు నిచట స్పష్టముచేయబడినది. క్షేత్రమును (ఉపాధిని) తెలిసికొనువాడైన ప్రజ్ఞారూపుడగు చైతన్యము అనగా క్షేత్రజ్ఞుడు ఎవడుకలడో ఆతనిని 'మాం విద్ధి' - నన్నుగనే తెలిసికొనుమని భగవానుడు కరుణతో బోధించిరి. దీనినిబట్టి సాక్షాత్ పరమాత్మ దూరమునగాక, అతి సమీపమున, వారివారి హృదయక్షేత్రమున అధివసించుచున్నాడని తెలియుచున్నది. ఇక జీవులు దుఃఖపడనేల? సంసారపరితాపమును బొందనేల? వారివారి హృదయస్థానమలంకరించియున్న ఆ దేవ దేవుని - దృగ్దృశ్యవివేకముచే చక్కగ తెలిసికొనినచాలును, ప్రత్యగాత్మ నెఱింగినచాలును, పరమాత్మ నెఱింగినట్లే.

ఈసత్యమును తెలిసికొనినచో, అనగా తనదేహమందు దేహసాక్షియైయున్న ప్రజ్ఞ పరమాత్మయే (ప్రజ్ఞానం బ్రహ్మ) అని ఎఱింగినచో ఇక జీవునకు అపరిమిత ధైర్యము, ఆనందము కలుగగలదు. ప్రపంచమున ఏ యితరవిద్యచేగాని, జ్ఞానముచేగాని ఇట్టి మహద్ధైర్యము జీవునకు కలుగనేరదు. కనుకనే అనేక జ్ఞానములు - సంగీతజ్ఞానము, శిల్పజ్ఞానము, రాజకీయజ్ఞానము మున్నగునవి లోకమున నున్నప్పటికిని అన్ని జ్ఞానములలోను క్షేత్రక్షేత్రజ్ఞవిభాగసంబంధమగు జ్ఞానమే నిజమైనజ్ఞానమని భగవాను డిచట తెలియజేసిరి. ఇంతియే కాదు. 'మమ మతమ్' - ఇది నానిశ్చితాభిప్రాయము - అని చెప్పుటవలన ఈ వాక్యముయొక్క పరమసత్యత్వమును వ్యక్తపఱచినట్లైనది. కాబట్టి సాధకలోక మిట్టి భగవన్ముఖారవింద సంజనిత ప్రతిజ్ఞాపూర్వక వచనములందపరిమిత విశ్వాసముకలదై, అట్టి క్షేత్రక్షేత్రజ్ఞవిభాగజ్ఞానమును, దృగ్దృశ్యవివేకమును తక్కిన విద్యలకంటె ముందుగా తప్పక సంపాదించి తనలోనే సర్వలోకాధీశ్వరుని ఉనికిని అనుభూత మొనర్చుకొని జన్మను కడతేర్చుకొనవలెను.

మఱియు సమస్తక్షేత్రములందును తాను క్షేత్రజ్ఞుడనని చెప్పుటవలన, శ్రీకృష్ణమూర్తి కేవలము మానవమాత్రుడు కాదనియు, సర్వభూతములందు అధిష్ఠానరూపుడుగ వెలయుచున్న పరమాత్మయే యనియు స్పష్టమగుచున్నది. ఇంకను 'సర్వక్షేత్రేషు' అని పేర్కొనుటవలన, ఏ ఒకానొక ప్రాణియందో, జాతియందో, వర్ణమందోకాక సమస్త ప్రాణికోట్లయందు, బ్రాహ్మణునియందు, చండాలునియందు, క్రిమికీటకాదులందు సర్వత్ర సత్తాసామాన్యరూపమున పరమాత్మ వసించుచున్నారని విశదమగుచున్నది. 'క్షేత్రజ్ఞమ్' అని చెప్పుటవలన, పరమాత్మ ప్రజ్ఞారూపుడేకాని జడరూపుడుగాని, శూన్యరూపుడుగాని కాదని అర్థమగుచున్నది.

**ప్ర:–** సమస్తప్రాణులందును క్షేత్రజ్ఞ రూపమున (ఉపాధిని యెఱుంగువాడుగ) వర్తించువాడెవరు?

**ఉ:–** సాక్షాత్ పరమాత్మయే.

**ప్ర:–** కాబట్టి పరమాత్మ ఎచటనున్నాడని తెలియుచున్నది?

**ఉ:–** సమస్తప్రాణులయొక్క హృదయమందు సాక్షిరూపమున వెలుగొందుచున్నారని తెలియుచున్నది.

**ప్ర:–** ఏ ఒకానొక ప్రాణియందే యాతడు నివసించునా?

**ఉ:–** కాదు – 'సర్వ' ప్రాణులందును.

**ప్ర:–** భగవంతుడు జడరూపుడా? శూన్యరూపుడా?

**ఉ:–** కాదు, చిన్మయరూపుడు – ప్రజ్ఞాస్వరూపుడు. కనుకనే ఆతనిని 'క్షేత్రజ్ఞమ్' అని చెప్పిరి.

**ప్ర:–** ప్రపంచములో వాస్తవమగు జ్ఞానమెయ్యది?

**ఉ:–** "క్షేత్రక్షేత్రజ్ఞులను విభజించి తెలుపునట్టి జ్ఞానమేదికలదో అనగా దృగ్దృశ్యవివేకము,– అదియే వాస్తవమగు జ్ఞానము – ఇది నా నిశ్చయము" అని భగవానుడు పలికెను. (మతంమమ –)

**అ॥** ఈ ప్రకారముగ క్షేత్రక్షేత్రజ్ఞులను గూర్చి సంక్షేపముగ జెప్పి ఇక వానిని గుఱించి ఒకింత వివరముగ వచించుచున్నాడు –

**4. తత్క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్**
**స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు.**

**టీక:–** తత్క్షేత్రమ్ = ఆ క్షేత్రమ్, యత్ చ = ఏదియో, యాదృక్ చ = ఎటువంటిదో, యత్ వికారి = ఎట్టివికారములు కలదో, యతః చ యత్ = దేనినుండి యేరీతిగనుత్పన్నమైనదో, సః చ = ఆ క్షేత్రజ్ఞుడును, యః = ఎవడో, యత్ ప్రభావః చ = ఎట్టిప్రభావముకలవాడో, తత్ = దానిని (ఆ విషయములన్నింటిని), సమాసేన = సంక్షేపముగ, మే = నావలన, శృణు = వినుము.

**తా:–** ఆ క్షేత్రమేదియో, ఎటువంటిదో, ఎట్టివికారములు కలదో, దేనినుండి యే రీతిగ నుత్పన్నమైనదో, ఆ క్షేత్రజ్ఞుడును ఎవడో, ఎట్టిప్రభావముకలవాడో ఆ విషయము లన్నింటిని సంక్షేపముగ నావలన వినుము.

**వ్యాఖ్య:–** భగవానుడు తాను చెప్పబోవు వాక్యములన్నిటియొక్క సారమును ఇచట ప్రారంభముననే సూచించిరి. ఎట్లనిన – క్షేత్రమును వికారవంతముగను (యద్వికారి) క్షేత్రజ్ఞుని ప్రభావశీలునిగను (యత్ప్రభావశ్చ) వర్ణించిరి. వాస్తవముగ దేహాదిరూపమగు ఉపాధి పెక్కు వికారములతో గూడి నశ్వరమైనదియు, ఆత్మ శాశ్వతమై, అమితప్రభావవంతమై వెలయుచున్నదియు నగును.

'సమాసేన మేశృణు' – ఈ విచారణనంతను సంక్షేపముగ చెప్పెదనని భగవానుడు పలికిరి. ఏలయనిన, ఈ దృగ్దృశ్యపదార్థ విచారణయంతయు ఒక పెద్దగ్రంథము. యుద్ధసమయము కావున దానినంతను చెప్పుటకు అనుకూలము లేదు. కాబట్టి సంగ్రహముగ చెప్పదలంచిరి.

**అ॥** క్షేత్రక్షేత్రజ్ఞ సంబంధజ్ఞానమును ప్రశంసించుచున్నాడు –

**5. ఋషిభిర్బహుధా గీతం ఛన్దోభిర్వివిధైః పృథక్**
**బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః.**

**టీక:–** (ఆ జ్ఞానము) ఋషిభిః = ఋషులచేత, బహుధా = అనేకప్రకారములుగా, పృథక్ = వేఱువేఱుగా, వివిధైః = పలువిధములైన, ఛన్దోభిః = వేదములచేత, గీతమ్ = ప్రతిపాదింపబడినది. (మఱియు) హేతుమద్భిః = హేతువులతో (యుక్తులతో) గూడి, వినిశ్చితైః = బాగుగ నిశ్చయింపబడినట్టి, బ్రహ్మసూత్రపదైః చ ఏవ = 'బ్రహ్మసూత్ర' వాక్యములచేతగూడ, (గీతమ్ = చెప్పబడినది.)

**తా:–** (ఆ క్షేత్రక్షేత్రజ్ఞ జ్ఞానము) ఋషులచే అనేకప్రకారములుగా నానావిధములైన వేదములద్వారా వేఱువేఱుగా ప్రతిపాదింపబడినది. మఱియు హేతువులతో (యుక్తులతో) గూడి బాగుగా నిశ్చయింపబడినట్టి బ్రహ్మసూత్రవాక్యములచేతగూడ నయ్యది చెప్పబడియున్నది.

**వ్యాఖ్య:–** తాను చెప్పదలంచుచున్న క్షేత్రక్షేత్రజ్ఞ జ్ఞానముయొక్క మహిమను తెలుపుటకై భగవానుడు అనుభవజ్ఞులగు పరమఋషుల వాక్యములను తార్కాణముగ జూపుచున్నాడు -

'ఋషిభిర్బహుధాగీతామ్' - ఋషులనగా ఇంద్రియములను జయించినవారు. ఆత్మ సాక్షాత్కారమునొందిన మహనీయులు. అట్టివారు దేనినైనను చెప్పినచో దానిలో ఎంతయో సారము, మహిమ, గొప్పతనము తప్పక ఉండియుండును. అట్టి ఋషులు ఒకసారికాదు, అనేకసార్లు - 'బహుధా' పలువిధములుగ ఆ జ్ఞానమునుగూర్చి చెప్పిరని వచించుటచే దానికి ఎంతయో ఆధిక్యతగలదని స్పష్టమగుచున్నది.

'హేతుమద్భిర్వినిశ్చితైః' - ఆ వ్యాసాది మహర్షులు పలికిన బ్రహ్మసూత్రాది బ్రహ్మప్రతిపాదక వాక్యములు సామాన్యములుకావు. హేతువాదము (Logic, Science) యొక్క పరీక్షకు నిలుచునవి. సహేతుకములైనవి. స్వానుభవముచే లెస్సగ నిశ్చయింపబడినవి కనుకనే 'నిశ్చితైః' అని చెప్పక 'వినిశ్చితైః' (బాగుగ నిశ్చయింపబడినవి) అని చెప్పిరి. పరమసత్యములని భావము. కాబట్టి శ్రీకృష్ణపరమాత్మ చెప్పబోవు ఈ క్షేత్రక్షేత్రజ్ఞ విభాగజ్ఞానము ఎంతగొప్పదో, దానిపై జనుల కెంతటి విశ్వాసముండవలెనో పై భగవద్వాక్యములవలన స్పష్టమగుచున్నది.

**అ॥** ఇక క్షేత్రముయొక్క స్వరూపమును వివరించి చెప్పుచున్నాడు -

**6. మహాభూతాన్యహఙ్కారో బుద్ధిరవ్యక్తమేవ చ**
**ఇన్ద్రియాణి దశైకం చ పఞ్చ చేన్ద్రియగోచరాః.**

**7. ఇచ్ఛాద్వేషస్సుఖం దుఃఖం సఙ్ఘాతశ్చేతనా ధృతిః**
**ఏతత్క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్.**

**టీక:–** మహాభూతాని = పంచమహాభూతములు, అహఙ్కారః = అహంకారము, బుద్ధిః = బుద్ధి, అవ్యక్తం ఏవ చ = మూలప్రకృతియు, దశ ఏకం చ ఇన్ద్రియాణి = పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, మనస్సొకటి - మొత్తము పదునొకండు ఇంద్రియములు, ఇంద్రియగోచరాః పఞ్చ చ = (శబ్దస్పర్శాది) ఇంద్రియవిషయము లైదు, ఇచ్ఛా = కోరిక, ద్వేషః = ద్వేషము, సుఖమ్ = (దృశ్య) సుఖము, దుఃఖమ్ = దుఃఖము, సఙ్ఘాతః = దేహేంద్రియాదుల సముదాయము, చేతనా = తెలివి

(వృత్తిజ్ఞానము), ధృతిః = ధైర్యము (అను), ఏతత్ = ఈ, సవికారమ్ = వికారములతోగూడిన, క్షేత్రమ్ = క్షేత్రము, సమాసేన = సంక్షేపముగా, ఉదాహృతమ్ = చెప్పబడినది.

**తా:–** పంచమహాభూతములు, అహంకారము, బుద్ధి, మూలప్రకృతి, పదునొకండు ఇంద్రియములు (దశేంద్రియములు+మనస్సు), ఐదు ఇంద్రియవిషయములు (శబ్దస్పర్శాదులు), కోరిక, ద్వేషము, సుఖము, దుఃఖము, దేహేంద్రియాదుల సముదాయము, తెలివి (వృత్తిజ్ఞానము), ధైర్యము, అను వీనిసముదాయమై, వికారసహితమైనట్టి క్షేత్రము సంక్షేపముగా చెప్పబడినది.

**వ్యాఖ్య:–** క్షేత్రమనగా కేవలమొక స్థూలదేహమేకాదు. సమస్తదృశ్యమున్ను క్షేత్రమే. స్థూల సూక్ష్మ పంచమహాభూతములు, మనస్సు, బుద్ధి, అతిసూక్ష్మమగు అవ్యక్తము (మూలప్రకృతి) కూడ క్షేత్రము క్రిందకే లెక్కకు వచ్చును. మనస్సు, బుద్ధికూడ క్షేత్రమునకు చెందినవే కావున వాని వృత్తులగు ద్వేషాది దుర్వృత్తులు, ధృత్యాది సద్వృత్తులుకూడ క్షేత్రము క్రిందనే లెక్క వేయబడినవి. దృశ్యరహిత నిస్సంకల్పాత్మస్థితియందు ఆ ధైర్యాదిసద్వృత్తులనుగూడ దాటిపోవలసియుండును.

'సవికారమ్' అని చెప్పబడుటవలన ఈ దృశ్యమంతయు (క్షేత్రము) వికారములకులోనైనదియనియు, దృక్స్వరూపుడగు క్షేత్రజ్ఞుడొకడే నిర్వికారుడనియు తాత్పర్యము. ఈ క్షేత్రమునందు 'సుఖమ్' అనునదికూడ చేర్చబడియుండుటచే, అట్టి దృశ్యసౌఖ్యమునకై అఱ్ఱులుచాచక నిర్వికార ఆత్మసుఖమునకైయే యత్నించవలెను.

'దృశ్యము' క్షేత్రము అనగా సామాన్యముగ ఈ దేహము, ఈ కానుపించు ప్రపంచము అని మాత్రము జనులు తలంచుదురు. కాని వాస్తవముగ సూక్ష్మపంచభూతములు, మనస్సు, బుద్ధి, మూలప్రకృతికూడ దృశ్యమే (క్షేత్రము) యని ఇచట స్పష్టముగ చెప్పబడినది. కాబట్టి విజ్ఞుడగువాడు తాను దృక్-వస్తువగు ఆత్మయే యని తలంచి ఈ దేహాదిదృశ్యమును, మనస్సును, బుద్ధిని, కామాది బుద్ధివృత్తులనుగూడ తనకంటె వేఱుగ జూచుచు వానితో తాదాత్మ్యము నొందక, క్రమముగ వానిని జయించి ఆత్మస్వరూపమున నిలుకడను సంపాదించవలెను.

భగవానుడు కావించిన క్షేత్రముయొక్క ఈ వివరణము ఆత్మానాత్మవిచారణాపరునకు మిక్కిలి ఉపకరించును. ఏలయనిన, సాధకునకు తననుండి దేనిని వేఱుపఱచవలెనో దీనియందు స్పష్టముగ చెప్పివేయబడినది. ప్రపంచమునేకాక, దేహమునేకాక, మనస్సునుగూడ తననుండి వేఱుపఱచవలెనను (లేక, వేఱుగాచూడవలెనను) మహోన్నతమగు అభ్యాసము దీనివలన సిద్ధించుచున్నది.

**ప్ర:–** క్షేత్రమనగా నెద్దియో తెలుపుము?

**ఉ:–** (1) పంచభూతములు (2) అహంకారము (3) బుద్ధి (4) మూలప్రకృతి (5) 11 ఇంద్రియములు (6) 5 ఇంద్రియవిషయములు (7) కోరిక (8) ద్వేషము (9) (దృశ్య) సుఖము (10) దుఃఖము (11) సంఘాతము (దేహేంద్రియాదుల సముదాయము) (12) తెలివి (వృత్తిజ్ఞానము) (13) ధైర్యము.

**ప్ర:–** క్షేత్రమెట్టిది?

**ఉ:–** వికారవంతమైనది.

**అ॥** ఇక జ్ఞానమనగా నేదియో ఐదు శ్లోకములద్వారా చెప్పుచున్నాడు –

**8. అమానిత్వమదమ్భిత్వమహింసా క్షాన్తిరార్జవమ్**
**ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మవినిగ్రహః.**

**9. ఇన్ద్రియార్థేషు వైరాగ్యమనహంకార ఏవ చ**
**జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్.**

**10. అసక్తి రనభిష్వఙ్గః పుత్రదారగృహాదిషు**
**నిత్యం చ సమచిత్తత్వమిష్టానిష్టోపపత్తిషు.**

**11. మయి చానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ**
**వివిక్తదేశ సేవిత్వమరతిర్జనసంసది.**

**12. అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్**
**ఏతజ్జ్ఞానమితి ప్రోక్తమజ్ఞానం యదతోఽన్యథా.**

**టీక:–** అమానిత్వమ్ = తన్నుతాను పొగడుకొనకుండుట, అదమ్భిత్వమ్ = డంబము లేకుండుట, అహింసా = (మనోవాక్కాయములచే) పరప్రాణులను బాధింపకుండుట, క్షాన్తిః = ఓర్పుగలిగియుండుట, ఆర్జవమ్ = ఋజుత్వము గలిగియుండుట (కుటిలత లేకుండుట), ఆచార్యోపాసనమ్ = గురుసేవాతత్పరుడైయుండుట, శౌచమ్ = బాహాభ్యంతరశుచిత్వము (శుద్ధి) గలిగియుండుట, స్థైర్యమ్ = (సన్మార్గమున, మోక్షప్రయత్నమున) స్థిరముగా నిలబడుట, ఆత్మవినిగ్రహః = మనస్సును బాగుగనిగ్రహించుట, ఇన్ద్రియార్థేషు = ఇంద్రియవిషయములగు శబ్దస్పర్శాదులందు, వైరాగ్యమ్ = విరక్తి గలిగియుండుట, అనహంకారః ఏవ చ = అహంకారము లేకుండుటయును, జన్మ, మృత్యు, జరా, వ్యాధి, దుఃఖదోషానుదర్శనమ్ = పుట్టుక, చావు, ముసలితనము, రోగము - అనువానివలన కలుగు దుఃఖమును, దోషమును మాటిమాటికి స్మరించుట, పుత్రదారగృహాదిషు = కొడుకులు (సంతానము), భార్య, ఇల్లు మున్నగువానియందు, అసక్తిః = ఆసక్తిలేకుండుట (మఱియు), అనభిష్వఙ్గః = సాహచర్యములేకుండుట (వారికి కలుగు సుఖదుఃఖములు తనకే గలిగినట్లు తాదాత్మ్యములేకుండుట), ఇష్ట, అనిష్ట ఉపపత్తిషు = ఇష్టానిష్టములు (శుభాశుభములు) సంప్రాప్తించినపుడు, నిత్యమ్ = ఎల్లప్పుడును, సమచిత్తత్వం చ = సమబుద్ధిగలిగియుండుటయు, మయి = నాయందు, అనన్యయోగేన = ఏకాగ్రబుద్ధితో (ఇతరమగు దేనియందును మనస్సును చేర్చక), అవ్యభిచారిణీ = చలించనట్టి (ఐకాంతికమగు), భక్తిః = భక్తిగలిగియుండుట, వివిక్తదేశసేవిత్వమ్ = ఏకాంతప్రదేశము(ప్రతిబంధము లేనిచోటు) నాశ్రయించుట, జనసంసది = జనసమూహమునందు, అరతిః = ప్రీతిలేకుండుట, అధ్యాత్మజ్ఞాననిత్యత్వమ్ = ఆధ్యాత్మజ్ఞానము (ఆత్మనిష్ఠ) ఎల్లప్పుడు కలిగియుండుట, తత్త్వజ్ఞానార్థదర్శనమ్ = తత్త్వజ్ఞానముయొక్క గొప్పప్రయోజనమును తెలిసికొనుట (అను), ఏతత్ = ఇది (ఇవియన్నియు), జ్ఞానం ఇతి = 'జ్ఞాన'మని, ప్రోక్తమ్ = చెప్పబడినది, యత్ = ఏది, అతః అన్యథా = దీనికంటె వేఱుగానుండునో, (తత్ = అది), అజ్ఞానమ్ = అజ్ఞానము (అని తెలియనగును).

**తా:–** తన్ను తాను పొగడుకొనకుండుట, డంబములేకుండ, (మనోవాక్కాయములచే) పరప్రాణులను బాధింపకుండుట, ఓర్పుగలిగియుండుట, ఋజుత్వము (శుద్ధి) గలిగియుండుట, (సన్మార్గమున, మోక్షమార్గమున) స్థిరముగానిలబడుట, మనస్సును బాగుగ నిగ్రహించుట, ఇంద్రియవిషయములను శబ్దస్పర్శాదులందు విరక్తిగలిగియుండుట, అహంకారములేకుండుట, పుట్టుక, చావు, ముసలితనము, రోగము - అనువానివలన కలుగు దుఃఖమును, దోషమును మాటిమాటికి స్మరించుట, కొడుకులు (సంతానము) భార్య, యిల్లు మున్నగు వానియందు ఆసక్తిలేకుండుట మఱియు వానియందు తాదాత్మ్యము లేకుండుట (వారికి కలుగు సుఖదుఃఖములు తనకే కలిగినట్లు అభిమానింపకుండుట), ఇష్టానిష్టములు (శుభాశుభములు) సంప్రాప్తించినపుడెల్లపుడును సమబుద్ధి గలిగియుండుట, నాయందు (భగవంతునియందు) అనన్యమైన (నిశ్చల) భక్తి గలిగియుండుట, ఏకాంత ప్రదేశమును (ప్రతిబంధములేనిచోటును) ఆశ్రయించుట, జనసమూహమునందు ప్రీతిలేకుండుట, అధ్యాత్మజ్ఞానము (ఆత్మనిష్ఠ) నిరంతరము గలిగియుండుట, తత్త్వజ్ఞానముయొక్క గొప్పప్రయోజనమును తెలిసికొనుట అను నిదియంతయు జ్ఞానమని చెప్పబడును. దీనికి వ్యతిరేకమైనది అజ్ఞానము (అని తెలియందగినది).

**వ్యాఖ్య:–** ఈ అధ్యాయమునందు జ్ఞానము, జ్ఞేయము అని రెండు చెప్పబడుచున్నవి. జ్ఞానము 'సాధన', జ్ఞేయము 'సాధ్యము'. పరమాత్మయను లక్ష్యమును జేరుటకు వలసిన నైతిక, ఆధ్యాత్మికసంపత్తియే జ్ఞానమని యిచట పేర్కొనబడినది. అట్టి జ్ఞానమునందారితేరనిచో జ్ఞేయవస్తువగు పరమాత్మ నెవరును బొందజాలరు. అద్దము నిర్మలముగా నుండినచో మాత్రమే వస్తువు దానియందు చక్కగ ప్రతిబింబించును. మాలిన్యముతో గూడియుండినచో కాదు. అట్లే పెక్కుసుగుణములచే విరాజిల్లుచు చిత్తమెపుడు అత్యంతనిర్మలముగానుండునో, అపుడే అధిష్ఠానమగు ఆత్మ దానియందు బాగుగ వ్యక్తముకాగలదు. కాబట్టి సాధకుడు ముఖ్యముగ ఈ జ్ఞానగుణములను అభ్యసించుటయందే మొట్టమొదట తన దృష్టిని కేంద్రీకరించవలసియుండును. జ్ఞానసహాయముచే జ్ఞేయము దానంతటనదియే సంప్రాప్తించగలదు. కనుకనే గీతయం దనేకచోట్ల భగవాను డీజ్ఞానగుణములను (Morality) ఎక్కువగ ప్రోత్సహించుచువచ్చిరి. ఇచ్చోట ఇఱువది సుగుణములు పేర్కొనబడినవి. సాధకుడు ఒక్కొక్కదానిని బాగుగ నభ్యసించుచు క్రమముగ వానినన్నింటిని తనస్వరూపమున మిళితము చేసికొనవలయును.

'ఆచార్యోపాసనమ్' - గురుసేవ తప్పక చేయవలెనని భగవానుడు నుడుపుచున్నాడు. ఏలయనిన దైవానుగ్రహము, గుర్వనుగ్రహము అను నీ రెండును లేనిచో మోక్షమార్గమున జనుట కష్టతరము. వారల అనుగ్రహము సాధకుని పురోభివృద్ధికి గొప్ప సహాయకారిగ నుండగలదు.

'శౌచమ్' - శుచిత్వమునకు గీతాచార్యులు ఎక్కువ ప్రాముఖ్యత నొసంగుచున్నారు (అనపేక్షశ్శుచిర్దక్షః (12-16)). బాహ్యాభ్యంతర శౌచము ముముక్షువులకత్యావశ్యకము. బయట గల మురికి, లోపల (చిత్తమున) గల మురికి రెండిటిని కడిగివేయవలెను.

'స్థైర్యమ్' - భగవన్మార్గమున చంచలత్వము పనికిరాదు. స్థిరమైన నిర్ణయములు గలిగి వానిని చక్కగ అమలుపఱచవలెను. ప్రపంచదృష్టిగలవారి వాక్యములను విని దైవమందు, ధర్మమందు, పరమార్థ నిలయములందు విశ్వాసమును సడలించరాదు.

'ఆత్మవినిగ్రహః' - ఇచట 'ఆత్మ' అనగా మనస్సు, ఇంద్రియములు అని అర్థము. మనోనిగ్రహము

ఇంద్రియనిగ్రహము తప్పక సంపాదించవలెను. 'నిగ్రహము' అని చెప్పక వినిగ్రహము అని చెప్పుటచే ఇంద్రియమనంబులను పరిపూర్ణముగ నిగ్రహించవలెననిభావము. ఏలయనిన, స్వల్పనిగ్రహాదులను బలవత్తరమగు మాయ ఎపుడైన పడగొట్టవచ్చును.

'ఇన్ద్రియార్థేషువైరాగ్యమ్' - ఆత్మసాక్షాత్కారమునకు వైరాగ్యము చాల అవసరము. మనస్సు శబ్దాదివిషయములపైకి పరుగిడుచున్నచో ధ్యానమందు ఏకాగ్రత కుదరదు. కాబట్టి దృశ్యభోగములనుండి మనస్సును అంతర్ముఖముగ మఱలించుటకై సాధకుడు వైరాగ్యమును తప్పక ఆశ్రయించవలెను.

'జన్మమృత్యు జరావ్యాధిదుఃఖ దోషానుదర్శనమ్' - సామాన్యముగ జనులు వార్ధక్యమరణాదులందు దుఃఖమును, దోషమును గాంచుదురు. కాని 'జన్మ' (పుట్టుక) యందుకాదు. ఎవరైన పుట్టినచో సంబరపడుదురే కాని దుఃఖింపరు. కాని భగవానుడు పుట్టుకయందును దోషమునే, అనర్థమునే చూడవలెనని చెప్పుచున్నారు. ఏలయనిన పుట్టుకవలననే తక్కిన జరావ్యాధులన్నియు ఏర్పడుచున్నవి. కావున జననమరణ వార్ధక్యాదులందుగల దోషములను మాటిమాటికి చింతనచేయుట ముముక్షువుయొక్క పరమధర్మము. అట్లు చింతనచేసి వానినుండి తప్పించుకొనుటకై ఆత్మజ్ఞానమును బడయుటకు యత్నింపవలెను. 'దర్శనమ్' అనిచెప్పక 'అనుదర్శనమ్' అని చెప్పుటవలన ఆ యా దోషములను మఱల మఱల విచారించుచుండవలెనని, దానిచే వైరాగ్యము, ముముక్షుత్వము తీవ్రముగ ఏర్పడగలవని భావము. కాబట్టి ఈసాధన ముముక్షువులకు అత్యంతావశ్యకమని గుర్తెఱుంగవలయును.

'అసక్తిరనభిష్వఙ్గః పుత్రదారగృహాదిషు' - 'ఆదిషు' అను పదములో ధనము, క్షేత్రము, మున్నగునవి చేరును. గృహస్థాశ్రమమునందున్నవారీ వాక్యమును బాగుగ గమనించవలెను. కుటుంబము, బంధువులు, ధనము మున్నగునవి ఉండుటలో తప్పులేదు. కాని వానియందు తాదాత్మ్యము - సంసక్తి (Attachment) లేకుండవలెను.

'నిత్యం చ సమచిత్తత్వమ్' - ఇష్టానిష్టములందు సమత్వబుద్ధి ఎప్పుడో ఒకప్పుడు కాదు, ఎల్లప్పుడు ఉండవలెనని 'నిత్యం' అను పదముచే సూచితమగుచున్నది. 'అనన్యయోగేన' - దైవముతప్ప ఇతరములగు దృశ్యవస్తువులనుగూర్చిన సంకల్పములెవ్వియు మనస్సునకు రానీయకుండుటయే అనన్యయోగము. భక్తియోగముగాని, ధ్యానయోగముగాని, ఏ యోగముగాని ఈ అనన్యయోగముతో చేరినపుడే శక్తివంతముకాగలదు.

'భక్తిరవ్యభిచారిణీ' - భక్తిచంచలముగ నుండరాదు. అచంచలమైన భక్తినే ఆశ్రయించవలెను. ప్రారంభస్థితిలో అట్టి నిశ్చలభక్తి అనగా నిరంతరము దైవము పైననే మనస్సు నిలుపుట - సాధ్యముకాకపోయినను, ప్రయత్నాతిశయముచే అట్టి స్థితిని (ఏకాంతభక్తిని) యెప్పటికైనను సంపాదించియేతీరవలెను.

'వివిక్తదేశసేవిత్వమ్' - ప్రారంభదశలో ప్రాపంచిక మనస్తత్త్వముగల జనుల వలన విక్షేపముకలుగకుండు నిమిత్తము సాధనను ఏకాంతస్థలమున కొనసాగించుట ఉత్తమము. అట్టి ఏకాంతస్థలమును వారి వారి గృహమునందును ఏర్పాటుచేసికొనవచ్చును. ఒక ప్రత్యేకమగు గదిని ధ్యానాదులకై వినియోగించు కొనవచ్చును.

'అరతిర్జనసంసది' - మొదట దుర్జనసాంగత్యమును వదలి సత్సాంగత్యమును, సత్పురుషుల

సహవాసమును ఆశ్రయించి, సద్బోధలను బడసి ఆ బోధలను హృదయంగమ మొనర్చుకొనుటకై పూర్ణముగ అనుష్ఠించుటకొఱకై జనసమ్మర్దములేని ఏకాంతస్థలమున సాధనచేయవలెను అనియే భావము. అంతియేకాని సత్సహవాసము కూడదనికాదు.

'అధ్యాత్మజ్ఞాననిత్యత్వమ్' - అధ్యాత్మజ్ఞానము, దైవసంబంధమైన స్మృతి ఎపుడో ఒకానొకవేళ ఉండుట చాలదనియు నిరంతరము అట్టి జ్ఞానము హృదయమున వెలుగొందుచుండవలెననియు ఇట బోధింపబడినది. రాత్రికాలమున ఏక్షణమున చేతినుండి దీపము తొలగిపోవునో, ఆక్షణముననే అంధకారమువచ్చి ఆవరించును. అట్లే జ్ఞానదీపమును జారవిడిచినచో వెనువెంటనే అజ్ఞానతిమిరము ప్రవేశించి జీవుని అధోగతికి త్రోసివేయగలదు. కాబట్టి సాధకులు బహుజాగరూకులుగనున్నవారై 'అధ్యాత్మజ్ఞాన నిత్యత్వమ్' అను ఈ భగవద్వాక్యమును మఱల మఱల స్మరించుచు మాయను దరికి జేరనీయక చూడవలెను.

'తత్త్వజ్ఞానార్థదర్శనమ్' - తత్త్వజ్ఞానమును మాటలచే చెప్పుట చాలదనియు, ప్రత్యక్షముగ దర్శించవలెననియు, అనుభూత మొనర్చుకొనవలెననియు ఆదేశింపబడినది.

'అజ్ఞానం యదతోఽన్యథా' - ఈ అమానిత్వాది గుణములకు విరుద్ధములైన గుణములన్నియు అనగా దంభదర్పాదులన్నియు అజ్ఞానమే యని అర్థము.

**ప్ర:—** జ్ఞానగుణములేన్ని? అవియేవి?

**ఉ:—** జ్ఞానగుణములు ఇరువది. అవి క్రమముగ -

(1) తన్ను తాను పొగడుకొనకుండుట (2) డంబము లేకుండుట (3) పరప్రాణులను హింసింపకుండుట (4) ఓర్పుగలిగియుండుట (5) ఋజుత్వముగలిగియుండుట (6) గురుసేవచేయుట (7) బాహ్యాభ్యంతరశుద్ధిగలిగియుండుట (8) సన్మార్గమున స్థిరముగా నిలబడుట (9) మనస్సును బాగుగ నిగ్రహించుట (10) ఇంద్రియవిషయములందు విరక్తిగలిగియుండుట (11) అహంకారము లేకుండుట (12) పుట్టుక, చావు, ముసలితనము, రోగము - అనువానివలన గలుగు దుఃఖమును దోషమును మాటిమాటికి స్మరించుట (13) కొడుకులు (సంతానము), భార్య, యిల్లు - మున్నగువానియం దాసక్తి లేకుండుట (14) మఱియు వానియందు తాదాత్మ్యము (వారి దుఃఖాదులు తనకు కలిగినట్లు అభిమానము) లేకుండుట (15) ఇష్టానిష్టములు కలిగినపుడెల్లపుడును సమబుద్ధిగలిగియుండుట (16) భగవంతునియందు అనన్యభక్తిగలిగియుండుట (17) ఏకాంతప్రదేశము నాశ్రయించుట (18) జనసముదాయమునందు ప్రీతిలేకుండుట (19) నిరంతరము అధ్యాత్మజ్ఞానముగలిగియుండుట (20) తత్త్వజ్ఞానముయొక్క గొప్ప ప్రయోజనమును తెలిసికొనుట - అనునవి అయియున్నవి.

**ప్ర:—** అజ్ఞానమనగానేది?

**ఉ:—** వీనికి వ్యతిరేకమైనదియంతయు అజ్ఞానమే.

**అ॥** ఇంతదనుక 'జ్ఞానము'ను గూర్చి చెప్పి ఇక జ్ఞేయమనగా నెద్దియో ఆఱుశ్లోకములద్వారా తెలియజేయుచున్నాడు -

**13. జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వాఽమృతమశ్నుతే**
**అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే.**

**టీక:–** యత్ = ఏది, జ్ఞేయమ్ = తెలియదగిన బ్రహ్మస్వరూపమో, యత్ = దేనిని, జ్ఞాత్వా = తెలిసికొని (మనుజుడు), అమృతమ్ = మోక్షమును (అమరత్వమును), అశ్నుతే = పొందుచున్నాడో, తత్ = దానిని, ప్రవక్ష్యామి = బాగుగచెప్పబోవుచున్నాను, అనాదిమత్ = ఆదిలేనట్టి, పరంబ్రహ్మ = పరబ్రహ్మమనబడు, తత్ = అది, సత్ = సత్తని (ఉన్నదనిగాని), న ఉచ్యతే = చెప్పబడదు, అసత్ న *(ఉచ్యతే)* = అసత్తనియు (లేదనిగాని) చెప్పబడదు.

**తా:–** ఏది తెలియదగిన బ్రహ్మస్వరూపమో, దేనిని తెలిసికొని మనుజుడు అమృతస్వరూపమగు మోక్షమును పొందుచున్నాడో అద్దానిని బాగుగ చెప్పబోవుచున్నాను. ఆదిలేనట్టి పరబ్రహ్మమనబడు అయ్యది సత్తనిగాని (ఉన్నదనిగాని), అసత్తనిగాని (లేదనిగాని) చెప్పబడదు.

**వ్యాఖ్య:–** ఇక్కడనుండి మొదలుకొని ఆఱుశ్లోకములవఱకు జ్ఞేయమగు పరమాత్మ స్వరూపమును వర్ణించుచున్నారు. జ్ఞానమాత్రముతో సంతృప్తినొందక జ్ఞేయమునుగూడ ప్రతివారును తప్పక పొందితీరవలెను. మొదట దుర్గుణములను పోగొట్టుకొని సద్గుణములను అలవాటు చేసికొనవలెను. తదుపరి ఆ సద్గుణములనుగూడ దాటి నిర్గుణపరమాత్మసన్నిధికి జేరవలెను. అదియొక్కటియే పూర్ణస్థితి. తక్కినవన్నియు అపూర్ణస్థితులేయగును. ఇట్టి జ్ఞేయతత్త్వమునుబోధించు మతములు లోకమున చాల అరుదు. ఏలయనిన మతములలో అనేకములు సద్గుణములను (Ethics) మాత్రము బోధించునవే అయియున్నవి. అట్టిస్థితి మంచిదేకాని చాలదు. సాధకుడు సద్గుణప్రభావముచే విశుద్ధాంతరంగుడై, అంతటితో తృప్తినొందక ఇంకను పైకిపోయి కేవలముజ్ఞేయవస్తువగు పరమాత్మతోటి తాదాత్మ్యమును బొందవలెను. అదియే జీవుని చరమస్థితి. అట్టిస్థితిని జేరువఱకును సాధన నెవరును వదలరాదు. కావున గీతయందు భగవానుడు జ్ఞానగుణములతో పరితృప్తినిబొందక జ్ఞేయమును గూడ జెప్పి జీవుని అద్వైత తత్త్వముల మూడింటిని బోధించుటవలన నిది పరిపూర్ణశాస్త్రమని విజ్ఞులు పలుకుచున్నారు.

'ప్రవక్ష్యామి' - లెస్సగా జెప్పుచున్నాను - అధ్యాత్మ బోధయందు శ్రీకృష్ణపరమాత్మయొక్క అపరిమిత ఉత్సాహము ఈ పదముచే ద్యోతకమగుచున్నది.

'యజ్జ్ఞాత్వాఽమృతమశ్నుతే' - జ్ఞేయవస్తువగు పరమాత్మనెఱింగినచో కలుగబోవు గొప్ప ఫలితము ముందుగానే తెలిసియున్నచో దానిని పొందుటకై సాధకుడు ఆనందముతో, ఉత్సాహముతో ముందునకు బయలుదేరగలడు. కనుకనే భగవాను డిచట జ్ఞేయస్వరూపమును వర్ణింపబోవుచు ముందుగనే దానిఫలితమును చెప్పివైచిరి. అమృతత్వమే, మోక్షమే దానిఫలితము. అహా! ఎట్టి మహత్తర ఫలితము! చిన్న చిన్న ప్రాపంచిక వస్తువులపై పెనగులాడుటకంటె మహోన్నతమైన ఈ జ్ఞేయవస్తువును పొందుటకై జీవుడేల కృషిసలుపరాదు.

'న సత్తన్నాసదుచ్యతే' - అది సత్తుకాదని చెప్పుదాని భావము దృశ్యవస్తువువలె గోచరము కాదనియే. అంతియేకాని అదిలేదని భావముకాదు.

**14. సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షి శిరోముఖమ్**
**సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి.**

**టీక:–** తత్ = అది (ఆ బ్రహ్మము, ఆత్మ), సర్వతః = అంతటను, పాణిపాదమ్ = చేతులు, కాళ్ళుగలదియు, సర్వతః = అంతటను, అక్షిశిరోముఖమ్ = కన్నులు, తలలు, ముఖములుగలదియు, సర్వతః = అంతటను, శ్రుతిమత్ = చెవులుగలదియు నయి, లోకే = ప్రపంచమునందు, సర్వమ్ = సమస్తమును, ఆవృత్య = ఆవరించి (వ్యాపించికొని), తిష్ఠతి = ఉన్నది.

**తా:–** అది (ఆ బ్రహ్మము, ఆత్మ) అంతటను చేతులు, కాళ్లు గలదియు, అంతటను కన్నులు, తలలు, ముఖములు గలదియు, అంతటను చెవులు గలదియు నయి ప్రపంచమునందు సమస్తమును ఆవరించి (వ్యాపించికొని) యున్నది.

**వ్యాఖ్య:–** ఆ పరబ్రహ్మను (పరమాత్మ) సర్వత్రనేత్రములు, చెవులు, ముఖములు గలిగియున్నదని చెప్పుటవలన, జీవులుచేయు పుణ్యపాపకార్యముల నన్నింటిని ఆతడు సదా గమనించుచునేయున్నాడని స్పష్టమగుచున్నది. ఈ సత్యమును తెలిసికొనినచో నిక పాపకృత్యముల నెవడు చేయగల్గును? మనస్సునందును ఆ పరమాత్మ వ్యాపించియుండుటవలన జీవుడుచేయు ప్రతిసంకల్పమున్ను ఆతని దృష్టియందు పడుచునే యుండునని భావము. ఇక్కారణమున ఏకార్యమైనను, ఏసంకల్పమైనను, అది యెంత రహస్యమైనది అయినప్పటికిని సర్వాంతర్యామియగు భగవంతునకు తెలియకపోదు. కాబట్టి జీవులు తమ యాచరణవిషయమై బహుజాగరూకులై పాపకార్యములను, పాపసంకల్పములను విడనాడి సన్మార్గమునే చేబట్టవలెను.

దేవుడెచటనున్నాడు? అను ప్రశ్నకు సర్వత్రవ్యాపించియున్నాడని యిచట సమాధానమొసంగబడెను.

'సర్వమావృత్యతిష్ఠతి' – సమస్తదృశ్యమును ఆవరించియున్నదని చెప్పుట వలన ఆత్మ దృశ్యముకంటె పరమై (అతీతమై) యున్నదని తేలుచున్నది. ఆవరించు వస్తువు ఆవరింపబడు వస్తువుకంటె అతీతమైయుండవలెనుగదా! దృగ్వస్తువగు ఆత్మ (బ్రహ్మము) దృశ్యమునంతను ఆవరించి తనయందుంచుకొనినది. తనగుప్పిటయందు పెట్టుకొనినది. కాబట్టి అల్పమగు దృశ్యము నాశ్రయింపక, మహత్తరమగు దృగ్వస్తువునే (పరమాత్మనే) ఆశ్రయింపవలయును.

**15. సర్వేన్ద్రియగుణాభాసం సర్వేన్ద్రియవివర్జితమ్**
**అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ.**

**16. బహిరన్తశ్చ భూతానామచరం చరమేవ చ**
**సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాన్తికే చ తత్.**

**17. అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్**
**భూతభర్తృ చ తజ్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ.**

**18. జ్యోతిషామపి తజ్జ్యోతిస్తమసః పరముచ్యతే**
**జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్★.**

**టీక:–** తత్ = ఆ బ్రహ్మము, సర్వేన్ద్రియగుణాభాసమ్ = సమస్తములైన ఇంద్రియముల యొక్క గుణములను ప్రకాశింపజేయునదియు, సర్వేన్ద్రియవివర్జితమ్ = సమస్తేంద్రియములులేనిదియు, అసక్తమ్ = దేనిని అంటనిదియు, సర్వభృత్ చ ఏవ = సమస్తమును భరించునదియు, నిర్గుణమ్ = (సత్త్వరజస్తమో) గుణరహితమైనదియు, గుణభోక్తృ చ = గుణముల ననుభవించునదియు, భూతానామ్ = ప్రాణులయొక్క, బహిః = వెలుపలను, అన్తః చ = లోపలను(స్థితమ్ = ఉండునదియు), అచరమ్ = కదలనిదియు, చరమ్ ఏవ చ = కదలునదికూడను, సూక్ష్మత్వాత్ = అతిసూక్ష్మమైయుండుటవలన, అవిజ్ఞేయమ్ = (అజ్ఞానులకు) తెలియబడనిదియు, తత్ = ఆ బ్రహ్మము, దూరస్థమ్ = దూరముగా నుండునదియు, అన్తికే చ = దగ్గఱగాకూడ (ఉండునదియు), భూతేషు = ప్రాణులందు, తత్ = ఆ బ్రహ్మము, అవిభక్తమ్ చ = విభజింపబడనిదియైనను, విభక్తం ఇవ చ = విభజింపబడిన దానివలె, స్థితమ్ = ఉన్నదియు, భూతభర్తృ చ = ప్రాణులను భరించునది (పోషించునది)యు, గ్రసిష్ణు = లయ మొనర్చునదియు, ప్రభవిష్ణు చ = సృష్టించునదియును (అని), జ్ఞేయమ్ = తెలిసికొన దగినది, (మఱియు) తత్ = ఆ బ్రహ్మము, జ్యోతిషామ్ అపి = ప్రాకాశించెడు వస్తువులగు సూర్యచంద్రాగ్న్యాదిపదార్థములకుగూడ, జ్యోతిః = ప్రకాశమునిచ్చునదియు, తమసః పరమ్ = తమస్సు (అజ్ఞానము) కంటె వేఱైనదియు (లేక అతీతమైనదియు), జ్ఞానమ్ = జ్ఞానస్వరూపమైనదియు, (చిన్మయరూపమును), జ్ఞేయమ్ = తెలియదగినదియు, జ్ఞానగమ్యమ్ = (అమానిత్వాది) జ్ఞానగుణములచే బొందదగినదియు, సర్వస్య = సమస్తప్రాణులయొక్క, హృది = హృదయమునందు, విష్ఠితమ్ = విశేషించియున్నదియు, (ఇతి = అని), ఉచ్యతే = చెప్పబడుచున్నది.

**తా:–** (జ్ఞేయస్వరూపమగు) ఆ బ్రహ్మము సమస్తములైన ఇంద్రియములయొక్క గుణములను ప్రకాశింపజేయునదియు, సమస్తేంద్రియములు లేనిదియు, దేనిని అంటనిదియు, సమస్తమును భరించునదియు, (సత్త్వరజస్తమో) గుణరహితమైనదియు, గుణముల ననుభవించునదియు, ప్రాణులయొక్క వెలుపలను, లోపలను ఉండునదియు, కదలనిదియు, కదలునదియును, అతిసూక్ష్మమై యుండుటవలన (అజ్ఞానులకు) తెలియబడనిదియు, దూరముగనుండునదియు, దగ్గరగాకూడ నుండునదియు, విభజింపబడనిదియైనను ప్రాణులందు విభజింపబడినదానివలె నున్నదియు, ప్రాణులను సృష్టించునదియు, పోషించునదియు, లయింపజేయునదియు అని తెలిసికొనదగినది. మఱియు అది ప్రకాశించెడు సూర్యచంద్రాగ్న్యాదిపదార్థములకుగూడ ప్రకాశమునిచ్చునదియు, తమస్సు (అజ్ఞానము) కంటె వేఱైనదియు (లేక అతీతమైనదియు), జ్ఞానస్వరూపమైనదియు (చిన్మయరూపమును), తెలియదగినదియు, (అమానిత్వాది) జ్ఞానగుణములచే బొందదగినదియు, సమస్తప్రాణులయొక్క హృదయమునందు విశేషించియున్నదియు నని చెప్పబడుచున్నది.

**వ్యాఖ్య:–** ఈ శ్లోకములందు జ్ఞేయమగు పరబ్రహ్మమెట్టిదో వివరముగ తెలుపబడినది. 'జ్ఞానగమ్యమ్' అని చెప్పుటవలన ఆ జ్ఞేయస్వరూపము పైన దెల్పిన జ్ఞానగుణములు గలిగియున్నప్పుడు

★ ధిష్ఠితమ్ – పాఠాంతరము

మాత్రమే లభ్యమగునని స్పష్టమగుచున్నది. కర్మ మార్గమునుగాని, భక్తిమార్గమునుగాని, ధ్యానమార్గమునుగాని దేనిననుసరించినప్పటికిని, తుద కందఱును ఈ జ్ఞేయస్వరూపమగు పరమాత్మనెఱింగియే ముక్తిని బడయవలసియుండును. కాబట్టి ముముక్షువు జ్ఞానగుణముల సముపార్జనతోబాటు ఈ జ్ఞేయస్వరూప మననముకూడ గావించుచుండవలెను.

వాసనాక్షయముతోబాటు తత్త్వజ్ఞానమున్ను గలిగియుండవలెనని అర్థము. సాధ్యవస్తువునుగూర్చిన పరిజ్ఞానము, సాధన రెండును ఉండవలెనని భావము. గీత యొక్క సారము, గీతయొక్క ధ్యేయము, లక్ష్యము ఈ జ్ఞేయ (పరబ్రహ్మ) తత్త్వమే కావున సాధకు లీ శ్లోకముయొక్క అర్థమును లెస్సగ భావించుచు తాముకూడ అట్టి పరబ్రహ్మస్వరూలేయని చింతించుచు తమచిత్తములను ఆ జ్ఞేయబ్రహ్మమునందు లీనమొనర్చి, బ్రహ్మస్వరూపులే అయి ప్రకాశించులాగున ప్రయత్నించవలెను. అదియే జీవితపరమావధి.

అసక్తమ్ = దృక్ స్వరూపమగు ఆత్మ దృశ్యమును ఏమాత్రము అంటకనున్నది.

'బహిరన్తశ్చభూతానామ్' - భగవంతు డెచటకలడు? అను ప్రశ్న కిచట సమాధాన మొసంగబడినది. సమస్తచరాచరప్రాణికోట్లయొక్క వెలుపల, లోపలగూడ పరమాత్మ యున్నారని యిచట స్పష్టీకరింపబడినది. కావున జనులు తాముజేయు పాపపుణ్యములను భగవానుడు అతిసమీపముగనేయుండి చూచుచున్నారని యెఱింగి పాపకార్యములను చేయరాదు.

'అచరం చరమేవ చ' - ఒకే వస్తువు కదలుచును, కదలకయు నెట్లుండ గలదు? స్వప్నములో మనుజుడు స్వప్నలోకదృష్ట్యా కదలుచున్నను వాస్తవముగ తన పడకపై కదలకనే పరుండియున్నాడుకదా! అట్లే స్వప్నతుల్యమగు ఈ జగత్తునందు ప్రాణికోట్లరూపమున కదలుచున్నను వాస్తవముగ బ్రహ్మరూపమున నిశ్చలముగనే పరమాత్మ వెలయుచున్నారు. లేక, ప్రాణికోట్లలో చరములగు మనుష్య పశుపక్ష్యాది రూపములతోను, అచరములగు శిలాపర్వతాదుల రూపముతోను వెలయుచున్నారనియు చెప్పవచ్చును.

'సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయమ్' - స్థూలాకాశము, చిత్తాకాశము, చిదాకాశము అని మూడు కలవు. ఇవి ఒకదానికంటె మఱియొకటి సూక్ష్మతరములైనవి. వీనిలో మూడవదియగు చిదాకాశమే జ్ఞేయమగు పరబ్రహ్మము. కావున అది అత్యంత సూక్ష్మమైనది. స్థూలదృష్టికి, ప్రాపంచకదృష్టికి, అజ్ఞానదృష్టికి, అది గోచరింపదు. జ్ఞాననేత్రముచేతనే అయ్యది తెలిసికొనబడగలదు.

'అన్తికే చ తత్' - పరమాత్మ జనులకు అతిసమీపమున నున్నారని యిట తెలుపబడినది. కావున దండించు అధికారి చెంతనేయున్నాడని భావించి పాపకృత్యములెవ్వియు చేయరాదు.

'అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్' - వాస్తవముగ పరమాత్మ ప్రాణికోట్లలో వేఱువేఱుగ లేరు. వారెన్నడును విభజింపబడి యుండలేదు. అవిద్యచేతనే అట్లు విభజింపబడియున్నట్లు గోచరించుచున్నారు. కనుకనే 'ఇవ' అను పదము ప్రయోగింపబడినది. కలశజలమందు, నదీజలమందు, సముద్రజలమందు సూర్యుడు వేఱ్వేఱుగా గనుపించినను బింబరూపమున వారు అవిభక్తముగనే యున్నారు కదా! అట్లే పరమాత్మయునని యెఱుంగవలెను. పుష్పమాలలో దారమువలె సమస్తభూతకోట్లయందు అవిభక్తులై వెలయుచున్న ఆ పరమాత్మ నెఱింగి జన్మసార్థకత నొందవలెను.

'భూతభర్తృ చ, గ్రసిష్ణు ప్రభవిష్ణుచ' - పుట్టించువారు, పోషించువారు, లయింపజేయువారు పరమాత్మయే. సృష్టిస్థితిలయకారకులు వారే. బ్రహ్మ, విష్ణు, శివరూపములు మూడును వారివే.

'తమసః పరముచ్యతే' - ఈ బ్రహ్మాండములన్నియు, మనస్సు, బుద్ధి మున్నగునవియు తమస్సునందు - అనగా మాయయందు, అవిద్యయందు గలవు. పరమాత్మ ఆ తమస్సునకు అవల నున్నారు. కావున మాయామాలిన్యము లెవ్వియు వారినంటవు. ముముక్షువు లీ ప్రకారముగ తమ యథార్థస్వరూప మట్టిదోషరహిత పరబ్రహ్మమే యని సతతము భావించుచు, మాయాదోషములను దరికిజేరనీయక చూడవలెను.

'జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యమ్' - మొదటిజ్ఞానమునకు శుద్ధచైతన్యమని అర్థము. రెండవజ్ఞానమునకు అమానిత్వాది గుణములని యర్థము. పరమాత్మకు జ్ఞేయమను నామధేయ మీ అధ్యాయమున నొసంగబడెను. అనగా 'తెలిసికొనదగినది' అని అర్థము. ప్రపంచములో ఇతరవస్తువులనెన్నిటిని తెలిసికొనినను, తెలిసికొనదగినదియగు బ్రహ్మమును తెలిసికొననిచో అవియన్నియు నిరుపయోగములే యగును. ఏలయనిన, ప్రపంచవస్తు జ్ఞానముచే జనులు జననమరణప్రవాహమును తప్పించుకొను శక్తిని బడయజాలరు.

భగవాను డెట్లు పొందబడునను ప్రశ్నకు 'జ్ఞానగమ్యమ్' అని సమాధానమొసంగబడినది. అమానిత్వాది జ్ఞానగుణములచే భగవంతుడు పొందబడునని యర్థము. కావున ఎవ్వరైనను సరియే భగవానుడు తెలిపిన ఈ అమానిత్వాది సద్గుణసంపత్తి కలిగియున్నచో ఆతడు జ్ఞేయమును తప్పక పొందియే తీరును.

'హృది సర్వస్య విష్ఠితమ్' అందఱి హృదయములలో భగవంతు డధివసించుచున్నారని చెప్పబడినది. సర్వస్య అని చెప్పుటవలన పిపీలికాది బ్రహ్మపర్యంతముగల ప్రాణికోట్ల హృదయమందును, స్థావరాదులందునుగూడ భగవానుడు వసించుచున్నారని అర్థము. కావున తన హృదయమందున్న పరమాత్మను బొందుటకు పాపికి, చండాలునకు కూడ హక్కుగలదు. ఆత్మ అందఱియొక్క జన్మహక్కు అయియున్నది. కావున జాతిమతవిచక్షణలేక సర్వులును నిరాటంకముగ వారిని పొందుటకు యత్నింపవచ్చును.

హృదయమందు నివసించుచున్నారని చెప్పుటవలన భగవంతుడు జనులశరీరమందే అతిసమీపమున వర్తించుచున్నారని నిశ్చయించి పాపకార్యము లెవ్వియు చేయక, భగవత్ప్రాప్తికై నిరంతరయత్నశీలురై యుండవలెను.

**ప్ర:-** 'జ్ఞేయ' మగు పరబ్రహ్మముయొక్క స్వరూపమును వర్ణింపుము?

**ఉ:-** (1) ఆ జ్ఞేయమగు పరబ్రహ్మము అంతటను చేతులు, కాళ్లు, కన్నులు, శిరస్సులు, ముఖములు, చెవులు గలదియు (2) అంతటను ఆవరించియున్నదియు (3) సమస్తేంద్రియముల గుణములను ప్రకాశింపజేయునదియు (4) సమస్తేంద్రియములు లేనిదియు (5) దేనిని అంటనిదియు (6) సమస్తమును భరించునదియు (7) సత్త్వరజస్తమోగుణరహితమైనదియు (8) గుణముల ననుభవించు నదియు (9) ప్రాణులయొక్క వెలుపలను, లోపలను ఉండునదియు (10) కదలనిదియు (11) కదులునదియు (12) అతిసూక్ష్మమైయుండుటవలన (అజ్ఞానులకు) తెలియబడనిదియు (13) దూరముగానుండునదియు (14) దగ్గఱగాకూడ నుండునదియు (15) విభజింపబడనిదియైనను ప్రాణుల యందు విభజింపబడినదానివలె నున్నదియు (16) ప్రాణులను సృష్టించునదియు, పోషించునదియు, లయింపజేయునదియు (17) సూర్యాది ప్రకాశకపదార్థములనుగూడ ప్రకాశింపజేయునదియు (18) తమస్సు (అజ్ఞానము) కంటె వేఱైనదియు (లేక అతీతమైనదియు) (19) చిన్మయరూపమును (20) తెలియదగినదియు

(21) (అమానిత్వాది) జ్ఞానగుణములచే పొందదగినదియు (22) సమస్తప్రాణులయొక్క హృదయమందు విశేషించియున్నదియు నని చెప్పబడుచున్నది.

**అ॥** ఇవ్విధముగ క్షేత్రక్షేత్రజ్ఞుల రెండిటినిగూర్చి తెలిపి, అట్టి విజ్ఞానమువలన కలుగు ఫలితమును వచించుచున్నాడు –

**19. ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః**
**మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే.**

**టీక:–** ఇతి = ఈ ప్రకారముగ, క్షేత్రమ్ = క్షేత్రము, తథా = అట్లే, జ్ఞానమ్ = జ్ఞానము, జ్ఞేయమ్ చ = జ్ఞేయముకూడ, సమాసతః = సంక్షేపముగ, ఉక్తమ్ = చెప్పబడెను, మద్భక్తః = నాభక్తుడు (నాయందు భక్తిగలవాడు), ఏతత్ = దీనిని, విజ్ఞాయ = తెలిసికొని, మద్భావాయ = నాస్వరూపమునుబొందుటకు (మోక్షమునొందుటకు), ఉపపద్యతే = తగినవాడగుచున్నాడు.

**తా:–** ఈ ప్రకారము క్షేత్రము, అట్లే జ్ఞానము, జ్ఞేయముకూడ సంక్షేపముగ చెప్పబడినవి. నా భక్తుడు (నాయందు భక్తిగలవాడు) వీనినెఱింగి నాస్వరూపమును (మోక్షమును, భగవదైక్యమును) బొందుట కర్హుడగుచున్నాడు.

**వ్యాఖ్య:–** 'మద్భక్త ఏతద్విజ్ఞాయ' – నాభక్తుడు దీనిని తెలిసికొని అనిచెప్పుట వలన భక్తుడు కానివాడు ఆ జ్ఞానాదుల నెఱుంగజాలడనియు, పైనదెల్పిన జ్ఞానజ్ఞేయాదుల నెఱుంగుటకు పూర్వము ప్రతివారున్ను భక్తుడు కావలసియున్నదనియు స్పష్టమగుచున్నది. భక్తియను పుష్పమునుండి జ్ఞానమనుఫల మావిర్భవించును. కావున ప్రప్రథమమున సర్వేశ్వరునిపై, సద్గురువులపై అచంచలభక్తి కలిగియుండి జపతపపూజసంకీర్తనాదులచే వారిని ఆరాధించువారికి వారు కరుణించి జ్ఞాన, జ్ఞేయముల నెఱుంగగల 'బుద్ధియోగము' నొసంగగలరు. తద్ద్వారా ఆ భక్తులు జ్ఞానులై భగవత్సాయుజ్యమునకు ('మద్భావాయ') తగినవారగుచున్నారు. అట్లుకాక భగవద్భక్తిలేనిచో వారెంతటి గొప్పపండితులైనప్పటికిని, భౌతికవిజ్ఞాన కుశలత్వము గలిగియున్నప్పటికిని ఈశ్వరీయ విజ్ఞానము, జ్ఞేయతత్త్వానుభవము వారికి కలుగజాలదని ఈశ్లోకముద్వారా వెల్లడియగుచున్నది. మఱియు జనులు సామాన్యభక్తితో తృప్తిపడక, సాధనాతిశయముచే క్రమముగ జ్ఞాన, జ్ఞేయములను గూడ నెఱిగి మోక్షార్హులు కావలసియున్నారనియు విదితమగుచున్నది.

మోక్షమును ఎవరు పొందగలరను ప్రశ్నకు భగవంతు డిచట సూటియైన సమాధానము నొసంగెను. ఈ జ్ఞానజ్ఞేయాది తత్త్వమును బాగుగ తెలిసికొనినవారే మోక్షార్హులని ఇచట వచింపబడినది. ఆ జ్ఞానాదులో భగవద్భక్తికలవారికే అబ్బుననియు తెలుపబడినది.

**ప్ర:–** భగవత్సాయుజ్యమును (మోక్షమును) ఎవడు బొందగల్గును?

**ఉ:–** జ్ఞానస్వరూపమును, జ్ఞేయస్వరూపమును బాగుగ తెలిసికొనినవాడు.

**ప్ర:–** జ్ఞాన జ్ఞేయములను ఎవడు తెలిసికొనగల్గును?

**ఉ:–** భగవద్భక్తికలవాడు మాత్రమే.

**అ॥** ఇంతదనుక జ్ఞానజ్ఞేయములను గూర్చి తెలిపి ఇక ప్రకృతి, పురుషులను వర్ణించుచున్నాడు –

## 20. ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి
## వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతి సంభవాన్.

**టీక:–** ప్రకృతిమ్ = ప్రకృతిని, పురుషమ్ చ ఏవ = పురుషుని, ఉభౌఅపి = రెండిటిని, అనాదీ = ఆదిలేనివని, విద్ధి = తెలిసికొనుము, వికారాన్ చ = (మనోబుద్ధీంద్రియాదుల) వికారములను, గుణాన్ చ ఏవ = (సత్త్వరజస్తమో) గుణములను, ప్రకృతిసంభవాన్ = ప్రకృతివలన గలిగినవిగా నెఱుంగుము.

**వ్యాఖ్య:–** మాయ, ఈ సంసారము, బంధము - ఎప్పుడు మొదలుపెట్టినది అని చాలామంది ప్రశ్నించుచుందురు. రాత్రి నిద్రించినపిదప స్వప్నములో ఈ స్వప్నమెపుడు మొదలుపెట్టినది? అను ప్రశ్నకు ఫలానసమయమని ఎవరు ఎట్లు జవాబు చెప్పలేరో, అట్లే ఈ జాగ్రత్ప్రపంచమును గూర్చియు నెఱుంగవలెను. కనుకనే ఈ మాయను, ప్రకృతిని అనాది యని పేర్కొనిరి. అనాదియని పేర్కొనిరేకాని అనంతమని చెప్పలేదు. ఏలయనగా ఏక్షణమున మనుజునకు జ్ఞానోదయమగునో ఆ క్షణముననే 'మాయ' 'ప్రకృతి' 'బంధము' అంతమైపోవును. కాబట్టి ప్రకృతి, బంధము అనాదియని యెవరును భయపడనవసరములేదు. జ్ఞానప్రాప్తికై యత్నించినచాలును. స్వప్నలోకములో స్వప్నము అనాదిగా కన్పించినను, మేలుకొనినచో అంతమైపోవునుగదా. ప్రకృతి అనాది, సాంతము అనియు; పురుషుడు అనాది, అనంతుడు అనియు నెఱుంగవలెను.

'వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధిప్రకృతిసంభవాన్' - ప్రకృతి పురుషుల యిరువురిలో పురుషుడు (ఆత్మ) నిత్యశుద్ధుడు. వారిలో ఏవికారమున్ను ఉండజాలదు. కామ క్రోధసుఖదుఃఖమోహాది వికారములన్నియు ప్రకృతినుండియే జనించినవై యున్నవి. కావున జీవునకు ఈ **కామక్రోధాది** వికారములున్నంతవఱకు తానింకను ప్రకృతియందున్నవాడేయనియు, బంధయుతుడేయనియు, పురుషుడగు నిర్వికారపరమాత్మను చేరలేదనియు నెఱుంగవలెను. జీవుడెపుడు ప్రయత్నపూర్వకముగ ఆ వికారములను పారద్రోలి చిత్తమును వాసనాశూన్యముగ గావించుకొనునో అపుడు మాత్రమే బంధవిముక్తిని బడసి, పురుషుడగు భగవంతునియందు వసింపగలడు. మఱియు ఏవైన దుఃఖములు, మనోవికారములు కలిగినపుడు 'ఇవి ప్రకృతికి జెందినవేకాని నాకుగాదు. ఇవి నాస్వరూపములుకావు. నేను వీనికి సాక్షిని, నిర్వికారుడను' అని దృఢముగ భావించుకొని దుఃఖరహితుడై మేరువుపగిది స్థిరచిత్తముగలిగి ఆయా వికారములను తొలగద్రోసికొనవలెను.

**అ॥** ప్రకృతి పురుషులను గుఱించి ఇంకను వివరముగ తెలుపుచున్నాడు -

## 21. కార్యకారణకర్తృత్వే★ హేతుః ప్రకృతిరుచ్యతే
## పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే.

**టీక:–** కార్యకారణకర్తృత్వే = కార్యకారణములను గలుగజేయుటయందు, ప్రకృతిః = ప్రకృతి (మాయ), హేతుః = హేతువని, ఉచ్యతే = చెప్పబడుచున్నది, సుఖదుఃఖానాం = సుఖదుఃఖ**ములయొక్క**, భోక్తృత్వే = అనుభవించుటయందు, పురుషః = .పురుషుడు., హేతుః = హేతువని, **ఉచ్యతే** = చెప్పబడుచున్నాడు.

★ కార్యకరణకర్తృత్వే - పాఠాంతరము

**తా:–** కార్యకారణములను గలుగజేయుటయందు ప్రకృతి హేతువనియు, సుఖదుఃఖముల ననుభవించుటయందు పురుషుడే హేతువనియు చెప్పబడుచున్నది.

**వ్యాఖ్య:–** కార్యమనగా శరీరము. కారణమనగా ఇంద్రియ మనోబుద్ధ్యహంకారములు, పంచభూతములు, శబ్దాదివిషయములు - వీనియన్నింటిని గలుగజేయునది (హేతువు) ప్రకృతి. ప్రకృతి జడమైనది. కావున సుఖదుఃఖముల ననుభవింపలేదు. పురుషుడు చిద్రూపుడు, అసంగుడు. కావున ఆతనికి సుఖదుఃఖభోక్తృత్వముండజాలదు. అయినను ప్రకృతియొక్క సంయోగముచే ఆ యా సుఖదుఃఖాదులను పురుషు డనుభవించునట్లు తోచుచున్నాడు. అంతియేకాని వాస్తవముగ నతనికి కర్తృత్వభోక్తృత్వాదు లెవ్వియునులేవు.

**అ॥** ప్రకృతియొక్క గుణములతోటి కలయికయే జీవుని జన్మకు హేతువని వచించుచున్నాడు -

## 22. పురుషః ప్రకృతిస్థో హి భుఙ్క్తే ప్రకృతిజాన్ గుణాన్
## కారణం గుణసఙ్గోఽస్య సదసద్యోనిజన్మసు.

**టీక:–** ప్రకృతిస్థః = ప్రకృతియందున్నవాడై, పురుషః = పురుషుడు (జీవుడు), ప్రకృతిజాన్ = ప్రకృతివలనబుట్టిన, గుణాన్ = (సుఖదుఃఖాది) గుణములను, భుఙ్క్తేహి = అనుభవించుచున్నాడు కదా!, గుణసఙ్గః = (ఆయా) గుణములతోటికూడికయే, అస్య = ఈ జీవునకు, సదసద్యోనిజన్మసు = మంచిచెడ్డజన్మములెత్తుటయందు, కారణమ్ = కారణము (అయియున్నది).

**తా:–** ప్రకృతియందున్నవాడై పురుషుడు (జీవుడు) ప్రకృతివలన బుట్టిన (సుఖదుఃఖాది) గుణములను అనుభవించుచున్నాడు. ఆ యా గుణములతోడి కూడికయే ఈ జీవునకు ఉత్తమ నికృష్టజన్మములెత్తుటయందు హేతువైయున్నది.

**వ్యాఖ్య:–** జీవుడు ఈ సంసారబంధమున తగుల్కొనుటకును, ఉత్తమాధమజన్మలను బొందుటకును కారణమేమియో ఈ శ్లోకమున తెలుపబడినది. ప్రకృతియొక్క (సత్త్వరజస్తమో) గుణములతోటి, ఆ యా గుణములవలనబుట్టిన ప్రాపంచిక పదార్థములతోటి సంయోగమే జీవునకు బంధహేతువగుచున్నది. పురుషుడు వాస్తవముగ నిర్వికారుడై, జన్మవర్జితుడై, దృగ్రూపుడై యున్నను దృశ్యమగు దేహేంద్రియాదులందు, ప్రాపంచిక పదార్థములందు అహంకార, మమకారములుగలిగి అట్టి దృశ్యోపాధితోను, దానిగుణములతోను సంయోగము గలిగియుండుటవలన వికారవంతుడై, జనన మరణములనొందుచు సంసారిత్వమును బడయుచున్నాడు. కాబట్టి విచారశీలుడు జన్మాది దుఃఖములకు కారణ మీగుణసంగమేయని యెఱింగి తన ఉపాధితోను, ఆ ఉపాధిగుణములతోను, సంగము, ఆసక్తి, మమకారము, అహంకారము లేనివాడై, అసంగ నిర్గుణ చిద్రూపమే తానని భావించుచు, తద్రూపుడై వెలయుచున్నచో, ఇక జన్మాదిదుఃఖము లెచ్చట? దుఃఖభూయిష్టమగు ఈ జననమరణప్రవాహమునుండి తప్పించుకొనుటకు ఉపాయ మిదియొకటియే అయియున్నది. సంసక్తియే బంధము, అసంసక్తియే ముక్తి. ఒకపెద్ద 'ఫ్యాక్టరీలో' అనేకచక్రములు, యంత్రములు పనిచేయుచున్నను, మూలస్థానమునగల పెద్దచక్రము (Flywheel) నకు తగిలించియుండు బెల్టు తెగిపోయినచో వేలకొలది యంత్రములన్నియు ఒక్కుమ్మడి ఆగిపోవునుగదా! అట్లే ఈ జననమరణాదిరూప సంసారయంత్రాంగమంతయు, జీవుడు గుణములతోటి,

ఉపాధితోటి, ప్రకృతితోటి సంగమును త్యజించినచో, ఆ క్షణమే నిలిచిపోవ జీవునకు మోక్షము కరతలామలకమగును.

**ప్ర:–** జీవుడు ఉత్తమ, నీచజన్మలను బొందుటకు కారణమేమి?

**ఉ:–** గుణములతోడ, ప్రకృతితోడ, ఆతని కలయికయే అట్టి జన్మాదిదుఃఖములకు కారణము.

**ప్ర:–** కాబట్టి జన్మరాహిత్యమునకు ఉపాయమేమి?

**ఉ:–** వివేకముద్వారా ప్రకృతితోను, గుణములతోను, ఉపాధితోను, దృశ్యవిషయములతోను, సంగమును (సంసక్తిని) త్యజించుటయే.

**అ॥** ఈ దేహమందలి పురుషుడు (జీవుడు) సాక్షాత్ పరమాత్మయే యని వచించుచున్నాడు -

**23. ఉపద్రష్టానుమన్తా చ భర్తా భోక్తా మహేశ్వరః**
**పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః.**

**టీక:–** పురుషః = పురుషుడు (ఆత్మ), అస్మిన్దేహే *(సతి)* అపి = ఈ శరీరమునందున్నప్పటికిని, పరః = శరీరముకంటె వేఱైనవాడును, ఉపద్రష్టా = సాక్షిగనుండువాడును, అనుమన్తాచ = అనుమతించువాడును, భర్తా = భరించువాడును, భోక్తా = అనుభవించువాడును, మహేశ్వరః = పరమేశ్వరుడును (గొప్ప ప్రభువు, నియామకుడును), పరమాత్మా ఇతి చ = పరమాత్మయుఅని, ఉక్తః= చెప్పబడెను.

**తా:–** పురుషుడు (ఆత్మ) ఈ శరీరమందున్నప్పటికిని శరీరముకంటె వేఱైనవాడును, సాక్షిభూతుడును, అనుమతించువాడును, భరించువాడును, అనుభవించువాడును, పరమేశ్వరుడును (గొప్ప ప్రభువు, నియామకుడును), పరమాత్మయు అని చెప్పబడుచున్నాడు.

**వ్యాఖ్య:–** 'ఉపద్రష్టా' - యజ్ఞమునందు 'ఉపద్రష్ట' అనువాడు సాక్షిమాత్రుడుగనుండును. అట్లే ఆత్మ శరీరమందున్నను 'పరః' - శరీరముకంటె వేఱుగ, పరముగనున్నవాడై దేహేంద్రియాదులకు సాక్షిగ వెలయుచున్నాడు. కావున జీవుడు తాను వాస్తవముగ అట్టి పరమాత్మస్వరూపుడే యనియు దేహేంద్రియాదులుకాదనియు లెస్సగ భావనచేయవలెను.

'మహేశ్వరః, పరమాత్మా, దేహేఽస్మిన్' - అని చెప్పబడినందువలన జగన్నాథుడైన పరమేశ్వరుడు, పరమాత్మ ఈ దేహమందే వర్తించుచున్నాడని స్పష్టమగుచున్నది. ఈ ప్రకారముగ భగవానుడు జీవునకు అతిసమీపమున నుండుటవలన **ప్రయత్నముచే** సులభముగ పొందగలడు. వారికై దూర దూరములందు ప్రయాసపడి వెతుకనక్కఱ లేదు. మఱియు శిక్షించువాడు, శాసించువాడు, (ఈశ్వరుడు) చెంతనేయుండుట వలన పాపులివ్విషయమును గమనించి పాపకృత్యము లెవ్వియు చేయకనుండవలెను.

'పరః' - అని చెప్పుటవలన ఆత్మ దేహముతో, ఉపాధితో, సంబంధములేక దానికి పరముగా వేఱుగ, అతీతముగ నున్నదని తెలియుచున్నది. 'పరఃపురుషః' - అను పదములకు పరమపురుషుడు, పరమాత్మ అనియు అర్థము చెప్పవచ్చును.

**ప్ర:–** పరమాత్మ యెట్టివాడు?

**ఉ:–** (1) శరీరమందున్నను, శరీరముకంటె వేఱుగనున్నవాడును, (2) సాక్షిభూతుడును, (3) అనుమతించువాడును, (4) భరించువాడును, (5) అనుభవించువాడును, (6) గొప్పనియామకుడును, (పరమేశ్వరుడును) అయియున్నాడు.

**అ॥** ఈ ప్రకారముగ ప్రకృతిపురుషులనుగూర్చి యెఱుంగుటవలన గలుగు ఫలితమును వచించుచున్నాడు –

## 24. య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైః సహ
## సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే.

**టీక:–** యః = ఎవడు, ఏవమ్ = ఈ ప్రకారముగ, పురుషమ్ = పురుషుని, గుణైఃసహ = గుణములతోగూడిన (త్రిగుణాత్మకమైన), ప్రకృతిమ్ చ = ప్రకృతిని, వేత్తి = తెలిసికొనుచున్నాడో, సః = అతడు, సర్వథావర్తమానః అపి = ఎట్లున్నప్పటికిని, భూయః = మఱల, న అభిజాయతే = పుట్టడు.

**తా:–** ఎవడీ ప్రకారముగ పురుషుని (ఆత్మను), గుణములతో గూడిన ప్రకృతిని తెలిసికొనుచున్నాడో, ఆతడేవిధముగ నున్నప్పటికిని మఱల జన్మింపడు.

**వ్యాఖ్య:–** మఱల జన్మనుబొందకుండుటకు అనగా మోక్షప్రాప్తికి ఉపాయమేమియో ఇచట సెలవిచ్చుచున్నారు. పురుషుడు (ఆత్మ) యెట్టివాడు? ప్రకృతి యెట్టిది? అను నీప్రకారముగ ఆత్మానాత్మవిచారణాసమర్థుడైయుండు మనుజుడు, దృక్, దృశ్యములను బాగుగ వివేచించి చూడగలడు. కాబట్టి అట్టి విచారణాశీలుడు త్రిగుణాత్మకమై, బంధజనకమై, దుఃఖప్రదమైనట్టి ప్రకృతిని ఆశ్రయింపక గుణరహితమై, బంధచ్ఛిదమై, పరమానందరూపమైనట్టి పురుషునే (ఆత్మనే) ఆశ్రయించును. కావున ఆతడిక జన్మింపడు, ముక్తుడేయగును. ఏలయనగా ప్రకృతి, పురుషుల జ్ఞానముకలవాడు, అనాత్మను, అనగా దృశ్యమును, ప్రకృతిని తనకంటె (పురుషునికంటె) వేఱుగజూచుచు అద్దానితో సంగము (కలయిక) లేకుండును. కనుకనే అట్టివాడు ముక్తుడై మఱల జన్మింపడని వచింపబడినది.

'సర్వథా వర్తమానోఽపి' – అట్టివాడు ఎట్లున్నప్పటికిని – అని చెప్పుటచే సమాధినిష్ఠుడైయున్నను, లేక లోకమున (ప్రజోపకార) కార్యములను జేయుచున్నను, బ్రహ్మచర్యాదిరూపమగు ఏ ఆశ్రమమందున్నను, మఱల జన్మింపడని భావము. అతడెట్లువర్తించినను సర్వథాముక్తుడేయగును. అయితే 'ఎట్లు వర్తించినను' అనుదానికి అర్థము 'నిషిద్ధాచరణ గలిగియుండినప్పటికిని' అని యెవరును భావింపరాదు. ఏలయనిన నిషిద్ధాచరణగలవాడు ఆత్మానాత్మవివేకి యెన్నటికిని కానేరడు. మఱియు వివేకియగువాడు నిషిద్ధకృత్యముల నెన్నటికిని చేయనూ చేయడు. కావున ఇట్టి వాక్యముల యర్థమును గ్రహించుటయందు బహుజాగరూకుడై యుండవలెను.

**ప్ర:–** ప్రకృతి, పురుషులనుగూర్చిన జ్ఞానము గలిగియున్నచో ఫలితమేమి?

**ఉ:–** అట్టి జ్ఞానము కలవాడు ఏ ప్రకారము వర్తించినను జన్మరాహిత్యమును బొందును. అతడు మఱల జన్మింపడు.

**అ||** వారివారి సంస్కారముల ననుసరించి జనులు పెక్కుమార్గములద్వారా పరమాత్మను సాక్షాత్కరించుకొని ముక్తులగుచున్నారని రెండు శ్లోకములలో తెలియజేయుచున్నాడు -

**25. ధ్యానేనాత్మని పశ్యన్తి కేచిదాత్మానమాత్మనా**
**అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే.**

**టీక:–** ఆత్మానమ్ = ఆత్మను, (ప్రత్యగాత్మను, లేక పరమాత్మను), కేచిత్ = కొందఱు, ఆత్మనా = శుద్ధమగుమనస్సుచేత, ధ్యానేన = ధ్యానయోగము ద్వారా, ఆత్మని = తనయందు, పశ్యన్తి = చూచుచున్నారు (సాక్షాత్కరించుకొనుచున్నారు), అన్యే = మఱికొందఱు, సాంఖ్యేన యోగేన = సాంఖ్యయోగముచేతను, అపరే = ఇంకకొందఱు, కర్మయోగేన చ = కర్మయోగముచేతను, (పశ్యన్తి = చూచుచున్నారు).

**తా:–** ఆత్మను (ప్రత్యగాత్మను లేక పరమాత్మను) కొందఱు శుద్ధమగు మనస్సుచే ధ్యానయోగముద్వారా తనయందు గాంచుచున్నారు (సాక్షాత్కరించుకొనుచున్నారు). అట్లే మఱికొందఱు సాంఖ్యయోగముచేతను, ఇంక కొందఱు కర్మయోగము చేతను చూచుచున్నారు. (అనుభూత మొనర్చుకొనుచున్నారు).

**వ్యాఖ్య:–** జనులు వారివారి యంతఃకరణము ననుసరించి భిన్నభిన్న సంస్కారములు గలిగియుందురు. అట్టి సంస్కారముల కనుగుణ్యముగనే వారు భగవంతుని గూర్చి ప్రయత్నించుదురు. కొందఱు ధ్యానమందు, కొందఱు భక్తియందు, కొందఱు జ్ఞానమందు, కొందఱు కర్మయందు ఇష్టము గలిగియుందురు. ఏ మార్గము ననుసరించినను శుద్ధచిత్తముతోగూడి ప్రయత్నించినయెడల భగవానుని సాక్షాత్కరింపగలరని యిట వచింపబడినది. అన్నియు ఒకే లక్ష్యమును పొందింపజేయుటవలన అన్నిమార్గములును సమానములే యగును. వారివారి మనస్తత్త్వము ననుసరించి ఆ యా మార్గములననుసరించుటకు సర్వులు స్వతంత్రులై యున్నారనియు ఈ శ్లోకముద్వారా మఱియు రాబోవు శ్లోకములద్వారా స్పష్టము చేయబడినది.

ఇచట ధ్యానయోగము, సాంఖ్యయోగము (జ్ఞానయోగము), కర్మయోగము అను మూడు యోగములు చెప్పబడినవి. భక్తియోగము ధ్యానయోగమం దంతర్భూతమై యుండుటచే నిట ప్రత్యేకముగ చెప్పలేదు.

'పశ్యన్తి' - చూచుచున్నారు అని చెప్పుటవలన, భగవంతుడు ఒక పరోక్షవస్తువుకాదని ప్రత్యక్షముగ జనులాతనిని గాంచగలరనియు, అనుభూత మొనర్చుకొనగలరనియు విదితమగుచున్నది. కావున ఇక దైవప్రాప్తివిషయమై జనులు సందేహింపనవసరములేదు. మఱియు దేవుడున్నాడా లేడా యను సంశయమునకును ఇక తావు లేదు. ఏలయనిన 'నీవు దేవుని చూడగలవు; మహాత్ములు ధ్యానాదులచే ఆ ప్రకారము చూచుచున్నారు' అని శ్రీకృష్ణమూర్తి అసందిగ్ధముగ చెప్పివైచిరి.

'ఆత్మని' - 'తనయందే' అని పేర్కొనుటవలన పరమాత్మ యెచటనోకాదు, తనయందే పొందబడుచున్నాడని వ్యక్తమగుచున్నది. దీనిచే భగవంతుని అతిసమీపత్వము వెల్లడియగుచున్నది. తన హృదయమందే పరమాత్మకలడని చెప్పుటచే ఆతనికై యితరత్ర వెతకుయత్నములను క్రమముగ తగ్గించుకొని మనుజుడు హృదయసంశోధనమునకై గడంగవలసియుండును. మఱియు 'ఆత్మనా' అని వచించుటచే ఏ

మార్గము ననుసరించినను శుద్ధచిత్తమొకటియే తనయందున్న ఆత్మరూపమును పొందుటకై ఏకైక సాధనమని గ్రహించవలెను. అదియొకటియే మోక్షద్వారమును తెరచుటకు తాళపుచెవియై యున్నది. కావున మోక్షసాధనము వారివారి చేతులలోనే యున్నది. తమ మనస్సును తాము శుద్ధముచేసికొని, సంస్కరించుకొని పరమాత్మవైపునకు అగ్రసరులగుటయే ముక్తిసాధనము.

సామాన్యముగ కొందఱు కర్మయోగమును తక్కువగను, జ్ఞానయోగమును అధికముగను చెప్పుకొనుచుందురు. కాని భగవాను డిచట కర్మయోగమునకు జ్ఞానధ్యానయోగములతో సరిసమానస్థాయి నొసంగి గౌరవించిరి. ఏలయనిన నిష్కామకర్మయోగము చిత్తశుద్ధిద్వారా జ్ఞానావిర్భావమునకు హేతుభూతమై జ్ఞానయోగఫలమగు భగవత్సాక్షాత్కారమును కలుగజేయుచున్నది.

**ప్ర:–** జనులు పరమాత్మను ఎచట సాక్షాత్కరించుకొనగలరు?

**ఉ:–** తమ హృదయమందే.

**ప్ర:–** దేనిద్వారా?

**ఉ:–** శుద్ధమనస్సుద్వారా.

**ప్ర:–** ఏ ప్రకారముగ?

**ఉ:–** కొందఱు ధ్యానయోగముననుసరించి, కొందఱు సాంఖ్యయోగము (జ్ఞానయోగము) ననుసరించి, మఱికొందఱు కర్మయోగము ననుసరించి - పరమాత్మను సాక్షాత్కరించుకొందురు.

**26. అన్యే త్వేవ మజానన్తః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే**
**తేఽపి చాతితరన్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః.**

**టీక:–** అన్యేతు = మఱికొందఱైతే, ఏవమ్ = ఈ ప్రకారముగ, (ధ్యాన, సాంఖ్య, కర్మయోగముల వలన), అజానన్తః = తెలిసికొనజాలనివారలై, అన్యేభ్యః = ఇతరులవలన, శ్రుత్వా = (ఆ పరమాత్మనుగూర్చి) విని (ఉపదేశింపబడి), ఉపాసతే = ఉపాసించుచున్నారు (అనుష్ఠించుచున్నారు), శ్రుతిపరాయణాః = శ్రవణమునందు ఆసక్తి, నిష్ఠగలవారగు, తేఅపిచ = వారుకూడ, మృత్యుమ్ = మరణమును(మరణరూపమగు ఈసంసారబంధమును), అతితరన్తిఏవ = తప్పకదాటుదురు.

**తా:–** మఱికొందఱైతే ఈ ప్రకారముగ (ధ్యాన సాంఖ్య కర్మయోగములవలన) తెలిసికొనజాలనివారై, ఇతరులవలన (ఆ పరమాత్మనుగూర్చి) విని ఉపాసించుచున్నారు. (అనుష్ఠించుచున్నారు). శ్రవణతత్పరులగు వారున్ను మృత్యువును (మృత్యురూపమగు ఈ సంసారమును) తప్పక దాటుదురు.

**వ్యాఖ్య:–** ధ్యానజ్ఞానాది యోగములను గూర్చిన తత్త్వమును తెలిసికొనజాలనివారు శ్రద్ధతో గూడుకొని అనుభవజ్ఞులగు ఇతరులవలన విని తద్రీతి యనుష్ఠించినచో వారున్ను పైవారివలె మృత్యురూపసంసారమును దాటివేయగలరని ఇట చెప్పబడినది. 'అజానన్తః' అని చెప్పుటచే యోగపరిజ్ఞానము, విద్య, పాండిత్యము లేకున్నను శ్రద్ధ, భక్తి, అనుష్ఠానములచే సంసారసముద్రమును దాటివేయవచ్చునని స్పష్టమగుచున్నది. వైద్యశాస్త్రపరిజ్ఞానము లేకున్నను వైద్యుడిచ్చిన మందును

శ్రద్ధావిశ్వాసములతో సేవించినచో రోగము నెమ్మదించునుగదా! వైద్యుడైనను తనకు రోగము వచ్చినచో ఆ ప్రకారము సేవించిననే రోగముపశమించును. కాబట్టి ఎవరికైనను అనుష్ఠానము ముఖ్యము. కనుకనే 'ఉపాసతే' అను పదముకూడ చేర్చబడెను. కేవలము విద్య, కేవలము శ్రవణముకూడచాలదు. ఆ రెండింటిలో అనుష్ఠానము కూడ చేరవలెను. అయితే తత్త్వపరిజ్ఞానము, విద్య లేకుండుటకంటె వానిని కలిగియుండుటయే శ్రేష్ఠము. ఒకవేళ ఏ కారణముచేతనైన అట్టివిద్య కలిగియుండని పక్షమున, ఇతరుల వలన దైవధర్మములను, పరమార్థసత్యములను వినియైనను అనుష్ఠించి తరించవచ్చుననియే యిట తెలుపబడినదని గ్రహించవలెను. కాబట్టి శాస్త్రపరిజ్ఞానము, విద్య ఏకారణముచేనైన సముపార్జించకనున్నవారు, చదువురానివారు దిగులుపడి కూర్చొనక మహనీయులవలన ఆధ్యాత్మిక రహస్యములను శ్రవణముచేసి వానిని చక్కగ ఆచరణయం దుంచుకొని తరించవచ్చును. తక్కినవారివలె వీరున్ను సంసారదుఃఖమును దాటివేయగలరు. 'అతితరన్త్యేవ' అని చెప్పుటవలన తప్పక దాటగలరని స్పష్టపఱుపబడినది.

'మృత్యుమ్' - 'సంసారబంధమును' దాటుదురు అని చెప్పక 'మృత్యువును' దాటుదురు అని ఇట చెప్పబడినది. దీనినిబట్టి ఈ సంసారస్థితి కేవలము మృత్యురూపమై, మృత్యుమయమైయున్నదని ద్యోతకమగుచున్నది. 'మృత్యువును, సంసారస్థితిని' భగవానుడు ఏకార్థవాచకములు (Synonyms) గ వాడెను. ఈ విషయమును సాధకులు **గుర్తెఱింగి** మృత్యురూపములేయగు ప్రాపంచిక (సాంసారిక) సుఖములను జూచి మురిసిపోక మరణరహిత పరమాత్మతో నైక్యమగుటకే యత్నించవలెను.

**ప్ర:-** శాస్త్రపరిజ్ఞానము లేనివారుగాని, ధ్యానాదియోగములను దెలియనివారుగాని యెట్లు తరించగలరు?

**ఉ:-** ఇతరులవలన తత్త్వమును శ్రవణముచేసి, చక్కగ అనుష్ఠించి తరించగలరు.

**ప్ర:-** ఈ సంసారస్థితి యెట్టిది?

**ఉ:-** మృత్యురూపమైయున్నది.

**ప్ర:-** మృత్యువును మనుజు డెట్లు దాటగలడు?

**ఉ:-** దైవతత్త్వమును పెద్దలవలన విని ఆ ప్రకార మాచరించినచో దాటివేయగలడు.

**అ॥** సమస్త పదార్థములున్ను క్షేత్రక్షేత్రజ్ఞుల సంయోగమువలననే కలుగుచున్నవని చెప్పుచున్నాడు -

## 27. యావత్సంజాయతే కించిత్సత్త్వం స్థావరజఙ్గమమ్
## క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్తద్విద్ధి భరతర్షభ.

**టీక:-** భరతర్షభ = భరతవంశశ్రేష్ఠుడవగు ఓ అర్జునా!, స్థావరజఙ్గమమ్ = చరాచరాత్మకమైన, సత్త్వమ్ = వస్తువు, యావత్ కించిత్ = ఏదేది, సంజాయతే = పుట్టుచున్నదో, తత్ = అది, క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్ = క్షేత్రక్షేత్రజ్ఞుల కూడికచేత, విద్ధి = (కలుగునవి) ఎఱుంగుము.

**తా:-** భరతవంశశ్రేష్ఠుడవగు ఓ అర్జునా! ఈ ప్రపంచమున స్థావర జంగమాత్మకమగు పదార్థ మేది పుట్టుచున్నదో, అదియదియంతయు క్షేత్రక్షేత్రజ్ఞులకూడిక వలననే కలుగుచున్నదని యెఱుంగుము.

**వ్యాఖ్య:—** ప్రపంచమున ఏవస్తువుకూడ, వ్యక్తికూడ క్షేత్రజ్ఞుడగు పరమాత్మయొక్క సంయోగములేనిదే ఉద్భవించదని తెలుపబడుటవలన చరాచరములగు సమస్తప్రాణికోట్లయందును భగవానుని అస్తిత్వమును కలదని నిశ్చయించి సర్వభూతదయ గలిగి వర్తించవలెను. భగవంతుడు రాతియందున్నాడా? అను ప్రశ్నకు భగవానుని సంయోగములేనిచో అసలు రాయియే ఉద్భవించదని గీత చెప్పుచున్నది. స్థావరమగు రాతి విషయమే ఇట్లుండ నిక జంగమమగు మనుష్యాది ప్రాణికోటి విషయమై వేఱుగ చెప్పవలెనా! కాబట్టి చెట్టుయందు, పుట్టయందు, రాతియందు, చీమయందు, పక్షియందు, మృగమునందు, మనుష్యునియందు, చండాలునియందు, బ్రాహ్మణునియందు రాక్షసునియందు, దేవతయందు పరమాత్మ నివసించుచున్నారను విశ్వాసము కలిగియుండవలెను.

**ప్ర:—** ఈ స్థావర జంగమ పదార్థములన్నియు నెట్లావిర్భవించుచున్నవి?

**ఉ:—** క్షేత్రముయొక్కయు, క్షేత్రజ్ఞునియొక్కయు సంయోగము (కూడిక) వలన ఆవిర్భవించుచున్నవి.

**అ॥** సర్వభూతములందును సమముగ వ్యాపించియున్న పరమాత్మను తెలిసికొనువాడే నిజముగ తెలివిగలవాడని వచించుచున్నాడు -

**28. సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్**
**వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి.**

**టీక:—** సర్వేషు భూతేషు = సమస్తప్రాణులందును, సమమ్ = సమముగ, తిష్ఠన్తమ్ = ఉన్నట్టి, పరమేశ్వరమ్ = పరమాత్మను, వినశ్యత్సు = (ఆ యా ప్రాణులదేహాదులు) నశించినను, అవినశ్యన్తమ్ = నశింపనివానినిగా, యః = ఎవడు, పశ్యతి = చూచుచున్నాడో, (తెలిసికొనుచున్నాడో) సః = అతడు, పశ్యతి = (నిజముగ) చూచుచున్నాడు, (అతడే యథార్థమును తెలిసికొనినవాడని భావము.)

**తా:—** సమస్తప్రాణులందును సమముగనున్నట్టి పరమాత్మను, ఆయా ప్రాణులదేహాదులు నశించినను నశింపనివానినిగ ఎవడు చూచుచున్నాడో, (తెలిసికొనుచున్నాడో) అతడే నిజముగ చూచువాడగును. (విజ్ఞుడని భావము).

**వ్యాఖ్య:—** భగవానుడు కొందఱియందు హెచ్చుగను కొందఱియందు తక్కువగను లేరు. పుష్పములందు దారమువలె సమస్తప్రాణికోట్లయందును, సమముగ వ్యాపించియున్నారు. (సమమ్). మఱియు 'సర్వేషు' అను పదముచే ఏ ఒకానొక ప్రాణిలోమాత్ర ముండుట కాదనియు, విశ్వమందలి సమస్తభూతకోట్లయందును భగవానుడధివసించుచున్నాడనియు స్పష్టమగుచున్నది.

'వినశ్యత్స్వవినశ్యన్తమ్' - దేహేద్యుపాధులు నశించినను అందున్న ఆత్మ, పరమేశ్వరుడు నశించుటలేదు - అని తెలుపబడినది. దీనినిబట్టి దేహాది దృశ్యప్రపంచమంతయు నాశశీలమైనదియు, నశింపనివస్తు వొక ఆత్మయే యనియు స్థిరపడుచున్నది. కావున అట్టి నశ్వరదేహాదిపదార్థములందు మమత్వములేక శాశ్వత ఆత్మవస్తువు కొఱకే అన్వేషింపవలయును.

'యఃపశ్యతి సపశ్యతి' - దేహాద్యుపాధులు నశించినను ఆత్మ నశింపదని చూడగల్గువారే నిజముగ చూడగలవారని యిట పేర్కొనబడినది. కాబట్టి ఈసత్యమెఱుంగని వారందఱు నేత్రములున్నను వాస్తవముగ నేత్రవిహీనులేయని పై భగవద్వాక్యముల వలన స్పష్టమగుచున్నది. స్థూలనేత్రములున్నను, పైనదెల్పిన దృశ్యవినాశత్వ బ్రహ్మ(ఆత్మ)సత్యత్వపరిజ్ఞానములేనివాడు అనగా జ్ఞాననేత్రములేనివాడు - అతడెంతటి లౌకిక విద్యావేత్తయైనను, ధనికుడైనను, సుందరుడైనను, బలవంతుడైనను, అధికారవంతుడైనను, రాజాధిరాజైనను - భగవానుని దృష్టిలో గ్రుడ్డివాడే యని తెలుచున్నది. కావున భగవత్ప్రతిపాదితమగు ఈ సూత్రప్రకారము ప్రతివారును తాము వాస్తవముగ నేత్రములు కలవారా, లేనివారా యని చూచుకొని అజ్ఞానాంధత్వమును తొలగించుటకై ప్రయత్నించవలెను. భౌతికనేత్రములతోబాటు జ్ఞాననేత్రములనుగూడ సంపాదించుకొనవలెను. దేహాది దృశ్యపదార్థములను నాశవంతములుగను, ఆత్మను శాశ్వతముగ నెఱుంగగల్గుటయే జ్ఞాననేత్రమును సంపాదించుట యగును.

**ప్ర:–** పరమాత్మ యెచట నివసించుచున్నారు?

**ఉ:–** సమస్తప్రాణులందును నివసించుచున్నారు.

**ప్ర:–** ఏ ప్రకారముగ?

**ఉ:–** సర్వప్రాణులందును సమముగ.

**ప్ర:–** దేహాదుల ప్రభావమేమి?

**ఉ:–** అవి నాశవంతములైనవి.

**ప్ర:–** ఆత్మయొక్క స్వభావమేమి?

**ఉ:–** ఆత్మ నాశరహితమైనది. దేహాద్యుపాధులు నశించినను అది నశింపకయేయుండును.

**ప్ర:–** లోకములో నేత్రములుగలవా డెవడు?

**ఉ:–** దేహాదిదృశ్యపదార్థములు నశించినను ఆత్మ నశింపదను నిట్టి వివేకము, జ్ఞానదృష్టికలవాడే వాస్తవముగ నేత్రములు గలవాడు.

**అ॥** పరమాత్మ సర్వత్ర సమరూపమున వెలయుచున్నారని యెఱుంగువాడు ముక్తుడు కాగల్గునని వచించుచున్నాడు -

## 29. సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్
## న హినస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాంగతిమ్.

**టీక:–** హి = ఏలయనగా, సర్వత్ర = సమస్తప్రాణులందును, సమవస్థితమ్ = లెస్సగఉన్నట్టి, ఈశ్వరమ్ = పరమేశ్వరుని (పరమాత్మను), సమమ్ = సమానముగా, పశ్యన్ = చూచుచు (తెలిసికొనుచు),

*ఆత్మనా* = తనచేత, *ఆత్మానమ్* = ఆత్మను (తన్ను), *న హినస్తి* = హింసించుకొనడు, *తతః* = అందుచేత, *పరాంగతిమ్* = సర్వోత్తమగతిని (మోక్షమును), *యాతి* = పొందుచున్నాడు.

**తా:–** ఏలయనగా - సమస్తప్రాణులందును లెస్సగ వెలయుచున్నట్టి పరమాత్మను సమముగ వ్యాపించియున్నట్లుజూచుచు మనుజుడు తన ఆత్మను తాను హింసించుకొనడు. కావున సర్వోత్తమగతిని (మోక్షమును) బొందుచున్నాడు.

**వ్యాఖ్య:–** సమం, సర్వత్ర, సమవస్థితమ్ - అను మూడుపదములను ప్రయోగించుటవలన భగవంతుడు (1) సమానముగ వర్తించుచున్నారనియు (2) సర్వత్రవర్తించుచున్నారనియు (3) లెస్సగా వర్తించుచున్నారనియు తెలియుచున్నది. ఈ ప్రకారముగ పరమాత్మను సమస్తప్రాణులందును సమముగ వీక్షించువాడు ఆ పరమాత్మను ప్రయత్నపూర్వకముగ నెట్లైనను తెలిసికొనుటవలన తన ఆత్మను తాను చంపుకొనుట లేదని తెలియుచున్నది. ఆత్మను తెలిసికొనకపోవుటయే ఆత్మను హింసించుట. అదియే 'ఆత్మ' హత్య. మఱియు ఆత్మ నెఱుంగనివాడు జననమరణ సంసారప్రవాహమునబడి కొట్టుకొనిపోయి నానాబాధలు పడుటవలనను తన ఆత్మను తాను హింసించుకొనినవాడేయగును. కావున వారివారి సంసారబాధలకు వారే కారకులని స్పష్టమగుచున్నది. ఆత్మను తెలిసికొనినచో ముక్తుడగుటచే ఆ బాధలెవ్వియు లేకుండును. కావున విజ్ఞులగువారు తమ ఆత్మను హింసించుకొనక, ఆత్మహత్యకు గడంగక, సర్వత్ర సమముగ వ్యాపించియున్న పరమాత్మనెఱింగి తత్ఫలితముగ సర్వోత్తమమగు మోక్షగతి నొందవలయును. మోక్షమును 'పరాంగతిమ్' (ఉత్తమగతి) యని చెప్పుటవలన ప్రపంచములో గల పదవులన్నిటిలోను ఆత్మసాక్షాత్కారస్థితియే సర్వోత్తమమని తెలియుచున్నది.

**ప్ర:–** పరమాత్మ అంతటను ఏ ప్రకారము వ్యాపించియున్నారు?

**ఉ:–** సమానముగా.

**ప్ర:–** ప్రపంచములో జీవుల సంసారబాధకు కారణమేమి?

**ఉ:–** సర్వత్ర సమముగ వ్యాపించియున్న పరమాత్మను దర్శింపకపోవుటయే.

**ప్ర:–** ఆ బాధకు బాధ్యు లెవరు?

**ఉ:–** తానే. తన ఆత్మను తాను తెలిసికొనక - ఈ రూపమున ఆత్మహత్యను చేసికొనుచు ఆ యా బాధలకు గురియగుచున్నాడు.

**ప్ర:–** జీవుల ఈ సంసారబాధకు నివారణోపాయమేమి?

**ఉ:–** సర్వత్ర సమముగ వ్యాపించియున్న పరమాత్మను తెలిసికొనుటయే.

**ప్ర:–** ప్రపంచములోగల సమస్తపదవులలో, గతులలో శ్రేష్ఠమైనదేది?

**ఉ:–** ఆత్మసాక్షాత్కారము, మోక్షము.

**ప్ర:–** మోక్షప్రాప్తికి ఉపాయమేమి?

**ఉ:–** పరమాత్మ సర్వత్ర సమముగ వ్యాపించియున్నట్లు తెలిసికొని తన హృదయమున వారిని సాక్షాత్కరించుకొనుటయే.

**అ॥** ప్రకృతియే సమస్తకార్యములను నెరవేర్చుననియు, ఆత్మ అకర్తయనియు తెలుపుచున్నాడు -

**30. ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః**
**యః పశ్యతి తథాఽఽత్మానమకర్తారం స పశ్యతి.**

**టీక:–** *యః* = ఎవడు, *కర్మాణి* = కర్మములను, *ప్రకృత్యా ఏవ* = ప్రకృతిచేతనే, *సర్వశః* = సర్వవిధముల, *క్రియమాణాని* = చేయబడుచున్నట్లుగను, *తథా* = అట్లే (మఱియు), *ఆత్మానమ్* = ఆత్మను, *అకర్తారం చ* = కర్తగానివానిగను, *పశ్యతి* = చూచుచున్నాడో (తెలిసికొనుచున్నాడో), *సః* = అతడు, *పశ్యతి* = (నిజముగ) చూచుచున్నవాడగును.

**తా:–** ఎవడు కర్మములను ప్రకృతిచేతనే సర్వవిధముల చేయబడుచున్నట్లుగను, అట్లే ఆత్మను కర్తకానివానిగను చూచుచున్నాడో (తెలిసికొనుచున్నాడో) ఆతడే నిజముగ చూచుచున్నవాడగును.

**వ్యాఖ్య:–** లోకములో సర్వత్ర సమస్తకర్మములను ప్రకృతియే జరుపుచున్నది. ఆత్మతటస్థుడుగ, సాక్షీభూతుడుగనున్నాడు. వాస్తవముగ అతడు కర్తకానేరడు. ఆతని సాన్నిధ్యమహిమచే ప్రకృతియే క్రియలన్నిటిని సర్వవిధముల నెఱవేర్చుచున్నది. ఈ సత్యము నెఱుంగువాడే వాస్తవదృష్టిగలవాడు. అతడే నిజముగ చూచువాడు. తక్కినవారు నేత్రములున్నను సత్యమును గాంచజాలనివారని అర్థము. ప్రపంచమున చాలమంది కర్తృత్వాదులను ఆత్మయందే ఆరోపించి 'నేను చేయుచున్నాను, నేను దుఃఖించుచున్నాను' - ఇత్యాదివాక్యములను పలుకుచున్నారు. వారు యథార్థమును చూచువారు కాదు. నేత్రములు గలిగియున్నను వారు సత్యమును గాంచజాలనివారు. కావున ఇట్టి జ్ఞాననేత్రమును సంపాదించుకొనవలెను. లేకున్న వారు భగవద్దృష్టియందు నేత్రవిహీనులే యగుదురు. వారు అంధకారమునందు (అవిద్యయందు) జీవించువారే యగుదురు.

**ప్ర:–** ప్రపంచములో సమస్తకర్మలు దేనిచే చేయబడుచున్నవి?

**ఉ:–** ప్రకృతిచే.

**ప్ర:–** మఱి ఆత్మ యేమి చేయుచున్నది?

**ఉ:–** అది యేమియు చేయుటలేదు. అది అకర్త. దాని సాన్నిధ్యముచేతనే ప్రకృతి సమస్తమును జరుపుచున్నది. (మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్).

**ప్ర:–** ఈ ప్రపంచమున యథార్థముగ నేత్రములు కలవాడెవడు?

**ఉ:–** 'ప్రకృతిచేతనే సమస్తకార్యములు చేయబడుచున్నవి. ఆత్మ అకర్త' అను జ్ఞానము కలవాడే ప్రపంచమున వాస్తవముగ నేత్రములుకలవాడు. తక్కినవారు నేత్రములున్నను లేనివారే యగుదురు (జ్ఞాననేత్రవిహీనులని భావము).

**అ॥** జీవుడు బ్రహ్మము నెపుడు పొందగలడో చెప్పుచున్నాడు -

## 31. యదా భూతపృథగ్భావమేకస్థమనుపశ్యతి
## తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా.

**టీక:–** యదా = ఎప్పుడు, భూతపృథగ్భావమ్ = ప్రాణికోట్లయొక్క వేఱ్వేఱుగనుండుటను (పలువిధభేదములతో గూడిన ప్రపంచమును), ఏకస్థమ్ = ఒక్కదానియందు (ఆత్మయందు) ఉన్నదానిగను, చ = మఱియు, తతః ఏవ = దానినుండియే, విస్తారమ్ = విస్తరించుచున్న దానినిగను, అనుపశ్యతి = చూచుచున్నాడో, తదా = అప్పుడు, (సః = అతడు), బ్రహ్మ = బ్రహ్మమును, సంపద్యతే = పొందుచున్నాడు, (లేక బ్రహ్మముగనే అగుచున్నాడు).

**తా:–** ఎప్పుడు వేఱ్వేఱుగనున్న ఈ భూతప్రపంచమంతను ఒక్కదానియందు (పరమాత్మయందు) ఉన్నదానిగను, మఱియు దానినుండియే విస్తరించుచున్నదానినిగను వీక్షించునో, అపుడు (మనుజుడు) బ్రహ్మమును పొందుచున్నాడు. (లేక బ్రహ్మముగనే అగుచున్నాడు).

**వ్యాఖ్య:–** అనేక ప్రాణికోట్లతోగూడి వేఱ్వేఱుగా కనుపించు ఈజగత్తు వాస్తవముగ ఒకే స్వరూపమై యున్నది.

ఒకే పరమాత్మయందది వేఱ్వేఱుగ కల్పింపబడినది. కావున ఈ వేఱ్వేఱురూపములు సత్యములుకావు. అవి దేనియందు కల్పింపబడినవో, అట్టి ఆత్మయే సత్యమైనది. ఈ రహస్యము నెపుడెఱుంగునో అపుడు మనుజుడు బ్రహ్మమునే పొందుచున్నాడు లేక బ్రహ్మముగనే అగుచున్నాడు.

'అనుపశ్యతి' – 'పశ్యతి' అని చెప్పక 'అనుపశ్యతి' అను చెప్పుటవలన అట్టి ఏకత్వమును మాటిమాటికి అభ్యాసముద్వారా లెస్సగ చూడవలెనని భావము.

'బ్రహ్మసంపద్యతే తదా' – మనుజుడు మోక్షము నెపుడు పొందగలడో ఆ సుముహూర్త మిచట తెలియజేయబడినది. అది ఒకానొక నిర్దిష్టసమయముకాదు. ఏ సుముహూర్తమం దాతడు భిన్నభిన్న రూపములతో గూడిన ఈ జగత్తును ఏకమగుపరమాత్మయందు కల్పింపబడియున్న దానినిగను దానినుండియే విస్తరించినదానినిగను తెలిసికొనునో, ఆ ముహూర్తమందే యాతడు అట్టి బ్రహ్మజ్ఞానముచే బ్రహ్మమునే పొందుచున్నాడు. (బ్రహ్మమందు లయమై బ్రహ్మరూపుడుగనే శేషించుచున్నాడు. అదియే మోక్షము).

దీనినిబట్టి ఈ ప్రపంచమున అనేకత్వమునుజూచుట బంధలక్షణమనియు, ఏకత్వమునుజూచుట మోక్షలక్షణమనియు స్ఫురించుచున్నది. కావున విజ్ఞుడగువాడు నామరూపములను విడనాడి సచ్చిదానందములను గ్రహించుటద్వారా అనేకత్వమున ఏకత్వమునువీక్షించుటను అభ్యసించవలయును.

ప్ర:– మనుజుడు బ్రహ్మము నెపుడు పొందగలడు?

**ఉ:–** ఎపుడీ భిన్నభిన్నరూపములతో గూడిన సమస్తప్రపంచమును ఒక్క పరమాత్మయందున్న దానినిగను, దానినుండియే విస్తరించినదానినిగను, వీక్షింపగల్గునో (అట్టి బ్రహ్మజ్ఞానముచే) అపుడే బ్రహ్మమును పొందగల్గును.

**అ||** ఇక మూడు శ్లోకములద్వారా ఆత్మయొక్క మహిమావిశేషమును, స్వభావమును వర్ణించుచున్నాడు –

**32. అనాదిత్వాన్నిర్గుణత్వాత్పరమాత్మాయ మవ్యయః**
**శరీరస్థోఽపి కౌన్తేయ న కరోతి న లిప్యతే.**

**టీక:–** కౌన్తేయ = ఓ అర్జునా!, అనాదిత్వాత్ = ఆదిలేనివాడు (కారణరహితుడు) అగుటచేతను, నిర్గుణత్వాత్ = (త్రి)గుణరహితుడగుటచేతను, అవ్యయః = నాశరహితుడగు, అయం పరమాత్మా = ఈ పరమాత్మ, శరీరస్థః అపి = శరీరమందున్నవాడైనను, న కరోతి = ఏమియు చేయుటలేదు, న లిప్యతే = దేనితోను అంటబడుట లేదు.

**తా:–** ఓ అర్జునా! ఆదిలేనివాడు (కారణరహితుడు) అగుటచేతను, (త్రి)గుణరహితుడగుట వలనను, ఈ పరమాత్మ శరీరమునందున్నప్పటికిని ఏమియు చేయకయు, దేనిచేతను అంటబడకయు నున్నాడు.

**వ్యాఖ్య:–** ప్రపంచములోని సమస్తపదార్థములు ఆద్యంతములు కలవి. పరమాత్మ ఒకడే ఆద్యంతములు లేనివాడు. మఱియు అతడు(త్రి)గుణములుగాని, తజ్జనితవికారములుగాని లేనివాడు, నాశరహితుడు (అవ్యయుడు). వాస్తవముగ తానేమియు చేయుటలేదు. సర్వము తానే అయియుండుటచే ఇకపోవుటగాని, వచ్చుటగాని, చేయుట గాని యెట్లు పొసగ గలదు? అతడు అసంగుడు. దేనితోను అంటకనున్నాడు. స్వప్నపదార్థములను మేలుకొనినవా రెట్లు అంటగలరు? కావున శరీరము, మనస్సు, బుద్ధి మున్నగునవి అనేకకార్యములను జేయుచున్నను ఆత్మ సాక్షిగ, నిష్క్రియముగ, అసంగముగ సహజ ఆనందస్థితియందు వెలయుచున్నాడు.

'శరీరోస్థోఽపి' – అని చెప్పుటవలన పరమాత్మ దూరమునలేడు. అతి సమీపమున వారివారి శరీరములందే యున్నాడని స్పష్టమగుచున్నది. కావున చెంతనే హృదయగుహయందు దాగుకొనియున్న ఆ దేవదేవుని కనుగొని ధన్యులగుటకు సర్వులును ప్రయత్నించవలెను. శరీరమొక దేవాలయమని, ఆత్మ మూలవిరాట్టని భావించి పవిత్రభావనలనే గలిగియుండులాగునను, పాపస్పర్శలేకుండులాగునను చూడవలెను.

**33. యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే**
**సర్వత్రావస్థితో దేహే తథాఽఽత్మా నోపలిప్యతే.**

**టీక:–** సర్వగతమ్ = సర్వత్రవ్యాపించియున్న, ఆకాశమ్ = ఆకాశము, సౌక్ష్మ్యాత్ = సూక్ష్మమగుటవలన, యథా = ఏ ప్రకారముగ, న ఉపలిప్యతే = (ధూళిమున్నగువానిచే) అంటబడదో, తథా = ఆప్రకారమే, సర్వత్రదేహే = శరీరమునందంతటను (లేక, సకలశరీరములందును), అవస్థితః = ఉన్న (వ్యాపించియున్న), ఆత్మా = పరమాత్మ, న ఉపలిప్యతే = (శరీరగుణదోషములచే) అంటబడడు.

**తా:–** సర్వత్రవ్యాపించియున్న ఆకాశము సూక్ష్మమగుటవలన ఏ ప్రకారముగ (ధూళిమున్నగువానిచే) అంటబడదో, ఆ ప్రకారమే శరీరమందంతటను (లేక, సకలశరీరములందును) వెలయుచున్న పరమాత్మ (శరీర గుణదోషములచే) అంటబడకనున్నాడు.

**వ్యాఖ్య:–** దృశ్యప్రపంచములో అతిసూక్ష్మమైనవస్తువు ఆకాశము. కావున దానిని దృష్టాంతముగ తీసికొని ఆత్మయొక్క నిర్లేపత్వ, సర్వవ్యాపకత్వ, సూక్ష్మత్వ, నిర్మలత్వములు బోధింపబడినవి. చిన్నచిన్న ఉపమానములద్వారా గొప్పగొప్పబోధలను తెలియజెప్పుట గీతయొక్క ఒకానొక విశిష్టత. ఆకాశము అని చెప్పినందువలన ఆత్మ ఆకాశమని యెవరును భావింపరాదు. ఆకాశమువలె అతిసూక్ష్మమైనదని మాత్రమే యెఱుంగవలయును. ఆకాశము బురద మొదలగువానియందు వ్యాపించియున్నను, వానిగుణదోషములచే అంటబడనట్లు, ఆత్మయు దేహమందంతటను వ్యాపించియున్నప్పటికిని, దాని సుఖదుఃఖాదులచేగాని, జననమరణాదులచేగాని ఏ మాత్రము అంటబడదు. మఱియు మేఘమునందు ఎన్ని మెఱుపులు, పిడుగులు, నీరు, వడగండ్లు, నలుపుదనము, శీతలత్వము మొదలైనవియున్నను, ఆకాశమునకు ఆ గుణదోషములు ఏవియు అంటనట్లు ఆత్మకున్ను శరీరసంబంధ, మనస్సంబంధ, సుఖదుఃఖాదులు ఏమాత్రమున్ను అంటనేరవని చక్కగ భావనజేసి గంభీరాత్మస్వరూపుడుగ సాధకుడు స్థితుడై యుండవలెను. తాను వాస్తవముగ ఆత్మస్వరూపుడే కావున తనను దేహమునకు సాక్షిగాను, దేహాతీతుడుగాను చింతనజేయుచు దేహసంబంధబంధముగాని, సుఖదుఃఖాదులుగాని తనకు లేవని తలంచి గంభీరముగ, నిర్భయముగ, ఆనందముగ నుండవలెను.

'సర్వత్రావస్థితోదేహే' - అని చెప్పినందువలన, (వెనుకటి శ్లోకమునందు తెలుపబడిన విధముగ) భగవంతుడు అతిసమీపమున - శరీరముననే - వర్తించుచున్నాడు. కావున పవిత్రాచరణచే వారిని హృదయమందే సాక్షాత్కరించుకొనవలయును. శరీరము దేవనిలయము, దేవసన్నిధి యని భావించి దుష్కృత్యములను, పాపకార్యములను, పాపసంకల్పములను దరికి జేర్చరాదు. మఱియు ఏజాతివారైనను, ఏమతమువారైనను, స్త్రీయైనను, పురుషుడైనను తనశరీరమున దేవదేవుడగు జగన్నాథుడు నివసించుచున్నాడని నిశ్చయించి ధైర్యోపేతులై వారిని సాక్షాత్కరించుకొనుటకు శీఘ్రముగ యత్నించవలెను. అతడు దేహమున ఎక్కడున్నాడోయని పంచకోశములను వెతకివెతకి, మనస్సును శోధించి తుదకు అతనిని కనుగొనుటలో విజయముగాంచవలెను. ప్రయత్నశీలునకు అతడు దొరికియేతీరును.

**ప్ర:–** పరమాత్మయొక్క స్వభావమేమి?

**ఉ:–** అతడు శరీరమందున్నను ఆకాశమువలె నిర్లేపుడై, దేహసంబంధ సుఖదుఃఖాదులచే ఏ మాత్రము అంటబడకనుండును.

**34. యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః**
**క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత.**

**టీక:–** భారత = ఓ అర్జునా!, ఏకః = ఒకడైన, రవిః = సూర్యుడు, ఇమమ్ = ఈ, కృత్స్నమ్ = సమస్తమైన, లోకమ్ = లోకమును, యథా = ఏలాగున, ప్రకాశయతి = ప్రకాశింపజేయుచున్నాడో, తథా = అలాగుననే, క్షేత్రీ = క్షేత్రజ్ఞుడు (పరమాత్మ), కృత్స్నమ్ = సమస్తమైన, క్షేత్రమ్ = క్షేత్రమును, ప్రకాశయతి = ప్రకాశింపజేయుచున్నాడు.

**తా:–** ఓ అర్జునా! సూర్యుడొక్కడే ఈ సమస్తలోకమును ఎట్లు ప్రకాశింపజేయుచున్నాడో, అట్లే క్షేత్రజ్ఞుడగు పరమాత్మ ఈ సమస్తక్షేత్రమును ప్రకాశింపజేయుచున్నాడు.

**వ్యాఖ్య:–** ఆత్మయొక్క నిర్లేపత్వమును ఆకాశదృష్టాంతముద్వారా చెప్పి ఇపుడిక ప్రకాశత్వమును సూర్యుని దృష్టాంతముద్వారా చెప్పుచున్నాడు – సూర్యుడు లోకమంతటికిని సాక్షిగ నున్నవాడై, ఈలోకము నెట్లు ప్రకాశింపజేయుచున్నాడో, ఆ ప్రకారమే క్షేత్రజ్ఞుడగు పరమాత్మ దేహేంద్రియ మనోబుద్ధ్యాది దృశ్యజగద్రూపక్షేత్రమునంతను ప్రకాశింపజేయుచు సర్వసాక్షియై వెలయుచున్నాడు. సూర్యుడు లేనిచో జగత్తు నిర్వీర్యమైపోవునట్లు ఆత్మతేజములేనిచో దేహేంద్రియ మనోబుద్ధ్యాదులన్నియు శక్తివిహీనములై పోవును.

'కృత్స్నమ్' – అని చెప్పినందువలన కేవలము జాగ్రత్పదార్థములనే గాక స్వప్నసుషుప్త్యాదులందలి పదార్థములను, అట్లే భూతభవిష్యత్పదార్థములనుగూడ పరమాత్మ ప్రకాశింపజేయుచున్నాడని భావము.

ఆత్మయొక్క ఈ నిర్లేపత్వ, ప్రకాశత్వ, సర్వసాక్షిత్వాది స్వభావములను, భగవానుడు తెలిపిన ఆ యా దృష్టాంతములను స్మరించుటద్వారా సాధకుడు లెస్సగ భావనచేయుచు తాను వాస్తవముగ అట్టి అసంగచిద్రూపుడేకాని దేహేంద్రియాది జడ పదార్థములు కాదని దృఢముగ నిశ్చయింపవలెను.

**ప్ర:–** పరమాత్మ ఈ లోకమునంతను ఏ ప్రకారము **ప్రకాశింపజేయుచున్నాడు?**

**ఉ:–** సూర్యుడు సమస్తలోకమును ప్రకాశింపజేయువిధమున.

**అ॥** క్షేత్రక్షేత్రజ్ఞులనుగూర్చిన పరిజ్ఞానము గలవారికి కలుగు ఫలితమును వచించి ఈ అధ్యాయమును ముగించుచున్నాడు –

**35. క్షేత్రక్షేత్రజ్ఞయోరేవమన్తరం జ్ఞానచక్షుషా**
**భూతప్రకృతిమోక్షం చ యే విదుర్యాన్తి తే పరమ్.**

**టీక:–** యే = ఎవరు, జ్ఞానచక్షుషా = జ్ఞానదృష్టిచేత, ఏవమ్ = ఈ ప్రకారముగా, క్షేత్రక్షేత్రజ్ఞయోః = క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క, అన్తరమ్ = భేదమును, భూతప్రకృతిమోక్షం చ = భూతములకు సంబంధించియుండు (లేక కారణమైన) ప్రకృతి (అవిద్య) నుండి విముక్తినొందించు ఉపాయమును, విదుః = తెలిసికొనుచున్నారో, తే = వారు, పరమ్ = పరమాత్మపదమును (మోక్షమును), యాన్తి = పొందుచున్నారు.

**తా:–** ఎవరు జ్ఞానదృష్టిచేత ఈ ప్రకారముగ క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క భేదమును, భూతములకు సంబంధించియుండు (లేక, కారణమైన) ప్రకృతి (అవిద్య) నుండి విముక్తిని కలుగుజేయు ఉపాయమును తెలిసికొందురో వారు పరమాత్మపదమును (మోక్షమును) బొందుదురు.

**వ్యాఖ్య:–** 'ఏవమ్' - (ఈ ప్రకారముగా) - అని చెప్పుటవలన ఈ అధ్యాయమందు తెలుపబడిన దృగ్దృశ్యవివేకమే, క్షేత్రక్షేత్రజ్ఞులనుగూర్చిన జ్ఞానమే కైవల్యప్రాప్తికి హేతువని నిరూపింపబడినది. కావున ఇది సామాన్యమైనది కాదనియు మోక్షమునకు సోపానమువంటి దనియు ముముక్షువులు గుర్తెఱింగి భగవద్వాక్యములపై విశ్వాసమునుంచి, అద్దానిని సాధించి తరించవలయును.

'అన్తరమ్' - (భేదమును) - సామాన్యులందఱును దృగ్దృశ్యములను, క్షేత్రక్షేత్రజ్ఞులను కలిపివేయుచున్నారు. 'నేనే దేహము, నేనే మనస్సు, నేనే సుందఱుడను, నేను ఫలానిజాతివాడను' - అని ఈప్రకారముగ జీవుడు క్షేత్రముతో నైక్యమొంది పోవుచున్నాడు. అదియే దుఃఖములకు కారణము. బంధహేతువదియే. వాస్తవముగ జీవుడు క్షేత్రజ్ఞుడగు ఆత్మయేకాని క్షేత్రముకాదు. తాను క్షేత్రమునకు (దేహాదులకు) సాక్షియగు క్షేత్రజ్ఞుడేయనియు, క్షేత్రము తనకంటె వేఱనియు, దుఃఖాదులనుపొందునది క్షేత్రమేకాని తాను కాదనియు, తానద్దానికి వేఱుగా సాక్షిగా నున్నాడనియు విచారణచే తెలిసికొని, ఇట్టి జ్ఞానదృష్టిగలిగి ఆ రెండిటిని (క్షేత్రక్షేత్రజ్ఞులను) విభజించి చూచుటయే ఈ అధ్యాయమందు తెలుపబడిన బోధ.

'భూతప్రకృతిమోక్షం చ' - జీవుడు అనాదికాలమునుండి ప్రకృతి (మాయ)చే బద్ధుడైయున్నాడు. ఇపుడు జ్ఞానాదిసాధనలచే దానినుండి విడుదలను బొందుటకై యత్నించుచున్నాడు. ప్రకృతివిమోచనమే ప్రతిజీవియొక్కయు పరమకర్తవ్యము. ప్రకృతి నుండి ఆ ప్రకారము విడుదలను బొందుటయే మోక్షము. మోక్షమనగా ఆకాశమునగాని, పాతాళమునగాని, లేక మఱియొకచోటగాని ఉంచబడిన వస్తువుకాదు. అజ్ఞానవశమున ఇంతకాలము ప్రకృతితో గూడియున్న తాను, జ్ఞానదృష్టిని సముపార్జించి అద్దాని నుండి (ప్రకృతినుండి) విముక్తిని బొందుటయే మోక్షము. కనుకనే 'జ్ఞానచక్షుషా' అని చెప్పబడినది. కావున ప్రతివారును బంధవిముక్తికై జ్ఞాననేత్రమును, విచారణాసామర్థ్యమును, క్షేత్రక్షేత్రజ్ఞ విభేద పరిజ్ఞానమును తప్పక పొందవలసియున్నారు. వేఱుదారిలేదు. 'నాకేల మోక్షము కలుగలేదు' అని ప్రశ్నించువారు ముందుగా తనకు జ్ఞాననేత్రము లభించినదాయని చూచుకొనవలెను. అట్టిజ్ఞానమో, చిరకాలము భగవంతుని భక్తితో సేవించుటవలన, ఆరాధించుటవలన సంప్రాప్తింపగలదు - (తేషాం సతతయుక్తానాం... దదామిబుద్ధి యోగం). కాబట్టి భక్తిచే, ఉపాసనచే, పరోపకారాది పుణ్యకార్యములచే భగవానుని ప్రీతితోసేవించి, భగవత్కృపచే జ్ఞాననేత్రమును (బుద్ధియోగమును) బడసి తద్ద్వారా క్షేత్రక్షేత్రజ్ఞుల మధ్యగల భేదమును తెలిసికొని తాను క్షేత్రజ్ఞుడేకాని క్షేత్రముకాదని భావించుచు జీవుడు మోక్షము నొందవలసి యుండును. దుఃఖరాహిత్యమునకు, పరమానందప్రాప్తికి జీవు డవలంబించవలసిన పద్ధతి ఇదియే యని భగవాను డిచట అసందిగ్ధముగ చెప్పివైచిరి.

'యే విదుర్యాన్తి తే పరమ్' - అని 'యచ్ఛబ్ద' ప్రయోగముచేయుటవలన, ఎవరైనను సరియే, ఏ మతమువారైనను, ఏ ఆశ్రమమువారైనను, ఏ కులమువారైనను, జ్ఞాననేత్రమును పొందినచో వారు తప్పక ముక్తులగుదురని స్పష్టముచేయబడినది. 'యాన్తి' అను పదముచే వారట్టి మోక్షస్థితిని నిస్సందేహముగ బడయగలరని నిరూపించబడినది. కావున ముముక్షువులిక తమ బంధవిమోచనమునం దేలాటిసంశయ మును ఉంచుకొనక, భగవద్వాక్యములపై పరిపూర్ణ విశ్వాసముంచి ప్రయత్నపూర్వకముగ జ్ఞానదృష్టినిబడసి బ్రహ్మసాయుజ్యము నొందవలయును.

**ప్ర:–** మోక్షమనగా నేమి?

**ఉ:–** ప్రకృతి (మాయ, అవిద్య) నుండి విడుదలయే.

**ప్ర:–** అట్టి మోక్షము నెవరు పొందగలరు?

**ఉ:–** క్షేత్రక్షేత్రజ్ఞుల విభేదమును చక్కగ నెఱుంగువారు.

**ప్ర:–** అట్టి భేదమును దేనిచే నెఱుంగగలరు?

**ఉ:–** జ్ఞానదృష్టిచే, వివేకముచే.

**ప్ర:–** కాబట్టి మోక్షమునొందుట కుపాయమేమి?

**ఉ:–** జ్ఞానదృష్టిని బడసి క్షేత్రక్షేత్రజ్ఞుల భేదము చక్కగ తెలిసికొనుటయే.

ఓమ్

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే కర్మయోగోనామ
త్రయోదశోఽధ్యాయః.

ఇది ఉపనిషత్ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును,
శ్రీకృష్ణార్జున సంవాదమునగు శ్రీ భగవద్గీతలందు క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగమను
పదుమూడవ అధ్యాయము.

ఓమ్ తత్ సత్



ఓం

# శ్రీ భగవద్గీత

అథ చతుర్దశోఽధ్యాయః

## పదునాల్గవ అధ్యాయము

గుణత్రయ విభాగయోగః

## గుణత్రయ విభాగయోగము

**ఈ అధ్యాయము యొక్క పేరు :-**

'గుణత్రయ విభాగయోగము' - సత్త్వరజస్తమస్సులను మూడుగుణములు, వాని స్వభావములు, అవి జీవుని యే ప్రకారము బంధించునది, ఒక్కొక్క జీవుని యందధికముగ నున్నపు డాత డేయేలక్షణములు గలిగియుండునది, ఆ యా గుణముల నాశ్రయించియుండుటవలన జీవున కే యే ఫలితములు కలుగునది, ఆ గుణము లన్నిటిని దాటివైచినట్టి గుణాతీతుడగు జీవన్ముక్తు డేప్రకారముండునది ఈ మున్నగు విషయములన్నియు విశదముగ నిరూపింపబడిన అధ్యాయమగుటవలన దీనికి గుణత్రయ విభాగయోగమను పేరు గలిగెను.

**ఈ అధ్యాయమందలి ప్రధాన విషయములు :-**

(1) జ్ఞానమహిమ, ప్రకృతిపురుషులవలన జగదుత్పత్తి - (1శ్లో॥ నుండి - 4 శ్లో॥ వఱకు)

(2) సత్త్వరజస్తమోగుణములయొక్క స్వరూప స్వభావములు - (5 శ్లో॥ నుండి - 13 శ్లో॥ వఱకు)

(3) ఆ యా గుణములయొక్క ఫలితములు - (14 శ్లో॥ నుండి - 18 శ్లో॥ వఱకు)

(4) భగవత్ప్రాప్తికి ఉపాయము - (19 శ్లో॥ నుండి - 20 శ్లో॥ వఱకు)

(5) గుణాతీతుని లక్షణములు - (21 శ్లో॥ నుండి - 27 శ్లో॥ వఱకు)

**పూర్వాధ్యాయముతో ఈ అధ్మాయమునకు గల సంబంధము :-**

క్రిందటి అధ్యాయమున భగవానుడు క్షేత్రక్షేత్రజ్ఞులగూర్చియు, ప్రకృతిపురుషులను గూర్చియు తెలుపుచు 20వ శ్లోకమునందు 'ప్రకృతిసంభవము'లగు త్రిగుణములను గుఱించి ప్రస్తావించిరి. అక్కడనుండి మూడు శ్లోకములవఱకు ఆగుణసంబంధమైన చర్చయే నడచినది. ప్రకృతిజనితములగు ఆ సత్త్వరజస్తమోగుణములే జీవుని ఉచ్చనీచజన్మలకు హేతువులనియు 22వ శ్లోకమున చెప్పబడెను. ఇప్పట్టున

# గుణత్రయవిభాగయోగము



బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహమమృతస్యావ్యయస్య చ
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాన్తికస్య చ. (14–27)

ఏలయనగా, నేను నాశరహితమును, నిర్వికారమును, శాశ్వతధర్మస్వరూపమును, (దుఃఖమిశ్రితముకాని) నిరతిశయ (అచంచల) ఆనందస్వరూపమును అగు బ్రహ్మమునకు ఆశ్రయమును (అనగా బ్రహ్మముయొక్క స్వరూపమును) అయియున్నాను.

సహజముగనే శ్రోతకు ఆ గుణములనుగూర్చిన వివరములు తెలిసికొనవలెనని, అవి జీవుని ఏలాగున బంధించునో, వానినుండి విముక్తి పొందగల్గు ఉపాయములెవ్వియో యెఱుగవలెనని అభిలాష జనించును. ఇక్కారణమున భగవానుడు అర్జునుడు ప్రశ్నించకమునుపే తనంతట తాను ఆగుణములను గుఱించి వివరముగ చెప్పదలంచియు, క్రిందటి అధ్యాయమున తెలుపబడిన అఖండపరమార్థ జ్ఞానమును ఇంకను విపులముగ బోధింపనెంచియు అట్టి జ్ఞానముయొక్క మహిమను ప్రప్రథమముననే ఉటంకించుచు ఈ అధ్యాయమును ప్రారంభించుచున్నాడు -

**శ్రీ భగవానువాచ -**

**1. పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమమ్.**
**యజ్ఞ్జాత్వా మునయస్సర్వే పరాం సిద్ధిమితో గతాః.**

శ్రీ భగవానువాచ = శ్రీ భగవంతుడు పలికెను.

**టీక:-** యత్ = దేనిని, జ్ఞాత్వా = తెలిసికొని, సర్వే మునయః = మునులందఱును, ఇతః = ఈ సంసారబంధమునుండి (విడివడి), పరాం సిద్ధిమ్ = సర్వోత్తమమగు మోక్షసిద్ధిని, గతాః = పొందిరో, (తత్ = అట్టి), పరమ్ = పరమాత్మ సంబంధమైనదియు (లేక, శ్రేష్ఠమైనదియు), జ్ఞానానాం = జ్ఞానములలోకెల్ల, ఉత్తమమ్ = ఉత్తమమైనదియు (అగు), జ్ఞానమును, భూయః = మఱల, ప్రవక్ష్యామి = చెప్పుచున్నాను.

**తా:-** శ్రీ భగవంతుడుచెప్పెను - (ఓ అర్జునా!) దేనిని తెలిసికొని మునులందఱును ఈ సంసారబంధమునుండి (విడివడి) సర్వోత్తమమగు మోక్షసిద్ధినిబడసిరో అట్టి - పరమాత్మవిషయకమైనదియు, జ్ఞానములలోకెల్ల నుత్తమమైనదియునగు జ్ఞానమును మఱల చెప్పుచున్నాను.

**వ్యాఖ్య:-** 'భూయః' - 'క్రిందటి అధ్యాయమున చెప్పబడిన అఖండ జ్ఞానమును మఱల చెప్పుచున్నాను వినుము' - అని పలుకుటచే భగవానునకు భక్తుల యెడల యెంత కరుణగలదో, వారిని తరింపజేయవలెనను కుతూహలమెంతకలదో విశదమగుచున్నది. ఉత్తముడగు గురువు విశ్వాసపాత్రుడగు శిష్యునకు మనస్సునకెక్కుటకై ఒకే బోధను మఱల మఱల చెప్పుచుండును. 'వక్ష్యామి' అని చెప్పక 'ప్రవక్ష్యామి' (లెస్సగా వచించుచున్నాను) అని చెప్పుటవలన ఈ అధ్యాయమందు తెలుపబడిన విషయములు భగవంతునిదృష్టిలో ఎంత ముఖ్యమైనవో యోచించుకొనవచ్చును.

'జ్ఞానానాం జ్ఞాన ముత్తమమ్' - ప్రపంచములో అనేక జ్ఞానములు (భౌతికజ్ఞానము, సంగీతజ్ఞానము, శిల్పజ్ఞానము, గణితజ్ఞానము మున్నగునవి) ఉన్నను, వానియన్నింటిలోను భగవానునిదృష్టిలో ఆధ్యాత్మికజ్ఞానమే సర్వశ్రేష్ఠమైనదని ఈ వాక్యముద్వారా, మఱియు 'పరమ్' అను పదముద్వారా స్పష్టమగుచున్నది.

'యజ్ఞ్జాత్వా మునయః సర్వే' - ఈ జ్ఞానమును తెలిసికొని పూర్వము మునులందఱును బంధవిముక్తులైరని ఇట తెలుపబడినది. ఔషధముయొక్క శ్రేష్ఠత్వము రోగులపై అది కలిగజేయు ఫలితముమీద ఆధారపడియుండును. దేని సేవనముచే రోగము శమించునో ఆ ఔషధము చాల గొప్పదని అర్థము. అట్లే పూర్వము మునులందఱును ఈ జ్ఞానమును సేవించుటవలన బంధరహితులై శాశ్వత

మోక్షపదము నొందిరని యిట తెలుపుటచే ఆ జ్ఞానముయొక్క మహిమ వెల్లడియగుచున్నది. ప్రత్యక్షఫలితమును జూపుటద్వారా భగవానుడు జనులకు జ్ఞానముపై పరమ విశ్వాసమును కలుగజేయుచున్నారు. 'సర్వే' అని చెప్పుటచే ఈ జ్ఞానము నెఱింగినవారిలో ఒకరు కూడ ముక్తినిబడయక నుండలేదనియు అందఱును తరించిపోయిరనియు తెలియుచున్నది. అయితే 'మునయః' = (మననశీలురు) అని పేర్కొనుటవలన, వారందఱును తత్త్వమును బాగుగ మననముచేసియే తరించిరిగాని, వాచాజ్ఞానముచే గాదని స్పష్టమగుచున్నది.

'పరాం సిద్ధిమ్' - మోక్షస్థితి అన్నిటికంటెను గొప్పపదవి - అని చెప్పబడుటచే, చిన్నచిన్న ప్రాపంచికపదవులను, గతులను గొప్పగ తలంచి మురిసిపోక వానికంటె ఎన్నియోరెట్లు ఆనందకరమైనట్టి పరమాత్మపదమును జ్ఞానసముపార్జనముద్వారా పొంది ధన్యులు కావలయును.

**ప్ర:–** భగవానుడు చెప్పబోవు జ్ఞానమెట్టిది?

**ఉ:–** (1) జ్ఞానములన్నిటిలోను ఉత్తమమైనది (2) దాని నెఱుంగుటవలన మునులందఱును మోక్షస్థితిని బడసిరి.

**ప్ర:–** మోక్షస్థితి యెట్టిది?

**ఉ:–** ప్రపంచములో అన్నిపదములకంటెను సర్వోత్తమమైనది.

**అ॥** జ్ఞానముయొక్క మహిమను ఇంకను తెలియజెప్పుచున్నాడు -

**2. ఇదం జ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః**
**సర్గేఽపి నోపజాయన్తే ప్రళయే న వ్యథన్తి చ.**

**టీక:–** ఇదమ్ = ఈ, జ్ఞానమ్ = జ్ఞానమును, ఉపాశ్రిత్య = ఆశ్రయించి, మమ = నాయొక్క, సాధర్మ్యమ్ = స్వరూపమును (నాతో సమానధర్మమును, నాతో ఐక్యమును), ఆగతాః = పొందినవారై, సర్గే అపి = సృష్టికాలమందును, న ఉపజాయన్తే = పుట్టరు, ప్రలయే = ప్రళయకాలమందును, నవ్యథన్తిచ = బాధపడరు (నశింపరు).

**తా:–** ఈ జ్ఞానము నాశ్రయించి జనులు నాతో నైక్యమునొందినవారై (నా స్వరూపమును బడసి) సృష్టికాలమున జన్మింపరు. ప్రళయకాలమున నశింపరు. (జననమరణరహితులై పునరావృత్తిలేక యుందురని భావము).

**వ్యాఖ్య:–** 'మమ సాధర్మ్యమాగతాః' - జ్ఞానముయొక్క అఖండమహిమను తెలియజేయుచున్నారు. ఈ జ్ఞానమును తెలిసికొనినవారు సాక్షాత్ భగవంతునితో నైక్యమొంది భగవద్రూపులే యగుచున్నారు. (జ్ఞానీత్వాత్మైవ మే మతమ్ (7-18) అని పూర్వమీభావమునే గీతాచార్యులు వ్యక్తపరచియుండిరి. ఈ జ్ఞానముచే జీవుడు శివుడగుచున్నాడు. భక్తుడు భగవంతుడగుచున్నాడు. 'సాధర్మ్యమ్' అని చెప్పుటవలన జ్ఞాని భగవంతునితో సరిసమానమైన రూపము, ధర్మములు గలిగియుండునని స్పష్టమగుచున్నది. అట్టి స్థితి ఐక్యమువలననే సిద్ధించగలదు. ఏలయనిన, సమానధర్మములుగల - అనగా సద్రూపముగల రెండు వస్తువులు

ఎచటను ఉండనేరవు. ఒకే సద్వస్తువు లోకమున ఉండగలదు. కాబట్టి జీవుడు జ్ఞానోపార్జనచే పరమాత్మయందు తప్పక లీనమగుచున్నాడని ఋజువగుచున్నది. ఆహా! ఎంత గొప్పపదవి! సాక్షాత్ భగవంతుడే తానగుటలో ఎంత ఘనత కలదు! కావున అట్టి మహోన్నతస్థితికై ఈ జీవితమందే యత్నించువాడు ధన్యాతిధన్యుడు.

అయితే అట్టి భగవత్సాయుజ్యమును, సాధర్మ్యమును, బొందుటవలన కలుగు ఫలితమేమి యనిన, అట్టివారు జననమరణరహితులై పునరావృత్తిలేక యుందురు. వారు సృష్టికాలమున జన్మించుటగాని, ప్రళయకాలమున నశించుట, బాధనొందుటగాని లేనివారై - 'పునరపి జననం పునరపి మరణమ్' - అనుదానిని తప్పించుకొనినవారై ఈ సంసారచక్రపరిభ్రమణమునుండి విడివడి పరమానంద మనుభవించుచుందురు. వెయ్యేల! ఆనందరూపులే యగుదురు. (సర్గేఽపి నోపజాయన్తే ప్రలయే న వ్యథన్తి చ). కాబట్టి సంసారవ్యథలనుండి, బాధలనుండి తప్పించుకొనవలెనని, ఈ ఆత్మజ్ఞానమొకటియే జనులకు శరణ్యమని తేలుచున్నది.

**ప్ర:–** ఈ జ్ఞానమును బొందుటవలన గలుగు ఫలితమేమి?

**ఉ:–** ఈ జ్ఞానమును బొందుటచే జనులు (1) భగవంతునితో నైక్యమొందినవారై భగవత్స్వరూపులే యగుదురు. (2) మఱియు సృష్టికాలమున జన్మింపరు, ప్రళయకాలమున నాశమొందరు, బాధితులుకారు. (జననమరణరహితు లగుదురని భావము).

**ప్ర:–** (దీనినిబట్టి) భగవత్సాయుజ్యమును, మోక్షమును బొందుట కుపాయమేమి?

**ఉ:–** పరమార్థజ్ఞానమును బడయుటయే.

**అ॥** ప్రకృతి పురుషులవలననే ఈ జగత్తంతయు ఆవిర్భవించుచున్నదని రెండుశ్లోకములద్వారా తెలుపుచున్నాడు -

**3. మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్గర్భం దధామ్యహమ్**
**సమ్భవస్సర్వభూతానాం తతో భవతి భారత .**

**టీక:–** భారత = ఓ అర్జునా!, మహత్ బ్రహ్మ = గొప్పదైన మూలప్రకృతి (మాయ), మమ = నాయొక్క, యోనిః = సర్వభూతోత్పత్తిస్థానము (ఉత్పత్తిక్షేత్రము), తస్మిన్ = దానియందు, అహమ్ = నేను, గర్భమ్ = గర్భకారణమైన చైతన్యరూపమగు బీజమును, దధామి = ఉంచుచున్నాను, తతః = అందువలన, సర్వభూతానామ్ = సమస్తప్రాణికోట్లయొక్కయు, సమ్భవః = ఉత్పత్తి, భవతి = కలుగుచున్నది.

**తా:–** అర్జునా! గొప్పదైన మూలప్రకృతి (మాయ) నాయొక్క సర్వభూతోత్పత్తిస్థానము. అద్దానియందు నేను గర్భకారణమైన చైతన్యరూపమగు బీజము నుంచుచున్నాను. దానివలన సమస్తప్రాణులయొక్కయు ఉత్పత్తి సంభవించుచున్నది.

**వ్యాఖ్య:–** ఈ చరాచరజగత్తు, ప్రాణికోట్లు యెట్లుసంభవించుచున్నవి? కేవలము ప్రకృతివలనకాదు. ఏలయనిన, అది జడమగు ప్రకృతితో చైతన్యరూపుడగు పరమాత్మయొక్క కలయిక చేతనే సృష్టి ఏర్పడుచున్నది. కాబట్టి పరమాత్మయే సర్వజీవులకును పిత. ప్రతిజీవి యొక్కయు బీజము వారే. ఈ రహస్యమే ఈశ్లోకమున

స్పష్టముగ తెలియజేయబడినది. కాబట్టి ఏ ప్రాణియు, ఏ జీవుడును ఎంతటి అల్పజాతికి జెందినప్పటికిని దిగులుపడక తనమూలము సాక్షాత్ పరమాత్మయేయని నిశ్చయించి, వారిని జేరుటకు, వారిలో లీనమగుటకు (జ్ఞానాదులద్వారా) సర్వయత్నములను గావించవలెను. మఱియు సర్వప్రాణులయొక్క బీజమూ పరాత్పరుడే కావున, ఏ ప్రాణినిజూచినను భగవద్భావముగలిగి జీవకారుణ్యము, పరోపకారపారీణత గలిగియుండ వలయును.

**ప్ర:–** సమస్తప్రాణులు ఏ ప్రకారము ఆవిర్భవించుచున్నవి?

**ఉ:–** ప్రకృతి పురుషులయొక్క సంయోగమువలన.

## 4. సర్వయోనిషు కౌన్తేయ ! మూర్తయస్సమ్భవన్తియాః
## తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రదః పితా.

**టీక:–** కౌన్తేయ = ఓ అర్జునా!, సర్వయోనిషు = (దేవమనుష్యాది) సమస్తజాతులయందును, యాః మూర్తయః = ఏ శరీరములు, సంభవన్తి = పుట్టుచున్నవో, తాసామ్ = వానికి, మహత్ బ్రహ్మ = మూలప్రకృతి (మాయ), యోనిః = కారణము, మాతృస్థానము (తల్లి), అహమ్ = నేను, బీజప్రదః పితా = (చిద్రూప) బీజమునుంచునట్టి తండ్రిని.

**తా:–** అర్జునా! (దేవమనుష్యాది) సమస్తజాతులందును ఏశరీరము లుద్భవించుచున్నవో, వానికి మూలప్రకృతి (మాయ) యే మాతృస్థానము (తల్లి). నేను బీజము నుంచునట్టి తండ్రిని.

**వ్యాఖ్య:–** క్రిందటి శ్లోకమునవలెనే ఈశ్లోకమునగూడ ప్రపంచమునగల సమస్తప్రాణులు భగవత్స్వరూపులేయని స్పష్టీకరించబడినది. వారికి ప్రకృతియే తల్లి, పరమాత్మయే తండ్రి.

**అ॥** ప్రకృతినుండియే (సత్త్వరజస్తమస్సులను) గుణము లావిర్భవించినవనియు జీవుని బంధమున కవియే కారణములనియు పేర్కొనుచున్నాడు -

## 5. సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతి సమ్భవాః
## నిబధ్నన్తి మహాబాహో ! దేహే దేహినమవ్యయమ్.

**టీక:–** మహాబాహో = గొప్పభుజములుగల ఓ అర్జునా!, ప్రకృతిసమ్భవాః = ప్రకృతివలనబుట్టిన, సత్త్వం రజస్తమ ఇతి = సత్వము, రజస్సు, తమస్సు అను, గుణాః = గుణములు, అవ్యయమ్ = నాశరహితుడైన, దేహినమ్ = ఆత్మను, దేహే = దేహమునందు (లేక, దేహమునకు), నిబధ్నన్తి = బంధించుచున్నవి.

**తా:–** గొప్పభుజములుగల ఓ అర్జునా! ప్రకృతివలనబుట్టిన సత్త్వరజస్తమోగుణములు మూడును నాశరహితుడైన ఆత్మను దేహమునందు (లేక, దేహమునకు) బంధించివైచుచున్నవి.

**వ్యాఖ్య:–** సత్త్వరజస్తమోగుణములు మూడును ప్రకృతివలన కలిగినవి. అవి ఆత్మకులేవు. ఆత్మ

నిర్గుణుడు. గుణాతీతుడు. అయినను, జీవుడు తన యథార్థస్వరూపమగు ఆత్మను విస్మరించి, తాను సత్త్వాదిగుణయుతుడని భావించి ఆ గుణములతో తాదాత్మ్యమునొందుచు దేహమునందు, సంసారమునందు బంధితుడగుచున్నాడు. ఆ మూడు గుణములలో ఏ ఒక్కగుణమున్నప్పటికిని జీవు డింకను ప్రకృతి (మాయ) యందే యున్నాడనియు, మాయాతీతుడగు ఆత్మ నింకను చేరలేదనియు తెలిసికొనవలసియుండును. జీవుని బంధించుచున్నది ఈ మూడు గుణములేయని యిచట స్పష్టముగ చెప్పబడినందున వానినుండి సత్వరముగ విడుదలబొందుటకై యాత దహర్నిశము ప్రయత్నపరుడు కావలసియున్నది. ఇచట రజస్తమస్సులతోబాటు సత్త్వగుణముకూడ జీవుని బంధించుచున్నదని ఏల చెప్పబడినదనగా, పూర్ణనిస్సంకల్పస్థితియందు, లేక నిర్వికల్పావస్థయందు ఏ గుణమున్ను ఉండదుకావునను, అది సత్త్వగుణమునుగూడ దాటిన నిర్వికారావస్థ అయియున్నందువలనను, అత్తఱి సత్త్వగుణమున్ను ఒకానొక బంధనముగనే యుండును. అయితే ప్రారంభములో రజస్తమస్సులనుదాటి ముందు సత్త్వగుణావస్థను కలుగజేసికొని ఆపిదప దానినిగూడ దాటి పూర్ణనిర్వికల్పస్థితిని జేరవలసియున్నది. అదియే మోక్షము.

'మహాబాహో' - ఓ అర్జునా! నీ భుజపరాక్రమముచే బాహ్య శత్రువుల నెట్లు పరిమార్చుచున్నావో, అట్లే నిన్ను బంధించు నీ అంతఃశత్రువులగు త్రిగుణములను నిర్జించి, బంధవిముక్తుడవై ఆత్మసామ్రాజ్యాధిపత్యము నొందుము - అని 'మహాబాహో' అను సంబోధనచే అర్జునునకు తెలిపినట్లైనది.

'దేహే దేహిన మవ్యయమ్' - 'దేహమందు' అని చెప్పినందువలన ఆత్మ భగవానుడు, నాశరహితుడగు పరంజ్యోతి, అతిసమీపమగు దేహమందు అధివసించుచున్నాడని స్పష్టమగుచున్నది. కావున, తీవ్రపరిశోధనచే, విచారణచే ఆతనిని ఈ దేహమందే కనుగొని తరింపవచ్చును. మఱియు 'అవ్యయమ్' అనుటవలన దేహాదులు నశించుచున్నను ఆత్మ నశింపడని స్ఫురించుచున్నది. ప్రపంచములోని సమస్తదృశ్యపదార్థములు 'వ్యయములు' - నశ్వరములు. ఆత్మయొకడే అవ్యయుడు - శాశ్వతుడు. కావున ప్రతివారును వారు ఏ స్థితియందున్నది ఒకింత విచారించుకొని, దేహమందా, లేక దేహియందా నిశ్చయించుకొని, దేహమందైనచో త్రిగుణములను క్రమక్రమముగ రహిత మొనర్చుకొని ఎట్టకేలకు దేహియగు పరమాత్మయందు చేరవలయును. అదియే జన్మసార్థకత.

**ప్ర:–** ఆత్మ యెట్టివాడు?

**ఉ:–** నాశరహితుడు (అవ్యయుడు).

**ప్ర:–** తాను వాస్తవముగ అట్టి నాశరహితుడగు ఆత్మయైయున్నప్పటికిని అజ్ఞానవశమున జీవుడు వేనిచే బంధింపబడుచున్నాడు?

**ఉ:–** సత్త్వరజస్తమోగుణములచే.

**ప్ర:–** ఆ గుణములు వేనినుండి జనించినవి?

**ఉ:–** ప్రకృతినుండి (ప్రకృతిసమ్భవాః).

**ప్ర:–** కావున జీవుడు బంధరహితుడగుటకు మార్గమేమి?

**ఉ:–** త్రిగుణములను దాటి ఆవలనున్న పరమాత్మను జేరుటయే.

**అ॥** ఇక సత్త్వాదిగుణములలో ఒక్కొక్క దానియొక్క స్వరూపస్వభావములను క్రమముగ మూడు శ్లోకములద్వారా తెలుపుచున్నాడు. మొట్టమొదట సత్త్వగుణమును గూర్చి పేర్కొనుచున్నాడు -

**6. తత్ర సత్త్వం నిర్మలత్వా త్ప్రకాశకమనామయమ్**
**సుఖసఙ్గేన బధ్నాతి జ్ఞానసఙ్గేన చానఘ.**

**టీక:–** అనఘ = పాపరహితుడవగు ఓ అర్జునా!, తత్ర = ఆ సత్త్వాదిగుణములలో, సత్త్వమ్ = సత్త్వగుణము, నిర్మలత్వాత్ = స్వచ్ఛమైనదగుటవలన, ప్రకాశకమ్ = ప్రకాశమును గలుగజేయునదియు, అనామయమ్ = ఉపద్రవము లేనిదియు (అగుచు), సుఖసఙ్గేన = (ఇంద్రియ) సుఖమునందలి ఆసక్తిచేతను, జ్ఞానసఙ్గేన చ = (వృత్తి) జ్ఞానమునందలి ఆసక్తిచేతను జీవుని బంధించుచున్నది.

**వ్యాఖ్య:–** గుణములు మూడును ప్రకృతి (మాయా) జన్యములగుటవలనను, సత్త్వగుణముకూడ అందు చేరియుండుటవలనను అదియు మాయయొక్క ఒకానొక భాగమే అయియున్నది. అయితే అది శుద్ధభాగము. అది నిర్మలమగుటచే తక్కినరెండిటి కంటెను శ్రేష్ఠమైనది. కావున వాంఛనీయమైనదే. కాని పూర్ణాత్మస్థితియం దదియు ఒకానొక అడ్డే అయియున్నది. దీపమునకు నల్లటి గాజుచిమ్నీతొడిగినచో నెట్లుండునో ఎఱ్ఱటిది తొడిగిన నెట్లుండునో, తెల్లటిది తొడిగిన నెట్లుండునో, ఈ గుణములచే నావృతమైన ఆత్మయు ఆ యా గుణములచే నావృతమగునపుడు అట్లుండునని తెలిసికొనవచ్చును. తెల్లటిచిమ్నీ నిర్మలముగానున్నప్పటికిని, అదియు ఒకానొక ఆవరణమే యగును. అట్లే సత్త్వగుణమున్ను సుఖాసక్తిచేతను, జ్ఞానాసక్తిచేతను ఆత్మను బంధించుచున్నదని యిట తెలుపబడినది. 'నేను సుఖవంతుడను' అను దేహేంద్రియాది క్షేత్రధర్మమైన సుఖమును ఆత్మయం దారోపించుట యను సుఖసంసక్తిచేతను, ప్రపంచవిషయమైన, లేక, పాండిత్య విషయమైన వృత్తిరూపమగు అంతఃకరణధర్మమును ఆత్మయం దారోపించుటయను (వృత్తి) జ్ఞానసంసక్తిచేతను ఆ సత్త్వగుణము ఆత్మను బంధించుచున్నది. కావున అద్దానినిగూడ దాటి ఆ బంధమునుగూడ వదలించుకొని కేవ లాత్మస్థితిని బడయుమని అర్జునునకు భగవానుడు బోధించుచున్నాడు.

'అనఘ' - 'అఘము' (పాపము) లేనివాడు అనఘుడు. పాపరాహిత్యము, నిర్మలచిత్తత్వము బ్రహ్మవిద్యోపదేశమునకు అర్హత అయియున్నది. అట్టి అర్హతను అర్జునుడు బడసెనని ఈ 'అనఘ' అను సంబోధనచే వ్యక్తమగుచున్నది.

**ప్ర:–** సత్త్వగుణమెట్టిది?

**ఉ:–** (1) నిర్మలమైనది (2) ప్రకాశింపజేయునది (3) ఉపద్రవములేనిది.

**ప్ర:–** అయితే అది యే ప్రకారము జీవుని బంధించుచున్నది?

**ఉ:–** (ఇంద్రియ) సుఖాసక్తిచేతను, (వృత్తి) జ్ఞానాసక్తిచేతను బంధించుచున్నది.

**ప్ర:–** కావున ఫలితాంశమేమి?

**ఉ:–** జీవుడు ప్రయత్నపూర్వకముగ ఆ సత్త్వగుణమునుగూడ దాటి కేవలాత్మస్థితిని బడయవలెను. అదియే మోక్షము.

**అ॥** ఇక రజోగుణమును గుఱించి తెలుపుచున్నాడు –

**7. రజో రాగాత్మకం విద్ధి తృష్ణా సఙ్గసముద్భవమ్**
**తన్నిబధ్నాతి కౌన్తేయ! కర్మసఙ్గేన దేహినమ్.**

**టీక:–** కౌన్తేయ = ఓ అర్జునా!, రజః = రజోగుణము, రాగాత్మకమ్ = దృశ్యవిషయముల యెడల ప్రీతినిగలుగజేయునదియు, తృష్ణాసఙ్గసముద్భవమ్ = తృష్ణను (కోరికను), ఆసక్తిని కలుగజేయునదియు (అని), విద్ధి = ఎఱుంగుము, తత్ = ఆ రజోగుణము, కర్మసఙ్గేన = కర్మములందలి ఆసక్తిచేత (కర్మసంబంధముచేత), దేహినమ్ = ఆత్మను (జీవుని), నిబధ్నాతి = లెస్సగ బంధించుచున్నది.

**తా:–** ఓ అర్జునా! రజోగుణము దృశ్యవిషయముల యెడల ప్రీతినిగలుగ జేయునదియు, తృష్ణను (కోరికను), ఆసక్తిని గలుగజేయునదియు (అని) యెఱుంగుము. అయ్యది కర్మములందలి ఆసక్తిచేత (కర్మసంబంధముచేత) ఆత్మను (జీవుని) లెస్సగ బంధించివేయుచున్నది.

**వ్యాఖ్య:–** లభింపని వస్తువునందలి అభిలాషయే తృష్ణ. లభించినదానియందలి అభిమానమే సంగము. ఈ తృష్ణాసంగముల రెండిటిని రజోగుణము గలుగజేయుచున్నది. మఱియు అనేక బాహ్యాడంబర కర్మలచేతను, విషయాసక్తిచేతను, ఖ్యాతినార్జించవలెనను ప్రయత్నములచేతను, ఇంకను దృశ్యసంబంధములైన వివిధ క్రియాకలాపముల చేతను రజోగుణము జీవుని బంధించివైచుచున్నది. 'నిబధ్నాతి' – సత్త్వగుణమును గూర్చి చెప్పినపుడు 'బధ్నాతి' అని చెప్పి, రజోగుణ, తమోగుణములను వర్ణించునపుడు 'నిబధ్నాతి' యని పేర్కొనుట గమనింపదగినది. రజోగుణ, తమోగుణములు జీవుని లెస్సగ బంధించివేయునని భావము.

**ప్ర:–** రజోగుణ మెట్టిది?

**ఉ:–** (1) దృశ్యవిషయములపై ప్రీతిని గలుగజేయునది (2) తృష్ణను (కోరికను), ఆసక్తిని జనింపజేయునది.

**ప్ర:–** అది యే ప్రకారము జీవుని బంధించుచున్నది?

**ఉ:–** (1) విషయాసక్తిచేతను (2) కర్మసంబంధముచేతను బంధించుచున్నది.

**ప్ర:–** కాబట్టి ఫలితాంశమేమి?

**ఉ:–** బంధకరమగు అట్టి రజోగుణమును ప్రయత్నపూర్వకముగ తొలగించుకొనవలెను.

**8. తమ స్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్**
**ప్రమాదాలస్యనిద్రాభి స్తన్నిబధ్నాతి భారత.**

**టీక:–** భారత = ఓ అర్జునా!, తమః తు = తమోగుణమన్ననో, అజ్ఞానజమ్ = అజ్ఞానము వలన

గలుగునదియు, సర్వదేహినామ్ = సమస్తప్రాణులకును, మోహనమ్ *(ఇతి)* = మోహము (అవివేకము) ను గలుగజేయునదియును (అని), విద్ధి = ఎఱుగుము, తత్ = అది, ప్రమాదాలస్యనిద్రాభిః = మఱపు (లేక పరాకు), సోమరితనము, నిద్ర మొదలగువానిచే, నిబధ్నాతి = లెస్సగ బంధించుచున్నది.

**తా:–** ఓ అర్జునా! తమోగుణము అజ్ఞానమువలన కలుగునదియు, సమస్తప్రాణులకును మోహమును (అవివేకమును) గలుగజేయునదియునని యెఱుగుము. అయ్యది మఱపు (పరాకు), సోమరితనము, నిద్ర మొదలగువానిచే జీవుని లెస్సగ బంధించివేయుచున్నది.

**వ్యాఖ్య:–** తమోగుణము అజ్ఞానజనితమైనది. అది జీవుని మోహపెట్టి ఆతనికి అవివేకమును గలుగజేసి సంసారమునబడవైచి బంధించుచున్నది, దట్టమగు మేఘము సూర్యుని గప్పిన చందమునను, నల్లటి గాజుచిమ్నీ దీపమునకు పెట్టిన చందమునను తమోగుణావృతుడగు జీవుని పరిస్థితి ఉండును. 'సర్వదేహినామ్' అని చెప్పుటవలన వివేకవంతులను, ఆత్మజ్ఞానయుతులనుదప్ప తక్కినవారినందఱిని అది ఆవరించుచునే యుండునని గ్రహించవలెను. ముముక్షువులకు వారి వారి ప్రయత్నతీవ్రతనుబట్టి అది క్రమముగ తొలగిపోవుచుండును. అయితే ఒకనికి తమోగుణము ఉన్నదా, లేదాయని తెలిసికొనుట ఎట్లు ? మత్తు, సోమరితనము, అతినిద్ర, అజాగ్రత, బద్ధకము మున్నగునవి ఎవనికుండునో, ఆతనికి తమోగుణము పూర్తిగా కలదనియే గ్రహించవలెను. అట్టి లక్షణములను ముందుగనే తెలిసికొని, వానిని నివారించుటద్వారా అంధకారసదృశమగు ఆ తమోగుణమును హృదయమునుండి దూరముగ పారద్రోలవలెను. ఏలయనిన, ఈ తమోగుణ, రజోగుణములు జీవుని గట్టిగ బంధించివైచి సంసారగర్తమున పడవైచి దైవమున కాతనిని దూరునిగ జేయుచున్నవి (నిబధ్నాతి). కాబట్టి ముముక్షువులు వాని విషయమున కడుజాగరూకులై మెలగవలెను.

'భారత' – (భరతవంశమందు జన్మించిన ఓ అర్జునా!) అను ఈ సంబోధనపదము ఈ అధ్యాయమున పెక్కుతూర్లు వాడబడుట గమనింపదగినది. ఎట్లనిన –

(1) సంభవః సర్వభూతానాం తతో భవతి భారత (14-3)

(2) ప్రమాదాలస్యనిద్రాభిస్తన్నిబధ్నాతి భారత (14-8)

(3) సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత (14-9)

(4) రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత (14-10)

(5) రజస్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ (14-12)

ఈ ప్రకారముగ ఒకే అధ్యాయములో ఒకే సందర్భమున 'భారత' అను పదమును ఇన్నిసార్లు ప్రయోగించుటలో ఏదైన విశేషముండియే యుండవలెను. అదియేది యనిన 'భా' అనగా ప్రకాశము (జ్ఞానము); అద్దానియందు 'రతః' – ఆసక్తుడవు కమ్ము – అను అర్థము ఈ పదముద్వారా అర్జుననకు సూచింపబడుచున్నది. 'ఓ అర్జునా! ప్రకాశస్వరూపమై, త్రిగుణమాలిన్యవర్జితమై, అతి నిర్మలమైనట్టి నీస్వస్వరూపమును జ్ఞాపకమునకు తెచ్చుకొనుము. నీవు అంధకారరూపములగు ఈ త్రిగుణములతో జేరినవాడవు కావు. అవి మాయా (ప్రకృతి) జన్యములు. నీవో తద్విలక్షణుడవు. జ్ఞానప్రకాశసచ్చిదానంద స్వరూపుడవు. కావున అట్టి ప్రకాశరూపనిజాత్మతత్త్వమున స్థితుడవై త్రిగుణాతీతుడవై పఱుగుము' అని హెచ్చరించుటకై కాబోలు ఇన్నిసార్లు 'భారత' అను పదమును భగవానుడు ప్రయోగించిరి.

ప్ర:– తమోగుణము దేనినుండి పుట్టినది?

ఉ:– అజ్ఞానమునుండి.

ప్ర:– దాని స్వభావమేమి?

ఉ:– అది సమస్త జీవులకును మోహమును (అవివేకమును) గలుగజేయును.

ప్ర:– ఏ రూపమున అయ్యది జీవులను బంధించును?

ఉ:– మఱపు, పరాకు, సోమరితనము, బద్ధకము, అతినిద్ర మున్నగువానిచే బంధించును.

అ॥ ఈ ప్రకారముగ మూడుగుణములు జీవుని ఏలాగున బంధించునో తెలిపి ఇక ఆ గుణములయొక్క లక్షణములను పేర్కొనుచున్నాడు –

**9. సత్త్వం సుఖే సఞ్జయతి రజః కర్మణి భారత**
**జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సఞ్జయత్యుత.**

**టీక:–** భారత = ఓ అర్జునా !, సత్త్వమ్ = సత్త్వగుణము, సుఖే = సుఖమునందు, సఞ్జయతి = చేర్చుచున్నది (కలుపుచున్నది), రజః = రజోగుణము, కర్మణి = కర్మమునందు, (సంజయతి = చేర్చుచున్నది), తమః తు = తమోగుణమో, జ్ఞానమ్ = జ్ఞానమును (వివేకమును), ఆవృత్య = కప్పి, ప్రమాదే = ప్రమాదమునందు (పొరపాటునందు), సఞ్జయతి = చేర్చుచున్నది, ఉత = ఆశ్చర్యము!

**తా:–** ఓ అర్జునా!, సత్త్వగుణము సుఖమునందును, రజోగుణము కర్మమునందును, తమోగుణము జ్ఞానమును (వివేకమును) కప్పివైచి ప్రమాదము (పొరపాటు) నందును జీవుని చేర్చుచున్నవి (కలుపుచున్నవి), ఆశ్చర్యము!

**వ్యాఖ్య:–** ఇంతదనుక చెప్పిన భావములనే బోధనాదార్ఢ్యముకొఱకై మఱల తెలియజేయుచున్నారు. సత్త్వగుణము ప్రాపంచికసుఖమునందును, రజోగుణము ప్రాపంచికకర్మయందును, తమోగుణము నిద్రాప్రమత్తతలయందును జీవుని చేర్చుచున్నవి.

జీవుని సత్త్వగుణము ఆవరించినచో దీపముపై గాజు చిమ్నీ బోర్లించినట్లుండును.

జీవుని రజోగుణము ఆవరించినచో దీపముపై అలకనిగంప బోర్లించినట్లుండును.

జీవుని తమోగుణము ఆవరించినచో దీపముపై కుండ బోర్లించినట్లుండును.

అని శ్రీరామకృష్ణపరమహంస ఒక సందర్భమున తెలిపియుండిరి. కావున మూడును జ్ఞానదీపమును, ఆత్మదీపమును ఏదోవిధముగ కప్పునవే అయియుండుటచే వానిని దాటి వైచి ఆత్మస్థానమును జీవుడు చేరవలసియున్నది. ఈ త్రిగుణముల వ్యవహారమును జూచియు, నిత్యనిర్మలుడగు జీవుడు వానికి వశుడై ప్రవర్తించుట జూచియు భగవాను డాశ్చర్యమును వెలిబుచ్చుచున్నాడని 'ఉత' (ఆశ్యర్యము) అను పదముచే వ్యక్తమగుచున్నది.

అ॥ ఆ గుణములనుగూర్చియే ఇంకను వివరముగ చెప్పుచున్నాడు –

**10. రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత
రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా.**

**టీక:–** భారత = ఓ అర్జునా !, సత్త్వమ్ = సత్త్వగుణము, రజః = రజోగుణమును, తమః చ = తమోగుణమును, అభిభూయ = అణచి, భవతి = కలుగుచున్నది (ప్రవర్తించుచున్నది), రజః = రజోగుణము, సత్త్వమ్ = సత్త్వగుణమును, తమః చ = తమోగుణమును,(అభిభూయ = అణచి), (భవతి = కలుగుచున్నది), తథా = అలాగుననే, తమః = తమోగుణము, సత్త్వమ్ = సత్త్వగుణమును, రజః చ ఏవ = రజోగుణమును (అభిభూయ = అణచి) (భవతి = కలుగుచున్నది).

**తా:–** ఓ అర్జునా! సత్త్వగుణము (బలముగలిగియుండునపుడు) రజోగుణ, తమోగుణములను అణగద్రొక్కి ప్రవర్తించును. అట్లే రజోగుణము సత్త్వగుణ, తమోగుణములను; తమోగుణము సత్త్వగుణ, రజోగుణములను అణగద్రొక్కి ప్రవర్తించును.

**వ్యాఖ్య:–** (సత్త్వాది) త్రిగుణములందును ఎయ్యది జీవునియందు అధికముగా నుండునో, అది తక్కినవానిని అణగద్రొక్కి వర్తించుచుండును. కావున సాధకుడు మొట్టమొదట సత్త్వగుణమును బాగుగ నభ్యసించి దానిచే రజోగుణ తమోగుణములను త్రొక్కివైచి, ఆపిదప ఆ సత్త్వగుణమునుగూడ దాటి నిర్గుణపరమాత్మస్థానమును జేరవలయును.

**అ॥** ఏ గుణము జీవునియందు అధికముగనున్నదో తెలిసికొనుటకు గుఱుతులను మూడు శ్లోకములద్వారా వచించుచున్నాడు. మొదట సత్త్వగుణమునుగూర్చి తెలుపుచున్నాడు.

**11. సర్వద్వారేషు దేహేఽస్మి న్ప్రకాశ ఉపజాయతే
జ్ఞానం యదా తదా విద్యా ద్వివృద్ధం సత్త్వమిత్యుత.**

**టీక:–** యదా = ఎప్పుడు, అస్మిన్ దేహే = ఈ శరీరమునందు, సర్వద్వారేషు = శ్రోత్రము మొదలగు ఇంద్రియములనెడి సమస్తద్వారములందును, ప్రకాశః = ప్రకాశరూపమగు (బుద్ధివృత్తిరూపమగు), జ్ఞానమ్ = జ్ఞానము, ఉపజాయతే = కలుగుచున్నదో, తదా = అప్పుడు, సత్త్వమ్ = సత్త్వగుణము, వివృద్ధమ్ = వృద్ధినొందియున్నదని, విద్యాత్ = తెలిసికొనవలెను.

**తా:–** ఎప్పుడీ శరీరమునందు శ్రోత్రాది ఇంద్రియద్వారములన్నిటియందును ప్రకాశరూపమగు (బుద్ధివృత్తిరూపమగు) జ్ఞానము కలుగుచున్నదో, అప్పుడు సత్త్వగుణము బాగుగ వృద్ధినొందియున్నదని తెలిసికొనవలెను.

**వ్యాఖ్య:–** ఒక్కొక్కగుణము అధికముగానున్నప్పుడు జీవుడు ఒనర్చు కర్మములున్ను, దాని కనుగుణముగనే యుండును. ఆతడు భుజించు ఆహారము, మాట్లాడు పద్ధతి, నడక సమస్తము ఆ గుణముల ననుసరించియే యుండును. అనగా సత్త్వగుణము అభివృద్ధినొందియున్నపుడు జీవునియొక్క సమస్తచర్యలు సాత్త్వికముగ, ప్రకాశయుతముగ, జ్ఞానవంతముగనుండును. ఒక ఫలము బాగుగ పండియున్నపుడు దానిని ఎక్కడ కొరికి చూచినను తీపిగనే యుండునుగదా! సత్త్వగుణయుతుడు మాట్లాడునపుడు ప్రశాంతముగ

మాట్లాడును. భుజించునపుడు సాత్త్వికాహారమునే భుజించును. చదువునపుడు ఉత్తమగ్రంథములనే చదువును. ఆలోచించునపుడు చక్కనిభావములనే ఆలోచించును. ఈ సత్యమే ఈ శ్లోకమునందు వెల్లడింపబడినది. ఈ ప్రకారమగు ప్రశాంతత, జ్ఞానప్రకాశము సమస్తేంద్రియములనుండియు ఎపుడు వెల్లివిరియునో, అపుడా వ్యక్తి యందు సత్త్వగుణము అధికముగానున్నదని వెంటనే గ్రహించవచ్చును. దీనినిబట్టి ఒకడు సాధనయందు అభివృద్ధినొందినది లేనిది స్పష్టముగా తెలిసికొనుటకు అవకాశమేర్పడు చున్నది. వాని ఆచరణ చూచినచాలును. వాని ఇంద్రియ ప్రవృత్తులు చూచినచాలును. భగవానుడు ఈ శ్లోకమునందును, రాబోవు రెండు శ్లోకములందును జీవుని చరిత్రశుద్ధి, అంతస్తు కనిపెట్టుటకు చక్కని కొలత వస్తువు (Meter) ను ప్రసాదించిరి. వారివారి ఆచరణయే ఆ కొలతసాధనము. కాబట్టి ప్రతివారును తమతమ దైనిక ఆచరణను పరీక్షించుకొనుచు తమయం దేగుణము ప్రవృద్ధమై యున్నదో బాగుగ కనిపెట్టి సాధనాతిశయముచే తమస్సునుండి రజస్సునకు, రజస్సునుండి సత్త్వమునకు, సత్త్వము నుండి విశుద్ధసత్త్వమునకు లేక గుణాతీతస్థితికి మారుటకై ప్రయత్నించవలయును. సత్త్వగుణమునకు విభీషణుని దృష్టాంతముగ చెప్పవచ్చును.

**ప్ర:–** సత్త్వగుణము అధికముగా నున్నపుడు జీవుడెట్లుండును?

**ఉ:–** ఆతని సమస్త ఇంద్రియద్వారములనుండి అత్తఱి ప్రకాశరూపమగు జ్ఞానము, సాత్త్వికత వెల్లివిరియుచుండును. అట్టి స్థితి యెవనికైన నుండినచో సత్త్వగుణ మాతనియం దభివృద్ధి నొందియున్నదని గ్రహింపవచ్చును.

**అ॥** రజోగుణము అధికముగ నున్నపుడు జీవుడెట్లుండునో తెలియజేయుచున్నాడు –

## 12. లోభః ప్రవృత్తి రారమ్భః కర్మణామశమః స్పృహా
## రజస్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ.

**టీక:–** భరతర్షభ = భరతకులశ్రేష్ఠుడవగు ఓ అర్జునా!, రజసి = రజోగుణము, వివృద్ధే (సతి) = వృద్ధి నొందినదగుచుండగా, లోభః = లోభత్వము, ప్రవృత్తిః = కార్యములందు ప్రవృత్తి, కర్మణామ్ = (కామ్య, నిషిద్ధ) కర్మములయొక్క, ఆరమ్భః = ప్రారంభించుటయు, అశమః = మనశ్శాంతిలేకపోవుటయు (లేక ఇన్ద్రియనిగ్రహము లేకుండుటయు), స్పృహా = ఆశ (అను), ఏతాని = ఈ లక్షణములు, జాయన్తే = పుట్టుచున్నవి.

**తా:–** భరతకులశ్రేష్ఠుడవగు ఓ అర్జునా! రజోగుణ మభివృద్ధినొందునపుడు మనుజునియందు లోభత్వము, కార్యములందు ప్రవృత్తి, (కామ్య, నిషిద్ధ) కర్మములను ప్రారంభించుట, మనశ్శాంతి లేకుండుట (లేక ఇంద్రియనిగ్రహము లేకుండుట), ఆశ అను నివి పుట్టుచుండును.

**వ్యాఖ్య:–** రజోగుణ మభివృద్ధినొందినపుడు మనుజుడు ఏవేవో లేనిపోని కర్మలను, వ్యవహారములను పైనవేసికొనుచుండును. తత్ఫలితముగ అతనికి శాంతి యుండదు. ప్రవృత్తియందే ఎల్లపు డాసక్తి గొనుచుండునుగాని నివృత్తియందుగాదు. అతడు తిను ఆహారమున్ను రాజసముగనేయుండును. నడక, మాటలుకూడ రాజసములుగనే యుండును. అతని హృదయమం దనేక విషయాశలు తిరుగాడుచుండును. ఇంద్రియనిగ్రహ మాతనికి పూజ్యము. మామిడికాయ పక్వముకాకుండ పుల్లగానున్నస్థితికి ఈ రజోగుణ

యుతుని పోల్చవచ్చును. మఱియు రజోగుణమునకు రావణాసురుని దృష్టాంతముగ చెప్పవచ్చును. ఈ శ్లోకమునందు రజోగుణముకలవారికి శాంతియుండదని తెలుపబడినందు వలన, శాంతినొందుటకు మార్గము రజోగుణమును హృదయమునుండి తొలగించుటయే యని స్పష్టమగుచున్నది.

**ప్ర:–** రజోగుణము అభివృద్ధినొందియున్నపుడు జీవుడెట్లుండును?

**ఉ:–** అత్తఱి యాతడు (1) లోభత్వము (2) కార్యములందు ప్రవృత్తి (3) (కామ్య, నిషిద్ధ) కర్మలను ప్రారంభించుట (4) మనశ్శాంతిలేకుండుట (5) విషయాశ – అను వీనిని గలిగియుండును. కావున ఈ లక్షణము లెవనియందుండునో వానియందు రజోగుణము అధికముగ నున్నదని గుర్తించవచ్చును.

**ప్ర:–** శాంతి యెవరికి లభించును?

**ఉ:–** రజోగుణ, తమోగుణములు తొలగినవారికి.

**అ||** ఇక తమోగుణాభివృద్ధియందు జీవుడెట్లుండునో వచించుచున్నాడు –

**13. అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ**
**తమస్యేతాని జాయన్తే వివృద్ధే కురునన్దన.**

**టీక:–** కురునన్దన = కురువంశీయుడవగు ఓ అర్జునా!, తమసి = తమోగుణము, వివృద్ధే *(సతి)* = అభివృద్ధినొందినదగుచుండగా, అప్రకాశః = అవివేకము (బుద్ధిమాంద్యము), అప్రవృత్తిఃచ = సోమరితనమున్ను (బద్ధకమున్ను), ప్రమాదః = అజాగ్రత (పరాకు, పొరపాటు), మోహః ఏవ చ = అజ్ఞానమున్ను (మూఢత్వము, లేక విపరీతజ్ఞానము), ఏతాని = (అను) ఇవి, జాయన్తే = కలుగుచున్నవి.

**తా:–** కురువంశీయుడవగు ఓ అర్జునా! తమోగుణము అభివృద్ధినొందినదగుచుండగా మనుజునియందు అవివేకము (బుద్ధిమాంద్యము), సోమరితనము, అజాగ్రత, అజ్ఞానము (మూఢత్వము,) లేక విపరీతజ్ఞానము) అనునవి కలుగుచున్నవి.

**వ్యాఖ్య:–** తమోగుణ మభివృద్ధినొందినపుడుజీవునియందు మత్తు, సోమరితనము, అజాగ్రత, బుద్ధిమాంద్యము మున్నగు లక్షణములు గోచరించుచుండును. అతని ఆహారపానీయములందును, మాటలందును ఈ తమోగుణమే వ్యక్తమగుచుండును. వగరు మామిడికాయకు ఈ తమోగుణస్థితిని పోల్చవచ్చును. మఱియు కుంభకర్ణుని ఈ గుణమునకు దృష్టాంతముగ చెప్పవచ్చును. ప్రతివారును తమ తమ హృదయములను పరిశోధించుకొని తమయం దేగుణముయొక్క లక్షణములున్నవో పరీక్షించుకొని సాధనాతిశయముచే క్రమముగ ఊర్ధ్వస్థితిని బడయుటకై యత్నించవలెను. చెట్టుమొదలుకు నీటినిబోయుచున్నచో, పిందెయొక్క వగరుదనము నెమ్మదిగా పులుసుదనముగామారి, ఆ పులుపుదనము తీపిదనముగా పరిణమించి, ఫలము పక్వమై, తుట్టతుదకు రాలిపోవును. అదియే జీవన్ముక్తదశ. అత్తఱి జీవునకు సంసారబంధమునుండి విముక్తి సంభవించును. అయితే ఫలముయొక్క పరిపక్వస్థితి, రాలునట్టిస్థితి చెట్టుయొక్క మొదలుకు నీరు పోయుటవలననే సిద్ధించునట్లు భగవద్ధ్యానము, నిరంతర పరమార్థసాధన – వీని మూలకముగనే జీవుడు క్రమపరిణామమొంది రజస్తమములనుండి సత్త్వమునందుకొని, అటనుండి గుణాతీతపదవిని చేరుకొనును.

ప్ర:– తమోగుణ మభివృద్ధి నొందియున్నపుడు జీవుడెట్లుండును?

ఉ:– (1) అవివేకము (2) సోమరితనము (3) అజాగ్రత (4) అజ్ఞానము - మున్నగు లక్షణము లత్తఱి యాతనియందు గోచరించును. ఈ గుఱుతులున్నచో వెంటనే ఆతనియందు తమోగుణ మధికముగ నున్నదని తెలిసికొనవచ్చును.

అ|| దేహవియోగసమయమున ఏ గుణ మభివృద్ధియందుండిన ఏ ఫలితమును జీవుడు పొందగల్గునో రెండు శ్లోకములద్వారా చెప్పుచున్నాడు - మున్ముందు సత్త్వగుణమును గూర్చి వచించుచున్నాడు -

**14. యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రళయం యాతి దేహభృత్**
**తదోత్తమవిదాం లోకా నమలాన్ప్రతిపద్యతే.**

**టీక:–** యదా తు =ఎప్పుడైతే, సత్త్వే = సత్త్వగుణము, ప్రవృద్ధే (సతి) = అభివృద్ధిని బొందినదగుచుండగా, దేహభృత్ = జీవుడు, ప్రలయమ్ = మరణమును, యాతి = పొందుచున్నాడో, తదా = అప్పుడు, ఉత్తమవిదామ్ = ఉత్తమజ్ఞానముగలవారియొక్క, అమలాన్ = పరిశుద్ధములైన, లోకాన్ = లోకములను, ప్రతిపద్యతే = పొందుచున్నాడు.

**తా:–** ఎప్పుడైతే జీవుడు సత్త్వగుణ మభివృద్ధిని బొందినదగుచుండగా మరణించునో, అప్పుడతడు ఉత్తమజ్ఞానముగలవారియొక్క పరిశుద్ధములైన లోకములనే పొందును.

**వ్యాఖ్య:–** అంత్యకాలమున చిత్తమున సత్త్వరజస్తమోగుణములలో ఏ యే గుణము ప్రవృద్ధముగ నుండునో తదనుగుణ్యమైన లోకమే, జన్మమే జీవునకు కలుగుచుండునని ఇట చెప్పబడుచున్నది. అంత్యకాలమున సత్త్వగుణ మధికముగనున్నచో ఉత్తమజ్ఞానవంతుల లోకములను జీవుడు పొందగల్గును. అయితే సత్త్వగుణమనునది ఒక్కక్షణములో ఏర్పడునదికాదు. చిత్తమునందలి తమోగుణ, రజోగుణ సంస్కారములు, వృత్తులు తొలగి సత్త్వగుణ సంస్కారమేర్పడుటకు ఎంతయోసాధన, ప్రయత్నము అవసరము. జీవితకాలమంతయు అట్టి సత్ప్రయత్న మాచరించుచుండిననే, పుణ్యకార్యములు పరోపకారభావనలు గలిగియుండిననే అంత్యకాలమున చిత్తము సత్త్వగుణమయము కాగలదు. అంతియేకాని ఏ ఒక్క క్షణములోనో, ఏ ఒక్క సంకల్పముచేతనో, ఏ ఒక్కవాక్యముచేతనో అమాంతముగ అట్టి సత్త్వగుణస్థితి యేర్పడుట కష్టము. మఱియు బహుప్రయత్నలభ్యమగు అట్టి అంత్యకాలగుణముపైననే భావిజన్మ, భావిలోకము ఆధారపడియుండును. కావున జీవుడు శ్రద్ధతో తన యావజ్జీవితమును అట్టి సత్త్వగుణమును, తద్ద్వారా విశుద్ధసత్త్వగుణమును (గుణాతీతస్థితిని) సంపాదించుటకై యత్నశీలుడు కావలయును. జీవితమంతయు పాపకార్యములుచేసినచో చిత్తము అంత్యకాలమున తమోగుణప్రాబల్యము గలిగియుండునుగావున తత్ఫలితముగ మనుజుడు నీచలోకములనే పొందును. ఈ విషయమును రాబోవు శ్లోకములందు భగవానుడు తెలుపగలరు.

'దేహభృత్' - (దేహమును ధరించువాడు) - అను పదముచే వాస్తవముగ జీవుడు దేహముకంటె వేఱని తెలియుచున్నది. ధరింపబడునది ధరించువానికంటె సదా వేఱుగనే యుండునుగదా! 'కిరీటమును ధరించెను. వస్త్రమును ధరించెను' - అను ఈ వాక్యములచే ఆ యా కిరీట వస్త్రాదులు మనుజునికంటె వేఱుగ నెట్లుండునో,

అట్లే దేహమును ధరించు జీవునికంటె దేహము వేఱుగనేయుండును. ఈ సత్యమును తెలిసికొని మనుజుడు దేహభావననువీడి దేహసాక్షియగు ఆత్మభావనయే గలిగియుండువలెను.

'ఉత్తమవిదాం అమలాన్' - అని చెప్పుటవలన అట్టి సత్త్వగుణోపేతుడు జ్ఞానవంతులుండు నిర్మలలోకములనే పొందునని స్పష్టమగుచున్నది. అట్టి వినిర్మల వాతావరణము అతని పురోభివృద్ధికి, శాశ్వత బంధవిముక్తికి అచ్చోట సహాయభూతముగ నుండగలదు.

**ప్ర:-** సత్త్వగుణము అధికముగ నుండగా మరణించువా డెట్టిలోకమును బొందును?

**ఉ:-** ఉత్తమజ్ఞానవంతులయొక్క పరిశుద్ధలోకముల నాతడ బొందును.

**అ॥** రజోగుణ, తమోగుణయుతులు మరణానంతరము బొందు గతులను వివరించుచున్నాడు -

**15. రజసి ప్రళయం గత్వా కర్మసఙ్గిషు జాయతే**
**తథా ప్రలీనస్తమసి మూఢయోనిషు జాయతే.**

**టీక:-** రజసి = రజోగుణము, (ప్రవృద్ధే సతి = అభివృద్ధిని బొందినదగుచుండగా), ప్రలయమ్ = మరణమును, గత్వా = పొంది (పొందినవాడు), కర్మసఙ్గిషు = కర్మాసక్తులగువారియందు, జాయతే = పుట్టుచున్నాడు, తథా = అలాగుననే, తమసి = తమోగుణము, (ప్రవృద్ధేసతి = అభివృద్ధినిబొందినదగుచుండగా), ప్రలీనః = మరణమునొందినవాడు, మూఢయోనిషు = పామరులయొక్క (మూర్ఖులయొక్క, అవివేకులయొక్క) గర్భములందు, లేక పశుపక్ష్యాదులందు, జాయతే = పుట్టుచున్నాడు.

**తా:-** రజోగుణము అభివృద్ధినొందియుండగా మరణించువాడు కర్మాసక్తులగు వారి యందు జన్మించుచున్నాడు. అట్లే తమోగుణ మభివృద్ధినొందియుండగా మరణించువాడు పామరుల గర్భములందు, లేక పశుపక్ష్యాది హీనజాతులందు పుట్టుచున్నాడు.

**వ్యాఖ్య:-** రజోగుణాధిక్యత గలిగి మరణించువాడు తనయొక్క సంస్కారమునకు అనుగుణ్యముగనే తిరిగి కర్మాసక్తులయందు జన్మించుచున్నాడు. అట్లు జన్మించి మఱల పెక్కు బహిర్ముఖకార్యములందు, విషయాదులందు ప్రవర్తించి - తిరిగి మరణించుచు - ఈ ప్రకారముగ సంసారబంధమునుండి విడివడక, పెక్కుయాతనల ననుభవించుచు అశాంతి గలిగియుండును. ఇక తమోగుణాధికత్యయందు మరణించువాడు హీనచరితులగు మూఢజనులందో, లేక పశుపక్ష్యాదులందో జన్మించును. అట్టివా రెన్ని దుర్భరదారుణ దుఃఖముల ననుభవించవలెనో! కావున అట్టి భయంకర పరిణామములు, భీషణ దుఃఖజనకపరిస్థితులు తనకు కలుగకుండ జీవుడు అతిజాగరూకుడై జీవితకాలమున, మరణము దవ్వుననున్నపుడే ప్రయత్నపూర్వకముగ ఆ రజోగుణ తమోగుణరూప ఘోరపిశాచములను తన హృదయగేహమునుండి తరిమివేసి, భగవద్భక్తి, వైరాగ్యము, ఆత్మజ్ఞానము - ఇత్యాది సద్గుణరాశిని అలవఱచుకొని ముక్తుడై జన్మసార్థకత నొందవలయును.

**ప్ర:-** రజోగుణాధిక్యతగలిగి మరణించువా డెచ్చోట జన్మించును?

**ఉ:-** కర్మాసక్తులందు.

**ప్ర:-** తమోగుణాధిక్యత గలిగి మరణించువా డెచ్చోట జన్మించును?

**ఉ:–** పామరుల (మూఢజనుల) గర్భములందు, లేక, పశుపక్ష్యాది నీచజాతులందు.

**అ॥** సాత్త్విక, రాజసిక, తామసిక కర్మములయొక్క ఫలములను నిరూపించుచున్నాడు –

**16. కర్మణస్సుకృతస్యాహుః సాత్త్వికం నిర్మలం ఫలమ్
రజసస్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్.**

**టీక:–** సుకృతస్య కర్మణః = సాత్త్వికమైన కర్మమునకు (లేక పుణ్యకార్యమునకు), సాత్త్వికమ్ = సత్త్వగుణసంబంధమైన, నిర్మలమ్ = పరిశుద్ధమగు సుఖము, ఫలమ్ = ఫలమనియు, రజసస్తు = రజోగుణసంబంధమైన కర్మమునకు, దుఃఖమ్ = దుఃఖము, ఫలమ్ = ఫలమనియు, తమసః = తమోగుణసంబంధమైన కర్మమునకు, అజ్ఞానమ్ = అజ్ఞానము (అవివేకము), ఫలమ్ = ఫలమనియు, ఆహుః = (పెద్దలు) చెప్పుదురు.

**తా:–** సాత్త్వికమైన కర్మమునకు (లేక పుణ్యకార్యములకు) సత్త్వగుణసంబంధమైన నిర్మలసుఖము ఫలమనియు, రజోగుణసంబంధమైన కర్మమునకు దుఃఖము ఫలమనియు తమోగుణసంబంధమైన కర్మకు అజ్ఞానము ఫలమనియు (పెద్దలు) చెప్పుదురు.

**వ్యాఖ్య:–** ప్రతిజీవియు సుఖమునే కోరునుగాని దుఃఖమునుగాదు. అయితే ఆ సుఖము దేనివలన కలుగునో ఆ కార్యములనే చేయవలెనుగాని దుఃఖజనకములగు క్రియలనుగాదు. నిర్మలమగు, అనగా రజస్తమస్సంపర్కములేని సుఖము దేనివలన కలుగును? సాత్త్వికకర్మచే. దుఃఖము, అజ్ఞానము దేనివలన కలుగును? రాజసిక తామసిక కర్మలచే – అని భగవానుడు నుడివిరి. కాబట్టి విజ్ఞుడగువాడు సాత్త్వికకర్మలనే అనుసరించుచు, రాజసిక తామసిక కర్మలను త్యజించివేయవలెను. నిప్పులో చేయిపెట్టిన కాలునని తెలిసినవాడు మఱల దానిచెంతకు జనునా? అట్లే రాజస తామస కర్మలకు దుఃఖము, అజ్ఞానము ఫలములని భగవానుడు తెలుపుటచే, వారి వాక్యములందు పరిపూర్ణవిశ్వాసముంచి, అట్టి కర్మలను వదలిపెట్టి సుఖప్రదములగు సాత్త్వికకర్మములనే ఆశ్రయించవలెను. ఇట్లు కావించి క్రమముగ సాధనయొక్క పరిపక్వతచే ఆ సత్త్వగుణమునుగూడ దాటి గుణాతీత పరమాత్మస్థితిని చేరుకొనవలసియున్నది. ఆ స్థితియందు సాత్త్విక సుఖమునుగూడ దాటిపైచి గుణసంపర్కములేని కేవలానందమునే అనుభవించును.

'రజసస్తు ఫలం దుఃఖమ్' – రజోగుణ రూపములగు తృష్ణా, కామక్రోధాదులయొక్క ఫలము దుఃఖమని చెప్పుటవలన సాధకులు, ముముక్షువులు వాని విషయమై అతిజాగరూకులుగనుండి వానిని త్యజించివేయవలెను. ఎవరికైనను దుఃఖము, అజ్ఞానము గలిగినచో, అయ్యవి రజోగుణ తమోగుణముల ప్రభావముచే గలిగినవని (ఈ భగవద్వాక్యములవలన) నిశ్చయించి ఆ దుర్గుణములను వదలివేయవలెను. దుఃఖనివారణకు, సుఖప్రాప్తికి ఇదితప్ప వేఱొక ఉపాయ మెద్దియు లేదు.

'అజ్ఞానం తమసః ఫలమ్' – అన్ని దుర్గుణములు అజ్ఞానమునం దంతర్భూతములైయే యుండును. కావున, రజోగుణఫలమగు దుఃఖమున్ను ఈ అజ్ఞానమం దిమిడియే యున్నదని గ్రహించవలెను. కావున ఇది అత్యంత ప్రమాదకరమై యున్నది. ముముక్షువు లెవరును దీనినిగూడ దరికి జేర్చరాదు.

**ప్ర:–** సాత్త్విక కర్మకు ఫలమేమి?

**ఉ:–** నిర్మలసుఖము.

**ప్ర:–** రాజసకర్మకు ఫలమేమి?

**ఉ:–** దుఃఖము.

**ప్ర:–** తామసకర్మకు ఫలమేమి?

**ఉ:–** అజ్ఞానము.

**ప్ర:–** కాబట్టి దుఃఖము తొలగుటకు, సుఖము సంప్రాప్తించుటకు ఉపాయమేమి?

**ఉ:–** రాజసిక, తామసిక కార్యములను త్యజించి సాత్త్వికకార్యములనే ఆశ్రయించవలెను.

**అ॥** ఆ యా గుణములవలన కలుగు ఫలితములను తెలియజేయుచున్నాడు –

**17. సత్త్వాత్సఞ్జాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞానమేవ చ.**

**టీక:–** సత్త్వాత్ = సత్త్వగుణమువలన, జ్ఞానమ్ = జ్ఞానము, సంజాయతే = కలుగుచున్నది, రజసః = రజోగుణమువలన, లోభః ఏవ చ = లోభమే, (సంజాయతే = కలుగుచున్నది), తమసః = తమోగుణమువలన, ప్రమాదమోహౌ = అజాగ్రత (మఱపు), విపరీతజ్ఞానము (భ్రమ), భవతః = కలుగుచున్నవి, చ = మఱియు, అజ్ఞానమ్ ఏవ = అజ్ఞానమే, (తస్మాత్ భవతి = దానినుండి జనించుచున్నది).

**తా:–** సత్త్వగుణమువలన జ్ఞానము, రజోగుణమువలన లోభము, తమోగుణమువలన అజాగ్రత (మఱపు) భ్రమ, అజ్ఞానము కలుగుచున్నవి.

**వ్యాఖ్య:–** తత్త్వము బాగుగ దృఢపడుటకొఱకై – ఉపాధ్యాయుడు విద్యార్థికి బోధించిన చందమున – భగవానుడు అర్జునునకు చెప్పినవిషయమునే వివిధరీతుల మఱల మఱల తెలియజెప్పుచున్నారు. లోభము, అజ్ఞానము మున్నగునవి దుఃఖప్రదములు కావున అవాంఛనీయములైనవి. కాబట్టి అవి వేనివలనకలుగునో, అట్టి రజోగుణ, తమోగుణములను దూరీకరించి జ్ఞానదాయకమగు సత్త్వగుణమునే విజ్ఞుడాశ్రయించ వలయును.

**ప్ర:–** సత్త్వగుణమువలన నేమికలుగును?

**ఉ:–** జ్ఞానము.

**ప్ర:–** రజోగుణమువలన నేమి కలుగును?

**ఉ:–** లోభము.

**ప్ర:–** తమోగుణమువలన నేమి కలుగును?

**ఉ:–** అజాగ్రత్త (మఱపు), భ్రమ, అజ్ఞానము కలుగును.

**అ॥** ఆ యా గుణములు కలవారు మరణానంతరమేయేలోకములను బొందుదురో చెప్పుచున్నాడు –

**18. ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా మధ్యే తిష్ఠన్తి రాజసాః**
**జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛన్తి తామసాః.**

**టీక:–** సత్త్వస్థాః = సత్త్వగుణమునందున్నవారు, ఊర్ధ్వమ్ = ఊర్ధ్వలోకములకు, గచ్ఛన్తి = పోవుచున్నారు, రాజసాః = రజోగుణముగలవారు, మధ్యే = మధ్యమమగు మనుష్యలోకమునందు, తిష్ఠన్తి = ఉండుచున్నారు (జన్మించుచున్నారు), జఘన్యగుణవృత్తిస్థాః = నీచగుణప్రవృత్తిగల, తామసాః = తమోగుణముగలవారు, అధః = క్రిందిలోకములకు (లేక నీచములగు పశ్వాదిజన్మలకు), గచ్ఛన్తి = పోవుచున్నారు.

**తా:–** సత్త్వగుణము గలవారు (మరణానంతరము) ఊర్ధ్వలోకముల కేగుచున్నారు. రజోగుణముగలవారు మధ్యమమగు మనుష్యలోకమున జన్మించుచున్నారు. నీచగుణ ప్రవృత్తిగల తమోగుణయుతులు (పాతాలాది) అధోలోకములకు (లేక, అల్పములగు పశ్వాదిజన్మలకు) జనుచున్నారు.

**వ్యాఖ్య:–** సత్వగుణముగలవారు ఊర్ధ్వలోకములను, ఊర్ధ్వగతినే పొందుదురని తెలుపుటవలన, ఆ గుణము అవలంబనీయమనియు, రజోగుణతమోగుణయుతులు, మధ్య లోకమును, అధోలోకమును బొందుదురని చెప్పుటవలన ఆ గుణములు అభిలషణీయములు కావనియు స్పష్టమగుచున్నది. దీనినిబట్టి ఊర్ధ్వగతిగాని, అధోగతిగాని వారి వారి యధీనమునందే కలవని తేలుచున్నది. కాబట్టి ప్రయత్నపూర్వకముగ సత్త్వగుణసమాశ్రయముద్వారా ఊర్ధ్వగతినే పడయుటకు సర్వులును యత్నించవలెను.

**ప్ర:–** సత్త్వగుణము కలవారు మరణానంతర మేలోకములకు పోవుదురు?

**ఉ:–** ఊర్ధ్వలోకములకు (లేక, ఊర్ధ్వగతికి)

**ప్ర:–** రజోగుణము కలవారు?

**ఉ:–** మధ్యమమగు మనుష్యలోకములకు (లేక, మధ్యమగతికి).

**ప్ర:–** తమోగుణము కలవారు?

**ఉ:–** అధోలోకములకు (లేక, అధోగతికి)

**అ॥** మోక్షమును బొందుటకు ఉపాయమును తెలియజేయుచున్నాడు –

**19. నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి**
**గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి.**

**టీక:–** యదా = ఎప్పుడు (మనుజుడు), ద్రష్టా (భూత్వా) = వివేకవంతుడుఅయి (తాను ద్రష్టయని గ్రహించి), గుణేభ్యః = (సత్త్వాది) గుణములకంటె, అన్యమ్ = వేరైన, కర్తారమ్ = కర్తను, న అనుపశ్యతి =

చూడడో, (ఆత్మానమ్ = తన్ను) గుణేభ్యః చ = (ఆ) గుణములకంటెను, పరమ్ = అన్యునిగా (సాక్షిగా), వేత్తి = తెలిసికొనుచున్నాడో, సః = ఆతడు, మద్భావమ్ = నాస్వరూపమును, అధిగచ్ఛతి = పొందుచున్నాడు.

**తా:–** ఎప్పుడు వివేకవంతుడు (సత్త్వాది) గుణములకంటె నితరమును కర్తగా నెంచడో మఱియు తన్ను గుణములకంటె వేఱగువానినిగ దెలిసికొనుచున్నాడో, అపుడాతడు నాస్వరూపమును (మోక్షమును) బొందుచున్నాడు.

**వ్యాఖ్య:–** ఈశ్లోకము, రాబోవు శ్లోకము చాలముఖ్యములైనవి. విచారణాపరులగు సాధకులీభావములను, మఱల మఱల జ్ఞాపకమునకు తెచ్చుకొనవలెను. ఏలయనిన సంసారబంధవిముక్తికి, పరమాత్మస్వరూపప్రాప్తికి (మోక్షమునకు) రాజబాట యిచట తెలుపబడినది. జీవుడుచేయు సమస్తకర్మములకు త్రిగుణములే కర్త. అనగా త్రిగుణాత్మకమగు మనస్సే కర్త. ఆ త్రిగుణములే, ఆ మనస్సే దేహేంద్రియాదులచే కర్మలను చేయించుచున్నది. బంధమునొందునది ఆ మనస్సే; మోక్షమునొందునదియు అదియే. కర్త, భోక్త దానికంటె వేఱుగ నెవడునులేడు. ఆత్మమాత్రము సాక్షిగ వర్తించుచున్నది.

కావున వివేకముచే జీవుడు తాను వాస్తవముగ గుణములకంటె వేఱుగానున్నాడనియు, గుణములకు, దేహేంద్రియాదులకు సాక్షియగు ఆత్మయే తాననియు, కావున ఆ యా కర్మలకు తాను కర్తకాదనియు ఎపుడు తెలిసికొనునో, అపుడే యాతడు ద్రష్టగ, దృగ్రూపుడుగ శేషించి పరమాత్మరూపమునే పొందుచున్నాడని యిట వచింపబడినది. కనుకనే ముందు 'ద్రష్ట' కావలెనని ఉద్బోధించుటకు కారణము. 'ఓ జీవుడా! నీవు దృశ్యరూపములగు త్రిగుణములతో, మనస్సుతో, దేహేంద్రియములతో ఐక్యముకాకుము. వానికి సాక్షియగు ద్రష్టవు కమ్ము' అని భగవానుడు కరుణతో బోధించుచున్నారు.

ఈ జగన్నాటకమందు మనస్సే, త్రిగుణములే కర్త. తాను నాటకమందు దీపము వలె వాని యన్ని క్రియలకు సాక్షియై వర్తించుచున్నాడు. తాను గుణములకు పరుడై వెలయుచున్నాడు. 'సినిమా' యందు అధిష్ఠానమగు తెరగుడ్డవలె అన్నిటికిని ఆధారభూతుడై, సుఖదుఃఖములకు పరుడై, నిర్లేపముగా విలసిల్లుచున్నాడు. ఇదియే పరమ సత్యము. ప్రపంచములోని సమస్తదుఃఖములకు కారణము ఈగుణతాదాత్మ్యమే. అనగా జీవుడు గుణములతో, మనస్సుతో, దేహముతో నైక్యమై 'నేను చేయుచున్నాను, నేను పుట్టుచున్నాను, నేను చచ్చుచున్నాను,' ఇత్యాదిరూపమున కర్తృత్వము గలిగియుండుచున్నాడు. బంధమునకు కారణ మీకర్తృత్వమే అయియున్నది. దానిని వదలగొట్టిన మఱుక్షణమే జీవుడు భగవత్ - స్వరూపమును బొందుచున్నాడని శ్రీకృష్ణపరమాత్మ పలుకుచున్నారు.

'మద్భావం సోఽధిగచ్ఛతి' – అని తెలిపినందువలన, ఏ జీవుడు క్రియలన్నిటికిని గుణములే కర్తయనియు, తాను వాస్తవముగ ఆ గుణములకంటె వేఱుగనున్నాడనియు తెలిసికొనునో అతడు ఎవడైనను ఏ జాతికి జెందినప్పటికిని, స్త్రీయైనను, పురుషుడైనను ఆ క్షణముననే భగవానుని స్వరూపమును తప్పక బొందగలడని స్పష్టమగుచున్నది. కావున జీవుడు శివు డగుటకు, నరుడు నారాయణునిస్థితిని జెందుటకు, జనుడు జనార్దను డగుటకు ఇది చక్కటి ఉపాయము. మోక్షమున కిదియే చక్కని బాట; ఇక జీవుడు తాను అల్పుడని, దుర్బలుడని తలంపక తాను వాస్తవముగ నిరంజనుడని, మనస్సాక్షియని, గుణాతీతుడని, సాక్షాత్ భగవత్స్వరూపుడేయని నిశ్చయించి, ధైర్యోపేతుడై అట్టి వివేకమును బడయుటకు యత్నముగావింపవలెను.

'అధిగచ్ఛతి' -- అను పదముచే బ్రహ్మైక్యమును అట్టివాడు తప్పక పొందగలడని భగవానుడు

నొక్కిచెప్పినట్లైనది. కావున ముముక్షువులు భగవద్వాక్యమునందు విశ్వాసము గలిగి, పిరికితనమును పారద్రోలి, త్రిగుణములను తెగద్రుంచి గుణాతీత పరమాత్మరూపులై వెలయవలెను.

'పశ్యతి' అని చెప్పక 'అనుపశ్యతి' - అని చెప్పుటవలన - 'తానుకర్తకాద'ను ఈ భావమును మఱల మఱల చింతనజేసి దృఢపఱచుకొనవలెనని భావము.

అయితే భగవానుడు తెలిపిన ఈ సత్యములను బహుజాగ్రతగ అర్థము చేసికొనవలసియుండును. ఏలయనిన కొందఱు అవివేకులు 'ఇంద్రియములు ఏమిచేసినను, ఏమి అనుభవించినను నాకేమియు సంబంధములేదు' అను ఈ వాక్యమును విపరీతముగ అర్థముచేసికొని ఇంద్రియములచే నిషిద్ధకార్యములకు గడంగి దుఃఖరూప సంసార అఖాతములో పడిపోవుచున్నారు. అట్టి శుష్కవేదాంతులవచనముల నెవరును విశ్వసింపరాదు. తమోగుణ, రజోగుణములను దాటినవాడు, లేక తనను, వానికంటె వేఱుగ దలంచువాడు మఱల తద్గుణసంబంధములైన నీచకార్యములం దెన్నటికిని ప్రవృత్తుడుకాడని ముమ్మాటికిని ఎఱుగవలెను.

**ప్ర:-** తానుచేయు సమస్తకార్యములకు వాస్తవముగ కర్తయెవరు?

**ఉ:-** త్రిగుణములు (త్రిగుణాత్మకమగు మనస్సు).

**ప్ర:-** మనుజుడు తాను వాస్తవముగ నెట్టివాడు?

**ఉ:-** అకర్త, సర్వసాక్షి, నిర్గుణుడు.

**ప్ర:-** ఈ ప్రకార మెఱిగినందువలన కలుగు ఫలితమేమి?

**ఉ:-** ఎపుడు జీవుడు తాను గుణములకంటె వేఱని, అకర్తయని యెఱుగునో, ఆ క్షణముననే యతడు భగవత్స్వరూపమును (మద్భావమ్) లెస్సగ బడయుచున్నాడు; ముక్తినొందుచున్నాడు.

**ప్ర:-** దీనిని బట్టి మోక్షమునకు, భగవదైక్యమునకు ఉపాయమేమియని తేలుచున్నది?

**ఉ:-** 'త్రిగుణములే కర్త, తాను అకర్త' యని భావించి, జీవుడు గుణములకంటె వేఱుగ తన్నెఱుగుటయే మోక్షోపాయము.

**అ||** ఈ ప్రకారముగ గుణములను దాటినవాడు జననమరణాది దుఃఖముల నుండి విడుదలబొంది మోక్షమును బడయునని వచించుచున్నాడు -

**20. గుణానేతానతీత్య త్రీ న్దేహీ దేహసముద్భవాన్**
**జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తో ఽ మృతమశ్నుతే.**

**టీక:-** దేహీ = జీవుడు, దేహసముద్భవాన్ = దేహోత్పత్తికి కారణభూతములగు, ఏతాన్ = ఈ, త్రీన్‌గుణాన్ = మూడుగుణములను, అతీత్య = దాటి (పోగుట్టుకొనినచో), జన్మ మృత్యు జరాదుఃఖైః = పుట్టుక, చావు, ముసలితనము, దుఃఖము - అనువానిచేత, విముక్తః = లెస్సగ విడువబడినవాడై, అమృతమ్ = మోక్షమును (మరణరహిత ఆత్మస్థితిని), అశ్నుతే = పొందుచున్నాడు.

**తా:-** జీవుడు దేహోత్పత్తికి కారణభూతములగు ఈ మూడుగుణములను దాటి (దాటినచో) పుట్టుక,

చావు, ముసలితనము, దుఃఖములు - అనువానిచేత లెస్సగ విడువబడినవాడై, మోక్షమును (మరణరహిత ఆత్మస్థితిని) బొందుచున్నాడు.

**వ్యాఖ్య:—** 'గుణాన్' అని చెప్పినందువలన, రజస్తమములతోబాటు సత్త్వగుణమును గూడదాటి నిర్గుణ పరమాత్మను జేరవలెనని భావము. అయితే మొట్టమొదట తమోగుణమును పారద్రోలి సత్త్వగుణమును బాగుగ అభ్యసించవలెను. ఆ పిదప నిస్సంకల్పాత్మస్థితియం దా సత్త్వగుణము దానియంతట నదియే అతిక్రమింపబడగలదు.

గుణములవలన కలుగు గొప్ప అపకారమేదియో, అవి తొలగినందువలన కలుగు గొప్ప ఉపకారమేదియో ఈశ్లోకమునందు తెలుపబడినది, 'దేహసముద్భవాన్' దేహములను సృష్టించుటయే వానివలనగలుగు దారుణమగు అపకారము. వానివలన జీవుడు జననమరణరూపమగు ఈ సంసారచక్రమునుండి తప్పించుకొనజాలడు. ఒక దేహము పోయిన మఱియొక దేహము వచ్చుచుండును. ఇప్పటికి ఎన్నియో కోట్లకొలది జన్మలు, శరీరములు, ఆ త్రిగుణరూప బీజమునుండియే, మూలమునుండియే ఉద్భవించినవి. ఆ మూలము విచ్ఛిన్నముకానిచో ఇంకను ఎన్నియో అగణితములైన జన్మలు రాగలవు.

అయితే జన్మవచ్చినచో నష్టమేమి? యని ప్రశ్నించవచ్చును. ఆ నష్ట మేమియో భగవానుడే ఈశ్లోకమందు తెలియజేసిరి. ముసలితనము, రోగము, చావు, దుఃఖములు మొదలగు ఆపత్తులన్నియు శరీరోద్భవము వలననే జీవునకు కలుగు చున్నవి. కాబట్టి అసలు శరీరమే రాకుండ, అనగా జన్మలేకుండ చేసికొనుటయే ఉత్తమము అట్టి జన్మరాహిత్యమో గుణములను దాటినపుడే కలుగగలదని ఇచట స్పష్టముగ చెప్పి వేయబడినది. కాబట్టి ముముక్షువు తన సత్ప్రయత్నములచే తమోగుణమును, రజోగుణమును తెగద్రుంచి, సత్త్వగుణమును దాటివైచి శాశ్వత కైవల్యపదవి నొందవలయును. అయ్యది మరణరహితస్థితి. గనుకనే దానిని 'అమృతము' అని భగవాను డిచట పేర్కొనిరి.

'ముక్తః' అని చెప్పక 'విముక్తః' అని చెప్పుటచే త్రిగుణములను దాటినవాడు జననమరణబంధమునుండి పూర్తిగ విముక్తుడగునని భావము.

**ప్ర:—** ఈ దేహములు వేనివలన కలుగుచున్నవి?

**ఉ:—** త్రిగుణములవలన.

**ప్ర:—** మరణరహితమగు కైవల్య (మోక్ష) పదమెట్లు చేకూరగలదు?

**ఉ:—** ఈ మూడుగుణములను దాటుటచే.

**ప్ర:—** దేహము (జన్మ) వచ్చినచో నష్టమేమి?

**ఉ:—** ముసలితనము, రోగము, చావు, వియోగము, దుఃఖము, మున్నగునవియన్నియు ఆ దేహమువలననే సంభవించుటవలన, అది మహానర్థదాయకమైయున్నది. కావున దేహరహిత (జననమరణరహిత) ఆత్మస్థితినే జీవుడు పొందవలెను.

**ప్ర:—** మోక్షస్థితి యెట్టిది?

**ఉ:—** అది జననమరణములు లేని స్థితి (అమృతమ్).

**అ॥** త్రిగుణములను దాటినవాడు మోక్షపదవినొందునని శ్రీకృష్ణభగవానుడు చెప్పగనే, అట్లు దాటిన వాడేయే లక్షణములతో గూడియుండునో తెలిసికొనవలెనని అర్జునునకు కుతూహలముగలుగ, ఆ విషయమును గుఱించి భగవానుని ప్రశ్నించుచున్నాడు -

**అర్జున ఉవాచ -**

**21. కైర్లింగైస్త్రీన్గుణానేతా నతీతో భవతి ప్రభో**
**కిమాచారః కథం చైతాం స్త్రీన్గుణానతివర్తతే.**

అర్జున ఉవాచ = అర్జును డడిగెను.

**టీక:–** *ప్రభో* = ప్రభువగు ఓ కృష్ణా!, *ఏతాన్* = ఈ, *త్రీన్గుణాన్* = మూడుగుణములను, **అతీతః** = అతిక్రమించినవాడు (దాటినవాడు), *కైఃలిఙ్గైః* = ఏ లక్షణములతో, (*ఉపలక్షితః* = కూడినవాడుగా), *భవతి* = అగుచున్నాడు?, *కిమాచారః (భవతి)* = ఎట్టివర్తనముకలవాడుగా అగుచున్నాడు?, *ఏతాన్ త్రీన్గుణాన్* = ఈ మూడుగుణములను, *కథం చ* = ఎట్లు (ఏ యుపాయములచే), **అతివర్తతే** = అతిక్రమించుచున్నాడు? (దాటివైచుచున్నాడు?).

**తా:–** అర్జును డడిగెను -- ప్రభువగు ఓ కృష్ణా! ఈ మూడుగుణములను దాటినవాడెట్టి లక్షణములతో గూడియుండును? ఎట్టి ప్రవర్తన గలిగియుండును? మఱియు ఈ మూడుగుణములను నాత డేప్రకారము దాటివేయగల్గును?

**వ్యాఖ్య:–** మూడుగుణములను దాటినవాడు జన్మమృత్యుజరాదుఃఖములనుండి విడివడి అమృతత్వము (మోక్షము)ను బొందునను భగవద్వాక్యమును వినినవెంటనే అర్జునునకు ఆగుణము లెట్లు దాటబడునో, అట్లు దాటినవా డెట్లు ప్రవర్తించునో ఏ లక్షణములు, గుర్తులు గలిగియుండునో తెలిసికొనదలంచి వెంటనే ఆ విషయమును గూర్చి భగవానుని ప్రశ్నించివైచెను.

'కైర్లిఙ్గైః' = 'ఏ లక్షణములచే, ఏ గుర్తులచే గుణాతీతుడు తెలియబడగలడు?' అని అర్జును డడుగుట చాల సమంజసముగానున్నది. ఏలయనిన కొందఱు తాము చాల క్రిందిస్థితియం దున్నప్పటికిని, దృశ్యవాసనలు తమకింకను నశింపకున్నప్పటికిని, తాము సిద్ధపురుషులమనియు, గుణాతీతులమనియు, జీవన్ముక్తుల మనియు చెప్పుకొని తిరుగుచు ప్రజలను మోసము చేయవచ్చును. గుణాతీతుని యథార్థమగు లక్షణములు, చిహ్నములు తెలిసికొనినచో, ఇక నట్టిస్థితికి అవకాశములేదు. పైగా అట్టి లక్షణములను ఎఱిగియున్నచో మనుజుడు తానుకూడ ప్రయత్నాతిశయముచే వానిని సాధించుటకును వీలుండును. ఇవియన్నియు ఆలోచించి అర్జునుడు సమయోచితమగు ప్రశ్నగావించెను. ఇదివఱలో గీతప్రారంభమునందు రెండవ అధ్యాయమున 'స్థితప్రజ్ఞస్య కాభాషా' - అను నీప్రకారముగ ఇట్టి ప్రశ్ననే అర్జునుడు కావించి యుండుట ఈ సందర్భములో గమనింపదగియున్నది. ఈ స్థితప్రజ్ఞలక్షణములుగాని, గుణాతీతుని లక్షణములుగాని, అద్వేష్టృత్వాది భక్తలక్షణములుగాని, అమానిత్వాది జ్ఞానగుణములుగాని ఒక 'బరా మీటరు' (Barometre) వంటివి. 'బరామీటర్' చే శీతోష్ణస్థితు లెట్లు కొలవబడునో, అట్లే మనుజుని ఆధ్యాత్మికోన్నత్యము ఈలక్షణములచే కొలవబడగలదు. ఈ లక్షణములను బట్టి చూచినచో జనులలో ఆధ్యాత్మికశక్తిగలవారెవరో, వేషధారులెవరో సులభముగ తెలిపోవును. శుష్కవేదాంతమును రూపుమాపుటకు, పరమార్థక్షేత్రమునందు

సోమరులచే కల్పింపబడిన కృత్రిమవాతావరణమును విచ్ఛిన్నమొనర్చుటకు ఇట్టి ప్రశ్నలెంతయో ఆవశ్యకములైయున్నవి.

'కిమాచారః' - గుణాతీతుని ఆచరణ, అనుష్ఠానము ఎట్టిదో అర్జును డెఱుగ దలంచెను. 'కిమాసీత వ్రజేత కిమ్' - అని యిట్టి యాచరణనుగూర్చియే యిదివఱలో అర్జునుడు ప్రశ్నించియుండెను. ఆధ్యాత్మికక్షేత్రమున అనుష్ఠానమునకు గొప్పప్రాధాన్య మొసంగబడియున్నది. 'సాధ్య' వస్తువునుగుఱించి, లక్ష్యమును గుఱించి తెలిసికొనుట అవసరమైయున్నను, ఆ లక్ష్యము ఏ సాధనచే బొందబడగలదో దాని నెఱుగుట ఇంకను ఆవశ్యకమైయున్నది. ఏలయనిన, 'సాధన' నవలంభించినచో 'సాధ్యము' దానియంతట నదియే చేకూరును. కనుకనే అర్జునుడు గుణాతీతునియొక్క ప్రవర్తనయెట్టిదో తెలిసికొన దలంచెను. అర్జునుని ఈ ప్రశ్న దానికి భగవాను డొసంగబోవు సమాధానము పాఠకలోకమునకు చాల ముఖ్యములైయున్నవి. గీతలో సాధనసంబంధమైన ప్రముఖ ఘట్టములలో నిదియు నొకటైయున్నది. కావున ముముక్షువులీ గుణాతీతుని లక్షణములను బాగుగ మననముచేసి, కార్యాన్విత మొనర్చుకొనవలయును.

**ప్ర:–** అర్జునుడు భగవానునిద్వారా ఏ యే విషయములను తెలిసికొనదలంచెను?

**ఉ:–** (1) గుణాతీతుని లక్షణము లెవ్వి? (2) ఆతని ప్రవర్తన యెట్టిది? - అను విషయములను తెలిసికొనదలంచెను.

**అ॥** అర్జునుని యా ప్రశ్నను విని భగవానుడు గుణాతీతుని లక్షణములను వివరముగ చెప్పుచున్నాడు -

**శ్రీ భగవానువాచ –**

**22. ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాణ్డవ**
**న ద్వేష్టి సమ్ప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి.**

**23. ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే**
**గుణా వర్తన్త ఇత్యేవ యోఽవతిష్ఠతి నేఙ్గతే.**

**24. సమదుఃఖసుఖస్స్వస్థ స్సమలోష్టాశ్మకాఞ్చనః**
**తుల్యప్రియాప్రియో ధీర స్తుల్యనిన్దాత్మసంస్తుతిః .**

**25. మానావమానయో★స్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః**
**సర్వారమ్భపరిత్యాగీ గుణాతీతస్స ఉచ్యతే.**

శ్రీ భగవానువాచ = శ్రీ భగవానుడు చెప్పెను -

**టీక:–** పాణ్డవ = ఓ అర్జునా!, యః = ఎవడు, సంప్రవృత్తాని = సంప్రాప్తములైన, ప్రకాశం చ = సత్త్వగుణసంబంధమగు ప్రకాశమును (సుఖమును), ప్రవృత్తిం చ = రజోగుణ సంబంధమగు కార్యప్రవృత్తిని,

★ మానాపమానయోః - పాఠాంతరము.

మోహమ్ ఏవ చ = తమోగుణసంబంధమగు మోహమును (నిద్రాతంద్రతలను), నద్వేష్టి = ద్వేషింపడో, నివృత్తాని = విడిచిపోయిన ఆ గుణసంబంధ కార్యములను, నకాఙ్క్షతి = కోరడో, ఉదాసీనవత్ = తటస్థునివలె, ఆసీనః = ఉన్నవాడై, గుణైః = గుణములచేత (గుణకార్యములగు సుఖాదులచేత), నవిచాల్యతే = చలింపజేయబడడో, గుణాః = గుణములు, వర్తన్తే = ప్రవర్తించుచున్నవి, ఇతి ఏవ = అనిమాత్రము, యః = ఎవడు, అవతిష్ఠతి = (తెలిసికొనుచు) ఉన్నాడో, న ఇఙ్గతే = (ఏపరిస్థితులయందును) చలింపడో, సమదుఃఖసుఖః = సుఖదుఃఖములందు సమభావము గలవాడును, స్వస్థః = ఆత్మయందే స్థిరముగనున్నవాడును, సమలోష్టాశ్మకాఞ్చనః = మట్టిగడ్డ, ఱాయి, బంగారము -- వీనియందు సమబుద్ధిగలవాడును, తుల్యప్రియాప్రియః = ఇష్టానిష్టములందు సమభావము గల్గియుండువాడును, ధీరః = ధైర్యవంతుడును (లేక, ఆత్మానాత్మవివేకము గలవాడును), తుల్యనిన్దాత్మసంస్తుతిః = తన్నితరులు దూషించినను, భూషించినను మనోవికారములేనివాడును (నిందాస్తుతులందు సమదృష్టి గలవాడును), మానావమానయోః = సన్మానమునందును, అవమానమునందును, తుల్యః = సమబుద్ధిగలవాడును, మిత్రారిపక్షయోః = శత్రుమిత్రులందు, తుల్యః = సమభావముగలవాడును, సర్వారమ్భపరిత్యాగీ = సమస్తకార్యములందును కర్తృత్వబుద్ధిని వదలువాడును (లేక కామ్యకర్మలన్నిటిని విడచువాడును, లేక సమస్తకర్మలను త్యజించి నిరంతరము బ్రహ్మనిష్ఠయందుండువాడును) (అయియుండునో), సః = అతడు, గుణాతీతః = గుణాతీతుడని (గుణములను దాటినవాడని), ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

**తా:–** శ్రీ భగవానుడు చెప్పెను – ఓ అర్జునా! ఎవడు తనకు సంప్రాప్తములైన సత్త్వగుణసంబంధమగు ప్రకాశమును (సుఖమును) గాని, రజోగుణసంబంధమగు కార్య ప్రవృత్తినిగాని, తమోగుణసంబంధమగు మోహమును (నిద్రాతంద్రతలను) గాని ద్వేషింపడో, అవి తొలగిపోయినచో వానిని అపేక్షింపడో, తటస్థునివలె ఉన్నవాడై గుణములచేత (గుణకార్యములగు సుఖాదులచేత) చలింపజేయడో, గుణములు ప్రవర్తించుచున్నవని మాత్రము తెలిసికొనియుండునో, (ఏపరిస్థితులయందును) చలింపక నిశ్చలముగ నుండునో, మఱియు ఎవడు సుఖదుఃఖములందు సమభావము గలవాడును, ఆత్మయందే స్థిరముగనున్నవాడును, మట్టిగడ్డ, ఱాయి, బంగారము – వీనియందు సమబుద్ధి గలవాడును, ఇష్టానిష్టములందు సమభావము గల్గియుండువాడును, ధైర్యవంతుడును, సమస్తకార్యములందును కర్తృత్వబుద్ధిని వదలువాడును, (లేక కామ్యకర్మలనన్నిటిని విడచువాడును, లేక సమస్తకర్మలను త్యజించి నిరంతరము బ్రహ్మనిష్ఠయందుండు వాడును) అయియుండునో అట్టివాడు గుణాతీతుడని చెప్పబడును.

**వ్యాఖ్య:–** గుణాతీతునియొక్క లక్షణము లిచట పేర్కొనబడినవి. ఈ లక్షణములను బట్టి మనుజుడు త్రిగుణములను దాటినది, లేనిది తెలిసికొనవచ్చును. గుణాతీతుడు తటస్థుడుగనుండుచు తనకేకారణముచేతనైనా, సత్త్వగుణసంబంధమైన ప్రకాశము (సుఖము) గాని, రజోగుణసంబంధమైన కార్యప్రవృత్తిగాని, తమోగుణసంబంధమైన మోహము (నిద్రాతంద్రతలు) గాని సంప్రాప్తించినచో వానియెడల ద్వేషముగాని, అవి తొలగినచో వానిని కోరుటగాని లేకుండును. గుణాతీతునియొక్క తాటస్థ్యమును, ఔదాసీన్యస్థితిని తెలుపుట కీవిషయము బోధింపబడినదేకాని ఆ యా మోహాదిగుణములు అవలంబనీయములని తెలుపుటకాదు. మఱియు, ఇచట మోహమనగా అజ్ఞానమని అర్థముకాదు. ఏలయనిన గుణాతీతునకు అజ్ఞానమెపుడో తొలగిపోయియుండును. భగవానుడు తెలిపిన ఈ గుణాతీతుని లక్షణములందు 'నిశ్చలత్వము', 'సమత్వము' అనునవి ప్రధానముగ గోచరించుచున్నవి –

(1) 'నిశ్చలత్వము' - ఏ చిన్న సంఘటన జరిగినను అజ్ఞాని బెదరిపోవును. తన సమత్వమును గోల్పోవును. కాని గుణాతీతుడు మేరుసమానగాంభీర్యముగలిగి, పరిస్థితులకు ఏమాత్రము చలింపకనుండును (న విచాల్యతే, నేఙ్గతే). శ్వాసవాయువు, లేక చిన్న అలలు పర్వతమును కదలింపజాలనట్లును, మేఘములకు పైనున్న సూర్యుని మేఘజనితములగు పిడుగులు, మెఱుపులు, వర్షము బాధింపజాలనట్లును, త్రిగుణములను దాటి మనస్సునకు అవలనున్న ఆత్మయందు నిలుకడగలిగియున్న యోగిపుంగవుడు ప్రపంచములోని ఏసంఘటనచేగాని, ఆపత్తుచేగాని చలింపక సదా ఆత్మయందే సుస్థిరుడై యుండును. ఆ వికటపరిస్థితులన్నియు మనస్సునకు జెందినవి. గుణములకు సంబంధించినవి. ఉపాధికి జేరినవి. 'నేను గుణములకంటె వేఱుగనున్నాను. మనస్సునకు అతీతుడనైయున్నాను' అని తలంచి యాతడు మహద్ధైర్యయుతుడై మెలగును. గుణాతీతునియొక్క గుఱుతు ఇదియే.

(2) సమత్వము - మానావమానములందు, నిందాస్తుతులయందు, సుఖదుఃఖము లందు, ఇష్టానిష్టము లందు, శత్రుమిత్రాదులందు, శిలాకాంచనములందు గుణాతీతుడగు మహనీయుడు సమబుద్ధి గలిగియుండును. గుణాతీతుడైన శుకమునీంద్రుడు జనకుని యాస్థానమున కేగినపుడు, ఆతని పరీక్షార్థము జనకునిచే కలుగజేయబడిన సుఖదుఃఖాదులందు ఆతడెంతటి సమత్వమునుజూపెనో ఈ సందర్భమున జ్ఞాపకమునకు తెచ్చుకొనవలెను. అట్టి మహనీయులు నిరంతరము ఆత్మస్థితియందే (ధ్యేయాకారమందే, స్వవస్తువునందే) నిలుకడ గలిగియుందురు. కావున మిథ్యారూప ప్రపంచమునందలి ఇట్టి ద్వంద్వములు వారినేమియు చేయజాలవు. మఱియు నిందాస్తుతులు, సుఖదుఃఖములు మున్నగునవి మనోధర్మములే, కావున మనస్సాక్షియగు ఆత్మయందు సదా సుస్థితులైయుండు గుణాతీతులను, జ్ఞానులను అవి కదలింపజేయజాలవు. మఱియొకనికి కలుగు సుఖదుఃఖములు మనుజుని యెట్లు బాధింపజాలవో, అట్లే ఉపాధిని తనకంటె వేఱుచేసికొనిన జ్ఞానిని, గుణాతీతుని ఆ యా ద్వంద్వములు బాధింపజాలవు.

'సర్వారమ్భపరిత్యాగీ' - ఈ పదమునకు 'సమస్తకార్యములందును కర్తృత్వమును వదలినవాడ'ని అర్థము చెప్పుటయే సమంజసముగ నుండును. లేక, కామ్యకర్మలన్నిటిని వదలినవాడనియు చెప్పవచ్చును. లేక, ఇతరకార్యములన్నిటిని త్యజించివైచి నిరంతరము బ్రహ్మనిష్ఠయందుండువాడనియు పేర్కొనవచ్చును.

ఇట్టివాడు 'యః' - ఎవడో 'సః' అతడు 'గుణాతీతః ఉచ్యతే' గుణాతీతుడని చెప్పబడును - అని తెలుపుటవలన - అనగా యచ్ఛబ్దప్రయోగము గావింపబడుటవలన ఎవరైనను సరియే ఆ స్థితిని బడయవచ్చుననియు, అట్లు (ప్రయత్నపూర్వకముగ) ఆ యా సద్గుణములను బడయువాడే గుణాతీతుడగునుగాని తక్కినవారు కారనియు స్పష్టమగుచున్నది. కావున సర్వులును అట్టి మహోన్నతస్థితికై యత్నించి కృతార్థత బడయవచ్చును.

ప్ర:- గుణాతీతుని లక్షణములెవ్వి?

**ఉ:-** ఎవడు తనకు సంప్రాప్తించిన సత్త్వగుణసంబంధమగు ప్రకాశము (సుఖము)ను గాని, రజోగుణసంబంధమగు కార్యప్రవృత్తినిగాని, తమోగుణసంబంధమగు మోహము (నిద్ర, తంద్రత) ను గాని ద్వేషింపడో, అవితొలగిపోయినచో వానిని అపేక్షింపడో, తటస్థునివలెనుండి ఆ యా గుణకార్యములచే ఏ మాత్రము చలింపడో, గుణములు ప్రవర్తించుచున్నవని మాత్రము తెలిసికొనియుండునో, ఏ పరిస్థితులందును చలింపడో, మఱియు ఎవడు ఆత్మయందే స్థిరముగ నుండునో, మట్టిగడ్డ, ఱాయి, బంగారములందు సమదృష్టిగలిగియుండునో, సుఖదుఃఖములందు, ఇష్టానిష్టములందు, నిందాస్తుతులందు, మానావమానము

లందు శత్రుమిత్రులయందు సమభావముగల్గి యుండునో, ధీరుడై వర్తించునో, సమస్త కార్యములందును కర్తృత్వము విడిచివేయునో (లేక కామ్యకర్మలన్నిటిని త్యజించివేయునో, లేక సమస్తకర్మలను త్యజించి నిరంతరము బ్రహ్మనిష్ఠయందుండునో) అట్టివాడు గుణాతీతుడని చెప్పబడును. కావున ఈసద్గుణములే గుణాతీతుని లక్షణములైయున్నవి.

**అ॥** అచంచల భక్తితో తనను సేవించువాడు త్రిగుణములను దాటి బ్రహ్మసాక్షాత్కారమును బడయగలడని భగవానుడు వచించుచున్నాడు -

**26. మాం చ యోఽవ్యభిచారేణ భక్తి యోగేన సేవతే**
**స గుణాన్సమతీత్యైతా న్బ్రహ్మభూయాయ కల్పతే.**

**టీక:–** యః = ఎవడు, మాం చ = నన్నే, అవ్యభిచారేణ = అచంచలమైన (ఇతరము నాశ్రయింపని), భక్తియోగేన = భక్తియోగముచేత, సేవతే = సేవించుచున్నాడో, సః = అతడు, ఏతాన్ = ఈ, గుణాన్ = గుణములను, సమతీత్య = లెస్సగాదాటి, బ్రహ్మభూయాయ = బ్రహ్మముగా నగుటకు (జీవన్ముక్తుడగుటకొఱకు), కల్పతే = సమర్థుడగుచున్నాడు.

**తా:–** ఎవడు నన్నే అచంచలమైన భక్తియోగముచేత సేవించుచున్నాడో, అతడీగుణములన్నిటిని లెస్సగా దాటివైచి బ్రహ్మముగానగుటకు (జీవన్ముక్తు డగుటకొఱకు) సమర్థుడగుచున్నాడు.

**వ్యాఖ్య:–** త్రిగుణముల కవ్వల - పరమాత్మకలడు. త్రిగుణమును దాటినచో భగవత్ప్రాప్తిసిద్ధించును. కాని వానిని దాటుటెట్లు? ఎంతయో విచారణ, మనోనిగ్రహము, సంయమము దాని కవసరము. కాని భక్తియొక్క సహాయమున్నచో ఈ జ్ఞానస్థితి సులభముగ లభింపగలదు. కనుకనే గీతాచార్యులు దాదాపు ప్రతి అధ్యాయమందును, ప్రతియోగమందును, ఈ భక్తిని గూర్చి చెప్పుచున్నారు. ఈ పదునాల్గవ అధ్యాయము అఖండమగు జ్ఞానోపదేశము గావింపబడిన సందర్భమైనప్పటికిని దీని చివరగూడ భక్తియోగముయొక్క ఆవశ్యకతను నిరూపించిరి. అయితే సామాన్యభక్తి చాలదనియు, అచంచలభక్తి, 'అవ్యభిచారిణీభక్తి', అనన్యభక్తి యుండవలయుననియు బోధించిరి. అనగా, దృశ్యవిషయములందు విభజింపబడని ఏకాంతభక్తి అవసరమని భావము. భక్తిమార్గము సర్వులకును చాలసులభమైనది యగుటచే, అట్టి ఉత్తమభక్తిని ప్రతివారును సంపాదించి తద్ద్వారా భగవత్కృపను, తద్ద్వారా బ్రహ్మజ్ఞానప్రాప్తిని, దానిచే బ్రహ్మానుభూతిని బడయుటకు అనుకూలముగ నుండును. ఆ విషయమే ఇచట తెలుపుబడినది.

బ్రహ్మత్వమును ఎవడు పొందగలడో, మోక్షసిద్ధి యేప్రకారము చేకూరగలదో ఈ శ్లోకమందు చక్కగ నిరూపింపబడినది. అచంచలభక్తికలవాడే మోక్షమునకు (ఆత్మానుభూతికి) అర్హతను సంపాదించగలడని స్పష్టముగ నిచట పేర్కొనబడినది. కావున యోగ్యతయే యిచట ప్రధానముగాని జాతిమతకులవర్ణాశ్రమాదులు కావు.

'అతీత్య' అని చెప్పక 'సమతీత్య' అని చెప్పుటచే నిర్మలభక్తికలవాడు త్రిగుణములను లెస్సగ దాటగలడని తెలియుచున్నది.

'కథం చైతాం స్త్రీన్గుణానతివర్తతే' - 'ఈ గుణము లెట్లు దాటబడును?' అను అర్జునుని ప్రశ్న కీ శ్లోకము సమాధానమైయున్నది. అచంచలభక్తిచేతనే (జ్ఞానప్రాప్తినిబడసి, తద్ద్వారా) మూడుగుణములను దాటి

మనుజుడు బ్రహ్మైక్యమును బడయగల్గుచున్నాడని యిచ్చోట వచింపబడినది. కావున సులభతరమైనట్టి ఈ భక్తియోగము యొక్క సహాయముచే సాధకుడు ఆత్మజ్ఞాన మొంది త్రిగుణములనుదాటి ముక్తిని శీఘ్రముగ బడయవచ్చును.

**అ॥** తాను సాక్షాత్ పరబ్రహ్మమేయని శ్రీకృష్ణమూర్తి తెలుపుచున్నాడు -

## 27. బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహ మమృతస్యావ్యయస్య చ
## శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాన్తికస్య చ .

**టీక:-** హి = ఏలయనగా, అహమ్ = నేను, అమృతస్య = నాశరహితమును, అవ్యయస్య చ = నిర్వికారమును, శాశ్వతస్య ధర్మస్య చ = శాశ్వతధర్మస్వరూపమును, ఏకాంతికస్య సుఖస్య చ = (దుఃఖముయొక్క కలయికలేని) నిరతిశయ (అచంచల) ఆనందస్వరూపమును అగు, బ్రహ్మణః = బ్రహ్మమునకు, ప్రతిష్ఠా = ఆశ్రయమును (అనగా బ్రహ్మముయొక్క స్వరూపమును) అయియున్నాను.

**తా:-** ఏలయనగా, నేను నాశరహితమును, నిర్వికారమును, శాశ్వత ధర్మస్వరూపమును, (దుఃఖమిశ్రితముకాని) నిరతిశయ (అచంచల) ఆనందస్వరూపమును అగుబ్రహ్మమునకు ఆశ్రయమును (అనగా బ్రహ్మముయొక్క స్వరూపమును) అయియున్నాను.

**వ్యాఖ్య:-** 'అచంచల భక్తితో నన్ను సేవించువాడు త్రిగుణములనుదాటి బ్రహ్మమును బొందు'నని పైశ్లోకమునందు శ్రీకృష్ణమూర్తి తెలియజేసి, తాను వాస్తవముగ నెవరో తనయథార్థస్వరూపమెట్టిదో ఈశ్లోకమున వెనువెంటనే విశదీకరించుచున్నారు. శ్రీకృష్ణుడు సామాన్య మానవుడు కాడు. సాక్షాత్ పరమాత్మయే, పరబ్రహ్మమే. ఆ సత్యమే యిచట తెలియజేయబడినది. ఆతడు యశోదాతనయుడు మాత్రమేకాదు; నాశరహితమై, శాశ్వతధర్మస్వరూపమై, నిరతిశయ ఆనందరూపమైనట్టి బ్రహ్మమే తానని శ్రీకృష్ణమూర్తి తెలియజేసిరి. ఇక్కారణమున వారిని అచంచలభక్తితో ధ్యానించువారు భ్రమరకీటకన్యాయము ననుసరించి వారియందే అనగా బ్రహ్మమునందేలయించి బ్రహ్మస్వరూపులే యగుదురు. ధ్యాత ధ్యేయాకారముగనే పరిణమించును. ఆ పరబ్రహ్మముయొక్క స్వరూపమెట్టిదో ఇచట విశదముగ తెలుపబడినది. అది (1) అమృతము, అవ్యయము - అనగా మరణరహితమైనది, వికారవర్జితమైనది - ఈ పదములద్వారా బ్రహ్మముయొక్క 'సత్' అంశము నిరూపితమైనది. మఱియు అది (2) శాశ్వత ధర్మస్వరూపము - ఈ పదముద్వారా బ్రహ్మముయొక్క 'చిత్' అంశము నిరూపింపబడినది. (3) నిరతిశయానందరూపము - ఈ పదముద్వారా 'ఆనంద' అంశము నిరూపితమైనది. ఈ ప్రకారముగ సత్, చిత్, ఆనందమగు పరబ్రహ్మమే తానని శ్రీకృష్ణభగవానుడు తెలియజేసిరి. ఉపాసనాసౌలభ్యముకొఱకు ప్రారంభమున శ్రీకృష్ణుని యశోదాతనయుని రూపముననను, శ్రీరాముని కౌసల్యాతనయుని రూపముననను ధ్యానించినను, వాస్తవముగ వారిరువురును, నిర్గుణ, నిరాకార, సచ్చిదానంద పరబ్రహ్మరూపులేయని ఎప్పటికైనను తెలిసికొనవలసి యుండును. ఈ శ్లోకముచే ద్వైత, విశిష్టాద్వైత, అద్వైతముల మూడిటియొక్క లక్ష్యము యథార్థముగ ఒకటేయగుచున్నదని స్పష్టమగుచున్నది. ఏలయనిన ద్వైత, విశిష్టాద్వైతు లేభగవద్రూపమును అర్చించు చున్నారో ఆరూపము వాస్తవముగ సచ్చిదానందమే అయియున్నదని ఇట తేలిపోయినది. భక్తియోగము, జ్ఞానయోగము ఈ శ్లోకమున పరస్పరము కౌగిలించుకొనుచున్నవి. కావున ఇక ఆయా సంప్రదాయములవారు

పరస్పరము విమర్శించుకొనక అందఱు ధ్యానించునది ఒకే పరబ్రహ్మమనియే నిశ్చయించి వారి వారి సంస్కారమున కనుగుణ్యమైన ఉపాసనాపద్ధతిని, ధ్యేయాకారమును ఏర్పాటుచేసికొని కట్టకడకు అందఱును ఆ పరబ్రహ్మమునే చేరవచ్చును.

**ప్ర:—** శ్రీకృష్ణమూర్తి వాస్తవముగ నెట్టివారు?

**ఉ:—** పరబ్రహ్మస్వరూపుడు.

**ప్ర:—** పరబ్రహ్మ మెట్టిది?

**ఉ:—** (1) నాశరహితమైనది, నిర్వికారమైనది (సత్) (2) శాశ్వతధర్మస్వరూపమైనది (చిత్) (3) నిరతిశయ ఆనందరూపమైనది (ఆనందము).

ఓమ్

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే

శ్రీకృష్ణార్జునసంవాదే గుణత్రయ విభాగయోగో నామ

చతుర్దశో ఽధ్యాయః

ఇది ఉపనిషత్ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జునసంవాదమునగు

శ్రీ భగవద్గీతలందు గుణత్రయ విభాగయోగమను

పదునాల్గవ అధ్యాయము

ఓమ్ తత్ సత్



# పురుషోత్తమప్రాప్తియోగము



**ఊర్ధ్వమూలమధఃశాఖమశ్వత్థం ప్రాహురవ్యయమ్**
**ఛన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్.** **(15-1)**

దేనికి వేదములు ఆకులుగనున్నవో, అట్టి సంసారమను అశ్వత్థవృక్షము (రావిచెట్టు) ను పైన వేళ్ళుగలదిగను, క్రింద కొమ్మలుగలదిగను, (జ్ఞానప్రాప్తి పర్యంతము) నాశములేనిదిగను (పెద్దలు) చెప్పుదురు. దాని నెవడు తెలిసికొనుచున్నాడో, అతడు వేదార్థము నెఱింగినవాడు (అగుచున్నాడు).

ॐ

# శ్రీ భగవద్గీత

అథ పఞ్చదశోఽధ్యాయః

## పదునైదవ అధ్యాయము

పురుషోత్తమప్రాప్తియోగః

## పురుషోత్తమప్రాప్తియోగము

### ఈ అధ్యాయముయొక్క పేరు :–

'పురుషోత్తమప్రాప్తియోగము' – 'పురుషోత్తము'డనగా పరమాత్మ. ఉపాధి (క్షేత్రము) అభిమానియగు క్షరపురుషునికంటెను, జీవుడు (మనస్సు యొక్క అభిమాని) అను అక్షరపురుషునికంటెను★ వేఱై వారిరువురికంటెను ఉత్తముడై పఱగుటవలన పరమాత్మకు పురుషోత్తముడని పేరు వచ్చినది. అట్టి పురుషోత్తముడగు పరమాత్మయొక్క స్వరూపమేమి? వారెట్టి వారు? వారిని పొందుటకు మార్గమేమి? అట్లు వారిని పొందుటవలన కలుగు ఫలితమేమి? – మున్నగు విషయములన్నియు తెలుపబడిన అధ్యాయమగుటవలన దీనికి 'పురుషోత్తమప్రాప్తియోగము' అనుపేరు గలిగినది.

### ఈ అధ్యాయమందలి ప్రధాన విషయములు :–

(1) సంసారవృక్షవర్ణనము, భగవత్ప్రాప్తికి ఉపాయము (1 వ శ్లో॥నుండి 6 వ శ్లో॥ వఱకు)

(2) జీవాత్మనుగూర్చిన విచారణ (7 వ శ్లో॥ నుండి 11 వ శ్లో॥ వఱకు)

(3) సర్వత్ర భగవంతునియొక్క అస్తిత్వమును తెలుపుట, భగవత్ప్రభావమును వర్ణించుట (12 వ శ్లో॥ నుండి 15 వ శ్లో॥ వఱకు)

(4) క్షరాక్షర పురుషులనుగూర్చినట్టియు, పురుషోత్తమునిగూర్చినట్టియు వివరణము (16 వ శ్లో॥ నుండి 20 వ శ్లో॥ వఱకు)

### పూర్వాధ్యాయముతో ఈ అధ్యాయమునకుగల సంబంధము :–

క్రిందటి అధ్యాయమున త్రిగుణములను గూర్చి వివరముగదెలిపి, చివఱకు వానిని దాటుటకు ఉపాయములను తెలియజేయుచు అచంచలమగుభక్తి అక్కార్యమును లెస్సగ సాధించగలదనియు, అట్టి భక్తిద్వారా మనుజుడు మూడుగుణములను దాటి బ్రహ్మసాక్షాత్కారము నొందగలడనియు భగవానుడు 26వ

★ ఇచట అక్షరపురుషుడనగా అక్షరపరబ్రహ్మమని అర్థముకాదు. భౌతికదేహము నశించినను నశింపనట్టి జీవుడు అనియే అర్థము.

శ్లోకమున వెల్లడించిరి. అట్టి అనన్య, అవ్యభిచారభక్తిని ప్రోత్సహించునిమిత్తమున్ను, అట్టిభక్తి జీవులయం దుద్భవించుటకు సహాయభూతముగ నుండగలందులకున్ను పురుషోత్తముడగు పరమాత్మయొక్క స్వరూపము, వారిని పొందుటకుమార్గము, పొందినందువలన కలుగు ప్రయోజనము తెలుపునట్టి ఈ అధ్యాయమును ఉపక్రమింపవలసి వచ్చినది. మఱియు భగవద్భక్తి అభివృద్ధినొందుటకుగాను విషయవిరక్తియు అత్యావశ్యకము కావున అట్టి విరాగమును బోధించునిమిత్తము మొట్టమొదట ఈ దృశ్యరూప సంసారము నొక అశ్వత్థవృక్షముగబోల్చి అద్దానిని అసంగ మను ఖడ్గముచే ఛేదించివేయులాగున తెలిపిరి. అట్టి సంసారవృక్షవర్ణనముతో ఈ అధ్యాయము ప్రారంభింపబడుచున్నది.

**శ్రీ భగవానువాచ –**

## 1. ఊర్ధ్వమూలమధశ్శాఖ మశ్వత్థం ప్రాహురవ్యయమ్
## ఛన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్.

శ్రీ భగవానువాచ = శ్రీ భగవానుడు చెప్పెను –

**టీక:–** యస్య = దేనికి, ఛన్దాంసి = వేదములు, పర్ణాని = ఆకులుగానున్నవో (అట్టి), అశ్వత్థమ్ = సంసారమను అశ్వత్థవృక్షము (రావిచెట్టు)ను, ఊర్ధ్వమూలమ్ = పైనవేళ్ళుగలదిగను, అధశ్శాఖమ్ = క్రిందకొమ్మలు గలదిగను, అవ్యయమ్ = (జ్ఞానప్రాప్తిపర్యంతము) నాశములేనిదిగను, ప్రాహుః = (పెద్దలు) చెప్పుదురు (లేక, వేదములు చెప్పుచున్నవి), తత్ = దానిని, యః = ఎవడు, వేద = తెలిసికొనుచున్నాడో, సః = అతడు, వేదవిత్ = వేదార్థమునెఱింగినవాడు (అగుచున్నాడు).

**తా:–** శ్రీ భగవానుడు చెప్పెను – దేనికి వేదములు ఆకులుగనున్నవో, అట్టి సంసారమను అశ్వత్థవృక్షము (రావిచెట్టు) ను పైన వేళ్ళుగలదిగను, క్రింది కొమ్మలు గలదిగను, (జ్ఞానప్రాప్తి పర్యంతము) నాశములేనిదిగను (పెద్దలు) చెప్పుదురు. దాని నెవడు తెలిసికొనుచున్నాడో, అతడు వేదార్థము నెఱింగినవాడు (అగుచున్నాడు).

**వ్యాఖ్య:–** ఈ సంసార మొక వృక్షముగా పోల్చిచెప్పబడినది. అయితే అది అన్ని వృక్షములవలె వేళ్ళుక్రిందను, కొమ్మలు పైనను గలది కాదు. కేవలము తద్విరుద్ధముగ నున్నట్టిది. వేళ్ళు పైనను, కొమ్మలుక్రిందను గలిగియున్నది. ఇట్టి వైపరీత్యమున కీ క్రింది కారణములు చెప్పవచ్చును.

(1) పరమాత్మనుండియే అవ్యక్త మహదహంకారాదులు, సమస్తజగత్తు ఆవిర్భవించి యుండుటవలన ఊర్ధ్వమున వెలయుచున్న ఆ పరమాత్మయే క్రిందనున్న ఈ జగత్తునకు కారణభూతుడని నిరూపించుటకుగాను పైన మూలము, క్రింద శాఖలు గలిగియున్నట్లు ఈ బ్రహ్మాండవృక్షము చిత్రించబడియుండవచ్చును.

(2) లేక, మాయాకార్య మేలాగున అంతయు తలక్రిందు వ్యవహారముగ నుండునో★, ఆ రీతిగనే ఈ సంసారవృక్షము వర్తించుచున్నది. మంచిని చెడ్డగను, చెడ్డను మంచిగను, లేనిదానిని ఉన్నట్లును, ఉన్నదానిని

★ అనిత్య, అశుచి, దుఃఖ, అనాత్మసు, నిత్య, శుచి, సుఖాత్మఖ్యాతిరవిద్యా – (పతంజలి యో.సూ)

అనిత్యమైనదానిని నిత్యముగను, అపవిత్రమైనదానిని పవిత్రముగను, దుఃఖమును సుఖముగను, అనాత్మను ఆత్మగను తోపింపజేయునదియే అవిద్య (మాయ).

లేనట్లును, తోపింపజేయునది యగుటచే నీటియందు ప్రతిబింబింపబడిన వృక్షమువలె ఈ సంసారవృక్షము తలక్రిందుగ వర్ణింబడినది.

(3) వృక్షము బాటప్రక్కననున్నపుడు దానివలన యాత్రికుల కవరోధముండదు. కాని గాలికి విరిగి తలక్రిందుగ బాటపైబడినచో అపుడు కొమ్మలు క్రిందను, వేళ్ళుపైనను ఉండును. అత్తఱి ఆ వృక్షమువలన పాంథుల కవరోధముకలుగును. ఆలాగుననే ఆ సంసారవృక్షము బ్రహ్మమార్గమున పయనించువారికి ప్రబలములగు అవరోధములను కల్పించుచుండుటవలన అది తలక్రిందులుగ వర్ణింపబడియుండవచ్చును.

'అశ్వత్థమ్' - 'శ్వః' అనగా రేపు, 'నస్థః' - ఉండనిది - 'అశ్వత్థః' - అశ్వత్థము. అనగా రేపు ఉండునో లేదో సందేహముతో గూడినదే ఈ సంసారవృక్షము. నశ్వరమైనదని భావము. క్షణికములగు దేహములు, క్షణికములగు పదార్థములుగలిగి నాశవంతమై, వికారయుక్తమై యున్నదియగుటచే 'అశ్వత్థమ్' అనుపేరు దీనికి తగియే యున్నది. అయితే 'అవ్యయమ్' - నాశరహితమైనది - అని యిచట చెప్పబడినదాని కర్థము ప్రవాహరూపమున నిత్యమైనదిగా తోచునదియేగాని శాశ్వతమనికాదు. మఱియు ఆత్మజ్ఞానము పొందనంతవఱకును ఈ జననమరణములు జీవుని అంటిపెట్టుకొనియే యుండుట వలనను, జ్ఞానప్రాప్తిపర్యంతము నిలుకడగలిగి యుండుటవలనను, అజ్ఞానులకు చిరకాలము జన్మజరాది దుఃఖములు కలుగజేయుచు నుండుటవలనను ఈ సంసారవృక్షము శాశ్వతమని చెప్పబడినదేకాని, ఆత్యంతిక నిత్యత్వము దానికిలేదు. అట్లుకాకున్నచో మఱుశ్లోకముననే 'అసంగ' శస్త్రముచే ఆ వృక్షమును ఛేదించివేయవలెనని భగవాను డేల చెప్పుదురు?

'యస్తం వేద స వేదవిత్' - ఈ సంసారస్థితియొక్క రహస్యమును తెలిసికొనినచో, వేదములయొక్క సారమెఱింగినట్లేయని చెప్పబడినది. ప్రతిబింబరూపమైన ఈజగత్తునకు మూలాధారము బింబభూతమగు పరమాత్మయేయని వేదము లుద్ఘోషించుచున్నవి. కావున పరమాత్మనుండియే ఈ జగత్తు విస్తరించినదని యెఱుంగువాడు, అట్టి బ్రహ్మబీజమునుండియే జగద్వృక్ష మావిర్భవించినదని తెలిసికొనువాడు వేదార్థమును చక్కగ నెఱింగినవాడే యగును.

**ప్ర:–** సంసారవృక్ష మెట్టిదో వర్ణింపుడు?

**ఉ:–** అది (1) వేళ్ళుపైనను, కొమ్మలు క్రిందనుగలది (2) (జ్ఞానప్రాప్తిపర్యంతము) నాశములేనిది (3) వేదములే ఆకులుగా గలది.

**ప్ర:–** వేదార్థము నెఱింగినవాడెవడు?

**ఉ:–** ఈ ప్రకారముగ సంసారవృక్షమునుగూర్చి యెఱుంగువాడు, అనగా బ్రహ్మమునుండియే జగత్తుఆవిర్భవించినదని తెలిసికొనువాడు, ఈజగత్తునకాధారము పరమాత్మయేయని నిశ్చయించువాడు వేదార్థమునెఱింగినవాడగును.

**అ॥** ఆ సంసారవృక్షమునే ఇంకను వర్ణించుచున్నాడు -

**2. అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్యశాఖా**
**గుణప్రవృద్ధా విషయప్రవాలాః**
**అధశ్చ మూలాన్యనుసన్తతాని**
**కర్మానుబన్ధీని మనుష్యలోకే.**

**టీక:–** తస్య = ఈ (సంసార) వృక్షముయొక్క, శాఖాః = కొమ్మలు, గుణప్రవృద్ధాః = (సత్త్వరజస్తమో) గుణములచే వృద్ధిబొందింపబడినవియు, విషయప్రవాలాః = (శబ్దాది) విషయములనెడు చిగుళ్లుగలవియునై, అధః చ = క్రిందికిని (స్థావరము మొదలుకొని), ఊర్ధ్వం చ = మీదికిని (బ్రహ్మలోకమువఱకు), ప్రసృతాః = వ్యాపించియున్నవి, మనుష్యలోకే = మనుష్యలోకమునందు, కర్మానుబన్ధీని = కర్మసంబంధమునుగలుగజేయునవియగు, మూలాని = దానివేళ్ళు, అధః చ (ఊర్ధ్వం చ)= క్రిందను (మీదనుగూడ), అనుసన్తతాని = బాగుగ విస్తరించి (దృఢముగ నాటుకొని) యున్నవి.

**తా:–** ఆ (సంసార) వృక్షముయొక్క కొమ్మలు (సత్త్వరజస్తమో) గుణములచే వృద్ధిబొందింపబడి నవియు, (శబ్దాది) విషయములనెడు చిగుళ్లుగలవియునై, క్రిందికిని (స్థావరము మొదలుకొని) మీదికిని (బ్రహ్మలోకమువఱకు) వ్యాపించియున్నవి. మనుష్యలోకమునందు కర్మసంబంధమును (కర్మవాసనలను) గలుగజేయునవియగు దాని వేళ్ళు క్రిందను (మీదనుగూడ) బాగుగ విస్తరించి (దృఢముగ నాటుకొని) యున్నవి.

**వ్యాఖ్య:–** ఈ సంసారవృక్షము స్వల్పమైనదికాదు. అతివిశాలమైనది. అనాదికాలమునుండి కోట్లకొలది జన్మలనుండి బాగుగ దృఢపడుచువచ్చి, వేళ్ళు తన్నుకొని శాఖోపశాఖలుగ విస్తరించియున్నది. కర్మవాసనలే దీని వేళ్ళు. సత్త్వరజస్తమోగుణములచే దీని శాఖలు బలపడుచున్నవి. శబ్దాది విషయములయొక్క సేవనముచే దీని చిగుళ్లు వృద్ధియగుచున్నవి. దీనినిబట్టి త్రిగుణరాహిత్యముచేత శాఖలు, విషయవిరక్తిచేత చిగుళ్లు, వాసనారాహిత్యముచేత వేళ్ళు ఈ సంసారవృక్షమునకు తప్పక నిర్మూలితములు కాగలవని స్పష్టమగుచున్నది. చెట్టునకు ముఖ్యాధారము మూలమే అయినట్లు ఆ సంసారవృక్షమునకు కర్మవాసనలే మూలము. కావున విజ్ఞుడు వైరాగ్యవిచారణాదులచే ప్రయత్నపూర్వకముగ ఆ వాసనలను తొలగించివేసికొని సంసారబంధవిముక్తుడు కావలయును. అట్లుకాకుండ, రాగద్వేషాదులచే ఆ వాసనలను ఇంకను బలపఱచుచు పోయినచో సంసారదుఃఖ మెన్నటికిని జీవుని వదలనేరదు.

**ప్ర:–** సంసారవృక్షమును ఇంకను వర్ణించి చెప్పుము?

**ఉ:–** (1) దానికొమ్మలు (సత్త్వరజస్తమో) గుణములచే వృద్ధిబొందింపబడినవియు, (శబ్దాది) విషయములను చిగుళ్ళుగలవియునై క్రిందికి మీదికి అంతటను వ్యాపించియున్నవి. (2) మనుష్యలోకమున కర్మసంబంధమును గలుగజేయునవియగు దానివేళ్ళుగూడ క్రిందను మీదను బాగుగ వ్యాపించి దృఢపడి యున్నవి.

**అ॥** అట్టి సంసారవృక్షమును అసంగమను శస్త్రముచే ఛేదించివైచి పరమాత్మ పదము నన్వేషింపవలయునని బోధించుచున్నాడు –

**3. న రూపమస్యేహ తథోపలభ్యతే**
**నాన్తో న చాదిర్న చ సమ్ప్రతిష్ఠా**
**అశ్వత్థమేనం సువిరూఢమూల**
**మసఙ్గశస్త్రేణ దృఢేన ఛిత్త్వా .**

**4. తతః పదం తత్పరిమార్గితవ్యం**
**యస్మిన్ గతా న నివర్తన్తి భూయః**
**తమేవ చాద్యం పురుషం ప్రపద్యే**
**యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ.**

**టీక:–** అస్య = ఈసంసారవృక్షముయొక్క, రూపమ్ = స్వరూపము, తథా = ఆలాగున (ఇపుడు వర్ణింపబడినరీతిగా), ఇహ = ఈలోకమునందు (సంసారాసక్తిగలవారిచేత), నఉపలభ్యతే = తెలియబడకున్నది, అన్తః = (దాని) అంతము, న = కనబడకున్నది, ఆదిః చ న = మొదలున్నుకానరాకున్నది, సంప్రతిష్ఠాచ న = స్థితియు (మధ్యమును) కనబడకున్నది, సువిరూఢమూలమ్= గట్టిగా నాటుకొనినవేళ్ళుగల, ఏనమ్ = ఈ, అశ్వత్థమ్ = సంసారమనెడు అశ్వత్థవృక్షమును (రావిచెట్టును), దృఢేన = బలమైన, అసఙ్గశస్త్రేణ = అసంగము (ప్రాపంచిక పదార్థములందు అభిమానమును, ఆసక్తినివిడుచుట) అను ఆయుధముచేత, ఛిత్త్వా = నఱికి, తతః = పిమ్మట, యస్మిన్ = ఏస్థానమందు, గతాః = ప్రవేశించినవారు, భూయః = తిరిగి, న నివర్తన్తి = వెనుకకు (సంసారమునకు) రారో, యతః = ఎవనినుండి, పురాణీ = అనాదియైన, ప్రవృత్తిః = ఈసంసారమను వృక్షముయొక్క ప్రవృత్తి, ప్రసృతా = వ్యాపించెనో, తమ్ ఏవ చ అద్యం పురుషమ్ = ఆ ఆదిపురుషుడగు పరమాత్మనే, ప్రపద్యే = శరణుబొందుచున్నాను, (ఇతి = అను నిట్టి భావముగల్గి), తత్ పదమ్ = ఆ (పరమాత్మ) స్థానము, పరిమార్గితవ్యమ్ = వెదకబడదగినది (దానిని అన్వేషింపవలెను).

**తా:–** ఆ సంసారవృక్షముయొక్క స్వరూపము ఆలాగున (ఇపుడు వర్ణింపబడినరీతిగా) ఈప్రపంచమున (సంసారాసక్తిగలవారిచేత) తెలియబడకున్నది. దాని ఆదిగాని అంతముగాని, మధ్యము (స్థితి) గాని కనబడకున్నది. గట్టిగ వేళ్ళునాటుకొనిన ఈ సంసారమను అశ్వత్థవృక్షమును అసంగమను బలమైన ఆయుధముచే నఱికివైచి ఆపిమ్మట ఏస్థానమందు ప్రవేశించినవారు మఱల వెనుకకు (సంసారమునకు) రారో, ఎవరినుండి అనాదియైన ఈ సంసారవృక్షముయొక్క ప్రవృత్తివ్యాపించెనో, (అట్టి) ఆది పురుషుడగు పరమాత్మనే శరణుబొందుచున్నాను – అనునిట్టి (భక్తి) భావముతో ఆ పరమాత్మపదమును వెదకవలయును.

**వ్యాఖ్య:–** క్రిందటి శ్లోకములందు వర్ణింపబడినలాగున (.ఊర్ధ్వమూలముగ, అధఃశాఖగ. – ఇత్యాదిరూపముగ) ఈ సంసారవృక్ష మేల కనుపించుటలేదు? సంసారాసక్తిగల అజ్ఞానుల కట్టిరూపము తెలియబడదు. దాని ఆద్యంతమధ్యములుకూడ తెలియబడవు. ఏలయనగా వారు దానిలో మునిగియుండి సత్యమును తెలిసికొనజాలకున్నారు (చీకటిలోనున్నవారికి వస్తువులు గోచరింపనట్లు). ప్రకాశమునందు వస్తువులు తెలియునట్లు, వైరాగ్యము, ముముక్షుత్వము, ఆత్మజ్ఞానము కలవారికి దానిస్వరూపము గోచరించగలదు.

ఈసంసారవృక్షము అనాదికాలమునుండి వర్తించుచు అతివిశాలముగ, శాఖోపశాఖలుగ వ్యాపించి, బాగుగ వేళ్ళుతన్నుకొని యున్నది. కనుకనే దానివేళ్ళనుగూర్చి వర్ణించునపుడు భగవానుడు 'రూఢమూలమ్' అనిగాని, 'విరూఢమూలమ్' అనిగాని చెప్పక 'సువిరూఢమూలమ్' అని చెప్పుటకు కారణము. దానివేళ్ళు చాలగట్టిగ పాతుకొనిపోయినవని భావము. అయితే అంతమాత్రముచేత దిగులునొందవలసిన పనిలేదు. చెట్టు

ఎంతగొప్పదైనను బలమైన ఆయుధముచే నేలమట్టము కాగలదు. అట్లే ఈ సంసారవృక్షమును ఛేదించుటకు భగవానుడు చక్కని ఆయుధమును సూచించిరి. అదియే అసంగము. ప్రాపంచిక పదార్థములందు అభిమానము, ఆసక్తి గలిగియుండుటయే సంగము. అది లేకుండుటయే అసంగము. వైరాగ్యమని భావము. అయితే మందమంద వైరాగ్యభావములచేత ఈ గొప్పసంసారవృక్షచ్ఛేదనము సాధ్యపడదు. తీవ్రతర విరక్తి, పరిపూర్ణ అసంగము ఆవశ్యకమైయున్నది. కనుకనే 'దృఢేన' అను పదమును భగవానుడు ప్రయోగించిరి. ఒక పెద్ద 'ఫ్యాక్టరీ' లో మూలచక్రమునకుగల 'బెల్టు' తెగినచో అన్నియంత్రములున్ను ఎట్లాగిపోవునో, అట్లే ఈసంసారరూప బృహద్యంత్రాంగమంతయు సంగరాహిత్యము (అసంగము)చే స్తబ్ధమైపోవును. మహనీయు లీప్రపంచమున నున్నప్పటికిని ఇట్టి అసంగభావమే గలిగియుండి సంసారబాధలెవ్వియు లేకయుందురు. అయితే ఈ అసంగము బాహ్యముననేగాక, అభ్యంతర సంకల్పములందును గలిగియుండవలెను. అపుడే ఆ అసంగము పరిపూర్ణము కాగలదు.

ఇంతటితో పని పూర్తి అయినదా? కాదు. సంసారవృక్షచ్ఛేదనము అయిన పిదప అనగా దృశ్యత్యాగము అయినపిదప దృక్ - స్వరూపమును ఆశ్రయించుట అను ముఖ్యమైనపని మఱియొకటి కలదు. అప్పు తొలగవలెను, సొంతముగ కొంత ద్రవ్యమును గలిగియుండవలెను. అపుడే మనుజుడు సుఖముగ నుండగలడు. దృశ్యభావత్యాగము అప్పుతొలగుటవంటిది. అది చాలదు. ఏలయనిన అప్పు తొలగినను, తన పోషణనిమిత్తము కొంత ద్రవ్యము లేనిచో మనుజునకు తృప్తియుండదు. అట్లే దృశ్యవిరక్తి, ఆత్మపదప్రాప్తి రెండును యున్నచో జీవునకు పరిపూర్ణసుఖమేర్పడగలదు. కనుకనే భగవానుడు సంసారవృక్షచ్ఛేదనమునుగూర్చి తెలిపి, 'తతః' - అటు పిమ్మట 'పరిమార్గితవ్యమ్' - 'పరమాత్మపదాన్వేషణము గావింపవలెను' అని బోధించుటకు కారణమైనది.

ప్రపంచములో అనేక పదవులున్నప్పటికిని అన్నిటికంటె గొప్పది పరమాత్మ పదవియే కావున దానినే అనుసరించవలెనని, అన్వేషింపవలెనని ఇచట బోధింపబడినది. ఏలయనిన ఆ మహోన్నతపదమును బొందినవాడిక మరల ఈ దుఃఖభూయిష్ఠమగు సంసారస్థితికి దిగిరాడు. (యస్మిన్గతా న నివర్తని భూయః). బ్రహ్మాండమునం దేలోకమునకు పోయినను తిరిగిరావలసినదే, మఱల పుట్టవలసినదే - కాని భగవంతుని పొందినవారు, ఆత్మపదవి నధిష్ఠించినవారు మఱల జన్మింపరు. అది శాశ్వతపదము. పూర్ణదుఃఖరాహిత్యము దానివలననే కలుగును. కనుకనే అన్ని పదవులలోను అది సర్వోత్కృష్టమైనది. కాబట్టి విజ్ఞులెల్లరును దానినే అనుసరించి తరించుదురుగాక!

అయితే 'ఆ పరమపురుషునే శరణుబొందుచున్నాను' (తమేవ పురుషం ప్రపద్యే) అను భక్తిభావముతో, నిరహంభావనతో ఆ యాత్మపదమును అన్వేషింపవలసియున్నది. నిర్మలభక్తిగలవానికి ఆత్మజ్ఞానము త్వరలో లభించగలదు.

**ప్ర:–** సంసారవృక్ష మేప్రకారముగనున్నది?

**ఉ:–** బాగుగ వేళ్ళుతన్నుకొనియున్నది.

**ప్ర:–** దానిని ఛేదించుటెట్లు?

**ఉ:–** 'అసంగము' (ప్రాపంచిక పదార్థములందు ఆసక్తి, అభిమానములేకుండుట) అను బలమైన ఖడ్గముచే అది ఛేదించివేయబడగలదు.

ప్ర:- అట్లు సంసారవృక్షమును ఛేదించినపిదప యేమి చేయవలెను?

ఉ:- పరమాత్మపదమును అన్వేషింపవలెను.

ప్ర:- ఆ పరమాత్మ యెట్టివాడు?

ఉ:- (1) ఆతనిని పొందినవారు మఱల వెనకకురారు (తిరిగి ఈ సంసారమున జన్మింపరు) (2) ఆతనినుండియే ఈ జగత్తంతయు అవిర్భవించినది. (3) ఆతడు ఆదిపురుషుడు.

అ॥ నాశరహితమగు అట్టి పరమాత్మపదమును ఎవరు పొందగలరో వచించుచున్నాడు -

**5. నిర్మానమోహా జితసఙ్గదోషా**
**అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః**
**ద్వన్ద్వైర్విముక్తాః సుఖదుఃఖసంజ్ఞై**
**ర్గచ్ఛన్త్య మూఢాః పదమవ్యయం తత్ .**

టీక:- నిర్మానమోహాః = అభిమానము (లేక అహంకారము), అవివేకము లేనివారును, జితసఙ్గదోషాః = సంగము (దృశ్యపదార్థములయం దాసక్తి) అను దోషమును జయించినవారును, అధ్యాత్మ నిత్యాః = నిరంతరము ఆత్మజ్ఞానము (బ్రహ్మనిష్ఠ) కలవారును, వినివృత్తకామాః = కోరికలన్నియు లెస్సగ (వాసనాసహితముగ) తొలగినవారును, సుఖదుఃఖ సంజ్ఞైః = సుఖదుఃఖములనంబడు, ద్వంద్వైః = ద్వంద్వములచేత, విముక్తాః = బాగుగ విడువబడినవారును (అగు), అమూఢాః = అజ్ఞానరహితులు (జ్ఞానులు), తత్ = ఆ, (వెనుకజెప్పబడిన), అవ్యయమ్ = నాశములేని, పదమ్ = స్థానమును (మోక్షపదమును), గచ్ఛన్తి = పొందుచున్నారు.

తా:- అభిమానము (లేక, అహంకారము) అవివేకము లేనివారును, సంగము (దృశ్యపదార్థములం దాసక్తి) అను దోషమును జయించినవారును, నిరంతరము ఆత్మజ్ఞానము (బ్రహ్మనిష్ఠ) గలవారును, కోరికలన్నియు లెస్సగ (వాసనాసహితముగ) తొలగినవారును, సుఖదుఃఖములను ద్వంద్వములనుండి బాగుగ విడువబడినవారును అగు జ్ఞానులు అట్టి అవ్యయమగు బ్రహ్మపదమును (మోక్షమును) బొందుచున్నారు.

వ్యాఖ్య:- పునరావృత్తిలేని శాశ్వతబ్రహ్మపదమును (మోక్షమును) ఎవరు పొందగలరో ఈ శ్లోకమునందు చక్కగ నిరూపింపబడినది. ఆఱు సల్లక్షణములు గలవారు అట్టి మహోన్నతపదవిని జేబట్టగలరు. అవి యేవి యనిన -

(1) అభిమాన, అవివేకరాహిత్యము.

(2) సంగమును దోషమును జయించుట - (సంగమనగా దృశ్యపదార్థములందు ఆసక్తి, అసంగమనగా అది లేకుండుట, వానితో అంటకనుండుట).

(3) నిరంతరము ఆత్మయందు నిష్ఠగలిగియుండుట. ఇచట నిరంతరము (నిత్యాః) అను పదము

గమనింపగదినది. ఏదియో యొక కాలమున దైవచింతన చేయుట మంచిదేకాని, అది చాలదు, క్రమక్రమముగ ఆ దైవనిష్ఠాసమయయమును పెంచుకొనుచుపోయి 'నిరంతర దైవనిష్ఠ' యను స్థితిని జేరుకొనవలయును. ఏలయనిన, దైవభావమను ప్రకాశము లేనిచో మాయయను అంధకారము వెంటనేవచ్చి అలముకొనును. అత్తఱి మహాప్రమాదము సంభవించును. కావున నిరంతర అధ్యాత్మనిష్ఠద్వారా మాయకు ఒకింతేని అవకాశమీయక నుండవలెను. ప్రపంచములో మూడురకముల జనులుందురు. కొందఱు అహర్నిశము ఆత్మస్థితిని, దైవభావమును గల్గియుందురు. వీరు ఉత్తములు. మఱికొందఱు కొద్దిసేపు దైవచింతనగలిగి తదుపరి ప్రాపంచిక కార్యకలాపములయందు నిమగ్నులగుదురు. వీరు మధ్యములు. సాధనాతిశయముచే వీరు మొదటితరగతికి క్రమముగ జేరుకొనగలరు. ఇక నిరంతరము దృశ్యపదార్థవ్యామోహములోనే కొట్టుకొనుచు దైవస్మరణ ఒకింతైనను లేనివారు కనిష్ఠులు. ఈ స్థితి నింద్యము, గర్హితము అయియున్నది. కావున వివేకవంతు లిద్దానిని త్యజించవలయును.

(4) ఇక మోక్షపదప్రాప్తికి అవశ్యకమైన నాల్గవ సుగుణము కోరికలను సంపూర్ణముగ, వాసనాసహితముగ తొలగించుట (వినివృత్తకామాః). 'నివృత్త' అని చెప్పక 'వినివృత్త' అని చెప్పుటవలన కోరికలన్నియు నిశ్శేషముగ, సమూలముగ (వాసనాసహితముగ) తొలగిపోవలెనని భావము. 'అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః' అను ఈ శ్లోకపాదమును ముముక్షువులు సదా స్మరించుచుండుట మంచిది. ఏలయనిన ఆధ్యాత్మికసాధనసర్వస్వమంతయు ఈ రెండు పదములలోనే ఇమిడియున్నది. మొదటిది తత్త్వజ్ఞానము (అధ్యాత్మనిత్యాః), రెండవది వాసనాక్షయము (వినివృత్తకామాః). మొదటిది దృక్ - స్వరూపస్థితి. రెండవది దృశ్యరాహిత్యము. ఈ రెండిటిని సాధకుడు ఏకకాలములో అభ్యసించుచురావలెనని శాస్త్రము లుద్ఘోషించుచున్నవి.

(5) ఇక ఐదవసాధన సుఖదుఃఖాది ద్వంద్వరాహిత్యము.

(6) ఆఱవది అమూఢత్వము. అనగా అజ్ఞానము లేకుండుట. అజ్ఞానమును, అవిద్యను దరికిచేరనీయక, జ్ఞానమందే సదా నిలుకడగలిగియుండుట. ఈ ప్రకారముగ భగవానుడు తెలిపిన ఆఱుసాధనలను చక్కగ అవలంబించువారు పొందునట్టి మహత్తర ఫలితమేది? అవ్యయమగు మోక్షమే (గచ్ఛన్తి పదమవ్యయమ్). ప్రపంచములోని పదవులన్నియు వ్యయములు, నాశవంతములు, క్షయిష్ణువులు. పరమాత్మపదవి యొక్కటియే అవ్యయమైనది. శాశ్వతమైనది. తరుగులేనిది. కావున విజ్ఞులెల్లరును అద్దానినే అన్వేషింపవలయును.

ప్ర:- పరమాత్మపద మెట్టిది?

**ఉ:-** అవ్యయమైనది. నాశరహితమైనది.

ప్ర:- దాని నెవరు, పొందగలరు?

**ఉ:-** (1) అభిమానము అవివేకము లేనివారు (2) సంగము (దృశ్యవస్తువులం దాసక్తి) అను దోషమును జయించినవారు (3) నిరంతరము ఆత్మస్థితియందుండువారు (4) కోరికలను పరిపూర్ణముగ (వాసనాసహితముగ) తొలగించినవారు (5) సుఖదుఃఖాది ద్వంద్వములనుండి విడువబడినవారు (6) మూఢత్వము (అజ్ఞానము) లేనివారు - ఈ ప్రకారములగు ఆఱుసల్లక్షణములుగలవారు పరమాత్మపదమును (మోక్షపదవిని) పొందగలరు.

**అ॥** అట్టి పరమాత్మపదమును బొందినవారు తిరిగిరారని అనగా మఱల జన్మబంధమున తగుల్కొనరని వచించుచున్నాడు -

## 6. న తద్భాసయతే సూర్యో న శశాఙ్కో న పావకః
## యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ.

**టీక:-** తత్ = ఆ (పరమాత్మ) స్థానమును, సూర్యః = సూర్యుడు, న భాసయతే = ప్రకాశింపజేయజాలడు, శశాఙ్కః = చంద్రుడు, న (భాసయతే) = ప్రకాశింపజేయజాలడు, పావకః = అగ్ని, న (భాసయతే) = ప్రకాశింపజేయజాలడు, యత్ = దేనిని, గత్వా = పొంది, న నివర్తన్తే = తిరిగిరానేరరో, (మఱల జన్మింపరో), తత్ = అది, మమ = నాయొక్క, పరమమ్ = శ్రేష్ఠమైన, ధామ = స్థానము.

**తా:-** ఆ (పరమాత్మ) స్థానమును సూర్యుడుగాని, చంద్రుడుగాని అగ్నిగాని ప్రకాశింపజేయజాలరు. దేనిని పొందినచో (జనులు) మఱల (ఈ సంసారమునకు) తిరిగిరారో అదియే నాయొక్క శ్రేష్ఠమైన స్థానము (అయియున్నది).

**వ్యాఖ్య:-** సూర్యచంద్రాగ్నులు దృశ్యవస్తువులను ప్రకాశింపజేయుచున్నవి. నేత్రము ఆ సూర్యాదులను ప్రకాశింపజేయుచున్నది. బుద్ధి ఆనేత్రమును ప్రకాశింపజేయుచున్నది. ఆత్మ ఆబుద్ధిని ప్రకాశింపజేయుచున్నది. కావున ఇక సూర్యాదులు ఆత్మ నెట్లు ప్రకాశింపజేయగలవు? ముండకోపనిషత్తునందు ఈవిషయము చక్కగ నిరూపింపబడినది. (న తత్ర సూర్యో భాతి...).

"యద్గత్వా న నివర్తన్తే" - ఆత్మస్థానమును బొందినవారు మఱల జన్మపరంపరలందు, సంసారదుఃఖరూపగర్తమందు పడరు. బ్రహ్మాండమునం దేలోకమునకేగినను మఱల తిరిగి రావలసినదే. మఱల జన్మింపవలసినదే. దుఃఖము నంతముచేయగలశక్తి వానికిలేదు. కాని ఒక్క పరమాత్మస్థానమునకు మాత్ర మట్టి శక్తికలదు. అద్దానిని బొందినవారు తిరిగిరారు. మఱల దుఃఖప్రదమగు ఈసంసారమున జన్మింపరు. పునరావృత్తిరహిత శాశ్వత కైవల్యపదమే అయ్యది. ఈ విషయమునే పై శ్లోకములో 'యస్మిన్గతా న నివర్తన్తి భూయః' అని తెలిపియుండిరి.

తనయొక్క స్థానమును వర్ణించుచు భగవానుడు 'పరమమ్' (శ్రేష్ఠమైనది) అని పేర్కొనినందువలన భగవానుని దృష్టియం దన్ని పదములలోనికి ఆ యాత్మపదమే, బ్రహ్మరూప నిజపదమే సర్వశ్రేష్ఠమను అభిప్రాయమును వెలిబుచ్చినట్లైనది. కావున దేవునిదృష్టిలో ఏది గొప్పదో దానినే ప్రాజ్ఞుడనుసరించవలెనుగాని ప్రాపంచికజనులదృష్టిలో గొప్పదగు వస్తువునుగాదు.

**అ॥** జీవుడు వాస్తవముగ తనయొక్క అంశమేయని భగవానుడు తెలుపుచున్నాడు -

## 7. మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః
## మనష్షష్ఠానీన్ద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి.

**టీక:-** మమ ఏవ = నాయొక్కయే, సనాతనః = అనాదియగు (నిత్యమగు), అంశః = అంశము, జీవలోకే = జీవలోకమందు, జీవభూతః = జీవుడై, ప్రకృతిస్థాని = ప్రకృతియందున్న, మనఃషష్ఠాని = మనస్సు

ఆఱువదిగా గలిగిన (త్వక్, చక్షుః, శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణ, మనంబులను), ఇన్ద్రియాణి = ఇంద్రియములను, కర్షతి = ఆకర్షించుచున్నది.

**తా:–** నాయొక్కయే అనాదియగు (నిత్యమగు) అంశము జీవలోకమందు జీవుడై ప్రకృతియందున్న త్వక్ చక్షు శ్ర్తోత్ర జిహ్వా ఘ్రాణ మనంబు లను ఆఱు ఇంద్రియములను ఆకర్షించుచున్నది.

**వ్యాఖ్య:–** 'మమైవాంశః' – జీవుడు (జీవాత్మ), దేవుడు వాస్తవముగ వేఱువేఱు కారు. దేవుని యంశయే జీవుడు. జీవుడు సాక్షాత్ దేవుడే. ఇరువురును సనాతన స్వరూపులే. నిత్యులే. కాని అజ్ఞానవశమున, ఉపాధిసంబంధమువలన జీవుడు ఆ ఉపాధిని, ఉపాధిగుణములను తనయం దారోపించుకొని, ఆ ఉపాధికిజెందిన ఇంద్రియాదులతో గూడినవానిగ తన్ను భావించుకొనుచున్నాడు. ఘటాకాశము విశాలాకాశము యొక్క అంశమాత్రమే యగును. విశాలాకాశముయొక్క లక్షణములన్నియు ఘటాకాశమునందు ఉండియేయున్నవి. అట్లే పరమాత్మయొక్క సనాతనత్వము జీవునియందు (జీవాత్మయందు) కలిగియేయున్నది. ఎపుడు జీవుడు తన ఉపాధిభావమునువీడి నిజరూపమును స్మరించునో అపు డాతడు సాక్షాత్ పరమాత్మయే యగుచున్నాడు.

'మమైవాంశః' అని జీవునిగూర్చి చెప్పుటవలన భగవంతునియొక్క అంశమే జీవుడని తేలుటచే, ఇక నట్టి భగవదంశములలో తక్కువయేమి? ఎక్కువయేమి? కావున సర్వజీవులును సమానులే. సర్వులు భగవదంశస్వరూపులేయని విజ్ఞుడు దలంచి సర్వులయెడల ప్రేమ, దయ, సమబుద్ధిగలిగి యుండవలెను. భగవానుని ఈవాక్యముచే జీవులకు పరమధైర్యము లభించుచున్నది. ఏలయనగా, ఇంతవఱకు అజ్ఞానముచే తాను బద్ధుడననియు, అల్పుడననియు, దుఃఖిననియు తలంచియున్నవాడు ఈ వాక్యములచే గొప్ప ఆశ్వాసమును బడయుచున్నాడు. తాను వాస్తవముగ అల్పుడుకాదు, జీవుడుకాదు, నశ్వరుడుకాదు, తాను సనాతనుడు. సాక్షాత్ పరమాత్మయే తాను. మాయావశముచే ప్రకృతికి లోబడి, భగవంతుని మఱచి, ప్రకృతిస్థములగు ఇంద్రియాదులతో గూడి కాలక్షేపము చేయుచున్నాడు. వానిని ఆకర్షించుచున్నాడు. (కర్షతి). అహా! ఇదివఱలో (అజ్ఞానకాలమున) ఎంత గొప్ప తప్పిద మాచరించుచునుండెను. ఇప్పుడీ భగవద్వాక్యస్మరణముచే జ్ఞానముకలుగ, అట్టి పొరపాటున కాస్కారములేదు. తిరిగి తన అమర, ఆనంద, ఆత్మరూపమునుగూర్చి చింతించి జీవుడు దానితో నైక్యమొందవలెను. అదియే మోక్షము.

జీవుడు తన స్వస్థాన మీ జీవలోకముకాదనియు ఆత్మలోకమేయనియు భావింపవలెను. ఇది తన స్వస్థలముకాదనియు పరస్థలమనియు చింతింపవలెను. దీనినే ఆశ్రయించుకొనినచో, ఈఇంద్రియములనే, ఈ ప్రకృతినే నమ్ముకొనినచో జన్మపరంపర తప్పదు. సంసారబాధలు తప్పవు – అని నిశ్చయించుకొని జీవుడు తన నిజరూపమును నిజస్థానమును అగు పరమాత్మను సంస్మరించి తద్రూపుడుగనే శేషించి ధన్యుడు కావలయునని ఈశ్లోకముయొక్క తాత్పర్యమై యున్నది.

**ప్ర:–** జీవుడు వాస్తవముగ నెట్టివాడు?

**ఉ:–** భగవదంశస్వరూపుడు, సనాతనుడు (నిత్యుడు).

**ప్ర:–** కాని అజ్ఞానవశమున నేమియొనర్చుచున్నాడు?

**ఉ:–** తాను ఉపాధినని తలంచి, ఇంద్రియాదులతోను, మనస్సుతోనుగూడి కాలక్షేపము చేయుచున్నాడు.

**ప్ర:–** కాబట్టి జీవు డేమిచేయవలెను?

**ఉ:–** (దృశ్యవస్తువులయెడల విరక్తిగలిగి) తన నిజరూపమగు పరమాత్మను సంస్మరించి తద్రూపుడుగనే శేషించవలెను. అదియే మోక్షము.

**అ||** జీవుడు తాను దేహమునువీడి చనునపుడును, నూతన శరీరమును గైకొనునపుడును ఈ ఇంద్రియాదులను (వాని సంస్కారములను) తనవెంట గొనిపోవునని వచించుచున్నాడు –

## 8. శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః
## గృహీత్వైతాని సంయాతి వాయుర్గన్ధానివాశయాత్ .

**టీక:–** ఈశ్వరః = దేహేంద్రియాది సంఘాతమునకు ప్రభువగు జీవుడు, యత్ చ అపి = ఎప్పుడైతే, ఉత్క్రామతి = (శరీరమును విడిచి) బయలుదేఱుచున్నాడో, యత్ = ఎప్పుడు, శరీరమ్ = (మఱియు) శరీరమును, అవాప్నోతి = పొందుచున్నాడో, (తదా = అప్పుడు), ఆశయాత్ = పుష్పాది స్థానములనుండి, వాయుః = గాలి, గన్ధాన్ ఇవ = వాసనలనువలె, ఏతాని = ఈ (ఆఱు) ఇంద్రియములను, గృహీత్వా = గ్రహించి, సంయాతి = వెడలుచున్నాడు.

**తా:–** దేహేంద్రియాది సంఘాతమునకు, ప్రభువగు జీవుడు శరీరమును విడుచునప్పుడును, నూతన శరీరమును పొందునపుడును – పుష్పాది స్థానములనుండి గాలి వాసనలను గ్రహించిపోవు చందమున – పంచేంద్రియములు, మనస్సు అను ఆఱింటిని గ్రహించి వెడలుచున్నాడు.

**వ్యాఖ్య:–** 'జీవుడు ఈ శరీరమును వీడునపుడు నూతన శరీరమును గ్రహించునపుడు' – అను వాక్యముద్వారా జీవుడు శరీరము కాదనియు, శరీరముకంటె అన్యుడనియు, వస్త్రమువలె శరీరమును ధరించుచు, త్యజించుచు నుండుననియు స్పష్టమగుచున్నది. కాబట్టి దేహాభిమానమును త్యజించివేయవలెను. (తాను ఆత్మయే యను భావము గలిగియుండవలెను).

మఱియు 'ఈశ్వరః' (ప్రభువు) – అను పదముచే జీవుడు వాస్తవముగ దేహమునకు, ఇంద్రియములకు, మనస్సునకు, దేహస్థమగు తదితరమునకు, వెయ్యేల, సమస్త సంఘాతమునకు ప్రభువేకాని సేవకుడుకాడనియు, బానిసకాడనియు ఋజువగుచున్నది. కాని అజ్ఞాని ఇట్టి ఈశ్వరస్థితిలో, ప్రభుస్థితిలోనుండక, సేవకావృత్తి నవలంబించి, ఇంద్రియమనంబులకు దాసానుదాసుడై దీనముగ ప్రవర్తించుచున్నాడు. అవి చెప్పినట్లు ఆడుచున్నాడు. భగవానుడు తెలిపిన ఈశ్వరత్వమెచట, ఈ క్షుద్రపరాధీనత్వమెచట! కావున ఈ 'ఈశ్వర' పదమును గుర్తునందుంచుకొని, దేహేంద్రియాదులకు లోబడకనుండవలెను. మఱియు తాను వాస్తవముగ జీవుడుకాడు, సాక్షాత్ ఈశ్వరుడే యను భావమున్ను గలిగియుండవలెను.

'గృహీత్వైతాని సంయాతి' – జీవుడు శరీరమును వీడి చనుచున్నపుడును, తిరిగి శరీరమును

గ్రహించునపుడును ఇంద్రియ మనంబులను వెంట తీసికొని వెళ్ళుచున్నాడని చెప్పబడినది. జీవుడు తన జీవితకాలమంతను అనేక ప్రాపంచిక పదార్థములను సేకరించుటలోను, అనుభవించుటలో కాలమును గడిపివైచుచున్నాడు. కాని తుట్టతుదకు వానిలో ఒక్క వస్తువునుగూడ తనవెంట (మరణానంతరము) తీసికొని వెళ్ళుటకు హక్కులేదని భగవాను డిచట స్పష్టముగ చెప్పివైచిరి. అయితే తనవెంట ఈ యాఱింటిని మాత్రము తీసికొనివెళ్ళవచ్చును - అవియే పంచేంద్రియములు, మనస్సు. కావున ఆ యాఱు వస్తువులను శుద్ధముగా, పవిత్రముగా, దైవసంస్కారయుతములుగా చేసి కొనవలయును. అట్లు కావించుటకై జీవితములో ఎంతయో పారమార్థిక ప్రయత్నము చేయవలసియున్నది. ఏలయనగా, అవిమాత్రమే జీవునకు వెంటవచ్చి నూతనజన్మను ఏర్పఱచును. ఇంద్రియమనంబులు శుద్ధముగానున్నచో శుద్ధజన్మ, మలినముగానున్నచో క్రిమికీటాది క్షుద్రజన్మవచ్చును. కాబట్టి భావికాలస్థితి, భావిజన్మ మనచేతిలోనున్నవి. ఇపుడే ఆ యింద్రియమనంబులను ఆధ్యాత్మికచింతనచే పవిత్రీభూతములుగ నొనర్చుకొని పతనమునుండి తప్పించుకొనవలెను.

ఆ ఇంద్రియమనంబులను ఆఱు పదార్థములే మరణానంతరము జీవునకు దారి బత్తెము. అవితప్ప ఇతరమగు ఒక్క తృణముకూడ వెంటరాదు. అంత్యకాలమున ఎవరిని పిలిచినను ఎవరును అక్కరకు రారు. భార్యబంధుపుత్రగృహధన పశుక్షేత్రాదులెవ్వియు అత్తఱి జీవునకు సహాయముచేయజాలవు. వెంటగూడ రాజాలవు. రాదలంచినను వచ్చుటకు హక్కులేదు. శుద్ధమొనర్పబడిన (దైవికముగా జేయబడిన) మనస్సు, ఇంద్రియములే, అపుడు జీవునకు సహాయమొనర్పగలవు. వానికి మాత్రమే అతనివెంట వెళ్లుటకు, సహాయముచేయుటకు అనుమతిగలదు. అవియే వానిని సంరక్షించుటకు రక్షకుల (Body - Guards) వలె వెంటవచ్చును. కాబట్టి జీవితకాలమంతయు మనుజుడు జాగరూకుడై ఆ యింద్రియమనంబులను ప్రయత్నపూర్వకముగ శుద్ధమొనర్చుకొనవలెను. మన భవిష్యత్తును మనమే ఇపుడే నిర్మించుకొనవలెను. నీచజన్మగాని, శుద్ధజన్మగాని, జన్మరాహిత్యముగాని అన్నియు మనచేతులలోనేయున్నవి. కావున మూడవదియగు జన్మరాహిత్యముకొఱకే విజ్ఞుడు పాటుపడుచు, తదనుగుణ్యమగు పవిత్రవాతావరణమునే సృష్టించుకొనవలయును.

'వాయుర్గన్ధానివాశయాత్' - శ్రీకృష్ణమూర్తి తాను బోధింపదలచిన విషయము బాగుగా అర్థమగుటకుగాను ఇట నొక చక్కని ఉపమానమును పేర్కొనిరి. సుగంధమునుగాని, దుర్గంధమునుగాని వాయువు ఆయావస్తువులనుండి గ్రహించి వేఱొక స్థానమునకు గొనిపోవుచుండును. వానికి సంబంధించిన సూక్ష్మతరములగు అణువులను సంగ్రహించుకొని అది వెడలుచుండును. ఎంతయోదూరమునగల పుష్పధూపాదులనుండి సుగంధము, క్రుళ్ళినవస్తువులనుండి, అమేధ్యమునుండి దుర్గంధము మనుజున కనుభూత మగుచుండుటకు కారణమిదియే అయియున్నది. ఆ యా సుగంధ, దుర్గంధాణువులను వాయువు వెంటతీసికొని ఇటునటు పోవుచుండును. ఇక్కార్యమున వాయువుయొక్క పక్షపాతమేమియులేదు. వార్తావాహకుని పగిది అది ప్రవర్తించును. అట్లే జీవుడు మరణానంతరము ఇంద్రియమనంబులను గైకొని వెడలి నూతన శరీరమున ప్రవేశించును. ఇంద్రియములు, మనస్సు అపవిత్రములుగానున్నచో, జీవుడు మరణానంతర మాదుర్వాసనాయుక్తములగు ఇంద్రియములనే, పాపాణువులనే గ్రహించిపోయి వానితో సహా నూతనమగు క్షుద్రశరీరమున ప్రవేశించును. ఇంద్రియమనంబులు పవిత్రములుగానున్నచో మరణానంతరం ఆసద్వాసనాయుక్తములగు ఇంద్రియములనే, పుణ్యాణువులనే గ్రహించి నూతనమగు శుద్ధశరీరమున ప్రవేశించును. కావున ఇచట భగవంతునకుగాని, కర్మదేవతలకుగాని ఏవిధమగు పక్షపాతమున్నులేదు. ఆశయము (చిత్తము) నందెట్టి సంస్కారములుండునో దానినిబట్టియే జన్మ యేర్పడును. లేక ఆశయము

(చిత్తము) వాసనారహితమై, నిస్సంకల్పస్థితిని బడసినచో ఇక జన్మయేలేక మోక్షము, జీవబ్రహ్మైక్యము ఇచటనే సిద్ధించును. కాబట్టి ప్రయత్నపూర్వకముగ వారివారి భవిష్యత్తును వారే ఇచట తీర్చిదిద్దుకొనవలెను. జీవితమందలి ప్రతినిమిషమున్ను ఆ యింద్రియమనంబులను శుద్ధమొనర్చుటయందు, నిగ్రహించుటయందు వినియోగించినచో అవియే జీవుని సద్గతికి గొనిపోవును. జన్మరాహిత్యమునుగూడ గల్గించును.

**ప్ర:–** శరీరమును వీడినపుడుగాని, క్రొత్తశరీరమును గ్రహించునపుడుగాని జీవుడు తనతో ఏ యే వస్తువులను తీసుకొనిపోవును?

**ఉ:–** మనస్సును, ఇంద్రియములను, వానివానియందుండు సంస్కారములను గైకొని పోవును. ఇతరమగు ఏ వస్తువును గాదు.

**ప్ర:–** ఏ ప్రకారముగ?

**ఉ:–** సుగంధవస్తువునుండిగాని, దుర్గంధవస్తునుండిగాని వాయువు ఆ యా సుగంధ దుర్గంధాణువులను తీసికొనిపోవునట్లు.

**అ॥** జీవుడు ఏ యింద్రియములను ఆశ్రయించి విషయముల ననుభవించునో తెలియజేయుచున్నాడు –

## 9. శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణమేవ చ
## అధిష్ఠాయ మనశ్చాయం విషయా నుపసేవతే.

**టీక:–** అయమ్ = ఈ జీవుడు, శ్రోత్రమ్ = చెవిని, చక్షుః = కంటిని, స్పర్శనమ్ చ = చర్మమును (త్వగింద్రియమును), రసనమ్ = నాలుకను, ఘ్రాణమ్ ఏవ చ = ముక్కును, మనః చ = మనస్సును, అధిష్ఠాయ = ఆశ్రయించి, విషయాన్ = శబ్దాదివిషయములను, ఉపసేవతే = అనుభవించుచున్నాడు.

**తా:–** ఈ జీవుడు (జీవాత్మ) చెవిని, కంటిని, చర్మమును (త్వగింద్రియమును), నాలుకను, ముక్కును, మనస్సును ఆశ్రయించి (శబ్దాది) విషయములను అనుభవించుచున్నాడు.

**వ్యాఖ్య:–** 'అధిష్ఠాయ మనశ్చాయమ్' – మనస్సును, ఇంద్రియములను ఆశ్రయించి – అని చెప్పుటవలన జీవుడు (జీవాత్మ) వాస్తవముగ మనస్సుకంటెను, ఇంద్రియముల కంటెను వేఱుగనున్నాడనియు, ఇంద్రియ మనంబులు ఉపాధిరూపములేయనియు, (అజ్ఞానవశమున) ఆ ఉపాధిని ఆశ్రయించి అతడు సుఖదుఃఖముల ననుభవించుచున్నాడనియు స్పష్టమగుచున్నది. కాబట్టి మనోవికారములుగాని, ఇంద్రియవికారములుగాని ఆత్మకుజెందవు. తనకంటె వేఱైన ఇంద్రియమనంబులను ఉపాధిరూపమైన తొడుగును ధరించి ఆత్మ (జీవుడు) విషయాదులను, సుఖదుఃఖాదులను అనుభవించుచున్నాడు కావున వాస్తవముగ ఆ ఉపాధితోగాని, ఉపాధిజనిత వికారములతోగాని ఆ యాత్మకు ఏలాటి సంబంధమున్ను లేదు.

**ప్ర:–** జీవుడు (జీవాత్మ) ఏ యే ఇంద్రియములను ఆశ్రయించి విషయముల ననుభవించుచున్నాడు?

**ఉ:–** (1) చెవి (2) కన్ను (3) చర్మము (4) నాలుక (5) ముక్కు - అను పంచజ్ఞానేంద్రియములను (6) మనస్సును ఆశ్రయించి విషయముల ననుభవించుచున్నాడు.

**అ॥** ఈ ఆత్మను ఎవరు తెలిసికొనగలరో, ఎవరు తెలిసికొనలేరో వచించుచున్నాడు -

**10. ఉత్క్రామన్తం స్థితం వాఽపి భుఞ్జానం వా గుణాన్వితమ్**
**విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః.**

**టీక:–** ఉత్క్రామన్తమ్ = (ఒక శరీరమునుండి మఱియొక శరీరమునకు) బయలుదేఱుచున్న వాడును, వా = లేక, స్థితమ్ = శరీరమందున్నవాడును, వా = లేక, భుఞ్జానమ్ = విషయముల ననుభవించుచున్నవాడును, గుణాన్వితమ్ అపి = (సత్త్వాది) గుణములతో గూడిన వాడును నగు, (ఏనమ్ = ఈ జీవాత్మను), విమూఢాః = అజ్ఞానులు, న అనుపశ్యన్తి = చూడజాలరు (తెలిసికొనజాలరు), జ్ఞానచక్షుషః = జ్ఞానదృష్టిగలవారు, పశ్యన్తి = చూచుచున్నారు (తెలిసికొనుచున్నారు).

**తా:–** (ఒక శరీరమునుండి మఱియొక శరీరమునకు) బయలుదేఱుచున్నవాడును, లేక, శరీరమునందున్నవాడును, లేక విషయముల ననుభవించుచున్నవాడును, (సత్త్వాది) గుణములతో గూడినవాడునగు ఈ జీవాత్మను అజ్ఞానులు చూడజాలరు (తెలిసికొనజాలరు). జ్ఞానదృష్టిగలవారు మాత్రము చూచుచున్నారు (తెలిసికొనుచున్నారు). (అనగా ఆ యా క్రియలు జరుపుచున్నప్పు డాతనిని అజ్ఞులెఱుంగజాలరనియు, జ్ఞానులుమాత్ర మెఱుంగ గలరనియు భావము).

**వ్యాఖ్య:–** భగవంతుడు మాకేల కానుపించకనున్నారని అనేకులు ప్రశ్నించుచుందురు. దానికి, సమాధానమును శ్రీకృష్ణమూర్తి ఈ శ్లోకమున నొసంగిరి. నీవు జ్ఞాననేత్రమును (ఆత్మానాత్మవివేకమును) సంపాదించినచో ఇచ్చటనే, ఈ శరీరమునందే పరమాత్మను దర్శింపగలవు, అని భగవానుడు నుడువుచున్నాడు. వారికై దూరమున వెతకనక్కఱలేదు. జీవునియొక్క స్వశరీరముననే ఆతనిని కనుగొనవచ్చును. తినుచు, త్రాగుచు, అనుభవించుచున్న ఆ వ్యక్తిని వివేచనతో, సూక్ష్మదృష్టితో, జ్ఞాననేత్రముతో మనుజుడు కనుగొనగలడు (పశ్యన్తిజ్ఞానచక్షుషః). ప్రాపంచిక దృశ్యవాసనాప్రాబల్యమువలన అజ్ఞానులాతనిని తెలిసికొన జాలకున్నారు. అద్దమును ప్రపంచమువైపు త్రిప్పి పట్టుకొనినచో ముఖము అందు కానరాదు. తనవైపు త్రిప్పుకొనినచో మాత్రమే కానవచ్చును. అట్లే మనస్సును బహిర్ముఖముగ, చపలముగ, వాసనాయుక్తముగ గావించినచో ఆత్మ వస్తువు అందు గానరాదు. అంతర్ముఖముగ, నిశ్చలముగ, వాసనారహితముగ నొనర్చిన మాత్రమే కానవచ్చును. నిశ్చలమనస్సు, ఆత్మానాత్మవివేకము కలవానికే ఆత్మదర్శనము, లేక భగవద్దర్శనము అగుచుండును. (ఇచట భగవద్దర్శనమనగా భగవదనుభూతి యని అర్థము).

'ఉత్క్రామన్తం ...' అని చెప్పుటచే ఆత్మ జీవరూపమున ఈ శరీరమందే తినుచు, త్రాగుచు, మఱియొక శరీరమును బొందుచునున్నదని తెలియుచున్నది. కావున ముముక్షువులు భగవద్దర్శనముకై దూరదూరముగ బోనక్కఱలేదు.

జ్ఞాననేత్రముచే మహనీయులాయాత్మను తప్పక చూడగల్గుచున్నారని ఇట చెప్పుటవలన జీవితమునందు ప్రతి మానవునియొక్క ప్రథమకర్తవ్యము (అవివేకమును బోగొట్టుకొని, విషయవిరక్తిగలిగి మనస్సును బయటకు పరుగెత్తనీయకుండచేసి జ్ఞాన విచారణద్వారా, హృదయపరిశోధనద్వారా లోనగల)

ఆత్మనెఱుంగుటయే యగును. 'పశ్యన్తి జ్ఞానచక్షుషః' అని అసందిగ్ధముగ చెప్పివేయబడినందువలన జ్ఞాననేత్రమును సంపాదించుటయే తరువాయి భగవద్దర్శనము జీవునకు లభించియే తీరునని స్పష్టమగుచున్నది. అట్టి జ్ఞాననేత్రము లేనిచో, జీవితము నిరర్థకమే కాగలదు.

**ప్ర:–** ఆత్మను ఎవరు చూడగలరు? ఎవరు చూడలేరు?

**ఉ:–** జ్ఞాననేత్రముగలవారు చూడగలరు. అది లేనివారు అనగా అజ్ఞానులు చూడలేరు. (జ్ఞాననేత్రము = ఆత్మానాత్మవివేకము).

**అ॥** చిత్తశుద్ధిలేనివారు ప్రయత్నము సలిపినప్పటికిని ఆత్మను చూడజాలరని చెప్పుచున్నాడు –

**11. యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితమ్**
**యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః.**

**టీక:–** యతన్తః = (ఆత్మసాక్షాత్కారమునకై) ప్రయత్నముచేయుచున్న, యోగినః = యోగులు, ఆత్మని = తమయందు, అవస్థితమ్ = ఉన్నట్టి, ఏనమ్ = ఈ ఆత్మను, పశ్యన్తి = చూచుచున్నారు (అనుభూతమొనర్చుకొనుచున్నారు), యతన్తః అపి చ = (అట్లు) ప్రయత్నముచేయుచున్నవారైనను, అకృతాత్మానః = చిత్తశుద్ధిలేని, అచేతసః = అవివేకులు, ఏనమ్ = ఈ ఆత్మను, న పశ్యన్తి = చూడజాలకున్నారు.

**తా:–** (ఆత్మాసాక్షాత్కారమునకై) ప్రయత్నము చేయుచున్న యోగులు తమయందున్నట్టి ఈ ఆత్మను చూచుచున్నారు (అనుభూతమొనర్చుకొనుచున్నారు). అట్లు ప్రయత్నము చేయుచున్నవారైనను చిత్తశుద్ధిలేని అవివేకులు ఈ ఆత్మను చూడజాలకున్నారు.

**వ్యాఖ్య:–** అనేకులు భగవత్ప్రాప్తికై యత్నించుచున్నప్పటికిని అందులో కొందఱు సఫలురగుటకును, కొందఱు విఫలురగుటకును కారణమేమియో ఇచట తెలుపబడుచున్నది. చిత్తశుద్ధిగలిగి యత్నించువారు తప్పక సాఫల్యమును బొందగలరు. అనగా పరమాత్మను తమయందు సాక్షాత్కరించుకొనగలరు. కాని అదేప్రయత్నము, అవే ధ్యానాదులు గావించుచున్నప్పటికిని, మలినచిత్తులు, సంస్కరింపబడని మనస్సు గలవారు, పరమాత్మను సాక్షాత్కరించుకొనజాలరు. కొందఱు శాస్త్రపాండిత్యము మున్నగునవి మాత్రము కలిగి హృదయపవిత్రతలేక ఆత్మాన్వేషణమునకై ఉపక్రమింతురు. మఱికొందఱు కేవలము వేషధారులుగ నున్నవారై ధ్యానాదులను చేయుచున్నట్లు కనుపించుచుందురు. అట్టివారు ఇంద్రియనిగ్రహము లేనికారణముచేతను, చిత్తశుద్ధి లేనందువలనను ఆత్మను తమయందు గాంచజాలరని ఈశ్లోకమున ఘంటాపథముగ చెప్పివేయబడినది. క్షేత్రమును బాగుగ దున్ని, కలుపుతీసి, శుద్ధముచేసి, ఎరువుచల్లి ఆపిదప విత్తనము వేసినచో చక్కగ పైరగును. అట్లుకాక, దున్నక, కలుపుతీయక వేసినను, లేక ఊషరక్షేత్రమునవేసినను ఆ విత్తనము మొలవదు. ఒకవేళ మొలచినను పెరగదు. ఒకవేళ పెరిగినను ఫలించదు. అట్లే సాధనచతుష్టయసంపత్తి మున్నగువానిద్వారా చిత్తమును మున్ముందు శుద్ధమొనర్చుకొనినచో, అత్తఱి ఆత్మవిచారణాధ్యానాదులచే అతిసులభముగ ఆత్మ యనుభూతము కాగలదు. అవి లేనివారు ఎంతప్రయత్నించినను ఆత్మను చూడజాలరు. భగవద్దర్శనమునకై రెండు విషయములు ప్రతివారికి అత్యవసరములని ఇచ్చోట తెలుపబడినది. అవియేవి యనిన – (1) ప్రయత్నము (2) చిత్తశుద్ధి – ఈ రెండును గలవారికి పరమాత్మ తప్పక అనుభూతుడు కాగలడు. రెండును అవసరములే. 'యతన్తః' – అని

చెప్పబడుటవలన పరమార్థమార్గమున ప్రయత్నము అత్యావశ్యకమని తెలుచున్నది. అయితే ఆ ప్రయత్నమునకు చిత్తశుద్ధియు తోడుగానున్నపుడు అది యింకను ప్రకాశించును. ఇచట 'అచేతసః' అని చెప్పబడినదానికి అర్థము కేవలము మూఢులని అజ్ఞానులని, నాస్తికులని కాదు. ఏలయనిన ఆ యత్నించువారికి దైవమును పొందవలెనను తలంపుగలదు. ముముక్షుత్వము కలదు. లేకున్న వారు భగవత్ప్రాప్తికై అసలు ప్రయత్నమే చేయరుగదా! వీరు ప్రయత్నము చేయుచున్నారు. కాని వక్రమార్గమున, అపసవ్య పద్ధతిలో చేయుచున్నారు. అట్టివారు అనుభవజ్ఞులగు పెద్దల సాంగత్యముచేసినచో సత్యమార్గమును కనుగొని తరించగలరు. దైవమార్గమున ప్రయత్నము మంచిదేకాని దానికి చిత్తశుద్ధికూడ తోడైనచో ఇంకను రాణించును. బాగుగ ఫలించును. మోటుగా సాధనచేయుటవలన గొప్పప్రయోజనములు చేకూరవు; సాధనపద్ధతిని, సాధన రహస్యములను భగవత్ప్రోక్తములగు ఇట్టి వచనములవలనను, సద్గ్రంథములవలనను, మహాత్ముల సాంగత్యమువలనను తెలిసికొని ముముక్షువులు సక్రమపద్ధతిలో ధ్యానించి తరించవలయును.

**ప్ర:–** పరమాత్మ యెచట గలడు?

**ఉ:–** తనయందే.

**ప్ర:–** ఆతనిని ఎవరు చూడగలరు?

**ఉ:–** చిత్తశుద్ధిగలిగి ధ్యానాదిప్రయత్నములను చేయువారు.

**ప్ర:–** ఎవరు చూడలేరు?

**ఉ:–** చిత్తశుద్ధిలేక ప్రయత్నము చేయువారు.

**ప్ర:–** కాబట్టి భగవద్దర్శనమున కేవి అవసరము?

**ఉ:–** (1) చిత్తశుద్ధి (2) ప్రయత్నము.

**అ॥** అట్టి పరమాత్మయొక్క మహిమను నాలుగు శ్లోకములద్వారా తెలియజేయుచున్నాడు –

**12. యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్
యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్.**

**టీక:–** ఆదిత్యగతమ్ = సూర్యునియందుగల, యత్ తేజః = ఏ తేజస్సు (ప్రకాశము, చైతన్యము), అఖిలమ్ = సమస్తమైన, జగత్ = ప్రపంచమును, భాసయతే = ప్రకాశింపజేయుచున్నదో, చంద్రమసి = చంద్రునియందు, యత్ (తేజః + అస్తి) = ఏ తేజస్సుకలదో, అగ్నౌచ = అగ్నియందును, యత్ (తేజః + అస్తి) = ఏ తేజస్సుకలదో, తత్ = ఆ, తేజః = (సమస్త) తేజస్సును, మామకమ్ = నాదియని, విద్ధి = తెలిసికొనుము.

**తా:–** సూర్యునియందేతేజస్సు (ప్రకాశము, చైతన్యము) ప్రపంచమునంతను ప్రకాశింప జేయుచున్నదో, అట్లే చంద్రునియందును, అగ్నియందును ఏ తేజస్సుగలదో, అదియంతయు నాదిగా నెఱుంగుము.

**వ్యాఖ్య:–** సూర్యాది ప్రకాశకపదార్థములందలి తేజస్సు తనదియని భగవానుడు తెలుపుటవలన ఆ యా వస్తువులను దర్శించినపుడు అవి భగవద్విభూతులే యను భావన గలిగియుండవలెను. ప్రపంచములో అనేక పదార్థములున్నప్పటికిని వాని యన్నింటికిని మఱియొక వస్తువును ప్రకాశింపజేయు సామర్థ్యములేదు. సూర్యచంద్రాగ్నులకుమాత్రమే కలదు. అవి తాము ప్రకాశించును; ఇతరమునుగూడ ప్రకాశింపజేయు చుండును. వాని యందలి ఆ ప్రకాశకశక్తి, ఆ తేజస్సు భగవానుని విభూతియే అయియున్నదని ఈశ్లోకముద్వారా తెలియుచున్నది. (అయితే సూర్యాదులు ప్రకాశింపజేయుననియు ఈ సందర్భమున జ్ఞాపకమునందుంచుకొనవలెను).

**ప్ర:–** సూర్యచంద్రాగ్నులయందలి తేజస్సు ఎట్టిది?

**ఉ:–** పరమాత్మసంబంధమైనది; దైవమునకు జెందినది.

**అ॥** భూమియందు ప్రవేశించి సస్యాదుల నభివృద్ధిపఱచునది తానే యని భగవానుడు పలుకుచున్నాడు –

**13. గామావిశ్య చ భూతాని ధారయామ్యహ మోజసా**
**పుష్ణామి చౌషధీస్సర్వా స్సోమో భూత్వా రసాత్మకః.**

**టీక:–** చ = మఱియు, అహమ్ = నేను, గామ్ = భూమిని, ఆవిశ్య = ప్రవేశించి, ఓజసా = బలము (శక్తి) చేత, భూతాని = (చరాచరములగు సమస్త) ప్రాణికోట్లను, ధారయామి = ధరించుచున్నాను, రసాత్మకః = రసస్వరూపుడగు, సోమః = చంద్రుడను, భూత్వా = అయి, సర్వాః = సమస్తములైన, ఓషధీః = సస్యముల (ధాన్యాదులను), పుష్ణామి = పోషించుచున్నాను.

**తా:–** మఱియు నేను భూమిని ప్రవేశించి శక్తిచేత సమస్త ప్రాణికోట్లను ధరించుచున్నాను (నిలుపుచున్నాను). రసస్వరూపుడగు చంద్రుడనై సస్యము లన్నింటిని పోషించుచున్నాను.

**వ్యాఖ్య:–** 'ధారయామి ఓజసా' – అని చెప్పుటవలన జగత్తునందలి సమస్త పదార్థములకును, ప్రాణికోట్లకును శక్తిని, సామర్థ్యమును, బలమును ఒసంగునది ఆ పరాత్పరుడే యని తెలియుచున్నది. పైవాక్యమువలన శ్రీకృష్ణమూర్తి వసుదేవునకు జన్మించిన ఒకానొక చిన్న ఉపాధిమాత్రమే కాదనియు, విశ్వవ్యాపి, జగద్భర్తకూడ యనియు స్పష్టమగుచున్నది. మఱియు సస్యములను అభివృద్ధిపఱచునది తానేయని చెప్పుటచే జీవులు భుజించు ఆహారము సాక్షాత్ పరమాత్మవలననే సంభవించుచున్నదని తెలియుచున్నది. కావున, ఆహారమును భుజించునపుడు ఈ అన్న మెవరివలన మనకు వచ్చినది? అని ఆలోచించి అన్నస్రష్ట, అన్నదాత యగు ఆ సర్వేశ్వరునకు సర్వులును కృతజ్ఞత చూపవలసియున్నారు. మనుజుడు తాను ఆహారమును భుజించుటకుముందు అద్దానిని ఆ దేవదేవునకు సమర్పించి తదుపరి దైవభావనతో దానిని భుజించవలెను. సస్యములను భగవానుడు పోషించనిచో జనులకు అన్నము దొఱకదు; సూర్యచంద్రాగ్నులకు ప్రకాశమివ్వనిచో లోక మంధకారావృతమై యుండును. కాబట్టి ఎన్నియో అనుకూలములుచేసి ప్రాణులను భరించుచున్న ఆ జగద్ధాత్రికి మనుజులు సదా కృతజ్ఞులై వర్తించవలెను. సర్వకాలములందును. వారిని స్మరించుచు, కీర్తించుచు నుండవలెను.

**ప్ర:–** భగవానుడే యేప్రకారములుగ ప్రజలకు మేలొనర్చుచున్నారు?

**ఉ:–** (1) భూమియందు ప్రవేశించి బలముచే సమస్తప్రాణులను భరించుచున్నారు. (2) చంద్రుడయి సస్యములన్నిటిని పోషించుచున్నారు.

**ప్ర:–** కావున జీవులేమి చేయవలెను?

**ఉ:–** అతనికి కృతజ్ఞులై వర్తించుచు, సంకీర్తన, జప, పూజాదులచే నిరంతర మాతనిని స్మరించుచుండవలెను.

**అ॥** జీవులు భుజించు ఆహారమును తానే పచనమొనర్చుచున్నానని భగవానుడు చెప్పుచున్నాడు –

## 14. అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః
## ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్.

**టీక:–** అహమ్ = నేను, వైశ్వానరః = వైశ్వానరుడను జఠరాగ్నిగా, భూత్వా = అయి, ప్రాణినామ్ = ప్రాణులయొక్క, దేహమ్ = శరీరమును, ఆశ్రితః = ఆశ్రయించినవాడనై, ప్రాణాపానసమాయుక్తః = ప్రాణ, అపానవాయువులతో గూడుకొని, చతుర్విధమ్ = నాలుగు విధములగు, అన్నమ్ = అన్నమును, పచామి = పక్వముచేయుచున్నాను.

**తా:–** నేను 'వైశ్వానరుడ'ను జఠరాగ్నిగానయి ప్రాణులయొక్క శరీరమును ఆశ్రయించి, ప్రాణాపానవాయువులతో గూడుకొని నాలుగువిధములగు అన్నమును పచనము చేయుచున్నాను.

**వ్యాఖ్య:–** క్రిందటిశ్లోకములో భగవానుడు తాను సస్యములను పోషించుటద్వారా జీవులు తిను అన్నమును సృష్టించుచున్నానని పలికి, ఇపుడా యన్నమును తానే జీవుల శరీరములందు పచనమొనర్చుచున్నానని వచించుచున్నారు. శరీరము ఆహారముచే నేర్పడుచున్నది. ఆ యాహారము జఠరాగ్నిచే పక్వముకానిచో, రక్తాదులద్వారా శరీరమంతటను వ్యాపించనేరదు. కావున జఠరాగ్ని శరీరమున కీలకస్థానమాక్రమించుకొనియున్నది. భగవానుడు తానే జఠరాగ్నిరూపమున అచ్చోట వర్తించుచున్నారని చెప్పుటవలన, దేహ నిర్మాత, దేహపోషణకర్త వారేయని స్పష్టమగుచున్నది. ఈ ప్రకారముగ ఆహారమును ధాన్యాదులద్వారా సృజించి, మఱల దానిని చక్కగా పచనముచేసి శరీరమునకు పుష్టిని కలుగజేయుచు జీవులకు మహోపకృతి నొనర్చుచున్న ఆ పరమాత్మకు కృతజ్ఞత చెల్లించక, ఆ అన్నము వారికి నివేదించక భుజించువాడు ఎంతటి కృతఘ్నుడు? అట్టివాడు దొంగయే యగునని పూర్వము శ్రీకృష్ణమూర్తి చెప్పియుండుట గమనించదగినది. [యో భుఙ్క్తేస్తేన ఏవ సః (3-12)] కనుకనే ఆహారమును భుజించుటకు ముందు దేవునకు 'నైవేద్యము' సమర్పించు ఆచారము లోకములో నేర్పడినది. అట్లు దేవునకు నివేదింపకుండ, దైవభావనలేకుండ భుజించునది అపవిత్రమే కాగలదు. కాబట్టి ప్రతివారును తాము భోజనముచేయుటకు ముందుగా, తమ యాహారమును దైవమునకుసమర్పించి, లేక అందలి కొంతభాగమును దైవస్వరూపులేయగు భూతకోట్లకు పెట్టి, భగవద్భావనతో భుజించవలెను. అప్పుడా భోజనమను క్రియ యజ్ఞముగాను, భుజించుపదార్థము అమృతముగాను మారిపోవును.

'ప్రాణినాం దేహమాశ్రితః' - అని చెప్పుటవలన భగవంతుడు అతిసమీపమున దేహమందే యున్నాడని నిశ్చితమగుచున్నది. కావున తమ శరీరమున దైవసన్నిధానమును అనుభవించుచు, భగవద్భక్తిగలిగి, పాపాచరణలేక జనులు పవిత్రమార్గమునే చేబట్టవలెను.

'పచామ్యన్నం చతుర్విధమ్' - పరమాత్మ జీవుల శరీరములో జఠరాగ్నిరూపమున వర్తించుచు, వారు తిను నాలుగు విధములైన ఆహారమును జీర్ణమొనర్చుచున్నారని తెలుపబడినది.

నాలుగు విధములైన ఆహారము - (1) భక్ష్యము (2) భోజ్యము (3) లేహ్యము (4) చోష్యము.

(1) భక్ష్యము = దంతములచే కొఱికి తినబడు కఠినపదార్థములు, పిండివంటలు, కూరగాయలు మున్నగునవి.

(2) భోజ్యము = నాలుకచే చప్పరించి మ్రింగబడు మెత్తటి వస్తువులగు అన్నము మొదలైనవి.

(3) లేహ్యము = నాలుకచే రుచిచూడబడు పచ్చళ్లు మొదలైనవి.

(4) చోష్యము = నోటిచే జుఱ్ఱబడు పాయసము, చారు, మజ్జిగ మున్నగునవి.

ఇట్టియాహారమును భగవానుడే జీర్ణమొనర్చుచుండుటవలన ఇక ఆహారవిషయమై మనుజుడెంత జాగరూకుడుగా నుండవలెనో యోచించుకొనవలయును. ఆహారసంబంధముగ ఈ క్రింది జాగ్రతలను పాటించుట ఉత్తమము - (1) అమితముగా భుజించి జీర్ణకర్తయగు భగవంతునకు పనిని కల్పించరాదు. (2) సాత్త్వికాహారమునే భుజించవలెను. రాజస, తామసాహారములను వర్జించవలెను★. (3) తిను ఆహారమును భగవంతునకు ముందుగా భక్తితో నివేదించవలెను. (4) ఆ యాహారము న్యాయార్జితవిత్తముచే నేర్పడినదిగా నుండవలెను. అధర్మమార్గముద్వారా సంపాదించిన ధనముతో పంచభక్ష్యపరమాన్నములను భుజించుట కంటె, న్యాయార్జితమైన సొత్తుతో లభించిన అంబలిత్రాగి బ్రతుకుట ఉత్తమము. భగవానుడు ప్రతివాని కడుపులో దాగి అంతయు గమనించుచున్నారు. కావున ఆహారాదివిషయములలో జనులు బహుజాగరూకులై యుండవలెను.

ఈ ప్రకారముగ ఈ అధ్యాయములో ఆహారవిషయమైన ప్రస్తావన విశేషముగ వచ్చియుండుటంబట్టి భోజనకాలమున ఈ అధ్యాయమును పఠించు ఆచారము లోకమున ఏర్పడినది. అనేక ఆశ్రమములందును, మఠములందును, గృహములందును ఈ అధ్యాయమును సమష్టిగాగాని వ్యష్టిగాగాని భోజనకాలమున జనులు పఠించి తదుపరి ఆహారమును సేవించుచుందురు. ఈ ప్రకారముగ భగవద్భావనతో భుజించువానికి పెట్టబడు అన్నము సాక్షాత్ భగవంతునకు పెట్టబడినట్లేయగును. అంతటి పుణ్యమాతనికి తప్పక లభింపగలదు. మఱియు దైవధ్యానముతో భుజించుటవలన మనుజుని శరీరములోని అణువణువు దైవశక్తితో గూడియుండును.

భోజనముచేయుటకు ముందుగా 15వ అధ్యాయమంతయును చెప్పి చివఱకు చేతిలో తీర్థమును గ్రహించి "బ్రహ్మార్పణం బ్రహ్మహవిః -" అను గీత 4వ అధ్యాయములోని 24వ శ్లోకమును భక్తితో పఠించి పిదప ఆ నీటిని అన్నముపైచల్లి ఆ పిదప భుజించుట ఉత్తమము.

ప్ర:- పరమాత్మ జీవుల శరీరములందే రూపమున వెలయుచున్నాడు?

★ సాత్త్విక, రాజస, తామసాహారముల వివరణమునకై 17వ అధ్యాయములోని 8,9,10వ శ్లోకములను జూడుడు.

**ఉ:–** (వైశ్వానరుడను) జఠరాగ్నిరూపమున.

**ప్ర:–** అట్లుండి యాతడేమిచేయుచున్నాడు?

**ఉ:–** ప్రాణాపానవాయువులతోగూడి జీవులు భుజించు ఆహారమును పచనమొనర్చుచున్నాడు.

**ప్ర:–** కాబట్టి జను లేమి చేయవలెను?

**ఉ:–** తమశరీరముననే వెలయుచున్నట్టి ఆ పరమాత్మను భక్తితో ధ్యానించుచు, తాము భుజించుటకు ముందుగా నాతని కర్పించి, దైవభావనతో భుజించవలెను.

**అ॥** సకల జీవుల హృదయములందును తాను వెలయుచున్నాడనియు, అన్నిటికిని తానే యాధారభూతుడనియు భగవానుడు తెలుపుచున్నాడు -

**15. సర్వస్య చాహం హృది సన్నివిష్టో**
**మత్తః స్మృతి ర్జ్ఞాన మపోహనం చ**
**వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో**
**వేదాన్తకృద్వేదవిదేవ చాహమ్.**

**టీక:–** అహమ్ = నేను, సర్వస్య చ = సమస్తప్రాణులయొక్కయు, హృది = హృదయమునందు, సన్నివిష్టః = ఉన్నవాడను, మత్తః = నా వలన, స్మృతిః = జ్ఞాపకశక్తి, జ్ఞానమ్ = జ్ఞానము (తెలివి), అపోహనం చ = మఱపును, (భవన్తి = కలుగుచున్నవి), సర్వైః = సమస్తములైన, వేదైః చ = వేదములచేతను, వేద్యః = తెలియదగినవాడను, అహమ్ ఏవ = నేనే, వేదాన్తకృత్ = వేదాంతమును నిర్మించినవాడను, వేదవిత్ ఏవ చ = వేదము నెఱిగినవాడనుగూడ, అహమ్ ఏవ = నేనే (అయియున్నాను).

**తా:–** నేను సమస్తప్రాణులయొక్క హృదయమందున్నవాడను; నావలననే (జీవునకు) జ్ఞాపకశక్తి, జ్ఞానము (తెలివి), మఱపు కలుగుచున్నవి. వేదములన్నిటిచేతను తెలియదగినవాడను నేనే అయియున్నాను. మఱియు వేదము నెఱిగినవాడనుగూడ నేనే అయియున్నాను.

**వ్యాఖ్య:–** 'సర్వస్య' - జాతిమతకులతారతమ్య మెద్దియులేక చరాచరప్రాణికోట్ల యందు భగవానుడు నివసించుచున్నాడని చెప్పబడుటవలన ఇక నెవరును అధైర్యపడవలసిన పనిలేదు. మహాపాపియైనను చండాలుడైనను తనయందలి దైవసన్నిధిని స్మరించి పవిత్రాచరణద్వారా వారిని తెలిసికొనవచ్చును. అట్టి పాపియు తన వెనుకనున్న, తనకు ఆధారముగనున్న అఖండ చైతన్యమును స్మృతియందుంచుకొనినచో తన నిజరూపమును చింతించినచో పుణ్యాత్ముడే అయి తరించును.

ఇట్టి అవకాశమును శ్రీకృష్ణపరమాత్మ గీతయందు సర్వులకును కల్పించియున్నారు. ఎటువంటివారికైనను తరించుటకు చక్కని అవకాశము నొసంగియున్నారు. తరంగము చిన్నదైనను, పెద్దదైనను రెండిటివెనుక మహాసముద్రమే కలదు. కాబట్టి చిన్నతరంగము (ప్రాణి) అధైర్యమొందవలసిన పనిలేదు.

తనయందలి అంతర్యామియగు పరమాత్మను తెలిసికొనిన చాలును. ఆ పరమాత్మ అందఱి యొక్కయు 'జన్మహక్కు' అని గీతాచార్యులు 'సర్వస్య' అను పదముద్వారా భేరిమ్రోగించి చెప్పుచున్నారు.

'హృది' (హృదయమునందు) - అని పేర్కొనుటవలన, భగవానుడు ప్రతివానికిని అతిసమీపమున హృదయమందే వర్తించుచున్నారని భావము. కావున శిక్షకుడు చెంతనే యున్నారని గ్రహించి, పాపకృత్యములనుచేయక భగవత్ప్రీతికరములైన కార్యములనే (ధర్మకార్యములనే) చేయవలెను.

'మత్తః స్మృతిర్జ్ఞాన మపోహనం చ' - స్మృతి, జ్ఞానము, మఱపు - ఇవి యన్నియు మనస్సుయొక్క వివిధరూపములు. పరమాత్మయో మనస్సునకు అధిష్ఠానముగ, ఆధారభూతుడుగ నున్నవారు. కావున వారివలననే యవి కలుగుచున్నవని చెప్పబడినది. దీనినిబట్టి కేవలము స్థూలవస్తువులనేకాక, అతిసూక్ష్మములగు జీవుని మానసిక ప్రవృత్తులనుగూడ భగవానుడు గమనించుచున్నట్లును, వారికి తెలియకుండ ఏదియు మనస్సునందు జరుగదనియు స్పష్టమగుచున్నది. కాబట్టి ప్రతివారును తమ మనస్సునం దేలాటి అపవిత్రత, మాలిన్యము, దుస్సంకల్పములు, విషయవాసనలు రానీయకుండ భద్రముగా చూచుచుండవలెను.

'వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః' - వేదములందు, శాస్త్రములందు అనేక దేవులు, దేవతలు చెప్పబడినప్పటికిని, తెలిసికొనదగినవాడు ఆ పరమాత్మ ఒకడే అయియున్నారు. బ్రహ్మవిష్ణుమహేశ్వరాది వివిధదేవులందఱును ఒక్క పరమాత్మ యొక్కయే వివిధరూపులైయున్నారు. ప్రపంచమున ఒకే చరమలక్ష్యము, ధ్యేయము, జ్ఞేయము కలదు. అది సచ్చిదానందపరబ్రహ్మమే (పరమాత్మయే) యగును.

'వేదాన్తకృత్'- వేదములన్నిటిని సృష్టించినది సాక్షాత్ పరమాత్మయేకాని మానవ మాత్రుడుకాడని యిట స్పష్టముగ తెలుపబడుటవలన, ఆ వేదాదులందు తెలుపబడిన సత్యములందు ('ఇవి భగవత్ప్రోక్తములే' అను) నమ్మకముగలిగి ప్రవర్తింప వలయును. అవి దైవనిర్మితములగుటచే వానియం దఖండవిశ్వాసముంచవలెను. లోకమున గురు పరంపర చెప్పునపుడును 'ఓమ్ నారాయణం పద్మభువం....' అని మొట్టమొదట ఆ పరమాత్మనే, శ్రీమన్నారాయణునే పేర్కొనుచుందురు.

**ప్ర:–** భగవంతు డెచటనున్నాడు?

**ఉ:–** అందఱియొక్క హృదయమున వసించుచున్నాడు.

**ప్ర:–** స్మృతి, జ్ఞానము, మఱపు ఎవనివలన గలుగుచున్నవి?

**ఉ:–** ఆ పరమాత్మవలననే.

**ప్ర:–** వేదములన్నిటిచే తెలియబడదగిన వారెవరు? వేదాంతమును సృష్టించినదెవరు? వేదమును లెస్సగ దెలిసినవారెవరు?

**ఉ:–** ఆ పరమాత్మయే.

**అ||** క్షర, అక్షర పురుషులయొక్క స్వరూపమును వర్ణించుచున్నాడు -

**16. ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ**
**క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే.**

**టీక:–** లోకే = ప్రపంచమునందు, క్షరః చ = క్షరుడు (నశించువాడు) అనియు, అక్షరః ఏవ చ = అక్షరుడు అనియు, ద్వౌ ఇమౌ పురుషౌ (స్తః) = ఈ ఇద్దఱు పురుషులు కలరు. సర్వాణి భూతాని = సమస్తప్రాణులయొక్క దేహములయొక్క అభిమాని, క్షరః = క్షరుడని, (ఉచ్యతే = చెప్పబడుచున్నాడు), కూటస్థః = కూటస్థుడగు (మోక్షపర్యంతము నశింపకనుండునట్టి) జీవుడు (మనస్సుయొక్క అభిమాని), అక్షరః = అక్షరుడనియు, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

**తా:–** ప్రపంచమునందు క్షరుడనియు, అక్షరుడనియు ఇరువురు పురుషులు కలరు. అందు సమస్త ప్రాణులయొక్క దేహముల యొక్క అభిమాని క్షరుడనియు, కూటస్థుడగు జీవుడు (మనస్సుయొక్క అభిమాని) అక్షరుడనియు చెప్పబడుచున్నారు.

**వ్యాఖ్య:–** క్షరపురుషుడు, అక్షరపురుషుడు, పురుషోత్తముడు - అను ముగ్వురు పురుషులను గూర్చి చెప్పబోవుచు మొట్టమొదట క్షరాక్షరులను గూర్చి భగవానుడీ శ్లోకమునందు తెలియజేయుచున్నాడు. నశించునట్టి దేహాదిదృశ్యపదార్థములన్నియు అనగా చరాచరజీవులయొక్క ఉపాధులన్నియు తాము అని అభిమానించువారు క్షరపురుషులనియు, ఆత్మచైతన్యము యొక్క ప్రతిబింబరూపులగు జీవులు (మనస్సులు తాము అని అభిమానించువారు) అక్షరపురుషులనియు ఇచట చెప్పబడిరి. క్షరమైన దేహములతో పోల్చిచూచినచో మోక్షపర్యంతము అనేక జన్మలకాలమువఱకు నశింపకుండ ఉండువా డగుటచే జీవుడు అక్షరుడనియు, కూటస్థుడనియు చెప్పబడెను. అయితే ఈ అక్షరుడు 8వ అధ్యాయమందు తెలుపబడిన అక్షరపరబ్రహ్మమనిగాని, కూటస్థుడనగా కూటస్థ చిదాత్మయనిగాని యెవరును తలంచరాదు. ఏలయనిన వారిరువురికిని 'అకాశపాతాళ' భేదముకలదు. ఒకడు బింబము; మఱియొకడు ప్రతిబింబము. ఈ అధ్యాయమందు తెలుపబడిన అక్షరుడు ప్రతిబింబము - అనగా జీవుడు. ఈ క్షరాక్షరుల యిరువురి కంటెను వేఱైనట్టి, అనగా ఉపాధి అభిమానికంటెను, చిత్ప్రతిబింబమగు జీవుని (మనస్సుయొక్క అభిమాని) కంటెను వేఱుగానున్నట్టి ఉత్తమపురుషుని గూర్చి రాబోవు శ్లోకమున చెప్పబడును. అతడే పరమాత్మ.

**ప్ర:–** ఈ ప్రపంచమున పురుషు లెందఱుకలరు? వారెవరు?

**ఉ:–** ఇరువురు కలరు - (1) క్షరుడు (2) అక్షరుడు - అని.

**ప్ర:–** అందు క్షరపురుషు డెవడు?

**ఉ:–** సమస్తప్రాణులయొక్క దేహాద్యుపాధుల అభిమాని క్షరపురుషుడని చెప్పబడును.

**ప్ర:–** అక్షరపురుషు డెవడు?

**ఉ:–** కూటస్థుడగు జీవుడు (మనస్సుయొక్క అభిమాని).

**అ॥** వారిరువురికంటెను వేఱైనట్టి ఉత్తమపురుషునిగూర్చి వచించుచున్నాడు -

**17. ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః**
**యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః.**

**టీక:–** యః = ఎవడు, లోకత్రయమ్ = మూడులోకములను, ఆవిశ్య = ప్రవేశించి, బిభర్తి = భరించుచున్నాడో (అట్టి), అవ్యయః = నాశరహితుడును, ఈశ్వరః = జగన్నియామకుడును, అన్యః = (పైనదెలిపిన క్షరాక్షరు లిద్దఱికంటెను) వేఱైనవాడును (అగు), ఉత్తమః పురుషః = ఉత్తమపురుషుడు (పురుషోత్తముడు), పరమాత్మేతి = పరమాత్మయని, ఉదాహృతః = చెప్పబడియున్నాడు.

**తా:–** ఎవడు మూడులోకములందును ప్రవేశించి వానిని భరించుచున్నాడో, అట్టి నాశరహితుడును, జగన్నియామకుడును, (పైనదెల్పిన క్షరాక్షరులిద్దఱికంటెను) వేఱైనవాడును నగు ఉత్తమపురుషుడు పరమాత్మయని చెప్పబడుచున్నాడు.

**వ్యాఖ్య:–** పైన దెలిపిన నశ్వరదేహాభిమానికంటెను, చిత్ - ప్రతిబింబరూపుడగు జీవుని (మనస్సుయొక్క అభిమాని) కంటెను వేఱుగ ఆత్మ కలదు. ఆతడే ఉత్తమపురుషుడని యిట వచింపబడెను. ఏలయనిన, క్షణికమగు దేహము యొక్క అభిమాని కంటెను, బద్ధుడగు జీవుని (మనస్సుయొక్క అభిమాని) కంటెను ముక్తుడగు ఆత్మ శ్రేష్ఠుడుగదా! జీవుడు త్రిగుణసహితుడు. పరమాత్మ త్రిగుణరహితుడు, గుణాతీతుడు. ఇక్కారణమున అతడు తక్కిన ఇద్దఱు క్షరాక్షరపురుషులకంటెను ఉత్తముడుగ పరిగణింపబడి 'ఉత్తమపురుషుడ'ని లేక పురుషోత్తముడని వ్యవహరింపబడుచున్నాడు.

ప్రపంచములో కొందఱు 'దేహస్థితి' యందును, కొందఱు 'జీవస్థితి' యందును ఉండుచుందురు. వారిరువురును సామాన్యపురుషులు. ఆత్మయందుండువాడే ఉత్తమ పురుషుడు. అట్టి ఉత్తమపురుషత్వమును, లేక పురుషోత్తమత్వమును సర్వులును ప్రయత్నపూర్వకముగ సంపాదించ వలయును. ఎల్లకాలములందును 'పురుష' (జీవ) స్థితిలోనే అనగా బద్ధజీవితములోనే యుండుట విజ్ఞులకు పాడికాదు. క్రమముగ దేహస్థితిని, జీవస్థితిని (మనస్థ్సితి, పురుషస్థితి) దాటి సాక్షియగు ఆత్మయొక్క స్థితికి అనగా పురుషోత్తముని స్థితికి వచ్చినవాడే ధన్యుడు, సర్వశ్రేష్ఠుడు. అట్టి స్థితియే జీవితము యొక్క పరమావధి, పరమలక్ష్యము. దానిచే జన్మ సార్థకమగును. తక్కిన ఏయితర క్రియలచేతను ఈ మానవజన్మ సార్థకతను బొందలేదు.

'అన్యః' - అని చెప్పినందువలన పరమాత్మ దేహముయొక్క అభిమానికంటె, జీవునికంటె (మనస్సుయొక్క అభిమానికంటె) వేఱుగనున్నాడని, వానికి సాక్షిగ వెలయుచున్నాడని తెలియుచున్నది. కాబట్టి జీవుడు ఆ దేహసంబంధ, జీవసంబంధ (మనస్సంబంధ) వికారములు తనకు వాస్తవముగ లేవని, తాను నిర్వికార అవ్యయ ఆత్మయని నిశ్చయముచేసికొని, అట్టి ఆత్మస్థితియందే సదా యుండులాగున అభ్యసించవలెను.

ఆ పరమాత్మ యెట్టివాడో తెలిసికొనినచో, అతని మహిమను ఎఱిగినచో, అతనిపై విశ్వాసము బాగుగ కలుగగలదు. ఇచ్చోట పరమాత్మకు రెండు విశేషణములు చెప్పబడినవి – అతడు (1) సర్వలోకధారకుడని (2) అవ్యయుడని. ముల్లోకములందును లెస్సగ ప్రవేశించి, అంతర్యామిరూపుడై వానిని భరించుచు, ఈశ్వరుడై యతడు వెలయుచున్నాడు. ముజ్జగంబులందును ఎల్లెడల ఆతడు నిండి నిబిడీకృతుడైయున్నాడు. మఱియు నాతడు అవ్యయుడు, నాశములేనివాడు. దేహాది దృశ్యపదార్థములన్నియు, తుట్టతుదకు చిత్ -

ప్రతిబింబరూపుడగు జీవుడున్ను ఒకానొక కాలమున అంతరించియే పోవుదురు (మోక్షప్రాప్తిసమయమున జీవత్వము తొలగిపోవును గావున). పరమాత్మయో ఏ కాలమందును నశింపడు; కావున అట్టి అవ్యయ ఆత్మపదముకొఱకే, పురుషోత్తమస్థితి కొఱకే సర్వులును ప్రయత్నించవలెను. క్షణికములగు అల్పప్రాపంచికవస్తువులకై, పదవులకై పరుగిడుట ఉత్తమము కాదు.

**ప్ర:–** ఈ క్షరాక్షరములకంటె వేఱైన వాడెవడైనకలడా?

**ఉ:–** కలడు. అతడే ఉత్తమపురుషుడు (పురుషోత్తముడు).

**ప్ర:–** అతడెట్టివాడు?

**ఉ:–** (1) ముల్లోకములందును ప్రవేశించి వానిని భరించువాడు. జగన్నియామకుడు. (2) నాశరహితుడు.

**ప్ర:–** కాబట్టి ఫలితాంశమేమి?

**ఉ:–** క్షర (దేహ) అక్షర (జీవ) భావములనుదాటి పురుషోత్తమభావమును, లేక పరమాత్మ భావమును అవలంబించవలెను.

**అ॥** పరమాత్మ పురుషోత్తముడని యేల చెప్పబడెనో తెలియజేయుచున్నాడు –

**18. యస్మాత్క్షర మతీతోఽహ మక్షరాదపి చోత్తమః
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః.**

**టీక:–** యస్మాత్ = ఏకారణమువలన, అహమ్ = నేను, క్షరమ్ = క్షరస్వరూపుని, అతీతః = అతిక్రమించినవాడనుగను, అక్షరాత్ అపి = అక్షరస్వరూపుని (జీవుని) కంటెను, ఉత్తమః చ = శ్రేష్ఠుడుగను ఉన్నానో, అతః = ఆ కారణమువలన, లోకే = ప్రపంచమునందును, వేదే చ = వేదమునందునుగూడ, పురుషోత్తమః = పురుషోత్తముడుగా, ప్రథితః = ప్రసిద్ధుడనై, అస్మి = ఉన్నాను.

**తా:–** నేను క్షరస్వరూపునికంటె మించినవాడును, అక్షరస్వరూపుని (జీవుని) కంటె శ్రేష్ఠుడను అయియున్నందువలన ప్రపంచమునందును, వేదమునందును 'పురుషోత్తము' డని ప్రసిద్ధికెక్కియున్నాను.

**వ్యాఖ్య:–** క్షర, అక్షర పురుషులిరువురికంటెను అతీతుడై యుండుటవలన పరమాత్మ పురుషోత్తముడని ప్రసిద్ధికెక్కెను. జీవుడున్ను తన పురుషత్వము (జీవత్వము)తో తృప్తి పడక పురుషోత్తమత్వమునకై అనగా ఆత్మస్థితికై యత్నశీలుడు కావలెను. అపుడే యతడు కృతార్థుడగుచు భవబంధవిముక్తుడై సాక్షాత్ భగవానునివలె లోకమున కీర్తింపబడగలడు.

**ప్ర:–** భగవానుడు పురుషోత్తముడని లోకమున ఏల ప్రసిద్ధికెక్కెను?

**ఉ:–** అతడు క్షర, అక్షరపురుషులిరువురికంటెను అతీతుడుగనుక.

**అ॥** ఆ ప్రకారముగ పురుషోత్తముడని పరమాత్మను ఎఱుగువా డాతనిని నిర్మల భక్తితో సేవించునని వచించుచున్నాడు -

**19. యో మామేవమసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్
స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత .**

**టీక:-** భారత = ఓ అర్జునా!, యః = ఎవడు, అసమ్మూఢః = అజ్ఞానములేనివాడై, ఏవమ్ = ఈ ప్రకారముగ, మామ్ = నన్ను, పురుషోత్తమమ్ = పురుషోత్తమునిగా, జానాతి = ఎఱుగుచున్నాడో, సః = అతడు, సర్వవిత్ = సమస్తమును దెలిసినవాడగుచు, సర్వభావేన = పూర్తిమనస్సుతో (లేక, సర్వవిధముల) మామ్ = నన్ను, భజతి = భజించుచున్నాడు (ధ్యానించుచున్నాడు).

**తా:-** ఓ అర్జునా! ఎవడు అజ్ఞానము లేనివాడై, ఈ ప్రకారముగ నన్ను పురుషోత్తమునిగా నెఱుగుచున్నాడో, అతడు సమస్తమును దెలిసినవాడగుచు పూర్తి మనస్సుతో (సర్వవిధముల) నన్ను భజించుచున్నాడు.

**వ్యాఖ్య:-** భగవంతునిపై భక్తి కుదరవలెననిన, వారెట్టివారో ముందుగ తెలిసి యుండవలెను. ఒక వస్తువుయొక్క మహిమాతిశయము తెలియనిదే దానిపై ఎవరికిని ప్రీతి జనించదు. ఒకవేళ జనించినను అపూర్ణమగు ప్రీతియే జనించును. కావున భగవానునిపై అకుంఠితభక్తి యేర్పడవలెననిన, 'వారు శాశ్వతులని, ఆనందస్వరూపులని, క్షరాక్షరములకు అతీతుల'ని బాగుగ గ్రహించియుండవలెను. ఆ విషయమే ఈ శ్లోకమందు చెప్పబడినది. 'ఎవడు అజ్ఞానమును పారద్రోలి నన్ను పురుషోత్తమునిగ, క్షరాక్షరాతీతునిగ నెఱుగునో, ఆతడు పూర్ణభావముతో నన్ను భజించును' అని భగవాను డిచట తెలియజేసిరి.

'అసమ్మూఢు'డనగా, దృశ్యవస్తువులు శాశ్వతములను మూఢత్వము (అజ్ఞానము) లేనివాడని, ఆత్మయే శాశ్వతమను జ్ఞానము కలవాడని భావము.

'స సర్వవిత్' - ప్రపంచములో ఎన్ని భౌతికవిద్యలను సంపాదించినను, ఎంతటి పాండిత్యమును బడసినను, ఎన్ని కళలను సముపార్జించినను మనుజుడు సర్వవేత్త, సర్వజ్ఞుడు కాలేడు.

'యస్మిన్ విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి'

అనునట్లు దేనిని తెలిసికొనినచో సమస్తము తెలిసికొనబడినదగునో అట్టి పరమాత్మ నెఱుగువాడే ప్రపంచమున సర్వవేత్త, సర్వజ్ఞుడు కాగల్గును. సమస్త బ్రహ్మాండములు, సమస్తవిద్యలు, శాస్త్రములు, కళలు, భగవానుని కుక్షియందే యుండుటవలన, వారి నెఱిగినచో వాని నన్నింటిని ఎఱిగినట్లేయగును. కనుకనే, 'స సర్వవిత్' - అట్టివాడు 'సర్వవేత్త', 'సర్వజ్ఞుడు' అని యిచట చెప్పబడెను.

'సర్వభావేన' - ఆ ప్రకారము భగవానుని యథార్థస్వరూపము నెఱిగినవాడు వారిపై అచంచల భక్తిభావము గలవాడై, సర్వవిధముల వారినే భజించును, సేవించును. దృశ్యవస్తువులన్నియు నశ్వరములని తెలిసికొనినవాడు సహజముగనే శాశ్వతమగు దృగ్వస్తువైన ఆత్మనొక్కదానినే సేవించుచుండును. 'సర్వభావేన' అని చెప్పుటచే అట్టివాడు పరిపూర్ణమనస్సుతో నాతనిని భజించునని భావము. అట్టి పరిపూర్ణ భావము

'దైవముయొక్క యథార్థతత్త్వము' నెఱుగనిదే కలుగదు. కావున మొట్టమొదట పరమాత్మయొక్క విభవము, వాస్తవస్వరూపము బాగుగ తెలిసికొని యుండవలెను. మఱియు ఈ 'సర్వభావేన' అను పదముచే లోకమున సాధకులు భగవానుని యేప్రకారముగభజించవలెనో ఆపద్ధతి తెలుపబడినట్లైనది. పూర్ణభక్తితో, అచంచల విశ్వాసముతో సేవింపవలెను. భక్తిని, భావమును విభజించరాదు. ప్రపంచ వస్తువులపైకొంత, దేవునిపై కొంత భక్తిని పంచివేసిన అది 'సర్వభావము' తోటి సేవనము కానేరదు. అయితే మొట్టమొదట అట్టి 'సర్వభావము'తో గూడిన భజనము సాధ్యపడకపోయినను, అభ్యాసవశమున ఎప్పటికైనను అట్టి పూర్ణభక్తిని (100% భక్తిని), (భగవానుడు తెలిపిన) 'సర్వభావము'ను అందఱును పొందియే తీరవలెను.

**ప్ర:–** భగవానుని పూర్ణమనస్సుతో ఎవరు సేవించెదరు?

**ఉ:–** ఎవడు అజ్ఞానరహితుడై (పైన తెలిపిన ప్రకారముగ) భగవానుని క్షరాక్షరపురుషులకంటె అతీతుడగు పురుషోత్తమునిగ నెఱుగునో అట్టివాడు పూర్ణమనస్సుతో నతనిని సేవించును, ధ్యానించును.

**ప్ర:–** భగవంతుని యేప్రకారముగ భజించవలెను?

**ఉ:–** అచంచలభక్తితో, పరిపూర్ణమనస్సుతో భజించవలెను (సర్వభావేన).

**అ॥** అధ్యాయముయొక్క ఫలశ్రుతిని జెప్పుచున్నాడు –

## 20. ఇతి గుహ్యతమం శాస్త్ర మిదముక్తం మయాఽనఘ
## ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్కృతకృత్యశ్చ భారత .

**టీక:–** అనఘ = పాపరహితుడవగు ఓ అర్జునా!, ఇతి = ఈ ప్రకారముగ, గుహ్యతమమ్ = అతిరహస్యమైనట్టి, ఇదమ్ = ఈ, శాస్త్రమ్ = శాస్త్రము, మయా = నాచేత, ఉక్తమ్ = చెప్పబడినది, భారత = ఓ అర్జునా!, ఏతత్ = దీనిని, బుద్ధ్వా = తెలిసికొని (మనుజుడు), బుద్ధిమాన్ = జ్ఞానవంతుడును, కృతకృత్యః చ = కృతకృత్యుడును, స్యాత్ = అగును.

**తా:–** పాపరహితుడవగు ఓ అర్జునా! ఈ ప్రకారముగ అతిరహస్యమైనట్టి ఈ శాస్త్రమును నీకు చెప్పితిని. దీనిని చక్కగా తెలిసికొనినవాడు జ్ఞానవంతుడును, కృతకృత్యుడును కాగలడు.

**వ్యాఖ్య:–** ఇంతదనుక చెప్పబడిన ఈ గీతాశాస్త్రమునంతను చక్కగా తెలిసికొనిన వారికి కలుగు ఫలితమును ఇచట వచించుచున్నారు. తానుగావించిన ఈ బోధయంతయు అతిరహస్యమైనదని ('గుహ్యతమమ్') మొట్టమొదట భగవానుడు పలికెను. కనుకనే 'గుహ్యమ్' అనిగాని, 'గుహ్యతరమ్' అనిగాని చెప్పక 'గుహ్యతమమ్' – అని 'తమ' ప్రత్యయపదమును ప్రయోగించి బోధయొక్క అతి గోప్యత్వమును, పరమరహస్యత్వమును వెల్లడించిరి. సామాన్యముగ అతిరహస్యమైన విషయమును మహనీయులు అందఱికిని జెప్పరు. యోగ్యతగలిగినవానికే, 'అధికారి'కే చెప్పుదురు. "మఱి అర్జునుడు అట్టి యోగ్యతను బడసెనా? అతనికి చిత్తశుద్ధికలదా" అని జనులు ప్రశ్నించుదురేమో యని తలంచికాబోలు భగవానుడు వెనువెంటనే 'అనఘ' (పాపరహితుడా) అని అర్జునుని సంబోధించి ఆ సంశయమును తీర్చివైచిరి. అర్జునుడు పాపరహితుడు, నిర్మలచిత్తుడు, ఆధ్యాత్మికవిజ్ఞానశ్రవణమునకు, గ్రహణమునకు అధికారి. అర్జునునివలెనే ఎవరైనను సరియే తమచిత్తమందలి దోషములను, పాపములను కడిగివైచికొనినచో వారికి

సర్వేశ్వరుడు ఏ మహనీయుడగు గురువుద్వారానో, లేక ఏదియోయొక నిమిత్తముచేతనో బ్రహ్మతత్త్వము నుపదేశింపజేయును. లేక స్వయముగనే అట్టి ఆధ్యాత్మికజ్ఞానగ్రహణానుకూలమగు ధీశక్తిని వారికి కలుగజేయును (దదామి బుద్ధియోగం తమ్).

భగవదుక్తమగు ఈ బోధ నెఱుగుటవలన కలుగు ఫలితమేమి? దాని నెఱుగుట వలన మనుజుడు (1) జ్ఞానవంతుడు (స్వస్వరూపానుభవము కలవాడు) (2) కృతకృత్యుడు కాగలడు. ఇట్టి బోధ తెలిసికొనుటవలన మనుజుడు భగవంతునిపై అనన్యభక్తిగలవాడై తద్ద్వారా బుద్ధియోగమును అనగా జ్ఞానానుభవమును (స్వస్వరూపానుభవమును) బడయగల్గును. దానిచే నతడు కృతకృత్యుడు కాగలడు. అట్టి కృతకృత్యత్వముచే కృతార్థుడున్ను తప్పక కాగలడు. ప్రపంచములో ఏ యితరకార్యముచే గూడ మనుజుడు కృతకృత్యుడు కాజాలడు. ఒక్క బ్రహ్మవిద్యచేతనే, అధ్యాత్మజ్ఞానముచేతనే అతడు కృతకృత్యుడు కాగలడు - అని భగవానుడిచట 'ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్కృతకృత్యశ్చ' - అను వాక్యముద్వారా స్పష్టముగ చెప్పివైచిరి. కావున ధన్యులు, కృతకృత్యులు కాదలంచినవారు, జన్మసార్థకత నొందదలంచినవారు భగవానుని ఈ వాక్యముపై విశ్వాసముంచి గీతయందు తెలుపబడిన పరమార్థరహస్యములనెల్ల చక్కగ నభ్యసింపవలయును. అట్లు కృతకృత్యులు కాకుండ మరణించినచో గొప్ప ప్రమాదము గలదు. జన్మపరంపర వారిని విడనాడదు. దుఃఖజాలము వెన్నంటుచునే యుండును.

ప్ర:— భగవానుడు బోధించిన ఈ అధ్యాత్మశాస్త్ర మెట్టిది?

ఉ:— అతిరహస్యమైనది (గుహ్యతమమ్).

ప్ర:— దానిని అర్జునునికే ఏల బోధించెను?

ఉ:— అతడు పాపరహితుడు (అనఘుడు) గనుక.

ప్ర:— ఈ బోధ నెఱుగుటవలన కలుగు ఫలితమేమి?

ఉ:— దాని నెఱుగుటవలన మనుజుడు (1) జ్ఞానవంతుడు (2) కృతకృత్యుడు కాగలడు.

ప్ర:— కావున జ్ఞానవంతుడగుటకు, కృతకృత్యత్వమును బడయుటకు ఉపాయ మేమియని తెలుచున్నది?

ఉ:— భగవానుడు బోధించిన ఈ పరమార్థరహస్యములను చక్కగ ఆచరించుటయే అందులకు ఉపాయము.

ఓమ్
ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే పురుషోత్తమప్రాప్తియోగో నామ
పంచదశోఽధ్యాయః.
ఇది ఉపనిషత్ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జునసంవాదమునగు
శ్రీ భగవద్గీతలందు పురుషోత్తమప్రాప్తియోగమను
పదునైదవ అధ్యాయము.
ఓమ్ తత్ సత్.

# దైవాసురసంపద్విభాగయోగము




**త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః**
**కామక్రోధస్తథా లోభస్తస్మాదేతత్త్రయం త్యజేత్.** **(16-21)**

కామము, క్రోధము, లోభము అను నీ మూడును మూడువిధములగు నరకద్వారములు. ఇవి తనకు (జీవునకు) నాశము గలుగజేయును - కాబట్టి ఈమూడిటిని విడనాడవలెను. (లేక, కామము, క్రోధము, లోభము అను మూడువిధములగు ఈ అసురసంపద నరకమునకు ద్వారములు - అనియు చెప్పవచ్చును).

ॐ

# శ్రీ భగవద్గీత

అథ షోడశోఽధ్యాయః

## పదునాఱవ అధ్యాయము

దైవాసుర సంపద్విభాగయోగః

## దైవాసుర సంపద్విభాగయోగము

### ఈ అధ్యాయముయొక్క పేరు :-

'దైవాసుర సంపద్విభాగయోగము' - సంపదయనగా ఐశ్వర్యము; దైవసంపద యనగా దైవీకములగు సద్గుణములయొక్క సంపత్తి, దైవసంబంధమైన గుణరాశి, జీవుని భగవంతుని సమీపమునకు చేర్చునట్టి శీలసంపద. అసురసంపద యనగా రాక్షసగుణములు, దుర్గుణరాశి; భగవంతుని దూరముగ జేసివైచునట్టి దుశ్శీలము. ఈ అధ్యాయమునందు శ్రీ కృష్ణపరమాత్మ దైవగుణములను, అసురగుణములను రెండిటిని గూర్చి విపులముగ తెలియజేసిరి. ఏలయనిన ఆ రెండిటిని తెలిసికొనియుండినచో సాధకుడు తన హృదయమును బాగుగ పరిశోధించుకొని, దైవగుణములులేనిచో సంపాదించుటకును, ఉన్నచో ఇంకను అభివృద్ధిపఱచుటకును, అసురగుణములుండినచో పాఱద్రోలుటకును అవకాశముండును. కావున రెండిటిని తెలిసికొనియుండవలెను. ఈ ప్రకారముగ అధ్యాత్మక్షేత్రమున సర్వులకును ఉపయోగముగ నుండుటకై భగవానుడు ఆ సద్గుణ, దుర్గుణముల రెండిటిని; దైవ, అసుర సంపదల రెండిటిని చక్కగ విభజించి తెలిపిన యధ్యాయమగుటచే దీనికి దైవాసుర సంపద్విభాగయోగమను పేరుకలిగినది.

### ఈ అధ్యాయమందలి ప్రధాన విషయములు :-

(1) దైవసంపద (దైవిక గుణసముదాయము) (1వ శ్లో॥నుండి 3వ శ్లో॥ వఱకు)

(2) అసురసంపద (4వ శ్లోకము)

(3) ఆ రెండిటియొక్క ఫలములు ... (5వ శ్లోకము)

(4) అసురసంపదగలవారియొక్క లక్షణములు, వారికి గలుగు అధోగతి (6వ శ్లో॥ నుండి 20వ శ్లో॥ వఱకు)

(5) నరకద్వారములు ... (21వ శ్లోకము)

(6) శాస్త్రవిరుద్ధమగు ఆచరణను త్యజించి, శాస్త్రానుకూలమగు ఆచరణను గ్రహించుటనుగూర్చిన ఉద్బోధము ... (22వ శ్లో॥ నుండి 24వ శ్లో॥ వఱకు)

## పూర్వాధ్యాయముతో ఈ అధ్యాయమునకు గల సంబంధము :-

ఇదివఱలో 7వ అధ్యాయమునందలి 15వ శ్లోకమగు 'న మాం దుష్కృతినో మూఢాః' - అనుదానియందును, 9వ అధ్యాయమందలి 11వ, 12వ శ్లోకములగు 'అవజానన్తిమాంమూఢా...', 'మోఘాశామోఘకర్మాణో....' - అనువానియందు భగవానుడు తన్నుగూర్చి చింతింపనివారును, అసురగుణయుతులు నగువారిని గుఱించి చెప్పియుండిరి. మఱల వెనువెంటనే 9వ అధ్యాయమందలి 13వ, 14వ శ్లోకములగు "మహాత్మానస్తు మాం పార్థ....." "సతతం కీర్తయన్తోమాం..." అనువానియందు తన్ను భజించు సత్పురుషులనుగూర్చి పలికియుండిరి. ఇవియన్నియు వినినవానికి సహజముగనే దైవిక లక్షణములనుగూర్చియు, ఆసురిక లక్షణములనుగూర్చియు విపులముగ తెలిసికొనవలెనను కుతూహలము జనించును. కాబట్టి వానిని వివరముగ తెల్పునిమిత్తము భగవాను డీయధ్యాయమును ప్రారంభించుచున్నారు. మఱియు క్రిందటి అధ్యాయమునందు తెలుపబడిన పురుషోత్తమప్రాప్తికి సద్గుణావలంబనము, దుర్గుణత్యాగము ఎంతయో అవసరములైయున్నవి. ఇక్కారణమున అట్టి భగవత్ప్రాప్తికి ఏసద్గుణములను స్వీకరించవలెనో, ఏ దుర్గుణములను త్యజించివేయవలెనో ముముక్షువునకు చక్కగ తెలిసియుండవలెను. కావున అట్టి శీలసంబంధ విజ్ఞానము నాతనికి లభింపజేయుటకై ఆ ప్రకారములగు బోధలతోగూడిన ఈ అధ్యాయము ప్రారంభింపబడినదనియు చెప్పవచ్చును. గ్రాహ్యములగు దైవగుణములు, త్యాజ్యములగు అసురగుణములు రెండిటినిగూర్చి అచట చెప్పదలంచినవారై శ్రీకృష్ణమూర్తి మొట్టమొదట దైవగుణములను పేర్కొనుచున్నారు -

**శ్రీ భగవానువాచ :-**

**1. అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగవ్యవస్థితిః**
**దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్.**

**2. అహింసా సత్యమక్రోధ స్త్యాగశ్శాన్తిరపైశునమ్**
**దయా భూతేష్వలోలత్వం★ మార్దవం హ్రీరచాపలమ్.**

**3. తేజః క్షమా ధృతిశ్శౌచ మద్రోహో నాతిమానితా**
**భవన్తి సమ్పదం దైవీ మభిజాతస్య భారత.**

శ్రీ భగవానువాచ = శ్రీ భగవంతుడు చెప్పుచున్నాడు -

**టీక:-** భారత = ఓ అర్జునా! అభయమ్ = భయములేకుండుట, సత్త్వసంశుద్ధిః = అంతఃకరణశుద్ధి, జ్ఞానయోగవ్యవస్థితిః = జ్ఞానయోగమునందుండుట, దానమ్ = దానము, దమః చ = బాహ్యేంద్రియనిగ్రహమున్ను, యజ్ఞః చ = (జ్ఞాన) యజ్ఞమున్ను, స్వాధ్యాయః = (వేదశాస్త్రాదుల) అధ్యయనము, తపః = తపస్సు, ఆర్జవమ్ = ఋజుత్వము (కపటములేకుండుట), అహింసా = ఏప్రాణికిన్ని బాధకలుగజేయకుండుట, సత్యమ్ = సద్వస్తువగు పరమాత్మ నాశ్రయించుట, లేక, నిజముపలుకుట, అక్రోధః = కోపములేకుండుట, త్యాగః = త్యాగబుద్ధిగలిగియుండుట, శాంతిః = శాంతిస్వభావము,

★ 'భూతేష్వలోలుప్త్వం' - పాఠాన్తరము.

అపైశునమ్ = కొండెములు చెప్పకుండుట, దయా భూతేషు = ప్రాణులందు దయ, కరుణ గలిగియుండుట, అలోలత్వమ్ = విషయలోలత్వములేకుండుట, తేజః = ప్రతిభ (లేక, బ్రహ్మతేజస్సు), క్షమా = ఓర్పు (కష్టసహిష్ణుత), ధృతిః = ధైర్యము, శౌచమ్ = బాహ్యాంతరశుచిత్వము, అద్రోహః = ఎవనికిని ద్రోహముచేయకుండుట (ద్రోహచింతనము లేకుండుట), నాతిమానితా = స్వాతిశయము లేకుండుట (తాను పూజింపదగినవాడనను దురభిమానము, గర్వము లేకుండుట) (అను నీ సుగుణములు), దైవీమ్ = దైవసంబంధమగు, సంపదమ్ = సంపత్తియందు (సంపత్తినిపొందదగి), అభిజాతస్య = పుట్టినవానికి, భవన్తి = కలుగుచున్నవి.

**తా:–** శ్రీ భగవానుడు చెప్పెను - ఓ అర్జునా! (1) భయములేకుండుట (2) అంతఃకరణశుద్ధి (3) జ్ఞానయోగమునందుండుట (4) దానము (5) బాహ్యేంద్రియనిగ్రహము (6) (జ్ఞాన) యజ్ఞము (7) (వేదశాస్త్రాదుల) అధ్యయనము (8) తపస్సు (9) ఋజుత్వము (కపటము లేకుండుట) (10) ఏ ప్రాణికిన్ని బాధగలుగజేయకుండుట (అహింస) (11) సద్వస్తువగు పరమాత్మ నాశ్రయించుట, లేక, నిజముపలుకుట (సత్యము) (12) కోపము లేకుండుట (13) త్యాగబుద్ధిగలిగియుండుట (14) శాంతస్వభావము (15) కొండెములు చెప్పకుండుట (16) ప్రాణులందు దయగలిగియుండుట (17) విషయలోలత్వము లేకుండుట, అనగా విషయములందాసక్తి లేకుండుట, వానిచే చలింపకుండుటయు (18) మృదుత్వము (క్రౌర్యము లేకుండుట) (19) (ధర్మవిరుద్ధకార్యములందు) సిగ్గు (20) చంచలస్వభావము లేకుండుట (21) ప్రతిభ (లేక, బ్రహ్మతేజస్సు) (22) ఓర్పు (కష్టసహిష్ణుత) (23) ధైర్యము (24) బాహ్యాభ్యంతర శుచిత్వము (25) ఎవనికిని ద్రోహముచేయకుండుట, ద్రోహచింతనము లేకుండట (26) స్వాతిశయములేకుండట (తాను పూజింపదగినవాడనను అభిమానము, గర్వము లేకుండుట) - అను నీసుగుణములు దైవసంపత్తియందు పుట్టిన వానికి కలుగుచున్నవి. (అనగా దైవసంపత్తిని పొందదగి పుట్టినవానికి కలుగుచున్నవని భావము).

**వ్యాఖ్య:–** గీతాగ్రంథమున 'సాధన'కు విశేషప్రాముఖ్యత నొసంగబడినది. చిత్తము నిర్మలముగానున్నచో, అత్తఱి పారమార్థికలక్ష్యము చేరువనేయుండును. కావున అట్టి చిత్తశుద్ధిపరికరము లనేకములు గీతయం దొసంగబడినవి. ఈ అధ్యాయప్రారంభమునగల దైవీసంపద్వివరణము వానిలో చేరినదే అయియున్నది. ఇఱువదియాఱు సుగుణములను భగవానుడిచట తెలియజేసిరి. వానినన్నింటిని ముముక్షువు - విద్యార్థి పాఠములనువలె - క్షుణ్ణముగ నభ్యసించి హృదయమును పరిశుద్ధ మొనర్చుకొనినచో ఇక మోక్ష లక్ష్యము సన్నిహితమైనట్లే యగును. కావున సాధకు లీసద్గుణరాశిని ప్రయత్నపూర్వకముగ నవలంబించి కడుజాగరూకతతో వానిని కాపాడుకొనుచుండవలెను.

సంపద యనగా ధనము, ఐశ్వర్యము. దైవసంపదయనగా దైవధనము. శ్రీకృష్ణపరమాత్మ దైవధనము నిపుడు లోకులముందు వెదజల్లుచు 'ఓ జీవులారా! నశ్వర ప్రాపంచికధనములతో క్రీడించుచు, వానియందే అమూల్యకాలమంతయు వినియోగించుచు దుఃఖపరంపరలను, జన్మపరంపరలను బొందకుడు! ఇవిగో! తీసికొనుడు. దైవసంపద్రాసులను, పారమార్థిక రత్నచయములను' అని వచించుచున్నారు. ఈ దైవధనము ముందు ప్రాపంచిక సంపదలు, వజ్రవైడూర్యాదులు ఏపాటి విలువగలవి? కావున వివేకవంతు లీ దైవసంపదను శీఘ్రముగ హస్తగతమొనర్చుకొని జ్ఞానధనులై బ్రహ్మసాయుజ్యము నొందెదరుగాక!

'అభయమ్' - శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు అనేక సుగుణములను చెప్పదలంచిన వారై మొట్టమొదట 'సుగుణరాట్' అనదగు, 'సుగుణసింహ' మనదగు 'అభయము'ను పేర్కొనెను. ఇది

గమనింపదగినవిషయమైయున్నది. ఏలయనిన, ఎన్నియో ఇతర సుగుణములుండ ఈ 'భయరాహిత్యము'నే తొలుదొల్త చెప్పనేల? దీనికి కారణములు కలవు - (1) అన్ని దుర్గుణములకును భయమే పునాది; భయమునుండియే తక్కిన అవగుణములన్నియు నంకురించును. కావున విజ్ఞులద్దానిని మొట్టమొదట పారద్రోలినచో, అనగా నిర్భయత్వము నవలంబించినచో ఇక తక్కిన సుగుణము లన్నియు అవలీలగా వచ్చిచేరగలవు. ఇక్కారణమున నయ్యది మొదట చేర్చబడి యుండవచ్చును. మఱియు (2) త్రాడులాగు పందెము (Tug of war) లో మొదటివానిని చివఱివానిని మహాబలశాలులుగ నుండునట్లుచూచి పెట్టుదురు. అట్లే అసురగుణములు గావింపబడుచున్న పందెమున దైవగుణములపక్షమున 'అభయం' - అను సుగుణరాజమును ఏరి భగవాను డద్దానిని నాయకునిగ (Captain) జేసి రణరంగమున నిలబెట్టెను. దీనిని బట్టి అది యెంతటి మహత్తర సుగుణమో వ్యక్తము కాగలదు. (3) 'అభయంవై జనక ప్రాప్తోఽసి' - అని ఉపనిషత్తు లా యభయమును సాక్షాత్ బ్రహ్మపదముగనే వర్ణించి చెప్పినవి. కాబట్టి గీతయందు భగవానునిచే నెంతయో ప్రముఖముగ నెంచబడినట్టి ఈ నిర్భయత్వమను గుణరత్నమును సర్వులును లెస్సగ నభ్యసించి దైవసంపత్తిని బాగుగ కూడబెట్టుకొనవలెను.

'సత్త్వసంశుద్ధిః' - 'శుద్ధిః' అని చెప్పక 'సంశుద్ధిః' అనిచెప్పుటవలన చిత్తము అత్యంత నిర్మలముగా నుండవలెనని భావము. మనస్సునం దేలాటి ప్రాపంచిక సంకల్పములకు, మలినసంస్కారములకు, పాపములకు చోటీయరాదు. నిర్మలదర్పణమందే ప్రతిబింబము స్పష్టముగ గోచరించునట్లు నిర్మలచిత్తముననే ఆత్మ చక్కగ స్ఫురించగలదు.

'జ్ఞానయోగ వ్యవస్థితిః' - భగవానుడు గీతలో అనేక యోగములనుగూర్చి బోధించినను, అచటచట జ్ఞానయోగాధిక్యతను వెల్లడించుచునేయున్నారు. (ఆత్మజ్ఞానానుభూతియే అన్నిటియొక్క పరమావధిగనుక). కనుకనే దైవసంపదలో ప్రారంభములోనే దానినిగూర్చిన ప్రస్తావనను లేవనెత్తిరి. 'సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే' అనునట్లు అన్ని కర్మలు, అన్ని యోగములును తుదకు జ్ఞానమందే పర్యవసించుచున్నవి. కాబట్టి అట్టి జ్ఞానయోగమందు దృఢస్థితిని సంపాదించవలసినదిగా భగవాను డిచట నాదేశించుచున్నారు.

'దానం' - భూదానము, సంపద్దానము, అన్నదానము, జలదానము, శ్రమదానము, విద్యాదానము, జ్ఞానదానము - ఇవియన్నియు దానములలో జేరినవే.

'దమశ్చ' - 'శమ' మను అంతరేంద్రియనిగ్రహము 'సత్త్వసంశుద్ధిః' అను పదము ద్వారా ఇదివఱకే పేర్కొనబడియుండుటవలన ఇచట 'దమ' మను బాహ్యేంద్రియ నిగ్రహముమాత్ర మిపుడు చెప్పబడినది. ఇంద్రియనిగ్రహములేనిది పరమార్థరంగమున ఎవరును ముందునకు పోజాలరని ఘంటాపథముగ చెప్పవచ్చును. కనుకనే గీతలో శమ, దమములకు సముచితస్థాన మొసంగబడుచునున్నది.

'యజ్ఞశ్చ' ఇచట యజ్ఞమనగా తపోయజ్ఞము, యోగయజ్ఞము, స్వాధ్యాయయజ్ఞము, జ్ఞానయజ్ఞము మున్నగునవిమాత్రమేయని గ్రహించవలెను.

'స్వాధ్యాయః' - గీత, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, యోగవాసిష్ఠము, భారత, భాగవత, రామాయణములు - ఇత్యాది ఆధ్యాత్మిక ఉద్గ్రంథములను పఠించి అందలి సారమును మననముచేయుట స్వాధ్యాయ మనబడును.

'తపః' - తపస్సనగా తల క్రిందబెట్టి కాళ్లు పైనబెట్టుకొనియుండుట కాదు. గీత 17వ అధ్యాయమున చెప్పబడిన శారీరక, వాచిక, మానసిక తపస్సులని భావము.

'ఆర్జవమ్' - శరీరము, వాక్కు, మనస్సు - అను మూడింటితోను ఏకరీతిగా వర్తించుట - అనగా త్రికరణశుద్ధి గలిగియుండుటయని అర్థము. విషజంతువులగు సర్పాదులు వక్రగతి గలిగియుండును. కావున వక్రస్వభావము గలిగియుండు మానవులున్ను విషజంతువులతో సమానులే యగుదురు.

'అహింసా' - శరీరముతో, వాక్కుతో, మనస్సుతో, ఏ ప్రాణికి హింసచేయకుండుట, ఏ ప్రాణిని బాధింపకుండుట.

'సత్యం' -(1) శరీర వాఙ్మనంబులతో అసత్యమాడకుండుట.

(2) సత్యవస్తువగు పరమాత్మయందు నిలుకడ గలిగియుండుట.

'అక్రోధః' - క్రోధము చాల చెడ్డగుణము. పరమార్థసాధకునకేకాదు. ప్రతి మానవునికిని అది యెంతయో కీడొనర్చగలదు. అది ఆవహించినపుడు మనుజుడు కల్లు త్రాగినవాని చందమున నుండును. ఆ 'కైపు'లో యుక్తాయుక్తములను విస్మరించి యతడు అధఃపతనమునొందును. కాబట్టియే 'క్రోధాద్భవతి సమ్మోహః .... ప్రణశ్యతి' - అని దీని ఆగడమును గూర్చి భగవాను డిదివఱకే విపులముగ తెలిపియుండెను. క్రోధము రజోగుణసంబంధమగు దుర్గుణము. కావున అది మనుజుని యావేశించునపుడతని కండ్లెఱ్ఱబడును. దేహమంతయు చెమటబట్టును. తుదకు వికృతరూపుడై, దాదాపు రాక్షసునివలె మారిపోవును. ఇక్కారణమున పరమార్థోన్నతికి క్రోధరాహిత్యము (అక్రోధము) ఒక గొప్ప ఆవశ్యకతయైయున్నది. కనుకనే యది దైవసంపదయందు పేర్కొనబడినది.

'త్యాగః' - 'త్యాగేనైకే అమృతత్వమానశుః' - త్యాగమువలననే మోక్షము సిద్ధించును అని ఉపనిషత్తు లుద్ఘోషించుచున్నవి. దృక్ - స్వరూపమగు ఆత్మను, భగవంతుని అవలంబించి, దృశ్యవస్తువులగు విషయసమూహములయం దాసక్తిని త్యజించుటయే త్యాగము. దుర్గుణములను, దుస్సంస్కారములను, దుష్టసంకల్పములను, విషయవ్యామోహమును, కర్మఫలమును త్యజించుటయే వాస్తవమగు త్యాగము. ఇదియే అంతరత్యాగము. బాహ్యత్యాగముకంటె అంతరత్యాగము శ్రేష్ఠమైనది.

'శాంతిః' - చిత్తము శాంతియుతముగ నుండవలెను. కల్లోలసముద్రమువలె నుండరాదు. సంకల్పములచే కొట్టుకొనుచుండరాదు. చిత్తము పరమాత్మయందు లయించినపుడే పూర్ణశాంతి సంభవించును. శాంతిలేనివానికి సుఖముండదు (అశాంతస్య కుతస్సుఖమ్). భగవదాశ్రయము, దృశ్యవిషయసంకల్ప వివర్జనము శాంతికి ఉపాయములు.

'అపైశునమ్' - ఇతరులదోషములను లెక్కింపకుండుట, చాడీలు చెప్పకుండుట. పరులగుణములతో మనకు పనియేకాని పరులదోషములతోగాదు. జనులు తమ తమ హృదయములందు దాగియున్న కోటానుకోట్ల దోషములను ముందు నిర్మూలించుకొనిన చాలును. ఇతరులదోషములను లెక్కింపవలసినపనిలేదు.

'దయా భూతేషు' - 'సమస్తప్రాణికోట్లయెడల దయగలిగియుండుట' సాధకునకొక అత్యవసరమైన సుగుణముగనుక దానినిగూర్చి గీతయం దనేకచోట్ల ప్రస్తావించబడెను. బ్రహ్మజ్ఞానమను మందుకు భూతదయయను పథ్యము ఉండియే తీరవలెను. అపుడే ఆ మందు చక్కగ పనిచేయును. కాబట్టి భక్తి, జ్ఞాన, వైరాగ్యాదులతోబాటు భూతదయనుగూడ సాధకులు బాగుగ నభ్యసించవలయును.

'అలోలత్వమ్' - ఇంద్రియలోలత్వము లేకుండుట, విషయచాపల్యము వదలి యుండుట;

ఇంద్రియములయొక్క శక్తియంతయు విషయభోగములందు వ్యర్థమైపోయినచో ఆత్మచింతనాదులం దది సమర్థమైయుండజాలదు. కావున ప్రత్యాహారముచే ఆ యా యింద్రియములను విషయములనుండి మఱలించి, ఆత్మయందు స్థాపించవలెను. మనస్సు చపలత్వము లేకయుండవలెను.

'మార్దవమ్' - మాటయందు, చేష్టయందు కాఠిన్యముచూపక మృదుత్వము గలిగి యుండవలెను. పరుషత్వమును వీడవలెను. ఇది సాత్త్వికగుణసంపన్నుని లక్షణము.

'హ్రీః' - (సిగ్గు) - (1) పాపకార్యములు చేయుటయందు సిగ్గుగలిగి యుండవలెను. (అనగా వానిని చేయరాదు).

(2) 'నేనింతవఱకు పరమార్థక్షేత్రమున ఏమియున్నతిని బొందితిని?' అని ప్రశ్నించుకొని, ఉన్నతినిబొందనిచో సిగ్గుపడవలెను.

(3) మహనీయులను, అనుభవజ్ఞులను సాధుమహాత్ములను, భక్తులనుగాంచి, తన సాంసారిక - అవనతిని తలంచుకొని సిగ్గునొందవలెను. మఱియు వారివలె ఉన్నత పారమార్థిక శిఖరము నధిరోహించుటకు పట్టుదలతో ప్రయత్నించవలెను.

'అచాపలమ్' - చంచలత్వము రజోగుణస్వభావము - అట్టిది లేకుండవలెను. మనస్సును ఆత్మనుండి (దైవమునుండి) చలింపజేయరాదు.

'తేజః' - బ్రహ్మతేజస్సుగలిగి యుండవలెను.

'క్షమా' - ఓర్పు, సహనము; ద్వంద్వములందు **నిర్వికారుడై** పృథివివలె, ఫలవృక్షమువలె క్షమాశీలుడై యుండవలెను. శుకుడు, యేసుక్రీస్తు మున్నగువారి క్షమాశీలత్వమును, సహనత్వమును అపుడపుడు తలంచుకొనుచుండవలెను.

'ధృతిః' - ధైర్యముగలిగి యుండవలెను. నిజరూపమగు ఆత్మను గూర్చి చింతించుచుండినచో, మఱియు ప్రపంచమిథ్యాత్వమునుగూర్చి మననము చేయుచుండినచో మనుజునకు గొప్పధైర్యము చేకూరుచుండగలదు. ఎన్ని విపత్తులు తటస్థించినను మేరుసమానముగ గంభీరుడై యుండవలెను.

'శౌచమ్' - (1) బాహ్యశౌచము (శరీర, గృహాదులశుద్ధి) (2) అభ్యంతర శౌచము (ఇంద్రియ మనంబుల శుద్ధి, అపవిత్రసంకల్పములు లేకుండుట).

'అద్రోహః' - ఎవరికిని ద్రోహము, బాధ కలుగజేయకుండుట, మనస్సునందును ద్రోహచింతన లేకుండుట.

'నాతిమానితా' - తాను గొప్పపూజ్యుడనని ఎన్నడును విఱ్ఱవీగరాదు. తననుపరులు గౌరవించవలెనను అభిమానమున్ను గలిగియుండరాదు. ఇది సాధకులకు అత్యంతావశ్యకమగు సుగుణము. ఇది లేనికారణమున అనేకుల దంభ, అభిమానాదులచే పతనమొందిపోయిరి.

ఆంజనేయునకు గల్గియున్నటువంటి వినయవిధేయతలు, నిరభిమానము, దైవభక్తి కలవాడే పరమార్థమార్గమున సముత్తీర్ణుడుకాగలడు.

ఈ యిరువదియాఱు సుగుణములు దైవసంపత్తియందు జన్మించినవారికి కలుగుచుండును. ఇవిలేనివారు అట్టి దైవసంపదకై యత్నించి అద్దానిని పొందవలెను. మోక్షమున కీ సద్గుణములన్నియు అత్యావశ్యకములు.

**ప్ర:–** శ్రీకృష్ణభగవానునిచే దైవగుణము లెన్ని పేర్కొనబడెను? అవి యేవి?

**ఉ:–** ఇరువదియాఱు. అవి క్రమముగ (1) భయరాహిత్యము (2) చిత్తశుద్ధి (3) జ్ఞానయోగస్థితి (4) దానము (5) బాహ్యేంద్రియనిగ్రహము (6) (జ్ఞాన) యజ్ఞము (7) శాస్త్రాధ్యయనము (8) (జ్ఞాన) తపస్సు (9) ఋజుత్వము (10) అహింస (11) సత్యము (12) క్రోధరాహిత్యము (13) త్యాగము (14) శాంతి (15) కొండెములు చెప్పకుండుట (16) భూతదయ (17) విషయలోలత్వము లేకుండుట (18) మృదుత్వము (19) సిగ్గు (20) చపలత్వము లేకుండుట (21) ప్రతిభ (బ్రహ్మతేజస్సు) (22) ఓర్పు (23) ధైర్యము (24) శుచిత్వము (25) ద్రోహబుద్ధిలేకుండుట (26) అభిమానరాహిత్యము – ఈ సద్గుణములే దైవీసంపద యనబడును.

**అ॥** ఇక అసురసంపదను (అసురగుణములను) పేర్కొనుచున్నాడు –

**4. దమ్భో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్య మేవ చ**
**అజ్ఞానం చాభిజాతస్య పార్థ సమ్పదమాసురీమ్.**

**టీక:–** పార్థ = ఓ అర్జునా! దమ్భః = డంబము (కపటవేషము), దర్పః = గర్వము, అభిమానః చ = అభిమానమున్ను (తానే గొప్పవాడనను దురహంకారమును), క్రోధః = కోపము, పారుష్యమ్ ఏవ చ = (వాక్కు మున్నగువానియందు) కఠినత్వమున్ను, అజ్ఞానమ్ చ = అవివేకమున్ను, ఆసురీమ్ = అసురసంబంధమైన, సంపదమ్ = సంపత్తియందు (అసురసంపత్తిని పొందదగి), అభిజాతస్య = పుట్టినవానికి (భవన్తి = కలుగుచున్నవి).

**తా:–** ఓ అర్జునా! డంబము, గర్వము, అభిమానము (దురహంకారము), కోపము, (వాక్కుమున్నగువానియందు) కాఠిన్యము, అవివేకము అను నీదుర్గుణములు అసురసంపత్తియందు పుట్టినవానికి కలుగుచున్నవి. (అనగా అసురసంపత్తిని పొందదగి జన్మించినవానికి కలుగుచున్నవని భావము).

**వ్యాఖ్య:–** ఇదివఱలో తెలుపబడిన సుగుణములను దైవనిష్ఠులు, భక్తులు, ఎట్లు సంపదగను, గొప్పధనముగను భావించుచున్నారో అట్లే ఈశ్లోకమునందు తెలుపబడిన దుర్గుణజాతమును అసురులు, దుర్మార్గులు గొప్పసంపదగ తలంచుకొని మురిసిపోవుచు వానినే ప్రీతితో సేవించుచున్నారు. కాబట్టియే వానికి అసురసంపదయను పేరు గలిగినది. అంతియేకాని వాస్తవముగ అవి సంపద్రూపములుకావు. దారిద్ర్య రూపములేయగును. పూర్వము ఇరువదియాఱు సుగుణములను పేర్కొని, ఇపుడు ఆఱు దుర్గుణములను మాత్రము వచించుచున్నారు. ఈ దుర్గుణములనే వివరించి భగవానుడు విస్తారముగ చెప్పబోవుదురు. సాధకుడు మాయతో, ప్రకృతితో, అవిద్యతో నొనర్చు సంగ్రామమందు స్వపక్షవీరులను, ప్రతిపక్షవీరులను ఇరువురినిగూర్చి బాగుగ తెలిసికొని యుండవలెను. అపుడే స్వపక్షసైనికులను బలపఱచుకొనుటకును, పరపక్షసైనికులను దునుమాడుటకును వీలుండును. కనుకనే భగవాను డిచట దైవసంబంధమైన పవిత్రగుణములను పేర్కొని అంతటితో ఊరుకొనక అసురసంబంధమైన అపవిత్రగుణములనుగూడ పేర్కొనుచున్నారు. ఒకయిల్లు శుభ్రముగానుండవలెననిన, అందు పూర్వముండిన దుమ్ము, బూజు, మురికినీరు మున్నగువానిచే ఇంటిని పరిమళవంతముగజేసి, త్రాగుటకు బయటనుండి మంచినీరు మున్నగువానిని లోనికి తెచ్చుకొనవలెను. శరీరము ఆరోగ్యముగ, పుష్టిగ నుండవలెననిన,

లోనగలమలమూత్రాదులు బయటపోవలెను; చక్కని పుష్టికర ఆహారము, పానీయము లోనికి పోవలెను. ఆప్రకారముగనే మనఃపారిశుద్ధ్యము నిమిత్తము ఆ మనస్సునందు అనాదిగనుండుచున్న దుష్టప్రవృత్తులను, దుర్వాసనలను, దుర్గుణములను బయటకుగెంటివేసి, అనగా ఆసురీసంపదకు ఉద్వాసనముచెప్పి, సద్గుణములను (సచ్ఛీలమును) అనగా దైవీసంపదను ఆహ్వానించవలెను, అవలంబించవలెను.

దుర్గుణములలో మొట్టమొదట దంభము చెప్పబడినది. పరమార్థరంగమునగాని ఏరంగమునగాని కపటము, వేషము, మోసము పనికిరాదు. తాము గొప్పవారమని నటించినంతమాత్రమున ఒకవేళ వారు లోకులను మోసపుచ్చగలరేమోకాని భగవంతుని మోసపుచ్చలేరు. వారి హృదయగుహయందు దాగి వారి సంకల్పములన్నిటిని సర్వేశ్వరుడు కనిపెట్టుచునేయున్నాడు. కాబట్టి డంబమను దుర్గుణమును మొదలంట నఱకివేయవలెను. గర్వమును పారద్రోలవలెను. తనకేదైన గొప్పవిద్యగాని, అధికారముగాని లభించినచో గర్వపడక, అదియంతయు సర్వేశ్వరుని యనుగ్రహమువలననే కలిగినదని భావించి వినయాన్వితుడై యుండవలెను. అట్లే క్రోధమును విడువవలెను. దైవగుణములలో 'అక్రోధము', అసురగుణములలో 'క్రోధము' చెప్పబడుట గమనింపదగినది. అక్రోధమును గ్రహింపుమని చెప్పినను, క్రోధమును త్యజింపుమని చెప్పినను రెండును ఒకటే. దైవ, అసురసంపత్తుల రెండిటియందును క్రోధమును గూర్చిన ప్రస్తావన వచ్చుటవలన క్రోధరాహిత్యము అధ్యాత్మక్షేత్రమున ఎంత ఆవశ్యకమో తేట తెల్లమగుచున్నది. మఱియు సాధకుడు పరుషముగా మాట్లాడరాదు. వాక్కు మున్నగు వానియందు కాఠిన్యము చూపరాదు. దైవగుణములలో పేర్కొనబడిన 'మృదుత్వము'నే స్వీకరించవలెను.

**ప్ర:–** అసురగుణము లెన్ని చెప్పబడెను? అవియేవి?

**ఉ:–** ఆఱు. అవి క్రమముగ (1) డంబము (2) గర్వము (3) అభిమానము (4) కోపము (5) కాఠిన్యము (6) అవివేకము అనునవి అయియున్నవి. ఈ దుర్గుణములే ఆసురీసంపద యనబడును.

**ప్ర:–** ఈ దుర్గుణముల నేమిచేయవలెను?

**ఉ:–** లెస్సగ పరిత్యజించవలెను.

**అ॥** దైవీసంపద మోక్షమును, ఆసురీసంపద బంధమును గలుగజేయునని చెప్పుచున్నాడు -

**5. దైవీ సమ్పద్విమోక్షాయ నిబన్ధాయాసురీ మతా**
**మా శుచస్సమ్పదం దైవీ మభిజాతోఽసి పాణ్డవ.**

**టీక:–** దైవీ = దైవసంబంధమైన సంపద, విమోక్షాయ = పరిపూర్ణ (సంసార) బంధనివృత్తి కొఱకును, ఆసురీ *(సంపత్)* = అసురసంబంధమైన సంపద, నిబన్ధాయ = అతిశయ (సంసార) బంధము కొఱకును, మతా = (కారణములని) నిశ్చయింపబడినది, పాణ్డవ = ఓ అర్జునా!, (త్వమ్ = నీవు), దైవీమ్ = దైవసంబంధమైన, సంపదమ్ = సంపత్తునందు, (సంపత్తును పొందదగి), అభిజాతః = జన్మించినవాడవు, అసి = అయియున్నావు, మాశుచః = (కావున) దుఃఖింపకుము.

**తా:–** ఓ అర్జునా! దైవీసంపద పరిపూర్ణ (సంసార) బంధనివృత్తిని, ఆసురీసంపద గొప్ప (సంసార) బంధమును గలుగజేయునని నిశ్చయింపబడినది. నీవు దైవీసంపదయందే (దైవీసంపదను పొందదగియే) జన్మించినాడవు కావున శోకింప నవసరములేదు.

**వ్యాఖ్య:–** ఇంతదనుక దైవాసురసంపదల రెండిటిని వివరించిచెప్పి, ఇక వాని ఫలితములను చెప్పుచున్నారు. ఏలయనిన, ఫలితములు బాగుగ తెలిసియున్నచో, వానిని గ్రహించుటకుగాని, త్యజించుటకుగాని ప్రవృత్తికలుగగలదు. దైవసంపద మోక్షమును అనగా బంధవిముక్తిని, అసురసంపద బంధమును గలుగజేయునని యిట స్పష్టముగ చెప్పివేయబడెను. ఒకటి విడుదలచేయును. మఱియొకటి బంధించును. కావున వీనిలో ఏదిశ్రేష్ఠమో, అవలంబనీయమో విజ్ఞులే యోచించుకొనవచ్చును. బాధను, దుఃఖమును ఎవరైన కోరుకొందురా? సంకెళ్లను ఎవరైన స్వీకరింతురా? స్వీకరింపరు. కాబట్టి ఫలితములలో ఒకటి మోక్షమును, మఱియొకటి బంధమును కలుగజేయునని చెప్పబడినపుడు వివేకముగలవారు మోక్షప్రదమగు దైవసంపదనే స్వీకరించి, బంధజనకమగు అసురసంపదను పారద్రోలవలెను. ఇప్పటికెన్నియో కోట్లజన్మలు బంధమునందు, దాస్యశృంఖలములందు మ్రగ్గియున్న జీవుడు ఇప్పటికైనను విడుదల పొందుటకై అభిలషించుట శ్రేయస్కరము. కాబట్టి శ్రేయఃకాములగు ప్రతివారును ప్రయత్నపూర్వకముగ భగవత్ప్రోక్తములగు దైవగుణములను అభ్యసించి అసురగుణములను పారద్రోలవలెను.

ఈ పైనాలుగు శ్లోకములందును ఆ యా సంపదలందు జన్మించినవారికి ఆ యా గుణములు కలుగుచున్నవి అనుదానియర్థము ఆ యా సంపదలను భావికాలమున పొందదగి పుట్టినవారికి కలుగచున్నవనియే యగును. అనగా వారు పుట్టినపిదప ప్రయత్న పూర్వకముగ ఆ యా గుణములను సంపాదించుదురనియే అర్థము. అంతియేకాని ఆ యా సంపదలు వారివారి వంశముపై, కులముపై ఆధారపడునవి యనికాదు. అర్జునుడు దైవీసంపదయందు జన్మించినవాడని భగవానుడు చెప్పుటవలన, అధ్యాత్మవిజ్ఞాన శ్రవణమున కాతడు అర్హతను బొందియున్నట్లే యనియు, సద్గుణశీలుడేయనియు స్పష్టమగు చున్నది. అట్టి సచ్ఛీలయుతుడుకాబట్టియే సాక్షాత్ భగవానుని ముఖారవిందమునుండి బోధామృతమును గ్రోలు భాగ్యమును నోచుకొనగల్గెను.

'మా శుచః' – అను ఈ వాక్యము గీతయొక్క సందేశము. అదియే గీతయొక్క ఆదేశమున్ను. 'దుఃఖింపవలదు' – 'ఓ అర్జునా! నీవు దైవసంపదయందు జన్మించియున్నావు కాబట్టి ఇక దుఃఖింపకుము' అని శ్రీకృష్ణభగవానుడు చెప్పినదానినిబట్టి దుఃఖరాహిత్యమునకు దైవసంపత్తే కారణమనియు, సచ్ఛీలమే, హృదయనైర్మల్యమే అద్దానికి హేతువులనియు తేలుచున్నది. ఇంతియేకాదు. అసురసంపద దుఃఖమునకు కారణమనియు, అది కలవారు నిరంతరము శోకింపవలసివచ్చుదురనియు ఈవాక్యమునందు ధ్వనించుచున్నది. కాబట్టి దుఃఖరాహిత్యము, ఆనందప్రాప్తిని వాంఛించువారందరును భగవత్ప్రోక్తమగు దైవసంపదను తప్పక స్వీకరించి, అసురసంపదను నిర్మూలించి వేయవలెను.

ఇచట 'మోక్షాయ' అని చెప్పక 'విమోక్షాయ' అని చెప్పుటయు, 'బన్ధాయ' అని చెప్పక 'నిబన్ధాయ' అవి చెప్పుటయు గమనించదగినది. అనగా దైవసంపద గలవాడు లెస్సగ విముక్తుడనియు, అసురసంపదగలవాడు పూర్ణముగ బద్ధుడగుననియు భావము.

**ప్ర:–** దైవసంపదయొక్క ఫలమేమి?

**ఉ:–** మోక్షము. బంధనివృత్తి.

**ప్ర:–** అసురసంపదయొక్క ఫలమేమి?

**ఉ:–** బంధము.

**ప్ర:**— దీనినిబట్టి మోక్షమునకు మార్గమేమి యని తేలుచున్నది?

**ఉ:**— దైవసంపదను (పైనదెల్పిన దైవగుణములను) చక్కగ అభ్యసించి వానిని బడయుటయే ముక్తికి మార్గము.

**ప్ర:**— బంధము (దుఃఖము) దేనివలన కలుగుచున్నది?

**ఉ:**— అసురగుణములను గలిగియుండుటవలన.

**ప్ర:**— అర్జును డెట్టి సంపదయందు జన్మించెను?

**ఉ:**— దైవసంపదయందు.

**ప్ర:**— ప్రపంచమున దుఃఖమును పోగొట్టుకొనగలవాడెవడు?

**ఉ:**— దైవసంపద (దైవగుణములు) కలవాడు.

**అ॥** దైవగుణములుకలవారు, అసురగుణములుకలవారు అని ప్రాణులు రెండు విధములుగా నుందురని చెప్పుచున్నాడు -

**6. ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ**
**దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ మే శృణు.**

**టీక:**— పార్థ = ఓ అర్జునా! అస్మిన్ లోకే = ఈ ప్రపంచమునందు, దైవః = దైవసంబంధమైన గుణముకలదియని, అసురః ఏవ చ = అసురసంబంధమైన గుణముగలదియని, ద్వౌ = రెండువిధములగు, భూతసర్గౌ = ప్రాణులసృష్టులు, (స్తః = కలవు), (అందు), దైవః = దైవసంబంధమైనది, విస్తరశః = విస్తారముగ, ప్రోక్తః = (నీకు) చెప్పబడినది, (ఇక) ఆసురమ్ = అసురసంబంధమైనదానిని, మే = నా వలన, శృణు = వినుము.

**తా:**— ఓ అర్జునా! ఈ ప్రపంచమున దైవసంబంధమైన గుణముకలదియని, అసురసంబంధమైన గుణముకలదియని రెండువిధములగు ప్రాణుల సృష్టులు కలవు. అందు దైవసంబంధమైనదానినిగూర్చి నీకు సవిస్తరముగ తెలిపితిని. ఇక అసురసంబంధమైన దానినిగూర్చి నావలన వినుము.

**వ్యాఖ్య:**— వాస్తవముగ ప్రపంచమున రెండేరెండు జాతులు కలవని ఈశ్లోకము ద్వారా తెలియుచున్నది. (1) దైవజాతి (2) అసురజాతి - అని. అనగా ఒకటి ఆర్యజాతి, మఱియొకటి అనార్యజాతి. తక్కిన అవాంతరజాతులన్నియు తదుపరి ఏర్పడినవేయగును. కావున ప్రతివారును తాము ఏజాతికిజెందినది బాగుగ పరీక్షించుకొని తమయందేవైన అసురగుణములున్నచో వానికి తిలాంజలినొసంగి దైవగుణముల నభివృద్ధి పఱచుకొని 'దైవజాతి' లో చేరినవారై పరమశ్రేయము (మోక్షము) నొందవలయును.

**అ॥** ఇక అసురస్వభావము గలవారినిగూర్చి పంద్రెండు శ్లోకములద్వారా వివరముగ బోధించుచున్నాడు -

## 7. ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః
## న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే.

**టీక:–** అసురాః = అసురస్వభావముగల, జనాః = జనులు, ప్రవృత్తిం చ = ధర్మ ప్రవృత్తినిగాని, నివృత్తిం చ = అధర్మనివృత్తినిగాని, న విదుః = ఎఱుగరు, తేషు = వారియందు, శౌచమ్ = శుచిత్వము, న విద్యతే = ఉండదు, ఆచారః చ = ఆచారము (సత్కర్మానుష్ఠానము) న్ను, న = ఉండదు, సత్యమ్ అపి = సత్యమున్ను, న = ఉండదు.

**తా:–** అసురస్వభావముగల జనులు ధర్మప్రవృత్తినిగాని, అధర్మనివృత్తినిగాని యెఱుగరు. వారియందు శుచిత్వముగాని, ఆచారము (సత్కర్మానుష్ఠానము) గాని, సత్యముగాని యుండదు.

**వ్యాఖ్య:–** అసురస్వభావయుతులు ధర్మకార్యములను చేయుటనుగాని, అధర్మకార్యములనుండి మఱలుటనుగాని యెఱుగరు. ఒకరు చెప్పినను వినరు. వీరు అధములు. తమ తప్పిదమునుగూర్చి మఱియొకరు చెప్పినపుడు దానిని మార్చుకొనువారు మధ్యములు. అసలు తప్పిదమే చేయనివారు ఉత్తములు. ఈ శ్లోకమున అధములను గూర్చియే చెప్పబడినది. మఱియు ప్రవృత్తి, నివృత్తియని ఇచట రెండు తెలుపబడినవి. ఇచట 'ప్రవృత్తి' యనగా చేయదగినదియనియు, నివృత్తియనగా విడిచిపెట్టదగినది యనియు అర్థము. రెండిటిని విజ్ఞుడు తెలిసికొనియుండవలెను. అనగా దైవసంబంధకార్యములు, దైవగుణములు మున్నగు గ్రాహ్యవస్తువులనుగూర్చియు, విషయసేవనము, అధర్మకార్యములు, అసురగుణములు మున్నగు త్యాజ్యవస్తువులనుగూర్చియు ఎఱిగియుండవలెను. అసురస్వభావయుతులు వాని నెఱుగరని ఇట చెప్పబడినది.

**ప్ర:–** అసురస్వభావుల కొన్ని లక్షణములను పేర్కొనుము?

**ఉ:–** (1) వారు ధర్మప్రవృత్తిగాని, పాపనివృత్తిగాని యెఱుగరు (2) శుచిత్వము, ఆచారము, సత్యము వారియందుండదు.

## 8. అసత్యమప్రతిష్ఠం తే జగదాహురనీశ్వరమ్
## అపరస్పరసమ్భూతం కిమన్యత్కామహైతుకమ్.

**టీక:–** తే = వారు, జగత్ = జగత్తు, అసత్యమ్ = అసత్యమనియు (వేదాది ప్రమాణరహితమనియు), అప్రతిష్ఠమ్ = ప్రతిష్ఠ (ధర్మాధర్మవ్యవస్థలు) లేనిదనియు, అనీశ్వరమ్ = (కర్తయగు) ఈశ్వరుడు లేనిదనియు, కామహైతుకమ్ = కామమే హేతువుగాగలదై, అపరస్పర సమ్భూతమ్ = స్త్రీపురుషులయొక్క పరస్పరసంబంధముచే గలిగినదిగాక, అన్యత్ = మఱియొకటి, కిమ్ = ఏమి కలదనియు, ఆహుః = చెప్పుదురు.

**తా:–** వారు జగత్తు అసత్యమనియు (వేదాది ప్రమాణరహితమనియు), ప్రతిష్ఠ (ధర్మాధర్మవ్యవస్థలు) లేనిదనియు, (కర్తయగు) ఈశ్వరుడు లేనిదియు, కామమే హేతువుగా గలదై స్త్రీపురుషులయొక్క పరస్పరసంబంధముచేతనే కలిగినదనియు, అదిగాక ఈ జగత్తునకు వేఱుకారణమేమియు లేదనియు చెప్పుదురు.

**వ్యాఖ్య:–** అసురతత్త్వముకలవారు ఈ జగత్తు వేదప్రమాణసహితమైన ధర్మాధర్మవ్యవస్థలతో గూడి భగవంతునిచే సృష్టింపబడిన ట్లంగీకరింపక, జగత్తు తనంతట దానే కలుగుచున్నదనియు, స్త్రీపురుషసంయోగమే జగత్తునకు కారణమనియు చెప్పుదురు. వారిది స్థూలదృష్టియే కావున వారికి అంతమాత్రమే గోచరించినది. కంటికి పొరకప్పబడినవాడు ఎదుటనున్న వస్తువులను సరిగా చూడజాలనట్లు అజ్ఞానతిమిరావృతుడగు జీవుడు సత్యస్థితిని గాంచజాలడు.

**ప్ర:–** అసురస్వభావుల లక్షణములను మఱికొన్నింటిని చెప్పుము?

**ఉ:–** (1) ఈ జగత్తు వేదాదిప్రమాణరహితమైనదనియు, ధర్మాధర్మవ్యవస్థలు లేని దనియు, కర్తయగు ఈశ్వరుడు లేనిదనియు చెప్పుదురు. (2) కేవలము కామమే హేతువుగాగలదై స్త్రీపురుషుల అన్యోన్యసంబంధమువలననే ఈ జగత్తు ఏర్పడినది కాని మఱియొకవిధముగ గాదనియు వారు పలుకుదురు.

**9. ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానో உల్పబుద్ధయః**
**ప్రభవన్త్యుగ్రకర్మాణః క్షయాయ జగతో உహితాః.**

**టీక:–** (తే = ఆ యసురసంపదలుగలవారు), ఏతామ్ దృష్టిమ్ = ఈ (నాస్తిక) దృష్టిని, అవష్టభ్య = అవలంబించి, నష్టాత్మానః = చెడినమనస్సుగలవారును, అల్పబుద్ధయః = స్వల్పబుద్ధిగలవారును, ఉగ్రకర్మాణః = క్రూరకార్యములను (పరులను హింసించు కార్యములు) చేయువారున్ను, అహితాః = (లోకమునకు) శత్రువులును (అయి), జగతః = ప్రపంచముయొక్క, క్షయాయ = నాశముకొఱకు, ప్రభవన్తి = పుట్టుచున్నారు.

**తా:–** (వారు) ఇట్టి నాస్తికదృష్టిని అవలంబించి చెడిన మనస్సుగలవారును, అల్పబుద్ధితో గూడియున్నవారును, క్రూరకార్యములను జేయువారును, (జగత్తునకు) శత్రువులును (లోకకంటకు లును) అయి ప్రపంచముయొక్క వినాశముకొఱకు పుట్టుచున్నారు.

**వ్యాఖ్య:–** 'నష్టాత్మానః' అను ఈ పదముచే నాస్తికదృష్టి, కామస్వభావములు కలవారి మనస్సు తప్పకచెడిపోగలదని స్పష్టమగుచున్నది. మఱియు అట్టివారిబుద్ధి అల్పముగనే యుండును కాని విశాలముగా నుండదనియు తెలియుచున్నది. వారిది హ్రస్వదృష్టి. విశాలదృక్పథము, విశాలదృష్టి వారికి ఉండదు. ఇవ్విధముగ నాస్తికత్వము, కామదృష్టి చిత్తవినాశకరములగుటచే త్యాజ్యములని పైభగవద్వాక్యముల వలన బుజువగుచున్నది. మఱియు నాస్తికులు, కామమే సర్వస్వమని, సృష్టికి మూలమని తలంచు అవివేకులు తమను గొప్పగా తలంచుకొనినను భగవద్దృష్టిలో, పెద్దల దృష్టిలో వారు 'అల్పబుద్ధులే' యని తేలుచున్నది.

'క్షయాయ జగతః' - జగత్తుయొక్క నాశముకొఱకే వారిపుట్టుక కాని ఉద్ధారముకొఱకుగాదు. పరప్రాణులను హింసించుటయే వారిపనిగాని, వారికి ఉపకారము చేయుటగాదు. వారు లోకకంటకులేకాని, లోకహితులుకారు. వారు 'కబంధులే' కాని లోకబంధువులుకారు. వెయ్యేల, అట్టివారు భూమికి భారభూతులే యగుదురు.

**ప్ర:–** అసురస్వభావముకలవారి లక్షణములను మఱికొన్నింటిని పేర్కొనుము?

**ఉ:–** (1) (ఇట్టి) నాస్తికదృష్టి నవలంబించి మనస్సును చెడగొట్టుకొందురు (2) స్వల్పబుద్ధి గలిగియుందురు (3) క్రూరకర్మలు చేయుదురు (4) లోకకంటకులై వర్తించుదురు (5) జగత్తు యొక్క క్షయమునకే జన్మించుదురు.

**10. కామమాశ్రిత్య దుష్పూరం దమ్భమానమదాన్వితాః**
**మోహాద్గృహీత్వాఽసద్గ్రాహాన్ ప్రవర్తన్తేఽశుచివ్రతాః.**

**టీక:–** దుష్పూరమ్ = నింపశక్యముకాని (తనివిదీరని), కామమ్ = కామమును, ఆశ్రిత్య = ఆశ్రయించి, దమ్భమానమదాన్వితాః = డంబము, అభిమానము, మదము - వీనితో గూడినవారలై, మోహాత్ = అవివేకమువలన, అసద్గ్రాహాన్ = సత్పురుషులు కానివారిచే గ్రహింపబడదగిన విషయములను (లేక, చెడుపట్టుదలలను), గృహీత్వా = అవలంబించి, అశుచివ్రతాః = అపవిత్రవ్రతములు (నీచవృత్తులు) గలవారై, ప్రవర్తన్తే = ప్రవర్తించుచున్నారు.

**తా:–** వారు తనివితీరని కామమునాశ్రయించి, డంబము, అభిమానము, మదము గలవారలై, అవివేకమువలన చెడుపట్టుదలల నాశ్రయించి, అపవిత్రములగు వ్రతములు (నీచవృత్తులు) గలవారై ప్రవర్తించుచున్నారు.

**వ్యాఖ్య:–** 'దుష్పూరమ్' - ఎంత అనుభవించినను తనివితీరనిదియగుటచే కామము దుష్పూరమని చెప్పబడినది. అనగా నింపశక్యముకానిది. 'దుష్పూరేణానలేనచ' అని ఇదివఱలో 3వ అధ్యాయమున దీనిని గుఱించి ప్రస్తావించబడెను. ఇట్టి దుష్పూరమగు కామమును ఆశ్రయించినందువలన వారు అసఫలమనోరథులై తత్ఫలితముగ అశాంతికిలోనై యుందురు.

'దమ్భమానమదాన్వితాః' - దంభ, అభిమాన, మదములలో ఏ ఒక్కటి యున్నను జీవునకు వినాశమేకలుగుచుండ ఇక మూడును కలిగియున్నవారి విషయము వేఱుగచెప్ప వలయునా? వారేల ఈ ప్రకారముగ దుష్టాచరణశీలురై యుందురు? 'మోహాత్' - అవివేకమువలన, అజ్ఞానమను 'కైపు'లో వారు చేయరాని పనులన్నిటిని చేయుదురనియు, గ్రహించదగనివానినన్నిటిని గ్రహించుదురనియు భావము.

'అశుచివ్రతాః' - వారు నింద్యములై, అపవిత్రములైనట్టి మద్యసేవన, మాంసభక్షణాదివ్రతములను గలిగియుందురు. అనగా ప్రతిరోజు ఆ యా కార్యములను చేయవలెనను పట్టుదలగలిగియుందురు. వ్రతము, పట్టుదల యనునవి మంచివే అయినను అవి ఉత్తమ పదార్థములకు, పవిత్రకార్యములకు సంబంధించినవియగునపుడే సత్ఫలముల నొసంగ గల్గును. కావున వానిమార్గమును త్రిప్పవలెను. శుచివ్రతములనే ఆచరించవలెనుగాని అశుచివ్రతములనుగాదు. సద్గ్రహణమే గల్గియుండవలెనుగాని అసద్గ్రహణముకాదు.

**ప్ర:–** కామ మెట్టిది?

**ఉ:–** పూరింప శక్యముకానిది (దుష్పూరమ్).

**ప్ర:–** అసురీసంపదగలవారి మఱికొన్ని లక్షణములను జెప్పుము?

**ఉ:–** వారు (1) అంతులేని కామమును ఆశ్రయించుదురు (2) డంబము, అభిమానము, మదము గల్గియుందురు (3) అవివేకము గల్గియుందురు (4) చెడ్డపట్టుదలలు (నీచప్రవృత్తులు), అపవిత్రవ్రతములు శీలించుదురు.

**11. చిన్తామపరిమేయాం చ ప్రళయాన్తాముపాశ్రితాః**
**కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః.**

**12. ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః**
**ఈహన్తే కామభోగార్థ మన్యాయేనార్థసఞ్చయాన్.**

**టీక:–** చ = మఱియు, అపరిమేయామ్ = అపరిమితమైనదియు, ప్రలయాన్తామ్ = మరణము వఱకు (లేక, ప్రళయకాలమువఱకు) విడువనిదియునగు, చిన్తామ్ = విషయచింతను (లేక, కోరికలను), *ఉపాశ్రితాః* = ఆశ్రయించినవారును, కామోపభోగపరమాః = కామముల ననుభవింపుటయే పరమప్రయోజనముగ దలంచువారును, ఏతావత్ ఇతి = కామోపభోగమే పరమపురుషార్థము, ఇంతకు మించినది వేరొకటిలేదని, నిశ్చితాః = నిశ్చయించుకొనినవారును, ఆశాపాశశతైర్బద్ధాః = పెక్కు ఆశాపాశములచే బంధింపబడిన వారును, కామక్రోధపరాయణాః = కామము క్రోధము – వీనినే ముఖ్యముగ నాశ్రయించినవారును (అయి), కామభోగార్థమ్ = కామముల ననుభవించుట కొఱకు, (అన్యాయేన = అన్యాయమార్గములద్వారా), అర్థసంచయాన్ = ధనసమూహములను, ఈహన్తే = కోరుచున్నారు.

**తా:–** మఱియు వారు అపరిమితమైనదియు, మరణమువఱకు (లేక, ప్రళయ కాలమువఱకు) విడువనిదియునగు విషయచింతన (కోరికలను)ను ఆశ్రయించినవారును, కామోపభోగమే పరమపురుషార్థముగ దలంచువారును, ఇంతకుమించినది వేఱొకటి లేదని, నిశ్చయించువారును, పెక్కు ఆశాపాశములచే బంధింపబడినవారును, కామక్రోధములనే ముఖ్యముగ నాశ్రయించినవారును అయి కామముల ననుభవించుట కొఱకుగాను అన్యాయమార్గములద్వారా ధనసమూహములను కోరుచున్నారు.

**వ్యాఖ్య:–** అట్టి ప్రాపంచిక మనుజులయొక్క చింతలకు, కోరికలకు, మనోరథములకు అంతముండదు. వారి యా చింతలను చావు (లేక మహాప్రళయము) నిలుపుదల చేయవలసినదేతప్ప వారు స్వయముగ నిలుపరు. భక్తులు, ముముక్షువులు దైవమునే పరమపురుషార్థముగను, గమ్యముగను, జీవితలక్ష్యముగను ఎట్లుతలంచుదురో; అట్లే ఈ అసురప్రవృత్తికలవారు కామోపభోగమునే పరమార్థముగ దలంచి అంతకు మించి ప్రపంచములో గొప్పదికాని, సుఖసాధనమార్గముకాని లేదని వచించుదురు. మఱియు లోకములో ఒక్కత్రాటిచే కట్టబడినవారే ఎంతయో బాధనొందుచుండగా వీరు వందలకొలది ఆశలనుత్రాళ్ళచే బంధింపబడియుండుటచే (ఆశాపాశశతైర్బద్ధాః) ఇక వారి బాధ, అశాంతి వర్ణనాతీతముగనుండునని ఊహించుకొనవచ్చును. అట్టివారు కామక్రోధముల నేకాలమందును విడిచియుండక తత్పరాయణులైయుందురు. మఱియు తమ కామోపభోగముకొఱకు అన్యాయమార్గముల ద్వారా విత్తము నభిలషించుచుందురు. 'అర్థసంచయాన్' – అని చెప్పినందువలన వారు ఏకొద్దిధనముతోనో తృప్తిపడువారు కారనియు, ధనసమూహమునే కోరుచుందురనియు, అదియు సత్కార్యములకొఱకుగాక కేవలము విషయభోగములకొఱకేయనియు తెలిసికొనవలసియున్నది. దీనినిబట్టి వీరు రెండు

ఘోరప్రమాదముల నాచరించుచున్నట్లు విదితమగుచున్నది - (1) కామాశ్రయము (2) అన్యాయార్జనము. కావున సాధకులు, ముముక్షువులు ఇట్టి అల్పచరితుల సాంగత్యము చేయక కడుజాగరూకులైయుండవలెను.

ప్ర:— ఆసురీసంపదగల వారింకను ఎట్లుందురో తెలుపుడు?

**ఉ:—** (1) అంతులేని ఆశ, చింతలు గలిగియుందురు (2) కామోపభోగమే గొప్పదిగ తలంచుదురు (3) దానినిమించి మఱియొకటిలేదని భావించుదురు (4) పెక్కు ఆశాపాశములచే బంధింపబడియుందురు (5) కామక్రోధతత్పరులై యుందురు (6) విషయభోగములను మిక్కుటముగ అనుభవించుచు వానికొఱకై అధికధనమును వాంఛించి, అన్యాయమార్గములద్వారా మోసపుపద్ధతులద్వారా దానిని సంపాదింపదలంచుదురు.

**13. ఇదమద్య మయా లబ్ధ మిమం ప్రాప్స్యే మనోరథమ్**
**ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్.**

**14. అసౌ మయా హతశ్శత్రు ర్హనిష్యే చాపరానపి**
**ఈశ్వరోఽహమహం భోగీ సిద్ధోఽహం బలవాన్సుఖీ.**

**15. ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తిసదృశో మయా**
**యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః.**

**16. అనేకచిత్తవిభ్రాన్తా మోహజాలసమావృతాః**
**ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽశుచౌ.**

**టీక:—** ఇదమ్ = ఇది (ఈ యభీష్టము), అద్య = ఇప్పుడు, మయా = నాచేత, లబ్ధమ్ = పొందబడినది, ఇదం మనోరథమ్ = ఈ కోరికను, ప్రాప్స్యే = పొందగలను, ఇదమ్ = ఈ (ధనము), అస్తి = కలదు, ఇమం ధనమ్ అపి = ఈ ధనముగూడ, మే = నాకు, పునః = మఱల, భవిష్యతి = కలుగగలదు, అసౌశత్రుః = ఈ శత్రువు, మయా = నాచేత, హతః = చంపబడెను, అపరాన్ అపి చ = ఇతరశత్రువులను గూడ, హనిష్యే = చంపగలను, అహమ్ = నేను, ఈశ్వరః = ప్రభువును, అహం = నేను, భోగీ = సమస్తభోగములను అనుభవించువాడను, అహమ్ = నేను, సిద్ధః = తలంచిన కార్యములను నెరవేర్పశక్తిగలవాడను, బలవాన్ = బలవంతుడను, సుఖీ = సుఖవంతుడను, ఆఢ్యః = ధనవంతుడను, అభిజనవాన్ = గొప్పవంశమున బుట్టినవాడను, అస్మి = అయియున్నాను, మయా = నాతో, సదృశః = సమానుడు, అన్యః = మఱియొకడు, కః = యెవడు, అస్తి = కలడు? యక్ష్యే = యాగము చేసెదను, దాస్యామి = దానముల నిచ్చెదను, మోదిష్యే = ఆనందము ననుభవించెదను, ఇతి = ఈ ప్రకారముగ, అజ్ఞానవిమోహితాః = అజ్ఞానముచే మోహము (భ్రమ) నొందినవారును, అనేకచిత్తవిభ్రాన్తాః = అనేకవిధములైన చిత్తచాంచల్యములతోగూడినవారును, మోహజాల సమావృతాః = మోహము (దారాపుత్రక్షేత్రాదులందు అభిమానము) అను వలచే లెస్సగ ఆవరింపబడినవారును, కామభోగేషు =

కామముల (విషయముల) ననుభవించుటయందు, ప్రసక్తాః = ఎక్కువగ ఆసక్తిగలవారును, (సన్తః = అగుచు), అశుచౌ = అపవిత్రమైన, నరకే = నరకమందు, పతన్తి = పడుచున్నారు.

**తా:–** "ఈ కోరికను ఇపుడు నేను పొందితిని, ఈ కోరికను ఇకమీదట పొందగలను; ఈ ధనము ఇపుడు నాకు కలదు, ఇంకను ఎంతయో ధనము నేను సంపాదింప గలను. ఈ శత్రువును నేనిపుడు చంపితిని, తక్కిన శత్రువులనుగూడ చంపగలను; నేను ప్రభువును; సమస్తభోగములను అనుభవించువాడను; తలంచినకార్యమును నెరవేర్ప శక్తిగలవాడను; బలవంతుడను; సుఖవంతుడను; ధనవంతుడను; గొప్పవంశమున జన్మించినవాడను; నాతో సమానమైనవాడు మఱియొక డెవడుకలడు? నేను యజ్ఞముల జేసెదను; దానముల నిచ్చెదను; ఆనందము ననుభవించెదను" – అని యీ ప్రకారముగ అజ్ఞానముచే మోహము (భ్రమ) నొందినవారును, అనేకవిధములైన చిత్తచాంచల్యములతో గూడినవారును, మోహము (దారాపుత్రక్షేత్రాదులందు అభిమానము) అను వలచే బాగుగ గప్పబడినవారును, కామముల ననుభవించుట యందు మిగుల యాసక్తిగలవారును అయి, వారు (అసురప్రకృతి గలవారు) అపవిత్రమైన నరకమునందు పడుచున్నారు.

**వ్యాఖ్య:–** అసురసంపద నాశ్రయించువారి స్వభావము, చిత్తవృత్తి యెట్లుండునో ఈ శ్లోకములందు శ్రీకృష్ణపరమాత్మ చాల విశదముగ వర్ణించిరి. అసురగుణయుతులు ఈ దృశ్యప్రపంచమును శాశ్వతమని నమ్మి, ఆ క్షణిక పదార్థములందే పేరాశగల వారై, ఆ యా వస్తుసంపాదనమునే గొప్పగ దలంచుచు గర్వముతో పలుకు వాక్యము లిచట చక్కగ నుదుహరింపబడినవి. ఈ వాక్యములందు ఆ యసురస్వభావులయొక్క అహంభావము, దర్పము, గర్వము ప్రస్ఫుటితమగుచున్నవి.

కోరికలను అనుభవించినకొలది అవి ఇంకను పెరుగునేకాని తరగవు. కనుకనే వారు ఒక్కొక్క కోరికను అనుభవించుచు ఇంకను ఎన్నిటినో అనుభవించవలెనను కుతూహలము గలిగియుందురని చెప్పబడినది. మఱియు 'నేను గొప్పవాడను. నాతో సమానమైన వాడెవడు?' అని విఱ్ఱవీగుచు గర్వాహంకారయుతులై వారు పెక్కు చిత్తవికారములు కలిగి అశాంతికిలోనై, తుదకు ఘోరనరకములనే పొందగలరని యిచట పేర్కొనబడుట వలన ఆ దుర్గుణములన్నిటిని వివేకవంతుడు తప్పక త్యజించవలెనని స్పష్టమగుచున్నది. ఈ శ్లోకములందు వారుగావించు దోషములు, ఆ దోషములయొక్క దుష్ఫలితము – రెండును చెప్పబడినవి. నరకప్రాప్తియే ఆ దుష్ఫలితము. అజ్ఞానులీ ప్రపంచమున ఏమో సుఖమనుభవించుచున్నట్లు పైకి గోచరించినను లోన అనేక మనోవ్యథలను, చిత్తచాంచల్యములను, అనుభవించుచు తుదకు అపవిత్రమగు నరకమునే పొందుదురు. వారనుభవించు విషయసుఖములు రాజససుఖములేకాని సాత్త్వికసుఖములు కావు. రాజససుఖములు కడకు దుఃఖములుగనే పర్యవసించును. 'యజ్ఞముల జేయుదును, దానముల నిచ్చెదను' అని వారు పలుకుట డంబమునకే గాని, వాస్తవముగగాదు. ఒకవేళ వారా యజ్ఞాదులను చేసినను, పరులమెప్పును సంపాదించుటకేగాని, సదుద్దేశ్యముతో గాదు. వారు కావించు ఆ యజ్ఞాదులు పేరునకు మాత్రమే యని 17వ శ్లోకమున భగవానుడు చెప్పబోవుదురు. (నామయజ్ఞైస్తే). ఇచట 'సక్తాః' అని చెప్పక 'ప్రసక్తాః' అని చెప్పుటవలన వారు విషయభోగములందు లెస్సగ ఆసక్తులైయుందురని తెలియుచున్నది. మఱియు 'పతన్తి' అని పేర్కొనుటవలన వారు పతనమునే పొందుదురుగాని అభివృద్ధిని గాదని భావము. ఈ శ్లోకములనుబట్టి ప్రపంచములో మనుజులు ఎంత బలము, ఎంత ధనము, ఎంత కీర్తి, ఎంత ఐశ్వర్యము గలిగియున్నప్పటికిని చిత్తశుద్ధిలేనిచో, అహంకారము, గర్వము తొలగనిచో తుదకు పతనమునే పొందగలరని విదితమగుచున్నది.

ప్ర:– అసురసంపదగల వారింకను ఎట్లు ప్రవర్తించుదురో తెలియజేయుడు?

**ఉ:–** వారు "ఈ కోరిక ఇపుడు నెరవేరినది. ఆ కోరిక త్వరలో నెరవేరగలదు; ఈ ధనమిపుడున్నది, ఆ ధనము త్వరలో సమకూడగలదు; నేను ఈ శత్రువును చంపితిని, మిగిలిన శత్రువులను గూడ చంపెదను. నేను ప్రభువును; నేను భోగిని; నేను కార్యసిద్ధిగలవాడను; నేను బలవంతుడను; నేను సుఖవంతుడను; నేను ధనవంతుడను; నేను గొప్పకులమందు జన్మించిన వాడను; నాతో సమానుడెవడు? నేను యాగములను చేయుదును, దానములను చేయుదును, ఆనందము ననుభవించెదను!" అని గర్వముతో అజ్ఞానమువలన పలుకుచుందురు. అనేక చిత్తవికారములుగల్గి భ్రాంతి జెందియుందురు. మఱియు మోహము (అజ్ఞానము, అభిమానము) అను వలచే జుట్టబడియుందురు.

ప్ర:– ఇట్టి లక్షణములు గలవారికి ఏగతి లభించును?

**ఉ:–** వారు అపవిత్రమగు నరకమందు పడుదురు.

**17. ఆత్మసమ్భావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః**
**యజన్తే నామయజ్ఞైస్తే దమ్భేనాఽవిధిపూర్వకమ్.**

**18. అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః**
**మామాత్మపరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః.**

**టీక:–** ఆత్మసమ్భావితాః = తమ్ముతాము గొప్పగా తలంచువారును, స్తబ్ధాః = వినయము, పెద్దలయెడల మర్యాదలేనివారును, ధనమానమదాన్వితాః = ధనముకలదని దురభిమానముతో, మదముతో గూడియుండువారును, అహంకారమ్ = అహంకారమును, బలమ్ = (పరపీడాకరమగు) బలమును లేక, పశుబలమును, దర్పమ్ = గర్వమును, కామమ్ = కామమును, క్రోధం చ = క్రోధమునుగూడ, సంశ్రితాః = బాగుగ ఆశ్రయించినవారును, ఆత్మపరదేహేషు = తమ శరీరములందును, ఇతరుల శరీరములందును (సాక్షిగనున్న), మామ్ = నన్ను, ప్రద్విషన్తః = మిగులద్వేషించువారును, అభ్యసూయకాః = అసూయాపరులై యుండువారునగు, తే = (అసురసంపదగల) వారు, దమ్భేన = డంబముతో, అవిధిపూర్వకమ్ = శాస్త్రవిరుద్ధముగ, నామయజ్ఞైః = నామమాత్రపు యజ్ఞములచే, యజన్తే = యాగము చేయుచున్నారు (పూజించుచున్నారు).

**తా:–** తమ్ముతాము గొప్పగాదలంచువారును, వినయము (మర్యాద) లేనివారును, ధనముకలదని అభిమానముతోను, మదముతోను గూడియుండువారును, అహంకారమును, (పరపీడాకరమగు) బలమును, గర్వమును, కామమును క్రోధమును బాగుగ ఆశ్రయించినవారును, తమ శరీరములందును, ఇతరుల శరీరములందును (సాక్షిగ) నున్న నన్ను మిగుల ద్వేషించువారును, అసూయాపరులైయుండువారు నగు (అసురసంపదగల) వారు డంబముతో శాస్త్రవిరుద్ధముగ నామమాత్రపు యజ్ఞములచే యాగము చేయుచుందురు.

**వ్యాఖ్య:–** 'ఆత్మసమ్భావితాః', 'ప్రద్విషన్తః' అను రెండు పదములద్వారా ఆత్మస్తుతి, పరనింద అను

రెండు గొప్పదోషము లిచట తెలుపబడినవి. అజ్ఞులు తమ్ము తాము గొప్పగ చెప్పుకొనుచుందురు. 'పండితం మన్యమానాః' అనునట్లు తమ్ముతామే గొప్పపండితులుగ తలంచుకొనుచుందురు. ఇంతియేకాదు ఇతరులను చాల చులకనగ చూచుచు, ద్వేషించుచునుందురు. సమస్త చరాచర ప్రాణికోట్లయొక్క శరీరములందును సాక్షిరూపుడై వెలయుచున్న పరమాత్మనుగూడ వారు ద్వేషించుచుందురు. వారి యాజ్ఞ నుల్లంగించుచుందురు. వారి వాక్కగు వేదములను, శాస్త్రములను ధిక్కరించి ప్రవర్తించుదురు. ధనమదముచే కన్నుమిన్ను తెలియకనుందురు. పేరుకు మాత్రము డంబముగా యజ్ఞములను చేయుచుందురు. ఆ క్రియలను వారు భక్తితోను, భగవత్ప్రీత్యర్థముగాను చేయరు. పేరుప్రఖ్యాతుల కొఱకే చేయుదురు.

'మామాత్మపరదేహేషు' - 'తమదేహమునందును, ఇతరుల దేహములందును ఉన్న నన్ను ద్వేషించువారు' అని చెప్పుటవలన, భగవానుడు సమస్తప్రాణికోట్ల యొక్క శరీరములందును నివసించుచున్నారని స్పష్టమగుచున్నది. భగవంతు డెచట నున్నారని ప్రశ్నించువారి కిచట చక్కని సమాధానముగలదు. సమస్తచరాచరప్రాణులయొక్క శరీరములందును సాక్షిమాత్రులై వారు విలసిల్లుచున్నారని ఈ వాక్యము ద్వారా తెలియుచున్నది. అట్టి సర్వవ్యాపక, సర్వశరీరస్థ పరమాత్మను తెలిసికొనలేక ప్రాణి మఱియొకప్రాణిని ద్వేషించుచున్నాడు. అట్లు ద్వేషించువాడు ఎదుటివాని యంతరంగమున విరాజమానుడై యున్న సాక్షాత్ భగవానునే ద్వేషించినట్లగుచున్నది. అదేవిధమున ఒకరికి ఉపకారము చేసినచో, ఎదుటివాని యంతరమునగల పరమాత్మను పూజించినవాడే యగుచున్నాడు. కావున ఇచట 'ప్రద్విషన్తః' అను పదముచే వారు పరులను దూషించుటద్వారా భగవంతుని దూషించుచున్నారనిగాని, లేక, నేరులో భగవంతుని దూషించుచున్నారనిగాని తలంచువచ్చును.

'శ్రితాః' అని చెప్పక 'సంశ్రితాః' - అని చెప్పుటవలన వారు కామాది దుర్గుణములను లెస్సగ ఆశ్రయించుదురనియు, 'ద్విషన్తః' - అని పేర్కొనక 'ప్రద్విషన్తః' - అని పేర్కొనుటవలన భగవానుని మిగుల ద్వేషించుచుందురనియు తెలియుచున్నది. వారియొక్క పరమనీచప్రవృత్తి ఈ పదములచే ద్యోతకమగుచున్నది.

ప్ర:- అసురసంపదగలవారియొక్క మఱికొన్ని లక్షణములను చెప్పుడు?

**ఉ:-** వారు (1) తమ్ముతాము గౌరవించుకొందురు (2) పెద్దలయెడల వినయాదులు లేకుందురు (3) ధనమదము, ధనాభిమానము గలిగియుందురు (4) డంబమునకు, పేరుప్రఖ్యాతులకు శాస్త్రవిరుద్ధముగ యజ్ఞాదులను గావించుచుందురు (5) అహంకారము, (పశు) బలము, దర్పము, కామము, క్రోధము వీనిని యెక్కువగ ఆశ్రయించుచుందురు (6) తమశరీరమందును, ఇతరుల శరీరమందునుగల భగవానుని ద్వేషించుచుందురు (7) అసూయ గలిగియుందురు (ఒకరిమేలుజూచి ఓర్వలేరు).

ప్ర:- భగవంతు డెచటనున్నారు?

**ఉ:-** సమస్తప్రాణికోట్లయొక్క శరీరములందు.

అసురసంపదగలవారియొక్క లక్షణములను పది శ్లోకములద్వారా చెప్పి తుట్టతుదకు అట్టి దుర్గుణశీలురు నరకములందు బడుదురు (పతన్తినరకేఽశుచౌ) - అని ఫలశ్రుతియు చెప్పి - అంతటితో పూర్తిచేయక మఱల రెండుశ్లోకములద్వారా వారి దుర్నీతులను, దుష్టభావములను వర్ణింపదొడగుట జూడ

అసురగుణములకు జనులు తమహృదయమున ఏమాత్రము చోటీయక పరిపూర్ణముగ వానిని త్యజించివేయవలెనని భగవదాశయమై యున్నట్లు విదితమగుచున్నది.

ఈశ్లోకముతో అసురసంపదగలవారి లక్షణములు పరిసమాప్తిగావించబడినవి. పండ్రెండు శ్లోకములందు ఏకధాటిగా పరమాత్మ అసురసంపత్తిని వర్ణించి చెప్పిరి. ఈ దుష్టగుణములు ఎవరియందున్నప్పటికిని, వారెంతటి విద్యావంతులు, ధనవంతులు, కులవంతులు, అధికారవంతులు, సౌందర్యవంతులు, బలవంతులు, అయియున్నను గూడ రాక్షసులుగనే జమకట్టబడుదురు. వారు మానవులైనను దానవులుగనే పరిగణింపబడుదురు. సురలోకవాసులైనను అసురులుగనే లెక్కింపబడుదురు. సామాన్యముగ రాక్షసులు ఏపాతాళలోకములోనో ఉందురని ప్రతీతి. కాని జనుల హృదయమందుగూడ వారు కాపురముందురు. కామాది దుష్టగుణములే ఆ రాక్షసులు. మనుజుడు తనహృదయమును బాగుగ పరిశోధించి, తనయం దేయేఅసురులు కాపురముండుచున్నారో చక్కగ పరికించి ప్రయత్నపూర్వకముగ వారందరిని బయటకు సాగనంపవలెను. భగవానుడు ఈ అధ్యాయమందు ఇంతవఱ కెన్నియో అసురగుణములను చెప్పియుండెను. వానిలో అన్నిగాని, లేక, కొన్నిగాని తుదకు ఒక్కటిగాని హృదయకుహరమున దాగియున్నచో - మంత్రోచ్చాటనముచే భూతములను వెడలగొట్టుచందమున - వానినన్నింటిని తొలగించివేయవలెను. అట్లు తొలగించి, ఇతఃపూర్వము భగవానుడు చెప్పిన 'అభయము' మున్నగు దైవగుణములను, దైవీసంపత్తిని లెస్సగ పరిగ్రహించవలెను.

**"ఆగమార్థం తు దేవానాం గమనార్థం తు రక్షసామ్"** "ఓ దేవతలారా! రండు! ఓ రాక్షసులారా! పొండు!" అను ఈ ఆగమవాక్యము ననుసరించి ప్రతివారును తమచిత్తములందు ఈ దుష్టగ్రహోచ్చాటనమును, పవిత్రదేవతాహ్వానమును - రెండిటిని గావించి హృదయములను దేవతానిలయములుగ గావించుకొని పరబ్రహ్మానుభూతిని బడయవలయును.

**అ॥** ఇంతవఱకు అసురస్వభావముగలవారి లక్షణములనుజెప్పి ఇక రెండు శ్లోకములద్వారా వారు పొందు ఘోరదుర్గతిని వివరించుచున్నాడు -

**19. తానహం ద్విషతః క్రూరా న్సంసారేషు నరాధమాన్**
**క్షిపామ్యజస్ర మశుభా నాసురీష్వేవ యోనిషు.**

**టీక:-** ద్విషతః = (అట్లు సమస్తప్రాణులలోగల ఆత్మయగు) నన్ను ద్వేషించువారును. క్రూరాన్ = క్రూరులును (కఠినచిత్తులును), అశుభాన్ = అశుభ (పాప) కార్యమును చేయువారును, లేక అశుభ (పాప) సంకల్పములుగలవారును (బాహ్యాభ్యంతర శుచిత్వములేనివారు) (అగు), తాన్ నరాధమాన్ = ఆ మనుజాధములను, అహమ్ = నేను, సంసారేషు = జననమరణ రూపములగు ఈ సంసారమార్గములందు, ఆసురీషు యోనిషు ఏవ = అసురసంబంధమైన (నీచ) జన్మములందే, అజస్రమ్ = ఎల్లప్పుడు, క్షిపామి = త్రోసివైచెదను.

**తా:-** (ఆ ప్రకారము సమస్తప్రాణులలోగల ఆత్మయగు) నన్ను ద్వేషించువారును, క్రూరులును, అశుభ (పాప) కార్యములను జేయువారును నగు అట్టి మనుజాధములను నేను జననమరణరూపములగు ఈ సంసారమార్గములందు అసురసంబంధమైన నీచజన్మలందే యెల్లప్పుడు త్రోసివైచెదను.

**వ్యాఖ్య:–** 'ద్విషతః' - ఇతరుని ద్వేషించినచో ఆతనిహృదయమున భగవానుడు కలడు కనుక భగవానుని ద్వేషించినట్లే యగుచున్నది.

పైనదెల్పిన ప్రకారముగ అసురగుణములుగలిగి భగవంతుని ద్వేషించుచు నీచకార్యములకు గడంగునట్టి జనుల కెట్టి భయంకరపరిణామముగలుగునో ఇచట తెలియజేయుచున్నారు. ప్రపంచములో సత్కార్యములు చేయువారికి సద్గతి, దుష్కార్యములు చేయువారికి దుర్గతి యను ఫలితములు సృష్టియందే ఏర్పడియున్నవి. అది ఈశ్వరనియతి. దాని నెవరును ఉల్లంఘించరాదు. ఉల్లంఘించినచో దాని దుష్ఫలితములకు వారే బాధ్యులగుదురు. కనుకనే భగవానుడు మొట్టమొదట అనేక దైవగుణములుచెప్పి, వానిని ఉల్లంఘించువారు, అనగా అసురగుణములను ఆశ్రయించువారు తత్ఫలితముగ నీచజన్మలను, ప్రవాహరూపమగు ఈ సంసారముననే పడి పుట్టుచు, చచ్చుచు పలువిధయాతనల ననుభవించుచుందురు. కాబట్టి అసురగుణముల నెవరును అవలంబించరాదు. దైవసంపదనే ఆశ్రయించి ముక్తిని బడయవలెను.

'తానహం' - 'నేనే వారిని కర్మఫలానుసారముగ కృమికీటకాది, రాక్షసాది నీచజన్మలందు బడద్రోసెదను' అని శ్రీకృష్ణమూర్తి చెప్పుటవలన, సర్వజగన్నియామకుడు, సర్వశాసకుడు, కర్మఫలప్రదాత, సర్వజీవగతినిర్ణేత ఆ పరమాత్మయే యని స్పష్టమగుచున్నది.

'నరాధమాన్' - 'మనుజాధము'లను కఠినపదము నిచట ప్రయోగించుటవలన భగవానుడు పాపులపై, దైవవిద్వేషులపై, అసురగుణాశ్రయులపై ఎంతటి రౌద్రమును వహించిరో తెలియుచున్నది. 'వినాశాయ చ దుష్కృతామ్' అని ఇదివఱలో పాపాత్ములను శిక్షించుటకు (పుణ్యాత్ములను రక్షించుటకు) తానవతరించుచుందునని పలికిన వాక్యముల నీ సందర్భమున జ్ఞాపకమునకు తెచ్చుకొనవలయును. మనుజుడు నరాధముడుగ నుండరాదు, నరోత్తముడుగ నుండవలెను. పురుషాధముడుగ వర్తింపక పురుషోత్తముడుగ నుండుటకైయే యత్నింపవలెను. ఒకవేళ పాపకార్యములుచేసి నరాధముడుగ మారెనా, తగినశాస్తి జరిగియే తీరునని యిచట వచింపబడినది. కాబట్టి మనుజులు భయభక్తులుగల్గి జాగరూకులై, తమ విజ్ఞత నుపయోగించి తమ జీవితమున అసురగుణముల నేమాత్రము ఆశ్రయింపక దైవీసంపదనే బాగుగ అభ్యసింపవలయును.

'సంసారేషు', 'అసురీష్వేవ యోనిషు' - అని బహువచనము ప్రయోగించుటచే వారు ఏ ఒకటి రెండు జన్మలలో కాదు, కృమికీటకాది, రాక్షసాది అనేక జన్మలను పొందుదురని స్పష్టమగుచున్నది. సంసారమునందే, జన్మపరంపరయందే పడి వారు తమ దుష్కర్మప్రభావముచే అందుండి తప్పించుకొనజాలక నానాబాధలను పొందుచుందురు. పారిపోవు గొఱ్ఱెను కసాయివారు మఱల వెనుకకు తెచ్చి వధించుచందమున అట్టినీచులు దుఃఖమునుండి, సంసారబంధమునుండి తప్పించుకొనదలంచినను, దుష్కర్మఫలితముండు వఱకు భగవదాజ్ఞచే తిరిగి దానియందే పడద్రోయబడుదురు. గరుడపురాణమును చదివినచో ఏ యే పాపముచేసినవారు నరకమున ఏ యే దుఃఖమనుభవించుచుందురో బాగుగ తెలియగలదు. అట్టి దారుణ నరకదుఃఖమునుగాని, కృమికీటకాది నీచజన్మజనితదుఃఖములనుగాని తప్పించుకొనదలంచు ప్రతిమానవుడును తన చరిత్రవిషయమై కడుజాగరూకుడై భగవానుడు పైనదెలిపిన దుష్టప్రవృత్తులు (అసురసంపద) ఏవియు లేకుండ చూచుకొని, సదాచారపరాయణుడై కైవల్యపదము నలంకరింపవలయును.

'క్షిపామి' - 'విసరివేసెదను' - పాపాత్ములను, అసురగుణావలంబులను 'నీచజన్మ లందు చేర్చెదను' అని చెప్పక నీచజన్మలందు విసరివేసెదనని భగవానుడు పలుకుటచే అట్టి దుర్మార్గులయెడల భగవాను

డెంతటి తీవ్రవైఖరి యవలంబించెనో తేటతెల్లము కాగలదు. ఒక రాయినిగాని, బంతినిగాని దూరముగ విసరునట్లు పాపులను నరకాదిలోకములలో నీచజన్మలందు విసరివేయుదునని శ్రీకృష్ణపరమాత్మ యిచట చెప్పిరి. కావున భగవదాశయమును, జగన్నియతిని ఎఱిగి సత్పథమునే చేబట్టుట విజ్ఞుల కర్తవ్యము.

'అజస్రమ్' - (ఎల్లప్పుడు) - జనుల దుష్టప్రవృత్తు లెంతకాలముండునో అంతకాలము దుఃఖము వారిని వెన్నంటుచునే యుండును. నీడవలె శోకము వారిని అనుగమించుచుండునని 'అజస్రమ్' అను ఈ పదముచే స్పష్టమైనది. కొందరిట్లు ప్రశ్నించుదురు - 'అయ్యా! ఈ సంసారబాధలు మాకింకను ఎన్నాళ్లుండును?' - వారి యా ప్రశ్న కిచట సమాధానమొసంగబడినది. జనులందు పాపము, దుర్మార్గము, దుశ్చరితము, భగవద్విస్మృతి, అజ్ఞానము మున్నగునవి ఎంతవఱకుండునో అంతవఱకును ఈ దుఃఖములు జనులను వీడనేవీడవు. దుర్గుణములు ఎల్లపుడుండుచో ఈ తాపములున్ను ఎల్లపుడుండును అవి పోయినచో ఇవియుపోవును. 'అజస్రమ్' అను పదముచే - 'పాపాత్ములకు శిక్ష లభించును' అను ఈ శాసనము ప్రపంచమున ఎల్లపుడును అమలునందుండును - అను భావమున్ను వ్యక్తమగుచున్నది.

**ప్ర:–** అసురగుణములు కలవారికి, దైవవిద్వేషులకు ఎట్టి ఫలితము లభించును?

**ఉ:–** వారు దైవనియతిచే అసురసంబంధమైన నీచజన్మలందే మఱల మఱల పుట్టుచుందురు. అనగా కృమికీటకాది, రాక్షసాది హీనజాతులందే వారు (దుష్కర్మలనివృత్తికాలమువఱకు) జన్మించి నానాయాతనల ననుభవించుదురు. భగవానుడే వారలను ఆ యా జన్మలందు విసరివేయును.

**ప్ర:–** దైవశాసన మెంతకాలముండును?

**ఉ:–** ఎల్లపుడును ఉండును (అజస్రమ్).

**అ॥** అట్టి నీచజన్మలను బడసి దైవప్రాప్తిలేక తుదకు వారు అధఃపతనమునే పొందుదురని వచించుచున్నాడు -

**20. ఆసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని**
**మామప్రాప్యైవ కౌన్తేయ! తతో యాన్త్యధమాం గతిమ్.**

**టీక:–** కౌన్తేయ = ఓ అర్జునా!, ఆసురీమ్ = అసురసంబంధమైన, యోనిమ్ = జన్మమును, ఆపన్నాః = పొందినవారలగు, మూఢాః = మూఢులు (అవివేకులు), జన్మని జన్మని = ప్రతిజన్మయందును, మామ్ = నన్ను, అప్రాప్య ఏవ = పొందకయే, తతః = అంతకంటె, అధమామ్ = నీచతరమైన, గతిమ్ = జన్మమును, యాన్తి = పొందుచున్నారు.

**తా:–** ఓ అర్జునా! అసురసంబంధమైన (నీచ) జన్మమును పొందినవారలగు మూఢులు ప్రతి జన్మయందును నన్నుపొందకయే, అంతకంటె (తాముపొందిన జన్మ కంటె) నీచతరమైన జన్మమును పొందుచున్నారు.

**వ్యాఖ్య:–** పాపాత్ములను, అసురగుణములు కలవారిని నీచజన్మలందు బడద్రోసెదనని క్రిందటి శ్లోకమున భగవానుడు తెలిపియుండిరి. తదుపరి వారిస్థితి యేమగునో ఇచట తెలియజేయుచున్నారు. తమ

దుష్కర్మప్రభావముచే వారు భగవానుని పొందు సౌభాగ్యమును నోచుకొనలేక, ఆనందమును చవిచూడలేక తామింతవఱకు పొందియున్న హీనజన్మకంటె ఇంకను హీనతరమైన జన్మమును పొందుదురని యిట వచింపబడినది. మేడమెట్లపైనుండి క్రిదకుజారిన బంతి ఒక్కొక్క మెట్టు దిగజారి ఏ ప్రకారముగ క్రిందకు పడిపోవునో, ఆప్రకారమే వారు అధోగతి నొందుచుందురు. ఆహా! పాపఫలితమెంత దారుణమైనది! కావున ఇటువంటి భగవద్వాక్యములు వినిన తరువాతయైనను దురాచారపరులు తమ దుర్వృత్తుల నికకట్టిబెట్టి సత్పథగాములై వర్తించుట శ్రేయోదాయకము.

'మామప్రాప్యైవ' - (నన్ను పొందకయే) - అని చెప్పుటవలన వారికి దైవప్రాప్తి లేక పోగా, ఇంకను హీనతరమైన జన్మము కలుగుచున్నదని భావము. కావున (1) మనుజుడు హీనజన్మనొందక యుండులాగునను (2) దైవమును పొందులాగునను ఏకకాలముననే ప్రయత్నింపవలెను. ఇట్టి సౌభాగ్యస్థితి జీవుని సదాచారణపైననే ఆధారపడియుండును. ఈ విషయమును రాబోవుశ్లోకమున చెప్పనున్నారు.

**ప్ర:–** అసురజన్మను పొందిన మూఢులయొక్క పరిస్థితి యెట్లుండును?

**ఉ:–** వారు పరమాత్మను పొందక, తామింతవఱకున్నట్టి నీచజన్మకంటెను ఇంకను నీచతరమగు జన్మను పొందుచునుందురు.

**ప్ర:–** కాబట్టి జీవుడు కడతేరుటకు మార్గమేమి?

**ఉ:–** 'అసురసంపద'ను (దుర్గుణములను, దురాచారములను) వదలి .దైవీసంపదను. (సద్గుణములను, సదాచారములను) పరిగ్రహించవలెను.

**అ॥** నరకబాధనుండి తప్పించుకొను ఉపాయమును సెలవిచ్చుచున్నాడు -

## 21. త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః
## కామః క్రోధస్తథా లోభ స్తస్మా దేతత్త్రయం త్యజేత్ .

**టీక:–** కామః = కామము (ఆశ), క్రోధః = కోపము, తథా = అటులనే (మఱియు), లోభః = లోభము (ఇతి = అను), ఇదమ్ = ఇది, త్రివిధమ్ = మూడువిధములగు, నరకస్య ద్వారమ్ = నరకద్వారము (మఱియు), ఆత్మనః = తనకు (జీవునకు), నాశనమ్ = నాశనముగలుగచేయునది, తస్మాత్ = ఆ కారణమువలన, ఏతత్ త్రయమ్ = ఈ మూడింటిని, త్యజేత్ = విడువవలెను.

**తా:–** కామము, క్రోధము, లోభము అను నీమూడును మూడువిధములగు నరక ద్వారములు. ఇవి తనకు (జీవునకు) నాశము గలుగజేయును - కాబట్టి ఈమూడిటిని విడనాడవలెను. (లేక, కామము, క్రోధము, లోభము అను మూడువిధములగు ఈ అసురసంపద నరకమునకు ద్వారములు - అనియు చెప్పవచ్చును).

**వ్యాఖ్య:–** నరకప్రాప్తికి హేతుభూతమైన దుష్టత్రయ మీశ్లోకమున తెలియజేయబడినది. ఆ మూడును (కామాదులు) నరకమునకు ద్వారములవంటివేయని చెప్పబడినది. అనగా అవి కలవారికి నరకద్వారము తెఱవబడినట్లేయని అర్థము. ఆ మూడు దుర్గుణములు లేనివారికి ఆ ద్వారములు మూయబడియుండుట

వలన, ఇక వారికి నరక ప్రవేశము లేనేలేదని యర్థము. ఇంతదనుక భగవానుడు అనేక అసుర గుణములు చెప్పుచువచ్చెను. అట్టి దుర్గుణములు కలవారు క్రిందిక్రింది లోకములకు, నీచనీచజన్మలకు జనుచు నానాదుఃఖపరంపరలను అనుభవించుచుందురనియు తెలిపెను. అయితే ఇక వారిగతి అంతియేనా? వారుద్ధరింపబడుటకిక అవకాశములు లేవా? అని ప్రశ్నించిన, కలవని గీతాచార్యులు చెప్పుచున్నారు. అసురగుణములన్నిటిని మూడుగ విభజించవచ్చును. అవియే (1) కామము (2) క్రోధము (3) లోభము. కాబట్టి ఎవడీ మూడింటిని ప్రయత్నపూర్వకముగ త్యజించివేయునో అతడు నరకముయొక్క బెడదనుండి తప్పించుకొని ఊర్ధ్వగతిని బడయగలడు. ఈసత్యమింకను రాబోవు శ్లోకమున చక్కగ విశదీకరింపబడగలదు. కాబట్టి ఇక పాపాత్ములెవరును తమ యధఃపతనమునుగూర్చి దిగులుపడక, తామెచ్చోటనున్నారో అచటినుండియే భగవానుడు తెలిపిన ఈ కామక్రోధలోభ త్యాగరూపప్రయత్న మాచరించుచు నుండినచో అచిరకాలములోనే వారు నరకవిముక్తులై, దుఃఖవర్జితులై పరమశ్రేయము నొందగలరు. కావున ప్రతివారును వారివారి హృదయములను చక్కగ పరిశోధించుకొని ఈ కామ, క్రోధ, లోభములను ముగ్గురుదొంగలను కనిపెట్టి వివేకాదుల సహాయమున వారిని దూరముగ తరుమగొట్టవలెను.

ఈశ్లోకమున 'త్రివిధమ్' అను పదమును 'నరకమ్' అనుదానికగాక, 'ఇదమ్' అను పదమునకు విశేషణముగ జెప్పి, (కామ, క్రోధ, లోభములను) మూడువిధములుగనున్న ఆసురీసంపద 'నరకద్వారము' అనియు అర్థము చెప్పవచ్చును.

**ప్ర:–** నరకమున కెన్ని ద్వారములు? అవియేవి?

**ఉ:–** మూడు. అవి క్రమముగ (1) కామము (2) క్రోధము (3) లోభము అనునవి.

**ప్ర:–** ఆ కామాదులవలన జీవునకు కలుగు హాని యేమి?

**ఉ:–** అవి యాతనిని నశింపజేయును. (ఆతని వినాశనమునకవి హేతువులైయున్నవి).

**ప్ర:–** కాబట్టి శ్రేయము నభిలషించువాడేమి చేయవలెను?

**ఉ:–** ఆ మూడు దుర్గుణములను త్యజించివేయవలెను.

**ప్ర:–** ఆసురీసంపదకు సంబంధించిన అనేక దుర్గుణములను భగవానుడు తెలిపెనుగదా! వానినన్నింటిని సంక్షేపించి మూడుగ జెప్పుము?

**ఉ:–** (1) కామము (2) క్రోధము (3) లోభము.

**అ॥** ఈ కామాదులను తొలగించుకొనువాడు పరమశ్రేయమును బొందునని సెలవిచ్చుచున్నాడు -

## 22. ఏతైర్విముక్తః కౌన్తేయ ! తమోద్వారై స్త్రిభిర్నరః
## ఆచరత్యాత్మన శ్శ్రేయ స్తతో యాతి పరాం గతిమ్.

**టీక:–** కౌన్తేయ = ఓ అర్జునా!, ఏతైః = ఈ, త్రిభిః = మూడైన, తమోద్వారైః = (అజ్ఞాన రూపములగు) నరకద్వారములనుండి, విముక్తః = బాగుగ విడువబడినట్టి, నరః = మనుజుడు, ఆత్మనః =

తనకు, శ్రేయః = మేలును (హితము) ఆచరతి = కావించుకొనుచున్నాడు, తతః = అందువలన, పరామ్ గతిమ్ = సర్వోత్కృష్టమగు మోక్షగతిని, యాతి = పొందుచున్నాడు.

**తా:–** ఓ అర్జునా! (కామక్రోధలోభములనునట్టి) ఈ మూడు నరకద్వారములనుండి బాగుగ విడువబడిన మనుజుడు తనకు హితమును గావించుకొనుచున్నాడు. అందువలన సర్వోత్కృష్టమగు మోక్షగతిని పొందుచున్నాడు.

**వ్యాఖ్య:–** కామ, క్రోధ, లోభములను ఈ మూడు దుష్టగుణము లున్నంతవఱకును ఎవడును వృద్ధికిరాలేడు. హితమును బొందలేడు. తనకు మేలొనర్చుకొనలేడు. అందుచేత మొట్టమొదట వానిని తొలగించివేయవలెననియు, అపుడు మాత్రమే మానవుడు తనకు శ్రేయము నొనగూర్చుకొని సర్వోత్తమమగు మోక్షపదవిని బడయగలడనియు భగవాను డిచట బోధించుచున్నారు. సూర్యచంద్రులు రాహువునుండి విడువబడినట్లున్ను, గజేంద్రుడు మొసలిబారినుండి విడుదలబొందినట్లును, బంధితుడు కారాగృహమునుండి విముక్తుడైనట్లును జీవుడీ దుష్టత్రయము యొక్క బంధమునుండి విడుదలను బొందవలెను. 'ముక్తః' అని చెప్పక 'విముక్తః' అని చెప్పుటవలన వానినుండి పూర్తిగ విడుదల జెందవలెనని, వానిజాడ ఏమాత్రము హృదయకోశమున నుండరాదని భావము. మఱియు అవి 'తమోద్వారము' లని పేర్కొనబడుటవలన, ఆ కామాదులు అజ్ఞానరూపములే యనియు, అంధకారబంధురములనియు, ప్రకాశాభావరూపములనియు, నరకహేతువులనియు స్పష్టమగుచున్నది. అవి తమోద్వారములగుటచే, అవి కలవాడు 'చీకటియింటి'లో కాపురము పెట్టిన చందముననే యుండును. అనగా దుఃఖములనే యనుభవించును.

'ఆచరత్యాత్మనః శ్రేయః' – ఆ కామాదులున్నంతవఱకు ఎవరును తనకు శ్రేయమును గలుగజేసికొనజాలరు. ఆత్మోద్ధరణము గావించుకొనజాలరు. తానెవరు? జగత్తేమి? అని విచారింపజాలరు. అనగా వాసనాక్షయము కానంతవఱకు ఆత్మజ్ఞానము పూర్ణముగ ఉదయించనేరదనియు, ఆత్మానుభూతి లెస్సగ కలుగదనియు అర్థము. కామాదులు వదలిపోయినపుడే అట్టి జ్ఞానము బాగుగ సంప్రాప్తము కాగలదని ఈ శ్లోకముద్వారా తెలియుచున్నది. కాబట్టి సాధకుడు ప్రప్రథమమున ఆ దుష్టత్రయమును పారద్రోలవలెను.

'పరాంగతిమ్' – అని చెప్పుటచే మోక్షము అన్ని పదములకంటెను, అన్ని గతులకంటెను సర్వోత్కృష్టమైనదని తెలియుచున్నది. మఱియు కామాదులున్న స్థితి అత్యంతనికృష్టమైనదనియు దీనివలన ధ్వనించుచున్నది.

**ప్ర:–** కామాదు లెట్టివి?

**ఉ:–** అవి నరకద్వారములు.

**ప్ర:–** మోక్షమను హితమునకై ఎవడు యత్నించును?

**ఉ:–** ఆ కామాదులనుండి లెస్సగ విముక్తుడైనవాడు.

**ప్ర:–** అట్లు యత్నించుటవలన నతనికి కలుగు ఫలితమేమి?

**ఉ:–** అతడు మోక్షమును బడయగలడు.

**ప్ర:–** మోక్షపద మెట్టిది?

**ఉ:–** అన్నిటికంటెను సర్వోత్తమమైనగతి (పరాంగతిమ్).

**అ॥** ఈ ప్రకారముగ (శాస్త్రాదేశము ననుసరించి) వర్తింపక తనయిష్టమువచ్చినట్లు ప్రవర్తించినచో మనుజు డున్నతిని పొందలేడని వచించుచున్నాడు –

## 23. యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః
## న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్.

**టీక:–** యః = ఎవడు, శాస్త్రవిధిమ్ = శాస్త్రోక్తమగు విధిని, ఉత్సృజ్య = విడిచిపెట్టి, కామకారతః = తనయిష్టమువచ్చినట్లు, వర్తతే = ప్రవర్తించుచున్నాడో, సః = అతడు, సిద్ధిమ్ = అనుష్ఠానముచే పొందదగు సిద్ధిని (పురుషార్థసిద్ధిని లేక జ్ఞానసిద్ధిని), న అవాప్నోతి = పొందడు, సుఖమ్ = సుఖమును, న (అవాప్నోతి) = పొందడు, పరాంగతిమ్ = ఉత్తమమగు మోక్షమును, న (అవాప్నోతి) = పొందడు.

**తా:–** ఎవడు శాస్త్రోక్తమగు విధిని విడిచిపెట్టి తనయిష్టమువచ్చినట్లు ప్రవర్తించునో, అట్టివాడు పురుషార్థసిద్ధినిగాని, సుఖముగాని, ఉత్తమగతియగు మోక్షమునుగాని పొందనేరడు.

**వ్యాఖ్య:–** వారివారి యిష్టమువచ్చినట్లు ఆచరించుటయనునది (స్వేచ్ఛాప్రవర్తన) ఈ శ్లోకమున ఖండింపబడినది. ఒక్కొక్కరు వారివారికి తోచిన పద్ధతిననుసరించుచు అదియే సరియైనదని వాదించుట పొరపాటు. ఒకరుచేయు అనుష్ఠానము సరియైనదా కాదా యని పరీక్షించుటకు శాస్త్రప్రమాణము ఆవశ్యకమై యున్నది. వారివారి యనుభవములు శాస్త్రప్రమాణము ననుసరించియున్నవా? యని పరీక్షించుకొనుచుం డవలెను. అద్దానికి తన యనుభవము సరిపోయినచో అపుడు తనది సరియైనమార్గమని, సిద్ధాంతమని నిర్ణయించుకొనవచ్చును. శాస్త్రవాక్యములు అనుభవజ్ఞులగు మహర్షులయొక్క నిర్ణయములుగనుకను, భగవదాశయములే గనుకను, వానినెవరును ఉల్లంఘింపరాదు. కనుకనే వాని నుల్లంఘించి వర్తించువారు మోక్షమును బడయలేరని, సుఖమును పొందజాలరని శ్రీకృష్ణమూర్తి ఇచట ఆనతిచ్చుచున్నారు. కాబట్టి విజ్ఞులెల్లరు శాస్త్రాదేశము ననుసరించియే ప్రవర్తించవలెను. దీనినిబట్టి సుఖమునుగాని, మోక్షమునుగాని వాంఛించువాడు శాస్త్రోక్తవిధిప్రకారము చక్కగ అనుష్ఠానమును శీలించవలెనని తెలియుచున్నది.

**ప్ర:–** మనుజుడు తన యనుష్ఠానమునందు ఏ ప్రకారము ప్రవర్తింపవలయును?

**ఉ:–** శాస్త్రవిధి ననుసరించి ప్రవర్తింపవలెను.

**ప్ర:–** అట్లుకాక తనఇష్టమువచ్చిన ట్లాచరించినచో?

**ఉ:–** అత్తఱి యాతడు పురుషార్థసిద్ధినిగాని, సుఖమునుగాని, మోక్షమునుగాని, బడయజాలడు.

**ప్ర:–** సుఖమును బడయుటకుగాని, మోక్షమునొందుటకుగాని ఉపాయమేమి?

**ఉ:–** శాస్త్రాదేశము ననుసరించి చక్కగ ననుష్ఠించుటయే.

ప్ర:- ప్రపంచములోగల పదవులన్నిటిలోను ఉత్కృష్టమైనదేది?

ఉ:- మోక్షము (పరాంగతిమ్).

అ॥ కాబట్టి శాస్త్రోక్తపద్ధతి ననుసరించియే కార్యము లాచరించులాగున అర్జునునకు శ్రీకృష్ణపరమాత్మ బోధించుచున్నాడు -

**24. తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ**
**జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి.**

**టీక:-** తస్మాత్ = ఆ కారణమువలన, తే = నీకు, కార్యాకార్యవ్యవస్థితౌ = చేయదగినదియు, చేయరానిదియు నిర్ణయించునపుడు, శాస్త్రమ్ = శాస్త్రము, ప్రమాణమ్ = ప్రమాణమైయున్నది, శాస్త్రవిధానోక్తమ్ = శాస్త్రమునందు జెప్పబడినదానిని, జ్ఞాత్వా = తెలిసికొని, ఇహ = ఈ ప్రపంచమున, కర్మ = కర్మమును, కర్తుమ్ = చేయుటకు, (త్వమ్ = నీవు), అర్హసి = తగియున్నావు.

**తా:-** కావున చేయదగినదియు, చేయరానిదియు నిర్ణయించునపుడు నీకు శాస్త్రము ప్రమాణమైయున్నది. శాస్త్రమునందు చెప్పబడినదానిని తెలిసికొని దాని ననుసరించి నీ వీ ప్రపంచమున కర్మమును జేయదగును.

**వ్యాఖ్య:-** ఏ కార్యమును చేయవలెను? ఏ కార్యమును చేయరాదు? అను వితర్కము కలిగినపుడు శాస్త్రమే యిట ప్రమాణమైయున్నది. దాని ననుసరించియే వర్తించవలెనని భగవాను డిచట బోధించుచున్నారు. 'తస్మాత్' అనగా, పూర్వశ్లోకము నందు చెప్పబడినరీతిగ శాస్త్రవిరుద్ధముగ నాచరించినచో సుఖముగాని, మోక్షముగాని గలుగదు కాబట్టి - అని యర్థము. ఈ వాక్యములవలన భగవద్దృష్టి యందు వేద శాస్త్రము లెంతటి పరమప్రమాణములో విదితమగుచున్నది. మఱియు అవి గొప్ప ప్రమాణములని సాక్షాత్ భగవానుడే సెలవిచ్చుటవలన ఇక నట్టిశాస్త్రాదులందు జనులెంతటి విశ్వాసముంచవలయునో యోచించుకొనవలసి యున్నది. కావున ఇక వేదశాస్త్రముల గొప్పతనము విషయమై, ప్రామాణ్యము విషయమై జనులకేమాత్రము సందేహముండరాదు. అకుంఠితవిశ్వాసముతో వానియందు బోధించిన రీతి యనుష్ఠించిన చాలును. మనుజుడు తరించిపోగలడు.

'జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం' అని చెప్పుటవలన కర్మాచరణకు పూర్వము శాస్త్రజ్ఞాన మవసరమని తేలుచున్నది. శాస్త్రాదులద్వారా కర్మచేయు పద్ధతిని తెలిసికొని పిదప కర్మచేయుట ఉత్తమము. శాస్త్రపరిచయమువలన అనగా అపరావిద్యవలన ఉత్తమ కర్మాచరణము సాధ్యమై క్రమముగ చిత్తశుద్ధి గలుగగా పరావిద్యయు అనగా బ్రహ్మానుభూతియు అచిరకాలములో (అభ్యాసవశమున) లభించుట కవకాశమేర్పడుచున్నది.

'కర్మకర్తుమిహార్హసి' - అని బోధించుటవలన కర్మచేయుటలో తప్పులేదనియు, అయితే ఆ కర్మ శాస్త్రానుకూలముగా నుండవలెననియు గీత తెలుపుచున్నది. కనుకనే అర్జునుని అట్టి శాస్త్రోపదిష్ట కర్మము నాచరింపవలసినదిగా భగవాను డిచట నుద్బోధించుచున్నారు.

ప్ర:– ఏ కార్యము చేయవలెను, ఏకార్యము చేయరాదు, అనువిషయమందు ప్రమాణమెయ్యది?

ఉ:– శాస్త్రము. కావున శాస్త్రోపదిష్టపద్ధతి ప్రకారమే ఆచరించవలెను.

ప్ర:– కర్మనెపుడు చేయవలెను?

ఉ:– శాస్త్రవిధానమెట్లున్నదో తెలిసికొని ఆవిధప చేయవలెను.

ప్ర:– కర్మ నెట్లు చేయవలెను?

ఉ:– శాస్త్రములం దుపదేశింపబడినరీతి చేయవలెను.

ఓమ్

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే దైవాసుర సంపద్విభాగయోగో నామ
షోడశోఽధ్యాయః.

ఇది ఉపనిషత్ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రము శ్రీకృష్ణార్జున సంవాదమునగు
శ్రీ భగవద్గీతలందు దైవాసుర సంపద్విభాగయోగమను
పదునాఱవ అధ్యాయము.

ఓమ్ తత్ సత్



# శ్రద్ధాత్రయవిభాగయోగము



**ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః**
**బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా.** (17-23)

పరబ్రహ్మమునకు 'ఓమ్' అనియు, 'తత్' అనియు, 'సత్' అనియు మూడువిధములగు పేర్లు చెప్పబడినవి. ఈ నామత్రయమువలననే (దాని యుచ్చారణ చేతనే) పూర్వము బ్రాహ్మణులు (బ్రహ్మజ్ఞానులు), వేదములు, యజ్ఞములు నిర్మింపబడినవి.

ఓం

# శ్రీ భగవద్గీత

అథ సప్తదశోఽధ్యాయః

## పదునేడవ అధ్యాయము

శ్రద్ధాత్రయ విభాగయోగః

## శ్రద్ధాత్రయ విభాగయోగము

**ఈ అధ్యాయముయొక్క పేరు :-**

''శ్రద్ధాత్రయ విభాగయోగము'' - శ్రద్ధ మూడువిధములుగా నుండును. సాత్త్వికశ్రద్ధ, రాజసికశ్రద్ధ, తామసికశ్రద్ధ అని. ఏ యే శ్రద్ధగలవాని లక్షణములు ఏ యే విధముగనుండునో ఈ అధ్యాయమున వివరముగ దెలుపబడినవి. ఈ ప్రకారముగ మూడు విధములైన శ్రద్ధను (గుణమును) గుఱించి చెప్పబడిన అధ్యాయమగుటవలన దీనికి శ్రద్ధాత్రయవిభాగయోగమను పేరు కలిగెను.

**ఈ అధ్యాయమందలి ప్రధాన విషయములు :-**

(1) మూడువిధములైన శ్రద్ధను గుఱించిన విషయము - (1 వ శ్లో॥నుండి 3 వ శ్లో॥ వఱకు)

(2) మూడువిధములైన ఆరాధన - శాస్త్రవిరుద్ధమగు ఘోరతపస్సు (4 వ శ్లో॥ నుండి 6 వ శ్లో॥ వఱకు)

(3) మూడువిధములైన ఆహారము - (7 వ శ్లో॥ నుండి 10 వ శ్లో॥ వఱకు)

(4) మూడువిధములైన యజ్ఞము (11 వ శ్లో॥ నుండి 13 వ శ్లో॥ వఱకు)

(5) మూడువిధములైన తపస్సు (14 వ శ్లో॥ నుండి 19 వ శ్లో॥ వఱకు)

(6) మూడువిధములైన దానము - (20 వ శ్లో॥ నుండి 22 వ శ్లో॥ వఱకు)

(7) ఓం తత్ సత్ - అను మంత్రముయొక్క వ్యాఖ్య - (23 వ శ్లో॥ నుండి 27 వ శ్లో॥ వఱకు)

(8) అశ్రద్ధతోచేయు కార్యముయొక్క ఫలితము - (28 శ్లోకము)

**పూర్వాధ్యాయముతో ఈ అధ్యాయమునకుగల సంబంధము:-**

క్రిందటి అధ్యాయముయొక్క చివర భగవానుడు శాస్త్రాదేశములకు భిన్నముగ ప్రవర్తింపరాదనియు, శాస్త్రవిధి నుల్లంఘించి విచ్చలవిడిగ ప్రవర్తించినచో మోక్షసిద్ధి లభించదనియు చెప్పగా ఆ వాక్యములను వినినపుడు అర్జునుని మనంబున నొక సంశయముదయించెను. అది యేదనగా - యెవరైన అజ్ఞానమువలనగాని, లేక మఱియొక కారణమువలనగాని శాస్త్రవిధిని వదలివేసి, శ్రద్ధతో గూడుకొనినవారై పూజాయజ్ఞాదు లాచరించుచుండినచో వారి నిష్ఠ యేవిధముగనుండును? వారియొక్క ప్రవర్తన

సత్త్వగుణసంబంధమైనది యగునా? లేక, రజోగుణసంబంధమైనది యగునా? లేక తమోగుణసంబంధమైనది యగునా? అని. అట్టి సంశయము కలుగగనే అర్జునుడు వెంటనే దానినిగూర్చి భగవానుని ప్రశ్నించివైచెను. అర్జునుని యా ప్రశ్నతో ఈ అధ్యాయము ప్రారంభమగుచున్నది.

**అర్జున ఉవాచ –**

## 1. యే శాస్త్రవిధిముత్సృజ్య యజన్తే శ్రద్ధయాఽన్వితాః
## తేషాం నిష్ఠా తు కా కృష్ణ సత్త్వమాహో రజస్తమః.

అర్జున ఉవాచ = అర్జునుడు అడిగెను.

**టీక:–** కృష్ణ = ఓ కృష్ణా! యే = ఎవరు, శాస్త్రవిధిమ్ = శాస్త్రోక్తవిధానమును, ఉత్సృజ్య = విడిచి, శ్రద్ధయా అన్వితాః = శ్రద్ధతోగూడకొనినవారై, యజన్తే = పూజాదుల నొనర్చుచున్నారో, తేషామ్ = వారియొక్క, నిష్ఠాతు = స్థితి (ప్రవృత్తి), కా = ఎట్టిది?, సత్త్వమ్ = సాత్త్వికమా, ఆహో= లేక, రజః = రాజసమా, (అథవా = లేక) తమః = తామసమా?

**తా:–** అర్జునుడు అడిగెను – ఓ కృష్ణా! ఎవరు శాస్త్రోక్తవిధానమును విడిచిపెట్టి శ్రద్ధతో గూడుకొని పూజాదుల నొనర్తురో వారియొక్క స్థితి సాత్త్వికమా, లేక రాజసమా, లేక తామసమా? ఏదియైయున్నది?

**వ్యాఖ్య:–** క్రిందటి అధ్యాయముయొక్క చివర శాస్త్రవిధి నుల్లంఘించి స్వేచ్ఛాచారులై ప్రవర్తించువారికి మోక్షసిద్ధి కలుగదని చెప్పబడినది. అయితే కొందఱు శాస్త్రనిర్దిష్టములగు విధినిషేధములను శ్రమయనితలంచియో, లేక, ఔదాసీన్యము వహించియో, వానినిగూర్చి తెలిసికొనుటకై యత్నింపక, శ్రద్ధతోగూడుకొనినవారై, ఆస్తికబుద్ధి గలిగి దేవతాదులను అర్చించుచుందురుగదా! అట్టివారియొక్క ప్రవృత్తి యెట్టిది? అది సాత్త్వికమా, రాజసమా, తామసమా అని అర్జునుని ప్రశ్న –

**అ॥** అర్జునుని యా ప్రశ్నకు భగవానుడు సమాధాన మొసంగుచున్నాడు –

**శ్రీ భగవానువాచ –**

## 2. త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా
## సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు.

శ్రీ భగవానువాచ = శ్రీ భగవంతుడు చెప్పెను –

**టీక:–** దేహినామ్ = ప్రాణులయొక్క, స్వభావజా = స్వభావముచే (పూర్వజన్మ సంస్కారములచే) గలిగిన, సా శ్రద్ధా = ఆ శ్రద్ధ, సాత్త్వికీ = సాత్త్విక (సత్త్వగుణసంబంధమైన) శ్రద్ధయనియు, రాజసీ చ ఏవ= రాజస (రజోగుణసంబంధమైన) శ్రద్ధయనియు, తామసీ చ ఇతి = తామస (తమోగుణసంబంధమైన) శ్రద్ధయనియు, త్రివిధా = మూడువిధములుగా, భవతి = అగుచున్నది, తామ్ = దానిని, శృణు = వినుము.

**తా:–** శ్రీ భగవంతుడు చెప్పెను – ప్రాణులయొక్క స్వభావముచే (పూర్వజన్మ సంస్కారముచే) గలిగిన ఆ శ్రద్ధ సాత్త్వికమనియు, రాజసమనియు, తామసమనియు మూడు విధములుగా నగుచున్నది. దానిని గూర్చి వినుము.

**వ్యాఖ్య:–** 'సా స్వభావజా' – అని చెప్పుటవలన పూర్వజన్మ సంస్కారమువలన, జన్మాంతర వాసనాప్రాబల్యమువలన అట్టిశ్రద్ధ వారియందు స్వభావముగనే జనించునని భావము.

**ప్ర:–** శ్రద్ధ యెన్ని విధములు? అవి యేవి?

**ఉ:–** మూడువిధములు – అవి క్రమముగ (1) సాత్త్వికశ్రద్ధ (2) రాజసికశ్రద్ధ (3) తామసికశ్రద్ధ అని చెప్పబడును.

**ప్ర:–** అట్టి శ్రద్ధ జీవులకెట్లు జనించును?

**ఉ:–** స్వభావముగనే. అనగా జన్మాంతరసంస్కారప్రాబల్యమువలన, లేక ఇహజన్మప్రయత్నాతి శయమున సహజముగనే అది జనించునవి భావము.

**అ॥** శ్రద్ధయే (సంస్కారమే లేక గుణమే) మనుజుని స్వరూపమనియు వచించుచున్నాడు –

**3. సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత**
**శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధస్స ఏవ సః.**

**టీక:–** భారత = ఓ అర్జునా! సర్వస్య = సమస్తజీవులకును, సత్త్వానురూపా = వారివారి (పూర్వజన్మసంస్కారముతోగూడిన) అంతఃకరణము ననుసరించిన, శ్రద్ధా = శ్రద్ధ (గుణము, సంస్కారము) భవతి = కలుగుచున్నది, అయమ్ = ఈ, పురుషః = జీవుడు, శ్రద్ధామయః = శ్రద్ధయే స్వరూపముగా గలవాడు, యః = ఎవడు, యచ్ఛ్రద్ధః = ఎట్టిశ్రద్ధగలవాడో, సః = అతడు, సః ఏవ = అట్టిశ్రద్ధయే, (భవతి = అగుచున్నాడు), (అట్టిశ్రద్ధనే గ్రహించుచు తద్రూపుడే అయియుండునని భావము).

**తా:–** ఓ అర్జునా! సమస్తజీవులకును వారివారి (పూర్వజన్మసంస్కారముతో గూడిన) యంతఃకరణము ననుసరించి శ్రద్ధ (గుణము, సంస్కారము) కలుగుచున్నది. ఈ జీవుడు శ్రద్ధయే స్వరూపుగ గలవాడైయున్నాడు. ఎవడెట్టిశ్రద్ధగలిగియుండునో ఆతడట్టి శ్రద్ధయే యగుచున్నాడు. (అట్టిశ్రద్ధనే గ్రహించును; తద్రూపుడే అయియుండునని భావము).

**వ్యాఖ్య:–** మనస్సే (అంతఃకరణమే) మనుజుడు (ప్రతిబింబరూపజీవుడు); మనుజుడు మనస్సే. కావున మనస్సు శుద్ధముగా నున్నచో మనుజుడున్ను శుద్ధరూపుడే యగుచున్నాడు. ఇచట 'సత్త్వానురూపా' అను పదములోని సత్త్వమనగా అంతఃకరణము. ప్రతివారికిని వానివాని జన్మాంతర సంస్కారములతో గూడిన యంతఃకరణమెట్లుండునో అట్టిశ్రద్ధ, అట్టిసంస్కారము, అట్టిగుణము వానికి కలుగుచున్నది. ఎవడు ఏ శ్రద్ధ ఏ గుణము గలిగియుండునో ఆతడు తద్రూపుడే అయియుండును. కాబట్టి మొట్టమొదట మనుజుడు తనయంతఃకరణమును శుద్ధమొనర్చుకొని సాత్త్వికశ్రద్ధామయుడై యుండులాగున ప్రయత్నించి, సాధనాభ్యాసముచే క్రమముగ నిర్గుణాత్మరూపుడై చెన్నొందుటకు ప్రయత్నించవలెను. ఎవనియొక్క చిత్త మెట్టి శ్రద్ధ, గుణము గలిగియుండునో తదనుగుణ్యమగు ప్రవృత్తియే ఆతడు కలిగియుండుటబట్టి (రాజసిక, తామసిక, శ్రద్ధలను పారద్రోలి) సాత్త్వికశ్రద్ధనవలంబించి క్రమముగ దానినిన్ని అధిరోహించి విశుద్ధసత్త్వ (ఆత్మ) స్థితిని జేరుకొనవలెను. అదియే ఆతని యథార్థస్వరూపము. స్థానము.

**ప్ర:–** జీవులకు ఎట్టిశ్రద్ధ గలుగుచున్నది?

**ఉ:–** వారి యంతఃకరణమెట్లుండునో దాని కనుగుణ్యమగు శ్రద్ధయే (గుణమే) కలుగుచున్నది.

**ప్ర:–** మనుజు డెద్దానిచే పరిపూర్ణుడైయుండును?

**ఉ:–** శ్రద్ధచే.

**ప్ర:–** మనుజుని స్వరూపమేమి?

**ఉ:–** అతడెట్టి శ్రద్ధగలిగియుండునో, అదియే యాతని స్వరూపము (అయితే ఇది ప్రతిబింబిత (జీవ) రూపము. వాస్తవముగ బింబభూతమగు ఆత్మయే ఆతనిస్వరూపమని యెఱుగవలెను).

**అ॥** ఎవడెట్టి శ్రద్ధ (గుణము) గలిగియుండునో తదనుగుణ్యమైన ధ్యేయమునే ఆతడారాధించునని వచించుచున్నాడు –

**4. యజన్తే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః**
**ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజన్తే తామసా జనాః.**

**టీక:–** సాత్త్వికాః = సత్త్వగుణముగలవారు, దేవాన్ = దేవతలను, యజన్తే = పూజించుచున్నారు, రాజసాః = రజోగుణముగలవారు, యక్షరక్షాంసి = యక్షులను, రాక్షసులను, (యజన్తే = పూజించుచున్నారు), అన్యే = ఇతరులగు, తామసాః జనాః = తమోగుణముగల జనులు, ప్రేతాన్ = ప్రేతములను, భూతగణాన్ చ = భూతగణములను, యజన్తే = పూజించుచున్నారు.

**తా:–** సత్త్వగుణముగలవారు దేవతలను, రజోగుణముగలవారు యక్షులను, రాక్షసులను, తమోగుణముగలవారు భూతప్రేతగణములను పూజించుచున్నారు.

**వ్యాఖ్య:–** ఎవరెవరు ఏ యే గుణము గలిగియుందురో, వారిస్వభావము, వారి నడక, వారియాహారము, వారిమాట, వారితీరు, వారు చదువుగ్రంథములు, వారు పూజించుదేవతలు – తదనుగుణ్యముగనేయుండును. ఈ విషయము నిదివఱకు 14వ అధ్యాయమున తెలిపియుండిరి. భావము దృఢపడుటకొఱకై మఱల నిపుడు తెలియుజేయుచున్నారు.

**అ॥** అసురస్వభావముగల వారాచరించు ఘోరతపస్సులు త్యాజ్యములని రెండుశ్లోకములద్వారా చెప్పుచున్నాడు –

**5. అశాస్త్రవిహితం ఘోరం తప్యన్తే యే తపో జనాః**
**దమ్భాహఙ్కారసంయుక్తాః కామరాగబలాన్వితాః.**

**6. కర్శయన్తశ్శరీరస్థం భూతగ్రామమచేతసః**
**మాం చైవాన్తశ్శరీరస్థం తాన్విద్ధ్యాసురనిశ్చయాన్ .**

**టీక:–** యేజనాః = ఏ జనులు, శరీరస్థమ్ = శరీరముననున్నట్టి, భూతగ్రామమ్ = పంచభూతముల సమూహమును, లేక ఇంద్రియసమూహమును, కర్శయన్తః = (ఉపవాసాదులచే) శుష్కింపజేయువారును, అన్తశ్శరీరస్థమ్ = శరీరమునందు అంతర్యామిగనున్న, మామ్ చ ఏవ = నన్నును, కర్శయన్తః = శుష్కింపజేయువారును (కష్టపెట్టువారును), దమ్భాహంకారసంయుక్తాః = దంభము, అహంకారము - వీనితో గూడినవారును, కామరాగబలాన్వితాః = కామము, రాగము (ఆసక్తి), (పశు) బలము కలవారును, (లేక కామబలము, రాగబలము కలవారును), అచేతసః = అవివేకులును అయి, అశాస్త్రవిహితమ్ = శాస్త్రమునందు విధింపబడనిదియు, ఘోరమ్ = తనకును ఇతరులకును గూడ బాధాకరమైనదియునగు, తపః = తపస్సును, తప్యన్తే = ఆచరించుచున్నారో, తాన్ = వారిని, ఆసురనిశ్చయాన్ = అసురస్వభావము గలవారినిగ, విద్ధి = తెలిసికొనుము.

**తా:–** ఏ జనులు శరీరముననున్నట్టి పంచభూతసముదాయమును లేక ఇంద్రియ సమూహమును (ఉపవాసాదులచే) శుష్కింపజేయువారును, శరీరమందంతర్యామిగనున్న నన్నును కష్టపెట్టువారును, దంభాహంకారములతో గూడినవారును, కామము, రాగము (ఆసక్తి), పశుబలము కలవారును (లేక కామబలము, రాగబలము గలవారును), అవివేకులును అయి శాస్త్రమునందు విధింపబడనిదియు, తమకును ఇతరులకును గూడ బాధాకరమైనదియునగు తపస్సును జేయుచున్నారో, అట్టివారిని అసురస్వభావము గలవారినిగ తెలిసికొనుము.

**వ్యాఖ్య:–** 'అశాస్త్రవిహితమ్' - శాస్త్రమునందు విధింపబడనికార్యముల నెవరును చేయరాదని గీత శాసించుచున్నది. ఘోరతపస్సులు, భయంకర రాజస, తామస క్రియలు శాస్త్రవిహితములు కావు. కాబట్టి శాస్త్రవిరుద్ధములగు అట్టి క్రియలు నింద్యములేయగును.

'తప్యన్తే యే తపోజనాః' - వాస్తవముగ తపస్సనగా అంతఃకరణమునందుగల దోషములను భస్మమొనర్చుటయేకాని దేహాదులను క్షీణింపజేయుటగాదని యెఱుగవలెను. కావున అట్టి తపస్సనే ఆశ్రయింపవలెనుగాని తనకును, ఇతరులకును ఉపద్రవకరము లైనట్టి క్రూరతపస్సులను (రావణ, హిరణ్యకశిపు లొనరించినవానిని) కాదు.

'కామరాగబలాన్వితాః' - ప్రాపంచిక బలము లెన్నియున్నను, దైవబలములేనిచో అవియన్నియు నిరుపయోగములేయగును. క్షుద్రబలములు కలవారు, దైవగంధము లేనివారు వారెవరైననుసరియే రాక్షసులక్రిందనే జమకట్టబడుదురు. కామరాగములు మానవులయొక్క మానవత్వమును, తదంతర్గతమగు దేవత్వమును హరించివైచి, వారి పారమార్థికతను పీల్చి పిప్పిచేసి, నిజాత్మస్వరూపమును గప్పివైచి వారలను రాక్షసులనుగా మార్చివేయగలవు. కావున వానిని త్యజించివేయవలెను. అసురస్వభావులకు కామమే బలము, రాగమే బలము; దైవీసంపదగలవారికి భక్తియే బలము, జ్ఞానమే బలము. కాబట్టి కామ, రాగ బలమును వదలివేసి భక్తి, జ్ఞానాదిబలమునే స్వీకరించవలెను.

'కర్శయన్తః శరీరస్థం భూతగ్రామమ్' - శుష్కోపవాసాదులచే ఇంద్రియాదులను కృశింపజేయువారు అసురస్వభావులని యిట చెప్పబడినది. దేహారోగ్యముకొఱకు, వ్రతాదుల నిమిత్తము ఉపవాసమును అపుడపుడు శీలించుట మంచిదే అయినను, అది మితముదప్పి యుండరాదు. అట్లు మితముతప్పినచో అది ఆసురికతపస్సే యగును. పుట్టనుకొట్టినంతమాత్రమున లోని పాము చావదు. కాబట్టి కేవల దీర్ఘశుష్కోపవాసాదులచే లోనగల దుర్వాసనాదుస్సంస్కారాదులెన్నియు నశింపనేరవు. కొందఱు తమ యొక్క ఆ

యుపవాసాదులనుగూర్చి ఘనముగ చెప్పుకొందురు. కాని భగవానుడీ శ్లోకములందు వానిని మెచ్చుకొనలేదు. పైగా అట్లు దేహాదులనుశుష్కింపజేయువారు అసురస్వభావులని చెప్పివైచిరి. కాబట్టి సాధకులివ్విషయమున జాగరూకులై భగవానుడు సెలవిచ్చినట్లు 'యుక్తాహారవిహారులై' మానవస్థితినుండి దైవస్థితికి ఎగబ్రాకవలెనేకాని అసురస్థితికి దిగజారకూడదు.

'మాం చైవాన్తః శరీరస్థమ్' - 'అట్టి శుష్కోపవాసాదులద్వారా వారి శరీరముల లోపలనున్న నన్ను (భగవంతుని) గూడ కృశింపజేయుచున్నార'ని శ్రీకృష్ణపరమాత్మ చమత్కారముగ నిచట పలికిరి. వాస్తవముగ విచారించిన, నిర్వికారుడు కృశించుట యేమి? అయినను అట్టివారి చర్యను గర్హించుటకు భగవానుడీవిధముగ పలికిరి. లేక, కృశింపజేయుచున్నారనగా వారి ఆజ్ఞను నిరాకరించుచున్నారనియు చెప్పవచ్చును. 'అన్తః శరీరస్థమ్' అను ఈ పదముచే భగవానుడు దూరముగా లేరనియు, ప్రతివాని శరీరములోపల (పంచకోశాంతర్గతముగ) దాగియున్నారనియు స్పష్టమగుచున్నది. కావున పాపాచరణమును త్యజించివైచి వివేక విచారణాదులద్వారా పంచకోశములను వేఱుపఱచి నిజశరీరమునందే భగవంతుని కనుగొని జనులు కృతార్థులు కావలయును. మఱియు శుష్కోపవాసాదులచే లోనగల ఆత్మను బాధింపక మధ్యమార్గమును జేబట్టి, మితాహార సాత్త్వికాహారాదుల నవలంబించి, ధ్యానాదులచే దైవానుభూతిని బడసి కృతకృత్యులు కావలెను.

**ప్ర:-** అసురస్వభావముగలవా రెవరు?

**ఉ:-** (1) డంబము, అహంకారము కలవారై (2) కామము, రాగము, (పశు) బలముగలవారై (3) అవివేకులై (4) శాస్త్రమందు విధింపబడని ఘోరతపస్సులు చేయుచు ఇంద్రియాదులను శుష్కింపజేయుచు శరీరాంతర్గతుడగు పరమాత్మనుగూడ బాధించువారు అసురస్వభావులే యగుదురు.

**ప్ర:-** కావున విజ్ఞు లేమి చేయవలెను?

**ఉ:-** డంబము, అహంకారము, కామము, రాగము - వీనిని త్యజించి వివేకవంతులై, శాస్త్రోక్తరీతి ననుసరించుచు, కేవల శుష్కోపవాసాదుల నాశ్రయింపక, మితాహారాదులను సేవించుచు లోనగల పరమాత్మను భక్తిపూర్వకముగ ధ్యానించవలయును.

**అ॥** ఇక మూడువిధములైన ఆహారము, యజ్ఞము, తపస్సు, దానములను గూర్చి చెప్పుచున్నాడు -

**7. ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః**
**యజ్ఞస్తపస్తథా దానం తేషాం భేదమిమం శృణు.**

**టీక:-** ఆహారః తు అపి = ఆహారముకూడ, సర్వస్య = సర్వులకును, త్రివిధః = (సత్త్వాది గుణములనుబట్టి) మూడు విధములుగా, ప్రియః భవతి = ఇష్టమగుచున్నది, తథా = అలాగుననే, యజ్ఞః = యజ్ఞము, తపః = తపస్సు, దానమ్ = దానము (కూడ), త్రివిధః ప్రియఃభవతి = మూడువిధములుగ ఇష్టమగుచున్నది, తేషామ్ = వానియొక్క, ఇమమ్ = ఈ, భేదమ్ = భేదమును, శృణు = వినుము.

**తా:-** ఆహారముకూడ సర్వులకును (సత్త్వాది గుణములనుబట్టి) మూడు విధములుగ

ఇష్టమగుచున్నది. అలాగుననే యజ్ఞము, తపస్సు, దానముకూడ జనులకు మూడువిధములుగ ప్రియమైయుండుచున్నది. ఆ యాహారాదుల ఈ భేదమును గూర్చి (చెప్పెదను) వినుము.

**వ్యాఖ్య:–** ఆహారాదులను నాలుగింటిని గుఱించి చెప్పదలంచి భగవానుడు వానిలో ఆహారమును గూర్చియే మొట్టమొదట ప్రస్తావించుట గమనింపదగినది. జీవుని ఆధ్యాత్మిక సాధనక్రమములో ఆహారశుద్ధి ప్రప్రథమమైనది. ఆహారశుద్ధిచే చిత్తశుద్ధి, చిత్తశుద్ధిచే జ్ఞానోదయము సంభవించును. ఆహారము శుద్ధముగలేనిచో మనస్సున్ను మలినముగానుండుటవలన దానివలన లక్ష్యప్రాప్తి చేకూరకయేయుండును.

**ప్ర:–** ఆహారము, యజ్ఞము, తపస్సు, దానము జనులకు ఎన్నివిధములుగ ప్రియమై యుండును?

**ఉ:–** వారివారి గుణముననుసరించి మూడు విధములుగ ప్రియమైయుండును (సత్త్వగుణము గలవారికి సాత్త్వికాహారము – ఈప్రకారముగ).

**అ||** అందు సాత్త్వికాహారమునుగూర్చి వచించుచున్నాడు –

**8. ఆయుస్సత్త్వబలారోగ్య సుఖప్రీతివివర్ధనాః**
**రస్యాస్స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాస్సాత్త్వికప్రియాః.**

**టీక:–** ఆయుస్సత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః = ఆయుస్సును, మనోబలమును, శరీరబలమును, ఆరోగ్యమును, సౌఖ్యమును, ప్రీతిని బాగుగ వృద్ధినొందించునవియు, రస్యాః = రసము గలవియు, స్నిగ్ధాః = చమురుగలవియు, స్థిరాః = దేహమునందు చాలకాలముండునవియు, హృద్యాః = మనోహరములైనవి యునగు, ఆహారాః = ఆహారములు, సాత్త్వికప్రియాః = సత్త్వగుణముగల వారికి ఇష్టములైనవి.

**తా:–** ఆయుస్సును, మనోబలమును, దేహబలమును, ఆరోగ్యమును, సౌఖ్యమును, ప్రీతిని బాగుగ వృద్ధినొందించునవియు, రసముగలవియు, చమురుగలవియు, దేహమందు చాలకాలముండునవియు, మనోహరములైనవియునగు ఆహారములు సత్త్వగుణముగలవారికి ఇష్టములైయుండును.

**వ్యాఖ్య:–** జనులయందు సత్త్వగుణ మభివృద్ధినొందునపుడు ఇట్టియాహారము వారికి రుచించునని భావము. అనగా కారముతోను, పులుపుతోనుగూడినదియు, రాజసికమైనదియు లేక తామసికమైనదియు నగు ఆహారము వారికెన్నడును ప్రీతికరము కానేరదు. పైనదెల్పిన సాత్త్వికాహారమే వారికి ఇష్టముగనుండును. ధ్యానాదుల కిట్టి యాహారము మిక్కుటముగ అనుకూలించును. ఆహారవిషయము పరమార్థరంగమున ఎంతయో ముఖ్యమైనది. కనుకనే శ్రీకృష్ణమూర్తి గీతలో పెక్కుచోట్ల దానిని గుఱించి ప్రస్తావించుచువచ్చిరి. కావున ముముక్షువులు ఆహారసంయమము ఏదియో చిన్నవిషయమని తలంపక, బ్రహ్మమార్గమున కీలకస్థాన మాక్రమించియున్నదానినిగ అద్దానిని భావించి సాత్త్వికాహారమునే సేవించుచురావలెను.

**ప్ర:–** సాత్త్వికాహార మెట్టిది?

**ఉ:–** (1) ఆయుస్సును, మనోబలమును, శరీరబలమును, ఆరోగ్యమును, సుఖమును, ప్రీతిని లెస్సగ అభివృద్ధినొందించునదియు (2) రసము గలదియు (3) చమురుతో గూడినదియు (4) దేహమునుందు చాలకాల ముండునదియు, మనోహరమైనదియు సాత్త్వికాహార మనబడును. కావున విజ్ఞు లట్టి యాహారమునే సేవించవలయును.

**అ||** రాజసాహార మేదియో వివరించి చెప్పుచున్నాడు –

**9. కట్వామ్ల★ లవణాత్యుష్ణ తీక్ష్ణరూక్షవిదాహినః**
**ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః.**

**టీక:–** కటు = చేదుగాను, అమ్ల = పులుపుగాను, లవణ = ఉప్పగాను, అత్యుష్ణ = మిక్కిలి వేడిగాను, తీక్ష్ణ = కారముగాను, రూక్ష = చమురులేనివిగాను, విదాహినః = మిగుల దాహము గలుగజేయునవిగాను ఉండునవియు, దుఃఖశోకామయప్రదాః = (శరీరమునకు) దుఃఖమును, (మనస్సునకు) వ్యాకులత్వమును, రోగమును గలుగజేయునవియునగు, ఆహారాః = ఆహారపదార్థములు, రాజసస్య = రజోగుణముగలవానికి, ఇష్టాః = ప్రియములు (అయియుండును).

**తా:–** చేదుగాను, పులుపుగాను, ఉప్పగాను, మిక్కిలి వేడిగాను, కారముగాను, చమురులేనివిగాను, మిగుల దాహము గలుగజేయునవిగాను ఉండునవియు, (శరీరమునకు) దుఃఖమును, (మనస్సునకు) వ్యాకులత్వమును గలుగజేయునవియునగు ఆహారపదార్థములు రజోగుణముగలవానికి ఇష్టములై యుండును.

**వ్యాఖ్య:–** ఈ శ్లోకమున తెలుపబడిన ఆహారపదార్థములు రాజసములని పేర్కొనుట వలన అవి సర్వథా త్యాజ్యములే అయియున్నవి.

'దుఃఖశోకామయప్రదాః' - ఇచట దుఃఖమనగా భుజించినవెంటనే శరీరాదులకు గలుగు బాధయనియు, శోకమనగా భుజించిన పిమ్మట మనస్సునకు గలుగు క్లేశమనియు గ్రహించవలెను.

కొందఱు 'ఉష్ణ' అను పదమునకు ముందున్న 'అతి' యను విశేషణమును కట్వాది పదములకన్నిటికిని అన్వయించి అర్థము చెప్పిరి. కాని అట్లుచేయుట సమీచీనముగ గన్పట్టలేదు. ఏలయనిన, అత్తఱి 'అతికటుత్వము నిషిద్ధమని అల్పకటుత్వము గ్రాహ్యమని' అర్థమువచ్చును. అది అసమంజసమే యగును. (కొద్ది చేదుకూడ ఎవరును కోరరుగదా). మఱియు 'విదాహినః' అను పదమునకు 'అతి' చేర్చినచో, 'అతివిదాహినః' అగును. అపుడు 'వి' అను ఉపసర్గమీద మఱల 'అతి' అను విశేషణమును జోడించుట అప్రస్తుతముగ నుండగలదు. (రెండును ఒకే అర్థమును సూచించును గావున).

రాజససుఖముయొక్క లక్షణము - ప్రారంభమున అమృతతుల్యముగనుండి తుదకు విషప్రాయముగ పరిణమించుటయే యని 18వ అధ్యాయమున భగవానుడు చెప్పబోవుదురు - "విషయేన్ద్రియ సంయోగా ద్యత్తదగ్రేఽమృతోపమమ్, పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్" అని అట్లే ఈ రాజసాహారమున్ను ప్రారంభమున జనులకు ఇంపుగా తోచవచ్చును, కాని భుజించిన కొంతసేపటికి గొప్పదుఃఖమును, వ్యాకులత్వమును గలుగజేయును. నిత్యజీవితమున ఈ విషయమును పెక్కురు అనుభవించుచునే యున్నారు. మఱియు రజోగుణాత్మకమగు ఈ ఆహారమును భుజించువారికి ధ్యానమున్ను సరిగా జరుగదు. చిత్తము వికారవంతమై, చంచలమైయుండును. అత్తఱి కొద్దిసేపైనను మనస్సు నిశ్చలముగానుండదు. జంతువులలోగూడ రజోగుణాహారమగు మాంసాదులను భుజించు సింహము, పులి, ఎలుగుగొడ్డు, అతిచంచలములై క్రూరములై యుండును. తృణాదులను భుజించు గోవు, మేక మొదలైనవి సాత్త్వికచిత్తవృత్తి గలిగియుండును.

★ కట్వమ్లలవణాత్యుష్ణ - పాఠాన్తరము.

'ఆమయప్రదాః' - అని చెప్పుటవలన రాజసాహారము ఆరోగ్యమునుగూడ చెడగొట్టి వ్యాధులను గలుగజేయునని తెలియుచున్నది. కాబట్టి ఆరోగ్యభంగకరములును, దుఃఖ, శోకప్రదములును, ధ్యానప్రతిబంధకములునునగు అట్టి రాజసాహార పదార్థములను ముముక్షువు లెన్నడును గ్రహించరాదు. అట్టియాహారముపై ఎపుడైన ఇష్టము గలిగినచో తనయందింకను రజోగుణ మేకోశమందునో గలదని నిశ్చయించి దానిని తొలగద్రోయుటకై యత్నించవలెను.

'దాః' అని చెప్పక 'ప్రదాః' అని చెప్పుటవలన రోగాదుల నవి లెస్సగ గలుగజేయునని అర్థము.

**ప్ర:-** రాజసాహార మెట్టిది?

**ఉ:-** (1) చేదు, పులుపు, ఉప్పు, కారము వీనితో గూడినది (2) మిక్కిలి వేడిగా నున్నది (3) చమురులేనిది (4) మిగుల దాహమును గలుగుజేయునది.

**ప్ర:-** కావున ముముక్షు వేమి చేయవలెను?

**ఉ:-** ఆ యాహారమువలన కలుగు దుష్పరిణామమును మఱల మఱల భావించుచు దానిని త్యజించివేయవలెను.

**అ॥** ఇక తామసాహారమెట్టిదో తెలుపుచున్నాడు -

## 10. యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్
## ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్.

**టీక:-** యాతయామమ్ = వండినపిమ్మట ఒక జాముదాటినదియు (అనగా వండి చాల సేపైనదియు, లేక బాగుగ ఉడకనిదియు), గతరసమ్ = సారమునశించినదియు, పూతి = దుర్గంధముగలదియు, పర్యుషితం చ = పాచిపోయినదియు (వండినపిదప నొకరాత్రి గడచినదియు), ఉచ్ఛిష్టమ్ అపి = ఒకరు తినగా మిగిలినది (ఎంగిలిచేసినది) యు, అమేధ్యం చ = అశుద్ధముగా నున్నదియు, (భగవంతునకు నివేదింపబడనిదియు) అగు, యత్ = ఏ, భోజనమ్ = ఆహారము, (అస్తి = కలదో, తత్ = అది), తామసప్రియమ్ = తమోగుణముకలవారి కిష్టమైనది (అగును).

**తా:-** వండిన పిమ్మట ఒక జాము దాటినదియు (లేక బాగుగ ఉడకనిదియు), సారము నశించినదియు, దుర్గంధము గలదియు, పాచిపోయినదియు (వండిన పిదప ఒక రాత్రి గడిచినదియు), ఒకరు తినగా మిగిలినది (ఎంగిలిచేసినది) యు, అశుద్ధముగా నున్నదియు (భగవంతునకు నివేదింపబడనిదియు) అగు ఆహారము తమోగుణము గలవారి కిష్టమైనది యగును.

**వ్యాఖ్య:-** ఆరోగ్యశాస్త్రప్రకారమున్ను ఇట్టి తామసాహారము, పైనదెల్పిన రాజసాహారము నిషిద్ధములే యగును. సారము నశించి పాచిపోయినట్టి పదార్థమును తినినచో మలినమైన ఆహారపదార్థములయొక్క అణువులు శరీరమున ప్రవేశించి రక్తమును చెడగొట్టి అనారోగ్యమును గలుగజేయుటయేగాక వాని సూక్ష్మాంశములు మనస్సునందు ప్రవేశించి అద్దానినిగూడ మలిన మొనర్చును. కాబట్టి ముముక్షువు లట్టి యాహారముల నెన్నడును సేవించరాదు.

**అ॥** ఇక యజ్ఞములనుగూర్చి చెప్పబోవుచు మొట్టమొదట సాత్త్విక యజ్ఞము యొక్క లక్షణములను వివరించుచున్నాడు -

**11. అఫలాకాంక్షిభిర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే**
**యష్టవ్యమేవేతి మన స్సమాధాయ స సాత్త్వికః.**

**టీక:–** యష్టవ్యమ్ ఏవ = చేయదగినదే, ఇతి = అని, మనః = మనస్సును, సమాధాయ = సమాధానపఱచి, విధిదృష్టః = శాస్త్రసమ్మతమగు, యః యజ్ఞః = ఏ యజ్ఞము, అఫలాకాంక్షిభిః = ఫలాపేక్షలేనివారిచేత, ఇజ్యతే = చేయబడుచున్నదో, సః = అది, సాత్త్వికః = సాత్త్వికమైనది, (భవతి = అగుచున్నది).

**తా:–** 'ఇది చేయదగినదియే' యని మనస్సును సమాధానపఱచి శాస్త్రసమ్మతమగు ఏ యజ్ఞము ఫలాపేక్షలేనివారిచేత చేయబడుచున్నదో అది సాత్త్వికయజ్ఞమనబడును.

**వ్యాఖ్య:–** ప్రతివాడును తానుచేయు కార్యము శాస్త్రసమ్మతమైనదో, కాదో బాగుగ విచారించుకొని శాస్త్రవిరుద్ధమైనదానిని త్యజించివేసి శాస్త్రసమ్మతమైన దానినే గ్రహించవలెను. కనుకనే 'విధిదృష్టః' అని చెప్పబడినది. మఱియు 'ఇది చేయదగినది' యను కర్తవ్యబుద్ధి అద్దానియందు లెస్సగనుంచుకొని ఫలాపేక్షలేక అద్దాని నాచరించవలెను. అపుడది సాత్త్వికకార్యమై చెన్నొందును. ఇచట యజ్ఞమని చెప్పబడినదాని యర్థము పశుహింసాదులతోగూడిన యాగములనికాదు. భగవద్ధ్యానము, పరోపకారము, దైవసంబంధమైనకార్యములు మున్నగునవి, లేక యే సత్కార్యమైనను – అనియే యగును.

'మనః సమాధాయ' – అని చెప్పబడినందువలన, ప్రతివారును తాము కార్యమును ప్రారంభించుటకు ముందుగా మనస్సును బాగుగ కుదుటపఱచుకొని సంశయములకు తావీయక నిశ్చయబుద్ధితో నద్దాని నుపక్రమించవలెనని తెలియుచున్నది. మనస్సును సమాధానపఱచక, నిశ్చలపఱచక, ఆరంభింపబడు ఏ కార్యమున్ను చక్కగ జరుగదు. కావున చేయబోవు కార్యముయొక్క బాగోగులను బాగుగ నిర్ణయించుకొని శాస్త్రాదులద్వారా, ఆప్తవాక్యములద్వారా నిశ్చయమునకువచ్చి మనస్సును స్థిరపఱచుకొని నిష్కామబుద్ధితో అట్టి శాస్త్రసమ్మతకార్యము నాచరించినచో అద్భుతఫలితముల నొసంగగలదు. అదియే సాత్త్వికకార్యము, సాత్త్వికయజ్ఞము నగును.

**ప్ర:–** సాత్త్వికయజ్ఞ మెట్టిది?

**ఉ:–** (1) శాస్త్రోక్తమైనదియు (2) ఫలాపేక్షరహితముగ చేయబడునదియు (3) . ఇదిచేయదగినది. అని మనస్సును సమాధానపఱచుకొని మనుజునిచే నాచరింపబడునదియు సాత్త్వికయజ్ఞమనబడును.

**అ॥** రాజసయజ్ఞమును గూర్చి తెలుపుచున్నాడు -

**12. అభిసన్ధాయ తు ఫలం దమ్భార్థమపి చైవ యత్**
**ఇజ్యతే భరతశ్రేష్ఠ తంయజ్ఞం విద్ధి రాజసమ్.**

**టీక:–** భరతశ్రేష్ఠ = భరతవంశశ్రేష్ఠుడవగు ఓ అర్జునా!, ఫలమ్ = ఫలమును, అభిసన్ధాయతు = అపేక్షించియు, దమ్భార్థమ్ అపి చ ఏవ = డంబము కొఱకును, యత్ = ఏది, (ఏ యజ్ఞము), ఇజ్యతే = చేయబడుచున్నదో, తం యజ్ఞమ్ = ఆ యజ్ఞమును, రాజసమ్ = రాజసమైనదానినిగా, విద్ధి = తెలిసికొనుము.

**తా:–** భరతవంశశ్రేష్ఠుడవగు ఓ అర్జునా! ఫలమునుగోరియు, డంబముకొఱకును గావింపబడు యజ్ఞమును రాజసమైనదానినిగా నీవు తెలిసికొనుము.

**వ్యాఖ్య:–** ఫలమునుగోరి చేయబడు కర్మచే చిత్తశుద్ధి యెన్నటికిని కలుగనేరదు. చిత్తము శుద్ధముకానిచో ఆత్మతత్త్వము ప్రకాశింపదు (అనుభూతముకాదు). కావున అట్టి ఫలాభిసంధియుక్తమగు కర్మ ఇచట రాజసమని (కావుననే త్యాజ్యమని) చెప్పబడినది. మఱియు కేవలము పేరుప్రఖ్యాతులకొఱకు, వేషముకొఱకు, డంబము కొఱకు చేయబడు కార్యమున్ను రాజసమేయని యిట పేర్కొనబడినది. కాబట్టి వానినెవరును ఆశ్రయించరాదు.

**ప్ర:–** రాజసయజ్ఞ మెట్టిది?

**ఉ:–** (1) ఫలాభిలాషతోను (2) డంబముకొఱకును గావింపబడు యజ్ఞము రాజసమని చెప్పబడును.

**అ॥** తామసయజ్ఞము చెప్పబడుచున్నది –

## 13. విధిహీనమసృష్టాన్నం మన్త్రహీనమదక్షిణమ్
## శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే.

**టీక:–** విధిహీనమ్ = శాస్త్రవిధిననుసరింపనిదియు, అసృష్టాన్నమ్ = అన్నదానములేనిదియు, మన్త్రహీనమ్ = మంత్రరహితమైనదియు, అదక్షిణమ్ = దక్షిణలేనిదియు, శ్రద్ధావిరహితమ్ = శ్రద్ధ బొత్తిగ లేనిదియునగు, యజ్ఞమ్ = యజ్ఞమును, తామసమ్ = తామసమని, పరిచక్షతే = చెప్పుచున్నారు.

**తా:–** విధ్యుక్తము కానిదియు, అన్నదానము లేనిదియు, మంత్రరహితమైనదియు, దక్షిణలేనిదియు, శ్రద్ధ బొత్తిగలేనిదియునగు యజ్ఞము తామసయజ్ఞమని చెప్పబడును.

**వ్యాఖ్య:–** 'అసృష్టాన్నమ్' – అన్నదానమనునది అనుష్ఠానవేదాంతముయొక్క ఒకానొక స్వరూపము. సర్వభూతములందును పరమాత్మకలడను సత్యము ననుభూత మొనర్చుకొనినవాడు పరోపకారము తప్పక చేయును. అదియే ఆచరణవేదాంతము. అందువలననే కాబోలు అన్నిపుణ్యకార్యములందును శ్రాద్ధాదులందును, యజ్ఞములందును అన్నదానమును పెద్దలు విధించిరి. తనవలె ఎల్లప్రాణులను చూచునట్టి గొప్పసాధన ఈ అన్నదానకార్యమువలన లెస్సగ అనుభవమునకు రాగలదు. కావున ఇట్టి పవిత్రమగు అంగము కొఱతపడిన యజ్ఞము తామసమేయని భగవానుడు పలికిరి.

'అదక్షిణమ్' – ఇదియు పైనదెల్పిన అన్నదానమును బోలినదే. తనసొత్తులో కొంతభాగమును ఋత్విక్కులకు, బీదలకు, దరిద్రనారాయణులకు దక్షిణగా నొసంగవలెను. ఇది త్యాగమునకు చిహ్నము. కావున ఇట్టి త్యాగభావములేని యజ్ఞము తామసమైనదని గీతాచార్యులు పేర్కొనిరి.

'శ్రద్ధావిరహితమ్' - ఏ కార్యమునైనను శ్రద్ధతో, భక్తితో పరిపూర్ణవిశ్వాసముతో చేయబడినపుడే ఉత్తమఫల మొసంగగలదు. శ్రద్ధలేకుండ చేయబడు కార్యము చేయని దానితో సమానమేయని ఈ అధ్యాయముననే మున్ముందు భగవానుడు చెప్పబోవుదురు. (అశ్రద్ధయా హుతం - అసదిత్యుచ్యతే...) కావున శ్రద్ధారాహిత్యమును, తామసప్రవృత్తిని విడనాడి జనులు శ్రద్ధాసమన్వితులైయే సమస్తకార్యములను ఆచరించి ఉత్తమఫలములను బొందవలయును.

ప్ర:- తామసయజ్ఞ మెట్టిది ?

ఉ:- (1) శాస్త్రోక్తముకానిది (2) అన్నదానములేనిది (3) మంత్రరహితమైనది (లేక మంత్ర లోపములు గలది) (4) దక్షిణలు లేనిది (5) శ్రద్ధతో చేయబడనిది - తామసయజ్ఞమనబడును.

అ॥ ఇక శారీరక, వాచిక, మానసిక తపస్సులను చెప్పబోవుచు ముందుగా శారీరక తపస్సునుగూర్చి వర్ణించుచున్నాడు -

**14. దేవద్విజగురుప్రాజ్ఞ పూజనం శౌచమార్జవమ్**
**బ్రహ్మచర్యమహింసా చ శారీరం తప ఉచ్యతే.**

**టీక:-** దేవద్విజగురుప్రాజ్ఞపూజనమ్ = దేవతలను, బ్రహ్మనిష్ఠులను, గురువులను, జ్ఞానులను (బ్రహ్మజ్ఞానముకల పెద్దలను) పూజించుట, శౌచమ్ = బాహ్యాభ్యంతరశుద్ధిగలిగియుండుట, ఆర్జవమ్ = ఋజుత్వముతో గూడియుండుట (కౌటిల్యము లేకుండుట, మనోవాక్కాయములచే ఏకరీతిగా ప్రవర్తించుట), బ్రహ్మచర్యమ్ = బ్రహ్మచర్యవ్రతమును పాలించుట, అహింసా చ = ఏ ప్రాణిని హింసించకుండుటయు, శారీరమ్ = శరీరసంబంధమైన, తపః = తపస్సని, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

**తా:-** దేవతలను, బ్రహ్మనిష్ఠులను, గురువులను, జ్ఞానులను (మహాత్ములను, బ్రహ్మజ్ఞానముగల పెద్దలను) పూజించుట, బాహ్యాభ్యంతరశుద్ధిగలిగియుండుట, ఋజుత్వముతోగూడియుండుట (కుటిలత్వము లేకుండుట, మనోవాక్కాయములతో ఏకరీతిగ వర్తించుట), బ్రహ్మచర్యవ్రతమును పాలించుట, ఏ ప్రాణిని హింసింపకుండుట, శారీరక (శరీరసంబంధమైన) తపస్సని చెప్పబడుచున్నది.

**వ్యాఖ్య:-** శారీరక, వాచిక, మానసికములను త్రివిధతపస్సులను గూర్చి చెప్పబడిన ఈ ఘట్టము (14, 15, 16 శ్లోకములు) చాలముఖ్యమైనది. సాధకులు ఈ మూడువిధములైన తపస్సులను చక్కగ శీలించి త్రికరణశుద్ధులైయుండినచో నిర్మల దర్పణమున ప్రతిబింబమువలె, ఆత్మానుభూతి వారికి సులభముగ లభ్యముకాగలదు. ఈ అధ్యాయమున ఆహారము, యజ్ఞము, దానము అనువానిని గూర్చి చెప్పునపుడు వానియొక్క సాత్త్విక, రాజస, తామసరూపములనే పేర్కొని, ఒక్క తపస్సునుగూర్చి వర్ణించునపుడు మాత్రము, అద్దాని సాత్త్విక, రాజస, తామసరూపములనేగాక, తత్సంబంధమైన శారీరక, వాచిక, మానసిక తపస్సులనుగూడ వక్కాణించిరి. ఉపాధియందలి (ఇంద్రియాదులందలి) మాలిన్యములను బాగుగ తపింపజేసి వానిని తొలగించుటయే తపస్సు. అదియే మోక్షమునకు హేతువు. పరమార్థసాధనలలో అదిచాల ప్రధానమైనది. అందువలననే కాబోలు గీతాచార్యులు తపస్సును గుఱించి చెప్పునపుడు అన్నిటి వలె సామాన్యముగ చెప్పక ప్రత్యేకించి మఱల మూడువిధములుగ చెప్పిరి. జనులలో కొందఱు తపస్సను మాట వినగనే భీతిల్లుచుందురు. ఎండలో, వానలో బాధ జెందుటయే తపస్సని వారిభావము. కాని శ్రీకృష్ణపరమాత్మ

తపస్సునుగూర్చి యిచట గావించిన వివరణమును, వ్యాఖ్యను పరిశీలించినచో ఇక వారట్టి భీతిజెందనవసరములేదని స్పష్టముకాగలదు. భయంకరములైన తపస్సులను గూర్చిన ప్రస్తావనయే ఇచట లేదు. కాబట్టి సులభసాధ్యములై, సర్వులకును ఆచరణయోగ్యములైనట్టి ఈ త్రివిధతపస్సులను ప్రతివారును స్త్రీలును, పురుషులును చక్కగ ఆచరించి శరీర వాఙ్మనంబులను శుద్ధమొనర్చుకొని మోక్షభాగులు కావలయును.

ఈ శ్లోకమునందు శారీరక (శరీరసంబంధమైన) తపస్సు చెప్పబడినది. ఇందు ఐదు సాధనలు వచింపబడినవి. (1) మొట్టమొదట పెద్దలసేవనము, పూజనము పేర్కొనబడినది (దేవద్విజగురుప్రాజ్ఞ పూజనమ్). పెద్దలను, బ్రహ్మనిష్ఠులను పూజించుటవలన, సేవించుటవలన రెండు మహత్తర సత్ఫలితములు సాధకునకు కలుగగలవు. అవియేవియనిన - (1) వారియొక్క అనుగ్రహము లభించుట (2) తనయొక్క అహంకారము, అభిమానము శమించుట. అధ్యాత్మమార్గమున సర్వేశ్వరుని యొక్కయు, సద్గురుని యొక్కయు, మహాత్ములయొక్కయు అనుగ్రహములేనిచో దుస్తరమగు మాయ ఎవరికిని దారి నొసంగదు. ప్రతిబంధకములు తొలగవు. అత్తఱి జనులు పరమార్థరంగమున ముందుకు జనుట చాలకష్టము. కాబట్టి వారియొక్క పూజా, సేవాదులచేతను, వారియెడల వినయవిధేయతలను జూపుటవలనను, వారి యనుగ్రహమును, ఆశీర్వాదమును ఎట్లైన సంపాదించవలెను. వారి కటాక్షము ముముక్షువులకు అపారమగు మేలును చేకూర్చగలదు. ఇంతియేకాదు. పెద్దలను సేవించుటవలన మనుజునకు తనయందలి అహంకారము, గర్వము, అభిమానము శీఘ్రముగ శమించిపోగలదు. కాబట్టి ముముక్షువున కీ సాధన చాల అవసరమైయున్నది. అందులకే కాబోలు భగవానుడు మొట్టమొదట దానినే వక్కాణించిరి.

'ద్విజ' - ద్విజులనగా రెండవజన్మయెత్తినవారు; అనగా పుట్టుకతో వచ్చిన జన్మకాక, సంస్కారముచే, సాధనచే వచ్చిన రెండవజన్మకలవారని అర్థము. అజ్ఞానమును ఛేదించి, లేక అజ్ఞానముతో గూడిన పాతశరీరమనంబులను పొందినవారని భావము. వారి జీవితము పూర్వజీవితమువలె నుండదు. వారియందు బ్రహ్మతేజస్సు ప్రకాశించుచుండును.

'ప్రాజ్ఞ' - ప్రజ్ఞకలవాడు ప్రాజ్ఞుడు. జ్ఞానియని అర్థము. 'ప్రజ్ఞానం బ్రహ్మ' అను మహావాక్యమందు తెలుపబడిన బ్రహ్మరూపమగు ప్రజ్ఞను, చిద్వస్తువును ఎఱుంగువారే ప్రాజ్ఞులనియు చెప్పవచ్చును. అట్టి ప్రాజ్ఞులను, మహనీయులను సత్కరించుట, పూజించుట ఒక విధమైన తపస్సనియే ఇట చెప్పబడినది.

'శౌచమ్' - మనశ్శుద్ధి, శరీరశుద్ధి, పరిసరశుద్ధి - మూడును అవసరములే. తన మనస్సు, తన శరీరము, తానుండుచోటు - మూడిటిని శుద్ధముగా నుంచుకొనవలెను. మురికితావులందుండువారికి ఆరోగ్యము చెడుటయేగాక 'మురికి' భావనలుగూడ గలుగుచుండును. మలినశరీరముగలవానికి స్వాస్థ్యము చెడుటచే నిష్ఠకు విఘ్నములు కలుగును. ఇక మలినమనస్సుగలవారికి అసలు దైవమార్గమే గోచరింప కుండును. కాబట్టి సాధకుడు కడుజాగరూకుడై శుచిత్వమును లెస్సగ సంపాదించవలెను. ఊడ్చిశుద్ధము చేయుటద్వారా పరిసరములను, స్నాన సాత్త్వికాహారాదులద్వారా శరీరమును, మలినసంకల్పత్యాగము ద్వారా, దైవసంకల్పములను చేయుటద్వారా మనస్సును శుచివంతముగ గావించుకొనవలెను.

'ఆర్జవమ్' - ఋజుత్వము - కుట్ర, కపటము, కౌటిల్యము లేకుండుట - పామువలె వక్రత గలిగియుండువానియందు విషము (పాపము, అజ్ఞానము) ఉండియేయుండును. కావున తలంపునందు, వాక్కునందు, క్రియయందు ఒకే విధమైన ప్రవర్తన గలిగియుండవలెను. శరీరవాఙ్మనంబులలో ఏకరీతివర్తింపవలయును. 'వక్ర' వ్యవహారము మానవలెను.

'బ్రహ్మచర్యమ్' - త్రికరణములతో బ్రహ్మచర్యమును శీలించుట ఒక మహాతపస్సని భగవానుడు చెప్పుచున్నాడు. బ్రహ్మచర్యమనగా విషయదోషము, కామభావన, కామవ్యవహారము లేకుండుట; మఱియు బ్రహ్మమును గూర్చి చింతించుట. అన్ని సాధనలకును బ్రహ్మచర్యము పునాదివంటిది. కనుకనే గీతలో భగవానుడు డచటచట అద్దానిని ప్రోత్సహించుచువచ్చిరి. దీనివిషమై అశ్రద్ధవహించినచో మనుజుడు పరమార్థపథమున ఉన్నతిని బడయజాలడు. అధ్యాత్మసాధమున బ్రహ్మచర్యము కీలకస్థానము నాక్రమించుకొనియున్నది (Main - Switch).

'అహింస' - శరీరవాఙ్మనంబులచే ఏ ప్రాణికిని అపకారము చేయకుండుట. (అజ్ఞానముగలిగియున్నచో తన ఆత్మను తాను హింసించుకొనినట్లగును. గావున అజ్ఞానమును తొలగించి, జ్ఞానసముపార్జనము గావించుటద్వారా ఆత్మహింసను త్యజించుటయు అహింసయే యగును. అయితే యిది అహింసయొక్క మహోన్నతమగు రూపమని యెఱుంగవలెను).

ప్ర:- శరీరతపస్సనగా నేమి ?

**ఉ:-** (1) దేవతలు, గురువులు, బ్రహ్మనిష్ఠులు, ప్రాజ్ఞులగు మహనీయులు (జ్ఞానులు, పెద్దలు) - వీరిని పూజించుట (2) బాహ్యాభ్యంతరశుచిత్వము (3) ఋజుత్వము (4) బ్రహ్మచర్యము (5) అహింస - వీనిని గలిగియుండుట శరీరతపస్సని చెప్పబడును.

**అ॥** వాచికతపస్సును గూర్చి చెప్పుచున్నాడు -

**15. అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్**
**స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే.**

**టీక:-** అనుద్వేగకరమ్ = ఇతరుల మనస్సునకు బాధగలిగింపనిదియు, సత్యమ్ = సత్యమైనదియు, ప్రియహితమ్ చ = ప్రియమైనదియు, మేలుగలిగించునదియు (అగు), వాక్యమ్ = వాక్యమున్ను, స్వాధ్యాయాభ్యసనమ్ చ ఏవ = వేదాదులయొక్క అధ్యయనమును అభ్యసించుట (వేదము, ఉపనిషత్తులు, భగవద్గీత, భారతము, భాగవతము, రామాయణము, యోగవాసిష్ఠము మున్నగువానిని అధ్యయనముచేయుట, ప్రణవాది మంత్రములను జపించుట), యత్ = ఏదికలదో. (తత్ = అది), వాఙ్మయమ్ = వాక్కునకి సంబంధించిన (వాచిక), తపః (ఇతి) = తపస్సని, ఉచ్యతే చెప్పబడుచున్నది.

**తా:-** ఇతరుల మనస్సునకు బాధగలిగింపనిదియు, సత్యమైనదియు, ప్రియమైనదియు, మేలు గలిగించునదియునగు వాక్యమును, వేదాదులయొక్క అధ్యయనమును అభ్యసించుట* (వేదము, ఉపనిషత్తులు, భగవద్గీత, భారతము, భాగవతము, రామాయణము, యోగవాసిష్ఠము మున్నగువానిని అధ్యయనముచేయుట, ప్రణవాది మంత్రములను జపించుట) వాచిక తపస్సని చెప్పబడుచున్నది.

**వ్యాఖ్య:-** 'అనుద్వేగకరం వాక్యమ్' - ఉచ్చరింపబడు వాక్యము పరుల మనస్సునకు నొప్పిగలుగజేయరాదు. మఱియు అది సత్యమై (యథార్థమై) యుండవలెను. సత్యవాక్కు అయినప్పటికిని దానిని పరుషముగ, అప్రియముగ పలుకరాదు. ఇతరులకు ప్రియముగ, హితముగ నుండవలెను.

*వేదాన్త శతరుద్రీయప్రణవాది జపం బుధాః
సత్త్వశుద్ధికరం పుంసాం స్వాధ్యాయం పరిచక్షతే.

'స్వాధ్యాయాభ్యసనమ్' - 'అభ్యసనమ్' అని చెప్పినందువలన అట్టి స్వాధ్యాయమును లెస్సగ అభ్యాసము చేయవలెనని, ప్రతిరోజు దానిని సాధించవలెనని స్పష్టమగుచున్నది. 'ధ్యానముగదా ప్రధానము, శాస్త్రాభ్యాసమెందులకు?' అని పలుకువారి కిచట చక్కని సమాధానమును భగవాను డొసంగిరి. ధ్యానమే ముఖ్యమైనప్పటికిని విరామసమయములందు శాస్త్రాదులను పరిశీలించుట, అధ్యయనముచేయుట, నిప్పుకు గాలితోడైనట్లు, అతని ధ్యానాదులకు చాల సహాయకారిగానుండునని యెఱుంగవలెను. ఇట్టి అధ్యయనము చేతను, ప్రణవాదిమంత్రముల జపముచేతను, సత్యవాక్కుచేతను వాక్ - శుద్ధియు కలుగగలదు.

ప్ర:- వాచికతపస్సు అనగా నేమి?

**ఉ:-** (1) పరులకు **నొప్పిగలుగజేయనిదియు,** సత్యమైనదియు, ప్రియముగను, హితముగ నుండునదియునగు వాక్కున్ను (2) వేదాదుల అధ్యయనమున్ను వాచికతపస్సని చెప్పబడును.

**అ॥** ఇక మానసిక తపస్సును గూర్చి వచించుచున్నాడు -

## 16. మనః ప్రసాదస్సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః
## భావసంశుద్ధిరిత్యేత త్తపో మానసముచ్యతే.

**టీక:-** మనః ప్రసాదః = మనస్సును నిర్మలముగా నుంచుట (కలతనొందనీయక స్వచ్ఛముగానుంచుట), సౌమ్యత్వమ్ = ముఖప్రసన్నత్వము (క్రూరభావము లేకుండుట), మౌనమ్ = భగవంతుని గూర్చిన, సత్ప్రవర్తననుగూర్చిన మననము గలిగియుండుట, అనగా ఆత్మధ్యానాదులందు చిత్తమును నిలుపుట (లేక దృశ్యసంకల్పము లెవ్వియులేక ఆత్మయందే స్థితిగలిగియుండుట అను వాఙ్మౌనసహిత మనోమౌనము), ఆత్మవినిగ్రహః = మనస్సును లెస్సగ నిగ్రహించుట, భావసంశుద్ధిః = పరిశుద్ధమగు భావము గలిగియుండుట (మోసము మున్నగునవి లేకుండుట), ఇతి ఏతత్ = అనునివి, మానసమ్ = మనస్సంబంధమైన, తపః = తపస్సని, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

**తా:-** మనస్సును నిర్మలముగానుంచుట (కలతనొందనీయక స్వచ్ఛముగానుంచుట), ముఖప్రసన్నత్వము (క్రూరభావము లేకుండుట), పరమాత్మనుగూర్చిన మననము (దైవధ్యానము) గలిగియుండుట (లేక, దృశ్యసంకల్పము లెవ్వియు లేక ఆత్మయందే స్థితిగలిగియుండుట, అను వాఙ్మౌనసహిత మనోమౌనము), మనస్సునుబాగుగ నిగ్రహించుట, పరిశుద్ధమగు భావము గలిగియుండుట (మోసము మున్నగునవి లేకుండుట) అనునివి మానసిక తపస్సని చెప్పబడుచున్నది.

**వ్యాఖ్య:-** 'మనః ప్రసాదః' - మనస్సు తేటగా, నిర్మలముగా, కలతనొందకుండనుండవలెను. మనస్సునందు. రజోగుణ, తమోగుణములయొక్క సంపర్కమున్నచో, అదిచంచలముగానో, మత్తుగానో యుండును. కావున సత్త్వగుణమును, విశుద్ధసత్త్వగుణము నాశ్రయించి మనస్సును నిర్మలముగా నుంచుకొనవలెను. చిల్లగింజ అరగదీసి నీటిలోకలిపినచో మురికియంతయు క్రిందకుజని నీరు తేటగానుండునట్లు, భక్తి జ్ఞాన వైరాగ్యదులచే మనోమాలిన్యమును రహితమొనర్చి చిత్తమును వినిర్మలముగా జేయవలెను. ఇదియే మనఃప్రసాదము, మానసిక తపస్సు. ఇట్టి మనఃప్రసాదమును స్వీకరించినవాడు మఱల బంధమును బొందనేరడు.

'సౌమ్యత్వమ్' - అంతఃకరణవృత్తి సామాన్యముగ ముఖమునందు ప్రతిబింబించుచుండును. ముఖము సౌమ్యముగా, వికాసముగానున్నచో దానినిబట్టి చిత్తవృత్తియు నిర్మలముగా, నిశ్చలముగా, సౌమ్యముగా నున్నదని ఊహించవచ్చును. అట్టి సౌమ్యస్థితి గలిగియుండుటయు మానసిక తపస్సేయగును.

'మౌనమ్' - 'వాఙ్మౌనము, మనోమౌనము' అని మౌనము రెండు విధములు. ఇచట మౌనమును మానసిక తపస్సునందు జెప్పుటవలన మానసిక మౌనమే ఇచటవివక్షితమని తెలియుచున్నది. అయితే వాఙ్మౌనము మనోమౌనమునకు సహాయకారిగా నుండగలదు. కాబట్టి అదియు నభ్యసించవలసినదే. అయితే మనోమౌనమునకై యత్నింపక కేవలము వాఙ్మౌనముమాత్రము గలిగియున్నచో అత్తఱి మనస్సు అనేక సంకల్పములతో గూడుకొని చంచలమైయుండుటవలన - ఆ మౌనమువలన ఎక్కువ ప్రయోజనముండదని ఈ సందర్భమున గ్రహించవలసియున్నది. మౌనమునకు ముఖ్యార్థము మనోవృత్తుల నిశ్చలత్వము, దృశ్యసంకల్పరాహిత్యమేయగును. కనుకనే మౌనమును భగవానుడు వాచిక తపస్సులో చేర్చక మానసిక తపస్సులో చేర్చుట సంభవించినది. కాబట్టి మనోమౌనమే సర్వులకును ముఖ్యమైనదనియు, వాఙ్మౌనము దానికి సహాయభూతముగ నుండుననియు నెఱుంగవలెను.

'ఆత్మవినిగ్రహః' - ఇచట 'ఆత్మ' అను పదమునకు మనస్సని, ఇంద్రియములని యర్థము. నిగ్రహమని చెప్పక వినిగ్రహమని చెప్పుటవలన సామాన్యనిగ్రహము చాలదనియు, ఇంద్రియ మనంబులను లెస్సగ నిగ్రహించవలెననియు తేలుచున్నది. అట్లే 'భావసంశుద్ధి' అను పదమునందును, శుద్ధి అని చెప్పక 'సంశుద్ధి' అని చెప్పుటవలన భావమందు పరిపూర్ణమగు శుద్ధత్వము గలిగియుండవలెనని స్పష్టమగుచున్నది. జ్ఞానసిద్ధికి భావశుద్ధి అవసరము. అనగా ఆత్మానుభూతికి భావనిర్మలత్వము అత్యంతావశ్యకమైయున్నది. నిర్మలజలమందు సూర్యుడు దేదీప్యమానముగ ప్రకాశించునట్లు శుద్ధహృదయమున ఆత్మభాస్కరుడు చక్కగ భాసించును. కాబట్టి మనస్సునందు, భావములందు ఏలాటి దృశ్యదోషము, అపవిత్రత చేరకుండ బహుజాగరూకతతో జూచుచుండవలెను.

**ప్ర:–** మానసికతపస్సు అనగా నేమి?

**ఉ:–** (1) మనస్సు నిర్మలముగా నుండుట (2) ముఖమందు ప్రసన్నత్వము గలిగియుండుట (3) మౌనము (ఆత్మనుగూర్చిన మననము, లేక దృశ్యవృత్తిరాహిత్యపూర్వకమగు ఆత్మస్థితి) - అనునవి మానసిక తపస్సని చెప్పబడును.

**అ॥** ఇంతదనుక శారీరక, వాచిక, మానసిక తపస్సులనుగూర్చి చెప్పి, ఇక సాత్త్వికక, రాజసిక, తామసిక తపస్సులను వివరించుచున్నాడు -

## 17. శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్త్రివిధం నరైః
## అఫలాకాంక్షిభిర్యుక్తై స్సాత్త్వికం పరిచక్షతే.

**టీక:–** అఫలాకాఙ్క్షిభిః = ఫలాపేక్షలేనివారును, యుక్తైః = నిశ్చలచిత్తులును (లేక దైవభావనతోగూడియున్నవారును) అగు, నరైః = మనుజులచే, పరయా = అధికమైన, శ్రద్ధయా = శ్రద్ధతో, తప్తమ్ = ఆచరింపబడినదైన, తత్ త్రివిధమ్ = (పైనతెలుపబడిన) ఆ మూడువిధములైన, తపః = తపస్సును, సాత్త్వికమ్ = సాత్త్వికమైనదిగా, పరిచక్షతే = (పెద్దలు) చెప్పుచున్నారు.

**తా:–** ఫలాపేక్షలేనివారును, నిశ్చలచిత్తులును (లేక, దైవభావనాయుక్తులును) అగు మనుజులచే అధికమగు శ్రద్ధతో ఆచరింపబడినట్టి ఆ (పైనదెలిపిన శారీరక, వాచిక, మానసికములను) మూడు విధములైన తపస్సును సాత్త్వికమని (సాత్త్వికతపస్సని) (పెద్దలు) చెప్పుచున్నారు.

**వ్యాఖ్య:–** 'శ్రద్ధయా' అను పదమునకు 'పరయా' అను విశేషణమును చేర్చుట వలన సామాన్యశ్రద్ధ చాలదనియు, మిక్కుటమైన శ్రద్ధ, లేక ఉత్తమమైనశ్రద్ధ అవసరమని విదితమగుచున్నది. ఏలయనగా సాధకునకు మధ్యమధ్య ఏవైన అంతరాయములు గలిగినచో అల్పమగు శ్రద్ధ చలించిపోవచ్చును. అందుచే అపరిమితమగు శ్రద్ధతో, విశ్వాసముతో, పట్టుదలతో గూడుకొనియున్నప్పుడు మాత్రమే మాయను దాటవీలగును.

'నరైః' – ఇచట నరులు అని చెప్పబడినదే కాని జాతిమతకులాదు లెవ్వియు పేర్కొన బడలేదు. కావున మానవులందఱును పరమార్థలక్ష్యమును సాధించుటకు, భగవంతుని అన్వేషించుటకు అర్హులేయని గీతాచార్యులు తేల్చిచెప్పివైచిరి.

'యుక్తైః' – భగవంతునితో, ఆత్మతత్త్వముతో, పరమార్థసాధనతో కూడిక (యోగము) కలవారు, ప్రాపంచికదృశ్యజాలముతో కూడిక తగ్గించుకొని, భగవద్ధ్యానపరులై యుండువారు, నిశ్చలచిత్తులు యుక్తులనబడుదురు.

దీనినిబట్టి సాత్త్వికతపస్సు నాచరించువారు మూడు సద్గుణములు గలిగియుండవలెనని తేలుచున్నది. అవి యేవియనిన – (1) వారు పరమశ్రద్ధతో గూడియుండవలెను (2) ఫలమును గోరక కర్మలనుచేయవలెను (3) నిశ్చలచిత్తము, లేక భగవద్ధ్యానపరత్వము గలిగియుండవలెను – ఇట్టి ఉత్తమ స్వభావములు గలిగి పైనదెల్పిన త్రివిధ (శారీరక, వాచిక, మానసిక) తపస్సుల నాచరించుచో అది సాత్త్విక తపస్సనబడును.

**ప్ర:–** సాత్త్వికతపస్సనగా నెట్టిది?

**ఉ:–** (1) అత్యంతశ్రద్ధతో (2) ఫలాభిలాషారహితముగ (3) నిశ్చలచిత్తుడై (లేక, దైవధ్యానపరుడై) పైన దెలిపిన త్రివిధతపస్సులను చేయుటయే సాత్త్వికతపస్సనబడును.

**అ॥** రాజసిక తపస్సునుగూర్చి చెప్పుచున్నాడు –

**18. సత్కారమానపూజార్థం తపో దమ్భేన చైవ యత్**
**క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమధ్రువమ్.**

**టీక:–** సత్కారమానపూజార్థమ్ = ఇతరులచే తాను సత్కరింపబడవలెనని, గౌరవింపబడవలెనని, పూజింపబడవలెనని, దమ్భేన చ ఏవ = డంబముతో మాత్రమే, యత్ = ఏ, తపః = తపస్సు, క్రియతే = చేయబడుచున్నదో, తత్ = అది, చలమ్ = అస్థిరమై, అధ్రువమ్ = అనిశ్చితమైనట్టి ఫలముగలదై, రాజసమ్ = రాజసతపస్సని, ఇహ = ఈ ప్రపంచమందు, ప్రోక్తమ్ = చెప్పబడినది.

**తా:–** ఇతరులచే తాను సత్కరింపబడవలెనని, గౌరవింపబడవలెనని, పూజింపబడవలెనని డంబముతోమాత్రమే చేయబడు తపస్సు అస్థిరమై, అనిశ్చితమైనట్టి ఫలముగలది (లేక చపలమైనట్టి రూపముగలది) ఈ ప్రపంచమున రాజసిక తపస్సు అని చెప్పబడినది.

**వ్యాఖ్య:–** కొందఱు తమ తపస్సునుజూచి ఇతరులు తమ్ము సత్కరించెదరను భావముతో తపస్సుచేయ నారంభింతురు. అది సదుద్దేశ్యముతోను, హృదయపూర్వకముగను స్థిరమైయుండదు. దాని ఫలితమున్ను అట్లే చపలముగ, అనిశ్చతముగ నుండును. కావున విజ్ఞులిద్దాని ననుసరించరాదు.

**ప్ర:–** రాజసతపస్సు ఎట్టిది?

**ఉ:–** సత్కారమానపూజాదులకొఱకై డంబముతో చేయబడునది రాజసతపస్సనబడును.

**ప్ర:–** అది యెట్టి ఫలితము గలిగియుండును? ఎట్టి స్వరూపము గలిగియుండును?

**ఉ:–** అస్థిరమై, అనిశ్చతమైనట్టి ఫలము గలిగియుండును. చంచల, అనిశ్చతస్వరూపము గలిగియుండును.

**అ॥** ఇక తామసిక తపస్సును గుఱించి తెలుపుచున్నాడు -

**19. మూఢగ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః**
**పరస్యోత్సాదనార్థం వా తత్తామసముదాహృతమ్.**

**టీక:–** యత్ తపః = ఏ తపస్సు, మూఢగ్రాహేణ = మూర్ఖపు పట్టుదలతో, ఆత్మనః పీడయా = తన శరీరమును (శుష్కోపవాసాదులచే) బాధించుకొనుటచేగాని, పరస్య = ఇతరునియొక్క, ఉత్సాదనార్థం వా = నాశముకొఱకుగాని, క్రియతే = చేయబడుచున్నదో, తత్ = అది, తామసమ్ = తామస తపస్సని, ఉదాహృతమ్ = చెప్పబడినది.

**తా:–** మూర్ఖపుపట్టుదలతో తన శరీరమును (శుష్కోపవాసాదులచే) బాధించుకొనుటద్వారాగాని, లేక ఇతరులను నాశనముచేయవలెనను ఉద్దేశ్యముతోగాని చేయబడు తపస్సు తామసిక తపస్సని చెప్పబడినది.

**వ్యాఖ్య:–** 'మూఢగ్రాహేణ' - (మూర్ఖపుపట్టుదలతో) - పట్టుదల మంచిదేకాని అది వివేకముతో గూడినపుడే సత్ఫలముల నొసంగగలదు. మూర్ఖపుపట్టుదలల వలన ప్రయోజనములేదు.

'ఆత్మనో యత్పీడయా' - కొందఱు మూర్ఖపు పట్టుదలతో శుష్కోపవాసాదుల ద్వారా తమ శరీరమును బాధించుకొనుచు తపస్సు చేయుదురు. తపస్సుగాని, ఉపవాసముగాని మంచివే అయినను కొంత వివేకమును వానికి జోడించినపుడే అవి శోభించును. లేకున్న మనుజుడు వక్రమార్గమున జను ప్రమాదముకలదు. అట్టి వివేకములేని కారణముచేతనే కొందఱు ఇతరులను నాశమొనర్చుటకుగాను తపస్సుచేయుచుందురని ఇట చెప్పబడినది. ఈ ప్రకారముగ వారు తపస్సను సాధనమును దుర్వినియోగపఱచుకొనుచున్నారు. దీనికంతటికిని మూఢత్వమే కారణము. కావున దానిని పోగొట్టుకొని రాజస, తామస తపస్సుల నాశ్రయింపక తమకున్న యా పట్టుదలను సన్మార్గమున వినియోగించి, దైవప్రాప్తికై సాత్త్విక తపస్సునే ఆశ్రయించి తరించవలయును.

ఈ శ్లోకముద్వారా ఈ క్రింది యంశములు తేలుచున్నవి -

1. మూర్ఖపుపట్టుదల పనికిరాదు. 2. శుష్కోపవాసాదులద్వారా తన శరీరమునుగాని, మనస్సునుగాని బాధించుకొనగూడదు. 3. పరప్రాణికి కీడుచేయరాదు.

ప్ర:– తామసిక తపస్సు ఎట్టిది?

ఉ:– (1) మూర్ఖపుపట్టుదలతో తన శరీరమును బాధపెట్టుట ద్వారాగాని (2) ఇతరులను నాశమొనర్పవలెనను ఉద్దేశ్యముతోగాని చేయబడు తపస్సు తామసిక తపస్సనబడును.

అ॥ ఇక నిపుడు దానములను గూర్చి చెప్పదలంచి మొట్టమొదట సాత్త్వికదానమెట్టిదో తెలుపుచున్నాడు -

**20. దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే**
**దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్.**

టీక:– దాతవ్యమ్ ఇతి = ఇవ్వవలసినదేయను నిశ్చయముతో, యత్ దానమ్ = ఏ దానము, దేశే = (పుణ్య) ప్రదేశమందును, కాలే చ = (పుణ్య) కాలమందును, పాత్రే చ = యోగ్యునియందును, అనుపకారిణే = ప్రత్యుపకారముచేయు శక్తిలేనివానికొఱకు, దీయతే = ఇవ్వబడుచున్నదో, తత్ దానమ్ = ఆ దానము, సాత్త్వికమ్ (ఇతి) = సాత్త్వికమని, స్మృతమ్ = తలంపబడుచున్నది.

తా:– ఇవ్వవలసినదే యను నిశ్చయముతో ఏ దానము పుణ్యప్రదేశమందును, పుణ్యకాలమందును, యోగ్యుడగువానికి మఱియు ప్రత్యుపకారముచేయ శక్తిలేనివానికొఱకు ఇవ్వబడుచున్నదో అది సాత్త్వికదానమని చెప్పబడుచున్నది.

వ్యాఖ్య:– 'దాతవ్యమితి' - ప్రతివాడును దానముచేయుట తన ధర్మమని తలంచి దానము చేయవలెను. అంతియేకాని ఒకరిమెప్పుకొఱకుగాని, ప్రతిఫలాపేక్షచేగాని చేయరాదు. 'నీవేల దానము చేయుచున్నా'వని యెవరైన దాత నడిగినచో 'ఇది నాధర్మము. నేను దానము చేయవలసినదే ('దాతవ్యమ్') కాబట్టి చేయుచున్నాను' అనియే సమాధానము చెప్పవలయును. వాస్తవముగ త్యాగముచేయుట, దానముచేయుట తనమేలు కొఱకే యగును. ఒకరికి ఉపకారము చేసినను అదియు (పుణ్యప్రాప్తివలన) తనకు తానుచేసికొను ఉపకారమే యగును. కావున దానముచేయువారు తామేదో ఒకరి నుద్ధరించితిమని తలంచుటకంటె ఆ దానక్రియచే తమ్ముతాము యుద్ధరించుకొనినవారైరని భావించుట యుత్తమము.

'అనుపకారిణే' - అని చెప్పినందువలన, ప్రత్యుపకారము చేయలేనివారికి, బీదవారికి, అశక్తులకు, వికలాంగులకు, దరిద్రనారాయణులకు చేయు దానము ఉత్కృష్టమని తెలుచున్నది. మఱియు శక్తిగలవారికి, ప్రత్యుపకారము చేయగల సమర్థతగలవారికి దానముచేయుట అంత ఉత్తమమైనదిగాదనియు ఈ పదముద్వారా సూచితమగుచున్నది.

'దేశే' - అనగా పుణ్యక్షేత్రమందు, తీర్థాదులందు, పవిత్ర ఆశ్రమాదులందు లేక పవిత్రమైనట్టి, దైవగంధయుతమైనట్టి ఏ ప్రదేశమందైనను అని యర్థము. 'కాలే' యనగా గ్రహణము, సంక్రాంతి, లేక ఏదైన పుణ్యకార్యసందర్భము - ఇత్యాదిరూపమగు పవిత్రకాలమునందు అని యర్థము. 'పాత్రే' యనగా యోగ్యతగలవానికి, తగినవానికి అని యర్థము. పాత్రతనెఱింగి దానముచేయుడని పెద్దలు చెప్పుదురు. అపాత్రునకు దానముచేసినచో దాతకు ఉత్తమఫలము చేకూరదని భావము.

ప్ర:– సాత్త్వికదానమనగా నెట్టిది?

**ఉ:–** 'దానముచేయవలసినదే' అని నిశ్చయించుకొని (1) ప్రత్యుపకారము చేయలేనివారికి, దీనులకు, అసహాయులకు (2) దేశ. కాల. పాత్రతలనుజూచి చేయబడు దానము సాత్త్వికమని చెప్పబడును.

**అ॥** రాజసదానమును పేర్కొనుచున్నాడు –

**21. యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః**
**దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్★.**

**టీక:–** ప్రత్యుపకారార్థం = ప్రత్యుపకారముకొఱకుగాని, పునః = మఱల, ఫలమ్ = ఫలమును, ఉద్దిశ్యవా = ఉద్దేశించికాని, పరిక్లిష్టమ్ చ = మనఃక్లేశముతో (అతి కష్టముతో) గాని, యత్ తు = ఏదయితే, దీయతే = ఈయబడుచున్నదో, తత్ దానమ్ = ఆ దానము, రాజసమ్ (ఇతి) = రాజసదానమని, స్మృతమ్ = తలంపబడుచున్నది.

**తా:–** ప్రత్యుపకారముకొఱకుగాని, లేక ఫలము నుద్దేశించిగాని లేక మనఃక్లేశముతో (అతికష్టముతో) గాని ఇవ్వబడు దానము రాజసదానమని చెప్పబడుచున్నది.

**వ్యాఖ్య:–** ప్రత్యుపకారము కోరి చేయు దానము ఉత్తమమైనదికాదని నుడువుచున్నారు. ప్రత్యుపకార మభిలషించి చేయు దానము బజారులోని వ్యాపారవిధానమే (Shop - keeping) కాగలదు. ఇచ్చిపుచ్చుకొను పద్ధతి అంత శ్రేష్ఠమైనదికాదు. అది రాజసదానపద్ధతియే యగును. మఱియు తనకేదియో ముమ్ముందు పరలోకాదులందు ఫలము కలుగునని ఆశించి చేయుదానము, అనగా ఫలాపేక్షతో చేయు దానమున్ను ఉత్తమమైనదికాదు. నిష్కామముగా, భగవత్ప్రీత్యర్థముగా చేయుదానమే మహోన్నతమైనది.

'పరిక్లిష్టమ్' – కొందఱు దానము చేయునపుడు 'అయ్యో! ఈ వస్తువు పోవుచున్నదే' యని మనస్సులో బాధపడుచుందురు. మఱికొందఱు ఇతరుల బలవంతముచే దానము చేయుచుందురు. అట్లు క్లేశముతో దానమొసంగుట ఉత్తమపద్ధతికాదు. అట్టిది సత్ప్రయోజనమునున్ను గలుగజేయజాలదు. దానముచేయుట తనకర్తవ్యమని, (ధర్మమని) భావించి ఐచ్ఛికముగ, ఆనందముతో ఒకరికిచ్చుటయే సాత్త్వికదానము. తదితరము రాజస, తామస, దానములే యగును. కావున విజ్ఞుడు సాత్త్వికదానమునే అవలంబించవలెను.

**ప్ర:–** రాజసదాన మెట్టిది?

**ఉ:–** (1) ప్రత్యుపకారముకొఱకుగాని (2) ఫలమునుగోరికాని (3) మనస్సునందు బాధపడుచుగాని చేయబడు దానము రాజసదానమనబడును.

**అ॥** ఇక తామస దానమునుగూర్చి వచించుచున్నాడు –

**22. అదేశకాలే యద్దాన మపాత్రేభ్యశ్చ దీయతే**
**అసత్కృతమవజ్ఞాతం తత్తామస ముదాహృతమ్.**

★ తద్రాజసముదాహృతమ్ – పాఠాన్తరము.

**టీక:–** అదేశకాలే = దానమునకు తగని (అపవిత్రములగు) దేశ, కాలములందు, అపాత్రేభ్యః చ = పాత్రులు (అర్హులు) కానివారికొఱకును, అసత్కృతమ్ = సత్కారశూన్యముగను, అవజ్ఞాతమ్ = అమర్యాదతోను (అవమానపరచియు), యత్ దానమ్ = ఏ దానము, దీయతే = ఒసంగబడుచున్నదో, తత్ = అది, తామసమ్ *(ఇతి)* = తామసదానమని, ఉదాహృతమ్ = చెప్పబడినది.

**తా:–** దానమునకు తగని (అపవిత్రములగు) దేశకాలములందును, పాత్రులు (అర్హులు) కానివారికొఱకును, సత్కారశూన్యముగను, అమర్యాదతోను ఇవ్వబడు దానము తామసదానమని చెప్పబడును.

**వ్యాఖ్య:–** దానము చేయునపుడు సత్కారభావనతో, మర్యాదతో, ఆదరముతో చేయవలెనేకాని, తిరస్కారభావముతో గాదు. అనాదరభావముతో 'పో! తీసికొని పో!' అని డబ్బు మున్నగువానిని విసిరివేయరాదు. తిట్టుకొనుచు ఇవ్వరాదు. అదియంతయు తామసలక్షణమేయగును. అట్టి తామసదానమువలన దానఫలితము ఎంతయో తగ్గిపోవును. లేక అసలు లేకుండను పోవచ్చును. ఏలయనగా అశ్రద్ధతో ఇవ్వబడు వస్తువు ఇవ్వబడనిదానితోనే సమానమని భగవానుడీ యధ్యాయమందే కట్టకడకు చెప్పబోవుదురు – (అశ్రద్ధయా హుతం దత్తం ... అసదిత్యుచ్యతే); కాబట్టి ఇట్టిదానము నెవరును ఆచరించరాదు. సాత్త్వికదానమునే ఆచరించవలెను.

**ప్ర:–** తామసదాన మెట్టిది?

**ఉ:–** (1) దేశకాలపాత్రలు చూడకుండ చేయబడునదియు (2) సత్కారపూర్వకముగ చేయబడనిదియు (3) తిరస్కారభావముతో చేయబడునదియు నగుదానము తామసదాన మనబడును.

**అ॥** బ్రహ్మముయొక్క నామమును గుఱించి ఐదు శ్లోకములద్వారా తెలియజేయుచున్నాడు –

**23. ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః**
**బ్రాహ్మణా స్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా.**

**టీక:–** బ్రహ్మణః = పరబ్రహ్మమునకు, ఓమ్ ఇతి = 'ఓమ్' అనియు, తత్ *(ఇతి)* = 'తత్' అనియు, సత్ *(ఇతి)* = 'సత్' అనియు, త్రివిధః = మూడువిధములగు, నిర్దేశః = నామనిర్ణయము (నామములు), స్మృతః = చెప్పబడినది, తేన = దానిచేత, బ్రాహ్మణాః = బ్రాహ్మణులును (బ్రహ్మజ్ఞానులును), వేదాః చ = వేదములును, యజ్ఞాః చ = యజ్ఞములును, పురా = పూర్వము, విహితాః = నిర్మింపబడినవి.

**తా:–** పరబ్రహ్మమునకు 'ఓమ్' అనియు, 'తత్' అనియు, 'సత్' అనియు మూడు విధములగు పేర్లు చెప్పబడినవి. ఈ నామత్రయమువలననే (దానియుచ్చారణచేతనే) పూర్వము బ్రాహ్మణులు (బ్రహ్మజ్ఞనులు), వేదములు, యజ్ఞములు నిర్మింపబడినవి.

**వ్యాఖ్య:–** పరబ్రహ్మము వాస్తవముగ నామరూపరహితమైనను, భక్తులు ధ్యానించుటకు, చింతించుటకు అద్దానికి నామములు నిర్దేశింపబడెను. అవియే 'ఓమ్' అనియు, 'తత్' అనియు, 'సత్' అనియు చెప్పబడును. అట్టి మంత్రముల చింతనద్వారా, లక్ష్యమగు పరబ్రహ్మమును జనులు చింతనజేయుచున్నారు. సాక్షాత్ పరబ్రహ్మము యొక్క వాచకములు గనుక ఆ మూడునామములకు

మహత్తరమగుశక్తి, పవిత్రతగలిగి యున్నది. వేదశాస్త్రాదులం దెల్లెడలను ఈ ప్రణవాది మంత్రములనుగూర్చి విశేషముగ చెప్పబడియున్నది.

'తస్యవాచకః ప్రణవః' - ఆ పరమాత్మయొక్క నామము ఓంకారము.

'తజ్జపస్తదర్థభావనమ్' - "ఆ నామమును జపించుచు దానియర్థమును లెస్సగ భావించవలెను" - అని పతంజలి మహర్షియు ఓంకారమహిమనుగూర్చి శ్లాఘించియున్నారు. కర్మానుష్ఠానమందు ఏవైన లోపములు, విఘ్నములు, దోషములు మున్నగునవి యున్నచో అవియన్నియు పరమపవిత్రములగు ఆ మూడునామముల యొక్క ఉచ్చారణచే పటాపంచలైపోవును. కనుకనే ఏ కార్యమును ప్రారంభించినను పెద్దలు ప్రణవోచ్చారణము చేయుదురు. మంత్రములన్నిటిలోను ప్రణవము శిరోమణియై యలరుచున్నది. కనుకనే ప్రతిమంత్రమునకును ఆదిలో ఓంకారము చేర్చబడుచుండును. అయితే 'ఓం తత్ సత్' అను మంత్రము నుచ్చరించునపుడు అద్దాని అర్థమును భావించుచు దాని వాచ్యరూపమగు పరబ్రహ్మమును చింతనజేయవలెను. భావలముతో గూడినపుడుమాత్రమే మంత్రము ఎక్కువగ శక్తివంతమగును.

మఱియు వేదములు, యజ్ఞములు మున్నగునవి ఆ ప్రణవమంత్రోచ్చారణము చేతనే నిర్మింపబడినవని చెప్పుటవలన వేదములయొక్క మూలము, బీజము ఓంకారమే (పరబ్రహ్మమే) అయియున్నదని తెలుచున్నది. మఱియు వేదసారమంతయు ఆ ప్రణవమునందే యున్నటుల గోచరమగుచున్నది. కావున వేదసారమగు ఓంకారము నుచ్చరించి భావమును మననముచేసినపుడు సమస్త వేదములను ఉచ్చరించినట్లే యగుచున్నది.

'ఓమ్ తత్ సత్' అనుదానికి మఱియొక అర్థమున్ను గలదు. ఓమ్ అనగా పరబ్రహ్మము, తత్ అనగా అది (ఆ పరబ్రహ్మము) ఒకటియే, సత్ = సద్వస్తువు, తక్కినదియగు దృశ్యజగత్తంతయు మిథ్యావస్తువు అని యర్థము. కావున ఈ 'ఓమ్ తత్ సత్' అను మంత్రముయొక్క ఉచ్చారణచేత 'బ్రహ్మసత్యం జగన్మిథ్యా' అను సర్వవేదాంతసిద్ధాంతసారసంగ్రహము ప్రస్ఫుటమగుచున్నది. అట్టి నామోచ్చారణ చేయుచు సద్వస్తువగు బ్రహ్మమును సత్యముగ భావించుచు, మిథ్యాభూతమగు దృశ్యజగత్తును అసత్యముగ తలంచుచు వైరాగ్యభావమును అభివృద్ధిపఱచుకొనవలెను. సద్రూపదైవభావనను, ఆత్మభావనను దృఢపఱచుకొనవలెను 'ఓమ్ తత్ సత్' అను మంత్రమునకు ఈక్రింది రెండు అర్థములున్ను చెప్పవచ్చును.

| | |
|---|---|
| (1) ఓమ్ = పరబ్రహ్మము (కలదు) | (2) తత్ = ఆ |
| తత్ = ఆ పరబ్రహ్మము | సత్ = సద్వస్తువు |
| సత్ = సద్రూపమైనది | ఓమ్ = పరబ్రహ్మము |

**ప్ర:–** పరబ్రహ్మమునకు ఎన్ని పేర్లు కలవు? అవియేవి?

**ఉ:–** మూడుపేర్లు కలవు. అవి క్రమముగ (1) ఓమ్ (2) తత్ (3) సత్ అని చెప్పబడును.

**ప్ర:–** వానియొక్క మహత్తు యెట్టిది?

**ఉ:–** వానినుండియే (లేక, వాని నామోచ్చారణచేతనే) పూర్వము (1) బ్రాహ్మణులు (బ్రహ్మజ్ఞానులు) (2) వేదములు (3) యజ్ఞములు సృష్టింపబడినవి.

**ప్ర:–** కావున బ్రహ్మజ్ఞానులు, వేదములు, యజ్ఞములు – వీనికి మూలమేమి?

**ఉ:–** ఓంకారమే. (తల్లక్ష్యమగు) పరబ్రహ్మమే.

## 24. తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః
## ప్రవర్తన్తే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్.

**టీక:–** తస్మాత్ = అందువలన, బ్రహ్మవాదినామ్ = వేదములను బాగుగ నెఱింగినవారి యొక్క, విధానోక్తాః శాస్త్రములందు చెప్పబడిన, యజ్ఞదాన తపః క్రియాః = యజ్ఞము, దానము, తపస్సు లనెడి కర్మలు, సతతమ్ = ఎల్లప్పుడును, ఓమ్ ఇతి = 'ఓమ్.' అని, ఉదాహృత్య = చెప్పి(నపిమ్మట), ప్రవర్తన్తే = ప్రవర్తించుచున్నవి (అనుష్ఠింపబడుచున్నవి).

**తా:–** అందువలన, వేదములను బాగుగనెఱింగినవారియొక్క శాస్త్రోక్తములగు యజ్ఞదాన తపః క్రియలన్నియు ఎల్లప్పుడును 'ఓమ్' అనిచెప్పిన పిమ్మటనే అనుష్ఠింప బడుచున్నవి.

**వ్యాఖ్య:–** 'ఓమ్. తత్. సత్' అను మూడుపదములలోను మొదటిది యగు 'ఓమ్' అను పదముయొక్క మహిమను వెల్లడించుచున్నారు – పరబ్రహ్మముయొక్క వాచకము (నామము) అయి అతిపవిత్రమై, మహాశక్తివంతమై యలరుచుండుటచే వేదవేత్తలందఱును తాము ప్రారంభించు యజ్ఞ దాన తపస్సులను క్రియలన్నిటియొక్క ఆదియందు ఎల్లప్పుడును 'ఓమ్' అను ఆ ఏకాక్షర ప్రణవమంత్రమును ఉచ్చరించుచున్నారు. అట్లుచ్చరించిన పిదపయే ఆ యా క్రియలను వారు ఉపక్రమించుదురు. (అట్లే ఆ యా క్రియలు సమాప్తమైన వెనుకను మఱల 'ఓమ్' అని (ఆ ప్రణవమును) ఉచ్చరించుచుందురు). అట్లొనర్చుటవలన ఆ యా క్రియలలో ఏవైనలోపములు, దోషములు ఉన్నచో అన్నియు తన్మంత్రప్రభావమువలన భస్మీభూతములైపోవ ఆ కర్మలు పరిపూర్ణఫలముల నొసంగగలవు.

'సతతమ్' – (ఎల్లప్పుడును) అని చెప్పుటవలన అట్టి వేదవేత్తలు తామాచరించు ఆ యా యజ్ఞదానాది సత్క్రియల ప్రారంభమున ఎల్లప్పుడును ఆ ప్రకారమే ప్రణవోచ్చారణము చేయుదురని స్పష్టమగుచున్నది. ఇంజనువలన రైలుపెట్టెలన్నియు కదలునట్లును, ఒకటి యను సంఖ్యచే ప్రక్కనగల పూర్ణానుస్వారములు (సున్నలు) అన్నియు శక్తివంతము లగునట్లును, మొదటగల ఓంకారముచే తక్కిన మంత్రములు క్రియలు అన్నియు చైతన్యవంతములు, ప్రతిభావంతములు అగును.

**ప్ర:–** 'ఓం కారము' యొక్క మహిమను తెలుపుడు?

**ఉ:–** వేదవేత్తలు తా మాచరించు యజ్ఞ దాన తపఃక్రియలకు మొదట ఎల్లప్పుడును ఓం కారమును ఉచ్చరించియే పిమ్మట ఆ యా క్రియలను చేయుచుందురు.

## 25. తదిత్యనభిసన్ధాయ ఫలం యజ్ఞతపః క్రియాః
## దానక్రియాశ్చ వివిధాః క్రియన్తే మోక్షకాంక్షిభిః.

**టీక:–** మోక్షకాఙ్క్షిభిః = ముముక్షువులచేత, 'తత్ ఇతి = 'తత్' అని, (ఉదాహృత్య = (బ్రహ్మనామమును) ఉచ్చరించి), ఫలమ్ =ఫలమును, అనభిసన్ధాయ = కోరక, వివిధాః = పలువిధములైన, యజ్ఞ తపః క్రియాః = యజ్ఞములు, తపస్సులు మున్నగుకర్మలు, దాన క్రియాః చ = దానరూపములగు కర్మలును, క్రియన్తే = చేయబడుచున్నవి.

**తా:–** అట్లే 'తత్' అను పదమును ఉచ్చరించియే ముముక్షువులు ఫలాపేక్షలేక పలువిధములైన యజ్ఞ, దాన, తపః కర్మలను చేయుచున్నారు.

**వ్యాఖ్య:–** ముముక్షువులు ఫలమమునుగోరక యజ్ఞ, దాన తపః క్రియల నాచరించుదురని చెప్పుటవలన ఫలాభిసంధిరహితముగ నాచరించునపుడే చిత్తశుద్ధి ద్వారా ఆ యాక్రియలు మోక్షమునకు సహాయభూతములుగ నుండునని తెలియుచున్నది. ఇట్టి కర్మ ఫలత్యాగమే గీతయొక్క ప్రధానబోధలలో నొకటియైయున్నది; మఱియు ముముక్షువునకత్యంతావశ్యకమైన అంగమైయున్నది.

మఱియు నిచట 'మోక్ష కాఙ్క్షులు. తపోయజ్ఞదానాదిక్రియలను నిష్కామముగా నాచరించుదురని చెప్పుటవలన, చిత్తశుద్ధిద్వారా ఆ యాక్రియలు మోక్షమునకు సహాయకారులుగ నుండుననియు, అట్టి తపోదానాది పుణ్యకార్యములను ముముక్షువు ముక్తి రూపమగు తన లక్ష్యప్రాప్తికై తప్పక ఆచరించవలెననియు నిచట ధ్వనించుచున్నది. అనగా ఆ యజ్ఞదాన తపః కార్యములను ముముక్షువులు వదలివేయరాదనియు, అవి యన్నియు మోక్షమునకు సహాయభూతములుగ నుండుననియు తెలిపినట్లైనది. ఈ భావముచే రాబోవు అధ్యాయమున 'యజ్ఞదానతపః కర్మ న త్యాజ్యం కార్యమేవతత్' అను శ్లోకము ద్వారా గీతాచార్యులు స్పష్టీకరించుదురు; లోకములో నిపుడు కొందఱు పుణ్యకార్యములను తక్కువగా జూచుచుందురు. వానిని చేయవద్దనియు, అవి బంధము గలిగించుననియుగూడ చెప్పుదురు. కాని భగవానుడు గీతలో అట్లు చెప్పలేదు. వానిని వదలవద్దని చెప్పుటయేకాక తప్పక ఆచరించవలయుననిగూడ పేర్కొనిరి. కాబట్టి మహాత్ముల వాక్యములపై విశ్వాసముంచి జనులు ఫలాపేక్షారహితముగ (జ్ఞాన) యజ్ఞతపోదానాది పుణ్యకార్యముల నాచరించి, చిత్తశుద్ధిని బడసి మోక్షభాగులు కావలయును.

**ప్ర:–** మోక్షము నభిలషించువారు ఏ ప్రకారముగ ప్రవర్తించుదురు?

**ఉ:–** 'తత్' అను బ్రహ్మవాచకము నుచ్చరించి వివిధములగు తపోయజ్ఞదానాది పుణ్యకార్యములను ఆచరించుదురు.

**ప్ర:–** ఆ యా కార్యములను వారెట్లాచరించెదరు?

**ఉ:–** ఫలాపేక్షారహితముగ.

**ప్ర:–** కావున మోక్షప్రాప్తికి మార్గమేదియని తేలుచున్నది?

**ఉ:–** 'ఓమ్' 'తత్' 'సత్' అను పరబ్రహ్మముయొక్క వాచకములగు పవిత్రనామముల నుచ్చరించి, తపో (జ్ఞాన) యజ్ఞదానాది వివిధక్రియలను ఫలాపేక్షారహితముగ నాచరించుటచే చిత్తశుద్ధి ద్వారా జ్ఞానము, దానిచే మోక్షము లభింపగలదు; కావున ఇదియే మోక్షప్రాప్తికి మార్గమైయున్నది.

## 26. సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే
## ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే.

**టీక:–** పార్థ = ఓ అర్జునా!, సద్భావే = 'కలదు' అనెడి అర్థమందును, సాధుభావే చ = 'మంచిది' అనెడి అర్థమందును, సత్ ఇతి ఏతత్ = 'సత్' అను ఈ పరబ్రహ్మనామము, ప్రయుజ్యతే = ప్రయోగింపబడుచున్నది, తథా = అలాగుననే, ప్రశస్తే కర్మణి = ఉత్తమమైన కర్మమునందును, సత్ శబ్దః = 'సత్' అను పదము, యుజ్యతే = ప్రయోగింపబడుచున్నది.

**తా:–** ఓ అర్జునా! 'కలదు' అనెడి అర్థమందును, 'మంచిది' అనెడి అర్థమందును 'సత్' అను ఈ పరబ్రహ్మనామము ప్రయోగింపబడుచున్నది. అట్లే ఉత్తమమైన కర్మమునందును ఆ 'సత్' అను పదము వాడబడుచున్నది.

**వ్యాఖ్య:–** పరబ్రహ్మవాచకమగు 'సత్' అను పదము 'ఉనికి'ని, 'శ్రేష్ఠత్వము'ను రెండింటిని సూచించుచున్నది. ఆ రెండు అర్థములలోగూడ ఆ పదము ప్రయోగింపబడుచుండును. (దృష్టాంతమునకు సత్ + భావము = ఉనికి).

**ప్ర:–** పరబ్రహ్మవాచకమగు 'సత్' అను పదము ఏ యర్థములందు వాడబడుచుండును?

**ఉ:–** (1) 'కలదు' అను అర్థమందును ('ఉనికి' యనెడి అర్థమందు), (2) 'మంచిది' అనెడి అర్థమందును అది వాడబడుచున్నది.

## 27. యజ్ఞే తపసి దానే చ స్థితిస్సదితి చోచ్యతే
## కర్మ చైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే.

**టీక:–** యజ్ఞే = యజ్ఞమునందును, తపసి చ = తపస్సునందును, దానే చ = దానమునందును (గల), స్థితిః = నిష్ఠ (లేక, ఉనికి), సత్, ఇతి ఉచ్యతే = 'సత్' అని చెప్పబడుచున్నది, తదర్థీయం కర్మ చ ఏవ = ఆ బ్రహ్మోద్దేశమైన (భగవత్ప్రీత్యర్థమైన) కర్మకూడ, సత్ ఇతి ఏవ = 'సత్' అనియే, అభిధీయతే = పిలువబడుచున్నది.

**తా:–** యజ్ఞమునందును, తపస్సునందును, దానమునందుగల నిష్ఠ (ఉనికి) కూడ 'సత్' అని చెప్పబడుచున్నది. మఱియు బ్రహ్మోద్దేశమైన (భగవత్ప్రీత్యర్థమైన) కర్మలు కూడ 'సత్' అనియే పిలువబడుచున్నవి.

**వ్యాఖ్య:–** గీతయందు తపో, యజ్ఞదానాది పుణ్యకార్యములను భగవానుడు లెస్సగ ప్రోత్సహించుచున్నాడు. వానియందలి స్థితి (ఉనికి, నిష్ఠ) కేవలము బ్రహ్మవాచకమగు 'సత్' అనియే ఈశ్లోకమునందు చెప్పుట వలన ఆ పుణ్యకార్యములకెట్టి ఆధిక్యత యొసంగబడెనో విదితమగుచున్నది. మఱియు 'తదర్థీయం కర్మ' అనగా భగవత్ప్రీత్యర్థమగు (భగవత్సంబంధమగు) కర్మయు 'సత్' అని చెప్పుటవలన అట్టి కర్మయు, పైనదెల్పిన యజ్ఞాదికర్మలున్ను చిత్తశుద్ధిద్వారా సద్రూపమగు బ్రహ్మమునే పొందించునని స్పష్టమగుచున్నది. అట్టి సద్రూపమగు బ్రహ్మముయొక్క ప్రాప్తికి

హేతుభూతములగుటవలననే ఆ యా పుణ్యకార్యములను, వానియందలిస్థితిని సాక్షాత్ బ్రహ్మముయొక్క నామమగు సత్తుగనే ఇచట వర్ణింపబడినది. అయితే కర్మ 'తదర్థీయము'గా నున్నపుడే అనగా, భగవత్సంబంధమైనదిగా (భగవత్ప్రీత్యర్థముగ, భగవద్భావనతో చేయబడినదిగా, మఱియు నిష్కామముగా) నున్నపుడే ఆ కర్మ సామాన్య కర్మగా నుండిపోవునేకాని బ్రహ్మరూపమగు 'సత్తు' గా నుండదు. కాబట్టి వాస్తవముగ కర్మలో లోపములేదు. కర్మచేయు విధానమందే లోపము కలదు. దైవబుద్ధితో చేసినచో కర్మ దైవరూపమును ('సత్' రూపమును) తప్పక బడయగలదని ఈ శ్లోకముద్వారా వ్యక్తమగుచున్నది. కావున అట్టి యజ్ఞదానాది పుణ్యకార్యములను భగవత్ప్రీత్యర్థముగ, నిష్కామముగ నాచరించి జనులు చిత్తశుద్ధిని తద్వారా 'సత్' రూప బ్రహ్మప్రాప్తిని బొందవలయును. ఈశ్లోకమందు భగవానుడు కర్మయందు దైవత్వమును బోధించిరి.

**ప్ర:–** యజ్ఞదానతపంబులందలి నిష్ఠను, భగవత్ప్రీత్యర్థకర్మను పెద్దలు ఏమందురు?

**ఉ:–** పరబ్రహ్మవాచకమగు 'సత్' అని అందురు (అనగా అవి దైవరూపములేయనిభావము).

**అ॥** అశ్రద్ధతో నాచరింపబడు కార్యము అసత్తనియే (చేయబడనిదానితో సమమనియే, లేక, బ్రహ్మసంబంధము కానిదనియే) చెప్పుచున్నాడు -

## 28. అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్
## అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ.

**టీక:–** పార్థ = ఓ అర్జునా!, అశ్రద్ధయా = అశ్రద్ధతో, హుతమ్ = హోమమొనర్పబడినదియు, దత్తమ్ = దానముచేయబడినదియు, తప్తం తపః చ = చేయబడిన తపస్సును, కృతమ్ చ = చేయబడిన ఇతరకర్మలున్ను, యత్ = ఏదికలదో, (తత్ = అది), 'అసత్' ఇతి = 'అసత్తు' అని, ఉచ్యతే = చెప్పబడుచున్నది; తత్ = అది, ప్రేత్య = పరలోకఫలముకొఱకు, న = కాదు, ఇహ చ = ఇహలోక ఫలముకొఱకును, న = కాదు.

**తా:–** ఓ అర్జునా! అశ్రద్ధతో చేయబడిన హోమముగాని, దానముగాని, తపస్సుగాని, ఇతర కర్మలుగాని 'అసత్తని' చెప్పబడును. అవి ఇహలోకఫలమును (సుఖమును) గాని, పరలోకఫలమును (సుఖమును) గాని కలుగజేయవు.

**వ్యాఖ్య:–** పరమార్థసాధనలయందుగాని, లేక వ్యవహారమునగాని శ్రద్ధకు అత్యధిక ప్రాముఖ్యతగలదు. శ్రద్ధతోగూడని కార్యము ఏరంగమందైనను విఫలమేయగును. ఇక పరమార్థరంగమున వేఱుగ జెప్పవలెనా? కనుకనే భగవానుడు గీతయందు పెక్కుచోట్ల శ్రద్ధయొక్క ఆవశ్యకతను నొక్కివక్కాణించుచున్నారు. గీత పూర్తికాబోవుచున్న ఈసమయమునగూడ శ్రీకృష్ణమూర్తి శ్రద్ధనుగూర్చి బోధింపదగు అవకాశమును ఏమాత్రము జారవిడుచుకొనలేదు. ఏ కార్యమైనప్పటికిని, అది హోమముకాని, దానముకాని, తపస్సుకాని, అధ్యయనముకాని శ్రద్ధతో జేయబడనిచో నిరుపయోగమగును; దైవసంబంధము లేనిదగును; అసత్తే (Zero) యగును. అనగా చేయనిదానితో సమానమేయగును - అని యిచట పేర్కొనబడినది. ఒకవేళ అట్టికార్యము ఈ లోకమున ఫలించకున్నను పరలోకమున ఏమైన ఫలించునాయనిన,

అచటను ఫలించదు (న చ తత్ప్రేత్య) అని ఖండితముగ చెప్పివేయబడెను; వంటకు పనికివచ్చు పదార్థములన్నియు సిద్ధముగనున్నప్పటికిని, వండువానికి ఏశ్రద్ధలేనిచో, ఆ వంటక మెట్లు చెడిపోవునో, అట్లే అధ్యాత్మక్షేత్రమందును ముముక్షువునకు తక్కిన యెన్నిగుణములున్నప్పటికిని శ్రద్ధ యొక్కటి లేనిచో సాధన ఫలించనేరదు. అత్తఱి వ్యర్థపరిశ్రమయే యగునని తెలుచున్నది. లేక, శ్రద్ధతో చేయనికార్యము అసత్తగు జగద్రూపముగనే యుండునుగాని సత్యమగు పరమార్థరూపమును బొందదనియు చెప్పవచ్చును. ఈ ప్రకారముగ ఇహలోకమునగాని, పరలోకమునగాని శ్రేయమునొసంగజాలని ఈ అశ్రద్ధను ముముక్షువు పారద్రోలి, సమస్తకార్యములందును శ్రద్ధను జోడించి తాను జేయుకార్యము అసత్తుగా (నిష్ఫలముగా) పరిణమించక సత్తుగా (దైవరూపముగ) పరిణమించులాగున చేసికొనవలెను. అపుడే యాతడు పరమార్థపథమున శీఘ్రముగ ఉన్నతిని బడయగలడు.

**ప్ర:—** అశ్రద్ధతో చేయబడు తపోయజ్ఞదానాదికర్మ లెట్టిఫలితమును గలుగజేయును?

**ఉ:—** ఏ ఫలమును గలుగజేయవు. అవి నిష్ఫలములేయగును. అవి చేయనివానితో సమానమేయగును. అసద్రూపములేయగును.

**ప్ర:—** అవి పరలోకమందైన ఫలించవా?

**ఉ:—** ఎక్కడను ఫలించవు.

**ప్ర:—** కాబట్టి తెలిసయంశమేమి?

**ఉ:—** ప్రతివారును శ్రద్ధను ఆశ్రయించి, ద్విగుణీకృత విశ్వాసముతో, శ్రద్ధతో, వారివారి ఆధ్యాత్మికాది కార్యముల నొనర్పవలెను.

ఓమ్
ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే శ్రద్ధాత్రయ విభాగయోగో నామ
సప్తదశోఽధ్యాయః
ఇది ఉపనిషత్ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జునసంవాదమునగు
శ్రీ భగవద్గీతలందు శ్రద్ధాత్రయ విభాగయోగమను
పదునేడవ అధ్యాయము
ఓమ్ తత్ సత్



# మోక్షసన్న్యాసయోగము



**యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః**
**తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ. (18-78)**

ఎచట యోగేశ్వరుడగు శ్రీకృష్ణుడున్ను ఎచట ధనుర్ధారియగు అర్జునుడున్ను ఉందురో అచట సంపదయు, విజయమున్ను, ఐశ్వర్యమున్ను, దృఢమగు నీతియు ఉండునని నా యభిప్రాయము.

ఓం

# శ్రీ భగవద్గీత

అథ అష్టాదశోఽధ్యాయః

## పదునెనిమిదవ అధ్యాయము

మోక్షసన్న్యాసయోగః

## మోక్షసన్న్యాసయోగము

**ఈ అధ్యాయముయొక్క పేరు :-**

''మోక్షసన్న్యాసయోగము'' - (1) మోక్షమనగా విడుదల; బంధమునుండి విడుదల. సంసారిక దుఃఖమునుండి, జననమరణములనుండి విడుదల. అనగా బంధవిముక్తి యని భావము. అట్టి బంధవిమోచనరూపమగు కైవల్యము (మోక్షము) త్యాగముచేతనే లభించును★. త్యాగమనినను, సన్న్యాసమనినను, రెండును ఒకటియే. త్యాగము (సన్న్యాసము) అనగా వాస్తవముగ దృశ్యభావనాపరిత్యాగము, సర్వసంగపరిత్యాగము. ప్రపంచము, దేహము, మనస్సు - ఇత్యాది సమస్తదృశ్యవస్తువులయొక్క సంగమును పరిత్యజించి మోక్షరూపుడగు భగవంతునొకరినే, ఆత్మవస్తువునొక్కదానినే శరణుబొందవలెను. దృశ్యవస్తుసంబంధమైన భావనయంతయు ఏక్షణమున మనుజుడు త్యజించివేయునో, ఆ క్షణముననే యతడు దృక్ - వస్తువగు ఆత్మగనే శేషించును. అదియే మోక్షస్థితి. అనగా క్షేత్రమును త్యజించుటచే క్షేత్రజ్ఞుడు శేషించునని భావము. దృశ్యసన్న్యాసము (త్యాగము)చే దృగ్రూపమగు మోక్షము (దైవము, ఆత్మ) లభించునని యర్థము. ఈప్రకారముగ సన్న్యాసమువలన, త్యాగమువలన, సర్వదృశ్యవస్తు సంగపరిత్యాగము వలన మోక్షము లభించునని బోధింపబడిన అధ్యాయమగుట వలన దీనికి మోక్షసన్న్యాసయోగమను పేరువచ్చినది.

(2) మోక్షసన్న్యాసమునకు మఱియొక అర్థము - మోక్షమనగా దైవము, భగవంతుడు. సన్న్యాసమనగా సమస్తకర్మములను అర్పించుట. సమస్తకర్మలను, ఆ కర్మలయొక్క ఫలములను భగవంతునకు అర్పించుటయే మోక్షసన్న్యాసమనియు చెప్పవచ్చును.

(3) ఇంకొక అర్థము - మోక్షమును సన్న్యసించుట, వదలుట మోక్షసన్న్యాసము. ప్రతివారును మోక్షమును కోరుదురేకాని వదలరుగదాయనిన, కోరునదియెవరు? మోక్షమును కోరునది బంధముననున్న వారే. బద్ధుడే ముక్తిని కోరును. కాని గీతపదునేడధ్యాయములందు తెలుపుబడిన అఖండమగు బోధను జీర్ణించుకొనినవాడిక బద్ధుడెట్లగును? 'అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో' అని నిత్యసత్యసనాతనమగు తన

★ త్యాగేనైకే అమృతత్వ మానశుః (కైవల్యోపనిషత్)

ఆత్మనెఱిగినవానికిక బంధమెచట? బంధమే లేనపు డిక మోక్షమునుగూర్చిన ప్రశ్నయే యెచట? @ కాబట్టి అట్టి ముక్తస్థితిలో జీవుడు మోక్షభావనను గూడ త్యజించివైచును, సన్న్యసించివైచును. ఏలయనిన అత్తఱి తానే మోక్షరూపుడైవెలయును. లేక, అట్టి 17 అధ్యాయముల బోధను చక్కగ అనుభూతమొనర్చుకొనినచో భగవానుడే అతనికి మోక్షమును ప్రసాదించును. కావున మోక్షమునుగూర్చిన సంకల్పమే యతని కనవసరము. అత్తఱి మోక్షసంకల్పము నతడు త్యజించివేయవచ్చును. అదియే మోక్షసన్న్యాసము.

ఇంతవఱకు 17 అధ్యాయములందు తెలుపబడిన బోధలన్నియు ఈ అధ్యాయమున సంక్షేపముగ తెలుపబడినవి. మఱియు ఇదివఱకు ఏవైనబోధలు విడిచియుండిన అవియు ఇచ్చోట సంపూర్తిచేయబడెను. కావున ఈ అధ్యాయమును గీతాసారమనిగాని, సంక్షిప్తగీతయనిగాని చెప్పవచ్చును. ఇట్టి అపూర్వ అధ్యాత్మబోధలను బడసినవాడిక ముక్తినొందక నుండునా? కావున అట్టివాడిక మోక్షమునుగూర్చిన సంకల్పమును త్యజించవచ్చును. అనగా మోక్షసన్న్యాసమును గావింపవచ్చును. ఇట్టి భావమును సూచించునదియగుటచేగూడ దీనికి మోక్షసన్న్యాసయోగమని పేరుకలిగియుండవచ్చును.

(4) ఇంతదనుక చెప్పబడిన 17 అధ్యాయములయొక్క పేర్లు జ్ఞానయోగమని, కర్మయోగమని, భక్తియోగమని - ఈ ప్రకారముగ నుండుటబట్టి ఆ యా పేర్ల యొక్క అర్థము - 'జ్ఞానముచే భగవదైక్యము (యోగము)ను', 'కర్మచే భగవదైక్యమును', 'భక్తిచే భగవదైక్యమును' గలుగజేయు పద్ధతులను తెలుపు అధ్యాయములని చెప్పుకొనుచుంటిమి. అట్లే ఇచట 'మోక్షసన్న్యాసయోగ'మని చెప్పినపుడు, 'మోక్షసన్న్యాస'మను క్రియద్వారా భగవ దైక్యమును సిద్ధింపజేయు యోగమని ఈ అధ్యాయమునుగూర్చి చెప్పవలసివచ్చును. ఈ ప్రకారముగ సాక్షాత్ మోక్షస్వరూపమగు లేక మోక్షప్రదమగు సన్న్యాసముద్వారా, త్యాగముద్వారా లేక భగవదర్పణముద్వారా, సర్వసంగరాహిత్యము ద్వారా యోగము (భగవ దైక్యము) సిద్ధించునని తెలుపు అధ్యాయమగుటచేతను దీనికి మోక్షసన్న్యాసయోగమను పేరు గలిగియుండవచ్చును.

(1) సన్న్యాసముచే, త్యాగముచే సర్వసంగపరిత్యాగముచే మోక్షము లభించును.
(2) మోక్షమును (మోక్షసంకల్పమును) గూడ సన్న్యసింపుము.
(3) మోక్షరూపుడగు భగవంతునకు సర్వకర్మలను సన్న్యసింపుము.
} అని బోధించిన అధ్యాయ మగుటచే దీనికి మోక్షసన్న్యాస యోగమని పేరువచ్చినది.

(4) మోక్షప్రదమగు, లేక మోక్షరూపమగు సన్న్యాసముచే (త్యాగముచే) భగవదైక్యము (యోగము) సిద్ధించును.

### ఈ అధ్యాయమునందలి ప్రధాన విషయములు :-

(1) త్యాగమును గూర్చిన ప్రసంగము :- (1శ్లో॥ నుండి - 12శ్లో॥ వఱకు)

(2) సాంఖ్యసిద్ధాంతప్రకారము కర్మలయొక్క స్థితికి కారణము వచించుట, ఆత్మ అకర్తయని బోధించుట - (13శ్లో॥ నుండి - 18శ్లో॥ వఱకు)

(3) జ్ఞానము, కర్మ, బుద్ధి, ధైర్యము, సుఖము - అను వీనియొక్క సాత్త్వక, రాజస, తామసరూపములు - (19శో॥ నుండి - 40శ్లో॥ వఱకు)

---

@ న నిరోధో న చోత్పత్తిర్నబద్ధో న చ సాధకః
న ముముక్షుర్నవైముక్త ఇత్యేషా పరమార్థతా (అమృతబిందూపనిషత్తు - 2)

(4) చాతుర్వర్ణ్యములవారి ధర్మములు - (41శ్లో॥ నుండి - 48శ్లో॥ వఱకు)

(5) బ్రహ్మసాక్షాత్కారసిద్ధికి ఉపాయములు - జ్ఞాననిష్ఠనుగూర్చి ప్రసంగము (49శ్లో॥ నుండి - 55శ్లో॥ వఱకు)

(6) భక్తిసహిత నిష్కామకర్మయోగమునుగూర్చిన వర్ణనము - (56శ్లో॥ నుండి - 60శ్లో॥ వఱకు)

(7) భగవచ్ఛరణాగతి, గీతాసారసంగ్రహము - (61శ్లో॥ నుండి - 66శ్లో॥ వఱకు)

(8) గీతామహిమ - (67శ్లో॥ నుండి - 73శ్లో॥ వఱకు)

(9) సంజయుని గీతా సంస్తుతి - (74శ్లో॥ నుండి - 78శ్లో॥ వఱకు)

**పూర్వాధ్యాయముతో ఈ అధ్యాయమునకుగల సంబంధము :-**

ఇంతదనుక శ్రీకృష్ణపరమాత్మ అనేకయోగములను గుఱించి అర్జునునకు బోధించుచు వచ్చిరి. అవియన్నియు వినినపిదప అర్జునునకు వాని యన్నింటియొక్క సారమును దెలిసికొన కుతూహలము గలిగి సన్న్యాసముయొక్కయు, త్యాగముయొక్కయు తత్త్వమునుగూర్చి భగవానుని ప్రశ్నించెను. అర్జునుని యా ప్రశ్నతో ఈ అధ్యాయము ప్రారంభమగుచున్నది. (ఇది చివఱి అధ్యాయమగుటవలన ఇంతవఱకు బోధింపబడిన తత్త్వము లన్నిటియొక్క సారము ఈ అధ్యాయమునందు చెప్పబడుచున్నది.)

**అర్జున ఉవాచ :-**

## 1. సన్న్యాసస్య మహాబాహో తత్త్వమిచ్ఛామి వేదితుమ్
## త్యాగస్య చ హృషీకేశ! పృథక్కేశి నిషూదన.

అర్జున ఉవాచ = అర్జునుడు చెప్పెను (ప్రశ్నించెను) -

**టీక:-** మహాబాహో = గొప్పభుజములుకలవాడవును, హృషీకేశ = ఇంద్రియములయొక్క నియామకుడవును, కేశినిషూదన = 'కేసి' యను రాక్షసుని సంహరించినవాడవును★నగు ఓ కృష్ణా!, సన్న్యాసస్య = సన్న్యాసముయొక్కయు, త్యాగస్య = త్యాగముయొక్కయు, తత్త్వమ్ = యథార్థమును (నిజస్థితిని), పృథక్ = వేఱ్వేఱుగా, వేదితుమ్ = తెలిసికొనుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

**తా:-** అర్జునుడు చెప్పెను (ప్రశ్నించెను) - గొప్పభుజములుగలవారును, ఇంద్రియములయొక్క నియామకులును, కేశియను రాక్షసుని సంహరించినవారునగు ఓ కృష్ణా! సన్న్యాసముయొక్కయు, త్యాగము యొక్కయు యథార్థము తెలిసికొనగోరుచున్నాను. కావున ఆ రెండిటిని వేఱువేఱుగా నాకు జెప్పుడు.

**వ్యాఖ్య:-** గీతయం దింతదనుక అనేక ప్రసంగములందు శ్రీకృష్ణపరమాత్మ సన్న్యాస, త్యాగ శబ్దములను వాడుచువచ్చిరి. కాని వానిని గూర్చిన వివరణమును తెలిపియుండలేదు. (శ్లో॥ 3-30, 4-20, 4-41, 9-28, 12-6, 12-11, 12-12, 12-16, 1-25). అందువలన అర్జునునకు వాని వివరములు తెలిసికొనవలెనను కాంక్ష ఉదయింప వానినిగూర్చి భగవానుని యిట్లు ప్రశ్నించెను.

★ గుఱ్ఱపుమూతిగల 'కేశి' యను రాక్షసుడు నోరుతెఱచుకొని శ్రీ కృష్ణునిపైకి యుద్ధమునకు రాగా శ్రీకృష్ణు డాతని నోటిలో తన చేతినిదూర్చి దానిని పెరుగనివ్వగా, అంతట నా రాక్షసుడు నోరు బ్రద్దలై చనిపోయెను.

(ఉపనిషత్తులందు సన్న్యాసము, త్యాగము, రెండును మోక్షమునకు హేతువులని చెప్పబడినది.

(1) 'త్యాగేనైకే అమృతత్వ మానశుః' - (2) సన్న్యాసయోగాద్యతయశ్శుద్ధసత్త్వాః .... ఇత్యాదివాక్యములనేకములు ఉపనిషత్తులందు గలవు.)

ఈ శ్లోకమున అర్జునుడు భగవానుని మూడు విశేషణములద్వారా సంస్తుతించుచు సంబోధించెను. ఇట్టిస్తుతిచే నతడు తనభక్తిభావమును బాగుగ వెల్లడించెను. ఈ ప్రకారముగ వినయాన్వితుడై, పరిపూర్ణభక్తిభావసంయుతుడై, ప్రశ్నించుటనే 'పరిప్రశ్న' యందురు. శిష్యుడు గురువుదగ్గఱ ఇవ్విధముగనే శ్రద్ధాభక్తులతో మెలగవలెను. అట్టి వర్తనచే గురువు సంతోషించి శిష్యుని శ్రేయముకొఱకై జ్ఞానబోధను వర్షించును.

**ప్ర:-** అర్జునుడు భగవానునివలన ఏయే విషయముల నెఱుగగోరెను?

**ఉ:-** సన్న్యాసము, త్యాగము - అను ఈ రెండిటియొక్క తత్త్వమెఱుగగోరెను.

**అ॥** అర్జునుని యాప్రశ్నకు భగవానుడు సమాధాన మొసంగుచున్నాడు -

**శ్రీ భగవానువాచ :-**

## 2. కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః
## సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః.

శ్రీ భగవానువాచ = శ్రీ భగవంతుడు పలికెను -

**టీక:-** కామ్యానామ్ = ఫలమునుగోరిచేయబడు (కామ్యములైన), కర్మణామ్ = కర్మముల యొక్క, న్యాసమ్ = వదలుటను, సన్న్యాసమ్ = సన్న్యాసముగా, కవయః = (కొందఱు) పండితులు (జ్ఞానులు), విదుః = తెలిసికొనుచున్నారు, సర్వకర్మఫలత్యాగమ్ = సమస్త కర్మముల యొక్కయు ఫలమును త్యజించుటను, త్యాగమ్ = త్యాగముగా, విచక్షణాః = (మఱికొందఱు) పండితులు (విద్వాంసులు), ప్రాహుః = చెప్పుదురు.

**తా:-** శ్రీ భగవంతుడు చెప్పెను - (ఓ అర్జునా!) కామ్యకర్మలను వదలుటయే సన్న్యాసమని కొందఱు పండితులు చెప్పుదురు. మఱికొందఱు పండితులు సమస్తకర్మములయొక్క ఫలమును త్యజించుటయే త్యాగమని వచించుదురు.

**వ్యాఖ్య:-** గీతయందు సన్న్యాసమనగా సమస్తమునుత్యజించి అడవులకుబోవుట అని చెప్పబడలేదు. కామ్యకర్మలను త్యజించుటయే సన్న్యాసమని చెప్పబడినది. అనగా నిట్టిసన్న్యాసమును గృహస్థులుకూడ నాచరించవచ్చునన్నమాట. నిష్కామకర్మల నాచరించువాడు, కామ్యకర్మలను త్యజించువాడు సన్న్యాసియే అని యర్థము. అట్లే సమస్తకర్మలయొక్క ఫలమును త్యజించువాడు ఆత దేయాశ్రమమున నున్నప్పటికిని 'త్యాగి'యే యగును.

**ప్ర:-** సన్న్యాసమనగా నేమి?

**ఉ:-** కామ్యకర్మలను వదలుటయే సన్న్యాసము.

ప్ర:– త్యాగమనగా నేమి?

ఉ:– సమస్తకర్మలయొక్క ఫలమును వదలుటయే త్యాగము.

అ॥ కర్మనుగూర్చిన కొందఱి యభిప్రాయములను చెప్పుచున్నాడు –

**3. త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహుర్మనీషిణః**
**యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యమితి చాపరే.**

**టీక:–** ఏకే = కొందఱు, మనీషిణః = బుద్ధిమంతులు (సాంఖ్యులు), దోషవత్ = దోషమువలె, కర్మ = కర్మ, త్యాజ్యమ్ = విడిచిపెట్టదగినది, ఇతి = అని, ప్రాహుః = చెప్పుదురు, అపరే = మఱికొందఱు, యజ్ఞ దాన తపః కర్మ = యజ్ఞము దానము తపస్సు అనెడి కర్మ, న త్యాజ్యమ్ ఇతి చ = విడువదగనిదియనియు (ప్రాహుః = చెప్పుదురు).

**తా:–** కొందఱు బుద్ధిమంతులు (సాంఖ్యులు) దోషమువలె కర్మ విడిచిపెట్టదగిన దని చెప్పుదురు. మఱికొందఱు యజ్ఞము, దానము, తపస్సు – మున్నగు కర్మలు విడువదగనివనియు చెప్పుదురు.

**వ్యాఖ్య:–** కర్మ ఉపాధికి (శరీర, ఇంద్రియ, మనంబులకు) సంబంధించినదిగావునను ఉపాధి భ్రాంతిజన్యమైనది గనుకను, ఆత్మ సర్వసాక్షికావునను, కర్మ దోషముపగిది త్యజింపదగినదని కొందఱి (సాంఖ్యుల) మతము. కర్మ బొత్తిగా వదలినచో జీవునకు చిత్తశుద్ధి యెట్లు కలుగుననియు, అసలు దేహయాత్రయే యెట్లు జరుగుననియు భావించినవారై కొందఱు చిత్తశుద్ధికరములగు తపో యజ్ఞ దానాది కర్మలు వదలదగినవి కావని చెప్పుదురు. ఈ ప్రకారముగ జనులలో కర్మనుగూర్చిన భిన్నాభిప్రాయములను భగవానుడు వ్యక్తపఱచి ఇవ్విషయమున తనయొక్క నిర్ణయమును రాబోవు శ్లోకమునతెలియజేయుచున్నాడు.

ప్ర:– కర్మనుగూర్చి కొందఱి యభిప్రాయమేమి?

ఉ:– కొందఱు కర్మను దోషమువలె త్యజించవలెననియు, మఱికొందఱు తపోయజ్ఞదానాది కర్మలను త్యజించరాదనియు చెప్పుచున్నారు.

అ॥ ఇట్లు కర్మనుగూర్చి భిన్నమతములను దెలిపి శ్రీకృష్ణమూర్తి అవ్విషయమున తన నిశ్చయమును తెలియజేయుచున్నాడు –

**4. నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరత సత్తమ!**
**త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధస్సంప్రకీర్తితః.**

**టీక:–** భరతసత్తమ = భరతవంశములో నుత్తముడవగు ఓ అర్జునా!, తత్రత్యాగే = (భిన్నవాదములుగల) ఆ కర్మత్యాగవిషయమందు, మే = నాయొక్క, నిశ్చయమ్ = నిశ్చయమును, శృణు = వినుము, పురుషవ్యాఘ్ర = పురుషశ్రేష్ఠుడవగు ఓ అర్జునా!, త్యాగః = త్యాగము, త్రివిధః = మూడువిధములుగా సంప్రకీర్తితః హి = చెప్పబడియున్నదికదా!

**తా:–** భరతకులోత్తముండవును, పురుషశ్రేష్ఠుడవునగు ఓ అర్జునా! అట్టి కర్మత్యాగవిషయమున నా యొక్క నిశ్చయమేదియో చెప్పెదను వినుము. త్యాగము మూడువిధములుగా చెప్పబడియున్నదికదా!

**వ్యాఖ్య:–** (1) కర్మలను బొత్తిగా వదలివేయవలెను. (2) తపోయజ్ఞదానాది కర్మలను మాత్రము వదలరాదు - అను రెండు వాదములను జెప్పి భగవానుడు ఆ విషయమున తన తీర్పును చెప్పుచున్నాడు -

'నిశ్చయం శృణు మే' - అని చెప్పినందువలన భగవానుడు తాను పూర్ణముగ స్థిరపఱచుకొని, నిశ్చయించుకొనినదానినే వచించుచున్నారని అర్థము. ఆహా! ఇట్టి భగవన్నిశ్చయమందు జనుల కేల విశ్వాసముండరాదు? సామాన్యులు ప్రకృతికి, మాయకు లోబడినవారుకావున వారి నిశ్చయములం దేవేని లోపములుండవచ్చును. కాని ప్రకృతికి అతీతుడై మాయాదోషములేని (చైతన్యరూపుడగు) పరమాత్మయొక్క భావములు అతినిర్దుష్టములై యుండును. అట్టి మహనీయుడు 'నా నిశ్చయము వినుడు' అని చెప్పినపుడు ఇక జీవులు ఎన్ని చెవులతో దానిని వినవలయునో యోచించుకొనుడు! కావున భగవాను డిపుడు చెప్పబోవు త్యాగము మున్నగువానిని గూర్చిన ఉదాత్తభావములను, నిశ్చయములను కడుజాగరూకతతో విని తదనురీతి యనుష్ఠించి తరించవలెను.

**ప్ర:–** త్యాగ మెన్నివిధములని భగవానుడు తెలియజేసిరి?

**ఉ:–** మూడు విధములని.

## 5. యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యం కార్యమేవ తత్
## యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్.

**టీక:–** యజ్ఞ దాన తపః కర్మ = యజ్ఞము, దానము, తపస్సు అనెడి కర్మ, న త్యాజ్యమ్ = విడిచిపెట్టదగినదికాదు, కార్యమ్ ఏవ = చేయదగినదియే యగును, యజ్ఞః = యజ్ఞము, దానమ్ = దానము, తపః చ ఏవ = తపస్సును, మనీషిణామ్ = (ఫలాభిలాషలేని) బుద్ధిమంతులకు, పావనాని = పవిత్రతను (చిత్తశుద్ధిని) గలుగజేయునవి (అయియున్నవి).

**తా:–** యజ్ఞము, దానము, తపస్సు అనెడి కర్మలు త్యజింపదగినవి కావు; చేయదగినవియే యగును. ఏలయనిన ఆ యజ్ఞదానతపంబులు బుద్ధిమంతులకు పవిత్రతను (చిత్తశుద్ధిని) గలుగజేయునవై యున్నవి.

**వ్యాఖ్య:–** భగవానుడీ శ్లోకమున కర్మలనుగూర్చిన తన నిశ్చయమును చెప్పుచున్నాడు -

(1) న త్యాజ్యమ్ - తపోయజ్ఞదానాది కర్మలను వదలగూడదు.

(2) కార్యమేవ తత్ - వానిని తప్పక చేయవలెను.

'పుణ్యకర్మలను వదలగూడదు' అను వాక్యములోనే ఆ కర్మలను చేయవలెనను అర్థముకూడ ఇమిడి యున్నది. అయినను భగవంతుడు దానితో తృప్తిపడక ఆ పుణ్యకర్మలనుతప్పకచేయవలెనని మఱలచెప్పుటచే ఈ విషయమువారెంతగా నొక్కిచెప్పినట్లైనదో విదితముకాగలదు. మఱియు అట్టి పుణ్యకార్యములను చేయుట ముముక్షువుల కెంతటి అవసరమో అదియు స్పష్టమైనది. సామాన్యముగ లోకములో కొందఱు జనులు

'పుణ్యకార్యములు చేసినచో మఱల జన్మకలుగును; కావున వానిని చేయరాదు. అని అమాయకులగువారికి దుర్బోధలుచేయుచు అట్టి కార్యములనుండి వారిని విరమింప జేయుచున్నారు. ఇది చాల ఘోరము. ఏలయనిన, అట్లు కావించుట భగవదాశయమునకు విరుద్ధము. భగవానుడు గీతలో పలుచోట్ల పుణ్యకార్యములను, తపోదానాది కర్మలను మిక్కుటముగ ప్రోత్సహించుచు వచ్చెను. ఈ శ్లోకమునందును వానిని తప్పక చేయవలెననియే హెచ్చరించెను. వానిని వదలరాదనియు శాసించెను. ఈ ప్రకారముగ సాక్షాత్ భగవానుడే పలుకుచుండ ఇక మానవమాత్రుల సత్యేతరవాక్యముల నేల విశ్వసించి అధోగతి నొందవలెను? యజ్ఞతపోదానాది పుణ్యకార్యములను నిష్కామముగ నాచరించినచో జనులకు చిత్తశుద్ధి కలుగును. చిత్తశుద్ధివలన ఆత్మజ్ఞానముదయించును. ఆత్మజ్ఞానముచే మోక్షము లభించగలదు. ఈ ప్రకారముగ ఆ యజ్ఞాదికర్మలు మోక్షహేతువులే యగుచున్నవి. కాబట్టి విజ్ఞులు వానినెన్నడును వదలరాదు.

'పావనాని' - అని చెప్పుటచే ఆ యజ్ఞాది కర్మలు పరమపవిత్రములైనవని స్పష్టమగుచున్నది. అయ్యవి చేయరానివి అయినచో, అపవిత్రములైనచో, దోషజనకములైనచో భగవానుడు వానినిగూర్చి 'పావనాని' అని యిచట చెప్పనేచెప్పరు.

'మనీషిణామ్' - తెలివిగలవారికి - బుద్ధిమంతులకు - అనగా ఫలమునుగోరక చేయువారికి అని యర్థము. ఫలమునుగోరి చేయువారు బుద్ధివికాసము లేనివారు కావున వారు మనీషులు కారు.

ఇచట యజ్ఞమనగా జ్ఞానయజ్ఞమనియు, ఇదివఱలో 4వ అధ్యాయమున తెలుపబడిన స్వాధ్యాయాది చిత్తశుద్ధికరములగు వివిధయజ్ఞములనియు భావము.

**ప్ర:–** యజ్ఞతపోదానాది కర్మలను చేయవలెనా? వదలవలెనా?

**ఉ:–** వానిని వదలరాదు. తప్పక చేయవలెను.

**ప్ర:–** ఎందువలన?

**ఉ:–** అవి జనులను పవిత్రవంతులుగ నొనర్చును. వారికి చిత్తశుద్ధిని గలుగజేయును.

**ప్ర:–** ఏప్రకార మాచరించినచో?

**ఉ:–** ఫలాభిలాషారహితముగ (నిష్కామముగ) నాచరించినచో (మనీష (తెలివి) గలిగి వాని విషయమై జాగ్రతగ వర్తించినచో)

**అ॥** తన యా నిశ్చయమును భగవానుడు ఇంకను దృఢపఱచుచున్నాడు -

**6. ఏతాన్యపి తు కర్మాణి సఙ్గం త్యక్త్వా ఫలాని చ
కర్తవ్యానీతి మే పార్థ! నిశ్చితం మతముత్తమమ్.**

**టీక:–** పార్థ = ఓ అర్జునా!, ఏతాని కర్మాణి అపి తు = ఈ (యజ్ఞదానతపములను) కర్మలనుగూడ, సఙ్గమ్ = ఆసక్తిని (తాను కర్తనను అభిమానమును), ఫలాని చ = ఫలములను, త్యక్త్వా = విడిచి, కర్తవ్యాని = చేయదగినవి, ఇతి = అని, మే = నాయొక్క, నిశ్చితమ్ = నిశ్చయింపబడినదియు, ఉత్తమమ్ = శ్రేష్ఠమైనదియునగు, మతమ్ = అభిప్రాయము

**తా:–** అర్జునా! ఈ యజ్ఞదానతపఃకర్మలనుగూడ ఆసక్తిని, ఫలములను విడిచియే చేయవలెనని నాయొక్క నిశ్చితమగు ఉత్తమాభిప్రాయము.

**వ్యాఖ్య:–** క్రిందటిశ్లోకమునందు యజ్ఞదానతపములను తప్పక చేయవలెనని చెప్పబడినది. అయితే వానిని ఏప్రకారముగ నాచరింపవలయునో, ఆ పద్ధతి నిచట తెలియజేయుచున్నారు. ఆ యా కర్మలను అసంగముగ, ఫలాపేక్షను వదలి చేయవలయునని చెప్పబడినది. సంగముతో (నేను కర్తయను అభిమానముతో) చేయుటవలన, ఫలములను కోరుటవలన కర్మయొక్క పవిత్రత తగ్గిపోవుచున్నది. కర్మలో దోషములేదుకాని దానిని సంగముతో, కర్తృత్వాభిమానముతో చేయుటచే దోష మేర్పడుచున్నది. కాబట్టి ముముక్షువులు అసంగముగ, ఫలాపేక్షారహితముగ ఆ తపోదానాది పుణ్యకార్యముల నాచరించవలెను. తన యీ యభిప్రాయమునుగూర్చి 'ఇది నిశ్చయింపబడినది, శ్రేష్ఠమైనది' (నిశ్చితమ్, ఉత్తమమ్) అని భగవానుడు తెలిపినందువలన అద్దాని మహత్తరశక్తి, ఉపాదేయత్వము వెల్లడియగుచున్నవి. ఇది సాక్షాత్ భగవంతుడే బాగుగ నిశ్చయించి చెప్పిన భావముగనుక అతినిర్దిష్టమై యుండుటచే విజ్ఞులెల్లరును ఇద్దానిని అనుసరించవలయును.

**ప్ర:–** పైన దెల్పిన యజ్ఞదానాది కార్యముల నెట్లాచరించవలెను?

**ఉ:–** సంగరహితముగ (నేను కర్తనను అభిమానములేక), ఫలాపేక్షారహితముగ (నిష్కామముగ) నాచరించవలెను.

**ప్ర:–** ఈ యభిప్రాయ మెట్టిది?

**ఉ:–** సాక్షాత్ భగవానునిచే బాగుగ నిశ్చయింపబడినది, మఱియు సర్వశ్రేష్ఠమైనది.

**అ॥** సాత్త్విక, రాజసిక, తామసిక, త్యాగములు మూడిటిని చెప్పదలంచి మొట్టమొదట తామసత్యాగమునుగూర్చి చెప్పుచున్నాడు -

**7. నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే**
**మోహాత్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః.**

**టీక:–** నియతస్య = (వేదశాస్త్రాదులచే) విధింపబడినట్టి, కర్మణః = కర్మముయొక్క, సన్న్యాసః తు = పరిత్యాగమైతే, న ఉపపద్యతే = యుక్తముకాదు, మోహాత్ = అజ్ఞానము వలన, తస్య = అట్టి కర్మముయొక్క, పరిత్యాగః = విడిచిపెట్టుట, తామసః = తామసమగు (తమోగుణసంబంధమైన) త్యాగమని, పరికీర్తితః = చెప్పబడుచున్నది.

**తా:–** (వేదశాస్త్రాదులచే) విధింపబడినట్టి కర్మముయొక్క పరిత్యాగము యుక్తము కాదు. అజ్ఞానముచే అట్టి కర్మమును ఎవడైన విడిచిపెట్టిన అది తామస త్యాగమే యగునని చెప్పబడుచున్నది.

**వ్యాఖ్య:–** శాస్త్రవిహితమగు కర్మను ఎవరును త్యజించరాదు. శాస్త్రములందు విధింపబడు కర్మలన్నియు జీవునియొక్క నైతిక ఆధ్యాత్మిక సమున్నతికి దోహదమును గలుగజేయునవియే యగుటవలన

వాని నెవరును త్యజించరాదు. అట్లు త్యజించుట అవివేకమే యగును. కనుకనే 'మోహాత్' అని యిచట చెప్పబడినది. అనగా మోహముచే, అజ్ఞానముచే ఆవరింపబడునపుడు మాత్రమే అట్టి విధ్యుక్తకర్మమును, ధర్మమును త్యజించు సంకల్పము జీవునకు కలుగుచుండునని భావము. కాబట్టి వివేకము నాశ్రయించి అట్టి శాస్త్రనియతకర్మలను పరిత్యజించక ఆచరించుటయే శ్రేయస్కరము. సోమరితనముచేగాని, అజ్ఞానముచేగాని అట్టిదేయగు మఱేకారణముచేగాని వానిని త్యజించినచో అది తామసత్యాగమే కాగలదు.

ఇదివఱలో యజ్ఞదానాదులనుగూర్చి వర్ణించునపుడును, మున్ముందు జ్ఞానము, ధైర్యము మున్నగువానిని చెప్పునపుడును మొదట సాత్త్వికమైనదానిని, తదుపరి రాజసమైనదానిని, ఆపిమ్మట తామసమైనదానిని చెప్పి, ఈ ఒక్క త్యాగమునుగూర్చి చెప్పునపుడుమాత్రము మొదట తామసమును, తదుపరి రాజసమును, ఆపిమ్మట సాత్త్వికమును చెప్పుట గమనార్హమైనది. మొట్టమొదటనే తామసత్యాగుల చర్యను ఖండించవలెనను ఉద్దేశ్యముతో భగవానుడీ విధముగ చెప్పియుండవచ్చును.

**ప్ర:–** తామసత్యాగ మెట్టిది?

**ఉ:–** శాస్త్రవిహితములగు తపోయజ్ఞదానాది కర్మలయొక్క పరిత్యాగము తగదు. అట్టి త్యాగము తామసమనియే చెప్పబడును.

**ప్ర:–** దేనివలన జనులు నియతకర్మలను త్యజించుచుందురు?

**ఉ:–** అవివేకమువలన, అజ్ఞానమువలన.

**ప్ర:–** కాబట్టి శాస్త్రవిహితకర్మలను త్యజించువారెట్టివారని నిశ్చయించుకొనవచ్చును?

**ఉ:–** అవివేకులని, మోహవశులని నిశ్చయించుకొనవచ్చును.

**అ॥** రాజసత్యాగమును వర్ణించుచున్నాడు –

**8. దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్త్యజేత్**
**స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్.**

**టీక:–** (యః = ఎవడు), యత్ కర్మ = ఏ కర్మమును, కాయక్లేశభయాత్ = శరీర ప్రయాసవలని భయముచేత, దుఃఖమ్ ఇతి ఏవ = దుఃఖము (కష్టము)ను గలుగజేయునదియనియే తలంచి, త్యజేత్ = విడిచిపెట్టునో, సః = అతడు, రాజసమ్ = రజోగుణసంబంధమైన, త్యాగమ్ = త్యాగమును, కృత్వా = చేసి, త్యాగఫలమ్ = త్యాగముయొక్క ఫలితమును, న లభేత్ ఏవ = పొందనే పొందడు.

**తా:–** ఎవడు శరీరప్రయాసవలని భయముచేత దుఃఖమును గలుగజేయునది యనియే తలంచి విధ్యుక్తకర్మమును విడిచిపెట్టునో, అట్టివాడు రాజసత్యాగమును గావించినవాడై త్యాగఫలమును బొందకయే యుండును.

**వ్యాఖ్య:–** తామసత్యాగి అజ్ఞానమువలన విధ్యుక్తకర్మలను వదలుచున్నాడు. రాజసత్యాగియో ఆ కర్మచేయుట ప్రయాసమని తలంచి దానిని విడిచివేయుచున్నాడు. అనగా సోమరతనము వహించుచున్నాడని

అర్థము. ఉత్తమసుఖమును గలుగజేయు క్రియలు సామాన్యముగ ప్రారంభములో కష్టముగా తోచును. కాని తుదకు అనంతసుఖమునే కలుగజేయును. కాని రాజసత్యాగి ప్రారంభమునతోచు కష్టమునకు బెదరిపోయి, సోమరితనముచే ఏమాత్రము శ్రమించక, ఆ కర్మలనే వదలివైచుచున్నాడు. బ్రహ్మ ముహూర్తమున లేచుట, శీతలోదకముచే స్నానముచేయుట, బ్రహ్మచర్యమును పాలించుట మున్నగు క్రియలు పారంభములో కష్టముగా తోచవచ్చును. కాని అవియే తుదకు మహదానందమును కలుగజేయును. కాని రాజసత్యాగి (బద్ధకము వలన) వానిని చేయుటకు నిచ్ఛగింపక వదలిపెట్టుచున్నాడు. అట్టివానికి త్యాగముయొక్క ఫలమేమియు లభించుటలేదు ఏలననగా త్యాగమనగా సంగత్యాగమేకాని కర్మత్యాగముకాదు. వారో, కర్మలనే త్యజించివైచుచున్నారు. ఈప్రకారముగ తామసుడు, రాజసుడు వేర్వేఱు కారణములచే విధ్యుక్తకర్మలను త్యజించివైచుచు తత్ఫలములను పొందకున్నారు.

**ప్ర:–** రాజసత్యాగముయొక్క లక్షణమేమి?

**ఉ:–** కార్యము కష్టమని తలంచి (సోమరితనముచే) దానిని వదలివేయుట రాజసత్యాగమనుబడును.

**ప్ర:–** దానివలన అతనికి కలుగు నష్టమేమి?

**ఉ:–** అతడు త్యాగఫల మిసుమంతేని పొందకుండును.

**అ॥** ఇక సాత్త్వికత్యాగమును వివరించుచున్నాడు –

**9. కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున !**
**సఙ్గం త్యక్త్వా ఫలం చైవ స త్యాగస్సాత్త్వికో మతః.**

**టీక:–** అర్జున = ఓ అర్జునా!, నియతమ్ = శాస్త్రముచే నియమింపబడిన, యత్ కర్మ = ఏ కర్మము, కార్యమ్ ఇతి ఏవ = చేయదగినదియేయని (తెలిసికొని), సఙ్గమ్ = అభిమానమును (ఆసక్తిని), ఫలం చఏవ = ఫలమునుగూడ, త్యక్త్వా = విడిచి, క్రియతే = చేయబడుచున్నదో, సః త్యాగః = అట్టి త్యాగము, సాత్త్వికః = సత్త్వగుణసంబంధమైనదని, మతః = నిశ్చయింపబడినది.

**తా:–** ఇది చేయదగినదియే యని తలంచి శాస్త్రనియతమగు ఏ కర్మము అభిమానము, ఫలము విడిచిపెట్టబడి చేయబడుచున్నదో అట్టి (కర్మమందలి సంగఫల) త్యాగము సాత్త్వికత్యాగమని నిశ్చయింపబడినది.

**వ్యాఖ్య:–** త్యాగమనగా సంగత్యాగమేకాని, ఫలత్యాగమేకాని, కర్మత్యాగముకాదని ఈశ్లోకముద్వారా స్పష్టముగ వెల్లడియగుచున్నది. మఱియు 'కార్యమ్' అని చెప్పినందువలన శాస్త్రనియతమగు కర్మ మనుజుడు తప్పక చేయవలెననియే బోధితమగుచున్నది. తామసుడు శాస్త్రవిధి తెలియక దాని నాచరించకనుండును. రాజసుడు తెలిసియు ఆచరించుట కష్టమని భావించి దానిని చేయకుండును. సాత్త్వికుడు తెలిసియు, కష్టములకు జంకక, సంగమును, ఫలమును త్యజించి దాని నాచరించును. సాత్త్వికునిదే ఉత్తమపద్ధతియనియు, ఆతడు కావించిన త్యాగమే ఉత్తమత్యాగమనియు ఈశ్లోకముద్వారా విదితమగుచున్నది. కావున అద్దానినే విజ్ఞులవలంబింపవలెను.

**ప్ర:–** సాత్త్వికత్యాగముయొక్క లక్షణమేమి?

**ఉ:–** శాస్త్రనియతమగు కర్మను, 'ఇది తప్పక చేయవలెను' అని యెంచి, ఫలమును, సంగమును (ఆసక్తిని) వదలిపైచి చేయుట సాత్త్వికత్యాగమనబడును.

**అ॥** అట్టి త్యాగశీలుడు కర్మలందు ఇచ్ఛాద్వేషములు లేకుండునని తెలుపుచున్నాడు –

## 10. న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలేనానుషజ్జతే
## త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః.

**టీక:–** సత్త్వసమావిష్టః = సత్త్వగుణముతో గూడినవాడును, మేధావీ = ప్రజ్ఞాశాలియు, ఛిన్న సంశయః = సంశయములను బోగొట్టుకొనినవాడును నగు, త్యాగీ = త్యాగశీలుడు, (సంగమును, ఫలమును త్యజించి కర్మలంజేయువాడు), అకుశలమ్ కర్మ = అశుభమును, దుఃఖకరమును, కామ్యమునగు కర్మను, న ద్వేష్టి = ద్వేషింపడు, కుశలే = శుభమును, సుఖకరమును, నిష్కామమునగు కర్మమందు, న అనుషజ్జతే = ఆసక్తుడు కాడు (అభిమానము గలిగియుండడు).

**తా:–** సత్త్వగుణముతో గూడినవాడును, ప్రజ్ఞాశాలియు, సంశయములను బోగొట్టుకొనినవాడును నగు త్యాగశీలుడు, అశుభమును, కామ్యమును, దుఃఖకరమును నగు కర్మను ద్వేషింపడు; శుభమును, నిష్కామమును, సుఖకరమునగు కర్మయందు ఆసక్తుడుకాడు (అభిమానము గలిగియుండడు).

**వ్యాఖ్య:–** సత్త్వగుణముతో గూడిన కర్మఫలత్యాగి ద్వంద్వములందు సమబుద్ధి గలిగి యుండునని చెప్పబడుచున్నది. ఒకదానిని ద్వేషించుటగాని, మఱియొక దానియందు ఆసక్తిగలిగి తగుల్కొనుటగాని యతనికుండదు. అతడు ఇచ్ఛాద్వేషరహితుడై యుండును. అశుభకర్మను, కామ్యకర్మను ద్వేషింపడని చెప్పినంతమాత్రముచేత దానిని ప్రేమించునని అర్థముకాదు. జీవన్ముక్తునిపగిది దానియెడల తటస్థభావముగలిగి, తాను మాత్రము దాని నాచరింపక శుభకార్యమునే, నిష్కామకర్మమునే ఆచరించును. అట్లాచరించినను దానితో కలియక, దానియం దభిమానము (సంగము) లేకయుండును.

**ప్ర:–** సత్త్వగుణశీలుడగు కర్మఫలత్యాగియొక్క స్వభావమెట్లుండును?

**ఉ:–** అతడు (1) సత్త్వగుణసంపన్నుడై (2) ప్రజ్ఞాశాలియై (3) సంశయరహితుడై (4) అశుభ (కామ్యాది) కర్మలను ద్వేషింపకయు, శుభ(నిష్కామాది) కర్మములందు తగుల్కొనకయు (అభిమానము లేకయు) నుండును.

**అ॥** కర్మఫలములను త్యజించువాడే త్యాగియని వచించుచున్నాడు –

## 11. న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః
## యస్తు కర్మఫల త్యాగీ స త్యాగీత్యభిధీయతే.

**టీక:–** కర్మాణి = కర్మలను, అశేషతః = సంపూర్ణముగా, త్యక్తుమ్ = విడుచుటకు, దేహభృతా =

దేహధారియగు జీవునకు, న శక్యం హి = సాధ్యముకాదుగదా!, యః తు = ఎవడైతే, కర్మఫలత్యాగీ = కర్మలయొక్క ఫలములను విడుచుచున్నాడో, సః = అతడు, త్యాగీ ఇతి = త్యాగియని, అభిధీయతే = పిలువబడుచున్నాడు.

**తా:-** కర్మములను పూర్తిగా విడుచుటకు దేహధారియగు జీవునకు సాధ్యము కాదు. ఎవడు కర్మలయొక్క ఫలమును విడుచుచున్నాడో అట్టివాడే త్యాగియని పిలువబడుచున్నాడు.

**వ్యాఖ్య:-** దేహధారియగు జీవుడు దేహసంరక్షణాదులకై కర్మను చేయవలసియే యున్నాడు. కావున కర్మలను సంపూర్తిగా విడచుట కాతనికి సాధ్యపడదు. ఇక్కారణమున ఆ యా కర్మలను చేయుచు వానిఫలములను విడచుటయే సర్వోత్తమమగు పద్ధతి. అట్టివాడిక ఆ కర్మలచే బద్ధుడు కానేరడు. మఱియు అట్టివాడే త్యాగియని చెప్పబడును. త్యాగి యనగా బాహ్యవస్తువులను త్యాగముచేయువాడు కాదనియు, కర్మలను చేయుచు వాని ఫలములను వదులువాడే త్యాగియనియు, అభిమానమును, సంగమును త్యజించువాడే త్యాగియనియు ఈ శ్లోకముద్వారా వెల్లడియగుచున్నది. కేవలము కర్మలను వదలివేసినంత మాత్రమున మనుజుడు త్యాగికానేరడు, త్యాగఫలమును బొందనేరడు. కర్మలను గావించుచు వాని ఫలములను వదలువాడే త్యాగి యగును. మఱియు త్యాగఫలమును బొందగలుగును. దీనినిబట్టి అంతరంగమునగల త్యాగిత్వము ఫలాపేక్షారూప (దేహాభిమానరూప) అంతరంగమనోవృత్తియొక్క త్యాగముపైననే ఆధారపడియున్నదిగాని బాహ్యవస్తువులయొక్క పరిత్యాగముపై గాదని స్పష్టపడుచున్నది. కావున కర్మలను జేయవలెననియు, కాని ఫలాభిసంధిరహితముగ చేయవలెననియు భగవంతుని ఆశయమై యున్నట్లు తెలియుచున్నది.

**ప్ర:-** కర్మలను పూర్తిగ విడచుట సాధ్యపడునా?

**ఉ:-** దేహధారియగు జీవున కది సాధ్యపడదు.

**ప్ర:-** త్యాగి అనగా ఎవడు?

**ఉ:-** ఎవడు కర్మలజేయుచు వాని ఫలములను వదలివేయునో ఆతడే త్యాగి యనబడును (అంతియే కాని కర్మలను వదలినవాడుకాదు).

**అ॥** కర్మఫలములను త్యజించుటచే కర్మబంధమునుండి మనుజు డేల విడివడగలడో చెప్పుచున్నాడు

## 12. అనిష్టమిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్ భవత్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్.

**టీక:-** అనిష్టమ్ = దుఃఖకరమైనదియు (నరకము, నీచజన్మాదులు గలుగజేయునది), ఇష్టమ్ = సుఖకరమైనదియు (స్వర్గము, దేవతాజన్మము గలుగజేయునది), మిశ్రం చ = సుఖదుఃఖములు రెండును గలసినదియు (మనుష్యజన్మను గలుగజేయునది) అగు, త్రివిధమ్ = మూడువిధములైన, కర్మణః ఫలమ్ = కర్మములయొక్క ఫలము, అత్యాగినామ్ = కర్మఫలత్యాగముచేయనివారలకు, ప్రేత్య = మరణానంతరము, భవతి = కలుగుచున్నది, సన్న్యాసినాం తు = కర్మఫలత్యాగము చేసినవారికన్నో, క్వచిత్ = ఒకప్పుడున్ను, న కలుగదు.

**తా:–** దుఃఖకరమైనదియు, సుఖకరమైనదియు, సుఖదుఃఖములు రెండును గలసినదియునగు మూడువిధములైన కర్మఫలము కర్మఫలత్యాగము చేయనివారలకు మరణానంతరము కలుగుచున్నది. కర్మఫలత్యాగముచేసినవారికన్నో అవి యెన్నటికిని కలుగనేరవు.

**వ్యాఖ్య:–** కర్మ బంధమును గలుగజేయునని, జన్మకు హేతువగునని, కావున చేయరాదని చెప్పువారికి భగవాను డీశ్లోకమున సరియైన సమాధాన మొసంగిరి. కర్మ యెవరికిబంధమును గలిగించును? అందఱికినిగాదు. ఫలాపేక్షతో చేయువారికి, సంగముతోను, అభిమానముతోను, కర్తృత్వబుద్ధితోను ఆచరించువారికిమాత్రమే కర్మ బంధకరముగ పరిణమించునుగాని, అసంగముగ, నిష్కామముగ ఫలాపేక్షారహితముగ ఆచరించువారికి గాదు. ఆ విషయమే ఈ శ్లోకమందు స్పష్టముగ చెప్పబడినది. స్వర్గాది సుఖరూప ఇష్టఫలముగాని, నరకనీచజన్మాది దుఃఖరూప అనిష్టఫలముగాని, మానవజన్మయను సుఖదుఃఖమిశ్రఫలముగాని ఫలాపేక్షతో కర్మలను జేయువారికే కలుగునుగాని, ఫలములను వదలిన వారికికాదు. (నతు సన్న్యాసినాం క్వచిత్). అని చెప్పుటవలన ఏకాలమందును వారికి బంధము కలుగదని భావము. ఏలయనగా కర్మఫలములను త్యజించువారికి చిత్తశుద్ధిద్వారా మోక్షమే కలుగును. జన్మరాహిత్యమే సిద్ధించును. వారికి లోకాదుల (జన్మాదుల) ప్రసక్తియే యుండదు. సంసారచక్ర పరిభ్రమణమంతయు ఫలాపేక్షతో కర్మలను జేయువారికే యగును. దీనినిబట్టి ఫలాపేక్షారహితమగు (నిష్కామమగు) కర్మ యెంతటి మహిమతో గూడుకొనియున్నదో, భగవానునకు దానియెడల యెంతటిప్రీతియో విస్పష్టమగుచున్నది.

**ప్ర:–** కర్మఫల మెన్నివిధములు? అవి యేవి?

**ఉ:–** మూడు విధములు – (1) ఇష్టమైనది (సుఖకరమైన స్వర్గాదులు) (2) అయిష్టమైనది (దుఃఖకరమగు నరకనీచజన్మాదులు) (3) ఇష్టానిష్టమిశ్రమమైనది (సుఖదుఃఖములు రెండునుగల మానవజన్మ).

**ప్ర:–** ఈ మూడు ఫలములు యెవరికి కలుగును?

**ఉ:–** కర్మఫలములను వదలక కర్మలను ఫలాసక్తితో చేయువారికే కలుగును.

**ప్ర:–** ఎపుడు కలుగును?

**ఉ:–** మరణానంతరము (ప్రేత్య).

**ప్ర:–** ఈ కర్మఫలములు ఎవరికి కలుగవు?

**ఉ:–** కర్మఫలములు త్యజించి కర్మనాచరించువారికి అనగా, నిష్కామకర్మాచరణపరులకు కలుగవు. (వారికి చిత్తశుద్ధిద్వారా మోక్షమే లభించును గావున).

*అ॥ కర్మలు నెరవేరుటకుగల ఐదు కారణములను వచించుచున్నాడు –*

**13. పఞ్చైతాని మహాబాహో! కారణాని నిబోధ మే**
**సాఙ్ఖ్యే కృతాన్తే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్.**

**టీక:–** మహాబాహో = గొప్పబాహువులు గల ఓ అర్జునా!, సర్వకర్మణామ్ = సమస్తకర్మములయొక్క, సిద్ధయే = నెరవేరుటకొఱకు (సంపూర్తికొఱకు), కృతాన్తే = కర్మకాండయొక్క అంతమును దెలుపు (లేక కర్మబంధమును నశింపజేసెడి, లేక, కర్మఫలసమాప్తిగల) సాంఖ్యే = సాంఖ్యశాస్త్రమందు (వేదాంతశాస్త్రమునందు), ప్రోక్తాని = చెప్పబడిన, ఏతాని = ఈ, పఞ్చ కారణాని = ఐదు కారణములను, మే (వచనాత్) = నా వాక్యములవలన, నిబోధ = తెలిసికొనుము.

**తా:–** గొప్పబాహువులుకల ఓ అర్జునా! సమస్త కర్మలు నెరవేరుటకు కర్మకాండయొక్క అంతమును దెలుపు సాంఖ్యశాస్త్రమునందు చెప్పబడిన ఈ ఐదు కారణములను నావలన తెలిసికొనుము.

**వ్యాఖ్య:–** కృత + అన్తే = కృతాన్తే, సాంఖ్యే - అనగా కర్మకాండయొక్క అంతమును బోధించు వేదాంతశాస్త్రమందు - అని అర్థము. వేదాంతమున ఆత్మ స్వరూపమును నిర్ణయించునపుడు అది ప్రకృతికి పరమై, అతీతమైయుండునది యనియు, సమస్తకర్మలు ప్రకృతిచేతనే జరుగుచుండుననియు, ఆత్మ సాక్షిగ, నిష్క్రియముగ నుండుననియు అట తెలియజేయబడును. కనుకనే సమస్తకర్మలు అంతమగు వేదాంత శాస్త్రమున అని యిట చెప్పబడినది. మఱియు 'సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే' అని చెప్పబడినందువలన కర్మలన్నియు జ్ఞానమందు లయించిపోయి, పరిసమాప్తమగుచున్నవి. ఏలయనిన, చైతన్య (ప్రజ్ఞారూప) ఆత్మస్థితయందు శరీర, ఇంద్రియ, మనస్సంకల్పాదులుండవుకావున అచట కర్మ రహితమగును. కర్మను దాటిపోయినస్థితి అది. కనుకనే ఇచట జ్ఞానమునకు, వేదాంతశాస్త్రమునకు కర్మయొక్క అంతము (కృతాంతము) అని చెప్పబడినది.

**ప్ర:–** ఏ కర్మ అయినను జరుగవలెననిన ఎన్ని కారణములుండవలెను?

**ఉ:–** ఐదు.

**ప్ర:–** వానినిగూర్చి ఎచట తెలుపబడినది?

**ఉ:–** కర్మయొక్క అంతమగు జ్ఞానమును బోధించు సాంఖ్య (వేదాంత) శాస్త్రమున తెలుపబడినది.

**అ॥** ఆ యైదు కారణము లెవ్వియో తెలుపుచున్నారు -

## 14. అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్
## వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పఞ్చమమ్.

**టీక:–** అత్ర = ఈ కర్మాచరణ విషయమున, అధిష్ఠానమ్ = శరీరము, తథా = అటులనే, కర్తా = కర్త, పృథగ్విధమ్ = వేఱువేఱు విధములగు, కరణం చ = ఇంద్రియములు, వివిధాః = నానావిధములుగను, పృథక్ = వేఱువేఱుగనుండు, చేష్టాః చ = క్రియలు, పంచమమ్ = అయిదవదియైన, దైవం చ = దైవమున్ను, (భవన్తి = కారణములగుచున్నవి).

**తా:–** ఈ కర్మాచరణ విషయమున (1) శరీరము (2) కర్త (3) వివిధములగు ఇంద్రియములు (4) పలువిధములుగను, వేఱువేఱుగను నుండు క్రియలు (వ్యాపారములు) ఐదవదియగు (5) దైవమున్ను కారణములుగా నున్నవి.

**వ్యాఖ్య:–** కరణములనగా పండ్రెండు (పంచకర్మేంద్రియములు + పంచజ్ఞానేంద్రియములు + మనస్సు + బుద్ధి). చేష్టలనగా వానివానివ్యాపారములు. ఇచట 'దైవ' మనగా ఆ యా ఇంద్రియాదుల అధిష్ఠానదేవతలనిగాని, లేక పూర్వజన్మసంస్కారములు (అదృష్టపుణ్యాపాపములు) అనిగాని చెప్పవచ్చును.

**ప్ర:–** ఏ కర్మ అయినను జరుగవలెననిన దానికిగల ఐదు కారణములెవ్వి?

**ఉ:–** (1) శరీరము (2) కర్త (3) వివిధములగు ఇంద్రియములు (4) ఆ ఇంధ్రియములయొక్క వ్యాపారములు (5) దైవము.

**అ॥** ఏ కర్మచేయబడినప్పటికిని ఈ ఐదున్ను అందులకు కారణములని చెప్పుచున్నాడు –

## 15. శరీరవాఙ్మనోభిర్య త్కర్మ ప్రారభతే నరః
## న్యాయ్యం వా విపరీతం వా పఞ్చైతే తస్య హేతవః.

**టీక:–** నరః = మనుజుడు, శరీరవాఙ్మనోభిః = శరీరము, వాక్కు, మనస్సు – అను వీనిచేత, న్యాయ్యం వా = న్యాయమైనట్టిగాని (శాస్త్రీయమైనట్టిగాని), విపరీతం వా = అన్యాయమైనట్టిగాని (అశాస్త్రీయమైనట్టిగాని), యత్ కర్మ = ఏ కర్మమును, ప్రారభతే = ఆరంభించుచున్నాడో, తస్య = ఆ కర్మమునకు, ఏతే పఞ్చ = ఈ అయిదున్ను, హేతవః = కారణములైయున్నవి.

**తా:–** మనుజుడు శరీరము, వాక్కు, మనస్సు అను వీనిచేత న్యాయమైనట్టిగాని (శాస్త్రీయమైనట్టిగాని), అన్యాయమైనట్టి) అశాస్త్రీయమైనట్టి) గాని ఏకర్మమును ప్రారంభించుచున్నాడో దానికీయైదున్ను కారణములైయున్నవి.

**అ॥** సాక్షియగు ఆత్మను కర్తయని తలంచువాడు అవివేకియని తెలుపుచున్నాడు –

## 16. తత్రైవం సతి కార్తార మాత్మానం కేవలం తు యః
## పశ్యత్యకృత బుద్ధిత్వా న్న స పశ్యతి దుర్మతిః.

**టీక:–** తత్ర = ఆ కర్మవిషయములందు, ఏవం సతి = ఇట్లుండగా, (పైనదెల్పిన అయిదున్ను కారణములైయుండగా), యః = ఎవడు, అకృతబుద్ధిత్వాత్ = (శాస్త్రాదులచే) సంస్కరింపబడని బుద్ధిగలవాడగుటచే, కేవలం ఆత్మానం తు = నిరుపాధికుడును, సంగరహితుడునగు ఆత్మను, కర్తారమ్ = కర్తనుగా, పశ్యతి = చూచుచున్నాడో (తలంచుచున్నాడో), సః దుర్మతిః = అట్టి దుర్బుద్ధి (అవివేకి), న పశ్యతి = కర్మముయొక్క స్వరూపమునుగాని, ఆత్మయొక్క స్వరూపమును గాని ఎఱుంగకున్నాడు.

**తా:–** కర్మవిషయమం దిట్లుండగా (పైనదెల్పిన అయిదున్ను కారణములై యుండగా) ఎవడు సంస్కరింపబడని బుద్ధిగలవాడగుటచే, నిరుపాధికుడగు ఆత్మను కర్తగా తలంచుచున్నాడో, అట్టి అవివేకి కర్మముయొక్కగాని, ఆత్మయొక్కగాని వాస్తవస్వరూపమును ఎఱుంగకున్నాడు.

**వ్యాఖ్య:–** కర్మయందు ఆత్మ కర్తకాదు. పైనదెల్పిన అయిదుమాత్రమేకర్తలు. ఆత్మసాక్షి, కేవలుడు, నిరుపాధికుడు, సంగరహితుడు. అయినను కర్తృత్వమును ఆత్మయందారోపించువాడు వివేకహీనుడేయగును. అతడు పరమార్థతత్త్వమును తెలియనివాడు. శ్రవణాది సంస్కారములేని బుద్ధిగలవాడు - దుర్మతి. అసంగమగు ఆత్మను కర్తగజూచువాడు నేత్రములున్నను గ్రుడ్డివాడేయగును. ఏలయనిన అతడు సత్యమును గాంచుటలేదు. ఆత్మకు కర్తృత్వము ఆరోపించుట అజ్ఞానమేయగును. కావుననే అట్టివారు గ్రుడ్డివారే యని చెప్పబడినది. దీనికి కారణము వారిబుద్ధికి సరియైన సంస్కారము లేకుండుటయే (అకృతబుద్ధిత్వాత్). ఎంత పాండిత్యము, ఎన్ని లౌకికవిద్యలు గలిగియున్నప్పటికిని, సత్యదృష్టిలేనిచో, ఆత్మజ్ఞానములేనిచో అట్టివారు అంధప్రాయులేయగుదురు. ఏలయనిన వారు జ్ఞాననేత్రవిహీనులై యున్నారు. వారెంత గొప్పవారైనప్పటికిని చీకటిలోనున్నవారి చందముననేయుండుచు వాస్తవమును గ్రహించజాలకయుందురు.

కాబట్టి ఎంతటి ప్రాపంచిక వివేకమున్నను, ఆత్మజ్ఞానము లేనివారు దుర్మతులు, అంధులేకనుక, ప్రపంచదృష్టిలో కీర్తి, ప్రతిష్ఠలు సంపాదించుకొనినప్పటికిని పరమార్థదృష్టిలో వారు గణనీయులుకారు. కనుక, జనులు ఆత్మతత్త్వమెఱింగి మానవులకేకాక, భగవంతునకుగూడ ప్రీతిపాత్రులు కావలయును.

దోషము - అసంగమగు ఆత్మను కర్తగ భావించుట.

దోషకారణము - బుద్ధి శ్రవణాదులచే సంస్కరింపబడకుండుట.

దోషఫలితము - అజ్ఞానరూప అంధత్వము (సత్యమును జూడజాలకుండుట).

**ప్ర:–** ఆత్మ యెట్టిది?

**ఉ:–** కేవలమై, సాక్షియై, అసంగమైయున్నది.

**ప్ర:–** అట్టి నిష్క్రియ, అసంగఆత్మను కర్తయని మనుజు డేల చెప్పుచున్నాడు?

**ఉ:–** అజ్ఞానమువలన, బుద్ధికి ఇంకను శ్రవణాది సంస్కారము లేనందువలన.

**ప్ర:–** కాబట్టి ఆతని స్థితి యెట్లున్నది?

**ఉ:–** గ్రుడ్డివానివలె నున్నది. సత్యము నతడు కాంచుటలేదు.

**అ॥** అహంకారము, కర్తృత్వబుద్ధి లేనివాడు కర్మలచే నంటడని వచించుచున్నాడు -

## 17. యస్య నాహఙ్కృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే
## హత్వాఽపి స ఇమాంల్లోకా న్న హన్తి న నిబధ్యతే.

**టీక:–** యస్య = ఎవనికి, అహంకృతః భావః = .నేను కర్తను. అను తలంపు, న = లేదో, యస్య = ఎవనియొక్క, బుద్ధిః = బుద్ధి (అంతఃకరణము), న లిప్యతే = విషయములను, కర్మలను అంటదో, సః = అతడు, ఇమాన్ లోకాన్ = ఈ ప్రాణులన్నిటిని, హత్వా అపి = చంపినను, న హన్తి = చంపుటలేదు, న నిబధ్యతే = (కర్మలచే, పాపముచే) బంధింపబడుటయు లేదు.

**తా:–** ఎవనికి 'నేను కర్తను' అను తలంపు లేదో, ఎవనియొక్క బుద్ధి విషయములను, కర్మలను అంటదో అతడీ ప్రాణులన్నిటిని చంపినను వాస్తవముగ ఏమియు చంపుటలేదు. మఱియు నతడు (కర్మలచే, పాపముచే) బంధింపబడుటయు లేదు.

**వ్యాఖ్య:–** అహంకారముగాని, నేను కర్తనను తలంపుగాని లేనివానికి, బుద్ధి విషయములందుగాని కర్మలందుగాని అంటనివానికి ఈ ప్రాణులన్నిటిని వధించినను, వధించనట్లేయనియు, పాపముచే నతడు చుట్టుకొనబడడనియు, అతడు బంధింపబడడనియు ఇచట తెలుపబడెను. ఈ శ్లోకార్థమును బహుజాగ్రత్తగ యోచనచేయవలయును. లేకున్న మనుజుడు అజ్ఞానమను అఖాతమున పడిపోవు ప్రమాదము గలదు.

కర్మబంధమునకు కారణము కర్మలందు కర్తృత్వబుద్ధి గలిగియుండుట, బుద్ధి ఆ యా విషయములకు, కర్మలకు అంటుకొనుట (సంగము) అయియున్నది. కర్తృత్వబుద్ధి లేకుండ కర్మలు చేయువానికిగాని, విషయములందు బుద్ధి అంటకుండ (సంగములేకుండుట) కర్మలు చేయువానికిగాని, ఆ కర్మజనిత సుఖదుఃఖములుగాని పుణ్యపాపములుగాని అంటవు. ఆ సత్యమే యిచట చెప్పబడినది. అంతియేకాని ప్రాణులను చంపుమనిగాని, చంపుట యుక్తమనిగాని యిచట బోధింపబడలేదు. పైగా సమస్తమును ఆత్మరూపముగ వీక్షించువాడు, కర్తృత్వములేనివాడు, అసంగుడై యుండువాడు, తాను మనస్సుగాదని తలంచువాడు, ఆత్మయందే స్థితిగలిగియుండును గావున అట్టివాడు సమస్తప్రాణులందును తన ఆత్మనే చూచుటవలన ఒక ప్రాణి కెట్లు బాధకలుగజేయగలడు? కాబట్టి అట్టి అసంగభావము గలవాడు, ఆత్మస్థితుడు జనులకుపకారము చేయునేకాని, అపకారము చేయడు. ప్రాణులను హింసింపడు. ఒకవేళ హింసించినచో అతని కింకను ఆత్మజ్ఞానము కలుగలేదనియే ఊహించవలసియుండును.

మనుజుడు వాస్తవముగ దేహముగాని, మనస్సుగాని కాదు; ఆత్మయే. కర్తృత్వము, అహంభావము లేనివాడు ఆత్మయందే స్థితి గల్గియుండును. అట్టివారు బుద్ధిచేగావింపబడు కర్మలతోగాని, తజ్జనిత బంధముతోగాని ఏ సంబంధమును లేకుండును. కాబట్టి యతడు ఒకప్రాణినేకాదు, అన్నిప్రాణులను ఒకవేళ చంపినను, బుద్ధితో సంగము లేకుండుటవలన, కర్తృత్వము లేకుండుటవలన, ఆత్మయందేయుండుటవలన అతడు చంపనట్లేయగుచున్నాడు. మఱియు ఆ వధవలన కలుగుపాపముచే, బంధముచే అంటబడక నుండుచున్నాడు. ఇచట ఆత్మయొక్క, ఆత్మస్థితునియొక్క నిర్లేపత్వమును గూర్చిన ఒకానొక సిద్ధాంతము, సత్యము చెప్పబడినదేకాని హింసాప్రేరణము కాదు. వాస్తవముగ అట్టి నిర్లేపత్వమును బడసినవాడు, ఆత్మయందున్నవాడు నిరంతరము ప్రాణికోట్లకు మేలుచేయునే కాని, వానినేమాత్రము బాధింపడు. ఈ విషయమును ముముక్షువులు ముఖ్యముగ జ్ఞప్తియందుంచుకొనవలెను.

పుణ్యపాపములకు కారణము కర్తృత్వము, సంగము, ఆసక్తి; అనగా జీవుడు తన ఆత్మస్థానమునువదలి, దిగివచ్చి దృశ్యముతో, బుద్ధితోజేరి 'నేను చేయుచున్నాను' అని తలంచుటయే. కాని యెపుడట్టి సంగము (ఆసక్తి), కర్తృత్వములేదో అత్తఱి ఆ పుణ్యపాపములతోగాని, తజ్జనితసుఖదుఃఖములచే గాని, బంధమోక్షములతోగాని మనుజునకు సంబంధముండదు. కావుననే అట్టివాడు అందఱిని చంపినను, చంపనివాడే యని చెప్పబడుటకు కారణము. 'ఎంతపాపమైనను అంటదు' - అనుదానికి ఒక తార్కాణముగ, 'అతడొకవేళ అందఱిని చంపినను చంపనివాడేయగునని' వచింపబడినదేకాని వారిని చంపుమని బోధింపబడలేదు.

మఱియు అర్జునుడు క్షత్రియుడు. దుష్టశిక్షణ ప్రభువుకు ధర్మము, కర్తవ్యము. కౌరవులు అధర్మమునుజేబట్టి దుష్టులుగ తయారైరి. "కావున అట్టివారినందఱిని ఓ అర్జునా! అసంగబుద్ధిగల్గి, నిరహంకారముతో నీవు వధించినను వధింపనట్లేయగు" నని భగవానుడు అర్జునునకు తెలియజేయుచున్నాడనియు భావించవచ్చును. బుద్ధినిదాటి, అహంభావమునుదాటి ఆత్మయందు నెలకొనియుండువానికి ఆ బుద్ధితో ఏది చేసినను చేయనట్లేయగునుగదా! అయితే అట్టి స్థితియందుండువారు అసభ్యమైన, అధర్మయుతమైన, హింసాకరమైన, పీడాకరమైన క్రియలెవ్వియును జేయరు. 'ఇమాన్ లోకాన్' అని అర్జునునకు చెప్పినందువలన 'ఈ యెదుటనున్న కౌరవరాజులు మున్నగువారు' అనియు తలంచవచ్చును. ప్రభువులు దుష్టులకు, ద్రోహులకు గావించు శిక్ష పాపముగా పరిగణింపబడదు. కావున అది వారిని బంధింపదు. పైగా అట్టి క్రియను అసంగబుద్ధితో నాచరించునపుడు ఇంకను ఏ మాత్రము బంధప్రభావమును కలుగజేయదు.

కాబట్టి భగవానుడు తెలిపిన ఈ శ్లోకమందలి భావమును చాల లోతుగ విచారించి, పరప్రాణికి ఏమియు బాధ కలుగజేయక, ఆత్మయందు స్థితుడై అసంగబుద్ధితో ఆ యా కార్యముల నెరవేర్చుచు, బంధవిముక్తుడై వెలయవలెను.

**ప్ర:–** పాపమునకు, బంధమునకు కారణమేమి?

**ఉ:–** (1) అహంభావము ('నేను కర్తను' అనుభావము) (2) బుద్ధియొక్క సంగము (విషయాదులతో, కర్మాదులతో అంటుకొనుట).

**ప్ర:–** పాపము, బంధము తొలగుటకు ఉపాయమేమి?

**ఉ:–** అట్టి సంగ కర్తృత్వాదులు లేకుండుట. అత్తఱి కార్యములనుజేసినను వానిచే నతడు బంధింపబడడు.

**అ॥** కర్మకు కారణమును, ఆధారమును తెలుపుచున్నాడు –

## 18. జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా
## కరణం కర్మకర్తేతి త్రివిధః కర్మసఙ్గ్రహః.

**టీక:–** కర్మచోదనా = కర్మమునకు (కర్మమును నడిపించుటకు) హేతువు (కర్మప్రవర్తనము), జ్ఞానమ్ = తెలివి, *జ్ఞేయమ్* = తెలియబడదగినవస్తువు, *పరిజ్ఞాతా* = తెలియువాడు (అని), *త్రివిధా* = మూడువిధములుగనున్నది, *కర్మసంగ్రహః* = కర్మమున కాధారమున్ను. *కరణమ్* = ఉపకరణము (సాధనము, బాహ్యాభ్యంతరేంద్రియములు), *కర్మ* = క్రియ, *కర్తా* = చేయువాడు, *ఇతి* = అని, *త్రివిధః* = మూడువిధములుగ నున్నది.

**తా:–** కర్మమునకు హేతువు తెలివి, తెలియదగిన వస్తువు, తెలియువాడు అని మూడువిధములుగ నున్నది. అట్లే కర్మ కాధారమున్ను, ఉపకరణము (సాధనము), క్రియ, చేయువాడు – అని మూడు విధములుగ నున్నది.

ప్ర:– కర్మమునకు హేతు వెన్ని విధములుగ నున్నది? అవియేవి?

ఉ:– మూడువిధములుగ. అవి (1) ఉపకరణము (2) క్రియ (3) కర్త (చేయువాడు) అయియున్నవి.

అ॥ జ్ఞానము, కర్మ, కర్త – అనువానియొక్క సాత్త్విక, రాజస, తామసరూపములను తెలియజేసెదనని భగవానుడు పలుకుచున్నాడు –

## 19. జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణ భేదతః
## ప్రోచ్యతే గుణసఙ్ఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి.

**టీక:–** *గుణసంఖ్యానే* = గుణములనుగూర్చి విచారణచేయుసాంఖ్యశాస్త్రమునందు, *జ్ఞానమ్* = జ్ఞానము, *కర్మచ* = కర్మమును, *కర్తాచ* = కర్తయును, *గుణభేదతః* = సత్త్వాదిగుణములయొక్క భేదము ననుసరించి, *త్రిధా ఏవ* = మూడువిధములుగానే, *ప్రోచ్యతే* = చెప్పబడుచున్నవి, *తాని అపి* = వానినిగూడ, *యథావత్* = యథారీతి (శాస్త్రమునందు చెప్పబడిన ప్రకారము), *శృణు* = వినుము.

**తా:–** గుణములనుగూర్చి విచారణచేయు సాంఖ్యశాస్త్రమునందు జ్ఞానము, కర్మము, కర్త అనునివియు సత్త్వాదిగుణములయొక్క భేదముననుసరించి మూడువిధములుగనే చెప్పబడుచున్నవి. వానినిగూడ యథారీతి (శాస్త్రోక్తప్రకారము) చెప్పెదను వినుము.

ప్ర:– భగవానుడు గుణభేదముననుసరించి మూడువిధములుగ వేనినిగుఱించి చెప్పదలంచెను?

ఉ:– (1) జ్ఞానము, (2) కర్మ, (3) కర్త – అను ఈ మూడింటినిగూర్చి.

ప్ర:– వానినిగుఱించి యెచట తెలుపబడినది?

ఉ:– సాంఖ్యశాస్త్రమునందు.

అ॥ అందు మొదట జ్ఞానము నెత్తుకొని సాత్త్వికజ్ఞానముయొక్క స్వరూపమును తెలియజేయుచున్నాడు –

## 20. సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే
## అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్.

**టీక:–** *విభక్తేషు* = విభజింపబడి వేఱువేఱుగనున్న, *సర్వభూతేషు* = సమస్త (చరాచర) ప్రాణికోట్లయందును, *ఏకమ్* = ఒక్కటైన, *అవ్యయమ్* = నాశరహితమగు, *భావమ్* = ఆత్మవస్తువును (లేక దైవముయొక్క ఉనికిని), *యేన* = ఏ జ్ఞానముచేత, *అవిభక్తమ్* = విభజింపబడక (ఏకముగ) నున్నట్లుగ, *ఈక్షతే* = చూచుచున్నాడో (ఎఱుంగుచున్నాడో), *తత్ జ్ఞానము* = ఆ జ్ఞానము, *సాత్త్వికమ్* = సాత్త్వికమని, *విద్ధి* = తెలిసికొనుము.

**తా:–** విభజింపబడి వేఱువేఱుగనున్న సమస్త చరాచర ప్రాణులందును, ఒక్కటైన నాశరహితమగు

ఆత్మవస్తువును (దైవముయొక్క ఉనికిని) విభజింపబడక (ఏకముగ) నున్నట్లు ఏ జ్ఞానముచేత నెఱుంగుచున్నాడో అట్టి జ్ఞానము సాత్త్వికమని తెలిసికొనుము.

**వ్యాఖ్య:—** అజ్ఞానుల దృష్టికి, (స్థూలదృష్టికి భౌతికనేత్రమునకు) ఈ ప్రపంచము, సమస్తపదార్థములు, సమస్తప్రాణులు విభజింపబడియున్నట్లు, వేఱువేఱుగానున్నట్లు కానుపించును. కాని జ్ఞానులదృష్టికి అంతయు అవిభక్తముగను, సర్వత్ర నాశరహితమగు ఒకే ఆత్మవస్తువు (పరబ్రహ్మము) వ్యాపించియున్నట్లును గోచరించును. ఏ జ్ఞానముచే అట్టి అవిభక్తము వారికి అనుభూతమగునో అట్టి జ్ఞానము సాత్త్వికమైనదని యిచట పేర్కొనబడెను.

'సర్వభూతేషు' - అని చెప్పినందువలన భగవంతుడు (ఆత్మ) సమస్తచరాచర ప్రాణికోట్లయందును వ్యాపించియున్నాడని తెలియుచున్నది. కావున ఎట్టి నికృష్టజీవి అయినప్పటికిని, తనవెనుకనున్న పరమాత్మను తెలిసికొని, తనయథార్థరూపమునుఅవగతమొనర్చుకొని తరించుటకు అవకాశము కలదు. తరంగము చిన్నదైనను దాని కాధారభూతమైన సముద్రమును భావించి దానిలో లీనమగుటకు, సముద్రరూపమగుటకు అద్దానికి హక్కుగలదు. కావున ఎట్టి అల్పవ్యక్తి అయినప్పటికిని ఎవరును ఇక అధైర్యపడవలసిన పనిలేదు. హృదయమును పవిత్రమొనర్చుకొని తన నిజరూపమగు ఆత్మను తెలిసికొనిన చాలును తరించిపోవును.

అనేకతరంగములున్నప్పటికిని వాని నామరూపములను వదలి జలమును మాత్రము చూచువానివలెను, పెక్కుకుండలను చూచియు వానియందలి మృత్తికనే వీక్షించువానివలెను, పుష్పమాలలోని అనేకపుష్పములలోనగల దారమును చూచువానివలెను ప్రపంచమున అనేక జీవరాసులను, భిన్నభిన్న పదార్థములను చూచినను వాని ఉపాధిరూపమును, నామరూపములను వదలి అన్నిటియందును అనుస్యూతమైయున్న అవిభక్తమగు ఏకమైన ఆత్మనే చూచువాడు సాత్త్విక జ్ఞానయుతుడని చెప్పబడును. అనగా అనేకత్వములో ఏకత్వమును, నాశములో అవినాశిత్వమును, విభజిత వస్తువులను అవిభక్తత్త్వముగ వీక్షింపగల్గుటయే ఉత్తమజ్ఞానమని భావము. దీనినిబట్టి ప్రపంచమున అనేకత్వమును జూచుటకేవలము అజ్ఞానమేయని తేలుచున్నది.

ఈ శ్లోకమున ఆత్మవస్తువునకు మూడు విశేషణములు చెప్పబడినవి - అది (1) ఏకమైనది (2) అవ్యయమైనది (3) అవిభక్తమైనది - అని. ప్రపంచవస్తువులకును ఆత్మకును భేదము ఈ క్రింద తెలుపబడుచున్నది.

| | ప్రపంచవస్తువులు | ఆత్మ (దైవము) |
|---|---|---|
| (1) | అనేకములైనవి | ఏకమైనది (ఏకమ్) |
| (2) | నాశవంతములు | నాశరహితమైనది (అవ్యయమ్) |
| (3) | విభాగముతో గూడినవి | అవిభక్తమైనది (అవిభక్తమ్) |

లోకమున పెక్కు జ్ఞానములు కలవు - సంగీతజ్ఞానము, సాహిత్యజ్ఞానము, రాజకీయజ్ఞానము, మున్నగునవి. కాని ఏ జ్ఞానమువలన అనేకత్వములో ఏకత్వమును, మృత్యువులో అమృతత్వమును, విభాగములో అవిభాగమును గాంచగల్గునో అదియే అన్ని జ్ఞానములలోను శ్రేష్ఠమైనదని, అదియే

సాత్త్వికజ్ఞానమని భగవానుడు తెలిపెను. అదియే అధ్యాత్మవిద్య. కాబట్టి విజ్ఞులు ఈ భగవద్వాక్యమునందు విశ్వాసముకలవారై ఉత్తమోత్తమజ్ఞానమునే బడసి ధన్యులయ్యెదరుగాక! దీనినిబట్టి ప్రపంచములో ఎందఱో మేధాసంపన్నులు, కళాకుశలురు ఉన్నప్పటికిని ఇట్టి సర్వభూతాత్మభావము, సర్వాత్మజ్ఞానము, అవిభక్తదైవభావము లేనిచో వారందఱును భగవద్దృష్టిలో వాస్తవజ్ఞానసహితులే యగుదురు. కావున లౌకికములగు ఇతర విద్యలు, జ్ఞానములు ఎన్నియున్నప్పటికిని ప్రతివారును భగవత్ప్రోక్తమగు ఈ సాత్త్వికజ్ఞానమును అవలంబించి సర్వాత్మదృష్టిగలవారై జీవితమును తరింపజేసికొనవలెను. అట్లుకాక, లోకములో భిన్నత్వమును కాంచుచో, అందులకు ఫలితము సంసారబంధమే, మృత్యువే, జననమరణదుఃఖమే. ఉపనిషత్తు లీయర్థమునే ఈప్రకారముగ తెలుపుచున్నవి –

'మృత్యోస్సమృత్యు మాప్నోతి య ఇహనానేవ పశ్యతి'. కావున ప్రపంచములో ఏ ప్రాణిని చూచినప్పటికిని అతని దేహముపైగాని, గుణముపైగాని దృష్టినుంచక లోనగల ఆత్మపైననే దృష్టినుంచవలెను. దేహదృష్టిమాత్రము గలిగియుండువారు అధములు. మనోదృష్టి గలిగియుండువారు, అనగా ఒకప్రాణిని జూచినపుడు అతని గుణములను మాత్రము పరికించువారు మధ్యములు. ఆత్మదృష్టి, దైవదృష్టిగలవారు ఉత్తములు. ఈ భావమే ఈ శ్లోకమున వ్యక్తీకరింపబడినది. కావున అట్టి ఆత్మదృష్టికై సాత్త్వికజ్ఞానమునకై సర్వులును యత్నించవలెను.

**ప్ర:–** సాత్త్వికజ్ఞానముయొక్క లక్షణమేమి?

**ఉ:–** ఏ జ్ఞానముచే మనుజుడు వేఱువేఱుగనున్న సమస్త ప్రాణులందును, ఏకమై, నాశరహితమై, అవిభక్తమైనట్టి ఆత్మవస్తువును వీక్షింపగల్గునో అదియే సాత్త్వికజ్ఞానము.

**ప్ర:–** భగవంతు డెచటగలరు?

**ఉ:–** సమస్త చరాచర ప్రాణికోట్లయందును గలరు.

**ప్ర:–** ఆత్మయొక్క స్వరూపమేది?

**ఉ:–** అది (1) ఏకమైనది (2) నాశరహితమైనది (3) అవిభక్తమైనది.

**ప్ర:–** ఈ ప్రపంచమున అనేకత్వము సత్యమా?

**ఉ:–** కాదు. ఏకత్వమే సత్యమైనది (పూసలలో దారమువలె, తరంగములలో జలమువలె).

**అ॥** రాజసజ్ఞానమును చెప్పుచున్నాడు –

## 21. పృథక్త్వేన తు యజ్జ్ఞానం నానాభావాన్పృథగ్విధాన్
## వేత్తి సర్వేషు భూతేషు తజ్జ్ఞానం విద్ధి రాజసమ్.

**టీక:–** యత్ జ్ఞానమ్ = ఏ జ్ఞానమును, సర్వేషు = సమస్తమైన, భూతేషు = ప్రాణులందును, పృథగ్విధాన్ = వేఱువేఱు విధములుగనున్న, నానాభావాన్ = అనేకములగుజీవులను, పృథక్త్వేనతు =

వేఱువేఱుగా, వేత్తి = తెలిసికొనుచున్నదో, తత్ జ్ఞానమ్ = అట్టిజ్ఞానము, రాజసమ్ = రాజసజ్ఞానమని, విద్ధి = ఎఱుంగుము.

**తా:–** ఏ జ్ఞానమువలన మనుజుడు సమస్తప్రాణులందును వేఱువేఱువిధములుగ నున్న అనేక జీవులను వేఱువేఱుగా నెఱుంగుచున్నాడో, అట్టి జ్ఞానమును రాజసజ్ఞానమని తెలిసికొనుము.

**వ్యాఖ్య:–** ప్రపంచమునగల ప్రాణులలో 'వీడువేఱు, వీడువేఱు' - అని యీప్రకారముగ అనేకత్వమునుజూచుట ఉత్తమజ్ఞానముకాదు. అది రాజసమేయగును. అట్టి జ్ఞానముకలవా రొకవ్యక్తిని చూచినపుడు ఆతని గుణమును పరికించుదురేకాని ఆత్మను కాదు. కనుకనే వారు వ్యక్తులలో భిన్నత్వమును జూచుదురు. ఇట్టి రాజసజ్ఞానమునే యిపుడు ప్రపంచమున పెక్కురు కలిగియుండుచున్నారు. ఏలయనగా వారు ప్రాణులలో భిన్నత్వమునే కాంచుచున్నారు. కావున అద్దానిని తొలగించుకొని అద్వైత భావమును సమదృష్టిని అవలంబించవలెను (దిండ్లపై గలీబులపై దృష్టినుంచక లోనగలదూదిపైననే దృష్టిగలిగి యుండునట్లు).

**ప్ర:–** రాజసజ్ఞానముయొక్క లక్షణమేమి?

**ఉ:–** ప్రపంచములో అనేకత్వమునుజూచుట, సర్వజీవులందును 'వీడు వేఱు, వీడు వేఱు' అను భేదభావము గలిగియుండుట.

**అ॥** ఇక తామసజ్ఞానమును గూర్చి తెలుపుచున్నాడు -

## 22. యత్తు కృత్స్నవదేకస్మి న్కార్యేసక్తమహైతుకమ్
## అతత్త్వార్థవదల్పం చ తత్తామసముదాహృతమ్.

**టీక:–** యత్ తు = ఏ జ్ఞానమైతే, ఏకస్మిన్ కార్యే = ఏదేని ఒక్క పనియందు (శరీరప్రతిమాదులందు), కృత్స్నవత్ = సమస్తమునందువలె (అంతయు అదియేయని), సక్తమ్ = తగుల్కొని యుండునో, అహైతుకమ్ = అందులకు తగిన హేతువులేకయుండునో, అతత్త్వార్థవత్ = తత్త్వమును (సత్యవస్తువును) తెలియక నుండునో, అల్పంచ = అల్పమైనదిగ (స్వల్పఫలములను గలిగినదిగ) నుండునో, తత్ = అట్టి జ్ఞానము, తామసం = తామసజ్ఞానమని, ఉదాహృతమ్ = చెప్పబడినది.

**తా:–** ఏ జ్ఞానమువలన మనుజుడు ఏదేని ఒక్కపనియందు (శరీర, ప్రతిమాదులందు) సమస్తమును అదియేయని తగుల్కొనియుండునో, అందులకు తగిన హేతువు లేకుండునో, తత్త్వమును (సత్యవస్తువును) తెలియకనుండునో, అల్పమైనదిగ (అల్పఫలము గలిగినదిగ) యుండునో అట్టి జ్ఞానము తామసజ్ఞానమని చెప్పబడినది.

**వ్యాఖ్య:–** తామసజ్ఞానము కలవాడు ఏదియో యొక దృశ్యవస్తువును పట్టుకొని ఏదియో మునిగిపోయినట్లు దానియందే ఆసక్తిగలిగి, అదియే సమస్తమని తలంచుచుండును. అతడు ఒకవ్యక్తియొక్క శరీరమును మాత్రమేచూచి, ఆ శరీరమే ఆత్మయని అదియే సమస్తమని భావించుచుండును. రాజసజ్ఞానము గలవాడు లోని గుణమును, మనోభావములను మాత్రమే చూచును. సాత్త్వికజ్ఞానముకలవాడు లోని

అవిభక్తమగు ఆత్మనే వీక్షించును. చంచలవస్తువులగు దేహము, మనస్సు రెండును వికారవంతములైనవి, అస్థిరములైనవి. కావున వాని నాశ్రయించువాడు, వానియెడల దృష్టిగలవాడు అస్థిరత్వమునే, వినాశమునే, జననమరణములనే పొందుచుండును. నిత్యమై, స్థిరమై, అవ్యయమైనట్టి ఆత్మనాశ్రయించువాడు, అట్టి అత్మదృష్టిగలవాడు నిత్య, పునరావృత్తి రహిత ఆత్మపదవినే పొందును. కాబట్టి రాజస, తామసజ్ఞానముల రెండిటిని వదలి సాత్త్వికజ్ఞానమునే విజ్ఞుడవలంబించవలెను.

ప్ర:– తామసజ్ఞాన మెట్టిది?

**ఉ:–** ఏదియో యొక దృశ్యవస్తువును పట్టుకొని దానియందే ఆసక్తిగలిగి, అదియే సమస్తమని భావించునది (దృష్టాంతమునకు శరీరమును జూచి అదియే ఆత్మయనిభావించుట) (2) అందులకు తగిన హేతువును జూపజాలనిది (3) తత్త్వమును, సత్యవస్తువును తెలియనిది (4) అల్పఫలము గలిగి యుండునది తామసజ్ఞానమనంబడును.

**అ॥** ఇంతదనుక మూడు విధములైన జ్ఞానములనుగూర్చి తెలిపి ఇక మూడు విధములైన కర్మలను గుఱించి తెలుపబోవుచు మొట్టమొదట సాత్త్వికకర్మనుగూర్చి చెప్పుచున్నాడు -

**23. నియతం సఙ్గరహిత మరాగద్వేషతః కృతమ్**
**అఫలప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్వికముచ్యతే.**

**టీక:–** నియతమ్ = శాస్త్రముచే నియమింపబడిన, యత్ కర్మ = ఏకర్మము, అఫలప్రేప్సునా = ఫలాపేక్షలేనివానిచేత, సఙ్గరహితమ్ = ఆసక్తిలేకయు (తాను కర్తయను అభిమానములేక), అరాగద్వేషతః = రాగద్వేషములు లేకుండగను, కృతమ్ = చేయబడినదో, తత్ = అది, సాత్త్వికమ్ = సాత్త్వికకర్మయని, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

**తా:–** శాస్త్రముచే నియమింపబడినదియు, ఫలాపేక్షగాని, ఆసక్తి (సంగము) అభిమానముగాని, రాగద్వేషములుగాని లేకుండ చేయబడునదియు సాత్త్వికకర్మయనంబడును.

**వ్యాఖ్య:–** కర్మను గుఱించి యెచట చెప్పవలసివచ్చినను 'నియతం' 'నియతం' అని భగవానుడు పదేపదే వాక్రుచ్చుచున్నారు. నియతమనగా వేదశాస్త్రాదులచే నియమింపబడినది అని యర్థము. వారివారికి తోచినదే సత్యమని భావించక జనులు శాస్త్రప్రమాణమునుగైకొని, దానితో తన యనుభవమును మేళవింపజేసికొని వ్యవహరింపవలెను. కనుకనే ఇష్టమువచ్చిన కర్మనుచేయక శాస్త్రనియతమగు కర్మనే చేయవలెనని యాదేశించుటకు కారణమైనది. 'నహికశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్' అనునట్లు ప్రపంచములో కర్మచేయక ఎవడును ఉండలేడుగనుక, కర్మయనునది నిత్యజీవితములో సర్వులకును అవశ్యకర్తవ్యమైయుండుటవలన దానిరహస్యమును ఎల్లరును బాగుగ తెలిసికొనియుండుట భావ్యమై యున్నది. కాబట్టి సాత్త్వికకర్మనుగూర్చి భగవాను డిచట తెలిపిన ఈ భావములు సర్వులకును చాల ముఖ్యములైయున్నవి. కర్మ యేప్రకారముండవలెననగా -

(1) శాస్త్రనియతమై యుండవలెను.

(2) సంగరహితముగ (ఆసక్తి, అభిమానములేకుండ) గావింపబడవలెను.

(3) రాగద్వేషములులేకుండ చేయబడవలెను.

(4) ఫలాపేక్షలేక నొనర్చబడవలెను.

ఈ నాలుగు విధముల సరిపోయి ఆచరింపబడు కర్మ చిత్తశుద్ధికరమై, హృదయమాలిన్యనివారకమై, దోషభంజకమై, జ్ఞానదాయకమై, మోక్షప్రదమైయుండగలదు.

'సఙ్గరహితమ్' - 'బుద్ధిర్యస్య న లిప్యతే' అని ఇదివఱలో తెలుపబడినట్లు కర్మలందు బుద్ధి అంటుకొనకయుండుటయే అసంగత్వము. అనగా 'నేను చేయుచున్నాన'ను అభిమానముగాని, మమత్వముగాని, ఆసక్తిగాని యుండరాదు. అట్టివాడు కర్మపాశముచే 'న నిబధ్యతే -' బంధింపబడనేరడని గీతాశయము. కావున సంగరహితముగ, ఫలాపేక్షావర్జితముగ కార్యముల నాచరించుటను అభ్యసింపవలెను.

'అరాగద్వేషతః' - పదార్థములపై రాగద్వేషములులేనపుడే సంగరహితముగ కార్యమాచరించుటకు వీలుపడును. మఱియు ఫలాభిలాషను త్యజించుటకును అనుకూలపడును. కాబట్టి కర్మయొక్క శుద్ధత్వమున కీ రాగద్వేషరాహిత్యము అత్యంతావశ్యకమైయున్నది.

**ప్ర:–** సాత్త్వికకర్మయెట్టిది?

**ఉ:–** (1) శాస్త్రనియమితమైనది (2) సంగరహితముగ నాచరింపబడునది (3) రాగద్వేషవర్జితముగ నొనర్పబడునది (4) ఫలాభిలాషలేక గావింపబడునది - సాత్త్వికకర్మయనబడును.

**అ॥** రాజసకర్మనుగూర్చి చెప్పుచున్నాడు -

## 24. యత్తు కామేప్సునా కర్మ సాహఙ్కారేణ వా పునః
## క్రియతే బహులాయాసం తద్రాజసముదాహృతమ్.

**టీక:–** కామేప్సునా = ఫలాపేక్షగలవానిచేతగాని, పునః = మఱియు, సాహంకారేణ వా = (నేను కర్తయను) అహంకారముతోగూడినవానిచేగాని, బహులాయాసమ్ = అధికప్రయాసకరమగు, యత్ కర్మతు = ఏ కర్మమైతే, క్రియతే = చేయబడుచున్నదో, తత్ = అది, రాజసమ్ = రాజసకర్మయని, ఉదాహృతమ్ = చెప్పబడినది.

**తా:–** ఫలాపేక్షగలవానిచేతగాని, మఱియు అహంకారముతోగూడినవానిచేగాని అధిక ప్రయాసకరమగు కర్మ మేది చేయబడుచున్నదో, అది రాజసకర్మయని చెప్పబడినది.

**వ్యాఖ్య:–** (1) ఫలాపేక్షతోను (2) అహంకారముతోను గూడి చేయబడు కర్మ రాజసకర్మ మనబడును. 'ఆయాసమ్' అని చెప్పక 'బహులాయాసమ్' అని చెప్పుటవలన రాజసకర్మావలంబి అత్యంతప్రయాసతో గూడిన కార్యములను జేయుచుండునని తెలియుచున్నది. కాని అట్టి కర్మలవలన ఆతనికి ప్రయాసయే మిగులునుగాని, బంధనివృత్తి కలుగజాలదు. ఏలయనిన అయ్యవి అహంకారము, ఫలాపేక్షయను దోషములతో గూడి యున్నవి. అహంకారమే బంధము, కర్తృత్వమే బంధము. ఫలాకాంక్షయే బంధము. కాబట్టి విజ్ఞుడట్టి రాజసకర్మలజోలికిపోక, సాత్త్వికకర్మలనే నిష్కామబుద్ధితో నాచరించితరించవలెను.



**ప్ర:–** రాజసకర్మ యెట్టిది ?

**ఉ:–** (1) ఫలాపేక్షతోను (2) అహంకారముతోనుగూడి యాచరింపబడునది (3) అధికప్రయాసతో గూడినది.

**అ॥** తామసకర్మను పేర్కొనుచున్నాడు -

## 25. అనుబన్ధం క్షయం హింసా మనపేక్ష్యచ పౌరుషమ్
## మోహాదారభ్యతే కర్మ యత్తత్తామసముచ్యతే.

**టీక:–** అనుబన్ధమ్ = తానుజేయుకర్మకు మున్ముందు గలుగబోవు దుఃఖాదులను, క్షయమ్ = (ధనాదులయొక్క) నాశమును, హింసామ్ = (తనయొక్కయు, ఇతరులయొక్కయు శరీరాదులకు గల్గు) బాధను, పౌరుషమ్ = తన సామర్థ్యమును, అనపేక్ష్య = ఆలోచింపక, మోహాత్ = అవివేకమువలన, యత్ కర్మ = ఏ కర్మము, అరభ్యతే = ప్రారంభింపబడుచున్నదో, తత్ = అది, తామసమ్ = తామసకర్మయని, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

**తా:–** తానుచేయుకర్మకు మున్ముందు కలుగబోవు దుఃఖాదులను (ధనాదుల) నాశమును, (తనయొక్క, ఇతరులయొక్క శరీరాదులకుగల్గు) బాధను, తన సామర్థ్యమును ఆలోచింపక, అవివేకముతో ప్రారంభింపబడు కర్మము తామసకర్మయని చెప్పబడుచున్నది.

**వ్యాఖ్య:–** తామసకర్మావలంబి ముందు వెనుకలు ఆలోచింపక కర్మలు ప్రారంభించును. ఆ కర్మవలనకలుగబోవు దుఃఖములనుగుఱించి విచారింపడు. ఇతరులకు దానివలన కలుగు బాధనుగూడ యోచింపడు. తనశక్తిసామర్థ్యములనుగూడ చూచుకొనడు. అవివేకముతో గ్రుడ్డిగా కర్మలుచేయ మొదలిడును. అట్టివాడు చేయుకర్మ మహాప్రమాదభూయిష్ఠమైయుండును గావున అది సర్వదా త్యాజ్యమేయగును.

మఱియు సామాన్యముగ భగవద్విముఖుడై, స్వార్థసాధనకొఱకు గావించు దృశ్యవిషయసంపాదనారూపమైన కర్మలన్నియు రాజస, తామస క్రియలక్రిందకే వచ్చును. ఏలయనిన, వానిచే తన ఆత్మకు కలుగు నష్టము (సంసారబంధము) నతడు ఆలోచించుటలేదు.

'మోహాత్' - అనుటవలన ఈ రాజస, తామసక్రియలన్నిటికిని మూలకారణము అవివేకము, అజ్ఞానము అయియున్నదని స్పష్టమగుచున్నది. కాబట్టి మొట్టమొదటవివేకమును సంపాదించి ఇట్టి రాజస తామసాది వృత్తులను త్యజించి జీవితమును సంస్కరించుకొనవలయును.

**ప్ర:–** తామసకర్మ యెట్టిది?

**ఉ:–** ముందు కలుగబోవు దుఃఖాదులను, (ధనాదుల) నాశమును, (దేహాదుల) బాధను తన సామర్థ్యమును ఆలోచింపక అవివేకముతో గ్రుడ్డిగా నాచరింపబడు కర్మము తామసకర్మమనబడును.

**ప్ర:–** ఇట్టి తామస ప్రవృత్తికి కారణమేమి?

**ఉ:–** అవివేకము.

**అ॥** మూడు విధములగు కర్తలను గుఱించిచెప్పుచు మొదట సాత్త్విక కర్తయొక్క స్వభావమును తెలియజేయుచున్నాడు -

**26. ముక్తసఙ్గో௨నహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే.**

**టీక:–** ముక్తసఙ్గః = సంగమును (ఫలాపేక్షను) విడిచినవాడును, అనహంవాదీ = 'నేను కర్తన'ను అభిమానము, అహంభావము లేనివాడును, ధృత్యుత్సాహసమన్వితః = ధైర్యము, ఉత్సాహము – వీనితో గూడియున్నవాడును, సిద్ధ్యసిద్ధ్యోః = కార్యము సిద్ధించునప్పుడును, సిద్ధింపకుండునప్పుడును, నిర్వికారః = వికారమును జెందనివాడును నగు, కర్తా = కర్త, సాత్త్వికః = సాత్త్వికకర్తయని, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

**తా:–** సంగమును (ఆసక్తిని, ఫలాపేక్షను) విడచినవాడును, 'నేను కర్తను' అను అభిమానము, అహంభావము లేనివాడును, ధైర్యముతోను, ఉత్సాహముతోను గూడియున్నవాడును, కార్యము సిద్ధించినను, సిద్ధింపకున్నను వికారమును జెందనివాడునునగు కర్త సాత్త్వికకర్తయని చెప్పబడుచున్నాడు.

**వ్యాఖ్య:–** నిత్యజీవితములో మనుజుడు నిరంతరము ఏదియోయొక కర్మను చేయవలసియే యుండుటవలన కర్తకుండవలసిన ఈ లక్షణములను తెలిసికొనినచో చక్కగ వ్యవహరించుటకు వీలగును. ఇచట కర్తకు నాలుగు ఉత్తమ లక్షణములు పేర్కొనబడినవి – అందు మొదటిది సంగము లేకుండుట. అనగా కార్యముచేసినను ఫలాపేక్షను విడచిపెట్టి కార్యమునందు తగుల్కొనక అసంగుడై యుండవలెను. రెండవది, 'అహం' భావము లేకుండుట. అనగా 'నేను కర్తన'ను అభిమానము లేకుండవలెను. ఇక మూడవది ధైర్యోత్సాహములతో గూడియుండుట. పిరికితనమునకును, నిరుత్సాహమునకును అధ్యాత్మక్షేత్రమున చోటే లేదు. అవికలవాడు ఒక్క అడుగైనను పరమార్థరంగమున ముందునకు వేయలేడు. తాను కేవలము నిత్యశుద్ధబుద్ధముక్తఆత్మస్వరూపుడే యని తలంచుకొనుచుండినచో అపరిమిత ధైర్యము, ఉత్సాహము మనుజునకు కలుగుచుండును. వాస్తవముగ తానట్టి నిర్మలాత్మయేకావున ఇక అధైర్యమును, నిరుత్సాహమును పారద్రోలి సాధనలందు ప్రయత్నశీలుడు కావలెను. సాత్త్వికకర్తయొక్క నాల్గవలక్షణము కార్యముయొక్క సిద్ధి, అసిద్ధులందు నిర్వికారుడైయుండుట. కార్యమునందు అపజయమును పొందినచో, లేక కార్యము విఫలమైనచో జయము కొఱకై, సఫలత్వము కొఱకై తిరిగి యత్నించవలసినదేకాని ఏవిధమైన మనోవికారమును బొందగూడదు. ద్వంద్వములకును ఏమాత్రము జంకగూడదు. ఈ జగత్తంతయు మిథ్యాభూతమని యెంచియు, తాను సాక్షియగు సత్యఆత్మస్వరూపుడని భావించియు, ద్వంద్వములందు సమబుద్ధిగలిగి వర్తించవలెను.

**ప్ర:–** సాత్త్వికకర్తయొక్క లక్షణము లేవి?

**ఉ:–** (1) సంగమును (ఫలాపేక్షను) విడచుట (2) 'నేను కర్తన' ను అహంభావము లేకుండుట (3) ధైర్యోత్సాహములు గలిగియుండుట (4) కార్యము సఫలమైనను, విఫలమైనను, ఏవిధమైన వికారమును జెందకుండుట.

**అ॥** రాజసకర్తనుగూర్చి చెప్పుచున్నాడు –

**27. రాగీ కర్మఫలప్రేప్సు ర్లుబ్ధో హింసాత్మకో௨శుచిః
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః.**

**టీక:–** రాగీ = అనురాగము (బంధ్వాదులం దభిమానము) గలవాడును, కర్మఫలప్రేప్సుః = కర్మఫలము నాశ్రయించువాడును, లుబ్ధః = లోభియు, హింసాత్మకః = హింసాస్వభావముకలవాడును, అశుచిః = శుచిత్వములేనివాడును, హర్ష శోకాన్వితః =(కార్యము సిద్ధించినపుడు) సంతోషముతోను (కార్యము చెడినపుడు) దుఃఖముతోను గూడియుండువాడునగు, కర్తా = కర్త, రాజసః = రాజసకర్తయని, పరికీర్తితః = చెప్పబడియున్నాడు.

**తా:–** అనురాగము (బంధ్వాదులం దభిమానము) గలవాడును, కర్మఫలము నాశించువాడును, లోభియు, హింసాస్వభావము కలవాడును, శుచిత్వము లేనివాడును, (కార్యము సిద్ధించినపుడు) సంతోషముతోను, (చెడినపుడు) దుఃఖముతోను గూడియుండువాడునగు కర్త రాజసకర్తయని చెప్పబడును.

**వ్యాఖ్య:–** ఈ పై లక్షణములు గలవాడు రాజసకర్తయని చెప్పబడుటవలన, ఉత్తముడగువాడు ఆ లక్షణములను త్యజించివేయవలెననుట సుస్పష్టము. అనగా బంధ్వాదులందును, ఇతర ప్రాపంచిక పదార్థములందును అనురాగము (అభిమానము) లేకుండవలెను. కర్మఫలమును కోరరాదు. ఏప్రాణిని హింసింపరాదు. అశుభ్రతను త్యజించవలెను. కార్యముయొక్క సిద్ధి, అసిద్ధులందు హర్షశోకములను మనోవికారములు లేకుండ సమచిత్తుడై, ద్వంద్వసహిష్ణువై యుండవలెను. ప్రతివాడును తన హృదయమును పరిశోధించుకొని ఈ పైనదెలిపిన రాజసకర్తయొక్క లక్షణములున్నచో వానిని ప్రయత్నపూర్వకముగ విడనాడి సాత్త్వికకర్తయే అయియుండులాగున చూడవలెను.

**ప్ర:–** రాజసకర్త యెట్టివాడు?

**ఉ:–** (1) (బంధ్వాదులందు) అనురాగముగలవాడును (2) కర్మఫలము నాశించువాడును (3) లోభియు (4) హింసాస్వభావముగలవాడును (5) శుచిత్వములేనివాడును (6) (కార్యసిద్ధియందు) సంతోషముతోను, (కార్యవైఫల్యమునందు) దుఃఖముతోను గూడియుండువాడును రాజసకర్తయనబడును.

**అ॥** ఇక తామసకర్తయొక్క లక్షణములను వివరించుచున్నాడు -

**28. అయుక్తః ప్రాకృతః స్తబ్ధ శ్శఠో నైష్కృతికో ఽలసః★**
**విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే.**

**టీక:–** అయుక్తః = మనోనిగ్రహము (లేక, చిత్తైకాగ్రత) లేనివాడును, ప్రాకృతః = పామరస్వభావముగలవాడును (అవివేకియు), స్తబ్ధః = వినయములేనివాడును, శఠః = మోసగాడును, నైష్కృతికః = ఇతరులను వంచించి వారికార్యములను పాడుచేయువాడును, అలసః = సోమరితనముగలవాడును, విషాదీ = ఎల్లప్పుడు దిగులుతో నుండువాడును, దీర్ఘసూత్రీ చ = స్వల్పకాలములో చేయవలసినదానిని దీర్ఘకాలమునకైనను పూర్తిచేయనివాడును నగు, కర్తా = కర్త, తామసః = తామసకర్తయని, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

**తా:–** మనోనిగ్రహము (లేక చిత్తైకాగ్రత) లేనివాడును, పామర స్వభావము గల వాడును (అవివేకము), వినయము లేనివాడును, మోసగాడును, ఇతరులనువంచించి వారిజీవనములను

★ నైకృతో ఽలసః - పాఠాన్తరము.

పాడుచేయువాడును, సోమరితనముగలవాడును, ఎల్లప్పుడు దిగులుతో నుండువాడును, స్వల్పకాలములో చేయవలసినదానిని దీర్ఘకాలమునకైనను పూర్తిచేయనివాడును నగు కర్త తామసకర్త యని చెప్పబడుచున్నాడు.

**వ్యాఖ్య:–** 'అయుక్తః' - మనస్సు బహిర్ముఖముగాను, చంచలముగాను నుండువాడు, ఆత్మయందు నిలుకడలేనివాడు, ఏకాగ్రత, నిగ్రహము లేకయుండువాడు అయుక్తుడనబడును. ఆత్మతో, భగవంతునితో గూడియుండనివాడు అయుక్తుడు. అట్టివాని మనస్సు నిగ్రహములేక బయటనే తిరుగాడుచుండును.

'ప్రాకృతః' - ప్రకృతిగుణములు కలవాడు ప్రాకృతుడు. సంస్కారము లేనివాడు పామరుడని అర్థము. ప్రతివాడును తనయందలి ప్రకృతిగుణములను తొలగించుకొని అప్రాకృతుడుగ, దైవస్వరూపుడుగ మారవలెను.

'నైష్కృతికః' - ఇతరుల కార్యములను చెడగొట్టువాడు. ఇతరులను వంచించువాడు. సామాన్యముగ జనులు నాలుగు రకములుగ నుందురు. (1) తన సుఖమునుగూడ చూడక ఇతరులకు మేలుచేయువాడు (2) తన సుఖము చూచుకొనుచు ఇతరులకు హితమొనర్చువాడు (3) తనసుఖము కొఱకు పరులకు కీడుచేయువాడు (4) అనవసరముగా ఇతరులకు కీడుచేయువాడు. మొదటివాడు ఉత్తముడు. రెండవవాడు మధ్యముడు. మూడవవాడు అధముడు. నాల్గవవాడు అధమాధముడు. ఈశ్లోకమున తెలుపబడిన 'నైష్కృతికులు' చివరి రెండు తరగతులకు జెందినవారు.

'అలసః' - సోమరి - భగవానుడు సోమరితనమును తామసగుణముగజెప్పదానిని పారద్రోలవలసినదిగా బోధించుచున్నారు. సోమరి ఏరంగమందును వృద్ధికి రానేరడు. అధ్యాత్మరంగమున సోమరులకు చోటేలేదు.

'విషాదీ' - తామసకర్త ప్రతికార్యమందును ఏడుపుమొగము పెట్టుకొని యుండును. వాస్తవముగ అనంతానందపరిపూర్ణుడగు మానవుడు విషాదయుక్తుడై మూలుగుచుండుట కేవలము అజ్ఞానమువలననే యగును. కావున గంభీరమగు స్వస్వరూపము నెఱింగి విషాదమును పారద్రోలవలెను.

'దీర్ఘసూత్రీ' - మందకొడిగ ప్రవర్తించువాడు. తాబేలు నడకవంటి గమనము గలిగి చిన్నపనిని గంటలతరబడి చేయుచు, లేక అసలేచేయక 'వాయిదా' వేయుచునుండును. తామసకర్త 'తరువాత చూచెదములే' అను ప్రమత్తతతో గూడిన భావము గలిగియుండును. మహాభారతములోని శాంతిపర్వమున భీష్ముడు ధర్మరాజునకు 'దీర్ఘదర్శి, ప్రాప్తకాలజ్ఞుడు, దీర్ఘసూత్రి' అను మూడు చేపలనుగూర్చి బోధించిన విషయమీసందర్భమున జ్ఞప్తికి తెచ్చుకొనుట యుక్తము. ఆ మూడు చేపలలో దీర్ఘదర్శి దూరపు ఆలోచనగలది. ప్రాప్తకాలజ్ఞుడు కొంత ప్రయత్నలోపముగలది. దీర్ఘసూత్రి ఏ ప్రయత్నము చేయని సోమరి. (కథలో అది బెస్తవాని వలలోపడి మరణించును). కాబట్టి ఇట్టి దీర్ఘసూత్రత్వమును, అలసత్వమును, సోమరితనమును ముముక్షువులు దరికిచేర్చరాదు. అమూల్యమగు మానవజన్మను బడసి భగవత్ప్రాప్తికై యత్నింపక సోమరిగ కాలము గడుపుట మహాప్రమాదకరమని యెఱుంగవలెను.

**ప్ర:–** తామసకర్త యెట్టివాడు?

**ఉ:–** (1) మనోనిగ్రహము (చిత్తైకాగ్రత) లేనివాడు (2) పామరుడు (3) మొద్దు, వినయము లేనివాడు

(4) మోసగాడు (5) ఇతరుల కార్యములను చెడగొట్టువాడు (6) సోమరి (7) ఎల్లప్పుడు ఏదియోచింతతో దుఃఖముతో గూడియుండువాడు (8) పనులను తెమల్చక దీర్ఘకాలము కొనసాగించువాడు - తామసకర్త యనబడును.

**అ॥** బుద్ధి, ధైర్యము - అనువానియొక్క సత్త్వాది త్రివిధరూపములను వేఱువేఱుగ తెలుపబోవుచున్నాడు -

## 29. బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణతస్త్రివిధం శృణు
## ప్రోచ్యమానమశేషేణ పృథక్త్వేన ధనఞ్జయ!.

**టీక:-** *ధనంజయ* = ఓ అర్జునా!, *బుద్ధేః* = బుద్ధియొక్కయు, *ధృతేః చ ఏవ*= ధైర్యముయొక్కయు, *భేదమ్* = భేదమును, *గుణతః* = గుణములనుబట్టి, *త్రివిధమ్* = మూడు విధములుగా, *పృథక్త్వేన* = వేఱ్వేఱుగాను, *అశేషేణ* = సంపూర్ణముగాను, *ప్రోచ్యమానమ్* = చెప్పబడుచున్నదానిని, *శృణు* = వినుము.

**తా:-** ఓ అర్జునా! బుద్ధియొక్కయు, ధైర్యముయొక్కయు భేదమును గుణములనుబట్టి మూడువిధములుగా వేఱ్వేఱుగను, సంపూర్ణముగను చెప్పబడుచున్నదానిని (నీ విపుడు) వినుము.

**అ॥** మొట్టమొదట సాత్త్వికబుద్ధిని గూర్చి చెప్పుచున్నాడు -

## 30. ప్రవృత్తిం చ నివృత్తించ కార్యాకార్యే భయాభయే
## బన్ధం మోక్షం చ యా వేత్తి బుద్ధిస్సా పార్థ! సాత్త్వికీ.

**టీక:-** *పార్థ* = ఓ అర్జునా!, *యాబుద్ధిః* = ఏబుద్ధి, *ప్రవృత్తించ* = ధర్మమందు ప్రవృత్తిని (లేక ప్రవృత్తిమార్గమగు కర్మమార్గమును), *నివృత్తిం చ* = అధర్మమునుండి నివృత్తిని (లేక నివృత్తిమార్గమగు సన్న్యాసమార్గమును), *కార్యాకార్యే* = చేయదగుదానిని, చేయగూడనిదానిని, *భయాభయే* = భయమును, అభయమును (నిర్భయత్వమును), *బంధమ్* = బంధమును, *మోక్షం చ* = మోక్షమును, *వేత్తి* = తెలిసికొనుచున్నదో, *సా* = అట్టిబుద్ధి, *సాత్త్వికీ* = సాత్త్వికమైనది యగును.

**తా:-** ఓ అర్జునా! ఏ బుద్ధి ధర్మమందు ప్రవృత్తిని (లేక ప్రవృత్తిమార్గమగు కర్మమార్గమును), అధర్మమునుండి నివృత్తిని (లేక నివృత్తిమార్గమగు సన్న్యాసమార్గమును), చేయదగుదానిని, చేయదగనిదానిని భయమును, అభయమును, బంధమును, మోక్షమును తెలిసి కొనుచున్నదో అట్టి బుద్ధి సాత్త్వికమైనది యగును.

**వ్యాఖ్య:-** సాత్త్వికబుద్ధి మంచి చెడ్డల రెండిటినిగూర్చి తెలిసికొని మంచిని గ్రహించి చెడ్డను వదలివేయుచుండును. అట్లే బంధము, మోక్షము రెండిటిని తెలిసికొని బంధమును పరిత్యజించి మోక్షమునుగూర్చి యత్నించును. అదేవిధమున భయరూపమగు ఈ దృశ్యసంసారస్థితినిజూచి, దానియెడల విరక్తిగలిగి, అభయరూపమగు నిత్యానంద పరమాత్మనే ఆశ్రయించి తరించును. అట్టి సాత్త్వికబుద్ధియే ఉత్తమోత్తమమైనది. కాబట్టి అట్టి బుద్ధి [illegible] ప్రతివారును యోచించుకొని భగవద్దృష్టిలో

'బుద్ధిమంతులై' వర్తించుటకు ప్రయత్నించవలెను. ఇట్టి లక్షణములుగల బుద్ధిలేనిచో ఎంతటి పాండిత్యము, లౌకికప్రజ్ఞ యున్నప్పటికిని జనులు బుద్ధికొఱవడినవారే యగుదురు.

**ప్ర:–** సాత్త్వికబుద్ధి యెట్టిది?

**ఉ:–** (1) ధర్మప్రవృత్తిని (లేక ప్రకృతిమార్గమును) (2) చేయదగినదానిని, జేయదగనిదానిని (3) భయమును, అభయమును (4) బంధమును, మోక్షమును - వీనిని చక్కగ తెలిసికొనగల బుద్ధియే సాత్త్వికబుద్ధియనబడును.

**అ॥** రాజసబుద్ధిని తెలుపుచున్నాడు -

## 31. యయా ధర్మమధర్మం చ కార్యం చాఽకార్య మేవ చ
## అయథావత్ప్రజానాతి బుద్ధిస్సా పార్థ! రాజసీ.

**టీక:–** పార్థ = ఓ అర్జునా!, యయా = ఏ బుద్ధిచేత, ధర్మమ్ = ధర్మమును, అధర్మమ్ చ = అధర్మమును, కార్యం చ = చేయదగినదానిని, అకార్యం ఏవ చ = చేయరానిదానిని, అయథావత్ = ఉన్నది యున్నట్లుగాక (మఱియొక విధముగ, పొరపాటుగ), ప్రజానాతి = తెలిసికొనుచున్నదో, సా బుద్ధిః = ఆ బుద్ధి, రాజసీ = రాజసమైనది (రజోగుణసంబంధమైనది) యగును.

**తా:–** ఓ అర్జునా! ఏ బుద్ధిచేత మనుజుడు ధర్మమును, అధర్మమును, చేయదగినదానిని, చేయరానిదానిని, ఉన్నదియున్నట్లుకాక (మఱియొకవిధముగ, పొరబాటుగ) తెలిసికొనుచున్నాడో ఆ బుద్ధి రాజసబుద్ధియైయున్నది.

**వ్యాఖ్య:–** కొందఱిబుద్ధి ధర్మాధర్మములను, కర్తవ్యాకర్తవ్యములను శాస్త్రములందు బోధింపబడిన రీతిగగాక, పెద్దలగు గురువులు తెలిపినరీతిగాగాక మఱియొక విధముగ పొరబాటుగ గ్రహించును. అట్టిబుద్ధి రాజసమైనది. దానిని సంస్కరించి సాత్త్వికబుద్ధిగా ప్రయత్నముచే మార్చుకొనవలెను.

**ప్ర:–** రాజస బుద్ధి యెట్టిది?

**ఉ:–** ధర్మమును, అధర్మమును, కర్తవ్యమును, అకర్తవ్యమును ఉన్నది ఉన్నట్లుకాక పొరబాటుగా తెలిసికొను బుద్ధి రాజసబుద్ధియైయున్నది.

**అ॥** ఇక తామసబుద్ధినిగూర్చి వచించుచున్నాడు -

## 32. అధర్మం ధర్మమితి యా మన్యతే తమసాఽఽవృతా
## సర్వార్థాన్విపరీతాంశ్చ బుద్ధిస్సా పార్థ! తామసీ.

**టీక:–** పార్థ = ఓ అర్జునా!, యా = ఏ బుద్ధి, తమసా = అవివేకముచేత, ఆవృతా = కప్పబడినదై, అధర్మం = అధర్మమును, ధర్మమ్ ఇతి = ధర్మమనియు, సర్వార్థాన్ = సమస్త పదార్థములను , విపరీతాన్ చ = విరుద్ధములుగాను, మన్యతే = తలంచుచున్నదో, సా బుద్ధిః = అట్టిబుద్ధి, తామసీ = తామసమైనది (తమోగుణసంబంధమైనది) యగును. 

**తా:–** ఓ అర్జునా! ఏ బుద్ధి అవివేకముచేత కప్పబడినదై అధర్మమును ధర్మమని యెంచునో, మఱియు సమస్తపదార్థములను విరుద్ధములుగా తలంచునో, అట్టి బుద్ధి తామసబుద్ధియైయున్నది.

**వ్యాఖ్య:–** తామసబుద్ధి గలవానికి అంతయు తలక్రిందుగనే కనుపించును. వికారమైన అద్దములో ముఖము వికృతముగ గనుపించునట్లును, నీటిలో ప్రతిబింబము తలక్రిందులుగ భాసించునట్లును, తామసబుద్ధియుతున కంతయు విపరీతముగ తోచును. 'సర్వార్థాన్' అని చెప్పినందువలన ఒకవిషయము కాదనియు, నిత్యజీవితములో ప్రతివిషయమున్ను అతనికి విరుద్ధముగ గన్పట్టుననియు తెలియుచున్నది. దీనికంతటికిని కారణమేమి? – 'తమసాఽఽవృతా' – బుద్ధి అవిద్యచే, అజ్ఞానముచే, అవివేకముచే గప్పబడుటయే కారణము. కల్లుత్రాగినవానికి లోకము తిరుగుచున్నట్లు గోచరించు విధమున, మాయామోహమదిరాపానముచే మత్తుడైయున్న అజ్ఞాని కీ జగత్తంతయు వాస్తవముగ గోచరించును. దృష్టాంతమునకు –

(1) లేని దేహము, జగత్తు వారికి ఉన్నట్లు చూపట్టును. ఉన్న ఆత్మ (దైవము) లేనట్లు కన్పించును.

(2) దుఃఖభూయిష్ఠములైన విషయభోగములు వారికి సుఖకరములుగ తోచును. పరమానందదాయక మగు ఆత్మ (దైవము) వారికి రుచింపకయే యుండును.

(3) రక్తమాంసమయమగు క్షణికదేహమందు వారు సౌందర్యబుద్ధి గలిగి యుందురు. సచ్చిదానందఘనమగు శాశ్వతపరమాత్మయందు హేయబుద్ధిని జూపుదురు.

వెయ్యేల, ధర్మమును అధర్మముగ జూచుదురు, అధర్మముగ భావించుచుందురు. దీనికంతటికిని కారణము అవివేకమేయని ఇదివఱలో తెలుపబడియున్నది. కావున ఏ బుద్ధియందు అట్టివిద్య, తమస్సు, కాపురముండునో ఆ బుద్ధి మహానికృష్టమైనదియే యగును – ఆతడెంతటి భౌతికబలయుతుడైనను, విజ్ఞానసంపన్నుడైనను సరియే. కాబట్టి వివేకము నాశ్రయించి ప్రయత్నపూర్వకముగ అట్టి తమస్సును బుద్ధినుండి పారద్రోలి, సత్యమును సత్యముగను గ్రహించు శక్తిని సంపాదించి కృతార్థుడుకావలయును.

**ప్ర:–** తామసబుద్ధి యెట్టిది?

**ఉ:–** అవివేకముచే గప్పబడినదై అధర్మమును ధర్మముగను సమస్త పదార్థములను విరుద్ధములుగను గ్రహించునట్టి బుద్ధియై యున్నది.

**అ॥** మూడు విధములగు ధైర్యమునుగూర్చి చెప్పబోవుచు మొదట సాత్త్వికధైర్యమును వివరించుచున్నాడు –

## 33. ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేన్ద్రియక్రియాః
## యోగేనావ్యభిచారిణ్యా ధృతిస్సా పార్థ! సాత్త్వికీ.

**టీక:–** పార్థ = ఓ అర్జునా!, అవ్యభిచారిణ్యా = చలింపని, యయా ధృత్యా *(యుక్తః)* = ఏ ధైర్యముతోగూడినవాడై, *మనఃప్రాణేన్ద్రియక్రియాః* = మనస్సుయొక్కయు, ప్రాణులయొక్కయు, ఇంద్రియములయొక్కయు క్రియలను, *యోగేన* = యోగసాధనచేత (లేక, చిత్తైకాగ్రతచేత), *ధారయతే* =

(విషయములనుండి త్రిప్పి), ఆత్మధ్యానమున, లేక శాస్త్రక్తమార్గమున నిలబెట్టుచున్నాడో, సా ధృతిః = ఆ ధైర్యము, సాత్త్వికీ = సాత్త్వికమైనది.

**తా:–** ఓ అర్జునా! చలింపని (విషయములందు ప్రవర్తింపని) ఏ ధైర్యముతో గూడిన వాడై మనస్సుయొక్కయు, ప్రాణముయొక్కయు, ఇంద్రియములయొక్కయు క్రియలను యోగసాధనచేత (విషయములనుండి త్రిప్పి ఆత్మధ్యానమున, లేక శాస్త్రోక్తమార్గమున) నిలబెట్టుచున్నాడో, అట్టి ధైర్యము సాత్త్వికమైనది.

**వ్యాఖ్య:–** ప్రపంచములో ధైర్యముగలవా రనేకులుందురు. కొందఱు యుద్ధమున ధైర్యముతో పోరాడుదురు. కొందఱు ధైర్యముతో నిశీథసమయమున భీకరారణ్యములలో సంచరించుదురు. కొందఱు ధైర్యముతో మహోన్నత పర్వత శిఖరముల నధిరోహించుదురు. సముద్రములను లంఘించుదురు. కాని ఆ ధైర్యములన్నిటికంటెను ఉపరిస్థానముననున్న ధైర్యమొకటి యిచ్చోట చెప్పబడినది. అదియే సాత్త్వికధైర్యము. అనగా ఏధైర్యముచే మనుజుడు తనమనస్సును, ఇంద్రియములను విషయభోగములనుండి నిరోధించునో, దృశ్యవ్యామోహమునుండి నివృత్తుడగునో, అదియే గొప్పధైర్యమని భగవానుడిచట సెలవిచ్చెను. కాబట్టి తక్కిన ధైర్యములు కలిగియున్నను, జన్మసాఫల్యకారణమగు ఈ పారమార్థిక ధైర్యమునుగూడ మనుజుడు తప్పక గలిగియుండవలెను.

అయితే ఆ ధైర్యము చపలముగనుండరాదు. ఈ రోజున ఉండి రేపు అదృశ్యముకారాదు. కనుకనే 'అవ్యభిచారిణ్యా' (నిశ్చలమైన) అని చెప్పబడినది. ఏలయనగా కొందఱు ముముక్షువులు ఏదియో యొక ఆవేశములో ధైర్యము కలిగి తమ ఇంద్రియాదులను నిగ్రహించినవారై, మఱల పరిస్థితుల ప్రాబల్యముచే క్రమముగ ఆ దైర్యమును సడలించి, విషయములందు ప్రవర్తించుట కానంబడుచున్నది. అది 'అవ్యభిచారిణీ ధైర్యము' కాదు. కాబట్టి స్థిరముగ నుండునట్టి ధైర్యమునే అవలంబించవలెను.

**ప్ర:–** సాత్త్వికధైర్య మెట్టిది?

**ఉ:–** ఏ నిశ్చలధైర్యముతో గూడి యోగసాధనచే మనుజుడు ఇంద్రియాదులను విషయముల నుండి నిరోధింపగల్గునో అట్టిధైర్యము సాత్త్వికమని చెప్పబడును.

**అ॥** రాజసధైర్యమునుగూర్చి చెప్పుచున్నాడు -

## 34. యయా తు ధర్మకామార్థా న్ధృత్యా ధారయతేఽర్జున! ప్రసఙ్గేన ఫలాకాంక్షీ ధృతిస్సాపార్థ! రాజసీ.

**టీక:–** పార్థ = ఓ అర్జునా!, యయా ధృత్యా తు = ఏ ధైర్యముచేత, ఫలాకాఙ్క్షీ = ఫలాపేక్షగలవాడై, ధర్మకామార్థాన్ = ధర్మమును, కామమును, అర్థమును, ప్రసఙ్గేన = మిగులయాసక్తితో, ధారయతే = అనుష్ఠించుచున్నాడో, సా ధృతిః = ఆ ధైర్యము, రాజసీ = రాజసమైనది.

**తా:–** ఓ అర్జునా! ఏ ధైర్యముతో మనుజుడు ఫలాపేక్షగలవాడై ధర్మమును, అర్థమును, కామమును మిగుల యాసక్తితో అనుష్ఠించుచుండునో, అట్టి ధైర్యము రాజసమై యున్నది.

**వ్యాఖ్య:–** పురుషార్థములు నాలుగు - (1) ధర్మము (2) అర్థము (3) కామము (4) మోక్షము. ఈ చతుర్విధ పురుషార్థములలో మొదటిమూడుమాత్రమే యిచట తెలుపబడినవి. నాల్గవది యగు మోక్షము చెప్పబడలేదు. దీనినిబట్టి రాజసధైర్యయుతులు మోక్షమునుగూర్చి అంతగా పట్టించుకొనరని విదితమగు చున్నది. కాబట్టి ఈ ధైర్యము పరమార్థదృష్టిలో అంత ఉత్తమమైనదిగాదని తేలుచున్నది. ఇంద్రియములను నిరోధించుటద్వారా మోక్షముకొఱకు యత్నింపజేయునట్టి సాత్త్వికధైర్యమే ఉత్కృష్టమైనది.

ధర్మార్థకామములను మూడు పురుషార్థముల నన్వేషించువారికంటె, నాల్గవపురుషార్థమగు మోక్షము నన్వేషించువాడే శ్రేష్ఠుడు. అయితే చతుర్విధపురుషార్థములందలి మొదటిదియగు ధర్మమున కర్థము సామాన్యధర్మమనియే గ్రహించవలెను. విశేషధర్మము పరమాత్మావలంబనమే, దైవనిష్ఠయే, ఆత్మజ్ఞానమే యగును.

'సఙ్గేన' అని చెప్పక 'ప్రసఙ్గేన' యని చెప్పుటచే అట్టివారా పురుషార్థములందు మిక్కుటమగు నాసక్తిని జూపుదురని తెలియుచున్నది.

**ప్ర:–** రాజసధైర్య మెట్టిది?

**ఉ:–** ఏ ధైర్యముచే మనుజుడు ఫలాపేక్షగలవాడై ధర్మార్థకామములను మిగులయాసక్తితో ననుష్ఠించుచుండునో అయ్యది రాజసధైర్యమనబడును.

**అ॥** ఇక తామసధైర్యమును పేర్కొనుచున్నాడు -

## 35. యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ
## న విముఞ్చతి దుర్మేధా ధృతిస్సా పార్థ! తామసీ.

**టీక:–** పార్థ = ఓ అర్జునా!, యయా = ఏ బుద్ధిచేత, దుర్మేధాః = దుర్బుద్ధిగలవాడు, స్వప్నమ్ = నిద్రను, భయమ్ = భయమును, శోకమ్ = దుఃఖమును, విషాదమ్ = సంతాపమును (దిగులును), మదం ఏవ చ = మదమును, న విముఞ్చతి = విడువకయుండునో, సా ధృతిః = ఆ ధైర్యము, తామసీ = తామసమైనది.

**తా:–** ఓ అర్జునా! ఏ బుద్ధిచేత దుర్బుద్ధియగు మనుజుడు నిద్రను, భయమును, దుఃఖమును, సంతాపమును (దిగులును), మదమును విడువకయుండునో, అట్టి ధైర్యము తామసమైనది.

**వ్యాఖ్య:–** ధైర్యము గొప్పసుగుణమే. కాని అది దుర్విషయములందు వినియోగింపబడునపుడు నిష్ఫలమైపోవును. తమోగుణయుతుడు ఒకానొక ధైర్యమవలంబించి తన అతినిద్రను, భయమును, దుఃఖమును, దిగులును, మదమును వదలకయే యుండును. ధైర్యమను గొప్ప సుగుణము అట్టి నిద్రాభయాది నికృష్టవస్తుసంపాదనమున వినియోగింపబడుటచే నిరర్థకమైపోయినది. కాబట్టి ఆ ధైర్యమునే సద్వస్తుసంపాదనమునకు, సచ్ఛీలసముపార్జనకు, మోక్షప్రాప్తికి, దైవకరుణను సంపాదించుటకు వినియోగించుట ఉత్తముని ధర్మమైయున్నది. వాల్మీకికి అపారధైర్యము, పట్టుదల కలదు. కాని మొట్టమొదట ఆ ధైర్యమును, పట్టుదలను దుర్వృత్తులందు, పరమహింసాకార్యములందు ఉపయోగించివిఫలుడయ్యెను.

కాని మహనీయుల సాంగత్య ప్రభావముచే తిరిగి ఆ ధైర్యమునే రామనామజపమందును, దైవధ్యానమందును వాడుకొని ధన్యుడయ్యెను.

'దుర్మేధా' - అనిచెప్పుటవలన అతనికి మేధ (తెలివి) యున్నప్పటికిని దానిని వక్రమార్గమున ప్రవేశపెట్టెనని భావము.

'స్వప్నమ్' - (నిద్ర) ఇచట నిద్రయని చెప్పినచోట 'అతినిద్ర' యని భావించుకొనవలెను. ఏలయనిన మితనిద్ర సర్వులకును అవసరమే అయియున్నది.

**ప్ర:**– తామసధైర్య మెట్టిది?

**ఉ:**– ఏ ధైర్యముచే దుర్బుద్ధిగలవాడు నిద్రను, భయమును, శోకమును, దిగులును, మదమును విడువకయుండునో అది తామసధైర్యమని చెప్పబడును.

**అ॥** ఇక సాత్త్వికసుఖము, రాజససుఖము, తామససుఖము - అను మూడు సుఖములనుగూర్చి వర్ణించుచున్నాడు -

## 36. సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ! అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాన్తం చ నిగచ్ఛతి.

**టీక:**– భరతర్షభ = భరతకులశ్రేష్ఠుడవగు ఓ అర్జునా!, యత్ర = దేనియందు, అభ్యాసాత్ = అభ్యాసమువలన, రమతే = ఆనందమునొందుచున్నాడో, దుఃఖాన్తం చ = దుఃఖనాశనమునుగూడ, నిగచ్ఛతి = లెస్సగ పొందుచున్నాడో, (తత్ = ఆ), సుఖమ్ తు = సుఖమునైతే, ఇదానీమ్ = ఇప్పుడు, త్రివిధమ్ = మూడువిధములుగా, మే = నాయొక్క, (వచనాత్ = వాక్యములవలన), శృణు = వినుము.

**తా:**– భరతకుల శ్రేష్ఠుడవగు ఓ అర్జునా! దేనియొక్క అభ్యాసముచే మనుజుడు ఆనందము నొందుచుండునో, దుఃఖశాంతినిగూడ లెస్సగ బడయుచుండునో, అట్టి సుఖమిపుడు మూడువిధములుగా నాచే తెలుపబడుచున్నది. వినుము -

**వ్యాఖ్య:**– 'అభ్యాసాత్' - సాత్త్వికసుఖము, దైవసుఖము, బ్రహ్మానందము అభ్యాసమువలననే జీవునకు లభించగలదని భగవాను డిచట తెలియజేయుచున్నాడు. అధ్యాత్మవిద్య మాటలచే, 'వాచా' జ్ఞానముచే కలుగునదికాదు. అది అనుభవవిద్య (Practical Science). అందలి ప్రతిసిద్ధాంతమును అనుభవములోచూచుకొనవలెను. అపుడే జీవునకు ప్రత్యక్ష సుఖము లభించును. చాలమంది 'మాకు సాక్షాత్కార మెట్లు కలుగును, దుఃఖ మెట్లు తొలగును, సుఖ మెట్లుకలుగును?' అని ప్రశ్నించుచుందురు. భగవాను డందులకు 'అభ్యాసముచేయుడు, మీకవి లభించును' అని యిచట చెప్పుచున్నాడు. ప్రయత్నము చేయక, సాధింపక, ఒడ్డునకూర్చొని మాటలు చెప్పుటద్వారా పరమార్థానుభవమెన్నటికిని కలుగనేరదు. పెరుగును చిలికిననే వెన్నవచ్చును. నువ్వులను పిండిననే నూనెవచ్చును. చెఱకును నమలిననే మాధుర్యమనుభూతమగును. అట్లే అభ్యాసముచేతనే 'దుఃఖాంతము,' సుఖావిర్భావము జీవునకు కలుగగలదు.

'దుఃఖాన్తం చ నిగచ్ఛతి' - ప్రపంచమున ప్రతిజీవియు కోరునది దుఃఖరాహిత్యము,

దుఃఖాంతము. జీవిత మందలి అతిముఖ్యమైన, క్లిష్టతరమైన సమస్య ఈ దుఃఖాంతసంపాదనమేయగును. ప్రతివానిని ఈ సమస్యయే బాధించుచున్నది. చీమయు ఈ దుఃఖాంతమునకే, అనగా దుఃఖమును పోగొట్టుకొనుటకొఱకే యత్నించుచున్నది. దోమయు దానికొఱకే యత్నించుచున్నది. చతుర్ముఖబ్రహ్మ దానికొఱకే యత్నించుచున్నాడు. దుఃఖముయొక్క అంతమును (దుఃఖరాహిత్యమును) ప్రాణియెచట పొందగలదు? ఈ మహాసంసారిక బాధలన్నియు ఎచ్చోట నుపశమించగలవు? దుఃఖములేనిచోటు ఏది? ప్రపంచములో ఎచట వెతకినను అట్టిచోటు లభించగలదా? శాశ్వతసుఖము నొసంగగల వస్తువు ఈ దృశ్యసమూహమందుకలదా? లేదు. దుఃఖముయొక్క అంత మొక ఆత్మయందే, దైవమందే కలదు. ఆత్మసుఖమందే, సాత్త్వికానందమందే దుఃఖముయొక్క అంతమును జీవుడు పొందగల్గుచున్నాడని ఈ శ్లోకమున చెప్పబడినది. ఈ భగవద్వాక్యమువలన ప్రతి ప్రాణిని వేధించుచున్న 'దుఃఖనివారణసమస్య' తీరిపోయినది. దుఃఖనివారణ కుపాయము సాత్త్వికసుఖసంపాదనమే, ఆత్మానందప్రాప్తియే. కాబట్టి ఆత్మసుఖమునే, దైవసుఖమునే అన్వేషింపవలయును. అది యెట్లు లభ్యమగును? అభ్యాసమువలన, సాధన చతుష్టయరూపసంపత్తిచేత, అమానిత్వాదిగుణములచేత, 'నిగచ్ఛతి' అని చెప్పుటవలన అభ్యాసముచే నట్టి దుఃఖరాహిత్యస్థితిని జీవుడు లెస్సగ బడయగలడని తెలియుచున్నది.

**ప్ర:–** సుఖ మెన్ని విధములు?

**ఉ:–** మూడువిధములు. (1) సాత్త్వికసుఖము (2) రాజససుఖము (3) తామససుఖము – అని.

**ప్ర:–** దుఃఖరాహిత్యము ఎట్లు కలుగును?

**ఉ:–** అభ్యాసముద్వారా ఉత్తమ (సాత్త్విక) సుఖమును బొందుటచే దుఃఖము సంపూర్ణముగ తొలగిపోగలదు.

**అ॥** సాత్త్వికసుఖముయొక్క లక్షణమును వచించుచున్నాడు –

## 37. యత్తదగ్రే విషమివ పరిణామే౽మృతోపమమ్
## తత్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మబుద్ధిప్రసాదజమ్.

**టీక:–** యత్ తత్ = ఏ సుఖము, అగ్రే = ఆరంభములో, విషమివ = విషమువలెను, పరిణామే = పర్యవసానమందు (చివరకి), అమృతోపమమ్ = అమృతమును బోలినదిగను నుండునో, ఆత్మబుద్ధి ప్రసాదజమ్ = తన బుద్ధియొక్క నైర్మల్యముచే గలుగునట్టి (లేక ఆత్మవిషయకమైన బుద్ధియొక్క నిర్మలత్వముచే గలుగునట్టి), తత్ సుఖమ్ = ఆ సుఖము, సాత్త్వికమ్ = సాత్త్వికమని, ప్రోక్తమ్ = చెప్పబడినది.

**తా:–** ఏ సుఖము ప్రారంభమునందు విషమువలెను, పర్యవసానమందు అమృతమును బోలినదిగను నుండునో, తన బుద్ధియొక్క నిర్మలత్వముచే గలుగునట్టి ఆ సుఖము సాత్త్వికమని చెప్పబడినది.

**వ్యాఖ్య:–** అధ్యాత్మక్షేత్రమున సాధకునకు అభ్యాసకాలమందు ప్రారంభమున బ్రహ్మనిష్ఠ, ధ్యాన, వైరాగ్యాదులు ఒకింత కష్టముగా తోచవచ్చును. కాని అభ్యాసము, సాధన పూర్తియగుకాలమున అమృతతుల్యముగ నుండును. ఆత్మసుఖము సిద్ధించగలదు – అని యిచట వచింపబడినది. కావున

సాధనదశలోగాని, అభ్యాసకాలములోగాని ఎవరికైనను కష్టముకలిగినచో, విసుగు జనించినచో, అధైర్యపడక, అది వాస్తవమగు బాధ కాదనియు, పరిణామమున అనంతానందము కలుగుననియు నిశ్చయించి సాధనను విడనాడక ధైర్యముతో కొనసాగించవలెను. కనుకనే 'విషమివ' అని చెప్పిరేకాని 'విషమ్' అని చెప్పలేదు. అనగా ఆ ప్రారంభకష్టము విషమువలె తోచునేగాని వాస్తవముగ విషముకాదని భావము. ఇచట ప్రయోగించిన 'ఇవ' అను పదమునందు. గొప్ప అర్థముకలదు. 'బాధవలె తోచునేకాని బాధకాద'ని ఆ పదమువలన స్పష్టమగుచున్నది. ఆ తాత్కాలిక బాధకైనను కారణము జన్మార్జితములైన పాపవాసనలకును, ఆధునిక పుణ్యవాసనలకును, మధ్యగలుగు సంఘర్షణమే యగును. పుణ్యవాసనలు బలమై, పాప వాసనలను తొలగద్రోయునపుడు అవి వెడలి పోవుచు పోవుచు జీవుని గిల్లిపోవును. ఆనొప్పియే ఈ 'విషమివ' అనుదాని యర్థము. అదియే జీవుని ప్రారంభబాధ. వాస్తవముగ అది బాధకాదు. అనుపమ సుఖమునకు నాందియే యగును.

ఒకానొక రోగమునకు 'వేపఉండ' అను మందు ఇచ్చుదురు. అది చేదుగా నున్నను ఆరోగ్యమును గలుగజేయును. ఔషధము సేవించునపుడు అప్రీతిగానున్నను, బలవంతముగా నైనను సేవించవలసినదే ఆరోగ్యముకొఱకు. ఒక ఱాయి దేవవిగ్రహముగా మారుటకు మొదట ఉలిదెబ్బలు తినునట్లును, బంగారము శిరోభూషణముగా మారుటకు స్వర్ణకారుని సుత్తిదెబ్బలు తినునట్లును, అనంతమగు బ్రహ్మానందము ననుభవించుటకుముందు జీవుడొకింత త్యాగము చేయవలసియుండును. అట్లు అల్పసుఖమును వదలునప్పుడు ఒకింత దుఃఖము కలుగవచ్చును. అనేక జన్మలనుండి ఆ విషయసుఖములను బంధువులు జీవుని హృదయగేహములో నివసించుచున్నారు. వారు పోవునపుడు బంధువియోగమందువలె తాత్కాలిక అవేదన కొంతకలుగును. అంతమాత్రముతో సాధకుడు బెదరిపోరాదు. కొంత ఓపికబట్టి సాధనను విడువక కొనసాగించినచో ఆ కష్టకాలము తొలగిపోయి సుఖకాల మేతెంచును.

ఒక విద్యార్థిదశలో రేయింబవళ్లు కష్టపడి చదువును. తదుపరి ఉద్యోగకాలమందు సుఖించును. అట్లే అధ్యాత్మరంగమున ఇంద్రియాదులను నిగ్రహించునపుడు, అంతర్యుద్ధఫలితముగ కొంత ప్రయాస కలిగినపుడు దానిని సహించుకొని ముందునకు సాగిపోవలెను. అంతియేకాని భయపడి సాధనను విరమించరాదు. కనుకనే భగవానుడిచట సాత్త్వికసుఖముయొక్క నిజస్థితిని తెలుపుచున్నారు. విషరూపదుఃఖములో అమృతరూప సుఖముయొక్క బీజములున్నవని సెలవిచ్చిరి. తాత్కాలికకష్టరూపమగు ఆ విషము నెట్లైనను దిగమ్రింగివేసినచో వానిలోనగల అమృతబీజము లపుడు మొలకెత్తును. ఇది విషమువలె నున్నదికదాయని పారవేసినచో దానిలోని అమృతబీజములనుగూడ జనులు పోగొట్టుకొనినవారగుదురు. కాబట్టి సాధకు లివ్విషయమున కడుజాగరూకులై యుండి భగవానుని ఈ అమూల్యోపదేశము జ్ఞప్తియందుంచుకొని అనంతాత్మసుఖము తమకై వేచియున్నదని భావించి, కష్టసహిష్ణువులై, త్యాగశీలురై, సాధనను విడువకుండ చేయుచునే యుండవలెను. కనుకనే 'కశ్చిద్ధీరః' - ఏ ఒకానొక ధీరుడో (అన్నికష్టముల నోర్చుకొని) ప్రత్యగాత్మను చూడగలడని ఉపనిషత్తులలో చెప్పబడినది. శ్రీ బుద్ధదేవుడు, శ్రీ రామకృష్ణపరమహంస మున్నగువారి సాధనకాలజీవితములను చూచినచో ఈ సత్యము బోధపడగలదు. మఱియు 'అమృతోపమమ్' - 'అమృతమునుబోలి' అని యిచట చెప్పుటయు చాల సమంజసముగా నున్నది. ఏలయనిన, ఆత్మసుఖము, దైవసుఖమును దేవతల అమృతమును పోలినదేకాని, జడమగు ఆ దేవతల అమృతముకాదు. దానికంటె ఎన్నికోట్ల రెట్లో అధికశక్తివంతమైనదది. దేవతల యొద్దగల అమృతము స్థూలదేహమునకు కొంతకాలము మృతిలేకుండ నివారించును. కాని ఈ ఆత్మసుఖరూపమగు అమృతము శాశ్వతముగ జననమరణ సంసారప్రవాహమునుండి జీవుని తప్పించివేయును.

'ఆత్మబుద్ధి ప్రసాదజమ్' - ఆ సాత్త్వికసుఖము (ఆత్మసుఖము) యెట్లు కలుగగలదు? బుద్ధి నిర్మలముగానున్నచో, విషయదోషము లెవ్వియు లేకయుండినచో, నిర్మలదర్పణమున ప్రతిబింబమువలె ఆత్మసుఖము అందు గోచరింపగలదు. అనుభూతము కాగలదు. కాబట్టి సుఖము నపేక్షించువారు మొట్టమొదట తమబుద్ధిని నిర్మలముగా నొనర్చుకొనవలెను. 'మోక్షమెచటనున్నది, సుఖమెచటనున్నది' అని కొందఱు ప్రశ్నించుదురు. దానికి భగవాను డిచట సమాధాన మొసంగిరి. మోక్షము, దైవసుఖము ఆకాశములో లేదు. పాతాళములో లేదు. నిర్మలమగు తనబుద్ధియందే కలదు. ఈ యర్థమునే శ్రీ వసిష్ఠమహర్షియు శ్రీరామచంద్రున కిట్లు బోధించిరి -

**న మోక్షో నభసః పృష్ఠే పాతాలే న చ భూతలే**
**మోక్షో హి చేతో విమలం సమ్యగ్జ్ఞానవిబోధితం** (శ్రీ వసిష్ఠగీత)

**ప్ర:-** సాత్త్వికసుఖముయొక్క లక్షణమేమి?

**ఉ:-** ప్రారంభములో (అభ్యాసకాలములో) విషమువలె కష్టముగదోచి తుదకు అమృతమువలె సుఖదాయకముగ నుండునది సాత్త్వికసుఖము.

**ప్ర:-** అట్టి సాత్త్వికసుఖము జీవున కెట్లుకలుగును?

**ఉ:-** నిర్మలబుద్ధినుండి ఆ సుఖము జనించును. కావున సుఖాభిలాషి బుద్ధిని నిర్మలమొనర్చుకొనవలయును.

**ప్ర:-** కాబట్టి జీవుని కర్తవ్యమేమి?

**ఉ:-** ఆధ్యాత్మికసాధనలు గావించునపుడు కలుగు కష్టములకు జంకక భగవంతునిపై పూర్ణ విశ్వాసముంచి, సాధనను ధైర్యముతో కొనసాగించి, బుద్ధియందు విషయదోషమెద్దియు లేకుండ అద్దానిని సునిర్మలముగా గావించవలెను. అత్తఱి మహత్తరమగు ఆత్మసుఖ మాతనికి అనుభూతము కాగలదు. అదియే మోక్షము.

**అ॥** రాజససుఖమును వివరించుచున్నాడు -

**38. విషయేన్ద్రియసంయోగా ద్యత్తదగ్రేఽమృతోపమమ్**
**పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్.**

**టీక:-** యత్తత్ = ఏ సుఖము, విషయేన్ద్రియసంయోగాత్ = విషయములు, ఇంద్రియములు కలిసికొనుటవలన (వాని సంబంధమువలన), అగ్రే = మొదట, అమృతోపమమ్ = అమృతమును బోలియుండునదియు, పరిణామే = పర్యవసానమందు (అనుభవానంతరమున), విషమ్ ఇవ = విషమువలె నుండునదియు, (భవతి = అగుచున్నదో), తత్ సుఖమ్ = ఆ సుఖము, రాజసమ్ = రాజసమని, స్మృతమ్ = చెప్పబడెను.

**తా:-** ఏ సుఖము విషయేంద్రియసంబంధమువలన మొదట అమృతమును బోలియు,

పర్యవసానమందు (అనుభవానంతరమున) విషమువలెను నుండుచున్నదో అట్టి సుఖము రాజసమని చెప్పబడినది.

**వ్యాఖ్య:–** విషయ సుఖము తాత్కాలికమైనది; క్షణికమైనది. ఇంద్రియములకు విషయములకు సంయోగము కలిగినపుడే ఆ సుఖ ముదయించును. మఱల వెంటనే పోవును. మఱియు ప్రారంభములో అమృతముపగిది సుఖముగా తోచినను, పర్యవసానమున విషమువలె దారుణ దుఃఖరూపముగ పరిణమించునని ఇచట తెలుపబడినది. దీనినిబట్టి రాజససుఖము ప్రారంభమున జీవులకు అమృతమువలెతోచుసుఖము అమృతము కాదనియు, పయోముఖవిషకుంభస్థవిషమే యనియు తెలియుచున్నది. విషరూపమగు ఆ అమృతము మహాప్రమాదకరమైనవస్తువు. ఏలయనిన ఆ అమృతములోన విషబీజములు కాపురముండును. ఆ సుఖమందు దుఃఖబీజములు నివసించును. కాబట్టి అట్టి అమృతమును విడనాడనిచో, దానిలో దాగియున్న విషబీజములనుగూడ స్వీకరించవలసివచ్చును. కావున ముముక్షువులు దృశ్యవిషయములద్వారా తమకేదైన సుఖము గలిగినపుడు అది దుఃఖగర్భితమని, చేపయొక్క ఎరలోపలనుండు గాలమువంటిదని నిశ్చయించి దానిని త్యజించివేయవలెను. ఆ సుఖము ఈ జీవితమునేకాక అనేక భావికాల జీవితములనుగూడ నాశనముచేయును. కనుకనే భగవానుడు కరుణించి సాధకులకిచట హెచ్చరికచేయుచున్నారు. ఆ దృశ్యసుఖములయొక్క అసలురంగును గీతాచార్యులు బయటపెట్టుచున్నారు. 'మోసపోకుడు' అని సలహానిచ్చుచున్నారు. అజ్ఞాను లీసత్యము నెఱుగక తృణావృతకూపములమాడ్కికానవచ్చు శబ్దాదిదృశ్యవిషయములనే సేవించి అగాధసంసారకూపములో పడిపోవుచున్నారు.

భగవానుని ఈవాక్యములు జీవులకు అంధకారమునందు వెలుగునిచ్చుచున్నవి. జగత్తుయొక్క వాస్తవస్వరూపమును బోధించుచున్నవి. పైపై తళుకుబెళుకులకు మోసపోగూడదను విషయమును తెలియబఱచుచున్నవి. కావున ముముక్షువులు విషయసుఖమువలన కలుగు ఈ కీడును గుర్తెఱిగి, ఇంద్రియములకు మనస్సునకు ఆ యా విషయములతో నేమాత్రము సంయోగము కలుగకుండ చూచుచుండవలెను. ఒకవేళ జన్మాంతరసంస్కారప్రాబల్యముచే ఇంద్రియములు బయటకు విషయములపై పరుగెత్తినను, వానిని వివేకముతోనే వెనుకకు లాగి ప్రత్యాహరించి ఆత్మయందు నెలకొల్పవలెను.

**ప్ర:–** రాజససుఖముయొక్క లక్షణమేమి?

**ఉ:–** మొదట అమృతమువలె మహాసుఖముగ కానుపించి, తుట్టతుదకు (అనుభవానంతరమున) విషమువలె దారుణ దుఃఖరూపముగ పరిణమించుటయే రాజససుఖలక్షణము.

**అ॥** ఇక తామససుఖమునుగూర్చి వర్ణించుచున్నాడు -

## 39. యదగ్రే చానుబన్ధే చ సుఖం మోహనమాత్మనః
## నిద్రాలస్యప్రమాదోత్థం తత్తామసముదాహృతమ్.

**టీక:–** నిద్రాలస్యప్రమాదోత్థమ్ = నిద్ర, సోమరితనము, ప్రమత్తత అనువానివలన బుట్టినదై, యత్ సుఖమ్ = ఏ సుఖము, అగ్రే చ = ఆరంభమందును, అనుబన్ధే చ = అంతమందును (అనుభవించిన తరువాతను), ఆత్మనః = తనకు, మోహనమ్ = మోహమును (అజ్ఞానమును, భ్రమను) గలుగజేయుచున్నదో, తత్ = అది, తామసమ్ = తామససుఖమని, ఉదాహృతమ్ = చెప్పబడినది.

**తా:—** నిద్ర, సోమరితనము, ప్రమత్తత - అనువానివలన బుట్టినదై, ఏ సుఖము ఆరంభమందును, అంతమందును (అనుభవించిన మీదటను) తనకు మోహమును (అజ్ఞానమును, భ్రమను) గలుగజేయుచున్నదో అది తామససుఖమని చెప్పబడినది.

**వ్యాఖ్య:—** అతినిద్ర, సోమరితనము (బద్ధకము), ప్రమత్తత - అనువాని వలన కలుగునదియే తామససుఖము. ఇది ఆరంభముననను, మధ్యముననను, అంతముననను గూడ జీవునకు మోహమును (అజ్ఞానమును, భ్రమను) గలుగజేయునదియే యగుటచే అత్యంత నికృష్టమైనది. ఇది జీవుని అజ్ఞానకూపమున ఇంకను అధికముగ త్రోసివేయునది యగుటచే మహాప్రమాదకరమైనది యగును. కావున అతినిద్రతోను, సోమరితనముతోను గూడి అమూల్యమగు ఈ మానవజీవితకాలమును వ్యర్థముగ గడపి వేయువారు సంసారదుఃఖ సౌధప్రాంగణమున అడుగిడినవారేయగుదురు. జననమరణ పరంపరారూపమగు ఈ సంసారమునకు హేతువైన అజ్ఞానరూపబీజము తామస సుఖావలంబులందు నశింపకయేయుండి ఇంకను బలపడుచుండునుగావున అట్టి సుఖము అత్యంత ప్రమాదజనకమైనదియగుటచే సర్వదా త్యాజ్యమేయగును. కాబట్టి భగవానుని ఈ సద్బోధలను గ్రహించి ముముక్షువు లిట్టి తామసిక, రాజసిక సుఖముల రెండిటిని విడిచివేసి సాత్త్వికసుఖమునే అవలంబించి శ్రేయము నొందవలెను.

**ప్ర:—** తామససుఖముయొక్క లక్షణమేమి?

**ఉ:—** (1) నిద్ర, సోమరితనము, ప్రమత్తత - వీనివలన కలుగునదియు, (2) ఆరంభమున, అంతమున (అనుభవానంతరమున) గూడ తనకు మోహమును (భ్రమను, అజ్ఞానమును) గలుగజేయునదియు తామససుఖమనబడును.

**అ॥** ఈ సత్త్వాది త్రిగుణములతో గూడియుండని వస్తు వీ ముల్లోకములందును ఏదియులేదని వచించుచున్నాడు -

## 40. న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః
## సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిస్స్యాత్త్రిభిర్గుణైః.

**టీక:—** ప్రకృతిజైః = ప్రకృతి (మాయ) నుండి పుట్టినవగు, ఏభిః త్రిభిః గుణైః = ఈ మూడుగుణములచేత, ముక్తమ్ = విడువబడిన, సత్త్వమ్ = వస్తువు, యత్ స్యాత్ = ఏదికలదో, తత్ = అది, పృథివ్యాం వా = భూలోకమందుగాని, పునః = తిరిగి, దివి = స్వర్గమునగాని, దేవేషు వా = దేవతలయందు గాని, న అస్తి = లేదు.

**తా:—** ప్రకృతి (మాయ) నుండి పుట్టినవగు ఈ మూడుగుణములతో గూడియుండని వస్తు వీభూలోకమునగాని, స్వర్గమందుగాని, దేవతలయందుగాని ఎచటనులేదు.

**వ్యాఖ్య:—** ముల్లోకములందలి ప్రతివస్తువున్ను సత్త్వరజస్తమస్సులను ఈమూడుగుణములతో గూడియుండుననియు, ఆ గుణములతో గూడియుండని వస్తువు (జీవన్ముక్తుడు తప్ప) ఏదియు ఈ ప్రపంచమున లేదనియు చెప్పుచున్నారు. జీవన్ముక్తులగు మహనీయులుతప్ప తక్కినవారందఱు ఏదియో యొక గుణముతోకాని, గుణములతో గాని గూడియున్నవారే. స్వర్గలోకములో నున్నవారున్ను

త్రిగుణములతో గూడినవారేయనియు, వానినుండి విడుదలపొందినవారు కాదనియు ఈ శ్లోకమున భగవానుడు చెప్పిరి. కాబట్టి వారున్ను బంధమునందున్నవారే. వారున్ను ఎప్పటికైనను జ్ఞానాదులను బడసి గుణరహితులు, ముక్తులు కావలసియున్నారు.

'ప్రకృతిజైః' - అని చెప్పినందువలన ఈ మూడు గుణములకు ఉత్పత్తిస్థానము ప్రకృతి, లేక మాయ (అజ్ఞానము) అని స్పష్టమగుచున్నది. ఈ మూడు గుణములలో ఏది యున్నను వారింకను ప్రకృతితో గూడియున్నవారేయని తాత్పర్యము. కావున రజస్తమస్సులను ప్రయత్నాతిశయముచేతను, అభ్యాసప్రాబల్యముచేతను దాటి సత్త్వగుణముయొద్దకు వచ్చి, క్రమముగ గుణాతీత ఆత్మస్థితిని బడయవలెను. అదియే మోక్షము.

ప్ర:- సత్త్వాది త్రిగుణములు దేనినుండి పుట్టినవి?

**ఉ:-** ప్రకృతినుండి (మాయనుండి, అజ్ఞానమునుండి).

ప్ర:- ఈ గుణములతో గూడని వస్తువేదైన ఈ ప్రపంచమున గలదా?

**ఉ:-** లేదు (జీవన్ముక్తుడు తప్ప).

ప్ర:- ఇట్టిస్థితి ఈ లోకమందేనా? లేక తదితర లోకములందుగూడనా?

**ఉ:-** స్వర్గాది ఇతర లోకములందును, దేవతలందును ఇదియే పరిస్థితి.

**అ॥** లోకములో జనులకు వారి వారి గుణములనుబట్టి కర్మములు విభజింపబడినవని తెలుపుచున్నాడు -

**41. బ్రాహ్మణ క్షత్రియవిశాం శూద్రాణాం చ పరన్తప!**
**కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః.**

**టీక:-** పరన్తప = శత్రువులను తపింపజేయు ఓ అర్జునా!, బ్రాహ్మణక్షత్రియవిశామ్ = బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు, శూద్రాణాం చ = శూద్రులకును, కర్మాణి = కర్మములు, స్వభావప్రభవైః = వారి వారి (జన్మాంతర సంస్కారము ననుసరించిన) స్వభావము (ప్రకృతి) వలనబుట్టిన, గుణైః = గుణములనుబట్టి, ప్రవిభక్తాని = వేఱువేఱుగా విభజింపబడినవి.

**తా:-** శత్రువులను తపింపజేయు ఓ అర్జునా! బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులకు వారి వారి (జన్మాంతర సంస్కారము ననుసరించిన) స్వభావము (ప్రకృతి) వలన పుట్టిన గుణములనుబట్టి కర్మలు వేఱువేఱుగా విభజింపబడినవి.

**వ్యాఖ్య:-** ఇదివఱలో 4వ అధ్యాయమున 13వ శ్లోకమందు చాతుర్వర్ణ్యములవారు వారివారి గుణములనుబట్టి కర్మలనుబట్టి సృష్టింపబడిరని భగవానుడు చెప్పియుండిరి*. ఇప్పుడును ఆ భావమునే

* చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః (4-13)

వ్యక్తీకరించుచు వారివారి జన్మాంతర సంస్కారము వలన నేర్పడిన గుణముల ననుసరించియే వారివారికి ఆ యా కర్మలు, (వానిననుసరించి ఆ యా వర్ణములు) విభజింపబడినవని తెలియజేయుచున్నారు. దీనినిబట్టి పుట్టుకతోనే జాతి ఏర్పడుటలేదనియు, వారి వారి గుణములనుబట్టియే జన్మ, కర్మలు ఏర్పడుచున్నవనియు స్పష్టమగుచున్నది. ఇట్టి పరిస్థితియందు ప్రతివానికిని ఊర్ధ్వస్థితికి బోవుటకు అవకాశము లభించుచున్నది. అనగా జన్మనా నీచజాతియందు పుట్టినప్పటికి తమ తమ కర్మలయొక్క శుద్ధత్వముచే, పారమార్థిక సాధనాతిశయముచే, పవిత్రతచే ఉత్తమవర్ణస్థులుగా తయారుకావచ్చును. ఈ ప్రకారముగ సర్వులకును ఆధ్యాత్మిక ఉన్నతశిఖరముల నధిరోహించుటకు అవకాశములు కల్పించుట గీతయొక్క ఒకానొక విశిష్టతయై యున్నది.

**ప్ర:–** బ్రాహ్మణాది వర్ణములు దేనిచే నేర్పడినవి?

**ఉ:–** వారి వారి గుణములచే.

**ప్ర:–** చాతుర్వర్ణ్యములవారికి కర్మ లేప్రకారముగ విభజింపబడినవి?

**ఉ:–** వారి వారి (జన్మాంతర సంస్కారము ననుసరించిన) స్వభావమువలన పుట్టిన గుణములను బట్టి ఆ యా కర్మలు వారికి విభజింపబడినవి.

**ప్ర:–** పుట్టుకచే జాతి ఏర్పడినదా?

**ఉ:–** కాదు. వారి వారి కర్మలచే.

**అ॥** అట్లు స్వభావమువలన కలుగు ఆ యా కర్మలను పేర్కొనుచున్నాడు –

**42. శమో దమ స్తపశ్శౌచం క్షాన్తి రార్జవమేవ చ**
**జ్ఞానం విజ్ఞానమా స్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్.**

**టీక:–** శమః = అంతరింద్రియనిగ్రహము (మనోనిగ్రహము), దమః = బాహ్యేంద్రియనిగ్రహము, తపః = తపస్సు, శౌచమ్ = శుచిత్వము, క్షాన్తిః = ఓర్పు, ఆర్జవమ్ ఏవ చ = ఋజుత్వము (కపటములేకుండుట, ఋజుమార్గవర్తనము), జ్ఞానమ్ = శాస్త్రజ్ఞానము, విజ్ఞానమ్ = అనుభవజ్ఞానము, ఆస్తిక్యమ్ = దైవమందు, గురువునందు, శాస్త్రమందు నమ్మకము (అనునవి), స్వభావజమ్ = స్వభావమువలన పుట్టిన, బ్రాహ్మంకర్మ = బ్రాహ్మణకర్మయై యున్నది.

**తా:–** అంతరింద్రియ నిగ్రహము (మనోనిగ్రహము), బాహ్యేంద్రియ నిగ్రహము, తపస్సు, శుచిత్వము, ఋజుమార్గవర్తనము, శాస్త్రజ్ఞానము, అనుభవజ్ఞానము, దైవమందు, గురువునందు, శాస్త్రమందు నమ్మకము గలిగియుండుట (అనునివి) స్వభావము వలన పుట్టిన బ్రాహ్మణకర్మయైయున్నది.

**వ్యాఖ్య:–** జ్ఞాన, విజ్ఞానముల రెండిటిని ముముక్షువు తప్పక గలిగియుండవలెనని భగవానుడు గీతయందు పెక్కుతావుల పేర్కొనుచున్నారు. కేవలము శాస్త్రజ్ఞానముచాలదు. అనుభవముగూడ నుండవలెను. అనుభవమువలననే మనుజునకు హృదయపరిణామము, ఆనందము కలుగుచుండును. మఱియు జనులకు పరమార్థవిషయములపై విశ్వాసమున్ను ఉదయించుచుండును. కాబట్టి ప్రతివారును

శాస్త్రజ్ఞానముతోబాటు అనుభవజ్ఞానమున్ను సంపాదించవలెను. ఈశ్లోకమున శమదమాదులను తొమ్మిది కర్మలు చెప్పబడియున్నవి. ఆ సత్కర్మల ననుష్ఠించువాడు బ్రహ్మణుడే యగునని భావము. ఇచట 'తపస్సని' చెప్పబడినదాని కర్థము 17వ అధ్యాయమున తెలుపబడిన శారీరక, వాచిక, మానసికతపస్సులే యని గ్రహించునది.

**ప్ర:-** ఏయే కర్మలు బ్రాహ్మణులకు స్వభావముగ నుండును? (లేక ఏయే కర్మలు బ్రాహ్మణత్వమును నిర్ణయించును)?

**ఉ:-** (1) అంతరింద్రియ నిగ్రహము (మనోనిగ్రహము) (2) బాహ్యేంద్రియ నిగ్రహము (3) తపస్సు (4) (బాహ్యాభ్యంతర) శుచిత్వము (5) ఓర్పు (6) ఋజుప్రవర్తన (7) శాస్త్రజ్ఞానము (8) అనుభవజ్ఞానము (9) ఆస్తికభావము (దేవునియందు, గురువునందు, శాస్త్రములందు విశ్వాసము) - అను ఈ తొమ్మిది కర్మలున్ను బ్రాహ్మణులకు స్వభావముగ నుండును. లేక, ఇవి కలవాడే బ్రాహ్మణుడనబడును.

**అ॥** క్షత్రియుల కర్మలను వివరించుచున్నాడు -

## 43. శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధేచాప్యపలాయనమ్
## దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్.

**టీక:-** శౌర్యమ్ = శూరత్వము (పరాక్రమము), తేజః = తేజస్సు, (కీర్తి = ప్రతాపము), ధృతిః = ధైర్యము, దాక్ష్యమ్ = సామర్థ్యము, యుద్ధే = యుద్ధమునందు, అపలాయనమ్ అపి చ = పాఱిపోకుండుటయు, దానమ్ = దానము, ఈశ్వరభావః చ = (ధర్మపూర్వక) ప్రజాపరిపాలనా శక్తియు (శాసకత్వము), స్వభావజమ్ = స్వభావమువలన పుట్టిన, క్షాత్రం కర్మ = క్షత్రియకర్మ (అయియున్నది).

**తా:-** శూరత్వము, తేజస్సు (కీర్తి, ప్రతాపము), ధైర్యము, సామర్థ్యము, యుద్ధము నందు పాఱిపోకుండుట, దానము, (ధర్మపూర్వక) ప్రజాపరిపాలనాశక్తి (శాసకత్వము) - ఇయ్యవి స్వభావమువలన పుట్టిన క్షత్రియకర్మయైయున్నది.

**వ్యాఖ్య:-** 'యుద్ధేచాప్యపలాయనమ్' యుద్ధమునందు పాఱిపోవుట క్షత్రియుని ధర్మముకాదనియు తెలుపబడినది. అయితే బాహ్యయుద్ధ మెపుడో యొకపుడు సంభవించును. కాని అంతర్యుద్ధము మోక్షపర్యంతము సర్వజీవులయందును జరుగుచునే యుండును. మంచికి చెడ్డకు, ధర్మమునకు అధర్మమునకు, దైవసంపదకు అసురసంపదకు సంగ్రామము హృదయమున నిరంతరము సాగుచునే యుండును. బలవత్తరమగు మాయతో జరుగు అట్టి యుద్ధమున ప్రతిమనుజుడు ఇట్టి క్షాత్రమునే ప్రదర్శించ వలసియుండును. అనగా మాయ (ప్రకృతి)తో జరుగుయుద్ధమున వెన్నుచూపరాదు. ముందు వేసిన అడుగును వెనుకకు త్రిప్పరాదు. బాహ్యయుద్ధమున క్షత్రియులు చూపు, ధైర్య, పరాక్రమములకంటె అధికతరములగు ధైర్యసాహసములను మనుజుడు తన అంతర్యుద్ధమున జూపవలసియుండును. అపుడే విజయము కరతలామలకమై జీవుడు మోక్షసామ్రాజ్యాభిషిక్తుడు కాగల్గును. కావున బ్రహ్మతేజము, క్షాత్రవీర్యము - అను నీ రెండిటిని జీవుడు సంపాదించవలసియున్నది. మఱియు లక్ష్యమగు ఆత్మసాక్షాత్కారము, జీవన్ముక్తి పొందువఱకు మనుజుడు వెనుకకు మఱలరాదు. ఇవ్విధమున 'యుద్ధేచాప్య

పలాయనమ్' అను ఈ క్షత్రియ ధర్మసూత్రమును ప్రతివాడును తన అంతర్యుద్ధమున అవలంబించి కృతార్థుడు కావలయును.

**ప్ర:–** క్షత్రియుని స్వభావజనిత కర్మలెవ్వి?

**ఉ:–** (1) శూరత్వము (2) తేజస్సు (కీర్తి, ప్రతాపము) (3) ధైర్యము (4) సామర్థ్యము (5) యుద్ధమునందు వెనుకకు మఱలకుండుట (6) దానము (7) ప్రజాపరిపాలనాశక్తి (శాసకత్వము) ఇవి క్షత్రియుని కర్మములు.

**అ॥** వైశ్య, శూద్రుల స్వభావజనిత కర్మలను నిరూపించుచున్నాడు –

## 44. కృషి గోరక్షవాణిజ్యం★ వైశ్యం కర్మ స్వభావజమ్
## పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్.

**టీక:–** కృషి = వ్యవసాయము, గోరక్ష = గోసంరక్షణము, వాణిజ్యం = వర్తకము, స్వభావజమ్ = స్వభావమువలనపుట్టిన (స్వభావసిద్ధమైన), వైశ్యంకర్మ = వైశ్యునికర్మమైయున్నది, అపి = మఱియు, పరిచర్యాత్మకమ్ = సేవారూపమైన, కర్మ = కర్మము, శూద్రస్య = శూద్రునకు, స్వభావజమ్ = స్వభావసిద్ధమైనది.

**తా:–** వ్యవసాయము, గోసంరక్షణము, వర్తకము వైశ్యునకు స్వభావజనితములగు కర్మలైయున్నవి. అట్లే సేవారూపమైన కర్మము శూద్రునకు స్వభావసిద్ధమై యున్నది.

**ప్ర:–** వైశ్యుని స్వభావజనిత కర్మలెవ్వి?

**ఉ:–** (1) వ్యవసాయము (2) గోసంరక్షణము (3) వర్తకము.

**ప్ర:–** శూద్రుని స్వాభావిక కర్మలెవ్వి?

**ఉ:–** సేవ.

**అ॥** వారి వారి స్వాభావిక కర్మలను చక్కగ నాచరించుటవలన జనులు జ్ఞానయోగ్యతారూపసిద్ధిని బడయగల్గుచున్నారని వచించుచున్నాడు –

## 45. స్వేస్వే కర్మణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః
## స్వకర్మ నిరతస్సిద్ధిం యథా విన్దతి తచ్ఛృణు. 45

**టీక:–** స్వే స్వే కర్మణి = (పైనదెల్పిన) తన తన స్వాభావిక కర్మమునందు, అభిరతః = ఆసక్తి (శ్రద్ధ) గల, నరః = మనుజుడు, సంసిద్ధిమ్ = జ్ఞానయోగ్యతారూపసిద్ధిని, లభతే = పొందుచున్నాడు, స్వకర్మనిరతః = స్వకీయకర్మమునం దాసక్తిగలవాడు, యథా = ఏ ప్రకారముగా, సిద్ధిమ్ = జ్ఞానయోగ్యతారూపసిద్ధిని, విన్దతి = పొందుచున్నాడో, తత్ శృణు = దానిని వినుము.

★ కృషిగౌరక్ష్యవాణిజ్యం – పాఠాన్తరము

**తా:–** తన తన స్వాభావిక కర్మమునందాసక్తి (శ్రద్ధ) గల మనుజుడు జ్ఞానయోగ్యతారూపసిద్ధిని బొందుచున్నాడు. స్వకీయకర్మయందాసక్తిగలవాడు జ్ఞానయోగ్యతారూపసిద్ధిని యెట్లు పడయగల్గునో దానిని చెప్పెదను వినుము.

**వ్యాఖ్య:–** వారివారి స్వాభావిక కర్మలను ఈశ్వరార్పితముగ, (లేక, ఫలాభిలాషా రహితముగ) చేయుటవలన మనుజుడు జ్ఞానయోగ్యతారూపసిద్ధిని పొందగలడని యిట వచింపబడినది. కర్మచే మోక్షసిద్ధి యెట్లు కలుగగలదని చాలమందికి సందేహము కలదు. ఆ సందేహమును భగవాను డిచటను, రాబోవు శ్లోకమందును తీర్చివైచిరి. కర్మను నిష్కామముగ నాచరించుటవలన చిత్తశుద్ధి కలుగగా దానిచే జ్ఞానమావిర్భవింప మనుజుడు మోక్షసిద్ధిని పొందగల్గుచున్నాడు. ఈ ప్రకారముగ కర్మ (పరంపరారూపమున) మోక్షసిద్ధికి హేతువగుచున్నది. కర్మయోగమందలి ఈగొప్ప రహస్యమును భగవాను డీప్రకారమగు గీతయందు ప్రస్ఫుట మొనర్చిరి.

**ప్ర:–** జ్ఞానయోగ్యతారూపసిద్ధిని మనుజుడెట్లు పొందగలడు?

**ఉ:–** తన తన స్వాభావిక కర్మను ఫలాభిసంధిరహితముగ, ఈశ్వరార్పణముగ, నిష్కామముగ నాచరించుటచే చిత్తశుద్ధి గలుగగా, దానిచే జ్ఞానయోగ్యత లభించుచున్నది.

**అ॥** స్వకీయ కర్మాచరణచే మనుజుడు జ్ఞానయోగ్యతారూపసిద్ధిని ఎట్లు బడయుగలడో వివరించుచున్నాడు –

## 46. యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వమిదం తతమ్
## స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః.

**టీక:–** యతః = ఎవనివలన, భూతానామ్ = ప్రాణులకు, ప్రవృత్తిః = ఉత్పత్తి మొదలగు ప్రవర్తనము (ప్రవృత్తి) - కలుగుచున్నదో), యేన = ఎవనిచేత, ఇదం సర్వం = ఈ సమస్తప్రపంచము, తతమ్ = వ్యాపింపబడియున్నదో, తమ్ = ఆతనిని (పరమాత్మను), మానవః = మనుజుడు, స్వకర్మణా = తనకర్మముచేత, అభ్యర్చ్య = ఆరాధించి, సిద్ధిమ్ = జ్ఞానయోగ్యతారూపసిద్ధిని, విన్దతి = పొందుచున్నాడు.

**తా:–** ఎవరివలన ప్రాణులకు ఉత్పత్తి మొదలగు ప్రవర్తనము (ప్రవృత్తి) కలుగుచున్నదో, ఎవరిచేత ఈ సమస్తప్రపంచము వ్యాపింపబడియున్నదో, వారిని (అట్టి పరమాత్మను), మనుజుడు స్వకీయ కర్మముచే నారాధించి జ్ఞానయోగ్యతారూపసిద్ధిని పొందుచున్నాడు.

**వ్యాఖ్య:–** 'యతః ప్రవృత్తిర్భూతానామ్' - ఎవరినుండి సమస్త ప్రాణికోట్లకు ఉత్పత్తి మొదలగునవి కలుగుచున్నవో. అని చెప్పుటవలన, సమస్తజీవులకును ఆధారభూతుడు ఆ పరమాత్మయే యని స్పష్టమగుచున్నది. జడమైన వస్తువు చైతన్యముయొక్క సహాయములేనిదే ఏమియు చేయజాలదు. జడమగు ప్రకృతి చిద్రూప పరమాత్మవలననే స్పందించుచున్నది. (మయాధ్యక్షేణప్రకృతిస్సూయతే స చరాచరమ్). కాబట్టి జీవులు తమ సమస్తమునకును కారణభూతుడైన ఆ పరాత్పరునియెడల అపారభక్తిశ్రద్ధలు గలిగి వారినే యారాధించుచు పరమశ్రేయము నొందవలెను.

'యేన సర్వమిదం తతమ్' - ఇదే వాక్యము గీతయందు మూడు పర్యాయములు ప్రయోగింపబడినది. 'దేనిచేత ఈ సమస్తప్రపంచము వ్యాపింపబడియున్నదో' అని దానియర్థము. పరమాత్మ సర్వవ్యాపకులై యుండుటవలన ఈ ప్రపంచమున వారు లేనిచోటు లేదని నిశ్చితమగుచున్నది. పాలలో వెన్నవలె వారు సర్వత్రవ్యాపించియున్నారు. స్థూలనేత్రమునకు వారు గోచరముకాకున్నను, జ్ఞాననేత్రమునకు సర్వత్ర గోచరించుదురు. ఈ ప్రకారముగ అణువణువునందును భగవంతుడు వ్యాపించియుండుటచే, సర్వ సాక్షియై సమస్తము పరికించుచుండుటచే జీవులాతని సాన్నిధ్యమును సర్వత్ర యనుభూతమొనర్చుకొనుచు, పాపకృత్యము లెవ్వియు చేయక, భక్తిభావ సమన్వితులై యుండవలెను.

'స్వకర్మణా తమభ్యర్చ్య' - మనుజుడు మోక్షసిద్ధిని కర్మాచరణముద్వారా ఎట్లు పొందగలడను ప్రశ్నకు భగవాను డిచట చక్కగ సమాధానమొసంగిరి - 'నీవు నీ కర్మ చేసికొనుచు దైవమును ఆరాధించుచుండుము, స్మరించుచుండుము, ఈశ్వరార్పణముగా నీ కర్మముల నాచరింపుము. అనగా నీ కర్మలద్వారా పరమాత్మను ఆరాధింపుము. అట్టిచో నీవు జ్ఞానసిద్ధిని, తద్ద్వారా మోక్షసిద్ధిని బడయగలవు' - అని భగవానుడిచట బోధించిరి. ఈ ప్రకారముగ కర్మను ఈశ్వరార్పణబుద్ధితో చేయునపుడే చిత్తశుద్ధిద్వారాయది జ్ఞానావిర్భావమునకు హేతువై మోక్షప్రదమగును. అట్లుకాక ఫలాభిలాషతో చేసినచో కర్మ మోక్షహేతువు కానేరదు. 'కర్మనుచేయుము కాని ఫలమును ఈశ్వరార్పణము గావింపుము' - ఇదియే కర్మద్వారా ఈశ్వరుని యారాధించుట. అనగా భగవత్ప్రీత్యర్థము కర్మలనాచరించవలెనని భావము.

కర్మచే మోక్షము లభించునా యని కొందఱు ప్రశ్నించుదురు. 'లభించును, కాని, దానిని చేయవలసిన పద్ధతిలో చేసిననే లభించును' అని తెలియవలెను. ఆపద్ధతి యేదియనిన, ఆ కర్మచే భగవంతుని అర్చించవలెను. అనగా ఆ కర్మనాచరించి తత్ఫలితమును భగవంతున కర్పించవలెను. నిష్కామముగ (భగవదర్పితముగ) కర్మాచరణ చేయవలెనని భావము. అత్తఱి కర్మయందలి దోషము తొలగిపోయి చిత్తశుద్ధిద్వారా యది మోక్షసాధనముగ పరిణమించును. ఇదియే కర్మమార్గమందుగల కీలకము. ఆ కీలకమును, ఆకర్మరహస్యమును భక్తులపై కరుణచే భగవంతు డిచట వెల్లడిచేసివైచిరి. 'ఓ జీవుడా!, కర్మ చేయుము. కాని ఈశ్వరార్పణబుద్ధితో చేయుము. ఆ కర్మచే ఈశ్వరుని యారాధించుము. ఫలితములను కోరకుము. కర్మచేయుటయే నీ వంతు. ఫలితమును భగవంతునకే అర్పింపుము' అని యిచట చక్కగ బోధింపబడినది. ఈ పద్ధతిద్వారా కర్మ తనకర్మత్వమును పోగొట్టుకొని, తన బంధరూపమును తొలగించుకొని మోక్షహేతువుగా మారిపోవుచున్నది. దీనినిబట్టి కర్మ నింద్యముకాదనియు, కర్మమార్గము నికృష్టముకాదనియు, దాని నాచరించుపద్ధతిని తెలిసికొనినచో అది తక్కిన భక్తిజ్ఞానాదులవలె పరమ పవిత్రమగు ఒకానొక మోక్షసాధనము కాగలదనియు ఈశ్లోకముద్వారా స్పష్టమగుచున్నది.

కాని 'స్వకర్మణా తమభ్యర్చ్య' (స్వకీయకర్మచే భగవంతుని ఆరాధించుట) - అను ఈ పద్ధతిని జనులు సరిగా గమనించక, దైవార్పితముగ కర్మలు చేయుట మాని కామ్యబుద్ధితో జేయుచున్నారు. అందువలన కర్మ బంధనరూపముగా మారిపోవుచున్నది. భగవానుడో, కర్మను మోక్షరూపముగ మార్చవచ్చునని తెలిపి దాని కిచట ఉపాయమునుగూడ సెలవిచ్చిరి. కాబట్టి ముముక్షువులెల్లరు ఈ సత్యమును జ్ఞాపకము నందుంచుకొని, ఈ భగవద్వాక్యములపై విశ్వాసముంచి తాము చేయు సమస్తకర్మలను ఈశ్వరార్పణబుద్ధితో, భగవత్కైంకర్యబుద్ధితో చేయవలయును. అట్లు చేసినచో 'సిద్ధింవిన్దతి మానవః' అనునట్లు మానవుడు జ్ఞానసిద్ధిని, మోక్షసిద్ధిని తప్పక బడయగలడని గీతాచార్యులు ఘంటాపథముగ తెలుపుచున్నారు.

ఈ శ్లోకమున కర్మ, భక్తి, జ్ఞానములయొక్క సముచ్చయము తెలుపబడినది. ఎట్లనిన -

1. కర్మనాచరించుట - (కర్మ)
2. దానిద్వారా భగవంతుని ఆరాధించుట (భక్తి)
3. అట్లు ఆరాధించుటచే చిత్తశుద్ధికలుగ జ్ఞానమావిర్భవించుట (జ్ఞానము)

కర్మయను ప్రమిదలో భక్తియను తైలమునుపోసి ధ్యానమను వత్తినిబెట్టి జ్ఞానమను జ్యోతిని వెలిగించవలెను.

**ప్ర:-** సమస్త ప్రాణికోట్లు ఎవనినుండి ఉత్పత్తిని బొందుచున్నవి?

**ఉ:-** పరమాత్మనుండి.

**ప్ర:-** ఈ ప్రపంచమంతయు ఎవనిచే వ్యాప్తమైయున్నది?

**ఉ:-** పరమాత్మచే.

**ప్ర:-** జీవుడు మోక్షసిద్ధిని యెట్లు పడయుగలడు?

**ఉ:-** స్వకీయకర్మచే భగవానుని ఆరాధించినచో, అనగా ఈశ్వరార్పణబుద్ధితో (నిష్కామముగ) కర్మలను ఆచరించినచో చిత్తశుద్ధిద్వారా జ్ఞానమును, దానిచే మోక్షమును బడయును.

**అ॥** స్వధర్మాచరణము చాల ఉత్తమమైనదని వచించుచున్నాడు -

## 47. శ్రేయాన్స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్
## స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్.

**టీక:-** స్వధర్మః = తనయొక్క ధర్మము, విగుణః (అపి) = (తన అవివేకముచే) గుణము లేనిదిగ కనబడినను (లేక, అసంపూర్ణముగ అనుష్ఠితమైనను), అనుష్ఠితాత్ = చక్కగా అనుష్ఠింపబడిన, పరధర్మాత్ = ఇతరుల ధర్మముకంటె (లేక ఇతర ధర్మములకంటె), శ్రేయాన్ = శ్రేష్ఠమైనది, స్వభావనియతమ్ = స్వభావముచే ఏర్పడిన (తన ధర్మమునకు తగిన), కర్మ = కర్మమును, కుర్వన్ = చేయుచున్నయెడల, కిల్బిషమ్ = పాపమును, న ఆప్నోతి = పొందడు.

**తా:-** తనయొక్క ధర్మము (తన అవివేకముచే) గుణములేనిదిగ కనబడినను (లేక, అసంపూర్ణముగ అనుష్ఠింపబడినను) చక్కగా అనుష్ఠింపబడిన ఇతరుల ధర్మముకంటె (లేక, ఇతర ధర్మములకంటె) శ్రేష్ఠమైనదే యగును. స్వభావముచే ఏర్పడిన (తన ధర్మమునకు తగిన) కర్మమును చేయుచున్నయెడల మనుజుడు పాపమును పొందనేరడు.

**వ్యాఖ్య:-** స్వకీయకర్మ, లేక తన ధర్మము ఆచరించుట ఒకింత కఠినమైనను, తేలికగా ఆచరింపబడినట్టి ఇతరుల కర్మను గ్రహించుటకంటె అది ఎంతయో మేలని చెప్పబడినది. కావున నిజధర్మమును ఒకింత కష్టమైనను వదలరాదు. స్వకీయ కర్మను పైశ్లోకమందు తెలుపబడిన చందమున ఈశ్వరార్పణబుద్ధితో చేసినచో మనుజుడు పాపమును బొందకుండును.

(లేక, ఇచట స్వధర్మమనగా ఆత్మకు సంబంధించిన ధర్మమనియు చెప్పవచ్చును. ఆత్మచింతనాదులు, ఆత్మధ్యానాదులు ఒకింత ప్రయాసముగా తోచినను, పరధర్మములైన దృశ్యవస్తుధర్మములను, లేక, దృశ్యవస్తుచింతనమును గ్రహించుటకంటె ఎంతయో మేలైనవి. ఆత్మచింతనాదులు (స్వధర్మము) ప్రారంభమున ఒకింత కష్టముగ తోచినను తుదకు అనంత సౌఖ్యమును ప్రసాదించును. దృశ్యవస్తువులు (పరధర్మము) ప్రారంభమున సుఖవంతములుగ తోచినను తుదకు పరమదుఃఖమునే కలుగజేయును. కావున పరధర్మముకంటె స్వధర్మమే మేలని చెప్పబడినది.)

**ప్ర:–** జీవునకు ఏ కర్మము, ఏ ధర్మము శ్రేష్ఠమైనది?

**ఉ:–** ఒకింతకష్టముగా తోచినను స్వకీయకర్మమే శ్రేష్ఠమైనది.

**ప్ర:–** దేనిచే మనుజుడు పాపమును బొందకుండును?

**ఉ:–** స్వభావముచే ఏర్పడిన కర్మమును, స్వధర్మమును (ఈశ్వరార్పణబుద్ధితో) చక్కగ నాచరించినపుడు పాపమును బొందకుండును.

**అ॥** స్వకీయకర్మము (స్వధర్మము) ఒకవేళ దోషముతో గూడియున్నదైనప్పటికిని దానిని వదలరాదని చెప్పుచున్నాడు –

## 48. సహజం కర్మ కౌన్తేయ! సదోషమపి న త్యజేత్
## సర్వారమ్భా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః.

**టీక:–** కౌన్తేయ = ఓ అర్జునా!, సహజమ్ = స్వభావసిద్ధమైన, కర్మ = కర్మము, సదోష మపి = దోషముతో గూడినదైనను (దృశ్యరూపమైనను, లేక, త్రిగుణాత్మకమైనను), న త్యజేత్ = విడువగూడదు, ధూమేన = పొగచేత, అగ్నిః ఇవ = నిప్పువలె, సర్వారమ్భాః = సమస్తకర్మములు, దోషేణ = (త్రిగుణములయొక్క) దోషముచేత, ఆవృతాః హి = కప్పబడియున్నవికదా!

**తా:–** ఓ అర్జునా! స్వభావసిద్ధిమగు కర్మము దోషయుక్తమైనను (దృశ్యరూపమైనను, లేక త్రిగుణాత్మకమైనను) దానిని వదలరాదు. పొగచేత అగ్ని కప్పబడునట్లు సమస్తకర్మములును (త్రిగుణములయొక్క) దోషముచేత కప్పబడియున్నవికదా!

**వ్యాఖ్య:–** కర్మ యనునది ఇంద్రియాదులచే చేయబడునదిగనుక దృశ్యమం దంతర్భూతమైనది. త్రిగుణాత్మకమైనది. ప్రకృతి (మాయ) యందు వర్తించునది. కనుకనే 'దోషేణ' అని చెప్పబడినది. కాబట్టి ఆత్మకాని దోషము, దృశ్యరూపమగు దోషము, త్రిగుణాత్మకమైన దోషము ప్రతికర్మయందును గలదు. అందుచేతనే 'సర్వారమ్భాహి' (సమస్తకర్మలును) అని తెలుపబడినది. కావున పొగచే అగ్ని కప్పబడి యుండునట్లు సమస్తకర్మలు (దృశ్యరూపములు కనుక) ఈ దృశ్యరూప దోషముచే గప్పబడియున్నవి. అయినను స్వభావసిద్ధములగు కర్మలను వదలరాదు. ఏలయనగా వానిని నిష్కామ బుద్ధితో, భగవదర్పితబుద్ధితో నాచరించినచో అవి చిత్తశుద్ధిద్వారా జ్ఞానమును, మోక్షమును గలుగజేయగలవు. అయితే పాపకార్యములను మాత్రము చేయరాదు. సమస్తకర్మములును 'మాయా' రూప దోషముచే

నావరింపబడియున్నప్పటికిని, అందు శుద్ధకర్మచే అశుద్ధకర్మను, పుణ్యకర్మచే పాపకర్మను, నిష్కామకర్మచే సకామకర్మను తొలగించివేసి ఆ పిదప క్రమముముగ సాధనాతిశయముచే ఇంకను పైకిపోయి నైష్కర్మ్యాత్మరూపమున చేరవలయును.

ఈ విషయమును మఱియొకదృష్టితో గూడ విచారించవచ్చును. వారువారు చేయుకొన్ని కార్యములందు పంచసూనాది అనివార్యదోషము లేర్పడుచుండును. జీవితయాత్రకై ఆ యా కార్యములను జనులు తప్పక చేయవలసియేయున్నారు. కావున ఆ యా దోషముల నివారణకై పంచవిధ ప్రాయశ్చిత్తము లేర్పడినవి.

| దోషము (పంచసూనములు) | ప్రాయశ్చిత్తము (పంచమహాయజ్ఞములు) |
|---|---|
| 1. ధాన్యమును ఉత్పత్తి చేయునపుడు సంభవించు ప్రాణిహింస | 1. బ్రహ్మయజ్ఞము - వేదాధ్యయనాదులను జేయుట |
| 2. విసరునపుడు | 2. పితృయజ్ఞము - పితృదేవతలను తర్పణాదులచే తృప్తిపఱచుట |
| 3. కట్టెలు నరకునపుడు వానిచే వంటవండునపుడు. | 3. దేవయజ్ఞము - హోమము మున్నగునవి చేయుట |
| 4. జలము తెచ్చునపుడు, కాచునపుడు | 4. భూతయజ్ఞము - ప్రాణులకు అన్నాదుల నొసంగుట |
| 5. ఊడ్చునపుడు | 5. మనుష్యయజ్ఞము - అతిథులను, బ్రహ్మనిష్ఠులను, దీనులను భోజనాదులచే తృప్తిపఱచుట. |

ఈ ప్రకారముగ కర్మలవలన గలుగు ఆ యా అనివార్యదోషములు పుణ్యకార్యములచే, నిష్కామకార్యములచే తొలగిపోగలవు. ఇంతియేకాక బ్రహ్మవిచారణ, ఆత్మధ్యానము మున్నగు మహోన్నత పవిత్రకార్యములచే జీవులందలి ప్రకృతి దోషములు లెస్సగ తుడిచిపెట్టుకొని పోగలవు. కావున వారి వారి స్వభావసిద్ధ కార్యమునందు ప్రకృతిజన్యములగు దోషములున్నప్పటికిని వానిని త్యజించక, నిష్కామబుద్ధితో వానినాచరించుచుండినచో క్రమముగ హృదయము నిర్మలమై జీవునకు జ్ఞానప్రాప్తి ఉత్తమ బ్రహ్మపదప్రాప్తి సిద్ధించగలవు.

**అ॥** 41వ శ్లోకమునుండి ఇంతవఱకు కర్మయోగమును గూర్చిన విచారణ గావించి, ఇక ఇక్కడనుండి జ్ఞానయోగమును గూర్చిన (సాంఖ్యయోగమును, లేక సన్న్యాసయోగమును) గూర్చిన విచారణను గావించుచున్నాడు -

**49. అసక్తబుద్ధిస్సర్వత్ర జితాత్మా విగతస్పృహః**
**నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి.**

**టీక:-** సర్వత్ర = సమస్తవిషయములందును, అసక్తబుద్ధిః = తగులుబాటు నొందని బుద్ధి గలవాడును (తనదనెడి అభిమానము లేనివాడును), జితాత్మా = మనస్సును జయించినవాడును (మనోనిగ్రహము గలవాడును), విగతస్పృహః = ఆశలేనివాడును (కోరికలు నశించినవాడును) (అగు మనుజుడు), సన్న్యాసేన = సంగత్యాగముచే (లేక కర్మఫలత్యాగముచే, లేక జ్ఞానమార్గముద్వారా), పరమామ్ = సర్వోత్కృష్టమైన, నైష్కర్మ్యసిద్ధిమ్ = నిష్క్రియమైన ఆత్మస్థితిని, అధిగచ్ఛతి = పొందుచున్నాడు.

**తా:–** సమస్తవిషయములందును తగులుబాటునొందని (అసక్తమగు) బుద్ధిగలవాడును, మనస్సును జయించినవాడును, కోరికలు లేనివాడునగు మనుజుడు సంగత్యాగముచే (జ్ఞానమార్గముచే) సర్వోత్కృష్టమైన నిష్క్రియాత్మస్థితిని పొందుచున్నాడు.

**వ్యాఖ్య:–** ఇంతవఱకు నిష్కామకర్మయోగమును ప్రతిపాదించుచువచ్చి ఇటనుండి జ్ఞానయోగ (సాంఖ్యయోగ) విచారణయందు **ప్రవేశించుచున్నారు.** కొన్ని సుగుణములు చెప్పి, అవి కలవాడు నిష్క్రియపరమాత్మస్థితిని బొందగల్గునని వచించుచున్నారు. అవి యేవియనగా (1) దేనియందును తగుల్కొనని బుద్ధిగలిగియుండుట (2) మనస్సును జయించుట (3) ఆశ లేకుండుట.

'సర్వత్ర' - అని చెప్పుటచే ఏవస్తువునందును, ఏ కాలమందును బుద్ధి తగుల్కొనరాదనియు, సర్వత్ర అసక్తుడై మెలగవలెననియు భావము. ఏలయనగా కొందఱు కొన్ని విషయములందు విరక్తులైయున్నను, కొన్నిటియందు ఆసక్తులై యుందురు. అట్లే కొందఱు ధ్యానకాలమందు అసక్తచిత్తులైయున్నను, బహిఃప్రపంచములో ప్రవేశించునపుడు విషయములందు సక్తత గలిగియుందురు. అట్టిదేమియు లేకుండుటకుగాను, 'సర్వత్ర' అని ఉపదేశింపబడినది.

'జితాత్మా' - తన మనస్సును జయించినవాడు ప్రపంచమునంతను జయించినట్లే. అట్లు మనస్సును జయించనివాడు ప్రపంచమునంతను జయించినను పరతంత్రుడేయగును. దుఃఖ మాతనిని వీడదు. కాబట్టి బయటి శత్రువులతోబాటు అంతఃశత్రువులనుగూడ జయించవలెను. లేనిచో 'భోక్తుర్గళే కణ్టకవత్ప్రతీతమ్' - అని శ్రీ శంకరులు చెప్పినట్లు, దుష్టమనస్సు 'భుజించువాని కంఠమున తగుల్కొనిన ముల్లువలె' బాధించును. కాబట్టి వివేకవంతులు ముందు తన మనస్సును, ఇంద్రియములను ప్రయత్నపూర్వకముగ జయించవలెను.

'విగతస్పృహః' - దృశ్యపదార్థముల వేనియందును కోరిక, ఆశ యుండరాదు. అపుడే మనస్సు బయటకుపరుగెత్తక అంతర్ముఖమై ఆత్మయందు నెలకొనును. చంచల చిత్తముచే ఆత్మానుభూతి యెన్నటికిని కలుగదు. చిత్తము నిశ్చలముగా నుండవలెననిన కోరికలు నశించవలెను. కనుకనే 'విగతస్పృహః' (ఆశ, కోరికలు లేకుండవలెను) అని చెప్పబడినది.

'నైష్కర్మ్యసిద్ధిమ్' - మోక్షము నిచట నైష్కర్మ్యస్థితియని వర్ణించిరి. అనగా సమస్తకర్మలు రహితమైన ఆత్మస్థితియని అర్థము. దేహము ఇంద్రియములు, మనస్సు అన్నిటిని దాటిన స్థితిగనుక అట్టి ఆత్మస్థితియందు కర్మ సంభవింపమి అద్దానిని నైష్కర్మ్యమని చెప్పిరి. అట్టి నైష్కర్మ్యరూపమగు ఆత్మస్థితి త్యాగము (సన్న్యాసము) చేతనే లభించునని ఇట తెలుపబడినది. దేని త్యాగము? కర్మఫలత్యాగము, విషయవాంఛా త్యాగము, సంగపరిత్యాగము. దీనినిబట్టి కర్మఫలత్యాగముచే, విషయాశాపరిత్యాగముచే క్రమముగ కర్మరహిత (నైష్కర్మ్య, లేక కర్మాతీత) మోక్షపదవి లభించగలదని స్పష్టమగుచున్నది.

'పరమామ్' - అని చెప్పుటచే ఆ యాత్మస్థితి అన్ని పదవులకంటెను, అన్ని సిద్ధులకంటెను శ్రేష్ఠతమమైనదని విదితమగుచున్నది.

**ప్ర:–** నైష్కర్మ్యసిద్ధియనగా నేమి?

**ఉ:–** నిష్క్రియ ఆత్మస్థితి, మోక్షము.

ప్ర:- అది యెట్లు లభ్యమగును?

ఉ:- (1) దేనియందును తగుల్కొనని బుద్ధిగలిగియుండుటచేతను (2) మనస్సును జయించుట చేతను (3) ఆశలు లేకుండుటచేతను (4) త్యాగబుద్ధి చేతను, (సర్వకర్మఫలత్యాగము, సంగపరిత్యాగముచేతను) అట్టి నైష్కర్మ్యరూపమోక్షస్థితి లభించును.

ప్ర:- ఆ మోక్షస్థితి యెట్టిది?

ఉ:- అన్ని సిద్ధులలోను, పదవులలోను ఉత్కృష్టమైనది.

ప్ర:- కర్మముచే నైష్కర్మ్యము (మోక్షము) నెట్లు పొందవచ్చును?

ఉ:- ఫలత్యాగపూర్వకముగ కర్మలనుచేయుటవలన చిత్తము శుద్ధమగుటచేతను, పైన దెల్పిన మనోనిగ్రహాదుల నభ్యసించుటచేతను జీవుడు క్రమముగ నైష్కర్మ్యస్థితిని (మోక్షమును) బొందగల్గుచున్నాడు.

## 50. సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాఽఽప్నోతి నిబోధ మే
## సమాసేనైవ కౌన్తేయ! నిష్ఠా జ్ఞానస్య యా పరా.

**టీక:-** కౌన్తేయ = ఓ అర్జునా! సిద్ధిమ్ = (నిష్కామకర్మయోగానుష్ఠానముచే కలుగు చిత్తశుద్ధిరూపమగు) కర్మసిద్ధిని, ప్రాప్తః = పొందినవాడు, యథా = ఏ ప్రకారముగ, బ్రహ్మ = పరమాత్మను, ఆప్నోతి = పొందుచున్నాడో, తథా = ఆ విధమును, జ్ఞానస్య = జ్ఞానముయొక్క, పరా = శ్రేష్ఠమైన, నిష్ఠా = (లేక పరాకాష్ఠ, పర్యవసానము), యా = ఏదికలదో (దానినిన్ని), సమాసేన ఏవ = సంక్షేపముగానే, మే = నా వలన, నిబోధ = తెలిసికొనుము.

**తా:-** ఓ అర్జునా! కర్మసిద్ధిని (నిష్కామకర్మలచే చిత్తశుద్ధిని) బడసినవాడు పరమాత్మ నే ప్రకారముగ పొందగలడో ఆవిధమును, మఱియు జ్ఞానముయొక్క శ్రేష్ఠమైననిష్ఠ (లేక పర్యవసానము) ఏది కలదో దానినిన్ని (జ్ఞాననిష్ఠను, లేక జ్ఞాన పరాకాష్ఠను) సంక్షేపముగ నావలన దెలిపికొనుము.

**వ్యాఖ్య:-** 'పరబ్రహ్మమును పొందు విధానమును, జ్ఞానముయొక్క పరాకాష్ఠను తెలుపబోవుచున్నానని భగవానుడు సెలవిచ్చుటవలనను గీత పరిసమాప్తము కాబోవుచున్నందున గీతాసారమంతయు సంక్షేపముగ (సమాసేనైవ) తెలుపబడనున్నందువలనను ఈ ఘట్టము అతిముఖ్యమైయున్నది. దీనిని ముముక్షువులు బహుజాగ్రతగ గమనింపవలయును. ఏలయనిన గీతసార మిచట తెలుపబడుచున్నది.

'సమాసేనైవ' - యుద్ధమారంభింపబడనున్నందున, ఇక అధికముగా చెప్పుటకు సమయము లేనందుచే సంక్షేపముగ తెలుపదలంచి యుండవచ్చును. లేక ఇంతవఱకు అనేక ధర్మరహస్యములను చెప్పెనుగావున, ఇక నధికముగ చెప్పనవసరములేదని యెంచి సారమంతను సంక్షేపముగ చెప్పదలంచి యుండవచ్చును. ఇపుడు చెప్పబోవు ఈ మూడుశ్లోకములున్ను 'గీతాసారమని', 'సంక్షిప్తగీత' యని ప్రసిద్ధికెక్కినవి.

**అ॥** పరబ్రహ్మమును పొందు విధానమునుగూర్చి, జ్ఞాననిష్ఠనుగూర్చి మూడుశ్లోకములద్వారా తెలుపుచున్నాడు -

**51. బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాఽఽత్మానం నియమ్య చ**
**శబ్దాదీన్విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ.**

**52. వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః**
**ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః.**

**53. అహఙ్కారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్**
**విముచ్య నిర్మమశ్శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే.**

**టీక:–** విశుద్ధయా = అతి నిర్మలమైన, బుద్ధ్యా = బుద్ధితో, యుక్తః = కూడినవాడును, ధృత్యా = ధైర్యముతో, ఆత్మానమ్ = మనస్సును, నియమ్యచ = నిగ్రహించి (స్వాధీనపఱచుకొని), శబ్దాదీన్ విషయాన్ = శబ్దస్పర్శాది విషయములను, త్యక్త్వా = విడిచిపెట్టి, రాగద్వేషౌ = రాగద్వేషములను, వ్యుదస్య చ = పరిత్యజించి, వివిక్త సేవీ = ఏకాంతస్థలములందు నివసించువాడును, లఘ్వాశీ = మితాహారమును సేవించువాడును, యతవాక్కాయమానసః = వాక్కును, శరీరమును, మనస్సును, స్వాధీనము చేసికొనినవాడును, నిత్యమ్ = ఎల్లప్పుడును, ధ్యానయోగ పరః = ధ్యానయోగతత్పరుడైయుండువాడును, వైరాగ్యమ్ = వైరాగ్యమును, సముపాశ్రితః = లెస్సగ నవలంబించినవాడును, అహంకారమ్ = అహంకారమును, బలమ్ = కామక్రోధాదులతో గూడిన బలమును (లేక మొండిపట్టును, లేక నేను బలవంతుడనను అభిమానమును, పశుబలమును), దర్పమ్ = డంబమును, కామమ్ = విషయాసక్తిని, క్రోధమ్ = కోపమును, పరిగ్రహమ్ = వస్తుసంగ్రహణమును, విముచ్య = బాగుగ వదలి, నిర్మమః = మమకారములేనివాడును, శాంతః = శాంతుడును (అయియుండువాడు), బ్రహ్మభూయాయ = బ్రహ్మస్వరూపుడగుటకు (బ్రహ్మైక్యమునకు), కల్పతే = సమర్థుడగుచున్నాడు.

**తా:–** అతినిర్మలమైన బుద్ధితోగూడినవాడును, ధైర్యముతో మనస్సును నిగ్రహించువాడును, శబ్దస్పర్శాది విషయములను విడిచిపెట్టువాడును, రాగద్వేషములను పరిత్యజించువాడును, ఏకాంతస్థలములందు నివసించువాడును, మితాహారమును సేవించువాడును, వాక్కును, శరీరమును, మనస్సును స్వాధీనముచేసికొనినవాడును, ఎల్లప్పుడును ధ్యానయోగతత్పరుడై యుండువాడును, వైరాగ్యమును లెస్సగ నవలంబించినవాడును, అహంకారమును, బలమును (కామక్రోధాది సంయుక్తమగు బలమును లేక మొండిపట్టును), డంబమును, కామమును (విషయాసక్తిని), క్రోధమును, వస్తుసంగ్రహణమును, బాగుగ వదలివైచువాడును, మమకారము లేనివాడును, శాంతుడును అయియుండువాడు బ్రహ్మస్వరూపము నొందుటకు (బ్రహ్మైక్యమునకు, మోక్షమునకు) సమర్థుడగుచున్నాడు.

**వ్యాఖ్య:–** ఈ మూడు శ్లోకములున్ను గీతాసారమని చెప్పబడును. తరించుటకు కావలసిన సాధన సంపత్తియంతయు వీనియందుగలదు. ఈ మూడు శ్లోకములందును తెలుపబడిన సాధనలను చక్కగ అనుష్ఠించినచో మనుజుడు బ్రహ్మసాక్షాత్కారమును (మోక్షమును) తప్పక పొందగలడు (బ్రహ్మభూయాయ

కల్పతే). సాధన విధానము, దానిఫలితమును రెండును ఇచట పేర్కొనబడినవి. బ్రహ్మైక్యరూపమగు మహోన్నత ఫలితమును గలుగజేయునవి యగుటవలన ముముక్షువు శ్రద్ధతో వానిని ఒక్కొక్కటిగ చక్కగ సాధించి, క్రమముగ అన్నిటిని సాధించవలెను.

'విశుద్ధయా' - 'శుద్ధయా' అని చెప్పక 'విశుద్ధయా' అని చెప్పుటవలన బుద్ధి ఒకింత శుద్ధముగానున్నచో చాలదనియు, మిక్కిలి శుద్ధముగా నుండవలెననియు స్పష్టమగుచున్నది. అత్యంతనిర్మలమైన అద్దమందే ముఖము స్పష్టముగ గోచరించునుగదా!

'ధృత్యా' - మనస్సు సామాన్యముగ లొంగునదికాదు. దానిని జయించుటకు, నిగ్రహించుటకు ఎంతయో ధైర్యమవసరము. ఆత్మ పిరికిపందలచే పొందబడునది కాదు.

'కశ్చిద్ధీరః' - అనునట్లు ధైర్యవంతుడే మనస్సును లొంగదీసికొని ఆత్మను బొందును.

'ఆత్మానం నియమ్య చ' - మనస్సును, ఇంద్రియములను నిగ్రహించనిచో అధ్యాత్మ క్షేత్రమున ఎవరును విజయశ్రీని జేబట్టజాలరు. సాధన క్రమములో మనస్సంయమము అత్యంత ప్రధానమైయున్నది. 'నియమ్య' అని చెప్పుటచే మనస్సును బాగుగ నిగ్రహించవలెనని ఆదేశించడమైనది.

'శబ్దాదీన్విషయాం స్త్యక్త్వా' - శబ్దాది దృశ్యవిషయములవెంట పరుగిడువారు ఆత్మానుభవము నెన్నటికిని బొందజాలరు. మనస్సు బహిర్ముఖత్వమునువీడి అంతర్ముఖమై ఆత్మధ్యానమందు నెలకొనియుండవలెను.

'వివిక్త సేవీ' - ఏకాంతస్థలమున నివసించవలెను. లేక గృహమందు ధ్యానమునకు ప్రతిబంధములేని ఒకానొక గదిని ఏర్పాటుచేసికొని అందు బ్రహ్మనిష్ఠాదులను జరుపుకొనవచ్చును. సాధనదశలో బహుజనమధ్యమున నుండినచో చిత్తమునకు విక్షేపము కలుగును. కావున ఏకాంతముగ ధ్యానాదులను శీలించవలెనని చెప్పబడినది.

'లఘ్వాశీ' - మితాహారమును గైకొనవలెను. అధికముగ భుజించుటవలన ఆరోగ్యము చెడుటయేగాక ధ్యానమున్ను సరిగా జరుగదు. శరీరము ఎంత తేలికగా నుండిన అంతమంచిది. అయితే కేవల శుష్కోపవాసాదులు పనికిరావు. యుక్తాహారవిహారుడై యుండవలెను. సాధకుడు ఆహారవిషయమై కడుజాగరూకుడై యుండవలెను. ఆహారము వలననే శరీరము, మనస్సు ఏర్పడునుకావున ధ్యానానుకూలమగు సాత్త్విక, మితాహారమునే సేవించవలెను. ఆధ్యాత్మిక సాధనరూప సౌధమునకు ఆహారనియమము పునాదివంటిది. కాబట్టి దానివిషయమైబహుజాగ్రతవహింపవలెను. ఇదివఱలో గీతయందు భగవానుడు దానిని గూర్చి పలుమార్లు హెచ్చరించియుండిరి. ఇపుడు గీత పరిసమాప్తమగుచున్నందువలన తిరిగి జ్ఞాపకముచేయుచున్నారు. గీతలోని 701 శ్లోకముల సారము 3 శ్లోకములలో ఇచట చెప్పబడుచున్నపుడు, ఆ శ్లోకములందు చేర్చబడు అంశములు (ఆహారసంయమాదులు) ఎంత ప్రధానమైనవో యోచించుకొనవచ్చును. కావున ఆహారవిషయమై జాగ్రతవహించుట చాల ముఖ్యమైనది.

'యతవాక్కాయమానసః' - వాక్కును, శరీరమును, మనస్సును అదుపులోనుంచుకొనవలయును. మదపుటేనుగును మావటివాడు అంకుశముచే స్వాధీనపఱచుకొనునట్లు సాధకుడు భక్తిజ్ఞానాదులచే, వివేకముచే పై మూడింటిని తన యధీనమందుంచు కొనవలెను. తాను చెప్పినట్లు అది నడువవలెనేకాని అదిచెప్పినట్లు తాను ఆడగూడదు.

'ధ్యానయోగపరోనిత్యం' - 'నిత్యం' అని చెప్పుటవలన ఎల్లపుడు ధ్యానశీలుడై, దైవచింతనాపరుడై

మఱియొకపుడు దృశ్యవిషయాదులందు విచ్చలవిడిగ తిరుగరాదని ఆదేశించడమైనది. ఇట్టిస్థితి ప్రారంభములో సాధ్యముకాకున్నను అభ్యాసముచే క్రమముగ సిద్ధించును. ధ్యానమునుండి బయటకువచ్చినపుడుకూడ ఆ ధ్యానకాలస్థ ప్రశాంత సాత్త్వికవాతావరణమునే కాపాడుకొనవలెను.

'వైరాగ్యం సముపాశ్రితః' - శ్రితః - ఆశ్రయించినవాడు

ఆశ్రితః - బాగుగ ఆశ్రయించినవాడు

ఉపాశ్రితః - ఇంకను బాగుగ ఆశ్రయించినవాడు

సముపాశ్రితః - లెస్సగ సంపూర్ణముగ ఆశ్రయించినవాడు.

'సముపాశ్రితః' అని చెప్పుటవలన వైరాగ్యమును పరిపూర్ణముగ లెస్సగ నాశ్రయించవలెనని బోధింపబడినది. ఏలయనగా మందవైరాగ్యయుతుని మాయ ఒక్క ఊపులో పడగొట్టివైచును★.

'బలమ్' - ఇచట 'బలమ్' అని చెప్పబడిన దానియర్థము దైవబలము, పరమార్థబలమనికాదు. అసురబలము, పశుబలము, కామక్రోధాదులబలము అనియే. లేక తాను బలవంతుడనను అభిమానమనియు చెప్పవచ్చును. వీనిని త్యజించివేయవలెను. సత్కార్యముల కుపయోగించు బలము ఉత్తమమైనది కాని దుష్కార్యముల కుపయోగించునది కాదు. మొండిపట్టుదలతో చూపబడుబలము త్యాజ్యమేయగును. కావున వానిని వదలి దైవబలముచే సంపాదించవలెను.

'కామం క్రోధమ్' - ఈ రెండును గీతలో చాలచోట్ల అన్నదమ్ములవలె కలసి వచ్చుచున్నవి. ఒకదానినొకటి విడిచివచ్చినచోట్లు గీతలో చాల అరుదుగా నుండును. ఏలయనగా, క్రోధమునకు పుట్టిల్లు కామము (కామాత్క్రోధోఽభిజాయతే). ఆ కామక్రోధముల రెండిటిని సమూలముగ ఛేదించివేయవలెను.

'పరిగ్రహమ్' - పరిగ్రహమనగా ఇతరులనుండి వస్తువులను స్వీకరించుట. తన దేహపోషణకు అవసరమైన భిక్షాదులు తప్ప తదితరములను సాధకుడు ఒరులనుండి గ్రహింపరాదు. అట్లు గ్రహించుటయే ఆ యా వస్తువునుగూర్చిన ఆశాదులచే చిత్తమునకు విక్షేపము గలుగుటయు ఇతరులకర్మ తనకు తగుల్కొనుటయు, భోగసామగ్రిచే సాధన చెడుటయు సంభవించును. కావున పరిగ్రహమును వదలివేయవలెను. అహంకారాది దుర్గుణములలో 'పరిగ్రహము'న్ను చేర్చబడుటబట్టి అదియు తక్కినవానివలె ప్రమాదకరమనియు, అనుపాదేయమనియు స్పష్టమగుచున్నది.

'విముచ్య' - అని చెప్పుటవలన పైనదెల్పిన అహంకారాది దుర్గుణము లన్నిటిని సంపూర్ణముగ విడనాడవలెనని బోధించినట్లైనది.

'బ్రహ్మభూయాయ కల్పతే' - ఈ చెప్పబడిన సాధనయందారితేరువారు వారెవరైనను సరియే బ్రహ్మప్రాప్తికి, మోక్షమునకు అర్హులే యగుదురు. వారు తప్పక బ్రహ్మానుభూతిని బడయగలరు. కాబట్టి ముముక్షువులు ఆ బోధలన్నిటిని చక్కగ కార్యాన్విత మొనర్చి బ్రహ్మప్రాప్తి నొందవలయును.

---

★ ఆపాతవైరాగ్యవతో ముముక్షూన్ భవాబ్ధిపారం ప్రతియాతుముద్యతాన్
ఆశాగ్రహో మజ్జయతేఽన్తరాలే నిగృహ్య కంఠం వినివర్త్య వేగాత్. (వివేకచూడామణి - శ్రీ శంకరాచార్యులవారు)
మందవైరాగ్యముగల ముముక్షువులను సంసారసాగరమున ఆశ యను మొసలి గట్టిగ కంఠము పట్టుకొని శీఘ్రముగ ముంచివైచుచున్నది.

ఈ మూడు శ్లోకములును గీతాసారమగుటవలనను, అతిముఖ్యములైనవి యగుట వలనను వీనిని ముముక్షువులు బాగుగ కంఠస్థముచేసి అర్థమును సదా మననముచేయుచు వానిని చక్కగ కార్యాన్వితమొనర్చి (మోక్షప్రాప్తి నొందుటద్వారా) కృతార్థులు కావలయును. వీనియందు కొన్ని గ్రహించవలసిన గుణములు, కొన్ని త్యజించవలసిన గుణములుకూడ చెప్పబడినవి. అనగా ఔషధము, పథ్యము రెండును తెలుపబడినవి రెండును సమకూడినపుడే భవరోగము కుదురును.

**ప్ర:–** బ్రహ్మసాక్షాత్కారమునకు (మోక్షప్రాప్తికి) ఏ యే సాధనలను జేయవలెను? ఎట్లు ప్రవర్తించవలెను?

**ఉ:–** (1) బుద్ధిని మిగుల నిర్మలముగా నొనర్చుకొనవలెను.

(2) ధైర్యముచే ఇంద్రియమనంబులను స్వాధీనము చేసికొనవలెను.

(3) శబ్దస్పర్శాది విషయములను త్యజించవలెను.

(4) రాగద్వేషములను విడిచిపెట్టవలయును.

(5) ఏకాంతస్థలము నాశ్రయించవలెను.

(6) మితాహారమును సేవింపవలెను.

(7) వాక్కును, శరీరమును, మనస్సును స్వాధీనమునందుంచుకొనవలెను.

(8) నిరంతరము ధ్యానయోగతత్పరుడై యుండవలెను.

(9) వైరాగ్యమును లెస్సగ నాశ్రయించవలెను (తీవ్రవైరాగ్యము గలిగియుండవలెను).

(10) అహంకారమును, దుష్టకార్యముల కుపయోగించు బలమును (లేక బలాభిమానమును) దర్పమును, కామమును, క్రోధమును, పరిగ్రహమును బాగుగ వదలివేయవలెను.

(11) మమకారమును పోగొట్టుకొనవలెను.

(12) శాంతచిత్తుడై యుండవలెను.

**ప్ర:–** ఇంద్రియమనంబులను ఏ ప్రకారము నిగ్రహించవలెను?

**ఉ:–** ధైర్యముతో.

**ప్ర:–** బ్రహ్మప్రాప్తికి (మోక్షమునకు) ఎవడు అర్హుడు?

**ఉ:–** పైన దెల్పిన సుగుణములుకలవాడు (ఆతడెవడైనను సరియే).

**అ॥** అట్లు బ్రహ్మరూపమును బొందిన మహనీయ డెట్లు ప్రవర్తించునో తెలుపుచున్నాడు –

**54. బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి**
**సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్.**

**టీక:–** బ్రహ్మభూతః = బ్రహ్మరూపమును (లేక) (బ్రహ్మైక్యమును) బొందినవాడు (జీవన్ముక్తుడు), ప్రసన్నాత్మా = నిర్మలమైన (ప్రశాంతమైన) మనస్సుగలవాడు (అగు మనుజుడు), న శోచతి = దేనిని గూర్చియు దుఃఖింపడు, న కాఙ్క్షతి = దేనినికోరడు, సర్వేషు భూతేషు = సమస్తప్రాణులందును, సమః = సమబుద్ధిగలవాడై (వానిని తనవలెనే చూచుకొనుచు), పరామ్ = ఉత్కృష్టమైన, మద్భక్తిమ్ = నాయందలి భక్తిని (సమస్తము బ్రహ్మమను భావమును), లభతే = పొందుచున్నాడు.

**తా:–** బ్రహ్మరూపమును (బ్రహ్మైక్యమును) బొందినవాడు (జీవన్ముక్తుడు), నిర్మలమైన (ప్రశాంతమైన) మనస్సుగలవాడు నగు మనుజుడు దేనిని గూర్చియు దుఃఖింపడు. దేనిని కోరడు. సమస్త ప్రాణులందును సమబుద్ధిగలవాడై (వానిని తనవలెనే చూచుకొనుచు) నాయందలి ఉత్తమ భక్తిని పొందుచున్నాడు.

**వ్యాఖ్య:–** నిర్మలచిత్తుడే బ్రహ్మసాక్షాత్కారము నొందగలడు. మలినచిత్తుడు కాదు. కనుకనే 'ప్రసన్నాత్మా' అని చెప్పబడినది. ఈ శ్లోకమునందు బ్రహ్మసాక్షాత్కారము నొందినవా డెట్లు ప్రవర్తించునో చక్కగ తెలుపబడినది. అట్టివాడు నిర్మలచిత్తుడై యుండి దేనిని గూర్చి దుఃఖింపక, దేనిని కోరక సర్వభూతముల యెడల సమబుద్ధిగలిగి (భూతదయగలవాడై) పరాభక్తియుతుడై వెలయుచుండును.

'న శోచతి న కాఙ్క్షతి' - దృశ్యప్రపంచమంతయు తనయందే (స్వాత్మయందే) కల్పితమైయున్నదని యెఱింగినవాడుకాబట్టి అతడిక దేనిని వాంఛించును? దేనికొఱకు దుఃఖించును? ఈ సత్యమునే ఈ క్రింది ఈశావాస్యోపనిషన్మంత్రము తెలుపుచున్నది.

**యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవాభూద్విజానతః**
**తత్ర కో మోహః కః శోక ఏకత్వ మనుపశ్యతః.** (ఈశావాస్యోపనిషత్)

'సమః సర్వేషు భూతేషు' - ఆత్మానుభూతి, బ్రహ్మానుభవము పొందినవానికి గుఱుతు సమస్తప్రాణికోట్లయందు సమభావముగల్గి తనవలెనే వానిని జూచుట. జ్ఞానప్రాప్తికి సర్వభూతదయ చిహ్నమైయున్నది. అదిలేనిచో పూర్ణజ్ఞానము, ఆత్మానుభవము ఇంకను కలుగలేదనియే అర్థము. కనుకనే బ్రహ్మప్రాప్తినొందిన మహనీయుడు సర్వప్రాణులందును సమబుద్ధి గల్గి, సర్వభూతహితుడై వర్తించుచుండునని భగవానుడు సెలవిచ్చిరి.

'మద్భక్తిం లభతే పరామ్' - అట్టి బ్రహ్మజ్ఞాని నాయొక్క పరాభక్తిని పొందుచున్నాడని చెప్పుటవలన భక్తియొక్క పరాకాష్ఠకు, జ్ఞానమునకు భేదములేదని తెలియుచున్నది.

భక్తి రెండు విధములు - (1) సామాన్యభక్తి (2) పరాభక్తి - అని. ఇందు రెండవదియగు పరాభక్తి కేవలము జ్ఞాననిష్ఠతో సమానము.

'స్వస్వరూపానుసంధానం భక్తి రిత్యభిధీయతే' - అను శంకరుల వచనప్రకారము ఆత్మతత్త్వానుసంధానమే పరాభక్తియొక్క లక్షణమగును. కావున పరాభక్తికి జ్ఞానమునకు భేదములేదు. మఱియు జ్ఞానమును పొందినవారికి అపరిమితమగు భక్తి ఉండియుండునను పరమసత్య మిచట వెల్లడియగుచున్నది. జ్ఞానికి ఆత్మదేవుని యెడల అనన్యభక్తి యుండును.

**ప్ర:–** బ్రహ్మసాక్షాత్కారమునొందిన మహనీయు డెట్లుండును?

**ఉ:–** (1) నిర్మల, శాంతమనస్కుడై యుండును. (2) దేనినిగూర్చి దుఃఖింపడు. (3) దేనిని కోరడు (4) సర్వభూతములందు (ప్రాణికోట్లయందు) సమభావముగలిగి వానిని తనవలెనే చూచుకొనుచుండును.

**ప్ర:–** అట్టి బ్రహ్మజ్ఞాని దేనిని పొందును?

**ఉ:–** ఉత్కృష్టమగు దైవభక్తిని (పరమాత్మయెడల అనన్యభక్తిని, పరాభక్తిని) పొందును.

**అ॥** భక్తిచే జ్ఞానము కలుగునని, జ్ఞానముచే మోక్షము లభించునని తెలుపుచున్నాడు -

## 55. భక్త్యా మామభిజానాతి యావాన్యశ్చాస్మితత్త్వతః
## తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్.

**టీక:–** భక్త్యా = భక్తిచేత, మామ్ = నన్ను, తత్త్వతః = యథార్థముగా, యావాన్ = ఎంతటివాడనో, యః చ అస్మి = ఎట్టివాడనో, అభిజానాతి = తెలిసికొనుచున్నాడు, తతః = దానినిబట్టి, మామ్ = నన్ను, తత్త్వతః = వాస్తవముగా, జ్ఞాత్వా = తెలిసికొని, తదనన్తరమ్ = తదుపరి, విశతే = (నాయందు) ప్రవేశించుచున్నాడు.

**తా:–** భక్తిచేత మనుజుడు 'నేనెంతటివాడనో, ఎట్టివాడనో' యథార్థముగ తెలిసికొనుచున్నాడు. ఈ ప్రకారముగ నన్నుగూర్చి వాస్తవముగా నెఱింగి అనంతరము నాయందు ప్రవేశించుచున్నాడు.

**వ్యాఖ్య:–** క్రిందటి శ్లోకమునందు జ్ఞానముచే భక్తికలుగుచున్నదని చెప్పబడెను. ఈశ్లోకమునందు భక్తిచే జ్ఞానముదయించుచున్నదని చెప్పబడుచున్నది. దీనినిబట్టి భక్తి జ్ఞానములు పరస్పర మొకదానినొకటి పరిపోషించుకొనుచున్నవని స్పష్టమగుచున్నది. భక్తి సర్వులకును సులభసాధ్యమగుటవలనను, భక్తిచే జ్ఞానముదయించుటవలనను గీతయందు దాదాపు ప్రతి అధ్యాయమందును భక్తిని గూర్చిన ప్రస్తావన చేయబడుచునేయున్నది. భక్తియను పుష్పమే జ్ఞానమను ఫలముగ మారుచుండును.

'మామభిజానాతి' - 'జానాతి' అని చెప్పక 'అభిజానాతి' యని చెప్పుటవలన భక్తిచే మనుజుడు భగవంతుని లెస్సగా తెలిసికొనగల్గుచున్నాడని భావము.

'తత్త్వతః' - భగవంతుని అనేకులు అనేకవిధములుగ నెఱింగుచున్నారుకాని యథార్థముగ నెఱుంగువారు చాల అరుదు. భక్తి చేతనో వారిని వాస్తవముగ తెలిసి కొనగల్గుచున్నారు.

'విశతే తదనన్తరమ్' - భగవత్స్వరూపమును, లేక ఆత్మస్వరూపమును, భక్తి ద్వారా యథార్థముగ తెలిసికొనిన పిమ్మట మనుజుడు ఆ స్వరూపమందు ప్రవేశించుచున్నాడు. అనగా లయించిపోవుచున్నాడు. అత్తఱి ఉప్పుకల్లు సముద్రమున లయించుచున్నట్లు ఆతడు బ్రహ్మమందు లయించి బ్రహ్మరూపుడుగనే శేషించుచున్నాడు.

**(జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరన్తప) (11-54)**

దీనినిబట్టి భగవంతుడెట్టివాడో బాగుగ తెలిసికొనిన పిదపయే వారియం దైక్యము సంభవించునుగాని అంతకుముందుకాదు అని 'అనన్తరమ్' అను పదముచే భగవానుడు స్పష్టపఱచిరి. అట్టి యథార్థ భగవద్జ్ఞానమో భక్తివలననే సిద్ధించుచున్నది. దీనినిబట్టి రెండు ప్రధానములగు అంశములు బోధపడుచున్నవి

(1) జ్ఞానముచేతనే ముక్తిలభించును.

(2) ఆ జ్ఞానము భక్తిచేతనే లభించును - అని.

కాబట్టి మోక్షమునకై భగవద్భక్తి సర్వజీవులకును అత్యావశ్యకమని తేలుచున్నది.

ప్ర:- భగవంతు డెట్టివాడో మనుజుడు దేనిచే తెలుసికొనగలడు?

ఉ:- భక్తిచే.

ప్ర:- అట్లు తెలిసికొనినపిదప ఆతడేమి చేయును?

ఉ:- భగవంతునియందు ప్రవేశించును. (దైవమందు విలీనుడగును) బ్రహ్మైక్యమునుబొందును.

ప్ర:- దీనినిబట్టి బ్రహ్మైక్యము దేనిచే సిద్ధింపగలగదని తెలియుచున్నది?

ఉ:- భగత్తత్త్వపరిజ్ఞానముచే. అట్టి తత్త్వజ్ఞానమో భక్తివలన గలుగుచున్నది. కాబట్టి భక్తిచే జ్ఞానము, జ్ఞానముచే మోక్షము జీవునకు సిద్ధించుచున్నవి.

అ॥ భగవంతుని ఆశ్రయించువానికి భగవదనుగ్రహముచే శాశ్వత మోక్షపదవి లభించగలదని చెప్పుచున్నాడు -

## 56. సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః
## మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్.

**టీక:-** సర్వకర్మాణి = సమస్తములైన కర్మములను, సదా = ఎల్లప్పుడు, కుర్వాణః అపి = చేయుచున్నవాడైనను, మద్వ్యపాశ్రయః = (కేవలము) నన్నే ఆశ్రయించువాడు (శరణుపొందియుండువాడు), మత్ప్రసాదాత్ = నాయనుగ్రహమువలన, అవ్యయమ్ = నాశరహితమగు, శాశ్వతం పదమ్ = శాశ్వతమోక్షపదమును, అప్నోతి = పొందుచున్నాడు.

**తా:-** సమస్తకర్మములను ఎల్లప్పుడును చేయుచున్నవాడైనను కేవలము నన్నే ఆశ్రయించువాడు (శరణుబొందువాడు) నా యనుగ్రహమువలన నాశరహితమగు శాశ్వత మోక్షపదమును పొందుచున్నాడు.

**వ్యాఖ్య:-** భక్తితోగూడి కర్మనాచరించుటవలన భగవదనుగ్రహము లభ్యమై జీవునకు మోక్షపదవి చేకూరుచున్నదని యిచట తెలుపబడినది. 'సర్వకర్మాణ్యపి' అని చెప్పబడినదాని యర్థము విధ్యుక్తములగు సమస్తకర్మములనియే కాని, దోషయుక్తములగు కర్మములుకూడ అనికాదు. ఏలయనిన అవి మొదటనే నిషిద్ధములైయున్నవి. సర్వేంద్రియములచే ఏ యే కర్మలు చేయుచున్నను భగవంతుని సదా స్మరించుచునేయుండువాడు, లేక ఆ యా కర్మఫలములను భగవదర్పణముచేయుచు నుండువాడు భగవదనుగ్రహమునకు పాత్రుడు కాగల్గును. దానిచే మోక్ష మాతనికి సులభముగ లభించుచున్నది. దీనినిబట్టి భక్తితోగూడి కర్మచేయుచో ఆ కర్మయే మనుజుని మోక్షపదమునకు గొనిపోగలదని స్పష్టమగుచున్నది. భగవంతుని ఆశ్రయించినవాడు ఒక కార్యముకాదు అనేక కార్యములను చేసినను బంధింపబడడు. అదియు ఎపుడో ఒకపుడు కాదు, నిరంతరము చేసినను బద్ధుడుకాడు. పైపెచ్చు

భగవదనుగ్రహమును బడసి దానిచే అవ్యయమోక్షపదమును బొందును. శిరస్సుపై ఉదకకుంభముంచుకొని నృత్యమొనర్చుస్త్రీ, నోటితో పాటపాడినను, చేతులతోను కాళ్ళతోను నాట్యవిన్యాసములనుగావించినను, ఆమె మనస్సు మాత్రము శిరస్సుపైగల నీటికుండ పైననే యుండునట్లు, సమస్త కార్యములను సదా చేయుచున్నను ఎవని మనస్సు భగవంతునిపైననే యుండునో సమస్త కార్యములను సదా చేయుచున్నను ఎవని మనస్సు భగవంతునిపైననే లగ్నమైయుండునో అతడు భగవదగ్రహమునకు పాత్రుడై ముక్తినొందగలడని యిచట వచింపబడినది.

దీనినిబట్టి కర్మ దైవస్మృతితో చేయబడినపుడే, లేక ఈశ్వరార్పణబుద్ధితో చేయబడినపుడుమాత్రమే మోక్షహేతువగునుగాని తదితర సమయములందు గాదని స్పష్టమగుచున్నది. అట్లు భగవంతుని ఆశ్రయింపక, ఫలములను ఈశ్వరార్పణము గావింపక చేయు కామ్యకర్మాదులచే జీవుడు బద్ధుడై మోక్షమును పొందజాలకుండును. కావున కర్మమార్గము నవలంబించు సాధకు లీవిషయము చక్కగా నెఱుంగవలెను.

'మత్ప్రసాదాత్' - భగవంతుని యనుగ్రహములేనిచో ఈ మాయాబంధమునుండి యెవడును తప్పించుకొనజాలడు. మాయాధీనులగు జనులు మాయాధీశుడగు ఈశ్వరుని యనుగ్రహమును పొందనిదే మాయను దాటజాలరు. (మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే). కావున ఆతని యనుగ్రహమును మొట్టమొదట సంపాదించవలెను. అది యెట్లు లభించును? భగవదాశ్రయముచే. సమస్తకర్మములను ఈశ్వరార్పణబుద్ధితో గావించుటచే. అట్టివారిని అతడు కరుణించి అనుగ్రహించునేకాని తదితరులనుగాదు. ఇట భగవంతుని పక్షపాతమేమియులేదు. ఎవరాతని నాశ్రయించుదురో వారి నత డనుగ్రహించును. అట్టి భగవదనుగ్రహముచే నతనికి ముక్తిపదవి లభించుచున్నది. కాబట్టి సర్వులును మొట్టమొదట భగవదాశ్రయ పూర్వకముగ, భగవత్ప్రీత్యర్థముగ కర్మలను చేయవలెను.

దానిచే లభించు మోక్షపదవి యెట్టిది? శాశ్వతమైనది. నాశరహితమైనది. దృశ్యపదార్థమెద్దియు శాశ్వతముకాదు; అది యెంతటి గొప్పదైనను సరియే. అది దేశకాలములకు లోబడియే యుండును. కాబట్టి అట్టి మహోన్నత నిత్యపదవికై, సర్వోత్కృష్ట దైవపదమునకై సర్వులును నిష్కామకర్మ భక్త్యాదులద్వారా యత్నించవలయును.

**ప్ర:**— మోక్ష మెట్టిది?

**ఉ:**— శాశ్వతమైనది, నాశరహితమైనది.

**ప్ర:**— అదియెట్లు లభించును?

**ఉ:**— భగవదనుగ్రహముచే (మత్ప్రసాదాత్).

**ప్ర:**— భగవదనుగ్రహ మెట్లు లభించును?

**ఉ:**— సమస్తకార్యము లాచరించుచుండినను భదవంతుని ఆశ్రయించి భగవత్స్మరణగలిగి యుండినచో, లేక భగవత్ప్రీత్యర్థముగా ఆ యా కర్మలను చేయుచుండినచో లభించును.

**ప్ర:**— మోక్షమునొందుటకు కర్మ[illegible]

**ఉ:–** లేదు. అన్ని కార్యములను నిరంతరము చేయుచున్నను, భగవంతునియందు మనస్సులగ్నమై యున్నచో వారి యనుగ్రహమువలన జీవునకు శాశ్వతమగు మోక్షము చేకూరగలదు కావున భగవద్భక్తి, నిష్కామకర్మాచరణము ఆవశ్యకములై యున్నవి.

**ప్ర:–** కర్మల నేప్రకార మాచరింపవలెను?

**ఉ:–** భగవంతుని ఆశ్రయించి కర్మలను భగవత్ప్రీతికరములుగ, నిష్కామముగ, ఈశ్వరార్పణముగ గావించవలెను.

**ప్ర:–** అట్టి భక్తిపూర్వక నిష్కామకర్మాచరణముచే ఏమి లభించును?

**ఉ:–** భగవదనుగ్రహము, అట్టి యనుగ్రహముచే మోక్షము లభించును.

**అ॥** సమస్త కర్మములను భగవదర్పణముచేసి చిత్తమును సదా ఆ పరమాత్మ యందే నెలకొల్పవలెనని వచించుచున్నాడు –

## 57. చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః
## బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తస్సతతం భవ.

**టీక:–** సర్వకర్మాణి = సమస్తకర్మలను (కర్మఫలములను), చేతసా = వివేకముతో గూడిన బుద్ధిచేత, మయి = నాయందు, సన్న్యస్య = సమర్పించి, మత్పరః = నన్నే పరమప్రాప్యముగా నెంచినవాడవై, బుద్ధియోగమ్ = చిత్తైకాగ్రతతో గూడిన తత్త్వవిచారణము (లేక, ధ్యానయోగమును), ఉపాశ్రిత్య = అవలంబించి, సతతమ్ = ఎల్లప్పుడును, మచ్చిత్తః = నాయందే చిత్తమును జేర్చినవాడవు, భవ = కమ్ము.

**తా:–** సమస్త కర్మములను (కర్మఫలములను) వివేకయుక్తమగు బుద్ధిచేత నాయందు సమర్పించి, నన్నే పరమప్రాప్యముగా నెంచినవాడవై చిత్తైకాగ్రతతో గూడిన తత్త్వవిచారణను (లేక ధ్యానయోగమును) అవలంబించి ఎల్లప్పుడు నాయందే చిత్తమును నిల్పుము.

**వ్యాఖ్య:–** 'చేతసా' – శరీరముతో సమస్తకర్మలు చేయుచున్నను మనస్సుతో ఆ కర్మలన్నిటిని, భగవంతునికే అర్పించి వారియందే మనస్సును సంలగ్న పఱచవలెను. 'చేతసా' అని చెప్పుటవలన కర్మఫలసన్న్యాసమే ఇట బోధింపబడినది కాని కర్మసన్న్యాసము కాదు. శరీరము నిశ్చలముగానుండి ఏకర్మచేయకున్నను మనస్సు ప్రపంచములో తిరుగుచున్నచో దానివలన ఇసుమంతైనను ప్రయోజనములేదు. అట్లుకాక, శరీరముతో అనేక కర్మలు చేయుచున్నను మనస్సుతో ఆ కర్మలను, కర్మఫలములను ఈశ్వరార్పణముగావించినచో అది మోక్షహేతువగును. కనుకనే ఇచట 'చేతసా' (చిత్తముతో) అని చెప్పబడినది.

'బుద్ధియోగమ్' – ప్రీతితో భక్తిపూర్వకముగ తన్ను భజించువారికి 'బుద్ధి యోగము' నొసంగెదనని 10వ అధ్యాయమున భగవానుడు తెలిపియుండిరి. (దదామి బుద్ధియోగం తమ్). అనగా చిత్తైకాగ్రత, తత్త్వవిచారణాశక్తి ఆతనికి భగవత్కృపచే కలుగును. అద్దానిని లెస్సగ నాశ్రయించి నిరంతరము చిత్తమును ఆ పరమాత్మయందే నెలకొల్పుమని యిచట చెప్పబడినది. 'సతతమ్' అని వచించుటవలన ఏకాలమందును

దైవవిస్మృతి కలుగనీయక నిరంతము చిత్తము ఆత్మయందే (దైవమందే) యుండులాగున ప్రయత్నించవలసియున్నది. ఏలయనిన, మాయ జీవుని పడగొట్టుటకు కాచుకొనియున్నది. అతడేమాత్రమొకింత అజాగ్రతగనున్నప్పటికిని అది యాతని నావరించివైచి తమస్సులో, (అజ్ఞానములో) విషయసుఖములలో పడవేయుటకు సిద్ధముగ నున్నది కావున సాధకులు 'సతతమ్' అను ఈ పదమును జ్ఞప్తియందుంచుకొని దైవవిస్మృతి ఏ మాత్రము కలుగకుండులాగున చూడవలెను.

'మత్పరః' - ప్రపంచమందలి సమస్త దృశ్యపదార్థములు నశ్వరములు. కావున విజ్ఞుడగువాడు శాశ్వతుడగు ఒక్క పరమాత్మనే పరమగమ్యముగ, పరమప్రాప్యముగ నెంచుకొనవలెను.

**ప్ర:–** పరమాత్మను పొందుటకై జీవు డేమి చేయవలెను?

**ఉ:–** (1) చిత్తముతో సమస్తకర్మములను భగవంతున కర్పించవలెను.

(2) వారినే పరమప్రాప్యముగ నెంచుకొనవలెను.

(3) బుద్ధియోగమును (చిత్తైకాగ్రతాపూర్వకవిచారణను) లెస్సగ నవలంబించవలెను.

(4) భగవంతునియందే నిరంతరము చిత్తమును సంలగ్న మొనర్పవలెను.

**ప్ర:–** భగవానుడు కర్మసన్న్యాసమును బోధించెనా, కర్మఫలసన్న్యాసమునా?

**ఉ:–** 'చేతసా' (చిత్తముతో సమస్త కర్మలను భగవంతునకర్పించి) అని చెప్పుటవలన శరీరముతో కర్మలను చేయుచున్నను, మనస్సుతో వానివాని ఫలములను ఈశ్వరార్పణముగావించవలెననియే బోధింపబడినదగును. కావున కర్మఫలసన్న్యాసమే ఇట వివక్షితముగాని కర్మసన్న్యాసముకాదు.

**ప్ర:–** మనుజుడు దేనిని పరమప్రాప్యముగ నెంచుకొనవలెను? ఎందుచేత?

**ఉ:–** పరమాత్మను; వారు శాశ్వతులు కనుక.

**ప్ర:–** నిరంతరము చిత్తము దేనియందు సంలగ్నమై యుండవలెను?

**ఉ:–** పరమాత్మయందు.

**అ॥** ఈ ప్రకారముగ భగవంతునియందు చిత్తమును నెలకొల్పువారికి భగవదనుగ్రహముచే సమస్తదుఃఖములు తొలగిపోగలవని వచించుచున్నాడు -

**58. మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి**
**అథ చేత్త్వమహఙ్కారాన్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి.**

**టీక:–** మచ్చిత్తః = నాయందు చిత్తమును జేర్చినవాడవైతివేని, మత్ప్రసాదాత్ = నాయనుగ్రహమువలన, సర్వదుర్గాణి = సమస్త సాంసారికదుఃఖములను (దాటుటకు కష్టసాధ్యములైన కష్టములను, ప్రతిబంధములను), తరిష్యసి = దాటగలవు, అథ = ఇక (అట్లుగాక), త్వమ్ = నీవు,

అహంకారాత్ = అహంకారమువలన, న శ్రోష్యసి చేత్ = (నా యీ వాక్యములను) వినకుందువేని, వినజ్ఞ్యసి = చెడిపోదువు.

**తా:—** నాయందు చిత్తమును జేర్చినవాడవైతివేని నా యనుగ్రహమువలన సమస్త సాంసారికదుఃఖములను దాటగలవు. అట్లుగాక అహంకారమువలన నా యీ వాక్యములను వినకుందువేని చెడిపోదువు.

**వ్యాఖ్య:—** లోకములో ప్రతివారును తమకు దుఃఖములెవ్వియును కలుగగూడదనియు, సుఖములే కలుగవలెననియు వాంఛించుదురు. కాని అందులకై, ఏ సాధన చేయవలెనో దానినిమాత్రము చేయరు. ఆ సాధన యెద్దియో భగవానుడే యిచట భక్తులపై కరుణచే తెలిపివైచిరి. సర్వేశ్వరునియందు ఎవరు తమ చిత్తమును లగ్నమొనర్చుదురో అనగా ఎవరు తమ చిత్తమును దృశ్యమందుంచక, విషయములందు సంచరింపనీయక ఆత్మయందే (భగవంతునియందే) కేంద్రీకరించుదురో, అట్టివారికి భగవదనుగ్రహము వలన సమస్తదుఃఖములు, ఆటంకములును నశించిపోవును. 'సర్వ' అను పదమును ప్రయోగించుటవలన ఏవియో కొన్ని ఆపత్తులుమాత్రము నశించుటకాదనియు భగవద్భక్తులకు సమస్త ఆపదలు, దుఃఖములు తొలగిపోవుననియు భావము. ఇట్టి స్థితియేకదా ప్రతివారును కోరునది! జీవులపై కరుణచే భగవాను డీ ప్రకారముగ తెలియజేయుచున్నారు - 'ఓ జీవులారా! మీ చిత్తమును నాయందు (ఆత్మయందు, భగవంతునియందు) లగ్నము చేయుడు. దానికి ప్రతిఫలముగ నేను మీయొక్క సమస్తసాంసారికదుఃఖము లను, ఆటంకములను పారద్రోలెదను!' కాబట్టి భగవద్వాక్యములపై పరిపూర్ణవిశ్వాసముంచి మనుజులు భక్తిభావసమన్వితులై, దైవసంలగ్నచిత్తులై - మెలగవలయును.

'దుర్గాణి' - దుర్గమనగా కోట, ప్రతిబంధము అని అర్థము. మాయ జీవుని చుట్టును పెక్కు అడ్డుగోడలను, దుఃఖములను, ఆటంకములను, విఘ్నములను ఏర్పాటుచేసియుంచినది. సంసారశృంఖములచే జీవుని కట్టివైచినది. అట్టి దుర్గములను భేదించుటకు లౌకిక ఉపాయములు పనికిరావు. మాయను భేదింపవలెనన్న మాయాధీశుడే శరణ్యము. కావున దుఃఖరాహిత్యమునకై సుఖానుభూతికై పరమాత్మయొక్క చరణారవిందములను పట్టుకొనుటయే, పరమాత్మను ధ్యానించుటయే జీవులకు ఏకైకమార్గము. వేఱుదారిలేదు.

'మత్ప్రసాదాత్' - నా యనుగ్రహముచే దుఃఖమును దాటగలవు. భగవానునకు అందఱును సమానులే అయియున్నప్పటికిని ఎవరు వారిని భక్తిపూర్వకముగ ధ్యానింతురో, సేవింతురో, అట్టివారియెడల మాత్రమే వారు తమయనుగ్రహమును జూపుదురు. గాలి అంతటను వీచుచున్నను ఎవరు తెరచాప నెత్తుదురో వారి పడవ మాత్రమే కదలును. చెట్టుక్రిందకు ఎవరు వెళ్ళుదురో వారికిమాత్రమే చెట్టు నీడ యొసంగును. కాబట్టి సుఖానుభూతి కావలసియున్నచో భగవంతుని ఆశ్రయించుటతప్ప వేఱొక ఉపాయ మెద్దియును లేదు.

ఒకవేళ యెవరైన అహంకారముచేగాని, ధనమదముచేగాని, అధికారగర్వముచేగాని భగవానుని ఈవాక్యములపై విశ్వాసము లేకయుండినచో, లేక ఈ వాక్యములను వినకుండినచో వారుచెడిపోవుదురనియు, సంసారకూపముననే పడి నానాబాధల నొందుదురనియు నిచట తెలుపబడినది. కావున దైవవాక్యములపై శ్రద్ధగలిగి తదనురీతి యాచరించి తరించుట జీవుల కర్తవ్యము.

**ప్ర:—** జీవునకు సమస్త సాంసారికదుఃఖములు ఎట్లు నశించగలవు?

**ఉ:–** భగవంతునియందు చిత్తమును సంలగ్నపఱచి, భగవత్పరాయణుడై యున్నచో ఆపత్తు లన్నియు అతనికి తొలగిపోగలవు.

**ప్ర:–** అట్లు భగవద్వాక్యములను విననిచో వారిగతి యేమగును?

**ఉ:–** వారు చెడుపోవుదురు. సంసారదుఃఖములపాల్బడుదురు.

**ప్ర:–** వారట్లు వినకుండుటకు కారణమేమి?

**ఉ:–** అహంకారముచే, గర్వముచే ప్రేరితులై వారట్లు వినకుందురు.

**అ॥** ఒకవేళ అహంకారముచే నా వాక్యములను వినక 'నేను యుద్ధముచేయ' నని నీవు చెప్పినను ప్రకృతియే నీచే యుద్ధము చేయించునని భగవానుడు అర్జునునితో పలుకుచున్నాడు -

## 59. యద్యహఙ్కారమాశ్రిత్య★ న యోత్స్య ఇతి మన్యసే
## మిథ్యైష వ్యవసాయ స్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి.

**టీక:–** యది = ఒకవేళ, అహంకారమ్ = అహంకారమును, ఆశ్రిత్య = అవలంబించి, న యోత్స్యే ఇతి = యుద్ధముచేయనని, మన్యసే (చేత్) = తలంచెదవేని, ఏషః తే వ్యవసాయః = ఈ నీ ప్రయత్నము, మిథ్యా = వ్యర్థమైనదియే యగును, ప్రకృతిః = నీ (క్షత్రియ) స్వభావమే, త్వామ్ = నిన్ను, నియోక్ష్యతి = (యుద్ధమున) నియోగింపగలదు.

**తా:–** ఒకవేళ అహంకారము నవలంబించి 'నేను యుద్ధముచేయను' అని నీవు తలంచెదవేని అట్టి నీ ప్రయత్నము వ్యర్థమైనదియే యగును. (ఏలయనిన) నీ (క్షత్రియ) స్వభావమే నిన్ను (యుద్ధమున) నియోగింపగలదు.

**వ్యాఖ్య:–** కర్తృత్వమునువీడి, క్షత్రియోచితమగు ధర్మయుద్ధమును గావింపుమని అర్జునునకు భగవాను డిదివఱలో తెలిపియుండిరి. ఇపుడు 'ఓ అర్జునా! అహంకారము వలన నా యీ వాక్యములను ఉల్లంఘించినచో అది నీయొక్క వ్యర్థప్రయత్నమే కాగలదు. ఏలయనిన, నీ క్షత్రియసంబంధ ప్రకృతియే, స్వభావమే బలాత్కారముగ నిన్ను యుద్ధమున దింపగలదు'. అని భవిష్యద్జ్ఞానముగల పరమాత్మ వచించిరి.

**అ॥** మనుజుడు తానొకపనిని చేయగూడదనుకొనినను తన స్వాభావిక కర్మప్రభావముచే నద్దానిని చేసియే తీరునని వచించుచున్నాడు -

## 60. స్వభావజేన కౌన్తేయ! నిబద్ధస్స్వేన కర్మణా
## కర్తుం నేచ్ఛసి యన్మోహా త్కరిష్యస్యవశోఽపి తత్.

**టీక:–** కౌన్తేయ = ఓ అర్జునా!, స్వభావజేన =స్వభావము (పూర్వజన్మసంస్కారము)చే గలిగిన (ప్రకృతిసిద్ధమైన), స్వేన = నీయొక్క, కర్మణా = కర్మముచేత, నిబద్ధః = లెస్సగ బంధింపబడినవాడవై,

★ యదహంకారమాశ్రిత్య = పాఠాన్తరము.

మోహాత్ = అవివేకమువలన, యత్ = దేనిని (ఏ యుద్ధమును), కర్తుమ్ = చేయుటకు, న ఇచ్ఛసి = ఇచ్ఛగింపవో, తత్ అపి = దానినిగూడ, అవశః అపి = పరాధీనుడవై (కర్మాధీనుడవై), కరిష్యసి = చేయగలవు.

**తా:–** ఓ అర్జునా! స్వభావము (పూర్వజన్మసంస్కారము) చే గలిగిన (ప్రకృతిసిద్ధమైన) నీయొక్క కర్మముచే లెస్సగ బంధింపబడినవాడవై దేనిని చేయుటకు అవివేకమున నిచ్ఛగింపకున్నావో దానిని పరాధీనుడవై (కర్మాధీనుడవై) తప్పక చేసియే తీరుదువు.

**వ్యాఖ్య:–** 'నిబద్ధః' - మనుజుడు తన కర్మచేతనే తాను బంధింపబడియున్నాడు. 'బద్ధః' అనిచెప్పక 'నిబద్ధః' అని చెప్పుటవలన లెస్సగ బంధింపబడియున్నాడని భావము. పూర్వజన్మసంస్కారము అర్జునునకు యుద్ధముచేయునదిగా నుండియున్నదని త్రికాలజ్ఞులగు భగవానుడు తెలిసికొనిరి. కావుననే 'నేను యుద్ధముచేయను. అని నీవనుకొనినను సంస్కారప్రభావముచే 'యుద్ధము చేసియే తీరుదువు' అని అర్జునునకు ధైర్యముగ తెలియజేయగల్గిరి. ఇంతమాత్రముచేత పురుషప్రయత్నము వ్యర్థమని యెవరును తలంపరాదు. మనుజునకు (1) పూర్వజన్మసంస్కారము (2) ఇహజన్మ పురుషప్రయత్నము అని రెండుకలవు. ఈ రెండింటికిని నిరంతరము జీవునియందు సంఘర్షణ జరుగుచునే యుండును. అందు ఇహజన్మ పురుషప్రయత్నము అధికముగా నున్నచో పూర్వజన్మ సంస్కారము జయించివేయబడును. ప్రతివారికిని వారి పూర్వజన్మసంస్కార మెట్లున్నదో తెలియదు గనుక తీవ్రపురుషప్రయత్నముచే ఈ జన్మమందు దైవిక సంస్కారములనే అలవాటు చేసికొనినచో పూర్వదుస్సంస్కారము లేవైనయున్నచో అవియన్నియు వానిచే జయించివేయబడును. ఇప్పటి ప్రయత్నము అధికముగ లేనిచో పూర్వసంస్కారములే జయించును కావున జీవుడు బహుజాగరూకుడై ప్రయత్నపూర్వకముగ దైవసంస్కారములను అభ్యసించవలెను.

**ప్ర:–** మనుజుడు దేనిచేత బంధింపబడియున్నాడు?

**ఉ:–** తన పూర్వజన్మ కర్మచే.

**ప్ర:–** దేనిచే ముక్తుడగును?

**ఉ:–** ఇహజన్మయందలి సత్కర్మపూర్వక పురుషప్రయత్నముచే.

**అ॥** ఈశ్వరుడు తనమాయచే సమస్తభూతములను కీలుబొమ్మలనువలె త్రిప్పుచున్నారని తెలుపుచున్నాడు -

## 61. ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున! తిష్ఠతి
## భ్రామయన్సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా.

**టీక:–** అర్జున = ఓ అర్జునా!, ఈశ్వరః = జగన్నియామకుడగు పరమేశ్వరుడు (అంతర్యామి), మాయయా = మాయచేత, సర్వభూతాని = సమస్తప్రాణులను, యన్త్రారూఢాని *(ఇవ)* = యంత్రమునారోహించినవారివలె (కీలుబొమ్మలనువలె), భ్రామయన్ = త్రిప్పుచు (నియమించుచు), సర్వభూతానామ్ = సమస్తప్రాణులయొక్క, హృద్దేశే = హృదయప్రదేశమునందు, తిష్ఠతి = వెలయుచున్నాడు.

**తా:–** ఓ అర్జునా! జగన్నియామకుడు పరమేశ్వరుడు (అంతర్యామి) మాయచేత సమస్తప్రాణులయొక్క హృదయమున వెలయుచున్నాడు.

**వ్యాఖ్య:-** ఈశ్వరు డెచట నున్నారు? ఏమి చేయుచున్నారు? అను ప్రశ్నలకిచట సమాధానము చెప్పబడినది. ఈశ్వరుడు (భగవంతుడు) దూరముగనే యున్నాడని తలంచుట వెఱ్ఱి. వారు జీవులకు, అతిసమీపమున హృదయమందుగూడ (ఆత్మరూపమున) అధివసించుచున్నారు. కనుకనే 'సర్వభూతానాం హృద్దేశే' - అని చెప్పబడినది. కావున భగవత్సాన్నిధ్యమును ఎల్లపుడు ననుభవించుచు, పాపాచరణములేక, భక్తియుతులై మెలగవలెను. జీవులుచేయు సమస్తకార్యములను, సంకల్పించు సమస్త సంకల్పములను ఈశ్వరుడు సాక్షిమాత్రుడై సదా వీక్షించుచునేయుండునని ఎవరును మఱవరాదు. ఈశ్వరుడనగా ప్రభువు, శాసకుడు, నియామకుడు. రాజు ప్రజలను శాసించునట్లు వారు సమస్తప్రాణికోట్లను శాసించుదురు. వారివారికి కర్మానుకూలముగ ఫలముల నొసంగుదురు. రాజాజ్ఞను మీరినచో జనులకెట్లు దండనము లభించునో అట్లే ఈశ్వరుని ఆజ్ఞయగు ధర్మము నుల్లంఘించినచో మనుజుడు వారిచే శిక్షితుడై, తన దుష్కర్మఫలితమగు ఘోరదుఃఖము ననుభవించును. కావున హృదయమున, బాహ్యమున, సర్వత్ర ఈశ్వరసన్నిధిని సదా భావించుచు ధర్మమును, సత్యమును, ఎవరును ఉల్లంఘించరాదు.

భగవంతుడు ఏ ప్రదేశమందుండును? వైకుంఠమందా? కైలాసమందా? పాతాళమందా? ఇతరలోకమందా? వారెల్లెడల వసించుచుందురు. అతిసమీపమునగల హృదయప్రదేశమందును ఉండును. కావున అట్టి పరమాత్మను సదా భక్తితో గొల్చుచుండవలెను. 'సర్వభూతానామ్' అని చెప్పుటవలన ఏ ఒకానొక ప్రాణియందో కాదనియు సమస్త జీవకోట్లయందును భగవానుడు వెలయుచుండుననియు స్పష్టమగుచున్నది. కాబట్టి చీమయందును, దోమయందును, పశువునందును, చండాలునియందునుకూడ వారు నివసించుచున్నారు. కాని ఎవని చిత్తము నిర్మలముగా నుండునో ఆతనియందు లెస్సగ భాసించుచు, వ్యక్తమగును.

యన్త్రారూఢాని - ఈశ్వరుడు మాయద్వారా సమస్తజీవులను సంసారరూపయంత్రమున త్రిప్పుచున్నాడు. యంత్రముయొక్క పెద్దచక్రములపై చిక్కుకొనిన చీమగాని పురుగుగాని, ఆచక్రముతోబాటు తిరుగుచునేయుండును. అట్లే జీవులున్ను (ఈశ్వరునిచే మాయద్వారా త్రిప్పబడుచున్న) ఈ సంసారచక్రమున తగుల్కొని, ఆ చక్రముతోబాటు వివశులై తిరుగుచున్నారు. దానినుండి తప్పించుకొనుట కుపాయము రాబోవు శ్లోకమున తెలుపబడును. ఆ యంత్రమును త్రిప్పుచున్నవానిని (భగవంతుని) ఆశ్రయించుటయే ఆ యుపాయము.

'మాయయా' అని చెప్పుటవలన ఈశ్వరుడు ఈ సంసారచక్రమును త్రిప్పుచున్నప్పటికిని మాయద్వారా ఆ పరిభ్రమణమును గావించుటవలన వాస్తవముగ వారికేమియు కర్తృత్వము లేకయేయున్నది. వారు సాక్షిమాత్రులై వర్తించుచున్నారు.

**ప్ర:-** ఈశ్వరుడు ఎచట నివసించుచున్నాడు?

**ఉ:-** సమస్తప్రాణికోట్ల హృదయమందు.

**ప్ర:-** ఏమిచేయుచున్నాడు?

**ఉ:-** ఈ సంసారచక్రమున తగుల్కొనియుండు జీవులందఱిని త్రిప్పుచున్నాడు.

**ప్ర:-** దేనిద్వారా?

**ఉ:–** మాయాశక్తిచేత.

**ప్ర:–** ఏ ప్రకారముగ?

**ఉ:–** యంత్రమందు తగుల్కొనియుండు పురుగులవలె.

**అ॥** జీవులు సంసారచక్రమున తగుల్కొని పరిభ్రమించుచున్నారని చెప్పబడినది గదా? మఱివారు శాంతిని, సుఖమును (మోక్షమును) ఎట్లు బొందగలరు? ఆ యుపాయము నీశ్లోకముద్వారా వచించుచున్నాడు –

## 62. తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత!
## తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్.

**టీక:–** భారత = ఓ అర్జునా!, సర్వభావేన = సర్వవిధముల, తమ్ ఏవ = (హృదయస్థుడగు) ఆ ఈశ్వరునే, శరణం గచ్ఛ = శరణుబొందుము, తత్ ప్రసాదాత్ = అతని యనుగ్రహముచే, పరామ్ = ఉత్కృష్టమైన, శాన్తిమ్ = శాంతిని, శాశ్వతమ్ = శాశ్వతమగు, స్థానమ్ = మోక్షపదవిని, ప్రాప్స్యసి = పొందగలవు.

**తా:–** ఓ అర్జునా! సర్వవిధముల ఆ (హృదయస్థుడగు) ఈశ్వరునే శరణుబొందుము. వారి యనుగ్రహముచే సర్వోత్తమమగు శాంతిని, శాశ్వతమగు మోక్షపదవిని నీవు పొందగలవు.

**వ్యాఖ్య:–** క్రిందటిశ్లోకమున జీవులు సంసారచక్రమున తగుల్కొని పరిభ్రమించుచున్నారని చెప్పబడినది. మఱి వారు తప్పించుకొనుటెట్లు? జననమరణరూప సంసారదుఃఖములనుండి వారు విడివడుట యెట్లు అను ప్రశ్నల కీశ్లోకమున సమాధానము చెప్పబడుచున్నది. సకల జీవులయొక్క హృదయస్థానమున ఏ పరాత్పరుడు (ఏ పరమాత్మ, ఏ సర్వేశ్వరుడు) నివసించుచున్నాడో వారిని సర్వవిధముల శరణుబొందుటయే బంధవిముక్తికి ఏకైక ఉపాయమని ఇచట తెలుపబడినది. యంత్రమును ఆపవలెననిన, ఆ యంత్రమును త్రిప్పువానిని ఆశ్రయించవలెను. ఈసంసారరూపయంత్రమును త్రిప్పువాడో, సాక్షాత్ ఈశ్వరుడేయని క్రిందటి శ్లోకమున చెప్పబడినది. (ఈశ్వరఃభ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని). కాబట్టి ఆ ఈశ్వరునే జీవుడు శరణుబొందవలసియున్నది. లేకున్న మాయ అతనికి దారియివ్వదు. మాయయొక్క శక్తి ఒక్క భగవచ్ఛక్తికి తప్ప మఱిదేనికిని లోబడదు. ప్రాపంచిక శక్తులన్నియు మాయాశక్తికిన్ని, మాయాశక్తి దైవశక్తికిని (ఈశ్వరశక్తికిని) లోబడియున్నవి. కావున మాయాధీనులగు జీవులందఱున్ను మాయామోహమును, సంసారచక్రపరిభ్రమణమును దాటివేయవలెననిన, మాయాధీశుడగు పరమాత్మను శరణుబొందవలయును. ఆ విషయమే ఈ శ్లోకమున తెలియజేయబడినది.

'సర్వభావేన' – అని చెప్పుటవలన ఆ హృదయస్థ పరమాత్మను సర్వవిధముల సంపూర్ణమనస్సుతో శరణుబొందవలెనని స్పష్టమగుచున్నది. శరీరవాఙ్మనంబులతో పరిపూర్ణముగ సేవించవలయునని అర్థము. అర్ధమనస్సుతో, అర్ధభావముతో దేవుని ప్రార్థించుట, సేవించుట చాలదు. మోక్షప్రాప్తికి పూర్ణమనస్సుతో భగవానుని ధ్యానింపవలెను. దృశ్యవిషయములపై మనస్సు పరిపాకము చేయబడరాదు.

'తత్ప్రసాదాత్' - మోక్షమునకు భగవదనుగ్రహము అత్యావశ్యకమై యున్నది. దానిని సంపాదించక తక్కినయెన్ని ఉపాయములను గావించినను మాయాబంధము తొలగదు. అది యెట్లు లభించునో ఈ శ్లోకముయొక్క మొదటిపాదమున తెలుపబడినది. భగవచ్ఛరణాగతిచేతను, సర్వవిధముల ఆ పరమాత్మను భక్తితో నాశ్రయించుట చేతను లభించును. భగవానుని నిర్మలభక్తితో సర్వవిధముల శరణుబొందుటచే వారి అనుగ్రహము కలుగును. ఆ యనుగ్రహమువలన జీవునకు సర్వోత్తమశాంతి, శాశ్వతమగు మోక్షపదము లభించుచున్నవి. ఓహో! ఎంతటి గొప్పఫలము! కావున జీవుని ప్రథమకర్తవ్యము ఈశ్వరునకు శరణాగతి నొందుటయే యగును.

'పరాం శాన్తిమ్' - ఆ మోక్షపదవి యెట్టిది? పరమ శాంతమైనది. దుఃఖరహితమైనది. పూర్ణశాంతి యెచట గలదు? దృశ్యములో లేదు. ఏ లోకమందును లేదు. చక్రవర్తిపదవియందుగాని, ఇంద్రపదవియందుగాని లేదు. దృక్స్వరూపమగు పరమాత్మయందే కలదు. కావున ప్రపంచములో శాంతినిగోరు ప్రతిమానవుడును అట్టి శాంతికి నిలయమైన భగవంతుని శరణుబొందవలెను. అత్తఱి యాతనికా శాంతి తప్పక లభించగలదని శ్రీకృష్ణమూర్తి యిచట ఘంటాపథముగ చెప్పివైచిరి (స్థానం ప్రాప్స్యసి). అయితే అట్టి సర్వోత్తమస్థానమును బొందుటకు తగిన మూల్యమును చెల్లించవలెను. దృశ్యవిషయాభిలాషను పరిత్యజించి పూర్ణభావముతో పరమాత్మను ఆశ్రయించుటయే ఆ మూల్యము.

'శాశ్వతమ్' - అని చెప్పుటచే దైవపదము కాలాతీతమై వెలయుచున్నదని, దానికి వినాశము లేనేలేదని స్పష్టమగుచున్నది. ప్రపంచములోని ప్రతివస్తువు అశాశ్వతమే అయియున్నది. కాలాధీనమే అయియున్నది. కావున అమూల్యమగు ఈ మానవజన్మను బడసి జన్మసార్థకత నొందుటకై అట్టి శాశ్వత దైవ (ఆత్మ) పదమునే సర్వులును పొందుటకు యత్నింపవలెను. భగవానుని ఈ వాక్యములపై పరిపూర్ణ విశ్వాసముంచి తదనురీతి భక్తితో ప్రవర్తింపవలయును.

**ప్ర:**– పరమాత్మస్థాన మెట్టిది?

**ఉ:**– (1) పరమశాంతికి నిలయము (2) శాశ్వతమైనది.

**ప్ర:**– అదిదేనిచే లభించును?

**ఉ:**– భగవదనుగ్రహముచే.

**ప్ర:**– భగవదనుగ్రహ మెట్లు కలుగును?

**ఉ:**– సర్వవిధముల ఆ పరమాత్మను శరణుబొందుటచే కలుగును.

**ప్ర:**– శాంతిని పొందుటకు మార్గమేమి? శాశ్వత కైవల్యపదవి దేనిచే ప్రాప్తించును?

**ఉ:**– భక్త్యాదులచే సర్వేశ్వరుని యనుగ్రహమును సంపాదించుటయే శాంతికిని, కైవల్యపదవికిని ఏకైకమార్గము.

**అ॥** ఇంతదనుక చెప్పినబోధను చక్కగ విచారణమొనర్చి తన కెట్లుచితమని తోచునో ఆప్రకార మాచరింపవలసినదిగా భగవాను డర్జునునకు హితమును చెప్పుచున్నారు –

## 63. ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా
## విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు.

**టీక:–** ఇతి = ఈ విధముగా, గుహ్యాత్ = రహస్యమునకంటెను, గుహ్యతరమ్ = మిక్కిలి రహస్యమగు, జ్ఞానమ్ = జ్ఞానము (కర్మ, భక్తి, ధ్యాన, జ్ఞాన వైరాగ్యాది బోధయుక్తమగు ఈగీతాశాస్త్రము), మయా = నాచేత, తే = నీకు, ఆఖ్యాతమ్ = చెప్పబడినది, ఏతత్ = దీనిని, అశేషేణ = సంపూర్ణముగ, విమృశ్య = విమర్శించి (బాగుగ విచారణచేసి) యథా = ఏ ప్రకారముగా, ఇచ్ఛసి = (చేయుటకు) తలంచుచున్నావో, తథా = ఆ ప్రకారముగ, కురు = చేయుము.

**తా:–** ఈ విధముగా రహస్యములన్నిటికంటెను పరమరహస్యమైనట్టి జ్ఞానమును(గీతాశాస్త్రము) నేను నీకు జెప్పితిని. దీనినంతను బాగుగ విచారణచేసి తదుపరి నీకెట్లిష్టమో అట్లాచరింపుము.

**వ్యాఖ్య:–** 'గుహ్యాద్గుహ్యతరమ్' – శ్రీకృష్ణపరమాత్మ గీతాశాస్త్రమంతయు నుపదేశించి తుట్టతుదకు దానిని అతిరహస్యమైన విద్యగా వర్ణించుచున్నారు. ఉపనిషత్సారమగు ఈ మహాజ్ఞానమును సద్గురువులు అతిగోప్యముగ నుంచుకొని అధికారులగు సచ్ఛిష్యులకే యుపదేశించుచుందురు. అధికారపురుషుడగుటచే అర్జునునకు శ్రీకృష్ణు డద్దానిని బోధించి తద్ద్వారా లోకమున కంతకును మహోపకార మొనర్చిరి. ఈ జ్ఞానము రహస్యములలోకెల్ల అతిరహస్యమని చెప్పుటవలన దాని ప్రభావమెట్టిదో మనము ఊహించవచ్చును. ఏలయనిన, సామాన్యముగ విలువగలిగిన వస్తువులనే జనులు రహస్యముగ నుంచుదురు కాబట్టి ఈమహత్తర జ్ఞానధనముయొక్క విలువను గ్రహించి విజ్ఞులగువారు దానిని సద్వినియోగపఱచుకొని ధన్యులు కావలయును.

'విమృశ్యైతదశేషేణ' – మహనీయులు తాము ధర్మమును బోధించినప్పటికిని దానిని గూర్చి ఆలోచించుటకును, విమర్శించుటకును ఇతరులకు పూర్తిగ అధికారమిచ్చుదురు. వారు చెప్పినబోధను పూర్వాపరవిచారణలేక, స్వయముగ దానినిగూర్చి ఆలోచింపక అమాంతముగా గ్రహించుడని ఇతరులకు వారు చెప్పరు. మహాత్ములగు గురువులయొక్క లక్షణ మిట్లే యుండును. గురువు బోధించినదానిని శిష్యుడు తనసొంతపరిజ్ఞానముతో, నిజసంస్కారముతో చక్కగ పరిశీలించి, విచారణ సలిపి, పూర్వాపరములను విమర్శించి తదుపరి దానిలో తనకు నచ్చినదానిని గ్రహింపవచ్చును. ఇట్టిస్వాతంత్ర్యమును పూర్వపు గురువులు తమ శిష్యుల కిచ్చియుండిరి. ఈపద్ధతికి అనుగుణ్యముగనే గురోర్గురువగు శ్రీకృష్ణపరమాత్మయు వ్యవహరించిరి. శ్రీకృష్ణుడు అర్జునునకు బోధింపవలసిన దానినంతను బోధించి తదుపరి 'ఓ అర్జునా! నాపై భక్తిచే, విశ్వాసముచే, గురుత్వముచే నేను చెప్పినదానినంతను నీవు కన్నుమూసికొని గ్రహింపవలెనని నేను చెప్పను. మఱియేమనిన, నీవు సొంతముగ దానిని చక్కగ విమర్శింపుము. వివేచనచేయుము. ఆ పిమ్మట నీకు నచ్చినదానిని గ్రహింపుము.' అని వచించి తనయొక్క విశాలభావమును, ఔదార్యమును ప్రకటించిరి. గురువు బోధించిన దానిని శిష్యుడు సొంతప్రజ్ఞచే సమాలోచన చేయనిచో శిష్యుని బుద్ధి వికసింపదు. ఇదియంతయు ఆలోచించియే భగవానుడు పైవాక్యములను పలికినవారైరి. మఱియు బోధయందు పటుత్వము, యాథార్థ్యము లేనిచో ఇట్టి వాక్యములను ధైర్యముగా ఎవరును పలుకజాలరు గనుక గీతాబోధయొక్క పరమప్రామాణ్యత్వము, సత్యత్వము దీనిచే సువ్యక్తమగుచున్నది. 'అశేషేణ' అని చెప్పుటచే ఒకింత విచారణతో ముగించవలదనియు, సంపూర్తిగ, సర్వవిధముల సమస్తప్రమాణములతో విచారించుమనియు అర్జునునకు తెలిపినట్లైనది.

'యథేచ్ఛసి తథాకురు' - 'అట్లు విచారణచేసినపిదప నీకెట్లుచితమని తోచునో అట్లాచరింపుము' అని భగవానుడు సెలవిచ్చిరి. గురువగు శ్రీకృష్ణుడు కర్తృత్వమును తనపై పెట్టుకొనలేదు. నిష్కామకర్మముయొక్క చక్కని దృష్టాంత మిచట కానంబడుచున్నది. పదునెనిమిది అధ్యాయముల బోధను అనర్గళముగ నుపదేశించి తుట్టతుదకు దాని ఫలితమును కోరకయే భగవానుడు విరమించుచున్నారు. అర్జునునిచే తిరిగి యుద్ధమును చేయింపించుట తన బోధయొక్క ఒకానొక లక్ష్యమైనప్పటికిని ఆ బోధయొక్క ఫలమగు అట్టి లక్ష్యమును వాఛింపకయే శ్రీకృష్ణుడు దానిని ముగించివైచెను. 'నీవు యుద్ధముచేయుము, లేక చేయకనుండుము - దానితో నాకు పనిలేదు. నేను చెప్పవలసిన ధర్మమును నీకు చెప్పివేసితిని. ఆ పిదప నీయిష్టము (యథేచ్ఛసి తథాకురు)' - అని భగవానుడు విశాలదృష్టితో పలికిరి. నిష్కామకర్మయొక్క మచ్చుతునక యిది.

అట్లుకాక కర్తృత్వము తమపై వేసికొనినచో ఇక గురువులకు శాంతియుండదు. కావున వారెన్నటికిని అట్లు చేయరు. వారి ధర్మమును (Duty) వారు నెరవేర్చుదురు. ఫలమును వాంఛింపరు. ఇక శిష్యుడు తన ఉద్ధారమును తాను చూచుకొనవలసియుండును. గురువు దారిచూపును. శిష్యుడు తాను సొంతముగ నడపవలెను.

'జ్ఞానమాఖ్యాతమ్' - అని చెప్పినందువలన గీతాశాస్త్రమందు కర్మ భక్త్యాద్యనేకములు వచింపబడినను అవి యన్నియు జ్ఞానమం దంతర్భూతములే యని స్పష్టపడుచున్నది. కర్మ, భక్తి, ధ్యానాద్యనేక ధర్మములుబోధించి తుట్టతుదకు వాని నన్నింటిని కలిపి భగవానుడు 'జ్ఞానం' అను ఒక్క పదములో ఇమిడ్చి యిచట చెప్పివైచిరి. కాబట్టి సమస్తమార్గములు తుదకు జ్ఞానమునందే పరిసమాప్తతను బొందుననియు, జ్ఞానమే జీవుల చరమలక్ష్యమనియు, ఆకర్మభక్త్యాదులు జ్ఞానప్రాప్తికి సహాయభూతములుగ నుండుననియు దీనిద్వారా నిశ్చయించుకొనవచ్చును.

ప్ర:- ఈ గీతాజ్ఞాన మెట్టిది?

**ఉ:-** పరమరహస్యమైనది.

ప్ర:- గురువు జ్ఞానమును బోధించినపిదప శిష్యు డేమిచేయవలెను?

**ఉ:-** ఆ చెప్పినదానిని తన సొంత భావములతో చక్కగా విమర్శించి, సమాలోచనచేసి తనకు నచ్చినదానిని కార్యానిత్వ మొనర్చవలెను.

**అ॥** అర్జునునిపై ప్రీతిగలిగి శ్రీకృష్ణభగవానుడు అతిరహస్యమైన, సారభూతమైన ఒకటి రెండు వాక్యములను మఱల చెప్పదలంచి యిట్లు నుడువుచున్నాడు -

## 64. సర్వగుహ్యతమం భూయ శ్శృణు మే పరమం వచః
## ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్.

**టీక:-** సర్వగుహ్యతమమ్ = రహస్యములన్నిటిలోను పరమరహస్యమైనదియు, పరమమ్ = శ్రేష్ఠమైనదియు నగు, మే = నాయొక్క, వచః = వాక్కును, భూయః = మఱల, శృణు = వినుము, (త్వమ్ = నీవు), మే = నాకు, దృఢమ్ = మిక్కిలి, ఇష్టః అసి = ఇష్టుడవగుచున్నావు, ఇతి తతః = అను కారణమువలన, తే = నీకు, హితమ్ = హితమును(మేలును), వక్ష్యామి = చెప్పుచున్నాను.

**తా:–** (ఓ అర్జునా!) రహస్యము లన్నిటిలో పరమ రహస్యమైనదియు, శ్రేష్ఠమైనదియునగు నా వాక్యమును మఱల వినుము. (ఏలయనిన) నీవు నాకు మిక్కిలి ఇష్టుడవు. ఇక్కారణమున నీయొక్క హితమునుగోరి మఱల చెప్పుచున్నాను.

**వ్యాఖ్య:–** 'సర్వగుహ్యతమమ్' - గుహ్యమ్ = రహస్యమైనది, గుహ్యతరమ్ = పరమరహస్యమైనది, గుహ్యతమమ్ = మిగుల పరమరహస్యమైనది, సర్వగుహ్యతమమ్ = మిక్కిలి అత్యంత పరమరహస్యమైనది. - ఈ ప్రకారముగ శ్రీకృష్ణపరమాత్మ తాను వేయగలిగినన్ని విశేషణములన్నిటిని వేసి ఈ పదమును ప్రయోగించిరి. బోధయొక్క రహస్యత్వపరిమాణము, ప్రభావము దీనిచే గోచరమగుచున్నది. మఱియు చెప్పబోవు బోధయందు పరమ విశ్వాసము, కుతూహలము ఈ పదముచే ఏర్పడుచున్నవి.

'భూయః' - మఱల చెప్పుచున్నాను వినుము. శిష్యునిపైగల వాత్సల్యముచే గురువాతనికి బోధను మఱల మఱల చెప్పును. చెప్పినదానినే మఱల జ్ఞాపకము చేయును. క్రిందటిశ్లోకమున 'ఇతి తే జ్ఞాన మాఖ్యాతమ్' అను వాక్యమును చెప్పి భగవానుడు గీతాబోధనంతను పరిసమాప్తము చేసిరి. అయినను అర్జుననిపైగల వాత్సల్యముచే ప్రేరితుడై మఱల కొంత ఉపదేశము చేయదలంచి ఈ వాక్యములను తిరిగి వచించిరి.

'పరమం వచః' - అని చెప్పుటవలన ఈ చెప్పబోవు వాక్యములు పరమోత్కృష్టములని స్పష్టమగుచున్నది. సాక్షాత్ భగవంతుడే వానిని ఉత్కృష్టములని పేర్కొనుటవలన ఆ వాక్యములపై జనులెంతటి విశ్వాసము గలిగియుండవలెనో ఊహించుకొనవచ్చును.

'ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్' - గురువుయొక్క ఇష్టమును సంపాదించుకొనుటలోనే ఉన్నది శిష్యుని ప్రజ్ఞ. గురువునకు ప్రీతిపాత్రుడగుట శిష్యునకు గొప్పవరప్రసాదము. ఏలయనిన, ప్రీతిపాత్రుడగు శిష్యునకే గురువు తన హృదయమును విప్పి అతిరహస్యములైనవానిని ఉపదేశించును. కనుకనే సేవాశుశ్రూషలద్వారా, నమస్కారాదులద్వారా, వినయవిధేయతలద్వారా గురువుయొక్క ప్రీతిని, ఇష్టమును సంపాదించుకొనినచో ఇక ముక్తిమార్గము శిష్యునకు చేతికి అందినట్లే యగును. ఈ విషయమునే భగవానుడు 'తద్విద్ధి ప్రణిపాతేన'.. (4-34) అను శ్లోకముద్వారా పూర్వము స్పష్టపఱచియుండిరి.

ఇచట అర్జునుడు గురువగు శ్రీకృష్ణునకు ప్రీతిపాత్రుడయ్యెను. ఈసంగతిని శ్రీకృష్ణుడే 'ఇష్టోఽసి మే దృఢమితి' అను వాక్యముద్వారా తేటతెల్లమొనర్చిరి. హృదయమెపుడు పరిపక్వమై, నిర్మలమై, భక్తియుతమై యలరారునో, అపుడు గురువాతనిని వెతకి కొనుచువచ్చి అతనిహృదయక్షేత్రమునందు జ్ఞానబీజమును నాటిపోవును. చరిత్రలో అనేక దృష్టాంతము లిట్టివి కానంబడుచున్నవి. ప్రస్తుత సందర్భమునగూడ అర్జునుడు పరిపక్వ నిర్మలహృదయుడుగా నుండుటంబట్టి సాక్షాత్ భగవానుడే అర్జునునకు స్వయముగ హితమును బోధించిరి. మోక్షమునకు ఎవరు దారిచూపుదురాయని చింతింప పనిలేదు. వారి వారి హృదయమును, మనస్సును, భక్తిసంయుతముగ, పవిత్రముగ నుంచుకొనిన చాలును. సద్గురువుల యొద్దకు చేర్చును. లేక తానే వారిహృదయమున సద్బోధలను గావింపజేయును.

'నీవు నాకు ఇష్టుడవైనందువలన నీకు హితమును చెప్పుచున్నాను' అని భగవానుడు అర్జునునితో చెప్పుటవలన సర్వేశ్వరునియొక్కయు సద్గురువులయొక్కయు అనుగ్రహమును సంపాదింపనివారికి

వారిద్వారా బోధయు లభింపకుండునని స్పష్టమగుచున్నది. కనుకనే శాస్త్రములలో పెక్కుచోట్ల **ఈశ్వరానుగ్రహములేనిచో,** సద్గురువుల అనుగ్రహములేనిచో అద్వైతజ్ఞానము (ఆత్మసాక్షాత్కారము) కలుగజాలదని చెప్పబడినది. కాబట్టి ముముక్షువులగు సాధకులందరును ఇవ్విషయమున కడుజాగరూకులై సర్వేశ్వరునియొక్కయు, సద్గురువులయొక్కయు అనుగ్రహమును సంపాదించుటకొఱకై నామస్మరణ, పూజా, సేవాదికార్యములను జేయుచు భక్తిభావసమన్వితులై యుండవలెను.

**ప్ర:–** శ్రీకృష్ణమూర్తి అర్జునునకు తిరిగి యెట్టి బోధను చెప్పదలంచిరి?

**ఉ:–** అతి రహస్యమై, సర్వోత్కృష్టమైనట్టిబోధను.

**ప్ర:–** శ్రీకృష్ణమూర్తి గీతాశాస్త్రమును అర్జునునికే ఏల బోధించిరి?

**ఉ:–** అర్జునుడు శ్రీకృష్ణునికి పరమప్రీతిపాత్రుడు కనుక (ఇష్టోఽసి మే దృఢమితి).

**అ॥** తాను చెప్పదలంచిన పరమరహస్యమగు బోధను భగవానుడు రెండుశ్లోకముల ద్వారా చెప్పుచున్నాడు –

## 65. మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
## మామేవైష్యసి సత్యం తే ప్రతి జానే ప్రియోఽసి మే.

**టీక:–** మన్మనాః = నాయందు మనస్సుగలవాడవును, మద్భక్తః = నాయందు భక్తి యున్నవాడవును, మద్యాజీ = నన్నారాధించువాడవును, భవ = అగుము, మామ్ = నన్ను, నమస్కురు = నమస్కరింపుము, మామ్ ఏవ = నన్నే, ఏష్యసి = పొందగలవు, మే = నాకు, ప్రియః అసి = ఇష్టుడవైయున్నావు (కాబట్టి), తే = నీ కొఱకు, సత్యమ్ = యథార్థముగా, ప్రతిజానే = ప్రతిజ్ఞ చేయుచున్నాను (ప్రతిజ్ఞచేసి చెప్పుచున్నాను).

**తా:–** నాయందు మనస్సునుంచుము, నాయెడల భక్తి గలిగియుండుము, నన్నారాధించుము, నాకు నమస్కరింపుము. అట్లు కావించెదవేని నీవు నన్నే పొందగలవు. నీవు నాకిష్టుడవైయున్నావు. కాబట్టి యథార్థముగా ప్రతిజ్ఞచేసి చెప్పుచున్నాను.

**వ్యాఖ్య:–** ఈ శ్లోకము, రాబోవు చరమశ్లోకము గీతాసారమును తెలుపునవియైయున్నవి. భగవానుడు అతిరహస్యమగు బోధను చెప్పెదనని పలికి వీనిని ప్రారంభించుటవలన ఈశ్లోకములయొక్క మహత్తు ఎట్టిదో ముందుగనే ఊహించుకొనవచ్చును. ఈ రెండుశ్లోకములందును మొదటిపాదము 'సాధనను' రెండవపాదము 'సాధ్యమును' తెలుపుచున్నవి. అనగా ఏ సాధనచేయవలెనో మొదటిపాదములో చెప్పి దానికి లభించు ఫలితమునుగూడ వెంటనే రెండవపాదములో చెప్పివైచెను. ఇచట నాలుగు సాధనలు పేర్కొనబడినవి. (1) మనస్సును దైవమందు లగ్నముచేయుట (2) దైవమందు భక్తిగలిగియుండుట (3) దైవమునే ఆరాధించుట (4) దైవమునకే నమస్కరించుట. ఈ నాలుగు సాధనలను చేయువాడు లక్ష్యమగు పరమాత్మను తప్పక పొందగలడు (మామేవైష్యసి). పరమాత్మప్రాప్తియే ఈసాధనయొక్క ఫలితమైయున్నది.

కాబట్టి జనులు తమ మనస్సును ప్రాపంచిక దృశ్యవిలాసములనుండి, శబ్దాది విషయములనుండి మఱలించి ఆత్మయందే (దైవమందే) నెలకొల్పవలెను. మఱియు జనులకు ఏ భక్తి, ఏ ప్రీతి

బాహ్యవిషయములందు కలదో దానిని అచ్చోటనుండి మఱలించి భగవంతునియందు స్థాపించవలెను. వారినే అర్చించవలెను. ధ్యానించవలెను. వారికే నమస్కరించవలెను. అజ్ఞానులగు జనులు అట్లుచేయక తమచిత్తములను దృశ్యవిషయములందే లగ్నముచేయుచు, వానినే సేవించుచు, కామాది రాక్షసులకే నమస్కరించుచు, వారినే అర్చించుచు, పరిపోషించుచున్నారు. అట్టివారు భగవానుని యెన్నడును పొందలేరని ఈశ్లోకముద్వారా స్పష్టమగుచున్నది. కావున అట్టి విషయసేవనమును వదలివైచి జనులు తమ చిత్తమును పరమాత్మయందే కేంద్రీకరించవలెను. అత్తఱి వారు పరమాత్మను నిక్కముగా పొందగలరు.

'సత్యం తే ప్రతిజానే' - ఆ ప్రకారము సాధనలను చేయువారు భగవానుని పొందుదురో - లేదో యని అర్జునునకు సంశయములు కలుగునేమోయని తలంచికాబోలు 'ఇది సత్యము నేను ప్రతిజ్ఞ చేసి చెప్పుచున్నాను' అని శ్రీకృష్ణమూర్తి అసందిగ్ధముగ చెప్పివైచిరి. సాక్షాత్ భగవానుడే తాను ప్రతిజ్ఞ చేసి చెప్పుచున్నానని పలికినపుడు ఇక ఆ వాక్యము లెంతటి పరమసత్యములో ఊహించుకొనవచ్చును. ఈప్రకారముగ భగవానుడు ప్రతిజ్ఞచేసి చెప్పినచోట్లు గీతలో చాల అరుదు. కావున సాధకు లిట్టి అపూర్వవాక్యములపై పరిపూర్ణశ్రద్ధనుంచి తదనురీతి యాచరించి, భగవత్సాక్షాత్కారమను మహోన్నత ఫలితమును బొంది కృతార్థులు కావలయును.

'మన్మనాభవ' - అను వాక్యమునందు. కర్మ, భక్తి, ధ్యాన, జ్ఞానములను నాలుగు సాధనలున్ను తెలుపబడినవి.

**ప్ర:**- భగవత్ప్రాప్తికి (మోక్షమునకు) ఉపాయలేవి?

**ఉ:**- (1) భగవంతునియందు (ఆత్మయందు) మనస్సు లగ్నమైయుండుట (2) భగవంతునిపై భక్తి కలిగియుండుట (3) భగవానుని ఆరాధించుట (4) భగవంతునకు నమస్కరించుట.

**ప్ర:**- భగవంతు డెవనిపై తన కృపాకటాక్షమును ప్రసరించును?

**ఉ:**- తన్నారాధించుటద్వారా తన యిష్టతను సంపాదించుకొనినవారిపై.

**ప్ర:**- పైన దెల్పిన విధముగ దైవమునుగూర్చి యత్నించువారికి కలుగు ఫలితమేమి?

**ఉ:**- వారు దైవమునే పొందెదరు. ఈ వాక్యము పరమసత్యము. సాక్షాత్ శ్రీకృష్ణమూర్తియే ఆ వాక్యములను సత్యమని ప్రతిజ్ఞచేసి చెప్పిరి.

**అ॥** గీతాసారమగు చరమశ్లోకమును చెప్పుచున్నాడు -

## 66. సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
## అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః.

**టీక:**- సర్వధర్మాన్ = సమస్తధర్మములను, పరిత్యజ్య = విడిచిపెట్టి, మామ్ = నన్ను, ఏకమ్ = ఒక్కనిమాత్రము, శరణం వ్రజ = శరణుబొందుము, అహమ్ = నేను, త్వా = నిన్ను, సర్వపాపేభ్యః = సమస్తపాపములనుండియు, మోక్షయిష్యామి = విడిపించెదను, మాశుచః = శోకింపకుము.

**తా:—** సమస్తధర్మములను విడిచిపెట్టి నన్నొక్కనిమాత్రము శరణుబొందుము. నేను సమస్త పాపములనుండియు నిన్ను విముక్తునిగ జేసెదను.

**వ్యాఖ్య:—** ఈ శ్లోకము చాల ముఖ్యమైనది. దీనిని చరమశ్లోకమని యందురు. ఋష్యాది న్యాసములలో ఈ శ్లోకముయొక్క మొదటిపాదము శక్తియనియు, రెండవపాదము కీలకమనియు చెప్పబడినది. దీనిచే ఈ శ్లోకముయొక్క ప్రాధాన్యము వెల్లడియగుచున్నది. గీతాశాస్త్రముయొక్క తత్త్వబోధయందలి తుదిశ్లోకముగనుక సారమంతయు నిమిడ్చి భగవాను డిద్దానిని చెప్పివైచిరి. ఇందు తెలుపబడిన భగవచ్ఛరణాగతి, ప్రపత్తి సాధకులకు అతిముఖ్యమైనది. వైష్ణవులీశ్లోకమును అతిప్రధానముగ నెంచి మంత్రమువలె సదా దీనిని జపించుచుందురు.

'సర్వధర్మాన్ పరిత్యజ్య' – నిత్యనైమిత్తికాది సమస్త ధర్మములకంటెను, కర్మలకంటెను భగవచ్ఛరణాగతి ఎన్నియోరెట్లు అధికఫలములను గలుగజేయును. ఆ చిన్నచిన్న ధర్మములు, కర్మలు అన్నియు పుణ్యమును గలుగజేయును. భగవచ్ఛరణాగతి మోక్షమునే కలుగజేయును. ఆ యా ధర్మములన్నింటియొక్క, కర్మలన్నింటియొక్క ఫలితము శరణాగతియొక్క ఫలితముననే ఇమిడియున్నది. (నూటిలో పది ఇమిడి యున్నట్లు). కావుననే భగవానుడు ఆ స్వల్పస్వల్పకార్యము లన్నిటిని విడిచిపెట్టి అనంతమోక్షఫలమును గలుగజేయుదానినే పట్టుకొనుమని బోధించిరి. 'మామేకమ్' – అని చెప్పుటవలన భగవంతు నొక్కరినే ఆశ్రయించిన చాలును, సమస్త కర్మ ధర్మములను ఆశ్రయించినట్లే యగునని విదితమగుచున్నది. చెట్టుమూలమును తడిపినచో శాఖాపత్రాదులన్నిటిని తడిపినట్లే యగునుగదా! పైగా పెక్కుమార్గములు, కర్మలు, ధర్మములు గజిబిజిగానుండి మనస్సునకు విక్షేపమునుగూడ కలుగజేయవచ్చును. కాబట్టి ఒక్కదానినే ఆశ్రయించుట శ్రేయస్కరము. ఆ ఒక్కటి యేది? దేనిని తెలిసికొనినచో సమస్తము తెలియబడినదగునో, దేనినిపొందినచో సమస్తము పొందబడినదియగునో, అట్టి ఆత్మవస్తువును, బ్రహ్మవస్తువును (భగవంతుని) ఒక్కరిని ఆశ్రయించిన చాలును. ఇతర గొడవలతో, ఇతర సాధనలతో, ఇతర ధర్మములతో, ఇతర కర్మలతో పనిలేదు. కావుననే వాని నన్నింటినివదలి తననొక్కనినే శరణుబొందుమని భగవాను డుపదేశించిరి.

'అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి' – అయితే కొందఱిట్లు ప్రశ్నించవచ్చును – అన్ని కర్మలు, ధర్మములు వదలుకొని భగవంతుని ఆశ్రయించినచో ఆతడు మాకేమి యొసంగగలడు? అని. అందులకు శ్రీకృష్ణభగవానుడు సూటియైన సమాధానమిచ్చిరి – 'అట్లు నన్నాశ్రయించినచో మీయొక్క సమస్తపాపములనుండి, బంధములనుండి మిమ్ములను విముక్తునిగ జేసెదను' – అని. 'సర్వపాపేభ్యో' – అని చెప్పుటవలన ఏ ఒక్క పాపమునుండియో కాదనియు సమస్తపాపములనుండియు విడుదల పొందించెద ననియు హామీనిచ్చిరి – అనగా సంపూర్ణముగ బంధవిముక్తునిగ జేసెదనని చెప్పిరి. మనుజున కింతకంటె నధికముగ కావలసినది యేమున్నది? జనన మరణాది బంధమునుండి తప్పించుకొనుట, కర్మపాశమునుండి విముక్తుడగుట ఒక్కటియే అతనికి కావలసినది. అది కలుగజేసెదనని భగవానుడు ప్రతిజ్ఞచేసిరి. అయితే యెవరికి? అందఱికినికాదు. అందఱును భగవంతుని బిడ్డలు అయియున్నప్పటికిని ఎవరు చేయిజాచి ఆతని నాహ్వానింతురో వారినే పట్టుకొని తన యొడిలో కూర్చుండబెట్టుకొనును. ఎవడు సమస్తవాంఛలను, కర్మలను, ధర్మములను వదలి తన్ను (భగవానుని, లేక ఆత్మను) ఒక్కనినే శరణుబొందునో, శరీరవాఙ్మనంబులచే తననే ఆశ్రయించునో, అనగా దృశ్యవస్తువులను, దృశ్యవిషయసంబంధకర్మలను, ధర్మములను త్యజించి దృగ్రూపమగు ఆత్మనొకదానినే అవలంబించునో అట్టివానిని మాత్రమే సంసారబంధ (పాప) శృంఖలములనుండి విడివడజేసి తరింపజేసెదనని శ్రీకృష్ణమూర్తి అసందిగ్ధముగ చెప్పివైచిరి.

దీనినిబట్టి జీవుడు నెరవేర్చవలసినదానిని నెరవేర్చినచో భగవంతుడు తానీయవలసినదానిని ఇచ్చునని స్పష్టమగుచున్నది. ఈ శ్లోకమందలి మొదటిపాదము జీవుని కర్తవ్యమును సూచించును. రెండవపాదము భగవంతు డొసంగు ప్రతిఫలమును సూచించును. జీవుడు తానుచేయవలసినది చేయనిచో భగవంతుడు తానొసంగవలసినదాని నొసంగరు. జీవుడు పరమాత్మనాశ్రయించనిచో, దృశ్యపదార్థములనుమాత్రమే అంటిపెట్టుకొనినచో పరమాత్మ మాత్ర మేమి చేయగలరు? ప్రకృతియందొకానొక అప్రతిహతనియమమును భగవాను డేర్పఱచిరి. అది యేదనగా - పాపముచే దుఃఖము, పుణ్యముచే సుఖము, జ్ఞానముచే లేక భగవచ్ఛరణాగతిచే మోక్షము కలుగును. ఎవరు ఏవిధముగ నాచరించుదురో వారావిధమగు ఫలితమునే అనుభవించుదురు. ఇందు భగవంతుని పక్షపాతమేమియులేదు. 'చేసుకొన్నవారికి చేసుకొన్నంత మహాదేవ!'

'సర్వధర్మాన్ పరిత్యజ్య' - అను వాక్యమునకు మఱియొక అర్థమున్ను కలదు. 'దృశ్యభావనలన్నింటిని వదలి దృగ్వస్తువగు ఆత్మనొకదానినే శరణుబొందుము.' అనియు చెప్పవచ్చును. ఇది ఇంకను శ్రేష్ఠమైన అర్థము. త్యాగముచే మోక్షము లభించునను శాస్త్రనిర్ణయము నిది చక్కగ పోషించుచున్నది. ఒకదానిని త్యజించనిదే మఱియొకటి లభించదు. దయ్యమును పట్టుకొనినచో దేవుడు లభించడు. దేవుని పట్టుకొనవలెనన్న దయ్యమును (దృశ్యరూప పిశాచమును) వదలవలెను. అనగా దృశ్యమునుగూర్చి, అనగా క్షేత్రమునుగుఱించిన భావములను త్యజించి క్షేత్రజ్ఞుడగు పరమాత్మను శరణుబొందవలెను.

ఈ శ్లోకమున సమస్త ధర్మములను వదలుమని చెప్పినంతమాత్రమున అధర్మము నాచరించవలెనని అర్థముకాదు. లేక ధర్మములను వదలి సోమరిగ నుండుమని కాదు. మహాధర్మమగు భగవచ్ఛరణాగతిలోనే, ఆత్మాశ్రయములోనే తక్కిన అవాంతర ధర్మము లన్నియు అంతర్భూతములైయుండునుగావున - 'శతే పంచాశత్' (నూరులో యాభై ఇమిడియుండును అను) న్యాయము ననుసరించి అట్టి మహద్ధర్మము నాశ్రయించువారు చిన్న చిన్న ధర్మములను ప్రత్యేకముగ ఆచరించ నవసరములేదనియు, దాని నొక్కదానిని చక్కగ పాలించిన చాలుననియు చెప్పుటయే యగును. ఇచట పెద్దధర్మమున్నపుడు చిన్నధర్మమును పట్టుకొన నవసరములేదని చెప్పుటయేకాని, చిన్నధర్మమునందు అసలు ఏమియు సత్తువలేదనికాని, దానిని వదలి సోమరిగా నుండుమని కాని అర్థముకాదు. కాబట్టి పదములను జాగ్రత్తగ అన్వయించుకొనవలెను.

'మాశుచః' - 'ఈ సత్యమును తెలిసికొని భగవచ్ఛరణాగతి యొనర్చి ఇక యేమాత్రము శోకింపకుము' అని శ్రీకృష్ణమూర్తి అర్జునున కానతిచ్చిరి. దుఃఖరహితమగు శాశ్వత ఆత్మపదము, భగవంతుని స్థానము లభించుచున్నపుడు, ఇక శోకమున కాస్కారమే లేదు. దృశ్యము నాశ్రయించువారిని, నశ్వరవస్తువులను నమ్ముకొనువారిని శోకము బాధించునేకాని, శాశ్వతమగు ఆత్మను, భగవంతుని ఆశ్రయించువారిని కాదు. వారు నిత్యము పరమానందమునే యనుభవించుదురు. కనుకనే 'నన్నాశ్రయించినచో ఇక నీవు దుఃఖపడవలసిన అవసరము లేదనియు, కాబట్టి శోకించవద్దు (మాశుచః)' అనియు అర్జునునకు శ్రీకృష్ణమూర్తి బోధించుటకు కారణము.

'అశోచ్యానన్వశోచస్త్వమ్' - అను శోకరాహిత్యబోధద్వారా గీత ప్రారంభమై 'మాశుచః' అను శోకరాహిత్యవాక్యముతో అంతమైనదికావున గీతాలక్ష్యము శోకరాహిత్యమే యని స్పష్టపడుచున్నది. దుఃఖరాహిత్యము, ఆనందప్రాప్తి - సంసారదుఃఖశమనము, బ్రహ్మానందప్రాప్తి - ఇవియే గీతాలక్ష్యములు. అట్టి లక్ష్యములను జీవులచే బొందింపజేయుటయే గీతయొక్క ఆశయము.

ఈ శ్లోకమునందు అతిసులభమైన భక్తి, ప్రపత్తి, శరణాగతిమాత్రమే ముక్తికి హేతువుగ తెలుపబడుటచే ఇక గొప్పగొప్ప శాస్త్రములు చదువలేనివారు పాండిత్య ప్రతిభ లేనివారు, చదువురానివారు మోక్షమునకై దిగులునొందవలసిన పనిలేదనియు, నిర్మల దైవభక్తియొక్కటుండిన చాలుననియు తెలియుచున్నది.

ఈ శ్లోకము గీతయందు చాల ముఖ్యమైనదగుటచే దీనిని బాగుగ కంఠస్థము చేసి అర్థము సదా మననము చేయుచునుండుట ముముక్షువుల కత్యంత శ్రేయస్కరము.

ప్ర:- జీవులకు సమస్త పాపనివృత్తి, బంధవిముక్తి, దుఃఖనివృత్తి యెట్లు కలుగగలదు?

ఉ:- సమస్త (నిత్యనైమిత్తికాది) ధర్మములను, కర్మలను లేక సమస్త దృశ్యభావనలను వదలివైచి భగవంతుని (ఆత్మను) ఒక్కనినే ఆశ్రయించినచో, వారే జీవునకు మోక్షమునొసంగగలరు.

ప్ర:- శోకరాహిత్యమునకు మార్గమేమి?

ఉ:- భగవచ్ఛరణాగతియే, దైవాశ్రయమే.

**అ॥** భక్తిలేనివానికి, భగద్వాక్యముపై విశ్వాసములేనివానికి ఈ గీతాశాస్త్రమును ఉపదేశింపరాదని తెలుపుచున్నాడు -

## 67. ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన
## న చాఽశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి.

**టీక:-** తే = నీకు, (అభిహితమ్ = చెప్పబడిన), ఇదమ్ = ఈ గీతాశాస్త్రము, కదాచన = ఎప్పుడును, అతపస్కాయ = తపస్సు లేనివానికొఱకు (లేక సంసారబంధమునుండి తప్పించుకొనవలెనని పరితపించనివానికి), న వాచ్యమ్ = చెప్పదగినదికాదు, అభక్తాయ = భక్తుడు కానివాని కొఱకును, న *(వాచ్యమ్)* = **చెప్పదగినదికాదు,** అశుశ్రూషవే చ = వినుట కిచ్ఛలేనివానికొఱకును (లేక గురుసేవ చేయనివానికొఱకు), న *(వాచ్యమ్)* = చెప్పదగినదికాదు, యః = ఎవడు, మామ్ = నన్నుగూర్చి, అభ్యసూయతి = **దూషించునో** (లేక అసూయజెందునో) *(తస్మై)* చ = అతనికొఱకును, న *(వాచ్యమ్)* = చెప్పదగినది కాదు.

**తా:-** నీకు బోధింపబడిన ఈగీతాశాస్త్రమును తపస్సులేనివానికిగాని, భక్తుడు కానివానికిగాని, వినుట కిష్టములేనివానికి గాని (లేక గురుసేవ చేయనివానికిగాని), నన్ను దూషించువానికిగాని (లేక, నాయెడల అసూయజెందువానికిగాని) ఎన్నడును చెప్పదగినదికాదు.

**వ్యాఖ్య:-** ఈ గీతాశాస్త్రమును ఎవరికి బోధింపరాదో ఈ శ్లోకమున తెలియజేయబడినది. ఏలయనగా అతిపవిత్రమైన ఈ బోధ అపాత్రునకు, అనర్హునకు ఒసంగబడుటద్వారా నిరుపయోగముకారాదు. అహంభావము, గర్వము హృదయమున బాగుగ తాండవించునపుడు జనులకీ బోధచేసినను వారి మనస్సునకెక్కదు. మురికి గుడ్డకు రంగుపట్టదు. కావున వినయవిధేయతలు, భక్తిసేవాది భావములు మున్నగునవి ఉన్నవారికే ఈగీతాశాస్త్రమును బోధింపవలెనుగాని తదితరులకు కాదని భగవానుడు చెప్పిరి. ఇట్టి అమూల్యమగుబోధ అనర్హులచేతిలోపడినచో నిష్ప్రయోజనమై పోవునుగాన అట్టిస్థితిని ఎవరును కలుగజేయకుండుటకుగాను గీతాబోధ చివఱ ఇట్టి హెచ్చరికచేయబడినది. తపస్సులేనివానికి, భక్తిలేనివానికి, (గురు) శుశ్రూష చేయనివానికి, భగవంతుని నిందించువానికి ఈ గీతాశాస్త్రమును బోధింపరాదని యిచట తెలుపబడినది. ఇచట తపస్సనగా పాపములను, హృదయమాలిన్యమును తపింపజేయుటయే యగును. లేక

'ఈ సంసారబంధమునుండి ఎప్పుడు తప్పించుకొందుమా' యను తీవ్రపరితపన అనియు చెప్పవచ్చును. అట్టి ఉత్కటపరితపనగలవానికి పరమార్థబోధ ఏది చెప్పినను బాగుగ ఒంటపట్టును (రోగిని ఔషధమువలె). ఇచట శుశ్రూషయనగా గురుసేవ, పెద్దలసేవ, భగవత్సేవయని చెప్పవచ్చును. లేక శ్రవణము చేయుటకు కుతూహలము అనియు పేర్కొనవచ్చును. 'కదాచన' అని చెప్పుటవలన ఇట్టి సుగుణములు లేనివారికి ఏ కాలమందును గీతాశాస్త్రమునుపదేశింపరాదని భగవానుడు హెచ్చరికచేసిరి. వారెవరైనను సరియే లోకదృష్టిలో ఎంతటి గొప్పవారైనను సరియే. అవి కలవారికో - వారెంతటి నీచజాతి యందున్నను, విద్యావిహీనులైనను సరియే తప్పక ఉపదేశింపవచ్చునని భావము. అపాత్రులకు, అనర్హులకు, అసూయాపరులకు, దైవవిద్వేషులకు, నాస్తికులకు బోధింపబడినచో అధ్యాత్మవిద్య సత్ఫలితములను గలుగజేయజాలకుండును. కావున యోగ్యులకే అద్దాని నుపదేశింపవలయును. ఇచట గీతాశాస్త్రశ్రవణమునకు, పఠనపాఠనములకు భక్త్యాది సద్గుణముల యొక్కయే ఆవశ్యకత చెప్పబడినదిగాని, తదితతరముకాదనువిషయము బాగుగ గమనించగదియున్నది.

**ప్ర:–** ఈ గీతాశాస్త్రమును ఎవని కుపదేశింపరాదు?

**ఉ:–** (1) తపస్సులేనివానికి (2) భక్తిలేనివానికి (3) శుశ్రూషచేయనివానికి (4) భగవంతుని నిందించువానికి - ఉపదేశింపరాదు.

**ప్ర:–** దీనినిబట్టి గీత నెవరికి బోధింపవచ్చునని తేలుచున్నది?

**ఉ:–** (1) తపస్సుకలవానికి (2) భక్తికలవానికి (3) శుశ్రూషచేయువానికి (4) భగవంతుని నిందింపనివానికి బోధింపవచ్చును.

**అ॥** ఈ గీతాశాస్త్రమును శ్రద్ధగల యితరులకు బోధించువారు తనకు అత్యంతప్రియులని, వారుతప్పక తన్ను పొందగలరని భగవానుడు రెండు శ్లోకములద్వారా తెలియజేయుచున్నాడు -

**68. య ఇమం★ పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి**
**భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః.**

**టీక:–** యః = ఎవడు, పరమం గుహ్యమ్ = అతిరహస్యమైన, ఇమమ్ = ఈ గీతాశాస్త్రమును, మద్భక్తేషు = నా భక్తులకు, అభిధాస్యతి = చెప్పునో, (సః = అట్టివాడు), మయి = నాయందు, పరామ్ = శ్రేష్ఠమైన, భక్తిమ్ = భక్తిని, కృత్వా = చేసి (కలిగి), అసంశయః = సంశయరహితుడై (లేక నిస్సందేహముగ), మామ్ ఏవ = నన్నే, ఏష్యతి = పొందగలడు.

**తా:–** ఎవడు అతిరహస్యమైన గీతాశాస్త్రమును నాభక్తులకు చెప్పునో అట్టి వాడు నాయందుత్తమభక్తిగలవాడై, సంశయరహితుడై (లేక, నిస్సందేహముగ) నన్నే పొందగలడు.

**వ్యాఖ్య:–** గీతా ప్రచారముయొక్క మహత్తర ఫలితమును భగవాను డిచట తెలుపుచున్నాడు.

★ ఇదం - పాఠాన్తరము.

గీతాప్రచారము యెడల భగవానున కెంత ప్రీతియో ఈ వాక్యముల వలన వెల్లడియగుచున్నది. గీతాప్రబోధ ఫలితము సాక్షాన్మోక్షమే యని యిట వక్కాణింపబడినది. (మామేవైష్యతి). తన భక్తులకు గీతాశాస్త్రమును బోధించువారు పరాభక్తి కలవారై బ్రహ్మసాయుజ్యమును బడయుదురని యిట వచింపబడినది. దీనినిబట్టి ఇతరులకు ఉపకారముచేయుటయే సర్వోత్తమభక్తి (పరాభక్తి) యగుచున్నది. ఇతరులకు ఉపకారముచేయుట యనగా ఆ యా రూపముతోనున్న భగవమతునకు సేవ చేయుటయే యగును. కావుననే యిది సామాన్యభక్తిగా గాక పరాభక్తిగా నిట వర్ణింపబడెను. అన్నిదానములకంటెను జ్ఞానదానము సర్వోత్తమమైనది కావున ఇతరులకు చేయుజ్ఞానదానము పరాభక్తిగ నిట వర్ణింపబడెను. 'అసంశయః' అని చెప్పినందువలన అట్టి గీతాప్రబోధకుడు తప్పక ముక్తినొందగలడని, సంశయరహితుడు కాగలడని విదితమగుచున్నది. కావున సర్వులున్ను ఇట్టి మహత్తరఫలితము నొసంగగల ఈ గీతాశాస్త్రమును తాము శ్రద్ధతో పఠించి దానిని ఇతరులకుకూడ బోధించుట ధర్మము.

**ప్ర:**– ఈగీతాశాస్త్ర మెట్టిది?

**ఉ:**– రహస్యమైనది.

**ప్ర:**– దీనిని ఎవరికి బోధించవలెను?

**ఉ:**– భగవద్భక్తులకు (క్రిందటి శ్లోకమున దెలిపిన దుర్గుణములు లేనివానికి)

**ప్ర:**– అట్లు బోధించువారికి కలుగు ఫలితమేమి?

**ఉ:**– వారు పరాభక్తికలవారై సంశయరహితులై భగవంతునే పొందుదురు (ముక్తులగుదురు). ఇవ్విషయమున సందియములేదు.

## 69. న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః
## భవితా న చ మే తస్మా దన్యః ప్రియతరో భువి.

**టీక:**– మనుష్యేషు = మనుజులలో, తస్మాత్ = అట్టివానికంటె, మే = నాకు, ప్రియకృత్తమః = మిక్కిలి ప్రియమునొనర్చువాడు, కశ్చిత్ = ఒక్కడును, న చ = లేనేలేడు, తస్మాత్ = అతనికంటె, మే = నాకు, ప్రియతరః = మిక్కిలి ఇష్టుడైనవాడు, అన్యః = ఇతరుడు, భువి = భూలోకమున, భవితా న చ = కలుగబోడు.

**తా:**– మనుజులలో అట్టివానికంటె నాకు మిక్కిలి ప్రియమునొనర్చువా డెవడును లేడు. మఱియు అతనికంటె నాకు మిక్కిలి ఇష్టుడైనవాడు ఈ భూలోకమున మఱియొకడు కలుగబోడు.

**వ్యాఖ్య:**– క్రిందటి శ్లోకమున్ను, ఈశ్లోకమున్ను భగవానునకు అధ్యాత్మవిద్యావ్యాప్తియెడల, గీతాతత్త్వ ప్రచారముయెడల ఎంతటి ప్రీతిగలదో సువ్యక్తము చేయుచున్నవి. గీతను భగద్భక్తులకు బోధించువానికంటె మిక్కిలి ప్రియమునొనర్చువాడు తనకు మఱియొక డెవడును లేడని శ్రీకృష్ణమూర్తి వచించిరి. 'ప్రియకృత్తమః' అని 'తమ' ప్రత్యయమును వాడుటచే అట్టివాడు భగవానునకు మహాప్రియమునొనర్చువాడని స్పష్టమగుచున్నది. (ప్రియకృత్, ప్రియకృత్తరః. ప్రియకృత్తమః) ప్రపంచములో దేవునకు ప్రియమొనర్చుటకై అనేక పుణ్యకార్యములను జనులు చేయుచున్నారు. కాని వారందఱికంటెను ఈ గీతాతత్త్వప్రబోధకుడే

అధికపుణ్యమును సంపాదించుకొనుచున్నాడు. ఏలయనిన, అక్కార్యముద్వారా యతడు సర్వేశ్వరునకు మహత్తరప్రియము నొనర్చుచు తత్ఫలితముగ సాక్షాత్ బ్రహ్మసాయుజ్యమునే పడయుచున్నాడు. అట్టివాడు భగవంతునకు పరమ ప్రీతిపాత్రుడు (ప్రియతముడు) అగుచున్నాడు. భూతభవిష్యద్వర్తమానముల యందు అంతటి ఇష్టుడు వేఱొకడు తనకెన్నడును లేడని శ్రీకృష్ణపరమాత్మ అట్టి గీతాప్రబోధకునిగూర్చి తన సదభిప్రాయమును వెల్లడించుటచూడ అట్టి గీతాప్రచారకార్యము మహాపుణ్యప్రదమైనదని, భగవత్ప్రీతికరమైనదని తెలియుచున్నది. నిజముగా జీవితములో భగవంతునకు ప్రీతిపాత్రుడుగ నుండుటకంటె వేఱొక గొప్ప విషయమేమున్నది? అట్టివానిజన్మ సార్థకమైనట్లే.

జగన్నాథుడగు సర్వేశ్వరునకు ప్రియుడుగా నుండగల్గునట్టి జన్మము ధన్యము. అట్టి భగవత్ప్రియత్వమే జీవితపరమావధి కావున ప్రతివారును గీతాతత్త్వమును తాము చక్కగ అనుభూతమొనర్చుకొని, ఇతరులకును దానిని బోధించవలెను. ఇవ్విధముగ తాను తరించి ఇతరులనుగూడ తరింపజేసి, తద్ద్వారా భగవంతునకు అతిప్రియముగా నుండగల్గు సౌభాగ్యమును నోచుకొనవలెను. ఎవడు దేవునకు మిగుల ప్రియమగు కార్యమును జేయునో అతడు దేవునకు మిక్కిలి ఇష్టుడగును.

గీతాప్రబోధముయొక్క మహిమనుగూర్చి భగవాను డివ్విధముగ తెలియజేసినందు వలన ఇక ప్రతివారును తమతమ గ్రామములలోను తమతమ పరిసర ప్రాంతములలోను, గీతాసంఘములను స్థాపించి, తద్ద్వారా గీతాజ్ఞానమును ప్రజలలో లెస్సగ వ్యాపింప జేయుట ధర్మము. అట్లు చేసినచో అది భగవానునకు అతిప్రియకరకార్యమై యలరును. వారును సర్వేశ్వరునకు మిక్కిలి ప్రీతిపాత్రులగుదురు (గీతాప్రచారమును గూర్చిన వివరములకై గ్రంథారంభమునగల 'గీతప్రచారము' అను శీర్షికక్రింద చూడనగును).

**ప్ర:**— ఈ ప్రపంచమున భగవంతునకు మిక్కిలి ప్రియమొనర్చువాడు, భగవంతునకు మిక్కిలి ఇష్టుడు ఎవుడు?

**ఉ:**— గీతాతత్త్వమును భగవద్భక్తులకు బోధించువాడు.

**ప్ర:**— అతనికంటె మిక్కిలి ప్రియుడు భగవంతునకు వేఱొకడుండునా?

**ఉ:**— భూతభవిష్యద్వర్తమానములం దెవడును ఉండడు.

**అ॥** ఈ గీతాశాస్త్రము నధ్యయనము చేయువాడు జ్ఞానయజ్ఞము నాచరించినట్లేయని వచించుచున్నాడు

## 70. అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాదమావయోః
## జ్ఞానయజ్ఞేన తేనాహ మిష్టస్స్యామితి మే మతిః.

**టీక:**— యః చ = ఎవడైతే, ధర్మ్యమ్ = ధర్మయుక్తమైన (లేక, ధర్మస్వరూపమేయగు), ఆవయోః = మనయిద్దఱియొక్క, ఇమం సంవాదమ్ = ఈసంభాషణను (తద్రూపమైన గ్రంథమును), అధ్యేష్యతే = అధ్యయనమొనర్చునో, తేన = అతనిచేత, జ్ఞానయజ్ఞేన = జ్ఞానయజ్ఞముచే, అహమ్ = నేను, ఇష్టః = ఆరాధింపబడినవాడను, స్యామ్ ఇతి = అగుదునని, మే = నాయొక్క, మతిః = నిశ్చయము.

**తా:**— ఎవడు ధర్మయుక్తమైన (లేక ధర్మస్వరూపమేయగు) మన యిరువురి ఈ సంభాషణమును అధ్యయనముచేయునో అట్టివాని జ్ఞానయజ్ఞముచేత నేను ఆరాధింపబడినవాడ నగుదునని నానిశ్చయము.

**వ్యాఖ్య:**— 'ధర్మ్యమ్' - అని చెప్పుటవలన ఈ గీతాశాస్త్రము ధర్మమార్గమునుండి తొలగనిదనియు, సాక్షాత్ ధర్మస్వరూపమేయనియు విదితమగుచున్నది. 'ధర్మక్షేత్ర' - అని ధర్మశబ్దముతోనే గీత ప్రారంభమగుట ఈ సందర్భమున గమనింపదగియున్నది.

'జ్ఞానయజ్ఞేన' - ఈ గీతాగ్రంథము నధ్యయనము చేయువాడు జ్ఞానయజ్ఞముచే భగవంతుని పూజించినవాడగుచున్నాడని యిచట తెలుపబడినది. కావున ఈ గ్రంథము యొక్క కేవలము పారాయణముకూడ గొప్పఫలితమును గలుగజేయగలదని తెలియచున్నది. అయితే భక్తితోగూడి చేయవలెను. అర్థము తెలిసికొని అధ్యయనము చేసినచో ఇంకను గొప్ప మేలు చేకూరగలదు. మఱియు గీతనంతను అధ్యయనము చేసినవాడు జ్ఞానయజ్ఞముచే తననారాధించుచున్నాడని చెప్పుటవలన గీతాగ్రంథముయొక్క పరమతత్త్వము జ్ఞానమేయనియు, కర్మ, భక్తి, ధ్యానాదులన్నియు ఆ జ్ఞానమందే పర్యవసించుచున్నవనియు అవి జ్ఞానోత్పత్తికి సహాయభూతములుగ నుండుననియు తెలియుచున్నది. అట్లు కానిచో గీతాగ్రంథాధ్యయనమంతయు జ్ఞానయజ్ఞమనియే యిచట యేల పేర్కొనవలెను? కావున తక్కిన కర్మ, భక్త్యాదులను సహాయముగ గైకొని జ్ఞానమును లెస్సగ నభ్యసించి అట్టి జ్ఞానరూపయజ్ఞముచే భగవత్సాక్షాత్కారము బడయవలెను. ఫల పుష్పాదులచే భగవంతుని పూజించుట సామాన్యపూజ. జ్ఞానయజ్ఞముచే నాతనిని పూజించుట పరాపూజ. మొదటిదానికంటె రెండవది మహోత్కృష్టమైనది.

'మే మతిః' - 'ఇది నా నిశ్చయము'. అని భగవానుడు చెప్పుటవలన ఈ వాక్యము పరమ ప్రమాణమైయున్నట్లు మనము భావించవలెను. ఏలయనగా సాక్షాత్ భగవానుడే 'ఇది నా స్థిరనిశ్చయము' అని ఘంటాపథముగ నొక్కి చెప్పిరిగదా!

**ప్ర:**— ఈ గీతాశాస్త్రము నధ్యయనముచేసినవాడు ఏ యజ్ఞము నాచరించినవాడగును?

**ఉ:**— జ్ఞానయజ్ఞమును.

**అ॥** శ్రద్ధతో ఈ గీతాగ్రంథమును వినువాడుకూడ గొప్ప పుణ్యమును బడయగలడని వచించుచున్నాడు

## 71. శ్రద్ధావాననసూయశ్చ శృణుయాదపి యో నరః
## సోఽపి ముక్తశ్శుభాన్ లోకా న్ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్.

**టీక:**— యః నరః = ఏ మనుజుడు, శ్రద్ధావాన్ = శ్రద్ధగలవాడును, అనసూయః చ = అసూయలేనివాడునునై, శృణుయాత్ అపి = (ఈ గీతాశాస్త్రమును) వినినప్పటికిని, సః అపి = అతడుకూడ, ముక్తః = పాపవిముక్తుడై, పుణ్యకర్మణామ్ = పుణ్యకార్యములను చేసినవారియొక్క, శుభాన్ లోకాన్ = పుణ్యలోకములను, ప్రాప్నుయాత్ = పొందును.

**తా:**— ఏ మనుజుడు శ్రద్ధతోగూడినవాడును, అసూయలేనివాడునునై ఈ గీతా శాస్త్రమును వినునో, అట్టివాడును పాపవిముక్తుడై పుణ్యకార్యములను చేసినవారి యొక్క పుణ్యలోకములను పొందును.

**వ్యాఖ్య:**— శ్రద్ధనుగూర్చి, అసూయారాహిత్యమునుగూర్చి గీతయందు పెక్కుచోట్ల చెప్పబడియున్నది. గ్రంథము పూర్తియగుచున్న ఈ సందర్భమున మఱల వానిని గూర్చిన ప్రస్తావనను భగవానుడు తీసికొనివచ్చిరి. ముముక్షువునకు ఆ సద్గుణము లెంత అవసరములో దీనివలన తెలియగలదు. శ్రద్ధలేక ఏ కార్యముచేసినను

అది నిరుపయోగమేయగును. అట్లే అసూయతో గూడియున్నవాడు ఏ రంగమునను వృద్ధికిరాలేడు. అసూయ అనునది ఒక వేరుపురుగువంటిది. అది హృదయములో ప్రవేశించినచో ఇతర సద్గుణములన్నిటిని, ఇతర శక్తులన్నిటిని తొలచివైచి గుల్లచేసివేయును. కావున ఆదుర్గుణము నెవరును దరికి చేర్చరాదు.

ఈ ప్రకారము శ్రద్ధ, అసూయారాహిత్యము గలిగియుండువాడు గీతనువినినప్పటికిని పాపరహితుడై గొప్పపుణ్యలోకములను బడయగలడని యిట చెప్పబడినది. భగవానుని ఈ వాక్యములు చదువురాని కొందఱు భక్తులకు పరమాశ్వాసమును గలుగజేయుచున్నవి. ఏలయనిన, 'వారు మాకు విద్యలేదే, గీతను పారాయణము చేయలేమే. మాకు పుణ్య మెట్లు లభించును?' అని సంశయగ్రస్తులై యున్నారు. అట్టివారి సంశయమును భగవాను డిచట తీర్చివైచిరి. చదువురాకున్నను, భక్తిశ్రద్ధలతోగుడి, అసూయాది దుర్గుణములులేక, ఇతరులవలన గీతను చక్కగ శ్రవణముచేసినను అట్టివారు మహాపుణ్యమును సంపాదించుదురని భగవానుడు తెలియజేసిరి. అధ్యాత్మతత్త్వము హృదయముతో సంబంధము గలిగియున్నదేకాని శిరస్సు (Brain) తో కాదు. భగవానుడు నివసించు స్థానము ముఖ్యముగ హృదయమే అయియున్నది. మహామహాపండితులు అనేక విద్యలను కళలను సంపాదించుకొని శిరస్సును (లౌకికప్రజ్ఞను) విశాలమొనర్చుకొనినను, వారి హృదయము సంకుచితముగ నున్నచో, దయ, కరుణ, శ్రద్ధ, అనసూయ మొదలగు సద్గుణములు లేనిచో ఎక్కువ ప్రయోజనముండదు. కావుననే భగవాను డిచట ఒకవేళ చదువురాకున్నను, చక్కని గుణములు కలిగి పరులవలన గీతాదులను వినినను గొప్ప పుణ్యమును సంపాదించగలరని నుడువుచున్నారు. అయితే ఈశ్రద్ధాదులతోబాటు విద్యయు నుండినచో ఇంకను మంచిది.

**ప్ర:–** చదువురానివాడు ఈగీతాగ్రంథమును అధ్యయనము చేయలేడుకదా! మఱి యాతడు తరించుట ఎట్లు?

**ఉ:–** (1) శ్రద్ధగలిగి (2) అసూయలేక ఈ గీతాశాస్త్రమును ఎవరివలననైన వినినచో అట్టివాడు పాపరహితుడై పుణ్యాత్ములు పొందు ఉత్తమలోకములను పొందగలడు. ఈ ప్రకారముగ నతడు సద్గతి నొందగలడు.

**అ॥** 'నా యీ బోధచే నీ యజ్ఞానము (భ్రమ) శమించినదా?' యని శ్రీకృష్ణమూర్తి అర్జునుని ప్రశ్నించుచున్నాడు -

## 72. కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ! త్వయైకాగ్రేణ చేతసా
## కచ్చిదజ్ఞానసమ్మోహః ప్రణష్టస్తే ధనఞ్జయ!.

**టీక:–** పార్థ = ఓ అర్జునా!, ఏతత్ = ఇది (నాచే నుపదేశింపబడిన ఈగీతాశాస్త్రము), త్వయా = నీచేత, ఏకాగ్రేణచేతసా = ఏకాగ్రమైన మనస్సుతో, శ్రుతం కచ్చిత్ = వినబడినదిగదా, ధనంజయ = ఓ అర్జునా!, తే = నీ యొక్క, అజ్ఞానసమ్మోహః = అజ్ఞానమువలన గలిగిన మోహము (భ్రమ), ప్రణష్టః కచ్చిత్ = సంపూర్ణముగా నశించినదిగదా?

**తా:–** ఓ అర్జునా! నా యీ బోధను నీవు ఏకాగ్రమనస్సుతో వింటివా? అజ్ఞానజనితమగు నీయొక్క భ్రమ (దానిచే) సంపూర్ణముగా నశించినదా?

**వ్యాఖ్య:—** శ్రీకృష్ణపరమాత్మ తాను చెప్పదలంచిన బోధనంతను చెప్పివైచి కట్టకడకు అర్జునుని ఈ విధముగ ప్రశ్నించుచున్నాడు. ఈ వాక్యముచే గీతాచార్యుని బోధయంతయు పరిసమాప్తమైపోవును. 'ఓ అర్జునా! నా యీ వాక్యములను నీవు ఏకాగ్రచిత్తుడవై వింటివా? నీ భ్రమ నశించినదా?' అని భగవానుడు ప్రశ్నించిరి. రోగికి ఔషధము నొసంగినపిదప అతని రోగము శమించినదా యని యడుగుట వైద్యుని కర్తవ్యమైయున్నది. భవరోగవైద్యుడగు శ్రీకృష్ణపరమాత్మయు ఆప్రకారమే చేసిరి. అజ్ఞానరుగ్మతచే బాధితుడగు అర్జునునకు గీతాశాస్త్రము అనుపమ ఔషధము నొసంగి భ్రమరూపమగు అతని వ్యాధి శమించినదాయని ప్రశ్నించుచున్నారు.

'ఏకాగ్రేణచేతసా' - ధ్యానించునపుడుగాని, శ్రవణముచేయునపుడుగాని, విచారణ సల్పునపుడుగాని మనస్సు ఏకాగ్రముగ నుండవలెను. చంచలచిత్తముతో ఏదిచేసినను ప్రయోజనకరముగా నుండదు. చంచల జలమందు సూర్యప్రతిబింబము చక్కగా పడనట్లును, చంచలదర్పణమందు ముఖము సరిగా కనుపించనట్లును, చంచలమనస్సునందు ఆత్మ సరిగా ప్రతిబింబించదు. శ్రవణాదులున్ను సరిగా జరుగవు. మఱియు అది యుద్ధకల్లోల సందర్భముగనుక అర్జునుని మనస్సు ఏమైన విక్షేపమును బొందియుండి ఏకాగ్రతను గోల్పోయినచో తాను గావించిన బోధయంతయు నిరుపయోగమగును. కావున భగవాను డిట్టి ప్రశ్నవేయుట సముచితముగనే యున్నది. ప్రతివారును తాము పారాయణము చేయునపుడుగాని, తత్త్వవిచారణ సలుపునపుడుగాని, ధ్యానమొనర్చునపుడుగాని మనస్సును బహిర్ముఖముగ పరుగెత్తనీయక ఏకాగ్రముగ నుంచుకొనవలెను. ఇదియే తుట్టతుదకు భగవానుడు కావించిన బోధ. 'మనస్సును ఏకాగ్రపఱచుకొని శ్రవణాదులనొనర్చి, అజ్ఞానమును సమూలముగ నశింపజేసికొనుడు' అను ఈ వాక్యమే శ్రీకృష్ణపరమాత్మ గీతాశాస్త్రమందు గావించిన అంతిమోపదేశము.

'అజ్ఞానసమ్మోహః' - మోహమునకు (భ్రమకు) కారణము అజ్ఞానము. అజ్ఞానముచే మనుజుడు త్రాటిని జూచి పాము అను భ్రమలో పడిపోవును. అట్లే అజ్ఞానముచే అనిత్యవస్తువు నిత్యమను మోహములో జీవుడు పడిపోవును. అజ్ఞానమువలన కలిగిన అర్జునుని మోహము (తన బంధువులు చనిపోవుదురని దుఃఖము) శ్రీకృష్ణపరమాత్మచే నుపదేశింపబడిన జ్ఞానముచే నశించిపోయెను. అది నశించినదా, లేదా యని భగవాను డర్జునుని ప్రశ్నించుచున్నారు.

'ప్రణష్టః' - ఔషధము శక్తివంతమైనది యగుచో రోగము సంపూర్తిగ నయమైపోవును. శ్రీకృష్ణుని అనుపమజ్ఞాన భేషజముచే అర్జునుని భవరోగము సంపూర్తిగ వినాశమొందినది. తాను ప్రయోగించిన ఔషధముయొక్క ప్రభావమెట్టిదో తెలియును. గనుకనే భగవానుడు ధైర్యముగ 'నీ రోగము శమించినదా?' అని యడుగగల్గిరి. 'నష్టః' యని యడుగక 'ప్రణష్టః' యని యడుగుటచే 'నీ అజ్ఞానవ్యాధి సంపూర్తిగ నశించినదా?' అని భగవానుడు ప్రశ్నించినవారైరి.

'ధనంజయ' - 'ఓ అర్జునా! పూర్వము రాజసూయయాగమున నీవు ధనాదుల నెట్లు జయించి తెచ్చితివో, అట్లే యిపుడును నీమాయాసమ్మోహమును, అజ్ఞానమును జయించి కీర్తి వహించుము.' అని హెచ్చరించుటకు కాబోలు ఈ 'ధనంజయ' పదమును భగవాను డిచట ప్రయోగించిరి.

**ప్ర:—** శ్రవణాదు లే ప్రకారము గావించవలెను?

**ఉ:—** ఏకాగ్రమనస్సుతో.

**అ॥** భగవానుని యాప్రశ్నకు అర్జునుడు సమాధాన మొసంగుచున్నాడు –

**అర్జున ఉవాచ –**

## 73. నష్టోమోహః స్మృతి ర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత!
## స్థితోఽస్మి గతసన్దేహః కరిష్యే వచనం తవ.

అర్జున ఉవాచ = అర్జునుడు చెప్పెను.

**టీక:–** అచ్యుత = ఓ కృష్ణా, త్వత్ప్రసాదాత్ = నీ యనుగ్రహమువలన, మోహః = నా యజ్ఞానము, నష్టః = నశించినది, మయా = నాచేత, స్మృతిః = జ్ఞానము (ఆత్మస్మృతి), లబ్ధా = పొందబడెను, గతసందేహః = సంశయరహితుడనై, స్థితః అస్మి = ఉన్నాను, తవ = నీ యొక్క, వచనమ్ = వాక్యమును (ఆజ్ఞను) కరిష్యే = నెరవేర్చెదను.

**తా:–** అర్జునుడు చెప్పెను – ఓ కృష్ణా! మీ యనుగ్రహమువలన నాయజ్ఞానము నశించినది. జ్ఞానము (ఆత్మస్మృతి) కలిగినది. సంశయములు తొలగినవి. ఇక మీయాజ్ఞను నెరవేర్చెదను.

**వ్యాఖ్య:–** శ్రీకృష్ణమూర్తి 'నీ అజ్ఞానము నశించినదా?' అని ప్రశ్నింప అర్జును డందులకు చక్కని సమాధానమును జెప్పెను. 'నా అజ్ఞానము (మోహము) అంతరించినది' అని యాతడు విస్పష్టముగ చెప్పివైచెను. అర్జునుడు దేహభ్రాంతితో గూడియున్నవాడై, కర్తవ్యాకర్తవ్యములను విస్మరించియున్న సందర్భమున శ్రీకృష్ణమూర్తి యాతనికి యథార్థతత్త్వము నుపదేశించిరి. (రోగికి ఔషధము నొసంగిన చందమున). ఇచట వైద్యుడు గొప్పవాడు. ఔషధము గొప్పది. ఇక రోగ మెంత తీవ్రమైనప్పటికిని ఏమి? గీతామృతమునుగ్రోలిన అర్జునునకు మోహ మంతరించినది. అజ్ఞానమను కైపు తొలగినది. ఈ విషయమును 'నష్టోమోహః' అను వాక్యముచే అర్జునుడు తానే ఒప్పుకొనెను. ఔషధమునకు సద్యఃఫలితము కలిగినది. బోధితునియందు తత్క్షణఫలితమును సాధింపగల్గుట యనునది బోధకునియొక్కయు, బోధయొక్కయు మహిమను చాటుచున్నది. కాబట్టి శ్రీకృష్ణపరమాత్మ యెంతటి శక్తిశాలియో, గీతాజ్ఞాన మెంతపటుతరమైనదో దీనిచే స్పష్టమగుచున్నది.

అధ్యాత్మజ్ఞానము అనుభవవిద్య. అది 'వాచా' జ్ఞానముతో పూర్తియగునది కాదు. ప్రతివారును దానిని ఆచరణలోపెట్టి అనుభవములో చూచుకొనవచ్చును. శాస్త్రాదులందు తెలిపినది, మహాత్ములగు ఋషులు బోధించినది కపోలకల్పితము కాదని అపుడు తేలిపోవును. అర్జునుడు శ్రీకృష్ణుని బోధను, సిద్ధాంతమును తన యుపాధియందు పరీక్షించుకొని చూచెను. సిద్ధాంతము సరియైనదేయని వెంటనే ఋజువుచేసెను. ఆ సత్యమునే ఈ శ్లోకముద్వారా అర్జునుడు లోకమునకు వెల్లడించుచున్నాడు. 'ఓ జనులారా! మందుతిని చూచితని తత్క్షణఫలితము కలిగినది. కావున ఓ సంసార వ్యాధిపీడితులారా! మీరందఱును నిరాటంకముగ, నిస్సంకోచముగ దీనిని సేవింపుడు. నాకువలె మీకును తప్పక భవరోగము శమింపగలదు'. అని యాతడు లోకమునకు చాటుచున్నాడు. మఱియు ఆకలితీరినందులకు గుఱుతు త్రేపు వచ్చుటయే. అట్లే గీతామృతమును తనివితీర గ్రోలగా అర్జునునకు కడుపునిండుటచే త్రేపువచ్చెను. ఈ శ్లోకమే ఆ త్రేపు. 'నాయాకలి తీరినది నాదాహము శమించినది. సంతృప్తుడనైతిని' అని అర్జునుడు పలికెను. కావున ఇక జనులకు గీతాప్రభావముపై నమ్మకము బాగుగ కుదురగలదు. ఏలయనిన, దానిని సేవించిన అర్జునునకు ప్రత్యక్షముగ సత్ఫలితము కలిగినది. ఇతరులకును కలుగగలదు.

'స్మృతిర్లబ్ధా' - మఱచిపోయినదానిని జ్ఞాపకమునకు తెచ్చుకొనుటయే స్మృతి, స్మరణ యనబడును. అర్జునుడు తన వాస్తవస్వరూపమగు ఆత్మను మరచి దేహభ్రాంతి కలిగియుండెను. ఇపుడు భగవానుని బోధలచే నాతనికి తిరిగి తనయొక్క ఆత్మస్వరూప జ్ఞానము కలిగినది. తాను దేహముకాదనియు, దేహాతీతమగు సచ్చిదానందాత్మయనియు భావము తిరిగి జ్ఞప్తికివచ్చినది. 'స్మృతిః' అని చెప్పుటవలన ఈ ఆత్మస్వరూపము ప్రతివానిచేతను క్రొత్తగ పొందబడునదికాదనియు, అనాదినుండి యాతనికి స్వతస్సిద్ధముగనే యుండియున్నదనియు, దానిని యాతడు మరచిపోయెననియు, తిరిగి ఆప్తుని వాక్యముచే నిపుడు జ్ఞాపకము చేసికొనవలసి యున్నదనియు స్పష్టమగుచున్నది.

**ఆత్మా తు సతతం ప్రాప్తో హ్యప్రాప్తవదవిద్యయా**
**తన్నాశే ప్రాప్తవద్భాతి స్వకంఠాభరణం యథా** (ఆత్మబోధ - శ్రీశంకరాచార్యులవారు)

'ఆత్మ ఎల్లప్పుడు పొందబడియేయున్నది. పొందబడనట్లు అవిద్యచే గోచరించుచున్నది. ఆ అవిద్య తొలగిపోవునపుడు మఱచిన స్వకంఠాభరణమునువలె తిరిగి పొందునట్లు గోచరించును' - అని శ్రీశంకరభగవత్పాదులు తెలిపినట్లు ఆత్మ సర్వజీవులకును స్వతస్సిద్ధముగ ఉండియేయున్నది. కాని మఱువబడినది. గురువాక్యముచే తిరిగి ఇపుడు జ్ఞాపకము చేసికొనవలసియున్నది. అదియే 'స్మృతి.' దీనినిబట్టి సర్వజీవులును నాశరహిత ఆత్మస్వరూపులే యనియు అవిద్యాప్రభావమున ఆ సంగతిని మఱచిపోయి తాను దేహేంద్రియాదులని తలంచి వ్యర్థముగ దుఃఖించుచున్నారనియు తేలుచున్నది. కావున అనుభవజ్ఞులగు మహనీయుల బోధచేతను, గీతాశాస్త్రవిచారణచేతను ఆ మఱచిపోయిన నిజరూపమును ప్రతివారును అర్జునునివలె తిరిగి జ్ఞప్తికితెచ్చుకొని నిజమహిమను గుర్తెఱిగి శోకవిముక్తులు కావలసియున్నారు.

'త్వత్ప్రసాదాత్' - సద్గురువులయొక్క అనుగ్రహమునకు అధ్యాత్మరంగమున గొప్పస్థానము కలదు. శిష్యుడు స్వాత్మోన్నతికై, తానెంతగా ప్రయత్నించినప్పటికిని సర్వేశ్వరునియొక్కయు, సద్గురునియొక్కయు కృపలేనిచో ఈ మాయను దాటుట కష్టసాధ్యము. కనుకనే భగవంతుని గూర్చిన పూజాజపధ్యానాదులను గావించుట, సద్గురుని త్రికరణశుద్ధముగ సేవించుట ముముక్షువునకు విధిగా ఏర్పఱుపబడినవి. మహాత్ముల యనుగ్రహమువలన మాయాబంధము సడలిపోవును. కనుకనే మన పూర్వీకులు తామెంత గొప్పవారైనను ఒకానొక గురువును ఆశ్రయించి, సేవించి, అదేవిధమున భగవంతుని పూజించి, అర్చించి తరించిపోయిరి. ఇచటగూడ అర్జునుడు తనకు అజ్ఞానము నశించుట గురువగు శ్రీకృష్ణునియొక్క అనుగ్రహమువలననే యని విస్పష్టముగ పేర్కొనెను.

'అచ్యుత' - తన భక్తులను సంసారమునందు చ్యుతులు కాకుండ తప్పించువాడు గనుక శ్రీకృష్ణునకు అచ్యుతుడను పేరు వచ్చెను. ఈ పద మిచట చాల సమయోచితముగ నున్నది. ఏలయనిన తనభక్తుడగు అర్జునుని సంసారకూపమున (అజ్ఞానమందు) జారిపోకుండ భగవంతుడు రక్షించి తన 'అచ్యుత' నామమును సార్థకము చేసికొనిరి. అర్జునుడు చ్యుతుడు కాలేదనుటకు గుఱుతు ఈ శ్లోకమునం దాతడు పలికిన పలుకులే యగును.

'గతసందేహః' - అజ్ఞానకాలములో సందేహపరంపరలు మనుజుని పీడించును. కాని ఆత్మతత్త్వముయొక్క, జగత్స్థితియొక్క ప్రత్యక్షానుభూతిని బడసినపు డిక అట్టి సంశయములకు తావేయుండదు.

**భిద్యతే హృదయగ్రన్థిశ్ఛిద్యన్తే సర్వసంశయాః**
**క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే.**

అను ఉపనిషద్వాక్య మీ సత్యమునే ఋజువుచేయుచున్నది.

'కరిష్యే వచనం తవ' - రోగికి ఆరోగ్యము కలిగినదానికి గుఱుతు లేచి చక్కగ నడవగల్గుట ఎట్లగునో అట్లే ఆత్మజ్ఞానమును పొందినదానికి గుఱుతు దేహభ్రాంతి తొలగి కర్తవ్యమును పాలించుటయే యగును. అట్లే అర్జునునకు అజ్ఞానము శమించుటబట్టి 'మీరు చెప్పినట్లు చేసెదను' అని శ్రీకృష్ణపరమాత్మతో పలికి కర్తవ్యోన్ముఖుడు కాగల్గెను.

మఱియు లోకములో నొక శిష్టాచారము కలదు. శిష్యుడు ఎంత పైస్థితికి పోయినప్పటికిని గురుభక్తిని, గురువాక్యపాలనమును వదలరాదు. అట్లే అర్జునుడు తనకు జ్ఞానోదయమైనప్పటికిని గుర్వాజ్ఞాపాలనమును వదలలేదు. గురుభక్తికి ఇదియొక ప్రబల నిదర్శనము. అర్జునుడు జ్ఞానమును బడసి జీవితలక్ష్యము నెరవేర్చుకొని కృతకృత్యుడయ్యెను. ఇక నాతనికి చేయవలసినదేమియు ఈ ప్రపంచమునలేదు. అయినను 'కరిష్యే వచనం తవ' - మీరు చెప్పినట్లాచరించెదను అని భక్తితో వచించెను. అర్జునుని ఈ యాదర్శమును ముముక్షువు లెల్లరు సదాజ్ఞాపకమునందుంచుకొని, గురుభక్తిని, దైవభక్తిని, శాస్త్రవిశ్వాసమును ఏకాలమందును విడనాడక యుండవలెను.

**ప్ర:-** శ్రీకృష్ణునిబోధచే అర్జునున కెట్టి సత్ఫలితములు కలిగినవి?

**ఉ:-** ఆతనికి (1) అజ్ఞానము తొలగినది (2) ఆత్మస్మృతి గలిగినది (3) సంశయములు పటాపంచలైనవి (4) అతడు కర్తవ్యపరాయణుడు కాగల్గెను.

**ప్ర:-** జీవునకు అజ్ఞానాదు లెట్లు తొలగగలవు?

**ఉ:-** మహాత్ములగు సద్గురువుల బోధలచేతను, వారి యనుగ్రహముచేతను తొలగగలవు. (త్వత్ప్రసాదాత్)

**అ॥** గీతాబోధయంతయు వినినపిదప సంజయుడు తనకు కలిగిన ఆనందానుభవమును ఐదు శ్లోకములద్వారా ధృతరాష్ట్రునకు వ్యక్తముచేయుచున్నాడు -

**సంజయ ఉవాచ -**

## 74. ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః సంవాదమిమమశ్రౌష మద్భుతం రోమహర్షణమ్.

సంజయ ఉవాచ = సంజయుడు చెప్పెను -

**టీక:-** ఇతి = ఈ ప్రకారముగా, అహమ్ = నేను, వాసుదేవస్య = శ్రీకృష్ణునియొక్కయు, మహాత్మనః = మహాత్ముడగు (మహాబుద్ధిశాలియగు), పార్థస్య చ = అర్జునునియొక్కయు, ఇమమ్ = ఈ, అద్భుతమ్ = ఆశ్చర్యకరమైనదియు, రోమహర్షణమ్ = పులకాంకురమును (గగుర్పాటును) గలుగుజేయునదియునగు, సంవాదమ్ = సంభాషణమును, అశ్రౌషమ్ = వింటిని.

**తా:–** సంజయుడు చెప్పెను - ఓ ధృతరాష్ట్రమహారాజా! ఈ ప్రకారముగా నేను శ్రీకృష్ణునియొక్కయు, మహాత్ముడగు అర్జునునియొక్కయు ఆశ్చర్యకరమైనట్టియు, పులకాంకురమును గలుగజేయుసదియునగు ఈ సంభాషణమును వింటిని.

**వ్యాఖ్య:–** శ్రీకృష్ణపరమాత్మ కావించిన గీతాబోధయంతయు వ్యాసుల యనుగ్రహముచే వినగల్గిన సంజయుడు, తచ్ఛ్రవణానంతరము అపూర్వమగు తన ఆనందాతిశయమును ధృతరాష్ట్రున కెఱిగించుచున్నాడు -

'పార్థస్య చ మహాత్మనః' - ఇంతదనుక మోహగ్రస్తుడై, భ్రాంతియుక్తుడై, అల్పాత్ముడుగనున్నట్టి అర్జునుడు భగవానుని దివ్యబోధలచే 'మహాత్ముడు'గ మారిపోయెను. అర్జునునివలెనే ప్రతివారునుగూడ శ్రీకృష్ణుని బోధామృతమును చక్కగ పానముచేసి సంసారబంధవిచ్ఛిత్తిని, మాయామోహవినాశమును గావించుకొని "మహాత్ములై" పఱగ వలెను. 'మహాత్మా' అనునది ఒక బిరుదు. ప్రయత్నముచే దాని నెవ్వరైనను సంపాదించుకొనవచ్చును. గీతయొక్క ముఖ్యోద్దేశ్యము, లక్ష్యము అల్పాత్ములను మహాత్ములుగ జేయుటయే యగును. మందబుద్ధులను బుద్ధిమంతులుగ మార్చుటయే యగును. అజ్ఞానిని జ్ఞానిగ నొనర్చుటయే యగును.

'అద్భుతం రోమహర్షణమ్' - శ్రీకృష్ణార్జున సంవాదరూపమగు ఈ గీతాశాస్త్రము అత్యాశ్చర్యకరమైనది. ఏలయనిన స్పర్శవేది ఇనుమును బంగారుగ జేయునట్లు ఈ శాస్త్రము మాయామోహితుని మాయావిముక్తునిగ జేయగల్గుచున్నది. ఏడ్చుచున్నవానిని నవ్వించుచున్నది. ఇట్టి అమోఘదైవీశక్తి దీనియందు కలదు. మఱియు దీనిని చదివిన, వినిన వ్యక్తి ఆనందముతో తన్మయుడైపోవును. ఇక్కారణముననే దీనిని సంజయుడు 'అద్భుతమనియు' 'రోమహర్షణ' మనియు వర్ణించిచెప్పెను. ఇట్టి అపూర్వమహిమ ఈ గీతాశాస్త్రమునం దుండుటవలననే ఇయ్యది జగద్విఖ్యాతమై సర్వజనసమాదరణీయమై, ముముక్షువులకు కల్పతరువై యొప్పుచున్నది.

**ప్ర:–** ఈ కృష్ణార్జునసంవాద మెట్టిదై యున్నది?

**ఉ:–** (1) అద్భుతమైనది (2) పులకాంకురమును (గగుర్పాటును) గలుగజేయునది.

**అ॥** శ్రీ వేదవ్యాసుల యనుగ్రహముచే తా నీసంభాషణను వినగల్గితినని సంజయుడు చెప్పుచున్నాడు

## 75. వ్యాసప్రసాదాచ్ఛ్రుతవా నేతద్గుహ్యతమం★ పరమ్
## యోగం యోగేశ్వరాత్కృష్ణా త్సాక్షాత్కథయతస్స్వయమ్.

**టీక:–** వ్యాసప్రసాదాత్ = శ్రీ వేదవ్యాసమహర్షియొక్క అనుగ్రహమువలన, అహమ్ = నేను, గుహ్యమ్ = రహస్యమైనదియు, పరమ్ = శ్రేష్ఠమైనదియు నగు, ఏతత్ యోగమ్ = ఈ యోగశాస్త్రమును, స్వయమ్ = స్వయముగనే, కథయతః = అర్జునునకు చెప్పుచున్న, యోగేశ్వరాత్ = యోగేశ్వరుడగు, కృష్ణాత్ = శ్రీకృష్ణునివలన, సాక్షాత్ = ప్రత్యక్షముగా, శ్రుతవాన్ = వింటిని.

★ మహం - పాఠాన్తరము.

**తా:–** శ్రీ వేదవ్యాసమహర్షియొక్క అనుగ్రహమువలన, నేను అతిరహస్యమైనదియు, మిగుల శ్రేష్ఠమైనదియు నగు ఈ యోగశాస్త్రమును స్వయముగనే అర్జునునకు చెప్పుచున్న యోగేశ్వరుడగు శ్రీకృష్ణునివలన ప్రత్యక్షముగా (నేరులో) వింటిని.

**వ్యాఖ్య:–** ఈగీతాశాస్త్రమునుగూర్చి 'యోగమ్' అని యిచట చెప్పబడినది. యోగమనగా కలుపునది. జీవుని పరమాత్మతో నైక్యపఱచునది యని అర్థము. ఈ గీతోపదేశము అట్టిదే కావున నిది యోగమనబడినది. మఱియు నిది పరమరహస్యమైనదనియు, సర్వోత్కృష్టమైనదనియు, నిట చెప్పబడినది. కావున ముముక్షువులకు అవశ్యము ఉపాధేయమై యొప్పుచున్నది.

'యోగేశ్వరాత్' - యోగమునకు ప్రభువు యోగేశ్వరుడు. యోగమును గుఱించి సంపూర్ణముగ నెఱిగినవాడు శ్రీకృష్ణపరమాత్మ. కాబట్టి అట్టిమహనీయుడు ఉపదేశించిన ఈ గీతారూపయోగశాస్త్రమునందు జనుల కెంతటి విశ్వసముండవలెనో యోచించుకొనవచ్చును.

'సాక్షాత్' - శ్రీవ్యాసుల యనుగ్రహముచేత గీతాశాస్త్రమును ప్రత్యక్షముగ తాను వినగల్గితినని సంజయుడు చెప్పుచున్నాడు. శ్రీవ్యాసమహర్షి సంజయునకు దూరశ్రవణ, దూరదర్శనశక్తి నొసంగినందువలన రణరంగమున జరిగిన ఈ సంవాదమును ఇంటియొద్దనుండియే యాతడు వినగల్గెను. చూడగల్గెను. కావున సంజయుడు ధృతరాష్ట్రునకు వచించినది ప్రత్యక్షప్రమాణమే అయియున్నది. అనగా సాక్షాత్ భగవానుని ముఖతః గీతాబోధ ఏ ప్రకారము వెలువడెనో దానిని ఉన్నది ఉన్నట్లుగ నాతడు చెప్పగల్గెనని భావము. ఈ ప్రకారముగ సంజయుడు చెప్పినది సాక్షాత్ భగవత్ప్రోక్తములైన వాక్యములే యగుటబట్టి గీతాగ్రంథముపై సర్వులకును పరమవిశ్వాసముండవలయును.

'స్వయమ్' - అని చెప్పుటవలన భగవానుడు స్వయముగ బోధించిన యుపదేశమగుటచే దీనికి అపరిమితమైన విలువ కలదు.

**ప్ర:–** గీతారూపమగు ఈ యోగశాస్త్ర మెట్టిది?

**ఉ:–** (1) అతిరహస్యమైనది (2) పరమోత్కృష్టమైనది (3) భగవానుడు స్వయముగ బోధించినది.

**ప్ర:–** ఈ గీతాశాస్త్రమును సంజయుడు నేరులో ఎట్లు వినగల్గెను?

**ఉ:–** శ్రీ వ్యాసమహర్షియొక్క అనుగ్రహముచే (దూరశ్రవణ, దూరదర్శనశక్తి, లభింప, దానిచే) వినగల్గెను.

**అ॥** భగవానుని యా దివ్యబోధలను స్మరించి స్మరించి మహదానందము నొందుచున్నానని సంజయుడు పలుకుచున్నాడు -

**76. రాజన్సంస్మృత్య సంస్మృత్య సంవాదమిమమద్భుతమ్**
**కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః.**

**టీక:–** రాజన్ = ఓ ధృతరాష్ట్రమహారాజా! అద్భుతమ్ = ఆశ్చర్యకరమైనదియు, పుణ్యమ్ =

పావనమైనదియు (లేక పుణ్యదాయకమైనదియు) నగు, కేశవార్జునయోః = కృష్ణార్జునులయొక్క, ఇమం సంవాదమ్ = ఈ సంభాషణమును, సంస్మృత్య సంస్మృత్య = తలంచి తలంచి, ముహూర్ముహుః చ = మాటిమాటికిని, హృష్యామి = ఆనందించుచున్నాను.

**తా:–** ఓ ధృతరాష్ట్రమహారాజా! ఆశ్చర్యకరమైనదియు, పావనమైనదియు (లేక పుణ్యదాయకమైనదియు) నగు కృష్ణార్జునులయొక్క ఈ సంభాషణమును తలంచి తలంచి మాటిమాటికి ఆనందమును బొందుచున్నాను.

**వ్యాఖ్య:–** సంజయుడు గీతాసంస్మరణజనిత మహదానందమును వ్యక్తమొనర్చుచున్నాడు.

'సంస్మృత్య సంస్మృత్య' - 'సంస్మృత్య' అని చెప్పుటలోను, సంస్మృత్య అని ఒక పర్యాయము చెప్పక, రెండు పర్యాయములు చెప్పుటలోను విశేషము కలదు. వివినబోధను లెస్సగస్మరించుటయే సంస్మరణము. మఱియు ఆ పదమును రెండుసార్లు చెప్పుటచే అద్దానిని మఱల మఱల లెస్సగా స్మరించవలెనని భావము. సంజయుడు ఆప్రకారమే చేసెను. అనగా భగవత్ప్రోక్తమగు ఈగీతాజ్ఞానమును వినుటమాత్రముతో తృప్తిపడక, దానిని మఱల మఱల స్మరింపదొడగెను. అనగా తీవ్రముగ మననముచేసెను. అట్లు మననము చేయుటవలననే దాని యర్థము చక్కగ హృదయమున ప్రవేశించును. (1) శ్రవణము (2) మననము (3) నిదిధ్యాసనము - అని మూడు పద్ధతులు శాస్త్రమునందు చెప్పబడినవి. సంజయుడు మొదట గీతాబోధను శ్రవణము చేసెను. ఆ పిదప మనననిదిధ్యాసనములను గావించి తత్ఫలితముగ పరమానందమును బొందగల్గెను.

'పుణ్యమ్' అని చెప్పుటవలన కృష్ణార్జునసంవాదరూపమగు ఈగీతాశాస్త్రము మహాపుణ్యప్రదమైనదియు, అతిపావనమైనదియు నని భావము. సాక్షాత్ మోక్షమునే కలుగజేయు పవిత్రవస్తువు కనుకనే దీనిని 'పుణ్యమ్' అని చెప్పిరి. అనగా ఈగీతా శాస్త్రము మూర్తీభవించిన పుణ్యమే యనియు, పాపక్షయకరమనియు భావము.

'హృష్యామి చ ముహుర్ముహుః' - స్వస్వరూపసాక్షాత్కారసమయమున, లేక భగవదైక్యము నొందుసమయ మున జీవుడు దుఃఖరాహిత్యమును, అతిహర్షమును బొందును. ఆనందమును మాటిమాటికి అనుభవిం చును. దుఃఖమయమగు ఈ సంసారమున మనుజునకు కావలసినది ఆనందమే (హర్షమే) కదా! దుఃఖరాహిత్యమేకదా! అట్టిది ఈ గీతాశాస్త్రముద్వారా జీవునకు లభించుచున్నది. దుఃఖమగ్నుడగు జీవునకు అనంతానందము దీనిద్వారా సంప్రాప్తించుచున్నది. అర్జునుడే యిందులకు దృష్టాంతము. మొదట ('విషీదన్తం' అనునట్లు) పరమశోకాకులుడైయున్న అర్జునుడు గీతాశాస్త్రశ్రవణముచే, మననముచే ('నష్టోమోహః' అనునట్లు) మోహరహితుడై ఆనందపరవశుడై కర్తవ్యనిర్వహణము నిమిత్తము రణరంగమున దుమికెను. అట్లే సంజయుడు గీతాశ్రవణమననములచే మాటిమాటికి పరమానందము నొందుచుండెను. (హృష్యామి చ ముహుర్ముహుః). ఈ ప్రకారముగ గీతాశ్రవణముచే ఇరువురును వెంటవెంటనే పరమానందము నొందగల్గిరి. కాబట్టి ఆనందము నపేక్షించు ప్రతిమానవుడును, దుఃఖము నంతమొందించగోరు ప్రతివ్యక్తియు ఈగీతాశాస్త్రమును తప్పకచదివి, అద్దాని మనన నిదిధ్యాసనములను గావింప వలెను. దుఃఖాకులురగు ప్రాణుల కీశాస్త్రము సంజీవివంటిదై యున్నది. వెయ్యేల, సమస్తజీవులకు ఆనందము నొసంగునదైయున్నది. సంజయుని పైవాక్యములే ఇందులకు తార్కాణము.

**ప్ర:–** కృష్ణార్జున సంవాదరూపమగు ఈ గీతాశాస్త్ర మెట్టిది?

**ఉ:–** (1) మహాపుణ్యప్రదమైనది - అతిపావనమైనది (2) అద్భుతమైనది - మహదాశ్చర్య జనకమైనది.

**ప్ర:–** అట్టి గీతాశాస్త్రమును వినిన పిదప యేమి చేయవలెను?

**ఉ:–** ఆ వినిన యర్థమును మాటిమాటికి మననము చేయవలెను. నిదిధ్యాసనము గావింపవలెను.

**ప్ర:–** అట్లు చేసినందువలన ఎమి ఫలితముచేకూరును?

**ఉ:–** జీవుడు దుఃఖరహితుడై, అతిహర్షమును, ఆత్మానందమును బొందును. మాటిమాటికి సంతోషార్ణవమున ఓలలాడుచుండును. సంజయుడే ఇందులకు దృష్టాంతము.

**అ॥** భగవానుని విశ్వరూపమును తలంచుకొని తలంచుకొని పరమాశ్చర్యము నొందుచున్నానని సంజయుడు చెప్పుచున్నాడు -

**77. తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూపమత్యద్భుతం హరేః**
**విస్మయో మే మహాన్ రాజన్! హృష్యామి చ పునః పునః.**

**టీక:–** రాజన్ = ఓ ధృతరాష్ట్రమహారాజా!, హరేః = శ్రీకృష్ణమూర్తియొక్క, అత్యద్భుతమ్ = మిక్కిలి ఆశ్చర్యకరమైన, తత్ చ రూపమ్ = ఆ విశ్వరూపమును, సంస్మృత్య సంస్మృత్య = తలంచి తలంచి, మే = నాకు, మహాన్ = అధికమగు, విస్మయః = ఆశ్చర్యము, (భవతి = కలుగుచున్నది), పునః పునః చ = మాటిమాటికిని, హృష్యామి = సంతోషించుచున్నాను.

**తా:–** ఓ ధృతరాష్ట్రమహారాజా! శ్రీకృష్ణమూర్తియొక్క మిగుల ఆశ్చర్యకరమైన ఆ విశ్వరూపమును తలంచి తలంచి నాకు మహాదాశ్చర్యము కలుగుచున్నది. మఱియు (దానిని తలంచుకొని) మాటిమాటికిని సంతోషమును బొందుచున్నాను.

**వ్యాఖ్య:–** క్రిందటి శ్లోకమును భగవానుని బోధవలన కలుగు ఆనందము తెలుపబడినది. ఈశ్లోకమున భగవానుని విశ్వరూపమును తలంచుకొనినపుడు, భావించినపుడు కలుగు దివ్యానుభూతి, పరమానందము వ్యక్తము చేయబడుచున్నది.

'హృష్యామి చ పునః పునః' - సంజయుడు భగవానుని బోధను, రూపమును తలంచుకొని ఆనందము పట్టలేకున్నాడు. అతనికికలిగిన ఆశ్చర్యమునకున్ను అంతులేకున్నది. ప్రతివాడును ఈ దశను అనగా 'అతిహర్ష' దశను ఎప్పటికైనను (జ్ఞానప్రాప్తిచే) పొందవలసియేయున్నాడు. నశ్వర ప్రపంచభావనను వీడి శాశ్వత భగవత్స్వరూపమును చింతించునపుడు కొందఱు ఆనందముపట్టలేక చిందులుద్రొక్కుదురు. కొందఱు యెలుగెత్తి గానముచేయుదురు (సామగానమువలె). కొందఱు ఆనందపారవశ్యముచే నృత్యముచేయుదురు. ఇవియన్నియు అతిహర్షమునకు చిహ్నములు. సంజయునకు గీతాశ్రవణానంతరము, విశ్వరూపసందర్శనానంతరము తన్మననాదులచే అట్టి మహదానందమే కలిగినది. ఆ విషయమునే యతడీ రెండు శ్లోకములద్వారా ధృతరాష్ట్రునకు వ్యక్తపఱచెను.

**ప్ర:–** భగవానుని విశ్వరూప మెట్టిది?

**ఉ:–** అత్యద్భుతమైనది.

**ప్ర:–** దానిని తలంచుకొనినపుడు సంజయున కెట్టి యనుభవము గలుగుచుండెను?

**ఉ:–** (1) మహదాశ్చర్యము (2) పరమానందము గలుగుచుండెను.

**అ॥** శ్రీకృష్ణార్జునులుండుచోట విజయము, ఐశ్వర్యము మున్నగు శుభలక్షణములు వెలయుచుండునని సంజయుడు పలుకుచున్నాడు –

**78. యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః**
**తత్ర శ్రీర్విజయో భూతి ర్ధ్రువా నీతిర్మతిర్మమ.**

**టీక:–** యత్ర = ఎచట, యోగేశ్వరః = యోగేశ్వరుడగు, (యోగమునకు ప్రభువగు), కృష్ణః = శ్రీకృష్ణుడు, (తిష్ఠతి = ఉండునో), యత్ర = ఎచట, ధనుర్ధరః = ధనస్సును చేబట్టిన, పార్థః = అర్జునుడు (తిష్ఠతి = ఉండునో), తత్ర = అచట, శ్రీః = లక్ష్మియు (సంపదయు), విజయః = విజయమున్ను, భూతిః = ఐశ్వర్యమున్ను, ధ్రువా = దృఢమైన, నీతిః = నీతియు, (సన్తిఇతి = కలవని) మమ = నాయొక్క, మతిః = అభిప్రాయము.

**తా:–** ఎచట యోగేశ్వరుడగు శ్రీకృష్ణుడున్ను ఎచట ధనుర్ధారియగు అర్జునుడున్ను ఉందురో అచట సంపదయు, విజయమున్ను ఐశ్వర్యమున్ను, దృఢమగు నీతియు ఉండునని నా యభిప్రాయము.

**వ్యాఖ్య:–** గీతాగ్రంథ మీశ్లోకముతో పరిసమాప్తమగుచున్నది. భగవత్సాన్నిధ్యమందు, భక్తుని సాన్నిధ్యమందు ఎట్టి శుభప్రదమైన వాతావరణమేర్పడునో ఈ శ్లోకముద్వారా వెల్వడిచేయబడినది. ఎచట యోగేశ్వరుడగు శ్రీకృష్ణభగవానుడుండునో, మఱియు నెచట ధనుర్ధారియగు అర్జునుడుండునో అచట ఐశ్వర్యము, విజయము, మున్నగునవి వెలయుచుండునవి చెప్పబడినది. కాబట్టి విజయమును, నీతిని, జ్ఞానసంపదను అభిలషించువారు భగవచ్చింతనాదులద్వారా సాక్షాత్ భగవానుని తమ హృదయమందు ప్రతిష్ఠింపజేసికొనవలెను.

భగవంతుడగు శ్రీకృష్ణుడుండుచోటే కాక, భక్తుడగు అర్జునుడుండుచోట గూడ అట్టి విజయాదులు సంభవించునని యేల చెప్పబడెననగా, అర్జునుడు సామాన్యభక్తుడు కాడు. ధనుర్ధారియగు భక్తుడు. అనగా బాహ్యశత్రువుల నే ప్రకారము గాండీవముచే జయించివైచెనో, అట్లే అంతఃశత్రువులనుగూడ గీతాజ్ఞానరూపధనస్సుచే ఛేదించివైచి మోహరహితుడై విలసిల్లెను (నష్టోమోహః). ఈ ప్రకారముగ అజ్ఞానము నశించిన భక్తుడు సాక్షాత్ భగవంతుడే యగుచున్నాడు. (బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి). కావున ప్రకృతిని జయించినట్టియు, మాయాశత్రువును జ్ఞానఖడ్గముచే, జ్ఞానధనస్సుచే విచ్ఛిన్న మొనర్చినట్టియు భక్తుడుండుచోటగూడ భగవత్సాన్నిధ్యమందువలె విజయ సంపదాదులు వర్ధిల్లుచుండుటలో ఆశ్చర్యమేమియును లేదు. అయితే ఇచట తెలిపినది సామాన్యభక్తుని విషయముకాదనియు, అజ్ఞానమును, కామక్రోధాదులను జయించి ప్రకృతిపై విజయమును సాధించిన (ధనుర్ధరుడగు) భక్తునివిషయమే చెప్పబడినదనియు నెఱుగవలెను. కాబట్టి గీతాజ్ఞానరూప మహాధనస్సును జేబట్టినవాడును, నిష్కామ కర్మ, భక్తి జ్ఞాన ధ్యాన వైరాగ్యాదులను అస్త్రములను ధరించినవాడు నగు భక్తునిచెంత సాక్షాత్ భగవానుని

సాన్నిధ్యమందువలె విజయాదులు వర్ధిల్లుచుండునని భావము. అట్టి పరమభక్తులు, జ్ఞానులు సాక్షాత్ భగవత్స్వరూపులుగనే యుందురు. కావున దైవమందెట్టి పవిత్రీకరణశక్తి యుండునో వారియందున్ను అట్టి శక్తి యుండును. ఏలయనిన, అతిశయభక్తిస్థితియందు, లేక జ్ఞానస్థితియందు, భక్తునకును భగవంతునకును, లేక జ్ఞానికిని దేవునకును భేదముండదు. (జ్ఞానీత్వాత్మైవ మే మతమ్).

మఱియు 'ధనుర్ధరః' అనుపదము కర్మయోగమును, నిర్మల అనుష్ఠానమును గూడ సూచించుచున్నది. ప్రతివ్యక్తికిని తత్త్వబోధతో బాటు అనుష్ఠానముగూడ ఉండవలెనని ఆ పదముచే స్పష్టమగుచున్నది.

ఎచట శ్రీకృష్ణుడుండునో అచట విజయ, ఐశ్వర్యము లుండునని తెలుపుటవలన ప్రతివారును తమ గృహమందును, తమ హృదయమందును భగవంతుని స్థాపించుకొని నిరంతరము అర్చన పూజాధ్యానాదులు సలుపుచుండినచో అచ్చోట సాక్షాత్ పరమాత్మయే నివసించుచుండును. గావున అట విజయైశ్వర్యాదులు తప్పక నుండగలవు. అట్లే ఎచట భక్తి జ్ఞాన వైరాగ్యాదులు, దైవీసంపత్తి గలిగియున్న మహనీయులు, భక్తవర్యులు నివసించుచుందురో అచ్చోట ధనుర్ధారియగు అర్జునుని సన్నిధానమందువలె విజయాదులు వర్ధిల్లునని గ్రహింపవలెను. లోకమునందును ఇపుడు భగవత్పూజాదులు జరుగుచోట, మహనీయులుండు చోట శుభప్రదమైన వాతావరణము, విజయాది సల్లక్షణములు ఉండియుండుట మనము చూచుచునే యున్నాము.

ప్రతిజీవియు విజయమునే కోరునుగాని అపజయమును గాదు. సంపదనే కోరునుగాని దారిద్ర్యమునుగాదు. కాని అవి లభించుట కుపాయమేమి? ఆ యుపాయ మీ శ్లోకమున చెప్పబడినది. దానిని కార్యాన్విత మొనర్చుకొనినచో తప్పక ఆ విజయాదులు జనులకు లభించగలవు. శ్రీకృష్ణపరమాత్మను వారి హృదయమందు, వారి గేహమందు చేర్చుటయే ఆ యుపాయము. భగవంతుని భక్తిపూర్వకముగ ధ్యానించుచు భగవత్సాన్నిధ్యము ననుభవించుచుండుటయే ఆ యుపాయము. ఎచట శ్రీకృష్ణుడుండునో అచట విజయాదులుండుట తథ్యము. కాబట్టి భగవత్సాన్నిధ్యమును గలుగజేసికొనుచుండు భగవద్భక్తులకు విజయాదులు తప్పక సిద్ధించితీరును. అట్లే మహనీయులగు జ్ఞానులు, యోగిపుంగవులు మున్నగువారి సాంగత్యమందును అట్టి మహచ్ఛక్తి కలుగగలదు. కావున భగవత్సాన్నిధ్యము, సజ్జనసాంగత్యము రెండిటిని కలుగజేసికొనుచు శ్రీకృష్ణార్జునుల (నరనారాయణుల) యిరువురి సాంగత్యశ్రీని అనుభవించుచుండవలెను.

మఱియు ఎచ్చోట (ఏ పక్షమున) శ్రీకృష్ణుడు, అర్జునుడు ఉండునో, ధర్మమేపక్షమున నుండునో అచట (ఆ పక్షమున) విజయము తప్పక కలుగునను వాక్యమును చెప్పుటద్వారా సంజయుడు పాండవ పక్షముననే విజయము కలుగునను భావమును ధృతరాష్ట్రునకు ధ్వనింపజేసెను. (ఆ వాక్యమును వినియైనను ధృతరాష్ట్రుడు సంధిచేసికొని యుద్ధమును మాన్పించుట శ్రేయస్కరమని యాతనికి గూఢముగ బోధింపబడినది).

ఈ శ్లోకమందలి 'ధ్రువానీతిః' అను పదమునకు "నీతి మున్నగునవి తప్పక కలుగును" అని కొందఱు అర్థము చెప్పిరి.

గీతయొక్క అంతమున సంజయునిచే బోధింపబడిన ఈ "యత్రయోగేశ్వరః కృష్ణో...." – అను మహత్తరమగు శ్లోకమును భక్తులు మఱల మఱల జ్ఞాపకము చేసికొనుచు భగవత్సాన్నిధ్యమును తమ హృదయమున నిరంతరము కలుగజేసికొనుచు భగవదనుగ్రహముచే జీవితములను ఆనందమయములుగ నొనర్చుకొందురుగాక! మఱియు భగవానునిచే కరుణతో బోధింపబడిన ఈ గీతాశాస్త్రము నంతను చక్కగ

పఠించి, అనుష్ఠించి, ఆత్మానుభూతిని బడసి జన్మరాహిత్యరూప నిత్యానందపదవి నొందుటద్వారా మానవ జీవితమును కృతార్థము చేసికొందురు గాక!!!

హరిః ఓం తత్ సత్
ఇతి శ్రీమన్మహాభారతే శతసాహస్రికాయాం సంహితాయాం వైయాసిక్యాం
శ్రీమద్భీష్మపర్వణి శ్రీ మద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే మోక్షసన్న్యాసయోగోనామ
అష్టాదశోఽధ్యాయః
ఇది శ్రీవ్యాసముని విరచితమైనదియు, నూఱువేల శ్లోకములుగలదియును, ఛందోబద్ధ
మైనదియు నగు శ్రీమహాభారతమున భీష్మపర్వమునగల ఉపనిషత్ప్రతిపాదకమును,
బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జునసంవాదమును నగు
శ్రీ భగవద్గీతలందు మోక్షసన్న్యాసయోగమను
పదునెనిమిదవ అధ్యాయము
సంపూర్ణము
హరిః ఓమ్ తత్ సత్
శ్రీ పరబ్రహ్మార్పణమస్తు
ఓమ్.



# శ్రీ భగవద్గీత

## శ్లోకానుక్రమణిక

ఓం తత్సత్

| | | |
|---|---|---|
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. | లక్ష్మి - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |

63. కలశపూజలు (9ఒకేసారి) 150-00
64. కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) ....
65. హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) ....
66. గోమాత 40-00

## 2. స్తోత్రాలు-సుప్రభాతములు సహస్రనామములు

1. శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు 45-00
పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం
2. లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, 50-00
3. లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, 50-00
4. స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) 99-00
5. లలితావిష్ణు (కేస్ బైండ్) 1/8 డెమ్మి 63-00
6. స్థూలాక్షరీ లలితావిష్ణు (క్రౌన్‌సైజు)కేస్‌బైండ్ 108-00
7. సర్వదేవతా స్తోత్రమంజరి 120-00
8. సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) 24-00
9. విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) 25-00
10. లలితా సహస్రనామ స్తోత్రమ్ (క్రౌన్) 36-00
11. లలితా సహస్రనామములు 24-00
12. లక్ష్మీ సహస్రనామములు 24-00
13. దుర్గా సహస్రనామములు 24-00
14. ఆంజనేయ సహస్రనామములు 24-00
15. శివ సహస్రనామములు 24-00
16. విష్ణు సహస్రనామములు 24-00
17. గణపతి సహస్రనామములు 24-00
18. సుబ్రహ్మణ్య సహస్రనామములు 24-00
19. గాయత్రి సహస్రనామములు 24-00
20. లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు 24-00
21. శ్రీరామా సహస్రనామములు 24-00
22. సరస్వతి సహస్రనామములు 24-00
23. సూర్యసహస్రనామములు & ఆదిత్యహృదయం 24-00
24. శ్రీవేంకటేశ్వరసహస్రనామములు 24-00
25. మణిద్వీపవర్ణన (పెద్దది) 24-00
26. సంధ్యావందనం 24-00
27. మంత్రపుష్పమ్ ....
28. త్రిభాషా హనుమాన్‌చాలీసా 15-00
29. హనుమాన్ చాలీసా 10-00

| | | |
|---|---|---|
| 30. | మణిద్వీపవర్ణన (పాకెట్) | 10-00 |
| 31. | ఆరు చాలీసాలు | 10-00 |
| 32. | శివారాధన (శివస్తోత్రాలు) | 10-00 |
| 33. | వేంకటేశ్వర సుప్రభాతం (పాకెట్) | 10-00 |
| 34. | ఆరుదండకాలు | 5-00 |
| 35. | వేంకటేశ్వర గోవిందనామములు | 5-00 |
| 36. | అష్టలక్ష్మీ స్తోత్రమ్ కనకధారాస్తోత్రమ్ | 10-00 |
| 37. | దేవీఖడ్గమాలాస్తోత్రమ్ (మహిషాసురమర్దనీస్తోత్రంతో) | 10-00 |
| 38. | సుందరకాండ (పాకెట్) | 10-00 |
| 39. | భగవద్గీత మూలం | 27-00 |
| 40. | రామరక్షాస్తోత్రమ్ | 15-00 |
| 41. | స్తోత్ర రత్నావళి | 36-00 |
| 42. | పురాణపండ లలితా-విష్ణు సహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 43. | పురాణపండ లలితాసహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 44. | పురాణపండ విష్ణు సహస్రనామస్తోత్రమ్ | 10-00 |
| 45. | పురాణపండ ఆదిత్య హృదయం | 10-00 |
| 46. | మంత్రపుష్పం (మినీ) | 10-00 |
| 47. | శివానందలహరి-సౌందర్యలహరి | 36-00 |
| 48. | కుజదోషం | 10-00 |
| 49. | కాలసర్ప దోషం | 10-00 |
| 50. | మీ అప్పులు తీరాలా? | 10-00 |
| 51. | దృష్టిదోషాలు నివారణ | 10-00 |
| 52. | పంచసూక్తములు | 10-00 |
| 53. | సంధ్యావందనం | 10-00 |
| 54. | రుద్రనమకమ్-చమకమ్ | 10-00 |
| 55. | గాయత్రీమంత్రాలు | 10-00 |
| 56. | హయగ్రీవ స్తోత్రమాల | 10-00 |
| 57. | దక్షిణామూర్తి స్తోత్రమాల | 10-00 |
| 58. | ద్వాదశ జ్యోతిర్లింగాలు - పంచారామాలతో | 10-00 |
| 59. | శ్రీసూక్తం పురుష సూక్తం | 10-00 |
| 60. | నవగ్రహస్తోత్రమాల | 36-00 |
| 61. | మహాన్యాసమ్ | 36-00 |
| 62. | సుందరకాండ గానామృతం | 36-00 |
| 63. | గోమాతపూజావిధానము | 10-00 |
| 64. | ఆనందసిద్ధి - 1 శ్రీదేవీ స్తోత్రమాల | 108-00 |

| | | |
|---|---|---|
| 65. | ఆనందసిద్ధి - 2 ఏ సమస్యకు ఏ స్తోత్రమ్ పారాయణచేయాలి | 108-00 |
| 66. | ఆనందసిద్ధి-3 మానసదేవీ స్తోత్రమాల | 108-00 |
| 67. | శ్రీ కాలభైరవ రక్షా కవచమ్ | 63-00 |
| 68. | అర్చన | 40-00 |
| 69. | నిత్యదేవతార్చన | 40-00 |
| 70. | సర్వదేవతా స్తోత్ర నిధి | 99-00 |
| 71. | శ్రీచక్ర నవవరణార్చన | 63-00 |
| 72. | చండీ సప్తశతి పారాయణ క్రమం | 99-00 |
| 73. | శ్రీదేవి స్తోత్ర రత్నావళి 32 దేవి స్తోత్రాలకు తాత్పర్యంతో | 99-00 |
| 74. | వనదుర్గా మంత్రానుష్ఠాన క్రమమ్ | 63-00 |
| 75. | శ్రీ కాలభైరవ వ్రతము | 63-00 |

## 3. శ్రీ సాయి దత్త గ్రంథములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ సాయిబాబా సచ్చరిత్ర | 120-00 |
| 2. | సంపూర్ణ శ్రీ గురు చరిత్ర | 120-00 |
| 3. | శ్రీ సాయిఆరాధన-షిర్డివైభవం | 120-00 |
| 4. | శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర (క్రౌన్) | 63-00 |
| 5. | శ్రీ గురుచరిత్ర (క్రౌన్) | 63-00 |
| 6. | నవనాధ చరిత్ర | 99-00 |
| 7. | శ్రీసాయిచరిత్ర (బైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 8. | శ్రీగురుచరిత్ర (బైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 9. | సత్యదత్తవ్రతం దత్తాత్రేయపూజాకల్పం,సహస్రంతో | 30-00 |
| 10. | అనఘాదేవీ వ్రతం | 30-00 |
| 11. | భక్తుల ప్రశ్నలకు బాబా జవాబులు | 30-00 |
| 12. | శ్రీ సాయిపూజాకల్పం (సహస్రంతో) | 25-00 |
| 13. | శ్రీ సాయిభజనమాల | 20-00 |
| 14. | శ్రీ సాయి భజన్స్ | 20-00 |
| 15. | శ్రీ సాయిభక్తి గీతాలు | 20-00 |
| 16. | శిరిడిహారతులు (భావంతో) | 20-00 |
| 17. | "శ్రీసాయి"కోటి | 27-00 |
| 18. | "శ్రీసాయిరామ్"కోటి | 20-00 |
| 19. | శ్రీ సాయినాథ స్తోత్రమంజరి | 10-00 |
| 20. | శ్రీ సాయివేయినామాలు | 8-00 |
| 21. | శ్రీ సాయి హారతులు (పాకెట్) | 15-00 |
| 22. | శ్రీ సాయి స్తవనమంజరి | 10-00 |
| 23. | హిందీ శ్రీ సాయి హారతులు | 15-00 |

| | |
|---|---|
| 24. శని సింగణాపూర్ క్షేత్రమాహాత్మ్యం | 63-00 |
| 25. ఇంగ్లీషు శ్రీ సాయిహారతులు | 15-00 |
| 26. షిరిడి దర్శనం-శ్రీసాయి వైభవం | 99-00 |
| 27. సాయిసత్యవ్రతం | 30-00 |
| 28. సాయి అనుగ్రహమ్ | 120-00 |
| 29. నవగురువారాల వ్రతకల్పము | 15-00 |
| 30. శ్రీదత్తలీలామృతము | 99-00 |
| 31. హృదయంలో సాయి | 15-00 |
| 32. శ్రీషిరిడీసాయి లీలామృతం(శ్రీసచ్చరిత్ర) | 120-00 |
| 33. గజాననమహరాజ్ చరిత్ర | 99-00 |

## 4. జ్యోతిషాలు

| | |
|---|---|
| 1. 'కాలచక్రం' గంటలపంచాంగం (గార్గేయ) | 72-00 |
| 2. గ్రహభూమి పంచాంగము (గార్గేయ) | 108.00 |
| 3. ఆనందసిద్ధి పంచాంగం (వై.వి.శాస్త్రి) | 63.00 |
| 4. ములుగు వారి రాశిఫలితాలు (12రాశులువారికి) | 50.00 |
| 5. ములుగు వారి రాశిఫలితాలు విడివిడిగాఒక్కొక్కటి | 12.00 |
| 6. కాలచక్రంజ్యోతిషక్యాలండర్ | 25.00 |
| 7. గ్రహబలం క్యాలండర్ (శ్రీనివాసగార్గేయ-భక్తిటివి) | 25.00 |
| 8. శుభమస్తు (పిడపర్తి) క్యాలండర్ | 25.00 |
| 9. సాదా క్యాలండర్ | 5.00 |
| 10. పాకెట్ క్యాలండర్ | 15.00 |
| 11. తాజకనీలకంఠీయమ్ | 100-00 |
| 12. కేరళ జ్యోతిష రహస్యాలు | 180-00 |
| 13. జ్యోతిష బ్రహ్మ రహస్యాలు | 180-00 |
| 14. మానసాగరి జాతకపద్ధతి | 180-00 |
| 15. వరాహమిహిర జాతకపద్ధతి | 180-00 |
| 16. వధూవర వివాహమైత్రిద్వాదశకూటములు | 99-00 |
| 17. సింపుల్ రెమిడీస్ | 180-00 |
| 18. శంభు హోరప్రకాశిక | 250-00 |
| 19. పూర్వ పరాశరి | 100-00 |
| 20. పరాశర జ్యోతిషవిజ్ఞాన సర్వస్వం | 200-00 |
| 21. ప్రశ్న సింధు | 99-00 |
| 22. నక్షత్ర విశేష ఫలితాలు | 63-00 |
| 23. సూర్యసిద్ధాంతపంచాంగగణితంచేయడంఎలా? | 180-00 |
| 24. దృక్సిద్ధాంతపంచాంగగణితం చేయడంఎలా? | 180-00 |

| | | |
|---|---|---|
| 25. | ఆయుర్దాయ నిర్ణయం | 63-00 |
| 26. | జాతక గణిత ప్రవేశిక | 63-00 |
| 27. | జ్యోతిషమర్మబోధిని | 63-00 |
| 28. | జ్యోతిష ప్రశ్నోత్తరమాల | 63-00 |
| 29. | ముహూర్తం నిర్ణయించడంఎలా? | 63-00 |
| 30. | జాతక మకరందం | 63-00 |
| 31. | జ్యోతిష సరస్వతి | 63-00 |
| 32. | మీజననకాల విశేషాలు | 63-00 |
| 33. | ముహూర్త విజ్ఞాన భాస్కరం | 63-00 |
| 34. | జ్యోతిష స్వయంబోధిని | 63-00 |
| 35. | శుభముహూర్త శిరోమణి | 63-00 |
| 36. | నక్షత్ర ఫలమంజరి | 36-00 |
| 37. | పంచాంగం చూసే విధానం | 36-00 |
| 38. | సర్వార్థ జ్యోతిషం | 36-00 |
| 39. | ప్రాథమిక జ్యోతిషం | 36-00 |
| 40. | నవరత్నములు శుభయోగములు | 36-00 |
| 41. | శుభశకునాలు | 30-00 |
| 42. | హస్తరేఖాఫలితాలు | 36-00 |
| 43. | సంఖ్యల్లో భవిష్యత్ | 36-00 |
| 44. | ముహూర్త దీపిక | 99-00 |
| 45. | పుట్టుమచ్చలు ఫలితాలు | 30-00 |
| 46. | కలలు ఫలితాలు | 30-00 |
| 47. | జాతక చక్రం వేయడం ఎలా? | 36-00 |
| 48. | మానసాగరి (ప్రాచీనజ్యోతిషగ్రంథం) -పుచ్చాశ్రీనివాసరావు | 250-00 |
| 49. | జ్యోతిషశాస్త్ర చిట్కాలు | 120-00 |
| 50. | గుప్తా శతాబ్ది పంచాంగం (1940-2050) | 999-00 |
| 51. | ప్రశ్నచండేశ్వరమ్ | 63-00 |
| 52. | ద్వాదశభావ ఫలచంద్రిక | 250-00 |
| 53. | జ్యోతిష శతయోగరత్నావళి (నూరుయోగాలఫలితాలు) | 120-00 |
| 54. | అంగసాముద్రికం | 36-00 |
| 55. | హస్త సాముద్రికం | 63-00 |
| 56. | లాల్ కితాబ్ | 99-00 |
| 57. | శకునశాస్త్రం | 63-00 |
| 58. | ఆధునికప్రశ్నశాస్త్రం | 120-00 |
| 59. | పరాశరజ్యోతిష ప్రశ్నజ్యోతిషం | 180-00 |

| | | |
|---|---|---|
| 60. | అష్టకవర్గు (కొండపల్లి) | 63-00 |
| 61. | బృహత్‌జాతకం (ప్రాచీనప్రతికిపునర్ముద్రణ) | 250-00 |
| 62. | లగ్నరత్నాకరం | 63-00 |
| 63. | షట్పంచాశిక | 120-00 |
| 64. | 40 రోజుల్లో జ్యోతిషంనేర్చుకొనండి | 270-00 |
| 65. | 40 రోజుల్లో సాముద్రికంనేర్చుకొనండి | 180-00 |
| 66. | 40 రోజుల్లో సంఖ్యాశాస్త్రం | 180-00 |
| 67. | 40 రోజుల్లో నక్షత్ర (నాడీ) ఫలితములు | 270-00 |
| 68. | 40 రోజుల్లో వైద్యజ్యోతిషం నేర్చుకోండి | 250-00 |
| 69. | మీ పుట్టినతేదీ అద్భుతరహస్యాలు (సాయిగణపతిరెడ్డి) | 270-00 |
| 70. | కె.పి.జ్యోతిషం (పరిచయం) | 63-00 |
| 71. | ముహూర్తచింతామణి | 99-00 |
| 72. | సూర్యచంద్ర గ్రహణములు | 63-00 |
| 73. | ప్రసిద్ధవ్యక్తుల జాతకాలు (వేరేకొండప్ప) | 180-00 |
| 74. | అదృష్టరెమెడీస్ | 144-00 |
| 75. | గ్రహసంచార ఫలనిర్ణయదీపిక | 63-00 |
| 76. | జ్యోతిష రెమిడీస్ | 300-00 |
| 77. | జాతకమార్తాండం పాతప్రతికి యథాతథం (కొండపల్లి) | 250-00 |
| 78. | జ్యోతిషవిద్యాప్రకాశిక పాతప్రతికి యథాతథం (కొండపల్లి) | 250-00 |
| 79. | నాడీజ్యోతిషం | 63-00 |
| 80. | నక్షత్రపారిజాతం (గోరసవీరభద్రాచార్య) | 63-00 |
| 81. | లగ్నపారిజాతం (గోరసవీరభద్రాచార్య) | 63-00 |
| 82. | గౌతమసంహిత | 63-00 |
| 83. | హోరరత్నమాల | 63-00 |
| 84. | జాతకఫల మణిమంజరి | 200-00 |
| 85. | పుష్కర పంచాంగం (2013-14నుండి 2024-25) | 560-00 |
| 86. | దశాభుక్తిఫల నిర్ణయం | 250-00 |
| 87. | వింత జోస్యములు | 63-00 |
| 88. | షోడశవర్గులు | 200-00 |
| 89. | రవిగ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 90. | చంద్ర గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 91. | కుజ గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 92. | బుధ గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 93. | గురు గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 94. | శుక్ర గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |

| | |
|---|---|
| 95. శని గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 96. రాహు & కేతు గ్రహముల సమస్త ప్రభావములు | 99-00 |
| 97. ఆధునిక గ్రహములు-ఉపగ్రహములు సమస్త ప్రభావములు | 99-00 |
| 98. ముహూర్తమార్తాండం | 63-00 |
| 99. లఘుజాతకం | 63-00 |
| 100. జాతకాలంకారము | 63-00 |
| 101. మేషలగ్న ఫలితములు | 99-00 |
| 102. వృషభ లగ్న ఫలితములు | 99-00 |
| 103. మిధున లగ్న ఫలితములు | 99-00 |
| 104. కర్కాటక లగ్న ఫలితములు | 99-00 |
| 105. సింహలగ్న ఫలితములు | 99-00 |
| 106. కన్యలగ్న ఫలితములు | 99-00 |
| 107. తుల లగ్న ఫలితములు | 99-00 |
| 108. వృశ్చిక లగ్న ఫలితములు | 99-00 |
| 109. ధనుస్సు లగ్న ఫలితములు | 99-00 |
| 110. మకర లగ్న ఫలితములు | 99-00 |
| 111. కుంభ లగ్న ఫలితములు | 99-00 |
| 112. మీన లగ్న ఫలితములు | 99-00 |
| 113. నారద సంహిత | 200-00 |
| 114. పంచాంగపీఠికలేఖికాగణితం | 250-00 |
| 115. తారాబలం - చంద్రబలం (వేరే కొండప్ప) | 99-00 |
| 116. సులభలగ్న సాధన (చిత్రాలగురుమూర్తిగుప్తా) | 200-00 |
| 117. రాహు కేతువుల యోగము | 99-00 |
| 118. ఛాయాగ్రహములు | 99-00 |
| 119. జ్యోతిషవిజ్ఞాన దీపిక | 63-00 |

**బి.వి.రామన్ గారి గ్రంథములు**

| | |
|---|---|
| 120. జ్యోతిష విద్యారంభం | 50-00 |
| 121 గ్రహభావ బలములు | 50-00 |
| 122. కాలచక్రదశ | 50-00 |
| 123. అనుభవ ప్రశ్నాజ్యోతిషం | 50-00 |
| 124. జ్యోతిషశాస్త్రంలో వాతావరణ భూకంపాలు | 50-00 |
| 125. పురోగామి జాతకం | 50-00 |
| 126. భావార్ధరత్నాకరం | 75-00 |
| 127. భారతీయజ్యోతిష సర్వస్వం | 75-00 |
| 128. అష్టకవర్గ పద్ధతిః | 75-00 |

| | |
|---|---|
| 129. జ్యోతిషశాస్త్రంలో సందేహాలు,సమాధానాలు | 75-00 |
| 130. ప్రశ్నతంత్ర | 75-00 |
| 131. ముహూర్తం | 75-00 |
| 132. విశిష్ట జాతకములు | 125-00 |
| 133. భారతీయఫలితజ్యోతిషం | 125-00 |
| 134. 300 ముఖ్యమైన యోగములు | 125-00 |
| 135. జాతకంపరిశీలించడంఎలా ? | 300-00 |

**రాష్ట్రపతి అవార్డుగ్రహీత, మహామహోపాధ్యాయ, వాచస్పతి**
**శ్రీ మధురకృష్ణమూర్తిగారి గ్రంథములు**

| | |
|---|---|
| 136. బృహత్పరాశరహోరాశాస్త్రము-1 | 200-00 |
| 137. బృహత్పరాశరహోరాశాస్త్రము-2 | 200-00 |
| 138. బృహత్పరాశరహోరాశాస్త్రము-3 | 200-00 |
| 139. బృహత్పరాశరహోరాశాస్త్రము-4 | 200-00 |
| 140. భావార్థరత్నాకరము | 100-00 |
| 141. ముహూర్త చింతామణి | 100-00 |
| 142. ముహుర్త చింతామణి-పార్టు2 | 200-00 |
| 143. స్వప్న శాస్త్రము | 36-00 |
| 144. శతయోగమంజరి | 50-00 |
| 145. వ్రతనిర్ణయకల్పవల్లి | 250-00 |
| 146. దైవజ్ఞవల్లభం | 75-00 |
| 147. వసంతరాజశకునమ్ (బృహత్శకునశాస్త్రం) | 250-00 |
| 148. వాస్తుశాస్త్రవివేకము-1 | 100-00 |
| 149. వాస్తుశాస్త్రవివేకము-2 | 200-00 |
| 150. వాస్తుశాస్త్రవివేకము-3 | 100-00 |
| 151. వాస్తుశాస్త్రవివేకము-4 | 200-00 |
| 152. అనుభవసులభవాస్తు - 1 | 50-00 |
| 153. అనుభవసులభవాస్తు - 2 | 100-00 |
| 154. పంచాంగ వివేకము | 99-00 |
| 155. వశిష్ఠ సంహిత | 360-00 |
| 156. పంచపక్షి శాస్త్రం (కేస్బైండ్) | 200-00 |

## 5. వాస్తులు

| | |
|---|---|
| 1. 40 రోజుల్లో "వాస్తువిద్య" నేర్చుకొనండి | 180-00 |
| 2. వాస్తుశాస్త్ర రహస్యములు | 200-00 |
| 3. వాస్తునుబట్టి మీ ఇల్లు | 63-00 |
| 4. మీరూ మీ వాస్తు | 63-00 |

| | | |
|---|---|---|
| 5. | గృహవాస్తు చిట్కాలు | 63-00 |
| 6. | వాస్తు పూజ | 63-00 |
| 7. | వాస్తు సూత్రములు | 63-00 |
| 8. | వాస్తుశాస్త్ర రహస్యాలు | 63-00 |
| 9. | గృహవాస్తు వర్గులు | 99-00 |
| 10. | విశ్వకర్మవాస్తు శాస్త్రరీత్యా మీ ఇంటి ప్లానులు | 63-00 |
| 11. | విశ్వకర్మ వాస్తుశాస్త్రరీత్యా మీఇండ్లఆయములు | 99-00 |
| 12. | విశ్వకర్మ వాస్తు శాస్త్రం(చిత్రాలగురుమూర్తిగుప్తా) | 180-00 |
| 13. | ఆధునిక గృహవాస్తు | 99-00 |
| 14. | శుభవాస్తు | 270-00 |
| 15. | వాస్తుయంత్ర రత్నావళి | 120-00 |
| 16. | వాస్తుశాస్త్రం | 120-00 |
| 17. | హౌస్ ప్లాన్స్ | 63-00 |
| 18. | గృహనిర్మాణ వాస్తు | 63-00 |
| 19. | వాస్తు రెమెడీస్ | 63-00 |
| 20. | గృహవాస్తు దర్పణం | 63-00 |
| 21. | జ్యోతిష-గృహవాస్తుచంద్రిక | 200-00 |
| 22. | వాస్తురత్నాకరం (కొండపల్లి) | 63-00 |
| 23. | వాస్తుశిరోమణి ,, | 120-00 |
| 24. | వాస్తుసంగ్రహమ్ ,, | 63-00 |
| 25. | పంచవాస్తు పారిజాతం ,, | 120-00 |
| 26. | వాస్తుడిండిమమ్ ,, | 63-00 |
| 27. | వాస్తుదుందిభి ,, | 120-00 |
| 28. | విశ్వకర్మవాస్తుప్రకాశిక (కేస్‌బైండ్) | 250-00 |
| 29. | కృష్ణవాస్తుశాస్త్రము | 63-00 |
| 30. | జలవాస్తు,శల్యవాస్తు (దంతూరిపండరీనాథ్) | 99-00 |
| 31. | మయవాస్తు (గోరసవీరభద్రాచార్య) | 120-00 |
| 32. | వాస్తు జ్యోతి | 63-00 |
| 33. | మన ఇల్లు-మనవాస్తు | 99-00 |
| 34. | వాస్తవ వాస్తుపూజావిధానము | 108-00 |
| 35. | వాస్తు దర్పణం | 120-00 |

## 6. మంత్రశాస్త్రాలు

| | | |
|---|---|---|
| 1. | మంత్రసాధన | 63-00 |
| 2. | తంత్రజాలం | 63-00 |
| 3. | మంత్రశక్తి | 63-00 |

| | | |
|---|---|---|
| 4. | దత్తాత్రేయ తంత్రవిద్య | 63-00 |
| 5. | దత్తాత్రేయ మూలికాతంత్రమ్ | 63-00 |
| 6. | తాంత్రిక పంచాంగం | 63-00 |
| 7. | యక్షిణీ తంత్రం | 63-00 |
| 8. | మంత్రానుష్ఠాన చంద్రిక | 63-00 |
| 9. | సర్వదేవతా మంత్రకవచములు | 63-00 |
| 10. | మంత్రాక్షరాలరహస్యం (బీజాక్షరనిఘంటువు) | 63-00 |
| 11. | సర్వదేవతా మంత్రరత్నావళి | 63-00 |
| 12. | సదాచార దీపిక | 63-00 |
| 13. | యోగినీ-వామకేశ్వరతంత్రం | 63-00 |
| 14. | ప్రపంచసారతంత్రం | 63-00 |
| 15. | బదనిక తంత్రమ్ | 63-00 |
| 16. | ఉచ్ఛిష్ట గణపతి తంత్రమ్ | 63-00 |
| 17. | గుప్త సాధన తంత్రం | 63-00 |
| 18. | గంధర్వ తంత్రమ్ | 63-00 |
| 19. | సౌందర్యలహరి (మంత్రయంత్రరత్నావళి) | 63-00 |
| 20. | యంత్ర మంత్ర తంత్ర | 63-00 |
| 21. | పాశుపత తంత్రం | 99-00 |
| 22. | పంచదశ మహాఖడ్గ తంత్రం | 99-00 |
| 23. | రుద్రాష్టాధ్యాయః | 99-00 |
| 24. | మంత్రసిద్ధి | 120-00 |
| 25. | పరశురామతంత్రమ్ | 108-00 |
| 26. | శ్రీలలితావిలోమ పంచదశీ | 108-00 |
| 27. | శ్రీ గురు తంత్రం | 108-00 |
| 28. | గాయత్రీ తంత్రమ్ | 108-00 |
| 29. | మహాశక్తి మంత్ర తంత్ర రహస్యాలు | 150-00 |
| 30. | శ్రీ దుర్గ తంత్రమ్ | 200-00 |
| 31. | మహామృత్యుంజయఅమృతపాశుపతమ్ | 200-00 |
| 32. | సర్ప (నాగ)తంత్రం | 250-00 |
| 33. | హవన తంత్రం | 250-00 |
| 34. | షోడశనిత్యతంత్రం | 250-00 |
| 35. | శాక్తేయతంత్రం | 250-00 |
| 36. | రుద్రయామళతంత్రం | 250-00 |
| 37. | లక్ష్మీప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 38. | హిరణ్యశూలినీ తంత్రమ్ | 250-00 |

| | | |
|---|---|---|
| 39. | మాయాప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 40. | శ్రీ విశ్వరూప ప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 41. | స్వర్ణాకర్షణభైరవతంత్రం | 250-00 |
| 42. | కాశీవిశాలాక్షి తంత్రం | 250-00 |
| 43. | శాంతితంత్రమ్ | 250-00 |
| 44. | యంత్రసిద్ధి | 360-00 |
| 45. | శ్రీ లక్ష్మీతంత్రమ్ | 360-00 |
| 46. | మంత్రమహోదధి (స్త్రీదేవతాఃకల్పమ్) | 360-00 |
| 47. | మంత్రమహోదధి (పురుషదేవతాఃకల్పమ్) | 360-00 |
| 48. | మంత్రశాస్త్రం (గ్రంథము) | 360-00 |
| 49. | ప్రత్యంగిరాకృత్యాతంత్రం | 360-00 |
| 50. | కామధేనువు తంత్రం | 360-00 |
| 51. | శూలినీదుర్గాతంత్రం | 360-00 |
| 52. | శ్రీవిద్య రహస్యం | 290-00 |
| 53. | కులార్ణవ తంత్రమ్ | 150-00 |
| 54. | ఆచార్య సిద్ధ నాగార్జునతంత్రం (ఒరిజనల్) | 390-00 |
| 55. | సిద్ధమూలిక రహస్యం (మంత్ర,యంత్రసహితం) | 63-00 |

## 7. గ్రంథాలు - ఆరాధనలు

| | | |
|---|---|---|
| 1. | భగవద్గీత శ్లోక తాత్పర్య సహితం | 54-00 |
| 2. | భగవద్గీత (వచనం) | 99-00 |
| 3. | భగవద్గీత శ్లోకతాత్పర్యం-కేసుబైండింగ్ | 72-00 |
| 2. | గణేశ ఆరాధన 1 | 99-00 |
| 3. | గణేశోపాసన 2 | 99-00 |
| 4. | నవగ్రహవైభవం | 99-00 |
| 5. | నవగ్రహ రెమెడీస్ | 99-00 |
| 6. | నవగ్రహ వేదం | 99-00 |
| 7. | శనిగ్రహారాధన | 99-00 |
| 8. | ఆదిత్యారాధన | 99-00 |
| 9. | సుబ్రహ్మణ్యారాధన | 99-00 |
| 10. | శ్రీ శివ ఆరాధన | 99-00 |
| 11. | లక్ష్మీ ఆరాధన | 99-00 |
| 12. | హనుమదారాధన | 99-00 |
| 13. | లలితారాధన | 99-00 |
| 14. | శ్రీ చక్రారాధన | 99-00 |
| 15. | గాయత్రీ ఆరాధన | 99-00 |

